వాల్మీకి విరచిత

# శ్రీమద్రామాయణము

వచన కావ్యము

రచన:
చిలుకూరు వెంకటేశ్వర్లు



రామకృష్ణ మఠం
దోమలగూడ, హైదరాబాద్ – 500 029

# ప్రకాశకుల మనవి



రామాయణ మహాకావ్యం కేవలం భారతీయులకే కాక, దక్షిణ ఆసియా దేశీయులకు సైతం ఆధ్యాత్మికతకు, సంస్కృతికి స్ఫూర్తిదాయకంగా నిత్యనూతనంగా అలరారుతోంది. ఈ కావ్యం, ఈ దేశాల చరిత్రలో ఒక భాగమై, కథాసారాంశమై నృత్య, నాటక, సంగీత, చిత్రలేఖన, శిల్పకళలలో సైతం చొచ్చుకుని పోయింది. మానవ జీవన ప్రవాహంలో ఎల్లవేళలా కలిసి ప్రవహించి, ప్రభావం చూపించగల అనిర్వచనీయ దివ్యశక్తి రామాయణంలో తేటతెల్లమవుతున్నది. ఊరూరా వాడవాడలా రామమందిరాలు, సీతారాముల పెళ్ళి పందిళ్ళు, పట్టాభిరాముని కొలువులు ఈ దేశమంతటా పరచుకున్న రామసంస్కృతి. 'రాముని వారము మాకేమి విచారము', 'తక్కువేమి మనకు రాముండొక్కడుండువరకు' – రామదాసుని ఈ గానాలు ముఖ్యంగా తెలుగు ప్రజల జీవనాడులలో జీర్ణించుకుపోయాయి. రమణీయత్వాత్ రామః – సౌందర్యమే రాముడు. కేవలం రూపసౌందర్యమే కాదు, గుణమహిమ, కథా సౌందర్యాలన్నీ రామునిలో కలబోసి కనిపిస్తాయి. ముఖ్యంగా రామాయణ సారాన్ని పరికిస్తే వ్యక్తిగత సుఖాలకంటే ధర్మబద్ధమైన జీవితమే శాశ్వతం అని రామచరిత్ర జీవనబోధ చేస్తుంది. రామాయణం రమ్య రామాయణం – రామాయణంలో రాముని రూపం, శ్రీరాముని నామం, గుణసమూహం, చరిత్ర, మహిమ, తత్త్వం అన్నీ రమణీయాలే.

ఈ రామాయణ మహాకావ్యం పలు భాషలలో అనువదించబడి దేశ విదేశాలలో బహు ప్రచారం గావించబడింది. సంస్కృతంలో ఆధ్యాత్మ రామాయణం, అగస్త్య రామాయణం, భరద్వాజ రామాయణం, ఆనంద రామాయణం ప్రసిద్ధిని పొందాయి. హిందీ భాషలో తులసీ రామాయణం అందరికీ తెలిసిందే. ఇక తెలుగులో మొల్ల రామాయణం, భాస్కర రామాయణం,

రంగనాథ రామాయణం, శ్రీమద్రామాయణ కల్పవృక్షం ప్రాధాన్యతను సంతరించుకున్నాయి.

ఈ గ్రంథ రచయిత శ్రీ చిలుకూరు వెంకటేశ్వర్లుగారు పాఠకులకు సుపరిచితులే. వారు రాసిన మహాభారతం, భాగవతసుధ, రామవతార తత్త్వం, శంకరవిజయం, ఉపదేశసారం మొదలైన గ్రంథాలు శ్రీరామకృష్ణ మఠం, హైదరాబాద్ ప్రాప్తిస్థానంగా రచయితే స్వయంగా శ్రీరామకృష్ణ తపోవనం, చెన్నై తరుపున ముద్రించారు. ధార్మిక సంపన్నుల కుటుంబంలో జన్మించిన శ్రీ చిలుకూరు వెంకటేశ్వర్లు, రామకృష్ణ మఠంతో అనుబంధాన్ని ఏర్పరచుకుని వివిధ రంగాలలో వారి సేవలను అందించడమే కాకుండా, తన తల్లి చిలుకూరు శ్యామలాంబ గారి జ్ఞాపకార్థం భారీ విరాళంతో మూలనిధిని రామకృష్ణ మిషన్, విజయవాడలో ఏర్పాటు చేశారు. ఆ మూలనిధిని పేద విద్యార్థులకు విద్య, వసతి తదితర సదుపాయాలను ఉచితంగా అందజేయడానికి ఉపయోగించేలా ఏర్పాటు చేశారు.

ఈ వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణ గ్రంథం ఎన్నో ముద్రణలకు నోచుకుని బహుప్రజాదరణను పొందింది. ఇప్పటి వరకు రచయితే స్వయంగా ముద్రించగా, ఈ ముద్రణనుండి రచయిత సహృదయంతో సర్వ హక్కులను రామకృష్ణ మఠానికి ఇవ్వడం జరిగింది. వారికి మా ధన్యవాదాలు. పాఠకలోకం రామకథా చరిత శ్రీమద్రామాయాణాన్ని చదివి ఆనందాన్ని పొందుతారని ఆశిస్తూ....

– ప్రకాశకులు

# ప్రస్తావన



విశ్వజనీనమై భాసిల్లుతోన్న భారతీయ వాఙ్మయ చరిత్రలో వాల్మీకి విరచితమైన శ్రీమద్రామాయణ కావ్యానికి గల స్థానం మహోన్నతమైనది. అది 'ఆదికావ్యం' గా ప్రాచుర్యం పొందడాన్నిబట్టే దాని ప్రాశస్త్య ప్రమాణాలు ఎంతటి విస్తృతమైనవో ఇట్టే గ్రహించవచ్చు! రామాయణ కావ్యం అంతటి వైశిష్ట్యాన్ని, ఘనతను సాధించడంలో ప్రధాన పాత్ర పోషించిన పాత్రలు అందులో అనేకం ఉన్నప్పటికీ ప్రముఖంగా పేర్కొనవలసిన పాత్ర ఒక్క 'శ్రీరాముడు' మాత్రమే!

శ్రీరామచంద్ర ప్రభువు సర్వధర్మస్వరూపుడని, పురుషోత్తముడని, సాక్షాత్తూ పరబ్రహ్మమేనని ఉపనిషత్తులు వక్కాణిస్తున్నాయి. ఆ విధంగానే వాల్మీకి మహర్షి కూడా శ్రీరాముణ్ణి షోడశగుణశోభితుణ్ణిగా తీర్చిదిద్దే ప్రయత్నం చేశాడు. ఆ మేరకు నిత్య జీవితంలో మానవాళి సుఖసంతోషాలతో శాంతిమయ జీవనాన్ని గడపడానికి తోడ్పడే సకల ధర్మాలను రామపాత్రలో పొందుపరచి రాక్షసుడైన మారీచుడి నోట– "రామో విగ్రహవాన్ ధర్మః" అని పలికించాడు! అంతేగాక, "మనిషి రాముడిలా బ్రతకాలే తప్ప రావణుడిలా కాదు" అనే వాస్తవాన్ని రామ చరిత ద్వారా లోకానికి చాటిచెప్పడానికి సంకల్పించాడు మహర్షి వాల్మీకి. అందుకు తగ్గట్టుగానే ఆయన తమ రామాయణ కావ్యసృష్టిలో సందర్భోచితంగా పలు విధాలైన పాత్రల్ని ప్రవేశపెట్టి ధార్మిక నేపథ్యంలో కర్మ–భక్తి–జ్ఞానాలను సమ్మిళితం చేసి తద్వారా సమున్నతమైన నైతిక ప్రమాణాలను, మానవ జన్మను సార్థకం చేసే మహోత్కృష్టమైన మానవ విలువలను పుష్కలంగా పండించి రామచరితను పరిపుష్టం చేశాడు. ఈ దృష్ట్యా రామాయణాన్ని అనేకులు తమ తమ అంచనాలకు, ఆలోచనలకు, భావాలకు తగ్గట్టుగా పరిగణించడం సహజం! కొందరేమో తత్త్వశాస్త్రమంటారు; మరికొందరేమో మంత్రశాస్త్రమంటారు; ఇంకొందరేమో పారాయణ గ్రంథమంటారు –ఇలా రామాయణ కావ్యాన్ని ఎందరెన్ని విధాలుగా పేర్కొన్నా – అది మాత్రం మానవాళి పరిపూర్ణ జీవన వికాసానికి దోహదపడే అత్యద్భుతమైన ధర్మనిధి. అందుకే అది అందరికీ శిరోధార్యం; చిరస్మరణీయం!

అంతటి విశేషాన్ని సంతరించుకున్న శ్రీరాముడి చరిత్ర పురాణాల్లో పలుచోట్ల ప్రస్తావించబడింది. ముప్పై కల్పాలున్నాయని అందులో మొదటిదైన శ్వేతకల్పంలో పదవదైన వైవస్వత మన్వంతరంలో 24వ మహాయుగమైన త్రేతాయుగం చివర్లో శ్రీరాముడు జన్మించాడని పెద్దలు నిర్ణయించారు. ఒక్కొక్క మహాయుగానికి ఒక్కొక్క వ్యాసుడుంటాడని, అట్లాగే 24వ మహాయుగానికి వాల్మీకి మహర్షియే వ్యాసుడని విష్ణు పురాణం చెప్తోంది. ఈ విషయాన్ని కూర్మపురాణం, హోరాదర్పణం సమర్థిస్తున్నాయి. కైకసికి నలుగురు సంతానం. అందులో రావణ, కుంభకర్ణ, విభీషణులు పుత్రులు కాగా, శూర్పణఖ పుత్రికయని వాయుపురాణంలో తెలుపబడింది. అందులోనే రావణుడి తపస్సు నశించిన పిదప శ్రీరాముడి వలన మరణిస్తాడని కూడా వివరించబడింది. కనుక శ్రీరాముడు 24వ మహాయుగంలో ఆవిర్భవించాడని, శ్రీరాముడి జీవితకాలంలోనే వాల్మీకి మహర్షి రామాయణాన్ని రచించాడని రూఢి అవుతోంది.

వాల్మీకి మహర్షి రామాయణాన్ని శ్రీరాముడి జీవితకాలంలోనే వ్రాశాడా? లేక అవతారం ముగిసిన తర్వాత వ్రాశాడా? అన్న విషయంలో కొందరిలో కొన్ని సందేహాలున్నాయి. విష్ణుధర్మోత్తరంలో మార్కండేయుడు వజ్రుడనే రాజుకు చెప్పిన కథ ప్రకారం, "24వ మహాయుగానికి చెందిన త్రేతాయుగంలో శ్రీరాముడు అవతరించి రావణ కుంభకర్ణులను వధించాడని, వాల్మీకి మహర్షి ఆశ్రమంలోనే కుశలవులు జన్మించారని, కుశలవులు రామాయణ గాథను శ్రీరామాదులకు వినిపించా" రని తెలుస్తోంది. కనుక శ్రీరాముడు జీవించి ఉండగానే వాల్మీకి రామాయణాన్ని వ్రాశాడన్నది నిర్వివాదాంశం.

వాల్మీకి విరచిత రామాయణం, సంస్కృత సాహిత్య జగత్తులో అనేక మహాకవులచేత నాటక కావ్యంగా, ఆర్ష రామాయణంగా వ్యాప్తి చెందింది. వ్యాసుడు మహాభారతంలోను, శ్రీమద్భాగవతంలోనూ రామకథను ప్రస్తావించకుండా ఉండలేకపోయాడు.

వాల్మీకి మహర్షి

వాల్మీకి మహర్షి జీవితానికి సంబంధించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. రత్నాకరుడనే బ్రాహ్మణుడు భ్రష్టుడై కిరాతకులతో స్నేహం చేసి ప్రాణుల్ని హింసిస్తూ ఉండేవాడని, ఒకానొక రోజున నారద మహర్షి "మరా" అనే మంత్రాన్ని ఉపదేశించి ధ్యానం చెయ్యమని ఆదేశించాడని, అతడా మంత్రాన్ని నిష్ఠతో ధ్యానం చేస్తూ ఉండగా అతడిపై పుట్టలు పెరిగాయని చెప్తారు. కొంతకాలానంతరం నారదమహర్షి తీవ్రతపస్సు చేస్తున్న రత్నాకరుణ్ణి చూసి అతడిపై జాలిగొని ఇంద్రుణ్ణి ప్రార్థించి వర్షం ద్వారా ఆ పుట్టనంతా కరిగించేశాడని చెప్తారు. రత్నాకరుడు పుట్టలో ఉంటూనే తపస్సు కొనసాగించాడు కనుక నారదుడు అతణ్ణి 'వాల్మీకి' అని లోకానికి పరిచయం చేశాడని, అటుపైన శ్రీరామచరిత్ర వ్రాసేందుకు ప్రోత్సహించాడని అంటారు. అయితే ఈ కథకు ఎక్కడా ప్రమాణాలు లేవు.

స్కంద పురాణంలో ఓ కథ ఈ విధంగా వివరించబడింది. "పూర్వం త్రేతాయుగంలో భృగు వంశంలో సుమతి అనే బ్రాహ్మణుడొకడుండేవాడు. అతడి భార్య కౌశికి. అగ్నిశర్మ వారి సంతానం. సుమతి అగ్నిశర్మచేత వేదాధ్యయనం చేయించాడు. అయితే అతడి మనస్సు వైదికంపై లగ్నం కాలేదు. అతడికి వివాహం అయిన కొంతకాలానికి అనావృష్టి సంభవించి కరువుకాటకాలు ఏర్పడ్డాయి. కుటుంబ పోషణ కష్టమయింది. దాంతో ఆ బ్రాహ్మణ కుటుంబం ఒక అరణ్యంలో ఆశ్రమం నిర్మించుకొని జీవించసాగింది. అగ్నిశర్మకు అరణ్యంలో దొంగలతో స్నేహం ఏర్పడింది. ఈ దుష్టసాంగత్యంతో దారిన పోయేవారిని చంపి వారి వద్ద ఉండే వస్తువుల్ని దొంగిలించి కుటుంబాన్ని పోషిస్తూ ఉండేవాడు.

అలా అగ్నిశర్మ తన బ్రాహ్మణత్వాన్ని మంట కలిపాడు. వేదానికి స్వస్తి పలికాడు. హింసనే వృత్తిగా స్వీకరించాడు. ఇట్లా ఉండగా ఒకనాడు సప్తర్షులు ఆ మార్గాన వెళ్తూ అగ్నిశర్మ కంటపడ్డారు. వాళ్ళను చంపి వాళ్ళవద్ద ఉన్న వస్తువుల్ని కాజేయాలనుకున్నాడు. వాళ్ళలో అత్రిమహర్షి కూడా ఉన్నాడు. 'అత్రి' అంటే ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములైన త్రివిధ తాపాలు లేనివాడని అర్థం. అత్రి మహర్షి అగ్నిశర్మపై జాలిగొని అతడితో "మమ్మల్ని చంపి ఈ

వస్తువులు పట్టుకెళ్ళి ఎవరికిస్తావు? నీకు మేము ఏ అపకారం చెయ్యకపోయినా మమ్మల్ని చంపుతానంటున్నావు. దీని వలన పాపం వస్తుంది గదా! ఈ పాపాన్ని ఎవరు భరిస్తారు" అని అడిగారు. అందుకు అగ్నిశర్మ "నాకు తల్లి, తండ్రి, భార్య ఉన్నారు. ఈ సొమ్ముతో వారిని పోషిస్తాను" అన్నాడు. అతడి సమాధానం విన్న అత్రి మహర్షి "బాగానే ఉంది. అయితే ఇందువల్ల వచ్చే పాపాన్ని కూడా వాళ్ళు పంచుకుంటారా? వెళ్ళి వారిని అడిగి రా! మేమంతా ఇక్కడే ఉంటాం" అన్నాడు.

అంతట అగ్నిశర్మ ఇంటికిపోయి తల్లిదండ్రుల్ని తన పాపంలో భాగం పంచుకుంటారా? అని అడిగాడు. అందుకు తండ్రి "మేం నీ పాపంలో భాగం పంచుకోం. తల్లిదండ్రుల్ని, భార్యను పోషించాల్సిన బాధ్యత నీకు ఉన్నది. కాబట్టి నువ్వు తెచ్చిన దానితో జీవిస్తాం. అది నువ్వు ఎట్లా సంపాదించుకొచ్చావన్న విషయం మాకు అవసరం లేదు. అట్లాగే దానివల్ల వచ్చే పాపంలో కూడా మాకు భాగం ఉండదు" అని తేల్చి చెప్పాడు. అగ్నిశర్మ భార్యను కూడా ప్రశ్నించి అదే సమాధానం పొందాడు. అప్పుడు అగ్నిశర్మకు వివేకం కలిగింది. ముఖం వ్రేలాడేసుకొని తిరిగి అత్రిమహర్షి వద్దకు వచ్చి జరిగింది చెప్పాడు. ఇంతకాలం చేసిన పాపకర్మలకు పరితాపం చెందాడు. మహర్షులంతా అగ్నిశర్మ పరిస్థితిని చూసి జాలిచెంది, అతణ్ణి అనుగ్రహించమని అత్రి మహర్షిని ప్రార్థించారు. దయాసముద్రుడైన అత్రిమహర్షి పాపనివారణకై ఒక ధ్యానయోగాన్ని ఉపదేశించాడు. నువ్వు ఉన్న పళంగా ఈ చెట్టు క్రిందనే కూర్చుని ధ్యానం ప్రారంభించు, పరమసిద్ధిని పొందగలుగుతావని ఆశీర్వదించి వెళ్ళిపోయారు. ఆ మహర్షులంతా తీర్థయాత్రలు పూర్తిచేసుకొని పదమూడు సంవత్సరాల తర్వాత తిరిగి ఆ దారినే రావడం తటస్థించింది. అగ్నిశర్మ తపస్సు చేస్తున్న చోట ఒక పుట్ట పెరిగింది. ఆ పుట్టలో నుండి పెద్దగా ధ్వని రాసాగింది. అప్పుడు వారు యోగదృష్టిని సారించి అగ్నిశర్మయే శరీర స్మృతి లేకుండా ధ్యాన సమాధిలో ఉండటం చూశారు. వారు అనుగ్రహించి ఆ పుట్టను ఛేదించి ఎముకల ప్రోగుగా ఉన్న అగ్నిశర్మ శరీరాన్ని అత్రిమహర్షి తన అమృత హస్తాలతో స్పృశించాడు. అగ్నిశర్మ కళ్ళు తెరచి దివ్యకాంతులతో ప్రకాశిస్తున్న ఆ మహర్షులను చూసి సాష్టాంగ ప్రణామం చేసి "మహర్షులారా!

మీ దివ్యానుగ్రహం వలన నాకు జ్ఞానం కలిగింది. పాపాలు పోయాయి" అంటూ పరమభక్తితో వారందర్నీ స్తుతించాడు. పరమ దయాళువులు, ధార్మికులు అయిన ఆ మహర్షులు అతడి భక్తికి మెచ్చి "మా ఉపదేశంతో సంపూర్ణ ధ్యానయోగాన్ని పొందావు. నీపైన పుట్టపెరగడం కూడా తెలియకుండా చిరకాలం పుట్ట (వల్మీకం) లోనే ఉన్నావు. కాబట్టి ఇకపైన నువ్వు 'వాల్మీకి' గా ప్రసిద్ధి చెందుతావు" అని ఆశీర్వదించి వెళ్ళిపోయారు.

భగవదనుగ్రహం చేతనే సద్గురువు లభిస్తాడు. సద్గురువు కటాక్షం వల్లనే మానవుడు దివ్యత్వాన్ని పొందుతాడు. అగ్నిశర్మ బ్రహ్మ అంశతో జన్మించినప్పటికీ ప్రారబ్ధకర్మ వశంచేత నివురుగప్పిన నిప్పులా అజ్ఞానంలో పడి హింసామార్గంలో పయనించాడు. అయినా కర్మపరిపక్వం కాగానే మళ్ళీ మహర్షి అయ్యాడు.

ఆ తర్వాత వాల్మీకి మహర్షి కుశస్థలికి పోయి తమసానదీ తీరాన ఆశ్రమాన్ని నిర్మించుకొని శిష్యులతో కూడి శివుని ఆరాధించాడు. నారదుని వలన రామకథను తెలుసుకున్నాడు. బ్రహ్మదేవుడే స్వయంగా వచ్చి "సరస్వతీదేవి నా అనుమతితోనే నీ నాలుకపై నిలిచి నీ చేత ఆ శ్లోకం పలికించింది. శ్రీరాముడు మహావిష్ణువు అవతారం; కాబట్టి ఆయన కథను రచించ" మని ఆదేశించాడు. అనగా వాల్మీకి త్రిమూర్తుల అనుగ్రహంతోనే రామాయణ రచనకు పూనుకున్నాడని తెలుస్తోంది. కాబట్టే 24 వేల శ్లోకాలు, నూరు ఉపాఖ్యానాలు, 500 సర్గములతో, ఆరు కాండములుగా విభజించి రామాయణ మహాకావ్యాన్ని విశ్వవిఖ్యాతి చెందేట్లు రచించాడు. బమ్మెర పోతన కూడా జన్మతః శివభక్తుడయినా, అటుపిమ్మట విష్ణుకథను వస్తువుగా స్వీకరించి సరస్వతీదేవి అనుగ్రహంతో శ్రీమద్భాగవతాన్ని రచించాడు. వాల్మీకి మహర్షి తన శివభక్తిని సందర్భం వచ్చినప్పుడల్లా ఎంతో ప్రీతితో వ్యక్తీకరించాడు. యుద్ధకాండములో "ఈ అస్త్ర సంపద ఆ మహేశ్వరుడికే ఉన్నది, మళ్ళీ నాకే ఉన్న" దని శ్రీరాముని నోట పలికిస్తాడు.

రామాయణం ఆదికావ్యం అని ప్రసిద్ధి చెందింది. ఎందువల్లనంటే రామాయణం రచించేటంతవరకు లౌకిక వాఙ్మయంలో మరో కావ్యం లేదు. అందువల్లనే ఆదికావ్యమని ప్రసిద్ధి

చెందింది. ఈనాడు మనం విప్లవాత్మకమైనవిగా చెప్పుకుంటున్న Faternity of mankind అని World Citizenship అని Human dignity అని Concern for Society అని Nationalism అన్న భావజాలమంతా రామాయణంలో మనకు అడుగడుగునా కనిపిస్తుంది.

రామాయణం పారాయణ గ్రంథంగా కూడా ప్రసిద్ధి గాంచింది. ముఖ్యంగా సుందర కాండము శక్తితత్త్వ ప్రతిపాదకమని కొందరి విశ్వాసం. ఇది శివుని మాహాత్మ్యాన్ని బోధించే మహద్గ్రంథమని అప్పయదీక్షితులు ప్రశంసించారు. ఇది విశిష్టాద్వైత సంప్రదాయానికి ప్రామాణిక గ్రంథమని, ప్రవృత్తి బోధకమైన ఉద్గ్రంథమని వైష్ణవులు కొనియాడడం విశేషం!

మరొక విశేషం ఏమంటే, రామచరితాన్ని రచించమని సాక్షాత్తూ బ్రహ్మయే వాల్మీకిని అదేశిస్తూ పర్వతాలు, నదులు, భూతలమునందు ఉన్నంతవరకు రామాయణ కథ లోకంలో వ్యాపించి ఉండునని తెలియజేశాడు. ఇది అక్షర సత్యం.

రామాయణంలో శ్రీరాముణ్ణి వాల్మీకి మహర్షి కేవలం మానవమాత్రుడిగానే చివరి వరకు చిత్రించాడు. అనగా పరమేశ్వరుడే “నా మాయయే నన్ను ఆవహించి ఉండుగాక” అని సంకల్పించి ఉంటాడు. తద్వారా శ్రీరాముడు మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, పతిభక్తి, సోదరప్రేమ, శరణాగత సంరక్షణము, సత్యవాక్పరిపాలనము మొదలైన విశిష్టమైన గుణాలను తాను ఆచరించి లోకానికి బోధించాడు. అందువల్లనే శ్రీరాముని చరిత్రను ఎన్నిసార్లు విన్నా, పారాయణం చేసినా విసుగనిపించదు. రావణ సంహారం తర్వాత దేవతలంతా వచ్చి “నువ్వు సాక్షాత్తు శ్రీమహావిష్ణువువే” అన్నప్పుడు “ఆ విషయం నాకు తెలియదు. నేను దశరథుని పుత్రుడును. నా పేరు రాముడు” అంటూ యుద్ధకాండం చివర తన అమాయకత్వాన్ని ప్రదర్శిస్తాడు. అంతేకాదు, బాలకాండ మొదలు యుద్ధకాండ వరకు అతడు మానవమాత్రుడిగానే ప్రవర్తిస్తాడు. రామాయణంలో కొందరు మహర్షులు శ్రీరాముణ్ణి శ్రీమహావిష్ణువుగా గుర్తించారు. కాని రాముడు తాను మాత్రం మామూలు మనిషిగానే జీవిస్తూ లోకాన్నంతటినీ తన మార్గంలో నడిచేట్లు చేశాడు.

దాంపత్యబంధం ఎంత పవిత్రమైనదో, ఎంత పురాతనమో మనకు రామాయణం బోధిస్తుంది. రాముడు శివధనుర్భంగం చేసినప్పుడు జనకుడు సీతాదేవిని వివాహం చేసుకోమని అడుగుతాడు. తండ్రి దశరథుని అనుమతి లేకుండా వివాహం చేసుకోనంటాడు. రాముడు వనవాసానికి వెళ్ళే ఘట్టంలో తల్లి కౌసల్యాదేవి కూడా రాముడి వెంట అడవులకు వెళ్ళడానికి సిద్ధపడుతుంది. అప్పుడు రాముడు తల్లిని ఓదార్చుతూ, తండ్రి దశరథ మహారాజు సేవలో తరించడమే ఆమెకు శ్రేయస్కరమని అదే పరమ సాధ్వీమణుల లక్షణమని వివరిస్తాడు. అట్లాగే రాక్షసజాతిలో కూడా మండోదరి పాతివ్రత్యాన్ని వాల్మీకి మహర్షి అతిపవిత్రంగా చిత్రించాడు. ప్రేమపాశం బలవత్తరమైనదని, ప్రేమ లేనివాడు ఎంతటి దుష్కార్యానికైనా వెనుకాడడని రామాయణం బోధిస్తుంది. కావున యుగయుగాలుగా వస్తున్న మన వివాహ వ్యవస్థను, దాని పవిత్రతను మనం ఎంతో జాగ్రత్తతో కాపాడుకోవాలి. అట్లా కాకుండా వివాహ బంధంలో ఏమాత్రం పొరబాటు జరిగినా పరిణామాలు విపరీతంగా ఉంటాయని వాలి వృత్తాంతం ద్వారా తెలియజేశాడు. వాలి మరణించాడని నమ్మిన సుగ్రీవుడు అన్న భార్య తారను స్వీకరిస్తాడు. ఇది వానర సమాజంలో ఆమోదయోగ్యమే అయినా, అంగదుడు సహించలేకపోయాడు. తన ఆవేదనను, ఆగ్రహాన్ని హనుమంతునికి తెలియబరుస్తాడు.

రామాయణంలో పితృభక్తిని, గురుభక్తిని, సోదర ప్రేమను ఎట్లా కాపాడుకోవాలో వాల్మీకి మహర్షి ఆయా ఘట్టాల్లో చక్కగా వివరించాడు. ఈ కట్టుబాటు చేతనే చిన్నవాళ్ళు సదాచారాలను గ్రహించగలుగుతారు. అనగా గురుభక్తి, పితృభక్తి, సోదరప్రేమల వంటి సద్గుణాలన్నింటినీ కుటుంబంలోని పెద్దలే నెలకొల్పాలి. పుత్రాదులపట్ల వారి కర్తవ్యాన్ని సరిగా నిర్వర్తించకపోతే కుటుంబ వ్యవస్థయే తారుమారైపోతుందని తెలుసుకోవాలి.

"ధన మూలమిదం జగత్!" – అన్నది అతిప్రాచీన సూక్తి. రామాయణ కాలం ఇందుకేమీ భిన్నం కాదు. ఎందువల్లనంటే ఇంద్రియాలన్నీ సుఖాలనే కోరతాయి. సుఖాలన్నీ ధనం మూలంగానే లభిస్తాయి. అంతవరకూ బాగానే ఉంది. ధనార్జన మోతాదుకి మించితే మొదటికే

మోసం వస్తుంది. ధనాన్ని, ధనమూలమైన సుఖాన్ని సీతారామలక్ష్మణులు తృణప్రాయంగా పరిత్యజించి ఎంత మహోన్నత స్థానాన్ని పొందగలిగారో మనం రామాయణంలో తెలుసుకుంటాం. కైకేయి రాముడు అడవులకు వెళ్తాడో వెళ్ళడోనన్న సందేహాన్ని వ్యక్తం చేస్తుంది. అప్పుడు ఆమె సందేహాలన్నీ నిరర్థకమైనవేనని కొట్టిపారేస్తూ ఇలా అంటాడు: “అమ్మా! నాకు అర్థకామాలు ముఖ్యం కాదు. నేను మంచి మార్గంలో నడుస్తూ, లోకాన్ని కూడా ఆ మార్గంలో నడిపించడమే నా లక్ష్యం. నేను ధర్మానికే ప్రాధాన్యం ఇస్తాను. నేను ముని జీవితాన్నే గడుపుతాను. గుర్తుంచుకో.” ఇక్కడ రాముడు ముని జీవితాన్ని గడపాలనుకోవడంలో తన అంతరంగాన్ని వెలిబుచ్చుతూ, “అర్థకామాలకు ప్రాధాన్యమివ్వనివాళ్ళే నిజమైన మునీశ్వరు” లని వాక్రుచ్చాడు.

భరతుడు సైన్యసమేతంగా చిత్రకూటానికి వచ్చేముందు లక్ష్మణుడు భరతుని భ్రాతృప్రేమను శంకిస్తాడు. అప్పుడు రాముడు ఇలా అంటాడు: “లక్ష్మణా! బంధుమిత్రుల్ని సంహరించి పొందే ధనం విషం కలిపిన ఆహారం వంటిది. అటువంటి ఆహారాన్ని నేను ఎన్నటికీ ముట్టను.” ఈ మాటలు అర్థకామాల యెడల రాముడికి గల విముఖతను మరోసారి నిరూపిస్తున్నాయి.

రావణాదులు ఇందుకు పూర్తిగా వ్యతిరేకం. అర్థకామాలే పరమార్థంగా భావించి నశించిపోయారు. ఈనాటి మన సమాజం కూడా రావణాది రాక్షస తత్త్వాన్నే జీర్ణించుకొని జీవిస్తోంది. అధికార దాహం, స్త్రీ వ్యామోహం, ధనకాంక్ష మొదలైన వ్యామోహాలు కొంతవరకైనా తగ్గి సుఖశాంతులతో జీవించడానికి రామాయణ పఠనం ఎంతగానో ఉపకరిస్తుందనడంలో ఏమాత్రం సందేహం లేదు. రామభరతాదులు రాజ్యం ‘నాకు వద్దంటే నాకు వద్ద’ ని పోటీపడ్డారు. అలాంటి వాళ్ళ ధార్మిక ప్రవృత్తి మనలో కొంతవరకైనా పరివర్తన తీసుకురావడంలో తప్పక ఉపకరించగలదు!

దశరథాదులది కావడానికి రాజ కుటుంబమే అయినా ఎన్నో కష్టాలను, మానసిక

ఒత్తిళ్ళను ఎదుర్కొన్నారు. సీతాదేవి హనుమంతునితో ఇలా అంటుంది. "దైవం మానవుడి మెడకు త్రాడు కట్టి ఒక్కొక్కప్పుడు అత్యధికమైన ఐశ్వర్యంలోకి, మరొకప్పుడు భయంకరమైన కష్టాల్లోకి లాక్కుపోతుంది" అని.

ఈనాడు సమాజంలో మనుషులు ఏ చిన్న కష్టం వచ్చిన తట్టుకోలేని స్థితికి జారిపోతున్నారు. మానసిక స్థైర్యాన్ని పూర్తిగా కోల్పోతున్నారు. ఏపాటి చిన్న కష్టం వచ్చినా హత్యకో లేక ఆత్మహత్యకో పాల్పడుతున్నారు. అందుకు ధన వ్యామోహం, స్త్రీవ్యామోహాలే (అర్థ కామాలే) ముఖ్యకారణం. జీవితానికి ఉత్తమాదర్శాలుండవు. ఆధ్యాత్మిక విలువలు అసలే అడుగంటాయి. లోకంలో కష్టాలు రాని మానవుడు ఎక్కడైనా ఉంటాడా? వాటిని సహించే శక్తిని పెంపొందించుకోవాలి. ఇందుకు దశరథుని కుటుంబం జగత్తుకంతటికీ ఆదర్శమవుతుంది. కావున రామాయణ పారాయణం ద్వారా సహనశక్తిని పెంపొందించుకోగలుగుతారు.

పరోపకారమే పుణ్యమని, పరపీడనమే పాపమని మన పెద్దలు సిద్ధాంతం చేసి చెప్పారు. కనుక ఈ కలియుగంలో పరోపకారానికి పెద్దపీట వేస్తే చాలు. అందుకు హనుమంతుడే ఏకైక ఉదాహరణం. ఇటువంటి మహాత్ముడు ఏ లోకంలోను, ఏ కాలంలోను కనబడదు. ఆయనకు ఆయనేసాటి. ఆయన్ను స్ఫూర్తిగా తీసుకొని ఆయన చేతల్ని, మాటల్ని, గుండె నిబ్బరాన్ని, మనోస్థైర్యాన్ని అలవరచుకోవాలి. ఆయన మాట ఎంత స్ఫూర్తిదాయకమో చూడండి.

"దిగులుపడకుండా ధైర్యంగా నిలబడితే అభివృద్ధి దానంతట అదే కలుగుతుంది. సుఖాలన్నింటికీ అభివృద్ధే మూలం. మరణిస్తే ఏం సాధిస్తాం? జీవించి ఉంటేనే ఏనాటికైనా మంచిని చూడగలుగుతాం." మనం శ్రద్ధతో రామాయణాన్ని పారాయణం చేస్తే ఇటువంటి ఉపదేశాలు అడుగడుగునా కనిపిస్తాయి. ఈ ఉపదేశాలకు దేశకాల భేదాలుండవు. ముల్లోకాలకు, త్రిగుణాలవారికి అవి సన్మార్గ దర్శకాలే. రామాయణం కేవలం పురాణమో, కావ్యమో మాత్రమే కాదు. సమాజం సుఖశాంతులతో వర్ధిల్లేందుకు పరోపకారమే ప్రథమ శాసనమని రామాయణం బోధిస్తుంది.

భరతుడు చిత్రకూటానికిపోయి తిరిగి రాజ్యాధికారాన్ని చేపట్టమని అడిగినప్పుడు భరతుని కోరికను మన్నించకపోయినా, శ్రీరాముడు ప్రజాసంక్షేమాన్ని ఎన్ని విధాలుగా కనిపెట్టి రాజ్యపాలన చెయ్యాలో భరతునికి ఉపదేశించాడు. అది లోకానికి ఎంతగానో ఉపకరిస్తుంది. ఆ ఉపదేశ సారాంశమిది:

నదీజలాలు సక్రమంగా వినియోగమవుతున్నాయా? వ్యవసాయం కుంటుపడకుండా ఉండే జాగ్రత్తలన్నీ తీసుకుంటున్నావా?

ప్రజలు నీ శాసనాలన్నీ శిరసావహిస్తున్నారా? ప్రభు ధిక్కారం జరగడం లేదుగదా? నువ్వు కూడా ప్రజాటంకమైన శాసనాలేవీ చెయ్యడం లేదుగదా?

ప్రజల నుండి పన్నులు అధికంగా వసూలు చెయ్యడం లేదుగదా? వసూలైన పన్నులన్నీ ప్రజాక్షేమానికే వినియోగం అవుతున్నాయి గదా! కోశాగారం ఎప్పుడూ సమృద్ధిగా ఉండేట్లు జాగ్రత్తలు తీసుకొంటున్నావా?

దోషులను దండించకుండా వదిలెయ్యడంగాని, నిర్దోషుల్ని దండించడం గాని జరగడం లేదుగదా?

గోసంరక్షణ నిరాటంకంగా సాగిపోతోంది గదా? దేశంలో గోసంపద తరిగిపోవడం లేదుగదా?

గూఢాచారులు దేశం నలుమూలలకూ పోయి ప్రజల కష్టసుఖాలను విచారించి వార్తలు తెస్తున్నారా?

ఈ ప్రశ్నల పరంపర శ్రీరాముడు గొప్ప పరిపాలనా దక్షుడని, నీతికోవిదుడని తెలియజేయడమే కాకుండా, యథార్థమైన పరిపాలనాదక్షుడు ఏయే మెలకువలు పాటించాలో లోకానికి చాటిచెబుతుంది.

ఈ విధంగా రామాయణ పఠనం పరమ పవిత్రమైనదేకాక రామాయణం పరమ ఆదర్శ గ్రంథమని ఋజువవుతోంది. మానవ జీవన ప్రవాహంలో కలిసి ప్రవహించి, ప్రభావం చూపగలిగే అనిర్వచనీయ దివ్యశక్తి రామాయణంలో ఉంది. త్రేతాయుగం నాటి కథ నేటికీ నిత్యనూతనమై అలరారుతుంది. రామాయణ పఠనం పరమ పవిత్రం, లోకహితకరం, మోక్ష పదానికి సోపానం.

–రచయిత



శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ॥

# బాలకాండము



## 1వ సర్గ నారదుడు రామాయణాన్ని సంక్షిప్తంగా చెప్పడం

తపోధనుడు, వేదాధ్యయనమునందు ఆసక్తి కలిగినవాడు వాఙ్మయవేత్తలలో శ్రేష్ఠుడు అయిన నారద మహర్షిని చూసి వాల్మీకి మహర్షి ఇట్లా ప్రశ్నించాడు.

వాల్మీకి మహర్షి : ఓ మహర్షీ! సకల సద్గుణసంపన్నుడూ, ధర్మజ్ఞుడూ, గొప్ప పరాక్రమ వంతుడూ, సత్యవ్రతుడూ, ధర్మం చక్కగా తెలిసినవాడూ, దృఢసంకల్పుడూ, సదాచార సంపన్నుడూ, సర్వభూతాలపట్ల సమభావం కలిగినవాడూ, మహావిద్వాంసుడూ, ఆదర్శప్రాయమైన నడవడిక గలవాడూ, ధైర్యవంతుడూ, ప్రకాశవంతుడూ, రాగద్వేషాలకు అతీతుడూ, సుందరుడూ, కోపమే లేనివాడూ, దేవతలైనా ఎదిరింపలేని పరాక్రమవంతుడూ, అసూయలేనివాడు, కామక్రోధ లోభమోహ మదమాత్సర్యాది అరిషడ్వర్గాలను జయించినవాడూ, ఎవరైనా ఇప్పుడు ఈ లోకంలో ఉన్నారా? ఉంటే అటువంటి మహానుభావుని చరిత్ర తెలుసుకోవాలని ఉంది. ఇటువంటి మంగళకరాలైన గుణాలు కలిగిన వ్యక్తిని త్రిలోకసంచారివైన నువ్వు తప్పక ఎరిగే ఉంటావు. నాకు అటువంటి పురుషుని గూర్చి తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది.

నారద మహర్షి : ఓ వాల్మీకి మహర్షీ! నువ్వు అడిగిన గుణగణాలన్నీ ఉన్నవాడు ఆ శ్రీమన్నారాయణుడు ఒక్కడే! అయినా అటువంటి గుణాలన్నీ కలిగి ఉన్న రాజు ఈ లోకంలో ఇప్పుడే రాజ్యపాలన చేస్తున్నాడు. అతడు ఇక్ష్వాకువంశంలో జన్మించాడు, రాముడు అనే పేరుతో ప్రసిద్ధి చెందాడు. ఆ రాముని కథను సంగ్రహంగా చెబుతాను విను:

ఓ వాల్మీకి మునీ! ఇక్ష్వాకువంశంలో జన్మించిన రాముని గూర్చి అందరికీ తెలుసు. నీవు అడిగిన సమస్త సద్గుణసంపన్నుడు ఆ శ్రీరాముడే, అతడు శ్రీమన్నారాయణ స్వరూపుడేనని మహాత్ము లంటారు. రాముడంటే అత్యంత శక్తిమంతుడేకాక స్వయంప్రకాశ స్వరూపుడు కూడా. సర్వజగత్తును తన అధీనంలో ఉంచుకొన్న పరబ్రహ్మమే. శ్రీరాముడంటే రమింపజేయువాడని, అఖండ సచ్చిదానంద పరబ్రహ్మ అని, యోగులు సర్వదా ఈయన యందు రమింతురని 'రామ' శబ్దాన్ని వ్యాఖ్యానిస్తారు.

పూర్వం ఇక్ష్వాకు మహారాజు శ్రీమన్నారాయణుని గూర్చి ధ్యానించి శ్రీరంగనాథునిలో సంలీన మయ్యాడు. ఆ తరువాత ఆయన వంశీయు లందరూ శ్రీమన్నారాయణుని తమ ఆరాధ్యదైవంగా అత్యంత నిష్ఠతో ఆరాధించారు. అందుకు ఎంతో సంతసించిన ఆ మహావిష్ణువు ఇక్ష్వాకువంశాన శ్రీరాముడుగా అవతరించి ఆ వంశాన్నే చరితార్థం చేశాడు.

శ్రీరాముడు సర్వశాస్త్రపారంగతుడు. ఆతడి బాహువులు మిక్కిలి బలిష్ఠమై మోకాళ్ళ దాకా ఉంటాయి. అందువల్ల ఆజానుబాహువని ఆతణ్ణి కీర్తిస్తారు. కంఠం శంఖం వలె ఉంటుంది. ఉన్నత మైన చెక్కిళ్ళు గలవాడు. ఇటువంటి సద్గుణాలు కలవారికి అలంకారాలతో పని ఉండదని, జీవిత మంతా సుఖాలనుభవిస్తారని సాముద్రిక శాస్త్రజ్ఞులు అంటారు.

రాముడు విశాలమైన వక్షస్థలం గలవాడు. రాముని దర్శనభాగ్యం చేతనే కామక్రోధాది అరిషడ్వర్గాలు సమూలంగా నాశం కాగలవు. కేవలం లోకకల్యాణం కొరకే అవతరించినవాడు. పెద్ద ధనుస్సును ఎప్పుడూ ధరిస్తాడు. బాహువులు మోకాళ్ళను తాకుచుండటం సార్వభౌముని లక్షణమని సాముద్రికులు అంటారు.

ఆ శ్రీరాముని శరీరం పొట్టి కాదు, మరీ పొడుగు కాదు. శరీరావయవాలన్నీ చక్కగా కొలిచి అమర్చినట్లుంటాయి. చక్కని శరీరచ్ఛాయతో తేజశ్శాలియై ప్రకాశిస్తూ ఉంటాడు. ఒక్కమాటలో చెప్పాలంటే అన్నీ శుభలక్షణాలే!

శ్రీరాముడు ధర్మం చక్కగా తెలిసినవాడు. శరణార్థులను రక్షిస్తూ ఉంటాడు. ప్రజాహితమే పరమలక్ష్యంగాగలవాడు, పరిశుద్ధుడు, నిజాయతీపరుడు. గురువుల యెడల, పెద్దల యెడల విధేయుడై ఉంటాడు.

శ్రీరాముడు సర్వోత్తముడు. శత్రువులను నాశనం చేసేవాడు. సర్వలోకాలను రక్షించే ధర్మరక్షకుడు. అపౌరుషేయుడు సాక్షాత్తూ పరబ్రహ్మస్వరూపుడే.

శ్రీరామునికి సర్వధర్మాలు తెలియటమేకాదు, తాను సంపూర్ణంగా వాటిని ఆచరించి చూపుతాడు. ఆతడికి వేదవేదాంగ రహస్యాలన్నీ చక్కగా తెలుసు. నాలుగు వేదాలు, వేదాంగాలైన శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. యుద్ధాల్లో ధనుస్సును, రథాన్ని, సారథిని, గుర్రాలను, ఛత్రాన్ని రక్షించగల అతిరథుల్లో శ్రేష్ఠుడు. ఆశ్రితరక్షకుడు.

అంతేకాదు, శ్రీరాముడు పురాణ, న్యాయ, మీమాంస, సాంఖ్య, వైశేషిక, యోగ మొదలైన ధర్మశాస్త్రాలన్నింటిలోనూ పారంగతుడు. ఏకసంథాగ్రాహి మాత్రమేకాదు, తెలుసుకున్న విషయమేదీ మరువడు, ప్రజలంటే అతడికి ప్రాణమైతే, ప్రజలందరికీ శ్రీరాముడే ప్రాణం. సుమధురమైన మాటలతో సంభాషిస్తాడు. ఎట్లాంటి విపత్కర పరిస్థితులు ఎదురైనా రాముడి మనస్సు కలత చెందదు. కార్యసాధనలో గొప్ప నేర్పుగలవాడు.

నదులన్నిటికీ కాలంతో నిమిత్తం లేకుండా, సముద్రాన్ని చేరటం తప్ప ఎట్లా గత్యంతరం లేదో అట్లాగే సత్పురుషులందరికీ శ్రీరాముని చేరడమే పరమగతి. శ్రీరాముని దర్శనం వారికి ఎల్లప్పుడూ ఆనందాన్ని కలిగిస్తుంది.

శ్రీరాముడు గాంభీర్యంలో సముద్రం వంటివాడు. ధైర్యసాహసాలలో హిమపర్వతంలా స్థిరమైనవాడు. ఓర్పున భూదేవి వంటివాడు. చంద్రుని వలె చల్లనైనవాడు. కోపం వస్తే కాలాగ్నియే. సంపదలలో కుబేరునికన్నా అధికుడు. ధర్మరక్షణ యందు మూర్తీభవించిన

ధర్మదేవతే! పరాక్రమంలో శ్రీమహావిష్ణువుతో సమానుడు, భూలోకాన పరాక్రమానికి తనకు తానే సాటి.

దశరథ మహారాజు సకల సద్గుణాభిరాముడైన శ్రీరాముని యువరాజుగా పట్టాభిషిక్తుని చేయా లని అనుకున్నాడు. కాని దశరథ మహారాజు అభీష్టాన్ని రాణులలో ఒకరైన కైకేయి వ్యతిరేకించింది. తనకు ముందెన్నడో మహారాజు ఇచ్చిన రెండు వరాలను ఇప్పుడు కావాలని పట్టుబట్టి శ్రీరామ యువరాజ్య పట్టాభిషేకానికి ఆటంకం కల్పించాలని సంకల్పించింది. అప్పుడు కైకేయి, దశరథుని తనకు పూర్వం ఇచ్చిన రెండు వరాలు ఇప్పుడే కావాలని పట్టుబట్టింది. అందులో శ్రీరాముని అరణ్యాలకు పంపటం మొదటిది. రెండవది తన కుమారుడైన భరతుని యువరాజుగా పట్టాభిషిక్తుని చేయడం.

ఇచ్చిన మాట తప్పని దశరథ మహారాజు రాముని అడవులకు పంపాడు. శ్రీరాముడుకూడా తండ్రి మాటను రాజాజ్ఞగా తలదాల్చి అరణ్యాలకు వెళ్ళి కైకేయికి సంతోషం కలిగించాడు.

లక్ష్మణుడు శ్రీరాముని అనుంగుసోదరుడు. శ్రీరాముని పట్ల అనన్య భక్తిశ్రద్ధలు గలవాడు. అతడు కూడా శ్రీరామునికి తోడుగా అడవులకు పోవడానికి నిశ్చయించుకొని తల్లి అయిన సుమిత్రకు సంతోషాన్ని కలిగించాడు.

జనక మహారాజు కుమార్తె, శ్రీరామునికి ధర్మపత్ని అయిన సీతాదేవి కూడా శ్రీరాముని వెంట అడవులకు వెళ్ళింది. అతిలోకసుందరియైన ఆ సీతాసాధ్వి సకల సద్గుణసంపన్నురాలు.

పురజనులనేకులు శ్రీరాముని వెంట గంగాతీరం వరకు వెళ్ళారు. ఆ తీరమందలి శృంగిబేరి పురానికి ప్రభువైన గుహుడనే బోయవాని సాయంతో గంగానదిని దాటి అరణ్యాల్లోకి ప్రవేశించారు.

తరువాత సీతారామలక్ష్మణులు అరణ్యాలను, నదులను దాటుతూ భరద్వాజ మహర్షి ఆశ్రమాన్ని చేరుకున్నారు. ఆయన సలహా మేరకు చిత్రకూట పర్వతంపైన పర్ణశాలను నిర్మించుకొని నివసింపసాగారు. సీతారామలక్ష్మణులు అక్కడ ఉన్నంత కాలం సుఖంగా జీవించారు. చిత్రకూట వాతావరణం, ఆశ్రమజీవనం వారిని అయోధ్యనే మరిపించింది.

శ్రీరాముడు అరణ్యములకు వెళ్ళిన తరువాత, దశరథ మహారాజు పుత్రశోకంతో మరణించాడు. దశరథ మహారాజు మరణానంతరం వసిష్ఠాది మహర్షులు భరతుని రాజ్యపాలనం చేయమని అడిగారు. తాను సమర్థుడే అయినా, శ్రీరాముని పట్ల గల భక్తి భావం చేత రాజ్యపాలనకు అంగీకరింపక, శ్రీరాముని ప్రసన్నుని చేసుకోవడానికి అరణ్యాలకు వెళ్ళాడు. శ్రీరాముని కలుసుకొని వినయంగా ఇలా ప్రార్థించాడు.

భరతుడు : అన్నా! నువ్వు సమస్త ధర్మాలు తెలిసినవాడవు, పెద్దవాడవు. నీవుండగా నేనెలా రాజ్యపాలన చేస్తాను? అందువలన నువ్వు తిరిగి నగరానికి వచ్చి రాజ్యపాలన చేపట్టు.

శ్రీరాముడు అందరికి సంతోషాన్ని కలిగించేవాడే అయినా తాను తండ్రికిచ్చిన మాట నిలబెట్టుకొనుటకై, భరతుని ప్రార్థన అంగీకరించలేదు. అయినా సోదరుని అభీష్టంకూడా నెరవేర్చే ఉద్దేశంతో తన పాదుకలనిచ్చి, తన ప్రతినిధిగా రాజ్యపాలన చేయమన్నాడు.

విఫలమనోరథుడైన భరతుడు, శ్రీరాముని పాదుకలనే పరమపదంగా సేవిస్తూ, అయోధ్యా నగరానికి సమీపాన గల నందిగ్రామం నుండి రాజ్యపాలన చేయసాగాడు.

ఓ వాల్మీకీ! భరతుడు తిరిగి అయోధ్యకు వెళ్ళిన తర్వాత, తను అక్కడే చిత్రకూటంలోనే ఉంటే భరతాదులు తరచూ వస్తూ పోతూ ఉంటారని తలచిన రాముడు అక్కడనుండి బయలుదేరి దండకారణ్యం చేరాడు.

అక్కడ దండకారణ్యంలో విరాధుడనే రాక్షసుణ్ణి చంపి, అగస్త్యాది మహర్షులకు

సంతోషాన్ని కలిగించాడు. అందుకు అగస్త్యుడు మెచ్చుకొని శ్రీరామునికి ఓ కత్తి, ధనుస్సు, తరగని బాణాలను బహూకరించాడు. శ్రీరాముడు కూడా తనకు సరియైన సమయంలో ఆయుధాలు సమకూరాయి గదా అని సంతోషించాడు.

దండకారణ్య ప్రాంతమంతా రాక్షస మయం. రాక్షస బాధలు అధికంగా ఉండేవి. అక్కడ ఉండే మహర్షులంతా తపోధనులైనా రాక్షస బాధల్ని ఓర్పుతో సహిస్తూ వచ్చారు. శ్రీరాముడు శరభంగ మహర్షి ఆశ్రమంలో ఉన్నప్పుడు మునీశ్వరులంతా కలసి రాక్షస బాధల నుండి తమకు విముక్తి కలిగించమని శ్రీరాముని ప్రార్థించారు. అప్పుడు శ్రీరాముడు "ఆ రాక్షసులను సంహరిస్తా" నని మునీశ్వరులకు అభయమిచ్చాడు.

దండకారణ్యంలో రావణుని పరివారం కూడా నివసిస్తూ ఉండేది. రావణుని సోదరి, కామ రూపిణియైన శూర్పణఖ శ్రీరాముని చూచి వలచింది. ఏకపత్నీవ్రతుడైన రాముడు ఆమెను వదలించు కోవాలనుకున్నాడు. లక్ష్మణుడు ఆమె ముక్కు, చెవులు కోసి రాముని ఆజ్ఞను శిరసా వహించాడు.

కామరూపిణియైన శూర్పణఖ తరపున యుద్ధానికి వచ్చిన ఖర, దూషణాది రాక్షసులందర్నీ శ్రీరాముడు సంహరించాడు. ఈ విధంగా శ్రీరాముడు తన దండకారణ్య వనవాస సమయంలో పదునాలుగు వేలమంది రాక్షసులను సంహరించాడు. తరువాత తన అనుచరుల మరణవార్త విన్న రావణుడి కోపం కట్టలుతెంచుకొంది. రాముని సంహరింపమని మారీచుని పంపాడు.

అప్పుడు మారీచుడు "ఓ రావణా! రాముడు సామాన్య మానవుడుకాదు. మహాబలశాలులైన పదునాలుగువేలమంది రాక్షసుల నొక్కడే సంహరించాడు. కాబట్టి అతడితో విరోధం తగదు" అని హితవు పలికాడు.

మృత్యువు సమీపించినవాడు మిత్రుని మాట వినడుకదా! అట్లే రావణుడు కూడా

మారీచుని సలహా పెడచెవిన పెట్టి ఇద్దరూ కలసి శ్రీరాముని ఆశ్రమానికి వెళ్ళారు.

మారీచుని సహాయంతో రామలక్ష్మణులను పర్ణశాల నుండి దూరంగా తీసుకొనిపోయి, ఒంటరిగా ఉన్న సీతను రావణుడు అపహరించాడు. ఆమెను రక్షించడానికై పోరాడిన జటాయువు నేలకొరిగాడు.

జటాయువు రామునికై ప్రాణములు నిలుపుకొని, సీతాదేవిని రావణుడు అపహరించాడని తెలిపి ప్రాణాలు విడిచాడు. సీతాపహరణను గూర్చి విన్న శ్రీరాముడు మిక్కిలి దుఃఖించాడు. ఆ తర్వాత జటాయువుకు దహన సంస్కారాలు జరిపాడు. సీతాదేవికై వెదకుతూ, అంధుడైన ఒక వికృతాకార రాక్షసుని శ్రీరామలక్ష్మణులు చూశారు.

శ్రీరాముడు ఆ కబంధుని చంపి దహన సంస్కారాలు చేశాడు. ఆ రాక్షసుడు శాప విముక్తి పొంది స్వర్గానికి పోతూ, శ్రీరామునితో "ఓ రామా! నీవు శబరి ఆశ్రమానికి వెళ్ళు. ఆమె ఎంతో ధర్మపరురాలు" అని చెప్పాడు. అంతట శ్రీరాముడు శబరి ఆశ్రమానికి వెళ్ళి ఆమె ఆతిథ్యాన్ని స్వీకరించాడు.

శ్రీరాముడు సీతాన్వేషణకై తిరుగుతూ, పంపా సరస్సును చేరుకున్నాడు. అక్కడ హనుమంతుని తోటి పరిచయ మేర్పడింది. హనుమంతుని ద్వారా సుగ్రీవునితో మైత్రి ఒప్పందం కుదుర్చుకున్నాడు. శ్రీరాముడు తమ వృత్తాంతమంతా సుగ్రీవునికి తెలిపాడు. తమకు సీతాన్వేషణలో సహాయపడమని కోరాడు.

శ్రీరామకథ ఆసాంతం విన్న సుగ్రీవుడు, శ్రీరాముడు కూడా తన వలెనే భార్యా వియోగంచే బాధపడుచున్నాడని గ్రహించాడు. అక్కడే వాళ్ళిద్దరూ అగ్నిసాక్షిగా మైత్రీబంధాన్ని దృఢతరం చేసుకున్నారు.

వాలితో వైరమెలా ఏర్పడిందని శ్రీరాముడు సుగ్రీవునడుగగా, సుగ్రీవుడు తన

వృత్తాంతమంతా రామునికి తెలిపాడు. అప్పుడు శ్రీరాముడు వాలిని సంహరిస్తానని ప్రతిజ్ఞచేశాడు. సుగ్రీవుడు వాలి విశేష బలపరాక్రమమాల గూర్చి తెలుపుతూ శ్రీరాముని పరాక్రమాన్ని సందేహించాడు. మహా బలశాలియైన వాలిని శ్రీరాముడు చంపగలడా? అని సుగ్రీవుడు సందేహించి, పూర్వం వాలిచే చంప బడి పర్వతంవలె పడివున్న దుందుభి కళేబరాన్ని చూపించాడు. అప్పుడు శ్రీరాముడు సుగ్రీవుని మనస్సులోని సందేహాన్ని పసికట్టి, ఆ దుందుభి మృతకళేబరాన్ని తన కాలి బ్రొటన వ్రేలుతో విసిరివేయగా అది పదియోజనాల దూరంలో పోయిపడింది. అయినా సుగ్రీవునికి మరింత నమ్మకం కలిగించడానికి ఒకే ఒక్క బాణంతో ఏడు మద్దిచెట్లను, ఒక పర్వతాన్ని ఛేదించి పాతాళానికి పోయి పడేట్లు బాణప్రయోగం చేశాడు.

సుగ్రీవుడు కిష్కింధ చేరుకొని గర్జించగా వాలి తన రాజభవనంనుండి బయటకు వచ్చి చూశాడు. ఇప్పుడు సుగ్రీవునితో యుద్ధానికి పోవద్దని తార వారించింది. అయినా మహాబలుడైన వాలి, సుగ్రీవునితో యుద్ధానికి తలపడ్డాడు. యుద్ధంలో శ్రీరాముడు వాలిని సంహరించాడు. తాను వాగ్దానం చేసినట్లుగానే రాముడు సుగ్రీవుని కిష్కింధకు పట్టాభిషిక్తుని చేశాడు. అనంతరం వానర శ్రేష్ఠులందరూ సీతాన్వేషణకై దేశం నలుమూలలకు వెళ్ళారు. మహా బలశాలియైన హనుమంతుడు సముద్రాన్ని లంఘించి రావణుని రాజ్యమైన లంకాపురిని చేరాడు. అక్కడ సీతాదేవిని అశోకవనంలో చూశాడు.

హనుమంతుడు శ్రీరాముడిచ్చిన అంగుళీయకాన్ని చూపి తాను రామబంటునని చెప్పి, శ్రీరామునకు సుగ్రీవునితో కలిగిన మైత్రీ ఒప్పందాన్ని గూర్చి తెలిపాడు; త్వరలోనే శ్రీరాముడు వస్తాడని ధైర్యం చెప్పాడు. అశోకవన ద్వారాన్ని ధ్వంసం చేశాడు. హనుమంతుని మట్టుపెట్టడానికి వచ్చిన ఐదుగురు సేనాపతులను, ఏడుగురు మంత్రులను, అక్షయ కుమారుణ్ణి హనుమంతుడు వధించాడు. చివరకు ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రానికి బంధితుడయ్యాడు. మూర్ఛితుడై పడివున్న హనుమంతుని రాక్షసులు త్రాళ్ళతో బంధించి ఈడ్చుకొనిపోయారు. పూర్వం బ్రహ్మదేవుడు ఇచ్చిన వర ప్రభావంచే బ్రహ్మాస్త్రం హనుమంతుణ్ణి కొద్దిక్షణాలు

బంధించగలిగింది. అప్పటికే రాక్షసులు తనను త్రాళ్ళతో బంధించి ఈడ్చుకొనిపోవటం తెలుసుకున్నాడు. రావణుని ఎదుట ప్రవేశ పెట్టగా, రావణునికి రామ సందేశాన్ని తెలిపాడు. సీతాసాధ్వి ఉండే అశోకవనం తప్ప మిగిలిన లంకా నగరాన్నంతటినీ దగ్ధంచేశాడు.

బుద్ధిశాలియైన హనుమంతుడు లంకా దహనంచేసి శ్రీరాముని వద్దకు వెళ్ళాడు. ప్రదక్షిణ నమస్కారంచేసి, సీతాదేవి సమాచారాన్ని రామునికి తెలిపాడు.

సుగ్రీవునితో కలసి శ్రీరాముడు సముద్రతీరం చేరి, తనకు దారి ఇవ్వనందుకు సముద్రునిపై కోపగించాడు. శ్రీరాముని కోపానికి భయపడిన సముద్రుడు మానవ రూపంలో వచ్చి తనపై సేతువును నిర్మించుకొమ్మని చెప్పాడు. తరువాత శ్రీరాముడు అదేవిధంగా సముద్రంపై సేతువు నిర్మించి, లంకకు చేరి రావణునితో యుద్ధం చేసి రావణుని సంహరించాడు. సీతను రావణుని చెర నుండి విడిపించాడేగాని, సీతాసాధ్విని గ్రహించడానికి సందేహించాడు. ఆ మాటనే అచ్చటి జను లందరితో శ్రీరాముడు చెప్పగా దుఃఖించిన సీతాసాధ్వి అగ్నిప్రవేశం చేస్తుంది. అగ్ని దేవుడు రాముని ఎదుట ప్రత్యక్షమై సీత ఎట్టి పాపమూ చేయలేదని తెలుపగా శ్రీరాముడు సీతను గ్రహిస్తాడు. దేవత లంతా పరమానందం చెందారు.

శ్రీరాముడు లోక కంటకుడైన రావణుని సంహరించటంచే ముల్లోకాలు సంతోషించాయి. రాముడు విభీషణుని లంకకు పట్టాభిషిక్తుని చేసి తన ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాడు. అప్పుడు దేవతలంతా శ్రీరాముని దర్శించి తమ కృతజ్ఞతలను ప్రకటించి వరాలిచ్చారు. దేవతలిచ్చిన వరములచే యుద్ధంలో మరణించిన వానరులందరూ సజీవులయ్యారు. తరువాత శ్రీరాముడు పుష్పక విమానంలో, స్నేహితు లతో కలసి అయోధ్యకు బయలుదేరాడు.

మార్గమధ్యంలో వారందరూ భరద్వాజాశ్రమానికి వెళ్ళారు. అక్కడ నుండి హనుమంతుని ముందుగా భరతుని వద్దకు పంపి రామ వృత్తాంతాన్ని తెలుపమన్నారు. తరువాత శ్రీరాముడు సుగ్రీవ –విభీషణాదులతో కలసి నందిగ్రామం చేరుకున్నాడు.

పాపరహితుడైన శ్రీరాముడు నందిగ్రామంలో సోదరులిద్దర్నీ కలుసుకున్నాడు. తదనంతరం వారు నారబట్టలు జటలను విడిచిపెట్టారు. మరల శ్రీరాముడు రాజ్యాన్ని పొందాడు. శ్రీరాముడు పట్టాభిషిక్తుడు కాగా ముల్లోకాలు సంతోషించాయి. ఆనందాతిశయంతో స్థావరజంగమాలన్నీ వృద్ధి చెందాయి. ప్రజలందరూ ధర్మవర్తనులయ్యారు.

రామరాజ్యంలో దుర్భిక్షంలేదు. వ్యాధుల్లేవు. భయంలేదు. తండ్రి బ్రతికివుండగా పుత్రులు మరణించేవారు కారు. స్త్రీలకు వైధవ్యముండేది కాదు. రామరాజ్యంలో అగ్ని భయం లేదు. నీటి వలన ఉపద్రవము లుండెడివి కావు. చోరభయం ఉండెడిది కాదు. ఆకలి చావుల్లేనేలేవు. ముసలితనం కాని, వ్యాధులచే బాధలుగాని లేక జనులు సుఖంగా జీవించే వారు.

దేశమంతా సుభిక్షమై ధనధాన్యాలతో సమృద్ధిగా ఉండేది. ప్రజలందరూ సుఖసంతోషాలతో ఉండేవారు. శ్రీరాముడు అనేక అశ్వమేధ యాగములు చేశాడు. బహు సువర్ణక యాగములు చేసి దేవతలను పూజించాడు. పది కోట్ల గోవులను, ధనధాన్యాదులను బ్రాహ్మణులకు దానం చేశాడు.

శ్రీరాముడు క్షత్రియులకు రాజ్యములిచ్చి వారి వంశవృద్ధికి తోడ్పడతాడు. నాలుగు వర్ణాలవారు వారి వారి ధర్మములను పాటించేట్లు నియంత్రిస్తాడు. ఈ విధంగా శ్రీరాముడు పదకొండు వేల సంవత్సరాలు రాజ్యపాలన చేసి బ్రహ్మలోకం చేరగలడు.

శ్రీరామ చరిత్ర పరమపవిత్రం, పాపాలను నశింపజేస్తుంది. పుణ్యం సమకూర్చిపెడుతుంది. ఇది వేదంతో సమానం. రామాయణగానం ఆయుర్దాయాన్ని పెంపొందిస్తుంది. రామాయణం పఠించే వారు పుత్రపౌత్రాదులతో, దాసదాసీ జనులతో స్వర్గసుఖం అనుభవిస్తారు. మరణానంతరం దేవతలచే పూజింపబడతారు.

రామాయణాన్ని బ్రాహ్మణులు పఠిస్తే అష్టాదశ విద్యలందు ప్రావీణ్యులవుతారు. క్షత్రియులు పఠిస్తే భూమండలాధిపతులవుతారు. వైశ్యులు పఠిస్తే అధికసంపదలు పొందుతారు.

శూద్రుడు పఠిస్తే గొప్పవాడవుతాడు.

# 2వ సర్గ బ్రహ్మ ప్రత్యక్షమవడం

వాల్మీకి మహర్షి ధర్మజ్ఞుడు. సమస్త శాస్త్రార్థాలు తెలిసినవాడు. నారదుడు చెప్పిన రామకథ విని విస్మితుడయ్యాడు. ఆయన శిష్యులుకూడా రామకథను వేనోళ్ళ కొనియాడారు. నారద మహర్షి ఉపదేశించిన రామకథయందు వేదాంతార్థాలను గ్రహించిన వాల్మీకి మహర్షి పరవశుడయ్యాడు. శిష్యులు కూడా పరమానంద భరితులయ్యారు. దేవర్షియైన ఆ నారద ముని వాల్మీకి మహర్షికి బ్రహ్మతత్త్వం ఉపదేశించి, గురుపూజలందుకొని దేవలోకానికి వెళ్లిపోయాడు.

తరువాత వాల్మీకి మహర్షి మాధ్యాహ్నిక కర్మానుష్ఠానాలకై భరద్వాజాది శిష్యులతో కలసి తమసా నదీతీరానికి వెళ్ళాడు. వారందరు బురదలేని నిర్మలమైన నీరుగల రేవునకు పోయారు. “భరద్వాజా! సత్పురుషుల హృదయంవలె ఈ నదీజలాలు నిర్మలమై మనోహరంగా ఉన్నాయి. చూడు” అన్నాడు.

తరువాత వాల్మీకి మహర్షి శిష్యునివద్దగల నారచీరలను అందుకొని స్నానమునకై నదిలోకి దిగాడు. ప్రకృతి రామణీయకతను చూస్తూ పులకించిపోయాడు. సమీపాన ఎడబాటులేకుండా కలసి తిరుగుచూ, మనోహరంగా ఎగురుచున్న రెండు క్రౌంచపక్షుల్ని చూశాడు.

వాల్మీకి మహర్షి శాపం ఇవ్వగల, ఉపసంహరింప గల సామర్థ్యం గలవాడు. పశుపక్ష్యాదులను వేటాడటమే వృత్తిగాగల బోయవాడొకడు మహర్షి ఆగ్రహిస్తారేమోననే సంకోచమైనా లేకుండా ఆ పక్షులలో మగపక్షిని తన బాణంతో నేలకూల్చాడు. వెంటనే ఆ మగపక్షి గిలగిలకొట్టుకుంటూ రక్తపు మడుగులో పడి చచ్చిపోయింది. అందమైన రెక్కలతో, తలపై ఎఱ్ఱటి కిరీటంతో ఉన్న ఆడుపక్షి కామం తీరనిదై వియోగంతో అతిదీనంగా ఏడ్వసాగింది.

వాల్మీకిమహర్షి దీనంగా విలపిస్తున్న ఆడ క్రౌంచ పక్షిని చూచి “రతి కాలమందు

చంపటం ధర్మంకా" దని తలచాడు. వెంటనే ఆ మహర్షి నోటి వెంట అప్రయత్నంగా ఈ శ్లోకం వెలువడింది.

మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః,
యత్ క్రౌఞ్చ మిథునాదేకమవధీః కామమోహితమ్.

(నిర్భాగ్యుడైన ఓ బోయవాడా! నీవు రతి కాలమందున్న క్రౌంచపక్షి దంపతుల నుండి ఒక దానిని చంపావు. అందుచే నీవు కూడా చాలాకాలం జీవించకుందువు గాక!)

మహాపండితుడు, బుద్ధిమంతుడైన ఆ మహర్షి శిష్యులతో "నేను ఆడు పక్షికై శోకార్తుడనై ఉండగా నా నోటి వెంట ఛందోబద్ధమై, సమానాక్షరములతో కూడిన నాలుగు పాదాల శ్లోకం వెలువడడం చాలా ఆశ్చర్యంగా ఉంది. ఇది ఛందోబద్ధంగా ఉంది, దీన్నే శ్లోకమంటారు. ఇటువంటిది ఇంతకు పూర్వం లేదు. అదీగాక వీణపై మీటి ఆలపించదగినదిగా కూడా ఉన్నది, ఏం ఆశ్చర్యం!" అని అన్నాడు.

వాల్మీకి శిష్యుడైన భరద్వాజుడు శాస్త్ర పారంగతుడు, వినయశీలి. వెంటనే గురుదేవుని మనోభావాన్ని తెలుసుకొని ఆ శ్లోకాన్ని అక్కడికక్కడే మననం చేసి కంఠస్థం చేశాడు. ఆశ్రమానికి వెళ్ళి తోటి శిష్యులందరిచే మననం చేయించాడు.

ధర్మవేత్తయైన ఆ వాల్మీకి మహర్షికి మళ్ళీమళ్ళీ ఆ పక్షి వృత్తాంతం తాను పలికిన శ్లోకం మనో ఫలకంపై మరల మరల గుర్తుకు రాసాగింది. శిష్యులందరూ ఆ శ్లోకాన్నే లయబద్ధంగా ఆలపిస్తూ ఉంటే మహదానంద పడిపోయాడు. ఆ సమయంలో సృష్టి కర్తయైన బ్రహ్మ అక్కడ ప్రత్యక్షమయ్యాడు. బ్రహ్మను చూడగానే వాల్మీకి మహర్షి ఆశ్చర్యపోయాడు. అంతలోనే తేరుకొని బ్రహ్మకు ప్రదక్షిణపూర్వక సాష్టాంగ నమస్కారం చేశాడు. అర్ఘ్యపాద్యాది ఉపచారాలుచేసి ఆసనంపై ఆసీనుని చేసి వినయంగా ఆయన ప్రక్కనే నిలబడ్డాడు. అప్పుడు బ్రహ్మ వాల్మీకి మహర్షిని తన ప్రక్కనే కూర్చుండబెట్టుకున్నాడు. మహర్షి ఆయన యెదుట కూర్చున్నాడే కాని,

మనస్సంతా క్రౌంచ పక్షిపైన, తాను ఉచ్చరించిన శ్లోకంపైనే లగ్నమై ఉంది. బ్రహ్మ వాల్మీకి మహర్షి మనోభావాలను గ్రహించాడు.

బ్రహ్మ : మహర్షీ! నీవు పలికింది శ్లోకమే. అందులో సందేహమే లేదు. నా అనుమతి పొందిన తరువాత సరస్వతీదేవి నీ నాలుకపై కొలువై ఈ శ్లోకాన్ని పలికించినది.

ఓ ఋషిసత్తమా! ఋషి కానివాడు కావ్యం వ్రాయలేడు. కనుక నువ్వు ఈ కావ్య రచన చేయటానికి శ్రేష్ఠుడవు. నీచే రచింపబడే ఈ కావ్యం కావ్యాలన్నింటిలోనూ శ్రేష్ఠమైనది అవుతుంది. నీవు రచించిన రామాయణ కావ్యం ఆచంద్రార్కం, ముల్లోకాల్లోనూ వ్యాప్తిగాంచుతుంది.

రాముడు ధర్మస్వరూపుడు లోకమునందలి ప్రశస్తమైన గుణములన్నీ అతడిలో ఉన్నాయి. నీవు నారదుని ద్వారా విన్నదంతా యథాతథంగా చెప్పు. రామలక్ష్మణుల కథను, సీతాదేవి కథను, భరతాదుల చరితము, రాక్షసుల చరిత్ర ఇత్యాదులన్నీ రహస్యమైనవే అయినా, నీకు ఇది వరకు తెలియని విషయములు కూడా నీకు స్పష్టమవుతాయి.

"ఈ కావ్యమందు నీవు చెప్పబోయే ఒక్క వాక్యం కూడా అసత్యం కాదు. రామకథ అంతా చదివినవారికి, విన్నవారికి కూడా పుణ్యం సంపాదించిపెడుతుంది. రామకథను శ్లోకబద్ధం చేయి."

బ్రహ్మదేవుడు ఈ విధంగా పలికి అంతర్ధానుడయ్యాడు. బ్రహ్మదేవుడే స్వయంగా వచ్చి ఆదేశించటంచే వాల్మీకీ, శిష్యులూ ఎంతో ఆశ్చర్యం చెందారు.

వాల్మీకీ, శిష్యులూ మరల మరల ఆ శ్లోకాన్ని గానం చేయసాగారు. అప్పుడు వాల్మీకి మహర్షి తనలో ఇలా తలపోశాడు: "ఈ రామాయణకావ్యం అంతటినీ ఈ శ్లోక వృత్తంతో రచిస్తాను."

"మా నిషాద" అను శబ్దంచే సీతారామ కల్యాణం వరకు బాలకాండగను; "ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః" అనే వాక్యం చేత ప్రితృవాక్య పరిపాలనను శ్లాఘిస్తూ అయోధ్యకాండగను;

"క్రౌఞ్చ మిథునాదేక మవధీ కామమోహితమ్" వాక్యార్థం ద్వారా వానర దంపతులైన తార, వాలి తోను, సుగ్రీవుని భార్య నపహరించిన వాలిని వధించు ఘట్టాలను వర్ణిస్తూ కిష్కింధాకాండగను,

"క్రౌఞ్చ" మిక్కిలి కృశించిన సీతాదేవి నపహరించి, విరహ దుఃఖమును వర్ణిస్తూ సుందర కాండగను; మరియు రావణ మండోదరులతో రావణుని చంపిన యుద్ధకాండ కథను వర్ణిస్తాను.

"ఓ నిషాద" సీతాదేవి మరల అరణ్యవాసం చేయుచు మిక్కిలి పీడించబడిన కథను తెలుపుతూ ఉత్తరకాండ కథను రచిస్తానుగాక అని తలపోశాడు.

# 3వ సర్గ రామాయణ వర్ణన

వాల్మీకి మహర్షి దర్భాసనంపై కూర్చుని ఆచమనంచేసి నారద మహర్షి తెలిపిన రామకథ అంతా మనస్సులో మరల మననం చేసుకున్నాడు. ఆ తరువాత తాను రచింపదలచిన కథనంతా తన దివ్యశక్తిచేత మనస్సునందే ఎవరెవరు ఏయే పనులు ఎట్లా చేశారో అన్నింటినీ చక్కగా తెలుసుకున్నాడు.

అప్పుడామహర్షి దశరథ మహారాజు రాజ్యపాలన గూర్చీ, రాజ్యభోగాలనుభవిస్తున్నప్పుడు సీతారామలక్ష్మణులు ఎట్లా ఉండేవారో తెలుసుకున్నాడు. తరువాత వారు రాజ్యం వీడి అడవుల్లో సంచరించుచున్నప్పుడు ఎట్లావున్నారో తన యోగదృష్టిచే దర్శించాడు.

యోగదృష్టిలో తాను తెలుసుకొన్న విషయాలన్నింటినీ గ్రహించి. తపః ప్రభావముచే నారదుడు తనకు తెలిపిన విషయములకన్న అధికముగా అనేక విషయములను దర్శించాడు.

శ్రీరాముని అవతార తత్త్వమును, మహాపరాక్రమమును, ఓర్పు, సౌందర్యం, సత్యశీలతలను జనరంజకంగా ఉండేట్లు చిత్రించుకొన్నాడు. తరువాత రాముడు విశ్వామిత్రునితో కలిసి అడవులకు పోవటం, శివధనుర్భంగం, సీతాపరిణయం వంటి ఘట్టాలను కడు రమణీయంగా చిత్రించుకొన్నాడు. పరశురామ దశరథరాముల సంవాదం, దశరథుడు రామునకు యువరాజ్య పట్టాభిషేకం తలపెట్టడం, కైకేయి అడ్డుపడటం, తిరిగి సీతారామలక్ష్మణుల వనవాసం, చిత్రకూటంలో పర్ణశాలను నిర్మించు కొనటం, దశరథ మహారాజు మరణించినా కూడా తండ్రికిచ్చిన మాటను నిలబెట్టుకొనుటకై భరతునకు తన పాదుకలనిచ్చి పంపటం మున్నగు సన్నివేశాలన్నీ మహర్షి తన మనోఫలకముపై చిత్రించుకున్నాడు.

శ్రీరాముడు శరభంగ, సుతీక్ష్ణ మహర్షులను సందర్శించటం, సీతాసాధ్వి అనసూయతో

సంభాషించటం, శూర్పణఖకు శృంగభంగం గావించటం, రావణుడు సీతను అపహరించటం, రాముడు సీతకై విలపించటం, ఋష్యమూక పర్వతమునకు జేరటం, కబంధుని, శబరిని, హనుమంతుని కలుసుకోవటం, సుగ్రీవునితో మైత్రి కుదుర్చుకొనటం, వాలిని వధించి సుగ్రీవునికి పట్టం కట్టటం, సీతాన్వేషణకై హనుమంతుడు సముద్రాన్ని లంఘించి లంక చేరటం, అశోకవనంలో సీతాసాధ్విని కలిసి రాముడిచ్చిన ఉంగరమును ఆమెకివ్వటం, హనుమంతుని భటులు బంధించి రావణుని వద్దకు తీసుకొనిపోవటం, లంకాదహనం గావించి, హనుమంతుడు తిరిగి రాముని కలసి సీతాసాధ్వి ఇచ్చిన చూడామణిని సమర్పించటం, అంతట రాముడు వానరసైన్యంతో కలసి సముద్రం మీద సేతువు నిర్మించి లంకకు చేరటం, ఘోరంగా యుద్ధంచేసి రావణుని సంహరించటం, విభీషణునికి లంకకు రాజునుజేసి తాను సీతా లక్ష్మణ సమేతుడై పుష్పకవిమానంలో అయోధ్యకు చేరటం, రామ పట్టాభిషేకానంతరం వానరసేన అంతా తిరిగి వెళ్లటం. రామరాజ్యపాలనం, సీతను తిరిగి అడవులకు పంపటం మున్నగు విషయాలన్నీ వాల్మీకి మహర్షి మనస్సున చిత్రించుకొన్నాడు. జరుగబోయే రామకథనంతా ఉత్తరకాండగా మనస్సున చిత్రించుకొన్నాడు.

# 4వ సర్గ లవకుశులు రామకథను వినిపించటం

వాల్మీకి మహర్షి భగవదాంశసంభూతుడు. ఆయనే రామచరితమునకు సమర్థుడని బ్రహ్మయే ఎంపికచేశాడు. వాల్మీకికి పూర్వం కావ్యాలే లేవు. అప్రయత్నంగా తన నోటినుండి జాలువారినది శ్లోకమువలె ఉన్నదే అని ఆలోచిస్తూ ఉండగా బ్రహ్మదేవుడే స్వయంగా వచ్చి అది శ్లోకమేననీ, ఆ శ్లోకాన్నే కథాంశంగా స్వీకరించి రామకథ వ్రాయమని ఆదేశించి అంతర్ధానుడయ్యాడు.

తరువాత వాల్మీకి మహర్షి రామరాజ్యమునందు జీవిస్తూనే, రామచరితమును కావ్యంగా వ్రాశాడు. ఆ రామచరితము ఏడు కాండలతో, ఐదువందల సర్గలతో, ఇరువది నాలుగువేల శ్లోకాలతో కూడి ఉన్నది.

రామకథ పూర్తి అయినది. ఆ గ్రంథాన్ని 'రామాయణ' మనీ 'సీతాచరిత' మనీ, "పౌలస్త్యవధ" అనీ, ఏదో ఒక నామం స్థిరం చేయాలని తలచాడు. ఆ రామకథ శ్రావ్యంగా గానం చేయడానికి కూడా తగి ఉన్నది. అప్పుడు వాల్మీకి మహర్షి కళ్ళుమూసుకొని "ఈ కథను ఎవరిచే గానం చేయించాలి?" అని మనస్సులో తలచుచుండగా, ఆశ్రమనివాసులైన లవకుశులను బాలురిద్దరు వాల్మీకి మహర్షి పాదాలకు నమస్కరించి తామాకథను గానం చేస్తామని తెలిపారు.

లవకుశులు బాలురు. ఆశ్రమంలోనే విద్యాభ్యాసం చేస్తున్నారు. సాంగవేదాన్ని పూర్తిగా అధ్యయనం చేశారు. చక్కటి సంగీత జ్ఞానంకలవారు. కుశలవులా గ్రంథాన్ని గానం చేసి చూపారు. సాహిత్యపరంగా అందలి భాషార్థాలు, భావగాంభీర్యం, సంగీత కౌశలం జోడించి చక్కగా గానం చేశారు. తమ హావభావములచే శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుత, శాంతరసాలను చక్కగా పోషించారు. సంగీత రహస్యాలన్నీ ఎరిగి మానవరూపంలోని గంధర్వులను తలపింపజేశారు. ఆ బాలురిరువురూ అపూర్వ సౌందర్యంతో

ఉత్తమ లక్షణాలతో అలరారుచుండిరి.

గురుదేవులైన వాల్మీకి మహర్షి నుంచి గానం చేసే మెలుకువలన్నీ తెలుసుకొని ఆ కావ్యాన్ని ఎవరూ తప్పుపట్ట వీలులేని విధంగా కంఠస్థం చేశారు.

ఒకనాడు ఆ బాలులిరువురును కొందరు ఋషీశ్వరుల యెదుట ఆ కావ్యగానం చేశారు. ఆ ఋషీశ్వరులందరూ కావ్య, గానమాధుర్యాలకు ఆనందబాష్పాలు కార్చారు. వారిలో ఒక మహర్షి ఆనందపారవశ్యంలో తన కలశాన్ని బాలురకు బహూకరించాడు. మరొక మహర్షి తన నారచీరను బహూకరించాడు.

వాల్మీకి మహర్షిచే రచింపబడిన రామాయణం ఆయుస్సు వృద్ధి పొందించునదిగాను, చెవులకు ఇంపైనదిగాను, పుష్టికరంగాను ఉండడంతో, ఆ కుశలవులను వేనోళ్ళ పొగిడారు. ఆ బాలురిరువురూ ఆ రామాయణ గాథను గానం చేయుచుండగా, ఒక రోజు రాముని కంటపడ్డారు. అంతట రాముడు ఆ బాలురను తన రాజప్రాసాదానికి తీసుకొనిపోయి, తన సోదరులను, మంత్రులను పరివారమును రప్పించి, లవకుశులచే రామకథను పాడించాడు. లవకుశులు రాగయుక్తంగా పాడగా, వారి కంఠ స్వరం వీణాతంత్రుల లయకు సరిపడేట్లు ఉండినది. అందలి అర్థం స్పష్టంగా బోధపడేది. జనులా లవకుశుల గానమునకు ముగ్ధులయ్యారు.

శ్రీరాముడు : ఓ జనులారా! వీరిరువురూ మునులే అయినా వీరిలో రాజలక్షణాలు స్పష్టంగా తెలుస్తున్నాయి. వీరు బాలకులే అయినా గొప్పతపస్సంపన్నులవటం వలన వీరి గానమాధుర్యంచే సదస్యులను మురిపించగలుగుచున్నారు. వీరు గానంచేసే సీతాచరితం నాకు కూడా ఊరట కలిగించేదిగా ఉన్నది. సావధానంగా వినండి.

శ్రీరాముని ప్రశంసాపూర్వకమైన మాటలకు లవకుశులు రెట్టింపు ఉత్సాహంతో మార్గ, దేశీయమనే రెండు పద్ధతులలోను గానాన్ని కొనసాగించారు. రాముడు కూడా ఆ గానానికి

ఎంతో ముగ్ధుడయ్యాడు.

# 5వ సర్గ అయోధ్యానగర వర్ణన

ఈ భూమండలాన్నంతా పూర్వం మనుచక్రవర్తి పరిపాలించేవాడు. ఆయన వంశీయుడైన సగరుడనే చక్రవర్తి తన అరువది వేలమంది కుమారులచేత సువిశాలమూ, అగాధమూ అయిన సాగరాన్ని త్రవ్వించాడు. సగరునిచే త్రవ్వించబడినదవటంచేత దానికి సాగరమనే నామం సార్థక మైంది. మహామహితాత్ములైన ఇక్ష్వాకు చక్రవర్తికూడ ఈ వంశంలో జన్మించినవాడే. అప్పటి నుండి ఈ వంశం ఇక్ష్వాకువంశంగా ప్రసిద్ధి చెందింది. అటువంటి మహాత్ములు జన్మించిన వంశంలో శ్రీరాముడు జన్మించాడు. అటువంటి రామకథను తెలిపే ఈ రామాయణం ధర్మార్థకామ మోక్షాలనే పురుషార్థాలను ప్రతిపాదించుచున్నది. సావధానులై వినండి.

సరయూనదీ తీరాన ఉన్న కోశలరాజ్యం ధన ధాన్యాలతోను సర్వసంపదలతోను తులతూగు తున్నది. ఆ దేశ ప్రజలు నిత్యసంతుష్టులై ఉండిరి. అయోధ్యానగరం ఆ రాజ్యానికి రాజధానియై వెలయుచున్నది. సకల జగత్తుకు ప్రభువైన మనుచక్రవర్తి ఆ మహానగరాన్ని స్వయంగా నిర్మించాడు. ఆ మహానగరం పన్నెండు యోజనాల పొడవు, మూడు యోజనాల వెడల్పు కలిగి ఉన్నది. ఆ నగరం జూదపు బల్లవలె అష్టపదాకారాన్ని పోలి ఉంటుంది. కోటకు నాలుగుప్రక్కలా, నాలుగు మూల లందూ విశాలమైన రాజమార్గాలు నిర్మించబడ్డాయి. ఆ మార్గాలన్నింటిని చల్లటి నీటితో తడుపుతూ, వాటిపై పుష్పాలు చల్లుతూ ఉంటారు.

ఆ అయోధ్యానగరం శత్రుదుర్భేద్యమై చుట్టూ ఎత్తైన ప్రహరీగోడలతో పెట్టని వడ్డాణంలా నిర్మించబడి ఎల్లవేళలందు సాయుధులైన సైనికులు కావలి కాస్తూ ఉంటారు. ప్రహరీగోడకు బయట సువిశాలమూ, అగాధమూ అయిన కందకాలు త్రవ్వి నీరు నింపబడి శత్రుదుర్భేద్యమై ఉంటుంది.

ఆ నగరమంతటా చదునైన నేలపై సొగసైన భవనాలు నిర్మించబడి ఉంటాయి. జనులు వరి బియ్యంవంటి రుచికరమైన ఆహారం తింటూ ఉంటారు. ఆ నగరంలోని బావులందు చెరకు

రసం కన్నా మధురమైన జలాలు స్రవిస్తూ ఉంటాయి. జనులు సర్వకాలములందూ సంతోషసల్లాపాలతో ఉంటారు; నగరం దుందుభి, వీణ మున్నగు మంగళవాద్యములతో మారుమ్రోగుతూ ఉంటుంది.

ఆ నగరంలో మహావీరులు, యోధానుయోధులు నివసిస్తూ ఉంటారు. ఎంతటి వీరులైనప్పటికీ పరమధర్మపరులు. ఒంటరిగవున్న వానిని, వెనుదిరిగి పోవువానిని ఎన్నడూ బాణములచే కొట్టేవారు కారు. జనులను బాధించు పులులు, సింహములవంటి క్రూరమృగాలను బాణములచేగాని, బాహువులతోగాని ఎదిరించి చంపేవారు.

ఆ మహానగరమంతా ఉద్యానవనాలతోను, మామిడి మున్నగు పండ్లతోటలతోను, పూదోటల తోను నిండి ఉంటుంది. అచ్చట రత్నఖచితమయమైన భవనములన్నీ మహాశిల్పులచే నిర్మించబడ్డాయి. ఆ మహానగరమునందు ఎంత వెదికినా దోషమే కనిపించదు. అటువంటి అయోధ్యా మహానగరాన్ని దశరథ మహారాజు పరిపాలించేవాడు.

# 6వ సర్గ దశరథుని అయోధ్య

దశరథ మహారాజు ఇక్ష్వాకుల రాజులలో అగ్రగణ్యుడు. శత్రుభయంకరుడు. అతిరథుడు, పండితపక్షపాతి. విశాల దృక్పథమూ, అపార దూరదృష్టీగలవాడు. మహాతేజోవంతుడు. అయోధ్య యందలి పౌరులేకాక, అడవులలో నివసించే జానపదులు కూడా దశరథుని పట్ల ప్రేమపాత్రులై ఉండేవారు. ఎన్నో యాగాలు చేసి, ఎందరో బ్రాహ్మణులకు దానాలిచ్చి ఇటు రాజులలను, అటు ఋషులలను, సర్వజనులను అభిమానంతో తన వశమునందుంచుకొనేవాడు: అంటే మిత్ర సంపద కలిగినవాడని అర్థం. ధనంలో కుబేరునితో సమానుడు. ఇంద్రియాలను జయించినవాడు. ఇంద్రుడు అమరావతిని పాలించినట్లు, దశరథుడు అయోధ్యను పాలించాడు.

అయోధ్యానగర వాసులందరూ ధర్మపరులు. తమకున్నంతలో సంతృప్తి చెందేవారు, సర్వశాస్త్ర పారంగతులు. ఆ నగరంలో ధర్మార్థకామాలనే పురుషార్థాలకై పాటుపడనివారు లేరు. ధనధాన్యాలతో నిత్యసంపదలతో తులతూగేవారు. లోభికాని, కాముకుడుకాని, విద్యాహీనుడుకాని, నాస్తికుడుకాని కాగడావేసి వెతికినా కనిపించేవాడు కాడు.

ఆ నగరంలో స్త్రీలు, పురుషులు ధర్మపరులు, ఇంద్రియనిగ్రహం కలవారు. పవిత్ర భావాలు కలవారు. బంగారు ఆభరణములు ధరింపనివారు గాని, భోగభాగ్యములను అభవింపనివారు గాని, పూలమాలలు ధరింపనివారు కాని, చందన, తాంబూలాది సుగంధ ద్రవ్యములు సేవించనివారు కాని వెదకినా కానరారు.

అయోధ్యలో అందరూ అగ్నిహోత్రాలు చేసేవారే. అందరూ యాగాలు చేయటంలో ఉత్సాహం చూపేవారే. బ్రాహ్మణులందరూ వేదాధ్యయనం చేస్తూ, నిత్యకర్మల నాచరిస్తూ ఉంటారు. దానాలు స్వీకరించటంలో ఆసక్తి లేనివారు. ఏకపత్నీవ్రతులై మెలగెడివారు. అయోధ్యానగరంలో రాజభక్తి లేనివారు గాని, ఐశ్వర్యం, సౌందర్యం లేనివారు గాని మచ్చుకైనా

కానరారు.

అయోధ్యలో నాలుగు వర్ణాలవారు దైవభక్తి కలిగినవారే. ఉదారులు, కృతజ్ఞులు, శూరులు, పరాక్రమవంతులు, దీర్ఘాయువులు, సత్యతత్పరులు అయి సుఖసంతోషాలతో జీవించేవారు. క్షత్రియులు బ్రాహ్మణులను, వైశ్యులు క్షత్రియులను ఎల్లప్పుడూ అనుసరించేవారు. శూద్రులు అదేవిధంగా మూడు వర్ణములవారికి ఉపచారం చేస్తూ తమ ధర్మాన్ని పాటిస్తూ ఉండేవారు.

దశరథుని రాజ్యపాలన అన్ని విషయాలందూ మనుచక్రవర్తి పరిపాలనను తలపింపజేస్తూ ఉండేది. ఆయన సైన్యం సింధుదేశంలో పుట్టిన మేలుజాతి గుర్రములతో నిండి ఉండేది. ఐరావతజాతి, అంజనజాతి, వామనజాతికి చెందిన ఏనుగులెన్నో లెక్కకుమించి ఉండేవి. అయోధ్యకు బయట కూడా రెండు యోజనాల వరకు శత్రువులు చేరలేరు. ఆ విధంగా అయోధ్య అనే నామాన్ని సార్థకం చేసేది. అట్టి దశరథ మహారాజు నక్షత్రములను పాలించే చంద్రుని వలె ప్రకాశించాడు.

# 7వ సర్గ దశరథుని రాజ్యపాలన

దశరథ మహారాజునకు ఎనిమిదిమంది మంత్రులు ఉన్నారు. వారందరూ అశేష ప్రజ్ఞా వంతులు, ఋజువర్తనులు, ప్రభుభక్తిపరాయణులు. ప్రజలను చూచినంతనే వారి మనోభావాలను పసిగట్టగలిగిన సమర్థులు. అవినీతియన్నదే వారెరుగరు. రాజ్యక్షేమానికై ఎల్లవేళలా సంసిద్ధులై ఉండేవారు.

ధృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థ, సాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు, సుమంత్రుడు – వీరు మంత్రిమండలిలోనివారు. దశరథ మహారాజు శ్రేయస్సును కోరే వసిష్ఠుడు, వామదేవుడను ఋషిసత్తములు ఉన్నారు. వీరేకాక మరికొందరు మంత్రిసత్తములతో కూడి దశరథ మహారాజు తన ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలించేవాడు.

ఆ మంత్రులందరూ ఎప్పటికప్పుడు రాజ్యంలో జరిగే విషయాలనేకాక పొరుగురాజ్యాలలో జరిగే విశేషాలను, ప్రజల కార్యకలాపాలను గూఢచారుల ద్వారా తెలుసుకొంటూ ఉండేవారు. అసత్య వాదులుగాని, కామక్రోధాదులచే నేరాలు చేసేవారుగాని ప్రజలలో ఉన్నా, చివరకు తమ సొంతపిల్లలే అయినా కూడా వివక్షత చూపకుండా తగిన దండన విధించేవారు. నేరానికి మించిన శిక్ష ఎన్నడూ విధించేవారు కాదు.

ధనాగారాన్ని సమృద్ధిగా ఉంచడంలోను, సైన్యాన్ని సుశిక్షుతులుగా ఉంచడంలోనూ ఎల్లప్పుడూ అప్రమత్తులై ఉండేవారు. తప్పుచేయనివారైతే శత్రువులనుకూడా శిక్షించేవారుకాదు. రాజు హితాన్నే ఎల్లప్పుడూ కోరుకునేవారు. వయోవృద్ధులను గౌరవిస్తూ వారి సుగుణాలనే పరిగణనలోనికి తీసుకొనేవారు.

ఆ మంత్రి సత్తములందరూ యుద్ధశాస్త్రంలో ఆరితేరినవారే కాక, రాజనీతిజ్ఞులై గొప్ప చాకచక్యంతో మసలుకునేవారు. ఎప్పుడు యుద్ధం చెయ్యాలో, ఎప్పుడు సంధి చేసుకోవాలో బాగా

ఎరిగిన వారవడంచేత శత్రువులతో కూడా ప్రియసంభాషణలే చేసేవారు.

అట్టి మంత్రులతో పరిపాలించే దశరథుడు తనకుగాని, ప్రజలకుగాని హాని తలపెట్టిన సామంత రాజులందరినీ సంహరిస్తూ, ఎదురులేనివాడై దేవేంద్రుడు స్వర్గాన్ని పాలించినట్లు పాలించే వాడు. తనకన్నా బలవంతుడుగాని, సమానుడుగాని లేనివాడై దశరథ మహరాజు ఈ భూమండలాన్ని పరిపాలించాడు.

# 8వ సర్గ దశరథుడు అశ్వమేధయాగాన్ని సంకల్పించడం

ధర్మజ్ఞుడు, బహు ప్రజ్ఞాశాలి అయిన దశరథునికి చాలాకాలంవరకు సంతానం కలుగక పోవడంతో, అశ్వమేధయాగంను చేయతలపెట్టాడు. వెంటనే సుమంత్రుని పిలిచి తన మనస్సులోని మాటను తెలిపి గురువులను, పురోహితులను పిలిపించవలసినదిగా ఆదేశించాడు.

అంతట సుమంత్రుడు సుయజ్ఞుని, వామదేవుని, జాబాలిని, కాశ్యపుని, వసిష్ఠుని మరియు కొంతమంది బ్రాహ్మణోత్తములను వెంటబెట్టుకొని దశరథ మహారాజు దగ్గరకు వచ్చాడు.

దశరథుడు వారందరినీ అర్ఘ్యపాద్యాదులతో ఆదరించి ప్రియవచనాలు పలుకుతూ, తన మనోవ్యధను వారిముందుంచాడు. పుత్రార్థియై అశ్వమేధయాగాన్ని చేయసంకల్పించినట్లు వారికి తెలిపి అందుకు తగిన ఏర్పాట్లు చేయమని ఆదేశించాడు.

వసిష్ఠుడు మున్నగు బ్రాహ్మణోత్తములందరూ దశరథుని నిర్ణయాన్ని వేనోళ్ళ అభినందించారు. "ఓ రాజా! నీ సంకల్పం ధర్మసమ్మతమైనది. ఈ యాగాన్ని అవశ్యం చెయ్యాలి. తమకు పుత్ర సంతానం ప్రాప్తిస్తుంది" అని దీవించారు.

అంతట దశరథుడు అశ్వాన్ని వదులుటకు ఏర్పాట్లు చేయించాడు, సరయూనదికి ఉత్తర దిక్కున యజ్ఞశాలను నిర్మింపచేశాడు. అశ్వరక్షణార్థమై తగిన వీరులను నియోగించాడు. బ్రహ్మరాక్షసుల బెడద కలుగకుండేట్లు క్రతువులన్నీ శాస్త్రసమ్మతంగా నిర్వహించమని బ్రాహ్మణులను ఆదేశించాడు. (సామాన్యంగా ఇట్టి యాగాలందు సంప్రదాయ విరుద్ధంగా చేసే బ్రాహ్మణులు, మరణానంతరం బ్రహ్మరాక్షసులై యాగములను ధ్వంసం చేస్తూ ఉంటారు.) ఆ బ్రాహ్మణులందరూ, తాము యాగాన్ని సక్రమంగా నిర్వహిస్తామని రాజుకు ధైర్యం చెప్పి మహారాజు వద్ద సెలవు తీసుకొని వెళ్ళారు. బ్రాహ్మణులు వెళ్ళిన తరువాత, దశరథుడు తన మంత్రులకు తక్కిన రాజోద్యోగులకు తగు ఆదేశాలిచ్చి పంపేశాడు. తరువాత రాజు, తన

రాణులందరినీ కలసి, తన సంకల్పాన్ని తెలిపి, వారందరినీ దీక్ష వహించమని ఆదేశించాడు. రాజు నోటి వెంట మనోహరమైన ఆ మాటలు వినగానే రాణులందరూ ఆనందపరవశులైపోయారు.

# 9వ సర్గ ఋష్యశృంగుని గూర్చి తెలుపడం

సుమంత్రుడు : మహారాజా! పూర్వం సనత్కుమారుడు ఋషులతో సంభాషిస్తూ ఉండగా వారి నోట కొన్ని జరుగబోయే విషయాలను విన్నాను. ఈ ఋత్విక్కులు పలికిన పలుకులు కూడా అట్లాగే ఉన్నాయి. కనుక తమకు తప్పక పుత్రప్రాప్తి కలుగుతుందని విశ్వసిస్తున్నాను. మీ కిప్పుడు ఆ సంభాషణ అంతా వివరంగా చెప్తాను వినండి.

కాశ్యపుని కుమారుడు విభండకుడు. అతనికి ఒక కుమారుడు కలుగబోవుచున్నాడు. ఆ పిల్లవాడు పుట్టింది మొదలు అడవుల్లోనే పెరుగుతాడు. ఆతడికి తండ్రి తప్ప మరెవ్వరూ తెలియకుండా పెరుగుతాడు. ఆ బాలుడికి తండ్రికి సేవచేయటం, అగ్నిహోత్రానికి చేసే సేవలు తప్ప వేరొక పనే తెలియదు. ఆతడి తలపై ఒక కొమ్ము మొలచి ఉంటుంది. అందుచేత ఆతడిని ఋష్యశృంగుడు అని పిలుస్తూవుంటారు, ఆ విధంగా అతడికి ఋష్యశృంగుడనే పేరే సార్థకనామం అయింది.

ఆ బాలుడు బ్రాహ్మణులచే మిక్కిలి ప్రశంసించబడతాడు. వ్రతిత్వము, ప్రాజాపత్యము అను రెండు విధాలైన బ్రహ్మచర్యములు ఉన్నాయి. అయితే ఆతడు కొంత కాలం వ్రతిత్వమనే బ్రహ్మచర్యాన్ని పాటిస్తాడు.

ఆ రోజుల్లో అంగరాజ్యాన్ని రోమపాదుడు పాలిస్తూ ఉంటాడు. అతడు గొప్ప పరాక్రమశాలిగా ప్రసిద్ధి పొందుతాడు. ప్రాణులను భయంకరంగా పీడిస్తూ ధర్మాన్ని తప్పి పరిపాలిస్తాడు. ఆ కారణంగా దేశంలో వర్షాలు కురవక అనావృష్టిపాలై ప్రజలు అష్టకష్టాలు పడతారు.

ప్రజల దుర్భర పరిస్థితులకు రాజు కలత చెంది, బ్రాహ్మణులను పిలిపించి, ప్రజల కష్టాలు తొలగే మార్గం చెప్పమంటాడు. వారంతా ధర్మపరాయణులు, లోకవ్యవహారాల్లోకూడా

అనుభవమున్న వారు. అందువల్ల వారంతా బాగా ఆలోచించి, "రాజా! ఋష్యశృంగుడనే ఋషి కుమారుడొకడు అడవులలో తండ్రిసేవ చేసుకుంటూ జీవిస్తున్నాడు. ఏదో ఉపాయం చేత ఆతడిని మన రాజ్యంలోకి తీసుకురాగలిగితే, వెంటనే వర్షాలు కురుస్తాయి; ప్రజల కష్టాలు తీరుతాయి" అని సలహా చెప్తారు.

అప్పుడు రాజు మంత్రులను, బ్రాహ్మణులను వెళ్ళి ఆ బాలుని రాజధానికి తీసుకురమ్మని ఆదేశిస్తాడు. మహాతపశ్శాలియైన విభండకుని ఆగ్రహానికి భయపడి తామాసాహసం చేయలేమని రాజుకు విన్నవించుకుంటారు. తరువాత వారంతా కలసి వేరే ఉపాయం కోసం ఆలోచిస్తారు. కొంతమంది నేర్పరులైన వేశ్యలను పంపి ఆ కార్యాన్ని సాధించాలనుకుంటారు. అదేవిధంగా కొంత మంది వేశ్యలను ఋష్యశృంగుడుండే అడవులకు పంపుతారు. వారు నేర్పుగా ఆ ఋషిని తమ వలలో వేసుకొని రాజధానికి తీసుకొనివస్తారు. వెంటనే రాజ్యమంతా వర్షాలు కురుస్తాయి.

అంతట పరమానందభరితుడైన రోమపాద మహారాజు తన కుమార్తె శాంతనిచ్చి వివాహంచేసి, ఋష్యశృంగుని అల్లునిగా చేసుకొని ఆతడిని తనతోనే ఉంచుకుంటాడు.

రోమపాదుని అల్లుడైన ఋష్యశృంగుని కృప చేత దశరథుడు కూడా పుత్రసంతానం పొంద గలడని సనత్కుమారుడు ఇతర ఋషులతో చెప్పడం నేను విన్నాను అన్నాడు సుమంత్రుడు.

దశరథ మహారాజు : సుమంతా! మంచి విషయాన్ని సరియైన సమయంలో చెప్పి గొప్ప సహాయం చేశావు. నీవే ఎట్లాగైనా ఆ ఋష్యశృంగుని మన రాజ్యానికి తీసుకువచ్చే ఉపాయం ఆలోచించు. ఆ ఋష్యశృంగుని ఎలా అంగదేశానికి తోడ్కొని వచ్చారో సవివరంగా చెప్పు.

# 10వ సర్గ ఋష్యశృంగుడు అంగదేశమునకు రావడం

మంత్రులు, బ్రాహ్మణులు : రాజా! ఆ ఋష్యశృంగుని మన పట్టణానికి తీసుకొనివస్తాం. అదెట్లాగో వివరిస్తాం; వినండి.

లోకమున మనస్సు సర్వేంద్రియాలను తన వశమునందుంచుకొనును. కనుక ఆతడి మనస్సును, ఇంద్రియములను ప్రలోభపరచడానికి సౌందర్యవతులు, నేర్పరులైన వేశ్యలను కార్యమునకై నియోగించండి.

ఋష్యశృంగుడు అడవులలో ఉండేవాడగుటచేత ముందెన్నడూ విషయ సుఖముల ననుభవించి ఎరుగడు. సౌందర్యవతులైన ఈ వేశ్యలు చక్కగా అలంకరించుకొని తమ చాతుర్యంతో ఆతడి ఇంద్రియములను ప్రలోభపరచి మన పట్టణమునకు తీసుకొని వస్తారు.

రోమపాద మహారాజు : మహాజనులారా! మీ ఆలోచన ప్రశస్థంగా ఉన్నది, అట్లాగే చెయ్యండి.

రోమపాద మహారాజు అనుజ్ఞతో మంత్రులు సౌందర్యవతులైన వేశ్యలను నియోగించి ఋష్యశృంగుడు ఉండే అడవులకు పంపారు. అంతట ఆ వేశ్యలు తినుబండారాలు ఇంకా ఇతర సంబారాలు తమతో తీసుకొని ఋష్యశృంగుని ఆశ్రమానికి సమీపముననే నివసింపసాగారు. ఒకానొక రోజున ఋష్యశృంగుడు ఒంటరిగా ఉన్న సమయం చూసుకొని ఈ వేశ్యలందరూ ఆతడిని సమీపించారు.

వేశ్యలు : ఓ బ్రహ్మచారీ! నీ వెవరవు? ఒంటరిగా ఈ అడవిలో ఏం చేస్తున్నావు? నీ జీవన విధానమంతా మాకు చెప్పు.

ఋష్యశృంగుడు : మీవంటి సౌందర్యవతులను ముందెన్నడూ నేను చూడలేదు. మీతో

స్నేహం చెయ్యటానికి నా మనస్సు కుతూహలపడుతోంది. నన్ను ఋష్యశృంగుడు అంటారు. నేను విభండకుని కుమారుడను. నా ఆశ్రమం సమీపంలోనే ఉన్నది. మీరందరూ మా ఆశ్రమానికి వచ్చి నా ఆతిథ్యాన్ని స్వీకరించండి.

తరువాత ఋష్యశృంగుని ఆహ్వానంపై వారందరూ ఆతడి ఆశ్రమానికి వెళ్ళారు.

ఋష్యశృంగుడు : ఓ సౌందర్యవతులారా! ఈ విధంగా మేము చేసే సేవను 'అర్ఘ్యము' అంటారు. దీనిని 'పాద్యము' అంటారు. వీటిని కందమూలములంటారు. వీటిని భుజించడానికి అతిథులకు సమర్పిస్తాము, ఆరగించండీ.

ఆ వేశ్యలందరూ తమ కార్యానికి శుభారంభమైనదని తలచి ఎంతో సంతోషించినవారై, ఆ కందమూలాలన్నీ ఆరగించారు.

"ఓ విప్రసత్తమా! నీ ఆతిథ్యం, నీ తోటి చెలిమి మాకు చాలా సంతోషంగా ఉంది" అని అంటూ ఆ వేశ్యలు అతణ్ణి కౌగలించుకొని ముద్దాడారు. తమ వద్దనున్న మధుర పదార్థములన్నీ అతనిచే తినిపించారు. ఋష్యశృంగుడు కూడా వారి కౌగిలింతలకు ముద్దులకు పులకించి పోయాడు. వారు సమర్పించిన మధుర పదార్థాలన్నీ మిక్కిలి ప్రీతితో ఆరగించాడు.

ఆ వేశ్యలందరూ విభండక ముని వస్తాడేమోనని భయపడిపోతున్నారు. మాకు కర్మాష్ఠానానికి సమయమైందని చెప్పి తమ నివాసానికి వెళ్ళిపోయారు.

మరునాడు ఆ వేశ్యలందరూ చక్కగా అలంకరించుకొని పూర్వం ఋష్యశృంగుని కలసిన ప్రదేశానికే వెళ్ళారు. ఋష్యశృంగుడు కూడా వారికోసం అక్కడికే వచ్చి కూర్చున్నాడు. ఆతడి రాకకు ఎంతో సంతోషించినవారై, ఆతడికి మరింత దగ్గరగా పోయి కూర్చున్నారు.

"ఓ విప్రకుమారా! నీవు కూడా మా ఆశ్రమానికి రా. నీకు కూడా అతిథి సత్కారాలు చేసే భాగ్యం మాకు కల్పించు" అని వారు వేడుకొన్నారు. అంతట వారి మధురమైన పలుకులకు,

చూపులకు ముగ్ధుడై ఋశ్యశృంగుడు వారితో అంగదేశానికి వెళ్ళాడు. ఆతడలా పట్టణ ప్రవేశం చేయగానే కుంభవృష్టిన వర్షం కురిసింది.

అప్పుడు రోమపాదుడు ఋష్యశృంగుని ఎదురుగా వెళ్ళి సాష్టాంగ నమస్కారంచేసి, అర్ఘ్య పాద్యాదులతో సత్కరించాడు. నీ తండ్రికి నాపై ఆగ్రహం కలుగకుండేట్లు అనుగ్రహింపమని వేడుకున్నాడు. తరువాత తన కుమార్తె శాంతనిచ్చి వివాహంచేసి, పరమానందం పొందాడు.

## 11వ సర్గ ఋష్యశృంగుని అయోధ్యకు రావించడం

సుమంత్రుడు : రాజా! సనత్కుమారుడు ఇతర మహాత్ములతో మాట్లాడినప్పుడు నేను విన్నది చెప్తాను విను. రాబోయే కాలంలో దశరథుడనే మహారాజు ఇక్ష్వాకువంశంలో జన్మిస్తాడు. అతడికి అంగరాజుతో స్నేహం ఏర్పడుతుంది. రాజు చేసే అశ్వమేధయాగానికి రోమపాదుణ్ణి, అతడి అల్లుడు ఋష్యశృంగుని కూడా ఆహ్వానిస్తాడు. ఋష్యశృంగుడు పుత్రకామేష్టి యాగానికి పౌరోహిత్యం చేస్తాడు. ఆ మహాత్ముని మహిమచేత దశరథునికి సంపూర్ణ యాగఫలం లభిస్తుంది. అంటే నలుగురు తేజోవంతులైన పుత్రులు జన్మిస్తారు – అని. ఇదంతా నేను స్వయంగా విన్నాను. నేను విన్నదే ఇప్పుడు నీకు యథార్థంగా చెప్తున్నాను.

కనుక ఓ మహారాజా! వెంటనే అంగదేశానికి పోయి ఋష్యశృంగుని సాదరంగా ఆహ్వానించి తోడ్కొనిరా. యాగం నిర్విఘ్నంగా జరగడమే కాకుండా నీ కోరిక ఫలించి పుత్రులను పొందగలవు.

అంతట దశరథ మహారాజు అంగదేశానికి వెళ్ళాడు.అంగరాజైన రోమపాదుడు దశరథునిసాటి మహారాజుగానే కాక, గొప్ప మిత్రుడుగా ఆహ్వానించి అక్కున చేర్చుకుంటాడు. దశరథ మహారాజు అంగరాజుకు అతిథిగా కొద్దిరోజులుండి ఆ తరువాత ఋష్యశృంగ దంపతులను యాగానికి పంపవలసినదని కోరాడు. అందుకు రోమపాదుడు కూడా పరమ సంతోషంతో అంగీకరిస్తాడు.

దశరథుడు ఋష్యశృంగుని తాను సంతానం కోరి యాగం తలపెట్టినట్లు తెలిపి తనకు పుత్రప్రాప్తీ, స్వర్గప్రాప్తీ కలుగజేసే ఆ యాగాన్ని దగ్గరుండి చేయించమని ప్రార్థిస్తాడు.

దశరథుడు యాగం నిర్వఘ్నంగా పూర్తిచేసిన తరువాత మహాపరాక్రమశాలురు, ముల్లోకాలను రక్షించువారు అయిన నలుగురు పుత్రులను పొందగలడు.

దేవర్షియైన సనత్కుమారుడు చెప్పిన ఈ ఉదంతాన్ని సుమంతుడు దశరథునకు తెలిపి, స్వయంగా అంగదేశానికి పోయి ఋష్యశృంగుని వెంట తీసుకొని రావలసినదని చెప్పాడు.

అప్పుడు దశరథుడు వసిష్ఠుడు మున్నగు బ్రాహ్మణోత్తములను వెంటబెట్టుకొని అంగదేశానికి వెళ్ళాడు. రోమపాదుడు తన పాత స్నేహితుని సాదరంగా ఆహ్వానించి ఆలింగనం చేసుకున్నాడు. తరువాత రోమపాదుడు, ఋష్యశృంగునితోపాటు తన కుమార్తెను కూడా అయోధ్యకు పంపించాడు.

తరువాత దశరథుడు దూతల ద్వారా తమ రాకను తన మంత్రులకు తెలియపరిచాడు. నగరమంతా విశేషంగా అలంకరించబడింది. ప్రజలంతా వారిని దర్శించడానికి దారికి రెండు వైపులా బారులుతీరి నిలబడ్డారు. వారిని చూడగానే జయజయధ్వానాలు చేశారు. వాద్యాలు మ్రోగించారు.

దశరథుడు ఋష్యశృంగుని రథంపై ముందుంచుకొని తన అంతఃపురానికి తీసుకొనిపోయి అర్ఘ్యపాద్యాదులతో పూజించాడు. ఋష్యశృంగుని భార్య శాంతను కూడా అంతఃపురకాంతలు సాదరంగా ఆహ్వానించి పూజించారు.

# 12వ సర్గ దశరథుడు యజ్ఞప్రారంభానికి ఆదేశించటం

కొ౦తకాలం గడచిన పిదప ఒకానొక వసంతఋతువులో యజ్ఞం ప్రారంభించాలని దైవజ్ఞులు నిర్ణయించారు. ఋష్యశృంగుని ఋత్త్విక్కుగా స్వీకరించిన దశరథ మహారాజు తన వంశం పుత్ర పౌత్రాదులతో వృద్ధిచెందేట్లుగాను, అవిచ్ఛిన్నంగా యశోవంతులైన సంతానాన్ని కోరుకుంటూ యజ్ఞం చేయించమని కోరుకున్నాడు.

ఋష్యశృంగుడు కూడా ఋత్త్విక్కుగా వ్యవహరించడానికి అంగీకారం తెలిపాడు. యజ్ఞానికి కావలసిన సంబారాలన్నీ సిద్ధం చేయమని అనుజ్ఞ ఇచ్చాడు. యాగాశ్వాన్ని యాగశాలలో నిలుపమని ఆదేశించాడు.

దశరథుని ఆదేశాన్ని శిరసావహిస్తూ సుమంత్రుడు వసిష్ఠుని, పురోహితులను, ఇతర బ్రాహ్మణులను యజ్ఞశాలకు పిలిపించాడు.

వారంతా యజ్ఞాన్ని నిర్విఘ్నంగా పూర్తిచేసి దశరథుని 'అనంత పరాక్రమశాలులైన నలుగురు పుత్రులను తప్పక పొందెద' వని దీవించారు. తరువాత తమ కిచ్చిన దక్షిణలు, కానుకలను స్వీకరించి తమతమ గృహాలకు వెళ్ళారు.

వివరణ : మొదట వసంత ఋతువు నందు మేధాశ్వబంధన స్నాపన, ప్రోక్షణ, విమోచనాదు లను చేయాలి. అట్లు నలుగురు ఋత్విక్కులను నియోగించి ఉండవలెనని శ్రౌతసూత్ర నియమాలలో చెప్పబడింది. అట్టి నియమాలననుసరించి ప్రతిదినం సావిత్రాది కర్మలు చేస్తూండాలి. ఈ విధంగా ఒక సంవత్సరం చేసిన పిదప ప్రధాన దీక్ష స్వీకరించాలి.

# 13వ సర్గ దశరథుడు యాగదీక్ష వహించడం

ఒక సంవత్సరకాలం సావిత్రాది కర్మలు నిర్విఘ్నంగా చేయడమైంది. మళ్ళీ వసంతకాలం వచ్చింది. యాగం చేసేందుకు దశరథుడు యాగశాలలోనికి ప్రవేశించాడు. ముందుగా వసిష్ఠుని వద్దకు పోయి వినమ్రుడై "మీరు నాశ్రేయోభిలాషి, మిత్రుడవు, పూజ్యుడవు. ఈ కార్యభారాన్ని వహించి పౌరోహిత్యాన్ని చేపట్టి యాగాన్ని పూర్తి చేయించండి" అని ప్రార్థించాడు. వసిష్ఠుడు అందుకు అంగీకరించాడు.

వసిష్ఠుడు యాగ కర్మలందు నిష్ణాతులైన బ్రాహ్మణులను, వృద్ధులను, వాస్తు పండితులను, శిల్పులను, శాస్త్రవేత్తలను, తాపీ పనివారిని, వడ్రంగిపనివారిని, మున్నగువారి నందరినీ పిలిపించి "రాజాజ్ఞను శిరసావహించి యాగానికి వచ్చే రాజులు, అతిథులు నివసించేందుకు గృహాలు నిర్మించండి. అతిథులకు అన్ని సౌకర్యాలు సమకూర్చండి. అందుకవసరమయ్యే వస్తు సముదాయాన్ని అంతా సమకూర్చండి" అని ఆదేశించాడు. "పౌరులను కూడా అతిథి గృహాల్ని నిర్మించమన్నాడు. గ్రామగ్రామాల నుండి యాగాన్ని చూచేందుకు వచ్చే ప్రజలకు చక్కటి ఆహార, పానీయ నివాస సదుపాయాలు కల్పించబడ్డాయి. వారందరిని ఎంతో ఆదరంతో సత్కరించమన్నాడు. ఇంత భారీ ఎత్తున ప్రయత్నాలు చేస్తున్నప్పుడు అక్కడక్కడా లోపాలు జరుగవచ్చు. ప్రజలు కోపతాపాలు ప్రదర్శించినా, మీరంతా ఎంతో ఓర్పుతో వారికి సేవలు చెయ్యాలి. అంతేకాదు ఈ నగర నిర్మాణానికి శిల్పులు, కళాకారులు, పనివారు అనేక దూరప్రాంతాలనుండి వస్తారు. వాళ్ళ సౌకర్యాలకు చక్కగా ఏర్పాట్లు చెయ్యాలి. వారి వారి అర్హతల ననుసరించి సత్కరించండి. మీరు చేసే సేవల్లో ప్రేమ, ఆర్ద్రత ఉట్టిపడుతూ ఉండేలా నడచుకోండి" అని కూడా చెప్పాడు.

తరువాత వారందరూ అప్పుడప్పుడూ వసిష్ఠుని వద్దకువచ్చి, ఆయన ఆదేశములకు అనుగుణంగానే నడుచుకుంటున్నామని, ఏర్పాట్లన్నీ చురుకుగా సాగుతున్నాయని నివేదికలు

సమర్పించేవారు. గృహనిర్మాణాలు, ఇతర సౌకర్యాలకై చేసిన ఏర్పాట్లు తృప్తికరంగా ఉండటంచేత, వసిష్ఠుడు సుమంతుని పిలిచి ఇలా అన్నాడు: "సుమంతా! ఈ భూమండలంలో ఉండే ధార్మికులైన రాజులందరినీ ఆహ్వానించు. మన రాజ్యంలో ఉండే ప్రజలే కాకుండా ఇతర దేశాలలో నివసించే ప్రజలకు కూడా ఆహ్వానాలు పంపు. బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్ర వర్ణాల వారందరికీ గౌరవ పూర్వకంగా ఆహ్వానాలు పంపు.

"సుమంత్రా! సర్వ వేదవేదాంతములందు నిష్ణాతుడు మనకు దగ్గర బంధువులైన మిథిలాధిపతి జనకమహారాజును నీవే స్వయంగా ఆహ్వానించి గౌరవపూర్వకంగా తీసుకొని రావాలి. అట్లాగే మన మహారాజుకు అత్యంత స్నేహితుడైన కాశీరాజునుకూడా నువ్వే స్వయంగా వెళ్ళి తీసుకొని రా.

"సాక్షాత్తూ మన మహారాజుగారి మామగారైన కేకయ దేశరాజును, వారి కుటుంబాన్ని స్వయంగా వెళ్ళి తీసుకొని రా. అంగరాజ్యాధిపతి, మహాభాగ్యశాలి, ఋష్యశృంగులవారి మామగారైన రోమపాద మహారాజును ఆదరంతో తీసుకొనిరా. తూర్పు, పశ్చిమ, దక్షిణ దేశాలలోని రాజులందరినీ పేరుపేరునా ప్రత్యేక దూతలను పంపి ఆహ్వానించు. ఇంకా మన హితులకు, స్నేహితులకు, శ్రేయోభి లాషులందరికీ ప్రత్యేకాహ్వానములు పంపు. ఆహ్వానితులందరూ ప్రత్యక్షంగా వచ్చారా లేదా అని గమనించి తగు ఏర్పాట్లు చెయ్యాలి."

"ఆయా కార్యాలలో నియుక్తులైన రాజోద్యోగులందర్నీ పిలిచి ఎవరికైనా, ఏదైనా ఇచ్చేటప్పుడు అనాదరం గాని, అశ్రద్ధ గాని ఉండరా' దని హెచ్చరించు. అట్లా అనాదరంతో చేసిన దానం వలన దాత నశిస్తాడు అని హెచ్చరించాడు."

నానా దేశాలకు చెందిన రాజులు ఆహ్వానాలు అందుకుని సకాలంలో అయోధ్య చేరుకున్నారు.

తరువాత వసిష్ఠుడు దశరథుని సమీపించి ఇలా అన్నాడు: "రాజా!

ఆహ్వానితులందరూవచ్చారు. వారికి తగిన వసతులన్నీ కల్పించబడ్డాయి. వారు కూడా సంతృప్తులై ఉన్నారు. అనేక దేశాధిపతులు రత్నాలను, విలువైన కానుకలను సమర్పించారు. అవి అన్నీ కోశాగారానికి చేర్చబడ్డాయి.

"ఓ రాజేంద్రా! యాగశాలకై నీవు చేసిన ఏర్పాట్లు చూసిన వారంతా నభూతోనభవిష్యతి అని మెచ్చుకొంటున్నారు. ఇంతటి ఏర్పాట్లను ఇంతకుపూర్వం ఏ మహారాజుకూడా చేసివుండలేదని వారు అనుకుంటూ ఉండటం మన చారులు విన్నారు. "కనుక ఓ రాజశ్రేష్ఠా! యజ్ఞానికి కావలసిన సమస్త సంబారాలు సమకూర్చబడ్డాయి. ఇక నీవు యాగాన్ని ప్రారంభించు."

తదనంతరం దశరథ మహారాజు వసిష్ఠ, ఋష్యశృంగులు ఆదేశించిన విధంగా ఒకానొక శుభముహూర్తాన యజ్ఞశాలయందు ప్రవేశించాడు. ఋష్యశృంగుని ముందు ఉంచుకొని యథా శాస్త్రీయంగా కల్పోక్త ప్రకారం యాగం ప్రారంభించబడింది.

# 14వ సర్గ అశ్వమేధ యాగం చేయడం

ఒక సంవత్సరం గడిచిపోయింది, యాగాశ్వం తిరిగి తిరిగి యాగశాలకు వచ్చి చేరుకుంది. దశరథుడు సరయూనదికి ఉత్తర భాగాన నిర్మించిన యాగశాలయందు ప్రవేశించి యాగాన్ని ప్రారంభించాడు.

బ్రాహ్మణులంతా ఋష్యశృంగుని ఋత్విక్కునిగా చేసి వేదవిహితంగా, శాస్త్రాలలో నిర్దేశించబడిన కర్మలన్నీ యథాశాస్త్రీయంగా చేశారు. మునిశ్రేష్ఠులంతా ఆయా దేవతలను ఆవాహనచేసి పూజించారు. సోమలతనుండి రసాన్ని గ్రహించి ఇంద్రునికి హవిస్సులను సమర్పించారు. ఆ విధంగా మాధ్యందిన సవనం పూర్తయింది. అదేవిధంగా దశరథుని తృతీయ సవనాన్ని కూడా పూర్తి చేశారు.

ఆ యజ్ఞానికి వచ్చిన వారిలో ఆకలితో బాధపడ్డవాడుగాని, అలసిపోయినవాడు, అస్వస్థతకు గురియైనవాడుగాని ఒక్కడు కూడా కనిపించలేదు. పండితుడుకాని బ్రాహ్మణుడుగాని, కనీసం వందమంది శిష్యులైన లేని బ్రాహ్మణుడు ఒక్కడు కూడా కనిపించలేదు.

యాగం జరిగినన్ని రోజులూ బ్రాహ్మణులు, దాసులు, మునులు, సన్న్యాసులు, స్త్రీలు, పురుషులు, చిన్నా పెద్దా, చాతుర్వర్ణాల వారు తృప్తిగా భోజనం చేశారు. వృద్ధులకు, రోగంతో బాధ పడేవారికీ వైద్యసదుపాయాలు కల్పించారు.

వండిన వంటలన్నీ పర్వతాల్లా రాసులు పోశారు. సుందరాకారులైన పురుషులంతా వడ్డనలు చేశారు. మణికుండలాలు ధరించిన వారంతా వడ్డనలో వారికి సహాయం చేశారు. భోక్తలందరినీ 'మరికాస్త వడ్డించుకోండి' అని ఆదరపూర్వకంగా బలవంతంచేసి తినిపించారు. భోజనశాల నుండి బయటకు వచ్చిన వారందరినీ నూతన వస్త్రాలతో గౌరవించారు. "అయ్యా

వస్త్రాలు ముట్టినవా!" అని పేరుపేరునా విచారించారు. యాగానికి వచ్చిన వారంతా తృప్తిగా తిని "అన్నదాతా! నీకు శుభమగు గాక! నీకు మంగళమగు గాక!" అని దీవించారు. ఆ విధంగా మారుమ్రోగిపోతున్న దీవెనలన్నీ దశరథుని చెవినపడ్డాయి. విని ఆయన చాలా సంతోషించాడు.

యాగంలో ఒక కర్మ ముగించి మరొక కర్మ ప్రారంభించేందుకు చిన్నచిన్న విరామాలొచ్చేవి. ఆ సమయంలో కొందరు పాండిత్యాన్ని ప్రదర్శించేవారు; కొందరు హాస్యోక్తులతో నలుగుర్నీ నవ్వించే వారు. వాదప్రతివాదాలు జరిగేవి. కర్మ ప్రారంభం కాగానే అన్నీ సద్దుమణిగిపోయేవి.

అచ్చట షడంగవేత్త కానివాడుగాని, వ్రతానుష్ఠానాలు చేయనివాడుగాని, బహుశాస్త్ర పరిచయం లేనివాడు గానిలేడు, శాస్త్ర కౌశలం లేనివారెవరూ సదస్యులుగా లేరు. ఆ యాగమునందు యూప స్తంభములు నాటవలసిన సమయం వచ్చింది.

యూపస్తంభములు : మొత్తం ఇరవై ఒక్క యూపస్తంభాలను నాటుతారు అందు ఆరు మారేడు కర్రతోను, ఆరు చంద్రకర్రతోను, ఆరు మోదుగ కర్రతోను, ఒకటి శ్లేష్మాతవృక్ష కర్రతో, రెండు దేవదారు కర్రతోను చేయబడతాయి.

ఇరవై ఒక అరత్నుల ఎత్తుగల ఆ యూపస్తంభాలను వస్త్రాలు చుట్టి అలంకరించారు. ఒక యూపానికి మరొక యూపానికీ బారెడు దూరం ఉండేట్లుగా నాటారు. ఆ యూపాలన్నీ దృఢంగా ఉండి ఎనిమిది అంచులు ఉండేట్లు శాస్త్రీయంగా శిల్పుల చేత చెక్కించారు. ఒక్కొక్క యూపాన్ని బంగారు రేకుతో తాపడం చేయించారు. ఆపైన పుష్పాలతో అలంకరించారు. ఆకాశంలో నుండి చూసేవారికి సప్త ఋషుల వలె అవి కనిపిస్తాయి.

'అరత్ని' అంటే మోచేయి నుండి చిటికెన వ్రేలి వరకు ఉన్న మూర. శాస్త్రం చెప్పినట్లుగా అగ్నివేదికలు నిర్మించబడ్డాయి. దశరథుడు చిత్యాగ్నిని ఉంచే వేదిక మాత్రం మిగతా వాటి కన్నా మూడు రెట్లు పెద్దదిగా నిర్మించారు.

(అశ్వమేధయాగంలో అగ్నిని ఉంచే వేదిక చుట్టూ ఇటుకలతో గరుడాకారంలో నిర్మిస్తారు. ఈ వేదిక గరుడుడు తూర్పుముఖంగా ఉండేట్లుగాను, రెండు ప్రక్కలా రెక్కలు విప్పుకొని తల దించుకున్నట్లుగా నిర్మిస్తారు. ఈ నిర్మాణాన్ని 'చయనము' అని అంటారు.)

శాస్త్రంలో చెప్పినట్లుగా ఆయా దేవతల కొరకు నిర్దేశించబడిన పశువులను, పాములను, పక్షులను ఆయా యూపములకు బంధించారు. (అశ్వమేధయాగంలో అనేక రకాలైన పశువులను వినియోగిస్తారు. పశువుల్లో కొన్ని గ్రామ్యమునకు చెందినవి కాగా, మరికొన్ని అడవులకు సంబంధించి నవి. అరణ్యాల నుండి తెచ్చిన జంతువుల్ని అగ్నిగుండం చుట్టూ ప్రదక్షిణ చేయించి, మళ్ళీ అరణ్యంలో వదిలేస్తారు. గ్రామ్య పశువుల్ని మాత్రం బలి ఇస్తారు.)

ఈ విధంగా మొత్తం మూడు వందల పశువుల్ని, యాగాశ్వాన్ని యూపములకు కట్టి ఉంచారు. కౌసల్య యాగాశ్వానికి మూడుసార్లు ప్రదక్షిణ చేసి, మూడు బంగారు కత్తులతో పొడిచి చంపాల్సి ఉంటుంది.

(కానీ శాస్త్రమును గౌరవించుటకై యజమానుని భార్య అదివరకే కొన ఊపిరితోవున్న అశ్వాన్ని మూడు బంగారు సూదులతో గుచ్చుతుంది, తరువాత ఆ అశ్వం చచ్చిపడి ఉంటుంది)

దశరథ మహారాజు రాణులైన, కౌసల్య, సుమిత్ర, కైకేయి ముగ్గురూ ఆ యాగాశ్వానికి భక్తి పూర్వకంగా ప్రదక్షిణ చేశారు. ఋత్విక్కుల ఆదేశాలను అనుసరించి వారంతా ఆ అశ్వాన్ని మూడు బంగారు సూదులతో గంట్లుపెట్టారు. వెంటనే ఆ అశ్వం పడిపోయింది. మనోధైర్యాన్ని సిద్ధించుకోవటం కోసం కౌసల్య ఆ రాత్రంతా యాగాశ్వం ప్రక్కనే గడిపింది.

ఆ తరువాత దశరథ మహారాజు హోతకు పట్టపురాణిని, అధ్వర్యునికి పరివృత్తిని, ఉద్గాతకు వావాతను, బ్రహ్మకు పాలకలినీ దక్షిణగా సమర్పించాడు.

పట్టమహిషి అంటే రాజుతో కలసి రాజ్యపట్టాభిషేకం పొందిన భార్య. ఉపేక్షిత భార్యను

పరివృత్తి అంటారు. భోగినీ స్త్రీ లేక ఉంపుడుకత్తెను వావాత అంటారు. రాజుకు పరిచర్యలు చేస్తూ పాత్రలందించే స్త్రీని పాలాకలి అని అంటారు. అశ్వమేధమునందు యజమాని ఆ నలుగురు స్త్రీలను దక్షిణగా ఇచ్చిన పిదప, వేరేదైనా పరిహారం చెల్లించి తిరిగి ఆ స్త్రీలను గ్రహిస్తాడు. ఇది శాస్త్రం నిర్దేశించిన విధి విధానం.

యాగ విధానాల్ని క్షుణ్ణంగా తెలిసిన ఋత్విక్కులు యాగాశ్వం మెదడును నేర్పుగా బయటకు తీస్తారు. మంత్రోక్తంగా హోమం చేస్తారు. జంతువధచే కలిగే పాపాన్ని పోగొట్టుకోవడానికి దశరథుడికి ఆ ధూపాన్ని వాసన చూపిస్తారు. అట్లా వాసన చూడటాన్ని 'వపాధూమ గంధం' అని అంటారు. తక్కిన ఋత్విక్కులంతా యాగాశ్వం యొక్క మిగిలిన శరీరభాగాలన్నీ హోమం చేస్తారు.

సామాన్యంగా యాగాలన్నింటిలోనూ జువ్వికట్టెలతో హవిస్సును వండుతారు కానీ, అశ్వ మేధంలో మాత్రం పబ్బలి తీగల్ని హవిస్సులు తయారు చేసేందుకు వాడుతారు.

అశ్వమేధమనేది మూడు రోజుల పాటు చేసే క్రతువు, మొదటి రోజు చేసే క్రతువును 'చతుస్టోమం' అంటారు. రెండో రోజు చేసే క్రతువును 'ఉర్థక్యము' అంటారు. మూడవ రోజు చేసే క్రతువును 'అతిరాత్ర' మని అంటారు. ఇవేకాక ఆ మూడు రోజుల్లో ఒక జోతిస్టోమ యాగాన్ని, ఒక ఆయుర్యాగాన్ని, రెండు అతిరాత్ర యాగాలను, ఒక అభిజిద్యాగాన్ని, ఒక విశ్వజిద్యాగాన్ని, ఒక అప్తోర్యామ యాగాన్ని చేశారు. అశ్వమేధయాగం యథాశాస్త్రవిధిన ముగిసింది.

దశరథ మహారాజు వంశాభివృద్ధిని కోరి తూర్పు దిక్కున ఉండే రాజ్యాన్నంతా హోతకు, పశ్చిమ దిక్కున ఉండే రాజ్యాన్ని అధ్వర్యునకు, దక్షిణ దిక్కున ఉండే రాజ్యాన్ని బ్రహ్మకు, ఉత్తర దిక్కున ఉండే రాజ్యాన్ని ఉద్గాతకు దానమిచ్చాడు. పూర్వం బ్రహ్మ కూడా అశ్వమేధ యాగాన్ని చేసి ఈ విధంగానే దక్షిణ ఇచ్చాడు. అప్పటి నుండి ఈ విధంగా దక్షిణ ఇవ్వడం శాస్త్రవిధిగా

నిర్ణయమైంది.

అంతట దక్షిణలు గ్రహించిన బ్రాహ్మణులంతా దశరథ మహారాజుతో "రాజా! రాజ్యాపాలన మా వృత్తి కాదు. మేము వేదాధ్యయనం చేసుకుంటూ, ప్రజాక్షేమం కోసం యాగాలు చేయిస్తూ ఉంటాం. అందువలన మాకు రాజ్యాన్ని పరిపాలించే సామర్థ్యం లేదు. మాకు జీవనానికి ఏదైనా ధనమో, ధాన్యమో, గోసంపదో ఇచ్చి మీ రాజ్యాన్ని మీరే తిరిగి గ్రహించండి" అన్నారు.

అప్పుడు దశరథ మహారాజు వారందరికీ పదిలక్షల గోవులను, వందకోట్ల బంగారు నాణాలను, వేలకోట్ల వెండినాణాలను, పరిహారంగా ఇచ్చి రాజ్యాన్ని గ్రహించాడు. అంతట ఆ బ్రాహ్మణులందరూ ఆ ధనాన్ని ఋత్విక్కులైన ఋష్యశృంగునికి, వసిష్ఠునికి సమర్పించారు. వీరు ఆ ధనాన్నంతా గ్రహించి అందరికీ సమానంగా పంచి ఇచ్చారు. బ్రాహ్మణులందరూ మహదానందాన్ని పొంది వారి వారి బహుమానాలను తీసుకొని ఇళ్ళకు వెళ్ళారు. అంతేకాక, యాగాన్ని చూచేందుకు వచ్చిన బ్రాహ్మణు లందరికీ దశరథ మహారాజు కోట్లకొద్దీ బంగారు నాణాలనిచ్చి సంతృప్తిపరచి పంపాడు. చివరలో తను అంతఃపురానికి వెళ్ళే సమయంలో ఒక పేద బ్రాహ్మణుడు యాచించగా తన ఒంటిపై ఉన్న ఆభరణాలిచ్చి సంతృప్తిపరచి పంపాడు.

దశరథ మహారాజుకు బ్రాహ్మణులంటే అమితమైన ప్రేమ, భక్తి. వారందరూ పరమ సంతృప్తులై తనను ఆశీర్వదిస్తూ ఉంటే ఉప్పొంగిపోయాడు. వారందరికీ సాష్టాంగ ప్రణామం చేశాడు. అంతట బ్రాహ్మణులు కూడా "అశ్వమేధం చేయటం వలన సర్వ పాపాలు తొలగి స్వర్గప్రాప్తి కలుగుగాక!" అని దీవించారు.

తరువాత దశరథ మహారాజు ఋష్యశృంగుని సమీపించి సవినయంగా నమస్కరించి, వంశాభి వృద్ధికై చేయవలసిన కర్మలను చేయించమని ప్రార్థించాడు. అప్పుడు ఋష్యశృంగుడు "ఓ రాజా! నీకు వంశోద్ధారకులైన నలుగురు పుత్రులు జన్మిస్తా" రని దీవించాడు.

# 15వ సర్గ పుత్రకామేష్టి యాగం

ఋష్యశృంగుడు మహాజ్ఞాని, సర్వశాస్త్రజ్ఞుడు. దశరథుని విన్నపాన్ని గూర్చి తీవ్రంగా ఆలోచిం చాడు. ఏ మార్గాన్ని అవలంబించి ఈతడి వంశాభివృద్ధికి తోడ్పడగలనా అని తీవ్రంగా ఆలోచించాడు. చివరకు దశరథుని సమీపించి "ఓ రాజా! పుత్ర సంతానానికై వేదమునందు అథర్వశిరస్సు అనే విభాగంలో పుత్రకామేష్టి యాగాన్ని గూర్చి తెలిపారు. ఇప్పుడు నీచే ఆ యాగాన్ని చేయిస్తాను" అని చెప్పాడు.

వేదోక్తమైన మంత్రాలతో అగ్నిలో హవిస్సుల్ని హోమం చేయించాడు. దేవతలు, సిద్ధులు, గంధర్వులు మున్నగు వారందరూ వారి వారి హవిస్సులు స్వీకరించేందుకు వచ్చారు. సృష్టికర్తయైన బ్రహ్మ కూడా వచ్చాడు. దేవగణాలన్నీ బ్రహ్మను ఈ విధంగా ప్రార్థించారు:

"ఓ విధాతా! నీవు రావణుడనే రాక్షసుని సృష్టించి అనేక వరాలిచ్చావు. నీ వర బలంచేత లోకాలన్నింటినీ అతడు వేధిస్తున్నాడు. నీ వర బలం ఉన్నవాడు కాబట్టి మేము కూడా ఏమీ చెయ్య లేక చేతులు కట్టుకొని కూర్చున్నాం.

సూర్యుడు ఆతడికి తాపమును కలిగించలేదు. వాయువు ఆతడిని తాకలేదు; సముద్రతరంగాలు ఇతణ్ణి చూసి స్తంభించి నిశ్చలమైపోతాయి. బ్రాహ్మణులు, ఋషులు, గంధర్వుల వంటివారి మాట వేరే చెప్పాలా? వాణ్ణి చూస్తే భయమే భయపడిపోతుంది. నీవే ఏదైనా ఉపాయం ఆలోచించి వాణ్ణి అంతమొందించాలి."

"దేవతలారా! భయపడకండి, రావణాసురుడు దేవదానవ, యక్ష, రాక్షస, గంధర్వ, యక్షుల చేతిలో మరణం కలుగకుండా వరాలు పొందాడు. మదాంధుడై మానవులను విస్మరించాడు. నేను కూడా అట్లాగేనని వరమిచ్చాను. కనుక మనం విష్ణు భగవానుణ్ణి ప్రార్థిద్దాం. ఆ భగవానుడే మనల్ని ఈ ఆపద నుండి కాపాడగల సమర్థుడు" అని బ్రహ్మదేవుడు చెప్పాడు.

తరువాత బ్రహ్మ, దేవతలు, ఋషులు మున్నగు వారందరూ విష్ణుభగవానుని స్తుతించారు. ఇంతలో పీతాంబరధారీ, శంఖచక్రగదాధారీ అయిన విష్ణుభగవానుడు ప్రత్యక్షమయ్యాడు. జగత్తు కంతకూ ప్రభువైన ఆ భగవానుని చూసి మళ్ళీ బ్రహ్మాది దేవతలందరూ ఇలా స్తుతించారు:

బ్రహ్మదేవుడు : ఓ పరబ్రహ్మా! పరమేశ్వరా! రావణాసురుని ఆగడాలు మితిమీరి పోతున్నాయి. మేము ప్రశాంతంగా నిన్ను ధ్యానింపలేకున్నాం. నిన్నే శరణువేడుచున్నాం, ఓ శత్రువినాశకా! నీవే అతడిని సంహరింప సమర్థుడవు. దీనులమై నిన్ను ప్రార్థించుచున్నాము.

దేవతలు : దేవా! నీవు సత్యసంకల్పుడవు, సత్యవ్రతుడవు, సృష్టి, స్థితి, లయము లందు సమభావం కలవాడవు. పంచభూతాల ఉత్పత్తికి కారణభూతుడవు. ప్రళయకాలమందు నీవొక్కడివే మిగిలి ఉంటావు. అట్టి నిన్ను శరణువేడుచున్నాం.

ఓ పరమాత్మా! నీవు పూర్ణజ్ఞాన స్వరూపుడవు. సత్పురుషులను ఉద్ధరించడానికి నీవు అనేక అవతారాలను దాల్చుతావు. వేదాలు ఎల్లప్పుడూ నిన్ను కీర్తిస్తుంటాయి. జ్ఞాన స్వరూపుడవైన నీవు సర్వ జీవులలోను చైతన్యరూపంలో సాక్షీ భూతుడవై ఉంటావు. అట్టి పరమేశ్వరుడవైన నీకు నమస్కారము.

అద్వితీయమైన నీ మాయాశక్తిచే సత్త్వరజస్తమోగుణాలను బ్రహ్మ, విష్ణు, రుద్రుడు అనే మూడు మూర్తులుగా విభజించి సృష్టి స్థితి లయాలను నిర్వహించుచున్నావు. అట్టి నీకు నమస్కారము.

ఓ పరమేశ్వరా! ప్రళయకాలమందు సకల జీవులను నీలోనికి ఉపసంహరించుకొని, ప్రళయజలమందు ఆదిశేషుని పక్కగా చేసుకొని శయనించే నీకు నమస్కారము.

సకల జగత్తుకు హితకారి, ఆత్మస్వరూపుడైన ఓ శ్రీహరి భగవానుడా! ఈ రావణాసురుని

సంహరించి మమ్ము కాపాడుగాక!

విష్ణు భగవానుడు : బ్రహ్మాది దేవతలారా! మీరందరూ రావణాసురుని వల్ల పొందుచున్న బాధలు నేనెరుగుదును. క్రూరుడు దుర్మార్గుడైన ఆ రావణాసురుని సంహరిస్తాను. మీరు భయపడ వద్దు. నేను భూలోకంలో జన్మించి రావణాసురుని పుత్రులను, మంత్రులందరినీ సంహరించి భూ మండలాన్నంతా పదకొండువేల సంవత్సరాలు పాలిస్తాను.

భగవానుడు దేవతలకు అభయమిచ్చి తాను దశరథుని ఇంట జన్మింప నిశ్చయించుకున్నాడు.

# 16వ సర్గ దశరథుని భార్యలు గర్భవతులవడం

విష్ణుభగవానుడు : బ్రహ్మా, మహర్షులారా! రావణుని ఏ విధంగా సంహరించాలని కోరు కుంటున్నారో చెప్పండి. నేను అలాగే చేస్తాను. (సర్వం తెలిసినవాడైననూ, దేవతలు మనస్సు తెలుసు కోవడానికి అలా అన్నాడు.)

దేవతలు : ఓ పరబ్రహ్మా! శత్రువినాశకా! రావణుడు చాలాకాలం బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. బ్రహ్మ సంతసించి ఆతడికి ప్రత్యక్షమయ్యాడు, తనకు ఏ ప్రాణిచేతనూ మరణం సంభవింప రాదని కోరుకున్నాడు. మానవులపై గల చులకన భావన చేత, ఆ ప్రాణులందరిలో మానవుల్ని చేర్చలేదు. కనుక ఓ పరమేశ్వరా! ఆ దుర్మార్గుని అంతమొందించేందుకు మానవజన్మయే ఉత్కృష్టమైన దని మేము భావిస్తున్నాం. ఓ జగత్కారా! ఏదో అడిగారని చెప్పామేకాని నీవెరుగని విషయం ఈ జగత్తులో ఉంటుందా?

విష్ణుభగవానుడు : బ్రహ్మాది దేవతలారా! మీ అభీష్టం నెరవేరు గాక!

విష్ణుభగవానుడు దేవతలతో ఆ విధంగా పలికి, తాను మానవ జన్మ ధరింప నిశ్చయించుకొని, దశరథుని తండ్రిగా చేసుకోవాలని అనుకున్నాడు.

అదే సమయంలో దశరథుడు పుత్రకామేష్టి యాగం చేస్తున్నాడు. అగ్నికుండము నుండి మహా కాంతివంతమైన భూతమొకటి ఆవిర్భవించింది. ఆ భూతం ఎరుపు, నలుపు రంగు గల వస్త్రాల్ని ధరించి, దాని కంఠము దుందుభులు మ్రోగించుచున్నట్లుండి, దాని రోమాలు బంగరు రంగులో సింహపు జూలును బోలివుంది. మహాబలశాలి యగు ఆ భూతం పర్వతం వలె కదలి వస్తూ రెండు చేతుల్లోనూ పాయసంతో నిండిన బంగారుపాత్రను తీసుకొని వచ్చింది. ఆ పాత్రపై వెండి మూత ఉంది.

ఆ భూతము ఇలా అంది : ఓ దశరథ మహారాజా! నేను ప్రజాపతి బంటును. నీవు

దేవతల కర్పించిన హవిస్సులచే వారు ఎంతో సంతోషించారు. నీకీ పాత్ర యాగఫలంగా లభించింది. ఓ రాజశ్రేష్ఠా! ఈ పాత్రనిండా పాయసం ఉంది. ఇది దేవతా వరప్రసాదం. ఈ ప్రసాదం వల్ల నీకు సంతానం, ధనం, ఆరోగ్యం కలుగగలవు. తీసుకో. ఓ రాజా! ఈ దేవతాప్రసాదం స్వీకరించు, నీవు శ్రద్ధతో చేస్తున్న పుత్రకామేష్టి యాగానికి ఫలసిద్ధి. దీనిని నీ భార్యలకివ్వు, వారి వలన నీకు పుత్రప్రాప్తి కలుగుతుంది.

దశరథ మహారాజు : ఓ మహాత్మా! ధనం లేని నిరుపేదకు ధనం లభించినట్లు, నాకు ఈ ప్రసాదం అంతు లేని ఆనందాన్ని కలిగిస్తోంది. నా జన్మ నా వంశం ధన్యమయ్యాయి.

దశరథ మహారాజు ఆ విధంగా పలికి, భూతానికి ప్రదక్షిణ నమస్కారం చేసి ఆ బంగారు పాయసపు పాత్రను కడు భక్తిశ్రద్ధలతో అందుకున్నాడు. వెంటనే భూతం అంతర్ధానమయింది.

దశరథుడు ఆ పాత్రను తీసుకొని పూర్ణచంద్రుని వలె చల్లని కాంతులు వెదజల్లుచూ, కౌసల్యను చూచి ఇలా అన్నాడు.

దశరథుడు : దేవీ! ఈ పాయసం మనకు యజ్ఞఫలంగా లభించింది. ఈ పాయసాన్ని భుజిస్తే పుత్రులు కలుగుతారు; ధన ధాన్యములు వృద్ధి అవుతాయి; ప్రజలందరూ ఆరోగ్యవంతులుగా ఉంటారు.

తరువాత దశరథుడు పాయసంలో సగభాగం కౌసల్యకు, మిగిలిన సగభాగంలో సగభాగం (నాలుగవ వంతు) సుమిత్రకు ఇచ్చాడు. మిగిలినది (ఎనిమిదవ భాగం) కైకేయికిచ్చాడు. తక్కిన ఎనిమిదవ భాగం మళ్ళీ సుమిత్రకు ఇచ్చాడు.

ఉత్తమ గుణవతులైన ఆ రాణులందరూ గొప్ప బహుమానంగా భావించి పాయిసం స్వీకరించారు. పిమ్మట కొద్దికాలానికి ఆ రాణులందరూ గర్భవతులయ్యారు. దశరథ మహారాజుకూడా తన మనోరథం ఈడేరిందని ఎంతో సంతోషించాడు.

## 17వ సర్గ దేవతలు వానర వీరులను సృజించటం

బ్రహ్మ : దేవతలారా! ఎప్పుడెప్పుడు ధర్మానికి హాని కలుగుతుందో అప్పుడల్లా విష్ణుభగవానుడు అవతరించి దుష్టులను శిక్షించి, భక్తులను కాపాడుతూ సమస్త ప్రాణికోటికి సుఖసంతోషాలు కలిగిస్తూ ఉంటాడు. అట్టి విష్ణుభగవానుడు దశరథునికి పుత్రుడుగా జన్మించేందుకు సంకల్పించాడు.

కనుక ఓ దేవతలారా! మీరందరూ కూడా భూలోకాన జన్మించి ఆ అవతారపురుషునకు సహాయపడండి.

మీరందరూ వీరులు, శూరులు. వాయువేగంతో సరితూగే వేగం గలవారు. అమృతపానం చేసినవారు. అన్ని మాయామర్మాలు తెలిసినవారు. అప్సరస, గంధర్వ స్త్రీలయందు మీరంతా పుత్రులను కనండి. వారంతా వానరులవుతారు. నేను ఆవలించినప్పుడు జాంబవంతుడు నా ముఖంనుండి జన్మించాడు. ఈ జాంబవంతుడు యోధులైన వానరసేనకు అండగా ఉంటాడు. మీరంతా వానరయోధులను సృజించి విష్ణుభగవానునికి తోడుగా పంపండి.

వాలి మహాబలశాలియై ఇంద్రునికి పుత్రుడుగా జన్మించాడు. మహా తేజశ్శాలియైన సుగ్రీవుడు సూర్యుని వలన జన్మించాడు. వానరశ్రేష్ఠులలో మహాబుద్ధిమంతుడైన తారుడనే వానరాన్ని బృహస్పతి సృజించాడు. మహా శ్రీమంతుడు, మహా తేజస్సంపన్నుడు అయిన నీలుడు అగ్ని వలన సృజింపబడ్డాడు. మహా సౌందర్యవంతులైన మైంద, ద్వివిదుల్ని అశ్వనీదేవతలు సృజించారు. సుషేషడనువాడు వరుణి వలన, శరభుడు అనువాడు పర్జన్యుని వలన సృజించబడెదరు.

శ్రీమంతుడు, వీర్యవంతుడు, వజ్రశరీరం కలవాడు, గరుత్మంతునితో సమానమైన వేగం గలవాడైన హనుమంతుని వాయుదేవుడు సృజించాడు.

రావణ సంహారానికై శ్రీరామునికి అండగా నిలిచేందుకు అనేక వేలమంది వానరవీరులు సృష్టించబడ్డారు. మేరుపర్వతంవంటి దేహాలు గలవారు మహాబలవంతులైన ఎలుగుబంటులు, కొండముచ్చులు కూడా పుట్టారు.

దేవతలూ ఏయే రూపాన ఏయే వేషం ధరించి, పరాక్రమవంతులై ఉంటారో అట్లే వారికి జన్మించిన పుత్రులుకూడా అదే అంశలు పొంది జన్మించారు.

బ్రహ్మ ఆదేశాన్ననుసరించి దేవ, మహర్షి, గంధర్వ, తార్క్ష్య, నాగ, కింపురుష, సిద్ధ, విద్యాధర, ఉరగులు అనేకులు అప్సరస, గంధర్వ మున్నగు స్త్రీలయందు వనములందు సంచరించే వానరాలను సృజించారు.

ఆ వానరులందరూ మహాబలశాలురే కాకుండా తమకు ఇష్టమైన రూపాన్ని కూడా ధరించగలరు. వారందరికీ గోళ్ళే ఆయుధాలయ్యాయి. వృక్షాల్ని శిలల్ని యథేచ్ఛగా వాడగలరు. పెద్దపెద్ద వృక్షాలను వ్రేళ్ళతోసహా పెకలించగలరు, మహానదులను అడ్డుకొని సముద్రానికి చేరకుండా ఆపగలరు. ఆకాశంలో ఎగురగలరు. సముద్రాన్ని దాటగలరు. మేఘాలలో నుండి ప్రయాణించగలరు. అంతేకాదు ఆ వానరవీరులందరూ మదించిన ఏనుగుల్ని తమ వశమునందుంచుకొనగలరు. అట్టి బలశాలురైన వానరయోధులంతా లక్షలకొద్దీ వానరాలను సృజించారు. వారంతా అరణ్యాల్లోనూ, పర్వతలపైనా నివసించసాగారు.

ఆ వానరసేనకంతటికీ ఇంద్రుని అంశతో జన్మించిన వాలి, సూర్యభగవానుని అంశతో జన్మించిన సుగ్రీవుడు రాజులయ్యారు. నలుడు, నీలుడు, హనుమంతుడు మున్నగు మహాబలశాలు రంతా వారికి మంత్రులయ్యారు.

మహాబలశాలురైన ఆ వానర సైన్యమంతా రామావతార ఆవిర్భావానికి ముందే సంసిద్ధమయి భూమండలమంతా వ్యాపించి ఉంది.

# 18వ సర్గ శ్రీరామ జననం

మ హాత్ముడైన దశరథ మహారాజు అశ్వమేధయాగాన్ని పుత్రకామేష్టియాగాన్నీ సంతృప్తికరంగా పూర్తిచేశాడు. దేవతలంతా హవిస్సులు స్వీకరించి సంతోషంతో తమ స్వస్థానాలకు వెళ్ళారు. దశరథుడు కూడ దీక్షను విరమించి యాగశాలనుండి తన రాణులతో కలసి అయోధ్యానగరానికి చేరుకున్నాడు.

యాగానికి ఆహ్వానించబడిన రాజులు, బ్రాహ్మణులు మున్నగు లక్షలాది అతిథులు దశరథుని పూజలందుకొని తరలి వెళ్ళారు. అందరు ధరించిన వస్త్రాలు ఒకే మాదిరిగా ఉండటంచేత వారంతా దశరథుని యాగాన్ని దర్శించి సత్కరించబడ్డారని చెప్పకయే చెప్పినట్లయింది.

అయోధ్యానగరానికి చేరిన తరువాత దశరథుడు ఋష్యశృంగుని కూడ ఘనంగా సన్మానించాడు. ఆ తర్వాత ఋష్యశృంగుడు కూడా భార్య శాంతాదేవి, రోమపాద మహారాజులతో కలసి అంగదేశానికి వెళ్ళిపోయాడు.

దశరథ మహారాజు, తన రాణులతో కలసి ఆనందంగా, సుఖంగా గడిపాడు. యజ్ఞం పూర్తియై సుమారు ఒక సంవత్సరం అయింది. చైత్రమాసంలో పునర్వసు నక్షత్ర యుక్త నవమినాడు, ఐదు గ్రహాలు ఉచ్ఛస్థితిలో ఉండగా లోకోద్ధారకుడు, ఇక్ష్వాకు వంశోద్ధారకుడు అయిన శ్రీరామచంద్రుడు శ్రీమహావిష్ణువు పూర్ణావతారంగా అవతరించాడు. అమిత తేజోవంతుడైన ఆ బాలుని ప్రక్కన కౌసల్యాదేవి అదితివలె ప్రకాశించింది.

సత్యపరాక్రముడు, విష్ణుభగవానుని నాలుగవవంతు అంశలో, కైకేయి యందు భరతుడు పుష్యమీ నక్షత్రమునందు మీన లగ్నమున జన్మించాడు. మరునాడు సకలశాస్త్ర పారంగతులును, విష్ణ్వంశ సంభూతులువైన లక్ష్మణ, శత్రుఘ్నులు సుమిత్రయందు ఆశ్లేషా నక్షత్ర కర్కాటక

లగ్నమందు జన్మించారు.

సర్వజనులను రంజింపజేసేవాడు కాబట్టి రామ అనీ, రాజ్యభారాన్ని భరించేవాడవడంచే భరతుడనీ, సర్వసంపదలతో (లక్ష్మి) శోభించేవాడు కాబట్టి లక్ష్మణుడనీ, శత్రువులను సంహరించే వాడవడం వలన శత్రుఘ్నుడనీ పండితులు వ్యుత్పత్తి అర్థాన్ని చెప్పారు.

అంతట దశరథుడు నలుగురి కుమారులకు జాతక కర్మ నామకరణ, అన్నప్రాశనాది సంస్కారాలన్నీ యథాశాస్త్రోక్తంగా చేసి బ్రాహ్మణులకు గోవులను, బంగారం, భూమిని విరివిగా దానాలిచ్చాడు.

దశరథుని పుత్రులందరూ వేదవేత్తలే అయ్యారు. జ్ఞానసంపన్నులే కాక మహాశూరులని కూడా ప్రసిద్ధిగాంచారు. రాముడు ధనుర్విద్యయందు నేర్పరి అయ్యాడు ఏనుగులపైన, గుర్రాలపైన కూర్చుని యుద్ధం చేయటంలో అగ్రగణ్యుడనిపించుకున్నాడు.

లక్ష్మణుడు చిన్నతనమునుండి రాముని యెడల అధిక స్నేహం కనబరచెడివాడు. రామునికి సంతోషాన్ని చేకూర్చేందుకు తన శరీరాన్నైనా త్యాగం చెయ్యడానికి సిద్ధంగా ఉండేవాడు. లక్ష్మణుడు ప్రక్కన లేకపోతే రాముడు నిద్రపోయేవాడు కాదు. లక్ష్మణుడు లేకుంటే ఆకలిగా ఉన్నా, మధురమైన పదార్థాలు ఎదురుగా ఉన్నా తినేవాడు కాదు. రాముడు గుర్రమునెక్కి వేటకు బయలుదేరితే లక్ష్మణుడు ధనుస్సు చేతబుచ్చుకొని పోయేవాడు. ఇన్ని మాటలెందుకు, లక్ష్మణుడు రామునికి బహిర్ప్రాణంగా మసలేవాడు. అదేవిధంగా భరతునికి బహిర్ప్రాణంగా శత్రుఘ్నుడుండేవాడు. ఆ విధంగా ఎంతో అన్యోన్యంగా ఉండే ఆ నలుగురు అన్నదమ్ముల్నీ చూసుకొంటూ బ్రహ్మదేవునివలె దశరథుడు ఆనందించేవాడు.

ఆ రామసోదరులు నలుగురూ శ్రద్ధగా వేదాధ్యయనం చేశారు. జ్ఞానసంపన్నులై, సర్వసుగుణ భూషితులై తప్పు చెయ్యాలంటేనే భయపడేవారు. ఏ విషయాన్నైనా నిశితంగా పరిశీలించిగాని చేసేవారుకారు. ధనుర్వేదమందు అమితాసక్తులై ఉండేవారు. అటువంటి

ప్రతిభావంతులు, తేజశ్శాలురైన పుత్రులను చూచుకొని దశరథుడు ప్రజాపతివలె సంతుష్టి చెందేవాడు.

ఈ విధంగా రామసోదరులంతా యుక్తవయస్కులయ్యారు. దశరథుడు వారి వివాహాన్ని గూర్చి ఆలోచిస్తూ ఉండగా, ఒక రోజున విశ్వామిత్ర మహర్షి వచ్చారని ద్వారపాలకులు తెలిపారు. వెంటనే దశరథ మహారాజు పురోహితులతో కూడి దేవేంద్రుడు బ్రహ్మను ఆహ్వానించినట్లుగా స్వాగతం పలికాడు. మహా తపశ్శాలియైన విశ్వామిత్రుని, దశరథుడు ఉచితమైన ఆసనముపై కూర్చుండబెట్టి, అర్ఘ్యపాద్యాదులతో అర్చించాడు.

విశ్వామిత్రుడు : రాజా! నీ రాజ్యములోని ప్రజలంతా సుఖసంతోషాలతో ఉన్నారా? గ్రామాలు, పట్టణాలలోని ప్రజలు ఎలాటి కొరతాలేక జీవిస్తున్నారా? నీవు ఎట్టి ఆపదలు లేనివాడవై కుశలంగా ఉన్నావా?

నీవు ఎన్నడూ శత్రువుల వలన భయాందోళనలు చెందటంలేదు గదా? నీ సామంత రాజు లందరూ నీకు విధేయులై ఉంటున్నారా? యజ్ఞయాగాదులచే దేవతలను తృప్తిపరుస్తున్నావా? రాజ్యపాలనయందు సామదాన భేద దండోపాయాలను సమయోచితంగా అనుష్ఠిస్తున్నావా?

తరువాత వసిష్ఠాది, మునిపుంగవులను సభలోని మహానుభావులందరినీ యథోచితంగా విచారించాడు.

దశరథుడు : మహర్షీ! తమ రాక వలన మా రాజ్యమే పావనమైనది. నీరులేని చోట వర్షించినట్లున్నది, దాహంవేసిన వానికి అమృతం దొరికినట్లున్నది. తమ రాక వలన పుత్రులులేని వారికి పుత్రోదయమైనంత ఆనందం కలుగుచున్నది. పోగొట్టుకున్న వస్తువు దొరికినంత ఆనందం కలుగుతోంది.

ఓ మహర్షీ! నీ దర్శనభాగ్యంచేతనే నన్నింత సంతోషపెట్టిన మీకు నేనేమి చెయ్యాలో ఆజ్ఞాపించండి. మీవంటి సత్పురుషుల రాకచే నా జన్మ ధన్యమైంది.

ఓ బ్రహ్మర్షీ! నీవు ముందుగా రాజర్షిగా ఉన్నావు, తరువాత నీ తపస్సును తీవ్రతరం చేసి బహ్మర్షిత్వం పొందావు. అట్టి నీవు నాకు సర్వదా పూజ్యుడవే! నీ పాదమెచ్చట మోపుతావో అదియే పుణ్య క్షేత్రమవుతుంది. నీవు నా ఇంట అడుగుపెట్టడంచే నేను, నా రాజ్యంకూడా పవిత్రులమయ్యాం.

ఓ విశ్వామిత్రమహర్షీ! నీవు వచ్చిన కార్యం ఎంత కష్టతరమైనదైనా సంతోషంతో నెరవేరుస్తాను, సందేహించవద్దు. నీవు పూజ్యుడవు, దైవంతో సమానమైన వాడవు.

వినయపూర్వకంగా దశరథుడు పలికిన పలుకులకు విశ్వామిత్రుడు చాలా సంతోషించాడు.

# 19వ సర్గ విశ్వామిత్రుడు రాముని పంపమని కోరటం

విశ్వామిత్రుడు : ఓ రాజశ్రేష్ఠుడా! నీవు ప్రసిద్ధమైన ఇక్ష్వాకు వంశంలో జన్మించావు. నీ మాటలు నీ వంశప్రతిష్ఠకు తగినట్లే ఉన్నాయి. మరియు నీవు ఎల్లప్పుడూ వసిష్ఠుని ఉపదేశాలను పొందుతూ ఉండటం వలన నీవు పలికిన వినయపూర్వకమైన మాటలన్నీ సబబుగానే ఉన్నాయి.

రాజా! నేనొక సిద్ధికోసం ఒక యాగం తలపెట్టాను. ఆ యాగ నియమం ప్రకారం, నేను కోపాన్ని పూర్తిగా విడువవలసి ఉన్నది. ఎట్టి విపత్కర పరిస్థితులలోనూ ఎవరికీ శాపమీయరాదు.

నేను శాపమీయలేనన్న ధైర్యంతో కామరూపులైన మారీచ సుబాహువులనే రాక్షసులు నా యాగానికి విఘ్నాలు కల్పిస్తున్నారు. వ్రతం సమాప్తి చెందే సమయంలో, వారిద్దరూ మద్యమాంసాలను యజ్ఞవేదికపై కుమ్మరిస్తున్నారు. ఆ విధంగా నేను ఈ యాగాన్ని మరల మరల ప్రారంభించి విఫలుడనయ్యాను. ఎంత ఓర్పు వహించినా, వారది బలహీనతగా పరిగణిస్తున్నారు. ఆ కారణంగా ఆ దేశాన్నే వదలి వచ్చాను.

రాజా! కౌమార వయస్సు యందున్నవాడూ, శూరుడూ, సత్యపరాక్రమవంతుడూ, అయిన నీ కుమారుడు రాముని నాతో పంపు. దుర్మార్గులైన ఆ రాక్షసులను వధించే సామర్థ్యం రామునికి మాత్రమే ఉంది. రాముని శౌర్యపరాక్రమాల గూర్చి నీవు సందేహపడవద్దు. నీవు రాముని గూర్చి నీ కుమారునిగానే ఎరుగుదువు. కానీ నేను, వసిష్ఠుడు, మరి ఇతర మహర్షులు మాత్రమే రాముని నిజస్వరూపాన్నెరుగుదుము. నా పలుకులు విశ్వసించు, మరియు, వసిష్ఠాది మహర్షులు మంత్రులు అంగీకరించకపోతే నాతో పంపవద్దు. వారి అంగీకారం తీసుకొని నాతో పంపు.

ఓ రాజా! నీవు ధర్మాన్ని రక్షిస్తూండాలని భావిస్తే, నీ కీర్తి ఆచంద్రార్కం ఈ భూమండలంపై ఉండాలని కోరుకుంటే, సందేహించక రాముణ్ణి నాతో పంపు. ఆ దుష్టరాక్షసుల నిద్దరినీ రాముడు మాత్రమే సంహరింపగల సమర్థుడు.

దశరథ మహారాజా! పద్మపత్ర విశాలాక్షుడైన రాముని సామాన్య మానవునిగా తలచవద్దు. నా యాగం ఆగిపోకుండేట్లు చూడు, నీకు క్షేమం కలుగుతుంది.

రాజా! విను. నా రక్షణలోని రామునికి అనేక విధములైన శ్రేయస్సులను ఇవ్వగలను. దానివలన ఇతడు ముల్లోకాల్లోనూ కీర్తి పొందగలడు. సందేహింపకు, దుఃఖింపకు రాముని నాతో పంపించు.

విశ్వామిత్రుని పలుకులు విన్న దశరథుని నవనాడులూ క్రుంగిపోయాయి. శోకంతో మాట్లాడలేకపోయాడు. భయంతో వణికిపోయాడు.

## 20వ సర్గ దశరథుడు రాముని పంపననడం

దశరథుడు : ఓ మునిశ్రేష్ఠా! పద్మములవంటి కన్నులు కలిగిన నా రామునకు ఇంకా పదునారు సంవత్సరాలైనా నిండలేదు. పసిబాలుడు. రాక్షసులతో యుద్ధం చేయగల అనుభవంగాని, నేర్పుగాని, శిక్షణగాని ఇంకా పొందలేదు.

మహర్షీ! నా వద్ద సంపూర్ణంగా అక్షౌహిణి సైన్యం ఉంది. చతురంగ బలాలకు నేనే అధిపతిని. నేను అనేక యుద్ధాలు చేసిన అనుభవం ఉన్నవాడిని. ఆ రాక్షసుల పరాక్రమమెట్టిదో నాకు తెలుపుము. వారి పుట్టుపూర్వోత్తరాలను తెలియజేయండి. వారు స్వతంత్రులా? లేక ఎవరైనా వారిని రక్షిస్తున్నారా?

ఓ విశ్వామిత్ర మహర్షీ! కపటయుద్ధంలో ఆరితేరిన ఆ రాక్షసులను ఎలా మట్టుపెట్టాలో నాకు బోధించండి. అరవై వేల సంవత్సరాలు పుత్రసంతానములేని వాడినై పుత్రకామేష్టియాగం చేసి ఈ రాముని పొందాను. నా స్థితిగతులను మనస్సులో ఉంచుకొని రాముని మీతో పంపమని కోరవద్దు. ఒకవేళ మీరు రాముడే తప్పక యుద్ధం చెయ్యాలని నిర్బంధిస్తే చెప్పండి. నేను, నా నలుగురు పుత్రులూ, నా చతురంగ బలాలతో కూడావచ్చి రాక్షసులను సంహరిస్తాం.

విశ్వామిత్రుడు : రాజా! పౌలస్త్య వంశంలో జన్మించిన రావణుడనే రాక్షస రాజొకడు ఉన్నాడు. ఈతడు విశ్రవసుడనే ముని కుమారుడు. కుబేరుని సోదరుడు. గొప్ప పరాక్రమవంతుడు; మహాబలవంతుడు; మహా వీర్యవంతుడు. ఇతడు బ్రహ్మనుండి అనేక వరాలను పొంది తాను స్వయంగా దుష్కార్యాలు చెయ్యకుండా తన అనుచరులను ప్రోత్సహించి యజ్ఞయాగాదులకు విఘ్నాలు కలిగిస్తూ ఉంటాడు. ఇప్పుడు నేను తలపెట్టిన యాగానికి, మారీచ సుబాహువులనే ఇద్దరు మాయావులు విఘ్నాలు కల్పిస్తున్నారు.

దశరథుడు : మహర్షీ! మీకు సర్వధర్మాలు తెలుసు. నాపై ఆగ్రహము చూపకు. గురువైన

మీరు నాకు దైవంతో సమానం.

మహర్షీ! దేవదానవ గంధర్వ యక్ష పతగ పన్నగులే రావణుని యెదిరించి పోరాడ సమర్థులు కారు. ఇక నేను పసిబాలురైన నా కుమారులు, నిశ్చయంగా రావణుని ఎదరించలేము. అతడితో తలపడిన వాడెంతటి వీర్యవంతుడైనా వాని వీర్యమంతా లాగివేసి క్షణాల్లో నిర్వీర్యుని చేస్తాడు.

ఓ విశ్వామిత్ర మహర్షీ! నేనుగాని, బాలుడైన నా కుమారుడుగాని, నా సైన్యంగాని ఆ రావణుని ఎదుట నిలువజాలం. బాలుడైన నా కుమారుడు దేవతలతో సమానుడు, యుద్ధాల గూర్చి ఇంతవరకు చూచిగాని, వినిగాని ఎరుగడు. అదీగాక నన్ను పున్నామ నరకం నుండి ఉద్ధరించాల్సిన రాముని నీతో పంపలేను.

ఓ మహర్షీ! మారీచ సుబాహువులు మహామాయావులు. కపట యుద్ధంలో ఆరితేరినవారు. నేను, నా స్నేహితులందరమూ కలసికట్టుగా యుద్ధంచేసినా, వారిలో ఒకరితో మాత్రమే యుద్ధం చేయగలం.

దశరథుని పలుకులు విన్న విశ్వామిత్రుడు ప్రజ్వరిల్లిన యాగాగ్నివలె మండిపడ్డాడు.

# 21వ సర్గ వసిష్ఠుడు నచ్చచెప్పటం

విశ్వామిత్రుడు : ఓ రాజా! నేను నిన్నేమీ అడగక ముందే, నాకేది కావాలన్నా ఇస్తానని ప్రగల్భాలు పలికావు. చేసిన ప్రతిజ్ఞను నిలుపుకోలేక పోవటం వలన రఘువంశరాజుల ప్రతిష్ఠ దిగజారిపోతుందే కాని, వృద్ధిచెందదు. ఓ కాకుత్థ్సా! నీవు నీ కుమారులు మాత్రమే సుఖశాంతులతో ఉండాలని అనుకుంటే అట్లాగే సుఖంగా ఉండండి. నేను వచ్చిన దారినే పోతాను. రాముని పంపమని నిర్బంధించను.

క్రోధంతో కూడిన విశ్వామిత్రుని మాటలకు భూమి కంపించింది, దేవతలు భయభ్రాంతులయ్యారు. పరిస్థితి చేయిదాటి పోతోందని వసిష్ఠ మహర్షి గ్రహించాడు. మహారాజుతో ఇలా అన్నాడు.

వసిష్ఠుడు : రాజా! నీవు ఇక్ష్వాకు వంశంలో జన్మించావు. ధర్మాలు తెలియటమేకాక, పరిపూర్ణంగా ఆచరించే ధర్మదేవతవంటి వాడవు. ధైర్యవంతుడవు; శ్రీమంతుడవు; ఉత్తమవ్రతం గలవాడవు. నీవిలా ప్రతిజ్ఞాభంగం గావించడం ధర్మం కాదు.

రాజా! నీవు ధర్మాత్ముడవని ముల్లోకాల్లోనూ ప్రసిద్ధిపొందావు. నువ్వు ధర్మమార్గాన్ని విడవవద్దు. తెలిసి తెలిసి అధర్మాన్ని ఆచరించకు. ప్రతిజ్ఞాభంగం చేస్తే పుణ్యం నశిస్తుంది

రాజా! రాముడు బాలుడన్న శంకను వదలిపెట్టు. రాముడు అస్త్ర, శస్త్ర విద్యలందు ఆరితేరినవాడు కాకపోయినా చింతించకు. విశ్వామిత్రుని రక్షణలో అతడికెలాటి ఆపదా వాటిల్లదు. అగ్నిచే రక్షించబడిన అమృతంవలె, రాక్షసులు రాముని ఏమీ చెయ్యలేరు.

రాజా! విశ్వామిత్రుని గూర్చి నీ వెరుగవు. ఈతడు మూర్తీభవించిన ధర్మము. పరాక్రమవంతులలో శ్రేష్ఠుడు, తపోనిధి, బుద్ధిబల సంపన్నుడు.

అదీగాక, ఈతడు అనేక అస్త్ర శస్త్రాలు తెలిసినవాడు, ముల్లోకాల్లోనూ ఇతడిని జయించగలవారు లేరు. అతడికి తెలిసినన్ని యుద్ధవిద్యలు దేవతలు, ఋషులు, గంధర్వులు మున్నగు శ్రేష్ఠులకు కూడా తెలియవంటే అతిశయోక్తికాదు.

రాజా! పూర్వం విశ్వామిత్రుడు రాజ్యంచేసే కాలంలో, భృశాశ్వ పుత్రులు తమ అస్త్రాలన్నింటినీ ఇతడి కిచ్చేశారు. ఆ అస్త్రాలన్నీ గొప్ప కాంతిగలవి; అనేక రూపములలో వెలయునవి; గొప్ప పరాక్రమంగలవి. జయమేగాని, అపజయమెరుగనివి.

జయ, సుప్రభ అనేవారు దక్షప్రజాపతి కుమార్తెలు. వారిరువురూ భృశాశ్వుని వివాహమాడారు. ఆతడి వలన జయ యాభైమంది పుత్రులను, సుప్రభ యాభైమంది పుత్రులను కన్నది.

రాజా! పూర్వం జయ, సుప్రభ రాక్షస సైన్యాన్ని జయించేందుకు అప్రమేయమైన పరాక్రమము, కోరుకున్న రూపాన్ని పొందే శక్తిని కాంతివంతులును అగు నూరుగురు పుత్రులను కన్నారు. జయకుమారులైన యాభైమంది విజయులని, సుప్రభకు పట్టిన యాభైమంది పుత్రులను సంహారకులు అని పిలుస్తారు. వారందరూ అతిశక్తిమంతమైన శస్త్రాస్త్రాలైనారు. శస్త్రమంటే హింసించేది. అస్త్రమంటే ఎదుటివారిపై విసురునది.

ఈ విశ్వామిత్రుడు శివుని గూర్చి తపస్సు చేసి ఆ నూరు శస్త్రాస్త్రాలు చక్కగా తెలుసుకొన్నాడు. ఇవేకాక ఈతడు కొత్త అస్త్రాలను సృజించడానికి కూడా సమర్థుడు.

కనుక ఓ దశరథ మహారాజా! రాముని విశ్వామిత్రుని వెంట పంపడానికి సందేహపడవద్దు. విశ్వామిత్రుడు తానే ఆ రాక్షసులను సంహరించగల సమర్థుడే అయినా నీ కుమారుడి మేలుకోసం తనవెంట పంపమని అడుగుతున్నాడు! రామునికి శుభం కలుగుతుంది. సందేహించక, విశ్వామిత్రుని వెంట పంపు.

# 22వ సర్గ రామలక్ష్మణులు విశ్వామిత్రునితో పయనమవటం

వసిష్ఠమహర్షి ఉపదేశం పొందిన తరువాత దశరథునిలోని భ్రమలన్నీ తొలగిపోయాయి. తానే వెళ్ళి స్వయంగా రామలక్ష్మణులను తీసుకొనివచ్చి విశ్వామిత్రుని ఎదుట నిలబెట్టాడు. దశరథుడు ప్రేమాతిశయంతో రాముని శిరస్సు ముద్దాడాడు. దశరథుని భార్యలుకూడా రామలక్ష్మణులను ఆశీర్వదించి పంపారు.

విశ్వామిత్రుడు ముందు నడువగా, రామలక్ష్మణులు ఆ మహర్షిని అనుసరించారు. అయోధ్యవాసులంతా వారిపై పుష్పవర్షం కురిపించారు. దుందుభులు మ్రోగించారు. వారా విధంగా కొంతదూరం పోయిన పిదప, సరయూనదీ ప్రాంతాన్ని చేరగానే విశ్వామిత్రుడు వారితో ఇలా అన్నాడు.

విశ్వామిత్రుడు : వత్సలారా! నదిలో స్నానంచేసి ఆచమనం చేయండి. మీకు బల, అతిబల అనే విద్యలను ఉపదేశిస్తాను. ఆ విద్యల ప్రభావంచేత మీకు శ్రమ తెలియదు. జ్వరంవంటి శారీరక బాధలు కలుగవు. మీరు నిద్రపోతున్నాకూడా, శత్రువులు మీకెట్టి కష్టాన్ని తలపెట్టలేరు.

ఓ రామా! సౌందర్యంలోను, జ్ఞానంలోను, శక్తిసామర్థ్యాల్లోగాని, బుద్ధి విశేషంలోగాని, నీకు సాటియైనవాడు ఉండడు. ఆ విద్యాబలం చేత నీతో సమానుడుగాని, నీకన్న అధికుడుగాని ముల్లోకాల్లోనూ ఉండబోడు.

ఓ రామా! నీలో అన్నీ ఉత్తమగుణాల్నే చూస్తున్నాను. ఈ విద్యలు రెంటినీ తపస్సుచే సాధించగలిగితే నీవు వివిధ ఫలాలను పొందగలవు.

తరువాత రాముడు శుచియై ఆచమనంచేసి, ఆనందంతో ఆ విద్యలు రెండింటినీ స్వీకరించాడు. ఆ విద్యలను స్వీకరించగానే రాముడు విశ్వామిత్రుని యెడల గురుభావం నిలిపి

సూర్యుని వలె ప్రకాశించాడు. ఆ రాత్రికి ఆ ముగ్గురూ సరయూనదీ తీరమందే విశ్రమించారు. విశ్వామిత్రుని ప్రియవచనాలతో కటికనేలపై పడుకున్నాకూడా వారికి సుఖంగా నిద్ర పట్టింది.

# 23వ సర్గ కౌసల్యా సుప్రజాః రామ

ఆ రాత్రంతా ఆ ముగ్గురూ సరయూనదీ తీరాన్నే కటికనేలపై నిద్రించారు. రామలక్ష్మణులిద్దరూ గాఢనిద్రలో ఉన్నారు. సూర్యోదయం కాబోతున్నది, విశ్వామిత్రుడు అతి సున్నితంగా వారిని మేల్కొలిపాడు.

విశ్వామిత్రుడు : కౌసల్యాదేవికి సత్పుత్రుడవైన ఓ రామా! సూర్యోదయం కావస్తోంది, ఓ శ్రేష్ఠా! లెమ్ము. సంధ్యావందనాది నిత్యకర్మలకు సమయమైనది, మేలుకో.

అంతట ఆ ముని పలికిన మధురమైన మేలుకొలుపు వాక్యాలు విని రామలక్ష్మణులిరువురు లేచి స్నానంచేసి నిత్యకర్మలన్నీ ముగించుకొని ప్రయాణానికి సిద్ధమయ్యారు. కొంతసేపు ప్రయాణం చేసిన తరువాత వారంతా సరయూ-గంగా సంగమమయ్యే తీర్థాన్ని చేరుకున్నారు. ఆ పవిత్ర తీర్థమందు అనేకమంది మహాత్ములైన ఋషిపుంగవు లెందరో ఆశ్రమాలు నిర్మించుకొని తపస్సు చేసుకొంటున్నారు. వారిని చూడగానే శ్రీరాముని మనస్సు సంతోషంతో ఉప్పొంగింది.

శ్రీరాముడు : ఓ పూజ్యుడా! ఇచ్చట ఉన్న ఋష్యాశ్రమాలు తపోవనాలు చాలా అందంగా కనిపిస్తున్నాయి. మనస్సంతా ఆనందంతో నిండిపోయింది. ఈ ఆశ్రమం ఎవరిది? ఇందు ఎవరు నివసిస్తున్నారు? దీని పూర్వచరిత్ర ఎట్టిది?.

విశ్వామిత్రుడు : రామా! పూర్వం శివభగవానుడు ఇక్కడ తపస్సు చేస్తూ ఉండేవాడు. ఒకనాడు మన్మథుడు తన కామ కళాచాతుర్యంతో శివుని తపస్సుకు అంతరాయం కలిగించాడు. తన ధ్యానానికి అంతరాయం కలగటంతో శివభగవానుడు కోపంతో చూశాడు. అంతే, ఎదురుగా ఉన్న మన్మథుడి శరీరం కాలి భస్మమైపోయింది. అనాటినుండి మన్మథుడు శరీరంలేని వాడయ్యాడు. అందువలననే మన్మథుని అనంగుడని కూడా అంటారు. అతడు కాలిబూడిదయైన

దేశం కాబట్టి అంగదేశమని పేరు వచ్చింది.

ఓ రామా! ఆ విధంగా ఇది శివభగవానుడు తపస్సు చేసిన పుణ్యస్థలం, ఇచ్చటి మునివరులందరూ శివభగవానుని శిష్యులే. అనాటినుండి ఇక్కడే తపస్సు చేసుకొంటున్నారు. వీరు పరమ ధర్మపరాయణులు. వీరిలో ఎవరూ పాపమన్నదే ఎరుగరు.

ఓ రాజకుమారులారా! మనం ఈ రాత్రికి ఈ గంగా-సరయూనదీ తీరాన్నే విశ్రమిద్దాం. ఉదయాన్నే అనుష్ఠానాలు పూర్తిచేసుకొని పరిశుద్ధులమై ముని ఆశ్రమంలో ప్రవేశిద్దాం.

విశ్వామిత్రుడు ఈ విధంగా రామలక్ష్మణులతో మాట్లాడటం ఆ మునులందరూ తమ జ్ఞాననేత్రాలచే చూశారు. అంతట ఆ మునులందరూ పరమానందభరితులై వారిని తమ ఆశ్రమానికి తీసుకొని వెళ్ళారు. ముందుగా విశ్వామిత్రునకు అర్ఘ్యపాద్యాదులతో ఆతిథ్యమిచ్చారు; ఆ తర్వాత రామలక్ష్మణులకు అతిథి సత్కారాలు చేశారు. ఆ రాత్రి అంతా విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు అనేక మనోహరమైన విషయాలను తెలుపుచూ వారిని ఆనందపరిచాడు.

# 24వ సర్గ గంగానదిని దాటడం

ప్రాతఃకాలానే రామలక్ష్మణులు విశ్వామిత్రునితో కలసి గంగానదిని దాటేందుకు బయలుదేరారు.

మునులు : ఓ మహర్షీ! రామలక్ష్మణులను వెంటబెట్టుకొని త్వరగా నావపై కూర్చోండి. కాలాతీతమైంది. మీకు సుఖప్రయాణమగుగాక!

అంతట విశ్వామిత్రుడు ఆ మునులందరినీ పూజించి రామలక్ష్మణులతో ప్రయాణం సాగించాడు. నావ గంగానది మధ్యకు చేరగానే నది వేగం వృద్ధియై, అసామాన్యమైన శబ్దాన్ని విన్నారు.

శ్రీరాముడు : మహాత్మా! నీటిలోనుండి ఏవో శబ్దాలు భయంకరంగా వినిపిస్తున్నాయి. నది వేగంకూడా ఉన్నట్లుండి పెరిగిపోతోంది. దీనికి కారణమేమిటి?

విశ్వామిత్రుడు : రామా! పూర్వం కైలాసపర్వతంపైన బ్రహ్మ తపస్సు చేసేవాడు. ఆయనకు సమీపానే ఒక సరస్సు కావలెనని మనస్సులో సంకల్పించాడు. ఆయన సంకల్పమాత్రం చేతనే అక్కడ ఒక సరస్సు ఏర్పడింది. బ్రహ్మ మనస్సునుండి ఏర్పడటంచే ఆ సరస్సును 'మానససరోవరం' అని పిలువసాగారు. ఆ సరస్సునుండి ఒక నదీ ప్రవాహం బయలుదేరింది. సరస్సునుండి ప్రవహించే నది కావటంచేత ఆ నది 'సరయూ' నది అని ప్రసిద్ధి చెందింది. అటువంటి సరయూనది వేగంగా ప్రవహిస్తూ ఇక్కడ గంగానదిలో సంగమిస్తోంది. ఆ సరయూనది వచ్చి చేరటం చేత గంభీరమైన శబ్దాలు పుడుతున్నాయి. నీవు ఈ గంగా, సరయూనదుల సంగమానికి నమస్కరించు.

రామలక్ష్మణులు ఆ రెండు నదులకూ నమస్కరించారు. గంగానది దక్షిణ తీరం చేరుకుని వేగంగా ప్రయాణం చేయసాగారు.

శ్రీరాముడు : మహాత్మా! పవిత్రమైన గంగా-సరయూ సంగమాన్ని దాటి చాలాదూరం వచ్చాం. ఈ అడవి అంతా భయంకరంగా ఉంది. ఎంతదూరం ప్రయాణంచేసినా ఒక్క మానవమాత్రుణ్ణి కూడా చూడలేకపోయాం. దీనికి కారణమేమిటి? ఇక్కడ తిరిగే వన్యమృగాలన్నీ చాలా భయంకరమైనవిగా ఉన్నాయి. సింహాలు, పులులు, ఏనుగులు, అడవి పందులు విచ్చలవిడిగా సంచరిస్తున్నాయే!

ఈ అడవి అంతా చంద్ర, ఇనుమద్ది, ఏరుమద్ది, మారేడు, కలిగొట్టు మున్నగు వృక్షసముదాయంతో దట్టంగా ఉండటం వల్ల సూర్యరశ్మి కూడా నేలపై పడటంలేదు. ఈ అరణ్యప్రదేశాన్ని ఏమని పిలుస్తారు?

విశ్వామిత్రుడు : వత్సా! రామా! పూర్వం దేవతలిక్కడ మలదము, కమాశము అను రెండు దేశాలను నిర్మించారు. పూర్వం ఇంద్రుడు వృత్రాసురుని చంపటంచేత అతడికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకొంది. దానివల్ల ఇంద్రునికి ఆకలి పట్టుకొని పీడించసాగింది. అప్పుడు దేవతలు, ఋషులు, తపశ్శాలురు ఇంద్రునికి కలశాలతో నీరు తెచ్చి మంత్రపూర్వకంగా అభిషేకం చేశారు. ఆ విధంగా వారు ఇంద్రుని అశుచిత్వాన్ని తొలగించారు. అప్పుడు మహేంద్రుని పట్టుకున్న అశుచిత్వం (ఆకలి) అక్కడే వదలివేశాడు. తనకు బ్రహ్మహత్యాపాతకాన్నుండి విముక్తుణ్ణి చేసిన ఆ ప్రదేశంపై ఇంద్రుడు ఎంతో ప్రసన్నుడై ఈ దేశాలు సర్వసమృద్ధాలై మలదము, కరూశము అను పేర్లతో ప్రసిద్ధి చెందగలవు అని వరం ప్రసాదించాడు. ఇంద్రునిచే ఆ విధంగా గౌరవించబడటంచే దేవతలు ఇంద్రుని వేనోళ్ళ కొనియాడారు.

రామా! మహేంద్రుని కటాక్షంచేత ఈ మలద, కరూర దేశాలు చాలాకాలం సమృద్ధంగా ఉండి ప్రజలు సుఖశాంతులలో నివసించారు. కొంతకాలానికి ఒక యక్షిణి ఆ దేశంలో అడుగుపెట్టింది. దానిపేరు తాటక. ఆమె వెయ్యి ఏనుగుల బలంగలది. ఆమెకు సుందుని వలన మారీచుడనే కుమారుడు కలిగాడు. అతడు దేవేంద్రుడంతటి పరాక్రమశాలి.

ఆ మారీచుడు బలమైన బాహువులు కలిగి విశాలమైన ముఖం, పర్వతంవంటి శరీరంతో ప్రజలను ఎల్లప్పుడూ బాధిస్తూ ఉంటాడు.

ఓ రామా! ఆ తాటక ఈ దేశంలో అడుగుపెట్టింది మొదలు, మలద, కరూరదేశాల్ని కబళించివేస్తూ వచ్చింది. అది నివసించే వనం కాబట్టి దీనిని తాటకవనం అని అంటారు. ఆ తాటకకు భయపడి ప్రజలు ఈ వనంలోకి అడుగుపెట్టడమే మానేశారు. రామా! నీవు ఆజానుబాహుడవు. నీ బాహుబలంతో ఆ దుర్మార్గురాలిని వధించు. తిరిగి ఈ దేశాన్ని సుభిక్షం చెయ్యి. నా మాట విను. ఎవరూ దాన్ని ఎదిరించే వాళ్ళు లేకపోవటం చేత ప్రాణులేవీ ఈ వనంలోనికి ప్రవేశించక ఈ వనం నిర్మానుష్యం అయింది.

రామా! ఈ వనాన్ని గురించి, తాటక పుట్టుపూర్వోత్తరాలన్నీ నీకు తెలియజేశాను. తాటక ఏ ప్రయోజనాన్ని ఆశించి ఈ వనాన్ని విడువకుండా ఉన్నదో చెప్పాను.

# 25వ సర్గ తాటకను వధించమని విశ్వామిత్రుడు రాముని ప్రేరేపించటం

శ్రీరాముడు : ఓ మునిపుంగవా! యక్షులు సహజంగానే అల్ప బలవంతులు గదా! ఈ తాటకకు ఎలా వెయ్యి ఏనుగుల బలం వచ్చింది?

విశ్వామిత్రుడు : రామా! పూర్వం సుకేతువనే యక్షుడొకడుండేవాడు. అతడికి సంతానం లేకుండటంచే బ్రహ్మ గూర్చి తీవ్రమైన తపస్సు చేశాడు. సదాచారుడు, పరాక్రమవంతుడైన ఆ సుకేతుడు బ్రహ్మను మెప్పించి తాటక అనే పుత్రికను కన్నాడు. బ్రహ్మదేవుడు ఆ బాలికకు వెయ్యి ఏనుగుల బలం కలిగేట్లుగా వరం ఇచ్చాడు. ఆ బాలిక దినదిన ప్రవర్ధమానమై రూపయౌవనాలను సంతరించుకొంది. ఆమెకు యుక్తవయస్సు రాగానే సుకేతువు ఆమెను ఝర్ఝుని కుమారుడైన సుందునకిచ్చి వివాహంచేశాడు. కొంతకాలానికి వారిరువురకు మారీచుడనే కుమారుడు కలిగాడు. మహాబలశాలియైన ఆ మారీచుడు శాపవశంచేత రాక్షసుడయ్యాడు.

ఒకానొకరోజున, సుందుడు అగస్త్యమహర్షి ఆగ్రహానికి గురయ్యాడు. ఆ మహర్షి శాపంచేత సుందుడు మరణించాడు. సుందుని కుమారుడైన మారీచుడు, తాటకతో కలసి అగస్త్యుని ఎదిరించాలని ప్రయత్నించారు. అప్పుడు మహర్షి వారిని రాక్షసులు కమ్మని శపించాడు. అంతట కుపితయైన ఆ తాటక గర్జిస్తూ అగస్త్యుని మ్రింగటానికి వెళ్ళింది. భగవత్స్వరూపుడైన అగస్త్యుడు ఆమెను "నీవు ఈ రూపాన్ని విడిచి, వికృతరూపివై మహాయక్షణివై జనులను భయభ్రాంతులను చేయుచుందువుగాక! నీకు అతిభయంకరమైన రూపం కలుగుగాక!" అని శపించాడు.

ఆమెకు కలిగిన రాక్షస స్వభావంచేత ఈ దేశాన్ని సర్వనాశనం చేసింది. అంతేకాకుండా అగస్త్యునిపైగల కోపంతో గో బ్రాహ్మణులను లక్ష్యంగా పెట్టుకొని వేధిస్తోంది. కనుక ఓ రామా!

నీవు ఈ తాటకను తక్షణమే వధించి గోబ్రాహ్మణులకు హితము చెయ్యి.

ఓ రామా! స్త్రీని వధించడమా అని సందేహింపకు. నాలుగు వర్ణాలవారి హితంకోరి ఎటువంటి పనినైనా చేయవచ్చు. గోబ్రాహ్మణ హితం కొరకై స్త్రీయైనా సందేహింపక నీవు వధించవచ్చు. ప్రజారక్షణ కోసం చేసే ఈ కార్యాల వల్ల రాజుకు ఏ విధమైన పాపమూ అంటుకోదు. ఎందువల్లనంటే, ప్రజారక్షణకోసం చేసేపని క్రూరమైనదే అయినా అతిప్రాచీనమైన రాజధర్మం. ధర్మమన్నదే లేని ఈ తాటకను వెంటనే సంహరించు. పూర్వం విరోచనుని కుమార్తె మంథరను దేవేంద్రుడు చంపలేదా? అంతేకాదు పూర్వం భృగుమహర్షి భార్య లోకంలో ఇంద్రపదవే ఉండరాదని తీవ్ర తపస్సు చేసింది. అప్పుడు విష్ణుభగవానుడు ఆమెను సంహరించాడు గదా?

ఓ రామా! వీరే కాదు ఇంకా అనేకమంది పురుషశ్రేష్ఠులు ధర్మవిరుద్ధంగా ప్రవర్తించే స్త్రీలను చంపారు.

# 26వ సర్గ శ్రీరాముడు తాటకను సంహరించటం

శ్రీరాముడు : ఓ విశ్వామిత్ర మహర్షీ! నా తండ్రి దశరథ మహారాజు వసిష్ఠాది మహర్షుల సమక్షంలో, 'విశ్వామిత్రుడు చెప్పినట్లు చేయి' అని అన్నారు. పితృవాక్యాన్ని పరిపాలించటం నా నిత్యధర్మం.

ఓ మహాత్మా! నీవు బ్రహ్మవాదివై ప్రజాహితం కోరి పలికిన మాటను తప్పక పాటిస్తాను. గోబ్రాహ్మణ హితమును, ఈ దేశశ్రేయస్సును కోరినవాడనై నీ ఆజ్ఞను తప్పక శిరసావహిస్తాను. కనుక మహానుభావా! నేను ఈ కార్యాన్ని నిస్సందేహంగా ముగిస్తాను.

అంతట శ్రీరాముడు ధనుస్సును చేతపుచ్చుకొని ధనుష్టంకారం చేయగా దిక్కులన్నీ దద్దరిల్లాయి. పశుపక్ష్యాదులన్నీ భీతిచెందాయి. తాటకకు ముందుగా ఆశ్చర్యం కలిగించినా ఆ తర్వాత కోపంతో పళ్ళు పటపటా కొరుకుతూ ఆ శబ్దంవచ్చిన దిశగా ముఖమెత్తి చూసింది. అక్కడ రామలక్ష్మణులు కనిపించారు.

శ్రీరాముడు : లక్ష్మణా! ఈమె మహాక్రూరురాలు; ఈమె భయంకరమైన ఆకారాన్ని చూస్తేనే జనులు గుండెలు పగిలి చస్తారు. అయినా ఈమె స్త్రీ అవడంచే బ్రతికిపోయింది. ఈమె పరాక్రమాన్ని గమనశక్తిని నశింపచేస్తాను. దానితో జీవచ్ఛవం వలె పడివుంటుంది. ఇకపైన ప్రజలకు ఎటువంటి హానీ చెయ్యలేదు మరియు ఆమె ముక్కు చెవులు కోసినచో ఆమెను చూసి ఆమెయే అసహ్యంచుకొనేట్లు చేస్తాను చూడు.

రామలక్ష్మణులు అట్లా మాట్లాడుకొంటూ ఉండగా, తాటక క్రోధావేశంతో వారిపైకి దూకటానికి సిద్ధమైంది. ఇది అంతా గమనిస్తున్న విశ్వామిత్రుడు, "రామలక్ష్మణులకు స్వస్తి అగుగాక; జయము కలుగుగాక!" అని దీవించాడు.

ఇంతలో తాటక వారిపై సుడిగాలిని సృష్టించి అంతా దుమ్ము ధూళితో నిండిపోయేట్లు

చేసింది. అటుపైన వారిపై రాళ్ళ వర్షాన్ని కురిపించింది. రాముడు ఆ రాళ్ళనన్నింటినీ తన బాణాలతో ఎదుర్కొని ఆమె ప్రయత్నాన్ని నిర్వీర్యం చేశాడు. మరొక బాణంతో దుమ్మంతా చెదిరిపోయేట్లుచేసి ఆ ప్రదేశాన్నంతా నిర్మలంగా చేశాడు. తన ప్రయత్నాలు విఫలం కావటంతో తాటక వారిపై విరుచుకుపడటానికి సిద్ధమైంది. అప్పుడు రాముడు వాడి బాణములతో ఆమె బాహువులను ఛేదించాడు. చేతులు రెండూ తెగి నేలపైపడి బాధతో పొర్లుతున్న ఆ తాటక ముక్కు చెవులను లక్ష్మణుడు ఖండించాడు. కామరూపాన్ని ధరించగల ఆ తాటక రాళ్ళ వర్షం కురిపించింది.

విశ్వామిత్రుడు : రామా! ఈ మాయావి అనేక రూపాలు ధరించి యజ్ఞాలను ధ్వంసం చేస్తూ ఉంటుంది. ఈమె యక్షిణి కావటాన మాయాబలంచేత శక్తి వృద్ధి అవుతూనే ఉంటుంది. ఈమె పాపాత్మురాలు. సంధ్యాకాలం సమీపిస్తోంది; సంధ్యాకాలంలో వీరి శక్తి రెట్టింపవుతుంది. కాబట్టి ఈమెపై జాలి చూపకు. వెంటనే సంహరించు.

విశ్వామిత్రుడి ఆదేశాన్ని స్వీకరించి శబ్దవేధిననుసరించి (బాణంతో ఎక్కడనుండి శబ్దం వస్తోందో, ఆ శబ్దం చేసే వ్యక్తిని కొట్టే సామర్థ్యాన్ని శబ్దవేధి అంటారు.) తాటక వక్షఃస్థలంపై కొట్టాడు. ఆమె అక్కడికక్కడే చచ్చి పడిపోయింది.

తాటక మరణించగానే దేవతలు పుష్పవర్షం కురిపించారు. గంధర్వులు, యక్షులు, కిన్నెరులు, కింపురుషులు నృత్యగానాలు చేస్తూ దుందుభులు మ్రోగించారు.

విశ్వామిత్రుడు : ఓ రామా! నీవు పరమ పవిత్రుడవు. నీ దర్శనం చేతనే శుభాలు చేకూరుతాయి. మనం ఈ రాత్రికి ఇక్కడే బసచేసి ప్రాతఃకాలానే ఆశ్రమానికి పోదాం.

విశ్వామిత్రుడు చెప్పినట్లే వారందరూ ఆ రాత్రి అక్కడే విశ్రాంతి తీసుకొన్నారు. తాటకలేని ఆ వనమంతా ప్రశాంతంగా కుబేరుని చైత్ర రథోద్యానంవలె ప్రకాశించింది.

## 27వ సర్గ విశ్వామిత్రుడు శ్రీరామునికి దివ్యాస్త్రాలు అనుగ్రహించడం

విశ్వామిత్రుడు : నరశ్రేష్ఠుడవు కీర్తిమంతుడవు అయిన ఓ రామా! స్నానంచేసిరా. ప్రసన్నచిత్తుడవై కూర్చో. తూర్పు వైపుగా ముఖంపెట్టి కూర్చో. అత్యుత్తమమైన నా అస్త్ర సంపదనంతా నీ కిస్తాను, స్వీకరించు.

రామా! అసుర, గంధర్వ ఉరగాదులెవ్వరూ నిన్ను ఎదుర్కొనలేరు. అంతేకాదు ఈ దివ్యాస్త్రాల మహిమచేత నీవు శత్రువు లందరినీ నీ వశమందు ఉంచుకోగలవు.

ఓ రామా! ధర్మచక్ర, కాలచక్ర, విష్ణుచక్రాలనే అత్యుత్తమమైన ఇంద్రాస్త్రాలను, వజ్రాస్త్రాలను, శివునిచే ప్రయోగించే శూలాన్ని, బ్రహ్మ శిరోస్త్రాన్ని, ఐషీకాస్త్రాన్ని, అత్యుత్తమమైన బ్రహ్మాస్త్రాన్ని స్వీకరించు.

సర్వశ్రేష్ఠుడవైన ఓ రామా! మోదకి, శిఖీరి అనే రెండు గదలనిస్తున్నాను. ఇవి ప్రజ్వరిల్లే అగ్నివలె ప్రకాశిస్తాయి.

రామా! శుష్కము, ఆర్ద్రము అనే రెండు పిడుగులను, పైనాకాస్త్రాన్ని, నారాయణాస్త్రాన్ని ఇస్తున్నాను.

దోషరహితుడవైన ఓ రామా! శిఖర అనే ఈ అస్త్రం అగ్నికి చాలా ప్రియమైనది. దీనినే ఆగ్నేయాస్త్రమనికూడా అంటారు. మరియు ప్రథన అనే వాయవ్యాస్త్రాన్నికూడా ఇస్తున్నాను స్వీకరించు.

కకుత్థ్స వంశోద్భవుడవైన రామా! హయశిరస్సు, క్రౌంచాస్త్రము అనే రెండు శక్తులను ఇస్తున్నాను. మరియు రాక్షసులు ధరించే కంకాళము, కపాలము, కంకణము అనే ముసలములను కూడా ఇస్తున్నాను. వైద్యాధర అనే మహాస్త్రాన్ని, నందన అనే శ్రేష్ఠమైన ఖడ్గాన్ని

ఇస్తున్నాను, స్వీకరించు.

రామా! ఇది గాంధర్వమానవాస్త్రం. దీనిని ప్రయోగించి, కావలెనన్నచో నిద్రించవచ్చు. అవసరంలేదనుకుంటే నిద్రను తొలగించవచ్చు. అట్టి సౌరాస్త్రాలన్నీ ఇస్తున్నాను గ్రహించు.

సర్వశ్రేష్ఠుడవగు ఓ రామా! దర్పణ, శోషణ, సంతాపన, విలాపనాస్త్రాలను ఇస్తున్నాను. ఎవరూ ఎదిరించలేనిది, మన్మథునికి అత్యంత ప్రీతిపాత్రమైనది అయిన మదనాస్త్రాన్ని ఇస్తున్నాను. పిశాచాలకు సంబంధించిన మోహనాస్త్రాన్ని కూడా ఇస్తున్నాను గ్రహించు.

ఓ మహాబలశాలీ! రామా! తామస–సౌమనాస్త్రాలను, సంవర్ధాస్త్రాన్ని, మౌసలాస్త్రాన్ని, సత్యాస్త్రాన్ని, మాయాధరాస్త్రాన్ని ఇస్తున్నాను గ్రహించు. ఇతరుల తేజస్సును ఆకర్షించే ఘోరమైన తేజఃప్రభాస్త్రాన్ని, సోమదేవతాకాస్త్రాన్ని, శిశిరాస్త్రాన్ని, త్వష్టృదేవతాక సుదామనాస్త్రాన్ని, భగుని శితేషువును(బాణం), మానవాస్త్రాన్ని ఇచ్చుచున్నాను గ్రహించు.

ఏ అస్త్రాలను సాంగోపాంగంగా గ్రహించటానికి దేవతలకైనా సాధ్యంకాదో, అట్టి దుర్లభమైన అస్త్రాలన్నింటినీ విశ్వామిత్రుడు రామునకు ఉపదేశించాడు.

ఒక్కొక్క అస్త్రానికి సంబంధించిన మంత్రాన్ని విశ్వామిత్రుడు జపించగానే అవన్నీ రాముని వశమైయ్యాయి. అంతట ఆ అస్త్ర దేవతలందరూ చేతులు కట్టుకొని రాముని ముందు నిలబడి "రామా! మేమందరమూ నీ కింకరులం" అన్నారు. రాముడు ఆ అస్త్రదేవతలందరిని చేతితో స్పృశించి "ఎల్లప్పుడూ నా మనస్సులో సంచరించుచుందురుగాక" అని దేవతలను ఆజ్ఞాపించాడు. అంతట మహాబలశాలియగు రాముడు విశ్వామిత్ర మహర్షికి నమస్కరించి ప్రయాణం అయ్యాడు.

# 28వ సర్గ రామునికి మరికొన్ని అస్త్రాలను అనుగ్రహించడం

రాముడు : పూజ్యుడా! నీవు ఉపదేశించిన అస్త్రాల వలన దేవతలకంటే బలవంతుడనయ్యాను. నాకు వాటి ఉపసంహార మంత్రాలను కూడా బోధించండి.

(ఆతర్వాత మహర్షి, రామునికి ఉపసంహార మంత్రాలను కూడా ఉపదేశించాడు.)

విశ్వామిత్రుడు : రామా! భృశాశ్వుని పుత్రులైన ఈ క్రింది అస్త్రాలను కూడా గ్రహించు. ఈ అస్త్రాలన్నీ మిక్కిలి ప్రకాశవంతమైనవే కాక కామరూపం కూడా కలిగివుండటంచే అవన్నీ అపురూపమైనవి; అమోఘమైనవి. సత్యవంతము, సత్యకీర్తి, ధృష్టము, రభసము, ప్రతిహారతరము, పరాఙ్ముఖము, అవాఙ్ముఖము, లక్షాక్షము, విషమము, దృఢనాభము, సునాభము, దశాక్షము, శతనక్త్రము, దశశీర్షము, శతోదరము, పద్మనాభము, మహానాభము, దుందునాభము, సునాభము, జ్యోగిషము, కృశనము, నైరాశ్యము, విమలము, యోగంధరము, హరిద్రము, దైత్యము, ప్రశమనము, సార్చిర్మాలి, ధృతి, మాలి, వృత్తిమంతము, రుచిరము, పిత్యసౌమనసము, విధూతము, మకరము, కరవీరకరము, ధనము, ధాన్యము, కామరూపము, కామరుచి, మోహము, ఆవరణము, జృంభకము, సర్వనాభము, సంతానము, వరణము అనే అస్త్రాలను నా నుంచి గ్రహించు.

శ్రీరాముడు ఆ అస్త్రాలన్నింటినీ పరమ సంతోషంతో గ్రహించాడు. ఆ అస్త్రదేవతలు కొందరు ప్రజ్వలించే అగ్నిలా ఉన్నారు. కొందరు ధూమమువలె, కొందరు సూర్యచంద్రులవలె ఉన్నారు. ఆ అస్త్రదేవతలందరూ వినయంతో చేతులు కట్టుకొని నిలబడ్డారు.

అస్త్ర దేవతలు : ఓ నరశ్రేష్ఠుడా! మేమందరమూ నీ కింకరులం, మేం ఏం చెయ్యాలో ఆజ్ఞాపించు.

శ్రీరాముడు : ఓ అస్త్రదేవతలారా! మీరందరూ నా మనస్సులో మెదలుతూ ఉండండి.

మీతో పని కలిగినప్పుడు స్మరిస్తాను. నాకు కావలసిన సహాయం చేయండి. ఇప్పుడు మీరు స్వేచ్ఛగా మీ అభీష్టమునకు నచ్చిన విధంగా నడచుకోవచ్చు.

అంతట ఆ అస్త్రదేవతలందరూ రామునికి ప్రదక్షిణపూర్వక నమస్కారం చేసి వెళ్ళిపోయారు. ఆ తర్వాత రాముడు విశ్వామిత్రునితో కలసి ప్రయాణం కొనసాగించాడు.

శ్రీరాముడు : మహర్షీ! ఉపసంహార మంత్రాలు కూడా నీ వలన తెలుసుకొన్నాను. అందువలన మనస్సు లోపలా, సుందరమైన ఈ వన్యప్రాంతముచే మనస్సుకు బయటాకూడా మనోహరంగా ఉంది.

ఎత్తైన పర్వతశ్రేణులు, వాటి నంటిపెట్టుకొనివున్న వృక్ష సంపద మేఘాలను తాకుచూ ముచ్చటగా ఉన్నాయి. ఈ వనమంతా నానావిధాలైన మృగాలు, పక్షులు యథేచ్ఛగా సంచరిస్తున్నాయి. ఈ వనం తక్కిన అరణ్యప్రాంతాల కన్నా వ్యత్యాసంగా ఎందుకు ఉన్నదో నాకు తెలుసుకోవాలని కుతూహలంగా ఉన్నది.

ఓ మునిసత్తమా! ఓ పూజ్యుడా! మనం ఆ భయంకరమైన అడవిని దాటి వచ్చామా? ఈ పర్ణశాలలు ముని ఆశ్రమాలను తలపింపచేస్తున్నవి. ఇవి ఎవరి ఆశ్రమాలో నాకు తెలుపండి.

ఓ మహర్షీ! గోబ్రాహ్మణ హత్యలు చేసేవారు, కిరాతకులు, దుర్మార్గులు అయిన ఆ పాపాత్ముల నివాసమెక్కడ? నేను సంరక్షింపవలసిన యాగశాల ఎచ్చట ఉన్నది? నేను చంపవలసిన రాక్షసులెవరో తెలుపండి. ఇది అంతా తెలుసుకోగోరుతున్నాను.

# 29వ సర్గ శ్రీరాముడు సిద్ధాశ్రమంలో ప్రవేశించటం

విశ్వామిత్రుడు : రామా! కాశ్యపుడు ఇచ్చట తపస్సిద్ధి పొందటంచే ఈ ప్రదేశానికి సిద్ధాశ్రమమని పేరు వచ్చింది. విష్ణుభగవానుడు వామనావతారంలో ఆవిర్భవించినప్పుడు ఇక్కడే తపస్సు నాచరించాడు.

ఆ కాలంలోనే విరోచనుని కుమారుడైన బలిచక్రవర్తి ఇంద్ర మరుద్గణాది దేవతలందరినీ జయించి త్రిలోకాధిపతియై రాజ్యపాలన చేస్తూ ఉండేవాడు. ఒకానొక సమయాన బలిచక్రవర్తి యాగమొకటి తలపెట్టాడు. అప్పుడు అగ్ని మున్నగు దేవతలంతా విష్ణుభగవానుని సమీపించి ఇలా ప్రార్థించారు.

అగ్ని మున్నగు దేవతలు : దేవా! నువ్వు వికారరహితుడవు, సత్యస్వరూపుడవు, అనంతుడవు, అనాదివి, సర్వాంతర్గతుడవు, సర్వశ్రేష్ఠుడవు. నీకు నమస్కారం.

దేవా! విరోచనుని కుమారుడైన బలి గొప్ప యజ్ఞం చేయుచున్నాడు. బలిచక్రవర్తి గొప్ప బ్రాహ్మణాభిమాని, బ్రాహ్మణులు ఏది కోరితే అది దానాలు చేస్తున్నాడు.

ఓ భగవానుడా! దేవతలమైన మేమందరం బలి వలన రాజ్యభ్రష్టులమయ్యాం. కనుక దేవతల హితం కోరి బలి మదమణచి ఉత్తమమైన ధర్మాన్ని నిలబెట్టు.

ఓ రామా! ఇంతలో అదితితో కూడి కాశ్యపుడు విష్ణుభగవానుని స్తుతించాడు. “ఓ యజ్ఞేశ్వరా! యజ్ఞపురుషా! మంగళధారీ, అచ్యుతా! దీనుల దుఃఖాలను పోగొట్టుటకై అవతరిస్తావు. మాకు శుభాలు కలుగజేయి. అనంతా! నీవు సంతృప్తుడవైతే, అభీష్టమగు దేహమూ, ముల్లోకాల ఆధిపత్యమూ, సాటిలేని సంపదలు, ధర్మార్థకామాలు, జ్ఞానం, అణిమాది సిద్ధులు లభిస్తాయి. అట్టి విష్ణుభగవానునికి నమస్కరిస్తున్నాము” అని పరిపరివిధాలుగా స్తుతించారు.

సంతృప్తుడైన విష్ణుభగవానుడు ఇలా పలికాడు: "దేవమాతా! కశ్యప ప్రజాపతీ! దానవులు నీ పుత్రుని సంపదలు రాజ్యం హరించి రాజ్యభ్రష్టులను చేసిన విషయం నేనెరుగుదును. అసురుల బలం అధికంగా ఉన్నది, అదీగాక బలి భృగువంశ బ్రాహ్మణుడైన శుక్రాచార్యులచే రక్షించబడు తున్నాడు. ఈ సమయంలో వారిపై యుద్ధం ప్రకటించి గెలువలేరు.

"మీరు నన్ను ధ్యానించి యజ్ఞవ్రతాన్ని చేశారు. నేను సంతుష్టుడనయ్యాను. నాకు చేసిన ఆరాధన వ్యర్థం కాదు. అందువలన నేనే నీకు పుత్రునిగా జన్మించి, నీ పుత్రులను రక్షిస్తాను, ఇది దేవరహస్యం." అని పలికి అంతర్థానుడయ్యాడు.

ఓ రామా! శ్రవణ ద్వాదశినాడు చంద్రుడు శ్రవణమున ఉండగా అభిజిన్నక్షత్రాన వామన భగవానుడు అవతరించాడు. దేవతలు, సిద్ధులు, విద్యాధరులు, కిన్నెరులు, కింపురుషులు, యక్షులు నృత్యాగానాలు చేస్తూ పుష్పవర్షాన్ని కురిపించారు. యుక్తవయస్సు రాగానే వామనునకు ఉపనయన సంస్కారాలు కావించారు.

నర్మదా నదీతీరాన భృగువత్సరమనే క్షేత్రంలో శుక్రాచార్యులవారి ఆధ్వర్యవంలో బలిచక్రవర్తి అశ్వమేధయాగం ప్రారంభించాడు. మహా తేజోవంతుడైన ఆ వామనబాలుడు యజ్ఞశాలలోనికి ప్రవేశించాడు.

అంతట బలిచక్రవర్తి ఆ బాలుని తేజస్సు చూచి, మూర్తీభవించిన బ్రహ్మర్షి వలె ఉన్నాడని తలచి కాళ్ళు కడిగి నీరు తలపై చల్లుకున్నాడు. "ద్విజోత్తమా! నీ పాదాలు కడగడంతో నా వంశమే పావనమైనదని భావిస్తున్నాను. మీకేమి కావాలో ఆజ్ఞాపించండి ఈ భృత్యుడు వెంటనే నెరవేరుస్తాడు" అని వినయంతో పలికాడు.

అంతట వామనరూపంలో ఉన్న విష్ణుభగవానుడు బలి యిచ్చిన మూడడుగుల నేలతో మూడు లోకాలను ఆక్రమించి బలిని బంధించి మహేంద్రునికి స్వర్గాన్ని, బలికి పాతాళాన్ని ఇచ్చాడు.

రాజా! పూర్వం వామనుడు ఈ ఆశ్రమంలో కొంతకాలం విశ్రమించాడు. విష్ణుభగవానునిపై నాకుగల భక్తి ప్రపత్తుల చేత నేనుకూడా ఈ ఆశ్రమంలోనే ఉంటున్నాను.

ఓ పురుషశ్రేష్ఠుడా! రామా! మునులు, మహర్షులు, బ్రాహ్మణులు చేస్తున్న యజ్ఞాలకు భంగం కలిగిస్తూ రాక్షసులు ఈ ఆశ్రమానికి వస్తున్నారు. వారందరినీ సంహరిస్తేగానీ, యజ్ఞయాగాలను ప్రశాంతంగా చేసుకోలేము.

నాయనా! రామా! మనమిప్పుడు అట్టి అతిపవిత్రమైన సిద్ధాశ్రమంలోకి ప్రవేశించాం. ఈ ఆశ్రమం నీదే. నీకు సొంతమైన ఆశ్రమం నీ భక్తుడనైన నాకు కూడా సొంతమే అగుచున్నది సుమా!

విశ్వామిత్ర సహిత రామలక్ష్మణులను చూడగానే ఆ ఆశ్రమమందలి మునులందరి ముఖ కమలాలన్నీ వికసించాయి. వేగంగాపోయి విశ్వామిత్రుని పూజించారు. రామలక్ష్మణులకు అతిథి పూజలు చేశారు.

రామలక్ష్మణులు : ఓ మునిశ్రేష్ఠా! మీరిక యజ్ఞదీక్షను స్వీకరించండి. మీ వచనాలు సత్యం కాగలవు. సిద్ధాశ్రమనామం సార్థకమగుగాక! లోకంలో అందరికీ యోగక్షేమాలు కలుగుగాక!

రామలక్ష్మణులు రాత్రి అంతా సావధానులై ఉండి ప్రాతఃకాలానే నిత్యకర్మలన్ని నిర్వర్తించి, అగ్నిహోత్రాన్ని ఉపాసించుకొన్నారు. విశ్వామిత్రుడు యజ్ఞదీక్షలో ప్రవేశించాడు.

# 30వ సర్గ శ్రీరాముడు రాక్షసులను సంహరించి యాగాన్ని రక్షించటం

రామలక్ష్మణులు: ఓ బ్రహ్మర్షీ! ఆ రాక్షసులను సంహరింపవలసిన సమయాన్ని మాకు తెలుపండి. సమయం మించిపోకమునుపే వారిని సంహరించి యాగరక్షణ చేస్తాము. మేమిరువురం అప్రమత్తులమై ఉన్నాం.

మునులు: రామలక్ష్మణులారా! నేటి నుండి ఆరు రాత్రులు, ఆరు పగళ్ళు యాగరక్షణ చేయాలి. విశ్వామిత్ర మహర్షి దీక్ష వహించినాడు. యాగం అయ్యేంతవరకు మౌనవ్రతం ఆచరిస్తాడు.

తరువాత రామలక్ష్మణులు రాత్రింబవళ్ళు అయిదు దినములు విశ్వామిత్రుని సమీపంలోనే సర్వసన్నద్ధులై ఉన్నారు. ఇట్లుండగా ఆరవ రోజు యజ్ఞవేదిక నుండి మంటలు బయలుదేరాయి. దర్భలు, పుష్పములు, ఋత్త్వికులు కూర్చునే వేదిక నుండి నిప్పు రగులుతోంది. అంటే ఇది రాబోయే ఉపద్రవాన్ని సూచిస్తున్నది. మారీచసుబాహువు లిద్దరూ యజ్ఞ వాటికకు పైన ఆకాశంలో మేఘాల్లాగా తిరుగుతున్నారు. అప్పటికే వేదిక అంతా రక్తం చిమ్మింది. మారీచ సుబాహువు లిద్దరూ శ్రీరాముని కంటపడ్డారు. రాముడు, లక్ష్మణునితో ఇలా అన్నాడు.

శ్రీరాముడు: సోదరా! లక్ష్మణా ఆ నరభక్షకులైన రాక్షసులపై నా బాణాలను ప్రయోగిస్తున్నాను చూడు. వాయువు మేఘాలను తరిమికొట్టినట్లుగా నా బాణాలు వారిని తరిమికొడ్తాయి చూడు.

అంతట రాముడు అమిత ప్రకాశవంతమైన మానవాస్త్రాన్ని మారీచుని వక్షఃస్థలాన్ని గురిచూసికొట్టాడు. ఆ ప్రభావానికి మారీచుడు ఎగిరి నూరు యోజనాల దూరాన ఉన్న సముద్రంలోపడ్డాడు.

"లక్ష్మణా! చూశావా! మానవాస్త్ర ప్రభావం. వాడికి మోహం కలుగజేసి తీసుకొని పోతోందేకాని ప్రాణాలు తియ్యదు. ధర్మబద్ధమైన ఈ అస్త్రరాజాన్ని అభినందించాలి. సోదరా! జాలిలేనివారు, దుర్మార్గులు, పాపాత్ములు, యజ్ఞయాగాదులను ధ్వంసం చేసేవారు అయిన ఈ రాక్షసులందరినీ సంహరిస్తాను. ఇప్పుడు నేను ఆగ్నేయాస్త్రాన్ని సుబాహువుపైన ప్రయోగిస్తున్నాను చూడు" అంటూ రాముడు అస్త్రాన్ని ప్రయోగించాడు. వాడు వెంటనే వక్షఃస్థలం పగిలి నెత్తురు కక్కుకొని నేలపై పడ్డాడు. అంతట రాముడు మిగిలిన రాక్షసులపై వాయవ్యాస్త్రమును ప్రయోగించి సంహరించాడు.

రాక్షసుల మరణం మునులందరినీ ఆనందపరవశుల్ని చేసింది. వారంతా రాముని దేవేంద్రుని వలె పూజించారు. యజ్ఞం నిర్విఘ్నంగా పరిసమాప్తమైంది. విశ్వామిత్రుడు దీక్ష విరమించాడు.

విశ్వామిత్రుడు: ఓ రామా! వచ్చిన పని చక్కగా పూర్తిచేశావు. నీ తండ్రి ఆదేశాలను పాటించావు. ఋషి, ముని, బ్రాహ్మణ లోకమంతా నిన్ను ప్రశంసిస్తున్నారు. సిద్ధాశ్రమం పేరును చిరస్థాయిగా చేశావు.

## 31వ సర్గ శ్రీరాముడు మిథిలానగరానికి ప్రయాణమవడం

విశ్వామిత్రుడు తలపెట్టిన యాగం నిర్విఘ్నంగా జరిగింది. మునుల కోరికపై రామలక్ష్మణులు సిద్ధాశ్రమంలోనే కొన్నిరోజులు గడిపారు. ఒకానొక రోజున రామలక్ష్మణులిరువురు ప్రాతఃకాలానే లేచి అనుష్ఠానాలన్నీ ముగించుకొని విశ్వామిత్రుని వద్దకు వెళ్ళి మృదుమధురంగా ఇలా అన్నారు.

రామలక్ష్మణులు : ఓ మునిశ్రేష్ఠా! మేము నీ సేవకులం. మిమ్మల్ని సంతోషపరచటానికి మేము ఇంకా ఏం చెయ్యాలో ఆజ్ఞాపించండి.

మునులు రామునితో : ఓ రామలక్ష్మణులారా! మీ రాక వలన మాకు రాక్షస బాధలన్నీ తొలగిపోయాయి, ప్రశాంతంగా ఉన్నాం. మిథిలానగరంలో జనకమహారాజు గొప్పయాగం ఒకటి చేస్తున్నాడు. మేమందరమూ ఆ యాగానికి వెళ్తున్నాం, మీరుకూడా మాతో మిథిలకు రండి. అక్కడ నరశ్రేష్ఠులైన మీరు చూడదగిన విశేషం ఒకటి ఉంది.

రామా! మిథిలాధిపతియైన దేవరాతుడు గొప్ప యజ్ఞం చేసి దేవతలనుండి ఒక ధనుస్సును పొందాడు. ఆ ధనుస్సు దాని మధ్య భాగం బాగా దృఢంగా ఉంటుంది. దాన్ని వంచి ఎవరూ నారిని సంధించలేరు. అప్పటినుండి ఆ ధనుస్సు మిథిలాధిపతులచే పూజలందుకొంటున్నది. ఆ ధనుస్సు వింటిని సారించి నారి బిగించడానికి ఎందరో దేవతలు, గంధర్వులు, అసురులు, రాక్షసులు తీవ్రంగా ప్రయత్నించి విఫలులయ్యారు. ఎందరో రాజులు ఆ ధనుస్సు శక్తిని పరీక్షింపగోరి విఫలులై చతికిలపడ్డారు.

ఓ రామా! నీవుకూడా మాతో మిథిలానగరానికి వస్తే నువ్వాధనుస్సును, జనకమహారాజు చేసే యజ్ఞాన్ని కూడా చూడవచ్చు.

విశ్వామిత్రుడు : ఓ వనదేవతలారా! ఈ సిద్ధాశ్రమమునందు నా సంకల్పం సిద్ధించింది.

మేము గంగానదికి ఉత్తరానవుండే హిమవత్ప్రాంతాలకు వెళ్ళాలని సంకల్పించాం. ఆశ్రమప్రాంతానికి మునివరుల కందరకు భక్తిపూర్వకంగా ప్రదక్షిణం చేస్తున్నాం. మాకు శుభమగుగాక!

ఆ విధంగా విశ్వామిత్రుడు ఆశ్రమం వదలివెళ్తూ ఉంటే పశుపక్ష్యాదులెన్నోవారి వెంట వెళ్ళాయి. కొంతదూరం పోయిన తర్వాత విశ్వామిత్రుడు వాటి నన్నింటినీ ప్రేమతో వెనక్కువెళ్ళమని ఆదేశించాడు.

ఆ మునీశ్వరులందరూ ఆ విధంగా ప్రయాణం చేస్తూ సాయంకాలానికి శోణానదీ తీరానికి చేరుకున్నారు. ఆ రాత్రికి అక్కడే బసచేశారు.

"ఓ పూజ్యుడా! విశ్వామిత్ర మహర్షీ! ఈ ప్రదేశమంతా ఫలపుష్పాదులతో మనోహరముగా ఉన్నది. ఇక్కడ తెలుసుకోదగిన స్థలమాహాత్మ్యం ఏమైనా ఉందా? ఉంటే మాకు చెప్పు" అని రాముడు ప్రశ్నించాడు.

# 32వ సర్గ కుశనాభుని నూరుగురు కుమార్తెలు గూనివారవడం

విశ్వామిత్రుడు : రామా! పూర్వం కుశుడనే మహాపురుషుడొకడుండేవాడు. అతడు బ్రహ్మ పుత్రుడు. మహాతపస్సంపన్నుడు, ఆతడు ఎన్నడూ నియమాలకుగాని, ధర్మానికిగాని విరుద్ధంగా నడచుకోలేదు. సజ్జనులను, సాధుపుంగవులను సేవించేవాడు.

ఆ మహాత్ముడు విదర్భరాజకుమార్తెను వివాహమాడి కుశాంబుడు, కుశనాభుడు, అధూర్తరజసుడు, వసువు అనే నలుగురు పుత్రులను పొందాడు.

కుశుడు పుత్రులతో "పుత్రులారా! మీరందరూ ధర్మనిరతులు, ఉత్సాహవంతులు, సత్యవ్రతులు. పరిపాలనమంతా ధర్మపథానే నడిపించండి" అని అన్నాడు.

రామా! తండ్రి ఆదేశమునను సరించి ఆ నలుగురూ నాలుగు పట్టణములను నిర్మించుకున్నారు. కుశాంబుడు కౌశాంబీ నగరాన్ని, కుశనాభుడు మహోదయపురాన్ని, అధూర్తరజసుడు ధర్మారణ్యమనే నగరాన్ని, వసువు గిరివ్రజపురాన్ని నిర్మించుకున్నారు.

రామా! ఇప్పుడు మనమున్న ప్రదేశం వసుమహారాజు రాజ్యంలోనిది. ఈ దేశానికి చుట్టూ ఐదు పర్వతాలున్నాయి. మగధదేశంలో పుట్టిన శోణనది ఈ ఐదు పర్వతాలనూ చుట్టి ప్రవహించడం చేత పుష్పమాలవలె ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ నది తూర్పునుండి పశ్చిమానికి ప్రవహిస్తూ ఉంటుంది. దీజలాల వలన ఈ దేశమంతా పాడిపంటలతో సస్యశ్యామలంగా ఉంటుంది. ఇదంతా వసువు రాజ్యమే.

రామా! ఈ కుశనాభుడు ఘృతాచి అను అప్సరకన్యను వివాహమాడి నూరుగురు కుమార్తెలను కన్నాడు. కాలక్రమాన వారంతా యౌవనవతులయ్యారు. వారు ఉద్యానవనాలలో ఆడుతూ పాడుతూ తిరుగుతూ మెరుపుతీగలవలె ప్రకాశవంతంగా ఉండేవారు. ఒకానొక రోజున వాయుదేవుడు వారితో ఇలా అన్నాడు.

వాయుదేవుడు : ఓ సుకుమారులారా! మిమ్ములను చూడగానే నా మనస్సు దోచుకున్నారు. నేను మిమ్మల్నందరినీ వివాహం చేసుకుంటాను. నన్ను వివాహమాడటంచే మీ మానవత్వంపోయి దైవత్వం సిద్ధిస్తుంది. మానవుల యౌవనం తాత్కాలికం, కొంతకాలం మాత్రమే ఉంటుంది. నన్ను వివాహం చేసుకుంటే మీరంతా దేవతాస్త్రీలై శాశ్వత్వం సిద్ధిస్తుంది.

రాజకుమార్తెలు : ఓ వాయుదేవా! సురోత్తమా! నువ్వు అన్ని ప్రాణుల్లోనూ సంచరిస్తావు, నీవులేని జీవి బ్రతుకలేదనేది అందరికీ తెలిసిన విషయమే. పనిగట్టుకొని మమ్ములను ఎందుకు అవమానిస్తున్నావు?

మా తండ్రియైన కుశనాభుడు సత్యవ్రతుడు, ధర్మపరుడు. ఆయన మమ్మల్ని ఎవరికిచ్చి వివాహం చెయ్యాలని అనుకుంటాడో వారిని మేము భర్తలుగా స్వీకరిస్తామేగాని స్వేచ్ఛావిహరులం కాము. మేం ఆయన మాటకు ఎదురుతిరిగి ప్రవర్తింపం. నీవు దేవతవే అయినా దుర్బుద్ధివి. నిన్ను నీ పదవినుండి తొలగించే శక్తి మాకు ఉన్నది. అయినా మా తపస్సు వ్యర్థం కారాదని నిన్ను విడిచి పెడ్తున్నాం.

వాయు భగవానుడు : ఓ కన్యకలారా! మీరు నన్ను నిరాకరించుటయే కాక అవమానించారు. కనుక మీ అవయవాలన్నీ దుర్బలములై పోవుగాక!

వాయు భగవానునిచే శపించబడిన ఆ కన్యలందరూ దుర్బలమైన శరీరాలతో సిగ్గుపడుతూ రాజమందిరాన్ని చేరి దుఃఖించసాగారు.

కుశనాభుడు : పుత్రికలారా! మెరుపుతీగలవలె ప్రకాశవంతంగా ఉండే మీకు ఈ గూనితనం ఎలా వచ్చింది? ఎవరు ఇట్లా చేశారు? ఈ విధంగా ధర్మాన్ని అవమానించిందెవరో నాకు చెప్పండి. దుఃఖముతో నేలపైపడి దొర్లుచున్న మిమ్ములను చూడలేకుండా ఉన్నాను.

# 33వ సర్గ కుశనాభుడు కుమార్తెలను ఓదార్చటం

కుశనాభుని పుత్రికలు : తండ్రీ! సర్వాంతర్యామి అయిన వాయువు మమ్మల్ని తనకు భార్యలుగా చేసుకొంటానన్నాడు. అందుకు మేము అంగీకరించక, "మేము మా తండ్రిగారి అధీనంలో ఉన్నాం, మేము స్వతంత్రులం కాము. నీవు ఆయనతో మాట్లాడి ఆయన అంగీకారం పొందు" అని చెప్పాం. వాయుదేవుడు మాపై కోపగించి మమ్మిట్లు గూని వారిగాజేసాడు.

కుశనాభుడు : పుత్రికలారా! మీరందరూ ఒకమాటపై ఉండి నా వంశగౌరవాన్ని కాపాడారు. స్త్రీలకైనా, పురుషులకైనా ఓర్పు అనునది మెచ్చదగినది. అది ఒక అలంకారంల మీరందరూ ఓర్పు కలిగి ఆ వాయువును క్షమించారు. అది ఇంకా ప్రశంశనీయం. దేవతలు ఓర్పులేనివారన్న విషయం అందరికీ తెలిసిందే. అయినా మీ ఓర్పు మిక్కిలి ప్రశంశనీయం. నీ తల్లి ఘృతాచి అప్సరస్త్రీ కావడంచే మీరూ దేవతలనియే నేను తలచుచున్నాను.

పుత్రికలారా! ఈ ప్రపంచం అంతా ఓర్పు పైననే నడుస్తోంది. ఓర్పే దానం, ఓర్పే యజ్ఞం, ఓర్పే కీర్తి, ఓర్పే ధర్మం. పుత్రికలారా! మీరు విచారించకండి. విశ్రాంతి తీసుకోండి.

పిమ్మట ఆ కుశధ్వజుడు (కుశనాభుడు) మంత్రులను పిలిచి కుమార్తెల వివాహవిషయమై వారితో సంప్రదించాడు. ఆ కాలంలో మహాతపశ్శాలి, ఊర్ధ్వరేతస్కుడు అయిన చూళి అనే మహర్షి వేదోక్తమైన రీతిలో తపస్సుచేశాడు. ఊర్మిళ అనే గంధర్వస్త్రీ కుమార్తెయైన సోమద ఆ మహర్షికి ఉపచారాలుచేస్తూ సేవించుకునేది. ఆ మహర్షికి ఆమెపై అనుగ్రహం కలిగి ఒకానొక రోజున "నీ సేవలకు సంతోషించాను ఏదైనా వరం కోరుకో" అన్నాడు. అందుకా సోమద "మహర్షీ! నీవు తేజస్సుచే బ్రహ్మదేవుని వంటివాడవు. నాకు భర్త లేడు, నేను ఎవరికీ భార్యనుకాను. ఓ ధార్మికుడా! బ్రాహ్మమగు తపస్సుతో కూడిన పుత్రుని ప్రసాదింపు" అని అడిగింది.

ప్రసన్నుడైన ఆ ఋషి ఆమెకు అత్యుత్తముడైన పుత్రునొకనిని ప్రసాదించాడు. ఆతడు బ్రహ్మదత్తుడనే నామంతో ప్రసిద్ధిచెందాడు. 'చూళి' మానసపుత్రుడుగా కూడా ప్రసిద్ధి పొందాడు. అంతట ఆ బ్రహ్మదత్తుడు కాంపిల్యానగరాన్ని, దేవేంద్రుడు స్వర్గాన్ని పరిపాలించినట్లు పరిపాలించాడు.

కుశనాభ మహారాజు బ్రహ్మదత్తుని తన నగరానికి తీసుకొనిపోయి తన నూరుగురు కుమార్తెలను ఇచ్చి వివాహం చేశాడు. అప్పుడా బ్రహ్మదత్త మహారాజు రాకుమార్తెలందరి హస్తాలను క్రమానుసారం గ్రహించాడు. ఆ విధంగా బ్రహ్మదత్తుని చేయి తగులగానే ఆ రాకుమార్తెల వాయుదోషంపోయి జ్వరం తగ్గి గూనితనం పోయింది.

కుమార్తెలందర్నీ సౌందర్యవతులైన యువతులుగా చూసుకొని కుశనాభ మహారాజు పరమానందం పొందాడు. 'సోమద' కూడా తన కుమారుడు చేసిన సత్కార్యానికి సంతోషించి కోడళ్ళందరినీ అభినందించింది.

# 34వ సర్గ గాధి జన్మ వృత్తాంతం

విశ్వామిత్రుడు : ఓ రామా! కుశనాభునికి నూరుగురూ కుమార్తెలే కలిగారు. పుత్ర సంతానం లేదు. తన నూరుగురు కుమార్తెలను బ్రహ్మదత్తునికిచ్చి వివాహంచేసిన పిదప, కుశనాభుడు పుత్రకామేష్టి యాగం చేశాడు. పుత్రకామేష్టియాగం జరిగే సమయంలో ఆయన తండ్రియైన కుశుడు ప్రత్యక్షమై "కుమారా! నీ అంత ధార్మికుడు, సమర్థుడు అయిన పుత్రుని పొందుతావు. ఆ పుత్రుని ద్వారా నువ్వు శాశ్వతకీర్తి పొందగలవు" అని పలికి బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు.

రామా! కొంతకాలానికి కుశనాభుడు, గాధి అనే పుత్రుని కన్నాడు. ఆ గాధి పరమధార్మికుడై తండ్రికి, తండ్రి వంశానికీ కూడా కీర్తి తెచ్చిపెట్టాడు. ఆ గాధియే నా తండ్రి. అతడి కీర్తి ప్రతిష్ఠలచే కౌశికుని పేరు మీద మా వంశాన్నంతా కౌశికులని పిలుస్తారు.

రామా! గాధి మహారాజుకు నేను, సత్యవతి అనే ఒక కుమార్తె గలరు. ఆమె మహా పతివ్రత. ఆమె భర్తను అనుసరించి స్వయంగా స్వర్గానికే వెళ్ళింది. అక్కడనుండి ఆమె పరమపవిత్రమైన 'కౌశికీ' మహానదిగా ప్రవహించినది. ఆ నది పరమ పవిత్రమైనది, అనేక దేవతాశక్తులుగలది అన్న ప్రఖ్యాతి పొందింది. ఆ మహానది (నా సోదరి) హిమాలయపర్వతాల గుండా ప్రవహించటంచే, నేను తరచూ హిమాలయ పర్వతాలకు పోయి నా సోదరి ఆతిథ్యం స్వీకరిస్తూ ఉంటాను.

రామా! నా యాగాన్ని పూర్తిచేయాలనే తలంపుతో ఆమెను విడిచి సిద్ధాశ్రమానికి వచ్చాను. నీ బల పరాక్రమాలచే నాకు యాగఫలం సిద్ధించింది.

ఓ రామా! నీవు కోరినట్లుగా, నా పుట్టుక, పూర్వోత్తరాలు అన్నీ నీకు చెప్పాను. రాత్రి చాలా పొద్దుపోయినది, ఇక నిద్రపోండి. నీకు మంగళమగుగాక! మరునాటి ప్రయాణం ఏ

విఘ్నాలు లేకుండ సాగుగాక!

రాముడు : ఓ మహాయశఃశాలీ! విశ్వామిత్ర మహర్షి! కుశవంశీయులందరూ పూజ్యులే. వారందరిలో నీవు పరమపూజ్యుడవు. బ్రహ్మతో సమానమైనవాడవు. అంతేకాకుండా నీ సోదరికూడా నదులలోకెల్లా పరమపవిత్రమైనదై నీ వంశమునకు ఇంకనూ వన్నె తెచ్చిపెట్టినది.

రామలక్ష్మణులు, తక్కిన మునులందరూ విశ్వామిత్రునిచే వివరించబడిన కుశవంశ చరిత్రనంతా విని పరమానందభరితులై విశ్రమించారు.

# 35వ సర్గ గంగావతరణం

శ్రీరాముడు : మునీంద్రా! సంధ్యావందనాది నిత్యకర్మలన్నీ పూర్తి చేసుకొని ప్రయాణానికి సిద్ధమయ్యాం, ఈ శోణా నదిలో నీళ్ళు ఎండిపోయాయి. అక్కడక్కడా ఇసుక దిబ్బలు బయటపడ్డాయి. ఈ నది దాటేందుకు నావతో పనిలేదు. అయితే ఎటుప్రక్కనుండి దాటాలో తెలియటం లేదు.

విశ్వామిత్రుడు : రామా! ఈ మహర్షులందరూ దారి బాగాతెలిసినవారే. వాళ్ళు వెళ్ళేదారిలోనే మనం కూడా ప్రయాణం చేద్దాం.

ఆ విధంగా వారు ముగ్గురూ మహర్షులను అనుసరిస్తూ అనేక వనాలను దాటుతూ మధ్యాహ్నానికి గంగానదీ తీరాన్ని చేరుకున్నారు. గంగానది దర్శనమాత్రం చేతనే వారి మనస్సులన్నీ సంతోషంతో ఉప్పొంగిపోయాయి. పవిత్ర గంగానదిలో స్నానాదులు ఆచరించారు, మధ్యాహ్నిక అగ్నిహోత్రాది నిత్యకర్మలన్నీ పూర్తిచేసుకున్నారు. అమృతంవంటి హవిస్సులను భుజించారు, కొద్దిసేపు విశ్రమించారు.

శ్రీరాముడు : పూజ్యుడా! గంగానది పరమ పవిత్రమైనదని తెలుసు. అయితే ఈ నది మూడు లోకాలను ఏ విధంగా ఆక్రమించిందో నాకు తెలుపగలరని ప్రార్ధన.

విశ్వామిత్రుడు : రామా! హిమవంతుడనే పర్వతరాజు ఉన్నాడు. అతడి అధీనంలో అనేక మూలికలు, ధాతువులు ఉంటాయి. ఔషధులకు ఆతడు నిధి. మేరుపర్వతం కుమార్తె అయిన మనోరమ హిమవంతుని భార్య. వారిరువురకూ అపురూప సౌందర్యరాసులైన ఇద్దరు కుమార్తెలు కలిగారు. పెద్దకుమార్తె పేరు గంగ, దేవతలందరూ గంగను తమకిమ్మని ప్రార్థించారు. ముల్లోకాలకూ హితంచెయ్యాలని సంకల్పించి ధర్మపరుడైన హిమవంతుడు గంగను దేవతలకిచ్చాడు. అక్కడనుండి దేవతలు గంగను మూడు మార్గాల్లో తీసుకొనిపోయి మూడు

లోకాలను పవిత్రం చేశారు.

రామా! గంగ దేవలోకానికి వెళ్ళిన విధం నీకు చెప్పాను. ఆ విధంగా గంగానది సురనది అయింది.

హిమవంతుని రెండవ కుమార్తె ఉమ. ఈమె ఉగ్రమైన తపస్సును ఆచరించి పరమశివుని వివాహమాడింది.

# 36 వ సర్గ శివపార్వతుల రతిక్రీడలు

రామలక్ష్మణులు : ఓ మహర్షీ! గంగను దేవతలు స్వర్గలోకానికి తీసుకొని వెళ్ళారు. మరి ఏ కారణంచేత గంగ మూడు మార్గాలను అనుసరించి ప్రవహించింది? మూడు లోకాల్లోనూ పరమ పవిత్రమైనదిగా పేరుపొందటానికి గంగ చేసిన పుణ్యకర్మలు ఎటువంటివి?

విశ్వామిత్రుడు : రామా! మహాతపశ్శాలి, జ్ఞాన స్వరూపుడైన శివభగవానుడు ఉమాదేవితో కలసి నూరు దివ్య సంవత్సరాలు రతిక్రీడలలో గడిపాడు. శివభగవానుని తేజస్సు లోకాలు భరించలేవు కనుక వారికి సంతానం కలుగలేదు. అంతట దేవతలందరూ ఆ భగవానుని సమీపించి, 'పరమేశ్వరా! నీ తేజస్సుచే జన్మించే భూతమును ముల్లోకాలూ భరించలేవు. కనుక నీవు దేవితో కలసి వేదోక్తంగా తపస్సు చెయ్యి. ఆ విధంగా తేజస్సు నీయందే నిలుపుకొని ముల్లోకాలకూ హితము చెయ్యి' అని ప్రార్థించారు.

శివభగవానుడు : బ్రహ్మాది దేవతలారా! లోకహితం కోరి నా తేజస్సు (రేతస్సు) నా శరీరమందే నిలుపుకుంటాను. మీరు నిశ్చింతగా ఉండండి. అయితే రేతస్సు తన స్వస్థానంనుండి కదలింది. దానిని ఏదో ఒకచోట నిక్షిప్తం చెయ్యాలి. దానికి సరియైన ప్రదేశాన్ని నాకు చూపండి.

బ్రహ్మాది దేవతలు : ఓ దేవదేవా! చలించిన రేతస్సును భూదేవి మాత్రమే భరించగలదు. వేరే మార్గమే లేదు.

అంతట శివభగవానుడు దేవతలు పలికినట్లుగా తన తేజస్సును భూమిపై విడిచాడు. ఆ తేజస్సు అడవులు, పర్వతాలంతా ప్రవహిస్తూ భూమండలమంతా నిండిపోయింది. భీతి చెందిన దేవతలు, అగ్నిదేవుని ప్రార్థించారు. అంతట అగ్నిభగవానుడు వాయువుతో కూడి ఆ తేజస్సున ప్రవేశించి, ఆ తేజస్సంతటినీ ఘనీభవించేట్లు చేశారు. అదే శ్వేత పర్వతమైంది. ఆ పర్వతంనుండి అగ్ని, ఆదిత్యులతో సమానమైన దివ్య 'శరవణము' బయలుదేరినది. అగ్నినుండి కృత్తికలచే ఒక

కుమారుడు జన్మించాడు. ఆయనే కుమారస్వామి అని ప్రసిద్ధి పొందాడు.

పరమేశ్వరుని తేజస్సును అగ్ని భరించటంచే అగ్నిసంభవుడనీ, కృత్తికలచే పెంచబడుట చేత 'కార్తికేయుడనీ' కుమారస్వామి పిలువబడుచున్నాడు. దేవతలంతా ఉమా–మహేశ్వరులను అనేక విధాలుగా స్తుతించారు.

ఉమాదేవి : ఓ దేవతలారా! పుత్రుని పొందాలనే కోరికచే నేనూ, మహేశ్వరుడూ సంగమించి ఉండగా మీరందరూ అడ్డుపడినారు. అందువలన మీరందరూ మీ భార్యల వలన సంతానాన్ని పొందజాలరు ఇదే నా శాపం.

ఓ భూమీ! నీకు అనేక రూపాలుండటంచేత నీవు అనేకమందికి భార్యవు అగుదువుగాక! దుష్టబుద్ధితో నాకు సంతానం లేకుండా చేశావు. కాబట్టి నీకూ పుత్రసంతానం లేకుండా పోవుగాక!

తమను దేవతలందరూ చూస్తూ ఉండటంచేత శివభగవానుడు సిగ్గుపడి ఉమాదేవితో కలసి హిమాలయాల్లో పశ్చిమ ప్రాంతానికిపోయి తపస్సు చేశాడు.

# 37 వ సర్గ గంగ నుండి కార్తికేయుడు జన్మించటం

విశ్వామిత్రుడు : ఓ రామా! పూర్వం దేవతలకు, ఋషులకు మహేశ్వరుడే సేనాధిపతిగా ఉండేవాడు. ఇప్పుడాయన ఉమాదేవితో కలసి హిమాలయాల్లో పశ్చిమ ప్రాంతాన తపస్సమాధిలో ఉన్నాడు. కనుక దేవతలంతా బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి, తమకో సమర్థుడైన సేనాపతి కావాలని కోరారు.

బ్రహ్మ : దేవతలారా! ఉమాదేవి శాపం కారణంగా మీరెవ్వరూ మీ మీ భార్యల వలన పుత్రులను కనలేరు. ఆమె మాటకు తిరుగు ఉండదు. ఇది సత్యం.

ఆకాశాన గంగానది ప్రవహిస్తోంది గదా! అగ్నిదేవుని యందు శివభగవానుని తేజస్సంతా నిండివుంది. అగ్నిదేవుని వలన గంగయందు ఒక పుత్రుని పొందండి. హిమవంతుని ప్రథమ పుత్రికయే కావటం వలన ఆమె శివభగవానుని తేజస్సును స్వీకరిస్తుంది. ఆమె వలన మీరు కోరుకొనే తేజశ్శాలియైన సేనాధిపతి జన్మిస్తాడు.

దేవతలంతా అగ్నిదేవుని ఇలా ప్రార్థించారు.

దేవతలు : ఓ అగ్నిదేవా! నీ యందున్న శివభగవానుని తేజస్సును హిమవంతుని పుత్రియైన గంగ యందు నిలుపు. దానివలన మాకు కావలసిన సేనాధిపతి జన్మించగలడు. ఇది బ్రహ్మవాక్కు; దేవకార్యం.

“దేవతలారా! మీరు కోరినట్లే జరుగునుగాక!” అని అగ్ని గంగతో “నువ్వు గర్భం ధరించు, ఇది దేవకార్యం” అన్నాడు. అందుకామె అంగీకరించి సుందరమైన యువతిగా రూపొందింది. అప్పుడు అగ్ని భగవానుడు ఆమెను పూర్తిగా ఆవహించి తనలోని శివభగవానుని తేజస్సును ప్రసరింపజేశాడు. ఆ తేజస్సుతో గంగ అవయవాలన్నీ నిండిపోయాయి.

గంగ : ఓ అగ్నిదేవా! విజృంభించిన శివతేజస్సును భరించలేకుండా ఉన్నాను, ఆ తేజస్సు నన్ను దహించివేస్తోంది. నేను స్పృహ కోల్పోతున్నాను.

అగ్ని భగవానుడు : గంగాదేవీ! నీవిప్పుడు హిమవత్పర్వతాలపై ఉన్నావు. కాబట్టి నీలోని తేజస్సును కొద్దికొద్దిగా చిన్నచిన్న పర్వతాలపై విడిచిపెట్టు.

ఓ రామా! అగ్ని చెప్పినట్లుగానే గంగాదేవి తనలోని తేజస్సును మిగిలిన అవయవాల ద్వారా బయటకు విదిలించింది. ఆ విధంగా బయటకువచ్చి భూమిపై పడిన ఆ తేజస్సు మంగళకరమైన బంగారం, వెండి ధాతువులుగా ఉద్భవించాయి. ఆ రేతస్సులోని క్షారం రాగి ఇనుముగా ఉత్పన్నమయ్యాయి. రేతస్సులోని మలం తగరము, సీసము మొదలైన అనేక ధాతువులుగా వృద్ధి పొందాయి.

ఓ రామా! గంగ గర్భం నుండి విడువగానే పర్వతంపై మొలచి ఉన్న శరవణమంతా కాంతులు విరజిమ్ముచూ బంగారు శరవణాలైపోయాయి. ఆనాటి నుండి బంగారం అగ్నివంటి కాంతిని సంతరించుకొని జాతరూపమై (పుట్టిన రూపముగలది) ప్రసిద్ధిచెందింది. ఆ ప్రభావంచే అక్కడ మొలచిన గడ్డిగాదము, వృక్షాలు, పొదలు అన్నీ బంగారు మయమైపోయినవి. అంతట కుమారుడు పుట్టాడు. అతడికి కృత్తికలు ఏకకాలంలో పాలిచ్చి ఆదరించాలని ఇంద్రాది దేవతలు ఆజ్ఞాపించారు. ఆ పుత్రుడే కార్తికేయుడు(కృత్తికల కుమారుడు) అని ఖ్యాతిగాంచాడు. అగ్ని మున్నగు దేవతలంతా గంగకు అవతరించిన పుత్రుని తమ సేనాధిపతిగా అభిషేకించారు.

ఓ రామా! గంగ చరిత్రనంతా నీకు వివరంగా చెప్పాను. అట్లాగే గంగకు కలిగిన కుమారుని వృత్తాంతం కూడా చెప్పాను. ఇట్టి మహత్తు కలిగిన కుమారస్వామి వృత్తాంతాన్ని విన్న భక్తులంతా దీర్ఘాయుర్దాయాన్ని పొందుతారు. మరణానంతరం స్కందునిలోకం చేరుకుంటారు.

# 38 వ సర్గ సగర చక్రవర్తి సంతానం

విశ్వామిత్రుడు : ఓ రామా! నీవు అడిగిన గంగకు సంబంధించిన చరిత్ర అంతా చెప్పాను. ఇప్పుడు సగరుని చరిత్ర చెబుతాను, విను.

పూర్వం అయోధ్యను సగరుడనే చక్రవర్తి పరిపాలించేవాడు. ఆయన మహాశూరుడు, ధర్మాత్ముడు. ఆయనకు కేశిని, సుమతి అనే ఇరువురు భార్యలు. కేశిని విదర్భాధీశుని కుమార్తె. మిక్కిలి ధార్మికురాలు, సత్యమునే పలికేది. రెండవ భార్య సుమతి అరిష్టనేమి కుమార్తె. ఆమె అపురూప సౌందర్యవతి.

సగరునకు సంతానం కలుగకపోవటంచేత భార్యలతో కలసి హిమవత్పర్వతప్రాంతాన 'భృగుప్రస్రవణ' మనే పర్వతంపై తపస్సు చేశాడు. ఆ విధంగా నూరు సంవత్సరాలు తపస్సు చేసిన పిదప భృగుమహర్షి ప్రత్యక్షమయ్యాడు.

భృగుమహర్షి : ఓ రాజా! నీ తపస్సునకు మెచ్చాను, నీ కోరిక న్యాయమైనది; ధర్మబద్ధమైనది. నీకు సంతానప్రాప్తి కలుగగలదు. వారి వలన లోకంలో నీకు అఖండ కీర్తికూడా లభిస్తుంది. రాజా! నీకు ఒక భార్యయందు నీ వంశమును నిలుపు ఒక కుమారుడు కలుగుతాడు. ఇంకొక భార్యవలన మహాబలశాలురు, కీర్తిమంతులు ఉత్సాహభరితులైన అరవై వేలమంది పుత్రులు కలుగుతారు.

రాణులు : మహాత్మా! ఎవరికి ఒక పుత్రుడు కలుగుతాడు? ఎవరు అరువదివేలమంది పుత్రులను కంటారు. దయచేసి తెలుపండి.

భృగుమహర్షి : ఎవరెవరికి ఎటువంటి పుత్రులు కావాలో మీరే నిర్ణయించుకోండి. మీరు కోరినట్లే అగుగాక!

కేశిని : మహాత్మా! వంశోద్ధారకుడైన ఒక్క పుత్రుని నాకు ప్రసాదించు.

సుమతి : మహాత్మా! మహాబలశాలులైన ఆ అరవైవేలమంది పుత్రులను నాకు ప్రసాదించు.

అంతట భృగుమహర్షి అట్లే అగుగాక అని దీవించాడు. సగరమహారాజు భార్యలతో కలసి భృగుమహర్షికి ప్రదక్షణ నమస్కారం చేసి తన నగరానికి వెళ్ళాడు.

రామా! కొంతకాలానికి కేశిని యందు ఒక పుత్రుడు కలిగాడు. అతడికి అసమంజుడని నామకరణం చేశారు. సుమతి ఒక సొరకాయను కన్నది. దానిని పగులగొట్టగా అరువదివేలమంది పుత్రులు బయటకువచ్చారు. వీరందర్నీ బహుజాగ్రత్తగా పెంచి పెద్దచేశారు. కొంత కాలానికి వీరందరూ యౌవనవంతులై పరాక్రమవంతులయ్యారు.

రామా! సగరుని పెద్ద కుమారుని పేరు అసమంజుడు. ఇతడు బాల్యంనుండీ మహా క్రూరుడయ్యాడు. పాపకార్యాలు చేస్తూవుండేవాడు, జనులందరినీ పీడించెడివాడు. ఇతడి ఆగడములకు కోపించిన సగరుడు అసమంజుని దేశంనుండి బహిష్కరించాడు. అతడి కుమారుడు అంశుమంతుడు. అమిత పరాక్రమశాలి, అందరితోను మధురంగా మాట్లాడుతూ ప్రజల మన్ననలను పొందాడు.

రామా! కొంతకాలానికి సగరుడు యజ్ఞ మొకటి చేయాలని సంకల్పించాడు. పండితులను పురోహితులను పిలిచి తగిన ఏర్పాట్లన్నీ చేయించాడు.

# 39 వ సర్గ సగరుని అశ్వమేధ యాగం

శ్రీరాముడు : బ్రాహ్మణశ్రేష్ఠా! మా పూర్వీకుడైన సగర చక్రవర్తి యజ్ఞాన్ని గూర్చి వివరంగా తెలుసుకోవాలని ఉంది.

విశ్వామిత్రుడు : రామా! దేశంలోకెల్లా హిమవత్పర్వతాలు చాలా ఎత్తైనవి. అట్లాగే వింధ్యపర్వతాలుకూడా ఎత్తైనవే కావటాన, ఈ రెంటికీ నడుమ మరే పర్వతంలేక ఒకరినొకరు చూచుకొంటూ ఉంటారని చమత్కరిస్తూ ఉంటారు. ఈ మధ్య ప్రదేశంలో ఎక్కడా ఎత్తైన పర్వతాలు లేకపోవటాన వ్యవసాయ క్షేత్రాలుగాను, జనావాసాలుగాను ఉండేది. అటువంటి ప్రదేశాలలో సగర మహారాజు యజ్ఞవాటికను నిర్మించాడు.

మహా బలవంతుడైన సగరుని మనుమడు గొప్ప ధనుర్విద్యా పారంగతుడు కావటాన, యజ్ఞాశ్వాన్ని రక్షిస్తూ దానివెంట వెళ్ళాడు. దేవేంద్రుడు రాక్షసరూపాన్ని ధరించి ఆ యాగాశ్వాన్ని అపహరించాడు. అదే సమయంలో ఋత్విక్కులు ఈ విషయాన్ని తెలుసుకోగలిగారు. వెంటనే ఋత్విక్కులు రాజుతో ఇలా అన్నారు "మహారాజా యాగాశ్వాన్ని ఎవరో పర్వతప్రాంతంలో అపహరించారు. ఆ విధంగా యాగాశ్వం అపహరించబడటం అమంగళకరం, కనుక వెంటనే అశ్వాన్ని అపహరించిన వారిని సంహరించి, అశ్వాన్ని విడిపించు."

సగర మహారాజు : పుత్రులారా! పరాక్రమవంతులైన అరవై వేలమంది పుత్రులుండగా యాగాశ్వాన్ని అపహరించేందుకు రాక్షసులు ఎవరూ సాహసంచేసి ఉండరు. అదీగాక ఆ అశ్వం మంత్రాలచే పవిత్రం కాబడినది. కనుక పుత్రులారా ఈ భూమండలమంతా వెతకండి. మీరందరూ ఒక్కొక్కరూ ఒక యోజనం దూరం చొప్పున వెదికినాకూడా గుర్రాన్ని అపహరించిన వానిని కనిపెట్టవచ్చు. అంతేకాకుండా మీరంతా భూమిని త్రవ్వి పాతాళానికి కూడా వెళ్ళండి. గుర్రం కనపడేవరకు నేను, ఋత్విక్కులు, మనుమడు యాగశాలయందే ఉంటాం.

రామా! సగరుని ఆదేశాన్ని అనుసరించి మహాబలశాలురైన అరువది వేలమంది సగర పుత్రులు అశ్వాన్ని వెదకడానికి బయలుదేరారు. వారందరూ భూమండలాన్నంతా వెదికారు. అశ్వాన్ని కనుక్కోలేక పోవటంచేత, బలమైన గోళ్ళనే ఆయుధాలుగా చేసుకొని భూమిని బ్రద్దలుకొట్టారు. అంతేకాక రకరకాలైన ఆయుధాలను కూడా ఉపయోగించి భూమిని త్రవ్వారు.

రామా! వారావిధంగా భూమిని బ్రద్దలుకొడుతూ ఉండగా సర్పములు, రాక్షసులు, జంతువులు, మరియు ఇతర ప్రాణులు నలిగి చచ్చిపోసాగాయి. వారంతా భూమిని అరవై వేల యోజనాల లోతుకు త్రవ్వి పాతాళలోకాన్ని చేరారు.

సగర కుమారులు తలపెట్టిన ఈ చాపల్యానికి దేవతలు, గంధర్వులు, పన్నగులు, అసురులు భయభ్రాంతులయ్యారు. బ్రహ్మ వద్దకు వెళ్ళి "ఓ దేవా! సగర కుమారులు భూమిని త్రవ్వటంచే, పాతాళంలో ఉండే ఎందరో మహాత్ములు చనిపోతున్నారు. కనిపించినవాడినల్లా అశ్వాన్ని దొంగిలించిన చోరులని తలచి హింసిస్తున్నారు" అన్నారు.

# 40 వ సర్గ సగరపుత్రులు భస్మమవడం

బ్రహ్మ : దేవతలారా! ఈ భూమండలమంతా వాసుదేవునిది. కపిలావతారం ధరించి ఈ భూమిని ఎల్లప్పుడూ కాపాడుతూనే ఉన్నాడు. కపిలదేవుని ఆగ్రహనికి గురియై సగరపుత్రులంతా భస్మమైపోతారు. మీరు భయపడకండి, ఈ విషయం ఏనాడో నిర్ణయమైంది.

విశ్వామిత్రుడు : రామా! బ్రహ్మ పలుకులు విన్న ముప్పదిముగ్గురు దేవతలు (వసువులు ఎనిమదిమంది; రుద్రులు పదకొండుమంది; ఆదిత్యులు పన్నెండుమంది; అశ్వినీదేవతలు ఇద్దరు) వారివారి స్థానములకు వెళ్లిపోయారు.

రామా! సగర కుమారులందరూ భూమిని పగులకొట్టునప్పుడు పెద్ద శబ్దమైంది. అది వారి వినాశాన్ని సూచించేదని వారు తెలుసుకోలేకపోయారు. భూమండలం, పాతాళం అంతా ఒకసారి చుట్టివచ్చారు. వారికి అశ్వం ఎక్కడా కనిపించలేదు. చివరకు ఇంటికిపోయి సగరమహారాజుకు జరిగిందంతా తెలిపారు. మాకు ఏమీతోచక, నీకు ఈ విషయం చెప్పటానికే వచ్చాం అన్నారు.

సగర మహారాజు : మీరందరూ వెంటనే వెళ్ళండి. మళ్ళీ భూమండలాన్నంతా వెదకండి. పాతాళంలో కూడ వెతకండి. అశ్వాన్ని అపహరించిన వానిని పట్టుకొని కార్యం పూర్తి చేసుకొనిరండి.

విశ్వామిత్రుడు : రామా! తండ్రి కోపంతో పలికిన మాటలు విన్న సగర పుత్రులంతా తిరిగి బయలుదేరారు. మరల భూమిని త్రవ్వుతుండగా భూభారాన్ని మోస్తూన్న విరూపాక్షమనే దిగ్గజాన్ని చూశారు. ఆ దిగ్గజానికి బాగా అలసట కలిగినప్పుడు తలకొద్దిగా అటూఇటూ ఆడిస్తుంది. అప్పుడు భూకంపాలు సంభవిస్తాయి.

రామా! వారా మహాగజానికి ప్రదక్షిణచేసి పూజించారు. భూమిని బ్రద్దలు కొట్టుకుంటూ

పాతాళానికి వెళ్ళారు. పాతాళానికిపోయి తూర్పు దిక్కంతా గాలించారు. మరల దక్షిణ దిక్కంతా త్రవ్వడం మొదలుపెట్టారు, అక్కడ మహాపద్మ మనే గజాన్ని చూశారు. అదికూడా భూమండలాన్ని శిరస్సుపై ఉంచుకొని మోస్తుంది. దాన్ని చూస్తూనే వారంతా ఆశ్చర్యపోయారు. పూర్వంలాగానే వారంతా ఈ మహాగజానికి కూడా ప్రదక్షిణచేసి పూజించారు. ఆ దిక్కంతా గాలించారు. అటుపిమ్మట పశ్చిమ దిక్కున భూమండలాన్ని త్రవ్వి అక్కడ 'సౌమనస' మనే మహాగజాన్ని చూశారు. వారు దానికికూడా ప్రదక్షిణచేసి పూజించారు. ఆ దిక్కునా వారు అశ్వాన్ని చూడలేకపోయారు. అచ్చట నుండి ఉత్తర దిక్కుగా త్రవ్వారు. వారక్కడ భద్ర మనే మహాగజాన్ని చూశారు. ఆ మహాగజానికి కూడా ప్రదక్షిణచేసి పూజించారు. అక్కడకూడా వారికి అశ్వం కనిపించకపోవటంతో కృద్ధులైనారు. కోపంలో వేగంగా ఈశాన్య దిక్కునకుపోయి భూమిని త్రవ్వసాగారు.

రామా! వారందరూ అచ్చట ఒక పురాణ పురుషుని చూశారు. అతడే కపిలభగవానుడు. ఆయన మహావిష్ణువు అవతారం. ఆయనకు సమీపానే గడ్డి మేస్తూ తిరుగుచున్న యాగాశ్వాన్ని చూశారు. అశ్వాన్ని చూడగానే వారి సంతోషానికి హద్దులు లేకుండా పోయాయి. ఆ ఆనందం అంతా ఒక్క క్షణమే, వెంటనే కపిలభగవానుని చూచి, కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి. అశ్వాన్ని అపహరించి ఏమీ ఎరగనట్లు ఇక్కడ కళ్ళు మూసుకొని కూర్చున్నాడని నానా విధాలుగా దుర్భాషలు ఆడారు. ఆయన్ను చంపేందుకు మీదకు దూకారు. వారి మాటలకు, చేష్టలకు కుపితుడైన కపిలమహర్షి కోపంతో వారి వంక చూశాడు. ఆయన కోపాగ్నికి వారంతా అక్కడికక్కడే కాలిబూడిద అయ్యారు. అక్కడ పర్వతమంత పెద్ద బూడిద గుట్ట తయారైంది.

# 41 వ సర్గ అంశుమంతుడు యాగాశ్వాన్ని తేవడం

సగర చక్రవర్తి : నాయనా! అంశుమంతా! నీవు శూరుడవు. అన్ని విద్యలు నేర్చినవాడవు, నీ పినతండ్రులంతా యాగాశ్వాన్ని వెతికి తేవడానికి వెళ్ళారు. వాళ్ళు ఇంతవరకు తిరిగిరాలేదు. అందువల్ల నువ్వు వెళ్ళి వెతికి యాగాశ్వాన్ని తీసుకొనిరా. భూమికి అడుగున ఉండే ప్రాణులు చాలా భయంకరంగా ఉంటాయి. అందువల్ల ధనుస్సు బాణాలు కూడా తీసుకొని వెళ్ళు. నీతో మంచిగా మసలేవారితో మంచిగావుండు, నీకు కీడు తలపెట్టేవారిని చంపు. వెదకి అశ్వాన్ని తెచ్చి యజ్ఞాన్ని పరిసమాప్తి చేయించు.

విశ్వామిత్రుడు : ఓ శ్రేష్ఠుడా! రామా! సగర చక్రవర్తి ఆదేశాన్ని శిరసావహించి ధనుస్సు, బాణాలు, ఖడ్గాన్ని తీసుకొని అంశుమంతుడు, పినతండ్రులు త్రవ్విన మార్గాన్నే వెళ్లాడు అంశుమంతుడు కూడా మహాగజాన్ని చూశాడు. ఆ మహాగజానికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, పినతండ్రులగూర్చి, అశ్వాన్నిగూర్చి తెలుపమని ప్రార్థించాడు. అతడియందు అనుగ్రహాన్ని చూపిన, ఆ మహాగజము “అంశుమంతా! నీవు త్వరలోనే అశ్వాన్ని పొందగలవు” అని అన్నది. ఆ మాటలకు మహదానందం చెందిన అంశుమంతుడు మిగిలిన మహాగజాలకు కూడా ప్రదక్షిణ నమస్కారాలు చేశాడు. మిగిలిన దిగ్గజములుకూడా అంశుమంతుని ఆదరించాయి. త్వరలోనే అశ్వాన్ని కనుక్కుంటావని అన్నాయి. పినతండ్రులు భస్మమైన దిక్కును చూపాయి, పినతండ్రులు భస్మమై పడివున్న దిక్కుగా వెళ్ళాడు. ఒకచోట పినతండ్రులందరు భస్మమైపోయారని తెలుసుకున్నాడు. అక్కడే గడ్డిమేస్తూ తిరుగుతున్న యాగాశ్వాన్ని చూశాడు.

రామా! అప్పుడు అంశుమంతుడు పినతండ్రులకు జలతర్పణలు ఇవ్వాలనుకున్నాడు. నీళ్ళకోసం జలాశయానికై వెదకుచుండగా, పినతండ్రుల మేనమామ అయిన గరుత్మంతుడు కనిపించాడు.

గరుత్మంతుడు : ఓ అంశుమంతుడా! దుఃఖించకు. నీ పినతండ్రుల మరణానికి

లోకులందరూ సంతోషిస్తున్నారు. నీ పినతండ్రులందరూ కపిలభగవానుని కోపాగ్నికి కాలిబూడిద అయ్యారు. అందుచేత సాధారణ జలతర్పణాలు ఫలించవు. వారంతా ఉద్ధరించబడాలంటే హిమవంతుని పుత్రిక గంగానదిని పాతాళానికి తెచ్చి జలతర్పణాలివ్వాలి. అట్లా చేస్తే భస్మరాసులైన వీరందరూ పవిత్రులై స్వర్గానికి వెళ్తారు.

ఓ అంశుమంతుడా! ముందుగా ఈ అశ్వాన్ని తీసుకొని వెళ్ళు. నీ తాతగారు తలపెట్టిన యజ్ఞాన్ని పూర్తిచేయించు. ఆ తర్వాత పినతండ్రుల గూర్చి ఆలోచించు. తరువాత సగరచక్రవర్తి ముందుగా యజ్ఞాన్ని పూర్తిచేశాడు.

తన పుత్రులందరికీ పట్టిన దుర్గతికి ఎంతో దుఃఖించాడు. గంగను భూమికి పాతాళానికి తెచ్చే మార్గం తెలియక దిగులుతో మరణించాడు.

# 42 వ సర్గ భగీరథ ప్రయత్నం

విశ్వామిత్రుడు : ఓ రామా! సగరచక్రవర్తి మరణించిన తర్వాత పరమ ధార్మికుడైన అంశుమంతుడు రాజయ్యాడు. ఇతడు ప్రజారంజకంగా రాజ్యపాలనం చేశాడు.

అంశుమంతుని కుమారుడు దిలీపుడు. దిలీపుణ్ణి రాజునుచేసి అంశుమంతుడు అడవులకు పోయి తపస్సుచేసి స్వర్గానికి వెళ్ళాడు. దిలీపుడుకూడా తన తాతలకు స్వర్గప్రాప్తి కలిగించేందుకు ఎంతగానో ప్రయత్నంచేశాడు. కానీ సఫలుడు కాలేకపోయాడు. దిలీపుడు రాజ్యాన్ని ప్రజారంజకంగా పాలించాడు. అనేక యజ్ఞాలు చేశాడు, ముప్పది వేల సంవత్సరాలు రాజ్యపాలనచేశాడు. కానీ సగరపుత్రులను ఉద్ధరించలేకపోయాడు. దిలీప మహారాజు పుత్రుడే భగీరథుడు; భగీరథుణ్ణి రాజునుచేసి మరణానంతరం స్వర్గమును చేరుకున్నాడు.

రామా! భగీరథుడు గంగానదిని భూలోకానికి, అక్కడనుండి పాతాళానికి తీసుకొచ్చి, శాపగ్రస్తులైన తాతలను ఉద్ధరించాలని గట్టి ప్రయత్నంచేశాడు. రాజ్యభారాన్నంతా మంత్రులకు అప్పగించి, తాను తపస్సు చేసుకోవటానికై అడవులకు వెళ్ళాడు.

రామా! భగీరథుడు కఠోర తపస్సు చేశాడు. మండు ఎండాకాలంలో నాలుగువైపులా అగ్నిని ఉంచుకొని తాను సూర్యుని వైపు చూస్తూ తపస్సు చేశాడు. నెలకు ఒక పర్యాయమే ఆహారం స్వీకరించేవాడు. ఈ విధంగా వేలకొద్దీ సంవత్సరాలు కఠినమైన నియమాలతో తపస్సు చేశాడు. ఆ తపస్సు ఫలించింది; బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైయ్యాడు, వరం కోరుకోమన్నాడు.

భగీరథుడు : ఓ విధాతా! నాయందు దయచూపదలిస్తే, సగర కుమారులందరికీ గంగాజలాలతో నాచే తర్పణం చేయించు. నా పితామహులందరికీ స్వర్గప్రాప్తి కలిగించు. దేవా! నాకు సంతానం లేకుండటంచే ఇక్ష్వాకు వంశవృద్ధి ఆగిపోతుంది. కనుక నాకు సంతాన ప్రాప్తిని కలిగించి, ఇక్ష్వాకు వంశాన్ని వృద్ధి అయ్యేట్లు చేయి.

బ్రహ్మ : భగీరథా! నీవు కోరిన రెండు కోరికలూ చాలా ఉదాత్తమైనవే. నీ కోర్కెలు రెండూ సిద్ధించుగాక! నీకు మంగళమగుగాక!

భగీరథా! హిమవంతుని పెద్దకుమార్తె గంగానది స్వర్గంనుండి భూలోకాన ప్రవేశిస్తునప్పుడు వేగాన్ని నియంత్రించ గలవాడు శివభగవాను డొక్కడే. ఆ వేగాన్ని భూమి భరించలేదు. కనుక ఓ వీరుడా! నీవు గంగను భరించమని శివభగవానుని ప్రార్థించి ఆయన నుండి వరం పొందు.

రామా! అంతట బ్రహ్మ, గంగ దేవతలతో కూడి స్వర్గానికి వెళ్లాడు.

# 43 వ సర్గ భగీరథుడు శివుని గూర్చి తపస్సు చేయటం

విశ్వామిత్రుడు : రామా! బ్రహ్మ అంతర్ధానుడైన పిదప, భగీరథుడు మళ్ళీ తపస్సు ప్రారంభించాడు. ఈసారి శివభగవానుని ధ్యానించి తపస్సు చేశాడు. ఒక కాలి బోటనవ్రేలుపై నిలబడి తపస్సును తీవ్రతరం చేశాడు. ఈ విధంగా ఒక సంవత్సరం తపస్సు చేయగా శివభగవానుడు మెచ్చి భగీరథుని ఎదుట ప్రత్యక్షమయ్యాడు.

శివభగవానుడు : నరశ్రేష్ఠా! నీ తపస్సుకు మెచ్చాను. గంగను శిరస్సున ధరించి నీకు సంతోషాన్ని కలిగిస్తాను.

విశ్వామిత్రుడు : రామా! గంగానది తన ప్రవాహవేగాన్ని పెంచి శివుని కూడా తనతోపాటు పాతాళానికి కొట్టుకుపోయేటట్లు చేయాలని తలచింది. శివభగవానుడు గంగ దురాలోచనను పసిగట్టాడు. ఆమె గర్వమణచదలచి తన జూటములందు బంధించాడు. గంగ ఎంత ప్రయత్నించినా శివుని జూటాలనుండి బయటకు రాలేకపోయింది. ఆమె ఎంత ప్రయత్నించినా ఒక జూటంనుండి మరొక జూటమున ప్రవేశిస్తోందేగాని బయటపడలేకపోతోంది. ఈ విధంగా కొన్ని సంవత్సరాలు గడచిపోయాయి. ఎంతకీ గంగ కనిపించకపోవడంతో భగీరథుడు మరల శివభగవానునికై తపస్సు చేశాడు.

రామా! శివభగవానుడు భగీరథుని పట్ల ప్రసన్నుడై గంగను విడిచిపెట్టాడు. ఆ గంగ ఏడు పాయలుగా చీలింది. వాటిలో మూడు హ్లాదిని, పావని, నళిని అనే పేర్లతో తూర్పుదిశగా ప్రవహించాయి. మూడు సుచక్షువు, సీత, సింధు అనే పేర్లతో పశ్చిమదిశగా ప్రవహించాయి. ఒక పాయ భగీరథుని వెంట పాతాళానికి పోయింది.

రామా! ఆ విధంగా గంగ ఆకాశాన్నుండి శంభుని శిరస్సుపైకి, శంభుని శిరస్సుపైనుండి హిమాలయపర్వతాలపైకి అచ్చటనుండి భూమిపైకి, భూమిపైనుండి పాతాళానికి తీవ్రమైన

శబ్దాలు చేసుకుంటూ ప్రవహించింది. ఆ నీటితోపాటు కొన్ని చేపలు, తాబేళ్ళువంటి జలచరాలు కూడా భూమిపైపడి భూదేవికి మరింత శోభను చేకూర్చిపెట్టాయి. గంగావతరణాన్ని దేవ, ఋషి, గంధర్వ, యక్ష సిద్ధాదులంతా ఆశ్చర్యంతో తిలకించారు. వీరంతా గంగావతారణాన్ని చూచేందుకు రకరకాలైన, విమానాలు, గుఱ్ఱాలు, ఏనుగులవంటి వివిధ వాహనాల్లో వచ్చి మేఘమండలాన్నంతా కప్పివేశారు. వారంతా ఆ విధంగా ఆవరించుకొని ఉంటే నూరు సూర్యుల కాంతితో ఆకాశమంతా వెలిగిపోయింది.

రామా! ఆ గంగ కొన్నిచోట్ల వేగంతోను, కొన్ని చోట్ల మెల్లగాను, కొన్నిచోట్ల వంకర్లు తిరుగుతూ, కొన్నిచోట్ల ఎత్తు పల్లాలపైన ప్రవహించింది. కొన్నిచోట్ల గంగాజలాలు ఒకదానితో మరొకటి ఢీకొని ఆకాశమంత ఎత్తుకుపోయి మళ్ళీ అంతలోనే గంగలో కలసిపోసాగాయి. గంగానదే పవిత్రమైనది; అందునా శివుని తలపై నుండి జారిపడటాన, పరమపవిత్రమై, మోక్షప్రదాయిని అయింది. దేవ ఋషి గంధర్వాదులంతా ఆ పవిత్ర జలాలను తీర్థంగా పుచ్చుకొని పవిత్రులయ్యారు. గంగాజలాల వల్ల భూలోకంలో పేరుకుపోయిన పాపాలన్నీ ప్రక్షాళనమైపోయాయి.

రామా! భగీరథుడు ముందు పోతూవుంటే గంగ ఆయనను అనుసరించింది. జలచరాలేకాక, ఋషి, దైత్య, దానవ, రాక్షస, గంధర్వ, యక్ష, కిన్నెరాది దేవతాగణాలంతా కూడా గంగ వెంట వెళ్ళారు. భగీరథుడు ఏ దిశగాపోతే గంగకూడా ఆ దిశనే అనుసరించి పోయింది.

ఓ రామా! గంగాప్రవాహం ఆ విధంగా కొనసాగి పోతూవుండగా, ఒకానొకచోట జహ్నుమహర్షి యజ్ఞంచేస్తున్న యజ్ఞవాటిక కూడా మునిగిపోయింది. దాంతో జహ్నుమహర్షి కోపించి గంగకు బుద్ధి చెప్పాలనుకున్నాడు. గంగాజలాన్నంతా త్రాగేశాడు. అప్పుడు భగీరథుడు, దేవతలు, ఋషులు, పరమశ్రేష్ఠుడైన జహ్ను మహర్షిని పూజించారు. గంగను పుత్రికగా స్వీకరించి ఆమెను విడువవలసినదని ప్రార్థించారు. మహా తేజశ్శాలియైన జహ్ను మహర్షి

సంతోషించి గంగను విడిచిపెట్టాడు. అందువల్ల గంగ 'జహ్నుసుత' అని 'జాహ్నవి' అనే పేర్లతో పిలువబడుతోంది.

రామా! మరల గంగానది భగీరథుని వెంటపోయి సముద్రంలో ప్రవేశించి, అటునుండి పాతాళానికి పోయింది. పాతాళంలో సగర పుత్రుల భస్మరాశి మీదుగా గంగానది ప్రవహించగానే, సగర కుమారుల పాపాలన్నీ నశించి వారు స్వర్గానికి చేరారు.

ఓ రామా! రాజర్షియైన భగీరథుడు ఎంతో పట్టుదలతో అనేక కష్టనష్టాలను తట్టుకొని గంగను స్వర్గాన్నుంచి భువికి, భువినుండి పాతాళానికి తీసుకొనిపోయి పితామహులకు స్వర్గప్రాప్తి కలిగించాడు. ఈ కారణంగానే లోకంలో 'భగీరథ ప్రయత్నం' అన్న నానుడి చిరస్థాయిగా ముల్లోకాల్లోనూ ప్రసిద్ధి చెందింది.

# 44 వ సర్గ గంగావతారణోపాఖ్యాన మహిమ

విశ్వామిత్రుడు : రామా! భగీరథుడు గంగను తన వెంట పాతాళానికి తీసుకుపోయి, తన పితామహుల భస్మంపైగా గంగాజలాలు ప్రవహించేట్లు చేశాడు. అప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు.

బ్రహ్మ : ఓ భగీరథా! మహాత్ముడైన సగరుని పుత్రులు అరవై వేలమంది పవిత్రులై స్వర్గాన్ని చేరారు. సముద్రాలలో నీరు ఉన్నంత కాలం వారు స్వర్గంలో ఉంటారు.

భగీరథా! అనేక కష్టనష్టాలకు ఓర్చి గంగను పాతాళానికి తెచ్చావు. అందువల్ల గంగ నీకు కుమార్తె అయింది. ఇకపై గంగను "భాగీరథి' అని పిలుస్తారు. నీ ప్రయత్నం వల్ల ముల్లోకాలు (స్వర్గ, భూలోక, పాతాళాలు) పవిత్రం కావటంవల్ల 'త్రిపథగ' అని కూడా పిలుస్తారు.

ఈ గంగా జలాలతో నీ పితృదేవతలందరికీ తర్పణాలివ్వు. నీ ప్రతిజ్ఞ నెరవేరింది. మహాత్ముడైన సగర మహారాజు గంగను తీసుకొని రాలేకపోయాడు. తేజోవంతుడైన అంశుమంతుడు కూడా తన ప్రయత్నంలో సఫలం కాలేకపోయాడు. నీ తండ్రి దిలీపుడు కూడా గంగను తీసుకొని రాలేకపోతినే అన్న దిగులుతోనే మరణించాడు.

పురుషశ్రేష్ఠుడా! ఆ ప్రతిజ్ఞను నీవు నెరవేర్చుకోగలిగావు. ముల్లోకాల్లోను, నీ పేరు చిరస్థాయిగా ఉండేట్లు చేసుకోగలిగావు. నీవు గొప్ప ధర్మప్రతిష్ఠాపనను చేశావు.

ఓ రాజా! నీ పితృదేవతలందరికీ జలతర్పణాలిచ్చి నీ రాజ్యానికి పొమ్ము.

ఓ రామా! అంతట భగీరథుడు పితృదేవత లందరికీ శాస్త్రానుసారంగా తర్పణాలిచ్చి తన రాజధానికి చేరుకున్నాడు.

రామా! గంగావతరణ వృత్తాంతం ఐశ్వర్యం, యశస్సును, ఆయుర్దాయాన్ని, సంతానాన్ని స్వర్గాన్ని ఇస్తుంది. ఈ వృత్తాంతాన్ని ఇతరులకు వినిపించే వారి పితృదేవతలు, వినేవారి పితృదేవతలు కృతార్థులవుతారు.

# 45 వ సర్గ క్షీరసాగర మథనం

రామలక్ష్మణులు : ఓ బ్రహ్మర్షీ! నీవు వర్ణించి చెప్పిన గంగావతరణ ఘట్టం మహా అద్భుతంగా ఉన్నది. అట్టి ఆసక్తికరమైన చరితాన్ని వినటంలో రాత్రి ఎలా గడచిపోయిందో మేమెరుగం.

మహాత్మా! శ్రేష్ఠమైన గంగానదిని దాటడానికి ఋషీశ్వరులు చక్కని నావను ఏర్పాటు చేశారు.

అంతట విశ్వామిత్రుడు తమను సాగనంపడానికి వచ్చిన ఋషిపుంగవులందరికీ ధన్యవాదములు తెలిపి రామలక్ష్మణులతో కలసి నావలో ప్రయాణించి విశాలానగరం చేరుకున్నారు.

శ్రీరాముడు : ఓ మహర్షీ! ఈ విశాలా నగరం ఏ రాజవంశానికి చెందినది? నాకు వినాలని కోరికగా ఉన్నది. చెప్పవలసింది.

విశ్వామిత్రుడు : శుభమైన దేవేంద్రుని కథ చెప్తాను విను. ఈ ప్రదేశంలో ఏం జరిగిందో కూడా చెప్తాను విను. పూర్వం కృతయుగంలో దితి పుత్రులు, అదితి పుత్రులు మహాబలవంతులై, పరమధార్మికులుగా ఉండేవారు. "ముసలితనం, మరణం, రోగం వంటివి రాకుండా ఉండాలంటే ఉపాయం ఏమిటని ఆలోచించారు. అంతట వారంతా క్షీరసాగరాన్ని మథించి అమృతాన్ని పొందటమే మార్గాంతరమని నిశ్చయించారు. ఆ విధంగా సాగరమథనం చెయ్యడానికి వాసుకిని త్రాడుగా మందర పర్వతాన్ని కవ్వంగా చేసుకొని క్షీరసాగరాన్ని మథించసాగారు. ఆ మథనమంతా ఒక వెయ్యి సంవత్సరాలపాటు సాగింది. త్రాడుగా ఉన్న వాసుకి ఆ శ్రమకు తట్టుకోలేక శిరస్సులనుండి విషాన్ని క్రక్కుతూ కోరలతో పర్వతాన్ని కరవడం మొదలుపెట్టాడు. అప్పుడు సముద్రంలోనుండి అగ్నితో సమానమైన హాలాహలమనే విషం పుట్టి

లోకాలన్నింటినీ దహించివేయసాగింది. అంతట దేవతలంతా శంకరుని వద్దకు పోయి రక్షింపమని ప్రార్థించారు. ఇంతలో సర్వరక్షకుడు సమర్థుడైన విష్ణు భగవానుడు అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

విష్ణుభగవానుడు (చిరునవ్వు నవ్వుతూ): ఓ శంకరా! నువ్వు దేవతలందరికన్నా ముందు పుట్టావు. అందుచేత దేవతలు మథించేటప్పుడు ముందుగా పుట్టినది నీకే చెందాలి, కనుక ఓ సమర్థుడా! ఈ విషాన్ని అగ్రపూజగా అందుకో!

విష్ణువు ఈ విధంగా చెప్పి అంతర్ధానమయ్యాడు. అంతట శివభగవానుడు ఆ కాలకూట విషాన్నే అమృతంలాగా గ్రహించాడు. శివుడు హాలాహలాన్ని స్వీకరించగానే దేవాసురులంతా తిరిగి సాగరాన్ని మళ్ళీ మథించసాగారు. ఇంతలో కవ్వంగా పనిచేస్తున్న మందరపర్వతం జారి పాతాళాన పడిపోయింది. అప్పుడు దేవతలంతా విష్ణుభగవానుని ప్రార్థించారు.

“ఓ మహాబాహూ! నువ్వే సర్వభూతాలకు గతి అయినవాడవు. ఈ పర్వతాన్ని ఎత్తి యథాస్థానంలో ఉంచి మమ్మలి రక్షించు” అని వేడుకున్నారు. వారి ప్రార్థనను మన్నించిన విష్ణువు కూర్మరూపాన్ని ధరించి, ఆ పర్వతాన్ని తన వీపుపైన ఉంచి తిరిగి జారిపడిపోకుండా సముద్రంలో శయనించాడు. మళ్ళీ దేవదానవులంతా మథించడం ప్రారంభించాడు. ఈ విధాన వెయ్యి సంవత్సరాలు మథించగా, అందులోనుండి దండకమండలవులను ధరించిన ధన్వంతరి అప్సర స్త్రీలు ఉద్భవించారు. సముద్రజలాన్ని మథించడం వలన పుట్టుకొచ్చిన అరవై కోట్లమంది స్త్రీలు అప్సరసలని ప్రసిద్ధి చెందారు. దేవదానవులెవరూ వారిని వివాహం చేసుకోవడానికి ఇష్టపడలేదు. అందువల్ల వారంతా వేశ్యలయ్యారు. ఆ తరువాత వరుణుని కుమార్తె వారుణి (మధ్య దేవతలయిన సుర) తననెవయినా పెండ్లాడుతారేమోనని బయటకు వచ్చింది. ఆమెను దైత్యులు స్వీకరించ లేదు. సురను గ్రహించలేదు కాబట్టి వారంతా అసురులయ్యారు. అదితి పుత్రులు ఆమెను స్వీకరించడం వలన వారంతా సురులయ్యారు.

రామా! ఆ పిమ్మట ఉచ్చైఃశ్రవమనే శ్రేష్ఠమైన అశ్వము, కౌస్తుభమనే శ్రేష్ఠమైన మాణిక్యము, ఉత్తమమైన అమృతం కూడా బయటకు వచ్చాయి. అమృతం కోసం గొప్ప కులక్షయం జరిగింది. దేవతలు దైత్యుల్ని చంపారు; దైత్యులంతా రాక్షసుల పక్షాన చేరారు. ముల్లోకాలూ దద్దరిల్లేట్లుగా ఘోరమైన యుద్ధం జరిగింది. అంతట శ్రీమహావిష్ణువు మాయామోహిని రూపాన్ని ధరించి అమృతాన్ని హరించాడు. తన్ను ఎదిరించిన దైత్యులందర్నీ పురుషోత్తముడైన విష్ణువు సంహరించాడు. దేవేంద్రుడు దైత్యుల్ని ఓడించి రాజ్యాన్ని పొంది ఋషులు, చారణులు మొదలైన వారందరితో కలసిన ముల్లోకాలను పాలించాడు.

# 46 వ సర్గ ఇంద్రునిపై దితి పగ పూనడం

విశ్వామిత్రుడు : రామా! దితి పుత్రులందర్నీ ఇంద్రుడు యుద్ధంలో మట్టుబెట్టాడు. దితి మితిమీరిన దుఃఖంతో భర్త అయిన కాశ్యపునితో ఇలా అంది: “నాథా! మహాబలశాలురైన దేవతలు (నీ కుమారులు) నా పుత్రులందర్నీ చంపేశారు. నాకు ఇంద్రుణ్ణి చంపగల పుత్రుడు కావాలి. అందుకోసం దీర్ఘ తపస్సు చెయ్యాలనుకుంటున్నాను. నాకు తపస్సు చేసుకునేందుకు అనుజ్ఞనివ్వు. ఇంద్రుని చంపగల బలవంతుడైన పుత్రుణ్ణి అనుగ్రహించు.”

మహాతేజశ్శాలి అయిన కాశ్యపుడు ఆమె చెప్పిందంతా విన్నాడు. ఆమెలో గూడుకట్టుకుపోయిన దుఃఖాన్ని అర్థం చేసుకున్నాడు. ఆమెతో ఇలా అన్నాడు: “ఓ తపోధనురాలా! నీవు కోరుకున్నట్లే జరుగుతుంది. నువ్వు దేవేంద్రుని చంపగల కుమారుణ్ణి కంటావు. నీకు శుభం కలగాలి. నువ్వు పరిశుద్ధంగా ఉన్నట్లయితే, వెయ్యి సంవత్సరాలు నిండగానే ముల్లోకాలకు ప్రభువయ్యే కుమారుణ్ణి కనగలవు.” ఆ మహాతేజశ్శాలి భార్యతో ఈ విధంగా పలికి ఆమె శరీరాన్నంతా చేతులతో స్పృశించి తపస్సు చేసుకోవడానికి వెళ్ళిపోయాడు.

రామా! ఆ మహర్షి వెళ్ళిన తర్వాత దితి చాలా సంతోషంతో కుశప్లవమనే క్షేత్రానికి పోయి తపస్సు చేసింది.

రామా! ఈమె తపస్సు చేస్తున్న సమయంలో దేవేంద్రుడు ఉత్తమమైన గుణ సంపదతో ఆమెకు సేవలు చేసేవాడు. అగ్నిహోత్రాన్ని చెయ్యడం, హోమానికి కావలసిన దర్భలు, సమిధలు, ఉదకం, ఫలాలు మొదలైనవన్నీ ఎంతో భక్తిశ్రద్ధలతో సమకూర్చి పెట్టేవాడు. దేవేంద్రుడు ఆమెను మాతృదేవతగా భావించి అనేక ఉపచారాలు చేశాడు.

రామా! ఈ విధంగా తొమ్మిది వందల తొంభై సంవత్సరాలు గడచిపోయాయి. దేవేంద్రుని సేవలకు ఎంతో సంతోషించినదై, దితి ఇలా అంది: “దేవేంద్రా! నా కోరికను మన్నించి వేయి

సంవత్సరాలకు పిదప నాకో కుమారుడు కలుగుతాడని నీ తండ్రి కాశ్యప మహర్షి వరం ఇచ్చాడు. ఇంకా పది సంవత్సరాలు శ్రద్ధతో తపస్సు చేస్తే నీ సోదరుణ్ణి చూడగలుగుతావు. నీకు శుభం కలగాలి, కుమారా! నీ కోసం అతనిలో జయాభిలాషను కలిగిస్తాను. నువ్వు అతడూ కలసి ముల్లోకాలను జయించి ఆనందంగా జీవిస్తారు."

దితి దేవేంద్రునితో ఇట్లా పలికి మధ్యాహ్నసమయంలో పాదాల వైపుగా తల ఉంచుకొని నిద్రావస్థలోకి పోయింది. అందువల్ల జుట్టంతా పాదాలపై పడింది. అది వ్రత భంగం క్రిందకే వస్తుంది. ఈ విధంగా ఆమె అపరిశుద్ధురాలవటం చూసి, దేవేంద్రుడు ఆమె గర్భంలోకి ప్రవేశించి, వజ్రాయుధంతో గర్భాన్ని ఏడు ముక్కలయ్యేట్లుగా ఖండించాడు. అప్పుడా గర్భం బిగ్గరగా ఏడ్చింది. ఆ ఏడుపు విన్న దితి మేల్కొంది. ఏడుస్తున్న గర్భాన్ని "ఏడవకు" "ఏడవకు" అని దేవేంద్రుడు అంటూనే ఆ గర్భాన్ని ముక్కలుగా చేశాడు.

అంతట మేల్కొన్న దితి, "చంపవద్దు" "చంపవద్దు" అని వారించగా, తల్లిపైగల గౌరవంచేత దేవేంద్రుడు బయటకు వచ్చాడు. అంతట వజ్రాయుధంతో నిలబడిన ఇంద్రుడు ఇలా అన్నాడు: "తల్లీ! నువ్వు జుట్టు పాదాలపై పడేట్లుగా నిద్రపోయావు. ఆ అవకాశం చూసుకొని నేను, యుద్ధంలో నన్ను సంహరించేందుకే జన్మించబోతున్న ఆ పిల్లవాణ్ణి ఏడు ముక్కలుగా ఖండించాను. ఇందుకు నన్ను క్షమించు."

# 47 వ సర్గ మరుత్తులు

రామా! ఈ విధంగా గర్భం ఏడు ముక్కలుగా ఖండించబడటంతో దుఃఖీస్తూ దితి ఇలా అంది: "దేవేంద్రా! నా అపరాధం చేతనే నా గర్భం విచ్ఛిన్నమైంది. ఇందులో నీ తప్పు ఏమీ లేదు. నా గర్భం విషయంలో నేను అనుకున్న దానికి వ్యతిరేకంగా జరిగింది. అందువల్ల నీవు నాకో ఉపకారం చెయ్యాలి. నువ్వు ఖండించిన ఈ ఏడు గర్భ ఖండాలు ఏడు మారుతస్థానాలకు పాలకులయ్యేట్లుగా చెయ్యి. ఈ ఏడుగురూ దివ్యరూపాలతో వాతస్కంధములకు అధిష్ఠానదేవతలై, మారుతులనే పేరుతో అంతరిక్షంలో సంచరించేట్లు చెయ్యి. వీరిలో ఒకడు బ్రహ్మలోకానికి, ఒకడు ఇంద్రలోకానికి, మూడవవాడు వాయువు అనే పేరులో అంతరిక్షంలోను సంచరిస్తారుగాక. మిగిలిన నలుగురూ నీ ఆజ్ఞలను పాలిస్తూ దేవతలై నాలుగు దిక్కులా సంచరిస్తారుగాక.

"నువ్వు ఖండించేటప్పుడు వీళ్ళంతా ఏడుస్తూ ఉండగా "మారుదః" (ఏడ్వద్దు) అని అన్నావు. అందుచేత వీరంతా 'మారుత' అనే పేరుతో ప్రసిద్ధి చెందగలరు." దితి మాటలువిన్న దేవేంద్రుడు దోసిలి ఒగ్గి తల్లికి నమస్కరిస్తూ "అమ్మా! అంతా నువ్వు చెప్పినట్లే జరుగుతుంది. నీ కుమారులు దేవతలై సంచరిస్తారు, సందేహించకు. నీకు క్షేమం కలుగుగాక" అన్నాడు.

రామా! ఆ తరువాత ఆ తల్లి బిడ్డలు ఈ తపోవనంనుండి స్వర్గానికి వెళ్ళారని విన్నాను. పూర్వం దేవేంద్రుడు తల్లికి ఉపచారాలు చేసిన తపోవనం ఇదే.

రామా! ఇక్ష్వాకునకు అలంబుస యందు జన్మించిన విశాలుడనే పరమధార్మికుడైన కుమారుడు విశాల అనే పురాన్ని నిర్మించి పాలించాడు. మహాబలశాలియైన హేమచంద్రుడు విశాలుని కుమారుడు. అతడి కుమారుడు సుచంద్రుడు. సుచంద్రుని కుమారుడు ధూమ్రాశ్వుడు. అతడి కుమారుడు సృంజయుడు, సృంజయుని కుమారుడు సహదేవుడు. సహదేవుని కుమారుడు కుశాశ్వుడు. కుశాశ్వుని కుమారుడు సోమదత్తుడు. సోమదత్తుని కుమారుడు కాకుత్థ్సుడు.

మహాతేజశ్శాలియైన ఇక్ష్వాకు కుమారుడైన సుమతి ఇప్పుడీ నగరాన్ని పాలిస్తున్నాడు. విశాలా నగర రాజులందరూ ఇక్ష్వాకు ప్రభావంచేత దీర్ఘాయుష్మంతులై, ధార్మికులని ప్రసిద్ధి చెందిన వారే.

రామా! ఈ రాత్రికి ఇక్కడే విశ్రమిద్దాం. రేపు ఉదయాన్నే జనకమహారాజును చూద్దాం.

ఇంతలో విశ్వామిత్రుడు వచ్చాడని తెలుసుకున్న సుమతి మహారాజు విశ్వామిత్రునికి స్వాగతం పలికేందుకు ఎదురు వెళ్ళాడు. బంధు పురోహితులు వెంటరాగా, సుమతి విశ్వామిత్రుని పూజించి, అంజలిఘటించి కుశల ప్రశ్నలు వేశాడు. "ఓ మహర్షీ! నీ రాకవలన నేనూ నా దేశమూ ధన్యులమయ్యాం" అన్నాడు.

# 48 వ సర్గ అహల్యా వృత్తాంతం

సుమతి : ఓ విశ్వామిత్ర మహర్షీ! మీ కిదే స్వాగతం తమ రాకచే నేనూ, మా దేశం కూడా పావనమయ్యాయి. మీ రాక పూర్వజన్మల సుకృతంగా భావిస్తాను.

మహర్షీ! ఈ యువకులిరువురూ దేవతలవలె ప్రకాశిస్తున్నారు. తేజోమూర్తులై అమిత పరాక్రమవంతులని తెలుస్తోంది. నడకలో వారు సింహాల వలె ఠీవిగా ఉన్నారు. మందగమనంలో ఐరావతంలా ఉన్నారు. సౌందర్యంలో అశ్వనీదేవతల్నే మించిపోయారు. ధనుస్సు, అంబులపొది, ఖడ్గం ధరించడంచేత ఉత్తమ రాజకుమారులని తెలుస్తోంది. మహాత్మా! వీరెవరు? వీరు ఎక్కడ నుండి వస్తున్నారు? ఇక్కడకు ఏ పని మీద వచ్చారు? వారు సాధించిన కార్యలేమైనా ఉన్నాయా?

మహర్షీ! వీరిరువురి హావభావాలు ఒకేమాదిరిగా ఉన్నాయి. వీరు సూర్యచంద్రులవలె ప్రకాశిస్తున్నారు. వీరి చరిత్ర చెబితే వినాలని ఉంది.

విశ్వామిత్రుడు : వీరిరువురూ అయోధ్యాధిపతియైన దశరథ మహారాజు పుత్రులు. పేరు రాముడు, లక్ష్మణుడు. సిద్ధాశ్రమంలో నేను తలపెట్టన యాగానికి రక్షకులుగా ఉంటూ మారీచ, సుబాహువు మొదలైన రాక్షసులను మట్టుపెట్టారు. మిథిలానగరంలో జనక మహారాజు చేస్తున్న యాగాన్ని చూడడానికి వెళ్తున్నాం.

సుమతి విశ్వామిత్రుని పూజించి రామలక్ష్మణులకు ఆతిథ్య మిచ్చి సత్కరించాడు. తరువాత రామలక్ష్మణులతో కలసి విశ్వామిత్రుడు మిథిలానగరానికి బయలుదేరాడు. వారంతా మిథిలానగర సౌందర్యానికి ఆశ్చర్యపోయారు.

మిథిలానగరం సమీపంలోని వనంలోని ప్రాచీనమూ, నిర్జనమూ అయిన ఆశ్రమాన్ని చూసి రాముడు విశ్వామిత్ర మహర్షిని ఇలా ప్రశ్నించాడు.

రాముడు : ఓ పూజ్యుడా! విశ్వామిత్ర మహర్షీ! ఈ ఆశ్రమం మిథిలానగరానికి సమీపాన ఉన్నా కూడా నిర్మానుష్యంగా ఉంది. ఆశ్రమంలో ఎవరూ ఉన్నట్లు లేదు. ఈ ప్రాచీనమైన ఆశ్రమం ఎవరిది? దీని వెనుక ఏదైనా చరిత్ర ఉందా?

విశ్వామిత్రుడు : ప్రశ్నించటంలో నేర్పు గల ఓ రామా! ఈ ఆశ్రమం గూర్చి నీకు అంతా చెప్తాను విను.

ఈ ఆశ్రమం గౌతమ మహర్షిది. ఆ మహాత్ముని దేవతలు కూడా పూజిస్తారు. ఆయన భార్య అహల్య. వారిరువురూ ఇక్కడ చాలాకాలం తపస్సు చేస్తూ నివసించారు.

ఒకానొక రోజున దేవేంద్రుడు గౌతమ మహర్షి ఆశ్రమంలో లేని సమయం చూసుకొని గౌతముని వేషాన్ని ధరించి ఆశ్రమంలో ప్రవేశించాడు. గౌతముని వేషంలో ఉన్న దేవేంద్రుడు అహల్యను సమీపించి "ఓ సుందరీ! నాకు నీ యందు కోరిక కలిగినది. కాముకులైన వారు ఋతుకాలంవరకూ వేచి ఉండలేరు గదా! అందువలన నీ సంగమాన్ని కోరుతున్నాను."

ఆతడు కపటముని వేషంలో ఉన్న దేవేంద్రుడేనని అహల్య గ్రహించింది. అయినా ఆతడితో సంగమించడానికి ఆసక్తి కలదై "ఓ దేవతలలో శ్రేష్ఠుడా! ఓ దేవరాజా! నేను నీ పొందుతో కృతార్థురాలనవుతాను. నీవు తక్షణమే గౌతముని కోపాగ్ని నుండి రక్షించుకో; నన్ను కూడా రక్షించు" అన్నది.

"ఓ సుందరీ! ఎట్లా వచ్చానో అట్లాగే గౌతముని కంటపడకుండా వెళ్ళిపోతాను. భయపడకు" అని అభయం పలికాడు దేవేంద్రుడు.

విశ్వామిత్రుడు : ఓ రామా! అహల్యా సంగమం చేసి దేవేంద్రుడు గౌతముని వేషంలో ఆశ్రమం నుండి బయటకు వచ్చే సమయానికి, గౌతముడు అప్పుడే ఆశ్రమానికి వస్తున్నాడు. ఇద్దరూ ఒకరికొకరు ఎదురయ్యారు. కపట వేషంలో ఉన్న దేవేంద్రుణ్ణి చూసి ముని

కృద్ధుడయ్యాడు. "కపట వేషంలో వచ్చి ఇట్టి దుష్టకార్యాన్ని చేశావు. కాబట్టి నీ వృషణాలు రాలిపోవుగాక" అని శపించాడు. వెంటనే ఇంద్రుని వృషణాలు రాలి నేలపై పడిపోయాయి.

మహర్షి, భార్య అహల్యను చూస్తూ "నువ్వు కొన్ని వేల సంవత్సరాలు ఇక్కడే ఒంటరిగా పడి ఉండు. గాలి మాత్రమే భుజిస్తూ, ఎవరి కంటా పడకుండా తపస్సు చేసుకో. కొంతకాలానికి దశరథ మహారాజు కుమారుడు శ్రీరాముడు ఈ ఆశ్రమానికి వస్తాడు. అతడు ఈ ఆశ్రమంలో అడుగుపెట్టగానే నువ్వు పరిశుద్ధురాలవవుతావు. ఓ చెడు ప్రవర్తన కలిగినదానా! నీవు రామునికి ఆతిథ్యం ఇవ్వు. నీలోని లోభమోహాలన్నీ తొలగిపోతాయి. పరిశుద్ధురాలవయి నన్ను చేరుకుంటావు" అన్నాడు. గౌతమ మహర్షి అహల్య నక్కడే వదలి తాను హిమాలయాలకు పోయి తపస్సు చేసుకుంటున్నాడు.

# 49 వ సర్గ అహల్య శాపవిమోచనం

దేవేంద్రుడు: ఓ దేవతలారా! ఋషిపుంగవులారా! గౌతమ మహర్షి మహా తపస్సంపన్నుడగుచున్నాడు. దేవతల హితాన్ని కోరి, నేను ఆయన ఆగ్రహానికి గురి అయ్యాను. గౌతమ మహర్షి తపశ్శక్తి ఖర్చు అయ్యేట్లు చేశాను. నేను దేవహితం కోరి ఈ కార్యాన్ని చేయటం వల్ల నా వృషణాలను పోగొట్టుకున్నాను. నేను ప్రస్తుతం వృషణాలు లేనివాడనై ఉన్నాను. కనుక మీరందరూ తిరిగి నేను వృషణాలను పొందేందుకు కావలసిన ఏర్పాట్లు చెయ్యండి.

విశ్వామిత్రుడు : ఓ రామా! ఇంద్రుడు ఈ విధంగా అనగానే దేవతలంతా పితృదేవతల వద్దకెళ్ళారు. "ఓ పితృదేవతలారా! యజ్ఞంలో మీ భాగంగా లభించే గొర్రె వృషణాలను దేవేంద్రునికి సమర్పించండి. వృషణాలు లేని గొర్రె అయినా మీకు యోగ్యంగానే ఉంటుంది. దానివల్ల మీకు ఏ విధమైన ఇబ్బంది కలుగదు" అంటూ వేడుకోగా ఆ విధంగా దేవేంద్రునికి తిరిగి వృషణాలు ఏర్పడ్డాయి.

విశ్వామిత్రుడు : ఓ రామా! పితృదేవతలు ఏర్పాటుకు సంతోషంగా అంగీకరించారు. ఆ విధంగా దేవేంద్రునికి మేష వృషణాలు అతికించారు. ఆనాటినుండి పితృదేవతలు వృషణాలు లేని గొర్రెలనే భుజిస్తున్నారు. దేవేంద్రుడు "మేషవృషణు" డయ్యాడు. కనుక ఓ రామా! నీవు అహల్యకు శాపవిమోచనాన్ని కలిగించు.

అంతట రామదర్శనంతో అహల్య శాపవిముక్తురాలయింది. ఇప్పుడామెను అందరూ చూడగలుగుచున్నారు. తరువాత అహల్య రామలక్ష్మణ విశ్వామిత్రులకు భక్తిప్రపత్తులతో ఆతిథ్యమిచ్చింది. విశ్వామిత్రునికి అర్ఘ్యపాద్యాలిచ్చి పూజించింది.

అహల్యా శాపవిమోచనాన్ని దేవతలంతా ఆకాశాన్నుండి తిలకించారు. పుష్పవర్షం కురిపించారు. దుందుభులు మ్రోగించారు. మహాతేజస్వి అయిన గౌతముడు కూడా ప్రత్యక్షమై

రామలక్ష్మణ విశ్వామిత్రులను పూజించి, అహల్యను స్వీకరించాడు. తరువాత గౌతమ మహర్షి అహల్యతో కలసి తపోవనానికి వెళ్ళిపోయాడు.

# 50 వ సర్గ రామలక్ష్మణులు, విశ్వామిత్రుడు మిథిలను చేరటం

రాముడు : మహాముని! ఈ యజ్ఞాన్ని చూసేందుకు వివిధ దేశాల నుండి అనేకమంది పరివారంతో సహా వచ్చారు. వారి వాహనాలతో నగరమంతా క్రిక్కిరిసి ఉంది. యజ్ఞం అంతా చాలా సందడిగాను ఉత్తమ ప్రమాణాలతోను నిర్వహించబడుతోంది. మనం ఉండేందుకు యోగ్యమైన ప్రదేశానికి వెళ్దాం.

విశ్వామిత్రుడు : ఓ రామా! జనసమ్మర్దం లేనిచోటు, జలం సమృద్ధిగా ఉండే చోటు మనకు యోగ్యమైనదని తలుస్తాను. అటువంటి చోటుకే మిమ్మల్ని తీసుకుపోయి బస ఏర్పాటు చేస్తాను.

జనక మహారాజుకు విశ్వామిత్రమహర్షి యజ్ఞం చూచేందుకు వచ్చాడని తెలిసింది. పురోహితుడైన శతానందుని ఇతర బ్రాహ్మణులను, ఋత్విక్కులను తీసుకొని పూజాద్రవ్యాలతో సహా ఆయనకు ఎదురు వెళ్ళాడు. శాస్త్రానుసారంగా, ధర్మానుసారంగా విశ్వామిత్రుని పూజించాడు.

విశ్వామిత్రుడు : జనక మహారాజా! నీవు క్షేమంగా ఉన్నావా? యజ్ఞం ఏ ఆటంకాలు లేకుండా సక్రమంగా సాగిపోతోందా?

ఓ పురోహితులారా! ఋత్విక్కులారా! ఉపాధ్యాయులారా! మీ అందరినీ ఇక్కడ కలసుకోవటం నాకు ఆనందంగా ఉన్నది.

జనక మహారాజు : ఓ పూజ్యుడా! నీవు, మునీశ్వరులు సుఖంగా కూర్చోండి. నీవు కూర్చున్న తర్వాతనే నేను, మంత్రులు, పురోహితులు, ఋత్విక్కులూ కూర్చుంటాం.

ఓ బ్రహ్మర్షీ! నీ రాకవలన నేను తలపెట్టిన యజ్ఞానికి సరి అయిన ఫలం దక్కింది. నీవు

నీతో కూడా వచ్చిన ఈ మునీశ్వరుల రాకవలన నా జన్మ ధన్యమైనది. నీ అనుగ్రహానికి పాత్రుడను కావటం నా అదృష్టంగా భావిస్తాను.

బ్రహ్మర్షివైన ఓ విశ్వామిత్రా! ఇంకో పన్నెండు రోజుల్లో యజ్ఞం ముగియబోతోంది. హవిస్సులు తీసుకొనేందుకు దేవతలంతా ఇక్కడకు రానున్నారు. నువ్వు వారందరినీ ఒకే చోట దర్శించవచ్చు.

ఓ మహర్షీ! నీతో కూడా వచ్చిన ఈ బాలురెవరు? కాలినడకన ఇంతదూరం ఏ పని మీద వచ్చారు? వారిద్దరూ ఠీవిగా రాజకుమారుల్లాగా కనిపిస్తున్నారు. ధనుస్సు విల్లంబుల పొది ధరించారు. ఖడ్గం మొలలో వేలాడుతోంది. నడకలో ఠీవి చూడబోతే సింహాలే సిగ్గుపడేట్లున్నాయి. ఆ మందగమనాన్ని 'ఐరావతం వీరి దగ్గరే నేర్చుకుందా?' అని అనిపిస్తోంది. యౌవన సౌందర్యాలలో అశ్వనీదేవతలనే మించిపోయారు. వీరు ఏ దేశపు రాజకుమారులు? నాకు తెలుపవలసింది.

విశ్వామిత్రుడు : రాజా! వీరు దశరథ మహారాజు పుత్రులు – పేరు రామలక్ష్మణులు.

నా యజ్ఞాన్ని మారీచ సుబాహువులు ధ్వంసం చేస్తూ ఉంటే వీరిద్దరినీ సిద్ధాశ్రమానికి నాతో కూడా తీసుకొనివెళ్ళాను. వీరిద్దరూ మారీచ సుబాహువులను మట్టుపెట్టి నా యజ్ఞాన్ని నిర్విఘ్నంగా పూర్తి చేయించారు. అక్కడ నుండి విశాలానగరానికి వచ్చాం. అక్కడ అహల్యకు శాపవిమోచనం కలిగించి, ఆమెతో గౌతమ మహర్షిని కలిశాం. ఇప్పుడు నీ యజ్ఞాన్ని చూసి, నీ ఇంట ఉన్న శివధనుస్సును పరీక్షించేందుకు మిథిలానగరం వచ్చాం.

రాజా! క్లుప్తంగా నీ ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పాను.

# 51 వ సర్గ శతానందుడు రాముని కలుసుకోవడం

శతానందుడు, గౌతమమహర్షి అహల్యల పెద్ద కుమారుడు. మహాతపస్వి. విశ్వామిత్రుని పలుకులు వినగానే ఆశ్చర్యపోయాడు. విశ్వామిత్ర మహర్షితో ఉన్న రామలక్ష్మణులను చూసి అమితానందంతో ఇలా అన్నాడు.

శతానందుడు : ఓ మునిశ్రేష్ఠా! తీవ్రతపస్సు చేస్తున్న నా తల్లిని చూశావా? రామదర్శనమైతేగాని ఆమెను ఇతరులు చూడలేరే? అట్టి రాముణ్ణి ఆమె పూజించిందా? ఫలములు, కందమూలములు ఇచ్చి అతిథి సత్కారాలు చేసిందా?

ఓ విశ్వామిత్ర మహర్షీ! నా తల్లి ఎలా విధి వంచితురాలైందో పూర్తిగా చెప్పావా? రామునికి ఆతిథ్యమిచ్చిన నా తల్లి తిరిగి నా తండ్రిని చేరగలిగిందా? రాముడు నా తండ్రిని గౌరవంగా పూజించాడా? ఆనందాశ్చర్యాలతో నా మనస్సు నిలవటం లేదు. నాకు అన్నీ వివరంగా చెప్పు.

విశ్వామిత్రుడు : ప్రశ్నించటంలో నేర్పరి అయినవాడా! ఓ శతానందా! నేను చేయవలసినదంతా చేశాను. రేణుకాదేవి జమదగ్నిని చేరినట్లు, అహల్యను కూడా గౌతమముని వద్దకు చేర్చాను.

శతానందుడు : నరశ్రేష్ఠుడవైన ఓ రామా! దైవం మాకు అనుకూలంగా ఉంది. మా అదృష్టం పండినది. విశ్వామిత్రమహర్షి వలన నీ దర్శనమైనది. మీకు స్వాగతం పలుకుచున్నాను.

ఓ రామా! విశ్వామిత్రుడు సాధించలేని కార్యం ఈ జగత్తులో ఏదీ లేదు. తపస్సు చేసి బ్రహ్మర్షి అయ్యాడు. ఆయన ప్రభావం తిరుగులేనిది. చక్కని గురువు నాశ్రయించిన నిన్ను అభినందించుచున్నాను. అతడి రక్షణలో ఉన్న నీకీ లోకంలో ఎదురుండదు. విశ్వామిత్రుడు ఎంతటి మహిమగలవాడో చెప్తాను, విను.

ఓ రామా! విశ్వామిత్రుడు ముందుగా ధర్మాత్ముడైన రాజుగా ఉండేవాడు. ఆయన ధర్మవేత్తయే కాదు, సకల విద్యాపారంగతుడు. శత్రు భయంకరుడు. ఎల్లవేళలా ప్రజల క్షేమమే కోరేవాడు. ఆయన అంతటి సాటిలేని రాజుగా ఉండేవాడు.

రామా! బ్రహ్మపుత్రుడైన కుశుడనే రాజు ఉండేవాడు. ఆయన పరమ ధార్మికుడు. ఆయన కుమారుడు కుశనాభుడు. కుశనాభుని కుమారుడు గాధి. గాధి కుమారుడు విశ్వామిత్ర ముని.

విశ్వామిత్రుడు రాజై అనేక వేల సంవత్సరాలు రాజ్యపాలన చేశాడు. మహాతేజశ్శాలి అయిన ఈ మహారాజు అనేక అక్షౌహిణీల సైన్యాన్ని వెంటబెట్టుకొని భూమండలం అంతా దిగ్విజయయాత్రలు చేశాడు.

ఓ రామా! విశ్వామిత్రుడు సైన్యం వెంటబెట్టుకొని నగరాలు, రాష్ట్రాలు, నదీమైదానాలు, పర్వత ప్రాంతాలు, ఆశ్రమాలు, వనాలు పర్యటించాడు. ఆయన దేశంలో సిద్ధ, దేవ, చారణ, దానవ, గంధర్వ, కిన్నెరాదులు నివసించేవారు. ఆయన రాజ్యంలోని వనాలన్నీ అనేక రకాలైన వృక్షసంపదతోను, పశుపక్ష్యాదులతోను బ్రహ్మర్షి, దేవర్షి గణాలతో కూడిన ఆశ్రమాలతో ప్రశాంతంగా అలరారుతూ ఉండేది. అచట ఋషులందరూ రాగద్వేషాలను జయించినవారే! జితేంద్రియులే! కొందరు వాయుభక్షణ మాత్రమే చేసేవారు. కొంతమంది నీరు మాత్రమే తీసుకునేవారు. కొందరు రాలిన ఆకులనే ఆహారంగా స్వీకరించేవారు. కొందరు అయాచితంగా లభించే పండ్లు, కాయలనే భుజించేవారు. ఎవరూ ఆహారాన్ని నిలవ ఉంచుకొనేవారు కాదు. వారంతా జపహోమాదుల యందు ఆసక్తి గల వాలఖిల్యులు, వైఖానసులుగా అయి ఉండి జగత్తుకే శోభాయమానంగా ఉండేవారు. అటువంటి విశ్వామిత్రుడు బ్రహ్మలోకాన్నే మరిపించే వసిష్ఠాశ్రమానికి వెళ్ళాడు.

# 52 వ సర్గ వసిష్ఠుని ఆతిథ్యం

వసిష్ఠాశ్రమంలో విశ్వామిత్రుడు వినమ్రుడై ఆ బ్రహ్మర్షికి నమస్కరించాడు. వసిష్ఠుడు కూడా విశ్వామిత్రుని సాదరంగా ఆహ్వానించి ఉచితాసనం ఇచ్చి గౌరవించాడు. ధర్మానుసారంగాను, శాస్త్రానుసారంగాను ఆతిథ్యమిచ్చాడు.

విశ్వామిత్రుడు : మహర్షి పుంగవా! మీ తపస్సు, అగ్నిహోత్రాదులు సక్రమంగా జరుగుతున్నాయా? శిష్యులందరూ చక్కగా అధ్యయనం చేస్తున్నారా? వృక్షసముదాయం సమృద్ధిగా ఉన్నదా?

వసిష్ఠుడు : ఓ రాజా! ధార్మికుడవైన నీ పాలనలో మాకేమి కొరత ఉంటుంది?

ఓ రాజా! నీకు క్షేమమే కదా! నీ పాలనలో జనులందరూ సుఖసంతోషాలతో ఉంటున్నారు గదా! రాజా! ధనాన్ని న్యాయంగా ఆర్జించటం, దాన్ని వృద్ధి పొందించే పనులు చేయటం, ప్రజలను రక్షించటం, సర్వజనులు సుఖసంతోషాలతో ఉండేట్లు పరిపాలించడం రాజధర్మమని శాస్త్రాలు చెప్తున్నాయి.

రాజా! నీ పరివారమంతా నీ అదుపాజ్ఞల్లో ఉంటున్నదా? శత్రువులందరినీ జయించావా? నీ కోశాగారం సమృద్ధిగా ఉన్నదా? నీ సైన్యం, మిత్రులు, పుత్రపౌత్రాదులు క్షేమమే కదా!

ఆ విధంగా వారిద్దరూ చాలాసేపు పరస్పరం కుశల ప్రశ్నలు, ధర్మ విచారణ, మున్నగు అనేక విషయాలను మాట్లాడుకుంటూ ఒకరినొకరు సంతోషపరచుకున్నారు.

వసిష్ఠుడు : ఓ పురుషశ్రేష్ఠుడా! సాటిలేనివాడా! ఓ విశ్వామిత్రా! ఓ మహాబలశాలీ! నీకు, నీ సైన్యానికి అతిథి సత్కారాలు చేయగోరుచున్నాను. నీవు వాటిని స్వీకరించి నన్ను ఆనందపరచు. మహారాజా! నీవు నాకు ఉత్తముడవైన అతిథివి. నీకు ఆతిథ్యమివ్వటం నా

భాగ్యంగా భావిస్తాను.

విశ్వామిత్రుడు : ఓ బ్రహ్మర్షీ! నీవు నా యందు ప్రియాతిప్రియమైన మాటలు మాట్లాడావు. అదే గొప్ప ఆతిథ్యంగా భావిస్తాను. ఓ పూజ్యుడా! నీ అందుబాటులో ఉండే ఫల, పుష్పాదులతో నన్ను సత్కరించి ఆతిథ్యమిచ్చావు. నీ అనుగ్రహం ఉంటే నాకు అదే పదివేలు. నేను వెళతాను.

వసిష్ఠుడు : మహారాజా! సందేహించకు. నేను నీకు, సైన్యానికి ఆతిథ్యమియ్యగల సమర్థుడను. అది నా భాగ్యంగా తలుస్తాను.

విశ్వామిత్రుడు : మునిశ్రేష్ఠా! నీకు సంతోషం కలిగించటమే నా పరమ బాధ్యతగా భావిస్తాను. తప్పక నేను, నా పరివారం నీ ఆతిథ్యం స్వీకరిస్తాం.

వసిష్ఠుడు : ఓ శబలా! కామధేనూ! ఇచటకు రా. నా మాటలు శ్రద్ధగా విను. నేను ఈ రాజర్షికీ, ఆయన పరివారానికీ ఆతిథ్య మివ్వాలని సంకల్పించాను. నీవే ఆ ఏర్పాట్లన్నీ చూడు. వారి ఇష్టాయిష్టాలను నీవే తెలుసుకొని ఆ విధంగా ఏర్పాట్లు చేసి వారిని పరమ సంతృప్తులుగా చెయ్యి. మన అతిథులను సత్కరించడం మన ఇద్దరి బాధ్యత కదా?

ఓ శబలా! రసాయనములతోను, తినదగినవి, త్రాగదగినవి, పీల్చగలిగినవి పదార్థాలన్నీ వడ్డన చెయ్యి. వారు తిరిగి తిరిగి ఉన్నారు. ఆకలికి ఓర్చుకోలేరు. వెంటనే ఏర్పాట్లు చెయ్యి.

## 53 వ సర్గ విశ్వామిత్రుడు కామధేనువును కోరటం

శతానందుడు : రామా! వసిష్ఠుని ఆదేశాల మేరకు కామధేనువు ఏర్పాట్లన్నీ చక్కగా చేసింది. ఏయే సైనికుడు ఇంట్లో ఏయే పదార్థాలు ఇష్టంగా తినేవాడో, వాడికి అవన్నీ వండి వడ్డించింది. ప్రతి ఒక్కరి విషయంలోనూ అదేవిధంగా జరిగింది. అంతా పరమ సంతృప్తులవడమే కాకుండా, ఈ అడవిలో ఇంతమందికి, ఇన్ని విధాలుగా ఇంత తక్కువ వ్యవధిలో ఎట్లా వండి వడ్డించారా అని ఆశ్చర్యపడ్డారు.

రాజర్షియైన విశ్వామిత్రుడు, ఆతడి అంతఃపురకాంతలు, బ్రాహ్మణ పురోహితులు, మంత్రులు మున్నగువారంతా కూడా తృప్తిచెంది పరమ సంతుష్టులయ్యారు.

విశ్వామిత్రుడు : ఓ బ్రాహ్మణోత్తమా! పూజార్హుడవైన నీవు నన్ను పూజించి సత్కరించినావు. నన్ను సంతోషపరిచినావు.

మహర్షీ! నీ వద్దనున్న ఈ శబల ఒక రత్నం. రత్నాలు ఎప్పుడూ రాజుల సొమ్మే! కనుక ఈ శబలను నాకిమ్ము. దీనికి బదులుగా నీకు లక్ష గోవులనిస్తాను.

వసిష్ఠుడు : ఓ మహారాజా! ఈ శబల సామాన్యమైన ఆవు కాదు. నా హవ్యము, కవ్యము, నా ప్రాణము, అగ్నిహోత్రము, భూతబలి, హోమము అన్నీ ఈ శబలపైనే ఆధారపడి ఉన్నాయి.

దేవతలకు హవిస్సులు అర్పించాలన్నా, నానావిధాలైన విద్యలన్నీ ఈ ధేనువుపైనే ఆధారపడి ఉన్నాయి.

రాజా! బుద్ధిమంతుడు, కీర్తి ఎట్లా విడదీయరానివో, అదేవిధంగా నా నుండి ఈ ధేనువును విడదీయలేను. ఇంకా ఈ ధేనువే నా ఆనందం, సర్వస్వంగా ఉన్నది. ఇంకా అనేక కారణాలవల్ల నేను ఈ ధేనువును నీకు ఇవ్వలేను. నీ విచ్చే లక్షగోవులు గాని, వెండిరాసులు గాని నాకు వద్దు.

విశ్వామిత్రుడు : ఓ మహర్షీ! నీకు పదునాలుగువేల ఏనుగుల నిస్తాను. వాటన్నింటికీ బంగారంతో చేసిన పట్టీలు నడుముకు వ్రేలాడతీసి ఉంటాయి, అట్లాగే మెడ పట్టీలు కూడా బంగారంతో చేసినవే. అవికాక ఎనిమిది వందల బంగారు రథాలనిస్తాను. ఒక్కొక్క రథానికి నాలుగేసి గుర్రాలను పూన్చవచ్చు. ఆ గుర్రాలన్నింటికీ బంగారంతో చేసిన చిరుగంటలు వ్రేలాడతీసి ఉంటాయి. అంతేకాదు, మంచి దేశంలో పుట్టిన పదకొండువేల మేలుజాతి గుర్రాలను కూడా ఇస్తాను. మంచి వయస్సులో ఉన్నవి, వివిధ రంగుల్లో ఉండేవి అయిన కోటి మేలు జాతి గోవులను ఇస్తాను. బ్రాహ్మణోత్తమా, నీవు కోరినన్ని రత్నాలు, బంగారు నాణాలు ఇస్తాను. అవన్నీ తీసుకొని శబలను నా కివ్వండి.

వసిష్ఠుడు : రాజా! ఇన్ని మాటలెందుకు? ఈ శబలియే నాకు ప్రాణం, ధనం, రత్నం, సర్వస్వం. మంచి దక్షిణలు గలిగిన ధర్శపూర్ణమాసయాగాల కన్నా కూడా నాకూ ఈ ధేనువే ముఖ్యం.

## 54 వ సర్గ విశ్వామిత్రుడు కామధేనువును అపహరించటం

శతానందుడు : రామా! వసిష్ఠుడు కామధేనువును ఇవ్వడానికి నిరాకరించటంచే, విశ్వామిత్రుడు ధేనువును బలాత్కారంగా లాక్కునిపోయాడు. బలాత్కారంగా తనను ఈడ్చుకొనిపోతూ ఉంటే శబల కంటికి మింటికి ఏకధారగా ఏడ్చింది.

ధేనువు తనలో ఇట్లు తలపోసింది: ఈ మహర్షి నన్ను కన్నకూతురికన్నా ఎక్కువ ప్రేమతో చూచుకొనేవాడు. నేను కూడా ఆయన యెడల అట్లాగే ఉండేదాన్ని. ఎందువలన ఈ మహర్షి నన్ను ఈ రాజు వశం చేసినాడు. నన్ను వదిలించుకోవాలని చూస్తున్నాడా?

ఓ మహర్షీ! బ్రహ్మపుత్రుడా! పూజ్యుడా! ఈ రాజభటులు నన్ను పట్టి ఈడ్చుకొనిపోతున్నారు. నీవే నన్ను వారి పరం చేశావా? ఏమిటి?

వసిష్ఠ మహర్షి : ఓ శబలా! నీవు దుఃఖంతో పలికిన పలుకులు నేను గ్రహించాను. అమ్మా! నేను నిన్ను విడువలేదు. ఎన్నటికీ విడువను. నన్ను నమ్ము. ఈ రాజు నా వద్ద నుండి నిన్ను బలాత్కారంగా ఈడ్చుకొనిపోతున్నాడు.

అమ్మా! శబలా! ఈతడు నాకన్నా బలవంతుడు. పైగా ఈ దేశానికి ప్రభువు. క్షత్రియ బలం ముందు బ్రాహ్మణ బలం నిలువలేదు. బలహీనమైపోతుంది. కానీ నీ బలం అనంతమైనది. విశ్వామిత్రుడు ఎంతటి బలవంతుడైనా నీ తేజస్సు ముందు నిలువలేడు.

ఓ శబలా! శత్రుసైన్యాని కన్నా బలమైన సైన్యాన్ని నీ నుండి సృజించు. నీ అతిథిమర్యాద లందుకున్న ఆ సైనికులనందరినీ నిర్దాక్షిణ్యంగా వధించు. నిన్ను నీవు కాపాడుకో. నీవు ఎప్పటికీ నాతోనే ఉండిపో.

శతానందుడు : ఓ రామా! వసిష్ఠుని ఆదేశాలను స్వీకరించిన కామధేనువు నిమిషాలలో

వేలకొద్దీ సైన్యాన్ని సృజించింది. కామధేనువు నుండి సృజింపబడ్డ పప్లవులు విశ్వామిత్రుని సైన్యాన్నంతా హరించివేశారు. అంతట కృద్ధుడైన విశ్వామిత్రుడు స్వయంగా యుద్ధంలో పాల్గొని పప్లవులందర్నీ చంపాడు. అది చూచిన కామధేనువు అనేక వేలమంది యవనులను, శకులను సృజించి విశ్వామిత్రుని పైకి పంపింది. వారంతా అగ్నులవలె ప్రకాశిస్తూ అరణ్యం అంతా నిండిపోయారు. వారి ముందు విశ్వామిత్రుని సైన్యం నిలువలేకపోయింది. విశ్వామిత్రుడు ఆ యవన శక సైనికులపై అమోఘమైన అస్త్రాలను ప్రయోగించి యవనులను శకులను కలవరపెట్టాడు.

# 55 వ సర్గ విశ్వామిత్రుడు వసిష్ఠునిపై దండెత్తటం

వసిష్ఠుడు : ఓ కామధేనూ! నీ యోగశక్తి నుపయోగించి ఇంకా సైనికులను సృజించి శత్రువును నిశ్శేషంగా వధించు.

శతానందుడు : ఓ రామా! వసిష్ఠుని ఆదేశాన్ని స్మరించి శబల 'హంబా' యని అరచింది. ఆ శబ్దం నుండి సూర్యునితో సమానమైన కాంభోజులు సృజింపబడ్డారు. పొదుగు నుండి ఆయుధాలు చేత ధరించి పప్లవులు జన్మించారు. యోని నుండి యవనులు; గోమయ ప్రదేశం నుండి శకులు, రోమాల నుండి మ్లేచ్ఛులు, కిరాతులు, హారీతులు పుట్టారు.

రామా! ఈ విధంగా జన్మించిన సైన్యమంతా విశ్వామిత్రుని సైన్యాన్ని క్షణాల్లో నశింపజేశారు. సైన్యం అంతా కళ్ళముందే నాశనమైపోతూ ఉంటే భరించలేని విశ్వామిత్రుని వందమంది పుత్రులు వసిష్ఠునిపై దాడిచేశారు. వసిష్ఠుడు వారిని చూచి ఒక్కసారి హుూంకరించగానే వారంతా భస్మమైపోయారు.

రామా! విశ్వామిత్రుడు సైన్యానంతా పోగొట్టుకున్నాడు. నూరుగురు పుత్రుల్ని కోల్పోయాడు. అవమాన భారంతో తలపట్టుకొని కూర్చున్నాడు. వేగం లేని సముద్రం వలె, కోరలు పీకిన పామువలె, రాహువుచే మ్రింగబడ్డ సూర్యునివలె కాంతివిహీనుడయ్యాడు.

ఓ రామా! రాజ్యాన్నంతా ఒక కుమారునికి పట్టంకట్టి తాను హిమవత్పర్వత ప్రాంతాలకుపోయి శివభగవానుని ధ్యానించి తపస్సు చేశాడు. కొంతకాలానికి శివుడు ప్రసన్నుడై విశ్వామిత్రునికి ప్రత్యక్షమయ్యాడు. వరం కోరుకోమన్నాడు.

విశ్వామిత్రుడు : మహాదేవా! ధనుర్విద్యనంతా నాకు సాంగోపాంగంగా ఉపదేశించు. దేవ, దానవ, యక్ష, గంధర్వ, రాక్షసులకు తెలిసిన అస్త్రాలన్నీ నాకు ఉపదేశించు. నేను కోరిన కోరికలన్నీ తీరేట్లు అనుగ్రహించు.

శతానందుడు : భగవానుడు అట్లే యగుగాక! అని అంతర్ధానుడయ్యాడు. విశ్వామిత్రుడు అసలే దర్పం గలవాడు. అందునా సర్వశస్త్రాస్త్రాలు వశమవటంతో సర్పం వలె బుసగొట్టుతూ వసిష్ఠునిపై దండెత్తాడు. వసిష్ఠుని తప్పక మట్టుబెట్టగలనని భావించాడు. వెంటనే వసిష్ఠుని ఆశ్రమానికి వెళ్ళి అస్త్రాలను ప్రయోగించగా, ఆశ్రమంలోని పర్ణశాలలన్నీ కాలి బూడిదయ్యాయి. అచ్చట నివసిస్తున్న మునీశ్వరులంతా దిక్కుతోచక చెల్లాచెదరై పరుగులు పెట్టారు. కొద్దిమంది వసిష్ఠుని శిష్యులు భీతిచెంది పారిపోయారు.

అంతట వసిష్ఠుడు మునులను, శిష్యులను చూసి “భయపడకండి. సూర్యుడు మంచును నాశనము చేసేట్లు ఈ విశ్వామిత్రుడి ఆగడములన్నింటినీ అరికడతాను. భయపడవద్దని అభయం ఇస్తున్నాను” అన్నాడు.

వసిష్ఠుడు : ఈ మునీశ్వరులంతా చాలాకాలంగా పర్ణశాలలు నిర్మించుకొని ప్రశాంతంగా తపస్సు చేసుకొంటున్నారు. నీవు దురాత్ముడవై వారినందరినీ నశింపజేశావు. ఇక నీ ఆయుర్దాయం తీరింది కాచుకో.

శతానందుడు : కృద్ధుడైన వసిష్ఠుడు యమదండం వంటి తన దండాన్ని చేత పట్టుకొని విశ్వామిత్రుని ఎదుట నిలబడ్డాడు.

# 56 వ సర్గ వసిష్ఠ విశ్వామిత్రుల పోరు

శతానందుడు: ఓ రామా! విశ్వామిత్రుడు బయటకు వచ్చిన వసిష్ఠునిపై ఆగ్నేయాస్త్రాన్ని సంధించాడు.

వసిష్ఠుడు : ఓ దుష్ట క్షత్రియా! తిరుగులేని నా బ్రహ్మబలం ముందు నీ క్షత్రియ బలం నిలువజాలదు. నీకున్న బలమేదో చూపితివి కదా! నీ ఆగ్నేయాస్త్రాన్ని నిన్ను ఎట్లా ఎదుర్కొంటానో చూస్తూ ఉండు. ఉదకంచే అగ్ని చల్లారిపోయేట్లు నీ ఆగ్నేయాస్త్రాన్ని నా బ్రహ్మాస్త్రంచే నీరు కార్చివేస్తున్నాను కాచుకో.

శతానందుడు : ఓ రామా! విశ్వామిత్రుని ఆగ్నేయాస్త్రాన్ని వసిష్ఠుని బ్రహ్మాస్త్రం చల్లార్చివేసింది.

దాంతో కోపించిన విశ్వామిత్రుడు వారుణ, రౌద్ర, ఐంద్ర, పాశుపత, ఐషీకాస్త్రాలన్నీ వసిష్ఠునిపై ప్రయోగించాడు. అవన్నీ వసిష్ఠుని బ్రహ్మదండం ముందు నిర్వీర్యం అయ్యాయి.

ఓ రామా! పట్టువిడువని విశ్వామిత్రుడు మానవ, మోహన, గాంధర్వ, స్వాపన, జృంభణ, మాదన, సంతాపన, విలాపన, శోషణ, దారుణ, వజ్రాస్త్రాలను, బ్రహ్మపాశ, వరుణపాశాలను, పైనాక, దయితాస్త్రాలను, శుష్కము, ఆర్ద్రము, అనే రెండు వజ్రములను, దండ పైశాచ, కౌంచాస్త్రాలను, ధర్మచక్ర, కాలచక్ర, విష్ణుచక్రాలను, వాయవ్య, మథన, హయ శిరోస్త్రములను, కంకాళ, ముసలములనే రెండు శక్తులను; వైద్యాధర, కాల, త్రిశూల, కాపాల, కంకణాస్త్రాలను ప్రయోగించాడు.

రామా! ఆ అస్త్రాలన్నింటినీ వసిష్ఠుని దండం మ్రింగివేసింది. చివరకు విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ బ్రహ్మాస్త్ర ప్రయోగానికి అగ్ని మున్నగు దేవతలు, ఋషులు, గంధర్వులు, ముల్లోకాలు కల్లోలమయ్యాయి. అంతా కలత చెందారు. బ్రహ్మాస్త్రం ముల్లోకాలను

బాధింపసాగింది.

ఓ రామా! వసిష్ఠుడు తన బ్రహ్మతేజః ప్రభావంచేత, అతి భయంకరమైన బ్రహ్మాస్త్రాన్ని కూడా తన బ్రహ్మదండం మ్రింగివేసేట్లు చేశాడు.

ఓ రామా! వసిష్ఠుడు ఆ బ్రహ్మాస్త్రాన్ని మ్రింగే సమయంలో, వసిష్ఠుని రూపం అతి భయంకరంగా మారిపోయింది. ముల్లోకాలూ మూర్ఛపొందాయి. ఆయన రోమాల నుండి అగ్నికణాలు వెలువడ్డాయి. వసిష్ఠుని చేతిలోని బ్రహ్మదండం ప్రళయాగ్నివలె ప్రజ్వరిల్లింది. మునిగణాలన్నీ ఇలా అన్నారు: ఓ మహాతపస్వీ! నీ బలం అనంతం. నీ తేజస్సును నీ తేజస్సునందే విలీనం చెయ్యి. నిగ్రహించు.

బ్రాహ్మణోత్తమా! నీవు విశ్వామిత్రుని నిగ్రహించావు. ఇక చాలు. లోకాలన్నీ బాధింపబడుతున్నాయి. లోకాలను కాపాడు. శాంతించు.

శతానందుడు : మునీశ్వరుల ఆక్రందనం విని మహర్షి శాంతించాడు. ఈ పరిణామమంతా చూసిన విశ్వామిత్రుడు నిట్టూర్పులు విడిచాడు.

విశ్వామిత్రుడు : ఛీ! బ్రహ్మతేజస్సు ముందు క్షత్రియ బలం తల ఒగ్గింది. ఒక్క బ్రహ్మదండం నా అస్త్రాలన్నింటినీ మ్రింగివేసిందన్న విషయాన్ని గ్రహించాను. కాబట్టి ఇకపై బ్రాహ్మణత్వం పొందటానికి తపస్సు చేస్తాను.

# 57 వ సర్గ త్రిశంకువు కోరికను వసిష్ఠుడు నిరాకరించటం

శతానందుడు : ఓ రామా! మహాత్ముడైన వసిష్ఠునితో వైరం పెంచుకొన్న విశ్వామిత్రుడు పెద్ద భార్యతో కలసి దక్షిణదిక్కుగా పోయి బ్రహ్మదేవుని ధ్యానించి వెయ్యి సంవత్సరాలు తపస్సు చేశాడు. కేవలం పండ్లు, కందమూలాలు మాత్రమే ఆహారంగా స్వీకరించేవాడు. ఆ కాలమునందే హవిష్యందుడు, మధుస్యందుడు, దృఢనేత్రుడు, మహారథుడు అనే నలుగురు పుత్రులు జన్మించారు. ఒకానొకనాడు బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు.

బ్రహ్మ : ఓ కుశికనందనా! నీ తపస్సు ఫలించింది. నీవు రాజర్షివయ్యావు. రాజర్షులు పొందే లోకాలన్నీ పొందుతావు. నీకు క్షేమము అగుగాక!

శతానందుడు : ఓ రామా! వేయి సంవత్సరాలు చేసిన తపస్సుకు తాను కేవలం రాజర్షిని మాత్రమే కాగలిగాను గదా అని విశ్వామిత్రుడు వ్యథ చెందాడు. రాజర్షి పదవిచే సంతృప్తుడు కాలేదు. పట్టుదల పెరిగింది. మరల తపస్సును తీవ్రతరం చేశాడు.

రామా! ఆ కాలంలో ఇక్ష్వాకు వంశంలో జన్మించిన త్రిశంకువు అనే రాజు ఉండేవాడు. ఆయన ధర్మాత్ముడు. అనేక యజ్ఞాలు చేశాడు. ఒకానొకనాడు ఆయనకు యజ్ఞం చేసి సశరీరంతో స్వర్గానికి వెళ్ళాలని కోరిక కలిగింది. వెంటనే రాజపురోహితులైన వసిష్ఠుని సమీపించి తన కోరికను తెలిపి, అటువంటి యజ్ఞాన్ని చేయించమని కోరాడు. అందుకు వసిష్ఠుడు, అటువంటి యజ్ఞం ఏదీ లేదని చెప్పాడు. సశరీరంతో స్వర్గానికి వెళ్ళడం అసంభవం, అటువంటి ఆలోచనను విరమించమన్నాడు.

అందుకు సంతృప్తి చెందని త్రిశంకువు, దక్షిణాన తపస్సు చేసుకుంటున్న నూరుగురు వసిష్ఠ పుత్రులను కలుసుకొన్నాడు. వారి వయస్సు ప్రకారం ఒక్కరొక్కరినే కలుసుకుంటూ “గురు పుత్రురాలా! స్వర్గానికి ఈ శరీరంతో వెళ్ళాలనే కోరిక కలిగింది. అటువంటి యజ్ఞాన్ని

చేయించమని వసిష్ఠుల వారిని ప్రార్థించాను. నా కోరికను వారు నిరాకరించారు. మీరు మా వంశానికి పురోహితులు. మీరు కాకపోతే నా చేత మరెవరు యజ్ఞం చేయించగలరు? నేను మీకు శరణాగతుడ నగుచున్నాను. మీరే దిక్కని వచ్చాను. మీరు నా కోరికను మన్నించి నాచే అట్టి యజ్ఞాన్ని చేయించండి. ఇక్ష్వాకు వంశీయులందరికీ పురోహితుడే పరమగతి. పురోహితుల వలననే మా పూర్వీకులంతా తరించబడ్డారు. వసిష్ఠుని తరువాత మీరే నాకు దేవతలు. మిమ్మల్ని నమ్ముకొని వచ్చాను" అని దీనంగా ప్రార్థించాడు.

# 58 వ సర్గ వసిష్ఠ పుత్రులు త్రిశంకువును శపించటం

శతానందుడు : ఓ రామా! త్రిశంకువు కోరికను విన్న వసిష్ఠుని కుమారులందరూ అతణ్ణి కోప్పడ్డారు.

వసిష్ఠుని పుత్రులు : ఓరీ దుర్బుద్ధీ! సత్యవాది, మహావిద్వాంసుడు అయిన గురువును కాదని నువ్వు మరొకరిని గురువుగా ఎట్లా ఆశ్రయించాలనుకుంటున్నావు? ఇక్ష్వాకు వంశపు రాజులకు గురువే దైవం. గురువాజ్ఞ ధిక్కరింపరానిది. వసిష్ఠ మహర్షి వంటి పురోహితుడు ఆచరింప సాధ్యం కాదని చెప్పినా కూడా నువ్వా యజ్ఞాన్ని మరొకరిచేత చేయించగలనని అనుకుంటున్నావా? నీవు మూఢుడవు. నీ ఆలోచన విరమించుకొని వెంటనే నీ నగరానికి వెళ్ళు. ఆయన సాధ్యం కాదన్న పనిని మేము ఎలా సాధించగలం? అది ఆయనను అవమానించటం కాదా?

త్రిశంకువు : తపోధనులారా! గురువు నా కోరికను నిరాకరించటంచేత, అంతటి సమర్థులని తలచి మిమ్ములను ఆశ్రయించాను. మీరు కూడా నిరాకరిస్తే, నేను మరొక గురువును ఆశ్రయిస్తాను.

శతానందుడు : ఓ రామా! వసిష్ఠుని పుత్రులు, త్రిశంకువు యొక్క గురు ధిక్కారాన్ని సహించలేకపోయారు. వారతన్ని చండాలుడవు కమ్మని శపించారు. మరునాటి ఉదయానికల్లా త్రిశంకుడు చండాలుడయ్యాడు. అతడి ఆకారమే పూర్తిగా మారిపోయింది. శరీరం నల్లగా, బొగ్గులా అయిపోయింది. వస్త్రాలన్నీ మాసి దుర్గంధపూరితాలయ్యాయి. చక్కటి కేశసంపదంతా పోయింది. గిడసబారి వెంట్రుకలన్నీ పొట్టివయ్యాయి. ఆభరణాలన్నీ పోయి పుర్రెలతో చేసిన మాలను ధరించాడు.

రామా! అటువంటి వికారమైన రూపంలో త్రిశంకువును చూసి ప్రజలు, మంత్రులు

దూరంగా పోయారు. ఆ విధంగా ఒంటరివాడయ్యాడు. తన దీనస్థితికి దుఃఖించాడే కాని, ధైర్యాన్ని విడువలేదు. కార్యం సాధించాలనే పట్టుదలతో త్రిశంకువు విశ్వామిత్రుని ఆశ్రమానికి వెళ్ళాడు.

రామా! ఛండాలత్వం పొందిన త్రిశంకుని చూచి విశ్వామిత్రుడు జాలి చెందాడు. మహాతేజశ్శాలియైన విశ్వామిత్రుడు త్రిశంకునకు ధైర్యం పలికి 'నీకు భద్రమగుగాక' అని దీవించాడు.

విశ్వామిత్రుడు : అయోధ్యాపతియైన ఓ రాజా! నీవు ఏ విధంగా ఛండాలత్వం పొందావు? నీవు ఏమి ఆశించి ఇక్కడకు వచ్చావు?

త్రిశంకుడు : ఓ మహాత్మా! ఈ శరీరంతో స్వర్గానికి పోయేందుకు యజ్ఞం చేయించమని అడిగాను. అందుకు గురువైన వసిష్ఠుడు అంగీకరించలేదు. అంతట గురుపుత్రులను ఆశ్రయించాను. వారు కోపించి నన్ను ఛండాలుడవు కమ్మని శపించారు.

ఓ మహర్షీ! నేను నూరు యజ్ఞాలు చేశాను. కానీ నా కోరిక నెరవేరలేదు. మహాత్మా! నేను ఎన్నడూ అసత్యాన్ని పలుకలేదు. క్షత్రియధర్మాలన్నీ సక్రమంగా పాటిస్తూవచ్చాను. మహాత్ములను, పెద్దలను గౌరవించి సంతోషపెట్టాను. ధర్మసమ్మతమైన నా కోరికను గురుదేవులు మన్నింపకపోగా వారి ఆగ్రహానికి గురి అయ్యాను. దైవం నాకు ప్రతికూలంగా ఉన్నది. అందుచే నా పురుష ప్రయత్నాలన్నీ విఫలమై విపరీత ఫలితాలను పొందాను. మహాత్మా! ఇటువంటి దీనస్థితిలో నిన్ను ఆశ్రయించటానికి వచ్చాను.

# 59 వ సర్గ విశ్వామిత్రుడు త్రిశంకునకు ధైర్యం చెప్పడం

విశ్వామిత్రుడు : ఓ ఇక్ష్వాకు వంశ సంజాతుడా! త్రిశంకూ! నీ మాటల వలన పరమ ధార్మికుడవని తెలుస్తోంది. భయపడకు. నీకు నేను రక్షగా ఉంటాను. నీ చేత నేను యజ్ఞం చేయిస్తాను. గురుశాపంచే ఛండాలరూపుడువైన నిన్ను ఈ ఛండాల శరీరంతోనే స్వర్గానికి పంపుతాను. ఎప్పుడైతే నీవు విశ్వామిత్రుని శరణు కోరి వచ్చావో, అప్పుడే నీకు స్వర్గప్రాప్తి కలిగిందని తెలుసుకో!

శతానందుడు : ఓ రామా! త్రిశంకునకు అభయమిచ్చి విశ్వామిత్రుడు తన కుమారులను పిలిచి యజ్ఞ సంబారాలన్నీ సమకూర్చండని ఆదేశించాడు.

విశ్వామిత్రుడు : ప్రియమైన శిష్యులారా! మీరందరూ వెళ్ళి యజ్ఞం పూర్తి చేయటానికి తగిన బ్రాహ్మణులను, ఋత్త్విక్కులను, ఋషులను తీసుకొని రండి.

వత్సరాలా! మీరు ఆహ్వానించినప్పుడు ఎక్కడైనా, ఎవరైనా అనాదరంగా మాట్లాడటం జరిగితే ఆ విషయాలన్నీ నాకు వివరంగా తెలియజేయండి.

శతానందుడు : ఓ రామా! విశ్వామిత్రుని ఆజ్ఞ ప్రకారం శిష్యులంతా నలుదిక్కులకూ వెళ్ళారు. వారి ఆహ్వానాన్ని మన్నించి వేదపండితులు నానాదేశాల నుండి వచ్చారు.

రామా! శిష్యులంతా తిరిగివచ్చారు. వారి ముఖాలన్నీ తేజస్సుతో వెలిగిపోతున్నాయి. వేదపండితులంతా తమ ఆహ్వానాన్ని సంతోషంతో స్వీకరించారని తెలిపారు. సకల దేశాలనుండీ బ్రాహ్మణోత్తము లెందరో వచ్చారు. కానీ ఒక్క మహోదయుడు మాత్రం రాలేదు.

విశ్వామిత్రుని శిష్యులు : మునిశ్రేష్ఠా! వసిష్ఠ కుమారులు మాత్రం తమ యజ్ఞాన్ని నిరసిస్తూ మాట్లాడారు. “ఆహా! ఒక ఛండాలుడు క్షత్రియుని యాజకునిగా స్వీకరించి దేవతలకు

హవిస్సులిస్తే వాటిని దేవతలు ఎట్లా స్వీకరిస్తారు?"

విశ్వామిత్రుని ఆహ్వానాన్ని మన్నించిన బ్రాహ్మణులు ఛండాలుని చేతి అన్నంతిని స్వర్గమున కెలా వెళ్ళగలరు?" అని ఆక్షేపించారు. మరియు, మహోదయుడూ, వసిష్ఠ కుమారులు, గురుదేవుల గూర్చి పలువిధాలైన పరుష వాక్యాలు పలికారు.

శతానందుడు : ఓ రామా! శిష్యుల మాటలు విన్న విశ్వామిత్రుని కన్నులు క్రోధంతో ఎర్రబడ్డాయి.

విశ్వామిత్రుడు : దోషం లేనివాడినై, తీవ్రమైన తపస్సు చేస్తున్న నన్ను దూషించిన దురాత్ములు భస్మమై పోవుదురుగాక! వారి వంశం క్షయమగుగాక! వారందరూ ఏడువందల జన్మలు ధరించి శవభక్షకులుగా ఉందురుగాక! వసిష్ఠ పుత్రులు ముష్టిక జాతిలో పుట్టి కుక్క మాంసం తిందురుగాక! వికృత రూపాలలో ఈ లోకంలో సంచరిస్తారుగాక! దూషింపరాని నన్ను దూషించిన ఈ మహోదయుడు నిషాదజాతిలో పుట్టుగాక! ఈ మహోదయుడు దయాహీనుడై ప్రాణాలు తీయడమే వృత్తిగా జీవించువాడగుగాక!

# 60 వ సర్గ త్రిశంకువు యజ్ఞాన్ని ప్రారంభించటం

విశ్వామిత్రుడు : ఋషిపుంగవులారా! మీరందరూ ధర్మాత్ములు. మహాతపశ్శాలురు. మనవంటి తపశ్శాలురను దూషించిన వారికి ఎట్టి గతులు కలుగుతాయో మహోదయ, వసిష్ఠకుమారుల ఉదంతమే ప్రత్యక్ష నిదర్శనం.

ఋషీశ్వరులారా! ఈతడు ఇక్ష్వాకు వంశమునకు చెందిన రాజు. పేరు త్రిశంకువు. ధర్మిష్ఠుడు. దాతృత్వం కలవాడు. ఈ శరీరంతోనే స్వర్గానికి వెళ్ళాలని మన సహాయం కోరాడు. నేనాతడికి అభయమిచ్చాను. ఈతడు ఈ శరీరంతో స్వర్గానికి వెళ్ళేందుకు మనమంతా సహాయపడాలి.

ఋషులు : (తమలో తాము ఇలా అనుకున్నారు. ఈ కౌశికుడు మిక్కిలి కోపిష్ఠి. అగ్నివలె తీవ్ర స్వభావం కలవాడు. తెలిసో తెలియకో పిలవగానే వచ్చాం. ఇతడి వల్ల శాపం పొందకుండా బైటపడాలి.)

ఓ విశ్వామిత్ర మహర్షీ! ఈ యజ్ఞమందు నీవు యాజకుడుగా ఉండు. కల్పోక్త ప్రకారం, మంత్రపూర్వకంగాను, అవసరమైన కర్మలన్నీ మేము నిర్వహిస్తాం.

శతానందుడు : రామా! ఈ విధంగా యజ్ఞం చాలా రోజులు సాగింది. తరువాత, మహాతపశ్శాలి అయిన విశ్వామిత్రుడు దేవతలందరినీ హవిస్సులు స్వీకరించడానికి ఆహ్వానించాడు. కాని, దేవతలెవ్వరూ ఆ హవిస్సులను స్వీకరించడానికి రాలేదు. విశ్వామిత్రుడి కోపానికి అంతు లేకుండాపోయింది.

'స్రువ' అనే హోమసాధనాలను చేతబుచ్చుకొని విశ్వామిత్రుడు ఇలా అన్నాడు: ఓ రాజా! నా తపఃప్రభావం చూడు. ఇక యజ్ఞ యాగాదులతో నిమిత్తం లేదు. నా తపః ఫలం కొంత ఉంది. దాని ప్రభావంచేత నిన్ను స్వర్గానికి పంపుతాను. నీ శరీరంతోనే స్వర్గంలో ప్రవేశించు. ఇది

ఇతరులకు సాధ్యం కానిది; విశ్వామిత్రుడొక్కడే చేయగలడు.

శతానందుడు : రామా! విశ్వామిత్రుడు ఈ విధంగా పలికి, మునులు, ఋత్విక్కులు, బ్రాహ్మణులందరూ చూస్తూండగా త్రిశంకువును స్వర్గానికి పంపాడు.

రామా! దేవతాగణాలతో కూడి ఉన్న దేవేంద్రుడు త్రిశంకువు స్వర్గంలో ప్రవేశించటం చూశాడు. అంతట దేవేంద్రుడు "ఓ త్రిశంకూ! నీవు మానవుడవు. పైగా గురుశాపానికి గురి అయ్యావు. నీవు స్వర్గంలో ఉండేందుకు అర్హుడవు కావు. తిరిగిపో. మూఢుడా! తలక్రిందులుగా పోయి భూమిపై పడు" అని త్రోసేశాడు.

రామా! మహేంద్రునిచే త్రోసివేయబడ్డ త్రిశంకువు, 'రక్షింపుము – రక్షింపుము' అంటూ తలక్రిందులుగా భూమిపై పడబోయాడు. ఆ మాటలు వింటూ, క్రిందపడబోవుచున్న త్రిశంకువును చూసిన విశ్వామిత్రుడు 'ఆగు–ఆగు' అని అరిచాడు. అంతట విశ్వామిత్రుడు తన తపోబలంచేత త్రిశంకువును అక్కడే నిలబడేట్లు చేశాడు. మహర్షుల మధ్యలో ఉన్న విశ్వామిత్రుడు రెండవ బ్రహ్మ అయ్యాడు. త్రిశంకువు ఉన్న దక్షిణ దిక్కున సప్తర్షి మండలం ఏర్పాటు చేశాడు. మరొక నక్షత్ర మండలాన్ని సృజిస్తాను. మరొక ఇంద్రుడినైనా ప్రతిష్ఠిస్తాను. లేదా ఇప్పుడున్న ఇంద్రుని కూడా తొలగిస్తాను అని ప్రతిజ్ఞ చేసి దేవతా సృష్టిని ప్రారంభించాడు.

రామా! విశ్వామిత్రుని ఈ ప్రతిసృష్టి కార్యక్రమానికి దేవతలు, దానవులు, ఋషులు అంతా భయపడిపోయారు. విశ్వామిత్రుని అనునయించారు.

దేవదానవులు : ఓ తపోధనా! ఈ త్రిశంకువు గురుశాపానికి గురి అయ్యాడు. ఈతడు శరీరంతో స్వర్గాన్ని చేరటానికి అర్హుడు కాడు.

విశ్వామిత్రుడు : దేవతలారా! మీకు క్షేమమగుగాక! ఈ త్రిశంకువును శరీరంతో స్వర్గానికి పంపుతానని ప్రతిజ్ఞ చేశాను. నా ప్రతిజ్ఞ భంగమునకు నేను అంగీకరించను. మరియు,

నాచే సృజించబడిన నక్షత్రాలన్నీ ఈ లోకాలు ఉన్నంతవరకు స్థిరంగా ఉండవలసిందే. కనుక ఓ దేవతలారా మీరు ఈ రెండూ అంగీకరించిన ఎడల నేను నా ప్రయత్నాలన్నీ విరమిస్తాను.

దేవతలు : ఓ మునిశ్రేష్ఠా! నీ ప్రతిజ్ఞకు భంగం రాదు. నీవు చెప్పినట్లే అవుతుంది. నీవు సృజించిన నక్షత్రమండలం జ్యోతిశ్చక్రమునకు వెలుపల ఉంటుంది. త్రిశంకువు ఆ నక్షత్ర మండలంలో నడుమ ప్రకాశిస్తూ దేవతలతో సమానుడైనా, తలక్రిందులుగా నివసిస్తాడు. ఈ రాజేంద్రుడు కీర్తిమంతుడైవుంటాడు. స్వర్గంలో ఉన్నవారిని నక్షత్రాలు ఎట్లు అనుసరిస్తాయో, ఈ రాజశ్రేష్ఠుని కూడా ఈ నక్షత్రాలన్నీ అనుసరిస్తాయి.

ఈ విధంగా దేవతల చేత, ఋషుల చేత స్తుతించబడినవాడై విశ్వామిత్రుడు సంతుష్టుడయ్యాడు.

రామా! ఆ యజ్ఞాన్ని యథావిధిగా పూర్తి చేసి ఋషులు, బ్రాహ్మణులు, ఋత్విక్కులు తమ తమ స్థానములకు వెళ్లారు.

# 61 వ సర్గ శునశ్శేఫుని యజ్ఞపశువుగా కొనడం

శతానందుడు : ఓ రామా! మహాత్ముడైన విశ్వామిత్రుడు దక్షిణ దిక్కున తరచుగా తపోభంగం కలుగుచున్నదని తోటి ఋషి పుంగవులందరినీ వెంటబెట్టుకొని పశ్చిమ దిక్కున పుష్కర క్షేత్రానికి వెళ్ళాడు. అచట ఉత్తమమైన తపోవనాన్నొకటి ఎంచుకొని కేవలం కందమూలాలనే తింటూ కఠోరమైన తపస్సు చేశాడు.

రామా! ఆ కాలంలో అయోధ్యాధిపతియైన అంబరీషుడు యాగం చేస్తున్నాడు. ఒకానొక రోజున అతడి యాగపశువును ఇంద్రుడు అపహరించాడు. అంతట పురోహితులు రాజుతో ఇలా అన్నారు.

పురోహితులు : రాజా! అంబరీషా! యాగపశువు అపహరింపబడినదంటే ఆ దోషం రాజుదే కాని మరొకరు బాధ్యులు కారు. ఇది మహాపాపంగా పరిగణించబడుతుంది. దీనికి ప్రాయశ్చిత్తం కూడా పెద్దదిగానే ఉంటుంది. యాగపశువు లభించని యెడల ఎవరైననూ మనుష్యుని తీసుకొనిరావాలి. ఆతడికి తగిన కర్మలు చేసి పశువుకు బదులుగా బలి ఇవ్వవచ్చు. అప్పుడే యజ్ఞం పరిసమాప్తం అవుతుంది.

శతానందుడు : రామా! బుద్ధిశాలియైన అంబరీషుడు లక్షలకొలది ఆవులనిచ్చి నరపశువును పొందాలని తీవ్రంగా ప్రయత్నం చేశాడు. దేశమందలి పల్లెలు, పట్టణాల్లోనూ, ఆశ్రమాల్లోను వెదకుతూ చివరకు ఋచీక మహర్షి భార్యాపిల్లలతో తపస్సు చేసుకుంటూ ఉన్న ఆశ్రమానికి వచ్చాడు. అంతట ఆ రాజు మునీశ్వరుని సమీపించి కుశల ప్రశ్నల పిదప ఇలా అన్నాడు.

అంబరీషుడు : మహామునీ! నేను తలపెట్టిన యజ్ఞంయొక్క యజ్ఞపశువు నెవరో అపహరించారు. దానికి ప్రత్యామ్నాయంగా ఎవరైనా నరుని పశువుగా చేసి బలి ఇస్తే యాగం

పరిసమాప్తి అవుతుంది. నీ కుమారుని నాకు అర్పిస్తే నీకు లక్ష ఆవులనిస్తాను. నా యజ్ఞం కూడా సమాప్తమవుతుంది. దేశదేశాలు ఆ నరపశువు కొరకై తిరుగుతున్నాను కానీ, లభించలేదు. కనుక నీ కుమారులలో ఒకరిని నాకు ఇవ్వవలసింది.

ఋచీకుడు : రాజా! నా పెద్దకుమారుడు నాకు చాలా ఇష్టమైన వాడు కనుక ఎంతమూల్యం చెల్లించినా, పెద్దవాడిని నేను అమ్మజాలను. చిన్నవాడిపైన వాడి తల్లికి మక్కువ ఎక్కువ కనుక ఆ పిల్లవానిని అమ్మడానికి నా భార్య అంగీకరించటం లేదు.

శతానందుడు : రామా! వారి మాటలను వింటున్న మధ్యముడు, 'శునశ్శేపుడు' స్వయంగా ముందుకు వచ్చి "రాజా! నా అన్నగారు నా తండ్రికి ఇష్టుడు. నా తమ్మునిపై నా తల్లికి అపేక్ష అధికం. కనుక వారు నన్ను అమ్మజూపుచున్నారని తెలుస్తోంది అందువలన, నన్ను తీసికొనిపొండి" అన్నాడు.

రామా! అంబరీషుడు లక్షగోవులనిచ్చి 'శునశ్శేపుని' తీసుకుని ఆనందంతో తన నగరానికి వెళ్లాడు.

## 62 వ సర్గ విశ్వామిత్రుడు శునశ్శేపుని రక్షించటం

శతానందుడు : రామా! అంబరీష మహారాజు శునశ్శేపుని వెంట బెట్టుకొని వెళ్తూ, మధ్యాహ్న సమయంలో విశ్రాంతి తీసుకొనుటకై పుష్కరక్షేత్రమందు బసచేశాడు. మహారాజు విశ్రాంతి తీసుకొనే సమయంలో శునశ్శేపుడు దుఃఖంతో బాధపడుతూ, అచటనే తపస్సు చేసుకొంటున్న విశ్వామిత్ర మహర్షిని చూశాడు. అలసటచేత, ఆకలిచేత ఆతడి ముఖం వడలిపోయింది. విశ్వామిత్రుని చూడగానే ఆతడిలో పేరుకుపోయిన దుఃఖం పొర్లుకొని ప్రవహించింది. ఆతడు విశ్వామిత్రుని కాళ్ళపై పడి ప్రార్థించాడు.

శునశ్శేపుడు : ఓ మహామునీ! నీవు సర్వజనరక్షకుడవు. లోకహితం కోరేవాడవు. నాకు తల్లి లేదు, తండ్రి లేదు, ఇక బంధువులు ఎచటనుండి వస్తారు? కనుక నన్నొక అనాధగా స్వీకరించి రక్షించు.

మునిశ్రేష్ఠా! మహారాజు నా తల్లిదండ్రులకు మూల్యం చెల్లించి నన్ను యజ్ఞపశువుగా కొనుక్కొనిపోతున్నాడు. కాబట్టి రాజు తలపెట్టిన కార్యానికి విఘ్నం కలుగరాదు. నాకు కలకాలం జీవించి, తపస్సుచేసి స్వర్గాన్ని చేరాలని ఉంది. ఓ ధర్మాత్మా! నాథుడులేని నన్ను తండ్రివై రక్షించు, నన్నీ ఆపదనుండి కాపాడు.

విశ్వామిత్రుడు (పుత్రులను పిలిచి) : పుత్రులారా! తల్లితండ్రులు లోకహితం చేయడానికి పుత్రులను కంటారు. ఇప్పుడు నాకా అవసరం ఏర్పడింది. అది మీ వలననే సాధించాల్సి ఉంది.

ఈతడు శునశ్శేపుడు. రాజు ఈతడిని యాగపశువుగా కొని తీసుకొని పోతున్నాడు. ఈ బాలుడు నన్ను ప్రాణభిక్ష కోరాడు, నేను అభయమిచ్చాను. రాజు కార్యం చెడిపోరాదు. ఈతడూ జీవించాలి, అందువలన మీలో ఒకడు ఈతడికి బదులుగా యాగపశువై ప్రాణత్యాగం చెయ్యండి. నేను మాట నిలబెట్టుకొన్నట్లవుతుంది.

విశ్వామిత్రుని పుత్రులు : తండ్రీ! నీ న్యాయం మెచ్చదగనిదిగా ఉంది! ఎందువల్లనంటే నీ కుమారుని వధించి, పరుల కుమారుని రక్షించటం ఏం న్యాయం? అంటే తన మాంసాన్ని తానే భుజించునట్లు కాదా? మేము నీ కోరికను మన్నించడానికి సిద్ధంగాలేము?

విశ్వామిత్రుడు : (క్రోధంతో కళ్ళు ఎర్రబడ్డాయి) మీరు నా మాటను అతిక్రమించటమే కాకుండా ఏ విధమైన సంకోచమూ లేకుండా ధర్మరహితంగా మాట్లాడారు. మీ మాటలు నన్ను ఈటెతో పొడిచినట్లు బాధిస్తున్నాయి. మీరందరూ వసిష్ఠకుమారులవలె ముష్టిక జాతులందుపుట్టి, కుక్కమాంసం తింటూ వెయ్యి సంవత్సరాలు పడి ఉండండి.

నాయనా! శునశ్శేఫా! భయపడకు. నీ ప్రాణాన్ని నేను కాపాడతాను విను. నీకు ఎర్రని పుష్పమాలలువేసి, ఎర్రని పైపూతపూసి, పవిత్ర పాశాలతో యూపస్తంభానికి కడ్తారు. అప్పుడు నీవు నేనిచ్చే ఈ మంత్రాలతో అగ్నిని స్తుతించు. నీవు కోరినట్లు జీవించి, నీ లక్ష్యాన్ని సాధిస్తావు.

శతానందుడు : రామా! అంతట శునశ్శేపుడు ఆ రెండు మంత్రాలను జాగ్రత్తగా మననం చేసుకున్నాడు.

రామా! శునశ్శేపుడు అంబరీషుని వద్దకుపోయి యజ్ఞాన్ని త్వరగా ప్రారంభించమని ప్రార్థించాడు. ఆ మాటలకు రాజు చాలా సంతోషించాడు. యాగశాలకు పోయి సదస్సుల అనుమతి పొంది, దర్భ పవిత్రములచే గుర్తులుంచి శునశ్శేప్పునకు ఎర్రని వస్త్రాలు కట్టారు. యజ్ఞపశువుగా యూపస్తంభానికి కట్టేశారు అప్పుడు శునశ్శేపుడు ఆ రెండు మంత్రాల్నీ శ్రద్ధతో పఠించాడు. ఇంద్రుని, ఉపేంద్రుని యథాశాస్త్రంగా స్తుతించాడు.

రామా! శునశ్శేపుడు చేసిన స్తుతికి సంతోషించిన ఇంద్రుడు అతడికి దీర్ఘాయువును ప్రసాదించాడు. అట్లాగే అంబరీష మహారాజు కూడా ఎన్నోరెట్లు అధికంగా యజ్ఞఫలాన్ని పొందాడు.

తరువాత విశ్వామిత్ర మహర్షి పుష్కరక్షేత్రమందు తన తపస్సును కొనసాగించాడు.

# 63 వ సర్గ విశ్వామిత్రుడు బ్రహ్మర్షిత్వానికై తపస్సు చేయటం

శతానందుడు : రామా! విశ్వామిత్రుడు పుష్కర క్షేత్రమందు వేయి సంవత్సరాలు తీవ్రమైన తపస్సు చేశాడు. బ్రహ్మాది దేవతలంతా ఆయన తపస్సుకు సంతోషించి ప్రత్యక్షమయ్యారు.

బ్రహ్మ : విశ్వామిత్రా! నీవు చేసిన పుణ్యకార్యాల వల్ల ఋషివయ్యావు, నీకు మంగళమగుగాక!

శతానందుడు : రామా! బ్రహ్మ ప్రసాదించిన ఋషిత్వానికి సంతృప్తి చెందని విశ్వామిత్రుడు, తిరిగి తీవ్రమైన తపస్సు ప్రారంభించాడు.

రామా! ఒకానొక రోజున మేనక అనే అప్సర స్త్రీ పుష్కరమందు స్నానం చేస్తూండగా, మెరుపు తీగవంటి ఆ అందగత్తెను విశ్వామిత్రుడు చూశాడు. వెంటనే ఆమె యందు తీవ్రమైన కోరిక కలిగింది.

విశ్వామిత్రుడు : ఓ సుందరీ! అప్సరకాంతా! నిన్ను చూచినంతనే మన్మథుడు నన్ను ప్రభావితుణ్ణి చేశాడు. నీపై మోహం కలిగింది నా ఆశ్రమంలోనే కొంతకాలం ఉండు.

శతానందుడు : రామా! విశ్వామిత్రుడు కోరినదే తడవుగా మేనక అతడితో ఆశ్రమంలో ఉండేందుకు అంగీకరించింది ఆమె అతడితో పది సంవత్సరములు గడిపింది. పది సంవత్సరాలు గడచిన తర్వాత తన తొందరపాటుతనానికి విశ్వామిత్రుడు సిగ్గుపడ్డాడు. తన తపస్సు భంగం చేయటానికే దేవతలు ఈ పన్నాగాన్ని పన్నారని గ్రహించాడు, పశ్చాత్తాపం చెందాడు. పశ్చాత్తాపడుతున్న విశ్వామిత్రుని చూసి మేనక భయంతో వణికిపోయింది. ఆమె భయాన్ని గ్రహించిన విశ్వామిత్రుడు ఆమెతో మృదుమనోహరములైన పలుకులు పలికి భయంపోగొట్టి ఆమెను ఆశ్రమంనుండి పంపివేశాడు.

రామా! మేనకను పంపిన తర్వాత విశ్వామిత్రుడు మనస్సును స్థిరపరచుకొన్నాడు. వసిష్ఠునిపై పగ తిరిగి బుసలుకొట్ట ప్రారంభించింది. కౌశికీనదీ తీరాన చేరి నిష్ఠతో అతితీవ్రమైన తపస్సును ప్రారంభించాడు. ఆ విధంగా వేయి సంవత్సరాలపాటు ఘోరమైన తపస్సు చేశాడు. దేవతలంతా భయపడ్డారు. దేవతలు, ఋషులు అంతా ఆయన్ని 'మహర్షి' అని సంబోధించడం ప్రారంభించారు.

బ్రహ్మ : మహర్షీ! నీ తపస్సుకు సంతోషించాను. నీ మహత్త్వాన్ని, మహర్షిత్వాన్ని గుర్తించి లోకమంతా నిన్ను 'మహర్షి' అంటారు. ఇక నీ తపస్సును చాలించు.

విశ్వామిత్రుడు : ఓ దేవా! నా తపస్సుకు సంతోషించి మహర్షిత్వాన్ని ప్రసాదించానన్నావు. మహర్షిత్వం నాకు సంతోషాన్ని కలిగించ లేదు; దుఃఖమూ కలుగలేదు. జితేంద్రియుడనయ్యాను. బ్రహ్మర్షి కావాలన్నదే నా కోరిక.

శతానందుడు : రామా! బ్రహ్మ, విశ్వామిత్రుని మాటలు విని, నీవు జితేంద్రియుడవు కాలేదు. ఇంకా నీ తపస్సు కొనసాగించు అని చెప్పి వెళ్ళిపోయాడు. ఆయనతోపాటు దేవతలుకూడా వెళ్ళిపోయారు.

రామా! బ్రహ్మాది దేవతలు వెళ్ళిపోయిన తర్వాత విశ్వామిత్రుడు తన తపస్సును ఇంకా తీవ్రతరం చేశాడు. చేతులు రెండూ పైకెత్తి, ఏ ఆలంబనమూ లేకుండా నిలబడి, గాలిని మాత్రమే ఆహారంగా స్వీకరిస్తూ తీవ్రమైన తపస్సు చేశాడు. ఎండాకాలమంతా పంచాగ్నులమధ్య నిలచి తపస్సు చేసేవాడు. వర్షాకాలంలో ఏ ఆచ్ఛాదనాలేకుండా ఆరు బయటే గడుపుతూ తపస్సు చేశాడు. శీతాకాలంలో నదిలో గొంతులోతు నీళ్ళల్లో నిలబడి తపస్సు చేశాడు. ఈ విధంగా వేయి సంవత్సరాలు గడచిపోయాయి. లోకాలన్నీ తాపంతో తల్లడిల్లిపోయారు. దేవేంద్రాది దేవతలంతా భయపడసాగారు. అంతట దేవేంద్రుడు, దేవతలను, రంభ అనే అప్సరసను వెంటబెట్టుకొని విశ్వామిత్రుని వద్దకు వచ్చాడు.

# 64 వ సర్గ విశ్వామిత్రుని తపోభంగం

శతానందుడు : "రంభా! నీ హావభావాల చేత, నీ సౌందర్యం చేతా విశ్వామిత్రుని మోహితునిగా చెయ్యి. ఇది దేవకార్యం. నిన్ను ఈ పనికి నియోగిస్తున్నాను, నీ వీకార్యం సక్రమంగా పూర్తిచెయ్యా" లని దేవేంద్రుడు ఆదేశించాడు.

రంభ : దేవదేవా! విశ్వామిత్రుడు మహాకోపిష్టి. ఇది లోకమంతటికీ తెలిసిన విషయమే! ఆయన కోపించి నన్ను శపిస్తాడేమోనని భయంగా ఉంది.

దేవేంద్రుడు : రంభా భయపడకు. నువ్వు ఈ కార్యం సాధించడంలో నేను, మన్మథుడు నీకు అండగా ఉంటాం. ఇది దేవకార్యం. నువ్వే ఇందుకు తగిన దానవు. ఈ కార్యం ఎట్లా సాధించాలో కూడా ముందుగానే ఆలోచించి ఉంచాం. అదెట్లాగంటే, వసంతకాలంలో ఒక కోకిల రూపాన్ని ధరించి నేను, మన్మథుడు నీకు సాయంగా ఉంటాం. నీ తళుకు బెళుకులన్నీ ప్రదర్శించు. హావభావాలతో ఆయనను మోహితుణ్ణిచెయ్యి. శృంగార చేష్టల్ని నీకు నేను నేర్పాలా? ఆ విద్యలో నిన్ను మించినవారు మరొకరున్నారా? విశ్వామిత్రుడి ఎదురుగా ఆడుతూ పాడుతూ తిరుగు. మిగతా కార్యం మన్మథుడు చూసుకుంటాడు.

శతానందుడు : ఓ రామా! దేవేంద్రుడు చెప్పినట్లే రంభ చక్కగా అలంకరించుకొంది. తియ్యటి చిరునవ్వులు చిందించింది. విశ్వామిత్రుని ముందు గాలితెరలాగా కనిపించీ కనిపించకుండా తిరిగింది. ఇంతలో మన్మథుడు కోకిలగా మారి తియ్యగా పాడనారంభించాడు. కోకిలమ్మ పాటలోని కమ్మదనానికి విశ్వామిత్రుడి కళ్ళు సగం తెరుచుకున్నాయి. ఎదురుగా రంభ కనిపించింది. ఇంకేముంది మిగతా సగంకూడా తెరిచేశాడు. మనస్సు చంచలమైంది. అయితే పాత అనుభవాలు జ్ఞాపకానికొచ్చాయి. వెంటనే నిగ్రహించుకున్నాడు. ఇది రంభే అని మనస్సు చెప్తోంది. ఇది దేవేంద్రుని పన్నాగమే అయివుంటుందని భావించాడు. విశ్వామిత్రుడి ఇంద్రియనిగ్రహానికి రంభ వణికిపోయింది. చావు తప్పదనుకొంది.

విశ్వామిత్రుడు : రంభా! నేను కామక్రోధాలను జయించాలని కఠోర నియమాలు పాటిస్తూ తీవ్రంగా తపస్సు చేస్తున్నాను. నన్ను ప్రలోభపెట్టి నా తపస్సుకు భంగం కలిగించాలనే కుటిలబుద్ధితో వచ్చావు. నీ అందచందాలతో నన్ను లోబరచుకోవాలని చూస్తూన్నావు. కాబట్టి ఎటువంటి అందచందాలులేని బండరాయివై పదివేల సంవత్సరాలపాటు పడివుండు. అయినా నీవు ఈ అపరాధం స్వయంగా తెలిసి చేయలేదు. కాబట్టి గొప్ప తేజస్సుగల బ్రాహ్మణుని వలన తిరిగి నీ పూర్వపు ఆకారాన్ని పొందగలవు. ఆ మహాత్మునిచే నీవు ఉద్ధరింపబడతావు.

శతానందుడు : రామా! విశ్వామిత్రుడు రంభను శపించిన క్షణానే పెద్ద శిలగా ఆమె మారిపోయింది. ఇదంతా చూస్తూన్న దేవేంద్రుడు, మన్మథుడు భయంతో పారిపోయారు.

రామా! మహర్షి కోపోద్రిక్తుడై రంభను శపించడంతో విశ్వామిత్రుని తపోఫలం క్షీణించింది. ఇంద్రియాలను జయింపలేకపోవటం వలన మహర్షి మనస్సు విలవిల్లాడిపోయింది. దాంతో మనశ్శాంతిని కూడా కోల్పోయాడు.

రామా! విశ్వామిత్రుడు రెట్టించిన పట్టుదలతో తపస్సు క్షీణించినా కలత చెందక మళ్ళీ తపస్సు ప్రారంభించాడు. ఈసారి కోపాన్ని జయిస్తానని భీషణ ప్రతిజ్ఞ చేశాడు. రెట్టించిన పట్టుదలతో తపస్సు మళ్ళీ ప్రారంభించాడు. గాలినికూడా బంధించి జితేంద్రియుడై శరీరాన్ని శుష్కింపజేశాడు.

"తపస్సుచేత నాకు బ్రాహ్మణ్యం సిద్ధించేవరకు గాలినికూడా బంధించి, నిరాహారినై తపస్సు చేస్తాను. తపస్సు చేసినంతవరకు అవయవాలు క్షీణింపకుండుగాక!" అని దృఢంగా నిశ్చయించుకున్నాడు.

రామా! విశ్వామిత్ర మహర్షి ఆ విధంగా ఎన్నడూ కనీ, వినీ ఎరుగని విధంగా వేయిసంవత్సరాలు తపస్సు చేశాడు. కార్యదీక్ష, పట్టుదల ఆయనకు పెట్టని ఆభరణాలయ్యాయి.

# 65 వ సర్గ విశ్వామిత్రుడు బ్రహ్మర్షి కావడం

శతానందుడు : ఓ రామా! విశ్వామిత్రుడు విఘ్నాలు కలుగుతున్నాయని పశ్చిమ దిక్కునుండి తూర్పు దిక్కుకుపోయి తపస్సు చేశాడు.

రామా! ఈ పర్యాయం సాటిలేని విధంగా వేయి సంవత్సరాలు మౌనవ్రతాన్ని పాటించాడు. విశ్వామిత్రుని రక్తమాంసాలన్నీ కరిగిపోయాయి, కేవలం ఎముకలపోగుగా మిగిలాడు. ఆ ఎముకలపై చర్మం మాత్రం కప్పబడింది, శరీరం పూర్తిగా క్షీణించిపోయింది.

రామా! వేయి సంవత్సరాల కఠోరమైన తపస్సు చేసిన తర్వాత ఒకనాడు విశ్వామిత్రునికి అన్నం తినాలనిపించింది. తినేందుకు అన్నం ముందు కూర్చున్నాడు. ఇంతలో దేవేంద్రుడు బ్రాహ్మణ వేషంలో వచ్చి “బాగా ఆకలిగా ఉంది” అన్నంపెట్టమని అడిగాడు.

రామా! విశ్వామిత్రుడు మౌనవ్రతంలో ఉండటం చేత మౌనంగా ఆ ఆహారాన్నంతా ఆ బ్రాహ్మణునికి ఇచ్చాడు. ఆ బ్రాహ్మణునితో ఒకమాట అయినా మాట్లాడలేదు. తిరిగి ఆహారం లేకుండానే మరొక వెయ్యి సంవత్సరాలు తీవ్రంగా తపస్సు చేశాడు. ఆహారంతో పాటు గాలి పీల్చడాన్ని కూడా బంధించాడు.

రామా! విశ్వామిత్రుడు ఆ విధంగా ఆహారం లేకుండా, గాలి కూడా పీల్చకుండా మరో వేయి సంవత్సరాలు తపస్సు చేసిన ఫలితంగా శిరస్సునుండి పొగలు వచ్చాయి. అవి ముల్లోకాలూ వ్యాపించి జనులు విపరీతంగా భయభ్రాంతులకు గురి అయ్యారు.

దేవ, గంధర్వ, కిన్నెర, కింపురుషాదులంతా ఆ తాపానికి తెలివితప్పి పడిపోయారు. రక్షించమంటూ అంతా కలసి బ్రహ్మ వద్దకు వెళ్లారు.

“ఈ విశ్వామిత్రుని తపస్సు రోజురోజుకూ ఉద్ధృతమౌతోందే గాని, తరగటంలేదు. ఏ

విధమైన ప్రలోభాలు అతడిని లొంగదీయలేక పోతున్నాయి. ఆతడి తపోగ్ని చేత లోకాలన్నీ తాపం చెందాయి. విశ్వామిత్రుడు సంపూర్ణంగా పాపరహితుడయ్యాడు. నీవు ఇంకా ఆలస్యం చేస్తే లోకాలన్నీ దగ్ధమైపోతాయి. ఇప్పటికే దిక్కులన్నీ తాపం చెందాయి. సాగరాలన్నీ క్షోభిల్లుతున్నాయి, పర్వతాలు కరిగి నీరై ప్రవహిస్తున్నాయి, భూమి కంపిస్తోంది. వాయుదేవుడు స్తంభించిపోయాడు. జనులంతా నాస్తికులయ్యే ప్రమాదం ఏర్పడుతోంది" అని దేవతలు ప్రార్థించారు.

బ్రహ్మ : ఓ బ్రహ్మర్షీ! నీకిదే స్వాగతం, నీ తపస్సుకు సంతోషించాను. పట్టినపట్టు విడవక కఠోర తపస్సుచేసి బ్రాహ్మణత్వాన్ని సంపాదించావు, నిన్ను అభినందిస్తున్నాను.

ఓ బ్రాహ్మణా! నేను నీకు దీర్ఘాయువును కూడా ప్రసాదిస్తున్నాను. మరుద్గణుడవు కమ్ము. స్వస్థచిత్తుడవై సుఖంగా ఉండు.

విశ్వామిత్రుడు : ఓ దేవదేవా! నాకు దీర్ఘాయువును, బ్రాహ్మణత్వాన్ని ప్రసాదించావు. నీకు కృతజ్ఞుడను.

దేవా! నేను ఓంకారము, వషత్కారము, వేదాలను నా స్వాధీనంలో ఉంచుకోవడమే కాకుండా; ఇతరులకు ఉపదేశించేట్లు, యజ్ఞయాగాదులు చేయించడానికి కూడా నాకు అధికారం ఇవ్వు.

ఓ దేవా! బ్రాహ్మణవిద్యలందు, క్షత్రియవిద్యలందు శ్రేష్ఠుడైన వసిష్ఠుడు నన్ను బ్రహ్మర్షీ అని పిలవాలి. దేవా! నాకీ శ్రేష్ఠమైన వరాలు ఇచ్చినట్లయితే సంతోషంతో తపస్సు విరమిస్తాను.

శతానందుడు : రామా! దేవతలందరూ వెళ్ళి వసిష్ఠ మహర్షిని స్వయంగా తీసుకొనివచ్చారు. వసిష్ఠుడు వచ్చి విశ్వామిత్రుని సాదరంగా కౌగలించుకొని 'ఓ బ్రహ్మర్షీ' అని పిలిచాడు. అప్పుడు బ్రహ్మాది దేవతలుకూడా "నీవు బ్రహ్మర్షివే! నీకు అన్నీ సమకూరుతాయి" అని

దీవించి వారి స్థానములకు వెళ్ళారు.

రామా! విశ్వామిత్రుడు మునులలో శ్రేష్ఠుడు. ఇతడు మూర్తీభవించిన, ధర్మపరుడు. ధైర్యసాహసములుగల మహావీరుడు.

జనక మహారాజు : ఓ ధార్మికుడా! మునిపుంగవా! నేను ధన్యుడనయ్యాను. నీ దర్శనం చేత పవిత్రుడనయ్యాను, నా ప్రజలందరికీ నిశ్చయంగా అనేక లాభాలు కలుగుతాయి.

ఓ విశ్వామిత్రా! నీ చరిత్రనంతా సవివరంగా మాకు తెలిపిన శతానందునకు నా కృతజ్ఞతలు, యజ్ఞమునకు వచ్చిన విజ్ఞులు, పెద్దలందరూ నీ గుణాలను విన్నారు. నీ గుణాలు, నీ బలం ఇతరులతో పోల్చి చెప్పజాలం; అంటే నీకు నువ్వే సాటి.

మహాత్మా! నీ చరితం ఎంత చెప్పినా, ఇంకా వినాలనే కుతూహలం కలుగుతోంది. సాయంకాలం అనుష్ఠానాలకు సమయం మించిపోతోంది, నాకు సెలవు ప్రసాదించు.

ఓ మునిశ్రేష్ఠుడా! రేపు ఉదయాన్నే రామలక్ష్మణులను వెంటబెట్టుకొని నా అంతఃపురానికి దయచేయండి. నీకు ఇవే నా ప్రదక్షిణ నమస్కారాలు.

అక్కడ ఉన్న ఉపాధ్యాయులు, ఋత్విక్కులు, బ్రాహ్మణులువిశ్వామిత్రునికిప్రదక్షిణనమస్కారాలు చేశారు. రామలక్ష్మణులను అభినందించారు.

# 66 వ సర్గ శివధనుస్సు వృత్తాంతం

ప్రాతఃకాలమయింది. జనక మహారాజు అనుష్ఠానాలన్నీ ముగించుకొని, సకల రాజ మర్యాదలతో విశ్వామిత్రుని, రామలక్ష్మణులను తన యజ్ఞవాటికకు ఆహ్వానించాడు. రామలక్ష్మణ విశ్వామిత్రులను యథావిధిగా పూజించి ఉచితాసనాలు సమర్పించాడు.

జనక మహారాజు : పూజ్యుడైన విశ్వామిత్ర మహర్షీ! నీకు స్వాగతం. నాచే పొందవలసిన సేవలను ఆజ్ఞాపించు. మిమ్ములను సేవించుకోవటానికి సిద్ధంగా ఉన్నాను.

విశ్వామిత్రుడు : రాజా! వీరు దశరథ మహారాజు పుత్రులు. రామలక్ష్మణులు. క్షత్రియులు, లోకప్రఖ్యాతి గాంచిన జగదేక వీరులు. వీరు శ్రేష్ఠమైన శివధనుస్సును చూడగోరుతున్నారు. నీకు సర్వశుభాలు చేకూరుగాక! వీరు ధనుస్సును చూసి, వచ్చిన పని ముగించుకొని తిరిగి వెళ్తారు.

జనక మహారాజు : మహర్షీ! ఈ శివధనుస్సు వృత్తాంతం చెప్తాను. వినండి.

పూర్వం దక్షయజ్ఞం ధ్వంసం చేస్తూ, కోపించిన శివభగవానుడు దేవతలతో ఇలా అన్నాడు. "దేవతలారా! యజ్ఞంలో నాకు చెందవలసిన హవిస్సులను నాకు చెందకుండా చేశారు. కనుక నా ధనుస్సుతో మీ తలలు నరుకుతాను."

దేవతలంతా భయపడిపోయారు. శివుని అనుగ్రహించమని ప్రార్థించారు. ఆ భగవానుడు వారినందరినీ కనికరించి విడిచిపెట్టాడు.

మహర్షీ! ఆ శివభగవానుడు దేవతలను కనికరిస్తూ, ఆ ధనుస్సును కూడా వారికే ఇచ్చేశాడు. ఆ దేవతలు ఆ ధనుస్సును నిమిచక్రవర్తికి ఆరవవాడైన దేవరాతుని వద్ద న్యాసంగా (దాచి తిరిగి ఇచ్చివేయవలసిన వస్తువు) ఉంచారు. ఆ విధంగా ఆ ధనుస్సు మాకు

వంశపారంపర్యంగా వస్తోంది.

విశ్వామిత్ర మహర్షీ! నేను ఒకానొక సమయంలో భూమిని దున్నుతూ ఉండగా ఆ నాగటి చాలులో ఒక బాలిక దొరికింది. ఆమెకు సీత అని నామకరణం చేసి నా కుమార్తెగా పెంచుకొనుచున్నాను. అయోనిజయైన (గర్భమందు జన్మించని) ఈ నా కుమార్తెను వివాహమాడ వలెనన్నచో పరాక్రమవంతుడై ఉండాలన్న నియమాన్ని పెట్టుకున్నాను. పరాక్రమమే వరశుల్కమని ప్రకటించాను.

మహామునీ! భూమి నుండి ఉద్భవించిన నా కుమార్తె సీతను వివాహమాడడానికి దేశం నలుమూలల నుండి రాజులు వచ్చారు. పరాక్రమానికి పరీక్ష ఏమిటని నన్నడిగారు. నేను వారందరికీ శివధనుస్సును చూపి 'దానిని ఎక్కుపెట్టి నారిని సంధించండి' అని చెప్పాను. వారిలో ఒక్కరు కూడా ఆ ధనుస్సును కనీసం అటూఇటూ కదల్చలేకపోయారు. దాంతో వారంతా అల్ప పరాక్రమవంతులేనని తెలిసిపోయింది. నా కుమార్తెనివ్వడానికి నిరాకరించాను.

ఓ విశ్వామిత్ర మహర్షీ! అప్పుడు ఆ రాజులంతా నాపై కోపంతో పెద్దసైన్యాల్ని వెంటబెట్టుకొని దండెత్తి వచ్చారు. మిథిలా నగరాన్ని ముట్టడించారు. ఈ విధంగా ఒక సంవత్సరం గడిచిపోయింది. నగరవాసుల జీవన సంబారాలన్నీ తరిగిపోయాయి. దాంతో వారంతా చాలా కష్టనష్టాలకు గురి అయ్యారు.

మహర్షీ! అప్పుడు నేను దేవతలందరినీ ప్రార్థించగా వారు నాకు చతురంగ బలాలను పంపి నన్నాదుకొన్నారు. ఆ సైన్యంతో చుట్టుముట్టిన పాపాత్ములైన రాజులందరినీ తరిమికొట్టాను. ఆ విధంగా శత్రురాజులంతా బలహీనపడి నాలుగు దిక్కులకూ పారిపోయారు.

ఓ మునిశ్రేష్ఠా! ప్రకాశవంతమైన ఆ శివధనుస్సును రామలక్ష్మణులు కూడా చూడవచ్చు. వారీ ధనుస్సును ఎక్కుపెట్టగలిగితే సీతనిచ్చి వివాహం జరుపుతాను.

# 67 వ సర్గ శివ ధనుర్భంగం

విశ్వామిత్రుడు : జనక మహారాజా! నీవు చెప్పిన శివధనుస్సు వృత్తాంతమంతా విన్నాం. ఆ ధనుస్సును ఇప్పుడే చూడాలని రామలక్ష్మణులు కుతూహలపడుతున్నారు.

జనక మహారాజు : మంత్రిసత్తములారా! మీరు వెంటనే శివధనుస్సును యజ్ఞవాటికకు తీసుకొని రండు. రామలక్ష్మణులు ఆ ధనుస్సును పరిశీలించదలచుచున్నారు.

ఆ శివధనుస్సు ఒక పెద్ద ఇనుప చట్రంపై అమర్చబడి ఉంది. ఆ ధనుస్సు గంధమాల్యాదులచే అలంకరించబడి నిత్యపూజలందుకొంటూ ఉంటుంది. ఆ ధనుస్సును ఎనిమిది చక్రములు గలిగిన రథమందు అమర్చారు. యాభై మంది మహాబలశాలురైన సైనికులు ఆ రథాన్ని ఈడ్చుకొచ్చారు.

మంత్రులు : ఓ మిథిలాధిపతీ! రాముడు చూడదలచిన శివధనుస్సును తెచ్చాం.

జనక మహారాజు : విశ్వామిత్ర మహర్షీ! మా పూర్వ వంశీయులు కొందరు ఈ ధనుస్సును ఎక్కుబెట్టబోయి విఫలులైపోయారు. మా పూర్వీకులందరిచే నిత్యపూజలందుకొంటున్న శివధనుస్సు ఇదే.

మహర్షీ! దేవ, దానవ, రాక్షస, గంధర్వ, కిన్నెర, కింపురుషాదులెందరో ఈ శ్రేష్ఠమైన ధనుస్సును ఎక్కుపెట్టలేక విఫలులయ్యారు. అటువంటి ఈ ధనుస్సును వంచుటకుగాని, నారి కట్టుటకుగాని, బాణం సంధించుటకుగాని మనుష్యులకు సాధ్యమా?

మునిశ్రేష్ఠా! అట్టి ధనుస్సును మీ ముందు ఉంచాం. మీ రాజపుత్రులకు చూపండి.

విశ్వామిత్రుడు : నాయనా! రామా! నీవు వెళ్ళి ఆ ధనుస్సును చూడు.

రాముడు : ఓ బ్రహ్మర్షీ! ఇప్పుడే శ్రేష్ఠమైన ధనుస్సును చేతులతో పైకి ఎత్తుతాను. దానిని కదల్చడానికి వీలైతే ఎక్కుపెడతాను.

విశ్వామిత్ర మహర్షి : వత్సా! అలాగే చేయి.

ధర్మాత్ముడైన రఘునందనుడు వేలకొలది జనులు చూస్తూండగా, ఆ ధనుస్సును అనాయాసంగా పైకి ఎత్తాడు. నారిని కట్టి సంధించి ఆకర్ణాంతం లాగగా ఆ ధనుస్సు విరిగి రెండు ముక్కలయింది. ఆ ధనుస్సు విరిగినప్పుడు పిడుగులు పడ్డాయా అన్నట్లు, పర్వతాలు బ్రద్దలయ్యాయా? అన్నట్లు, భూమి రెండుగా విచ్చుకుందా? అన్నంత పెద్ద శబ్దమయింది. విశ్వామిత్ర, రామలక్ష్మణ, జనక మహారాజు తప్ప మిగిలిన వారంతా మూర్ఛపోయారు.

జనక మహారాజు : మహామునీ! దశరథ పుత్రుడైన రాముని పరాక్రమాన్ని కన్నులార చూశాను. అత్యద్భుతం. ఇట్టి వీరోచిత కార్యాన్ని నేను ఊహించనైనా ఊహించలేదు. నా కుమార్తె సీత రాముని భర్తగా పొంది ఇరువంశాలకూ కీర్తిని తేగలదు.

మహర్షీ! నా కుమార్తెను వివాహమాడదలచిన వారు పరాక్రమాన్నే శుల్కంగా చెల్లించాలని ప్రకటించాను. నా ప్రతిజ్ఞ సత్యమైంది. నా ప్రాణాలతో సమానురాలైన నా సీతను రాముని కిచ్చి వివాహం చేస్తాను.

విశ్వామిత్ర మహర్షీ! ఆజ్ఞాపించు. ఇప్పుడే నా మంత్రులను అయోధ్యకు పంపుతాను. అంతా శుభమగు గాక! శివధనుర్భంగ వృత్తాంతమంతా నా మంత్రులు దశరథ మహారాజుకు వివరించి చెప్తారు. రామలక్ష్మణులు విశ్వామిత్రుని రక్షణలో సుఖంగా ఉన్నారని తెలుసుకొని, దశరథ మహారాజును మిథిలా నగరానికి గౌరవలాంఛనాలతో తీసుకొనిరాగలరు గాక! మహర్షి! తమ ఆజ్ఞకై ఈ మిథిలాధిపతి ఎదురుచూస్తున్నాడు.

విశ్వామిత్రుడు "అట్లే అగుగాక!" అని అన్నాడు. వెంటనే జనకమహారాజు, మంత్రుల్ని,

బ్రాహ్మణోత్తములను దశరథుని ఆహ్వానించేందుకు అయోధ్యకు పంపాడు. వారంతా ఉత్తమమైనవి, వేగంగా పరిగెత్తే గుర్రాలను పూన్చిన రథాల్లో అయోధ్యకు వెళ్ళారు.

# 68 వ సర్గ దశరథ మహారాజు మిథిలకు బయలుదేరటం

జనక మహారాజు మంత్రులు, బ్రాహ్మణులు, రాత్రింబవళ్ళు ప్రయాణము చేసి, నాలుగవనాడు అయోధ్యానగరాన్ని చేరి రాజభవనం వద్దకుపోయి, జనకమహారాజు దూతలుగా వచ్చాం, దశరథ మహారాజును దర్శింపగోరుచున్నామని ద్వారపాలకులతో చెప్పారు. వారు దశరథ మహారాజు అనుమతి పొంది వారందర్నీ రాజభవనానికి తీసుకొని వెళ్ళారు. బంగారు కాంతులతో ప్రకాశిస్తున్న మహారాజును చూసి మిథిలావాసులు ఇలా అన్నారు.

దూతలు : దశరథ మహారాజునకు జయమగుగాక! రాజా! మేము మిథిలాధిపతియైన జనక మహారాజు పంపగా, వారి దూతలుగా వచ్చాం.

మిథిలాధిపతియైన జనకమహారాజు, స్నేహపూర్వకంగా తమ క్షేమాన్ని, తమ గురువుల, రాజ్యక్షేమాన్ని విచారించారు. తమ అగ్నిహోత్రాదులు నిరంతరాయంగా జరుగుతున్నవి గదా అని అడిగి తెలుసుకోమన్నారు.

మహారాజా! విశ్వామిత్ర మహర్షి అనుజ్ఞతో, శతానందులవారి అనుమతితో తమకు ఈ విషయాలు విన్నవించమని మమ్మల్ని దూతలుగా పంపారు అని దూతలు సందేశం వినిపించారు.

మహారాజా! మిథిలాధిపతినయిన నా కుమార్తె సీతను పరాక్రమవంతులకే ఇచ్చి వివాహం చేస్తానని, పరాక్రమమే వరశుల్కమని ప్రకటించాను. అనేక దేశాల నుండి రాజకుమారులు వచ్చారు కానీ, వారంతా అల్పమైన పరాక్రమం కలవారేనని నిరూపించుకొని వెనుతిరిగి వెళ్ళిపోయారు.

మహారాజా! దైవం మా పట్ల అనుకూలించటం చేత, విశ్వామిత్ర మహర్షి రామలక్ష్మణులతో కలసి మా నగరానికి వేంచేశాడు. నేను చేస్తున్న యాగాన్ని సందర్శించారు.

మహావీరుడైన నీ పెద్దకుమారుడు, రాముడు, మా ఇంట తరతరాలుగా పూజించబడుతున్న శివధనుస్సును ఎక్కుపెట్టి ధనుష్టంకారం చేయబోగా ధనుస్సు రెండుగా విరిగి కిందపడింది. ఆ విధంగా రాముడు లోకంలో ఏకైక పరాక్రమవంతుడని చాటుకున్నాడు. అట్టి తన పరాక్రమాన్నే ఓలిగా పెట్టి నా కుమార్తె సీతను గెలుచుకున్నాడు. మేమంతా కూడా రాముని అతిలోక పరాక్రమానికి తలవొగ్గినవారమై సగౌరవంగా నా కుమార్తె సీతాదేవి నిచ్చి వివాహం చేయదలచాను. అందుకు తమ అనుమతి కోరుతున్నాను. నా ఆహ్వానాన్ని మన్నించి మీరు మీ పరివారం, గురువులతో కూడా మిథిలానగరానికి రావలసింది.

ఓ మహారాజా! మేము జనక మహారాజు దూతలమై వచ్చాం. జనక మహారాజు చేసిన విన్నపాన్ని మీ ముందుంచాం.

దశరథ మహారాజు : ఓ వసిష్ఠ మహర్షీ! వామదేవా! బ్రాహ్మణోత్తములారా! మిథిలాధిపతి సందేశాన్ని విన్నారు గదా! ఈ జనక మహారాజు దూతలు పలికిన మధురమైన వాక్కులన్నీ వింటిరి కదా! మీ అభీష్టాన్ని తెలియజేయండి.

వసిష్ఠ, వామదేవులు : మా కందరికీ మహదానందంగా ఉంది. అట్లే చేద్దాం. రేపే ప్రయాణానికి ఏర్పాట్లు చేస్తాం.

# 69 వ సర్గ దశరథుడు మిథిలానగరం చేరటం

దశరథ మహారాజు : మంత్రులారా! ధనాధ్యక్షుని అనేక విలువైన రత్నరాసులను, కనక వస్తువాహనాలను తీసుకొని ముందుగా బయలుదేరమనండి. చతురంగ బలాలను సమకూర్చండి. శ్రేష్ఠమైన పల్లకీలను, రథాలను సమకూర్చండి. వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, మార్కండేయ ఋషి, కాత్యాయన ఋషి, బ్రాహ్మణోత్తములతో కూడి ముందుగా బయలుదేరండి.

ఆ విధంగా బ్రాహ్మణోత్తములను వెంటబెట్టుకొని చతురంగ బలాలు వెంటరాగా, నాలుగు రోజులు ప్రయాణం చేసి దశరథ మహారాజు మిథిలానగరాన్ని చేరుకున్నాడు.

జనక మహారాజు : దశరథ మహారాజా! నీకు స్వాగతం. నా భాగ్యవశంచే నిన్ను కలుసుకో గలిగాను. మహాపరాక్రమవంతులైన మీ ఇరువురు కుమారులను కలసి పుత్రాలింగనానందాన్ని పొందండి.

కేవలం భగవత్స్వరూపుడు, మహాతేజశ్శాలీ అయిన వసిష్ఠ మహర్షి బ్రాహ్మణోత్తములతో కూడి, దేవతలతో కూడిన ఇంద్రునివలె, నా అదృష్టం వలన ఇచటకు వచ్చారు.

పరాక్రమవంతులు, శ్రేష్ఠులు, మహాత్ములు అయిన రఘువంశరాజులతో వియ్యమందటంవలన నా పూర్వజన్మల పుణ్యవిశేషంచే నా భాగ్యం పండింది.

ఓ సర్వశ్రేష్ఠుడా! రాజాధిరాజా! దశరథ మహారాజా! రేపు ప్రాతఃకాల యజ్ఞం పూర్తైన పిమ్మట ఋషులకు అంగీకారయోగ్యమైన వివాహాన్ని జరిపిద్దాం.

దశరథ మహారాజు : సర్వధర్మాలూ తెలిసిన ఓ జనక మహారాజా! దానమనేది దాత చేతిలో ఉంటుంది. దాత ఇచ్చినప్పుడే పుచ్చుకొనేవాడి వశమౌతుందని పెద్దలు చెప్పగా విన్నాను.

మీ ఇష్టప్రకారమే జరిపించండి.

సత్యవాదియైన దశరథ మహారాజు పలుకులు విని జనకమహారాజు ఉప్పొంగిపోయాడు.

వివాహానికి వచ్చిన మునీశ్వరులంతా పరస్పరం కలసుకొన్నందుకు ఎంతో సంతోషించారు.

దశరథ మహారాజు పుత్రులిరువురినీ కలుసుకొని మాట్లాడుకుంటూ ఆ రాత్రంతా అక్కడే గడిపాడు.

ధర్మజ్ఞుడైన జనకమహారాజు యజ్ఞానికి సంబంధించిన కర్మలు, వివాహానికి సంబంధించిన పనులను చక్కబెట్టుకుంటూ ఆ రాత్రి అంతా గడిపివేశాడు.

# 70 వ సర్గ సూర్యవంశీయ రాజుల వర్ణనం

జనక మహారాజు : శతానందా! ప్రాతఃకాల కర్మానుష్ఠానాలన్నీ ముగిశాయి కదా! మహా తేజశ్శాలి, ధార్మికుడు అయిన నా సోదరుడు కుశధ్వజుడు సాంకాశ్య నగరంలో నివసిస్తున్నాడు. అతడు నా యజ్ఞం పూర్తి చేయటానికి ఎన్నో విధాలుగా సహాయపడ్డాడు. ఈ వివాహ శుభసమయాన అతడు నా ప్రక్కనే ఉండి నా ఆనందాన్ని పంచుకోవాలని కోరుకుంటున్నాను. కాబట్టి అతివేగంగా వెళ్ళేవారిని వాని వద్దకు పంపు. వెంటనే నా సోదరుడు ఇక్కడకు వచ్చే ఏర్పాట్లు చెయ్యి.

జనక మహారాజు చెప్పగానే శతానందుడు వేగంగా వెళ్ళే దూతలను కుశధ్వజుని నగరానికి పంపాడు. కుశధ్వజుడు దూతలు చెప్పిన వృత్తాంతాన్ని విని, రెక్కలు కట్టుకొని మిథిలానగరానికి వచ్చి జనకుని ముందు వ్రాలాడు.

కుశధ్వజుడు మహాత్ముడైన జనకునికి, శతానందునికి నమస్కారం చేసి రాజులకు ఏర్పాటు చెయ్యబడిన ఆసనంపై కూర్చున్నాడు. మహాతేజశ్శాలురైన జనకమహారాజు, కుశధ్వజుడు, మంత్రులు సంప్రదించుకొని మంత్రులలో శ్రేష్ఠుడైన సుదామనుని దశరథుని వద్దకు పంపారు. దశరథ మహారాజును పుత్రులతో సహా సకల మర్యాదలతో ఆహ్వానించి తీసుకొనిరమ్మన్నారు.

సుదామనుడు : ఓ దశరథ మహారాజా! నేను, నా మహారాజు తరఫున అభినందన తెలియబరచుకొనుచున్నాను. మిథిలాధిపతియైన జనక మహారాజు, మిమ్మల్ని, మీ పుత్రరత్నాలను, పరివారాన్ని సగౌరవంగా ఆహ్వానించి తీసుకొని రమ్మని నన్ను పంపాడు.

అంతట దశరథ మహారాజు తన పరివారంతో కలసి ఆ సుదామనుని వెంట వివాహమందిరానికి వెళ్ళాడు.

దశరథ మహారాజు : జనక మహారాజా! పూజ్యుడైన వసిష్ఠ మహర్షి మాకు పరమపూజ్యులు, దేవతా సమానులు. మా మాటలన్నీ మా పక్షంలో వారే మాట్లాడుతారు. ఇదే మా ఆచారమని మీరెరుగుదురు గదా! విశ్వామిత్ర మహర్షి అనుజ్ఞ పొంది, సకల మహర్షుల సమక్షాన ధర్మాత్ముడైన వసిష్ఠుడు మా వంశంలోని పూర్వీకుల గూర్చి యథాతథంగా చెబుతారు ఆలకించండి.

వసిష్ఠ మహర్షి : జనక మహారాజా! అవ్యక్తం నుండి పుట్టినవాడు, ఎల్లప్పుడూ ఉండేవాడు, నిత్యుడు, వినాశరహితుడు, అయిన బ్రహ్మదేవుని నుండి మరీచి పుట్టాడు. మరీచికి కాశ్యపుడు జన్మించాడు. కాశ్యపునకు సూర్యుడు పుట్టాడు. సూర్యుని కుమారుడు మనువు. ఈ మనువు ప్రజాపతిగా ఉండేవాడు. మనువుకు ఇక్ష్వాకు జన్మించాడు. ఇక్ష్వాకు అయోధ్యకు మొట్టమొదటిరాజు. ఇక్ష్వాకు, కుమారుడు కుక్షి, కుక్షికి వికుక్షుడు అనే పుత్రుడు జన్మించాడు. వికుక్షి పుత్రుడు బాణుడు. బాణుని కుమారుడు అనరణ్యుడు. అనరణ్యునకు పృథువు జన్మించాడు. పృథువు కుమారుడు త్రిశంకువు. త్రిశంకువుకు దుందుమారుడు జన్మించాడు. దుందుమారుని పుత్రుడు యువనాశ్వుడు. ఈతడి కుమారుడు మాంధాత. మాంధాతకు సుసంధి జన్మించాడు. సుసంధికి ధ్రువసంధి, ప్రసేనజిత్ అని ఇరువురు పుత్రులు కలిగారు. ధ్రువసంధి కుమారుడు భరతుడు. భరతునికి అసితుడు అనే కుమారుడు పుట్టాడు.

రాజా! ఈ అసితుడు, హైహయ, తాలజంఘ, శిశుబిందు వంశస్థులతో విరోధం పెట్టుకొని రాజ్యభ్రష్టుడయ్యాడు. కొద్దిపాటి సైన్యాన్ని, మంత్రులను వెంటబెట్టుకొని హిమాలయ ప్రాంతాల్లో భృగుప్రస్రవణమనే ప్రదేశంలో నివసించాడు. అసితునకు ఇద్దరు భార్యలు. ఆ కాలంలో ఇద్దరూ గర్భవతులైన పిమ్మట అసితుడు మరణించాడు. అందులో ఒక రాణి సవతిపై అసూయతో ఆమె గర్భం నష్టమవ్వాలని విషాన్నిచ్చింది. విషప్రయోగం చేయబడినా కూడా, తన గర్భం నష్టము కారాదని, రెండవ రాణి దేవతలనందరినీ ప్రార్థించింది. ఆ ప్రాంతంలోనే నివసిస్తున్న భృగు వంశీయుడైన చ్యవన మహర్షిని దర్శించి ప్రార్థించింది.

చ్యవన మహర్షి : మహాభాగ్యవంతురాలా! మహాబలుడు, మహాతేజోసంపన్నుడు అయిన పుత్రుడు నీ గర్భంలో క్షేమంగా ఉన్నాడు. విషప్రయోగం వల్ల ఆ శిశువుకేమీ నష్టం కలుగదు. అంతేకాదు ఆ బాలుడు విషంతో కలసి జన్మిస్తాడు. దుఃఖింపకు.

పట్టపురాణి, పతివ్రత, భర్త వియోగంచే దుఃఖితురాలైన ఆ రాజమహిషి పండువంటి పుత్రుని కన్నది. ఆ బాలుడు విషంతో కలసి పుట్టడంవల్ల 'సగరుడు' అని పిలువబడ్డాడు.

సగరుని కుమారుడు అసమంజుడు. అతని కుమారుడు అంశుమంతుడు. అంశుమంతుని పుత్రుడు దిలీపుడు. దిలీపుని కుమారుడు భగీరథుడు. భగీరథునకు కకుత్థ్సుడు, అతనికి రఘువు పుట్టారు. రఘువు కుమారుడు మహాతేజశ్శాలియైన ప్రవృద్ధుడు. అతడు వసిష్ఠుని శాపంచే మనుష్య మాంసాన్ని తినేవాడయ్యాడు. ఆగ్రహం చెందిన ప్రవృద్ధుడు వసిష్ఠుని తిరిగి శపించేందుకు చేతిలోనికి నీరు తీసుకున్నాడు. ప్రక్కనే ఉన్న అతడి భార్య వారిస్తూండగా ఆ నీరు అతడి పాదాలపైనే పడ్డాయి. ఆ శాపజలంచే కల్మషం చెందటం చేత 'కల్మాషపాదుడు' అయ్యాడు. ప్రవృద్ధుని కుమారుడు శంఖణుడు. శంఖణుని కుమారుడు మరువు. అతని కుమారుడు ప్రశుశ్రుకుడు. ప్రశుశ్రుకుని కుమారుడు అంబరీషుడు. అంబరీషుని పుత్రుడు నహుషుడు. నహుషుని పుత్రుడు యయాతి. యయాతి కుమారుడు నాభాగుడు. నాభాగుని కుమారుడు అజుడు. ఆ అజుని కుమారుడు దశరథుడు. ఈ దశరథుని కుమారులే ఈ రామలక్ష్మణులు.

ఓ జనక మహారాజా! పరిశుద్ధమైన వంశచరితంగలవారు, పరమ ధార్మికులు, వీరులు, సత్యవాదులు అయిన ఈ ఇక్ష్వాకు వంశీయుల వంశంలో జన్మించిన ఈ రామలక్ష్మణులను నీ కుమార్తెలు వరించుచున్నారు. నీ కుమార్తెలకు అన్ని విధాలా యోగ్యులైన ఈ రామలక్ష్మణులకిచ్చి వివాహం చేయి.

# 71 వ సర్గ జనక మహారాజు వంశ వర్ణనం

జనక మహారాజు : ఓ వసిష్ఠ మహర్షీ! నీకు మంగళమగుగాక! మహామునీ! కన్యాదానం చేసేవారు తమ కులాన్ని గూర్చి చెప్పుకోవాలిగదా! ఇప్పుడు నా వంశం గూర్చి చెబుతాను. వినండి.

ముల్లోకాలందు ప్రసిద్ధుడు, పరమధర్మాత్ముడు, బలశాలురలో శ్రేష్ఠుడు అయిన 'నిమి' అనే చక్రవర్తి ఉండేవాడు. మిథిలా నగరాన్ని నిర్మించిన మిథి చక్రవర్తి నిమి కుమారుడే. ఈయన కుమారుడు మొట్టమొదటి జనకుడు. అతని కుమారుడు ఉదావసువు. ఉదావసువు కుమారుడు ధర్మాత్ముడైన నందివర్ధనుడు. నందివర్ధనుని కుమారుడు సుకేతువు. సుకేతువునకు మహాబలుడైన దేవరాతుడు జన్మించాడు. రాజర్షియైన దేవరాతునకు బృహద్రధుడు జన్మించాడు. బృహద్రధునకు శూరుడు, మహావీరుడయిన సధృతి జన్మించాడు. సధృతి కుమారుడు దుష్టకేతువు. ఈతడికి హర్యశ్వుడు జన్మించాడు. హర్యశ్వునకు మరుడనే పుత్రుడు జన్మించాడు. మరుని పుత్రుడు ప్రతింధకుడు. ప్రతింధకుని కుమారుడు కీర్తిరథ మహారాజు. కీర్తిరథునికి దేవమీఢుడు, అతనికి విబుధుడు జన్మించారు. విబుధినికి మహీధ్రకుడు జన్మించాడు. మహీధ్రకునికి కీర్తిరాతుడనే పుత్రుడు కలిగాడు. రాజర్షియైన కీర్తిరాతునకు మహారోముడు జన్మించాడు. మహారోమునికి స్వర్ణరోముడు, స్వర్ణరోమునకు హ్రస్వరోముడు పుట్టారు. హ్రస్వరోమునకు ఇద్దరు కుమారులు జన్మించారు. వారిలో నేను (జనక మహారాజు) పెద్దవాడిని, రెండవవాడు నా తమ్ముడు కుశధ్వజుడు. మా తండ్రి అయిన హ్రస్వరోమ మహారాజు పెద్దవాడినైన నాకు రాజ్యాభిషేకం చేసి నా తమ్ముడు కుశధ్వజుని పోషణ భారం నాపైనే ఉంచాడు. ఆ పైన తపస్సు చేసుకోవటానికి ఆయన తపోవనాలకు వెళ్ళిపోయాడు. మా తండ్రి స్వర్గస్థుడైన తర్వాత నా తమ్ముడు కుశధ్వజుని స్నేహితునిగా చూసుకొంటూ, ధర్మానుసారం రాజ్యం చేస్తూ వచ్చాను. కొంతకాలానికి సాంకాశ్యపురాన్ని పాలిస్తూ ఉండే పరాక్రమవంతుడైన సుధన్వుడనే రాజు ఒకనాడు మిథిలపైకి దండెత్తి వచ్చాడు. "శ్రేష్ఠమగు శివధనుస్సును, పద్మ

పత్రాక్షి అయిన సీతను నాకు ఇమ్ము" అని కబురు పంపాడు. అందుకు నేను ఒప్పుకోలేదు. అందువల్ల అతడు నా పైన యుద్ధానికి వచ్చాడు. ఆ యుద్ధంలో నేనతణ్ణి వధించాను. ఆ సుధన్వుని సంహరించి, నా తమ్ముడైన కుశధ్వజుని సాంకాశ్యపురానికి రాజ్యాభిషిక్తుణ్ణి చేశాను.

మునిశ్రేష్ఠుడవైన ఓ వసిష్ఠ మహర్షీ! సోదరులలో పెద్దవాడనైన నేను నా పుత్రిక సీతను రామునికిస్తాను. నా తమ్ముడు కుశధ్వజుని కుమార్తె ఊర్మిళను లక్ష్మణున కిస్తాను.

ఓ మహర్షీ! దేవకన్యవంటి నా కుమార్తె సీతను రామునికి, నా రెండవ కుమార్తె అయిన ఊర్మిళను లక్ష్మణునకు ఇచ్చి వివాహం జరిపిస్తానని మూడుసార్లు పలుకుచున్నాను. ఇది సత్యం ఇందులో ఎటువంటి సందేహమూ లేదు.

ఓ దశరథ మహారాజా! ఈ కన్యలిరువురిని రామలక్ష్మణులకు సంతోషంగా ఇచ్చుచున్నాను. మనోవాక్కాయాలు అనే మూడు కరణాల చేత సంతోషంగా ఇచ్చుచున్నాను. ముందుగా రామలక్ష్మణులచేత గోదానం చేయించండి. తరువాత వివాహం జరిపిద్దాం.

# 72 వ సర్గ భరతశత్రుఘ్నులకు మాండవీ, శృతకీర్తులను నిశ్చయించటం

వసిష్ఠ, విశ్వామిత్రులు : రాజా! ఈ వివాహం వల్ల ఇక్ష్వాకు, విదేహ కుటుంబాలు ఒకటయ్యాయి. రెండు వంశాల ఘనతను ఇంత అని చెప్పడం ఎవరి తరమూ కాదు. ఇది ఒక అపురూపమైన కలయిక. ఇక వధూవరులంటావా రాముడికి సీత, లక్ష్మణునికి ఊర్మిళ చాలా చక్కగా కుదిరిపోయారు. వారు ఒకరికోసం మరొకరు పుట్టారా? అన్నంత అపురూపంగా ఉన్నారు.

ఇంతవరకూ అంతా బాగానే ఉంది. నేను, వసిష్ఠుడు కలసి ఒక ఆలోచన చేశాం. అదేమంటే, నీ తమ్ముడు కుశధ్వజుని కుమార్తె లిద్దరూ బంగారు బొమ్మలు. వారిద్దరినీ కూడా భరత శత్రుఘ్నులకు ఇచ్చి వివాహం చేయించు. భరతుడు మహాబుద్ధిశాలి. శత్రుఘ్నుడు అమితమైన పరాక్రమశాలి. అతిరూప సౌందర్యవంతులైన నీ తమ్ముని కుమార్తెలిద్దరినీ వీరికి నిర్ణయిస్తున్నాం. మీ నలుగురు కుమార్తెలు దశరథ మహారాజుకు నలుగురు కోడళ్ళు కావలెనన్నది మా నిర్ణయం. మీ అన్నదమ్ములిద్దిరూ మా మాటను పాటించాలి.

జనక మహారాజా! పుణ్యకర్మ సంజాతులైన నీ వంశమూ, ఇక్ష్వాకు వంశమూ, ఈ వివాహ సంబంధం చేత దృఢమగు గాక!

జనక మహారాజు : మునిశ్రేష్ఠులారా! మీరు స్వయంగా మా కుమార్తెల వివాహాన్ని నిర్ణయించడంతో నా వంశం ధన్యమైనదని తలుస్తాను. మీరు ఆజ్ఞాపించిన విధంగానే నా సోదరుడు కుశధ్వజుని కుమార్తెలు మాండవీ, శృతకీర్తులను భరత, శత్రుఘ్నులకిచ్చి వివాహం చేసేందుకు సంతోషంగా అంగీకరిస్తున్నాం. అది మా పుత్రికల పరమ భాగ్యంగా భావిస్తాను.

మహామునీ! మహాబలశాలురైన నలుగురు సోదరులకూ ఒకే ముహూర్తాన మా

నలుగురు రాజపుత్రికల నిచ్చి వివాహం జరిపిస్తాం. భగుడు ఉత్తరానక్షత్రంలో కూడి ఉండే రోజున వివాహానికి ముహూర్తంగా పెద్దలు నిశ్చయించుచున్నారు. ఎందుకంటే భగుడు సంతానదాత అవడంచే దాంపత్యాలు ఫలప్రదాలు కాగలవు.

ఓ మహర్షులారా! ధర్మకార్యాలు చేస్తూ ఉండటమే మీ నిత్యకృత్యాలు. అందుచే నన్ను తమకు శిష్యునిగా స్వీకరించండి. మీరిరువురు, జనక, దశరథ, కుశధ్వజ సింహాసనాలను యధేచ్ఛగా పరిపాలిస్తూ మాచే సేవలు చేయించుకోవలసినదని సవినయంగా కోరుతున్నాను.

మహర్షులారా! దశరథ మహారాజుకు మిథిలపై సర్వాధికారాలు కలవు. అట్లాగే అయోధ్యపై నాకూ అధికారం ఏర్పడింది.

దశరథ మహారాజు : ఓ జనక మహారాజా! మీ సోదరుల సద్గుణాలను లెక్కించడం జగత్తులో ఎవరికీ సాధ్యం కాదు. మీరు అనేకమంది రాజులను, ఋషులను పూజించి వారి సద్గుణాలన్నీ అలవర్చుకున్నారు.

నేను నా నివాసానికి వెళ్ళుచున్నాను. నాందీముఖాది కర్మలను పూర్తి చేయిస్తాను. మీరు సుఖశాంతులతో ఉండాలి.

మరునాడు దశరథ మహారాజు ఉదయానే లేచి స్నాతకవ్రతం జరిపించాడు. ఒక్కొక్క పుత్రుని పేర లక్ష గోవులను బ్రాహ్మణులకు దానం చేశాడు.

# 73 వ సర్గ శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల వివాహం

దశరథ మహారాజు పుత్రుల కొరకై గోదాన వ్రతాన్ని చేయించాడు. ఇంతలో కైకేయ మహారాజు కుమారుడు, భరతుని మేనమామ అయిన యూధాజిత్తు వచ్చాడు.

యూధాజిత్తు : మహారాజా! మా నాయనగారు మీ క్షేమసమాచారాన్ని విచారించి రమ్మని నన్ను పంపారు. అక్కడ మేము, మా పరివారం అంతా క్షేమమే. ముఖ్యంగా మనుమడైన భరతుని క్షేమం తెలుసుకొని రమ్మన్నారు. అందుకొరకు అయోధ్యకు వెళ్ళాను. మీరంతా వివాహానికై ఇక్కడ ఉన్నారని తెలిసింది. వెంటనే బయలుదేరి వచ్చాను.

అంతట దశరథ మహారాజు తన ప్రియాతిప్రియమైన అతిథికి ఉచితరీతిన గౌరవమర్యాదలు చేశాడు. రాత్రంతా కులాసా కబుర్లతో గడిపారు. ఉదయానే దశరథుడు తన పుత్రులందరినీ, వెంటబెట్టుకొని, వసిష్ఠాది మహర్షులు ముందు నడువగా యజ్ఞవాటికకు బయలుదేరాడు. జనక మహారాజు వచ్చి దశరథుని ప్రక్కనే కూర్చున్నాడు.

రాముడు, సోదరులంతా కలసి చక్కగా అలంకరించుకొని తండ్రి వద్దకు వచ్చారు.

వసిష్ఠ మహర్షి : ఓ జనక మహారాజా! దశరథ మహారాజు తన పుత్రులతో వివాహానికై తరలివచ్చారు. కన్యాదాత కొరకు ఎదురు చూస్తున్నారు. ఇప్పుడు నీవు నీ ధర్మాన్ని నెరవేర్చాలి.

జనక మహారాజు (మందహాసం చేస్తూ) : మహర్షీ! దశరథ మహారాజుకు ఇక్కడ అడ్డు ఏమైనా ఉన్నదా? ద్వారపాలకులు ఆయన్ను అడ్డగిస్తున్నారా? నేనూ, నా రాజ్యం అంతా ఆయన సేవలో ఉన్నాం. కాబట్టి మేమే ఆయన ఆజ్ఞలకై ఎదురుచూస్తూ ఉంటాం.

ఓ వసిష్ఠ మహర్షీ! ఇక తామే పూనుకొని వివాహ కర్మలన్నీ చేయించమని కోరుచున్నాను.

అంతట వసిష్ఠ, విశ్వామిత్ర, శతానందులు అందరినీ వివాహ మంటపానికి తీసుకొని వెళ్ళారు. అచట అప్పటికే గంధపుష్పములు, బంగారు పాలికలు, అంకురములు గల రంధ్రములతో కూడిన కలశాలు, అంకురములు కట్టిన మూకుళ్ళు, ధూపాన్ని వెదజల్లే ధూప పాత్రలు, శంఖాకారంలో ఉండే పాత్రలు, ఇంకా అనేక రకాలైన పాత్రలు, అక్షితలు సిద్ధంగా ఉన్నాయి.

మహా తేజశ్శాలియైన వసిష్ఠుడు యథాశాస్త్రోక్తంగా, మంత్రపూర్వకంగా, సమములైన దర్భల్ని పరచి అగ్నిలో హోమం చేశాడు.

శ్రీ సీతారాముల కళ్యాణం

జనక మహారాజు : (సర్వాలంకార భూషితయగు సీతను తీసుకొని వచ్చి రాముని ఎదుటగా నిలబెట్టాడు). ఓ రామా! ఈమె నా కుమార్తె సీత. ఈమె నీకు సహధర్మచారిణి కాగలదు. ఈమెను స్వీకరింపు. నీ హస్తమును ఆమె హస్తముపై ఉంచి పట్టుకొనుము. మహా భాగ్యవంతురాలగు ఈమె పతివ్రతయై నీడ వలె ఎల్లవేళలా నిన్ను అనుసరిస్తుంది. ఈ మంత్రపూర్వకమైన జలాన్ని మీ ఉభయులపైనా అభిషేకించుచున్నాను.

ఆ వివాహాన్ని ఆకాశాన్నుండే దేవతలంతా వీక్షించారు. ఆనందంతో నృత్యగీతాలు పాడారు. పుష్పవర్షం కురిపించారు.

తరువాత, ఓ లక్ష్మణా! నీకు క్షేమమగుగాక! ఈమె నా కుమార్తె ఊర్మిళ. ఈమెను నీ ధర్మపత్నిగా స్వీకరింపు. ఈమె చేతిని నీ చేతిలోకి తీసుకో.

పిమ్మట, ఓ భరతుడా! నీకు క్షేమమగుగాక. ఈమె నా కుమార్తె మాండవి. నీ హస్తంతో ఈమె హస్తమును స్వీకరించు.

పిమ్మట, ఓ శత్రుఘ్నుడా! ఈమె నా కుమార్తె శృతకీర్తి. నీ హస్తంతో ఈమె హస్తాన్ని

స్వీకరింపు. ఈ క్షణం నుండి ఈమె నీ ధర్మపత్ని.

జనకుని మాటలు విన్న రామలక్ష్మణ భరతశతృఘ్నులు నలుగురూ, వసిష్ఠుని అనుమతి పొంది వారి హస్తములను స్వీకరించారు. తరువాత వారందరూ భార్యాసమేతులై అగ్నికి, వేదికకు, దశరథ మహారాజుకు, జనక మహారాజుకు, వసిష్ఠ, విశ్వామిత్ర, శతానందాది ఋషులకు మూడు పర్యాయాలు ప్రదక్షిణ చేశారు. యథాశాస్త్రోక్తంగా వివాహాలయ్యాయి. రామలక్ష్మణ భరత శత్రఘ్నులు, సీతా, ఊర్మిళ, మాండవి, శృతకీర్తుల పాణిగ్రహణం చేయగానే దేవతలంతా ఎడతెరిపి లేకుండా పుష్పవర్షాన్ని కురిపించారు. దేవగంధర్వ కిన్నెర కింపురుషాదులు దుందుభులు మ్రోగించారు. గీతము లాలపించారు. నాట్యం చేశారు. ఆకాశమంతా దేదీప్యమానంగా వెలిగిపోతూ ఎన్నడూ కనీ వినీ ఎరుగని ఒక అద్భుత దృశ్యమైంది.

రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు నూతన వధువులను చేయి పుచ్చుకొని మెల్లగా నడిపించుకుంటూ విడిది గృహానికి బయలుదేరారు. దశరథ మహారాజు, జనక మహారాజు, కుశధ్వజుడు, వసిష్ఠ, విశ్వామిత్ర, శతానందాది ఋషిపుంగవులంతా వారిని అనుసరించారు.

# 74 వ సర్గ నూతన వధూవరులకు జనకుని వీడుకోలు

రాత్రంతా ఒక్క క్షణంలా గడచిపోయింది. ఎవరూ కునుకు తీయలేదు. తెల్లవారింది. అనుష్ఠానాలన్నీ ముగిశాయి. విశ్వామిత్రుడు వధూవరులను ఆశీర్వదించి హిమాలయాలకు తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోయాడు.

అంతట దశరథ మహారాజు కూడా జనకాదుల వద్ద సెలవు తీసుకొని అయోధ్యకు బయలుదేరాడు. జనక మహారాజు తన కుమార్తెలకు లక్షలకొద్దీ ఆవులను, శ్రేష్ఠమైన కంబళీలు, కోట్లకొద్దీ పట్టువస్త్రాలను, ఏనుగులు, అశ్వాలు, రథాలు, చతురంగ సైన్యాన్ని, శ్రేష్ఠలైన దాసీలను, వెండి, బంగారు ఆభరణాలను విలువైన రత్నాలను కానుకగా సమర్పించాడు.

జనకాది బంధువులంతా దశరథుని పరివారాన్ని చాలా దూరం అనుసరించి సాగనంపి తిరిగి ఇళ్ళకు చేరారు.

దశరథుడు, రామలక్ష్మణ భరత శత్రఘ్నులతో కలసి ప్రయాణం చేస్తూ ఉండగా పక్షులు భయంతో వికృతమైన ధ్వనులు చేశాయి. జంతువులన్నీ ప్రదక్షిణలు చేస్తున్నాయి. దశరథుడు ఇవన్నీ దుశ్శకునాలని తలచి తన మనస్సు ఏదో కీడు శంకిస్తున్నదని వసిష్ఠునితో అన్నాడు.

వసిష్ఠ మహర్షి : మహారాజా! ఆకస్మికంగాను, దైవికంగాను, భయంకరమైన ఆపదలు ఏవైనా సంభవించేటప్పుడు పక్షులు ముందుగా పసిగట్టి భయంకరంగా అరుస్తాయి. అయితే భయపడవలసిన పనిలేదు. మృగాలన్నీ ప్రదక్షిణలు చేస్తున్నాయి. ఆ ప్రమాదాలేమీ మనల్ని బాధించేవి కావు.

వసిష్ఠ మహర్షి ఈ విధంగా దశరథ మహారాజుకు ధైర్యం చెప్తూ ఉండగానే భూమి కంపించింది. పెనుగాలులు వీచి వృక్షాలన్నీ వ్రేళ్ళతో సహా పెకలించివేయబడ్డాయి. మేఘాలు సూర్యుణ్ణి ఆవరించి నలుదిక్కులా చీకట్లు కమ్మాయి. సైనికులు మూర్ఛపొందారు. వసిష్ఠాది

మహర్షులు, దశరథుడు, దశరథుని కుమారులు మాత్రం ఏమాత్రం కలత చెందకుండా నిబ్బరంగా నిలబడ్డారు.

హఠాత్తుగా మహా తపస్వి, భయంకరుడు, రాజుల పాలిట యముడు అయిన పరశురాముడు వారి ఎదుట ప్రత్యక్షమయ్యాడు. ఆ తేజస్సును చూడలేక సామాన్యుల కళ్ళు మూతలుపడ్డాయి. గండ్రగొడ్డలి భుజాన వేలాడుతోంది. ధనుర్బాణాలు ధరించి అపరశివుని వలె కనిపించాడు. తన తండ్రిని (కార్తవీర్యార్జునుడు) చంపటం వలన ఇతడు క్షత్రియులందరినీ శత్రువులుగా భావించాడు. భూమిపై క్షత్రియులను లేకుండా చేస్తానని దీక్ష పూనాడు. ఇప్పుడు కూడా క్షత్రియ నాశనమునకే వచ్చాడా? అని అనుకుంటూ మహర్షులంతా ఆతడికి అర్ఘ్యపాద్యాదులనిచ్చి "ఓ రామా! పరశురామా!" అంటూ మృదుమధురంగా స్తుతించారు. ఋషీశ్వరుల పూజలను గ్రహించిన పరశురాముడు, రామునితో ఇట్లా అన్నాడు.

# 75 వ సర్గ పరశురాముడు, రామునికి సవాలు విసరడం

పరశురాముడు : రామా! నీవు గొప్ప పరాక్రమవంతుడవని విన్నాను. శివధనుస్సును విరిచావట గదా! అది చాలా గొప్ప విషయమే. ఆశ్చర్యాన్ని కూడా కలిగిస్తోంది. అయితే నీ శక్తి పరాక్రమాలేమిటో స్వయంగా చూడాలని ఒక ధనుస్సును తీసుకొచ్చాను. ఇది నాకు జమదగ్ని నుండి సంక్రమించింది. దీన్ని ఎక్కుపెట్టి బాణం వేస్తే, నేను కూడా నీ పరాక్రమాన్ని మెచ్చుకొని నీతో ద్వంద్వయుద్ధానికి అంగీకరిస్తాను. ఎందుకంటే లోకంలో ఇద్దరు రాముళ్ళు ఉండకూడదు. రాముడో, పరశురాముడో ఎవరో ఒక్కరే ఉండాలి.

దశరథ మహారాజు (దీనుడై, వాడిపోయిన ముఖం పెట్టుకొని) : ఓ రామా! క్షత్రియులపై కోపాన్ని తొలగించుకొని చాలాకాలంగా శాంతంగా ఉంటున్నావు గదా? ఉన్నట్లుండి పసిబాలురైన నా కుమారులపై ఎందుకు కోపం ప్రదర్శిస్తున్నావు? నువ్వు భృగువంశీయ బ్రాహ్మణుడవు. దేవేంద్రుని ముందు శపథం చేసి అస్త్రసన్యాసం చేశావు. ఈ భూమినంతా కాశ్యపునికి దానం చేసి గొప్ప ధార్మికుడవై, మహేంద్ర పర్వతంపైన తపస్సు చేసుకుంటున్నావు గదా!

ఓ మహామునీ! ఈ రోజు అకారణంగా మా అందరిపైనా ఎందుకు కోపగించుకుంటున్నావు. మా వినాశాన్ని కోరివచ్చావా? రాముడు మరణించిన మేమందరమూ మరణిస్తాం. నా కుమారులకు అభయమిమ్ము. నా కోరిక మన్నించు.

పరశురాముడు : ఓ రామా! నీవు నరశ్రేష్ఠుడవైతే, ఇచట రెండు ధనుస్సులు ఉన్నాయి. అవి బహుశ్రేష్ఠమైనవి. వాటిని విశ్వకర్మ నిర్మించాడు. ఇవి దేవలోకానికి చెందినవి. అందులో ఒకటి త్రిపుర వినాశానికి దేవతలు శివునికిచ్చారు. దానిని నీవు విరిచావు. ఇక రెండవది. దేవతలు విష్ణువు కిచ్చారు. ఈ విష్ణు ధనుస్సు కూడా అతి పవిత్రమైనది, దృఢమైనది.

దేవతలందరూ శివ, విష్ణుల బలాబలాలు తెలుసుకోగోరి బ్రహ్మను అడిగారు. అప్పుడు బ్రహ్మ వారిద్దరికీ మిథ్యావైరం కల్పించాడు. వారిరువురూ ఒకరి నొకరు జయించాలనే పట్టుదలతో భయంకరంగా పోరాడారు. విష్ణువు తన శక్తినంతా కూడగట్టుకొని ఒక్క హూంకారం చేశాడు. దాంతో శివధనుస్సు జడమైపోయింది. దాంతోపాటు లోకాలన్నీ చైతన్యాన్ని కోల్పోయి జడమయ్యాయి. ఆ విపరీత పరిణామానికి, దేవతలు, ఋషులు, చారణులు తల్లడిల్లిపోయారు. బ్రహ్మాది దేవతలంతా వచ్చి ప్రార్థించగా వారివురూ శాంతించారు. శివధనుస్సు జడమై పోవటం వలన విష్ణుశక్తియే గొప్పదని తీర్మానించారు. కోపించిన శివభగవానుడు, జడమైపోయిన శివధనుస్సును రాజర్షియైన దేవరాతునకిచ్చాడు.

ఓ రామా! ఈ ధనుస్సు శత్రు వినాశకరమైనది. విష్ణువు, భృగు వంశానికి చెందిన ఋచీకునకు న్యాసంగా ఇచ్చాడు. మహాత్ముడూ, కర్మ మార్గావలంబీ అయిన ఆ ఋచీకుడు నా తండ్రి అయిన జమదగ్నికి ఇచ్చాడు. మహాతపస్సంపన్నుడైన నా తండ్రి నిరాయుధుడుగా ఉన్నప్పుడు కార్తవీర్యార్జునుడు నా తండ్రిని చంపాడు.

దారుణంగా, అతికిరాతకంగా నా తండ్రిని చంపిన క్రోధంతో నేను అనేక పర్యాయాలు క్షత్రియ జాతియందు పుట్టిన ప్రతివాణ్ణి చంపుతూ వచ్చాను. ఈ భూమినంతా జయించాను. చివరకు మహాత్ముడైన కాశ్యపునకు ఈ భూమినంతా దానం చేశాను. పిదప మహేంద్ర పర్వతానికి పోయి తపస్సు చేసుకుంటున్నాను.

పరాక్రమవంతుడవైన ఓ రామా! ఇప్పుడు నీవు శివధనుస్సును విరిచావని తెలిసింది. అందుకే వేగంగా నిన్ను చూచేందుకు వచ్చాను. క్షత్రియుడవైతే, క్షత్రియ ధర్మాన్ని పాటించి శ్రేష్ఠమైన ఈ విష్ణు ధనుస్సును స్వీకరించు. నారి సంధించు. బాణము నెక్కుపెట్టు. అట్లా చెయ్యగలిగితే నీతో ద్వంద్వయుద్ధం చేస్తాను.

## 76 వ సర్గ శ్రీరాముడు వైష్ణవ ధనుస్సును సంధించటం

రాముడు : పరశురామా! నీవు నా తండ్రితో పలికిన పలుకులన్నింటిని విన్నాను. నువ్వు స్వధర్మాన్ని పాటిస్తూ పితృఋణాన్ని తీర్చుకోవడం ఎంతైనా మెచ్చుకోదగ్గ విషయమే! అయినా, నన్ను పరాక్రమం లేని వాడిగా చులకన చేయడం, అవమానించడం నేను సహించను. ఇదుగో నా తేజస్సును, పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్నా. చూడు.

ఇదుగో నువ్వు చూపిన ఈ విష్ణు ధనుస్సును చేత పట్టి నారి సంధించి బాణం ప్రయోగించేందుకు సిద్ధంగా ఉన్నాను.

ఓ పరశురామా! నీవు బ్రాహ్మణుడవయిపోయావు. అందునా, నా గురువరేణ్యులైన విశ్వామిత్రునికి బంధువవడం చేత నేను సంధించిన బాణాన్ని నీపై ప్రయోగించి నీ ప్రాణం తీయజాలను. (పరశురాముని తండ్రియైన జమదగ్ని విశ్వామిత్రుని సోదరియగు సత్యవతి కుమారుడు)

ఓ రామా! ఎక్కుపెట్టిన విష్ణు బాణం వ్యర్థం కారాదు. చెప్పు! నీ గమన శక్తిని కొట్టమంటావా? లేక నీవు ఇంతవరకు పుణ్యకర్మలచే సంపాదించుకొనిన సాటిలేని ఉత్తమ లోకాలను కొట్టమంటావా? నిర్ణయం నీకే వదలుతున్నాను.

రాముడు శ్రేష్ఠమైన ఆ ధనుస్సును ఎక్కుపెట్టగానే పరశురాముని తేజస్సు అంతా నిర్వీర్యమయింది. లోకమంతా స్తంభించిపోయింది.

పరశురాముడు : ఓ రామా! పూర్వం నేను భూమినంతా కాశ్యపునికి ఇచ్చినప్పుడు, నన్ను ఈ దేశం విడిచి వెళ్ళిపొమ్మన్నాడు. అప్పటి నుండి నేను మహేంద్ర పర్వతంపై నివసిస్తున్నాను. రాత్రి సమయమందు భూమిపై ఉండకూడదు. చీకటి పడబోతోంది. నేను వెంటనే భూమిని వదలి మహేంద్ర పర్వతానికి చేరుకోవాలి. కనుక నా వేగాన్ని (పాదగతిని) కొట్టవద్దు.

మనోవేగం చేత క్షణాల్లో మహేంద్ర పర్వతాన్ని చేరుకుంటాను.

కాబట్టి ఓ రామా! నేను తపస్సు చేత సంపాదించిన ఉత్తమలోకాలను నీ బాణంతో కొట్టు. ఆలస్యం చెయ్యకు. ఎప్పుడైతే నీవా ధనుస్సును, ఎక్కుపెట్టి బాణాన్ని సంధించావో అప్పుడే నీవు సాక్షాత్తూ విష్ణువేనని గ్రహించాను. నీకు మంగళమగుగాక! ఓ రామా! నీవు చేసే పనులకు ఎవరూ సాటిరారు. నీ పరాక్రమాన్ని ఆకాశం నుండి దేవతలంతా చూస్తున్నారు.

ఓ రామా! ముల్లోకాలకు ప్రభువైన నీ చేతిలో ఓడిపోవడం వల్ల నేను సిగ్గుపడటం లేదు. నీవు వెంటనే బాణాన్ని ప్రయోగింపు. నీవు బాణం విడిచిన పిదప నేను మహేంద్ర పర్వతానికి వెళతాను.

పరశురాముడు అన్నమాటలు విని రాముడు బాణాన్ని విడిచాడు.

తాను తపస్సుచే సంపాదించుకొన్న పుణ్యలోకాలను రాముడు బాణంతో కొట్టగా, వెంటనే పరశురాముడు మహేంద్రగిరి పర్వతంపైకి వెళ్ళిపోయాడు.

వెంటనే నలుదిక్కులనూ క్రమ్ముకొన్న చీకటులు తొలగిపోయాయి. దేవతలు ఆకాశం నుండి హర్షధ్వానాలు చేస్తూ పుష్పవర్షం కురిపించారు.

# 77 వ సర్గ దశరథుడు అయోధ్యకు చేరటం

పరశురాముడు వెళ్ళగానే రాముడు విష్ణుధనుస్సును, బాణాలను వరుణదేవునికి సమర్పించాడు. దశరథునికి వసిష్ఠాది మహర్షులకు నమస్కరించి తండ్రిని వ్యాకులపాటు చెందవలదని ఊరడించాడు.

రాముడు : తండ్రీ! పరశురాముడు వెళ్లిపోయాడు. ఇక నీవు ఆతడిని గూర్చి చింతించటం మాను. మనమందరమూ అయోధ్యకు పోదాం. వానచినుకులకు ఎదురు చూచే చాతక పక్షులవలె సైన్యమంతా నీ ఆజ్ఞలకై వేచి ఉంది. వారందరికీ అయోధ్య వైపు ప్రయాణానికి అనుమతి ఇవ్వు.

రాముని మాటలు విన్న దశరథుడు బాహ్యస్మృతిని పొందాడు. పుత్రుని ప్రేమానురాగాలతో కౌగలించుకున్నాడు. ఆయనకంతా ఒక కలలాగా అనిపించింది. రాముడు పునర్జన్మ ఎత్తినట్లుగా ఆనందపడిపోయాడు.

దశరథుని పరివారమంతా అయోధ్యానగరం చేరుకున్నారు. నగర వీధులన్నీ నీళ్ళుచల్లి, వీథి వీథికీ తోరణాలు కట్టారు. ప్రజలంతా ఆనందోత్సాహాలతో నాట్యం చేశారు. మంగళవాద్యాలెన్నో మోగించారు. ప్రజలు, మంత్రులు ఎదురు వచ్చి స్వాగత వచనాలు పలికారు.

వారంతా అంతఃపురానికి చేరుకున్నారు. కౌసల్య, సుమిత్ర, కైకేయిలు ఎదురువచ్చి సీత, ఊర్మిళ, మాండవీ, శృతకీర్తులను అనురాగంతో అక్కున చేర్చుకొన్నారు. నూతన వధువులందరూ గృహ ఇలవేల్పులను భక్తితో పూజించారు. తరువాత బ్రాహ్మణులకు గోవులను, ధనధాన్యాలను దానం చేశారు. వారందరూ భర్తలతో చేరి ఏకాంతంలో ఆనందంగా గడిపారు. రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు తల్లిదండ్రులకు సేవలు చేస్తూ వారిని ఆనందపరచసాగారు.

ఇలా కొంతకాలము గడచిపోయింది.

దశరథుడు : కుమారా! భరతా! నీ తాతగారు కేకయ మహారాజు నిన్ను చూడవలెనని ముచ్చటపడుచున్నారట. నిన్ను వారి వద్దకు తీసుకొని వెళ్ళేందుకు నీ మేనమామ యుధాజిత్తు మిథిలానగరానికి వచ్చి నన్నా విధంగా ప్రార్థించాడు. నాయనా! నీవు వారితో వెళ్ళి వారికి ఆనందం కలిగించు.

అంతట భరతుడు తండ్రి చెప్పినట్లు మేనమామతో కలసి కేకయ మహారాజును చూసేందుకు శత్రుఘ్నునితో కలసి వెళ్ళే ముందుగా తండ్రిని తల్లులను రామలక్ష్మణులను కౌగలించుకొని వారి వద్ద సెలవు తీసుకొనివెళ్లాడు.

భరతుడు వెళ్ళిన తర్వాత రామలక్ష్మణులు తల్లిదండ్రులకు సేవలు చేస్తూ వారిని ఆనందపరచసాగారు. తండ్రితోపాటు రాచకార్యాలందు సహాయం చేస్తూ, ప్రజాహితులై ప్రజల మన్నలను అందుకొంటూ తల్లులకు, తండ్రికి, గురువులకు ఇంకా ఇతర పెద్దలందరికీ సమయోచితంగా సేవలు చేస్తూ తలలో నాలుకై మెలగసాగారు.

రాముడి మనస్సు ఎప్పుడూ సీత మీదనే ఉండేది. ఆమె సౌజన్యం, సౌందర్యం, సౌశీల్యం వంటి సద్గుణాలన్నీ రాముని ఆకట్టుకున్నాయి. సీతకు కూడా ఎల్లవేళలా మనస్సు రాముని యందే ఉండేది. తాను శివధనుస్సును విరిచి వైదేహీయుల మనస్సు దోచుకున్నా, దశరథుడు వచ్చి తన అంగీకారం తెలిపేవరకు రాముడు, సీతను గూర్చి ఆలోచించనైనా లేదు. తండ్రి అంగీకరించిన సంబంధమవటంచే అతడికి సీతపై మక్కువ వృద్ధి చెందింది. తండ్రి అంగీకరించి చేసిన సంబంధ మవటం వలనా, ఆమె రూప గుణానురాగముల చేతా రాముని కామె యందు అనురాగం వృద్ధి చెందినది. కాని సీత మాత్రం రాముడు తన భర్త అన్న ఒక్క కారణం చేత రాముని ప్రేమిస్తూ ఉండేది. ఒకరికొకరు వారి హృదయాల్లో ఉండే భావాలను సునాయాసంగా గ్రహిస్తూ, ఆ విధంగా నడచుకుంటూ ఉండేవారు. సీతపై రామునికుండే ప్రేమకంటే సీతకు

రామునిపై ప్రేమ రెట్టింపు ఉండేది. వారి ప్రేమానురాగాలను కొలిచే సాధనాలు గాని, ఇంత అని చెప్పగలిగేవారు గాని, భూమండలంలో ఎవరూ లేదు. వారు ఆ విధంగా చాలాకాలం లక్ష్మీదేవితో కూడిన విష్ణుమూర్తివలె ప్రకాశించసాగారు.



# అయోధ్యకాండము



## 1వ సర్గ రాముని గుణగణాలు

భరతశత్రుఘ్ను లిద్దరూ మేనమామతోపాటు గిరివ్రజపురానికి వెళ్ళారు. అక్కడ మేనమామ వారికి ఏ కొరతా రాకుండా కన్నబిడ్డల్లా అల్లారుముద్దుగా చూచుకోసాగాడు. అక్కడ ఆనందంగా కాలక్షేపం చేస్తున్నా కూడా, వాళ్ల మనస్సులు వృద్ధుడైన తండ్రిపైన, ప్రేమపాత్రుడైన రాముడి పైనే ఉన్నవి.

దశరథ మహారాజుకు నలుగురు కుమారులు నాలుగు భుజాలవంటివారు. అందరిపట్లా సమానమైన ప్రేమతో మెలగేవాడు. విష్ణుభగవానుడు ప్రాణులన్నిటి పట్లా సమాన ప్రేమ కలిగి ఉన్నా, బ్రహ్మపట్ల విశేష ప్రేమ కలిగి ఉంటాడట. అట్లాగే దశరథుడు కూడా నలుగురు పుత్రుల పట్లా సమానమైన ప్రేమ కలిగి ఉన్నా రాముడంటే ప్రాణం. ఎందుకంటే ఆతడు రావణ సంహారానికై మానవ రూపంతో వచ్చిన విష్ణుభగవానుడే గదా! రాముని చూసుకొని కౌసల్యాదేవి కూడా ఇంద్రుని చూసుకొని మురిసిపోయే అదితి లాగా మురిసిపోయేది.

రాముని గుణగణాలు వర్ణించి చెప్పడం ఎవరి వల్ల సాధ్యపడుతుంది? తండ్రి వలెనే పరాక్రమవంతుడు, అందగాడు, అసూయ లేనివాడు. మృదువుగాను, మధురంగాను మాట్లాడతాడు. పరుషంగా మాట్లాడటం తనకు చేతకాకపోగా, ఎవరైనా మాట్లాడినా బదులు చెప్పేవాడు కాడు.

రాముడిది ఎంత మంచి మనసంటే, ఏ పాటి చిన్న ఉపకారానికైనా పొంగిపోయేవాడు.

ఎంత పెద్ద తప్పుచేసిన వాడినైనా పెద్ద మనస్సుతో క్షమించేవాడు. అందువల్ల ఆతడి ముఖం ఎప్పుడూ చంద్రుని వెన్నెలలాగా చల్లగా ఉంటూ చూసేవారికి ఆహ్లాదాన్ని కలిగిస్తూ ఉంటుంది.

విలువిద్యలు నేర్చుకుంటూ, విరామ సమయాల్లో, వయస్సులో పెద్దవారిని, గుణశీలురైన వారితో కలసి కూర్చుని సదాచారాల గురించీ, పరంపరాగత సత్సంప్రదాయాల గురించీ చర్చించేవాడు. అట్లాగే జ్ఞానవృద్ధులతో కూర్చుని వేదాంత రహస్యాలను గూర్చి అడిగి తెలుసుకునేవాడు.

రాముడు వినయ సంపన్నుడు. ఎవరైనా ఎదురు పడితే ముందుగా తానే పలకరించి మాట్లాడేవాడు. తను ఎంతటి పరాక్రమశాలి అయినా, తన పరాక్రమాన్ని చూసుకొని గర్వపడే వాడు కాదు.

రాముడికి అన్ని విషయాల్లోనూ విశేష జ్ఞానమున్నది. పెద్దలను ఎల్లప్పుడూ పూజించి గౌరవించే వాడు. ఎల్లప్పుడూ సత్యాన్నే మాట్లాడేవాడు. తాను ప్రజలనెంతగా ప్రేమించే వాడో, ప్రజలాతడిని అంతకు నూరురెట్లు అధికంగా ప్రేమించే వారు.

రాముడు దీనుల పట్ల దయ కలిగి ఉండేవాడు. బ్రాహ్మణులను పూజించేవాడు.ధర్మాలన్నీ తెలిసినవాడు. కోపమన్నదే ఎరుగని వాడు. పరిశుద్ధమైన ప్రవర్తన కలిగిన వాడు.

క్షత్రియ ధర్మాన్ని ఆచరించడంలో, పరిరక్షించడంలో అత్యంత ఆదరం చూపేవాడు. ఆ విధంగా క్షత్రియ ధర్మాన్ని పరిరక్షించడం వల్లనే యశస్సు, స్వర్గం, సౌఖ్యాలు సమకూరుతాయని నమ్మిన వాడు.

యుక్తిగాను, చక్కగాను మాట్లాడటంలో బృహస్పతి వంటి పాండిత్యం కలిగినవాడు. సారంలేని మాటలంటే ఇష్టపడేవాడు కాదు. ధర్మబద్ధంకాని, శ్రేయస్కరం కాని పనుల జోలికి పోయేవాడు కాదు. మంచి వాక్చాతుర్యం కలవాడు.

రాముడు అందమైన దేహం కలిగినవాడు. ఏ విధమైన రుగ్మతలూ ఆతడి సమీపానికి కూడా పోయేవి కావు. ఎప్పుడు, ఏ పని, ఏ విధంగా చేసి సఫలీకృతుడు కావాలో బాగా తెలిసినవాడు. ఎదుటివారి సత్తాని అంచనా వేయడంలో దిట్ట. లోకంలో జన్మించిన ఏకైక సత్పురుషుడు. ఇన్ని శ్రేష్ఠమైన గుణాలు కలిగిన రాముడంటే ప్రజలందరికీ అమితమైన ప్రేమ. వారందరికీ ఆయన ఆరవ ప్రాణంగా మెలగేవాడు.

రాముడు సాంగ, వేదవిద్య లన్నింటిలోను నిష్ణాతుడై, ధనుర్విద్యయందు తండ్రి దశరథుణ్ణే మించిపోయాడు. ధర్మార్థకామాల యథార్థ స్వరూపాన్ని ఎరిగిన వాడు. శాస్త్రాల సముదాయంలో చెప్పబడిన అర్థాలన్నిటినీ ఒకదానికొకటి చక్కగా సమన్వయపరచడంలో గొప్ప ప్రావీణ్యాన్ని సముపార్జించాడు. ధర్మానికి అర్థం వివరించాల్సి వచ్చినప్పుడు తగిన జాగ్రత్తలన్నీ తీసుకొని ఆ తరువాతే భోగాలనుభవించేవాడు.

రామునికి అర్థశాస్త్రం చక్కగా తెలుసు. సంపాదించిన ధనాన్ని అయిదు విధాలుగా విభజించేవాడు (1. ధర్మానికి, 2. కీర్తి కొరకు, 3. లౌకిక వ్యవహారాలకు, 4. ఇహానికి 5. పరానికి) సంగీత, నృత్య, సాహిత్యాలను వినోదించటంలో నేర్పుగలవాడు.

రాముడు లోకంలోని ధనుర్వేద వేత్తలలో శ్రేష్ఠుడు. గుర్రాలను, ఏనుగులను లొంగ తీసుకొని సేనలను నడపడంలో నైపుణ్యం గలవాడు. అతిరథులందరి మెప్పు పొందినవాడు. ఆ నైపుణ్యంతో శత్రుసేనలను నాశనం చేసేవాడు.

రాముడు అసూయను, క్రోధాన్ని జయించాడు. (ఇతరుల గుణాలందు దోషాల నెంచటాన్ని అసూయ అంటారు. ఇతరుల ఉన్నతిని చూసి ఓర్వలేకపోవటాన్ని మత్సరం అంటారు) ఏ ప్రాణినీ అవమానించకుండా, సందర్భాన్ని బట్టి సర్దుకు పోయేవాడు.

రాముడు సహనంలో భూమితో పోల్చదగినవాడు. బుద్ధిలో బృహస్పతితోను, పరాక్రమంలో ఇంద్రునితోను సమానుడు.

దశరథుడు ఇలా తలచాడు: నా రాముడు పరాక్రమంలో దేవేంద్రునితోను, యమునితోను పోల్చదగినవాడు. బుద్ధియందు బృహస్పతితో సమానుడు. ధైర్యంలో పర్వతంతో పోల్చదగినవాడు. నాకన్నా అధిక పరాక్రమశాలి.

ప్రజల అభివృద్ధిని కోరుతూ, ప్రజలందరి మన్ననలను పొందినవాడు. ప్రజలు నా కంటే ఎక్కువగా రాముణ్ణి ప్రేమిస్తున్నారు. అలాంటి నా రామునికి రాజ్యాభిషేకం చేయాలని నా మనస్సు తహతహలాడుతున్నది. అంతేకాదు రాముడు ప్రభువు కావాలని భూదేవియే కోరుకొంటున్నది.

అలాంటి నా కుమారుడు ఈ భూమండలాన్నంతా పరిపాలించడం నా జీవిత కాలంలో చూసి, స్వర్గానికి పోగలనా? నా రామునిలో నేనింతవరకు తలచినవే కాక ఇంకా అనేక శుభగుణాలు ఉన్నవి. అట్టి లోకోత్తరుడైన రాముణ్ణి యువరాజును చేయాలి. మంత్రులందరిని సంప్రదించి రాముని రాజ్యాభిషేకానికి త్వరగా ఏర్పాట్లు చేయించాలి.

అంతట ధర్మాత్ముడైన దశరథ మహారాజు మంత్రులను, రాజులను, నగర పాలకులను, గ్రామాధికారులను అతి త్వరగా సమావేశపరచాడు. రాముని యౌవరాజ్య పట్టాభిషేకానికి త్వరపడవలసిన సమయం ఆసన్నమైనదని వివరించాడు. ఆ తొందరలో కేకయరాజుకుగాని, జనక మహారాజుకుగాని వర్తమానం పంపలేదు. కనీసం భరతుణ్ణి కూడా పిలిపించలేదు. రాజ్యాభిషేకం అయిన తరువాత సంతోషపడతారు లెమ్మని తలచాడు.

వచ్చిన అతిథులందరికీ ఉచితరీతిన మర్యాదలు చేసి, వారందరికీ అనేక కానుకలిచ్చి సత్కరించాడు. వారంతా ఆయన సమ్ముఖంలో ఆసీనులై ఉన్నారు.

## 2వ సర్గ శ్రీరాముని పట్టాభిషేకానికి సదస్యుల హర్షం

దశరథుడు: మహాజనులారా! పూజ్యులారా! మా పూర్వీకులంతా ప్రజలను తమ సొంత బిడ్డల్లా చూసుకొని పరిపాలించారు. ఇక్ష్వాకుల రాజవంశంలో జన్మించిన నేను కూడా వారి దారినే అనుసరించాను. లోకకల్యాణాన్నే వాంఛిస్తూ వచ్చాను. ఈ విధంగా కొన్ని వేల సంవత్సరాలు గడచిపోయాయి. ఫలితంగా నా శరీరమంతా పండి ఒడిలిపోయింది. ఇట్లాగే ఇంకా ఎక్కువ కాలం పరిపాలించలేను. నా శరీరం విశ్రాంతిని కోరుకుంటోంది.

నా కుమారుడు రాముడు దేవేంద్రునితో పోల్చదగిన పరాక్రమవంతుడు. శత్రుభయంకరుడు, సకల గుణాభిరాముడు. నా రాముడు కూడా నా పోలికలనే పుణికి పుచ్చుకున్నాడు. పుష్యమీ నక్షత్రంతో కూడిన చంద్రునిలా చల్లగా ప్రకాశిస్తూ ఉంటాడు. ధర్మసంరక్షకులలో శ్రేష్ఠుడు. అటువంటి రామునికి రాజ్యాభిషేకం చేయాలని అనుకుంటున్నాను. అతడు మూడు లోకాలనూ మెప్పించగల సమర్థుడూ, యోగ్యుడూ అని అనుకుంటున్నాను. నేనీ రాజ్యభారాన్ని రాముని భుజస్కంధాల మీద ఉంచినట్లయితే లోకాభ్యుదయం జరుగుతుంది. ఏ విధమైన కొరతా లేకుండా నేను విశ్రాంతి తీసుకోగలుగుతాను. ఈ విషయాన్ని అన్ని కోణాలనుంచీ బాగా ఆలోచించి ఈ నిర్ణయం తీసుకొన్నాను. ఇది మంచి ఆలోచనేనని, ఇందువలన ప్రజలు సుఖపడతారని మీరు కూడా భావిస్తే, నేను ఇలా చేయడం సముచితమేనని మీరు కూడా భావిస్తే ఈ పని చేస్తాను. మీ సంపూర్ణాంగీకారం లేకపోతే నేనీ పని చేయను. నన్ను మెప్పించడంకోసం ఒప్పుకోవలసిన అవసరం లేదు. మరేదైనా మంచి ఆలోచన ఉంటే చెప్పండి. అట్లాగే చేద్దాం. ఇది యావత్తూ రాజ్య క్షేమానికి సంబంధించిన విషయం. సమష్టిగా ఆలోచించి, మంచి నిర్ణయం తీసుకోవాలి. అందుకే మిమ్మల్నందరినీ రావించాను. ఎన్నో కష్టనష్టాలను లెక్క చేయకుండా పిలవగానే మీరు కూడా వచ్చారు. ఒక్కరే తీసుకునే నిర్ణయం మంచి ఫలితాలను ఇవ్వకపోవచ్చునేమోనని, మీ అందరినీ పిలిపించాను. మీరంతా మధ్యస్థులు. మీకు అందరూ సమానమే. అందువల్ల పూర్వాపరాలు బాగా ఆలోచించి నిష్పక్షపాతంగా, ప్రజాక్షేమాన్ని దృష్టిలో

ఉంచుకొని మంచి నిర్ణయం చెప్పగలరనే మిమ్మల్ని సమావేశపరచాను. మీరు అందరూ బాగా ఆలోచించి మీ నిర్ణయాన్ని చెప్పండి.

ఈ విధంగా పలికి దశరథ మహారాజు కూర్చున్నాడు. సభలోని రాజుల, రాజోద్యోగుల, ఋషుల, మంత్రుల ఆనందానికి అవధులు లేకుండాపోయాయి. మహదానంద పడిపోయారు. వారి మనస్సులు పురివిప్పిన నెమళ్ళలా నాట్యం చేశాయి. ఆనందంతో చప్పట్లు చరిచారు. బాగు, బాగు అంటూ తమ ఆమోదాన్ని తెలిపారు.

సభికులు: మహారాజా! తాము పలికిన పలుకులన్నీ అక్షర సత్యాలే! మీరు అనేక వేల సంవత్సరాలనుండి రాజ్యభారాన్ని మోస్తూ అలసి ఉన్నారు. మీకు విశ్రాంతి తప్పక అవసరం. అందువలన రాజ్యభారాన్ని మోసేందుకు యువరాజుగా రాముని నియమించండి.

రాజా! రాముడు మా అందరకూ ఎంతో ప్రియమైనవాడు. మహావీరుడు, రఘుకుల సంజాతుడు, ఆజానుబాహుడు అయిన రాముడు పట్టాభిషిక్తుడై శ్వేత ఛత్రధారియై పట్టపుటేనుగు అంబారీపై ఊరేగుతూ ఉంటే చూడాలని మా నేత్రాలు ఉబలాట పడుతున్నాయి.

దశరథుడు: ఓ సభికులారా! మీ మాటలను బట్టి మీరందరూ నన్ను సంతోషపెట్టడానికి, నా మాటకు ఎదురుచెప్పలేక ఇలా పలుకుతున్నారు. అంతేకాని యథార్థమైన మీ అభిప్రాయాలను వ్యక్తం చెయ్యటం లేదు.

మహాజనులారా! ఈ విషయంలో యథార్థమైన మీ అభిప్రాయాన్ని నిర్భయంగా చెప్పండి. నేను ధర్మానుసారంగా ఇన్ని వేల సంవత్సరాలు రాజ్యపాలన చేసిన విషయం మీ రెరుగుదురు. మీరు యథార్థమైన మీ అభిప్రాయాన్ని తెలుపడం లేదని సందేహిస్తున్నాను. కనుక మీరందరూ రాముడే యువరాజు కావాలని ఎందుకు కోరుకొంటున్నారు? నిర్భయంగా తెలుపండి.

సభికులు: రాజా! నీ కుమారుడైన రామునిలో అనేక కల్యాణ గుణాలున్నాయి. రాజా!

రాముడు బుద్ధిమంతుడు, సద్గుణాలలో దేవతలతో సమానుడు. రాముడు అందరికీ ఇష్టమైనవాడు.

రాజా! దివ్యమైన దేవేంద్రునితో సమానుడు. ఇక్ష్వాకు వంశ రాజులందరిలోనూ బలవంతుడు. ధర్మం పట్ల, సత్యం పట్ల ఆసక్తి గల రాముడు ప్రజలకు సర్వ సంపదలనూ చేకూర్చగల సమర్థుడు. రాముని గుణాలనేమని వర్ణించగలం? ఆతడు పరాక్రమంలో దేవేంద్రుని మించినవాడు. బుద్ధిబలంలో బృహస్పతిని మించినవాడు, జనులకు ఆహ్లాదాన్నివ్వడంలో చంద్రునితో పోల్చదగినవాడు.

రాజా! రాముడు ధర్మాలన్నీ తెలిసినవాడు. సత్యసంధుడు; అసూయలేనివాడు; భూదేవివంటి సహనం గలవాడు. దుఃఖీతులను, అభాగ్యులను సదా వెన్నంటే ఉంటూ కాపాడతాడు. జితేంద్రియుడు. రాముడు సుకుమారుడు. మంగళకరమైనవాడు; ప్రియమైన పలుకులనే పలుకుతాడు. ధర్మపరాయణులైన వృద్ధులను, బ్రాహ్మణులను కీర్తిస్తూ, తన యశస్సును, తేజస్సును పెంపొందించుకొంటున్నాడు.

రాజా! అస్త్ర విద్యలో రాముడు దేవతలను, రాక్షసులను కూడా మించిపోయాడు. వేద విద్యలన్నీ సాంగోపాంగంగా అధ్యయనం చేసినవాడు. దైన్యమన్నదే ఎరుగడు. యుద్ధం చేయవలసివస్తే లక్ష్మణునితో కలసి వెళ్ళి జయంతో తిరిగి వస్తాడు. అలా విజయలక్ష్మితో తిరిగి వచ్చిన రాముడు గుర్రంపై గాని, ఏనుగుపై గాని ఊరేగుతూ, వారి కుశలాన్ని విచారిస్తాడు. వారి తల్లితండ్రుల సుఖశాంతులను విచారిస్తాడు. అగ్నిహోత్రాదులు సక్రమంగా జరుగుతున్నాయా? అని వారందరినీ తరచి తరచి అడుగుతుంటాడు. అలా విచారిస్తున్న రాముని జనులందరూ జయజయధ్వానాలతో ముంచెత్తుతుంటారు.

రాజా! మా కొరకు నియోగించబడిన రాజోద్యోగుల నుండి సేవలు అందుచున్నవా? అని మమ్మల్ని ప్రశ్నిస్తూ రాముడు ప్రజల కష్టసుఖాలన్నింటిలోను పాలుపంచుకొంటూ, వారిలో ఒకడై

సంచరిస్తాడు. యుక్తిచేత ప్రజల కలహాలను తీర్చి సమాధాన పరచుతాడు.

రాజా! రాముని మనోహరమైన రూపాన్ని ఏమని వర్ణించగలం? అందమైన కనుబొమలు కలిగి చెంపకు చారడేసి కన్నులతో విరాజిల్లుతున్నాడు. సమస్త సద్గుణాలచే శ్రీమహావిష్ణువుతో పోల్చదగినవాడు. మెలకువ కలిగి ప్రజలను పాలించగల సమర్థుడు. ఇంద్రియాలను జయించిన వాడవడంచే చెడు మార్గాల జోలికి పోడు. ఆగ్రహం వచ్చినా, అనుగ్రహం కలిగినా ఎదుటివాడు ఫలాన్ని పొందకుండా తప్పించుకోలేడు. ప్రాణాలు తీయవలసివస్తే అటువంటివాడి ప్రాణాలను హరించే తీరుతాడు. ప్రజలకు సుఖశాంతులను కలిగిస్తూ సూర్యభగవానుని మల్లే ప్రకాశిస్తూంటాడు.

రాజా! ఇన్ని సుగుణాలు కలిగినవాడు కనుకనే ప్రజలాతణ్ణే రాజుగా కోరుకొంటున్నారు. రాముడు నీ పుత్రుడై జన్మించడం నీ పూర్వజన్మల పుణ్యఫలమని భావిస్తున్నాం. మరీచి కుమారుడు కశ్యపుని మల్లే రామునికి కూడా మంచి పుత్రునికి ఉండవలసిన లక్షణాలన్నీ ఉన్నాయి.

రాజా! అలాంటి యోగ్యుడైన రాముడు ఆయురారోగ్యాలతో వర్ధిల్లుతూ, మమ్మల్ని పాలించాలని, గ్రామవాసులం, పట్టణవాసులం అంతా ముక్తకంఠంతో కోరుచున్నాం. స్త్రీలు, పురుషులు, చిన్న, పెద్ద అన్న తేడాలేకుండా రాముని కొరకై ముప్పూటలా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాం.

ఓ రాజశ్రేష్ఠుడా! దశరథ మహారాజా! అటువంటి రాముని యువరాజుగా పట్టాభిషిక్తుని చేసి ప్రజల కోరికను తీర్చు. ఉత్తమ గుణాలు గల రాముణ్ణి, మా క్షేమం కోరి త్వరగా యువరాజును చేయి.

# 3వ సర్గ యౌవరాజ్యాభిషేకానికి ఏర్పాట్లు

దశరథుడు: రాజులారా! పట్టణ, గ్రామాధ్యక్షులారా! రాముణ్ణి గూర్చి మీరు పలికిన మాటలన్నీ యథార్థాలే! నాకు కూడా ఇష్టుడైన నా పెద్దకుమారుడు రాముడి యువరాజ్యాభిషేకానికి ఏర్పాట్లు చేస్తాను.

వసిష్ఠ మహర్షీ! మహర్షులారా! పూజ్యులైన బ్రాహ్మణోత్తములారా! చెట్లు, వనాలు చిగురించే చైత్రమాసంలో రాజ్యాభిషేకానికి ఏర్పాట్లు చేయించండి.

వసిష్ఠ మహర్షీ! పూజ్యుడా! రాముని యౌవరాజ్యాభిషేకానికి కావలసిన ఏర్పాట్లన్నీ మీరే స్వయంగా చూడండి.

అప్పుడు వసిష్ఠుడు ఇలా పలికాడు: ఓ మంత్రులారా! బ్రాహ్మణులారా! అధికారులారా! బంగారం, రత్నాలు, అన్ని రకాలైన ధాన్యాలు, నూతన వస్త్రాలు, తేనె, నెయ్యి, పేలాలు, రథాలు, ఆయుధాలు, చతురంగ బలాలను సిద్ధం చేయండి. పట్టపుటేనుగుకు తెల్లని వస్త్రాలు ధరింపజేయండి; తెల్లని గొడుగును, బంగారు కలశాలను, మేలుజాతి ఎడ్ల కొమ్ములకు బంగారు తాపడలు ధరింపజేసి రాజుగారి యాగశాలకు చేర్చండి. ఏ ఒక్క చిన్న వస్తువు కూడా మరువకుండా అక్కడ సమకూర్చండి.

అధికారులారా! నగర ద్వారాలన్నీ చందనపు నీటితో కడగండి. పుష్పమాలలతో అలంకరించండి. కమ్మటి సువాసనలు వెదజల్లే ధూపాలను వేయండి. బ్రాహ్మణులు, అతిథులంతా తృప్తిగా భోజనం చేసేట్లుగా చక్కటి భక్ష్యాలను, కమ్మటి పెరుగుపాలతో కూడిన భోజనాలను వండించండి. రేపు ఉదయానికల్లా ఈ భక్ష్యాలన్నీ సిద్ధం కావాలి. సూర్యోదయం కాగానే స్వస్తి వచనాలు పలుకుతారు; వెంటనే బ్రాహ్మణులు కూర్చునేందుకు ఆసనాలు ఏర్పాటు చేయండి.

వీథులన్నీ కడిగి ముగ్గులు పెట్టించండి. ప్రజలకు ఆనందాన్ని కలిగించే నటులు, వేశ్యా స్త్రీలు రాజ్యప్రాసాదపు రెండవ కక్ష్య వద్ద ఉండేట్లు చేయండి. దేవాలయాలన్నింటిలో నైవేద్యానికి అన్నిరకాలైన ప్రసాదాలను సిద్ధంచేయండి. దక్షిణలు సమృద్ధిగా ఇవ్వండి. యుద్ధవిద్యలందు ఆరితేరిన యోధులందరినీ వారి వారి శస్త్రాలను ధరించి రాజప్రాసాదానికి ఎదుట నిలపండి.

ఆ విధంగా దశరథుని అభీష్టానికి తగ్గట్లుగా వసిష్ఠుడు కింది ఉద్యోగులందరికీ ఆదేశాలిచ్చాడు. ఏర్పాట్లన్నీ స్వయంగాను, మంత్రులతోను పరిశీలించి తిరిగి దశరథునికి అన్ని ఏర్పాట్లు సవ్యంగా జరిగాయని తెలిపాడు. అంతట దశరథుడు రాముని సభా మండపానికి పిలిపించాడు.

దేశం నలుమూలలనుండి సామంతరాజులు, అధికారులు వచ్చారు. వారంతా రాముని గూర్చి తమ అభిప్రాయాలను దశరథ మహారాజుకు నివేదించుకున్నారు. వారంతా కూడా సూర్యోదయానికి ముందే సభాస్థలానికి వచ్చి దశరథుని సందర్శించుకున్నారు. దేవతల మధ్యనున్న దేవేంద్రునిలా దశరథ మహారాజు సామంతరాజుల మధ్య తన రాజప్రాసాదంలో నిలబడ్డాడు.

అమిత రూపవంతుడు, చంద్రకాంతులవలె మనోహరమైన ముఖం కలవాడు, మహాబలశాలియై మదించిన ఏనుగుమల్లే వస్తూన్న రాముని, దశరథుడు తన రాజప్రాసాదం నుండే చూశాడు. గంధర్వరాజులా ప్రకాశిస్తూన్న తన కుమారుణ్ణి చూసి దశరథుడు ఉప్పొంగిపోయాడు. అలాంటి రాముడు సుమంత్రుని అనుసరించి దశరథ మహారాజు వద్దకు వచ్చాడు. తండ్రిని చూడగానే ఆయన పాదాలకు సాష్టాంగ నమస్కారం చేశాడు.

అప్పుడు దశరథుడు రాముని లేవనెత్తి కౌగలించుకొని ముద్దాడాడు. సాదరంగా రాముని తీసుకొనిపోయి మణిమయరత్నాలతో అలంకరించబడిన ఉన్నతాసనం మీద కూర్చోబెట్టాడు. ఆసనం మీద కూర్చున్న రాముడు మేరుపర్వతాన్ని దాటి వస్తున్న ఉదయసూర్యునిలా

ప్రకాశించాడు. అటువంటి రాముణ్ణి దిగ్భ్రమతో చూస్తూన్న దశరథుడు తన ప్రతిబింబాన్ని తానే చూసుకుంటున్నట్లు అనుభూతి చెందాడు. ఆహా! కాశ్యపుడు కూడా దేవేంద్రుని చూసుకొని తన మాదిరే ఆనందించి ఉంటాడని తలచాడు.

దశరథుడు ఇలా అన్నాడు: ఓ రామా! పరమయోగ్యురాలైన నా పట్టమహిషి కౌసల్యాదేవి యందు జన్మించావు. నాకు పెద్ద కుమారుడవు. నీవు సకల సుగుణాభిరాముడవడం వలన నాకు చాలా ప్రియమైనవాడవు. ప్రజలందరినీ విచారించాను, వారందరినీ నీ గుణగణాలచే రంజింపచేశావు. ఈనాడు పుష్యమీ నక్షత్రం. శుభదినమని పెద్దలు నిర్ణయించారు. అందు వలన ఈ శుభనక్షత్రాన నిన్ను యువరాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేయాలని నిర్ణయించాను.

నాయనా! కుమారా! నీవు సకలసుగుణాలకు రాశివే అయినా, ఈ సందర్భానుసారంగా కొన్నిమాటలు చెప్తాను. శ్రద్ధగా విను.

రామా! వినయాన్ని ఇంకా పెంపొందించుకో. ఇంద్రియాలను అదుపులో పెట్టుకో. కోరికలను, వ్యసనాలను, క్రోధాన్ని దగ్గరకు రానీయకు. జితేంద్రియుడవుగా ఉండు. [జూదం, పగటినిద్ర, వేటాడటం, ఇతరుల దోషాలను ఎంచడం, స్త్రీలతో భోగాలనుభవించడం, మద్యాన్ని సేవించడం, నృత్యం, గీతం, వాద్యం, ఊరకే దేశాటనం చేయడం వంటి పదిరకములైన కోరికలను వ్యసనాలంటారు.]

[ఇవి కాక క్రోధంతో వచ్చే వ్యసనాలు ఎనిమిది ఉన్నాయి. అవి: 1. చాడీలు చెప్పడం 2. సత్పురుషులను బంధించడం 3. ద్రోహబుద్ధి 4. అసూయ 5. ధనాన్ని అపహరించడం 6. ఇతరులకు ఇవ్వవలసిన ధనాన్ని ఇవ్వకపోవడం 7. పరుషమైన పదాలతో మాట్లాడడం 8. ఇతరులను కొట్టడం. ఈ ఎనిమిది వ్యసనాలకు దూరంగా ఉండు.]

రామా! పరోక్షంగాను, ప్రత్యక్షంగాను పనిచేసే మంత్రులు, రాజోద్యోగుల వంటి వారిని సంతోషపరుస్తూ ఉండాలి. ఈ విధంగా నువ్వు కూడా ఆత్మనిగ్రహం కలిగి రాజోద్యోగులను

ఆనందపరచు.

దశరథుని మాటలు వింటున్న వారిలో కొందరు కౌసల్యాదేవిని సంతోషపెట్టాలని ఉత్సాహంగా వెళ్ళి ఆమెకు ఈ శుభవార్తను తెలిపారు. ఆమె వారందరికీ బంగారం, గోవులు, రత్నాలను ఇచ్చి సంతోషపరచింది.

తరువాత రాముడు, దశరథ మహారాజుకు నమస్కరించి, సభలోని జనులంతా జయజయధ్వానాలు చేస్తూ ఉండగా రథమెక్కి తన గృహానికి వెళ్లాడు. అప్పుడు సభాసదులందరూ దశరథ మహారాజును అభినందించి ఇళ్ళకు వెళ్లారు.

# 4వ సర్గ రాముడు కౌసల్యాదేవిని సందర్శించటం

రాముడూ, సభాసదులు ఎవరి ఇళ్ళకు వారు వెళ్లారు. పిదప దశరథుడు మంత్రులతో ఆలోచించి "రేపే పుష్యమీ నక్షత్రం. రాముని రాజ్యాభిషిక్తుని చేయాలి. నా మనస్సు ఇంకొకసారి రాముణ్ణి చూడాలని వేధిస్తోంది. ఓయీ! సుమంత్రా! నువ్వు వెళ్లి నా మాటగా చెప్పి రాముణ్ణి ఇక్కడకు తీసుకొని రా" అన్నాడు.

దశరథుని ఆజ్ఞ మేరకు సుమంత్రుడు రాముని గృహానికి వెళ్ళి మహారాజు ఆదేశాన్ని రామునికి తెలిపాడు. తరువాత రాముడు తండ్రి ఎందుకు ఇంత తక్కువ వ్యవధిలో మళ్లీ పిలిపిస్తున్నాడని విస్తుపోతూ సుమంత్రుని వెంట రాజప్రాసాదానికి వెళ్లాడు. తండ్రిని చూడగానే రాముడు దోసిలి ఒగ్గి నమస్కరించాడు. అప్పుడు దశరథుడు రాముణ్ణి లేవనెత్తి కౌగలించుకొని అతడికి ఆసనం చూపి కూర్చోమన్నాడు.

దశరథుడు ఇలా పలికాడు: రామా! దీర్ఘాయుష్మంతుడనైన నేను వృద్ధుడనయ్యాను. అన్నదానాలు, వందలాది యజ్ఞాలు, భూదానాలు, సత్కార్యాలన్నీ చేశాను. బ్రాహ్మణులకు పుష్కలంగా దక్షిణలిచ్చాను.

రామా! సమస్త సుఖాలను అనుభవించాను. యజ్ఞాలు చేసి దేవతాఋణాలు తీర్చాను. రకరకాలైన దానాలు చేసి ఋషిఋణాన్ని తీర్చాను. సంతానాన్ని కని పితౄణాన్ని తీర్చాను. శరీరధర్మంగా తీర్చవలసిన ఋణాలన్నీ తీర్చాను. చేయవలసిన ధర్మాలన్నీ ఆచరించాను. ఇక నీ రాజ్యాభిషేకం చేయడంతో నేను అన్నివిధాలైన బాధ్యతల నుండి విముక్తుడనవుతాను. కనుక రామా! నేను చెప్పిన విధంగా చేయి.

రామా! ప్రజలందరూ నువ్వే రాజువు కావాలని కోరుకుంటున్నారు. అటువంటి ఈ శుభ సమయంలో ఎందువల్లనో కొన్ని భయంకరమైన స్వప్నాలచే, దుశ్శకునాలచే నా మనస్సు

కలవరపడుతోంది. పగలే ఆకాశం నుండి ఉల్కలు రాలిపడటం చూస్తున్నాను. నా జాతకరీత్యా, రవి, కుజ, రాహువులు నా జన్మ నక్షత్రాన్ని ఆక్రమించుకున్నారని, అటువంటిప్పుడు నాకు మరణంగాని, గొప్ప విపత్తుగాని సంభవిస్తుందని దైవజ్ఞులు చెబుతున్నారు.

కనుక రామా! నాకు ఏదైనా అసందర్భమైన సంఘటనలు జరుగక ముందే నువ్వు రాజ్యాభిషిక్తుడవవు. ఎందువలనంటే, మనస్సు చంచలమైనది. అంతేకాక గ్రహదోషంచే కూడా పీడించబడుతున్నాను. ఇప్పుడే చంద్రుడు పునర్వసు నక్షత్రంలో ప్రవేశించాడు. రేపు ఉదయానికల్లా చంద్రుడు పుష్యమీ నక్షత్రానికి వచ్చి చేరుకుంటాడు. ఆ ముహూర్తం దివ్యంగా ఉన్నదని దైవజ్ఞులు నిర్ణయించారు. రేపు ఉదయాన్నే నిన్ను రాజ్యాభిషిక్తుణ్ణి చేస్తాను. ఎందువల్లనో నా మనస్సు కలత చెందుతోంది. ఏం జరుగబోతుందోనని కీడు శంకిస్తోంది సుమా!

కనుక రామా! నువ్వు సీతతో కలసి ఉపవాసం చేసి శయనించు. కుమారా! ఇటువంటి సమయాల్లో అనేక విఘ్నాలు, విపత్తులు కలుగుతాయి. నువ్వు, నీ మిత్రులంతా కలసి నన్ను రక్షించాలి. నీ తమ్ముడు భరతుడు ఇక్కడ లేని సమయంలోనే నీ రాజ్యాభిషేకం జరగాలని ఈ ఏర్పాట్లన్నీ అతిత్వరగా చేయిస్తున్నాను.

నిజానికి భరతునికి నీ పట్ల విపరీతమైన ప్రేమాభిమానాలున్నాయి. ధర్మబుద్ధి గలవాడు; ఇంద్రియనిగ్రహం కలిగినవాడు. భరతుడెప్పుడూ సత్పురుషులు ఆచరించే మార్గాన్నే అనుసరిస్తాడు. అయినా అటువంటివారి మనస్సు కూడా ఒక్కో సమయంలో చంచలం గావచ్చు గదా!

అంతట రాముడు దశరథునకు నమస్కరించి తన గృహానికి చేరుకొన్నాడు. అక్కడ నుండి తల్లియైన కౌసల్యాదేవిని చూడదలచి ఆమె అంతఃపురానికి వెళ్లాడు.

రాముడు వెళ్ళే సమయానికి కౌసల్యాదేవి చక్కగా అలంకరించుకొని ధ్యానముద్ర వహించి మౌనంగా మహావిష్ణువును, లక్ష్మీదేవిని ప్రార్థిస్తూన్నది. రాముని రాజ్యాభిషేక వార్త విని,

సుమిత్రను, లక్ష్మణుని, సీతను పిలిపించింది. రాముడు వెళ్ళేసరికి వారూ అక్కడే ఉన్నారు.

రాముడు: తల్లీ! నన్ను ప్రజాపాలన చేయవలసినదని తండ్రిగారు ఆజ్ఞాపించారు. అందుకై రేపు పుష్యమీ నక్షత్రాన రాజ్యాభిషేకం జరుగగలదని, నన్ను, సీతను ఉపవాసదీక్ష వహించి దర్భలపై శయనించమని ఆదేశించారు. కనుక నాకు, సీతకు నువ్వు చేయదలచిన మంగళకార్యాలన్నీ ఇప్పుడే జరిపించు.

కౌసల్య: నాయనా! రామా! దీర్ఘాయుష్మాన్ భవ! ఐశ్వర్యాలతో కూడినవాడవై నా జ్ఞాతులను, సుమిత్ర జ్ఞాతులను తరింపచేయి. శత్రుభయంకరుడవుగా!

నాయనా! రామా! నువ్వు సర్వమంగళకరమైన నక్షత్రాన పుట్టావు. అందువల్లనే నీ సద్గుణాలతో నీ తండ్రికి సంతోషాన్ని కలిగిస్తున్నావు. నాయనా! నీ కోసం మహావిష్ణువును నిష్ఠతో ఆరాధించాను. నా తపస్సు ఫలించింది. ఇక్ష్వాకు వంశస్థుడవైన నిన్ను ఈ రోజు రాజ్యలక్ష్మి ఆశ్రయిస్తోంది.

ఈ విధంగా పలికిన తల్లి మాటలు విన్న రాముడు, తన పక్కనే అణకువతో చేతులు కట్టుకొని ఉన్న లక్ష్మణునితో మందహాసం చేస్తూ ఇలా అన్నాడు:

లక్ష్మణా! నువ్వు నాకు ఆరవ ప్రాణం కావటంచేత ఈ రాజ్యలక్ష్మి నాతోపాటు నిన్నుకూడా ఆశ్రయిస్తోంది. నువ్వు కూడా ఈ రాజ్యాన్ని పాలించు. లక్ష్మణా! నేను తండ్రిగారి ఆజ్ఞను శిరసావహించి రాజ్యభిషేకాన్ని అంగీకరించేది నీ కోసమే సుమా! నీ కిష్టమైన భోగాలన్నీ అనుభవించు. ఇతర రాజ్యఫలాలను కూడా నువ్వే అనుభవించు.

ఇలా పలికి రాముడు తల్లుల వద్ద సెలవు పుచ్చుకొని సీతతో తన గృహానికి వెళ్లాడు.

# 5వ సర్గ సీతారాముల ఉపవాసదీక్ష

దశరథుడు వసిష్ఠునితో ఇలా పలికాడు: ఓ వసిష్ఠ మహర్షీ! లక్ష్మి, కీర్తి, రాజ్యం లభించడానికి సీతారాములను ఉపవాస దీక్ష చేయమని ఆదేశించాను. కనుక మీరు రాముని గృహానికి వెళ్ళి వారి చేత ఉపవాస వ్రతాన్ని చేయించండి.

వసిష్ఠ మహాముని, దశరథుని ఆదేశం ప్రకారం రథం మీద రాముని ఇంటికి వెళ్లాడు. వసిష్ఠుని చూడగానే రాముడు ఎదురుగా వెళ్ళి ఆయనను రథంపై నుండి చేయిపుచ్చుకొని దింపి భవనంలోకి తీసుకొనిపోయాడు.

వసిష్ఠుడు: రామా! దశరథ మహారాజు రేపు ఉదయాన్నే నీకు రాజ్యాభిషేకం చేయాలని నిశ్చయించారు. అందువల్ల ఈ రాత్రికి నువ్వు ఉపవాస వ్రతం చెయ్యాలి. సీత కూడా ఈ వ్రతంలో పాల్గొంటుంది.

నహుషుడు, యయాతికి ఏ విధంగా రాజ్యాభిషేకం చేశాడో, నీకూ అదే విధంగా చేయాలని నీ తండ్రి సంకల్పించాడు.

తరువాత వసిష్ఠ మహర్షి సీతారాములచే ఉపవాస వ్రతాన్ని ఆరంభించి తన గృహానికి వెళ్ళిపోయాడు. అంతట రాముడు కొంతసేపు మిత్రులతో గడిపి, వారిని పంపివేశాడు. తదనంతరం తాను అంతఃపురంలోనికి వెళ్లాడు. రాముని భవనంలో స్త్రీ పురుషులు ఆనందోత్సాహాలతో కేరింతలు కొడుతూ కాలక్షేపం చేస్తున్నారు.

వసిష్ఠుడు రాముని భవనం నుండి వెళ్తూ జనం అంతా గుంపులు గుంపులుగా చేరి నృత్యగానాలతో వీథులన్నీ క్రిక్కిరిసివుండడం చూశాడు. వాళ్ళు చేసే ధ్వనులన్నీ సముద్రఘోషను తలపింప చేస్తున్నాయి. జనంతో వీథులన్నీ నిండిపోవడంతో ఇరుకైపోయాయి. బాలురు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు అంతా ‘ఎప్పుడు తెల్లవారుతుందా? ఎప్పుడు రాముని రాజ్యభిషేకం

చూద్దామా?' అని ఎదురు చూడసాగారు. వీథులన్నీ నీళ్ళు జల్లి ముగ్గులు పెట్టారు. ఇళ్ళ మీద పతాకాలు ఎగురవేశారు. సూర్యోదయానికై ఆతురతతో నిరీక్షించసాగారు.

వసిష్ఠుడు అరుదైన ఈ పండుగ వాతావరణాన్ని చూస్తూ, రథం మీద వెళుతూ ఉంటే జనులంతా రెండుగా చీలి దారి ఇచ్చారు. సరాసరి వసిష్ఠుడు దశరథుని కలుసుకొని రాముని అంతఃపురంలో తాను చేయించిన ఉపావాస వ్రతాన్ని గూర్చి, వీథుల్లో జనుల ఆనందోత్సాహాలను గురించీ పూసగుచ్చినట్లు చెప్పాడు.

తరువాత దశరథ మహారాజు వసిష్ఠుని అనుమతి తీసుకొని, సామంతరాజులను, అధికారులను పంపివేసి తాను కూడా తన అంతఃపురంలోకి వెళ్లాడు.

# 6వ సర్గ శ్రీరాముడు సీతాసమేతుడై వ్రతం ఆచరించడం

వసిష్ఠుడు ఆదేశించినట్లుగానే రాముడు స్నానంచేసి సీతతో కూడినవాడై శ్రీమన్నారాయణుని ఏకాగ్రతతో ధ్యానించాడు. హవిస్సు ఉన్న పాత్రను శాస్త్రంలో చెప్పినట్లు శిరస్సున ధరించాడు. పిమ్మట శ్రీమహావిష్ణువును ధ్యానించి అగ్నిలో ఉంచుతూ హోమం చేశాడు.

రాముడు తన శ్రేయస్సును కోరుకుంటూ హవిస్సును హోమంచేసి, మిగిలినది తాను, సీత స్వీకరించారు. తరువాత శ్రీమహావిష్ణువు సన్నిధానంలో దర్భలు పరచుకొని సీతతో కూడా శయనించాడు. సరిగా బ్రాహ్మీముహూర్తంలో లేచి గృహాలంకరణలన్నీ సరిగా ఉన్నాయా అని మరోసారి పర్యవేక్షించాడు. ఇంతలోనే సూతమాగధవందుల స్తోత్రాలు వినరావడంతో స్నానాదులు పూర్తిచేసుకొని సంధ్యావందనాన్ని ఉపాసించాడు. నిశ్చలమైన మనస్సుతో గాయత్రీమంత్రాన్ని జపించాడు.

తరువాత సీతారాములిద్దరూ తెల్లని పట్టువస్త్రాలు ధరించి శిరస్సు వంచి శ్రీమహావిష్ణువును స్తుతించారు. బ్రాహ్మణులు వచ్చి పుణ్యాహవాచనాలను జరిపించారు. ఆ పుణ్యాహవాచన ఘోష అయోధ్యానగరమంతా మారుమ్రోగింది. నగరమంతా మంగళతూర్యరావాలతో నిండిపోయింది.

ప్రజలంతా తమ ఇళ్లతోపాటు అయోధ్యానగరమంతా తోరణాలు కట్టారు. మార్గమంతా నీళ్ళు చల్లి పువ్వులు పరిచారు. సీతారాములు ఉపవాస దీక్ష ఆచరించారని విని చాలా సంతోషించారు.

దేవాలయం గోపురాల పైన, ఇంటి కప్పుల పైన, వీధులలోను, కూడళ్ళయందు, కోటబురుజులపైన, ఎత్తైన వృక్షాలపైన, చిత్రపటాలను, ధ్వజాలను, పతాకాలను ఎగురవేశారు.

పురవీథుల కూడళ్ళ యందు కొన్నిచోట్ల నటులు, నర్తకులు, గాయకులు గానంచేస్తూ

ప్రజలను రంజింపచేస్తున్నారు. ఎక్కడవిన్నా రాముని కబుర్లే. రాజ్యాభిషేకాన్ని గూర్చి ఒకరికొకరు చెప్పుకుంటూ ఆనందించసాగారు. రాజ్యాభిషేకం పూర్తి అయ్యేందుకు చాలా రాత్రి కావచ్చునేమో! అని ఊహించి వీథుల్లో వృక్షాకారంలో దీపాలను ఏర్పాటు చేశారు.

దశరథుడు వృద్ధుడైపోవటం వలన రామునికి రాజ్యాభిషేకాన్ని చేయటం ఎంతైనా సమయోచితంగా ఉందని జనులు అభినందించారు. దశరథుని ఔదార్యాన్ని, ముందుచూపును మెచ్చుకున్నారు. రాముని గుణగణాలను ఇంకొందరు మెచ్చుకున్నారు. రాముని పాలనలో తామంతా ఎంత సురక్షితంగా, సుఖసంతోషాలతో ఉంటామో గదా అని తమ ఆనందాన్ని వ్యక్తంచేస్తున్నారు. రాముడికి తన సోదరులపై ఎంత ప్రేమ ఉందో మనపైన కూడా అంతే ప్రేమ ఉందని కొందరు అన్నారు. మరికొందరు దశరథుడు ఇంకా పదికాలాలపాటు ఆరోగ్యంగా ఉండాలని కోరుకున్నారు. పెద్దగా ప్రచారం లేకపోయినా రామ రాజ్యాభిషేకం చూడటానికి జానపదులు గుంపులు గుంపులుగా వస్తున్నారు. క్షణక్షణానికీ బైట గ్రామాల నుండి వచ్చే జనంతో పట్టణం క్రిక్కిరిసిపోతోంది. ఎక్కడ చూసినా పండుగ వాతావరణమే. వాళ్ళ మాటలు, అరుపులు సముద్రఘోషను తలపిస్తున్నాయి.

## 7వ సర్గ మంథర దుర్బోధ– 1

మంథర కైకేయికి అత్యంత ఇష్టమైన దాసీ. ఆమెను తన జ్ఞాతి దాసి అని అందరికీ చెప్పి గౌరవిస్తూ ఉంటుంది. మంథర అంతఃపురంలోని పై అంతస్తు నుండి అయోధ్యా నగరాన్నంతా కలయచూసింది.

రాజమార్గాలన్నీ కిటకిటలాడిపోతున్నాయి. చాలా చోట్ల ధ్వజాలు, పతాకాలు ఎగురవేశారు. జనమంతా తలంటుకొని కొత్తబట్టలు కట్టుకున్నారు. బ్రాహ్మణులంతా పూలమాలల్ని, తినుబండారాలనీ చేతబుచ్చుకొని సంతోషంగా పరుగువంటి నడకతో పోతున్నారు. వారంతా స్తోత్రపాఠాలు వల్లిస్తున్నారు. దేవాలయాలన్నింటికీ కొత్తగా సున్నం వేశారు. అందువల్ల అవన్నీ తెల్లగా మెరిసిపోతున్నాయి. వేదఘోష దూరప్రాంతాల్లో కూడా మారుమ్రోగిపోతున్నది. భటులు గుర్రాలపైనా, ఏనుగులపైనా పురవీథుల్లో పహారా తిరుగుతున్నారు.

అయోధ్యా నగరమంతా పండుగ వాతావరణంలో ఉండటం మంథర చూసింది. ఆమెకు ఏమీ అర్థం కాలేదు. ప్రక్కనే ఉన్న దాదిని అడిగింది.

మంథర: ఏమే! రామ మాతా దాసీ! నువ్వు రాముని తల్లికి ఇష్టదాసివి గదా! లుబ్ధురాలైన రాముని తల్లి ఈ రోజు విరివిగా దానాలు చేస్తోంది ఏమిటి? ఏమైనా విశేషం ఉందా? సంతోషంతో వెలిగిపోతున్నావు. తెల్లని పట్టుబట్టలు కట్టావు. అంత సంతోషించ దగ్గ విషయమైతే నాకూ చెప్పు. సంతోషిస్తాను. (మంథర కౌసల్యపై ద్వేషం పెంచుకొంది. ఆమె ద్వేషం పరాకాష్ఠకు పోయింది. కౌసల్య అని పిలవటానికి కూడా ఇష్టపడలేదు; రామమాతా! అని సంబోధించింది.)

కౌసల్య దాసి: ఓ మంథరా! ఇది లోకమంతా విని సంతోషించాల్సిన సంగతి. నీకు చెప్పకుండా ఉంటానా? ఈ రోజు పుష్యమీ నక్షత్రాన దశరథ మహారాజు రాముడికి

యువరాజ్యాభిషేకం చేస్తున్నారు. ఎటువంటి దోషాలులేనివాడు, సర్వ సుగుణాభిరాముడు రాజు కావటంతో జనమంతా సంతోషంతో పండుగ చేసుకుంటున్నారు. రాజ్యం నలుమూలల నుండి జనం అయోధ్యకు తరలి వస్తున్నారు.

దాది సంతోషంతో చెప్పిన మాటలు విన్న మంథరకు ఒళ్ళంతా కారం రాసుకున్నట్లయింది. పంచాగ్నుల మధ్య ఉన్నట్లుగా తాపం చెందింది. పట్టరానికోపంతో పళ్ళు పటపటా కొరుకుతూ కైకేయి మందిరానికి వెళ్ళింది. ఆ సమయంలో కైకేయి పడుకొని ఉంది.

మంథర: ఓ తెలివితక్కువదానా! ఇంకా పడుకొని ఉన్నావా? అవతల కొంపలు అంటుకొంటూ ఉంటే నీకు నిద్ర ఎట్లా పడుతోంది? నిన్ను అందరూ మహారాజుకు ఇష్టమైన భార్యవని అంటారు. నువ్వూ అదే భ్రమలో ఉన్నావు. అందుకనే నిశ్చింతగా పడుకొని ఉండగలుగుతున్నావు. ఇవన్నీ నేటితో బడాయి కబుర్లేనని తేలిపోయింది. మహారాజుకు నీ మీదున్న ఇష్టమంతా గ్రీష్మంలో నదీప్రవాహంలా ఎండిపోతోంది సుమా!

కైకేయి: ఓసీ మంథరా! నీ ముఖం చూస్తూ ఉంటే ఏదో పెద్ద ప్రమాదంలో చిక్కుకున్నట్లున్నావు. నీ దుఃఖానికి కారణం ఏమిటి? నిన్ను చూస్తూ ఉంటే నాకు దిగులు పట్టుకుంది. అసలు విషయమేమిటో త్వరగా చెప్పు.

మంథర: రాణీ! మహాదుఃఖం వచ్చి పడింది. ఏమని చెప్పను? ఎట్లా చెప్పను? నాకైతే కణకణలాడే నిప్పులో పొర్లిస్తున్నట్లుగా ఉన్నది. నేను నీ ఉప్పు తిని బ్రతికేదాన్ని కాబట్టి నీ హితం కోరి పరుగు పరుగున వచ్చి నీ దగ్గరపడ్డాను.

అమ్మా! నీకు అంతులేని దుఃఖం వచ్చిపడింది. నీకు దుఃఖం కలిగితే నాకూ దుఃఖం కలిగినట్లే. నీకు సుఖ సౌఖ్యాలు చేకూరితే నాకూ చేకూరినట్లే. ఇందులో ఎంతమాత్రమూ సందేహంలేదు.

అమ్మా! రాజవంశంలో జన్మించావు. దశరథ మహారాజు భార్యల్లో నువ్వు ఆయనకు ప్రియమైన దానవు. అయినా రాజధర్మాలు ఎంత క్రూరమైనవో తెలుసుకోలేకుండా ఉన్నావు.

నీ భర్తకు తెలియని ధర్మాలు లేవు. ఆయన అందరికీ ధర్మోపదేశాలు చేస్తారు. నీ విషయంలో ధర్మవిరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడు. నీతో తియ్యగానే మాట్లాడుతాడు. కానీ, నీకు అపకారం తలపెట్టిన విషయమే నువ్వు ఎరుగవు. నీవు ఒట్టి బోళామనిషివి. తెల్లనివన్నీ పాలని, నల్లనివన్నీ నీళ్ళని నమ్ముతావు. అందుకే ఆయన నిన్ను ఇంత తేలికగా మోసం చేయగలుగుతున్నాడు. నువ్వు మాత్రం అదేమీ తెలుసుకోలేకుండా ఉన్నావు.

అమ్మా! ఆయన నీ వద్ద పనికిమాలిన కబుర్లుచెప్పి తన పబ్బం గడుపుకుంటాడు. ఏదైనా లాభించే విషయాలైతే వాటిని కౌసల్యకే ముట్టేట్టుగా చూస్తాడు.

నీ భర్త ఎంత దుష్టబుద్ధి గలవాడో నీవే చూడు! భరతుణ్ణి వాళ్ళ మేనమామ వద్దకు పంపేశాడు. ఇక ఆయనకు అడ్డు చెప్పేవాళ్ళే లేరు. ఇదే సమయమని తలచి రేపు ఉదయాన్నే రాముడికి రాజ్యాభిషేకం చెయ్యబోతున్నాడు. నువ్వు ఒట్టి అమాయకురాలవు! పాముని పక్కలో పెట్టుకొని పడుకున్నట్లుగా, భర్త అని నమ్మి శత్రువుతో జీవిస్తున్నావు. ఉపేక్షిస్తే పాముగాని, శత్రువుగాని ఏమి చేస్తారో, నీ విషయంలో దశరథ మహారాజు కూడా అదే చేస్తున్నారమ్మా! నిన్ను, నీ కుమారుడు భరతుని కాదని రాజ్యాన్ని రామునికి కట్టబెట్టుతున్నాడు. ఇప్పటి వరకు పట్టమహిషిగా ఉంటున్న కౌసల్యను రేపటినుండి రాజమాత అంటారు. నీ గతి అధోగతి అవుతుంది. భరతుడు కూడా తద్దినం పెట్టేవాడి తమ్ముడుగా మిగిలిపోతాడు.

ఓ తెలివితక్కువదానా! నీ భర్త నీకు తియ్యటి మాటలు చెప్పి నిన్ను బుజ్జగిస్తూ తన వలలో వేసుకున్నాడు. తన పబ్బం గడుపుకుపోతున్నాడు. రాజ్యాభిషేకం మాత్రం ఆ పాపాత్ముడైన రాముడికే కట్టబెడుతున్నాడు. నిన్ను, నీ కొడుకు భరతుని నట్టేట ముంచుతున్నాడు. నువ్వు ఈ విషయం గ్రహించలేకపోతున్నావు. అందంగా ఉన్నంత మాత్రాన సరిపోదు. అందుకు తగిన

సూక్ష్మబుద్ధి, కార్యకుశలత కూడా ఉండాలి. ఇప్పటికైనా సమయం మించిపోలేదు. ముందు భరతుణ్ణి రక్షించు, ఆ తరువాత నిన్ను రక్షించుకో! మీ ఇద్దరూ క్షేమంగా ఉంటే నేనూ క్షేమంగానే ఉంటాను. ఆ విధంగా నన్ను కూడా రక్షించినట్లవుతుంది.

కైకేయి: (పడుకున్నదల్లా చివాలునలేచి కూర్చుంది.) ఓసీ మంథరా! ఎంత తియ్యటి కబురు మోసుకొనివచ్చావు? ఇదిగో ఈ ఆభరణాన్ని నా బహుమతిగా అందుకో. ఆ తరువాత ఇంకా విలువైన బహుమతులను కోరుకో. అన్నీ ఇస్తాను. ఇంత మంచివార్త తెచ్చిన నీకు ఎన్ని బహుమతులిచ్చినా, ఇంకా తక్కువే అవుతుంది.

ఓ మంథరా! నాకు భరతుడెంతో రాముడూ అంతే సుమా! నేనెప్పుడూ వారిని విడిగా చూడలేదు. కాబట్టి రాముని రాజ్యాభిషేక వార్త నాకు అత్యంత ప్రియమైనది. నా మనస్సు ఆనందంతో గాలిలో తేలిపోతోంది. రాముని రాజ్యాభిషేకం కన్నా నన్ను సంతోషపెట్టే సంగతి మరొకటి లేదు. ఇంత మంచివార్త చెప్పిన నీకు ఒక వరం ఇవ్వదలచాను. కోరుకో.

వివరణ: మంథరను 'యతోజాతా' అని సంబోధించాడు వాల్మీకి మహర్షి. తల్లితండ్రుల వివరాలు, కులగోత్రాలు తెలియని ఆడది అని, ఏ దేశానికి చెందినదో తెలియదని కొందరు వ్యాఖ్యానించారు. ఇటువంటి స్త్రీ అయోధ్యలో పుట్టదు గనుక ఇట్లా సంబోధించాడని వారి అభిప్రాయం.

'గూని' వంటి అవలక్షణాలుండబట్టి కైకేయికి దాసి అయినదిగాని, లేకుంటే అంతఃపుర దాసిగా యోగ్యత లేనిదని కొందరి అభిప్రాయం.

ఇవన్నీ మంథరపై ఉండే ద్వేషంచేతనే వ్యాఖ్యానిస్తున్నారేగాని, నిజానికి అట్టి స్త్రీయే అయితే దశరథునివంటి వాడు తన రాణికి అటువంటి దాసిని పెట్టుకొంటాడా? అని మరి కొందరి అభిప్రాయం.

రాముని వనవాసానికి పంపేందుకే దేవతలచే నియోగించబడిందని, ఆమె జన్మ దేవరహస్యమని ఇంకొందరు అభిప్రాయపడ్డారు.

ఎప్పుడు పుట్టినదో అప్పటినుండి కైకేయితో కలసి పెరిగిందని, ఆమె జ్ఞాతి కుటుంబాన 'కుల క్రమాగతమైన దాసి' అనే అర్థమే సబబుగా ఉందని గోరఖ్‌పూర్ వారి ప్రచురణలో వివరించారు. ఇదే అన్నిటి కన్నా సబబుగా ఉన్నట్లు తోస్తుంది.

# 8వ సర్గ మంథర దుర్బోధ– 2

మంథర: మూఢురాలా! నీ బహుమతి నువ్వే ఉంచుకో. నువ్వు తలమునిగిపోయే కష్టాల్లో ఉన్నప్పుడు నీ వద్ద బహుమతులు తీసుకొనేటువంటి నీచురాలను కాను.

అమ్మా! రాణీ! నీవిప్పుడు పుట్టెడు దుఃఖంలో ఉండి కూడా ఆనందంగా కనబడుతున్నావు. నిన్ను చూస్తే నాకు నవ్వూ, జాలి రెండూ కలుగుతున్నాయి. నీ అంతటి తెలివితక్కువ ఆడది ప్రపంచంలో ఎక్కడా ఉండదు సుమా! ఒక వంక నీ సవతి కొడుకు మహారాజైతే నువ్వు అతగాడిని మెచ్చుకోవడం ఎట్లా ఉందంటే మృత్యువును కౌగలించుకొన్నట్లున్నది.

రాణీ! నేను చెప్పేది కొద్దిగా చెవి కెక్కించుకో. ఆ పైన నువ్వే ఆలోచించుకో. నా మాటలు ఎంత న్యాయమైనవో, ధర్మసమ్మతమైనవో నీకే తెలుస్తుంది.

రాజకుమారులందరిలో రాముడు పెద్దవాడైతే, భరతుడు రెండవవాడే కదా! అతడికి రాజ్యంలో భాగం ఉన్నదా? లేదా? అందువల్ల రాముడు ఎప్పుడూ భరతుడంటే భయంతో ఉంటాడే కాని, ప్రేమతో ఉండడు. ఎవరిని చూసి భయపడుతున్నామో వారివల్ల ప్రమాదం రావచ్చు గదా? అందువల్ల రాముడు, భరతుణ్ణి ఎప్పుడూ శత్రువుగా చూస్తూ భయపడుతూనే ఉంటాడు. సమయం వస్తే ఏదైనా అపకారం చేసినా చెయ్యవచ్చు.

అంతేకాదు, రాముడికి లక్ష్మణుడు ఎట్లా విశ్వాసపాత్రుడో, భరతునికి శత్రుఘ్నుడు కూడా అంతే విశ్వాసపాత్రుడు. పుట్టుకచే రాముడు పెద్దవాడైతే భరతుడు రెండవవాడుగా పుట్టాడు. పోటీ ఎప్పుడూ వీరిద్దరి మధ్యనే ఉంటుంది. ఇక లక్ష్మణ శత్రుఘ్నులు బాగా చిన్నవారు కావటాన, రాజ్యభోగాలు అనుభవించవచ్చునేగాని, రాజ్యాధికారం దక్కదు. పైగా వారిద్దరూ రాముడికి, భరతుడికి విశ్వాసపాత్రులు కావటాన వీరిని ఎదిరించరు.

రాముడు రాజనీతి దక్షుడు, విద్వాంసుడు. ఏ సమయంలో ఏ పని ఏ విధంగా

చక్కబెట్టాలో తెలిసినవాడు. అటువంటి రాముని వలన భరతునికి కలుగబోయే ప్రమాదాన్ని తలచుకొంటేనే ఒంట్లో నుండి వణుకు పుట్టుకొస్తోంది.

అమ్మా! కౌసల్య చాలా అదృష్టవంతురాలు. ఆమె ఇప్పుడే పట్టమహిషిగా ఆధికృత కలిగి ఉంది. ఇక రామునికి రాజ్యాభిషేకం కూడా అయిపోతే నీ గతి అధోగతే అవుతుంది. నీవు కౌసల్య ముందు దాసిలాగా చేతులు కట్టుకొని నిలబడితే, నీ కొడుకు భరతుడు రాముని ముందు సేవకునిలా నిలబడతాడు. అంతేకాదు, సీత ముందు నీ మిగతా కోడళ్ళ బ్రతుకులన్నీ బానిస బ్రతుకులే అవుతాయి.

కైకేయి: బుద్ధిహీనురాలా! నీ పనికిమాలిన మాటలు కట్టిపెట్టు. రాముడంటే ఎవరనుకొంటున్నావు? సర్వధర్మాలు తెలిసినవాడు. పెద్దలకు శుశ్రూష చేసి విద్యాబుద్ధులు నేర్చినవాడు. నిర్మలమైన చరిత్ర గలవాడు. సత్యవ్రతుడు. దశరథ మహారాజుకు పెద్దకొడుకు. అతడే యువరాజ్యాభిషేకానికి అన్ని విధాలా అర్హుడు.

రాముడు తన తమ్ముళ్ళ నందరినీ పుత్రవాత్సల్యంతో చూస్తాడు. ఒక్క తమ్ములను మాత్రమే కాదు. ప్రజలందరినీ పుత్రవాత్సల్యంతో (కన్నబిడ్డల్లా) పరిపాలిస్తాడు. నువ్వు శరీరం చేతనేకాక బుద్ధిచేత కూడా గూని దానివయిపోయావు. అందువల్లనే అందరూ ప్రేమించే రాముడంటే మత్సరం కలిగి ఉన్నావు.

ఓసీ మంథరా! రాముని రాజ్యం అయినప్పుడు అది భరతుని రాజ్యం కూడా అయినట్లే గదా! మనకు మంచిరోజులు వస్తాయని సంతోషపడక, కుశంకలు పెట్టుకొని దుఃఖీస్తున్నావు. ఇది నీకు తగదు.

ఓసీ దుష్టురాలా! నాకు భరతుడెంత ప్రేమపాత్రుడో రాముడు కూడా అంతే. మరో విషయం, రాముడు కౌసల్య కన్నా నన్నే ఎక్కువగా ప్రేమిస్తాడు. నీకా విషయం తెలియదు. రాముడు రాజైతే, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులంతా రాజులైనట్లేనని తెలుసుకో! వాళ్ళకు

అటువంటి భేదబుద్ధి ఎన్నడూ లేదు; ఇకపై ఉండదు.

మంథర: రాణీ! నీ మేలుకోరి చెప్పిన మాటలన్నీ పెడచెవిన పెడుతున్నావేమి? రాజ్యాన్ని ఎప్పుడూ పెద్ద కుమారునికే కట్టబెడతారు. మరల అతడు తన పెద్ద కుమారుణ్ణి రాజు చేస్తాడు. కాబట్టి నువ్వు అనుకుంటున్నట్లుగా, భరతుడు ఎన్నటికీ రాజు కాలేడు. ఇక ఈ రాజవంశంలో భరతుని పేరు ఎక్కడా కనబడదు.

నేను నీ మేలు కోరి ఇంతగా చెబుతూ ఉంటే, నువ్వు నీ సవతికి పట్టిన అదృష్టానికి సంతోషిస్తూ నాకు బహుమతి ఇస్తున్నావు. ఇదేమైనా బాగుందా? రాజనీతి తెలిసిన రాముడు రాజు కాగానే భరతుణ్ణి చంపినా చంపివేయగలడు. లేదా దేశంనుండి బహిష్కరిస్తాడు.

ఎవరికైనా దగ్గరగా ఉన్న వాళ్ళ మీదనే ప్రేమాభిమానాలుంటాయి. నువ్వు భరతుని చిన్నతనంలోనే మేనమామల ఇంటికి పంపివేశావు. అందువల్ల నీకూ, దశరథుడికీ కూడా భరతునిపై ప్రేమ లేకుండాపోయింది. భరతుడంటే విశ్వాసంగా ఉండే శత్రుఘ్నుని కూడా భరతునితో పాటే దూరంగా పంపేశావు. కనీసం శత్రుఘ్నుడైనా ఇక్కడ ఉండి ఉంటే నాకు మల్లేనే భరతుని శ్రేయస్సు గూర్చి ఆలోచించేవాడు.

రామలక్ష్మణులు అశ్వనీదేవతల్లా ఒకరినొకరు విడిచి ఉండరు. కనుక రాముడు ఎన్నటికీ లక్ష్మణుని చంపడు. కానీ భరతుణ్ణి రాముడు తప్పక చంపగలడనడంలో ఎంతమాత్రమూ సందేహం లేదు. నా మాట విని, భరతుని మేనమామ ఇంటినుండి ఏదైనా అరణ్యానికి పోయి ప్రాణాలు కాపాడుకోమని చెప్పు. అదే మంచిదని నాకు అనిపిస్తోంది. నీకైనా భరతుడు ప్రాణాలతో ఉండటం ఇష్టమే కదా!

రామునికి భరతుడు దాయాది కావటం వల్ల ఇద్దరూ సహజ శత్రువులవుతారు. బలవంతమైన సింహాలు ఏనుగుల గుంపును చెదరగొట్టి ఆక్రమించుకొన్నట్లుగా, రాముడు భరతుని వెళ్ళగొట్టి తనను తాను రక్షించుకొంటాడు. నువ్వు యౌవనంలో ఉండగా కౌసల్యను

చులకన చేసి చూసే దానవు. నీ సవతి అయిన కౌసల్య ఇప్పుడు తన పగ తీర్చుకోకుండా నిన్ను విడిచిపెడ్తుందా?

రాజ్యాభిషేకం అయిన మరుక్షణమే, సర్వసైన్యాలకు, పట్టణాలకు, పర్వతాలకు, అరణ్యాలకు రాముడు అధిపతి ఔతాడు. నువ్వు, భరతుడు సేవకులై అవమానాలపాలు కావలసివస్తుంది. అంటే రాముడికి రాజ్యాధిపత్యం రాగానే నీకూ భరతునికీ వినాశం తప్పదు.

నువ్వు బుద్ధికుశలత కలిగినదానవు. ఏదో ఒక మార్గంచేత రాముని రాజ్యంనుండి వెళ్ళగొట్టేట్లు చూడు. తండ్రి రాజ్యానికి భరతుని రాజును చెయ్యి. నీకు, నీ బంధువులకు, నాకూ కూడా శ్రేయస్సు కలుగుతుంది.

# 9వ సర్గ కైకేయి కోపగృహం చేరటం

కైకేయి: ఓ మంథరా! నీ మాటలలోని గూఢార్థం ఇప్పుడిప్పుడే బోధపడుతోంది. రాముని రాజ్యాభిషేకాన్ని ఎట్లాగైనా ఆపాలని నా మనస్సు తహతహలాడుతోంది. నా మనస్సు మొద్దుబారిపోయింది. నాకు ఏమీ తోచటంలేదు. నువ్వే ఏదైనా మంచి ఆలోచన చెప్పు.

మంథర: అమ్మా! రాణీ! నీకు అన్నీ తెలుసు. నా నోటినుండి వినాలని ఈ విధంగా మాట్లాతున్నావు. అయినా అడిగావు కాబట్టి, నాకు తోచిన సలహా చెబుతాను, విను.

పూర్వం దేవాసురులు యుద్ధం చేసే సమయంలో ఇంద్రుడు, ఇతర రాజర్షులతోపాటు నీ భర్త సహాయం కోరాడు. ఆ యుద్ధానికి దశరథ మహారాజు నిన్నుకూడా తీసుకొని వెళ్ళాడు. మీరంతా కలసి దండకారణ్య ప్రాంతంలో తిమిధ్వజుడనే రాక్షసుని బలగాలను ఎదుర్కొన్నారు. వారిలో శంబరుడనే వాడు బహు మాయావి. దేవతలందరినీ జయించి ఇంద్రునితో తలపడ్డాడు. ఆ మహాయుద్ధంలో గాయపడ్డ వారిని రాక్షసులు రాత్రిపూట నిర్దాక్షిణ్యంగా చంపడం మొదలుపెట్టారు.

ఆ సమయంలో దశరథ మహారాజుకు కూడా యుద్ధంలో బాగా గాయాలయ్యాయి. ఒళ్ళు తెలియకుండా రథంలోనే పడి ఉన్న దశరథుని, నువ్వు రథసారథ్యం వహించి అతినేర్పుగా కాపాడావు. అయినా రాక్షసులు అక్కడకు కూడా వచ్చి దశరథుని చంపేందుకు ప్రయత్నించారు. అప్పుడు కూడా నువ్వు బహు చాకచక్యంగా నీ భర్తను రక్షించుకున్నావు. తరువాత నీ సాహసానికి, చాకచక్యానికి మెచ్చుకొని, “ఓ రమణీ! నువ్వు నాకు రెండుసార్లు ప్రాణదానం చేశావు. కనుక నేను నీకు రెండు వరాలు ఇవ్వదలచాను. కోరుకో” అన్నాడు. అప్పుడు నువ్వు పతిప్రాణాలు కాపాడటం నా ధర్మంకదా అని చెప్పినా ఆయన నిన్ను రెండు వరాలు కోరుకొమ్మని బలవంతపెట్టాడు. అంతట నువ్వు “నా కెప్పుడు కావాలో ఆ సమయంలో కోరుకొంటా” నని ఆయనతో అన్నావు.

అమ్మా! కైకేయీ! ఈ కథ అంతా నువ్వే నాకు అనేక సందర్భాలలో చెప్పావు. నీ శౌర్యపరాక్రమాలను రోజూ మననం చేసుకుంటూ ఈ కథను జ్ఞాపకం పెట్టుకున్నాను. ఇంకా నువ్వు ఆ వరాలను కోరుకోలేదు సుమా.

దేవీ! ఇప్పుడు నువ్వు ఆ వరాలు కోరుకొనే సమయం వచ్చిందని అనుకొంటున్నాను. భరతునికి యౌవరాజ్యాభిషేకం చేయమని ఒక వరం కోరుకో. రాముని పద్నాలుగేళ్ళపాటు వనవాసానికి పంపమని రెండో వరం కోరుకో. అంటే భరతుడు పద్నాలుగేళ్ళ పరిపాలనలో రాముడిని మరిపించి తన రాజరికాన్ని సుస్థిరం చేసుకుంటాడు.

ఇక ఆ వరాలను అడిగే విధానం కూడా చెబుతాను విను. నగలన్నీ తీసివెయ్యి. చిరిగిపోయిన, మాసిపోయిన చీర ధరించు. కోపం నటించు. అలక గృహంలో పడుకో. మహారాజు వచ్చి నిన్ను అనునయించినా పలకవద్దు. ఆయన అనునయించిన కొద్దీ ఏడుస్తూ నేలపై పొర్లిగింతలు పెట్టు.

అంతట మహారాజు నీ దైన్యస్థితి చూసి హడలిపోతాడు. ఏమీ పాలుపోక "రాణీ! నీ దుఃఖానికి కారణం ఏమిటో చెప్పు, ఇంద్రుడినైనా ఎదిరిస్తాను. ప్రాణత్యాగానికైనా సిద్ధపడతాను. కానీ నీ దుః ఖాన్ని భరించలే" నని పరిపరి విధాల వేడుకుంటాడు.

అమ్మా, కైకేయీ! ఆయనకు నీపై గల అనురాగాన్ని వెలకట్టలేము. ఆ విషయంలో మిగతా రాణుల కంటే నువ్వు అదృష్టవంతురాలవు. నీకు మణులు, మాణిక్యాలు ఇస్తానంటాడు. నువ్వు దేనికీ లొంగరాదు. మరీ తెగేదాకా లాగకూడదు సుమా! సరైన సమయం చూసి ఈ రెండు వరాలు అడిగెయ్యి.

దశరథ మహారాజు ధర్మశీలుడు. ఆడినమాట తప్పనివాడు. మొదట కాస్త తటపటాయించినా, చివరకు నువ్వు కోరిన రెండు వరాలనూ ప్రసాదించగలడు. నా మాట నమ్ము.

కైకేయి స్వభావంచేత మంచిదే అయినా, దుష్టసాంగత్యం చేత క్షణకాలం బాలికలా మంథర పన్నాగానికి బానిస అయింది.

కైకేయి: ఓ మంథరా! నిన్ను ఇంతకాలం ఏదో ఒక దాసీని చూసినట్లుగానే చూశానే గాని, నువ్వు నా పట్ల ఇంత ప్రేమాభిమానాలు కలిగి ఉంటావని అనుకోలేదు. అంతేకాదు, నువ్వు ఇంత వివరంగా చెప్పకపోయినట్లయితే నా భర్త నా పట్ల చేస్తున్న దుర్మార్గాన్ని తెలుసుకోలేకపోయేదాన్ని. నా కళ్ళు తెరిపించావు. నువ్వు ప్రపంచంలో ఉండే గూని వాళ్ళందరిలోకి శ్రేష్ఠురాలవు సుమా! ఆ మాటకొస్తే, నీకూ మిగతా గూని వారికీ పోలికే లేదు. వాళ్ళంతా వీపుపైన ఇంత గూనితో ఉంటూ వంకరటింకర అవయవాలతో అందవిహీనంగా ఉంటారు. నువ్వు అట్లా కాదు. గూని వారందరిలోకి అందగత్తెవు. వీపుపై నీ గూని ఎంత ఎత్తుగా బైటకు కనిపిస్తుందో అంతే ఎత్తున ముందు ప్రక్కగూడా నీ ఎత్తైన వక్షస్థలం బిగువుగాను, బింకంగాను ఉండే నీ స్తనాల అందాలను ఏమని వర్ణించి చెప్పను? ఆ అందాలు తమకు లేకపోయాయే అనే దిగులుతో నీ బొడ్డు, పొట్ట సిగ్గుతో చిక్కిపోయాయి. నీ ముఖం చంద్రబింబంలా వెలిగిపోతోంది. నువ్వు గూని చేత వంగి నడుస్తున్నా నీ ముఖం మాత్రం అందవికారంగా లేదు. వంగిన తామరపూవులా ఉంది. తొడలు, పిక్కలు, అందమైన పాదాలతో నువ్వు నడచి వెళ్తూ ఉంటే రాజహంసలా ఉంటావు సుమా! నువ్వు తెల్లని చీరకట్టుకొని మొలలో గజ్జలు కట్టుకొని నడుస్తూంటే కోయిలలు సన్నగా గానం చేస్తున్నట్లుంటుంది.

ఓ మంథరా! యుద్ధంలో శంబరాసురుడి మాయలు చూశాను. కానీ వాడి మాయలకన్నా ఎన్నో వేలరెట్లు నీలో మాయలు ఉన్నాయి. ఎన్నో రాజనీతులు ఉన్నాయి. రాముడు అడవులకు పోయి, భరతుని పట్టాభిషేకం కాగానే నీ గూనుకు బంగారు తొడుగు చేయిస్తాను. బంగారు మాలలు చేయిస్తాను. నీ ముఖాన బంగారు తిలకం దిద్దిస్తాను. ఇంకా ఎన్నో అందమైన అలంకారాలు చేయిస్తాను. నీ వైభవం చూసి నా సవతులంతా అసూయపడేట్లు చేస్తాను. నా దాసీలంతా నీకు పాదసేవ చేసేట్లుగా చేస్తాను. ఇంకా ఎన్ని చేసినా నీ ఋణం తీర్చుకోలేను

సుమా!

మంథర: కైకేయీ! నువ్వు ఈ మాటలతో కాలం వృథాచేస్తున్నావు. ఈలోగా రామపట్టాభిషేకం జరిగిపోతుంది. అప్పుడు చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లవుతుంది మన బ్రతుకు. నదిలో నీరంతా పోయిన తర్వాత ఆనకట్టలు కడితే ఏమైనా ప్రయోజనం ఉంటుందా? చెప్పు. కాబట్టి ఇట్లాంటి మాటలతో కాలయాపన చేయవద్దు. వెంటనే రంగంలోకి దిగు, రాజును పిలిపించు. నీ చాకచక్యం అంతా చూపించు. అనుకున్న పని సాధించు. ఆపైన ఈ మాటలన్నీ చెప్పు.

మంథర ఆ విధంగా కైకేయిని పెడమార్గాన నడిపించింది. ఆమె కళ్లు, బుద్ధికూడా మూసుకుపోయేంత వరకు ఆమెను ప్రేరేపించింది. కైకేయి ఆ క్షణాన బుద్ధిహీనురాలయింది. తన అందమైన ముఖానికి వన్నె తెచ్చిపెట్టే ఎంతో విలువైన ఆభరాణాలన్నీ తీసి అవతల పారేసింది. మంథరతో కలసి కోప గృహంలోనికి ప్రవేశించింది. కటిక నేలపై పడుకుంది.

కైకేయి: ఓ కుబ్జా! మంథరా! నేను ఇప్పుడే ప్రతిజ్ఞ చేస్తున్నాను. రాముడు అడవులకు వెళ్లి భరతుని పట్టాభిషేకమైనా జరగాలి. లేదా నేను ఇక్కడే మరణించాలి. ఈ రెంటిలో ఏదో ఒకటి తప్పక జరిగి తీరాలి. పోయి రాజుకు నా మాటగా చెప్పు.

మంథర: ఓ రాణీ! రాముడు రాజైతే నువ్వు, నీ కొడుకు అనేక కష్టాలు పాలుకాక తప్పదు. అందువల్ల నూరు ఆరైనా నీ పట్టు విడువరాదు. నువ్వు అనుకొన్నది సాధించాలి. భరతునికి పట్టాభిషేకం జరిగి తీరాలి.

కైకేయి: ఓ మంథరా! నువ్వు పదేపదే చెబుతున్న మాటలు తలచుకొంటూ ఉంటే దుఃఖం పొర్లుకొనివస్తోంది. రాముడు అడవులకు పోయి తీరవలసిందే. అట్లా జరుగకపోతే, ఇకపైన ఈ చీకటి ఇంట్లోనుండి బైటకురాను. చందన లేపనాలేవీ ఒంటికి పులుముకోను. అన్నమే తినను. నీళ్ళు త్రాగను. ప్రాణత్యాగం చేస్తాను.

శాపగ్రస్తురాలైన దేవకన్యలాగా, కైకేయి ఆ చీకటిగదిలో కటిక నేలపై పడుకుంది. అంత చీకటి గృహంలో కోపంతో రగిలిపోయే ఆమె ముఖం మాత్రమే ఎర్రగా తెలుస్తోంది. ఆమె నేలపై విసిరికొట్టిన రత్నహారాలు, మణిమాణిక్యాలు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి.

## 10వ సర్గ దశరథ మహారాజు కైకేయిని ఓదార్చడం

పాపాత్మురాలైన మంథర చేసిన దుర్బోధలన్నీ కైకేయికి తలకెక్కాయి. తాను దశరథమహారాజు వచ్చినప్పుడు నడుచుకోవలసిన తీరును గూర్చి మంథరతో చర్చించింది. అంతలోనే తాను తలపెట్టిన కార్యం సఫలమవుతుందా, కాదా? అని బేలవలె భయపడసాగింది. వారిద్దరూ కూడబలుక్కుని 'అంతా బాగుందని' అనుకున్నారు.

కైకేయి తీసిపారవేసిన నగలన్నీ చిందరవందరగా పడి ఆకాశంలో నక్షత్రాల్లా ప్రకాశిస్తున్నాయి. మాసిన చీర కట్టుకుంది. చక్కగా అల్లుకున్న జడను విడదీసి జుట్టంతా విరబోసుకుంది. కటిక నేల మీద మరణించిన కిన్నర స్త్రీలా పడి ఉంది.

దశరథమహారాజు రాముని పట్టాభిషేకం విషయంగా ఏర్పాట్లు చేయడంలో తలమునకలై ఉన్నాడు. మిగిలిన ఏర్పాట్లన్నింటినీ అతి సన్నిహితులైన వారికి, పురోహితులకు అప్పగించి తాను అంతఃపురానికి వెళ్ళాడు.

ఇంతవరకు రాముని పట్టాభిషేకం విషయం తన గుప్పెట్లో పెట్టుకొని వ్యవహరిస్తూ వచ్చాడు. సమయం దగ్గర పడుతున్నకొద్దీ, విషయాలన్నీ ఒక్కొక్కటిగా బహిర్గతమవుతున్నాయి. ఇంకా ఆలస్యం చేయకూడదని అనుకున్నాడు. ఈ విషయాలన్నీ బయటకు వచ్చాయి కాబట్టి కైకేయికి తానే స్వయంగా చెప్పటం ఉచితంగా ఉంటుందని అనుకున్నాడు. ఈ విధంగా తనలో తానే అనుకుంటూ కైకేయి మందిరాన్ని ప్రవేశించాడు.

కైకేయి మందిరంలో నెమళ్ళు, రాజహంసలు, క్రౌంచపక్షులు పెంచబడుతూ ఉంటాయి. అందువల్ల ఎప్పుడూ వాటి కిలకిలారావాలతో సందడిగా ఉంటుంది. ఇంటినిండా అనేక మంది గూనివాళ్లు, మరుగుజ్జులైన దాసీలు సందడిగా తిరుగుతూ ఉంటారు. అన్ని ఋతువుల్లోనూ పుష్పించే వృక్షాలతో కూడిన ఆరామాలెన్నో ఉన్నాయి. వాటి మధ్య దంతంతోను, వెండి

బంగారాలతోను తాపడం చేసిన ఆసనాలుంటాయి. చూసే వారికి ఆహ్లాదం కలిగిస్తూ ఇంద్రుని ఉద్యానవనమా అని అనిపిస్తూ ఉంటుంది.

అటువంటి భవనంలోకి దశరథుడు కామోద్రేకంతో రతికోసం వచ్చాడు. అక్కడ మనుష్య సంచారంలేదు అంతా నిశ్శబ్దంగా ఉంది. ఎప్పుడూ తాను రాగానే కైకేయి ఎదురువచ్చి సాదరంగా ఆహ్వానించి తీసుకువెళ్ళేది. ఈనాడు ఆమె జాడ అయినా తెలియటంలేదు. మనస్సు ఏదో కీడును శంకిస్తూ ఉండగా, అక్కడున్న ద్వారపాలకుని అడిగాడు.

ద్వారపాలకుడు: మహారాజా! రాణిగారు బాగా కోపంగా ఉన్నారు. ఆమె ఇప్పుడు అలకాగృహంలో ఒంటరిగా ఉన్నారు.

ద్వారపాలకుని మాటలు విన్న దశరథుని ఉత్సాహమంతా నీరు కారిపోయింది. దుఃఖంతో నిండిన మనస్సుతో కైకేయి ఉన్న కోపగృహాన్ని చేరుకున్నాడు. కైకేయి కుపితురాలై నేలపై మరణించిన దానిలా పడి ఉంది.

కైకేయి మరణించిన దానిలా కటికనేల మీద పడి ఉండటం దశరథుడు చూశాడు. ఆమె జుట్టంతా దయ్యం పట్టినదానిలా విరబోసుకుంది. ఆమె విసరివేసిన మణిమాణిక్యాలన్నీ నక్షత్రాల్లాగా మెరిసిపోతున్నాయి.

అప్పుడు దశరథుడు, కైకేయిని అనునయిస్తూ ఇలా అన్నాడు:

“ఓ దేవీ! నువ్వు ఎల్లప్పుడూ మంగళకరమైన లక్షణాలు కలిగి ఉండేదానవు. ఈ రోజు నీకు నాపై కోపం ఎందుకు వచ్చిందో తెలియటంలేదు. నిన్ను ఎవరైనా అవమానించారా? దూషించారా? ఏ కారణం చేత నీవు ఈ కోపగృహంలో ఒంటరిగా పడి ఉన్నావు. నీవు నోరు తెరచి అడిగిన వెంటనే ఎంతటి కష్టసాధ్యమైన కోరికనైనా కూడా తీర్చేందుకు నేనుండగా నీవెందుకు దుఃఖించుచున్నావు? పీకిపారవేసిన తీగవలె వడలిపోయి ఉన్నావు.

నీవేమైనా అనారోగ్యంతో బాధపడుతున్నావా? నీ బాధ ఏమిటో చెప్పు. వెంటనే రాజవైద్యులను పిలిపిస్తాను. లేదా ఎవరికైనా ఏమైనా సహాయం చేయాలని అనుకొంటున్నావా? లేక ఎవరైనా నీకు అపకారం తలపెట్టారా? నిన్ను సంతోషపెట్టేందుకు నన్ను ఏం చేయమంటావో ఆజ్ఞాపించు. నిన్ను కష్టపెట్టినవాడు చంపదగినవాడైతే చంపుతాను. ఒకవేళ నేను స్వయంగా చంపరాదన్న నియమమున్నట్లయితే, ఎవరిచేతనైనా చంపిస్తాను. నీకు ప్రీతిపాత్రుడైన వాడు ఒకవేళ దరిద్రుడైతే వాడిని కుబేరునిగా చేస్తాను. ఒకవేళ నీకు అపకారం తలపెట్టినవాడు సంపన్నుడే అయితే వాడి సంపద లన్నింటినీ హరిస్తాను.

కైకేయీ! నేను, నాకు సంబంధించిన వారంతా నీ అధీనంలోని వాళ్లమే గదా! నిన్ను వ్యతిరేకించే వారెవరైనా సరే, నేను సహించను. నీ కోసం నా ప్రాణాలనే అర్పిస్తాను. నీకు నాపై ఎంత అధికారమున్నదో నువ్వు ఎరుగవా? ఈ మాటలన్నీ కూడా నేను చేసిన పుణ్యంపై ఒట్టుపెట్టుకొని చెబుతున్నాను. నన్ను నమ్ము. నీ కేది ఇష్టమో అది తప్పక చేస్తాను."

అంతట కైకేయి తన భర్త చేత శపథం చేయించుకొని గాని తన మనస్సులోని మాటను బయట పెట్టరాదని నిశ్చయించుకొంది.

# 11వ సర్గ కైకేయి వరం కోరుకోవడం

కామోద్రేకంతో ఉన్న దశరథుణ్ణి చూసి కైకేయి, ఇకపై ఆలస్యం చేయరాదనుకుంది. తన మనస్సులో మాట బయటపెట్టే సమయం వచ్చిందని అనుకొంది. అయినా భర్త నుండి మరొకసారి ప్రతిజ్ఞ తీసుకొనిగాని తన కోరిక బయటపెట్టరాదని అనుకుంది.

కైకేయి: మహారాజా! నన్ను ఎవరూ అవమానపరచలేదు. నాకో కోరిక కలిగింది. ఆ కోరికను మీరు నెరవేరుస్తానని ప్రతిజ్ఞ చేస్తేనే, నా కోరిక ఏమిటో చెప్పగలను. లేకుంటే వృథాయే గదా!

దశరథుడు: (నవ్వుతూ ఆమె చేతిని తన చేతిలోనికి తీసుకుంటూ) ప్రియురాలా! నాకీ ప్రపంచంలో నువ్వు, రాముడు తప్ప మరెవ్వరూ అంతటి ప్రియమైన వారు కారని నీకు తెలియదా? నా పంచప్రాణాలు రాముడే అని నీకు తెలుసుగదా! అట్టి రాముడి మీద ఒట్టుపెట్టి ప్రతిజ్ఞ చేస్తున్నాను. నీకు ఏం కావాలో చెప్పు. రాముణ్ణి చూడకుండా బ్రతుకలేను. అటువంటి రాముడి మీద ఒట్టుపెట్టి చెబుతున్నాను. నేనింతవరకు సంపాదించిన పుణ్యం మీద ఒట్టుపెట్టి చెబుతున్నాను. నీ కోరిక చెల్లిస్తాను. నన్ను నమ్ము.

కైకేయి: మహారాజా! నా కోరిక చెల్లిస్తానని మీరు సంపాదించిన పుణ్యం మీద, రాముడి మీద ఒట్టుపెట్టుకున్నారు. మీరు చేసిన ఆ వాగ్దానాన్ని అగ్నిదేవుడు, ముక్కోటి దేవతలు విన్నారు. సూర్యచంద్రులు, ఆకాశం, గ్రహాలు, రాత్రి, పగలు, దిక్కులు సర్వజగత్తు విన్నారు. గంధర్వులు, రాక్షసులు, సర్వభూతాలు మీ మాటలు విన్నారు.

రాజా! మీరు సత్యవ్రతులు, పరమ ధార్మికులు. మీరు నాకు రెండు వరాలు ఇచ్చారు. అందుకు పైన చెప్పిన ముక్కోటి దేవతలంతా సాక్షులు. ఆ వరాలు రెండూ ధర్మానుసారంగా మీరు నాకు ఇవ్వాలి. అట్లా ఇవ్వలేనని తప్పించుకోవటానికి ప్రయత్నిస్తే నేను ప్రాణత్యాగం

చెయ్యటానికి సిద్ధపడి ఉన్నాను.

దశరథుడు: ఓ కైకేయీ! నేను ధర్మబద్ధుడనై ఉంటాను.

కైకేయి: ఓ రాజా! వెనుక దేవాసురయుద్ధం జరిగినప్పుడు మీరు ఇంద్రుని పక్షాన పోరాడారు. ఆ యుద్ధంలో మాయావి అయిన శంబరాసురుడు అందరినీ సంహరించుకుంటూ వచ్చాడు. అప్పుడు మీరు స్పృహతప్పి ఉన్నారు. ఇంకొద్ది క్షణాల్లో వాడు మిమ్మల్ని సంహరించేవాడే కానీ నేను రథసారథ్యం వహించి మిమ్మల్ని అక్కడనుండి తప్పించి ప్రాణాపాయం నుండి కాపాడాను. మిమ్మల్ని కాపాడిన కొద్దిసేపటికే మరల ఇంకో ఉపద్రవం ముంచుకొచ్చింది. అప్పుడుకూడా మళ్ళీ ప్రాణాలు పోయేస్థితిలో మిమ్మల్ని సురక్షితమైన ప్రాంతానికి చేర్చి సేవలుచేసి మీ ప్రాణాలు కాపాడాను. మీ ప్రాణాలు రెండుసార్లు కాపాడాను కాబట్టి నన్ను రెండు వరాలు కోరుకోమన్నారు.

నాథా! మీరు భూమినంతా ఏలుతున్న మహారాజులు, పైగా నాకు భర్త. సత్యసంధులు, ధర్మపరాయణులు. కాబట్టి ఆ వరాలు రెండూ మీ వద్దనే దాచుకున్నాను. వాటి అవసరం వచ్చినప్పుడు కోరుకుంటాను, అప్పటి వరకూ మీ వద్దనే దాచి ఉంచండి అని కోరాను. మీరు కూడా అంగీకరించారు. ఆ రెండు వరాలు ఇప్పుడు కోరుకుంటున్నాను. అదే నా కోరిక. మీరా వరాలు ఇవ్వటానికి నిరాకరించినట్లైతే, నాకు అంతకన్నా పెద్ద అవమానం మరొకటి ఉండదు. ఆ అవమానభారంతో జీవించడం కన్నా, మరణమే నాకు శరణ్యం అవుతుంది.

దశరథుడు: దేవీ! నీకు నే నిచ్చిన వరాలు జ్ఞాపకమున్నాయి. నువ్వు కోరే ఆ వరాలు రెండూ నేను చెల్లిస్తాను. అవి ఏమిటో చెప్పు?

కైకేయి: నాథా! ప్రశాంతంగా వినండి. రాముడి రాజ్యపట్టాభిషేకం చేయడానికి అన్ని ఏర్పాట్లు చేశారు గదా! ఆ యౌవరాజ్య పట్టాభిషేకాన్ని రాముడికి బదులుగా భరతుడికి చేయండి. ఇదే నేను కోరే మొదటి కోరిక. ఇక రెండవ వరం. రాముడు పట్టుపీతాంబరాలన్నీ

వదలి, నారబట్టలు ధరించి పద్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసం చేయాలి. ఇదే నా రెండవ కోరిక.

ప్రభూ! ఇంక ఏమాత్రమూ ఆలస్యం కాకుండా రాముడు ఈ క్షణాన్నే అడవులకు వెళ్ళిపోవాలి. మీరు సత్యవ్రతులు అయితే, ధర్మాన్ని పరిరక్షించేవారయితే ఈ రెండు వరాలను ఇప్పుడే అమలు చేయండి. మీ వంశగౌరవాన్ని నిలబెట్టుకోండి. సదాచారాన్ని పాటించేవారికే ఇహమూ, పరమూ దక్కుతాయని, జన్మసార్థకమవుతుందని తపోధనులు వచిస్తారు.

# 12వ సర్గ దశరథుడు కైకేయిని నిందించడం

కైకేయి మాటలకు దశరథుని తల గిర్రున తిరిగినట్లయింది. తాను విన్నదంతా కలా, నిజమా అన్న సందేహం కలిగింది. లేక మనస్సేమైనా చెదరి అట్లా వినిపిస్తోందా అన్న భ్రమ కలిగింది. కొద్దిసేపటికి తేరుకుని, కైకేయి వంక చూశాడు. ఆమెపై పెట్టుకొని వచ్చిన తీయని ఊహలన్నీ మటుమాయమయ్యాయి. ఎదురుగా ఒక ఆడపులి ఉన్నట్లు ఉలిక్కిపడ్డాడు. మహామంత్రంచే బంధించబడిన సర్పంలా విలవిలలాడిపోయాడు. కొద్దిగా స్పృహ వచ్చీ రాగానే "అయ్యో!" అని నిట్టూరుస్తూ, కైకేయిని చూసి "ఛీ ఛీ" అని చీదరించుకుంటూ మళ్ళీ స్పృహ కోల్పోయాడు.

దశరథుడు: (కళ్ళతో నిప్పులు చెరగుతూ) క్రూరాత్మురాలా! మా వంశ నాశనానికి దాపురించావా? నేనుగాని, బాలుడైన రాముడుగాని నీకు ఏం అపకారం చేశాం? రాముడు నిన్ను కౌసల్యకన్నా ఎక్కువగా ప్రేమించాడు.

నువ్వు విషసర్పానివని గ్రహించలేకపోయాను. రాజకుమార్తెవు గదా అని వలచి వివాహమాడాను. నా వంశాన్ని నేనే చేతులారా నాశనం చేసుకున్నట్లయింది గదా! లోకంలో జనులంతా రాముని గుణగణాలను వేనోళ్ళ స్తుతిస్తున్నారు. నేను వారందరికీ ఏమని సమాధానం చెప్పగలను? కౌసల్య సుమిత్రలను, నా రాజ్యాన్ని, నా సర్వస్వాన్ని గడ్డిపరకలాగా విడిచి పెట్టగలను, కానీ రాముణ్ణి విడువలేను. నాలో చైతన్యం ఉన్నదంటే అది రాముణ్ణి చూసుకునే! రాముడు లేని రోజున నేను మరణించిన వాడితో సమానం. సూర్యుడు లేకుండా జీవరాశి బ్రతుకవచ్చు. నీరు లేకుండా వృక్షాలు జీవించవచ్చు కానీ రాముణ్ణి చూడకుండా నేను బ్రతుకలేను.

ఓ కైకేయీ! నాపై దయ చూపించు. నీ పాదాలు పట్టుకొని వేడుకుంటున్నాను, నన్ను అనుగ్రహించు. నీ రెండు కోరికలు వెనక్కు తీసుకో.

కైకేయీ! భరతునిపై నాకేపాటి ప్రేమ ఉన్నదో పరీక్షించదలచావా? అసలు నీ కిలాంటి ఆలోచన ఎట్లా వచ్చింది? పూర్వం రాముణ్ణి గూర్చి నువ్వేమనేదానవో గుర్తున్నదా? "శ్రీమంతుడైన రాముడే నా పెద్ద కుమారుడు. రాజ్యాధికారంతోసహా ధర్మసమ్మతమైన విషయాలన్నింటిలోను అధికారం పెద్దవాడైన రాముడికే ఉన్నది" అని అందరితో గర్వంగా చెప్పేదానవు. నీ నోట ఈ మాట రోజూ అంతా వింటున్నదే! ఈ రోజు నన్ను ఆటపట్టించడానికి ఇంత క్రూరమైన మాటలు నీ నోట వచ్చాయి. నా మీదా, నా దేశ ప్రజల మీదా కనికరం చూపించు. నీ కఠినమైన మాటలను నీ నోటితోనే ఉపసంహరించు. లోకకల్యాణానికి దోహదం చెయ్యి.

ఓ కైకా! ఇంతవరకూ లోకంలో అంతా బుద్ధిమంతురాలు, నీతిమంతురాలు ఎవరంటే, 'కైకేయి' అని చెప్పుకుంటూ వచ్చారు. అటువంటి నీకు ఇటువంటి దురాలోచన ఎట్లా వచ్చింది. రామరాజ్యాభిషేకం అని తెలియగానే ఈ కోపగృహంలోకి ప్రవేశించావు? నా మీదగాని, రాముడి మీదగాని ఎవరైనా చాడీలు చెప్పారా? వారి చెప్పుడుమాటలకు లొంగిపోయావు. నువ్వు దుః ఖీస్తున్నావు. నన్ను బాధపెడుతున్నావు.

ఓ కైకా! నువ్వు ఇంతవరకు నాకు అయిష్టమైన పని ఒక్కటి కూడా చేయలేదు. ఒక పరుషమైన మాట మాట్లాడి ఎరుగవు. అందువల్లనే నువ్వు మాట్లాడిన మాటలను ఇంకా నమ్మలేకపోతున్నాను.

కైకా! ధర్మాత్ముడు, సత్కీర్తిగల రాముణ్ణి పదునాలుగు సంవత్సరాలు వనవాసం చెయ్యమని ఎందుకు కోరావు? "నాకు రాముడు మహాత్ముడైన భరతునితో సమానుడే" అని చెప్పేదానవు కదా? ఆ మాటలన్నీ ఏమైపోయాయి! రాముడు పసిబాలుడు, సుకుమారుడు. స్థిరమైన ధర్మబుద్ధి గలవాడు. పుట్టినప్పటినుండే రాజభోగాలు అనుభవించినవాడు. అట్టి రాముడు అరణ్యాలలో నివసించగలడని ఎట్లా ఊహించావు? ఎంతమంది దాసీలు, సేవకులు ఉన్నా కూడా రాముడు ప్రతిరోజూ నీకు సేవలు చేస్తూ ఉంటాడు గదా! అటువంటి రాముణ్ణి

దూరంగా ఎందువల్ల పంపుతున్నావు?

రాముడు మహావీరుడు. అతడు ధర్మ, దయా, దాన, యుద్ధ, వీరత్వాలనే నాలుగు విధాలైన వీరత్వాన్ని కలిగి ఉన్నాడు. అతడు ఎన్నడూ, నిందాకార్యాలను చేయడు. దానాలు చేసి దీనులను ఉద్ధరిస్తాడు. శుశ్రూష చేత గురువులను మెప్పిస్తాడు. యుద్ధంలో పరాక్రమంచేత శత్రువును జయిస్తాడు.

సత్యం, దానం, తపస్సు, ఇతరుల శ్రేయస్సుకై త్యాగం త్రికరణాలందు శుద్ధి, విద్య, నిష్కాపట్యం, గురుశుశ్రూష మున్నగునవన్నీ రాముని ఐశ్వర్యాలు. నిష్కాపట్యంలో దేవతలతో సమానుడు. తేజస్సులో మహర్షులతో సమానుడు. సహనం, ఇంద్రియనిగ్రహం, త్యాగం, సత్యం ధర్మం, కృతజ్ఞత, సకల భూతాల పట్ల సమభావం మున్నగునవన్నీ రాముని గుణాలు. ప్రజలందరితోనూ ప్రియంగా మాట్లాడతాడు. రాముడే నాకు దిక్కని నమ్ముకొని బ్రతుకుతున్నాను. నా రాజ్యమంతా నీకు ధారదత్తం చేస్తాను, కానీ రాముణ్ణి మాత్రం అడవులకు పంపవద్దు.

కైకా! నేను వృద్ధుణ్ణయ్యాను. జీవితంలో చివరి భాగాన ఉన్నాను. ఈ వయస్సులో నన్ను దుః ఖీతుణ్ణి చేయవద్దు, నాపై కరుణ చూపించు. నీకు చేతులు జోడించి నమస్కరిస్తాను. నీకు పాదాభివందనం చేస్తాను. రాముణ్ణి మాత్రం నాకు అనుగ్రహించు. నీ కోరిక ఉపసంహరించుకొని నాకు అధర్మం వాటిల్లకుండా చూడు.

కైకేయి: మహారాజా! నీవు మహావీరుడవు. లోకంలో ధార్మికుడవన్న పేరు ఉంది. వరాలు నువ్వే ఇచ్చావు. ఇప్పుడు పశ్చాత్తాపపడి దుఃఖీస్తున్నావు. ఇట్లా మాట్లాడటం వల్ల నీ ప్రతిష్ఠ పెంపొందేదిగా లేదు. పైగా నీతోటి రాజర్షుల ముందు ఏమని బదులు చెప్పగలవు. నీవు ఏ కైకేయి దయచేత ఇన్ని సంవత్సరాలు జీవించి ఉన్నావో అట్టి కైకేయి కిచ్చినమాట తప్పుతున్నావు. ఎన్నడో యుద్ధంలో ఇచ్చిన వరాలేకాదు, కొద్దిక్షణాలకు ముందు ప్రతిజ్ఞ కూడా చేశావు. ఈ

విధంగా మాట తప్పటం అటు రాజులకూ, ఇటు ఇక్ష్వాకుల వంశానికీ కూడా కళంకం తెస్తుంది.

డేగకు, పావురానికి మధ్య వైరం వచ్చినప్పుడు శిబిచక్రవర్తి తన శరీరంనుండి మాంసాన్ని డేగకు సమర్పించాడు. అలర్కుడనే రాజు తనను యాచించిన ఒక గ్రుడ్డి బ్రాహ్మణునికి తన నేత్రాలనే దానం చేశాడు. సముద్రం దేవతల కిచ్చిన మాట నిలబెట్టుకోవటం కోసం ఈ రోజువరకూ చెలియలికట్టను దాటి రావడంలేదు. ఇదంతా ఎందుకోసం చేశారు? తాము ఇచ్చినమాట కాపాడుకోవటం కోసం! అందువల్లనే నేటికీ వారిని స్మరిస్తున్నాం. కాబట్టి నీవుకూడా చేసిన ప్రతిజ్ఞను నిలబెట్టుకో.

ఓ రాజా! నీ దుష్టబుద్ధి స్పష్టంగా తెలుస్తూనే ఉంది. రాముడికి రాజ్యం కట్టబెట్టి, కౌసల్యతో కులకాలని దురాలోచన చేస్తున్నావు. నీవు నాకు ధర్మాధర్మాలు చెప్పకు. నేను నీ విచ్చినమాట ప్రకారం నా కిచ్చిన వరాలను ఇప్పుడు ఇమ్మని అడుగుతున్నాను. నేనడిగే దాంట్లో కొంచెమైనా అధర్మంగాని, అసత్యంగాని లేదు.

ఓ రాజా! నీ విచ్చిన మాటతప్పి రామునికి రాజ్యాభిషేకం చేసినట్లయితే, నేను ఇప్పుడే ఇక్కడే విషం పుచ్చుకొని మరణిస్తానే గాని, కౌసల్యను రాజమాతగా అంగీకరించను. భరతునిపైన, నాపైన ఒట్టువేసుకొని మరొకసారి చెబుతున్నాను. "భరతుని రాజ్యాభిషేకం, రాముని వనవాసం తప్ప మరేమీ నన్ను సంతోషపరచలేవు. నేను జీవించి ఉండాలంటే ఇచ్చిన రెండు వరాలు వెంటనే అమలు పరచవలసిందే."

దశరథమహారాజు పదేపదే ఎన్నో విధాలుగా చెప్పి చూశాడు. బ్రతిమాలాడు, కాళ్ళావేళ్ళాపడ్డాడు. అయినా ఆమె మనస్సు కరుగలేదు. కొద్దిసేపు ఆమెవంకే చూస్తూ ఉండిపోయాడు. భరతుని పట్టాభిషేకం, రాముని వనవాసం అన్న ఆమె పలుకులు సముద్రఘోషలా వినిపించాయి. మనస్సంతా మొద్దుబారిపోయింది. మొదలు నరికిన చెట్టులాగా కూలిపోయాడు. మతి భ్రమించినవాడిలా పిచ్చిచూపులు చూడసాగాడు. ఏదో మాట్లాడాలని

ప్రయత్నిస్తున్నాడేగాని మాట బయటకు రావడంలేదు. దీనంగా కైకేయి వంక చూడసాగాడు. మందస్వరంతో పలికాడు.

దశరథుడు: ఓ కైకా! నువ్వు ఇంతకుపూర్వం రాముడంటే ఎంతో ప్రేమగా ఉండేదానివి. ఈ రోజున విపరీతంగా మాట్లాడుతున్నావు. ఇంతలో నీకు వచ్చిన భయం ఏమిటి? ఈ బుద్ధి నీకే పుట్టిందా? లేక ఏదైనా దయ్యం పట్టిందా? నీకు నిజంగా నీ భర్తపైన, నీ కొడుకు భరతునిపైనా ప్రేమ ఉన్నట్లయితే రామవనవాసం మాట పూర్తిగా మరచిపో. అది మనందరికీ, వంశానికీ కూడా శుభం కలిగిస్తుంది.

ఓసీ వెర్రిబాగులదానా! భరతుడు రాముడికన్నా ధార్మికుడు. ఈ విషయం భరతుడు వింటే రాముని వనవాసానికి అంగీకరించడు.

అంతేకాదు. రాజులు, సామంతులు, మంత్రులు అందరూ కలసి రామరాజ్యాభిషేకాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు. నేను కూడా వారందరి ముందూ అంగీకారం తెలిపాను. ఇప్పుడు పోయి వనవాసం మాటచెబితే నలుగురూ నన్ను హేళనచేస్తారు. రామునికి రాజ్యాభిషేకం చేస్తానని నేనిచ్చినమాట అసత్య మవుతుంది.

ఓ కైకా! ఇంతకాలం కౌసల్య నాకు దాసిగా సేవలుచేసేది. జూదం మున్నగు ఆటపాటల్లో స్నేహితురాలుగా ఉండేది. ఒక సోదరిలాగా నా శ్రేయస్సునే కోరేది. తల్లిలాగా నన్ను లాలించేది. భార్యగా వేదవిహితమైన యజ్ఞ యాగాదులన్నింటిలోను నాకు తోడుగా ఉండేది. ఇన్ని విధాలుగా ఆమె సేవలు చేస్తున్నాకూడా, నీయందు ప్రేమచేత నా సమయమంతా నీతోనే గడిపేవాడిని. అయినా ఆమె ఎన్నడూ నీ గురించి పల్లెత్తుమాట అని ఎరుగదు. రాముడు ఆమె కడుపున పుట్టడం, పెద్దవాడు కావడం దైవనిర్ణయమేగాని ఎవరూ ప్రయత్నించి చేసింది కాదు. రాముని అడవులకు పంపమని అంటున్నావు. అటువంటి కౌసల్యకు నేను ఏమని సమాధానం చెప్పను? రోగంతో లంఖణాలు చేస్తున్న రోగికి ఊరగాయలతో కూడిన అన్నం తింటే రోగం

తిరగబెట్టినట్లుగా నేను నీ పట్ల చూపిన ప్రేమాభిమానాలన్నీ వికటించి నన్ను పీడిస్తున్నాయి. రాముణ్ణి అరణ్యాలకు పంపితే లక్ష్మణుడు ఏమైపోతాడోనని సుమిత్ర భయపడిపోతుంది. రాముడు అడవులకు పోవలసివస్తే నేను మరణించడం ఖాయం. నా మరణవార్త, రాముని వనవాసం తప్పక సీతను క్రుంగదీస్తాయి. ఇన్ని అనర్థాలకూ కారణమైన నువ్వు, భరతుడు కలసి రాజ్యాన్ని పరిపాలించుకోండి!

విషాన్ని మద్యమనుకొని త్రాగినట్లుగా ఇంతకాలం నేను కూడా నీ అందచందాలు, నీ నటన చూసి మోసపోయాను. నీ నిజస్వరూపం ఈ రోజే చూస్తున్నాను.

పూర్వం నన్ను బుజ్జగిస్తూ తియ్యటి కబుర్లు చెబుతూ లాలించే దానవు. అవన్నీ వేటగాడు గీతాన్ని పాడి లేడిని పట్టినట్లుగా నన్ను చంపుతున్నాయి. నా ప్రియమైన రాముణ్ణి అమ్ముకొని స్త్రీ సుఖం కొనుక్కున్నవాణ్ణయ్యాను. సురాపానం చేసిన బ్రాహ్మణునిలా నన్ను అంతా చులకనగా చూస్తారు. నేను పూర్వజన్మలందు చేసుకొన్న పాపఫలితంగా, నీ స్వభావం తెలుసుకోలేక ఇంతకాలం పోషించాను. పిల్లవాడు తెలియక విషసర్పంతో ఆడుకున్నట్లయింది. నా చేతులతో నేనే ఉరిత్రాడును బిగించుకున్నట్లయింది. మహాత్ముడైన రామునికి నేను తండ్రిని అని చెప్పుకోవటం కూడా దోషమే! లోకులు నన్ను తప్పక ద్వేషిస్తారు. కామానికి లొంగిపోయి స్త్రీ సుఖం కోసం కన్న కొడుకును అమ్ముకున్నానని నన్ను తప్పక ద్వేషిస్తారు. రాముడు ఇంతకాలం గురుకులంలో బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ రాజభోగాలన్నింటికీ దూరంగా ఉన్నాడు. ఇక ఇప్పుడు భోగాలు అనుభవించే సమయం వచ్చేసరికి అడవులకు పంపుతున్నాను. “నాయనా! రామా! నువ్వు అరణ్యవాసం చెయ్యాలయ్యా!” అంటే “అలాగే తండ్రీ” అంటాడే కాని ఎదురు చెప్పడు. నా మాటను జవదాటడు. రాముడు అటు అడవులకు పోగానే, నేనుకూడా యమలోకానికి ప్రయాణమవుతాను. ఇంకా ఎన్నో అశుభాలు జరుగనున్నాయి. నా వియోగాన్ని సహించలేని కౌసల్యాదేవి నన్ను అనుసరిస్తుంది. సుమిత్రకు, లక్ష్మణ శత్రుఘ్నులకు మిగతా పరివారానికందరికీ నరకాన్ని చూపిస్తూ నీ వొక్కతెవే సుఖంగా ఉండు! ఈ పరిణామాలతో

ఇక్ష్వాకువంశానికే కళంకం వస్తుంది. ఇక ఈ వంశం సర్వనాశనం కావడం తథ్యం. ఒకవేళ రాజ్యాభిషేకానికి భరతుడు కూడా ఇష్టపడితే నా మరణానంతరం అతనిచే నాకు ప్రేతకార్యాలు చేయించవద్దు.

ఓ దుష్టురాలా! నువ్వు నా వంశానికి శత్రువుగా నా ఇంట్లో ప్రవేశించావు. నీ కోరిక ప్రకారం రాముడు అడవులకు వెళ్ళగలడు. ఆ తరువాత నా మరణం కూడా సత్యమే. ఇక విధవవై నీ కొడుకుతో కలసి రాజ్యపాలన చేసుకో! ఇప్పుడు జీవించి ఉన్న ప్రాణులు, ఇకపై జీవించే ప్రాణులన్నీకూడా నన్ను ఒక మహాపాపిగా అనాదరంతో చూస్తారు. ఇంతవరకు రథాలపైన, గుర్రాలపైన, ఏనుగులపైన ఎక్కి ప్రయాణం చేసిన నా రాముడు అరణ్యంలో కాలినడకన పద్నాలుగు సంవత్సరాలు నడవబోతున్నాడని తలచుకొంటేనే నా గుండెలు పగిలిపోతున్నాయి. రాముడికి వివిధరకాలైన రుచులతో అన్నం పెట్టేందుకు వంటవాళ్ళంతా ఎగబడేవాళ్ళు. ఇకపై అరణ్యంలో దొరికే కందమూలాలు భుజిస్తూ కాలం గడపాలి. అవికూడా ఒక్కోసారి సమయానికి దొరుకుతాయి, కొన్ని సమయాల్లో దొరకవు. నా రాముడు ఆకలికి తట్టుకోగలడా? అమూల్యమైన పట్టువస్త్రాలు ధరించే నా రాముడు ఇకపై నారవస్త్రాలు ధరించి కటిక నేలపై పడుకోవలసి ఉంటుంది గదా! ఆడవారు స్వలాభంకోసం ఎంతటి అపకారాన్నైనా తలపెట్టగలరుగదా! ఈ మాట అందరి స్త్రీలకు వర్తించదు. భరతుని తల్లి మాత్రమే అట్టి స్వార్థపరురాలు.

స్వార్థపరురాలా! క్రూరురాలా! నాకు దుఃఖం కలిగించటమే లక్ష్యంగా పెట్టుకున్నావేగాని, నా వలనగాని, రాముని వలనగాని నీకు ఏ విధమైన అపకారం జరుగుతుందని అనుకొంటున్నావు? నిన్ను ఆదర్శంగా తీసుకొని కొందరు స్త్రీలు భర్తను, పిల్లలను విడిచి వేస్తారు. అన్యోన్యంగా ఉంటున్న భార్యలు భర్తలను, భర్తలు భార్యలను విడిచిపోతారు.

రాముడు చక్కగా అలంకరించుకొని దేవేంద్రునిలా వస్తూ ఉంటే, నాకు మళ్ళీ యౌవనం వచ్చినంత ఆనందం కలుగుతుంది. సూర్య చంద్రులు లేకుండా లోకవ్యవహారాలు నడుస్తాయేమోగాని, రాముడు లేకుండా ఎవరూ జీవించలేరు.

నువ్వు వినాశనాన్ని కోరుకుంటున్నావు. నువ్వు శత్రువని తెలియక ఇన్నాళ్ళూ పాలుపోసి పోషించాను. ఆ పొరపాటుకు ఈనాడు శిక్ష అనుభవిస్తున్నాను. నన్నూ రామలక్ష్మణులనూ వెళ్లగొట్టి భరతుడు, నువ్వూ రాజ్యాన్ని పాలించండి. నా శత్రువులకు ఆనందం కలిగించండి.

ఓసీ! దుష్టురాలా! నువ్వు పలికిన మాటలకు నీ నోటి దంతాలన్నీ వేయి ముక్కలైపోతాయి. రాముడెప్పుడైనా ఎవరినైనా మాటలతో నొప్పించాడా? రాముడు సకల సద్గుణసంపన్నుడు. అతడిలో ఏమి దోషం చూపించి అడవులకు పొమ్మంటున్నావు? నువ్వు కోరే కోరికలు సర్వనాశనానికి దారితీస్తాయి.

ఓసీ పాపాత్మురాలా! నువ్వు ఏడ్చినాసరే! మంటల్లోపడి కాలిపోయినా సరే, వేయిముక్కలైనా సరే! నేను మాత్రం నువ్వు కోరిన వరాలివ్వను. నువ్వు మంగలి కత్తిలాంటి దానవు. అప్రియమైన మాటలే మాట్లాడుతున్నావు. నీ దుష్టస్వభావం, నీ అసత్యపు మాటలు నా కులాన్నే చిచ్చు పెట్టుతున్నాయి. నీ ఇచ్చకాలకు, కల్లబొల్లి మాటలకు నేను లొంగిపోను. నా మనస్సును ముక్కలు ముక్కలుగా నరుకుతున్నావు. నా హృదయాన్ని దహించి వేస్తున్నావు. నువ్వు జీవించి ఉండటం శ్రేయస్కరం కాదు.

ఓ కైకా! రాముడు లేనిదే నాకు జీవితమే లేదు. ఇక సుఖా లెక్కడివి? నువ్వు నా భార్యవు. నాకు దుఃఖం కలిగించే పనులు చేయవద్దు. నీ కాళ్ళు పట్టుకొని వేడుకుంటున్నాను. నన్ను అనుగ్రహించు.

ఆ విధంగా అంటూ, లేచి దశరథుడు తూలుతూ ఆమె పాదాలు పట్టుకోబోయాడు. ఆయన తన పాదాలు తాకకుండా ఉండేందుకు కైక దూరంగా జరిగింది. నిలబడే శక్తికూడా లేని దశరథుడు కుప్పగాకూలి నేలమీద పడిపోయాడు.

# 13వ సర్గ దశరథ విలాపం

దశరథుడు, పుణ్యమంతా ఖర్చయిపోయి స్వర్గంనుండి భూమిపైపడిన యయాతిలా నేలపై పడి ఉన్నాడు. ఇట్లా దీనంగా పడి ఉండటం గాని, కాళ్ళావేళ్ళా పడటంకాని ఆయన స్వభావం కాదు; ఆయనకు అలాంటి అనుభవమూ లేదు. కైకేయి భర్త అనే భయం, లజ్జ, బిడియం అన్నీ వదిలి వేసింది. పదే పదే అవే వరాలు కావాలని పట్టుపట్టింది. పైగా "నేను సత్యవంతుడననీ, చేసిన ప్రతిజ్ఞ నెరవేరుస్తాననీ బడాయి మాటలు మాట్లాడతావు. తీరా వాటిని ఇవ్వవలసి వచ్చే సమయానికి బీదఏడుపులు ఏడుస్తున్నావు. అసలు నా కిచ్చిన వరాలు ఎందుకు కాదంటున్నావు" అంటూ నిలదీసింది. రెచ్చగొట్టే మాటలు మాట్లాడింది.

దశరథుడు: (కోపంగా) దుష్టురాలా! నీ కన్నా శత్రువులే నయం సుమా! రాముడు అడవులకు వెళ్ళి, నేను మరణించిన తర్వాత నీవు ఒక్కతెవే సుఖంగా ఉండు. మరణానంతరం నేను స్వర్గానికి పోయినప్పుడు దేవతలంతా రాముడి క్షేమం అడుగుతారు. నేను ఏం చెయ్యాలి? యథార్థం చెప్పకుండా దాటవేయనా? ఒకవేళ నేను నిజమే చెప్పినా వారు నమ్మరు. ఎందువల్లనంటే, "రాముడికి రాజ్యం ఇస్తానని దశరథుడు రాజులందరి ముందూ ప్రతిజ్ఞ చేశాడు. ఆ ప్రతిజ్ఞను భంగంచేస్తూ కైకేయి మాటలు వినవలసిన అవసరంలేదు కదా?" అంటారు.

కైకా! ఎంతోకాలం మనమంతా సంతానం కోసం అలమటించాం. ఎన్నో వ్రతాలు, యాగాలు చేశాం. చివరకు మహాపరాక్రమవంతుడైన రాముణ్ణి పొందగలిగాం. అటువంటి రాముని ఎట్లా అడవులకు పంపగలను? రాముడు శూరుడే కాదు అన్ని విద్యలూ అభ్యసించినవాడు; కోపాన్ని జయించినవాడు; సహనమూ, శీలమూగలవాడు; చెంపకు చారడేసి కళ్ళున్న రాముణ్ణి అడవులకు ఎట్లా పంపగలను?

ఆహా! నా రాముడు శ్యామవర్ణంతో మెరిసిపోతూ ఉంటాడు. దీర్ఘ బాహువులు గలవాడు,

మహాబలశాలి అయిన రాముని అడవులపాలు చెయ్యలేను. రాముడు ఇక్ష్వాకువంశంలో పుట్టాడు. కష్టాలంటే ఏమిటో ఎరుగనివాడు. అటువంటి రాముణ్ణి అడవులకు ఎట్లా పంపను? రాముడు కష్టపడటం అనే మాటే నేను వినలేను. రాముడు కష్టపడుతున్నాడనే మాట నా చెవిన పడకమునుపే నేను మరణిస్తాను. అదే నాకు ఉత్తమం.

ఓ కఠినాత్మురాలా! నీకు ఇటువంటి పాపిష్టి ఆలోచన ఎట్లా వచ్చిందో నాకు తెలియటంలేదు. నీ మూలంగా లోకంలో నాకెంత అపకీర్తి వస్తుందో ఆలోచించావా?

దశరథుడు మధ్య మధ్యలో మూర్ఛపోతున్నాడు. లేవగానే మళ్ళీ కైకేయిని చూసి విలపిస్తూనే ఉన్నాడు. ఇంతలో చీకటి పడింది. చంద్రోదయమై ఆకాశమంతా వెన్నెలకాస్తున్నా ఆయన మనస్సు మాత్రం చీకటిగానే ఉంది. రోగిష్టి వాడిలాగా నీరసించిపోయాడు. మధ్యమధ్యలో నిట్టూర్పులు విడుస్తూ తనలో తానే కుమిలిపోతున్నాడు. "ఓ రాత్రీ! నువ్వు శాశ్వతంగా రాత్రిగానే ఉండిపో. ఎప్పటికీ తెల్లారవద్దు. నీకు చేతులెత్తి నమస్కరిస్తున్నాను. ఒకవేళ నీకు కనికరంలేక తెల్లవారితే మళ్ళీ ఈ పాపిష్టిదాని ముఖాన్ని చూడాల్సివస్తుందే! నన్ను కనికరించు" అని అంటున్నాడు.

మళ్ళీ కైకేయితో ఇలా చెప్పసాగాడు.

దశరథుడు: ఓ దేవీ! నువ్వు నా భార్యవు. మంగళ స్వరూపిణివి. నేను ఇంతకాలం సత్యవ్రతుడుగా బ్రతికాను. జీవితంలో చివరి భాగానికి చేరుకొన్నాను. ఇంకా ఎంతోకాలం బ్రతుకను. నిన్ను శరణు కోరుతున్నాను. నువ్వు చిన్నదానవు. చక్కటి విచక్షణాజ్ఞానం కలిగినదానవు. ఈ రాజ్యమంతా నీకే ఇచ్చేస్తాను. నీ చేతులతో ఆ రాజ్యాన్ని రాముడికి అప్పగించు. భరతుడుకూడా ఇందుకు అంగీకరిస్తాడు. గురువులు, మంత్రులు, ప్రజలు నిన్ను పూజిస్తారు, గౌరవిస్తారు. నీ కీర్తి ఆచంద్రార్కం శాశ్వతంగా ఉంటుంది. నేనూ మాటతప్పని వాణ్ణి అవుతాను. ఈ మార్గం అందరికీ ఆమోదయోగ్యంగా ఉంటుంది. నా కన్నీళ్ళు నదులై

ప్రవహిస్తున్నాయి. కనికరించు.

దశరథుడు జాలిపుట్టేట్లు ఎన్ని మాటలు చెప్పినా కైకేయి మనస్సు కరగలేదు. ఆమె తన పట్టు విడువలేదు. కఠినమైన భార్య మాటలకు తట్టుకోలేక దశరథుడు మరల మూర్ఛపోయాడు. ఇంతలోనే రాత్రి గడచిపోయింది. ప్రాతఃకాలాన వందిమాగధులు వచ్చి మేలుకొలుపులు ప్రారంభించారు. దశరథుడు వారందరినీ నిలిపివేయమని పలికి తిరిగి మూర్ఛపోయాడు.

## 14వ సర్గ వసిష్ఠాదులు కైకేయి మందిరానికి రావడం

కైకేయి: మహారాజా! సత్యమనే ఒక్క పదమే బ్రహ్మస్వరూపం. ధర్మం సత్యంపై ఆధారపడి ఉంటుంది. సత్యమే అక్షయవేదాలు. ఎవరైనా సత్యాన్ని ఆచరించటం చేతనే పరమపదాన్ని చేరుకుంటారు. ధర్మవేత్తలైన వారంతా సత్యమే ధర్మమని అంటారు కదా! నేను కూడా ఆ సత్యాన్నే ఆశ్రయించి నిన్ను ధర్మాన్ని ఆచరించమని ప్రేరేపిస్తున్నాను.

నా కిచ్చిన ప్రతిజ్ఞను (వరములు) గుర్తుచేయగానే మహాపాపం చేసినట్లు దుఃఖీస్తూ నేలపై పడి పొర్లుతున్నావు. ధర్మాన్ని పాటించు. ఆ ధర్మమే నీకు సత్కీర్తిని, ఉత్తమగతుల్ని కలిగిస్తుంది.

పూర్వం శిబిచక్రవర్తి తన దేహంలోనుండి మాంసాన్ని డేగకు ఇచ్చి ఉత్తమలోకాలు పొందాడు. మహాతేజశ్శాలియైన అలర్కుడు బ్రాహ్మణుడు వచ్చి అడగ్గానే, తన నేత్రాలను తీసి ఇచ్చివేశాడు. సముద్రుడు కూడా సత్యాన్ని పాటిస్తూ వృద్ధి సమయాల్లో కూడా చెలియలికట్టను దాటిరావడం లేదు.

ఓ పురుషశ్రేష్ఠుడా! నీ బుద్ధిని స్థిరంగా ధర్మంపైనే నిలుపు. నాకు ఇచ్చిన వరాలను అమలుచెయ్యి. వరాలిచ్చిన నీకు వాటిని తీర్చడమే ధర్మం. అది నెరవేర్చమని నిన్ను ప్రేరేపిస్తున్నాను. ముమ్మాటికీ రాముణ్ణి అడవులకు పంపమని చెబుతున్నాను.

నాథా! నువ్వు వరాలు ఇవ్వకుండా అసత్యాన్నే వరించి నట్లయితే, నన్ను విడిచివేసినట్లే భావిస్తాను. అందువల్ల నీ ఎదుటే ప్రాణాలు విడుస్తాను.

పూర్వం వామనుడు ధర్మపాశంతో బలిచక్రవర్తిని బంధించినట్లు కైకేయి దశరథుణ్ణి ధర్మపాశంచే బంధించివేసింది, కాడికి, చక్రానికి మధ్య బంధించబడిన ఎద్దులా దశరథుడు నలిగిపోతున్నాడు. హృదయం పగిలిపోయింది. ముఖం పాలిపోయింది. కళ్లు వ్యాకులత చెందాయి. దృష్టి మందగించింది. అతికష్టంతో ఎట్లాగో నిలదొక్కుకున్నాడు.

దశరథుడు: పాపాత్ముూరాలా! అగ్నిసాక్షిగా ఏ చేత్తో నిన్ను పరిగ్రహించానో, అదే చేత్తో నిన్నూ, నీ వలన పుట్టిన భరతుణ్ణి కూడా విడిచేస్తాను. సూర్యోదయం కావస్తోంది. రామరాజ్యాభిషేకానికి ఏర్పాట్లన్నీ సిద్ధమయ్యాయి. వసిష్ఠాదులు వచ్చే సమయం దగ్గర పడుతోంది.

ఓ దురాచారురాలా! నువ్వు రాముని రాజ్యాభిషేకానికి అడ్డుపడే పక్షంలో నువ్వుగాని, నీ కుమారుడు భరతుడుగాని నా మరణానంతరం ఉత్తరక్రియలు జరుపకూడదు. రామపట్టాభిషేకానికి సిద్ధంచేసిన మంత్రజలాలతో రాముడే నాకు ఉదకక్రియలన్నీ జరపాలి. ప్రజలంతా రామపట్టాభిషేకమని మహా ఆనందంతో పరవశులై ఉన్నారు. ఇప్పుడు వారి ఆనందమంతా నశించిపోతుంది. తలలు వంచుకొని దుఃఖంతో ఉన్న వాళ్ళ ముఖాలను నేను చూడలేను.

కైకేయి: రాజా! మీ మాటలు చాలా తీవ్రంగాను, బాధాకరంగాను ఉన్నాయి. మాటలతో కాలాన్ని వృథాచేయకండి. రాముణ్ణి వెంటనే ఇక్కడకు పిలిపించండి. వెంటనే రాముడు వనాలకు వెళ్ళేట్లు ఏర్పాట్లు చేయండి. అప్పుడే నాకు శత్రువులెవరూ లేకుండా ఉంటారు. నీ ధర్మాన్ని వెంటనే అమలు పరచండి.

దశరథుడు: దుష్టబుద్ధి గలదానా! నన్ను ధర్మపాశంచేత బంధించి వేశావు. నా బుద్ధి బొత్తిగా మొద్దుబారిపోయింది. నేనుకూడా నా రాముణ్ణి వెంటనే చూడాలనుకొంటున్నాను.

ఇంతలో సూర్యోదయమైంది. వసిష్ఠాదులు రాజ్యాభిషేకానికి కావలసిన సామగ్రి అంతా వెంటతీసుకొని అయోధ్యానగరంలో ప్రవేశించారు.

అయోధ్యలోని వీథులనన్నింటినీ నీళ్ళుచల్లి ముగ్గులుపెట్టారు. అందమైన పతాకాలు ఎగురవేశారు. మార్గమంతా పువ్వులు, రంగులు చల్లారు. ఎక్కడ చూసినా ఆనందోత్సాహాలే. ప్రజలంతా రాముని చూడాలని ఉవ్విళ్ళూరుతున్నారు. వీథులన్నీ ధూపాల సువాసనలతో

నిండిపోయాయి. రాజాంతఃపురానికి ఎదుట బ్రాహ్మణులు గుంపులుగుంపులుగా నిలబడ్డారు. గ్రామ, పట్టణ ప్రజలతో నగరమంతా క్రిక్కిరిసిపోయింది. వసిష్ఠ మహర్షి మంత్రజలాలతో అంతఃపురంలోకి ప్రవేశించారు. అంతలోనే ఆయనకు సుమంత్రుడు ఎదురుగా వచ్చాడు.

వసిష్ఠ మహర్షి: మహామంత్రీ! సుమంత్రా! గంగాజలంతో నిండిన కలశాలు, సముద్రజలాలతో నిండిన కలశాలు, భద్రపీఠం అభిషేకం కోసం తెచ్చాము. నవధాన్యాలు, గంధం, రత్నాలు, దర్భలు, పూలు, పాలు మొదలైన ద్రవ్యాలు, ఎనమండుగురు కన్యలు, మదించిన ఏనుగు, నాలుగు గుర్రాలు కట్టిన రథం, ఖడ్గం, ధనుస్సు అమర్చబడ్డాయి. తెల్లని గొడుగు, వింజామరలు ఏర్పరచారు. పెద్ద మూపురం కలిగిన తెల్లని ఎద్దు, అందమైన జూలు కలిగిన శ్రేష్ఠమైన గుర్రము, సింహాసనం, పులిచర్మాలు, ప్రజ్వలించే అగ్ని, ఇంకా అవసరమైన ద్రవ్యాలన్నీ సమకూర్చారు. చక్కగా అలంకరించుకున్న అందమైన వేశ్యలు వచ్చారు. కులస్త్రీలు, బ్రాహ్మణులు, గోవులు, శిల్పులు, వర్తకులు ఇంకా ఎంతోమంది గ్రామీణులు, నగరవాసులు కూడా వచ్చారు. కనుక ఓ సుమంత్రా! నువ్వు వెంటనే పోయి మహారాజును తీసుకొనిరా.

సుమంత్రుడు అంతఃపురం లోనికి ప్రవేశించాడు. మహారాజుకు అత్యంత ప్రియమైన వాడవడం చేత పాలకులు వారిని అడ్డగించలేదు. రాజు పరిస్థితిని ఎరుగక సుమంత్రుడు ఇట్లు స్తుతించసాగాడు.

సుమంత్రుడు: ఓ దశరథ మహారాజా! సూర్యోదయానికి ఉప్పొంగే సముద్రుడు ఆనందించేట్లు సంతోషమైన మనస్సుతో ఆనందించు. మహారాజా! ఇటువంటి ప్రాతఃకాలంలోనే మాతలి దేవేంద్రుని స్తుతించి మేల్కొలిపినట్లు నేను కూడా నిన్ను అట్లే మేల్కొలుపుతున్నాను.

తనంతట తానే పుట్టినవాడూ, వేదాలకు ప్రభుమా అయిన బ్రహ్మదేవుని మేల్కొలిపినట్లు నేను నిన్ను మేల్కొలుపుతున్నాను. ప్రాణులన్నింటినీ భరించే భూదేవిని సూర్యచంద్రులు మేలుకొలిపినట్లుగా నిన్ను నేను మేలుకొలుపుతున్నాను. మేరుపర్వతం నుంచీ సూర్యుడు

లేచివచ్చేట్లుగా చక్కటి దుస్తులు, ఆభరణాలు ధరించి లేచి రా. ఓ రాజా! ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, శివుడు, కుబేరుడు, సూర్యచంద్రులు నిన్ను అన్ని విధాలా కాపాడతారు గాక!

మహారాజా! రాత్రంతా జరగబోయే ఉత్సవానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేశాం. అన్నీ రామరాజ్యాభిషేకానికి సిద్ధం చెయ్యబడ్డాయి. రామాభిషేకానికి అనుజ్ఞ కోరుతున్నాం.

దశరథుడు పడుకునే సుమంత్రుడి ప్రార్థనను ఆలకించాడు. అది ఆయనకు సంతోషాన్ని కలిగించక పోగా, కడుపంతా దేవినట్లయింది. "ఓ సుమంత్రా! నీ స్తోత్రాలన్నీ నా హృదయాన్ని చీల్చివేస్తున్నాయి" అని దీనంగా అన్నాడు. ఆ మాటలు కూడా ఎక్కడో నూతిలో నుంచి వస్తునట్లు అతి నీరసంగా ఉన్నాయి. ఆ పైన ఆయన మాట్లాడలేకపోయాడు. మహారాజు అతి దీనస్థితిలో ఉన్నాడని గ్రహించిన సుమంత్రుడు కొద్దిదూరం పోయి ఆజ్ఞకై నిలబడ్డాడు.

కైకేయి: ఓ సుమంత్రా! రాముని విషయం ఆలోచిస్తూ రాత్రంతా ఆయన నిద్రపోనేలేదు. ఇప్పుడే కొద్దిగా కునుకు పట్టింది. అందుచే మీరు వెంటనే వెళ్ళి రాముణ్ణి ఇక్కడకు తీసుకొనిరండి. ఈలోగా ఆయన లేచి సిద్ధం కాగలరు.

కైకేయీదేవి మాటలనే ఆజ్ఞగా తీసుకొని సుమంత్రుడు రాముని అక్కడకు తీసుకొని రావటానికి వెంటనే బయలుదేరాడు. రామునికి మహారాజుకు కానుకలిచ్చేందుకు రాజులు, ధనవంతులైన పౌరులు, అంతఃపురం బయట వేచి ఉన్నారు. వీథులన్నీ జనంతో కిటకిటలాడిపోవటం చూసి సుమంత్రుడు ఆనందంతో రాముని మందిరం వైపుగా బయలుదేరాడు.

# 15వ సర్గ సుమంత్రుడు రామ మందిరానికి చేరడం

సూర్యోదయం అయింది, వసిష్ఠుడు, బ్రాహ్మణులు, వర్తక ప్రముఖులు, రాజోద్యోగులంతా రాముని భవంతి ముందు వేచి ఉన్నారు. పుష్యమీ నక్షత్రాన రాముడి జన్మలగ్నమైన కర్కాటక లగ్నంలో రామరాజ్యాభిషేకం జరగాల్సి ఉంది. ఏర్పాట్లన్నీ అయ్యాయి.

అభిషేకం కోసం భద్రపీఠాన్ని (రాజాసనం) తెచ్చారు. నాలుగు గుర్రాలు పూన్చిన రథం సిద్ధంగా ఉంది. రథంలో కూర్చోవటానికి పులితోలు పరిచారు. బోయీలతో పల్లకీ కూడా సిద్ధంగా ఉంది. గంగోదకం, ఇతర నదుల్లో నుంచి తెప్పించి ఉంచిన పవిత్ర జలాలు, పవిత్ర సరస్సులనుండి, బావులనుండి, సప్తసముద్రాలనుండి తెప్పించిన జలాలన్నీ బంగారు కలశాల్లో నింపి సిద్ధంగా ఉంచారు. ఆ కలశాలను రావి ఆకులతోను, తామరపూలతోను, కలువపూవులతోను మూసి ఉంచారు.

తేనె, నెయ్యి, పాలు, నవధాన్యాలు, దర్భలు, నవరత్నాలు, ఖడ్గం, ధనుస్సు మున్నగునవన్నీ సిద్ధంచేశారు. తెల్లని ఆబోతును తెచ్చారు. దాని పెద్ద మూపురానికి తెల్లటి వస్త్రాన్ని ధరింపజేశారు. మెడ నిండా జూలు వేళ్ళాడుతున్న నాలుగు గుర్రాలు, పర్వతం అంత ఎత్తున ఉన్న మదించిన ఏనుగు, ఆవులు, మృగాలు, అనేక రకాలైన పక్షుల్నీ సిద్ధంగా ఉంచారు. చక్కగా అలంకరించుకొన్న అందమైన వేశ్యలున్నారు. అనేక రకాలైన వాద్యాలు, గాయకులు, నర్తకులు, నటులంతా వేచిఉన్నారు.

ఇక్ష్వాకువంశపు రాజుల రాజ్యాభిషేకానికి ఆనవాయితీగా ఇచ్చే బహుమతులన్నీ చేతబట్టుకొని రాజులు, సామంతులు, పురప్రముఖులు మహారాజు దర్శనానికై బయట వేచి ఉన్నారు. ఇంకా మహారాజు బయటకు రాలేదే అని తహతహలాడుతున్నారు. మహారాజుకు ఎవరిచేత కబురు పంపటమా అని తటపటాయిస్తున్నారు.

సుమంత్రుడు: మహాజనులారా! రాజోత్తములారా! మీరంతా మహారాజుగారి దర్శనం చెయ్యాలనీ, మీ బహుమతులను అందజేసి ఆయనచే గౌరవింపబడాలనీ కుతూహలపడుతున్నారు. నేను వెళ్ళి మహారాజును నిద్రలేపి, మీకు దర్శనం అయ్యే ఏర్పాట్లు చేస్తాను. వేచి ఉండండి.

తరువాత సుమంత్రుడు అంతఃపురంలోనికి వెళ్ళి దశరథునితో ఇలా చెప్పాడు: ఓ మహారాజా! తెల్లవారిపోయింది. సామంతరాజులంతా కానుకలు తీసుకొని బయట తమ దర్శనం కోసమే వేచి ఉన్నారు. ఇక మీరు లేచి వచ్చి వారికి దర్శనమీయాలి.

దశరథుడు: ఓయీ సుమంతా! నేను రాత్రి అంతా నిద్రపోలేదు. రాముణ్ణి ఇక్కడకు తీసుకురమ్మని కైకేయి నా మాటగా చెప్పింది. అది నా ఆజ్ఞగానే స్వీకరించు. వెంటనే వెళ్ళి రాముణ్ణి ఇక్కడకు తీసుకొని రా.

అంతట సుమంత్రుడు పైకప్పు కలిగిన రథాన్ని అధిరోహించి రామ మందిరానికి బయలుదేరాడు. మార్గమంతా జనసందోహంతో ఆనందోత్సాహంతో ఉండటం చూసి చాలా సంతోషించాడు.

ప్రజలంతా కానుకలు చేతపుచ్చుకొని రామదర్శనానికై నిలబడ్డారు. పురప్రముఖులు, సామంతరాజులు కూడా రామదర్శనార్థం నిరీక్షిస్తున్నారు. వారందరినీ చూస్తూ ఇంకొద్దిసేపట్లో రాముడు రాజవుతాడని సుమంత్రుడు సంతోషంతో ముందుకు సాగిపోయాడు.

రాజభవనం తెల్లగా కైలాసపర్వతంలా ఉంది. మేరుపర్వతంలా మెరిసిపోతోంది. చందనాగరు ధూపాలతో సువాసనలు వెదజల్లుతున్నది. వాకిళ్ళన్నీ రత్నాలతోను, మాణిక్యాలతోనూ పొదగబడి కుబేరుని భవనంలాగా సర్వసమృద్ధితో విరాజిల్లుతోంది. వాకిళ్ళకు ముత్యాల తోరణాలు కట్టారు. అవన్నీ సూర్యకాంతి పడి ధగధగా మెరుస్తున్నాయి. గోడల మీద, స్తంభాల మీద విలువైన చిత్రాలు అలంకరించబడ్డాయి. రకరకాల పక్షులు కిలకిలారావాలు

చేస్తూ రాజభవనమంతా స్వేచ్ఛగా విహరిస్తున్నాయి. అవేవీ ద్వారపాలకులను లెక్కచేయకుండా తమ ఇష్టానికి ఎగురుతున్నాయి.

సుమంత్రుడు మూడు ప్రాకారాలను దాటి రామమందిరాన్ని చేరుకున్నాడు. వాకిట్లో పర్వతంలాంటి 'శత్రుంజయ' మనే మదపుటేనుగు ఒకటి రాముని తీసుకుపోయేందుకు సిద్ధంగా ఉంది. ఏడు అంతస్తులు దాటుకొని సుమంత్రుడు రాముని మందిరాన్ని చేరుకున్నాడు.

# 16వ సర్గ శ్రీరాముడు దశరథ దర్శనానికి బయలుదేరటం

సుమంత్రుడు అంతఃపురంలోని ఏకాంతవాస ప్రాంతాన్ని చేరాడు. ఆ కక్ష్యలో జనసమ్మర్దం ఎక్కువగాలేదు. సుశిక్షితులు, రామభక్తి పరాయణులైన రక్షకభటులు మాత్రమే ఉన్నారు. వారిని పర్యవేక్షిస్తూ కాషాయ వస్త్రాలు ధరించిన వృద్ధులున్నారు. వారితో సుమంత్రుడు "రామదర్శనానికి వచ్చా" నని చెప్పమన్నాడు. సుమంత్రుడు తండ్రికి సన్నిహితుడు, వృద్ధుడు, తనకు అత్యంత గౌరవపాత్రుడు కావటం వలన రాముడు సీతతో కలసి ఏకాంతగృహంలో ఉన్నా కూడా వెంటనే తన వద్దకు తీసుకురమ్మని ద్వారపాలకునికి చెప్పి పంపాడు.

రాముడు తెల్లటి దుప్పటికప్పిన బంగారుపాన్పుపై కూర్చున్నాడు. ఒంటినిండా శ్రేష్ఠమైన చందనాన్ని అలదుకున్నాడు. ఆ చందనం వరాహరక్తంలా సుగంధాన్ని వెదజల్లుతోంది. చక్కగా అలంకరించుకొని కుబేరునిలా కూర్చున్నాడు. ప్రక్కనే సీత నిలబడి వింజామరతో విసురుతూ ఉంది. రాముణ్ణి చూస్తూ ఉంటే చిత్రానక్షత్రంలో చంద్రునిలా ప్రకాశిస్తున్నాడు.

అటువంటి మహాతేజస్సుతో సూర్యునిలా వెలిగిపోతున్న రాముడికి సుమంత్రుడు వినయంగా నమస్కారం చేశాడు. ఆసనంపై కూర్చున్నాడు.

సుమంత్రుడు: కౌసల్యా పుత్రా! రామా! దశరథ మహారాజు, కైకేయి నిన్ను వెంటనే చూడాలని కోరుతున్నారు. నువ్వు వెంటనే అక్కడకు వెళ్ళవలసినది.

రాముడు: (సీతతో) సీతా! నా తండ్రి, తల్లి కైకేయీ నన్ను చూడాలని అనుకొంటున్నారట. నా శ్రేయస్సుకోరి రాజ్యాభిషేకం గూర్చి వారేదో ఆలోచించి ఉంటారు. సమర్థురాలైన నా తల్లి కైకేయి నా తండ్రిగారి అభిప్రాయానికి తోడు తన ఆలోచన కూడా ఆయనకు తెలిపి, ఇప్పుడు నన్ను అక్కడకు తీసుకొని రమ్మని మంత్రి సుమంత్రుణ్ణి ఇక్కడకు పంపారు. నా తల్లి కైకేయి ఎల్లప్పుడూ నా శ్రేయస్సునే కోరుతూ ఉంటుంది. నా అభ్యుదయాన్నే కాంక్షిస్తూ ఉంటుంది. నా

తండ్రి సంతోషాన్నే ఆవిడ ఎప్పుడూ ఆకాంక్షిస్తూ ఉంటుంది. ఇది నా భాగ్యమని తలుస్తాను. నేను వెళ్ళి నా తండ్రిగారిని, తల్లి కైకేయిని కలుసుకొని వస్తాను. అంతవరకు నువ్వు ఇక్కడే ఉండు.

సీత: ప్రభూ! ఇప్పుడు మీ తండ్రిగారు యౌవరాజ్యాభిషేకం చేయబోతున్నారు. ముందు ముందు బ్రహ్మ దేవేంద్రునికి చేసినట్లుగా మహారాజ్యాభిషేకం కూడా చేయగలరు. అప్పుడు మీరు పరిశుద్ధులై రాజసూయాన్ని చేయతలపెట్టినప్పుడు మీరు కృష్ణాజినాన్ని ధరించి చేతితో లేడి కొమ్మును పట్టుకొని ఉండటం చూడాలని ముచ్చటపడుతున్నాను. మిమ్మల్ని తూర్పుదిక్కున ఇంద్రుడు, దక్షిణాన యముడు, పశ్చిమాన వరుణుడు, ఉత్తరాన కుబేరుడు రక్షిస్తారు గాక!

తరువాత రాముడు రాజ్యాభిషేకానికి తగినట్లుగా సర్వాలంకారాలు చేసుకొని సుమంత్రుని వెంట బయలుదేరాడు. బయటకురాగానే అక్కడే వేచి ఉన్న లక్ష్మణుని చూశాడు. అక్కడ నుండి మధ్యప్రాకారంలో తన కోసం వేచి ఉన్న వారందరినీ కలసి వారందరిని మర్యాదపూర్వకంగా పలకరించాడు. వారందరివద్ద సెలవు తీసుకొని తనకోసం నిరీక్షిస్తున్న రథంలో కూర్చున్నాడు. లక్ష్మణుడు కూడా రాముని వెనుకనే చమరాలతో రాముడికి విసురుతూ నిలబడ్డాడు. సుమంత్రుడే రథాన్ని స్వయంగా నడిపాడు.

సైనికులంతా సింహనాదాలు చేశారు. వందిమాగధులు మంగళాచరణాలు గానంచేశారు. జనులంతా కూడా రాముని స్తుతిస్తూ జయజయ ధ్వానాలు చేశారు. కవచాలు తొడుక్కుని, ఖడ్గాలు ధరించిన సైనికులు అప్రమత్తంగా రామునికి రక్షణగా రథాల మీద గుర్రాల మీద ఏనుగులపైన కాలినడకన అనుసరించారు.

కులస్త్రీలంతా వారి వారి ఇళ్ళల్లోనుండి, మేడల పైనుండి పూలవాన కురిపించారు. ఇంకొందరు ఎదురుగా వెళ్ళి మంగళహారతులు పట్టి "కౌసల్య కుమారుడా! ఓ రామా! నిన్ను కన్నతల్లి జన్మ ధన్యం, నిన్ను రాజుగా పొందటంతో మా జన్మ ధన్యమైంది. ఓ రామా! నీ భార్య సీత ఎన్ని పూజలు చేసిందో నిన్ను భర్తగా పొందింది. ఆమె జన్మ తరించింది" అని పలికారు.

స్త్రీలు, పురుషులు చిన్న, పెద్దలంతా పలుకుతున్న ఆ ప్రియ వచనాలన్నీ రాముడు వింటూ, చిరునవ్వులు చిందిస్తూ ముందుకు సాగిపోయాడు.

# 17వ సర్గ శ్రీరాముడు దశరథ మందిరంలోనికి వెళ్ళడం

రాముడు రథంలో అయోధ్యానగర వీథుల గుండా వివిధరకాలైన చందన, అగరు ధూపాలచే నిండిపోయిన సుగంధాలను దాటుకుంటూ పోయాడు. వివిధ దేశాలనుండి తనను చూడటానికి వచ్చిన జనసమూహాల్ని చూశాడు. వారంతా తనను, తన వంశాన్ని స్తుతించడం విన్నాడు.

వీథులకు రెండుప్రక్కలా ఉన్న రకరకాల అంగళ్ళను చూశాడు. అంగళ్ళలో రాసులుగా పోసిన పట్టువస్త్రాలను, నూలువస్త్రాలను చూశాడు. కొత్తముత్యాలను, పగడాలను చూశాడు. వాటికి ఇంకా బెజ్జాలైనా వేయలేదు. సరికొత్తవి. స్ఫటికాల్లాంటి రత్నరాసుల్ని చూశాడు. పరిమళ ద్రవ్యాల నమ్మే అంగళ్లను, తినుబండారల నమ్మే అంగళ్ళను, వాటిని విరివిగా కొంటున్న జనాన్ని చూశాడు. ఇంకొన్ని అంగళ్ళలో నిత్యపూజలకోసం పెరుగు, అక్షతలు, పేలాలు, చందనం, పూలు, పండ్లు మొదలైన వస్తువులను విక్రయిస్తున్నారు. వీథుల రెండు వైపులా ఆకాశాన్నంటే పెద్ద పెద్ద మేడల్ని చూశాడు. బ్రాహ్మణులు ఆశీర్వచనాలు పలుకుతూ ఉంటే రాముడు ముందుకు సాగిపోయాడు.

దేవేంద్రుని రాజవీథుల్లాగా ఉన్న ఆ అయోధ్యాపుర వీథుల్లో జానపదులు గుంపులు గుంపులుగా చేరారు. రామరాజ్యాన్ని గురించి గానం చేశారు. "దశరథ మహారాజు మన రాముణ్ణి యువరాజును చేస్తున్నాడు. అతడి పాలనలో మనం ఏ కొరతా లేకుండా జీవిస్తాం. మనందరికీ ఏ దిగులూ, కష్టమూ రాకుండా రాముడే మనల్ని ఆదుకుంటాడు. ఇకపై మనకు ఎట్లాంటి చీకూచింతా ఉండదు. ఇదంతా మన పూర్వజన్మల పుణ్యఫలం" అని గానం చేస్తున్నారు.

వయోవృద్ధులు, ముఖ్యమైన పౌరులు, సహృదయులూ ఆ రథానికి దగ్గరగా వెళ్ళి, బిగ్గరగా "ఓ రామా! నీ రాజ్యపాలన నీ తాతముత్తాతల పరిపాలనను మరిపించేదిగా ఉండాలి.

మమ్మల్నందరినీ ఇదివరకటికన్నా ఎక్కువ సంతోషపెట్టాలి. ఇప్పుడు మాకు అన్నంతో పనిలేదు. నీళ్ళు అంతకన్నా వద్దు. నీ రాజ్యాభిషేకాన్ని కన్నులపండువుగా మేమంతా చూడాలి. మాకు ఆ నేత్రానందమే అన్నోదకాలు. నీ రాజ్యాభిషేకం కన్నులారా చూసి మా జన్మలు ధన్యం చేసుకోవాలని కలలు కంటున్నాం" అన్నారు.

రాముడు ఈ ప్రశంసలకు పొంగిపోలేదు. సమభావం ప్రదర్శించాడు. రాముడు రథం దూరమైనా, ప్రజల దృష్టి మాత్రం అతడి నుండి దూరం కాలేదు. ఆ వైపే చూస్తూ ఉండిపోయారు. రాముని చూడని వారుగాని రామునిచే చూడబడని వారు గానీ అక్కడ లేరు. ఒకవేళ ఎవరైనా ఉంటే వారిని లోకులు నిందించటమేకాదు, తనను తనే నిందించుకుంటాడు. రాముడు చిన్న, పెద్దా తేడా లేకుండా, నాలుగు వర్ణాల వారిని సమదృష్టితో చూశాడు. అందువల్ల అందరూ అతణ్ణి ప్రేమించారు. రాముడు చతుష్పథాలను, దేవాలయాలను, చైత్యాలను ప్రదక్షిణం చేస్తూ కైలాస శిఖరంలా తెల్లగా మెరిసిపోయే దశరథుని వర్ధమానమనే రాజప్రాసాదాన్ని చేరుకున్నాడు. మూడు ప్రాకారాలను దాటిన పిదప రాముడు రథంపైనుండి దిగి కాలినడకన బయలుదేరాడు. తన వెంట వచ్చినవారి నందరినీ అక్కడే ఆగిపొమ్మన్నాడు. రాముడు ఒంటరిగానే అంతఃపురంలోనికి ప్రవేశించాడు.

## 18వ సర్గ కైకేయి తను కోరిన వరాలను గూర్చి రాముడితో చెప్పడం

రాముడు మందిరంలోనికి ఒంటరిగా ప్రవేశించాడు. అక్కడ ముఖాన కళాకాంతులు లేకుండా, వాడిపోయిన ముఖంతో పక్కపై పడుకొని ఉన్న దశరథుణ్ణి చూశాడు. వెంటనే ఆయన పాదాలకు నమస్కరించాడు. పిదప కైకేయి పాదాలకు నమస్కరించాడు. దశరథుడు 'రామా' అని మాత్రం అన్నాడు. ఆపై గొంతు పెగల్లేదు. కళ్లు నీటితో నిండిపోయి, బొటబొటా నీరు కారసాగింది. తండ్రిని ఇదివరకెప్పుడూ అంత దీనంగా చూడలేదు. తండ్రి పరిస్థితికి రాముడు కూడా కలత చెందాడు.

రాముడు: అమ్మా! తండ్రిగారు సంతోషం లేనివారై కృశించిపోయి ఉన్నారు. గ్రహణం పట్టిన సూర్యునిలా, అబద్ధమాడిన మహర్షిలా కాంతిహీనుడై ఉన్నాడు. తండ్రిగారు ఏదో ఊహించటానికి వీలుకానంత దుఃఖంలో ఉన్నారు. పూర్ణిమ నాటి సముద్రునిలా అమిత అశాంతితో ఉన్నారు.

అమ్మా! తండ్రిగారు నన్ను చూడటంతోనే సంతోషంగా పలకరించేవారు. అంతకుపూర్వం కోపంగా ఉన్నా నన్ను చూడగానే కోపం అంతా పోయి ప్రశాంతంగా మారిపోయేవారు.

అమ్మా! అజ్ఞానంచేత నేను ఏమైనా తండ్రిగారి మనస్సు కష్టపెట్టానా? ఎప్పుడూ నేనంటే ప్రేమగా ఉండే వారు ఈనాడు ఒక్కమాటైనా నోటి వెంట రావడంలేదు. పైగా ముఖమంతా వాడిపోయి ఉంది. శరీరానికిగాని, మనస్సుకుగాని ఏదైనా తీవ్రంగా గాయం అయిందా?

అమ్మా! భరత శత్రుఘ్నులు క్షేమంగా ఉన్నారు గదా? నా తల్లులంతా క్షేమంగా ఉన్నారు గదా? నా తండ్రిగారికి నా వల్ల ఏదైనా కోపం కలిగితే, ఆయనను సంతోషపెట్టకుండా, ఆయన ఆజ్ఞలను పాలించకుండా ఒక్క క్షణంకూడా జీవించి ఉండను. తండ్రి అంటే మనిషికి ఇహ

లోకంలో జన్మ నిచ్చినవాడు కదా! ఆయనను సంతోషపెట్టకుండా ఎట్లా ఉండగలను?

అమ్మా! నువ్వు గాని, తండ్రిగారికి కోపం తెప్పించే మాట ఏమైనా అన్నావా? ముందెన్నడూ నా తండ్రిని ఇటువంటి దీనస్థితిలో చూడలేదు. నీవైనా నాకు యథార్థం చెప్పు.

కైకేయి: రామా నీ తండ్రికి ఎవరి మీదా కోపం లేదు. ఎటువంటి కష్టమూ కలుగలేదు. అయితే ఆయన నీతో ఒక మాట చెప్పటానికి భయపడుతున్నాడు. నువ్వు ఆయనకు ఎంతో ప్రియమైన వాడివి. అటువంటి ప్రేమపాత్రుడవైన నీతో అప్రియమైన ఒక మాట చెప్పటానికే తటపటాయిస్తున్నారు. ఆ మాట చెప్పటానికి ఆయనకు నోరు పెగలడం లేదు. అది నువ్వు తప్పక తెలుసుకోవాలి.

రామా! పూర్వం ఆయన నాకో వరం ఇచ్చారు. ఇప్పుడు ఆనాడు ఆ వరం నాకు ఎందుకు ఇచ్చానా? అని మథనపడుతున్నారు. అందువలన ఆయన మనస్సంతా పశ్చాత్తాపంతో నిండిపోయింది. నోట మాట రావడం లేదు. నదిలో నీరంతా పోయిన తర్వాత ఈయన ఆనకట్ట (సేతువు) కట్టాలని ప్రయత్నిస్తున్నారు.

రామా! సత్యమనేది అన్ని ధర్మాలకు మూలమని అందరికీ తెలిసిన విషయమే. నీ మీద ప్రేమచేత రాజు, ఈ రోజు ఆ సత్యాన్ని విడిచిపెట్టాలని చూస్తున్నాడు. నీ తండ్రి అసత్యవ్రతుడు కాకుండా ఉండేట్లు చూడటం కుమారుడిగా నీ బాధ్యత.

రామా! రాజు చెప్పదలచిన విషయం నీకు ప్రియమైనదైనా, అప్రియమైనదైనా నువ్వు ఆచరిస్తానంటే నేనే చెప్తాను. రాజు ఈ విషయాన్ని నీతో చెప్పలేకుండా ఉన్నాడు.

రాముడు: అమ్మా! నీవిట్లా మాట్లాడవద్దు. తండ్రిగారు చెబితే నేను నిప్పులోనైనా దూకుతాను. ఆయన మహారాజు. నా తండ్రి. నా శ్రేయస్సు కోరేవాడు. ఆయన నన్ను విషం తినమన్నా సంతోషంగా తింటాను. సముద్రంలో దూకమన్నా దూకుతాను.

అమ్మా! తండ్రి చెప్పదలచినదేమో నువ్వే చెప్పు. నా తండ్రి చెప్పినట్లుగానే స్వీకరిస్తాను. ఆయన కోరినట్లుగా తప్పక చేస్తాను. ప్రతిజ్ఞ చేస్తున్నాను. రాముడు ఎన్నడూ రెండు మాటలు మాట్లాడడు.

కైకేయి: రామా! పూర్వం దేవతలు రాక్షసులు యుద్ధం చేస్తున్నప్పుడు నీ తండ్రి దేవేంద్రుని పక్షాన పోరాడాడు. ఆ యుద్ధంలో ప్రాణాలు కోల్పోవడానికి సిద్ధంగా ఉన్న తరుణంలో ఆయన ప్రాణం రెండుసార్లు కాపాడాను. అప్పుడాయన సంతోషపూర్వకంగా నాకు రెండు వరాలిచ్చారు.

రామా! ఆ రెండు వరాలను నేనిప్పుడు ఈయమని అడిగాను. అవి ఏమిటంటే, ఒకటి భరతునికి రాజ్యాభిషేకం చేయడం, రెండు నువ్వు ఈ రోజే అరణ్యవాసానికి వెళ్లడం.

రామా! నీ తండ్రి సత్యవాదిగా ఉండాలంటే నువ్వు ఈ రెండింటికీ అంగీకారం తెలపాలి. ఆయన ఆజ్ఞ ప్రకారం ఈ రోజునుండి పద్నాలుగు సంవత్సరాలపాటు నువ్వు అరణ్యాల్లో ఉండాలి. నీ కోసం ఏర్పాట్లు చేసిన యౌవరాజ్యాభిషేకాన్ని భరతునికి జరపాలి. అంటే నువ్వు రాజ్యాన్ని త్యాగం చేసి నారబట్టలు ధరించి పద్నాలుగు సంవత్సరాలు దండకారణ్యంలో నివసించాలి. భరతుడు రాజై అయోధ్యను పరిపాలిస్తాడు.

రామా! నీ పట్లగల ప్రేమ వలన నీతో ఈ మాటలు చెప్పలేక దుఃఖపడుతున్నారు. నీతో మాట్లాడలేకుండా ఉన్నారు. నిన్ను చూడలేకుండా ఉన్నారు. ఈ దుఃఖంతో ముఖమంతా వాడిపోయి ఉంది. రామా! ఈ విధంగా రాజు ఇచ్చిన వరాలను అమలుపరచి రాజుకు సత్యవ్రతుడన్న పేరును నిలబెట్టు.

## 19వ సర్గ రాముడు వనవాసానికి అంగీకరించడం

రాముడు: అమ్మా! నువ్వు చెప్పినట్లే నడచుకుంటాను. రాజు నీకు ఇచ్చిన వరాలు రెండూ తప్పక నెరవేర్చగలడు. ఆయన తన ప్రతిజ్ఞను నెరవేర్చి సత్యవ్రతాన్ని కాపాడుకోగలడు.

నువ్వు చెప్పినట్లుగా నారబట్టలు ధరించి, జటాధారినై అడవులందే నివసిస్తాను. ఈ మాత్రానికే, నా తండ్రి నన్ను ప్రేమపూర్వకంగా పలకరించటం లేదా? నా హితం కోరేవాడు, పూజ్యుడు, అంతేగాక మహారాజు అయిన నా తండ్రి ఆజ్ఞాపిస్తే నేను ఆయన ఆజ్ఞను శిరసావహించనా? అది నా కర్తవ్యం కాదా? నేను ఎల్లప్పుడూ ఆయనకు కృతజ్ఞుడుగానే ఉంటాను.

అమ్మా! భరతుని రాజ్యాభిషేకం గూర్చి తండ్రిగారు ఒక్క మాట నాతో చెప్పినా నేను సంతోషంగా అంగీకరించేవాడను. నన్ను ఎవరూ ప్రేరేపించకపోయినా, నేనే తమ్ముడైన భరతునికై, సీతను, రాజ్యాన్ని, ఇష్టజనాన్ని ఆఖరుకు నా ప్రాణాలను కూడా సంతోషంగా అర్పించేవాణ్ణి.

అమ్మా! తండ్రిగారే స్వయంగా నీ ప్రియమైన కోరికను తీర్చమని అడిగితే, నా సర్వస్వాన్ని తండ్రిగారి ప్రతిజ్ఞ నెరవేర్చడానికి అర్పించడానికి సిద్ధంగా ఉన్నాను. నా తమ్ముడు భరతునికి సర్వస్వం ఇవ్వగలనని విడిగా చెప్పాలా?

అమ్మా! నువ్వు తండ్రిగారిని ఓదార్చు. మహారాజు దైన్యంగా నేలచూపులు చూడటం బాగాలేదు. శత్రుసంహారకుడు, ఎదిరింప శక్యం కానివాడు అయిన దశరథ మహారాజుచే కన్నీరు పెట్టించకు. ఆయనను అనునయించు.

అమ్మా! రాజాజ్ఞగా కబురుపంపి వెంటనే భరతుణ్ణి ఇక్కడకు పిలిపించు. నేను వెంటనే ముందూ వెనుకా ఆలోచించకుండా అరణ్యాలకు బయలుదేరుతున్నాను. అట్లాగే వెంటనే

భరతునికి కూడా రాజ్యాభిషేకం చేయించు.

కైకేయి: రామా! ఈ మహారాజు సిగ్గు వలన నీతో స్వయంగా చెప్పలేకపోతున్నాడు. ఆయన పరిస్థితిని అర్థం చేసుకో. నువ్వు వెంటనే అడవులకు బయలుదేరి వెళ్ళు. నువ్వు అయోధ్య వదలి వెళ్ళేవరకు నీ తండ్రి స్నానం చెయ్యడు, అన్నం తినడు. కాబట్టి ఆయన ఆరోగ్యాన్ని దృష్టిలో ఉంచుకొని వెంటనే అడవులకు బయలుదేరు. ఏమాత్రం ఆలస్యం అయినా అది శ్రేయస్కరం కాదని నేను అనుకొంటున్నాను. నువ్వు చెప్పినట్లుగానే వేగంగా దౌడు తీసే గుర్రాలనిచ్చి దూతలను పంపి భరతుణ్ణి పిలిపిస్తాను. అతడు రాగానే రాజ్యాభిషేకం ఏర్పాట్లు జరుగుతాయి. నువ్వు మాత్రం వెంటనే అడవులకు బయలుదేరి నీ తండ్రి ప్రతిజ్ఞను నెరవేర్చు.

కైకేయి, రాముల సంభాషణ దశరథుడు విన్నాడు. దుఃఖంతో ఆయన గుండెలు పగిలాయి. ఆ దుఃఖంలోనే అప్రయత్నంగానే "ఛీ! నా కెంతటి దుస్థితి పట్టింది" అని తిరిగి మూర్ఛపోయాడు. రాముడు ఆయనను లేవనెత్తి సపర్యలు చేయబోయాడు. అంతట కైకేయి రామునితో "రాజుకు సేవలుచేసే వంకతో అడవులకు పోవటానికి ఆలస్యం చేస్తున్నావు" అని పరిపరి విధాలుగా నిందించింది. రాముడు ఆమె మాటలకు ఏమీ వ్యధచెందలేదు.

రాముడు: అమ్మా! నేను ధనాన్ని ఆశించి గాని, మరో ప్రయోజనాన్ని ఆశించి గాని రాజుకు సేవ చేయడం లేదు. నేను ధర్మాన్ని పాటిస్తున్నాను. నీకు రాజుకు మాట ఇవ్వటంవల్ల నేను ఋషితో సమానుడనయ్యాను. నా తండ్రి ఏం కావాలన్నా నా ప్రాణాలు అర్పించి అయినా ఆయన కోరిక తీరుస్తాను. తండ్రికి శుశ్రూష చెయ్యడం, ఆయన ఆజ్ఞను పాలించడం నా ధర్మంగా భావిస్తాను. మా తండ్రిగారు చెప్పినా చెప్పకపోయినా, నీ మాటే ఆయన ఆజ్ఞగా శిరసావహిస్తాను. పద్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసం చేస్తాను.

అమ్మా! నీకు నా మీద సర్వాధికారాలు ఉన్నాయి. అటువంటిది భరతునికి రాజ్యాభిషేకం విషయమై నాకు చెప్పకుండా తండ్రిగారితో చెప్పావు. అంటే నాపై విశ్వాసం లేదని తెలుస్తోంది.

అమ్మా! వెంటనే బయలుదేరి నా తల్లికి ఈ వార్త చెప్పి, సీతను ఊరడించి, వెంటనే అరణ్యవాసానికి బయలుదేరుతాను. నువ్వు భరతునితో చెప్పి తండ్రికి శుశ్రూషలు చేసేట్లు చూడు. ఇది మన సంప్రదాయం; ధర్మం.

రాముని ధర్మ సమ్మతమైన, ఓర్పుతో కూడిన సంభాషణ అంతా వింటున్న దశరథుడు భోరున ఏడ్చాడు. అట్లా బిగ్గరగా ఏడుస్తున్న తండ్రి పాదాలకు, తల్లి కైకేయి పాదాలకు రాముడు నమస్కరించాడు. తరువాత బయటకు వెళ్ళి అభిషేక సామగ్రికంతటికీ మర్యాదపూర్వకంగా ప్రదక్షిణ చేసి నమస్కరించి బయలుదేరాడు. లక్ష్మణుడు కూడా రాముణ్ణి అనుసరించి వెళ్ళాడు. రాముని ముఖంలో ఎటువంటి మార్పూ లేదు. వెళ్ళేటప్పుడు ఎంత ప్రశాంతంగా వెళ్ళాడో వచ్చేటప్పుడు కూడా అంతే.

రాముడు గొప్ప మనోనిబ్బరం గలవాడు. ఇంద్రియనిగ్రహం గలవాడు. బయటకు రాగానే ఛత్రచామరాలన్నీ వదిలేశాడు. రథాన్ని, మిత్రుల్ని పంపివేశాడు. కాలినడకనే తల్లి గృహానికి వెళ్ళాడు. లక్ష్మణుడు కూడా రాముని మల్లే మనోనిబ్బరం గలవాడై మనస్సులోని దుఃఖాన్ని ఎక్కడా బయటకు తెలియనీయక గంభీరంగా రాముణ్ణి అనుసరించాడు.

రామలక్ష్మణులు కౌసల్యామందిరానికి చేరే సమయానికి ఆ మందిరమంతా ఆనందంతో నిండి ఉంది.

## 20వ సర్గ రాముడు కౌసల్యకు తన వనవాసం గూర్చి తెలుపడం

రాముడు దశరథునికి, కైకేయికి నమస్కరించి బయలుదేరగానే అంతఃపురంలోని స్త్రీలంతా ఘొల్లున ఏడ్చారు. రాముడు తండ్రి చెప్పినా చెప్పకపోయినా అందరికీ అన్ని పనులు చేసిపెడుతూ ఉండేవాడు. ఎవరి మీదా కోపగించుకొనేవాడు కాదు. ఒకవేళ ఎవరికైనా కోపంవస్తే వాళ్ళ కోపం మంచులా కరిగిపోయేట్లు మాటలు చెప్పేవాడు. అటువంటి రాముణ్ణి అడవులకు పంపుతున్నారు. మనమంతా దూడలు లేని ఆవుల్లాగా అయిపోతామే అంటూ ఏడవసాగారు. ఈ ఏడుపులన్నీ వింటూ దశరథుడు మళ్ళీ మూర్ఛపోయాడు. ఈ రోదన అంతా రాముడు కూడా విన్నాడు. కానీ మనోనిగ్రహంతో మదపుటేనుగులా మెల్లగా అడుగులు వేస్తూ ముందుకు సాగిపోయాడు.

కౌసల్యాదేవి అంతఃపురంలోకి ప్రవేశిస్తూనే అక్కడ చాలాకాలంగా ఉంటున్న వృద్ధుడైన ద్వారపాలకుణ్ణి, మరికొందరిని చూశాడు. వారంతా రాముణ్ణి 'జయీభవా' అని అభినందించారు. అట్లా ముందుకు పోతూనే రెండవ ప్రాకారం దాటాడు. అక్కడ వృద్ధులైన బ్రాహ్మణులున్నారు. రాముడు వారందరికీ నమస్కారం చేశాడు. అట్లా ముందుకుపోయి మూడవ ప్రాకారంలో ప్రవేశించాడు. అక్కడంతా స్త్రీలే ద్వారపాలకులుగా ఉన్నారు. వారంతా పరుగెత్తుకుపోయి కౌసల్యాదేవికి రాముని రాకను తెలియజేశారు.

కౌసల్యాదేవి ఎప్పుడూ వ్రతాలనాచరిస్తూ నియమనిష్ఠలు పాటిస్తూ ఉంటుంది. ఆ క్రిందటి రోజు రాత్రి అంతా జాగారం చేసి, ఉదయానే రాముని క్షేమాన్నికోరి తెల్లని పట్టుచీర ధరించి విష్ణుపూజ చేస్తోంది. సాక్షాత్తూ లక్ష్మీదేవిలా ప్రకాశిస్తున్న తల్లి పాదాలకు రాముడు నమస్కారం చేశాడు. ఆమె రాముణ్ణి లేవనెత్తి రెండు చేతులతో గట్టిగా కౌగలించుకొని శిరస్సుపై ముద్దుపెట్టుకొంది.

"ఓ రామా! నీ పూర్వీకులంతా పరమధార్మికులు. అంతా రాజర్షులే. మహాత్ములైన వారికి

మల్లేనే నువ్వు దీర్ఘాయుష్మంతుడవు కావాలి. గొప్ప కీర్తిమంతుడవు కావాలి. నీ కీర్తి ముల్లోకాలలోను వ్యాపించాలి. మన వంశ గౌరవాన్ని, వంశ ధర్మాన్ని ఎప్పటికీ కాపాడాలి.

నాయనా! నీకు రాజ్యాభిషేకానికి సమయం దగ్గరవుతూంది. ధర్మపరుడు, సత్యసంధుడు అయిన నీ తండ్రి దశరథ మహారాజు నీకు రాజ్యాభిషేకం చేయిస్తాడు. నువ్వు రాత్రంతా ఏమీ తినలేదు. ఉపవాసం ఉన్నావు. భోజనం చేసి వెళ్లు" అంది.

రాముడు: అమ్మా! ఇప్పుడు మనకు వచ్చిన ఆపద గూర్చి నీకు తెలియదు. నీకు ఎట్లా చెప్పటమా అని తటపటాయిస్తున్నాను. ఇంకా కొద్దిసేపట్లో నిన్ను, లక్ష్మణుని, సీతను విడిచి దండకారణ్యానికి పోవలసి ఉంది.

ఇకపై మాంసాహారానికి బదులు, తేనె, దుంపలు, పండ్లు తింటూ ఉండాలి. పద్నాలుగు సంవత్సరాలు అరణ్యంలో నివసించాలి. రాజ్యాభిషేకం భరతుడికి జరుగుతుంది. ఒక మునీశ్వరునిలా దండకారణ్యంలో నివసించమని నన్ను మహారాజు ఆజ్ఞాపించాడు.

రాముని మాటలు విన్న కౌసల్యాదేవి గొడ్డలితో నరికిన మద్దికొమ్మవలే నేలపై ఒరిగిపోయింది. స్వర్గం నుండి భూమిపై పడ్డట్లు పడిపోయింది. మొదలు నరికిన అరటిచెట్టులా నేలపై పడిపోయింది. రాముడు వెంటనే తల్లిని లేవదీసి పట్టుకొని కూర్చోబెట్టాడు. ఉపచారాలు చేశాడు.

కౌసల్య: నాయనా! రామా! గొడ్రాలికి ఒక్కటే దుఃఖం 'అయ్యో నాకు బిడ్డ లేకపోయాడే' అని. కానీ నీవు పుట్టడంవల్ల నాకు దుఃఖమే మిగిలింది సుమా!

నాయనా! నేను మీ నాయనగారి వల్ల ఏ విధమైన సుఖసంతోషాలనూ పొందలేదు. అన్నీ నా కొడుకు హయాంలో రాజైన (తరువాత) రాజమాతగా పొందవచ్చునని సంతోషపడుతూ ఉండేదాన్ని. అవన్నీ కలలే అయిపోయాయి. నీటి మీద వ్రాసిన రాతలైపోయాయి.

నాయనా! ఆడది భర్త కొట్టినా బాధపడదు గాని, తోటికోడలు నవ్వితే తల ఎత్తుకుని తిరుగలేదు. నా పని అట్లాగే అయింది. నేను ఇంతకాలం పట్టమహిషిగా ఉన్నాను. ఇకపై నా సవతులు చేసే ఎద్దేవా తలచుకొంటే తలకొట్టేసినట్లుంటుంది సుమా! వారి సూటిపోటి మాటలు వినలేను. వారు చేసే అవమానాలన్నీ పడాల్సిందే! ఇక నా దుఃఖానికి అంతే ఉండదు సుమా! ఓ రామా! నువ్వు ఇక్కడ ఉండగానే నన్ను ఈ విధంగా అవమానిస్తున్నారే! ఇక నువ్వు వనవాసానికి పోతే నన్ను వీళ్ళు బ్రతుకనివ్వరు. నాకు మరణం తప్ప వేరే గత్యంతరం లేదు.

నీ తండ్రి నా బ్రతుకును, కైకేయి దాసి కన్నా హీనంగా చేశాడు. నా స్వాతంత్ర్యాన్ని పూర్తిగా హరించివేశాడు. ఇప్పుడు నాకు సేవచేస్తున్న సేవకులు కూడా, భరతునికి ఎక్కడ కోపం వస్తుందోనని భయపడి నన్ను పలకరించను కూడా పలుకరించరు. ఇక సేవల మాట చెప్పాలా? ఇకపై ఎవరూ నా ముఖం వంక కూడా చూడరు. నేను దిక్కుమాలిన దాననై పోతాను. కైకేయి ఇప్పుడు నన్ను చూస్తే నిప్పులు చెరుగుతూ ఉంటుంది. ఇక నువ్వు కూడా లేకపోతే ఆవిడతో నేనెట్లా వేగగలను?

రామా! ఎప్పటికైనా నాకు మంచి రోజులు వస్తాయని, నా దుఃఖాలన్నీ తొలగిపోతాయని నీ ఉపనయనం అయిన తర్వాత పదిహేడు సంవత్సరాల నుండి ఎదురుచూపులు చూస్తున్నాను. కానీ, రామా! నా అదృష్టం ఇట్లా తారుమారై ఈ వృద్ధాప్యంలో కూడా నా సవతులచే అవమానాలు ఈసడింపులు పడాలని నా ముఖాన రాసి ఉంది కాబోలు! ఈ ముసలితనంలో ఈ అవమానాలన్నీ ఎట్లా సహించగలను? చంద్రబింబం లాంటి నీ ముఖం చూడకుండా ఎట్లా ఉండగలను?

ఓ రామా! నీ కోసం ఎన్నో పూజలు చేశాను. ఎన్నో ఉపవాసాలు ఉన్నాను. ఎందరో దేవుళ్ళను పూజించాను. కాని ఒక్కళ్ళకూ నాపట్ల కనికరం లేకుండాపోయింది.

నా తపస్సు అంతా చవిటి నేలలో నాటిన విత్తనాల్లాగా వ్యర్థమైపోయింది. నిన్ను కన్ననాటి

నుండి కళ్ళల్లో వత్తులు వేసుకొని జాగ్రత్తగా పెంచాను. నేను దరిద్రురాలను కావటంచేతనే నీకు ఈ కష్టం దాపురించిందేమో? రామా! ఏటిగట్లు కూడా వరదలొస్తే తెగిపోతూ ఉంటాయి కానీ, నా దుః ఖానికి నా గుండెలు పగిలిపోవటంలేదు. బహుశా నా గుండె రాతితో చేశాడో, ఏమో! ప్రాణభయంతో ఒణికిపోతున్న లేడిని సింహం కనికరం లేకుండా నోట కరచుకుపోతుంది. కానీ ఇన్ని అవమానాలు పడుతున్నా భయంతో ఒణికిపోతూ జీవితం సాగిస్తున్నా యముడు నన్ను తీసుకుపోవటంలేదు. యముడికి కూడా నాపై కనికరం లేకుండా పోయిందా? లేక యమలోకంలో నాకు చోటు లేకుండా పోయిందా? ఇన్ని దుఃఖాలు, అవమానాలు భరించి ఇంకా మరణం రాలేదంటే, అసలు నాకు మరణం లేదేమో! ఓ రామా! దూడ వెంటపోయే బక్క ఆవులా నేను కూడా నీ వెంట వస్తాను. చంద్రబింబం లాంటి నీ ముఖం చూసుకొంటూ బ్రతుకుతాను.

రాముడు తండ్రి ఆజ్ఞను జవదాటడని తెలిసినా లోపలనుండి ఉబికి వచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక కౌసల్య, రాముణ్ణి పెనవేసుకొని ఏడ్చింది.

## 21వ సర్గ రాముడు తల్లికి, లక్ష్మణునకు నచ్చచెప్పడం

లక్ష్మణుడు: ఆర్యులారా! దశరథమహారాజు వృద్ధుడైపోయినా ఇంకా యౌవనంలోనే ఉన్నానను కొంటున్నాడు. అందువల్ల ఆయనలో భోగాసక్తి తగ్గలేదు. కామంచేత ఒక ఆడదాని మాటలకు బానిసై విపరీతపు నిర్ణయాలు తీసుకున్నాడు. అంతమాత్రం చేత రాముడు ఒక ఆడదానికిచ్చిన మాటకోసం రాజ్యలక్ష్మిని వదులుకోవటం నాకు బొత్తిగా ఇష్టంలేదు. ఆ మాటకు వస్తే రాముడు ఏం తప్పుచేశాడని దేశాన్నుంచి బహిష్కృతుడవుతున్నాడు. అరణ్యాలకు పంపాల్సినంత దోషం అతడు ఏమి చేశాడు? ఎంతటి శత్రువైనా రాముణ్ణి గూర్చి ఒక్క మాట కూడా వ్యతిరేకంగా మాట్లాడలేదు.

రాముడు దేవతలలో పరిగణించదగ్గవాడు. ధర్మబుద్ధి గలవాడు, ఇంద్రియనిగ్రహం కలవాడు, కపటం లేనివాడు. శత్రువులకు కూడా మేలు చేసే స్వభావం గల రాముణ్ణి ఎందుకొరకు అడవులకు పంపాలి? ఏ తండ్రి అయినా అటువంటి వాడికి ఇలాంటి ఏకపక్షమైన శిక్షను విధిస్తాడా?

రామా! ఈ విషయం నలుగురికీ తెలియకమునుపే రాజ్యాధికారాన్ని చేజిక్కించుకుందాం. ధనుస్సును ధరించి, నేను నీ ప్రక్కన ఉంటే నిన్ను ఎదిరించే ధైర్యం ఎవరికుందో చూద్దాం. నా వాడిబాణాల ధాటికి ఈ అయోధ్యా నగరమే నిర్మానుష్యమైపోతుంది. భరతుని పక్షాన ఎవరొచ్చినా, ఎందరొచ్చినా వాళ్ళందరినీ నాశనం చేస్తాను. ఒకవేళ దశరథ మహారాజే కైకేయిని వెనకేసుకువస్తే ఆయన్నూ బంధిస్తాను. తప్పనిసరైతే చంపుతాను. గురువైనా అధర్మమార్గాన్ని అనుసరిస్తే అతణ్ణి శిక్షించాల్సిందే.

రామా! కామంతో కళ్ళు మూసుకుపోయిన వారు తండ్రే అయినా దండించాల్సిందే. ఇది రాజధర్మమే కదా! నీకు ధర్మబద్ధంగా రావలసిన రాజ్యాన్ని దశరథ మహారాజు కైకేయికి ఏ కారణంచూపి కట్టబెడదామని అనుకున్నాడు? ఆ విషయంలో ధర్మం ఆయన పక్షాన లేదు.

శౌర్యపరంగా, ఆయన సైన్యమంతా ఏకమై వచ్చినా మనిద్దరినీ జయించలేడు.

అమ్మా! ఓ కౌసల్యాదేవీ! నేను త్రికరణశుద్ధిగా రాముని అనుచరుణ్ణి. ఈ మాట నా ధనుస్సు మీదా, నేను చేసుకున్న పుణ్యం మీద, ధర్మం మీద ఒట్టువేసి చెబుతున్నాను. అమ్మా! రాముడి కోసం మండే మంటల్లోనైనా దూకుతాను. రాముడి కోసం ఏ త్యాగానికైనా సిద్ధమే. రాముడు అడవులకు వెళ్ళేందుకు నిర్ణయించుకుంటే నేనూ అడవులకుపోతాను. అమ్మా! నీ దుఃఖాన్ని చూడలేకుండా ఉన్నాను. నా పరాక్రమంతో నీ దుఃఖాన్ని, సూర్యరశ్మి చీకటిని అంతంచేసినట్లు, అంతం చేస్తాను.

కౌసల్య: రామా! లక్ష్మణుని మాటలు విన్నావు కదా! ఏం చెయ్యాలో నీవే నిర్ణయించుకో. మహారాజు నా సవతి మెప్పుకోసం, నన్ను దుఃఖంలో ముంచి నిన్ను అడవులకు పంపుతున్నాడు. నన్ను ఒంటరిదాన్ని చేసి పితృవాక్య పరిపాలన అంటూ అడవులకు పోవద్దు. నువ్వు ధర్మాలన్నీ తెలిసినవాడవు. ఈ వృద్ధాప్యంలో నాకు సేవలు చేయడం కూడా పరమధర్మమే అని తెలుసుకో కుమారా! పూర్వం కాశ్యపుడు ఇంట్లో ఉంటూనే మాతృసేవలు చేస్తూ స్వర్గాన్ని పొందాడు. గురువుగా తండ్రి నీకెట్లా పూజ్యుడో అట్లాగే తల్లిగా నేనుకూడా పూజ్యురాలినే. కాబట్టి నేను నీకు అనుమతి ఇవ్వటం లేదు. నువ్వు లేనిచోట ఎన్ని సుఖాలున్నా నన్ను సంతోషపెట్ట లేవు. కాబట్టి నీతోపాటే వస్తాను. అక్కడ నీతో గడ్డి తిని బ్రతకమన్నా సంతోషంగా తింటాను. నా మాట కాదని అడవులకు వెళ్తే నేను ఆమరణ నిరాహారదీక్ష చేపడతాను.

రామా! పిప్పలాదమహర్షి విషయంలో సముద్రుడు అధర్మంగా ప్రవర్తించటం మూలంగా, సముద్రుడికి బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంది. అట్లానే నీ మూలంగా నేను మరణిస్తే నీకు గూడా ఘోరమైన దుర్గతి పడుతుంది.

రాముడు: అమ్మా! తండ్రి ఆజ్ఞను నేను తప్పక పాటించాలి. ఆయన ఆజ్ఞను అతిక్రమించే శక్తి నాకు లేదు. కండుమహర్షి సర్వధర్మాలు, సర్వశాస్త్రాలు తెలిసినవాడు. అనేక వ్రతాలు

ఆచరించినవాడు. తండ్రి చెప్పినందువలన గోవును చంపాడు. మన వంశంలోనే జన్మించిన సగరుని కుమారులందరూ తండ్రి ఆజ్ఞలను శిరసావహించి భూమిని త్రవ్వి భయం కరమైన మరణాన్ని పొందారు. జమదగ్ని కుమారుడైన పరశురాముడు తండ్రి చెప్పాడని తన గండ్రగొడ్డలితో తల్లి రేణుకాదేవి తలను నరికాడు. వీరే కాదు. ఇంకా ఎంతోమంది మహాత్ములు తండ్రి ఆజ్ఞను శిరసావహించారు. అట్లాగే నేను కూడా తండ్రిగారి ఇష్టానికి వ్యతిరేకంగా నడచుకోలేను. అమ్మా! పితృవాక్యాన్ని పరిపాలించడం అనే ధర్మం నాతోనే మొదలు కాలేదు. ఇంతకు పూర్వం ఎంతోమంది అనుసరించారు. అట్లాగే ఇది ముందు తరాలవాళ్ళు కూడా ఆచరించాల్సిన ధర్మం. తండ్రి ఆజ్ఞ పరిపాలించిన వారికి ఏ విధమైన దోషమూ అంటదు.

సోదరా! లక్ష్మణా! నీకు నా పట్ల ఉండే ప్రేమాభిమానాలను నేనెరుగుదును. నీ బలపరాక్రమాలు కూడా నాకు బాగాతెలుసు. మన తల్లి కౌసల్యాదేవి మహాదుఃఖంలో మునిగి ఉంది. అందువలన సత్యము, ధర్మము, శాంతిని గూర్చి చక్కగా తెలియకపోవటం వలన ఇట్లా మాట్లాడుతోంది.

లక్ష్మణా! సకల పురుషార్థాలకూ ధర్మమే మూలం. ధర్మానికి సత్యమే మూలం. సత్యం లేకుండా ధర్మం నిలవదు. ధర్మం లేకుండా సత్యం నిలవదు. ఆ రెండింటికీ అటువంటి అవినాభావ సంబంధం ఉంది. తండ్రికిగాని, తల్లికిగాని, బ్రాహ్మణునికిగాని మాట ఇచ్చిన తర్వాత ధర్మాన్ని అనుసరించేవాడు ఎవడూ మాట తప్పడు; తప్పకూడదు. అందువల్లనే నేను తండ్రి ఆజ్ఞను శిరసావహిస్తున్నాను. నాతో చెప్పింది కైకేయీదేవియే అయినా నా తండ్రి మాటనే, ఆమె తెలియ చెప్పింది. అందువలన ఇది క్షత్రియధర్మాన్ని ఆచరించాల్సిన సమయం కాదు. ఎవరిపైనా క్రోధాన్ని పెంచుకోవద్దు.

అమ్మా! కౌసల్యాదేవీ! నేను అరణ్యానికి పోక తప్పదు. నా వనవాసానికి నువ్వు అడ్డుచెప్పవద్దు. నన్ను ఆశీర్వదించి పంపు. నీ దీవెనలుంటే, యయాతి మహారాజులాగా స్వర్గాన్నుండి భూమిపైకి వచ్చి మరల భూమిపైనుండి స్వర్గానికి వెళ్ళినట్లుగా, నేనుకూడా

అరణ్యాలకు వెళ్ళి పద్నాలుగు సంవత్సరాలైన తరువాత మళ్ళీ అయోధ్యకు వస్తాను. అమ్మా! రాజాజ్ఞ నా ఒక్కడికే కాదు. నువ్వు, సుమిత్రాదేవి, సీత, లక్ష్మణుడు కూడా పాటించాలి. ఇదే సనాతన ధర్మం.

అమ్మా! రాజ్యాభిషేకానికై సమకూర్చిన సంబారాలన్నీ భరతుని రాజ్యాభిషేకానికి ఉపయోగించండి. నేను వనవాసానికి వెళ్ళక తప్పదు. కాబట్టి నువ్వుకూడా సమ్మతించి నన్ను ఆశీర్వదించి పంపు. అమ్మా! దుఃఖించవద్దు.

రాముడు ఈ విధంగా తల్లికీ, లక్ష్మణునికీ ధైర్యం చెప్పి, పితృవాక్పరిపాలన విషయంలో తన దృఢనిశ్చయాన్ని తెలిపాడు. ఈ మాటలన్నీ వింటూ కౌసల్యాదేవి మూర్ఛపోయింది. రామలక్ష్మణులిద్దరూ ఆమెకు ఉపచారాలు చేశారు. కొంతసేపటికి ఆమె తేరుకుని ఇట్లా అంది.

కౌసల్య: పుత్రా! నిన్ను పెంచి పోషించడంలోను, స్వధర్మం చేతా నీకు తండ్రి ఎట్లా గురువో, నేనూ అట్లాగే గురువు నవుతాను. తండ్రి ఎంత పూజ్యుడో, తల్లీ అంతే పూజ్యురాలవుతుంది. ఈ వయస్సులో నువ్వు నా దగ్గర లేకపోతే, ఇక నేను బ్రతికి ఉండడం వ్యర్థమే. మరణించిన తర్వాత నీ వలన కలిగే స్వర్గం, అమృతపానం, పితృలోకంలో లభించే స్వధలు తినడం, మహర్లోకంలో ఆనందాన్ని పొందడంవంటి వాటిపై నాకు ఆసక్తి లేదు. నేను జీవించి ఉన్నంత కాలం, నువ్వు నా ఎదుట ఉండాలన్నదే నా కోరిక. అది తీరని పక్షంలో నేను ఎందుకు జీవించాలి?

అట్లా అంటూనే కౌసల్యాదేవి మళ్ళీ మూర్ఛపోయింది. మరోపక్క తమ్ముడు లక్ష్మణుడు దుః ఖావేశంలో ఉన్నాడు. ఎవరెన్ని చెప్పినా రాముడిలోని ధర్మచింతన మారలేదు. స్థిరంగా ధర్మంపైనే నిలబడి ఉన్నాడు.

రాముడు: తమ్ముడా! లక్ష్మణా! నీకు నా పట్ల ఉన్న భక్తిని, నీ పరాక్రమాన్ని నే నెరుగుదును. కానీ నువ్వు నన్ను అర్థం చేసుకోకుండా అమ్మతో చేరి నన్ను ఇబ్బంది

పెడుతున్నావు.

ఒక్క ధర్మం వల్లనే ధర్మార్థకామాలనే మూడు పురుషార్థాలు లభిస్తాయి. అది ఎట్లాగంటే, ఒక్క భార్యలోనే అనుకూలత, ప్రేమపాత్రురాలుగా ఉండటం, సుపుత్రులను ఇవ్వడం వంటి మూడు గుణాలున్నాయో, అట్లాగే ధర్మం ధర్మార్థ కామ ఫలాలు మూడింటినీ ఇస్తుంది. కాబట్టి మానవుడు ధర్మార్థకామాలు మూడూ ఇచ్చే ధర్మాన్నే ఆచరించాలి. కానీ అర్థాన్ని మాత్రమే ఇచ్చే ధర్మాన్ని ఆచరించ కూడదు. అట్లా కాకుండా ఒక్క అర్థాన్ని మాత్రమే ఇచ్చే ధర్మాన్ని ఆచరిస్తే లోకంలో ద్వేషం పెరిగిపోతుంది. అట్లాగే కామాన్ని మాత్రమే సాధించే ధర్మం కూడా మెచ్చుకోదగ్గది కాదు.

పూజ్యుడు, వృద్ధుడు, రాజు, అంతేగాక తండ్రి అయినవాడు కోపంతో గాని, సంతోషంతో గాని, కామం వలన గాని ఒక పనిచేయమని ఆదేశించినప్పుడు ధర్మదృష్టి కలిగిన వాడు ఆ పనిని తప్పక చేయాలి. అట్లా చేయనని అనడం క్రూర ప్రవృత్తే అవుతుంది.

కాబట్టి సోదరా! నీకు, నాకు కూడా మన తండ్రే గురువు. ఆయన ఆజ్ఞాపించినట్లు చేయడమే మన ధర్మం. ఇక అమ్మ కూడా ఆయనకు ధర్మపత్ని. ఆమెకు కూడా ఆయనే దిక్కు. ఆయన ఆజ్ఞను శిరసావహించడమే ఈమెకు పరమధర్మం. మన తండ్రికి, తన పూర్వీకులకన్నా ధర్మాత్ముడన్న పేరు ఉంది. అటువంటి ధర్మాత్ముడు జీవించి ఉండగా ఆయనను వదలి (విధవలాగా) కొడుకు వెంట అడవులకు వెళ్ళడం ధర్మసమ్మతం కాదు.

అమ్మా! ఓ పట్టపురాణీ! నేను వనవాసానికి పోతున్నాను. కేవలం ధర్మాచరణ వలననే యయాతి మహారాజు తిరిగి స్వర్గానికి వెళ్ళినట్లు, పద్నాలుగు సంవత్సరాలు వనవాసం పూర్తిచేసుకొని తిరిగి అయోధ్యకు రమ్మని నన్ను ఆశీర్వదించు. అమ్మా! కేవలం రాజ్యంకోసం గొప్ప కీర్తిని, సత్ఫలితాలను ఇచ్చే ధర్మాన్ని విడిచి పెట్టలేను. ధర్మాచరణ ముందు రాజ్యాన్ని తుచ్ఛమైనదిగా పరిగణిస్తాను.

ఆ విధంగా పురుషోత్తముడైన రాముడు తల్లికి, లక్ష్మణుడికి ధైర్య వచనాలు చెప్పి తల్లికి ప్రదక్షిణ నమస్కారం చేసి బయటకు వెళ్లాడు.

# 22వ సర్గ దైవమే వనవాసానికి కారణమని లక్ష్మణునికి నచ్చచెప్పడం

రాముడు: సోదరా! లక్ష్మణా! నువ్వు కోపంతో నాగేంద్రుడిలాగా బుసలు కొడ్తున్నావు, కానీ నీ హృదయం చాలా మంచిది. నువ్వు నాకు ప్రియాతిప్రియమైన సోదరుడవు. నువ్వు కోపాన్ని విడిచిపెట్టు. ధైర్యం తెచ్చుకో. అవమానాన్ని మరచిపో! ఆనందంగా ఉండు. ఇంతవరకు నా రాజ్యాభిషేకం జరగటంలో చూపిన ఉత్సాహాన్ని ఇకపై నా అభిషేకం జరుగకుండా ఉండేటందుకు చూపు. అందువల్ల నీకు దుఃఖం పోయి ఆనందం కలుగుతుంది.

లక్ష్మణా! నా అభిషేకం జరుగుతుందేమోనని బాధపడుతున్న కైకేయీదేవికి ఎటువంటి అనుమానం కలుగకుండా నడచుకో. ఆమెకు ఏ విధమైన అనుమానం కలిగినా నేను ఒప్పుకోను. నేను తెలిసిగాని, తెలియకగాని మన తల్లులకుగాని, తండ్రిగారికిగాని కష్టం కలిగించినట్లు గుర్తులేదు. నా తండ్రి సత్యవ్రతుడు, పరాక్రమశాలి. పరలోకములందు విశ్వాసం గలవాడు అయిన నా తండ్రి ప్రతిజ్ఞ అసత్యమవుతుంది. ఆయన మనస్సు బాధపడుతుంది. అట్లా జరగడం నాకు సుతరామూ ఇష్టంలేదు. ఇదంతా జరగాలంటే నేను ఆలస్యం చేయకుండా వనాలకు వెళ్ళడం ఒక్కటే మార్గం.

లక్ష్మణా! నేను అరణ్యాలకు బయలుదేరగానే మన తల్లి కైకేయి భరతుణ్ణి పిలిపించి రాజ్యాభిషేకం చేయించి నిర్భయంగా ఉంటుంది. కాబట్టి నేను కృష్ణాజినం జటలను ధరించి వెంటనే అరణ్యవాసానికి బయలుదేరాలి. అప్పుడే మన తల్లి కైకేయీదేవికి మనశ్శాంతి లభిస్తుంది.

లక్ష్మణా! తండ్రిగారు నాకు రాజ్యాభిషేకం చేయాలనుకోవటం, అది తప్పిపోవటం అంతా దైవనిర్ణయమని భావిస్తాను. అందులో మన తల్లి కైకేయి కూడా దైవం నిర్ణయించిన పాత్రయేనని నా భావన. ఎందువల్లనంటే పూర్వం మన తల్లి కైకేయికి నా పట్లగాని, భరతుని పట్లగాని భేదభావముండేది కాదు. అట్లాగే మనంకూడా మన తల్లులందరినీ సమభావంతో చూసేవాళ్ళం.

అటువంటి ఆమె ఇప్పుడు ఇంత ఉగ్రరూపం దాల్చిందంటే దైవమే ఆమెను ప్రేరేపించి ఉంటుంది. లేని పక్షంలో, ఇన్ని సంవత్సరాలు నాయనగారితో జీవితం గడిపి, ఇప్పుడు ఇంతగా ఆయన మనస్సును క్షోభపెట్టడానికి ఆ దైవప్రేరణే కారణం అయివుంటుంది.

లక్ష్మణా! దైవప్రభావాన్ని మనం ఊహించలేం. ఏ ప్రాణికికూడా దైవాన్ని అడ్డుకొనే శక్తి లేదు. ఇక నా విషయం, కైకేయీదేవి విషయం వేరే చెప్పాలా? దైవం ఆడించినట్లల్లా ఆడటమే మనం చేయగలిగింది. సుఖదుఃఖాలు, భయక్రోధాలు, లాభనష్టాలు, ఉత్పత్తి, వినాశనాలన్నీ దైవ ప్రేరితాలే!

# 23వ సర్గ లక్ష్మణుడు రాముని మాటలతో విభేదించడం

రాముడు చెప్పినదంతా లక్ష్మణుడు శ్రద్ధగాను భక్తితోనూ విన్నాడు. అన్నగారి ధర్మనిష్ఠ తలచుకొని సంతోషించాడు. కానీ అరణ్యానికి పోవలసి వచ్చిందే అని దుఃఖించాడు. రాముడు జరిగిందంతా దైవానికి ఆపాదించడం మాత్రం జీర్ణించుకోలేకపోయాడు. పాముకు మల్లే కోపంతో బుసలుకొట్టాడు. కోపంతో ముఖమంతా ఎర్రబడింది.

లక్ష్మణుడు: అన్నా! రామా! నువ్వు క్షత్రియులలో శ్రేష్ఠుడవు. పితృవాక్పరిపాలన చేయకపోతే ధర్మహాని చేసినట్లవుతుందని భయపడుతున్నావా? లోకులు నిన్ను గౌరవించరేమోనని భయపడుతున్నావా? ఇన్ని భయాలు లోపల పెట్టుకొని దైవంపై నెపం వేస్తున్నావు. ఇదంతా నీ భయమే కాని మరొకటి కాదు. నువ్వు చాలా తొందరపడి అడవులకు పోవాలనే నిర్ణయానికొచ్చావు.

అన్నా! దైవానికి ఏమీ శక్తి లేదు. తన పని నెరవేర్చుకోవడానికి, మరొకరిని ఆశ్రయిస్తుంది. దీనులైనవారు, శక్తిహీనులు మాత్రమే దైవాన్ని తలుస్తూంటారు. రామా! నువ్వు క్షత్రియులలో శ్రేష్ఠుడవు. శూరులలో అగ్రగణ్యుడవు. నువ్వు దైవాన్ని కూడా ఎదిరించగల సమర్థుడవు.

రామా! నువ్వు బుద్ధిశాలివి. కైకేయి, దశరథులను ఎందుకు నువ్వు అనుమానించటం లేదు? వారిద్దరూ కలసి నిన్ను వంచిస్తున్నారు. మృదువైన మాటలతో ధర్మాన్ని వల్లిస్తున్నారు. ఇదంతా వారిద్దరూ ముందుగానే ఆలోచించి చేస్తున్న మంత్రాంగం, కుట్ర. నువ్వు తెలుసుకోలేకపోతున్నావు. నువ్వే ఒకసారి స్థిమితంగా ఆలోచించి చూడు.

దశరథుడు ఎన్నడో ఇచ్చిన వరాన్ని గూర్చి ఇప్పుడు బయటపెడుతున్నారు. దశరథుడు ఆ వరం తీర్చదలచుకుంటే ఇన్ని సంవత్సరాలు ఆగాలా? ఎప్పుడో తీర్చి ఉండేవాడు. ఒకవేళ

ఆలస్యం జరిగి ఉన్నాకూడా, ఇదా సమయం? ఇంకా కొద్ది ఘడియల్లో జరగబోయే రాజ్యాభిషేకాన్ని ఆపటానికి వాళ్ళిద్దరూ కలసి చేసిన కుట్ర ఇది. ఇట్లాంటి వారి కుట్రలు, పన్నాగాలు భగ్నం చేయడంవల్ల ధర్మహాని ఏమీ వాటిల్లదు. నిన్ను ఏ పాపమూ అంటదు. నిన్ను ఎవరూ నిందించరు.

ఓ రామా! నువ్వు జ్యేష్ఠుడవు. నీకు తప్ప వేరొకరికి రాజ్యాభిషేకం చేయటం లోకవిరుద్ధం. ఇది సహింపరానిది. నువ్వు చెప్పే ధర్మంతో నేను ఏకీభవించను. అది ఎట్లాగంటే, నువ్వు పితృవాక్య పరిపాలనమే పరమ ధర్మమని నిన్న రాజ్యాభిషేకానికి అంగీకరించావు. మళ్ళీ ఈ రోజు అదే పితృవాక్యపరిపాలనే పరమధర్మమని చెబుతూ అడవులకు పోతానంటున్నావు. ఈ విధంగా క్షణక్షణానికీ మారే ధర్మం కూడా ఒక ధర్మమేనా? ఇట్లాంటి ధర్మాన్ని తిరస్కరించినా వాటిల్లే దోషం ఏమీ ఉండదు. నువ్వు చెప్పే పితృవాక్య పరిపాలనమనేది వ్యామోహమేకాని, ధర్మం కాదు. ఒకవేళ నీవన్నట్లే ధర్మమే అనుకున్నా, దశరథమహారాజు స్త్రీలోలుడై కైకేయికి బానిసైపోయాడు. అటువంటి నైతికంగా బలహీనమైన వ్యక్తి నిన్ను ఇట్లా ఆజ్ఞాపించడం అధర్మం. కాబట్టి ధర్మాన్ని శిరసావహించే ఓ రామా! నువ్వు దశరథుని ఆజ్ఞను శిరసావహించాల్సిన అవసరం లేదు. నువ్వు వీరుడవు. ప్రతీకారం చేసే సామర్థ్యం గలవాడవు. అటువంటి అర్హుడవైన నిన్ను అడవులకు పంపి, భరతునికి రాజ్యాభిషేకం చేస్తాననటం వారిద్దరూ కూడబలుక్కుని చేస్తున్న కుట్ర తప్ప మరొకటి కాదు. కాముకులైన తల్లితండ్రుల మాట నీవు వినకపోయినా లోకులు నిన్ను తప్పుపట్టరు.

ఓ రామా! దశరథునికి, కైకేయికి దైవికంగా ఇటువంటి బుద్ధిపుట్టిందని నువ్వు సరిపెట్టుకుంటున్నావు. నేను అందుకు అంగీకరించటంలేదు. నన్ను క్షమించు. బలహీనులు, శక్తిహీనులే దైవాన్ని గౌరవిస్తారు. దైవశక్తి గొప్పదో, పురుషశక్తి గొప్పదో నేను ఇప్పుడే ఋజువు చేస్తాను. లోకం అంతా తెలుసుకొంటుంది. నీ రాజ్యాభిషేకాన్ని చెడగొట్టిన దైవాన్ని నేను ఎదుర్కొంటాను. అడ్డుకునే వారందరినీ సంహరిస్తాను. మదపుటేనుగు గొలుసులు తెంచుకొని

వీధిన పడితే మావటివాడు చిన్న అంకుశంతో తన వశంలోకి తెచ్చుకుంటాడు. అట్లాగే మదగజంవంటి నీ దైవాన్ని నా వశంలోకి తీసుకోబోతున్నాను. అష్టదిక్పాలకులు, ముల్లోకాలు కూడా నన్ను ఆపలేవు. ఇక ఈ దశరథ మహారాజు విషయం చెప్పాలా?

ఓ రామా! దశరథ మహారాజుకు, కైకేయీదేవికి దైవం ప్రతికూలంగా ఉండేట్లు చేస్తాను. నీ రాజ్యాభిషేకానికి విఘాతం కలిగించినవారే పద్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసం చేసేట్లు చేస్తాను. దశరథ మహారాజు కైకేయిల ఆశలన్నింటినీ వమ్ము చేస్తాను. నాతో విరోధం పెట్టుకున్నవారికి దైవం ఎంత అనుకూలంగా ఉన్నా వారందరినీ హతమారుస్తాను.

రామా! ఇది నీకు వనవాసంచేసే వయస్సు కాదు. వెయ్యి సంవత్సరాలు రాజ్యపాలనచేసి వృద్ధులైన తరువాత వానప్రస్థానికి వెళ్ళాలి. ఇప్పుడు కాదు సుమా! అప్పుడైనా నీ పుత్రులే రాజ్యం పాలిస్తారు కాని, భరతుడు కాదు. పూర్వం మన వంశంలోని రాజర్షులంతా తమ పెద్దకుమారుడికే రాజ్యం అప్పగించి, వారు వానప్రస్థానికి వనాలకు వెళ్ళారు. అట్లాగే చేయమని శాస్త్రం చెబుతోంది. నువ్వు కూడా రాజ్యం పరిపాలించినంత కాలం పరిపాలించి పిదప నీ జ్యేష్ఠపుత్రునికి అప్పగించి అప్పుడు వనవాసానికి వెళ్ళాలి. అంతేగాని దశరథ మహారాజు చెప్పాడు గదా అని ఇప్పుడే వనాలకు వెళ్ళరాదు.

ఓ రామా! దశరథ మహారాజుకు మతిస్తిమితం తప్పింది. మతి స్తిమితం లేని రాజు పాలనార్హుడు కాదు. అట్టి రాజాజ్ఞను శిరసావహించవలసిన అవసరం లేదు. నువ్వు ధైర్యంగా రాజ్యాభిషేకానికి సిద్ధంగా ఉండు. నేనొక్కణ్ణే అడ్డంవచ్చిన రాజులందరినీ ఎదుర్కొంటాను. నా చేతులు అందానికి పెట్టినవి కావు. ధనుస్సు, ఖడ్గం నాకు అలంకారాలు కావు. నా బాహువులు, ఆయుధాలన్నీ శత్రుసంహారానికే! ఇంద్రుడే వచ్చి వజ్రాయుధంతో ఎదుర్కొన్నా నన్ను ఎదిరించలేడు. నన్ను ఎదిరించిన వారందరి కాళ్ళు, చేతులు తెగిపడేట్లు నరుకుతాను. వాళ్ళ గుర్రాలు, ఏనుగులు కూడా కుప్పలు కుప్పలుగా చచ్చిపడతాయి. అన్నా! చెలియలికట్ట సముద్రుడు భూమిపైకి రాకుండా కాపాడినట్లు నిన్ను నేను కాపాడుకుంటాను. నీకు నేను

ఎల్లవేళలా తోడుగా ఉంటాను.

రామా! ఈనాటితో దశరథమహారాజు పరిపాలన అంతమయింది. ఇకనుండి రామరాజ్యం ప్రారంభించు అన్నా! ఇంతవరకు నా చేతులతో నీకు వింజామరలు విసిరాను. దానధర్మాలు చేయడానికి, నీ స్నేహితులకు హితం చేయడానికి అవి ఉపయోగపడ్డాయి. ఇకపై, నీ రాజ్యాభిషేకానికి అడ్డం వచ్చేవారి తలలు నరికేందుకు ఉపయోగిస్తాను.

రామప్రభూ! నేను నీ సేవకుడను, నేను ఏం చేయాలో ఆజ్ఞాపించు. ఏ శత్రువులను హతమార్చాలో చెప్పు. నేను ఇప్పుడే వారిని నామరూపాలు లేకుండా చేస్తాను. ఈ రాజ్యానికి నువ్వు సర్వాధికారివి కావటానికి నేను ఏఏ పనులు చక్కబెట్టాలో చెప్పు, వెంటనే అమలు పరుస్తాను.

అంతట రాముడు లక్ష్మణుని అక్కున చేర్చుకున్నాడు. చేత్తో కన్నీళ్ళు తుడిచాడు. “లక్ష్మణా! తండ్రిమాట జవదాటను. అదే నా స్థిరమైన నిర్ణయం. అదే మంచి మార్గం. నువ్వు కూడా హింసామార్గాన్ని, ఆలోచనల్ని కట్టిపెట్టు” అన్నాడు.

# 24వ సర్గ రాముడు కౌసల్యాదేవి అనుమతి పొందడం

కౌసల్య: రామా! నువ్వు పితృవాక్యాన్ని పరిపాలించాలని నిశ్చయించుకొన్నావు. ఇక ఎవరూ నీ నిర్ణయాన్ని మార్చలేరని తెలుస్తూనే ఉంది.

దశరథ మహారాజుకు, నాకు జ్యేష్ఠకుమారుడవు. ప్రాణకోటినంతటినీ సంతోషపెట్టే నా రాముడు ఉంఛవృత్తిలో (నేలపైరాలిన గింజలను ఏరుకుని తింటూ) ఎట్లా బ్రతుకగలడు? నీ కింద పనిచేసేవాళ్ళు కూడా శ్రేష్ఠమైన ఆహారాన్ని భుజిస్తున్నారు. నువ్వు మాత్రం అడవుల్లో లభించే కందమూలాలు తింటూ ఎలా బ్రతుకుతావు?

ప్రజలకు, ప్రేమపాత్రుడైన రాముణ్ణి దశరథుడు అడవులకు పంపాడంటే ఎవరూ నమ్మరు. ఒకవేళ నమ్మితే, అంతటి గుణవంతుణ్ణి అడవులకు పంపితే ఇక మన గతి ఏమిటి? అని ప్రజలు భయపడతారు. రామా! నువ్వు లోకాభిరాముడవు. లోకంలో సుఖదుఃఖాలన్నీ దైవమే నిర్ణయిస్తాడు. నీ వనవాసం కూడా దైవఘటనే! దైవబలాన్ని ఎవరూ నిగ్రహించలేరు గదా!

నాయనా! నువ్వు అడవులకు వెళ్ళగానే ఈ శరీరం కట్టె అయిపోతుంది. అందులోనుండి శోకాగ్ని రగుల్కొంటుంది. నీ ఎడబాటే దాన్ని రగిల్చే గాలి అవుతుంది. నా ఏడుపు, దుఃఖమే ఆ శోకాగ్నికి సమిధ లవుతాయి. నా కన్నీళ్ళే హవిస్సులు. నాలోని దిగులే, ధూమం అవుతుంది. నా నిట్టూర్పుతో విజృంభించి కార్చిచ్చయి నన్ను దహించి వేస్తుంది. అంటే నువ్వు అటు అడవులకు వెళ్ళగానే నాకు మరణమే శరణ్యం. కాబట్టి నాయనా! రామా! నేను బక్కచిక్కిన ఆవులాంటి దాన్ని. నువ్వు లేగదూడవంటి వాడవు. దూడ వెంట ఆవులాగా నేనూ నీ వెంటే వస్తాను.

రాముడు: అమ్మా! కైకేయి ముందుగానే తండ్రిగారిని వంచించింది. నేను అరణ్యానికి పోయిన తర్వాత, ఆయన్ను ఎవరు కనిపెట్టి ఉంటారు? నువ్వు కూడా వదిలేస్తే ఆయన తప్పక మరణిస్తాడు.

అమ్మా! స్త్రీ భర్తను విడిచిపోరాదమ్మా! అది చాలా క్రూరం. అటువంటి క్రూరమైన పనిని నువ్వు చేయకూడదు. ఆయన జీవించి ఉన్నంత వరకు ఆయనకు సేవలు చేయడం నీ ధర్మం. ఇదే సనాతన ధర్మం.

కౌసల్య (పట్టరాని దుఃఖంతో) : నాయనా! నువ్వు చెప్పినట్లే చేస్తాను. నువ్వు ఏది ధర్మమో అదే చెప్పావు. కాబట్టి నువ్వు చెప్పినట్లే చేస్తాను.

రాముడు: అమ్మా! దశరథ మహారాజు మనందరకూ ప్రభువు. నువ్వు, నేను కూడా ఆయన మాటను పాటించాలి. మనల్ని ఆజ్ఞాపించే అధికారం ఆయనకున్నది. పైగా ఆయన శ్రేష్ఠుడు, పూజ్యుడు.

అమ్మా పదునాలుగు సంవత్సరాలు చిటికెలో గడిచిపోతాయి. నేను అరణ్యంలో ఆనందంగా గడిపి తిరిగి వచ్చేస్తాను. ఆ తరువాత నీకు సేవలు చేసుకుంటూ జీవిస్తాను. నీ ఆజ్ఞలు పాలిస్తూ ఉంటాను.

కౌసల్య (కన్నీరు పెట్టుకుంటూ) : రామా! నేను ఈ సవతులతో కలసి జీవించలేను. నన్నుకూడా ఒక లేడిపిల్లలా నీ వెంట అడవులకు తీసుకొనిపోరా నాయనా! అక్కడ నీకు ఏమీ శ్రమ కలిగించను (అంటూ వెక్కివెక్కి ఏడ్చింది).

రాముడు (దుఃఖీస్తూ) : అమ్మా స్త్రీ ఎన్ని వ్రతాలు చేసినా, ఉపవాసాలు చేసినా, భర్తకు సేవలు చేస్తూ ఉండాలి. అట్లా చేయని స్త్రీకి సద్గతులు ఉండవు. అమ్మా! నువ్వు ఆయనకు సమస్త ఉపచారాలు చేస్తూ ఉండు. భార్య ఎప్పుడూ భర్తను సంతోషపెట్టాలి. ఇదే స్త్రీకి నిర్దేశించిన సనాతన ధర్మం. ఇదే వేదాలలోను శ్రుతులలోను కూడా చెప్పారు.

అమ్మా! నా క్షేమం కోరుతూ, తిరిగి రావాలని హోమాలు చేస్తూ ఉండు. దేవతలందరికీ పూజలు చేస్తూ ఉండు! బ్రాహ్మణులను సత్కరించి దానాలివ్వు. ఆహార నియమాలు పాటిస్తూ

ఉండు.

నేను తిరిగి వచ్చేవరకు తండ్రిగారు జీవించి ఉంటే నువ్వు కోరుకున్నవన్నీ పొందగలవు.

కౌసల్య: కుమారా! నువ్వు అడవులకు వెళ్ళాలనే నిర్ణయించుకున్నావు. నీ నిర్ణయాన్ని ఎవరూ మార్చలేరు. అడవులలో ఉన్నంతకాలం చాలా జాగ్రత్తగా మసలుకో. ఆత్మరక్షణలో అమిత జాగ్రత్త వహించు. నువ్వు క్షేమంగా తిరిగి రావాలని కోటిదేవుళ్ళను ప్రార్థిస్తాను. నువ్వు తిరిగి వచ్చిన తరువాత నా దుఃఖాలన్నీ తొలగిపోతాయి. తండ్రి ఋణాన్ని తీర్చి అశేషకీర్తిని, సుఖాలను పొందగలవు. నాయనా! నువ్వు క్షేమంగా తిరిగివచ్చి నీ తీయనిమాటలతో నన్ను ఆనందపరచు.

అంతట రాముణ్ణి తనివితీరా కౌగలించుకొని ముద్దుపెట్టుకొంది. రాముడు కూడా ఆమె పాదాలకు పదేపదే నమస్కారం చేశాడు.

“నాయనా! నువ్వు అడవుల నుండి తిరిగివచ్చే దినం ఈ రోజే అయితే ఎంత బాగుండేదో గదా!” అని గుండెలు బాదుకొని ఏడ్చింది.

## 25వ సర్గ కౌసల్య రాముణ్ణి దీవించి అడవులకు పంపడం

కౌసల్య: నాయనా! రామా! నువ్వు అరణ్యవాసం చేయడానికి నిశ్చయించుకున్నావు. నిన్ను ఆపడం నాకు చేతకాలేదు. సరే అట్లాగే కానిమ్ము. నువ్వు అడవులకు వెళ్ళి త్వరగాను, క్షేమంగాను తిరిగివచ్చి రాజ్యాభిషేకం చేసుకో.

నువ్వు ధైర్యంతో ఆచరిస్తున్న ధర్మమే నిన్ను ఎల్లప్పుడూ కాపాడుతుంది. నువ్వు రోజూ దేవాలయాల్లో ఉన్న దేవతలనందరినీ ప్రార్థిస్తూ ఉండేవాడివి. ఆ దేవతలంతా నిన్ను అరణ్యంలో కాపాడతారు. విశ్వామిత్ర మహర్షి నీ కిచ్చిన అస్త్రశస్త్రాలన్నీ నీకు ఎల్లవేళలా రక్షగా ఉండాలి.

రామా! నువ్వు ఇన్నాళ్ళు చేసిన పితృసేవ, మాతృసేవ, సత్యవ్రతము నీకు దీర్ఘాయువునిస్తాయి. నాయనా! ముని ఆశ్రమాల్లోని దర్భ, అగ్నిగుండాలు, సమిధలు, పూజాద్రవ్యాలన్నీ నీకు ఉపయోగపడాలి. అడవుల్లో పొదలు, పర్వతాలు, నదులు, వాగులు నీ సంతోషానికి ఉపయోగపడాలి. బ్రహ్మదేవుడు, విరాట్పురుషుడు, దేవేంద్రుడు, లోకపాలకులు, విశ్వేదేవతలు, సిద్ధులు నిన్ను సుఖపెట్టాలి.

ఋతువులు, పక్షాలు, మాసాలు, సంవత్సరాలు, రాత్రుళ్ళు, పగళ్ళు, నీకు కాలం సుఖంగా ఉండేందుకు సహాయపడుగాక! సూర్యచంద్రులు, భూమి, ఆకాశం, నక్షత్రాలు, గ్రహాలు, సప్తర్షులు, నారదాది మహర్షులు నిన్ను సర్వదా కాపాడుతూ ఉండాలి.

అరణ్యంలో ముని వేషధారివై, ముని జీవితం గడిపే నీకు ఆదిత్యులు, దైత్యులు సహకరింతురుగాక! క్రూరాత్ములైన రాక్షసులు, పిశాచాలు నీ జోలికి రాకుండా ఉండాలి. అడవుల్లో తిరిగే పాములు, ఈగలు, దోమలు ఇంకా ఇతర కీటకాలు నిన్ను బాధించకుండా ఉండాలి.

నాయనా! నువ్వు అరణ్యాల్లో ఉన్నంతకాలం నీ క్షేమాన్ని కోరి ఇక్కడ దేవతలందరినీ

స్తోత్రం చేస్తూ ఉంటాను. నీ అరణ్యవాసం సుఖప్రదంగా పూర్తికావాలి, నీకు ఏమీ ఇబ్బందులు కలుగకుండా ఉండాలి; నువ్వు తిరిగే చోట్లన్నీ శుభప్రదంగా ఉండేవిగా ఉండాలి. నదుల్లో స్నానాలు చేసేటప్పుడు ఆ నదులు నిన్ను కాపాడుతాయి. అగ్నిదేవుడు, వాయుదేవుడు నీ అరణ్యవాసకాలమంతా నిన్ను అంటిపెట్టుకొని ఉంటారు. నీకు సర్వసుఖాలను ప్రసాదిస్తారు.

కుమారా! స్మృతి, ధృతి, ధర్మము, కుమారస్వామి, సోముడు, బృహస్పతి నిన్ను రక్షిస్తారు గాక! ఆకాశాన ఉండే దేవతలు భూమిపై ఉండే దేవతలు నిన్ను రక్షించాలి. నీకు శత్రువుల వలన అపాయం కలుగకుండా ఉండాలి. సర్వలోకాలకు ప్రభువైన శివుడు, బ్రహ్మ, విష్ణువు, ఋషులు నిన్ను రక్షిస్తారుగాక!

అంతట కౌసల్య రామునికి అన్నీ శుభాలే కలగాలని బ్రాహ్మణులను పిలిపించి హోమాలు చేయించింది. దేవతలందరిని పుష్పాలతోను, సుగంధద్రవ్యాలతోను పూజించింది. నెయ్యి, తెల్లనిపుష్పాలు, సమిధలు, తెల్లని ఆవాలు తెప్పించి హోమం చేయించింది. రాముడు అడవులలో సుఖంగా ఉండాలని బ్రాహ్మణులచేత స్వస్త్యయన మంత్రాలు చదివించింది. పెరుగు, తేనె, అక్షితలు, నెయ్యి ఇచ్చి బ్రాహ్మణులచేత పుణ్యాహము చెప్పించింది.

ఓ రామా! వృత్రాసురుణ్ణి చంపిన దేవేంద్రుడికి ఎటువంటి మంగళాలు జరిగాయో అవన్నీ నీకూ జరగాలి. పూర్వం అమృతం తేవడానికి వెళ్ళిన గరుత్మంతుడికి కలిగిన శుభాలన్నీ నీకూ కలగాలి. పాలసముద్రాన్ని మథించేటప్పుడు దేవేంద్రుడి తల్లి అదితి పలికిన మంగళా వాచకాలన్నీ నీకూ సిద్ధించాలి. బలి చక్రవర్తిని పాతాళానికి అణగద్రొక్కిన విష్ణువుకు ఏ ఏ శుభాలు కలిగాయో అవన్నీ నీకూ కలగాలి.

అంతట కౌసల్యాదేవి పూజాక్షితల్ని రాముని శిరస్సున ఉంచింది. ఒళ్ళంతా గంధం పూసింది. మంత్రాలతో శుద్ధిచేసిన 'విశల్యకరణి' అనే రక్షను రామునికి కట్టింది. పైకి భక్తిశ్రద్ధలతో పూజలు చేస్తున్నా మాటలు తడబడ్డాయి. శరీరం తూలింది, మనస్సంతా దుఃఖమే

నిండి ఉంది. రాముని గట్టిగా కౌగలించుకుంది. తలపై వాసన చూచింది.

కుమారా! నువ్వు వనవాసం అంతా శుభంగా పూర్తిచేసుకొని, త్వరగా వచ్చి రాజ్యాభిషేకాన్ని చేసుకోవడం నేను చూడాలి. నాలో ఉన్న దుఃఖమంతా తొలగి పూర్ణచంద్రునివంటి నీ ముఖాన్ని నేను చూడాలి. నీ తండ్రి మాట నిలబెట్టి, తిరిగి వచ్చి సింహాసనం అధిష్ఠించడం నేను కళ్ళారా చూడాలి. నాయనా! రామా! నేను, నా కోడలు సీతా కోరే కోరికలు నువ్వు తీర్చి మమ్మల్ని సంతోషపెట్టు.

నాయనా! రామా! నేను నీ క్షేమంకోసం అనుక్షణం శివుడు మున్నగు దేవతలందరినీ పూజిస్తూ ఉంటాను. నువ్వు క్షేమంగా ఉండాలని, నీకు ఎల్లవేళలా రక్షగా ఉండాలని నీకు మూడుసార్లు ప్రదక్షిణ చేస్తున్నాను. నిన్ను ఏ శక్తీ బాధించలేదు. నువ్వు అన్ని శక్తుల్నీ జయిస్తావు – అంటూ రాముణ్ణి రెండు చేతులతో కౌగలించుకొని తలపై ముద్దు పెట్టుకుంది. “ఇక క్షేమంగా పోయిరా నాయనా” అని దీవించింది.

రాముడు కూడా ఆమె పాదాలు పట్టుకొని నమస్కారం చేశాడు. ఆమె వద్ద సెలవు పుచ్చుకొని సీతను చూసేందుకు బయలుదేరాడు.

# 26వ సర్గ సీత తానుకూడా అరణ్యాలకు వస్తాననడం

రాముడు కౌసల్యాదేవి భవనాన్నుండి రాజవీథులగుండా కాలినడకన తన భవనాన్ని చేరాడు. దారిలో జనం రాముణ్ణి చూసి త్రొక్కిసలాడుకొన్నారు. భద్రతా సిబ్బంది లేదు, రథం లేదు. అట్లా సాదాసీదాగా నడచి వస్తున్న రాముణ్ణి చూసి ఆశ్చర్యపోయారు.

అభిషేకవ్రతాన్ని పూర్తిచేసుకొని ఎప్పుడు వస్తాడా అని సీత ఎదురుచూస్తూ ఉంది. రాజ్యాభిషేకం చేసుకొని వచ్చే భర్తకు ఎట్లా స్వాగతం పలకాలో ఆమెకు తెలుసు. అందుకోసం ఇష్టదేవతలందరినీ పూజ చేసి ముగించింది. రాముడి కోసం నిరీక్షిస్తూ ఎదురుచూడసాగింది. కైకేయి భవనంలో జరిగింది ఆమెకు తెలియదు. కౌసల్యాదేవి ఎంతగా దుఃఖించిందో ఆమెకు తెలియదు. రాజ్యాభిషేకం ఆగిపోయిందని ఆమె ఎరుగదు.

తలవంచుకొని తన భవనంలోకి ప్రవేశించాడు రాముడు. ఇల్లంతా కళకళలాడుతోంది. దాసీజనం, బంధుమిత్రులతో ఇంటినిండా సందడిగా ఉన్నారు. అవన్నీ చూసి రాముడు సిగ్గుపడిపోయాడు.

దీర్ఘాలోచన చేస్తూ, తలవంచుకొని బాధపడుతూ ఇంట్లోకి అడుగుపెడుతున్న భర్తను చూసి సీతాదేవి నిలువెల్లా వణికిపోయింది. కాళ్ళు చేతులూ వణకసాగాయి. సీతాదేవిని చూడగానే రాముడు తొట్రుబాటు కూడా అణచుకోలేకపోయాడు, దుఃఖం పెల్లుబికింది.

సీతాదేవి: ప్రభూ! నేడు లక్ష్మీప్రదమైన పుష్యమీ నక్షత్రమందు మీ పట్టాభిషేకం జరుగుతుందని బ్రాహ్మణులు, పండితులు నిర్ణయించారు గదా! మరి మీరు ఇట్లా ఉన్నారేమిటి? చంద్రబింబంలాంటి మీ ముఖం, పాలనురుగువంటి మీ చిరునవ్వులు ఏమైపోయాయి?

ఓ నరశ్రేష్ఠా! మంగళాపాఠాలు స్తుతిస్తూ నీ వెంట వచ్చే వందిమాగధులు ఏమైనారు? అభిషిక్తుడవైన నీ తలపై తేనె, పెరుగు, అక్షితలు వంటివి కనిపించటం లేదేమి? నిన్ను

అనుసరించి వచ్చే మంత్రులు, బ్రాహ్మణులు ఒక్కరూ కనిపించటంలేదు. నీకంటే ముందుగా వచ్చే పర్వతంలా ఉండే నల్లని మదపుటేనుగు కనిపించటం లేదేమి? అభిషిక్తుడవైన నీ ముఖంలో ఎక్కడా సంతోషమే కనిపించటంలేదేమి?

రాముడు: ఓ సీతా! పూజ్యుడైన నా తండ్రి దశరథ మహారాజు నన్ను అరణ్యవాసం చెయ్యమని ఆజ్ఞాపించాడు. నువ్వు ఉత్తమమైన రాజవంశంలో పుట్టావు. నీకు తెలియని విషయాలేమీ లేవు. పైగా నీకు అన్ని ధర్మాలు తెలుసు. ఏం జరిగిందో నీకు వివరంగా చెప్తాను. విను.

పూర్వం నా తండ్రి దశరథ మహారాజు నా తల్లి కైకేయీదేవికి రెండు వరాలు ప్రసాదించాడు. వాటిని ఆవిడ ఇంతవరకూ వినియోగించుకోలేదు. నా రాజ్యాభిషేకం గూర్చి విని, ఇప్పుడు తన వరాలను తీర్చమని రాజును నిర్బంధించినది. ధర్మాన్ని చూపి తన ప్రతిజ్ఞను నిలబెట్టుకొమ్మని తన పంతం నెగ్గించుకొన్నది. నా తండ్రి పరమ ధార్మికుడు. ఆమె కోరిక ప్రకారం నేను ఈ రోజు నుండి పద్నాలుగు సంవత్సరాలు వనవాసం చెయ్యాలి. తరువాత నా తండ్రి భరతునికి రాజ్యాభిషేకం జరిపి రాజ్యభారాన్ని అప్పగించాలి.

అందువలన ఓ సీతా! ఈ విషయాలన్నీ నీకు చెప్పి పోదామని వచ్చాను. సీతా! భరతుడు రాజైన తరువాత నీకు నమస్కారం చేసేందుకు వస్తాడు. ఈ విషయాలేవీ అతడి ముందు ప్రస్తావించవద్దు. ఐశ్వర్యం గలవారూ, అధికారంలో ఉండేవారూ, ఇతరులను పొగిడితే సహించలేరు. ఇది లోకంలో సహజమే. అందువల్ల నా గుణగణాలను గూర్చి కూడా అతని ముందు ప్రస్తావన తేవద్దు.

నా తండ్రి ఆజ్ఞ ప్రకారం నేనిప్పుడే అరణ్యానికి బయలుదేరి వెళుతున్నాను. నువ్వు ధైర్యంగా ఉండు. నీవు వ్రతాలను ఆచరిస్తూ ఉపవాసాది నియామాలను పాటిస్తూ ఉండు. ఉదయానే లేచి నా తండ్రిగారికి నమస్కరిస్తూ ఉండు. నా తల్లి కౌసల్యాదేవి వృద్ధురాలు. ఆమె

పుత్రవియోగంతో పుట్టెడు దుఃఖంలో ఉంది. నీవు ఆమెకు చక్కగా సేవలు చేస్తూ ఉండు. నా తల్లులందరూ కూడా ప్రేమపాత్రులే. వారందరినీ కూడా నీవు చక్కగా ఆదరించాలి. నా తమ్ములు భరత శత్రుఘ్నులను పుత్రులవలె ప్రేమగా చూచుకో. భరతుడు నీకు పుత్రునితో సమానమే అయినా, అతడు అందరికీ ప్రభువు. కాబట్టి నీవు ఎప్పుడూ అతడికి అయిష్టాన్ని కలిగించే మాటలు మాట్లాడకు. రాజులంతా వారిని అనుసరించిపోయే వారిని అభిమానిస్తారు. వ్యతిరేకించే వారిపై కోపం తెచ్చుకుంటారు. ఈ విషయంలో వారు తమ సొంతపుత్రులనైనా సరే సహించరు. కనుక ఈ విషయాలు తెలుసుకొని మసలుకో.

ఓ సీతా! నువ్వు ధర్మవ్రతాన్ని పాటించు. సత్యవ్రతాన్ని ఆచరించు. పెద్దలకు సేవలు చేస్తూ ఉండు. భరతుని రాజ్యంలోనే నివసిస్తూ ఉండు.

# 27వ సర్గ సీత తానుకూడా రాముణ్ణి అనుసరిస్తానని కోరటం

రాముని మాటలన్నీ ప్రశాంతంగా విని సీత రామునిపై గల ప్రేమచేత కోపగించింది. తన మనస్సులోని మాట నిర్భయంగా చెప్పింది.

సీత: నాథా! నువ్వు చెప్పే మాటలు అర్థం లేనివిగా ఉన్నాయి. నువ్వు మరొకసారి ఆలోచించుకుంటే నీకే నవ్వు కూడా వస్తుంది. అంతేకాదు వినేవాళ్ళంతా కూడా నవ్వుతారు. ఎందుకంటావా?

లోకంలో తల్లి, తండ్రి సోదరులు అంతా కూడా వాళ్ళ పుణ్యపాప ఫలాలను బట్టి జన్మిస్తారు; కర్మలు అనుభవించి పోతారు. కానీ ఒక్క భార్య మాత్రం భర్త కష్టసుఖాలను పంచుకొంటుంది. కాబట్టి మహారాజు మిమ్మల్ని అడవులకు పొమ్మని ఆజ్ఞాపిస్తే నన్నుకూడా ఆజ్ఞాపించినట్లే అవుతుంది.

స్త్రీకి తండ్రికాని, పుత్రులుగాని, తల్లిగాని గమ్యాన్ని చూపరు (దిక్కు కాదు). ఈ లోకంలో అయినా పరలోకంలో అయినా భార్య భవిష్యత్తంతా భర్తతోనే ముడిపడి ఉంటుంది. అదే స్త్రీకి ఉత్తమగతి. కనుక నాథా! నువ్వు అడవులకు బయలుదేరినట్లయితే నేను నీ ముందు నడుస్తాను; దారిలో ఉండే రాళ్ళురప్పలు, ముళ్ళపొదలు శుభ్రంచేస్తూ నువ్వు నడవటానికి దారి సుగమంచేస్తూ ముందుకు పోతాను.

ఓ వీరుడా! నా మీద కోపం తెచ్చుకోకు. ఒకవేళ వచ్చినా, త్రాగగా మిగిలిన నీళ్ళను పారబోసినట్లుగా ఆ కోపాన్ని విసిరిపారెయ్యి. ఎందుకంటే, నన్ను విడిచి నువ్వు ఒక్కడవే వెళ్ళేందుకు, నేను ఏ పాపమూ చేయలేదు. పైగా అడవుల్లో నీకు ఏ కష్టమూ కలిగించను, నా మాట నమ్ము. కాబట్టి నన్ను కూడా నీతో అడవులకు తీసుకొని వెళ్ళు.

దేవా! భార్య ఎప్పుడూ భర్తను అనుసరించే ఉండాలి. అదే శాస్త్ర సమ్మతం. పెద్ద పెద్ద

భవనాల్లో నివసించినా, మేడలు మిద్దెలు కలిగి ఉన్నా, అణిమాది సిద్ధులతో ఆకాశమార్గాన రాకపోకలు సాగించినా, భార్య ఎప్పుడూ భర్తను అనుసరించే ఉండాలి. అట్లా భర్తతో కలసి ఉండటమే భార్యకు ధర్మం. ఈ భార్యాధర్మాలన్నీ నా తల్లిదండ్రులు ఉగ్గుపాలతో నాకు నేర్పారు. ఇవాళ కొత్తగా నేర్చుకోవలసింది ఏమీ లేదు.

నాథా! మీరు వెళ్ళే అడవి ముళ్ళపొదలతో కూడి ఉంటుందని, పులులు, సింహాల వంటి క్రూరమృగాలు ఉంటాయనీ నన్ను భయపెట్టవద్దు. అక్కడ ఎటువంటి కష్టాలు ఎదుర్కోవలసివచ్చినా నేను వెనుకాడను; మీతో రాక తప్పదు. అదీకాక నా రామునితో ఉంటున్న నా దగ్గరకు భయం గాని, ఆపదలుగాని ఎట్లా వస్తాయి? మీకు సేవలు చేసుకుంటూ, పొందే పరమానందాన్ని త్రుంచి వేయకండి.

ఓ పురుషోత్తమా! అరణ్యవాస కాలమంతా మీకు ఉత్తమ సేవలు చేస్తూ ఉంటాను. కఠినమైన బ్రహ్మచర్యాన్ని అవలంబిస్తాను. మీతోపాటు పూలవాసనలు, పండ్లవాసనలను పీల్చుకుంటూ ఆనందిస్తాను. తామరపూలతో నిండిన సరస్సులలో స్నానాలుచేస్తాను. కొండలు, గుట్టలు, పర్వతాలు, నదులు, వాగులు ఇలా ఎన్నిటినో నీతో పాటే ఉంటూ చూసి ఆనందిస్తాను. ఈ విధంగా మీతోపాటు లక్ష సంవత్సరాలైనా గడిపేస్తాను. మీ పాదాలకు సేవ చేసుకుంటూ ఉండే సుఖం నాకు పుట్టింట్లో దొరకుతుందా? నాథా! నువ్వులేని స్వర్గమైనా నాకు వద్దు.

నాథా! మిమ్మల్ని సేవించటంకన్నా వేరొకటి తెలియని నన్ను నిర్దాక్షిణ్యంగా వదలి ఒంటరిగా వెళ్ళినట్లయితే నేను వెంటనే ప్రాణత్యాగం చేస్తాను. కాబట్టి ఏ విధమైన శంకలూ పెట్టుకోకుండా నన్ను కూడా మీతో తీసుకువెళ్ళండి. నేను మీకు బరువు కాను. నా కోరిక తప్పక మన్నించండి.

అంతట రాముడు ఆమెకు అరణ్యవాసంలో ఎదురయ్యే కష్టాలెన్నో చెప్పాడు. ఆమె మనస్సు మరల్చాలని అరణ్యంలో వాటిల్లే కష్టాలను ఏకరువు పెట్టడం మొదలుపెట్టాడు.

# 28వ సర్గ రాముడు వనవాసంలో ఎదురయ్యే కష్టాలను సీతకు వివరించటం

రాముడు: సీతా! నువ్వు ఉత్తమమైన రాజవంశంలో పుట్టి పెరిగావు. ధర్మాచరణమందు నిష్ఠ కలిగినదానవు. నేను తిరిగి వచ్చేవరకు నువ్వు ఇక్కడే ఉంటూ, నీ స్వధర్మాన్ని ఆచరిస్తూ ఉండు. అప్పుడే నేను సంతోషంగా ఉండగలుగుతాను. అట్లాకాదని మూర్ఖించి నాతో వస్తే అనేక కష్టాలు ఎదురవుతాయి. అవన్నీ నువ్వు సహించలేవు. నా మాట విని నువ్వు నాతో అడవులకు వచ్చే ఆలోచన మానుకో. అది మన ఇద్దరికీ శుభకరం. నీకిక్కడ అలవాటైన సుఖాల్లో ఒక్కటికూడా అడవుల్లో దొరకదు. తర్వాత నువ్వు తీవ్రంగా దుఃఖీస్తావు.

ఇక్కడ ఎంత ప్రశాంతంగా ఉంటుందో అక్కడ అంత బీభత్సంగా ఉంటుంది. ఎత్తైన పర్వతాల మీద నుండి లోతైన లోయల్లోకి నీరు పారేటప్పుడు పుట్టే శబ్దాలు కఠోరంగా ఉంటాయి. అంతేకాదు కొండగుహల్లో సింహాలు చేరి గర్జిస్తూ ఉంటాయి. ఆ గర్జనలు కఠోరంగానే కాదు, భయంకరంగా కూడా ఉంటాయి. బలిసిన క్రూరమృగాలు మనుష్యులను చూడగానే భీకరంగా మీదపడి చంపుతాయి. నదుల్లో బలమైన మొసళ్ళు తిరుగుతూ ఉంటాయి. మదించిన ఏనుగులు కూడా గుంపులు గుంపులుగా సంచరిస్తాయి. పగలల్లా కష్టపడి తిరిగి ఉంటాం, పోనీ రాత్రయినా సుఖంగా నిద్రిద్దామన్నా ఎండిన ఆకులపైనే పడుకోవాలి. అట్లాగే ఆహారం కూడా వేళకు లభించదు. ఎక్కడైనా పండిరాలిన ఫలాలు నేలపై కనిపిస్తే వాటిని తిని ఆకలి తీర్చుకోవాలి. అరణ్యంలో నివసించే వారంతా నారబట్టలు, జటలు ధరించవలసి ఉంటుంది. అడవుల్లో ఆహారం దొరకని రోజల్లా ఉపవాసమే గత్యంతరం. ఎప్పుడు రాలిన పండ్లు దొరకుతాయో ఆనాడే విందు. దేవతలను, పితృదేవతలను, అతిథులను నిత్యమూ పూజిస్తూ ఉండాలి. వనవాసంలో నియమవంతులై రోజూ ముప్పూటలా స్నానం చేస్తూవుండాలి. నీళ్ళకోసం చాలా కష్టాలు పడాల్సి ఉంటుంది.

ఓ సీతా! పూజకోసం మనమే స్వయంగా పూలను పండ్లను సమకూర్చుకోవలసి ఉంటుంది. ఋషిప్రోక్తానుసారంగా పూజలు చెయ్యాలి. వర్షం పడితే కుండపోతగా కురుస్తుంది. ఇక రాత్రుళ్ళు చీకటి చెప్పవలసిన పనేలేదు. వాటన్నిటినీ మించి ఆకలిబాధ మరీ భయంకరమైనది; ప్రాణాపాయం కూడాను. అడవుల్లో భయంకరమైన సర్పాలుంటాయి, అవి ఎటునుండి వస్తాయో, ఎప్పుడు ఎదురవుతాయో ఎవరూ ఊహించలేరు. పక్షులు, తేళ్ళు, కీటకాలు, ఈగలు, దోమలు నిత్యం మనలను పీక్కు తింటూ ఉంటాయి. అబలవైన నువ్వు ఇన్ని కష్టాలు భరించలేవు. సుఖంగా ఇక్కడే ఉండు. ఇవికాక అనేకమైన జబ్బులుచేసి శరీరం కృశించిపోతుంది. వైద్యం చేయించుకుందామా, అంటే అక్కడ వైద్యులే ఉండరు.

ఓ సీతా! అరణ్యవాసం చేయవలసి వస్తే కామక్రోధ లోభాలన్నిటినీ విడచి ధ్యాసనంతా తపస్సుపైనే నిలపాలి. అందువల్ల నీవు అరణ్యానికి రావద్దు. నువ్వు అబలవు. ఇన్ని కష్టాలు పడలేవు.

# 29వ సర్గ వనవాసానికి సీత, రాముని ఒప్పించడానికి ప్రయత్నించడం

సీత: నాథా! అడవులలో ఉండే పులులు, సింహాలవంటి క్రూరమృగాలన్నీ ఇంతకు పూర్వం నిన్ను చూడకపోవటం వల్ల అవి వర్ధిల్లుతూ ఉన్నాయి. అడవులలో నిన్ను చూడగానే అవి అన్నీ భయంతో పారిపోతాయి. నేను నీ వెంటే ఉంటాను కాబట్టి నాకు వాటి వలన ఎటువంటి ఆపదా రాదు.

రామా! వనవాసం చెయ్యమని నీ తండ్రి నిన్ను ఆజ్ఞాపించినప్పుడు, అది నన్నుకూడా ఆజ్ఞాపించినట్లే అవుతుంది. అట్లాకాదని నన్ను విడిచి నువ్వు ఒక్కడవే వెళ్ళినట్లయితే నేను జీవించి ఉండకూడదు. అదే ధర్మం. నీ చెంత ఉంటే ఇంద్రుడుకూడా నన్ను కన్నెత్తి చూడలేడు. "భర్తచే వదలివేయబడ్డ స్త్రీ బ్రతుకరాదని" మీరే నాకు వెనుక చెప్పారు.

నాథా! నా జాతకంలో కొంతకాలం వనవాసం చెయ్యాలని ఉందట. నా వివాహానికి పూర్వమే ఓ పండితుడు మా అమ్మతో చెబుతూ ఉంటే విన్నాను. అప్పటినుండే ఎప్పుడెప్పుడు వనవాసం చేస్తానా అని ఎదురుచూస్తున్నాను. అందువల్లనే నేను మీతో మనం గంగాతీరాన కొంతకాలం వనవాసం చేసివద్దామని కోరాను. మీరుకూడా అందుకు అంగీకరించారు. ఇప్పుడు దైవమే ఆ వనవాసాన్ని ఏర్పాటుచేశాడు. అందువల్ల ఈ వనవాసం చెయ్యవలసి రావటంవల్ల నేనేమీ దుః ఖపడటం లేదు. నాకు ఈ విషయం ముందే తెలుసు కాబట్టి 'నా, జాతకంలో రాసిపెట్టి ఉన్నట్లే జరుగుతోంది కదా' అని సంతోషంగా ఉంది. మీరు పరిశుద్ధులు, నిర్మలమైన అంతఃకరణం గలవారు; నాకు భర్తవు. అటువంటి నీకు వనవాసంలో సేవలు చేయడం నా అదృష్టంగా భావిస్తాను. ఈ లోకంలోను, పరలోకంలోను కూడా మిమ్మల్ని విడిచి ఉండలేను. ఇది నిశ్చయం.

నాథా! నా తండ్రి నీళ్ళు వదలి నీకు నన్ను కన్యాదానం చేశారు. ఆనాటినుండే భర్తే

ఇహపర లోకాల్లో దైవమని బ్రాహ్మణులు వేదమంత్రాలు చదివారు. ఆ విషయం మీకూ తెలుసు. కనుక నాథా! నేను నీ దానను, పతివ్రతను, సత్ప్రవర్తన కలిగినదానను. నేను నీకు భక్తురాలను, నీ సుఖదుఃఖాలలో భాగస్వామిని. కాబట్టి నన్ను నీతో కూడా అడవులకు తీసుకొనివెళ్లు. అట్లా తీసుకుపోని ఎడల విషం త్రాగి గాని, మంటలలో దూకిగాని, నీళ్ళలో పడిగాని ప్రాణాలు విడుస్తాను.

ఎన్ని విధాలుగా బ్రతిమాలినా, రాముడు తనతో కూడా అడవులకు తీసుకువెళ్ళేందుకు అంగీకరించలేదు. అమితంగా దుఃఖీస్తున్న ఆమెను పరిపరివిధాల ఓదారుస్తూ ఇలా అన్నాడు.

# 30వ సర్గ రాముడు అంగీకరించడం

రాముని ఓదార్పు పలుకులు ములుకులై సీతను బాధించాయి. రాముని పట్ల ఎంత ప్రేమ ఉన్నా, పైకి మాత్రం కోపం నటిస్తూ నర్మగర్భితంగా ఇలా అంటోంది.

సీత: ఓ పురుషశ్రేష్ఠా! మీ విశాల వక్షస్థలాన్ని చూసి జనమంతా మీరు అందగాడని మురిసిపోతున్నారు. కానీ మీలో పౌరుషం లేదు. మీరు చూడటానికి పురుషులేకాని, స్వభావం చేత స్త్రీలు సుమా! మీరు ఒక్కరే అడవులకు వెళితే, నా తండ్రి జనకమహారాజు భార్యను పోషించలేక తానొక్కడే అడవులకు వెళ్ళాడని అనుకుంటాడు. “అయ్యో! నా కుమార్తెను పురుషవేషంలో ఉన్న స్త్రీకిచ్చి కట్టబెట్టానా?” అని బాధపడి నా తండ్రి తప్పక దుఃఖీస్తాడు.

నాథా! మీరు తేజోవంతులని మిమ్మల్ని ఇంతవరకూ సూర్యుడితో పోల్చి స్తుతిస్తూ వచ్చారు. ఇప్పుడు నన్ను ఇక్కడ వదలి మీరు ఒక్కరూ ఒంటరిగా అడవులకు వెళితే, “రాముడు మనం ఇన్నాళ్లు అనుకున్నట్లుగా శూరుడు, తేజోవంతుడు కాదు. అజ్ఞానంచేతనే అట్లా అనుకున్నాం” అని వారు అనుకుంటారు. ఆ మాటలు తప్పకుండా మీ ప్రతిష్ఠను దిగజారుస్తాయి.

ఓ వీరుడా! దిక్కులేని నన్ను ఒంటరిగా వదలి నువ్వు ఒక్కడివే వెళ్ళాలని ఎందుకు అనుకుంటున్నావు? నీలో ఉన్న భయానికి కారణం ఏమిటి? ద్యుమత్సేనుడి కుమారుడు సత్యవంతుణ్ణి సావిత్రి వివాహమాడింది. ఆవిడ భర్తను అనుసరించి ఉండటమే వ్రతంగా పెట్టుకుంది. నేనూ ఆమెనే అనుసరిస్తున్నాను. నేను కులానికి కళంకం తెచ్చే పనులేమీ చేయలేదు; చేయబోను. ఇంకొక పురుషుణ్ణి కన్నెత్తైనా చూసేదాన్నికాను. కాబట్టి మీరు ఎక్కడికి వెళితే అక్కడికి వస్తాను. ఉంటే మీతోనే ఉంటాను. లేదంటారా, అసలు ఎక్కడా ఉండను.

నాథా! నేను మిమ్మల్ని వివాహం చేసుకున్న భార్యను. ఇంతకాలం మీకు సేవలు చేసుకుంటూ మీతోటిదే లోకమని జీవిస్తూ వచ్చాను. అటువంటి నన్ను నాటకాలలో వేషాలు వేసే

నటుడు తన భార్యను ఇతరుల కిచ్చినట్లుగా, నన్ను ఇతరులకు అప్పగించదలచుకున్నావు. భరతుణ్ణి పుత్రుడులా చూడమన్నారు; దశరథునికి సేవలు చెయ్యమన్నారు. కౌసల్యాది తల్లులను ఓదార్చటం కోసమే నన్ను అడవులకు రావద్దంటున్నారా? నాథా! అవన్నీ మీ బాధ్యతలే కాని నావి కావు. నాకు వారందరితో ఏం నిమిత్తం ఉంది? ఎప్పుడూ మీతో ఉంటూ, మీకు సేవలుచేస్తూ ఉండటమే నా ధర్మం. సర్వధర్మాలూ తెలిసిన ధర్మాత్ముడవు. ఇప్పుడు నన్ను ఒంటరిగా వదలి మీరు మాత్రం అడవులకు పోవడం అధర్మం కాదా?

నాథా! నువ్వు ముందుండి నన్ను నడిపిస్తూవుంటే నాకు శ్రమే తెలియదు. ఆడుతూ పాడుతూ నడచి వస్తాను. విహారానికి వెళ్ళినట్లుంటుందేకాని అరణ్యవాసం చేసినట్లనిపించదు. నీ నీడన విశ్రమించినప్పుడు అంతఃపురాల్లో పూలపాన్పుపై శయనించిన దానికన్నా ఎక్కువ సుఖంగా ఉంటుంది. నీతో నడుస్తూవుంటే రాయి రప్పా, ముళ్ళ దుబ్బులు కూడా దూదిలాగాను, లేడిచర్మంపై నడుస్తున్నట్లుగాను ఉంటుంది. రకరకాలైన ఫలపుష్పాలపై నుండి వీచే గాలి, అంతఃపురంలో వాడుకునే పరిమళ ద్రవ్యాలకన్నా ఆహ్లాదాన్నిస్తుంది. అడవిలో పచ్చికబయళ్ళల్లో శయనించినప్పుడు కలిగే సుఖం, తివాచీల మీద కూడా పొందలేను. నీ చేతులమీదుగా తెచ్చి ఇచ్చిన దుంపలు అమృతంకన్నా మధురంగా ఉంటాయి. అరణ్యంలో వివిధ ఋతువుల్లో లభించే ఫలపుష్పాదులను చూస్తూ ఉంటే నాకు తల్లిదండ్రులు కూడా జ్ఞాపకానికి రారు.

కనుక నాథా! అరణ్యంలో నా వల్ల నీకు ఏ విధమైన కష్టమూ కలుగదు. నీకు ఎన్నడూ భారంకాను. పైపెచ్చు నీకు సేవలు చేసుకుంటూ జీవితం ధన్యం చేసుకుంటాను.

ఇలా మాట్లాడుతూండగా సీతాదేవి గొంతు దుఃఖంతో గాద్గదికమయింది. ఆమె కళ్ళనుండి నీరు ప్రవాహమై పద్మాల్లాంటి ఆమె చెక్కిళ్ళపైపడి జారిపోసాగాయి. శోకంతో నీరసించి మూర్ఛపోవటానికి సిద్ధంగా ఉన్న సీతను తన చేతుల్లోకి తీసుకొని రాముడు ఇలా అన్నాడు.

రాముడు: ఓ దేవీ! నీకు కష్టం కలిగించే పని ఏదీ చేయను. స్వర్గాన్నైనా కాదంటాను. బ్రహ్మదేవుడిమల్లే నేనుకూడా ఎవరికీ భయపడను.

సీతా! లోకాలనే రక్షించగల సమర్థత నాకు ఉంది. అటువంటిది నా ప్రియమైన భార్యను సంరక్షించుకోలేనా? కేవలం నీ మనస్సు తెలుసుకోవటానికే అలా మాట్లాడాను. ప్రియురాలా! నేను మాత్రం నిన్ను విడిచి ఎట్లా ఉండగలను? నిజానికి బ్రహ్మ మనిద్దరినీ అన్యోన్యంగా వనవాసం చేయడానికే సృష్టించాడా? అని అనిపిస్తోంది. నిన్ను ఎన్నటికీ విడువను.

ఓ సీతా! పితృవాక్యపరిపాలనను పరమధర్మంగా పూర్వం అనేకమంది సత్పురుషులు ఆచరించారు. సువర్చల సూర్యుణ్ణి అనుసరించినట్లు, నేనూ ఆ ధర్మాన్నే అనుసరిస్తాను. నా తండ్రిగారి మాట నిలబెట్టడం కోసం నేను వనవాసానికి వెళుతున్నాను. తల్లితండ్రులకు విధేయులై ఉండటం పుత్రుడుగా నా ధర్మం. ధర్మాన్ని నేను ఎన్నటికీ అతిక్రమించను.

సీతా! తల్లి, తండ్రి, గురువు మనకు ప్రత్యక్ష దైవాలు. వారిని పూజించకుండా, ఎక్కడో కనిపించని దేవతలను ఆరాధించడం ధర్మం కాదు. ముల్లోకాలు వెదికినా తల్లి, తండ్రి, గురువుకు మించిన దైవాలు కానరారు. అటువంటివారు భూలోకంలోనే మన కళ్ళెదురుగానే ఉండగా వారిని సేవించుకోవాలి. మనం ఎన్ని యజ్ఞయాగాది కర్మలు చేసినా, విరివిగా దక్షిణలిచ్చినా అవన్నీ తండ్రికి చేసే సేవకు సరిసమానం కావు. తండ్రి ఆజ్ఞను శిరసావహించే వాడికి, స్వర్గం, ధనం, విద్య, సంతానం మొదలైనవన్నీ సమకూరుతాయి. లోకంలో తండ్రిని సేవించినవానికి లభించనిది ఏదీ ఉండదు. నిశ్చయంగా అటువంటి మహాత్ములకు బ్రహ్మలోకంగాని, దేవలోకంగాని, గంధర్వలోకంగాని, ఇంకా ఏవి కోరుకుంటే అవన్నీ లభిస్తాయి.

కాబట్టి నా తండ్రి నన్ను ఏం చేయమని ఆజ్ఞాపించారో నేను ఆ కార్యాన్ని శిరసావహించి ఆచరిస్తాను. అదే సనాతన ధర్మం.

సీతా! ముందుగా అరణ్యవాసంలోని కష్టాలు నువ్వు భరించలేవని అనుకున్నాను. కానీ

నువ్వు నాతో కూడా తప్పక రావాలని నిశ్చయించుకున్నావు కాబట్టి, నాతో నిన్నుకూడా తీసుకొని వెళ్ళాలని నిశ్చయించుకున్నాను. నాకు సహధర్మచారిణిగా ఉండు. నువ్వు కృతనిశ్చయురాలైనందుకు నిన్ను అభినందిస్తున్నాను. నీ నిర్ణయం వల్ల ఇటు నా వంశ ప్రతిష్ఠ అటు జనకమహారాజు వంశప్రతిష్ఠ ఇనుమడిస్తాయి.

సీతా! వనవాసానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసుకొని త్వరగా సిద్ధంకా. నువ్వు లేకుండా స్వర్గానికి కూడా పోను సుమా! నీ వద్ద ఉండే విలువైన వస్తువులన్నీ నీ క్రింద పనిచేసే వాళ్ళకు ఇచ్చెయ్యి. కొన్ని బ్రాహ్మణులకు కూడా దానంచెయ్యి. ఇంకా ఆలస్యం చెయ్యకు, త్వరపడు.

భర్త తననుకూడా వనాలకు తీసుకొని వెళుతున్నాడని తెలుసుకొని, సీతాదేవి సంతోషంతో గాలిలో తేలిపోయింది. ఆ మహదానందంలోనే తన దగ్గరున్న వస్తువులన్నీ వెంటనే దానం చేసింది.

# 31వ సర్గ రామలక్ష్మణుల సంవాదం

సీతారాముల సంభాషణ అంతా లక్ష్మణస్వామి విన్నాడు. అతడి మనస్సంతా వ్యాకులం చెందింది. దుఃఖంతో కన్నీరు వరదలా కారుతోంది.

లక్ష్మణుడు: ఓ రామా! నువ్వు వనాలకు వెళ్ళేందుకే నిశ్చయించుకున్నావని గ్రహించాను. అట్లాగయితే, నేనూ నీతోపాటే అడవులకు వస్తాను. నువ్వులేని స్వర్గమైనా నాకు వద్దు. త్రిలోకాధిపత్యమైనా అంగీకరించను. ధనుస్సు ధరించి అడవుల్లో ముందు నడుస్తూ ఉంటాను.

ఓ రామా! నువ్వు నాకు ఇంతకుపూర్వమే అనుమతి ఇచ్చావు. మళ్ళీ మనసు మార్చుకొని వద్దనడం ఏమీ బాగాలేదు. నన్ను రాకుండా ఎందుకు అడ్డుకుంటున్నావో చెప్పు? నాలో కలుగుతున్న సంశయాలన్నీ తీర్చు.

రాముడు: లక్ష్మణా! నువ్వు నాకు ప్రియమైన స్నేహితుడివి. సోదరుడవు, వీరుడవు. ఎప్పుడూ మంచిమార్గాననే నడుస్తావు. అన్నిటికీ మించి నువ్వు నాకు ప్రాణంతో సమానం.

లక్ష్మణా! నువ్వు కూడా నాతోపాటే అడవుల్లోకి వచ్చినట్లయితే తల్లి కౌసల్యకు, సుమిత్రకు ఎవరు సేవలు చేస్తారు? మన తండ్రి కోరిన కోరికలన్నీ తీర్చే కల్పతరువు వంటివాడే అయినా, ప్రస్తుతం ఆయన కామపాశంచేత బంధితుడై ఉన్నాడు.

సోదరా! కైకేయీదేవి రాజ్యం చేజిక్కించుకోవటంతో తృప్తి చెందదు గదా! సవతులపై తన అధికారాన్ని చెలాయించాలను కుంటుంది. అసలే దుఃఖంలో ఉన్న వారికి ఇంకా కష్టాలు కలిగిస్తూ ఉండవచ్చు. భరతుడు కూడా కైకేయీదేవిని గౌరవించినంతగా కౌసల్యా సుమిత్రల యోగక్షేమాలను తలచడు.

కనుక లక్ష్మణా! నువ్వు ఇక్కడే ఉంటూ ఒక ప్రక్క తండ్రిగారిని మరొక ప్రక్క తల్లులు

కౌసల్యాసుమిత్రలను సేవించుకుంటూ ఉండు. పెద్దలను సేవించటం ఉత్తమమైన ధర్మం. నువ్వు నేను చెప్పినట్లు చేస్తే నా మనస్సు ఇంకా ఎక్కువ సంతోషిస్తుంది. నాపై నీకు ఎక్కువ భక్తి ఉన్నదని అనుకొంటాను.

లక్ష్మణుడు: ఓ మహావీరా! రామా! నువ్వు మన తల్లుల క్షేమాన్ని గూర్చి దిగులుపడకు. ఎందువల్లనంటే, భరతునికి నీపై ప్రేమ, భక్తి మాత్రమేకాదు, భయంకూడా ఉంది. ఆ విధంగా భయంతోనైనా మన తల్లుల యోగక్షేమాల గూర్చి బాగా విచారిస్తూ ఉంటాడు. ఆ విషయంలో నువ్వు నిశ్చింతగా ఉండవచ్చు.

మన తల్లి కౌసల్యాదేవి అధీనంలో వెయ్యి గ్రామాలున్నాయి. అంటే ఆవిడ సహస్ర గ్రామాధిపతి. ఆ విధంగా ఆవిడ భరతునిపై ఆధారపడవలసిన అవసరం ఏర్పడదు. ఆ వెయ్యి గ్రామాలపై వచ్చే రాబడితో తన్ను తాను పోషించుకోవటమే కాకుండా నా తల్లి సుమిత్రను నాలాంటి వారినికూడా పోషించగలదు.

కాబట్టి మన తల్లుల గూర్చిన విచారం వదలిపెట్టు. నన్ను నీ అనుచరుడుగా చేసుకో. నీతోపాటు అడవులకువచ్చి నీకు సేవ చేసుకునే భాగ్యం కలిగించు. ఇందులో ధర్మహాని ఏమీ లేదు. అన్నా! ధనుస్సు, బాణాలు తీసుకొని, ఒక గునపం, గంప పుచ్చుకొని నీ ముందు దారి అంతా శుభ్రంచేస్తూ నడుస్తూ ఉంటాను. సమీపంలో లభించే దుంపలు, ఫలాలు, పుష్పాలు సేకరించి మీకు సమర్పించుకుంటాను. నువ్వు సీతాదేవితో కలసి పర్వతాలపైనగాని, గుహల్లోగాని, ఆశ్రమాల్లోగాని విహరించవచ్చు. మీరు నిద్రిస్తున్నా, మేల్కొని ఉన్నా మీకు కావలసిన సేవలన్నీ చేస్తూ ఉంటాను.

రాముడు: లక్ష్మణా! నువ్వు నా పట్ల చూపుతున్న ప్రేమాభిమానాలకు సంతోషించాను. నువ్వు కూడా మాతో రావచ్చు. నువ్వు త్వరగా వెళ్ళి నీ స్నేహితులందరినీ కలసి వీడ్కోలు చెప్పిరా.

సోదరా! మనం జనక మహారాజు చేసిన యజ్ఞానికి వెళ్ళినప్పుడు వరుణుడు మనకు

రెండు దివ్యధనుస్సులు, రెండు దివ్య కవచాలు, బంగారు తొడుగుతో మెరిసిపోయే రెండు ఖడ్గాలు, తరగని బాణాలు కలిగిన రెండు తూణీరాలు (అంబులపొది) ఇచ్చాడు. ఇవన్నీ మన గురుదేవులైన వసిష్ఠుల వారింట్లో పూజింపబడుతున్నాయి. నువ్వు వెంటనే పోయి వాటినన్నిటినీ తీసుకొనిరా. త్వరగా వెళ్లిరా.

అంతట రాముడు వనవాసానికి అనుమతించినందుకు మిక్కిలి సంతోషించినవాడై తన మిత్రులందరికీ లక్ష్మణుడు వీడ్కోలు పలికాడు. వసిష్ఠుని ఇంటికి వెళ్ళి ఆయుధాలన్నీ తీసుకొని వచ్చి రాముడికి చూపించాడు.

రాముడు: తమ్ముడా! లక్ష్మణా! సరైన సమయానికే వచ్చావు. నా సొంత సొమ్మునంతా బ్రాహ్మణులకు, ఆశ్రయించి ఉన్నవారికి దానం చేయదలచాను. కాబట్టి నువ్వు వెంటనే వెళ్లి పూజ్యులైన బ్రాహ్మణులను, వసిష్ఠులవారి కుమారుడైన సుయజ్ఞుణ్ణి ఇక్కడకు తోడ్కొనిరా. వారందరికీ నా ధనాన్నంతా దానంచేసి వెంటనే మనం అరణ్యానికి ప్రయాణమైపోదాం.

# 32వ సర్గ రాముడు తన ధనాన్నంతా దానమిచ్చి వనాలకు బయలుదేరడం

రాముని ఆజ్ఞ ప్రకారం లక్ష్మణుడు వెంటనే సుయజ్ఞుని ఇంటికి వెళ్ళాడు. ఆ సమయానికి ఆయన అనుష్ఠానం పూర్తిచేసుకొని బయటకు వచ్చాడు. లక్ష్మణుడు ఆయనకు రాముని ఆజ్ఞను తెలిపి, తన వెంటబెట్టుకొని రాముని ప్రాసాదానికి తీసుకొనిపోయాడు. ఆ సమయానికి రాముడు కోశాధ్యక్షుని పిలిచి తన ధనమంతా తీసుకొని రమ్మని ఆజ్ఞాపించాడు. రాముని ఆజ్ఞను అనుసరించి కోశాధ్యక్షుడు రాముని ధనమంతా అతడి ముందు ఉంచాడు. ఆ ధనరాసులన్నీ చూడడానికి నేత్రానందంగా ఉన్నాయి.

బ్రహ్మవేత్త అయిన సుయజ్ఞుడు రాగానే, రాముడు సీతతో కలసి సుయజ్ఞునికి ప్రదక్షిణ నమస్కారాలు చేశాడు. రాముడు విలువైన బంగారు అంగదాలు, కుండలాలు, సూత్రాలు, మణులు, వలయాలు, కేయూరాలను సుయజ్ఞునకు దానం చేశాడు. పిదప సీత కోరికపై ఆమె హారాలను, బంగారు సూత్రాలను, వడ్డాణాన్ని అంగదాలను, బాహుపురులను, రత్నాలచే తాపడము చేసిన పర్యంకాలను సుయజ్ఞుని భార్యకు దానం ఇచ్చాడు.

ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! నా మేనమామచే బహూకరించబడిన శత్రుంజయమనే ఏనుగును, మరొక వెయ్యి ఏనుగులను కూడా ఇస్తున్నాను, పుచ్చుకో.

సుయజ్ఞుడు ఆ ధనాన్నంతా తీసుకొని సీతారాము లిద్దరినీ ఆశీర్వదించి వెళ్లాడు.

రాముడు: లక్ష్మణా! బ్రాహ్మణోత్తములైన అగస్త్యుని, కౌశికుని ఆహ్వానించు. పంటపొలాలను వర్షం ఎట్లా సంతోషపరుస్తుందో వీరిని అట్లా మణులతో సంతోషపరచు. అంతేకాకుండా ఇంకా వారిద్దరికీ అమూల్యమైన వెండి, బంగారం, రత్నాలు ఇచ్చి సంతోషపెట్టు.

లక్ష్మణా! తైత్తరీయశాఖకు చెందిన బ్రాహ్మణోత్తము డొకడున్నాడు, ఆయన అందరికీ

గురువు. గొప్ప బ్రహ్మవేత్త, మా అమ్మ ఆయనను రోజూ పూజిస్తూ ఉంటుంది. ఆయనకు పట్టుబట్టలు, వాహనాలు, దాసీజనాన్ని ఇచ్చి సంతోషపెట్టు.

చిత్రరథుడనే సారథి ఉన్నాడు, మా నాయనగారి వద్ద చాలాకాలంగా పనిచేస్తున్నాడు. అతనికి అమూల్యమైన రత్నాలు, వస్త్రాలు, ధనం, పశువులు, వేయి ఆవులు ఇచ్చి సంతోషపెట్టు.

లక్ష్మణా! కఠకలాపశాఖకు చెందినవారు ఎందరో బ్రహ్మచారులున్నారు. వాళ్ళంతా రోజూ వేదాధ్యయనం చేస్తూ ఉంటారు. వారికి అంతకన్నా ఏ పనీ చేతకాదు. అందుచేత వారు రోజు తీయటి పదార్థాలు తినాలని ఆశపడుతూ ఉంటారు. అందుకోసం వారందరికీ ఎనభై బండ్లలో రత్నాలు, ధాన్యం మోసేందుకు వెయ్యి ఎడ్లను భూమి దున్నుకునేందుకు రెండు వందల ఎడ్లను, ఓ వెయ్యి పాడిఆవులను దానమివ్వు.

శ్రీరాముడు బ్రాహ్మణులకు దానాలివ్వడం

లక్ష్మణా! వీరేకాక ఇంకా అనేకమంది బ్రాహ్మణులు అమ్మ నాశ్రయించి ఉన్నారు. వాళ్ళందరికీ ఒక వెయ్యి ఆవులను ఇవ్వు. అమ్మ నాశ్రయించుకున్న వాళ్ళు ఎందరున్నా వారందరికీ ధనాన్ని, గోవుల్ని దానం ఇవ్వు.

ఎదురుగా కొందరు సేవకులు కన్నీరు కారుస్తూ కనిపించారు. రాముడు వాళ్ళందరితో "ఓ సైనికులారా! మేము అడవులనుండి తిరిగి వచ్చేవరకూ నా ఇంటిని, లక్ష్మణుని ఇంటిని జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉండండి" అని వాళ్ళందరికీ విరివిగా ధనాన్ని ఇప్పించాడు. మిగిలిన ధనమంతా ఒక రాశిగా పోసి ఉంది. ఆ ధనాన్నంతా పేద బ్రాహ్మణ బాలురకు, వృద్ధులకూ పంచిపెట్టాడు.

ఇంతలో త్రిజటుడనే బ్రాహ్మణోత్తముడు ఒకడు రాముణ్ణి చూసేందుకు వచ్చాడు. ఆయన గర్గమహర్షి వంశానికి చెందినవాడు. అయోధ్య ప్రాంతాల్లోనే నివసిస్తూ ఉంటాడు. కడు

బీదవాడు. ఒక చిన్నగొడ్డలి, ఉలి, ఒక తట్ట పుచ్చుకొని అడవికి పోయి, కందమూలాలు త్రవ్వి, పరిగలు ఏరుకుని భార్యాబిడ్డలను పోషించుకుంటూ ఉంటాడు. ఆయన వృద్ధుడయ్యాడు. చిన్నప్పటినుండీ అదేపని చేస్తూ ఉండటంతో శరీరం అంతా కృశించిపోయింది. ఎముకల పోగయ్యాడు. ఆయన భార్య తరుణి. వారు అధిక సంతానంతో చాలీచాలని బ్రతుకు వెళ్ళదీస్తున్నారు. ఆయన భార్య "స్వామీ! ఈ రోజు అడవికి పోకండి, రాముడు వనవాసానికి వెళుతున్నాడు. తన వద్ద ఉన్న ధనమంతా బీదవారికి దానం చేస్తున్నాడట. నువ్వు, నేను, పిల్లలం పోయి ఆయన దర్శనం చేసుకుందాం. ఆయన తప్పకుండా మనకు కూడా ఏదైనా దానంచేస్తాడు. మన దరిద్రం తీరిపోతుంది" అని అన్నది. త్రిజటుడు భార్య ఆలోచన ప్రకారం పిల్లలను తీసుకొని రాముని దర్శనం కోసం బయలుదేరాడు. వాళ్ళనుచూసి జనం కూడా దారి ఇచ్చారు. ద్వారపాలకులు కూడా వారిని అడ్డగించలేదు. వాళ్ళంతా సరాసరి రామదర్శనానికి వెళ్ళారు. త్రిజటుడు రాముణ్ణి చూశాడు. "ఓ రాజకుమారా! నీ కీర్తిని గూర్చి విన్నాను. పేద బ్రాహ్మణుడను. బహు సంతానంతో అడవిలో కందమూలాలు, పండ్లు, పరిగలూ ఏరుకుని తింటూ బ్రతుకు వెళ్ళదీస్తున్నాను. నీ కరుణా కటాక్షాలుంటే నేను, నా భార్య పిల్లలు సుఖంగా బ్రతుకుతాం" అన్నాడు.

రాముడు ఆ త్రిజటుణ్ణి, అతడి భార్యా పిల్లల్ని చూశాడు. వాళ్ళ బీదరికానికి పరితాపం చెందాడు. జాలితో కూడిన మందహాసం చేస్తూ, "ఓ బ్రాహ్మణోత్తమా! ఆ కనిపించే ఆవులమంద అంతా నాదే. అందులో నీ కెన్ని కావాలో, నేను ఎన్ని ఇవ్వాలో తెలియటంలేదు. అందువల్ల నీ చేతిలోని కర్రను బలంగా విసురు, అది ఎంత దూరానపోయి పడుతుందో అంతవరకూ ఉన్న గోవులన్నీ నీవే" అన్నాడు.

అంతట ఆ త్రిజటుడు లేచి నిలబడ్డాడు. తలకు కట్టిన గుడ్డను నడుముకు బిగించాడు. చేతిలో ఉన్న కర్రను గిరగిరా తిప్పాడు. ఆ కర్ర వేగంగా అయిదు కక్షలూ దాటి, సరయూ నదిని దాటి దూరంగా మేస్తున్న ఆవుల మందలోని ఒక ఆబోతువద్ద పోయి పడింది. అక్కడున్న

వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. అప్పుడు రాముడు లేచి ఆ బ్రాహ్మణోత్తముణ్ణి కౌగలించుకొని "బ్రాహ్మణోత్తమా! దానమడిగితే బలపరీక్ష పెట్టాడేమిటని ఆశ్చర్యపడకు. ఇక్కడున్న వారందరికీ నీ పరాక్రమం చూపాలనే అట్లా అన్నాను. ఈ గోవులన్నీ నీవే, వాటిని తీసుకొని సంతోషంగా ఉండు. ఇంకా ఏమైనా కావాలంటే కూడా అడుగు. నీ వడిగినవన్నీ ఇస్తాను. నేను ఈ ధనమంతా కూడబెట్టింది పేద బ్రాహ్మణుల కోసమే. ఆ ధనం మీకు చేరినప్పుడే సద్వినియోగం అవుతుంది" అన్నాడు.

కొన్ని వేల ఆవులను తీసుకొని సంతృప్తుడైనాడు త్రిజటుడు; ఇంకేమీ వద్దన్నాడు. సీతారామ లక్ష్మణులను దీర్ఘాయుష్కులుగాను, అఖండ కీర్తిమంతులుగానూ దీవించాడు.

రాముడు తన స్నేహితులందరికీ వారి వారి యోగ్యతను బట్టి వీడ్కోలు వాక్యాలు పలికాడు. తన పరాక్రమంతో సంపాదించిందంతా పేదసాదలకు పంచి ఇచ్చాడు. అయోధ్యానగరంలోని బ్రాహ్మణులు, సేవకులు, పేదవారు అందరూ రాముని దానధర్మాలు పొంది సంతుష్టులయ్యారు. జనమంతా ముక్తకంఠంతో సీతారామ లక్ష్మణులను దీర్ఘాయుష్కులుగాను కీర్తిమంతులుగాను దీవించారు.

# 33వ సర్గ సీతారామలక్ష్మణులు దశరథుని దర్శించబోవడం

సీతారామలక్ష్మణులు తమ ధనాన్నంతా బ్రాహ్మణులకు దానం చేశారు. రామలక్ష్మణుల ఆయుధాలన్నిటికి సీతాదేవి పూజలుచేసి పూలమాలలు అలంకరించింది. ఆ ఆయుధాలు ధరించి రామలక్ష్మణులతో పాటు సీతాదేవి కూడా పురవీథుల గుండా కాలినడకన దశరథుని భవనం వైపు బయలుదేరింది. రాజవీథులన్నీ జనంతో కిటకిటలాడిపోతున్నాయి. జనం వారిని చూచేందుకు తండోపతండాలుగా వస్తున్నారు. పూర్వం వారు రథాల్లో వెళ్తూ ఉంటే చతురంగబలాలు వెనుక నడిచేవి. ఈ రోజు వారు ముగ్గురూ సామాన్యులుగా కాలినడకన పోతూ ఉంటే జనం వారంతటవారే తప్పుకొని దారినిచ్చారు. వారిని స్త్రీలు, పిల్లలు, వృద్ధులు మేడల పైనుండి చూస్తూ వారి దీనస్థితిని తలచుకొని విలపించారు. గొడుగు అయినా లేకుండా వెళ్తున్న వారిని చూసి ప్రజలంతా ఎంతో దుఃఖించారు. తండ్రికి అసత్యదోషం అంటకూడదని రాజ్యాన్నే త్యాగం చేశాడు. వనవాసానికి సిద్ధమయ్యాడు. ఆకాశమార్గాన ప్రయాణంచేసే దేవతలూ, గంధర్వులూ కూడా చూడలేని ఆ సీతాదేవి రాజవీథిలో కాలినడకన వెళుతూ ఉంటే ప్రజలంతా చూసి విలపించసాగారు. రక్తచందనపు పైపూతలు పూసుకుంటూ సుకుమారంగా పెరిగిన సీతాదేవి శరీరం ఇకపై వర్షం, వేడి, చలి మొదలైన వాటివల్ల నల్లగా పెంకైపోతుందే అని విలపించారు. పిల్లలు ఎంతటి దుర్మార్గులైనా, క్రూరులైనా కూడా ఊరినుండి వెళ్ళగొట్టరు. అటువంటిది ప్రజలందరి ప్రేమాభిమానాలను చూరగొన్న సీతారాముల వంటి కోడలినీ, కొడుకునూ, అడవులకు పంపుతారా? నిశ్చయంగా ఈ దశరథ మహారాజును ఏదో పిశాచం ఆవహించిందని దూషించారు.

రాముడు జాలి, విద్య, మంచిశీలము, ఇంద్రియనిగ్రహం, మనోనిగ్రహం, క్రూరత్వం లేకపోవటం వంటి ఆరు ఉత్కృష్టమైన గుణాలు కలిగి ఉన్నాడు. అందువల్ల ప్రజలంతా గ్రీష్మఋతువులో నీరులేక బాధపడే జలచరాల్లా విలవిల్లాడిపోయారు.

ఫలపుష్పాలతో నిండి ఉన్న వృక్షాన్ని మొదలు కొట్టి వేసినట్లు, కల్యాణ గుణాలు కలిగిన రాముడికి కష్టంవస్తే ప్రజలంతా కష్టాల పాలయ్యారు. ఫలపుష్పాలు గల వృక్షానికి కాండమే సారం. అట్లాగే మన జీవితాలన్నింటికీ రాముడే సారం. కాబట్టి మనం కూడా లక్ష్మణుడు వెళ్ళినట్లే రాముడితో పాటు అడవులకు పోదాం. మనతోపాటు మన భార్య, పిల్లలను కూడా తీసుకొనిపోదాం. అడవుల్లో రాముడు సుఖంగా ఉంటే మనమూ సుఖంగా ఉంటాం. రాముడు కష్టపడితే మనమూ కష్ట పడతాం. కాబట్టి మనమంతా ధర్మాత్ముడైన రాముని వెంట అడవులకు పోదాం. మనమంతా అడవులకుపోతే, మన ఇళ్ళూ, వాకిళ్ళు, పొలాలు అన్నీ పాడుపడిపోతాయి. ధనధాన్యాలన్నీ నశిస్తాయి. ఇళ్ళన్నీ కూలి పడిపోతాయి. పూజించేవారు లేక దేవతలుకూడా ఊరు వదలిపోతారు. ఎలుకలన్నీ కలుగుల్లో నుంచి బైటకువచ్చి ఇష్టానికి విహరిస్తాయి. ఇళ్ళల్లో ఎవరూ వంటలు చేసుకోరు; హోమాలు చెయ్యరు, కాబట్టి నీరు నిప్పు పొగలు ఉండవు. ఎక్కడ చూసినా పగిలిపోయిన కుండపెంకులే కనిపిస్తాయి. అవన్నీ కైకేయికే సొంతం అగుగాక! రాముడితోపాటు మనమూ అడవులకు పోవటంవల్ల అరణ్యమే నగరమవుతుంది. నగరమంతా పాడుబడుతుంది కాబట్టి నగరమే అడవి అవుతుంది. మనల్ని చూసి అడవిలో పాములు, క్రూరమృగాలన్నీ దూరంగా పోతాయి. పులులు, సింహాలు మొదలైన జంతువులన్నీ వచ్చి ఈ నగరంలో స్వేచ్ఛగా తిరుగుతాయి. అప్పుడు కైకేయి, ఆమె కొడుకు, బంధువులు జంతువులనే పరిపాలిస్తారు. మనం మాత్రం రాముడితో కలసి అడవుల్లోనే సుఖంగా ఉందాం.

ఈ మాటలన్నీ రాముని చెవిన పడుతూనే ఉన్నాయి. అయినా రాముడిలో ఏమార్పూ లేదు. నిర్వికారుడై ఉన్నాడు. రాముడు సీతాలక్ష్మణులతో కలసి మెల్లగా నడకసాగించాడు. అల్లంత దూరాన కైలాసశిఖరంలా ఎత్తైన తండ్రిగారి రాజమహలు కనిపిస్తోంది. రాముడు రాజప్రాసాదంలోకి అడుగుపెట్టి అక్కడ దీనంగా నిలబడి ఉన్న సుమంత్రుణ్ణి చూశాడు. సుమంత్రుడు దుఃఖీస్తున్నా, ప్రజలంతా విలవిల్లాడిపోతున్నా రాముడిలో ఏమాత్రం దుఃఖఛాయలు కనిపించలేదు. పైపెచ్చు చిరునవ్వులు చిందిస్తూ తండ్రిని చూసేందుకు భవనంలో ప్రవేశించాడు. సుమంత్రుణ్ణి పిలిచి, తన రాకను తండ్రికి చెప్పమని ఆయన అనుమతి కోసం వేచి

ఉన్నాడు. “సుమంత్రా! నేను అడవులకు పోవటానికి సిద్ధమై, ఆయన దర్శనం కోసం వేచి ఉన్నా” నని చెప్పి రమ్మన్నాడు.

# 34వ సర్గ శ్రీరాముడు సీతాలక్ష్మణులతో దశరథుని దర్శించడం

పద్మపత్రాల వంటి నేత్రాలు గలవాడు, నీలమేఘశ్యాముడు, పూజ్యుడు అయిన రాముడు తన తండ్రిగారిని చూడాలనుకొంటున్నట్లుగా సుమంత్రునితో కబురు పంపాడు. రాముణ్ణి చూడగానే సుమంత్రునికి దుఃఖం ఆగలేదు. ఒళ్లంతా జలదరించినట్లయింది. మహారాజుకు చెప్పేందుకు లోపలకు వెళ్ళాడు. దశరథుణ్ణి చూశాడు. రాజు గ్రహణం పట్టిన సూర్యుని మాదిరి, బూడిదతో కప్పబడిన నిప్పుమల్లే, నీళ్ళులేని సరస్సులా కళాకాంతులు లేకుండా పడి ఉన్నాడు. సంప్రదాయమైన స్తుతివాక్యం పలికితే మహారాజు 'ఖస్సు' మని కోపగించుకుంటాడని భయపడ్డాడు. 'జయీభవా విజయీభవ' అని మధురంగాను, అతిమెల్లగాను పలికాడు.

సుమంత్రుడు: మహారాజా! పురుషశ్రేష్ఠుడైన నీ కుమారుడు తన ధనాన్నంతా బ్రాహ్మణులకు, బీదలకు, సేవకులకు దానంచేశాడు. మిత్రులందరివద్దా వీడ్కోలు చెప్పివచ్చాడు. వనవాసానికి ప్రయాణమై సీతా, లక్ష్మణ సమేతుడై వచ్చి మీ ఆజ్ఞ కోసం ద్వారం వద్ద నిలబడి ఉన్నాడు. తాము వారికి దర్శనం ఇవ్వాలి.

దశరథుడు: సుమంత్రా! నా భార్యలందరినీ ఇక్కడకు పిలిపించు. ఆ ధార్మికుణ్ణి వాళ్ళ ముందే చూస్తాను.

అప్పుడు సుమంత్రుడు కౌసల్య మొదలైన మూడువందల ఏభై మందికి కబురుపెట్టి పిలిపించాడు. అప్పటికే రాముడి వనవాసం గురించి విని ఏడ్చి ఏడ్చి వారందరి కళ్లూ ఎర్రబడి ఉన్నాయి. ముఖాలన్నీ ఉబ్బి ఉన్నాయి. వారంతా కౌసల్యను ముందు ఉంచుకొని దశరథుని వద్దకు వచ్చారు. అప్పుడు సుమంత్రుడు సీతారామలక్ష్మణులను కూడా ఆయన వద్దకు తీసుకొని వచ్చాడు. దశరథుడు రాముణ్ణి చూడగానే చివాలున మంచం పైనుండి లేచి ఏనుగులాంటి నడకతో రాముని చేరేందుకు ప్రయత్నించాడు. కానీ మధ్యలోనే మూర్ఛిల్లి నేలపై పడిపోయాడు. వెంటనే రామలక్ష్మణులు పోయి ఆయనను లేవనెత్తి శుశ్రూషలు చేశారు. లోపలనుండి అనేక

వేలమంది స్త్రీలు ఒకేసారి "అయ్యో! రామా!" అంటూ ఆక్రందనం చేశారు.

రాముడు (తండ్రితో) : మహారాజా! నాకు తండ్రివి. మా అందరికీ మహారాజువు. మీ ఆజ్ఞ ప్రకారం నేడే దండకారణ్యానికి బయలుదేరి వెళుతున్నాను. మీరు త్వరగా కోలుకొని సంపూర్ణారోగ్యాన్ని పొందాలి. ఇప్పుడు మమ్మల్ని దీవించి సంతోషంగా సాగనంపండి. చివరగా మీ అనుమతికై వచ్చాను. సీత, లక్ష్మణుడు కూడా నన్ను అనుసరించి వస్తున్నారు. నేను ఎన్నివిధాలుగా వద్దని చెప్పినా వినటం లేదు. ఇక తప్పనిసరియై వారిద్దరూ కూడా నన్ను అనుసరించి అడవులకు వస్తున్నారు. ఓ మహారాజా! మీరు దుఃఖించకండి. నన్ను, సీతను లక్ష్మణుని నీ పౌరులుగా ఎంచి మాకు అనుమతి ఇవ్వండి.

దశరథుడు: ఓ రామా! కైకేయి నేను తనకెన్నడో ఇచ్చిన వరాలను అడ్డుగా పెట్టుకొని నన్ను వంచించింది. రామా! నీవు నా ఆజ్ఞలను పాటించకు. ఈ రాజ్యాన్ని నీ స్వాధీనం చేసుకో. అయోధ్యాధిపత్యాన్ని పొందు.

రాముడు (నమస్కరిస్తూ) : మహారాజా! నీవు ఇంకా అనేక సంవత్సరాలు మహారాజుగా ఉండాలి. తల్లిగారికి ఇచ్చిన మాటను అసత్యం చేయవద్దు. నా పట్ల ప్రేమచే నీవు అసత్యపరుడవు కాకూడదు. నేను సంతోషంగా అరణ్యవాసం పూర్తిచేసుకొని వస్తాను. పద్నాలుగు సంవత్సరాలు చిటికెలో గడచిపోతాయి. నీ ప్రతిజ్ఞ నెరవేర్చి మళ్ళీ వచ్చి నీ పాదాలపై వాలుతాను.

రాముణ్ణి చూడగానే దశరథునిలో పుత్రపాశం పెల్లుబికింది. ఆయన వాలకం చూసి కైకేయి బెంగపడింది, ఎక్కడ మెత్తబడతాడోనని భయపడి రాముణ్ణి త్వరగా పంపివేయమని దశరథుని చెవిలో గుసగుసలో చెప్పింది.

దశరథుడు (ఏడుస్తూ) : నాయనా! రామా! నువ్వు ఇహపర సుఖాలన్నీ అనుభవించాలి. ఇప్పుడు వెళుతున్నా, అతిక్షేమంగా తిరిగి రావటానికే సుమా! ఈ రాజ్యాన్ని నువ్వు పాలించాలి. నువ్వు మంగళకరమూ, నిర్భయమూ అయిన మంచిమార్గాన్ని అవలంబిస్తున్నావు.

రామా! నువ్వు రఘువంశంలోనే శ్రేష్ఠుడవవుతావు. సత్యవ్రతుడవు, పరమధార్మికుడవు అయి అడవులకు వెళుతున్నావు. అటువంటి నీ బుద్ధిని మార్చటం ఎవరి శక్యమూ కాదు.

నాయనా! ఈ రాత్రికి మాత్రం ఇక్కడే ఉండు. ఈ ఒక్కపూట అయినా నిన్ను కళ్లారా చూసుకొని సంతోషిస్తాను. నన్నూ, మీ అమ్మనూ సంతోషపెట్టు. మా శాయశక్తులా నిన్ను ఆనందపరచేందుకు ప్రయత్నిస్తాం. రేపు ఉదయానే ప్రయాణమవండి.

నాయనా! కుమారా! నన్ను సత్యవ్రతుణ్ణి చేయడానికి, ధర్మాత్మునిగా చేయడానికి, నీ మిత్రులందరినీ వదలి వెళుతున్నావు. ఇహలోక సౌఖ్యాలన్నింటినీ కాలదన్నావు. లోకంలో ఇట్లాంటి కార్యాలు ఎవరూ చేయలేరు.

రామా! నువ్వు అరణ్యాలకు వెళ్ళడం నాకు సుతరామూ ఇష్టంలేదు. సత్యంపైన ఒట్టువేసి చెబుతున్నాను, ఈ కైక నివురుగప్పిన నిప్పులాంటిది. తనలో ఉన్న క్రౌర్యాన్ని, ఎవరికీ తెలియకుండా చాలా సంవత్సరాలు దాచి ఉంచుకొంది. నన్ను మోసగించి ఎప్పుడో ఇచ్చిన వాగ్దానాన్ని దుర్మార్గంగా తనకు అనుకూలంగా మలచుకొంది. ఈమె ముందు నా తెలివితేటలన్నీ వ్యర్థమయ్యాయి. ఈ కైక మన వంశప్రతిష్ఠను మంటగలిపింది. నేను ఆమెకు ఇచ్చిన మాటను సత్యం చేయడం కోసం నువ్వు అరణ్యాలకు వెళ్ళవలసి వస్తోంది. నా కుమారా! నీవు నాకు పెద్దకుమారుడవై, నా మాట అసత్యం కాకుండేటట్లు చేయడంలో ఆశ్చర్యంలేదు.

రాముడు: తండ్రీ! ఈ రాత్రికి నీవు నన్ను భోగాలతో ముంచెత్తగలవు. కానీ రేపటినుండి అవి నాకు ఎక్కడనుండి వస్తాయి? కాబట్టి నేను ఈ రాత్రికే బయలుదేరడం మంచిది.

సువిశాలమైన ఈ దేశాన్ని, ధనధాన్యాలతో సమృద్ధిగా ఉండే ఈ భూమిని, ఈ ప్రజలను విడిచి వెళుతున్నాను. వాటన్నింటినీ భరతునకు ఇవ్వు. నీవు సంతోషంగా తల్లి కైకేయికి ఇచ్చిన వరాలను పూర్తిగా నెరవేర్చు. నీవు వరాలను ఇవ్వగలిగిన మహారాజువనే పేరు తెచ్చుకో. నీవు సత్యసంధుడవవు.

తండ్రీ! నేను నీకు మాట ఇస్తున్నాను. పద్నాలుగు సంవత్సరాలు వనవాసంచేసి నీ ఆజ్ఞను శిరసావహిస్తాను. నీవు ఎటువంటి ఆలోచనలు పెట్టుకోవద్దు, రెండవ వరంగా భరతునికి రాజ్యాన్ని ఇవ్వు. దానితో నీ ప్రతిజ్ఞ పూర్తిగా నెరవేర్చినట్లవుతుంది.

తండ్రీ! ఇకపై దుఃఖించవద్దు. కన్నీరు కార్చవద్దు. సముద్రం నదులన్నింటికీ భర్త. గంభీరమైన సముద్రమెన్నడైనా క్షోభ చెందుతుందా?

తండ్రీ! నాకు ఈ రాజ్యమందుగాని, సుఖాలందు గాని, భోగాలందుగాని, స్వర్గమందుగాని, జీవితమందుగాని, చివరగా సీతయందు కూడా కోరిక లేదు. ఓ పురుషశ్రేష్ఠా! తండ్రీ! నాకు ఉన్నదల్లా ఒక్క కోరికే. నీవు సత్యాన్ని కాపాడాలి. అసత్యవంతుడవు కారాదు. ఇదే నేను కోరుకొంటున్నది. నా పుణ్యంపైన, సత్యంపైన ఒట్టుపెట్టి చెబుతున్నాను.

తండ్రీ! నేనింకా ఎక్కువసేపు ఇక్కడ ఉండను. వెంటనే బయలుదేరుతున్నాను. నీవు దుఃఖించవద్దు. నా నిర్ణయంలో తిరుగులేదు. తల్లి కైకేయి “నువ్వు వనాలకు వెళ్ళు” అన్నది. నేనుకూడా అట్లాగే వెళ్తానని మాట ఇచ్చాను. కాబట్టి నేను కూడా ఆ సత్యాన్ని పాటిస్తాను.

మహారాజా! మమ్మల్ని గూర్చి మీరు చింతించకండి, మేము ముగ్గురమున్నాం. అడవుల్లో అందమైన లేళ్లను చూస్తూ పక్షుల కిలకిలారావాలను వింటూ ఆనందిస్తూ సుఖంగా కాలం గడిపివేస్తాము.

తండ్రీ! దేవతలకు కూడా తండ్రియే దేవత అని చెప్తారు. అందువలన దేవతయైన నీ మాట నిలబెడతాను; తండ్రీ! పద్నాలుగు సంవత్సరాలు వనవాసం పూర్తిచేసుకొని తిరిగివస్తాను. వచ్చి నిన్ను సంతోషపెడ్తాను కాబట్టి దుఃఖాన్ని అణచివెయ్యి. తల్లులకు, ప్రజలకుకూడా నీవే ధైర్యం చెప్పాలి. నీవే ఇలా దిగులుగావుంటే ఎట్లా?

రాముడు ఇలా అంటూ ఉంటే దశరథుడు పెద్దపెట్టున ఏడుస్తూ రాముణ్ణి

కౌగలించుకొన్నాడు. వెంటనే మూర్ఛపోయాడు. కైకేయి తప్ప తక్కిన స్త్రీలంతా ఘొల్లున ఏడ్చారు. ఇదంతా చూస్తున్న సుమంత్రుడికి కూడా దుఃఖం ఆగలేదు, బావురుమని ఏడుస్తూ మూర్ఛపోయాడు. ఆ మందిరమంతా ఆక్రందనలతో నిండిపోయింది.

## 35వ సర్గ సుమంత్రుడు కైకను బ్రతిమిలాడటం

రథసారధి అయిన సుమంత్రుడు అక్కడే ఉండి అంతా వింటున్నాడు. ఆయన దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు. చేతులు రెండూ గట్టిగా నలుపుకుంటూ, పళ్ళు పటపటా కొరుకుతున్నాడు. అతడి కళ్ళు చింతనిప్పుల్లా ఎర్రగా కణకణలాడుతున్నాయి. హృదయం అంతా తడిగుడ్డను పిండుతున్నట్లయింది. ఇంద్రుడు తన వజ్రాయుధంతో శత్రువుల మర్మస్థానాలను కొట్టినట్లుగా, వాడి అయిన మాటలతో కైకేయి హృదయం పగిలే మాటలు మాట్లాడాడు.

సుమంత్రుడు: ఓ కైకేయీ! దశరథ మహారాజు కదిలే ప్రాణులకు కదలలేని ప్రాణులకు (వృక్షాలు, పర్వతాల వంటివి) కూడా ప్రభువు, ఆయన నీకు భర్తకూడాను. అటువంటి మహానుభావుని పట్ల నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తున్నావు. ఇక ఈ ప్రపంచంలో నీవు చేయలేని దుర్మార్గం ఇంకా ఏం మిగిలిలేదు. నువ్వు ఎంతటి దారుణాన్నైనా చేయగల సమర్థురాలవు సుమా!

దశరథ మహారాజు ఇంద్రుడిమల్లే అజేయుడు. పర్వతంలాగా కదల్చటానికి వీలుకానివాడు. సముద్రంలాగా గంభీరుడు. నువ్వు తలపెట్టిన దుర్మార్గంవల్ల ఆయనను చంపినట్లవుతోంది. కాదు కాదు, ఆ వంశాన్నే నాశనం చేస్తున్నావు. దశరథ మహారాజు నీకు భర్త, నిన్ను పోషించేవాడు, నీకు వరాలు ఇవ్వగల సమర్థుడు. అటువంటి భర్తను అవమానించి అపకీర్తిపాలు చేయకు. స్త్రీకి కోటిమంది పుత్రులకన్నా భర్త అధికమైనవాడు. లోకంలో రాజు మరణిస్తే ఆయన కొడుకుల్లో పెద్దవాడే రాజవుతాడు. తక్కిన వారంతా అతడిని అనుసరిస్తారు. మీ ఇక్ష్వాకువంశంలో కూడా అదే ఆనవాయితీ వస్తోంది. ఈనాడు నీవా సంప్రదాయాన్ని నాశనం చేస్తున్నావు. అటువంటప్పుడు నువ్వూ నీ భరతుడూ రాజ్యమేలండి. మేమంతా అడవులకుపోతాం. నువ్వు ఈ విధంగా మూర్ఖమైన పనులు చేస్తూ ఉంటే ఈ దేశంలో ఇక బ్రాహ్మణులు నివసించరు. దేశాన్ని వదిలిపోతారు. ఆ విధంగా మంచివాళ్ళు, బ్రాహ్మణులు,

శ్రేయస్సు కోరే వారంతా రాజ్యం వదిలిపోతూ ఉంటే, ఇక ఇక్కడ నీకు మిగిలిందేమిటి? దానివల్ల పొందే ఆనందం ఏమిటి? నువ్వు అటువంటి హీనమైన పని తలపెట్టావు. నువ్వు ఇంత అరాచకమైన పని తలపెట్టినా కూడా భూమి ఎందుకు రెండుగా చీలిపోలేదా? అని ఆశ్చర్యపడుతున్నాను.

ఏమైనా సరే, రాముణ్ణి అడవులకు పంపాలని పట్టుపడుతున్నావు. బ్రహ్మర్షుల శాపంకన్నా నీ మాటలు మమ్మల్ని ఎక్కువ బాధపెడ్తున్నాయి. దశరథ మహారాజు తక్కిన రాణులందరినీ నిర్లక్ష్యంచేసి నిన్ను తలమీద పెట్టుకుని గౌరవించాడు. అయినా నీవు ఇంత కఠినంగాను, నిర్లజ్జగాను ప్రవర్తిస్తున్నావు. ఇది ఎట్లా ఉందంటే తియ్యటి పండ్లనిచ్చే మామిడిచెట్టును కొట్టివేసి, వేపచెట్టును నాటి పాలుపోసి పెంచినట్లుంది. ఆహా! వేపచెట్టు నుండి ఎక్కడైనా తేనె కారుతుందా? ఎందుకంటే నీవుకూడా నీ తల్లి లాగానే ప్రవర్తిస్తున్నావు. లోకంలో మగపిల్లలకు తండ్రి పోలిక, ఆడపిల్లలకు తల్లి పోలిక వస్తాయంటారు. అట్లాగే నీకుకూడా నీ తల్లి పోలికే వచ్చింది సుమా! నీ తల్లికి ఉండే మూర్ఖత్వమే నీకూ వచ్చింది. నేను విన్న కథ చెబుతాను విను.

పూర్వం ఒక మహాత్ముడు ఇచ్చిన వరప్రభావం చేత నీ తండ్రికి సమస్త జీవులు మాట్లాడుకునే దంతా అర్థం అయ్యేది. ఇట్లా ఉండగా ఆయన ఒకానొక రోజు నీ తల్లితోపాటు కలసి ఉండగా మంచంపై తిరిగే రెండు చీమలు మాట్లాడుకోవడం విన్నాడు. వాటి మాటలు ఆయనకు విపరీతమైన నవ్వు తెప్పించాయి. ఆ కారణంచేత పగలబడి నవ్వాడు. నీ తల్లికి ఆయన తనని అవమానం చేస్తున్నాడని ఉక్రోషం వచ్చింది. ఎందుకు నవ్వావో చెప్పమని ఆయనను నిలదీసింది "నేను చెప్పకూడదు. ఇట్లా విన్నది ఇతరులకు చెబితే తలపగిలి చస్తానని ఆ మహాత్ముడు నాకు మంత్రం ఉపదేశించేటప్పుడే చెప్పాడు. కాబట్టి నేను చెప్పకూడదు" అన్నాడు. అందుకావిడ కోపగించుకొని, నీవు చచ్చినాసరే, బ్రతికినాసరే నాకా విషయం చెప్పాల్సిందేనని పట్టుబట్టింది. అటువంటి మూర్ఖురాలైన నీ తల్లిని నీ తండ్రి వదిలేశాడు. ఆ తరువాత కుబేరుడులా సుఖంగా బ్రతికాడు.

నీ తల్లిలాగానే నువ్వుకూడా పాపాత్మురాలవు. అందువల్లనే దశరథ మహారాజును దుఃఖపెట్టి అయినా సరే, ఇక్ష్వాకువంశానికి కళంకం వచ్చినాసరే నీ పంతం నెగ్గించుకోవాలని చూస్తున్నావు. నీకు కూడా నీ తల్లి పోలికే వచ్చినట్లుంది! ఇప్పటికీ మించిపోయింది ఏమీలేదు. నీ కోరికలను ఉపసంహరించుకో. నీ భర్తను, నీ వంశాన్ని కాపాడు. నీకు ఎవరో పాపాత్ములు దుర్బోధ చేశారు. వారి మాట విని దేవేంద్రుడివంటి భర్తను అధర్మం చేసేందుకు ప్రేరేపిస్తున్నావు. ఇది నీకు తగదు. ఏమైనా కానీ, దశరథ మహారాజుకు అసత్యవ్రతుడనే పేరు రాకూడదు. కాబట్టి నీ వరాలను ఉపసంహరించుకో.

రాముడు అన్నదమ్ములలో పెద్దవాడు, ఉదారుడు, ప్రజలచే అధికంగా ప్రేమించబడ్డవాడు. పరిపాలనాదక్షుడు, సకలవిద్యలూ నేర్చినవాడు. స్వధర్మాన్ని కాపాడేవాడు. మహాబలశాలి. ప్రాణులన్నింటినీ రక్షించ గలవాడు. అటువంటి రాముడికి రాజ్యాభిషేకం జరిగేట్లు చూడు. రాముడు పితృవాక్య పరిపాలకుడై అడవులకు వెళ్ళితే నీకు చాలా చెడ్డపేరు వస్తుంది. అది నీకు, భరతునికి క్షేమం కాదు.

కాబట్టి రాముణ్ణే రాజుని చెయ్యి. రాముడు రాజైన తర్వాత దశరథ మహారాజు తన వంశాచారాన్ని పాటిస్తూ తపస్సు చేసుకోవటానికి అడవులకు వెళతాడు. అందుకు మీరంతా ఆయనకు సహకరించాలి.

రాముడి సమక్షంలోనే సుమంత్రుడు కైకేయిని ఇంత నిష్ఠూరంగా మాట్లాడాడు. ఇంత చెప్పినా ఆవిడ మనస్సు కరుగలేదు, ఆమె ముఖంలో చోటుచేసుకొన్న ద్వేషం ఇసుమంత కూడా తగ్గలేదు.

# 36వ సర్గ కైకేయి దౌష్ట్యం

దశరథుడు కైకేయి కిచ్చిన వరాలను తీర్చటానికై తనకు ప్రాణంతో సమానమైన రాముణ్ణి అడవులకు పంపాల్సివచ్చిందే అని కన్నీళ్ళు కారుస్తూ సుమంత్రుడితో ఇట్లా అన్నాడు.

దశరథుడు: ఓ సుమంత్రుడా! రాముడితోపాటు వెళ్ళేందుకు చతురంగ బలాలను పంపు. వినోదంకోసం మేళతాళాలను, వేశ్యలను పంపించు. వాళ్ళకు సౌకర్యాలన్నీ అమర్చేందుకు వర్తకుల్ని పంపు. రాముడిపై ఆధారపడి జీవించే వారికి, రాముడికి అస్త్రాలు సమకూర్చి పెట్టేవారికి జీవించటానికి సరిపడేట్లు ధనాగారంనుండి ధనాన్ని, ధాన్యాగారాన్నుండి ధాన్యాన్ని సమృద్ధిగా పంపించు. అడవుల్లో ఏనుగుల్ని, మృగాల్ని వేటాడుతూ, అక్కడ దొరికే తేనెను త్రాగుతూ, పర్వతాలపైనుండి ఎడతెగక ప్రవహించే సెలయేరుల స్వచ్ఛమైన జలాల్లో స్నానాలుచేస్తూ వాళ్ళు అయోధ్యను మరిచిపోయేట్లు ఏర్పాట్లు చేయించు. పుణ్యక్షేత్రాల్లో యాగాలు చేస్తూ, దక్షిణలిస్తూ, ఋషులతో కలసి జీవిస్తూ పద్నాలుగు సంవత్సరాలు సునాయాసంగా గడిపి వేయగలడు. భరతుడు ఇక్కడ రాజ్యపాలన చేసే రోజుల్లో, అక్కడ రాముడుకూడా భోగాలు అనుభవించేందుకు అవసరమైనవన్నీ ఇచ్చి పంపు.

కైకేయి (వాడిపోయిన ముఖం గలదై, భయంతో) : ఓ రాజా! ధనధాన్యాలను, నృత్యగాన వినోద కళాకారుల్ని, విలువిద్యా నిపుణులందరినీ రామునితో అడవులకు పంపితే ఇక అయోధ్యలో మిగిలేది ఏం ఉంటుంది? చెరుకురసం అంతా రాముడికి పంపించి, మిగిలిన పిప్పి భరతుడికి మిగిల్చినట్లుగా ఉంది. ఇతరులు తినగా మిగిలినది భరతునకు అక్కరలేదు.

దశరథుడు (కోపంతో): ఓ కైకేయీ! నువ్వు నాకు ఎన్నడో శత్రువై, నాపై పగసాధించేందుకు భార్యరూపంలో వచ్చావు. నన్ను కాడికికట్టిన ఎద్దులా లాగిస్తున్నావు. అది చాలదన్నట్లుగా మధ్యమధ్యలో ముల్లుకర్రతో పొడుస్తున్నావు. నేను రాముడి సంతోషంకోసం చేస్తున్న ఏర్పాట్లను ముందే ఎందుకు అడ్డుకోలేదు? (అంటే వరాలు అడిగేటప్పుడే ఈ

విషయంకూడా చెప్పి ఉండాల్సింది)

కైకేయి (రెట్టించిన కోపం ప్రదర్శిస్తూ): రాజా! నీ వంశంలోనే సగరుడనే రాజు ఉండేవాడు. ఆయన తన పెద్ద కుమారుడైన అసమంజుడనే వాడికి రాజ్యం ఇవ్వకుండా వెళ్ళగొట్టాడు. అదే ప్రకారం రాముణ్ణి కూడా అట్లాగే పంపాలి.

దశరథుడు: ఛీ! పాపాత్మురాలా! ఎంతమాట అన్నావు!

ఈ మాటలు వింటున్న వాళ్ళంతా సిగ్గుతో తలలువంచుకున్నారు. వయస్సులో వృద్ధుడు, మంచిస్వభావం కలవాడు, అయిన సిద్ధార్థుడనే మంత్రి కైకేయితో ఇలా అన్నాడు.

సిద్ధార్థుడు: అమ్మా! కైకేయీదేవీ! రాముణ్ణి అసమంజునితో పోల్చి చెప్పకు. అసమంజుడు ఆడుకొంటున్న పిల్లలను కాళ్ళుపట్టుకొని గిరగిరాతిప్పుతూ సరయూనదిలోకి విసిరివేసేవాడు. పౌరులంతా ఈ దుఃఖాన్ని భరించలేక రాజు వద్దకు పోయి "ఓ రాజా! నీ పెద్దకుమారుడైన అసమంజుడు ఆడుకొనే మా పిల్లల్ని పట్టుకొని సరయూనదిలోకి విసిరేసి ఆనందిస్తున్నాడు. కాబట్టి ప్రజల శ్రేయస్సుకోరే ఓ రాజా! అసమంజుడు ఈ దేశంలో ఉంటే మేమంతా దేశం విడిచిపెట్టి పోతాం. లేదా అసమంజుణ్ణి దేశబహిష్కారం చేస్తే మేమంతా నీ రాజ్యంలో ఉంటాం" అన్నారు.

అంతట సగరచక్రవర్తి ప్రజల విన్నపాన్ని పరిశీలించాడు. ప్రజాక్షేమాన్ని ఎంచి అసమంజుణ్ణి, వాని భార్యాపిల్లల్ని దేశం నుండి కట్టుబట్టలతో వెళ్ళగొట్టించాడు.

అసమంజుడు చేయని పాపకర్మలుండేవి కావు. దేశబహిష్కారం అయిన తర్వాత, ఓ గునపం, ఉలి, ఓ గంపా నెత్తిన పెట్టుకొని కందమూలాలు తవ్వుకొని తింటూ కాలం గడిపాడు. అటువంటి మహాపరాధాలు చేశాడు కాబట్టే, ధర్మాత్ముడైన సగరచక్రవర్తి, పెద్దకొడుకైనా కూడా, ప్రజల క్షేమంకోరి దేశంనుండి ఆతణ్ణి బహిష్కరించాడు.

అమ్మా! రాముడు ఏం అపరాధంచేశాడు? దశరథ మహారాజు ఏ కారణంచూపి రాముణ్ణి అడవులకు పంపుతున్నాడు? మేమెవ్వరమూ రాముడిలో ఒక్క దోషం కూడా చూడలేదు. పైగా చంద్రునిమల్లే చల్లనైనవాడు.

అమ్మా! రాణీ! రాముడిలో ఏదైనా దోషం మీకు కనబడితే బహిరంగంగా చెప్పండి. దశరథ మహారాజు ఇప్పుడే అడవులకు పంపుతాడు, రాముడి యందు ఏ దోషమూ లేదు. పరమధార్మికుడు. అటువంటివాణ్ణి అకారణంగా అడవులకు పంపడం అధర్మమే కాదు, అపరాధం కూడాను. అటువంటి అపరాధం చేసినవాడు దేవేంద్రుడే అయినా తప్పించుకోలేడు.

దశరథుడు: ఓ పాపిష్టిదానా! ఈ సిద్ధార్థమంత్రి వయోవృద్ధుడు, ధర్మపరుడు, పైగా ప్రజలనాడి తెలిసిన మహామంత్రి. అటువంటివాడు చెప్పిన మాటలు నీ చెవికెక్కవు. నువ్వు దుష్టురాలవు, నీ బుద్ధి నీచమైపోయింది. మంచిచెడులు, బాగోగులు తెలుసుకునే స్థితిలో లేవు. ఓ కైకా! నేనుకూడా రాముడితోపాటు అడవులకు పోతున్నాను. నువ్వూ, భరతుడూ కలసి ఈ రాజ్యం ఏలుకోండి.

# 37వ సర్గ సీతారామలక్ష్మణులు నారబట్టలు ధరించడం

మహామంత్రి సిద్ధార్థుని మాటలు విన్న రాముడు వినయంగా దశరథ మహారాజుతో ఇలా అన్నాడు.

రాముడు: మహారాజా! నేను భోగాలన్నీ విడిచిపెట్టాలని నిర్ణయించుకున్నాను. నాకున్న ధనమంతా దానం చేసేశాను. సర్వసంగ పరిత్యాగినై అడవులకు వెళ్ళేందుకు సిద్ధపడ్డాను, అడవుల్లో లభించే కందమూలాలు తింటూ నివసించేందుకే ఇష్టపడ్డాను. అటువంటి నాకు ఈ పరివారమంతా ఎందుకు? ఎవరైనా ఉత్తమ జాతికి చెందిన ఏనుగును దానంచేసి, దాని నడుముకు కట్టిన త్రాడును కోరుకుంటాడా? అట్లాగే, మహారాజా! నేను రాజ్యాన్నే వదలి అడవులకు పోతున్నప్పుడు ఈ పరివారం, సేన నా కెందుకు? అవన్నీ భరతునికే ఉండనివ్వండి.

నేను పద్నాలుగు సంవత్సరాలు అడవుల్లో కట్టుకునేందుకు నార బట్ట లిప్పించండి. కందమూలాలు త్రవ్వుకునేందుకు ఒక గునపం, ఒక గంప ఇప్పించండి.

రాముడు అట్లా అంటూ ఉండగానే కైకేయి ఆలస్యం చేయకుండా వెంటనే వారి ముగ్గురికీ నారబట్టలు తెప్పించి ఇచ్చింది. రాముడు తన శరీరంపై ఉన్న చీనీచీనాంబరాలను విడిచి దశరథుని ఎదుటే నారబట్టలు ధరించాడు. లక్ష్మణుడు కూడా నారబట్టలు ధరించాడు, కైకేయి, నారబట్టలు సీతకు ఇస్తూ ఉండగా సీతాదేవి దుఃఖంతోను, సిగ్గుతోను తలవంచుకొని ఆ బట్టలు పుచ్చుకొని తలవంచుకుంది, సిగ్గుతో రాముడితో “నాథా! అరణ్యాల్లోని స్త్రీలు నారచీరలు ఎట్లా కట్టుకుంటారో నాకు తెలియదు” అంది.

అప్పుడు రాముడు ఆమె చేతిలోనుండి నారచీరలు తన చేతిలోనికి తీసుకొని, ఆమె ధరించి ఉన్న పట్టు చీరలపైనే నారచీరల్ని కట్టిచూపించాడు. ఆ విధంగా రాముడు సీతకు నారచీరను కడుతూ ఉంటే అంతఃపురంలో ఉండే స్త్రీలంతా ఘొల్లున ఏడ్చారు.

అంతఃపుర స్త్రీలు: నాయనా! నువ్వు నీ తండ్రి ఆజ్ఞ ప్రకారం అరణ్యాలకు వెళుతున్నావు. నీ భార్య సీతను ఆదేశించలేదుగదా! అందువలన ఆమెను ఇక్కడే ఉండనివ్వు. మేమంతా సంతోషిస్తాము. నువ్వు నీ తమ్ముడైన లక్ష్మణుణ్ణి తోడుగా తీసుకొని వెళ్ళు. సుకుమారి, మంగళస్వరూపిణి అయిన సీత అడవుల్లో ఉండలేదు. కాబట్టి మా మాట మన్నించి ఆమెను ఇక్కడే ఉండనీ.

వాళ్ళంతా అట్లా మాట్లాడుతూనే ఉన్నారు. కానీ రాముడు మాత్రం సీతకు చీరకట్టి ముగించాడు. రాముడు సీతకు నారచీర కట్టడం చూసిన వసిష్ఠుడు బాధతో కైకేయితో ఇట్లా అన్నాడు.

వసిష్ఠుడు: ఓ కైకేయీ! నువ్వు మితిమీరి ప్రవర్తిస్తున్నావు. నీ బుద్ధి పెడదారిన పోతోంది. వంశప్రతిష్ఠనే అపవిత్రం చేస్తున్నావు. రాజును సునాయాసంగా మోసంచేశావు. అయినా నీ దాహం తీరినట్లుగా లేదు. ఇప్పటికీ న్యాయమైన మార్గంలో ఆలోచించటం లేదు.

సీత సదాచారవంతురాలు. ఆమెకు అడవులకు వెళ్ళాల్సిన పనిలేదు. ఆమె రాముడి అర్ధాంగి. ఇక్కడ ఉంటూనే సింహాసనంపై కూర్చుని రాజ్యాన్ని పాలించగలదు. సీత అంటే రామునికి ఆత్మవంటిది.

ఒకవేళ సీతకూడా అడవులకు వెళితే, మేమంతా కూడా ఆమెతోపాటే అడవులకు పోతాం. నేనే కాదు ఈ అయోధ్యవాసులంతా కూడా వాళ్ల వెనకే ఉంటారు. ఈ దేశప్రజలంతా కూడా రాముడి వెనకే ఉంటారు. భరత శత్రుఘ్నులు కూడా నారబట్టలు ధరించి రాముడి వెనకనే నడుస్తారు. అడవుల్లో రాముడితోనే ఉంటారు. చివరగా ఇక్కడ మిగిలేదల్లా క్రూరాత్మురాలవైన నువ్వు ఒక్కదానివే! ఓ కైకా! నీకు దుర్బుద్ధి పుట్టింది, సదాచారాలన్నీ వదలివేశావు. ప్రజలందరికీ కీడు తలపెట్టావు. ప్రజలంతా రాముడితోపోతే, నువ్వు పాలించేదల్లా పాడుపడిన ఇళ్ళను, ఎండిపోతున్న వృక్షాలను మాత్రమే. రాముడు లేనిది రాజ్యం కాదు. రాముడు ఉండే అడవే

రాజ్యం అవుతుంది.

కైకా! భరతుడికి తండ్రివంశంలో పుట్టినవాళ్ళ పూర్వీకుల చరిత్రలన్నీ తెలుసు. ఆరు నూరైనా అతడీరాజ్యాన్ని పాలించడు, నీ మాట వినడు. నిన్ను తల్లిగా కూడా గౌరవించడు. నువ్వు పుత్రప్రేమ అనే మైకంలోపడి అపకారమే చేస్తున్నావు. లోకంలో రాముణ్ణి అనుసరించి పోనివాళ్ళెవరూ ఉండరు –ఒక్క నువ్వు తప్ప. కైకా! చివరకు పశుపక్ష్యాదులు కూడా రాముడితోనే పోతాయి. కదలలేని వృక్షాలు కూడా దీనంగా రాముడికేసే ముఖంపెట్టి చూస్తున్నాయి.

అందుచేత ఓ కైకా! సీతకు నారచీరలు ఇవ్వకు. ఉత్తమమైన ఆభరణాలనివ్వు. ఆమె నారబట్టలు ధరించాలనే నిబంధన ఎక్కడాలేదు. రాముడికొక్కడికే మహారాజు వనవాసం విధించారు, కాబట్టి సీత చక్కగా అలంకరించుకొని, రామునితో అడవుల్లో నివసించవచ్చు. సీతాదేవికోసం అవసరమైన పరిచారికలు, వాహనాలు, వస్త్రాలు తీసుకొని వెళ్లనివ్వు. నువ్వు వరాలు కోరినప్పుడు ఈ నిబంధనలేవీ లేవు.

రాజగురువు, బ్రాహ్మణశ్రేష్ఠుడు, గొప్పతపశ్శాలి అయిన వసిష్ఠుడు ఈ విధంగా వారించినా కూడా, సీతాదేవి తనకు అత్యంత ప్రీతిపాత్రుడూ, దైవసమానుడూ అయిన రాముని వెంట అడవులకు వెళ్ళటానికే సిద్ధపడింది.

# 38వ సర్గ తల్లి కౌసల్యను ఆదరించమని రాముడు తండ్రిని కోరడం

కైకేయి సీతకు కూడా నారచీరల్ని కట్టబెట్టడం చూసి వసిష్ఠుడు మున్నగు పెద్దలేకాక జనంకూడా 'ఛీ' అన్నారు. అది వింటున్న దశరథుడికి దుఃఖంతో బ్రతుకు మీదా, కీర్తి మీదా అసహ్యం వేసింది. నిట్టూరుస్తూ కైకేయితో ఇట్లా అన్నాడు.

దశరథుడు: ఓ కైకా! సీత నారబట్టలు ధరించాల్సిన అవసరం లేదు. ఆమె ఇంకా యౌవనంలో ఉంది, సుకుమారి. ఆమె ఇంతవరకు సుఖాలే అనుభవించిందిగాని, వనవాసం గూర్చి ఏమీ తెలియదు. ఆమె జనక మహారాజు కుమార్తె. ఆమె ఎవరికి ఏం అపకారం చేసిందని ఈ విధంగా నారచీరలు కట్టి దీనంగా నిలబడాలి? సీతను గూర్చి నీకేమీ నేను వాగ్దానం చెయ్యలేదు. అందువలన ఈ జనకపుత్రి ఆభరణాలను ఉత్తమమైన వస్తువులను తీసుకొని అడవులకు వెళ్ళవచ్చు.

ఓ కైకా! నాకు మరణం దగ్గరపడింది. అందువల్లనే నువ్వు అడగ్గానే, నీ కిచ్చిన వరాలు తీరుస్తున్నాను. నేను నీకు బానిసనయ్యాను. రాముణ్ణి అడవులకు పంపటానికి ఒప్పుకున్నాను. వెదురుకర్రకు పూచిన పుష్పమే ఆ వెదురు పొదనంతా కాల్చివేసినట్లు నీ మూర్ఖత్వమే నా మరణానికి కారణమవుతుంది. ఓసీ! పాపాత్మురాలా! రాజ్యంకోసం నువ్వు రాముడిపై పగ పట్టావన్నా అర్థంచేసుకోగలం కానీ, సీత నీకేమి అపకారం చేసింది? నువ్వు నిశ్చయంగా పాపాత్మురాలవే. రాముణ్ణి అడవులకు పంపటమే కాకుండా ఇటువంటి నీచమైన ఆలోచనలు చేస్తున్నావు.

ఓ కైకా! రాజ్యాభిషేకానికి ముందు రాముడితో నువ్వు ఏం చెప్పావో, అంతవరకే నీకు నేను ప్రతిజ్ఞ చేశాను. ఇప్పుడు నువ్వు నా ప్రతిజ్ఞను అతిక్రమించి సీతచేత నారచీరలు ధరింపజేయాలని చూస్తున్నావు. నువ్వు ఘోరమైన నరకానికి పోతావు సుమా!

దశరథుడు ఎంతగా విలపించినా కైకేయి మనస్సు కరగలేదు. నేలచూపులు చూస్తూ దుః ఖాసాగరంలో మునిగి ఉన్నాడు.

రాముడు: తండ్రీ! మీరు పరమధార్మికులు. నా తల్లి కౌసల్యాదేవి ఉత్తమురాలు; వృద్ధురాలు. నన్ను అడవులకు పంపినా ఆమె మిమ్మల్ని నిందించడం లేదు. నేను వనాలకు పోగానే ఆమె దుః ఖంతో మంచాన పడుతుంది. ఆవిడ ఇదివరకు ఎన్నడూ ఇటువంటి దుఃఖాలూ పొందలేదు. కాబట్టి మీరే ఆమెను కనికరించాలి. దయతోను, సానుభూతితోను చూసి ఆమెను ఆదరించాలి. నేను అడవులకు పోయిన తరువాత మీరు తప్ప ఆమెను ఆదరించేవారెవరూ ఉండరు. నా మీద ప్రేమచేత కృశించిపోతూ ఉంటుంది. ఆమె ప్రాణాలు మీ చేతుల్లో ఉన్నాయి. మీరే ఆమెను కాపాడాలి. మీరు కోరిన కోరికలివ్వడంలో దేవేంద్రుడంతటివారు. నాకు ఇంతకన్నా ఇంకే కోరికా లేదు.

# 39వ సర్గ రామునికై రథాన్ని ఏర్పాటు చేయడం

నారబట్టలు ధరించి మునివేషంలో ఉన్న రాముణ్ణి, దశరథుడు చూశాడు. దుఃఖంతో వాళ్ళ కడుపులన్నీ తరుక్కుపోయాయి. దశరథుడు రాముడి ముఖంలో ముఖంపెట్టి చూడలేక నేలచూపులు చూస్తూ ఏడుస్తూ కూర్చున్నాడు.

“పూర్వం నేను ఎందరో పిల్లల్ని, తల్లితండ్రుల నుండి వేరుచేసి ఉంటాను, లేదా చంపి ఉంటాను. అందువల్లనే నేడు ఇంత దుఃఖం అనుభవిస్తున్నాను. కాలం చెల్లకపోతే మరణం కూడా దగ్గరకు రాదు. అందువల్లనే కైకేయి చేత పీడించబడుతున్నాను. అగ్నిలా ప్రకాశవంతంగా ఉండే రాముడు పట్టువస్త్రాలన్నీ వదలివేసి మునులు ధరించే నారచీరలు కట్టుకొని ఎదురుగా నిలబడి ఉంటే చూడాల్సిన దుర్గతి పట్టింది. ఇంత అనుభవం అయినా, మరణానికి కూడా నాపై దయకలగటం లేదు. కైకేయి తన స్వార్థం కోసం నన్ను వంచన చేసింది. ఇంతమంది మహామహుల్నీ దుః ఖసముద్రంలో ముంచింది” అంటూ దశరథమహారాజు లోలోపలే విలపించసాగాడు.

దశరథుడు: సుమంత్రా! సత్పురుషుడు, వీరుడు అయిన కుమారుణ్ణి తల్లిదండ్రులే అడవులకు పంపుతున్నారు. గుణవంతులైన వారి మంచి నడవడికకు లభించే ప్రతిఫలం ఇంతేనా? ఇదేనా సుగుణాలకు కలిగే ఫలం! నువ్వు వెళ్ళి విలాసానికి, విహారాలకు వెళ్ళే రథాన్ని ఒకదానిని పూన్చి పట్టుకొనిరా. ఆ మహానుభావుణ్ణి అందులో ఎక్కించుకొని దేశానికి దూరంగా ఉండే వనాల్లో వదిలిరా.

రాజాజ్ఞను శిరసావహించి సుమంత్రుడు వెళ్ళి చక్కగా అలంకరించిన రథాన్ని తీసుకొని వచ్చాడు. రామునికి నమస్కరించి ఇలా అన్నాడు.

సుమంత్రుడు: రామా! బంగారంతో తాపడం చేయబడి ఉత్తమమైన అశ్వాలను పూన్చిన

రథం సిద్ధంగా ఉంది.

అప్పుడు దశరథ మహారాజు కోశాధ్యక్షుణ్ణి పిలిపించి, పద్నాలుగు సంవత్సరాలకు సరిపోయే విలువైన వస్త్రాలను, అలంకారాలను సీతకోసం తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. అతడు వెంటనే ఆ వస్తువులన్నీ సమకూర్చి సీతకిచ్చాడు. సీత వాటన్నింటినీ చక్కగా అలంకరించుకొంది. అంతటి కష్టంలో కూడా ముఖంలో ఏమాత్రమూ దైన్యంలేని సీతను కౌసల్యాదేవి కౌగలించుకొంది.

కౌసల్యాదేవి: సీతా! లోకంలో స్త్రీలు తమకు కావలసినవన్నీ సమకూర్చి సంతోషపెట్టేంతవరకు భర్తలను గౌరవిస్తారు. భర్తకు కష్టకాలం రాగానే అంతవరకూ చేసిన మంచినంతా మరచిపోతారు. భర్తను లెక్క చేయరు. ఏ కొంచెం ఆపదవచ్చినా, లేక దరిద్రం వాటిల్లినా వాళ్ళకు చెడుబుద్ధులు పుట్టుకొస్తాయి. భర్తలను చీదరించుకుంటారు. లేక వదలి వేస్తారు. సామాన్యంగా వాళ్ళు భర్తతో అబద్ధాలాడుతూ ఉంటారు. చిన్న చిన్న విషయాలనే పెద్దవిగాచేసి పోట్లాడుతూ ఉంటారు. వాళ్ళకు కులం, గౌరవాలతో పని ఉండదు. చేసిన మేలు అంతా మరచిపోతారు. లోకమర్యాద పాటించరు. వాళ్ళు చదువుకున్న చదువు ఎందుకూ కొరగాకుండా పోతుంది. అయ్యో! అగ్నిసాక్షిగా పెళ్ళి చేసుకున్నామే, భర్తకు చేదోడువాదోడుగా ఉందామనే జ్ఞానమే ఉండదు. వాళ్ళెప్పుడూ చంచల మనస్కులై ఉంటారు. వికృతంగా ప్రవర్తిస్తారు. అటువంటి స్త్రీని నమ్మలేము.

సీతా! ఇది సామాన్యంగా ఉండే లోకం తీరు. వాళ్ళల్లో పతివ్రతలైన వాళ్ళుకూడా కొందరుంటారు. వాళ్ళంతా సత్యవ్రతులై ఉంటారు. సదాచారాలను ఎన్నటికీ వదలరు. పెద్దల పట్ల వినయవిధేయతలతో మెలగుతారు. వాళ్ళు భర్తనే ఆరాధ్యదైవంగా భావిస్తారు. భర్తే వాళ్ళకు సర్వస్వం. భర్తకన్నా అధికుడు లోకంలో వాళ్ళకు కనిపించడు. భర్తనే దైవంగా భావిస్తారు.

తల్లీ! ఓ సీతా! నా కుమారుడు దరిద్రుడు అయినా, ధనవంతుడు అయినా నీకు భర్త. నీకు

సర్వస్వం నీ భర్తే. ధనమంతా పోయింది, అడవుల పాలయ్యాడని నీవు వాణ్ణి అలక్ష్యంగా చూడవద్దు. అతణ్ణి దేవతమల్లే చూసుకోవాలి. నువ్వు ఎప్పుడూ రాముణ్ణే అనుసరించి ఉండు.

సీత: అత్తా! పూజ్యురాలా! నీకు నమస్కరించి ప్రతిజ్ఞ చేస్తున్నాను. నీవు ఆజ్ఞాపించినట్లే నడచుకొంటాను. భర్త విషయంలో ఎట్లా ప్రవర్తించాలో నా తల్లితండ్రులు నాకు నేర్పి పంపించారు. అత్తా! చంద్రుణ్ణి వెన్నెల ఎన్నడూ వదలిపెట్టని విధంగా, నేనూ ధర్మాన్ని విడువను. నా భర్త ఉన్న చోటనే నేనూ ఉంటాను. తీగలు లేకుండా వీణ మోగదు. చక్రాలు లేకుండా రథం నడువదు. అట్లాగే వెయ్యిమంది కొడుకులున్నా భర్తలేని స్త్రీ సుఖపడలేదు. ఆడపిల్లలకు తల్లితండ్రులు ఏది ఇచ్చినా అది మితంగానే ఉంటుంది. కానీ భర్త మాత్రం తన భార్యకు అపరిమితంగా ఇస్తాడు. అందువల్ల భర్తను పూజించకుండా ఎట్లా ఉండగలను? నేను మహాపతివ్రతలైన వారివల్ల అనేక విషయాలు విన్నాను. నేనూ వారి అడుగు జాడల్లోనే నడచుకుంటాను. నా భర్తను ఎన్నటికీ అలక్ష్యం చెయ్యను. ఆయనే నాకు దేవుడు, సర్వస్వమూ.

సీతమ్మ పలుకులకు కౌసల్యాదేవి పులకించిపోయింది. రాముడు తల్లి కౌసల్యాదేవికి ప్రదక్షిణపూర్వకంగా నమస్కరించాడు.

రాముడు: అమ్మా! నువ్వు దుఃఖించవద్దు. తండ్రికి జాగ్రత్తగా సేవలు చెయ్యి. కళ్ళుమూసి కళ్ళుతెరిచే లోపల నా వనవాసం పూర్తి అయిపోతుంది. వనవాసం పూర్తిచేసుకొని నీ పాదాలపై వాలతాను.

(మిగిలిన తల్లులతో) ఓ తల్లులారా! మీ దగ్గర చనువు వల్లగాని అజ్ఞానం చేతగాని, మీకు ఏమైనా కష్టం కలిగించి ఉంటే నన్ను క్షమించండి. తల్లులారా! ఈ రోజు మిమ్మల్నందరినీ వదలి అడవులకు పోతున్నాను.

రాముడు ఆ విధంగా వారి వద్ద వీడ్కోలు పలుకుతూ ఉంటే వాళ్ళంతా ఘొల్లున ఏడ్చారు.

# 40వ సర్గ సీతారామలక్ష్మణులు రథంపై అడవులకు బయలుదేరడం

సీతారామలక్ష్మణులు దశరథ మహారాజుకు పాదాభివందనం చేశారు. హృదయంలో నుండి వచ్చే దుఃఖం ఆ ముగ్గురి ముఖాలలో కొట్టొచ్చినట్లు కనబడుతోంది. ముఖాలు దీనంగా పెట్టుకొని ఆయనకు ప్రదక్షిణం చేశారు. తండ్రి నుండి సీతను, లక్ష్మణుని కూడా తనతో తీసుకొని వెళ్ళేందుకు రాముడు అనుమతి పొందాడు. ప్రక్కనే దుఃఖీస్తున్న తల్లిని చూశాడు. రాముడి మనసంతా దుః ఖంతో నిండి మూఢుడైపోయాడు. సీతా లక్ష్మణులతో కలసి ఆమెకు కూడా శిరస్సువంచి నమస్కరించాడు. లక్ష్మణుడు తన తల్లి సుమిత్రాదేవి వద్దకు పోయి శిరస్సు వంచి నమస్కరించాడు. ఆమె దుఃఖం ఆపుకోలేకపోయింది. బావురుమని ఒక్కసారి బిగ్గరగా ఏడుస్తూ పాదాలకు నమస్కరిస్తున్న లక్ష్మణుని రెండు చేతులతో పైకి లేవనెత్తింది. కౌగలించుకొని శిరస్సుపై వాసన చూసింది.

సుమిత్రాదేవి: కుమారా! లోకకల్యాణంకోసం కౌసల్య రాముణ్ణి కన్నది. నిరంతరంగా రాముడికి సేవచేసేందుకే నిన్ను నేను కన్నాను. నాయనా మీరిద్దరూ కారణజన్ములు. కాబట్టి రాముణ్ణి ఎప్పుడూ కనిపెట్టుకొని ఉండు. రాముడికి సేవలు చేసేందుకే నువ్వు జన్మించావు. కంటికి రెప్పలాగా రాముణ్ణి చూసుకో. ఒక్క రాముడే కాదు, సీతను కూడా నువ్వు అట్లాగే కనిపెట్టుకొని ఉండాలి.

కుమారా! కష్టాల్లో ఉన్నా, మహారాజైన రాముడే దిక్కని నమ్ముకో. పెద్ద అన్నగారిని అనుసరించుకొని బ్రతకడమే సత్పురుషుల ధర్మమని శాస్త్రం వచిస్తోంది. దానధర్మాలు చెయ్యడం, యజ్ఞయాగాది క్రతువులు చెయ్యడం, యుద్ధంలో దేహాన్ని త్యాగం చెయ్యడం అనేవి మన వంశంలో అనాదిగా వస్తున్న పద్ధతులు.

పుత్రా! రాముడే నీకు దశరథుడని భావించుకో. సీతయే నేననుకో. నువ్వు ఉండబోయే అడవియే అయోధ్య అని తలచుకో. నాయనా! అన్నగారితో సుఖంగా వెళ్ళిరా. (ఇచట

"దశరథమ్" అన్న వాల్మీకి ప్రయోగాన్ని పక్షి వాహనుడైన విష్ణువుగాను, "మామ్" అన్న ప్రయోగాన్ని లక్ష్మీదేవిగాను, "అయోధ్యామ్" అన్న ప్రయోగాన్ని యుద్ధంచేయ శక్యం కాని వైకుంఠంగాను కొందరు విశేషార్థాన్ని స్వీకరించారు. అంటే శ్రీరాముడే సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువని, సీతయే లక్ష్మీదేవి అని, రాముడు నివసించే అడవియే వైకుంఠమని అన్వయించి చెప్పారు.)

అప్పుడు సుమంత్రుడు రాముని వద్దకువచ్చి చేతులు జోడించి నమస్కరించాడు. "మహానుభావా! రథం సిద్ధంగా ఉంది. తామంతా ఈ రోజే అరణ్యానికి వెళ్ళాలని కైకేయీదేవి ఆదేశించింది. ఈ రోజే బయలుదేరితే, పద్నాలుగు సంవత్సరాల వనవాస దీక్ష ప్రారంభమైనట్లవుతుంది" అన్నాడు.

చక్కగా అలంకరించుకొని లక్ష్మీదేవిలా ఉన్న సీత ముందుగా రథం ఎక్కి కూర్చుంది. తరువాత రాముడు, లక్ష్మణుడూ రథం ఎక్కారు. అనంతరం పద్నాలుగు సంవత్సరాలకు సరిపడే నగలు, చీరలు, రామలక్ష్మణుల కోసం వివిధ రకాల ఆయుధాలు, కవచాలు, కందమూలాలు త్రవ్వుకునేందుకు చిన్న గునపాలు, దుంపలు వేసుకునేందుకు గంపలు ఆ రథం మధ్యభాగంలో పెట్టించారు. ఆ తరువాత రథం నడపటంలో నేర్పరి అయిన సుమంత్రుడు రథాన్ని కదల్చాడు.

అలా రథం కదలగానే, అయోధ్యానగరం యావత్తు ఒక్కసారిగా అట్టుడికినట్లు కంపించిపోయింది. దుఃఖంతో ఏమీ తోచనివారై జనం నిశ్చేష్టులయ్యారు. సైనికులు కూడా కలవరం చెందారు. వాళ్ళు ఎక్కి కూర్చున్న ఏనుగులు ఒక్కసారిగా కోపంతోను, దుఃఖంతోను ఘీంకారం చేశాయి. గుర్రాల కాళ్ళకు కట్టిన గజ్జెలు, గిట్టల చప్పుళ్ళతో రౌతుల మాట వినకుండా పట్టణమంతా కలయతిరిగాయి. పిల్లలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు, వృద్ధులు రాముడి రథం వెనుక పరుగులు పెట్టారు. వాళ్ళంతా రథాన్ని నాలుగు పక్కలనుండి ముట్టడించారు. అందులో కొంతమందికి రామదర్శనం కాలేదు. వాళ్ళంతా పెద్దగా ఏడుస్తూ "ఓ సుమంత్రా! రథాన్ని మెల్లగా పోనివ్వు. మేమంతా రాముణ్ణి చూడాలి. మళ్ళీ ఎన్ని సంవత్సరాల తర్వాత చూస్తామో?"

అంటూ కేకలు వేశారు.

“దేవుడితో సమానమైన రాముడు అడవులకు వెళుతూంటే కౌసల్యాదేవి గుండెలు పగిలిపోలేదా? ఆ గుండెను ఇనుముతో చేశారేమో! మా గుండెలు పగిలిపోతున్నాయి” అని కొందరు బిగ్గరగా ఏడ్చారు.

“ధర్మపత్ని అంటే సీతలా ఉండాలి. సూర్యుని కాంతి మేరుపర్వతాన్ని విడువనట్లుగా, సీతాదేవి రాముణ్ణి విడవకుండా అడవులకు పోతోంది. ఆమె ధర్మపరాయణురాలు” అని మరికొందరన్నారు.

దశరథుడు కూడా భార్యతో కలసి రాముణ్ణి చూసేందుకు బయటకు వచ్చాడు. స్త్రీలందరూ ఒక్క పెట్టున ఏడవటం మొదలుపెట్టారు. బలమైన మగ ఏనుగును ఇనుప గొలుసులతో కట్టి బంధించినప్పుడు ఏడుస్తున్న ఆడ ఏనుగుల ఆక్రందనంలా వినపడింది.

దశరథుడు సహజంగా తేజోవంతుడైనా, ఆ క్షణంలో గ్రహణం పట్టిన చంద్రుడిమల్లే కాంతివిహీనంగా కనపడ్డాడు.

జనులంతా రథాన్ని అడ్డగించడంవల్ల, రాముడు సుమంత్రుణ్ణి రథాన్ని త్వరగా తోలమని తొందరపెట్టాడు. అదే సమయంలో రథాన్ని నిలుపమని పౌరులు సుమంత్రుణ్ణి అడ్డగించారు. ఆ తొక్కిసలాటలో రేగిన దుమ్ము అంతా పౌరుల కన్నీళ్ళతో అణిగిపోయింది. జనమంతా కన్నీళ్ళు కారుస్తూ దుఃఖంతో హాహాకారాలు చేశారు. చేపల కదలిక చేత పద్మాల నుండి నీరు కారినట్లు ఆ స్త్రీల కళ్ళనుండి కన్నీరు స్రవించింది. ఆబాలగోపాలం దుఃఖీస్తున్నారు; అందరి దుఃఖం రాముని కోసమే. ఆ దృశ్యం చూసిన దశరథుడు మొదలు నరికిన వృక్షంలా పడిపోయాడు. జనమంతా రాముడికోసం విలపించగా స్త్రీలు కొందరు కౌసల్యకై విలపించారు.

రాముడు ప్రయాణమై వెళుతూ ఒకసారి వెనక్కు తిరిగి చూశాడు. దూరాన్నుండి

దుఃఖంతో కృంగిపోతున్న తల్లిదండ్రులు మసక మసకగా కనిపించారు. ఎన్నడూ నడవటమే అలవాటులేని దశరథుడు, ఆయన స్త్రీలు రథం వైపు పరుగెత్తడం చూసిన రాముడు సారథిని రథాన్ని త్వరగా నడపమని ఆదేశించాడు. వెనుకనుండి దశరథుడు రథాన్ని ఆపమని అరవడం మొదలుపెట్టాడు. సుమంత్రుడు ఇరకాటంలో పడ్డాడు. ఒక ప్రక్క రాముడు త్వరగా పొమ్మంటాడు. మరో ప్రక్క దశరథుడు రథాన్ని ఆపమంటాడు. అప్పుడు సుమంత్రుడి మనస్సు రెండు చక్రాలమధ్య పడి నలిగినట్లయింది. ఒకవేళ మహారాజు రథం ఎందుకు ఆపలేదని నిన్ను నిలదీసినా కూడా, నాకు వినపడలేదని చెప్పుకోవచ్చునని రాముడు సుమంత్రునితో చెప్పి రథాన్ని ముందుకే నడిపించాడు.

సుమంత్రుడు మాత్రం రాముడు చెప్పినట్లే రథాన్ని వేగంగా నడిపాడు. జనం రాముడికి ప్రదక్షిణ నమస్కారాలుచేసి వెనక్కు తిరిగారు; కాని వాళ్ళ మనస్సు మాత్రం రాముడితో ముందుకే పోతోంది.

మంత్రులంతా దశరథుని వద్దకుపోయి "మహారాజా! ఎవరిని మనం సాగనంపాలని అనుకుంటామో, వాళ్ళతో కూడా చాలాదూరం వెళ్ళకూడదు" అన్నారు. దశరథుడి ఒళ్ళంతా చెమటలు పట్టాయి. ముఖం, శరీరం వాడిపోయాయి. రాముడు పోయిన వైపే దీనంగా చూస్తూ నిలబడ్డాడు.

# 41వ సర్గ రాముడి కోసం నగరవాసులు వ్యాకులత చెందటం

రాముడు రథమెక్కి ముందుకు సాగిపోయాడు. అంతఃపుర స్త్రీలంతా బావురుమని ఏడ్చారు. దిక్కులేని వాళ్ళందరికీ కొండంత అండగా ఉండే రాముడు ఇప్పుడు నగరం విడిచిపోయాడు. ఎవరి మనస్సూ నొప్పించేవాడు కాడు. ఒకవేళ తనను ఎవరైనా నొప్పించినా కోపగించుకొనే వాడు కాదు. కోపం వచ్చినా వాళ్ళనుకూడా చక్కగా సమాధానపరచి శాంతపరచేవాడు. రాముడు ఇతరుల సుఖమే తన సుఖమనుకొంటాడు. ఇతరులకొచ్చే దుఃఖం తన దుఃఖమని బాధపడేవాడు. కన్నతల్లి అనీ, సవతి తల్లి అనీ తేడాలు లేకుండా అందరినీ సమానంగా పూజించేవాడు. దశరథ మహారాజు కైకేయి పోరుపడలేక అడవులకు పంపాడేగాని, రాముడు లేకుండా జీవించగలడా?

ప్రాణికోటి నంతటినీ సంతోషపెట్టేవాడు, ధర్మం తప్పనివాడు అయిన రాముడు మహారాజు ఎంత బ్రతిమాలినా తండ్రి అసత్యవాది కాకూడదన్నాడు. తండ్రి మాట నిలబెట్టేందుకే అడవులకు వెళ్ళాడు. అటువంటి రాముడు ఎక్కడకుపోతున్నాడో? ఈ రకంగా అంతఃపురస్త్రీలంతా దూడల నుండి బలవంతంగా లాగివేసిన ఆవులమల్లే బిగ్గరగా ఏడ్చారు. అసలే పుత్రవియోగంతో బాధపడుతున్న దశరథునికి, అంతఃపురస్త్రీల ఆక్రందనలతో దుఃఖం రెట్టింపయింది.

బ్రాహ్మణుల ఇళ్ళలో అగ్నిహోత్రాలు చెయ్యలేదు. గృహస్థులు వంటలు చేసుకోలేదు. ప్రజలు తమ వృత్తుల్లోకి పోలేదు. సూర్యుడే ముఖం చాటేస్తే ఇక వీరందరిమాటా విడిగా చెప్పాలా? ఏనుగులు నోట్లో ఉన్న ఆహారాన్ని బైటకు తోసేశాయి. ఆవులు తమ దూడలకు పాలివ్వలేదు. తొలికాన్పే అయినా బాలింతలు తమ బిడ్డలను చూసుకొని మురిసిపోలేదు. త్రిశంకువు, కుజుడు, గురుడు, బుధుడు గ్రహాలు తేజస్సును కోల్పోయాయి.

దేవేంద్రుడు త్రిలోకాధిపత్యాన్ని కోల్పోతే మండలాలన్నీ గజగజలాడినట్లుగా, రాముడి

వనవాసాన్ని తలచుకోగానే, ఏనుగులన్నీ ఘీంకారాలు చేశాయి. ఆ ఘీంకారానికి పర్వతాలన్నీ కదలిపోయాయి. ఒకటేమిటి, అన్నీ ప్రకృతికి విపరీతంగానే నడిచాయి.

# 42వ సర్గ దశరథుడు కౌసల్య భవనానికి వెళ్ళడం

రాముడు వెళుతున్న రథాన్ని దశరథుడూ పరివారమూ చూస్తూ నిలబడిపోయారు. రథచక్రాలనుండి రేగిన దుమ్ము ఆకాశాన్నంటింది. అదంతా అణగిపోయేదాకా అక్కడే నిలబడ్డారు. దశరథ మహారాజు దుఃఖాన్ని తట్టుకోలేక తూలి పడబోయాడు. ప్రక్కనే ఉన్న కౌసల్యాదేవి కుడివైపునుండి వచ్చి ఆయనను లేవనెత్తింది. కైకేయీదేవి కూడా ఆయనను ఎడమవైపునుండి పట్టుకుని లేపబోయింది. కైకేయిని చూచి దశరథుడు బాధపడుతూ ఇట్లా అన్నాడు.

దశరథుడు: కైకేయీ! నువ్వు నా శరీరాన్ని తాకవద్దు. నిన్ను చూడటానికి కూడా నేను ఇష్టపడను. నువ్వు నా భార్యవు కావు. కనీసం నా బంధువు కూడా కాదు. నీ వాళ్ళుకూడా నాకేమీ కారు. ఇప్పుడే నిన్నూ, నీ వాళ్ళనూ విడిచిపెడుతున్నాను. నిన్ను అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్న బంధం ఈ క్షణమే తెగిపోయింది. ఇకపై నీతో నాకు ఇహలోకంలోగాని, పరలోకంలోగాని ఎటువంటి సంబంధమూ లేదు. భరతుడు నువ్వు సంపాదించి ఇచ్చిన ఈ రాజ్యాన్ని సంతోషంగా స్వీకరిస్తే నా మరణానంతరం ఆతడు నాకు ఏ విధమైన కర్మలు చేయటానికి అర్హుడుకాడు; అతణ్ణికూడా వదలి వేస్తున్నాను.

అప్పుడు కౌసల్యాదేవి ఆయన ఒంటికి అంటిన దుమ్మునంతా దులిపింది. మెల్లగా ఆయనను రాజమందిరం వైపుగా నడిపించుకుపోయింది. ఆయన ఇంట్లోకి నడుస్తున్నా వెనక్కు తిరిగి రాముడు రథం వెళ్ళిన దిక్కునే చూస్తూ ఉండిపోయాడు. కళ్ళుమూసినా, కళ్ళు తెరిచినా మునివేషంలో ఉన్న రాముడే ఆయనకు కనిపించాడు. మాటిమాటికీ బ్రహ్మహత్యాపాపం చేసినవాడిలాగా ఒణికిపోయాడు. నిప్పును అరచేతిలో పెట్టుకున్నట్లుగా తాపం భరించలేకపోయాడు. చిన్నపిల్లవాడిలా వలవలా ఏడవటం మొదలుపెట్టాడు. రాహువు మింగుతున్న సూర్యునిలా, కాంతి హీనుడయ్యాడు. ఆయనకు ఉపచారం చేస్తున్న కౌసల్యాదేవి

కూడా మూర్ఛపోయింది. పరిచారికలు ఆవిణ్ణి లోపలకు తీసుకుపోయారు. ఇంతలో రాముడి రథం అయోధ్య పొలిమేర దాటిందని వర్తమానం వచ్చింది.

దశరథుడు: నా రాముణ్ణి తీసుకుని వెళ్ళిన గుర్రం అడుగుజాడలు ఇంకా కనిపిస్తూనే ఉన్నాయి. కానీ రాముడు కనబడటంలేదు.

నా రాముడు ఇక్కడ మెత్తటి పరుపులపై పడుకొంటే, ఉత్తమమైన స్త్రీలు వింజామరలతో వీచేవారు. ఇప్పుడు అరణ్యంలో ఏదో ఒక చెట్టు నీడన పడుకొని ఉంటాడు. అట్లా పడుకొని ఉన్న రాముడి ఒంటినిండా దుమ్ముకొట్టుకొని ఉంటుంది. ఏనుగు నదీతీరాన బురదలోనుండి లేచినట్లు, ఆజానుబాహుడైన రాముడు, లోకులకు నాథుడైనవాడు అనాథమల్లే ఆటవికజనంతో కలసి అనామకుడై తిరుగుతూ ఉంటాడు. జనకుని కుమార్తె, అతిసుకుమారి అయిన సీత ఇప్పుడు అడవిలో ముళ్ళమీద నడుస్తూ జీవించాలిగదా. పూర్వం ఎన్నడూ అడవులు చూడని సీత ఇప్పుడు క్రూరమృగాల ధ్వనులకు భయపడగలదు.

ఎక్కడా జనసంచారమే లేదు. అంతా రాముడి రథం వెనకే పరిగెత్తుకుంటూ వెళ్ళారు. ఎక్కడో ముసలీముతకా మాత్రమే వీథుల్లో కనిపిస్తున్నారు. మిగతావారంతా రాముడితో వెళ్ళారు. దుకాణాలన్నీ మూసి ఉన్నాయి. దేవాలయాలు కూడా తెరవలేదు. ఊరంతా పాడుపెట్టినట్లుంది. దశరథ మహారాజు మెల్లగా రాజవీథిగుండా నడచి వస్తున్నాడు. తనలో తనే మాట్లాడుకోసాగాడు. “ఓ కైకేయీ! నీ కోరిక తీరింది. నీ పంతం నెగ్గించుకున్నావు. నేను రాముడు లేకుండా జీవించలేను. నేడో రేపో నా మరణం తప్పదు. నువ్వు ఒక్కతెవే విధవవై ఈ రాజ్యం ఏలుకో!” అంటూ గొణుక్కున్నాడు. మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ కౌసల్యాదేవి మందిరాన్ని చేరుకున్నాడు. అక్కడ పక్కమీద పడుకున్నాడు. మనస్సంతా వికలమై ఉంది. సీతారామ లక్ష్మణులు లేని ఆ భవంతి చంద్రుడు, నక్షత్రాలు లేని ఆకాశంలా అనిపించింది. అంత పెద్దభవనం శూన్యంగా ఉంటే ఆయన ముఖంనిండా చేతులు కప్పుకొని “అయ్యో! రామా! నన్ను విడిచి వెళ్ళావు గదా!” అంటూ చిన్నపిల్లవాడిలా భోరున ఏడ్చాడు.

“రాముడు తిరిగి వచ్చేవరకూ బ్రతికి ఉండే అదృష్టం నాకు లేదుగదా! పుణ్యాత్ములైన వారు రాముడు తిరిగి వచ్చిన తరువాత కౌగలించుకొని ఆనందిస్తారు. వాళ్ళంతా పుణ్యాత్ములే” అంటూ పక్కమీద పడి నిద్రాదేవి ఒడిలోకి ఒరిగిపోయాడు.

అర్ధరాత్రయింది దశరథుడు నిద్రలేచాడు. కౌసల్యాదేవిని పిలిచాడు. “ఓ కౌసల్యా! నాకు ఇప్పుడు కళ్ళు కనిపించడంలేదు. నా చూపు రాముడితోనే పోయింది. నాకు ఒళ్ళంతా మంటలుగా ఉంది. దేహమంతా తాపంగా ఉంది. రాముణ్ణి పెంచిన నీ చేతులతో నన్ను తాకు. కొంతైనా తాపం తగ్గుతుందేమో!” అన్నాడు. కౌసల్యాదేవి ఆయన ప్రక్కనే కూర్చుని చేత్తో ఆయన ఒళ్ళంతా నిమురుతూ నిట్టూరుస్తూ, ఏడుస్తూ పడిపోయింది.

# 43వ సర్గ కౌసల్య విలాపం

ప్రక్కమీద పడుకొన్న దశరథ మహారాజు ప్రక్కన కూర్చుని కౌసల్యాదేవి పుత్రశోకంతో బాధపడుతూ ఇట్లా అంది.

కౌసల్యాదేవి: ఓ రాజా! కైకేయి తన కుటిలత్వంతో క్రూరసర్పంలాగా నా రాముణ్ణి కాటేసింది. ఇకపై కుబుసం విడిచిన పాములా వీరవిహారం చేస్తుంది. రాముణ్ణి అడవులకు పంపడంతో సర్పాన్ని పక్కలో పెట్టుకొని పడుకున్నట్లయింది. ఇకపై తన పగ అంతా నాపై చూపుతుంది.

రాముణ్ణి అడవులకు పంపకుండా కైకకు బానిసగా చేసినా, ఆవిడ చెప్పిన పనులన్నీ చేస్తూ నగరంలో భిక్షాటన చేసుకుంటూ బ్రతికేవాడు. కనీసం రోజూ కళ్ళతోనైనా చూసుకునేదాన్ని.

రాజా! నీవుకూడా కైకేయి చెప్పినట్లుగా చేసి రాముణ్ణి యౌవరాజ్య పదవినుండి కిందకు పడదోశావు. దేవతలకివ్వాల్సిన హవిస్సులను రాక్షసుల కిచ్చినట్లుగా, రాజ్యాన్ని భరతునికి ఇచ్చావు. సీతారామ లక్ష్మణులు ఈ సమయానికి అడవుల్లోకి ప్రవేశించి ఉంటారు. వాళ్ళెప్పుడూ కాలు కిందపెట్టినవాళ్ళు కారు. రాజభోగాలు అనుభవించిన వాళ్ళు ఈనాడు అరణ్యంలో ఏం అవస్థలు పడుతున్నారో గదా! ఏమైనా కైకేయి తాను అనుకున్నది సాధించింది. సరిగ్గా ఇప్పుడు వాళ్ళది సకలభోగాలు అనుభవించాల్సిన వయస్సు. ఈ సమయంలో అరణ్యాల్లో దుంపలు, పండ్లు తింటూ బ్రతికేట్లుగా చేశావు. ఆ పద్నాలుగు సంవత్సరాలు ఎంత త్వరగా పూర్తి అవుతాయా అని ఎదురుచూస్తున్నాను. అటువంటి మంగళ ప్రదమైన కాలంకోసం తపిస్తున్నాను. నేనొక్కత్తెనే కాదు, ఈ అయోధ్యావాసులంతా సంతోషించి పండుగ చేసుకుంటారు. ఆ సంతోషంలో మళ్ళీ పతాకాలను, ధ్వజాలను ఎగురవేస్తారు. నగరమంతా పూర్ణిమనాటి సముద్రంలా ఆనందంతో పొంగిపోతుంది. ఆవు వెంట ఉండే కోడెలా సీత వెనకాలే నా రాముడు ఎప్పుడు వస్తాడోగదా? ఆ ఆనందం పట్టలేని ప్రజలు వీథుల్లో పేలాలు ఎన్నడు జల్లుతారోగదా?

ధగధగమెరిసే కుండలాలతో, మొలలో ఖడ్గమూ, భుజాన ధనుస్సు వ్రేలాడదీసుకొని నా రాముడు ఎప్పుడు తిరిగి వస్తాడోగదా? నా బిడ్డలు ముగ్గురూ తిరిగివచ్చి బ్రాహ్మణకన్యలకు పూలు, పండ్లు ఎన్నడు పంచి పెడతారోగదా? అయోధ్యా నగరానికి ఎన్నడు ప్రదక్షిణం చేస్తారో గదా?

నాథా నేను పూర్వజన్మలో క్రూరమైన పనులు ఎన్నో చేసి ఉంటాను. పాలు తాగే పిల్లల్ని తల్లి దగ్గరనుండి వేరుచేసి ఉంటాను. ఆవు ఎంతో ప్రేమగా తన దూడ ఒళ్లంతా నాకుతూ ఉండగా సింహం వచ్చి ఎత్తుకుపోయినట్లు, కైక నా రాముణ్ణి అడవులకు పంపింది.

నాథా! నాకు ఒక్కడే ఒక్కడు పుట్టాడు. వాడు సకల సద్గుణాభిరాముడయ్యాడు. సర్వశాస్త్ర విశారదుడయ్యాడు. వాణ్ణి వదలి నేను జీవించలేను. వాణ్ణి నేను ఇప్పుడే చూడాలి. వాణ్ణి చూడకుండా ఉండలేను. ఓ రాజా! మండుటెండలకు భూమికి తాపం కలిగినట్లు, పుత్ర శోకాగ్ని చేత నా శరీరం అంతా తాపం ఎత్తిపోయింది. ఈ తాపాన్ని భరించి, జీవించే శక్తి నాకు లేదు.

## 44వ సర్గ సుమిత్ర కౌసల్యను ఓదార్చడం

ఆవిధంగా దుఃఖిస్తున్న కౌసల్యను చూసి లక్ష్మణుని తల్లీ, ధర్మమునందు స్థిరమైన బుద్ధిగలదీ అయిన సుమిత్రాదేవి ఇలా అంది.

సుమిత్రాదేవి: ఓ పూజ్యురాలా! ఎందుకు దుఃఖిస్తావు. నీ కొడుకు సకలసద్గుణసంపన్నుడు, పురుషోత్తముడు, మహాబలశాలి, శ్రేష్ఠుడు. ఇహలోక సుఖాలన్నీ కాలతన్నాడు. మరణానంతరంకూడా సత్ఫలితాన్నిచ్చే ధర్మమార్గాన్ని ఎన్నుకున్నాడు. ధర్మంపైనే స్థిరంగా నిలిచి ఉన్నాడు. అటువంటి రాముణ్ణి గూర్చి దుఃఖింపవచ్చునా?

అక్కా! నువ్వు రాముణ్ణి గూర్చే కాదు, లక్ష్మణుడి విషయంలో కూడా దుఃఖపడవద్దు. లక్ష్మణుడు సకల ప్రాణులపైనా దయ చూపుతాడు. ఏ దోషాలూ లేనివాడు. రాముని పట్ల అచంచలమైన భక్తిగలవాడు. అన్ని విధాలా సేవలుచేస్తూ రాముణ్ణి సుఖపెట్టగలడు. సీత సుకుమారి అయినా, రాజభోగాలకు అలవాటు పడినదే అయినా, అరణ్యంలో ఏ విధమైన కష్టమూ పడదు. ఎందుకంటే ఆమెను కంటికి రెప్పలాగా చూసుకొనే రాముడు ఆమె వెంటనే ఉన్నాడు. రాముణ్ణి, సీతను కంటికిరెప్పలా చూసుకొనే నా కుమారుడు లక్ష్మణుడున్నాడు. ఇంక నువ్వు ఎందుకోసం దుఃఖించాలి?

అక్కా! నీ కుమారుడు ధర్మమూ, సత్యవ్రతమే నిజమైన ధనమని అనుకున్నాడు. అది నిరూపించేందుకే అడవులకు వెళ్ళాడు. అందుమూలంగా రాముడి కీర్తి ముల్లోకాల్లోనూ వ్యాపిస్తుంది. ధర్మాన్ని సత్యాన్ని స్థిరంగా నిలబెట్టి తిరిగి మన ముందుకు వస్తాడు. తిరిగి రాజవుతాడు. ముల్లోకాలు రాముడు మహాత్ముడని, పరిశుద్ధుడని గుర్తిస్తాయి.

అక్కా! వాళ్ళు అడవుల్లో ఉన్నా సూర్యుడు తన వేడికిరణాలతో వాళ్ళను బాధపెట్టడు. వాయుదేవుడు అడవుల్లో ఉండే సుగంధాన్నంతా మోసుకొచ్చి, వాళ్ళను ఆహ్లాదపరుస్తాడు.

వాళ్ళకు ఎల్లవేళలా సమమైన ఉష్ణాన్ని, శీతలాన్ని అందజేస్తూ ఉంటాడు. చంద్రుడు రాత్రంతా వారిపై తన చల్లని కిరణాలను ప్రసరిస్తూ తండ్రిలాగా కౌగలించుకొంటాడు.

దేవీ! పూర్వం రాముడు రాక్షసరాజైన శంబరాసురుడి కొడుకును సంహరించగా, బ్రహ్మ సంతోషించి అనేక దివ్యాస్త్రాలను ప్రసాదించాడు. అటువంటి అస్త్రాలు కలిగిన వాడు, శూరుడు, పురుషశ్రేష్ఠుడైన రాముడు అరణ్యంలో నిర్భయంగా ఇంట్లో ఉన్నట్లుగా నివసించగలడు.

అక్కా! రాముని బాణానికి ఎదురులేదు. రామబాణానికి గురి అయిన శత్రువు ఒక్కడు కూడా మిగిలి ఉండడు. అంటే ఈ భూమండలమంతా రాముని వశంలో ఉంటుంది.

రాముని అధీనంలో లక్ష్మి ఉన్నది. శౌర్యమున్నది. బలమున్నది. ఈ లక్షణాలన్నీ ఉన్న రాముడు అరణ్యవాసం కాగానే ఈ భూమండలానికి రాజవుతాడు.

ఓ కౌసల్యా! లోకానికి సూర్యుడు వెలుగునిస్తే రాముడు సూర్యుడికే వెలుగునిస్తాడు. అగ్నికి దహనశక్తినిచ్చేవాడు కూడా రాముడే. సంపదలన్నింటికీ నాథుడు. రాజులందరికీ రారాజు. కీర్తికే కీర్తి తెచ్చిపెట్టగల సమర్థుడు. ఓర్పుకే ఓర్పును నేర్పగల దిట్ట. దేవతలందరికీ అధిదేవత అవుతాడు. భూతములన్నింటికీ ప్రభువు. అటువంటి రాముడు అరణ్యంలో ఉన్నా అయోధ్యలో ఉన్నా ఒక్కటే సుమా! రాముడు వనవాసం నుండి రాగానే భూమి, సీత, లక్ష్మి అనే ముగ్గురినీ కలుపుకుని రాజ్యాభిషేకం చేసుకుంటాడు.

అక్కా! వనవాసానికి వెళ్ళిన రాముడితో పాటు సీత మాత్రమే కాదు, రాజ్యలక్ష్మి కూడా వెళ్లిపోయింది. అటువంటి రాముడు సాధించలేనిది ఈ భూమిపైన ఏం ఉంది? ధనుర్విద్యలో శ్రేష్ఠుడైన లక్ష్మణుడు ధనుస్సు, ఖడ్గం పుచ్చుకొని రాముని ముందు నడుస్తూ ఉంటే రాముడు సాధించలేనిదంటూ ఉంటుందా?

కనుక ఓ కౌసల్యా! రాముడు వనవాసం ముగించుకొని వచ్చి నీ పాదాలకు

నమస్కరిస్తాడు. నీవు త్వరలోనే చూస్తావు. అన్నీ తెలిసినదానవు. పెద్దదానివి. మోహంచేత అజ్ఞానంలో పడవద్దు. నేను చెప్పేది అంతా సత్యం.

ఓ కౌసల్యా! రాముడికి ఎటువంటి అమంగళమూ వాటిల్లదు. సీతారామలక్ష్మణులు త్వరలోనే వస్తారు. నువ్వే అందరినీ ఓదార్చవలసినదానవు. నువ్వే ఇలా అధైర్యంగా మాట్లాడవచ్చునా? రామునివంటి పుత్రుని కన్న నువ్వు నిజంగా గర్వించాలి. లోకంలో రాముడితో సమానుడుగానీ, రామునికంటే అధికుడుగానీ ఉండడు; ఉండబోడు. రాముడు వచ్చి నీ పాదాలకు నమస్కరిస్తూ ఉండగా వర్షాకాలంలో మేఘాలు వర్షించినట్లుగా నీ కన్నులనుండి ఆనందబాష్పాలు వర్షిస్తాయి. నీకు నమస్కరిస్తున్న రాముని తలను మేఘాలు పర్వతాన్ని తడిపినట్లు నీ కన్నీటితో తడపగలవు.

సుమిత్ర మాటలు విన్న కౌసల్యాదేవి కొంత ఊరట చెందింది. శరత్కాల మేఘంలో జలంమల్లే ఆమె దుఃఖంకూడా అంతరించింది.

# 45వ సర్గ రాముణ్ణి అయోధ్యకు రమ్మని పట్టుబట్టడం

మహాయశశ్శాలి, సద్గుణసంపన్నుడు, పూర్ణచంద్రుని మల్లే అయోధ్యావాసులందరికీ అమిత ఇష్టుడుగా ఉండే రాముడు తన మిత్రులను, దశరథ మహారాజును వెనుకకు పంపగలిగాడేగాని, వేలకొలది, లక్షలకొద్దీ అయోధ్యావాసులను వెనుకకు పంపలేకపోయాడు. మహాత్ముడు, సత్యపరాక్రమములు కలవాడు అయిన రాముని వారు అనుసరించి వెళ్ళారు. వారు ఎంతగా ప్రార్థించినా రాముడు తన పట్టువిడువలేదు. తాను తన తండ్రిని సత్యవ్రతుణ్ణి చేయటానికే వనానికి వెళ్తున్నానని వారందరికీ నచ్చచెప్పాడు.

రాముడు: అయోధ్యా పౌరులారా! మీ కందరికీ నాపట్ల ప్రేమ, గౌరవం ఉన్నాయి. ఆ ప్రేమాభిమానాలన్నీ భరతునిపట్ల చూపించండి. మీరు ఆ విధంగా చేసినట్లయితే నేను ఎక్కువగా సంతోషిస్తాను.

భరతుడు కైకేయి పుత్రుడని అతణ్ణి ద్వేషించవద్దు. భరతుడు సకల కల్యాణగుణాలు కలవాడు. మీకు మేలు చేస్తాడు. వాడు వయస్సులో చిన్నవాడే అయినా జ్ఞానవంతుడు. ప్రజాహితంపట్ల మక్కువ ఉన్నవాడు, తప్పక మిమ్మల్ని సంతోషపరుస్తాడు. గొప్ప పరాక్రమశాలి. రాజ లక్షణాలన్నీ గలవాడు. అతడి పాలనలో మీరు ఎటువంటి భయాలు పెట్టుకోనక్కరలేదు. నేను, మీరు అంతా దశరథ మహారాజు ఆజ్ఞను శిరసావహించాలి. మీరు నాకు సంతోషాన్ని కలిగించదలచుకొంటే, నా వనవాసాన్ని గూర్చి విచారించకండి; కానీ మహారాజు నా కోసం దుఃఖించకుండా ఉండేట్లు నడచుకోండి, మీరంతా అయోధ్యకు తిరిగి పొండి. నేను చెప్పినట్లు చేస్తే సంతోషిస్తాను. ఇక ఇళ్లకు బయదేరివెళ్ళండి.

పితృవాక్పరిపాలన విషయంలోను, ధర్మాన్ని ఆచరించడంలోను రాముడు ఎంత స్థిరంగా ఉన్నాడో, ప్రజలుకూడా అంతే స్థిరంగా ఉండి, వారి పట్టుదల విడువలేదు. వాళ్ళల్లో వయోవృద్ధులున్నారు, బ్రాహ్మణోత్తములున్నారు. వాళ్ళంతా కన్నీరుమున్నీరై రథం వెనుక

పరుగెత్తారు. చూసేవాళ్ళకు వాళ్ళందరినీ తాటితో కట్టి ఎవరో లాక్కుని వెళుతున్నట్లుగా ఉంది. అంటే రాముడిలోని మంచిగుణాలు, ఆయనపట్ల వారికిగల ప్రేమయే ఒక త్రాడై వారందరినీ లాక్కెళుతోంది.

అట్లా రథం వెంట పరుగెత్తే వాళ్ళల్లో బ్రాహ్మణోత్తములు, జ్ఞానులు, వయోవృద్ధులు ఉన్నారు. రథంతో దీటుగా వాళ్ళంతా పరుగెత్తలేక వెనుకపడ్డారు. రథసారథియైన సుమంత్రుణ్ణి రథాన్ని మెల్లగా పోనివ్వమని ప్రార్థిస్తే అతడు వారి మన్ననను మన్నించడు. అందుకని ఆ రథాన్నిలాగే గుర్రాలను వేడుకున్నారు.

బ్రాహ్మణులు, ప్రజలు ఇలా పలికారు: ఉత్తమ జాతిలో పుట్టిన ఓ అశ్వాల్లారా! మీరు రాముణ్ణి ముందుకు తీసుకొనిపోకండి. తిరిగి అయోధ్యకు తీసుకుని వెళ్ళండి. మీరట్లాచేస్తే రాముడికి మేలు చేసినట్లవుతుంది. జంతువులకు సహజంగానే చెవులు బాగా పనిచేస్తాయి. గుర్రాలకు ఇంకా బాగా పనిచేస్తాయి. అందువల్ల మీరు మా ప్రార్థన తప్పక మన్నించాలి. వెంటనే రాముణ్ణి అయోధ్యకు తీసుకొని రండి.

రాముడు పరిశుద్ధమైనవాడు, వీరుడు, శుభకార్యాలు చేయటంలో సమర్థుడు. అటువంటి ప్రభువు రాజ్యంలో ఉండాలేగాని అడవుల్లో కాదు. అందుకని రాముణ్ణి అడవుల్లోకి తీసుకొని వెళ్ళవద్దు.

రాముడు ఇదంతా చూస్తూనే ఉన్నాడు. ప్రజలు, బ్రాహ్మణులు వృద్ధులు ఎన్ని విధాలుగా చెప్పినా వినిపించుకోవటం లేదు. అందువల్ల స్వయంగా తానే రథం దిగి, సీతా లక్ష్మణులతో కలసి అడవుల వైపుగా కాలినడకనే ప్రయాణం సాగించాడు. అంతమంది ప్రజలు, వృద్ధులు, రథం వెనుకగా పరుగెత్తుకు వస్తూ ఉంటే, తాను మాత్రం రథం మీద వెళ్ళడానికి మనస్కరించక కాలినడకనే బయలుదేరాడు. రాముడు కాలినడకన అడవుల వైపు పోతూ ఉంటే బ్రాహ్మణులు గాయపడ్డ మనస్సుతో ఇలా పలికారు.

బ్రాహ్మణులు: ఓ రామా! బ్రాహ్మణ సమూహమంతా నీ వెనకే ఉంది. మా అగ్నిహోత్రాలు కూడా మా వీపుపై ఎక్కి నీ వెనకే వస్తున్నాయి. వాజపేయ యాగం చేసినప్పుడు మాకు తెల్లని గొడుగులు వచ్చాయి. వాటినికూడా మాతోనే తెస్తున్నాం. అడవుల్లో ఎండ నీపై పడకుండా ఉండేందుకు మేము తెస్తున్న తెల్లని గొడుగులు పట్టి నీకు నీడ కలిగిస్తాం.

రామా! మా బుద్ధి ఎప్పుడూ వేదమంత్రాలపైనే ఉంటుంది. వేదమే మాకు ధనం. ఆ వేదం ఎప్పుడూ మా హృదయాల్లోనే ఉంటుంది. మేము మా వేదమూ వనవాసం చేయడానికే నిశ్చయించుకొన్నాం. మా స్త్రీలు మాత్రం ఇళ్ళల్లో ఉంటారు. వాళ్ళ పాతివ్రత్యమే వారిని కాపాడుతుంది.

ఓ రామా! మేమంతా నువ్వు తిరిగి అయోధ్యకు రావాలనే ప్రార్థిస్తున్నాం. మా మాట కాదనకు. నువ్వే ధర్మాన్ని ఆచరించకపోతే, ఇక ధర్మాన్ని ఆచరించే వాళ్ళెవరుంటారు? మా తలలన్నీ తెల్లగా హంసల్లా పండిపోయినాయి. నేల మీద దుమ్ములో నీకు సాగిలపడి ప్రార్థించటంచేత మా తెల్లని జుట్టంతా దుమ్ముకొట్టుకుంది. అడవులకు పోవద్దు. అయోధ్యకు తిరిగిరా అనే మా ప్రార్థన ధర్మబద్ధమైనది. బ్రాహ్మణుల ప్రార్థన మన్నించడం ధర్మం. నాయనా! రామా! మేమంతా అయోధ్యలో ఉంటూ యజ్ఞాలు చెయ్యాలి. అందుకు కావలసిన సంబారాలన్ని సమకూర్చుకున్నాం. నువ్వు వస్తేనే ఆ యజ్ఞాలు జరుగుతాయి. నువ్వు రాకపోతే అవన్నీ ఆగిపోతాయి. అట్లా ఆగిపోతే ఆ దోషం నీకే చుట్టుకుంటుంది.

ఓ రామా! అయోధ్యలో ఉండే చరాచరాలన్నీ నీ కోసం దుఃఖిస్తున్నాయి. నిన్ను అయోధ్యకు తిరిగి రమ్మని ప్రార్థిస్తున్నాయి. నిన్ను విడిచి ఉండలేక మేమంతా నీ వెనుక పరిగెత్తుకు వస్తున్నాం. చెట్టు చేమలుకూడా మాతో రావాలనే చూశాయి. కాని వాటి వేళ్ళు వాటిని పోనివ్వటం లేదు. అవన్నీ భోరున ఏడుస్తూ నీ వైపే చూస్తున్నాయి.

రామా! పక్షులు కూడా ఆహారం ముట్టడంలేదు. చెట్ల మీద కూర్చుని నీవైపే దీనంగా

చూస్తున్నాయి.

ఆ బ్రాహ్మణులు, పౌరులు అంతా ఈ విధంగా విలపిస్తూ వెనకాలే వచ్చారు. ఇంతలో రాముణ్ణి అడ్డగించేందుకా అన్నట్లుగా 'తమసా' నది అడ్డంగా నిలచింది.

అప్పుడు సుమంత్రుడు రథానికి కట్టిన గుర్రాలను విప్పి స్వచ్ఛమైన తమసానదీ జలాల్లో స్నానం చేయించి పచ్చిక మేయడానికి వదిలాడు.

# 46వ సర్గ తమసానదీ తీరంలో

సీతారామలక్ష్మణులు తమసానదీ తీరాన్ని చేరుకోగానే రాముడు లక్ష్మణునితో ఇట్లా అన్నాడు.

రాముడు: లక్ష్మణా! మన వనవాసంలో ఇది మొదటి రాత్రి. ఇకపై నువ్వు మన ఇంటిని గూర్చి, అయోధ్యా జీవితాన్నిగూర్చి ఆలోచించరాదు. సుకుమారియైన సీత ఎట్లా నడుస్తుందా అన్న ఆలోచనకూడా పెట్టుకోకూడదు. చూడు సాయంకాలం అయిపోయింది. ఈ అడవిలో పక్షులు, జంతువులు తమ నివాసాలకు పోయి నిద్రిస్తూ ఉంటాయి. వాటి అరుపులు లేకపోవటంతో అడవి అంతా ఏడుస్తూ ఉంటుంది. చీకటి పడగానే అడవి అంతా బావురుమంటూ ఉంటుంది. అట్లాగే మన తండ్రిగారి అయోధ్యానగరంలో కూడా స్త్రీ పురుషులందరూ మనం వారిని విడిచి వచ్చినందుకు దుః ఖీస్తూ ఉంటారు. అనేక కారణాల వల్ల ప్రజలంతా రాజుపైనా, నాపైనా, నీపైనా, భరత శత్రుఘ్నులపైనా ప్రేమను పెంచుకున్నారు. అందువల్ల వారంతా మనల్ని తలచుకొంటూ దుఃఖీస్తారు.

నా కోసం ఏడ్చి ఏడ్చి కీర్తిమంతులైన నా తల్లితండ్రుల కళ్ళు కాయలుకాచి ఉంటాయి. గుడ్డివారై పోతారేమోననిపిస్తోంది. అట్లా జరగదులే. ఎందువల్లనంటే, భరతుడు వస్తాడు. వాడు ధర్మాత్ముడు, వారిద్దరికీ ధర్మార్థకామాలను బోధిస్తూ చక్కగా ఓదారుస్తాడు.

లక్ష్మణా! భరతుని మంచితనాన్ని తలచుకున్నప్పుడు, నాకు తల్లిదండ్రుల మీద బెంగ కలగటం లేదు. నువ్వు కూడా నా వెంట రావడమే మంచిదయింది. లేకపోతే సీత ఆలనాపాలనా చూసుకోవటానికి నేనొక్కణ్ణే కష్టపడేవాడిని.

లక్ష్మణా! ఈ తమసానదీ తీరం మనోహరంగా ఉంది. తినేందుకు అనేకమైన పదార్థాలు దొరుకుతున్నాయి కూడా, ఈ రాత్రికి ఉపవాసం ఉందాం. ఎందుకంటే ఇదే మన మొదటి మజిలీ

కదా! నిరాహారులంగానే ఉందాం.

ఓయీ సుమంత్రా! నువ్వు గుర్రాలకు మేతవేసి, నీళ్ళు పట్టు; బాగా స్నానం చేయించి వాటన్నింటినీ జాగ్రత్తగా చూసుకో!

రాముని ఆజ్ఞ తీసుకొని సుమంత్రుడు గుర్రాలకు చక్కటి గడ్డి వేసి, సీతారామలక్ష్మణులకు ఎండిన ఆకులతో చక్కగా పక్క ఏర్పాటుచేశాడు. సీతారాములు నిద్రించగానే లక్ష్మణుడు, సుమంత్రునికి రాముని మంచి గుణాలను వర్ణించి చెబుతూ రాత్రి అంతా గడిపేశాడు. తమసానదీ తీరాన మేస్తున్న ఆవులు నీళ్ళు తాగేందుకు నదిలోకి వెళుతున్నాయి. దాన్నిబట్టి తెల్లవారుతోందని గ్రహించారు. ఇంతలో రాముడు కూడా నిద్ర చేచివచ్చాడు.

రాముని వెంట వచ్చిన అయోధ్యా పౌరులంతా చెట్లకింద పడుకుని నిద్రపోతున్నారు. రాముడు వాళ్ళందరినీ చూసి విచారిస్తూ ఇలా అన్నాడు.

రాముడు: లక్ష్మణా! వీళ్ళంతా మన మీద ప్రేమకొద్దీ మన వెంటపడివచ్చారు. అలసి ఉండటంవల్ల గాఢమైన నిద్రలో ఉన్నారు. మన కోసం ప్రాణాలైనా అర్పిస్తారు కాని, మనను విడిచిపోరు. కాబట్టి వాళ్ళు నిద్ర మేల్కొనే లోపలే మనం ఇక్కడనుండి వెళ్ళిపోవటం మంచిది. మనం ఆ విధంగా చేస్తే, కొద్దిసేపు మనకోసం విచారించి ఇళ్ళకు తిరిగి పోతారు. వాళ్ళ దుఃఖాన్ని తొలగించేందుకు ఇదొక్కటే మార్గమనిపిస్తోంది. వాళ్ళ దుఃఖం తొలగించడం మన బాధ్యత గదా!

లక్ష్మణుడు కూడా రాముడు చెప్పిందే బాగుందన్నాడు. వాళ్ళిద్దరూ సుమంత్రుణ్ణి పిలిచి, పౌరులు లేచే లోపుగానే ప్రయాణానికి రథాన్ని సిద్ధం చెయ్యమన్నాడు. అంతట సుమంత్రుడు రథం సిద్ధంచేశాడు. వాళ్ళంతా తమసానదిని దాటి మహారణ్యంలోకి ప్రవేశించారు. అప్పుడు సుమంత్రునితో రాముడు ఇలా అన్నాడు.

రాముడు: ఓ సుమంత్రా! మళ్ళీ మీరు రథాన్ని అయోధ్యానగరం వైపుగా కొంతదూరం నడిపించుకుని వెళ్లు. తరువాత మరొక రేవులో తమసానదిని దాటి మా కోసం వేచి ఉండు. మేము కాలినడకన వచ్చి అక్కడ రథాన్ని చేరుకుంటాం. అందువల్ల ఈ నిద్రపోతున్న పౌరులు మేము ఏ మార్గాన అడవిలో ప్రవేశించిందీ తెలుసుకోలేక కొంచెంసేపు దుఃఖించి తిరిగి అయోధ్యకు చేరుకుంటారు. ప్రజల క్షేమం కోరి మీరు మాకు ఈ ఉపకారం చెయ్యాలి.

అప్పుడు సుమంత్రుడు రాముడు చెప్పినట్లుగానే ఉత్తర దిక్కుగా రథాన్ని కొంత దూరం నడిపి తిరిగి మరోదారిన పోయి సీతారామ లక్ష్మణులను కలుసుకొన్నాడు. ఆ తరువాత వారంతా కలసి రథాన్ని ఉత్తరం వైపుగా పోనిచ్చి అక్కడనుండి తపోవనాలకు పోయేదారిని చేరుకున్నారు.

# 47వ సర్గ పౌరులు అయోధ్యకు తిరిగి పోవడం

తెల్లవారింది. పౌరులంతా నిద్రలేచారు. రాముడు అక్కడ లేకపోవటంతో వాళ్ళంతా 'పడ్డ కష్టం అంతా వృథా అయిందే' అని దుఃఖించారు.

ఒక పౌరుడు: ఛీ! ఈ పాడునిద్ర మనల్ని మోసంచేసింది. ఒళ్ళు తెలియకుండా నిద్రపోవటం వలన ఆజానుబాహుడైన మన రాముణ్ణి పోగొట్టుకున్నాం. మనం అంతా రాముడి భక్తులం. మనం చేసిన సేవ ఎన్నటికీ వ్యర్థమైపోదు. వెతుకుదాం మహా అయితే ఎంతదూరం పోయి ఉంటాడంటారు? మనల్ని కన్నబిడ్డల్లా చూసుకునే వారే! మనల్ని వదిలి పోవటానికి ఆయనకు మనస్సు ఎట్లా వచ్చింది? మనం అయోధ్యకు పోయిమాత్రం చేసేది ఏముంది? చచ్చేవరకూ ఇక్కడే ఉందాం. లేదా చచ్చేవరకూ ఉత్తర దిక్కుగా ప్రయాణం చేద్దాం. అట్లాకాకపోతే, ఇక్కడ ఎండుకట్టెలు కావలసినన్ని ఉన్నాయి. వాటితో అగ్నిగుండం రగిల్చి దాంట్లోకి దూకేద్దాం.

ఒకవేళ అయోధ్యకు తిరిగిపోతే అక్కడి వాళ్ళకు మన ముఖం ఎట్లా చూపిస్తాం? మన భార్యాపిల్లలకు రాముణ్ణి గూర్చి ఏమని చెప్పగలం? మన పెద్దవాళ్ళు మనల్ని గురించి ఏమనుకొంటారు? అయోధ్యా నగరమంతా దుఃఖసముద్రంలో మునిగిపోయింది కదా! మనం రాముడు లేకుండా వెళితే ఎంత దుఃఖీస్తారో గదా! ఆ మహానుభావుడి వెనక పరుగెత్తుకు వచ్చాం. వచ్చి మనం ఏం సాధించినట్లు?

కొంతమంది రథచక్రాల గుర్తులను బట్టి కొంతదూరం వెళ్ళారు. ఆ తరువాత చక్రాల గుర్తులు కనిపించలేదు. రథం ఎటుపోయిందీ తెలుసుకోలేకపోయారు. ఏం చేయడమా అని ఏడ్చారు. దైవం తమను మోసం చేసిందని బాధపడ్డారు. వేరేమార్గం తోచలేదు. కొంతసేపు వాళ్ళల్లో వాళ్ళే తర్కించుకొన్నారు. చివరకు చేసేదేమీలేక ఇంటిదారి పట్టారు.

రాముడులేని అయోధ్య చంద్రుడులేని ఆకాశంలా ఉంటుంది గదా! ఎండిపోయిన సరస్సులా ఉంటుందే! బరువెక్కిన హృదయాలతో ఇంటి ముఖం పట్టారు. కళ్ళ నిండుగా నీళ్ళు ఉండటంవల్ల దారిలో తారసపడేవాళ్ళను కూడా గుర్తించలేకపోయారు.

## 48వ సర్గ అయోధ్యానగర స్త్రీలు విలపించడం

అయోధ్యా పౌరులందరూ ఆ తమసానదీ తీరానే చాలాసేపు ఏడ్చిఏడ్చి దుఃఖంతో చివరకు ఇళ్ళకు చేరారు. వాళ్ళ ముఖాన ఎక్కడా కళాకాంతులు లేవు. జీవచ్ఛవాల్లా ఉన్నారు. ఇంటికి వచ్చి భార్యాపిల్లలను చూడటంతో వాళ్ళ దుఃఖం రెట్టింపయింది. వాళ్ళను కౌగలించుకొని బావురుమని ఏడ్చారు.

మహారాజు నిర్ణయాన్ని ప్రజలంతా నిరసించారు. వర్తకులు దుకాణాలు తెరువలేదు, జనం దేవాలయాలకు వెళ్ళలేదు. దేవాలయాలన్నీ జనశూన్యంగా ఉన్నాయి. గృహస్థులెవరూ ఇళ్ళల్లో వంటలు చేసుకోలేదు.

మనసులోనుండి సంతోషమనేది పూర్తిగా ఇంకిపోయింది. ఎవరైనా పారేసుకున్న వస్తువు దొరికినా సంతోషపడటం లేదు. ధనం సంపాదించినా ఆనందం కలగటంలేదు. తొలికాన్పు అయినాగానీ, బిడ్డను చూసుకుని తల్లి సంతోషపడటంలేదు. ప్రజల్లో ఉత్సాహం చచ్చిపోయింది. చావలేక బతుకుతున్నట్లున్నారు.

ఇల్లాళ్లు ప్రతిఒక్కరూ తమ భర్తలను, పిల్లలను, మామలను ఏనుగును అంకుశంతో పొడిచినట్లు మాటలతో పొడిచి వేధిస్తున్నారు. రాముడు లేని అయోధ్యలో భార్యవల్లగాని, ధనంమూలంగా గాని, బిడ్డల వలనగాని సుఖం పొందలేకపోతున్నారు. సీతారాములకు సేవలు చేస్తున్న లక్ష్మణుడొక్కడే వాళ్ళ దృష్టిలో సత్పురుషుడుగా కనిపిస్తున్నాడు. రాముడు ఏ సరస్సులో, నదిలో స్నానం చేస్తాడో ఆ జలాలు మాత్రమే పవిత్రమైనవని వాళ్ల భావన. రాముడు తిరిగే అరణ్యాలు, పర్వతాలు, జలాశయాలు మొదలైనవి మాత్రమే ఆనందించదగిన ప్రదేశాలై రాణిస్తాయి. అరణ్యాల్లోని చరాచర ప్రాణులన్నీ కూడా రాముణ్ణి తమకు ప్రియమైన అతిథిగా సన్మానిస్తాయి. నానావిధాలయిన పూలమొక్కలు పూలగుత్తులతోను, తుమ్మెదల గుంపులతో ప్రకాశించే చెట్లన్నీ రాముడికి ఆనందాన్ని చేకూరుస్తాయి. తన దగ్గరకు వచ్చిన రామునికి

పర్వతాలు అకాలంలో కూడా పుష్పాలను, ఫలాలను సమర్పించుకుంటాయి. పర్వతాలు వివిధ రకాలైన నిర్మలజలాశయాల్ని రాముడి ఆనందం కోసం సృష్టిస్తాయి.

రాముడున్న చోట భయముండదు; అవమానం ఉండదు, పరాభవం ఉండదు. శూరుడు, ఆజానుబాహువు, దశరథుని కుమారుడు అయిన రామునితోనే కలసి జీవిద్దాం. ఆ మహాత్ముడే మాకు గతి; నాథుడు; మాకు గమ్యం. ఆ ప్రభువు పాదాలనే మేము ఆశ్రయిస్తాం. మేము సీతాదేవిని సేవిస్తాం. మీరంతా రాముణ్ణి సేవించండి. సీతమ్మ మా యోగక్షేమాలు చూస్తుంది. రామయ్య తండ్రి మిమ్మల్ని కనిపెట్టి ఉంటాడు. ఇక్కడ అయోధ్యలో మనకు ఏం మిగిలింది? అంతా శూన్యం. దుఃఖాలేతప్ప సుఖం లేదు. కాబట్టి మనం కూడా అడవులకే పోదాం.

అయోధ్య నాథుడులేని రాజ్యం అయింది. రాజ్యం కైకేయి చేతుల్లోకి పోయింది. ఇక అధర్మమే రాజ్యం చేస్తుంది. ఇటువంటి రాజ్యంలో ధనం ఉన్నా సుఖపడలేము. కైకేయి కాబట్టి ధనంకోసం భర్తని, కొడుకుల్నీ వదిలేసింది. వంశాన్నే నాశనంచేసింది. ఆమె ఇంక ఎవరినీ లెక్క చేయదు. రాముణ్ణే అడవులకు పంపింది. మనం ఆమె రాజ్యంలో సుఖంగా జీవించలేం. కొద్దికాలంలోనే సరైన నాయకుడులేక దేశం ఆరాచకమవుతుంది. అప్పుడు మనమూ నాశనమైపోతాము.

రాముడు అరణ్యానికి వెళ్ళాడు. దశరథుడు ఇకపై జీవించడు. ఆయన కూడా పోయిన తరువాత మిగిలేది ఏడుపులు, పెడబొబ్బలే. మనందరి పుణ్యాలు క్షీణించాయి, కష్టాల్లో పడిపోయాం. మనమంతా విషం పుచ్చుకొని చావనన్నా చావాలి, లేదా మరో రాజ్యానికి వలస అయినా పోవాలి. అంతకన్నా అరణ్యానికే పోయి రాముడితోనే ఉందాం.

దశరథుడు కైకేయితో కూడా చేరి సీతారామలక్ష్మణుల్ని అరణ్యాలకు పంపాడు. పశువులను కసాయివాడికి అప్పచెప్పినట్లు మనల్ని భరతునికి అప్పచెప్పాడు.

రాముడు మహారథుడు. పూర్ణచంద్రునివంటి ముఖం కలవాడు. నీలవర్ణుడు.

పద్మాలవంటి నేత్రాలు కలవాడు. శత్రువులను నశింపచేసేవాడు. తియ్యని స్వభావం కలవాడు. ఇతరులకన్నా ముందు తానే పలకరించేవాడు, సత్యాన్నే పలికేవాడు, మహాబలశాలి, సౌమ్యమైన స్వభావం కలవాడు, సకల జగత్తులకు తన దర్శనంచే చంద్రునిమల్లే ఆనందాన్ని కలిగించేవాడు, పురుషులలో శ్రేష్ఠుడు. మదించిన ఏనుగువలె మందగమనం గలవాడయిన రాముడు తాను అరణ్యాలలో నివసించడం చేత అరణ్యాలకే అందాన్నిస్తూ ప్రకాశింపజేసేవాడు.

అయోధ్యానగరంలోని స్త్రీలంతా ఈ విధంగా విలపిస్తూ ఉండగానే సూర్యుడు అస్తమించి రాత్రి అయింది. ఎవరూ పొయ్యి వెలిగించలేదు. అగ్నిహోత్రాలు చేయలేదు. అటువంటి అయోధ్యానగరం చీకటితో నలుపురంగు పూసినట్లుంది. అంగళ్ళన్నీ మూసి ఉండటం చేత వీథుల్లో దీపాల వెలుగుకూడా లేదు, జనసంచారమేలేదు. నగరమంతా నక్షత్రాలు లేని ఆకాశంలా ఉంది. తమ సంతానానికో, బంధువులకో దేశబహిష్కారం జరిగినట్లుగా జనులు బాధపడుతూ ఏడవసాగారు. రాముణ్ణి వాళ్ళంతా తమ సొంతకుమారుడిగా భావించారు. ఇదంతా ఇట్లా ఉంటే ఇంకా నృత్యశాలల గూర్చిగాని, సంగీత సభల గూర్చిగాని, వినోదప్రదర్శనాల గూర్చిగాని ప్రత్యేకంగా చెప్పాలా? అయోధ్య అంతా నీరు ఇంకిపోయిన సముద్రంలా ఉంది.

# 49వ సర్గ వేదశ్రుతి, గోమతి నదులను రాముడు దాటడం

రాముడు సీతాలక్ష్మణులను వెంటబెట్టుకొని, అయోధ్యా పౌరులంతా నిద్రిస్తున్న సమయంలో, తండ్రి ఆజ్ఞను పరిపాలించటానికి అడవులకు ప్రయాణమైపోయాడు. తెల్లవారుతుందనగా వారంతా ఉదయ సంధ్యను ఉపాసించారు.

అంతట వారు, పెద్దపెద్ద పల్లెలు, చిన్నచిన్న గ్రామాలను దాటుకుంటూ ముందుకుపోయారు. దారిపొడవునా దున్నిన పొలాలు చూశారు. చెట్లనిండా విరగబూసిన పూలు, పండ్లు ఉన్న వృక్షాలను చూశారు. రథం వేగంగాపోతున్నది. దారిలో వాళ్లకు గ్రామీణుల మాటలు అక్కడక్కడ వినిపించాయి.

గ్రామీణులు దశరథ మహారాజు కాముకుడయ్యాడు. ఒక స్త్రీని సంతోషపరచేందుకు కన్న కొడుకులను, కోడలిని కూడా అడవికి పంపాడు. ఆహా! కైకేయి ఎంతటి పాపాత్మురాలు. రాముడు పరమ ధార్మికుడు. దయామయుడు, జితేంద్రియుడు. అటువంటి మహాత్ముణ్ణి అడవులకు వెళ్లగొట్టింది. కట్టుబాట్లన్నింటినీ కాలదన్ని, ఎంతటి క్రూరమైన పనికి సాహసించింది!

సుకుమారి, రాజభోగాలకే అలవాటు పడిన సీత ఈ అడవుల్లో ఎట్లా ఉంటుందో గదా? దశరథ మహారాజుకు బుద్ధి లోపించింది. లేకపోతే ప్రజలచే ప్రేమించబడ్డవాడు, దోషరహితుడు అయిన తన జ్యేష్ఠ కుమారుణ్ణి అడవులకు పంపగలడా?

ఈ విధంగా కోసల రాజ్యంలోని గ్రామాల్లో ఉండే స్త్రీలు మాట్లాడుకోవడం వారంతా విన్నారు. అప్పుడు వారు పవిత్రమైన వేదశ్రుతి అనే నదిని దాటి, అగస్త్యుడు నివసించే స్థలానికి దక్షిణ వైపుగా ప్రయాణించారు. అట్లా కొంతదూరం ప్రయాణించిన తరువాత పవిత్రజలాలతో ప్రవహించే గోమతీనదిని కూడా దాటారు. అంతట రాముడు పూర్వం మనుచక్రవర్తి ఇక్ష్వాకునికి ఇచ్చిన భూమండలాన్నంతా సీతకు చూపించాడు.

రాముడు (సుమంత్రునితో) : ఓ సుమంత్రా! నేను తిరిగి వచ్చిన తరువాత తల్లితండ్రుల దర్శనం చేసుకొని, ఈ సరయూనదీ ప్రాంతాలలో ఉండే వనాల్లో వేటాడాలని ఉన్నది. వేట లోకంలోని రాజర్షులందరూ ఇష్టపడే క్రీడ. మంత్రిసత్తమా! జంతువధ దూష్యమే అయినా, రాజర్షులంతా పితృదేవతలకు శ్రాద్ధం పెట్టేటప్పుడు శ్రేష్ఠమైన మాంసంకోసం వేటాడుతూ ఉంటారు. అంతేకాకుండా విలువిద్యాభ్యాసానికి, లక్ష్యసాధనకు కూడా వేట నిజంగా ఒక సాటిలేని క్రీడయే కదా! పోనుపోను మృగాలను వేటాడటం ఒక వినోదంగా మారింది. అటువంటి వినోదాలు, క్రీడలు నాకు ఇష్టం లేదు.

ఈ విధంగా మాట్లాడుతూ ఉండగానే రథం కోసలరాజ్యం పొలిమేరలు సమీపించింది.

# 50వ సర్గ నిషాదరాజు గుహుడు సీతారామలక్ష్మణులను సత్కరించడం

కోసల దేశం తనకు జన్మనిచ్చిన భూమి. సువిశాలమైనది, బహు సుందరమైన దేశం. ఆ దేశాన్ని వదలిపెట్టి బుద్ధిమంతుడైన రాముడు భార్యతోను, లక్ష్మణునితోను కలసి వెళ్ళిపోతున్నాడు. దేశ రాజధాని అయిన అయోధ్య వైపుగా తిరిగి నమస్కరిస్తూ ఇలా అన్నాడు: "ఓ అయోధ్యానగరమా! కకుత్థ్స వంశంలో పుట్టిన వారంతా నిన్ను పరిపాలిస్తూ వచ్చారు. ఇంతవరకూ మేము కూడా నీ ఒడిలోనే పెరిగాం. నిన్ను పాలిస్తున్న దేవతలందరి అనుమతినీ పొంది వనాలకు పోతున్నాం. వనవాసం పూర్తిచేసుకొని, దశరథుని ఋణాన్ని తీర్చి మరల నీ దర్శనం చేస్తాం." అట్లా నగరాన్ని, నగరదేవతల్ని తలచుకొని వీడ్కోలు పలుకుతూ ఉంటే రాముడి కళ్ళల్లో నీళ్ళు నిండాయి; రక్తమంతా కళ్ళల్లోకి ప్రవహించి అవి ఎర్రబడ్డాయి.

తనను చూడటానికి వచ్చిన గ్రామీణులందరికీ కుడిచేతిని గాలిలో ఊపుతూ తన కృతజ్ఞతలను తెలిపాడు. "మీరంతా నాపై చూపిన ప్రేమాభిమానాలకు సంతోషించాను. మీరెవరూ నా కోసం దుఃఖించకండి. మీమీ పనులు చేసుకుంటూ ఉండండి" అన్నాడు. అంతట ఆ ప్రజలంతా రాముడికి ప్రదక్షిణపూర్వకంగా నమస్కారాలు చేసి ఏడుస్తూ తిరిగి రాముడి వంక చూస్తూ మధ్య మధ్య నిలబడుతూ, ఇళ్ళకు వెళ్లారు.

తరువాత రాముడు కోసల దేశాన్ని దాటాడు. ఆ దేశం ధనధాన్యాలతో సమృద్ధిగా ఉంది. జనులలో భయమన్నదే కనిపించటం లేదు. ప్రజలు నిర్భయులై ఉన్నారు. ప్రజల్లో దానగుణం కొట్టొచ్చినట్లు కనబడుతోంది. భవనాలన్నీ సుందరంగాను, మంగళప్రదంగాను ఉన్నాయి. అక్కడక్కడా యజ్ఞశాలలు, దేవాలయాలు; అడుగడుగునా మామిడితోటలు, ఉద్యానవనాలే. పుష్కలంగా ప్రతి గ్రామంలోను నీటితో నిండిన జలాశయాలున్నాయి. ఎక్కడ చూసినా ఆవులమందలే. అన్ని వైపులనుండీ వేదఘోషలు వినిపిస్తూ ఉన్నాయి. ప్రజలంతా

సుఖసంతోషాలతో జీవిస్తూ ఉన్నారు. రాజులందరూ వచ్చి స్వయంగా చూడవలసిన సుందరప్రదేశం ఆ రాజ్యం. అటువంటి భాగ్యవంతమైన రాజ్యాన్నంతటినీ దాటుకుంటూ వచ్చాడు. కోసలదేశ సౌభాగ్యాన్ని కొనియాడాడు.

కోసలదేశం దాటి రాముడు గంగాతీరాన్ని చేరాడు. సుందరమూ, మంగళకరమూ అయిన ఆ దేవనది మూడు పాయలుగా చీలి ప్రవహిస్తూ ఉంది. ఆ నదీతీరాలన్నీ ఋషులచే సేవించబడుతూ ఉంటాయి. అందమైన ఆశ్రమాలు నిర్మించుకొని ఋషులు తపస్సు చేసుకుంటూ ఉంటారు. అప్సర స్త్రీలు ఆయా కాలాల్లో వచ్చి గంగాజలాలలో జలకాలాడుతూ ఉంటారు. దేవతలు, దానవులు, గంధర్వులు, కిన్నెరలు ఈ గంగాజలాల్లో విహరిస్తూ ఉంటారు. గంధర్వస్త్రీలు తరచూ ఈ ప్రాంతాల్లో జలకాలాడుతూ ఉంటారు. ఈ నదీతీరాన దేవతలు విహరించే క్రీడా పర్వతాలు, ఉద్యానవనాలు అనేకం ఉన్నాయి. గంగానది దేవనదిగా కూడా ప్రసిద్ధి చెందింది. గంగ కొన్ని చోట్ల ఉద్ధృతంగా ప్రవహిస్తుంది. కొన్నిచోట్ల సుడిగుండాలు సృష్టిస్తుంది. ఇంకొన్ని చోట్ల మందహాసమా అన్నట్లు నురుగులు కక్కుతూ ఉంటుంది.

అట్లా ప్రవహించే గంగానదిలోని నల్లకలువలన్నీ గంగమ్మతల్లి కళ్ళలా ఉన్నాయి. కమలాలు చేతులమల్లే ఉన్నాయి. తీరాన ఉన్న వృక్షాలన్నీ మెడలో హారాల్లా, విశాలమైన ఇసుకతిన్నెలు దాని జఘనాల్లా విరాజిల్లుతున్నాయి. విరగబూసిన తెల్లకలువల గుంపులు, వాటి మొగ్గలు, ఇంకా అనేక రకాలైన పుష్పాలు సుగంధాలతో మత్తెక్కిస్తూ ఉంటాయి. నిర్మలమైన ఆ గంగాజలాలు, తళతళా మెరుస్తూ మణిభూషణాల్లా ఉన్నాయి. ఇక పూలు, పండ్లు, పక్షులు, మొసళ్ళు రకరకాలైన ఆభరణాల్లా భ్రమ కలిగిస్తూ ఉంటాయి.

రాజహంసలు, చక్రవాకాలు మనోహరంగా పాడుతూ ఉంటాయి. అడవి ఏనుగులు, దేవతల ఏనుగులు, దిగ్గజాలు ఘీంకారాలు చేస్తూ ఉంటాయి. గంగాదేవి సముద్రుణ్ణి కలిసేందుకు ఉరకలు వేస్తూ ప్రవహిస్తూ ఉంటుంది.

గంగమ్మతల్లి విష్ణుపాదాల మీద నుండి జాలువారింది. భూలోక, పాతాళలోకాల్లోని పాపాలన్నింటినీ ప్రక్షాళనం చేసేందుకు భగీరథుడి వెంట వచ్చింది. ఆమె ధాటికి భూదేవి తట్టుకోలేదని శివుడి జటాజూటాల్లో నుండి క్రిందకు జారి సుడులు తిరుగుతూ, అలలతో భూమినంతా సారవంతం చేస్తూ ప్రవహిస్తున్న గంగానదీ తీరాన సుమంత్రుడు రథాన్ని నిలిపాడు. అక్కడకు కూతవేటు దూరంలోనే శృంగిబేరపురం ఉంది.

రాముడు: మంత్రిపుంగవా! ఈ రాత్రికి మనం ఇక్కడే విశ్రమిద్దాం. అక్కడొక పెద్ద చెట్టు కనిపిస్తోంది. దేవతలు, దానవులు, పక్షులు గంగమ్మ తల్లిని ఇక్కడ సేవిస్తూ ఉంటారు మనం కూడా సేవిద్దాం.

లక్ష్మణుడు, సుమంత్రుడు కూడా బాగుందన్నారు. సీతారామలక్ష్మణులు రథం దిగారు. సుమంత్రుడు కూడా రథం దిగి గుర్రాలను విప్పి వాటికి మేత వేసి, నీళ్ళు తాగించాడు. సీతారాములు ఆ వృక్షాన్ని ఆనుకుని కూర్చున్నారు. ఇక్కడికి సమీపంలోనే శృంగిబేరపురం ఉంది. దాన్ని గుహుడు పరిపాలిస్తున్నాడు. అతడు నిషాదజాతి (బోయజాతి)లో పుట్టాడు. ప్రజలను తన కన్నబిడ్డలవలె చూసుకుంటూ పాలించడం చేత 'స్థపతి' అని గౌరవంగా అతణ్ణి పిలుస్తారు. గుహుడికి రాముడికి మంచి స్నేహం ఉంది. గుహుడికి రాముడంటే అమితమైన ప్రేమ, గౌరవం ఉన్నాయి. చారుల మూలంగా రాముడు సీతాలక్ష్మణులతో కలసి గంగాతీరాన ఉన్నట్లు విన్నాడు. నిషాదజాతిలోని పెద్దల్ని, మంత్రుల్ని వెంటబెట్టుకొని రాముణ్ణి దర్శించేందుకు బయలుదేరాడు.

రాముడు గుహుణ్ణి దూరాన్నుంచే చూశాడు. వెంటనే లేచి అతడికి ఎదురుగా లక్ష్మణుని కూడా తీసుకువెళ్ళాడు. మునివేషంలో ఉన్న రాముణ్ణి గుహుడు చూశాడు. ఇద్దరూ కౌగలించుకున్నారు.

గుహుడు: ప్రభూ! మీకు నేను స్వాగతం చెబుతున్నాను. మీ కొరకు అర్ఘ్యం, భక్ష్యాలు,

భోజ్యాలు, లేహ్యాలు తెచ్చాను. వాటన్నింటినీ మీరు ఆరగించండి. ఈ దీనుడి నుండి ఇంకా ఏమి సేవలు కావాలో ఆజ్ఞాపించండి. మేమందరం నీ సేవకులం. ఇంత కన్నా ప్రియమైన అతిథి ఎవరికైనా దొరుకుతాడా? ఆజానుబాహువైన ఓ రామా! ఈ రాజ్యం నీది, నువ్వే ఏలుకో. మేమంతా నిన్ను సేవించుకుంటాం. ఇంత గొప్ప ప్రభువు, అతిథి ఎవరికి దొరుకుతాడు?

రాముడు: ఓ గుహుడా! నన్ను చూసేందుకు కాలినడకన ఇంత దూరం వచ్చావు, అదే పదివేలు. అదే నాకు గొప్ప సత్కారం, ఇది చాలు.

మిత్రుడా! నువ్వు, నీ ప్రజలు నీ బంధువులు క్షేమంగా ఉన్నారు గదా! ఎటువంటి ఉపద్రవాలు లేకుండా నీ ప్రజలు సుఖంగా ఉన్నారు గదా! నీ ధనాగారం సమృద్ధిగా ఉన్నది గదా! నిన్నూ నీ బంధువులను చూడగలగడం నా భాగ్యంగా భావిస్తున్నాను. నా పట్ల ప్రేమతో తీసుకొని వచ్చిన ఆహారన్నంతా తిరిగి ఇచ్చివేస్తున్నాను. ఎందువల్లనంటే నేను ఇప్పుడు నా తండ్రి ఆజ్ఞను శిరసావహించి నారబట్టలు ధరించి వనవాసం చేస్తున్నాను. నేను ఇతరులనుండి ఆహారంగాని, కానుకలుగానీ తీసుకోలేను. తపస్సు చేసుకుంటూ కందమూలాలు భుజిస్తూ జీవించాలి. అందువల్ల ఇప్పుడు నాకు ఇవేమీ అవసరంలేదు. గుర్రాలకు మాత్రం చక్కటి మేత ఏర్పాటు చెయ్యి. ఎందువలనంటే అవి మా తండ్రిగారికి చాలా ప్రియమైనవి. కాబట్టి వాటికి మంచి ఆహారాన్నిస్తే నన్ను సత్కరించినవాడవవుతావు.

అప్పుడు గుహుడు గుర్రాలకు చక్కటి పచ్చిగడ్డితో దానా కలిపి తినిపించాడు. తరువాత రాముడు సాయంసంధ్యను ఉపాసించాడు. లక్ష్మణుడు గంగనుండి తెచ్చిన జలాన్నే ఆహారంగా స్వీకరించాడు. చీకటిపడిన తర్వాత ఆదమరచి నేల మీద పడుకున్నాడు. సీతాదేవి కూడా అక్కడే నేల మీద పడుకుంది. లక్ష్మణుడు, సుమంత్రుడు, గుహుడూ మాట్లాడుకుంటూ ఆ రాత్రంతా గడిపేశారు.

మహాత్ముడు, ధీమంతుడు, యశస్వి అయిన దశరథుని కుమారుడు రాముడు

ఇంతవరకూ భోగాలనే అనుభవించాడు. పూలపైనే నడిచాడు. అటువంటి రాముడు ఈ రోజున కటికనేల మీద పడుకున్నాడు. ఆ రాత్రి ఎంతకీ తెల్లవారలేదు.

# 51వ సర్గ గుహుని సమక్షంలో లక్ష్మణుడు విలపించడం

సీతారాములు ఆ కటికనేలపైనే చెట్టు మొదట్లో పడుకొని ఉన్నారు. కాస్త దూరంలో లక్ష్మణుడు, గుహుడు, సుమంత్రుడు కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

గుహుడు: నాయనా! లక్ష్మణా! నీకు కూడా పక్క ఏర్పాటు చేయించాను. ఆ ధనుస్సు కొంచంసేపు నేలపై ఉంచి, ఇట్లావచ్చి నడుంవాల్చు. సీతారాములకు, నీకు కూడా మేం కాపలాకాస్తూ ఉంటాము. మీరు కష్టమంటే తెలియకుండా పెరిగినవాళ్ళు. మేము అట్లాకాదు, కష్టాలకు అలవాటు పడ్డవాళ్ళం.

ఓ లక్ష్మణా! రాముడికన్నా ప్రియమైవాడు నాకు ఈ ప్రపంచంలో ఎవరూ లేరు. అతడి అనుగ్రహం వల్లనే నాకు లోకంలో కీర్తి, సంపద కలిగాయి. ధర్మం అంటే ఏమిటో, అధర్మం అంటే ఏమిటో రాముడి అనుగ్రహం వల్లనే తెలుసుకోగలిగాను.

ఈ అడవి ప్రాంతమంతా నాకు బాగా పరిచయమైన ప్రదేశాలే. చతురంగబలాలతో వచ్చినా నన్ను ఎదిరించలేరు. నేను, నా జ్ఞాతులు నాలుగు దిక్కులా కాపలా కాస్తాము. మీ ముగ్గురూ నిశ్చింతగా పడుకోండి.

లక్ష్మణుడు: గుహుడా! నువ్వు పరమ ధార్మికుడవు. నీ శక్తి సామర్థ్యాలు నేను ఎరుగుదును. నువ్వు ఇక్కడుండగా మాకు ఏ భయమూ ఉండదు. సీతారాములు కటికనేలపై పడుకొంటే నాకు నిద్ర ఎట్లా పడుతుంది? నేను సుఖంగా ఎట్లా ఉండగలను? ఏ రాముణ్ణి చూస్తే యుద్ధంలో దేవాసురులు కూడా ఎదిరించలేరో అటువంటి రాముడు కటిక నేలపై పడుకున్నాడు.

ఓ గుహుడా! దశరథ మహారాజు ఎన్నో పూజలు, వ్రతాలు, యాగాలుచేసి రాముణ్ణి కన్నాడు. రాముడంటే దశరథునికి పంచప్రాణాలు. అటువంటి రాముణ్ణి అడవులకు పంపించాడు. ఇక ఆయన ఎక్కువకాలం జీవించరు. త్వరలోనే అయోధ్య అనాథ అయిపోతుంది.

దశరథమహారాజుతోపాటు కౌసల్యాదేవికూడా మరణించడం ఖాయం. ఏది జరుగకూడదో అది జరిగిపోయింది, నా తండ్రి రాముణ్ణి రాజుగా చెయ్యాలనుకున్నాడు. అది ఆయన చూడకుండానే చనిపోతాడు.

గుహుడా! నా తండ్రి మరణించే సమయానికి మేము ఇద్దరం ఆయన వద్ద ఉండం. ఎవరు తండ్రి పితృకర్మలు చేస్తాడో వాడే నిజానికి పుత్రుడనిపించుకుంటారు. మా ఇద్దరికీ ఆ అదృష్టంలేదు.

అయోధ్యానగరం ఎంతో అందమయిన పట్టణం. రాజవీథులన్నీ తీర్చిదిద్దినట్లుంటాయి. మహోన్నతమైన రాజభవనాలన్నీ నా కళ్ళ ఎదుట కనిపిస్తున్నాయి. అయోధ్యానగర రాజవీథులన్నీ రథాలతోను, గుర్రాలతోను, ఏనుగులతోను కిటకిటలాడుతూ ఉంటాయి. ఆరామాలలో, ఉద్యానవనాలలో రాజులు, జనులు విహరిస్తూ ఉంటారు. అనేకాలైన ఉత్సవాలను చేసుకుంటూ జనమంతా సంచరిస్తూ ఉంటారు. మా వనవాసం ఎప్పటికి ముగుస్తుందోగదా? రాముడు రాజు ఎప్పుడు ఔతాడోగదా!

లక్ష్మణుడు ఉన్మాదంతో విలపిస్తూ ఉంటే గుహుడు కూడా కన్నీరు కార్చసాగాడు. ఇంతలో తెల్లవారింది.

# 52వ సర్గ రాముడు గంగానదిని దాటడం

తెల్లవారింది. నిత్యకృత్యాలన్నీ పూర్తిచేసుకున్నారు. రాముడు లక్ష్మణుని పిలిచి ఇలా అన్నాడు:

రాముడు: నాయనా! లక్ష్మణా! రాత్రి గడిచిపోయింది. తెల్లవారింది. పక్షులన్నీ ఆహారం కోసం బయలుదేరాయి. కోయిలలు కమ్మగా కూస్తున్నాయి. నెమళ్ళ క్రేంకారవాలు కూడా దూరాన వినవస్తున్నాయి. వేగంగా ప్రవహిస్తున్న ఈ గంగానదిని దాటుదాం.

గుహుడు, రాముని మాటలు విన్నాడు. తన మంత్రులను పిలిచాడు. సీతారామ లక్ష్మణులు గంగను దాటేందుకు దృఢమైన నావ నొకదాన్ని ఏర్పాటు చెయ్యమని ఆదేశించాడు.

(రెండు చేతులతోను నమస్కరిస్తూ) ఓ రామా! ఇదుగో నీవు ఆదేశించినట్లుగానే నావను ఏర్పాటు చేశాను. నీవు నావను ఎక్కి కూర్చో. ఇంకా ఏదైనా ఆదేశిస్తే నీ సేవకు సిద్ధంగా ఉన్నాను.

అంతట రామలక్ష్మణులు అంబులపొదిని, ధనుస్సును, ఖడ్గాన్ని ధరించి సీతతో కలసి నావలో కూర్చొన్నారు. తరువాత సుమంత్రుడు వచ్చి, “ఇప్పుడు నాకు ఏం ఆజ్ఞ ఇస్తావు, రామా!” అన్నాడు.

రాముడు (చేత్తో ప్రేమపూర్వకంగా సుమంత్రుని భుజం తట్టుతూ) : సుమంత్రా! నువ్విక అయోధ్యకు వెళ్లు. ఏమాత్రం అశ్రద్ధ చేయకుండా మహారాజును కనిపెట్టి ఉండు. మమ్మల్ని రథంలో తీసుకొని వచ్చావు. నువ్వు బాగా అలసిపోయావు. ఇకపై మేము కాలినడకనే వెళతాము. నువ్వు అయోధ్యకు తిరిగిపో.

సుమంత్రుడు: రామా! నువ్వు సీతతోను, లక్ష్మణునితోను అరణ్యవాసానికి

బయలుదేరావు. ఇది లోకోత్తరమైన విషయం. నువ్వు తప్ప మరెవ్వరూ ఈ విధంగా చెయ్యలేరు. ఎన్ని విధాలుగా ప్రయత్నించినా నీ నిర్ణయాన్ని ఎవరూ మార్చలేకపోయారు. నువ్వు ఆచరించిన బ్రహ్మచర్యానికి గాని, వేదాధ్యయనానికి గాని, నీ దయాగుణానికి గాని విలువే లేకుండా పోయింది గదా! నీవు అడవుల్లో ఉన్నా కూడా ముల్లోకాలను జయించిన విష్ణుమూర్తికి మల్లేనే కీర్తిమంతుడవవుతావు. మీ కందరికీ సద్గతులే కలుగుతాయి. ఇంతకూ మోసపోయినవాణ్ణి నేనే సుమా! మిమ్మల్ని వెంబడిస్తూ వచ్చిన పౌరులను కనుగప్పేందుకు నన్ను ఉపయో గించుకున్నావు. ఇప్పుడు నా వంతు వచ్చింది. నన్నూ పొమ్మంటున్నావు. ఇకపోయి ఏం బావుకుంటాను? కైకేయికి సేవలు చేస్తూ బ్రతకలేక, చావలేక నలిగిపోవల్సిందే గదా!

ఈ విధంగా సుమంత్రుడు చాలాసేపు ఏడ్చాడు. తరువాత గంగాజలాలతో ముఖం శుద్ధి చేసుకొని ఆచమనం చేశాడు. అప్పుడు రాముడు ఇలా అన్నాడు:

రాముడు: సుమంత్రా! మా ఇక్ష్వాకువంశానికి ఎన్నడూ నీవంటి విశ్వాసపాత్రుడైన సన్నిహితుడు లేడు. దశరథ మహారాజు నన్ను తలచుకొని దుఃఖించకుండా ఆయన్ను దగ్గరుండి ఓదారుస్తూ ఉండు. ఈ పనిని నువ్వు తప్ప ఇతరులెవ్వరూ చేయలేరు.

నా తండ్రిగారు వృద్ధులయ్యారు. నా గురించిన దుఃఖంతో పీడించబడుతున్నాడు. కామంకూడా ఆయన్ను పీడిస్తూనే ఉంది. అందువల్ల కైకేయీదేవిని తృప్తిపరచేందుకు ఆయన ఏం చేయమన్నా కూడా నువ్వు ఎదురు చెప్పవద్దు. ఆయన చెప్పినట్లల్లా చేస్తూ ఆయన్ను సంతృప్తిపరచు. రాజులు వారు తలపెట్టిన పనులు తలపెట్టినట్లుగా చేయటమే రాజ్యపాలన అని భావిస్తారు. అందువల్ల నువ్వు దశరథ మహారాజు మనస్సు కనిపెట్టి నడచుకుంటూ ఆయన్ను సంతోషపెడుతూ ఉండు.

ఓ సుమంత్రా! నా తండ్రి జితేంద్రియుడు. పూజనీయుడు. ఆయనకు నమస్కారం చేస్తూ ఇలా మనవి చేశానని చెప్పు.

"తండ్రీ! అడవుల్లో ఉండవలసి వచ్చినందుకు నేనుగాని, సీతగాని, లక్ష్మణుడుగాని ఏమాత్రమూ బాధపడటం లేదు. పద్నాలుగు సంవత్సరాల అరణ్యవాసం పూర్తికాగానే అయోధ్యకు తిరిగివస్తాం. ఆ తరువాత మీరు మమ్మల్ని ప్రతిరోజూ చూస్తూ ఉండవచ్చు. మేము కూడా మీ సేవలు చేసుకుంటూ ఉంటాం. అంతవరకూ దుఃఖించవద్దు. అట్లాగే నా తల్లి కౌసల్యా దేవికి, తక్కిన తల్లులకు నేను, సీత, లక్ష్మణులు పాదనమస్కారాలు చేస్తున్నామని చెప్పండి. వాళ్ల ఆరోగ్యం గూర్చి జాగ్రత్తగా కనిపెట్టి ఉండండి."

సుమంత్రుడా! నా తండ్రి గారికి కూడా పాదాభివందనం చేస్తూ భరతుని త్వరగా పిలిపించమని చెప్పు. భరతుడు రాగానే రాజ్యాభిషేకం చేయించమని చెప్పు. భరతుడికి రాజ్యాభిషేకం జరిగిన తర్వాత ఇక నువ్వు దుఃఖించే పని ఉండదు. భరతుడితో నా మాటగా ఇలా చెప్పు.

భరతా! నువ్వు తండ్రిగారి విషయంలో ఎటువంటి శ్రద్ధ వహిస్తూ ఉంటావో, మన తల్లులందరి విషయంలో కూడా ఎలాంటి భేదబుద్ధి లేకుండా మసలుకో. నన్ను గూర్చిన దుఃఖం మరచిపోయేటట్లుగా ప్రవర్తించు. నువ్వు తల్లి కైకేయిని ఎంత ప్రేమాభిమానాలతో చూస్తావో అంతే ప్రేమాభిమానాలు తల్లులు కౌసల్య, సుమిత్రలపై కూడా చూపుతూ మెలగు.

తమ్ముడూ! తండ్రిగారు కోరినట్లుగా యౌవరాజ్య పదవిని స్వీకరించు. ఇహపరాలలో సుఖాలు పొందేట్లుగా ధర్మవర్తనుడవై మెలగు.

సుమంత్రుడు (శోకంతో) : ఓ రామా! నేను చెప్పే మాటలకు మనస్సు కష్టపెట్టుకోవద్దు. నేను నీకు పరమభక్తుణ్ణి. అందువల్ల నన్ను అపార్థం చేసుకోవద్దు. నిన్ను సంతోషపెట్టడానికి మాట్లాడటం లేదు. ముఖప్రీతి మాటలు ఎంతమాత్రమూ కావు.

ఓ రామా! అయోధ్యావాసులంతా నువ్వు వనాలకు వెళ్లడం వల్ల, తమ కుమారుణ్ణే పోగొట్టుకొన్నట్లుగా దుఃఖీస్తున్నారు. నేను ఒక్కణ్ణే నగరానికి పోయి నా ముఖం వారికి ఎలా

చూపేది? మనం బయలుదేరే రోజున నువ్వు కూర్చున్న రథాన్ని వెంబడిస్తూ ఎంతో దుఃఖించారు. ఇప్పుడు రాముడు లేకుండా ఒట్టి రథంతో వెళ్లడం చూస్తే వాళ్ళ గుండెలు పగిలిపోతాయి. యుద్ధంలో వీరుడు మరణిస్తే, తిరిగి వెళ్లే ఖాళీ రథాన్ని చూసి మిగతా సైనికులు గుండెలు బాదుకుంటూ దుఃఖిస్తారు. అట్లాగే నేను కూడా ఖాళీ రథంతో అయోధ్యకు తిరిగిపోతే జనం అంతకన్నా ఎక్కువగా దుఃఖిస్తారు.

రామా! నువ్వు అల్లంత దూరాన అడవుల్లో ఉన్నా వాళ్ల మనస్సులన్నీ నీ వద్దనే ఉంటాయి. ఆ బెంగతో అన్నం నీళ్లు ముట్టరు. మనం వనవాసానికి బయలుదేరిన రోజున జనం ఎంత తల్లడిల్లిపోయారో, ఎంత మానసిక క్షోభ అనుభవించారో మీరే చూశారు గదా! ఇప్పుడు నేను ఖాళీ రథంతో తిరిగిపోతే అంతకు నూరింతలు దుఃఖిస్తారు.

రామా! నీ తల్లి కౌసల్యాదేవితో ఏమని చెప్పను? నీ మేనమామ గారింటి వద్ద దిగబెట్టానని చెప్పమంటావా? ఆమెకు ఊరట కలిగించేదే అయినా, ఆ అబద్ధం నేను చెప్పలేను. లేదు, కష్టం కలిగినా సరేనని నిర్దాక్షిణ్యంగా నట్టడివిలో వదిలివచ్చానని చెప్పమంటావా? అటువంటి మాట చెప్పడానికి నాకు నోరురావడం లేదు.

రామా! నిన్ను, సీతను, లక్ష్మణుని ఇంతవరకూ తీసుకొని వచ్చిన గుర్రాలు నీ పట్ల చాలా విశ్వాసపాత్రమైనవి. నీవు లేకుండా రథానికి పూన్చితే అవి నా మాట వింటాయా? నీవు లేకుండా తిరిగి అయోధ్య వైపు నడిపిస్తే అవి నడవవు. వాటిని నేను నడిపించలేను.

కనుక ఓ పాపరహితుడవైన రామా! నేను ఒంటరిగా అయోధ్యకు తిరిగి వెళ్లలేను. కాబట్టి నన్ను గూడా మీతోబాటే అడవుల్లో ఉండేందుకు అనుమతించు. అంతగా నువ్వు నన్ను తిరిగిపోవలసిందేనని ఆజ్ఞాపిస్తే, నేను ఇక్కడే అగ్నిప్రవేశం చేస్తాను.

ఓ రామా! నేను నీతో ఉండటం వలన నీకు మేలే జరుగుతుంది కాని కీడు జరుగదు. రథంలో కూర్చుని, ఒక్క క్రూరమృగం కూడా నీ సమీపానికి రాకుండా చూస్తాను. అందువల్ల నీ

తపస్సుకు ఎటువంటి అంతరాయమూ కలగకుండా ఉంటుంది.

రామా! ఇంతకాలం నీ అనుగ్రహం వల్ల రథం తోలుతూ సుఖాలు అనుభవించాను. ఇకపైన కూడా నీతోపాటే, వనవాససుఖం కూడా అనుభవిస్తాను. నన్ను నివారించకు. "సరే! నీవు కూడా మాతోబాటే ఉండు" అనే చల్లనిమాట నీ నోట వినాలని ఆశపడుతున్నాను.

ఓ వీరుడా! గుర్రాలు ఎప్పుడూ వీరులకు సేవలుచేసే తరించాలని చూస్తాయి. అట్లాగే విశ్వాసపాత్రములైన ఈ అశ్వాలు కూడా ఇక్కడే ఉండి నీ సేవలోనే తరించాలనుకొంటున్నాయి.

నేను నిన్ను విడిచి స్వర్గానికైనా పోను. ఇక అయోధ్య మాట వేరే చెప్పాలా? నీకు శుశ్రూష చేసుకుంటూ నేను ఇక్కడే ఉండిపోవడానికి నాకు అనుజ్ఞ ఇమ్మని శిరస్సు వంచి ప్రార్థిస్తున్నాను.

రామా! పాపాత్ములు, దేవేంద్రుని అమరావతిపట్టణంలో ప్రవేశించలేరు. అట్లాగే, నేను కూడా నీవులేని అయోధ్యలో ప్రవేశించలేను. వనవాసం పూర్తయ్యాక మళ్లీ ఇదే రథంపైన ఎక్కించుకొని మిమ్మల్ని అయోధ్యకు తీసుకొనిపోతాను. నువ్వు ప్రక్కన ఉంటే అడవుల్లో కూడా పద్నాలుగు సంవత్సరాలు, పద్నాలుగు క్షణాల్లాగా గడచిపోతాయి. అట్లాగే నువ్వు లేని అయోధ్య వంద సంవత్సరాలుగా గడుస్తుంది.

ప్రభూ! ప్రభువులు ఎప్పుడూ సేవకులపై దయ చూపిస్తూ ఉంటారు. నేను నీకు సేవకుణ్ణి. నీ భక్తుణ్ణి. నీకు ఏ విధమైన కష్టమూ కలిగించనివాడిని. నువ్వు నా ప్రభువుకు పుత్రుడవు. కాబట్టి అటువంటి భక్తుడనైన నన్ను విడిచిపెట్టవద్దు.

రాముడు: ప్రభుభక్తిపరాయణుడా! ఓ సుమంత్రా! నీకు నా పట్ల ఎంత భక్తి ఉన్నదో నాకు తెలుసు. నేను నిన్ను అయోధ్యకు తిరిగి వెళ్ళమని చెప్పటానికి బలమైన కారణాలున్నాయి. చెప్తాను, విను.

సుమంత్రా! నువ్వు తిరిగి అయోధ్యకు వెళితే నా పినతల్లి కైకేయి నేను నిజంగానే

అరణ్యాలకు పోయినట్లు నమ్ముతుంది. ఆ విధంగా ఆవిడకు నమ్మకం కలగకపోతే ధార్మికుడైన దశరథ మహారాజు కూడా అసత్యం చెప్తున్నాడని అంటుంది. ఇంకో ముఖ్యమైన విషయం ఏమంటే, నా తమ్ముడు భరతుడికి రాజ్యాభిషేకం జరగాలి. అప్పుడే నా తండ్రిగారి రెండవ ప్రతిజ్ఞ కూడా నెరవేర్చినట్లవుతుంది.

కనుక సుమంత్రా! నువ్వు రథాన్ని తీసుకొని అయోధ్యకు వెళ్లినట్లయితే నాకు, మహారాజుకు కూడా సంతోషం కలిగించిన వాడవవుతావు. కాబట్టి ఓ సుమంత్రా! నేను చెప్పిన విషయాలన్నీ బాగా జ్ఞాపకం పెట్టుకో. నేను చెప్పినదంతా చెయ్యి. నాకు సంతోషాన్ని కలిగించు.

తిరిగి గుహునితో ఇలా అన్నాడు:

ఓ గుహుడా! నేను నా తండ్రికిచ్చిన మాట ప్రకారం జనులుండే నగరాల్లో వసించకూడదు. జటాధారినై ఆశ్రమాల్లోనే నివసించాలి. కాబట్టి నాకు కొద్దిగా మర్రిపాలు తెప్పించు. నేను, సీత, లక్ష్మణులు జటలకు పూసుకొంటాము. అందువలన మేమందరమూ మునుల నియమాన్ని అవలంబించినట్లవుతుంది.

అంతట గుహుడు మర్రిపాలు తెప్పించగా వారు ముగ్గురూ ఆ పాలను జటలకు పూసుకొన్నారు. సీతారామలక్ష్మణులు ముగ్గురికీ జటలుకట్టాయి.

ఆజానుబాహుడూ పురుషశ్రేష్ఠుడూ అయిన రాముడు, సీత, లక్ష్మణులు జటలుకట్టిన వారై నారబట్టలు ధరించి ఋషులమల్లే కనిపించారు. తరువాత లక్ష్మణునితో కలసి 'విఖనస్సు' అనే మహర్షి ప్రబోధించినట్లు వానప్రస్థమార్గాన్ని అవలంబించాడు.

రాముడు: గుహుడా! రాజ్యాన్ని పాలించడం అంటే సామాన్యమైన విషయం కాదు. చాలా కష్టమైనది. మంచి పరిపాలకుడు కావాలంటే సైన్యంమీద, ధనాగారం మీద, దుర్గంపైనా, దేశంపైన మంచి పట్టు సంపాదించాలి. ఏ ఒక్క అంశంలో ఏమరుపాటుతో ఉన్నా పరిపాలన

దెబ్బతింటుంది.

తరువాత గుహుడు రాముడికి వీడ్కోలు చెప్పాడు. ముందుగా సీతాదేవిని నావ ఎక్కించారు. పిదప లక్ష్మణస్వామి ఎక్కాడు. చివరగా రాముడు నావ ఎక్కి కూర్చున్నాడు. అంతట గుహుడు నావ నడిపేవాడితో "నావను అవతలి ఒడ్డుకు క్షేమంగా చేర్చు" అని చెప్పాడు.

తేజోవంతుడైన రాముడు నావనెక్కి సర్వజనుల శ్రేయస్సును కోరి జపించే "దైవీం నావమ్ " అనే మంత్రాన్ని జపించాడు. తరువాత ఆ ముగ్గురూ గంగమ్మతల్లికి నమస్కరించారు. సుమంత్రునికి, గుహునికి అంతిమ వీడ్కోలు పలికి నావను పోనిమ్మన్నాడు. నావ గంగానదిలో ప్రయాణం సాగించింది. సీతాదేవి పడవలో నుండే గంగామాతను స్తోత్రం చేసింది.

సీత: ఓ గంగాదేవీ! ధీమంతుడైన నా భర్త తండ్రి ఆజ్ఞను శిరసావహిస్తూ వనవాసానికి ప్రయాణమయ్యాడు. మా ముగ్గురనూ నువ్వే రక్షించాలి. అందాల ఓ గంగమ్మా! వనవాసదీక్ష ముగించుకొని తిరిగి వచ్చేటప్పుడు సంతోషంతో నిన్ను పూజిస్తాను.

అమ్మా! గంగాభవానీ! నువ్వు స్వర్గ, భూ, పాతాళ లోకాలు మూడింటిలోనూ ప్రకాశిస్తూ పరబ్రహ్మవై ఉన్నావు. భూలోకంలో సముద్రుడికి భార్యవనే పేరు పొందావు. మంగళప్రదమైన ఓ గంగాదేవీ! పరమశ్రేష్ఠుడైన రాముడు క్షేమంగా తిరిగివచ్చి రాజ్యాన్ని చేపట్టిన తర్వాత, సంతోషంగా నీకు, వెయ్యి కుండల మద్యం, మాంసంతోకూడిన ఆహారం నైవేద్యంగా సమర్పించి పూజిస్తాను. నీకు రెండుప్రక్కలా ఉండే తీర్థాలన్నింటిలోను, దేవాలయాల్లో కూడా పూజలు జరిపిస్తాను.

ఓ పుణ్యాత్మురాలా! పాపరహితుడైన నా భర్త రాముడు నాతోను, సోదరుడు లక్ష్మణునితోను వనవాసం పూర్తిచేసుకొని తిరిగి అయోధ్యకు క్షేమంగా చేరాలని దీవించు.

సీత ఆ విధంగా ప్రార్థనలు ముగించే లోపల నావ దక్షిణ తీరాన్ని సమీపించింది. అక్కడ

నుండి సీతా లక్ష్మణులతో కలసి రాముడు నావ నుండి దిగి అరణ్యాల వైపుగా నడచివెళ్లాడు.

రాముడు: లక్ష్మణా! మనం తిరగబోయే ప్రదేశాలన్నీ జనసమ్మర్దాలైనా, నిర్జనప్రదేశాలైనా మనం కొత్త ప్రాంతాలలో సంచరిస్తున్నాం. ప్రమాదం ఎటువైపు నుండి అయినా పొంచివుండవచ్చు. అందువల్ల మనం అత్యంత అప్రమత్తంగా మసలుకోవాలి. చెయ్యిదాటిపోయిన తర్వాత ఏమనుకొని ఏం లాభం? ఇకపైన నేల సమంగా ఉండదు. ఎత్తు పల్లాలుంటాయి. ముళ్లపొదలతో కూడి ఉండటం వల్ల దారి ఉండదు. మనమే దారి చేసుకుంటూ ముందుకుపోవాలి. ఇక్కడ పొలాలుగాని, ఉద్యానవనాలుగాని మచ్చుకైనా కనపడవు. ఎత్తైన కొండలు, లోతైన లోయలు ఉంటాయి. అటువంటి వనాల్లోకి మనం ఇప్పుడు ప్రవేశించ బోతున్నాం. సీతకు ఇకపైనే అరణ్యవాసం అంటే ఏమిటో తెలిసివస్తుంది.

రాముడు చెప్పినట్లే లక్ష్మణుడు ముందు నడిచాడు. సీత అతణ్ణి అనుసరించింది. రాముడు సీత వెనుక నడిచాడు. అట్లా పోతూ పోతూ కొంతసేపటికి వత్సదేశపు పొలిమేరలకు చేరుకున్నారు. ఆ దేశం పాడిపంటలు, సస్యాలతో ఐశ్వర్యవంతమై సమృద్ధిగా ఉన్నట్లు కనిపించింది. జనులు కూడా సంతోషంగాను, ఉత్సాహంగాను కనిపించారు. అప్పుడు వారికి ఆకలి వేసింది. రామలక్ష్మణులు వేటకు వెళ్లి ఒక అడవిపందిని, ఒక ఎనుబోతును, ఒక నల్లచారల దుప్పిని వేటాడి వాటి మాంసాన్ని వండుకొని తిన్నారు. సాయంత్రం కాగానే విశ్రమించేందుకు అనువైన వృక్షంకోసం వెదికారు.

# 53వ సర్గ రాముడు కౌసల్యకు కీడు శంకించడం

రాముడు సాయంసంధ్యను ఉపాసించి ఒకానొక వృక్షానికి నడుం ఆనించి కూర్చుని, లక్ష్మణునితో ఇలా అన్నాడు.

రాముడు: లక్ష్మణా! అయోధ్య విడిచి వచ్చిన తర్వాత మన ముగ్గురమూ ఇకపై అనేక రాత్రులు ఒంటరిగా గడపవలసి ఉంటుంది. సుమంత్రుడు కూడా వెళ్లిపోయాడు కాబట్టి ఇదే మొదటి రాత్రి అవుతుంది. ధైర్యంగా ఉండు. ఇక నుండి మనమిద్దరం అప్రమత్తులమై ఉండాలి. అప్పుడే మనం సీత క్షేమం జాగ్రత్తగా చూసుకోగలుగుతాం. ఏవైనా ఎండిన ఆకులు పరచుకొని ఎట్లాగో ఈ రాత్రి గడిపేద్దాం.

లక్ష్మణా! నా మనస్సు ఇప్పుడు అయోధ్య మీదకు పోతోంది. దశరథ మహారాజు దుఃఖంతో నిద్రపట్టక పక్కమీద అటూ ఇటూ పొర్లుతూ ఉంటాడు. కైకేయి మాత్రం తన పంతం నెగ్గిందిగదా అని సంతోషంతో గుర్రుపెట్టి నిద్రపోతూ ఉంటుంది. భరతుడు రాగానే కైకేయి మహారాజును కాలుచెయ్యి ఆడకుండా చేస్తుంది. భరతుని రాజ్యాభిషేకం గూర్చి చెవిలో ఇల్లు కట్టుకొని పోరుతుంది. నువ్వు, నేనూ కూడా దగ్గర లేకపోవడంతో మహారాజు పని కుడితిలో పడ్డ ఎలుక తంతు అవుతుంది.

లక్ష్మణా! మహారాజు దయనీయ స్థితి చూస్తూ ఉంటే ఆశ్చర్యం కలుగుతోంది. ఆహా! కామం అర్థాన్ని కూడా జయిస్తోంది గదా! లేకపోతే ఆడదాని మాట విని, తనకు విధేయుడైన కొడుకును విడిచిపెట్టుకుంటాడా?

లక్ష్మణా! దశరథ మహారాజు మరణానికి, నా వనవాసానికి, భరతుణ్ణి రాజును చెయ్యటానికి కైకేయీదేవి మన ఇంట్లో అవతరించినట్లున్నది. ఎందువల్లనంటే ధర్మార్థాలను విడిచి కామాన్నే పట్టుకు వేళ్లాడేవాడు తప్పక ఆపదల్లో చిక్కుకుంటాడు.

దశరథ మహారాజు వృద్ధాప్యంతో మరణిస్తాడు. నేను అరణ్యంలో ఉన్నాను. అందువలన భరతుడు రాజు అవుతాడు. ఇది ఇట్లాగే సాగిపోతూ ఉంటే ఒళ్లు తెలియని అధికారమదంతో కైకేయీదేవి నా తల్లి కౌసల్యాదేవినీ, నీ తల్లి సుమిత్రాదేవినీ చిత్రహింసలు పెట్టగలదు. కాబట్టి లక్ష్మణా! దండకారణ్య వ్రతం సీతతో కలసి నేనొక్కణ్ణే ఆచరిస్తాను. నువ్వు అయోధ్యకు తిరిగి వెళ్లి కౌసల్యాదేవిని, సుమిత్రాదేవిని కాపాడు.

లక్ష్మణా! కైకేయీదేవికి ధర్మాధర్మాలు తెలియవు. ఎదుటివారిని హింసించటం, దుఃఖాలకు గురిచెయ్యటమే ఆవిడ లక్ష్యం. ఆ విధంగా కౌసల్యాదేవి, సుమిత్రాదేవిలను తప్పక హింసిస్తుంది. అప్పటికి భరతుడు రాజవుతాడు. వాడు పరమ ధార్మికుడు. మన తల్లులిద్దరినీ ధర్మం తెలిసిన భరతుని రక్షణలో ఉంచు. కనుక ఉదయాన్నే నువ్వు అయోధ్యకు ప్రయాణమైపో. అమ్మను భరతునికి అప్పగించు. నేను సీతతో కలసి దండకారణ్యానికి వెళతాను.

లక్ష్మణా! నా తల్లి పూర్వజన్మలో స్త్రీలను పుత్రుల నుండి వేరుచేసి ఉంటుంది. అందువల్లనే ఆమెకా కష్టం వచ్చిందని అనుకొంటున్నాను. నా తల్లి నన్ను ఎంతో కష్టపడి కని, పెంచి పెద్దచేసింది. సరిగ్గా ఆమెను సుఖపెట్టాల్సిన సమయంలో ఆమె నుండే దూరం చేయబడ్డాను. నేనెంత పనికిమాలిన వాడను! నా వలననే నా తల్లికి తీరని కష్టం కలుగుతోంది. లోకంలో ఏ తల్లికీ నాలాంటి కొడుకు పుట్టకూడదు!

లక్ష్మణా! మా అమ్మ ఒక చిలుకని, ఒక గోరువంకనూ పెంచుతోంది. నా వనవాసం గూర్చి మాట్లాడుకుంటూ ఉంటే ఆ రెండూ విన్నాయి. అందులో గోరువంక చిలుకని పిలిచి నువ్వు పోయి కైకేయి కాలు కొరికి రమ్మంది. చూశావా! లక్ష్మణా! అమ్మ మీద ఆ పక్షికి ఉన్న పాటి ఆదరణ కూడా నాకు లేకపోయింది గదా! కైకేయి ప్రతిపాదనను మారుమాట్లాడకుండా అంగీకరించటం వలన అమ్మకు తీరని అపకారం వాటిల్లింది.

లక్ష్మణా! నేను నా తల్లికి ఒక్కణ్ణే పుత్రుణ్ణి. అయినా కూడా ఆమెకు ఏ విధమైన

ఉపకారమూ చెయ్యలేకపోయాను. నాలాంటి పుత్రుడు ఉంటేనేం? లేకపోతేనేం? ఆమెను శోకసాగరంలో ముంచేసి నేను ఇట్లా వచ్చేశాను.

తమ్ముడా! నేను ఒక్కణ్ణే ఒక్క అయోధ్యనే కాదు, సమస్త భూమండలాన్నీ వశం చేసుకోగలను. కాని పరాక్రమం ప్రదర్శించే సమయం ఇది కాదు గదా!

ఆ సమయాన రాముడు ఆరిపోయిన అగ్నిహోత్రంలాగా, అలలు స్తంభించిన సముద్రంలాగా ఉన్నాడు. అప్పుడు లక్ష్మణుడు ఇలా అన్నాడు:

నువ్వు వనవాసానికి వచ్చిన తర్వాత అయోధ్య అంతా చంద్రుడు లేని ఆకాశంలాగా అంధకారమయంగా ఉంటుంది. నువ్వు పురుషశ్రేష్ఠుడవు. నువ్వు ఈ విధంగా దుఃఖిస్తూ ఉంటే నాకూ, సీతకూ కూడా కాళ్లూ చేతులూ ఆడవు. ఈ విధంగా విలపించటం వల్ల ప్రయోజనం ఏం ఉంటుంది? అన్నా! సీతాదేవి, నేను నిన్ను విడిచి ఒక్క క్షణం కూడా ఉండం; ఉండలేం కూడా! నువ్వు లేకపోతే మేము నీళ్లల్లో నుండి బయటపడేసిన చేపల్లాగా క్షణం కూడా జీవించలేం.

అన్నా! నువ్వు లేకుండా అయోధ్యలో అడుగుపెట్టను. నా తండ్రిగారిని చూడను. మా తమ్ముడి దగ్గరకు గాని, మా అమ్మ వద్దకు గానీ పోనేపోను. అన్నా! నువ్వు నన్ను క్షమించాలి. నువ్వు లేని స్వర్గమైనా నాకు వద్దు.

అంతట రాముడు ఆ మర్రిచెట్టు నానుకొని స్తిమితంగా ఆలోచించాడు. మనస్సు కుదుట పరచుకున్నాడు. పద్నాలుగు సంవత్సరాల వనవాసం చేయటానికే నిశ్చయించుకున్నాడు. సీతారామలక్ష్మణులు ఆ రాత్రి ఆ మర్రిచెట్టు కిందే గడిపారు.

# 54వ సర్గ భరద్వాజాశ్రమానికి చేరుకోవటం

ఆరాత్రి ఆ మర్రిచెట్టు మొదట్లోనే గడిపేశారు. బాగా తెల్లవారింది. నిత్యకృత్యాలు పూర్తిచేసుకున్నారు. అక్కడ నుండి గంగా యమునా సంగమం వైపుగా నడక సాగించారు. వాళ్లు ఇదివరకు ఎన్నడూ చూడని ప్రదేశాలను, వృక్షాలను, రకరకాల పంటపొలాలను చూసుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ నడిచారు.

“లక్ష్మణా! అల్లంత దూరాన పొగ ఎంత ఎత్తున లేచిందో చూశావా? ఆ పొగ అగ్నిహోత్రుడి ధ్వజంలాగా కనిపిస్తోంది గదా! గంగాయమునలు ఒకదానితో మరొకటి ఢీకొన్న శబ్దం అస్పష్టంగా వినిపిస్తోంది. ఆ పొగను బట్టి అక్కడ కొన్ని ముని ఆశ్రమాలు ఉండి ఉండాలి. భరద్వాజ మహర్షి ఆశ్రమం కూడా ఈ ప్రాంతంలోనే ఉంటుంది” అన్నాడు రాముడు.

వాళ్లు ముగ్గురూ అట్లా మాట్లాడుకుంటూ సాయంకాలానికి భరద్వాజ మహర్షి ఆశ్రమాన్ని చేరుకొన్నారు. వీళ్లను చూసి ఆశ్రమంలో ఉన్న కొన్ని పక్షులు, జంతువులు రక్షణ కోసం బెదిరిపోయి పరుగెత్తాయి. సీతారామ లక్ష్మణులు భరద్వాజుని ఆశ్రమంలోని ఆయన పర్ణశాల వద్దకు పోయారు. ఆ సమయంలో ఆయన ఏకాగ్రచిత్తంతో హోమం ముగించుకొని బయటకు వచ్చాడు. ఆ ముగ్గురూ ఆ మహర్షికి ప్రణామం చేశారు.

రాముడు: ఓ మహాత్మా! మేమిద్దరమూ దశరథ మహారాజు పుత్రులం. నా పేరు రాముడు. ఇతని పేరు లక్ష్మణుడు, నా తమ్ముడు. ఈమె సీత. నా భార్య. జనకమహారాజు కుమార్తె. మేము నా తండ్రి ఆజ్ఞ ప్రకారం అరణ్యంలో నివసించేందుకు వచ్చాము. నా తమ్ముడు నా పట్ల భక్తిచేత నన్ను విడువలేక నాతోపాటే అరణ్యాల్లో ఉండేందుకు వచ్చాడు. ఈ నా భార్య పతివ్రత. అందువల్ల నన్ను వదలి ఉండలేక నాతోపాటే అడవుల్లో ఉండేందుకు వచ్చింది. నా తమ్ముడు నన్ను సంతోషపెట్టడమే పరమ భాగ్యమని తలుస్తాడు. మేం ముగ్గురమూ అడవుల్లో దొరికే పండ్లు, కందమూలాలు తింటూ, ధర్మాన్ని ఆచరిస్తూ, ఇక్కడే ఒక ఆశ్రమాన్ని

నిర్మించుకొని జీవించాలని వచ్చాం.

అంతట భరద్వాజ మహర్షి, "ఓ రామా! నీకు స్వాగతం. మధుపర్కానికి బదులుగా గోవును, అర్ఘ్యానికి జలాన్ని సమర్పిస్తున్నాను. స్వీకరించు" అంటూ ఎన్నో రకాలైన కందమూలాలను, ఫలాలను, వివిధాలైన అన్నాలను వాళ్లకు సమర్పించి, ఆదరించాడు. వారు ముగ్గురూ అవన్నీ ఆరగించి ఆ రాత్రికి అక్కడే విశ్రమించారు.

భరద్వాజుడు సీతారామ లక్ష్మణులను సత్కరించి వారి వద్దనే కూర్చున్నాడు. అప్పుడు ఆ ప్రాంతాల్లో తపస్సు చేసుకుంటున్న మునీశ్వరులు అనేకమంది వచ్చారు. వారితోపాటు వారి వారి ఆశ్రమాల నుండి రకరకాల పక్షులు, జంతువులు కూడా వచ్చాయి.

భరద్వాజ మహర్షి: ఓ రామా! నీ తండ్రి దశరథ మహారాజు అకారణంగా నిన్ను అరణ్యవాసానికి పంపాడని విన్నాను. ఆ కారణంగా నిన్ను చూసే అదృష్టం కలిగింది.

నాయనా! ఈ గంగా యమునా సంగమ ప్రదేశంలో జనులు తక్కువగా నివసిస్తూ ఉంటారు. ఈ ప్రదేశమంతా సుందరంగాను, మనోహరంగాను ఉంటుంది. అందువల్ల ఇక్కడ నివసించేందుకు సుఖంగా ఉంటుంది. తపోవనాలు కూడా ఉన్నాయి. నువ్వు ఇక్కడ సుఖంగా ఉండవచ్చు.

రాముడు: మహాత్మా! ఈ ప్రదేశానికి దగ్గరలో అనేక పట్టణాలు, గ్రామాలు ఉన్నాయి. మేము ఇక్కడ ఉంటున్నామని తెలుసుకున్న ప్రజలు మమ్మల్ని చూడటానికి వస్తూ ఉంటారు. అందువల్ల నేను ఇక్కడ ఉండలేను. జానపదులకు దూరంగా ఉంటూ తపస్సుకు అనుకూలంగా ఉండే ప్రదేశాన్నేదైనా చూపండి. అటువంటి నిర్జన ప్రదేశాలంటేనే, మేము ఇష్టపడతాం.

భరద్వాజ మహర్షి: ఓ రామా! ఇక్కడకు పది కోసుల దూరంలో గంధమాదన పర్వతాలకు దీటైన 'చిత్రకూట' మనే పర్వతం ఒకటి ఉన్నది. అక్కడ ఎంతోమంది మహర్షులు

పర్ణశాలలు నిర్మించుకుని తపస్సు చేసుకుంటూ ఉన్నారు. ఆ పర్వతం పరమపవిత్రమైనది. ఆ పర్వతం నిండా ఎత్తైన వృక్షాలు ఉన్నాయి. చూడటానికి ఆ ప్రాంతం చాలా ఆహ్లాదంగా ఉంటుంది. ఆ వృక్షాలకు కాస్తున్న పండ్లను ఆశించి అనేక కోతులు, కొండముచ్చులు, ఎలుగుబంట్లు స్వేచ్ఛగా అక్కడ సంచరిస్తూ ఉంటాయి. అయితే క్రూరమృగాల బెడద ఉండదు. ఆ పర్వతం నువ్వు కోరుకున్నట్లుగా నీకు అనుకూలంగా ఉంటుంది. ఆ చిత్రకూట పర్వత శిఖరాల్ని చూస్తూ నివసించే వారందరూ మంగళకరమైన ఆలోచనలనే చేస్తూ ఉంటారు. అక్కడి వారి మనస్సు అమంగళకరమైన కార్యాలపట్ల ఆసక్తి చూపదు. ఆ చిత్రకూట పర్వతం మీద ఎందరో మహర్షులు తపస్సు చేసి స్వర్గానికి వెళ్ళారు.

కనుక రామా! నువ్వు కోరితే చిత్రకూట పర్వతంపై పర్ణశాల నిర్మించుకొని సుఖంగా ఉండవచ్చు. లేదా మాతోపాటే మా ఆశ్రమంలో ఉంటూ వనవాసం పూర్తిచేసుకోవచ్చు.

ధర్మవేత్త అయిన భరద్వాజుడు వారికి ఆదరంగా అతిథి సత్కారాలు చేసి, ఆ రాత్రి అంతా ఎన్నో పుణ్యకథలు చెప్పాడు. ఆ రాత్రి వారు సుఖంగా నిద్రపోయారు.

తెల్లవారగానే రాముడు భరద్వాజ మహర్షికి నమస్కారం చేశాడు. "మహాత్మా! రాత్రి సుఖంగా నిద్రపోయాం. ఇప్పుడు మేము చిత్రకూట పర్వతానికి వెళతాము. తాము ఆశీర్వదించి సెలవు ఇప్పించండి" అన్నాడు.

భరద్వాజుడు: నాయనా! చిత్రకూట పర్వతం మీద తేనె, కందమూలాలు అనేక రకాలైన ఫలాలు సమృద్ధిగా దొరుకుతాయి. రకరకాలైన వృక్ష సంపదతో ఆ ప్రదేశం అంతా మనోహరంగా ఉంటుంది. విహారానికై కిన్నెరులు, గంధర్వులు, ఉరగులు కూడా వస్తూ ఉంటారు. అనేక జంతువులు విహరిస్తూ ఉంటాయి. అనేక నదులు, సెలయేర్లు ప్రవహిస్తూ ఉంటాయి. చిన్నవి, పెద్దవియైన అనేక కొండ గుహలున్నాయి. అనేక పక్షులు గానం చేస్తూ ఉంటాయి. కాబట్టి నువ్వు అక్కడ ఆశ్రమం నిర్మించుకొని నివసించు.

## 55వ సర్గ పడవ కట్టుకొని యమునను దాటడం

పడవ యమునానది మధ్యలోకి చేరిన తరువాత సీతాదేవి ఇలా ప్రార్థించింది: “ఓ యమునాదేవీ! ఇప్పుడు నీ ప్రవాహాన్ని దాటి వెళ్తున్నాను. నా భర్త తన వనవాసవ్రతాన్ని కూడా మంగళకరమైన నీ ప్రవాహమంత వేగంగా ముగించుకొనేట్లుగా అనుగ్రహించు. నా భర్త ఇక్ష్వాకులచే పరిపాలించబడిన అయోధ్యకు క్షేమంగా చేరుకొన్న తరువాత నీకు వెయ్యి గోవులను, వంద మద్యపుకుండల్ని సమర్పించుకొని పూజిస్తాను. మమ్మల్ని దీవించి పంపు.” సీతమ్మ ఈ విధంగా ప్రార్థించిన తరువాత పడవ దక్షిణతీరాన్ని చేరింది. పడవ మీద ఉన్న ఆభరణాలు, ఆయుధాలన్నీ చేతబట్టుకొని శ్యామము అనే మర్రిచెట్టు వద్దకు వారు చేరుకున్నారు. భరద్వాజ మహర్షి చెప్పినట్లుగానే సీతాదేవి ఆ వటవృక్షాన్ని ఇలా ప్రార్థించింది:

“ఓ వటవృక్షమా! నీకు నమస్కారం. నా భర్త తన వనవాసవ్రతాన్ని నిర్విఘ్నంగా పూర్తిచెయ్యాలి. నేను మళ్ళీ అయోధ్యకు తిరిగి వెళ్ళి కౌసల్యాదేవిని, సుమిత్రాదేవిని, మరి ఇతర బంధువర్గాన్నందరినీ దర్శించేట్లు అనుగ్రహించు.” ఇలా అంటూ పదేపదే నమస్కారం చేసింది. పతివ్రత, విధేయురాలు, దోషంలేనిదైన సీతాదేవి ప్రార్థిస్తూండగా రాముడు లక్ష్మణునితో ఇట్లా అన్నాడు.

రాముడు: లక్ష్మణా! నువ్వు సీతతో కలసి ముందు నడుస్తూ ఉండు. నేను మన ఆయుధాలన్నీ తీసుకొని మీ వెనకనే నడుస్తూ ఉంటాను. ఈ ప్రాంతం అంతా సీతకు క్రొత్త. ఆమె ఇదివరకెప్పుడూ చూడని ఫలాలు, పుష్పాలు, తదితరములైనవి ఏవైనా చూసి అడిగితే నువ్వు వెళ్ళి వెంటనే తెచ్చి ఇవ్వు. ఆమెను సంతోషపెట్టడం మన కర్తవ్యం.

సీతాదేవి తాను ఇంతకుపూర్వం చూడని పుష్పాలుగాని, వృక్షాలుగాని, మరే వింతైనా కనపడినప్పుడు రాముణ్ణి అడిగేది. రాముడు వాటిని గూర్చి వివరంగా చెప్పేవాడు. వాళ్ళు అట్లా మాట్లాడుకుంటూ ఉండగానే లక్ష్మణుడు గబగబాపోయి ఆ పుష్పాన్నో, ఫలాన్నో తెచ్చి సీతమ్మ

కిచ్చేవాడు. ఆ విధంగా ఆ ముగ్గురూ మాట్లాడుకుంటూ ఒక క్రోసుదూరం నడిచారు. ఆ అడవి ప్రాంతంలో కనిపించే మృగాలను ఆకలి వేసినప్పుడల్లా చంపి, పక్వంచేసుకొని, ఆ మాంసాన్ని తినేవారు. భరద్వాజ మహర్షి చెప్పినట్లు ఆ ప్రాంతంలో ఎన్నో కోతుల్ని, కొండముచ్చులీ్న, ఎలుగుబంట్లనీ, అడవిపందుల్నీ, ఏనుగులను చూసి వారు ఎంతో ఆనందించారు.

# 56వ సర్గ సీతారామలక్ష్మణులు చిత్రకూటాన్ని చేరుకోవడం

వారంతా ఆ రాత్రి అక్కడే నిద్రించారు. తెల్లవారింది. ముందుగా రాముడే లేచాడు. లక్ష్మణుని మెల్లగా నిద్రలేపాడు. ఆ తరువాత "ఓ లక్ష్మణా! పక్షులన్నీ లేచాయి. చక్కటి ధ్వనులు చేసుకుంటూ ఆహారం కోసం వెతుక్కుంటున్నాయి. అందువల్ల ఇక మనంకూడా బయలుదేరాలి" అన్నాడు. అన్నగారు నిద్ర లేపగానే బద్ధకం, అలసట అన్నీ మాయమైపోయాయి. దిగ్గున లేచి కూర్చున్నాడు. అంతా కలసి యమునాతీరానికి పోయి స్నానాలు ముగించుకున్నారు. భరద్వాజ మహర్షి చెప్పిన చిత్రకూటానికి ప్రయాణమయ్యారు.

రాముడు: సీతా! ఈ కింశుక వృక్షాల్ని చూడు. శిశిరం ముగియటంతో, ఈ కింశుక వృక్షాలన్నీ ఎర్రటి పుష్పాలతో నిండిపోయాయి. ఒక్క ఆకు కూడా కనిపించటంలేదు. చెట్టు చెట్టునా పుష్పించిన ఎర్రటి పుష్పాల మూలంగా అడవికంతా నిప్పు అంటుకుందా అనిపిస్తోంది. ఆ వృక్షాలన్నీ తమ పుష్పాలతో తామే మాలలు ధరించినట్లుంది. ఆహా! ఎంత మనోహరమైన దృశ్యం!

సీతా! ఈ జీడిచెట్లను చూడు. ఇవన్నీ తమ పువ్వుల కాయల బరువును మోయలేక తలలు వాల్చేసుకున్నాయి. కానీ ఈ ఫలపుష్పాలను అనుభవించేందుకు ఎవరూ లేరుగదా! మనకు ఈ ప్రాంతంలో ఫలాలు, పుష్పాలు పుష్కలంగా లభిస్తాయి. మనం సుఖంగా జీవించవచ్చు.

లక్ష్మణా! చెట్టు చెట్టునా తేనెపట్టులు పెట్టాయి. ప్రతీ తేనెపట్టు పెద్దబాన అంత ఉన్నది. వాటినిండా కమ్మటితేనె నిండి ఉంది. ఈ చెట్ల కింద అంతా రాలిన పూలతో మెత్తగా తివాచీలు పరచినట్లున్నాయి. కోయిలమ్మలు కమ్మగా పాడుతున్నాయి. నెమళ్ళు పురివిప్పి నాట్యం చేస్తున్నాయి. ఇవేవీ పట్టించుకోకుండా ఏనుగులు తమ పాటిన తాము గుంపులు గుంపులుగా మెల్లగా నడుస్తున్నాయి.

నాయనా! లక్ష్మణా! మనం ఈ చిత్రకూటంపై చదునైన నేలను చూసుకొని ఈ వృక్షాల మధ్యనే సుఖంగా జీవిద్దాం. ఆ పర్వతంపైన మనకు ఎక్కడ చూసినా రుచికరాలైన కందమూలాలు, ఫలాలు లభిస్తాయి. మధురమైన నీరున్న మడుగులు, సరస్సులు, సెలయేరులు, లెక్కకు మించి ఉన్నాయి. మనతో స్నేహం చేయటానికి అనేక పక్షిజాతులున్నాయి. ఈ పర్వతంపైనే అనేకమంది మునీశ్వరులు కూడా తపస్సు చేసుకుంటున్నారు.

వారంతా అట్లా మాట్లాడుకుంటూ వాల్మీకి మహర్షి ఆశ్రమానికి చేరుకున్నారు. వాల్మీకి మహర్షికి ముగ్గురూ శిరస్సువంచి నమస్కరించారు. ధర్మవేత్త అయిన వాల్మీకి మహర్షి వారిని ఎంతో ఆదరంతో ఆహ్వానించి స్వాగతం పలికాడు. ఆసనం చూపాడు. అప్పుడు రాముడు తనను గూర్చి, లక్ష్మణుని గూర్చి, సీతను గూర్చి ఆ మహర్షికి తెలిపాడు. తాము అక్కడే నివాసం ఏర్పాటు చేసుకుంటున్నామని కూడా తెలియజేశాడు.

రాముడు: లక్ష్మణా! మనం ఈ ప్రాంతంలోనే ఆశ్రమం ఒకటి ఏర్పాటు చేసుకుందాం. అందు లోనే ఒక పర్ణశాలను కూడా నిర్మించుకుందాం. అందుకు అవసరమయ్యే కలపను సిద్ధంచెయ్యి.

అప్పుడు లక్ష్మణుడు రామాజ్ఞను శిరసావహించి వివిధ రకాలైన వృక్షాలనుండి కలపను సిద్ధంచేశాడు. దాంతో పర్ణశాల ఒకటి నిర్మించాడు.

రాముడు: లక్ష్మణా! మనం ఈ పర్ణశాలలోనే చాలాకాలం ఉండాలని అనుకొంటున్నాను. అందువల్ల వాస్తుశాంతి కూడా చేస్తే బాగుంటుంది. కనుక లేడిమాంసం తీసుకొనిరా. నైవేద్యం చేసి వాస్తుపూజ చేద్దాం. ఈ రోజు మంచి ముహూర్తం. యజమానికి స్థిరత్వాన్నిస్తుంది.

అంతట సుమిత్రాపుత్రుడైన లక్ష్మణుడు ఒక కృష్ణజింకను వేటాడి తెచ్చాడు. దాని మాంసాన్ని నిప్పులోవేసి పక్వంచేశాడు. అంగవైకల్యంలేని జింకమాంసాన్ని రాముడి ముందుంచి "అన్నా లేడిమాంసం పక్వంచేసి తెచ్చాను, దేవతాపూజ చేయటానికి నువ్వే సమర్థుడివి"

అన్నాడు. అప్పుడు రాముడు వాస్తుమంత్రాలను సంగ్రహంగా పఠించాడు. దేవతలందరినీ పూజించాడు. రుద్రుని, విష్ణువుని, విశ్వేదేవతలను ఉద్దేశించి బలులు సమర్పించాడు. నియమానుసారంగా జపాలన్నీ చేశాడు. ఆ విధంగా వాస్తుశాంతి చేసి ఉత్తమబలులు అన్నీ ఇచ్చి నదికి పోయి స్నానంచేసి వచ్చాడు. ఈలోగా లక్ష్మణుడు ఆశ్రమంలో ఉండాల్సిన వేదికల్ని, చైత్యాలను, అగ్నిగృహాలను ఏర్పాటుచేశాడు. అడవిలో లభించే పండ్లు, పుష్పాలను, మూలములను, ఉడికించిన మాంసాన్ని తెచ్చాడు. జలతర్పణాలతోను, వేదోక్తమైన మంత్రాలతోను, దర్భలు, కుశలు, సమిధలతో శాస్త్రోక్తంగా భూతశాంతి చేశారు. తరువాత పర్ణశాలలోకి ప్రవేశించారు.

పర్ణశాల ఎంతో రమణీయంగా ఉంది. ఎటునుంచి చూసినా రకరకాలైన పూలచెట్లు కనిపిస్తూ ఉన్నాయి. వివిధరకాల పక్షుల కూతలు వినిపిస్తూ ఉన్నాయి. ఎత్తైన ప్రదేశంలో కట్టడంవల్ల లోయలో తిరిగే ఏనుగులు మొదలైన వన్యమృగాలు కనిపిస్తూ ఉన్నాయి. మాల్యవతీనది స్వచ్ఛమైన జలాలు చెయ్యిజాపితే అందేటంత దూరంలో కనిపిస్తూ ఉన్నాయి. పర్ణశాలలో గాలి ఆహ్లాదంగా వీస్తూ ఉంది. దేవేంద్రుడు దేవగణంతో 'సుధర్మ' అనే సభాభవనంలోకి పోయినట్లు, రాముడు, సీతా, లక్ష్మణులు ఆ పర్ణశాలలోనికి ప్రవేశించారు. అయోధ్య వదలి వచ్చామే అన్న విచారం వాళ్ళలో ఎక్కడా కనిపించడం లేదు.

## 57వ సర్గ సుమంత్రుడు అయోధ్య చేరడం

సీతా రామలక్ష్మణులు గంగను దాటి వెళ్ళేవరకు గుహుడు, సుమంత్రుడు తదితరులంతా అక్కడే చూస్తూ నిలబడిపోయారు. తరువాత గుహుడు సుమంత్రుణ్ణి వెంటబెట్టుకొని తనతో శృంగిబేరపురానికి తీసుకొని వెళ్ళాడు. సుమంత్రుడు అక్కడే నాలుగు రోజులున్నాడు. గుహుడు, రాముడి వెనకాలే తన మనుషుల్ని పంపాడు. వారు నాలుగు రోజుల్లో తిరిగి వచ్చారు. సీతా రామలక్ష్మణులు ప్రయాగ క్షేత్రాన్ని చేరుకున్నారని, ఆ రాత్రికి అక్కడే భరద్వాజుని ఆశ్రమంలో విశ్రాంతి తీసుకున్నారని, అటుతర్వాత చిత్రకూట పర్వతానికి పోయి అక్కడే పర్ణశాల నిర్మించుకున్నారని చెప్పారు.

అప్పుడు సుమంత్రుడు గుహుడి అనుమతి తీసుకొని అయోధ్యకు బయలుదేరి వెళ్ళాడు. దారిలో ఎక్కడా ఆగకుండా అడవులు, గ్రామాలు, పట్టణాలు దాటుకుంటూ మూడు రోజుల తర్వాత అయోధ్య చేరుకొన్నాడు. అయోధ్యానగర వీధులన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి. ఎక్కడా గుర్రాల సంచారంగాని, ఏనుగులు తిరగటంగాని కనపడలేదు. పట్టణం యావత్తూ పాడుపడిపోయినట్లుంది. రాముడు వెళ్ళిపోయిన దుఃఖంలో పట్టణమంతా శోకాగ్నిలో మునిగిపోయింది.

అంతలో సుమంత్రుడు రథంలో రావటం జనం కిటికీలలో నుండి చూశారు. ఆశతో గబాగబా పరుగెత్తుకువచ్చి "రాముడెక్కడ?" అని సుమంత్రుణ్ణి అడిగారు: "నేను రాముణ్ణి గంగాతీరాన వదలి వచ్చాను" అని చెప్పాడు. జనమంతా హాహాకారాలు చేశారు. "హా రామా!" అంటూ ఆక్రందనలు చేశారు. సుమంత్రుడి రథం రాకముందు నిశ్శబ్దంగా ఊరంతా పాడుపడినట్లుండగా, ఇప్పుడు రాముడులేని రథాన్ని చూసి ఆక్రందనలతో అయోధ్య అంతా మారుమ్రోగింది. ఇదివరకు యజ్ఞాలు జరిగేటప్పుడో, వివాహాల్లోనో, దానధర్మాలు చేసేటప్పుడో రాముణ్ణి చూసేవాళ్ళం. ఇక మా జన్మలో రాముణ్ణి చూడలేము అని జనం ఘొల్లుమన్నారు.

రాముడు ఉండగా మా తండ్రిలాగా మా మంచిచెడులన్నీ తానే చూసేవాడు ఇక మాకు దిక్కెవరని వాపోయారు.

చివరగా సుమంత్రుడు రథాన్ని దశరథ మహారాజు భవనం వద్ద ఆపాడు. రథంలోనుండి దిగి ఎవరినీ పలకరించకుండా, తలవంచుకొని ఏడు ప్రాకారాలు దాటాడు. ఎనిమిదవ ప్రాకారంలోని దశరథుడున్న భవనంలోకి ప్రవేశించాడు. పుత్రశోకంతో కుమిలిపోతున్న దశరథ మహారాజును చూశాడు.

అంతఃపురకాంతలు సుమంత్రుడు రావడం చూశారు. ఒకరు: రాముణ్ణి రథంలో తీసుకునిపోయిన ఈ సుమంత్రుడు ఒంటరిగా వచ్చాడు. కౌసల్యాదేవికి ఏమని సమాధానం చెప్తాడు? ఎంతచెప్పినా వినిపించుకోకుండా ఆ రాముడు అడవులకు వెళ్లిపోయాడు. అయినా కూడా కౌసల్య ఇంకా బ్రతికే ఉందంటే ఏమని అనుకోవాలి? ఆవిడ కాబట్టి ఇంకా బ్రతికే ఉంది. మరొకరైతే ఈపాటికే చచ్చిపోయేవారు, అంటూ దశరథుని భార్యలు చెప్పుకునే మాటలు వింటూ సుమంత్రుడు దశరథుడున్న భవనంలోకి ప్రవేశించాడు. దశరథ మహారాజును చూసి నమస్కారం చేశాడు. బాగా దగ్గరగాపోయి రాముడు చెప్పమన్న మాటలను వినిపించాడు. ఆ మాటలు విన్న దశరథుడు శోకంతో మూర్ఛపోయాడు. అక్కడే పడిపోయాడు. దశరథుని భార్యలు త్వరగావచ్చి అతణ్ణి లేవనెత్తి పడుకోబెట్టి సపర్యలు చేశారు. దశరథుడితోపాటు అందరూ భోరున ఏడ్చేశారు.

కౌసల్య: మహారాజా! ఇతరులు చెయ్యలేని పనిని రాముడు చేసి చూపించాడు. మీ గౌరవాన్ని, మీ వంశగౌరవాన్ని నిలబెట్టాడు. అటువంటి రాముడు మీతో చెప్పమన్న మాటలు సుమంత్రుడు చెప్తున్నాడు. వినరేమిటి?

రాజా! లోకంలో ఎవరూ చేయని పనిని చేశారు మీరు. ఇప్పుడు ఈ విధంగా సిగ్గుపడుతున్నావేమి? లేచి కూర్చుని రాముడు చెప్పి పంపిన మాటలు వినండి. మీరు కైకకిచ్చిన

మాట నిలబెట్టుకొని పుణ్యం సంపాదించుకున్నారుగదా! ఇప్పుడు ఏడుస్తూ కూర్చుంటే ఏమైనా లాభం ఉంటుందా? మీరు కైకేయికి భయపడేకదా, సుమంత్రుడి మాటలు వినడంలేదు. ఆ కైకేయి ఇక్కడ లేదు లెండి. లేచి కూర్చుని సుమంత్రుడు చెప్పేది వినండి.

ఈ విధంగా శోకంతో పలికి కౌసల్యాదేవి భరించశక్యంకాని దుఃఖంతో నేలమీద పడిపోయింది. ఈ రకంగా మహారాజు, పట్టపురాణి దుఃఖసముద్రంలో మునిగిపోయి ఉండటం చూసిన అంతః పుర స్త్రీ లందరూ భోరున ఏడ్చారు.

రాజాంతఃపురం నుండి బయలుదేరిన ఆ హాహాకారాలు అయోధ్యా నగరమంతా వ్యాపించాయి. ఆబాలగోపాలం, స్త్రీలు పురుషులు అంతా కలసి పెద్దపెట్టున రోదించారు.

# 58వ సర్గ రాముని సందేశాన్ని వినిపించడం

రాణులంతా కలసి దశరథునికి ఉపచారాలు చేశారు. కొంతసేపటికి తెప్పరిల్లాడు. అప్పుడు సుమంత్రుణ్ణి పిలిపించారు. రోగం వచ్చిన ఏనుగులాగా 'రామా' 'రామా' అంటూ కేకలు వేస్తున్న దశరథుడు, సుమంత్రుణ్ణి దగ్గరకు పిలిపించుకున్నాడు. సుమంత్రుడు కూడా కన్నీరు కారుస్తూ చేతులు జోడించి మహారాజుకు నమస్కారం చేశాడు.

దశరథుడు: ఓ సుమంత్రుడా! ధర్మాత్ముడైన నా రాముడు ఏ చెట్టుకింద పడుకున్నాడు. రాజభోగాలు అనుభవించిన నా రాముడు ఇప్పుడు కందమూలాలు తింటూ కటికనేలపై పడుకుంటున్నాడా? అయ్యో ఇక్కడ పట్టుపాన్పులపై పడుకునేవాడే! రాముడు కాలుకదిపితే అతడి వెనుక రథ గజ తురగ పదాతిదళాలు వెంబడించి పోయేవే! ఇప్పుడు అరణ్యంలో ఎట్లా తిరుగుతున్నాడు? అరణ్యాలలో క్రూరమృగాలు, కృష్ణసర్పాలు విచ్చలవిడిగా తిరుగుతూ ఉంటాయే! అటువంటి అడవిలోకి ఎట్లా ప్రవేశించాడు?

ఓ సుమంత్రా! జనకపుత్రి, సుకుమారి అయిన సీత ఎన్నడూ ఏ కష్టమూ ఎరుగదు గదా! రథం దిగిన తర్వాత రామలక్ష్మణుల వెనుక ఎట్లా నడచివెళ్ళింది?

ఓ సుమంత్రుడా! అశ్వనీదేవతలు మందరపర్వతానికి పోయినట్లు రామలక్ష్మణులు అరణ్యానికి పోవడం నువ్వు కళ్ళారా చూశావు. నువ్వు ఎంతో అదృష్టవంతుడివి.

సుమంత్రా! నువ్వు అరణ్యానికి చేరిన తరువాత రాముడేమైనా చెప్పాడా? లక్ష్మణుడేమైనా అన్నాడా? సీత ఏమన్నది? ఓ సుమంత్రుడా! రాముడు ఎక్కడ కూర్చుంటున్నాడు? ఎక్కడ పడుకుంటున్నాడు? ఎక్కడ భోజనం చేస్తున్నాడు? చెప్పు. నువ్వు చెప్పే మాటలు విని యయాతి సత్పురుషుల సావాసంచేత జీవించినట్లు, నేనుకూడా ఇంకా కొంతకాలం జీవిస్తాను.

దశరథుడు ఈ విధంగా మాట్లాడుతూ ఉండగా సుమంత్రుడి గొంతు పూడుకుపోయింది.

కళ్ళనిండా నీళ్ళు నిండుకున్నాయి. మాటలు తడబడ్డాయి.

సుమంత్రుడు: మహారాజా! రాముడు ధర్మం తప్పలేదు. రెండు చేతులు జోడించి శిరస్సువంచి నీకు నమస్కరిస్తూ నీకు చెప్పమని నాతో ఇట్లా అన్నాడు.

ఓ సుమంత్రా! నా తండ్రి దశరథ మహారాజు మహాత్ముడు, నమస్కరింప దగినవాడు. అట్టి నా తండ్రికి శిరస్సువంచి నమస్కరిస్తున్నానని చెప్పు.

రాజా! అంతఃపురంలో ఉన్న రాణులందరికీ వారి వారి యోగ్యతానుసారంగా నమస్కారంచేసినట్లు చెప్పమన్నాడు. అట్టి నీ రాణులందరినీ సమభావంతో క్షేమం అడిగినట్లు చెప్పమన్నాడు.

నా తల్లి కౌసల్యాదేవికి నేను క్షేమంగా ఉన్నట్లు చెప్పు. ధర్మం తప్పకుండా అగ్నిహోత్రం, హోమం మున్నగు కార్యాలు క్రమం తప్పకుండా ఆచరించమన్నాడు. దశరథ మహారాజుకు దేవతలకు చేసినట్లుగా ఉపచారాలు చేస్తూ ఆయనను నా తల్లి కౌసల్యాదేవికి నేను క్షేమంగా ఉన్నట్లు చెప్పు. ధర్మం తప్పకుండా అగ్ని హోత్రం హోమం మున్నగు కార్యాలు క్రమం తప్పకుండా ఆచరించమన్నాడు. దశరథ మహారాజుకు దేవతలకు చేసినట్లుగా ఉపచారాలు చేస్తూ ఆయనను కాపాడుకొమ్మన్నాడు. అమ్మా! నిన్ను పట్టపురాణినన్న అహంకారాన్ని విడిచి పెట్టమన్నాడు. తక్కిన తల్లులతో స్నేహంగాను సౌహార్ద్రంతోను ఉండమన్నాడు. పూజ్యురాలైన కైకేయీదేవితో అనుకూలంగా ప్రవర్తించవలసిందన్నాడు. భరతుడు నీ కుమారుడే అయినా, రాజు పట్ల ఎలా ప్రవర్తిస్తామో, అదే రీతిన నువ్వుకూడా అతడితో ప్రవర్తించాలి. ఎందుకంటే అధికారం, ధనం విషయాల్లో నీకంటే పెద్దవాడు కదా! అదే రాజధర్మం అని గుర్తుంచుకో.

మహారాజా! రాముడు భరతునితో ఈ విధంగా చెప్పమన్నాడు.

ఓ భరతుడా! నువ్వు మన తల్లుల విషయంలో సమభావంతో మెలగాలి. భేదభావం

చూపవద్దు. తండ్రిగారు చెప్పినట్లు నడచుకుంటూ ఉండు. ఆయన వయస్సులో పెద్దవారు, అనుభవజ్ఞుడైన మహారాజు. పరమ ధార్మికుడు. ఆయన ఏం చెప్పినా వ్యతిరేకించవద్దు. అన్ని విషయాల్లోనూ ఆయన మాటను శిరసావహించు.

ఓ భరతుడా! నీకు నీ తల్లిపట్ల ఎంత ప్రేమ ఉందో నా తల్లిపట్ల కూడా అంతే ప్రేమాభిమానాలు చూపిస్తూ ఆమెను సంతోషపెట్టు.

మహారాజా! రాముడు ఈ మాటలు నాతో చెప్తూ వలవలా ఏడ్చాడు. లక్ష్మణుడు మాత్రం కోపంతో బుసలుకొడుతూ ప్రక్కనే నిలబడ్డాడు. "సుమంత్రా! ఈ రాజకుమారుడు ఏం నేరం చేశాడని దేశం నుండి వెళ్ళగొట్టారు" అని నిలదీసి అడిగాడు. కైకేయి నీచమైన కోరిక కోరగా మహారాజు చేయకూడని పనిచేశాడు. మమ్మల్ని నిర్దాక్షిణ్యంగా దేశంనుండి వెళ్ళగొట్టారు. కైకేయీదేవికిచ్చిన వరాలను నెపంగా చూపి, రాజ్యాన్ని ఆమె పరం చేశాడు. ఏమైనా ఆమె చేసింది అధర్మం; దుర్మార్గం. ఆయన మా అందరికీ రాజు కాబట్టి తను చేయదలచుకున్నదంతా యథేచ్ఛగా చేసేశాడు. ఆయనకు మతిస్తిమితం తప్పింది. మతిచెడే అంతా యథేచ్ఛగా చేసేశాడు. ఈ దుష్కర్మకు ఫలం తప్పక అనుభవిస్తాడు. నేను దశరథ మహారాజుకు విన్నవించుకోవలసింది ఏమీ లేదు. నాకు తల్లి అయినా, తండ్రి అయినా, ప్రభువు అయినా, అన్న అయినా రాముడే!

మహారాజా! ఎప్పుడూ చిరునవ్వుతో ఉండే సీతాదేవి కూడా ముఖం కాంతిహీనం కాగా నిట్టూరుస్తూ నా వంక చూసింది. నోరు విప్పి ఏమీ మాట్లాడలేకపోయింది. నా వంకా, రథం వంకా చూస్తూ వలవలా ఏడ్చింది. రాముడు, లక్ష్మణుడు ఆమెను ఓదార్చారు.

## 59వ సర్గ రాముని వియోగంతో దశరథుడు విలపించడం

సుమంత్రుడు చెప్పిందంతా విని తృప్తిచెందని దశరథ మహారాజు “ఇంకా ఏమేం జరిగాయో నాకు వివరంగా చెప్పు” అన్నాడు. సుమంత్రుని మనస్సంతా వ్యాకులత చెందింది. కళ్ళనిండుగా నీళ్ళు నిండాయి. గొంతు తడారిపోయింది. అట్లాగే తనను తాను సంబాళించుకొని చెప్పటం మొదలుపెట్టాడు.

మహారాజా! వీరులైన రామలక్ష్మణులు నారబట్టలు ధరించి జటలు కట్టుకొని గంగానదిని దాటి ప్రయాగ వైపుగా ప్రయాణం సాగించారు. సీతారాములకు రక్షణగా ముందు లక్ష్మణుడు నడక సాగించాడు. వాళ్ళు కనిపించినంతవరకూ గంగానది ఒడ్డునే నిలబడి చూశాం. గుర్రాలు కూడా దుఃఖాన్ని ఆపుకోలేక వేడి కన్నీరు కార్చాయి. వెనక్కు తిరిగేందుకు ఇష్టపడ లేదు. నాకు కూడా దుఃఖం ఆగలేదు. రాముడు కబురు పెడతాడేమోనన్న ఆశ నాలో ఇంకా చావలేదు. అక్కడ గుహుడి ఇంట్లో నాలుగు రోజులు బసచేశాను.

మహారాజా! రాముడు వెళ్ళిపోయిన తరువాత నీ దేశంలో ఉన్న చెట్లు కృశించిపోయాయి. చిగర్చటం, పుష్పించడం మానేశాయి. ఉన్న చిగుళ్ళు, పుష్పాలు కూడా ఎండిపోయాయి. నదుల్లోను, చెరువుల్లోను, సరస్సుల్లోను నీరంతా వేడెక్కింది. క్రూరమృగాలన్నీ కూడా వేటాడటానికి పోలేదు. మిగిలిన ప్రాణులన్నీ శక్తి ఉడిగిపోయి ఉన్న చోటు నుండి కదలలేకపోతున్నాయి.

మహారాజా! సరస్సుల్లోని పద్మాలు వాడిపోయాయి. వాటి ఆకులన్నీ నీళ్ళలో పైకి తేలటం లేదు, నీళ్ళలో మునిగిపోయి నీరంతా కలుషితమయింది. చేపలు సంతోషంతో ఈదలేకపోతున్నాయి. నీళ్ళలో పుట్టే పద్మపత్రాలు, నేలపై పుట్టే మల్లె, మొల్ల మొదలైన ఫలపుష్పజాతులన్నీ ఇప్పుడు సుగంధాలను వెదజల్లడం లేదు. వాటికి సహజంగా ఉండే సుగంధమూ పోయింది, సుకుమారత్వమూ పోయింది. ఉద్యానవనాలన్నీ వాడిపోయి

నశించడానికి సిద్ధంగా ఉన్నాయి.

మహారాజా! అట్లా ఉన్న అయోధ్యలోకి నేను రథంలో వస్తూ ఉంటే ఒక్కడు కూడా నన్ను పలుకరించలేదు. రాముడు లేని రథాన్ని చూసి నిట్టూర్పులు విడిచారు; కన్నీళ్ళు పెట్టుకున్నారు. స్త్రీలంతా వాళ్ళ ఇళ్ళ కిటికీల నుండి, మేడల మీద నుండి, విమానాల పైనుండి రాముడి కోసం ఆతురతతో నా రథం వైపు చూశారు. రాముడు రథంలో లేకపోవటంతో దుఃఖంతో హాహాకారాలు చేస్తున్నారు. రాముడి వియోగదుఃఖం విషయంలో శత్రువులనిగాని మిత్రులని గాని, తటస్థులనిగాని తేడాల్లేవు. అంతా ఒకే మాదిరిగా ఏడుస్తున్నారు. నా కంటికి అయోధ్య అంతా కూడా పుత్రుణ్ణి పోగొట్టుకున్న కౌసల్యాదేవిలా కనిపిస్తోంది.

దశరథుడు: సుమంత్రుడా! నేను దుష్టుల మధ్య వాళ్ళచేతుల్లో చిక్కుకుపోయాను. నాకు బుద్ధి పనిచేయలేదు. కైకేయి నన్ను ఆ విధంగా నిర్బంధించినప్పుడు, వృద్ధులు, జ్ఞానులు అయిన వారితో సంప్రదించి ఉండవలసింది. స్త్రీలోలుడనైన నేను మంత్రులతోగాని, సిద్ధులతోగాని ఆలోచించలేదు. తొందరపడి నిర్ణయం తీసుకున్నాను.

సుమంత్రా! చేజేతులా నా వంశాన్ని నాశనం చేసుకోవటానికే నాకీ వ్యసనం పట్టుకు పీడించింది. దైవం కూడా నాకు వ్యతిరేకంగా పని చేసింది.

ఓ సుమంత్రా! నా జీవితంలో నీకు ఎన్నడైనా ఏదైనా ఉపకారం చేసి ఉంటే, నన్ను రథంలో ఎక్కించుకొని రాముని వద్దకు తీసుకొనివెళ్లు. నా ప్రాణాలన్నీ రాముణ్ణే చూడాలంటున్నాయి. ఇంకా రాజుగా నా మాటకు, విలువ ఉంటే నేను రాముణ్ణి వెనక్కు తీసుకొని రమ్మని ఆజ్ఞాపిస్తున్నాను. వెంటనే రాముణ్ణి ఇక్కడకు తీసుకొని రా! రాముడు లేకుండా ఒక్క క్షణం కూడా బ్రతుకలేను. ఒకవేళ రాముణ్ణి తీసుకురావడానికి ఏమైనా అడ్డంకులుంటే, నన్ను రాముడి వద్దకు తీసుకొని వెళ్ళు.

నా రాముడి నేత్రాలు ఎర్రగా ఉంటాయి. వాడి దంతాలు గుండ్రంగా ఉంటాయి. ధనుస్సు

భుజాన ధరించినవాడు, మణికుండలాలతో ప్రకాశించేవాడు, ఆజానుబాహువు, ఇక్ష్వాకువంశానికే మణిదీపం వంటివాడు అయిన నా రాముణ్ణి చూడకపోతే నా ప్రాణాలు నిలవవు. నేను మరణించడం తప్పదు. అయ్యో! రామా! అయ్యో! లక్ష్మణా! అయ్యో! సీతా! నేను చనిపోయినా కూడా మీకు తెలియనంత దూరంలో ఉన్నారు గదా!

ఓ కౌసల్యాదేవీ! నేను శోకసముద్రంలో పడి ఉన్నాను. రాముడి ఎడబాటే ఆ సముద్రం. సీతావియోగమే దాని తీరం. ఆ వియోగం చేత క్షణక్షణానికీ తీరం నుండే దూరమై పోతున్నాను. నేను రామవియోగాన్ని భరించలేక విడిచే నిట్టూర్పులే ఆ సముద్రంలోని సుడిగుండాలు. నా ఆక్రందనలే ఆ సముద్రం చేస్తున్న ఘోష. నా చేతులే సముద్రంలో చేపల వంటివి. విరబోసుకున్న నా తలవెంట్రుకలే సముద్రంలో పెరిగే నాచు. కైకేయి అట్టి సముద్రంలో నుంచి పుట్టిన బడబాగ్ని. నా కన్నీటి ప్రవాహమే ఆ బడబాగ్ని వేగం. ఆ గూని దాసీ, దాని మాటలే మొసళ్ళు. కైకేయి అడిగిన రెండు వరాలు ఆ సముద్రానికి రెండు తీరాలు. ఈ రెండు తీరాలకు ఉన్న మధ్య దూరమే రాముణ్ణి అడవులకు పంపిన కాలం. ఇటువంటి భవసాగరాన్ని నేను దాటలేను. నా కష్టం ఎవరూ తీర్చేలాగా లేదు. నేను ఆయుర్దాయం ఉన్నంత కాలం ఏడుస్తూ చావవలసిందే.

ఇట్లా మాట్లాడుతూనే మహారాజు మూర్ఛపోయి పక్కపైన ఒరిగిపోయాడు.

రాముడు అడవికి పోవడం ఒక ప్రక్కా, ఇటు భర్త అడుగడుగునా మూర్ఛపోతూ ఉండడం మరో ప్రక్కా, కౌసల్య పాలిట గోరుచుట్టుపై రోకటిపోటులా పరిణమించాయి.

# 60వ సర్గ కౌసల్యను సుమంత్రుడు ఓదార్చటం

కౌసల్య ఒంట్లోనుండి భయంతో కూడిన వణుకు వస్తోంది. పిశాచం ఆవహించిన దానికి మల్లే ఊగిపోతోంది, కిందపడి పొర్లిగింతలు పెడుతోంది. అంతలోనే కొద్దిగా కళ్ళు తెరచి సుమంత్రుణ్ణి చూస్తూ "ఓ సుమంత్రా! సీతారామ లక్ష్మణులు లేని ఈ రాజ్యంలో నేను జీవించలేను. వెంటనే రథాన్ని వెనక్కు తిప్పు. నేను కూడా వాళ్ళతోపాటే అరణ్యంలో ఉంటాను. నువ్వు అట్లా కాదంటే యమలోకానికే పోతాను కానీ, ఇక్కడ మాత్రం ఉండను" అంది.

ఆ విధంగా రోదిస్తున్న కౌసల్యాదేవిని ఉపశమన వాక్యాలు చెబుతూ సుమంత్రుడు ఇట్లా ఓదారుస్తున్నాడు.

"అమ్మా! కౌసల్యాదేవీ! నువ్వు దుఃఖంతోను, మోహం చేతను మనస్సు పాడుచేసుకోవద్దు. రాముడు అక్కడ క్షేమంగాను సంతోషంగాను ఉన్నాడు. ధర్మజ్ఞుడైన లక్ష్మణుడు పరలోకచింతనతో, అన్నగారికి పాదసేవ చేస్తున్నాడు. అటు సీతాదేవి కూడా రాముడికి ఇక్కడ సేవలు చేస్తున్నట్లే అక్కడ కూడా ఏ లోపమూ లేకుండా సేవలు చేస్తోంది. అరణ్యంలో ఉన్నాకూడా రాముడు ఏ కొరతా లేకుండా సుఖంగా ఉన్నాడు. వాళ్ళు ముగ్గురూ వనవాసానికి అలవాటుపడిపోయారు. సీతమ్మ కూడా ఇక్కడ ఉద్యానవనాల్లో విహరించినట్లే అక్కడ రాముడితో కలసి తపోవనాల్లో విహరిస్తున్నది. సీత మహాపతివ్రత, ఆమెకు రాముడితోడిదే లోకం. చిన్నపిల్లలా రాముడితో ఆడుకుంటూ ఉంటుంది. రాముడులేని అయోధ్య ఆమెకు అరణ్యం. రాముడితో కలసి ఉండే అరణ్యమే ఆమెకు అయోధ్య. ఆమె ముఖంలో కళాకాంతులు అట్లాగే చెక్కుచెదరకుండా ఉన్నాయి.

అమ్మా! కౌసల్యాదేవీ! మేము వాళ్ళను గంగాతీరాన వదలి వచ్చేశామా? ఇంకా వాళ్ళు ఒక క్రోసెడు దూరమైనా వెళ్ళి ఉండరు. సీతకు ఆ అరణ్యప్రాంతమంతా ఎంతో కొత్తగా ఉంది. ఆయా గ్రామాలను గురించీ, పట్టణాలను గురించీ, నదుల గురించీ రాముణ్ణి అడిగి

తెలుసుకొంటూ ఉంది. ఎక్కడ ఏ కొత్త వృక్షాన్ని చూసినా, పుష్పాన్ని చూసినా రాముణ్ణి అడిగి తెలుసుకుంటోంది. లక్ష్మణుడు క్షణాల్లో వాటిని తెచ్చి ఆమె చేతిలో ఉంచుతున్నాడు. వాటన్నింటినీ చూస్తూ వినూత్న అను భూతుల్ని పొందుతోంది.

ఒకసారి కైకేయీదేవిని గూర్చి ఏదో అన్నది కానీ సరిగా గుర్తుకు రావడంలేదు, అని తన్ను తాను సంబాళించుకున్నాడు. సుమంత్రుడు కౌసల్యాదేవిని సంతోషపెట్టే మాటలే చెప్పాడు. రాముడి ప్రక్కన ఉన్న సీత సింహమన్నా, పెద్దపులి అన్నా, ఏనుగులన్నా కొంచెంకూడా భయపడటం లేదు. కాలికి పారాణి లేకపోయినా, ఆమె పాదాలు తామర మొగ్గల్లా ఎర్రగా కనిపించేవి. అరణ్యాల్లో ఉన్నా ఎండవానల్లో తిరుగుతున్నా ముఖం కించిత్తు కూడా వసివాడలేదు.

కనుక ఓ దేవీ! మనమెవ్వరమూ సీతా రామలక్ష్మణుల గూర్చి చింతించాల్సిన పనిలేదు. అరణ్యాల్లో కందమూలాలు తింటున్నా మహర్షుల్లా సుఖసంతోషాలతో ఉన్నారు. వారి చరిత్ర సూర్యచంద్రులున్నంత కాలం చిరస్థాయిగా ఉంటుంది.

# 61వ సర్గ కౌసల్య విలపిస్తూ దశరథుని నిందించడం

కౌసల్యాదేవి ఏడుస్తూ దశరథ మహారాజును చూసి ఇలా అన్నది.

"మహారాజా! ధర్మం ఆచరించటంలో శ్రేష్ఠుడవు. దయాశీలుడవని, ఉదార స్వభావుడవని మూడు లోకాల్లోనూ నీకు పేరు ఉంది. ఉంటే ఉండవచ్చునుగాక! అటువంటి నువ్వు నీ పెద్దకొడుకు విషయంలో ఏం చేశావు? ప్రజలందరిచేత ప్రేమించబడ్డ రాముణ్ణి వనవాసానికి పంపావు. పుట్టినప్పటనుండీ సుఖాలకు, భోగాలకూ అలవాటుపడిన సీత అల్లారుముద్దుగా పెరిగింది. పైగా యౌవనంలో ఉంది. అటువంటి సీతను కూడా రామలక్ష్మణులతోపాటు అడవులకు పంపావు. అక్కడ ఉంటే ఆ శీతోష్ణాలకు ఆ పిల్ల తట్టుకోగలదా? ఇంతవరకూ మంచి రుచికరమైన రకరకాల ఆహారాలను భుజించేది. ఇప్పుడు అరణ్యంలో దొరికే కందమూలాలతో సరిపెట్టుకోవలసిందే కదా! మంగళకరమైన గీతవాద్యాలను వింటూ ఆనందిస్తూ ఉండేది. ఇకపైన ఆ జానకి సింహాలు, పెద్దపులుల అరుపులతో సరిపెట్టుకోవాల్సిందే. ఇంద్రుడి ధ్వజస్తంభంలా ఎంతో ఉన్నతంగా ఉండేవాడు, పొడుగాటి బాహువులుగల వాడు, మహాబలశాలి అయిన రాముడు తలకింద చెయ్యి పెట్టుకొని పడుకోవలసిందే. నా రాముడి ముఖం పద్మంలా ఉంటుంది. నా రాముడి జుట్టు ఎంతో అందంగా ఉంటుంది. అటువంటి రాముణ్ణి మళ్ళీ ఎప్పుడు చూడగలుగుతానో గదా? రాముడి కోసం ఇంతగా తపిస్తున్నాకూడా నా గుండె వెయ్యిముక్కలు కాకుండా ఉందే! అంటే దాన్ని ఏ వజ్రంతోనో చేసి ఉండాలి? లేకపోతే ఈపాటికే పగిలి తునాతునకలయ్యేది.

ఓ మహారాజా! నీవు దయాదాక్షిణ్యాలు లేని కసాయివాడవు. లేకుంటే సకల సుఖాలు అనుభవించవలసిన నా సీతారామలక్ష్మణులను నా నుంచి దూరంగా అడవులకు పంపి ఉండేవాడవు కావు. వాళ్ళు ముగ్గురూ అతిదీనంగా అడవుల్లో కష్టాలు పడుతున్నా కూడా నా గుండె పగిలిపోకుండా ఉంది.

ఓ రాజా! రాముడు పద్నాలుగు సంవత్సరాలు వనవాసం చేసి పదిహేనో సంవత్సరాన తిరిగి అయోధ్యకు వచ్చినా కూడా, భరతుడు తన సింహాసనాన్ని, కోశాగారాన్ని రాముడికిస్తాడా? కొంతమంది పితృదేవతలకు శ్రాద్ధం పెడుతూ భోజనాలు బ్రాహ్మణులకన్నా ముందుగా తమ బంధువులకే పెడ్తారు. ఆ తరువాత బ్రాహ్మణులకు భోజనం వడ్డిస్తారట. అట్లా ఆహ్వానించబడిన బ్రాహ్మణులు, విద్వాంసులు, గుణవంతులు, పండితులు, దేవతలతో సమానమైన తపశ్శాలురయితే ఇతరులు భోజనం చేసిన తరువాత తమకు అమృతం వడ్డించినా ముట్టుకోరు. తమకంటే ముందు తిని వెళ్లినవారు బ్రాహ్మణులే అయినా కూడా బుద్ధిమంతులైనవారు భోజనం చేయటానికి అంగీకరించరు. ఎడ్లు తమ కొమ్ములు కోయించుకోవటానికి ఇష్టపడతాయా? ఏనుగులు తమ దంతాలు పీకుతామంటే ఒప్పుకుంటాయా?

మహారాజా! రాముడు మీకు పెద్దకొడుకు మాత్రమే కాదు, పరమ శ్రేష్ఠుడు కూడాను. తమ్ముడు అనుభవిస్తున్న రాజ్యాన్ని కోరుకుంటాడా? పెద్దపులులు, సింహాలు మరో జంతువు మూతిపెట్టిన ఆహారాన్ని తినవు. అట్లాగే రాముడు కూడా ఇతరులు అనుభవించిన రాజ్యాన్ని అంగీకరించడు. యజ్ఞయాగాదుల్లో హవిస్సు, నెయ్యి పురోడాశములు, కుశలు, యూపస్తంభాలు మొదలైన వాటిని ఒకసారి వాడిన తర్వాత మళ్ళీ యజ్ఞంలో ఉపయోగించరు. అట్లాగే రాముడుకూడా ఇతరులు అనుభవించిన రాజ్యాన్ని సారాన్ని తీసేసిన మద్యంలా, నష్టమైపోయిన సోమలతగల యజ్ఞంలా అంగీకరించడు.

రాజా! రాముడు చాలా ఆత్మాభిమానం కలవాడే కాని, బలహీనుడు కాడు. వాడికి కోపం వస్తే మందరపర్వతాన్నైనా పిండిచేయగలడు. ఏదో కన్న తండ్రివి కదా అన్న మమకారంతో ఆ మహాత్ముడు నిన్ను చంపలేదు. కోపంవస్తే సూర్యచంద్రుల్ని, నక్షత్రమండలాన్ని, ద్యులోకాన్నికూడా క్రిందికి పడగొట్టగల సమర్థుడు. వాడే తలచుకుంటే వందలకొద్దీ పర్వతాలున్న భూమండలాన్నే చీల్చిచండాడగలడు. అటువంటి నా రాముడు నీ మాటను సత్యం చేయటంకోసం మారు మాట్లాడకుండా వనవాసానికి వెళ్ళాడు.

రాజా! పులితోక పుచ్చుకొని ఎవరైనా ఆడుకుంటారా? అట్లాగే రాముడు ఈ అవమానాన్ని సహించడు. లోకాలన్నీ కలసి మహాయుద్ధాన్ని ప్రకటించినా రాముణ్ణి భయపెట్టలేవు. ఈ ధర్మాత్ముడు లోకంలో ధర్మాన్ని స్థాపించగల సమర్థుడు, మహా పరాక్రమశాలి అయిన రాముడి బాణాలనుండి పుట్టే అగ్ని సకలభూతాలను, సప్తసముద్రాలను కూడా కాల్చివేయగలదు.

మహారాజా! సింహం వంటి బలశాలి అయిన రాముణ్ణి చేపలు తమ సంతానాన్ని తామే చంపినట్లు చంపేశావు. ధర్మాత్ముడైన కుమారుణ్ణి దేశంనుండి వెళ్ళగొట్టావు. ఇది శాస్త్రసమ్మతమా? బ్రహ్మవేత్తలు అనుసరించే సనాతనధర్మమేనా ఇది?

రాజా! స్త్రీకి భర్త మొదటి రక్షకుడు. తరువాత కుమారుడు. జ్ఞాతులు మూడవగతి అవుతారు. ఇప్పుడు నీవు జీవించి ఉన్నా లేనివాడిక్రిందే లెక్క. ఇక నా పుత్రుడు అడవులపాలయ్యాడు, అన్నివిధాలా నన్ను గతిలేనిదాన్నిగా చేశావు. నీ మూలంగా ఈ దేశం నాశనమయింది. మంత్రులందరినీ చంపేశావు. చివరగా నిన్ను నీవే చంపుకున్నావు. నన్నూ నా కుమారుణ్ణి చంపేశావు, నిన్ను నమ్ముకున్న ప్రజల్ని చంపేశావు. ఇక నీ కొడుకు భరతుడు, నీ భార్య కైకేయి మాత్రమే ఈ రాజ్యాన్ని ఏలేందుకు మిగులుతారు. వాళ్ళిద్దరే ఆనందించేవాళ్ళు.

# 62వ సర్గ దశరథుడు కౌసల్యను ఊరడించటం

దుఃఖంచేత కౌసల్యాదేవి అన్న మాటలన్నీ దశరథ మహారాజుకు ములుకులై గుచ్చుకున్నాయి. రామవియోగానికి తోడు, పూర్వం తను శబ్దవేధి బాణం ద్వారా చేసిన పాపకృత్యం జ్ఞాపకానికివచ్చి మరింత క్రుంగదీసింది. భయంతో గొంతులోనుంచి వణుకు ప్రారంభమయింది, నేలచూపులు చూస్తూ రెండు చేతులూ జోడించి కౌసల్యాదేవికి నమస్కారంచేసి ఇట్లా అన్నాడు.

దశరథుడు: కౌసల్యా! నువ్వు నా పట్ల ఎన్నడూ కోపాన్ని ప్రదర్శించలేదు. నువ్వు ఎంతో మంచిదానవు. నన్ను ఎంతో ప్రేమగా చూసుకునేదానవు. ఈ విషయంలో నువ్వు నాపట్ల కరుణ చూపించాలి. నిన్ను చేతులు జోడించి యాచిస్తున్నాను.

కౌసల్యా! నువ్వు మంచిచెడులన్నీ బాగా తెలిసినదానవు, నువ్వు ఎంతో దుఃఖంలో ఉన్నావని నేను ఎరుగుదును. నువ్వు పరమ ధార్మికురాలవు. శత్రువులనైనా దయతోచూసే స్వభావం గలదానవు. గుణవంతురాలైన స్త్రీలకు గుణవంతుడయినా, కాకపోయినా భర్త ప్రత్యక్షదైవం. నువ్వు దుఃఖంతో మాట్లాడిన ఎత్తిపొడుపు మాటలతో నన్ను ఇంకా బాధించవద్దు.

మహారాజు, భర్త అయిన దశరథుడు ఈ విధంగా దీనుడై బ్రతిమాలుతుంటే కౌసల్యాదేవి హృదయం కరిగిపోయింది. కన్నుల నీరు జలజలా కారసాగింది. శరీరం క్షోభిస్తే రక్తం కారుతుంది. హృదయం క్షోభిస్తే కన్నీరు కారుతుంది. ఆయన రెండు చేతులూ పట్టుకొని తన తలపై ఉంచుకుంది.

కౌసల్య: నాథా! మీరట్లా దీనులై యాచిస్తూ మాట్లాడుతుంటే నాకు తల కొట్టేసినట్లుంది. నేను మీకు సాష్టాంగ నమస్కారం చేస్తున్నాను. నా అజ్ఞానాన్ని క్షమించండి, మిమ్మల్ని చాలా క్షోభపెట్టాను.

మహావీరా! కీర్తిమంతుడూ, బుద్ధిమంతుడూ అయిన భర్తచేత దీనమైన మాటలు మాట్లాడేట్లుచేయడం వలన భార్యకు ఇహపరాలు రెండూ చెడుతాయి. ధర్మాత్ముడవైన ఓ మహారాజా! నీవు ధర్మాత్ముడవనీ, సత్యసంధుడవనీ తెలిసికూడా పుత్రశోకం చేత అనరాని మాటలన్నీ అన్నాను. లోకంలో శోకం, ధైర్యాన్ని నశించేట్లు చేస్తుంది, శోకం శాస్త్రజ్ఞానాన్ని కూడా నశింపచేస్తుంది. శోకం సర్వాన్నీ నాశనం చేస్తుంది. మానవులకు శోకమంతటి శత్రువు మరొకటి ఉండదు. శత్రువులు నాలుగు దెబ్బలు వేసినా భరించగలం కానీ శోకాన్ని భరించలేం. ధర్మవేత్త, శాస్త్రజ్ఞుడు ధర్మార్థాలు రెండిటినీ జయించిన సన్న్యాసులు కూడా శోకంచేత మూఢులైపోతున్నారు. రాముడు అడవులకు వెళ్ళి అయిదు దినాలే అయినా, శోకంచేత సంతోషం నశించి అయిదు సంవత్సరాలైనట్లుంది. నదుల్లోని నీరువచ్చి పడుతూ ఉంటే, సముద్రం పొంగినట్లే నా మనస్సులో కూడా అలలు నిలువెత్తున లేచి క్రింద పడుతున్నట్లున్నది.

ఇట్లా దశరథమహారాజు, కౌసల్యాదేవి పరస్పరం ఓదార్చుకుంటూ ఉండగా సూర్యాస్తమయం అయింది.

# 63వ సర్గ దశరథుని శాప వృత్తాంతం

దశరథ మహారాజు కాసేపు నిద్రపోయాడు. కౌసల్యాదేవి ఇంకా నిద్రపోతూనే ఉంది. రామలక్ష్మణులను అడవులకు పంపడం వల్ల ఆయన రాహువు మింగిన సూర్యుడిలా అయ్యాడు. పక్కపైన అటూ ఇటూ దొర్లుతున్నాడు. తన యౌవనంలో జరిగిన సంఘటన ఈమధ్య పదేపదే జ్ఞాపకం వస్తోంది. ఆ విషయమంతా కౌసల్యకు చెప్తే కొంత ఉపశమనంగా ఉంటుందేమోనని అనుకున్నాడు. రామలక్ష్మణులు అడవులకు వెళ్ళి అప్పుడే ఆరు రోజులైపోయింది. కౌసల్యాదేవిని మెల్లగా తట్టి లేపాడు. తన పూర్వవృత్తాంతాన్ని ఆమెతో ఇట్లా చెప్పాడు.

దశరథుడు: సాధుస్వభావురాలా! ఓ కౌసల్యాదేవీ! మానవులు కర్మఫలాన్ని అనుభవించక తప్పదు. ఏదైనా పని మొదలు పెట్టేముందే అందులోని సాధకబాధకాలను, గుణదోషాలను చక్కగా విచారించాలి. అట్లా కాకుండా కళ్ళు మూసుకొని ఏ పనిపడితే ఆ పని చేస్తూ ఉంటే వాడు బాలురతో (మూఢుడు) సమానమని పెద్దలంటారు.

మామిడిచెట్లు చిన్నచిన్న పూలు పూస్తాయి కాబట్టి చిన్నచిన్న కాయలు కాస్తాయని అనుకొని మామిడిచెట్టును నరికివేసి, మోదుగచెట్టు పెద్ద పెద్ద పూలుపూస్తుంది కనుక మోదుగ చెట్టుకు పెద్ద పెద్ద కాయలు కాస్తాయని ఆశించి అక్కడ మోదుగు చెట్టును నాటి, పాలుపోసి పెంచినా కూడా అది కాయలు కాచే సమయానికి ఏడవక తప్పదు. అట్లాగే తను చేసే పనులకు ఎటువంటి ఫలితం రాబోతుందో తెలుసుకోకుండా కళ్ళు మూసుకొని కర్మలు చేసేవాడు కూడా కర్మఫలాలు అనుభవానికి వచ్చినప్పుడు విలపించక తప్పదు. కౌసల్యా! నేనుకూడా అట్లాగే చెడుపనులు చేసేటప్పుడు ముందూ వెనకా ఆలోచించకుండా చేశాను. దాని ఫలితంగా రాముణ్ణి వనవాసానికి పంపించి, ఈ రోజు కూర్చుని ఏడుస్తున్నాను.

కౌసల్యా! నేను శబ్దవేధి విద్యను నేర్చుకున్న సంగతి నీకు కూడా తెలుసు. యువకుడుగా ఉన్నప్పుడు, శబ్దాన్ని బట్టి (లక్ష్యాన్ని) ఆ వస్తువును బాణంతో కొట్టే నైపుణ్యం కలవాడినని ఖ్యాతి

నాకు ఉండేది.

కౌసల్యా! ఈ సంఘటన జరిగేనాటికి నేను బాగా చిన్నవాణ్ణి. ఇంకా వివాహం కూడా కాలేదు. అప్పటికే యువరాజునయ్యాను, వేటాడటం రాజులకు జన్మతో వచ్చే వ్యసనం కదా? ఒక రోజు నేను ధనుస్సును ధరించి వేటకని అడవులకు బయలుదేరాను. సరయూనదీ తీరాన ఉండే అడవుల్లో నీళ్లు తాగటానికి వచ్చే ఏనుగునో, అడవిదున్ననో కొట్టాలని లక్ష్యంగా పెట్టుకొని బయలుదేరాను. అప్పటికి రాత్రి బాగా పొద్దుపోయింది. ఒక ఏకాంత ప్రదేశంలో పొంచి కూర్చున్నాను.

ఆ రాత్రి ఆకాశమంతా దట్టంగా మేఘాలు ఆవరించాయి. అప్పుడు కప్పలు, చక్రవాకాలు, నెమళ్ళు వర్షంలో తడిసి బాగా సంతోషంగా ఉన్నాయి. ఎడతెగకుండా వాన పడటం వల్ల పర్వతాల మీద పడ్డ నీళ్ళన్నీ క్రిందకు పారుతూ ఉంటే పెద్దపాములు జరజరా పాకుతున్నట్లుంది. అవన్నీ కలసి సముద్రంలా అయిపోయింది.

అటువంటి భయంకరమైన అర్ధరాత్రివేళ నేను అక్కడ రహస్యంగా పొంచి ఉండి నదిలో నీళ్ళు తాగటానికి వచ్చే అడవి జంతువును దేనినైనా అవి చేసే శబ్దాన్ని బట్టి గుర్తించి (శబ్దవేధి) బాణాన్ని ప్రయోగించాలని అనుకున్నాను.

కొంతసేపటికి ఆ కారుచీకట్లో ఏదో జంతువు నీరు త్రాగుతున్నట్లుగా శబ్దం వినవచ్చింది. ఆ శబ్దాన్నిబట్టి ఏనుగు అయి ఉండవచ్చు ననుకున్నాను. వెంటనే శబ్దవేధి మంత్రాన్ని ఉచ్చరించి సర్పంలాంటి బాణాన్ని ఆ వైపుగా ప్రయోగించాను. ఇంకేముంది! నా బాణంపోయి లక్ష్యాన్ని ఛేదించనే ఛేదించింది. అప్పుడు ఆ వైపు నుండి "అయ్యో! అయ్యో!" అంటూ ఒక బాలుని ఆక్రందనం వినపడింది. "నేను మునికుమారుణ్ణి, ఈ బాణాన్ని నాపై ఎవరు ప్రయోగించారు? నేను వారికి ఏం అపకారం చేశాను? జటాధారినై, నారచీరలు కట్టుకొని అరణ్యంలో తపస్సు చేసుకుంటూ కాలం గడిపేవాడినే! నాలాంటి వాణ్ణి చంపినందువల్ల ఇట్లా బాణంవేసి

కొట్టినవాడికి ఏం లాభం కలుగుతుంది? అట్లాంటి వాణ్ణి గురుపత్నీగమనం చేసిన వాడిగా అంతా నిందిస్తారుగదా? నా మరణాన్ని గూర్చి నేను అంతగా బాధపడటంలేదు. నా తల్లిదండ్రులిద్దరూ గుడ్డివారే! వారికి దాహంగా ఉందంటే నీళ్ళకోసం వచ్చాను. గుడ్డివారూ, ముసలితనంలో ఉన్న నా తల్లిదండ్రులకు సేవలు చేసుకొంటూ ఎంతో కాలంనుండి వారిని కాపాడుకొస్తున్నాను. ఇప్పుడు నేను మరణించిన తరువాత వారూ మరణిస్తారు. ఆ విధంగా ఒక్క బాణంతో ముగ్గురి ప్రాణాలు తీశాడే" అంటూ ఏడ్చాడు.

దేవీ! నేను దగ్గరకుపోయి ఈ మాటల్ని విన్నాను. నా చేతిలో ఉన్న ధనుస్సు, బాణాలు జారి నేలమీద పడిపోయాయి. నేను బాలుడి వద్దకు వెళ్ళాను, నా బాణం ఇంకా అతడి శరీరంలోనే నాటుకొని రక్తం ధారగా ప్రవహిస్తోంది. ఆ బాధతో విలవిల్లాడిపోతున్నాడు. అప్పుడా బాలుడు నన్ను చూసి కళ్ళతోనే నిప్పులు కురిపించాడు. "ఓ రాజా! నా తల్లిదండ్రులు దాహంకోసం నీరు అడిగితే నీటికోసం వచ్చాను. నేను తపస్సు చేసుకునే మునిబాలుణ్ణి. నీవు నాపై బాణం వేశావు. నేను నీకు ఏం అపకారం చేశాను? నువ్వు వేసిన ఒక్క బాణంతో నేను, నా తల్లిదండ్రులు ముగ్గురమూ ప్రాణం విడుస్తున్నాం. దాహంతో ఉన్న నా తల్లిదండ్రులు నీళ్ళు తెస్తానని నా కోసం ఎదురుచూస్తూ ఉంటారు. గొంతు ఎండిపోయి కొద్దిసేపట్లో వాళ్ళూ మరణిస్తారు. నాకు ఇట్లాంటి గతి పట్టిందని కూడా వాళ్ళకు తెలియదు. తెలిసినా వాళ్ళు ఏం చేయగలరు? నడచి వస్తారనుకోవటానికా, వాళ్ళు వృద్ధులు; ఒకవేళ వచ్చినా వాళ్లు గుడ్డివారు కాబట్టి మరణించి పడివున్న నన్ను వాళ్ళు చూడలేరు. రాజా! ఎవరైనా ఒక చెట్టును నరుకుతూ ఉంటే పక్క చెట్లన్నీ చూస్తూ ఉండటం తప్ప ఏం చేయగలవు? నా గతి అంతే! మా తపస్సుకు ఫలితం ఇదే కాబోలు!

రాజా! నా తలిదండ్రుల వద్దకు పోయి జరిగిందంతా చెప్పు. వాళ్ళను ప్రసన్నులను చేసుకో. వాళ్ళు నీకు తరుణోపాయం చూపిస్తారు. అట్లా కాకపోతే వారి కోపాగ్నికి, అరణ్యమంతా కార్చిచ్చుచే కాలి బూడిద అయినట్లు, నీవుకూడా ఆహుతి అయిపోతావు. కాబట్టి

వెళ్ళి వాళ్ళను ప్రసన్నులను చేసుకో. ఈ కాలిబాటనే వెళితే సరిగ్గా మా ఆశ్రమానికి చేరుకుంటావు.

రాజా! ముందుగా ఈ బాణాన్ని నా శరీరంలో నుండి లాగివెయ్యి. ఈ మరణవేదన పడేకంటే మరణమే మేలు. ఈ బాణాన్ని లాగివెయ్యగానే నేను మరణిస్తాను. నీకు బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంటుందేమోనని భయపడకు. నేను బ్రాహ్మణుడను కాను. ఒక వైశ్యునకు, ఒక శూద్రస్త్రీకి జన్మించాను. కనుక, ఓ రాజా! ముందు ఈ బాణాన్ని లాగివేయి. నేను ఈ బాధ భరించలేకుండా ఉన్నాను" అన్నాడు.

ఓ దేవీ! నేను వెంటనే ఆ బాలుని శరీరం నుండి బాణాన్ని లాగి వేశాను. ఆ పిల్లవాడు ఏడుస్తూ, నిట్టూరుస్తూ నన్ను చూస్తూ కన్నుమూశాడు.

# 64వ సర్గ దశరథ మహారాజు ప్రాణాలు విడవడం

ధర్మాత్ముడైన దశరథుడు ఏడుస్తూ ఎన్నడో జరిగిపోయిన కథనంతా గుర్తుచేసుకొని కౌసల్యాదేవితో మరలా ఇట్లా చెప్పాడు.

దశరథుడు: ఓ దేవీ! అజ్ఞానం చేత మహాపాపాన్ని చేశాను. ఒంటరిగా మిగిలిపోయాను. బుద్ధి పనిచేయడం మానేసింది, ఈ మహాపాపం నుండి బైటపడటం ఎట్లాగా అని తపన మొదలైంది. అప్పుడాబాలుడు చెప్పినమాటలే మంత్రంలాగా పనిచేశాయి. వెంటనే ఆ బాలుడు తెచ్చుకున్న కడవనే శుభ్రంగా కడిగి, దానినిండా మంచినీరు నింపి అతడు చెప్పిన గుర్తులను పట్టుకొని అతడి ఆశ్రమానికి చేరాను. అక్కడ ఆ మునికుమారుని తల్లిదండ్రులను చూశాను. వారు అంధులు, వృద్ధులు, చాలా బలహీనంగా ఉన్నారు. నా అడుగుల చప్పుడు విన్నారు. “నాయనా! ఇంత ఆలస్యమైంది ఏమిరా? ఇంత చీకట్లో కూడా నీళ్ళల్లో ఆడుతున్నావా? మీ అమ్మ నీకోసం దిగులు పెట్టుకుంది. నాక్కూడా దాహంతో గొంతు ఎండిపోతోంది. నాయనా! త్వరగా రారా! అక్కడే నిలబడిపోయావు. అలిగావా? నేనుగాని, మీ అమ్మగానీ ఏమైనా అన్నామా? ఒకవేళ అన్నా అవేమీ మనస్సులో పెట్టుకోకు, త్వరగా రా! దిక్కులేని మాకు నువ్వే దిక్కు. నేత్రాలు లేని మాకు నువ్వే నేత్రాలు, మా ప్రాణాలన్నీ నీపైనే ఉన్నాయి. నువ్వు మాట్లాడవేమిటి?” అన్నారు.

దేవీ! ఆ ముని మాటలు వినగానే నా పై ప్రాణాలు పైనేపోయాయి. మాటలు గొంతు దాటి రాలేదు. ఏదో గొణుగుతున్నట్లుగా అన్నాను. “మహాత్మా! నేను దశరథుడనే రాజును. క్షత్రియుడను. మీరనుకున్నట్లు మీ కుమారుణ్ణి కాను. నా వలన ఒక అనర్థం జరిగిపోయింది. అందుకే దుఃఖీస్తున్నాను.

ఓ పూజ్యుడా! నేను ధనుస్సును ధరించి సరయూనదీ తీరాన గల అరణ్యాల్లో ఏనుగులను వేటాడాలని వచ్చాను. అక్కడ కడవలో నీరు నింపుకుంటున్న ధ్వని విని, ఏనుగే అయి

ఉంటుందని బాణాన్ని ప్రయోగించాను. తీరా దగ్గరకుపోయి చూడగా నా బాణం ఒక మునిబాలకుని గుండెలో గుచ్చుకొంది.

మహాత్మా! తెలియక, తొందరపాటు చేత నీ కుమారుణ్ణి చంపాను. నా అపరాధాన్ని అంగీకరిస్తున్నాను. నేను తమ ఆజ్ఞకు బద్ధుడనై ఉంటాను.

నేను ఆ బాణాన్ని లాగివేసిన తర్వాత అతడు తల్లిదండ్రులైన మీ ఇరువురి గురించి దుఃఖీస్తూ, మీరు అంధులని, తనపైనే ఆధారపడి జీవిస్తున్నారని చెప్పాడు. మీ ఆశ్రమానికి చేరుకునే గుర్తులు కూడా చెప్పాడు. ఆ తరువాత కొద్దిసేపటికే ప్రాణాలు విడిచాడు.

మహాత్మా! తెలియక తొందరపాటుతో నీ కుమారుణ్ణి చంపాను. నా అపరాధాన్ని అంగీకరిస్తున్నాను. మునీశ్వరుడవైన నీ ఆజ్ఞను శిరసావహించటానికి సిద్ధంగా ఉన్నాను." అప్పుడు ఆ మునీశ్వరుడు నాతో ఇట్లా అన్నాడు.

మునీశ్వరుడు: ఓ రాజా! దుర్వార్తను స్వయంగా నువ్వే వచ్చి చెప్పటం వలన బ్రతికిపోయావు. లేకపోతే నీ తల వెయ్యిముక్కలయ్యేది. ఒక వానప్రస్థుణ్ణి చంపిన పాపానికి దేవేంద్రుడికైనా పదవి పోయి భ్రష్టుడయ్యేవాడు. తెలిసి సత్పురుషుని మీద బాణం ప్రయోగించినవాడి తల ఏడు ముక్కలుగా పగిలిపోయి ఉండేది. నువ్వు తెలియక చేసిన నేరం కావటంవల్ల బ్రతికిపోయావు. లేని ఎడల నీ ఇక్ష్వాకువంశమే అంతరించిపోయేది.

రాజా! మా పిల్లవాడు మరణించిన చోటుకు మా ఇద్దరినీ తీసుకొనిపో. రక్తపుమడుగులో పడి ఉన్న మా పిల్లవాణ్ణి చివరిసారిగా చేతులతో తడిమి తృప్తిచెందుతాం.

ఓ కౌసల్యా! నేను ఆ అంధదంపతులిద్దరినీ ఆ బాలుడు పడి ఉన్న సరయూనదీ తీరానికి తీసుకొని వెళ్ళాను. తల్లి మంచులా చల్లగా ఉన్న పిల్లవాడి శవంపై పడి ఏడుస్తూ మూర్ఛపోయింది. తండ్రి "నాయనా! నువ్వు నాకు నమస్కారం చెయ్యటం లేదేమి?

ఒక్కమాటైనా మాట్లాడవేం? నా మీద కోపంవస్తే, పోనీ మీ అమ్మతోనైనా మాట్లాడవచ్చు గదా? నాయనా! ఉదయానే లేచి వేదపఠనం చేసేవాడివి. మళ్ళీ నీ తియ్యటి కంఠస్వరం వినలేం గదా? ఇకపై ఉదయానే ప్రాతఃసంధ్యాదులు ముగించుకొని అగ్నిహోత్రంలో హోమం ఎవరు చేస్తారురా? ఇకపై మాకు సేవలు ఎవరు చేస్తారు? ఉదయాన, సాయంసమయాల్లో మా చెయ్యిపట్టుకొని నడిపించేవాడవే! ఇకపై మమ్మల్ని ఎవరు నడిపిస్తారు? మధురమైన కందమూలాలు తెచ్చి పెట్టేవాడివి. ఇకపై మా చేత ఎవరు తినిపిస్తారు? నువ్వు లేకుండా నేను మీ అమ్మను ఎట్లా పోషించగలను? ఈ అడవిలో నేను ఎట్లా బ్రతుకగలను? నాయనా నువ్వు ఒక్కడివే పోవద్దు. నన్నూ మీ అమ్మనూ కూడా తీసుకొనిపో. ఆలస్యమైందేమని యమధర్మరాజు కోప్పడితే, నా తల్లితండ్రులు ముసలివారు, పైగా గుడ్డివారు. వాళ్ళను కూడా నడిపించుకొని వచ్చినందువల్ల ఆలస్యమైనదని చెప్పు. నిన్ను కోప్పడవద్దని మేము కూడా వేడుకుంటాము. యమధర్మరాజు దయామయుడు. మావంటి దీనులను దయతో చూస్తాడు. నిన్ను అనుగ్రహిస్తాడు.

ఓ కుమారా! నువ్వు ఏ పాపమూ చేయలేదు. కానీ నిన్ను చంపినవాడు నిజంగా పాపాత్ముడే. అందువల్ల నువ్వు సగరుడు, శైబ్యుడు, దిలీపుడు, దుందుమారుడు, నహుషుడు, జనమేజయుడు వెళ్ళిన పుణ్యలోకాలకే వెళతావు. యుద్ధంలో వెనుతిరుగని శూరులైన శస్త్రయోధులు, సాధువులు, స్వాధ్యాయనపరులు, తపోనిష్ఠ పొందినవారు, భూదానాలు చేసినవారు అహితాగ్నిపరులు, ఏకపత్నీవ్రతులు, వేలకొద్దీ గోవులను దానం చేసినవారు, గురుసేవలు చేసేవారు మొదలైన వారంతా పోయే పుణ్యలోకాలకే పోతావు.

కుమారా! మన కులంలో పుట్టిన వారెవ్వరూ అధోగతులు పొందరు. అట్లాగే నువ్వు కూడా పుణ్యలోకాలకే వెళతావు. కానీ నిన్ను చంపిన ఈ దశరథ మహారాజుకు మాత్రం అధోగతులు తప్పవు" అని ఏడుస్తూ భార్యతో కలసి ఉదకక్రియలు చేశాడు.

ఓ కౌసల్యా! అప్పుడు ఆ మునిబాలుడు ఒక దివ్యరూపాన్ని ధరించాడు. ఆకాశంలో ఒక దివ్యవిమానంలో నుంచి తల్లిదండ్రులతో "ఓ మునిదంపతులారా! నేను మీకు సేవలు

చేయడంవల్ల గొప్ప ఉన్నత స్థానాన్ని పొందాను. మీరు కూడా అటువంటి ఉచ్ఛస్థానమే పొందుతారు. త్వరలోనే మీరుకూడా వచ్చి నన్ను కలుసుకుంటారు" అని విమానంలో వెళ్ళిపోయాడు.

కౌసల్యా! అప్పుడు నేను చేతులు జోడించుకొని ఆ వృద్ధదంపతుల ప్రక్కనే నిలబడ్డాను. అప్పుడా మునీశ్వరుడు నాతో "ఓ రాజా! మాకు ఒక్కడే పుత్రుడు. అతడూ చనిపోయాడు, మేమూ వృద్ధులమైపోయాము. మాకు సేవలు చేసేవాళ్ళెవరూ లేరు. ఇక మాకు మరణం అంటే భయంలేదు. మరణం చేతనే మాకు పుత్రశోకం పోతుంది. కాబట్టి మమ్మల్ని కూడా చంపెయ్యి" అన్నాడు. నేను ఏమీ మాట్లాడలేదు. శిలలా అట్లాగే నిలబడ్డాను. అప్పుడు ఆ మునీశ్వరుడు "ఓ రాజా! నువ్వు తెలియక నా కుమారుణ్ణి చంపేశావు. ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నావు, కాబట్టి నీకు ఏ పాపమూ అంటదు. అయితే వృద్ధాప్యంలో నాకు నువ్వు పుత్రశోకం కలిగించావు. కాబట్టి ఆ పాపకర్మ వృథాగా పోదు. నువ్వు కూడా నాకు మల్లేనే పుత్రశోకంతో మరణిస్తావు" అని శాపం పెట్టాడు. ఆ తరువాత వారిద్దరూ కుమారునికై చితిపేర్చి మండుతూ ఉన్న ఆ చితిలోనే పడి ప్రాణాలు విడిచారు.

ఓ కౌసల్యా! ఈ అర్ధరాత్రి సమయంలో ఉన్నట్లుండి మెలకువ వచ్చింది. నా చిన్నతనంలో జరిగిన ఈ సంఘటన అంతా జ్ఞాపకం వచ్చింది. అపథ్యాహారాన్ని తిన్నవాడికి రోగం రాక తప్పదు. అట్లాగే నేను చేసిన పాపకర్మకు ఫలం ఈనాడు అనుభవిస్తున్నాను. ఆనాడు మునీశ్వరుడు అన్న మాటలు ఈ రోజు నిజమవుతున్నాయి. రాముని ఎడబాటుతో ఇక నేను బ్రతకడం దుర్లభం. కౌసల్యా! నాకు కళ్లు కూడా కనిపించడం లేదు. ఎక్కడున్నావు? వింటున్నావా? ఏమీ మాట్లాడవేం? కౌసల్యా! ఒక్కసారి నన్ను చేత్తో తాకు.

ఓ దేవీ! లోకంలో తండ్రి ఎంత కిరాతకుడైనా తన పుత్రుణ్ణి అడవులకు పంపడు. తండ్రి ఎంత పరాక్రమవంతుడైనా, రాజ్యాధికారంతో కళ్ళు మూసుకుపోయినా కూడా ఎదురుతిరగని కొడుకు ఉండడు. అంతటి కిరాతకమైన పని నేను చేశాను, రాముణ్ణి అడవులకు పొమ్మన్నాను,

అంతే! కిక్కురుమనకుండా వెళ్ళిపోవడం రాముడికే చెల్లింది.

ఓ కౌసల్యా! రాముడు ఇప్పటికిప్పుడు వచ్చి నన్ను తాకితే నేను ఇంకా కొంతకాలం బ్రతుకగలను. లేకపోతే ఇక నేను వాణ్ణి చూడలేను. వాడుకూడా నన్ను చూడలేడు. కౌసల్యా! నువ్వు ఒక్క మాటకూడా మాట్లాడటం లేదేమి? నాకు కళ్లు మూసుకుపోతున్నాయి. యమకింకరులు నా కోసం నిరీక్షిస్తున్నారు. నాకు తెలివితప్పిపోతోంది.

దేవీ! నా ప్రాణంపోతోంది. ఈ చివరి క్షణాల్లో ధర్మాత్ముడు, జితేంద్రియుడు, సత్యవ్రతుడు, పితృవాక్పరిపాలకుడు అయిన రాముడు నా ప్రక్కన లేకుండా పోయాడే! చెరువులో ఉండే కొంచెం నీటిని మండుటెండలు పీల్చేసినట్లుగా, నాలో మిగిలిన కొనఊపిరిని కాస్తా పుత్రశోకం పీల్చేస్తోంది.

ఓ కౌసల్యా! పద్నాలుగు సంవత్సరాల తర్వాత రాముణ్ణి చూసేవారంతా అదృష్టవంతులే. వారందరూ దేవతలే! చంద్రబింబంవంటి వాడి ముఖం, పద్మాలవంటి వాడి కళ్ళు, పొడవాటి ముక్కు, అందమైన కనుబొమలు, ముత్యాలవంటి పలువరసగల రాముడి ముఖం ఎంతో పుణ్యం చేసుకున్నవారు మాత్రమే చూడగలుగుతారు. అయోధ్యావాసులంతా కూడా పద్నాలుగు సంవత్సరాల తరువాత తిరిగివచ్చిన నా రాముణ్ణి, ఆకాశ మార్గంలోని శుక్రుని చూసినట్లు చూడగలుగుతారు. వారంతా ధన్యజీవులు. నాకు ఆ అదృష్టం లేదు.

ఓ కౌసల్యా! నాకు ఏమీ కనపడడం లేదు. ఏమీ వినపడడం లేదు. ఊపిరి బిగదీసుకుపోయింది. గుండె కొట్టుకుంటోందో లేదో తెలియటం లేదు. నూనె అయిపోయిన దీపంలా నా ప్రాణం రెపరెపలాడిపోతోంది. వరదనీరు ఏటిగట్లను కోసివేసినట్లుగా పుత్రశోకం దిక్కులేని నన్ను కూలదోసి యమలోకానికి తీసుకొనిపోతున్నది.

రామా! తండ్రీ! పితృవాక్యపరిపాలకుడా! ఎక్కడున్నావు? కౌసల్యా! రాముడు వచ్చాడా? అంటూ కన్నుమూశారు. ఈ విధంగా దశరథ మహారాజు పుత్రుడు అరణ్యానికి పోవటంచేత

దుఃఖాన్ని భరించలేనివాడై అర్ధరాత్రి సమయంలో ప్రాణాలు విడిచాడు.

# 65వ సర్గ రాజు మరణించినట్లు రాణులు తెలుసుకోవడం

దశరథుడు ఆ విధంగా విలపిస్తూ రాత్రంతా గడపడం వల్ల రాజుకు నిద్రపట్టి ఉంటుందని తలచి కౌసల్య ఆయన్ను మేల్కొలపలేదు. కౌసల్య కూడా దుఃఖంచేత బాగా అలసిపోయి ఉంది.

ఇంతలో ప్రాతఃకాలం అయింది. విద్యావంతులైన సూతులు మంగళ వాక్యాలు పలికారు. గాయకులు స్తుతిగీతాలు, స్తోత్రపాఠాలు, వంశావళీ స్తోత్రాలు గానంచేశారు. ఆశీర్వచనాలు, స్తోత్రాలు బిగ్గరగా చదవటంతో రాజప్రాసాదమంతా ప్రతిధ్వనించిపోయింది. పాణి వాదకులు పూర్వం దశరథుడు చేసిన వీరోచిత కార్యాలన్నీ చప్పట్లు చరుస్తూ ఏకరువుపెట్టారు. అంతఃపురంలో ఉండే పెంపుడు పక్షులన్నీ ఈ శబ్దానికి నిద్రలేచి రాజప్రాసాదమంతా ఎగురుతున్నాయి. వందిమాగధులు పుణ్యశబ్దాలు ఉచ్చరించారు. సంగీతవిద్వాంసులు వీణానాదాలు చేశారు.

స్నానం చేయించటంలో నిపుణులైన పరిచారికలు బంగారు బిందెల్లో మంచిగంధం కలిపిన నీళ్ళు తెచ్చారు. కొంతమంది కన్యలు, ఇతర స్త్రీలు సుగంధద్రవ్యాలను, తినుబండారాలను తెచ్చారు. రాజుగారి కోసం తీసుకొచ్చిన సామాగ్రి అంతా శాస్త్రోక్తంగా అమర్చబడి, సుగుణసంపత్తితో ప్రకాశించేవిగా ఉన్నాయి. వీళ్ళల్లో ఎవరూ రాజుకు దగ్గరగా వెళ్ళలేదు. రాజు ఎప్పుడు మేల్కొంటాడా అని ఎదురుచూస్తూ, దూరంగా వేచి ఉన్నారు. సూర్యోదయమయిన తరువాత రాజుగారి వద్దకు వెళ్ళే అధికారమున్న స్త్రీలు వెళ్ళి దశరథ మహారాజును తట్టి లేపారు. అయినా రాజు లేవలేదు. ఆ అంతఃపుర స్త్రీలు ఏదో కీడు శంకించారు.

కౌసల్య, సుమిత్ర కూడా రాత్రంతా పుత్రశోకంతో మేల్కొని ఉండటం వలన వారూ గాఢనిద్రలోనే ఉన్నారు. అంతఃపుర కాంతలంతా రాజును చూసి నిద్రలోనే మరణించి ఉంటాడని

అనుకొన్నారు. ఇక ఉండబట్టలేక ఆ స్త్రీలంతా ఘొల్లున ఏడ్చారు. వాళ్ళ ఏడ్పులతో కౌసల్యా, సుమిత్రలు కూడా దిగ్గున లేచి కూర్చున్నారు. వాళ్ళిద్దరూ దశరథుని దగ్గరగా పోయి ఒంటి మీద చెయ్యివేసి చూశారు. అంతలోనే "హా! నాథా" అంటూ నేలమీద పడిపోయారు. అట్లాగే ఏడుస్తూ నేలపై పడి దొర్లడంవల్ల ఒళ్ళంతా దుమ్ముకొట్టుకొని ఆకాశం నుండి రాలిపడిన నక్షత్రంలా కాంతివిహీనంగా కనిపించారు. అప్పుడు కౌసల్య చచ్చిన ఆడ ఏనుగుమల్లే పడి ఉంది. కైకేయి మొదలైన ఇతర భార్యలు కూడా స్పృహతప్పి నేలపై పడిపోయారు. స్త్రీల ఏడ్పులతో ఇల్లంతా మారుమ్రోగిపోయింది.

దశరథుడు మరణించగానే రాజభవనం అంతా కళతప్పిపోయింది. పరివారమంతా భయభ్రాంతులయ్యారు. ఎటుచూసినా దైన్యము, విషాదమే కనిపిస్తోంది. దశరథుని భార్యలంతా ఒకరినొకరు కౌగలించుకుంటూ జాలి కలిగేట్లు దుఃఖించసాగారు.

# 66వ సర్గ కౌసల్యాదులు కైకేయిని నిందించడం

నీరులేని సముద్రంలా, ఆరిపోయిన అగ్నిహోత్రంలా, తేజస్సులేని సూర్యునిలా పడి ఉన్న రాజు శిరస్సును ఒడిలో పెట్టుకొని దుఃఖీస్తూ కైకేయితో కౌసల్య ఇట్లా అంది.

కౌసల్య: ఓసీ! దుష్టురాలా! కైకేయీ! ఇప్పుడు నీ కళ్ళు చల్లబడ్డాయి గదా? ఇకపై రాజు లేడు. నువ్వు అడ్డూ ఆపూ లేకుండా ఈ రాజ్యాన్నంతా అనుభవించవచ్చు. రాముణ్ణి అడవుల పాలుచేశావు. నా భర్త స్వర్గానికి పోయాడు. భయంకరమైన మార్గంలో అంతా నన్ను విడిచిపెట్టగా ఒంటరి దాన్నయిపోయాను. ఇకపై నాకు కూడా జీవించాలనే ఆశలేదు. ధర్మ మార్గాన్ని విడిచిన నీవంటిది (కైకేయి) తప్ప మరి ఏ స్త్రీ అయినా దేవత వంటి భర్త పోయిన తర్వాత కూడా జీవిస్తుందా? దురాశాపరుడు, కింపాకాలను తినేవాడు, తన ప్రవర్తనలోని దోషాలను ఎరుగడు; గూనిదాని మాటలు నమ్మి నువ్వు (కైకేయి) రఘువంశాన్నే ఛిన్నాభిన్నం చేశావు. నీ మాటలు విని దశరథుడు సీతారాములను అడవులకు పంపాడని తెలిస్తే జనకుడు కూడా శోకసముద్రంలో మునిగిపోతాడు.

ధార్మికుడు, కమలాలవంటి నేత్రాలు కలిగిన నా రాముడు తండ్రి చనిపోయాడని, నేను భర్తలేని అనాథనయ్యానని ఎరుగడు గదా! జనక మహారాజు కుమార్తెయైన సీతకూడా నా దైన్యస్థితిని తలచుకొని భయపడిపోతుంది. ఆమె అడవుల్లోని క్రూరమృగాలకు భయపడి రాముడి వెనకాలే తిరుగుతూ ఉంటుంది. జనకునికి కూడా కొడుకైనా, కూతురైనా సీతయే కాబట్టి, ఆమెకు కలిగిన స్థితికి దుఃఖీస్తూ ప్రాణాలు విడిచినా విడుస్తాడు. పతివ్రతనైన నేను నా భర్తతో పాటే సహగమనం చేసి, ప్రాణాలు విడుస్తాను.

ఈ విధంగా రోదిస్తూన్న కౌసల్యను అంతఃపుర స్త్రీలు దశరథుని శరీరం నుండి దూరంగా తీసుకుపోయారు. తరువాత వసిష్ఠాది మంత్రులంతా దశరథుని శరీరాన్ని తైలద్రోణిలో భద్రపరచారు. దశరథుని పుత్రుల్లో ఒక్కరూ దగ్గర లేకపోవటం మూలాన అంత్యక్రియలు

జరుపకుండా శరీరాన్ని భద్రపరచాలని మంత్రులంతా తీర్మానించుకున్నారు. రాజు శరీరాన్ని తైలద్రోణిలో ఉంచగానే స్త్రీలంతా ఘొల్లున ఏడ్చారు. “మధురంగా మాట్లాడేవాడు, సత్యసంధుడు అయిన రాముడే మమ్మల్ని విడిచి అడవులకు వెళ్ళాడని ఏడుస్తూ ఉంటే, ఇప్పుడు నువ్వుకూడా మమ్మల్ని అనాథలను చేసిపోయావా? దుష్టురాలైన కైకేయి ముందు రాముణ్ణి మానుంచి దూరం చేసింది. ఇప్పుడు భర్తవైన నిన్నూ మాకు దూరం చేసింది. అటువంటి క్రూరాత్మురాలి వద్ద మేము ఎట్లా ఉండగలం? సర్వసమర్థుడు, శ్రీమంతుడూ, నీకూ మాకు కూడా సంరక్షకుడుగా ఉంటున్న రాముడు రాజ్యలక్ష్మిని వద్దని అడవులకు వెళ్ళాడు. అటువంటి రాముడు, నీవు కూడా లేని ఈ ఇంట్లో కైకేయి తిట్టే తిట్లనన్నింటినీ భరిస్తూ ఎట్లా బ్రతుకగలం? రాజుని, రాముణ్ణి, లక్ష్మణుని, సీతను వదలి వేయగలిగిన కైకేయి ఇక ఎవరినైనా వదలివేయగలదు.” ఈ విధంగా దశరథుని భార్యలంతా కంటికిమింటికి ఏకధారగా దుఃఖించసాగారు. దశరథ మహారాజు లేని అయోధ్య చంద్రుడులేని ఆకాశంలా కాంతి విహీనమైంది. పురజనులంతా ఏకధారగా కన్నీళ్ళు పెట్టున్నారు. కులాంగనలంతా హాహాకారాలు చేశారు. దశరథుడు మరణించిన తరువాత నగరంలోని స్త్రీలు, పురుషులు గుంపులు గుంపులుగా చేరి కైకేయిని నిందించసాగారు.

# 67వ సర్గ రాజు లేకుండా దేశం ఉండరాదని మార్కండేయాది మహర్షులు తెలుపడం

అయోధ్యలో ఆ రోజు ఎంతకూ తెల్లవారలేదు. అతి దీర్ఘమైన ఆ రాత్రి ఏడుపులతోను, అరుపులతోను, పెడబొబ్బలతోను, కన్నీళ్ళతోను వ్యాకులతతోను ఎట్లాగో గడచి సూర్యోదయమైంది. రాజు లేకుండా దేశం ఉండరాదు. అందువల్ల అనుభవజ్ఞులైన పెద్దలు, బ్రాహ్మణులు, మంత్రులు, వసిష్ఠుడు ఉదయానే సమావేశమయ్యారు.

మార్కండేయుడు, మౌద్గల్యుడు, వామదేవుడు, కాశ్యపుడు, కాత్యాయనుడు, గౌతముడు, జాబాలి, రాజపురోహితుడైన వసిష్ఠుడు, మరి ఇతర మంత్రులంతా సభకు వచ్చారు. వారంతా విడివిడిగా ఇట్లా అన్నారు.

పుత్రశోకం చేత మహారాజు రాత్రి నిద్రలోనే మరణించాడు. ఈ రాత్రి గడపటం మనకు చాలా కష్టమైపోయింది. ఈ ఒక్క రాత్రి మనకు నూరు సంవత్సరాల పెట్టు అయింది.

మహారాజు మరణించాడు. రామలక్ష్మణులు అడవుల్లో ఉన్నారు. భరత శత్రుఘ్నులు కేకయ రాజ్యంలో దూరంగా ఉన్నారు. రాజు లేకుండా రాజ్యం ఉండకూడదు. అందువలన ఇక్ష్వాకువంశానికే చెందిన వారిని ఎవరినైనా రాజును చెయ్యాలి.

రాజులేని దేశంలో ఉరుములు మెరుపులతోకూడి వర్షాలు పడవు. రైతులు పిడికిళ్ళనిండా విత్తనాలు తీసుకొని పొలాల్లో జల్లలేరు. అంటే వ్యవసాయం బాగా సాగదు. పుత్రుడు, భార్య ఇంటి యజమాని మాట వినరు. ధనం సంపాదించినా దక్కించుకోలేరు. భర్తలకు భార్యలు దక్కరు. అన్నిటికంటే ముఖ్యమైనది సత్యానికి చోటుండదు.

రాజులేని దేశంలో ప్రజలు సంతోషంతో ఉండలేరు! ఉద్యానవనాలు, దేవాలయాలు నిర్మించుకోరు. యజ్ఞయాగాదులు చెయ్యరు; తగినన్ని దక్షిణ లివ్వరు. సంగీత, నృత్య

నాటకాదులు వర్ధిల్లవు. దాయాదుల, జ్ఞాతుల తగాదాలు న్యాయస్థానాలకు వెళ్ళినా న్యాయం జరుగదు. కథాకాలక్షేపాలు, భజనలు, కీర్తనలు జనులు జరుపుకోరు. యువతీ యువకులు చక్కగా అలంకరించుకొని సాయంత్రం పూట విహారాలకు వెళ్ళరు; అడవులలోకి వేటకు వెళ్ళలేరు.

రాజు లేకపోతే ధనికులకు రక్షణ ఉండదు. వ్యవసాయం, గోసంరక్షణ సరిగా జరగవు. ఇళ్ళలో తలుపులు తెరుచుకొని నిర్భయంగా బ్రతకలేరు (దొంగలభయం అధికంగా ఉంటుంది). దంతాలకు గంటలు కట్టి అరవై సంవత్సరాలు దాటిన ఏనుగులు వీథులలో తిరుగలేవు. యువకులు అస్త్రశాస్త్రాలను నేర్చుకోవటంలో శ్రద్ధ చూపించరు. వర్తక వాణిజ్యాలు దెబ్బతింటాయి. వర్తకులు తమ సరకులు తీసుకొని ఒక దేశం నుండి మరో దేశానికి క్షేమంగా ప్రయాణం చెయ్యలేరు.

రాజులేని రాజ్యంలో ఎప్పుడూ ఒంటరిగా తిరిగేవారు, ఆత్మనిగ్రహం కలిగినవారు, ఆత్మస్వరూపం కోసం ధ్యానం చేసేవారు, ఎక్కడ చీకటి పడితే అదే ఇల్లు అనుకునే మునీశ్వరులు స్వేచ్ఛగా సంచరించరు.

రాజులేని దేశంలో యోగక్షేమాలు సరిగా ఉండవు. సైన్యం శత్రువులను ఎదిరించి పోరాడలేదు. పండితులు వనాల్లోను, ఉపవనాల్లోను కూర్చుని శాస్త్రచర్చలు చెయ్యలేరు. దైవకార్యాలు, దేవతాపూజలూ నిర్భయంగా సాగవు.

రాజులేని దేశం నీళ్ళులేని చెరువులాంటిది. పంటలు పండని పొలం వంటిది. గోపాలురు లేని గోవులమంద వంటిది. రథంపై ఎగిరే ధ్వజాన్నిబట్టి అది ఎవరి రథమో గుర్తిస్తాం. పొగనుబట్టి అగ్నిని గుర్తిస్తాం. అట్లాగే మనకందరికీ ధ్వజంవంటి వాడైన దశరథ మహారాజు స్వర్గస్థుడయ్యాడు. రాజులేని రాజ్యంలో ఎవరూ తన సంపదను కాపాడుకోలేరు. పెద్దచేప చిన్నచేపను తిన్నట్లుగా ఒకరినొకరు కబళించడానికి ప్రయత్నిస్తారు. కట్టుబాట్లు కరువైపోతాయి.

నాస్తికులు వృద్ధి చెందుతారు. దైవభక్తి, రాజభయం నశించి సన్మార్గులై ప్రవర్తించరు.

సత్యాన్ని, ధర్మాన్ని రక్షించేవాడు రాజే. వర్ణాశ్రమధర్మాలను కాపాడేదీ రాజే. ప్రజలకు రాజే తల్లి, రాజే తండ్రి, రాజే దైవం – కాబట్టి రాజు అనేది ఒక గొప్ప వ్యవస్థ. రాజు తన ఘనత వలన దిక్పాలకులైన యమ, కుబేర, ఇంద్ర, వరుణులను కూడా అతిశయించి ఉంటాడు. రాజు ధర్మాధర్మాలు, సత్యాసత్యాలు, విభజించి చూపకుంటే ప్రపంచం అంతా అంధకారమైపోయేది. సృష్టి జరిగేది కాదు.

మహారాజు జీవించి ఉన్నంతకాలం మేమంతా, సముద్రం తీరాన్ని దాటనట్లు నీ మాట జవదాటలేదు. బ్రాహ్మణులలో శ్రేష్ఠుడవైన ఓ వసిష్ఠా! జరిగిన విషయాలన్నీ పరిశీలించి, రాజు లేకుండా ఉండే రాజ్యం అడవి అయిపోతుందన్న వాస్తవాన్ని గుర్తించి, ఉత్తముడైన ఇక్ష్వాకువంశస్థుణ్ణి మాకు రాజుగా అభిషిక్తుణ్ణిచెయ్యి. మేమంతా ఆ బాధ్యతను, అధికారాన్ని ఈ సభాముఖంగా నీకు ఇస్తున్నాం.

# 68వ సర్గ రాజదూతలు కేకయ దేశానికి పోవడం

ఆసభలోని పెద్దల మాటలన్నీ విన్న వసిష్ఠుడు మంత్రులతోను, బ్రాహ్మణులతోను ఇలా చెప్పాడు.

వసిష్ఠుడు: పెద్దల్లారా! భరత శత్రుఘ్నులు వారి మేనమామల ఇంటి వద్ద సుఖంగా ఉన్నారు. కాబట్టి మనం వెంటనే వేగంగా పరుగెత్తే గుర్రాలపైన దూతలను పంపుదాం. దశరథ మహారాజు జీవించి ఉండగానే భరతుడికి రాజ్యాన్నివ్వటానికి అంగీకరించాడు గదా? ఇక మన పంచాయితీ అనవసరం. కాబట్టి వెంటనే వారిద్దరిని అయోధ్యకు పిలిపించడమే మన తక్షణ కర్తవ్యం.

ఓ సిద్ధార్థా! జయంతా! విజయా! అశోకా! నందనా! మీరంతా వేగంగా పరిగెత్తే గుర్రాలపైన రాజగృహపురానికి వెళ్లండి. మీ మనస్సులో ఎంత దుఃఖం ఉన్నా దాన్ని బయటకు కనిపించనీయకండి. నా మాటగా (వసిష్ఠుని) భరతునితో ఈ విధంగా చెప్పండి.

"భరతుడా! పురోహితులు, మంత్రులు నీ క్షేమాన్ని విచారిస్తున్నారు. నీతో చాలా ముఖ్యమైన పని ఉన్నది. కాబట్టి నిలబడ్డవాడివి నిలబడినట్లే వీళ్ళతో బయలుదేరి అయోధ్యకు రావాలి."

దూతలారా! మీ రెవ్వరూ రాముడు వనవాసానికి వెళ్ళాడని చెప్పకూడదు. అట్లాగే దశరథ మహారాజు మరణించాడని కూడా చెప్పరాదు. మీతోపాటు కేకయ రాజుకు, భరతుడికి మంచి పట్టువస్త్రాలు, అలంకారాలు కానుకగా తీసుకొనిపొండి.

వసిష్ఠుడు చేసిన ఈ ఏర్పాట్లకు సభలోని పెద్దలంతా పూర్తిగా అంగీకరించారు. తరువాత దూతలు ప్రయాణానికి కావలసిన వన్నీ సమకూర్చుకొని, ఉత్తమమైన అశ్వాలపైన కేకయ రాజధానికి బయలుదేరారు. దూతలు అయోధ్యనుండి బయలుదేరి పశ్చిమంగా కొంతదూరం

పోయి, ప్రలంబపర్వతాలకు అపరతాలపర్వతాలకూ మధ్య ప్రవహించే మాలినీ నదీతీరాన కొంతదూరం ఉత్తరదిక్కుగా పోయారు. అక్కడ నుండి పడమట దిక్కుగా పోతూ శరదండానదిని కూడా దాటారు. ఆ శరదండానదిని దాటి కోరిన కోరికలన్నీ ఇస్తుందని ప్రతీతిగల 'సత్యోపయాచన' మనే వృక్షాన్ని సమీపించారు. ఆ పుణ్యవృక్షరాజానికి భక్తితో ప్రదక్షిణ నమస్కారాలు చేశారు. ఆ తరువాత కులింగాపురం చేరారు.

కులింగాపురం నుండి అభికాలమనే గ్రామానికి పోయారు. అక్కడ నుండి బోధిభవనమనే పర్వతాలలో పుట్టి ప్రవహించే ఇక్షుమతీ నదీ తీరాన్ని చేరుకున్నారు. (ఆ నదీతీరాన పూర్వం దశరథ మహారాజు పూర్వీకులు అనుభవించిన గ్రామాలున్నాయి.) ఆ నదీతీరాన అనేకమంది తాపసులు, వేద పారంగతులు, బ్రాహ్మణోత్తములు నివసిస్తూ ఉంటారు. దూతలు ఆ నదిని కూడా దాటి బాహ్లికదేశానికీ, సుదామపర్వతానికీ మధ్యనున్న దారిగుండా విష్ణుపాదణితం అనే పుణ్యభూమిని చూశారు. తదనంతరం విపాశనదిని దాటారు.

ఆ దూతలందరూ అనేక కష్టనష్టాలకు ఓర్చుకొని ప్రయాణం సాగించారు. దూరాభారాన్ని, ఆకలిదప్పులను లెక్కచేయలేదు. రాజకార్య ధురంధరులు, ప్రభుభక్తి పరాయణులు అయిన వారి లక్ష్యం అంతా భరతుణ్ణి వెంటనే తీసుకుని అయోధ్యకు చేరాలి. దశరథ మహారాజు దేహానికి అంత్యక్రియలన్నీ త్వరగా జరిగిపోవాలి. దివంగతుడైన ఆ మహారాజు ప్రతిష్ఠ కాపాడాలి ఆ లక్ష్యంతో వారు ఆహారం తినలేదు. గుర్రాలకు మాత్రం అక్కడక్కడా నీళ్లు పట్టించారు. అట్లా ప్రయాణం చేస్తూ ఒక రాత్రి అయ్యేసరికి గిరివ్రజపురం చేరారు.

# 69వ సర్గ భరతుని స్వప్నం

రాజదూతలు నాటి రాత్రి గిరివ్రజపురాన్ని చేరారు. అదే రాత్రి తెల్లవారుతూండగా భరతుడికి ఒక భయంకరమైన స్వప్నం వచ్చింది. అట్లా తెల్లవారే ముందు వచ్చే స్వప్నాలు నిజమవుతాయని అంటారు. ఆ స్వప్నాన్ని తలచుకొని ఏం వినవలసి వస్తుందోనని భరతుడు భయపడిపోయాడు. తెల్లవారినా అతడి దిగులు తగ్గలేదు.

తెల్లవారింది. స్నేహితులంతా అతడి చుట్టూ చేరారు. అతడు మామూలుగా లేడని, ఏదో దిగులుతో బాధపడుతున్నాడని గ్రహించారు. అతణ్ణి సంతోషపెట్టేందుకు, దిగులు పోగొట్టేందుకు అనేక విధాలుగా ప్రయత్నించారు. కానీ భరతుడు మామూలు మనిషి కాలేకపోయాడు. కొందరు నాటకంలో పాత్రలను అభినయం చేసి చూపారు. కొందరు హాస్య ప్రసంగాలు చేశారు. ఎందరు ఎన్ని విధాలుగా ప్రయత్నించినా ఏదో తెలియని బాధ, దిగులు అతడి గుండెల్లోనుంచి ఎగతన్నుకు వస్తున్నాయి.

చివరగా వాళ్ళంతా భరతుణ్ణి "మిత్రుడా! మేము ఇన్ని విధాలుగా ప్రయత్నించినా నిన్ను సంతోషపెట్టలేకపోయాం. అంత తీవ్రంగా నిన్ను బాధించే సమస్య ఏమిటి? ఎందుచేత అంత దిగులుగా ఉన్నావు?" అని అడిగేశారు.

అందుకు భరతుడు ఇలా అన్నాడు:

"మిత్రులారా! నాకు రాత్రి తెల్లవారేముందు ఒక పీడకల వచ్చింది. అందులో నా తండ్రి తల విరబోసుకొని, కొండశిఖరం నుండి క్రింద కంపుకొట్టే ఒక గుంటలో పడిపోయాడు. ఆయన శరీరం అంతా పేడ అయిపోయింది. ఆయన శరీరం దూరాన్నించే కంపుకొట్టింది, ఆ పేడ గుంటలో అంత కంపుకొట్టుకుంటూ కూడా దోసిలినిండా నూనె తీసుకుని త్రాగుతూ పిచ్చినవ్వులు నవ్వుతూ కనిపించాడు. ఇంకొంచెంసేపైన తర్వాత నువ్వులు అన్నంలో కలుపుకొని

తింటున్నాడు. నూనెలో మాటిమాటికీ మునుగుతూ ఉన్నాడు, ఒంటినిండా నూనె కారిపోతోంది.

మిత్రులారా! ఆ కలలోనే సముద్రం ఎండిపోతున్నట్లుగాను, చంద్రుడు నేలపై కూలిపోయినట్లుగాను, లోకమంతా చీకట్లు కమ్ముకున్నట్లుగాను కనిపించింది. పట్టపుటేనుగు దంతాలు విరిగిపోయాయి. మండే మండే అగ్నిహోత్రం హఠాత్తుగా ఆరిపోయింది. చెట్లు ఎండిపోయినట్లు కనబడ్డాయి. భూమి రెండుగా చీలిపోయినట్లు, కొండల్లోనుండి పొగలు వస్తున్నట్లు కనిపించాయి.

నా తండ్రి దశరథ మహారాజు నల్లటి వస్త్రాలు ధరించాడు. ఇనుముతో చేసిన పీట మీద కూర్చున్నాడు. నల్లగా ఉన్న స్త్రీలు ఆయనను చూసి నవ్వుతున్నారు. ఒంటినిండా నల్లటిరంగు పులుముకున్నారు. ఎర్రటిచీర కట్టుకున్న ఒక రాక్షసస్త్రీ ఆయనను చూసి వికృతంగా నవ్వుతూ, గాడిదలు కట్టిన రథంపైనుండి క్రిందకు పడతోసింది.

మిత్రులారా! ఇది ఏదో మరణాన్నే సూచిస్తోందని నా కనిపిస్తోంది. నాకో, రాముడికో, లక్ష్మణుడికో, నాయనగారికో మరణకాలం సమీపించిందని అనిపిస్తోంది. గాడిదలు పూన్చిన రథంపై ఎక్కినట్లు కలవస్తే ఆ కలగన్న వ్యక్తి తప్పక మరణిస్తాడంటారు. ఇక నాకు మరణం తప్పదేమో! ఆ స్వప్న ప్రభావం నా మీద విపరీతంగా పనిచేస్తోంది. గొంతు తడారిపోతోంది, మనస్సు మనస్సులో లేదు. మనస్సునంతా దిగులే ఆవరించి ఉంది. అందువల్ల మీరు నన్ను సంతోషపెట్టేందుకు ఎంత ప్రయత్నించినా నా దిగులు తరగడం లేదు. నేను ఎన్నడూ దేనికీ భయపడి ఎరుగను. ఇటువంటి స్వప్నాలకు ఇంత ప్రాధాన్యం ఇచ్చినందుకు నన్ను నేనే నిందించుకుంటున్నాను. ఈ స్వప్నానికి కారణమూ తెలియదు; ఏం జరుగబోతోందో కూడా తెలియటం లేదు. ఏదో తెలియని దిగులు మాత్రం ఆవహించింది. మిత్రులారా! వృద్ధుడైన నా తండ్రికి ఏదైనా ఆపద వాటిల్లిందేమోనని భయపడుతున్నాను."

# 70వ సర్గ భరత శత్రుఘ్నులు దూతలతో అయోధ్యకు బయలుదేరడం

భరతుడు ఈ విధంగా తన స్వప్నాన్ని గురించి మిత్రులకు వివరిస్తూ ఉండగా దూతలు కేకేయ మహారాజును అతని కుమారుడైన యుధాజిత్తును కలుసుకొని వారికి పాదనమస్కారం చేశారు. తాము భరతుణ్ణి అయోధ్యకు తీసుకుపోవడానికి వచ్చామని చెప్పారు. అప్పుడు మహారాజు వారిని భరతుని వద్దకు పంపాడు.

దూతలు: ఓ రాజకుమారా! వసిష్ఠ మహర్షి, మంత్రిపుంగవులు, పెద్దలు మీ క్షేమసమాచారాన్ని తెలుసుకొని రమ్మని మమ్మల్ని పంపారు. మీ వలన ఒక ముఖ్యమైన రాచకార్యం నెరవేర్చాల్సి ఉందని, అందుకోసం మీరిరువురూ మాతో కలసి అయోధ్యకు వెంటనే బయలుదేరాలని వసిష్ఠ మహర్షి ఆజ్ఞాపించారు. కనుక మీరు ఇక ఏమాత్రమూ ఆలస్యం చేయక అయోధ్యకు ప్రయాణం కావాలి.

ఓ భరత ప్రభూ! మీ తాతగారికి, మేనమామగారికి పట్టువస్త్రాలు, ఆభరణాలు మొదలైన శ్రేష్ఠమైన కానుకలు పంపారు. వీటిని మీరే స్వయంగా వారికి సమర్పించాలని ఆదేశించారు. ఈ వస్త్రాభరణాలన్నీ ఇరవై కోట్లు విలువ చేస్తాయని వసిష్ఠాదులు మాతో చెప్పారు.

అప్పుడు భరతుడు, ఆ కానుకలన్నీ తీసుకొని తాతగారికీ, మేనమామకూ ఇచ్చాడు. తిరిగి కేకేయ మహారాజు కూడా ఆ వచ్చిన దూతలను సత్కరించాడు.

భరతుడు: ఓ దూతలారా! నా తండ్రిగారైన దశరథ మహారాజు క్షేమమేకదా! నా అన్నగారైన రాముడూ, తమ్ముడు లక్ష్మణుడూ కులాసాగా ఉన్నారా? ధర్మాన్నే ఎల్లప్పుడూ ఆచరిస్తూన్నదీ, ధర్మాన్నే ఎల్లప్పుడూ చూస్తూన్నదీ, ధర్మమునందే ఆసక్తి గలదీ అయిన పూజ్యురాలు నా తల్లి కౌసల్యాదేవి ఆరోగ్యంగా ఉందా? ధర్మాలన్నీ తెలిసిన నా తల్లి సుమిత్రాదేవి

ఆరోగ్యంగా ఉందా? క్రోధ స్వభావంకలదీ, తనకే అన్నీ తెలుసుననుకునేదీ, మహాభయంకరంగా ఆలోచనలు చేసే నా తల్లి కైకేయి ఆరోగ్యంగా ఉందా? ఆమె నాకేదైనా చెప్పమన్నదా?

దూతలు: ప్రభూ! మీరడిగినవారంతా క్షేమంగానే ఉన్నారు. మీరు అయోధ్యానగరానికి సత్వరమే చేరుకోవాలి. తమతో అతిముఖ్యమైన పనులున్నాయని మమ్మల్ని పంపారు. కాబట్టి మీరు మీ తాతగారికి, మేనమామగారికి చెప్పి, వారి వద్ద సెలవు తీసుకొని వెంటనే ప్రయాణానికి సిద్ధం కావాలి.

భరతుడు: ఓ దూతలారా! నేనిప్పుడే పోయి మా తాతగారి వద్ద అనుమతి తీసుకొని వస్తాను. వేచి ఉండండి.

"తాతగారూ! నా కోసం దూతలు అయోధ్యనుండి వచ్చారు. నేను వెంటనే అయోధ్యకు ప్రయాణమై పోవాలి. అందుకు మీరు అనుమతించాలి, మా అమ్మను కూడా చూడాలని ఉంది. మళ్ళీ మీరు ఎప్పుడు కబురుపెడితే అప్పుడు మీ ముందువచ్చి వాలతాను" అని భరతుడు, కేకయ రాజుతో చెప్పాడు.

కేకయ మహారాజు (భరతుని గాఢంగా కౌగలించుకొని శిరస్సు వాసన చూశాడు.) : ఓ పరంతపా! నువ్వు వెంటనే పోయి నీ తండ్రిగారిని చూసిరా. నువ్వు బుద్ధిమంతుడవు, ధర్మపరుడవు. గొప్పకీర్తిని సంపాదిస్తావు. అటువంటి నిన్ను కని నా కూతురు కైక ధన్యురాలైంది. నీ తండ్రితోను, నీ తక్కిన తల్లులతోను మేమంతా క్షేమంగా ఉన్నామని చెప్పు. రామలక్ష్మణులను మరీ మరీ అడిగానని చెప్పు. వసిష్ఠ మహర్షికి, తక్కిన బ్రాహ్మణోత్తములకు నా నమస్కారాలు తెలుపు.

రెండువేల బంగారు కంఠహారాలు, పదహారు వందల ఉత్తమ జాతిగుర్రాలు, మదపుటేనుగులను, రంగు రంగుల తివాచీలను, పులి తోళ్ళను సేవకులకిచ్చి పంపుతున్నాను. వాటన్నింటినీ యోగ్యమైన వారందరికీ నా కానుకగా ఇప్పించు. ధైర్యవంతులు, ప్రాణాలనుకూడా

లెక్కచేయని సాహసవంతులు, ప్రభుభక్తిపరాయణులు, దారులన్నీ బాగా తెలిసినవారూ, సుశిక్షితులూ అయిన వీరులు నీకు తోడుగా అయోధ్య వరకూ వస్తారు. క్షేమంగా వెళ్ళిరా!

భరతుని మేనమామ కూడా మేనల్లుడికి ఐరావతం జాతి ఏనుగుల్ని, కంచరగాడిదల్ని, సింహాల్లాంటి బలంగలవైనవీ, అంతఃపురంలోనే పుట్టి పెరిగినవీ, పౌరుషంలో పెద్దపులిలాంటివి, వేగంలో చిరుతపులివంటి వేటకుక్కలను ప్రత్యేక కానుకగా ఇచ్చాడు.

ఎవరెన్ని కానుకలిచ్చినా, ఎవరెన్ని ప్రియమైన మాటలు చెప్పినా భరతుని మనస్సులో సంతోషం కరువైంది. రాత్రి వచ్చిన కలే మాటిమాటికీ గుర్తుకు వస్తోంది. అయోధ్యనుండి దూతలు రాకపోయినా, భరతుడి మనస్సు అంతకు మునుపే అయోధ్యపై మళ్లింది.

భరతుని వెంట గుర్రాలు పూన్చిన రథాలు, ఒంటెలను పూన్చిన బండ్లు, ఎడ్లబండ్లు, కేకయ రాజు ఇచ్చిన కానుకలను మోసుకొంటూ వస్తున్న కంచరగాడిదలు బయలుదేరాయి. భద్రత కోసం కేకేయరాజు పంపించిన సైన్యానికి తోడుగా వేటకుక్కలు కూడా ఉన్నాయి. ఆ విధంగా పోతున్న భరతుడు చూసేవాళ్లకు దేవసేనను వెంటబెట్టుకొని పోతున్న సిద్ధుడిలా కనిపించాడు.

## 71వ సర్గ భరతుడు అయోధ్యా రాజభవనాన్ని చేరటం

తాతగారి వద్ద, మేనమామ వద్ద సెలవు పుచ్చుకొని భరతుడు రాజభవనం నుండి బయలుదేరి తూర్పుదిక్కుగా ప్రయాణమై వెళ్ళాడు. సుదామా, హ్లాదినీ, శతద్రూ నదులను దాటుకుంటూ అపరపర్వటమనే దేశాన్ని చేరాడు. అక్కడనుండి ఆజ్ఞేయము, శల్యకర్తనము అనే గ్రామాలను దాటుకొని శిలావహా నదిని కూడా దాటి చైత్రరథవనం వైపుగా ప్రయాణం కొనసాగించాడు. అక్కడనుండి పర్వతాలను ఆహ్లాదపరుస్తూ వేగంగా ప్రవహించే కులింగ నదినిదాటి, యమునా నదీతీరాన్ని చేరి అక్కడ కొంతసేపు విశ్రమించాడు. అక్కడ గుర్రాలకు, ఇతర జంతువులకు చల్లని నీళ్ళు పట్టించి, కొద్దిగా విశ్రాంతి నిచ్చి తర్వాత మళ్లీ ప్రయాణం కొనసాగించాడు. అరణ్యాల్లో నదులు దాటవలసి వచ్చినప్పుడల్లా భరతుడు భద్ర అనే గజరాజునెక్కి, వాయువు ఆకాశంలో ప్రయాణం చేసినట్లు, సునాయాసంగా నదులన్నింటినీ దాటాడు. తరువాత ప్రాగ్వటమనే పట్టణాన్ని, అంశుధానమనే ప్రాంతాన్ని దాటుకుంటూ భాగీరథీ నదీ ప్రాంతానికి వచ్చాడు. అక్కడనుండి కుటికోష్ఠికానదిని దాటి ధర్మవర్ధనమనే గ్రామాన్ని చేరాడు. అక్కడనుండి తోరణమనే ప్రదేశానికి దక్షిణంగా ఉన్న జంబూప్రస్థాన్ని, అక్కడనుండి వరూథమనే గ్రామాన్ని చేరాడు. అక్కడ నుండి కదంబవృక్షాలు దట్టంగా పెరిగిన ఉజ్జిహాన నగర ఉద్యానవనాన్ని చేరాడు. అక్కడ భరతుడు కొంతసేపు విశ్రమించాడు. అనంతరం తాను మాత్రం వేగంగా పరిగెత్తే గుర్రాలు పూన్చిన రథమెక్కి, సైన్యాన్ని వెనకాల రమ్మని ఆదేశించాడు, రాత్రులందుకూడా ప్రయాణం చేస్తూ సూర్యోదయానికల్లా మనుచక్రవర్తి నిర్మించిన అయోధ్యానగర శివార్లను చేరుకొన్నాడు.

ప్రయాణంలో అవిశ్రాంతంగా ఏడు రోజులు గడపిన భరతుడు అయోధ్యా నగర పొలిమేరల్లోకి రాగానే సారథితో ఇలా అన్నాడు.

భరతుడు: ఓ సారథీ! కనుచూపు మేరలో నేను అయోధ్యానగరాన్ని అస్పష్టంగా

చూస్తున్నాను. ఆ నగరంలో తెల్లని పాటిమన్నుపై పెరిగిన అనేక ఉద్యానవనాలున్నాయి. ఎందరో రాజర్షులు ఈ నగరాన్ని పాలించారు. ఉత్తమ గుణసంపన్నులు, విద్యావేత్తలు, ఎన్నో యజ్ఞాలు చేసిన ఐశ్వర్యవంతులైన బ్రాహ్మణోత్తములు ఇక్కడ నివసిస్తున్నారు. పూర్వం ఈ నగరమంతా యువతీ యువకులు అందరూ చిలుకా గోరింకల్లా కిలకిలలాడుతూ, ఉద్యానవనాలన్నీ తిరుగుతూ ఉండేవాళ్ళు. వాళ్ళందరూ సాయం సమయాన ఈ ఉద్యానవనాల్లోకి చేరుకొని, రాత్రంతా ఆట పాటలతో గడిపి ఉదయాన్నే ఇళ్ళకు పోయేవాళ్ళు. సారథీ! అటువంటి ఉద్యానవనాలలో ఎక్కడా కాముకులు మచ్చుకైనా కనిపించటం లేదేమీ! వారి కిలకిలారావాలు లేకపోవటంవల్ల, కారుచిచ్చుచేత కాలి బూడిద అయిన అరణ్యాల్లో పక్షులన్నీ కాలిపోయినట్లు, ఉద్యానవనాలు నిర్మానుష్యంగా ఉన్నాయి. అదీ కాకుండా పూర్వంలా గుఱ్ఱాల మీదా, ఏనుగుల మీదా పురప్రముఖులెవ్వరూ నగరంలోకి వెళుతునట్లుగాని, నగరం నుండి వస్తున్నట్లుగా కానీ, కనిపించటంలేదు. ఉద్యానవనాల్లోనూ, వీథుల్లోనూ ఉండే వృక్షాలుకూడా ఆకులన్నీ రాలిపోయి ఏడుస్తున్నట్లుగాను, కళావిహీనంగాను కనిపిస్తున్నాయి. సూర్యోదయమవుతున్నా ఎక్కడా పక్షుల కిలకిలారావాలు వినిపించడంలేదు. మృగ పక్ష్యాదులు ఆహారాన్వేషణకై తొందరపడినట్లే కనిపించటం లేదు. అంతా ప్రళయకాలంలాగా నిశ్శబ్దంగా ఉందేం? పూర్వం ఉదయానే ఇళ్ళల్లోను, దేవాలయాల్లోను వెలిగించిన అగరు, చందనాది ధూపాలతో వీథులన్నీ గుబాళించేవి. ఈ రోజు అటువంటి సుగంధాలే వీచటంలేదు. ఎందుచేత? పూర్వం ఉదయానే మృదంగ వీణాగానాలతో వీథులన్నీ ప్రతిధ్వనించేవి. ఇప్పుడు నాకు ఎందువల్లనో పరిస్థితి అరిష్టాన్ని సూచిస్తోంది. నేను ఇవన్నీ చెడు శకునాలుగా భావిస్తున్నాను. ఎందుకో నా మనస్సు కీడును శంకిస్తోంది. సారథీ! ఎందువల్లనో నా బంధువులందరూ క్షేమంగా ఉన్నారని తోచడం లేదు. నాకు దిగులు పుడుతోంది. మనస్సు వేదనతో దుఃఖీస్తోంది.

భరతుడు ఈ విధంగా బాగా దిగులుపడి, వేదనతో కూడిన మనస్సుతో వైజయంతమనే ద్వారం గుండా అయోధ్యలోనికి ప్రవేశించాడు. భరతుణ్ణి చూడగానే ద్వారపాలకులు జయజయ ధ్వానాలు చేశారు. ఆ ద్వారపాలకులను గౌరవిస్తూ (ఈనాటి ప్రతి నమస్కారం లాంటిది)

సారథితో ఇలా అన్నాడు:

ఓ సారథీ! నువ్వు విశ్వాసపాత్రుడవు. దోషాలు ఏవీ లేనివాడవు. నాకు ఈ విషయం బోధపడేట్లు చెప్పు. ఏ కారణమూ లేకుండా నన్ను ఇంత త్వరగా ఎందుకు పిలిపించారు? నా మనస్సేదో కీడును శంకిస్తోంది. జరుగకూడని ఘోరమేదో జరిగినట్లు అనిపిస్తోంది. రాజు మరణించినప్పుడు ఉండే శోకలక్షణాలన్నీ కనిపిస్తున్నాయి. ఇళ్ళ ముందు గృహస్థులెవరూ ముగ్గులు పెట్టుకోలేదు. ఇళ్ల తలుపులన్నీ మూసే ఉన్నాయి. పూజాపునస్కారాలు చేస్తున్నట్లు లేదు. వంటావార్పూ కూడా చేస్తున్నట్లు లేదు. గృహస్థులెవరూ అన్నాలు తింటున్నట్లు లేదు. ఇళ్ళన్నీ కళతప్పి ఉన్నాయి. అంగళ్ళన్నీ మూసి ఉన్నాయి. వీథులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. దేవాలయ ద్వారాలకు పూలమాలలు అలంకరించలేదు. చెట్లమీదా, దేవాలయాలమీదా, స్తూపాలమీదా వాలిన పక్షులు కూడా చైతన్యం లేకుండా ఉన్నాయి. అందరూ కన్నీళ్ళు కారుస్తూ కనిపిస్తున్నారు.

భరతుడు అలా అంటూనే రథం దిగి తండ్రిగారి భవనం వైపుగా నడిచాడు.

## 72వ సర్గ భరతుడు కైకేయి గృహానికి వెళ్ళటం

భరతుడు ముందుగా దశరథుని భవంతికి వెళ్ళాడు. ఆ ఇల్లంతా శూన్యంగా ఉండటంతో తల్లి అయిన కైకేయి ఇంటికి వచ్చాడు. భరతుణ్ణి చూడగానే కూర్చున్న బంగారు ఆసనంనుండి కైకేయి సంతోషంగా ఎదురు వెళ్ళింది. భరతుడు శిరస్సువంచి ఆమె పాదాలకు నమస్కరించాడు. ఆమె కూడా భరతుణ్ణి కౌగలించుకొని శిరస్సు వాసన చూసి తన ప్రక్కన కూర్చోబెట్టుకొని కుశలప్రశ్నలు వేసింది.

"నాయనా! భరతా! నువ్వు తాతగారింటినుండి ఇక్కడకు రావడానికి ఎన్ని రోజులు పట్టింది? ప్రయాణం కులాసాగా జరిగిందా? దారిలో ఏమీ ఇబ్బందులు పడలేదుగదా? నాయనా! నీ తాతగారు, మేనమామ యుధాజిత్తు క్షేమమేగదా? నువ్వు అక్కడ ఉన్నన్ని రోజులూ సుఖంగా గడచిపోయాయి గదా?"

భరతుడు: అమ్మా! నేను తాతగారింటినుండి బయలుదేరి ఏడు రోజులైంది. నీ తండ్రి అయిన కేకేయరాజు, నీ సోదరుడైన యుధాజిత్తు క్షేమంగానే ఉన్నారు. ఆయన మనకు వెలకట్టలేనన్ని రత్నాలు, ఇతర కానుకలు ఇచ్చారు. వాటి భద్రతకై గొప్పసైన్యాన్ని కూడా వెంటపంపారు. వారిని వెనుక రమ్మని నేను ముందుగా వచ్చేశాను.

అమ్మా! నీకు సర్వసౌఖ్యాలు సమకూర్చిపెట్టే దశరథమహారాజు పడుకునే మంచం బోసిపోతోందేమిటి? పరిచారికలు కూడా ముఖాన కళాకాంతి లేకుండా తిరుగుతున్నారు. ఏం కారణం? ముఖ్యమైన పని ఉందని దూతలు నాతో చెప్పి నన్ను ఇక్కడకు తీసుకొని వచ్చారు. ఆ విషయమేమిటో తెలుసుకోవాలనే ఆదుర్దాతో సైన్యాన్నంతా విడిచి నేను ముందుగా వచ్చాను.

అమ్మా! తండ్రిగారు ఎక్కువగా నీ ఇంట్లోనే ఉంటూ ఉంటారు. అందువల్లనే ముందుగా ఇక్కడకు వచ్చాను. ముందు నా తండ్రిగారికి పాదాభివందనం చెయ్యాలి. ఆయన ఇక్కడ

లేకపోతే, ఏ తల్లిగారి ఇంట్లో ఉన్నాడో చెబితే అక్కడికే వెళ్ళి ఆయన దర్శనం చేసుకుంటాను. నేను వెంటనే ఆయనకు పాదాభివందనం చెయ్యాలి.

అప్పుడు కైకేయి అన్ని విషయాలు తెలిసినా, ఆమెలో జీర్ణించుకుపోయిన రాజ్యలోభం చేత భరతుడితో తండ్రి మరణాన్ని గురించిన యథార్థాలన్నీ దాచిపెట్టి ఇలా చెప్పింది.

కైకేయి: భరతా! మహారాజు మహాత్ముడు, తేజశ్శాలి. అనేక యజ్ఞాలు చేశారు. ఎంతోమంది బ్రాహ్మణులకు ఆశ్రయం కల్పించాడు. ఎన్ని మంచి పనులు చేసినా ప్రాణులు శాశ్వతంగా జీవించి ఉండరు కదా! లోకంలో ప్రాణులందరికీ చివరిగతి ఏదో నీ తండ్రినీ అదే మరణం కబళించింది.

తల్లినోటి నుండి ఆ మాటలు వింటూనే భరతుడికి దుఃఖంతో నోట మాట రాలేదు. అక్కడికక్కడే కుప్పగా కూలిపోయాడు. మహాతేజశ్శాలి అయిన భరతుడు తండ్రి మరణవార్తను భరించలేకపోయాడు.

భరతుడు: నా తండ్రి పడుకున్నప్పుడు వర్షాకాలం గడిచాక నిర్మలమైన ఆకాశంలోని చంద్రుడిమల్లే ప్రకాశించేవాడు. అటువంటి నా తండ్రిలేని ఆ బంగారు మంచం కారుమేఘాలతో నిండిన అమావాస్యరాత్రిలా ఉంది.

ఇలా అంటూ శోకంతో ముఖాన గుడ్డకప్పుకొని వెక్కి వెక్కి ఏడవసాగాడు. దేవతవంటివాడు, మహాకీర్తిమంతుడు అయిన భరతుడు గొడ్డలితో కొట్టిన మద్దివృక్షంలా నేలపై పడిపోయాడు. మదించిన ఏనుగువంటి వాడు, సూర్యచంద్రులతో సమానమైన వాడయిన భరతుణ్ణి కైకేయి లేవదీసి ఇలా అంది.

కైకేయి: ఓ రాజకుమారా! నువ్వు సత్కీర్తి గలవాడవు. సభలలో సన్మానాలు పొందదగిన సత్పురుషుడవు. అటువంటి నువ్వు ఈ విధంగా నేలపై పడి ఏడుస్తూ పొర్లిగింతలు పెట్టవచ్చా? లే

నాయనా, లే! పోయి ముఖం కడుక్కునిరా. యజ్ఞయాగాదులు చేయవలసిన బుద్ధిమంతుడవు. నువ్వు మందరపర్వతంపై సూర్యునిలా వెలిగిపోవాల్సినవాడవు. అటువంటి నువ్వు ఈ విధంగా బేలవై ఏడవడం బాగాలేదు.

భరతుడు: అమ్మా! నన్ను త్వరగా అయోధ్యకు రమ్మని దూతలను పంపితే, నాయనగారేదో యజ్ఞం తలపెట్టారేమోనని అనుకున్నాను. లేకపోతే వ్యవధి లేకుండా రాముడికి రాజ్యాభిషేకం చేస్తున్నారేమోనని అనుకున్నానేగాని తండ్రిగారు మనల్ని శాశ్వతంగా వదలి వెళ్లిపోతారని అనుకోలేదు. నా ఊహలన్నీ ఊహలుగానే మిగిలిపోయాయి. అమ్మా! తండ్రిగారి మరణానికి హేతువేమిటి? కనీసం తండ్రిగారి చివరి చూపులకైనా నోచుకోలేదు. ఆహా! తండ్రిగారి అంత్యక్రియలు చేసిన రామలక్ష్మణులెంత అదృష్టవంతులో గదా! తండ్రిగారు బ్రతికి ఉండగానే నేను వచ్చి ఉంటే, ప్రేమతో నన్ను కౌగలించుకొనేవారు. ప్రయాణం చేత నా ఒంటినిండా పడిన దుమ్మును తానే స్వయంగా దులిపేవారు.

అమ్మా! ఇకనుండీ నాకు అన్న అయినా, తండ్రి అయినా రాముడే! అందరి దుఃఖాలు పోగొట్టేవాడు రాముడొక్కడే! నేను ఆ రాముడికి సేవకుణ్ణి. నేను వచ్చినట్లు ఇంకా అతడికి తెలిసి ఉండదు. నేను వెంటనే వెళ్ళి పరమధార్మికుడూ, తండ్రి తరువాత తండ్రి అంతటివాడూ అయిన రామునికి పాదాభివందనం చెయ్యాలి. జ్యేష్ఠభ్రాత తండ్రితో సమానమంటారు. ఇకపై రాముడే నాకు దిక్కు.

అమ్మా! ధర్మాత్ముడు, సత్యసంధుడు అయిన తండ్రిగారు చివరి క్షణాల్లో నాకేమైనా సందేశం ఇచ్చారా? నాకు వివరంగా చెప్పు.

కైకేయి: నాయనా! నీ తండ్రి పుణ్యలోకాలకుపోయే వారిలో శ్రేష్ఠుడు. ఆ మహాత్ముడు చివరిక్షణాల్లో "హా రామా! హా లక్ష్మణా! హా సీతా!" అని విలపించాడు. మహాగజాన్ని గొలుసులతో బంధించినట్లు, నీ తండ్రిని ఆ మృత్యుదేవత తన పాశాలచే బంధించి

తీసుకుపోయింది. "సీతా లక్ష్మణులతో కలసి తిరిగి వచ్చినప్పుడు రాముని చూడగలిగేవారు నిజంగా మహాత్ములు; ధన్యాత్ములు గదా" అంటూ ప్రాణం విడిచారు.

భరతుడు: అమ్మా! నువ్వు ఇప్పుడు మరో పిడుగు వంటి వార్తను చెప్పావు. ధర్మాత్ముడూ, కౌసల్యాదేవి పుత్రుడూ అయిన రాముడు, సీతాలక్ష్మణులూ ఇప్పుడు ఎక్కడున్నారు?

కైకేయి: కుమారా! రాముడు నారచీరలు కట్టుకొని సీతా, లక్ష్మణులతో కలసి దండకారణ్యానికి వెళ్ళాడు.

భరతుడు: అమ్మా! రాముడు దండకారణ్యాలకు ఎందుకు పోవలసి వచ్చింది? రాముడు ఎవరైనా బ్రాహ్మణుని ధనాన్ని అపహరించాడా? ధనవంతునిగాని దరిద్రునిగాని హింసించినాడా? పరభార్యలపైన ఏమైనా అత్యాచారం చేశాడా? శిశుహత్యవంటి పాపాలేమైనా చేశాడా? ఏ కారణంచేత రాముడు దండకారణ్యానికి వెళ్ళవలసివచ్చింది?

మూఢురాలు, బుద్ధిహీనురాలు, సర్వం తనకే తెలుసనే గర్వంకలదీ అయిన కైకేయి జరిగింది జరిగినట్లుగా భరతునితో చెప్పింది.

కైకేయి: కుమారా! రాముడు ఏ ధర్మమూ తప్పలేదు. రాముడు ఇతరుల భార్యలను కన్నెత్తి చూడలేదు. శిశుహత్యలేమీ చేయలేదు. బ్రాహ్మణుల సొమ్ము అపహరించలేదు. ఎవరినీ కారణం లేకుండా హింసించలేదు. రాముడు అటువంటి తప్పులేవీ చేయలేదు; చెయ్యడు.

నీ తండ్రి దశరథ మహారాజు రామునికి రాజ్యాభిషేకాన్ని జరపాలని నిశ్చయించాడు. ఆ విషయం నాకు చెప్పలేదు. ఆ విషయం తెలియగానే నాకు కోపం వచ్చింది. బాగా ఆలోచించాను. తరువాత రాజు వచ్చి నాకు చెప్పాడు. అప్పుడు నేను నీకు (భరతుడికి) రాజ్యాభిషేకం చెయ్యమన్నాను, నీ రాజ్యపాలన నిరాటంకంగా సాగటానికి రాముడు అడ్డుగా ఉంటాడేమోనని పద్నాలుగు సంవత్సరాలు రాముణ్ణి అడవులకు పంపాలని చెప్పాను. పూర్వం నీ

తండ్రి నాకు రెండు వరాలిచ్చారు. వాటిని ఇప్పుడు ఈ విధంగా చెల్లించమని నిర్బంధించాను. నీ తండ్రి సత్యవ్రతుడు కాబట్టి నేను అడిగిన రెండు వరాలూ ఇచ్చాడు. రాముడు తండ్రి మాట సత్యం చెయ్యటం కోసం అడవులకు వెళ్తానన్నాడు. రాముడి వెంట సీత, లక్ష్మణుడు కూడా సంతోషంగా వెళ్ళారు. నీ తండ్రి రాముణ్ణి అడవులకు పంపానన్న దుఃఖంతో మరణించాడు.

ఓ భరతుడా! నేను నీ క్షేమమూ, శ్రేయస్సూ కోరి ఇదంతా చేశాను. ఇక ఈ రాజ్యం అంతా నీది. నువ్వు ఇకపై పూర్తిగా మహారాజువి. ఈ అయోధ్య నీది. దుఃఖించవద్దు. ధైర్యంగా వచ్చిన అవకాశాన్ని ఉపయోగించుకొని ఏ చిక్కులూ లేకుండా ఈ కోసల రాజ్యాన్ని ఏలుకో. వసిష్ఠాది బ్రాహ్మణోత్తములు నీ తండ్రికి దహనసంస్కారాలు చేయించి పిదప రాజ్యాభిషేకం చేస్తారు. నువ్వు ధైర్యంగా ఉండు.

# 73వ సర్గ భరతుడు కైకను దూషించటం – 1

తండ్రి మరణం, సీతారామలక్ష్మణుల వనవాసం వార్తలు విన్న భరతునిలో తీవ్రమైన దుఃఖంతోపాటు వైరాగ్యంకూడా కలిగింది.

భరతుడు: ఓ తల్లీ! నా తండ్రి మరణించాడు. నాకు తండ్రితో సమానుడైన అన్నగారు అడవులు పట్టిపోయాడు. కందమూలాలు తింటూ మునీశ్వరునిలా బ్రతుకుతున్నాడు. అక్కడ సీతారామలక్ష్మణులు అడవుల్లో నానాకష్టాలూ పడుతూ ఉంటే నే నిక్కడ భోగాలు అనుభవిస్తూ ఉండనా? అటువంటి రాజ్యం నాకు అక్కరలేదు. తండ్రి మరణానికే నేను దుఃఖీస్తూ ఉంటే రాముడి వనవాసం మాటకూడా చెప్పి పుండుమీద కారం చల్లినట్లు చేశావు. నా తండ్రి నువ్వు నిప్పువని తెలియక నిన్ను కౌగలించుకొని బూడిద అయిపోయాడేగాని ఆయనగా మరణించలేదు. ఆయనను మాత్రమేకాదు, వంశాన్నే సర్వనాశనం చెయ్యటానికి వచ్చిన కాళరాత్రిలా మా ఇంట్లోకి నువ్వు ప్రవేశించావు.

ఓ పాపపు ఆలోచనలు గలదానా! సత్యసంధుడు, కీర్తిమంతుడూ అయిన నా తండ్రిని చంపావు. మా ఇంట్లో సుఖశాంతులు లేకుండా చేశావు. ధర్మాత్ముడైన నా తండ్రిని ఎందుకు చంపావు? తండ్రివంటి రాముణ్ణి ఎందుకు అడవులకు పంపావు? కౌసల్యాదేవిని ఎందుకు పుత్రశోకంలో పడదోశావు? ఇకపై నా తల్లులు కౌసల్యా, సుమిత్రలు నీ నీడన బ్రతుకగలరా?

నా అన్న రాముడు పెద్దల పట్ల ఎలా ప్రవర్తించాలో తెలిసినవాడు. నిన్ను తన కన్నతల్లికన్నా మిన్నగా ప్రేమించేవాడు. అట్లాగే నా పెత్తల్లి కౌసల్యాదేవి ధర్మాత్మురాలు. ధర్మాన్ని తప్పి ఎన్నడూ నడచుకోలేదు. నువ్వు ఎంత దురుసుగా ప్రవర్తించినా ఆమె మాత్రం నిన్ను తన చెల్లెలుగానే చూసుకునేది.

ఓసీ పాపాత్మురాలా! దైవసమానుడైన నా అన్నగారు రాముణ్ణి నారచీరలు కట్టించి

వనవాసానికి పంపినా కూడా ఇంకా నీలో క్రోధం చావలేదే! ఇక నీలో పశ్చాత్తాపం కలుగుతుందని ఎట్లా అనుకోను? ఇన్ని పాపాలు చేశావు కదా? ఎందుకు ఈ పాపాలన్నీ చేస్తున్నావో ఒక్కసారైనా వెనక్కు తిరిగి ఆలోచించుకున్నావా? నువ్వు రాజ్యం కోసం లోభంతో ఇందరికి ఇన్ని కష్టాలు తెచ్చిపెట్టావు.

మేరుపర్వతం తన రక్షణ కోసం చుట్టూ ఉండే అరణ్యాలను ఆశ్రయించినట్లుగా, నా తండ్రి దశరథ మహారాజు రాముణ్ణి ఆశ్రయించి ఉండేవాడు. రామలక్ష్మణులు లేని ఈ రాజ్యం నా కెందుకు? పెద్ద బరువులు వేసిన బండిని లేగదూడ లాగగలదా? అట్లాగే నేను ఈ రాజ్యభారాన్ని మోయగలనా?

ఓ తల్లీ! నేను ఈ రాజ్యాన్ని ఏలవలసిన పరిస్థితులు ఏర్పడితే, దశరథ మహారాజు కుమారుణ్ణే అయినందువల్ల దేశంలో శాంతి భద్రతలు కాపాడటానికి ఏలుతానేగాని, నీ కోరిక తీర్చటానికి మాత్రంకాదు. నువ్వు చేసిన ఈ దుర్మార్గపు పనికి నిన్ను ఇప్పుడే దేశంనుండి వెళ్లగొట్టేవాడనే. కానీ తండ్రితో సమానుడైన నా అన్నగారు రాముడు నిన్ను కన్నతల్లికన్నా ఎక్కువగా ప్రేమించేవాడు. అటువంటి నా అన్నగారికి కోపం వస్తుందేమోనని భయపడి నిన్ను వెళ్ళగొట్టడం లేదు. ఏ రాముణ్ణి నువ్వు అడవులకు పంపావో అదే రాముడి కారణంగానే నువ్వు బ్రతికిపోయావు.

ఓసీ! దుష్టురాలా! మా పూర్వీకులందరూ నిన్ను చూసి చీదరించుకొనే పాపపు ఆలోచన నీకు ఎట్లా వచ్చింది? లోకంలోను మన వంశాచారం వల్లకూడా రాజు పెద్దకొడుకే రాజ్యాభిషిక్తుడవుతాడు. తక్కిన వారంతా అతడిని భక్తితోను, ప్రేమతోను సేవిస్తూ ఉంటారు. ఇదే కదా మన వంశాచారం?

ఓ క్రూరాత్మురాలా! రాజధర్మం ప్రకారం ఎల్లప్పుడూ పెద్ద కొడుకే రాజ్యాభిషిక్తుడు అవుతాడు. ఈ ధర్మం అన్ని రాజవంశాలకూ వర్తిస్తుంది. మీదుమిక్కిలి మా

ఇక్ష్వాకువంశీయులకు ఇది పరమధర్మం. ఈ ధర్మం నువ్వు తెలియనిదానవైనా అయి ఉండాలి లేదా రాజధర్మాలంటే గౌరవం లేనిదానివైనా అయి ఉండాలి.

మా ఇక్ష్వాకులవంశాన్ని ధర్మమే రక్షిస్తోంది. వారి ధర్మాచరణ, సదాచారమే మా వంశానికి గర్వకారణంగా ఉండేవి. ఈ రోజున నీ లోభత్వం చేత, అజ్ఞానం చేత మా వంశప్రతిష్ఠనంతా నాశనం చేశావు. అటువంటి సదాచార సంపన్నమైన మా వంశంలో మెట్టిన నీకు ఇటువంటి నీచపు ఆలోచన ఎట్లా కలిగింది?

ఓసీ పాపాత్మురాలా! నా ప్రాణాలనైనా విడుస్తాను కానీ, నువ్వు కోరిన పనిచేయను. అంతేకాదు, ఇప్పుడే నీకు దుఃఖాన్ని కలిగించే పనిచేస్తాను. అదేమంటే, ప్రజారంజకుడు, దోషరహితుడు, నాకు పితృ సమానుడు, జ్యేష్ఠసోదరుడూ అయిన రాముణ్ణి కాళ్ళు పట్టుకొని బ్రతిమాలి వెనక్కు తీసుకొని వస్తాను. జీవితాంతం అతడికి సేవకుడుగా, విశ్వాసపాత్రుడుగా బ్రతుకుతాను.

మహాత్ముడైన భరతుడు ఈ విధంగా తల్లిని నిందించి గుహలో బంధింపబడ్డ సింహంలా బిగ్గరగా ఏడ్చాడు.

# 74వ సర్గ భరతుడు కైకను దూషించటం – 2

భరతుడు తల్లిని ఈ విధంగా దూషించినా అతడి కోపం ఏమాత్రం చల్లారలేదు. ఆ కోపంలోనే మళ్ళీ ఇలా అన్నాడు.

భరతుడు: ఓ తల్లీ! నువ్వు దుష్టురాలవు. నువ్వు ధర్మంలేని దానవు. నేనుకూడా మరణించి నీ కోరిక నెరవేరకుండా ఉండేట్లు చేస్తాను. దాంతో నీ ఆశలన్నీ బూడిదలో పోసిన పన్నీరులాగా నిరర్థకమైపోవాలి. దాంతో నువ్వు కోరుకున్న రాజ్యం నీకు దక్కకుండా పోతుంది. అప్పుడు ఈ దుర్మార్గమైన పని ఎందుకు చేశానా అని నెత్తిన చేతులు పెట్టుకొని ఏడుస్తూ కూర్చో.

నీ మూలంగా రాజు మరణించాడు, రాముడు అడవులకు పోయాడు. రాముడు నీకు ఏం అపకారం చేశాడని నువ్వు ఈ పాడుపనికి పూనుకున్నావు? ఓ కైకేయీ! నువ్వు మా వంశాన్ని నాశనం చేయటంవల్ల నీకు భ్రూణహత్యాపాతకం చుట్టుకుంటుంది. నీకు నరకం తప్పదు, మరణానంతరం నీ భర్త ఉండే స్వర్గానికి పోలేవు. నువ్వు భయంకరమైన పనులు చేసి మహాపాపాన్ని మూటగట్టుకున్నావు. నీ కొడుకునై పుట్టిన నేరానికి నేనూ ఆ పాపాలన్నీ భరించాల్సి వస్తోంది. ఆ విధంగా నువ్వు నాకు తల్లి రూపంలో వచ్చిన శత్రువ్వి. రాజ్యకాంక్షతో ఈ పాపాలన్నీ నిర్భయంగా చేశావు. చేతులారా దేవుడిలాంటి నా తండ్రిని చంపావు. నీతో మాట్లాడినా పాపమే చుట్టుకుంటుంది. నా తక్కిన తల్లులైన కౌసల్య, సుమిత్ర వంటి వారందరికీ తీరని దుఃఖాన్ని మిగిల్చావు. ఇంతమందిని దుఃఖసాగరంలో ముంచిన నువ్వు కేకేయ రాజపుత్రివి కాదు. మా వంశాన్ని సర్వనాశనం చేయటానికి వచ్చిన రాక్షసివి. నువ్వు చేసిన పాపాలన్నీ నాకు చుట్టుకోవటం వల్ల నా తండ్రి మరణించాడు. సోదరులంతా నన్ను విడిచిపోయారు. నేను ఏకాకినయ్యాను. ప్రజలంతా నన్ను చూసి అసహ్యించుకుంటున్నారు. ఓ పాపిష్ఠురాలా! కౌసల్యాదేవి పుత్రుడు, ఆత్మనిగ్రహం కలవాడూ, నాకు అన్నగారూ అయిన రాముడు నాకు తండ్రివంటి వాడని నువ్వు ఎరుగవా?

ఓ కైకా! పుత్రుడు శరీరంలోని ప్రతి అవయవం నుండే కాకుండా హృదయం నుండి కూడా పుట్టినవాడు కావటంచేత తల్లికి ఎంతో ఆత్మీయుడవుతాడు. అందువల్ల ఆడవాళ్ళకు మిగతా బంధువర్గానికన్నా కూడా అత్యంత దగ్గరవాడవుతాడు. కామధేనువు దేవతలందరికీ అత్యంత ప్రీతిపాత్రమైనది. సమస్త ధర్మాలు తెలిసినది, పూర్వం ఒకప్పుడు భూలోకంలో మండుటెండలో దుక్కి దున్నుతున్న రెండు ఎద్దులు పడుతున్న కష్టాన్ని చూసింది. తన సంతానం అయిన ఎద్దులు పడే కష్టాన్ని చూడలేక కన్నీళ్ళు పెట్టుకుంది. అదే సమయాన క్రిందికి పోతున్న దేవేంద్రుడిపై ఆ కామధేనువు కన్నీళ్ళు పడ్డాయట. పరిమళంతో ఉన్న ఈ కన్నీరు ఎవరిదా అని పైకి చూస్తే, కామధేనువు కన్నీరు కారుస్తూ ఉండటం కనిపించింది. అప్పుడు దేవేంద్రుడు "ఓ సురభీ! నువ్వు అందరి క్షేమం కోరేదానవు, మా దేవతలకేదైనా కీడు రాబోతోందా ఏమి?" అని అడిగాడు. అందుకు ఆ కామధేనువు "దేవేంద్రా! పాపం శమించుగాక, దేవతలకు ఎటువంటి భయమూలేదు. నా సంతానం అయిన ఎద్దులు కష్టాల్లో ఉన్నాయి, ఎండ వాన అని లేకుండా కష్టపడుతూ కృశించిపోతున్నాయి. అయినా కూడా జాలి లేకుండా రైతులు పీడిస్తూనే ఉన్నారు. బరువులు మోయలేని వాటి దీనావస్థచూసి నేను సహించలేకపోతున్నాను. ఆ ఎద్దులు నా శరీరంలో నుండి పుట్టినవి. అందువల్ల అవి దుఃఖపడుతూ ఉంటే చూడలేక నాకూ దుఃఖం వచ్చింది. తల్లికి పుత్రుడికంటే అధికమైన ప్రేమపాత్రుడు మరొకడు ఉండడు కదా! అందువల్ల దుఃఖంతో నా కడుపు తరుక్కుపోతోంది" అన్నది.

ప్రపంచంలోని కోట్లాది ప్రాణులన్నీ కామధేనువు సంతానమే అయినా, ఆ రెండు ఎద్దులు తన కడుపున పుట్టినవి కావటంచేత అవి పడే కష్టాలుచూసి సహించలేక ఏడుస్తున్నదని దేవేంద్రుడు గ్రహించి, "ఆహా! తల్లికి పుత్రులకన్నా ప్రియమైనవారు ఎవరూ ఉండరు కదా" అని అనుకున్నాడు. కామధేనువు తలచినంత మాత్రానే, కోరుకున్న వాళ్ళ కోరికలన్నీ తీర్చకలిగే సామర్థ్యం ఉంది. లోకహితం కోసం దాని సంతానాన్ని భూమి మీద అనంతంగా వృద్ధిచేసింది. అయినా కూడా తన కడుపునుండి పుట్టిన కారణంగా ఆ రెండు ఎద్దులు పడే కష్టాన్ని చూడలేక విలపించింది. కామధేనువు వంటిదే సంతానంకోసం అట్లా ఏడిస్తే, ఇక ఒక్కగానొక్క పుత్రుణ్ణి

కన్న కౌసల్యాదేవి దుఃఖాన్ని గూర్చి వివరించి చెప్పగలనా? రామ వియోగాన్ని భరిస్తూ ఆమె జీవించలేదు. ఆమె రాముణ్ణి అల్లారుముద్దుగా పెంచుకుంది. నువ్వు ఆమె పుత్రుణ్ణి ఆమెకు కాకుండా చేశావు. అటువంటి పాపానికి నీకు ఇహమూ, పరమూ రెండూ దక్కవు. నువ్వు జన్మజన్మలకు దుఃఖాన్నే అనుభవిస్తావు.

ఓ కైకా! నా తండ్రి విషయంలోను, నా అన్నగారి విషయంలోను నువ్వు చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను. అట్లాచేసి కీర్తిని కూడా సంపాదించుకుంటాను. ఇది సత్యం. నేను ఇప్పుడే అరణ్యాలకు వెళతాను. రాముణ్ణి కాళ్ళావేళ్ళాపడి బ్రతిమాలి వెనక్కు పిలిపిస్తాను. అన్నకు బదులు నేనే వనవాసం చేస్తాను. ఓ పాపిష్టిదానా! ప్రజలంతా రాముడికోసం విలపిస్తూ ఉంటే నేను ఆ పాపాన్ని మోస్తూ జీవించలేను. ఇన్ని పాపాలు చేసినదానవు పోయి నిప్పుల్లో దూకి చావు, లేదా నువ్వే దండకారణ్యాలకు పో! లేదా ఉరిపోసుకు చావు. అంతకన్నా నీకు నశించే మార్గం లేదు. రాముడు వచ్చి తిరిగి రాజయిన తరువాతనే నా పాపభారం తగ్గి, కృతార్థుడనవుతాను.

భరతుడు ఆ విధంగా తల్లిని దూషిస్తూ అంకుశంతో పొడిచిన ఏనుగులాగా ఘీంకరించాడు. సర్పంలా నిట్టూరుస్తూ నేలపై పడిపోయాడు.

# 75వ సర్గ భరతుడు కౌసల్యను ఓదార్చడం

భరతుడు వచ్చాడని తెలిసిన మంత్రులు కైకేయి గృహానికి వెళ్లారు. మంత్రులను చూడగానే మళ్ళీ భరతుని కళ్లనిండా నీరు కమ్మింది. అసహనంగా తల్లి వంక చూస్తూ "ఓ మంత్రి పుంగవులారా! నేను ఎన్నడూ రాజ్యాన్ని కోరుకోలేదు. రాజ్యం కావాలని మా అమ్మతో అనుకూడా లేదు. నా తండ్రి నాకు రాజ్యం ఇచ్చిన విషయంకూడా నాకు తెలియదు. నేను, శత్రుఘ్నుడు చాలాదూరంలో మా తాతగారింట్లో ఉన్నాం. ఇదంతా మా అమ్మ చేసిన కుట్ర, పన్నాగం. అందులో నా ప్రమేయం ఏమీ లేదు. సీతారామలక్ష్మణులు అడవులకు వెళ్ళిన విషయం కూడా నాకు తెలియదు" అన్నాడు.

భరతుని కంఠం విన్న కౌసల్య, సుమిత్రతో ఇలా అంది: "సుమిత్రా! దుర్మార్గురాలైన కైకేయి కొడుకు, భరతుడు వచ్చినట్లున్నాడు. వాడు ధర్మాత్ముడు. వాడికి తల్లి బుద్ధులు రాలేదు. వెంటనే వాడితో మాట్లాడాలని ఉంది." అట్లా అంటూ లేచి నిలబడబోయింది. పుత్రవియోగంతోను, భర్తృవియోగంతోను దుఃఖంలో ఉండి శరీరం అంతా కృశించి పోవటంతో లేవలేక కూలపడిపోయింది.

అదే సమయానికి, భరత శత్రుఘ్నులిద్దరూ మంత్రులను వెంట బెట్టుకొని కౌసల్యాదేవిని చూసేందుకు వచ్చారు. వారిద్దరూ దుఃఖంతో ఏడుస్తూ నేలపై పడి ఉన్న కౌసల్యాదేవిని చూసి త్వరగా ఆమె వద్దకుపోయి కౌగలించుకొని పెద్దపెట్టున ఏడ్చారు. వాళ్ళను, వాళ్ళ ఔదార్యాన్ని చూసిన కౌసల్యాదేవి వెక్కివెక్కి ఏడ్చింది. "నాయనా భరతా! నీ తల్లి చాలా సమర్థురాలు. రాజ్యం కావాలని కోరుకున్న నీకు ఎటువంటి ఆటంకాలూ లేకుండా, శత్రువధ లేకుండా ఈ రాజ్యాన్నంతా అలవోకగా సంపాదించి పెట్టింది. అంతేకాదు. దుర్మార్గురాలైన కైకేయి నా కొడుకు రాముణ్ణి నారచీరలు కట్టి అడవులకు పంపింది. నాయనా! ఇన్ని అనర్థాలూ మీ అమ్మ ఏ ప్రయోజనం పొందాలని చేసింది? నాయనా! నన్నుకూడా నా కొడుకు ఉన్న చోటుకే పంపెయ్యి.

లేకపోతే నేనే సుమిత్రను కూడా తీసుకొని మీ తండ్రిగారి అగ్నిహోత్రాన్ని, ఆయన శరీరాన్ని తీసుకొని రాముడున్న చోటుకేపోతాను. లేదంటావా, నువ్వే నన్ను నా రాముడు తపస్సు చేసుకునే చోటుకు తీసుకుపోయి వదిలిపెట్టి రా. ధనధాన్యసమృద్ధి కలిగిన ఈ రాజ్యాన్ని, గజతురగ రథాలతో కూడిన అతివిశాలమైన ఈ రాజ్యాన్ని నీకు సంపాదించి పెట్టింది కదా! నన్ను కూడా అడవులకు పంపే అధికారం నీకూ, నీ తల్లికీ ఉన్నాయి" అంది.

అసలే తల్లి చేసిన అకృత్యానికి బాధపడుతున్న భరతుడికి తల్లి కౌసల్యాదేవి మాటలు పుండుమీద కారం చల్లినట్లు బాధపెట్టాయి. కౌసల్య పలికిన నిష్ఠురపు మాటలకు భరతుడు విలవిలా కొట్టుకొని ఏడుస్తూ ఆమె కాళ్ళమీదపడి స్పృహతప్పిపోయాడు. కొంతసేపటికి తెప్పరిల్లి కళ్ళు తెరచిచూడగా కౌసల్యాదేవి సపర్యలు చేస్తోంది.

భరతుడు: అమ్మా! నేను ఏ పాపమూ ఎరుగను. నీ మాటలు నన్ను ఈటెలతో పొడిచినట్లు బాధిస్తున్నాయి. అమ్మా! రాముణ్ణి నేనెంత గాఢంగా ప్రేమిస్తానో నీ వెరుగవా? రామునిపై నాకు నిశ్చలమైన భక్తి ఉండటం నీకు తెలియదా? అన్నీ తెలిసిన నీవే నన్ను ఇట్లా మాటలతో బాధపెట్టడం తగునా?

నా అన్నగారైన రాముడు సత్యసంధుడు, సత్పురుషులలో శ్రేష్ఠుడు. అటువంటివాడిని అరణ్యాలకు పొమ్మని ఎవరు ఆజ్ఞాపించారో వారికి మతిచలించి ఉంటుంది, బుద్ధి మందగించి ఉంటుంది. అన్నగారిని అరణ్యవాసం చెయ్యమనటం ధర్మసమ్మతం కాదు; శాస్త్రం ఒప్పుకోదు.

[ వివరణ: సత్పురుషులకు అపకారం తలపెడితే వాని బుద్ధిచెడి పెడమార్గాలను పట్టుకొని వినాశనానికి కారణం అవుతుందని వాల్మీకి మహర్షి భరతునిచే శపథాలు చేయిస్తూ మనకు ధర్మబోధ చేస్తున్నాడు.]

అమ్మా! నేను అన్నగారి వనవాసానికి అనుమతించి ఉన్నట్లయితే పాపాత్ములకు సేవచేసిన చెడు ఫలం (పాపం) నాకు దక్కుగాక! సూర్యుని ఎదురుగా మలమూత్రాదులు

విసర్జించే వాడికి పట్టే దుర్గతులు నాకు పట్టుగాక! నిద్రపోతున్న ఆవును కాలితో తన్నేవాడికి కలిగే పాపం నాకు వాటిల్లుగాక! సేవకునిచేత సేవలు చేయించుకొని అతడికి జీతభత్యాలు ఏమీ ఇవ్వని (వెట్టిచాకిరీ) యజమానికి కలిగే పాపం నన్ను చుట్టుకొంటుంది గాక! ప్రజలను కన్నబిడ్డల్లా చూసుకొనే రాజుకు ద్రోహం చేసినంత పాపం నాకు సంభవించుగాక! దక్షిణలు ఇస్తానని వాగ్దానం చేసి, యజ్ఞాలు చేయించుకొని తరువాత నేను ఇస్తానని చెప్పలేదని అబద్ధమాడే వాడికి కలిగే నరకం నాకు దాపురించుగాక! వీరుడని చెప్పుకొని యుద్ధరంగం నుండి పారిపోయి వచ్చి ప్రాణాలు కాపాడుకొన్నవాడికి పట్టే దుర్గతులన్నీ నాకు కలుగుగాక! గురువుల వద్ద నేర్చుకున్న ధర్మోపదేశాలను, సూక్ష్మ విషయాలను పొంది వాటిని విస్మరించిన వాడికి కలిగే దోషాలన్నీ నాకు కలుగుగాక! ఆజానుబాహువు, సూర్యచంద్రులతో సమానమైన తేజస్సు కలిగిన రాముడు, రాజై పరిపాలిస్తుండగా చూసే భాగ్యంలేని అభాగ్యుడినై పోవుదునుగాక! పితృదేవతలకు, అతిథిదేవతలకు, గురువుల కొరకు నిర్దేశించబడిన పాయసం, పులగం, మేకమాంసం వారికి పెట్టకుండా (తానే తిని) వారిని అవమానించేవాడికి కలిగే దుర్గతులన్నీ నాకు వాటిల్లుగాక! ఆవును కాలితో తన్నిన పాపము, పెద్దలను దూషించిన పాపము, మిత్రులకు ద్రోహంచేసిన పాపము నాకు వాటిల్లుగాక! మిత్రులు తనను నమ్మి చెప్పిన రహస్యాలను నిర్దాక్షిణ్యంగా బహిరంగ పరచినవాడికి పట్టే దుర్గతులన్నీ నాకు కలుగుగాక! నేను ఎవరికీ ఏ ఉపకారమూ చేయనివాణ్ణిగాను, కృతజ్ఞతలేని వాణ్ణిగాను, ఆత్మహత్య చేసుకొన్నవాణ్ణిగాను, సిగ్గూశరమూ లేని జీవితం గడిపేవాణ్ణిగాను పొందే నిందాపూర్వకమైన జీవితాన్ని పొందుదునుగాక! భార్యాపిల్లలను పస్తులు పడుకోబెట్టి తానుమాత్రం విందుభోజనాలు చేసేవాడికి కలిగే దుర్గతులన్నీ నాకు పట్టుగాక! విచ్చలవిడిగా బాలలను, వృద్ధులను, స్త్రీలను చంపే రాజుకు పట్టే పాపం నన్ను చుట్టుకొనునుగాక! నిషేధించబడిన మధువు, లక్క, మాంసం, లోహము, విషం మొదలైన వస్తువులను విక్రయించేవాడికి ఎటువంటి పాపం కలుగుతుందో నాకూ అట్టి పాపమే ప్రాప్తించుగాక! భీకరమైన యుద్ధం జరుగుతూ ఉండగా వెన్నిచ్చి పారిపోయే భీరువుకి ఎటువంటి దుర్గతులు కలుగుతాయో నాకూ అటువంటి దుర్గతులే కలుగుగాక! చిరిగిన గుడ్డలు కట్టుకొని, కుండపెంకు చేతిలోపెట్టుకొని అడుక్కునే వాడికి, స్త్రీ వ్యామోహపరునికి,

మద్యపానానికి దాసుడైనవాడికి పట్టే గతే నాకూ పట్టునుగాక!

రాముణ్ణి అరణ్యాలకు పంపటంలో అణుమాత్రమైనా నా ప్రమేయం ఉంటే పైన చెప్పిన పాపాలన్నీ నాకు కలుగుతాయి. నేను అధర్మపరుణ్ణే అవుతానుగాక! జీవితమంతా సంపాదించుకొన్న ధనాన్ని దొంగలెత్తుకు పోతే, ఎంత విలపిస్తాడో అట్టి దుఃఖాన్ని నేను పొందుదునుగాక! ప్రాతః కాలంలో, సంధ్యా సమయాల్లో నిద్రించే వాడికి కలిగే పాపం నాకు కలుగుగాక! ఇళ్ళు తగలబెట్టిన వాళ్ళకు కలిగే పాపం; గురుభార్యాగమనం చేసిన వాళ్ళకు దాపురించే పాపం; మిత్రదోహం చేసేవారికి కలిగే పాపం నాకు కలుగునుగాక! తల్లిదండ్రులకు, గురువుకు శుశ్రూష చెయ్యని వాడికి ఎటువంటి పాపం కలుగుతుందో అటువంటి పాపం నాకు చుట్టుకొనును గాక! అధిక సంతానంతో, రోగాలతో, దరిద్రంతో పడే బాధలన్నీ నేను అనుభవిస్తానుగాక! క్రూరుడు, చాడీలు చెప్పేవాడు, అపవిత్రుడు, అధర్మపరుడు, క్షణక్షణం రాజభటులను చూసి భయపడేవాడు, మోసంచేస్తూ జీవించేవాళ్ళు ఎటువంటి పాపాలను పొందుతారో నేనూ అటువంటి పాపాలనే పొందుతానుగాక! పతివ్రత అయిన భార్య ఋతుస్నాత అయినప్పుడు, ఋతునియమాలను పాటించని భ్రష్ఠుడికి ఎటువంటి పాపం కలుగుతుందో నేనూ అదే పాపాన్ని పొందుతానుగాక! అధర్మపరుడై, ధర్మపత్నిని విడచి, పరభార్యతో సంపర్కం పెట్టుకునే వాడికి ఎటువంటి పాపం కలుగుతుందో నేనూ అటువంటి పాపాన్నే పొందుతాను గాక! సంతానహీనుడైన బ్రాహ్మణునకు ఎలాంటి పాపం కలుగుతుందో నాకూ అట్టి పాపమే కలుగుగాక! త్రాగేనీళ్ళలో దుమ్ముకొట్టేవాడికీ, విషాన్నం పెట్టేవాడికి ఎటువంటి పాపం చుట్టుకుంటుందో, నాకూ అదే పాపం కలుగుగాక! ఇంద్రియలోలుడై సిద్ధంచేసుకున్న బ్రాహ్మణపూజకు విఘాతం కలిగిస్తే వచ్చే పాపం; దూడకు మిగల్చకుండా పాలు మొత్తం పితికేవాడికి ఎలాంటి పాపం చుట్టుకుంటుందో నాకూ అట్టి పాపం కలుగుగాక! దాహంగా ఉన్నవాడికి నీళ్ళు ఉంచుకొని కూడా ఇవ్వకుండా దాచుకునేవాడికి కలిగే పాపం నాకూ కలుగుగాక! ఎవరైనా పోట్లాడుకొంటూ ఉంటే వాళ్ళను విడదీసి సమాధానపరచకుండా వినోదంగా చూసేవాడికి ఎటువంటి పాపం కలుగుతుందో నాకూ అట్లాంటి పాపమే

కలుగుగాక!"

ఈ విధంగా దుఃఖీస్తూనే శపథం చేసిన భరతుణ్ణి చూసి కౌసల్య ఇలా అంది: "నాయనా! భరతా! నువ్వు ఇటువంటి ప్రతిజ్ఞలన్నీ చేయటం వల్ల నా ప్రాణానికి దుఃఖం పెరిగిపోతోందేగాని తరగటం లేదు. భగవత్కృప చేతా, పుణ్యవశంచేతా, నీ మనస్సు ధర్మమార్గాన్ని విడిచిపెట్టలేదు. ఇటువంటి ప్రతిజ్ఞలు చేయడంవల్ల లక్ష్మణుని లాగానే సత్పురుషుల కోవకు చెందుతావు." ఇలా అంటూ భరతుణ్ణి కౌగలించుకొని శిరస్సుపైన ఆఘ్రాణించి తన ప్రక్కనే కూర్చోబెట్టుకుంది. ఇద్దరూ కొద్దిసేపు జరిగిన వాటిని తలచుకొని దుఃఖీంచారు. వారట్లా దుఃఖీస్తూ ఉండగానే భళ్ళున తెల్లవారిపోయింది.

# 76వ సర్గ దశరథ మహారాజుకు దహన సంస్కారాలు

ఈవిధంగా దుఃఖంలో కుమిలిపోతున్న భరతునితో వసిష్ఠ మహర్షి "ఓ రాజకుమారా! భరతుడా! దుఃఖించకు. నీకు శుభం జరుగుతుంది. ఇకపై నువ్వు మహారాజు దేహానికి ఉత్తరక్రియలు జరపాలి" అన్నాడు. తరువాత భరతుడు ఉత్తరక్రియలకు సిద్ధమయ్యాడు.

దశరథ మహారాజు దేహాన్ని తైలద్రోణి నుండి బయటకు తీసుకువచ్చారు. మహారాజు ముఖం దీర్ఘనిద్రలో ఉన్నట్లు కనిపించింది. అనేక విలువైన రత్నాలు పొదిగిన శయ్యపైకి చేర్చారు. భరతుడు తండ్రి మృతకాయాన్ని చూస్తూ తన్నుతాను సంబాళించుకో లేకపోయాడు. బిగ్గరగా ఏడ్చాడు. "ఓ రాజా! నేను ఎంత దూరదేశంలో ఉన్నాను. ధర్మవేత్త అయిన అన్నగారు, లక్ష్మణుడు అడవులకు పోయారు. వాళ్ళను అరణ్యానికి ఎందుకు పంపావు తండ్రీ! అందరినీ ప్రేమించే రాముడి కోసం ప్రజలంతా దుఃఖీస్తున్నారే! ఇట్లాంటి సమయంలో నువ్వు ఒక్కడివీ ఎక్కడకు వెళ్లావు? ఇకపై ప్రజల యోగక్షేమాలు చూసేవాళ్ళెవరు?

ఓ తండ్రీ! నీవు మరణించావు, రాముడు అడవులకు వెళ్ళాడు. మీ ఇద్దరూలేని అయోధ్య విధవ అయిపోయింది. ఈ అయోధ్య చంద్రుడులేని రాత్రిలా ఉంది; లోకమంతా పాడుపడిపోయినట్లుంది" అంటూ విలపించాడు.

అప్పుడు వసిష్ఠ మహర్షి భరతునితో "ఓ మహాబాహూ! ఇప్పటికే బాగా ఆలస్యం అయిపోయింది. ఇంక రాజు దేహానికి ప్రేతసంస్కారాలు చేయించాలి. త్వరగా లేచిరా!" అన్నాడు.

వసిష్ఠ మహర్షి ఆదేశాన్ని భరతుడు శిరసావహించాడు. బ్రాహ్మణులను ప్రేతకార్యాలకు నియోగించాడు. దశరథ మహారాజును పడుకోబెట్టిన శయ్యను బయటకు తెచ్చారు. అగ్నిహోత్రాన్ని పుచ్చుకొని భరతాదులు ముందు నడువగా, పరిచారకులు దశరథుని కళేబరాన్ని

వాహనంపై ఉంచి మోస్తూ వాళ్ళను అనుసరించారు. ఆ పల్లకీ అట్లా ముందుకు పోతూ ఉంటే రాజబంధువులు, రాజోద్యోగులు, ప్రజలు ఆ పల్లకీపై రత్నాలు, విలువైన వస్తువులు, పుష్పాలు వెదజల్లారు. గుగ్గిలము, చందనం, అగరువంటి సుగంధద్రవ్యాలతో ధూపంవేస్తూ పల్లకీతో కూడా నడిచారు. శ్మశానంలో గంధం, పద్మక, దేవదారువంటి సుగంధ పరిమళాలు వెదజల్లే కట్టెలతో చితిని పేర్చారు. జాగ్రత్తగా మహారాజు భౌతికకాయాన్ని ఆ చితిపైకి చేర్చారు. భరతుడు ఆ చితికి అగ్నిహోత్రాన్ని చేర్చాడు. పౌరోహితులు (ఋత్విజులు) ప్రేతసంస్కారానికి జపించే మంత్రాలను చదివారు. శాస్త్రప్రకారం సామగానాన్ని వల్లించారు.

రాణులందరూ తమ తమ అంతస్తును, వయస్సును బట్టి వాహనాలలో వచ్చారు. వారందరినీ వృద్ధ పరిచారికలు అనుసరించారు.

భరతునితోపాటు కౌసల్యాదేవికూడా అగ్నికి ప్రదక్షిణం చేసింది. రాణులంతా జాలిగొలిపేట్లుగా రోదించారు. అంతా భరతుడితో కలిసి సరయూనదికి వెళ్ళి దశరథునికి ఉదకక్రియలు నిర్వర్తించారు. తరువాత మంత్రి, పురోహితులంతా కలసి అయోధ్యానగరానికి చేరుకున్నారు. దుఃఖంతో వారంతా ఆ పది రోజులూ నేల మీదనే పడుకుని కాలం గడిపారు.

# 77వ సర్గ పదమూడవనాడు అస్థిసంచయన కార్యం చేయడం

పదవ దినాన భరతుడు శుద్ధి చేసుకొన్నాడు, పన్నెండవ దినాన శ్రాద్ధకర్మలు చేయించాడు. ఆ శ్రాద్ధం జరిపించి బ్రాహ్మణులందరికీ రత్నాలు, ధనము, విలువైన వస్త్రాలు ఇచ్చి భోజనాదులుపెట్టి సంతృప్తులను చేశాడు. దశరథుని పారలౌకిక కర్మలు చేయించేటప్పుడు విరివిగా గోవులను, మేకలను, దాసదాసీజనాన్ని, వాహనాలను, గృహాలను బ్రాహ్మణులకు దానం చేశాడు.

పదమూడవనాడు అస్థికల సంచయనం కోసం శ్మశానానికి వెళ్ళారు. భరతుడు అస్థికలు ప్రోగుచేస్తూ విపరీతంగా ఏడుస్తూ ఇట్లా అన్నాడు. “తండ్రీ! నువ్వు రాముడి సంరక్షణలో నేను సుఖంగాను, భద్రంగాను ఉంటానని చెప్పేవాడివి. అటువంటి రాముడు ఈ రోజు అడవుల్లో ఉన్నాడు. ఇక నాకు మిగిలిందంతా శూన్యమే కదా! నాకు సుఖం ఎక్కడుంది? భద్రత ఎక్కడుంది? ఒంటరివాణ్ణిచేసి నువ్వు వెళ్ళిపోయావు.

“ఓ మహారాజా! అనాథయైన కౌసల్యాదేవికి దిక్కుగా ఉండవలసిన రాముణ్ణి అడవులకు పంపి, ఆమెను ఒంటరిగా ఇక్కడ వదిలేసి నువ్వు ఎక్కడికి వెళ్ళావు? ఆవిడను అన్ని విధాలుగా అనాథను చేసిపోయావు. మమ్మల్నందరినీ ఇట్లా అనాథలుగా చేసిపోయావే! మేము చేసిన నేరం ఏమిటి?” అంటూ శరీరం ఎముకలు కాలిబూడిద అయిన చితిచుట్టూ తిరుగుతూ విలపించాడు. అక్కడ కాలిపోగా మిగిలిన అస్థులను చూసి “అయ్యో! అయ్యో! ఇదేనా మిగిలింది” అంటూ కుప్పకూలిపోయాడు. పుణ్యం అంతా ఖర్చయిపోయి నేలమీద పడుతున్న యయాతిని ఋషులు పట్టుకున్నట్లుగా, భరతుణ్ణి సుమంత్రుడు పట్టుకొని లేవనెత్తబోయి ఇద్దరూ నేలపై పడ్డారు.

అంతవరకూ దుఃఖిస్తున్నా నిబ్బరంగా ఉన్న శత్రుఘ్నుడు కూడా మనస్సు చెదరిపోయి తండ్రిని తలచుకుంటూ నేలమీద పడిపోయాడు. “ఓ తండ్రీ! మంథర నుండి పుట్టి, కైకేయి అనే మొసలిచే భయంకరమైన వరదానమనే మహాసముద్రం అందరినీ ముంచివేసింది, తండ్రీ! నీ

గుండెల మీద పెరిగి లాలించబడిన భరతుణ్ణి ఒంటరిగా వదలి ఎక్కడకు వెళ్ళావు? మాకు కావలసినవీ, ఇష్టమైనవీ అయిన వస్త్రాలు, ఆభరణాలు, తినుబండారాలు నువ్వే స్వయంగా సమకూర్చి పెట్టేవాడివే? ఇకమీదట ఆ విధంగా మాకు ఇచ్చేందుకు ఎవరున్నారు? ధర్మాత్ముడు, మహాత్ముడైన నువ్వులేని ఈ భూమి రెండు ముక్కలు కావాలి గదా? ఎందువల్ల ఇంకా ఈ భూమి బ్రద్దలు కాలేదు? ప్రళయంలో కూడా ఈ భూమి బ్రద్దలవదా? తండ్రీ నువ్వు స్వర్గానికి పోయావు, రాముడు అడవులకు పోయాడు. భరతుడికి మతి చెడిపోయింది. నేను ఒక్కణ్ణే ఎట్లా జీవించగలను? నేను కూడా అగ్నిప్రవేశం చేసి ప్రాణత్యాగం చేస్తాను" అంటూ విలపించసాగాడు.

# 78వ సర్గ మంథరను శత్రుఘ్నుడు బయటకు గెంటడం

దశరథుని అంత్యక్రియలు పూర్తయ్యాయి. ఇక భరతుడు, రాముడి వద్దకు పోవాలని ఆలోచిస్తూ ఉండగా శతృఘ్నుడు వచ్చాడు.

"అన్నా! లోకాలన్నింటినీ, ప్రాణులన్నింటినీ కాపాడే రాముడు చివరకు తన్ను తాను కాపాడుకోలేకపోయాడు. ఎంత విచిత్రం! ఒక ఆడదాని మంత్రాంగానికి తల ఒగ్గి అడవులకు పోయాడు. తండ్రిగారి మాట సత్యం చెయ్యడంకోసం అడవులకు వెళ్ళాడు. పోనీ లక్ష్మణుడైనా మహారాజును నిలదీసి ఉండవచ్చునే! వాడూ అట్లా చేయకుండా రాముడి వెనకాలే వెళ్ళాడు. ఇంతకూ దుష్టురాలైన ఆ కైకేయి చేసిన కుతంత్రమే దీనికంతకూ మూలం. రాజు ఆమె వలలో చిక్కుకుపోయాడు, ఆమె గీచిన గీటు దాటలేకపోయాడు గదా! ఆయన కైకేయిని తల మీద కెక్కించుకొని తనకు ఈ అనర్థాన్ని కొనితెచ్చుకున్నాడు. ఆమెను మొదటినుండీ సరిగా నియంత్రించలేకపోయాడు" అని భరతుడితో అంటూ ఉండగా తూర్పు ద్వారం వద్ద మంథర బంగారు ఆభరణాలన్నీ అలంకరిచుకొని కనిపించింది. ఒంటినిండా చందనం పూసుకుంది. రాణులు ధరించే విలువైన వస్త్రాలు, ఇంకా ఎన్నో రకాల ఆభరణాలు ధరించింది. అవన్నీ ధరించిన ఆ గూనిది చూసేవాళ్ళకు ఒక ఆడకోతిలాగా కనిపించింది. ఆ గూనిదాన్ని చూస్తూనే అక్కడున్న పరివారమంతా చీదరించుకున్నారు; ఇంతలో సంచలనం బయలుదేరింది. ఏమిటా ఈ గడబిడ అని శత్నుఘ్నుడు పోయి చూశాడు. అందులో కొంతమంది బహిరంగంగానే "ఇదుగో ఈ గూనిదే రాముణ్ణి అడవులకు పంపింది. మహారాజు ప్రాణాలు తీసింది. ఇది మహాపాపాత్మురాలు. అటువంటి నీచమైన స్త్రీని ఏం చేస్తావో చెయ్యి. ఆపైన నీ ఇష్టం" అన్నారు.

అమిత దుఃఖంలో ఉన్న శత్రుఘ్నుని చెవిన ఆ మాటలు పడగానే "ఓసీ మంథరా! నీ మూలంగానే మేం మా తండ్రిగారిని కోల్పోయాం. మా అన్నదమ్ములమంతా తలోదారి అయిపోయాం. మా అందరికీ ఇంత దుఃఖాన్ని కలిగించిన నువ్వు తగిన ఫలం

అనుభవించాల్సిందే" నని ఆమెను బలవంతంగా పట్టుకొని పడతోశాడు. అప్పుడు ఆ గూనిది ఆ భవనమంతా దద్దరిల్లిపోయేట్లుగా శోకాలు పెట్టడం మొదలుపెట్టింది. దాని చుట్టూ ఉన్న పనివాళ్ళంతా శత్రుఘ్నుడు దాన్ని చంపేస్తాడని తలచి ప్రాణ భయంతో పరుగుపెట్టారు. కౌసల్యాదేవియే కాపాడగల దిక్కని తలచి ఆమె వద్దకు పోయి శరణువేడారు.

ఆవేశంతోను, రోషంతోను శత్రుఘ్నుడు కేకలు పెడ్తూ ఆ గూనిదైన మంథరను, పట్టుకొని జరజరా ఈడ్చుకుపోతూ ఉంటే ఆమె ధరించిన ఆభరణాలనుండి రత్నాలన్నీ నేలంతా చిందరవందరగా పడ్డాయి. మంథర ఏడవడం విన్న కైకేయి అక్కడకు పరుగెత్తుకుంటూ వచ్చింది. శత్రుఘ్నుడికి అడ్డుగా పోబోయింది అప్పుడు కైకేయీదేవిని కూడా అతిపరుషమైన పదాలతో దూషించాడు. శత్రుఘ్నుడి ఉగ్రరూపం చూసి కైకేయి కూడా భయపడిపోయింది. గజగజా వణకిపోతూ భరతుడి వద్దకు పరుగెత్తింది.

భరతుడు తమ్ముణ్ణి చూసి "తమ్ముడా! వీరుడైనవారు స్త్రీలను వధించకూడదు. రేపు రాముడు నన్ను మాతృఘాతకుడా అని అంటా డేమోననే భయంతో నా తల్లి కైకేయిని చంపకుండా విడిచిపెట్టాను. నీవిప్పుడు ఈ దాసీదాన్ని చంపితే ధర్మాత్ముడైన రాముడు నిన్నూ, నన్నూ కూడా మన్నించడు. మనతో మాట్లాడటం కూడా మానేస్తాడు. ఇది సత్యం. కాబట్టి ఆ దాసీదాన్ని విడిచిపెట్టు" అన్నాడు.

భరతుడు రాముడి పేరు చెప్పి పలికిన మాటలతో శత్రుఘ్నునిలోని ఆవేశం అంతా చల్లారింది. వెంటనే ఆ గూనిదాన్ని వదలివేశాడు. వెంటనే మంథర కైకేయి కాళ్ళ మీద పడి వలవలా ఏడ్చింది. కైకేయీదేవి దాన్ని ఓదార్చి తనతో కూడా తీసుకుపోయింది.

## 79వ సర్గ భరతుడు రాజ్యాభిషేకాన్ని నిరాకరించటం

దశరథ మహారాజుకు ప్రేత కర్మలన్నీ యథాశాస్త్రీయంగా జరిగాయి. పద్నాలుగో దినాన, మంత్రులు, వసిష్ఠ మహర్షి అంతా సమావేశమయ్యారు.

మంత్రులు ఇలా అన్నారు: మనకందరికీ పూజ్యుడైన మహారాజు జ్యేష్ఠకుమారుడైన రాముణ్ణి అడవులకు పంపాడు. సీతా లక్ష్మణులు కూడా రాముణ్ణి అనుసరించి వెళ్ళారు. తరువాత మహారాజు కూడా స్వర్గస్థులయ్యారు.

ఓ రాజకుమారా! నువ్వు మహా యశశ్శాలివి. ఇప్పుడు ఉన్న పరిస్థితిల్లో నువ్వే మాకు రాజువు కావాలి. రాజు లేకుండా రాజ్యం ఉండకూడదు. అట్లా ఉంటే ప్రజలు కష్టాల పాలవుతారు. దొంగల భయం అధికమవుతుంది. ఇంకా అనేక అరిష్టాలు దాపురిస్తాయి. ఇంకా అవేమీ ప్రారంభం కాలేదు. కనుక ఇప్పుడు నువ్వు రాజువై ఈ రాజ్యాన్ని పాలించు. ఈ ప్రజల్ని కన్నబిడ్డల్లాగా లాలించు.

అప్పుడు భరతుడు రాజ్యాభిషేకానికై ఏర్పాటు చేసిన సంబారాలన్నింటికీ ప్రదక్షిణ నమస్కారం చేశాడు. తరువాత వాళ్ళతో అలా అన్నాడు.

భరతుడు: మంత్రులారా! మా వంశంలో ఎప్పుడూ పెద్దకుమారుడే రాజవుతూ వచ్చాడు. ఇదే మా ఆచారం. శాస్త్రసమ్మతం కూడాను. మాలో పెద్దవాడైన రాముడే రాజయ్యేందుకు అర్హుడు. రాముడికి బదులుగా, తండ్రిగారి ఆజ్ఞను శిరసావహిస్తూ నేను పద్నాలుగు సంవత్సరాలు అడవుల్లో ఉంటాను.

మీరు చతురంగబలాలను సమకూర్చండి. నేను సైన్యంతో కలసి అడవులకుపోయి రాముణ్ణి అరణ్యాలనుండి తీసుకొని వస్తాను. అభిషేకానికై సిద్ధంచేసిన సంబారాలన్నీ కూడా వెంట తీసుకొని వెళతాను. పురుష శ్రేష్ఠుడైన శ్రీరామునికి అక్కడే రాజ్యాభిషేకం చేయించి తిరిగి

అయోధ్యకు తీసుకొని వస్తాను.

ఈ కైకేయీదేవి కోరిక నెరవేర్చను. ఆమె నాకు తల్లి అని పేరుపెట్టుకున్న కొరివిదయ్యం. నేనే అరణ్యాల్లో నివసిస్తాను. రాముడే అయోధ్యకు రాజవుతాడు. గంగానది వరకు సైన్యం సుఖంగా ప్రయాణం చేసేందుకు మార్గాన్ని ఏర్పాటు చేయించండి. మార్గంలో కొండలు గుట్టలు వస్తాయి. వాటిని అధిగమించే నైపుణ్యమున్న వారిని కూడా పంపండి. ఈ క్షణానే ఈ పనిని ప్రారంభించాలి. ఇదే నా ఆజ్ఞ.

ఈ విధంగా ఆజ్ఞను జారీచేసిన భరతుని సభలోని మహామహులంతా శభాష్! అని మెచ్చుకున్నారు. ఆనందభరితులైపోయారు.

“ఓ రాజకుమారా! నీ చేతికి రాజ్యం వచ్చినా, దాన్ని జ్యేష్ఠుడికే చెందాలని అంటున్నావు. అటువంటి త్యాగమూర్తివైన నిన్ను లక్ష్మీదేవి ఎప్పుడూ విడువకుండా ఉంటుంది. నీ కీర్తికూడా చిరస్థాయిగా నిలిచి ఉంటుంది. ఓ ప్రభూ! నీ ఆజ్ఞ శిరసావహిస్తాం. ఇప్పుడే సేనలు పోయేందుకు బాటకు ఏర్పాట్లు చేయిస్తాం” అన్నారు అమాత్యులు ఆనందంతో.

# 80వ సర్గ అయోధ్య నుండి గంగాతీరం వరకు మార్గాన్ని నిర్మించడం

గంగాతీరం వరకూ మార్గం నిర్మించేందుకు ఏర్పాట్లన్నీ చురుకుగాసాగాయి. ఆయా ప్రాంతాల్లో మార్గం బాగా తెలిసిన వాళ్ళను ఆ పనిలో నియమించి ముందు పంపారు. అందుకు అవసరం అయ్యే పరికరాలనీ, యంత్రాలు నడిపేవాళ్ళను, కూలీలను, శిల్పులను, వడ్రంగులను నియమించారు. వాళ్ళందరి మీద పర్యవేక్షణకు సమర్థులైనవారిని నియమించారు. బాటలు వేయడానికి నిపుణులు ముందు నడుస్తూ మార్గాన్ని నిర్ణయించారు. వాళ్ళంతా రాముణ్ణి చూడబోతామనే సంతోషంతో పర్వదినాల్లో ఉప్పొంగే సముద్రంలా ఉన్నారు.

దారిలో అడ్డుగా ఉన్న తీగలు, రాళ్ళు రప్పలు, కంచెలు, ముళ్ళు అన్నింటినీ తొలగించారు. చక్కటి రాజమార్గాన్ని ఏర్పాటుచేశారు. అడ్డం వచ్చిన చోట చెట్లను సైతం నరికారు. చెట్లులేని చోట్ల చెట్లను నాటారు. నదులపైన, వాగులపైన వంతెనలు నిర్మించారు. నీరు లభించని ప్రాంతాల్లో బావులు త్రవ్వారు. రాజులు మంత్రులు నడిచే మార్గాలన్నీ సున్నం కలిపి మార్గాయాసం తెలియకుండా ఉండటం కోసం నున్నగా చేశారు. ఆ మార్గానికి ఇరుప్రక్కలా చెట్లన్నీ పుష్పించి ఉన్నాయి. పక్షులన్నీ తమ సమృద్ధిని తెలియజేస్తూ మదించి కూయసాగాయి. అటువంటి రాజమార్గాన్ని గంగాతీరం వరకు నిర్మించారు.

భరతుడు నివసించేందుకు తగినన్ని వసతి గృహాలు నిర్మించారు. ఇతర అధికారులకోసం సమీపానే మరికొన్ని గృహాలు కూడా నిర్మించారు. ఆ గృహాలన్నిటికీ అలంకారాలు చేశారు. జోతిశ్శాస్త్రవేత్తలు ముహూర్తబలం చూసుకొని నిర్దేశించిన శుభముహూర్తాలు నిశ్చయించారు. భరతుని సైన్యానికి శిబిరాలు నిర్మించారు. ఆకాశాన్నంటే విమానగృహాలు నిర్మించారు. ఆ విధంగా చక్కటి రాజమార్గాన్ని ఏర్పాటుచేసి మధ్యమధ్యలో దేవాలయాలు నిర్మించారు. జెండాలు ఎత్తారు. ఆ మార్గమంతా దేవేంద్రుడికోసం ఏర్పాటు చేసినట్లుంది.

# 81వ సర్గ వసిస్ఠుడు మంత్రులతో సభను ఏర్పాటు చేయడం

ఈవిధంగా గంగాతీరం వరకు రాజమార్గం వేసేందుకు ఆజ్ఞ ఇచ్చి భరతశత్రుఘ్నులు తమ గృహాలకి వెళ్ళారు. మర్నాడు తెల్లవారుజాముననే వందిమాగధులు స్తోత్రాలు ప్రారంభించారు. మంగళవాద్యాలన్నీ మోగుతున్నాయి. పూర్వం దశరథ మహారాజును స్తుతించినట్లే ఈనాడు భరతుని స్తోత్రం చేశారు. భరతుడు అసలే దుఃఖంలో ఉన్నాడు. ఈ స్తోత్రాలు, మంగళవాద్యాలతో ఇంకా ఎక్కువగా దుఃఖించాడు. నేను రాజును కాదని చెప్పి వాళ్ళందరినీ వెళ్ళిపొమ్మన్నాడు. అప్పుడు శత్రుఘ్నునితో ఇలా అన్నాడు:

“సోదరా! శత్రుఘ్నా! చూశావా! కైకేయి లోకానికి ఎంత అపకారం చేసిందో. మహారాజు తన దుఃఖాలన్నీ నాకు వదిలేసి స్వర్గానికి వెళ్లిపోయాడు. మహాత్ముడైన దశరథ మహారాజుకు చెందిన ఈ రాజ్యలక్ష్మి అనాథ అయిపోయింది. చుక్కానిలేని నావ అయింది, మనందరకూ రక్షకుడైన రాముణ్ణి నా తల్లి కైక అడవులకు పంపింది” అంటూ ఒళ్ళు తెలియకుండా పడిపోయాడు. భరతుణ్ణి చూస్తున్న స్త్రీలంతా పెద్దపెట్టున ఏడ్చారు.

భరతుడు ఈ విధంగా విలపిస్తూ ఉండగా, రాజధర్మాలన్నీ తెలిసినవాడు, గొప్పకీర్తి గలవాడూ అయిన వసిష్ఠ మహర్షి దేవసభ అయిన ‘సుధర్మ’ వలే ఉన్న ఇక్ష్వాకుల కాలంనుండీ వస్తున్న రాజభవనానికి వచ్చాడు. తనకోసం ఏర్పాటైన బంగారు ఆసనంపై కూర్చున్నాడు. దూతలను పిలిపించి, “ఓ దూతలారా! మేము ఒక ముఖ్యమైన కార్యాన్ని తలపెట్టామని చెప్పి భరత శత్రుఘ్నులను, సుమంత్రుడు, విజయుడు తదితర మంత్రులను, బ్రాహ్మణ, వైశ్య క్షత్రియ ప్రముఖులను, రాజోద్యోగులందరినీ వెంటబెట్టుకొని త్వరగా రండి” అని ఆజ్ఞాపించాడు.

ఆ విధంగా వసిష్ఠ మహర్షిచే పిలవబడ్డ ఆ ప్రముఖులంతా రథాలపైన, ఏనుగులపైన, గుర్రాలపైన సభాభవనానికి సత్వరమే వచ్చారు.

ఇంతలో భరత శత్రుఘ్నులుకూడా సభాభవనాన్ని చేరుకున్నారు. దేవేంద్రుడికి ఎదురు వెళ్ళి, ఆహ్వానం పలికే దేవతలమల్లే ఆ సభకు వచ్చిన వారంతా ఎదురుగా వెళ్లి, పూర్వం దశరథ మహారాజును ఆహ్వానించినట్లుగా, భరతుడికి స్వాగతం పలికారు. దశరథుని కుమారులైన భరత శత్రుఘ్నులతోను, వసిష్ఠ మహర్షితోను, మంత్రిమండలి తోను ఆనాటి రాజసభ దశరథుడు ఉన్నట్లే కళకళలాడింది.

# 82వ సర్గ భరతుడు దండకారణ్యంలో రాముని కలుసుకోవడానికి ఆయత్తం కావటం

దశరథుని మంత్రిమండలిలోని వారంతా ఆ సభకు వచ్చారు. వారందరూ మహావిద్వాంసులు. భరతుడు ఆ సభను పూర్ణచంద్రుడు ఉత్తమమైన గ్రహాలతో కూడిన రాత్రిలా సాగించాడు. సభను ఉద్దేశించి వసిష్ఠ మహర్షి ఇలా ప్రసంగించాడు:

"నాయనా! భరతా! నీ తండ్రి ధర్మం తప్పకుండా రాజ్యపాలన చేశాడు. ఈ రాజ్యాన్ని ధన ధాన్య సమృద్ధి గలదిగా చేశాడు. ఇప్పుడు ఆయన స్వర్గస్థుడయ్యాడు. ఈ విశాలమైన రాజ్యాన్నంతా నీకు ఇచ్చి నిన్ను రాజును చెయ్యాలని తలచాడు. నీ అన్నగారైన రాముడు కూడా ధర్మమార్గాన్నే అనుసరించాడు. ఆయన సత్యవ్రతుడై, చంద్రుడు వెన్నెలను వదలి పెట్టనట్లుగా, తన ధర్మాన్ని వదలిపెట్టకుండా తండ్రి ఆజ్ఞను శిరసావహించి అడవులకు వెళ్ళాడు. ఆ విధంగా నీ తండ్రి, అన్నకూడా ఈ రాజ్యాన్ని నీకు ఇచ్చారు. నువ్వు దేశప్రజలందరినీ కన్నబిడ్డలలా పరిపాలించాలి. అందుకోసం వెంటనే రాజ్యాభిషేకం జరిగిపోవాలి. నువ్వు ఆ విధంగా చేస్తే మంత్రులంతా సంతోషిస్తారు. మంత్రులే కాదు, రాజులు, సామంతులు, ప్రజలందరూ దేశానికి నాలుగు మూలల నుండీ వచ్చి నీకు కానుకలిచ్చి అభినందిస్తారు. నిన్ను రాజుగా అంగీకరిస్తారు."

భరతుడు (కన్నీళ్ళు కారుస్తూ) : ఓ మహర్షీ! ఓ సభాసదులారా! మా అన్న రాముడు అన్ని విద్యలు అభ్యసించినవాడు. బ్రహ్మచర్యవ్రతాన్ని ఆచరించి సకల విద్యాపారంగతుడై, ధర్మాన్ని రక్షించేవాడు, మా అన్నదమ్ములందరిలో పెద్దవాడు. కాబట్టి దశరథ మహారాజు రాజ్యానికి రాముడే రాజు కావాలి. నా అన్నగారి రాజ్యాన్ని నేను అపహరించలేను. దశరథ మహారాజు కుమారుడు రాజ్యాన్ని అపహరిస్తాడా? నేను రాముడి మనిషిని. ఓ మహర్షీ! మీలాంటి పెద్దలు చెప్పదగిన ధర్మం కాదిది.

మహాజనులారా! రాముడు మా అన్నదమ్ములందరిలోనూ పెద్దవాడు, శ్రేష్ఠుడు, ధర్మాత్ముడు. మా పూర్వీకుల్లో దిలీపుడు, నహుషుడువంటి వారితో పోల్చదగినవాడు. దశరథ మహారాజుకు జ్యేష్ఠ పుత్రుడైన రాముడే రాజ్యానికి అర్హుడు. దుష్టులు, లోభులు ఆలోచించినట్లుగా నేను ఆలోచించలేను. నా తల్లిలా పాపకార్యానికి పూనుకోలేను. పరమపూజ్యుడైన నా అన్నగారికి ఇక్కడ నుండే నమస్కరిస్తున్నాను. రాముడు ఒక్క అయోధ్యనే కాదు ముల్లోకాలను ఏలగల సమర్థుడు. కాబట్టి అన్నగారిని ఒప్పించి వెనక్కు తీసుకువచ్చేందుకు అడవులకు వెళతాను. ఆయన రానిపక్షంలో నేనూ అడవుల్లోనే ఉండిపోతాను. మంత్రిపుంగవులు, సభాసదులైన మీరంతా బుద్ధిమంతులు, సత్పురుషులు, పూజ్యులు. ఎట్లైనా అన్నగారిని ఒప్పించి అయోధ్యకు తీసుకొని రావటానికి మీరంతా కూడా నాతో అరణ్యానికి రండి. మీ ముందే రాముణ్ణి ప్రార్థిస్తాను. నా శాయశక్తులా ప్రయత్నిస్తాను.

భరతుడు, కలహంసలా మధురమైన మాటలు మాట్లాడుతూ ఉంటే సుమంత్రుడు, సేనాధ్యక్షులు, పురప్రముఖులందరూ సంతోషంతో ఉప్పొంగిపోయారు.

అంతట భరతుడు సుమంత్రుని పిలిచి దండకారణ్యయాత్రకు కావలసిన ఏర్పాట్లన్నీ సిద్ధంచేయమని ఆజ్ఞాపించాడు. భరతుని ఆజ్ఞను సుమంత్రుడు పరమ సంతోషంతో శిరసావహించాడు. భరతునితోపాటు సైన్యం కూడా వెళ్ళడం వలన సైన్యాధ్యక్షులు కూడా సంతోషించారు. యోధుల భార్యలందరూ భరతుని ఆజ్ఞను విని సంతోషంతో తమతమ భర్తలను ప్రయాణానికి తొందరపెట్టారు.

వసిష్ఠ మహర్షి సమక్షంలో సుమంత్రుణ్ణి పిలిచి “నా రథాన్ని త్వరగా సిద్ధంచేయి” అని ఆజ్ఞాపించాడు. వెంటనే సుమంత్రుడు ఉత్తమమైన గుర్రాలను పూన్చిన రథాన్ని తీసుకువచ్చాడు. అప్పుడు భరతుడు సుమంత్రునితో “మంత్రిసత్తమా! లోకహితంకోసం రాముణ్ణి ప్రసన్నంచేసుకోవటానికి తెల్లవారుజామునే ప్రయాణం కావాలి. చతురంగబలాలను, సేనాధ్యక్షులనూ సిద్ధం కమ్మనండి” అన్నాడు.

భరతుడి వెంట ప్రయాణమై వెళ్ళేందుకు ప్రతి ఇంటినుండీ ఒక్కొక్కరు చొప్పున నాలుగు వర్ణాలవాళ్ళు సంసిద్ధులయ్యారు.

# 83వ సర్గ భరతుడు శృంగిబేరపురం చేరటం

రాముణ్ణి ఎప్పుడు చూద్దామా అనే కోరికతో భరతుడు ప్రాతఃకాలానే లేచి తయారయ్యాడు. రథాన్నెక్కి కూర్చున్నాడు. భరతుని రథానికి ఉత్తమమైన అశ్వాలను పూన్చారు. మంత్రులు, పురోహితులు ఉత్తమమైన రథాలపై భరతునికంటే ముందుగా బయలుదేరారు. ఆయన వెనక తొమ్మిదివేల ఏనుగులు బయలుదేరాయి. అంతేకాకుండా అరవై వేల రథాలు రకరకాలైన ఆయుధాలను నింపుకొని వారి వెనకాలే బయలుదేరాయి. లక్షమంది అశ్వారూఢులై వెళ్ళారు.

రాముడు తిరిగివస్తాడన్న ఆనందంతో కౌసల్య, సుమిత్ర, కైకేయి కూడా ఉత్తమమైన అశ్వాలు పూన్చిన రథాల్లో బయలుదేరారు. అయోధ్యా వాసులంతా గుంపులు గుంపులుగా రాముణ్ణి చూడాలనే తపనలో బయలుదేరారు. దారిపొడవునా రాముడి కథలు చెప్పుకుంటూ ఉత్సాహంగా కాలి నడకన బయలుదేరారు. ఉదయించిన సూర్యుడు లోకంలోని చీకట్లన్నీ తొలగించినట్లు, రాముణ్ణి చూడగానే మన దుఃఖమంతా ఎగిరిపోతుందనుకుంటూ నడిచారు. మేఘశ్యాముడు, మహాబాహువు, దృఢమైన బలం గలవాడు, లోకంలో ఉండే శోకాన్నంతా నశింపచేసే రాముణ్ణి ఎప్పుడు చూస్తామా? అంటూ ఒకరికొకరు కబుర్లు చెప్పుకుంటూ నడిచారు.

భరతుడి వెనుకన రత్నాలను సానపట్టేవాళ్ళు, కుండలు తయారు చేసేవాళ్ళు, సాలెవాళ్ళు, అలంకరణలు చేసేవాళ్ళు, స్నానాలు చేయించేవాళ్ళు, వేన్నీళ్ళు అందించేవాళ్ళు, రజకులు, కుట్టుపనివాళ్ళు, గొల్లపల్లెలకు చెందిన పిల్లలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు వెళ్ళారు.

భరతుని వెంట వెళ్ళిన వాళ్ళల్లో వేదవిదులున్నారు; యోగనిష్ఠాపరులున్నారు. సదాచార సంపన్నులున్నారు. ఈ విధంగా వేలకు వేలమంది ఎడ్లబండ్లు కట్టుకొని వెనకాలే వెళ్ళారు.

సూర్యాస్తమయం అవబోతోంది. హంసలు, బెగ్గురపక్షులు, చక్రవాకపక్షులు గంగాతీరాన

ఎగురుతున్నాయి. ఆ సమయాన వారంతా శృంగిబేరపురాన్ని చేరుకున్నారు. ఆ తీరప్రాంతాన్నంతా గుహుడనే నిషాదుడు పరిపాలిస్తున్నాడు.

భరతుడు మంగళజలాలతో ప్రవహిస్తున్న గంగాజలాలను చూడగానే సుమంత్రుణ్ణి పిలిచి "మన సేనల్ని ఈ రాత్రికి ఇక్కడే విశ్రాంతి తీసుకొమ్మని చెప్పు. రేపు ఉదయానే గంగానదిని దాటుదాం. నేను గంగాజలాలతో నా తండ్రి దశరథ మహారాజుకు జలతర్పణాలు వదులుతాను" అన్నాడు. అంత వారంతా వారి వారి వసతులకు తగ్గట్టుగా ఆ రాత్రి అక్కడే విశ్రమించారు. కానీ భరతుడి ఆలోచనలన్నీ రాముడి మీదే ఉన్నాయి.

# 84వ సర్గ భరతుడు గుహునితో సంభాషించడం

గంగానది తీరాన విడిది చేసి ఉన్న సేనల్ని గుహుడు చూశాడు. తొందరపాటులో ఎవరైనా శత్రురాజు తన దేశంపై దండెత్తి వస్తున్నాడా అని సందేహించాడు. తన వాళ్ళందరినీ పిలిచాడు. తన మనసులో మెదలిన సందేహాన్ని చెప్పాడు. దూరం నుంచి ఆ ఎత్తైన రథంపైన బంగారుధ్వజాన్ని చూచి భరతుడిదే అయి ఉంటుందని ఊహించారు. తనవారితో ఇట్లా అన్నాడు. "ఈ సమయంలో భరతుడు ఇంత సైన్యాన్ని వెంటబెట్టుకొని వచ్చాడు? పల్లెల్ని దోచుకుపోవడానికి వచ్చి ఉంటాడా? లేకపోతే దశరథుని రాజ్యంతో తృప్తి చెందక రాముణ్ణి చంపడానికి అరణ్యాల్లో వెతుకుతున్నాడా? అదే నిజమయితే, నేనీ భరతుణ్ణి ఎదిరించాల్సిందే. ఎందువల్లనంటే రాముడు నాకు ప్రభువు మాత్రమే కాదు. నాకు మిత్రుడు, పరమ ఆప్తుడుకూడా. అందువల్ల రామప్రభువును కాపాడుకోవడం కోసం మన ప్రాణాలనైనా అర్పించడానికి సిద్ధంగా ఉండాలి. మనం వెంటనే ఎదిరించకూడదు. అట్లా ఎదిరిస్తే మనల్ని చంపి అయినా తన కార్యం నెరవేర్చుకుంటాడు.

కాబట్టి మనం నేర్పుతో ఈ విషయాన్ని సాధించాలి. కొంత రాజతంత్రాన్ని అవలంబిద్దాం.

ఒక ప్రక్కన, అయిదువందల నావలను గంగానది పొడవునా సిద్ధం చేసి ఉంచండి. ప్రతీ నావలో వందమంది యువకుల్ని యుద్ధానికి సిద్ధంగా ఉంచండి. భరతుడు రామప్రభువుకు అపకారం తలపెడ్తున్నాడని తెలిస్తే మన ప్రాణాలైనా అర్పించి భరతుణ్ణి గంగానది దాటకుండా అడ్డుకుందాం. మన రామప్రభువుని కాపాడుకుందాం. ఇక రెండవ వైపు నేను కొంతమంది వృద్ధులను వెంటబెట్టుకొని భరతుడికి చేపలు, మాంసం, మధువు, కానుకలు తీసుకొని వెళతాను. రామప్రభువుకు అపకారం తలపెట్టే బుద్ధి లేకపోతే మనమే ఆయనను సకలమర్యాదలతోనూ గంగానదిని దాటిద్దాం."

అదేవిధంగా గుహుడు ఉత్తమమైన ఆహార పదార్థాలను తీసుకొని తన కులంలోని

వృద్ధుల్ని వెంటబెట్టుకొని భరతుణ్ణి చూడబోయాడు. అట్లా వెళ్ళిన గుహుడు మున్ముందుగా సుమంత్రుణ్ణి చూశాడు. సుమంత్రుణ్ణి చూడగానే గుహుడికి ప్రాణం లేచివచ్చింది.

అంతట సుమంత్రుడు మహా పరాక్రమవంతుడే కాకుండా సమయాసమయాలు ఎరిగి నేర్పుతో మాట్లాడగల నేర్పరి. అందువల్ల సుమంత్రుడు భరతుని వద్దకుపోయి వినయంగా "ఓ రాజకుమారా! గుహుడు తన మంత్రులతో కలసి నిన్ను చూడటానికి వచ్చాడు. అతడు ఈ ప్రాంతానికి ప్రభువు. నీ అన్నగారైన రాముడికి పరమ ఆప్తుడు, మంచి మిత్రుడు. అతడికి ఈ అరణ్య ప్రాంతమంతా కొట్టిన పిండిలాగా అణువణుమా క్షుణ్ణంగా తెలుసు. ఆతడి కొలువులో వెయ్యిమంది వరకూ పనిచేస్తారు. వీరేకాక అతడి దాయాదులంతా ఆరితేరినవారు. పైగా అతడు వృద్ధుడు. ఈ దండకారణ్య ప్రాంతమంతా క్షుణ్ణంగా తెలిసినవాడు. మన సీతారామ లక్ష్మణులు ఎక్కడ నివసిస్తున్నారో చెప్పగలవాడు. ఇప్పుడతడు మీ దర్శనంకోసం బయట కూర్చున్నాడు. మీరు వెంటనే అతణ్ణి పిలిపించి మాట్లాడండి" అన్నాడు.

అప్పుడు భరతుడు వెంటనే గుహుడిని తన వద్దకు తీసుకొని రమ్మని సుమంత్రుడితో చెప్పాడు. గుహుడు సంతోషంతో తన మంత్రిబృందంతో కలసి భరతుణ్ణి కలుసుకొన్నాడు. వినయంతో ఇట్లా అన్నాడు:

"ప్రభూ! మేము బోయవాళ్లం. మేము సంపాదించుకున్న పండ్లూ, కందమూలాలు, మాంసం, ఇంకా అనేక రకాలైన అడవి ధాన్యాలు తమకు సమర్పించుకొని సత్కరించుకోవాలని ఆశిస్తున్నాను. మీ సైన్యానికందరికీ భోజనం పెట్టే భాగ్యం కలిగించండి. ఈ ప్రాంతం అంతా మీ గృహమే అనుకోండి. మేమంతా మీ సేవకులం. ఈ రాత్రికి మీరంతా మా ఇంటికి వచ్చి నా ఆతిథ్యం స్వీకరించండి. మీ సైన్యాన్ని కూడా ఇక్కడే విశ్రమించమనండి. వాళ్ళకు కూడా భోజన సదుపాయాలు చేస్తాం. రేపు ఉదయాన్నే మీ అందరినీ గంగానదిని దాటిస్తాం" అని ప్రాథేయపడ్డాడు.

# 85వ సర్గ గుహునితో భరతుని సంభాషణ

భరతుడు: ఓ గుహుడా! నా అన్నగారికి పరమ ఆప్తుడవైన నిన్ను చూడటం నాకు ఎంతో ఆనందంగా ఉంది. నువ్వొక్కడివే ఇంతమంది సైన్యానికి ఆతిథ్యం ఇస్తాననటం నీ విశాలహృదయాన్ని చాటిచెప్తోంది.

ఓ గుహుడా! ఈ గంగానది అత్యంతవేగంగా ప్రవహిస్తూ ఉంటుంది. ఇక్కడ నదిని దాటడం కష్టతరమే కాదు, ప్రమాదకరం కూడాను. నీకు ఈ దండకారణ్య ప్రాంతమంతా బాగా పరిచయమైనది. కాబట్టి మమ్మల్ని నదిని దాటించి, మాకు భరద్వాజుని ఆశ్రమానికి పోయే మార్గం చూపు. అదే పదివేలు.

గుహుడు: ఓ రాజకుమారా! నీనుండి యథార్థాన్ని తెలుసుకోగోరుతున్నాను. నీ సైన్యాన్ని చూస్తూ ఉంటే ఏదో కీడు జరుగుతుందేమోనని అనుమానిస్తున్నాను. నువ్వు నా మిత్రుడైన రాముడికి ఏదైనా కీడు తలపెట్టాలని బయలుదేరావా? రాముడు ఎన్నడూ ఎవరినీ కష్టపెట్టేవాడుకాదు. ఎవరు దుఃఖంలో ఉన్నా ఆదుకుంటాడు. రాముడికేదైనా ప్రమాదం తలపెట్టేవారయితే రాముడి కోసం మా ప్రాణాలు అర్పిస్తాం. మీరు రాముని దర్శనమే కోరేవారైతే, మావాళ్ళంతా మీ వెంట నడుస్తారు. నేనూ మీతోనే వస్తాను. దగ్గరుండి క్షేమంగా రామప్రభువు దగ్గరకు చేరుస్తాను. ఆ విషయంలో మీరు నిశ్చింతగా ఉండండి.

భరతుడు: ఓ గుహుడా! నన్ను అనుమానించాల్సిన పనిలేదు. ఎందువల్లనంటావా? రాముడు నాకు అన్నగారు. తండ్రి తర్వాత తండ్రి అంతటివాడు. ఆయనను అయోధ్యకు తోడ్కొని వెళ్ళి రాజ్యాభిషిక్తుణ్ణి చేయడమే నా లక్ష్యం; ప్రజల ఆనందం. నేను రాముడికి అపకారం తలపెట్టే రోజు నా జన్మజన్మలకూ రాకూడదని కోరుకుంటాను. నా అన్నగారు రాముడు పరమ ధార్మికుడు. నా ఒక్కడి మాట వినకపోయినా ఈ ప్రజల మాటనైనా మన్నిస్తాడన్న ఆశతోనే ఇంతమంది ప్రజలను, సైన్యాన్ని వెంటబెట్టుకొని బయలుదేరాను.

గుహుడు: ఓ రాజకుమారా! నీకీ రాజ్యలక్ష్మి అయాచితంగానూ, అనుకోకుండానూ వచ్చింది. అంతటి రాజ్యాన్ని కూడా వదిలెయ్యాలన్న నీ సంకల్పం మెచ్చుకోదగ్గది. ఇటువంటివారు ఈ లోకంలో ఇంకొకరు ఉండదు. నువ్వు తలపెట్టిన ఈ కార్యం మూలంగా నీ కీర్తి సూర్యచంద్రులున్నంత కాలం నిలిచి ఉంటుంది.

వాళ్ళిద్దరూ ఇట్లా మాట్లాడుకుంటూ ఉండగానే రాత్రయిపోయింది. సేనలను విశ్రమించటానికి ఆజ్ఞ ఇచ్చారు. పిమ్మట గుహుని ఆతిథ్యాన్ని స్వీకరించి, భరతుడు విశ్రమించాడు. తరువాత శత్రుఘ్నుడు కూడా విశ్రమించాడు.

హిమవత్పర్వతంపై సూర్యకాంతి పడి మంచుకరిగినట్లు భరతుని శరీరమంతా శోకాగ్నిచే చెమటలుపట్టి కారుతోంది. అయినా లెక్కచేయకుండా రాముని గూర్చి తలచుకొంటూ విలపించసాగాడు. అక్కడే సేవలు చేస్తున్న గుహుడు భరతుణ్ణి ఓదార్చాడు.

# 86వ సర్గ గుహుడు లక్ష్మణుని స్వభావాన్ని వివరించటం

గుహుడు భరతునికి సపర్యలు చేస్తూ, ఆ రాత్రంతా లక్ష్మణుని గుణగణాలను ఇలా వివరించి చెప్పాడు.

గుహుడు: ఓ రాజకుమారా! ఆ రోజు రాత్రి సీతారాములు పడుకున్నారు. నేను లక్ష్మణునికి కూడా ప్రక్క ఏర్పాటుచేసి "నాయనా! లక్ష్మణా! నువ్వుకూడా రాజకుమారుడవేకదా! చాలా సుకుమారంగా పెరిగావు. పైగా పగలంతా ప్రయాణం చేసి ఉన్నావు. నీ కోసం ఏర్పాటు చేసిన ఈ ప్రక్కపైన కొద్దిసేపు విశ్రమించు. మేము అరణ్యవాసులం. మాకు నిద్రలేకపోవటం, కష్టాలు ఎదుర్కోవడం సర్వసామాన్యం. మేము ఈ రాత్రంతా మేల్కొని నీకు, సీతారాములకు ఏ ఆపద రాకుండా కాపలా ఉంటాం. ఈ లోకంలో రాముడికన్నా పరమప్రియుడు నాకు మరొకడులేడు. ఇది సత్యం. ఈ రాముడి సేవలవల్ల కీర్తి, ధర్మం, అర్థం కూడా సంపాదించాను. అటువంటి ప్రియమిత్రుడు, భార్యతో కలసి నిద్రిస్తూ ఉంటే ఆయనకు కాపలాకాయడం కన్నా నా జీవితానికి పరమార్థం ఇంకేముంటుంది? నేనే కాదు, నా అనుచరులంతా విల్లంబులు చేతపుచ్చుకొని తెల్లవారే దాకా కాపలా కాస్తారు. ఈ అడవిలో ప్రతి అంగుళం మాకు కొట్టినపిండే. కాబట్టి మా కన్నుగప్పి ఏ ప్రమాదమూ ఈ పరిసరప్రాంతానికి కూడా రాలేదు. ఎవరైనా చతురంగ బలాలతో వచ్చినా, మమ్మల్ని ఎదిరించలేరు. కాబట్టి ఓ లక్ష్మణా! నువ్వు నిద్రపో" అన్నాను.

లక్ష్మణుడు: ఓ గుహుడా! పడుకొని నిద్రపొమ్మని సులభంగా చెప్పావు. కానీ నాకు నిద్ర ఎట్లా పడుతుంది? దశరథ మహారాజు పెద్దకుమారుడు భార్యతో కలసి కటికనేల మీద పడుకొని ఉండగా, ఇక నాకు నిద్ర ఎట్లా పడుతుంది?

ఓ గుహుడా! దేవాసురులిద్దరూ కలసి వచ్చినా రాముణ్ణి గెలువలేరు. అటువంటి రాముడు సీతతో కలసి పచ్చికమీద పడుకున్నాడు. నా తండ్రి దశరథ మహారాజు గొప్పయజ్ఞాన్ని

చేసి నా అన్నగారిని పుత్రుడుగా పొందాడు. నా తండ్రితో సరిసమానమైన లక్షణాలు కలిగినవాడు. నాకు అన్నగారు. నాకు తండ్రితో సమానమైనవాడు. నా పుణ్యఫలంచేత అతడికి సోదరుడనయ్యాను. అటువంటి రాముణ్ణి విడిచి నా తండ్రి ఎక్కువకాలం జీవించడు. నా తల్లి త్వరలోనే వితంతువు కావటం తథ్యం. రాముని తల్లి కౌసల్యాదేవి, నా తల్లి సుమిత్రాదేవి, మిగిలిన తల్లులు ఈ రాత్రి గడిపి రేపు ఉదయం దాకా జీవించి ఉంటారనే నమ్మకం లేదు. నా తండ్రి దశరథ మహారాజు రామునికి రాజ్యాభిషేకం జరుగకపోవటం చేత తప్పక మరణిస్తాడు. అట్లా మరణించినప్పుడు ఆయన దేహానికి ప్రేత సంస్కారాలు చేసే భరతశత్రుఘ్నులు కృతార్థులవుతారు.

ఓ గుహుడా! మేము ఈ వనవాసాన్ని పూర్తిచేసుకొని తిరిగి అయోధ్యలో సుఖంగా ఉండే రోజు వస్తుందంటావా?

ఓ భరత ప్రభూ! ఈ విధంగా లక్ష్మణుడు మాతో చెబుతూ విలపిస్తూ ఉండగానే తెల్లారి పోయింది. మర్నాడు ఉదయానే వారిని నా నావపై గంగను దాటించాను. తరువాత రామలక్ష్మణులు నారచీరలు ధరించినవారై జటలు దాల్చి మునివేషంలో దండకారణ్యంలోకి ప్రవేశించారు.

## 87వ సర్గ గుహుడు సీతారామలక్ష్మణుల గూర్చి చెప్పడం

రామలక్ష్మణులు నారచీరలు ధరించడం మాత్రమే కాకుండా తన చేత మర్రిపాలు తెప్పించుకొని తలకు పట్టించుకొని జటలు కట్టించుకొన్న తర్వాత సీతతో సహా అడవుల్లోకి వెళ్ళారని చెప్పగానే భరతుడిలో భయం పట్టుకుంది. రాముడు వనవాసానికే కృతనిశ్చయుడై ఉన్నాడా? తన ప్రయత్నం సఫలమౌతుందో, కాదో? అని అతడి మనస్సు పరిపరి విధాలపోయింది. ఇంతవరకు భరతుడు తన ఇంట్లో జరిగిన సంఘటనలకే దుఃఖీస్తూ వచ్చాడు. తను అడవుల్లోకి పోయి రాముణ్ణి ఒప్పించి తిరిగి అయోధ్యకు తీసుకొని రాగలనన్న ధైర్యం ఉండేది. తనొక్కడి వల్లా కాకపోతే ఈ జనప్రవాహంచేతనైనా బలవంతం పెట్టవచ్చునని ధైర్యంగా ఉన్నాడు. రాముడు నారచీరలతోపాటు, జటలుకూడా కట్టించుకొని పూర్తిగా మునిరూపం ధరించి వెళ్ళాడని తెలియగానే భరించలేని దుఃఖంతో మూర్ఛపోయాడు. ఎన్ని పరిచర్యలు చేసినా భరతునికి తెలివిరాలేదు. శత్రుఘ్నుడు భయపడిపోయి బిగ్గరగా ఏడవడంతో చుట్టూ ఉన్న వాళ్ళుకూడా పెద్దపెట్టున ఏడ్చారు.

అందరికన్నా ఎక్కువ దుఃఖపడుతున్న కౌసల్యాదేవి భరతుడి తల తన ఒళ్ళో పెట్టుకొని, ఆవు తన దూడను ఒళ్ళంతా నాకుతున్నట్లుగా, భరతుడి ఒళ్ళంతా తడుముతూ “నాయనా! ఎందుకిట్లా ఉన్నట్లుండి పడిపోయావు? రాముణ్ణి గూర్చిగాని, లక్ష్మణుని గూర్చిగాని, సీతను గూర్చిగాని పీడకల ఏమైనా వచ్చిందా? లేదా ఎవరైనా ఏమైన అశుభమైన మాటలు చెప్పారా? ఒంట్లో బాగాలేదా? ఎందుకింతగా ప్రాణాల మీదకు తెచ్చుకున్నావు? సీతా రామలక్ష్మణులు అడవులకుపోయినా, నీ తండ్రి స్వర్గస్థుడయినా, నిన్ను చూసుకొనే బ్రతుకుతున్నామే! ఇప్పుడు నువ్వుకూడా మమ్మల్ని అన్యాయం చేస్తావా? నాయనా! ఇప్పుడు మాకందరికీ నువ్వే దిక్కురా?” అంటూ ఓదార్చింది.

భరతుడు కొంతసేపటికి తెప్పరిల్లాడు. కౌసల్యాదేవిని చూస్తూ “అమ్మా! నువ్వు

భయపడ్డట్టుగా ఏమీ జరుగలేదు. భయపడకు" అని ఓదార్చి, గుహునితో ఇలా అన్నాడు: "ఓ గుహుడా! ఆ రోజు రాత్రి మా రాముడు ఎక్కడ పడుకున్నాడయ్యా? మా సీతమ్మతల్లి ఎక్కడ పడుకుంది. నా సీతారామ లక్ష్మణులు ఆ రాత్రి ఏం తిన్నారు? నీతో ఏం మాట్లాడారు? నాకు వాళ్ళు పడుకున్నచోటు చూపించు. వాళ్ళను గూర్చి వివరంగా అంతా చెప్పు. వినాలని మనస్సు తహతహలాడుతోంది."

గుహుడు: ప్రభూ! రాముడు వచ్చాడని తెలియగానే, నేను వివిధరకాలైన అన్నాలు, భక్ష్యాలు, పండ్లు, తేనె, పాలు ఇంకా ఎన్నో తీసుకొని రామప్రభువును దర్శించుకున్నాను. ఆ ధర్మపరుడు, సత్యశీలుడు, పరాక్రమవంతుడు నేను తీసుకుపోయిన పదార్థాలన్నింటినీ మర్యాదపూర్వకంగా తిరస్కరించాడు. "ఓ గుహుడా! నేనిప్పుడు పితృవాక్యాన్ని పరిపాలిస్తున్నాను. ఆ నియమాల ప్రకారం నేను ఎవరినుండి కానుకలు తీసుకోగూడదు" అని నన్ను సముదాయించి చెప్పాడు. తరువాత లక్ష్మణుణ్ణి గంగానదికి పంపించి గంగాజలాన్ని తెప్పించుకున్నాడు. ఆ జలాన్నే తానూ, సీతమ్మతల్లీ కూడా త్రాగారు. మిగిలింది లక్ష్మణస్వామి త్రాగాడు. సీతా రామలక్ష్మణులు ముగ్గురూ సాయం సంధ్యను ఏకాగ్రచిత్తంతో ధ్యానం చేశారు. ఆ తరువాత లక్ష్మణుడు తెచ్చిన దర్భలు పరచుకొని దానిపై కటికనేలపై పడుకున్నారు. ఓ భరతప్రభూ! రాత్రి ఆ కనిపించే గారచెట్టు క్రిందనే దర్భలు పరచుకొని సీతారాములు పడుకున్నారు. వాళ్ళు పడుకోగానే, లక్ష్మణుడు కవచాన్ని ధరించాడు, ధనుస్సును ఎక్కుపెట్టి చేత పట్టుకుని, అంబులపొదిని భుజాన వేసుకున్నాడు. రాత్రంతా సీతారాముల చుట్టూ తిరుగుతూ కావలి కాచాడు. నా అనుచరులంతా కూడా విల్లంబులు పట్టుకొని లక్ష్మణుని వెనకాలే దేవేంద్రుడి వంటి రాముడికి, సీతమ్మతల్లికీ కాపలాగా ఉన్నారు.

# 88వ సర్గ సీతారాములు పడుకున్న దర్భశయ్యను చూసి భరతుడు దుఃఖించటం

గుహుడు చెప్పిందంతా భరతుడు, మంత్రులు ఎంతో శ్రద్ధగా విన్నారు. తరువాత భరతుడు, శత్రుఘ్నుని, మంత్రులందరినీ వెంట బెట్టుకొని ఆ గారచెట్టు వద్దకు వెళ్లాడు. సీతారాములు పడుకున్న దర్భశయ్యను చూశాడు. అవన్నీ ఎండి వాడిపోయి ఉన్నాయి, చెల్లాచెదరై ఉన్నాయి. ఆ దర్భశయ్యను తల్లులందరికీ చూపిస్తూ ఇలా అన్నాడు: "ఓ తల్లులారా! నా అన్నగారు ఇక్ష్వాకుల వంశంలో జన్మించాడు. దశరథ మహారాజుకు జ్యేష్ఠ కుమారుడుగా పుట్టి ఇక్కడ కటికనేలపైన ఈ దర్భలు పరచుకొని పడుకున్నాడు. ఇట్లా జరుగకుండా ఉంటే ఎంతో బాగుండేది కానీ జరిగిపోయింది.

శత్రు భయంకరుడైన రాముడు పుట్టినప్పటినుండే పెద్దపెద్ద రాజ ప్రాసాదాల్లో మేడపైభాగాన శ్రేష్ఠమైన ప్రక్కలమీద పడుకునేవాడు. ఆతడి గది అంతా చందనాగరు ధూపాలతో తెల్లటిమేఘాల్లా పరుచుకుని ఉండేది. పుష్పాల సుగంధాలతో గుబాళిస్తూ ఉండేది. చిలుకలు యధేచ్ఛగా గుంపులు గుంపులుగా ఎగురుతూ చిలుక పలుకులు పలికేవి. ఆహ్లాదాన్ని కలిగించేందుకు మధురమైన సంగీతం వినిపించేవాళ్ళు. ఉదయానే వందులు, సూతులు, మాగధులు వచ్చి యథార్థమైన స్తోత్ర పాఠాలతో మేల్కొలిపేవాళ్ళు. ఇంతలోనే బండ్లు ఓడలయ్యాయి, ఓడలు బండ్లయ్యాయి. ఈ మార్పును లోకం నమ్మలేకపోతోంది. ఇది నిజం కాగూడదనే కోరుకుంటోంది. స్వప్నం కావాలని కోరుకుంటోంది.

రాముడే ఈ విధంగా నేలపై పడుకోవాల్సి వచ్చిందంటే, దేవతలు కూడా కాలానికి బద్ధులై ఉండాల్సిందేనని అనిపిస్తోంది, ఇది సత్యం. ఆహా! మహాసుకుమారి, జనకమహారాజు పుత్రిక, దశరథ మహారాజు పెద్దకోడలు అయిన సీతాదేవికూడా కటికనేలపై దర్భలు పరచుకొని పడుకోవాల్సి వచ్చిందే!

ఇది నా అన్నగారు పడుకున్న నేల. ఇక్కడ పరచిన దర్భలన్నీ చిందరవందరగా ఉన్నాయి. బహుశా నిద్రపట్టక అటూ ఇటూ పొర్లి ఉండవచ్చును. ఈ ప్రక్కపైన అక్కడక్కడా బంగారపుపొడి అంటుకొని ఉంది. బహుశా సీతాదేవి ఈ ప్రక్కపై పడుకొని ఉంటుంది. అక్కడక్కడా పట్టు దారాలుకూడా కనిపిస్తున్నాయి. ఆనాడు నా సీతమ్మతల్లి ధరించిన ఉత్తరీయం ఇక్కడ తగుల్కొన్నట్లు భావిస్తున్నాను. చిన్నవయస్సులో ఉండికూడా పతివ్రత కావటంవల్ల ఈ చెట్టు క్రింద కటికనేలమీద పడుకున్నా సీతాదేవికి దుఃఖం అని అనిపించలేదు. దీన్ని బట్టి ఆమె తన భర్త ఉన్నచోటే రాజప్రాసాదమని అనుకొని ఉంటుంది. కనుకనే ఈ కటిక నేలపైన సుఖంగా పడుకుంది.

లోకంలో లక్ష్మణుని మించిన ధన్యజీవి ఇంకొకడు ఉండబోడు. ఎందువల్లనంటే, ఇటువంటి కష్టాల్లోకూడా రాముణ్ణి అంటిపెట్టుకొని కంటికిరెప్పలా చూసుకుంటూ సీతారాములకు సేవలు చేస్తున్నాడు.

దశరథ మహారాజు మరణించాడు. రామలక్ష్మణులు అడవుల్లో ఉంటున్నారు. దాంతో అయోధ్య చుక్కానిలేని నావలా అయిపోయింది. అయినా రాముడు అరణ్యాల్లో ఉన్నా, ఆ మహావీరుని బాహుపరాక్రమం అయోధ్యను రక్షిస్తూనే ఉంటుంది. ఎవరూ అయోధ్య వైపు కన్నెత్తికూడా చూడలేరు.

ఇప్పుడు చతురంగబలాలను వెంటబెట్టుకుని వచ్చాను. సేనాధిపతులు, మంత్రులు, ప్రజలు కూడా నాతోనే అరణ్యంలో ఉన్నారు. అక్కడ అయోధ్యలో ప్రాకారాల్ని రక్షించే వాళ్ళులేరు. పట్టణపు ద్వారాలన్నీ తెరిచే ఉన్నాయి. అయినా శత్రువులు, విషాన్నం తినేందుకు ఎట్లా ఇష్టపడరో, అట్లాగే అయోధ్య వైపు కన్నెత్తి అయినా చూడరు.”

# 89వ సర్గ భరతుడు గంగను దాటడం

ఆరాత్రి వారంతా గంగానది ఒడ్డునే గడిపారు. ప్రాతఃకాలానే భరతుడు లేచి కాలకృత్యాలన్నీ ముగించుకున్నాడు. తరువాత శత్రుఘ్నుని వద్దకు పోయి "సోదరా! లే, ఇంకా నిద్ర పోవడమేమిటి? మనం త్వరగా గంగానదిని దాటాలి" అన్నాడు. అంతట శత్రుఘ్నుడు దిగ్గున లేచి కూర్చుని "అన్నా నేను నిద్రపోవటంలేదు. మెలకువతోనే ఉన్నాను. రాముని గూర్చి ఆలోచిస్తూ పడుకున్నాను" అన్నాడు. ఇంతలోనే గుహుడు వచ్చి వారిద్దరికీ నమస్కరించాడు. "భరతశత్రుఘ్నులారా! మీకీ గంగా నదీతీరాన నిద్రబాగా పట్టిందా? మీ సైన్యం కూడా ఏమీ ఇబ్బందులు పడలేదు గదా?" అని గుహుడు వారి క్షేమాన్ని విచారించాడు.

భరతుడు: ఓ గుహుడా! మేమంతా సుఖంగానే ఉన్నాం. మా కోసం నువ్వు చాలా శ్రమపడ్డావు. నువ్వు చేసిన ఉపకారాలను మరవగలనా? ఇక మేము సైన్యంతో గంగను దాటి అరణ్యంలో ప్రవేశించాలి. కనుక మాకు తగినన్ని నావలను ఏర్పాటుచెయ్యి.

గుహుడు: భరతుని మాటను ఆజ్ఞగా తీసుకొని తన వారినందరినీ సమావేశపరిచి, నావలన్నింటినీ రేవుల్లో పెట్టించమన్నాడు. అందుకు వారంతా "ఇప్పటికే అయిదువందల నావలను గంగాతీరాన సిద్ధంచేశాం" అని చెప్పారు.

స్వస్తికమనే నావపై తెల్లటి కంబళ్ళు పరిచారు. చిన్నచిన్న తెరచాపలుకట్టారు. గాలి వీచినప్పుడల్లా శబ్దంచేసే చిరుగంటల్ని కట్టారు. అందులో ముందుగా వసిష్ఠుడు, పూజ్యులైన బ్రాహ్మణులు ఎక్కారు. తరువాత భరత, శత్రుఘ్నులు, కౌసల్య, సుమిత్ర ఇతర రాణులు ఎక్కారు. వారి తర్వాత బండ్లు, అంగళ్ళను ఎక్కించారు.

గంగాతీరాన సైనికులకోసం వేసిన గుడారాలన్నింటికీ నిప్పంటించారు. నిప్పంటుకుని వాసాలు ఫెళఫెళమని శబ్దాలు వస్తున్నాయి. నావలలోకి ఎక్కే జనం అరుపులు

ఆకాశాన్నంటుతున్నాయి. ఏనుగులు, గుర్రాలు, కంచరగాడిదల అరుపులతో అరణ్యమంతా మారుమ్రోగిపోతోంది. పడవలన్నింటిలోనూ మనుషుల్ని, సామాన్లను, జంతువుల్ని, రథాల్ని ఎక్కించారు. తెరచాపలు ఎత్తారు. ఆ నావలన్నీ గంగానదిని వేగంగా దాటసాగాయి.

మావటివాళ్ళు ఏనుగుల వీపు మీద ధ్వజాలను నిలిపి గంగానదిని ఈదుకుంటూ దాటించారు. దూరాన్నించి చూసే వాళ్ళకు జండాలు పాతిన కొండలు నీళ్ళల్లో నడుస్తున్నట్లుగా కనిపించింది.

ఇవికాక కొందరు వాసాలను కలిపికట్టి తెప్పలుగా చేసుకొని ఈదారు. కొందరు చేతులతో బారలువేస్తూ ఈదారు. కొందరు మట్టి కుండలను బోర్లించి వాటి ఆసరాతో ఈదుకొంటూ అవతలి ఒడ్డుకు చేరుకున్నారు.

అంతా గంగానదికి ఆవలిగట్టుకు చేరుకొని మరల స్నానాదులు ముగించుకొన్నారు. అంతాకలసి భరతుడి వెనకాలే మైత్ర ముహూర్తంలో ప్రయాగవనాన్ని చేరుకున్నారు.

ఋషిశ్రేష్ఠుడైన భరద్వాజ మహర్షి తపోవనం కనుచూపు మేరలో కనిపించింది. వసిష్ఠాది మహాత్ములతో కలసి భరతుడు భరద్వాజాశ్రమం వైపుగా ప్రయాణం సాగించాడు.

# 90వ సర్గ భరతుడు భరద్వాజ మహర్షిని కలుసుకోవడం

ధర్మవేత్త అయిన భరతుడు సైన్యాన్నంతా భరద్వాజాశ్రమానికి క్రోసు దూరంలోనే నిలిపివేశాడు. పట్టుబట్టలు కట్టుకొని వసిష్ఠాది మహనీయులను ముందుంచుకొని భరద్వాజుని ఆశ్రమానికి కాలినడకన బయలుదేరాడు.

వసిష్ఠ మహర్షిని భరద్వాజుడు దూరాన్నుంచే చూశాడు. వెంటనే ఆసనంపై నుండి లేచాడు. అర్ఘ్యం తెమ్మని శిష్యులను ఆదేశించాడు. శీఘ్రంగా వసిష్ఠునికి ఎదురుగావెళ్ళి స్వాగతం పలికాడు. ప్రక్కనే ఉన్న భరతుడు ఆ మహర్షికి నమస్కరించాడు. అతడు దశరథుని కుమారుడు భరతుడని గ్రహించాడు. వసిష్ఠ మహర్షిని, భరతుణ్ణి అర్ఘ్యపాద్యాదులతో సత్కరించి ఆసనం చూపాడు. తరువాత భరద్వాజుడు అయోధ్యానగరాన్ని గురించి, మంత్రుల గురించి, సైన్యాన్ని గురించి, ధనాగారాన్ని గురించి యోగక్షేమాలు విచారించాడు. దశరథుని గూర్చి ఆయనకు ముందే తెలియటంవల్ల ఆయన ప్రస్తావన తీసుకురాలేదు.

అంతట భరతుడు కూడా మహర్షి ఆరోగ్యాన్ని గూర్చి, ఆయనను సేవిస్తున్న శిష్యులను గూర్చి, పశుపక్ష్యాదులను గూర్చి విచారించాడు. ఈ విధంగా పరస్పర క్షేమాలను విచారించుకున్న తరువాత, మహర్షి రాముని పట్లగల స్నేహాన్ని దృష్టిలో ఉంచుకొని భరతుడితో ఇలా అన్నారు: "ఓ భరతుడా! నువ్వు అయోధ్యలో రాజ్యం చేస్తూ ఉండవలసినవాడవు. ఈ విధంగా సైన్యంతోను, మంత్రులతోను అరణ్యాల్లోకి ఎందుకు వచ్చావు? నాకు వివరంగా చెప్పు. నా మనస్సెందుకో శంకిస్తోంది."

భరతుడా! శత్రుసంహారకుడు, ఆనందాన్ని వృద్ధిచెందించే వాడైన రాముణ్ణి పద్నాలుగు సంవత్సరాలు వనవాసం చెయ్యమని దశరథ మహారాజు ఆజ్ఞాపించాడు. రాముడు కూడా ఆయన ఆజ్ఞను శిరసావహించి సీతాలక్ష్మణులతో కలసి అరణ్యంలో ఉంటున్నాడు. ఇక నీకు అయోధ్యను పాలించటానికి ఎటువంటి అడ్డంకులూ లేవుగదా! మరి ఇంత పెద్ద సైన్యాన్ని

వెంటబెట్టుకొని రాముణ్ణి వెతుక్కుంటూ అడవులకు ఎందుకు వచ్చావు? నీలో పాపపు ఆలోచనలేవీ లేవు గదా?"

భరతుడు (బొటబొటా కన్నీరు కారుస్తూ) : ఓ భరద్వాజ మహర్షీ! తమరు దైవజ్ఞులు, పరమపూజ్యులు, ధార్మికులు. మీరుకూడా నన్ను అనుమానించినట్లయితే మరణం ఒక్కటే నాకు శరణ్యం. వేరే దిక్కులేదు. నాలో ఎటువంటి పాపపు ఆలోచనలూ లేవు. నేను ఎటువంటి దోషాన్ని తలపెట్టడంలేదు. నన్ను గూర్చి అట్లా మాట్లాడకండి. నన్ను కనికరించండి.

నేను నా తాతగారి ఇంట్లో ఉండగా నా తల్లి కైకేయి పట్టుబట్టి రాముణ్ణి అడవులకు పోయేట్లు చేసింది.

ఆమె చేసిన ఆలోచనల్లోగానీ, చర్యల్లోగానీ నా ప్రమేయం ఎంతమాత్రమూ లేదు; నేను సమ్మతించలేదు. అట్లా చేయడం నా అభిమతం కాదు.

ఓ మహర్షీ! నేను ఇప్పుడు పురుషశ్రేష్ఠుడైన ఆ రాముని పాదాలకు నమస్కరించటానికి, ఆయన అనుగ్రహాన్ని పొంది మళ్ళీ ఆయనను అయోధ్యకు తీసుకువెళ్ళేందుకు వచ్చాను. కనుక ఓ మహర్షీ! నన్ను అనుగ్రహించండి. మహారాజైన రాముడు ఎక్కడ ఉన్నదీ చెప్పండి.

తరువాత వసిష్ఠాది బ్రహ్మశ్రేష్ఠులు, మంత్రులు కూడా మహర్షిని ప్రార్థించగా పూజ్యుడైన మహర్షి ప్రసన్నుడయి ఇలా అన్నాడు: "ఓ భరతుడా! నువ్వు చేస్తున్న ఈ కార్యం నీ కీర్తి ఆచంద్రార్కం నిలిచి ఉండేట్లు చేయగలదు. నువ్వు పురుషులలో శ్రేష్ఠుడవు. నీలోని సత్ప్రవర్తన, ఇంద్రియ నిగ్రహం, పెద్దల ననుసరించిపోవడం వంటి మంచి లక్షణాలన్నీ, రఘువంశంలో పుట్టిన నీకు తగినట్లుగా ఉన్నాయి.

నాయనా! భరతుడా! నీ మనస్సులోని భావాలు నాకు తెలిసినా కూడా, దాన్ని ధ్రువీకరించుకొందామనే నిన్ను ఆ విధంగా అడిగాను. సీతారామలక్ష్మణులు చిత్రకూట పర్వతం

మీద నివసిస్తున్నారు. నువ్వు రేపు అక్కడకు వెళ్లు. ఈ రోజు ఇక్కడే ఉండి నా ఆతిథ్యం స్వీకరించు. నా మాట కాదనకు."

మహర్షి ఆదరానికి, ప్రేమకు ఎంతో సంతోషించినవాడై భరతుడు ఆ రోజు అక్కడే ఉండి, మర్నాడు చిత్రకూటానికి వెళ్ళేందుకు అంగీకరించాడు.

# 91వ సర్గ భరతునకు భరద్వాజ మహర్షి ఆతిథ్య మివ్వడం

భరద్వాజ మహర్షి పట్టుపట్టడంతో భరతుడు ఆ రాత్రి అక్కడే ఉండేందుకు సంశయిస్తూ "మహర్షీ! అరణ్యంలో అతిథులు అర్ఘ్యం, పాద్యం వంటివి మాత్రమే ఎదురుచూడాలి కాని, ఇంత పెద్ద సైన్యానికి ఆతిథ్యాన్ని ఎదురుచూడరాదు గదా!" అన్నాడు.

భరద్వాజ మహర్షి (మందహాసం చేస్తూ) : నాయనా! భరతుడా! నీకు నా పట్ల ఉండే గౌరవం, అభిమానం నేను ఎరుగుదును. నీ మంచి స్వభావంచేత ఎంత ఉంటే అంతలోనే సంతృప్తి పడగలవు. అది నీ ఉదాత్త స్వభావం. అయినా ఎందుకో ఈ రోజు నీ పరివారానికంతకూ విందు చేయాలని అనిపిస్తోంది. నా మాట కాదనకు. నీవు నీ పరివారాన్నంతటినీ వెంటబెట్టుకొని రాకుండా ఒంటరిగా కాలినడకన వచ్చావు. ఎందుకో తెలుసుకోవచ్చా?

భరతుడు: ఓ మహర్షీ! తమ పట్ల గల భక్తిశ్రద్ధల చేతనే నా సైన్యాన్నంతా దూరంగా ఉంచి వచ్చాను. రాజులు తపోధనులను దర్శించేటప్పుడు తమ సైన్యాన్ని, పరివారాన్ని ఆశ్రమంలోకి తీసుకొని రాకూడదని పెద్దలు చెప్పగా విన్నాను. ఎందుకంటే ఆశ్రమవాసులు పర్ణశాలలు నిర్మించుకొని, తమ అభిరుచులకు తగినట్లుగా వృక్షాలను, మొక్కలను పెంచుకొంటారు. వారికి ఉల్లాసం కలిగించే చిన్నచిన్న జంతువులను, పక్షులను పెంచుకుంటారు. వారి అవసరాల కోసం చిన్నచిన్న జలాశయాలను ఏర్పాటు చేసుకుంటారు. రాజులు తమ పరివారంతో కలసి వస్తే మహర్షులు ఎంతో కష్టపడి చేసుకున్న ఈ ఏర్పాట్లన్నింటినీ తొక్కి పాడు చేస్తారు. ఆ నష్టాన్ని సరి చేసుకోవటానికి మహర్షులకు చాలా సంవత్సరాలు పట్టవచ్చు. అందువల్ల నా సైన్యాన్నంతా దూరంగా ఉంచి, మీ దర్శనానికి ఒంటరిగా వచ్చాను.

భరద్వాజ మహర్షి: భరతుడా! నీవు బుద్ధిమంతుడవు. నీ ఆలోచన ఉదాత్తమైనది. అయినా

భయపడకు. నీ సైన్యంగానీ, ఏనుగులు, గుర్రాలు మొదలైన జంతువులుగానీ, నా ఆశ్రమాన్ని ఏమీ పాడుచెయ్యలేవు. కాబట్టి నీ వెంట ఉన్న చతురంగ బలాలను, జనసమూహాన్ని ఇక్కడకు పిలిపించు.

అంతట భరద్వాజ మహర్షి ఆజ్ఞను శిరసావహించిన భరతుడు తన చతురంగ సేనల్నీ, జనసమూహాల్నీ ఆశ్రమానికి రప్పించాడు.

అప్పుడు భరద్వాజ మహర్షి తన అగ్నిహోత్ర గృహంలోకి వెళ్ళాడు. మూడుసార్లు ఆచమించాడు. అగ్నిహోత్రానికి నమస్కరించాడు. భరతునికి ఆతిథ్యం ఇచ్చేందుకు దేవతల నందరినీ ఆహ్వానించాడు. ఒక్కొక్కరికీ ఒక్కొక్క కార్యభారాన్ని అప్పజెప్పాడు. అన్నీ క్షణాల మీద జరిగిపోయాయి. భరద్వాజ సృష్టి ఈ విధంగా నడచింది:

ఓ ముగ్గురు లోకపాలకులారా! (యమ, వరుణ, కుబేర) నేను భరతునికి ఆతిథ్యం ఇస్తున్నాను. మీ ముగ్గురూ వచ్చి నాకు సహాయపడవలసింది. ఓ దేవేంద్రుడా! నీవు కూడా తక్కిన దేవతలతో వచ్చి నాకు సహాయపడు. ఓ అగ్నిహోత్రుడా నీవు ముందుండి అన్నీ నిర్వహించాలి.

ఆంతరిక్షంలోను, భూమి మీద తూర్పుగా ప్రవహించే నదులు, పడమరగా ప్రవహించే నదాలు ఇక్కడకు రండి. మీలో కొందరు మైరేయమనే మద్యాన్ని ప్రవహింపజేయండి. ఇంకొందరు సుర అనే మద్యాన్ని ప్రవహింపజేయండి. మిగిలిన వారందరూ చెరుకురసం వంటి తియ్యని చల్లని నీటిని ప్రవహింపజేయండి.

ఓ హాహా, హూహూ గంధర్వులారా! మీ జాతిలోని ఉత్తమమైన అప్సరసలను వెంటబెట్టుకొని రండి. ఓ ఘృతాచీ, విశ్వాచీ, మిశ్రకేశీ, అలంబుసా, నాగదంతా, హేమా మీరు కూడా మీ జాతిలోని ఉత్తమమైన అప్సరసలను తోడ్కొని రండి.

ఓ బ్రహ్మ! ఇంద్రా! కుబేరా! మిమ్మల్ని సేవించే ఉత్తమ స్త్రీలను పంపి భరతుణ్ణి

నృత్యసంగీతాదులతో రంజింపచేయండి. సంగీత పారంగతులైన నారద తుంబురులను కూడా పంపించండి.

ఓ చంద్ర భగవానుడా! నీవు ఓషధులకు అధిపతివి. కనుక వివిధ రకాలైన భక్ష్య, భోజ్య, చోష్య లేహ్యాలను; ఉత్తమమైన అన్నాలను, మద్య మాంసాదులను, వివిధాలైన పూలను, పండ్లను ఏర్పాటు చేయి.

ఓ వాయుదేవుడా! నీవు సర్వవ్యాపకుడవు కాబట్టి చల్లటి మలయమారుతాన్ని, రకరకాలైన సుగంధాలను వ్యాపింపజేసి అతిథులందరికీ ఆహ్లాదాన్ని కలిగించు.

అంతట దేవతలంతా పుష్పవర్షం కురిపించారు. గంధర్వాదులు గానం ఆలపించారు; వీణానాదాలు చేశారు. అప్సరసలు నృత్యం చేశారు. వీటినన్నింటినీ వాయుదేవుడు తనలో మోసుకొనిపోయి ప్రతి ఒక్కరికీ ఆనందాన్ని, పులకింతల్ని కలిగేట్లు చేశాడు.

"ఓ విశ్వకర్మా! నీ నైపుణ్యం చూపి అతిథులందరికీ సుఖంగా ఉండేందుకు ఇళ్ళు నిర్మించిపెట్టు" అని భరద్వాజ మహర్షి ప్రార్థించారు. అంతట విశ్వకర్మ, సైనికులు ఉండేందుకు, మంత్రులు తదితర రాజోద్యోగులు బసచేసేందుకు, పరిచారికలకు, అంతఃపుర స్త్రీలకు, రాణులకు, విడివిడిగా వారివారి యోగ్యతలకు తగినట్లుగా నాణ్యమైన చతుశ్శాలా గృహాలు, రమ్యమైన హర్మ్యాలు, రాజప్రాసాదాలు, ఏనుగుల శాలలు, గుర్రాలకు లాయాలు, వాహనాలకు కొట్లు నిర్మించాడు. ఆ రాజప్రాసాదాలన్నీ మణులు, వైదూర్యాలు, నీలాలతో పొదగబడ్డాయి. ఆ గృహ ఆవరణలల్లో మారేడు చెట్లు, ఉసిరిక చెట్లు, వెలగ, పనస, మామిడి మొదలైన ఫలవృక్షాలన్నీ కాయ, పిందె, ఫలాలతో వ్రేలాడుతూ వెలిశాయి. ఉత్తర కురుదేశం నుండి కుబేరుని చైత్రరథమనే ఉద్యానవనమంతా అక్కడ ప్రత్యక్షమైంది.

అక్కడ వెలసిన రాజమందిరం, శరత్కాల మేఘంలా తెల్లగా ఉంది. నలుచదరంగా భూమినంతా పరచుకొంది. హిమాలయ శిఖరాల్లా ఎత్తుగా ఉంది. రకరకాలైన పూలదండలతో

తోరణాలు కట్టబడటంతో దివ్య సుగంధాలు వ్యాపించాయి. గదులన్నీ విశాలంగా ఉన్నాయి. అందులో స్నానాలకు, పడకలకు, భోజనాలకు ప్రత్యేకమైన గదులు ఏర్పాటు చేయబడ్డాయి. తళతళలాడే భోజనపాత్రల నిండా పానీయాలు, అనేక రకాలైన అన్నాలు, ఆవుపాలు ఏర్పాటు చేయబడ్డాయి.

భరద్వాజుని అనుజ్ఞ పొంది భరతుడు తన మంత్రులు, సేనాధిపతులు, ఇతర రాజోద్యోగులను వెంటబెట్టుకొని ఆ రాజభవనంలోకి ప్రవేశించాడు. అక్కడ చేసిన ఏర్పాట్లు చూసి ఆశ్చర్యపడటమే కాకుండా పరమానందభరితుడయ్యాడు.

ఆ రాజభవనంలో పరమాశ్చర్యకరంగా దివ్యకాంతులతో రాజసింహాసనం ఉంది. దానిమీద తెల్లటి గొడుగు పట్టి ఉంది. తెల్లటి వింజామరలు వీస్తున్నాయి. ఆ సింహాసనాన్ని చూస్తూనే పరమభక్తితో రాముణ్ణి తలచుకున్నాడు. ఆ సింహాసనానికి ప్రదక్షిణ పూర్వకంగా సాష్టాంగ నమస్కారం చేశాడు. చేతుల్లోకి ఒక వింజామరను తీసుకొని, ఆ సింహాసనానికి దిగువన మంత్రి మండలి కోసం ఏర్పాటైన ఆసనాలలో భరతుడు కూడా మంత్రులతోపాటు పోయి కూర్చున్నాడు. పురోహితులు, బ్రాహ్మణోత్తములు తమకు కేటాయించిన స్థానాల్లో కూర్చున్నారు.

ఆ విధంగా వారంతా రాజభవన సభామంటపంలో కూర్చుని ఉండగా భరద్వాజ మహర్షి మహిమచేత వారి ఎదురుగా ఒక పాయసపు నది ప్రవహించింది. ఆ నది రెండు గట్లపైనా సకల సౌకర్యాలతో భవనాలు వెలిశాయి. వాటిలో అరవై వేలమంది అప్సరాంగనలు వచ్చి భరతుడి సేవలకై నిలబడ్డారు. వారిలో ఇరవైవేలమందిని బ్రహ్మదేవుడు పంపించాడు. మరో ఇరవై వేలమందిని కుబేరుడు పంపాడు. ఇంకో ఇరవై వేలమందిని దేవేంద్రుడు పంపించాడు.

భరతుణ్ణి ఆ అరవై వేలమంది అప్సరాంగనలు సేవిస్తూ ఉండగా, నారదుడు, తుంబురుడు, గోపుడు అనే ముగ్గురు గంధర్వరాజులు సంగీతం వినిపించారు. అప్పుడే వారి

గానానికి లయబద్ధంగా అలంబుస, మిశ్రకేశి, పుండరీక, వామన అనే అప్సరసలు నృత్యం చేశారు. దేవేంద్రుడి నందనోద్యానంలో లభించే పూలు, కుబేరుడి చైత్రరథమనే వనంలో దొరికేవన్నీ భరతుడికి ప్రయాగ క్షేత్రంలో భరద్వాజుని ఆశ్రమంలో లభించాయి.

సభా మందిరంలో భరతుడు ఈ విధంగా దేవేంద్రభోగాలు చవిచూస్తూ ఉంటే, అక్కడ సైనికుల కోసం మారేడు చెట్లు మద్దెళ్ళు వాయించాయి. తాటిచెట్లు తాళాలు వేశాయి. రావిచెట్లు నృత్యం చేశాయి. దేవదారు, గానుగ, బొట్టుగ చెట్లు కుబ్జలుగాను, వామన రూపంలోను స్త్రీలుగా మారిపోయినాయి. శింశుపా వృక్షాలు, ఉసిరిక నేరేడు మొదలైన చెట్లన్నీ స్త్రీ రూపాలు ధరించి సైనికుల చుట్టూ తిరుగుతూ వారందరినీ అలరించాయి.

ఆ స్త్రీలంతా పరమ ఆప్యాయంగా సైనికుల మెడలచుట్టూ చేతులు వేసి "ఓ వీరులారా! మేమంతా మిమ్మల్ని సంతోషపెట్టడానికి వచ్చాం. మీకు ఏం కావాలో చెప్పండి? ఆకలిగా ఉంటే తినేందుకు రకరకాలైన ఆహార పదార్థాలున్నాయి. సుర త్రాగుతారా? ఏరులై పారుతోంది. మీరు తాగినంత తాగవచ్చు" అని అన్నారు.

ఒక్కొక్క సైనికుణ్ణీ ఎనిమిది మంది స్త్రీలు తలకు, ఒంటికి నూనె రాసి, నలుగు పెట్టి నదీతీరాలకు తీసుకొని పోయి స్నానాలు చేయించారు. ఇంకో సుందరాంగి వచ్చి వాళ్ళ ఒంటికి ఉన్న తడి అంతా తుడిచి, చక్కగా అలంకరించి ఏకాంతానికి తీసుకొనిపోయి పరస్పరం సురాపానం చేసి మత్తెక్కి తిరుగసాగారు.

వీరికే కాకుండా వాహనాలను కాపలా కాసేవారు, ఏనుగులు, గుర్రాలను కనిపెట్టుకుని ఉండేవారు, గాడిదలు ఒంటెలను చూసుకునే వాళ్ళందరికీ కూడా అప్సర స్త్రీలు వచ్చి తేనెలో కలిపిన పేలాలు తినిపించారు. అందరికీ కడుపునిండా మద్యం ఇచ్చారు. గుర్రాలను చూసే వాళ్ళకు వాళ్ళ గుర్రాలెక్కడున్నాయో కనిపించలేదు. ఏనుగుల్ని కనిపెట్టి ఉండేవాళ్ళకు ఏనుగులే కంటికి కనపడలేదు. ఆ విధంగా అంత రుచికరమైన భోజనాలతో, మత్తెక్కించే మద్యాలతో

అతిలోక సుందరుల సాంగత్యంలో ఆటపాటలతో వారంతా సంతుష్టులయ్యారు.

అనేకమంది అప్సరసలు కలసి ఒక సైనికుడితో కలసి తిరిగారు. అనేకమంది సైనికులు కలసి ఒక అప్సరసతో తిరిగారు. “మేం అయోధ్యకూ పోము; దండకారణ్యానికీ పోము. ఇక్కడే ఉంటాం” అని అరిచారు. ఇంకొందరు “ఇదే స్వర్గం, ఇంతకన్నా స్వర్గం ఎక్కడ ఉంది?” అంటూ కేకలు పెట్టారు. వాళ్ళంతా అప్సరసల చేత చందనం పూయించుకున్నారు. పూలదండలు వేయించుకున్నారు. వాళ్ళతో కలసి పాటలు పాడారు. వాళ్ళతో కలసి నృత్యం చేశారు. ఎగిరారు, గంతులు వేశారు; పరుగులు పెట్టారు. అలసిపోయిన వాళ్ళు మళ్ళీ మళ్ళీ తినడం త్రాగడం చేశారు.

ఆ సైన్యంలో స్త్రీలు పరిచారికలుగాను, దాసీలుగాను, వీరాంగనలుగాను వేలసంఖ్యలో ఉన్నారు. వారంతా కూడా కొత్త చీరలు ధరించి, చక్కగా అలంకరించుకొని యథేచ్ఛగా విహరించారు. భరద్వాజ మహర్షి అనుగ్రహం చేత ఏనుగులు, గుర్రాల వంటి జంతువులకే కాకుండా, అనేక రకాలైన పశుపక్ష్యాదులకు కూడా తిండి సమృద్ధిగా దొరికింది.

భరతుడి పరివారంలో ఎవరూ వంటలు చేసుకోలేదు. మురికిబట్టలు వేసుకున్నవారు మచ్చుకైనా కనబడలేదు. అంతా కొత్తబట్టలే కట్టారు. ఆనాటి రాత్రి విందులో అనేక రకాలైన మాంసాహారాలు చేయించారు. ఘుమఘుమలాడే వాసనలతో చేసిన పప్పులు, చక్కెరతో పక్వం చేసిన ఫలరసాలు, చక్కగా తేనెలో మాగిన పండ్లు, మృగమాంసం, నెమలి మాంసం, కోడిమాంసం, మేకమాంసం, మున్నగు అనేక మాంసాహారాలు సిద్ధం అయ్యాయి. చక్కెరతోను, తేనెతోను కలిపి పక్వం చేసిన అనేక రుచికరమైన పదార్థాలను వడ్డించారు. పెద్దపెద్ద బానల నిండా పెరుగు, చిన్నచిన్న దుత్తలనిండా శొంఠి, పిప్పలి, మిరియాలు, ఏలకులు, లవంగాలు, జీలకర్ర, అల్లం, పంచదార, తిరగమూత వేసిన పెరుగు, రకరకాల పాయసాలు, చక్కెరతో చేసిన తీపిపదార్థాలు చూసి భరతుని సైనికులంతా ఆశ్చర్యపోయారు.

నదీతీరాన రేవులన్నింటిలోను, ఉసిరికకాయ, మినుములు, కాయ ధాన్యాలు, చందనంతో కలిపి, నలుగుపిండిని ఉంచారు. ఆ నలుగు పిండితో ఒళ్ళు శుభ్రం చేసుకొని సైనికులంతా నదిలో స్నానాలు చేశారు. ఒంటిని పూసుకోవడానికి దొప్పలనిండా చందనం ఉంచారు. ముఖం చూసుకోవటానికి అద్దాలు, అలంకార సామగ్రి ఏర్పాటు చేశారు. కొత్త కొత్త బట్టలున్నాయి. చిత్ర విచిత్రాలయిన కవచాలున్నాయి. ఇవన్నీ చూసి సైనికులు ఉప్పొంగిపోయారు.

సైనికులకే కాకుండా, ఏనుగులు, గుర్రాలు మొదలైన ఇతర జంతువులన్నీ చక్కగా నదిలో స్నానాలు చేసేందుకు, కడుపునిండా చల్లటి నీళ్ళు తాగేందుకు రేవులు కట్టించారు. తమ జంతువులన్నీ ఆనందంగా నీళ్ళల్లో మునకలు వేస్తూ ఉంటే సైనికులంతా ముగ్ధులైపోయారు.

ఆ విధంగా భరద్వాజ మహర్షి చేసిన ఏర్పాట్లన్నీ చూసి ఆనందించిన వారంతా 'ఇది నిజమా? కలా?' అని సందేహంలో పడ్డారు. అంతా ఆనందంగా, ఉల్లాసంగా ఆ రాత్రి గడపారు. వాళ్ళకు ఆతిథ్య మివ్వటానికి వచ్చిన గంధర్వులు, అప్సరసలు, దేవతలు తమ తమ స్థానాలకు వెళ్ళిపోయారు. భరతుడి సైనికులు ఇంకా మద్యంమత్తులో నిద్రపోతూనే ఉన్నారు. రాత్రంతా వాడిన పూలు, పూలమాలలు మాత్రం వాళ్ళ తీపి అనుభవాలకు గుర్తుగా మిగిలిపోయాయి.

# 92వ సర్గ భరతుడు చిత్రకూటానికి ప్రయాణమవడం

భరతుడు ఉదయానే లేచి రాముణ్ణి చూసేందుకు ప్రయాణమయ్యాడు. భరద్వాజ మహర్షికి ధన్యవాదాలు తెలిపి ఆయన అనుజ్ఞ పొంది రాముణ్ణి చూడాలనుకున్నాడు. ఆయన ఆశ్రమానికి పోయే సమయానికి ఆయనే అగ్నిహోత్రాన్ని ముగించుకొని భరతుణ్ణి చూడాలని బయలుదేరబోతున్నాడు. ఇంతలో భరతుడే కనబడి ఆయనకు పాదాభివందనం చేశాడు. ఆ మునీశ్వరుడు భరతుడితో ఇలా అన్నాడు:

భరద్వాజ మహర్షి: నాయనా! భరతా! రాత్రి బాగా నిద్రపట్టిందా? నీ సైనికులంతా నా ఆతిథ్యానికి సంతోషపడ్డారా? ఎక్కడా ఏమీ లోపం జరగలేదుగదా?

భరతుడు: ఓ మహర్షీ! నేను, నా మంత్రులు, నా సైన్యం అందరమూ మీ ఆతిథ్యంతో సంతుష్టులమై ఉన్నాం. సుఖంగా నిద్రపోయాం. ఓ పూజ్యుడా! ఇక మేము రాముని దర్శనం చేసుకునేందుకు మీవద్ద నుండి అనుమతిని కోరుతున్నాము. నా పట్ల దయ చూపండి. ధార్మికుడవైన ఓ మహాముని! నేను నా అన్నగారి దర్శనం చేసుకోవటానికి తహతహలాడుతున్నాను. అతణ్ణి దర్శించే మార్గం ఎంత దూరాన ఉన్నదో తెలిపి నన్ను అనుగ్రహించండి.

భరద్వాజ మహర్షి: ఓ భరతుడా! ఇక్కడ నుండి మూడున్నర కోసుల దూరాన చిత్రకూట పర్వతం ఉంది. అక్కడకు చేరే ముందు జనసంచారం లేని దట్టమైన అడవులను, అనేక వాగులను, సెలయేళ్ళను దాటుకుంటూ పోవాలి. ఆ పర్వతానికి ఉత్తరాన మందాకినీ నది ప్రవహిస్తూ ఉంటుంది. ఆ మందాకినీ నదీతీరం రెండువైపులా పుష్పించిన వృక్షాలతో నిండి ఉంటుంది. ఆ నది దాటగానే చిత్రకూటం ప్రారంభమవుతుంది. ఆ పర్వతంపైన సీతారామ లక్ష్మణులు పర్ణశాల నిర్మించుకొని నివసిస్తున్నారు. కనుక నీవు నీ సేనలను, ఏనుగులను, గుర్రాలను, పరివారాన్ని వెంటబెట్టుకొని దక్షిణం ప్రక్కగాకాని, నైరుతిమూలగా కాని ప్రయాణం

చెయ్యి. నీవు తప్పక రాముణ్ణి కలుసుకుంటావు.

ఇంతలో దశరథుని భార్యలు రథంపై నుండి దిగి వెళ్ళి మహర్షి ప్రక్కన నిలబడ్డారు. కౌసల్యాదేవి, సుమిత్రాదేవి మహర్షి పాదాలకు నమస్కరించారు. రెండువిధాలా చెడిన కైకేయి సిగ్గుతో తలవంచుకొని మహర్షికి ప్రదక్షిణ నమస్కారం చేసి భరతుని ప్రక్కన నిలబడ్డది. అప్పుడు మహర్షి వారిలో ఎవరెవరు ఎవరికి తల్లులో వివరించి చెప్పమని అడగ్గా భరతుడు ఇలా అన్నాడు.

భరతుడు: ఓ మహర్షీ! శోకంతోను, దుఃఖంతోను కృశించి ఉన్న ఈ దీనురాలే దశరథ మహారాజు పట్టమహిషి, పురుషశ్రేష్ఠుడైన రాముని కన్నతల్లి. ఓ మహాత్మా! ఈమె సుమిత్రాదేవి. దేవతలతో సమానమైన సత్యపరాక్రమవంతులైన లక్ష్మణ శత్రుఘ్నులను కన్నతల్లి.

కోపస్వభావం కలది, మహాగర్విష్ఠి, తానే అందగత్తెననే అహంభావం గలది, పరమలోభి, అధికమైన రాజ్యకాంక్ష కలిగినది అయిన ఈ కైకేయీదేవి పాపపు ఆలోచనలు చేసి రామలక్ష్మణులను అడవులకు పంపింది. పుత్రవియోగం చేత దశరథ మహారాజు మరణానికి కారణభూతమైనది. ఈమే నాకు జన్మనిచ్చిన తల్లి.

ఈ మాటలు అనేటప్పుడు భరతుని కళ్లు చింతనిప్పుల్లా ఎర్రబడ్డాయి. గొంతు గద్గదమైంది. పగబట్టిన పాము బుస కొడుతున్నట్లుంది.

భరద్వాజ మహర్షి: భరతుడా! నీవు కైకేయిని తప్పుపట్టవద్దు. దైవమే ఆమెచే అట్లా రామవనవాసం అడిగేట్లు చేసింది. ఆమె నిమిత్తమాత్రురాలు. రాముడి అరణ్యవాసం లోకకల్యాణం కోసమే ప్రేరేపించబడ్డది. దేవతలకు, మానవులకు కూడా అనేక సుఖాలు జరుగనున్నాయి. కాబట్టి మీ అమ్మను ఏమీ అనవద్దు.

అంతట భరతుడు మహర్షి అనుమతి పొంది, సైన్యాన్ని చిత్రకూటం దిశగా నడిపించాడు. కౌసల్యాదేవి తదితర స్త్రీలంతా రామదర్శనానికై వాహనాల నెక్కి కూర్చున్నారు.

ఏనుగులతోను, గుర్రాలతోను, రథాలతోను, ఆ సైన్యమంతా దక్షిణ దిక్కుగా ప్రయాణం చేసింది. అడవిలో జీవించే మృగాలు, పక్షులు భయంతో పరుగులు తీశాయి.

# 93వ సర్గ భరతుడు చిత్రకూటానికి వెళ్ళడం

భరతుడు తన సైన్యాన్ని చిత్రకూటం వైపుగా నడిపించాడు. సైన్యం చేస్తున్న అరుపులు, రథాల చప్పుళ్ళకు అడవిలోని ఏనుగులన్నీ భయంతో గుంపులు గుంపులుగా పరుగులు పెట్టాయి. ఆ శబ్దాలకు కొండలోయలన్నీ ప్రతిధ్వనించాయి. ఒక్కొక్కచోట సెలయేళ్ళ ప్రక్కనుండి ఎలుగుబంట్లు గుంపులుగా పరుగెత్తడం కనిపించింది. మరోచోట నల్లమచ్చల దుప్పులు, జింకలు పరుగెత్తుతూ కనిపించాయి.

చతురంగబలాలు అడవిలో పోతూ ఉంటే నేలపై దుమ్ము ఆకాశాన్నంటింది. వానాకాలంలో ఆకాశాన్ని మేఘాలు కప్పివేసినట్లు దుమ్ము ధూళి ఆకాశాన్ని కప్పివేసింది. కొంతదూరం ప్రయాణం చేసిన తరువాత గుర్రాలు, ఏనుగులు అలసిపోయి ప్రయాణంలో వేగం కొంత తగ్గింది. అప్పుడు భరతుడు వసిష్ఠ మహర్షితో ఇలా అన్నాడు:

"ఓ మహర్షీ! భరద్వాజ మహర్షి చెప్పిన గుర్తుల ప్రకారం మనం చిత్రకూటాన్ని చేరుకుంటున్నాం. ఆహా! ఈ ప్రదేశానికి రావాలనే కదా నేను ఇన్నాళ్ళూ కలలు కన్నాను! అదుగో మందాకినీ నది. ఆ నది పైనుంచి చూస్తే కనిపించేదే చిత్రకూట పర్వతం. ఆ పర్వతం మీద ఆ నల్లగా కానవచ్చే వృక్ష సముదాయ ప్రాంతమే సీతారామలక్ష్మణుల నివాసస్థలం అయి ఉంటుంది.

"ఓ శత్రుఘ్నా! చూశావా! మన ఏనుగులు ఈ పర్వతం పైన నడుస్తూ ఉంటే కొండలన్నీ పిండి అయిపోతున్నాయి. వెనక వెళ్ళేవాళ్ళకు చక్కటి బాట ఏర్పడుతోంది. ఈ పర్వత సానువుల్లో ఉన్న పొగడ వృక్షాలు పొగడపూలను రాలుస్తూ ఉంటే, వర్షాకాలంలో మేఘాలనుండి రాలే వానతుప్పరలాగా ఉంది సుమా! సముద్రంలో రకరకాలైన జలచరాలు తిరుగుతున్నట్లుగా, ఇక్కడ అడవిలో రకరకాలైన వన్యమృగాలు పరుగులు పెడుతున్నాయి. శరత్కాలంలో వాయువు వేగానికి మేఘాలు పరుగులు పెట్టినట్లుగా, మన సేనలను చూసి వన్యమృగాలన్నీ పరుగులు

పెడుతున్నాయి.

"తమ్ముడా! దక్షిణదేశీయులు కాటుక కొండల్లాంటి తమ నల్లని జుత్తును రకరకాలుగా చుట్టలుచుట్టుకొని కొప్పునిండా పువ్వులు పెట్టుకొంటారు. అట్లా ఈ పర్వత సానువుల్లోని చెట్ల చిటారు కొమ్మలన్నీ గుత్తులు గుత్తులుగా పువ్వులు పూసి వారి కొప్పుల్ని తలపింప జేస్తున్నాయి. ఈ అరణ్యం ఇంతవరకూ నిర్జనారణ్యమైతే ఇకనుండి మన సైన్యం రావటం వల్ల జనాకీర్ణమైపోయింది. మన అయోధ్యానగరం లాగానే కనిపిస్తోంది. మన రథాలు, గుర్రాలు, ఏనుగులు సైనికుల త్రొక్కిడి వలన దుమ్మూధూళీ ఆకాశం ఎత్తున లేస్తోంది. అయినా వాయుదేవుడు మనకు సహాయం చెయ్యడం కోసం దూరంగా తరిమివేస్తున్నాడు.

"తమ్ముడూ! మన రథాలు రాముణ్ణి చూడాలనే కుతూహలంతో వేగంగా పరుగెత్తుతున్నాయి. ఆ వేగానికి భయపడిన నెమళ్ళు ఫించాలు దింపుకొని తమ స్థావరాలకు పరుగెడుతున్నాయి. తమ్ముడూ! ఈ బాట నాకు ఎంతో మనోహరంగా ఉంది. ఈ ప్రాంతాల్లో మునీశ్వరులు ఎంతోమంది తపస్సు చేసుకొంటూ ఉంటారు. చుక్కలున్న లేళ్లు, ఆడలేళ్లతో కూడినవై పుష్పాలతో చిత్రించ బడినట్లుగా మనోజ్ఞరూపాలతో ఈ అరణ్యంలో విహరిస్తున్నాయి. చూసేవారికి పూలు అద్దినట్లు కనిపిస్తున్నాయి. "తమ్ముడూ! ఈ నదీతీరాన మన సేనలకు కొద్దిగా విశ్రాంతి ఇద్దాం. ఈ లోపుగా కొంతమంది యోధులు నాలుగుమూలలా వెదకి సీతారామలక్ష్మణులుండే చోటు కనుగొని వస్తారు."

భరతుని ఆజ్ఞను శిరసావహించి కొంతమంది సైనికులు అడవిలో నాలుగు మూలలకూ పోయారు. వారిలో కొందరు వచ్చి, "ప్రభూ! ఈ ప్రక్కనుండి ఆకాశంలో పొగలు రావడం చూశాం. నిప్పు లేకుండా పొగరాదు గదా? అదీకాక ఈ అడవిలో ప్రతినిత్యమూ అగ్నిహోత్రం చేసేవారు ఉండొచ్చు గదా? కాబట్టి ఆ దిశగా మనం ముందుకు పోతే తప్పక సీతారామలక్ష్మణులను చూడగలం. ఒకవేళ వారక్కడ లేకపోయినా, నిత్యమూ అగ్నిహోత్రం చేసే మునీశ్వరులైనా అక్కడ ఉండి ఉంటారు. వారిని విచారించినా కూడా మన రామప్రభువు జాడను

చెప్పగలరు" అన్నారు.

భరతుడికి ఆ మాటలు సబబుగానే తోచాయి. వసిష్ఠ మహర్షిని, కొందరు మంత్రులను వెంటబెట్టుకొని భరతుడు ఆ ప్రాంతానికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. తక్కిన రాజోద్యోగులను, సైన్యాన్ని అక్కడే ఉండమని ఆజ్ఞాపించి సీతారామలక్ష్మణులను వెదకుతూ బయలుదేరాడు. భరతుడితోపాటు వసిష్ఠాది మంత్రులు కూడా ఆ పొగవచ్చే ప్రాంతాన్ని పరిశీలనగా చూస్తూ ముందుకు సాగారు.

# 94వ సర్గ చిత్రకూట పర్వత శోభ

సీతారామలక్ష్మణులు వనవాసం ప్రారంభించి నెలరోజులు కావస్తోంది. వారు చిత్రకూట పర్వతం పైన నివసించటం మొదలైన నాటి నుండి దేవతలతో సమానుడైన రాముడు వనాలలో నివసించటానికి అలవాటు పడటమే కాకుండా, వనాల అందచందాలను కూడా ఇష్టపడటం ప్రారంభించాడు. అందువల్ల అతడికి చిత్రకూట పర్వతంపై జీవించడం నిత్యనూతనంగా ఉంటోంది. ఆ ప్రకృతిశోభను తాను ఆస్వాదించడమే కాకుండా సీతాలక్ష్మణులకు కూడా చూపించి ఆనందిస్తున్నాడు.

రాముడు: ఓ సీతా! ఈ సుందరమైన పర్వతంపైన ఉండటం వలన మనం రాజ్యం పోగొట్టుకున్నామని గానీ, బంధువులకు దూరమైనామనిగానీ బాధ కలగటం లేదు. ఈ పర్వతంపైన పక్షులు మనోహరంగా ఎలా పాటలు పాడుకుంటున్నాయో చూడు! ఈ పర్వతాలన్నీ మణులు, మాణిక్యాలు, రత్నాలు వంటి వివిధ ధాతువులతో నిండి ఉంటాయి. ఆ పర్వతశిఖరాలు ఎలా ఆకాశంలోకి చొచ్చుకొనిపోతున్నాయో చూశావా? ఈ పర్వతం మీద అడవి అంతా దట్టంగా ఉంది. ఆ దట్టమైన అడవి నిండా పులులు, చిరుతపులులు, ఎలుగుబంట్లు మొదలైన అనేక జంతుజాలం శత్రుత్వాన్ని మరచి భయం లేకుండా తిరుగుతున్నాయి.

ఇక వృక్షసంపద గూర్చి చెప్పవలసిన పనేలేదు. ఎన్ని రకాలైన వృక్షాలు, ఎన్ని ఫలజాతులు, ఎన్ని పుష్పజాతులు. ఈ ఫలపుష్పాలపై నుండి వీచే గాలితో వాతావరణం యావత్తు సువాసనలతో గుబాళిస్తోంది. ఇక్కడి మామిడి, నేరేడు, వేగిస, లొద్దుగ, మోరటి, పనస, చంద్ర, ఊడుగు, తినిసము, పేము, ఏరుమద్ది, దానిమ్మాది వృక్షజాతులతో ఈ ప్రాంతం శోభాయమానంగా ఉంది.

ఓ సీతా! ఈ పర్వతం మీద ఉత్తమమైన కిన్నెరలు జంటలు జంటలుగా విహరిస్తూ ఉన్నారు. అటు ఆ లోయకేసి చూడు. అట్లాగే శ్రేష్ఠమైన విద్యాధరులు వారి స్త్రీలు ఆ ప్రాంతాన

విహరిస్తున్నారు. చెట్ల కొమ్మలకు తగిల్చిన వారి ఖడ్గాలను, విలువైన వస్త్రాలను చూడు.

ఓ సీతా! ఈ పర్వతంపై నీరు ఎంత సమృద్ధిగా ఉందో చూశావా? కొన్నిచోట్ల ఏరులై ప్రవహిస్తోంది. కొన్నిచోట్ల భూమిని ఛేదించి పైకి ఉబికి రావడం చూస్తూ ఉంటే మదించిన ఏనుగు విడుస్తున్న మదోదకం లాగా ఉంది.

వాయుదేవుడు వివిధ రకాలైన ఫలపుష్పాల మీదుగా వీస్తూ లోయ అంతా సువాసనలు వెదజల్లుతున్నాడు. ఓ సీతా! నీతోను, లక్ష్మణునితోను కలసి నేను ఎన్ని సంవత్సరాలు ఇక్కడ నివసించినా దుఃఖం అంటే ఏమిటో తెలియకుండా గడిపివేయగలను. వీటన్నిటి మూలంగా నాకీ పర్వతం పట్ల అభిమానం పెరిగిపోతోంది. నేను ఇక్కడ సుఖంగా ఉంటూనే, తండ్రి ఋణాన్ని తీరుస్తున్నాను. భరతుడికి సంతోషాన్ని కలిగిస్తున్నాను. ఈ రెండు ప్రయోజనాలనీ ఒకేసారి పొందగలుగుతున్నాను సుమా!

ఓ సీతా! నాకు ఒక మాట చెప్పు. నీవీ చిత్రకూట పర్వతంపై ఆనందంగా ఉండగలుగు తున్నావా? రాజులకు మరణానంతరం ఉత్తమగతులు కలగాలంటే ఈ వనవాసం అమృతం వంటిదని నా పూర్వీకులైన రాజర్షులు చెప్పారు. ఈ చిత్రకూటమందు రకరకాలైన నీలం, పసుపు, తెలుపు, ఎరుపు రంగులతో కూడిన అనేక ధాతువులు లభిస్తున్నాయి. వాటి ప్రభావం చేత ఈ పర్వతప్రాంతమంతా రాత్రిళ్ళు కాంతివంతంగా ప్రకాశిస్తూ ఉంటుంది.

సీతా! ఈ చిత్రకూటం భూమిని చీల్చుకొని వస్తున్నట్లు కనిపిస్తోంది. కొన్నిచోట్ల పొదరిళ్ళలాగా ఉంది. కొన్నిచోట్ల ఉద్యానవనాల్లాగా ఉంది. ఇంకొన్ని చోట్ల ఏకశిలలమల్లే ఉంది. ఓ సీతా! అటు చూడు. ఇక్కడ కుష్ఠ, స్థగర, పున్నాగ, భూర్జర వృక్షాల ఆకులను, పద్మాల రేకులను పైన పరచి, మంచి పక్కగా చేసుకున్నారు. అక్కడ కాముకులు నలిపి పారవేసిన పద్మాలలో గుచ్చిన మాలలు, ఫలాలు గుట్టలు గుట్టలుగా పడి ఉన్నాయి. ఓ సీతా! నీతోను, లక్ష్మణునితోను ఇక్కడ విహరిస్తూ, సత్పురుషుల మార్గంలో జీవిస్తూ కులాన్ని, ధర్మాన్ని

కాపాడుకుంటూ ఆనందంగా గడిపేస్తాను.

# 95వ సర్గ సీతకు గంగానది శోభను వర్ణించి చెప్పటం

రాముడు సీతాదేవికి చిత్రకూట పర్వతశోభను వర్ణించి చెప్పిన తరువాత ఆమెతో కలసి విహారంగా పర్వతం దిగి మందాకినీ తీరానికి వెళ్ళాడు. పద్మాలవంటి కన్నులుగల రాముడు చంద్రుని వంటి ముఖం, సుందరమైన నడుం కలిగిన సీతాదేవితో మందాకినీశోభను గూర్చి ఇలా అన్నాడు:

ఓ సీతా! ఈ పవిత్ర మందాకినీ నదిని తిలకించు. రాజహంసలు, చక్రవాకాలు, సారస పక్షులు ఇంకా ఎన్నో మనోహరమైన పక్షులు ఆ ఇసుక తిన్నెలన్నింటినీ కప్పివేస్తున్నాయి. నదికి రెండు ప్రక్కలా ఉండే వృక్షాలన్నీ ఫలాలతోను, పుష్పాలతోను ఉండటం వల్ల కుబేరుడి సౌగంధికా సరస్సును మరిపించేట్లు చేస్తూన్నది. రేవులో దిగి నీళ్ళు త్రాగుతున్న లేళ్ళు, దుప్పులు నీటినంతా బురదలు చేస్తున్నవి.

ప్రియురాలా! నారచీరలు కట్టుకొని జటలు ధరించిన మునీశ్వరు లెందరో ఉభయసంధ్యలలోనూ ఈ పవిత్ర మందాకినీనదిలో స్నానాలు చేసేందుకు ఇష్టపడతారు. చేతులు పైకెత్తి సూర్య భగవానుని స్తుతిస్తూ ఉంటారు. ఎత్తైన పైభాగాన బాగా పండిపోయిన పూలు గాలివాటానికి రాలి కిందపడుతున్నాయి. అట్లా నేలపై రాలుతూ ఉంటే దేవతలు పుష్పవర్షం కురిపిస్తున్నట్లుగా ఉన్నది.

ఓ సీతా! మందాకినీనది కొన్నిచోట్ల నిండుగా నీరు నింపుకొని సూర్యకాంతి చేత మణులకాంతిలాగా మెరిసిపోతోంది. మరికొన్ని చోట్ల నీరు సన్నగిల్లి నది అంతా ఇసుకమేటలు వేసి ఉంది. ఆ ఇసుకతిన్నెలపైన సిద్ధులు కూర్చుని ఉపాసన చేస్తున్నారు. గాలికి ఎగిరివచ్చే పుష్పాలు వాళ్ళ తలలపై పడి వారిని పూజిస్తున్నట్లున్నది. మరికొన్ని నది మధ్యలో పడి నదితోపాటే వేగంగా కొట్టుకుపోతున్నాయి. అట్లా కొట్టుకుపోతున్న ఆ పూలపై చక్రవాక పక్షులు వాలి మధురంగా కూస్తున్నాయి.

ఓ మంగళస్వరూపిణివయిన సీతా! తపస్సు, ఇంద్రియనిగ్రహం కలిగి ప్రశాంతంగా జీవిస్తూ పాపాలన్నింటినీ తొలగించగల సిద్ధులంతా ఈ మందాకినిలో స్నానాలు చెయ్యడానికి ఇష్టపడతారు.

ఓ ప్రియురాలా! ఇటువంటి చిత్రకూటాన్ని, మంగళకరమైన మందాకినీ నదిని చూస్తూ ఉంటే అయోధ్యా నగరంలో కంటే ఇక్కడే ఎక్కువ ఆనందంగా ఉన్నామనిపిస్తోంది. లేచి రా! నాతోపాటు ఈ నదిలో దిగు. జలక్రీడలు చేస్తూ ఆనందిద్దాం.

సౌందర్యవతివైన ఓ సీతా! రా, అట్లా ఈదుకుంటూ నది మధ్య భాగానికి పోదాం. జలక్రీడలు చేస్తూ ఎర్రకలువలనీ, నల్లకలువ లన్నింటినీ నీటిలో మునిగిపోయేట్లు చేద్దాం. నా ప్రేయసివై నాతోపాటు నదిలోకి దిగు.

ఓ సీతా! అంతా మన మనసులోనే ఉంది. ఈ చిత్రకూటంలో తిరిగే మృగాలే పౌరులనుకో, ఈ చిత్రకూటమే అయోధ్య అనుకో, ఈ మందాకినియే సరయూనది అనుకో.

ఓ సీతా! ప్రేమపాత్రుడైన లక్ష్మణుడూ, ప్రియురాలివైన నీమా నన్ను ఆనందపరుస్తున్నారు. నీతో కలసి జీవించడం, నీతో కలసి మూడు సంధ్యలలోను ఈ నదిలో స్నానం చేయడం, నీతో కలసి తేనె, దుంపలు పండ్లు పంచుకొని తింటూ ఉంటే నాకు అయోధ్య మీదగాని, రాజ్యంపైనగాని బొత్తిగా ఆసక్తి కలగటం లేదు.

ఈ మందాకినీ జలాలను లేళ్ళు, దుప్పులు, సింహాలు, ఏనుగులు గుంపులు గుంపులుగా వచ్చి త్రాగి పోతున్నాయి. ఈ వనంలోని వృక్షాలన్నీ ఉద్యానవనాల్ని మరపిస్తున్నాయి. వృక్షాల పైనుండి రాలిన పూలన్నీ రకరకాల రంగులతో తివాచీలు పరచినట్లున్నాయి. సీతా! ఇట్లాంటి నదిని, ఈ పరిసరాన్ని చూసి ఆనందించనివాడెవడైనా ఉంటాడా?

రఘుకులదీపకుడైన రాముడు ఈ విధంగా మందాకినీశోభను గూర్చి తన ప్రియురాలైన

సీతమ్మ తల్లితో ముచ్చటించాడు.

## 96వ సర్గ భరతుని సేనను లక్ష్మణుడు చూడడం

రాముడు సీతాదేవికి చిత్రకూట పర్వతశోభను గూర్చి వివరించి చెప్పాడు. మందాకినీ శోభను గూర్చి తెలిపాడు. ఇప్పుడు వారిద్దరూ భోజనానికి కూర్చున్నారు. "ఓ సీతా! ఈ మాంసం బాగా వేగి ఉన్నది. బాగా రుచిగా ఉంటుంది. ముందు ఇది తిను. ఇది బాగా పరిశుభ్రం చేసింది. వేడిగా ఉన్నప్పుడే తిను" అంటూ ఆమెను చక్కగా అనునయిస్తూ తినిపించాడు.

రాముడు సీతాదేవితో కలసి కూర్చుని ఉండగా, భరతుడి సైన్యం చేస్తున్న శబ్దాలన్నీ గాలిలో కలసి రాముడి పర్ణశాల దాకా వినవస్తున్నాయి. ఆ శబ్దాలకు అలవాటు పడని పక్షులు, మృగాలు దిక్కుతోచక పరుగులు పెడుతున్నాయి. రాముడు కూడా ఈ శబ్దాలకు కారణం ఏమై ఉంటుందో ఊహించలేకపోయాడు. లక్ష్మణుణ్ణి పిలిచి, "లక్ష్మణా! రాజుగాని, రాజు సైన్యంగాని వేటాడేందుకు ఈ అరణ్యానికి వచ్చారా? లేక క్రూరమృగం ఏదైనా ప్రవేశించిందా? పోయి తెలుసుకొనిరా. ఈ పక్షులు, మృగాలు భయభ్రాంతమైపోతున్నాయి" అన్నాడు.

అంతట లక్ష్మణుడు బాగా పుష్పించి ఉన్న సాలవృక్షాన్నొకదాన్ని ఎక్కి నలుమూలలా పరికించి చూశాడు. ఉత్తరదిశగా చూశాడు. ఆ దిశ నుండి రథాలు, గుర్రాలు, ఏనుగులు, సైనికులతో కూడిన పెద్ద సేన తరలిరావడం చూశాడు. గుర్రాలు పూన్చిన పెద్దపెద్ద రథాలున్నాయనీ, ఆ రథాలపైన ధ్వజాలు కూడా ఉన్నాయనీ చెప్పాడు.

"అన్నా! నీవు నిప్పును చల్లార్చివెయ్యి. సీతమ్మతల్లిని పర్వత గుహలోనికి పంపు. ధనుస్సు తీసుకొని నారిని సంధించు. కవచం కూడా ధరించు. నేను సిద్ధంగానే ఉన్నాను" అన్నాడు.

రాముడు: లక్ష్మణా! ఆ సేన అంతా ఎవరిదని అనుకొంటున్నావు?

లక్ష్మణుడు (అమిత కోపంతో): అన్నా! ఆ సైన్యం మరెవరిదో అయి ఉండదు. కైకేయీ కుమారుడైన భరతుడే రాజ్యాభిషేకాన్ని చేసుకొని, మన ముగ్గురనూ చంపి తన మార్గానికి అడ్డు

తొలగించుకోవాలని గొప్ప సైన్యాన్ని వెంటబెట్టుకొని వస్తున్నాడు.

కాంతివంతమైనది, అతి విశాలమైనది అయిన ఆ రథంపైన కోవిదార వృక్ష చిహ్నమైన ధ్వజం ప్రకాశిస్తోంది. సైనికులు, గుర్రాలు, ఏనుగులు ఆ రథాన్ని అనుసరించి వస్తున్నాయి.

కనుక సోదరా! మనం ధనుస్సు చేతబట్టుకొని పర్వతశిఖరంపై నుండి అయినా ఎదిరిద్దాం. లేదా కవచం ధరించి ఇక్కడే ఎదుర్కొందాం.

అన్నా! ఈ కోవిదార ధ్వజం యుద్ధంలో మనకు స్వాధీనం కావాలని కోరుకొంటున్నాను. నీకూ, సీతకూ, నాకూ దుఃఖాన్ని కలిగించిన ఆ భరతుణ్ణి ఎదుర్కొందాం. నీవు ఎవరి మూలంగా రాజ్యాన్ని కోల్పోయావో అటువంటివాడు చంపదగినవాడే.

ఓ రామా! భరతుణ్ణి చంపటం దోషమని నేను భావించడం లేదు. ఎవరివల్ల అపకారం పొందామో అటువంటివారు యుద్ధంలో ఎదురుపడితే చంపవచ్చు. అందులో అధర్మం కించిత్తుకూడా లేదు. అతడే ముందుగా నీ రాజ్యాన్ని కాజేశాడు. నీవు ధర్మానికి కట్టుబడి వనవాసం చేస్తున్నావు. నిన్ను వెతుక్కుంటూ సైన్యంతో అతడే నిన్ను ఎదుర్కోవడానికి వస్తున్నాడు. అటువంటి వాడిని చంపి తరువాత ఈ భూమినంతా పరిపాలించు.

అన్నా! అధర్మంగా రాజ్యాన్ని కాజేయాలని కుట్రపన్నిన కైకేయి, మొదలు నరికిన వృక్షంలాగా చచ్చిపడి ఉన్న భరతుణ్ణి చూసి గుండెలు పగిలేట్లు విలపించాలి. బంధుపరివారంతో ఉన్న ఆ కైకేయిని నేను స్వయంగా చంపుతాను. దాంతో భూమికి దాపురించిన పాపం అంతా తొలగిపోతుంది.

రామా! మనకు జరిగిన అన్యాయాన్ని, కోపాన్ని ఇంతకాలం అణచిపెట్టుకున్నాను. ఇప్పుడు నా కోపాగ్ని చేత భరతుని సైన్యాన్నంతా కాల్చి బూడిద చేస్తాను. ఈ చిత్రకూటారణ్యానికి రక్తతర్పణం ఇస్తాను. నాచే చంపబడిన ఏనుగులు, గుర్రాలు, మనుష్యులను క్రూరమృగాలు

ఆహారంగా స్వీకరిస్తాయి గాక! నేడు భరతుని సైన్యాన్ని చంపి నా ధనుర్బాణాల ఋణాన్ని తీర్చుకుంటాను. ఇది సత్యం.

## 97వ సర్గ రాముడు లక్ష్మణుని శాంతపరచడం

రాముడు: సోదరా! లక్ష్మణా! శాంతించు. తొందరపడకు. మహాబుద్ధిశాలి అయిన భరతుడే స్వయంగా వస్తున్నప్పుడు మనకు ధనుస్సుతోగానీ, కత్తితోగానీ ఏం పని ఉంటుంది? బంధువుల్ని, మిత్రుల్ని చంపుకుని సంపాదించే రాజ్యం నాకు విషంతో సమానం.

ఓ లక్ష్మణా! నేను రాజ్యాభిషేకానికి అంగీకరించింది కూడా మీ కోసమే కాని నా కోసం కాదు. ధర్మంకాని, అర్థంకాని, కామంకాని, ఈ రాజ్యం కానీ మీ అందరి సుఖసంతోషాల కోసమే కావాలని అన్నాను. కానీ నా ఒక్కడి కోసం కాదు. ఇది నా ఖడ్గం మీద ప్రమాణం చేసి చెబుతున్నాను. నేను రాజ్యాన్ని కోరుకున్నది సోదరులైన మిమ్మల్నందరినీ కూడగట్టుకొనేందుకు, మీ సుఖం కోసమేనని ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాను.

లక్ష్మణా! నేను కావాలనుకొంటే ఈ సమస్త భూమండలాన్నీ నా ఆధిపత్యంలోకి తెచ్చుకోగలను. అధర్మంతో వచ్చే ఇంద్రపదవిని కూడా నేను ఇష్టపడను.

లక్ష్మణా! భరతుడు, నీవు, శత్రుఘ్నుడు అనుభవించని సుఖాన్ని కించిత్తు అయినా నేను కోరుకోను. ఒకవేళ అటువంటి కోర్కె ఉంటే దాన్ని అగ్నిలో కాల్చి భస్మం చేస్తానేగాని అనుభవించను. ఇది సత్యం.

ఓ వీరుడా! నాకు ప్రాణం కంటే ప్రియమైనవాడూ, సోదరులందరి పట్ల ప్రేమగలవాడూ అయిన భరతుడు అయోధ్యకు తిరిగి వచ్చి ఉంటాడు. నేను, జటావల్కలధారినై నీతోనూ, సీతతోనూ వనవాసానికి పంపబడినట్లు తెలుసుకొని ఉంటాడు. ధర్మాత్ముడైన భరతుడు పెద్దకొడుకే రాజ్యాధికారాన్ని పొందాలనే కులాచారం తెలిసినవాడవటం చేత, ఎంతో దుఃఖించి ఉంటాడు. వ్యాకులత చెందిన మనస్సు గలవాడై మనల్ని చూసేందుకు సేనలను, పరివారాన్ని వెంటబెట్టుకొని వస్తున్నాడని నాకు అనిపిస్తోంది. యుద్ధానికి కాదని నా నిశ్చితాభిప్రాయం. తల్లి

కైకేయీదేవికి కలిగిన దుష్టమైన ఆలోచనకు ఆమెను దూషించి తిరిగి నాకు రాజ్యాభిషేకాన్ని చేయించేందుకు తండ్రిగారిని ఒప్పించి నా కోసం వస్తున్నాడని అనుకొంటున్నాను. ఎందుకంటే, భరతుడికి నాపట్ల ఉన్న ప్రేమ, ధర్మబుద్ధి నేను చక్కగా ఎరుగుదును.

లక్ష్మణా! భరతుడు ఈ సమయంలో ఇక్కడకు రావడం మంచిదే. మనకు కష్టం కలిగించే ఆలోచన కూడా అతడి మనస్సులోనికి రానీయడు. భరతుని ధర్మశీలం గూర్చి నాకు బాగాతెలుసు. ఇంతకు పూర్వం ఎప్పుడైనా భరతుడు మనకు ఏ చిన్న కష్టమైనా కలిగించాడా? కనీసం అటువంటి అనుమానాన్ని కూడా మనకు కలిగించలేదే! అటువంటి ధర్మపరాయణుడైన మన సోదరుణ్ణి శంకించడం ఏమీ బాగాలేదు. నీవు భరతుణ్ణి ఏమైనా పరుషమైన మాటలతో బాధపెట్టినట్లయితే అవన్నీ నన్ను అన్నట్లుగానే భావిస్తాను.

లక్ష్మణా! లోకంలో ఎక్కడైనా తండ్రే తన పుత్రుణ్ణి చంపుకుంటాడా? సోదరుడు తన ప్రాణసమానుడైన సోదరుని చంపుకుంటాడా? ఒకవేళ నీవు రాజ్యం కోసమే ఇంత కఠినంగా మాట్లాడుతూ ఉంటే, ఈ రాజ్యాన్ని లక్ష్మణుని కిమ్మని భరతుడితో చెబుతాను. నేను చెబితే భరతుడు ఎన్నడూ నా మాట కాదనడు. మారుమాట్లాడకుండా ఒప్పుకుంటాడు.

రాముడి సుఖమే తన సుఖమనుకొనే లక్ష్మణుడు, రాముని నోటి నుండి ఇటువంటి మాటలు వినటంతో సిగ్గుతో కుంచించుకుపోయాడు.

లక్ష్మణుడు: అన్నా! నిన్ను తీసుకొని వెళ్ళేందుకు దశరథ మహారాజే స్వయంగా వస్తున్నాడని అనుకొంటున్నాను.

రాముడు: ఇక్కడ మనిద్దరం వనవాసంలో కష్టపడుతున్నామని తలచి తిరిగి అయోధ్యకు రమ్మని బలవంతపెట్టవచ్చు. మనం ఆయన కోరికను తిరస్కరించినట్లయితే, సీతనైనా అయోధ్యకు పంపమని అడుగవచ్చు.

లక్ష్మణుడు: సోదరా! ఉత్తమ జాతియందు పుట్టినవి, మహావేగంతో పరుగెత్తేవీ అయిన రెండు అశ్వాలు, ముందు వరుసలో ఉన్నాయి. మన తండ్రిగారు ఉపయోగించే 'శత్రుఞ్జయ' మనే గజరాజు సైన్యమధ్యంలో హుందాగా నడచివస్తోంది చూశావా! అన్నా! ఆ ఏనుగుపై ఎప్పుడూ తెల్లటి ఛత్రం అమర్చబడి ఉండేది గదా! ఎందువల్లనో ఆ శ్వేతఛత్రం కనిపించడం లేదు. నాకేదో అనుమానంగా ఉంది.

అప్పుడు రాముడు తమ్ముడు లక్ష్మణుని చెట్టు దిగి రమ్మన్నాడు. వెంటనే లక్ష్మణుడు చెట్టుదిగివచ్చి అన్నగారి ఎదుట నిలబడ్డాడు. వారిద్దరూ, భరతుడి చతురంగబలాలన్నీ అక్కడికి ఒకటిన్నర యోజనాల దూరంలో విడిదిచేసి ఉండటం చూశారు.

# 98వ సర్గ భరతుడు, వసిష్ఠుడు వచ్చి రాముణ్ణి చూడబోవడం

భరతుడు తన సైన్యాన్నంతా కాస్త దూరంలో నిలబెట్టాడు. తామంతా రాముడి వద్దకు కాలినడకనే వెళ్ళాలని నిశ్చయించాడు.

భరతుడు: తమ్ముడా! శత్రుఘ్నా! నీవు పోయి నిషాదులను, గుహుడిని వెంటబెట్టుకొనిరా. గుహుడితో తన బంధువుల్ని వెయ్యిమందిని తీసుకొని రామలక్ష్మణులకోసం వెతకమని చెప్పు. మన గురువైన వసిష్ఠులు, బ్రాహ్మణోత్తములు, అమాత్యులు, కొంతమంది పౌరులు మన వెంట వస్తారు. రాముణ్ణి చూసేవరకూ నాకు మనశ్శాంతి ఉండదు. రాముణ్ణి చూడందే నాకు ఆనందమే లేదు.

రాముడికి అరికాళ్ళల్లో ధ్వజం, వజ్రం, కమలం, అంకుశం, అమృతకలశ చిహ్నాలు ఉంటాయి. ఇవన్నీ రాజలక్షణాలు. ఈ ఇక్ష్వాకువంశానికి కోసలదేశానికి రాజు కాదగినవాడు. రాముడికి రాజ్యాభిషేకం జరిగేవరకూ నా మనస్సు స్తిమితపడదు. చంద్రబింబంవంటి ముఖం, పద్మపత్రాల వంటి నేత్రాలుగల రాముణ్ణి చూసేవరకూ నాకు శాంతియే లేదు. నేను వెంటనే నా అన్నగారి పాదాలపై నా శిరస్సు వంచి నమస్కరించాలి.

కుబేరుడు చైత్రరథమనే తన ఉద్యానవనాన్ని వదలి నందనోద్యాన వనానికి పోయినట్లు రాముడు అయోధ్యను వదలి ఈ చిత్రకూటంపై విడిది చేశాడు. సీతారాములు చిత్రకూటానికి రావటం వల్ల, పార్వతీ పరమేశ్వరులుండే హిమవత్పర్వతంతో ఇది సమానమైన పుణ్యక్షేత్రమైంది. క్రూరమృగాలతో నిండిన ఈ వనం రాముడి రాకతో ఎంతో పుణ్యం చేసుకుంది.

రాముణ్ణి గురించే తలచుకొంటూ భరతుడు పూలచెట్లతో విరగబూసిన ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ దారే కానరాలేదు. ఏం చేయాలో తోచలేదు. అప్పుడు సమీపాన ఉన్న సాలవృక్షాన్నొకటి ఎక్కి నాలుగు ప్రక్కలా కలయచూశాడు. చివరకు ఒక ప్రక్క రాముడి ఆశ్రమం

కనిపించింది. అక్కడ అగ్నిహోత్రం వెలుగుతోంది. దాంట్లో నుండి పొగలు కూడా వస్తున్నాయి. అంతే, అదే రాముని ఆశ్రమమయి ఉంటుందని నిశ్చయించుకున్నాడు. భరతుని నోట ఆ మాట వినగానే అంతా ఆనందపరవశులయ్యారు. మహాసముద్రంలో నుండి ఎట్లాగో కష్టపడి ఒడ్డుకు చేరుకున్నట్లుగా భరతుడు పరవశుడైపోయాడు.

# 99వ సర్గ భరత శత్రుఘ్నులు రాముని ఆశ్రమానికి చేరడం

భరతుడు తన సేనలన్నింటినీ అక్కడే నిలచిపొమ్మన్నాడు. వసిష్ఠ మహర్షిని వెళ్ళి తన తల్లులు ముగ్గురనూ వెంటబెట్టుకు రమ్మని ప్రార్థించాడు. గుహుణ్ణి తన బంధుజనంతో తోడు తీసుకొని బయలుదేరాడు. భరతశత్రుఘ్నులు వారి వెనకాలే బయలుదేరారు. ఆ చుట్టుపట్ల చాలామంది తాపసులు ఆశ్రమాలు నిర్మించుకొని తపస్సు చేసుకుంటున్నారు. వాళ్ళంతా అట్లా కొంత దూరం వెళ్ళిన తర్వాత అల్లంత దూరాన రాముడి ఆశ్రమం చూశారు. భరతుడు చిత్రకూటం వైపుగా వెళుతూ దారిలో మందాకినీనదిని సమీపించాడు.

భరతుడు: అమాత్యులారా! రాముడు లోకానికి ప్రభువు. జనులను కాపాడేవాడు. అటువంటి రాముడు నేలపై పడుకుంటున్నాడు గదా! ఇదంతా నా వల్లనే గదా! అటువంటి నా జీవితం వ్యర్థమని తలుస్తాను. లోకమంతా నన్ను దూషిస్తూనే ఉంది. నేను సీతారాముల పాదాలపైపడి మన్నించమని కోరుకుంటాను.

చివరకు వారంతా రాముని ఆశ్రమానికి చేరగలిగారు. అది విశాలమైన పర్ణశాల. చాలా ఎత్తులో కట్టారు. పైన తాటాకులతో కప్పువేశారు. లోపల పర్ణశాలలోని యజ్ఞశాలలో దర్భలు పరచి ఉన్నాయి. శత్రుసంహారం చేసే రెండు ధనుస్సులు పర్ణశాలలో వ్రేలాడదీశారు. మహాశక్తిమంతమైన ఆ ధనుస్సులు ఇంద్రుని వజ్రాయుధం కన్నా బలమైనవి; బరువైనవి. అంబులపొదిలోని బాణాలు బంగారుకాంతులతో మెరుస్తున్నాయి. ఆ బాణాలన్నీ భోగవతీపురంలోని సర్పాల్లాగా తళతళ మెరుస్తు న్నాయి. బంగారు ఒరలలో ఖడ్గాలు ఉన్నాయి. ఒరలకు పొదిగిన రత్నాలు, మణులు మెరుస్తున్నాయి. ఆ పర్ణశాలలోనికి ఎవరూ ప్రవేశించే సాహసం చేయరు. ఈశాన్యమూల కొంచెం పల్లంగా ఉంది. దాంట్లో అగ్నిహోత్రం రాత్రింబవళ్ళు భగభగ మండుతూనే ఉంటుంది. భరతాదులంతా ఆ పర్ణశాలలోనికి పోయారు.

రాముడు ఆ పర్ణశాలలో జటాధారియై కూర్చున్నాడు. కృష్ణాజినాన్ని, నారవస్త్రాలు ధరించి

ఉన్నాడు. సింహం వంటి మూపురం గలవాడూ, దీర్ఘమైన బాహువులు గలవాడూ, పద్మాల వంటి నేత్రాలు గలవాడూ, సమస్త భూమండలానికి అధిపతీ అయిన రాముడు బ్రహ్మదేవుడిలాగా స్థిరంగా కూర్చున్నాడు. సీతా లక్ష్మణులు ఇద్దరూ చెరో ప్రక్కా కూర్చుని ఉన్నారు. వారంతా నేలమీద దర్భలు పరచి ఆ దర్భలపై కూర్చుని ఉన్నారు.

ధర్మాత్ముడైన భరతుడు రాముణ్ణి చూడగానే పొంగిపొర్లే దుఃఖంతో అతడి వైపు పరుగెత్తుకొనిపోయాడు. నోట్లో నుంచి మాటలు పెగల్లేదు. ఎట్లాగో గద్గదస్వరంలో ఇలా అన్నాడు.

భరతుడు: రాజసభల్లో మంత్రులతో సభ చేసి కూర్చోవలసినవాడు ఇక్కడ అడవిలో ఒంటరిగా నేలపై కూర్చున్నాడు. పూర్వం చీనీచీనాంబరాలతో రకరకాలైన దుస్తులు ధరించిన వాడు ఇప్పుడు నారవస్త్రాలు ధరించాడు. అయోధ్యలో శిరోజాలను పూలతో అలంకరించుకొనేవారు. కానీ ఇక్కడ జుట్టంతా జటలు కట్టి తైలసంస్కారం లేకుండా ఎలా ఉండగలుగుతున్నాడో గదా! రాముడు వేదోక్తంగా ఎప్పుడూ యజ్ఞాలు చేస్తూ ఉండేవాడు. అటువంటి వాడు ఈనాడు శరీరాన్ని శుష్కింపచేయటమే ఒక యజ్ఞంగా పెట్టుకున్నాడు. విలువైన చందనాది సుగంధాలను అలదుకొనే నా అన్నగారి శరీరం అంతా నేడు దుమ్ముధూళితో నిండి ఉంది. రాజభోగాలకు అలవాటుపడిన రాముడు నా మూలంగా కష్టపడుతున్నాడు. లోకం నన్ను క్రూరుడుగా నిందిస్తుంది. ఆ మాటలన్నీ పడుతూ జీవిస్తేనేం, మరణిస్తే ఏం?

భరతుడు ఈ విధంగా దుఃఖీస్తూ రాముడి పాదాలను సమీపించక ముందే నేలపైపడి మూర్ఛపోయాడు. కంఠం పూడుకుపోయింది. నోట్లో నుంచి మాట రావడం లేదు. అతికష్టం మీద "ఓ ఆర్యా!" అనగలిగాడు. ఆ పైన ఇంకా ఏమీ మాట్లాడలేకపోయాడు. శత్రుఘ్నుడు కూడా రాముడి పాదాలపై పడి ఏడ్చాడు. సీతారామలక్ష్మణుల పాదాలకు నమస్కరించారు. అప్పుడు రాముడు వారిని లేవనెత్తి కౌగలించుకున్నాడు. రాముడు కూడా వారితోపాటు కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

ఆకాశంలో సూర్యచంద్రుల్ని శుక్ర బృహస్పతులు కలుసుకొన్నట్లుగా రామలక్ష్మణుల్ని గుహుడు, సుమంత్రుడు కలుసుకున్నారు.

ఆ మహారణ్యంలో గజరాజులాగా తమ్ములను కలుసుకొని ఆలింగనం చేసుకొంటూ ఉంటే ఋషుల కళ్లుకూడా ఆర్ద్రమైనాయి.

# 100వ సర్గ శ్రీరాముడు భరతునికి రాజనీతి ఉపదేశించడం

రాముడు తన పాదాల ముందు తెలివితప్పి పడి ఉన్న భరతుణ్ణి చూసి ముందు గుర్తించలేక పోయాడు.ఎందువల్లనంటే, ప్రళయకాల సూర్యుడి లాగా ఉండే భరతుడి ముఖం అంతా మాడిపోయి, కృశించి కళావిహీనమైపోయింది. పైగా నారవస్త్రాలు కట్టుకున్నాడు. తలంతా జటలు కట్టి ఉన్నాయి. అటువంటి భరతుణ్ణి రాముడు భుజాలు పట్టుకొని లేవనెత్తి కౌగలించుకొని శిరస్సు వాసన చూసి తన ప్రక్కనే కూర్చోబెట్టుకున్నాడు.

రాముడు: సోదరా! వృద్ధుడైన తండ్రిని ఒంటరిగా వదలి నువ్విప్పుడు ఇక్కడకు ఎందుకు వచ్చావు? తండ్రిగారూ తల్లులందరూ క్షేమమే కదా? నీ శరీరం ఇలా కృశించి ఉన్నదేమిటి? చాలాకాలం తర్వాత నిన్ను చూస్తున్నాను. సంతోషంగా ఉంది.

సోదరా! సత్యప్రతిజ్ఞావంతుడు, రాజసూయాది యజ్ఞాలు చేసినవాడు, ధర్మాత్ముడు అయిన దశరథ మహారాజు కుశలమే కదా? పరాక్రమవంతుడైన తండ్రికి శుశ్రూషలు చేస్తున్నావు కదా? నీవు చిన్నవాడవని రాజు కాకుండా ఎవరైనా అడ్డగిస్తున్నారా? తరతరాల నుండి మన అనుభవంలో ఉన్న రాజ్యాన్ని కోల్పోలేదుగదా? దశరథ మహారాజు దుఃఖంతో మరణించలేదుగదా? నీవిప్పుడు అరణ్యాలకు ఎందుకు వచ్చావు?

నాయనా! విద్యావంతుడు, ధర్మనిరతుడు, ఇక్ష్వాకులకు పురోహితుడు అయిన వసిష్ఠ మహర్షిని పూజిస్తున్నావు గదా? వినయసంపన్నుడు, శాస్త్రజ్ఞానం గలవాడు, అసూయారహితుడు, కర్తవ్యాన్ని సమయోచితంగా బోధించేవాడు, వసిష్ఠుని కుమారుడు అయిన సుయజ్ఞుని గౌరవిస్తున్నావా?

సోదరా! మన తల్లులు కౌసల్యాదేవి, సుమిత్రాదేవి, కైకేయీదేవి తక్కిన తల్లులూ క్షేమమే కదా? శ్రద్ధతో హోమాలన్నీ సమయం తప్పకుండా చేస్తున్నావు కదా?

నాయనా దేవతలను, తల్లులను, తండ్రిని, గురువును, వృద్ధులను, వైద్యులను, బ్రాహ్మణులను పూజిస్తున్నావు గదా?

రాజనీతిశాస్త్రంలో నిష్ణాతుడైన సుధన్వుని గౌరవిస్తున్నావా? నీతో సమానులైనవారు, జితేంద్రియులు, విద్యావంతులైన వారిని మంత్రులుగా నియమించుకున్నావు గదా? రహస్యాలన్నింటినీ జాగ్రత్తగా కాపాడేవాళ్ళను ఎంపిక చేసుకొని మంత్రులుగా చేసుకోవాలి. అప్పుడే రాజు క్షేమంగా ఉంటాడు.

ఏ కాలంలో చెయ్యాల్సిన పనులు ఆయాకాలాల్లో క్రమం తప్పకుండా చేస్తున్నావు కదా? అతిగా నిద్రపోవడం లేదుగదా? మంచి నిర్ణయాలు తీసుకోవలసిన విషయాల గూర్చి తెల్లవారుజాముల్లోనే ఆలోచిస్తున్నావు గదా? నీ ఆలోచనలు ముందుగానే రాజ్యంలో అందరికీ తెలిసిపోవటం లేదుగదా? తక్కువ శ్రమతో ఎక్కువ ఫలితాలు పొందే ఆలోచనలే చేస్తున్నావు కదా? నీవు తలపెట్టే కార్యాలన్నీ పూర్తిగా అమలయ్యాకనే తక్కిన రాజులకు తెలిసేట్లుగా జాగ్రత్తలు తీసుకుంటున్నావు గదా?

వెయ్యిమంది మూర్ఖులను వదిలేసి ఒక్క విద్వాంసుడికి ఆశ్రయం ఇస్తూ ఉండు. ఎందుకంటే విపత్కర పరిస్థితుల్లో సహాయపడేవాళ్లు పండితులే సుమా! ప్రభువు చిన్నవాడే అయినా, మంత్రి సమర్థుడైతే గొప్ప అభివృద్ధిని సాధించిపెడతాడు. వారివారి సామర్థ్యాన్ని చక్కగా అంచనా వేసుకొని సేవకులను ఆయా కార్యాలకు ఉపయోగించుకోవాలి. రహస్యాలను కాపాడేవాళ్ళు, తరతరాలుగా రాజసేవ చేస్తున్నవాళ్ళు, శ్రేష్ఠమైన చరిత్ర కలవాళ్ళనే మంత్రులుగా నియమించుకో. (అంటే ధనం, స్త్రీ మొదలైన ప్రలోభాలకు లొంగని చరిత్ర గలవారు) సదాచార సంపన్నులైన ఋత్విక్కులు నీచమైన దానాలు గ్రహిస్తున్నవారిని, అవమానిస్తున్నట్లుగాను, కాముకులను స్త్రీలు అవమానిస్తున్నట్లుగాను, నిన్ను నీ మంత్రులు చులకన చేసి మాట్లాడటం లేదు కదా? అధికారదాహంతో రాజు అంతరంగ సేవకుల్లో విభేదాలు కల్పించేవాణ్ణి వెంటనే వధించాలి. అలా చెయ్యకపోతే రాజే నశించిపోతాడు.

తృప్తికలవాడిని, ధైర్యవంతుణ్ణి, నిజాయతీపరుణ్ణి, రాజభక్తి గలవాణ్ణి సేనాధిపతిగా నిర్ణయించుకున్నావు గదా? బలవంతులు, పూర్వం ఎన్నో విజయాలు సాధించినవాళ్ళు, శూరులు అయిన వాళ్ళను సత్కరించి గౌరవిస్తున్నావు గదా? సైన్యానికి తగినన్ని ఆహారపదార్థాలు, తగినంత జీతాలు సరైన సమయంలో అందిస్తున్నావు గదా?

స్వదేశంలో పుట్టిన వాడిని, విషయాలన్నీ బాగా తెలిసిన వాడిని, సమర్థత, సమయస్ఫూర్తి ఉన్నవాడిని, యథార్థమే మాట్లాడేవాడిని దూతగా నియమిస్తున్నావు గదా?

మంత్రులు, పురోహితులు, యువరాజు, సేనాపతి, ద్వారపాలకులు, అంతఃపురాధికారులు, కారాగారాధికారులు, ధనాగారాధ్యక్షులు, కార్యనిర్వహణాధికారులు, న్యాయాధికారులు, సేనానాయకులు, నగరాధ్యక్షులు, కార్యనిర్వాహకులు, సభాధికృతులు, ధర్మాధికారులు, దండపాలురు, దుర్గపాలురు, రాష్ట్రపాలకులు, అనేవి శత్రుపక్షంలోని పద్దెనిమిది తీర్థాలు. ఒక్కొక్క దానిలో ముగ్గురేసి గూఢచారులను నియమించి, ఆయా శాఖలు చేసే కార్యకలాపాలను (సమీక్షించాలి) రాజు తెలుసుకోవాలి. అలాగే, తన రాజ్యంలోని మంత్రి, పురోహితుడు, యువరాజు తప్ప మిగిలిన పదిహేను తీర్థాలలో జరిగే కార్యకలాపాలను తెలుసుకోవటానికి ముగ్గురేసి గూఢచారులను నియమించాలి.

ఓ శత్రుసంహారకుడా! నీ చేతిలో ఓడిపోయిన శత్రువులను బలహీనులని నిర్లక్ష్యం చేయవద్దు. బ్రాహ్మణులే అయినా ఇహాన్ని గూర్చే ఆలోచించే వారిని దూరంగా ఉంచుకో. వాళ్ళు నాస్తికులతో సమానం. ఇటువంటి పండితులు కుతర్కాలతో వేదవిరుద్ధంగా మాట్లాడతారు. అందుచేత వారిని నీ దగ్గరకు రానియ్యకు.

నాయనా! మన నగరం బహుపురాతనమైనది. శత్రు దుర్భేద్యమైనది. అందువల్లనే మన నగరానికి 'అయోధ్య' అనే పేరు సార్థకమైంది. జితేంద్రియులు, కర్మలయందు ఆసక్తి గలవారు, పూజ్యులు అయిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు, శూద్రులు అనేకమంది నివసిస్తున్నారు. అనేక

రాజభవనాలు గలదీ, పండితులతో క్రిక్కిరిసిపోయి ఉన్నదీ సర్వసమృద్ధికరమైనదీ అయిన మన అయోధ్యానగరాన్ని జాగ్రతగా కాపాడు.

దేశం నిండా దేవాలయాలు – చలివేంద్రాలు, చెరువులు ఉండేట్లుగా చూడు. భూముల కోసం తగాదాలు రాకుండా ఉండేందుకు సరిహద్దులో రాళ్ళు పాతించు. స్త్రీ పురుషులంతా సుఖసంతోషాలతో ఉండేట్లు చూసుకో. భూములన్నీ చక్కగాదున్ని పంటలు పండించేట్లు చూసుకో. క్రూరమృగాలు ఊళ్ళ మీద పడకుండా గట్టికావలి ఏర్పాటు చెయ్యి. దొంగలకు, పాపాత్ములకు దేశంలో చోటు లేకుండా చెయ్యి. మన పూర్వీకుల నుండీ కాపాడుకుంటూ వస్తున్న ఈ సంప్రదాయాలన్నీ కాపాడు. ఎల్లవేళలా ధర్మాన్ని కాపాడుతూ ఉండు.

స్త్రీలతో మంచిగా మాట్లాడుతూ ఉండు. వాళ్ళతో రహస్యాలేవీ చెప్పవద్దు. వారి మాటలు నమ్మవద్దు. వ్యవసాయం, గోసంరక్షణ వృత్తులలోని అందరూ నీ పట్ల అనుకూలంగా వ్యవహరిస్తున్నారు గదా! ఆడ ఏనుగులు, ఆడగుర్రాల సంఖ్య పెరిగేట్లుగా కనిపెట్టి ఉండు. మనకు ఇంత మంద ఉంది కదా అని తృప్తిపడకు. ఏనుగులు, గుర్రాలే రాజుకు నిజమైన బలం.

ఓ భరతుడా! నీవు ఉదయాన్నే లేచి చక్కగా అలంకరించుకొని, మధ్యాహ్న సమయాలలో ప్రజలకు దర్శనం ఇస్తూ ఉండు. నీ క్రింద పని చేసేవారంతా నీవంటే భయపడుతూ ఉండటం సహజమే! అయినా వాళ్ళు నీతో చనువుగాను, ప్రేమతో కూడా మెలిగేట్లుగా నడచుకో.

ఓ భరతుడా! దుర్గాలన్నింటిలోనూ ఆహార పదార్థాలు, ఆయుధాలు, నీరు సమృద్ధిగా ఉండేట్లు చూసుకో. ఆదాయం ఎప్పుడూ ఎక్కువగా ఉండాలి. ఖర్చులు తక్కువగా ఉండాలి. ధనం ఎప్పుడూ దేవతా కార్యాలకోసం, పితృదేవతా కార్యాలకోసం, బ్రాహ్మణుల కోసం, అతిథుల కోసం, సైన్యానికి, మిత్రులు, హితులు, శ్రేయోభిలాషులకు ఖర్చు అయ్యేట్లు చూడు. ఏ పరిస్థితుల్లో కూడా అపాత్రుల చేతుల్లోకి రాజు ధనం పోకుండా చూడాలి.

భరతుడా! పరిశుద్ధాత్ములు, ఉత్తమచరిత్ర కలవారిపై తప్పుడు అభియోగాలు వస్తూ

ఉంటాయి. కొందరు శాస్త్రాన్ని వక్రీకరించి విచారణ లేకుండానే మరణదండన విధిస్తూ ఉంటారు. అలా దండనకు లోనైన వారిని నీవు మెలకువతోను, నేర్పుతోను కాపాడుతూ ఉండాలి. అంతేకాదు. దొంగతనం చేసి పట్టుబడ్డవాణ్ణి, లంచం తీసుకుని విడిచి వేయడం జరగడం లేదుగదా?

భరతుడా! నీ మంత్రులు న్యాయవిచారణ చేసేటప్పుడు ధనికులకో న్యాయం, దరిద్రుడికో న్యాయం జరపడం లేదుకదా? భరతుడా! ఒకటి బాగా జ్ఞాపకం ఉంచుకో. ఎవడైనా రాజు తన ఇష్టానికి ఒక శాసనం చేసి, అపరాధం చెయ్యనివాణ్ణి శిక్షించినట్లయితే ఆ శిక్ష అనుభవిస్తూ అతడు కార్చే కన్నీటి వలన ఆ రాజు పుత్రులు, పశువులు, సంపద నశిస్తాయి.

ఓ భరతుడా! మనస్సు, దానం, వాక్కు అనే మూడు విధాలుగా ఆబాలగోపాలాన్ని ఆకట్టుకొంటూ ఉండు. ప్రతినిత్యమూ గురువుకు, వృద్ధులకు, మునులకు, దేవతలకు, అతిథులకు నమస్కరిస్తూ ఉండు. అధిక సుఖాలకోసం ఏ పరిస్థితుల్లోనూ ధర్మార్థాలను దూరం చేసుకోవద్దు. నీ విజయాలన్నీ కాలం విలువ తెలుసుకొని నడచుకోవడంలోనే ఉంటుంది. కాబట్టి ధర్మార్థకామాలకు కాలాన్ని తగువిధంగా కేటాయించుకో.

నాస్తికత్వం, అసత్యం, క్రోధం, ఏమరుపాటు, దీర్ఘాలోచన చెయ్యటం ఏ నిర్ణయమూ తీసుకోలేకపోవటం, పండితులను నిర్లక్ష్యం చెయ్యడం, సోమరితనం, ఇంద్రియాలకు వశుడవటం, ఏకపక్ష నిర్ణయాలు తీసుకోవడం, అసమర్థులతో ఆలోచనలు చెయ్యడం, అనుకున్నది అనుకున్నట్లుగా అమలుచేయకపోవడం, రహస్యాలను దాచుకోలేకపోవడం, మంచిపనులు చేయకపోవడం, నాలుగు ప్రక్కలా ఏకకాలంలో శత్రువుల్ని ఎదిరించడం అనే పద్నాలుగు దోషాలూ రాజులు విడిచిపెట్టాలి.

ఓ భరతుడా! దశవర్గం, పంచవర్గం, చతుర్వర్గం, సప్తవర్గం, అష్టవర్గం, త్రివర్గం, మూడువిద్యలు, ఇంద్రియాలను జయించడం, షాడ్గుణ్యం, దైవమానుషం, కృత్యం, వింశతివర్గం,

ప్రకృతులు, మండలం, యాత్రావిధానం, దండవిధానం, సంధి విగ్రహాలనే రెండు కారణాలు వాటన్నింటినీ సరిగా అర్థంచేసుకొని అనుసరించు.

[ దశవర్గం: వేట, జూదం, పగటినిద్ర, ఇతరులను నిందించడం, స్త్రీలు, మద్యపానం, నృత్య, గీత, వాద్యాలు, వ్యర్థంగా తిరగడం అనే పది వ్యసనాలు దశవర్గమని మనువు చెప్పాడు. అంతేగాక లుబ్ధుడు, క్రూరుడు, అలసుడు, అసత్యవాది, ఏమరుపాటుతో ఉండేవాడు, పిరికివాడు, స్థైర్యంలేనివాడు, మూఢుడు, నీతిలేనివాడు అందరినీ అవమానించేవాడు వీరికి గల పదిగుణాలను కూడా దశవర్గమంటారు.

పంచవర్గం: ఉదకదుర్గం, పార్వతదుర్గం, వృక్షదుర్గం, చవటపఱ్ఱల చేత ఏర్పడిన దుర్గం, ఎడారిలో ఏర్పడిన దుర్గం అనే అయిదు దుర్గాలు లేదా శత్రువు, ద్రవ్యం, స్త్రీలు, పురుషవాక్కు, అపరాధం వలన కలిగే అయిదు విధాలైన వైరాలను పంచవర్గాలంటారు.

చతుర్వర్గం: కామందకుడు వచించినట్లు రక్తసంబంధం చేత, వివాహసంబంధంచేత, వంశక్రమాగతంగాను, వ్యసనాలనుండి రక్షింపబడినవారు అనే నాలుగువిధాలైన మిత్రులు లేదా ధనాన్ని న్యాయంగా సంపాదించటం, రక్షించడం, వృద్ధి పొందించడం, సత్పాత్రయందు ఇవ్వడం అనే రాజవృత్తం, నాలుగు విధాలు.

సప్తవర్గం: స్వామి, మంత్రులు, రాష్ట్రం, దుర్గం, కోశం, సైన్యం, మిత్రుడు అనే సప్తాంగాలు రాజ్యానికి సంబంధించినవి. ఇవన్నీ పరస్పరం ఉపకారం చేసుకునేవి. లేదా తనవాడు, మిత్రుడు, ఆశ్రితుడు, బంధుత్వం కలవాడు, కార్యార్థం ఏర్పడినవాడు, భృత్యుడు, ఉపకారాలు చేయడంచే లభించినవాడు అనే ఏడుగురు స్వపక్షానికి చెందినవారు. లేదా శ్యేనం (సేనవ్యూహం), సూచి, వజ్రం, శకటం, మకరం, దండం, పద్మం అనే ప్రధానమైన వ్యూహాలు ఏడు.

అష్టవర్గం: పరిపాలనాదక్షుడైన రాజు, వ్యవసాయం, వర్తకం, దుర్గాలు, సేతువులు,

ఏనుగులను పట్టుకొనే అడవి, గనులు, పన్నుల వసూలు, కొత్తగా పల్లెలు నిర్మించటం అనే ఎనిమిదింటికి భంగం రాకుండా చూసుకోవాలి.

లేదా పితూరీలు చెప్పడం, సాహసం, ద్రోహం, ఇతరుల ధనాన్ని అపహరించడం, ఇతరుల అభివృద్ధిని చూసి ఓర్వలేకపోవడం, అసూయ, పరుషమైన మాటలు మాట్లాడటం, దండపౌరుష్యం అనేవి క్రోధానికి సంబంధించిన ఎనిమిది గుణాల సముదాయం.

త్రివర్గము: ధర్మార్థ కామాలు.

లేదా, ఇతరుల వృద్ధి, క్షయం, స్థానం.

లేదా సాధ్యంకాని పనులు ప్రారంభించడం; లేదా అజ్ఞానంచేత చేయదగిన పనులు చేయకపోవడం; శక్యమైన పనులను సమయంకాని సమయంలో ప్రారంభించడం అనే మూడూ కార్యవ్యసనమని చెప్పిన వ్యసన త్రయం.

మూడు విద్యలు: త్రయి, వార్త, దండనీతి. 'త్రయి' అంటే వేదత్రయాలు. వార్త అంటే వ్యవసాయం, గోసంరక్షణ, వర్తకం. దండనీతి అంటే రాజనీతి.

షాడ్గుణ్యం: సంధి, విగ్రహం (విరోధం వహించడం), యానం (దండెత్తి వెళ్లటం), ఆసనం (కాలానికై ప్రతీక్షించటం,) ద్వైధీభావం (దుర్బలుడు, ప్రబలుడు అనే ఇద్దరు శత్రువులతో మాటలతో మాత్రం మంచిగా ఉండటం), సమాశ్రయణం (బలవంతుని ఆశ్రయించటం) అనే ఆరు గుణాలు.

దైవమానుషమ్: దైవం వలన వచ్చే అయిదు విధాలైన ఆపదలు; మనుష్యుల వల్ల వచ్చే అయిదు విధాలైన ఆపదలు. వాటిని కామందకుడు ఈ విధంగా వివరించాడు.

అగ్ని, జలం, వ్యాధులు, దుర్భిక్షం, మరణం దైవం వలన వచ్చే అయిదు ఆపదలు.

అధికారులు, దొంగలు, శత్రువులు, రాజోద్యోగులు, రాజుదురాశ వలన వచ్చే అయిదు ఆపదలు మానవుల వల్ల వచ్చేవి.

కృత్యం: శత్రుపక్షంలో జీతం లభించని లుబ్ధులూ, అవమానించబడిన ఆత్మాభిమానం గలవారు, నిష్కారణంగా కోపానికి గురి అయినవారు, భయభ్రాంతులైన ధీరులు అనే నాలుగు విధాలైన వారికి కావలసినవి ఇచ్చి తన ప్రక్కకు తిప్పుకోవటం.

వింశతివర్గం: ఏ పరిస్థితుల్లోనూ సంధికి తగనివారు, విరోధం చేతనే పరిష్కారం పొందదగిన ఇరవై విధాల శత్రుసముదాయం. బాలుడు, వృద్ధుడు, దీర్ఘవ్యాధితో బాధపడుతున్నవాడు, బంధువులు బహిష్కరించినవాడు, పిరికివాడు, పిరికిపందలైన జనం ఉన్నవాడు, లోభి, లుబ్ధజనం గలవాడు, అమాత్యాది ప్రకృతుల ప్రేమను చూరగొన్నవాడు, అమిత భోగలాలసుడు, చపలచిత్తం, వివిధ ఆలోచనలు గలవాడు, దైవబ్రాహ్మణులను నిందించేవాడు, దైవోపహతుడు (మునుల శాపాలు వాటిల్లినవాడు), దైవచింతకుడు (సమస్తం దైవమే చేకూరుస్తుందని పురుషప్రయత్నం ఏమీ చేయనివాడు), రాజ్యంలో దుర్భిక్షం ఏర్పడినవాడు, వ్యసనాలలో చిక్కుకొన్న సేన గలవాడు, స్వదేశంలో ఉండనివాడు, అనేక శత్రువులున్నవాడు, కాలం ప్రతికూలంగా ఉన్నవాడు, సత్యధర్మాలు లోపించినవాడు – అనే ఇరవై విధాల శత్రువులతో సంధి చేసుకోరాదు. విరోధమే వహించాలి – అని చెప్పబడిన ఇరవైమంది వర్గం లేదా – విగ్రహ కారణాలైన ఇరువదింటి సముదాయం వింశతి గణం. వాటిని కామందకుడు ఇలా వివరించాడు.

రాజ్య, స్త్రీ, స్థాన, దేశ, జ్ఞాతి ధనాలను అపహరించడం, మదం, దురభిమానం, దేశాన్ని పీడించడం, జ్ఞాన అర్థ శక్తి ధర్మాలకు విఘాతం కలిగించడం, మిత్రులను వారి అర్థాన్ని అవమానించడం, బంధువులను నశింప చేయడం, ఇంద్రాది దేవతల పట్ల విరోధం, జనులపట్ల ప్రేమ లేకపోవడం, మండలాన్ని హింసించడం, ఒకే కార్యం పట్ల తగని పట్టుదల – ఇవి విగ్రహాన్ని (విరోధం) కొనసాగించడానికి కారణాలు.

ప్రకృతులు: మంత్రులు, రాష్ట్రం, దుర్గాలు, ధనాగారం, దండం – ఈ అయిదూ ప్రకృతులు.

మండలం: విజిగీషువునకు (తన రాజ్యాన్ని విస్తరించాలనుకొన్న రాజు విజిగీషువు) చుట్టుప్రక్కల గల పదకొండు విధాలయిన రాజుల సముదాయం. మధ్య విజిగీషువు. అతనికి ముందు శత్రువు, మిత్రుడు, శత్రుమిత్రుడు, మిత్రశత్రువు, శత్రుమిత్రమిత్రుడు, అని అయిదుగురుంటారు. పృష్ఠ భాగాన పార్ష్ణిగ్రాహుడు, ఆక్రందుడు, పార్ష్ణిగ్రాహాసారుడు, ఆక్రందాసారుడు అని నలుగురుంటారు. పార్శ్వమందు గలవాడు మధ్యస్థుడు. వారికి బయట ఉన్నవాడు ఉదాసీనుడు. ఇది ద్వాదశ రాజమండలం.

ద్వియోనీ సంధివిగ్రహ: సంధి విగ్రహాది షడ్గుణాలలో సంధి విగ్రహాలు ప్రధానాలు, యాన – ఆసనాలకు మూలం విగ్రహం. ద్వైదీభావ – సమాశ్రయణాలకు సంధి మూలం.]

భరతా! శాస్త్రోక్త లక్షణాలున్న ముగ్గురు లేక నలుగురు మంత్రులతోగాని, అందరితో కలసిగాని, విడివిడిగాగాని రహస్యంగా సమాలోచన చేస్తున్నావు గదా! నువ్వు పఠించిన వేదాలు, తలపెట్టిన పనులు, నీ భార్య, నువ్వు విన్న శాస్త్రాలు సఫలాలుగా ఉన్నాయి కదా!

నాయనా భరతా! నేను ఆశిస్తున్నట్లు నీ బుద్ధి ధర్మార్థకామాల పట్ల శ్రద్ధగలదై, ఆయుస్సును యశస్సును పెంపొందిస్తున్నది గదా! సన్మార్గంలో నడిపించేదీ, మంగళకరమైనదీ అయిన ఏ ఆచారాన్ని మన తండ్రి అనుసరిస్తున్నాడో, మన తాతముత్తాతలు అనుసరించారో దాన్నే నువ్వు అనుసరిస్తున్నావు కదా! ఓ భరతా! వండిన మధురపదార్థాలను నువ్వు ఒక్కడివే తినకుండా వాటిపట్ల ఇష్టంగల నీ మిత్రులకు కూడా ఇస్తున్నావు గదా!

విద్వాంసుడూ, గొప్ప బుద్ధిగలవాడూ అయిన రాజు సమస్తమైన రాజ్యాన్ని పొంది, ప్రజలను సముచితరీతిలో దండిస్తూ యథాశాస్త్రంగా ధర్మం ప్రకారం పరిపాలిస్తూ మరణానంతరం స్వర్గానికి పోతాడు.

# 101వ సర్గ భరతుడు రాజ్యం స్వీకరించమని రాముణ్ణి కోరటం

రాముడు భరతుణ్ణి ఓదార్చి "సోదరా! భరతుడా! నీవు ఈ నారవస్త్రాలు ధరించావెందుకు? ఈ జటలేమిటి? నీవు ఇక్కడకు వచ్చిన కారణం ఏమిటి?" అని అడిగాడు. రాముడు అలా అడగ్గానే భరతుడు మళ్ళీ రాముణ్ణి గట్టిగా కౌగలించుకున్నాడు. నమస్కారం చేస్తూ ఇలా అన్నాడు.

భరతుడు: ఓ రామా! మన తండ్రి దశరథ మహారాజు నిన్ను అడవులకు పంపాడేకాని, ఆ దుఃఖాన్ని భరించలేకపోయాడు. పుత్రశోకంతోనే ఆయన స్వర్గస్థుడయ్యాడు. సోదరా! దశరథ మహారాజు తన రాణి కైకేయీదేవి అభీష్టాన్ని కాదనలేక పరిస్థితులకు తలొగ్గి ఈ మహాపాపాన్ని చేశాడు. ఆ పాపాన్ని తలచుకుంటూ కుమిలి కుమిలి ఏడుస్తూ చివరి క్షణాల్లోకూడా "హా రామా! హా లక్ష్మణా! హా సీతా!" అంటూ ప్రాణాలు విడిచాడు. నా తల్లి కైకేయీదేవి తను కోరుకున్నట్లుగా రాజ్యాన్ని పొందలేకపోయింది కానీ వైధవ్యాన్ని మాత్రం పొందింది.

కనుక ఓ రామా! నన్ను అనుగ్రహించు. నా మనవిని మన్నించు. దేవేంద్రుడిలాగా రాజ్యాభిషిక్తుడవుగా. నా న్యాయమైన కోరికను మన్నించమని కోరటానికి మన తల్లులు, మంత్రులు, ప్రజలు సైన్యంతోసహా తరలివచ్చారు.

గౌరవమిచ్చే ఓ రామా! మన అన్నదమ్ములందరిలోను జ్యేష్ఠుడవు. వంశాచారం ప్రకారంగాను, ధర్మానుసారంగాను ఈ రాజ్యం నీదే. నా మాట, మన తల్లుల మాట, ప్రజల మాట మన్నించి మమ్మల్ని పాలించు. శరత్కాల రేయి నిర్మలమైన చంద్రుణ్ణి పొందినట్లు అనాథై ఉన్న ఈ కోసల రాజ్యానికి నాథుడవుకా.

ఓ పురుష శ్రేష్ఠుడా! వంశపారంపర్యంగా వస్తున్నదీ, తండ్రిగారు ఇప్పటి వరకూ పాలించిందీ అయిన ఈ ప్రకృతి మండలం చేసే ప్రార్థన మన్నించు. నేను, పౌరులమంతా కలసి

శిరస్సువంచి నమస్కరిస్తున్నాం.

భరతుడు ఈ విధంగా అంటూ కన్నీరు కారుస్తూ మళ్ళీ రాముడి పాదాలకు నమస్కరించాడు. అప్పుడు రాముడు భరతుని భుజాలు పట్టుకొని లేవనెత్తి కౌగలించుకున్నాడు. భరుతుణ్ణి ఓదారుస్తూ ఇలా అన్నాడు.

రాముడు: ఓ శత్రు సంహారకుడవైన భరతుడా! నీలో ఎటువంటి పాపమూ లేదని నాకు తెలుసు. నీ తల్లినికూడా నిందించవద్దు. నన్ను నారవస్త్రాలు ధరించి వనవాసం చెయ్యమనే అధికారం మహారాజుకు ఉన్నది. తల్లిదండ్రులు కూడా తమ బిడ్డల విషయంగా తమ ఇష్టం వచ్చినట్లు నడచుకోవచ్చునని శాస్త్రవచనం. నువ్వు ధర్మం తెలిసినవాడవు. పూజ్యుడైన తండ్రి విషయంలో ఎటువంటి గౌరవాన్ని చూపిస్తావో, అదే గౌరవాన్ని తల్లి పట్లా చూపించాలి. అటువంటి తల్లితండ్రులు నన్ను అడవులకు పొమ్మని ఆజ్ఞాపించినప్పుడు నేను వాళ్ళ ఆజ్ఞను ఏ కారణంగా కాదనగలను? తండ్రిగారి ఆజ్ఞ ప్రకారం నీవు రాజ్యాన్ని పాలించు. నేను నారవస్త్రాలు ధరించి వనవాసం చేస్తాను. లోకగురువు, ధర్మాత్ముడు అయిన మహారాజు మాటను మనం రాజశాసనంగా తీసుకొని పాటించాలి. కాబట్టి నీకు తండ్రిగారు ఇచ్చిన ఆదేశాన్ని పాలించు. నాకు ఇచ్చిన ఆదేశాన్ని నేను పాలిస్తాను.

# 102వ సర్గ తిరిగి రాజ్యాన్ని పొందమని భరతుడు బలవంతం చేయడం

భరతుడు: పురుషశ్రేష్ఠుడవైన ఓ రామా! ధర్మాన్ని తప్పిన నాకు నీవు చెప్పే ధర్మాలతో ప్రయోజనం ఏమిటి? నాకు తెలిసినదల్లా ఒకే ఒక్క ధర్మం. అదేమంటే, మన వంశాచారం ప్రకారం పెద్దకుమారుడే రాజ్యాన్ని పాలించాలి. పెద్దవాడు జీవించి ఉండగా చిన్నవాడు రాజు కాకూడదు. కాబట్టి నీవు అయోధ్యకు వచ్చి రాజ్యాభిషేకం చేసుకో.

సోదరా! రాజుకూడా మనిషే కదా? అని అనుకోవచ్చు కానీ, నీవు మాత్రం నాకు దేవేంద్రుడితో సమానమని నా అభిప్రాయం. నేను కేకేయ దేశంలో ఉండగా, నీవు వనవాసానికి వచ్చేశావు. ఆ దుఃఖం భరించలేక తండ్రిగారు స్వర్గస్థులయ్యారు. నేనూ, శత్రుఘ్నుడూ అయోధ్యకు రాగానే తండ్రిగారి దేహానికి అంత్యక్రియలు జరిపి జలతర్పణాలు ఇచ్చాం. నీవు కూడా వెంటనే తండ్రిగారికి జలతర్పణాలివ్వు. తనకు ప్రియమైన కుమారుడు జలతర్పణాలిస్తే స్వర్గాన ఉన్న పితృదేవతలు సంతోషిస్తారని పెద్దలంటారు. కాబట్టి నీవు ఇక ఆలస్యం చెయకుండా తండ్రిగారికి జలతర్పణాలివ్వు. మన తండ్రికి నీవంటేనే ప్రాణం. కాబట్టి అంత్యక్రియలు కూడా నీవే చెయ్యి. చివరి క్షణాల్లో కూడా తండ్రిగారు నీ కోసమే దుఃఖించారు; నిన్నే చూడాలనుకొన్నారు; మనస్సు నీపైనే నిలిపారు; నీ పేరు తలచుకొంటూనే ప్రాణాలు విడిచారు.

# 103వ సర్గ రాముడు తండ్రికి పిండప్రదానం చేయడం

భరతుడు తండ్రి మరణవార్త చెప్పగానే రాముడు దుఃఖంతో మొదలు నరికినవృక్షంలాగా నేలపై పడి మూర్ఛపోయాడు. భరత లక్ష్మణులు, రాముడి ముఖంపై చల్లటి నీటిని చిలకరించారు. పరిచర్యలు చేసి తిరిగి తేరుకునేట్లు చేశారు. తండ్రి మరణవార్తను రాముడు తట్టుకోలేకపోయాడు. దీనంగా ఏడుస్తూ, భరతుడితో ఇలా అన్నాడు.

రాముడు: సోదరా! మరణించిన తండ్రిగారి దేహానికి అంత్యక్రియలు చేయడానికి కూడా నేను నోచుకోలేదు. అటువంటి నేను జీవించి ఉన్నా చనిపోయినవాడితో సమానమే. తండ్రికి అంత్యక్రియలు చేయలేని జన్మ ఏం జన్మ? నీవు, శత్రుఘ్నుడు అంత్యక్రియలు చేయగలిగారు. మీరిద్దరూ కృతార్థులు. దశరథ మహారాజు లేని అయోధ్యలో నాకు ఏం మిగిలింది? అంతా శూన్యమే! నేను వనవాసం పూర్తిచేసుకొని అయోధ్యకు తిరిగి వచ్చినా నాకు సూచనలు, సలహాలు ఇచ్చేందుకు ఎవరున్నారు? పూర్వం తండ్రిగారు మంచి నడవడి గురించి ఎన్నో మాటలు మధురంగా చెప్పేవారు. అవి వింటుంటే పరమానందంగా ఉండేది. ఇకపై నాకు అలా చెప్పేవారెవరు? నేను ఎవరినుండి వినగలను? ఓ సీతా! నీ మామగారు మరణించారు. ఓ లక్ష్మణా! మన తండ్రి మరణించాడు.

అప్పుడు వసిష్ఠాది మంత్రులంతా అన్నదమ్ములు నలుగురినీ ఓదార్చి, రాముణ్ణి, లక్ష్మణుణ్ణి తండ్రికి జలతర్పణాలిచ్చేందుకు బయలుదేరమన్నారు. అంతట సీత ముందు నడుస్తూ ఉంటే లక్ష్మణుడు ఆమెను అనుసరించాడు, వారి వెనుకగా రాముడు నడిచాడు. దశరథ మహారాజుకు పరమ ఆప్తుడైన సుమంత్రుడు వారిని మందాకినీనదిలో స్నానం చేయించాడు. రామలక్ష్మణులు తండ్రికి జలతర్పణాలిచ్చారు.

రాముడు: రాజులలో శ్రేష్ఠుడవైన ఓ తండ్రీ! పితృలోకాల్లో ఉన్న నీకు ఇప్పుడు నేను ఇస్తున్న నీళ్ళు అక్షయమై చేరాలని కోరుతున్నాను. తండ్రీ! నేను ఇప్పుడు అర్పిస్తున్న పిండములు

కూడా నిన్ను చేరి అక్షయంగా ఉండాలని కోరుకుంటున్నాను.

రాముడు నేలపై దర్భలు పరిచాడు. రేగుపండ్లు కలిపిన గారతెలక పిండిని ముద్దలుగా చేశాడు.

ఓ మహారాజా! మేము తినే ఆహారాన్నే నీకు సమర్పిస్తున్నాం. పురుషుడు ఏఏ ఆహారం తింటాడో, ఆతడి దేవతలు కూడా అట్టి ఆహారాన్నే ఆరగిస్తారుగదా.

మందాకినీ తీరాన పిండప్రదానాలు చేసిన తరువాత వారంతా చిత్రకూటపర్వతం మీద ఉన్న తమ పర్ణశాలకు వెళ్ళారు. పర్ణశాలను చేరగానే మళ్ళీ రాముడిలో దుఃఖం పొర్లుకుంటూ వచ్చింది. భరతుణ్ణి, శత్రుఘ్నుణ్ణి, లక్ష్మణుణ్ణి కౌగలించుకొని ఏడ్చాడు. వారి ఏడుపులతో అడవి అంతా దద్దరిల్లింది. దూరంగా వేచి ఉన్న సైనికులంతా ఆ శబ్దాన్ని అనుసరించి పర్ణశాల వైపుగా పరుగులు పెట్టుకొంటూ వచ్చారు.

# 104వ సర్గ రాముడు తల్లులందరినీ కలుసుకోవటం

వసిష్ఠ మహర్షి దశరథ మహారాజు భార్యలందరినీ వెంట బెట్టుకొని రాముణ్ణి చూసేందుకు బయలుదేరాడు. వారంతా మందాకినీ తీరానికి వచ్చారు. సీతారామలక్ష్మణులు స్నానాలుచేసే రేవును చూడగానే వాళ్ళలో దుఃఖం మళ్ళీ కట్టలుతెంచుకొని వచ్చింది.

కౌసల్య: ఓ సుమిత్రా! ఏ పాపమూ చేయని మన పిల్లల్ని దేశం నుండి వెళ్ళగొట్టారు. పాపం! వాళ్ళు అనాథల్లాగా ఈ రేవులో స్నానాలు చేస్తూ ఉంటారు. నీ కొడుకు రాముడికోసం ఇక్కడనుండే నీళ్ళు మోసుకుపోతాడు. అందుకు నీవేమీ అగౌరవంగా భావించనక్కరలేదు. ఎందువల్లనంటే, పెద్ద అన్నగారు తండ్రిలాంటివాడు. కాబట్టి తండ్రికి సేవలు చేయడం వల్ల ఏమీ దోషం రాదు. అయినా ఇంకా ఎన్నాళ్ళులే. ఈ కష్టాలన్నీ త్వరలోనే తీరిపోతాయి.

ఓ సుమిత్రా! ఇక్కడ చూశావా! ఈ దర్భలు, ప్రదక్షిణాలు చేసినట్లుగా పాదాల గుర్తులు, పిండాలు కలిపిన పిండీ. అంటే వారిద్దరూ ఆ మహానుభావుడికి పిండప్రదానాలు చేసినట్లున్నారు.

మన భర్త, దశరథ మహారాజు అనుభవించని భోగాలు ఉన్నాయా? దేవేంద్రుడితో సమానమైన ఆ మహానుభావుడికి పెట్టే ఆహారం ఇదా? ఈ విశాల కోసలదేశాన్నేలిన మహారాజు ఈ గారపిండి తిని బ్రతకాలా? రాముడు తండ్రికి ఈ గారపిండితో చేసిన పిండాలే ఆహారమయితే, ఇంతకన్నా దుఃఖించాల్సిన విషయం ఏముంటుంది? ఇంత దారుణం చూస్తూ కూడా ఇంకా ప్రాణాలు పోలేదంటే నేను ఎంత పాపిష్టిదాన్ని? అవునులే! ఎవరు ఏది తింటారో అదే దేవతలకు కూడా పెడ తారు. అందులో తప్పుపట్టవలసిందేముంది? ఇదంతా లోకంలో సహజంగా జరిగేదే గదా!

ఈ విధంగా మాట్లాడుకుంటూ ఉండగానే వాళ్ళకు ఎదురుగుండా రాముడు కనిపించాడు. రాముణ్ణి చూస్తూనే రాణులంతా ఒక్కసారి ఘొల్లున ఏడ్చారు.

రాముడు తల్లులందరి పాదాలకూ నమస్కారం చేశాడు. కౌసల్యాదేవి ఏడుస్తూనే రాముణ్ణి లేవనెత్తి కౌగలించుకొంది. రాముడు తన మృదువైన హస్తాలతో ఆమె కన్నీళ్ళు తుడిచి ఓదార్చాడు. లక్ష్మణుడు కూడా తల్లులందరికీ నమస్కరించాడు. వాళ్ళంతా కూడా రాముణ్ణి ఆదరించినట్లే ఆదరించారు.

సీతాదేవి కన్నీరు కారుస్తూ అత్తలందరికీ పాదాభివందనం చేసింది. కౌసల్యాదేవి సీతను కన్నకూతురులాగా అక్కున చేర్చుకొంది. ఒళ్ళంతా తడుముతూ "ఓ సీతా! నీవు జనకమహారాజు పుత్రికవు. దశరథ మహారాజు కోడలివి. రాముడికి భార్యవు. అటువంటి నీవు ఈ మహారణ్యంలో కష్టాలు పడుతున్నావు. నీ ముఖం వాడిపోయిన కలువపువ్వులా మారిపోయింది. మబ్బుపట్టిన చంద్రుడులాగా మసకబారింది. నిన్ను చూస్తూ ఉంటే ఆరణి కట్టెలోనుండి నిప్పుపుట్టి ఆ కట్టెనే కాల్చి వేసినట్లుగా నీ లోనుంచి పుట్టిన శోకాగ్ని నా మనస్సును దహించి వేస్తోంది.

అప్పుడు రాముడు వసిష్ఠ మహర్షి వద్దకు పోయి పాదాభివందనం చేశాడు. తరువాత అయోధ్యాపుర ముఖ్యులతో, సైనికాధికారులతో, బ్రాహ్మణోత్తములతో భరతుడు వచ్చి రాముడికి నమస్కరించి, బ్రహ్మదేవుని ఎదుట మహేంద్రుడులాగా కూర్చున్నాడు. అంటే రాజసభలో ఉండే సభ్యులంతా ఇంచుమించు హాజరయ్యారు. భరతుడు ఎంతో శ్రమకు ఓర్చుకొని రాముని ఒప్పిస్తాననే ధైర్యంతో అడవుల్లోకి ప్రవేశించాడు. ఇప్పుడు రాముడు భరతుడు ఎదురెదురుగా కూర్చున్నారు. భరతుడు ఏం చెబుతాడోనని, రాముడి నిర్ణయం ఎట్లా ఉంటుందోనన్న కుతూహలంతో అంతా ఎదురుచుస్తున్నారు.

# 105వ సర్గ రామ–భరత సంవాదం

భరతుడు: అన్నా! నా తల్లి మాటను దశరథ మహారాజు మన్నించి రాజ్యాన్ని నాకిచ్చాడు; నేను ఆ రాజ్యాన్ని తిరిగి నీకే ఇచ్చివేస్తున్నాను. నీవు ఇక ఏ విధమైన అడ్డంకులుగాని, శంకలుగాని పెట్టుకోకుండా అయోధ్యను పాలించు. వర్షాకాలంలో వరదలకు ఆనకట్టలు తెగిపోయినట్లుగా ఇంత విశాలమైన కోసలదేశాన్ని మరెవరూ పాలించలేరు. గాడిద ఎంత ప్రయత్నించినా గుర్రంలాగా పరుగెత్తలేదు. కాకి ఎలాగైతే గరుత్మంతుడిలాగా వేగంగా ఎగరలేదో, అట్లాగే అయోధ్యను నీవు తప్ప మరెవరూ పాలించలేరు. ఎవరైనా ఒక వృక్షాన్ని నాటగా అది పెద్దమ్రానుతో ఆకాశమంత వృక్షమైనా కూడా పుష్పాలు, ఫలాలు ఇవ్వకుంటే, ఆ వృక్షం వల్ల ఏం ప్రయోజనం? అట్లాగే నీ తండ్రి దశరథ మహారాజు నీవు ప్రజారంజకంగా పాలిస్తావని నమ్మకంతో అయోధ్యను మహావృక్షంగా పెంచాడు. కాబట్టి ఇప్పుడు నీవు రాజ్యభిషేకం చేసుకొని రాజు అవ్వాలి. అట్లా కాదన్నావంటే తండ్రిగారు నీ మీద పెట్టుకున్న ఆశలన్నీ వ్యర్థమైపోతాయి. ఫలపుష్పాలులేని మహావృక్షంలాగా నిష్ఫలమైపోతుంది.

ఓ రామా! శత్రుసంహారకుడా! నీవు రాజ్యాభిషేకం చేసుకో. సూర్యుడిలా ప్రకాశిస్తూవుంటే వర్తకులు, శిల్పులు, వారి వారి సంఘాలన్నీ కూడా ఆనందిస్తారు. నీవు రాజువు కావాలని అంతః పురంలోని స్త్రీలంతా వెయ్యి కళ్ళతో ఎదురుచూస్తున్నారు.

భరతుడి మాటలకు అయోధ్యావాసులు, రాజోద్యోగులు, మంత్రులు, వసిష్ఠాది బ్రాహ్మణోత్తములంతా శభాష్ అని మెచ్చుకున్నారు. కానీ రాముడు భరతుని అనేక మధురమైన మాటలలో ఓదారుస్తున్నాడు.

రాముడు: తమ్ముడా! భరతుడా! మానవులంతా భగవంతుని చేతిలో కీలుబొమ్మలు. ఆయన ఎట్లా ఆడిస్తే అట్లా ఆడుతూ ఉంటారు. మనం స్వతంత్రులమని అనుకోవటం సరికాదు.

మానవుడు ధనం ఎంత ప్రోగుచేసుకున్నా చివరకది నశించక తప్పదు. ఎంత వృద్ధిపొందినా చివరకు పతనం తప్పదు. మానవుల సంబంధాలు పరస్పరం ఎంత అన్యోన్యంగా ఉన్నా విచ్ఛిన్నం తప్పదు. అట్లాగే పుట్టిన ప్రతివాడూ మరణించక తప్పదు. చెట్టున పండిన పండు రాలటం ఎంత సత్యమో అలాగే పుట్టిన ప్రతివాడూ గిట్టడం కూడా అంతే సత్యం. భవనం ఎంత దృఢంగా కట్టినా కాలక్రమంలో పడిపోక తప్పదు. అట్లాగే మానవుడి శరీరం కూడా వృద్ధాప్యమూ, మరణాలనుండి తప్పించుకోలేదు. యమునానది ఒకసారి సముద్రంలో కలసిపోయిన తర్వాత మళ్ళీ వెనుకకు రాగలదా? గడచిపోయిన రాత్రి, పగలు తిరిగివస్తాయా? గ్రీష్మకాలంలో సూర్యతాపానికి నీరంతా పీల్చి వేయబడ్డట్లుగా, ఆయుర్దాయం క్షీణించిపోతుంది. నిలబడ్డా నడుస్తున్నా కూడా ఆయుర్దాయం క్షీణిస్తూనే ఉంటుంది. కాబట్టి నీ గురించి ఆలోచించుకోవాలేగానీ, ఇతరుల గూర్చి ఆలోచిస్తూ కుర్చోకూడదు. మానవుడు ఎక్కడకు వెళ్ళినా మృత్యువు అతణ్ణి కూడా అనుసరిస్తూనే ఉంటుంది. కూర్చునేవాడు మృత్యువుతో కలసి కూర్చుంటున్నాడు. నడిచేవాడు ఎంత దూరం ప్రయాణంచేసినా మృత్యువుతో కలిసే పోతున్నాడు. శరీరం ముడతలు పడుతూనే ఉంటుంది. జుట్టు తెల్లబడుతూనే ఉంటుంది. అటువంటి మానవుడు ఏంచేసి తనను తను సమర్థుణ్ణి చేసుకోగలడు? సూర్యోదయం కాగానే పనులన్నీ చక్కబెట్టుకోవచ్చుగదా అని సంతోషపడుతున్నాడు. రాత్రి కాగానే చక్కగా నిద్రపోయి విశ్రాంతి తీసుకోవచ్చుగదా అని సంబరపడిపోతున్నాడే కానీ, ఆయుర్దాయం క్షీణించిపోతోందని తెలుసుకోలేకుండా ఉన్నాడు. ప్రవాహంలో రెండు కర్రముక్కలు కలసి ప్రయాణం చేస్తాయి. కొంతసేపయ్యాక మళ్ళీ విడిపోతూ ఉంటాయి. అట్లాగే భార్యా పిల్లలు, ధనం కొంతకాలం కలసి ఉండి తర్వాత విడిపోక తప్పదు. బ్రతికి ఉన్నవాడు చనిపోయిన వాడిని గూర్చి దుఃఖించగలడేగాని, మరణంపైన ఎటువంటి నియంత్రణాశక్తీ అతడికి ఉండదు.

కాబట్టి రాజు తన మనస్సును సుఖాలనిచ్చే ధర్మంపైనే లగ్నం చెయ్యాలి. అట్లా చెయ్యటంవల్ల ప్రజలు సుఖపడతారు. మన తండ్రి దశరథ మహారాజు అనేక యజ్ఞయాగాది క్రతువులు చేసి స్వర్గానికి వెళ్ళాడు. ప్రజలను చక్కగా పాలించటం వల్లా, ధనాన్ని

ధర్మానుసారంగా వసూలు చెయ్యడంవల్లా, పోషింపదగిన వారినందరినీ పోషించడం చేతా ఉత్తమమైన భోగాలను అనుభవించి, సత్పురుషులచేత గౌరవించబడి చివరకు స్వర్గానికి వెళ్ళగలిగాడు. ఈ భౌతిక శరీరాన్ని విడచి బ్రహ్మ లోకానికి కూడా వెళ్ళగల దివ్యదేహాన్ని పొందాడు. అటువంటి మహాత్ముని గూర్చి నీమా, నేనూ, మనలాంటివాళ్ళు దుఃఖించకూడదు. ఓ భరతుడా! నీవు దుఃఖాన్ని విడిచి స్వస్థుడవవు. వెళ్లి అయోధ్యను పాలించు. జితేంద్రియుడైన తండ్రి ఆజ్ఞను శిరసావహించు. అట్లాగే ఆ పవిత్రాత్ముడు నన్నేవిధంగా ఆజ్ఞాపించాడో నేను ఆ ఆజ్ఞను శిరసావహిస్తాను. కనుక నీవు కూడా రాజాజ్ఞను అతిక్రమించకూడదు. ఎందువలనంటే, ఆయనే మనకు బంధువు, తండ్రికూడా. అందువల్ల మనం పూజనీయుడైన తండ్రిగారి ఆజ్ఞను పాలిద్దాం.

ఓ నరశ్రేష్ఠా! పరలోకంలో సుఖం కావాలనుకున్న వాడెవరైనా ధార్మికుడై ఉండాలి; క్రూరత్వాన్ని విడిచిపెట్టాలి, గురు శుశ్రూషచెయ్యాలి. మన తండ్రి ఉత్తమచరిత్రను పరిశీలించి తెలుసుకొని నీవుకూడా స్వధర్మాన్ని పాలించాలి.

మహాత్ముడైన రాముడు 'తండ్రి మాటను పాలించు' అన్న ఒకే వాక్యాన్ని నొక్కిచెప్పాడు.

# 106వ సర్గ రాముని తిరిగి రాజ్యం స్వీకరించమని భరతుడు కోరటం

భరతుడు: శత్రుసంహారకుడవైన ఓ రామా! నీకు దుఃఖమూ లేదు, సంతోషమూ లేదు. నీకేదైనా సందేహంవస్తే పెద్దలను అడిగి తెలుసుకుంటావు. చనిపోయిన వాళ్ళ విషయంలోగాని, బ్రతికి ఉన్నవాళ్ళ విషయాలలోగానీ, మంచి వాళ్లపైనగానీ, చెడ్డవాళ్ళపైనగానీ నీకు రాగద్వేషాలుండవు. అటువంటప్పుడు లోకంలో నీకు దుఃఖాన్ని కలిగించేదేమైనా ఉంటుందా? అటువంటి నీతో సమానమైన వాడుగాని, నీకంటే అధికుడుగానీ ఈ లోకంలో లేదు.

కనుక ఓ మహారాజా! వస్తువులలోని నాణ్యతలు నీకు బాగా తెలుసు. మానవుల్లోని తారతమ్యాలు నీవు బాగా ఎరుగుదువు. నీవు దేవతలతో సమానమైన బలం కలవాడవు. సత్యన్నే పలికేవాడవు. ధర్మాన్నే ఆచరించేవాడవు. నీవు అన్నీ తెలిసిన వాడవు; అన్నీ చూడగలిగిన బుద్ధిమంతుడవు. జగత్తూ, సృష్టి స్థితి లయాల గూర్చి నీకు తెలిసినట్లుగా ఇంకెవ్వరికీ తెలియదు. అటువంటి నీవు వనవాసం పేరుతో ఇన్ని కష్టాలుపడుతూ ఉండటం తగదు.

సోదరా! నేను నా తాతగారి ఇంట్లో ఉన్నప్పుడు దుష్టురాలైన నా తల్లి ఈ పాపకార్యానికి ఒడిగట్టింది. ఇటువంటి పనిని నేను ఎన్నడూ కోరలేదు; నాకు ఇష్టమూ కాదు. కాబట్టి నన్ను అనుగ్రహించు. నాకు కైకేయి తల్లి కావటం వలన ఆమెను చంపకుండా వదిలేస్తున్నాను. ఇదే పాపకార్యం మరెవరైనా చేసి ఉంటే వెంటనే చంపేసేవాడిని. ధర్మం తెలిసినవాడిని కావటం వలన ఈ అధర్మకార్యాన్ని చేయలేకపోతున్నాను.

దశరథ మహారాజు నాకు గురువు, వృద్ధుడు; తండ్రి; పైగా ఇప్పుడు జీవించి లేదు. కనుక ఆయనను ఈ నిండుసభలో నిందించ లేను. ధర్మజ్ఞుడైన వాడెవడైనా ఒక స్త్రీని సంతోషపరచటం కోసం ఇటువంటి పాపకార్యం చేస్తాడా? 'వినాశకాలే విపరీతబుద్ధి' అన్న లోకోక్తి దశరథ మహారాజు విషయంలో అతికినట్లు చక్కగా సరిపోతుంది.

సోదరా! మన తండ్రిగారు తెలిసో తెలియకో, కోపంచేతగాని, అజ్ఞానం చేతగాని ధర్మాన్ని అతిక్రమిస్తే, ధర్మాత్ముడవైన నీవు చక్కగా ఆలోచించి ఆ ధర్మవిరుద్ధమైన కార్యాన్ని వెనుకకు త్రిప్పవద్దా? పుత్రుడనేవాడు తండ్రి ఉత్తమకార్యాలు చేసినప్పుడు అభినందించాల్సిందే కానీ, అధర్మం చేసినప్పుడు కూడా ఆభినందించేవాడు పుత్రుడు కాదన్నది అసత్యం కాదు.

కనుక ఓ సోదరా! నీవు తండ్రిగారికి సుపుత్రుడివిగా. లోకమంతా ఆయన చేసిన అధర్మాన్ని నిందిస్తోంది. నీవు ప్రజల తీర్పుకు వ్యతిరేకివై అధర్మాన్ని సమర్థించకు. అట్లా చేయటంవల్ల నీవు నన్నూ, కైకేయినీ, తండ్రిగారినీ, బంధుమిత్రులనూ, సకలజనులనూ రక్షించిన వాడవవుతావు.

అన్నా! అరణ్యమెక్కడ? రాజ్యపాలన ఎక్కడ? జటలెక్కడ? క్షత్రియ ధర్మం ఎక్కడ? ఇటువంటి విరుద్ధమైన కార్యాలు చెయ్యవద్దు. ఓ రామా! రాజ్యాభిషేకమే క్షత్రియునికి ధర్మం. రాజ్యపాలన చేతనే అతడు ప్రజలను రక్షించగలడు. ఆ విధంగా ఫలాన్ని ప్రత్యక్షంగా పొందగలిగే క్షత్రియధర్మాన్ని వదలి, ఎప్పుడో ఏదో తెలియని ఫలాన్ని పొందవచ్చునని క్షత్రియుడై ఉండికూడా తాపసధర్మాన్ని చేపట్టవచ్చునా? ఒకవేళ నీవు కష్టాలుపడుతూనే ధర్మాన్ని ఆచరించదలచుకొంటే, నాలుగు వర్ణాల వాళ్ళ ధర్మాన్నీ ఆచరిస్తూ శ్రమపడు. నాలుగు ఆశ్రమాల్లోను గృహస్థాశ్రమం శ్రేష్ఠమైనదని ధర్మవేత్తలు చెబుతారు కదా? అటువంటి గృహ స్థాశ్రమాన్ని వదలిపెట్టి తాపసధర్మాన్ని ఎట్లా చేపడతావు?

రామా! విద్యచేతను, జన్మచేతను, నీకంటే చిన్నవాడనైన నేను, నీవు ఉండగా ఈ రాజ్యాన్ని ఎలా పాలిస్తాను? ధర్మజ్ఞుడవైన ఓ రామా! తండ్రి నుండి సంక్రమించిన రాజ్యాన్ని పెద్దకుమారుడవైన నీవే పాలించాలి. నీకు ఎలాంటి అడ్డూ ఉండదు. బంధుమిత్రులతో కలసి ధర్మబద్ధంగా రాజ్యంచెయ్యి.

మంత్రిమండలి అంతా ఇక్కడే ఉంది. వసిష్ఠుడు మొదలైన ఋత్విక్కులంతా ఇక్కడే

ఉన్నారు. తండ్రిగారు నీ రాజ్యాభిషేకానికి సమకూర్చిన సంబారాలన్నీ వెంట తెచ్చాను. వేదోక్తంగా ఇక్కడే రాజ్యాభిషేకం చేస్తారు. కాదనకుండా అంగీకరించు. ఆ తరువాత దేవేంద్రుడులాగా అయోధ్యకు బయలుదేరు. నీ వెంట మేమంతా వస్తాం. దేవ, పితృ, ఋషి ఋణాలను తీరుస్తూ, శత్రువులను బాధిస్తూ, మిత్రులకు ఉల్లాసం కలిగిస్తూ మమ్మల్ని పాలించు.

ఓ పురుషశ్రేష్ఠుడా! జనులు నా తల్లికి పెట్టిన శాపాన్ని తొలగించి, ఆమెను కృతార్థురాలను చెయ్యి. పూజ్యుడైన తండ్రిగారి పాపాన్ని కూడా ప్రక్షాళనచెయ్యి. మహేశ్వరుడు ప్రాణులపై దయచూపేట్లు నీవు మా అందరిపైనా దయ చూపు. నేను శిరస్సువంచి నీకు నమస్కరిస్తున్నాను. నా ప్రార్థన కాదని నీవు అరణ్యంలోనే ఉండేట్లయితే నేనుకూడా నీతోపాటు ఇక్కడే ఉండిపోతాను.

భరతుడు వినయంతో ఎన్ని విధాలుగా ప్రార్థించినా స్థిరసంకల్పం గల రాముడు తండ్రి ఆజ్ఞకు కట్టుబడి అయోధ్యకు పోవటానికి సుతరామూ ఇష్టపడలేదు.

రాముడు ఆ విధంగా ధర్మాన్ని ఆచరించడంలో సుస్థిరంగా ఉండటం చూసి జనం సంతోషించినా, అయ్యో! అయోధ్యకు రావటంలేదే అని దుఃఖించారు.

యుక్తియుక్తంగా మాట్లాడిన భరతుణ్ణి వసిష్ఠాది ఋత్విక్కులు, అమాత్యులు కొనియాడారు. తల్లులందరూ భరతుణ్ణి మెచ్చుకొని కన్నీళ్ళు పెట్టుకున్నారు. కన్నీళ్ళు పెట్టుకుంటూ తల్లులందరూ రాముణ్ణి అయోధ్యకు రమ్మని మరోసారి బ్రతిమాలారు. ప్రజలందరూ రామునికి నమస్కరించి అయోధ్యకు రమ్మని ముక్తకంఠంతో వేడుకున్నారు.

# 107వ సర్గ రాముడు భరతుణ్ణి ఓదార్చటం

రాముడు: సోదరా! భరతుడా! నీవు చెప్పినదంతా బాగానే ఉంది. దశరథ మహారాజుకు కైకేయీదేవి యందు పుట్టిన ఓ భరతుడా! నీకో రహస్యాన్ని చెబుతాను విను. ఈ రహస్యాన్ని తండ్రిగారే నాకు చెప్పగా విన్నాను.

నీవు, లోకులు తండ్రిగారు కామవశుడై నీకు రాజ్యం ఇచ్చాడని అనుకొంటున్నారు. అది యథార్థం కాదు దశరథ మహారాజు కైకేయీదేవిని వివాహమాడటానికి ముందే, మీ అమ్మ కడుపున పుట్టే సంతానానికే రాజ్యం ఇస్తానని నీ తాతగారికి మాట ఇచ్చాడు. ఆ తరువాతే నీ తల్లితో వివాహం అయింది. ఇంతకాలం నీ తల్లికూడా ఈ విషయం మరచిపోయిందో, లేక కేకయ మహారాజే నీ తల్లికి చెప్పలేదో! కానీ ఈ రహస్యం మంత్రులందరికీ తెలుసు. మన తండ్రి దశరథ మహారాజు చెప్పడం వల్లనే నాకుకూడా తెలిసింది.

నాయనా! పూర్వం దేవాసురయుద్ధంలో మన తండ్రి ప్రాణాపాయంలో ఉండగా నీ తల్లి రెండుసార్లు ఆయన ప్రాణాన్ని కాపాడింది. అందుకు కృతజ్ఞతగా మన నాయనగారు నీ తల్లి కైకేయీదేవికి రెండు వరాలు ఇస్తామన్నారు. ఆ రెండు వరాలు ఇస్తానని ముందుగా తండ్రిగారి నుండి వాగ్దానం తీసుకొని ఆ తరువాతే నన్ను అడవులకు పంపాలని, రాజ్యం నీకు ఇవ్వాలని అడిగింది. తన మాట సత్యం చేయటానికి తండ్రిగారు నన్ను అరణ్యవాసానికి ఆదేశించారు. నేను ఆయన ఆజ్ఞను శిరసావహించి అరణ్యవాసానికి వచ్చాను. నీవే కాదు, ఎంతోమంది ఎన్నో విధాల నన్ను బలవంతంచేశారు; ప్రలోభపరచారు. కానీ ఎవరు ఎన్ని చెప్పినా, తండ్రిగారు ఇచ్చినమాట సత్యం చేయాలని, ఆయన సత్యవ్రతానికి భంగం రాకూడదని, సీతను లక్ష్మణుని వెంటబెట్టుకొని అడవులకు వచ్చాను.

కాబట్టి భరతుడా! నీవు రాజ్యాభిషేకం చేసుకొని రాజ్యాన్ని పాలిస్తూ తండ్రిగారి రెండవ వాగ్దానం కూడా సత్యంచెయ్యి. ధరాత్ముడవై తల్లినీ, తండ్రినీ సంతోషపెట్టు.

పూర్వం, గయాక్షేత్రంలో పితృదేవతల గూర్చి యాగం చేసున్న గయుడు ఈ విధంగా చెప్పాడు. "కొడుకు తండ్రిని 'పుత్' అనే నరకం నుండి రక్షిస్తాడు. తక్కిన పితృదేవతలను అన్ని నరకాలనుండి రక్షిస్తాడు. అందువల్ల కుమారుడికి 'పుత్రుడు' అనే పేరు వచ్చింది." అందువలన ప్రతివారూ చాలామంది పుత్రులను కోరుకుంటారు. ఎందువల్లనంటే, వారిలో ఏ ఒక్కడైనా గయాక్షేత్రానికి పోయి పితృయాగం చెయ్యకపోతాడా అనే ఆశతో. అందువలన నీవుకూడా మన తండ్రిని నరకంలో పడకుండా కాపాడు.

ఓ భరతుడా! నీవు శత్రుఘ్నునితో కలసి అయోధ్యకు పోయి జనరంజకంగా పరిపాలించు. నేను సీతాలక్ష్మణులతో కలసి వనవాసవ్రతం పూర్తి చేస్తాను. నీవు పోయి కోసలదేశానికి రాజువుగా. ఆ దేశప్రజలందరినీ రక్షించు. నేను ఇక్కడ అరణ్యానికి రాజు అవుతాను. ఇక్కడ ఉండే పశుపక్ష్యాదులను, తపశ్శాలురను, మునీశ్వరులను రక్షిస్తాను. ఆ విధంగా అడవుల్లో ఉంటూకూడా క్షత్రియధర్మాన్ని కాపాడుకుంటాను. అయోధ్యలో రాజునై తెల్లని గొడుగునీడలో (శ్వేతఛత్రం) రాజ్యపాలన చెయ్యి. నేను ఇక్కడ అరణ్యంలోని చెట్టునీడలలో ఉంటూ వన్యజీవాలను కాపాడుతూ ఉంటాను. అయోధ్యలో శత్రుఘ్నుడు నీకు తోడునీడగా ఉంటాడు. ఇక్కడ అరణ్యంలో లక్ష్మణుడు నాకు తోడునీడగా ఉంటాడు. మన నలుగురం మన తండ్రి దశరథ మహారాజు సత్యవ్రతాన్ని నిలబెడదాం. కనుక దుఃఖించవద్దు.

# 108వ సర్గ జాబాలి నాస్తికవాదం

ధర్మజ్ఞుడైన రాముడు భరతునికి ఈ విధంగా ధర్మబోధ చేస్తూ ఉండగా జాబాలి అనే బ్రాహ్మణోత్తముడు రాముడితో ఇలా అన్నాడు.

జాబాలి: ఓ రామా! నీవు సకలవిద్యాపారంగతుడవు, ధర్మవేత్తవు. అయినా ఒక సామాన్య మూర్ఖునిలాగా మాట్లాడుతున్నావు. నీ ఆలోచనలు ఏ ప్రయోజనాన్నీ సాధించలేవు. లోకంలో ఎవరైనా ఒక్కడే పుడుతున్నాడు. ఒక్కడే మరణిస్తున్నాడు. అటువంటప్పుడు ఎవరు ఎవరికి బంధువు? ఎవరు ఎవరికి మంచి చేస్తాడు? ఆ మంచి నుండి ఏం లాభం పొందగలడు? తల్లి తండ్రి అని పిలుచు కోవటం, అజ్ఞానం చేత బంధితులు కావడమే తప్ప సత్యం ఏమీ లేదు. అధికంగా ప్రేమించడం ప్రేమించబడుతున్నాననుకోవడం వంటివన్నీ ఉన్మత్త లక్షణాలే. నిజానికి ఎవరికి ఎవరూ ఏమీ కారు.

రామా! బాటసారి ఒక్కొక్కచోట ఏదో సత్రంలో మజిలీచేస్తూ మర్నాడు ఉదయానే లేచి వెళ్లిపోతూ ఉంటాడు. లోకంలో మనుష్యులకు తల్లి, తండ్రి, ఇల్లు, ధనం మొదలైనవన్నీ ఒక సత్రం లాంటివి. బుద్ధిమంతుడెవడూ వాటితో బంధితుడు కాడు.

కనుక ఓ నరశ్రేష్ఠుడా! తండ్రి ఇచ్చిన రాజ్యాన్ని కాదని, కష్టమైనదీ, దుఃఖకరమైనదీ అయిన చెడుమార్గాన్ని అవలంబిస్తున్నావు. ఈ చెడుమార్గాన్ని విడిచిపెట్టు. అయోధ్యకు వెళ్ళి రాజ్యాభిషేకం చేసుకొని సుఖంగా ఉండు. పతివ్రత భర్తకోసం ఎదురు చూస్తున్నట్లుగా అయోధ్యానగరం నీ కోసం కాచుకొని ఉంది. ఓ రాజకుమారా! దేవేంద్రుడు స్వర్గంలో అనుభవించినట్లు శ్రేష్ఠమైన రాజ్యభోగాలు నీవు అయోధ్యలో అనుభవించు.

ఓ రామా! అజ్ఞానిలాగా భ్రమలో ఉండకు. దశరథుడు నీకు ఏమీ కాడు. అతడికి నువ్వు కూడా ఏమీ కావు. అతడెవరో, నీ వెవరో! ఎవరికి ఎవరూ ఏమీ కారు. అట్లా కాకుండా

అనుబంధాలు పెంచుకునేవాడు ఉన్మత్తుడి లాంటివాడు.

ప్రాణికి తండ్రి బీజంలాంటివాడు. తల్లి ఋతుమతి అయినప్పుడు శుక్లం, శ్రోణితం కలసి సంతానం జన్మిస్తారు. దశరథ మహారాజు ఎక్కడకు చేరాలో అక్కడకు చేరిపోయాడు; కానీ నీవు మాత్రం అనవసరంగా కష్టాలు కొనితెచ్చుకుంటున్నావు. కేవలం అర్థం కోసమో, ధర్మం కోసమో పాటుపడేవాళ్ళను చూస్తే నాకు జాలి పుడుతుంది. ఇతరులను చూస్తే కలుగదు. ఎందువల్లనంటే, ధర్మార్థాలను పట్టుకు వేళాడేవాళ్ళు ఇహంలోను, పరంలోను కూడా కష్టాలనే అనుభవిస్తారు. లోకంలో అష్టకాశ్రాద్ధమని ప్రత్యాబ్దిక శ్రాద్ధమని చేస్తూ ఉంటారు. చచ్చినవాళ్ళు ఏమీ తినరు, కానీ వీళ్ళ అజ్ఞానం వల్ల బోలెడు అన్నం వృథా అయిపోతోంది. రామా! నీవే బాగా ఆలోచించు.

ఎక్కడైనా ఒకడు ఆహారం తింటే, ఆ సారం మరొకడి దేహంలోకి పోతుందా? అట్లా వెళ్ళినట్లయితే దేశాంతరానికి పోయిన వాళ్ళకు కూడా శ్రాద్ధం పెట్టవచ్చు.

యజ్ఞాలు చెయ్యమంటారు, దానా లిమ్మంటారు, దీక్ష తీసుకోమంటారు, తపస్సు చెయ్యమంటారు. 'అన్నీ ఇచ్చెయ్యి' అంటారు. ఓ రామా! ఇవన్నీ సత్తాలేని మాటలు. మేధావులు వ్రాసిన ఈ గ్రంథాలన్నీ కేవలం దాన వశీకరణోపాయాలే.

బుద్ధిశాలివైన ఓ రామా! పరం అంటూ ఏమీలేదు. ప్రత్యక్షంగా చూసేదే యథార్థం. కనుక ప్రత్యక్షంగా కనిపిస్తున్న రాజ్యాన్ని అనుభవించు. ఊహల్లో మాత్రమే ఉంటూ ఉన్మాదుల్ని చేసే పరాన్ని గూర్చి మర్చిపో. భరతుడు నిన్ను ఇంతగా బ్రతిమాలుతున్నాడు. నేను చెప్పిన మార్గాన్ని అంగీకరించి రాజ్యాన్ని తీసుకో.

## 109వ సర్గ నాస్తికత్వాన్ని ఖండించడం –ఆస్తికత్త్వాన్ని స్థాపించడం

రాముడు: ఓ జాబాలీ! నీవు ఇంతవరకూ ఎంతో కష్టపడి నేర్పుతో నా హితాన్ని కోరుతున్నట్లుగా మాట్లాడావు. నిజానికి అవన్నీ నాకు అహితాన్నే కలిగిస్తాయి. అధర్మాన్నే బోధిస్తున్నాయి.

కట్టుబాట్లు లేనివాడు, పాపాలు చేసేవాడు, మంచి నడవడిక లేనివాడు. సత్పురుషుడనే గౌరవాన్ని పొందలేడు. ఎవడు కులీనుడో, ఎవడు వీరుడో వాడి నడవడికే చెప్పక చెబుతుంది.

ఎవడైనా పూజ్యుడులాగా పైకి కనిపిస్తూ, నిజాయితీలేని పనులే చేస్తూ ఉంటే, ఉత్తమ లక్షణాలున్న వాడిలాగా కనిపిస్తూ, నీచమైన పనులు చేస్తూ ఉంటే, చెడు ప్రవర్తన కలవాడు కూడా మంచివాడిలాగా నటిస్తూ ఉంటే, అన్నీ అధర్మమైన పనులు చేస్తూ అదే పరమధర్మమని చెప్పేవాడు, నిజానికి లోకానికి కీడే కలిగిస్తూ ఉంటాడు. అలాంటి అధర్మపరుణ్ణి ఎవరైనా గౌరవిస్తారా?

ఓ జాబాలీ! ఎవడు కులీనుడో, ఎవడు వదరుబోతో, ఎవడు పరిశుద్ధమైన నడవడిక గలవాడో, ఎవడు పరిశుద్ధుడు కాడో, వాడి నడవడికయే చెబుతుంది.

నేను పూజ్యుడనని పైకి చెప్పుకుంటూ చేసేవన్నీ అధర్మమైన పనులే చేస్తూ ఉంటే; నేను నిజాయితీగల వాడినని చెప్పుకుంటూ ఉత్తమలక్షణాలు లేనివాడినై, చెడు శీలం గలవాడినైనా శీలవంతుడిగా నటిస్తూ; శుభకరమైన మార్గాన్ని విడిచి అశాస్త్రీయమైన పనులే చేస్తూ లోకాన్ని భ్రష్టుపట్టిస్తూ ఉంటే (కీడు కలిగిస్తూ), చైతన్యవంతుడైన పురుషుడెవరైనా గౌరవిస్తాడా?

ఓ జాబాలీ! సత్యం మీదనే ఈ లోకమంతా నిలచి ఉంది. ఋషులు, దేవతలు కూడా సత్యమే పరమధర్మమని అంగీకరిస్తారు. సత్యం మాట్లాడేవాడికి ఈ లోకంలో ఉత్తమమైన స్థానం లభిస్తుంది. అలాగే ఈ రాజధర్మం కూడా అతిపురాతనమైనది, శాశ్వతమైనది. ఈ రాజధర్మం

కూడా సత్యస్వరూపమైనదే. దీన్లో క్రూరత్వానికి చోటుండదు. నేను తండ్రిగారికి ఇచ్చిన వాగ్దానాన్ని వదిలేసి నీవు చెప్పిన మార్గాన్ని ఆచరిస్తే, నేను ఎవరికీ మంచిమార్గాన్ని ఉపదేశించలేను. స్వర్గానికి వెళ్లగలనా? రాజులు ఎలా ప్రవర్తిస్తాడో, ప్రజలుకూడా ఆ విధంగానే ప్రవర్తిస్తారు. నేను నీ మార్గాన్ని ఆచరిస్తే ప్రజలందరూ విచ్చలవిడిగా తిరుగుతారు.

ఓ జాబాలీ! అసత్యం చెప్పేవాణ్ణి చూస్తే ప్రజలు త్రాచుపామును చూసినట్లు భయపడతారు. ఇహలోకానికి సత్యమే మూలాధారం. స్వర్గానికి పోయేందుకు కూడా అదే పునాది.

లోకంలో సత్యమే ఈశ్వరుడు. లక్ష్మి ఎల్లప్పుడూ సత్యాన్ని ఆశ్రయించే ఉంటుంది. అంటే అన్నింటికీ సత్యమే మూలం – సత్యాన్ని మించిన ఉత్తమధర్మం ఇంకొకటి ఎక్కడా లేదు. దానం, యాగం, తపస్సు, వేదాలు అన్నీ సత్యం మీదనే ఆధారపడి ఉన్నాయి. అందుచేత మానవుడికి సత్యమే పరమధర్మం.

లోకంలో ఒకడు రాజ్యం చేస్తాడు, ఇంకొాడు కటిక దరిద్రుడౌతాడు. ఒకడు వంశాన్ని వృద్ధి చేస్తాడు, ఒకడు నరకానికి పోతాడు. ఇంకొకడు స్వర్గానికి పోతాడు, ఇవన్నీ కూడా సత్యాసత్యాల వలన వచ్చే ఫలాలే.

ఓ జాబాలీ! నేను సత్యాన్నే ఆశ్రయించుకొని ఉంటాను. నా తండ్రి ఎదుట సత్యంపై ప్రతిజ్ఞ చేశాను. సత్యమైన ఆ ప్రతిజ్ఞను పాలించకుండా ఎలా ఉండగలను? కాబట్టి సత్యానికే కట్టుబడి ఉన్న నేను, నా తండ్రిగారికిచ్చిన ప్రతిజ్ఞకు లోభం చేతగాని, చిత్తభ్రమచేతగాని, తమోగుణం చేతగాని భంగం కలిగించలేను. సత్యసంధుడు కానివాడు యజ్ఞయాగాల్లో ఇచ్చే హవ్యకవ్యాదుల్ని దేవతలు, పితృదేవతలు కూడా స్వీకరించరు.

సత్యమైన ఈ ధర్మమే ప్రత్యగాత్మ అని అనుకొంటున్నాను. అందువల్లనే మహాత్ములైన వారందరూ ఆచరించిన ఈ కష్టసాధ్యమైన సత్యవ్రతాన్ని నేను గౌరవిస్తున్నాను. సత్యవ్రతులైన

పూర్వరాజర్షులు ఆచరించిన మార్గాన్నే నేనూ అవలంబిస్తాను.

ఆశాపాతకులు, అల్పులు, క్రూరకర్మలు చేసే వాళ్ళు అవలంబించే క్షత్రియధర్మాన్ని నేను పరిత్యజించాను. ఇటువంటి క్షత్రియధర్మాల్లో అధర్మమే అధికంగా ఉంటుంది. ధర్మం అతిస్వల్పంగా ఉంటుంది. అటువంటి క్షత్రియధర్మాన్ని నేను స్వీకరించను. పాపం మూడు రకాలుగా ఉంటుంది. మానవుడు పాపకార్యాలను మనస్సులో సంకల్పిస్తాడు. పాపకార్యాలు ప్రత్యక్షంగా చేస్తాడు. నోటితో అబద్ధాలాడుతూ పాపం చేస్తాడు. కాబట్టి పాపం మానసికంగా, కర్మచేతా, మాటచేతా కూడా చేస్తూ ఉంటాడు. దృఢమైన సంకల్పం లేనివాడు ఈ మూడు పాపాలు నిస్సంకోచంగా చేస్తూనే ఉంటాడు. మంచి పనులవల్ల వచ్చే కీర్తి, మంచి ప్రవర్తనవల్ల వచ్చే యశస్సు, ఎప్పుడూ సత్యవ్రతుణ్ణే వరిస్తాయి. మనిషి చనిపోయినా అవి అతణ్ణి వదలిపోవు. కాబట్టి సత్యాన్నే నమ్ముకొని ఉండాలి.

కనుక ఓ బ్రాహ్మణుడా! నీవు శ్రేష్ఠమనీ, మంగళకరమైనదనీ, నాకు చెప్పినదంతా అమంగళకరమే! చెడ్డదే! నేను వనవాసం చేస్తానని తండ్రిగారికి మాట ఇచ్చాను. ఇప్పుడు ఆ మాటను కాదని భరతుని మాట ఎలా వింటాను? నేను తండ్రికి స్థిరమైన వాగ్దానాన్ని చేశాను. ఆ నా ప్రతిజ్ఞకు కైకేయీదేవి కూడా సంతోషించింది. కాబట్టి నేను పరిశుద్ధుడనై మితభోజనం చేస్తూ పితృదేవతలను తృప్తిపరుస్తాను. ఇంద్రియనిగ్రహం కలవాడినై కపటం లేకుండా విచక్షణతో కార్యాలను చేస్తూ వనవాస జీవితం గడుపుతాను.

బ్రాహ్మణుడా! ఇది కర్మభూమి. ఈ భూమిపై పుట్టినవాడు శుభమైన కర్మలు చేయాలి. ఆ కర్మల ఫలంగా ఆయా పదవులను పొందుతారు. దేవేంద్రుడు నూరు యజ్ఞాలుచేసి స్వర్గానికి అధిపతి అయ్యాడు. మహర్షులు ఎందరో కఠోర తపస్సులు చేసి స్వర్గాన్ని పొందారు.

ఓ జాబాలీ! సత్యం, ధర్మం, పరాక్రమం, భూతదయ, మధురమైన వాక్కు, దేవతలను, బ్రాహ్మణులను, అతిథులను పూజించడం వంటివి స్వర్గానికి మార్గాలని పెద్దలు చెబుతున్నారు.

బ్రాహ్మణులు ఎప్పుడూ బాగా ఆలోచించి మంచి ఫలితాలనిచ్చే కర్మలనే చేస్తూ, సకల ధర్మాలను చక్కగా ఆచరిస్తూ, ఉత్తమ లోకప్రాప్తిని పొందుతూ ఉంటారు.

ఓ జాబాలీ! నీవు వారందరికంటే భిన్నంగా ఆలోచిస్తున్నావు. ఇటువంటి ఆలోచనలు గలవారు ధర్మమార్గాన్నుండి పతనమవుతారు. అటువంటి పతనమైన నీ వంటి నాస్తికుణ్ణి చేరదీసిన నా తండ్రి నిజంగా నిందించదగ్గవాడే!

తథాగతుడు (బుద్ధుడు) దొంగలాంటివాడు; నాస్తికుడు; ప్రజలు అనుమానించ దగినవాడు. పండితుడైన వాడెవ్వడూ నాస్తికుడితో సంబంధాలు పెట్టుకోడు.

[ వివరణ: త్రేతాయుగంలో బుద్ధుని ప్రసక్తి తేవడంవల్ల, కలియుగంలో కనిపించే బుద్ధావతారమని అనుకోగూడదు.]

ధర్మమందు ఆసక్తికలవారు, సత్పురుషులతో స్నేహం చేసేవారు, హింస చేయనివారు, పాపాలనుండి విముక్తులైన వారినే లోకం పూజిస్తుంది.

నీకంటే పూర్వీకులైన శ్రేష్ఠులు ఎంతోమంది అనేక సత్కార్యాలు చేస్తూ ఇహపరాలలో సుఖపడ్డారు. అందువల్లనే బ్రాహ్మణులు ఎల్లప్పుడూ హోమాలు, కర్మలూ శుభాలు కోరి చేస్తూంటారు.

దైన్యమంటే తెలియనివాడు, మహాత్ముడు అయిన రాముడు కోపంగా అన్న ఈ మాటలకు జాబాలి వినయంగా ఇలా అన్నాడు.

జాబాలి: రామా! నేను నాస్తికుణ్ణి కాదు. నేను ఒక సమయంలో నాస్తికుడిగా మాట్లాడతాను. మరొక సందర్భంలో ఆస్తికుడిగా మాట్లాడతాను.

ఓ రామా! ఇప్పుడు నీతో నాస్తికుడుగా చెప్పవలసి రావటంచేత నాస్తికుడిగా మాట్లాడాను.

ఈ నాస్తికత్వపు మాటలన్నీ నిన్ను తిరిగి అయోధ్యకు తీసుకు వెళ్ళేందుకే చెప్పాను.

# 110వ సర్గ వసిష్ఠుడు రాముని రాజ్యాన్ని స్వీకరించమనటం

జాబాలిపై రాముడు ఆగ్రహించడం గుర్తించిన వసిష్ఠ మహర్షి ఇలా అన్నాడు.

వసిష్ఠ మహర్షి: ఓ రామా! కేవలం నిన్ను అయోధ్యకు తీసుకువెళ్ళాలనే ఉద్దేశంతోనే జాబాలి అలా మాట్లాడాడు. అంతేకాని అతడు నాస్తికుడు కాదు. అతడికి, జనం ఆయాలోకాలకు పోవడం తిరిగి రావడం వంటి విషయాలన్నీ తెలుసు. ఓ రామా! ఈ లోకం ఎలా పుట్టిందో చెబుతాను విను.

సృష్టి ప్రారంభానికి ముందు అంతా ప్రళయజలంతో నిండి ఉంది. దాన్లోనుండి భూమి పుట్టింది. ఆ తరువాత బ్రహ్మ; దేవతలు పుట్టారు. శ్రీమహావిష్ణువు వరాహరూపాన్ని ధరించి భూమిని ఉద్ధరించాడు. శాశ్వతుడూ, వినాశంలేనివాడూ అయిన బ్రహ్మకు మరీచ్యాదులు, మరీచికి కశ్యపుడు, కశ్యపుడికి సూర్యుడు పుట్టారు. పూర్వం ప్రజాపతిగా ఉన్న మనువు సూర్యుని కుమారుడు. మనువు కుమారుడు ఇక్ష్వాకుడు. మనువు మొదటగా ఈ భూమినంతా ఇక్ష్వాకునికి ఇచ్చాడు. ఆ ఇక్ష్వాకుడే ఈ అయోధ్యానగరాన్ని నిర్మించాడు.

ఇక్ష్వాకునకు కుక్షి కుమారుడుగా పుట్టాడు. కుక్షికి వికుక్షి, వికుక్షికి బాణుడు, బాణునికి అనరణ్యుడు పుట్టారు. అనరణ్య మహారాజు రాజ్యం చేసే రోజుల్లో అతివృష్టి అనావృష్టులు ఉండేవి కావు. దొంగలభయం అంతకు మునుపే ఉండేదికాదు. అనరణ్యునికి పృథువు, అతడికి త్రిశంకువు పుట్టారు. సత్యవాక్య పరిపాలనచేత త్రిశంకువు శరీరంతోనే స్వర్గానికి వెళ్ళాడు. త్రిశంకువునకు దున్దుమారుడు, అతడికి యువనాశ్వుడు పుట్టారు.

యువనాశ్వుని కుమారుడు మాంధాత, అతడికి సుసంధి పుట్టాడు. సుసంధికి ధ్రువసంధి, ప్రసేనజిత్తు అని ఇద్దరు కుమారులు కలిగారు. ధ్రువసంధికి భరతుడు పుట్టాడు, భరతునికి అసితుడు పుట్టాడు. అసితుడికి హైహయులు, తాలజంఘులు అనే రాజులతో వైరం ఏర్పడింది.

ఆ యుద్ధంలో వారు అసితుణ్ణి ఓడించి రాజ్యంనుండి వెళ్ళగొట్టారు. అప్పుడు అసితుడు అడవుల్లోకి పోయి పర్వతసానువుల్లో మునివృత్తి చేపట్టాడు. ఆ సమయంలో అసితుడి భార్యలిద్దరూ గర్భవతులై ఉన్నారు. అందులో ఒక భార్య తన సవతి గర్భం విచ్ఛిన్నం చేయడానికి విషం పెట్టింది. ఆ సమయంలో భృగువంశానికి చెందిన చ్యవనమహర్షి ఆ ప్రాంతాలకు రావడం జరిగింది. అప్పుడు అసితుడి భార్య కాళింది, తన సవతి తనకు చేసిన విషప్రయోగాన్ని గురించి ఆ మహర్షికి చెప్పుకొని ఏడ్చింది. అప్పుడా మహర్షి దివ్యదృష్టిలో చూసి “అమ్మా! నీ గర్భం విచ్ఛిన్నం కాలేదు. నీకు మహాత్ముడు, పరమధార్మికుడు, ఉత్తమశీలుడు, వంశోద్ధారకుడు, శత్రుసంహారకుడు అయిన కుమారుడు పుడతాడు” అని చెప్పాడు. అంతట ఆ కాళిందీదేవి చ్యవనమహర్షికి ప్రదక్షిణపూర్వక నమస్కారంచేసి ఇంటికి వెళ్ళింది. తరువాత కొంతకాలానికి పద్మాలవంటి నేత్రాలు కలిగిన పుత్రుణ్ణి కన్నది. సవతి పెట్టిన విషంతో కలసి పిల్లవాణ్ణి కనటంవల్ల ఆ పిల్లవాడికి సగరుడు అని పేరు పెట్టారు. ఆ సగర మహారాజు యజ్ఞం చేసి, యాగాశ్వాన్ని అన్వేషించే సమయంలో ఆతని పుత్రులు అరవైవేలమంది పాతాళానికి పోయేందుకు భూమిని త్రవ్వగా, పర్వతాలలోని నీరంతా అందులోకి ప్రవహించి సముద్రాలయ్యాయి. సగరుని పుత్రులచే త్రవ్వబడ్డాయి కాబట్టి అవి సాగరాలుగా ప్రసిద్ధి చెందాయి. సగరునకు అసమంజుడనే పుత్రుడు కలిగాడు. అతడు ప్రజలను క్రూరంగా హింసించటం వలన, తండ్రి అతణ్ణి దేశంనుండి వెళ్ళగొట్టాడు. అసమంజుని పుత్రుడు అంశుమంతుడు. అతనికి దిలీపుడనే పుత్రుడు కలిగాడు. దిలీపునకు భగీరథుడు పుట్టాడు. భగీరథునకు కకుత్థ్సుడనే పుత్రుడు కలిగాడు. కకుత్సునకు రఘువు అనే పుత్రుడు పుట్టాడు. ఈ మహాత్ముని వలననే మీ వంశానికి రఘువంశమనే పేరు వచ్చింది.

రఘువు పుత్రుడు పురుషాదకుడు, కల్మాషపాదుడు, సౌదాసుడు అనే పేర్లతో ప్రసిద్ధిపొందాడు. కల్మాషపాదుని పుత్రుడు శంఖణుడు. ఇతడు తండ్రితోనే యుద్ధంచేసి యుద్ధంలో మరణించాడు. శంఖణుని కుమారుడు సుదర్శనుడు. అతని కుమారుడు అగ్నివర్ణుడు. అతని కుమారుడు శీఘ్రగుడు. అతడి కుమారుడు మరువు. అతని కుమారుడు ప్రశుశ్రువుడు,

అతని కుమారుడు అంబరీషుడు, అతని కుమారుడు నహుషుడు, అతని కుమారుడు నాభాగుడు. నాభాగునకు అజుడు, సువ్రతుడు అనే ఇద్దరు కుమారులు కలిగారు. అజుని కుమారుడే ధర్మాత్ముడైన దశరథ మహారాజు. రాముడనే ప్రసిద్ధమైన పేరుగల నీవే ఆ దశరథ మహారాజుకు జ్యేష్ఠపుత్రుడవు. దశరథుని రాజ్యంపైన అధికారం గలవాడవు. ఇక్ష్వాకుల వంశంలో పెద్దకుమారుడే రాజవుతాడు. జ్యేష్ఠుడు ఉండగా చిన్నవాడు రాజార్హుడు కాడు. కనుక ఓ రామా! నీవు నీ రాజ్యాన్ని గ్రహించు; అయోధ్యను పాలించి మా అందరి మాటా మన్నించు.

ఓ రామా! అతి ప్రాచీనమైన ఈ రఘువంశాన వస్తున్న కులధర్మాన్ని మార్చవద్దు. నీవు కూడా నీ తండ్రిగానే చిరకాలం ప్రజారంజకంగా పాలించు.

# 111వ సర్గ రాముడు భరతుని అయోధ్యకు తిరిగి వెళ్ళమనటం

వసిష్ఠుడు (మరల రామునితో): ఓ రామా! పుట్టిన ప్రతి మానవుడికీ ముగ్గురు గురువులుంటారు. జన్మనివ్వటం చేత తండ్రి, కని పెంచటంవల్ల తల్లి, జ్ఞానం ప్రసాదించటం వల్ల ఆచార్యుడు గురువులవుతారు.

ఓ రామా! నేను నీకూ, నీ తండ్రికి కూడా గురువును. నువ్వు నేను చెప్పినట్లు చేస్తే సత్పురుషుల మార్గాన వెళ్ళినవాడవవుతావు. పండితులు, ఈ పరిషత్తు సభ్యులు, బ్రాహ్మణులంతా నీవారు. వీళ్ళందరినీ పరిపాలించడం ద్వారా కూడా నీవు సత్పురుషుల మార్గాన నడిచినవాడవవుతావు. నీ తల్లి పెద్దదయిపోయింది. ఆమెకు శుశ్రూషలు చెయ్యడం నీ ధర్మం. కాబట్టి ఆవిడకు శుశ్రూషలు చేస్తూ ఉంటే సత్పురుషుల మార్గాన్ని అతిక్రమించినవాడవు కావు. భరతుని ప్రార్థనలు మన్నించినట్లయితే నీవు స్వధర్మాన్ని అతిక్రమించినట్లు కాదు.

రాముడు: ఓ మహర్షీ! తల్లిదండ్రులు చిన్నతనం నుండే ఎంతో ప్రేమతో పెంచి పెద్దవాళ్ళను చేస్తారు. ఎన్నో మంచి మంచి ఉపదేశాలు చేసి పిల్లల్ని తీర్చిదిద్దుతారు. వారి ఋణాన్ని తీర్చుకోవడం సాధ్యమయ్యే పనికాదు.

నా తండ్రి దశరథ మహారాజు నాకు జన్మనిచ్చాడు. ఆయనకు నేను చేసిన వాగ్దానానికి భంగం వాటిల్లకూడదు.

భరతుడు: ఓ సుమంత్రుడా! నా అన్నగారు ఎన్ని విధాలుగా ప్రాథేయపడ్డా తన పట్టువీడటం లేదు. ప్రాయోపవేశం చేస్తాను. అన్నం, నీళ్ళు ముట్టను. దర్భలు తెప్పించండి. వాటిని నేలపై పరుచుకొని అన్నగారు ప్రసన్నులయ్యేంత వరకు వాటిపైనే పడుకుంటాను. రాముని ప్రసన్నం చేసుకోలేని ఈ దేహంతో పని ఏముంది?

సుమంత్రుడు రాముని వంక చూశాడు, రాముడు ఏమీ మాట్లాడలేదు. ఇక లాభం

లేదనుకున్నాడు. భరతుడే వెళ్ళి స్వయంగా దర్భలు తెచ్చుకొని నేలపై పరచుకొని దానిపై పడుకున్నాడు.

రాముడు: తమ్ముడా! భరతా! నేను నీకేం అపకారం చేశాను? ఎందుకు వాకిలికి అడ్డంగా పడుకుని ప్రాయోపవేశం చేస్తావు? బ్రాహ్మణులు మాత్రమే తమ బాకీ వసూలు చేసుకునేందుకు ఈ విధంగా ప్రాయోపవేశం చేస్తారు. కానీ క్షత్రియులకు అది ధర్మం కాదే? కనుక ఓ భరతుడా! వెంటనే ప్రాయోపవేశాన్ని విరమించి అయోధ్యకు వెళ్ళు.

ఈ విధంగా అంటున్న అన్నగారి మాటలు విన్న భరతుడు అక్కడ ఉన్న పౌరులతో, "మీరు ఎంతో శ్రమకోర్చి ఇంతదూరం వచ్చారు. అన్నగారికి ఏమీ చెప్పడం లేదేమిటి?" అన్నాడు. అందుకు పౌరులంతా ముక్తకంఠంతో "రాముని గూర్చి మాకు బాగాతెలుసు. ఆయన ఆడిన మాట తప్పడు. తండ్రిగారికిచ్చిన వాగ్దానం నెరవేర్చాలంటున్నాడు. ఆయన చెప్పేది ధర్మసమ్మతంగానే ఉంది" అన్నారు.

రాముడు: ఓ భరతుడా! ఈ పౌరులంతా ఏమంటున్నారో విన్నావు కదా! నేను చెప్పింది ప్రశాంతంగా ఆలోచించు. వాళ్ళు చెప్పింది కూడా కాస్త చెవికెక్కించుకో. నీ మొండిపట్టుదల విడిచి వెంటనే లేచి ఆచమనం చెయ్యి. నీ దోషం పోతుంది.

భరతుడికి ఏం చెయ్యాలో పాలుబోలేదు. కొద్దిసేపు ఆలోచించి అన్నగారు చెప్పినట్లే ఆచరించి రాముడి పాదాలకు నమస్కరించాడు. పౌరులతో ఇలా అన్నాడు.

భరతుడు: మహాజనులారా! నా మాటలను సావధానంగా ఆలకించండి. నేను రాజ్యం కావాలని ఎన్నడూ కోరలేదు. నేను నా తల్లిని రాజ్యం కావాలని ప్రేరేపించలేదు. రాముడు అడవులకు వెళ్ళేటప్పుడు నేను అయోధ్యలో లేను. నేను మీ అందరినీ కూడగట్టుకొని ఇంతదూరం వచ్చి మీ సమక్షంలో ఆయన పాదాలు పట్టుకొని తిరిగి అయోధ్యకు వచ్చి రాజ్యాభిషక్తుడవు కమ్మని ప్రార్థించాను. కానీ ఆయన తండ్రిగారికిచ్చిన మాట నెరవేర్చాల్సిందేనని ఖరాఖండీగా

అంటున్నాడు. ఆయనను అయోధ్యకు తీసుకుపోవటం నాకు సాధ్యపడటం లేదు. పైగా మీరంతా 'ఆయన చెప్పిందే బాగుంది' అంటున్నారు. సరే! ఆ పితృవాక్య పరిపాలన ఏదో నేనే చేస్తాను. ఆ పద్నాలుగు సంవత్సరాలు నేనూ శత్రుఘ్నుడూ అడవుల్లో ఉంటాం. అన్నగారిని సీతాలక్ష్మణులను తీసుకొని అయోధ్యకు వెళ్ళి రాజ్యం పాలించమనండి. ఆ విధంగా చేస్తే పితృవాక్యం పాలించినట్లు అవుతుంది. మీకు రామరాజ్యం దొరుకుతుంది.

భరతుడి మాటలకు పౌరులే కాదు, వసిష్ఠాది బ్రాహ్మణోత్తములు, మంత్రులు అంతా ఆశ్చర్యపోయారు. అప్పుడు రాముడు ఆ మహాజనాన్ని ఉద్దేశించి ఇలా అన్నాడు.

రాముడు: మహాజనులారా! మా తండ్రి దశరథ మహారాజు జీవించి ఉండగా ఏదైనా కొన్నా, అమ్మినా, కుదవ పెట్టినా, దానమిచ్చినా మేమెవ్వరమూ దానిని మార్చలేం గదా! అట్లా మార్పులూ, కూర్పులూ చేయడం నా తరం కాదు, భరతుడివల్లా కాదు; ఎవరివల్లా కాదు.

ఆ విధంగా ఆయన బ్రతికి ఉండగా భరతుడికి రాజ్యపాలన, నాకు అరణ్యవాసం నిర్ణయించారు. ఈ రోజు ఆ నిర్ణయాన్ని మార్చడం ఎవరి వల్ల అవుతుంది?

నేను రాజ్యపాలన చేయరాదని, భరతుడు రాజ్యం చెయ్యాలని నా తల్లి కైకేయీదేవి కోరటం, నా తండ్రి అందుకు ఆమోదముద్ర వేయడం జరిగిపోయింది. ఇప్పుడా ఏర్పాటును ఎవరూ మార్చలేరు. ఆ విధంగా తండ్రిగారికి అసత్యదోషం అంటరాదని మేము వనాలకు వచ్చేశాం. కాబట్టి తండ్రిగారి మాట నిలబెట్టడం కోసం ఎవరి బాధ్యత వాళ్లు నిర్వర్తించాలి.ఎంతమాత్రమూ బాధపడకూడదు.

# 112వ సర్గ భరతుడు రాముడి పాదుకలు స్వీకరించడం

ఆమహారణ్యంలో రామ–భరత సమావేశం, సంవాదం అంతా అక్కడ చేరిన మహర్షులకు, బ్రాహ్మణోత్తములకు, మంత్రులకు, పౌరులకు జానపదులకు పరమాశ్చర్యం కలిగించాయి. వారి ఒళ్ళంతా పులకరించింది. గగుర్పాటు చెందారు. ఈ సంవాదమంతా అక్కడ చేరిన వారేకాక ఆకాశాన్నుండి ఋషిగణం, సిద్ధులు, దేవర్షులు ఇంకా ఎందరో విని, రామ భరతులను ప్రశంసించారు. ధర్మంపట్ల వారు కనబరచిన అత్యాసక్తికి ఆశ్చర్యపడ్డారు. అట్టి కుమారులను కన్న దశరథుని వేనోళ్ళ కొనియాడారు. వారంతా ఆకాశాన్నుండి దిగివచ్చి వారితో ఇలా అన్నారు.

ఋషి దేవగణం: ఓ సోదరులారా! మీ ఇద్దరూ మాట్లాడుకోవటం శ్రద్ధతోను, ఆసక్తితోను విన్నాం. మిమ్మల్ని కన్న దశరథుడు ధన్యుడు. మీ సోదరులంతా ధర్మవేత్తలు. మాకు మీ మీద కలిగిన మక్కువ వలన మిమ్మల్ని కలసి మాట్లాడకుండా ఉండలేకపోయి ఇట్లా వచ్చాం. మేమంతా రావణుని ఆగడాలకు విసిగిపోయి ఉన్నాం.

ఓ భరతుడా! నీవు ఉత్తమమైన కులంలో పుట్టావు. సదాచారపరుడవు, గొప్ప కీర్తి గలవాడవు. నీ తండ్రిపై గౌరవం ఉంచి, రాముడు చెప్పినట్లు చెయ్యి. దశరథుడు కైకేయీదేవి ఋణం తీర్చటం వల్లనే స్వర్గానికి వెళ్ళాడు. మీ అన్నదమ్ములు ఆయన కైకేయికి చేసిన వాగ్దానాన్ని యథార్థంచేసి ఉండకపోతే ఆయన స్వర్గం నుండి పతనమయ్యేవాడు.

అప్పుడు రాముడు వారందరినీ సముచిత రీతిలో పూజించాడు. అంతట వారంతా వారివారి స్థానాలకు వెళ్ళిపోయారు.

భరతుడు: ఓ రామా! రాజధర్మానికి, కులధర్మానికి అంతరాయం కలుగకుండా ఉండాలంటే నీవు అయోధ్యకు తిరిగి రావాలి. అంతేకాదు, ఎవరైతే నిన్ను అరణ్యవాసానికి

ప్రేరేపించారో అట్టి నా తల్లి కైకేయీదేవి కూడా నిన్ను అయోధ్యకు తిరిగి రమ్మని కోరుతోంది. నీవు ఒక్క కోసల దేశమే కాదు, సమస్త భూమండలాన్నీ ఏలగల సత్తా ఉన్నవాడివి. నాకు అటువంటి శక్తి లేదు. కనుక నా మాట, నా తల్లి మాట, పౌరుల మాట మన్నించి అయోధ్యకు తిరిగి రావలసింది. ఇదే నీ పాదాలపైన నా శిరస్సు ఉంచి ప్రార్థిస్తున్నాను.

రాముడు: నాయనా! భరతుడా! లే! వచ్చి నా ప్రక్కన కూర్చో. భయపడకు. నీవు బుద్ధిశాలివి, గురువులనుండి శిక్షణపొందావు. ఈ భూమిని పాలించే సత్తా నీకు పూర్తిగా ఉంది. సమర్థులైన మంత్రు లున్నారు. తేజోవంతులైన బ్రాహ్మణులున్నారు. వారి సహాయంతో ఈ కోసల రాజ్యాన్నంతా ఏలగల సామర్థ్యం నీకు ఉంది.

ఇక నా సంగతి అంటావా! చంద్రుడికి కాంతి తరిగిపోతే పోవచ్చు. హిమాలయాల్లో మంచు లేకుండా పోవచ్చు. సముద్రం చెలియలికట్టను దాటి రావచ్చును. కానీ నేను మాత్రం తండ్రిగారికిచ్చిన వాగ్దానాన్ని మాత్రం తప్పను. నీ తల్లి నీ మీద ప్రేమచేతనో, రాజ్యంపై కాంక్షచేతనో నా వనవాసాన్ని కోరింది. అదంతా నీవు మనస్సులో ఉంచుకోవద్దు. నీ తల్లిని దూషించకు, ఆమెను చక్కగా గౌరవించు.

భరతుడు: పూజ్యుడవైన ఓ రామా! బంగారంతో చేసిన ఈ పాదుకలపై నీ పాదాలుంచు. ఈ పాదుకలే ఇకపై సమస్త భూమండలానికీ రక్షగా ఉంటాయి. యోగక్షేమాలు సమకూరుస్తాయి.

భరతుడు కోరినట్లుగా రాముడు ఆ బంగారు పాదుకలలో తన పాదాలుంచి మరల తీసి ఆ పాదుకలను భరతునకిచ్చేశాడు. భరతుడు ఆ పాదుకలకు భక్తితో నమస్కరించాడు.

భరతుడు: ఓ రామా! ఓ వీరుడా! నేను కూడా ఇకపై నారవస్త్రాలనే ధరిస్తాను. ఫలాలను మాత్రమే తింటూ రాజ్యభారాన్నంతా నీ పాదుకలపై ఉంచుతాను. నీవు వచ్చేవరకు నగరం బైటనే ఉంటాను. ఓ రామా! పద్నాలుగు సంవత్సరాలు కాగానే, ఆ మరునాడే నీవు అయోధ్యకు రావాలి.

నీవు అలా రాకపోతే అగ్నిప్రవేశం చేస్తాను.

అంతట రాముడు భరతుని కోరికను అంగీకరించాడు. తమ్ముడు శత్రుఘ్నుని కౌగలించుకొన్నాడు.

రాముడు: ఓ భరతా! నీ తల్లి కైకేయీదేవిని ప్రేమతోను, భక్తితోను చూసుకో. ఆమెపట్ల కోపం వహించవద్దు. ఈ మాట నీకు నా మీద సీత మీద ఒట్టుపెట్టుకొని చెబుతున్నాను. ఇక బయలుదేరి క్షేమంగా అయోధ్యకు చేరుకో.

అంతట భరతుడు ఆ పాదుకలను చక్కగా అలంకరించాడు. ఆ పాదుకలను శిరస్సున ఉంచుకొని రామునికి ప్రదక్షిణం చేశాడు. అంతట ఆ పాదుకల్ని పట్టపు ఏనుగుపైన చక్కటి ఆసనంపై ప్రతిష్ఠించాడు.

స్వధర్మాన్ని హిమవత్పర్వతంలాగా స్థిరంగా నిలుపుకొన్న రాముడు, ఆ వచ్చిన పౌరులను, మంత్రులను, వసిష్ఠ మహర్షిని, తల్లులను భరత శత్రుఘ్నులను అభినందించి పంపేశాడు.

## 113వ సర్గ భరతుడు అయోధ్యకు బయలుదేరటం

అంతట భరతుడు రాముని పాదాలకు నమస్కరించి, శ్రీరామ పాదుకలను భక్తితో శిరస్సున ఉంచుకొన్నాడు. శత్రుఘ్నునితో కలసి రథంపై కూర్చున్నాడు. అతడి రథానికి ముందుగా వసిష్ఠ మహర్షి, వామదేవుడు, జాబాలి, మంత్రులు వెళ్ళారు. వారంతా చిత్రకూట పర్వతానికి ప్రదక్షిణ నమస్కారం చేశారు. తూర్పుదిక్కుగా పర్వతం దిగి అక్కడనుండి మందాకినీనదిని దాటారు. వారి రథాన్ని వేలాది సైన్యం అనుసరించి వెళ్ళింది. భరతుడు భరద్వాజుని ఆశ్రమానికి కొద్ది దూరంలోనే రథాన్ని ఆపి కాలినడకన వెళ్ళి ఆ మహర్షి పాదాలకు నమస్కరించాడు. భరతుని చూస్తూనే ఆ మహర్షి సంతోషించినవాడై “రాముణ్ణి చూశావా? నీ పని పూర్తి అయిందా?” అని అడిగాడు.

భరతుడు: ఓ మహర్షీ! నేను, వసిష్ఠ మహర్షి మున్నగువారమంతా రాముని ప్రార్థించాం. వసిష్ఠ మహర్షి రామునితో ఇలా అన్నాడు. “ఓ గొప్ప బుద్ధిగల రామా! నీవు ఈ బంగారు పాదుకల్ని ధరించి భరతుడికి ఇవ్వు. మేము ఆ పాదుకలనే సింహాసనంపై పెట్టుకుని నీవు ఉన్నట్లుగానే భావిస్తూ అయోధ్యావాసుల యోగక్షేమాలు చూస్తూ ఉంటాం.” అందుకు రాముడు తూర్పుదిక్కుగా తిరిగి పాదుకలను ధరించి రాజ్యపాలన చేయటానికి తిరిగి వాటిని నాకిచ్చాడు. మేము ఆ మహాత్ముడైన రాముని పాదుకలను తీసుకొని అయోధ్యకు బయలుదేరాం. దారిలో మిమ్మల్ని కలుసుకొని మీ పాదాలకు నమస్కరించి, మీ ఆశీర్వాదాలు పొందటానికి మీ దర్శనానికై వచ్చాం.

భరద్వాజ మహర్షి: ఓ నరశ్రేష్ఠుడా! నీవు ఉత్తమ చరిత్రగల వాళ్ళల్లో శ్రేష్ఠుడవు. నీరు పల్లానికి పోయి చేరినట్లు, మంచి లక్షణాలన్నీ నీలో ఉన్నాయి. ధర్మం తెలిసినవాడవు, ధర్మం ఆచరించటంలో ఆసక్తి చూపే వాడవైన నిన్ను కన్న నీ తండ్రి దశరథ మహారాజు ధన్యుడు, మరణించినా సజీవుడే!

అప్పుడు భరతుడు ఆయన పాదాలకు నమస్కరించి ఆయన అనుమతి పొంది అయోధ్యకు ప్రయాణమయ్యాడు. వారంతా యమునానదిని దాటి తరువాత గంగానదిని సమీపించారు. పవిత్ర గంగానదిని దాటి శృంగిబేరపురాన్ని దాటుకుంటూ వచ్చి అయోధ్యను చూశారు.

అయోధ్యానగరం పాడుపడిపోయినట్లుగా ఉండడం చూస్తున్న భరతుడు సారథితో "ఓ సారథీ! దశరథ మహారాజు, సీతా రామలక్ష్మణులు లేని అయోధ్యానగరం పాడుపడిపోయినట్లుగా ఉన్నది. సంతోషం ఎక్కడా కనిపించడం లేదు" అన్నాడు.

# 114వ సర్గ భరతుడు అంతఃపురములోనికి ప్రవేశించటం

భరతుడి రథం గంభీరమైన ధ్వనులు చేసుకుంటూ అయోధ్యానగరం లోనికి ప్రవేశించింది. నగరమంతా చిక్కటి చీకట్లు క్రమ్ముకొని ఉంది; ఎక్కడా జనసంచారంలేదు. గుడ్లగూబలు యథేచ్ఛగా తిరుగుతున్నాయి. అంగారకగ్రహంచే పీడించబడుతున్న చంద్రుని ప్రియమైన భార్య రోహిణిమల్లే ఉంది. చెరువుల్లోనూ, వాగుల్లోను నీళ్ళు దాదాపు ఎండిపోయాయి. ఆ ఉన్న కాసిని నీళ్ళు సలసలా కాగుతున్నట్లున్నాయి. ఆ వేడినీళ్ళను పక్షులు కూడా త్రాగలేకుండా ఉన్నాయి. చేపలవంటి జలచరాలన్నీ చస్తున్నాయి. హవిస్సులు వేయగానే అణగారిపోయే అగ్నిహోత్రంలాగా నగరం కళావిహీనంగా ఉంది. యుద్ధరంగంలో కుప్పలు కుప్పలుగా చచ్చిపడి ఉన్న సైన్యం మాదిరి గొప్ప ఆపదలో ఉన్నట్లు అయోధ్యానగరం కానవస్తోంది. యాగం పూర్తి అయిన తరువాత ఉండే యాగమండపంలాగా నిశ్శబ్దంగా ఉంది. అయోధ్యానగరం ఆబోతులేని ఆవుల మందలాగా ఉంది. సానపట్టిన రత్నాలవలె ప్రకాశించాల్సిన అయోధ్య సానపట్టని మణుల్లాగా ప్రకాశం లేకుండా ఉంది. పుణ్యం క్షీణించి నేలరాలిన నక్షత్రంలాగా ఉంది ఆ అయోధ్య. అంగళ్ళన్నీ కొనేవాళ్ళులేక వెలవెలబోతున్నాయి. కార్యాలయాలు జనసంచారంలేక నిశ్శబ్దంగా ఉన్నాయి, చలివేంద్రంలోని కుండలన్నీ పగిలిపోయి త్రాగేందుకు నీరులేనట్లుగా ఉంది ఆ అయోధ్య. యుద్ధరంగంలో చచ్చిపడి ఉన్న ఆడగుర్రంలాగా ఉంది ఆ అయోధ్య. శరీరానికి చందనం మొదలైన సుగంధద్రవ్యాలు అందుకోని రసికుడి శరీరంలా ఉంది ఆ అయోధ్య. అటువంటి అయోధ్యను చూస్తూ భరతుడు సారథితో “ఓ సారథీ! ఇప్పుడు నగరంలో జనులు నృత్యగీతాలతో ఆనందంగా గడపడంలేదు. ఎందువల్లనో? మద్యవాసనలు ఎక్కడా మచ్చుకైనాలేవు; పూల గుబాళింపులు అంతకుమునుపే లేవు. రాముడే కాలినడకన వెళ్ళడం వల్ల ప్రజలెవ్వరూ వాహనాలను వాడటం లేదు. వాళ్ళు కాలినడకనే పోతున్నారు. అయోధ్యలోని యువకుల్లో రసికత్వం పోయి నిరాసక్తత చోటుచేసుకుంది. ఎక్కడ చూసినా, ఎక్కడ విన్నా రాముని వియోగశోకమే కనబడుతోంది; సారథీ! నగరశోభకూడా నా

సోదరుడితో కలసి వెళ్ళిపోయింది సుమా! రాముడు గ్రీష్మకాలమేఘంలాగా ఏనాడు అయోధ్యకు తిరిగివస్తాడో ఆనాడే ఆనందం తాండవిస్తుంది."

భరతుడు ఈ విధంగా మాట్లాడుతూ తండ్రి గృహంలోకి ప్రవేశించాడు. దశరథ మహారాజు లేని ఆ గృహం సింహంలేని గుహలాగా ఉంది. అటువంటి రాజాంతఃపురాన్ని చూసి భరతుడు కన్నీరు కార్చాడు.

# 115వ సర్గ నందిగ్రామంలో రామపాదుకలకు పట్టాభిషేకం

దృఢమైన మనస్సు గలిగిన భరతుడు తల్లులందరినీ అంతఃపురంలో దిగబెట్టాడు. తను మాత్రం తండ్రి, అన్నగారు లేని ఆ అంతఃపురంలో నివసించేందుకు ఇష్టపడలేదు. వసిష్ఠాది పెద్దలతో ఇలా అన్నాడు.

భరతుడు: నేను ఈ అంతఃపురంలో ఉండలేను. ఈ అయోధ్యలో కూడా ఉండలేను. దశరథ మహారాజు నన్ను శాశ్వతంగా వదలి వెళ్ళాడు. మహాత్ముడైన అన్నగారు వనాలకు వెళ్ళాడు. వాళ్ళులేని ఆ అంతఃపురంలోని భోగాలు నాకు వద్దు. సమీపానే ఉన్న నందిగ్రామానికి వెళతాను. ఇకపై నేను అక్కడే నివసిస్తాను.

వసిష్ఠ మహర్షి, మంత్రులు: ఓ భరతుడా! నీ నిర్ణయం ఎంతో మెచ్చుకోదగ్గది. ఈ విధంగా ఆలోచించడంగాని, మాట్లాడటంగాని, ఆచరించగలగటంకాని లోకంలో నీ వొక్కడికే చెల్లుతుంది. పితృప్రేమలోను, సోదరప్రేమలోను నీకు నీవే సాటి. నీవు ఉత్తమమైన నిర్ణయాన్ని తీసుకున్నావు. నీతో మేమంతా ఏకీభవిస్తున్నాం.

అంతట భరతుడు సారథిని రథం సిద్ధం చెయ్యమన్నాడు. భరతుడు అక్కడున్న పెద్దలందరికీ నమస్కారంచేసి రథమెక్కాడు. అతడి వెనకాలే శత్రుఘ్నుడు కూడా రథంలో కూర్చున్నాడు. భరతుడి రథానికి ముందుగా వసిష్ఠాదు లందరూ బయలుదేరారు. వారి వెంట చతురంగబలాలు బయలుదేరాయి వారంతా నందిగ్రామం చేరుకొన్నారు. భరతుడు రథంలో కూర్చున్నా రామపాదుకలను శిరస్సునే ఉంచుకున్నాడు. మంత్రులతో ఇలా అన్నాడు.

భరతుడు: ఓ మంత్రి సత్తములారా! మహాజనులారా! రాముడు ఈ రాజ్యానికి నన్ను తన ప్రతినిధిగా నియమించాడు. ఈ పాదుకలే ప్రజల యోగక్షేమాలను కనిపెట్టి ఉంటాయి. కాబట్టి మీరు ఇప్పుడు ఈ పాదుకలకే తెల్లని గొడుగు పట్టండి. ఇవే ఆయన స్థానంలో ఇక్కడ ఉంటాయి.

ఈ పాదుకల వల్లనే రాజ్యం సురక్షితంగా ఉంటుంది. నా మీదగల ప్రేమాతిశయం చేత రాముడు ఈ నిక్షేపాన్ని నాకు ఇచ్చాడు. అందువల్ల ఆయన వచ్చేంతవరకు ఈ పాదుకలకోసం నేను రాజ్యపాలన చేస్తాను. ఆయన రాగానే స్వయంగా ఈ పాదుకల్ని ఆయన పాదాలకు తొడుగుతాను. ఆయన పాదాలకు నమస్కరించి, ఈ రాజ్యభారాన్ని ఆయనకు అప్పగిస్తాను. అటుపైన ఆయన్నే నా తండ్రిగా చూసుకుంటూ సేవలు చేసుకుంటాను. నాకు వచ్చిన అపకీర్తిని ఈ విధంగా పోగొట్టుకుంటాను. ఆయన వచ్చాక రాజ్యాభిషేకం జరిగేటప్పుడు అంతా సంతోషిస్తారు. నేను కూడా వాళ్ళతోపాటు సంతోషిస్తాను అదే నా భాగ్యమని భావిస్తాను.

అంతట భరతుడు ఆ పాదుకలకు పట్టాభిషేకం చేయించాడు. నారవస్త్రాలు జటావల్కలాలు ధరించి ఆ నందిగ్రామంలోనే ఉంటూ రాజ్యపాలన చేయసాగాడు. సమస్త రాచకార్యాలు పాదుకలకే విన్నవించేవాడు. సామంతులిచ్చే కానుకలన్నీ ఆ పాదుకలకే సమర్పించేవాడు.

# 116వ సర్గ ఋషులు చిత్రకూటాన్ని విడిచి వెళ్ళటం

భరతుడు సైన్యంతో తిరిగి వెళ్లిపోగానే, చిత్రకూటంలో తపస్సు చేసుకుంటున్న ఋషుల్లో కొద్దిగా కలకలం ప్రారంభమైంది. వాళ్ళల్లో అంతకు పూర్వం ఎరగని భయం, అనుమానం చోటు చేసుకున్నాయి. వాళ్ళల్లో వాళ్ళు రాముణ్ణి గూర్చి సౌజ్ఞలతోను, కన్నులతోను, కనుబొమ్మలు ఆడిస్తూ రాముని ఎదుటే మాట్లాడుకోసాగారు. కొందరు చిత్రకూటాన్ని వదలి వేరొకచోటుకు వెళ్ళిపోయారు. ఇదంతా గమనించిన రాముడు తనవల్ల ఏదైనా అపరాధం జరిగిందేమోనని సందేహించాడు. అక్కడుంటున్న ఋషీశ్వరుల్లో వృద్ధుడూ, వారందరికీ గౌరవపాత్రుడూ అయిన కులపతి వద్దకు పోయి రాముడు నమస్కరించి ఇలా అన్నాడు.

రాముడు: ఓ మహానుభావా! నేను ఇక్కడకు వచ్చిన తరువాత, తపోధనులెవ్వరికీ అసౌకర్యం కలిగించలేదు. వాళ్లంతా నన్ను చూసి భయపడుతున్నట్లున్నారు. నేనుగాని, నా తమ్ముడు లక్ష్మణుడుగాని ఎవరికైనా అపరాధం చేశామా? ఋషులందరికీ సేవలు చెయ్యటమే పరమభాగ్యంగా తలచే నా భార్య సీత ఏమైనా అపరాధం చేసిందా? మా వల్ల ఏదైనా అపచారం జరిగివుంటే సరిదిద్దుకుంటాం.

కులపతి (శరీరం, మాట కూడా వణకుతున్నాయి): ఓ రామా! జనక మహారాజు కుమార్తె అయిన సీత ధర్మలోపం ఏమీ చేయలేదు. ఆమె మంగళస్వరూపిణి.

రామా! ఈ ప్రాంతంలో రాక్షసుల బాధ ఎక్కువగా ఉంటుంది. వాళ్ళలో ఖరుడు అనేవాడు మహాబలవంతుడు, పరమకిరాతకుడు. వాడు ఈ మధ్య నరమాంసానికి అలవాటుపడ్డాడు. అన్నిటికీ మించి వాడు రావణాసురుడికి తమ్ముడవుతాడు. ఆ కారణాన వాడు అపజయమనేదే ఎరుగడు. ఈ చిత్రకూటంలో తపస్సు చేసుకుంటున్న చాలామంది ఋషులను వెళ్ళగొట్టాడు.

నీవు వచ్చి ఇక్కడ ఉండటం మూలంగా వాడు నీపట్ల చాలా అసూయగా ఉన్నాడు. వాడు నిన్ను చూసి ఒక విధంగా భయపడుతున్నాడు. వాడు అప్పుడప్పుడూ కొంతమంది రాక్షసుల్ని పంపి ఋషీశ్వరులను భయపెట్టిపోతూ ఉంటాడు. మా ఆశ్రమాల ముందు రక్తమాంసాలవంటి అపరిశుద్ధమైన పదార్థాలు పడేసి పోతూ ఉంటాడు. కొంతమంది తపస్సు చేసుకునే వాళ్ళ మీద పడి చంపేస్తూ ఉంటాడు. హోమగుండాల్లో నీళ్ళుపోసి పోతూ ఉంటాడు. హోమాలు చేస్తూంటే సమిధలను, కట్టెలను బయటకు లాగేస్తూ ఉంటాడు. మేమంతా ఈ ప్రాంతాన్ని విడిచి పోయేందుకు అనేక ఇబ్బందులు కలిగిస్తున్నాడు.

ఓ రామా! మేము ఈ ప్రాంతాన్ని విడిచిపెట్టి పోవాలనుకుంటున్నాం. మేమంతా వెళ్ళిపోతే ఒంటరివాడివైపోతావు. పైగా భార్యతో కలసి ఉంటున్నావు. ఏం అఘాయిత్యం చేస్తారో అని భయపడుతున్నాం. నువ్వు ఇక్కడకు కొత్తగా వచ్చావు. నువ్వు మంచివాడిలాగా ఉన్నావు. ఈ విషయాలన్నీ నీకు ఎట్లా చెప్పటమా అని మా వాళ్ళంతా తటపటాయిస్తున్నారు. మేము ఇప్పుడు పోతున్న వనం చాలా ప్రశాంతంగా ఉంటుంది. కందమూలాలు సమృద్ధిగా దొరుకుతాయి. రాక్షసుల బెడదలేదు. కాబట్టి నీవు ఒక్కడవు ఇక్కడ ఉండొద్దు. మాతో రండి.

ఆ రాక్షసులను గూర్చి ఏమీ భయపడవద్దని రాముడు వారికి ఎన్నో విధాల నచ్చచెప్పాడు. కానీ వారు వినలేదు. రాముణ్ణికూడా రమ్మని బలవంతం చేశారు. చివరకు ఆ కులపతి రాముణ్ణి అభినందించి ముని సమూహంతో వెళ్ళిపోయాడు. రాముడు వాళ్ళందరినీ చాలాదూరం సాగనంపి తిరిగి పర్ణశాలకు వచ్చాడు.

# 117వ సర్గ సీతా రామలక్ష్మణులు అత్రిమహర్షి ఆశ్రమానికి వెళ్ళడం

కులపతి మునీశ్వరుడు తక్కిన మునీశ్వరులను తీసుకొని వెళ్ళిపోయిన తరువాత రాముడు బాగా ఆలోచించి తాముకూడా ఈ చిత్రకూటాన్ని విడిచిపోవాలనే అనుకున్నాడు.

భరతుడు వచ్చి వెళ్ళిన తరువాత రాముడికి మనస్సు మనసులో లేదు. తల్లులు, మంత్రులు, భరతుడు, శత్రుఘ్నుడు రావడం, కొంతసేపు ఉండి ఒకళ్ళకోసం ఒకళ్ళు దుఃఖించడం, ఒకరినొకరు ఓదార్చుకోవటం, ఇవన్నీ రాముడి మనస్సును కలతపెట్టాయి. అంతేకాకుండా సైన్యంతోపాటు వచ్చిన ఏనుగులు, గుర్రాలు, ఇతర జంతువులు వేలు, లక్షల సంఖ్యలో రావటం వలన ఆశ్రమ వాతావరణం బీభత్సంగా తయారైంది. ఈ విధంగా ఆలోచిస్తూ సీతా లక్ష్మణులను కూడా సంప్రదించి చిత్రకూట పర్వతాన్ని విడిచిపెట్టి పోయేందుకే నిర్ణయించుకొని, అత్రిమహాముని ఆశ్రమానికి చేరుకున్నారు.

అత్రిమహాముని సీతా రామలక్ష్మణులను సాదరంగా ఆహ్వానించి అర్ఘ్యపాద్యాదులతో సత్కరించాడు. వృద్ధులైన అత్రిమహాముని అనసూయలు సీతా రామలక్ష్మణులతో చక్కగా మాట్లాడి వాళ్ళను సంతోషపెట్టారు.

అత్రి మహర్షి: ఓ రామా! ఈమె నా భార్య అనసూయ. మహాభాగ్యవతి. గొప్ప తపస్విని. పూర్వం ఒకప్పుడు పది సంవత్సరాలు వరుసగా వర్షాలు కురవలేదు. ఈ వనాల్లో ఉండే మునులంతా ఆహారానికీ, నీటికీ మొహంవాచి ఉండగా ఈమె తన తపశ్శక్తి చేత ఆహారాన్ని సృష్టించి వారందరికీ ప్రాణదానం చేసింది. మధురమైన గంగాజలాన్ని ప్రవహింపజేసి ప్రాణుల దాహాన్ని తీర్చింది. ఈమె అనేక నియమాలు పాటిస్తూ తీవ్రమైన తపస్సు చేసింది. ఎన్నో వ్రతాలు చేసింది. అనేక పర్యాయాలు దేవతలకు సహాయం చేసింది. పది పగళ్ళను ఏకంచేసి రాత్రి లేకుండా చేసింది. నాయనా! ఈమె నీకు తల్లిలాంటిది. ఈమె కోపమంటేనే ఎరుగనిది. అమ్మా సీతా! నీవు ఈమెను పూజించు.

రాముడు: ఓ సీతా! అత్రి మహర్షి చెప్పినదంతా విన్నావు కదా! నీవు ఈమెకు సేవచెయ్యి.

అనసూయాదేవి చాలా వృద్ధురాలు. శరీరం అంతా ముడతలు పడిపోయింది. అవయవాలన్నీ పండిపోయాయి, జుట్టంతా నెరిసిపోయింది. గాలి గట్టిగా వీస్తే పడిపోయేట్లుంది. ఆ మహాపతివ్రతకు సీతా రామలక్ష్మణులు భక్తిపూర్వకంగా ప్రదక్షిణ నమస్కారాలు చేశారు. సీతాదేవి ఆమెకు నమస్కరించి దగ్గరగా కూర్చుని ఆరోగ్యాన్ని గూర్చి విచారించింది.

అనసూయ: అమ్మా! సీతా! నువ్వు ధర్మమార్గాన నడుస్తున్నావు. భోగాలని, ఐశ్వర్యాన్ని, ఆహంకారాన్ని కాదని భర్త వెంట అడవులకు వచ్చావు. భర్త ఎట్లాంటివాడైనా ధార్మికుడైనా, పాపాత్ముడైనా భార్య అతణ్ణి ఎప్పుడూ వెన్నంటే ఉండాలి. భర్తను సంతోషపెట్టే భార్యకు ఇహంలోను, పరంలోనూ సుఖాలు దక్కుతాయి. ఉత్తమ స్వభావురాలైన స్త్రీలు భర్త దుశ్శీలుడైనా, దరిద్రుడైనా అతణ్ణే దైవంగా భావించాలి.

ఓ సీతా! నేను ఎంత ఆలోచించినా భర్తను మించిన బంధువు నాకు కనబడటం లేదు. అతడు ఒక గొప్పతపస్సు వంటివాడు. కామంతో భర్తపై అధికారం చెయ్యాలని స్త్రీలు మంచిచెడ్డలను తెలుసుకోలేరు. ధర్మసూక్ష్మాలు తెలియనివాళ్ళు. అటువంటి వాళ్ళంతా దురాలోచనలు చేస్తారు, దుర్మార్గాలను అనుసరిస్తారు, సుఖశాంతులు లేకుండా చేస్తారు. చివరగా అపకీర్తి పాలవుతారు. ధర్మభ్రష్టులైనవారు పరలోకాల్లోకూడా బాధలు అనుభవిస్తారు. మంచీచెడు తెలుసుకొని విచక్షణతో ఆలోచించే నీలాంటి వాళ్ళు గుణవంతులు, ధర్మపరాయణులు అవుతారు. ఇహపరాల్లో సుఖాలు అనుభవిస్తారు. కాబట్టి ఓ సీతా! నీవు చివరివరకూ ఇట్లాగే భర్త వెంట ఉంటూ, సహధర్మచారిణి అన్న మాటను సార్థకం చేస్తూ పతివ్రతగా ఉండు. నీవు ధర్మపరురాలవు అవుతావు. లోకంలో యశస్సు పెరుగుతుంది.

# 118వ సర్గ సీత –అనసూయల సంభాషణ

అసూయ అంటే ఏమిటో ఎరుగని సీత అనసూయాదేవి మాటలు శ్రద్ధతో విన్నది. ఆమె చెప్పింది అక్షరాలా సత్యమని ఒప్పుకుంది.

సీత: ఓ పూజ్యురాలా! నీవు చెప్పిందంతా యథార్థమే. స్త్రీకి భర్తే దైవమని నేనుకూడా నమ్ముతాను. భర్త సదాచారపరుడు కాకపోయినా అతడు పూజించ తగ్గవాడే. ఇక నా భర్త విషయానికొస్తే, అతడు గుణవంతుడు, దయామయుడు, జితేంద్రియుడు, ధర్మాత్ముడు, తల్లిలాగా, తండ్రిలాగా, చాలా ఇష్టుడు. నా ఎడల స్థిరమైన ప్రేమగలవాడు. ఇంకా ఆయన్ను గురించి చెప్పాలంటే లోకంలో ఇంకేమి మిగిలి ఉంది? సర్వసద్గుణాలు ఆయనలోనే ఉన్నాయి.

మహాబలశాలి అయిన రాముడు కౌసల్యాదేవి పట్ల ఏ విధంగా ప్రవర్తిస్తాడో, దశరథ మహారాజు ఇతర భార్యలందరినీ ఆమెతో సమానంగా చూస్తాడు. దశరథ మహారాజు ఏ స్త్రీ వైపైనా కన్నెత్తి చూసినా సరే, ఆమెను తన తల్లిలాగా గౌరవిస్తాడు.

నేను నా భర్తతో అరణ్యానికి బయలుదేరే ముందు నా అత్తగారైన కౌసల్యాదేవి చేసిన ఉపదేశం నాకు బాగా గుర్తుంది. నా పెళ్ళైనప్పుడు నా తల్లిగారు చేసిన ఉపదేశం ఇప్పటికీ నా చెవుల్లో చెప్తున్నట్లుగానే ఉంటుంది.

ఓ ధర్మాత్మురాలా! మీ మాటలు వింటుంటే మా అత్తగారు, తల్లీ చేసిన ఉపదేశాలే జ్ఞాపకం వస్తున్నాయి. స్త్రీకి పతి శుశ్రూష కంటే వేరే తపస్సు ఏదీలేదనే నేనుకూడా నమ్ముతున్నాను.

తల్లీ! సావిత్రీదేవి పతి శుశ్రూష చేసినందువల్ల ఆమె స్వర్గానికి కూడా వన్నెతెచ్చి పెట్టింది. నీవుకూడా పతి శుశ్రూష చేతనే గొప్ప తపశ్శక్తిని పొందటమే కాకుండా, మరణానంతరం స్వర్గానికి కూడా వెళతావు. అంతెందుకు! స్త్రీలలో మాణిక్యమైన రోహిణీదేవి చంద్రుని విడిచి

క్షణమైనా ఉంటుందా? ఇంకా ఎంతో మంది ఉత్తమ స్త్రీలు వారి భర్తలను సేవించిన పుణ్యకర్మల ఫలితంగా స్వర్గాన్ని పొందారు.

సీత చెప్పిన మాటలకు అనసూయాదేవి చాలా సంతోషించింది. ప్రేమతో సీత శిరస్సున ముద్దు పెట్టుకొని ఇలా అంది: “ఓ సీతా! నీ అందమైన చిరునవ్వులే నీకు పెట్టని ఆభరణాలు. నేను అనేక నియమాలు పాటిస్తూ గొప్పతపస్సు చేశాను. ఆ తపస్సే నా బలం. నా తపోబలంతో నీకో వరం ఇవ్వాలని ఉంది కోరుకో.”

సీత: అమ్మా! నీ ప్రేమతో నా తల్లిని, అత్తనే మరిపించావు. అంత ప్రేమతో వరం ఇస్తానని అనడం కన్నా గొప్పవరం ఇంకేం ఉంటుంది?

అనసూయ: ఓ సీతా! నీ మాటలు నాకు చాలా సంతోషాన్ని కలిగించాయి. నువ్వు కోరటం లేదు కాబట్టి నేనే స్వయంగా వరం ఇస్తున్నాను తీసుకో. ఈ అంగరాగాన్ని ఒంటికి పూసుకుంటే, మహావిష్ణువును లక్ష్మీదేవి సంతోషపరచినట్లుగా నీవు రాముణ్ణి సంతోషపరుస్తావు. ఇదిగో ఈ వస్త్రాన్ని, అంగరాగాన్ని నీ వద్ద ఉంచుకో.

అంతట సీత అనసూయాదేవి ఇచ్చిన కానుక అందుకొంది. తరువాత అనసూయాదేవి సీతనుండి ఏదో విషయం తెలుసుకోవాలనే కుతూహలంతో దగ్గరగా జరిగి కూర్చుంది.

అనసూయ: ఓ సీతా! మహాకీర్తిమంతుడైన రాముడు నిన్ను స్వయంవరంలో పొందాడని వారూ వీరూ చెప్పగా విన్నాను. ఇప్పుడు నీవే నా ప్రక్కన ఉండటం వల్ల, నీ నోటి మీదుగానే తెలుసుకోవాలని ఉంది. ఆ స్వయంవర విశేషాలన్నీ నాకు చెప్పు.

సీత: మిథిలాధిపతియైన జనకుడు నాకు తండ్రి. ఆయన గొప్ప ధర్మవేత్త, క్షత్రియధర్మాన్ని అనుసరించి న్యాయానుసారంగా రాజ్యపాలన చేస్తాడు. ఆయన ఒక యజ్ఞాన్ని చేపట్టి యజ్ఞభూమిని నాగలి పట్టి దున్నసాగాడు. అప్పుడు నేల దున్నుతుండగా భూమి లోపలనుండి

నేను బయటకు వచ్చానట. దున్నిన ఆ యజ్ఞభూమిలో విత్తనాలు చల్లబోతూ ఉండగా నేను కనిపించటంతో నన్ను చూసి ఆశ్చర్యపోయాడు. సంతానంలేని ఆ రాజు నన్ను ప్రేమతో ఎత్తుకొని తీసుకొనిపోయి నా తల్లి చేతిలో పెట్టినాడట. ఆనాటినుండి వారిద్దరూ "ఈమె నా కూతురు" అంటూ నన్ను ప్రేమతో ఎత్తుకుని ముద్దాడుతూ ఉండగా "ఓ మహారాజా! ఈమె మనుష్యజాతికి చెందింది కాదు. దేవతలకే దేవేరి. ధర్మంచేత ఈమె నీ కూతురన్న విషయంకూడా సత్యమే" అని అశరీరవాణి పలికిందట.

అశరీరవాణి పలుకులకు పరమానందం పొందిన నా తండ్రి జనకమహారాజు నన్ను పుత్రిగా స్వీకరించి పరమ ఆదరంతో పెంచారు. ఆనాటినుండి ఆయన సంపదలు వృద్ధిపొందుతూ వస్తున్నాయట.

నాకు వివాహానికి తగిన వయసు రాగానే నా తండ్రి చెప్పరాని దిగులు చెందాడు. ధనం పోగొట్టుకున్న దరిద్రుడిలాగా దుఃఖించాడు. లోకంలో ఆడపిల్ల తండ్రి ఎంత ఉన్నత స్థితిలో ఉన్నా, పిల్ల పెళ్ళి విషయానికి వచ్చేటప్పటికి తనకంటే తక్కువవాళ్ళ చేతకూడా మాటలు పడుతూ ఉండాల్సివస్తుంది. దీంట్లోనుండి ఎట్లా బయటపడటమా అని నా తల్లితండ్రులు తలలు పగిలేట్లు ఆలోచించారు. చివరకు వారికో బ్రహ్మాండమైన ఆలోచన తట్టిందట. అదేమంటే నా వివాహానికి స్వయంవరం చాటించడం.

పూర్వం నా తండ్రి తలపెట్టిన ఒక మహాయజ్ఞంలో వరుణదేవుడు వచ్చి నా తండ్రికి ఒక ధనుస్సు, రెండు అంబుల పొదులను ప్రేమతో ఇచ్చాడట. ఆ ధనుస్సు చాలాబరువైనది కావటంవల్ల మానవమాత్రులెవ్వరూ దాన్ని ఎత్తలేకపోయేవారు.

సత్యవాది అయిన నా తండ్రి రాజులందరినీ పిలిచి ఆ ధనుస్సు పుట్టుపూర్వోత్తరాలన్నీ వివరించి చెప్పారు. "ఎవరైతే ఆ ధనుస్సుకు నారి సంధిస్తాడో వారికే నా కుమార్తె నిచ్చి వివాహం చేస్తాను. ఇది సత్యం" అని ప్రకటించాడు. ఆ రాజులందరూ ఆ ధనుస్సును కదల్చటానికి కూడా

అసమర్థులై వెనక్కు తిరిగి వెళ్ళిపోయారు.

చాలాకాలం తర్వాత నా తండ్రిగారు తలపెట్టిన యజ్ఞాన్ని చూసేందుకు విశ్వామిత్ర మహర్షి మరికొందరు మునీశ్వరులు వచ్చారు. వారితోపాటు ఇద్దరు సోదరులు కూడా వచ్చారు. యజ్ఞశాలలో నా తండ్రి విశ్వామిత్ర మహర్షికి స్వాగతంచెప్పి అర్ఘ్య పాద్యాదులతో గౌరవించాడు.

విశ్వామిత్రుడు: ఓ జనకమహారాజా! వీరిద్దరూ రామలక్ష్మణులు, దశరథ మహారాజు పుత్రులు. వారు నీ స్వయంవర ప్రకటన గూర్చి విన్నారు. వారాధనుస్సును చూడాలని అనుకొంటున్నారు.

విశ్వామిత్రుని మాటలు విన్న మా తండ్రి ఆ ధనుస్సును తెప్పించారు. మహాబలశాలి, ఆజానుబాహువు, మహాపరాక్రమవంతుడు అయిన రాముడు క్షణంలో ఆ విల్లుని పట్టుకొని నారిసంధించే లోపుగానే ఆ ధనుస్సు రెండు ముక్కలైపోయింది. ఆ ధనుస్సు విరిగి పడ్డప్పుడు పిడుగులు పడ్డట్టుగా భయంకరమైన ధ్వని కలిగింది.

అంతట సత్యవ్రతుడైన నా తండ్రి నన్ను రాముడికిచ్చి వివాహం జరిపేందుకు అన్ని ఏర్పాట్లూ చేయించాడు. కానీ తండ్రి అయిన దశరథ మహారాజు అనుమతి లేకుండా నన్ను వివాహం చేసుకోవటానికి రాముడు అంగీకరించలేదు. అంతట నా తండ్రి వృద్ధులైన నా మామగారైన దశరథ మహారాజును పిలిపించారు. ఆయన అనుమతి అయిన తరువాత నన్ను రామునికి, ఊర్మిళను లక్ష్మణునికి ఇచ్చి వివాహం చేశారు. ఆ విధంగా పరాక్రమంలో శేష్ఠుడైన రాముని ధర్మపత్నినై సేవలు చేస్తున్నాను.

## 119వ సర్గ సీత రామలక్ష్మణులు అత్రి ఆశ్రమంలో నిద్రించటం

ధర్మజ్ఞురాలైన అనసూయాదేవి సీతారాముల కల్యాణఘట్టాన్ని విని పరమానందం చెందింది. సీతను దగ్గరకు తీసుకొని తలపై ప్రేమతో ముద్దుపెట్టుకుని, "నీ కథంతా క్లుప్తంగా చెప్పినా మనోహరంగా చెప్పావు" అంది. ఇంతలో సూర్యాస్తమయం కావచ్చింది. పక్షులన్నీ గూళ్ళకు చేరుతున్నాయి – మునులంతా సాయంకాలపు స్నానాలు ముగించుకొని కలశాలనిండా నీళ్ళు నింపుకొని తడిబట్టలతో ఆశ్రమాలకు తిరిగి వస్తున్నారు. హోమాలనుండి పొగ బైటకువస్తోంది. సంధ్యచీకట్లలో చెట్ల ఆకులన్నీ ఒత్తుగాను, దగ్గరగాను ఉన్నట్లు కనిపిస్తున్నాయి.

అనసూయ: ఓ సీతా! ఆకాశంలోని నక్షత్రాలవల్ల చీకటి రాత్రి చుక్కల చీరకట్టుకున్నట్లుంది. నీ కథ మనోహరంగా చెప్పావు, నాకు చాలా ఆనందంగా ఉంది. ఇక నీవు పోయి రాముడి సేవలు చూసుకో, నేను అనుజ్ఞ ఇస్తున్నాను.

ఓ సీతా! నీవు ఇక్కడే నేనిచ్చిన చీరను సింగారించుకో, అలంకారంతో ముస్తాబైన నిన్ను కన్నులపండువగా చూడాలని ఉంది.

అంతట సీతాదేవి చక్కగా అలంకరించుకొని అనసూయాదేవికి నమస్కరించి ఆమె అనుమతి తీసుకొని రాముని వద్దకు వెళ్ళింది. రాముడు ఆమె అలంకారాలను చూసి చాలా సంతోషించాడు. అనసూయాదేవి ఇచ్చిన ఆ అలంకారాలను ఎంతో మెచ్చుకున్నాడు. అనసూయాదేవిని సంతోషపెట్టి ఆమెనుండి పొందిన అలంకరణ రూపమైన కానుకలు చూసి రామలక్ష్మణులు సీతను అభినందించారు.

ఆ తపోవనంలోని మునులంతా చేరి ఆ రాత్రి సీతా రామలక్ష్మణులకు ఆతిథ్యం ఇచ్చారు. ఆ రాత్రి ఇట్టే గడచిపోయి భళ్ళున తెల్లవారింది. మరునాడు ఉదయానే లేచి స్నానాదులు పూర్తి చేసుకున్నారు. మునులంతా హోమకర్మలన్నీ పూర్తి చేసుకోగానే సీతా రామలక్ష్మణులు

ప్రయాణమయ్యారు. దండకారణ్యంలో నరమాంసాన్ని తినే రాక్షసులు తిరుగుతూ ఉంటారని, క్రూరమృగాలు కూడా అధికంగా ఉంటాయని ఋషులు వారిని హెచ్చరించారు. తరువాత సీతా రామలక్ష్మణులకు దారిచూపి సాగనంపారు. సీతా రామలక్ష్మణులు ఆ మహర్షులందరికీ నమస్కరించి బయలుదేరారు.



# అరణ్య కాండము



## 1వ సర్గ రాముని దండకారణ్య ప్రవేశం

ధైర్యవంతుడూ, బుద్ధిమంతుడూ అయిన రాముడు సీతా లక్ష్మణులతో దండకారణ్యంలోకి ప్రవేశించాడు. అక్కడ వారు ఒక తపోవనాన్ని చూశారు. ఆ ప్రాంతంలో అనేకమంది మునులు పర్ణశాలలు నిర్మించుకొని తపస్సు చేసుకుంటున్నారు. ఆ ప్రాంతంలో చెట్లమీద నారచీరలు, కౌపీనాలు ఆరవేసుకున్నారు. అక్కడక్కడా దర్భలు, నువ్వులు కనిపిస్తున్నాయి. వారి అగ్నిగృహాలన్నీ విశాలంగా ఉన్నాయి. అవన్నీ భగభగ మండే అగ్నితో ప్రకాశిస్తున్నాయి. అగ్నిహోత్రాల్లో వేసిన హవిస్సులతో ఆకాశాన్నంతా దట్టమైన పొగలు క్రమ్మివేశాయి. ఆశ్రమంలో పెరిగే జంతువులన్నీ జాతి వైరాలు మరచిపోయి నిర్భయంగా తిరుగుతున్నాయి. ప్రతి పర్ణశాల ముందు చక్కగా అలికి ముగ్గులు పెట్టి ఉన్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ఆ తపోవనం అంతా వైదిక శోభతోను, బ్రహ్మవర్చస్సుగల మునులతోను, సూర్యమండలం మల్లే కళ్ళు మిరుమిట్లు గొలుపుతోంది. ఆ ఆశ్రమాలను పూజించటానికి అప్సరసలు వచ్చి ప్రతిరోజూ నాట్యం చేసి పోతూ ఉంటారు.

ఆ ఆశ్రమాల్లో ప్రతి రోజూ బలిహోమాలు, దేవతల పూజలూ జరుగుతూ ఉంటాయి. వేదఘోషలు మారుమ్రోగుతూ ఉంటాయి. ఆ చుట్టుపక్కల ఉండే వృక్షాలన్నీ సువాసనలు వెదజల్లే పుష్పాలను, మధురమైన ఫలాలను ఆ తాపసుల కోసం నిస్స్వార్థంగా సమర్పిస్తున్నాయి. ఆ ఆశ్రమవాసులంతా ఆ ఫలాలనే ఆహారంగా తీసుకొంటూ ఇంద్రియ నిగ్రహం కలవారై నారవస్త్రాలు ధరిస్తూ, సూర్యుడు, అగ్నులతో సమానమైన తేజస్సుతో ప్రకాశిస్తున్నారు. ఆ

ఆశ్రమవాసులంతా వయోవృద్ధులే. నిత్యం వేద ఘోషలతో ఆ ఆశ్రమం బ్రహ్మలోకాన్ని తలపింప చేస్తూ ఉంటుంది.

మహా పుణ్యాత్ములు, వేదవేత్తలు అయిన బ్రాహ్మణులతో నిండి ఉన్న ఆ తపోవనాన్ని చూడగానే రాముడు తన ధనుస్సు నుండి నారిని విప్పివేశాడు. దివ్యజ్ఞాన సంపన్నులైన ఆ మునీశ్వరులంతా సీతారామలక్ష్మణులు తమ ఆశ్రమాల వైపు రావడం చూశారు. నియమ నిష్ఠలలో ఉన్నవారంతా, ధర్మాచరణ తత్పరులైన రామలక్ష్మణులను, కీర్తిమంతురాలైన సీతను చూశారు. వారందరూ వారికి ఎదురుగా వెళ్ళి మధురమైన మాటలతో స్వాగతం పలికారు. రూపసౌందర్యాలతో సీతారామలక్ష్మణులు ఒకరిని మించి మరొకరు ఉండటంతో, ఆ తపోవనంలోని జనులంతా వారిని ఆశ్చర్యంగా చూశారు. లోకహితం కోరే ఆ తాపసులు సీతారామలక్ష్మణులు ఉండేందుకు ఒక పర్ణశాలను ఏర్పాటు చేశారు. అనంతరం రామునికి అర్ఘ్యపాద్యాలిచ్చి ఆదరించారు. తినేందుకు ఫలాలు, కందమూలాలు తెచ్చి ఇచ్చారు.

మునులు: ఓ రామా! రాజు అంటే ప్రజలు ధర్మాన్ని ఆచరించేట్లు చేసేవాడు, ధర్మరక్షకుడు. దుష్టులను శిక్షించేవాడు. ఈ విధంగా కీర్తిమంతుడైన రాజు గౌరవించతగినవాడు.

రామా! రాజు ఇంద్రునిలో నాలుగోవంతు అంశతో జన్మిస్తాడంటారు. అందువల్లనే అందరిచే గౌరవించబడుతూ, భోగాలు అనుభవిస్తూ ఉంటాడు. మేమంతా నీ ప్రజలం. అయోధ్యలో ఉన్నా, అడవుల్లో ఉన్నా నువ్వే మాకు రాజువు. రామా! మేమంతా ఇంద్రియాలను జయించాం. కామక్రోధ మదమాత్సర్యాలు మమ్మల్ని స్పృశించవు. అంటే దండించడం ఎట్లా ఉంటుందో మాకు తెలియదు. కాబట్టి నువ్వే మమ్మల్ని, తల్లి గర్భాన్ని రక్షించినట్లు రక్షించాలి.

ఆ మునీశ్వరులంతా ఆ విధంగా పూజించగా, వారిచ్చిన ఫలాలను, కందమూలాలను, ఇతర ఆహార పదార్థాలను స్వీకరించి సీతారామలక్ష్మణులు సంతృప్తులయ్యారు. అగ్నితో సమానమైన తేజస్సుగల ఆ మునులందరూ రామునికి సంతోషాన్ని కలిగించారు.

# 2వ సర్గ రామాదులను విరాధుడు చూడటం

సూర్యోదయానికి ముందే రాముడు మునులందరి వద్దా అనుమతి తీసుకొని అరణ్యంలో ముందుకు సాగిపోయాడు. దారిలో వారు అనేక వన్యమృగాలను చూశారు. కొన్నిచోట్ల ఎలుగుబంట్లను గుంపులుగా చూశారు. మరికొన్ని చోట్ల పులులను, సింహాలను గుంపులుగా చూశారు. అనేక రకాలైన వృక్షాలను చూశారు. ఆ వృక్షాలకు లతలు పెనవేసుకుపోవడం చూశారు. సరస్సులు, జలాశయాల్ని చూశారు. అనేక రకాల పక్షులు కమ్మగా కూస్తుండటం విన్నారు. అడవి ఈగల రొద విన్నారు.

అట్లా పోతూ ఉండగా దారిలో ఒక నరమాంస భక్షకుణ్ణి చూశారు. వాడు ఒక చిన్న పర్వతం అంత ఉన్నాడు. వాడి లోతైన కళ్ళు రెండు దిగుడు బావుల్లా ఉన్నాయి. వాడి వికృతాకారం చూస్తూ ఉంటే జుగుప్స కలుగుతుంది. కాళ్ళు చేతులన్నీ ఎగుడు దిగుడుగా ఉన్నాయి. ఒంటి నిండా పచ్చి పులి తోలు కప్పుకున్నాడు. అందువల్ల ఒళ్ళంతా రక్తమాంసాలు అంటుకొని తడితడిగా ఉండి దుర్వాసన వేస్తోంది. ఎంత ధైర్యస్థుడికైనా వాణ్ణి చూడగానే గుండె ఆగిపోయేటంత భయంకరంగా ఉన్నాడు. వాడు మూడు సింహాలను, నాలుగు పెద్ద పులులను, రెండు తోడేళ్ళను, పది చుక్కల జింకల్నీ, ఒక ఏనుగు తలను తన ఇనప శూలానికి గుచ్చి భుజాన వేసుకుని పోతున్నాడు. సీతారామలక్ష్మణులను చూశాడు. వాళ్ళను చూస్తూనే పెద్దగా అరుస్తూ ఇలా అన్నాడు.బిబి

విరాధుడు: మీరిద్దరూ జటావల్కాలు ధరించారు. ధనుర్బాణాలను, ఖడ్గాన్ని ధరించారు. భార్యతో సహా నా కంటపడ్డారు. అంటే మీ ఆయువు మూడిందని అర్థం. మీరు ధరించిన ముని వేషాలేమిటి? చేతుల్లో ఆయుధాలు ధరించడం ఏమిటి? పైగా భార్యను వెంటబెట్టుకొని తిరుగుతున్నారు. ఇదంతా ముని ధర్మానికి వ్యతిరేకం కాదా? ఈ విధమైన అధర్మాల్ని చేస్తున్న మీరెవరు? చెప్పండి.

నేను విరాధుడనే రాక్షసుణ్ణి. మునీశ్వరుల మాంసం తింటూ ఈ అరణ్యంలో ఈ జంతువుల మాంసాన్ని చిరుతిండిగా తింటాను. నరమాంసమే నాకు ఆహారం.

అందమైన నడుముగల ఈ సుందరి నాకు కావాలి. పాపాత్ములైన మీ ఇద్దరినీ చంపి తింటాను.

విరాధుడు ఈ విధంగా మాట్లాడేటప్పటికి సీతకు చాలా భయం వేసింది. పెనుగాలికి ఊగిపోయే అరటి చెట్టులాగా వణకిపోసాగింది. అప్పటికే విరాధుడు సీతను పట్టుకొని తన ఒడిలో కూర్చోబెట్టాడు. సీత దైన్య స్థితిని చూస్తూ రాముడు లక్ష్మణుడితో ఇట్లా అన్నాడు.

రాముడు: చూశావా! లక్ష్మణా! జనకమహారాజు కుమార్తె, నా భార్య అయిన సీత సదాచారవంతురాలు. కీర్తిమంతురాలు. ఎంతో అల్లారు ముద్దుగా పెరిగింది. విధి ఆమెను ఎట్లా విరాధుని ఒళ్ళో కూర్చోబెట్టిందో చూశావా? కైకేయీదేవి మనకు ఏమి జరగాలని కోరుకుందో అది ఇంత త్వరలోనే జరిగిపోయింది. ఇంకా మనం అరణ్యవాసం ప్రారంభంలోనే ఉన్నాం. అప్పుడే సీత ప్రమాదంలో చిక్కుకోవటం చూస్తున్నాం. మన తల్లి కైకేయి తన కుమారునికి రాజ్యం లభించడంతో తృప్తి చెందలేదు. అందరికీ ఇష్టుడనైన నేను ఏ గతి పొందాలని కోరుకుందో అది కాస్తా ఈనాడు జరుగబోతోంది. లక్ష్మణా! సీతను పరపురుషుడు తాకడం, మన తండ్రి మరణించడం, మన రాజ్యాన్ని ఇతరులు అపహరించడం – వీటికంటే అధికమైన దుఃఖం ఏముంటుంది?

రాముని మాటలు విన్న లక్ష్మణుడు తోక త్రొక్కిన త్రాచులాగా బుసలుకొడ్తూ ఇట్లా అన్నాడు.

లక్ష్మణుడు: అన్నా! రామా! నీవు సర్వభూతాలకు నాథుడవు. ఎందుకు సామాన్య మానవుడిలాగా దుఃఖీస్తావు? నా పదునైన బాణంతో ఈ విరాధుని పడగొట్టి రక్తపు మడుగులో మునిగేట్లు చేస్తాను. నాకు పూర్వం భరతుడిపై కోపం వచ్చినప్పుడే నా బాణానికి పని చెప్పాలని

అనుకున్నాను. కానీ అది నెరవేరలేదు. ఇప్పుడు అదే బాణాన్ని ఇంద్రుడు వజ్రాయుధాన్ని పర్వతంపై ప్రయోగించినట్లు, ఈ విరాధుడి మీద ప్రయోగించి, వాణ్ణి నేలకూలుస్తాను. నా బాహువుల నుండి విడువబడ్డ బాణం అతివేగంగా పోయి వాడి వక్షఃస్థలాన్ని చీల్చి నేల కూలుస్తుంది.

## 3వ సర్గ విరాధునిపై బాణమును ప్రయోగించటం

విరాధుడు: ఇప్పుడు అడుగుతున్నాను. చెప్పండి. మీరిద్దరూ ఎవరు? ఎక్కడ నుండి వచ్చారు. ఎంతవరకూ మీ ప్రయాణం?

రాముడు: ఓ విరాధుడా! నేను ఇక్ష్వాకు వంశానికి చెందిన రాముడను. ఇతడు నా తమ్ముడు లక్ష్మణుడు. ఈమె నా ధర్మపత్ని సీత. మేము మంచి నడవడిక గల రాజవంశానికి చెందినవాళ్ళం. ఈ వనాల్లో నివసించేందుకు వచ్చాం. నీవెవరవో, ఎందువలన ఈ దండకారణ్యంలో తిరుగుతున్నావో తెలుసుకోవాలని అనుకొంటున్నాను.

విరాధుడు: ఓ రామా! నేనెవరినో చెప్తాను. విను. జవుడనే రాక్షసుడు నా తండ్రి. శతహ్రత నా తల్లి. మా రాక్షస జాతి వారందరూ నన్ను విరాధుడని పిలుస్తారు. నేను గొప్ప తపస్సు చేసి బ్రహ్మ అనుగ్రహం పొందాను. ఆ వరప్రభావం చేత నన్ను ఎవ్వరూ ఛేదించలేరు; భేదించలేరు; చంపలేరు. అందువల్ల మీరిద్దరూ ఈ స్త్రీని నాకు వదలి వెళ్ళిపోండి. మీ ప్రాణాలు తియ్యకుండా మిమ్మల్ని వదిలేస్తాను. అదే నేను మీకు చేసే పెద్ద ఉపకారం.

రాముడు (కోపంతో కళ్ళు ఎర్రగా చేసి): ఓరీ నీచుడా! నీకు రోజులు మూడినాయి. ఈ రోజు నా చేతుల్లో నీకు చావు తప్పదు. నిన్ను చంపక వదలను.

ఈ విధంగా అంటూ రాముడు ధనుస్సును ఎక్కుపెట్టి వాడిపై వాడి అయిన బాణాలను వదిలాడు. ఆ బాణాలు వాయువేగంతో వెళ్ళి వాడి శరీరంలోపలకు చొచ్చుకొనిపోయాయి. రామబాణంతో శరీరం అంతా రక్తం కారుతూ ఉండగా ఆ విరాధుడు, సీతను నేలపైకి దింపి, శూలం చేత్తో పట్టుకొని రామలక్ష్మణులపై దూకాడు. ఇంద్రధ్వజం లాంటి ఆ శూలాన్ని పట్టుకొని అడవి అంతా దద్దరిల్లిపోయేట్లుగా అరుస్తూ, పర్వత గుహలాగా నోరు తెరచుకొని మృత్యు దేవతలాగా ఆ శూలాన్ని వారిపై విసిరాడు. అంతట రామలక్ష్మణులు ఆ శూలాన్ని బాణాలతో

మధ్యలోనే ముక్కలు ముక్కలుగా త్రుంచివేశారు. రామలక్ష్మణులు వేసిన బాణాలన్నీ విరాధుడి శరీరం అంతా గుచ్చుకొని రక్తం కారింది. అప్పుడాతడు బ్రహ్మదేవుడి వరప్రభావం చేత తన శరీరాన్ని బాగా పెంచాడు. దాంతో ఆ బాణాలన్నీ రాలి నేలపై పడ్డాయి. అంతట ఆ విరాధుడు మరో శూలాన్ని ఎత్తి రాముడిపై విసిరాడు. శస్త్రవిద్య లందు ప్రవీణులైన రామలక్ష్మణులు ఆ శూలాన్ని ఆకాశంలో ఉండగానే రెండుగా విరగ్గొట్టారు. తరువాత రామలక్ష్మణు లిద్దరూ వాడి చేతులు రెండూ నరికి పారెయ్యాలని ఖడ్గాలు ధరించి దగ్గరగా వెళ్ళారు. వారి ఆలోచన గ్రహించిన ఆ విరాధుడు వారిద్దరినీ ఎత్తి తన భుజాలపై కూర్చోబెట్టుకున్నాడు. చిన్న పిల్లల వలె వాళ్ళను భుజాన ఎక్కించుకొని దట్టమైన అడవుల్లోకి పరుగుపెట్టాడు. రాముడు నవ్వుతూ “లక్ష్మణా! వీడు మనల్ని ఎత్తుకు తిప్పాలని సరదా పడుతున్నాడు. అట్లాగే చెయ్యనీ. మనకు కొంత అలసట తీర్చుకున్నట్లవుతుంది. వీడు మనల్ని ఎంతదూరం మోసినా వీడికి మన చేతిలో చావు తప్పదుగదా” అన్నాడు.

విరాధుడు వారిద్దరినీ, మదించిన ఏనుగులు, అడవి మృగాలు, నక్కలు తిరగాడే దట్టమైన అడవిలోనికి తీసుకువెళ్ళాడు.

# 4వ సర్గ విరాధ వధ

విరాధుడు ఆ విధంగా రామలక్ష్మణు లిద్దరినీ భుజాలపై ఎక్కించుకొని దట్టమైన అడవుల్లోకి పోతూవుంటే సీత బిగ్గరగా ఏడ్చింది. "ఓ రాక్షసుడా! రామలక్ష్మణులను విడచిపెట్టి నన్ను తిను. నీ ఆకలి తీర్చుకో" అంటూ విలపించింది. సీత విలాపం రామలక్ష్మణులు విన్నారు. ఇక వాడితో ఆటలు కట్టిపెట్టి వాణ్ణి చంపాలని సోదరులిద్దరూ కూడాబలుక్కున్నారు. రాముడు వాడి కుడిభుజాన్ని పట్టి గట్టిగా మెలిపెట్టాడు. రెండు చుట్లుచుట్టగానే వాడి చెయ్యి ఊడి నేలపైన పడింది. అదే సమయాన లక్ష్మణుడు తన ఖడ్గంతో వాడి ఎడమ భుజాన్ని నరికివేశాడు. అదీ పోయి నేలమీద పడింది. ఆ విధంగా రెండు చేతులూ విరిగి నేలపై పడటంతో బాధతో ఆ విరాధుడు విలవిల్లాడిపోయాడు. నేలపై పడి మూర్ఛపొందాడు. అట్లాపడి ఉన్న వాణ్ణి పిడిగుద్దులు గుద్దారు. కాళ్ళతో తన్నారు. ఎత్తి నేలపై విసిరికొట్టారు. ఇద్దరూ చెరోప్రక్కా తడిగుడ్డను పిండినట్లు పిండారు. ఇన్ని విధాలుగా హింసించినా ఆ రాక్షసుడు చావలేదు. అంతట రాముడు ఈ విధంగా విరాధుణ్ణి చంపటం సాధ్యం కాదని అనుకున్నాడు.

రాముడు: లక్ష్మణా! ఈ విరాధుడు తపోబలం వలన అస్త్రాల చేత, శస్త్రాల చేత చచ్చేట్లుగా లేడు. అందువల్ల ఇతణ్ణి పాతివేద్దాం. క్రూరుడూ, పరాక్రమం కలవాడూ అయిన ఈ రాక్షసుణ్ణి పాతివేద్దాం. పెద్ద గొయ్యి తవ్వు.

విరాధుని కంఠంపై రాముడు కాలుపెట్టి గట్టిగా నొక్కిపెట్టి ఉంచాడు. లక్ష్మణుణ్ణి గొయ్యి తవ్వమని ఆదేశించటం వాడు విన్నాడు.

విరాధుడు: ఓ పురుషశ్రేష్ఠా! నీ వెవరవో ముందుగా తెలుసుకోలేకపోయాను. బ్రహ్మ ఇచ్చిన వరాలు, అజ్ఞానం నా కళ్ళు కప్పేశాయి. నీ బలాన్ని తక్కువగా అంచనా వేశాను.

ఓ మహానుభావా! నీవు కౌసల్యా పుత్రుడు రాముడవని తెలుసుకున్నాను. సీతా,

లక్ష్మణులను కూడా ఇప్పుడు గుర్తించగలిగాను. నేను ఒక గంధర్వుడను. రంభ పట్ల ఆసక్తి గలవాడనై కుబేరుని సేవించడానికి వెళ్లకపోవడంతో ఆయన ఆగ్రహోదగ్రుడై నన్ను శపించాడు. కుబేరుని శాపం వలన నేను భయంకరమైన రాక్షసరూపం ధరించాల్సి వచ్చింది. శాపవిమోచనానికై నేను కుబేరుణ్ణి కాళ్ళావేళ్ళా పడి ప్రాథేయపడగా, "దశరథుని కుమారుడైన రాముడు నిన్ను యుద్ధంలో సంహరిస్తాడు. ఆ తరువాత నీ నిజరూపాన్ని పొంది తిరిగి స్వర్గాన్ని చేరుకుంటావు" అని శాపవిమోచనం అనుగ్రహించాడు. శత్రుసంహారకుడవైన ఓ రామా! నీ అనుగ్రహం చేత నాకు శాప విముక్తి అయింది. నీవు అనుమతిస్తే ఇక నా లోకానికి పోతాను.

ఓ రామ ప్రభూ! ఇక్కడకు ఒకటిన్నర యోజనాల దూరంలో శరభంగుడనే మహర్షి ఆశ్రమం ఉంది. మీరు అక్కడకు వెళ్ళండి. మీకు ఇక అన్నీ శుభాలే జరుగుతాయి.

రామా! బ్రహ్మ ఇచ్చిన వరం వలన నాకు అస్త్రశస్త్రాలతో చావు రాదు. గోతిలో వేసి పూడ్చిపెట్టండి. అప్పుడే నాకు మరణం సంభవించి నా లోకానికి పోగలుగుతాను. అదీగాక రాక్షసులను గోతిలో పూడ్చిపెట్టడమే పరంపరగా వస్తున్న ఆచారం.

తరువాత రాముడు ఆ రాక్షసుని గొంతుపై నుండి కాలు తీయగా లక్ష్మణుడు ఆ రాక్షసుని గోతిలో పెట్టి పూడ్చివేశాడు.

# 5వ సర్గ రాముడు శరభంగ మహర్షి ఆశ్రమానికి వెళ్ళడం

పరాక్రమశాలి అయిన రాముడు మహా బలశాలి అయిన విరాధుని చంపి, సీతను కౌగలించుకొని ఎన్నో విధాలుగా ఓదార్చాడు.

రాముడు: లక్ష్మణా! ఈ అరణ్యం చాలా దట్టంగాను, భయంకరంగాను ఉంది. మనం త్వరగా శరభంగ మహర్షి ఆశ్రమానికి చేరుకుందాం.

అనంతరం వారు శరభంగ మహర్షి ఆశ్రమాన్ని చేరారు. అక్కడ రాముడు ఒక అద్భుతమైన దృశ్యాన్ని చూశాడు. తాను చూస్తున్నదంతా సీతా లక్ష్మణులకు ఈ విధంగా వివరించాడు.

రాముడు: లక్ష్మణా! ఆకాశంలో ముల్లోకాలకు అధిపతి అయిన దేవేంద్రుణ్ణి చూస్తున్నాను. అతడు సూర్యుడు, అగ్నిలాగా ప్రకాశిస్తున్నాడు. ఆయన కూర్చున్న రథాన్ని దేవతలంతా అనుసరించివస్తున్నారు. అతడు కాంతివంతమైన ఆభరణాలు, స్వచ్ఛమైన వస్త్రాలు ధరించాడు. ఆయన రథానికి ఆకుపచ్చని గుర్రాలు పూన్చబడ్డాయి. అవన్నీ సూర్యచంద్రుల్లాగా ప్రకాశవంతంగా ఉన్నాయి. ఇద్దరు అప్సర స్త్రీలు తెల్లటి వింజామరలతో ఆయనకు విసురుతున్నారు. కొండంత తెల్లని గొడుగును పట్టారు.

యజ్ఞాల్లో ఇచ్చే హవ్యాలు తీసుకోవడానికి ఇంద్రుడు ఎటువంటి రథంలో వస్తాడని శాస్త్రాల్లో వర్ణించారో, ఈ రథం కూడా అదే మోస్తరుగా ఉంది. ఏం సందేహం లేదు. అవి దేవతా అశ్వాలే! అది దేవేంద్రుని రథమే.

లక్ష్మణా! ఆ రథం యువకులైన దేవతలచే సంరక్షించబడుతోంది. వారంతా యువకులు. పెద్ద పులిలాగా ఎదిరింప శక్యంకాని వీరంతా చాలా అందంగాను, చూడటానికి మనోహరంగానూ ఉన్నారు. వీళ్ళంతా కూడా మెరిసిపోయే ఆభరణాలు, విలువైన వస్త్రాలు

ధరించారు. వారి వయస్సు సుమారు ఇరవై సంవత్సరాలుంటాయి. అంటే దేవతలు కూడా ఎప్పుడు ఇదే వయసులో ఉంటారని శాస్త్రాలు వచిస్తున్నాయి. లక్ష్మణా! నేను వాళ్ళ వద్దకు పోయి వాళ్ళ వివరాలన్నీ తెలుసుకొని వస్తాను. నీవు సీతను కనిపెట్టుకొని ఇక్కడే ఉండు.

రాముడు సీతాలక్ష్మణులను అక్కడే వదలి తాను మాత్రం శరభంగ మహర్షి ఆశ్రమం ప్రక్కగా వెళ్ళాడు. అక్కడ దేవతలతో కూర్చుని ఉన్న దేవేంద్రుడు శరభంగ మహర్షితో "మహర్షీ! రాముడు నాతో మాట్లాడేందుకు వస్తున్నాడు" అని దేవతలతో ఇట్లా అన్నాడు.

దేవేంద్రుడు: ఓ దేవతలారా! రాముడు దేవతలకు కూడా సాధ్యపడని కార్యాలు చేయగల సమర్థుడు. ఈ శత్రు సంహారకుణ్ణి ముందుగా చూడను. తాను వచ్చిన పనిని పూర్తిచెయ్యనీ! ఆ తర్వాతే నేను అతణ్ణి కలుసుకుంటాను.

దేవేంద్రుడే ఈ విధంగా మాట్లాడి, శరభంగ మహర్షి అనుమతి తీసుకొని స్వర్గానికి వెళ్ళిపోయాడు. తరువాత రాముడు సీత లక్ష్మణులను వెంటబెట్టుకొని శరభంగ మహర్షిని దర్శించాడు. ఆయన పాదాలకు భక్తిపూర్వకంగా నమస్కరించాడు. మహర్షి వారిని ఆదరంతో ఆహ్వానించి అతిథి మర్యాదలు చేశాడు. వారిని ఆ రోజు అక్కడే బస చెయ్యమని కోరాడు. అంతట రాముడు "మహర్షీ! దేవేంద్రుని ఇంతకు పూర్వమే ఇక్కడ చూశాను. ఆయన ఎందుకు వచ్చాడు?" అని అడిగాడు.

శరభంగ మహర్షి: ఓ రామా! నేను తపస్సు చేసి బ్రహ్మలోకాన్ని, స్వర్గాన్ని కూడా జయించాను. దేవేంద్రుడు నన్ను బ్రహ్మలోకానికి తీసుకొని వెళ్ళేందుకు వచ్చాడు. నీవు నన్ను చూడటానికి రావడం వలన నిన్ను కలసుకున్న తర్వాతే బ్రహ్మలోకానికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాను. ఓ పురుషశ్రేష్ఠా! నేను సంపాదించిన పుణ్యలోకాలన్నీ నీ కివ్వాలని సంకల్పించాను. తీసుకో.

శరభంగ మహర్షి మాటలు విని, సర్వశాస్త్రాలలో పండితుడైన రాముడు మహర్షితో ఇట్లా

అన్నాడు.

రాముడు: ఓ మహర్షీ! నీవు ఇస్తానంటున్న పుణ్యలోకాలన్నీ నేను సంపాదించుకుంటాను. కానీ ఇప్పుడు నేను ఈ వనంలో నా భార్య, తమ్మునితో ఉండాలనుకొంటున్నాను. మాకు నివాసయోగ్యమైన ప్రదేశాన్నేదైనా చూపించండి. అంతే చాలు.

శరభంగ మహర్షి: ఓ రామా! ఇక్కడకు దగ్గరలోనే సుతీక్ష్ణుడనే మహా మునీశ్వరుడు నివసిస్తున్నాడు. నీవు ఆయనను దర్శించు. ఆయనే నీకు కావలసిన నివాసాన్ని ఏర్పాటు చేస్తాడు. నదీ ప్రవాహానికి ఎదురుగా వెళ్ళు. కొంత దూరం పోయిన తర్వాత నీవు ఆయన ఆశ్రమాన్ని చేరుకుంటావు. నాయనా! రామా! నీవు ఇక్కడే కొద్దిక్షణాలుండు. పాము కుబుసం విడిచినట్లుగా నేను ఈ శరీరాన్ని విడవటం చూస్తావు.

కొంతసేపైన తర్వాత, మహర్షి అగ్నిహోత్రాన్ని చేసి అందులో మంత్రపూర్వకంగా ఆజ్యం (నెయ్యి) మున్నగునవి హోమంచేసి తరువాత ఆ అగ్నిలో ప్రవేశించాడు. అప్పుడా అగ్ని జీర్ణించిన ఆ మహర్షి దేహాన్ని తనలో కలిపేసుకొంది. తరువాత కొద్ది క్షణాల్లోనే, ఆ మహర్షి కౌమార వయస్కుడుగా ఆ అగ్నిలో నుండి పైకి లేచాడు. అంతట ఆ మహర్షి దేవలోకాన్ని దాటుకుంటూ బ్రహ్మలోకాన్ని చేరాడు. బ్రహ్మ స్వయంగా లేచి వచ్చి ఆ మహర్షికి స్వాగతం పలికాడు.

# 6వ సర్గ మునులకు రాముని అభయం

శరభంగ మహర్షి బ్రహ్మలోకానికి పోగానే, ఆ వనంలో నివసించే మునీశ్వరులంతా రాముణ్ణి చూడటానికి బయలుదేరి వచ్చారు.

ప్రజాపతి గోళ్ళ నుండి పుట్టినవారు (వైఖానసులు), ప్రజాపతి రోమముల నుండి పుట్టినవారు (వాలఖిల్యులు) ప్రజాపతి పాదప్రక్షాళనచే పుట్టినవారు (సంప్రక్షాలులు), చంద్ర కిరణాలను మాత్రమే త్రాగేవారు (మరీచిపులు), ధాన్యాన్ని రాళ్ళతో దంచి తినేవాళ్ళు (అశ్మకుట్టాశ్చులు), ఆకుల్నే ఆహారంగా తినేవాళ్ళు (పత్రాహారులు), దంతాలనే రోళ్ళుగా ఉపయోగించేవారు (దన్తోలూఖలినశ్చైవులు), నీళ్ళలో గొంతు లోతుకి నిలబడి తపస్సు చేసేవాళ్ళు, మోచేతులు, మోకాళ్ళనే పడకగా వాడుకుంటూ తపస్సు చేసేవాళ్ళు, కదల్చడానికి మెదల్చడానికి చోటు లేకుండా ఉండే ఇరుకైన ప్రదేశాల్లో తపస్సు చేసేవాళ్ళు. ఈ విధంగా అనేక రకాలుగా తపస్సు చేసేవాళ్ళంతా శరభంగుని ఆశ్రమానికి వచ్చి రాముణ్ణి కలుసుకున్నారు. వారంతా బ్రహ్మవర్చస్సుతో ప్రకాశిస్తూ, యోగమార్గంలో స్థిరపడిపోయినవాళ్ళే.

మునీశ్వరులు: ఓ రామా! నీ యందు సత్యము, ధర్మము, పితృభక్తి సంపూర్ణంగా ఉన్నాయి. నీవు కీర్తి చేతను, పరాక్రమం చేతను ముల్లోకాలనూ జయించగల సమర్థుడివి. ఇక్ష్వాకుల వంశానికే మణిదీపం లాంటివాడివి.

ఓ రామా! నీవు ధర్మం తెలిసిన వాడవు; ధర్మాన్ని ఆచరించేవాడవు; ధర్మమంటే ఆసక్తి గలవాడవు. మేమంతా కలసి నిన్ను అర్థించేందుకు వచ్చాం. మా మాట కాదనకు.

ప్రభూ! ఎవరైతే ఆదాయంలోను, తపస్సులోను ఆరవ భాగం పన్ను రూపంలో తీసుకుంటూ కూడా ప్రజల్ని కన్నబిడ్డల్లాగా చూడడో, అటువంటి రాజుని అధర్మపరుడని చెప్పాలి.

ఎవరైతే ప్రజల్ని ప్రాణంతో సమానంగా కాపాడుతాడో, తన బిడ్డలాగా చూసుకుంటాడో,

ప్రజా శ్రేయస్సు కోసం తన ప్రాణాలైనా అర్పిస్తాడో అటువంటి రాజుకు బ్రహ్మలోకప్రాప్తి కలిగి అతడు కీర్తిం చబడతాడు.

ఈ విధంగా పరిపాలించే రాజుకు మునులు చేసుకుంటున్న తపోఫలంలో నాలుగోవంతు చెందుతుంది. ఓ రామా! నీవు ప్రభువువై ఉండి కూడా, ఈ వానప్రస్థాశ్రమంలోని వృద్ధబ్రాహ్మణులు తరచూ రాక్షసుల చేత పీడించబడుతున్నారు. రక్షణ లేనివారైపోయారు. నిర్దయులైన ఆ రాక్షసులు ఎందరో మునీశ్వరులను చంపారు. నీవు మాతోరా! నీకు వాళ్ళ శరీరాలన్నీ చూపిస్తాం. పంపానదీ ప్రాంతాన, మందాకినీ నదీ ప్రాంతాన, చిత్రకూట పర్వత ప్రాంతాన ఈ రాక్షసులు విచ్చలవిడిగా విహరిస్తున్నారు. వాళ్ళ ఆగడాలకు అంతు లేకుండాపోయింది. కనిపించిన మునీశ్వరులందరినీ చంపేస్తున్నారు. మేము వాళ్ళ బాధలు పడలేకపోతున్నాము. ప్రభువువైన నీవు వచ్చావని తెలిసి మా గోడు వెళ్ళబోసుకుందామని వచ్చాం. ధర్మాత్ముడవైన నీవే మమ్మల్ని కాపాడాలి.

రాముడు: ఓ మహాత్ములారా! మీ వంటి తపోధనులు నన్ను ఆజ్ఞాపించాలే కానీ అర్థించకూడదు. మిమ్మల్ని ఈ రాక్షసుల బారినుండి కాపాడేందుకే నా తండ్రిగారు నన్ను వనవాసానికి పంపాడా? అని అనిపిస్తోంది. మేము కూడా మీతో పాటే ఈ అరణ్యాల్లో ఉంటున్నాం. ఆ రాక్షసులందరినీ సంహరించి మీకు సంతోషాన్ని కలిగిస్తాం. ఇకపైన నా పరాక్రమం, నా తమ్ముని పరాక్రమం మీరే చూడబోతారు గదా? మీరు నిర్భయంగా తపస్సు చేసుకోండి. మేము సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమానికి వెళ్తున్నాం.

# 7వ సర్గ రాముడు సుతీక్ష్ణ మహర్షిని దర్శించటం

శత్రుసంహారకుడైన రాముడు సీతాలక్ష్మణులతో కలసి సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమానికి బయలుదేరాడు. వారు వెళ్ళే దారిలో జల ప్రవాహాలను దాటారు, ఎత్తైన పర్వతాల్ని దాటారు, విశాలమైన పర్వత పంక్తులగుండా వెళ్లారు. ఆ విధంగా ప్రయాణం చేస్తూ ఒక భయంకరమైన అరణ్యాన్ని చేరారు. అక్కడ వృక్షాలన్నీ వివిధ ఫల పుష్పాలతో సమృద్ధిగా ఉన్నాయి. ఒక ఏకాంత ప్రదేశంలో నారచీరలు ఆరవేసి ఉండటం చూశాడు. ఆ ప్రశాంత వాతావరణాన్ని బట్టి అది సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమయి ఉంటుందని తలచాడు. సీతారామలక్ష్మణులు ఆ ఆశ్రమంలోకి ప్రవేశించారు. సమాధిలో ఉన్న మహర్షిని చూశారు. ఆయన జటలన్నీ అట్టలు కట్టుకుపోయాయి. శరీరం అంతా దుమ్ముధూళితో నిండి ఉంది. ఆ దుమ్మంతా ఎండలకు ఎండుతూ వానలకు తడుస్తూ ఉండటం వల్ల బురదలాగా మందంగా పేరుకుపోయి ఉంది.

రాముడు (మహర్షిని సమీపించి) : ఓ మహాత్మా! నేను రాముడను. నీవు ధర్మాలన్నీ తెలిసినవాడవని, సత్యమైన తపఃప్రభావం కలవాడవని విని నీతో మాట్లాడాలని వచ్చాను.

అంతట సుతీక్ష్ణ మహర్షి కళ్ళు తెరచి రాముణ్ణి కౌగలించుకొని ఇట్లా అన్నాడు.

సుతీక్ష్ణ మహర్షి: ఓ రామా! నీవు రఘువంశంలో శ్రేష్ఠుడవు. సత్యపరిపాలనలో అగ్రగణ్యుడవు. ఓ రామా! నీకు స్వాగతం పలుకుతున్నాను. నీ కాలు మోపడం వల్ల ఈ ఆశ్రమమే పావనమైంది. ఈ అరణ్యానికే రక్షకుడు దొరికినట్లయింది.

ఓ కీర్తిమంతుడా! రామా! నేను నీ కోసమే కాచుకొని కూర్చున్నాను. నీవు పితృవాక్పరిపాలనకై అరణ్యవాసం చేస్తున్నావనీ, చిత్రకూటంలో నివసిస్తున్నావనీ నాకు తెలుసు. నీవు ఎప్పుడు వస్తావోనని ఈ శరీరాన్ని త్యజించి స్వర్గానికి పోకుండా ధ్యానంలో కాలంగడుపుతున్నాను.

దేవేంద్రుడు వచ్చి నా తపస్సు చేత నేను అన్ని లోకాల్నీ జయించానని చెప్పాడు. ఋషులు, సిద్ధులు తపస్సు చేసే ఈ కర్మభూమినంతా నీకు ఇచ్చేస్తున్నాను. దేవతలు విహరించే లోకాలన్నీ నీకు ఇచ్చేస్తున్నాను. నీవు సీతా లక్ష్మణులతో సంతోషంగా విహరించు.

రామా! ఈ వనంలో చాలామంది ఋషులు తపస్సు చేసుకుంటూ ఉంటారు. ఇక్కడ కందమూలాలు, ఫలపుష్పాలు సమృద్ధిగా దొరుకుతాయి. నీకు ఇక్కడ సుఖప్రదంగా ఉంటుంది. కాబట్టి నీవు ఇక్కడే నివసించవచ్చు. పెద్దపెద్ద క్రూరమృగాలు గుంపులు గుంపులుగా వస్తాయి. ఈ ఆశ్రమం చుట్టూ తిరుగుతాయి. కానీ ఎవరికీ అపకారం చెయ్యవు. కొంతసేపైన తర్వాత వాటి దోవన అవి పోతాయి. ఇంతకుమించి ఇక ఏ విధమైన ఆపదలు ఉండవు. కనుక నీవు ఇక్కడే నివసించు.

రాముడు: ఓ మహర్షీ! ఇది అరణ్యప్రాంతం కాబట్టి క్రూరమృగాలు తిరుగుతూ ఉండటం సహజమే. కానీ ఇది మునులు తపస్సు చేసుకొనే చోటు అవటం వలన మేము వాటిని వేటాడి చంపవచ్చును. అటువంటి హింస మీకు కష్టం కలిగించవచ్చు. అందువల్ల మేము ఎక్కువ కాలం ఇక్కడే ఉండటం సముచితంగా ఉండదని భావిస్తున్నాను.

రాముడు సుతీక్ష్ణ మహర్షితో సంభాషించి సాయం సంధ్యను ముగించుకొని, అక్కడే ఆ రాత్రి గడిపాడు. మహర్షి అతిథులందరికీ ఆహారం ఇచ్చి సత్కరించాడు.

# 8వ సర్గ సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమం నుండి బయలుదేరడం

సుతీక్ష్ణ మహర్షి ఆతిథ్యాన్ని స్వీకరించిన సీతారామ లక్ష్మణులు ఉదయానే లేచి ప్రాతఃసంధ్య అనుష్ఠానం ముగించుకున్నారు. పాపరహితుడైన సుతీక్ష్ణ మహర్షిని కలుసుకొన్నారు.

రాముడు: మహామునీ! మీ ఆతిథ్యం పొందటం మా అదృష్టంగా భావిస్తున్నాం. రాత్రి అంతా సుఖంగా గడచింది. ఇక మేము బయలుదేరటానికి అనుమతి కోరుతున్నాం. ఈ దండకారణ్యంలో నెలకొన్న ముని ఆశ్రమాలన్నీ చూడాలని కుతూహలపడుతున్నాం. మా వెంట వచ్చిన మునీశ్వరులు కూడా తక్కిన ముని ఆశ్రమాలు చూడాలని తొందరపెడ్తున్నారు. వారంతా జ్వాలలు లేని అగ్నివంటి తపోసంపన్నులు. నడమంత్రపు సిరిపట్టినవాడిలాగా ఈ సూర్యుడు కూడా తాపాన్ని పెంచుకుంటూ పోతాడు. అందువల్ల మేము సూర్యతాపం వృద్ధికాక ముందే బయలుదేరుతాం.

రాముడు మున్నగు వారంతా సుతీక్ష్ణ మహర్షి పాదాలకు నమస్కరించారు. ఆ మహర్షి రాముణ్ణి లేవనెత్తి కౌగలించుకొన్నాడు.

సుతీక్ష్ణ మహర్షి: రామా! నీడలాగా నిన్ను అనుసరించి వస్తున్న ఈ సీత లక్ష్మణులతో కలసి నిరపాయకరమైన దారిన పోండి. మీకు అంతా శుభమే జరుగుతుంది. ఈ దండకారణ్యంలో అనేకమంది మునులు ఇంద్రియ నిగ్రహం కలవారై, పరిశుద్ధమైన మనస్సుతో తపస్సు చేసుకుంటున్నారు. నీవు వారి ఆశ్రమాలన్నీ వెళ్ళి చూడు. ఈ అరణ్యంలో సుందరమైన వనాలు అనేకం ఉన్నాయి. నీవు అవన్నీ కూడా చూడు. దారి పొడవునా అనేక రకాలైన ఫలాలు, కందమూలాలు లభిస్తాయి. ఆహారానికి ఏమీ ఇబ్బంది ఉండదు. అడవి మృగాలను గుంపులు గుంపులుగా చూస్తావు. అనేక రకాలైన పక్షులు కిలకిలారావాలతో చెవులకు విందు చేస్తాయి. మార్గంలో అనేక చెరువులు, సరస్సులు, దిగుడుబావులు కనిపిస్తాయి. అన్నింట్లోనూ నీకు

మధురమైన నీరు లభిస్తుంది. చెరువులన్నీ పద్మాలతో కూడి శోభాయమానంగా ఉంటాయి. కారండవం అనే పక్షులు నీళ్ళలో సంచరించటం నీవు చూస్తావు. పురివిప్పి నెమళ్ళు నాట్యం చేస్తూ ఉండటం చూసి పులకించిపోతారు. మునీశ్వరులను కలసుకోవడం, మాట్లాడటం, వారి ఆతిథ్యాలు స్వీకరించడంతో పాటు, ఈ వనసౌందర్యాలను కూడా తిలకించండి. రామా! లక్ష్మణా! అమ్మా సీతా! క్షేమంగా వెళ్ళండి. మళ్ళీ నా ఆశ్రమానికి రావడం మాత్రం మరచిపోకండి. తప్పక మళ్ళీ రావాలి సుమా!

రాముడు మహర్షి మాటలన్నీ శ్రద్ధాభక్తులతో విని 'అట్లాగే' నని చెప్పి ఆయనకు ప్రదక్షిణ నమస్కారం చేసి బయలుదేరాడు. తరువాత సీతాదేవి ధనుస్సు, అంబుల పొది, ఖడ్గాన్ని తెచ్చి రామలక్ష్మణుల కిచ్చింది. వారా ఆయుధాలను ధరించి ఆశ్రమం నుండి బయలుదేరారు.

# 9వ సర్గ రామునికి సీత ఉపదేశం

సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణ మహర్షి వద్ద అనుమతి తీసుకొని ప్రయాణం కొనసాగించారు. మార్గంలో వారు ఆ మాట ఈ మాట మాట్లాడుకుంటూ కులాసాగా నడక సాగించారు. సీత రాముడితో ఇట్లా అంటోంది.

సీత: ప్రభూ! మీరు మహాత్ములు. ధర్మవేత్తలే అయినా కూడా బాగా సూక్ష్మంగా ఆలోచిస్తే కొద్దిగా అధర్మం పొడచూపుతోందేమోనని అనిపిస్తోంది.

లోకంలో జనులు కోరికల వల్ల మూడు వ్యసనాలకు అలవాటుపడుతూ ఉంటారు. మొదటిది అసత్యం చెప్పడం. రెండవది పర స్త్రీల పట్ల వ్యామోహపడటం. మూడవది అకారణంగా ఇతరులను హింసించడం.

రామా! నీవు ఇంతవరకు ఎప్పుడూ అబద్ధమాడలేదు. ఇకముందు కూడా అసత్యం చెప్పవు. నాకా నమ్మకం ఉంది. పరస్త్రీలపై కోరిక కూడా నీ కుండటం అసంభవం. ఇక ముందు కూడా ఉండదు. అటువంటి ఆలోచన కూడా నీ మనసులోకి రాదు. మీలో సత్యసంధత, ధర్మనిష్ఠ బలంగా ఉండటం వల్లనే తండ్రి మాట జవదాటకుండా వనవాసం చేస్తున్నారు. కాబట్టి సత్యం, ధర్మం వంటి సద్గుణాలన్నీ నీలోనే కొలువుదీరి ఉన్నాయి.

పూర్వవైరం ఏమీ లేకపోయినా అజ్ఞానం చేత, ఇతరుల ప్రాణాలు తీయడం అనే మూడో వ్యసనం నాకు భయంకరంగా కనిపిస్తోంది. దండకారణ్యంలో నివసించే ఋషులను రక్షించడం కోసం రాక్షసులందరినీ చంపుతానని ప్రతిజ్ఞ చేశావు. ఇందుకోసమే తమ్ముడితో కలసి ధనుస్సు బాణాలు పట్టుకొని బయలుదేరానంటున్నావు. నీ మాటలు వింటుంటే నా మనసులో దిగులూ, భయమూ చోటు చేసుకుంటున్నాయి. ఆ తరువాత బాగా సూక్ష్మంగా ఆలోచించాను. మనం దండకారణ్యానికి వెళ్ళడం క్షేమం కాదు. ఎందుకనో చెప్తాను. విను.

దండకారణ్యం బాగా దట్టమైన కీకారణ్యం. అందులో క్రూరమృగాలు విచ్చలవిడిగా తిరుగాడుతూ ఉంటాయి. నీమా, నీ తమ్ముడూ ఊరుకోరు గదా! మీ దగ్గరున్న ధనుర్బాణాలతో వాటిని చంపుతారు. బాగా ప్రజ్వలించే అగ్నికి దగ్గరగా ఉన్న కట్టెలకు కూడా నిప్పు ముట్టుకుంటుందంటారు. అట్లాగే క్షత్రియులకు అందుబాటులో ధనుర్బాణాలు ఉంటే వారి తేజస్సు, బలమూ వృద్ధి అవుతాయంటారు.

ఓ మహాబాహూ! పూర్వం ఒక ఆశ్రమంలో సత్యాన్నే పలుకుతూ, పరిశుద్ధుడైన ఒక ముని నివసించేవాడు. ఆ ఆశ్రమంలో మృగాలు, పక్షులు సుఖంగా సహజీవనం చేస్తూ ఉండేవి. ఒకనాడు ఇంద్రుడు ఆ ముని తపస్సు భంగం చేయడానికై ఒక సైనికుడి వేషంలో వెళ్ళాడు. తన ఖడ్గాన్ని ఆ ముని వద్ద ఉంచమని ప్రార్థించి, మళ్లీ కొద్దికాలం తర్వాత వచ్చి తీసుకుంటానన్నాడట. ఆనాటి నుండి ఆ మునీశ్వరుడు ఆ ఖడ్గాన్ని జాగ్రత్తగా పదిలపరచే ప్రయత్నంలో ఎప్పుడూ తనవద్దే ఉంచుకొని తిరిగేవాడట. ఎక్కడకు వెళ్ళినా తనతోనే తీసుకువెళ్ళేవాడు. కొంత కాలానికి ఆతడికి తపస్సుపై శ్రద్ధ తగ్గి, ధ్యానం అంతా ఖడ్గంపైనే ఉండేది. ఎల్లప్పుడూ ఖడ్గాన్ని ధరించి తిరగడం వల్ల అతడి స్వభావంలో క్రూరత్వం చోటుచేసుకొని క్రమంగా వృద్ధి అయింది. దాంతో ధర్మం క్షీణించి, అధర్మం వృద్ధి అయింది. ఫలితంగా నరకానికి పోయాడు.

శస్త్రాలు నిప్పులాగానే ప్రమాదమైనవి. నాకు నీ యందు ఉండే ప్రేమ చేత, గౌరవం చేత నీకు ఈ విషయాన్ని గుర్తు చేస్తున్నానే కానీ, నీకు తెలియదని కాదు. కాబట్టి దండకారణ్యంలో ధనుస్సు చేతబట్టుకొని, కనీసం పూర్వపరిచయమైనా లేని, రాక్షసులతో విరోధం తెచ్చుకోవడం క్షేమం కాదు. ఏ అపరాధమూ నీపట్ల చెయ్యని ఆ రాక్షసులను చంపుతాననడం నాకు ఇష్టం లేదు.

ఓ రామా! స్వధర్మం పాలించే క్షత్రియులకు శరణు కోరిన వారిని రక్షించేందుకే ధనుర్బాణాలు ఉపయోగపడాలి. ప్రస్తుతం నీవు క్షత్రియ ధర్మంలో లేవు కాబట్టి రాక్షసులతో విరోధం పెట్టుకోవడం క్షేమం కాదు. పైగా మనం తాపస వృత్తిలో జటావల్కలాలను ధరించి

ఉన్నాం. కాబట్టి ప్రస్తుతం వనాల్లో తిరుగుతున్న మనకు క్షత్రియ ధర్మం పనికిరాదు. తాపస వృత్తే మన ప్రస్తుత కర్తవ్యం.

ఓ రామా! ఆయుధం పట్టుకోవడం వల్ల మనస్సు వికారం చెందుతుంది. కాబట్టి నీవు తిరిగి అయోధ్యకు వెళ్ళేంతవరకు క్షత్రియ ధర్మాన్ని విడిచిపెట్టు. నీవు రాజ్యాన్ని కాదని వచ్చావు. అట్లాగే అరణ్యంలో తాపస వృత్తి చేపడితే నా అత్తమామలు కూడా సంతోషిస్తారు.

ఓ రామా! ధర్మం ఆచరించటం వల్ల అర్థము (ధనం) లభిస్తుంది; ధర్మం సర్వసుఖాలను ఇస్తుంది. ధర్మం వల్ల మానవుడు సమస్తమూ పొందగలడు. ఈ జగత్తు అంతటికీ సారమైనది ధర్మమే.

బుద్ధిమంతులైన వాళ్ళు, నేర్పుతోను, నియమంతోను శరీరాన్ని కృశింపజేసుకొని ధర్మాన్ని సంపాదిస్తారు. ఆ విధంగా కష్టపడ్డవాళ్ళకే సుఖం దక్కుతుందేకాని, సుఖపడేవారికి సుఖం కలుగదు.

కనుక ఓ రామా! తపోవనాల్లో ఉన్నంతకాలం నిర్మలమైన బుద్ధితో ముని ధర్మాన్ని ఆచరించు ప్రభూ! స్త్రీ సహజమైన చపలత్వం చేత ఏదేదో మాట్లాడాను. మీకు ధర్మాన్నుపదేశించాలని నా కోరిక కాదు; అంతటి సామర్థ్యం కూడా నాకు లేదు. మీకు ధర్మం ఉపదేశించే సామర్థ్యం నాకే కాదు, ఈ ప్రపంచంలో ఎవరికీ కూడా లేదు. మీరు మీ తమ్ముడితో కూడా ఆలోచించి ఏది ధర్మమని అనుకుంటారో దాన్నే చెయ్యండి.

# 10వ సర్గ సీతకు రాముని సమాధానం

ధర్మాత్ముడైన రాముడు సీత చెప్పింది అంతా విన్నాడు.

రాముడు: ఓ దేవీ! నీవు జనకుని కుమార్తెవు. ధర్మాలన్నీ చక్కగా తెలిసినదానవు నా మీద ప్రేమాభిమానాలతో నలుగురు మెచ్చే మాటలే చెప్పావు.

ఓ సీతా! "పీడితులైన వారి దీనాలాపాలు వినపడకుండా ఉండేందుకే క్షత్రియులు ధనుస్సు ధరించా" లని చెప్పావు కదా? ఇంక నేను చెప్పవలసింది ఏముంది?

సీతా! దండకారణ్యంలో నివసిస్తున్న మునులంతా కూడా తపోధనులే. వారే ఇతరులకు శరణు ఇవ్వగల సత్తా ఉన్నవారే అయినా దుఃఖీస్తూ స్వయంగా వచ్చి నన్ను శరణు కోరారు. వారంతా దుంపలు, ఫలాలు తింటూ ధర్మాన్ని పాటిస్తూ కూడా క్రూరకర్మలు చేసే రాక్షసుల ఆగడాలకు భయపడిపోతున్నారు. కడుపు నిండా తినడం లేదు. కంటి నిండా నిద్రపోవడం లేదు. సుఖశాంతులకు దూరమై బ్రతుకుతున్నారు. ముని ధర్మాన్ని పాటిస్తూ ఉండేవాళ్ళను నరమాంస భక్షకులైన రాక్షసులు చంపి తింటున్నారు. ఈ దండకారణ్యంలో తపస్సు చేసుకుంటున్న బ్రాహ్మణోత్తములంతా "మమ్మల్ని రక్షించండి" అని నన్ను ప్రార్థించారు.

సీతా! వారంతా వయోవృద్ధులు. తపోధనులు. కేవలం భగవద్ధ్యానం చేసుకోవటానికి అడవుల్లో కందమూలాలు తింటూ బ్రతుకుతున్నారు. అటువంటి వాళ్ళు ప్రాణాలు కాపాడమని ప్రార్థించడం ఏ క్షత్రియుడైనా సిగ్గుపడాల్సిన విషయం. అందుకనే నేను వాళ్ళను "మీకేం కావాలి?" అని అడిగాను. వారు నాతో ఇట్లా అన్నారు.

మునులు: ఓ రామా! దండకారణ్యంలో తమ ఇష్టానుసారంగా రూపాలు మార్చుకొంటూ ఉన్న అనేకమంది రాక్షసులు మమ్మల్ని పీడిస్తున్నారు.

రామా! మేము హోమాలు చేసుకుంటూ ఉంటే, పచ్చి మాంసం తెచ్చి హోమాల్లో వేసి పోతూంటారు. ఇంతేకాదు. ఏ సమయంలో, ఏ ఉపద్రవం తెచ్చి పెడ్తారో చెప్పలేం. ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని జీవిస్తున్నాం. తపస్సు చేసుకుంటున్న వాళ్ళం. మా అందరినీ నీవే కాపాడాలి. ఇంతకాలంగా సరి అయిన రక్షకుడు కోసం ఎదురుచూస్తున్నాం. ఆ భగవంతుడే నిన్ను పంపాడని అనుకుంటున్నాం. అట్టి మాకు నీవే దిక్కు.

రామా! మా తపః ప్రభావం చేత రాక్షసులను మేమే చంపగలం. కానీ చిరకాలం నుండి ఎన్నో కష్టాలకు ఓర్చుకుని చేసిన తపస్సంతా ఖర్చయిపోతుంది. లోక కల్యాణానికైతే, మా తపస్సు ఖర్చు అయినా మేము బాధపడం. కేవలం మా ప్రాణాలు కాపాడుకోవటం కోసం తపస్సంతా ఖర్చయిపోవటానికి మేము ఇష్టపడటం లేదు. కష్టాలనే సహిస్తున్నాం. అట్టి మాకు నీవే దిక్కు.

రామా! ప్రతి రోజూ మా తపస్సుకు ఏదో విఘ్నం ఆ రాక్షసులు కలిగిస్తూనే ఉంటారు. తపస్సు చేసుకోవటం చాలాకష్టమైపోతోంది. అందువలన రాక్షసులు మా ప్రాణాలు తీస్తున్నా ఓపిగ్గా సహిస్తూ శాపం ఇవ్వలేకుండా ఉన్నాం.

అందువలన నీవు, నీ సోదరుడు దండకారణ్యంలో పేట్రేగిపోతున్న నరమాంస భక్షకుల్ని మట్టుపెట్టి మమ్మల్ని కాపాడండి.

కనుక ఓ సీతా! మునీశ్వరుల ప్రార్థన విన్న తర్వాత, దండకారణ్యంలో నివసించే మునీశ్వరులందరినీ కాపాడుతానని ప్రతిజ్ఞ చేశాను. మునులను హింసించే నరమాంస భక్షకులను చంపుతానని మాట ఇచ్చాను. నాలో ప్రాణం ఉన్నంతవరకూ ఇచ్చిన ప్రతిజ్ఞను నెరవేర్చకుండా ఉండలేను. ఇచ్చిన మాటను వెనక్కు తీసుకోను.

నాకు సత్యం చాలా ఇష్టమైనది కదా! ప్రతిజ్ఞను నెరవేర్చడం కోసం, అందునా బ్రాహ్మణులకు చేసిన ప్రతిజ్ఞ విషయంలో నా ప్రాణాన్నైనా ఇస్తాను. నిన్నూ లక్ష్మణుడినీ కూడా

అందునిమిత్తం విడిచిపెట్టడానికి సంకోచించను.

సీతా! ఋషుల విషయంలో అడక్కపోయినా నేను వారిని కాపాడాలి. అటువంటిది, ప్రతిజ్ఞ చేసిన తర్వాత వెనక్కు తీసుకుంటానా?

ఓ సీతా! నీవు నా యందు గల ప్రేమాభిమానం వల్ల ఈ మంచిమాటలు చెప్పావు. ఇష్టం ఉన్న వారికే గదా ఎవరైనా హితాన్ని ఉపదేశిస్తారు! నువ్వూ ఆ పనే చేశావు. నాకు చాలా సంతోషంగా ఉంది.

సీతా! సహధర్మచారిణివైన నీవు నాకు ప్రాణం కన్నా మిన్న. నీవు చెప్పిన మాటలు నీకూ, నీ వంశానికీ కూడా హుందా తెచ్చిపెట్టేవిగా ఉన్నాయి.

రాముడు, సీతాదేవితో ఇలా మాట్లాడుతూ లక్ష్మణ సమేతుడై సుందరమైన తపోవనాల వైపుగా వెళ్ళసాగాడు.

## 11వ సర్గ సీతారామ లక్ష్మణులు అగస్త్యుని ఆశ్రమానికి వెళ్ళటం

రాముడు ముందు నడుస్తూ ఉంటే ఆ వెనకాలే సీత, సీత వెనుక లక్ష్మణుడూ అనేక విషయాలు మాట్లాడుకొంటూ నడుస్తున్నారు. మార్గంలో వాళ్ళు అనేకమైన వనాల్ని, కొండ చరియల్ని, నదులను, సరస్సులను దాటుకుంటూ వెళ్తున్నారు. వనాల్లో చుక్కలున్న జింకలను ఇంకా అనేక మృగాల్ని చూశారు. కొండచరియల్లో జలజలా ప్రవహించే చిన్నా పెద్దా వాగుల్ని చూశారు. నదులు సరస్సులన్నీ కొంత మేర ఇసుక మేటలు వేసి ఉన్నాయి. ఆ ఇసుక మేటలపై వందలాది సారపక్షులు, చక్రవాకాలు. ఇతర నీటి పక్షుల్ని చూశారు. చెరువుల్లో నీళ్ళన్నీ రంగు రంగుల పుష్పాలు, కలువలు పద్మాలతో నిండి ఉన్నాయి. వాళ్ళిట్లా నడవగా నడవగా సూర్యోస్తమయం కావచ్చింది. అటువంటి రమ్యమైన సరస్సులో నుండి శ్రావ్యమైన సంగీతం వినిపించింది. కానీ ఆ చుట్టు ప్రక్కల ఎక్కడా మనుష్య సంచారమే కనబడలేదు. ఆశ్చర్యపడుతూ రాముడు ధర్మభృత్ మునిని 'ఈ సంగీతం ఎక్కడనుండి వినిపిస్తోం' దని అడిగాడు. అంతట ఆ ముని ఆ సరస్సు చరిత్రనంతా రాముడికి ఇట్లా చెప్పాడు.

ధర్మభృత్ మహర్షి: రామా! ఈ సరస్సును 'పంచాప్సర స్సరస్సు' అని పిలుస్తారు. దీన్ని మాండకర్ణి అనే మహర్షి తన తపోబలంచేత నిర్మించాడు. ఈ సంగీతం అన్ని కాలాల్లోనూ ఒకే విధంగా వినిపిస్తూ ఉంటుంది. ఆ మాండకర్ణి మహర్షి తాను కూడా దిక్పాలకుల్లో ఒకడు కావాలని అనుకున్నాడు. అందుకోసం గాలి మాత్రమే పీలుస్తూ ఆ సరస్సులో ఉంటూ పది వేల సంవత్సరాలు తపస్సు చేశాడు. ఆ తీవ్రమైన తపస్సు చేత అగ్ని మొదలైన దేవతలంతా భయపడి ఎట్లాగైనా ఆయన తపోతీవ్రతను తగ్గించాలనుకున్నారు. అందుకోసం వారంతా కలసి ఆయన వద్దకు అయిదుగురు అప్సరసలను పంపి వారి హావభావాలతో ఆ మునిని ఆకట్టుకునేట్లు చేశారు. అప్పుడా ముని వారందరినీ తన భార్యలుగా చేసుకున్నాడు. వారికోసం, నరుల కంటపడకుండా ఆ నీటి లోపలే అయిదు ఇళ్ళు కట్టించి ఇచ్చాడు. వారంతా నీటి అడుగునే ఉంటూ ఆ మహర్షిని ఆటపాటల్తో అలరిస్తూ ఉన్నారు. అందువల్ల సంగీతవాద్యాలు

వినిపిస్తాయేకాని, కంటికి ఎవరూ కనబడరు.

ముని చెప్పిన కథంతా వింటూ రాముడు 'ఆహా! ఎంత ఆశ్చర్యం' అనుకున్నాడు. వారట్లా కొంతదూరం నడవగా వారికి ఒక తపోవనం కనిపించింది. ఆశ్రమంలో అక్కడక్కడా నారచీరలు వ్రేలాడుతూ కనిపించాయి. ఆ ఆశ్రమాల్లో నివసిస్తున్న మునీశ్వరులంతా గొప్ప బ్రహ్మచర్య వ్రతాన్ని పాటిస్తున్నారు. సీతారామలక్ష్మణుల్ని చూడగానే వారంతా ఎదురువెళ్ళి వారికి స్వాగత సత్కారాలు చేశారు. అర్ఘ్యపాద్యాదులతో పూజించారు. వారంతా రాక్షసుల వలన తాము పడుతున్న కష్టనష్టాలను ఏకరువు పెట్టారు. పరమదయాత్ముడైన రాముడు వారి కష్టాలను కడతేర్చాలనుకున్నాడు. మహాశస్త్రాస్త్రవేత్త అయిన రాముడు వారితోనే కొంతకాలం ఉంటూ రాక్షస బాధను నివృత్తి చేయాలని అనుకున్నాడు. అందుకుగాను ఒక్కొక్క ఆశ్రమంలో రెండేసి పర్యాయాలు నివసించాడు. ఆ ప్రకారంగా ఒక ఆశ్రమంలో పదమూడు మాసాలున్నాడు. ఇంకో ఆశ్రమంలో ఒక సంవత్సర కాలం ఉన్నాడు. ఒక్కోచోట నాలుగేసి మాసాలున్నాడు. ఇంకోచోట అయిదు మాసాలు, మరోచోట నాలుగేసి మాసాలున్నాడు. ఇంకోచోట అయిదు మాసాలు, మరోచోట ఏడు మాసాలు, ఒకచోట పదిహేను దినాలు, ఇంకోచోట ఇరవై ఒక్క రోజులు ఇట్లా పది సంవత్సరాలు ఇట్టే అయిపోయాయి.

తరువాత ధర్మజ్ఞుడైన రాముడు సీతా లక్ష్మణులతో కలసి మరల సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ మునులంతా పరమానందంతో రాముణ్ణి పూజించారు. వారితో కొంతకాలం అట్లా గడిపిన తరువాత ఒక రోజు సుతీక్ష్ణ మహర్షిని రాముడు ఇలా అడిగాడు.

రాముడు: ఓ మహర్షీ! ఈ అరణ్యంలోనే ఏదో ప్రాంతంలో మహాత్ముడైన అగస్త్య మహర్షి తపస్సు చేసుకుంటున్నాడని విన్నాను. ఆయన నివసించే ఆశ్రమానికి దారి చూపిస్తే ఆ మహాత్ముడి దర్శనం చేసుకోవాలని ఉంది. ఈ అరణ్యం చాలా విశాలమైనది. ఈ వనంలో అనేక దారులు ఉన్నాయి. మేము అగస్త్య మహర్షిని దర్శించుకునేందుకు శుభకరమైన మార్గాన్ని చూపండి.

సుతీక్ష్ణ మహర్షి: ఓ రామా! మంచి మాట అడిగావు. అగస్త్య మహర్షిని దర్శించమని నేనే చెప్పాలని అనుకుంటున్నాను. దైవవశాన నీవే అడిగావు. ఆయన ఆశ్రమానికి దారి చెప్తాను. విను.

ఇక్కడ నుండి దక్షిణంగా నాలుగు యోజనాల దూరం వెళ్ళాలి. ఆ ప్రాంతాలకు చేరగానే నందనవనంలా పుష్ప ఫలాలతో నిండిన వృక్షసముదాయంతో మనోహరమైన వనం కనిపిస్తుంది. అక్కడ రకరకాల పక్షులు మధురమైన గానాలు చేస్తూ ఉంటాయి. అక్కడే ఒక పిప్పలి చెట్ల సముదాయం కనిపిస్తుంది. వాటి మధ్య ఎత్తుగా సమతలంగా ఉన్న చోట అగస్త్య మహర్షి పర్ణశాలను నిర్మించుకొని నివసిస్తూ ఉంటాడు. ఆ పర్ణశాల ప్రక్కనే పద్మాలతో నిండిన కొలను ఒకటి ఉంటుంది. దాంట్లో ఎల్లవేళలా రాజహంసలు విహరిస్తూ ఉంటాయి. ఆ సరస్సులోని నీరు కొబ్బరి నీళ్ళలాగా తియ్యగాను, పుష్టికరంగాను ఉంటాయి. నీవు భార్య తమ్ముడితో కలసి ఆయన ఆశ్రమంలో కొంతకాలం ఉండవచ్చు.

అంతట సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణ మహర్షికి ప్రదక్షిణపూర్వక నమస్కారం చేసి, ఆయన అనుమతి తీసుకొని అగస్త్యాశ్రమం వైపుగా ప్రయాణం సాగించారు. ముందుగా వారు అగస్త్యుని తమ్ముడి ఆశ్రమానికి చేరుకున్నారు. ఆయన్ను 'అగస్త్యభ్రాత' అని అంటారు.

రాముడు: లక్ష్మణా! సుతీక్ష్ణ మహర్షి చెప్పిన గుర్తులను బట్టి మనం అగస్త్య భ్రాత ఆశ్రమానికి చేరుకున్నాం. మనం పోయి ఆయనకు నమస్కరించి ఈ రాత్రికి ఆతిథ్యం కోరదాం. ఆ తరువాత రేపు ఉదయం అగస్త్యుని ఆశ్రమాన్ని చేరుదాం. ఆ మహనీయుడు లోక కల్యాణం కోసం మృత్యువును నిగ్రహించి ఈ దక్షిణ దేశాన్ని ఋషులకు నివాసయోగ్యంగా చేశాడట.

అంతట సీతారామ లక్ష్మణులు అగస్త్య మహర్షి తమ్ముడి ఆశ్రమంలోకి ప్రవేశించారు.

రాముడు: లక్ష్మణా! ఈ అగస్త్య మహర్షి గొప్పతనాన్ని చాటే అనేక వృత్తాంతాలున్నాయి. మనం ఆశ్రమంలోకి ప్రవేశించే ముందు నీకు ఇల్వలుదు వాతాపి అనే రాక్షసుల్ని ఏ విధంగా

చంపాడో చెప్తాను. విను.

ఓ లక్ష్మణా! ఈ ప్రాంతంలో ఇల్వలుడూ, వాతాపీ అని ఇద్దరు రాక్షసులుండేవారు. వాళ్ళిద్దరూ బ్రాహ్మణులను, మునీశ్వరులను మోసగించి చంపి తింటూ ఉండేవాళ్ళు.

వాళ్ళల్లో ఇల్వలుడు అనే వాడు బ్రాహ్మణ వేషంలో మునుల, బ్రాహ్మణుల వద్దకు పోయి తన తండ్రిదో, తల్లిదో శ్రద్ధమనీ, అందుకుగాను భోక్తలుగా బ్రాహ్మణులు కావాలనీ వాళ్ళకు నమ్మకం కలిగించేట్లుగా సంస్కృతంలో ప్రార్థించేవాడు. అప్పుడు వాడి తమ్ముడు వాతాపి మేకరూపం ధరించేవాడు. ఇల్వలుడు ఆ మేక మాంసాన్ని వండి బ్రాహ్మణులకు పెట్టేవాడు. ఆ బ్రాహ్మణులు భోజనం చేసిన తర్వాత ఇల్వలుడు “తమ్ముడూ! వాతాపీ! బయటకు రా!” అని పిలిచేవాడు. ఆ పిలుపు వినగానే వాతాపి ఆ బ్రాహ్మణుల పొట్టలు చీల్చుకొని బయటకు వచ్చేవాడు. ఆ విధంగా చచ్చిపడున్న బ్రాహ్మణులను వారిద్దరూ తింటూ ఉండేవారు. కోరిన రూపాల్ని పొందే విద్య నేర్చినవారు (కామరూపులు), నరమాంస భక్షకులూ అయిన ఆ ఇద్దరు అన్నదమ్ములూ ఇలా వేలమంది బ్రాహ్మణులను చంపి తిన్నారు.

అప్పుడు దేవతలు ప్రార్థించగా అగస్త్య మహర్షి ఒకనాటి శ్రాద్ధానికి బ్రాహ్మణుడుగా వెళ్ళాడు. ఆ రాక్షసుడు పెట్టిన మేక మాంసాన్ని పూర్తిగా తిని “వాతాపి జీర్ణం, వాతాపి జీర్ణం, వాతాపి జీర్ణం” అని ముమ్మార్లు పలికి మంత్రం పఠించాడట. శ్రాద్ధం పూర్తి అయిన తరువాత ఇల్వలుడు ఉత్తరాపోశనం వడ్డించి “సోదరా! వాతాపీ! బయటకు రా!” అని పిలిచాడట.

అప్పుడు బుద్ధిశాలి, మునిశ్రేష్ఠుడు అయిన అగస్త్యుడు బ్రాహ్మణ రూపంలో ఉన్న ఇల్వలుడితో నవ్వుతూ ఇట్లా అన్నాడు.

అగస్త్యుడు: ఓరీ ఇల్వలుడా! ఇంకెక్కడి వాతాపి. నీ తమ్ముణ్ణి నేను తిని జీర్ణం చేసుకున్నాను. అతడీపాటికి యమలోకం చేరి ఉంటాడు.

అంతట ఇల్వలుడికి తమ్ముడు చనిపోయాడన్న దుఃఖం, తమ్ముణ్ణి చంపాడన్న కోపం రెండూ పెనవేసుకొనిపోగా అగస్త్యునిపైకి దూకాడు. అగస్త్యుడు ఆ ఇల్వలుణ్ణి తన నేత్రాగ్నితోనే కాల్చి బూడిద చేశాడు.

ఇంతలో సంధ్యాకాలం కావటం వల్ల రామలక్ష్మణు లిద్దరూ సంధ్యావందనాలు ముగించుకొని అగస్త్య భ్రాత ఆశ్రమంలోకి పోయారు. అక్కడ అగస్త్యుని తమ్ముడు వారికి ఎదురువెళ్ళి స్వాగతం పలికి కందమూలాలు, ఫలాలు ఇచ్చాడు. వారా రాత్రికి అక్కడే నిద్రించి మర్నాడు ఉదయానే అగస్త్యుని ఆశ్రమానికి బయలుదేరారు. బయలుదేరే ముందు అగస్త్యుని తమ్ముడి దగ్గర వీడ్కోలు పలికి బయలుదేరారు.

సీతారామ లక్ష్మణులు సుతీక్ష్ణ మహర్షి చెప్పిన గుర్తులు పట్టుకొని అడవి మార్గాన అగస్త్యుని ఆశ్రమానికి బయలుదేరారు. దారిలో అడవి నిండా ఇప్ప చెట్లు, పనస చెట్లు, పొగడ చెట్లు, మామిడి చెట్లు, చంద్రవృక్షాలు ఇట్లా ఎన్నో జాతుల వృక్షాలు పూలు కాయలతో వేళ్ళాడుతూ కనిపించాయి. ఏనుగులు తొండాలతో ఆ వృక్షాల కొమ్మల్ని విరుచుకు తింటున్నాయి. కొమ్మల మీద ఎగురుతున్న కోతులు భయంతో మరో వృక్షంపైకి దూకుతున్నాయి.

రాముడు: లక్ష్మణా! ఇక్కడున్న చెట్లకు మిగతా అడవిలో ఉన్న చెట్లకూ తేడా తెలుస్తోంది. ఈ చెట్ల ఆకులన్నీ ముదురాకుపచ్చ రంగుతో ఎంతో ఆరోగ్యంగా కనిపిస్తున్నాయి. అట్లాగే, జంతువులు పక్షులు కూడా తమతమ జాతి వైరాన్ని మరచి అన్యోన్యంగా జీవిస్తున్నాయి. అంటే ఆ మహాత్ముడు అగస్త్యుడి ఆశ్రమం ఇక్కడే ఎక్కడో దగ్గరలో ఉండి ఉండాలి. ఆ మహాత్ముడు వింధ్య పర్వతాన్ని పెరగకుండా నియంత్రించాడు. అందువల్లనే ఆయన్ను అగస్త్యుడు అన్నారు. అదుగో! చెట్ల ఆకుల్లో నుండి పొగ వస్తోంది. బహుశా ఆ పొగలు అగ్నిహోత్రాల నుండి వ్యాపించి ఉంటాయి. అదిగో ఆరవేసిన నారచీరలు తపోవనాలని చెప్పకయే చెప్తున్నాయి.

లక్ష్మణా! ఈ తపోధనుడి మాహాత్మ్యం వల్ల రాక్షసులు దక్షిణ దేశంలో అడుగుపెట్టేందుకే భయపడుతూ ఉంటారు. ఇక్కడ తమ ఆటలు సాగవని తెలుసుకున్నారు. ఆయన దక్షిణ దేశానికి వచ్చి స్థిరపడ్డప్పటి నుండీ ఇక్కడ ఋషులు ప్రశాంతంగా తపస్సు చేసుకోగలుగుతున్నారు. అంతటి మహితాత్ముడవటం వల్ల దక్షిణదిక్కును 'అగస్త్య దిక్కు' అని కూడా పిలుస్తూ ఉంటారు. అగస్త్య మహర్షి తపోధనులందరిలోనూ శ్రేష్ఠుడు. ఆయన ప్రకృతినే నియంత్రించగల దిట్ట. ఒకప్పుడు వింధ్య పర్వతాలు హిమాలయాలతో పోటీ పడ్డాయి. రోజురోజుకూ పెరుగుతూ సూర్యుడి మార్గాన్నే అడ్డగించసాగాయి. అప్పుడు ఈ మహాత్ముడు ఆ పర్వతరాజును "ఇకపై పెరగవద్దు" అని నియంత్రించాడు.

సోదరా! అగస్త్య మహర్షి జనులచేత విశేషంగా పూజించబడ్డాడు. సత్పురుషులకు సహాయపడటంలో ఆసక్తి చూపుతాడు. ఇతరులకు సహాయపడటం ఆయనకు పరమ సంతోషాన్నిస్తుందట. మనం కూడా తక్కిన వనవాస కాలమంతా ఈ మహనీయుడి ఆశ్రమంలోనే గడిపేద్దాం. దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు ఈయన ఆశ్రమానికి వచ్చి నియమాలు పాటిస్తూ తపస్సు చేసుకుంటూ ఈ అగస్త్య మహర్షిని సేవించుకుంటారు.

లక్ష్మణా! అసత్యం మాట్లాడేవాడు, క్రూరుడు, వంచకుడు, స్వేచ్ఛగా ప్రవర్తించేవాడూ ఈ ఆశ్రమంలో జీవించలేడు. ఆ మహర్షి ప్రభావం అటువంటిది. పశుపక్ష్యాదులు కూడా ధర్మాన్ని పాటిస్తాయి. ఇక్కడ తపస్సు చేసిన మహర్షులు ఎంతోమంది తమ దేహాలను వదలిపెట్టి సూర్యచంద్రుల్లాగా ప్రకాశిస్తూ స్వర్గానికి వెళ్ళారు. అగస్త్యుని సేవించిన మహర్షుల్లో అనేక మందిని దేవతలు మెచ్చుకొని వారికి యక్షత్వం, అనురత్వం ఇచ్చారు.

లక్ష్మణా! మనం ఆ మహానుభావుని ఆశ్రమంలోకి వచ్చాం. నీవు ముందుగా పోయి, నేను సీతతో కలసి ఆయన్ను సేవించేందుకు వచ్చానని చెప్పు.

# 12వ సర్గ అగస్త్యుడు రామునికి దివ్యాస్త్రాలను ప్రసాదించడం

అంతట లక్ష్మణుడు అగస్త్య మహర్షి ఆశ్రమంలోకి పోయి, అగస్త్యుని శిష్యునితో ఇట్లా అన్నాడు.

లక్ష్మణుడు: ఓ తపస్వీ! దశరథ మహారాజు కుమారుడు, మహా పరాక్రమవంతుడు అయిన రాముడు, ఆయన ధర్మపత్ని సీతాదేవితో కలసి వచ్చాడు. ఆయన అగస్త్య మహర్షి దర్శనం చేసుకోగోరుతున్నాడు. నేను ఆయన సోదరుడను. నా పేరు లక్ష్మణుడు. ఆ మహాత్ముడి అనుమతి కోసం వేచి ఉన్నాం.

అగస్త్య మహర్షి శిష్యుడు వెంటనే అగ్నిహోత్ర గృహంలోకి వెళ్ళి అగస్త్య మహర్షితో సీతారామలక్ష్మణులు ఆయన దర్శనానికై ద్వారం వద్ద వేచి ఉన్నారని చెప్పాడు.

అగస్త్యుడు: శిష్యా! సీతారామలక్ష్మణులను వెంటనే లోపలకు తీసుకొనిరా! వారికి ఎటువంటి అనుమతులతోనూ పనిలేదు. వాళ్ళే స్వయంగా రావచ్చు, పోవచ్చు. వాళ్ళంతటి పూజనీయులు. రాముడి కోసం నేనే ఎదురు చూస్తున్నాను. నా భాగ్యం ఇన్నాళ్ళకు పండింది. వెంటనే వాళ్ళను లోపలకు తీసుకొనిరా.

వెంటనే శిష్యుడు బైటకు వచ్చి లక్ష్మణునితో ఇలా అన్నాడు.

శిష్యుడు: ఓ లక్ష్మణ స్వామీ! రాముడు ఎక్కడున్నాడు? సీతాదేవి ఎక్కడున్నది? అగస్త్య మహర్షి అగ్ని కార్యం నిర్వర్తిస్తున్నారు. ఆయన మిమ్మల్ని వెంటనే చూడాలనుకొంటున్నారు.

అని పలికి, లక్ష్మణునితో కలసి సీతారాములున్న ద్వారం దగ్గరకు వెళ్ళాడు. శిష్యుడు మహర్షి అన్న మాటలన్నీ రామునితో ఎంతో వినయంతోను, గౌరవంగాను చెప్పాడు. వారి ముగ్గురినీ గౌరవ మర్యాదలతో లోపలకు తీసుకువెళ్ళాడు. ఆశ్రమంలో వేంచేసి ఉన్న బ్రహ్మ,

విష్ణు, అగ్ని, ఇంద్ర, వివస్వతుడు, సోముడు, భగుడు, కుబేరుడు, ధాత, విధాత, వాయువు, ఆదిశేషువు, గాయత్రి, వసువులు, వరుణుడు, కుమారస్వామి, యమధర్మరాజులుంటున్న స్థానాలను చూస్తూ లోపలకు వెళ్ళారు.

రాముణ్ణి చూస్తూనే అగస్త్య మహర్షి శిష్యగణంతో కలసి ఎదురుగా వెళ్ళాడు. అప్పుడాయన్ను చూపిస్తూ “లక్ష్మణా! ఆ మహా తేజోవంతుడే అగస్త్య మహర్షి అనుకొంటున్నాను” అని చెప్పి తాను కూడా ఆయనకు ఎదురుగా వెళ్ళి ఆయన పాదాలకు నమస్కరించాడు. తరువాత సీతాదేవి లక్ష్మణుడు కూడా ఆ మహర్షి పాదాలకు నమస్కరించారు. రాముడు ఆ మహాత్ముణ్ణి చేతులు జోడించి చూస్తూ నిలబడ్డాడు.

అప్పుడు మహర్షి వారందరికీ ఆసనమిచ్చి కూర్చోమన్నాడు. అగస్త్యుడు అగ్నిహోత్రాదులు పూర్తి చేసుకొని అర్ఘ్యపాద్యాలిచ్చి అతిథుల్ని పూజించాడు. వానప్రస్థ ధర్మాన్ననుసరించి తియ్యటి ఫలాలతోను, కందమూలాలతోను భోజనం పెట్టాడు.

అగస్త్యుడు: రామా! ముందుగా (వైశ్వదేవము) అగ్నిహోత్రంచేసి అటు తర్వాతే అతిథుల్ని అర్ఘ్యమిచ్చి పూజించాలి. అట్లా కాని ఎడల తప్పుడు సాక్ష్యం చెప్పినవాడివలె నరకానికి పోయి తన మాంసాన్ని తానే తినాల్సి వస్తుంది.

రామా! నీవు లోకాలన్నింటికీ చక్రవర్తివి. ధర్మాచరణ శీలుడవు. మహారథుడవు. పూజించదగిన వారిలో శ్రేష్ఠుడవు. అటువంటి వాడవు నా భాగ్యవశాన ఈ రోజు నాకు అతిథిగా వచ్చావు.

పురుషులలో శ్రేష్ఠుడవైన రామా! బంగారంతోను రత్నాలతోను పొదగబడిన ఈ దివ్యధనుసు విష్ణుదేవునిది. దీనిని విశ్వకర్మ తయారుచేశాడు. సూర్యునివలె వెలిగిపోతున్న ఈ బాణాలను నాకు బ్రహ్మ ఇచ్చాడు. అగ్నివలె మండిపోతున్న అక్షయతూణీరాన్ని, బంగారు ఒరలో ఉన్న ఈ ఖడ్గాన్ని నాకు ఇంద్రుడు ఇచ్చాడు.

రామా! పూర్వం విష్ణువు ఈ ధనుస్సు చేతనే రాక్షసులందరినీ సంహరించి, దేవతలకు తిరిగి స్వర్గాన్ని పొందేట్లు చేశాడు. శరణు కోరిన వారందరినీ రక్షించే ఓ రామా! ఇంద్రుడు వజ్రాయుధాన్ని పొందినట్లు, ఈ ధనుస్సు, బాణములు, అంబుల పొది, ఖడ్గము స్వీకరించు. ఈ ఆయుధాలు నీకు విజయలక్ష్మిని చేకూర్చిపెడ్తాయి.

మహా తేజశ్శాలి అయిన అగస్త్యుడు ఈ విధంగా మాట్లాడి శ్రేష్ఠాలైన ఆయుధాలను రామునికిచ్చాడు.

# 13వ సర్గ అగస్త్యుడు సీతారాములను ప్రశంసించడం

అగస్త్య మహర్షి: రామా మీరు చాలా దూరం నడచి వచ్చారు. ఎన్నో శ్రమలకు ఓర్చుకుని నన్ను చూడటానికి వచ్చారు. చాలా సంతోషంగా ఉంది. లక్ష్మణా! నీవు నీ అన్న సేవలు చేసుకుంటూ ఆయన్నే అనుసరించి వస్తున్నావు. నీకు శుభం కలగాలి. మీరు బాగా అలసిపోయారు. జనక మహారాజు కుమార్తె అయిన సీతాదేవి కూడా చాలా అలసి ఉన్నట్లు కనిపిస్తోంది. ఈమెకు కూడా విశ్రాంతి చాలా అవసరం.

సీతాదేవి పుట్టినప్పటి నుండీ రాజభోగాలు అనుభవించింది. ఎన్నడూ కష్టపడి ఎరుగదు. ఆమె మీ వెంటపడి అడవులకు రావటం అనేది సామాన్యమైన విషయమా? భర్తకు సేవలు చేయడం కోసం, తన సుఖాల్ని కూడా త్యాగం చేసి రాముడి వెంట వచ్చింది. రామా! ఈమెకు ఏ కష్టమూ కలుగకుండా ఈ ఆశ్రమంలో అన్ని సౌకర్యాలు కలిగించు.

రామా! లోకంలో స్త్రీలు భర్త సుఖంగా ఉన్నప్పుడు అనురాగం చూపిస్తారు. ఏమాత్రం అతడు కష్టాల్లో పడ్డా అతణ్ణి వదిలేస్తారు. స్త్రీలు మెరుపువలె చంచల స్వభావం కలవాళ్ళు. వారి మాటలకు, చేతలకు ఆయుధాలకున్నంత పదును ఉంటుంది. వాళ్ళ ఆలోచనలు గరుత్మంతుని కన్నా వేగంగా పరుగెత్తుతాయి. ఇవన్నీ స్త్రీలలో సృష్టి ప్రారంభం నుండీ వచ్చేవే!

కానీ సీత మాత్రం అట్లా కాదు. ఏ దోషమూ లేనిది. అరుంధతి దేవి లాగా ప్రశంసించదగ్గది. ఓ రామా! నీవు సీతా లక్ష్మణులతో ఎక్కడ ఉంటావో అదే స్వర్గంలాగా శోభిస్తుంది.

రాముడు (వినయంగా) : ఓ మహర్షీ! నా భార్య, నా తమ్ముడు మీ అనుగ్రహానికి పాత్రులు కావటం వాళ్ళ పూర్వజన్మల సుకృతం. మీరు వరములు ఇవ్వగల సమర్థులు. వారు మీ మెప్పును పొందగలగడం నాకు సంతోషంగా ఉంది.

ఓ మహానుభావా! ఒక పర్ణశాలను నిర్మించుకొని నిశ్చల చిత్తంతో తపస్సు చేసుకోవాలని నాకు ఉంది. నీటి వసతి కలిగి ఫలవృక్షాలతో సమృద్ధమైన ప్రదేశాన్ని చెప్పండి. మేము వనవాస గడువు తీరేంతవరకూ అక్కడే ఉండాలనుకొంటున్నాం.

అగస్త్య మహర్షి: నాయనా! రామా! ఇక్కడకు రెండు యోజనాల దూరంలో పంచవటి అని ఒక చక్కటి ప్రదేశమున్నది. అక్కడ కందమూలాలు, ఫలాలు సమృద్ధిగా లభిస్తాయి. సమీపానే గోదావరీ నది నిరంతరం ప్రవహిస్తూ ఉంటుంది. అక్కడ అనేక మృగాలు స్వేచ్ఛగా తిరుగాడుతూంటాయి. అనేక పక్షి జాతులతో సందడి బాగా ఉంటుంది. నీవు సీతా లక్ష్మణులతో కలసి ఆ ప్రదేశానికి వెళ్ళి పర్ణశాల నిర్మించుకో. నీవు నీ తండ్రికి చేసిన ప్రతిజ్ఞ పూర్తి అయ్యేవరకూ అక్కడే సుఖంగా ఉండవచ్చు. దశరథ మహారాజు విధించిన వనవాసకాలం, చాలాభాగం అయిపోయింది. మిగతా కాలం పంచవటిలో సుఖంగా గడిపి అయోధ్యకు పోగలవు. ఓ రామా! యయాతి మహారాజులాగానే నీ తండ్రి దశరథుడు కూడా నిన్ను జ్యేష్ఠ పుత్రుడుగా పొంది ధన్యుడయ్యాడు. నా తపఃప్రభావం చేతను, దశరథునితో నా కున్న స్నేహం వల్లనూ, నీ విషయం అలా గ్రహించాను. అందుకనే నేను మొదట్లో నిన్ను కూడా నాతోనే ఇక్కడే ఉండమన్నాను. కానీ నీ భవిష్యత్తు దివ్యదృష్టిచే తెలుసుకొన్న తరువాత నీవు పంచవటిలో ఉండటమే మంచిదని అనుకుంటున్నాను. అందువల్లనే పంచవటిలో పర్ణశాల నిర్మించుకొని మిగతా సమయం అంతా అక్కడే గడుపు. ఆ ప్రదేశం నాకు చాలా దగ్గరగా ఉంటుంది. సీత కూడా అక్కడ సుఖంగా ఉండగలదు.

ఓ మహానుభావా! అక్కడ పంచవటికి దగ్గరగా గోదావరి ప్రవహిస్తూ ఉంటుంది. కందమూలాలు, ఫలాలు సమృద్ధిగా దొరుకుతాయి. సీత కూడా ఆ ప్రాంతంలో సుఖంగా ఉండగలదు. రామా! నీవు శరణు కోరిన వారిని రక్షించటంలో సమర్థుడవు. నీవు అక్కడ ఉంటూ, ఆ ప్రాంతంలో తపస్సు చేసుకునే మునులను, తాపసులను కాపాడవచ్చు.

రామా! ఈ పర్వతం పైన ఒక దిబ్బ ఉంది. దానిపైన ఎక్కి చూస్తే పుష్పించిన దట్టమైన

అడవి కనిపిస్తుంది. ఆ పుష్పవనమే పంచవటి.

తరువాత మహర్షి నుండి అనుమతి తీసుకొని రాముడు సీతాలక్ష్మణులతో కలసి పంచవటి దిశగా ప్రయాణమై వెళ్ళాడు.

# 14వ సర్గ రాముడు జటాయువును కలవటం

రాముడు ధనుస్సు ఖడ్గము ధరించి సీతా లక్ష్మణులతో కలసి పంచవటి వైపు ప్రయాణం సాగించాడు. దారిలో ఒక మర్రిచెట్టుపై మహాకాయుడూ మహాపరాక్రమవంతుడూ అయిన గ్రద్దను ఒకదాన్ని చూశారు. ఆ గ్రద్దను చూసి రామలక్ష్మణులు రాక్షసుడేమోనని అనుకున్నారు. అంతట రాముడు ఆ గ్రద్దను "ఎవరు నీవు?" అని ప్రశ్నించాడు. అందుకు ఆ గ్రద్ద మృదుమధురంగా "నాయనా! నేను నీ తండ్రి దశరథునకు స్నేహితుడను" అన్నది. ఆ మహాకాయుడు తన తండ్రికి స్నేహితుడని తెలియగానే రామలక్ష్మణు లిద్దరూ ఆ గ్రద్దను పూజించారు. తరువాత ఆ పక్షిని "నీ పేరేమి? నీ కులమేమి?" అని అడిగారు.

అందుకా గ్రద్ద, తన గూర్చి చెప్పే ముందుగా సమస్త ప్రాణికోటి పుట్టు పూర్వోత్తరాలు చెప్పదలచుకొంది. "ఓ రామా! ప్రజాపతులలో మొట్టమొదటి వాడు కర్దమ ప్రజాపతి. తర్వాతివాడు విక్రీతుడు. ఆ తర్వాత శేషుడు, చాలామంది పుత్రులను కలిగిన సంశ్రయుడు, స్థాణువు, మరీచి, అత్రి, క్రతువు, పులస్త్యుడు, అంగీరసుడు, ప్రచేతసుడు, పులహుడు, దక్షుడు, వివస్వంతుడు ఉన్నారు.

ఓ రామా! ప్రజాపతి అయిన దక్షునకు అరవై మంది కుమార్తెలు. వారిలో అతిది, దితి, దనువు, కాళిక, తామ్ర క్రోధవశ, అనల, మను అను ఎనిమిదిమందిని కాశ్యపుడు వివాహమాడాడు. వారందరినీ తనతో సమానమైన వారిని, లోకాలను పోషించేవారు అయిన పుత్రులను కనమన్నాడు. కానీ వాళ్ళల్లో దితి, అదితి, కాళికా అనే వారు మాత్రమే పుత్రులను కనేందుకు ఇష్టపడ్డారు. మిగతా వాళ్ళెవరూ కాశ్యపుని మాటను లెక్కపెట్టలేదు.

రామా! అదితికి పన్నెండు మంది ఆదిత్యులు, ఎనిమిది మంది వసువులు, పదకొండుమంది రుద్రులు, ఇద్దరు అశ్వనీ దేవతలను ముప్పై ముగ్గురు దేవతలు పుట్టారు. దితి కీర్తిమంతులైన దైత్యులను కన్నది. ఆ విధంగా పూర్వం ఈ భూమి, అడవులు, సముద్రాలు,

దేవతలకు, దైత్యులకు సొంతం అయి ఉండేది.

రామా! దనువు హయగ్రీవుణ్ణి కన్నది. కాళిక నరకుణ్ణి, కాలకుణ్ణి కన్నది. క్రౌంచి, భాసి, శ్యేని, ధృతరాష్ట్రి, శుకి అనే అయిదుగురు కుమార్తెలు తామ్రకు పుట్టారు. వారిలో క్రౌంచికి గుడ్లగూబలు పుట్టాయి. భాసికి భాసపక్షులు పుట్టాయి. శ్యేనికి తేజోవంతమైన డేగలు, గద్దలు పుట్టాయి. ధృతరాష్ట్రికి కలహంసలు, హంసలు, చక్రవాక పక్షులు పుట్టాయి. శుకి నత పుట్టింది, నతకు వినతి పుట్టింది.

రామా! క్రోధవశకు మృగి, మృగమంద, హరి, భద్రమద, మాతంగి, శార్దూలి, శ్వేత, సురభి, సురస, కద్రువ అనే పదిమంది కుమార్తెలు పుట్టారు. వీరిలో మృగికి జింకలు పుట్టాయి. మృగమందకు ఎలుగుబంట్లు, సృమర మృగాలు, చమర మృగాలు పుట్టాయి. హరికి సింహాలు, వానరాలు పుట్టాయి. భద్రమదకు ఇరావతి అనే కుమార్తె పుట్టింది. ఇరావతికి ఐరావతము అనే పెద్ద ఏనుగు పుట్టింది. అది ఇంద్రుడికి వాహనం అయింది. మాతంగికి ఏనుగులు పుట్టాయి. శార్దూలికి పెద్ద పులులు, కొండముచ్చులు పుట్టాయి. శ్వేతకు దిగ్గజాలు పుట్టాయి. సురభికి రోహిణి, గంధర్వి అనే ఇద్దరు కుమార్తెలు పుట్టారు. రోహిణికి ఆవులు, గంధర్వికి గుర్రాలు పుట్టాయి. సురస దివ్యసర్పాలను కన్నది. కద్రువ సామాన్య సర్పాలను కన్నది. మనువు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే మనుజులను కన్నది. అనల పవిత్రమైన వృక్షాలను సృష్టించింది. వినత (శుకి మనుమరాలు) వంశాన్ని, సురస చెల్లెలు కద్రువు వంశాన్ని చెప్పుతాను. కద్రువు భూమిని మోస్తున్న శేషుణ్ణి కన్నది. వినతకు గరుడుడు, అరుణుడు అనే ఇద్దరు కొడుకులు పుట్టారు. నేను ఆ అరుణికి, శ్యేనికి పుట్టాను. నా కన్నా పెద్దవాడి పేరు సంపాతి. నా పేరు జటాయువు.

రామా! నేను నీకు సేవకుడుగా ఉంటూ సేవలు చెయ్యాలని ఉంది. నీవు సరేనంటే నీకు సేవకుడుగా ఉంటాను. ఇది భయంకరమైన అడవి. ఎన్నో క్రూరమృగాలు తిరుగుతూ ఉంటాయి; రాక్షసులూ యథేచ్ఛగా తిరుగుతూ ఉంటారు. రామా! ఎప్పుడైనా సీత ఒంటరిగా

ఉండాల్సి వస్తే నేను ఆమెను కనిపెట్టుకొని ఉంటాను.

అంతట రాముడికి జటాయువుపై గౌరవంతోపాటు ప్రేమ కూడా పెరిగింది. అమాంతం కౌగలించుకున్నాడు. వాళ్ళు అలా దశరథ మహారాజుకు సంబంధించిన ఎన్నో కబుర్లు చెప్పుకుంటూ పంచవటికి చేరుకున్నారు.

# 15వ సర్గ పంచవటిని చేరుకోవడం

సీతారామలక్ష్మణులు పంచవటికి చేరుకున్నారు. అడవి అంతా పెద్ద వృక్షాలతోను, ఆ వృక్షాలన్నీ మనోహరమైన పూలతోను, మధురమైన ఫలాలతోను – సమృద్ధిగా ఉంది. కందమూలాలు కూడా విరివిగా దొరుకుతాయి. అంతేకాదు ఆ ప్రాంతం రకరకాలైన సాధు జంతువులు, క్రూర మృగాలు, సర్పాలతో నిండి ఉంది.

రాముడు: లక్ష్మణా! అగస్త్య మహర్షి చెప్పిన పంచవటికి వచ్చాం. ఈ పంచవటిలో మనం ఉండేందుకు సౌకర్యంగా ఉండే చోటును వెతుక్కోవాలి. మనం కోరుకునే చోటు ఎలా ఉండాలంటే సమీపంలో సమృద్ధిగా నీళ్ళ నిచ్చే సరస్సుండాలి. అగ్నిహోత్రానికి, దైవకార్యాలకు అవసరమయ్యే దర్భలు విరివిగా దొరికేట్లుండాలి. వర్షాకాలం వస్తే బురద రొచ్చు లేకుండా పొడిగా ఉండే చోటయి ఉండాలి. నేల సమమట్టంగా ఉండాలి. వీటితోపాటు సీత నిర్భయంగా అటూ ఇటూ తిరిగే చోటయి ఉండాలి. అటువంటి యోగ్యమైన చోటు చూడు. మనం అక్కడ ఒక పర్ణశాల నిర్మించుకుందాం.

లక్ష్మణుడు: అన్నా! రామా! నా జీవితం అంతా నీవు చెప్పింది చేయటమే కాని, స్వతంత్రంగా ఏదీ చెయ్యను; చెయ్యలేను. కాబట్టి ఆ చోటేదో నీవే నిర్ణయించు. 'ఇక్కడ ఒక పర్ణశాల నిర్మించు' అని ఆజ్ఞాపించు. నీ ఆజ్ఞను శిరసావహిస్తాను.

లక్ష్మణుడు ఆ విధంగా పూజ్యభావంతోనూ, ఎంతో వినయంతోనూ చెప్పిన మాటలకు సంతోషించిన రాముడు తానే ఒక అనువైన ప్రదేశాన్ని పర్ణశాల కోసం చూపించాడు. అది సమతలమైన ప్రదేశం. దగ్గరలోనే తామర పూలతో నిండిన సరస్సు ఉంది. ఆ పూల నుండి వస్తున్న పరిమళాలు ఆ ప్రాంతమంతా వ్యాపించి. ఆహ్లాదపరుస్తున్నాయి. అక్కడకు కొద్ది దూరంలోనే గోదావరి గలగలా పారుతోంది. నదిలో చక్రవాకాలు, హంసలు, కారండవాలు స్వేచ్ఛగా తిరుగుతున్నాయి. ఆ ప్రదేశం మరీ ఎత్తుగా పర్వతం మీదా లేదు, అట్లా అని మరీ

నేలమీదా లేదు. అక్కడ నుండి చూస్తే జింకలు, ఏనుగులు, పెద్దపులులు గుంపులుగా తిరగటం కనిపిస్తూ ఉంటుంది. ఆ కొండల్లో ఎన్నో గుహలున్నాయి. ఆ కొండ చరియల్లో పెరిగిన చెట్ల నిండా పూలు పండ్లూ విస్తారంగా కాస్తున్నాయి. ఆ కొండ సానువుల్లో వెండి, బంగారం, రాగి వంటి ధాతువులుండటం వల్ల ఎండపడి తళతళా మెరుస్తున్నాయి.

ఆ పర్వతం నిండా మద్దిచెట్లూ, కానుగ చెట్లు, తాటి చెట్లు; మామిడి చెట్లు వంటి ఫల వృక్షాలు, సువాసన నిచ్చే పూలతో కూడిన లతలు, తీగలు, మొక్కలు ఎన్నో ఉన్నాయి. ఇదేకాక అశోక, కదంబ, మద్ది, చంపక వంటి మహావృక్షాలతో కూడి ఉన్నది.

ఓ లక్ష్మణా! ఈ ప్రదేశం చాలా రమణీయమైనది మాత్రమే కాదు పరమ పవిత్రమైనది కూడా. మనం ఈ ప్రాంతంలో ఒక పర్ణశాల నిర్మించుకుందాం. జటాయువు కూడా మనతో ఉంటుంది.

రాముని ఆజ్ఞను శిరసావహించి లక్ష్మణుడు వాసాలతో, దుంగలతోను పర్ణశాలను నిర్మించాడు. పైన రెల్లుతో కప్పు వేశాడు. ఆ పర్ణశాల సువిశాలంగా ఉంది. అగ్ని గృహాన్ని నిర్మించాడు. గోదావరిలో స్నానం చేసి కలువల్ని తెచ్చి వాస్తుపూజ చేశాడు. సీతారాములు ఆ పర్ణశాలను చూసి ఎంతో ముచ్చటపడ్డారు. రాముడు లక్ష్మణుని ఆప్యాయంగా కౌగలించుకొని “తమ్ముడా! నీవు నా హృదయం తెలిసినవాడవు. నాకు ఏవేవి ఎనలేని సంతోషాన్ని కలిగిస్తాయో అవన్నీ చక్కగా ఆలోచించి అమర్చిపెట్టావు. ప్రేమగా కౌగలించుకోవటం కన్నా ఇంకా ఏం బహుమతి ఇవ్వగలను? నీవు ధర్మాత్ముడైన తండ్రి లేని లోటు తీరుస్తున్నావు” అంటూ తమ్ముణ్ణి మెచ్చుకుంటూ సీతతో పర్ణశాలలోకి ప్రవేశిస్తూ గృహప్రవేశం చేశాడు.

# 16వ సర్గ హేమంత ఋతు వర్ణన

సీతారామలక్ష్మణులు పంచవటిలో సుఖంగా స్థిరపడ్డారు. ఇంతలోనే శరదృతువు పోయి హేమంత ఋతువు ప్రారంభం అయింది. ఒకానొక రోజు రాముడు ఉదయానే లేచి గోదావరిలో స్నానం చెయ్యటానికి బయలుదేరాడు. సీత, లక్ష్మణులు కూడా రాముణ్ణి అనుసరించి వెళ్ళారు. లక్ష్మణుడు ఒక చెంబు కూడా తీసుకువెళ్ళాడు.

లక్ష్మణుడు: ఓ రామా! నువ్వు ఏ కాలాన్నైతే ఇష్టపడతావో ఆ కాలం రానేవచ్చింది. సంవత్సరానికే ఈ ఋతువు అలంకారప్రాయమైనది కాబట్టి నీమా ఈ ఋతువునే ఎక్కువ ఇష్టపడతావు.

రామా! మంచువల్ల ప్రాణుల శరీరాలన్నీ బిగుసుకుపోతున్నాయి. పంట భూముల్లో పంటలు సమృద్ధిగా పండుతున్నాయి. నదిలో నీళ్ళు స్నానానికి సుఖంగా ఉండటం లేదు. చలిమంటలే వెచ్చగా హాయిగా ఉంటున్నాయి.

పల్లెలో పదార్థాలన్నీ సమృద్ధిగా దొరికే రోజులు. కొత్త ధాన్యాలు రావటం వల్ల పితృదేవతలకు ఆరాధనలు చేయాల్సిన సమయం. దేవతల్ని ఆరాధించే ఋతువు కూడా ఇదే. ఆవులు సమృద్ధిగా పాలు ఇస్తూ ఉంటాయి. రాజులు యుద్ధాలు, దండయాత్రలు చెయ్యటానికి సరి అయిన సమయం.

రామా! యముడు సేవించే దక్షిణ దిక్కును సూర్యుడు అధికంగా సేవించడం వలన ఉత్తర దిక్కు తిలకంలేని స్త్రీలా బోసిపోతోంది. సూర్యుడు శక్తిహీనుడు కావటం వల్ల హిమాలయాల నిండా మంచు పేరుకుని ఆ పేరు సార్థకం అవుతోంది.

బయట తిరగటానికి పగటిపూట నీరెండా సుఖాన్నిస్తున్నాయి. నీడలోకి పోవటానికి, నీళ్ళు ముట్టుకోవటానికి ప్రాణం ఒప్పుకోవటం లేదు. ప్రయాణానికి కాస్త పొద్దెక్కాకే సుఖంగా

ఉంటుంది. సూర్యోదయానికి ముందే బయలుదేరాలంటే ప్రాణం విలవిల్లాడిపోతోంది.

చలి ఎక్కువగా ఉండటం వల్ల జంతువులు కూడా బయట తిరగటం లేదు. పొగమంచు చేత సూర్యుడు మసకబారిపోయాడు. అందువల్ల శరీరంలోంచి ఒణుకుపుడ్తోంది.

పుష్యమాసం కావటాన ఎవరూ ఆరుబయట పడుకోవడం లేదు. మంచుతో కప్పబడిన చంద్రుడు కూడా ఎర్రగా కనిపిస్తున్నాడు. రాత్రిళ్ళు ప్రొద్దు పెరిగి మరీ ఏడిపిస్తోంది.

ఇప్పుడు దట్టంగా పొగమంచు పట్టడం మూలంగా చంద్రుడి గుణాన్ని సూర్యుడు పుణికిపుచ్చుకున్నాడు. చంద్రుడు ఎర్రగా కనబడుతూ ఉదయించే సూర్యుడులాగా కనిపిస్తున్నాడు. నోట్లోంచి వచ్చే ఆవిరి అద్దంపైన పడి ముఖం మసకమసకగా కనిపిస్తోంది.

పూర్ణిమనాడు కూడా మంచు కప్పేయడం వల్ల చంద్రుడు మసకబారిపోయాడు. సీతాదేవి శరీరం కూడా ఎండకూ వానకూ తడిసి అడవుల్లో తిరగడం మూలంగా నల్లబడింది.

పడమటి గాడ్పులు ఎప్పుడూ చల్లగానే ఉంటాయి. ఇప్పుడు మంచు కూడా కురవటం వల్ల చలి, ఒణుకు తోడయ్యాయి. వరి, గోధుమ పంట పొలాలపై కప్పబడ్డ మంచు సూర్యోదయం కాగానే కరగడంతో మొక్కలు ఆనందంగా తలలాడిస్తున్నాయి. ఆహారాన్ని వెతుక్కుంటూ క్రౌంచపక్షులు, సారపక్షులు ఆ పొలాలపై గుంపులుగా ఎగురుతున్నాయి. వరి కంకులన్నీ ఎండ పొడ పడి బంగారం లాగా మెరిసిపోతున్నాయి. పొగమంచు దట్టంగా ఉండటం చేత మధ్యాహ్నానికిగానీ ఎండవేడి తెలియటం లేదు. అంటే సూర్యుడు తన ఓటమిని అంగీకరిస్తున్నాడన్నమాట.

రామా! ఈ అడవిలో గడ్డి మీద మంచుపడి ఎండకు ముత్యాల్లా మెరుస్తున్నది. నీళ్ళను చూడగానే ఆనందంతో పరుగు పరుగున వస్తున్న ఏనుగులు నీళ్ళల్లో తొండంపెట్టి, చలికి తట్టుకోలేక, వెంటనే తొండాలను బయటకు లాగేసుకుంటున్నాయి. ఇక నీళ్ళల్లో దిగటానికి

ఒకటికి పదిసార్లు ఆలోచిస్తున్నాయి.

రామా! అటుచూడు. పక్షులన్నీ నీళ్ళల్లోకి దిగకుండా చలికి భయపడి ఒడ్డునే పచార్లు చేస్తున్నాయి. వాటిని చూస్తూ ఉంటే పిరికివాళ్ళు యుద్ధానికి పోయేందుకు భయపడుతున్నట్లుంది. నది లోపలి నుండి వచ్చే ఆవిరి, బైట నుండి పడే మంచూ కలసి దట్టమైన పొర ఏర్పడింది. దాంతో నీళ్ళే కాదు, నీటిపై వాలిన సారపక్షులు కూడా కనిపించటం లేదు. వాటి కూతలే వాటి ఉనికిని చాటుతున్నాయి. అటువంటి మంచు నదీ తీరాన ఉండే ఇసుక మేటల్ని కూడా నదియేనెమోనని భ్రమింపజేస్తున్నాయి. పైనుండి కురుస్తున్న మంచు నీళ్ళ అడుగుభాగం వరకూ పోయి నదిలో నీళ్ళు త్రాగటానికి వీలులేనంత చల్లగా ఉన్నాయి.

ఓ రామా! ఇటువంటి శీతాకాలంలో కూడా నీ తమ్ముడు భరతుడు పట్టణంలో ఉంటున్నా, తపస్సు చేసుకుంటున్నాడు. అతడు రాజ్యాన్ని, రాజభోగాలను కాలదన్నాడు. ఆహార నియమాలు పాటిస్తూ తపస్సు చేస్తూ ఉంటాడు.

రామా! మనం స్నానానికి గోదావరీ తీరానికి వస్తున్నట్లే భరతుడు కూడా ఇదే సమయానికి సరయూ నదీ తీరానికి పోతూ ఉంటాడు. భరతుడు ఎన్నడూ కాలు కింద పెట్టినవాడు కాదు. రాజభోగాలనుభవిస్తూ ఉండేవాడు. అటువంటి వాడు ఇప్పుడు చలిలో తెల్లవారుజామునే లేచి సరయూ నది మెట్ల మీద కూర్చుని మనల్ని గురించి ఆలోచిస్తూ ఉంటాడేమో!

అన్నా! రామా! పద్మరేకుల వంటి కన్నులు గల మన భరతుడు వీరుడే కాదు, ధర్మం తెలిసినవాడు; సత్యాన్నే పలికేవాడు; జితేంద్రియుడు; మధురంగా మాట్లాడతాడు; పెద్దల ఎడల వినయ విధేయతలు చూపుతాడు; ఆజానుబాహువు; శత్రువినాశకుడు; అటువంటి భరతుడు నీ కోసం రాజభోగాలన్నీ వదులుకున్నాడు. పూజ్యుడవైన నిన్నే ఆశ్రయించాడు. అరణ్యంలో ఉంటూ నువ్వు ఎట్లా జీవిస్తున్నావో, అయోధ్యలో ఉన్నా భరతుడు కూడా అట్లాంటి జీవితాన్నే

గడుపుతున్నాడు. నీ కోసం వెయ్యి కళ్ళతో ఎదురుచూస్తున్నాడు.

లోకంలో పిల్లలు తల్లి స్వభావాన్ని పుణికి పుచ్చుకుంటారని అంటారు (తండ్రి స్వభావాన్ని అనుసరించరని). కానీ భరతుడు తల్లి స్వభావానికి భిన్నంగా ప్రవర్తించాడు. ధర్మాత్ముడైన దశరథ మహారాజుకు ధర్మపత్ని అయి, భరతుని వంటి సత్పురుషుని కన్న కైకేయిదేవికి ఇటువంటి క్రూరస్వభావం ఎట్లా వచ్చిందో బోధపడటం లేదు.

రాముడు: సోదరా! లక్ష్మణా! నీకు భరతునిపై ఉన్న ప్రేమాభిమానాలను నేను అర్థం చేసుకోగలను. నీవు భరతుణ్ణి గూర్చి, ఇక్ష్వాకు వంశాన్ని గూర్చి ఎంతైనా మాట్లాడు. కానీ మా సవతి తల్లి అయిన కైకేయిని నిందించవద్దు.

నేను వనవాసం చెయ్యాలనే దృఢంగా అనుకోవటం వల్ల ఇక్కడ జీవిస్తున్నానే కాని నా మనస్సు ఎప్పుడూ భరతుని చుట్టూనే తిరుగుతూ ఉంటుంది. "అయ్యో! భరతుడు దగ్గర లేడు కదా" అని దుఃఖిస్తూ ఉంటాను. ఆహా! భరతుడు ఎంత తియ్యగా మాట్లాడతాడు? అతడు ఆప్యాయంగా మాట్లాడుతూ ఉంటే హృదయం ద్రవించిపోతుంది. అతడు మాట్లాడిన మాటలు ఇంకా నా చెవుల్లో మారుమ్రోగుతూనే ఉన్నాయి. లక్ష్మణా! మహాత్ముడైన భరతునితోను, వీరుడైన శత్రుఘ్నునితోను నీవు, నేను అందరం కలసి ఉండే రోజు ఎప్పుడు వస్తుందో గదా!

ఈ విధంగా దుఃఖిస్తూ సీతాలక్ష్మణులతో కలసి గోదావరిలో స్నానం చేసి పితృదేవతలకు, దేవతలకు తర్పణాలిచ్చి, పార్వతీ నందీశ్వరులతో కూడిన రుద్రునివలె రాముడు దివ్య తేజస్సుతో ప్రకాశించాడు.

# 17వ సర్గ శూర్పణఖ

గోదావరి స్నానాలు ముగించుకొని సీతారామలక్ష్మణులు మధ్యాహ్నం చెయ్యాల్సిన అనుష్ఠాలన్నీ చేసుకొని కూర్చున్నారు. అప్పుడు రాముడు చిత్రానక్షత్రంలో చంద్రుడి లాగా ప్రకాశిస్తున్నాడు. వాళ్ళు ముగ్గురూ కూర్చుని పిచాపాటీ మాట్లాడుకుంటూ ఉండగా ఒక రాక్షస స్త్రీ వాళ్ళ దగ్గరకు వచ్చింది.

ఆ స్త్రీ రాముణ్ణి దగ్గరగా వచ్చి బాగా పరిశీలనగా చూసింది. బలిష్ఠమైన బాహువులతో, విశాల వక్షఃస్థలంతో, పద్మరేకుల వంటి నేత్రాలతో, తేజస్సుతో ప్రకాశిస్తున్న రాముణ్ణి చూసి ముగ్ధురాలైపోయింది. రాముడిలో మహారాజ ఠీవిని చూసింది. సుకుమారుడు, మహాబలశాలి, హుందాతనం ఉట్టిపడుతున్న రాముణ్ణి చూసింది.

అట్టి రాముణ్ణి చూడగానే మన్మథుడు ఆ రాక్షసిని ఆవహించాడు. రాముడు ముఖం చాలా అందమైనది. ఆమె ముఖము వికృతంగా ఉంది. పద్మరేకులవంటివి రాముడి కళ్ళు. ఆమె కళ్ళు రెండు గుంటల్లాగా ఉన్నాయి. రాముని జుట్టు నల్లగా కాటుక లాగా ఉంటే ఆమెది రాగి జుట్టు. రాముడు మాట్లాడితే వీణ మీటినట్లుంటుంది. ఆమె కంఠం కఠోరమైనది. మాటలు నేర్పుగా మాట్లాడేవాడు రాముడైతే ఆమె ఆటవికభాషలో మాట్లాడుతుంది. రాముడు ధర్మాత్ముడు, న్యాయ సమ్మతుడైతే ఆమె చెడునడత గలది. చూసేవాళ్ళందరికీ రాముడు ఆనందాన్ని కలిగిస్తే ఆమెను చూసిన వాళ్ళు భయపడిపోతారు. ఆ రాక్షసి రాముడితో ఇలా అంది.

రాక్షసి శూర్పణఖ: నీవు భార్యతో సహా వచ్చావు. ధనుర్బాణాలు, ఖడ్గమూ ధరించావు. ముని వేషం ధరించావు. అరణ్యం అంతా రాక్షసులకు నివాస స్థానం. అటువంటి ప్రదేశానికి ఏం పని మీద వచ్చావు? నిజం చెప్పు?

రాముడు ఎన్నడూ అసత్యం చెప్పేవాడు కాదు. అందువల్ల యథార్థ విషయం అంతా

ఉన్నదున్నట్లు చెప్పాలనుకున్నాడు.

రాముడు: దేవతలతో సమానమైన పరాక్రమవంతుడైన దశరథుడనే రాజు ఉండేవాడు. ఆయనకు నేను పెద్ద కుమారుణ్ణి. నన్ను రాముడు అని పిలుస్తారు. ఇతడు నా తమ్ముడు, పేరు లక్ష్మణుడు. నాకు సేవలు చేయటానికై నాతోపాటు వచ్చాడు. ఈమె పేరు సీతాదేవి. నా భార్య. ఈమె విదేహదేశపు రాజైన జనక మహారాజు కుమార్తె.

నా తండ్రి, తల్లికిచ్చిన మాట ప్రకారం నేను అడవులలో నివసించేందుకు వచ్చాను. ఇప్పుడు నీ వెవరవో నాకు చెప్పు. నీ నివాసం ఎక్కడ? నీవు ఎవరి భార్యవు? ఇంతటి అందగత్తెవైన నీవు రాక్షస స్త్రీ అని అంటే నమ్మలేకుండా ఉన్నాను. నీవు ఇక్కడకు ఎందుకువచ్చావో నిజం చెప్పు.

శూర్పణఖ: నేను రాక్షస స్త్రీని. నా పేరు శూర్పణఖ. కామరూప విద్యలు తెలిసినదాన్ని. నేను ఏ రూపం కావాలనుకున్నా చిటికలో ఆ రూపాన్ని పొందగలను. నేను ఒక్కదాన్నే ఉంటాను. నన్ను చూస్తే జనులంతా భయపడతారు. ఎప్పుడూ నేను ఈ అరణ్యంలోనే తిరుగుతూ ఉంటాను.

దేవతల కంటే అధిక బలం కలవాడు, విశ్రవసుని కొడుకు అయిన రావణుడనే రాక్షసరాజు నాకు సోదరుడు. అధికంగా నిద్రలోనే గడిపే కుంభకర్ణుడు, ధర్మాత్ముడైన విభీషణుడు కూడా నా సోదరులే. గొప్ప యుద్ధ నిపుణులైన ఖరదూషణులుకూడా నాకు సోదరులే.

రామా! నేను నిన్ను చూడగానే మోహించాను. నేను ఇంతవరకూ చూసిన పురుషుల్లో నీవు శ్రేష్ఠుడవు. నిన్ను చూడగానే మనస్సులో నా భర్తగా నిర్ణయించుకున్నాను. నేను మావాళ్ళెవర్నీ లెక్కచేయను.

ఓ రామా! నేను చాల శక్తిసంపన్నురాలను, నాకున్న బలంతో ఎక్కడికైనా పోగలను, రాగలను. నీవు కూడా నన్ను నీ భార్యగా అంగీకరించు. నీ భార్య సీత అందంగా లేదు. ఆమె నీకు తగదు. నేనే నీకు తగిన దానను. ఏమీ ఆలోచించకుండా నన్ను భార్యగా స్వీకరించు.

ఈ సీత చూడటానికి వికృతంగా ఉండటమే కాదు; ఈమె స్వభావం కూడా చెడ్డది. ఆమె పొట్ట వికృతంగా అంటుకుపోయి ఉంది. నీవు 'ఊఁ' అంటే చాలు. నీ తమ్ముణ్ణి, భార్యను కూడా ఒక్క క్షణంలో చంపి తినేస్తాను.

ఓ మనోహరా! వారిద్దరినీ చంపిన తరువాత మనం ఈ వనమంతా, పర్వత శిఖరాలపైనా, ఆకాశంలోనూ స్వేచ్ఛగా విహరిద్దాం. ఈ దండకారణ్యం అంతా మన వశంలో ఉంటుంది.

మాటలలో నేర్పరి అయిన రాముడు ఆమె వదరుబోతు మాటలు విని నవ్వుకున్నాడు. ఆమె కామపాశం చేత బాధించబడుతోందని గ్రహించాడు. మృదువయిన మాటలతో ఇట్లా అన్నాడు.

# 18వ సర్గ శూర్పణఖ ముక్కులు చెవులు కోయటం

రాముడు: పూజ్యురాలా! నాకు వివాహం అయింది. ఈమె అంటే నాకు ప్రాణం. నీలాంటివాళ్ళు సవతులుండటానికి ఇష్టపడరు. ఇతడు నా తమ్ముడు, చాలా యోగ్యుడు. మంచి శీలం గలవాడు. ఎదుటి వారికి ఆనందం కలిగించగల సమర్థుడు. పరాక్రమవంతుడు. భార్య లేకుండా ఒంటరిగా ఉన్నాడు. ఇంతవరకూ భార్యాసుఖం లేనివాడు. నీ రూపలావణ్యాలకు సరైన జోడు. ఎందుకంటావా, నీ చెంపకు చారడేసి కళ్ళున్నాయి. ఇతడు నీ రూపలావణ్యాలకు తగినభర్త అవుతాడు. అన్నిటినీ మించి నీకు సవతి పోరు ఉండదు. కాబట్టి నీవు పోయి అతణ్ణి ఆశ్రయించు.

రాముని మధురమైన మాటలకు శూర్పణఖ వివశురాలైపోయింది. వెంటనే రాముణ్ణి వదలి లక్ష్మణుని వద్దకు వెళ్ళింది.

శూర్పణఖ: ఓ అందగాడా! నీ సౌందర్యానికి, శరీరచ్ఛాయకు నేను తగిన భార్యను. నీవు కూడా నన్ను భార్యగా స్వీకరించు. మనిద్దరం కలసి ఈ దండకారణ్యం అంతా విహరిద్దాం.

లక్ష్మణుడు: పద్మం వంటి రంగుగలదానా! నేను పూర్తిగా నా అన్నగారి సేవలకే అంకితమై పోయాను. ఇటువంటి దాసుణ్ణి పెళ్ళిచేసుకుంటే నీవు కూడా దాసివే కావటం తప్ప ఏమి సుఖాలు అనుభవిస్తావు? కాబట్టి ఓ విశాలాక్షీ! నీవు పోయి నా అన్నగారినే ఆశ్రయించు. నా అన్నకు చిన్న భార్యగా ఉండు. అప్పుడు నేను నీకు కూడా సేవలు చేస్తూ ఉంటాను. నా అన్నగారి మొదటి భార్య నీవు చెప్పినట్లుగానే అంటుకుపోయిన పొట్టతో చాలా వికృతంగా ఉంటుంది. రాముడు ఆ ముసలి భార్యను వదలించుకొని నీతో స్వర్గసుఖాలు అనుభవించగలడు. ఓ బంగారు శరీరచ్ఛాయ గలదానా! నీ వంటి జగదేక సుందరిని విడిచి ఎవరైనా మానవస్త్రీల యందు ఆసక్తుడవుతాడా? నీవే చెప్పు.

లక్ష్మణుడు చెప్పిందంతా నిజమేనని శూర్పణఖ నమ్మింది. అంతట, జారిపోతున్న పొట్టను మోసుకుంటూ, దొర్లుకుంటూ దొర్లుకుంటూ లక్ష్మణుడి వద్ద నుండి సీతతో కలసి పర్ణశాలలో కూర్చున్న రాముడి దగ్గరకు పోయి ఇట్లా అంది.

శూర్పణఖ: ఓ రామా! నీ భార్య వృద్ధురాలు. వికారంగా ఉంటుంది. అణగారిపోయిన పొట్టగలది. ఇటువంటి వికృత రూపాన్ని చూసుకొని నన్ను నిరాకరిస్తున్నావు. నీ ఎదురుగుండానే ఈ మానవ స్త్రీని చంపి తినేస్తాను. దాంతో నాకూ సవతి పీడ విరగడయిపోతుంది. ఆ తరువాత మనిద్దరం స్వేచ్ఛగా ఆ దండకారణ్యం అంతా విహరిద్దాం.

తరువాత ఆ శూర్పణఖ మిడిగుడ్లు అప్పటికప్పుడే కొరువుల్లాగా మారిపోయాయి. లేడిపిల్ల కన్నుల వంటి సీతాదేవిపై పడబోయింది. ప్రక్కనే ఉన్న రాముడు కుపితుడై ఆమెను అడ్డగించాడు.

రాముడు: లక్ష్మణా! క్రూరాత్ములతోను, చెడ్డవాళ్ళతోను పరిహాసాలాడకూడదు. దైవవశం చేత సీతకు ప్రాణాపాయం తప్పింది. ఇకపై ఉపేక్షించకూడదు. మదించి ఉన్న ఈ రాక్షసిని అంగవిహీనురాలిగా చేసి వికృతంగా ఉండేట్లు చెయ్యి.

అంతట మహాబలశాలి అయిన లక్ష్మణుడు అన్నగారి ఆజ్ఞను పాటించి రాముని నడుమున వ్రేలాడుతున్న కత్తిని తీసుకొని ఆమె ముక్కు, చెవులు కోసివేశాడు. లక్ష్మణుడు ఆ విధంగా ముక్కు చెవులు కోసివేయగా వికృతరూపంతో శూర్పణఖ అడవిలోకి పారిపోయింది. ముక్కు చెవుల నుండి రక్తం కారుతూ ఉండగా అడవిలో నేలంతా తడిసిపోయింది. పెద్ద పెద్ద కేకలు వేస్తూ, అరుచుకుంటూ ఆ అరణ్యం అంతా పరుగులు పెట్టింది. అట్లా పరుగెత్తి, పరుగెత్తి భయంకరుడైన ఆమె సోదరుడు, ఖరుని వద్దకు వెళ్ళింది.

తరువాత ఆ శూర్పణఖ, సీతారామలక్ష్మణులు అడవులకు వచ్చారనీ, తన ముక్కుచెవులు కోసి పంపింది వారేనని తన సోదరుడైన ఖరునితో చెప్పింది.

## 19వ సర్గ ఖరుడు రామాదులను చంపటానికి ప్రయత్నించడం

ముక్కు చెవులు రక్తం కారుతూండగా తన వద్దకు వచ్చి నేలపై పడి విలపిస్తున్న తన సోదరి దురవస్థను ఖరుడు చూశాడు. కట్టలు తెంచుకువస్తున్న కోపంతో శూర్పణఖతో ఇట్లా అన్నాడు.

ఖరుడు: సోదరీ! దుఃఖించకు. నీకు ఈ విధంగా అంగవైకల్యాన్ని, దురవస్థను కలిగించిందెవరు? చెప్పు. నిద్రిస్తున్న విషసర్పాన్ని చిటికిన వేలుతో కదలించినవాడెవడు? కాలపాశాన్ని మెడకు తగిలించుకున్న వాడెవడు? అజ్ఞానంచేత నిన్ను అవమానించినవాడెవడు?

సోదరీ! నీవు పరాక్రమ సంపన్నురాలవే! స్వేచ్ఛగా సంచరించగల కామరూప విద్యలన్నీ తెలిసిన దానవే! మారణ విద్యల్లో యముడితో సమానమైనదానవే! అటువంటి నీకు ఈ అవస్థ కలిగించినవాడెవడు?

దేవ, గంధర్వులుగాని, భూతాలుగాని, మహాత్ములైన ఋషులుగాని నీకు వికృతరూపాన్ని కలిగించే సాహసం చెయ్యలేరే! అట్టి నీకు ఈ వికృత రూపాన్ని కలిగించిన వాడెవడు?

ఈ లోకంలో నాకు అపకారం తలపెట్టి బ్రతికి బట్టకట్టినవాడు ఇంతవరకూ కనిపించలేదు. దేవేంద్రుడు కూడా నాకు అపకారం చెయ్యటానికి సాహసించలేదే?

సోదరీ! పాలను, నీళ్ళను వేరుచేసే హంసల్లాగా, ఇప్పుడు నా బాణాలు వారి ప్రాణాలను శరీరం నుండి వేరుచేస్తాను. నా బాణాల నుండి వాళ్ళు తప్పించుకోలేరు. వాళ్ళ మర్మస్థానాల్లో గుచ్చుకొని వారి ఒంట్లో ఉన్న నెత్తురుతో నేలంతా తడసిపోతుంది. వాళ్ళ శరీరాన్ని పక్షులు గుంపులు గుంపులుగా వచ్చి తింటాయి. నేను యుద్ధానికి పిలిస్తే దేవతలైనా, గంధర్వులైనా ప్రాణాలపైన ఆశ వదలుకోవాల్సిందే. నిన్ను ఇంత అవమానంపాలు చేసినవాడెవడో చెప్పు. ఎక్కడుంటాడో చెప్పు. లేచి నాకు వాళ్ళ వివరాలన్నీ చెప్పు.

శూర్పణఖ: అన్నా! వాళ్ళిద్దరూ అన్నదమ్ములు, దశరథ మహారాజు కుమారులు. పేరు రామలక్ష్మణులు. మహాబలవంతులు. కమలరేకుల వంటి కన్నులున్నవారు. నారచీరలు ధరించారు. తాపస వేషంలో ఉంటారు. పండ్లు కందమూలాలే తింటారు. జితేంద్రియులు. ధర్మాచరణ పరాయణులు. వాళ్ళు మనుష్యులా, గంధర్వులా, దేవతలా అన్నది నాకు తెలియటం లేదు. వారిద్దరూ కాక ఒక స్త్రీ ఉన్నది. అందంగానే ఉంటుంది. ఒంటినిండా నగలున్నాయి. ఆ స్త్రీని రాముడనేవాడు తన భార్య అని నాతో చెప్పాడు. ఆ ఇద్దరు అన్నదమ్ములే నన్ను పరాభవించారు. వారు పంచవటిలో పర్ణశాలని నిర్మించుకొని నివసిస్తున్నారు.

సోదరా! నీవు త్వరగా బయలుదేరు. వాళ్ళిద్దరినీ చంపు. నేను వాళ్ళ నెత్తురు త్రాగాలి. అప్పుడుగానీ నా పగ చల్లారదు.

అంతట ఆ ఖరుడు పద్నాలుగు మంది రాక్షసుల్ని పిలిచి ఇట్లా అన్నాడు.

ఖరుడు: రాక్షస యోధుల్లారా! పంచవటిలో ఇద్దరు మానవులు కుటీరం నిర్మించుకొని నివసిస్తున్నారు. వాళ్ళతోపాటు ఒక స్త్రీ కూడా ఉంది. వారు నా సోదరిని దారుణంగా అవమానపరిచారు. మీరు వెంటనే ఆ ముగ్గురినీ చంపెయ్యండి. ఆ తరువాత నా సోదరి శూర్పణఖ వచ్చి వాళ్ళ రక్తం తాగుతుంది. ఆలస్యం చెయ్యకండి. వెంటనే బయలుదేరండి.

అంతట ఆ పద్నాలుగురు యోధులు శూర్పణఖతో కలసి రాముని ఆశ్రమానికి వెళ్ళారు. వారంతా రాముణ్ణి చూస్తూనే కార్చిచ్చును చూసిన ఏనుగుల వలె నిశ్చేష్టులయ్యారు.

## 20వ సర్గ ఖరుని అనుచరుల్ని రాముడు సంహరించడం

అంతట శూర్పణఖ ఆ రాక్షసుల్ని వెంటబెట్టుకొని రాముని కుటీరానికి వచ్చి వారందరికీ సీతారామలక్ష్మణులను చూపింది. మహా తేజోవంతుడైన రామలక్ష్మణులు కూడా వారిని చూశారు.

రాముడు: తమ్ముడా! నీవు సీతను కనిపెట్టి ఉండు. నేను వీరందరినీ మట్టుబెట్టి వెంటనే తిరిగివస్తాను. ఈ శూర్పణఖ వెంటబెట్టుకొని వచ్చిన వారందరినీ చంపేస్తాను.

అంతట రాముడు బంగారు పూత పూసిన ధనుస్సును, అంబుల పొదిని బాణాలను ధరించాడు. "ఓ రాక్షసులారా! మేము దశరథ మహారాజు కుమారులం. నేను నా భార్యతోను, నా తమ్ముడు లక్ష్మణునితోను ఈ దండకారణ్యానికి వచ్చి కందమూలాలు తింటూ తపస్సు చేసుకుంటున్నాం. ధర్మాన్ని ఆచరిస్తూ, ఇంద్రియ నిగ్రహం కలిగి ఉంటున్నాం. మీరంతా అకారణంగా వచ్చి మమ్మల్ని హింసించాలని చూస్తున్నారు. మీరంతా పాపాత్ములు. మీరు మహర్షులను కూడా హింసిస్తున్నారు. వారంతా కూడా నన్ను శరణు వేడారు. కాబట్టి మిమ్మల్నందరినీ చంపి వారికి సంతోషాన్ని కలిగిస్తాను. అందుకోసమే మేము ఇక్కడకు వచ్చాం. కాచుకోండి. లేదూ యుద్ధం చెయ్యడానికి భయపడితే వెంటనే పారిపోండి. మీ ప్రాణాల్ని కాపాడుకోండి.

చేతుల్లో శూలాలు ధరించి వచ్చిన ఆ పద్నాలుగు మంది రాక్షసులు కృద్ధులై ఇట్లా అన్నారు.

రాక్షసులు: ఓ మానవుల్లారా! మా ప్రభువు అయిన ఖరుడికి కోపం తెప్పించారు. ఇక మా చేతుల్లో మీ మరణం తప్పదు. మేం ఇంతమంది వచ్చాం. నీవా ఒక్కడవు. యుద్ధం చేస్తానంటూ ప్రగల్భాలు పలుకుతున్నావు. నీకు మా ఎదుట నిలబడే శక్తి ఎక్కడిది? మేం వేసే ఆయుధాలతో

నిన్ను నిర్వీర్యుణ్ణి చేస్తాం. నీవు నీ ధనుస్సు కూడా నేలకొరగాల్సిందే!

ఈ విధంగా పలికి వాళ్ళంతా రాముడి మీద రకరకాల ఆయుధాల్ని విసిరారు. రాముడు తన అక్షతూణీరాన్నుండి పద్నాలుగు బాణాలు వదిలాడు. ఆ బంగారు బాణాలు మిలమిలా మెరుస్తూ ఆ పద్నాలుగుమంది రాక్షసుల గుండెల్లో గుచ్చుకున్నాయి. నెత్తురు బొటబొటా కారుతూ నేలంతా నెత్తురు మడుగయింది. వాళ్ళంతా అక్కడికక్కడే నేలపై కూలిపోయారు.

మహాబలవంతులయిన ఆ పద్నాలుగుమంది రాక్షసులూ రాముడి చేతుల్లో మరణించి నేలకొరిగిపోవడం శూర్పణఖ చూస్తూనే ఉంది. భయంతోను, కోపంతోను భయంకరంగా అరచింది. భయంతో అట్లాగే కేకలు పెట్టుకుంటూ పరిగెత్తుకుపోయింది. ఖరుడికి జరిగిందంతా చెప్పింది.

# 21వ సర్గ శూర్పణఖ ఖరుని ప్రేరేపించడం

శూర్పణఖ మళ్ళీ వచ్చి నేలపై పడి పొర్లుతూండటం ఖరుడు చూశాడు. తనకు చెడుకాలం దాపురించిందని తెలుసుకోలేకపోయాడు.

ఖరుడు: సోదరీ! శూర్పణఖా! ఏమిటి మళ్ళీ వచ్చావు? ఇప్పుడే కదా మెరికల్లాంటివారిని, ఒకరు కాదు, ఇద్దరు కాదు పద్నాలుగు మందిని పంపాను. వాళ్ళంతా నాకు ఎంతో విశ్వాసపాత్రులు. వాళ్ళు మహాశూరులు. చెప్పిన పని పూర్తిచెయ్యకుండా వచ్చేవాళ్ళు కాదు. ఎంతటి బలశాలురనైనా ఇట్టే చంపేయగలవారు. మరి నీవు మళ్ళీ ఏడుస్తూ ఎందుకు వచ్చావు? దుఃఖించకు. నేనుండగా నీకు వచ్చిన భయం ఏమీలేదు. లేచి కూర్చో. నేను నీకు అభయం ఇస్తున్నాను.

శూర్పణఖ: అన్నా! ఆ మానవులు నా ముక్కు చెవులు కోసి పంపారు గదా! వారిని చంపమని విశ్వాసపాత్రులైన పద్నాలుగు మంది రాక్షసుల్నీ పంపావు. వాళ్ళంతా ఆయుధాలతో రాముణ్ణి ఎదిరించటానికిపోయారు. ఇంతలోనే ఆ మానవుడు వాడియైన బాణాలను వారి మర్మస్థానాల్లో కొట్టి చంపేశాడు. అది చూసి నాకు చాలా భయం వేసింది. వెంటనే నీ దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చాను. అన్నా! మన ప్రాణాలకు ప్రమాదం పొంచి ఉంది. ఏ క్షణానైనా, ఏమైనా జరగచ్చు. అందుకే రక్షణకోసం నీ దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చాను.

సోదరా! నేనిప్పుడు భయం అనే సముద్రంలో దిగులు అనే మొసళ్ళ మధ్య చిక్కుకుపోయాను. మునిగిపోతానేమోనని భయంగా ఉంది. నీవు వచ్చి రక్షించాలి. నీ సేవకుల్ని చంపిన ఆ మానవుణ్ణి ఊరకే వదలిపెట్టొద్దు. నీలో శక్తి, బలం ఉంటే వెంటనే వెళ్ళి వాళ్ళిద్దర్నీ చంపెయ్యి. అప్పుడే నాకు మనశ్శాంతి దొరుకుతుంది. నేను ముందే చెప్పాను గదా! నా చెవులు ముక్కు కోసినవాళ్ళ నెత్తురు నేను తాగాలి. నీవు వాళ్ళను చంపలేకపోతే మన కులానికే తలవంపులు తెచ్చిన వాడవవుతావు. వాళ్ళపైన పగతీర్చుకోకుండా నీవు బ్రతకడం కన్నా ఈ

దండకారణ్యాన్ని వదలి పెట్టి ఎక్కడికైనా పోవడం మంచిది. రాముడి చేతుల్లో ఓడిపోయినట్లు ఒప్పుకో!

## 22వ సర్గ ఖరదూషణాదులు పంచవటికి బయలుదేరడం

శూర్పణఖ ఈ విధంగా అవమానించబడటం, శూరులైన తన అనుచరులు చంపబడటం వల్ల బాగా దాహంగా ఉన్నవాడు సముద్ర జలాలతో ఎట్లా దాహం తీర్చుకోలేడో అట్లాగే అవమానాన్ని ఖరుడు జీర్ణించుకోలేకపోయాడు.

ఖరుడు: సోదరీ! రాముడి పరాక్రమాన్ని గూర్చి నా దగ్గర చెప్పకు. ఆ మానవుడి ఆయువు మూడింది. తన పాపానికి ఇప్పుడే ఫలితం అనుభవిస్తాడు. నీవు దుఃఖించకు. ఏడవడం మానెయ్యి. నేను రాముణ్ణి, అతడి తమ్ముణ్ణి యమలోకానికి పంపుతాను.

సోదరీ! ఆ రాముడు అల్పాయుర్దాయం గలవాడు. నా గండ్రగొడ్డలితో వాని తల నరుకుతాను. అప్పుడు నీవు ఆతడి గోరువెచ్చటి రక్తాన్ని త్రాగు.

ఖరుడి మాటలు శూర్పణకకు పరమ సంతోషం కలిగించాయి. "నీవు రాక్షసులలో శ్రేష్ఠుడ" వని మెచ్చుకుంది. సోదరి దుఃఖం మాని తనను ప్రశంసించడంతో ఖరుడు సంతోషించాడు. వెంటనే తన సేనాపతి అయిన దూషణుని పిలిచాడు.

ఖరుడు: ఓ దూషణా! భయంకరమైన వేగం గలవాళ్ళూ, యుద్ధంలో అపజయమనేదే ఎరగనివాళ్ళూ అయిన మన సేనలో పద్నాలుగు వేలమంది ఉన్నారు గదా! వాళ్ళందరినీ సిద్ధం చెయ్యి.

ఓ సౌమ్యుడా! మన రాక్షసులంతా నల్లటి మేఘాల్లాంటి వాళ్ళు, గర్వం గలవాళ్ళు. లోకుల్ని హింసించడం వాళ్ళకు వెన్నతో పెట్టిన విద్య. వాళ్ళందరినీ యుద్ధానికి సిద్ధం చెయ్యి. నా కోసం రథాన్ని సిద్ధం చెయ్యి. అందులో అనేకరకాలైన ఆయుధాలను ఉంచు. రాముణ్ణి సంహరించేందుకు నిష్ణాతులైన రాక్షస సైన్యాన్ని ముందు నడవమని చెప్పు.

వెంటనే దూషణుడు సూర్యునితో సమానమైన అశ్వాలను పూన్చిన రథాన్ని, చిత్రవిచిత్రమైన ఆయుధాల్ని సిద్ధం చేశానని చెప్పాడు. బంగారు రేకులతో తాపడం చేయడం వల్ల ఆ రథం మేరు పర్వతంలాగా మెరిసిపోతోంది. దాని చక్రాలకు మణులు, వైడూర్యాలు పొదిగారు. ఖరుడు అటువంటి రథంలో కోపోద్రేకాలతో ఎక్కి కూర్చున్నాడు.

రథంలో కూర్చున్న ఖరుణ్ణి యోధులంతా చూశారు. వారంతా ఖరుడి ఆజ్ఞకోసం యుద్ధానికి సన్నద్ధులై సిద్ధంగా ఉన్నారు. అప్పుడు ఖరుడు బయలుదేరమని ఆజ్ఞాపించాడు. ఆ పద్నాలుగు వేలమంది శూలాలు, అడ్డకత్తులు, పదునైన గొడ్డళ్ళు, ఈటెలు ఇంకా ఎన్నో మారణాయుధాలను ధరించి రామలక్ష్మణులపై యుద్ధానికి బయలుదేరారు. ఆ మహాసైన్యం వెనుక ఖరుడి రథం బయలుదేరింది. ఖరుడి మనోవేగాన్ని తెలుసుకొన్న రథసారథి, గుర్రాలను కూడా వేగంగా నడిపించాడు. వేగంగా పోతున్న రథచక్రాల నుండి భయంకరమైన శబ్దాలు వెలువడ్డాయి; దిక్కులు పిక్కటిల్లిపోయాయి. రథ వేగంతోపాటు శత్రువు లిద్దరినీ ఎంత త్వరగా చంపుదామా అన్న తొందరకూడా అధికమైంది. యముడిలాగా రామలక్ష్మణులపై గర్జించాడు.

## 23వ సర్గ దుష్టశకునాలను ఖరుడు లెక్కచేయకపోవడం

ఖరుడి సైన్యం బయలుదేరింది. వెనకాలే ఖరుడి రథం కూడా బయలుదేరింది. రథం రాజవీథి గుండా పోతోంది. ఉన్నట్లుండి గుర్రాలు తడబడ్డాయి. కాలు జారిపడ్డాయి. ఆకాశమంతా గాడిద రంగులో మేఘాలు ఆవరించాయి. పెద్ద ఆకారంలో ఉన్న గ్రద్ద ఒకటి రథధ్వజంపైన వాలింది. క్రూరమృగాలు, పక్షులు విపరీత ధ్వనులు చేశాయి. నక్కలు మంటలు ఉన్న దిక్కుగా చూస్తూ ఊళలు వేయడం మొదలుపెట్టాయి. ఇవన్నీ రాక్షసులకు అశుభాన్నే సూచిస్తునాయి. చిక్కటి చీకట్లు కమ్ముకోవటం వల్ల దిక్కులే తెలియటం లేదు. అకాలంలో ఆకాశాన ఎర్రటి బింబం కనిపించింది. ఖరునికి ఎదురుగా నిలచి మృగాలు, పక్షులు అరవటం మొదలుపెట్టాయి. డేగలు, గ్రద్దలు రథంపైన, ఆకాశంలో తిరుగసాగాయి. నక్కల ఊళలు వినిపిస్తున్నాయి. నక్క ఊళలు రాబోయే అశుభాన్ని సూచిస్తుందంటారు.

ఆనాడు గ్రహణ దినం కాకపోయినా కూడా, రాహువు సూర్యుణ్ణి మ్రింగివేశాడు. దాంతో సూర్యరశ్మి క్షీణించిపోయింది. ఎదురుగాడ్పులు వీచటం వల్ల రథం వేగంగా కదలటం లేదు. కొలనుల్లోని తామర పూలు వాడిపోయాయి. చేపలు నీటి అడుగు భాగానికి పోయి దాక్కున్నాయి. చెట్లనున్న ఆకులు పూలు రాలి చెట్లు మ్రోడులైపోయాయి. కొద్దిసేపు నెత్తురు వాన కురిసింది.

ఈ దుశ్శకునాలన్నీ ఖరుడు కూడా చూశాడు. అయినా తన వాళ్ళందరికీ బయపడవద్దని ధైర్యం చెప్పాడు. అట్లా చెపూ్త చెపూ్త ఉండగానే గొంతు ఎండిపోయి మాట బైటకు పెగల్లేదు. ఎడమ భుజం అదిరింది. ఎందువల్లనో కళ్ళ నుండి నీళ్ళు బొటబొట స్రవించసాగాయి. ఇన్ని చూస్తున్నా అతనిలోని రాముడిపై ద్వేషం తగ్గలేదు. సైనికులతో “ఓ యోధుల్లారా! నేను ఇటువంటి శకునాలకు విలువ ఇవ్వను. మనం బలవంతులం. మన భుజబలమే మనకు జయాన్నిస్తుంది కాని, ఈ శకునాలు కాదు. మృత్యువును కూడా చంపగల శక్తి నాకుంది.

“రాముడు తానే బలవంతుణ్ణని మిడిసిపడుతున్నాడు. నా సంగతి, నా శస్త్రాస్త్రాల బలాన్ని

అతడెరుగడు. నా ఎదుట పడ్డప్పుడుగానీ నా సత్తా ఏమిటో అతడికి తెలిసిరాదు. రామలక్ష్మణులను చంపకుండా నేను ఇంటికి వెళ్లను. నా సోదరి శూర్పణఖ, వాళ్ళ నెత్తురు త్రాగాలి. ఇదే నా ప్రతిజ్ఞ. నేను ఇంతవరకూ అపజయమన్నది ఎరుగనని మీ అందరికీ తెలుసు. నేను అబద్ధాలు చెప్పేవాడిని కాదు. దేవేంద్రుడైనా నా దెబ్బకు ఐరావతం వజ్రాయుధంతో కలసి నేలకూలాల్సిందే! ఇక ఈ మానవుల గూర్చి ప్రత్యేకంగా చెప్పాలా?" అంటూ పెద్దపెట్టున అరిచాడు. అది మేఘాలు గర్జించినట్లుంది.

అప్పుడు శ్యేనగామి, పృథుగ్రీవుడు, యజ్ఞశత్రువు, విహంగముడు, దుర్జయుడు, కరవీరాక్షుడు, పరుషుడు, కాలకార్ముకుడు, మేఘమాలి, మహామాలి, సర్పాస్యుడు, రుధిరాశనుడు అనే పన్నెండుమంది మంత్రులు ఖరుడికి రెండు ప్రక్కలా ఉన్నారు. మహాకపాలి, స్థూలాక్షుడు, ప్రమాథి, త్రిశరస్సు అనే నలుగురు సేనాపతులు దూషణుని వెనుకగా ఉన్నారు. వాళ్ళంతా, సూర్యచంద్రుల మీదకు అంగారాది గ్రహాలు పోయినట్లు, రామలక్ష్మణుల మీదకు వేగంగా దూసుకుపోసాగారు.

# 24వ సర్గ ఖరునితో యుద్ధం

ఖరుడు సైన్యాన్ని వెంటబెట్టుకొని తమపై దండయాత్ర చేయటానికి రావటం అల్లంత దూరాన్నుంచే రామలక్ష్మణులు చూశారు. తమను మట్టుపెట్టాలన్న ఖరుడి తపన, ఉత్సాహం కనిపెట్టిన రాముడు లక్ష్మణుడితో ఇట్లా అన్నాడు.

రాముడు: లక్ష్మణా! మనం చూస్తున్న దుశ్శకునాలన్నీ ప్రాణులకు కష్టాలు తెచ్చేవిగాను, రాక్షసుల వినాశనాన్ని తెలిపేవిగాను అనిపిస్తోంది.

పైన ఆకాశంలో మేఘాలు గాడిద రంగులో ఉండి దట్టంగా ఆకాశమంతా వ్యాపిస్తున్నాయి. ఈ మేఘాలు వికృతంగా కనిపించటమే కాదు, రక్తం కూడా కురిపిస్తున్నాయి. మన బాణాలు ధనుస్సు కూడా తమ ప్రతాపం చూపే సమయం వచ్చింది కదా అని ఎగిరెగిరి పడుతున్నాయి. పక్షుల కూతలు అసాధారణంగా ఉన్నాయి. దీన్నిబట్టి అపాయం పొంచి ఉన్నట్లు తెలుస్తోంది. జీవితం కూడా సంశయంలో పడ్డట్లుంది.

లక్ష్మణా! యుద్ధం భీకరంగా ఉండేట్లుంది. సందేహం లేదు. నా కుడి భుజం తడవతడవకూ అదురుతోంది. అది మనకు జయం, శత్రువులకు అపజయాన్ని సూచిస్తోంది. యుద్ధానికొచ్చే వాళ్ళలో ఎవరి ముఖాన కళతప్పి ఉంటుందో వాళ్ళకు మరణం తప్పదు. దూరాన్నుండి రాక్షసుల అరుపులు, కేకలు వినిపిస్తున్నాయి. అంటే ఆపద రాబోతోందని తెలిసిన తర్వాత బుద్ధిమంతుడైనవాడు అన్ని జాగ్రత్తలు తీసుకోవాలి కదా! అందువల్ల ధనుస్సు బాణాలు ధరించి సిద్ధంగా ఉందాం. నువ్వు సీతను తీసుకొని వెళ్లి గుబురుగా చెట్లచాటున ఉన్న కొండగుహలో కూర్చోబెట్టు. నీవు కూడా ఆమెకు రక్షణగా అక్కడే ఉండు. వాళ్ళందరినీ నేను ఒక్కడినే ఎదుర్కొంటాను. నీవు ఇక మారుమాట్లాడొద్దు. నేను చెప్పినట్లు చెయ్యి. ఇక ఏమాత్రం నీవు తటపటాయించినా ప్రమాదం మన నెత్తిపై పడుతుంది. కాబట్టి ముందుగా సీతా రక్షణ చూడు. లక్ష్మణా ఈ రాక్షసి మూకనంతా నీవు ఒక్కడివే చంపగలవు. నాకు ఆ నమ్మకం ఉంది.

అయినా వాళ్ళను నా చేతులతో చంపాలని కోరుకుంటున్నాను.

రాముడి ఆజ్ఞ మేరకు లక్ష్మణుడు ధనుర్బాణాలు, ఖడ్గము ధరించి, సీతను తీసుకొని దుర్భేద్యమైన కొండ గుహలోకి ప్రవేశించాడు.

అప్పుడు రాముడు సీతను సురక్షితంగా చేయగలిగాను గదా అని సంతోషించి, తాను కూడా కవచాన్ని ధరించి, ధనుర్బాణాలను, ఖడ్గాన్ని ధరించి పోరుకు సిద్ధపడ్డాడు. అంతట ధనుస్సుకు నారి సంధించాడు. మాటిమాటికీ ధనుష్టంకారాలు చేయగా ఆ టంకార శబ్దంతో అడవి అంతా మారుమ్రోగింది. ఆ యుద్ధాన్ని చూడటంకోసం దేవతలు, యక్షులు, గంధర్వులు ఆకాశంలో బారులు తీరారు. మహాత్ములైన ఋషులు, రాజర్షులు, సిద్ధులు కూడా వచ్చారు. వాళ్ళలో వాళ్ళు, “భయంకరమైన పనులు చేస్తూ లోకాన్ని పీడిస్తున్న రాక్షసులు పద్నాలుగు వేలమంది ఉన్నారు. వారిని ఎదిరించేందుకు రాముడు ఒక్కడే ఉన్నాడు. జయాపజయాలు ఎట్లా ఉంటాయో గదా” అని అనుకున్నారు.

పోరుకు సిద్ధంగా ఉన్న రాముణ్ణి ఆ సమయంలో ఒక దివ్య తేజస్సు ఆవహించింది. అంతట రామునిలో వారంతా ఉగ్రరూపాన్ని చూశారు. మహాత్ములైన దేవతలు, ఋషులు దాన్ని రుద్రుని తేజస్సుగా గుర్తించారు. అంతే! క్షణాల్లో రాక్షస సేన అంతా రాముని ఆశ్రమాన్ని నాలుగు మూలల నుండీ ముట్టడించారు. రాక్షసుల్లో కొందరు సింహనాదాలు చేశారు; కొందరు గర్జించారు. కొందరు ధనుష్టంకారాలు చేశారు. కొందరు అరచారు. ఈ శబ్దాలతో ఆ అడవి అంతా మారుమ్రోగిపోయింది. ఆ భయంకర శబ్దాలకు ప్రాణులన్నీ పరుగులు తీశాయి.

ఆ సైన్యం అంతా రాముణ్ణి చూసింది. రాముడు కూడా శత్రు సైన్యాన్ని పరికించి చూశాడు. క్రుద్ధుడైన రాముడు, పినాకమనే ధనుస్సును ధరించిన రుద్రుడులాగా ఉన్నాడు. రుద్ర తేజస్సుతో వెలిగిపోతున్న రాముణ్ణి చూసి సర్వభూతాలు భయపడ్డాయి. రాక్షససైన్యం అంతా ఆభరణాలు, ధ్వజాలూ, కవచాలు ధరించి ఉదయ సూర్యుని కాంతి ప్రసరిస్తున్న నల్లని మేఘాల

గుంపులా కనిపించారు.

# 25వ సర్గ రాముడు రాక్షసులను సంహరించటం

ఖరుడు సైన్యంతో కలసి రాముడి ఆశ్రమంలోకి ప్రవేశించాడు. ధనుస్సును నేలపై నిలబెట్టి రెండో అంచుని చేత్తో పట్టుకొని నిలబడ్డ రాముణ్ణి చూశాడు. అంతట ఖరుడు సారథిని రథాన్ని రాముడి వద్దకు పోనిమ్మన్నాడు. అంతటి ఆ సారథి రథాన్ని ధనుస్సు ఒక చేత్తో పట్టుకొని ఒంటరిగా నిలబడ్డ రాముని ఎదుటగా తీసుకుపోయి నిలబెట్టాడు. అతడి వెనుకనే సైనికులంతా రథం చుట్టూ చేరారు. అప్పుడు ఖరుడు నక్షత్రాల మధ్యనున్న కుజగ్రహం లాగా కనిపించాడు.

అప్పుడు ఖరుడు రాముడిపై అనేక బాణాలు వేసి బాధించాడు. రాక్షస సైన్యం కూడా అనేక రకాలైన ఆయుధాలను రామునిపై విసిరారు. రాక్షసులందరూ రాముణ్ణి శూలాలు, పట్టెసములు, ప్రాసలు, ముద్గరులు, గండ్రగొడ్డళ్ళు, ఖడ్గాలు మున్నగు ఆయుధాలతో కొట్టి బాధించారు. ఎట్లాగైనా రాముణ్ణి చంపటమే లక్ష్యంగా పెట్టుకున్న వాళ్ళంతా రథాలు, గుర్రాలు, ఏనుగులపై ఎక్కి రాముడిపై దండెత్తారు. వాళ్ళంతా మూకుమ్మడిగా ఒకే లక్ష్యమైన రామునిపై వివిధమైన ఆయుధాలు విసురుతూ ఉంటే ఆయుధాల వర్షం కురిసినట్లైంది. ఆయా తిథుల్లో ప్రమథ గణాలు మహాశివుని చుట్టూ నిలచినట్లుగా ఆ రాక్షసులంతా రాముని చుట్టుముట్టారు.

ఆ రాక్షసులు ప్రయోగించిన ఆయుధాలన్నింటినీ రాముడు తన బాణాలను ప్రయోగించి, నదులలో నీళ్ళన్నింటినీ సముద్రుడు స్వీకరించినట్లు, స్వీకరించాడు. అయినా కొన్ని ఆయుధాలు తప్పించుకొని వచ్చి రాముడి శరీరానికి తాకాయి. అవన్నీ పర్వతాలపై వర్షం పడ్డట్లుగా, రామునికి ఏమాత్రం బాధ కలిగించలేకపోయాయి. అయినా రాముడి శరీరంలో వివిధ అవయవాల నుండీ రక్తం కారుతూ ఉండటం వల్ల సంధ్యాకాల సూర్యుడు వలె ప్రకాశించాడు. ఏకాకి అయిన రాముణ్ణి అంతమంది రాక్షస సైన్యం చుట్టుముట్టడం, వేడుక చూస్తున్న దేవ, గంధర్వ, సిద్ధ, ఋషి గణాలను కలత పెట్టింది.

ఇక రాముడిలో కోపాగ్ని ప్రజ్వరిల్లింది. ధనుస్సును మండలాకారంగా వంచి

పట్టుకున్నాడు. దాంట్లో నుండి వేలకొలది బాణాలను నాలుగు ప్రక్కలకూ ఒకేసారి ప్రయోగించసాగాడు. రాముడు వదిలే బాణాలు కొన్ని సూటిగా వెళ్ళాయి. కొన్ని వంకర తిరిగి వెళ్ళాయి. కొన్ని సమానంగా వెళ్ళాయి. అట్లా వెళ్ళిన బాణాలన్నీ లక్ష్యాన్ని ఛేదించి యమదండాల్లాగా పనిచేశాయి. అవి తగిలిన వాళ్ళు అక్కడకక్కడే చచ్చి నేలపై పడ్డారు. అట్లా రాక్షసుల శరీరాల్నుండీ ధారలుగా కారుతున్న రక్తం అంతా మడుగులాగా అయింది. ఎర్రగా మండుతున్న అగ్నిగుండం లాగా కనిపించింది. రాముడి ధనుస్సు నుండి ఒకేసారి వందలు వేలలో బాణాలు బయలుదేరి రాక్షసుల ప్రాణాలు హరించాయి. ఆ విధంగా రాముడు ఛేదించిన రాక్షసుల శిరస్సులు వందలు దాటి వేలల్లో పడ్డాయి.

రాముడు ఆ యుద్ధంలో బంగారు అలంకారాలతో ఉన్న రథాలను, రథాలకు కట్టిన గుర్రాలను, ఏనుగుల్ని, వాటిపై ఉన్న వీరుల్ని, గుర్రాల్ని, వాటిపై ఉన్న వీరుల్ని, కాలిబంట్లను చంపి యమలోకానికి పంపాడు. రాముడు ఆ విధంగా మర్మస్థానాలన్నింటి పైనా గురిచూసి కొట్టడంవల్ల, అగ్నిచేత దగ్ధం చేయబడ్డ అడవిలాగా, కళాకాంతుల్ని కోల్పోయారు.

కొందరు వీరులు ధైర్యంతో ముందుకు పోయి రామునిపై మారణాయుధాల్ని ప్రయోగించారు. మహాబాహువైన రాముడు తన బాణాలను ప్రయోగించి వాళ్ళ ఆయుధాల్ని నిరోధించడమే కాకుండా అవి ప్రయోగించినవాళ్ళ కంఠాలు కూడా తెంపేశాడు. అక్కడ నేలంతా తలలు తెగిపడిపోయిన వాళ్ళతో, ముక్కలు చెక్కలైన కవచాలు, ధనుస్సులతో చిందర వందరగా ఉంది. గరుత్మంతుని వేగానికి వీచిన గాలి వలన పడిపోయిన వృక్షాల్లాగా పడిపోయారు.

ప్రాణాలతో మిగిలిన కొద్దిమంది కాపాడమంటూ ఖరుని దగ్గరకు పోయి మొరపెట్టుకున్నారు. అంతట దూషణుడు అనే రాక్షసుడు వారందరినీ ఓదార్చి, వారిని తన వెంటబెట్టుకొని యముడు రుద్రుడిపైకి వెళ్ళినట్లు రామునిపై దండెత్తాడు. వాళ్ళుతెచ్చుకున్న ఆయుధాలన్నీ నాశనం అయిపోయాయి. అందువల్ల దూషణుడితో కలిసే వెళ్ళి మద్దిచెట్లని, తాటిచెట్లని, కొండరాళ్ళను ఆయుధాలుగా చేసుకొని పోరాడారు. వాళ్ళందరినీ ఇప్పుడే

నిరాయుధుల్ని చేశాను గదా అని అనుకుంటూ ఉండగా వారంతా తాటిచెట్లతోను, మద్దిచెట్లతోను దాడి చేయడంతో రాముడు తిరిగి భీకరమైన బాణాలు ప్రయోగించాడు. యుద్ధం ముమ్మరంగా సాగుతూ రోమాంచితమవుతోంది.

రాక్షసులందరూ మళ్ళీ ఒకటిగా సమీకృతులై రాముడిపై తీవ్రంగా దాడి ప్రారంభించారు. రాముడు వాళ్ళందరిపైనా బాణాల వర్షాన్ని కురిపించి దిక్కులన్నీ కప్పివేస్తూ గాంధర్వాస్త్రాన్ని ప్రయోగించాడు. రాముడు తన బాణాలతో పది దిక్కుల్నీ కప్పి వేయడంతో వారికి రాముడెక్కడున్నాడో కనిపించలేదు. గుంపులు గుంపులుగా పడిపోతున్న రాక్షసులు, ఇంతకు పూర్వమే పడిపోయి ఉన్న రాక్షస సైనికులు, చంపబడ్డవాళ్ళు, కాళ్లు పోగొట్టుకున్నవాళ్లు, చేతులు పోగొట్టుకున్నవాళ్లు నేలంతా కుప్పలు కుప్పలుగా పడి ఉన్నారు. అటువంటి ఆ యుద్ధభూమి అంతా భయంకరంగా ఉంది.

# 26వ సర్గ రాముడు పద్నాలుగు వేలమంది రాక్షసులను సంహరించడం

అప్పుడు రాక్షసులలో యోధుడైన దూషణుడు అయిదువేలమంది యోధులను సమీకరించుకొని రామునిపై దాడిచేశాడు. వారంతా మహా యోధులే కాకుండా గొప్ప సాహసవంతులు, యుద్ధంలో వెనుకంజ వేయటం అంటే ఏమిటో తెలియనివాళ్ళు. వారంతా ధైర్యాన్ని కూడగట్టుకొని ప్రాణాలర్పించి అయినా రాముణ్ణి చంపాలనే పట్టుదలతో యుద్ధం ప్రారంభించారు. వాళ్ళంతా రాముణ్ణి చుట్టుముట్టి శూలాలు, పట్టెసములు, ఖడ్గాలు, రాళ్ళు, వృక్షాలు, బాణాలు విచ్చలవిడిగా రాముడిపై ప్రయోగించారు. మహాబాహువు అయిన రాముడు వాటి నన్నింటినీ సమర్ధవంతంగా ఎదుర్కొన్నాడు. దున్నపోతు మీద వర్షం పడ్డట్లుగా తనపైన రకరకాలైన ఆయుధాల పడుతున్నా లెక్కచేయకుండా క్రోధంతో రాముడు తన ఎదురు దాడిని తీవ్రతరం చేశాడు. మహావీరుడైన రాముడు కోపంతో ఆ దూషణునిపై అర్ధచంద్ర బాణాన్ని ప్రయోగించి అతడి ధనుస్సును విరిచేశాడు. మరో నాలుగు బాణాలు వేసి ఆ రథానికి కట్టిన నాలుగు గుర్రాలను నేలకూల్చాడు. మరల ఇంకొక బాణాన్ని వేసి సారథి శిరస్సు ఖండించాడు. చివరగా మూడు అర్ధచంద్ర బాణాలను ప్రయోగించి, దూషణుణ్ణి కొట్టాడు. ఈ పరాజయాన్ని జీర్ణించుకోలేని దూషణుడు పర్వత శిఖరం వంటి భయంకరమైన పరిఘనొకదాన్ని చేతిలోకి తీసుకున్నాడు. (దానిచుట్టూ బంగారు పట్టీలున్నాయి. పూర్తిగా ఇనుప మేకులు కొట్టి ఉంది. అనేక పర్యాయాలు ఆ పరిఘను దేవతలపై ప్రయోగించాడు. దాని నిండా శత్రువుల వస దట్టంగా అంటి ఉంది. అది వజ్రంతోను, పిడుగుతోను సమానమైనది. పూర్వం అనేక పర్యాయాలు శత్రువుల గోపురాలను బద్దలుకొట్టింది). అప్పుడు రాముడు రెండు బాణాలను తీసుకొని దూషణుడి రెండు చేతులపైనా ప్రయోగించాడు. అంతే! వెంటనే వాడి రెండు చేతులూ, చేతిలో ఉన్న పరిఘ కూడా తెగి నేలపై పడ్డాయి. రెండు చేతులూ పోగొట్టుకున్న దూషణుడు రెండు దంతాలు విరిగిపోయిన మహాగజం వలె నేలపై పడిపోయారు. ఆ విధంగా దూషణుడు నేలపై

పడి పొర్లుతూ ఉంటే ఆకాశంలో నుండి చూస్తున్న దేవగంధర్వ ఋషీశ్వరులంతా 'బాగు బాగు' అని మెచ్చుకొన్నారు.

దూషణుడి మరణం ఖరుడికి రాముడిపై ఎక్కడ లేని కోపం తెప్పించింది. మిగిలిన సేనాధిపతులందరినీ పిలిచి రాముడిపై యుద్ధాన్ని తీవ్రతరం చెయ్యమని ఆజ్ఞాపించాడు. ఖరుడు ఈ విధంగా పలికి కోపంతో రాముడి వైపు పరుగెత్తాడు. శ్యేనగామి, పృథుగ్రీవుడు, యజ్ఞశత్రువు, విహంగముడు, దుర్జయుడు, కరవీరాక్షుడు, పరుషుడు, కాలకార్ముకుడు, మేఘమాలి, మహామాలి, సర్పాస్యుడు, రుధిరాశనుడు అనే మహా పరాక్రమశాలులైన పన్నెండు మంది సేనానాయకులు శ్రేష్ఠమైన ఆయుధాలతో రాముణ్ణి ఎదిరించారు.

అంతట మహా తేజశ్శాలి అయిన రాముడు బంగారంతోను, వజ్రాలతోను, అలంకరించబడిన బాణాలను ప్రయోగించి మిగిలిన సైన్యాన్నంతా మట్టుపెట్టాడు. బంగారు పొన్నులతోను, ధూమంతోను కూడిన అగ్నివలె మండి ప్రజ్వరిల్లుతున్న ఆ బాణాలు, వజ్రాయుధం మహావృక్షాలను పడగొట్టినట్లు, ఆ రాక్షసుల తలలను పడగొట్టాయి. రాముడు ఒక్కొక్క సైనికుడిపై ఒక్కో బాణాన్ని సంధిస్తూ వాడిని యమలోకానికి పంపాడు. అంటే, నూరు బాణాలతో నూరు మందిని, వెయ్యి బాణాలతో వెయ్యిమంది రాక్షసుల్ని సంహరించాడు. రాముడి బాణాల చేత రాక్షసుల కవచాలు బ్రద్దలయ్యాయి. దాంతో బాణాలన్నీ శరీరంలో గుచ్చుకొని రక్తం ప్రవాహాల్లాగా కారిపోయింది. ఆ సైనికులంతా చెదిరిపోయిన జుట్టుతో, రక్తంతో తడిసిన శరీరంతో, దర్భలు మహావేది చుట్టూ వేసి కప్పినట్లు నేలంతా కప్పివేశాయి. అక్కడ అంతా మాంసం రక్తంతో తడిసి రక్తమాంసాలనే బురద తయారైంది. ఆ క్షణాన అదొక నరకంలాగా కనిపించింది.

ఏ వాహనమూ లేకుండా, ఒక్కడూ ఇంత భయంకరులతో యుద్ధం చేసి పద్నాలుగు వేలమందిని చంపి భూభారం తగ్గించాడు. ఆ మొత్తం యుద్ధంలో ఖరుడు, త్రిశిరస్సు అనే ఇద్దరు మాత్రమే మిగిలారు. మిగిలినవాళ్ళంతా యమలోకానికి పోయారు.

ఆ మహాయుద్ధంలో మహా బలశాలి అయిన రాముడు భయంకరమైన రాక్షస సైన్యాన్ని అంతటినీ చంపివేశాడు. ఇదంతా చూస్తున్న ఖరుడి గుండె పగిలిపోయింది. భయంకరంగా అరుస్తూ మరో పెద్ద రథాన్ని ఎక్కి, వజ్రాయుధాన్ని ధరించిన దేవేంద్రుడిలాగా, రాముడి మీద తలపడ్డాడు.

# 27వ సర్గ రాముడు త్రిశిరస్సును సంహరించటం

యుద్ధం చేయటానికి రాముని వైపుగా వెళ్తున్న ఖరుణ్ణి చూసి త్రిశిరస్సు అనే సేనాపతి అతనికి నమస్కరించి, ఇట్లా అన్నాడు.

త్రిశిరస్సు: ఓ మహాపరాక్రమవంతుడా! మహాబాహువైన రాముణ్ణి యుద్ధంలో నేను సంహరిస్తాను. నీవు తొందరపడి యుద్ధరంగానికి వెళ్ళవద్దు. నా చేతుల మీదుగా ఆ రాముణ్ణి చంపాలని ముచ్చటపడుతున్నాను. నాకీ అవకాశం ఇవ్వు. చంపగలిగితే నేను రాముణ్ణి చంపి నీకు సంతోషం కలిగిస్తాను. లేదా నేనే అతడి చేతిలో మరణిస్తే, అప్పుడే నీవు యుద్ధంగంలో ప్రవేశించవచ్చు.

ఖరుడు: ఓయీ త్రిశిరస్సూ! నీ కోరిక యందు స్వామిభక్తి, దేశభక్తీ రెండూ ఉన్నాయి. నీకు అనుజ్ఞ ఇస్తున్నాను. విజయంతో తిరిగిరా!

అంతట త్రిశిరస్సు గుర్రాలు పూన్చిన రథాన్ని ఎక్కి రాముణ్ణి ఎదిరించటానికి వెళ్ళాడు. రాముడు ధనుస్సును చేతబట్టి వాడియైన బాణాలు అతడిపై వదిలాడు. వారిద్దరి మధ్యా కరి గజాల మధ్యన జరిగినట్లు చాలాసేపు యుద్ధం జరిగింది. త్రిశిరస్సు వాడియైన మూడు బాణాల్ని రాముడి నుదుట వేశాడు. అవి రాముడిపై పూలుజల్లినట్లయింది. త్రిశిరస్సు వదిలిన మూడు బాణాలకు సమాధానంగా రాముడు అతడిపై పద్నాలుగు బాణాలు వదిలాడు. అవి సూటిగా పోయి వాని కవచాన్ని పగులకొట్టి గుండెల్లో గుచ్చుకున్నాయి. సూటిగా వెళ్లే నాలుగు బాణాలను రథానికి కట్టిన నాలుగు గుర్రాలపైన వేసి వాటిని నేల కూల్చాడు. అంతట మరో ఎనిమిది బాణాల్ని సారథి మీద వేసి అతడినీ నేల కొరిగేట్లు చేశాడు. ఇంకో బాణం వేసి రథ ధ్వజాన్ని పడగొట్టాడు. రథంపై నుండి దిగబోతున్న త్రిశిరస్సు గుండెల్లోకి ఒక బాణాన్ని వదిలాడు. ఇంకో పదమూడు బాణాలతో అతడి శిరస్సు శరీరం నుండి విడిపోయి నేలపై పడింది. త్రిశిరస్సు నేలకొరగ్గానే మిగిలిన సైనికుల్లో ధైర్యం నీరుకారిపోయింది. సింహాన్ని చూసిన లేడి పిల్లల్లాగా

పారిపోయారు. అప్పుడు ఖరుడే స్వయంగా చంద్రుణ్ణి పట్టబోయే రాహువులాగా రాముడిపై కురికాడు.

# 28వ సర్గ రాముడు ఖరునితో పోరాడటం

త్రిశిరస్సు నేల కొరగటం ఖరుడు చూశాడు. రాముడి పరాక్రమం చూసి ఖరుడు కూడా భయపడిపోయాడు. దేవతలను కూడా ఎదిరించడానికి వీలుకాని తన సైన్యం అంతా నశించింది. మహావీరులైన దూషణుడు, త్రిశిరస్సు నేలకొరిగిపోయారు. అట్లాంటి సమయంలో ఖరుడు, నముచి దేవేంద్రుణ్ణి ఎదిరించినట్లు, రాముణ్ణి ఎదుర్కోవటానికి సిద్ధమయ్యాడు.

ఖరుడు నారి సంధించాడు, పగపట్టిన సర్పాల్లాంటి బాణాలను రాముడిపైకి వదిలాడు. ఇంతవరకు తాను నేర్చిన ప్రజ్ఞాపాటవాలన్నీ ప్రదర్శిస్తూ బాణాల్ని అనేక రీతుల్లో ప్రయోగించాడు. ఆ బాణాలన్నీ దిక్కులను, విదిక్కులను కప్పివేశాయి.

రాముడు కూడా ఖరుడి బాణాలకు దీటైనవీ, అంతకన్నా తీవ్రమైన బాణాలతో ఆకాశమంతా నింపివేశాడు. దాంతో ఖరుడి బాణాలకు ఆ వలయాన్ని దాటి వచ్చే అవకాశమే లేకుండా పోయింది. క్షణాల్లో రాముడు బాణాలతో ఆకాశాన్నే మాయం చేసి, చూసే వాళ్ళకు ఆకాశం కనపడకుండా చేశాడు. ఇట్లా వాళ్ళిద్దరూ ఒకరిని చంపాలని మరొకరు చేస్తున్న భీకరమైన పోరులో ఆకాశంలో సూర్యుడు కనిపించకుండాపోయాడు.

తరువాత ఖరుడు రాముణ్ణి నాళీక బాణాలతోను నారాచ బాణాలతోను, వికర్ణి బాణాలతోను, అంకుశంతో మహాగజాన్ని కొట్టినట్లు, కొట్టాడు. ధనుస్సు బాణాలు ధరించిన రథంపై నిలబడిన ఖరుడు, పాశాలు పట్టుకొని నిలబడ్డ యముడిలాగా భయంకరంగా కనిపించాడు. తన సైన్యంలో మహావీరులతో పోట్లాడటం వల్ల, భీకరం, అసంఖ్యాకం అయిన పరివారాన్ని పరిమార్చడం వల్ల రాముడు బాగా అలసిపోయి ఉంటాడని తలచాడు. రాముడికి విశ్రాంతి ఇవ్వకుండా బాగా అలసిపోయి ఉన్నప్పుడే అతడిని ఎదుర్కొని పరిమార్చాలని అనుకున్నాడు.

సింహంలాగా పరాక్రమంతో వస్తున్న ఖరుణ్ణి, రాముడు చూశాడు. ఒక సింహం ఇంకో సింహంతో తలపడేందుకు సిద్ధపడుతున్నట్లుంది. ఎవరిని చూసి ఎవరూ భయపడటం లేదు. గెలుపు తనదేనన్న ధీమా ఇద్దరిలోనూ విపరీతంగా కనిపిస్తోంది.

సూర్యరశ్మిలాగా వెలిగిపోయే రథాన్ని ఎక్కి రాముడి వైపుగా, మిడత అగ్ని దగ్గరకు వెళుతున్నట్లుగా వెళ్ళాడు. ఖరుడు గురి చూసి రాముడి ధనుస్సుపై సారించిన బాణం పోయి ధనుస్సు చేతి పిడిని తాకింది. మరల ఏడు బాణాల్ని తీసుకొని రాముడి కవచంపై సంధించాడు. దాంతో రాముడి కవచం విరిగి నేలపై పడింది. ఇక గెలుపు తనదేనన్నంత సంతోషంతో అరుస్తూ అనేక బాణాలను రాముని గుండెలపై సంధించాడు. ఖరుడి బాణాలు రాముడి శరీరంలో అన్ని భాగాలపైనా తగిలాయి.

తరువాత శత్రు సంహారకుడైన రాముడు, అగస్త్య మహర్షి ఇచ్చిన ధనుస్సుకు నారి కట్టి సిద్ధం చేశాడు. అంతట ఆ వైష్ణవ ధనుస్సును సంధించి బంగారు పొన్నులచే వంగిన కణుపులు గల బాణాలతో ఖరుడి రథ ధ్వజాన్ని ముందుగా విరగ్గొట్టాడు.

రథ ధ్వజాన్ని పోగొట్టుకున్న ఖరుడికి రామునిపై కోపం కట్టలు తెంచుకు వచ్చింది. వాడియైన నాలుగు బాణాలను తీసి అవయవాలన్నింటినీ గురిచూసి కొట్టాడు. దాంతో రాముడి శరీరంలో అన్ని భాగాల నుండీ రక్తం కారసాగింది.

దాంతో కృద్ధుడైన రాముడు ఆరు బాణాలను గురిచూసి ఖరుని శిరస్సుపైన ఒకటి, బాహువులపైన రెండు బాణాలు, వక్షఃస్థలంపైన మూడు బాణాలు విడిచాడు.

మహా తేజశ్శాలి అయిన రాముడు ఈ రాక్షసి మూకతో ఇంతసేపు ఆడుకున్నాడు. ఇక ఈ ఆట చాలిద్దామని అనుకున్నాడు. అంతే! సూర్యునితో సమానమైన తేజస్సుగల పదమూడు నారాచ బాణాలను తీసుకున్నాడు. ఒక బాణాన్ని రథంపైనా, నాలుగింటిని నాలుగు గుర్రాలపైన, ఒక బాణంతో రథసారథిని, మూడు బాణాలతో రథం ముందు భాగాన్ని, రెండు బాణాలతో బండి

ఇరుసుల్ని; ఒక బాణంతో ఖరుని ధనుస్సును, చివరిది పదమూడవది అయిన బాణంతో ఖరుణ్ణి కొట్టాడు. దాంతో ఖరుడి ధనుస్సు విరిగిపోయింది; రథం కుప్పకూలిపోయింది. అంతట ఖరుడు చేతిలోకి గద తీసుకొని నేలపైకి దూకాడు.

ఈ యుద్ధాన్నంతా ఆకాశం నుండి ఆసక్తిగా తిలకిస్తున్న దేవతలు, మహర్షులు మున్నగు వారంతా సంతోషించి నమస్కరిస్తూ, రాముణ్ణి కొనియాడారు.

# 29వ సర్గ రాముడు ఖరుని నిందించడం

రథం కూలిపోగానే ఖరుడు గద తీసుకొని నిలబడ్డాడు. అప్పుడు రాముడు ఖరునితో అతి మృదువుగాను, మధురంగాను వినిపిస్తున్నా, మిక్కిలి పరుషమైన వాక్యాలతో ఇలా పలికాడు.

రాముడు: ఓ ఖరుడా! నీవు గజములు, అశ్వములతో కూడిన మహా సైన్యానికి అధిపతిగా ఉన్నావు. ఇంతబలగం చేతిలో పెట్టుకొని నలుగురూ నిందించే పనులే చేశావు. నీవు చేసినవన్నీ మహా భయంకరమైన పనులు. అనేక పాపకర్మలు చేశావు. ప్రాణులన్నీ నిన్ను ప్రేమించాల్సింది పోయి నిన్ను చూసి భయపడుతున్నాయి. ఒక్క విషయం గుర్తుంచుకో! క్రూరుడు మూడు లోకాలకూ అధిపతే అయినా సుఖంగా బ్రతకలేడు.

ఓ రాక్షసుడా! క్రూరకర్మలు చేసే పాపాత్ములు దగ్గరగా వచ్చినా కూడా జనులు త్రాచుపామును చూసినట్లు భయపడతారు. త్రాచుపామును చంపినట్లే నిర్దాక్షిణ్యంగా చంపేస్తారు. దురాశ చేతగాని, కోరికల చేతగాని పాపాలు చేస్తూ తన తప్పు తెలుసుకోలేనివాడు, వడగల్లు తిన్న నలికెళ్ళ పాములాగా, భ్రష్టుడై తన పాపాలకు ఫలం అనుభవిస్తాడు.

ఓ ఖరుడా! ఒక్క మాట చెప్పు. దండకారణ్యంలో కందమూలాలు తింటూ తపస్సు చేసుకుంటూ బ్రతుకుతున్న ఆ మునీశ్వరులను చంపడం వల్ల నీకేం లాభం కలుగుతుంది? దాని వల్ల నువ్వు ఏం ఆనందం పొందుతావు? లోకంలో అందరిచేతా 'ఛీ' అని అనిపించుకుంటూ క్రూరులైన పాపాత్ములు ఐశ్వర్యవంతులయినా కూడా మొదళ్లు పుచ్చిపోయిన వృక్షంలాగా ఎక్కువకాలం జీవించలేరు.

భయంకరమైన పాపకర్మలు చేసిన ప్రాణులన్నీ సమయం వచ్చినప్పుడు, ఆయా ఋతువుల్లో పుష్పించి ఫలించే వృక్షాల్లాగా, పాపఫలాన్ని అనుభవించక తప్పదు. పాపకర్మల ఫలం, విషం కలసిన ఆహారాన్ని భుజించడం వలెనే, అది కొద్ది కాలంలోనే లభిస్తుంది.

ప్రాణులకు రక్షణ కలిగించడం రాజధర్మం. నీలాంటి పాపాత్ములైన రాక్షసుల నుండి కాపాడమని రాజునైన నన్ను మునులంతా వేడుకున్నారు.

ఓ ఖరుడా! ఇప్పుడు నేను ఉపయోగించే బంగారు అలంకారాలతో చేసిన ఈ బాణాలు, పాములు పుట్టను చీల్చుకొని బయటకు వచ్చేట్లుగా, నీ శరీరాన్ని చీల్చివేయగలవు. ఇంతకాలం ఈ దండకారణ్యంలోని మునులను భక్షించి ఎక్కడకు పంపావో, ఇప్పుడు నిన్ను కూడా అక్కడికే పంపుతున్నాను. ఇప్పుడు నా బాణం చేత సంహరించబడిన నీకు, పూర్వం నీచే చంపబడిన మునులంతా విమానాల మీద ఎక్కి నరకంలో ఉన్న నిన్ను చూస్తారు.

ఓ కులాధముడా! నీవు గదను ధరించి ఉన్నావు గదా! నీ ఇష్టం వచ్చినట్లు, నన్ను కొట్టేందుకు ప్రయత్నించు. ఈలోగా నీ తల తెగి తాటిపండు లాగా నేలపై పడుతుంది.

ఖరుడు (క్రోధంతో కూడిన నవ్వు నవ్వుతూ) : రామా! యుద్ధంలో ఏదో కొద్దిమంది సాధారణ సైనికుల్ని చంపి నిన్ను చూసుకొని నువ్వే గొప్ప వీరుడనని మురిసిపోతున్నావు. నిజంగా పరాక్రమవంతు లెవరూ ప్రగల్భాలు పలుకరు. నరశ్రేష్ఠు లెవరూ గర్వించరు. క్షత్రియుల్లో అధములు మాత్రమే నీకుమల్లే బడాయిలు చెప్పుకుంటారు. యుద్ధంలో సామాన్య సైనికులు మాత్రమే తన్ను గూర్చి తన కులాన్ని గూర్చీ మాట్లాడుకుంటూ ఉంటారు. ఎవరైనా ప్రాణం ఒడ్డి యుద్ధం చెయ్యాల్సిన సమయంలో ఈ విధమైన వ్యర్థ ప్రేలాపన చేస్తాడా? దర్భను కాలిస్తే బంగారం రంగులో ఉన్నంత మాత్రాన బంగారం అవుతుందా? అదేవిధంగా నీ వ్యర్థ ప్రేలాపన అంతా నీ చవకబారుతనాన్ని బయటపెడ్తోంది.

ఓ రామా! లోకంలో జీవుల ప్రాణాలను హరించేందుకు యమధర్మరాజు గదను ధరించి ఎలా నిలబడి ఉంటాడో అదేవిధంగా నీ ప్రాణాలు తీయడానికి నేను కూడా గదను ధరించి నీ ముందు నిలబడ్డాను.

ఓ రామా! నేను కూడా నీకు కొన్ని నీతి వాక్యాలు చెప్పాలని ఉంది. కానీ సమయం

చాలటం లేదు. ఎందువల్లనంటే, సూర్యాస్తమయం అయిన తర్వాత యుద్ధం చేయగూడదు. ఈలోగా నేను నిన్ను చంపి నీవు చంపిన నా సైనికుల బంధువర్గాల కన్నీళ్ళు తుడవాలి.

ఈ విధంగా ఖరుడు కోపంతోను, ద్వేషంతోను పరుషంగా మాట్లాడుతూ తన చేతిలో ఉన్న గదను గిరగిరా త్రిప్పి రాముడి పైకి విసిరేశాడు. మృత్యపాశంలాగా మెరుస్తూ వస్తున్న ఆ గదను రాముడు తన బాణాలతో ఆకాశంలోనే ముక్కలు ముక్కలుగా చేశాడు. మంత్ర ప్రభావం చేత తల వాల్చేసిన ఆడసర్పంలాగా, ఆ గద ముక్కలు ముక్కలై నేలపై పడింది.

# 30వ సర్గ ఖరుని వధ

ధర్మమందు ఆసక్తి గల రాముడు బాణాల చేత ఖరుని గదను విరుగకొట్టి నవ్వుతూ ఇట్లా అన్నాడు.

రాముడు: ఓరీ రాక్షసాధమా! నీకున్న బలం అంతా ప్రదర్శించావు. నీ బలమంతా నా కాలిగోటికి కూడా సాటిరాదని రుజువైంది. ఇంకా ఎందుకు అనవసరంగా రంకెలు వేస్తావు? నువ్వు పలికిన ప్రగల్భాలన్నీ నీటి మీద వ్రాతల్లాంటివేనని నీ గదయే రుజువు చేసి చూపింది గదా? నీ నమ్మకాన్నంతా వమ్ముచేసి నేలమీద పడిపోయింది. "నేను వెళ్ళి రాక్షసుల బంధువుల కన్నీళ్ళు తుడుస్తా" నన్నావే, అది అసత్యమే కానీ, చచ్చిన రాక్షసుల దగ్గరకు నువ్వు వెళ్ళడం మాత్రం నిజం చేస్తాను.

ఓరీ రాక్షసాధముడా! నీవు నీచుడవు. దుష్ట స్వభావం గలవాడివి. చెడ్డనడవడిక గలవాడివి. అటువంటి నీ ప్రాణాలను, గరుత్మంతుడు అమృతాన్ని హరించినట్లు హరిస్తాను. ఇప్పుడే నీ తల తెగి నేలపై పడేట్లు చేస్తాను. నులి వెచ్చని నీ నెత్తురంతా భూమిలో ఇంకిపోతుంది. రాక్షసాధముడవైన నీ మరణానంతరం ఈ దండకారణ్యం అంతా ప్రశాంతమైన తపోవనం కాగలదు. ఓరీ రాక్షసుడా! నీ అధీనంలో మిగిలిపోయిన రాక్షసులందరినీ కూడా చంపి, తాపసులంతా ఈ వనంలో నిర్భయంగా ఉండేట్లు చేస్తాను. ఇంతకాలం ఇతరులకు భయం కలిగిస్తూ వచ్చిన రాక్షస స్త్రీలందరూ తమ బంధువులంతా యుద్ధంలో మరణించడం చేత భయంతో పరుగుపెడ్తారు. నీ మరణంతో నీ భార్యలంతా ఇకపై జీవితంపై విరక్తి కలిగి దుఃఖాలంటే ఏమిటో చవిచూస్తారు.

ఈ దండకారణ్యంలో ఉండే బ్రాహ్మణులంతా వాళ్ళ అగ్నిహోత్రాలను ఎక్కడ అపవిత్రం చేస్తావోనని నిత్యం భయంతో చస్తున్నారు. అసహాయులైన ఆ మునులను చంపి తింటున్నావు. నిజంగా నీ అంత క్రూరుడూ, నీచుడూ ఎక్కడా ఉండదు.

ఖరుడు: ఓ రామా! నీ ఇంద్రియాలు ఆరూ పని చేయటం మానేశాయి. అందువల్లనే భయపడాల్సిన ఈ సమయంలో కూడా భయపడటం లేదు. మృత్యువు చేతుల్లో చిక్కుకుపోయిన నీకు ఏం మాట్లాడాలో, ఏం మాట్లాడకూడదో కూడా తెలియటం లేదు. ఏది చేయదగిన పనో, ఏది చేయకూడని పనో తెలుసుకోలేకుండా ఉన్నావు.

ఖరుడు ఈ విధంగా పరుషమైన మాటలు మాట్లాడుతూ చేతుల్లో ఏ ఆయుధం లేకపోవటం చేత చుట్టూ కలయచూశాడు. సమీపానే ఉన్న సాల వృక్షాన్ని చూశాడు. ఆ మహాబలవంతుడు రెండు చేతులతో గట్టిగా పట్టుకొని ఆ వృక్షాన్ని ఎత్తి గిరగిరా త్రిప్పుచూ, “దీంతో నీ చావు మూడిం” దని అరుస్తూ రాముడి పైకి విసిరేశాడు. రాముడు ఆ వృక్షాన్ని ఆకాశంలో ఉండగానే ముక్కలుగా చేసి నేలపై పడేట్లు చేశాడు.

తరువాత కోపమే ఎరుగని రాముడు ఖరుణ్ణి చంపేందుకు కోపాన్ని బలవంతాన ప్రేరేపించుకున్నాడు. దాంతో రాముడి నేత్రాలు కోపంతో ఎర్రబడి వెయ్యి బాణాలు ప్రయోగించగా ఖరుడి శరీరం అంతా తూట్లుపడిపోయింది. దాంట్లో నుండి రక్తం కారుతూండగా వేగంగా అతడు రాముడి వైపు పరుగెత్తాడు. అంతట రాముడు కొద్దిగా ప్రక్కకు తప్పుకోగా ఆ ఖరుడు ప్రక్కగా బోర్లాపడిపోయాడు. అంతట రాముడు దేవేంద్రునిచే ఇవ్వబడిన బాణాన్ని సంధించి ఖరునిపై ప్రయోగించాడు. అంతట ఆ బాణం పోయి ఖరుడి గుండెల్లో గుచ్చుకోగా అతడు నేలపై పడ్డాడు.

రామబాణం చేత చంపబడిన ఖరుడు వజ్రముచే చంపబడ్డ వృత్రాసురుడివలె, నురుగుచేత చంపబడిన నముచివలె, ఇంద్రుని వజ్రాయుధం చేత చంపబడ్డ బలాసురునివలె నేలపై పడ్డాడు.

ఆకాశం నుండి రాజర్షులు, బ్రహ్మర్షులు సంతోషించినవారై రాముణ్ణి అభినందించారు. వారంతా ఇట్లా అన్నారు.

మహర్షులు: రామా! ఖరుడు మున్నగు రాక్షసులందరినీ నీవు సంహరించడానికే దేవేంద్రుడు శరభంగాశ్రమానికి వచ్చాడు. ఆయన చేసిన మంత్రాంగం వల్లనే మేమంతా నిన్ను ప్రార్థించి ఇక్కడకు రప్పించాం. ఖరాది రాక్షసులంతా క్రూరులు. వారందరినీ సంహరించి ధర్మపరులైన మహర్షులంతా ఈ అరణ్యంలో స్వేచ్ఛగా యజ్ఞాది కార్యాలు చేసుకునేట్లు చేశావు. ఇక దండకారణ్యం అంతా ధర్మం నెలకొనగా, వేదోక్తమైన కర్మలను ఆచరిస్తూ మునులంతా సుఖంగా ఉంటారు.

ఆకాశాన చేరిన దేవతలు, గంధర్వులు, చారణులంతా పూలవర్షం కురిపించారు. దుందుభులు మ్రోగించారు.

ఈ మహాభయంకర యుద్ధంలో రాముడు ఒకటిన్నర ముహూర్తాల కాలంలో పధ్నాలుగువేలమంది రాక్షసుల్ని సంహరించాడు.

రాముడు ఆత్మజ్ఞానం కలిగిన జ్ఞాని. అతడి సామర్థ్యం, పరాక్రమంతో ఆశ్చర్యం గొలిపే మహత్కార్యాలు చేశాడు. శ్రీ మహావిష్ణువులాగా, కనబడుతున్నాడని దేవతలంతా తమలోతామే అనుకొంటూ వెళ్ళిపోయారు.

లక్ష్మణుడు సీతాదేవిని తీసుకొని పర్వత గుహలో నుండి వచ్చాడు. ముగ్గురూ కలసి ఆశ్రమానికి వెళ్ళారు. ఇంత పెద్ద యుద్ధాన్ని ఒక్కచేతి మీదుగా నడిపి విజయం సాధించినా ఎక్కడా అలసటే తెలియని రాముణ్ణి సీతాదేవి కౌగలించుకొని అభినందించింది.

# 31వ సర్గ ఖరుడి మరణాన్ని రావణునికి తెలియజేయడం

జనస్థానంలో రాముడు రాక్షస సంహారం చేసిన తర్వాత, అకంపనుడనేవాడు లంకా నగరానికి వెళ్ళాడు. అక్కడ రావణాసురుని వద్దకు పోయి, "రాజా! జనస్థానంలో చాలామంది రాక్షసులు చంపబడ్డారు. నేను ఎట్లాగో ప్రాణాలతో బయటపడ్డాను. ఈ వార్త మీకు చేరవెయ్యాలని త్వరత్వరగా వచ్చాను" అన్నాడు. అకంపనుడు తెచ్చిన దుర్వార్త విన్న రావణాసురుని కళ్ళు కోపంతో ఎరుపెక్కాయి.

రావణాసురుడు: అకంపనా! నా జనస్థానాన్ని పాడుచేసిన ఆ అల్పాయువు ఎవరు? నాకు అపకారం చేసినవాడు ఈ లోకంలో ఉండటానికి వీలులేదు. వాడు దేవేంద్రుడైనా, కుబేరుడైనా లెక్కచేయను. నేను దండించి తీరుతాను. నేను యముడికే యముడను. మరణానికే మరణాన్ని. నన్ను ఎదిరించిన వాడెవడూ సుఖంగా బ్రతుకలేదు. నాకు కోపం వస్తే సూర్య చంద్రుల్నే కాల్చివేస్తాను. వాయుదేవుణ్ణే కట్టిపడేస్తాను.

అకంపనుడు: ఈ దీనుడు మీ అభయాన్ని కోరుతున్నాడు. దశరథ మహారాజుకు పెద్దకుమారుడైన రాముడనే వాడొకడున్నాడు. అతడు యువకుడు. సింహంలాటి గంభీరమైన ఆకారం. వృషభంలాగా బలమైన మూపుగలవాడు. బలిష్ఠమైన భుజాలు పొడవుగా మోకాళ్ళ వరకూ ఉంటాయి. రాజా! ఆ రాముడు గొప్ప వీరుడే కాదు. మంచి కీర్తి కలవాడు కూడా! అతడు జనస్థానంలో దూషణుణ్ణి, ఖరుణ్ణి ఇంకా అనేకమంది రాక్షసులను పొట్టనపెట్టుకున్నాడు.

రావణుడు (మహాసర్పంలాగా బుసకొడ్తూ) : అకంపనా! జనస్థానానికి రాముడు ఒక్కడే వచ్చాడా? లేక దేవేంద్రుడు ఇతర దేవతలతో కలసివచ్చాడా?

అకంపనుడు: రాజా! రాముడు గొప్ప తేజస్సు గలవాడు. ధనుస్సు ధరించే వీరులలో శ్రేష్ఠుడు. దివ్యాస్త్రాలెన్నో అతడి వద్ద ఉన్నాయి. యుద్ధం చేయడంలో దేవేంద్రుణ్ణి మించినవాడు.

ఈ రాముడికి లక్ష్మణుడనే తమ్ముడొకడున్నాడు. అతడు కూడా మహాబలశాలి. అతడి కంఠస్వరం దుందుభులు వాయించినట్లుంటుంది. చంద్రుని వంటి గుండ్రనైన ముఖం కలవాడు. రామలక్ష్మణులు అగ్నివాయువుల్లాగా జనస్థానాన్ని నామరూపాల్లేకుండా చేశారు.

రాజా! జనస్థానానికి దేవత లెవరూ రాలేదు. ఇది సత్యం. రాముడే బంగారు పొన్నులు, రెక్కలుగల బాణాలు ప్రయోగించాడు. ఆ బాణాలు అయిదు తలల సర్పాలుగా మారి రాక్షసులందర్నీ సంహరించాయి.

ఓ రావణ మహారాజా! భయంతో రాక్షసులు ఆ మూలకు, ఈ మూలకు పరుగుపెడ్తూ ఉంటే, రాముడు వాళ్ళందరికీ ఎదురుగా ఉన్నట్లు కనిపించేవాడు. ఆ రాముడే నీ జనస్థానాన్ని నాశనం చేశాడు.

రావణుడు: నేను రామలక్ష్మణులను చంపుతాను. నేనే స్వయంగా జనస్థానానికి వెళ్తాను.

అకంపనుడు: ఓ దోషరహితుడా! నీవు రాముణ్ణి ఎదుర్కొనే ముందు అతడి బలపరాక్రమాల గూర్చి విను. నీకు ఉపయోగంగా ఉండవచ్చు.

రాముణ్ణి జయించటం ఎవరి శక్యమూ కాదు. అతడికి కోపం వస్తే నిండుగా ప్రవహిస్తున్న నదీ ప్రవాహాన్ని కూడా నిలిపివేయగలడు. చంద్రుడు, నక్షత్రాలతో సహా ఆకాశాన్ని కూల్చగలడు. క్రుంగిపోతున్న భూమిని పైకి ఎత్తగలడు. సముద్రాలన్నింటినీ ఒకటిగా చేసి లోకాన్ని మునిగిపోయేట్లు చేయగలడు. వాయువేగాన్ని బాణాలతో నిగ్రహించగలడు. ఒకసారి లోకాలన్నింటినీ బూడిద చేసి మళ్ళీ సృష్టి ప్రారంభించగలడు.

రాజా! నీవుగానీ, రాక్షసులంతా కలసివచ్చినా, పాపాత్ముడు ఎట్లా స్వర్గాన్ని చేరలేడో అట్లాగే, అతణ్ణి జయించలేరని నేను అనుకొంటున్నాను. అయితే అతణ్ణి జయించే ఉపాయం ఒకటుంది చెప్తాను. విను.

సీత అతడి భార్య. ఆమె నడుము పిడికెడుంటుంది. అతిలోక సౌందర్యవతి. పొందికైన అవయవాలు గలది. స్త్రీ జాతికే రత్నం వంటి ఆ సీత ఎన్నో రత్నాభరణాన్ని ధరించి ఉంటుంది. అన్నింటినీ మించి ఆమె అన్ని విషయాల్లోనూ ఉత్తమురాలు. ఆమె సౌందర్యాన్ని వర్ణించి చెప్పాలంటే అంత సౌందర్యవతి అటు దేవ, గంధర్వుల్లోగాని, ఇటు మానవుల్లోగానీ మరొకళ్ళు లేరు. కాబట్టి ఆమెకు ఆమే సాటి. కాబట్టి నీవు అరణ్యంలో ఉన్న సీతను అపహరించు. సీత అంటే రాముడికి ప్రాణం. ఆమె లేకుండా బ్రతుకలేడు. కాబట్టి ప్రాణాలు విడుస్తాడు.

అకంపనుడి మాటలు రావణుని చెవులకు విందు చేశాయి. మహాబాహువైన రావణుడు బాగా ఆలోచించాడు.

రావణుడు: మంచిది. అకంపనా! రేపే నేను పోయి ఆ సీతను ఈ మహానగరానికి తీసుకొని వస్తాను.

మర్నాడే, సూర్యకాంతితో సమానమైన, కంచరగాడిదలచే పూన్చిన, బంగారు రథాన్ని ఎక్కి రావణుడు ప్రయాణమయ్యాడు. ఆ రథం ఆకాశమార్గాన ప్రయాణం చేసింది. చూసేందుకు మేఘాల మధ్య చంద్రుడిలాగా ప్రకాశించింది. దారిలో మారీచుడి ఆశ్రమానికి వెళ్ళాడు. మారీచుడు తాటక కొడుకు. మారీచుడు రావణునికి అర్ఘ్యము, పాద్యం ఇచ్చి పూజించాడు. చక్కటి ఆహారం ఇచ్చి భోజనం పెట్టాడు. కొద్దిసేపు విశ్రాంతి తీసుకున్న తర్వాత మారీచుడు ఇట్లా అన్నాడు.

మారీచుడు: దానవేశ్వరా! నీ ప్రజలంతా క్షేమంగా ఉన్నారా? రాజా! నీవు ఇప్పుడు ఏదో రాచకార్యంపై వచ్చినట్లున్నావని అనుకొంటున్నాను. చెప్పదగినదైతే నాతో చెప్పవలసింది.

రావణుడు: మారీచుడా! దండకారణ్యంలో రక్షణకోసం పెట్టిన రాక్షస సైన్యాన్నంతా రాముడనేవాడు సంహరించాడు. శత్రు దుర్భేద్యమైన ఆ జనస్థానమంతా మరుభూమి అయింది. అక్కడ నివసిస్తున్న రాక్షసులంతా రాముడిచే వధింపబడ్డారు. అందువల్ల ఆ రాముడి భార్యను

అపహరించుకుపోవాలని వచ్చాను. అందుకు నాకు నీ సహాయం కావాలి.

మారీచుడు: రాక్షసులలో శ్రేష్ఠుడవైన రావణా! నీకు సీతను గూర్చి ఈ విధంగా చెప్పిన దుష్టుడెవడు? వాడు మిత్రుడివలె కనిపించే శత్రువు. నువ్వంటే కిట్టనివాడెవరో నీకీ సలహా ఇచ్చారు. ఎవరా దుష్టుడు? వాడెవరో నీ గొప్పతనాన్ని, కీర్తిని నాశనం చేయదలచుకొని నీకు సలహా ఇచ్చాడు. నీకీ విషయంలో ప్రేరేపించినవాడు నిస్సందేహంగా నీకు శత్రువు. నీ చేత పాము కోరలను పీకించాలని చూస్తున్నాడు.

రాజా! సుఖంగా నిద్రపోతున్నవాడి తల పగలకొట్టినట్లుగా ఈ చెడు ఆలోచనను నీ తలలోకి ఎక్కించాడు. వాడెవడో నీకు మహాద్రోహాన్ని తలపెట్టాడు. మహాప్రభూ! రాముడంటే యుద్ధంలో జయించటానికి అలవికానివాడు. ఒక మదించిన ఏనుగు వంటివాడు. ఆతడి పరిశుద్ధమైన వంశమే ఆ ఏనుగుకు తొండం. ఆతడి బలమైన చేతులే ఏనుగు దంతాలవంటివి. అతడి ప్రతాపమే మదజలం; ఆ మదజల గంధానికి ఇతర ఏనుగులు ఏవీ దగ్గరకు కూడా రాలేవు. కాబట్టి అటువంటి రాముడితో విరోధం పెట్టుకోవడం మంచిది కాదు.

రావణా! రాక్షసరాజా! రాముడు నిద్రిస్తున్న సింహం వంటివాడు. అటువంటి సింహాన్ని లేపవద్దు. ఆ సింహం తోకను నడుముకు చుట్టుకొని నిలబడటమే రణరంగం. రాముడి బాణాలు ఆ సింహానికి గోళ్లు. అతడి ఖడ్గమే కోరలు. ఆ సింహం మృగాలను వేటాడినట్లు రాముడు రాక్షసుల్ని సంహరించి వీరవిహారం చేస్తున్నాడు. అటువంటి నర-సింహం నిద్రపోతోంది. దాన్నిప్పుడు లేపడం అంటే కొరివితో తల గోక్కున్నట్లవుతుంది.

రాముడనే అతి భయంకరమైన సముద్రంలో జారిపడటం మంచిది కాదు. అతడి ధనుస్సే అందులోని మొసలి. భుజాల వేగమే బురద. బాణాలే అలలు. యుద్ధమే అందలి జలప్రవాహం.

రాక్షసరాజా! నీ ప్రయత్నం మానుకో. తిరిగి లంకకు వెళ్ళిపో. నీ భార్యతో కులాసాగా కాలం గడుపు. పరభార్యపైన ఆసక్తి విడిచిపెట్టు. రాముణ్ణి భార్యతో అరణ్యంలో సుఖంగా

ఉండనివ్వు.

మారీచుని మాటలు ఆలకించి రావణుడు మారుమాట్లాడకుండా లంకకు తిరిగి వెళ్ళిపోయాడు.

# 32వ సర్గ శూర్పణఖ రావణుని వద్దకు వెళ్ళటం

మహా క్రూరులు, భయంకరులు అయిన పద్నాలుగు వేలమంది రాక్షసుల్ని, త్రిశిరస్సును, దూషణుణ్ణి, ఖరుణ్ణి రాముడొక్కడే చంపటం చూసి శూర్పణఖ బావురుమని ఏడ్చింది. రాముడి అసాధారణ శౌర్యం, బలపరాక్రమాలు కళ్ళారా చూసింది. ఏం చెయ్యాలో తోచలేదు. వెంటనే లంకకు పోయి రావణుడికి విషయం అంతా చెప్పాలనుకుంది.

మరుత్తులనే దేవతలు మహేంద్రుణ్ణి సేవిస్తున్నట్లుగా మంత్రిమండలి మధ్యన రావణాసురుడు కూర్చుని ఉండటం శూర్పణఖ చూసింది. రావణుడు సూర్యునివలె వెలిగిపోతున్న బంగారు సింహాసనంపై కూర్చున్నాడు. అగ్నిగుండంలో ఉన్న అగ్నివలె ప్రకాశిస్తున్నాడు.

దేవాసుర యుద్ధంలో రావణుడు అనేకసార్లు వజ్రాయుధం చేత దెబ్బలుతిన్నాడు. ఐరావతం తన దంతాలతో కుమ్మేసింది. అందువల్ల ఒళ్ళంతా కాయలుకాసి ఉన్నాయి. ఇరవై భుజాలు ఇరవై తలలకు సరిపడా విశాలమైన వక్షఃస్థలం ఉంది. మహారాజులకు జరిగే శ్వేతఛత్రం, వింజామరలచే విసరుతూ ఉండటం వంటి రాచమర్యాదలన్నీ జరుగుతున్నాయి. రావణుని శరీర కాంతి వజ్రవైడూర్యాల కాంతిని పోలి ఉంది. బంగారు కుండలాలు ధరించాడు. భుజాలు బలంగాను అందంగాను ఉన్నాయి. విష్ణువుతో పోరాడినప్పుడు తాకిన విష్ణు చక్రం దెబ్బలు శరీరంపై స్పష్టంగా కనిపిస్తున్నాయి. దేవతలందరూ అతడి శరీరంపై కొట్టారు. ఆ దెబ్బలన్నీ శరీరంపై కనిపిస్తూనే ఉన్నాయి. సముద్రాలను కూడా క్షోభింపజేయగల సమర్థుడు. పర్వతాల్ని పిండిచేయగలడు. అధర్మం అంటే ప్రాణం.

రావణునికి అనేక దివ్యాస్త్రాలను ప్రయోగించడం తెలుసు. యజ్ఞాలకు విఘ్నం కలుగజేయటం అతడికి ఒక క్రీడ. భోగవతీ నగరానికి వెళ్ళి వాసుకిని ఓడించారు. తక్షకుని భార్యను బలాత్కారంగా ఎత్తుకొనిపోయాడు. కైలాస పర్వతానికిపోయి కుబేరుణ్ణి ఓడించి అతడి పుష్పక విమానాన్ని సొంతం చేసుకున్నాడు. రావణుని కోపాగ్నికి చైతరథమనే ఉద్యానవనం,

పద్మసరోవరం, నందనవనం ఇంకా ఎన్నో దేవతల ఉద్యానవనాలు ధ్వంసమయ్యాయి.

రావణుడు శత్రువులను హింసించేవాడు, పర్వత శిఖరాలతో సమానమైన వాడు. సూర్యచంద్రులనైనా తన చేతులతో నిలిపివేయగలడు. బ్రహ్మను గూర్చి పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. బ్రహ్మకు తన శిరస్సులన్నీ కానుకగా ఇచ్చి బ్రహ్మను మెప్పించాడు. బ్రహ్మ నుండి దేవతలు, దానవులు, గంధర్వులు, పిశాచాలు, పక్షులు, సర్పముల వలన తనకు మరణం రాకుండా ఉండేట్లుగా వరం పొందాడు. మానవులు తన్నేమీ చేయలేరన్న చులకన భావంతో మానవులను గూర్చి ఏమీ అడగలేదు.

మహాబలశాలి అయిన రావణుడు, బ్రాహ్మణులు యజ్ఞం చేసి దేవతల కోసం సిద్ధం చేసుకున్న హవిస్సులను దేవతలకు అందకుండా నాశనం చేసేవాడు. రావణుడు యజ్ఞశాలలో బ్రహ్మహత్యలు చేసేవాడు. యజ్ఞాలను ధ్వంసం చేసేవాడు. క్రూరుడై దుష్టప్రవర్తన కలవాడై ప్రజాకంటకుడుగా ఉండేవాడు. కఠినాత్ముడనే పేరు సంపాదించుకున్నాడు. సర్వభూతాలను ఏడిపిస్తూ, సకల లోకాలకూ భయాన్ని కల్పిస్తూ ఉంటున్నవాడూ, మహాబలశాలి అయిన తన అన్నగారైన రావణుని శూర్పణఖ కలుసుకొంది.

దివ్యమైన వస్త్రాలు, పూలమాలలు మున్నగు సమస్తమైన అలంకారాలతో బంగారపు సింహాసనంపై కూర్చున్న రావణుడు మృత్యుదేవతలాగా కనిపించాడు. భయంతోను, వ్యాకులత చెందిన మనస్సుతోను దుఃఖీతురాలైన శూర్పణఖ, మంత్రులతో కలసి కూర్చుని ఉన్న శత్రుసంహారకుడైన రావణుని చూస్తూ ఇట్లా అన్నది.

నిర్భయంగాను విచ్చలవిడిగాను తిరిగే ఆ శూర్పణఖ లక్ష్మణుని చేత వికృతరూపాన్ని పొందినదై భయంతోను, దుఃఖంతోను ఆ రాక్షసరాజుతో ఇట్లా అంది.

## 33వ సర్గ శూర్పణఖ రావణుని నిందించటం

శూర్పణఖ: ఓ సోదరా! నీవు బాగా మదించి కామ భోగాలపైననే ఆసక్తి కలిగి ఉంటున్నావు. ఎటువంటి ఘోరాలు జరుగుతున్నా పట్టించుకోవటం లేదు. కామాలన్నీ తీర్చుకొంటూ, భోగాలన్నింటినీ అనుభవిస్తూ కూర్చున్నావు. స్వార్థపరుడవు, నిరంకుశుడవు అయ్యావు. ఇటువంటి రాజును ప్రజలు గౌరవించరు. ఈ విధంగా నీచమైన భోగాలను అనుభవిస్తూ దురాశాపరుడైన రాజును శ్మశానంలో ఉండే అగ్నిలాగా గౌరవించరు. రాజనేవాడు ఏఏ పనులు, ఏఏ సమయాల్లో చేయాలో తెలుసుకొని చేయకపోతే ఆ రాజ్యం నిలవదు; నశిస్తుంది. రాజు గూఢచారుల ద్వారా దేశంలో నలుమూలలా ఏం జరుగుతుందో తెలుసుకోవాలి. ప్రజల్ని కలుసుకొని వారి కష్టసుఖాలను వినాలి. అట్లా కాకుండా ఉండే రాజును ప్రజలు, నదిలో బురదగా ఉన్న ప్రదేశాన్ని ఏనుగులు వదిలేసినట్లు, వదలి దూరంగా వెళ్ళిపోతారు. తమను తామే అదుపులో ఉంచు కోలేని వాళ్ళు, దేశాన్ని రక్షించలేని రాజు, సముద్రంలో మునిగి ఉన్న పర్వతంలాగా ఉపయోగపడరు. నీవు దేవదానవ గంధర్వాదులందరితోనూ విరోధం పెట్టుకున్నావేగాని, గూఢచారులను పెట్టుకోకుండా వాళ్ళందరినీ నీ అదుపులో ఎట్లా ఉంచుకోగలుగుతావు? సమర్థుడవైన రాజువని ఎట్లా అనిపించుకుంటావు?

జయించే వారిలో శ్రేష్ఠమైనవాడా! రావణా! సమర్థుడైన రాజు గూఢచారుల్ని, కోశాగారాన్ని, పరిపాలనా వ్యవహారాలని తన అదుపులో ఉంచుకోవాలి. అట్లా చేయలేని రాజు సామాన్య ప్రజలతో సమానమే అవుతాడు. రాజులు గూఢచారుల్ని పెట్టుకొని ఎక్కడెక్కడి సంగతులూ తెలుసుకుంటూ ఉంటారు. అందువల్లనే రాజులకు దూరదృష్టి గలవాళ్ళనే ప్రసిద్ధి కలిగింది. గూఢచారులను పెట్టుకోకుండా పరిపాలనా వ్యవహారాల్ని చూస్తున్న నీ చుట్టు ఉంటున్న మంత్రులు కూడా సామాన్య ప్రజలతోనే సమానులవుతారు. అందువల్లనే నీ జనస్థానంలో నీ వాళ్ళందరూ ఘోరంగా చంపబడ్డా కూడా నీవు తెలుసుకోలేకపోయావు.

నీ అజాగ్రత్త వల్లనే నరుడైన రాముడు ఒక్కడూ ఖరుడు, దూషణుడు, త్రిశిరస్సు వంటి మహా బలశాలురైన పద్నాలుగు వేలమంది రాక్షసులను చంపాడు. ఇక నుండి మునులు, తాపసులు, బ్రాహ్మణులు పేట్రేగిపోతారు. యజ్ఞయాగాదులు నిర్భయంగా చేస్తారు. వాళ్ళను అడ్డుకునే రాక్షసులంతా మరణించారు. రాముడు ఆ మునులందరికీ రాక్షసులను అడ్డుకుంటానని మాట ఇచ్చాడు. ఇచ్చిన మాటను నిలబెట్టుకున్నాడు. జనస్థానాన్నంతటినీ దుంపనాశనం చేసేశాడు.

రావణా! నీవు దురాశాపరుడవు. మదించి ఉన్నావు. నీ వాళ్ళంతా నిన్ను తమ గుప్పిట్లోపెట్టుకొని ఆడిస్తున్నారు. అందువల్లనే నీ దేశంలో ఏర్పడ్డ భయానక వాతావరణాన్ని, తెలుసుకోలేకపోతున్నావు.

తీవ్రమైన స్వభావం కలవాడు, జీతభత్యాలు సరిగా ఇవ్వని లుబ్ధుడు, ఏమరిపాటుతనంతో ఉండేవాడు, గర్వపోతు, శఠుడు అయిన రాజు వద్దకు ప్రజలు ఎన్ని కష్టాలు వచ్చినా వెళ్ళరు.

గర్విష్టి, ప్రజలకు అందుబాటులో లేనివాడు, ఆత్మస్తుతి చేసుకునేవాడు, కోపిష్ఠి అయిన రాజును, సమయం వస్తే ప్రజలే చంపేస్తారు. చేయవలసిన పనులు చెయ్యనివాడు, భయపడాల్సిన సమయాలలో భయపడనివాడు త్వరలోనే రాజ్యభ్రష్టుడవుతాడు. ప్రజలు అటువంటి వాడిని గడ్డిపరకతో సమానంగా చూస్తారు. గడ్డిపరకలు, మట్టిబెడ్డలు, బూడిద లాంటివి కూడా ఎప్పుడో ఒకప్పుడు ఉపయోగపడతాయి. కానీ రాజ్యభ్రష్టుడైన రాజు ఎందుకూ పనికిరాడు. కట్టి విడిచిన వస్త్రం లాగా, నలిగిపోయిన పూలదండలాగా ఎందుకూ పనికిరాడు.

ఏమరిపాటుతనం లేకుండా, సమయస్ఫూర్తి కలిగి ఎప్పటికప్పుడు అన్ని విషయాలూ తెలుసుకుంటూ, ఇంద్రియ నిగ్రహంతో ఉంటూ, ధర్మాన్ని ఆచరిస్తూ, కృతజ్ఞుడై ఉండే రాజును ప్రజలు పదికాలాల పాటు గుర్తుంచుకుంటారు.

ఏ రాజు నిద్రపోతున్నా నీతి అనే కళ్లతో మేల్కొని ఉంటాడో, క్రోధం లేనివాడై ప్రవర్తిస్తాడో

అతణ్ణి జనులు పువ్వుల్లో పెట్టి పూజిస్తారు.

రావణా! నీవు దుర్బుద్ధి గలవాడవయ్యావు. నీలో ఈ సుగుణాలన్నీ నశించాయి. స్వజనం అయిన రాక్షసుల శ్రేయస్సును గూర్చి గుఢచారుల ద్వారా తెలుసుకోవటం మానేశావు. నీకు మంచి చెడుల విచక్షణ తెలియడం లేదు. ఏది ఎప్పుడు చెయ్యాలో చెప్పే మంత్రులు లేరు. ఇతరులను అనుమానించి అవమానిస్తూ భోగాల్లో మునిగి తేలుతున్నావు. అందు వల్ల త్వరలోనే నీవు రాజ్యభ్రష్టుడవయి, ఆపదల్లో చిక్కుకుంటావు.

అత్యధికమైన ధనము, దర్పము, బలము గల రాక్షసరాజైన రావణుడు ఆమె చేసిన నిందావాక్యాలన్నీ శ్రద్ధగా విన్నాడు. దోషాలన్నీ ఆత్మపరిశీలన చేసుకున్నాడు. పరిస్థితులు ఇట్లా చెయ్యిదాటిపోవటానికి కారణాలను అన్వేషించడం మొదలుపెట్టాడు.

# 34వ సర్గ శూర్పణఖ, రావణునికి సీతను గూర్చి తెలుపటం

రావణుడు: ఓ శూర్పణఖా! నీవు చెప్తున్న ఆ రాముడెవరు? ఎక్కడ నుండి వచ్చాడు? ఈ దండకారణ్యానికి ఎందుకు వచ్చాడు? అతడి రూపరేఖలు, బలపరాక్రమా లెటువంటివి? నాకు వివరంగా చెప్పు. ఖరుడు, దూషణుడు వంటి యోధులను చంపిన రాముడు ఎటువంటి ఆయుధాల్ని ఉపయోగిస్తాడు?

శూర్పణఖ: రావణా! ఆ రాముడు దశరథ మహారాజు కుమారుడు. ఆజానుబాహువు. పద్మాలవంటి నేత్రాలు గలవాడు. నారచీరలు, కృష్ణాజినాలు, జటలు ధరిస్తాడు. మన్మథుడంతటి అందగాడు.

ఆ రాముడు బంగారు కట్లు కట్టిన ధనుస్సును వాడతాడు. నారాచ బాణాల్ని వాడతాడు. అతడు ఎప్పుడు బాణాలు పొది నుండి తీస్తాడో, ఎప్పుడు సంధిస్తాడో, ఎప్పుడు ప్రయోగిస్తాడో ఎవరూ ఇదమిత్థంగా చెప్పలేరు. ఆ వేగం అటువంటిది. ఇంద్రుడు కురిపించే రాళ్ళ వానకు పంటలన్నీ నాశనమైనట్లు, ఆ బాణాలు తగిలిన వాడల్లా ప్రాణాలు విడవవలసిందే.

ఆ రాముడు ఒంటరివాడు. ఒకటిన్నర ముహూర్తాల కాలంలో (ఒక గంట పన్నెండు నిమిషాలు) భయంకరమైన ఆకారం గలవారు, మహాశౌర్య పరాక్రమాలు కలిగిన పద్నాలుగు వేలమందిని, ఖరుడు, దూషణుడు త్రిశిరస్సువంటి వారిని కూడా సంహరించాడు.

అడవుల్లో తపస్సు చేసుకొనే మునులు పోయి అతణ్ణి రాక్షసుల బారినుండి కాపాడమని ప్రార్థించారట. ఇతడు 'అట్లాగే' నని అభయమిచ్చాడట. జనస్థానాన్నంతా నాశనం చేసి తాను ఇచ్చిన మాట నిలబెట్టుకున్నాడు. యోధులైనవారు స్త్రీలను వధించరాదని, నన్ను ప్రాణాలతో వదిలాడు.

రాముడికి ఓ తమ్ముడున్నాడు. అతడి పేరు లక్ష్మణుడు. అతడు కూడా రాముడంతటి

పరాక్రమవంతుడు. అందగాడు. తేజస్సు గలవాడు. సకల సద్గుణసంపన్నుడు. అన్నగారిపై ప్రేమ, భక్తి గలవాడవటంచేత, అడవుల్లో అన్నగారికి సేవలు చెయ్యడానికి రాముడితో కలసి వచ్చాడు. ఈ లక్ష్మణునకు కోపం ఎక్కువ. జయించడం ఒక్కటే తెలుసు. అతణ్ణి జయించేవాడే లేడు. అతడు రాముడికి బహిర్ప్రాణం.

రాముడికి భార్య ఉంది. ఆమె పేరు సీత. ఆమె కళ్ళు పద్మపు రేకుల్లాగా ఉంటాయి. చంద్రబింబం వంటి ముఖం. ఆమె అంటే రాముడికి అమితమైన ప్రేమ. సీత ఎప్పుడూ రాముడి హితాన్నే కోరుతూ ఉంటుంది. ఆమె జుట్టు అందంగాను, పొడుగ్గాను ఉంటుంది. అందమైన ముక్కు, తొడలు గల సౌందర్యవతి. ఆమె ఇప్పుడు జనస్థానంలో రెండవ లక్ష్మీదేవిలాగా విరాజిల్లుతోంది. బంగారం వంటి శరీరచ్ఛాయగలది. ఆమె గోళ్ళు ఎర్రగాను, ఎత్తుగాను ఉంటాయి. నడుం సన్నగా గుప్పెడంత ఉంటుంది. ఆమె విదేహరాజైన జనకమహారాజు కుమార్తె. ఆమెను సీత అంటారు. ఇంతటి అతిలోకసుందరిని దేవతల్లోగాని, గంధర్వుల్లోగాని, మానవుల్లోగాని నేను చూడలేదు. ఇంతటి అపురూప సుందరిని భార్యగా పొందినవాడు, ఆనందంగా కౌగిలించుకున్నవాడు దేవేంద్రుడికంటే అధికుడు.

అన్నా! మంచి శీలం, అందమైన శరీరం, సాటిలేని రూపం గల ఆమె నీకు తగిన భార్య అవుతుంది. నీవుకూడా ఆమెకు తగిన భర్తవవుతావు. మీ రిద్దరూ ఒకరికోసం మరొకరు పుట్టారని నా కనిపిస్తోంది.

ఓ గొప్ప భుజాలుగలవాడా! విశాలమైన జఘనము, బలిసిన కటిప్రదేశము, స్తనాలు, సుందరమైన ముఖం గల ఆ సీతను నీకు భార్యగా చెయ్యాలని అనుకున్నాను. నా ప్రయత్నానికి విఘ్నం కలిగిస్తూ, క్రూరుడైన లక్ష్మణుడు ముక్కు చెవులు కోసి నన్ను కురూపినిగా చేశాడు.

ఓ రావణా! ఆ సీతను నీవు చూసినట్లయితే తప్పకుండా మన్మథుని పాశాలలో బంధించబడగలవు. ఆమె కోసం పిచ్చివాడివై పోతావు.

సోదరా! నీకు ఆమెను భార్యగా పొందాలనే కోరిక కలిగినట్లయితే వెంటనే బయలుదేరు. అంతేకాదు. ఆ క్రూరాత్ముడైన రాముణ్ణి చంపినట్లయితే చనిపోయిన రాక్షసులందరికీ ఆత్మశాంతి కూడా కలుగుతుంది. కాబట్టి నీ పరాక్రమం చేత ఆ రామలక్ష్మణులిద్దర్నీ సంహరించు. అనాథగా ఉన్న సీతను స్వేచ్ఛగా భార్యను చేసుకోవచ్చును. సోదరా! నీకు నా మాటలు రుచించినట్లయితే వెంటనే బయలుదేరు. నేను చెప్పినట్లు చెయ్యి.

ఓ రాక్షసరాజా! నీవు మహాబలవంతుడవన్న విషయం ఒక్కసారి గుర్తుచేసుకో. ఎటువంటి దోషాలూలేని సీతను బలాత్కారంగా అపహరించు. లంకకు తీసుకొని వచ్చి భార్యగా చేసుకో.

ఓ రావణా! రాముడు వంకరగా పోయే బాణాలతో కాక, సూటిగా వెళ్ళే బాణాలతో ఖరుడు, దూషణుడు మొదలైన వాళ్ళందరినీ సంహరించాడు. ఈ విషయం మనసులో పెట్టుకొని నీ కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టు.

## 35వ సర్గ రావణుడు మారీచుని వద్దకు వెళ్ళటం

రావణుడు శూర్పణఖ చెప్పినదంతా విన్నాడు. మనసంతా ఆ విషయమే ఆక్రమించుకోవటం వల్ల, తక్కిన రాచకార్యాలన్నింటినీ కట్టిపెట్టి మంత్రులను ఇళ్ళకు పొమ్మన్నాడు. శూర్పణఖ చెప్పిన విషయంపై గుణదోషాలు, మంచి చెడులు, సాధ్యాసాధ్యాల గూర్చి బాగా ఆలోచించాడు. చివరకు ఏం చెయ్యాలో నిర్ణయించుకున్నాడు. బుద్ధిని స్థిరపరచుకున్నాడు. ఒంటరిగానే వాహనశాలకు వెళ్ళాడు. అక్కడే ఉన్న సారథితో రథాన్ని సిద్ధంచెయ్యమన్నాడు. వెంటనే సారథి రథాన్ని సిద్ధం చేశాడు. కుబేరుడి తమ్ముడైన రావణుడు బంగారు రథాన్ని ఎక్కి కూర్చున్నాడు. ఆ రథంలో నవరత్నాలు పొదగబడ్డాయి. బంగారు అలంకారాలు చేసిన గాడిదల్ని ఆ రథానికి కట్టారు. ఆ గాడిదలు రథసారథి మనోభావాల్ని తెలుసుకొని సంచరిస్తాయి. రావణుడు ఎక్కి కూర్చున్న ఆ రథం సముద్రం ప్రక్కగా ప్రయాణించింది.

రావణుడు వైడూర్యాల దేహచ్ఛాయ గలిగినవాడు. బంగారు కుండలాలు ధరించాడు. రాజలాంఛనాలను తెలిపే శ్వేతఛత్ర వింజామరలు అమర్చబడ్డాయి. పది తలలు, ఇరవై చేతులతో కూడిన ఆ రావణుడు పదిశిఖరాలున్న పర్వతంలాగా ఉన్నాడు. దేవతలకు శత్రువు, మునులను హింసించటంలో ఆనందం పొందేవాడూ అయిన ఆ రావణుడు ఆ రథంలో వెళ్తూ ఉంటే, ఆకాశంలో మెరుపు తీగలతో కూడిన నీలమేఘంలాగా ఉన్నాడు. మేఘాల్లాగా ఉరుముకుంటూ రథం సముద్రతీరానికి చేరింది. ఆ సముద్ర తీరంలో రకరకాల ఫలవృక్షాలు, పుష్పవనాలు ఉన్నాయి. చల్లటి మధురమైన జలాలతో సరస్సులున్నాయి. ఆ సరస్సులు తామరపూలతోను, రాజహంసలతోను శోభాయమానంగా ఉన్నాయి. విశాలమైన అగ్నివేదికల్తో ఆశ్రమాలున్నాయి. ఆశ్రమాల చుట్టూ అరటిచెట్లు, కొబ్బరిచెట్లు, కంది మొక్కలు, పూవు, పిందె కాయలతో కళకళలాడుతూ ఉన్నాయి.

ఆ సముద్ర తీరం వేలకొద్దీ నాగులు, పక్షులు, గంధర్వులు, బ్రహ్మపుత్రులైన వైఖానసులు, మాషగోత్రీకులు, చంద్రకిరణాలనే ఆహారంగా తీసుకునే వాలఖీల్యులు, ఆహార నియమాలను తీవ్రంగా పాటించే మహర్షులు, కోరికల్ని జయించిన సిద్ధులు చారుణులు నివసిస్తూండడంచే శోభాయమానంగా ఉంది. ఆ తీరాన అప్సరస స్త్రీలు ఉన్నారు. వాళ్ళు రకరకాలైన అలంకారాలు చేసుకొని రతిక్రీడలలో నిపుణులై ఉన్నారు. ఆ సముద్రతీరాన దేవతల భార్యలు నివసిస్తున్నారు. అమృతమందు ఆసక్తిగల దేవదానవులంతా అక్కడుంటున్నారు. ఆ సముద్రతీరమంతా మెత్తటి ఇసుక తిన్నెలచేత నున్నగా ఉన్నట్లు కనబడుతోంది. అక్కడ హంసలు, క్రౌంచపక్షులు, కప్పలు గుంపులు గుంపులుగా ఉన్నాయి. వైడూర్య మాణిక్యాలతో తాపడం చేసిన శిలాఫలకాలున్నాయి.

వేగంగా ప్రయాణం చేస్తున్న రావణుడు దారిలో గంధర్వ, అప్సర స్త్రీలను, తపస్సు చేత పుణ్యలోకాలకు పోయిన వారి విమానాలను చూశాడు. ఆ ప్రాంతం అంతా వాద్యసంగీతాలతో మారుమ్రోగుతోంది. సువాసనలు వెదజల్లే వేలకొలది చందన వృక్షాలను చూశాడు. ఆ వృక్షాల పొదరిళ్ళల్లో పల్చటి జిగురు కారుతోంది. ఆ ఉద్యానవనాల్లో తక్కోల వృక్షాలు ఫలాలున్నవి, మంచి సువాసనగలవి అయిన జాజి తీగలున్నాయి. తమాల వృక్షాల పుష్పాలు, మిరియపు తీగలు, మంచి ముత్యాలు, శంఖాలు, పగడాలు రాసులుపోసి ఉన్నాయి. వాటి చుట్టూ బంగారు, వెండి కొండలు వ్యాపించి ఉన్నాయి. ఆ మార్గం మనోహరమైన సెలయేళ్ళు, చెరువులు, ధనధాన్యాలు, ఉత్తమ స్త్రీలతోను శోభిస్తున్నాయి. ఆ నగరాలన్నీ ఏనుగులు, గుర్రాలతో రద్దీగా ఉంది. సముద్రంపై నుండి వచ్చే ఆ చల్లని తేమతో కూడిన గాలులు ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి. ఈ మనోహర దృశ్యాలన్నీ స్వర్గాన్ని మరిపించేవిగా ఉన్నాయి. ఆ విధంగా అనేక నగరాలను దాటుకుంటూ సింధురాజు అనే ముని ఆశ్రమాన్ని చేరుకున్నాడు.

ఆ ఆశ్రమంలో విశాలమైన వటవృక్షం ఒకటి ఉంది. దాని శాఖలన్నీ నూరు యోజనాల దూరం విస్తరించి ఉంది. దాని క్రింద ఎందరో ఋషులు తపస్సు చేసుకుంటున్నారు. పూర్వం గరుత్మంతుడు పెద్ద ఏనుగును, పెద్దతాబేళ్ళను ఆహారంగా తెచ్చుకొని ఆ కొమ్మలపైన కూర్చుని

తినేవాడట. ఆ గరుత్మంతుని బరువుకు ఆ చెట్టు కొమ్మలు విరిగిపోయేవి. వైఖానసులు, మాషగోత్రీకులైన మహర్షులు, చంద్రకిరణాలను ఆహారంగా తీసుకుంటూ తపస్సు చేసే వాలఖీల్యులు, బ్రహ్మపుత్రులైన మహర్షులు, తలక్రిందులుగా వ్రేలాడుతూ ఉండే మహర్షులు, ఆ కొమ్మను అంటిపెట్టుకొని ఉండేవారు. ఆ మహర్షులకు కష్టం కలిగించడం ఇష్టంలేని గరుత్మంతుడు ఆ ఏనుగును, తాబేలును కాళ్ళ మధ్య ఉంచుకొని వేరొకచోటుకు ఎగిరిపోయాడు. ఆ గరుత్మంతుడు విరిగిన ఆ వటవృక్షం కొమ్మతో నిషాదులను చంపి ఋషులకు రక్షణ కల్పించాడు. అంతట ఆ గరుత్మంతుడు రెట్టింపు సంతోషంతో అమృతం తీసుకురావటానికి నిశ్చయించుకున్నాడు. ఆ గరుత్మంతుడు ఇనుప కటకటాలను విరగకొట్టి రత్నాలతో నిర్మించిన ఆ ఇంటిని పగలకొట్టి, ఆ మహేంద్ర భవనంలో దాచి ఉంచిన అమృతాన్ని తీసుకొనివచ్చాడు.

అక్కడ రావణుడు సుభద్రమనే న్యగ్రోధ వృక్షాన్ని చూశాడు. వేలమంది మహర్షులు ఆ వృక్షాన్ని ఆశ్రయించి ఉన్నారు. గరుత్మంతుడు ఆ వృక్షంపై కూడా కొన్ని గుర్తులు పడేట్లు చేశాడు.

తరువాత రావణుడు సముద్రాన్ని దాటి ఆవలి ప్రక్కకు చేరుకున్నాడు. అక్కడ సుందరము, ప్రశాంతము, ఏకాంతము అయిన ఆశ్రమాన్నొకటి చూశాడు. ఆ ఆశ్రమంలో కృష్ణాజినము నారచీరలు ధరించి ఆహార నియమాలు పాటిస్తూ మునివృత్తిని పాటిస్తున్న మారీచుడనే రాక్షసుణ్ణి చూశాడు.

మారీచుడు తన ఆశ్రమానికి వచ్చిన దానవేంద్రునికి స్వాగతం పలికి అర్ఘ్యపాద్యాదులతో పూజించాడు. ఆసనమిచ్చి మానవులకు లభించని అనేక భోగవస్తువులనిచ్చి సన్మానించాడు.

మారీచుడు: రాక్షసరాజా! లంకానగరంలో అంతా క్షేమమే కదా! మళ్ళీ ఇంత త్వరలో నిన్ను చూస్తాననుకోలేదు. ఈసారి ఏ మహత్కార్యం సాధించేందుకు వచ్చావు?

# 36వ సర్గ సీతను అపహరింప మారీచుని సహాయం అడగటం

రావణుడు: తండ్రీ! నేనిప్పుడు ఆపదల్లో చిక్కుకున్నాను. నీవే దిక్కని నమ్ముకొని వచ్చాను. నా తమ్ముడు ఖరుడు, సోదరి శూర్పణఖ, దూషణుడు, త్రిశిరస్సు ఇంకా ఎన్నో వేలమంది రాక్షసుల్ని దండకారణ్యంలోని జనస్థానంలో ఉండమని నియమించాను. వాళ్ళంతా చాలా సంవత్సరాలుగా అక్కడే ఉంటూ నేను చెప్పినట్లుగా తపస్సు చేసుకొనే మునులను హింసిస్తూ చంపుకు తింటూ ఉంటున్నారు. ఆ విషయాలన్నీ నీకూ తెలుసు.

ఆ జనస్థానంలో అంతా ఖరుడి ఏలుబడిలో సుఖ సంతోషాలతో జీవిస్తూ ఉన్నారు. ఖరుడు మొదలైన రాక్షసులంతా అనేక ఆయుధాలు ధరించి రాముడితో యుద్ధానికి తలపడ్డారు. రాముడు పరుషమైన వాగ్యుద్ధం చెయ్యకుండా సూటిగా బాణాలతో మన వాళ్ళందరినీ ఎదుర్కొన్నాడు. రాముడు ఒక సామాన్య మానవుడు. అందునా నేలపై ఒంటరిగా నిలబడి బాణాలతో తీవ్రమైన యుద్ధం చేసి నా సైన్యాన్నందరినీ చంపేశాడు. ఖరుడు, దూషణుడు, త్రిశిరస్సులను, మిగత సైన్యాన్నంతా హరించడం వల్ల రాముడు మునులందరినీ నిర్భయంగా తిరిగేట్లు చేశాడు.

అక్కడ తండ్రిచేత రాజ్యం నుండి వెళ్ళగొట్టబడ్డాడు. తల దాచుకునేందుకు భార్య, తమ్ముడితో ఈ దండకారణ్యానికి వచ్చాడు. వచ్చినవాడు కందమూలాలు తింటూ బతక్కుండా నా సైన్యాన్నంతా చంపేశాడు. దాంతో అతడి ఆయుర్దాయం మూడింది. ఆయుర్దాయం క్షీణించింది. పైగా అతడి స్వభావం మంచిది కాదు. కఠినాత్ముడు. మూర్ఖుడు, లుబ్ధుడు, ఇంద్రియనిగ్రహం లేనివాడు. ధర్మాన్ని విడిచిన అధర్మాత్ముడు. ప్రాణులకు అపకారం తలపెట్టేవాడు.

రాముడు తనకేగదా బలముందని నా సోదరి శూర్పణఖ ముక్కూ, చెవులు కోసి వికారిని చేశాడు. అందువల్ల వీటన్నింటికీ ప్రతీకారంగా జనస్థానం నుండి అతని భార్య సీతను

అపహరించుకు రావాలని అనుకొంటున్నాను. ఈ విషయంలో నేను నీ సహాయం అడగటానికి వచ్చాను. నీవు నా ప్రక్కన ఉంటే దేవతలంతా కట్టకట్టుకు వచ్చినా మనల్ని ఏమీ చేయలేరు. కాబట్టి నాకు సహాయం చేయటానికి నీవే సమర్థుడవు. నీవు సకల మాయలలో నిపుణుడవు. సమయానుకూలంగా ఉపాయాలు చెప్పగలిగిన నేర్పరివి. యుద్ధంలో నీ సాహసం, దర్పం మరెవరికీ ఉండవు.

ఓ మారీచా! ఈ కార్యం నీ వల్లనే సాధ్యమవుతుంది. నిన్ను నమ్ముకొనే ఇంతదూరం వచ్చాను. నీవు ఏంచెయ్యాలో చెప్తాను. నీవు వెండి చుక్కలున్న బంగారు లేడి రూపాన్ని ధరించి రాముడి ఆశ్రమం ముందు సీతకు కనిపించేట్లుగా తిరుగు. ఆ రూపంలో ఉన్న నీ అసామాన్యమైన అందాన్ని చూసి, ఆ లేడిని పట్టి తెమ్మని రాముణ్ణి, లక్ష్మణుణ్ణి ఆమె కోరుతుంది. రామలక్ష్మణులు నిన్ను వెంబడిస్తూ నీ వెంట పడ్తారు. నీవు పట్టుబడకుండా వాళ్ళను చాలాదూరం తీసుకొనిపో. రామ లక్ష్మణులు ఇద్దరూ దూరంగా పోయిన తర్వాత నాకు ఏ ఆటంకమూ ఉండదు. అవలీలగా నేను సీతను చంద్రకాంతిని రాహువు అపహరించినట్లు, అపహరిస్తాను. రాముడు భార్యావియోగం వల్ల కృశించి, దుర్బలుడై మరణిస్తాడు. అట్లా క్షీణించిపోయిన, బలహీనుడైన రాముణ్ణి సునాయాసంగా చంపేస్తాను.

రాముడి పేరు వినగానే మారీచుడి ముఖం వాడిపోయింది. భయంతో ఒణికిపోయాడు. పెదవులు ఎండిపోయాయి. మరణశయ్యపై ఉన్నవాడిలాగా దీనంగా రావణుడి ముఖంలోకి చూశాడు. అప్పటికే రాముడి శౌర్యపరాక్రమాల గూర్చి విని ఉండటంచేత మారీచుడి మనస్సు భయంతో విలవిల్లాడిపోయింది. అప్పుడు మారీచుడు రెండు చేతులూ ఎత్తి రావణునికి నమస్కారం చేస్తూ, తనకూ, రావణునికీ మేలు చేసే మాటలు చెప్పాడు.

# 37వ సర్గ రావణునికి మారీచుని ఉపదేశం

మారీచుడు: రాజా! తియ్యగా మాట్లాడేవాళ్ళు లోకంలో కోకొల్లలుగా దొరుకుతారు కానీ, హితం కోరేవాళ్ళను వేళ్ళపై లెక్కించవచ్చు. అట్లాగే యథార్థవాది బంధువిరోధి అని కూడా అంటారు.

నీ వాళ్ళంతా యుద్ధంలో చచ్చిపోయారన్న ఆవేదనలో నీ మనస్సు వ్యాకులపడి చంచలంగా ఉంది. అందువల్లనే గూఢచారులను నియమించటంలో అశ్రద్ధ వహించావు. కనుకనే రాముడి విషయంలో సరి అయిన అవగాహన లేకుండా మాట్లాడుతున్నావు. రాముడు గొప్ప పరాక్రమం గలవాడు. సద్గుణసంపన్నుడు. ఇంద్రవరుణులతో పోల్చదగిన తేజశ్శాలి. నీవు రాముడి జోలికి పోయినట్లయితే భూలోకంలో రాక్షస జాతియే అంతరించిపోదా? అని సంశయం కలుగుతోంది. ఆ సీత నీ ప్రాణాలు తియ్యటానికి పుట్టలేదు గదా? నీ మూలంగా నేను కూడా ప్రాణం మీదకు తెచ్చుకున్నవాడనవుతాను. ఇంతకాలం స్వేచ్ఛగాను, నిరంకుశంగాను రాజ్యం పాలించిన నీ, రాజ్యం నశించి పోదుగదా? ఇటువంటి పాపపు ఆలోచనలు చేసే రాజు తనను తానే నాశనం చేసుకోవటమే కాకుండా తన ప్రజలను కూడా నాశనం చేస్తాడు.

ఓ రావణా! కౌసల్యా పుత్రుడైన రాముడు తండ్రిచేత రాజ్యం నుండి వెళ్ళగొట్టబడలేదు. అతడు ఎటువంటి చెడుమార్గాలూ అవలంబించేవాడు కాదు. అతడు దుష్టక్షత్రియుడు కాదు. దుష్ట స్వభావీ కాడు. పైగా అతడు సకల సద్గుణాభిరాముడు. అతడికి ఎవరూ దండన విధించలేదు; లేరు.

రాజా! దశరథ మహారాజు కైకేయిదేవికి ఇచ్చిన మాటను సత్యం చెయ్యటం కోసం, తండ్రి ఆజ్ఞను శిరసావహించి రాముడు దండకారణ్యంలో ప్రవేశించాడు. రాముడు కఠినుడు కాదు. సర్వశాస్త్రాలు, సర్వధర్మాలు తెలిసిన పండితుడు. ఇంద్రియాలను జయించాడేకాని, ఇంద్రియలోలుడు కాదు. నీవు రాముణ్ణి గూర్చి విన్నదంతా అసత్యం.

రాముడు మూర్తీభవించిన ధర్మదేవత. సత్పురుషుడు. సత్యపరాక్రమశీలుడు. దేవతలకు దేవేంద్రుడిలాగా, సర్వలోకాలకు ప్రభువు అయినవాడు. రాముడి నుండి సీతను హరించడానికి ప్రయత్నించడం అంటే సూర్యుడి నుండి కాంతిని హరించటానికి ప్రయత్నించినట్లుగా ఉంటుంది. అటువంటి సీతను రాముడి నుండి బలాత్కారంగా అపహరించాలనే పాపపు ఆలోచన నీకు ఎట్లా వచ్చింది? రాముడు అగ్నివంటివాడు. ధనుస్సు బాణాలు, ఖడ్గం ఆ అగ్నిప్రజ్వరిల్లించే కట్టెల వంటివి. ఎదిరించటానికి సాధ్యంకాని పరాక్రమంగల రాముడనే అగ్నిలోకి దూకవద్దు.

చాపబాణాలు ధరించిన రాముడే యముడు. ధనుస్సే ప్రజ్వరిల్లే నోరు. బాణాలనే మంటలు కక్కుతూ శత్రుసైన్యాన్నంతా భస్మం చేసేస్తుంది. నీవు నీ రాజ్యంలో, నీ ప్రజలతో సుఖాలనుభవిస్తూ జీవితం గడిపెయ్యి. అంతేగాని రాముడి జోలికిపోవద్దు. రాముడి తేజస్సు ఇంత అని ఎవరూ కొలిచి చెప్పలేరు. అరణ్యంలో రామునిచే రక్షించబడుతున్న సీతను నువ్వు అపహరించలేవు.

మానవులలో శ్రేష్ఠుడైన రాముడికి సీత ప్రాణం కన్నా కూడా అధికం. ఆమె కూడా ఎప్పుడూ రాముణ్ణే అనుసరిస్తూ ఉంటుంది. ఆమె మహా పతివ్రత.

ఓ రాక్షసరాజా! ఎందుకు వ్యర్థప్రయత్నం చేస్తావు? పోరాటంలో రామదర్శనం కావటం, నీ జీవితం అంతమవటం రెండూ ఒకేసారి జరుగుతాయి. ఎందుకు కోరి కష్టాలు తెచ్చుకుంటావు? గొప్పదైన నీ రాజ్యాన్ని పాలించుకుంటూ చిరకాలం సుఖంగా ఉండు. నీకు జీవితంపై ఆశ ఉంటే ఆ రాముడి జోలికిపోవద్దు. అతడిని యుద్ధానికి ప్రేరేపించి నాశనాన్ని కొనితెచ్చుకోకు.

నీ మంత్రి, తమ్ముడు విభీషణుడు ధర్మాత్ముడు. అతడికి అన్ని ధర్మాలు తెలుసు. వాళ్ళతో ఆలోచించు. గుణదోషాలు, బలబలాలు, లాభ నష్టాలు, కీడు, మేలు బాగా ఆలోచించి తగినట్లుగా మంచి నిర్ణయాన్ని తీసుకో. అటువంటి ఆలోచన నీకు మేలు చేకూరుస్తుంది. ఓ

రాక్షస రాజా! నీవు యుద్ధంలో రాముణ్ణి ఎదుర్కోవటం నీకు క్షేమం కాదు. ఈ మాటే వెయ్యిసార్లు చెబుతున్నాను.

# 38వ సర్గ మారీచుడు తన స్వీయ అనుభవాన్ని తెలుపడం

మారీచుడు: ఓ రావణా! ఈ మాటలు కూడా విను. ఒకానొకప్పుడు నేను వెయ్యి ఏనుగుల బలంతో పరాక్రమవంతుడనై దండకారణ్యంలోని మునులందరినీ హింసిస్తూ, వాళ్ళను చంపి తింటూ సంచరించేవాడిని. నా పేరు చెబితేనే గడగడా వణికిపోయేవాళ్ళు.

అప్పుడు మహాత్ముడైన విశ్వామిత్రుడు తాను తలబెట్టిన యాగానికి రక్షణగా రాముణ్ణి తనతో పంపమని దశరథ మహారాజును అడిగాడు. అందుకు దశరథుడు ఇలా అన్నాడు.

దశరథుడు: ఓ మహర్షీ! రాముడు చిన్న పిల్లవాడు. శస్త్రాలలో ఇంకా ప్రావీణ్యం సంపాదించలేదు. కావాలంటే నేను, నా చతురంగ బలాల్ని వెంటబెట్టుకొని వస్తాను. ఆ రాక్షసులందరినీ చంపుతాను. రాముణ్ణి మాత్రం పంపమని అడగవద్దు.

విశ్వామిత్రుడు: దశరథ మహారాజా! నీవు అనేక యుద్ధాల్లో దేవతలకు సహాయం చేశావు. నీ శౌర్యపరాక్రమాలు మూడు లోకాల్లోనూ ప్రసిద్ధి చెందాయి. అవన్నీ నేనెరుగుదును. నువ్వూ నీ సైన్యం ఇక్కడే ఉండండి. మహాతేజశ్శాలురైన రామ లక్ష్మణులను మాత్రం నాతో పంపు. నా మాట విను. నీకు సర్వశుభాలు చేకూరుతాయి.

ఈ విధంగా దశరథ మహారాజు అనుమతి తీసుకొని ఆ మహర్షి రామలక్ష్మణుల్ని తనతో తీసుకొని వెళ్ళాడు. అప్పుడు విశ్వామిత్రుడు యజ్ఞదీక్ష వహించి ఉన్నాడు. రాముడు కూడా విశ్వామిత్రుడి ప్రక్కనే ఉన్నాడు.

ఓ రావణా! అప్పుడు రాముడికి మీసాలు కూడా మొలవలేదు. బ్రహ్మచారి కావటాన ఒకే వస్త్రాన్ని ధరించాడు. బంగారు మాల ధరించాడు. తల మీద జుట్టును ముడిగా చుట్టుకున్నాడు. అటువంటి రాముడు ఉదయించిన బాలచంద్రుడి లాగా ప్రకాశించాడు.

అప్పుడు నేను మంచి బలం మీద ఉన్నాను. అప్పటికే అనేక వరాలు కూడా పొందాను. అనేక మాయలు నేర్చాను. బలగర్వంతో నేను విశ్వామిత్రుడి ఆశ్రమంలోకి వెళ్ళాను. రాముడు నన్ను చూశాడు. నేనూ రాముణ్ణి చూశాను. ఏదో చిన్న పిల్లవాడు లెమ్మని నిర్లక్ష్యంగా ఉన్నాను. అది నా అజ్ఞానం అని తర్వాత తెలుసుకున్నాను. రాముణ్ణి లెక్కచెయ్యకుండా విశ్వామిత్రుడి యజ్ఞవేదిక వద్దకు వెళ్ళాను. అంతట రాముడు శత్రుసంహారకమైన ఒక బాణాన్ని నాపై ప్రయోగించాడు. ఆ బాణం నన్ను నూరుయోజనాల దూరాన ఉన్న సముద్రంలో పడేసింది. ఆ వేగానికి నాకు స్పృహ తప్పింది. సముద్రంలో అట్టడుక్కుపోయాను. ఆ తర్వాత ఎట్లాగో సర్దుకుని నెమ్మదిగా లంకా పట్టణానికి చేరుకున్నాను. అప్పుడు రాముడు నన్ను చంపాలనుకోలేదు. అందువల్ల బ్రతికిపోయాను. నాతోపాటు విశ్వామిత్రుడి యజ్ఞశాలకు వెళ్ళిన వాళ్ళందరినీ రాముడు హతమార్చాడు. నన్ను మాత్రం వదలిపెట్టాడు.

రావణా! నీ హితాన్ని కోరి ఇన్ని విధాలుగా చెప్తున్నాను. కాదు, కూడదు అని మూర్ఖించావే అనుకో! నీవు తప్పకుండా కష్టాల్లో పడతావు. నువ్వు మాత్రమే కాదు. రాక్షసులంతా ఆపదల్లో చిక్కుకుంటారు.

రావణా! ఇప్పటి వరకూ లంకా వాసులంతా చక్కగా ఆటపాటల్తోను, పండుగ పబ్బాలతోను ఉత్సవాలు చేసుకుంటూ సుఖసంతోషాలతో జీవిస్తున్నారు. వాళ్ళందరినీ నీవు దుఃఖాలపాలు చేసిన వాడవవుతావు. మేడలు మిద్దెలు కట్టుకొని, నగానట్రా పెట్టుకొని రాక్షసులంతా ఆనందంగా జీవితాన్ని గడిపేస్తున్నారు. సీత మూలంగా వారు అవన్నీ నష్టపోవటం చూస్తావు. ఎందుకు ఈ పని చేశానా అని బాధపడతావు. చేతులు కాలాక ఆకులుపట్టుకుంటే ఏమైనా లాభం ఉంటుందా? ఏ పాపమూ చేయని పరిశుద్ధులు కూడా పాపుల సహవాసం వల్ల పాముల మడుగులో ఉన్న చేపవలె నశించిపోతారు. చందనం మున్నగు దివ్యలేపనాల్ని పూసుకొని ఆభరణాలతో ఆనందంతో కేరింతలు కొట్టే నీ పరివారం అలా నువ్వు చేసిన తప్పుకు రామబాణానికి గురికాక తప్పదు. రామబాణం తిరుగులేనిది. లక్ష్యాన్ని నాశనం చెయ్యకుండా

వెనుతిరుగదు. అంటే ప్రజలంతా భార్యాపిల్లల్ని వదలిపెట్టి పారిపోవడమో, లేక వాళ్ళను కూడా తీసుకొనిపోవడమో నీ కళ్ళతో నీవే చూస్తావు. లంకా పట్టణం అంతా రామ బాణాగ్నిచేత మండిపోవడం చూస్తావు.

ఓ రాజా! పరివారాన్ని కాపాడాల్సింది పోయి, వాళ్ళ వినాశనాన్ని కళ్ళారా చూడటం కన్నా మహాపాపం ఇంకొకటి ఉంటుందా? నీకు వేలాది మంది భార్యలున్నారు. వాళ్ళందరూ అప్సరసలను మించిన అందగత్తెలే కదా? వాళ్ళతో సుఖాలు అనుభవించు. పరభార్యను గూర్చి ఆలోచించడం కన్నా మహాపాపం ఇంకొకటి లేదని తెలుసుకుంటావు.

నీ గౌరవాన్ని కాపాడుకో. నీ సంపదను కాపాడుకో. నీ వంశాన్ని కాపాడుకో. నీ ప్రజలను కాపాడుకో, నీ రాజ్యాన్ని కాపాడుకో. అంతా కలసి కలకాలం సుఖంగా ఉండండి. నీ బంధుమిత్రులందరితో ఆనందంగాను, వారిని సంతోషపెడుతూ పదికాలాలపాటు బ్రతకాలనుకొంటే రాముడి జోలికి పోవద్దు. సీత మాట మరచిపో.

ఓ మహారాజా! నేను ఇంతగా నీ చెవిలో ఇల్లు కట్టుకొని 'వద్ద' ని పోరుతున్నాను. నీవు 'కాదు –కూడదు' అని బలవంతంగానే సీతను అపహరించేటట్లయితే నీ చతురంగ బలాల నాశనం తప్పదు. నీ బంధు పరివారం నశిస్తుంది. చివరకు నువ్వూ తిరుగులేని రామబాణానికి ఆహుతి అయిపోతావు.

# 39వ సర్గ మారీచుడు రావణుని వారించటం

మారీచుడు: రావణా! విశ్వామిత్రుని ఆశ్రమంలో జరిగిన పోరాటానికి తరువాత జరిగిన కథను కూడా చెప్తాను. విను.

రాముడు నన్ను బాణంతో కొట్టి సముద్రంలో పడేట్లు చేసినా నేను నిరుత్సాహపడలేదు. ధైర్యాన్ని, బలాన్ని కూడగట్టుకొని మరో ఇద్దరు రాక్షసుల్ని వెంటబెట్టుకొని తిరిగి దండకారణ్యానికి వచ్చాను. ఈసారి పెద్ద దేహంతో జింక రూపం ధరించాను. నాలుక భయంకరంగా పెద్దూ, పెద్దపెద్ద కోరలతో ముని ఆశ్రమాలకు, యజ్ఞశాలలకు, పుణ్యతీర్థాలకు ఋషుల సమావేశాలకూ వెళ్తూ అక్కవాళ్ళందరినీ భయభ్రాంతులను చేస్తూ అందినవాళ్ళను అందినట్లు చంపి తింటూ స్వేచ్ఛగా విహరించాను.

రాజా! నేను అట్లా తిరుగుతూ ఒకానొక రోజున నారబట్టలతో మునివేషాన్ని ధరించి ఉన్న మహాత్ముడైన రాముణ్ణి, లక్ష్మణుణ్ణి, సీతను చూశాను. వాళ్ళకు దగ్గరగా వెళ్ళినా నేను జింక రూపంలో ఉండటం వల్ల వారు నన్ను గుర్తుపట్టలేదు. ఒకసారి దెబ్బతిన్నవాణ్ణి కదా! నేను వాళ్ళను గుర్తుపట్టాను. పూర్వం ఆ మహానుభావుడు నన్ను కొట్టిన దెబ్బగుర్తుకు వచ్చింది. నాలో పూర్వ వైరం పొంగి బయటకు వచ్చింది. రాముడు ఇప్పుడు ముని జీవితం గడుపుతున్నాడు లెమ్మనుకున్నాను. ఇప్పు డున్న జీవితంలో నన్ను ఏమీ చేయలేడని నాకు నేను ధైర్యం చెప్పుకున్నాను. ప్రాణికోటి కంతటికీ సహాయం చెయ్యటానికి వచ్చిన మహానుభావుడని అనుకోలేదు. మదమెక్కిన వాడినై నా వాడి కొమ్ములతో రాముణ్ణి పొడిచి చంపాలని వెళ్ళాను. బుద్ధి గడ్డి తింది. రాముడికి ఎదురు పడ్డా.

అప్పుడు రాముడు ధనుస్సు చేతిలోకి తీసుకొని నారి సంధించి మూడు బాణాలు వదిలాడు. వజ్రాల వంటి ఆ బాణాలు నెత్తురు తాగితేగానీ క్రిందపడవు. అవి నా వైపుగా రావడం చూశాను. అదివరకు రామబాణం ఎట్లా ఉంటుందో రుచి చూసినవాణ్ణి కావటాన, తప్పించుకు

తిరగడంలో మాయామర్మాలు బాగా తెలిసిన వాణ్ణవడం చేతా, నేను ఎట్లాగో తప్పించుకొని బ్రతికి బయటపడ్డాను. నాతోబాటు ఉన్న ఇద్దరూ ఆ బాణాలకు గురి అయి అక్కడికక్కడే మరణించారు. నా పూర్వానుభవం, మాయలు నన్ను కాపాడాయి. ఎట్లాగో తప్పించుకొని బ్రతికి బయటపడ్డాను.

రాజా! రామబాణం నన్ను వెంటాడుతూ ఉంటే, ప్రాణరక్షణ కోసం నేను పరుగులు పెడ్తూ ఉంటే నాలో జ్ఞానోదయం అయింది. క్రూర ప్రవృత్తి నుండి తప్పుకున్నాను. దుర్మార్గమైన పనుల జోలికి వెళ్ళడం లేదు. ఏ మునులను చంపి తింటూవచ్చానో, నేను కూడా ఆ ముని జీవితాన్నే చేపట్టాను. ఆశ్రమం నిర్మించుకొని మనోనిగ్రహంతో తపస్సు చేసుకొంటూ, కందమూలాలు తింటూ బ్రతుకుతున్నాను.

రాజా! నేను కళ్ళు తెరిచినా, కళ్ళు మూసినా నారచీరలు, కృష్ణాజినాన్ని ధరించిన ధనుర్ధారి అయిన రాముడు, పాశం పుచ్చుకున్న యముడిలాగా చెట్టుచెట్టునా కనబడుతున్నాడు. ఎటుచూసినా వందలు వేలల్లో రాముళ్ళు నా కళ్లకు కనిపిస్తున్నారు. ఈ దండకారణ్యం అంతా రామమయం అయిపోయింది. శూన్యంలో కూడా రాముడే కనబడుతున్నాడు. ఒక్క మాటలో చెప్పాలంటే రామ శబ్దమే అక్కర లేదు – 'ర' అనే అక్షరంతో వచ్చే ఏమాటైనా (రత్నం, రథం వంటివి) నన్ను భయపెడుతున్నాయి.

ఓ రావణా! రామబాణం ఎట్లా ఉంటుందో రుచి చూసినవాణ్ణి. రాముడి ప్రభావం ఎట్లాంటిదో చూసినవాణ్ణి. నా మాట నమ్ము. నీవు రాముడితో పోరాడలేవు. బలిచక్రవర్తి, నముచి కూడా రాముణ్ణి ఎదిరించలేరు. ఓ రాక్షసరాజా! ఇంత చెప్పినా, నీకు ఇంకా రాముడితో పోరాడాలని ఉంటే, పోరాడు! చూస్తూ చూస్తూ నా ప్రాణాలు నేనే తీసుకోలేను. ఇక రాముణ్ణి గురించి నాతో ఇంకేమీ మాట్లాడొద్దు. లోకంలో ఇతరుల అపరాధాలకోసం ధార్మికులు, సజ్జనులైనవాళ్ళుకూడా బలి అయిపోతూ ఉంటారు. కాబట్టి నేనూ నీతో వస్తే నీ మూలంగా నేనూ నాశనం అయిపోవాల్సి వస్తుంది. కాబట్టి నన్ను ఒదిలిపెట్టు. నేను నీతో రాను. నువ్వు మూర్ఖించి

నీ ప్రయత్నం మానకపోతే రాక్షసులంతా రాముడి చేతుల్లో చస్తారు. ఇది సత్యం.

ఓ రాజా! శూర్పణఖ మాట విని ఖరుడు రాముడిపై యుద్ధానికి వెళ్ళాడు. రాముడికి అపకారం తలబెట్టబోయాడు. తన మీదకు దండెత్తి వచ్చిన శత్రువుతో పోరాడటంలో రాముడి తప్పేముంది? నీవే బాగా ఆలోచించు.

ఓ రాజా! నేను బంధువుల హితాన్ని కోరి చెప్తున్నాను. నువ్వు నా మాట లక్ష్యపెట్టకపోతే నువ్వు, నీ బంధువర్గం అంతా రణరంగంలో రాముడి బాణాలకు ఆహుతి అయిపోవాల్సిందే. నీ రాజ్యంలో ఇంకా ఎవరూ మిగిలి ఉండరు. ఇది ముమ్మాటికీ సత్యం.

## 40వ సర్గ మారీచుని తనతో రమ్మని రావణుడు ఆజ్ఞాపించటం

మారీచుడు ఎన్ని విధాలుగా ఉపదేశించినా రావణుడి చెవికెక్కలేదు. మరణాన్ని కోరుకునేవాడు మందులు వేసుకుంటాడా? మారీచుడి మాటలు వినకపోగా కఠినమైన మాటలతో అతణ్ణి నిందించాడు.

రావణుడు: ఓ మారీచుడా! నువ్వు నాకు పిరికిమందు నూరిపొయ్యాలని చూస్తున్నావు. నీ మాటలు చవిటి నేలలో విత్తనాలు చల్లినట్లు ఫలించవు. రాముడు పాపి, మూర్ఖుడు. అన్నిటినీ మించి మానవమాత్రుడు. అటువంటి అల్పుడితో యుద్ధానికి నేను భయపడేవాడిని కాను. రాముడెంత మూర్ఖుడో ఒక మాటలో చెప్పనా? ఎవరో ఒక ఆడదానికిచ్చిన (కైకేయి) మాటకోసం రాజ్యాన్ని, బంధుమిత్రుల్ని, భోగభాగ్యాల్ని విడిచి అడవులకు వచ్చాడు. ఇంతకన్నా పిరికివాడు, మందమతి, మూర్ఖుడూ లోకంలో ఎక్కడైనా ఉంటాడా?

ప్రాణసమానుడైన నా తమ్ముణ్ణి పొట్టన పెట్టుకున్న ఆ రాముణ్ణి వదలను. రాముడికి ప్రాణ సమానురాలైన అతడి భార్యను హరించి నా పగ తీర్చుకుంటాను. దానికి నీ సహాయం కావాలి. నువ్వు కాదని చెప్పవద్దు. నేను ఏదైనా అనుకుంటే చేసితీరుతాను. ఇంద్రాది దేవతలు వచ్చినా నా నిర్ణయాన్ని మార్చలేరు.

ఏదైనా పని చేయటానికి మంచి, చెడులను గూర్చిగాని, లాభనష్టాల గూర్చిగాని నిన్ను అడిగితే చెప్పటంలో దోషం లేదు. కానీ నేను నీ సలహా ఏమీ అడగలేదు గదా? అప్పుడది అధిక ప్రసంగం అనిపించుకుంటుంది. అంతేకాదు రాజు ఏదైనా అడిగినప్పుడు బుద్ధిమంతుడైన మంత్రి దోసిలి కట్టి వినయంతో చెప్పాలి. ఆ చెప్పే మాటలు కూడా రాజుకు ప్రతికూలంగా ఉండే మాటలు మాట్లాడకూడదు. మృదువుగాను, మధురమైన మాటల్లో చెప్పాలి. హితంగాను శుభకరంగానూ ఉండాలి.

మారీచుడా! ఒక వేళ హితం కోరి చెప్పవలసి వచ్చినా, ఆ మాటలు అగౌరవంగాను, తిరస్కార బుద్ధితోనూ చెప్పినట్లయితే ఆ రాజు ఆత్మాభిమానం దెబ్బతింటుంది. అభినందించకపోగా దండించవచ్చు కూడా.

తేజోవంతుడైన రాజులలో ఇంద్రుడు, చంద్రుడు, అగ్ని, వరుణుడు, యముడు అనే ఐదుగురు దేవతల అంశలుంటాయి. ఈ అంశం ప్రభావం ఎట్లా ఉంటుందంటే, అగ్నిదేవునిలో ఉండే వేడి, ఇంద్రుడిలో ఉండే పరాక్రమం, చంద్రుడిలో ఉండే చల్లదనం (సౌమ్యత్వం), యముడిలో ఉండే దండనాశక్తి, వరుణినిలో ఉండే ప్రసన్నత ఉంటాయి. అందువల్ల రాజులను ఎల్లప్పుడూ గౌరవించి పూజించాలి. కాబట్టి ఓ మారీచా! నీవు ఈ ధర్మాన్ని మరచిపోయి నీ ఇంటికి వచ్చాను కదా అని నోటికి వచ్చినట్లల్లా పేలుతున్నావు. అది నీ అజ్ఞానం. నువ్వు దుష్టబుద్ధి గలవాడవు.

ఓ మారీచుడా! ఈ పని మంచిదా, చెడ్డదా అని కాని, సామర్థ్యం ఉన్నదా లేదా అని గాని, చెయ్యవచ్చునా, చెయ్యరాదా అని కాని నిన్ను అడగలేదు. నేను తలపెట్టిన పనికి సహాయం చెయ్యమని మాత్రమే అడిగాను. ఇప్పుడు ఈ పని చెయ్యమని నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. ఆ పని ఎట్లా చెయ్యాలో చెప్తాను. నువ్వు ఆ ప్రకారం చెయ్యాలి. అంతే.

నీవు ఒంటి నిండా వెండి చుక్కలు పెట్టుకొని బంగారు లేడి రూపం ధరించు. రాముడి ఆశ్రమంలో సీత కంటపడేట్లు అటూ ఇటూ తిరుగు. ఆమెకు లేడిపట్ల ఆసక్తి కలిగిన తర్వాత ఇక నీ ఇష్టం వచ్చినచోటుకు వెళ్ళిపోవచ్చు.

బంగారు లేడి రూపంలో ఉన్న నిన్ను చూసి సీత ముచ్చటపడుతుంది. “ఆ బంగారు లేడి కావాలి. తెచ్చి ఇ” మ్మని రాముణ్ణి అడుగుతుంది. రాముడు నిన్ను పట్టుకోవటానికి ఆశ్రమం బయటకు వస్తాడు. నువ్వు అట్లా ఆ రాముణ్ణి చాలాదూరం తీసుకుపో. అక్కడ నుండి సరిగ్గా రాముడి గొంతునే అనుకరిస్తూ “హా సీతా! హా లక్ష్మణా” అంటూ గట్టిగా కేకలుపెట్టు. నీ

అరుపులు విని రాముడి మీద గల ప్రేమచేత రాముడి కేదో ప్రమాదం జరిగిందని తలచి లక్ష్మణుణ్ణి కూడా రాముడికి సహాయంగా పంపుతుంది. రాముడు లక్ష్మణుడు ఆశ్రమంలో లేని సమయంలో దేవేంద్రుడు శచీదేవిని అపహరించినట్లు, నేను సీతను అపహరించుకు వెళ్తాను.

ఓ మారీచుడా! నాకు ఈ పని చేసిపెట్టు. పనికాగానే నీ దారిన నువ్వు వెళ్ళిపోవచ్చు. నీ కష్టాన్ని ఉంచుకోను. నా రాజ్యంలో సగం నీకిస్తాను. కాబట్టి నీవు త్వరగా వెళ్ళి ఈ పనిని పూర్తిచెయ్యి. నీవు తలపెట్టిన పని నిర్విఘ్నంగా జరగాలని కోరుకుంటున్నాను. వెంటనే బయలుదేరు. నీ వెనకాలే నేనూ రథం పైన వస్తాను.

ఈ విధంగా రాముడితో యుద్ధం చెయ్యకుండానే సీతను పొంది, నీతో కలసి లంకకు వెళ్తాను. ఓ మారీచుడా! నీవు ఈ పని చేయనని మూర్ఖిస్తే నిన్ను ఇప్పుడే వధిస్తాను. రాజు తను సాధించదలచిన పనిని సాధించకుండా నిద్రపోడు. నీ చేత బలవంతంగానైనా నాకు కావలసిన పనిని చేయిస్తాను. నన్ను ఎదిరించి ఎవడూ బ్రతికి బట్టకట్టలేదు సుమా! ఆ సంగతి బాగా తెలుసుకొని ప్రవర్తించు.

# 41వ సర్గ మరల మారీచుని హితబోధ

రావణుడు రాజుగా తన ఇష్టంలేని పనిని చేయమని నిర్బంధించగా మారీచుడు కూడా పరుషంగానే సమాధానం చెప్పాడు.

మారీచుడు: రావణా! నీ పుత్రులు, నీ మంత్రులు, నీ ప్రజలు అందరూ నశించే ఉపదేశాన్ని ఏ పాపాత్ముడు నీకు చేశాడు? వాడెవడో నువ్వు సుఖంగా ఉండటం ఇష్టంలేక ఈ సలహా ఇచ్చాడు. ఆ విధంగా నిన్ను మృత్యు ద్వారానికి దగ్గరగా నిలబెట్టాడు. వాడు మిత్రుడుగా కనిపిస్తూన్న శత్రువని తెలుసుకో. బలహీనుడు, నీకు శత్రువు అయిన రాక్షసు డెవ్వడో నీవు రాముడి చేతిలో ఓడిపోవడం చూసి సంతోషించాలని నీకీ సలహా ఇచ్చాడు. నీ చేత తప్పుడు పనులు చేయించి “అయ్యో! నేను చేసిన పాపానికి నేను నాశనమయ్యా” నని నీవు వాపోతూ ఉంటే చూచి సంతోషించాలనుకొనే ఆ దుష్టుడు ఎవరు?

రావణా! నీవు చెడు మార్గంలో వెళుతూ ఉంటే నిన్ను వారించడం నీ మంత్రుల బాధ్యత. అట్లా చెయ్యని వారిని నిలువునా పాతేసినా పాపం రాదు. కానీ నీ మంత్రులు వాళ్ళ బాధ్యతల్ని విస్మరించడం వల్ల, నీ వింకా ఆ తప్పుడు ఆలోచనల సుడిగుండంలోనే పడి కొట్టుకొంటున్నావు.

మంత్రులకు ధర్మార్థకామాలు రాజు వల్లనే లభిస్తాయి. రాజు ధర్మమార్గంలో నడవకపోతే అంతా వ్యర్థమైపోతుంది. ప్రజలు మంత్రులు అందరూ నష్టపోతారు. అందువల్ల వాళ్ళంతా కలసి రాజును రక్షించుకోవాలి.

రావణా! రాజు క్రూరుడూ, అవినీతిపరుడూ అయితే ఆ రాజ్యం ఎక్కువ కాలం నిలువదు. బుద్ధిలేని రాజు, అవినీతిపరులైన మంత్రులు ఉండే రాజ్యం ఎట్లా ఉంటుందంటే కళ్ళాలు పట్టుకోవడం చేతకాని వాడి రథానికి వేగవంతమైన గుర్రాల్ని పూన్చినట్లుంటుంది. తాను, గుర్రాలు రథం మిట్ట పల్లాలలో పడి నాశనమైనట్లుగా రాజు, రాజ్యము, మంత్రులు కూడా

నాశనం అయిపోతారు. లోకంలో ఎంతోమంది సత్పురుషులు ఇతరులు చేసే తప్పుడు పనులకు తాము కూడా సపరివారంగా నశించిపోతున్నారు. అటువంటి రాజు పాలనలో ఉన్న ప్రజలు నక్కల రక్షణలో ఉన్న గొర్రెల్లాగా క్షీణించిపోతారు.

రావణా! నీవు క్రూరుడవు, దుర్బుద్ధి గలవాడవు, ఇంద్రియ నిగ్రహం లేనివాడవు కావటం వల్ల నీ ప్రజలకు వినాశకాలం దాపురించింది. అనుకోని విధంగా నాకే ఆపద వచ్చిపడింది. నా గురించి నేనేమీ బాధపడటం లేదు. నా బాధ అంతా నీ గురించే! ఎందువల్లనంటే నీవు సైన్యంతో సహా నశిస్తావు కనుక. నన్ను చంపిన కొద్దికాలానికే రాముడు నిన్ను కూడా చంపుతాడు. నేను శత్రువు చేతిలో చస్తాను కాబట్టి కృతార్థుణ్ణి అవుతాను. రాముణ్ణి దర్శించుకుంటూ నేను చస్తాను. సీతను అపహరించి బంధువర్గ సపరివారంగా నువ్వు చస్తావు. నీ ఆలోచన ప్రకారం ఆశ్రమంలో నుండి సీతను అపహరించి తెచ్చినట్లయితే నువ్వూ బ్రతకవు, నేనూ బ్రతకను. రాక్షసులు బ్రతకరు. లంకా ఉండదు.

ఓ రావణా! నేను నీ మేలు కోరి ‘వద్దు’ అని చెప్తున్నాను. అయినా నీవు వినడం లేదు. పోయేకాలం దాపురించినవాడు మిత్రుడి మాట వినడు కదా!

# 42వ సర్గ మారీచుడు బంగారు లేడి రూపం దాల్చడం

మారీచుడు నయాన భయాన ఎన్నో మంచి మాటలు చెప్పి చూశాడు. కానీ అంతా బూడిదలో పోసిన పన్నీరయింది. ఇక గత్యంతరంలేక దీనంగా చూస్తూ "రావణా! పద వెళ్దాం" అన్నాడు.

ధనుస్సు, బాణాలు, ఖడ్గం ధరించిన రాముని కంటబడితే ఇక నాకు మరణం తప్పదు. రాముణ్ణి ఎదిరించి బ్రతికి బట్టకట్టేవాడు ఈ భూమ్మీద లేడు. నన్ను రాముడు ఎప్పుడో చంపేశాడు. ఇప్పుడు నీ ఎదుట ఉన్నది మారీచుడి బొంది (శరీరం) మాత్రమే.

నాయనా! రావణా! నీవు పట్టినపట్టు విడువనంటున్నావు. నేను ఏం చెయ్యగలను? నీకు అంతా శుభం కలగాలని కోరుకుంటున్నాను.

రావణుడు (మారీచుణ్ణి సంతోషంతో కౌగలించుకొంటూ) : మారీచుడా! ఇప్పుడు నీవు పలికిన మాటలు వీరోచితంగా ఉన్నాయి. స్వామిభక్తిని చాటేవిగా ఉన్నాయి. ఇప్పుడు నీవు యథార్థమైన మారీచుడవు.

మారీచుడా! రమ్ము. గాడిదలు పూన్చిన నా రథాన్ని ఎక్కు. మనం త్వరగా రాముడి ఆశ్రమానికి పోదాం. అక్కడ నీవు బంగారు లేడివై సీతను ప్రలోభపరచి నీ ఇష్టం వచ్చిన చోటుకు వెళ్లు. నేను సీతను బలాత్కారంగా లంకానగరానికి తీసుకొని వెళ్తాను.

వారిద్దరూ విమానం వంటి ఆ రథాన్ని ఎక్కారు. ఆ రథానికి పిశాచం ముఖాలున్న గాడిదల్ని పూన్చారు. రథమంతా రత్నకంబళీలు తివాచీలు పరచి ఉన్నాయి. ఆ రథం అనేక పట్టణాలు, అరణ్యాలు, పర్వతాలు, నదులు, రాజ్యాలు నగరాలు దాటుకుంటూ దండకారణ్యంలోని రాముడి ఆశ్రమాన్ని చేరుకున్నది. రావణుడు ఆ రథంపై నుండి దిగి మారీచునితో, "మిత్రుడా! ఇదుగో ఇదే రాముని ఆశ్రమం. మనం వచ్చిన పని ప్రారంభించు"

అన్నాడు.

అప్పుడు మారీచుడు రావణుని మాటలు విని బంగారు లేడి రూపాన్ని దాల్చి, రాముని ఆశ్రమం ముందు అటూ ఇటూ తిరగడం మొదలుపెట్టాడు.

ఆ లేడి కొమ్ముల చివర శ్రేష్ఠమైన మణులు అతికినట్లున్నాయి. ముఖం సగం తెల్లగాను, సగం నల్లగాను ఉంది. దాని నోరు ఎర్రకమలం, నల్ల కమలాల్లా ఉంది. చెవుల దగ్గర నల్లకలువల్లా నల్లగా ఉంది. కంఠం కొంచెం ఎత్తుగా ఉంది. పెదవులు ఇంద్రనీలాల్లా ఉన్నాయి. పొట్టంతా తెల్లటి మల్లెపూవు లాగాను, చంద్రబింబం లాగాను ఉంది. దాని ఇరుప్రక్కలూ ఇప్పపూలలా ఉన్నాయి. గిట్టలు వైడూర్యాలు పొదిగినట్లున్నాయి. పైకి ఎత్తి ఉన్న తోక ఇంద్రధనుస్సులా ఉంది. అనేక రత్నాలచే పొదగబడినట్లు శరీరం అంతా మెరిసిపోతోంది. క్షణాల్లో మారీచుడు అందమైన లేడిగా మారిపోయి ఆ వనానికే శోభతెచ్చాడు. సీతాదేవిని ప్రలోభపెట్టడానికి అటూ ఇటూ తిరిగి గంతులు వేస్తూ, పచ్చిక వేస్తూ ఆ లేడి తిరిగింది. కొంతసేపు ఆశ్రమం లోపల దాకా వెళ్ళి మళ్ళా బైటకు పరుగెత్తుకుపోయేది. మళ్ళీ ఆశ్రమంలో తలుపుదాకా వెళ్ళి మళ్ళీ లేళ్ళమందలో కలసి పచ్చిక మేసేది. సీతాదేవి కన్నుల్లో పడాలని అది పడే ఆరాటం అంతా ఇంతా కాదు. లోపల ద్వారం దగ్గరకు పోయి ఎగురుతూ గంతులు వేస్తూ, గిరగిరా తిరుగుతూ అంతలోనే అది లేళ్ళ గుంపులోకి పోయేది. తక్కిన లేళ్ళు కొన్ని దగ్గరగా వచ్చి వాసన చూసి భయంతో పరిగెత్తుకుపోయేవి. మారీచుడికి వాటిలో ఒకదాన్నైనా పట్టుకుని చంపి తినాలని ఉన్నదే కాని, రావణుని పని వ్యర్థం కాకూడదు గదా అని సంయమనం పాటించాడు.

ఆ సమయంలో మంగళకరమైన సీతాదేవి పూలుకోసుకోవటానికి బయటకు వచ్చి ఆ బంగారు లేడిని చూడనే చూసింది. వెండివలె మెరిసిపోతూంది. ముత్యాలవంటి చుక్కల్లో, రత్నాల వంటి మచ్చలతో, బంగారం రంగులో దేహం కలిగిన వింతైన ఆ లేడిని చూసింది. ఆ వింత మృగాన్ని చూసి ఆశ్చర్యపోయింది. రంగురంగుల ఆ లేడి వైపు ప్రేమతో చూసింది.

సీతాదేవి తన్ను చూసి ప్రలోభపడుతోందని లేడి రూపంలో ఉన్న మారీచుడు తెలుసుకున్నాడు. రెట్టించిన ఉత్సాహంతో గంతులు వేస్తూ ఆశ్రమం అంతా కలయ తిరిగాడు. అదివరకు ఎన్నడూ అటువంటి అందమైన, విచిత్రమైన లేడిని చూడకపోవటంతో సీత ఆశ్చర్యంతో చూసింది.

# 43వ సర్గ మాయా లేడిని సీత కోరటం

అందమైన కటిప్రదేశం గల సీత పూలు కోసుకోవటానికి బయటకు వచ్చింది. అక్కడే తారట్లాడుతున్న బంగారు లేడిని చూసింది. దానికి రెండు ప్రక్కలా ఉన్న వెండి బంగారు రంగులు చూసి ఆశ్చర్యపోయింది. రాముణ్ణి, లక్ష్మణుణ్ణి గట్టిగా పిలిచింది. వాళ్ళకూ చూపించింది.

లక్ష్మణుడు: అన్నా! ఈ లేడిని చూస్తూ ఉంటే మారీచుడే మళ్ళీ ఏదో మాయోపాయంతో వచ్చి ఉంటాడనుకొంటాను. వాడికి కోరుకున్న రూపాన్ని పొందే విద్య వచ్చు, దాంతో రకరకాల వేషాలు వేసి ప్రజల్ని మోసం చేస్తూ ఉంటాడు. పూర్వం వేటకు వచ్చే రాజులను ఏదో వేషం వేసి వారిని చంపి వాళ్ళ మాంసం తింటూ ఉండేవాడు.

పురుషశ్రేష్ఠా! ఓ రామా! మాయావి అయిన ఆ మారీచుడే ఈ మాయామృగాన్ని నిర్మించి ఉంటాడు. రామా! ఎక్కడైనా అడివిలో తిరిగే లేడికి ఒంటి నిండా మణుల వంటి చుక్కలుంటాయా? ఇదేదో విపరీతంగా ఉంది. ఇది మాయే అయి ఉంటుంది. ఏమీ సందేహం లేదు.

సీతకు ఆ లేడిపై అనురాగం పెరిగిపోయింది. లక్ష్మణుడి అనుమానాల్ని కొట్టిపారేసింది.

సీత: ఆర్యపుత్రా! ఈ అందమైన లేడి నన్ను ఎంతో ఆకర్షించింది. దీనిని పట్టి తీసుకొని రండి. మనం దాన్ని పెంచుకుందాం. మనమంతా వినోదంగా దాంతో ఆడుకోవచ్చు. మన ఆశ్రమంలో సృమరములు, చమరాలు గుంపులు గుంపులుగా తిరుగుతూ ఉంటాయి. చక్కటి ఆకారాల్తో ఉన్న మృగాలు, కోతులు, ఎలుగుబంట్లు ఇంకా ఎన్నో జంతువులున్నాయి. కానీ ఈ లేడి వంటి మృగాన్ని నేను ఇంతవరకు ఎక్కడా చూడలేదు. దీని శరీర నిర్మాణమే చిత్రంగా ఉంది. రత్నాల చుక్కలతో తళతళలాడుతోంది. ఈ లేడి వల్ల వనానికే అందం వచ్చింది. దీని

కంఠస్వరం, అవయవాలు అద్భుతంగా ఉన్నాయి. ఇది నా మనస్సు దోచేసింది. ఎలాగైనా దాన్ని ప్రాణాలతో పట్టుకురండి. నేను ఆశ్రమంలో మనతోపాటే పెంచుకుంటాను. మనం వనవాసం ముగించుకొని అయోధ్యకు వెళ్ళేటప్పుడు మనతో తీసుకువెళదాం. మన అంతఃపురానికే శోభనిస్తుంది.

ప్రభూ! దాని అందం చూసి భరతశత్రుఘ్నులు, నా అత్తగారు తదితరులంతా ఆశ్చర్యపోతారు. మీరు దీన్ని ప్రాణాలతో పట్టుకోలేకపోతే దీని చర్మాన్నయినా తీసుకురండి. ఆ చర్మాన్ని దర్భలపైన పరచుకొని మిమ్మల్ని గూర్చి ధ్యానం చేసుకుంటాను.

నాథా! మిమ్మల్ని ఇట్లా ఆజ్ఞాపించినట్లుగా మాట్లాడటం తప్పే. ఏ స్త్రీ కూడా భర్తను ఇట్లా ఇబ్బంది పెట్టకూడదు. ఆ విషయం నేను ఎరుగుదును. కానీ ఈ లేడిపై కలిగిన వ్యామోహం వల్ల ఉచితానుచితాల్ని పాటించలేకుండా ఉన్నాను.

బంగారం రంగులో ఉన్న దాని దేహకాంతి, కొమ్ములకు వ్రేలాడుతున్న ఇంద్రనీలమణులు, నక్షత్రాల్లాగా తెల్లగా వెండి మచ్చలు చూసి రాముడు కూడా ఆశ్చర్యపోయాడు. రాముడు కూడా ఆ లేడిపై మక్కువ చూపాడు. దానికి తగ్గట్టు సీత కూడా కావాలంటోంది. మళ్ళీ ఒకసారి దాని వంక చూశాడు. తప్పకుండా దాన్ని పట్టుకొని పెంచుకోవాలనుకున్నాడు. వెంటనే లక్ష్మణునితో ఇలా అన్నాడు: "సోదరా! ఈ అందమైన లేడి తనకు కావాలని సీత నన్ను కోరింది. ఇంతకు పూర్వం నేను కూడా ఇంత అందమైన లేడిని చూడలేదు. మళ్ళీ ఇంకోటి చూస్తామో లేదో! అందుకని సీత కోసం ఆ లేడిని బంధించి తీసుకురావాలని ఉంది. ఇటువంటివి నందనోద్యానవనంలోకాని, చైత్రరథంలోకాని ఉంటాయని నేననుకోను. ఈ భూమిపై కూడా రెండోది ఉందో లేదో తెలియదు. అది ఆవులిస్తే మండే మంటలు బైటకు కనిపిస్తున్నాయి. దాని నాలుక మేఘాలలోని మెరుపులాగా ఉంది. దాని పొట్ట శంఖంలాగా ఉంది. దాని మూతి ఇంద్రనీలమణుల్తో చేసిన గిన్నె బోర్లించినట్లుంది. ఇటువంటి అద్భుతమైన దివ్యరూపాన్ని చూసి ఎవరు మాత్రం ఆశపడకుండా ఉండగలరు?

"లక్ష్మణా! రాజులు వినోదం కోసం, మాంసం కోసం అడవుల్లో జింకల్ని వేటాడుతూ ఉంటారు. ఈ వేటకు రావడం వల్లనే అరణ్యాల్లో ఉండే రత్నాలు, మాణిక్యాలు, బంగారం వంటి విలువైన వస్తువుల్ని సంపాదించుకొని తమ ధనాగారాల్లో చేర్చుకుంటారు. లక్ష్మణా! శుక్రునికి తలచుకున్నంతమాత్రానే సమస్త సంపదలూ చేకూరినట్లు, రాజులు కూడా ఈ లోకాలను, ధనసారాన్ని సమకూర్చుకొని తమ కోశాగారాన్ని వృద్ధి చేసుకుంటారు.

"లక్ష్మణా! తనకు ఈ వస్తువు కావాలి అని అనుకునేవాడిని 'అర్థి' అంటారు. వేరే వ్యాపకాలన్నీ వదిలేసి ఆ వస్తువు కోసమే పనిచేసి సంపాదించటాన్ని 'అర్థము' అని నీతిశాస్త్రజ్ఞులు, అర్థశాస్త్రజ్ఞులూ కూడా అంటారు. అట్లా సంపాదించుకున్నవాణ్ణి అర్థసంపాదనాపరుడు అన్నారు. లక్ష్మణా! నేను ఈ మృగచర్మాన్ని విడిచిపెట్టను. దీని చర్మం అందంగానే కాదు, కదలీమృగ చర్మం కన్నా, ప్రియకమృగ చర్మం కన్నా, ప్రవేణీమృగ కన్నా మెత్తగా ఉంటుంది. నేను దీని చర్మాన్ని సంపాదించి దీని బంగారు చర్మం పైన నేను ఈ సన్నటి నడుముగల సీతతో కూర్చుంటాను. ముల్లోకాలూ వెదికినా ఇంత కాంతివంతమైన, మృదువైన చర్మాలు రెండే కనిపిస్తాయి. ఒకటి ఆకాశంలో మృగశీర్ష తారా మృగమూ, రెండవది ఈ మహారణ్యంలో ఉన్న ఈ లేడిచర్మం మాత్రమే.

"లక్ష్మణా! నువ్వు ఈ లేడి మారీచుడి మాయ అని అంటున్నావు. అట్లా అనుకున్నా కూడా దీన్ని చంపడమే మన కర్తవ్యం. మారీచుడు దుష్టుడు, క్రూరుడు, ఘాతుకుడు. వాడు ఇప్పటికే అనేకమంది మునిపుంగవుల్ని చంపి తిన్నాడు. ఒక్క మునుల్నే కాదు, వేటకోసం వచ్చిన రాజుల్ని అనేకమందిని పొట్టనపెట్టుకున్నాడు.

"లక్ష్మణా! పూర్వకాలంలో ఈ అరణ్యంలో వాతాపి అనే రాక్షసుడు ఉండేవాడు. వాడు తాపసులను, బ్రాహ్మణోత్తములను మోసం చేసి వాళ్ళ కడుపులో దూరేవాడు. ఆ తరువాత వాళ్ళ కడుపులు చీల్చుకుంటూ బయటకు వచ్చి వాళ్ళ మాంసాన్ని తింటూ ఉండేవాడు. ఒకానొకనాడు, మహాతపస్వి అయిన అగస్త్య మహర్షికి ఆహారమై ఆయన పొట్టలో నుండి బయటపడలేక తిప్పలు

పడుతూ ఉంటే, ఆ మహర్షి నవ్వుతూ “ఓ వాతాపీ! ఇంతకాలం నువ్వు అనేకమంది మునీశ్వరులను పొట్టన పెట్టుకున్నావు. ఈనాడు నిన్ను నేను పొట్టన పెట్టుకున్నాను. దీంతో ఈనాటి నుండే నీ ఆట కట్టు” అని వాతాపిని జీర్ణం చేసుకున్నాడు. దాంతో లోకానికి వాడి పీడ విరగడైపోయింది.

“లక్ష్మణా! ధర్మాన్ని ఆచరించేవాణ్ణి జితేంద్రియుణ్ణి అయిన నన్ను అతిక్రమించి ఈ లోకంలో ఎవడూ బ్రతికి బట్టకట్టలేడు. అగస్త్యుడు వాతాపిని మట్టుపెట్టినట్లు నేను ఈ మారీచుణ్ణి చంపేస్తాను. తమ్ముడూ నీవు కవచం ధరించి, ధనుస్సు చేతబట్టుకో. సీతను జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉండు. సీత ఆ లేడి మీద మోజుపడింది. నేను ఆమెకు దాని చర్మాన్ని తెచ్చి ఇస్తానని చెప్పాను. కాబట్టి ఆ లేడి ఇక జీవించి ఉండదు. ఆ లేడి చర్మాన్ని తెచ్చి సీతకిస్తాను. నీవు అతి జాగ్రత్తగా ఉంటూ సీతను కనిపెట్టుకొని ఉండు. నేను త్వరగా వచ్చేస్తాను.

తమ్ముడా! మనకు హితుడు, మహాబలశాలి అయిన జటాయువును కూడా నీతో తోడుగా ఉంచుకో. ఎందుకంటే జటాయువు ఆకాశంలో నుండి నాలుగు వైపులా చూస్తూ, నీకు చేదోడు వాదోడుగా ఉండగలదు. నేను త్వరలోనే వచ్చేస్తాను.”

# 44వ సర్గ రాముడు మారీచుణ్ణి వధించడం

రాముడు సోదరుడైన లక్ష్మణుణ్ణి సీతకు రక్షణగా ఉంచి ఖడ్గాన్ని నడుముకు కట్టుకున్నాడు. ధనుస్సు చేత ధరించాడు. అంబులపొదిని భుజాన వేసుకొని తన వైపు వస్తున్న రాజాధిరాజైన ఆ రాముణ్ణి చూసి లేడి రూపంలో ఉన్న మారీచుడు భయపడిపోయాడు. లేడి రూపంలోని మారీచుడు రాముణ్ణి మోసం చేస్తూ దూరంగా పారిపోయాడు. రాముడు దాన్ని వెంబడిస్తూ దాని వెనుకనే పరుగెత్తాడు. ధనుస్సు ధరించి ఉన్న ఆ రాముడికి కొద్దిసేపు ఆ లేడి తన కళ్ళ ఎదుటనే మెదలు తున్నట్లుంది. ఇంతలోనే దూరంగా అరణ్యంలోకి పరుగెత్తుతున్నట్లు కనిపించేది. ఒక్కో సమయంలో రాముడికి బాణం వేస్తే పట్టుబడుతుందనే భ్రమ కలిగించేది. కానీ ఇంతలోనే మాయమైపోయేది. ప్రాణరక్షణ కోసం ఆకాశంలోకి దూకుతున్నట్లు కనపడేది. మేఘాల్లో వెనుక దాక్కున్న శరత్కాల చంద్రమండలంలాగా కొన్ని చోట్ల కనిపిస్తూ, కొన్ని చోట్ల కనిపించకుండా ఉండేది.

లేడి రూపంలో ఉన్న మారీచుడు దగ్గరలో ఉన్నట్లే కనపడి క్షణాల్లో మాయమయ్యేవాడు. ఆ విధంగా రాముణ్ణి భ్రమపెడ్తూ ఆశ్రమం నుండే చాలా దూరం తీసుకువెళ్ళాడు. రాముడిలో సహనం నశించింది. కోపం వచ్చింది. చాలాదూరం రావటాన అలసిపోవటంతో ఒక చెట్టు నీడన కూర్చున్నాడు. ఇంతలో ఇతర లేళ్ల గుంపుతో కలసి పచ్చిక మేస్తూ ఆ లేడి కనిపించింది. రాముడు తన్ను ఎక్కడ పట్టుకుంటాడోనని, అతడికి దొరకకుండా పరుగెత్తింది.

అప్పుడు శత్రుసంహారకుడు, మహాబలశాలి అయిన రాముడు కోపంతో సూర్యకిరణంలాంటి బాణా నొకదాన్ని తీసి, సర్పంలాగా బుసలుకొట్టే బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. వజ్రాయుధంలాంటి ఆ బాణం మారీచుడు గుండెల్లో గుచ్చుకొని గుండెలు పగలకొట్టింది. అంతే! ఆ మారీచుడు లేడి దేహాన్ని వదలి పర్వతం లాంటి శరీరంతో తాటి చెట్టంత ఎత్తు ఎగిరి నేలమీద పడ్డాడు. ఆ చివరి క్షణాల్లో తాను ఇప్పుడు ఏం చేయాలా అని

తీవ్రంగా ఆలోచించాడు. సీతను వదలి లక్ష్మణుడు కూడా ఇక్కడకు వచ్చేట్లు చెయ్యాలి. అప్పుడే కదా సీత ఒంటరిదై రావణుడు అపహరించేందుకు వీలుగా ఉంటుందని అనుకున్నాడు.

అంతట మారీచుడు, రాముడి కంఠస్వరంతో సమానమైన స్వరంతో "హా! సీతా! హా! లక్ష్మణా" అని అరిచాడు. ఇట్లా అరుస్తూనే పర్వతంలాంటి శరీరంతో నేలపై దొర్లుతూ చచ్చాడు.

భయంకరాకారంతో ఆ రాక్షసుడు చచ్చి నేలపై పడుండటం చూసిన రామునికి, లక్ష్మణుని మాటలు గుర్తుకువచ్చాయి. అంతలోనే సీత జ్ఞాపకం వచ్చింది. "ఇది మారీచుడి మాయేనని లక్ష్మణుడు ముందుగానే చెప్పాడు. ఆ మాటే సత్యం అయింది. నేను చంపింది మారీచుణ్ణే! ఈ రాక్షసుడు 'అయ్యో సీతా! అయ్యో లక్ష్మణా!' అంటూ మోసపూరితంగా అరుస్తూ చచ్చాడు. దీని వెనుక వీడి దురుద్దేశం ఏమిటి? నాకు ప్రాణాపాయమన్న భ్రమతో సీతను విడిచి లక్ష్మణుడు కూడా రాడు గదా?" అన్న ఆలోచన రాగానే రాముడి ఒళ్ళు జలదరించింది. ఆ రాక్షసుడు అచ్చం తన గొంతుకతోనే అరవడం వల్ల రాముడిలో భయమూ, ఆందోళనా పట్టుకున్నాయి. అంతట రాముడు మరొక చుక్కల లేడిని చంపి, దాని మాంసాన్ని తీసుకొని ఆశ్రమం వైపు బయలుదేరాడు.

# 45వ సర్గ లక్ష్మణుడు, రాముని వద్దకు వెళ్ళటం

తన భర్త దీనమైన కంఠంతో రక్షణ కోరుతూ తన పేరు, లక్ష్మణుడి పేరు ఉచ్చరించటం వల్ల సీత మనస్సు వ్యాకులం చెందింది.

సీత: లక్ష్మణా! సహాయం కోరుతూ బిగ్గరగా అరచిన రాముడి గొంతు విన్నావు కదా! త్వరగా వెళ్ళి రామునికి ఏమైందో తెలుసుకో. నాకు మనసు మనసులో లేదు. రాముణ్ణి చూసేదాకా నా ప్రాణాలు నిలవ్వు. అయ్యో! ఎద్దు సింహాల పాలిట పడ్డట్లు నీ సోదరుడు రాక్షసుల బారినపడ్డాడు. ఎన్ని కష్టాల్లో ఉన్నాడో! తమ్ముడవైన నీ రక్షణ కోరుతూ "హా లక్ష్మణా" అన్నాడు. త్వరగా వెళ్ళు.

సీత ఇంతగా విలపిస్తున్నా లక్ష్మణుడు మారుపలుకలేదు; అక్కడ నుండి కదలనూ లేదు. అతడి మనస్సు శరీరం కూడా రాముడు పలికిన "సీతను జాగ్రత్తగా కనిపెట్టి ఉండు" అన్న ఒక్క మాట మీదనే నిశ్చలమై ఉన్నాయి. లక్ష్మణుడు మారుపలకకుండా అక్కడే ఉండటంతో కుపితురాలై మళ్ళీ ఇట్లా అంది.

సీత: లక్ష్మణా! కష్టాల్లో ఉన్న నీ అన్నగారికి సహాయంగా వెళ్ళమంటే ఎందుకు వెళ్ళడం లేదు? అంటే నీవు రాముడికి మిత్రుడు లాగా కనిపించే శత్రువువి. నాకు నీ అంతర్యమేమిటో బోధపడింది. నీకు నాపై ఆసక్తి ఉండటం చేత రాముడి మరణాన్ని కోరుకుంటున్నావు. అందువల్లనే రాముడి దగ్గరకు వెళ్ళనంటున్నావు. రాముడికి కష్టం కలగటమే నీకు ఇష్టం. నీకు నీ అన్నగారిపై ప్రేమ లేదు. అందువల్లనే నిశ్చలంగా కూర్చున్నావు. నువ్వు రాముడికి సేవలు చేస్తాననే మాతోబాటు అడవులకు వచ్చావు. కానీ ఈ రోజున అటువంటి రాముడు ప్రాణాపాయ స్థితిలో ఉంటే 'నాకు రక్షణ' కల్పిస్తానంటూ ఇక్కడే కూర్చోవటంలో అర్థం లేదు. నీవు వనాలకు వచ్చింది రాముణ్ణి రక్షించడానికేగాని, నన్ను రక్షించడానికి కాదు.

లక్ష్మణుడు: ఓ సీతా! దేవతలుగాని, దానవులుగాని, గంధర్వులు గాని, సర్పాలుగాని రాముణ్ణి జయించలేరు. ఇది సత్యం. మంగళప్రదమైన ఓ దేవీ! నువ్వు ఈ విధంగా మాట్లాడటం తగదు. రాముడూ లేక, నేనూ లేక ఈ అరణ్యంలో నిన్ను ఒంటరిగా వదలి వెళ్ళడం నాకు ఇష్టం లేదు. రాముణ్ణి ఎవరూ జయించలేరు. రాముణ్ణి గూర్చి భయపడటం మానెయ్యి. మనస్సు కుదుటపరచుకో. రాముడు ఆ రాక్షసుణ్ణి చంపి త్వరలో నీ దగ్గరకు వస్తాడు.

మనం విన్నది నిజంగా రాముడి కంఠం కాదు. ఎవరో మాయావి అన్నగారి గొంతును అనుకరిస్తూ అరచిన అరుపు. ఆ మారీచుడు మాయావి. వాడి మాయలు కూడా ఐంద్రజాలకుడి మాయల్లాగానే ఉంటాయి. అమ్మా! మహాత్ముడైన రాముడు నిన్ను జాగ్రత్తగా కనిపెట్టి ఉండమని నాకు చెప్పి వెళ్ళాడు. అందుచేత నీవు నా దగ్గర తాకట్టులో ఉన్నట్లుగా నా భావన. అన్నగారు రాగానే వారి సొత్తైన మిమ్ము వారికి క్షేమంగా అప్పజెప్పాలి.

సీతా! ఈ జనస్థానంలో మనం ఖరుణ్ణి చంపి యుద్ధంలో జయించిన దగ్గర నుండి తక్కిన రాక్షసులంతా మనపై పగబూని ఉన్నారు. మాయోపాయాలు, కుట్రలు, కుతంత్రాలు వాళ్ళకు వెన్నతో పెట్టిన విద్య. వారు అనేక రకాలైన మాటలను, అరుపులను అనుకరించగలరు. నీవు విచారించవద్దు.

సీత (కోపంతో కళ్ళు చింత నిప్పులయ్యాయి): నీవు ఈ కులంలో చెడబుట్టావు. క్రూరుడవవుతున్నావు. దుర్బుద్ధులు పుడుతున్నాయి. నీ మనసులో రాముడికి పెద్ద ఆపద రావాలనే కోరుకుంటున్నావు. ఇది స్పష్టంగా తెలుస్తూనే ఉంది.

ఓ లక్ష్మణా! నీవు పయోముఖ విషకుంభానివి. నీకు నాపై దురుద్దేశం అయోధ్యలోనే పుట్టి ఉండి ఉండాలి. ఇప్పుడు రాముడు ఆపదలో చిక్కుకున్నాడని తెలిసినా, నేను చెవిలో ఇల్లు కట్టుకొని పోరుతున్నా నిమ్మకు నీరెత్తినట్లు నిబ్బరంగా కూర్చున్నావంటే, ఆ అభిప్రాయం సరి అయినదేనని నమ్మకం కలుగుతోంది.

లక్ష్మణా! నా మాట కూడా విను. అటువంటి దుర్బుద్ధి నీలో ఉంది, లేదా నీవు భరతుడు కలసి చేసిన పన్నాగమైనా కావచ్చు. బుద్ధిపూర్వకంగానే రాముణ్ణి అంతం చేయాలనే మీ ఆలోచన నెరవేరినా, నేను మాత్రం నీకు దక్కను. నీ ఎదుటే ప్రాణాలు విడుస్తాను. రాముడు లేని ఈ భూమిపై క్షణమైనా జీవించను. ఇది సత్యం.

సీత మాటలు వింటున్న లక్ష్మణుడు నిలువెల్లా ఒణికిపోయాడు. కాళ్ళూ చేతులూ ఆడలేదు. జీవచ్ఛవంలాగా చేతులెత్తి నమస్కరిస్తూ ఇట్లా అన్నాడు.

లక్ష్మణుడు: తల్లీ! నీకు బదులు చెప్పను. ఎందుకంటే నీవు దైవసమానురాలవు. ఇటువంటి నిందాపూర్వకమైన మాటలు ఆడవాళ్ళకు సహజమే. స్త్రీలు ధర్మాన్ని వదలి చంచల స్వభావంతో ఎప్పుడు ఏది తోస్తే అది మాట్లాడుతూ ఉంటారు. అప్పుడు, తాము తలచుకొన్న పని ఏదో విధంగా జరిగిపోవాలనుకుంటారు. అంతేకాని ఆ మాటల్లోని ధర్మాధర్మాలను, మంచిచెడులను, ఉచితానుచితాలను గూర్చి ఆలోచించరు. ఈ స్వభావం అన్ని లోకాల్లోనూ ఒకే మోస్తరుగా కనిపిస్తుంది. స్త్రీలు ధర్మం వదలిపెడ్తారు. చంచల స్వభావులు. క్రూర హృదయులు. ఇప్పుడు నీవు అన్న మాటలు ఎర్రగా కాలిన ఇనుప బాణాలతో నా చెవుల్లో గుచ్చినట్లుంది. ఇటువంటి మాటలు నేను సహించలేను. నీవు మాట్లాడిన మాటలన్నీ కూడా కఠినమైనవి. పంచభూతాలు, వనాలలో సంచరించే దేవతలు అంతా వింటూనే ఉన్నారు. వారంతా నాకు సాక్షులుగా నిలుస్తారు. నేను అన్నగారి ఆజ్ఞను జవదాటలేదు. ఆ కారణంగా నీవు నన్ను ఇట్లా సందేహిస్తున్నావు. స్త్రీలంతా ఈ విషయాల్లో దుష్టులే. సహజంగానే వారి బుద్ధి దుష్టమైనది. ఇప్పుడే నేను రాముడి దగ్గరకు పోతున్నాను. ఇకపై ఈ వనదేవతలే నిన్ను కాపాడాలి. నాకు అన్నీ దుశ్శకునాలే కనిపిస్తున్నాయి. నేను రాముడితో తిరిగి వచ్చి నిన్ను చూడగలనో లేనో నాకు తెలియదు.

లక్ష్మణుడి మాటలకు సీతాదేవి తీవ్రంగా స్పందించి "ఓ లక్ష్మణా! రాముడు రాకపోతే నేను గోదావరిలో దూకుతాను. లేదా ఉరివేసుకుంటాను. లేదా పర్వతంపై నుండి దూకి

చచ్చిపోతాను. నేను రాముణ్ణి తప్ప పరపురుషుణ్ణి కాలితో కూడా తాకను" అన్నది.

ఈ విధంగా లక్ష్మణుణ్ణి తీవ్రంగా నిందిస్తూ చేతుల్తో కడుపు బాదుకుంటూ ఏడ్చింది. తరువాత లక్ష్మణుడు దుఃఖించుచున్న సీతాదేవిని ఓదార్చి, ఆమెకు నమస్కరించి, వెనక్కి తిరిగి మళ్ళీ మళ్ళీ చూస్తూ రాముని దగ్గరకు బయలుదేరాడు.

# 46వ సర్గ రావణుడు సన్న్యాసి వేషంలో సీత వద్దకు వెళ్ళటం

సీత పరుషమైన మాటలు మాట్లాడటంతో లక్ష్మణుడు కోపంతో రాముడు దగ్గరకు బయలుదేరాడు. ఈ సమయం కోసమే కాచుకుని కూర్చున్న రావణుడు సన్న్యాసి వేషంలో ఆశ్రమంలోకి ప్రవేశించాడు. ఒంటి మీద కాషాయవస్త్రాలు ధరించాడు. తల అంతా జటలు కట్టి ఉన్నాయి. దండకమండలాల్ని ఎడమ భుజానికి తగిలించుకున్నాడు. కాళ్ళకు పావుకోళ్ళు వేసుకున్నాడు. చేతిలో గొడుగు ఉంది.

సూర్యాస్తమయం అయింది. సంధ్యచీకట్లు అప్పుడే కమ్ముకుంటున్నాయి. రామలక్ష్మణులిద్దరూ ఆశ్రమంలో లేరు. నెమ్మదిగా సీతాదేవి వద్దకు వెళ్ళాడు. చంద్రుణ్ణి వదలిపోయిన అంగారక గ్రహంలాగా అమాయకురాలైన సీతను చూశాడు.

ఆ క్రూరాత్ముణ్ణి చూసీ చూడటంతోనే అడవిలోని వృక్షాలన్నీ భయంతో ఊగిపోయాయి. గాలివీచడం ఆగిపోయింది. వేగంగా పరుగులు పెట్టే గోదావరి వేగాన్ని తగ్గించింది.

రామలక్ష్మణులు లేని ఆ ఆశ్రమంలోకి రావణాసురుడు సన్న్యాసి రూపంలో శనీశ్వరుడు చిత్రానక్షత్రాన్ని చేరినట్లు సీతాదేవి వద్దకు వెళ్ళాడు. గడ్డిగాదంతో కప్పబడిన దిగుడు బావిలాగా, ఆ పాపాత్ముడు శుభకరమైన సన్న్యాసి వేషాన్ని ధరించాడు. ఆ బ్రాహ్మణ వేషంలో రాముడి భార్య అయిన సీతాదేవిని చూశాడు.

పున్నమి చంద్రుడులాంటి ముఖం, తామర రేకులవంటి కన్నులు, మల్లె మొగ్గల్లాంటి పలువరుస, దొండపండు లాంటి పెదవులు, పసుపు పచ్చని పట్టుచీర ధరించి ఉన్న సీతాదేవిని రావణుడు చూశాడు. ఆమె తన పర్ణశాలలో భర్తను తలచుకుంటూ ఏడుస్తోంది. అపవిత్రమైన మనస్సుతో, పవిత్రమైన బ్రాహ్మణ వేషాన్ని ధరించాడు. వేదమంత్రాలు వల్లెవేస్తూ వచ్చాడు. ఉత్తమ స్త్రీ అయిన సీత పద్మంలేని లక్ష్మీదేవిలాగా ప్రకాశించింది. రావణుడు ఆమెతో ఇట్లు

అన్నాడు.

రావణుడు: బంగారువర్ణం గలదానా! పట్టువస్త్రాలు ధరించినదానా! పద్మాలవంటి ముఖం గలదానా! నీ వెవరవు? శుభకరమైన ముఖమూ, శ్రేష్ఠమైన కటిప్రదేశం గలదానా! నీవు పార్వతీదేవివా? వనదేవతవా? మంగళప్రదురాలైన లక్ష్మివా? అప్సరసవా? ఐశ్వర్యాధిష్ఠాన దేవతవా? లేక స్వేచ్ఛగా విహరించుచున్న రతీదేవివా?

నీ పలువరుసలు సమంగాను కొనదేలీ ఉన్నాయి. నీ నేత్రాలు విశాలంగాను, నిర్మలంగానూ ఉన్నాయి. కనుగ్రుడ్లు నల్లగా ఉన్నాయి. విశాలమైన నీ జఘనం బలిసి ఉంది. తొడలు ఏనుగు తొండలలాగా ఉన్నాయి. మణులు రత్నాలతో అలంకరించబడ్డ నీ స్తనాలు గుండ్రంగా ఉంటూ ఒకదానికొకటి కరచుకొని ఉన్నాయి. అప్పుడప్పుడూ కదలాడుతున్నాయి. బలిసిన ఈ స్తనాలు తాటిపండ్లవలె పెద్దవిగా ఉన్నాయి. నీ ముఖాన చిరునవ్వు అందంగా తాండవమాడుతోంది. విలాసంగా ఉన్న ఓ కాంతా! నీటి ప్రవాహం కట్టల్ని హరించినట్లు నా మనస్సును హరిస్తున్నావు. పిడికెడు నడుము గలదానా! నీ కేశపాశాలు చక్కగా ఉన్నాయి. స్తనాలు గుండ్రంగా, పెద్దవిగా ఉన్నాయి. నేను పుట్టిన తర్వాత భూమి మీద ఇంతటి అందగత్తెను చూడలేదు. ఈపాటి అందం దేవతల్లోగాని, గంధర్వుల్లోగాని, యక్షస్త్రీలలోగాని లేదు.

ముల్లోకాల్లోనూ కనిపించని అపురూపమైన సౌందర్యవతివై ఇంత చిన్నవయస్సులో ఈ అరణ్యాల్లో ఏ కారణం చేత నివసిస్తున్నావు? నిన్ను చూస్తూ ఉంటే నా మనసు కలత చెందుతోంది. నీవు ఇక్కడ ఉండవద్దు. ఇది క్షేమమైన చోటు కాదు. కామరూపులైన రాక్షసులు నివసించే జనస్థానం.

ఓ సుందరీ! పెద్దపెద్ద పట్టణాల్లో, మేడలు మిద్దెలు ఉండే ఇళ్ళల్లో ఉండదగ్గదానివి. ఈ అరణ్యం ఎంత మాత్రం నీకు తగిన చోటు కాదు. శ్రేష్ఠమైన వస్త్రాలు, పుష్పమాలలు, ఆహారం, శ్రేష్ఠుడైన భర్త నీకు లభించాలి.

శ్రేష్ఠమైన కటి ప్రదేశం గలదానా! నీవు ఎవరవు? రుద్రులకుగాని, మరుత్తులకుగాని, వసువులకుగాని సంబంధించినదానవా? నిన్ను నేను దేవతా స్త్రీవై ఉంటావని తలుస్తున్నాను. ఇది రాక్షసులు నివసించే ప్రదేశం. ఇక్కడికి దేవతలు గంధర్వులే రావటానికి భయపడ్తారు. నీవు ఎట్లా వచ్చావు? ఇక్కడ స్వేచ్ఛగా తిరిగే సింహాలు, పులులు, కోతులు మున్నగు మృగాలను చూస్తూ ఉంటే భయం కలగటం లేదా?

రావణుడు సీతాదేవిని ఈ విధంగా ప్రశ్నించగా, సీత బ్రాహ్మణ వేషంలో వచ్చిన రావణుణ్ణి చూసి, అతిథి సత్కారాలన్నీ చేసింది. కూర్చునేందుకు ఆసనం చూపింది. పాద్యం ఇచ్చింది. సౌమ్యుడుగా కనపడే ఆ సన్న్యాసితో "ఆహారం సిద్ధంగా ఉం" దని చెప్పింది. సామాన్యంగా ఒక బ్రాహ్మణునికి ఏ విధంగా అతిథి సత్కారాలు చేస్తారో అటువంటి ఉపచారాలన్నీ చేసింది.

సీత: ఓ బ్రాహ్మణుడా! ఇదుగో మునులు కూర్చునే ఆసనం. సుఖంగా కూర్చో. ఇదుగో పాద్యం. ఇవిగో ఫలాలు. నిదానంగా భోజనం చేయండి.

సీత ఈ విధంగా చాలా అమాయకంగా సకల అతిథి మర్యాదలూ చేస్తూ ఉంటే, రావణుడు మాత్రం ఈమెను బలాత్కారంగా ఎట్లా అపహరించటమా అని తలబ్రద్దలు కొట్టుకుంటున్నాడు. తన చావుకు తానే ముహూర్తం పెట్టుకుంటున్నాడు.

రామలక్ష్మణుల కోసం ఒళ్ళంతా కళ్ళు చేసుకొని చూస్తున్న సీతకు ఆకుపచ్చటి అరణ్యమే కనిపించింది కానీ, రామలక్ష్మణులు కనిపించలేదు.

# 47వ సర్గ రావణునికి సీత తన వృత్తాంతం చెప్పటం

సన్న్యాసి రూపంలో వచ్చి తనను గూర్చి అడిగిన రావణాసురుడు నిజంగానే ఎవరో తాపసికుడని సీత అనుకొంది. 'అతడు బ్రాహ్మణుడు. పైగా అతిథి. అడిగిన దానికి సమాధానం చెప్పకపోతే శపిస్తాడేమో' నని అనుకొంది. ఒక క్షణం బాగా ఆలోచించింది. చివరకు ఉన్నది ఉన్నట్లుగానే చెప్పాలనుకుంది.

సీత: ఓ బ్రాహ్మణోత్తమా! నేను మిథిలాధిపతి అయిన జనకుడి కుమార్తెను, రాముడి భార్యను. నా పేరు సీత. ఇక్ష్వాకుల వంశీయుడు, నాకు మామగారు అయిన దశరథ మహారాజు ఇంట్లో పన్నెండు సంవత్సరాలు సకల భోగాలు అనుభవించాను. ఈ భూమి మీద మానవులు ఎన్నెన్ని భోగాలు అనుభవించగలరో అవన్నీ నా మామగారింట్లో అనుభవించాను.

పదమూడో సంవత్సరంలో దశరథ మహారాజు రాముడికి పట్టాభిషేకం చెయ్యాలని అనుకున్నాడు. తన మంత్రులతోను, రాజులతోను ఆలోచించి, రాజ్యాభిషేకానికి ఏర్పాట్లన్నీ చేశాడు. నా అత్తగారైన కైకేయి పూర్వం నా మామగారి నుండి రెండు వరాలను పొంది ఉంది. ఆమె ఆ రెండు వరాలు ఇప్పుడు కావాలని పట్టుబట్టింది. ఆ రెండూ ఏమిటంటే, ఒకటి నా భర్త రాముడు అడవుల్లో పద్నాలుగు సంవత్సరాలు నివసించాలి, రెండవది తన కుమారుడైన భరతుడికి రాజ్యాభిషేకం చెయ్యాలి. నా అత్త కైకేయి తన పట్టువిడువలేదు. తన రెండు వరాలు తీర్చాల్సిందేనని పట్టుబట్టింది. కాదంటే, అన్నం నీరు ముట్టనంది. నా మామగారేమో సత్యాసంధుడు. ఎన్నడూ ఆడిన మాట తప్పిన వాడు కాదు. అయినా ఆమెకు ఆ రెండు వరాలకు బదులుగా కోరినంత ధనం ఇస్తానన్నారు. ఆమె కాదు కూడదంది. తన మాట నెగ్గకపోతే చస్తానంది.

అప్పటికి నా భర్త వయస్సు ఇరవై అయిదు సంవత్సరాలు. నా వయస్సు పద్దెనిమిది సంవత్సరాలు. నా భర్త గుణవంతుడు, సద్గుణవంతుడు, త్రికరణములందు

(మనోవాక్కాయాలందు) పరిశుద్ధమైనవాడు. ఆజానుబాహువు. అందరికీ శుభాలను, సంతోషాన్ని కలిగించేవాడు. నా మామగారు కైకేయి కిచ్చిన మాట చెల్లించాడు. ఫలితంగా నా భర్తకు రాజ్యాభిషేకం చెయ్యలేదు. నా భర్త తన తండ్రి మాటను సత్యం చెయ్యటం కోసం అడవుల్లో ఉండేందుకు సిద్ధపడ్డాడు. అందువల్ల మేము అడవుల్లో ఉంటున్నాం.

ఓ బ్రాహ్మణుడా! రాముడు ఇతరులకు దానం చేసేవాడే కాని ఇతరుల దగ్గర పుచ్చుకునేవాడు కాదు. అతడు ఎప్పుడూ సత్యమే మాట్లాడుతాడు. అసత్యం ఎన్నడూ మాట్లాడడు. అది ఆయన మతం. ఆ నియమాన్ని స్థిరంగా పాటిస్తాడు.

లక్ష్మణుడు రాముడికి సవతి తమ్ముడు. రాముడంటే అమితమైన ప్రేమ, భక్తి కలవాడు. అతడు రాముడికి యుద్ధంలోను, యుద్ధం లేని సమయాల్లో కూడా సహాయం చేస్తూ ఉంటాడు. ధర్మాన్ని ఎల్లప్పుడూ దృఢంగా ఆచరిస్తాడు. రాముడికి, నాకు సహాయం చెయ్యటానికి అరణ్యాలకు వచ్చాడు.

తరువాత జితేంద్రియుడైన రాముడు, జటలు నారచీరలు ధరించి అడవులకు వచ్చాడు. సత్యం, ధర్మం ఆచరించడమే వ్రతంగా పెట్టుకొని మేము ముగ్గురమూ అరణ్యాల్లో నివసించేందుకు వచ్చాం. నా భర్త మృగాల్ని వేటాడి మాంసం తేవడానికి వనానికి వెళ్ళారు. ఇంకొద్ది సేపట్లో వచ్చేస్తాడు. అట్లా ఒక్క క్షణం విశ్రాంతి తీసుకోండి. మీకు సమృద్ధిగా ఆహారాన్ని వండి వడ్డిస్తాను.

ఓ బ్రాహ్మణుడా! నీవు కోరినట్లు నా వృత్తాంతం అంతా చెప్పాను. నీ కులగోత్రాలేమిటి? ఈ దండకారణ్యంలో ఏం చేస్తూ ఉంటావు? ఈ అరణ్యంలో నీ సంచారానికి కారణం ఏమిటి?

రావణుడు: సీతా! నేను రాక్షస రాజైన రావణుడను. నా శౌర్యపరాక్రమాలకు దేవతలు, అసురులు, పన్నగులు కూడా భయపడిపోతారు.

ఓ దోషాలు లేనిదానా! నీ శరీరం పచ్చగా బంగారంలాగా మిసమిసలాడిపోతున్నది. పట్టుచీర ధరించి ఉన్న నిన్ను చూస్తూ ఉంటే నా భార్యల ముఖం చూడబుద్ధి పుట్టడం లేదు. నేను అనేకమంది స్త్రీలను అనేక ప్రదేశాల నుండి తెచ్చాను. నీవు నన్ను వివాహం చేసుకొని నాకు పట్టపురాణివిగా ఉండు. నే నుండే నగరాన్ని లంక అంటారు. అది సముద్రం మధ్యలో నిర్మించబడింది. అక్కడ సుందరమైన ఉద్యానవనాలెన్నో ఉన్నాయి. నీవు నాతో కలసి అక్కడ స్వేచ్ఛగా విహరించవచ్చు. ఇక్కడ అరణ్యాల్లో కష్టాలు పడాల్సిన పని ఉండదు. నీవు నా భార్యవైతే, నీకు సేవలు చేసేందుకు చక్కగా అలంకరించుకున్న ఐదువేల మంది దాసీలను ఏర్పాటు చేస్తాను.

సీత (కోపంతో) : నా భర్త రాముడు కదిలించటానికి వీలుకాని పర్వతం లాంటివాడు. దేవేంద్రుడి వంటి పరాక్రమం కలవాడు. క్షోభపెట్టటానికి అలవికాని సముద్రం వంటివాడు. రాముడు సర్వలక్షణ సంపన్నుడు. వటవృక్షంలాగా కోరిన వారందరికీ సుఖసంతోషాల నిచ్చేవాడు. మహా భాగ్యవంతుడు. రాముడు మహాబాహువు. విశాల వక్షఃస్థలం కలవాడు. నరులలో శ్రేష్ఠుడు. సింహంలాంటి పరాక్రమం కలవాడు. పూర్ణచంద్రుడి వంటి ముఖం కలవాడు. ఇంద్రియాల్ని జయించినవాడు. గొప్ప కీర్తి గల మహాత్ముడు. అటువంటి రామునికి నేను నీడలాంటి దాన్ని. అటువంటి రాముని యందే వ్రతం గలదాన్ని.

ఓ రావణా! నీవు ఒక నక్కలాంటివాడవు. నేను ఆడసింహాన్ని. నీవు నన్ను కోరటం అంటే మృత్యువును కౌగిలించుకోవటమే. సూర్యుని కాంతిలాగా నన్ను తాకనైనా తాకలేవు. రాముడి ప్రియురాలైన నన్ను కోరుతున్నావంటే, నీకు మరణం దగ్గరలోనే ఉందని తెలుస్తోంది. సింహం కోరలతోను పాము కోరలతోనూ ఆడుకోవాలని చూస్తున్నావు. నీకు మరణం తప్పదు. మందర పర్వతాన్ని చేతుల్తో ఎత్తాలని చూస్తున్నావు. కాలకూట విషాన్ని తాగి సుఖంగా నిద్రపోవాలనుకుంటున్నావు. రాముడి భార్యనైన నాపై ఆశపడుతున్న నీవు సూదుల్తో కళ్ళల్లో పొడుచుకున్నట్లుంటుంది. నాలుకను మంగలి కత్తితో కోసుకున్నట్లుంటుంది. రాముడి భార్యను

ఈ విధంగా అవమానిస్తున్న నీవు ఒక పెద్ద బండను మెడకు కట్టుకొని సముద్రాన్ని ఈదాలనుకొంటున్నావు. నువ్వు రాముడి భార్యను హరించాలని అనుకుంటే నిప్పును గుడ్డలో మూటకట్టుకొని వెళ్ళినట్లుంటుంది. రాముడి భార్యపై కన్నువేశావంటే, ఇనుప శూలాల మొనలపైన నడిచినట్లుంటుంది. సింహానికీ నక్కకూ ఎంత తేడా ఉందో నీకూ రాముడికీ అంత తేడా ఉంది. సముద్రాన్ని చిన్న పంటకాలువతో పోల్చినట్లుంటుంది. ఉత్తమమైన మద్యానికి, కుండ కడిగిన నీళ్ళకూ ఉన్నంత వ్యత్యాసం ఉంటుంది. సీసాన్ని బంగారంతో పోల్చినట్లుంటుంది. మంచి గంధాన్ని బురదతో పోల్చి చెప్పినట్లుంటుంది. ఏనుగుకు పిల్లికీ ఉన్న తేడా మీ ఇద్దరి మధ్యా ఉంటుంది. కాకికీ గరుత్మంతుడికీ ఎక్కడైనా పోలిక ఉంటుందా? నీటికాకిని నెమలితో పోలుస్తామా? గ్రద్దకూ, హంసకూ పోలికా? అటువంటి రాముడికీ నీకూ పోలికా?

ఒకవేళ నీవు నన్ను అపహరించినా, రాముని ప్రతాపం ముందు నిలబడలేవు. ఈగ మింగిన వజ్రంలాగా నన్ను జీర్ణం చేసుకోలేవు.

సీత రావణుడితో ఈ విధంగా ధైర్యంగా చెప్పి, పెనుగాలికి ఊగిపోయే అరటి చెట్టులాగా, వణికిపోయింది. మృత్యుదేవత వంటి రావణుడు వణికిపోతున్న సీతను చూసి ఆమెను మరింత భయపెట్టడానికి తన కులాన్ని, బలాన్ని ఇట్లా వివరించి చెప్పాడు.

# 48వ సర్గ రావణుడు తన పరాక్రమాన్ని వర్ణించి చెప్పడం

సీత మాటలు రావణుడికి కోపం తెప్పించాయి. కనుబొమలు చిట్లించాడు. పరుషంగా ఇట్లా అన్నాడు.

రావణుడు: సీతా! నేను పది తలలు గల దశకంఠునిగా ప్రసిద్ధి చెందినవాడిని. మహా పరాక్రమశాలి అయిన కుబేరునికి సవతి తమ్ముణ్ణి. మృత్యువుకు జనులు భయపడినట్లుగా, దేవతలు, గంధర్వులు, పిశాచాలు, పతగాలు, ఉరగాలు కూడా నన్ను చూసి భయపడి దూరంగా పారిపోతారు. నేను నా సవతి సోదరుడైన కుబేరునితో విభేదం వచ్చినప్పుడు యుద్ధం చేసి అతణ్ణి చిత్తుగా ఓడించాను. అటువంటి కుబేరుడు నాకు భయపడి తన నగరాన్ని వదలిపెట్టి హిమాలయ పర్వతాల్లో తలదాచుకొంటున్నాడు. నా పరాక్రమం చేత కుబేరుణ్ణి జయించి అతడి పుష్పక విమానాన్ని స్వాధీనం చేసుకొన్నాను. అందులో నా ఇష్టమైన చోటుకల్లా ఆకాశంలో ప్రయాణాలు చేస్తూ ఉంటాను.

సీతా! నాకు కోపం వస్తే దేవేంద్రుడు మున్నగు దేవతలంతా పారిపోతారు. నేను నిలబడ్డ చోటుకు వాయుదేవుడు కూడా రావటానికి భయపడతాడు. సూర్యుడు తన కిరణాలను నా కోసం చల్లగా ఉండేట్లు చేస్తాడు. నే నుండే చోట ఆకులు కూడా కదలటానికి భయపడతాయి. నదులు వాటి వేగాన్ని తగ్గించుకుంటాయి.

మంగళప్రదురాలా! ఇంద్రుని అమరావతి కంటే నా లంకానగరం ఎన్నో రెట్లు అందమైనది. నా నగరం సముద్రం మధ్యలో ఉంది. భయంకరమైన రాక్షసులు ఎల్లవేళలా కాపలా కాస్తూంటారు. నా లంకా నగరానికి చుట్టూ తెల్లటి ప్రాకారం ఉంటుంది. లోపల బంగారు మేడలున్నాయి. మణులు, రత్నాలు, వైడూర్యాలతో తోరణాలు కట్టి ఉంటాయి. నా నగరం అంతా ఏనుగులతోను, గుర్రాలతోను, రథాలతోను క్రిక్కిరిసి ఉంటుంది. ఎప్పుడూ మంగళవాద్యాలు మ్రోగుతూ ఉంటాయి. అక్కడ వృక్షాలు అన్ని కాలాల్లోను పుష్పాలు, ఫలాలను

ఇస్తూంటాయి. ఉద్యానవనాలన్నీ శోభాయమానంగా ఉంటాయి.

ఓ సీతా! నీవు నాతో కలసి ఆ పట్టణంలో నివసిస్తే ఇకపైన మానవ స్త్రీల గూర్చి ఆలోచించవు. దేవతలకు లభించే భోగాలన్నీ నీవు అనుభవిస్తావు. అటుపైన నీకు ఈ ఆయువు మూడిన రాముని గూర్చిన ఆలోచనే ఉండదు.

ఓ సీతా! రాముడు కావటానికి పెద్దకొడుకే అయినా పరాక్రమం లేనివాడు, అసమర్థుడూ కావటాన, దశరథ మహారాజు ఆ రెండు సమృద్ధిగా ఉన్న భరతుడికి రాజ్యం ఇచ్చాడు. రాముణ్ణి అడవులకు పంపాడు.

ఓ విశాలనేత్రాలు గల సీతా! రాముడు రాజ్యం పోగొట్టుకున్నవాడు. దీనంగా అడవులు పట్టి తిరుగుతున్నాడు. బొత్తిగా తెలివిలేనివాడు. ముని వృత్తిలో ఉన్నాడు. అటువంటివాడితో నీవు ఏం సుఖపడతావు? నేనంటావా! సకల రాక్షసులకు ప్రభువుని. నిన్ను చూసినప్పటినుండీ మన్మథుడు నన్ను వేధిస్తున్నాడు. కోరికను అణచుకోలేని వాడినై నీ దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చాను. నన్ను నీవు నిరాకరించడం న్యాయం కాదు. పూర్వం పురూరవుణ్ణి నిరాకరించి ఊర్వశి పశ్చాత్తాపం చెందింది. నీవు కూడా అట్లాగే పశ్చాత్తాపపడే పరిస్థితి తెచ్చుకోకు.

సీతా! రాముడు కేవలం మానవమాత్రుడు. యుద్ధంలో నా కాలి గోటికి కూడా సరిపోడు. నిన్ను వెతుక్కుంటూ వచ్చిన అదృష్టాన్ని కాలదన్నుకోవద్దు. నన్ను అంగీకరించి నువ్వు ధన్యవుగా; నన్నూ ధన్యుణ్ణి చెయ్యి.

రావణుడి మాటలకు సీత కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. జనశూన్యమైన ఆ కారడివిలో రాక్షస రాజుతో ఇట్లా అంది.

సీత: కుబేరుడు లోకాలందరిచేతా పూజింపబడుతున్నాడు. అటువంటి మహనీయుడికి సోదరుడవని చెప్పుకుంటూ ఇటువంటి నీచమైన మాటలు మాట్లాడటానికి సిగ్గుగా లేదా? నీవు

వట్టి క్రూరుడవు. దుర్బుద్ధులతోను, ఇంద్రియలోలుడవై ఉంటే నీ రాక్షసులు, రాక్షసరాజ్యం కూడా అంతరిస్తుంది. ఇంద్రుని భార్య శచీదేవిని అపహరించి అయినా జీవించవచ్చునేమోగాని, రాముడి భార్య అయిన నన్ను అపహరిస్తే అంతటితో నీ జీవితం సమాప్తం అయినట్లే. ఓరీ మూర్ఖుడా! అతిలోకసుందరి అయిన శచీదేవిని ఇంద్రుని వద్ద నుండి బలాత్కారంగా అపహరించుకొనిపోయి కూడా చాలాకాలం బ్రతికి ఉండవచ్చునేమోకాని, నా వంటిదానిని దూషించినా చాలు, నువ్వు అమృతం తాగినవాడవైనా సరే, నీకు మరణం తప్పదు.

## 49వ సర్గ సీతాపహరణం

రావణుడు: ఓ పిచ్చి సీతా! నేను ఎన్ని విధాలుగా చెప్పినా నీవు నా మాటలు చెవికెక్కించుకోవడం లేదు. మతి స్థిమితం లేనిదానవా? నీకు ఏమైనా కొద్దిపాటి వెఱ్ఱి ఉన్నదా? నా శౌర్యపరాక్రమాల గూర్చి నీకు ఎన్ని చెప్పినా వినిపించుకోవడం లేదు. ఆకాశంలో నిలబడి భూమిని రెండు చేతులతో పైకి ఎత్తి చూపనా? సముద్రంలో నీళ్ళన్నీ త్రాగేయనా? నేను యుద్ధరంగంలో నిలబడితే ఆ మృత్యువును కూడా చంపుతాను. సూరుణ్ణి కదలకుండా చేస్తాను. బాణాలతో భూమిని బ్రద్దల కొడతాను. నేను ఏ రూపం కోరుకుంటే ఆ రూపాన్ని ధరించగలను.

ఓసీ! పిచ్చిదానా! నే నెవరో, నా శక్తి ఏమిటో నీకు తెలియకుండా ఉంది. నేను కోరినవన్నీ ఇవ్వగల సమర్థుణ్ణి. నేను కామరూపుణ్ణి. నేను ఏ రూపం కావాలనుకుంటే ఆ రూపాన్ని పొందగలను. చూడు నా నిజ స్వరూపం చూపిస్తాను.

అంతకు పూర్వం సౌమ్యంగా ఉన్న సన్యాసి రూపం పోయింది. యముని వంటి తన నిజరూపాన్ని పొందాడు. రావణుడి పది తలలూ, కోపంతో కూడిన ఇరవై కళ్ళు, ధరించిన బంగారు ఆభరణాలు చూసి సీత భయపడిపోయింది. నల్లగా మేఘంలాగా ఉన్నాడు. ధనుస్సు బాణాలు ధరించి ఉన్నాడు. మళ్లీ రావణుడు సీతతో ఇట్లా అన్నాడు.

రావణుడు: అందమైన కటి ప్రదేశం గలదానా! ముల్లోకాలలోనూ ప్రసిద్ధిగల భర్త కావాలని అనుకుంటే నన్ను కోరుకో. నేనే నీకు తగిన భర్తను. నీవు కూడా నన్ను భర్తగా అంగీకరిస్తే నాతోపాటు ముల్లోకాలలోనూ ప్రసిద్ధిని పొందుతావు. పదికాలాలపాటు నా సాహచర్యం నీకు లభిస్తుంది. నిన్ను కష్టపెట్టే పనులేవీ చేయను. పువ్వుల్లో పెట్టి పూజిస్తాను. నన్ను వరించు. మానవుడైన రాముణ్ణి మరచిపో.

తెలివిగలదానవని అనుకునే తెలివితక్కువదానవు. ఒక స్త్రీకి ఇచ్చిన మాటకోసం రాజ్యాన్ని

వదలిపెట్టాడు. అరణ్యాలు పట్టుకొని తిరుగుతున్నాడు. రాముడు ప్రయోజనం లేనివాడు; రాజ్యభ్రష్టుడు; అల్పాయుష్మంతుడు. అటువంటి రాముణ్ణి పట్టుకొని వ్రేలాడుతున్నావు. అందువల్ల నీవు నిజంగానే తెలివితక్కువదానవు. రాముడిలో ఏ మంచి గుణాలు చూసి ప్రేమిస్తున్నావు? నన్ను నిరాకరిస్తున్న నీవు ముమ్మాటికీ తెలివి తక్కువదానవే!

రావణుడు సన్న్యాసి రూపంలో ఉండగా చక్కగా మాట్లాడింది. అతిథి మర్యాదలన్నీ చేసింది. అందుకు కృతజ్ఞత చూపకపోగా, ఆకాశంలో బుధుడు రోహిణిని సమీపించినట్లు, రావణుడు సీతను పట్టుకొన్నాడు. రావణుడు పద్మాలవంటి నేత్రాలు గల సీతను ఎడమ చేత్తో ఆమె జుట్టును కుడి చేతితో ఆమె తొడలను పట్టుకొని లేవదీసుకొని వెళ్ళాడు. మృత్యుదేవతలాగా పెద్దపెద్ద కోరలతో, కొండంత శరీరంతో ఉన్న ఆ రావణాసురుణ్ణి చూసి వనదేవతలన్నీ భయపడ్డాయి. అంతలో మాయా నిర్మితమైన, గాడిదలచే పూన్చబడిన రథం అక్కడకు వచ్చి నిలబడింది. పరుషమైన మాటలు మాట్లాడుతూ, భయపెడ్తూ రావణాసురుడు సీతను తన ఒడిలో కూర్చోబెట్టుకున్నాడు. రావణుని చేతిలో చిక్కిన సీత దుఃఖంతో అడవి అంతా మారుమ్రోగినట్లుగా 'రామా! రామా!' అంటూ అరచింది. అతడిపై కోరికలేని సీత ఆడపాములాగా మెలికలు తిరిగిపోతూ విలవిలలాడింది. ఆమెను అట్లాగే పట్టుకుని రావణుడు రథాన్ని ఆకాశమార్గంలో పోనిచ్చాడు. ఆ విధంగా ఆకాశమార్గంలో హరించబడుతున్న ఆ సీత ఒళ్ళు తెలియని స్థితిలో పిచ్చి కేకలు వేసింది.

ఓ లక్ష్మణా! నీ అన్నగారి సంతోషమే నీ సంతోషం అనుకునేవాడవు. ఓ మహాబాహువులు గలవాడా! రావణుడు కోపంతో నన్ను అపహరించుకొనిపోతున్నాడు. నీకు ఈ సంగతి ఎట్లా చెప్పను? ఓ రామా! ధర్మంకోసం సుఖాన్ని, ప్రాణాన్ని అయినా త్యాగం చేస్తావే! ఇప్పుడు ఈ రాక్షసుడు అధర్మంగా నన్ను ఎత్తుకుపోతున్నాడు. నీకీ విషయాన్ని ఎట్లా చెప్పేది?

ఓ శత్రుసంహారకుడా! నీవు దుష్టులను శిక్షించేవాడవు కదా! మరి దుష్టుడైన ఈ రావణుణ్ణి ఎందుకు శిక్షించడం లేదు? ఓ రావణుడా! నీవు ఈ పాపకార్యానికి ఫలం

అనుభవించకుండా తప్పించుకోలేవు. విత్తిన పొలాలు కొంతకాలానికిగాని పంటలు రానట్లుగా, నీ పాపకర్మలకు కూడా కొంతకాలమైన తర్వాత ఫలితం అనుభవిస్తావు. రాముడు తప్పక నిన్ను వధిస్తాడు.

అయ్యో! కైకేయి, ఆమె బంధువులు కోరుకున్నది ఈనాడు నెరవేరింది. రాముని భార్యనైన నన్ను ఈ రాక్షసుడు ఎత్తుకొని పోతున్నాడే! ఈ సంగతి రాముడి కెవరు చెప్తారు. ఇక్కడ కొండగోగు చెట్లన్నీ మంచి పూత మీదున్నాయి. ఆ గోగు పూలను చెప్పమంటాను. "ఓ కొండగోగుల్లారా! రావణుడు నన్ను ఎత్తుకుపోతున్నాడని రాముడితో చెప్పిండి." అదుగో పూలతో సింగారించుకున్న ప్రస్రవణ పర్వత శిఖరాలు నన్ను చూస్తున్నాయి. "ఓ పర్వత శ్రేణుల్లారా! మీకు నమస్కారం చేస్తున్నాను. రావణాసురుడు సీతను ఎత్తుకుపోతున్నాడని రాముడితో చెప్పిండి." అవిగో హంసలు. గోదావరీ నది. "ఓ గోదావరీ! సీతను రావణాసురుడు ఎత్తుకుపోతున్నాడని రాముడితో చెప్పు. ఓ వృక్షాది వనదేవతల్లారా! రావణాసురుడు సీతను ఎత్తుకుపోతున్నాడని రాముడితో చెప్పండి. మీకు నమస్కారం చేస్తున్నాను."

ఓ మృగములారా! ఓ పక్షులారా! మిమ్ముల్నందరినీ శరణు కోరుతున్నాను. నా భర్త రాగానే "రామా! నీ ప్రియురాలైన సీతను రావణాసురుడు ఎత్తుకుపోయాడని చెప్పండి. నా భర్త, మహాబాహువు అయిన రాముడికి ఈ వార్త తెలిస్తే ఈ రావణుడే కాదు, మహేంద్రుడే నన్ను ఎత్తుకుపోయి స్వర్గంలోకాని, నరకంలోగాని ఎక్కడ దాచి ఉంచినా వాళ్ళను జయించి నన్ను విడిపించి తెచ్చుకుంటాడు.

ఈ విధంగా విలపిస్తున్న విశాల నేత్రాలు గల సీతకు అక్కడ ఒక చెట్టుకొమ్మన ఉన్న జటాయువు కనిపించాడు. రావణుడిచే బంధించబడి, భయంతోను, దుఃఖంతోను విలపిస్తున్న సీతకు జటాయువును చూడగానే ప్రాణం వచ్చినట్లయింది. దుఃఖంతో తొట్రుబడుతున్న కంఠంతో జటాయువును పిలుస్తూ బిగ్గరగా ఏడ్చింది. "ఓ జటాయుమా! పాపాత్ముడైన ఈ రావణుడు నన్ను అనాథను చేసి తీసుకొనిపోతున్నాడు. ఈ రాక్షసుడు క్రూరుడు. మహాబలవంతుడు. అనేక

యుద్ధాల్లో జయించినవాడు. ఆయుధాలతో ఉన్న దుర్మార్గుడు. కాబట్టి నీవు వీడితో పోట్లాడలేవు. ఓ జటాయువా! నన్ను ఈ రాక్షసుడు ఎత్తుకుపోయే విషయాన్ని రామలక్ష్మణులకు వివరంగా చెప్పు.”

# 50వ సర్గ జటాయువు రావణునకు ఉపదేశించటం

సీత ఆర్తనాదం జటాయువు చెవినపడింది. చెట్టు కొమ్మపై నుండి చూడగా సీత రావణాసురుడి రథంలో ఉండటం చూశాడు. ఈ ఆర్తనాదం సీతదేనని తెలుసుకున్నాడు. పర్వతాకారంలో, వాడి అయిన ముక్కుగల జటాయువు రావణాసురుడితో ఇట్లా అన్నాడు.

జటాయువు: ఓ రావణా! నేను సనాతన ధర్మాన్ని ఆచరించేవాడిని. సత్యవ్రతాన్ని పాటిస్తాను. మహా బలశాలినైన గృధ్రరాజును. నా పేరు జటాయువు.

దశరథుని కుమారుడైన రాముడు సకల లోకాలకు రాజు. ప్రజల సుఖసంతోషాలకోసం పాటుపడేవాడు. ఇంద్రవరుణులంత బలశాలి. నీవు ఇప్పుడు హరించుకొనిపోతున్న స్త్రీ ఆ రాముడి భార్య, సీత. మహా పతివ్రత.

ధర్మమార్గంలో ఉండే రాజు పరభార్యలపై ఆశపడకూడదు. మీదుమిక్కిలి సాటిరాజుల భార్యలను కాపాడాలి. ఇతరుల భార్యపై ఆశపడే నీచబుద్ధి వదులు. బుద్ధిమంతుడైన వాడు ఇతరులు నిందించే పనులు చేయరు గదా? తన భార్యను ఇతరులు తాకరాదని ఎలా అనుకుంటామో, అట్లాగే మనం కూడా ఇతరుల భార్యను తాకగూడదు. వాళ్ళను రక్షించాలి.

రావణా! ధర్మాన్ని గూర్చిగాని, అర్థాన్ని గూర్చిగాని, కామాన్ని గూర్చిగాని సందేహాలు వస్తే శాస్త్రాలను సంప్రదిస్తారు. ఆ శాస్త్రాలవల్ల కూడా సందేహాలు తీరకపోతే రాజును ఆశ్రయిస్తారు. ఆ విధంగా ధర్మార్థకామాలు మూడింటికీ రాజే నిధి వంటివాడు. ధర్మమైనా, పాపపుణ్యాలైనా వాటికి రాజే మూలాధారం.

ఓ రాక్షస నాయకుడా! నీవు పాపపు స్వభావం కలవాడవు. చపలుడవు. పాపాత్ముడికి స్వర్గానికి వెళ్ళేందుకు విమానం దొరికినట్లు నీకు రాజ్యాధికారం లభించింది. స్వభావాలు మారవు. దుష్టుల ఇళ్ళల్లో పుణ్యం ఎక్కువ కాలం ఉండదు. అంటే పాపాలను నివారించే పుణ్య

కార్యాలను చేయరు. అందువల్ల పాపస్వభావంలో నుండి బయటపడలేరు.

రాముడు ధర్మాత్ముడు. నీ పట్టణంలోగానీ, నీ రాజ్యంలోగానీ ఎటువంటి అపరాధమూ చెయ్యలేదు గదా! అటువంటి రాముడికి నువ్వు ఎందుకు అపరాధం తలపెడ్తున్నావు? రాముడు ఎంతటి కష్టమైన పనినైనా అనాయాసంగా చెయ్యగలడు. జనస్థానంలో రాముడు ఖరాసురుణ్ణి చంపాడని, నీవు ఇప్పుడు రాముడి భార్యను ఎత్తుకుపోతున్నానని అంటావా? అందులో రాముడి తప్పు ఏముంది? ఖరాసురుడు, శూర్పణఖను వెనకేసుకొచ్చాడు. అధర్మంగా తగాదా పెట్టుకున్నాడు. ఒక్కడి మీదకు పద్నాలుగు వేలమంది దండెత్తి వచ్చారు. అయినా రాముడు అందర్నీ సమర్థవంతంగా ఎదుర్కొన్నాడు. ఖరుడు మతిమీరి ప్రవర్తించాడు. మర్యాదను అతిక్రమించాడు. అందువల్ల రాముడి తప్పు ఏముంది? నీవే ధర్మంగా ఆలోచించు.

ఓ రాక్షసుడా! నా మాట విను. ఇప్పుడే సీతాదేవిని వదలి నీ దారిన నువ్వు పో. దేవేంద్రుడి వజ్రాయుధానికి వృత్రాసురుడిలాగా ఈమె నేత్రాగ్ని చేత నీవు బూడిద అయిపోతావు. ఘోర విషసర్పాన్ని చెంగున కట్టుకుని తిరుగుతున్నావు. అయినా తెలుసుకోలేకపోతున్నావు. నీ కంఠానికి కాలపాశం బిగుసుకున్నా గ్రహించలేకపోతున్నావు.

ఓ రాక్షసరాజా! ఎవరైనా తనను క్రుంగదీయనంత బరువునే మెడకు కట్టుకోవాలి. మోయలేని బరువు తలకెత్తుకుంటే కూలి పడిపోతావు. ఎంత రుచిగా ఉన్నా, మితిమించి తింటే రోగం తప్పదు. బుద్ధిమంతుడైన వాడు, ఏ పని ధర్మం కాదో అట్టి అధర్మం చెయ్యడు; ఏ పని చెయ్యడం వల్ల రాజ్యం నశిస్తుందో ఆ పని చెయ్యడు. ఏ పని వల్ల వృథాశ్రమయే తప్ప ఎట్టి లాభమూ ఉండదో అటువంటి పని చెయ్యరాదు.

ఓ రావణా! నేను పుట్టి అరవై వేల సంవత్సరాలైంది. మా తాతముత్తాతల నుండి వస్తున్న గృధ్రరాజ్యాన్ని ఏలాను. ముసలివాణ్ణయిపోయాను. నా దగ్గర ఏమీ ఆయుధాలు లేవు. నీవు కవచాన్ని ధరించావు. ధనుస్సు, బాణాలు, ఖడ్గం ధరించావు. నా కన్నా బాగా యౌవనంలో

ఉన్నావు. అయినా సీతాదేవి కోసం నా ప్రాణాలు అర్పించి అయినా నిన్ను అడ్డుకుంటాను. వేదప్రమాణాల విషయమై వేదవిదుడైన పండితుణ్ణి తర్కం చేత ఓడించలేరు. అట్లాగే నేను ఇక్కడ జీవించి ఉన్నంతవరకూ సీతాదేవిని నీవు అపహరించుకుపోవటానికి అంగీకరించను.

రావణా! నేను వయస్సులో ముసలివాణ్ణే అయినా, నిరాయుధుణ్ణే అయినా, సీతాదేవిని రక్షించడం అనే ధర్మంతో నీతో పోరాడుతాను. లేదంటావా; కొంచంసేపు ఆగు. రాముడే వస్తాడు. ఖరుడు మున్నగు రాక్షసులందరినీ పంపిన చోటుకు నిన్ను కూడా పంపుతాడు. రామలక్ష్మణు లిద్దరూ దగ్గర్లో లేరనీ, వాళ్ళు వచ్చే లోపుగా పారిపోవాలని చూస్తున్నావు. నీ ఆటలు సాగనివ్వను. నేను బ్రతికి ఉండగా రాముడి ప్రియురాలైన సీతాదేవిని నీవు ఎత్తుకుపోలేవు.

ఓ దశకంఠుడా! నాతో యుద్ధానికి సిద్ధంగా. నా శక్తికొద్దీ పోరాడుతాను. నా శక్తి ఏమిటో కూడా నీకు తెలిసివస్తుంది. నిన్ను రథం నుండి, తొడిమ నుండి పండును విడగొట్టినట్లు విడదీస్తాను.

# 51వ సర్గ రావణ, జటాయువుల యుద్ధం

జటాయువు చేసిన ధర్మోపదేశానికి రావణుడికి బాగా కోపం వచ్చింది. ఇరవై కళ్ళూ నిప్పులు చెరిగాయి. బంగారు చెవి కుండలాలు మెరుస్తూ ఉండగా రావణుడు జటాయువుని అడ్డు తొలగించుకోవాలనుకున్నాడు. జటాయువు కూడా రావణుడిపై కలియబడ్డాడు. వాళ్ళిద్దరూ గాలికి ఒకదానితో మరొకటి ఢీకొనే మేఘాల్లాగా ఉన్నారు; రెండు మాల్యవంత పర్వతాల్లా కనిపించారు. (ఒక మాల్యవంత పర్వతం మేరువుకు సమీపాన ఉంది. రెండవది దండకారణ్యంలో ఉంది)

మహాబలశాలి అయిన రావణుడు నాళీక బాణాల్ని, నారాచ బాణాల్ని, వికర్ణి బాణాలని జటాయువుపై వర్షంలా కురిపించాడు. పక్షిరాజైన జటాయువు వాడి అయిన గోళ్ళతో రావణాసురుణ్ణి బాధించాడు. తరువాత జటాయువును అంతం చెయ్యాలని నిశ్చయించుకున్న రావణుడు మృత్యువుతో సమానమైన పది బాణాల్ని వదిలాడు. ఆ పది బాణాలు చివర ఉక్కుతో చేసినవి. కొనలు బాగా మొనతేలి ఉన్నాయి. తిన్నగా ఎగిరేవి. అవన్నీ వెళ్ళి జటాయువు శరీరంలో గుచ్చుకున్నాయి. సీత జటాయువు ధైర్యంగా ఎదిరించి పోరాడటం చూస్తూ కన్నీళ్ళు పెట్టుకుంది. జటాయువు ఆ బాణాలను లెక్కచేయలేదు. వేగంగా రావణాసురుడి ధనుస్సును బాణాలనీ తన పాదాలతో విరగొట్టాడు. అంతట కృద్ధుడైన రావణుడు ఇంకో ధనుస్సు చేతిలోకి తీసుకున్నాడు. రావణుడు బాణాల వర్షం కురిపించగా వాటి మధ్యలో ఉన్న జటాయువు గూడులో ఉన్న పక్షిలాగా కనిపించాడు. ఆ జటాయువు ఆ బాణాలన్నింటినీ తన రెక్కల చేత చెదరగొట్టి కిందపడేట్లు చేశాడు. బాణాలు శరీరంలో గుచ్చుకొని బాధిస్తున్నా మహాబలశాలి అయిన జటాయువు కృద్ధుడై రెక్కలను మహావేగంగా విసురుతూ రావణుడి ధనుస్సును, బంగారు కవచాల్ని ధరించిన పిశాచ ముఖాలు కలిగి, రథానికి పూన్చబడిన గాడిదలను చంపివేశాడు. మణులచే అలంకరించబడిన రథాన్ని చక్రాల్ని, విరగ్గొట్టాడు. ఆ రథంతోపాటు రావణుడి శ్వేతఛత్రం, వింజామరలు కూడా విరిగి కిందపడ్డాయి. రథసారథిని తన ముక్కుతో పొడిచి

చంపాడు.

ఆ విధంగా రావణుడు ధనుస్సు, బాణాలు, కవచం, రథం, రథానికి పూన్చిన గాడిదలు, రథసారథిని నష్టపోయాడు. అప్పుడు ఒళ్ళో కూర్చోబెట్టుకున్న సీతతో సహా వచ్చి నేలమీద పడ్డాడు. రావణుడికి జరిగిన ఈ భంగపాటు ఆకాశం నుండి చూస్తున్న వారంతా “ఆహా! తగిన శాస్తి జరిగింది. శభాష్ జటాయూ!” అంటూ అభినందించారు. అప్పుడు అలసిపోయిన జటాయువు కొద్దిసేపు విశ్రాంతి తీసుకున్నాడు. ఇదే సమయమని తలచి, రావణుడు సీతతో సహా ఆకాశంలోకి ఎగురుతూ ప్రయాణం చేయసాగాడు. ఇది చూస్తున్న జటాయువు తిరిగి తాను కూడా ఆకాశంలోకి ఎగురుతూ రావణుణ్ణి ఎదుర్కొన్నాడు.

జటాయువు: ఓ అల్పబుద్ధిగలవాడా! రావణా! నీవు సీతను ఎత్తుకొనిపోతున్నావు. రాముడి బాణం వజ్రాయుధం కన్నా బలమైనదని తెలుసుకో. రామబాణం రాక్షసుల వినాశానికి దారితీస్తుందని తెలుసుకో. నువ్వు, నీ మంత్రులు, నీ స్నేహితులు, నీ బంధువులంతా ‘సీతాపహరణం’ అనే విషం కలిపిన పానీయాన్ని తాగుతున్నారు. గాలానికి కట్టిన మాంసపు ముక్కను మింగిన చేపలాగా ఇక నీకు మరణం తప్పదు. బుద్ధిహీనులు తాము చేసే పాపకర్మలకు ఎటువంటి ఫలం కలిగి నశిస్తారో అట్లాగే నీవూ నశిస్తావు.

ఓ రావణా! కకుత్థ్స వంశానికి చెందిన రామలక్ష్మణులు నీవు చేసిన పాపకృత్యాన్ని సహించి ఊరుకోరు. నువ్వు పిరికివాడవు. నీవు చేస్తున్న పని దొంగలు చేసేదేకాని, వీరులు చేసేది కాదు. నీకు వినాశకాలం దాపురించింది. కాబట్టే నీకు ఇట్లాంటి విపరీతబుద్ధి పుట్టింది. నీవు పాపానికి, అధర్మానికి ఒడికట్టావు. నిన్ను బ్రహ్మాది దేవతలు కూడా కాపాడలేరు.

పరాక్రమవంతుడైన జటాయువు ఈ విధంగా పలికి వీపుపై వేలాడు మావటివాడు ఏనుగును అంకుశంతో పొడిచినట్లు వాడి అయిన గోళ్ళతో రావణుని శరీరం అంతా గీరి ఒదిలాడు. ముక్కుతో పొడిచాడు. రెక్కలతో జుట్టంతా పీకాడు. ఈ బాధ భరించలేక రావణుడు

సీతను ఎడమ చంకలో ఉంచుకొని అరచేత్తో జటాయువును గట్టిగా కొట్టాడు. అప్పుడు జటాయువు రావణుని ఎడమ చేతి భుజం మీద ముక్కుతో గట్టిగా పొడిచాడు. దాంతో వాడి చెయ్యి విరిగి నేలపై పడింది. వెంటనే పుట్ట నుండి సర్పం బైటకు వచ్చినట్లు మరల బాహువులు మొలిచాయి. దాంతో రావణాసురుని కోపం కట్టలు తెంచుకుంది. సీతాదేవిని కిందకు దింపి జటాయువును పిడికిళ్ళతోను, కాళ్ళతోను తొక్కుతూ కుమ్మివేశాడు. రాక్షసరాజు, పక్షిరాజుల మధ్య యుద్ధం ఆ విధంగా కొంతసేపు కొనసాగింది. చివరగా రావణుడు ఖడ్గాన్ని చేతిలోకి తీసుకొని రామునికై పోరాడుతున్న జటాయువు రెక్కల్ని, పార్శ్వాలను, కాళ్ళను నరికివేశాడు. దాంతో జటాయువు కొనఊపిరితో నేలపైకి ఒరిగిపోయాడు.

ఆ విధంగా నేలపై పడి రక్తంతో తడిసి ఉన్న జటాయువు దగ్గరకు సీత పరుగెత్తుకొని వెళ్ళింది. నేలపై పడి ఉన్న జటాయువు తెల్లని వక్షఃస్థలంతో శాంతించిన దావాగ్నిలాగా ఉన్నాడు. అంతట చంద్రుని వంటి ముఖం కలిగిన సీత నేలపై మరణావస్థలో ఉన్న జటాయువును పట్టుకొని ఏడ్చింది.

# 52వ సర్గ రావణుడు, సీతను అపహరించటం

రాముడి ఆశ్రమానికి దగ్గర్లోనే జటాయువు ఆ విధంగా కొన ఊపిరితో నేలపైపడి కొట్టుకుంటూ ఉండగా, సీతాదేవి దగ్గరగా వెళ్ళి జటాయువును పట్టుకొని ఏడ్చింది.

ఓ రామా! రాబోయే సుఖదుఃఖాలను శకునాల ద్వారా మానవులు తెలుసుకొంటూ ఉంటారు. కన్నులు, భుజాలు అదురుతూ ఉంటాయి. పక్షులు అటూ ఇటూ తిరుగుతూ అరుస్తూ ఉంటాయి. ఇవన్నీ శకునాలే. రామా! నాకు ఇటువంటి కష్టం వచ్చిన సంగతి నీవు ఎరుగవు. ఇట్లాంటి శకునాల వల్లనయినా తెలుసుకోగలుగుతావా? అడవిలోని పక్షులు, మృగాలు నా గురించి చెప్పేందుకే నీ దగ్గరకు పరుగెత్తుకొని వస్తున్నాయి. నన్ను కాపాడాలని ఈ జటాయువు తన ప్రాణాలే ఇచ్చాడు. చావుబ్రతుకుల్లో నేలపై పడి ఉన్నాడు. దగ్గర్లోనే రామలక్ష్మణులున్నట్లుగా "ఓ రామా! రామా!" అంటూ బిగ్గరగా కేకలు పెట్టింది. ఆమె పుష్పమాలలు, అలంకారాలు నలిగిపోయాయి. వృక్షాన్ని తీగలాగా కరచుకొని ఏడుస్తోంది. అప్పుడు రావణుడు ఆమె దగ్గరగా పోయి "చెట్టు వదలిరా" అంటూ ఆమె కొప్పు పుచ్చుకొని లాగాడు. దాంతో వాడి ఆయుర్దాయం తీరినట్లైంది. తన ప్రాణాలు తీసుకోవడానికే ఆమె కొప్పు తాకాడా అని అనిపించింది.

ఆ రాక్షసుడు సీతాదేవిని అట్లా అవమానిస్తూ ఉంటే గాలి వీచడం మానేసింది. సూర్యుడు కాంతిహీనుడై వెలవెలబోయాడు. సమస్త జగత్తూ అజ్ఞానాంధకారంలో మునిగిపోయింది. అప్పుడు బ్రహ్మదేవుడు ఆ సీతాదేవిని దివ్యదృష్టితో చూసి 'ఆహా దేవకార్యం నెరవేరింది' అని అనుకున్నాడు. మహర్షులంతా దుఃఖించారు. రావణాసురుడి వినాశకాలం దగ్గరపడింది కదా అని సంతోషించారు. రామా! లక్ష్మణా! అని విలపిస్తున్న సీతను రావణుడు చంకన ఉంచుకొని ఆకాశమార్గాన ఎగిరిపోయాడు. అట్లా ఆమెను ఎత్తుకొని గాలిలో ఎగిరిపోతూ ఉంటే గాలికి రెపరెపలాడుతున్న ఆమె పమిటి చెంగు ఎగురుతూంటే రావణాసురుడు మండే పర్వతంలాగా కనిపించాడు. సీత కొప్పులో నుండి రాలిన పూలు రావణునిపై చల్లినట్లుంది. రాముడు లేని సీత

ముఖం కాడలేని పుష్పంలాగా వాడిపోయి ఉంది.

ఆకాశమార్గాన రావణుడు సీతను హరించుకుపోతూ ఉంటే, రాముడు పక్కన లేకపోవటం చేత పగటి చంద్రుడిలాగా ఆమె కాంతిహీనమై ఉంది. సీత కొప్పులో నుండి జారిపడిన పూలు నేలపై పుష్పవర్షమైంది. సీత తన తేజస్సుతో ఆకాశంలో పెద్ద అగ్నిపిండంలాగా ప్రకాశించింది.

అప్పుడు నేల మీద పులులు, సింహాలు, లేళ్ల గుంపులు గుంపులుగా సీత వెనుకే పరుగెత్తాయి. నదులు కన్నీరు కార్చాయి. పర్వత శిఖరాలు చేతులెత్తి విలపిస్తున్నట్లుంది. "రాముని భార్య అయిన సీతనే రావణుడు అపహరించుకుపోతూ ఉంటే ఇక ధర్మం ఎక్కడుంది? సత్యానికి స్థానం ఎక్కడ? మంచితనానికి చోటు ఎక్కడుంది?" అని అనుకుంటూ సమస్త భూతాలూ విలపించాయి.

అప్పుడు సీత 'రామా! లక్ష్మణా!' అంటూ విలపిస్తూ ఉంది. ఎక్కడైనా రామలక్ష్మణులు కనిపిస్తారేమోనని ఆశతో చూస్తోంది. అటువంటి సీతను రావణుడు తన వినాశానికే అపహరించుకుపోయాడు.

# 53వ సర్గ సీత, రావణుని నిందించడం

రావణాసురుడు సీతను ఆ విధంగా ఆకాశమార్గంలో తీసుకుపోతూ ఉంటే ఆమె భయపడ్డది; దుఃఖించింది; ఏడ్చింది. ఆమె కళ్ళు చింతనిప్పులా ఎర్రగా ఉన్నాయి. రావణాసురుణ్ణి ఇట్లా నిందించింది.

సీత: ఓరీ నీచుడా! రామలక్ష్మణులు లేని సమయం చూసి ఒంటరిగా ఉన్న ఆడదాన్ని దొంగతనంగా ఎత్తుకొనిపోతున్నావే! ఇటువంటి నీచమైన పని చేయడానికి నీకు సిగ్గువెయ్యడం లేదా?

ఓ దుష్టబుద్ధి గలవాడా! నన్ను అపహరించాలనే దురుద్దేశంతో మాయామృగాన్ని నీవే కల్పించావు. నా భర్త దూరంగా వెళ్ళేట్లుగా పన్నాగం పన్నావు. నా మామగారి స్నేహితుడైన జటాయువు నన్ను రక్షించటానికి వస్తే అతడిని కూడా నేలకూల్చావు.

రాక్షసాధమా! నిన్ను గూర్చి నీవే గొప్పలు చెప్పుకుంటున్నావు. రాముడితో యుద్ధంచేసి గెలవలేక పిరికివాడవై నన్ను దొంగతనంగా అపహరించుకొని పోతున్నావు. నీచుడా! ఒంటరిగా ఉన్న ఆడదాన్ని, పరస్త్రీని అపహరించుకొని పోవటం ఎంత నీచమైన పనో నీకు తెలియటం లేదా? అటువంటి నీచమైన పని చెయ్యటానికి నీకు సిగ్గు వెయ్యటం లేదా?

క్రూరుడా! గొప్ప శూరుడునని చెప్పుకుంటావు. నీవు చేస్తున్న పనులన్నీ ధర్మవిరుద్ధమైనవి. నీచమైనవి. ఇటువంటి పనులు చేసిన నిన్ను జనులు నిందించరా? ఇది నీ కులానికే మాయని మచ్చకాదా?

పిరికివాడా! మహావేగంగా వెళ్ళిపోతున్నావు. ఒక్క క్షణం ఆగితే ఎక్కడ రామలక్ష్మణులు ఎదురుపడ్తారేమోనని భయమా? రామలక్ష్మణుల కంటపడితే నిన్నూ, నీ సైన్యాన్ని కూడా మట్టి కరిపించగలరు. అరణ్యం కారుచిచ్చుకు లోనైనప్పుడు పక్షులు ఎట్లా విలవిల్లాడుతాయో, నీవు

కూడా రామలక్ష్మణుల బాణాలకు అట్లే విలవిల్లాడిపోతావు.

ఓ రావణా! ఇప్పటికైనా సమయం మించిపోలేదు. మంచితనంతో నన్ను విడిచిపెట్టు. రాముడు నిన్ను తప్పక క్షమిస్తాడు. కాదని మూర్ఖిస్తే నా భర్త సోదరునితో కలసి వచ్చి నీ ప్రాణాలు తీసి నన్ను దక్కించుకుంటాడు.

దేవతలతో సమానుడైన నా భర్తను చూడకుండా ఎక్కువ కాలం జీవించలేను. మరణ కాలం దాపురించినవాడు మంచిచెడులను తెలుసుకోలేడు. అందువల్లనే నీవు ఏది కీడో, ఏది మేలో తెలుసుకోలేకుండా ఉన్నావు. చావుకు సిద్ధంగా ఉన్నవాళ్ళకి ఆహారం రుచించదు. కనుక రావణా! భయపడవలసిన ఇట్టి స్థితిలో భయపడకపోవడం చూస్తూ ఉంటే నీవు బంగారు వృక్షాలను చూస్తున్నట్లున్నావు. (బంగారు వృక్షాలను చూసినవారు ఎక్కువ కాలం జీవించరని ప్రతీతి)

ఓ రావణా! మరణానంతరం నీవు నరకంలో రక్తప్రవాహంతో ప్రవహించే వైతరణీనదిని; భయంకరమై కత్తులు పరచి ఉన్న 'అసిప్రత వనాన్ని' చూడగలవు. ఆ నరకంలో బంగారు పుష్పాలు, వైడూర్యాల వంటి ఆకులున్న బూరుగ వృక్షాల్ని చూస్తావు. వాటి నిండా ఉన్న ఇనుపముళ్ళు నిన్ను తీవ్రంగా బాధిస్తాయి.

క్రూరుడవైన నీవు, రామునికి ఇటువంటి అపకారాన్ని చేసిన తరువాత, విషం త్రాగిన వాడివలె ఎక్కువకాలం జీవించవు. నీవు తప్పించుకోవటానికి వీలుకాని యమపాశం చేత కట్టివేయబడ్డావు. నువ్వు ఎక్కడకుపోయినా, నా భర్త నుండి తప్పించుకోలేవు.

ఏ రాముడు తాను ఒక్కడై పద్నాలుగువేలమంది రాక్షసుల్ని రెప్పపాటుకాలంలో చంపాడో, ఆ బలశాలి, మహావీరుడు సర్వశాస్త్రాలు తెలిసినవాడు అయిన రాముడు ప్రియురాలినైన నన్ను అపహరించిన నిన్ను ఊరక ఒదలుతాడా?

రావణుని ఒడిలో ఉన్న సీత ఈ విధంగా పరుషమైన వాక్యాలెన్నో పలుకుతూ, భయంతోనూ దుఃఖంతోను ఆవేశంతోను, శోకంతోను దీనంగా విలపించింది.

# 54వ సర్గ సీత, ఆభరణాలను జారవిడవటం

ఈవిధంగా విలపిస్తున్న సీతకు రక్షకులెవరూ లేకుండా పోయారు. ఇట్లా విలపిస్తూ ఉండగా మార్గంలో పర్వత శిఖరంపైన ఐదుగురు వానరశ్రేష్ఠులు కనిపించారు. వాళ్ళను చూడగానే వీళ్ళేమైనా రాముడికి తన విషయం చెప్పగలరేమోననే ఆలోచన వచ్చింది. వెంటనే తనపై ఉత్తరీయంలో తన నగలన్నీ ఒలిచి మూటగా కట్టి వారిమధ్య పడేట్లుగా జారవిడిచింది. రావణుని ధ్యాస అంతా త్వరగా లంకానగరానికి చేరటంపైనే ఉంది. అందువల్ల సీత నగల మూటను జారవిడవటం రావణుడు గమనించలేదు.

పచ్చని కళ్ళున్న ఆ వానరులు విలపిస్తూతున్న సీతను గుడ్లు అప్పగించి చూస్తూ నిలబడ్డారు. రావణుడు విలపిస్తున్న స్త్రీని తీసుకొని పంపానదిని దాటి లంకానగరం వైపుగా వెళ్ళడం చూశారు.

తనకు మృత్యుదేవత అయిన సీతను తీవ్రమైన కోరికతో, కోరలతో ఉన్న ఆడ విషసర్పాన్ని ఒడిలో పెట్టుకొని తీసుకొని వెళ్తున్నట్లుగా సంతోషంతో తీసుకుపోయాడు. ధనుస్సు నుంచి బయటపడ్డ బాణంలాగా నదులు పర్వతాలు దాటుకుంటూ ఆకాశమార్గాన పోయాడు. ఇంతలో తిమింగలాలకు, మొసళ్ళకు, నదులకు నివాసమైన సముద్రాన్ని దాటాడు. సీతతో సహా వస్తున్న రావణుణ్ణి చూసి సముద్రుడు కూడా గతుక్కుమన్నాడు. చేపలు మొదలైన జలచరాలన్నీ చేష్టలుడిగి స్తంభించిపోయాయి.

ఆకాశాన దేవతలు, చారణులు, సిద్ధులు జేరి “రావణుని అంతం ఆరభం అయింది” అనుకున్నారు. తన మృత్యువైన సీతాదేవిని చంకనబెట్టుకొని రావణుడు లంకానగరంలో ప్రవేశించాడు. ఆ పట్టణంలోని వీథులన్నీ తీర్చిదిద్దినట్లున్నాయి. జనంతో కిటకిటలాడిపోతున్నాయి. మయుడు మాయాజాలంతో నిర్మించిన రాజభవనంలో, శోకంతో అపస్మారక స్థితిలో ఉన్న సీతాదేవిని ఉంచాడు.

సుందరమైన పిశాచ స్త్రీలను పిలిచి తన అనుమతి లేకుండా స్త్రీలుగాని, పురుషులుగాని ఎవరూ లోపలకుపోయి సీతను చూడరాదని ఆదేశించాడు. కాపలా కట్టుదిట్టంగా ఏర్పాటు చేశాడు.

ఓ పిశాచాంగనలారా! మణులుగాని, బంగారంగాని వస్త్రాలుగాని, సీత ఏది కోరితే అది వెంటనే ఇవ్వండి. అప్రియమైన మాట ఒకటి కూడా ఎవరి నోట వెంటా రాకూడదు. అట్లా మాట్లాడారని తెలిస్తే వెంటనే మరణదండన విధిస్తాను.

ఈ విధమైన ఆదేశాలిచ్చి, రావణుడు బయటకు వచ్చాడు. ఇకపై తాను చేయవలసిన కార్యక్రమాల గూర్చి ఆలోచించడం మొదలుపెట్టాడు. మహా పరాక్రమవంతులు, నరమాంస భక్షకులు అయిన ఎనిమిది మంది వీరులను పిలిచి ఇలా చెప్పాడు.

రావణుడు: వీరులారా! మీరంతా వివిధ రకాలైన ఆయుధాలను తీసుకొని జనస్థానానికి వెళ్ళండి. పూర్వం ఖరుడు ఉంటూ మన కార్యక్రమాలు చేసేవాడు. ఖరుణ్ణి, పద్నాలుగు వేలమంది రాక్షసవీరులను రాముడు పొట్టనపెట్టుకున్నాడు. అందువల్ల జనస్థానం ఖాళీగా ఉంది. అట్లా ఖాళీగా ఉండటం నాకు ఇష్టం లేదు. మీరంతా జనస్థానంలో ధైర్యంతో ఉండండి. రాముడితో నాకున్న వైరం తీవ్రస్థాయికి చేరుకుంది. ఆ కారణంగా నాకు పూర్వం ఎన్నడూ కలుగనంత కోపం కలుగుతోంది. నా పగ చల్లారాలంటే, శత్రువును యుద్ధంలో సంపూర్ణంగా నాశనం చెయ్యాలి. అప్పటవరకూ నాకు నిద్రపట్టదు. రాముణ్ణి చంపిన తర్వాతనే దరిద్రుడికి ధనం దొరికినట్లు సంతోషపడతాను.

మీరు జనస్థానంలో నివసిస్తూ, రాముడి కదలికలన్నీ గమనిస్తూ ఉండండి. ఆ సమాచారాన్ని ఎప్పటికప్పుడు నాకు చేరవేయండి. మీరందరూ కూడా రాముణ్ణి చంపే ఈ యజ్ఞంలో పాలుపంచుకోవాలి. మీరు యుద్ధాల్లో ఇంతకుపూర్వం చూపిన శౌర్యపరాక్రమాలను గుర్తించి, ఇప్పుడు మిమ్మల్ని జనస్థానానికి పంపుతున్నాను.

తరువాత ఆ ఎనిమిదిమంది నరమాంస భక్షకులు రావణుని విలువైన సందేశాన్ని బాగా అర్థం చేసుకున్నవారై, రావణునికి నమస్కరించి మాయచేత ఎవరికీ కనిపించకుండా జనస్థానానికి వెళ్ళారు.

ఈ విధంగా రావణాసురుడు సీతను పొందాను గదా అని సంతోషిస్తూ, రాముడితో కయ్యానికి కాలుదువ్వాడు.

# 55వ సర్గ రావణుడు, సీతను తన భార్యవు కమ్మని కోరటం

రావణాసురుడు జమాజట్టిలాంటి ఎనమందుగురు నరమాంస భక్షకుల్ని జనస్థానానికి పంపి "ఆహా! నేను కృతకృత్యుడనయ్యాను గదా!" అని సంతోషించాడు. తరువాత సీతను గూర్చి ఆలోచిస్తూ, మన్మథ తాపానికి గురికావటం వల్ల ఉండబట్టలేక సీతను నిర్బంధించిన భవనానికి వెళ్ళాడు. అక్కడ సీత శోక సముద్రంలో మునిగి ఉంది. ఆమె చుట్టూ పిశాచ స్త్రీలు పరిచర్యలు చేయటానికి సిద్ధంగా ఉన్నారు.

అక్కడ సీత ముఖం అంతా కన్నీళ్ళతో చారలు కట్టి ఉంది. నడి సముద్రంలో తుపానుకు గురి అయిన ఓడలాగా ఉంది. గుంపు నుండి విడిపోయి, కుక్కల మధ్యనున్న ఆడలేడి లాగా ఉంది. తల మోకాళ్ళ మీద పెట్టుకొని నేలను చూస్తూ ఉంది. అటువంటి దీనావస్థలో ఉన్న సీత దగ్గరకు పోయి రావణుడు ఆమెను బలవంతంగా తీసుకొనిపోయి తన అంతఃపురాన్నంతా ఆమెకు చూపించాడు. అతడి అంతఃపురం మేడలతోను, ప్రాసాదాలతోను నిండి ఉంది. ఆ భవనాల్లో అనేక వేలమంది స్త్రీలున్నారు. రకరకాల పక్షులున్నాయి. ఆ ఇళ్ళల్లో స్తంభాలన్నీ వెండి, బంగారంతో చేసి రత్నాలు పొదిగారు. వాటన్నింటి మీదా నగిషీలు చెక్కి ఉన్నాయి.

అక్కడ మేలిమి బంగారంతో చేసిన ద్వారాలున్నాయి. అక్కడ కాలుపెట్టగానే దుందుభులతో కూడిన శ్రావ్యమైన సంగీతం వినబడింది. బంగారు మెట్లమీద నుండి సీతాదేవిని వెంటబెట్టుకొని పై అంతస్తుల్లోకి తీసుకువెళ్ళాడు. కిటికీలన్నీ వెండితోను, దంతాలతోను చేశారు. కిటికీలలో నుంచి చూస్తే చుట్టూ బంగారు మేడలు కనిపించాయి. నేలమీద అనేక దిగుడు బావులు, కోనేర్లు, వృక్షాలను సీతకు చూపించాడు. ఆ మనోహర భవనాన్ని అంతా చూపించి ఆ సంపదతో ఆమెను ప్రలోభపెట్టాలని ఆ పాపాత్ముడి పాపపు ఆలోచన.

ఓ సీతా! ఇక్కడ లంకలో పదికోట్ల మంది రాక్షసులున్నారు. వీళ్ళు కాక ఇంకో ఇరవై రెండు కోట్ల మంది రాక్షసులున్నారు. అందరూ క్రూరాత్ములే! వాళ్ళందరికీ నేను ప్రభువును. నా

రాజ్యం అంతా నీ అధీనం చేస్తాను. నా ప్రాణం నీ అధీనంలో ఉంచుతాను. ఎందువల్లనంటే నేను నిన్ను ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాను కనుక.

ఓ ప్రియురాలా! నాకు వేలకొద్దీ భార్యలున్నారు. వాళ్ళంతా ఉత్తమాంగనలు, జగదేక సుందరులు. వాళ్ళందరికీ నీవు పట్టపురాణివి అవుతావు. నా మాట విను. నీ మనసు కుదుటపరచుకో. మన్మథుడు నన్ను పీడిస్తున్నాడు. కామాగ్నితో కాలిపోతున్నాను. నన్ను అనుగ్రహించు. ఈ లంకా పట్టణమంతా నూరు యోజనాలుంటుంది. చుట్టూ సముద్రం. దేవాసురులు ఇద్దరూ కలసి వచ్చినా ఈ లంకా పట్టణాన్ని ముట్టడించలేరు. నాతో సరితూగే పరాక్రమవంతుడు ముల్లోకాల్లోనూ లేడు.

రాముడు రాజ్యం పోగొట్టుకున్నవాడు. దీనుడు. అన్నిటినీ మించి తాపసవృత్తిలో ఉన్నాడు. శౌర్య పరాక్రమాలుగాని, సైన్యబలంగానీ బొత్తిగా లేనివాడు. అటువంటి వాడితో నీవు ఏం సుఖపడతావు? ఓ సీతా! నీకు అన్ని విధాలా తగినవాడను నన్ను అంగీకరించు. నీవా మంచి యౌవనంలో ఉన్నావు. ఇహసుఖాలన్నీ దేహంతోనే అనుభవించాలి. యౌవనం శాశ్వతం కాదు. యౌవనం ఉండగానే నాతో సర్వసుఖాలు అనుభవించు.

సీతా! ఓ సుందరమైన చిన్నదానా! నీవు రాముడి గూర్చి ఆలోచించడం మానెయ్యి. నీవు ఇక్కడ ఉన్నది రాముడికి తెలియదు. ఒకవేళ తెలుసుకోగలిగినా ఈ సముద్రం దాటి నా లంకానగరంలో ప్రవేశించలేడు. మహాశక్తిమంతమైన పెనుగాలిని ఎవరైనా తాళ్ళతో బంధించగలరా? భగభగమండే మంటల్ని ఎవరైనా పట్టుకోగలరా? ఓ సుందరీ! నా అధీనంలో ఉన్న ఈ లంకా పట్టణంలోకి ప్రవేశించడం, నిన్ను తీసుకువెళ్ళడం అనేది ముల్లోకాల్లోనూ ఎవరికీ సాధ్యం కాదు. నువ్వు ఈ సామ్రాజ్యాన్ని అంగీకరించి నాకు మహారాణివిగా. దేవతలంతా నీకు పరిచారకులు అవుతారు. ముల్లోకాలూ నీ పాదాక్రాంతం చేస్తాను. నీవు మహారాణిగా పట్టాభిషేకం చేసుకో. సంతోషంగా నాతో సుఖించు. నువ్వు ఏ జన్మలోనో చేసిన పాపఫలంగా వనవాసం చేశావు. నిన్ను ఆ నరకం నుండి తప్పించి తీసుకొని వచ్చాను. దాంతో ఆ పాత చరిత్ర

మాసిపోయింది. నీ పుణ్యఫలాలు ఫలించడం ప్రారంభ అయింది. ఓ జనకపుత్రీ! మైథిలీ! ఈ దివ్య పుష్పమాలలు ధరించు. ఉత్తమమైన ఆభరణాలన్నీ ధరించు. నన్ను ప్రేమించు. నా జన్మ ధన్యంచెయ్యి. ఓ సీతా! నేను నా సవతి అన్నను ఓడించి పుష్పకవిమానాన్ని సంపాదించాను. అది సూర్యుని తేజస్సువలె ప్రకాశిస్తూ ఉంటుంది. ఎంతో విశాలమైనది. అందమైనది. ఓ సీతా! నీవు నేను ఆ విమానంలో సుఖంగా విహారయాత్రలు చేద్దాం. శ్రేష్ఠమైన కటిప్రదేశంగలదానా! నీ ముఖ సౌందర్యం పద్మాలలాగా అందంగా ఉంటుంది. చూడముచ్చటగా ఉంటుంది. ఇప్పుడు నీ ముఖం దుఃఖంచేత మలినమై ప్రకాశించడం లేదు.

రావణుని మాటలు వింటూ, స్త్రీలలో శ్రేష్ఠురాలైన సీత పమిటి చెంగుతో ముఖం కప్పుకొని కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. పరధ్యానంగా దీనురాలై వికలమైన మనస్సుతో కూర్చుని ఉంది. పాపాత్ముడైన రావణుడు మళ్ళీ ఇట్లా అన్నాడు.

రావణుడు: నన్ను భర్తగా అంగీకరించడం ధర్మవిరుద్ధమని అనుకోవద్దు. ఇటువంటి వివాహాన్ని ధర్మశాస్త్రం, ఋషులు కూడా అంగీకరించారు.

ఓ సుందరీ! సుందరమైన నీ పాదాలను తాకి నమస్కరించుచున్నాను. నేను మన్మథ బాధను భరించలేకుండా ఉన్నాను. కాబట్టి నీవు నన్ను త్వరగా అనుగ్రహించు. నీకు వశుడనై ఉంటాను. ఇంతవరకూ రావణాసురుడు ఏ ఒక్క స్త్రీకి తల ఒగ్గి నమస్కారం చెయ్యలేదు. కాబట్టి నీవు నన్ను తప్పక అనుగ్రహించు.

రావణుడు సీతతో ఇలా పలికి, యమునకు వశుడై పోవటంచే, "ఈమె ఇక నాకు చెందినదే" అని సంతోషించాడు.

## 56వ సర్గ సీత రామునిపై తన అచంచల ప్రేమను ప్రకటించటం

శోకంతో కృశించిపోయిన సీత రావణుని ప్రేలాపనకు ఏమాత్రమూ భయం లేకుండా, మధ్యలో ఒక గడ్డిపరకను ఉంచి ఇట్లా అన్నది.

సీత: దశరథ మహారాజు ధర్మాన్ని పరిరక్షించడంలో సేతువు వంటివాడనీ, సత్యసంధుడనీ జగమెరిగిన సత్యం. రాముడు అతని పుత్రుడు, ముమ్మూర్తులా సత్యసంధతలోనూ, ధర్మపరిరక్షణలోనూ తండ్రిని పోలినవాడే. ఈ విషయం ముల్లోకాలకూ తెలిసిన విషయమే. అంతేకాదు. రాముడు ఆజానుబాహువు. విశాలనేత్రుడు. అటువంటి రాముడే జన్మజన్మలకూ నాకు భర్త; నాకు దైవం. ఇక్ష్వాకుల వంశంలో పుట్టాడు. సింహం వంటి మూపు కలవాడు. గొప్ప తేజోవంతుడు. ఆ రాముడు తన సోదరుడైన లక్ష్మణునితో కలసి వస్తాడు. నీ ప్రాణాలు తీస్తాడు. నీవు నన్ను రాముడి సమక్షంలో అవమానించి ఉంటే ఈ పాటికే మర ణించి నేలకరచుకొని ఉండేవాడివి. ఇంకా నీకు భూమిపై నూకలుండబట్టి రాముడి సమక్షంలో ఈ కారుకూతలన్నీ కూయలేదు.

ఓ రావణా! నీ రాక్షసుల గర్వాన్ని గురించి ఏమేమో మాట్లాడావు. విను. నువ్వూ, నీ రాక్షసుల ధర్మమూ అంతా కూడా రాముని ముందు, గరుత్మంతుని ముందు సర్పాలు విషశూన్యం అయినట్లు, నిర్వీర్యులైపోతారు.

రామునిచే విడువబడిన బంగారు కొనగల బాణాలు, గంగా తరంగాలు తీరాన్ని కూలదోసినట్లు, నిన్నూ నీ సైన్యాన్నీ నేల కూలుస్తాయి. నీవు సురులను, అసురులను గెలువవచ్చునేమోగాని, రాముడితో విరోధం పెట్టుకొని ప్రాణాలు దక్కించుకోలేవు. నిన్ను యూప స్తంభానికి కట్టిన పశువులాగా కట్టి నీ జీవితాన్ని అంతం చేస్తాడు. నీ వింకా రోజులు లెక్కపెట్టుకొంటూ జీవించు. ఓరీ రాక్షసాధమా! రాముడు నిన్ను కోపంతో చూస్తేనే చాలు, ఆ కోపాగ్నికే శలభంలాగా మాడి చస్తావు. నా రాముడు తలచుకుంటే చంద్రుణ్ణి నేలకూల్చగలడు,

సముద్రాల్లో నీరు లేకుండా చేయగలడు. నిన్ను అంతం చేసి నన్ను విడిపించగలడు. నీ ఆయుస్సు మూడింది. నీ రాజ్యం నశిస్తుంది. నీ బలం నిర్వీర్యమైపోతుంది. నీ ఇంద్రియాలన్నీ నశిస్తాయి. నీవు చేసిన పాపపు పనికి లంక వైధవ్యం అనుభవిస్తుంది. అరణ్యంలో నా ధర్మాన నేను నా భర్తతో జీవిస్తున్నాను. అటువంటి నాకు భర్తృవియోగం కలిగించావు. నీవు చేసిన ఈ పాపపు కర్మకు, నీ కిక శుభఫలాలు ఏమీ దక్కవు. మరణమే నీకు శరణ్యం.

నా భర్త మహా తేజశ్శాలి. తన సొంత బలంపైన ఆధారపడి దండకారణ్యంలో ఒంటరిగా జీవిస్తున్నాడు. ఓ రావణా! నా భర్తకు ఎదురుపడినప్పుడు నీ శరీరంలో ఒక్క అంగుళం కూడా విడవకుండా రామబాణాలు చొచ్చుకుపోతాయి. దాంతో నీ మదం, గర్వం, అహంభావం నీతోపాటే నేలకూల్చగలడు. ప్రాణులు, పోయేకాలం దాపురించినప్పుడు, కాలానికి కట్టుబడి పొరపాట్లు చేస్తూ ఉంటారు. ఓ రాక్షసాధముడా! నీకు కూడా పోయేకాలం రావటంవల్ల, కాలప్రవాహానికి లోబడి నన్ను అవమానించి పొరపాటు చేశావు. అందుకు నీవు, నీ బంధుజనం, నీ రాజ్యంకూడా నాశనంకాక తప్పదు. బ్రాహ్మణుల మంత్రాలచే పవిత్రం చేయబడ్డ యజ్ఞశాలలో చండాలుడు ప్రవేశించరాదు. అట్లాగే రాముని భార్యను, పతివ్రతను అయిన నన్ను పాపాత్ముడవైన నీవు తాకరాదు.

ఓ రాక్షసాధమా! నిత్యమూ పద్మ సరోవరంలో పద్మాలతో విహరించే రాజహంస గడ్డిలో తిరిగే మాలకాకితో కలసి ఉండటానికి ఇష్టపడుతుందా?

ఓరీ అధముడా! ఈ శరీరం జడపదార్థం. అదే నీ కిష్టమనుకుంటే శరీరాన్ని బంధించవచ్చు. నాకు ఈ శరీరాన్ని కానీ ప్రాణాలను కానీ కాపాడుకోవాలని కోరిక లేదు. అయితే అపకీర్తి కలిగే పనిని మాత్రం చెయ్యను.

రావణుడు: ఓ సీతా! నీవు నన్ను ఎంత దూషించినా నీపై గల కోరిక చావటం లేదు. అందువల్ల నీకు పన్నెండు మాసాలు గడువిస్తున్నాను. బాగా ఆలోచించుకో. అయినా నీవు

మనస్సు నాపై మళ్ళించుకోకపోతే, గడువు తీరగానే నా వంటవాళ్ళు నీ మాంసంతో ఉదయాన నేను తినే అల్పాహారం చేసి పెడతారు.

సీతపై మిక్కిలి కోపించిన రావణుడు రాక్షస స్త్రీలతో ఇట్లా అన్నాడు.

"ఓ నరమాంస భక్షకులారా! మీరు చాకచక్యం అంతా ఉపయోగించి, ఈ సీత గర్వం అణిగేట్లుగా చేయండి. మీకు కూడా గడువుపెడ్తున్నాను. ఈ పన్నెండు నెలల్లో ఆమె నాదయ్యేందుకు మీ ప్రయత్నాలన్నీ చేయండి. మీరు ఈ సీతను అశోకవనంలోకి తీసుకువెళ్ళండి. అక్కడ ఆమెను సంరక్షిస్తూనే నయానా భయానా ఒప్పించేందుకు ప్రయత్నించండి. మీరంతా సీతను వనంలోని ఆడఏనుగువలె భయపెట్టే మాటలతోను, మంచి మాటలతోనూ లొంగదీసుకోండి."

వెంటనే ఆ రాక్షస స్త్రీలు సీతను అశోక వనానికి తీసుకువెళ్ళారు. అశోక వనంలో ఫలాలు, పుష్పాలు ఇచ్చే వృక్షాలు అనేకం ఉన్నాయి. ఆ చెట్ల నిండా మదించి ఉండే పక్షులు ఉన్నాయి. దుఃఖంలో ఉన్న సీత, ఆడలేడి పెద్దపులుల వశమైనట్లు, ఆ రాక్షస స్త్రీల వశమైపోయింది. త్రాళ్ళతో కట్టివేసిన ఆడలేడివలె, సీతాదేవికి ఆ అశోకవనంలో ఏమాత్రం సుఖంగా లేదు. వికృతమైన ఆ రాక్షస స్త్రీలు ఎక్కువగా భయపెట్టడం వలన భయపడిపోయింది. భయంతో స్పృహ కోల్పోయింది.

# 57వ సర్గ మాయా లేడిని చంపి రాముడు ఆశ్రమానికి చేరటం

బంగారు లేడి రూపంలో ఉన్న మారీచుణ్ణి చంపి రాముడు వెనక్కు తిరిగి ఆశ్రమానికి వస్తూంటే, వెనుక నుండి నక్కలు ఊళలు వేశాయి. రాముడు అదేదో అపశకునంగా తలచి తనలో ఇట్లా అనుకొన్నాడు.

‘అయ్యో! నేనిప్పుడు ఈ నక్క ఊళను వింటున్నాను. ఆశ్రమంలో జరగరానిదేదీ జరిగి ఉండదు గదా! సీత నెవరైనా రాక్షసులు భక్షించి ఉంటారా? సీత క్షేమంగా ఉండి ఉంటుందా?

ఈ మారీచుడు నా గొంతుకను అనుకరిస్తూ ‘హా లక్ష్మణా’ అని అరుస్తూ చచ్చాడు. ఆ కేక విని లక్ష్మణుడు, సీత బలవంతం చేయగా నా దగ్గరకు బయలుదేరి ఉండడుగదా? అదే జరిగి ఉంటే సీత ఆశ్రమంలో ఒంటరిగా ఉంటుంది గదా! అప్పుడు రాక్షసులెవరైనా వచ్చి సీతకు అపకారం తలపెట్టి ఉంటారా? అనుమానం నిజమే అయిందేమో? మారీచుడే బంగారు లేడి వేషం ధరించి నన్ను ఆశ్రమం నుండి దూరంగా తీసుకువెళ్ళాడు. అట్లాగే ఏదో కుట్ర ప్రకారమే ‘హా లక్ష్మణా’ అంటూ అరిచాడు. నేను ఆపదలో చిక్కుకున్నానని లక్ష్మణుణ్ణి కూడా ఆశ్రమం నుండి దూరంగా వెళ్ళేట్లు చేయడానికే అట్లా అరచి ఉంటాడు. బహుశా, ఇదంతా ఆశ్రమంలో సీతను ఒంటరిదాన్ని చేయటం కోసం వాడు పన్నిన పన్నాగమై ఉంటుంది.

జనస్థానం మూలంగా నాకు రాక్షసులతో వైరం ఏర్పడింది. నాకు అనేక భయంకరమైన దుశ్శకునాలు కనిపిస్తున్నాయి. దీనిని బట్టి అరణ్యంలో సీతాలక్ష్మణులు క్షేమంగా ఉండి ఉంటారా? ఈ విధంగా రాముడు మనస్సు పరిపరి విధాల పోతోంది.’ ఇట్లా ఆలోచిస్తూ ఉండగానే పక్షులు, మృగాలు దీనంగా చూస్తూ రాముడికి ఎడమ వైపు తిరుగుతూ ఘోరమైన ధ్వనులు చేశాయి. రాముడు ఈ శకునాలు చూసి పరుగులాంటి నడకతో ఆశ్రమంవైపు ప్రయాణం సాగించాడు. రాముడి మన స్సంతా సుందరమైన కటిప్రదేశం గల సీతపైనా, మహాబలశాలి అయిన లక్ష్మణుణ్ణి గూర్చియే ఆలోచించసాగింది. అట్లా కొద్ది దూరం పోగానే

దిగులుతో దుఃఖితుడై ఉన్న లక్ష్మణుడు, వ్యాకులతతో వస్తున్న రాముడు కలుసుకున్నారు. అప్పుడు అన్నగారైన రాముడు సీతను ఒంటరిగా వదలి ఎందుకు వచ్చావని లక్ష్మణుని నిందించాడు.

రాముడు: సౌమ్యుడా! లక్ష్మణా! నీవు సీతను విడచి ఇంతదూరం ఎందుకు వచ్చావు? సీత క్షేమంగా ఉంటుందా? అయ్యో! ఎంత చెడ్డపని చేశావు? లక్ష్మణా! నాకు అన్నీ అపశకునాలే కనబడుతున్నాయి. దీన్నిబట్టి సీత మరణించి ఉంటుందేమోనని భయపడుతున్నాను. లేదా రాక్షసులు భక్షించి ఉంటారు. సందేహం లేదు. లక్ష్మణా! జనకపుత్రిక అయిన సీతను ప్రాణాలతో చూస్తామంటావా? ఏమీ అపాయం జరిగి ఉండదు గదా?

మంటలు మండుతున్న దిక్కుగా చూస్తూ మృగాలు, నక్కలు, పక్షులు గుంపులు గుంపులుగా భయంకరమైన ధ్వనులు చేస్తున్నాయి. దీన్నిబట్టి రాజకుమార్తె అయిన సీత క్షేమంగా ఉంటుందా? అని భయంగా ఉంది.

ఆ మృగరూపంలో ఉన్న మారీచుడు నన్ను ప్రలోభపెట్టి చాలాదూరం తీసుకుపోయాడు. ఎట్లాగో దాన్ని చంపాను. చావగానే వాడు రాక్షసుడుగా మారిపోయాడు.

లక్ష్మణా! నా మనస్సు ఇప్పుడు వ్యాకులత చెందుతోంది. సంతోషం నశించిపోయింది. నా ఎడమ కన్ను కూడా అదురుతోంది. లక్ష్మణా! సీత ఆశ్రమంలో క్షేమంగా లేదు. రాక్షసులు సంహరించైనా ఉంటారు, లేదా మరణించైనా ఉంటుంది. నా మనస్సు ఏదో విపరీతమైన కీడును శంకిస్తోంది.

# 58వ సర్గ సీత ఆశ్రమంలో లేకపోవటం

ఆమహారణ్యంలో సీతను ఒంటరిగా వదలి వచ్చిన లక్ష్మణుణ్ణి చూసి వ్యాకులత చెందిన మనస్సు గలవాడైన రాముడు ఇలా అన్నాడు.

రాముడు: లక్ష్మణా! నేను దండకారణ్యానికి బయలుదేరేటప్పుడు ఒంటరిగా నన్ను విడిచి ఉండలేక నాతోపాటే అరణ్యవాసం చేయటానికి సిద్ధపడి వచ్చిన సీత ఎక్కడుంది? నీవు ఒంటరిగా ఆశ్రమంలో వదలి వచ్చిన సీత ఎక్కడుంది? నేను రాజ్యాన్ని పోగొట్టుకొని దీనంగా అడవులకు పోతున్న సమయంలో, నా కష్టాల్లో కూడా పాలుపంచుకుంటానని నాతో వచ్చిన ఆ సీత ఎక్కడుంది? నా ప్రాణానికి ప్రాణమైన నా ప్రియురాలు బ్రతికి ఉందా?

ఓ వీరుడా! లక్ష్మణా! దేవతవంటి ఆ సీత లేకుండా నేను ఒక్క క్షణం కూడా బ్రతుకలేను. నాకు ఎల్లవేళలా తోడునీడగా ఉండేది. ఆ సీత ప్రాణాలతో ఉందా? ఇప్పుడు ఎక్కడ ఉంది? బంగారు దేహచ్ఛాయతో, సన్నని నడుముతో ఉండే నా సీత లేకుండా భూలోకానికంతకూ పట్టాభిషిక్తుణ్ణిగా చేసినా, దేవలోకానికంతకూ ఆధిపత్యం ఇచ్చినా నాకు వద్దు. వాటి అన్నింటికన్నా నాకు సీతే ప్రియమైనది. ఓ సౌమ్యుడా! సీతలేని నా ఈ అరణ్యవాసం అంతా వృథాయే కదా? అటువంటి నా ప్రియురాలైన సీత బ్రతికే ఉందా? లక్ష్మణా! సీత లేకుండా మనం అయోధ్యకు తిరిగి వెళితే కైకేయి కళ్ళు చల్లపడతాయంటావా? సోదరా! ఇట్లా జరగాలని మన ముఖాన రాసి ఉందా ఏమిటి?

లక్ష్మణా! నేను సీత లేకుండా ఉండలేను. నేనూ మరణించడం ఖాయం. అటువంటప్పుడు మా అమ్మ కౌసల్యాదేవికి ఉన్న ఒక్క కొడుకునూ, రాజ్యాన్ని పోగొట్టుకొని సవతి అయిన కైకేయికి అణకువగా దాస్యం చేస్తూ బ్రతికే గతి పడుతుందంటావా? లక్ష్మణా! సీత బ్రతికి ఉంటేనే ఆశ్రమానికి వస్తాను. లేకపోతే నేనూ ఇక్కడే ప్రాణాలు వదులుతాను. ఆశ్రమంలో అడుగుపెట్టగానే గలగలా నవ్వుతూ పలకరించేది. అటువంటి సీత నాతో మాట్లాడేందుకు

ఆశ్రమంలో లేకపోతే నేను ఇంకా ఎందుకు బ్రతికి ఉండాలి? అటువంటి బ్రతుకుపై నాకు ఆశ లేదు. నేనూ మరణిస్తాను.

లక్ష్మణా! యథార్థం చెప్పు. సీత బ్రతికి ఉందా? లేదా! ఒంటరిగా ఏమరిపాటుగా ఉన్న నా సీతను ఏ రాక్షసుడైనా తినేసి ఉంటాడా? యథార్థంగా చెప్పు. నా సీత సుకుమారి. చిన్న వయస్సు, నన్ను విడిచి ఎన్నడూ ఉన్నది కాదు. అందుచేత నా వియోగాన్ని భరించలేక కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ ఉంటుంది. అన్నం నీరు ముట్టకుండా నా కోసం ఏడుస్తూ ఉంటుంది. ఇది సత్యం.

తమ్ముడా! ఆ మారీచుడు చచ్చిపోతూ "హా లక్ష్మణా" అంటూ అరిచాడు. ఆ అరుపు విని నువ్వూ భయపడి ఉంటావు. సీత కూడా నాకేదో అపాయం సంభవించి ఉంటుందని భ్రమపడి ఉంటుంది. ఆమె నిన్ను బలవంతంగా నా దగ్గరకు పోయి నాకు సహాయపడమని పోరుపెట్టి ఉంటుంది. ఆమె పోరు పడలేక నీవు నా దగ్గరకు పరుగెత్తుకొంటూ వచ్చావు. ఔనా?

లక్ష్మణా! ఆమె పోరు పెట్టిందిగదా అని నువ్వు కూడా దూరం ఆలోచించకుండా ఆమెను ఒంటరిగా వదిలేసి నా కోసం వచ్చావు? ఎంత కష్టం తెచ్చిపెట్టావురా తమ్ముడా! క్రూరుడైన రాక్షసులు మనపై ప్రతీకారం తీర్చుకోవటానికి చక్కని అవకాశం ఇచ్చాం గదా! నేను ఖరుణ్ణి చంపడం వల్ల రాక్షసులంతా దుఃఖంలో ఉన్నారు. వాళ్ళంతా క్రూరులు. నరమాంస భక్షకులు. వాళ్ళీపాటికి సీతను చంపి తినేసి ఉంటారు. సందేహం లేదు.

శత్రుసంహారకుడా! లక్ష్మణా! భగవంతుడు నా ముఖాన అన్నీ కష్టాలే రాసినట్లున్నాడు. అందువల్లనే ఇప్పుడు ఈ కష్టంలో చిక్కుకున్నాను. ఇప్పుడు నేను ఏం చెయ్యాలి? నాకు ఏమీ తోచకుండా ఉందే!

రాముడు అందమైనది, సన్నటి నడుముగలదీ అయిన సీతను గూర్చి ఆలోచిస్తూ, విలపిస్తూ లక్ష్మణుడితో కలసి పరుగులాంటి నడకతో జనస్థానాన్ని చేరాడు.

రాముడు దుఃఖంతో తమ్ముణ్ణి నిందిస్తూ, తన్ను తాను నిందించుకుంటూ ఆశ్రమంలోకి వెళ్ళాడు. ఒక ప్రక్క ఆకలి, దాహం మరో ప్రక్క అలసట చేత రాముడి ముఖం అంతా వాడిపోయి ఉంది. ఆశ్రమం అంతా జనశూన్యంగా ఉంది. ఇల్లంతా కలయచూశాడు. పిచ్చివాడిలాగా చూసిన గదిలోకే మళ్ళీ మళ్ళీ వెళ్ళి సీత కోసం వెతికాడు. సీత ఎక్కడా కనబడకపోవటం చేత, 'నేను అనుకున్నదంతా జరిగింది' అని అనుకుంటూ బిగ్గరగా విలపించాడు.

# 59వ సర్గ రామలక్ష్మణుల సంభాషణ

రాముడు తను చూస్తున్న దుశ్శకునాలను తలచుకుంటూ మనసు ఏదో కీడు శంకిస్తున్నా, సీతను చూడాలన్న ఆతురతతో ఆశ్రమం వైపుగా అడుగులు త్వరత్వరగా వేస్తున్నాడు.

రాముడు: తమ్ముడూ! నేను నిన్ను నమ్ముకొని సీతను వదలి వెళ్ళాను. అటువంటి నీవు సీతను ఒంటరిగా వదలి ఎందుకు వచ్చావు? లక్ష్మణా! సీత లేకుండా ఒంటరిగా వస్తున్న నిన్ను చూస్తున్నప్పుడే సీతకేదో కీడు మూడిందని సందేహించాను. నేను ఎంతో బాధపడుతున్నాను. నిన్ను దూరాన్నుంచి చూస్తున్నప్పుడే నా ఎడమ కన్ను అదిరింది. ఎడమ భుజం; ఎడమ గుండె అదిరాయి.

రాముడి కన్నా పదిరెట్లు దుఃఖిస్తున్న లక్ష్మణుడు రాముడి మాటలు విని ఇట్లా అన్నాడు.

లక్ష్మణుడు: అన్నా! నేను సీతాదేవిని ఒంటరిగా వదలి రావటానికి సుతరామూ ఇష్టపడలేదు. వదినగారు నన్ను అనరాని మాటలు అన్నది. నా హృదయాన్ని బద్దలుకొట్టే మాటలంది. శూలాల వంటి ఆ మాటలు విని కూడా నేను బయలుదేరకపోతే ఆమె చేస్తున్న నిందావాక్యాలకు ఇంకా బలమిచ్చినట్లవుతుందని భారమంతా వనదేవతలపై వదలి దిక్కుతోచని స్థితిలో నీ కోసం బయలుదేరాను. అంతేకాని, తల్లివంటి సీతాదేవిని వదలి బుద్ధిపూర్వకంగా రాలేదు.

"అయ్యో! సీతా! అయ్యో! లక్ష్మణా!" అని నీ గొంతుతో అరవడం వల్ల ఆమె నీ కేదో కీడు మూడిందని భయపడ్డది. ఆమె పెద్దపెట్టున ఏడుస్తూ నన్ను నీ దగ్గరకు పొమ్మని చెవిలో ఇల్లు కట్టుకొని పోరింది. మొదటగా, "అట్లా అరచింది అన్న కాదని, అన్న గొంతుతో ఎవరో రాక్షసుడు అరిచాడనీ" ఎంతగానో నచ్చచెప్పాను. రెండవది, నీ శౌర్యపరాక్రమాలు ఎరిగి ఉన్న నేను "అన్నగారికి ఎటువంటి ఆపదా రాదని" గట్టిగా చెప్పాను. ఆవిడకు బాగా నమ్మకం కలగటం

కోసం ఇంకా ఇట్లా చెప్పాను.

ఓ పూజ్యురాలా! రాముణ్ణి భయపెట్టిన రాక్షసుడు ఈ లోకంలో ఒక్కడు కూడా లేడు. ఇకముందూ ఉండబోడు. నీవు నిశ్చింతగా ఉండు. ఎవడో రాక్షసుడే రాముడి గొంతును అనుకరించి అరిచాడేకానీ, అది రాముడి గొంతులాగా లేదు. సీతా! రాముడేమీ సామాన్యుడు కాదు. దేవతలను కూడా రక్షించగల పరాక్రమవంతుడు. అంతేగాక, లక్ష్మణుడు రాముడికి చేదోడు వాదోడుగా ఉంటాడేకాని, రాముడెన్నడూ లక్ష్మణుడి సహాయాన్ని కోరడు. ఇదంతా మాయావులైన రాక్షసుల పన్నాగం. “ఓ లక్ష్మణా! కాపాడు” అని రాముడు ఎన్నడూ కోరడు. నీవు నిశ్చింతగా ఉండు. దుఃఖించవద్దు. మనస్సు కుదుటపరచుకోమని, పరిపరి విధాల చెప్పాను. యుద్ధంలో దేవేంద్రుడు కూడా రాముణ్ణి జయించలేరని కూడా నచ్చచెప్పెను.

ఈ విధంగా నేను ఎంత నచ్చ చెప్పినా ఆమె నా మాటలు నమ్మలేదు. ఒళ్ళు తెలియని ఆవేశంతోను, దుఃఖంతోను ఊగిపోతూ “ఓ లక్ష్మణా! నీ సోదరుడు మరణించిన తర్వాత నన్ను పొందాలనే పాపపు ఆలోచనలో ఉన్నావు. నేను మరణించటానికైనా సిద్ధపడతాను కానీ, రాముణ్ణి తప్ప మరెవరూ నన్ను తాకను కూడా తాకలేరు. రాముడు ఎంతటి కష్టంలో ఉండి నీ సహాయం కోరుతున్నాడో గదా! అటువంటి నీవు నేను కాళ్ళావేళ్ళాపడి బ్రతిమాలినా రాముడికి సహాయపడటానికి కదలడం లేదంటే, నీవు భరతుడు కలసి ఏదో కుట్ర పన్నుతున్నారని అర్థం అవుతోంది. నీవు అవకాశంకోసం ఎదురుచూస్తూ కూర్చున్న మిత్రరూపంలో ఉన్న శత్రువువి. రాముడికి కష్టం కలగటమే నీకు ఇష్టం. అందుకనే రాముడికి సహాయపడేందుకు వెళ్ళడం లేదు” అని తల, కడుపూ బాదుకుంటూ ఏడ్చింది.

అన్నా! సీతాదేవి మాటలకు నాకు కోపంకన్నా దుఃఖమే ఎక్కువ వచ్చింది. వెంటనే ఆశ్రమం వదలి బయటకు వచ్చాను.

రాముడు: లక్ష్మణా! నీవు సీతను విడిచి రావడం మంచిది కాదు. నా శౌర్యపరాక్రమాలు

తెలిసి కూడా సీత ఏదో అన్నదని ఆమెను ఒంటరిగా విడిచి రావడం సరి అయినది కాదు. నాకు ఏమాత్రమూ సంతోషాన్ని కలిగించడం లేదు. ఆమె కోపంలోనో, దుఃఖంచేతనో పరుషంగా మాట్లాడిందని ఒక అబలను ఒంటరిగా వదలివస్తావా? నీవు సీత కోపానికి ఆవేశపడ్డావే కాని, నా ఆజ్ఞను పాటించలేదు. నీవు పెద్ద తప్పు చేశావు.

లక్ష్మణా! మృగరూపంలో నన్ను చాలా దూరం తీసుకుపోయిన రాక్షసుడు నేను వేసిన బాణానికి చచ్చిపడ్డాడు. లేడి శరీరం పోయి రాక్షసాకారం వచ్చింది. వాడే ఏడుస్తూ, నా కంఠ స్వరంతో 'సీతా! లక్ష్మణా!' అని అరుస్తూ మరణించాడు. అది విన్న నీవు, సీత నిందించిందని ఆమెను ఒంటరిగా విడిచి వచ్చావు.

## 60వ సర్గ రాముడు సీతను తలచుకొని విలపించటం

ఆవిధంగా మాట్లాడుకుంటూ ఆశ్రమానికి వస్తూ ఉండగా రాముడి ఎడమ కన్ను అదిరింది. కాళ్ళు తడబడ్డాయి. శరీరంలోనుంచి ఒణుకు వచ్చింది. ఈ దుశ్శకునాలు చూచి సీతకేదో కీడు సంభవించి ఉంటుందని అనుకున్నాడు. దాంతో ఆమెను చూడాలన్న తపన ఇంకా ఎక్కువైంది. పరుగు పరుగున ఆశ్రమంలోకి వెళ్ళాడు.

ఆశ్రమం అంతా నిర్మానుష్యంగా ఉంది. పాడు పడినట్లుంది. తలుపులన్నీ బార్లా తెరిచి ఉన్నాయి. హేమంత ఋతువులో కమలాలు లేని కొలనులాగా బోసిపోయి ఉంది. పూలన్నీ రాలి పడున్నాయి. తుమ్మెదలు ఝుంకారాలు మాని వికార ధ్వనులు చేస్తున్నాయి. సీత లేదని తీగలు, పొదులు, మొక్కలు విలపిస్తున్నాయి. వన దేవతలు ఆశ్రమాన్ని ఖాళీ చేసి వెళ్ళిపోయారు. కృష్ణాజినాలు, దర్భలు, పీటలు, చాపలు చెల్లాచెదరుగా పడి ఉన్నాయి; ఇంట్లో ఇల్లాలు లేదని చెప్పకయే చెప్తున్నాయి. ఆశ్రమాన్ని అట్లా చూస్తున్నందుకు రాముడికి దుఃఖం ఆగలేదు.

సీతాదేవిని రాక్షసు లెవరైనా అపహరించుకొని పోయారా? చంపి తిన్నారా? ఏదైనా ఆపదలో చిక్కుకుందా? ఎక్కడైనా దాచిపెట్టారా? నీళ్లకోసం నదికేమైనా పోయిందా? పూలు పండ్లు సేకరించడానికి వెళ్ళిందా? ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పేందుకు అక్కడ ఎవరున్నారు? వృక్షాలూ, తలుపులూ, వాకిళ్లూ, పక్షులూ, మృగాలూ ఉన్నా అవి జవాబు చెప్పలేవు. రాముడు పిచ్చివాడిలాగా గోదావరిదాకా పరుగున వెళ్ళి చూసివచ్చాడు. చెట్టుచెట్టును పిల్చి అడిగాడు. విలపిస్తూ అడిగాడు. సీత మాత్రం కనపడలేదు. జాడ చెప్పేందుకు కూడా అక్కడ ఎవరూ లేరు.

రాముడు పిచ్చిపట్టినవాడిలాగా కదంబ వృక్షం దగ్గరకుపోయాడు. "కదంబ వృక్షమా! నీ పూలంటే నా భార్యకు చాలా ఇష్టం. నీవేమైనా ఆమెను చూశావా? చివరగా నీ దగ్గరకు ఎప్పుడు వచ్చింది?"

ఓ బిల్వవృక్షమా! నీ ఫలాలు కూడా నా ప్రియురాలి స్తనాలలాగానే అందంగా గుండ్రంగా ఉంటాయి. అటువంటి నా ప్రియురాలు సీతను చూశావా?

ఓ అర్జున వృక్షమా! నీవన్నా కూడా జనక మహారాజు కుమార్తెకు చాలా ఇష్టం. నీకేమైనా నా జానకి జాడ తెలుసా?

ఓ కుకుభ వృక్షమా! నా ప్రియురాలి తొడలు కూడా నీ బోదెలు వలెనే ఉంటాయి. అటువంటి మైథిలిని నీవు చూశావా? నీ చిగురుటాకులన్నా పూలన్నా సీతకు చాలా ఇష్టం. నిన్ను చూడటానికి ఆమె వచ్చి ఉంటుంది.

ఓ తిలకవృక్షమా! నీ వంటే నా ప్రియురాలికి ఎంతో ప్రేమ. నీ చుట్టూ ఎప్పుడూ తుమ్మెదలు పాడుతూ ఉంటాయి. ఆ తుమ్మెదల పాటలంటే నా ప్రియురాలికి ఇష్టం. ఆ పాటలు వినటానికి ఏమైనా వచ్చిందా?

ఓ అశోక వృక్షమా! నువ్వు దుఃఖించేవారి దుఃఖాలను పోగొడతావు. నా ప్రియురాలు కనబడక శోకంలో మునిగి ఉన్నాను. ఓ అశోకవృక్షమా! నా ప్రియురాలు ఎక్కడుందో చెప్పి నా దుఃఖాన్ని పోగొట్టు. నీ పేరును సార్థకం చేసుకో. ఓ తాలవృక్షమా! నీ పండ్లు నా ప్రియురాలి స్తనాలు ఓ మోస్తరుగా ఉంటాయి. కాబట్టి నీకు ఆమె గూర్చి తప్పక తెలిసి ఉంటుంది. నా మీద దయ చూపు. ఆమె ఎక్కడుందో చెప్పు. ఓ జంబూ వృక్షమా! నా ప్రియురాలి శరీరం కూడా నీ పండ్లకుమల్లెనే నున్నగాను, నిగనిగలాడుతూ ఉంటుంది. కాబట్టి నీకు ఆమె గూర్చి తెలిసే ఉంటుంది. ఆమె జాడ చెప్పి పుణ్యం కట్టుకో. ఓ కర్ణికా వృక్షమా! నీ పూల పరిమళం, కోమలత్వం అంటే నా ప్రియురాలికి అమితమైన ఇష్టం. రోజూ నీ పూలే కోస్తూ ఉంటుంది. కాబట్టి నీకు ఆమె గూర్చి తెలిస్తే చెప్పు.

ఇదే విధంగా రాముడు మామిడి, మద్ది, పనస, చంద్ర, గోరింట, దానిమ్మ మున్నగు వృక్షాలను కూడా సీతను గూర్చి అడుగుతూ మతి భ్రమించినవాడిలాగా అడవి అంతా

కలయతిరిగాడు.

ఓ జింకా! నేను ఒక్కొక్క చెట్టునూ పేరుపేరునా అడిగాను. ఒక్కరూ నా ప్రియురాలి జాడ చెప్పలేదు. నా ప్రియురాలికి కూడా నీ పిల్ల కన్నువంటి కన్నులే ఉంటాయి. నీకు ఆమె తెలుసు. ఆ బెదురు చూపుల సీత ఎక్కడుందో చెప్పు. ఓ గజరాజమా! నా ప్రియురాలి తొడలు, నీ తొండమువలె ఉంటాయి. ఆమెను గూర్చి నీకు తప్పక తెలుసు. ఆమె ఎక్కడుందో చెప్పు. ఓ శార్దూలమా! చంద్రబింబం వంటి ముఖం కలిగిన నా ప్రియురాలు ఎక్కడుందో చెప్పు. నిన్ను నేను ఏమీ అనను. చూస్తే నిర్భయంగా చెప్పు.

ఓ ప్రియురాలా! ఎందుకు నన్ను తప్పించుకు తిరుగుతున్నావు? ఎందుకు చెట్ల చాటున దాక్కుంటున్నావు? మాట్లాడు. నా మీద దయలేదా! ఎందుకు నన్ను ఇట్లా వియోగ దుఃఖంలో ముంచుతున్నావు? నువ్వు కనబడకుండా ఉండాలని ఎంత ప్రయత్నించినా, నీ పట్టుచీర నాకు కనిపిస్తూనే ఉంది.

నా ప్రియురాలు ఇక లేదు. రాక్షసులు చంపివేసి ఉంటారు. నవనవలాడే ఆమె అవయవాలన్నిటిని విరుచుకొని తినేసి ఉంటారు. తెల్లని పలువరుసలు, దొండపండు వంటి పెదిమలు, కోటేరులాంటి ముక్కు, మెరిసి పోయే కుండలాలు, చంద్రబింబం వంటి ముఖం, రాక్షసులు చుట్టూ మూగగానే రాహువు పట్టిన చంద్రునిలాగా మసకబారిపోయి ఉంటాయి. రాక్షసులు భక్షించటం కోసమే నేను ఆమెను ఒంటరిగా వదలిపోయాను. బాటసారులు వదలిపెట్టిపోయిన స్త్రీని క్రూరమృగాల్లాగా రాక్షసులు ఆమెను భక్షించి ఉంటారు.

అట్లా వెక్కి వెక్కి ఏడుస్తూ రాముడు అడవిలో పరుగులుపెడుతూ పిచ్చివాడిలా తిరిగాడు. జడపదార్థాలు కూడా సీతను గూర్చి చెప్పగలవేమోనన్న ఆశ రాముణ్ణి విడవలేదు. ఏమో చెప్తాయేమోనన్న భ్రమ! సీతను గూర్చిన తపనతో ఒక చోట స్థిరంగా నిలుచోలేకపోయాడు; ఒక చోట కూర్చోలేకపోయాడు. నదులు, అడవులు, కొండలు, కొండవాగులు తిరి గాడు; వెతికాడు.

కనిపించిన జడపదార్థాలన్నింటినీ అడిగాడు. ఎక్కడా సీతాదేవి జాడకూడా కనిపించలేదు.

ఓ లక్ష్మణా! నా ప్రియురాలు నీకు ఎక్కడైనా కనిపించిందా? అయ్యో! సీతా! ఎక్కడకు పోయావు? ఏమైపోయావు? అంటూ రాముడు వెక్కి వెక్కి ఏడ్చాడు.

# 61వ సర్గ రామలక్ష్మణులు సీతను వెతకటం

రాముడు, సీత లేని పర్ణశాలను, చెల్లాచెదరైె ఉన్న వస్తువులను చూసి, సీత కనబడకపోవటం వల్ల ఆశ్రమ ప్రాంతమంతా కలయ తిరిగాడు. లక్ష్మణుడి భుజాలు పట్టి ఊపేశాడు.

రాముడు: లక్ష్మణా! సీత ఎక్కడ ఉన్నదో! ఆమెను ఎవరు అపహరించారో? నా ప్రియురాలిని ఎవరు చంపి తిన్నారో గదా?

సీతా! నన్ను ఆటలు పట్టించేందుకు చెట్ల చాటున దాక్కున్నావా? ఇక చాలు. దుఃఖం భరించలేకుండా ఉన్నాను. త్వరగా వచ్చెయ్యి. సీతా! నీవు ఆడుకునే లేడి పిల్లలన్నీ నీవు కనపడక బెంగపెట్టుకున్నాయి. లక్ష్మణా! నేను సీత లేకుండా బ్రతుకలేను. నేను కూడా మన తండ్రి దశరథ మహారాజు వద్దకే పోతాను. ఆయన నన్ను చూసి "ప్రతిజ్ఞ కాలం ముగియకుండా ఎందుకువచ్చావు? అసత్యం పలికావు. అధర్మం ఆచరించావు" అని కూడా నన్ను తిరస్కరిస్తాడు.

ఓ అందమైన కటి ప్రదేశం గల సీతా! కుటిల స్వభావం కలవాడిని కీర్తి వదలినట్లుగా నీవు నన్ను వదలివెళ్ళావు. నువ్వు అట్లా చెయ్యవద్దు. నీవు నన్ను విడిచేస్తే, నేను జీవితాన్నే విడిచేస్తాను.

సీత కనపడకపోవటం వలన చిక్కటి బురదలో కూరుకుపోయిన ఏనుగువలె రాముడు బాధపడుతూండగా లక్ష్మణుడు ఇలా అన్నాడు.

లక్ష్మణుడు: ఓ మహాబాహూ! విరక్తి చెందకు. మనిద్దరం కలసి అడవి అంతా గాలిద్దాం. గుహలలోకి వెళ్ళి చూద్దాం. నదులు, సరస్సులు ఏదీ విడిచిపెట్టకుండా అన్నిచోట్లా వెతుకుదాం.

రామా! ఆమె కనిపించకపోతే మనం ఏం చేస్తామో చూద్దామని, ఆటపట్టిద్దామని ఇక్కడే

ఎక్కడో దాక్కుని ఉంటుంది లే! మనం వెతకడం ప్రారంభిద్దాం. నీవు సరే అంటే నేను అడవి అంతా గాలించి వస్తాను. నీవు మాత్రం దుఃఖించటం మాను.

లక్ష్మణుని మాటలతో కొద్దిగా ఊరట చెందిన రాముడు లక్ష్మణునితో కలసి సీత కోసం వెతకటం ఉద్ధృతం చేశాడు.

లక్ష్మణుడు: మహాబుద్ధిశాలివైన రామా! విష్ణు భగవానుడు బలిచక్రవర్తిని బంధించి భూమిని పొందినట్లు నీవు కూడా సీతను పొందగలవు.

రాముడు: లక్ష్మణా! వనాలన్నీ వెతికాం. గుహలు వెదికాం. పద్మాలున్న సరస్సులన్నీ చూశాం. పర్వతాలపై నుండి ప్రవహించే సెలయేర్లు చూశాం. కానీ నా ప్రాణ సమానురాలైన సీతను చూడలేకపోయాం.

సీతావియోగం చేతను, సీతను వెదకటం వలననూ విలపించుచూ, దీనుడైన రాముడు వ్యాకులతతో కృశించిపోయాడు. రాముడికి సంతాపం చేత శరీరం కృశించిపోయింది. బుద్ధి సరిగా పనిచేయడం లేదు. అప్పుడప్పుడు స్పృహతప్పుతోంది. 'అయ్యో! ప్రియురాలా!' అంటూ కళ్ళ నిండా నీళ్ళు పెట్టుకుంటున్నాడు. అన్నగారిపై ప్రేమా, భక్తి గల లక్ష్మణుడు అనేక విధాలుగా రాముణ్ణి ఓదార్చాడు. లక్ష్మణుడు ఎంత వినయంగా భక్తితో, ప్రేమపూర్వకంగా అనునయించినా, రాముణ్ణి దుఃఖాన్నుండి మరల్చలేకపోయాడు.

# 62వ సర్గ రాముడు సీతకై విలపించటం

సీత కనిపించకపోవటం వలన ధర్మాత్ముడు, మహాబాహువు, పద్మనేత్రుడు అయిన రాముని దుఃఖానికి అంతు లేకుండా పోయింది. సీతా విరహాన్ని భరించలేక, మన్మథ పీడితుడైన రాముడు సీత కనబడుతున్నదనే భావంతో అస్పష్టంగా ఇలా పలుకసాగాడు.

రాముడు: ప్రియురాలా! నీకు పుష్పాలంటే చాలా ఇష్టమని నాకు తెలుసు. అందువల్ల అశోక వృక్షాల కొమ్మల్లో కనపడకుండా దాక్కున్నావు. అట్లా దాక్కోవటం వల్ల నా దుఃఖం రెట్టింపవుతోంది.

మంగళప్రదురాలవైన ఓ దేవీ! నీవు ఆటపట్టించేందుకు కర్ణికార వృక్షాలలోనికి పోతున్నావు. నాకు బాధ కలిగించే పరిహాసాలు ఇక చాలించు.

ప్రియురాలవైన ఓ సీతా! నేను ఒక ప్రక్క శోకంతో అలసిపోయి ఉంటే, నీవు పరిహాసాలు చేస్తే ఏమైనా లాభం ఉంటుందా? అట్లాంటి పరిహాసాలంటే నాకు నచ్చవు. ప్రియురాలా! పరిహాసాలంటే నీకు ఇష్టమని నాకు తెలుసు. కానీ ఇటువంటి పరిస్థితిలో పరిహాసాలు సబబు కావు. నీవు లేని పర్ణశాల శూన్యం.

లక్ష్మణా! సీతను రాక్షసులు చంపి తినేసి ఉంటారు. ఆమె లేకుండా ఉండలేను. కన్నీళ్ళు పెట్టుకొంటున్న ఆ లేళ్ళ గుంపుల్ని చూడగా అవి కూడా సీతను రాక్షసులు భక్షించారనే చెబుతున్నాయి. ఓ పతివ్రతా! ఎక్కడకుపోయావు. బంగారు శరీరచ్ఛాయగలదానా! ఇప్పుడు కైకేయి ఏది కోరుకుందో అది నెరవేరింది. లక్ష్మణా! సీత లేకుండా నేను అయోధ్యకు ఎట్లా వెళ్ళను? అంతఃపురంలో కాలు ఎట్లా పెట్టగలను? నేను సీతను పోగొట్టుకోవడం చేత లోకులు నన్ను భార్యను కాపాడుకోలేని అసమర్థుడని అంటారు. వనవాసం అయిన తర్వాత జనకమహారాజు 'క్షేమమా' అని అడిగితే ఏమని సమాధానం చెప్పను? విషయం తెలియగానే

జనక మహారాజు మూర్ఛపోతాడు. అది నిశ్చయం. నేను భరతుడు పాలించే అయోధ్యకు వెళ్ళనుగాక వెళ్ళను. సీత లేని స్వర్గం కూడా శూన్యంగానే ఉంటుంది. లక్ష్మణా! నన్ను ఇక్కడ అరణ్యంలో వదిలేసి నీవు అయోధ్యకు తిరిగి వెళ్ళిపో. సీత లేకుండా నేను ఎక్కడా జీవించలేను. భరతుణ్ణే రాజ్యం ఏలుకోమను. నాకా రాజ్యం అక్కరలేదని చెప్పు. నీవు వెళ్ళగానే తల్లి కౌసల్య, సుమిత్రలకు నమస్కారం చేశానని చెప్పు. నీవే కౌసల్యాదేవికి సేవలు చేస్తూ ఆమెను కడతేర్చు. శత్రుసంహారకుడైన లక్ష్మణా! నేనూ సీతా ఎట్లా సర్వనాశనమైపోయామో వివరంగా నా తల్లికి చెప్పు.

సీత కనపడకపోవటం చేత దైన్యం చెందిన రాముడు పరిపరి విధాలుగా విలపిస్తూ ఉంటే, లక్ష్మణుడు కూడా భయపడిపోయాడు. అతడి మనస్సంతా వ్యధ చెందింది. అన్నగార్ని కౌగలించుకొని బావురుమని ఏడ్చాడు.

# 63వ సర్గ రామ విలాపం

దశరథుడికి పెద్ద కుమారుదుగా పుట్టాడు. రాజ్యాన్ని పోగొట్టుకున్నాడు. అరణ్యాల్లో అష్టకష్టాలు పడుతున్నాడు. అది చాలదు అన్నట్లు ఇప్పుడు సీతను కూడా పోగొట్టుకున్నాడు. ఈ సీతావియోగం అతణ్ణి పూర్తిగా కృంగదీసేసింది. రాముడి దుఃఖం లక్ష్మణుణ్ణి కూడా కృంగదీస్తోంది.

రాముడు: తమ్ముడా! ఈ భూమిపైన నాకంటే మహాపాపి ఇంకొకడు ఉండడని అనుకొంటున్నాను. ఎందువల్లనంటే నాకు కష్టాలు ఒకదాని తర్వాత మరొకటి వస్తూనే ఉన్నాయి. ప్రతిసారి నా హృదయం పగిలిపోయినట్లవుతోంది. పూర్వజన్మలలో చేసిన పాపకర్మలే నన్నిప్పుడు వెంటాడి ఏడిపిస్తున్నాయి. లక్ష్మణా! రాజ్యం పోయిందా? బంధు జనులంతా దూరమయ్యారా? తండ్రి మరణించాడా? తల్లికి దూరమయ్యాను. ఇవన్నీ గుర్తుకు వస్తూ ఉంటే హృదయం తరుక్కుపోతోంది. నిర్జనమైన ఈ అరణ్యంలోకి ప్రవేశించగానే ఆ బాధలన్నీ మరచిపోయి ఈ జీవితాన్ని అలవాటు చేసుకున్నాను. ఇప్పుడు ఇంత పెద్ద కష్టం వచ్చింది. సీతను పోగొట్టుకోవడంలో అసలే మండుతున్న గుండెల్లో ఆజ్యం పోసినట్లయింది. సీత సహజంగా భయ స్వభావం కలది. అటువంటిది రాక్షసులు బలాత్కారంగా హరించుకుపోతూ ఉంటే గుండెలు పగిలేటట్లుగా, ఆకాశం చిల్లులు పడేట్లుగా ఎంతగా ఆక్రోశించి ఉంటుందో కదా! నా ప్రియురాలైన సీత స్తనాలు అందంగా ఉండేందుకు రక్తచందనంతో పూత పూసుకునేది. ఇప్పుడు ఆ స్తనాలన్నీ రక్తంతో తడపడం వల్ల అందవిహీనాలైపోయి ఉంటాయి. సీత మధురంగాను, మృదువుగాను, స్పష్టంగాను, మాట్లాడేది. చక్కగా తల దువ్వి కొప్పుపెట్టుకునే అందమైన సీత ముఖం రాహువు మింగిన చంద్రుడిలాగా కాంతివిహీనమై ఉంటుంది. ఎన్నో నియమాలు పాటించే నా ప్రియురాలు మెడనిండా హారాలు ధరించేది. అటువంటి అందమైన మెడను రాక్షసులు పట్టి బంధించి తీసుకొనిపోతూ ఉంటే నేను కనపడకపోవటం చేత దీనురాలై గోరింకవలె తప్పక అరచి ఉంటుంది.

లక్ష్మణా! ఉత్తమ శీలవంతురాలైన నా సీత చిరునవ్వులు ఒలకబోస్తూ ప్రక్కనే కూర్చుని నవ్వుతూ నాకు ఎన్నో మాటలు చెప్పేది. శ్రేష్ఠమైన గోదావరీనది అంటే నా సీతకు చాలా ఇష్టం. ఒకవేళ నదికి వెళ్ళిందా అని అనుకున్నానేగాని, ఆమె ఎన్నడూ ఒంటరిగా నదికి పోయిందిలేదు. పద్మాల వంటి ముఖంగల సీత, పద్మాలకోసం వెళ్ళిందా అంటే అదీ సబబుగా కనపించడం లేదు. ఎందుకంటే పద్మాలు కావాలంటే ఎప్పుడూ నాతోనే వెళ్ళేది గాని ఒంటరిగా వెళ్ళలేదు. పూలకోసం అడవిలోకి పోయి ఉంటుందా అంటే, అదీ సబబుగాలేదు. ఎందువల్లనంటే ఆమె భయస్థురాలు. ఒంటరిగా అడవిలోకి వెళ్ళలేదు. ఓ సూర్య భగవానుడా! ఏ లోకంలో ఎవరెవరు ఏం చేసేదీ, అన్నీ నీకు తెలుసు. లోకంలో జనులు చేసే పాప పుణ్యాలన్నింటికీ నీవే సాక్షివి. నీకు సీతను గూర్చి తప్పకుండా తెలిసి ఉంటుంది. ఆమెను ఎవరైనా ఎత్తుకుపోయారా? లేక చంపేశారా? ఈ ఒక్క విషయం చెప్పు. నీకు పుణ్యం ఉంటుంది. చెప్పి నన్నీ శోకాన్నుండి తప్పించు.

ఓ వాయుదేవుడా! నీవు వెళ్ళని లోకం ఉండదు. చోటు ఉండదు. నీకు తెలియని విషయం ఉండదు. అందువల్ల మహా పతివ్రత అయిన నా సీతను గూర్చి చెప్పు. ఆమెను ఎవరైనా హరించారా? మరణించిందా? లేదా ఇంకా జీవించే ఉందా?

ఈ విధంగా శోకంతో చేష్టలుడిగిపోయి, పిచ్చివాడిలాగా విలపిస్తున్న రాముణ్ణి, న్యాయమార్గాన్ని అనుసరించే లక్ష్మణుడు ఈ విధంగా ఓదార్చాడు.

లక్ష్మణుడు: పూజ్యుడా! ఓ రామా! ధైర్యంగా ఉండు. దైన్యాన్ని వదలు. దుఃఖీస్తూ కాలం వృథా చేయటం మంచిది కాదు. లెమ్ము. మనిద్దరం కలసి సీతకోసం తీవ్రంగా గాలిద్దాం. ఉత్సాహవంతులైన వారు కష్టాలొచ్చినా దిగులుపడరు.

లక్ష్మణుడు ఎంత ధైర్యం చెప్పినా రాముడిపైన అదేమీ ప్రభావం చూపలేకపోయింది. అయినా ఇంకా విలపిస్తూనే ఉన్నాడు.

# 64వ సర్గ రామలక్ష్మణులు సీతకై అన్వేషించటం

రాముడు దైన్యంతో లక్ష్మణుణ్ణి చూసి "తమ్ముడా! సీత కమలాలకోసం గోదావరికి పోయిందేమో? పోయిచూసిరా" అన్నాడు. లక్ష్మణుడు వెంటనే గోదావరీ తీరానికి వెళ్ళి సీతకోసం బిగ్గరగా అరిచాడు. ఎక్కడా సమాధానం వినపడలేదు. తిరిగి వెళ్ళి రాముడికి ఆ మాటే చెప్పాడు. రాముడికి నమ్మకం కుదరలేదు. తానే స్వయంగా వెళ్ళి వెదికాడు; అరిచాడు; కేకలు వేశాడు. కాని ఫలితం శూన్యం. రావణాసురుడు సీతను హరించుకుపోయాడని గోదావరీ నదిగానీ, భూతాలు గానీ రాముడికి చెప్పలేదు.

తిరిగి వచ్చాక రాముడు, లక్ష్మణునితో ఇలా అన్నాడు:

తమ్ముడా! లక్ష్మణా! వనవాస కాలం గడువు దగ్గర పడుతోంది. గడువు అయిన తర్వాత సీత లేకుండా అయోధ్యకు వెళితే నా తల్లి కౌసల్యాదేవికి ఏమని చెప్పేది. సీత తండ్రి జనకమహారాజువచ్చి "సీత ఏదీ?" అని అడిగితే ఏమి సమాధానం చెప్పేది? నాతోపాటే అరణ్యవాసానికి వచ్చింది. నాతోపాటు అనేక కష్టాలుపడ్డది. నాకు సేవలు చేస్తూ నన్ను అనేక విధాలుగా సుఖపెట్టింది. అటువంటి నా సీత ఇప్పుడు ఎక్కడుంది? బంధుజనాన్నంతా విడిచి అరణ్యవాసం చేస్తున్నా, సీత ఒక్కతే నా ప్రక్కన ఉండటం వల్ల అన్ని కష్టాలు మరిచి ఇన్ని సంవత్సరాలు ఉండగలిగాను. ఇప్పుడు ఆమె లేకుండా ఒక్క రాత్రి కూడా గడపలేను.

లక్ష్మణా! సీత కనిపిస్తే నేను ఈ గోదావరీ తీరాన, జనస్థానంలో, ఈ పర్వత సానువుల్లో ఇంకా ఎన్నో రమణీయమైన ప్రదేశాల్లో విహరిస్తాను. లక్ష్మణా! ఈ మృగాలన్నీ నాతో ఏదో చెప్పాలని తాపత్రయ పడుతున్నాయి. కానీ నేనే తెలుసుకోలేక పోతున్నాను. వాటి హావభావాలు చూస్తుంటే నా కట్లా అనిపిస్తోంది.

రాముడు అట్లా అంటూ ఉంటే అవన్నీ ఒక్క గంతువేసి పైకి ఎగిరాయి; ఆకాశం వైపు

మొహం చూపిస్తూ చూశాయి. ఆ ఎగరటం కూడా దక్షిణం ప్రక్కగా ముఖం పెట్టి పరుగుతీసి తిరిగి రాముడి దగ్గరకొచ్చి రాముడి ముఖంలోకి చూశాయి. వాటి చేష్టల్నీ, భావాల్నీ లక్ష్మణుడు బాగా అర్థం చేసుకున్నాడు. రాముడితో ఇలా అన్నాడు.

లక్ష్మణుడు: ఓ ప్రభూ! నీవు సీత ఎక్కడకు పోయిందని మృగాలను అడిగావు. అవి భూమిపై నుండి పైకెగిరాయి. దక్షిణ దిక్కును చూపిస్తూ పరుగెత్తాయి. కాబట్టి ఇప్పుడు మనం రాక్షసుల నివాసం అయిన నైరుతి దిక్కుగా పోదాం. ఆమెను గూర్చిన వివరాలేమైనా తెలియవచ్చు. మన అదృష్టం బాగుంటే ఆ పూజ్యురాలు కనిపించినా కనిపించవచ్చు.

అప్పుడు రాముడు కూడా సరేనని లక్ష్మణుడితో మాట్లాడుతూ దక్షిణ దిక్కుగా బయలుదేరారు. కొంతదూరం పోయాక నేల మీద రాలిన పూలు చూశారు. ఆ పూలు చూస్తూనే రాముడికి దుఃఖం పొంగుకొచ్చింది.

రాముడు: లక్ష్మణా! తమ్ముడా! ఇక్కడ నేల మీద పడి ఉన్న పువ్వుల్ని చూశావా? ఇవి ఎవరి తలలో నుండి రాలాయో తెలుసా? నాకు తెలుసు. నేనే ఈ పూలని సీతకోసం కోసి తెచ్చి ఇచ్చాను. వీటిని ఎంతో ఇష్టంగా తలలో పెట్టుకుంది. ఆ పూలే ఇప్పుడు ఇక్కడ నేలపై రాలి ఉన్నాయి. నా కోసమే సూర్యభగవానుడు వాటిని వాడిపోకుండా కాపాడాడు. వాయుదేవుడు ఎగిరిపోకుండా ఉంచాడు. భూదేవి తలలో అలంకరించుకొని నాకు చూపుతోంది.

అక్కడే నిలబడి ప్రసరణ పర్వతాన్ని "ఓ పర్వతరాజమా! నా సీతను నీవు చూశావా?" అని అడిగాడు. పర్వతం ఏమీ మాట్లాడలేదు. రాముడికి చాలా కోపం వచ్చింది. "ఓ పర్వతమా! సీతను గూర్చి తెలిసి కూడా చెప్పకపోతే నీ పర్వత శ్రేణులన్నిటినీ నా బాణాలతో ధ్వసంచేసివేస్తాను. గడ్డికూడా మొలవకుండా చేస్తాను" అని అరిచాడు. రాముడి అరుపే ప్రతిధ్వనించింది కానీ, సీతా జాడ ఏమీ చెప్పలేదు. అంతట లక్ష్మణునితో "లక్ష్మణా! నా ప్రియురాలైన సీత ఎక్కడుందో చెప్పకపోతే నదిలో నీళ్ళన్నీ ఎండగడతాను" అన్నాడు.

తరువాత నేల మీద పరిశీలనగా చూశాడు. అక్కడ పెద్దపెద్ద కాలి అడుగులు కనిపించాయి. అవి ఎవడో రాక్షసుడివే అయి ఉంటాయి. అక్కడే ఆ అడుగుల నుండి తప్పించుకొని పారిపోవటానికి ప్రయత్నించి సీతాదేవి అడుగులు కనపడ్డాయి. అక్కడే విరిగిపడున్న ధనుస్సు, అంబులపొది, బాణాలు కనిపించాయి. విరిగి ముక్కలై ఉన్న రథాన్ని చూశాడు. అవన్నీ చూసి రాముడి హృదయం కంపించిపోయింది.

రాముడు: లక్ష్మణా! సీత అలంకారాలైన చిన్నచిన్న బంగారపు ముక్కలు, పూలహారాలు నేలపై పడి ఉన్నాయి. ఈ పర్వతంపైన అక్కడక్కడా రక్తపు మరకలు కనిపిస్తున్నాయి.

లక్ష్మణా! ఈ ఆధారాలు చూస్తూ ఉంటే కామరూపులైన రాక్షసులు సీతను ముక్కలు ముక్కలుగా కోసి తిని ఉంటారనిపిస్తోంది. అందువల్లనే అక్కడక్కడా రక్తపు మరకలు కనిపిస్తున్నాయి. అంతేకాదు. ఎవరో ఇద్దరు బలవంతులైన రాక్షసులు సీత కోసం యుద్ధం చేసి ఉంటారు. ఈ మణులు పొదిగిన బంగారు ధనుస్సు అందులో ఒకరిదై ఉండవచ్చును. సూర్యుని తేజస్సుతో పోటీ పడే మణులు ఈ కవచానికి పొదిగారు. ఆ కవచం కూడా నేలపై పడి ఉంది. ఈ శ్వేతఛత్రం చూశావా ఎంత పెద్దదో. దాన్ని నూరు ఊచలతో నిర్మించారు. అదీ విరిగి నేలపై పడి ఉంది.

బంగారు కవచంతో, పిశాచముఖం వంటి ముఖంతో, భయంకరమైన శరీరంతో రథానికి కట్టిన గాడిదలు కూడా చచ్చిపడున్నాయి. ఈ ధనుస్సు, ఛత్రం, రథం, రథానికి కట్టిన గాడిదలు చూడగా అవి ఎవరో పెద్ద వీరుడివే అయి ఉండాలనిపిస్తోంది. ఇవి ఎవరివో?

లక్ష్మణా! ఈ రథానికి కట్టిన ధ్వజాన్ని చూడు. ఈ ధ్వజమే ఈ యుద్ధంలో ఈ రథం ఫలానా గొప్ప నాయకుడిది అని సూచిస్తుంది. ఆ రథం, ధ్వజం విరగొట్టబడి ముక్కలై పడున్నాయి. బంగారంతో అలంకరించిన పొడుగాటి మొనలు కలిగిన బాణాలు నేలపై చిందరవందరగా పడి ఉన్నాయి. వీడెవడో భయంకరుడే అయి ఉంటాడు. సారథి కూడా

చచ్చిపడి ఉన్నాడు. అయినా ఇంకా పగ్గాలు వాడి చేతుల్లోనే ఉన్నాయి. వీడు ఎవరి సారథి అయి ఉంటాడు? తలపాగాలతోను, మణి కుండలాలతోను పడి ఉన్న ఈ ఇద్దరూ చామరగ్రాహకులు అయి ఉంటారు. వీరు ఎవరి వారో? ఈ లక్షణాలను చూస్తే వీడెవడో రాక్షసుడే అయి ఉంటాడు. సందేహం లేదు. ఇప్పుడు రాక్షసులతో వైరం నాకు నూరింతలయినట్లుంది? ఇక రాక్షసులందరినీ చంపుతాను. చూస్తూ ఉండు.

లక్ష్మణా! కామరూపులైన రాక్షసులు సీతను అపహరింపగా ఆమె మరణించి ఉంటుంది; లేదా వాళ్ళు ఆమెను తినేసి ఉంటారు. అరణ్యంలో సీత అపహరించబడుతుండగా ధర్మం కాపాడలేకపోయింది గదా! లక్ష్మణా! సీత హరించబడ్డా, లేదా భక్షించబడినా ఈ దేవతలంతా కలిసినా ఇక నాకు ఏమి ఉపకారం చెయ్యగలరు? నాకు జరిగిన నష్టం తీర్చలేనిది గదా!

లక్ష్మణా! దయాగుణం కలవాడు, ఎంత శూరుడైనా లోకం అతడిని బలహీనుడని అంటుంది. ఇంద్రియనిగ్రహంతో, దయాగుణం కలవాడినై లోకానికి హితం చెయ్యాలని ప్రయత్నించాను. దేవతలతో సహా అందరూ నాకు 'పరాక్రమ శూన్యుడు' అనే ముద్రవేశారు.

లక్ష్మణా! చూశావా! నాలో ఉండే మంచి గుణాలనే ఎలా దోషాలుగా చూస్తున్నారో! సూర్యుని ప్రకాశం చంద్రుని వెన్నెలను అణచివేసి ఉదయించినట్లుగా, నేనుకూడా నా తేజస్సు (శౌర్య పరాక్రమాల) చేత మృదుత్వం మున్నగు గుణాలన్నింటిని అణగద్రొక్కి విజృంభిస్తాను. రాక్షసులందరినీ నాశనం చేస్తాను.

లక్ష్మణా! ఇకమీదట యక్షులు గాని, గంధర్వులను గాని, పిశాచాలను గాని, రాక్షసులనుగాని, కిన్నరులనుగాని, మానవులనుగాని సుఖంగా బ్రతుక నివ్వను. ఆకాశమంతా నా బాణాలతో పరచివేస్తాను. ఇక దేవతలు మున్నగువారు ఆకాశమార్గాన ఎట్లా ప్రయాణం చేస్తారో చూస్తాను?

చంద్రుని ఉదయించకుండా చేస్తాను. అగ్నిని, వాయువుని, సూర్యుని తేజస్సును

నశించేట్లు చేసి లోకమంతా అంధకారం అలుముకునేట్లు చేస్తాను. పర్వత శిఖరాలను పిండిపిండి చేస్తాను. నదులు, సరస్సులు మొదలైన జలాశయాల్లో నీళ్ళు లేకుండా చేస్తాను. వృక్షాలను, లతలను, పొదలను మాడ్చి మసి చేస్తాను. సముద్రాల్లో నీరంతా ఇంకిపోయేట్లు చేస్తాను.

లక్ష్మణా! దేవతలు సీతను నాకు క్షేమంగా ఒప్పచెప్పకపోతే నా పరాక్రమం ఎట్లా ఉంటుందో చూపిస్తాను. ఆకాశంలో దేవతలే కాదు పక్షులు కూడా ఎగరకుండా చేస్తాను. ఇప్పుడు ఆకాశాన్నంతా నారాచ బాణాలచే కప్పివేసి ప్రాణులన్నీ భయపడేట్లు చేస్తాను.

కట్టుబాట్లన్నింటినీ తారుమారుచేస్తాను. సీతను అపహరించి, నాకు క్షోభ కలిగించిన పిశాచాలను, రాక్షసులను భూమిపై లేకుండా చేస్తాను. చెవి వరకు నారి లాగి విడిచిన నా బాణాలు వారినందరినీ సమూలంగా నాశనం చేస్తాయి. చూస్తూ ఉండు.

మృదువుగాను, మంచిగాను ఉంటున్న నాలో రోషాన్ని ప్రేరేపించారు. నా బాణాలు ఎంతదూరం ప్రయాణం చెయ్యగలవో దేవతలకు తెలిసివచ్చేట్లు చేస్తాను. నా క్రోధానికి గురి అయిన తర్వాత ఈ జగత్తులో దేవతలుగాని, దైత్యులుగాని, పిశాచాలుగాని, రాక్షసులుగాని ఎవరూ మిగిలి ఉండరు. లోకాన్ని ఛిన్నాభిన్నం చేస్తాను. నా కోపాగ్ని చేత ముల్లోకాలను నశింపజేస్తాను.

లోకాభిరాముడు, శ్రీమంతుడు, శత్రుభయంకరుడు అయిన రాముడు భీకరంగా అలా పలుకగా, కన్నులు ఎర్రబడ్డాయి. ధనుస్సును దృఢంగా పట్టుకున్నాడు. సర్పాల వంటి బాణాలను సంధించాడు. ప్రళయాగ్ని అయి ఇట్లా అన్నాడు.

రాముడు: లక్ష్మణా! ముసలితనాన్ని, మృత్యువును, కాలాన్ని, దైవాన్ని, భూతాలేవీ కూడా ఏ విధంగా అతిక్రమించలేవో, కోపం వచ్చిన నన్ను కూడా ఎవరూ అడ్డుకోలేరు.

అందమైన పలువరస గలది, దోషాలు లేనిది, జనకరాజకుమారి అయిన సీతను నా కిప్పుడు పూర్వం ఉన్న రూపంతో అప్పగించని ఎడల దేవతలతోను, గంధర్వులతోను, మనుష్యులతోను, పన్నగులతో కూడిన ఈ జగత్తునంతా తలక్రిందులు చేస్తాను.

# 65వ సర్గ లక్ష్మణుడు రాముని కోపాన్ని చల్చార్చటం

సీతాపహరణం చేత దుఃఖంతో కృశించి ఉన్న లోకాభిరాముడు ప్రళయాగ్ని అయిపోయాడు. లోకాల్ని కాల్చివెయ్యాలని ధనుస్సు చేతబట్టాడు. నారి బిగించి రుద్రుడవడం చూసి లక్ష్మణుడు వణికిపోయాడు. పూర్వమెన్నడూ రాముణ్ణి అంతటి ఉగ్రమూర్తిగా చూడలేదు. దాంతో లక్ష్మణుడు భయపడిపోయాడు. ముఖాన ఎక్కడా కళ లేదు. అటువంటి స్థితిలో లక్ష్మణుడు రెండు చేతులూ జోడించి నమస్కారం చేస్తూ ఇట్లా ప్రార్థించాడు.

లక్ష్మణుడు: రామా! నీవు ఇంతవరకు మృదు స్వభావంతో ఉన్నావు. ఇంద్రియ నిగ్రహుడవై ఉన్నావు. ప్రాణుల హితాన్నే కోరావు. అటువంటి నీవు నీ స్వభావానికి విరుద్ధమైన క్రోధాన్ని తెచ్చిపెట్టుకోవద్దు.

చంద్రుడిలో శోభ, సూర్యుడిలో కాంతి, వాయువులో గమనం, భూమిలోని ఓర్పు ఎప్పుడు నిశ్చలంగా ఉన్నట్లే నీ యందు కూడా ఉత్తమమైన స్వభావాలు స్థిరంగా ఉన్నాయి. ఎవరో ఏదో అపరాధం చేశాడని లోకాలన్నింటినీ నాశనం చెయ్యటం సమంజసం కాదు. ఈ రథం ఎవరిదో, దీనిలోని ఆయుధాలు, పరివారం ఏ కారణం చేత ధ్వంసం అయ్యాయో, అట్లా ధ్వంసం చేసింది ఎవరో తెలియటం లేదు. రామా! ఈ ప్రాంతం అంతా రథచక్రాల చేత నలిగి ఉంది. రక్తబిందువు లతో తడిసి ఉంది. ఇక్కడ ఏదో యుద్ధం జరిగింది. పెద్ద సైన్యంతో చేసిన యుద్ధంలాగా కనబడటం లేదు. ఎవరో ఇద్దరో ముగ్గురో తలపడి యుద్ధం చేసి ఉంటారు. ఎవరో ఒకరిద్దరి కోసం లోకాలను నశింపచేయటం భావ్యం కాదు. ఎందువల్లనంటే ప్రభువైనవారు తగిన దండననే విధించాలి. దయాగుణం కలిగి ఉండాలి. ప్రశాంతచిత్తుడై వ్యవహరించాలి.

రామా! నీవు ఎల్లప్పుడూ సకల ప్రాణులకు రక్షకుడవు. నీవే వాళ్ళకు గతి. అటువంటి నీవు భార్యను పోగొట్టుకొని దుఃఖీస్తూ ఉంటే, లోకంలో అంతా నీతోపాటు దుఃఖీస్తారే కాని సంతోషించే వారుండరు.

రామా! యజ్ఞదీక్ష వహించిన వానికి సత్పురుషులు ఏ విధంగా అపకారం తలపెట్టరో, అదేవిధంగా నదులుగాని, సముద్రాలుగాని, పర్వతాలు గాని, గంధర్వులుగాని, దేవతలుగాని నీకు అపకారం తలపెట్టరు.

రామా! ధనుస్సు ధరించి నీవు, నేను, మహర్షుల సహాయం తీసుకొని సీతకోసం వెతుకుదాం. సముద్రాలలోను, పర్వతాల్లోను, గుహల్లోను, నదుల్లోను సీతకోసం వెతుకుదాం.

అన్నా! సీతను అపహరించినవాడు దొరికేటంత వరకూ వెతుకుదాం. ముల్లోకాల్లోనూ వెతుకుదాం. కోసలాధిపతివైన రామా! దేవతలు మర్యాదగా సీతను తెచ్చి నీ కివ్వని పక్షంలో ఏంచెయ్యాలో అప్పుడు ఆలోచిద్దాం.

రామా! సదాచారంతోను, సామోపాయం చేతనూ, వినయం చేతనూ, నీతి మార్గం చేతనూ ప్రయత్నం చేద్దాం. అప్పటికీ సీత లభించకపోతే, బంగారు పొన్నులుగల, వజ్రాయుధం వంటి, నీ బాణాలను ప్రయోగించి సంహరించు.

# 66వ సర్గ లక్ష్మణుడు రాముని శాంతింపజేయటం

లక్ష్మణుడు (రాముని పాదాలకు నమస్కరిస్తూ) : రామా! దశరథ మహారాజు గొప్ప తపస్సు చేసి, దేవతలు అమృతం సంపాదించినట్లుగా, నిన్ను కుమారుడుగా పొందాడు. మన తండ్రి దశరథ మహారాజు నీ గుణాలచేత ఆకర్షించబడటం చేత నీ వియోగాన్ని భరించలేక స్వర్గస్థుడయ్యాడని భరతుడు మనకు చెప్పాడు. కనుక రామా! ఎటువంటి కష్టాన్నైనా ఎదుర్కొనగల సమర్థుడవు, సకల సద్గుణ సంపన్నుడవు అయిన నీవే నీకు వాటిల్లిన ఈ కష్టాన్ని సహించలేకపోతే అల్పుడైన సామాన్య మానవులు ఎవరు సహించగలరు?

రామా! దుఃఖంచేత నీ తేజస్సుతో లోకాలను దహించివేస్తే, వారంతా దుఃఖాలతో నిండి ఉంటే లోకోద్ధారకుడవైన నీవు వారిని ఎట్లా సుఖపెట్టగలవు? నీ ప్రజలంతా సంతోషాన్ని ఎట్లా పొందుతారు? నహుషుడి కుమారుడు యయాతి స్వర్గానికి పోయినప్పుడు దేవేంద్రుడు అసూయతో 'నీ రాజ్యంలో శ్రేష్ఠుడు ఎవరు' అని అడిగాడట. అందుకు యయాతి "నేనేనని" చెప్పాడట. అంతట దేవేంద్రుడు నీవు ఆత్మస్తుతి చేసుకుంటున్నావు. కాబట్టి నీకు స్వర్గంలో స్థానం లేదని స్వర్గం నుండి క్రిందకు తోసేశాడట. అంతట యయాతి భూలోకంపై పడి దుఃఖాలపాలయ్యాడట.

వసిష్ఠ మహర్షి బ్రహ్మవేత్తలలో అగ్రగణ్యుడు. మహామంత్రవేత్త. మనకు పురోహితుడు. ఆయన నూరుమంది పుత్రుల్ని విశ్వామిత్రుడు ఒక శాపంచేత చంపేశాడు.

సూర్యచంద్రులిద్దరూ కూడా లోకాలన్నింటికీ రెండు కన్నుల వంటివారు. అంతటి వారు కూడా అప్పుడప్పుడూ గ్రహణాలచేత పీడించబడుతున్నారు. భూదేవి మనందరకు తల్లి. ఓర్పునకు మారుపేరు. అట్టి భూదేవికి కూడా అపుడప్పుడూ చలనం (భూకంపం) కలుగుతూ ఉంటుంది.

పురుషశ్రేష్ఠుడా! చాలా గొప్ప భూతాలైనా, దేవతలైనా, ఎంతటి వారైనా దైవశక్తికి

తలవంచవలసిందే.

ఓ నరశ్రేష్ఠుడా! దేవతలలో కూడా నీతి, దుర్నీతి ఉన్నట్లు మనం విన్నాం. కాబట్టి మనకు సంభవించిన ఈ దుఃఖం విషయంలో కొంత సంయమనం పాటిద్దాం.

ఓ దోషాలు లేని వీరుడా! సీతను ఎవరైనా అపహరించినా, మరణించినా నీవు సామాన్య మానవుడిలాగా దుఃఖించరాదు. నీ వంటి సత్యవ్రతులు, చెడు ఆలోచనలు చేయని వారు ఎన్ని పెద్ద కష్టాలు వచ్చినా దుఃఖించరు.

నరులలో శ్రేష్ఠుడైన ఓ రామా! నీవు బుద్ధిశాలివి. యథార్థ స్థితిని, మంచి చెడ్డలను నీవే చక్కగా ఆలోచించు. కర్మలు చేయడమే మన వంతు. దానికి ఎటువంటి ఫలితం వస్తుందో మనం ఎరుగం. అవి అస్థిరాలు. ఎందువల్లనంటే, మనం పూర్వజన్మలలో చేసిన కర్మఫలాలనే ఈ జన్మలో అనుభవిస్తూ ఉంటాం. అంటే ఇప్పుడు అనుభవిస్తున్న ఫలాలు పూర్వజన్మల్లో చేసిన కర్మలేనని మనం అనుకోవాలి. కర్మఫలానుభవానికే శరీరాన్ని ధరిస్తాం. కనుక కర్మఫలానుభవం తప్పదు కాబట్టి, మనం దుఃఖించి ప్రయోజనం లేదు.

రామా! ఇదంతా నీవే నాకు లోగడ చెప్పావు. అంతేకాని, నీకు చెప్పగల సామర్థ్యం కలవాడిని కాను. ఆ మాట కొస్తే బృహస్పతి కూడా నీకు బోధించలేడు.

గొప్ప బుద్ధిగలవాడా! నీ బుద్ధిని దేవతలు కూడా తెలుసుకోలేరు. నేను కేవలం దుఃఖంచేత అణిగి ఉన్న నీ జ్ఞానాన్ని మేల్కొల్పుతున్నాను; నీవు ఉపదేశించిన వాక్యాలను నీకు గుర్తు చేస్తున్నాను.

రామా! నీవు గొప్ప పరాక్రమవంతుడవు. నీకు సాటి అయినవారు అటు దేవతల్లోగానీ, ఇటు మానవుల్లోగానీ లేరు. అంతటి పరాక్రమశాలివైన నీవు శత్రుసంహారానికి ప్రయత్నం చెయ్యి. దుః ఖించటం మానెయ్యి. సర్వనాశనం చెయ్యటం వల్ల ఏం ప్రయోజనం ఉంటుంది?

పాపాత్ముడైన మన శత్రువును దొరికేదాకా వెతుకుదాం; కంటపడగానే చంపేద్దాం.

# 67వ సర్గ రామలక్ష్మణులు జటాయువును చూడటం

రాముడు ఇతరులు చెప్పేది వినే స్వభావం గలవాడు. తాను పెద్దవాడే అయినా లక్ష్మణుడు చెప్పినదంతా సావధానంగా విన్నాడు. మనస్సుకు ఎక్కించుకున్నాడు. అందులో సారాన్నంతా గ్రహించాడు. తన కోపాన్ని నిగ్రహించుకున్నాడు. ధనుస్సును ఆపుకొని నిలబడి ఇలా అన్నాడు.

రాముడు: నాయనా! లక్ష్మణా! ఇప్పుడు మన కర్తవ్యం ఏమిటి? ఎటు ప్రక్కగా పోదాం. ఏం చేస్తే సీతను త్వరగా కలుసుకుంటామో అటువంటి ఆలోచన చెప్పు.

లక్ష్మణుడు: అన్నా! ఈ జనస్థానంలో ఇంకా అనేకమంది రాక్షసులు ఉన్నారు. ఇది ఒక మహారణ్యం. ఏ పుట్టలో ఏ పాముందో అంటారు. కాబట్టి ఇక్కడే వెతుకుదాం. అనేక పర్వత ద్వారాలున్నాయి, లోయలున్నాయి. గుహలున్నాయి; భయంకరమైన పులులు, సింహాలు, ఏనుగులు తిరుగాడుతూ ఉంటాయి. కిన్నరుల, గంధర్వుల, భవనాలున్నాయి. నీమా నేను కలసి చెట్టుచెట్టునూ, పుట్టపుట్టనూ వెతుకుదాం. ఓ నరశ్రేష్ఠుడా! నీ వంటి మహాత్ములు, వాయువేగానికి పర్వతాలు చలించనట్లుగా, ఆపదలు వచ్చినా చలించరు.

తదనంతరం రాముడు లక్ష్మణుడు కలసి ధనుస్సు భుజాన ధరించి అడవి అంతా వెదకటం ప్రారంభించారు. అట్లా వెతుకుతూ ఉండగా, రాముడు పక్షులలో శ్రేష్ఠుడైన జటాయువును చూశాడు. పర్వతం అంత జటాయువు రక్తపు మడుగులో పడి ఉండటం చూశాడు. అతణ్ణి చూస్తూనే రాముడు లక్ష్మణునితో "సోదరా! ఇదుగో! ఈ జటాయువే సీతను భక్షించి ఉంటాడు. సందేహం లేదు. అంటే వాడు కూడా గ్రద్దరూపంలో తిరుగుతున్న రాక్షసుడేనన్నమాట! సీతను కడుపు నిండుగా భోజనం చేసి ఆ రక్తంలోనే విశ్రాంతి తీసుకుంటున్నాడు. వీడిని వంకరలేని నా బాణాలతో చంపేస్తాను" అని అంటూ జటాయువుకు దగ్గరగా పోయాడు. అప్పుడు కొన ఊపిరితో ఉన్న జటాయువు దీనంగా ఇట్లా అన్నాడు.

జటాయువు: ఆయుష్మంతుడా! రామా! ఈ మహారణ్యంలో ఓషధిని వెతకుతున్నట్లు వెదకుతున్న సీతను, నా ప్రాణాలను రావణుడు హరించాడు. రామా! నీవు, లక్ష్మణుడు ఆశ్రమంలో లేని సమయంలో సీతను బలవంతుడైన రావణుడు అపహరించుకుపోతూ ఉంటే నేను చూశాను. నేను వెంటనే ఆమెను రక్షించడానికి వాడితో ఘోరంగా యుద్ధం చేశాను. వాడి రథాన్ని విరగ్గొట్టాను. వాడి ధనుస్సును, బాణాలను ముక్కలుగా చేశాను. వాడి రథానికి కట్టిన గాడిదల్ని, రథాన్ని నడుపుతున్న సారథిని చంపాను. ఇదో నేను విరగ్గొట్టిన రావణుడి కవచం. ఇది వాడి ధనుస్సు. ఇది వాడి రథం. నా రెక్కలు, కాళ్ళు, వాడి అయిన ముక్కు నా ఆయుధాలు. వాటితో రథసారథిని చంపాను. రథానికి కట్టిన గాడిదలను చంపాను. అలసిపోయి ఉన్నప్పుడు రావణాసురుడు ఖడ్గంతో నా రెక్కలు నరికేశాడు. నా శరీరం అంతా గాయాలు చేసి సీతను అపహరించుకొని ఆకాశమార్గాన ఎగిరిపోయాడు. ఓ రామా! రావణుడు ముందే నన్ను చంపేశాడు. నిన్ను చూసి ఈ మాట చెప్పటానికే కొన ఊపిరితో ప్రాణం నిలుపుకొని ఉన్నాను. మళ్ళీ నీవు నన్ను చంపాల్సిన పనిలేదు.

జటాయువు సీత గూర్చి చెప్పిన ప్రియమైన వార్త రాముడికి ఎంతో తాపం కలిగించింది. చేతుల్లోని ఖడ్గాన్ని, ధనుస్సును కిందపడేసి రాముడు అమాంతం జటాయువుని కౌగలించుకొని చిన్నపిల్లవాడిలా విలపించాడు. జటాయువు దీనావస్థ చూచి రాముడు ఇలా అన్నాడు.

రాముడు: లక్ష్మణా! రాజ్యం పోయింది. అరణ్యంలో తలదాచుకోవలసి వచ్చింది. తండ్రి మరణించాడు. సీత కనిపించకుండా పోయింది. తండ్రివంటి జటాయువు కూడా నా మూలంగా చనిపోయాడు. నా దౌర్భాగ్యం అగ్నిని కూడా కాల్చివేస్తుంది. లక్ష్మణా! నేను కాలు పెట్టిన చోటల్లా మాడి బూడిద అవుతోంది. ఒకవేళ నేను సముద్రంలో కాలుపెడితే సముద్రంలో నీరంతా ఎండిపోయినా ఆశ్చర్యపడక్కరలేదు సుమా! నేను ఇన్ని కష్టాల ఊబిలో చిక్కుకొని ఉన్నాను. లక్ష్మణా! ఈ జగత్తులో నా కంటే దురదృష్టవంతుడు మరొకడుండడు. ఈ నా దౌర్భాగ్యం చేతనే మన తండ్రిగారి స్నేహితుడైన జటాయువు కూడా మరణించాడు.

అంతట రామ లక్ష్మణు లిద్దరూ జటాయువు ప్రక్కనే కూర్చుని కన్న తండ్రి వలె ప్రేమ చూపుతూ జటాయువు శరీరం అంతా తడవారు. అంతట రాముడు రెక్కలు పోగొట్టుకొని, రక్తపు మడుగులో పడి చావుకు సిద్ధంగా ఉన్న జటాయువును కౌగలించుకొని "నా ప్రియురాలు సీత ఎక్కడున్నది" అని నేలమీద పడిపోయాడు.

# 68వ సర్గ జటాయువుకు దహన సంస్కారాలు

నేల మీద రక్తపు మడుగులో కొన ఊపిరితో ఉన్న జటాయువును చూస్తూ రాముడు ఇట్లా అన్నాడు.

రాముడు: లక్ష్మణా! ఈ జటాయువు మన తండ్రికి స్నేహితుడు. కడు వృద్ధుడు. మనకు తండ్రితో సమానమైనవాడు. నాకు ఉపకారం చెయ్యటానికి రాక్షసుడితో యుద్ధం చేశాడు. నాకు ఈ వార్త చెప్పటానికే కొన ఊపిరితో ప్రాణాలు నిలుపుకున్నాడు. ఇంకా ప్రాణాలు గాలిలో కలసిపోలేదు. కంఠస్వరం పడిపోయింది.

ఓ జటాయువా! నీకు చెప్పగల శక్తి ఉంటే, నిన్ను ఆ రాక్షసుడు ఎట్లా చంపాడో చెప్పు. సీతను గూర్చి నీకు తెలిసిందంతా చెప్పు. రావణాసురుడు సీతను ఎందుకు అపహరించుకుపోయినాడు? నేనుగాని, సీతగాని వాడికేం అపకారం చేశాం? నా సీత ఏమైనా నాతో చెప్పమందా? అప్పుడామె స్థితి ఎట్లా ఉంది? వాడి బలపరాక్రమాలు ఎట్లాంటివి? వాడి ఆకారం ఎట్లా ఉంటుంది? వాడు ఏఏ పనులు చేస్తూ ఉంటాడు? వాడుండే చోటు ఎక్కడ? ఓపిక తెచ్చుకొని చెప్పు.

జటాయువు దీనంగా విలపిస్తూ, రాముని వైపు చూస్తూ క్షీణ స్వరంలో రాముడితో ఇట్లా అన్నాడు.

జటాయువు: రామా! వాడు రాక్షస రాజు. పేరు రావణుడు. మాయలు బాగా తెలిసినవాడు. మేఘాలలో ప్రయాణం చేస్తూ సీతను తీసుకొనిపోయాడు. రామా! నేను బాగా అలసిపోయి ఉండటం కనిపెట్టి నా రెక్కలు రెండూ విరిచేశాడు. తరువాత సీతను తీసుకొని ఆకాశమార్గాన దక్షిణ దిక్కుగా వెళ్ళాడు.

రామా! రావణుడు సీతను హరించిన ముహూర్తాన్ని 'విందముహూర్తం' అంటారు.

అంటే ఆ ముహూర్తంలో పోగొట్టుకున్న ధనం తిరిగి కొద్దికాలంలోనే ఆ యజమానికి లభిస్తుంది. ఈ విషయం వాడికి తెలుసో తెలియదో నాకు తెలియదు. కానీ, నాకు మాత్రం బాగా తెలుసు.

రామా! సీతాదేవిని హరించిన రావణుడు గాలాన్ని మింగిన చేపలాగా అతి త్వరలోనే నశించిపోతాడు. నువ్వు సీతను గూర్చి దుఃఖించకు. నువ్వు త్వరలోనే రావణాసురుణ్ణి వధించి సీతను పొందుతావు.

ఆ రావణాసురుడు విశ్రవసుని కుమారుడు. కుబేరుడికి సవతి సోదరుడు.

ఈ విధంగా చెప్తూ చెప్తూ ఉండగానే జటాయువు ప్రాణాలు గాలిలో కలసిపోయాయి. అంతట జటాయువు పాదాలు చాపి, శరీరం నేలపై పడగా శిరస్సు రాముడి ఒడిలోకి జారిపోయింది.

రాముడు: లక్ష్మణా! వృద్ధుడైన ఈ జటాయువు దండకారణ్యంలో ప్రశాంతమైన జీవితం గడుపుతున్నాడు. నా గురించి రావణుడితో యుద్ధం చేసి ప్రాణాలు వదిలాడు. కాలం ముంచుకువస్తే ఎవరూ తప్పించుకోలేరు గదా!

లక్ష్మణా! ఈ జటాయువు నాకు ఉపకారం చెయ్యాలనుకున్నాడు. తన రాజ్యాన్ని కూడా ఒదిలేశాడు. మనతో పాటే ఉంటున్నాడు. నాకు ఉపకారం చెయ్యాలని, సీతాదేవిని రావణుని చెర నుండి తప్పించాలని రావణాసురుడితో యుద్ధం చేసి ప్రాణాలు పోగొట్టుకున్నాడు.

ఓ లక్ష్మణా! మృగ, పక్షి జాతుల్లో కూడా సాధువులు, ధార్మికులు, శూరులు, స్నేహానికి ప్రాణం ఇచ్చేవారు ఉన్నారు కదా! ఓ పరంతపా! ఇప్పుడు సీతా వియోగం కన్నా ఎక్కువగా జటాయువు మరణం నన్ను కలచి వేస్తోంది. నేను పొందుతున్న వ్యధను చెప్పలేకపోతున్నాను. ఈ జటాయువు దశరథ మహారాజువలె మనకు పూజ్యుడు, పితృసమానుడు.

నాయనా! లక్ష్మణా! నీవు కట్టెలను పోగుచెయ్యి, చితిని పేర్చు. నా కోసం ప్రాణ త్యాగం

చేసిన ఈ మహనీయుడికి నేనే దహనసంస్కారాలు చేస్తాను.

గొప్ప బలశాలివైన గ్రద్దరాజా! యజ్ఞాలు చేసేవాడికి ఎటువంటి పుణ్యగతులు కలుగుతాయో, భూదానాలు చేసిన వారికి ఏఏ గతులు కలుగుతాయో, నీవు కూడా ఆయాగతులను పొందగలవు. నేను నీకు దహన సంస్కారాలు చేస్తున్నాను. నాచే సంస్కరించబడ్డ నీవు ఉత్తమోత్తమ లోకాలను పొందుతావు.

ధర్మాత్ముడైన రాముడు ఈ విధంగా పలుకుతూ జటాయువును చితిపైకి ఎక్కించి తన బంధువుకు చేసినట్లే దహనసంస్కారాలు చేశాడు. లక్ష్మణునితో కలసి అడవిలోనికి వెళ్ళి పెద్ద రోహిమృగాన్ని చంపి జటాయువుకు పిండప్రదానాలు చేయటానికి దర్భలు పరచాడు. అంతట రాముడు రోహిమృగ మాంసాన్ని ముద్ద చేసి, పచ్చిక బీడుపై ఉంచి జటాయువుకు పిండప్రదానం చేశాడు. చనిపోయిన వాళ్ళకోసం బ్రాహ్మణులు పఠించే వేదోక్తమైన మంత్రాలన్నీ రాముడే పఠించాడు. తరువాత రామలక్ష్మణులు ఇద్దరూ గోదావరీ నదికి పోయి జలతర్పణాలు వదిలారు. గోదావరీ నదిలో స్నానాలు చేసి మరల జలతర్పణాలు వదిలారు.

ఆ పక్షిరాజు పతివ్రత అయిన సీతకోసం ఏ ఆయుధాలూ లేకుండా రెక్కల కష్టంతో ఎదిరించాడు. అంత వృద్ధుడై ఉండి కూడా ఎవరూ చెయ్యలేని సాహసం చేశాడు; శౌర్యం చూపాడు; ధైర్యాన్ని ప్రదర్శించాడు. దశరథ మహారాజు ఎడలగల స్నేహంకోసం ప్రాణాల్నే వదిలాడు. మహర్షి అయిన జటాయువుకు రాముడు దహన సంస్కారాలు చేశాడు. జటాయువు అప్పటికప్పుడే పుణ్యలోకాలకు చేరుకున్నాడు. అంతేకాదు ఇహలోకాన శాశ్వతమైన కీర్తిని సంపాదించుకున్నాడు. సీతారాముల కథ చెప్పుకున్నంత కాలం జటాయువును స్మరిస్తూ ఉంటారు.

రామలక్ష్మణులు జటాయువుకు పిండోదకాలు సమర్పించి, జటాయువు చెప్పిన గుర్తులు పట్టుకొని సీతాదేవిని వెదకటానికి స్థిరమైన చిత్తంతో అక్కడ నుండి బయలుదేరారు.

## 69వ సర్గ కబంధుడు రామలక్ష్మణుల్ని బంధించడం

రామలక్ష్మణులు జటాయువుకు దహన సంస్కారాలు చేసి జనస్థానం నుండి పశ్చిమ దిక్కుగా సాగిపోయారు. ఆ ప్రాంతాలన్నీ చెట్లతోను, తీగలతోను, పొదలతోను నిర్మానుష్యంగా ఉన్నాయి. ఆ మార్గాన ఎవరూ వెళ్ళిన గుర్తులు ఎక్కడా కనపడలేదు. రామ లక్ష్మణులు మాత్రమే ధనుస్సు బాణాలు, ఖడ్గం ధరించి ధైర్యంగా ప్రయాణం సాగించారు. పెద్దపులులు, సింహాలు వంటి క్రూరమృగాలు అనేకం ఎదురయ్యారు. భయంకరమైన విషసర్పాలను చూశారు.

జనస్థానం వదలి మూడు కోసుల దూరం నడిచారు. క్రౌంచారణ్యంలోకి ప్రవేశించారు. మధ్యమధ్య ఆగుతూ, అడవి అంతా గాలిస్తూ సీతకోసం వెదికారు. వారు క్రౌంచారణ్యాన్ని కూడా దాటి తూర్పు దిక్కుగా మరో మూడు కోసుల దూరం ప్రయాణం చేశారు. ఆ ప్రదేశం కూడా అనేక క్రూరమృగాలతో నిండి ఉంది. ఆ అడవి ఎంత దట్టంగా ఉందంటే పట్టపగలే చిమ్మచీకట్లు కమ్మేసి ఉంది. కన్ను పొడుచుకున్నా దారి కనిపించేది కాదు. ఏ ప్రక్క నుండి ఏ క్రూరమృగం మీద పడుతుందోనని చాలా అప్రమత్తులై ప్రయాణం చేశారు. ఇంతలో వారొక గుహను సమీపించారు. ఆ గుహ దగ్గర వికృతాకారంలో ఉన్న రాక్షస స్త్రీ ఒకతె కూర్చుని ఉంది. రామలక్ష్మణులిద్దరూ ఆ రాక్షసిని చూశారు. ఆ రాక్షసి ఆకారం పగలు చూస్తే రాత్రి కల్లోకి వచ్చేటంత వికృతంగాను భయంకరంగాను ఉంది. దుర్బలులైతే అక్కడికక్కడే గుండె ఆగి చస్తారు. చూట్టానికే మహా క్రూరంగా కనిపిస్తోంది. వేలాడుతూ ఉండే పెద్ద పొట్ట. తీక్షణమైన కోరలు. ఎగుడుదిగుడుగా ఉండే అవయవాలు. బిరుసైన మందపాటి చర్మం. విరబోసుకున్న జుట్టు. చాలా వికృతంగా ఉంది.

ఆ రాక్షసి రామలక్ష్మణులను సమీపించింది. లక్ష్మణుడి దగ్గరకు పోయి "రా, రమిద్దాం" అని అంటూ లక్ష్మణుడి చెయ్యిపట్టుకుని కౌగలించుకుంది. లక్ష్మణుడు ఆమెను విదలించి కొట్టి, ఖడ్గంతో ఆమె ముక్కు, చెవులు, స్తనాలు కోసివేశాడు. దాంతో భయపడిపోయిన ఆ రాక్షసి

అడవుల్లోకి పారిపోయింది. తరువాత శత్రుసంహారకులైన రామలక్ష్మణులిద్దరూ అడవిలో ప్రయాణం కొనసాగించారు. అలా కొంతదూరం వెళ్ళాక లక్ష్మణుడు రామునికి నమస్కరించి ఇట్లా అన్నాడు.

లక్ష్మణుడు: అన్నా! నా ఎడమ కన్ను అదురుతోంది, ఏదో ఆపద వస్తోందని నాకు అనిపిస్తోంది. సిద్ధపడి ఉండాలి. మనకు మేలు జరిగేట్లుగా చూడు. అయితే గుడ్డిలో మెల్ల అన్నట్లుగా వంచులక పక్షి విడవకుండా కూస్తున్నది – ఇది శుభాన్నే సూచిస్తోంది. జయం మన ప్రక్కనే ఉంటుందని దాని అర్థం.

వాళ్ళిద్దరూ అట్లా మాట్లాడుకుంటూ అడవిలో అన్నిచోట్లా సీతకోసం వెతుక్కుంటూ ముందుకు పోయారు. ఇంతలో వృక్షాలన్నీ ఊగిపోతూ పెనుగాలులు వీచాయి. భయంకరమైన శబ్దం అయింది. ఆ భయంకర ధ్వని ఏ ప్రక్కనుండి వస్తున్నదా అని నాలుగు పక్కలా కలయచూశారు.

అంతలో ఒక పొదలో కూర్చున్న భయంకరాకారంతో ఉన్న ఒక రాక్షసుణ్ణి చూశారు. వాడి వక్షస్థలం విశాలమైన ఒక పెద్ద కొండలాగా ఉంది. వాడికి తలలేదు, మొండెం మాత్రమే ఉంది. వాడికి పొట్టలోనే పెద్ద నోరు, విశాలమైన ఒకే ఒక్క కన్ను ఉన్నాయి. వాడి ఒళ్ళంతా వెంట్రుకలు దట్టంగా ఉన్నాయి. అయితే అవన్నీ సూదుల్లాగా మొనలుతేలి ఉన్నాయి. కనుగుడ్లు తేనెరంగులో ఉన్నాయి, కనురెప్పలు పెద్ద తేనెపట్టంత ఉన్నాయి. వాడికి ఉన్నది ఒకటే కన్ను అయినా అది ఎన్నో క్రోసులదూరాన ఉన్న వస్తువుల్ని చూడగలదు. చిమ్మచీకట్లలో కూడా వాడి కన్ను మండుతూ కొరివిదయ్యంలా కనిపిస్తుంది. పెద్ద పెద్ద కోరలున్నాయి, ఎప్పుడూ పాములాగా నాలుక ఆడిస్తూ ఉంటాడు, వాడి చేతులు రెండూ భయంకరంగా ఉన్నాయి. వాడు చేతుల్ని యోజనం దూరందాకా చాపుతూ ఉంటాడు. వాడు రెండు చేతులూ అలా చాచి ఒక యోజనం దూరంలో ఉండే సింహాల్ని, ఏనుగుల్ని పట్టుకొని దగ్గరకు లాక్కొని మింగేస్తూ ఉంటాడు. ఏనుగంత జంతువైనా సరే, వాడికి ఇష్టం లేకపోతే విసిరి పారేస్తాడు. ఆ జంతువు అట్లా ఆరేడు

యోజనాల దూరానపడి చచ్చి ఊరకుంటుంది.

ఆ దారిన వస్తున్న రామలక్ష్మణుల్ని ఆ రాక్షసుడు రెండు చేతుల్తో పట్టుకొన్నాడు. తరువాత విదిలించి అవతలపారేశాడు, వారిద్దరూ క్రోసెడు దూరానపోయి పడ్డారు. అప్పుడు వాళ్ళిద్దరినీ కోసెడు దూరంలోనే రెండు చేతులతో అదిమిపట్టాడు. వాడట్లా చెత్తోనొక్కి పట్టగానే వాళ్ళకు ఊపిరి ఆడలేదు. ఉక్కిరి బిక్కిరి అయిపోయారు. వాళ్ళ చేతుల్లో ఉన్నా ఆయుధాలు ఉపయోగం లేకుండాపోయాయి. రాముడు మాత్రం ధైర్యాన్ని కోల్పోలేదు, లక్ష్మణుడు మాత్రం ధైర్యాన్ని కోల్పోయాడు. ప్రాణాలపైన ఆశ వదులు కున్నాడు, రాముడితో ఇట్లా అన్నాడు.

లక్ష్మణుడు: అన్నా! నన్ను రాక్షసుడు ఉడుంపట్టు పట్టాడు, ఊపిరి ఆడటమే కష్టంగా ఉంది. నీవు ఎట్లాగో బైటపడు, నాకోసం విచారించకు. నన్ను వాడు తింటేతిననీ, నా కోసం నువ్వుకూడా బలి కావద్దు. ఎట్లాగో బయటపడి సీతాదేవిని కలుసుకో. ఆమెను తీసుకొని అయోధ్యకు త్వరగా చేరుకో. మన పూర్వీకుల రాజ్యమైన అయోధ్యను జనరంజకంగా పాలించు. భరతుణ్ణి, తల్లులను అడిగానని చెప్పు. ఎప్పుడైనా నన్ను తలచుకో. వెంటనే బైటపడు.

రాముడు: తమ్ముడా! నీవు వీరుడవు. నీవంటి వాళ్ళు ఇట్లా భయపడిపోకూడదు.

వాళ్ళిద్దరూ ఈ విధంగా మాట్లాడుకుంటూ ఉండగానే కబంధుడు అనే రాక్షసుడు ఇట్లా అన్నాడు.

కబంధుడు: ఎవరు మీరు? ఆబోతులవంటి భుజాలు కలిగి ఉన్నారు. భుజాన ధనుస్సు, బాణాలు, ఖడ్గం వ్రేలాడేసుకున్నారు. మీరు ఏం పని మీద వచ్చారు. బాగా ఆకలిగా ఉంది. మిమ్మల్ని తిని ఈ పూటకు ఆకలి తీర్చుకుంటాను. మీ ఆయుధాలు మిమ్మల్ని కాపాడలేవు, నా నోటి వద్ద వచ్చిన ఆహారాన్ని వదులుతానా? ఇక మీ ఆయుర్దాయం తీరిపోయింది.

రాముడు: నాయనా! లక్ష్మణా! నువ్వు సత్య పరాక్రమవంతుడివి, మనకు కష్టంమీద కష్టం

వచ్చిపడుతోంది. సీత ఎడబాటులోనే దుఃఖీస్తున్న మనకు ఇప్పుడు ప్రాణాలే దక్కేట్లులేవు.

లక్ష్మణా! నీవు పెద్దపులి వంటివాడవు. ఎంతటి వారయినా కాలానికి తల ఒగ్గవలసిందే. కాలాన్ని ఎదిరించి ఎవరూ నిలబడలేరు. ఎంతటి బలవంతులైనా, ఎంతటి శాస్త్రవేత్తలైనా యుద్ధభూమిలో కాలానికి కట్టుబడి ఉండాల్సిందే. ఇసుకతో కట్టిన ఆనకట్ట నదీ ప్రవాహానికి కొట్టుకుపోక తప్పదు.

కాబట్టి కబంధుణ్ణి మనం జయిస్తామా? లేక మనల్ని ఈ కబంధుడు జయిస్తాడో కాలమే నిర్ణయిస్తుంది. నీవు ధైర్యం కలవాడవు, వీరుడవు, అధైర్యపడవద్దు. మన శాయశక్తులా పోరాడదాం. ఫలితాన్ని కాలానికి ఒదిలేద్దాం.

ఈ విధంగా సత్య పరాక్రమవంతుడు, దృఢసంకల్పం కలవాడు అయిన రాముడు లక్ష్మణుడికి ధైర్యంచెప్పి కార్యోన్ముఖుణ్ణి చేశాడు.

# 70వ సర్గ కబంధుని భుజాలు నరకడం

కబంధుడు రామలక్ష్మణుల్ని తన చేతులతో పట్టుకొని నెమ్మదిగా తనకు దగ్గరగా తెచ్చుకున్నాడు. తరువాత వాళ్ళతో ఇట్లా అన్నాడు.

కబంధుడు: ఓ క్షత్రియుల్లారా! భగవంతుడే మిమ్మల్ని నా దగ్గరకు ఆహారంగా పంపాడు. మీ ఆయుధాల వల్ల ఏమీ ప్రయోజనంలేదు. మీరు మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చున్న కొద్దీ నాకు ఆకలి పెరిగిపోతోంది.

అంటూ వారిద్దరినీ చెరో భుజంపైకి తెచ్చుకున్నాడు.

లక్ష్మణుడు: అన్నా! కొద్ది క్షణాల్లో మనిద్దరినీ మింగటానికే తనకు దగ్గరగా చేర్చుకున్నాడు. వీడి బలం అంతా భుజాల్లోనే ఉన్నట్లుంది. వాడికి కాలం చెల్లినట్లుంది. అందుకనే మనల్ని వాడి భుజాల మీదకు తెచ్చుకున్నాడు. ఇదే మంచి అదను, మనిద్దరం వీడి భూజాల్ని నరికి నేలపై పడేట్లు చేద్దాం. ప్రస్తుతానికి ఇదే మంచి మార్గంగా అనిపిస్తోంది.

రామా! నీవు రాజువు. యజ్ఞం కోసం తెచ్చిన పశువుల్ని చంపటం ఎట్లా నింద్యమో కదలలేని వారినికూడా చంపడం నింద్యం.

రామలక్ష్మణులు మాట్లాడుకునేదంతా వింటున్న కబంధుడు కుపితుడయ్యాడు. వారిద్దరినీ మింగటానికి నోరు పెద్దగా తెరిచాడు. తరువాత దేశకాలాలను ఎరిగిన రామలక్ష్మణులు వాడిలో వచ్చిన కదలికలకు ఎంతో సంతోషించి అతడి చేతులను భుజాల వరకు నరికివేశారు. రాముడు కబంధుడి కుడిచెయ్యిని నరుకగా, లక్ష్మణుడు వాడి ఎడమచెయ్యిని నరికాడు.

రెండు చేతులూ తెగి నేలపై పడగానే ఆ కబంధుడు భూమీ ఆకాశం దద్దరిల్లేటట్లుగా, దిక్కులు పక్కటిల్లేటట్లుగా కేకలువేస్తూ నేలకొరిగాడు. తెగి పడిపోయిన రెండు చేతుల్నీ

చూసుకున్నాడు. శరీరంలోనుండి రక్తం ప్రవాహంగా కారి నేల అంతా మడుగు అయింది. ఆ రక్తపుమడుగులో పడి దొర్లుకుంటూ, ఏడుస్తూ కొంతసేపైన తర్వాత తెప్పరిల్లుకొని "ఎవరు మీరు" అని అడిగాడు. అప్పుడు లక్ష్మణుడు ఇట్లా చెప్పాడు.

లక్ష్మణుడు: ఇతడు ఇక్ష్వాకుల వంశంలో పుట్టినవాడు. పేరు రాముడు. నేను ఇతడి తమ్ముడను, నా పేరు లక్ష్మణుడు. నా అన్న రాముడు దేవతలవంటి శౌర్యపరాక్రమములు గలవాడు. మేము దండకారణ్యంలో నివసిస్తూ ఉండగా ఇతడి భార్యను రాక్షసుడొకడు అపహరించుకొనిపోయాడు. ఆమెను వెతుకుతూ ఇక్కడకు వచ్చాం. నీ వెవరవు? నీకు ముఖం లేకుండా మొండెం మాత్రమే ఉంది. ఎందువల్ల? కాళ్ళు లేకుండా ఎందువల్ల ఈ అరణ్యంలో పడి ఉన్నావు?

కబంధుడు (సంతోషంతో) : ఓ పురుష శ్రేష్ఠులారా! మీకు శుభం అగుగాక! నా అదృష్టవశాత్తే మీరు నా చేతులు నరికారు. మిమ్మల్ని చూసే భాగ్యం కలిగింది. నాకీ వికృత రూపం ఎట్లా వచ్చిందో, ఎందుకు వచ్చిందో వివరంగా చెప్తాను వినండి.

# 71వ సర్గ కబంధుని వృత్తాంతం

ఓప్రభూ! గొప్ప బాహువులు గలవాడా! అధికమైన బల పరాక్రమాలు గలవాడా! రామా! నీకు ప్రణామాలు. పూర్వం నేను సూర్యచంద్రుల్లాగా, దేవేంద్రుడిలాగా అతిలోక సుందరమైన రూపాన్ని కలిగి ఉండేవాడిని. అటువంటి నేను మునుల్ని, ఋషుల్ని ఆట పట్టించేందుకు ఈ వికృత రూపాన్ని ధరించి అక్కడక్కడా తపస్సు చేసుకుంటున్న ఋషులను భయపెడుతూ ఉండేవాడిని. ఒక రోజున స్థూలశిరస్కుడనే మహర్షి కందమూలాల కోసం వెతుక్కుంటూ ఉంటే ఈ రూపంలో వెళ్ళి ఆయనను భయపెట్టాను. ఆయనకు నాపై విపరీతమైన కోపం వచ్చి "నీకు ఇటుపైన క్రూరము, నింద్యము అయిన ఈ రూపమే ఉండుగాక!" అని శపించాడు. ఆ శాపానికి భయపడిపోయాను. నా అపచారాన్ని క్షమించమని కాళ్ళా వేళ్ళాపడి ప్రార్థించాను. అంతట ఆయన నా యందు కరుణ కలిగినవాడై "జనశూన్యమైన అడవిలో ఎప్పుడు రాముడు వచ్చి నీ చేతులు నరుకుతాడో, అప్పుడు నువ్వు తిరిగి నీ అందమైన రూపాన్ని పొందుతావు" అని చెప్పాడు.

లక్ష్మణా! నా పేరు దనువు. ముని శాపం ఇచ్చిన తర్వాత నేను బ్రహ్మదేవుని గూర్చి ఘోర తపస్సు చేశాను. నేను బ్రహ్మను మెప్పించాను. ఆయన నాకు దీర్ఘాయువును ప్రసాదించాడు. ఆ వరంతో నేను గర్వపోతునయ్యాను. నాకు ఇంద్రునిపై శతృత్వం ఉండేది. దీర్ఘాయువునైన నన్ను దేవేంద్రుడు ఏం చేయగలడు లెమ్మని దేవేంద్రుణ్ణి ఎదిరించాను. దేవేంద్రుడు నాపై వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. ఆ వజ్రము నా తలను, రెండు తొడల్ని నా దేహంలోనికి చొచ్చుకుపోయేట్లు చేసింది. బ్రహ్మదేవుడు పూర్ణాయుర్దాయాన్ని ప్రసాదించటంవల్ల మిగిలిన ఈ మొండంతోనే జీవిస్తున్నాను. దేవేంద్రుడు నా పట్ల దయతలచి ఆహార సేకరణకై నాకు యోజనం పొడవుగల బాహువులు అనుగ్రహించాడు. అప్పటినుండి నా పొడవాటి చేతులతో ఏనుగుల్ని, పెద్దపులుల్ని ఇంకా ఇతర క్రూరమృగాల్ని దగ్గరకు లాక్కుని వాటిని తింటూ కాలం గడుపుతున్నాను. దేవేంద్రుడి శాపం తర్వాత మళ్ళీ ఆయనను శాప విమోచనానికై ప్రార్థిస్తే ఆయనా ఇదే చెప్పాడు.

“రాముడు వచ్చి నీ బాహువుల్ని ఎప్పుడు నరుకుతాడో ఎప్పుడు నీకు నీ పూర్వ రూపం వస్తుంది” అని అన్నాడు. రాముడు ఎప్పుడు వస్తాడా? నాకు ఎప్పుడు శాపవిమోచనం అవుతుందా? అని ఎదురుచూస్తున్నాను.

ఓ రామా! నీవే ఇంత కాలానికి వచ్చావు, నా చేతులు రెండూ నరికావు. ఇక నీవు నాకు దహన సంస్కారాలు చెయ్యి. ఆ తరువాత నేను నా పూర్వరూపం పొంది మీకు సీతాన్వేషణకు అవసరమయ్యే ఆలోచన చెప్తాను. మీకు సహాయపడే స్నేహితుల్ని చూపించగలను.

అంతట రాముడు దనువుతో తన వృత్తాంతం లక్ష్మణుడు వింటూ ఉండగా ఇట్లా చెప్పాడు: నేనూ, నా తమ్ముడూ జనస్థానంలో మా ఆశ్రమం విడిచి బయటకు వెళ్ళాం. మేము లేని సమయం చూసి రావణుడనే రాక్షసుడు నా భార్య సీతను అపహరించుకుని పోయాడు. అతడి పేరు రావణుడని మాత్రమే తెలుసు. అతడు ఎక్కడ ఉంటాడో తెలియదు. అతడు ఎట్లా ఉంటాడో తెలియదు. అతడి శక్తి సామర్థ్యాలు అసలే తెలియవు. మేము దుఃఖంతో దారి తెలియక సీతను వెతుక్కుంటూ అడవులన్నీ తిరుగుతున్నాం. మా వల్ల నీవు ఉపకారం పొందావు. నీవు కూడా సీతాన్వేషణలో మాకు చేతనయిన సహాయం చేస్తే బాగుంటుంది.

తరువాత లక్ష్మణునితో “వీరుడా! అడవిలో ఏనుగులు విరిచిన ఎండిన కొమ్మలుంటాయి. వాటిని పోగుచేసి, పెద్ద గొయ్యి తవ్వి అందులో ఇతణ్ణి దహనం చేద్దాం” అంటూ “సీతను గూర్చిన వివరాలన్నీ మాకు చెప్పి పుణ్యం కట్టుకో” అన్నాడు దనువుతో.

దనువు: రామా! నాకు దివ్యదృష్టి లేదు. కనుక సీత ఇప్పుడు ఎక్కడ ఉందో చెప్పలేను. మీరు నన్ను దహనం చేసిన తర్వాత నా నిజరూపాన్ని పొంది, సీతను వెతికే సామర్థ్యం ఉన్నవారిని చూపుతాను. వారి ద్వారా నీవు నీ కార్యాన్ని సాధించుకో గలుగుతావు. రామా! శాప ప్రభావం చేత నాలో ఉన్న దివ్యశక్తి మరుగున పడిపోయింది. ఈ దేహం లోకులచేత నిందించబడ్డది. కాబట్టి దీన్ని తక్షణమే దహనం చెయ్యాలి. అప్పుడే నేను మీకు

సహాయపడగలను. రామా! నీవు స్నేహం చేయబోయే వ్యక్తి మహా పరాక్రమవంతుడు. ముల్లోకాల్లోనూ అతడికి తెలియని విషయం ఏమీలేదు. సీతాన్వేషణలో మీకు గొప్పగా సహాయ పడగలడు. నీవు తప్పక అతడితో స్నేహం చేసుకోవాలి.

# 72వ సర్గ సుగ్రీవునితో స్నేహం చేయమని కబంధుడు చెప్పటం

కబంధుడు కోరినట్లు రామలక్ష్మణులు కబంధుని శరీరాన్ని లోయలోనికి తోసి, ఎండిన కొమ్మలు కప్పి కొరవులతో నిప్పు ముట్టించి దహనం చేశారు. కబంధుడి శరీరం నిండా కొవ్వు పేరుకొని ఉండటం వల్ల ఆ వేడికి కరిగి మంటలు రెట్టింపైనాయి. అలా కబంధుని శరీరం దహించబడగానే, శుభ్రమైన దుస్తులు ధరించి పుష్పములతోను, విచిత్రమైన అలంకారాలతోను పొగలేని అగ్నిలాగా దనువు ఆ చితినుండి పైకి లేచాడు.

అప్పుడు కబంధుడు ఆకాశంలో తనకై వేచివున్న హంసలు కట్టిన విమానాన్ని ఎక్కి మహాతేజస్సు కలవాడై రాముడితో ఇట్లా అన్నాడు.

దనువు: రామా! లోకంలో ఏదైనా కార్యం సాధించాలంటే సంధి, విగ్రహం, యానం, ఆసనం, ద్వైదీభావం, సమాశ్రయం అనే ఆరు ఉపాయాలను ఆశ్రయించాలి. ఒకడు దుర్దశలో ఉన్నప్పుడు, దుర్దశలో ఉండే మరొకడితో చేరి పనులు చక్కబెట్టుకుంటాడు.

ఓ రామా! నీ భార్యను ఎవడో అపహరించినందువల్ల నీవు దురవస్థలో ఉన్నావు. నీ మూలంగా లక్ష్మణుడూ దురవస్థలో పడిపోయాడు. అంటే మీ ఇద్దరికీ ఈ విషయంలో మరో దుర్దశచేత బాధపడుతున్నవాడి సహాయసహకారాలు అవసరపడతాయి. కాబట్టి అటువంటి వాడితోనే స్నేహం చేసుకోవాలి. రామా! నేను బాగా ఆలోచించి, నీకు మేలు జరగాలని నిండుమనస్సుతో చెబుతున్నాను. నీవు అతడితో తప్పక స్నేహం చేసుకో, నీవు తలపెట్టిన కార్యాన్ని సాధిస్తావు.

రామా! సుగ్రీవుడనే వానరరాజు ఒకడున్నాడు. అతడు స్నేహనికి శ్రేష్ఠమైనవాడు. అతడికి ఒక అన్న ఉన్నాడు. అతడి పేరు వాలి. ఆ వాలి దేవేంద్రుడి పుత్రుడు, మహా పరాక్రమవంతుడు. వాలికి ఒక రోజున సుగ్రీవుడిపై కోపంవచ్చి, దేశంనుండి వెళ్ళగొట్టాడు. అంతట ఆ సుగ్రీవుడు

మరో నలుగురు స్నేహితులతో కలసి పంపా సరోవరం దగ్గర, ఋష్యమూక పర్వతంపైన నివసిస్తున్నాడు.

ఆ సుగ్రీవుడు అమిత బలవంతుడు, కాంతిమంతుడు, సత్యసంధుడు, వినయం కలవాడు. ధైర్యస్థుడు. అటువంటి సుగ్రీవుణ్ణి వాలి దేశాన్నుండి వెళ్ళగొట్టాడు. సుగ్రీవుడుకి ఎన్ని సద్గుణాలున్నా కాలాన్ని అతిక్రమించలేడు గదా? అందువల్లనే కాలానికి తలవంచి ఋష్యమూక పర్వతంపై ఉంటున్నాడు. కాబట్టి నీవు వెళ్ళి సుగ్రీవుడితో స్నేహం చేసుకో. ఒకరికొకరు ద్రోహం తలపెట్టకుండా అగ్నిదేవుణ్ణి సాక్షిగా పెట్టుకోండి – ఆ సుగ్రీవుడు కూడా ఇతరుల సహాయం పొంది తన పూర్వ వైభవం పొందాలని చూస్తున్నాడు. కాబట్టి నువ్వు వెళ్ళి అడిగితే చులకనగా చూడడు. పైపెచ్చు గంతేసి నిన్ను నెత్తిన పెట్టుకొని పూజిస్తాడు.

నీవుకూడా అతడికి కావలసినపని చేసిపెట్టు, అతడు కామరూపుడు, కృతజ్ఞత గలవాడు. అందువల్ల నీవు చేసిన సహాయాన్ని మరవకుండా తిరిగి నీకు సీతాన్వేషణలో పెద్దగా సహాయపడగలడు.

సుగ్రీవుడు 'ఋక్షరజస్సు' అనేవాడి క్షేత్రజుడు. సూర్యుడి వీర్యానికి పుట్టినవాడు. వాలితో విరోధం వచ్చినప్పటినుండి పంపానదీతీరాన నివసిస్తున్నాడు. మీరు వెంటనే ఋష్యమూక పర్వతానికి వెళ్ళండి. ఆయుధాల్ని అగ్నిని సాక్షులుగా పెట్టుకొని ప్రమాణాలు చేసుకోండి. సుగ్రీవుడు నరమాంస భక్షకులైన రాక్షసుల నందరినీ బాగా ఎరుగును. వాళ్ళు సుగ్రీవుడికి బాగా తెలియటంవల్ల నీ పని ఇంకా సులువు అవుతుంది.

ఓ రామా! ఈ లోకంలో సూర్యరశ్మి ఏ యే ప్రాంతాల్లో పడుతుందో ఆ ప్రాంతాలన్నీ సుగ్రీవుడికి తెలుసు. అతడి సైన్యమంతా వానరులే కావటంవల్ల వనాలు, పర్వతాలు, దుర్గమమైన అరణ్యాలు పర్వత గుహలు ఇవన్నీ సునాయాసంగా వెదకి, నీ భార్య సీత ఎక్కడున్నదీ తెలుసుకోగల సమర్థులు. రామా! ఆ మహా పతివ్రత నీ వియోగంతోను, ఆ రాక్షసుల చెరలోనూ

ఎన్ని కష్టాలు పడుతోందో గదా! అందుకని ఇకపై ఒక్క క్షణంకూడా వ్యర్థం చెయ్యవద్దు. వెంటనే వెళ్ళి సుగ్రీవుణ్ణి కలుసుకో.

## 73వ సర్గ కబంధుడు ఋష్యమూక పర్వతానికి దారి చెప్పటం

కబంధుడు రామునికి సీతాదేవిని వెదికి తెచ్చేందుకు సుగ్రీవునితో స్నేహం చేసుకోమని సలహా ఇవ్వటమే కాకుండా, రాముడు ఏమాత్రం ఆలస్యం చేయకూడదని ఋష్యమూకానికి వెళ్ళేమార్గం కూడా చెప్పాడు.

కబంధుడు: రామా! ఇక్కడనుండి పడమట దిక్కుగా కొంతదూరం పోయిన తర్వాత మారేడు, నేరేడు, పనస, మామిడి, జువ్వి, మర్రి, కొండగోగు, పొన్న, కానుగు మున్నగు అనేక వృక్షాలతో కూడిన అడవి వస్తుంది. ఆ వృక్షాల నడుమనుంచి చక్కని కాలిబాట లుంటాయి. వాటి గుండా కొంత దూరం ప్రయాణంచేస్తే, నందనవనంలాగాను, ఉత్తర కురుదేశంలాగాను మనోహరంగా ఉండే ఇంకో వనం వస్తుంది. ఆ వనంనిండా తేనెలోలికే అనేక ఫలజాతులుంటాయి. ఆ ఫలాలన్ని కుబేరుడి చైత్రరథవనంలో దొరికేటంత శ్రేష్ఠమైనవి. అక్కడున్న వృక్షాలకొమ్మలన్నీ ఫలాల బరువుకు వంగి నేలను తాకుతూ ఉంటాయి. మేఘాల సముదాయం వచ్చి నేలపై పరచుకున్నట్లుంటాయి; పండ్లన్నీ చేతికి అందుతూ ఉంటాయి. కడుపుకు పట్టినన్ని తింటూ వెళ్ళండి. కొంతదూరం పోతే మీకు పంపా సరస్సు కనిపిస్తుంది. అక్కడ కొండచరియలన్నీ నడిచేందుకు అనుకూలంగాను, సుఖంగానూ ఉంటాయి. ఆ పర్వత సానువుల్లో ఎక్కడా జారుడు బండలు కనబడవు. ఆ పంపా సరస్సుకు చాలా రేవులున్నాయి, ఏ రేవులోనూ పాచిపట్టి ఉండదు. ఇసుకనేల కావటాన ఆ సరస్సునిండా పద్మాలు, కమలాలు, నల్లకలువలు ఏ కాలంలోనైనా విరగబూస్తూ ఉంటాయి.

రామా! ఆ పంపా సరోవరానికి అల్లంత దూరాన ఉండగానే నీరుకోళ్ళు, క్రౌంచపిట్టలు, కురురపిట్టలు, హంసలు ఇంకా ఎన్నో మనోహరమైన పక్షులు నీ కంటపడుతాయి. అవన్నీ నిర్భయంగా నీ మీద వాలి వినోదించి వెళ్ళిపోతాయి. అవి మనుష్యులంటే భయపడవు. ఎందువల్లనంటే ఆ ప్రాంతాలకు మనుష్యులెవరూ వెళ్ళి వాటికి అపకారం చెయ్యరు గనుక. అవి

బాగా బలిసి ఉంటాయి. వాటి మాసం వెన్నలాగా మెత్తగా బాగా ఉంటుంది.

రామా! ఆ పంపా సరోవరంనిండా గండుచేపలు, సొరచేపలు, రొయ్యలు ఇంకా అనేక రకాలైన చేపలు దొరుకుతాయి. నీ యందు ఎంతో భక్తిగల లక్ష్మణుని ఆ చేపలను పట్టి ముళ్ళుతీసి ఇనుప ఊచకు గుచ్చి కాల్చితెచ్చి ఇమ్మని చెప్పు. అవి తినటానికి ఎంతో రుచిగా ఉంటాయి. నువ్వు వాటిని తింటూవుంటే, అతడు తామరాకులలో చల్లటి పంపాజలాల్ని పట్టి తెచ్చి నీకు అందిస్తాడు. ఆ పంపా జలాలు మంచి ముత్యాల్లాగా మెరుస్తూ ఉంటాయి. చక్కటి సుగంధాలతో ఘుమఘుమలాడుతూ ఉంటాయి, ఆ నీళ్ళు. నీ ఆరోగ్యానికి కూడా మంచిది.

రామా! పంపానదీ తీరాన నివాసయోగ్యమైన కొండగుహలు చాలా ఉన్నాయి. నిద్రపోయి లేచి వెళ్ళి ఆ పంపాతీరాన కూర్చుంటే అడవి పందులు నీళ్ళు తాగటానికి రావటం నువ్వు చూస్తావు. అవి బాగా బలిసి ఉంటాయి. ఆబోతుల్లాగా రంకెలు పెడ్తాయి. రామా! పంపాతీరాన చెట్లన్నీ విరగబూసి ఉంటాయి. పంపాజలాలనుండి వచ్చే చల్లని గాలులు నీ దుఃఖాన్ని పోగొడతాయి. విరగబూసిన పూలను చూస్తూ దుఃఖాన్ని మరచిపోతావు. ఆ పూలు వాడవు, రాలవు. నిత్యనూతనంగా ఉంటాయి. దాని వెనుక ఉన్న కథ ఏమంటే, పూర్వం మతంగ మహర్షి తన శిష్యులతో కలసి తపస్సు చేసుకునేవాడు. ఆయన శిష్యులంతా గురువుకు కందమూలాలు సేకరించి తెచ్చేవారు. అప్పుడు వాళ్ళ శరీరం అంతా చెమటలు పట్టేవి. వారి చెమట బిందువులు ఆ వృక్షాల మొదళ్లలో పడి తడవడం వల్ల వారి తపఃప్రభావంచేత వాటికి పూసేపూలు వాడవు; రాలవు. మతంగ మహర్షి శిష్యులంతా స్వర్గస్థులైనా, వారి పరిచారిక శబరి చిరంజీవిగా ఇంకా అక్కడే ఉంది. ఆమె గురుసేవలను మరువలేదు.

ఓ రామా! నీవు దేవుడితో సమానం. సర్వ ప్రాణకోటి నీకు నమస్కరిస్తోంది. ఆ శబరి నీ కోసం నిరీక్షిస్తోంది. నీ దర్శనం చేసుకున్న తర్వాతే ఆమె స్వర్గానికి పోతుందట. రామా! నీవు పంపాసరస్సు పడమటి గట్టుకుపోతే ఒక నిగూఢమైన ప్రదేశంలో శబరి ఆశ్రమం కనబడుతుంది. ఆ వనంలోను ఋష్యమూక పర్వతప్రాంతాన రకరకాల ఏనుగులున్నాయి.

మతంగ మహర్షి నిర్మించిన వనం కావటాన, ఆ ఏనుగులు ఆశ్రమంలోనికి పోవు. అనేక రకాల పక్షుల కిలకిలారావాలు నీ దుఃఖాన్ని ఉపశమింప చేస్తాయి. సరస్సును ఆనుకునే ఋష్యమూక పర్వతం ఉంది. దానిపై అనేక వృక్షజాతులున్నాయి. అవి అన్ని కాలాల్లోనూ పువ్వులు పండ్లతో సమృద్ధిగా ఉంటాయి. ఆ పర్వతాన్ని ఏనుగు పిల్లలు కాపలాకాస్తూ ఉంటాయి. అందువల్ల అందరూ ఆ పర్వతం పైకి అంత సులభంగా వెళ్ళలేరు. ఆ పర్వతం బ్రహ్మచేత నిర్మించబడ్డది ఆ పర్వతంపై నిద్రించిన పురుషుడు ఏమి కలకన్నా నిద్రలేవగానే దానిని పొందుతాడు. పాపాత్ముడు, దురాచారపరుడు ఎవరూ ఆ పర్వతంపైకి ఎక్కలేరు. ఒకవేళ ఎక్కినా, రాక్షసులు వారిని నిద్రలోనే చంపేస్తారు. అందువల్ల అంతా ఆ పర్వతం పైకి వెళ్ళడానికి భయపడతారు.

రామా! మతంగాశ్రమంలో నివసించే ఏనుగులు పంపా సరస్సులో జలకాలాడుతున్నప్పుడు, వాటి కేరింతలు పర్వతం పైకి వినపడుతూ ఉంటాయి. ఆ ఏనుగులు పోట్లాడుకుంటున్నప్పుడు రక్తం ధారలుకడ్తాయి, గుంపులుగా తిరిగేవన్నీ చెట్టుకొకటి పుట్టకొకటిగా పరుగులు తీస్తాయి. జలకాలాటలంటే ఇష్టపడే ఏనుగుల మందలు సరస్సులో స్వేచ్ఛగా సంచరించి, నీళ్ళు తాగి పోతూ ఉంటాయి.

సరస్సులో నీరు తాగటానికి వచ్చే ఎలుగుబంట్లు, పులులు, ఇంద్రనీలం వంటి కాంతిగల నల్లచారల దుప్పులను చూస్తూ దుఃఖాన్ని మరచిపోవచ్చు.

కకుత్థ్స వంశాన జన్మించిన రామా! అక్కడొక పెద్ద గుహ ఉంది. దాని ద్వారానికడ్డంగా ఒక శిలవుంది. ఆ గుహ లోపలకు వెళ్ళడం చాలా కష్టం. దానికి తూర్పున చల్లని నీరు కలది, పుష్ప ఫలవృక్షాలతో కూడిన చెరువు ఉంది. సుగ్రీవుడు తన నలుగురు అనుచరులతో కలసి ఆ గుహలో ఉంటున్నాడు. ఎప్పుడైనా పైన పర్వతశిఖారానికి పోయి ఉంటూ ఉంటాడు.

పుష్పమాలలు, సర్వాలంకారాలు ధరించిన కబంధుడు రామలక్ష్మణులిద్దరికీ సుగ్రీవుడి విలాసాన్ని వివరంగా చెప్పి ఆకాశంలో ఉన్న తన విమానంలో కూర్చున్నాడు.

రామలక్ష్మణులు ఆ మహాభాగ్యశాలికి దగ్గరగా వెళ్ళి కబంధునితో “ఇక నీవు వెళ్ళు” అని వీడ్కోలు చెప్పారు అంతట కబంధుడు రామలక్ష్మణుల వద్ద అనుమతి తీసుకొని “మీకు కార్యసిద్ధి జరగాలి వెళ్ళండి” అని రామలక్ష్మణులకు వీడ్కొలు వచనాలు చెప్పాడు.

అంతట కబంధుడు తన నిజరూపాన్ని పొంది సూర్యుని దేహం వంటి దేహంతో ఆకాశంలోకి ఎగిరి, ఋష్యమూక పర్వతంవైపు చెయ్యి చూపుతూ, “సుగ్రీవునితో స్నేహం నెరపండి” అన్నాడు.

# 74వ సర్గ రామలక్ష్మణులు శబరి ఆశ్రమానికి వెళ్లటం

రామలక్ష్మణులు పశ్చిమ దిక్కుగా కబంధుడు చెప్పిన పంపాసరోవరానికి బయలుదేరారు. ఆ పర్వతం పైన మొలచిన ఫలవృక్షాలను చూస్తూ సుగ్రీవుని చూసేందుకు వెళ్ళారు. అట్లా పర్వతం ఎక్కి పశ్చిమ తీరానికి చేరుకున్నారు. పంపా తీరాన ఉన్న రమ్యమైన ఆశ్రమాన్ని చూశారు. వారిద్దరూ మెల్లగా ఆశ్రమం లోపలకు ప్రవేశించి శబరికి దగ్గరగా వెళ్ళారు.

అప్పుడు సిద్ధురాలైన శబరి రామలక్ష్మణులను చూడగానే కన్నుల నుండి ఆనందబాష్పాలు రాలుతుండగా, గబగబా లేచి వెళ్ళి నమస్కరించి రాముడి పాదాలను, లక్ష్మణుడి పాదాలను కళ్ళకు అద్దుకుంది.

వాళ్ళిద్దరికీ యథాశాస్త్రీయంగా పాద్యము, ఆచమనానికి ఉదకం సమర్పించింది. తరువాత రాముడు ఆ తపస్వినితో ఇట్లా అన్నాడు.

రాముడు: ఓ తాపసురాలా! నీ తపస్సుకు ఏమీ ఆటంకాలు కలగటం లేదుగదా? తపస్సులో పురోగతి సాధిస్తున్నావా? కామక్రోధాలన్నిటినీ అదుపులో ఉంచుకుంటున్నావా? ఆహారం విషయంలో నిగ్రహం చూపుతున్నావా?

ఓ శబరీ! నీ చంద్రాయణ వ్రతాలు పూర్తి అయ్యాయా? నీకు మనశ్శాంతి లభిస్తోందా? నీ గురుసేవలు ఫలించాయా?

అప్పుడు తపస్సంపన్నురాలు తపస్సిద్ధి సాధించినది, తపోనిధుల గౌరవాన్ని పొందినది, వృద్ధురాలు అయిన శబరి రాముడితో ఇట్లా అన్నది.

శబరి: ఓ రామా! ఈనాడు నీ దర్శనం కావటంవల్ల నా తపస్సు సిద్ధించింది. నీ దర్శనంతోనే గురు శుశ్రూషాఫలం కూడా లభించింది. నా తపస్సు ఫలించింది.

పురుష శ్రేష్ఠుడా! రామా! దేవతా స్వరూపుడవైన నిన్ను పూజించిన తరువాత నా జన్మ ధన్యమైనది. స్వర్గప్రాప్తి తప్పక పొందగలను. ఎప్పుడు నీ కరుణాకటాక్షదృష్టి నాపైన పడిందో అప్పుడే నేను పవిత్రురాలనయ్యాను. శత్రుసంహారకా! నీ దర్శన భాగ్యం చేత అక్షయములైన ఉత్తమలోకాలకు పోగలను.

రామా! నేను శుశ్రూష చేసిన మునులందరూ, నీవు చిత్రకూటమందు నివసించే రోజుల్లోనే విమానాల నెక్కి స్వర్గానికి వెళ్ళారు. ధర్మవేత్తలు, పూజనీయులు అయిన ఆ మునీశ్వరులు నాతో ఇట్లా అన్నారు. "పవిత్రమైన నీ ఆశ్రమానికి లక్ష్మణుడితో కలసి రాముడు వస్తాడు. అతడికి నీవు అతిథి సత్కారాలు చెయ్యి. ఆయన దర్శనం అయిన తరువాత నీవు అక్షయములైన ఉత్తమలోకాలను పొందగలవు."

పురుషశ్రేష్ఠుడవైన ఓ రామా! నీ కోసం పంపానదీతీరాన లభించే ఫలపుష్పాలను సేకరించి ఉంచాను.

రాముడు: శబరీ! మహాత్ముడైన దనువు నీ గూర్చి చెప్పాడు. నీ తపోవనం విశిష్టమైనదని విన్నాను. నీకు అభ్యంతరం లేకపోతే ఆ వనాన్ని చూడాలని ఉంది.

శబరి: రామా! ఈ వనాన్ని మతంగ వనమని అంటారు. ఈ వనమంతా దట్టమైన మేఘాలు కమ్ముకున్నట్లుంటుంది. మృగాలు, పక్షులు అన్యోన్యంగా నివసిస్తూ ఉంటాయి.

ఓ కాంతిమంతుడా! పరమ పవిత్రులైన నా గురుదేవులు ఇక్కడ వేదోక్తంగా యజ్ఞాలు చేశారు. ఇదిగో ఇదే యజ్ఞవేదిక; పడమటి మిట్ట ఇదే. ఇక్కడే నా గురుదేవులకు సేవచేస్తూ ఉండేదాన్ని. ఆయన తపో ప్రభావంచేతనే ఈనాటికి ఆ యజ్ఞవేదికలన్నీ అంతులేని కాంతులతో దిక్కులన్నిటా ప్రకాశిస్తున్నాయి. నా గురుదేవులు ఉపవాసాలతో బలహీనులై, వార్ధక్యం వల్ల స్వయంగా వెళ్ళలేకపోవటంవల్ల, సప్తసాగరాల జలాలు ఇక్కడకు వచ్చి ఈ సరస్సుగా అయ్యాయి. ఆయన ఆ సరస్సులో స్నానంచేసి వల్కలాలను గట్టుపై ఆరవేసుకునేవారు. ఆయన

లేకపోయినా ఆ ప్రదేశాలన్నీ ఇంకా తడిగానే ఉన్నాయి. నల్ల కలువలతోను, ఇతర పూలతోను వారు కట్టిన మాలలు ఇంకా వాడిపోకుండా అట్లాగే ఉన్నాయి; చూడు.

ఓ రామా! ఈ వనమంతా చూశావుగదా! నీవు విని తెలుసుకోవాలనుకున్నవన్నీ విన్నావు. ఇక నాకు అనుమతి ఇస్తే ఈ దేహాన్ని విడిచేస్తాను. సపర్యలు చేసిన మహానీయుల దగ్గరకే నేనూ వెళ్ళిపోతాను.

రామలక్ష్మణులు శబరి సత్కారాలకు చాలా సంతోషించారు. ఆ తపోవన మహత్యాన్ని తెలుసుకొని ఆశ్చర్యపోయారు. అంతట రాముడు "ఓ శబరీ! నీవు భక్తితో నన్ను సత్కరించావు. పూజించావు ఇక నీవు స్వేచ్ఛగా దివ్యలోకాలకు వెళ్లిపో" అన్నాడు.

రాముడు అనుజ్ఞ ఇవ్వగానే తల అంతా జటలుకట్టి నారచీరలు ధరించి ఉన్న శబరి కృష్ణాజినాన్ని కప్పుకొని అగ్ని ప్రవేశం చేసింది.

అంతట ఆమె దివ్యమాలలతోను, దివ్యాభరణాలతోను, దివ్యమైన వస్త్రాలతోను, లేపనాలతోను మెరుపు తీగలాగా పుణ్యాత్ములైన మహర్షులు ఉండే దివ్యలోకాలకు అప్పటికప్పుడే వెళ్ళిపోయింది.

# 75వ సర్గ రామలక్ష్మణులు పంపాతీరానికి చేరటం

శబరి తన తపోబలంచేత ఉత్తమ లోకాలకు వెళ్ళిన తరువాత రామలక్ష్మణులు శబరి ఆశ్రమాన్ని గూర్చి ఇట్లా అనుకున్నారు.

రాముడు: లక్ష్మణా! లేళ్ళు పెద్దపులులు జాతి వైరాలు మరచి ఇక్కడ ఆశ్రమంలో జీవిస్తున్నాయి. పవిత్ర హృదయులైన మహర్షుల ఆశ్రమాన్ని చూశాము. ఎంత ఆశ్చర్యకరమైన విషయాలను చూశాం! ఈ మహనీయుడైన మహర్షి తన సౌకర్యం కోసం సప్త సముద్రాలనుండి నీళ్ళను ఈ సరస్సులో ప్రవేశపెట్టాడట. ఈ పవిత్రజలాలలో మనంకూడా పితృ తర్పణాలు చేశాం. లక్ష్మణా! మనకు పట్టిన అశుభాలన్నీ తొలగాయి. కల్యాణప్రదమైన శుభాలు ఆరంభమయ్యాయి. నా మనస్సు సంతోషంతో తేలిపోతోంది. సంతోషం కలిగేటప్పుడు ఆ విషయం హృదయానికి తెలుస్తుంది కదా!

సూర్యుని పుత్రుడైన సుగ్రీవుడు వాలికి భయపడి నమ్మకస్థులైన నలుగురు మిత్రులతో ఇక్కడే నివసిస్తున్నాడు. ఋష్యమూక పర్వతం పంపా సరోవరానికి సమీపానే ఉంది. మనం ఇప్పుడు పంపాసరస్సుకు పోదాం పద. మనస్సు తొందరపెట్టుచున్నది. సౌమ్యుడా! వానర శ్రేష్ఠుడైన సుగ్రీవుని చూడాలి. ఎందుకంటే, మన సీతాన్వేషణ అతనిపైనే ఆధారపడి ఉంది కనుక.

లక్ష్మణుడు: అన్నా! నా మనస్సుకూడా సుగ్రీవుని చూడటానికి తొందర పెడ్తోంది. అక్కడికి త్వరగా వెళదాం.

అంతట రామలక్ష్మణులిద్దరూ కలసి ఆశ్రమంనుండి బయటకువచ్చి పంపా సరోవరానికి చేరుకున్నారు. ఆ సరస్సు త్రాగేందుకు యోగ్యమైన మంచినీటితో సమృద్ధిగా ఉంది. దానినిండా సువాసనలు వెదజల్లే ఎర్ర కలువలు, నల్ల కలువలు, తెల్ల కలువలు వికసించి ఉండటంవల్ల తివాసీ పరచినట్లుంది. అంతట రాముడు ఆ పంపా సరస్సును చేరి, మతంగ సరస్సు అని

పిలువబడే రేవుకు పోయి స్నానంచేశాడు. స్నానం కాగానే వారిద్దరు వనంలోకి వెళ్ళారు.

పంపాసరస్సు చుట్టూ పుష్పించిన వనాలున్నాయి. సాలవృక్షాలు, చంపక మున్నగు వృక్షజాతులతో దాని ప్రకాశం రెట్టింపయింది. ఆ సరోవరంలో నీళ్ళు స్వచ్ఛంగా స్ఫటికంలాగా ఉన్నాయి, ఆ తీరానవుండే ఇసుక మెత్తగా మృదువుగా ఉంది. ఎర్రటి పద్మాలతో నిండిన ఆ పంపానదిని చూస్తూ రాముడు ఇట్లా అన్నాడు.

రాముడు: ధాతువులతో నిండి ఉండటం వల్ల, పుష్పించిన వృక్షాలతో నిండివున్న ఆ ఋష్యమూకం ఆ పంపానది ప్రక్కనే ఉంది. ఋక్షరజస్సు కుమారుడైన సుగ్రీవుడు ఈ పర్వతం మీదనే ఉన్నాడు. లక్ష్మణా! వానర నాయకుడైన సుగ్రీవుని వద్దకు వెళదాం.

లక్ష్మణా! నేను రాజ్యం పోగొట్టుకున్నాను. దీనుడవై ఉన్నాను. నా మనస్సంతా సీతపై ఉంది. నేను సీత లేకుండా జీవించలేను.

మన్మథునిచే బాధించబడిన రాముని మనస్సంతా సీతే నిండి పోయివుంది. లక్ష్మణునితో ఇట్లా చెప్పి దుఃఖిస్తూ ఆ పంపానదీ తీరానికి చేరాడు. తరువాత రాముడు చాలాదూరం నడవవలసిన మార్గంగుండా నడిచి, అడవుల్లోని శోభనంతా చూసుకుంటూ, పంపానదీ తీరాన్ని చేరాడు.



# కిష్కింధాకాండము



## 1వ సర్గ రామలక్ష్మణులను చూసి సుగ్రీవుడు భయపడడం

పంపానదీ తీరానికి రాగానే ఆనందం వలన రాముని మనస్సు మన్మథ ప్రభావంచేత విపరీతంగా స్పందించింది. లక్ష్మణునితో ఇలా అన్నాడు.

రాముడు: లక్ష్మణా! ఈ పంపానదిలోని నీరు వైదూర్య మణుల్లాగా నిర్మలంగా ఉన్నాయి. పద్మాలు, కలువలతో నిండి ఉంది. ఇక్కడ ఉండే వృక్షసంపద ఆ అందాలను ఇనుమడింప చేస్తోంది. ఆకాశాన్నందుకునే ఆ చెట్ల వరుసలు పర్వతశిఖరాల్లాగా శోభిస్తున్నాయి. సీత దగ్గర లేకపోవడం, భరతుడికి దూరంగా ఉండటంచేత ఇంత సుందరమైన ప్రదేశంలో ఉన్నా మనస్సుకు సంతోషం కలగటం లేదు. ఇక్కడ చెట్లన్నీ విరగపూసి ఉన్నాయి. రాలిన పుష్పాలన్నీ నేలపై అందంగా, మెత్తగా తివాసీలు పరచినట్లున్నాయి. ఆ తివాసీల పైనుండి లేళ్లు, ఏనుగులు, పక్షులు, సర్పాలు, యథేచ్ఛగా తిరుగుతున్నాయి. పుష్పాలన్నీ రకరకాలైన రంగుల్లో ఉండటంతో పచ్చికబీడులపై రంగురంగుల తివాచీలు పరచినట్లున్నాయి. పుష్పాల భారంతో నిండుగా ఉన్న చెట్లను లతలు, తీగలు కౌగలించుకున్నట్లుంది.

లక్ష్మణా! ఈ కాలంలో వీచే గాలిలో మన్మథ ప్రభావం బాగా ఉంటుంది. పూల పరిమళాలతో నిండిన గాలి సుఖంగానూ, మధురంగానూ, సువాసనలతోనూ నిండిపోయింది. పుష్పాలతో నిండిన ఈ వనాలన్నీ నీటిని చేరవేసే మేఘాల్లాగా కనిపిస్తున్నాయి. కొండచరియల్లోనుంచి వచ్చే హోరుగాలి చెట్లపై ఉన్న పుష్పాలను నేలపై చల్లి ఆ సువాసనలను చాలాదూరం మోసుకుపోతోంది. చెట్లపై పూసిన రకరకాల పూలతో వాయుదేవుడు

ఆడుకుంటున్నట్లుంది. ఆ సువాసనలతోపాటు తుమ్మెదలు కూడా గాలిలో తేలిపోతూ ఝుంకారం చేస్తున్నాయి. పర్వతశిఖాల్లోంచి పుట్టిన గాలి కోయిలలచేత పాటలు పాడిస్తూ, వృక్షాలచేత నాట్యం చేయిస్తున్నట్లుగా ఉంది. గాలి అంతటా వస్తూనే ఉంది గానీ, చెట్ల కొమ్మలపైన ఆ ప్రభావం బాగా కనిపిస్తోంది. కొమ్మలన్నీ పరస్పరం కట్టబడినట్లు కనిపిస్తున్నాయి. ఆ విధంగా సువాసనలను చేరవేస్తున్న గాలి ఒంటికి చందనం అలదినట్లు చల్లగావుంది, శ్రమను తొలగించేదిగా ఉంది. పూలలోని మకరంద సువాసన గాలిలో వ్యాపించటంవల్ల తుమ్మెదలు తమ సంతోషాన్ని తెలుపుతూ ఝుంకారనాదం చేస్తున్నాయి.

కొండచరియలపై మొలచిన మహావృక్షాలు పర్వత శిఖరాలతో పోటీపడుతున్నాయి. అవికూడా పర్వతాలేమో అన్న భ్రమ కలిగిస్తున్నాయి. వృక్షాల శిరస్సులన్నీ దట్టంగా పుష్పించబడి ఉన్నాయి. వాటి చుట్టూ గానం చేస్తూ తుమ్మెదలు తిరుగుతున్నాయి, ఆ తుమ్మెదల గానానికి ఆనందంతో నాట్యం చేస్తున్నట్లు ఊగుతున్నాయి. కర్ణికారవృక్షాలన్నీ పుష్పించి బంగారు ఆభరణాలు, పట్టువస్త్రాలు ధరించిన మనుష్యుల్లా ఉన్నాయి.

లక్ష్మణా! ఈ పక్షుల కిలకిలారావాలు, నాలో ఉన్న సీతావిరహాన్ని రెట్టింపు చేస్తున్నాయి. దుఃఖీతుడనై ఉన్న నన్ను, మన్మథుడు ఇంకా పీడిస్తున్నాడు. కుహూ కుహూ అంటూ కోయిలలు నన్ను పిలుస్తున్నట్లుంది. ఆనందంతో కూస్తున్న దాత్యూహపక్షులు కూడా తోడై నాలో ఉన్న విరహాన్ని అధికం చేస్తున్నాయి. పూర్వం సీతాదేవి ఆ పక్షుల కూతలకు కేరింతలు పెట్టుతూ ఉండేది. ఒకటేమిటి అనేక విధాలైన స్వరాలతో, విచిత్రమైన పక్షులు, పొదలపైనా, చెట్లపైనా, తలపైనా స్వేచ్ఛగా ఎక్కడపడితే అక్కడల్లా ఎగురుతూ ఉల్లాసంగా ఉన్నాయి. పక్షులన్నీ జంటలు జంటలుగా తిరుగుతూ ఒకదానికి మరొకటి ఆనందాన్ని కలిగిస్తున్నాయి. పక్షులతోపాటు తుమ్మెదలూ తోడయ్యాయి. పంపాతీరాన దాత్యూహపక్షుల రతికలాపాలూ, కోకిలల కూహూ ధ్వనులూ, విరగబూసిన ఈ వృక్షాలూ నాలో మన్మథోద్రేకాన్ని రేకెత్తిస్తున్నాయి.

లక్ష్మణా! ఎర్రటి అశోక పుష్పగుత్తులు కణకణాలాడే నిప్పులా, తుమ్మెదల ఝుంకారాల

ధ్వనులు, చెట్లపైనుండే లేతచిగుళ్ళు ఎర్రనిమంటలా ఉన్న వసంతమనే అగ్ని నన్ను నిలువునా కాల్చివేస్తోంది. అందమైన కనురెప్పలు, నల్లగా పొడవుగా ఉండే కేశాలతో, మృదుమధురంగా మాట్లాడే సీత లేకపోతే నాకు జీవితమే లేదు. లక్ష్మణా! ఈ వసంత ఋతువు, కోయిల పాటలు, తుమ్మెద ఝుంకారాలు నా ప్రియురాలైన సీతకు ఎంతో ఇష్టమైనవి. మన్మథ బాధతో పుట్టిన నా శోకాగ్ని, వసంత ఋతు లక్షణాలచేత వృద్ధి చెందటంవల్ల నేను త్వరలోనే కాలి బూడిద అయిపోతాను. సీతావియోగంతో ఈ సుందర పరిసరాలన్నీ నా మన్మథ తాపాన్ని, దుఃఖాన్ని వృద్ధి చేస్తున్నాయేకాని ఏమాత్రం సుఖాన్నివ్వటం లేదు.

లక్ష్మణా! ఒక ప్రక్క సీతను గూర్చి తలపులతో క్రుంగిపోతూ ఉంటే, మరో ప్రక్క చైత్రమాసపు పిల్లగాలులు ఇంకా బాధిస్తున్నాయి. దూరాన నాట్యం చేస్తూ ఉన్న నెమళ్లు మాణిక్యాలు పొదిగిన కిటికీల మల్లే ఉన్న పింఛాలతో ప్రకాశిస్తున్నాయి. ఆడనెమళ్ళతో కలిసి బాగా మత్తెక్కివున్న ఈ మగనెమళ్ళు చేసే మన్మథలీలలు నన్ను ఎక్కువ బాధిస్తున్నాయి. ఆ కొండచరియల్లో ఆడనెమలి నాట్యం చేస్తూన్న మగనెమళ్లను అనుసరించి పురివిప్పి నాట్యం చేస్తున్నది. ఆ మగనెమలి ప్రియురాలైన ఆడ నెమలిని ఏ రాక్షసుడూ అపహరించలేదు గదా! అందుకని దాని సంతోషానికి ఎక్కడా హద్దులు లేకుండాపోయాయి. పుష్పాలతో నిండిన ఈ చైత్రమాసంలో సీత లేకుండా గడపడం కష్టంగా ఉంది. లక్ష్మణా! ఈ పశుపక్ష్యాదుల్లో కూడా అనురాగం ఎట్లా పొంగిపొర్లుతూందో చూడు. కామంతో ఈ ఆడనెమలి, మగనెమలి సరసన చేరుతోంది చూడు. రాక్షసుడు అపహరించుకు పోయి ఉండకపోతే, సీతకూడా ఇట్లాగే మన్మథోద్రేకంతో నా దగ్గరకు వచ్చేది కదా! ఏం లాభం! సీత నా దగ్గర లేకపోవడంవల్ల అడవిలో పూలన్నీ వ్యర్థమైపోతున్నాయి. ఈ పుష్పాలన్నీ వృథాగా నేలపాలవుతున్నాయి గదా! పక్షులన్నీ గుంపులు గుంపులుగా స్వేచ్ఛగా ఎగురుతూ ఒకదాన్నొకటి కవ్వించుకుంటున్నాయి, వాటిని చూస్తూ ఉంటే నాకు కామోద్రేకం కలుగుతోంది. నా సీత ఉన్న ప్రదేశంలో కూడా వసంత ఋతువు ఉండి ఉంటే ఆమె కూడా నాకు మల్లేనే మన్మథోద్రేకం పొందే దేమో! సీత ఉన్నచోట వసంత ఋతువు ఉండి ఉండదు. ఎందుకంటే నేను లేకుండా ఆమె ఎట్లా గడపగలదు? లేదు;

లేదు. ఆమె ఉన్నచోట కూడా వసంత ఋతువు ఉంటుంది. కానీ రాక్షసులు పెట్టే బాధలతో అందమైన నడుముగల నా సీత భయపడుతూ ఉంటుంది.

యౌవనంలో ఉన్నది, అందమైనది, పద్మములవంటి నేత్రాలు గలది, మృదుమధురంగా మాట్లాడేదీ అయిన నా ప్రియురాలు వసంతం రాగానే జీవితాన్ని విడిచేస్తుంది. ఔను నాపై విరహంతో నా ప్రియురాలు బ్రతకలేదని నాకు నమ్మకంగా అనిపిస్తోంది. సీత మనస్సు నా మీదే లగ్నమై ఉంటుంది. నా మనస్సుకూడా ఎల్లవేళలా సీతపైనే ఉంటుంది. వాయుదేవుడు చల్లగానూ, పుష్పాల సౌరభాలతోనూ అందరినీ అలరిస్తూ ఉంటాడు. కానీ నన్ను మాత్రం అగ్నిలాగా కాల్చేస్తున్నాడు. ఇదే వాయుదేవుడు పూర్వం నేను సీతతో కలసి కబుర్లు చెప్పేటప్పుడు చల్లగాను, సుఖకరంగానే ఉండేవాడు. కానీ ఇప్పుడు సీతా వియోగంచేత దుఃఖాన్ని కలిగిస్తున్నాడు. అప్పుడు సీతా వియోగాన్ని తెలుపుతూ ఆకాశంలో ఎగిరిన ఆ కాకియే, ఇప్పుడు చెట్టు మీద కూర్చుని సీతను మళ్ళీ కలుస్తాననే సంతోషాన్ని వ్యక్తం చేస్తోంది. ఈ కాకి తప్పక నన్ను సీత దగ్గరకు చేరుస్తుంది.

తమ్ముడా! అడవి వృక్షాలపైన కూర్చున్న పక్షుల మధుర ధ్వనులు వింటుంటే నేను కామపరవశుణ్ణవుతున్నాను. కామంతో తపించిపోతున్న ప్రియురాలి వద్దకు పోయే ప్రియుడిలాగా గాలికి కదిలే పూలగుత్తుల పైకి మగతుమ్మెదలు పోతున్నాయి. అశోకవృక్షాలు కామప్రవృత్తిని వృద్ధిచేస్తూ ఉంటాయి. గాలికి కదలాడే ఈ అశోకవృక్షము, గాలికి కదలాడే పూల గుత్తులు నన్ను చెదరగొడ్తున్నాయి. నిండుగా పూతపూసి ప్రకాశిస్తున్న మామిడిచెట్లు విలాసాలచే గర్వించిన మనస్సులున్న, శరీరాలకు అంగరాగం అలదుకొన్న మానవుల్లా కానవస్తున్నాయి.

ఓ పురుషశ్రేష్ఠుడా! లక్ష్మణా! ఇక్కడ పంపాతీరాన కింనరులు నివసిస్తూ ఉంటారు. సువాసనలు వెదజల్లే ఈ పద్మాలు సూర్యుడిలా ప్రకాశిస్తున్నాయి. ఆ పద్మాలలోని పుప్పొడి తుమ్మెదల రాపిడికి నదిలోపడి సరస్సు అంతా అందంగా కనిపిస్తోంది. ఈ జలాల్లో చక్రవాక పక్షులు ఎక్కువగా ఉంటాయి. నీళ్ళు తాగటానికి వచ్చే ఏనుగులు, లేళ్ళు మొదలైన జంతువులు

నదికి మరింత శోభను చేకూరుస్తున్నాయి. నీటిపై తేలి ఉన్న పద్మాలు నీటి తరంగాలచే కదులుతూ శోభాయమానంగా ఉన్నాయి. పద్మాలంటే సీతకు ఎంతో ఇష్టం. అటువంటి సీత లేకపోవడంతో ఈ పద్మాలు నన్ను సంతోషపెట్టలేక పోతున్నాయి. నా ప్రియురాలైన సీత నాకు దూరమైపోయిందని తెలిసికూడా మన్మథుడు నాపై దండెత్తుతున్నాడు గదా! ఆహా! ఆతడెంతటి క్రూరుడు? ఈ వసంతఋతువు విజృంభించి ఉండకపోతే, నేను మన్మథుడిని లెక్కచేసేవాడిని కాదు. సీత ఉన్నప్పుడు నాకు ఆనందం కలిగించే వస్తువులే ఇప్పుడు సీత లేకపోవటాన దుఃఖాన్ని కలిగిస్తున్నాయి. లక్ష్మణా! నా మనస్సు పద్మముల రేకులపైకి పోతోంది, ఎందువల్లనంటే అవి సీత నేత్రాల్లా ఉంటాయి కనుక. వృక్షాలపైనుండి వీచే మలయమారుతాలు పద్మాల పుప్పొడి మీదుగా వీచి సీత నిట్టూర్పులమల్లే ఉన్నాయి.

లక్ష్మణా! పంపానది దక్షిణతీరానవున్న కొండచరియల్లో పూచిన కర్ణికారవృక్షాన్ని చూస్తూవుంటే సీత దేహం గుర్తుకు వస్తోంది. వివిధ ధాతువులతో నిండిన ఈ పర్వతం పైనుండి పరాగాలు అనేకం గాలి ఒత్తిడికి కొట్టుకొని వస్తున్నాయి. మోదుగచెట్ల పూలు భగభగ మండే మంటలా కనిపిస్తున్నాయి.

తమ్ముడా! పంపాతీరాన, మల్లెలు, జాజి, గన్నేరు, మొగలి, అడవిమొల్ల పూల సువాసనలు ఒకదానితో ఒకటి కలసిపోయి మధురమైన వాసనలను గుబాళిస్తున్నాయి. ఇంతే కాకుండా, కానుగ, ఇప్ప, పొగడ, అనాస, సంపంగి, చూట్టుగ, ఉలిమిరి, ఖర్జూరం, పద్మకము, నీలాకోకం, మున్నగు చెట్లన్నీ విరగబూశాయి.

లక్ష్మణా! పంపాతీరాన పుష్పించిన అనేక వృక్షాలకు లతలు అల్లుకుపోయివున్నాయి. ఆ లతలనిండా పూలు విరగబూశాయి. ఈ లతలన్నీ ఉత్తమస్త్రీల వలె వృక్షాలను అల్లుకుపోయి గాలికి కదలాడుతున్నాయి. వాయుదేవుడు అనేక రకాలైన రసాలను స్వీకరించటంవల్ల ఒక వృక్షం నుండి మరో వృక్షానికి, ఒక పర్వతం పైనుండి మరో పర్వతానికి, ఒక వనం నుండి మరో వనానికి తుమ్మెదలు సంతోషంతో పువ్వులు పరిశుద్ధంగా ఉన్నాయా? లేదా అని పరీక్షించి మరీ

వాటిలోకి ప్రవేశిస్తున్నాడు. మకరందంపై ఆసక్తిగల తుమ్మెదలు తేనె త్రాగటం కాగానే హఠాత్తుగా లేచి వెళ్ళిపోతున్నాయి. పూలు నేలపై రాలిపడి ఉండటంచేత పక్కలు పరిచినట్లున్నాయి. అవన్నీ రకరకాల పుష్పాలు కావటాన అనేక రంగులలో ప్రకాశిస్తున్నాయి. హేమంత ఋతువు ముగిసి చైత్రమాసంలో ప్రవేశించటంతో పుష్పించటంలో ఒకదానితో మరొకటి పోటీ పడుతున్నాయి. ఈ కారండవ పక్షి ప్రియురాలితో క్రీడిస్తూ ఉండటం వల్ల చూసే కాముకులలో కూడా ఉద్రేకాన్ని రేకెత్తిస్తున్నాయి. మందాకినీ నదికి కూడా పంపానదికి ఉన్నట్లే అనేకమైన మనోహర లక్షణాలున్నాయి, అందువల్లనే పంపానది జగత్తులో ప్రసిద్ధి చెందింది.

లక్ష్మణా! సీతాదేవిని మనం పొందగలిగితే మనమందరం ఈ పంపానదీతీరానే నివసిద్దాం. ఇంద్రపదవి ఇచ్చినా కూడా అయోధ్యకు తిరిగి వెళ్ళాలనిలేదు. ఎందువల్లనంటే, ఈ మనోహరమైన పచ్చికబయళ్లలో ఆమెతో విహరించటంకన్నా ఆనందం ఏం ఉంటుంది? పద్మములనుండి వీచే సువాసనలు, పంపానదినుండి వీచే చల్లని వాయుతరంగాలు శోకాలన్నింటినీ తొలగిస్తాయి. ఇక్కడ నివసించగలిగే వాళ్ళు అదృష్టవంతులు.

మంచి యౌవనంలో ఉన్నది, పద్మాలవంటి కన్నులు కలది, నా ప్రియురాలైన సీత నా ఎడబాటు సహించి ఎట్లా ఉంటోందో? ధర్మవేత్త అయిన జనకమహారాజు సీత కుశలాన్ని అడిగితే ఏమని సమాధానం చెప్పాలి? తండ్రిచే అడవులకు పంపబడిన దురదృష్టవంతుణ్ణి. భార్యను పోగొట్టుకున్నవాడిని. ధర్మాన్ని పాటించి ఆమె నాతో అడవులకు వచ్చింది. అటువంటి సీత లేకుండా ఎట్లా బ్రతుకగలను?

లక్ష్మణా! సీత ఎప్పుడూ చిరునవ్వులు చిందిస్తూ ఉంటుంది. అప్పుడప్పుడూ, ఆటలు పట్టించడంలో ఆమె దిట్ట. మళ్ళీ ఆమె మాటలు, పరిహాసాలు ఎప్పుడు వింటానో కదా! అడవిలో కష్టాలు పడుతున్నా, తనకు ఏ కష్టమూ లేనట్లుగాను, ఆనందంగా ఉన్నట్లుగాను ప్రవర్తించేది. ఆమె మంచి యౌవనంలో ఉంది. మన్మథపీడితుడనైనప్పుడల్లా నా మనస్సుకు ఉల్లాసం కలిగించే మాటలు మాట్లాడేది. లక్ష్మణా! నేను అయోధ్యకు వెళ్ళినప్పుడు నా తల్లి కౌసల్యాదేవి, 'నా

కోడలెక్కడ' అని అడిగితే ఏమని చెప్పను? లక్ష్మణా! నీవు, తమ్ముడు భరతుని దగ్గరకు వెళ్ళిపో. నేను సీత లేకుండా జీవించలేను.

రాముడు ఈ విధంగా అనాథలా విలపిస్తూ ఉంటే, దోషరహితుడూ, బుద్ధిశాలీ అయిన లక్ష్మణుడు ఇట్లా అన్నాడు.

లక్ష్మణుడు: పురుషులలో ఉత్తముడవైన రామా! ధైర్యం తెచ్చుకో. నీకు అన్నీ శుభాలే జరుగుతాయి. నీలాంటి బుద్ధిమంతులకు బుద్ధి మందగించకూడదు. ప్రియమైనవాళ్ళను దూరం చేసుకున్నప్పుడు దుఃఖం కలుగుతుందని నీకు తెలియదా? అందుకని అతిస్నేహం పనికి రాదంటారు. ఎక్కువ నూనెతో కలిసివుంటే నీళ్ళవత్తి కూడా మండుతుంది అని అంటారు.

రామా! రావణుడు పాతాళంలో దాగివున్నా, ఇంకా లోతైన లోకాల్లోవున్నా, అతడు సీతనైనా విడిచిపెట్టాలి; లేదా వాడి ప్రాణాన్నైనా వదులుకోవాలి. రావణుడు సీతతో కలసి దితి గర్భంలో దాగివున్నా, అతడు సీతను విడవకుండా ఉంటే వాడిని అక్కడే చంపేస్తాను.

పూజ్యుడా! ధైర్యాన్ని అవలంబించు. అది క్షేమకరం. దీనమైనబుద్ధిని వదలిపెట్టు, దుఃఖాన్ని తోసెయ్యి. కామపరవశం పొందవద్దు. నీవు గొప్ప ప్రతిభావంతుడవు. సుశిక్షితమైన బుద్ధి గలవాడవు. అయినా మోహంచేత, నిన్ను నువ్వు తెలుసుకోలేకుండా ఉన్నావు.

పూజ్యుడా! ఉత్సాహం చాలా బలాన్నిస్తుంది. ఉత్సాహవంతుడికి ఈ లోకంలో లభించనిది ఏదీ ఉండదు, ఆతడికి ఏ పనిలోనూ ఓటమి ఉండదు. అన్నా! అందుకని ఉత్సాహాన్ని పెంపొందించుకొని సీతకోసం ప్రయత్నం చేద్దాం.

లక్ష్మణుని మాటలు విని, శోకాన్ని, మోహాన్ని వదిలి రాముడు ధైర్యాన్ని పొందాడు. రాముడు ఆ పంపానదిని దాటి వెళ్ళాడు. రాముడు ఉద్విగ్నమనస్కుడై నడుస్తూ ఉంటే, మహాపరాక్రమవంతుడైన లక్ష్మణుడు సోదరధర్మంలో రాముడికి రక్షకభటుడిలా వెళ్ళాడు.

చూసేవాళ్ళకు ఆశ్చర్యం కలిగిస్తూ అట్లా నడిచి వెళుతున్న రామలక్ష్మణుల్ని ఋష్యమూక పర్వత ప్రాంతాల్లో సంచరించే వానర శ్రేష్ఠుడైన సుగ్రీవుడు చూశాడు. భయపడిపోయాడు. నిశ్చేష్ఠుడయ్యాడు. భయంతో కృంగిపోయాడు.

# 2వ సర్గ హనుమంతుడు రామలక్ష్మణుల వద్దకు బయలుదేరడం

రామలక్ష్మణులిద్దరూ శ్రేష్ఠమైన ఆయుధాలను ధరించి తమ వైపు వస్తూ ఉండటం సుగ్రీవుడు చూశాడు. వీళ్ళిద్దరూ వాలిచే పంపబడిన మహావీరులై ఉంటారని అనుకున్నాడు. దిగులు చెందిన మనస్సుతో ఒక చోట స్థిరంగా కూర్చోలేకపోయాడు. కాలు కాలిన పిల్లిలాగా అటూ ఇటూ తిరిగాడు. ఇంతలోనే మనస్సు కొద్దిగా కుదుటపరచుకొని తను బలవంతుడా? లేక వారు బలవంతులా? అని తర్కించుకున్నాడు. ఆతడి అనుచరులు కూడా భయపడ్డారు.

సుగ్రీవుడు: మంత్రి పుంగవులారా! వారిద్దరూ నారవస్త్రాలు ధరించారు. దుర్గమమైన ఈ పర్వతంపై కాలుపెట్టారు. వాళ్ళిద్దరూ వాలి వనంలో మనుష్యులే అయి ఉంటారు. సందేహంలేదు.

వారంతా ఆ శిఖరాన్ని విడిచి మరో భద్రమైన ఉత్తమమైన శిఖరంపైకి పోయారు. అక్కడ సుగ్రీవుని చుట్టూ అతడి అనుచరులు కూర్చున్నారు. వాళ్ళు ఆ విధంగా ఒక శిఖరాన్నుండి మరో శిఖరానికి చేరటానికి వేగంగా గెంతుకుంటూ పోతూవుంటే శిఖరాలు కంపించాయి; పిందెకాయ పుష్పాలతో నిండిన చెట్ల కొమ్మలెన్నో విరిగి పడ్డాయి. లేళ్ళు, పులులు వంటి అడవిమృగాలు భయపడ్డాయి.

అప్పుడు భయంచేత వణికిపోతున్న సుగ్రీవుడికి దగ్గరగా పోయి బుద్ధిశాలి అయిన హనుమంతుడు ఇట్లా అన్నాడు.

హనుమంతుడు: వానర శ్రేష్ఠుడవైన సుగ్రీవా! మనమంతా వాలిని గూర్చి రాత్రింబగళ్ళు ఆలోచిస్తూ ఉండడంవల్ల, చీమ చిటుక్కుమన్నా అది వాలి చేష్టయేనని భయపడుతున్నాం. నిజానికి మనం అంతా వాలికి భయపడటంలేదు; భయానికి భయపడుతున్నాం. బాగా ఆలోచించు. ఇక్కడ మనకు వాలి వలన వచ్చే భయం ఏమీ లేదు. ఎందువల్లనంటే, ఇది

మలయపర్వతం కనుక. వాలి ఈ మలయపర్వతంపై కాలుకూడా పెట్టలేడు. అటువంటప్పుడు వాలిని తలచుకుని భయపడటానికి హేతువు ఏమీ కనిపించడం లేదు.

సుగ్రీవా! నీవు ఇప్పుడు ధైర్యాన్ని కోల్పోయావు. ధైర్యాని విడిచిన నీ బుద్ధి స్థిరంగా లేదు. ఆ విధంగా నువ్వు వానరత్వాన్ని స్పష్టంగా చాటిచెప్తున్నావు. నీ అంతటి శూరుడు, ధైర్యశాలి ఇట్లా భయానికి బానిస కావటం ఆశ్చర్యంగా ఉంది.

సుగ్రీవా! భయాన్ని విడిచిపెట్టు. దృఢమైన మనస్సుతో, చేష్టలతో ఇతరుల మనోభావాలను గ్రహించు. అట్టి బుద్ధితో పనులు చెయ్యి. స్థిరమైన ఆలోచనలు లేని రాజు ప్రజలను పాలించలేడు కదా!

సుగ్రీవుడు: ఓ వీరుడా! హనుమంతుడా! వాళ్ళిద్దర్నీ పరీక్షించి చూడు. వాళ్ళు ఆజానుబాహులు; విశాలమైన నేత్రాలతో దేవతాపురుషుల్లాగా ఉన్నారు. ధనుస్సు, బాణాలు, ఖడ్గం ధరించారు. ఇటువంటి వాళ్ళను చూస్తూవుంటే ఎవరైనా భయపడకుండా ఉండగలరా? పురుషశ్రేష్ఠులైన వీరిద్దర్నీ వాలియే పంపించి ఉంటాడని నేను అనుమానిస్తున్నాను. ఎందువల్ల అంటే, వాలికి చాలామంది స్నేహితులు ఉన్నారు. రాజుల్ని నమ్మటానికి వీలులేదు, ఎప్పుడేం చేస్తారో ఉహించలేం. కపటంగా ప్రవర్తించే శత్రువును ఎప్పుడూ ఒక కంట కనిపెడుతూనే ఉండాలి, ఏమరుపాటున ఉండకూడదు. అట్లా ఉంటే చాటుగా వచ్చి దెబ్బతీస్తాడు.

హనుమంతుడా! వాలి, ఎట్లాంటి పనులు చెయ్యాలో, ఎప్పుడు చెయ్యాలో, ఎట్లా చెయ్యాలో అనే విషయాలన్నీ బాగా తెలిసినవాడు. కాబట్టి మనం జాగ్రత్తగా ఉండాలి. హనుమంతుడా! నీవు సామాన్య మానవుడిలాగా ఆ నరశ్రేష్ఠుల వద్దకు వెళ్ళు. వేషభాషల్ని, ముఖకవళికల్ని, చేష్టల్ని బట్టి వాళ్ళను మాటల్లోపెట్టు. దాన్నిబట్టి వాళ్ళ ఆంతర్యంలో ఏముందో గ్రహించు. ఆ తరువాత వారు ఎవరో, ఎట్లాంటివారో, ఏం పని మీద ఇక్కడ తిరుగుతున్నారో గ్రహించగలుగుతాం.

వానరులలో శ్రేష్ఠుడా! ఓ హనుమంతుడా! వారిని బాగా పొగుడు. వాళ్ళ మనస్సులు ప్రసన్నం అయ్యేట్లు చూడు. నీ చేష్టలవల్ల, వారికి నీపట్ల బాగా విశ్వాసం కుదిరేట్లుగా ప్రవర్తించు. వాళ్ళతో మాట్లాడేటప్పుడు నీవు నా వైపుకు తిరిగి మాట్లాడుతూ ఉండు. మాటల్నిబట్టి వాళ్ళ మనస్సు పరిశుద్ధమైనదా? కాదా? అని గ్రహించు. వాళ్ళు మంచివాళ్ళా? చెడ్డవాళ్ళా? అని మాటల్నిబట్టి తెలుసుకో.

సుగ్రీవుడు ఈ విధంగా హనుమంతుడిని ఆజ్ఞాపించగా హనుమంతుడు రామలక్ష్మణులున్న చోటుకు వెళ్ళటానికి సిద్ధమయ్యాడు. మహాబలశాలులైన రామలక్ష్మణులున్న చోటుకు బయలుదేరాడు.

## 3వ సర్గ హనుమంతుడు రామలక్ష్మణులను ప్రశ్నించటం

మహాత్ముడైన సుగ్రీవుని ఆజ్ఞ ప్రకారం హనుమంతుడు రామలక్ష్మణులున్న చోటుకు ఆకాశమార్గాన ఎగిరి వెళ్ళాడు. వాయుపుత్రుడు, వానరుడూ అయిన హనుమంతుడు రామలక్ష్మణులపై పూర్తిగా విశ్వాసం లేకపోవటం వల్ల, వానరరూపాన్ని విడిచి, ఒక సన్న్యాసి రూపాన్ని ధరించాడు. నెమ్మదిగా రామలక్ష్మణులకు దగ్గరగా వెళ్ళి వినయంగా వాళ్ళకు నమస్క రించాడు. మృదుమధురంగా వాళ్ళతో ఇట్లా అన్నాడు.

హనుమంతుడు: మహాత్ముల్లారా! మీరు చూట్టానికి దేవతల్లాగా ఉన్నారు. మీ ముఖవర్చస్సు చూస్తూ ఉంటే రాజర్షుల్లా కనిపిస్తున్నారు. మునుల వేషంలో ఉన్నారు. ధనుస్సు, బాణాలు, ఖడ్గము ధరించారు. మిమ్మల్ని చూస్తూ ఈ అడవిలోని మృగాలన్నీ భయపడుతున్నాయి. మీరు ఎవరు? మీరు ఈ ప్రదేశానికి ఎందుకు వచ్చారు? మీరు మహా ధైర్యస్థులని మీ ఆయుధాలే చెప్తున్నాయి. మహాబాహువులు కలిగివున్నారు. ఈ పంపాతీరాన ఉన్న వృక్షాల్ని చూస్తూ మీ ఉనికిచే పంపానదీ పవిత్రజలాల్ని ప్రకాశింపచేస్తున్నారు. నిజానికి మిమ్మల్ని చూసి జనులు, మృగపక్ష్యాదులు కూడా భయపడుతున్నారు. మీ రెవరు?

మహాపురుషుల్లారా! మీరు గొప్ప బలపరాక్రమాలు కలవారు. మీ ధనుస్సులు ఇంద్రధనుస్సుల్లాగా కనిపిస్తున్నాయి. శత్రుసంహారం చేయగల సమర్థుల్లాగా ఉన్నారు. గొప్పశోభతో కూడిన పరాక్రమవంతులై ఉన్నారు. ఏనుగు తొండం వలె మీ బాహువులు పొడవుగాను, బలంగాను ఉన్నాయి. గొప్ప కాంతిగల మానవ శ్రేష్ఠులారా! మీరు ఎవరు?

ఓ శ్రేష్ఠులారా! మీ కాంతి చేత ఈ పర్వతమే ప్రకాశిస్తున్నది. రాజ్యాలు ఏలవలసినవారు, దేవతలతో సమానులైన మీకు ఈ పర్వత ప్రాంతాల్లో ఏమి పని? మీ నేత్రాలు పద్మరేకుల్లా ఉన్నాయి. వీరులైవుండీ జటలు, వల్కలాలు ధరించారు. ఒకరిని పోలి మరొకరున్నారు. దేవలోకం నుండి దిగివచ్చిన వీరుల్లాగా ఉన్నారు. ఏదో అనుకోకుండా భూలోకానికి దిగి వచ్చిన

సూర్యచంద్రుల్లా ఉన్నారు. శౌర్యంతో మదించిన ఆబోతుల్లా ఉన్నారు. మీ చేతులు బలంగాను, పొడవుగాను, కోట తలుపులకు వేసే గడియల్లాగా ఉన్నాయి. అలంకరించుకోదగిన మీ భుజాలు అలంకారాల్లేకుండా ఉన్నాయేమిటి? సముద్రాలు, నదులు, పర్వతాలతో కూడుకున్న ఈ భూమండలాన్నంతా ఏలగల సమర్థులని నా అభిప్రాయం. బంగారు పూలుపూసి రత్నాలు, మణులతో అలంకరించి మీ ధనుస్సులు వజ్రాయుధంలాగా ఉన్నవి. అంబులపొదిలో ప్రజ్వరిల్లుతున్న బాణాలు సర్పాల్లాగా ఉన్నాయి, బంగారు ఒరలలో ఉన్న మీ ఖడ్గాలు కుబుసం విడిచిన భయంకర సర్పాల్లా ఉన్నాయి.

ఓ నరశ్రేష్ఠుల్లారా! నేను ఇంతసేపు మాట్లాడినా మీరు ఒక్క మాటైనా బదులు చెప్పలేదేమి? సరే, నేనే విషయానికొస్తాను.

ధర్మాత్ముడు, వీరుడు అయిన సుగ్రీవుడనే వానరరాజు ఉన్నాడు. అతడు తన అన్నగారైన వాలిచేత అవమానించబడి దేశంనుండి వెళ్ళగొట్టబడ్డాడు. అతడు ఈ పర్వతంపై తల దాచుకుంటున్నాడు. నేను కూడా వానరాన్నే, నా పేరు హనుమంతుడు. వానర నాయకుడైన సుగ్రీవుడు పంపగా వచ్చాను.

మహాత్మా! వానర రాజైన సుగ్రీవుడు మీతో స్నేహాన్ని కోరుతున్నాడు. నేను అతడి మంత్రిని, వాయుదేవుని కుమారుడను, వానరుడను. నేను నా ఇష్టమైన రూపాన్ని ధరించగలను, ఇష్టమైన చోటుకు పోగలను. నాకా సమర్థత ఉంది. సుగ్రీవుడికి సహాయపడేందుకు మీ వద్దకు ఋష్యమూక పర్వతం నుండి సన్యాసి రూపాన్ని ధరించి వచ్చాను.

రాముడు (మహదానందం పొందుతూ) : లక్ష్మణా! చూశావా? మనం ఏ వానరరాజైన సుగ్రీవుణ్ణి వెతుక్కుంటూ వచ్చామో, అదే సుగ్రీవుడి మంత్రి అయిన ఈ హనుమంతుడు నన్ను వెతుక్కుంటూ వచ్చాడు.

లక్ష్మణా! సుగ్రీవుని మంత్రి అయిన ఈ వానరుడు మంచి మాటకారి, స్నేహపాత్రుడు.

శత్రుసంహారం చేయగల శక్తీ, నేర్పూ రెండూ ఉన్నాయి. అటువంటి ఈ హనుమంతునితో స్నేహంగాను, మధురంగాను మాట్లాడు. ఇతడి మాటల నేర్పు, మాధుర్యము, కార్యదక్షత చూస్తూ ఉంటే ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం చదివిన వేదవిదుడులాగా కనిపిస్తున్నాడు. లక్ష్మణా! ఇతడు వ్యాకణశాస్త్రంలోకూడా నిష్ణాతుడే. ఎందుకంటే అతడు ఇంతసేపు మాట్లాడినా ఒక్క అపశబ్దం కూడా దొర్లలేదు. ముఖమునందుగానీ, కళ్ళల్లోగానీ, నుదుటగానీ, కనుచూపులోగానీ, మరి ఏ ఇతర అవయవాల యందు కూడా దోషం కనిపించలేదు.

లక్ష్మణా! ఇతడి మాటల్లో అధిక ప్రసంగం కనిపించడం లేదు. సందేహనికి ఎక్కడా ఆస్కారం లేదు. ఉచ్చారణ స్పష్టంగాను, శుభ్రంగాను ఉంది. వినేవాడికి బాధ కలిగించటం లేదు. లక్ష్మణా! ఇతడి మాట నాభి దగ్గర బయలుదేరింది. వక్షఃస్థలాన్ని తాకుతూ, వినేవాళ్ళకు సౌకర్యంగా ఉండే వైఖరీ రూపంలో కంఠాన్ని చేరింది. కాబట్టి ఇతడి మాట బిగ్గరగాగానీ, మందంగాగానీ కాకుండా మధ్యమస్వరంలో ఉంది. ఇతడు మాట్లాడిందంతా వ్యాకరణబద్ధంగా ఉంది. ఉచ్చారణల్లో తొందరపాటుతనం లేకుండా ఆశ్చర్యంగా ఉంది. లక్ష్మణా! వర్ణాల్ని ఉచ్చరించే వక్షము, కంఠము, శిరస్సు అనే మూడు స్థానములందు చక్కగా పలికిన పలుకుల వలన, కత్తి పట్టి నిలచిన శత్రువు మనస్సుకూడా మారిపోతుంది.

రాముని మాటలు విన్న లక్ష్మణుడు హనుమంతునితో “ఓ బుద్ధిమంతుడా! మహాత్ముడైన సుగ్రీవుని గుణాలను గూర్చి మేము ఎరుగుదుము. మేము ఆ సుగ్రీవుణ్ణి వెతుక్కుంటూనే వచ్చాం. సత్పురుషులలో శ్రేష్ఠుడవైన ఓ హనుమంతుడా! మేము సుగ్రీవుడు కోరినట్లు అతడితో స్నేహం చెయ్యటానికే వచ్చాం” అన్నాడు.

# 4వ సర్గ రామలక్ష్మణులను సుగ్రీవుని వద్దకు చేర్చటం

లక్ష్మణుడి మాటలు హనుమంతుణ్ణి సంతోషంతో పరవశుణ్ణి చేశాయి. మనస్సులోనే సుగ్రీవుణ్ణి అభినందించాడు. 'ఓ సుగ్రీవా! నీ కోరిక నెరవేరే సమయం వచ్చింది. ఎట్లాగంటే, సుగ్రీవుని సహాయంకోరి ఈ మహాపురుషుడు వచ్చాడు. ఈ మహానుభావుడు కోరే సహాయాన్ని సుగ్రీవుడు సులభంగా చేయగలడు. కాబట్టి ఇదే మహానుభావుడు సుగ్రీవుడికి రాజ్యం లభించేట్లు కూడా చేయగలడు' అని మనస్సులోనే ఆలోచనచేసి లక్ష్మణుడితో ఇట్లా అన్నాడు.

హనుమంతుడు: ఓ లక్ష్మణా! పంపాతీరాన ఉన్న ఈ పర్వత ప్రాంతమంతా భయంకరమైన అరణ్యంతో నిండి ఉంటుంది. ఇక్కడ భయంకరమైన క్రూరమృగాలు, సర్పాలు తిరుగుతూ ఉంటాయి. అటువంటి ఈ అడవిలోకి మీరు ఏ ప్రయోజనాన్ని ఆశించి వచ్చారు?

లక్ష్మణుడు: ఓ హనుమంతుడా! ధర్మాత్ముడు, నాలుగు వర్ణాలవారిని స్వధర్మమందు ఆసక్తులయ్యేట్లుగా దశరథుడు అనే రాజు పాలిస్తూ ఉండేవాడు. ఆ మహాత్ముడు ఎవరినీ ద్వేషించి ఎరుగడు. అట్లాగే జగత్తులో ఒక్కడు కూడా ఆయనను ద్వేషించి ఎరుగరు. సర్వభూతాలపట్లా సమభావంతో మెలిగేవాడు. అనేక యాగాలు చేశాడు. దక్షిణలు విరివిగా ఇచ్చాడు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయనను రెండవ బ్రహ్మదేవుడిగా భావించేవారు.

అటువంటి ధర్మాత్ముడైన దశరథ మహారాజు పెద్ద కుమారుడైన ఈతడి పేరు రాముడు. ఇతడు సకల ప్రాణులకు అభయమిచ్చేవాడు. తండ్రి ఆజ్ఞను తు.చ. తప్పక పాలించేవాడు. ఇతడు ఆ దశరథ మహారాజు పుత్రులందరిలోనూ అధిక గుణసంపన్నుడు. రాజ్యసంపదలు కలిగినవాడు. కానీ రాజ్యభ్రష్టుడు కావడం వలన ఇప్పుడు అడవుల్లో నివసిస్తున్నాడు. ఇతడు ఇంద్రియనిగ్రహం కలవాడు. మహాతేజశ్శాలి. ఈతడి భార్య సీతాదేవి, మహా పతివ్రత. భర్తతో సహజీవనం చేయడానికి ఇతడితోపాటు అడవులకు వచ్చింది.

నేను ఇతడి తమ్ముడను, పేరు లక్ష్మణుడు. నేను ఇతడి గుణాలకు ఆసక్తుడనై ఇతడికి సేవలు చేస్తూ ఇతడి వెంటనే ఉంటున్నాను. నా అన్న రాముడు ఏ కొద్దిపాటి మేలుచేసిన వారినైనా మరువడు. పైగా తను పొందిన సహాయం చిన్నదైనా ఆకాశమంత పెద్దదిగా భావిస్తాడు. ఇతడు సమస్త ప్రాణికోటికి మేలుచేయటమే పరమార్థంగా పెట్టుకున్నవాడు. ఇతడు రాజ్యాన్ని పోగొట్టుకొని భార్యతో కలసి అడవుల్లో నివసిస్తూ ఉండగా, మేము ఇద్దరం ఆశ్రమంలో లేని సమయం కనిపెట్టి రాక్షసుడొకడు ఇతడి భార్యను అపహరించుకు పోయాడు. అట్లా అపహరించుకు పోయిన రాక్షసుడెవరో మాకు తెలియక అరణ్యంలో పుట్టలు, గుట్టలు వెతుక్కుంటూ తిరుగుతున్నాం. ఇట్లా ఉండగా శ్రీపుత్రుడైన దనువు అనేవాడు శాపగ్రస్థుడై రాక్షసత్వం పొందాడు. అతడు రాముని వలన శాప విమోచనం పొంది, తిరిగి తన దివ్యరూపాన్ని పొందగలిగాడు. ఆ దనువు "గొప్ప పరాక్రమ శాలి అయిన సుగ్రీవుడనే వానరరాజు ఒకడున్నాడని, అతడి సహాయంతో నీ భార్యను అపహరించిన వానిని గూర్చి తెలుసుకొనగలవని, ప్రస్తుతం సుగ్రీవుడు ఋష్యమూకపర్వతంపై తన మంత్రులతో నివసిస్తున్నాడని, వెంటనే వెళ్ళి అతణ్ణి కలుసుకొని, నీ కార్యం సాధించుకొ" మ్మని చెప్పి తన విమానం ఎక్కి ఆకాశమార్గాన వెళ్ళిపోయాడు. నీవు అడిగిన ప్రశ్నలన్నింటికీ యథార్థమైన సమాధానాన్ని చెప్పాను. ఇప్పుడు నేను, రాముడు సుగ్రీవుని సహాయం కోరటానికి ఇక్కడకు వచ్చాం.

హనుమంతుడా! ఏ దశరథ మహారాజు భూమిపై ఉండే సకల రాజులను సామంతులుగా చేసుకుని అనుగ్రహదృష్టితో చూసేవాడో, సత్కరించేవాడో, అటువంటి దశరథ మహారాజు పెద్దకుమారుడైన రాముడు వానరరాజైన సుగ్రీవుని శరణుకోరి వచ్చాడు. శోకంచేత బాధపడుచున్న రామునిపై సుగ్రీవుడు అనుగ్రహం చూపాలి.

హనుమంతుడు: మహాత్ములారా! బుద్ధిమంతులు, క్రోధాన్ని, ఇంద్రియాల్ని జయించిన మీవంటివారి దర్శనం చేతనే సకల పాపాలూ తొలగిపోతాయి. అటువంటి మీ దర్శనం

సుగ్రీవుడు తప్పక చేసుకోవాలి.

సుగ్రీవుడు తన అన్నగారైన వాలితో విరోధం పెట్టుకున్నాడు. వాలి, సుగ్రీవుని భార్యను అపహరించాడు. సుగ్రీవుణ్ణి రాజ్యం నుండి వెళ్ళగొట్టాడు. ఇప్పుడు సుగ్రీవుడు భయపడుతూ ఈ అరణ్యాల్లో తల దాచుకుంటున్నాడు. సూర్యపుత్రుడైన సుగ్రీవుడు తప్పకుండా సీతాన్వేషణలో మీకు సహాయపడగలడు.

హనుమంతుడు ఈ విధంగా మధురంగా మాట్లాడి, వారిద్దరితో సుగ్రీవుడి దగ్గరకు బయలుదేరాడు. అప్పుడు లక్ష్మణుడు హనుమంతునికి ధన్యవాదాలు చెప్పి రాముడితో ఇలా అన్నాడు.

లక్ష్మణుడు: రామా! ఈ హనుమంతుడు మాట్లాడే తీరు చూస్తే, అతడు కూడా మనతో పనిపెట్టుకునే వచ్చినట్లు తెలుస్తోంది. కాబట్టి మనం వచ్చిన పని పూర్తి అయినట్లుగానే భావించుకోవచ్చు. ఇతడి ముఖాన ప్రసన్నత ఉట్టిపడుతోంది. వాయుపుత్రుడైన హనుమంతుడు అసత్యం పలుకడు.

తరువాత వారంతా కలసి సుగ్రీవుని వద్దకు వెళ్ళారు. వాయుపుత్రుడైన హనుమంతుడు సన్న్యాసి రూపాన్ని వదలి వానర రూపాన్ని ధరించాడు. రామలక్ష్మణులిద్దర్నీ తన భుజాల మీద కూర్చోబెట్టుకొని ఆకాశమార్గాన సుగ్రీవుడి వద్దకు తీసుకువెళ్ళాడు. అధిక కీర్తి, పరాక్రమం, మంగళప్రదమైన బుద్ధిగల హనుమంతుడు తన పని అయిందిగదా అని సంతోషంతో రామలక్ష్మణులతో కలసి సుగ్రీవుని వద్దకు వెళ్ళాడు.

# 5వ సర్గ రామ సుగ్రీవుల మైత్రి

హనుమంతుడు రామలక్ష్మణులను తీసుకొని మలయ పర్వతానికి వెళ్ళి సుగ్రీవునితో ఇట్లా అన్నాడు.

హనుమంతుడు: ఓ సుగ్రీవా! రామలక్ష్మణు లిద్దరినీ తీసుకొనివచ్చాను.

రాముడు సత్య పరాక్రమములు కలవాడు. ఇక్ష్వాకుల వంశంలో పుట్టాడు. దశరథ మహారాజు పెద్దకుమారుడు. తండ్రి ఆజ్ఞను పాలించడానికి అడవులకు భార్యతో కలసివచ్చాడు.

దశరథ మహారాజు రాజసూయం మున్నగు అనేక యాగాలు చేశాడు, వేలకొద్దీ ఆవుల్ని దానం చేశాడు. విరివిగా దక్షిణలిచ్చాడు. అటువంటి దశరథుని పుత్రుడైన రాముడు కైకేయికి తండ్రి ఇచ్చిన మాటను సత్యం చేయడానికి అరణ్యవాసం చేస్తున్నాడు. అటువంటి రాముడు ఇంద్రియనిగ్రహం కలవాడై, అరణ్యంలో నివసిస్తూ ఉండగా, ఈతడి భార్యను రావణుడు అపహరించాడు. సీతాన్వేషణకై రాముడు నీ సహాయం కోరుతున్నాడు. సోదరులైన రామలక్ష్మణులు నీతో స్నేహం చెయ్యాలని ఉవ్విళ్లూరుతున్నారు. వారిద్దరూ పూజార్హులు. సాదరంగా వారిని ఆహ్వానించి పూజించు.

వానర రాజైన సుగ్రీవుడు హనుమంతుని మాటలు విని, పరమానందంతో ఇట్లా అన్నాడు.

సుగ్రీవుడు: రామా! నీవు ధర్మాలన్నీ చక్కగా తెలిసినవాడవు. గొప్ప తపస్సు గలవాడవు. అందరియందూ ప్రేమ గలవాడవు. నీ గుణాలను గూర్చి వాయుపుత్రుడు నాకు చెప్పాడు.

ఓ ప్రభూ! వానరుడనైన నాతో స్నేహం చేయాలనుకుంటున్నావంటే, అది నాకెంతో గొప్ప సత్కారం చేసినట్లు భావిస్తాను. గొప్ప అదృష్టవంతుణ్ణిగా భావిస్తున్నాను. రామా! నేను నీ స్నేహాన్ని కోరుతూ చెయ్యి చాపుతున్నాను. నీకూ అంగీకారమైతే నా చేతిని అందుకో.

వినయంతో కూడిన సుగ్రీవుని మాటలకు రాముడు ఎంతో సంతోషించి, సుగ్రీవుని చేతిని గ్రహించి తన చేతులో పెట్టుకొన్నాడు. లేచి ఇద్దరూ ఒకరినొకరు కౌగలించుకున్నారు. అప్పుడు హనుమంతుడు సన్న్యాసి రూపాన్ని విడిచి తన రూపాన్ని ధరించాడు. రెండు కర్రలను ఒరిపిడి చేసి అగ్ని పుట్టించి ఆ కర్రల్ని రామసుగ్రీవుల మధ్య ఉంచాడు. రామసుగ్రీవులు ఇద్దరూ మండుచున్న ఆ అగ్నిచుట్టూ తిరిగి ప్రదక్షిణం చేశారు. ఆ విధంగా అగ్నిసాక్షిగా వారిద్దరూ స్నేహితులయ్యారు.

సుగ్రీవుడు: రామా! నీవు నాకు ప్రేమపాత్రుడవైన మిత్రుడవయ్యావు. ఇకపై మనం సుఖదుః ఖాలన్నీ సమానంగా పంచుకుందాం.

తరువాత సుగ్రీవుడు సాలవృక్షం నుండి కొమ్మ ఒకటి విరిచి, దాని ఆకులను, పూలను నేలపై పరచి దానిపై రామునితో కలసి కూర్చున్నాడు. తరువాత హనుమంతుడు పుష్పాలతో ఉన్న చందనవృక్షం నుండి ఒక కొమ్మను నరికి లక్ష్మణునకు ఇచ్చాడు.

సుగ్రీవుడు: రామా! నా అన్న వాలి నన్ను అవమానించాడు. నా భార్యను అపహరించాడు. ప్రాణభయంతో నేను నా దేశాన్ని విడిచి ఈ అడవుల్లో తలదాచుకుంటున్నాను. ఇది మహాభయంకరమైన అరణ్యం కావటాన ఇతరులెవ్వరూ ఇక్కడకు రారు.

భాగ్యవంతుడవైన ఓ రామా! నాకు వాలి నుండి భయం కలుగకుండా చెయ్యి, నాకు అభయమివ్వు.

రాముడు (నవ్వుతూ) : సుగ్రీవుడా! నీకు ఉపకారం చేస్తాను. మిత్రుడికి సహాయం చెయ్యడమే ఉపకారం. నేను నీ కోసం వాలిని చంపుతాను. నీ భార్యను అపహరించిన వాలిని వధిస్తాను. నీవు నిర్భయంగా ఉండు. నా బాణాలు సూర్యప్రకాశం వంటివి. చాలా వాడియైనవి. వీటికి గ్రద్దల రెక్కలు కట్టబడి ఉన్నాయి. చివర వంకర లేకుండా కణుపులు గల ఈ బాణాలు మహేంద్రుడి వజ్రాయుధంతో సమమైనవి. ఈ బాణాలు పగబట్టిన సర్పాల్లాగా మహావేగంగా

వెళ్ళి వాలిని అంతం చేస్తాయి. వాలి పర్వతం పడినట్లు నేలకూలక తప్పదు. నీవు చూస్తూ ఉండు.

తేజఃశ్శాలి, ధర్మం తెలిసినవాడు, ధర్మములందు ఆసక్తికలవాడు అయిన రాముడు, సుగ్రీవునకు హితమైన మాటలు చెప్పి సంతోషపెట్టాడు.

సుగ్రీవుడు: నరులలో శ్రేష్ఠుడైన ఓ వీరుడా! నీ అనుగ్రహం వల్ల తిరిగి నా రాజ్యాన్ని, భార్యను పొందగలను, ఓ రాజా! మళ్ళీ నా అన్న అయిన వాలి మళ్ళీ నన్ను బాధించకుండా ఉండేట్లు చెయ్యి.

రాముడు, సుగ్రీవుడు ఒప్పందం చేసుకున్న క్షణానే వాలి ఎడమకన్ను, సీతాదేవి ఎడమకన్ను, అగ్నిహోత్రంలాగా మండే రావణుని ఎడమకన్ను ఏకకాలంలో అదిరాయి.

# 6వ సర్గ సుగ్రీవుడు సీత ఆభరణాలు చూపడం

సుగ్రీవుడు: ఓ రామా! నీవు నీ సోదరుడైన లక్ష్మణునితో కలసి ఈ అరణ్యంలోకి ఎందుకు వచ్చావో హనుమంతుడు నాకు చెప్పాడు. మీరిద్దరూ లేని సమయం చూసి, నీ భార్య సీతాదేవిని ఎవరో రాక్షసుడు అపహరించాడని చెప్పాడు. సీతాదేవిని రక్షించటానికి అడ్డువెళ్ళిన జటాయువును కూడా ఆ రాక్షసుడు చంపి నీకు భార్యావియోగాన్ని కలిగించాడని చెప్పాడు.

రామా! శత్రు సంహారకుడా! నీ భార్య పాతాళాన ఉన్నా సరే, ఆకాశాన ఉన్నా సరే, నేను వెతికి త్వరలోనే ఆమెను నీ వద్దకు చేరుస్తాను. నీ భార్యావియోగ దుఃఖాన్ని పోగొడతాను. గొప్పబాహువులుగల రామా! నీ భార్యను హరించుకుపోయినవాడు సురుడైనా, అసురుడైనా విషం తాగినవాడి వలె, నీ భార్యను జీర్ణించుకోలేడు.

గొప్ప బాహువులు గలవాడా! రామా! భయంకరమైన పనులు చేసే ఆ రావణుడు ఒక స్త్రీని ఒడిలో పెట్టుకొని అపహరించుకుపోతూ ఉండగా ఆమె ఆడసర్పం లాగా పెనుగులాడింది. 'రామా! రామా! లక్ష్మణా' అంటూ హృదయవిదారకంగా విలపిస్తూ ఉండటం నేనొకనాడు చూశాను. ఆ స్త్రీయే సీత అని అనుకొంటున్నాను. సందేహం లేదు. ఆ స్త్రీ సీతయే అయి ఉంటుంది. ఆ సమయంలో నేను, నా నలుగురు మంత్రులం ఈ పర్వత శిఖరంపైన ఉండగా ఆమె ఉత్తరీయంలో నగలు మూటకట్టి జారవిడచింది. రామా! మేము ఆ నగలను తీసి జాగ్రత్తపరచాం. నువ్వు కూడా చూడు. అవి సీతవేనేమో! గుర్తించి చెప్పు.

వెంటనే సుగ్రీవుడు పర్వత గుహలో దాచిపెట్టి ఉత్తరీయంలో కట్టి ఉంచిన నగలను, ఆభరణాలను తెచ్చి రాముడి ముందు ఉంచాడు. అప్పుడు రాముడు ఆ ఉత్తరీయపు మూటను విప్పి శ్రేష్ఠమైన అలంకారాలన్నీ చూశాడు. చంద్రుడు పొగమంచుచే కప్పబడినట్లు, రాముని కళ్ళ నిండుగా బాష్పాలు ఆవరించాయి. ఆ నగలను చూస్తూనే 'హే ప్రియా' అంటూ విలపిస్తూ మూర్ఛ చెందాడు. రాముడు ఆ అలంకారాలను చేతిలోనికి తీసుకొని గుండెలకు హత్తుకొని

దుఃఖంతోనూ, కోపంతోనూ బుసలు కొట్టాడు. కళ్ల నుండి నీరు ధారాపాతంగా వస్తూవుండగా ప్రక్కనే ఉన్న లక్ష్మణుడికి ఆ నగల్ని చూపించి "లక్ష్మణా! రాక్షసుడు అపహరించుకు పోతున్నప్పుడు సీత నగలన్నీ ఉత్తరీయంలోకట్టి జారవిడిచింది. నేలంతా పచ్చిక దట్టంగా పట్టి ఉండటంవల్ల నగలేవీ విరిగిపోకుండా ఉన్నాయి. సీతవి అవునో కాదో చూసి చెప్పు" అన్నాడు.

లక్ష్మణుడు: అన్నా! నాకు చేతులకు పెట్టుకునే అలంకారాలు గానీ, చెవులకు పెట్టుకునే కుండలాలు గానీ తెలియవు. కానీ ప్రతిరోజు ఆమె పాదాలకు నమస్కరించేవాడిని కాబట్టి ఆమె కాళ్ళకు వేసుకున్న కడియాలను, కాలివేళ్ళకు పెట్టుకునే మెట్టెలను గుర్తిస్తున్నాను.

రాముడు: సుగ్రీవుడా! నా ప్రియురాలైన సీతను ఆ రాక్షసుడు ఏ దేశానికి తీసుకుపోయాడో చెప్పు. నాకు ఇంతటి దుఃఖాన్ని కలిగించిన ఆ భయంకర రాక్షసుణ్ణే కాదు, రాక్షసులనందరినీ నశించేట్లు చేస్తాను. నా ప్రియురాలు సీతను హరించటం వల్ల వాడి చావు వాడే కొని తెచ్చుకున్నాడు. ఓ సుగ్రీవా! నా ప్రియురాలైన సీతను బలాత్కారంగా తీసుకుపోయిన ఆ రాక్షసుణ్ణి ఇప్పుడే యమలోకానికి పంపుతాను.

# 7వ సర్గ సుగ్రీవుడు రాముణ్ణి ఓదార్చడం

సుగ్రీవుడు (డగ్గుత్తిక స్వరంతో కన్నీళ్ళు పెట్టుకుంటూ) : రామా! దుర్మార్గుడైన ఆ రాక్షసుడి నివాసంగాని, సామర్థ్యం గాని, పరాక్రమంగాని నాకు తెలియవు. శత్రు సంహారకుడవైన రామా! దుఃఖాన్ని విడిచిపెట్టు. నీకు సీత లభించేట్లు చేస్తాను. నీకు ప్రతిజ్ఞచేసి చెబుతున్నాను. నీవు రావణుణ్ణి, వాడి పరివారాన్ని చంపి నీ పౌరుషాన్ని ప్రదర్శించుకునేట్లు, నీకు సంతోషం కలిగేట్లు, త్వరలోనే చేస్తాను. ధైర్యంగా ఉండు. నీ సహజగుణమైన ధైర్యాన్ని గుర్తు తెచ్చుకో. నీవంటి వీరుడు ఇట్లా అధైర్యపడకూడదు.

రామా! భార్యావియోగం ఎంత బాధాకరమో నాకూ తెలుసు. నేనూ ఆ బాధను అనుభవిస్తూనే ఉన్నాను. కానీ దుఃఖీస్తున్నానుగానీ, ధైర్యాన్ని విడవటంలేదు. నేను ఒక వానరుణ్ణి అయినా నా భార్యను గూర్చి ఇంతగా దుఃఖించటం లేదంటే, ఇక నీవంటి మహాత్ముడు, విద్యావంతుడు, ధైర్యస్థుడు అయిన నీవు ఇంతగా బేలవైపోవచ్చునా?

రామా! నీ కన్నీటిని ధైర్యంతో నిలిపెయ్యి. ధైర్యాన్ని వదలొద్దు. కష్టాలు వచ్చినప్పుడు, రాజ్యాన్ని పోగొట్టుకున్నప్పుడు ప్రాణభయం కలిగినప్పుడు బుద్ధిమంతుడైనవాడు బుద్ధి బలంతో ఆలోచిస్తాడు, అధైర్యపడడు, దుఃఖపడడు. బుద్ధిబలం లేనివాడే అధైర్యపడతాడు. దుఃఖపడుతూ ఉంటాడు. బరువు ఎక్కువైనప్పుడు పడవ మునిగిపోయినట్లు దుఃఖభారంతో క్రుంగిపోతాడు.

ఓ ప్రభూ! నేను చేతులు జోడించి స్నేహితుడిగా వేడుకుంటున్నాను. సహజమైన నీ పరాక్రమాన్ని అవలంబించు. దుఃఖాన్ని విడిచిపెట్టు. దుఃఖానికి అవకాశం కూడా ఇవ్వకు. ఎందుకంటే, దుఃఖపడేవాడికి సుఖం ఉండదు, పరాక్రమం ఉండదు, ప్రాణాపాయంకూడా సంభవించవచ్చు. కాబట్టి ధైర్యం వహించు. నేను నీ మేలు కోరుతున్న స్నేహితుడిగా మనవి చేసుకుంటున్నానేకాని, నేనేమీ నీకు ఉపదేశం చెయ్యటంలేదు. స్నేహాన్ని గౌరవించేవాడివి కాబట్టి చెబుతున్నాను. లోకం నీ వల్ల ఉపకారాలు పొందవలసి ఉంది. కాబట్టి మా అందరి హితం కోరి

మనవిచేస్తున్నాను. ఇదంతా నేను హృదయపూర్వకంగా నీ ముందు నివేదించుకుంటున్నాను.

ఈ విధంగా సుగ్రీవుడు మృదుమధుర భాషణాలతో ఓదారుస్తూ ఉండగా, రాముడు పైపంచెతో ముఖం తుడుచుకుని సుగ్రీవుణ్ణి కౌగలించుకున్నాడు.

రాముడు: స్నేహితుడా! సుగ్రీవుడా! నీవు నా మిత్రుడివి. స్నేహంతో నా మేలు కోరుతున్నావు, నన్ను ఊరడించావు. నా కర్తవ్యాన్ని గుర్తుచేశావు, ఇటువంటి కష్ట సమయంలో నీలాంటి మిత్రుడు దొరకటం చాలాకష్టం.

స్నేహితుడా! సుగ్రీవా! నా ప్రియురాలు సీతను ఎక్కడ దాచి ఉంచాడో వెతికిపెట్టు. క్రూరుడైన ఆ రావణాసురుడు ఎక్కడ ఉంటాడో చెప్పు, ఈ సహాయం నాకు నువ్వు చేసిపెట్టు. నేను నీకు ఏం సహాయం చెయ్యాలో దాపరికం లేకుండా చెప్పు. రాముడు ఈ పని చేయటానికి సమర్థుడేనా? అని సందేహపడకు. నా పట్ల నమ్మకం ఉంచు. రైతు వానాకాలంలో విత్తిన పైర్లు చక్కగా ఫలించినట్లు నీవు ఇప్పుడు నానుండి ఆశించే కార్యాలన్నీ నీకు మంచి ఫలితాలనిస్తాయి.

ఓ వానరశార్దూలమా! నేను నీ అన్న వాలిని వధిస్తానని చెప్పాను. ఆ మాట యథార్థం. నేను ఇదివరకు ఎన్నడూ అసత్యం పలుకలేదు. ఇకపైన కూడా పలుకను. నేను వాలిని వధిస్తానని నీకు ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఇది సత్యం. ఇది నా శపథం.

సుగ్రీవుడు రాముని మాటలు విన్నాడు. అతడు చేసిన ప్రతిజ్ఞకు పరిపూర్ణమైన సంతృప్తి చెందాడు. అతడి మంత్రులు కూడా చాలా ఉత్సాహభరితులయ్యారు. ఆ విధంగా వారిద్దరూ చాలాసేపు కూర్చుని సుఖదుఃఖాలు ముచ్చటించుకున్నారు. వారు చేసుకున్న ప్రతిజ్ఞలు ఏ విధంగా ఆచరణలో పెట్టాలో ప్రణాళికలు వేసుకున్నారు. రాముడి మాటలపై విశ్వాసముంచి తన కార్యం అయిపోయినట్లేనని సుగ్రీవుడు సంతోషించాడు.

# 8వ సర్గ తన దుఃఖ కారణాన్ని సుగ్రీవుడు రామునికి చెప్పడం

సుగ్రీవుడు: ఓ రామా! సకల సంపదలతోనూ, సకల సద్గుణాలతోనూ నిండిన నువ్వు నాకు స్నేహితుడవు కావడం దైవానుగ్రహమేననీ, నా పూర్వజన్మల పుణ్యఫల విశేషమేననీ భావిస్తాను. అందులో సందేహం లేదు. నువ్వు నా ప్రక్కన ఉండి సహాయంచేస్తే స్వర్గలోకానికే రాజును కాగలను. అటువంటిది నా రాజ్యాన్ని తిరిగి పొందలేనా? రఘువంశంలో పుట్టిన నీతో అగ్నిసాక్షిగా ఒప్పందం చేసుకోవడం వల్ల నన్ను బంధువులు, స్నేహితులు కూడా గౌరవిస్తారు.

ఓ రామా! నేను కూడా నీకు మంచి స్నేహితుడననే అనిపించుకుంటాను. నా గుణాలను గూర్చి నేను చెప్పుకోకూడదు, ముందు ముందు నీకే తెలుస్తుంది. నీవంటి సత్పురుషులు వెండి బంగారం వంటి విలువైన వస్తువుల్నికూడా 'ఇది నీది, అది నాది' అని పంచుకోరు. సమానంగా అనుభవిస్తారని పెద్దలంటారు.

స్నేహితుడు ధనికుడైనా, దరిద్రుడైనా, సుఖాల్లోవున్నా, దుఃఖాల్లోవున్నా, దోషాలున్నా లేకపోయినా మనిషికి స్నేహితుడొక్కడే తోడు నీడగా నిలబడతాడు. స్నేహం విలువ తెలిసిన వాళ్ళు (నిజమైన స్నేహితులు) ధనాన్నిగానీ, సుఖాన్నిగానీ, దేశాన్నిగానీ, ప్రాణాన్నిగానీ స్నేహితుని నిమిత్తమై వదులుకోవటానికి వెనుకాడరు.

లక్ష్మణుడి సమక్షంలో దేవేంద్రుడిలాగా కూర్చున్న రాముడు సుగ్రీవునితో, "నీవు చెప్పినదంతా యథార్థం" అన్నాడు.

తరువాత సుగ్రీవుడు ఇలా కొనసాగించాడు:

ఓ మిత్రుడా! నా అన్న వాలి నన్ను అవమానించాడు, నా భార్యను అపహరించాడు. ఏంచెయ్యాలో తోచక భయంతో ఈ ఋష్యమూక పర్వతంపైన తలదాచుకుంటున్నాను. నా అన్నతో వైరం వచ్చినప్పటినుండి నా మనస్సు మనస్సులో లేదు.

ఓ రామా! నీవు సమస్త లోకాల వారి భయాన్ని పోగొట్టి రక్షణ కల్పించే సమర్థుడవు. ఇప్పుడు భయం గుప్పిటలో ఇరుక్కుపోయి వున్నాను. అనాథగా మిగిలిపోయాను ఇకపై నీవే నాకు రక్షకుడవు, నాకు దిక్కు.

రాముడు: సుగ్రీవుడా! మిత్రుడికి ఉపకారం చెయ్యాలి. అపకారం చెయ్యడం శత్రువుల లక్షణం. నీ భార్యను అపహరించిన వాలిని ఇప్పుడే వధిస్తాను. నా బాణాలు తీక్షణమైనవి, వేగవంతమైనవి, తేజస్సుతో కూడినవి. ఇవన్నీ కార్తికేయుని వనంలో పుట్టాయి, బంగారు ములుకులు, కణుపులతో అమర్చబడ్డాయి. వీటికి గ్రద్దల రెక్కలు కట్టి ఉన్నాయి. ఇన్నెందుకు, దేవేంద్రుడి వజ్రాయుధంతో సమమైనవి. ఇవి ప్రాణాలు తీసే మహాసర్పాల వంటివి. నీకు అన్నగా పుట్టికూడా ఇటువంటి పాపిష్టి పని చేసిన వాలిని వెంటనే చంపేస్తాను. నా బాణం తగలగానే పర్వతం లాగా నేలకూలుతాడు.

సుగ్రీవుడు: రామా! లోకంలో దుఃఖంతో బాధపడేవాళ్ళకు నీవే దిక్కు. అందువల్లనే స్నేహంతో నీ చేతిని పట్టుకొన్నాను. అగ్నిసాక్షిగా స్నేహితుడివి కావడంవల్ల నాకు ప్రాణంకన్నా ఎక్కువైన వాడవయ్యావు. నేను కూడా సత్యం మీద శపథం చేసి చెప్తున్నాను. నీవు నా స్నేహితుడివి కావటం వల్ల నా దుఃఖాన్నంతా నీ దగ్గర వెళ్ళబోసుకుంటున్నాను. నీ మీద ఉన్న నమ్మకంతోనే ఏ దాపరికం లేకుండా అన్ని విషయాలు చెప్పేశాను. నా గుండెబరువు దించుకున్నట్లైంది.

మిత్రుడా! నా అన్న నా కన్నా బలవంతుడు. నన్ను అనరాని మాటలన్నాడు, చెయ్యరాని అవమానాలన్నీ చేశాడు. దేశం నుండి వెళ్ళగొట్టాడు. నాకు ప్రియాతిప్రియమైన భార్యను అపహరించాడు. నా స్నేహితులందరినీ కారాగారంలో బంధించాడు.

రామా! దుష్టుడైన నా అన్న, నన్ను చంపటానికి ఎంతోమంది వానరుల్ని పంపించాడు. కానీ వాళ్ళంతా నాకంటే బలహీనులు కావటంతో వారినందరినీ నేను చంపేశాను. అందువల్లనే

మీ ఇద్దర్నీ దూరాన్నుంచి చూసినప్పుడు వాలియే పంపించి ఉంటాడని సందేహించాను, భయపడిపోయాను. అందువల్లనే నేను నీ ఎదుట పడేందుకు భయపడ్డాను. భయపడటానికి తగినన్ని కారణాలున్నప్పుడు ఎవరైనా భయపడటం సహజమే కదా?

ఓ ప్రభూ! హనుమంతుడి లాంటివారు నాతో ముగ్గురు నలుగురున్నారు. కాబట్టి బ్రతికిపోయాను. వీళ్ళు అన్ని విషయాల్లోనూ, నా వెనుకనే నీడలాగా ఉంటూ నన్ను కాపాడుతున్నారు. వాళ్లు నా క్షేమమే పరమలక్ష్యంగా పెట్టుకున్నారు.

ఓ రామా! నా అన్నగారైన వాలి పరాక్రమవంతుల్లో ప్రసిద్ధి గలవాడు, శ్రేష్ఠుడు. ఇప్పుడు నాకు పరమశత్రువు. వాలి చావుతో కానీ నా దుఃఖానికి అంతం లేదు. నా సుఖశాంతులన్నీ అతడి చావుపైనే ఆధారపడివున్నాయి. అతడు జీవించి ఉన్నంతకాలం నేను 'జీవించీ లేనట్లే'. నేను శోకంలో మునిగి ఉన్నాను. నా కథ అంతా సంక్షిప్తంగా చెప్పుకున్నాను. కష్టాల్లో అయినా, సుఖాల్లో అయినా స్నేహితుడే దిక్కని నమ్ముతున్నాను.

రాముడు: ఓ సుగ్రీవుడా! నీకూ వాలికీ విరోధం ఎందుకు వచ్చిందో నాకు యథార్థంగా చెప్పు. విరోధానికి మూలకారణం ఏమిటో నాకు చెప్పు. విరోధ కారణం బలీయమైనదా, విరోధం బలీయమైనదా నిర్ణయిస్తాను. వైర కారణంలో నీ అపరాధం అల్పంగానూ, వాలి నీతో పెట్టుకొన్న వైరమే ప్రబలమైనదయితే ఇప్పుడే ఆతణ్ణి వధిస్తాను. వైర కారణంలో నీ అపరాధమే ప్రబలంగానూ, వాలి నీతో పెట్టుకొన్న విరోధం అల్పమైనదైతే అతణ్ణి సమాధానపరుస్తాను. నువ్వు సుఖంగా జీవించేట్లు చేస్తాను. ఎందువల్లనంటే, విరోధం బలమైనదైతే వాలి నిన్నో, నువ్వు వాలినో చంపక తప్పదు. అట్లా కాకుండా విరోధ కారణం బలమైనది కాకుంటే, మీ ఇద్దరూ సమాధానపడే అవకాశం ఉంది. అన్న అయివుండీ వాలి నిన్ను అవమానించాడని వినగానే నా ఒళ్ళంతా కంపించింది? వర్షాకాలపు వరదలాగా నాకు కోపం ముంచుకు వచ్చింది. ఇంత వివరంగా ఎందుకు విచారణ చేస్తున్నానంటే, తీరా వాలిని చంపిన తర్వాత నీవు దుఃఖపడకూడదు. నీవు సంతోషంగా జీవించేందుకు, నేను విల్లు ఎక్కుపెట్టి బాణాన్ని సంధించే

ముందుగానే చెప్పాలి. నా బాణం వదలిన తర్వాత పగవాడు చావడం తథ్యం. అప్పుడు నువ్వు 'అయ్యో' అని దుఃఖపడకూడదు.

రాముని మాటలు విని సుగ్రీవుడు, ఆతడి అనుయాయులైన నలుగురు వానరశ్రేష్ఠులూ ఎంతో సంతోషించారు. తరువాత సుగ్రీవుడు తనకూ, వాలికీ ఏర్పడ్డ విరోధానికి కారణం ఏమిటో యథార్థంగా రాముడికి చెప్పనారంభించాడు.

# 9వ సర్గ వాలి సుగ్రీవుల వైరం – 1

సుగ్రీవుడు: రామా! వాలి అని పిలువబడే నా అన్నగారు శత్రుసంహారకుడుగా ప్రసిద్ధి చెందాడు. నా తండ్రిగారు కూడా వాలి బలపరాక్రమాలను అమితంగా మెచ్చుకునేవాడు. నేను కూడా నా అన్నగారిని భక్తితో ఆరాధించేవాడిని.

నా తండ్రిగారి మరణం తర్వాత, మంత్రులంతా కలసి పెద్దవాడైన వాలికి రాజ్యాభిషేకం చేశారు. పూర్వీకులనుండి సంక్రమిస్తున్న ఈ కిష్కింధ రాజ్యాన్ని వాలి పరిపాలిస్తూ ఉండగా నేను భక్తిశ్రద్ధలు గలవాడినై అన్నగారికి సేవలు చేస్తూ ఉండేవాడిని.

మహామాయావి అయిన మయుడికి మాయావి, దుందుభి అనే ఇద్దరు కుమారులున్నారు. వారిలో పెద్దవాడైన మాయావికి నా అన్నగారికి స్త్రీ సంబంధమైన వైరం ఏర్పడింది. ఆ మాయావి ఒకానొకనాడు అర్ధరాత్రి కిష్కింధానగర ద్వారం వద్దకు వచ్చి వాలిని యుద్ధానికి రమ్మని గట్టిగా అరిచాడు.

అప్పుడు నిద్రపోతున్న వాలి లేచాడు. నిద్రాభంగానికి ఎంతో కోపించినవాడై, పూర్వవైరాన్ని కూడా దృష్టిలో పెట్టుకొని వాడితో యుద్ధానికి బయలుదేరాడు. అంతఃపుర కాంతలందరూ అర్ధరాత్రిపూట యుద్ధానికి వెళ్ళొద్దని కాళ్ళావేళ్ళా బ్రతిమిలాడారు. నేనుకూడా ఎన్నో విధాల వెళ్ళొద్దని ప్రాథేయపడ్డాను. వాలి మా ఎవరిమాటా వినలేదు. తలుపులు తెరచి యుద్ధానికి బయలుదేరాడు. వాలి వెంట నేనూ వెళ్ళాను. మాయావి మా ఇద్దరినీ దూరం నుండే చూశాడు. మమ్మల్ని చూడగానే పారిపోయాడు. నేను, వాలి వాడిని వెంబడించాం. వాడు మమ్మల్ని దారీడొంకా లేని అరణ్యాలన్నీ తిప్పుతూ ఒక పర్వతగుహలోకి దూరాడు. వాలి నాతో "తమ్ముడా! నీవు ఈ బిలద్వారం దగ్గరే వేచి ఉండు. నేను లోపలకు పోయి ఆ రాక్షసుణ్ణి చంపి తిరిగివస్తాను. నేను వచ్చేవరకూ బిలద్వారం దగ్గరే జాగ్రత్తగా ఉండు" అన్నాడు. నేనుకూడా గుహలోకి వస్తానని ఎన్నో విధాలుగా చెప్పాను. వాలి నా మాట చెవికెక్కించుకోకపోగా తన

పాదాలమీద ఒట్టు పెట్టి, గుహలోకి ప్రవేశించాడు. నేను బిలద్వారం వద్దే కాపలా కాస్తూ ఉన్నాను. దాదాపు సంవత్సరం గడిచింది. ఎవరూ తిరిగి రాలేదు. వాళ్ళ మాటలు కూడా వినపడలేదు. ఒకానొక రోజు నురుగుతో కూడిన రక్తం కాలవకట్టి గుహ లోపల నుండి ప్రవహించడం మొదలైంది. అది చూసి రాక్షసుడు వాలిని చంపి ఉంటాడు అనుకున్నాను. ఆ రాక్షసుడు మళ్ళీ బైటకు రాకుండా చిన్న కొండను ఒకదాన్ని తోసుకుంటూవచ్చి ఆ బిలానికి అడ్డంగాపెట్టి ఇంటికి వెళ్ళాను. నేను ఈ విషయాన్ని చాలా గుంభనంగా ఉంచాను. అయినా నా మంత్రులు ఈ విషయాన్ని తెలుసుకొని నాకు రాజ్యాభిషేకం చేసి రాజును చేశారు.

రామా! నేను న్యాయసమ్మతంగా రాజ్యపాలన చేస్తూ ఉండగా ఒకానొకనాడు వాలి తిరిగివచ్చాడు. వాలి తిరిగి వచ్చాడన్న వార్త విన్న నేను సంతోషంతో ఎదురువెళ్ళి అభినందనలు చెప్పాను. కానీ వాలి నన్ను తిరిగి అభినందించలేదు. సరేకదా కోపంతో ఎర్రబడిన కళ్ళతో నన్ను నానావిధాలుగా దూషించాడు. నా మంత్రుల్ని బంధించాడు.

రామా! నేను కూడా అతణ్ణి అవమానించటానికి సామర్థ్యం ఉన్నా, అన్నగారన్న గౌరవం కొద్దీ ఆ పాపాత్ముడి విషయంలో క్రూరంగా ప్రవర్తించలేదు. నేను కిరీటంతో అతడి పాదాలు తాకి నమస్కరించినా అతడు నా పట్ల అనుగ్రహం చూపించలేదు.

## 10వ సర్గ వాలి సుగ్రీవుల వైరం – 2

సుగ్రీవుడు: రామా! అప్పుడు వాలి కోపావేశంతో నాపై విరుచుకు పడేట్లుగా వచ్చాడు. మా ఇరువురి క్షేమాన్ని దృష్టిలో ఉంచుకొని నేను త్వరగా వాలి దగ్గరకు పోయి నమస్కరించి ఎంతగానో బ్రతిమాలుకున్నాను.

అన్నా! వాలీ! నీ రక్షణ కోరినవారికి ఆనందం కలిగించేవాడవు. మా అదృష్టం బాగుండి నీవు శత్రువును జయించి క్షేమంగా తిరిగి వచ్చావు. అనాథగావున్న నాకు నీవే రక్షకుడవు. పూర్ణచంద్రుడిలాగా తెల్లగా ఉండి అనేక ఊచలు కలిగిన ఛత్రాన్ని, వింజామరల్ని పట్టుకొని ఇట్లా మొరపెట్టుకున్నాను.

"అన్నా! నేను చెప్పేది అంతా సత్యం, నీవు నమ్ము. నీవు చెప్పినట్లుగానే బిలద్వారం దగ్గర ఒక సంవత్సరానికిపైగా వేచి ఉన్నాను. లోపలనుండి ఉలుకూ పలుకూ లేకపోవడంతో నీవు ఏమైనావా అని దిగులుపడుతూ అక్కడే ఉన్నాను. సుమారు సంవత్సరం దాటిన తర్వాత ఒకానొకరోజు లోపల నుండి రక్తం ప్రవాహంగా రావటం మొదలైంది. అది చూసిన నాకు హృదయం అంతా వికలమైపోయింది. బిగ్గరగా ఏడ్చాను. ఇంద్రియాలన్నీ పట్టుతప్పాయి. ఏం చెయ్యాలో తోచలేదు. ఆ బిలద్వారాన్ని మూసివేస్తే ఆ రాక్షసుడు లోపలే బంధితుడై ఉంటాడుగదా అని, పర్వత శిఖరాన్నొకటి ఆ బిలద్వారానికి అడ్డంగాపెట్టి కిష్కింధకు చేరుకున్నాను.

దుఃఖంతో ఉన్న నన్ను చూసి మంత్రులు, పౌరులు నాకు రాజ్యాభిషేకం చేశారు. నన్ను రాజును చెయ్యమని నేను కోరలేదు. వారే ఒక నిర్ణయానికి వచ్చి నన్ను రాజును చేశారు. అందుకు హృదయపూర్వకంగా నిన్ను క్షమార్పణ కోరుకుంటున్నాను, యథార్థానికి నీవే రాజువు. నేను పూర్వంలాగానే నీ సేవలు చేసుకుంటూ ఉంటాను." ప్రేమతోను, భక్తితోను, భయంతోను పలికిన నా మాటలను వాలి విశ్వసించలేదు! 'ఛీ ఛీ' అంటూ నన్ను కసిరికొట్టి తీవ్రంగా అవమానించాడు. అది చాలదన్నట్లుగా, మంత్రులను, పౌరులను సమావేశపరచి వారితో ఇట్లా

అన్నాడు.

వాలి: మంత్రులారా! ప్రజలారా! పూర్వం ఒకానొక అర్ధరాత్రి రాక్షసుడొకడు వచ్చి నన్ను యుద్ధానికి ఉసిగొలిపాడు. ఆ విషయం అంతా మీకు తెలుసు. వాడిని వెంబడిస్తూ నేను, నా సోదరుడు ఈ సుగ్రీవుడూ వెళ్ళాం. అతడు ఒక గుహలోకి ప్రవేశించగా, నేనుకూడా అతణ్ణి అనుసరించి ఆ గుహలోకి వెళ్ళాను. వెళ్ళేముందు నా తమ్ముడితో, "ఈ రాక్షసుణ్ణి చంపకుండా నేను తిరిగిరాను. నేను వచ్చేవరకూ ఈ బిలద్వారం దగ్గరే ఉండు" అని గుహ లోపలకు వెళ్లాను. దాదాపు సంవత్సరం పైనే అయింది. అక్కడ ఎంత వెతికినా ఒక్కడూ కనిపించలేదు. చివరకు వెతగ్గా వెతగ్గా వాడు, వాడి బంధువులు కనిపించారు. నేను వాళ్ళందరినీ చంపేశాను. ఆ గుహ అంతా రక్తం మడుగు అయింది. ఆ రక్తం కాలువకట్టి బిలద్వారం వైపు ప్రవహిస్తూ ఉండటం వల్ల నాకు దారే తెలియలేదు. ఎట్లాగో ఆ రక్తంలోనే నడుచుకుంటూ బిలద్వారాన్ని చేరాను. అక్కడ ఒక పెద్ద బండ అడ్డంగా పెట్టివుంది. "తమ్ముడూ, సుగ్రీవా" అంటూ ఎన్నిసార్లు పిలిచినా సమాధానం రాలేదు. దాంతో నాకు దుఃఖం వచ్చింది. ఆ ద్వారానికి అడ్డంగా పెట్టివున్న కొండని కాళ్ళతో తన్నుతూ అడ్డం తొలగించుకొని బైటపడ్డాను.

క్రూరుడైన ఈ సుగ్రీవుడు అన్నగారినైన నా పట్ల గౌరవం, ప్రేమ లేకుండా, నా రాజ్యం కాజెయ్యాలనే కోరికతో నేను బయటకు రాకుండా ఉండేట్లుగా గట్టి ఏర్పాటు చేశాడు.

ఈ విధంగా వాలి నాపై నేరారోపణచేసి నన్ను కట్టుబట్టలతో దేశాన్ని విడిచిపొమ్మని ఆజ్ఞాపించాడు.

రామా! ఆ విధంగా అతడు నన్ను దేశంనుండి వెళ్ళగొట్టి నా భార్యను అపహరించాడు. నేను అతడికి భయపడి అనేక గుట్టలు, మిట్టలు, నదులు సముద్రాలు తిరిగి ఈ పర్వతంపై తలదాచుకుంటున్నాను.

వాలి నా భార్యను హరించటంచేత భార్యావియోగంతో దుఃఖీస్తూ ఇక్కడ కాలం

గడుపుతున్నాను. కారణాంతరాలచేత వాలి ఈ ఋష్యమూక పర్వతంపై కాలుమోపలేదు.

రామా! మా మధ్యగల వైరాన్నంతా యథార్థంగా చెప్పాను. తెలిసి ఏ విషయాన్నీ దాచిపెట్టలేదు. నేను ఏ దోషమూ చేయకపోయినా నాకు ఇంతపెద్ద శిక్ష విధించాడు. కనుక ఓ దేవా! వాలిని నిగ్రహించు. నాకు భార్యావియోగం లేకుండా చెయ్యి. నన్ను అనుగ్రహించు.

అప్పుడు తేజశ్శాలి, సర్వధర్మములు ఎరిగినవాడు, ధర్మాచరణయందు ఆసక్తి గలవాడు అయిన రాముడు ఇట్లా అన్నాడు.

రాముడు: సుగ్రీవుడా! సూర్యునితో సమానమైన అమోఘమైన నా బాణాలను వాలిపైన ప్రయోగిస్తాను. నీ భార్యను అపహరించి పాపం చేశాడు. పాపాత్ముడైన వాలి నా కంటపడగానే మరణిస్తాడు.

ఓ మిత్రుడా! భార్యావియోగం ఎంత బాధాకరమో స్వయంగా నాకు తెలుసు. అందువల్ల నీ కష్టాన్ని అర్థం చేసుకోగలను. నిన్ను ఈ శోకసాగరం నుండి దాటిస్తాను, నీ తండ్రి తాతల రాజ్యానికి నిన్ను ఏకైక ప్రభువుగా చేస్తాను.

సుగ్రీవుడు రాముడి అభయానికి ఆనందపరవశుడయ్యాడు. రాముడితో ఇట్లా అన్నాడు.

# 11వ సర్గ మాతంగ మహర్షి వాలిని శపించడం

సుగ్రీవుడు: ఓ రామా! నీకు కోపం వస్తే ప్రళయకాలపు సూర్యుడి మల్లే లోకాలను దహించివేయగలవు; నీ బాణాలు తాకిన శత్రువుల మర్మస్థానాలన్నీ భేదించివేయగలవు. అందులో సందేహమే లేదు. కానీ, రామా! నీ బాణాన్ని సంధించే ముందుగానే వాలి ఎంతటి బలశాలియో, పరాక్రమవంతుడో తెలుసుకోవటం మంచిది. ఆ తరువాతే ఏం చేస్తే బాగుంటుందో, ఎట్లా చేస్తే బాగుంటుందో ఆ విధంగా చెయ్యి.

రామా! వాలి బ్రహ్మ ముహూర్తంలోనే నిద్ర లేస్తాడు. సూర్యుడు ఉదయించక ముందే పశ్చిమసముద్రం నుండి తూర్పు సముద్రానికి, దక్షిణ సముద్రం నుండి ఉత్తర సముద్రానికి వెళ్ళి సంధ్యోపాసనలు చేస్తూ ఉంటాడు.

[ వివరణ: ఉత్తరకాండలో 'వాలి నాలుగు సముద్రాలకు వెళ్ళి సంధ్యోపాసన చేసేవాడని' చెప్పటం చేత వ్యాఖ్యాతలు ఈ విధంగా వర్ణించారు.]

తరువాత పరాక్రమవంతుడైన వాలి పర్వత శిఖరాలకు వెళ్ళి పెద్ద పెద్ద బండలను బంతిలాగా ఎగరేసి పట్టుకుంటూ ఆడుకునేవాడు. వాలి తన బలాన్ని తానే పరీక్షించుకోవటం కోసం ఏపుగా ఎదిగిన వృక్షాలను పెళ్ళగించడమో, విరగ్గొట్టడమో చేస్తూ ఉండేవాడు.

ఓ రామా! వాలి రాజ్యానికి వచ్చిన కొత్తల్లో దుందుభి అనే బలాఢ్యుడు ఒకడుండేవాడు. అతడి శరీరం పర్వతం అంత ఉండేది. అతడు మహిష రూపంలో ఉండేవాడు. బ్రహ్మ నుండి అనేక వరాలు పొంది మితిమీరిన గర్వంతో ఉండేవాడు. వరాల గర్వంతోనూ, విశేషమైన శరీర బలంతోనూ దుష్టబుద్ధిగలవాడై తన బలాన్ని పరీక్షించుకోవాలని అనుకున్నాడు. ఆ బలపరీక్షకు మహాతరంగాలతో, రత్నాలన్నీ తన గర్భంలో దాచుకున్న సముద్రుడిపై దుందుభి కన్ను పడింది. తనతో యుద్ధానికి రమ్మని పిలిచాడు.

రామా! ధర్మాత్ముడు, గొప్ప బలం గలవాడూ అయిన సముద్రుడు దుందుభితో ఇట్లా అన్నాడు. "యుద్ధంలో సమర్థుడా! నీవు కోరినట్లుగా నీతో నేను యుద్ధం చెయ్యలేను. నన్ను ఒదిలిపెట్టు. నీకు అంతగా బలపరీక్ష మీద కోర్కె ఉంటే హిమవంతుడనే పర్వతరాజు ఉన్నాడు. అతడు నీతో యుద్ధం చేయగల సమర్థుడు. అతడు శివుడికి మామగారు. ఆయన వద్ద అనేక కొండగుహలున్నాయి. వాటిలో మునీశ్వరులు ఎప్పుడూ తపస్సు చేసుకుంటూ ఉంటారు. మంచుతో కప్పబడిన అనేక శిఖరాలున్నాయి. కాబట్టి నీతో యుద్ధానికి హిమవంతుడే సమర్థుడు. నీవు కోరుకునే ఆనందాన్నివ్వగలడు."

అసురశ్రేష్ఠుడైన దుందుభి సముద్రుడు తన్ను చూసి భయపడటంతో రెట్టింపైన గర్వాతిశయంతో హిమాలయాల్ని చేరుకున్నాడు. మంచుతో నిండిన మంచు శిఖరాల్ని ఎన్నింటినో ఛిన్నాభిన్నం చేశాడు. ఇదంతా చూసి ఆనందకరమైన ఆకారం, ధర్మమందు ఆసక్తి గల హిమవంతుడు, "ఓ దుందుభీ! నా పర్వతం అంతా మునీశ్వరులకు నివాస స్థానమై ఉంది. నాకా యుద్ధాలు చెయ్యటంలో నేర్పూ లేదు, ఆసక్తీ లేదు" అన్నాడు. అంతట ఆ దుందుభి పర్వతరాజుపై కోపంతో "నీకు యుద్ధం చేసే సామర్థ్యం లేకపోతే పోనీ. కానీ నాతో యుద్ధం చెయ్యగల సమర్థుణ్ణి చూపించు" అన్నాడు. అంతట హిమవంతుడు "బుద్ధిశాలి అయిన ఓ దుంధుభీ! దేవేంద్రుడి కుమారుడు, మహాపరాక్రమశాలి, శోభాసంపన్నుడు అయిన వాలి అనే వానరయోధుని వద్దకు వెళ్ళు. అతడు కిష్కింధకు రాజు. వాలి అనే వానరరాజు యుద్ధంలో గొప్ప నేర్పు గలవాడు. దేవేంద్రుడు –నముచి మల్లే వాలి నీకు ద్వంద్వయుద్ధంలో పోటీ ఇవ్వగల సమర్థుడు" అని అన్నాడు.

ఓ రామా! హిమవంతుని మాటలు విన్న దుందుభి కోపావేశంతో కిష్కింధకు వెళ్ళాడు. మహా బలశాలి అయిన ఆ దుందుభి మహిష రూపంలో, వాడి అయిన కొమ్ములతో భయం కలిగిస్తూ, వర్షాకాలపు మేఘాల్లాగా నల్లగా ఉన్నాడు. కిష్కింధాద్వారం దగ్గరకు వచ్చి భూమి కంపించిపోయేట్లుగా రంకెలు వేశాడు. సమీపంలో ఉన్న వృక్షాలన్నింటినీ విరిచేశాడు.

కొమ్ములతో కిష్కింధాద్వారాన్ని ఏనుగులాగా పొడిచాడు. గిట్టలతో నేలంతా దున్నేశాడు.

అప్పుడు అంతఃపురంలో నిద్రిస్తున్న వాలి ఈ శబ్దం విని కోపంతో తన స్త్రీలతో సహా బయటకు వచ్చాడు. దుందుభిని చూశాడు. అతడితో ఇట్లా అన్నాడు: "ఓ దుందుభీ! నేను నిన్ను బాగా ఎరుగుదును. కానీ ఎందుకు అరుస్తున్నావు? ఎందుకు నా నగరశోభనంతా పాడు చేస్తున్నావు? ప్రాణాల మీద ఆశలేదా?"

దుందుభి: ఓ వీరుడా! ఆడవాళ్ళను మధ్యన పెట్టుకొని ఇలాంటి ప్రగల్భాలు మాట్లాడటం ఏమీ కొత్తకాదు. నాతో యుద్ధం చేసిన తర్వాత నేనేమిటో నా బలం ఏమిటో నీకు తెలియవస్తుంది.

ఓ వానరుడా! నా కోపాన్ని తెల్లవారేవరకూ నిగ్రహించుకుంటాను. సూర్యోదయం దాకా నీ స్త్రీలకు ఇవ్వగలిగినంత సుఖాల నివ్వు. ఎందుకంటే, రేపు నాతో యుద్ధానికి తలపడ్డ తర్వాత మళ్ళీ ఇంటికి వెళ్ళడం, నీ స్త్రీలందరినీ చూడటమనేది ఉండదు గదా! నాతో కలియబడగానే నీ ఆయుర్దాయం ముగిసిపోతుంది. పనిలోపనిగా నీ మంత్రులకు, బంధువులకు కూడా వీడ్కోలు చెప్పిరా. నీ స్థానంలో ఎవరినైనా నియమించుకో. నేను నీ గర్వాన్ని, ఆయుర్దాయాన్ని రెంటినీ ఒకేసారి తీసుకొనిపోతాను. కిష్కింధనంతా చివరిసారిగా చూసుకో. నీ స్త్రీ లందరినీ ఆఖరిసారిగా సంతోషపెట్టు. నీకు రేపు ఉదయం దాకా గడువిస్తున్నాను. ఈలోగా ఇవన్నీ చక్కబెట్టుకో.

ఓ వీరుడా! మద్యం గ్రోలి మత్తులో ఉన్నవారిని, ఏమరుపాటున ఉన్నవారిని, ఓడిపోయిన వారిని, ఆయుధాలు లేనివారిని, బలహీనులను, నీకు మల్లే కామపీడితులను చంపితే భ్రూణహత్యా పాతకం చుట్టుకుంటుంది.

దుందుభి ప్రేలాపనలన్నీ వాలి విన్నాడు. పెద్దగా నవ్వేస్తూ స్త్రీలనందరినీ పంపేశాడు. కోపంతో దుందుభితో ఇలా అన్నాడు.

వాలి: ఓరీ వాచాలుడా, దుందుభీ! నేను మద్యం తీసుకున్నానని అనుకోకు. నీకు భయం లేకపోతే ఇప్పుడే యుద్ధం చేద్దాం. ఈ యుద్ధంలో నిన్ను ఓడించి మద్యపానానికి బదులు వీరపానం చేస్తాను.

వాలి ఈ విధంగా పలుకుతూ, తన తండ్రి దేవేంద్రుడు ఇచ్చిన బంగారుమాలను ధరించి యుద్ధానికి సంసిద్ధుడయ్యాడు.

అప్పుడు వాలి, ఆ పర్వతాకారుడైన దుందుభి కొమ్ములు రెండూ పట్టుకుని గిరగిరా తిప్పి నేలపై కొట్టాడు. దుందుభి నేలపైపడగా చెవుల్లో నుండి రక్తం కారింది. అంతట దుందుభి మరల లేచి నిలబడి వాలిపై కలియబడ్డాడు. ఈ విధంగా వారు పరస్పరం గెలవాలనే ఆకాంక్షతో ఘోరంగా యుద్ధం చేశారు.

దేవేంద్రుడితో సమానమైన బలం కలిగిన వాలి దుందుభిని పిడికిళ్ళతో గుద్దాడు. కాళ్ళతో తన్నాడు. గిరగిరా తిప్పి నేలపై కొట్టాడు. తరువాత వారిద్దరూ వృక్షాల్ని పెళ్ళగించి వాటితో యుద్ధం చేశారు. క్రమంగా దుందుభి బలం క్షీణించింది. వాలి బలం వృద్ధి చెందింది. దుందుభిని నేలపై విసిరికొట్టి ఒళ్ళంతా హూనం హూనం చేసి వదిలాడు. దుందుభి అవయవాలన్నీ ఘోరంగా విరిగాయి. రక్తం ధారలు కట్టి ప్రవహించింది. తరువాత ఆ దుందుభి మరణించాడు. వాలి వాడి శరీరాన్ని పట్టి విసిరి దూరంగా పారేయగా అది యోజనం దూరంపోయి పడింది. అట్లా విసిరి వేయటంతో ఆ దుందుభి రక్తం చింది మతంగాశ్రమమంతా పడింది.

మహాభాగ్యవంతుడవైన ఓ రామా! మతంగ మహర్షి ఆశ్రమంలో రక్తపు బిందువులు పడ్డాయి. ఆశ్రమాన్ని ఈ విధంగా అపవిత్రం చేసిందెవరా అని మహర్షి ఆలోచించాడు. ఆ ముని పుంగవుడు ఆశ్రమం బయటకు వచ్చి చూడగా దున్నపోతు ఆకారంతో చచ్చిపడి ఉన్న దుందుభి కనిపించింది. తన తపోబలం చేత ఈ పని చేసినవాడు వాలి అని తెలుసుకున్నాడు. అప్పుడు మతంగ మహర్షి వాలిని ఉద్దేశించి "ఎవడు నా ఈ తపోవనంలో రక్తబిందువులు పడేట్లు చేశాడో,

ఎవడు ఈ తపోవనంలోని వృక్షాల్ని విరగ్గొట్టాడో, ఎవడు ఈ రాక్షస కళేబరాన్ని ఆశ్రమంపై విసిరివేశాడో, వాడు నా ఆశ్రమానికి ఒక యోజన దూరం అవతల తప్ప, ఇవతల కాలుపెట్టకూడదు. ఈ మాటలు ధిక్కరించి ఇవతలకు వచ్చేట్లయితే వాడు బ్రతుకకూడదు" అని శపించాడు. అంతేకాదు అక్కడ ఉంటున్న వాలి మిత్రులందరినీ చూసి, "నా ఈ తపోవనంలో వాలి మిత్రులైన వారు ఎవరూ ఉండకూడదు. వెంటనే వెళ్ళిపోవాలి. నేను పసిబిడ్డవలె కాపాడుకుంటూ వస్తున్న ఈ తపోవనం ఆకులు కానీ, మొక్కలు కానీ, పండ్లుకాని, కందమూలాలు కాని వాలికి సంబంధించిన వానరులు ముట్టుకోరాదు. నేను వాళ్ళందరికీ ఒక రోజు గడువు ఇస్తున్నాను. రేపు ఉదయానికల్లా వాలి సంబంధీకులైన వానరులు ఇంకా మిగిలి ఉంటే వాళ్ళందరూ శిలలైపోతారు" అని శాపంపెట్టాడు.

మతంగ మహర్షి శాపాన్ని విన్న వాలి మిత్రులైన వానరులంతా కలసి వాలి దగ్గరకు వెళ్ళారు. వాలి వాళ్ళందరినీ "వానరులారా! మీరంతా మతంగ మహర్షి ఆశ్రమం నుండి ఎందుకు వచ్చేశారు? మీకు అక్కడ సుఖంగానే ఉంది కదా?" అని అడిగాడు. అప్పుడు వారంతా మతంగ మహర్షి శాపాన్ని గూర్చి చెప్పారు. వెంటనే వాలి వెంటనే మతంగ మహర్షి ఆశ్రమానికి వెళ్ళి ఆ మహర్షి ఎదుట చేతులు జోడించి నమస్కరిస్తూ వినయంగా నిలబడ్డాడు. ఆ మహర్షి వాలితో ఒక్క మాటకూడా మాట్లాడకుండా ఆశ్రమం లోపలకు వెళ్ళిపోయాడు. ఇక అక్కడ ఎక్కువసేపు ఉంటే మరణిస్తానేమోనని భయపడి వాలి అక్కడ నుండి వచ్చేశాడు.

మహారాజా! రామా! ఆనాటి నుండి వాలి ఋష్యమూక పర్వతంవైపు కన్నెత్తి చూడటానికి కూడా భయపడుతున్నాడు. రామా! వాలి ఈ పర్వతప్రాంతాలకు రాలేదన్న ధైర్యంతో నేను, నా మంత్రులు నలుగురం ఇక్కడ తలదాచుకుంటున్నాం. బలగర్వంతో వాలి విసిరేసిన దుందుభి దేహం అక్కడ ఒక పర్వతంలాగా పడి ఉంది చూడు! రామా! ఇంకా చెబుతాను. విను. ఇవిగో ఇక్కడ ఏడు మహా సాలవృక్షాలున్నాయి గదా! అవన్నీ కొమ్మలతో విస్తరించి ఉన్నాయి. వాలి వాటిల్లో ఒక వృక్షాన్ని తన భుజబలంతో ఊపి ఒక ఆకు కూడా మిగల్చకుండా రాల్చేశాడు.

ఓ రామా! వాలి ఎంత బలవంతుడో నీకు కొంత అవగాహన ఉండటం మంచిదిగదా అని ఇంత వివరంగా చెప్పాను. ఇప్పుడు నువ్వు నీ బలాన్ని, వాలి బలంతో అంచనా వేసుకొని వాలిని చంపగలనా, లేదా అని నిర్ణయించుకొని చెప్పు.

లక్ష్మణుడు (నవ్వుతూ) : ఓ సుగ్రీవా! రాముడు ఏం చేసి చూపెడితే వాలిని చంపగలడని నమ్ముతావో చెప్పు.

సుగ్రీవుడు: ఓ లక్ష్మణా! వాలి పూర్వం ఈ ఏడు సాలవృక్షాల్లో ఒక్కదాన్ని పట్టుకొని గట్టిగా ఊపేవాడు. దాంతో మిగిలిన ఆరు సాల వృక్షాలూ ఊగిపోయేవి. కాబట్టి ఓ లక్ష్మణా! రాముడు బాణంతో ఒక్క వృక్షాన్ని ఛేదించగలిగినట్లయితే, అప్పుడు రాముని పరాక్రమం చూసి, ఇతడు వాలిని చంపగలడన్న నమ్మకం కలుగుతుంది. అంతేకాదు. ఆ మహిషాసుర రూపంలో ఉన్న దుందుభి కళేబరాన్ని రాముడు కాలితో ఎత్తి నాలుగు వందల గజాల దూరంలో విసిరివేసినా కూడా, రాముడు వాలిని చంపగలడని గట్టిగా నమ్ముతాను.

ఓ మహారాజా! రామా! వాలి మహాశూరుడు. బలపౌరుషాలు గలవాడు. అతడు జీవితంలో ఓటమి అన్నదే ఎరుగడు. ఇతడు దేవతలు కూడా చెయ్యలేని సాహసకార్యాలు చేశాడు. అటువంటి బలపరాక్రమశాలి అయిన వాలిని చూసి భయంతో నేను ఈ ఋష్యమూక పర్వతం పైన నివసిస్తున్నాను. వాలి కోపస్వభావం కలవాడు. అటువంటి వాలిని ఎదిరించటంగాని, జయించటంగాని చేతకాక ఈ మతంగ మహర్షి వనంలో తలదాచుకొంటున్నాను. నేను భయపడి ఏ ఆపద కొనితెచ్చుకుంటానోనని, నా పట్ల ప్రేమగల హనుమంతుడు తదితర మంత్రులు నన్ను విడవకుండా కాపాడుతున్నారు.

ఓ రామా! ఈనాటికి భగవత్కృపవల్ల ప్రశంసించదగిన ఉత్తమమైన స్నేహితుడివి నీవు దొరికావు. ఓ పురుషశ్రేష్ఠుడా! హిమాలయాలవంటి వాడివైన నిన్ను ఆశ్రయిస్తున్నాను.

ఓ మహారాజా! నిన్ను పరీక్షించాలనిగాని, అవమానించాలనిగాని, భయపెట్టాలనిగాని

ఇదంతా చెప్పలేదు. అతడు చేసిన భయంకరమైన అనేక సాహసాలు తెలిసినవాణ్ణి కావటం వల్ల భయంకొద్దీ చెప్పాను. అదీగాక, యుద్ధంలో నీ పరాక్రమం ఎటువంటిదో ఎన్నడూ చూసి ఉండకపోవటం వల్ల ఇదంతా చెప్పాను.

ఓ రామా! నీ శరీర సౌష్ఠవం, మాటతీరు, ధైర్యం, సత్యం, ధర్మంపైగల విశ్వాసం అన్నీ నివురుగప్పిన నిప్పులాగా నీ అసాధారణ తేజస్సును చాటి చెబుతున్నాయి.

రాముడు (చిరునవ్వుతో) : ఓ సుగ్రీవా! నా పరాక్రమంపై నీకు విశ్వాసం లేకపోతే నీకు నా యుద్ధ నైపుణ్య (సామర్థ్యం) మేమిటో రుజువు చేసి చూపిస్తాను. నీకు నమ్మకం కలిగిస్తాను.

అప్పుడు సుగ్రీవుడు, లక్ష్మణుడు ఇతరులు చూస్తూ ఉండగానే దుందుభి మృత కళేబరాన్ని రాముడు కాలి బొటనవ్రేలితో ఎత్తి విసిరేశాడు. అది పోయి పది యోజనాల దూరాన పడింది.

సుగ్రీవుడు (అర్థయుక్తంగా) : మిత్రుడా! ఆనాడు నా అన్న వాలి తప్పతాగి ఉండి కూడా, రక్తమాంసాలతో ఉన్న ఈ భారీశరీరాన్ని గడ్డిపోచలాగా ఎగరేశాడు. కానీ ఈనాడు రక్తమాంసాలన్నీ ఎండిపోయి ఉండి ఎముకల పోగుమాత్రమే మిగిలి ఉంది. అందులో వెనుకటి బరువు లేదు గదా! అంతేకాకుండా, నీవు మద్యపదార్థాలేవీ సేవించలేదు; ఉత్సాహంగా ఉన్నావు. కాబట్టి నీవు చేసిన ఈ మహత్కార్యం మెచ్చతగిందే అయినా, వాలితో సమానమైన బలవంతుడవు ఔనా? కాదా? అన్న సందేహం అట్లాగే ఉండిపోయింది. కాబట్టి నీవు ఒక్క సాలవృక్షాన్ని ఛేదించినా కూడా, మీ బలాబలాలు స్పష్టంగా తెలుస్తాయి.

వెంటనే రాముడు ధనుస్సును చేతిలోకి తీసుకుని నారిని చెవిదాకా లాగి, తేజస్సుతో కూడిన బాణాన్నొకటి ఎక్కుపెట్టి నిలబడ్డ రామునితో సుగ్రీవుడు ఇట్లా అన్నాడు.

సుగ్రీవుడు: ఓ రాజా! నీవు ప్రయోగించబోయే బాణం తప్పకుండా లక్ష్యాన్ని ఛేదిస్తుంది; సాలవృక్షాన్ని చీల్చివేస్తుంది; నాకు ఎంతమాత్రమూ సందేహం లేదు; ఆలోచింపక బాణాన్ని

ప్రయోగించు. నీవు తప్పక లక్ష్యాన్ని సాధిస్తావని నా మీద ఒట్టుపెట్టుకొని చెప్తున్నాను.

ఓ రామా! తేజస్సులో సూర్యుడు ఎలా శ్రేష్ఠుడో, పర్వతాలలో హిమవత్పర్వతం ఎలా శ్రేష్ఠమో, నాలుగు పాదాల జంతువుల్లో సింహమెలా శ్రేష్ఠమో, నీవు కూడా పరాక్రమంచే మనుష్యుల్లో శ్రేష్ఠుడవు.

# 12వ సర్గ రాముడు ఏడు సాల వృక్షాలను ఛేదించటం

మహా తేజశ్శాలి అయిన రాముడు సుగ్రీవుడు అన్న మాటలకు సంతోషించి ధనుస్సును చేతిలోకి తీసుకుని నారి సారించి భయంకరమైన ధ్వనుల్ని చేశాడు. బాణాన్ని ఎక్కుపెట్టి సాలవృక్షం పైన సంధించాడు. మహాబలశాలి అయిన రాముడు ప్రయోగించిన బాణం ఏడు సాల వృక్షాల గుండా చొచ్చుకుపోతూ సమీపాన ఉన్న కొండ చరియను ఛేదించి భూమిలో ప్రవేశించి మరల అంబులపొదిలోకి వచ్చి చేరింది.

రామబాణం ఆ విధంగా ఏడు సాల వృక్షాలను ఛేదించడం, ఆ బాణం యొక్క వేగం, శక్తి చూస్తున్న సుగ్రీవుడు ఆశ్చర్యపోయాడు. అంతట సుగ్రీవుడు తాను ధరించిన అలంకారాలన్నీ నేలకు తాకేట్లుగా సాష్టాంగపడి రాముడి పాదాలకు నమస్కారం చేశాడు. మహదానందంతో రాముడు చేసి చూపిన ఆ అద్భుత కార్యాన్ని చూసి సంతోషంతో ఇలా అన్నాడు.

సుగ్రీవుడు: పురుషులలో శ్రేష్ఠుడవైన ఓ రామా! నీవు శూరుడవు. అస్త్రవేత్తలందరిలో శ్రేష్ఠుడవు. ఓ రామా! నీ బాణాలతో ఇంద్రునితో సహా దేవతలందరినీ యుద్ధంలో సంహరించగల సమర్థుడవు. ఇక వాలి మాట చెప్పాలా?

రామా! నీవు ఒక్క బాణంతో ఏడు సాలవృక్షాలను, పర్వతాన్ని, భూమిని కూడా చీల్చివేశావు. అటువంటి నీ ముందు యుద్ధంలో ఎవరు నిలబడగలరు? నీవు దేవేంద్రుడితోను, వరుణుడితోను సమానమైనవాడవు. అటువంటి నీ స్నేహం లభించటంతో నా దుఃఖం అంతా మాయమైపోయింది. నా ఆనందానికి అవధుల్లేవు.

ఓ రామా! నిన్ను నేను చేతులు కట్టుకొని ప్రార్థిస్తున్నాను. సోదర రూపంలో ఉన్న నా శత్రువైన వాలిని ఇప్పుడే చంపెయ్యి. ఆలస్యం చెయ్యకు. నాకు సంతోషాన్ని కలిగించు.

ఆ తరువాత స్నేహశీలి, ఇతరులకు ఆనందం కలిగించేవాడు అయిన రాముడు సుగ్రీవుణ్ణి

కౌగలించుకొని ఇలా అన్నాడు.

రాముడు: సుగ్రీవా! ఇక్కడ నుండి వెంటనే కిష్కింధకు వెళ్దాం. నీవు ముందు నడు. నీ వెనకే మేమూ వస్తాం. నీవు పోయి నీ అన్నతో కయ్యానికి కాలుదువ్వు.

తరువాత వారంతా కిష్కింధకు పోయి దట్టమైన చెట్ల మధ్యన పొంచి ఉన్నారు. సుగ్రీవుడు పంచ ఎగగట్టి, గోచీ బిగించి ఆకాశం ఉరిమినట్లు, దిక్కులు పిక్కటిల్లేటట్లు అరుస్తూ వాలిని యుద్ధానికి రమ్మని తొడగొట్టి సవాలు చేశాడు.

మహాబలశాలి అయిన వాలి, సుగ్రీవుడు యుద్ధానికి సవాలు చేయటం జీర్ణించుకోలేకపోయాడు. కోపంతో త్వరగా బయటకు వచ్చాడు.

తరువాత ఆకాశంలో బుధుడు అంగారకుల మధ్య జరిగే పోరు లాగానే వాలి సుగ్రీవుల మధ్య తీవ్రమైన యుద్ధం జరిగింది. ఒకరి నొకరు వజ్రాయుధపు దెబ్బల్లాగా గుద్దుకున్నారు. అరచేతుల్తో చరుచుకున్నారు. వీళ్ళిద్దరూ ఇట్లా ఘోరంగా యుద్ధం చేస్తూ ఉండగా రాముడు ధనుస్సు చేత్తో పట్టుకొని బాణం వేద్దామా అని ఆలోచిస్తూ ఉండగా, రాముడి కంటికి ఇద్దరూ ఒకేమాదిరిగా కనిపించారు. వాళ్ళల్లో ఎవరు వాలియో, ఎవరు సుగ్రీవుడో కనిపెట్టలేకపోయాడు. వాళ్ళిద్దరూ అశ్వనీ దేవతల్లాగా ఒకే మోస్తరుగా ఉన్నారు. ఎవరు ఎవరో తెలుసుకోకుండా బాణాన్ని ప్రయోగిస్తే వికటించవచ్చని భయపడ్డాడు. అందుచేత తటస్థంగా ఉండిపోయాడు.

వాలి ధాటికి సుగ్రీవుడు నిలబడలేకపోయాడు. సుగ్రీవుడు బాగా అలసిపోయాడు, శరీరం అంతా రక్తసిక్తమైపోయింది. అప్పటికే సుగ్రీవుడి శరీరం శిథిలంకాగా, మహావనంలోకి పారిపోయాడు. మహాబలశాలి అయిన వాలి తాను ప్రవేశించటానికి అలవికాని వనంలోకి పోయి దాక్కోవటం మూలంగా సుగ్రీవుని చూస్తూ, "బ్రతికిపోయావు పో" అంటూ అక్కడ నుండి వెళ్ళిపోయాడు. రామలక్ష్మణులు, హనుమంతుడు కూడా ఆ వనానికి వచ్చారు. సుగ్రీవుడు లక్ష్మణునితో కూడివున్న రాముణ్ణి చూస్తూ తలవంచుకొని సిగ్గుతో ఇలా అన్నాడు.

సుగ్రీవుడు: ఓ రామా! శత్రువును యుద్ధానికి పిలవమన్నావు. నీ బలపరాక్రమాల్ని నాకు చూపి నమ్మించావు. ఇప్పుడు శత్రువుచేత కొట్టించావు. ఎందుకు ఇట్లా చేశావు? "సుగ్రీవుడా! నేను వాలిని చంపను" అని ఒక్కమాట చెప్పి ఉంటే, నేను యుద్ధానికి వెళ్ళేవాడను కాదు గదా?"

రాముడు: నాయనా! సుగ్రీవా! అట్లా దీనంగా మాట్లాడకు. నేను వాలిని ఎందుకు చంపలేదో చెబుతాను. విను. కోపగించుకోకు.

సుగ్రీవుడా! ఆకారాల్లోను, అలంకారాల్లోను, వేషాల్లోను, శరీరసౌష్టవంలోనూ, ఒడ్డు పొడుగులలో మీరు ఒకే విధంగా ఉన్నారు. కంఠస్వరంలోగాని, పరాక్రమంలోగాని, మాటల్లోగాని మీ ఇద్దరికీ తేడాలేమీ కనిపించడం లేదు.

ఓ వానరశ్రేష్ఠుడా! మీ ఇద్దరి రూపాలు అచ్చుగుద్దినట్లు ఒకే మాదిరిగా ఉండటం వల్ల, మహా వేగవంతమైన బాణాన్ని విడిస్తే ఏం అనర్థం జరుగుతుందోనన్న భయంచేత బాణాన్ని విడువలేదు. మనిద్దరికీ వియోగం కలుగుతుందని బాణాన్ని విడువలేదు. వీరుడైన సుగ్రీవుడా! నా అజ్ఞానం చేత నీకు ఎక్కడ ఆపద వస్తుందోనని బాణం విడువలేదు. నా అజ్ఞానాన్ని నేనే చాటుకున్నట్లవుతుంది. అదీగాక, ఎవరికి అభయమిచ్చానో, అజ్ఞానం చేతనైనా కూడా, అట్టి వారిని చంపడం మహాపాతకం అవుతుంది. నేను లక్ష్మణుడు నీ అధీనంలో ఉన్నాం. సీతను వెదకటంలో నీపైనే ఆశలు పెట్టుకున్నాం. కనుక, ఓ సుగ్రీవుడా! నీవు మళ్ళీ యుద్ధం చెయ్యి. నేను నిన్ను దూరం నుంచీ కూడా గుర్తించేందుకు ఏదైనా ఆనవాలు ధరించు. లక్ష్మణా! ఈ గజపుష్పాలతో మాలకట్టి సుగ్రీవుడి మెడలో వెయ్యి.

తరువాత లక్ష్మణుడు ఆ పర్వత చరియలపై ఏపుగా పెరుగుతున్న గజపుష్పలతను త్రెంచి సుగ్రీవుడి కంఠంలో వేశాడు. అప్పుడు సుగ్రీవుడు సంధ్యాకాలపు ఎర్రని మేఘం కొంగలబారుతో ప్రకాశించే రీతిలో ప్రకాశించాడు. తదనంతరం వారంతా కిష్కింధకు బయలుదేరారు.

# 13వ సర్గ రామలక్ష్మణులు సుగ్రీవునితో కిష్కింధకు వెళ్ళటం

ధర్మాత్ముడైన రాముడు లక్ష్మణుని, సుగ్రీవుని వెంటబెట్టుకొని ఋష్యమూకం నుండి కిష్కింధకు వెళ్ళాడు. బంగారు కాంతులతో మెరిసిపోతున్న ధనుస్సును, సూర్యునితో సమానమైనవి యుద్ధంలో విజయాన్ని సంపాదించిపెట్టేవి అయిన బాణాలతో కూడిన అంబులపొదితో రాముడు ప్రకాశించాడు. లక్ష్మణునిచే అలంకరించబడిన మాలను సుగ్రీవుడు మెడలో ధరించాడు. రాముడితోపాటు సుగ్రీవుని మంత్రులైన హనుమంతుడు, నలుడు, నీలుడు, తారుడు కూడా వెళ్ళారు.

పుష్పాలతో వంగిన వృక్షాలను, పర్వతాలపై నుండి సముద్రానికి ప్రయాణమైన నదుల్ని, చూసుకుంటూ కిష్కింధకు బయలుదేరారు. వాళ్ళు దారిలో చిన్నా పెద్దా అనేక గుహల్ని చూశారు. ఎత్తైన శిఖరాలు, లోతైన లోయల్ని చూసుకుంటూ వెళ్ళారు. దారిలో పూర్తిగా వికసించిన పద్మాలతో నిండిన, నీళ్ళు సమృద్ధిగా ఉన్న జలాశయాల్ని చూశారు. ఆ మనోహర సరస్సుల నాశ్రయించుకొన్న హంసల, సారసాల, వంజులాల, కారండవాలి, చక్రవాక పక్షుల ధ్వనులతో ఆ ప్రాంతాలు మారుమ్రోగిపోతున్నాయి. నిర్భయంగా పచ్చిక మేస్తున్న లేళ్ళ గుంపుల్ని చూశారు. భయంకరమైన మదపుటేనుగుల్ని చూశారు. ఈ ఏనుగులన్నీ సరస్సులకు శత్రువులా అన్నట్లు వాటి తెల్లటి పొడవాటి దంతాలతో సరస్సుల తీరాలనన్నింటినీ కుళ్ళగిస్తున్నాయి. ఆకాశంలో గుంపులుగా ఎగురుతున్న పక్షుల్ని చూసుకుంటూ వారంతా కిష్కింధకు బయలుదేరారు.

ఈ విధంగా ప్రకృతి అందాలను ఆస్వాదిస్తూ వేగంగా ముందుకు పోతూన్న రామలక్ష్మణుల పరివారం ఒక విశాలమైన వనాన్ని చూశారు. ఆ వనాన్ని రాముడు సుగ్రీవుడికి చూపిస్తూ "మిత్రమా! మేఘాలను తాకుతున్న అనేక వృక్షాలతో ఈ వనం చాలా విశాలంగా ఉంది. చుట్టూ అరటి చెట్లున్నాయి. చూడటానికి మనోహరంగా ఉన్న ఈ వనం ఎవరిది?" అని

అడిగాడు.

సుగ్రీవుడు: ఓ రామా! ఇది విశాలమైన మునుల ఆశ్రమం. తియ్యటి కందమూలాలతోను, నిర్మలమైన నీటితోను అలరారుతున్న ఈ ఆశ్రమం శ్రమను తొలగిస్తుంది. 'సప్తజను' లనే ఏడుగురు మునులు కఠోరమైన నియమాలను పాటిస్తూ తలక్రిందులుగా తపస్సు చేస్తూ ఉండేవారు. ఈ ఏడుగురూ కదలకుండా తపస్సు చేస్తూ, వారాని కొకసారి మాత్రమే వాయు భక్షణ చేసేవారు. వారంతా ఆ విధంగా ఏడు వందల సంవత్సరాలు తపస్సు చేసి శరీరంతోనే స్వర్గానికి వెళ్ళారు. ఈ వనంలో ఉన్న వృక్షాలే ప్రాకారాలుగా ఉండేవి. వాటిని దాటి ఇంద్రాది దేవతలు కూడా లోపలకు ప్రవేశించలేకపోయేవాళ్ళు. పక్షులు, జంతువులు కూడా ఆ ప్రాకారాన్ని దాటి లోపలకు వెళ్ళలేకపోయేవి. ఒక వేళ ఆ నియమాన్ని ఉల్లంఘించి ఏ ప్రాణి అయినా లోపలకు వెళ్ళినట్లయితే ఇక తిరిగి వచ్చేవి కావు.

ఓ రామా! ఇక్కడ నుండే మధురమైన సంగీతం, వాద్యసంగీతాల స్వరాలు, అలంకారాల ధ్వనులు, దివ్యమైన సువాసనలు వస్తూ ఉంటాయి. ఇక్కడ దక్షిణాగ్ని, గార్హపత్యము, ఆహవనీయం అనే మూడు అగ్నులు ఎల్లవేళలా ప్రజ్వరిల్లుతూ ఉంటాయి. పావురం రంగులో ఉండే దట్టమైన పొగలు ఎప్పుడూ చెట్ల పైభాగాల్నుండి ఆకాశంలో కనిపిస్తూ ఉంటాయి.

ధర్మాత్ముడవైన ఓ రామా! నీవు, నీ తమ్ముడు లక్ష్మణుడూ కూడా నిశ్చలమైన మనస్సుతో చేతులు జోడించి ఇక్కడనుంచే ఆ మహాత్ములకు నమస్కారం చెయ్యండి. పవిత్రులైన ఆ మునీశ్వరులకు నమస్కరించేవారి శరీరాలన్నీ శుద్ధి అయి పవిత్రాలవుతాయి.

తరువాత రామలక్ష్మణులిరువురూ భక్తిశ్రద్ధలతో ఆ ఋషుల నుద్దేశించి నమస్కారం చేశారు. సుగ్రీవుడు అతడి అనుచరులు కూడా ఆ మహర్షులకు శ్రద్ధతో నమస్కరించారు. ఆ విధంగా వారంతా సుదీర్ఘమైన సప్తమున్యాశ్రమాన్నుండి ప్రయాణమై కిష్కింధను చేరుకున్నారు.

ఆ మునులకు నమస్కరించటం చేత వారందరిలోను దివ్యమైన తేజస్సు ప్రవేశించింది. ఆ

విధంగా వారంతా వాలి పాలించే కిష్కింధను చేరుకున్నారు.

## 14వ సర్గ రాముడు వాలిని వధిస్తానని మళ్లీ మాట ఇవ్వడం

రామ లక్ష్మణులు, సుగ్రీవాదులంతా కిష్కింధా నగరాన్ని చేరుకున్నారు. వారంతా ఆ దట్టమైన అతడవిలో ఒక చెట్టు చాటున నిలబడ్డారు. ఆ అడవినంతా సుగ్రీవుడు ఒకసారి తేరిపారచూశాడు. కోపంతో అతడి ముఖం అంతా జేవురించింది. ఉదయసూర్యుడిలాగా ప్రకాశిస్తూ, సింహంలాగా గర్జిస్తూ కిష్కింధ వైపుగా నడుస్తూ రాముడితో ఇలా అన్నాడు.

సుగ్రీవుడు: ఓ రామా! వాలి నగరం అయిన కిష్కింధకు వచ్చాం. దీని ముఖద్వారం బంగారంతో చేయబడింది. ధ్వజాలతోను, యంత్రాలతోను అలంకరించబడి ఉంటుంది. సాయుధులైన వానరులు ఎప్పుడూ ఈ నగరాన్ని కాపలా కాస్తూ ఉంటారు.

వీరుడవైన ఓ రామా! వాలిని చంపుతానని మాట ఇచ్చావు. వృక్షాలు, లతలు తరుణం రాగానే (పూలు పండ్లను) ఫలిస్తాయి. అట్లాగే నీవు కూడా నీ ప్రతిజ్ఞను నెరవేర్చే సమయం వచ్చింది. ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా నీ ప్రతిజ్ఞను సఫలం చెయ్యి.

రాముడు: ఓ సుగ్రీవుడా! లక్ష్మణుడు గజపుష్పలతను నీ కంఠాన అలంకరించాడు కదా! ఇక నేను నిన్ను తేలికగా గుర్తిస్తాను. అందులో ఏమీ సందేహం లేదు.

ఓ సుగ్రీవుడా! ఈ గజలత పుష్పమాలను ధరించిన తర్వాత నక్షత్రాల మధ్యన ఉండే సూర్యుడిలాగా వెలిగిపోతున్నావు.

ఓ మిత్రుడా! సోదరుని రూపంలో నిన్ను వేధిస్తున్న నీ శత్రువును చూపించు. ఒక్క బాణంతో చచ్చి దుమ్ములో పడి పొర్లాడుతాడు. ఓ మిత్రుడా! వాలి నా కంటపడి కూడా ప్రాణాలతో వెనక్కు వెళ్ళినట్లయితే నన్ను దోషిగా నిందించు. నీ ఎదుటనే ఏడు సాలవృక్షాల్ని చీల్చివేసి నా సామర్థ్యం ఏమిటో చూపించాను గదా? కాబట్టి ఈ రోజు వాలి చావు నా చేతుల్లో రాసిపెట్టి ఉంది. నీవు నిర్భయంగా ముందుకు పో.

ఓ వీరుడా! ధర్మం పట్ల ఆసక్తిగల నేను ఇంతవరకు అసత్యం పలుకలేదు. ఇకముందు కూడా అసత్యం పలుకను. దేవేంద్రుడు మొలకలెత్తిన వరి పైరుకు వర్షాన్నిచ్చి సఫలం చేసినట్లు నేను కూడా నా ప్రతిజ్ఞను సఫలం చేస్తాను. భయపడకు.

ఓ సుగ్రీవుడా! బంగారుమాలను ధరించే ఆ వాలిని ఎట్లా పిలిస్తే బయటకు వస్తాడో, ఆ శబ్దాల చేత బయటకు రప్పించు. అతడు ధరించిన బంగారుమాల నా బాణం నుండి రక్షించలేదు. వాలికి యుద్ధం అంటే ఉండే ప్రేమ చేతనూ, ఎన్నడూ ఓడిపోలేదన్న గర్వంతోనూ, నువ్వంటే ఉండే చులకన భావంతోనూ, నువ్వు పిలవగానే ఒంటికాలిపై నీతో యుద్ధానికి వస్తాడు. తమ బలంపై నమ్మకమున్న వాళ్ళు; స్త్రీల మధ్యన ఉన్నవాళ్ళు శత్రువులు యుద్ధానికి పిలిస్తే రాను అనరు.

బంగారు వర్ణంలో ఉండే సుగ్రీవుడు రాముడి మాటలతో ధైర్యవంతుడై ఆకాశం బద్దలయ్యేట్లుగా శబ్దాలు చేస్తూ వాలిని యుద్ధానికి పిలిచాడు. సుగ్రీవుడు చేస్తూన్న ధ్వనులకు గోవులన్నీ భయపడ్డాయి. రాజు ధర్మపాలన చెయ్యకుండా, ఇతరుల భార్యలను అపహరించడం చేత భయపడిన పతివ్రతల్లాగా భయంతో అవి పారిపోయాయి. మృగాలన్నీ యుద్ధంలో ఓడిపోయిన గుర్రాల్లాగా పారిపోయాయి. పక్షులు, పుణ్యం ఖర్చయిపోగానే నేలపైపడే నక్షత్రాల్లాగా, నేలపై రాలిపడ్డాయి. మేఘాల్లాగా ఉరిమేవాడు, సూర్యుని కుమారుడు అయిన సుగ్రీవుడు శౌర్యంచేత వృద్ధి అయిన తేజస్సు గలవాడై గొప్పధ్వని చేశాడు.

# 15వ సర్గ వాలిని తార అడ్డగించటం

అంతఃపురంలో ఉన్న వాలి, సుగ్రీవుడు చేసిన సింహనాదాన్ని విన్నాడు. ఆ సింహనాదానికి కిష్కింధానగరం అంతా లేచి కూర్చుంది. వాలికి నిద్రమత్తు అంతా వదిలిపోయింది. కోపం ముంచుకొచ్చింది. గ్రహణం పట్టిన సూర్యునిలా కొంత కాంతివిహీనమైనాడు.

సింహనాదం చేసి యుద్ధానికి పిలిస్తే శూరుడైన వాడెవ్వడూ విని ఊరుకోడు. వాలి భూమి అదిరిపోయేట్లుగా పాదాలు నేలకేసికొట్టాడు. గబగబా తలుపులు తెరచుకొని బయటకు వచ్చాడు. అర్ధరాత్రి వేళ ఈ అనుకోని పరిణామానికి తార భయపడింది. వాలిని ప్రేమతోను, భయంతోను కౌగిలించుకొంది. అతని క్షేమాన్ని కోరుతూ ఇట్లా అంది.

తార: ఓ వీరుడా! నీలో కోపం వరదలా ముంచుకొస్తోంది. ఇంత అర్ధరాత్రివేళ ఇంత కోపం తగదు. వాడిపోయిన పూలమాలలాగా కోపాన్ని అవతల పారెయ్యి. అతడితో యుద్ధానికి ఉదయానే వెళ్ళు. నీవు ఇంత ఉద్రేకపడటానికి ఇది తగిన సమయంగా కనిపించటం లేదు. ఎందుకంటావా? సుగ్రీవుడు నీ కంటే బలహీనుడు; అదీగాక అతడికి పెద్ద సైన్యం కూడా లేదు.

ప్రభూ! ఇప్పుడు సుగ్రీవుడు ఎవరో బైట వాళ్ళ సహాయంతో వచ్చి ఉంటాడు. సుగ్రీవుడు కార్యాలు చక్కబెట్టుకోవడంలో నేర్పరి. తెలివైనవాడు. సాయం వచ్చినవాళ్ళ పరాక్రమం పరీక్షించకుండా మళ్ళీ యుద్ధానికి వచ్చి ఉండడు. వాళ్ళు నీకంటే బలవంతులని తెలుసుకున్న తరువాతే యుద్ధానికి వచ్చి ఉంటాడు.

ఓ రాజా! నాది కేవలం ఊహ మాత్రమే కాదు. అంగదుడు నాతో అన్న మాటల్ని ఇప్పుడు నీకు చెప్తున్నాను. నీవు సావధానంగా విని, చక్కగా ఆలోచించి ఆపైన రేపు ఉదయానే యుద్ధానికి వెళ్ళు. కుమారుడు అంగదుడికి మన వేగులవాళ్ళు చెప్పిన విషయాన్నే నీకు నేను చెప్తున్నాను.

ఇక్ష్వాకు వంశంలో పుట్టినవారు, దశరథ మహారాజు కుమారులు అయిన రామలక్ష్మణులనేవారు ఇద్దరు ఈ ప్రాంతాల్లో తిరుగుతున్నారు. వాళ్ళిద్దరూ శూరులు, యుద్ధంలో నేర్పరులు. వాళ్ళను ఎవరూ జయించలేరు. సుగ్రీవుడి కోరికపైననే వాళ్ళు ఇక్కడకు వచ్చారట. రాముడు యుద్ధంలో ప్రళయాగ్నిలాగా విజృంభించి శత్రువులను నాశనం చేస్తాడట. అటువంటి రాముణ్ణి, సుగ్రీవుడు సహాయం కోరాడట.

రాముడు లౌకిక జ్ఞానం, శాస్త్రజ్ఞానం రెండూ ఉన్నవాడు. రాముడు సాధుజనానికి వటవృక్షంలాంటివాడు. ఆపదల్లో ఉన్నవాళ్ళను ఆదుకొని రక్షిస్తూ ఉంటాడు. దుఃఖీతులకు ఆశ్రయమిస్తాడు. ధాతువులకు హిమాలయాలలాగా, రాముడు సర్వసద్గుణాలకు పుట్టినిల్లు. అటువంటి మహాత్ముడైన రాముణ్ణి యుద్ధంలో ఎవరూ జయించలేరు.

ఓ వీరుడా! నే చెప్పేది విని కోపించుకోవద్దు. మన అందరి క్షేమాన్నీ కోరి ఈ మాట చెప్తున్నాను. ఆ విధంగా చెయ్యి, అదేమంటే

నీ తమ్ముడితో విరోధం పెట్టుకోవద్దు. సుగ్రీవుణ్ణి పిలిచి యౌవరాజ్యాభిషిక్తుణ్ణి చెయ్యి. విరోధభావం మరచిపో. తమ్ముడిపై ప్రేమ చూపించు. అట్లాగే రాముడితో స్నేహం చెయ్యి. నీ తమ్ముడైన సుగ్రీవుడు నీకు ఆత్మీయుడు. ఎక్కడున్నా నీవతణ్ణి దూరం చేసుకోవద్దు. నీకు సుగ్రీవుడి కన్నా ఆత్మబంధువు ఈ భూలోకం అంతా వెతికినా కనపడరు. కాబట్టి, దగ్గరకు పిలిచి గౌరవసత్కారాలు చేసి నీకు వారసుడుగా చేసుకో. మీ ఇద్దరూ కలసిమెలసి ఉండటం మీ ఇద్దరికే కాదు కిష్కింధకే లాభదాయకం. విశాలమైన కంఠంగల సుగ్రీవుని యెడల సోదరప్రేమ చూపించు. ఎప్పటికీ నీకు అదే శ్రేయస్సు చేకూరుస్తుంది. నేను నీ హితంకోరి చెప్తున్నానని నీకు అనిపిస్తే, నా మాట విను. నా ప్రాణనాథుడివి కాబట్టి ఇంతగా ప్రాథేయపడుతున్నాను. నేను చెప్పిన హితవాక్యాలను విని మన బంధులోకానికందరికీ సంతోషం కలిగించు. దేవేంద్రుడితో సమానమైన తేజస్సు గల రాముడితో విరోధం పెట్టుకోవద్దు.

తార చెప్పిన మాటలన్నీ అక్షర సత్యాలూ, హితం చేసేవే అయినా, వినాశకాలం దగ్గర పడటం చేత, అవి వాలి చెవి కెక్కలేదు.

# 16వ సర్గ వాలి సుగ్రీవుల యుద్ధం

తార మాటలు వాలికి రుచించలేదు. తారపై విసుక్కున్నాడు. కటువుగా ఇట్లా అన్నాడు.

వాలి: ఓ భయస్వరూపురాలా! నా తమ్ముడే శత్రువై గర్జిస్తూ ఉంటే చేతకానివాడిలాగా నన్ను వంటింట్లో కూర్చోమంటావా? ఎన్నడూ అపజయమన్నదే ఎరుగనివాడినీ, శూరుడనూ అయిన నన్ను అవమానకరంగా కయ్యానికి కాలుదువ్వుతూ ఉంటే ఓర్పు వహించమంటావా? ఇంతకన్నా మరణం మేలు కదా? హీనమైన కంఠస్వరంగల సుగ్రీవుడు యుద్ధరంగంలో నిలిచి నాతో సవాలు చేస్తూ ఉంటే నేను సహించి ఊరుకోవటమా?

ఓ అందమైనదానా! రాముడిని గూర్చి భయపడకు. రాముడు సర్వధర్మాలు తెలిసినవాడు; కృతజ్ఞుడు. ఇటువంటి పాపాత్ముడితో ఎట్లా చేతులు కలుపుతాడు? నీవు ఇంతవరకూ చేసిన ధర్మబోధ చాలు. ఇక తక్కిన స్త్రీలను కూడా తీసుకొని లోపలకు వెళ్ళు. ఇంతవరకు నా క్షేమం కోరి మాట్లాడింది చాలు. ఇక లోపలకు వెళ్ళు.

ఓ భయస్థురాలా! నేను సుగ్రీవుడితో యుద్ధానికి వెళుతున్నాను. వాడి గర్వం అణచివేస్తానేగాని చంపను. నన్ను యుద్ధానికి పిలుస్తున్నది సుగ్రీవుడే కాబట్టి, వాడు ఏ విధంగా యుద్ధం కోరుకొంటాడో ఆ విధంగానే చేస్తాను. వృక్షాలతో చేద్దాం అంటే వృక్షాలతోనే చేస్తాను. పిడికిళ్ళతోను, బాహువులతోనూ చేద్దామంటే అట్లాగే చేస్తాను. దుర్బలుడు, దుష్టబుద్ధి అయిన సుగ్రీవుడు నా ముందు నిలబడలేడు. వాడు ఏ రకమైన యుద్ధాన్ని కోరుకున్నా వాడి శరీరం అంతా పచ్చడి పచ్చడిగా చేస్తానేగానీ చంపను. నా మీద ఉన్న ప్రేమతో ఇంతవరకు చేసిన ధర్మబోధ చాలు. ఇక లోపలకు వెళ్ళు. నేను నా ప్రాణాల మీద ఒట్టు వేసి చెప్తున్నాను. యుద్ధంలో నేను సుగ్రీవుణ్ణి జయించి త్వరగా తిరిగి వచ్చేస్తాను. నీవు ఈ స్త్రీలందరినీ తీసుకొని లోపలకు వెళ్ళు.

అంతట తార వాలికి ప్రదక్షిణ నమస్కారం చేసి, కౌగలించుకొంది. స్వస్త్యయనాది మంత్రాలతో భర్త విజయానికై ప్రార్థన చేసింది. లోలోన దుఃఖీస్తూ మిగిలిన స్త్రీలందరినీ కలుపుకొని అంతః పురంలోకి వెళ్ళింది.

వాలి బుసలు కొడ్తూ నగరం దాటి బయటకు వచ్చి శత్రువుకోసం నాలుగు మూలలా కలయచూశాడు. అప్పుడు ఒకానొక చోట బంగారు దేహ కాంతితో వెలిగిపోతూ, అగ్నిలాగా ప్రజ్వరిల్లుతున్న సుగ్రీవుణ్ణి చూశాడు. సుగ్రీవుడు అప్పటికే పంచపైకి ఎగకట్టి గోచీ బిగించి సిద్ధంగా ఉన్నాడు. వాలి కూడా పంచ బిగించాడు. మహాకోపిష్టి అయిన వాలి తన బాహువులు రెండూ చాచి చూసుకున్నాడు. తరువాత సుగ్రీవుడి వైపుగా నడిచాడు. సుగ్రీవుడు కూడా పిడికిళ్ళు బిగించుకొని, బంగారుమాల ధరించిన వాలిపైకి దుమికాడు. తన మీదకు వస్తున్న సుగ్రీవుడితో, కళ్ళు చింతనిప్పుల్లా చేసుకొని వాలి ఇట్లా అన్నాడు.

వాలి: ఓరీ! సుగ్రీవుడా! బాగా పిడికిలి బిగించి ఉంచాను. నీవు దగ్గరకు రావటమే ఆలస్యం. ఒక్క గుద్దుతో గిద్దెడు మిరియాలు కక్కిచస్తావు. కాచుకో!

సుగ్రీవుడు: నేనూ పిడికిలి బిగించే ఉన్నాను. పెద్దవాడివన్న గౌరవంతో ఇంతకుపూర్వం నీకు నా పిడికిలి రుచి చూపించలేదు. ఇప్పుడు ఒక్క గుద్దు గుద్దానంటే నీ తల పగిలి రెండవుతుంది.

అప్పుడు వాలి సుగ్రీవుని సమీపించి తన బలాన్నంతా కూడా గట్టుకొని ఒక్క గుద్దు గుద్దాడు. దాంతో సుగ్రీవుడు నెత్తురు కక్కుకుంటూ పర్వతంలాగా నేలపై పడ్డాడు. వెంటనే లేచి సుగ్రీవుడు సాలవృక్షాన్నొకటి పెళ్ళగించి వాలిని కొట్టిన చోట కొట్టకుండా శరీరం అంతా పుండయ్యేట్లు కొట్టాడు. ఆ సాలవృక్షంతో బలంగా తాకిన దెబ్బలతో వాలి నడి సముద్రాన తుపానులో చిక్కుకున్న నావలాగా అటూ ఇటూ ఊగిపోయాడు. భయంకరమైన బలపరాక్రమాలు కలిగిన ఆ వాలి సుగ్రీవులిద్దరూ గరుత్మంతుని వేగంతో ఒకరినొకరు

కొట్టుకున్నారు. ఇద్దరూ కూడా ఎదుటి వారి బలహీనతపై ఎక్కువగా దాడి చేశారు. బలపరాక్రమాల్లో ఆకాశాన గల సూర్యచంద్రుల్లాంటి వారు. క్రమంగా వాలి బలం వృద్ధి చెందగా, సుగ్రీవుడి బలం క్షీణించింది. వాలి సుగ్రీవుడి దర్పాన్ని అణచివేయగా, సుగ్రీవుడిలో కోపం, చురుకుదనం పెరిగాయి. వారిరువురూ చెట్ల కొమ్మల్తో కొట్టుకున్నారు. పిడికిళ్ళతో పొడుచుకున్నారు. వజ్రాయుధం అంచుల్లా ఉన్న తమ గోళ్లతో రక్కుకున్నారు. కాళ్ళతో ఎగిరెగిరి తన్నుకున్నారు. అరచేతుల్తో చరచుకున్నారు. వృత్రాసుర దేవేంద్రులలాగా పోట్లాడుకున్నారు. ఇద్దరి శరీరాలు నెత్తురుతో తడిసి ముద్దయ్యాయి. ఒకరిపై ఒకరు గర్జిస్తూ వాళ్ళను వాళ్ళే ఉత్తేజపరచుకున్నారు.

క్రమంగా సుగ్రీవుడి బలం నీరు కారిపోసాగింది. మాటిమాటికీ దీనంగా దిక్కులు చూడటం మొదలుపెట్టాడు. అంతా గమనిస్తూనే ఉన్న రాముడు వాలిని చంపటానికి నిశ్చయించుకున్నాడు. వాలిని చంపేందుకు సరైన బాణాన్ని ఎంచుకున్నాడు. కృష్ణసర్పంలాంటి బాణాన్ని తీశాడు. యముడు కాలచక్రాన్ని సంధించినట్లు, రాముడా బాణాన్ని ధనుస్సులో పెట్టి ఎక్కుపెట్టాడు. అప్పుడు నారిలాగిన శబ్దానికి పక్షులు మృగాలు భయపడి పరుగులు పెట్టాయి. రాముడిచే విడువబడిన ఆ బాణం వజ్రంలాగా ధ్వని చేస్తూ పిడుగులాగా పోయి వాలి వక్షఃస్థలంలో గుచ్చుకుంది. ఆ బాణం దెబ్బకు మహా తేజశ్శాలి అయిన వాలి నేల కొరిగాడు. ఆశ్వయుజమాసం పూర్ణిమనాడు పడిపోయిన ఇంద్రధ్వజంలాగా వాలి నేలపై పడ్డాడు. వెంటనే స్పృహ తప్పింది. నెమ్మదిగా తేరుకున్నాడు. కన్నీటితోను, దుఃఖంతోను కంఠం పూడుకుపోయి మాట మెల్లగా వస్తోంది.

నరులలో శ్రేష్ఠుడైన రాముడు, వెలిగిపోతున్న శత్రుసంహారకమైన ఆ బాణాన్ని, ప్రళయకాలంలో రుద్రుడు నేత్రం నుండి ధూమంతో కూడిన అగ్నిని విడిచినట్లు, విడిచాడు. ఆ బాణం వెండితోను, బంగారంతోను అలంకరించబడి ప్రళయకాల యముడిలాగా భయంకరంగా ఉంది.

# 17వ సర్గ వాలి రాముని నిందించటం

రామబాణానికి ఆహుతి అయిన వాలి మొదలు నరికిన చెట్టులాగా నేలపై పడిపోయాడు. వానరులకు ప్రభువైన వాలి పడిపోవటంతో వానర రాజ్యం చంద్రుడు లేని ఆకాశంలాగా వెలవెలబోయింది. దేవేంద్రుడు ఇచ్చిన బంగారుమాల ధరించడంవల్ల మహాత్ముడైన వాలి పడిపోయినా తేజస్సుగాని, ప్రాణాలుగాని, పరాక్రమంగానీ అతడిని విడిచిపోలేదు. వాలి శరీరం బంగారుమాల వల్లను, అతడి శోభ వల్లను, రామబాణంచే కారుతున్న రక్తం వల్లనూ ఒకేసారి మూడు రంగులతో ప్రకాశించింది.

రాముడు వాలిని బాణంతో కొట్టేటప్పుడు ఏ బాణం ప్రయోగించాలా అని ఒక క్షణం ఆలోచించాడు. అగస్త్య మహర్షి తనకు ఇచ్చిన అస్త్రాన్ని వాలిపై ప్రయోగించాడు. ఆ బాణ ప్రభావంచేత వాలికి ఉత్తమలోకాలు ప్రాప్తిస్తాయి. యుద్ధంలో పడిపోయిన వాలి అణగారిన అగ్నిహోత్రంలాగా, ప్రళయకాలంలో కాలునిచే క్రిందపడవేయబడిన సూర్యుడిలాగా కనిపించాడు. విశాల వక్షఃస్థలం, పొడవాటి చేతులు, ప్రకాశవంతమైన ముఖం, పచ్చటి కళ్ళు కలిగిన ఆ వాలి మహేంద్రుడిలాగా ఉపేంద్రుడిలాగా ఎదిరించటానికి వీలుకాని శక్తిమంతుడై ఉండేవాడు. అటువంటి వాలి నేలకొరిగి పడి ఉండటం చూచి రామలక్ష్మణులిద్దరూ గౌరవసూచకంగా వాలి వద్దకు వెళ్లారు. బాణం దెబ్బతిని కొనప్రాణంతోను, తేజస్సుతోను నేల మీద పడి ఉన్న వాలి మహాబలవంతులైన రామలక్ష్మణులను చూశాడు. అర్థవంతం, వినయ సంపన్నం, ధర్మసమ్మతం అయిన మాటలు సగర్వంగా మాట్లాడాడు.

వాలి: ఓ రామా! నీవు రాజకుమారుడవు, చూసే వాళ్ళకు ఆనందాన్ని కలిగించేవాడవు. నీవు ధరించిన జటావల్కలాలు ధర్మపరుడవని తెలుపుతున్నాయి. పరాక్రమశాలివి, సత్యసంధుడవు. ఇటువంటి నీవు నేను ఇంకొకరితో యుద్ధం చేస్తూ ఉండగా, నేను నీకు ఎదురుగా లేని సమయంలో నా రొమ్ముల్లపై బాణాన్ని వదిలావు. ఈ కార్యం వల్ల నీ కీర్తి

ఇనుమడిస్తుందా? ఈ విధంగా నన్ను చంపిన నీవు ఏ ఘనత సాధిస్తావు?

ఓ రామా! నీవు గొప్ప కులంలో పుట్టినవాడవని, బలశాలివని, తేజస్సుగల వాడివని, నియమాల్ని పాటించేవాడివని, కరుణ కలవాడివని, ప్రజాక్షేమానికే పాటుపడేవాడివని, సమయాసమయాలు తెలిసినవాడివని, ఉత్సాహం కలవాడివని సకల జనులు నిన్ను గురించి అనుకుంటూ ఉంటారు.

రాజా! ఇంద్రియాల్ని, మనస్సును అదుపులో ఉంచుకోవటం, ఓర్పు, ధర్మం, ధైర్యం, బలపరాక్రమాలు, అపకారం చేసిన వారిని దండించడం మొదలైనవన్నీ రాజుల లక్షణాలు. నీవు ఇన్ని శ్రేష్ఠమైన గుణాలు కలవాడివనే నమ్మకంతో తార వారిస్తున్నా కూడా వినకుండా సుగ్రీవుడితో యుద్ధానికి వచ్చాను. నేను యుద్ధానికి సిద్ధపడి వచ్చినప్పుడు నిన్ను నేను చూడ లేదు. సుగ్రీవుడితోనే యుద్ధం చేస్తున్న నన్ను ఏమరుపాటున ఉండగా బాణంతో కొట్టవని అనుకున్నాను.

ఓ రామా! నీ బుద్ధి చాలా చెడ్డది, నువ్వు ధర్మం అనే ముసుగు వేసుకున్న అధార్మికుడవు. పాపప్రవృత్తిగలవాడవు. గడ్డికప్పిన బావిలాంటి వాడవని నాకు తెలియదు. సత్పురుషులు వేసుకునే వేషాన్ని వేసుకున్న పాపాత్ముడవు. నివురుగప్పిన నిప్పులాంటివాడవని గ్రహించలేకపోయాను.

ఓ రామా! నేను నీ దేశంలోగాని, నీ నగరంలోగాని ఏ పాపకార్యమూ చెయ్యలేదు. నిన్ను అవమానించలేదు. నేను జీవితమంతా కందమూలాలు, ఫలాలే తింటూ అడవుల్లో ఉండేవాడిని. పాపాలు ఏమీ చెయ్యలేదు. నీతో యుద్ధం చేయటం లేదు. నేను ఇంకొకరితో యుద్ధం చేస్తున్నాను. అటువంటి నన్ను ఎందుకు చంపావు?

క్షత్రియ వంశంలో జన్మించినవాడవు, శాస్త్రాలన్నీ చదివిన వాడివి. ధర్మ చిహ్నాలన్నీ ధరించినవాడివి, ఇటువంటి క్రూరమైన పని చేయదగునా? రఘువంశంలో పుట్టావు.

ధర్మాత్ముడవని పేరు తెచ్చుకున్నావు. నిజానికి నీవు ధర్మాత్ముడవు కావు. దుష్టుడవు. ఎందుకని ఇట్లా మంచివాడిలాగా నటిస్తూ తిరుగుతున్నావు?

రామా! మేము పండ్లు దుంపలు తింటూ అడవుల్లో జీవిస్తూ ఉంటాం. ఎవరినైనా చంపాలంటే వారివద్ద ఉండే బంగారుగానీ, వెండిగానీ, భూములుగాని కారణాలవుతాయి. మరి నేనుండే అడవులమీదగాని, నేను తినే దుంపలు, ఫలాల మీదగానీ నీకు ఆశ ఎందుకు కలిగింది?

రామా! రాజులు ఎప్పుడూ స్వేచ్ఛగా ప్రవర్తించరు. నీతినే అవలంబించటం, వినయం కలిగి ఉండటం, శిక్షించదగ్గవారిని శిక్షించడం, అనుగ్రహించదగినవారిని అనుగ్రహించడం ఇవన్నీ రాజు ధర్మాలు. రాజైనవాడు వీటిని అతిక్రమించకూడదు. కానీ నీలో రాజలక్షణాలు లేవు. నీవు చంచల స్వభావం కలవాడవు. నీవనుకున్నది సాధించడమేకాని ధర్మాధర్మాల గూర్చి పట్టించుకోవు. కోపిష్టివాడవు. నిశ్చలమైన బుద్ధిలేనివాడవు. ధనుస్సు చేతిలో ఉన్నది కదా అని విచ్చలవిడిగా నిరపరాధుల్ని చంపుతావు.

ఓ రామా! నీవు పేరుకు రాజువేకాని, నీకు ధర్మంపై శ్రద్ధలేదు. కామానికే ప్రాధాన్యమిచ్చే నీవు ఇంద్రియాలు ఎటు లాగితే అటు వెళ్తావు. అంటే నీకు విషయాలపై స్థిరత్వం లేదు. రామా! నిరపరాధినైన నన్ను బాణంతో కొట్టి చంపావు. ఈ పాపాన్ని సత్పురుషుల ముందు సమర్థించుకోలేవు. రాజును చంపినవాడు, బ్రాహ్మణుని చంపినవాడు, గోవును చంపినవాడు, దొంగ, ప్రాణుల్ని ఇష్టానుసారం చంపేవాడు, వేదాన్ని నిందించే నాస్తికుడు వీరందరూ నరకానికే పోతారు. చాడీలు చెప్పేవాడు, లోభి, మిత్రుణ్ణి చంపినవాడు, గురుపత్ని గమనం చేసినవాడు, వీరందరూ పాపాత్ములు వెళ్ళే లోకాలకే వెళ్తారు.

రామా! నా రోమాలు వ్యర్థం. నా చర్మం ఎముకలు కూడా సత్పురుషులు తాకరు. నీ వంటి ధర్మాత్ములు నా మాంసాన్ని తినరు. అయిదు వేళ్ళ జంతువుల్లో శల్యకం, శ్వావిధం, ఉడుము, చెవులపిల్లి, తాబేలు మాంసం మాత్రమే బ్రాహ్మణులు, క్షత్రియులు తినవచ్చును.

తారకు అన్ని విషయాలు తెలుసు. నాకు ముందే హితం చెప్పింది. యథార్థమైన మాటల్నే చెప్పింది. కానీ నేను అజ్ఞానం వల్ల ఆమె మాటలు కాదన్నాను. ఫలితంగా యముడికి దగ్గరయ్యాను.

ఓ రామా! భర్త చెడ్డ ప్రవర్తనగలవాడైతే, శీలవంతురాలైన భార్యకు నాథుడు లేనట్లే అవుతుంది. అట్లాగే నీవు ఈ భూమికి నాథుడుగా బ్రతికి ఉన్నావన్నమాటేగాని, మంచి నాథుడు లేనట్లే అవుతుంది.

రామా! నీవు పయోముఖవిషకుంభానివి. నీచుడవు. మనస్సులో ఒకటి పెట్టుకొని, వినయంగా నటిస్తావు. పాపాత్ముడవు. ఇన్ని దుర్గుణాలున్న నీవు మహాత్ముడైన దశరథుని కుమారుడుగా ఎట్లా పుట్టావు? రాముడనే ఏనుగు, సచ్చరిత్ర అనే కట్టు త్రాళ్ళను తెంచివేసి సత్పురుషుల ధర్మాలన్నీ అతిక్రమించి, ధర్మం అనే అంకుశాన్ని దూరంగా పారేసి, నన్ను చంపివేసింది. సత్పురుషులు నిందించే ఇటువంటి నింద్యమైన పనులు చేసి, మరల సత్పురుషుల ముందు తల ఎత్తుకొని ఎట్లా తిరుగుతావు?

రామా! నీతో నాకు శత్రుత్వం లేదు; మిత్రత్వమూ లేదు. కానీ నీవు మా యందు చూపిన పరాక్రమాన్ని, నీ శత్రువులపై ఎందుకు చూపటం లేదు? రామా! నీవు నాతో ప్రత్యక్షంగా యుద్ధం చేసి ఉంటే ఈ పాటికే యమలోకానికి పోయి ఉండేవాడివి. నన్ను యుద్ధంలో జయించలేవని నీకు బాగా తెలుసు. అందుకనే చాటుమాటుగా, మద్యం త్రాగి నిద్రపోతున్న వాడిని పాము కాటువేసినట్లుగా, నన్ను చంపావు.

సుగ్రీవుడిని సంతోషపరచి నీ కార్యం సాధించుకోవాలని అనుకున్నావు. అంతకన్నా ముందు నన్నే అడిగి ఉంటే, నీ భార్యను అపహరించిన రావణాసురుణ్ణి మెడకు తాడుకట్టి తీసుకొనివచ్చి నీకు అప్పగించేవాడిని. సీతను సముద్రాల మధ్య దాచినా, పాతాళంలో దాచినా నీ ఆజ్ఞచే నేను ఆమెను మధుకైటభులచే పాతాళంలో ఆడ గుర్రం రూపంలో బంధించబడిన శ్రుతిని

హయగ్రీవుడు తీసుకొని వచ్చినట్లు, తీసుకొనివచ్చి నీకు అప్పగించేవాడిని.

రామా! నేను మరణించిన తరువాత సుగ్రీవుడు రాజవటం ధర్మమే కాని, యుద్ధంలో నీవు నన్ను చంపటం మాత్రం అధర్మమే. రామా! పుట్టిన ప్రతివాడూ చావక తప్పదు. అందువల్ల నేను చనిపోవడం ఏమీ అసాధారణం కాదు. చచ్చిపోతున్నందుకు నేనేమీ దుఃఖించడం లేదు. నీవు పొంచి ఉండి అధర్మంగా నన్ను చంపి, సుగ్రీవుడిని రాజును చేస్తున్నందుకు బాధపడుతున్నాను. నువ్వు కూడా ఇది ఆలోచించు.

ఈ విధంగా అంటూ, రామ బాణం వల్ల దేహం అంతా మంటలు పుడుతూ ఉంటే, నోరు ఎండిపోగా దేవేంద్ర పుత్రుడైన వాలి, రాముణ్ణి తదేకంగా చూడసాగాడు.

# 18వ సర్గ రాముడు వాలికి సమాధానం చెప్పటం

రామబాణంతో నేలకొరిగిన వాలి ధర్మమైన, అర్థవంతమైన అభియోగాల్ని వినయపూర్వకంగా పలుకగా, రాముడు వాలికి తగిన విధంగా సమాధానం చెప్పాడు.

రాముడు: ఓ వాలీ! నీవు ధర్మం, అర్థం, కామం, లోకమర్యాదలు తెలియక అజ్ఞానంచేత నీకు తోచిన విధంగా నిందించావు. నీవు వానర సహజమైన చాపల్యం చేతను, అజ్ఞానం చేతను నోటికొచ్చినవన్నీ మాట్లాడావు. తెలియని విషయాల్ని బుద్ధిమంతులు, పెద్దలు, మాన్యులు అయిన వారి వద్ద అడిగి తెలుసుకోవాలి. అంతేగాని ఏది తోస్తే అది మాట్లాడటం సబబు కాదు.

పర్వతాలు, వనాలు, మహారణ్యాలతో కూడిన ఈ భూమి అంతా ఇక్ష్వాకు వంశీయులకు చెందినదే. మృగాల్ని గాని, పక్షులనుగాని, మనుష్యులనుగాని, నిగ్రహించడం, అనుగ్రహించడం వంటి విషయాలపై ఆ వంశీయులకే అధికారం ఉంది.

ఈ భూమిని ఇప్పుడు భరతుడు పాలిస్తున్నాడు. అతడు ధర్మాత్ముడు. సత్యాన్ని మాత్రమే మాట్లాడతాడు. కుటిలత్వం, వక్రత్వం లేనివాడు. ధర్మార్థ కామాల తత్త్వం బాగా తెలిసినవాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయటంలో శ్రద్ధగలవాడు. భరతుడు అద్వితీయ పరాక్రమశాలి. సత్యము, వినయాలందు అతడి మనస్సు స్థిరంగా ఉంటుంది. దేశకాలాలు తెలిసిన రాజు. ధర్మసంరక్షణ కోసమై నేను, మరికొందరు రాజులు భూమి అంతా పర్యవేక్షిస్తున్నాం. ఓ వాలీ! రాజులలో శ్రేష్ఠుడైన భరతుడు పరిపాలించే రాజ్యంలో ధర్మవిరుద్ధంగా ఎవడైనా ప్రవర్తించగలరా? మేము భరతుని ఆజ్ఞ ప్రకారం ధర్మాన్ని అతిక్రమించేవాళ్ళను ఓ కంట కనిపెడ్తూ సంచరిస్తున్నాం.

ఓ వాలీ! నీవు ధర్మాన్ని ఆచరించటం మానేశావు. నలుగురూ అసహ్యించుకొనే నీచమైన పనులు చేస్తున్నావు. కామానికి భోగానికే ప్రాధాన్యం ఇచ్చావు. అన్నగారు, కన్న తండ్రి, విద్య నేర్పిన గురువు వీరు ముగ్గురూ తండ్రులే అవుతారని ధర్మశాస్త్రం చెబుతోంది. తమ్ముడు,

సద్గుణవంతుడైన శిష్యుడు, కుమారుడు అతనికి పుత్రులతో సమానం. అదే ధర్మం.

ఓ వానరుడా! నీవు కేవలం నాపై గల ద్వేషంతో ఈ విధంగా దూషిస్తున్నావేగాని, నీకు ధర్మాధర్మాలు తెలియవు. ధర్మం చాలా సూక్ష్మమైనది. సత్పురుషులు మాత్రమే ధర్మాన్ని పూర్తిగా తెలుసుకొని ఆచరిస్తారు. ధర్మాన్ని సామాన్యులు ఆచరించటం చాలాకష్టం. సకల భూతాలలో ఉండే ఆత్మ మాత్రమే మంచి చెడుల్ని తెలుసుకోగలుగుతుంది. పుట్టు గుడ్డివాడు మరొక పుట్టు గుడ్డివాడితో కలసి చూచేట్లు, చంచల స్వభావం గలిగిన ఒక వానరుడు మరొక వానరుడి నుండి ధర్మాధర్మాల గూర్చి తెలుసుకోగలడా? ఇంకా వివరంగా చెప్తాను విను. నిన్ను ఎందుకు చంపాల్సి వచ్చిందో కారణం చెప్తాను. విను.

నువ్వు శాశ్వతమైన ధర్మాన్ని విడిచి తమ్ముని భార్యను అపహరించావు. సుగ్రీవుడు జీవించి ఉండగానే కోడలివంటిదైన రుమను కామంచేత పొందావు. కాబట్టి ఓ వానరుడా! నీవు కట్టుబాటును, ధర్మాన్ని అతిక్రమించి సోదరుని భార్యను పొంది స్వేచ్ఛగాను, నిర్లజ్జతోను ప్రవర్తించావు. నీకు ఆ పాపానికి దండన ఇవ్వబడింది. ఓ వానర రాజా! లోకంలో ధర్మాచారానికి, లోకాచారానికి విరుద్ధంగా ప్రవర్తించే నీకు దండన తప్ప మరో ప్రాయశ్చిత్తం నాకు కనపడలేదు. ఉత్తమవంశంలో పుట్టిన క్షత్రియుడనైన నేను నువ్వు చేసిన పాపకర్మను సహించలేను. కామంతో ఎవడు కుమార్తెనుగాని, సోదరినిగాని, తమ్ముని భార్యనుగాని పొందుతాడో, వాడికి దండన తప్పక విధించాలి. ఇప్పుడు ఈ దేశాన్ని భరతుడు పాలిస్తున్నాడు. మేము అతడి ఆజ్ఞను పాటిస్తున్నాం. నువ్వు ధర్మం తప్పావు. నిన్ను శిక్షించకుండా ఎట్లా ఉండగలను? భరతుడు ధర్మానుసారంగా రాజ్యపాలన చెయ్యాలని స్థిరంగా సంకల్పించాడు. ధర్మాన్ని పరిరక్షించడం ఆతడి బాధ్యత. కాబట్టి ధర్మాన్ని తప్పి, స్వేచ్ఛగా ప్రవర్తిస్తున్న నిన్ను శిక్షించి ధర్మాన్ని కాపాడాడు.

కాబట్టి ఓ వానరరాజా! మేము భరతుని ఆదేశాల ప్రకారం, శాస్త్ర సమ్మతంగా, కట్టుబాట్లు తప్పి ప్రవర్తించే నీబోటివారిని శిక్షించటానికే నిలచి ఉన్నాం. నాకు సుగ్రీవుడు,

లక్ష్మణుడు సమానమే. ఇద్దరూ సోదరులే. మేమిద్దరం ఒప్పందం చేసుకుని స్నేహితులమయ్యాం. ఆ విధంగా నాకు లక్ష్మణుడు, సుగ్రీవుడు సోదరులతో సమానం. భార్య, రాజ్యాల విషయంగా మే మిద్దరం ఒక ఒప్పందం చేసుకున్నాం. నేను వానరుల సమక్షంలో సుగ్రీవుడికి ప్రతిజ్ఞ చేశాను. నావంటివాడు చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చకుండా ఎట్లా ఉండగలడు? కాబట్టి ఓ వానరరాజా! నీకు తగిన దండనే విధించబడింది. మారు మాట్లాడకుండా ఆ దండనను స్వీకరించాలి. ధర్మం ఆచరించేవాడు స్నేహితుడికి ఉపకారం చేసితీరాలి.

ఓ వానరుడా! నీ పాపాలన్నీ ఈ విధంగా ప్రక్షాళనం అయినాయని సంతోషించు. మనువు సదాచారాన్ని గూర్చి రెండు శ్లోకాలు చెప్పాడు. వాటిని ధర్మాత్ములు, సచ్చరిత్రులంతా అంగీకరించారు. ఆ ప్రమాణాన్నే నీ విషయంలో పాటించాను. 'అపరాధం చేసినవారిని రాజు శిక్షించేట్లయితే, వాడి అపరాధాలన్నీ ప్రక్షాళనం అయిపోతాయి. పుణ్యాత్ముడిలాగానే స్వర్గానికి పోతాడు. ఒక దొంగను రాజు శిక్షిస్తే, ఆ దొంగవాడి దోషాలన్నీ అక్కడికక్కడే నశించిపోతాయి. అట్లా ఆ రాజు శిక్షించకపోతే, ఆ పాపం దొంగ కన్నా కూడా రాజునే ఎక్కువ బాధిస్తుంది. అందువల్లనే మా పూర్వీకుడైన మాంధాత శ్రమణకుడనేవాడు చేసిన మహాపాపానికి ఘోరమైన శిక్ష విధించాడు.

రాజు ఏమరుపాటుతో ఉన్నప్పుడు, అనేకమంది పాపాత్ములు రాజుకు తెలియకుండా తప్పించుకు తిరుగుతూ ఉంటారు. అయితే ఆ రాజు వాళ్ళను పట్టి శిక్షించినట్లయితే వారి పాపాలన్నీ ప్రక్షాళనం అయిపోతాయి. అంతేకాదు, ఆ రాజు కూడా పుణ్యలోకాలకు పోతాడు.

ఓ వానరుడా! నా క్షేమం కోరే వాడు సుగ్రీవుడేగాని, నీవు కాదు. ముందుగా నిన్నే సహాయం అడిగితే రావణుణ్ణి త్రాళ్లతో కట్టి నా కాళ్ల ముందు పడవేసేవాడిని అన్నావు. అవి వట్టి ప్రగల్భాలేగాని అందులో సత్యం ఎంతమాత్రం లేదు. నా బాణం దెబ్బతిని మట్టికరుస్తూన్న వాడివి, మరణానికి సమీపంలో ఉన్న వాడివి, నీవా నాకు సహాయపడేది?

ఓ వానర వీరుడా! నీకు ఇంకో ప్రధానమైన కారణం కూడా చెప్తాను విను. అది వింటే నీకు కోపం రాదు. ఓ వానరా! మానవులు పొంచి ఉండిగాని ఎదురుగా కనబడుతూగానీ మృగాలను వలలతోను, తాళ్ళతోను, ఇతర కపటోపాయాలతోను బంధిస్తూ ఉంటారు. జంతువులు భయపడి పారిపోతున్నా, లేక కదలకుండా నిలబడి ఉన్నా, ఏమరుపాటుతో ఉన్నా, లేకపోయినా, ఇంకో ప్రక్కకు తిరిగి ఉన్నా వాటిని చంపుతారు. జంతువుల విషయంలో అట్లా చేయటం వల్ల దోషం ఏమీ ఉండదు.

ధర్మవేత్తలైన రాజర్షులు వేటాడుతూ ఉంటారు. ఓ వానరుడా! నీవు నాతో యుద్ధం చేసినా చెయ్యకపోయినా నీవు వానరుడవే కదా! అందుచే నిన్ను బాణంతో కొట్టి చంపటంలో దోషం లేదు.

ఓ వానరుడా! రాజులంటే భూలోకంలో సంచరించే దేవతలే. అందువల్ల వారిని హింసించకూడదు, నిందించకూడదు. తేలికచేసి అప్రియంగా మాట్లాడకూడదు. సంపాదించటానికి సాధ్యంకాని ధర్మాన్ని, పవిత్రమైన జీవితాన్ని రాజులే అందిస్తారు. ఇందులో ఎంతమాత్రమూ సందేహం లేదు.

ఓ వానరుడా! నీలో కోపం, ద్వేషం ఉన్నాయి. దాంతో ధర్మం అంటే ఏమిటో తెలియని నీవు, తరతరాలుగా ధర్మమార్గాన్నే అనుసరిస్తున్న నన్ను దూషిస్తున్నావు.

రాముడి మాటలు వాలి శ్రద్ధగా విన్నాడు. ధర్మం అంటే ఏమిటో ఇంతకాలం తెలియకపోవటం వల్ల, రాముడు చేసిన దాంట్లో దోషమేమీ లేదని గ్రహించాడు. రాముడికి భక్తిశ్రద్ధలతో నమస్కరించి ఇట్లా అన్నాడు.

వాలి: రామా! ఉత్తముడికి నీచుడు నిలబడి సమాధానం చెప్పలేడుగదా! అందుచేత ఇంతకు ముందు నిన్ను దోషిగా చేసి అప్రియంగా మాట్లాడాను. నన్ను క్షమించు. ఓ రామా! నీవు నరులలో శ్రేష్ఠుడవు. నీవు పలికినదంతా సత్యం. అందులో ఏమాత్రం సందేహం లేదు.

ఓ రామా! నీవు సర్వధర్మాలు తెలిసినవాడవు. దాంట్లో ఉండే తత్త్వం అంతా గ్రహించినవాడవు. ప్రజల యోగక్షేమాలయందే ఆసక్తి గలవాడవు. ఓ రామా! నేను ధర్మాన్ని అతిక్రమించాను. ధర్మమార్గాన్ని తప్పి ప్రయాణించాను. ధర్మం తెలిసిన నీవే నన్ను అనుగ్రహించి ధర్మమార్గంలో పెట్టు.

ఓ రామా! నా మరణావస్థను గూర్చి నేను చింతించడం లేదు. నా భార్య తారను గూర్చి చింతించడం లేదు. సద్గుణసంపన్నుడు, అందమైన బాహువులు గలవాడు అయిన నా కుమారుడు అంగదుని గూర్చి నా మనస్సు బాధపడుతోంది. చిన్నప్పటి నుండి నేనంటే బాగా చనువుగా పెరగటం వలన, నేను కనబడక తల్లడిల్లిపోతాడు. నీరంతా పూర్తిగా ఎండిపోయిన చెరువుమల్లే ఎండిపోతాడు. రామా! అంగదుడు చిన్నవాడు. లోకానుభం లేదు. తార వలన కలిగిన ఈ అంగదుడు నా ఏకైక పుత్రుడు. నాకు ప్రియాతిప్రియమైనవాడు. నీవు అతడిని రక్షించాలి.

ఓ రామా! నీవు పనులు చక్కబెట్టడంలో నేర్పూ, నిశ్చితమైన, ధర్మబద్ధమైన అభిప్రాయాలున్నవాడవు. నీవు సర్వరక్షకుడవు. దుష్టులను శిక్షించేవాడవు. కాబట్టి నీవు అంగదుని విషయంలోను, సుగ్రీవుడి విషయంలోను ఒకే మాదిరిగా వ్యవహరించాలి. ఇకపై వారిద్దరి బరువు బాధ్యతలన్నీ నీవే. ఓ నరశ్రేష్ఠుడా! నీవు భరతుణ్ణి, లక్ష్మణుణ్ణి ఎంత ప్రేమగా చూస్తావో, నా కుమారుడు అంగదుణ్ణి, తమ్ముడు సుగ్రీవుణ్ణి కూడా అంతే ప్రేమగా చూడు.

ఓ రామా! నా మూలంగా తార కూడా అపరాధి అయింది. కానీ తానుగా ఏ తప్పూ చేయలేదు. కాబట్టి సుగ్రీవుడు ఆమెను అవమానించకుండా ఉండాలి. రామా! నా మరణానంతరం ఎవరు నీ అనుగ్రహం సంపాదిస్తారో అతడే వానరరాజ్యానికి వారసుడు కావాలి. ఎందువల్లనంటే, నీ అనుగ్రహం పొందినవాడు ఒక్క వానరరాజ్యానికే కాదు, సమస్త భూమండలాన్నీ ఏలగలడు. స్వర్గాన్ని కూడా శాసించగలడు.

ఓ రామా! తార నీతో యుద్ధానికి వెళ్ళొద్దని వారించింది. కానీ నీ చేతిలో నేను మరణం పొంది ధన్యుణ్ణి కావాలని ఉంది. అందువల్లనే తార మాటను పెడచెవిని పెట్టి సుగ్రీవుడితో యుద్ధానికి వచ్చాను.

రాముడు: ఓ వానర శ్రేష్ఠుడా! వాలీ! తారను గూర్చిగాని, అంగదుని గూర్చిగాని నీవు దుః ఖించవద్దు. నీవు మహాపాపాలు చేశావనిగాని, నేను నిన్ను చంపాననిగానీ నీవు అనుకోవద్దు. ఎందువల్లనంటే, నిన్ను అనుగ్రహించటానికే ధర్మానుసారంగా వ్యవహరించాలని అనుకున్నాను. శిక్షించదగినవాడిని శిక్షించినవాడు, శిక్షింపదగినవాడై ఉండి శిక్ష అనుభవించినవాడు వారిద్దరూ కార్యాకారణాలు. అంటే దండింపదగినవాడు అనే కారణాన, దండించటం అనే కార్యాన్ని చేయటం చేత చరితార్థులవుతారేగాని వినాశనం పొందరు. ఆ విధంగా ఇప్పుడు నీకు దండన విధించడం మూలంగా నీ అధర్మవర్తనలు సంసారాన్నుండి తొలగిపోయాయి. ధర్మసమ్మతమైన సహజ స్థితికి వచ్చావు. ఓ వాలీ! మనసులో నుండి మోహాన్ని, దుఃఖాన్ని శోకాన్ని విడిచిపెట్టు. దైవనిర్ణయానికి విరుద్ధంగా ఎవరూ నడుచుకోలేరు. ఓ వానరరాజా! అంగదుడు నీ యందు ఎంత ప్రేమానురాగాలతో ఉండే వాడో, సుగ్రీవుని యందు కూడా అట్లాగే ప్రవర్తిస్తాడు. నీవు ఏమీ సందేహించవద్దు.

మహాత్ముడు, ధర్మమార్గమందు ఆసక్తి కలవాడు, యుద్ధంలో శత్రు సంహారకుడు అయిన రాముడు ఈ విధంగా పలికిన మధురమైన మాటలు విన్న వాలి ఇట్లా అన్నాడు.

వాలి: ఓ రామా! నీవు మహేంద్రుడితో సమానమైనవాడవు. భయంకరమైన పరాక్రమం కలవాడివి. మహారాజా! ఓ ప్రభూ! బాణంచేత బాధించబడి తెలిసీ తెలియని స్థితిలో నేను నోటికి వచ్చిందల్లా మాట్లాడాను. నన్ను క్షమించమని మనసారా వేడుకొంటున్నాను. నా అపరాధాన్ని క్షమించు.

# 19వ సర్గ తార వాలికై విలపించటం

వానర రాజైన వాలి రామబాణంచేత నేలకొరిగాడు. అతడి శరీరం అంతా రాళ్ళతోను, చెట్టు కొమ్మలతోను తగిలిన దెబ్బలచేత పుండై రక్తసిక్తమై ఉంది. కొన ఊపిరితో ఆ వాలి స్పృహతప్పి పడి ఉన్నాడు.

రామబాణానికి తన భర్త నేలకొరిగాడని తార విన్నది. విభ్రాంతి చెందింది. అంతఃపురం నుండి బయలుదేరి కొండలు గుట్టలూ దాటుకుంటూ వాలి పడి ఉన్న వనానికి బయలుదేరింది. రాముణ్ణి చూసి భయపడి పారిపోయివస్తున్న వానరులు తారకు ఎదురుపడ్డారు. గుంపు నాయకుణ్ణి పడగొడ్తే పారిపోయే మృగాల్లాగా ఉన్నారా వానరులంతా. వాళ్ళందరినీ చూస్తూ తార ఇట్లా అంది.

తార: ఓ వానర వీరులారా! యుద్ధంలో మీరెప్పుడూ వాలికి ముందు నడిచేవాళ్ళు. అటువంటిది, వాలిని ఒదిలేసి మీరంతా ఇట్లా పరుగులు పెడుతూ ఉన్నారు, ఎందుకని? రాజ్యం కోసం ఆ దుర్మార్గుడు, సుగ్రీవుడు, రాముణ్ణి సాయం తెచ్చుకున్నాడు. రామబాణం ఎంత దూరమైనా పోయి లక్ష్యాన్ని ఛేదిస్తుంది గదా! అదే రామబాణం నా భర్త ప్రాణాల్ని బలి తీసుకుందా?

వానరులు: ఓ దేవీ! నీ కొడుకు ఉన్నాడు. ముందు ఆ కొడుకును కాపాడుకో. సాహసం చేసి రాముడి ఎదుటపడవద్దు. వెనుతిరిగి అంతఃపురానికి పో. కాలయముడు రాముడి రూపంలో వచ్చాడు. ఇప్పుడో కాసేపటికో కిష్కింధపై పడి అందర్నీ చంపేస్తాడు.

ఓ తారాదేవీ! సుగ్రీవుడు వాలిని రాళ్ళతోను, చెట్లకొమ్మల్తోను ఒళ్ళంతా ఎక్కడా సందు లేకుండా కొట్టాడు. వాలి అన్నింటినీ ధైర్యంగాను, బలంగాను ఎదుర్కొన్నాడు. కానీ వజ్రాయుధం లాంటి రామబాణాన్ని తట్టుకొని నిలబడలేకపోయాడు. దేవేంద్రుడితో సమానమైన వాలి నేల

కూలిపోయాడు. ఇక మన సేనలన్నీ వెనక్కు తిరిగివస్తున్నాయి.

ఓ దేవీ! వెంటనే నగరద్వారాలన్నీ మూయించండి. అంగదుడికి రాజ్యాభిషేకానికి ఏర్పాట్లు చేయండి. వాలిపుత్రుడు కాబట్టి అంగదుడే వారసుడవుతాడు. వానరులంతా అతడినే రాజుగా అంగీకరిస్తారు. నీవు వెంటనే ఈ ఏర్పాట్లు చెయ్యడం మంచిది. ఇప్పటికే మన శత్రువులు అంతః పురం తప్ప మిగిలిన దుర్గాలన్నీ ఆక్రమించుకొని ఉంటారు. వాలి చేత వెళ్ళగొట్టబడిన శత్రువులు అనేకమంది ఈ అవకాశం కోసం కాచుకుని కూర్చున్నారు. వాళ్ళల్లో కొందరు భార్యల్తో కలిసి ఉన్నారు. ఇంకొంతమంది భార్యలు లేనివాళ్ళు ఉన్నారు. సుగ్రీవుడు వీళ్ళందరినీ కలుపుకుని మనకు అనేక చిక్కులు తెచ్చిపెట్టగలడు.

తార: ఓ వానరులారా! మహా బలశాలి, కపివీరుడు, నా భర్త అయిన వాలి మరణించిన తర్వాత ఈ అంగదుడు కానీ, ఈ రాజ్యంకానీ నన్ను ఉద్ధరిస్తాయా? నా బ్రతుక్కి అర్థమే హరించిపోయింది. నేను ఇక ఎవరికోసం బ్రతికి ఉండాలి. రామబాణానికి నేలకొరిగిన ఆ మహాత్ముడి పాదాల దగ్గరకే పోతాను. నేనూ ఆయనతోపాటే, ఆయన పోయే లోకాలకే వెళ్తాను. (అంటూ దుఃఖం ఆపుకోలేక రెండు చేతుల్తో రొమ్ము బాదుకుంటూ ఏడ్చింది.)

ఓ పూజ్యుడా! నువ్వు గతంలో అనేక యుద్ధాల్లో అనేకమంది రాక్షసుల్ని చంపావు. పెద్దపెద్ద కొండల్ని పూలబంతుల్లా విసిరేశావు. దేవేంద్రుడితో సమానమైన పరాక్రమం గలవాడివి. గర్జించేవాళ్ళకే భయం పుట్టేట్లు గర్జించేవాడవు. రామబాణం చేత మాంసంకోసం పులిచేత చంపబడ్డ శ్రేష్ఠమైన మృగంలా పడి ఉన్నావే! అంటూ తల రొమ్ములు బాదుకుంటూ ఏడ్చింది. నేలమీద పడి ఉన్న తన భర్తను తార చూసింది. ధనుస్సు ధరించి ఉన్న రామలక్షణుల్ని, వారి ప్రక్కనే ఉన్న సుగ్రీవుణ్ణీ చూసింది. వాళ్ళను దాటుకుంటూ పోయి వాలి శరీరంపై పడి మూర్ఛపోయింది. కొంతసేపటికి తేరుకుని "పూజ్యుడా" అంటూ కొనఊపిరితో ఉన్న వాలిని చూసి ఎలుగెత్తి ఏడ్చింది. అట్లా దుఃఖీస్తూన్న తారను, ఆమె ప్రక్కనే ఉన్న అంగదుణ్ణి చూస్తూ సుగ్రీవుడు కూడా దుఃఖం ఆపుకోలేకపోయాడు.

## 20వ సర్గ తార విలాపం

రామ బాణంచేత కొట్టబడి నేలపై పడి ఉన్న భర్తను తార కౌగలించుకొని ఏడ్చింది. పర్వతం లాంటివాడు ఒక్క రామబాణం చేత మదపుటేనుగులాగా పడి ఉన్నాడు. కూకటి వేళ్ళతో సహా కూలిపోయిన మహావృక్షంలాగా పడిపోయాడు. అది చూసి తార ఇలా విలపించింది.

భయంకర యుద్ధాలందు పరాక్రమాన్ని ప్రదర్శించినవాడా! ఓ గొప్ప వీరుడా! వానరులలో శ్రేష్ఠుడా! నిన్ను ఎన్నడూ పల్లెత్తు మాటైనా అనలేదే! అటువంటి నాతో ఎందుకు మాట్లాడటం లేదు?

ఓ వానర శ్రేష్ఠుడా! ఓ మహారాజా! ఎందుకు నీ విట్లా కటిక నేలపై పడి ఉన్నావు? నీ వంటి రాజు లెక్కడైనా నేల మీద పడుకుంటారా? ఓహో! నీవు భూమికి అధిపతివి కదా? అందుకని ఆ భూమినే కౌగలించుకొని పడుకున్నావా? నన్ను మరిచిపోయావు. భూదేవే నీకు ప్రియురాలైంది!

ఓ వీరుడా! ధర్మప్రవర్తన గలవాడా! నీ విప్పుడు స్వర్గంలోనే ఒక కిష్కింధను నిర్మించుకొని, భూమిపై ఉండే ఈ కిష్కింధను వదిలేశావు! నీవు మాతో కలసి ఆయా ఋతువులకు తగినట్లుగా మద్యగంధాలతో నిండిన వనాల్లో విహరిస్తూ ఉండేవాడివి. ఇప్పుడు అవన్నీ వద్దని ఒక్కడివే వెళ్ళిపోయావు. ఓ వానర నాయకుడా! నీవు వదిలి వెళ్ళిన ఈ కిష్కింధలో నేను నిరాశ్రయురాలనయ్యాను. ఏ ఆనందమూ లేకుండా శోకంలో మునిగి ఉన్నాను. నా హృదయాన్ని పాషాణంతో చేశాడా బ్రహ్మదేవుడు. అందుకనే నీవు మరణించినా, నా హృదయం వెయ్యిముక్కలు కాలేదు.

ఓ వానర రాజా! నిన్ను – సుగ్రీవుని భార్యను హరించవద్దు, అతడిని రాజ్యాన్నుండి వెళ్ళకొట్టవద్దని నెత్తీనోరు బాదుకొని అర్థించాను. నీవు నా మాట లెక్కచేయలేదు. అందువల్లనే

ఈనాడు ఈ ఉపద్రవం వచ్చిపడింది. నేను నీ క్షేమం కోరి హితమైన మాటలు ఎన్నో చెప్పాను. నీవు ఒక్కటీ చెవి కెక్కించుకోలేదు. అజ్ఞానంచేత నన్ను అనేక విధాలుగా తిట్టివేశావు.

ఓ గొప్ప అందగాడా! రూపం చేతనూ, యౌవనం చేతనూ నీవు అనేకమంది అప్సరస్త్రీల మనస్సులు దోచుకున్నావు. నీవు ఎవరికీ వశుడవు కావు. కానీ అటువంటి నీవు కాలానికి వశుడవైపోయావు. ఆ కాలమే బలవంతంగా నిన్ను సుగ్రీవుడి వశమయ్యేట్లు చేసింది. రాముడు ఇతరులతో యుద్ధం చేస్తున్న నిన్ను చంపి, కొంచెమైనా విచారించటం లేదు గదా! ఇంతవరకు ఎన్నడూ దుఃఖాన్నిగాని, దైన్యాన్నిగాని ఎరుగని నేను ఈనాడు విధవనై, అనాథనై దుఃఖాన్ని అనుభవిస్తున్నాను.

ఓ వీరుడా! అంగదుణ్ణి అల్లారుముద్దుగా పెంచావు. వాడు బహు సుకుమారుడు. సుఖాలకే అలవాటు పడినవాడు. ఇకపైన పినతండ్రి అయిన సుగ్రీవుడి దగ్గర ఎట్లా మసలుకుంటాడో గదా? నాయనా! అంగదుడా! నీ తండ్రిని చూడు. మళ్ళీ మళ్ళీ ఇకపై చూడలేవు. ఇదే ఆఖరిచూపు. బాగా చూడు.

ప్రాణనాథా! నీ కుమారుణ్ణి దగ్గరకు తీసుకో. వాడి శిరస్సు వాసన చూసి ముద్దుపెట్టుకో. దీర్ఘప్రయాణం పెట్టుకున్నావు గదా! చెప్పవలసిన నాలుగుమాటలు చెప్పెయ్యి.

నాథా! నిన్ను చంపి రాముడు సుగ్రీవుడికి చేసిన ప్రతిజ్ఞను నిలుపుకున్నాడు. ఈ విధంగా తన ఋణాన్ని తీర్చుకున్నట్లయింది. ఓ సుగ్రీవా! నీ కోరిక తీరింది గదా? ఇకపై నీవు 'రుమ' తో సుఖంగా ఉండవచ్చు. నీ అన్న అడ్డు తొలగించుకొన్నావు.

ఓ వానర రాజా! గొంతు చించుకొని నేను ఇంతగా మాట్లాడుతున్నా, నీవు ఒక్కమాట కూడా బదులు చెప్పడం లేదు. ఇటు చూడు. నీ ఇతర భార్యలంతా ఎట్లా కన్నీరుమున్నీరుగా ఏడుస్తున్నారో!

ఓ బలమైన బాహువులు గలవాడా! అంగదుడు సకల సద్గుణాల నిధి. అందగాడు, ప్రియంగా మాట్లాడేవాడు, మంచిదుస్తులు ధరించేవాడు, నీకు చాలా ఇష్టుడూ అయిన అంగదుణ్ణి విడిచిపెట్టి చిరకాల ప్రవాసానికి వెళ్ళిపోవటం భావ్యంగా లేదు. నేనుగాని, అంగదుడు గాని నీ విషయంలో ఏమైనా అనుచితంగా ప్రవర్తించామా? మరి ఎందుకు ఈ దీర్ఘప్రవాసం? ఓ వీరుడా! నేను తెలిసికానీ, తెలియకగానీ నీ యెడల ఏమైనా అపరాధం చేస్తే క్షమించు. నీ పాదాలపై శిరస్సు ఉంచి ప్రార్థిస్తున్నాను.

ఇట్లా రోదిస్తూ ఆ తార భర్తతోపాటు ప్రాయోపవేశం చేయటానికి నిర్ణయించుకుంది.

# 21వ సర్గ హనుమంతుడు తారను ఓదార్చటం

ఆకాశం నుండి రాలిపడిన నక్షత్రమల్లే నేలమీద పడివున్న తారను వానర సేనానాయకుడైన హనుమంతుడు అనునయంగా ఓదార్చాడు.

హనుమంతుడు: ఓ దేవీ! దుఃఖించకు. ఈ దేహం నీటి బుడగ లాంటిది. ప్రతిప్రాణీ శుభాశుభ కర్మలు రెండూ చేస్తూ ఉంటుంది. ప్రతి కర్మకూ ఫలం ఉంటుంది. ఆ ఫలాన్ని అనుభవించేందుకు శరీరాల్ని ధరిస్తూ విడుస్తూ ఉంటాయి. అందువలన నీవిప్పుడు ఎవరికోసం దుఃఖిస్తున్నావు? ఇప్పుడు నిన్ను గూర్చి నీవు దుఃఖపడాలి. అట్లాంటిది నీవు ఇతరుల గూర్చి దుఃఖించటం ఏమైనా బావుందా? ఒకరేమిటి, అందరి దేహాలూ నీటి బుడగలే! అందువల్ల ఈ దేహం కోసం ఒకరికొకరు దుఃఖిస్తూ కూర్చుంటే ఏమైనా ప్రయోజనం ఉంటుందా?

అమ్మా! నీకు పుత్రుడున్నాడు. నువ్వు ఆ కుమారుణ్ణి చూసుకుంటూ బ్రతకాలి. ఇకపైన నీ కుమారుణ్ణి ఉపయోగించే అనేక పనులు అవసర పడ్తాయి. నీవు వాటన్నింటిలోను ఆ పిల్లవాడికి చేదోడువాదోడుగా ఉంటూ వృద్ధిలోకి తీసుకురావాలి.

ఓ దేవీ! నీకు తెలియనిదేమీ లేదు. అన్ని శాస్త్రాలు చదివినదానవు. ఏడవడం మానెయ్యి. వాలికి పరలోక సౌఖ్యాలన్నీ కలిగేట్లుగా ప్రేత కార్యాలన్నీ చేయించు. వానరులందరికీ వారివారి యోగ్యతల్ని బట్టి సుఖంగా జీవించే ఏర్పాట్లన్నీ వాలి చేసేపోయాడు. అతడు సమస్త శాస్త్రాలూ చదివిన తత్త్వవేత్త. అతడు సామదాన క్షమాపరుడు. ఇప్పుడు కాలం తీరిపోయింది. అందరూ పోయే లోకాలకు అతడు పోతున్నాడు. అతడి కోసం దుఃఖించడం అవివేకం.

అమ్మా! వాలికి సంస్కారాలు చెయ్యాలి. అంగదుడికి రాజ్యాభిషేకం చెయ్యాలి. సింహాసనంపై కూర్చున్న కుమారుణ్ణి చూసుకుంటూ నీవు ప్రశాంతమైన జీవితం గడుపు.

భర్త మరణంతో అమిత దుఃఖం అనుభవిస్తున్న తార, హనుమంతుని సాంత్వన

వచనాలు విని, ఇలా అంది.

తార: ఓ హనుమంతుడా! అంగదుడు వంటి నూరుగురు పుత్రులున్నా, అది ఈ వీరుడి గాఢాలింగనంతో సరిసమానం కాజాలదు. ఆ మహానుభావుడు వాలికి దేహ సంస్కారాలు చేయించడం, అంగదుడికి రాజ్యాభిషేకం చెయ్యడం నా పనికాదు. వాలి తర్వాత ఆ పనులన్నీ చేయవలసింది అంగదుడి పినతండ్రి సుగ్రీవుడే కాని, నేను కాదు. కాబట్టి, అంగదుడి విషయంలో నేను ఆలోచించవలసింది ఏమీ లేదు. పుత్రుడికి ఉపకారం చేసేది తండ్రేకాని తల్లి కాదు. కాబట్టి అవన్నీ సుగ్రీవుడే చూసుకుంటాడు.

ఓ వానర శ్రేష్ఠుడా! హనుమంతుడా! ఈ లోకంలోగానీ, పరలోకంలోగానీ, వాలిని అంటిపెట్టుకొని ఉండాల్సిన దానినేకాని, నాకు మరో పరమార్థం లేదు. నేను నా భర్తతోపాటు సహగమనం చేసి ఆయన వెంటే ఉండేందుకు నిశ్చయించుకున్నాను.

# 22వ సర్గ వాలి తుది సందేశం

కొన ప్రాణాలతో ఉంటూ, తుదిశ్వాస విడవటానికి ముందుగా వాలి ఒక్కసారి కళ్ళుతెరచి చూశాడు. ఎదురుగా సుగ్రీవుడు కనిపించాడు. హీనస్వరంలో సుగ్రీవుడితో ఇట్లా అన్నాడు.

వాలి: సుగ్రీవుడా! నా తప్పులన్నీ మరచిపో. బుద్ధిఃకర్మానుసారిణీ అన్నట్లుగానే నా ప్రారబ్ధంలో ఉన్నది అనుభవించటానికే నీతో వైరం పెట్టుకున్నానే కానీ, నాకు నీపై ఏమీ ద్వేషం లేదు. మనిద్దరం సఖ్యంగా కలకాలం ఉండటం భగవంతుడికి ఇష్టం లేనట్లుంది. అందుకే ముందుగా నేను ఈ లోకాన్ని వదలి వెళ్తున్నాను. నాకు ఇంతకాలం "ఎవరిచేతా జయింప శక్యంకానివాడ" నే కీర్తి ఉండేది. ఇప్పుడు నా రాజ్యం, ఐశ్వర్యాలతోపాటు ఆ కీర్తిని కూడా ఇక్కడే వదిలేసి పోతున్నాను. నిన్ను ఒక కోరిక కోరుతున్నాను. అది కష్టమే అయినా నా కోసం చెయ్యి. అదేమంటే:

నా పుత్రుడైన అంగదుడు చిన్నపిల్లవాడు. బాగా సుఖజీవనానికి అలవాటుపడ్డాడు. కాబట్టి ఇంకా సుఖాలనే కోరుకుంటూ ఉంటాడు. బుద్ధిమంతుడు. నా కోసం ఏడుస్తూ నేలపై పడిఉన్నాడు చూడు. అంగదుడు నాకు ప్రాణంకన్నా ఎక్కువైనవాడు. నేను లేని లోటు వాడికి తెలియకుండా పెంచు.

ఓ సుగ్రీవుడా! నీవు కూడా అంగదుణ్ణి తండ్రిలాగా కనిపెట్టి ఉండు. కావలసినవన్నీ సమకూర్చిపెట్టు. అన్ని విధాలా వాడికి రక్షకుడుగా ఉండు. వాడు దేనికీ భయపడకుండా అభయమివ్వు. వాడు బలవంతుడు, పరాక్రమం కలవాడు. మంచి తేజస్సు గలవాడు. నీవు రాక్షసులతో యుద్ధం చేసేటప్పుడు నీకు బాగా సహాయపడతాడు.

ఓ సుగ్రీవుడా! సుషేనుని కుమార్తె అయిన తార అతిసూక్ష్మమైన విషయాలను కూడా ఆలోచించి నిర్ణయాలు చేస్తుంది. అకస్మాత్తుగా రాబోయే కష్టాలు ఉపద్రవాలను కూడా ముందే

పసికట్టగల దిట్ట. తమ్ముడూ, ఈ తార మంచిది అని చెప్పిన పనులన్నీ కళ్ళు మూసుకొని చేస్తూ ఉండు. తార చెప్పింది ఎప్పుడూ తారుమారు కాదు. అందువల్ల ఆమె మంచిది అని చెప్పింది చేసెయ్యి.

సుగ్రీవుడా! నీవు రాముడికి చేస్తానని ప్రతిజ్ఞ చేసిన కార్యాన్ని తప్పక చెయ్యాలి. అట్లా చెయ్యకుండా ఉండడం అధర్మం. ఒక వేళ నీవు మాట తప్పినట్లయితే (అవమానించినట్లయితే) రాముడు నిన్ను కూడా చంపగలడు.

ఓ సుగ్రీవుడా! ఇదుగో ఈ బంగారు మాలను తీసుకొని ధరించు. నా మరణానంతరం ఈ మాలను తీస్తే శవస్పర్శాదోషం కలిగి జయలక్ష్మినిచ్చే దాని శక్తిని కోల్పోతుంది. కాబట్టి నా ప్రాణాలుండగానే తీసుకొని మెడలో ధరించు.

వాలి సోదరప్రేమతో పలికిన మాటలు విని సుగ్రీవుడు రాహువు మింగిన చంద్రుడిలాగా కాంతి విహీనుడయ్యాడు. వాలి కోరినట్లుగా వైరాన్ని మరచి స్నేహహస్తాన్ని అందించాడు. తరువాత ఆ బంగారు మాలను తీసుకొని ధరించాడు. వారి ప్రక్కనే ఉన్న అంగదుడిని దగ్గరకు పిలిచి వాలి ప్రేమతో ఇట్లా అన్నాడు.

వాలి: గొప్ప బాహువులు గల అంగదుడా! ఇంతకాలం నువ్వు ఆడింది ఆట, పాడింది పాటగా నా దగ్గర సాగిపోతూ వచ్చింది. ఇకపైన నీవు సుగ్రీవుడి దగ్గర కూడా అట్లాగే మసలుకుంటే అతడు ఇష్టపడడు. కాబట్టి ఈ విషయం గుర్తుంచుకొని నీ పినతండ్రి దగ్గర భయభక్తులతో నడుచుకుంటూ ఉండు.

ఓ శత్రుసంహారకుడా! అంగదా! సుగ్రీవునితో అంటీ ముట్టనట్లు ఉండవద్దు. సుగ్రీవునికి ఇష్టంకాని వారితో (శత్రువులు) కలసిమెలసి తిరగవద్దు. ఇంద్రియనిగ్రహంతో మెలగు. సుగ్రీవుడు ఏ పని చెప్తే ఆ పని పూర్తి అయ్యేవరకు మనసు దానిమీదనే పెట్టి పనిచెయ్యి. అతడి పట్ల ఎప్పుడూ అణకువతోను వినయంతోను ప్రవర్తిస్తూ ఉండు. నువ్వు ఎవరి విషయంలో కూడా

అతిగా ప్రవర్తించకు (ఎక్కువ ద్వేషమూ ఉండగూడదు, ఎక్కువ ప్రేమా చూపించకూడదు).

వాలి ఇట్లా అంటూనే బాణం గుచ్చుకున్న చోట విపరీతమైన బాధ తట్టుకోలేక కళ్ళు తేలేసి, పళ్లు బయటకు కనిపించేట్లుగా నోరు తెరచి తుదిశ్వాస విడిచాడు. తమ నాయకుడి మరణానికి వానరజాతి అంతా కంటికిమింటికి ఏకధారగా కన్నీళ్ళు పెట్టుకుంది. వానరరాజు లేని అరణ్యాలు, పర్వతాలు బోసిపోయాయి. కిష్కింధారాజ్యం అంతా చీకట్లు కమ్ముకున్నాయి. వెనుక వాలి వేగంగా నడచివెళ్తూ ఉంటే ఆ వేగానికి వృక్షాలపై ఉండే పూలన్నీ రాలి గాలిలో ఎగిరేవి. మహాబలవంతుడైన వాలి గోలభుడనే గంధర్వుడితో పదిహేను సంవత్సరాలు రాత్రింబవళ్ళు విరామం లేకుండా యుద్ధం చేశాడు. చివరకు ఆ గోలభుడి శక్తి క్షీణించి పదహారో సంవత్సరంలో మరణించాడు. ఆహా! అంతటి బలశాలి అయిన వాలి ఈనాడు రామబాణంచే హతుడయ్యాడు గదా! మహారణ్యంలో సింహం చేతిలో ఆబోతు చచ్చిపడి ఉండగా గోవులన్నీ ఎట్లా దిక్కులేనివవుతాయో, అదే విధంగా వానరులంతా దిక్కులేని వాళ్ళయ్యారు.

ఆ తరువాత తార దుఃఖసముద్రంలో మునిగిపోయినదై వాలిని చూస్తూ, నేలకూలిన వృక్షాన్ని అల్లుకున్న తీగలాగా, వాలిని కౌగలించుకొని నేలపై పడిపోయింది.

# 23వ సర్గ తార విలపించటం

మరణించిన వాలి ముఖాన్ని వాసన చూస్తూ భర్తను తలచుకుంటూ ఆపుకోలేని దుఃఖంతో తార ఇట్లా అంది.

తార: ఓ రాజా! నువ్వు నేను చెప్పిన మంచిమాటలన్నీ చెవికెక్కించుకోలేదు. ఫలితంగా ఈ రాయిారప్పా ఉన్న నేలపై పడి ఉన్నావు. నిన్ను ఇట్లా చూస్తూ ఉంటే దుఃఖంతో నాకు కడుపు చెరువైపోతోంది. నీకు నా మాటకన్నా భూమిపైనే (రాజ్యం) ఎక్కువ ఇష్టం. అందువల్లనే కాబోలు, నన్ను వదలిపెట్టి ఈ నేలనే కావలించుకొని పడుకున్నావు; నాతో ఒక్క మాటైనా మాట్లాడటం లేదు.

సాహసాలు చెయ్యటంలో నీవు మొనగాడివే అయినా, ఈ రోజు సుగ్రీవుడి చేతిలో చిత్తైపోయావు గదా! సుగ్రీవుడిదే పైచెయ్యి అయింది. ఆహా! విధి ఎంత బలీయమైనది? నిన్ను సేవిస్తున్న భల్లూక నాయకులు, వానర నాయకులంతా దుఃఖసముద్రంలో ఉన్నా, నేను నెత్తీ నోరూ బాదుకొని ఏడుస్తున్నా నీకు వినిపించటం లేదా? ఎందుకని మారు మాట్లాడకుండా పడి ఉన్నావు? పూర్వం నీ శత్రువులందరినీ ఎలా వీరమరణం పొందేట్లు చేశావో, ఈనాడు నీవే ఆ వీరమరణాన్ని పొందావు కదా!

బుద్ధిమంతుడెవడూ తన కూతుర్ని శూరుడికిచ్చి పెళ్ళి చెయ్యకూడదు. ఎందుకంటే, ఒకప్పుడు మహాశూరుడి భార్యననే గర్వం నాకు ఉండేది. ఇప్పుడు చూడు?! హఠాత్తుగా విధవనై అనాథనైపోయాను. నా గర్వం అంతా ఆవిరి అయిపోయింది. ఆడది ఎప్పుడూ పతికి సేవలు చేసుకుంటూ ఉండాలి. అదే పరమభాగ్యం. ఇప్పుడు నాకా భాగ్యం శాశ్వతంగా కరువైపోయింది. ఇంతటి శోకసాగరంలో మునిగి ఉన్నా కూడా నా గుండె పగిలి వెయ్యి ముక్కలు కాలేదంటే, అది గుండె కాదు; రాయి (పాషాణం) అయి ఉండాలి. లేకపోతే ఎందుకు పగిలిపోలేదు?

భర్త పోయిన ఆడదానికి కొడుకు ఉండవచ్చు. ధనధాన్య వస్తువాహనాలన్నీ ఉండవచ్చు. లెక్కలేనన్ని సంపదలుండొచ్చు. కానీ పండితులామెను (లోకం) విధవ అనే అంటారు.

ఓ వీరుడా! నీ శరీరం అంతా నెత్తురుతో తడిసి ముద్ద అయింది. నేలపై పడి ఉన్నావు. ఒళ్ళంతా దుమ్ము అంటుకొని శరీరం పట్టుకుంటేనే జారిపోతోంది. నిన్ను తనివితీరా కౌగలించుకోలేకపోతున్నాను; అదీకాక, ఈ రామబాణం ఒకటి నాకు అడ్డంగా ఉంది. నీకూ సుగ్రీవుడికీ మధ్యనున్న అతి దారుణమైన వైరం ఒక రామబాణంతో ముగిసిపోయింది. ఇప్పుడు సుగ్రీవుడిదే పైచెయ్యి అయింది. నీవు ఓడిపోలేదు; కానీ చనిపోయావు. ప్రాణాలతో ఉంటే ఇంకా యుద్ధం చేస్తూనే ఉండేవాడివి. వెనుక ఆ గంధర్వుడితో చేయలేదా?

అప్పుడు సర్పంలాగా తళతళా మెరిసిపోతున్న రామబాణాన్ని నీలుడు బలవంతంగా పీకేశాడు. అప్పుడా రామబాణం అస్తమించే సూర్యుణ్ణి అడ్డగిస్తున్న పర్వతంలాగా ఉంది. ఆ రామబాణం పీకి వెయ్యగానే వాలి శరీరం నుండి రక్తం పర్వతంపై నుండి ప్రవహించే సెలయేరులా పారింది. శరీరం అంతా రక్తంతో తడిసి ఉన్న వాలి శరీరాన్ని చూసి తార వలవలా ఏడ్చింది.

ఓ అంగదుడా! చూడు. బాలసూర్యుడిలాగా వెలిగిపోయేవాడు. అటువంటి నీ తండ్రి మరణించి నేలపై దీనంగా పడి ఉన్నాడు. నీ తండ్రికి నమస్కారం చెయ్యి. (అంగదుడు తండ్రి పాదాలపై శిరస్సు ఉంచి నమస్కరించాడు)

ఓ వీరుడా! నీకు పాదనమస్కారం చేస్తున్న అంగదుణ్ణి నీవు ఎందువలన ఆశీర్వదించటం లేదు? సింహం చేత దెబ్బతిని పడి ఉన్న ఆంబోతు ప్రక్కన ఉన్న లేగదూడ, ఆవులాగా నేను అంగదుడు నీ ప్రక్కనే ఉండి విలపిస్తున్నాం. యుద్ధం అనే యజ్ఞాన్ని చేశావు. ఆ యజ్ఞంలో భార్యనైన నేను లేకుండానే రామబాణం అనే ఉదకంతో అవబృథస్నానం (యజ్ఞం పూర్తి అయిన తర్వాత చేసే పవిత్రస్నానం) ఎట్లా చేశావు? నాథా! యుద్ధంలో నీ నైపుణ్యాన్ని మెచ్చుకొని

దేవేంద్రుడు ఇచ్చిన బంగారుమాల కనిపించటం లేదేమి? మేరు పర్వతానికి ప్రదక్షిణం చేసే సూర్యుడు కాంతిని విడువనట్లు, నీవు మరణించినా కూడా రాజ్యలక్ష్మి నిన్ను విడవటం లేదు!

ఓ నాథా! నేను చెప్పిన హితమైన మాటల్ని పెడచెవినపెట్టావు. నేను అప్పుడు ఆపలేకపోయాను. యుద్ధంలో నీవు మరణించడం వల్ల నేనూ, నీ కుమారుడూ కూడా మరణించినట్లైంది. నీతోపాటు రాజ్యలక్ష్మి కూడా మమ్మల్ని విడిచి వెళ్ళిపోయింది.

# 24వ సర్గ సుగ్రీవుడి వైరాగ్యం

తార దుఃఖం, సముద్ర తరంగాలలాగా ఆగకుండా వస్తూనే ఉంది. ఆవిడ దుఃఖాన్ని చూస్తున్న సుగ్రీవుడు కూడా అన్నగారి మరణానికి దుఃఖ వివశుడయ్యాడు. అతడిలో తీవ్ర వైరాగ్యం పుట్టుకొచ్చింది. మెల్లగా లేచి, తన మంత్రులను వెంటబెట్టుకొని రాముడి వద్దకు వెళ్ళాడు.

సుగ్రీవుడు: ఓ రాజా! నీవు చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చావు. కానీ నా మనస్సు పూర్తిగా వికలమైపోయింది. నా మనస్సు భోగాన్ని కోరటం లేదు. వాలి చనిపోయాడు. పట్టపురాణి తార ఘోరంగా విలపిస్తోంది. కిష్కింధలోని ప్రజలంతా దుఃఖసాగరంలో మునిగి ఉన్నారు. అంగదుడు జీవిస్తాడా లేడా అన్నట్లుంది. అందుచేత నా మనస్సు రాజ్యంపైనా, రాజ్యభోగాల పట్లా ఆసక్తి చూపటం లేదు.

రాజా! పూర్వం వాలి నన్ను ఘోరంగా అవమానించడం వల్ల కోపం వచ్చినమాట నిజమే. చంపాలని అనుకున్నాను. కానీ యథార్థంగా ఇప్పుడు వాలి మరణించి నేలపై పడి ఉండటం చూస్తూ ఉంటే మనస్సు వికలమైపోతోంది. ఇంత బీభత్సం సృష్టించడం కంటే ఆ ఋష్యమూక పర్వతంపైనే కందమూలాలు తింటూ బ్రతుకు వెళ్ళదీయలేమా అని అనిపిస్తోంది. వాలిని చంపిన నేను స్వర్గానికి కూడా యోగ్యుడను కాను.

ఓ రామా! నా అన్న వాలిది చాలా ఉదాత్తమైన స్వభావం. ఒకసారి వాలితో యుద్ధం చేస్తూ బాగా అలసిపోయి ఉన్నాను. “నేను నిన్ను చంపను. పోయి స్వేచ్ఛగా బ్రతుకు” అన్నాడు. అంత ఉదాత్తంగా పలకడం అతనికే చెల్లింది. నేను దుర్మార్గుణ్ణి. వాలిని చంపి నీచమైన పని చేశాను. ఓ రామా! వాలిని చంపక పూర్వం నాకు ఈ వైరాగ్యం కలగలేదు. కలిగి ఉంటే అప్పుడే రాజ్యలాభం సుఖమా? లేక వాలి మరణం వల్ల దుఃఖం ఎక్కువా? అని ఆలోచించి ఉండేవాణ్ణి. వాలి మహాత్ముడు. నా ప్రాణం వాడి చేతుల్లో ఉన్నప్పుడు కూడా నాపై సోదరప్రేమ చూపి

ప్రాణదానం చేశాడు. నేను దుర్మార్గుణ్ణి. వాలిని చంపి భ్రాతృమర్యాదను అతిక్రమించాను.

ఓ రామా! వాలితో యుద్ధం చేస్తూ ఉండగా, నన్ను చెట్టుకొమ్మల్తో బాదాడు. నేను ఆ బాధ భరించలేక దీనంగా కేకలుపెడ్తూ ఉంటే "మళ్ళీ ఎప్పుడూ పోట్లాటకు రావు కదా! ఇక పో!" అన్నాడు. ఆ విధంగా వాలి సోదరధర్మం కనబరిస్తే నేను కసి, క్రోధాల్ని వ్యక్తపరిచాను.

ఓ రామా! విశ్వరూపుని చంపటం వల్ల ఇంద్రుడికి బ్రహ్మహత్యా పాపం వాటిల్లినట్లు వాలిని చంపటం వల్ల నాకు మహాపాపం చుట్టుకుంది. ఇంద్రుడి పాపాన్ని భూమి, నీరు, వృక్షాలు, స్త్రీలు పంచుకున్నారు. కానీ నా పాపాలను ఎవరు పంచుకుంటారు?

రామా! నేను అధర్మం చేశాను. దానివల్ల వంశనాశనం అయింది. అటువంటి నేను యౌవరాజ్యాభిషేకమునకే తగనివాడిని. ఇక రాజ్యాధిపత్యం మాట వేరేచెప్పాలా?

ఓ రామా! నిందించదగిన మహాపాపాన్ని చేశాను. పర్వతాల పైన పడ్డ నీరు పల్లానికి చేరినట్లు ఈ దుఃఖం నన్ను ముంచెత్తుతూ ఉంది. మదపుటేనుగు ఏటిగట్లను కుళ్ళపొడిచినట్లు, సోదరుని చంపటం అనేది ఏనుగు శరీరం వెనుక భాగం, వాలం అయివున్నాయి. దుఃఖమే దీని తొండము, కళ్ళు, శిరస్సు, దంతములు.

ఓ రామా! బంగారం మలినమై ఉంటే దాన్ని అగ్నిలో కాల్చి పుటం పెడ్తారు. దాని వల్ల మలినాలు పోయి బంగారానికి వన్నె వస్తుంది. కానీ నేను ఇప్పుడు సంతాపమనే అగ్నిలో పుటం అవుతూ ఉంటే నాలో ఉన్న మంచి అంతా తగలబడిపోయి, భ్రాతృవధ వలన సంక్రమించిన పాపం మాత్రమే మిగిలి ఉంటోంది.

ఓ రామా! నా మూలంగా తండ్రిని పోగొట్టుకున్న అంగదుడు విలవిల్లాడుతున్నాడు. నా మూలంగా తమ నాయకుణ్ణి పోగొట్టుకొని ఈ వానరలోకం తల్లడిల్లిపోతోంది. లోకంలో చాలామందికి పిల్లలుంటారు కానీ అంగదుడి వంటి బుద్ధిమంతుడు, సజ్జనుడు అరుదుగా

ఉంటారు. అంతేకాదు, వాలివంటి సోదరుడు ఎక్కడైనా దొరుకుతాడా? అంగదుడు చావుబతుకుల్లో ఉన్నాడు. ఒకవేళ అంగదుడు దక్కకపోతే తార కూడా మరణించడం ఖాయం. ఇదంతా ఆలోచిస్తూ ఉంటే నేను బ్రతికి ఉండటం భూమికే భారంలాగా తోస్తోంది. నేను చచ్చిపోయి నా అన్న వాలిని కలుసుకుంటాను. తప్పులన్నింటినీ క్షమించమని అడిగేస్తాను. ఇక్కడ అంగదుడు కూడా తన తండ్రిని చంపినవాడు చనిపోయినందుకు సంతోషిస్తాడు. అందువల్ల నేను ఇప్పుడు అగ్నిప్రవేశం చేస్తాను. ఈ వానర వీరులంతా నీ ఆజ్ఞను పాలించి దేశంలో నాలుగు మూలలకూ పోయి సీతను వెతుకుతారు.

ఓ రామా! ఈ హనుమంతుడు తదితర వానర వీరులంతా నీ అధీనంలో ఉంటారు. సీతాదేవిని వెతికి నీకు తెలియజేస్తారు. ప్రభూ! నేను మరణించినా నీ పని ఆగదు. నా ప్రతిజ్ఞ నెరవేర్చుకుంటాను. నేను నా వంశాన్నే నాశనం చేసిన పాపాత్ముణ్ణి. చేసిన మహాపరాధాన్ని నేను జీర్ణించుకోలేకపోతున్నాను. నేను జీవించి ఉండేందుకు యోగ్యుణ్ణి కాదు. అగ్నిప్రవేశానికి అనుమతించు.

మహావీరుడు, శత్రు సంహారకుడూ అయిన రాముడు సుగ్రీవుని మాటలకు ఎంతో కలత చెందాడు. భూమి వంటి ఓర్పు గలవాడు, జగద్రక్షకుడు అయిన రాముడు దుఃఖంతో తల్లడిల్లిపోతున్న తారను చూశాడు. వాలి దేహాన్ని గట్టిగా పట్టుకొని రోదిస్తున్న తారను, వానర శ్రేష్ఠులు లేవదీసి కూర్చోబెట్టారు. అప్పుడామె ధనుస్సు బాణాలు ధరించి సూర్యుని వలె ప్రకాశించుచున్న రాముణ్ణి చూసింది. ఎదురుగా నిలిచి ఉన్న పురుష శ్రేష్ఠుని ఇదివరకెన్నడూ చూడకపోయినా, 'ఇతడే ఆ రాముడు' అని గ్రహించింది. అంతట పూజ్యురాలైన తార వ్యాకులత చెందిన మనస్సుగలదై ఇంద్రునితో సమానుడైన రాముని చూసి ఇట్లా అంది.

తార: ఓ రామా! నిన్ను ఎవరూ ఎదిరించలేరు. నీ పరాక్రమాన్ని ఎవరూ ఊహించను కూడా ఊహించలేరు. నీవు జితేంద్రియుడవు. ఉత్తమమైన ధర్మస్వరూపుడవు. క్షీణించని కీర్తి గలవాడవు. భూమి వంటి ఓర్పు గలవాడవు. నా కంటికి సాక్షాత్తూ మహావిష్ణువువలె

కనిపిస్తున్నావు.

ఓ వీరుడా! ఏ బాణంతో నా భర్తను చంపావో, అదే బాణంతో నన్ను కూడా చంపు. నేను కూడా నా భర్తను చేరుకుంటాను. నేను లేకుండా వాలి సుఖంగా ఉండలేడు. ఓ పద్మాల వంటి నేత్రాలు గలవాడా! నా భర్త స్వర్గానికి వెళ్ళినా, ఒళ్ళంతా కళ్ళు చేసుకొని నా కోసమే వెతుకుతాడు. అప్సరసలు వెంటపడ్డా కన్నెత్తైనా చూడడు.

ఓ వీరుడా! సీత కనిపించక నీవు అడవులు, పుట్టలూ, పర్వతాలు వెతకుతూ ఎలా కృశించిపోతున్నావో, వాలి కూడా అట్లాగే నా కోసం స్వర్గంలో పరితపించిపోతూ ఉంటాడు. యువకుడైన పురుషుడు స్త్రీ ఎడబాటుతో ఎట్లా దుఃఖీస్తాడో నీకు ఒకరు చెప్పనవసరం లేదు; నీకే తెలుసు. అందువల్ల నన్ను త్వరగా నా భర్త దగ్గరకు పంపు. వాలికి నా వియోగం వల్ల దుః ఖం కలుగకుండా ఉండేట్లు చూడు.

ఓ రాజకుమారా! మహాత్ముడవైన నీవు, నన్ను చంపి స్త్రీ హత్యాదోషం కలుగుతుందేమోనని విచారించవద్దు. ఎందువల్లనంటే ఇది కూడా వాలి శరీరమే అని భావించి చంపు. అప్పుడు నీకు స్త్రీహత్యాదోషం అంటదు. ఇది శాస్త్రసమ్మతం కూడా అవుతుంది. ఎందువల్లనంటే భార్య భర్తకంటే వేరు కాదు గదా! అదీగాక భార్యా (కన్యా) దానమునకు మించిన దానం లోకంలో మరొకటి లేదని పెద్దలు అంటారు. కాబట్టి, ఓ వీరుడా! ఈ ధర్మాన్ని అనుసరించి నన్ను నా ప్రియుడైన వాలి వద్దకు పంపు. ఈ కార్యం వల్ల నీకు పాపం రాదు.

ఓ రాజా! నేను ఆర్తురాలను. అనాథను. ఇట్టి పరిస్థితుల్లో నన్ను చంపకుండా ఉండటం నీకు ధర్మం కాదు. ఏనుగులాగా విలాసంగా నడిచేవాడు, బుద్ధిమంతుడు, శ్రేష్ఠమైన బంగారుమాల కలవాడు, వానర శ్రేష్ఠుడు అయిన వాలి లేకుండా నేను జీవించలేను.

రాముడు: ఓ వీరుని భార్యయైన తారా! ఇట్లాంటి విపరీతమైన ఆలోచనలు చెయ్యకు. ఈ లోకాన్నంతా బ్రహ్మ సృష్టించాడు. సుఖదుఃఖాలు కూడా బ్రహ్మయే నిర్ణయిస్తాడంటారు. ఈ

విధంగా ముల్లోకాలూ బ్రహ్మ శరీరంలోనే ఉంటాయి. నీవు పూర్వం వలెనే ఆనందాన్ని పొందుతావు. నీ కుమారుడు యువరాజవుతాడు. శూరుల భార్యలు ఎక్కడైనా ఏడుస్తారా?

## 25వ సర్గ వాలికి దహన సంస్కారాలు

శోకంతో ఉన్న సుగ్రీవుణ్ణి, అంగదుణ్ణి, తారను ఓదార్చుతూ రాముడు ఇట్లా అన్నాడు.

రాముడు: మీరు వాలి చనిపోయిన దగ్గర నుండి విలపిస్తూనే ఉన్నారు. విలపించటం వలన మరణించిన వారికి ఏమీ మేలు జరుగదు. ఏ కార్యం చేస్తే వాళ్ళకు శ్రేయస్సు చేకూరుతుందో ఆ పనులు ఆలస్యం కాకుండా చెయ్యండి.

లోకంలో అన్నింటికీ కారణం కాలమే. కర్మలన్నింటికీ కాలమే సాధనం. సమస్త భూతాలనూ ప్రేరేపించేదీ, నడిపించేదీ కాలమే. దైవమే ఆయాపనులు చేయటానికి ప్రాణుల్ని ప్రేరేపిస్తూ ఉంటుంది. అంతేకాని, ప్రాణులకు ఎటువంటి స్వతంత్రమూ లేదు. ఎవరూ ఏ పనీ చేయడానికి స్వతంత్రుడు కారు. ఏ పనికీ ఎవర్నీ ఎవరూ ప్రేరేపించలేరు. అంటే లోకం అంతా దేవుని అధీనంలో ఉంటుంది; దైవాధీనం. కాబట్టి అందరికీ దైవమే పరమగతి.

దైవం స్వతంత్రమైనది. అది దేనికీ లోబడేది కాదు. అంతా ఆ దైవానికి లోబడి ఉండాల్సిందే. ఎవరూ దానిని అతిక్రమించలేరు. ఎవరూ దానిని వశపరచుకోలేరు. పరాక్రమంలో జయించబడేది కాదు. ప్రాణుల కర్మలనుబట్టి ఫలం ఇస్తూ ఉంటుంది. వారి వారి కర్మఫలాలను బట్టి ధర్మం, అర్థం, కామం అనుభవిస్తూ ఉంటారు. అట్లాగే వాలి తన కర్మఫలాలను బట్టి ధర్మార్థకామాలను అనుభవించేందుకు పరలోకానికి పోయాడు. అతడు తన ప్రాణాన్ని కూడా లెక్క చేయకుండా ధర్మాన్ని ఆచరించాడు. ఉత్తమగతులు పొంది స్వర్గస్థుడయ్యాడు. కాబట్టి ఇక ఆ వానర శ్రేష్ఠుని గూర్చి దుః ఖించకండి. చేయవలసిన కార్యాలు మొదలుపెట్టండి.

లక్ష్మణుడు: ఓ సుగ్రీవుడా! నీవు, అంగదుడు, తార కలసి వాలికి చేయవలసిన ప్రేతకార్యాలు చెయ్యండి. ఈతడి దేహానికి దహన సంస్కారాలు చెయ్యండి. బాగా ఎండిన కట్టెలు,

గంధపు కట్టెలు తెప్పించండి. బాలుడైన అంగదుణ్ణి ఓదార్చు. ఇకపై ఈ నగరమూ, ప్రజలు నీపై ఆధారపడి ఉన్నారు.

ఓ అంగదుడా! నీవు పోయి పుష్పమాలలు, వస్త్రాలు, నెయ్యి, నూనె, సుగంధద్రవ్యాలు మొదలైన వస్తువులన్నీ సిద్ధం చెయ్యి.

ఓ తారుడా! నీవు పోయి పల్లకీ నొకటి ఏర్పాటు చెయ్యి. ఇప్పటికే బాగా ఆలస్యం అయింది. ఈ పనులన్నీ త్వరగా పూర్తి చెయ్యటం మంచిది. ఆ పల్లకీని మోసేందుకు సమర్థులు, బలవంతులైన వానరుల్ని ఎంపిక చేయండి.

లక్ష్మణుడి మాటలు విన్న తారుడు త్వరగా పల్లకీ వాహకుల్ని సిద్ధంచేసి తీసుకొని వచ్చేందుకు కిష్కింధకు వెళ్ళాడు.

తారుడు తెచ్చిన పల్లకీ పెద్ద రథంలాగా ఉంది. రాజు కూర్చునేందుకు అన్ని వసతులూ ఉన్న ఆసనాన్ని ఏర్పాటు చేశారు. అక్కడక్కడా కిటికీలు ఏర్పాటు చేశారు. అక్కడక్కడా కర్రతో చేసిన చిన్న చిన్న కొండలు, గుహలు ఏర్పాటు చేశారు. పద్మాలు, పద్మమాలలతో అలంకరించబడి ఉంది. అంత రాముడు లక్ష్మణుని పిలిచి, ఇక ఆలస్యం కాకుండా ప్రేత కార్యాలు చేయించమని చెప్పాడు.

అప్పుడు ఆ వానరరాజును పుష్పమాలికలతోను, వస్త్రాలతోను అలంకరించి రథంపైకి ఎక్కించారు. వానరులంతా అనేక విధాలైన రత్నాలు పంచిపెడుతూ ముందు నడిచారు. వారి వెనుకనే వాలి దేహాన్నుంచిన పల్లకీ వెళ్ళింది. లోకంలో రాజులకు ఎటువంటి ఉత్తరక్రియలు జరుగుతాయో ఆ విధమైన ఏర్పాట్లన్నీ చేశారు.

తారుడు మొదలైన దగ్గర బంధువులంతా అంగదుడి వెనుక రోదన చేస్తూ నడువగా, వారి వెనకాలే వానర స్త్రీలంతా బయలుదేరారు. తార, ఇతర వాలి పత్నులు జాలిపుట్టేట్లుగా ఏడుస్తూ

నడిచారు. అంతమంది వానరులు, వానరాంగనలు పెద్దపెట్టున ఒక్కసారిగా ఏడుస్తూ ఉంటే కొండలు, అడవులూ, వాగులూ ఏడుస్తున్నట్లనిపించింది.

అక్కడ ఒక కొండవాగుకు సమీపంలో ఇసుకతిన్నెపై చితిపేర్చి ఉంది. సేవకులంతా వాలి దేహాన్ని నెత్తిన పెట్టుకొని మోస్తూ "ఓ రాజా! ఓ నాథా! ఓ మహాబాహూ! ఓ వత్సలా! ఓ ప్రియుడా!" అంటూ ఏడుస్తున్నారు. ఈ స్త్రీజనాన్ని ఒక్కసారి కన్నెత్తి చూడమని విలపించారు! ఒక్కసారి కన్నెత్తి చూడమని ప్రాథేయపడ్డారు.

ఓ నాథా! నీ ముఖం ఎప్పటిలాగానే అస్తమిస్తున్న సూర్యబింబంలాగా కనబడుతోంది. ఓ రాజా! యముడు రాముడి రూపంలో ఈ వనానికి వచ్చాడు. మమ్మల్నందరినీ విధవల్ని చేశాడు. యముడు నిన్ను తీసుకొనిపోతున్నాడు.

ఓ ప్రియుడా! నీ ప్రియురాండ్రంతా చాలాదూరం నడిచివచ్చారు. అంత కష్టపడి వచ్చిన నీ స్త్రీలను ఓదార్చవా? ఓ రాజా! నీవు సుగ్రీవుణ్ణి కూడా చూడటం లేదేమి? ఓ రాజా! తారుడు మొదలైన నీ మంత్రులంతా దుఃఖీస్తున్నారు. నీవు వారినైనా చూడవా?

ఓ శత్రుసంహారకుడా! నీ మంత్రులందరినీ వారికి చెప్పవలసిందేదో చెప్పి పంపించెయ్యి. తరువాత నేను, మిగతా నీ స్త్రీలు నీతో కలసి మన్మథ క్రీడలతో విహరిద్దాం – అని తార వాలి శరీరం పైపడి ఏడవసాగింది. అంతట మిగిలిన వానరాంగనలు తారను అవతలకు తీసుకొని వెళ్ళారు.

అప్పుడు అంగదుడు సుగ్రీవుని సహాయంతో వాలి దేహాన్ని చితిపైకి చేర్చి నిప్పు ముట్టించి "ఓ తండ్రీ! బహుదూరతీరాలకు ప్రయాణమై పోతున్నావా" అంటూ ఏడ్చాడు. తరువాత అంగదుడు, సుగ్రీవుడు, తార మరియు ఇతర వానరులంతా వాలికి జలతర్పణాలిచ్చారు. అనంతరం వాలికి ప్రేతకార్యాలన్నీ శాస్త్రోక్తంగా జరిపారు.

# 26వ సర్గ సుగ్రీవుని రాజ్యాభిషేకం

తడిబట్టలతో ఉన్న సుగ్రీవుడు మంత్రుల్ని, వానర ముఖ్యుల్ని వెంటబెట్టుకొని, ఆపద సమయాల్లో దేవతలు, ఋషులు బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళినట్లు, రాముడి దగ్గరకుపోయి నమస్కరించాడు. తరువాత బంగారుకాంతులు వెదజల్లుతూ ఉదయ సూర్యుడువలె వెలిగిపోతున్న హనుమంతుడు చేతులు జోడించి నమస్కరిస్తూ ఇట్లా అన్నాడు.

హనుమంతుడు: ఓ రామప్రభూ! నీ అనుగ్రహం వల్ల సుగ్రీవునికి తన తాత, తండ్రుల నుండి పరంపరగా వస్తున్న రాజ్యం సంప్రాప్తమైంది. నీ అనుమతితో అతడు తన బంధువులతోను, మంత్రులతోను కిష్కింధా నగరానికి ప్రయాణమయ్యాడు. అక్కడ నానావిధాలైన సుగంధద్రవ్యాలతోను, ఓషధులతోను శాస్త్రీయంగా రాజ్యాభిషిక్తుడై నిన్ను పూజించాలని అనుకుంటున్నాడు. కాబట్టి నీవు, నీ తమ్ముడు లక్ష్మణుని కూడా వెంటబెట్టుకొని రావాలి. నువ్వే సుగ్రీవుణ్ణి రాజుగా చెయ్యాలి. అట్లా చేస్తే సుగ్రీవుడు, నేను, వానరులమంతా సంతోషిస్తాం.

రాముడు: ఓ శత్రుసంహారకుడా! మాటలలో నేర్పుగలవాడా! బుద్ధిమంతుడా! హనుమంతుడా! నేను నా తండ్రికి చేసిన ప్రతిజ్ఞ పాలిస్తూ పధ్నాలుగు సంవత్సరాలు వనవాసం చెయ్యాలి. గ్రామాల్లోగాని, పట్టణాల్లోగాని ప్రవేశించకూడదు. కాబట్టి మీరంతా ఆ వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుణ్ణి వెంటబెట్టుకొని కిష్కింధకు వెళ్లండి. సుగ్రీవుడికి రాజ్యాభిషేకం చేయండి.

ఓ సుగ్రీవుడా! నీ అన్నగారి కుమారుడైన అంగదుడు బలపరాక్రమాలలో నీతో సమానమైనవాడు, మంచి ఉత్సాహవంతుడు. ఈ అంగదుని యౌవరాజ్య పట్టాభిషిక్తునిగా చెయ్యి.

ఓ సుగ్రీవుడా! శ్రావణమాసం ప్రారంభం అయింది. ఇటుపై వచ్చే నాలుగు మాసాలు వర్షాలు విరివిగా కురుస్తూ ఉంటాయి. యుద్ధానికి సరి అయిన సమయం కాదు. కాబట్టి

మీరంతా ఈ నాలుగు నెలలు కిష్కింధలోనే ఉంటూ సర్వ సౌఖ్యాలు అనుభవించండి. నేనూ, నా తమ్ముడు లక్ష్మణుడు ఈ సమీపాన ఉండే పర్వతాల్లో నివసిస్తాం.

ఓ సౌమ్యుడా! ఈ ప్రక్కనే ఉన్న పర్వతగుహ చాలా విశాలంగా ఉంది. బాగా గాలి, వెలుతురూ కూడా వస్తాయి. ప్రక్కనే ఓ సరస్సు కూడా ఉంది. అందులోని నీరు చల్లగా, తియ్యగా ఉంటుంది. సరస్సు నిండా నల్లకలువలు అల్లుకుపోయి అందంగా కూడా ఉంది. మేము ఈ గుహలో ఉంటాం. కార్తీకమాసం రాగానే రావణవధకు తగిన వ్యూహం తయారుచెయ్యి. ఇదే మన ఒడంబడిక. ఇక నీవు కిష్కింధకు వెళ్ళు. రాజాభిషిక్తుడవయి బంధుమిత్రులకు సంతోషం కలిగించు.

ఈ విధంగా రాముని వద్ద అనుమతి పొందిన తరువాత సుగ్రీవుడు కిష్కింధా నగరానికి బయలుదేరాడు. సుగ్రీవునితోపాటు హనుమంతుడు, మంత్రులు, అనేక వేలమంది వానరులు కిష్కింధకు బయలుదేరారు. కిష్కింధా పౌరులంతా సుగ్రీవుడికి గౌరవ పురస్సరంగా లేచి నిలబడి నమస్కరించారు. అంతట సుగ్రీవుడు బంధు మిత్రులూ, అభిమానులతో స్నేహపూర్వకంగా మాట్లాడి వాళ్ళందరినీ సంతోషపరచి, వాలి అంతఃపురంలోకి ప్రవేశించాడు. తరువాత దేవతలు ఇంద్రునికి చేసినట్లుగా, వానరశ్రేష్ఠులంతా సుగ్రీవుడికి రాజ్యాభిషేకం చేశారు.

బంగారంతో చేసిన శ్వేతఛత్రాన్ని, వింజామరలు, సింహాసనానికి అమర్చారు. మూలికలు, ఓషధులు, రత్నాలు, వృక్షాల చిగుళ్ళు, పూలు, పండ్లు, తెల్లటి వస్త్రాలు అంగరాగాలు, కమలాలు, సుగంధ ద్రవ్యాలు, అక్షతలు, కుంకుమ, పూలు, తేనె, నెయ్యి, పెరుగు, పులితోలు, అడవిపంది తోలుతో చేసిన పాదరక్షలు తెచ్చారు. పదహారుమంది కన్యలు మైపూతల్నీ, తిలకాన్నీ, గోరోచనాన్ని, మణిశిలను తెచ్చారు.

తరువాత బ్రాహ్మణులకు రత్నాలు, వస్త్రాలు, భక్ష్యాలు దానం చేసి వారందరినీ సంతోషపెట్టారు. పురోహితులు వచ్చి దర్భలు పరచి అగ్నిహోత్రం చేశారు. అగ్నిహోత్రంలో

హవిస్సులు వేశారు. నానావిధాలైన పుష్పాలతోను, అలంకారాలతోను, వేదోక్తంగా మంత్రాలు చదువుతూ ఉండగా, సుగ్రీవుణ్ణి తూర్పు ముఖంగా బంగారు సింహాసనంపై కూర్చోబెట్టారు. దేశం నలుమూలల నుండి నదీజలాలు, సముద్ర జలాలు, సమస్త తీర్థాల నుండి తెచ్చిన జలాలను కలశాల్లో భద్రపరచారు. అవన్నీ ఎద్దు కొమ్ము ఆకారంలో ఉన్న బంగారు కలశాల్లో పోసి వానరశ్రేష్ఠులైన గజుడూ, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడు, మైందుడు, ద్వివిదుడు, నలుడు, హనుమంతుడు, జాంబవంతుడు మున్నగు ప్రముఖులంతా ఆ శుభ ముహూర్తాన, వసువులు దేవేంద్రుణ్ణి అభిషేకించినట్లు, సుగ్రీవుణ్ణి అభిషేకించారు. అంగదుణ్ణి యువరాజుగా అభిషిక్తుణ్ణి చేశారు.

ఈ విధంగా సుగ్రీవుడి రాజ్యాభిషేకం కాగానే అక్కడ చేరిన వేలాది, లక్షలాది వానర పౌరులంతా జయజయధ్వానాలు చేశారు. అంతా సుగ్రీవుణ్ణి అభినందించారు. సుగ్రీవుణ్ణి రాజ్యాభిషిక్తుణ్ణిగా, అంగదుడిని యౌవరాజ్యాభిషిక్తునిగా చేసిన రామలక్ష్మణుల్ని గురించి కృతజ్ఞతాభావంతో మెచ్చుకున్నారు. కిష్కింధా నగరం అంతా పతాకాలు, ధ్వజాలతో కళకళలాడింది.

తరువాత సుగ్రీవుడు తన భార్య రుమను వెంటబెట్టుకొని పోయి రాముణ్ణి దర్శించి ప్రదక్షిణపూర్వకంగా పాదాభివందనం చేశాడు. రాజ్యాభిషేక విశేషాలన్నీ వివరించి చెప్పాడు. తిరిగి కిష్కింధకు పోయి దేవేంద్రుడిలాగా రాజ్యపాలన చేయసాగాడు.

## 27వ సర్గ రామలక్ష్మణులు ప్రస్రవణ పర్వతం మీద నివసించటం

రాజ్యాభిషిక్తుడైన సుగ్రీవుడు రాముని అనుమతి పొంది కిష్కింధా నగరానికి వెళ్ళాడు. తరువాత రాముడు లక్ష్మణునితో కలసి ప్రస్రవణ పర్వతంపై నివసించాలని అనుకున్నాడు. ఆ పర్వతం పులుల గాండ్రిపులతో, మృగాల ధ్వనులతో నిండి ఉంది. ఆ పర్వతం నిండా దట్టమైన అరణ్యం వ్యాపించి ఉంది. ఆ పర్వతంపై ఎలుగుబంట్లు, కోతులు, కొండముచ్చులు, సింహాలు ఇంకా అనేక రకాలైన వృక్షసముదాయాలున్నాయి.

ఆ పర్వత శిఖరంపై ఉన్న పెద్ద గుహను ఒకదాన్ని తమ నివాసానికి ఎంచుకున్నారు. దోషం లేనివాడు, రఘువంశానికి ఆనందం కలిగించేవాడు అయిన రాముడు సుగ్రీవుడితో ఒడంబడిక కుదుర్చుకొని వినయశీలి అయిన లక్ష్మణునితో ఇట్లా అన్నాడు.

రాముడు: శత్రుసంహారకుడా! లక్ష్మణా! ఈ గుహలో గాలి వెలుతురూ బాగా వస్తున్నాయి. విశాలంగా కూడా ఉంది. మనం ఈ వర్షాకాలం అంతా ఇందులోనే గడిపేద్దాం.

ఓ రాజకుమారా! ఈ పర్వతం రకరకాలైన ధాతువులతో కూడి చాలా అందంగా ఉంది. ఇక్కడ కొండరాళ్లన్నీ తెలుపు నలుపు రంగుల్తో మెరుస్తూ ఉన్నాయి. రకరకాలైన వృక్షాలున్నాయి. ఆ వృక్షాల్ని అల్లుకొని అనేకమైన లతలు, తీగలు ఉన్నాయి. మల్లె, మాలతి, శిరీష, కదంబం, అర్జున మున్నగు లతలు, వృక్షాలన్నీ విశేషంగా పుష్పించి ఉన్నాయి. ఆ వృక్షాలను ఆశ్రయించుకొని అనేక పక్షిజాతులున్నాయి. ఓ లక్ష్మణా! పద్మాలతో కళకళలాడుతూ, ఈ సరస్సు మన గుహకు దగ్గరగా ఉండటం చేత ఎంతో రమ్యంగా ఉంది. ఓ సౌమ్యుడా! ఈ గుహ చూశావా? తూర్పు ఉత్తరాలు పల్లంగా ఉండి, వెనుకభాగం ఎత్తుగా ఉండటం వల్ల మనకు గాలి అధికంగా రాదు. గుహద్వారం వద్ద సమంగాను ఎత్తుగాను విశాలంగాను ఉన్న పెద్ద బండరాయి ఉంది. కాటుకలాగా ఎంత నల్లగా ఉందో చూశావా? ఆరుబయట కూర్చోవటానికి, పడుకుని విశ్రాంతి తీసుకోవటానికి చాలా అనుకూలంగా ఉంది. ఇక్కడ నుండి ఉత్తరాన ఒక కాటుకవంటి

నల్లని శిఖరం కనిపిస్తోంది. పెద్ద మేఘాన్ని ఒకటి ఆ శిఖరంపైన కూర్చోబెట్టినట్లుంది. ఇటు ప్రక్కన దక్షిణాన ఒక శిఖరం కనిపిస్తోంది. అది తెల్లటి వస్త్రం కప్పినట్లుగా ఉంది. మనం ఉంటున్న గుహకు తూర్పుగా ప్రవహించే నదిని చూస్తూ ఉంటే త్రికూట పర్వతంపై ప్రవహించే గంగానదిలాగా అనిపిస్తోంది. దీని చుట్టూ చందన, సాల, తిలక, తమాల, అతిముక్తక, పద్మక, సరళ, అశోక వృక్షాలతో ఈ నదీతీరమంతా ఇంకా శోభాయమానంగా ఉంది. ఈ వృక్షాలపైన అనేక పక్షిజాతులు నివాసాలుగా చేసుకున్నాయి. ఇవేకాక వానీర, తిమిద, వకుల, కేతక, హింతాల, తినిశ, నీప, వేతసాది మున్నగు వృక్షాలతో ఈ నది మంచిచీర కట్టి సింగారించుకున్న యువతిలా కనబడుతోంది. ఈ నది సమీపంలో హంసలు, చక్రవాకాలు, సారపక్షులు ఇంకా ఎన్నో రకాలు వివిధమైన కూతలతో పరస్పరం ఒకదానితో మరొకటి ముచ్చటించుకుంటున్నాయి. ఈ నదిలో దూరాన ఉన్న అందమైన ఇసుకతిన్నెలు నవ్వుతున్న స్త్రీ పలువరుసల్లాగా ఉన్నవి. నది కొన్ని చోట్ల, నల్లకలువ, మరికొన్ని చోట్ల ఎర్రకలువలతో అందంగా ప్రకాశిస్తోంది.

ఓ లక్ష్మణా! ఈ ప్రదేశం చాలా సుందరంగా ఉంది. ఇక్కడే ఈ వర్షాకాలం అంతా సుఖంగాను, ఆనందంగాను గడిపేద్దాం. అంతేకాకుండా కిష్కింధ కూడా ఇక్కడకు దగ్గర్లోనే ఉన్నట్లుంది. ఎందువల్లనంటే సంగీత ధ్వనులు, మృదంగధ్వనులు, వానరుల గోల బాగా దగ్గరగా ఉన్నట్లు వినపడుతున్నాయి. వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు భార్యను, రాజ్యాన్ని పొంది బంధుమిత్రులతో ఆనందసాగరంలో మునిగి తేలుతున్నట్లున్నాడు; ఇది నిశ్చయం.

సుఖకరంగాను, సమృద్ధితోనూ ఉన్న ఆ పర్వతంపై ఉంటున్న రామునికి కొంచెం కూడా ఆనందం కలుగలేదు. విశేషించి పర్వతంపై నుండి కన్పించే చంద్రుని చూస్తూ ప్రాణం కన్నా ఎక్కువైన ప్రియురాలు సీతను తలచుకుంటూ ఆనందంగా ఉండలేకపోయాడు. అప్పుడు లక్ష్మణుడు రామునితో ఇట్లా అన్నాడు.

లక్ష్మణుడు: ఓ వీరుడా! దుఃఖించకు. దుఃఖించేవాడి పనులన్నీ చెడిపోతాయని నీకు

తెలుసు కదా! రామా! లోకంలో చేయవలసిన కర్తవ్యాలన్నింటినీ చేస్తూ ఫలం పొందటం కోసం దేవతల్ని కూడా పూజిస్తూ ఉంటాం. అంటే ఆస్తికుడు ధర్మస్వభావం గలవాడు. ఎప్పుడూ పనులు చేస్తూనే ఉంటాడు. నీవు కార్యోన్ముఖుడవు కాకపోతే, కపటులైన రాక్షసులను సంహరించే శక్తి ఉండదు. అందువల్ల దుఃఖాన్ని పూర్తిగా విడిచిపెట్టి ఉద్యమించు. రాక్షసుల్నందరినీ సపరివారంగా చంపెయ్యి.

ఓ రామా! నీవు, సముద్రాలు, పర్వతాలు, అరణ్యాలతో కూడుకున్న, భూమిని తలక్రిందులు చేయగల సమర్థుడవు. ఇక రావణుడి మాట వేరే చెప్పాలా? ఇప్పుడు వర్షాకాలం వచ్చింది. శరత్కాలం వచ్చేవరకు వేచి ఉందాం. ఆ తరువాత వానర పరివారంతో సహా వెళ్ళి రావణుని చంపేద్దాం.

ఓ రామా! నివురుకప్పి ఉన్న అగ్నిని హవిస్సుల చేత ప్రజ్వలింపజేసినట్లు, నేను ఈ మాటలతో నిద్రించే నీ పరాక్రమాన్ని మేల్కొలుపుతున్నాను.

రాముడు: లక్ష్మణా! హితం కోరేవాడు, ఎదుటివారిపై ప్రేమాభిమానాలున్నవాడూ, యథార్థమైన పరాక్రమం కలవాడూ చెప్పవలసిన మాటల్ని చెప్పావు. సోదరా! ఇదుగో ఇప్పుడే నా తేజస్సును కాంతివిహీనం చేస్తున్న దుఃఖాన్ని విడచిపెడుతున్నాను. శరత్కాలం రాగానే సుగ్రీవుడి సహకారంతో నీవు చెప్పినట్లు కార్యోన్ముఖుడనవుతాను. ఇతరుల నుండి ఉపకారాన్ని పొందిన వీరుడు తప్పకుండా ఉపకారం చేస్తాడు. అట్లాకాకుండా, చేసిన మేలు మరచిపోయి, ప్రత్యుపకారం చెయ్యనివాడు సత్పురుషుల మనస్సు నొప్పిస్తాడు.

లక్ష్మణుడు: ఓ రాజా! సుగ్రీవుడు నీతో కుదుర్చుకొన్న ఒప్పందాన్ని నెరవేరుస్తాడు. నీవు మెచ్చుకునేట్లు, తాను చేయగలిగినవన్నీ చేస్తాడు. నీవు శరత్కాలం వచ్చేవరకు ఓపికపట్టు. నాతో కలసి, ఇంతకాలం సింహాలు కాపురమున్న ఈ గుహలో నివసించు. నాలుగు మాసాలు వేచివుండు.

# 28వ సర్గ వర్షాకాల వర్ణన

వాలివధ అయింది. సుగ్రీవుడి రాజ్యాభిషేకం కూడా అయింది. సుగ్రీవుడు కిష్కింధలోను, రాముడు ప్రస్రవణ పర్వత గుహలోనూ నివసిస్తున్నారు. వర్షాలు బాగా కురుస్తున్నాయి. ఒక రోజు రాముడు ఇలా అన్నాడు.

రాముడు: లక్ష్మణా! వర్షాకాలం వచ్చింది. భూమిని పర్వతాలు ఆవరించినట్లు ఆకాశాన్నంతా మేఘాలు ఆవరించాయి. సూర్యకిరణాల సహాయంతో సముద్రంలో ఉండే నీటినంతా గ్రహించిన ఆకాశం కార్తీకం నుండి ఆషాఢం వరకూ నవమాసాల గర్భం ధరించి ఇప్పుడు ప్రసవిస్తున్నట్లు కనబడుతోంది. లక్ష్మణా! ఈ పర్వతం మీద నుండి చూస్తూ ఉంటే మేఘాలు ఆకాశానికి నిచ్చెన్లు వేసినట్లుంది. ఈ మేఘాల నిచ్చెనల మీద నుండి వెళ్ళి సూర్యుణ్ణి కొండమల్లెలు, ఏరుమద్ది పూలతో అలంకరింప వీలయ్యేట్లున్నది.

ఉదయసూర్యుని ఎర్రటి కాంతితో ఎర్రబారిన మేఘాలు తెల్లటి అంచులతో, ఆకాశానికి కలిగిన పుండులకు కట్టుకట్టిన తెల్ల గుడ్డపీలికలాగా ఉన్నవి. మందమారుతాలు నిట్టూర్పుల్లాగాను, సంధ్యారాగాలు చందనం లాగాను, తెల్లటి మేఘాలు పాలిపోయిన శరీరంలాగా ఉండి ఆకాశం భార్యావియోగంతో దుఃఖీస్తున్న భర్తలాగా ఉంది. గ్రీష్మఋతువు వలన బాగా ఎండిపోయి, క్రొత్తగా కురిసిన వానలకు, తడిసిన నేలనుండి వచ్చే ఆవిరితో ఉన్న ఈ భూమి, దుఃఖంతో కన్నీళ్ళు కార్చే సీతాదేవిలాగా కనిపిస్తోంది.

లక్ష్మణా! మొగలిపూల వాసనల్లాగాను, కలువపూలంత చల్లగానూ ఉన్న మేఘాల్లోంచి వీస్తున్న గాలులను తనివితీర జుర్రుకోవాలని ఉంది. విరగబూసిన మద్దిపూలు, మొగలిపూల సువాసనలతో కూడిన ఈ పర్వతం, శత్రుబాధ తొలగిపోయి రాజ్యాభిషేకం చేసుకున్న సుగ్రీవుడిలాగా జలధారల చేత అభిషిక్తమైనది. నల్లటి మేఘాల నుండి జారిపడే తెల్లటి వానధారలు కృష్ణాజినాల్ని కప్పుకుని యజ్ఞోపవీతాలు ధరించిన బ్రహ్మచారుల్లా ఉన్నాయి. ఈ

ఉరుములు ఆకాశాన్ని బంగారు కొరడాలవలె ఉన్న మెరపులచే కొడితే బాధపడుతున్నట్లుగా ఉన్నాయి.

లక్ష్మణా! నల్లటి మేఘాల మధ్యన కనిపించే మెరుపు తీగల్ని చూస్తూ ఉంటే, రావణాసురుడి నుండి తప్పించుకొని పారిపోవడానికి పెనగులాడుతున్న సీతలాగా ఉంది. కాముకులకు ఆనందం ఇవ్వాల్సిన దిక్కులు, మేఘాలు చంద్రుణ్ణి కప్పేయడం వల్ల దిక్కులే తెలియడం లేదు. ఆవిరిచే కప్పబడిన పుష్పాలు దుఃఖీతుడనై ఉన్న నాలో కామోద్రేకాన్ని రేకెత్తిస్తున్నాయి. గ్రీష్మ ఋతువుకుండే తాపం తగ్గింది. రాజులు యుద్ధయాత్రలను నిలిపేశారు. దేశాంతరాలు పోయిన వాళ్ళు తిరిగి స్వదేశానికి వస్తున్నారు. హంసలు మానససరోవరానికి బయలుదేరాయి. చక్రవాకాలు ప్రియురాళ్ళతో కలసి విహరిస్తున్నాయి. ఆకాశం మేఘావృతం అయినా కొన్ని చోట్ల ప్రకాశవంతంగాను, కొన్నిచోట్ల నల్లగానూ ఉండి, తరంగాలు లేని మహాసముద్రంలా కనిపిస్తోంది.

వాగుల్లో నీరు వేగంగా ప్రవహిస్తోంది. పర్వతంపై ఉండే ధాతువుల్తో కలసి ఎర్రగానూ, రాలిన పూలతో కలసి మలినంగాను కనిపిస్తోంది. ప్రవహిస్తున్న ఆ వాగులను అనుసరించి నెమళ్ళు క్రేంకార ధ్వనుల్ని చేసుకొంటూ వెళుతున్నాయి.

మెరుపులనే పతాకాలు, కొంగలనే మాలలు ధరించి, పర్వత శిఖరాల్లో ఉన్న మేఘాలు మదించిన ఏనుగుల్లా అధికధ్వనితో గర్జిస్తున్నాయి. ఈ వనంలో వర్షం బాగా కురిసింది. అందువల్ల పచ్చిక దట్టంగా పట్టింది. నెమళ్ళు నాట్యాలు ప్రారంభించాయి. అందువల్ల మిట్టమధ్యాహ్నమైనా ఆహ్లాదంగానే ఉంది. కొంగలబారుల్ని హారాల్లా ధరించిన మేఘాలు కొద్దిసేపు కొండ శిఖరాలపై విశ్రాంతి తీసుకొని మళ్ళీ ప్రయాణమవుతున్నాయి. ఆకాశంలో ఎగురుతున్న కొంగలబారులు మేఘాలకు పద్మాలతో మాలలు కట్టినట్లుంది.

నిద్రాదేవి శ్రీమహావిష్ణువు ఒడిలోకి చేరింది. నది సాగరగర్భంలో లీనమైపోయింది.

ఆకాశంలో ఆనందంగా ఎగిరే ఆడకొంగ ప్రియుణ్ణి చేరుకుంది. ఆడనెమళ్ళు నృత్యం చేస్తున్నాయి. కదంబవృక్షాలు విరగబూశాయి. ఆంబోతులు ఆవులు కామంతో పోటీలు పడుతున్నాయి. పంట పొలాలతో నేలతల్లి ఈనినట్లుంది. నదులు ప్రవహిస్తున్నాయి. మేఘాలు వర్షిస్తున్నాయి. మదించిన గజములు ఘీంకరిస్తున్నాయి. ప్రియురాలు దగ్గర లేనివాళ్ళు పరధ్యానంలో ఉన్నారు. వానరులు సుగ్రీవుని రాజ్యాభిషేకానికి గంతులు వేస్తున్నారు. తుమ్మెదలకు పుష్పాల నుండి రసం అధికంగా దొరుకుతోంది; ఆ రసాన్ని తాగి మదాన్ని విపరీతంగా విసర్జిస్తున్నాయి. నేరేడుపండ్ల నుండి తుమ్మెదలకు రసం విరివిగా లభిస్తోంది. అందువల్ల నేరేడు కొమ్మలనిండా తుమ్మెదలు వాలి ఉన్నాయి. మేఘగర్జన విని శత్రువు అనుకొని అటూ ఇటూ చూస్తున్నాయి. తుమ్మెదలు అధికంగా ఉన్న వనాలన్నీ గానంతో నిండిపోయాయి. గజేంద్రులు విరివిగా ఉన్న వనాలు మదించినట్లున్నాయి. దట్టంగా పుష్పించి ఉన్న కదంబ, సర్జు, అర్జున వనాల్లో నెమళ్ళు అధికంగా తిరుగుతున్నాయి. పర్వత శిఖరాల్లో విరివిగా వర్షించటం వల్ల పక్షులకు దాహశాంతి అయి సంతోషంతో ఉన్నాయి. అడవి అంతా సంగీత ధ్వనులు వినిపిస్తున్నా, వీణానాదం చేసే తుమ్మెలదే పైచెయ్యిగా ఉంది. మేఘనాదాలు మృదంగనాదాలు కాగా, మండూకాల కంఠస్వరాలే కరతాళాలయ్యాయి. నెమళ్ళకు పింఛాలే అలంకారాలయ్యాయి; క్రేంకారాలతో వనమంతా మారుమ్రోగింది. నిద్రావస్థలో ఉన్న కప్పలన్నీ వర్షధారలకు లేచి ఆనందంతో ధ్వనులు చేస్తున్నాయి. ఉప్పొంగుతున్న నదులు ప్రియుడైన సముద్రుణ్ణి కలిసేందుకు ఉరకలు వేస్తూ పోతున్నాయి.

వర్షాలతో వనంలో ఏనుగులన్నీ మదించి ఉన్నాయి. ఆబోతులన్నీ సంతోషంతో రంకెలు వేస్తున్నాయి. సింహాలు పరాక్రమిస్తున్నాయి. పర్వతాలన్నీ పచ్చగా ఉన్నాయి. రాజులంతా యుద్ధాలు నిలిపి ప్రశాంతంగా ఉన్నారు. దేవేంద్రుడు మేఘాలను నియంత్రించడంలో తీరిక లేకుండా ఉన్నాడు. వర్షాలు ఎక్కువయ్యాయి. చెరువులు, బావులు, సరస్సులు, నదులు పొంగిపొరలుతున్నాయి. సముద్రుడు నీరు ఎక్కువై తన్ను కలవటానికి వచ్చే నదుల్ని వెనక్కు నెడుతున్నాడు. కురిసిన వర్షాలకు భూమి తృప్తిపడింది. మేఘాలతో ఆకాశం కప్పేసి

సూర్యబింబం కనిపించటం లేదు. చిక్కటి చీకట్లు వ్యాపించి దిక్కులు తెలియటం లేదు. రాత్రి అయిందని భ్రమపడి పక్షులు గూళ్ళకు చేరుతున్నాయి. పద్మాలు ముకుళించుకోవటం వల్ల భ్రమరాలు పద్మాల్లో చిక్కుకుపోతున్నాయి. పర్వతాలపై పడ్డ వర్షం అంతా జలపాతాలై పర్వతాలకు ముత్యాల హారాలయ్యాయి.

రాజుల దండయాత్రలు ఆగిపోయాయి. పరస్పర విరోధాలు శాంతించాయి. బ్రాహ్మణులు సామవేదం అధ్యయనం చేసే భాద్రపదమాసం వచ్చింది. కోశలాధిపతి భరతుడు ఆషాఢమాసం నుండీ నియమంతో ఉండి ఉంటాడు. నేను ఎక్కడికైనా పోయి వచ్చినప్పుడు అయోధ్యావాసులంతా సంతోషంతో కేరింతలు కొట్టేవాళ్ళు. ఇప్పుడు సరయూనది వరదల్తో కోలాహలంగా అయోధ్యావాసుల కేరింతల్లాగానే ఉంటుంది.

లక్ష్మణా! సుగ్రీవుడు శత్రువును జయించాడు. గొప్ప రాజ్యం చేజిక్కించుకుని వర్షాకాలం అంతా భార్యలతో సుఖంగా కాలం గడుపుతున్నాడు. నేను మాత్రం రాజ్యభ్రష్టుడనయ్యాను. భార్యను ఎవరో అపహరించుకొనిపోయారు. నేను మాత్రం నదీప్రవాహానికి తెగిపడే ఒడ్డులా ఉన్నాను. నా దుః ఖం అధికమైపోతోంది. వర్షాకాలం కావటాన, కాలు కదల్చలేకుండా ఉన్నాను. నా శత్రువైన రావణుడా, బలవంతుడు. అన్ని విధాలా నా దుఃఖానికి అంతే లేకుండా పోతోంది. సుగ్రీవుడు ఆనాడే సీతాన్వేషణకు బయలుదేరుదామన్నాడు. నేనే వర్షాకాలం గదా! ఆగి వెళదామన్నాను. అంతేకాదు, సుగ్రీవుడు కూడా నాకు మల్లేనే చాలాకాలం భార్యావియోగంతో బాధపడ్డాడు. అందుచేత నేను అతనితో ఏమీ అనలేదు. సుగ్రీవుడే కొద్దిగా కుదుటపడ్డ తర్వాత వచ్చి, సీతాన్వేషణకు తగిన ఏర్పాట్లు చేయగలడు. ఈ విషయంలో ఏమీ సందేహం లేదు.

ఓ లక్ష్మణా! అందువలన (వర్షాకాలం పోయి) నదుల్లో నీరు నిర్మలమై, సుగ్రీవుడు వచ్చి సహాయపడాలని కోరుకొంటున్నాను. ఆ సమయం కోసం వేచి ఉన్నాను.

# 29వ సర్గ సుగ్రీవుడు వానర సైన్యాన్ని సమకూర్చటం

ఇంతలో వర్షాకాలం గడచిపోయింది. మేఘాలు, మెరుపులు తెరిపి ఇచ్చాయి. ఆకాశం నిర్మలమైంది. సుగ్రీవుడు కామభోగం పట్లనే ఎక్కువ ఆసక్తి చూపుతూ ఎక్కువకాలం స్త్రీలతోనే రహస్య మందిరాల్లో గడుపుతూ వచ్చాడు. అతడి మనోరథాలన్నీ తీర్చే భార్య రుమ, తారలు లభించడంచేత రాత్రింబవళ్ళు వారితోనే విహరిస్తూ వచ్చాడు. అప్సరసలతో విహరించే దేవేంద్రుడివలె, తన్ను తాను తలచుకొని ఇతర విషయాలన్నీ పూర్తిగా మంత్రులపై ఉంచి వారికి దర్శనం కూడా ఇచ్చేవాడు కాదు. ఏ బాదరబందీ లేనివాడు కావటం చేత ఆ వానరరాజు స్వేచ్ఛగా విహరించసాగాడు.

జరుగుతున్న విషయాలు, వాటి తత్త్వాలు ఎరిగినవాడు, కాలం విలువ, ధర్మం విలువ తెలిసినవాడు, మాటలలో నేర్పరి, వాయుపుత్రుడు అయిన హనుమంతుడు సుగ్రీవుని దగ్గరకు వెళ్ళి హితమైనవి, సత్యమైనవి, లాభకరమైనవి, ప్రేమను, సంతోషాన్ని తెలిపేవీ, విశ్వాసంతో కూడినవి అయిన వాక్యాలు ఇట్లా పలికాడు. ఆతడి మాటల్లో సామధర్మ అర్థనీతులను చొప్పించి నేర్పుగా మాట్లాడాడు.

హనుమంతుడు: ఓ సుగ్రీవుడా! నీకు రాజ్యం వచ్చింది. కీర్తి వచ్చింది. నీ సంపదలు వృద్ధి చెందాయి. నీవు ఎవరి సహాయంతో ఇవన్నీ పొందావో వారి పనికూడా చేసిపెట్టి వారి స్నేహాన్ని, అభిమానాన్ని సంపాదించుకోవాల్సి ఉంది. తక్షణం నీవు ఆ పని చేయాల్సి ఉంది. ఏ కాలంలో ఏది చెయ్యాలో తెలుసుకొని మిత్రుల విషయంలో కృతజ్ఞులై ఉంటే వాళ్ళ రాజ్యం, కీర్తి, సంపద వృద్ధి చెందుతాయి.

ఓ రాజా! ఎవరు మిత్రులు, కోశాగారం, సైన్యం, ప్రభుత్వ పరిపాలన అనే నాలుగింటినీ సమపాళ్ళల్లో ఉంచుతాడో అట్టి వాడి రాజ్యం వృద్ధి చెందుతుంది. నీవు చేసిన ప్రతిజ్ఞ ప్రకారం మిత్రుడి పని చేసిపెట్టాలి. ఎవరు మిత్రులకు ఇచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చడో అట్టివాడు

అడుగడుగునా కష్టాలను ఎదుర్కోవలసి ఉంటుంది. కాబట్టి మిత్రుడికి ఏ కార్యం ఏ సమయంలో చెయ్యాలో ఆలస్యం కాకుండా ఆయా పనులు చెయ్యాలి. ఆ తర్వాత ఏమనుకున్నా ఏమీ ప్రయోజనముండదు.

ఓ రాజా! నీవు ఇతర పనులన్నీ ఒక పక్కన పెట్టు. ముందు నీ సర్వశక్తియుక్తులు, సర్వసంపదలు, మందీమార్బలం అంతా సీతను వెదికిపెట్టడంలో నిమగ్నం చేయి. ఇప్పటికే చాలా ఆలస్యం అయింది.

ఓ శత్రు సంహారకుడా! నీవు ఉపకారం చెయ్యనివాళ్ళకు కూడా సహాయపడే స్వభావం గలవాడివి. అటువంటిది, నీకు రాజ్యం, భార్య, కీర్తి, సంపదలు సమకూర్చి పెట్టిన రాముడి విషయం విడిగా చెప్పాలా? ఓ సుగ్రీవా! నీవు శక్తిమంతుడివి. గొప్ప పరాక్రమశాలివి; సీతాదేవి కోసం వానరులను పంపటంలో ఎందుకు ఆలస్యం చేస్తున్నావు? రాముడు తన ధనుస్సు చేత నరులను, అసురులను, మహాసర్పాలను కూడా తన అధీనంలో ఉంచుకొనే శక్తి సామర్థ్యాలు ఉన్నవాడు. సహాయపడతానని మాట ఇచ్చినందువల్ల వేచి ఉన్నాడు. అతడు నీతో స్నేహం చెయ్యగానే నీకు సహాయపడాలని అనుకున్నాడు. వాలి, యథార్థానికి, అతడికి శత్రువు కాకపోయినా, నీ స్నేహం కోసం అతడి ప్రాణం తీశాడు. కాబట్టి ఇప్పుడు భూమి, ఆకాశం, పాతాళాలు కూడా వెతికి సీతాదేవి ఆచూకీ తెలుసుకోవాలి.

ఓ సుగ్రీవా! రాముడు అధికశక్తిమంతుడు. దేవదానవ మరుద్గణాలను కూడా లెక్కచేయడు. అటువంటి రాముడు నీకు గొప్ప సహాయం చేశాడు. నీవు అతడికి కృతజ్ఞుడవై ఉండాలి. అతడి పని చేసిపెట్టాలి. నీవు త్వరగా ఈ విషయం ఆలోచించి నీ మంత్రులందరికీ, ఏయే పనులు, ఎవరెవరు ఎట్లా చెయ్యాలో ఆజ్ఞాపించు.

హనుమంతుడు చేసిన హితబోధనంతా చక్కగా విన్న సుగ్రీవుడు వెంటనే కార్యారంగంలోకి దిగేందుకు నిశ్చయించాడు. నీలుణ్ణి పిలిపించి సైన్యాన్నంతా

సమీకరించమన్నాడు.

"ఓ వీరుడా! పదిహేను రోజుల్లో వానరసేన అంతా నలుమూలల్నుంచీ వచ్చి కిష్కింధలో సమావేశం కావాలి. అట్లారాని వాడెవడైనా ఉంటే వాడికి మరణశిక్ష విధిస్తాను. ఇప్పుడే అంగదుడితో సహా వానరశ్రేష్ఠులందరికీ ఈ విషయం తెలియపరచు" అని ఆజ్ఞాపించాడు. తరువాత సుగ్రీవుడు తన అంతఃపురంలోకి వెళ్ళాడు.

# 30వ సర్గ సుగ్రీవుని వద్దకు లక్ష్మణుని పంపటం

హనుమంతుని హితవాక్యాలు విని సుగ్రీవుడు సీతాన్వేషణకై తగిన ఏర్పాట్లు చెయ్యమని మంత్రులను ఆదేశించి అంతఃపురంలోకి వెళ్ళాడు.

అక్కడ రాముడు వర్షాకాలం అంతా సీతాదేవి జ్ఞాపకాలతోను విరహంతోను తపించిపోయాడు. ఆకాశం నిర్మలమైంది. చంద్రమండలం, వెన్నెల రాత్రి అంతా వెండిపూత పూసినట్లు తెల్లగా ఉన్నాయి. సీతాదేవి ఎక్కడ ఉన్నదీ తెలియలేదు. సీతాదేవిని వెతికిపెడతానని వాగ్దానం చేసిన సుగ్రీవుడు కామభోగాలతో వర్షాకాలం అంతా సుఖంగా గడిపేశాడు. సుగ్రీవుడితో ఒప్పందం చేసుకున్న గడువుకాలం (వర్షాకాలం) తీరిపోయింది. ఇట్లా ఆలోచిస్తూ చాలాసేపు ఒళ్ళు తెలియకుండా పడుకున్నాడు. కొద్దిసేపట్లో మళ్ళీ సీతాదేవిని గూర్చిన ఆలోచనల్లో పడిపోయాడు. ధాతువులతో నిండిన ఆ పర్వతశిఖరంపై కూర్చుని ఆకాశం వంక చూస్తున్నాడు. వర్షాకాలం నాటి మేఘాలు, మెరుపులు ఇప్పుడు లేవు. సారస పక్షులు జంటలుగా తిరుగుతూ శబ్దాలు చేస్తున్నాయి. ఎంత వద్దనుకున్నా ఆలోచనలన్నీ సీతాదేవి మీదకే పోతున్నాయి. దుఃఖాన్ని నిగ్రహించలేక నిశ్శబ్దంగా విలపిస్తూ ఇట్లా ఆలోచించాడు.

నా ప్రియురాలు సీత నాతో మాట్లాడుతూ ఉన్నప్పుడు సారసపక్షులు చేస్తున్న శబ్దాలను అనుకరిస్తూ, నన్ను కవ్విస్తూ నాతో ఆడుకునేది. ఇప్పుడు ఎక్కడ ఉందో? ఎట్లా ఉందో?

బంగారం రంగులో ఉండే వేగిసపూలంటే నా సీతకు ఎంతో ఇష్టం. ఇప్పుడా వేగిసపూలు విరగబూశాయి. వాటిని చూస్తూ ఉంటే, సీత నాలుగు వైపులా నాకోసం వెదుకుతోందా? అన్నట్లుంది. నేను కనపడకపోవటం వల్ల ఎంత దుఃఖీస్తోందో గదా! ఇదివరకు కలహంసలు గలగల శబ్దాలు చేస్తూ ఉంటే మేలుకునేది. ఇప్పుడా సుందరాంగిని ఏ కలహంసలు మేల్కొల్పుతున్నాయో? నా ప్రియురాలు సీత చక్రవాకపక్షుల సరాగాలు చూసి తాపంతో నా దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చేది. ఇప్పుడు ఆమె ఎట్లా ఉందో?

లేడి కన్నులవంటి కన్నుల గల నా ప్రియురాలు సీత నా వెంట లేనందువల్ల సరస్సులు, వనాలు, ఉద్యానవనాలు రామునికి సంతోషాన్ని కలిగించలేకపోతున్నాయి. ఈ శరత్కాలంలో మన్మథుడు పీడించడం వల్ల నా వియోగం తట్టుకోలేక సీత ఎక్కడున్నా విలపిస్తూనే ఉంటుందనుకొని వానజల్లుకోసం పరితపించే చాతకపక్షిలా రాముడు సీత కోసం విలపించాడు.

పండ్లు, దుంపలు తెచ్చేందుకు అడవిలోకి పోయిన లక్ష్మణుడు అప్పుడే తిరిగి వచ్చాడు. ఆ పర్వతశిఖరంపై ఒంటరిగా పరధ్యానంలో ఉన్న రాముణ్ణి చూశాడు. రాముని స్థితి చూసి లక్ష్మణుడి గుండెలు పిండినట్లయింది. రాముడితో ఇట్లా అన్నాడు.

లక్ష్మణుడు: ఓ పూజ్యుడా! నీవు కామపరవశుడవై ఉండటం వల్ల ఏం ప్రయోజనం సాధించగలవు? అన్నా! నీవు మహాధైర్యశాలివి. నువ్వు ధైర్యాన్ని విడువవద్దు. మనస్సు చెడగొట్టే ఆలోచనలు చెయ్యొద్దు. ఇప్పుడు మనకు జయం సమకూడే సమయం వచ్చింది. నువ్వు సుగ్రీవుడికి ఎంత సమర్థవంతంగా సహాయపడ్డావో, అదేవిధంగా సుగ్రీవుడి నుండి కూడా అంత సమర్థవంతమైన సహాయాన్ని పొందాలి. ఆ విషయాన్ని గూర్చి బాగా ఆలోచించు. నీ ఆలోచన అంతా ఆ విషయం మీదనే ఉంచు. మనకు జయంసిద్ధించే సమయం వచ్చింది.

ఓ రామా! నీవు రాజాధిరాజువు. మహావీరుడవు. పూజనీయుడవు. సీతాదేవి నీ ధర్మపత్ని. మహాపతివ్రత. ఆమె ఎక్కడున్నా ఆమె నీడనైనా ఎవరూ తాకలేరు. అగ్నిహోత్రాన్ని ఎవడైనా చెంగున కట్టుకుంటాడా?

లక్ష్మణుడు తన స్వభావానికి తగ్గ మాటలు చెప్పాడు. ప్రస్తుతానికి, భవిష్యత్కాలానికి పనికివచ్చే మాటలు చెప్పాడు. రాజనీతి, ధర్మం రెండూ కలబోసి మాట్లాడాడు. లక్ష్మణుడి మాటలన్నిటినీ రాముడు సావధానంగా విన్నాడు.

రాముడు: తమ్ముడా! మనం కార్యసిద్ధి కోసం చెయ్యవలసిందంతా చేయాల్సిందే! దానికి అవసరం అయ్యే సాధన సంపత్తులను, ఉత్సాహాన్ని సమకూర్చుకొని ఆ కష్టసాధ్యమైన కార్యాన్ని

సాధిద్దాం. ఫలితాన్ని గురించి మనం ఆలోచించవద్దు. మన కర్తవ్యం మనం చేద్దాం. (ఇట్లా అంటూ ఉండగా, సీత జ్ఞాపకానికి వచ్చి రాముడి నోరు ఎండిపోయింది.)

నాయనా! లక్ష్మణా! ఇంద్రుడి అనుమతితో వరుణదేవుడు ఈ నేలంతా తడిపేసి భూమాతను తృప్తిపరచాడు. పంటలు సమృద్ధిగా పండేట్లు చేశాడు. గంభీరమైన ధ్వనులతో, దట్టమైన మేఘాలతో పర్వతాల మీదా, ఆకాశాన్నంటే వృక్షాల మీదా వర్షం కురిపించి అలసిపోయి కూర్చున్నాడు. తాను చేయవలసిందంతా చేశాడు. కృతకృత్యుడయ్యాడు. నల్లకలువల వంటి మేఘాలు దశదిశలా వర్షించి ఇప్పుడు మదం ఉడిగిపోయిన ఏనుగుల్లాగా పరుగెత్తలేక చతికిలపడ్డాయి. మేఘగర్జనలు, మదపుటేనుగుల ఘీంకారాలు, నెమళ్ళ క్రేంకారాలు, కొండల మీద నుండి ప్రవహించే సెలయేరులు ఆగిపోయాయి. వర్షంతో పర్వత సానువులన్నీ శుభ్రంగా కడిగేయటం వల్ల రకరకాల ధాతువులు బయటపడి కుంకుమ, చందనం వంటి సుగంధద్రవ్యాలతో పూతలు పూసినట్లున్నాయి.

ఓ లక్ష్మణా! ఈ శరద్ఋతువు తన ఐశ్వర్యాన్నంతా అరటిచెట్లకు, కొమ్మలకు, నక్షత్రాలకు, సూర్యచంద్రులకు, మదపుటేనుగులకు పంచిపెట్టినట్లుంది. శరత్కాలలక్ష్మి రకరకాల రంగులతో సూర్యోదయకాంతి చేత నానావిధ కాంతులతో ప్రకాశిస్తోంది.

అడవిలో ఏడాకుల అరటిచెట్లు విరగబూసి సుగంధాలు వెదజల్లుతూ ఉంటే, తుమ్మెదల గుంపులు వాటిని చుట్టుముట్టాయి. మదపుటేనుగులు వాటిపై దాడి చేశాయి. చక్రవాకపక్షులు తమ రెక్కలనిండా పద్మాలపై ఉండే పుప్పొడిని నింపుకొని కామోద్రేకంతో నదీతీరాన విహారాలు చేస్తున్నాయి. ఇసుకతిన్నెలపైకి వచ్చి వాలిన చక్రవాకాలతో హంసలు ఆడుకుంటున్నాయి. మదగర్వంతో తిరిగే మదపుటేనుగుల మీదా, గర్వంతో రంకెలు వేస్తున్న ఆబోతుల మీదా నదిలో ప్రవహిస్తున్న నిర్మలజలాల ప్రభావం కనిపిస్తోంది. శరత్కాలలక్ష్మి తన శోభను ప్రదర్శించనిచోటు అంటూ ఆ వనంలో ఎక్కడా కనిపించలేదు. కన్నులకింపుగా ఉండే నల్లటి మేఘాలు ఆకాశం నుండి మాయమయ్యాయి. నెమళ్ళు పురివిప్పి నాట్యాలు చెయ్యటం లేదు; తమ ప్రియురాంద్రపట్ల

ఆసక్తిని పోగొట్టుకున్నాయి.

లక్ష్మణా! రాజులు యుద్ధయాత్రలు చేసే సమయం వచ్చేసింది. కానీ సుగ్రీవుడు ఆ ప్రయత్నంలో ఉన్నట్లు తెలియడం లేదు. వర్షాకాలం నాలుగు నెలలూ సీత కనపడక దుఃఖంతో ఉన్న నాకు వంద సంవత్సరాలు అయినట్లున్నది. ఆడ చక్రవాకపక్షి తన భర్తను అనుసరించినట్లుగా సీత నాతో దండకారణ్యంలోకి ప్రవేశించింది.

లక్ష్మణా! చూశావా! నేను రాజ్యాన్ని పోగొట్టుకున్నాను. ప్రియురాలిని పోగొట్టుకొని విలపిస్తున్నాను. అయినా రాజైన సుగ్రీవుడికి నాపై దయ కలగటం లేదు.

శత్రు సంహారకుడా! ఓ లక్ష్మణా! "ఇతడు అనాథుడు. రాజ్యాన్ని పోగొట్టుకున్నాడు. భార్యను పోగొట్టుకున్నాడు. రావణుడి చేత అవమానించబడ్డాడు. నాకు శరణాగతుడైనాడు" అనే చులకన భావంతో దుర్బుద్ధియైన వానరరాజు సుగ్రీవుడు నన్ను అవమానిస్తున్నాడు.

ఆ దుర్బుద్ధి అయిన సుగ్రీవుడు సీతను వెతికిపెడతానని నాతో ప్రతిజ్ఞ చేశాడు. తన పని అయిపోయింది గదా అని ఇప్పుడు మనల్ని, మనకు చేసిన ప్రతిజ్ఞని మరచిపోయాడు. నీవు వెంటనే కిష్కింధకు వెళ్ళు. స్త్రీ సుఖాలలో మునిగి తేలుతున్న ఆ మూర్ఖుడైన సుగ్రీవుడితో నా మాటగా చెప్పు.

రాముడు: ఓ సుగ్రీవుడా! మంచైనా, చెడైనా ఒకసారి మాట ఇస్తే, ఆ మాట నిలబెట్టుకున్నవాడే పురుషోత్తముడవుతాడు. ఎవరు తమ పనులు చేయించుకొని మిత్రులకు ఉపయోగపడరో అటువంటి కృతఘ్నుల శవాల్ని కుక్కలు కూడా ముట్టవు.

ఓ సుగ్రీవుడా! నీవు నిజంగానే నా బాణాల రుచి చూడాలని ఉబలాటపడుతున్నట్లున్నావు. బంగారు తాపడం చేసిన నా ధనుస్సు నారి సంధిస్తున్నప్పుడు జనించే మెరుపులు చూడాలని అనుకుంటున్నావు. నేను యుద్ధంలో కోపంతో సంధించిన నారి చేసే భయంకర ధ్వనులు, మళ్ళీ

వినాలని కోరికగా ఉన్నట్లుంది.

ఓ లక్ష్మణా! ఇవి నా మాటలుగా సుగ్రీవుడితో చెప్పు. సుగ్రీవుడు ఇట్లా ముఖం చాటేసినా, నా కేమీ నష్టం లేదు. నీ వొక్కడివీ నా ప్రక్కనే ఉంటే చాలు. శత్రు దుర్గాలను జయించువాడా! లక్ష్మణా! మనం అతడికి కావలసినవన్నీ చేసిపెట్టాం. మనమాతడికి ఆ పని ఎందుకు చేసిపెట్టామో మరచిపోయాడు. అతడు తిరిగి మనకు సహాయపడాల్సిన సమయం వచ్చినా కూడా ఏమీ గుర్తులేనివాడిలాగా ప్రవర్తిస్తున్నాడు. వర్షాకాలం ముగియగానే వచ్చి సీత కోసం వెతకడం ప్రారంభిస్తానని వెళ్ళాడు. కిష్కింధకు పోయిన తర్వాత సుఖాలు మరిగాడు. మనమాట మరచిపోయాడు. ఇప్పటికే నాలుగు మాసాలైపోయింది. సుగ్రీవుడు మంత్రులతో కలసి మద్యపానం చేస్తూ కులాసాగా ఉన్నాడు. దుఃఖంతో అనాథల్లాగా పడి ఉన్న మన మాట బొత్తిగా మరచిపోయాడు.

ఓ వీరుడా! నీవు వెళ్ళి, నాకు కోపం వస్తే అతడి గతి ఏమవుతుందో చెప్పిరా. ఈ మాట కూడా చెప్పు.

“ఓ సుగ్రీవుడా! వాలిని ఏ దారిన పంపానో, ఆ దారి ఇంకా తెరిచే ఉంది. ఇంకా మూసివేయలేదు. నీవు చేసిన ప్రతిజ్ఞ నిలబెట్టుకోలేకపోతే వాలి పోయిన దారినే నీమా పోతావు. నా బాణంతో వాలిని ఒక్కడినే చంపాను. నీవు మాట తప్పినట్లయితే ఒకే ఒక్క బాణంతో నిన్నూ, నీ బంధువర్గాన్ని అందర్నీ కాల్చిబూడిద చేస్తా” నని చెప్పు.

లక్ష్మణా! మన పరిస్థితి ఇట్లా ఉంది. కనుక నీవే అక్కడ సమయోచితంగా మాట్లాడు. కాలం మించిపోతోంది. ఇక ఏమాత్రం ఆలస్యం చేయడం తగదు. ఇంకా సుగ్రీవుడితో ఇట్లా చెప్పు.

“ఓ వానరుడా! నీ ప్రతిజ్ఞ కాపాడుకో. శాశ్వతమైన ధర్మాన్ని అనుసరించు. సత్యానికి కట్టుబడి ఉండు. అట్లా చేయకుండా రాముణ్ణి మోసం చెయ్యాలని చూస్తే రామబాణానికి

గురికావలసి వస్తుంది. వాలి లాగా కోరి మరణం తెచ్చుకోవద్దు.”

రాముడి తీవ్రమైన పలుకులు విని లక్ష్మణుడు దీర్ఘంగా ఆలోచిస్తూ ఉండిపోయాడు.

## 31వ సర్గ లక్ష్మణుడు కిష్కింధకు వెళ్ళడం

సీతావియోగంతో బాధపడుతూ, దీనుడై దుఃఖీస్తున్న దశరథుని కుమారుడైన రాముడు విరహవేదనతో బాధ పడటం లక్ష్మణుడు చూడలేకపోయాడు. సుగ్రీవుడిపైన మండిపడ్డాడు. అన్నగారితో ఇలా అన్నాడు.

లక్ష్మణుడు: అన్నా! సుగ్రీవుడు చేసిన మేలు మరచిపోయాడు. రాజ్యం దక్కింది గదా అని సంబరపడిపోతున్నాడు. స్త్రీలోలుడైపోయాడు. సదాచారుడు కాడు. అగ్నిసాక్షిగా నీతో చేసుకున్న ఒప్పందాన్ని మరచిపోయాడు. ఎవరి వల్ల రాజ్యలక్ష్మిని చేజిక్కించుకున్నాడో వారికిచ్చిన వాగ్దానాన్ని మరచిపోయాడు. ఇకపై వానర రాజ్యలక్ష్మి వాడి చేతుల్లో నిలిచేటట్లుగా కనిపించడం లేదు. వాడిని కూడా వాడి అన్న వాలి దగ్గరకే పంపిస్తాను. అంగదుడిని, వానర సైన్యాన్ని వెంటబెట్టుకొని రమ్మని చెప్తాను.

సుగ్రీవుడి దగ్గరకు రాయబారానికి పొమ్మంటే, వాణ్ణి చంపుతానని ప్రతిజ్ఞ చేస్తున్న లక్ష్మణుణ్ణి శాంతింపజేస్తూ రాముడు ఇట్లా అన్నాడు.

రాముడు: తమ్ముడా! నీవు బుద్ధిమంతుడవు. స్నేహతుణ్ణి చంపడం పాపం. నువ్వు అటువంటి పాపం తలపెట్టుకు. కోపాన్ని అదుపులో ఉంచుకో. నీవు సదాచార సంపన్నుడవు.

సుగ్రీవుడితో ఒప్పందం చేసుకున్నాం. ఆ ఒప్పందం ప్రకారం మనం అతనికి చేసిపెడతామన్నది చేసి చూపించాం. ఇకపైన అతడు మనకు వాగ్దానం చేసిన సహాయాన్ని చెయ్యాలి. అందుకు ఆలస్యమైపోతోందని, త్వరగా ఏర్పాట్లు చేసి సీతాన్వేషణ మొదలుపెట్టమని చెప్పు. అది చాలు. మంచి మాటలతో చెప్పు.

రాముడి శాంతివచనాలు విన్న లక్షణుడు తన కోపాన్ని అదుపులో పెట్టుకున్నాడు. అన్నగారి సంతోషమే తనకు పరమ లక్ష్యం కాబట్టి ఆయన చెప్పినట్లే చేస్తానని మాట ఇచ్చాడు.

మందరపర్వత శిఖరంలా వెలిగిపోతున్న ధనుస్సును చేతిలో ధరించి లక్ష్మణుడు కిష్కింధకు ప్రయాణమయ్యాడు.

లక్ష్మణుడు బుద్ధిమంతుడు. బృహస్పతి అంతటి వాడు. కిష్కింధకు పోయి తాను చెప్పవలసిన మాటలు, సుగ్రీవుడిచ్చే సమాధానాలను గూర్చి మనసులోనే బాగా తర్జనభర్జనలు చేసుకుంటూ పోయాడు. అప్పుడు అతడి ఆలోచనల్లోని వేడికి పాదాలకింద పడిన కొండరాళ్ళన్నీ పిండి అయ్యాయి. వృక్షాల్ని కూకటివ్రేళ్ళతో పెళ్ళగించే పెనుగాలిగా వేగంగా అడుగులు వేస్తూ కిష్కింధ నగరాన్ని సమీపించాడు.

కాలయముడి లాగా కిష్కింధపైకి వేగంగా వస్తున్న లక్ష్మణుణ్ణి, కిష్కింధను కాపలా కాస్తున్న వానర సైనికులు చూశారు. అతణ్ణి చూసి ఎవరో శత్రువని భయపడ్డారు. నగరరక్షణలో అప్రమత్తులైన వాళ్ళంతా పెద్ద పెద్ద రాళ్ళను చేతుల్లో పట్టుకున్నారు; కొంతమంది వృక్షాల్ని పెళ్ళగించి యుద్ధానికి సిద్ధపడ్డారు. వాళ్ళ యుద్ధ ప్రయత్నాలు చూసి లక్ష్మణుడికి కోపం మరింత పెరిగిపోయింది. ఇంతలో కొందరు పోయి సుగ్రీవుడితో చెప్పారు. మద్యంతోను మగువలతోను మత్తెక్కి ఉన్న సుగ్రీవుడు వారి మాటల్ని పట్టించుకోలేదు.

కానీ, ఆ విషయం తెలుసుకున్న మంత్రులు, యథార్థం తెలుసుకొని రమ్మని వానరవీరుల్ని పంపించారు. వాళ్ళంతా పర్వతం అంత శరీరంతో చూసేవాళ్ళకు భయం కలిగించేట్లుగా ఉన్నారు. వాళ్లు ఏనుగుల్లాగా బలిసి ఉన్నారు. మేఘాల్లాగా నల్లగా ఉన్నారు. వాళ్ళకి వాడి అయిన గోళ్ళు, కోరలే ఆయుధాలు. పెద్దపులిలాగా బలమైన వాళ్లలా ఉన్నారు. వాళ్ళంతా లక్ష్మణుని ఎదుటకు పోయి చేతులు కట్టుకొని నిలబడ్డారు. వాళ్ళను చూస్తూ సుగ్రీవుడు తమ పట్ల నిరాసక్తతతో ఉండటం, రాముడు దుఃఖంతో కుమిలిపోతూ ఉండటం జ్ఞాపకానికి వచ్చి లక్ష్మణుడు మరింత మండిపడ్డాడు. పాములాగా బుసలుకొట్టాడు. లక్ష్మణుని చేతిలోని ధనుస్సు చూసేవాళ్ళకు పెద్ద పాముపడగలాగా కనిపించడంతో, వాళ్లంతా భయపడిపోయారు. లక్ష్మణునిలోని తేజస్సు విషం కక్కుతున్నట్లుగా అనిపించింది. అతడి అంబులపొదిలోని బాణాలు

ఆదిశేషుడి నాలుకల్లా కనిపించాయి. ఇంతలో అంగదుడు కూడా అక్కడకు వచ్చాడు. అయిదు తలల పన్నగంలా ఊగిపోతున్న లక్ష్మణునికి భయపడుతూనే నమస్కరించాడు. అంగదుడి వినయానికి శాంతించిన లక్ష్మణుడు "నాయనా! నీవు పోయి సుగ్రీవుడితో నేను వచ్చానని చెప్పు" అన్నాడు. వెంటనే అంగదుడు పరుగుపరుగున పినతండ్రి అయిన సుగ్రీవుని వద్దకెళ్లి పాదాలకు నమస్కరించాడు. తరువాత తల్లికి, పినతల్లి రుమ పాదాలకు కూడా నమస్కరించాడు. పినతండ్రి మద్యం తాగిన మత్తులో నిద్రపోతున్నాడు. అందువల్ల లక్ష్మణుడు వచ్చిన విషయాన్ని తల్లికి, పినతల్లి రుమకు చెప్పాడు.

అక్కడ లక్ష్మణుని చుట్టూ చేరిన వానర వీరులంతా లక్ష్మణుడి కోపం చల్లారేందుకు విశ్వప్రయత్నం చేశారు. వాళ్ళకు సాధ్యం కాలేదు. సుగ్రీవుడు తప్ప ఇంకెవరూ ఇతణ్ణి శాంతపరచలేరని తెలుసుకున్నారు. అందుకని వాళ్ళంతా కిష్కింధ పిక్కటిల్లిపోయేట్లుగా సింహనాదాలు చేశారు.

ఆ సింహనాదాల ధ్వనితో సుగ్రీవుడికి మెలుకువ వచ్చింది. కళ్ళు తెరిచి చూశాడు. అంగదుడితోపాటు ప్లక్షుడు, ప్రభావుడు అనే ఇద్దరు మంత్రులు కూడా అక్కడే కనిపించారు. ఆ మంత్రులిద్దరూ చాలా దూరదృష్టి గలవాళ్ళు. ఒకడు ధర్మశాస్త్రంలో ఉద్దండుడైతే, మరొకడు అర్థశాస్త్రంలో నిపుణుడు.

మద్యంమైకంలో సుగ్రీవుని కళ్ళు ఎర్రగా ఉన్నాయి. దేవేంద్రుడిలాగా కూర్చున్న సుగ్రీవుణ్ణి వాళ్ళిద్దరూ మంచి మాటలతో స్తుతించి, పసన్నం చేసుకున్నారు. సుగ్రీవుడికి బాగా దగ్గరగా కూర్చుని, ఇట్లా అన్నారు.

మంత్రులు: రాజా! రామలక్ష్మణులు ధర్మాత్ములు. మహా బలశాలురు. మహా సామ్రాజ్యానికి రాజులు. నీతో స్నేహం చేశారు. అనుకున్న ఒప్పందం ప్రకారం నిన్ను రాజుని చేశారు. వాళ్ళిద్దరూ కూడా మానవ రూపంలో ఉన్న దేవతలు. వాళ్ళల్లో లక్ష్మణుడు ధనుస్సు

ధరించి నగరం వాకిటి దగ్గర నిలబడి ఉన్నాడు. అతణ్ణి చూచి వానరులంతా భయంతో ఒణికిపోతున్నారు. సింహనాదాలు చేస్తున్నారు. రాముడి తమ్ముడైన లక్ష్మణుడు రామాజ్ఞచే రాముని కార్యాలనే సారథి తోడ్కొనిరాగా, రామ కార్య నిశ్చయమనే రథం ఎక్కివచ్చాడు.

కాబట్టి ఓ రాజా! నీవు వెంటనే నీ పరివారంతో కలసివెళ్ళు. అతడికి శిరస్సు వంచి నమస్కరించు. నీ శక్తియుక్తులన్నీ ఉపయోగించి అతడి కోపాన్ని శమింపచెయ్యి. నీవు చేసిన ప్రతిజ్ఞను నిజం చెయ్యి. ధర్మాత్ముడైన రాముడికి సంతోషం కలిగించే పనులు చేయటానికి సంసిద్ధుడవవు. చేసుకున్న ఒప్పందం ప్రకారం నడచుకో.

# 32వ సర్గ హనుమంతుడు సుగ్రీవునికి బోధించటం

మంత్రులు, అంగదుడు లక్ష్మణుడు నగరానికి వచ్చాడని చెప్పగానే సుగ్రీవుడు చివాలున లేచి కూర్చున్నాడు. సావధానుడై వాళ్ళతో ఇట్లా అన్నాడు.

సుగ్రీవుడు: మంత్రిసత్తములారా! రాముడి విషయంలో నేను ఏమీ చెడ్డమాట అనలేదు. చెడ్డపని చెయ్యలేదు. లక్ష్మణుడికి కోపం ఎందుకు వచ్చిందో తెలియకుండా ఉంది. ఎవరో గిట్టనివాళ్ళు నాపై లక్ష్మణునికి పితూరీలు చెప్పి ఉంటారు. లేని దోషాలను నాపై కల్పించి చెప్పి ఉంటారు. ఇప్పుడు మనం అందరం నేర్పుగాను, చాకచక్యంతోను ఏం చెయ్యాలో ఆలో చించాలి. నేను వాళ్ళను చూసి భయపడటం లేదు. కానీ, ఒక మంచి మిత్రుడికి నాపై అకారణంగా ఎందుకు కోపం వచ్చిందా అని బాధపడుతున్నాను.

వానరశ్రేష్ఠులారా! స్నేహితులను సంపాదించుకోవటం పెద్ద కష్టమైన పనేమీ కాదు. అయితే, స్నేహాన్ని కలకాలం నిలిచి ఉండేట్లు చూసుకోవడమనేది చాలా కష్టమైన పని. ఎందువల్లనంటే, చిన్న చిన్న విషయాల్లో కూడా మనస్పర్థలు వస్తూ ఉంటాయి. వాటి వల్ల స్నేహం చెడిపోయే ప్రమాదం ఉంటుంది. అందువల్ల నేను రాముడి స్నేహం ఎక్కడ జారవిడుచుకుంటానోనని భయపడుతున్నాను. అతడు నాకు చేసిన సహాయాలు మరువలేను. నేను కూడా అతడికి ప్రత్యుపకారం చేస్తానని మాట ఇచ్చాను. ఇప్పుడు నేను అతడికి ఎట్లా ప్రత్యుపకారం చెయ్యాలా? అని ఆలోచిస్తున్నాను.

హనుమంతుడు: ఓ రాజా! రాముడు ముందూ వెనుకా చూడకుండా నీకు సంతోషం కలిగించేందుకై దేవేంద్రుడితో సమానమైన వాలిని చంపాడు. రాముడు నీ మీద ఉండే స్నేహంతోనే కోపం చూపుతున్నాడు. సందేహం లేదు. అందువల్లనే లక్ష్మణుణ్ణి నీ దగ్గరకు పంపించాడు.

ఓ సుగ్రీవుడా! ఏమరుపాటుతో ఉన్నావు. ఇప్పుడు శరత్కాలం ప్రారంభం అయింది. ఏడాకుల అరటిచెట్లు వికసిస్తున్నాయి. వర్షాకాలం పోయి ఆకాశం నిర్మలంగా ఉంది. నక్షత్రాలు నిర్మలంగా ప్రకాశిస్తున్నాయి. నదులలో సరస్సులలో నీరంతా తేటపడింది.

వానరరాజా! మనం సీతాన్వేషణకు సాయపడతామని మాట ఇచ్చాం. అందుకు సమయం వచ్చింది. ఏమరుపాటుతనం వల్ల నీవు ఆ విషయాన్ని గుర్తించడం లేదు. ఆ విషయం గుర్తుచేయటానికే లక్ష్మణుడు వచ్చాడని స్పష్టమవుతోంది.

ఓ సుగ్రీవా! రాముడి భార్య అపహరించబడ్డది. అందువల్ల రాముడు దుఃఖంలో ఉన్నాడు. అతడు తమ్ముడి ద్వారా సందేశం పంపాడు. నీవు సావధానుడవై లక్ష్మణుని వినయంగా ఆహ్వానించి, అతడు చెప్పేది వినాలి. నీవు భోగాల్లో మునిగిపోయి చేసుకున్న ఒప్పందాన్ని మరచావు. కాలాన్ని వృథాచేశావు. కాబట్టి నీవు లక్ష్మణుడికి చేతులు జోడించి అనుగ్రహించమని వేడుకో. అంతకన్నా మార్గాంతరం కనబడటం లేదు.

ఓ రాజా! రాజుకు ఎప్పుడు ఏ హితాన్ని, ఎంతవరకు చెప్పాలో చెప్పడం నీ మంత్రిగా నా బాధ్యత. అందువల్లనే నిర్భయంగా నీ ఎదుట నిలబడి యథార్థాన్ని చెప్తున్నాను. రాముడికి కోపం వచ్చే పనులు చెయ్యకు. అతడికి కోపం వస్తే దేవతల్ని, అసురుల్ని, గంధర్వుల్నే కాదు ముల్లోకాలనూ జయించగలడు. పూర్వం రాముడు చేసిన ఉపకారాన్ని మనస్సులో ఉంచుకొని, మాటిమాటికి అనుగ్రహించమని కోరటంలో తప్పు లేదు. అందువల్ల రాముని కోపం తగ్గిపోతుంది. నీవు అతడికి శిరస్సు వంచి నమస్కరించు. భర్తకు భార్యవలె వశుడవై ఉండు. అతడికిచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చు.

ఓ వానర రాజా! నీవు మనస్సులో కూడా రామలక్ష్మణుల ఆజ్ఞలను నిర్లక్ష్యం చెయ్యకూడదు. రాముడి బలం ఏమిటో నువ్వే చూశావు. ఇక ఆతడి వద్ద ఉన్న దివ్యాస్త్రాల గూర్చి నీవు ఊహించనైనా ఊహించలేవు సుమా!

# 33వ సర్గ లక్ష్మణుడు సుగ్రీవుని కలుసుకోవటం

సుగ్రీవుని వద్దకు వెళ్ళిన అంగదుడు లక్ష్మణుని వద్దకు వచ్చి లోనికి రమ్మని ఆహ్వానించాడు. శత్రువీరసంహారకుడైన లక్ష్మణుడు పర్వతాల నడుమనున్న కిష్కింధా నగరంలోకి ప్రవేశించాడు. అక్కడే కావలి కాస్తున్న మహాకాయులు, బలవంతులు అయిన వానరులు లక్ష్మణుణ్ణి చూసి భయపడిపోయారు. చేతులు జోడించి వినయంగా ఒదిగి నిలబడ్డారు.

కాంతిమంతుడైన లక్ష్మణుడు కిష్కింధా నగరంలో ప్రవేశించాడు. ఆ పట్టణం అంతా మణులతోను, రత్నాలతోను, ధనికుల ఇళ్లతోను నిండివుంది. వీథులన్నీ ఇరుకుగా ఉన్నాయి. రకరకాలైన వస్తువులు అమ్మే అంగళ్ళున్నాయి. పండ్లు పూలతో సమృద్ధిగా ఉన్న వృక్షాలు అనేకం ఉన్నాయి. దేవతల పుత్రులు, గంధర్వుల పుత్రులు, ఇష్టానుసారం రూపాలు మార్చుకోగల వారు, దివ్యమైన మాలలు, వస్త్రాలు ధరించినవారు, చూసేవారికి ఆనందం కలిగించేవారు అయిన వానరులు అనేకమంది ఆ నగరంలో ఉన్నారు. నగర వీథులన్నీ, మైరేయము, మధువు అనే మద్యముల సువాసనలతో మతెక్కిస్తున్నాయి. అక్కడ వింధ్య, మేరు పర్వతాల్లాంటి ఎత్తైన భవనాల్ని, కొండలపై నుండి ప్రవహించే సెలయేర్లని లక్ష్మణుడు చూశాడు.

దారిలో లక్షణుడు అంగదుని గృహాన్ని చూశాడు. మహాత్ములైన మైంద, ద్వివిద, గవయ గవాక్ష – గజ – శరభ–విద్యున్మాలి–సంపాతి–సూర్యాక్ష–హనుమంతుడు–వీరబాహు–సుబాహు–నలకుమాద–సుషేణ–తార–జాంబవత్–దధివక్త్ర–నీల–సుపాటల–సునేత్రుడు మున్నగు వానరశ్రేష్ఠుల గృహాలనూ చూశాడు.

గంధాలతోను, మాలికలతోను, ధనధాన్యాలతోనూ, ఉత్తమ స్త్రీలతోను, కూడిన ఆ భవనాలన్నీ తెల్లని మేఘాలా అన్నట్లున్నాయి. అక్కడ దేవేంద్రభవనంలాంటి వానరరాజు అంతఃపురం ఉంది. ఆ భవనం చుట్టూ కైలాసశిఖరం లాంటి తెల్లని బురుజుల్తో వెలిగిపోతున్నది.

రకరకాలైన ఫలపుష్ప వృక్షాలతో ప్రకాశవంతంగా ఉంది. అందులో కొన్ని మేఘాల్లాగా ఉండి, దివ్యమైన ఫలపుష్పాలిచ్చేవి, మనోహరములైనవి అయిన దేవేంద్రుడు ఇచ్చిన వృక్షాలు కూడా ఉన్నాయి. ద్వారాలకు రెండు ప్రక్కలా ఆయుధాలు ధరించిన వానరులు కాపలా ఉన్నారు. ఆ ద్వారాలకు తెల్లని పుష్పమాలలు వ్రేలాడదీశారు. అటువంటి సుగ్రీవుడి భవనంలోకి సూర్యుడు మేఘాల్లోకి ప్రవేశించినట్లుగా లక్ష్మణుడు ప్రవేశించాడు. అక్కడ ఎవ్వరూ లక్ష్మణుణ్ణి అడ్డుకునేవారే లేరు.

లక్ష్మణుడు అనేక వాహనాలను, ఏడువాకిళ్ళు దాటుకుంటూ విశాలమైన అంతఃపురంలోకి ప్రవేశించాడు. ప్రవేశించగానే వీణా, తంత్రు నాదాలతో కూడిని మధురధ్వనులు వినబడ్డాయి. అందచందాలతో తొణికిసలాడే యువతులను అనేకమందిని చూశాడు.

ఉత్తమమైన అలంకారాలతో, పుష్పమాలలు ధరించి పుష్పమాలికల్ని కడుతున్న స్త్రీలను, సుగ్రీవుని అనుచరుల్ని చూశాడు. వాళ్ళందరూ ఆనందంతోను, సంతోషంగాను పనిపాటలు చేసుకుంటూ కనిపించారు.

కాంతిమంతుడైన లక్ష్మణునికి అక్కడ స్త్రీల నూపురాల ధ్వనులు, మొలనూళ్ళ సవ్వడులు, స్త్రీల ఆభరణాల చప్పుళ్ళు వినబడ్డాయి. లక్ష్మణునికి కోపం వచ్చింది. ధనుష్టంకారం చేశాడు. కుపితుడైపోయాడు. సభ్యత గల నడవడిక గలవాడు అవటంవల్ల ఒదిగి ఒక ప్రక్కగా నిలబడ్డాడు.

ధనుష్టంకారానికి సుగ్రీవుడు ఉలిక్కిపడ్డాడు. పాన్పుపై నుండి దిగ్గున లేచాడు. లక్ష్మణుడు అంతఃపురంలోకి వచ్చాడని గ్రహించాడు. ఎదుటపడ్డానికి భయపడ్డాడు. గొంతు తడి ఆరిపోయింది. కలవరపడిపోయాడు. అందగత్తె అయిన తారతో ఇట్లా అన్నాడు.

సుగ్రీవుడు: ఓ తారా! లక్ష్మణుడు స్వభావసిద్ధంగా చాలా మెత్తని స్వభావం గలవాడు. ఎందుకో ఇతనికి కోపం వచ్చింది. కోప కారణం తెలియటం లేదు. నీవు చాలా బుద్ధిమంతురాలవు. ఈతడి కోపానికి కారణం ఏమై ఉంటుంది? ఇతడు పురుషోత్తముడు. మన

వల్ల ఏదో అపచారం జరిగి ఉంటుంది. నేను ఎంత ఆలోచించినా, నాకు ఏమీ తెలియటం లేదు. నీకేమైనా స్ఫురిస్తోందా? ఎందుకైనా మంచిది. ముందుగా నీవు పోయి అతణ్ణి మాటల్లో పెట్టు. చల్లగా మధురంగా మాట్లాడు. అతడి కోపం చల్లారేట్లు చూడు. ఎంత కోపిష్టి అయినా ఆడవాళ్ళ విషయంలో దారుణంగా ప్రవర్తించరు గదా? అతడి కోపం చల్లారిన తర్వాత నేను వచ్చి మాట్లాడతాను. కాబట్టి నువ్వు ముందుగా పోయి అతన్ని మాటల్లో పెట్టు.

అప్పటికే సంభోగవివశ కావటం వల్లనూ, మదిరాపానం చేయటం వల్లనూ, తారకు కళ్ళు తిరుగుతున్నట్లున్నాయి. అడుగులు తడబడుతూ బయలుదేరింది. తలవెంట్రుకలన్నీ చెదిరిపోయి ఉన్నాయి. చీర, రవిక నలిగిపోయాయి. మొలత్రాడు వ్రేలాడుతోంది. సుగ్రీవుడి భయాన్ని తొలగించడానికి, ఎట్లా ఉన్నది అట్లాగే బయలుదేరింది. అట్లా తన ముందుకు వచ్చి నిలబడ్డ రాజపత్నిని లక్ష్మణుడు చూశాడు. కొద్దిగా సిగ్గుపడుతూ బిడియంగా తల వంచుకొని నిలబడ్డాడు. అంత మత్తులో ఉన్నా తారకు లక్ష్మణుని ముఖంలో కోపం ఉన్న లక్షణాలు ఎక్కడా కనిపించలేదు. తార లక్ష్మణునితో ఇట్లా అంది.

తార: ఓ రాజపుత్రా! నీ కోపానికి కారణం ఏమిటి? నీకెవరైనా ఎదురు చెప్పారా? అయితే అతడెవరు? ఎండిపోయిన అడవిని దహించే దావానలంతో ఆటలాడాలనుకొంటున్న వాడెవరు?

లక్ష్మణుడు: ఓ తారా! నీవు నీ భర్తకు మేలు జరగాలని కోరుకుంటున్నావు. అందువల్ల అన్నీ తెలిసీ తెలియనట్లు మాట్లాడుతున్నావు. నీ భర్త ధర్మార్థాలను విస్మరించాడు. కాముకుడై విషయ భోగాల్లో మునిగిపోయాడు. రాజకార్యాలు పట్టించుకోవటం మానేశాడు. మేము మీకు చేసిన సహాయాన్ని మరచిపోయి, ఇక మమ్మల్ని గూర్చి తలచనైనా తలచుకోవటం లేదు. తనకు, తన మంత్రులకు విషయభోగాలు తప్ప వేరే ధ్యాసే లేకుండా పోయింది.

ఓ తారా! వానరరాజు సుగ్రీవుడు సైన్యాన్ని సమీకరించేందుకు వర్షాకాలం నాలుగు నెలలు గడువు అడిగాడు. మద్యం, మగువలతో కాలం గడిపేస్తున్నాడే కానీ, గడువు

అయిపోయిందని కూడా అతడికి గుర్తులేదు. ధర్మార్థాలను కాపాడే రాజు ఎవడూ ఇట్లా ప్రవర్తించడు. ఈ విధంగా నిరంతరం మద్యం, మగువలతో కాలం గడిపేస్తూ ఉంటే, ధర్మము, అర్థము, కామము నాశనం అయిపోతాయి. బుద్ధిమంతులెవరూ దీన్ని మెచ్చుకోరు.

ఓ తారా! ఉపకారం చేసిన వాళ్ళకు ప్రత్యుపకారం చెయ్యకుండా ఉండటం కన్నా పెద్ద అధర్మం ఏముంటుంది? ఒప్పందం చేసుకుని ప్రత్యుపకారం చెయ్యకుండా ఉంటే అర్థలోపం అవుతుంది; కామలోపం కూడా అవుతుంది తన అర్థ కామాలకు మూలకారకుడు సత్యధర్మ పరాయణుడైన రాముడు. ఆ అర్థాకామాలకన్నా అధికుడు. సుగ్రీవుడు అటువంటి మిత్రుణ్ణి పోగొట్టుకుంటున్నాడు. ధర్మానికి కట్టుబడక, మిత్ర ద్రోహం చేస్తున్నాడు. అందువల్ల సుగ్రీవుడు ధర్మ, అర్థ, కామాలు మూడింటినీ పోగొట్టుకుంటున్నాడు.

ఓ తారా! నీవు అన్నీ తెలిసిన దానవు. పెద్దదానివి. రాజపత్నివి. సుగ్రీవుడు ప్రత్యుపకారాన్ని మరచి, కాలయాపన చేస్తూ ఉంటే, మేము చూస్తూ ఊరుకుంటామా? నీవే చెప్పు.

లక్ష్మణుడు చెప్పిన మాటలన్నీ చక్కగా ఆలకించిన తార, లక్ష్మణుణ్ణి రాముడు ఎందుకు పంపాడో అర్థం చేసుకుంది. లక్ష్మణుణ్ణి సంతృప్తి పరిచేట్లుగాను, యథార్థాలు ఇట్లా చెప్పింది:

తార: ఓ రాజపుత్రా! ఇది కోపగించుకొనే సమయం కాదు. అందులోనూ, అయినవాళ్ళ మధ్య కోపతాపాలు శ్రేయస్సు చేకూర్చవు. సుగ్రీవుడు మీ వాడు. రాత్రింబవళ్ళు మీ శ్రేయస్సే కోరుకుంటూ ఉంటాడు. నన్ను నమ్ము. అతడు కొద్దికాలం ఏమరుపాటుతో ఉన్నా మీరు అంతగా పట్టించుకోవద్దు. గుణాధికుడు, మహాబలవంతుడు ఎక్కడైనా తనకన్నా బలహీనుడిపై కోపగించుకోవటంలో ఏం ప్రయోజనం ఉంటుంది? నీ వంటి సత్యగుణనిధి, కోపానికి చోటివ్వవచ్చునా?

నాయనా! యుద్ధ ప్రయత్నాల్లో కొంత ఆలస్యం అయిందే కాని అశ్రద్ధ జరగలేదు. ఈ

ఆలస్యానికి రాముడికి కోపం రావటంలో న్యాయముంది. కానీ సుగ్రీవుడు చేసిన మహోపకారాన్ని మాత్రం మరచిపోలేదు. సుగ్రీవుడు, అందుకు తగిన ప్రత్యుపకారం చేయడంలో అప్రమత్తుడయ్యే ఉన్నాడు; ఏర్పాట్లన్నీ చేస్తూనే ఉన్నాడు. నాయనా! మేము అందరం మన్మథుడి దాడికి తట్టుకోలేని వాళ్ళం. అందువల్లనే సుగ్రీవుడు ఇప్పుడు స్త్రీలతో కలసి కామానికి కట్టుబడిపోయాడు. మేము వానరులం కదా! స్వభావసిద్ధంగా చపలచిత్తులం; విషయ లంపటులం అవటంలో ఆశ్చర్యం ఏమీ లేదు. నాయనా! లక్ష్మణా! నీకు ఈ కామ విషయాల్లో అనుభవం లేకపోవటం వల్ల మమ్మల్ని చూసి కోపగించుకుంటున్నావు. కామంతో తపించేవాడు ధర్మార్థాలను, దేశకాలాల గురించి ఆలోచించడు.

నాయనా! నీవు ఉత్తముడవు. నా మాట నమ్ము. సుగ్రీవుడు కామ కలాపాల్లో మునిగి ఉన్నా, మీ విషయంలో ఏమరి లేదు. కార్యసాధనకు అవసరమయ్యే ప్రయత్నాలన్నీ ముమ్మురంగా చేస్తున్నాడు. మా వానరులంతా కోట్లు లక్షలమంది ఉన్నారు. వాళ్ళంతా అడవుల్లోనూ, పర్వతాల్లోనూ, దూరదూర ప్రాంతాల్లోనూ ఉంటూ ఉంటారు. వారందరినీ ఇక్కడకు రప్పించే ప్రయత్నాలన్నీ చేశాడు. వీళ్ళంతా మహా పరాక్రమవంతులు, కామరూపులు. ఇప్పటికే కోట్లకొద్దీ వానరులు కిష్కింధకు వచ్చారు. వానరసేననంతా సిద్ధం చేయడం అయిపోయింది.

నాయనా! ఓ మహాబాహూ! నీవు పరస్త్రీలు ఉన్నారని బిడియపడుతూ ఇక్కడే నిలబడి పోయావు. నీవు సదాచారవంతుడవు. కానీ, మిత్రుల భార్యలను చూడటంలోగానీ, మాట్లాడటంలోగానీ దోషం ఏమీ లేదు. అందువల్ల లోపలకు రా! సుగ్రీవుణ్ణి చూడు. అతడితో మాట్లాడు.

అప్పుడు శత్రు సంహారకుడు, మహాబాహువు అయిన లక్ష్మణుడు, తారతో కలసి అంతః పురంలోకి ప్రవేశించాడు. అక్కడ బంగారు సింహాసనం వంటి ఆసనం పైన సూర్యుని వంటి కాంతితో ప్రకాశిస్తున్న సుగ్రీవుడు కూర్చుని ఉన్నాడు. దివ్యాభరణాలతో అలంకరించుకొని

ఉన్నాడు. ఖరీదైన దుస్తులు ధరించి దేవేంద్రుడిలాగా కనిపించాడు. అతడి చుట్టూ అనేకమంది స్త్రీలు నిలబడి సేవలు చెయ్యటానికి సిద్ధంగా ఉన్నారు. కోపంతో ఎరుపెక్కి ఉన్న కళ్ళతో లోపలకు వస్తున్న లక్ష్మణుడు కాలయముడిలా సుగ్రీవుడి కంటికి కనిపించాడు.

రుమను గాఢంగా కౌగలించుకొని ఆ బంగారు ఆసనంపై కూర్చొని ఉన్న వీరుడైన సుగ్రీవుడు, విశాలనేత్రుడైన లక్ష్మణుని చూశాడు.

## 34వ సర్గ లక్ష్మణ – సుగ్రీవుల సంభాషణ

అన్నగారు పడుతున్న మనోవ్యధకు బాధపడుతున్న లక్ష్మణుడు ప్రజ్వలిస్తున్న కోపంతో సుగ్రీవుడి మందిరంలోకి ప్రవేశించాడు. ఎర్రగా చింతనిప్పుల్లా మండుతున్న కళ్ళతో లోపలకు ప్రవేశించిన లక్ష్మణుని చూస్తూనే సుగ్రీవుడు ఆసనంపై నుండి ఎగిరి నేలపైకి దూకాడు. క్షణంలో లక్ష్మణుణ్ణి సమీపించి చేతులు జోడించి గొప్ప కల్పవృక్షంలాగా లక్ష్మణుని ప్రక్కనే నిలబడ్డాడు. పూర్ణచంద్రుణ్ణి అనుసరించే నక్షత్రాల్లాగా రుమ, ఇతర స్త్రీలు కూడా సుగ్రీవుణ్ణి అనుసరించారు. రుమ మున్నగు స్త్రీలతో కూడి ఉన్న సుగ్రీవుణ్ణి చూస్తూ లక్ష్మణుడు కోపంతో ఇట్లా అన్నాడు.

లక్ష్మణుడు: ఓ సుగ్రీవుడా! బలము, ఉత్తమ బంధుజనము, జాలి కలవాడు, ఇంద్రియాలను జయించినవాడు, కృతజ్ఞుడు, సత్యమునే పలుకువాడు అయిన రాజును ప్రజలు గౌరవిస్తారు.

ఓ సుగ్రీవుడా! ఉపకారం చేసిన స్నేహితులకు, ప్రత్యుపకారం చేస్తానని వాగ్దానం చేసి కూడా, తన మాట నిలబెట్టుకోలేని వాడికంటే క్రూరుడు మరొకడు ఉండడు. గుర్రాన్ని దానం ఇస్తానని మాట ఇచ్చి ఆ దానం చెయ్యని వాడికి కూడా గుర్రాన్ని చంపిన పాపం చుట్టుకుంటుంది. అట్లాగే గోవు విషయంలో అసత్యం పలికితే వెయ్యి గోవుల్ని చంపిన పాపం చుట్టుకుంటుంది. పురుషునికి మాట ఇచ్చి తప్పినవానికి బంధువుని చంపి తనను చంపుకున్నంత పాపం వస్తుంది.

ఓ సుగ్రీవుడా! తనకు కావలసిన పనులు చేయించుకొని ఆ మిత్రునికి ప్రత్యుపకారం చెయ్యకుండా తప్పించుకు తిరిగేవాడిని ప్రజలు క్షమించరు; చంపేస్తారు.

సుగ్రీవుడా! బ్రహ్మదేవుడికి ఒక కృతఘ్నుడి పైన కోపం వచ్చి అన్న మాటలు విను: “గోహత్య చేసిన వాడికి, సురాపానం చేసినవారికి దొంగకు, కృతఘ్నుడికి ప్రాయశ్చిత్తం లేదు.”

సుగ్రీవా! ముందుగా నీ పని చేయించుకున్నావు. ఇప్పుడు రాముడి పని చెయ్యకుండా ముఖం చాటేస్తున్నావు. ఆ విధంగా నీవు కృతఘ్నుడవు, అబద్ధాలకోరువి; దుష్టుడవు. నీవు వర్షాకాలం కాగానే సీతాన్వేషణకై ప్రయత్నం చెయ్యాలి గదా? నీవు ఆ మాటే మరచిపోయి స్త్రీలతో కులుకుతున్నావు. నీవు కప్పకూతలు కూసే సర్పానివని రాముడికి తెలియలేదు. మహాభాగ్యశాలి, మహాత్ముడు, కరుణాశీలి అయిన రాముడు దుష్టబుద్ధివైన నిన్ను వానరులకు రాజుగా చేశాడు. నీవు ఇంకా ఇట్లాగే రాముడి పని గూర్చి పట్టించుకోకుండా ఉంటే, ఇప్పుడే నిమిషాల్లో నిన్ను వాలి దగ్గరకు పంపుతాను. మీ ఇద్దరూ కలసి అక్కడే కొట్టుకుంటూ ఉండవచ్చు. నీవు నిజంగా రాముడి ధనుస్సు నుండి వెలువడే వజ్రాయుధంలాంటి బాణాన్ని రుచి చూడలేదు. అందువల్ల సుఖంగా నీ స్త్రీలతో కాలం గడుపుతున్నావు. అందుకనే రాముడి పనిని చెయ్యకుండా తప్పించుకు తిరుగుతున్నావు.

## 35వ సర్గ తార లక్ష్మణుణ్ణి శాంతపరచడం

తేజస్సుతో వెలిగిపోతున్న లక్ష్మణుని పరుషమైన మాటలు విన్న తార ఇట్లా అన్నది.

తార: ఓ లక్ష్మణా! వానర రాజైన సుగ్రీవుడు కృతజ్ఞత లేనివాడు కాడు. క్రూరుడుగాని, అసత్యం మాట్లాడేవాడు కానీ కాదు. కుటిల స్వభావం కలవాడు అంతకన్నా కాడు. ఓ లక్ష్మణా! నీ వంటి సాధుస్వభావం కలవాడు వానర రాజైన సుగ్రీవుడు ఇంత కఠినమైన మాటలు వినదగినవాడు కాదు.

ఓ లక్ష్మణా! యుద్ధంలో ఇతరులు ఎవరూ చేయలేని సహాయాన్ని రాముడు చేశాడు. సుగ్రీవుడు ఆ ఉపకారం మరచిపోలేదు. ఓ శత్రు సంహారకుడా! రాముడి అనుగ్రహం చేతనే సుగ్రీవుడు రాజ్యాన్ని, కీర్తిని, రుమను, నన్నూ కూడా పొందగలిగాడు. వాలి చేత దేశం నుండి వెళ్ళ గొట్టబడి భార్యకు దూరమై అడవుల్లోనూ, పర్వతాల్లోనూ తలదాచుకోవడం వల్ల సుఖాలకు, భోగాలకు ముఖం వాచి ఉన్నాడు. ఒక్కసారిగా ఈ సుఖం లభించడం, వర్షాకాలం నాలుగు నెలలు రాచకార్యాలకు దూరం కావడంవల్ల రాత్రింబవళ్ళు మద్యంతోను, మాతోను గడిపాడు. ఓ లక్ష్మణా! పూర్వం విశ్వామిత్రుడు ఘృతాచి కనిపించగానే జపతపాలన్నీ మానేసి ఆమెతో పది సంవత్సరాలు ఒక రాత్రి ఒక పగలుగా గడిపేశాడు. కాలవేత్తలలో శ్రేష్ఠుడు, గొప్ప తేజస్సుగలవాడు అయిన విశ్వామిత్రుడే కాలాన్ని గుర్తించలేకపోయాడు. ఇక సామాన్యుల విషయం వేరే చెప్పాలా? అట్లాగే సుగ్రీవుడు కూడా వర్షాకాలం నాలుగు నెలలూ ఒక రోజులాగా గడిపేశాడు! కాలాన్ని గుర్తించలేకపోయాడు.

ఓ లక్ష్మణా! దేహధర్మాన్ననుసరించి విషయసుఖాల పట్ల ఆసక్తుడైనాడు. కాలగమనాన్ని మరచిపోయాడు. రాముడు ఈ తప్పుని క్షమించాలి. కనుక లక్ష్మణా! మా స్థితిగతులు, పరిస్థితులూ అర్థం చేసుకో! సామాన్య మానవుడిలాగా కోపగించుకోవద్దు. అందునా, బుద్ధిమంతులైన నీలాంటి ఉత్తమ పురుషులు కోపానికి వశులు కాకూడదు. రామబాణం శక్తి

ఏమిటో తెలుసుకున్న నేను సుగ్రీవుడి తరఫున నిన్ను వేడుకుంటున్నాను. ఆవేశంలో పుట్టిన కోపాన్ని విడిచిపెట్టు.

ఓ లక్ష్మణా! రామ కార్యానికై సుగ్రీవుడు రుమని, నన్ను, అంగదుణ్ణి, రాజ్యాన్ని సకల సంపదల్నీ కూడా వదులుకుంటాడు. ఇది సత్యం. సుగ్రీవుడు రాక్షసాధకుడైన రావణుణ్ణి వధించి, చంద్రుని రోహిణితో చేర్చినట్లు, రాముణ్ణి సీతతో చేరుస్తాడు. లంకలో రాక్షసులు కోట్ల సంఖ్యలో ఉన్నారట. వారందరూ మాయావులు. తమ ఇష్టానుసారం రూపం మార్చుకుంటూ తిరగగలరు. ముందు ఈ రాక్షసులందరినీ చంపాలి. ఆ తరువాతే రావణుణ్ణి చంపి సీతను పొందగలం. కాబట్టి ఓ లక్ష్మణా! ఇతరుల సహాయం లేకుండా రాముడొక్కడే ఇంతమంది రాక్షసుల్నీ చంపటం కష్టం. అందుచేత సుగ్రీవుడి సహాయం తప్పక అవసరం. అందుకే సుగ్రీవుడు ఎక్కడెక్కడో అరణ్యాల్లోనూ, పర్వతాల్లోనూ ఉండే కోట్లకొలది వానరయోధుల్ని కిష్కింధకు రప్పించాడు.

లక్ష్మణా! రావణుని బలాన్ని గూర్చి లోగడ వాలి నాతో చెప్పాడు. పరాక్రమవంతుడైన సుగ్రీవుడు రాముని కార్యం సఫలం కావడానికై మహాబలశాలురైన వానరుల రాకకోసం ఎదురు చూస్తున్నాడు. వాళ్ళకోసం సుగ్రీవుడు నిరీక్షిస్తున్నాడు. అందువల్ల కూడా రాముడి వద్దకు రాలేకపోయాడు. లక్ష్మణా! వానర యోధులంతా నేడో రేపో వచ్చి చేరుతారు. కోట్లకొలది భల్లూకాలు, కొండముచ్చులు, గొప్ప తేజశ్శాలురైన వానరులు ఈ రోజు సమావేశం అవుతారు. కాబట్టి నీవు కోపాన్ని విడిచిపెట్టు.

ఓ లక్ష్మణా! అంతఃపుర స్త్రీలంతా, కోపంతో ఎర్రబడిన నీ ముఖం, నేత్రాలు చూసి భయభ్రాంతులయి ఉన్నారు. ఎప్పుడు ఏం ముంచుకొస్తుందోనని దిగులుపడుతున్నారు. నేను, రుమ కూడా, వాలికి జరిగిందే, సుగ్రీవుడికి కూడా ఎక్కడ జరుగుతుందోనని భయంతో చస్తున్నాం.

# 36వ సర్గ సుగ్రీవుడు లక్ష్మణుని క్షమించమని వేడుకోవడం

ధర్మసమ్మతంగాను, వినయంగానూ తార పలికిన మాటలతో లక్ష్మణుడు సంతృప్తి చెందాడు. ఆ తరువాత వానరరాజైన సుగ్రీవుడు కూడా మత్తు వదిలించుకున్నాడు. మెడలో ధరించిన పూలమాలలు, ఇతర అలంకారాలు తెంపి పారేశాడు. దాంతో ఒంటికి పట్టిన మత్తు, మదమూ దిగిపోయాయి. లక్ష్మణుడి వల్ల కలిగిన భయాన్ని తడిగుడ్డను విడిచినట్లు విడిచేశాడు. లక్ష్మణుని మనస్సు సంతోష పెట్టేందుకు వినయంగా ఇట్లా అన్నాడు.

సుగ్రీవుడు: లక్ష్మణా! నేను రాముని కటాక్షం చేత శాశ్వతమైన రాజ్యాన్ని, పోయిన కీర్తిని, ఐశ్వర్యాన్ని పొందగలిగాను. అటువంటి సర్వశక్తిపరుడైన రాముడికి ప్రత్యుపకారం చేసే సామర్థ్యం లోకంలో ఎవరికి ఉంది? నేను కేవలం నామమాత్రంగానే ఆ మహానుభావుడి వెనుక ఉంటానే గాని, యథార్థానికి ఆయనకు నా సహాయం అవసరం లేదు. ఆయన ఒక్కడే రావణాసురుణ్ణి సంహరించగలడు. సీతాదేవిని తెచ్చుకోగలడు. ఒక్క బాణం ఏడు మద్ది వృక్షాలను, పర్వతాన్ని, భూమినీ చీల్చుకుంటూ వెళ్ళి తిరిగి ఆయన అంబులపొదిలోకే వచ్చి చేరింది. అటువంటి దివ్యాస్త్రాలు ఆయన వద్ద ఎన్ని ఉన్నాయో ఎవరు లెక్కపెట్టగలరు? అటువంటి మహావీరుడికి ఒకడు సహాయం చెయ్యడం ఏమిటి? రాముడు నారి సంధిస్తే పర్వతాలు, భూమి కంపించాయే! ఆ మహావీరుడికి ఒక వానరుడి సహాయం కావాలా? ఆ నరశ్రేష్ఠుడు రావణాసురుణ్ణి, అతడి సైన్యాన్ని ఒక్కడే సమూలంగా నాశనం చేస్తూ ఉంటే, నేను కూడా ఆ మహానుభావుడి వెనుకనే ఉంటాను. అది నా పూర్వజన్మల్లో చేసుకున్న పుణ్యఫలం. అంతేకాని ఆ మహానుభావుడికి సహాయం చేసేవాడికోసం ముల్లోకాలు వెదికినా ఎక్కడా కనపడదు.

ఓ లక్ష్మణా! స్నేహంలో గాని, తొందరపాటుతనం చేతగానీ నేను ఏదైనా తప్పు చేసి ఉంటే సేవకుడనైన నన్ను ఆ మహానుభావుడు క్షమించాలి. ఎందుకంటే, అంతో ఇంతో అపరాధం

చెయ్యని వాడుండడు గదా!

లక్ష్మణుడు: ఓ వానర రాజా! నీవు వానర రాజువు. విశేషించి వినయశీలుడవు. అందువల్ల నీవంటివాడు అన్నివిధాలా తోడు నీడగా ఉండటం రాముడికి లాభదాయకమే. సుగ్రీవుడా! నీవు మాట్లాడిందీ, మాట్లాడిన తీరూ, నీ పరిశుద్ధమైన స్వభావాన్నీ చూస్తూ ఉంటే నీవే వానర రాజ్యలక్ష్మికి ఉత్తమమైన వారసుడవని అనిపిస్తోంది. త్వరలో రాముడు నీ సహాయంతో యుద్ధం చేసి శత్రుసంహారం చేస్తాడు. సందేహం లేదు. నువ్వు ధర్మం తెలిసినవాడవి; మేలు మరువనివాడవి; యుద్ధం అంటే భయం లేనివాడివి (వెనుతిరగని వాడివి). నీ తోటి స్నేహం చిరకాలం ఉంటుంది.

ఓ సుగ్రీవుడా! నీవు, రాముడు కూడా నిగ్రహించేందుకు, అనుగ్రహించేందుకు కూడా సమర్థులు. అయినా కూడా, చిన్నదైనా, పెద్దదైనా చేసిన తప్పును తెలుసుకొని, తమ దోషాన్ని అంగీకరించే మనోధైర్యం గలవాళ్లు లోకంలో మీ ఇద్దరూ కాక మూడోవాడు ఉండడు.

ఓ వానర శ్రేష్ఠుడా! పరాక్రమంలోను, బలంలోను, సత్యాన్ని, ధర్మాన్ని ఆచరించటంలోను నీవు రాముడితో తగిన వాడవు. దైవీకంగా నీవు మాకు మిత్రుడవయ్యావు. నీ సహాయాన్ని అందిస్తున్నావు. ఓ వీరుడా! నీవు ఇప్పుడే నాతో బయలుదేరి రావాలి. దుఃఖంలో కృశించిపోతున్న నా అన్నగారైన రాముని ఓదార్చాలి... మా అన్న మహావ్యధను చూస్తూ భరించలేకుండా ఉన్నాను. నా అన్నగారి బాధ చూడలేక నీతో పరుషంగా మాట్లాడాను. ఏమీ మనసులో పెట్టుకోవద్దు.

## 37వ సర్గ వానర సేననంతా కిష్కింధకు రప్పించటం

సుగ్రీవుడు, లక్ష్మణుడు మాట్లాడుకుంటూ ఉండగా హనుమంతుడు అక్కడే ఉన్నాడు. సుగ్రీవుడు హనుమంతుడితో ఇట్లా అన్నాడు.

సుగ్రీవుడు: హనుమంతుడా! మహేంద్ర పర్వతం మీదా, హిమాలయ పర్వతాల మీదా, వింధ్యపర్వతాల మీదా, కైలాసపర్వతం మీదా, మందర పర్వతం మీదా ఉన్న వానర శ్రేష్ఠులందరినీ పిలిపించు. అట్లాగే, పడమటి సముద్రతీరాన ఉండే పర్వతాల మీద, ఉదయపర్వతాల మీద ఉండే వానరవీరులందరికీ వెంటనే రమ్మని కబురు చెయ్యి. పద్మతాళవనంలో నివసించే వానరులను, అంజనపర్వతంపైన నివసించే భయంకరమైన వానర యోధుల్ని, కాటుకరాసుల వలెను, కారుమబ్బుల్లాగాను, మదించిన ఏనుగుల్లాగాను ఉండే భయంకరమైన వానరయోధులను రమ్మని కబురు చెయ్యి. మహాశైలగుహల్లో బంగారుకాంతులతో ప్రకాశించే బలవంతులైన వానరులందరినీ రమ్మని కబురుపంపు. మేరుపర్వత సానువుల్లో ఉంటున్న వానరులను, ధూమ్రగిరి మీద వసిస్తున్న వారిని, అస్త్రాద్రి మీద అరుణకాంతులతో తేజరిల్లే కపియోధుల్ని, ఘుమ, ఘుమ సువాసనలు వెదజల్లే మైరాయ మద్యాన్ని ప్రీతితో త్రాగుతూ భీమవేగులుగా ఉంటున్నవారిని, మహా తపస్యుల ఆశ్రమాల్లో ఉంటున్న వారిని, ఇంకా ఈ నేలపై ఎక్కడెక్కడ ఉండే వానర యోధులందరినీ వెంటనే కిష్కింధకు చేరుకోమని కబురు పంపు.

ఓ హనుమంతుడా! ఈ చోట్లకు ఇదివరకే కబురు పంపించాను. అంతా బయలుదేరి ఉంటారు. అయినా, మరికొందరిని పై ప్రదేశాలన్నింటికీ పంపించు.

ఓ హనుమంతుడా! ఇప్పటిదాకా విషయసుఖాల్లో మునిగిపోయింది చాలని చెప్పి పంపు. ఇప్పుడు యుద్ధానికి వెళ్ళే సమయం వచ్చింది, కాబట్టి సోమరిపోతుతనాన్ని విడిచిపెట్టి వెంటనే బయలుదేరమని నా ఆజ్ఞగా చెప్పు. నా ఆజ్ఞను ఎవరైనా మీరితే అక్కడికక్కడే మరణదండన

విధించు. అంతా పది రోజుల్లో ఇక్కడ ఉండాలని చెప్పు. కపి సింహాలన్నీ అన్ని ప్రాంతాలనుండి వెంటనే కిష్కింధకు రావాలని మన సైన్యంలోని భయంకరాకారుల్ని, పర్వతాల్లాంటి వారిని పంపించు. మేఘాలను తాకుతూ వేగంగా ఆకాశంలో పొమ్మను.

అప్పుడు హనుమంతుడు పరాక్రమవంతులు, ఏనుగుల వంటి భయంకరాకారాలు గలవాళ్ళను ఎంచి ఆకాశమార్గాన అన్ని దిక్కులకూ పంపాడు. ఆ వెళ్ళిన వాళ్ళు పర్వతాలకు వెళ్ళారు, సరస్సుల, నదీతీరాలకు వెళ్ళారు, సముద్రం మధ్యన ఉన్న ద్వీపాలకు వెళ్ళారు. మహారణ్యాలకు వెళ్ళారు. అక్కడున్న వానరులందరికీ రాముని కార్యంకోసం బయలుదేరాలని చెప్పారు. ఇది సుగ్రీవాజ్ఞ అని చెప్పారు. ఆ వానరులంతా రాజాజ్ఞను ధిక్కరించటానికి భయపడ్డారు. వెంటనే బయలుదేరారు. ఒక్కొక్క ప్రక్కనుండీ రోజూ వేలు, లక్షల్లో వానరులు కిష్కింధకు బయలుదేరారు.

రామకార్యం కోసం, అంజనపర్వతంపైనుండి కాటుకలాగా నల్లగా ఉండే వానరయోధులు మూడు కోట్ల మంది వచ్చారు. అస్తగిరి పర్వతం పైనుండి బంగారుకాంతులీనే దేహాల్లో ఉండే వానరులు పది కోట్లమంది వచ్చారు. వింధ్యపర్వతాలనుండి అంగారకకాంతుల్తో ఉండేవారు భయంకరమైన కార్యాలు చేసేవాళ్ళు అయిన వానర సింహాలు అనేక కోట్ల మంది వచ్చారు. పాల సముద్రం గట్టులపైన టెంకాయలు తినే వానరులు కోట్లకొద్దీ బయలుదేరారు. అడవుల్లోను, కొండల్లోను, గుహల్లోను నివసించే వానరులంతా సూర్యుణ్ణి మింగేట్లుగా బయలుదేరారు.

అంతకు ముందే నీలుడు వానరవీరుల్ని పిలవటానికి నాలుగు మూలలకూ వానరులను పంపించాడు. అందులో, హిమాలయాలకు వెళ్ళినవారు శివుడి యజ్ఞవాటికలోని మహావృక్షాన్ని చూశారు. పూర్వం దేవతల్ని సంతోషపెట్టడానికి మహేశ్వరుని ఉద్దేశించి యజ్ఞం ఒకటి ఆ పర్వతంపైన జరిగింది. హోమం చేస్తూ ఉండగా హవిస్సులు జారి నేలమీద పడ్డాయి. ఆ హవిస్సుల మూలంగా క్షేత్రం అంతా పవిత్రం అయింది. అక్కడున్న వృక్షాలు, తీగలు, పాదులు

అన్నీ దేవతా లక్షణాలను సంతరించుకున్నాయి. ఆ క్షేత్రంలో దొరికే కందమూలాలు పండ్లు అమృతత్వాన్ని పొందాయి. అందువల్ల ఆ ఫలాలుగాని, కందమూలాలు గానీ తిన్నవారికి నెలరోజుల దాకా ఆకలి దప్పికలుండవు. అక్కడి నుండి బయలుదేరే వానరులంతా సుగ్రీవుణ్ణి సంతోష పరచేందుకు వాళ్ళు మోయగలిగినన్ని ఫలాలు, కందమూలాలు, దివ్యౌషధాలు, యజ్ఞవాటికలో పూసే సుగంధ పుష్పాల్ని తీసుకొని బయలుదేరారు.

ఆ విధంగా కిష్కింధనుండి పిలవటానికి వెళ్ళిన వానర యోధులంతా, అందరినీ సత్వరమే కిష్కింధకు చేరుకోమని చెప్పి తిరిగివచ్చారు. తిరిగివచ్చిన వానరయోధులంతా సుగ్రీవుణ్ణి చూసి ఆయా ప్రాంతాలనుండి వారు తెచ్చిన సంబారాలన్నీ సమర్పించి, "ఓ రాజా! మేము మీ ఆ దేశాలను శిరసావహించి సప్తసముద్ర ద్వీపకల్పాలలో నివసిస్తున్న వానరయోధులకూ, మహారణ్యాల్లో నివసిస్తున్న వానరయోధులకూ అందరికీ తమ ఆజ్ఞను తెలియబరచాము. భూమిపైన ఉండే వానరులంతా బయలుదేరుతున్నారు. రామకార్యానికి వానరులంతా నడుం బిగించారు. ఈ విషయం మీకు చెప్పాలని ముందుగా వచ్చాం" అన్నారు. అప్పుడు సుగ్రీవుడు తన ఆజ్ఞను వానరులంతా శిరసావహించినందుకు సంతోషించాడు. వారు తెచ్చిన కానుకలన్నీ సంతోషంతో స్వీకరించాడు.

# 38వ సర్గ సుగ్రీవుడు రాముని దర్శించటం

వానరయోధులు వివిధ ప్రాంతాల నుండి తెచ్చి సమర్పించిన కానుక లన్నింటినీ తీసుకొని సుగ్రీవుడు వాళ్ళందరినీ పంపేశాడు. ఆహా! నేను రామునికిచ్చిన ప్రతిజ్ఞను నెరవేర్చగలను అని తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు. సంతోషపడ్డాడు. అప్పుడు లక్ష్మణుడు కూడా సుగ్రీవుడి ప్రయత్నాల్ని చూసి సంతృప్తి చెందాడు. తరువాత సుగ్రీవుడితో "ఓ సుగ్రీవుడా! నీవు నాతో కూడా వెంటనే రాముని వద్దకు రా. నాతో చెప్పిందంతా రాముడికే ప్రత్యక్షంగా చెప్పు. రాముడికి సంతోషం కలిగించు" అన్నాడు. సుగ్రీవుడు "సరే! అట్లాగే వస్తాను" అన్నాడు.

వెంటనే సుగ్రీవుడు అంతఃపురంలో పనిచేసే సేవకుల్ని పిలిచి, వెంటనే తన పల్లకీని ఏర్పాటు చెయ్యమని చెప్పాడు. వాళ్ళంతా సుగ్రీవుని ఆజ్ఞ విని వాయువేగంతో పల్లకీని సిద్ధం చేశారు. ఆ పల్లకీ సూర్యుడితో సమానంగా వెలిగిపోతోంది. ఆ పల్లకీని మోసేందుకు మహా బలవంతులైన వాహకులు వచ్చి సిద్ధంగా నిలబడ్డారు. వానర రాజ్యలక్ష్మిచే వరించబడ్డ సుగ్రీవుడికోసం శ్వేతఛత్రం, వింజామరలు పట్టుకుని నిలబడ్డారు. అప్పుడు రాజఠీవితో లక్ష్మణుణ్ణి పల్లకీ వద్దకు రాజమర్యాదలతో తీసుకొని వచ్చి పల్లకీలో కూర్చోబెట్టాడు. తానూ పల్లకీలోనే కూర్చున్నాడు. ఇద్దరూ కలసి రామ దర్శనం చేసుకునేందుకు బయలుదేరారు. వానరసేన అంతా వారిని అనుసరించారు.

ఆ పల్లకీ రాముడు నివసిస్తున్న ప్రస్రవణ పర్వతంపైకి చేరింది. మహాతేజోవంతుడైన సుగ్రీవుడు, మహాబలశాలి అయిన లక్ష్మణుడు ఆ పల్లకీలో నుండి క్రిందకు దిగారు. సుగ్రీవుడు రాముడికి దగ్గరగా పోయి దోసిలికట్టి తలవంచి వినయంగా నిలబడ్డాడు. సుగ్రీవుడితో కూడా వచ్చిన లక్షలాది వానరసేన కూడా అట్లాగే రాముడికి చేతులు జోడించి తలవంచి వినయంగా నిలబడ్డారు. తరువాత సుగ్రీవుడు రాముని పాదాలపైన శిరస్సు ఉంచి నమస్కరించాడు. రాముడు తన పాదాలకు నమస్కరిస్తున్న సుగ్రీవుణ్ణి లేవనెత్తి ప్రేమగాను, గౌరవభావంతోను

కౌగలించుకొన్నాడు. తదనంతరం తన ప్రక్కనే కూర్చోబెట్టుకొని ఇట్లా అన్నాడు.

రాముడు: వీరుడవైన ఓ సుగ్రీవుడా! ధర్మార్థకామాలకు సరి అయిన సమయాన్ని నిర్ణయించుకొని ఆయా సమయాల్లో వాటిని అనుష్ఠించేవాడు మాత్రమే రాజు అని పిలువబడతాడు. అట్లా కాకుండా ధర్మార్థాలను విడిచిపెట్టి కామాలను మాత్రమే అనుసరించేవాడు, చెట్టు చివరికొమ్మపైన నిద్రించినవాడు కింద పడిన తర్వాత మేలుకొన్నట్లుగా, ఆపదల్లో చిక్కుకున్న తర్వాతనే తన తప్పును తెలుసుకుంటాడు. శత్రుసంహారం చేస్తూనే, మిత్రులను సంపాదించుకోవడం, సంపాదించిన స్నేహాన్ని కాపాడుకోవడం వల్ల రాజధర్మాన్ని పాలించినవాడవుతాడు. అటువంటివాడే ధర్మార్థ కామాల ఫలాల్ని అనుభవించగలుగుతాడు.

ఓ శత్రు సంహారకుడా! సుగ్రీవా! మనం శత్రువును సంహరించాల్సిన సమయం వచ్చింది. దానికి సంబంధించిన వ్యూహమంతా నీ మంత్రులతో ఆలోచించు.

సుగ్రీవుడు: ఓ రామా! నీ అనుగ్రహం చేత పోయిన కీర్తిని, రాజ్యాన్ని ఐశ్వర్యాన్ని పొందాను.

ఓ ప్రభూ! నీవు, నీ సోదరుడు నన్ను అనుగ్రహించి చేసిన ఈ ఉపకారానికి ప్రత్యుపకారం చెయ్యకపోతే నేను అధర్మపరుణ్ణవుతాను. రామా! నా సైనికులు ఈ భూమిపైన ఉండే కోట్లాది వానరులందరినీ సమకూర్చుకొని రామకార్యం కోసం కిష్కింధలో సమీకృతులయ్యారు. మహారణ్యాల్లోను, పర్వతాలమీద, దుర్గాల్లోను నివసిస్తున్నవారు, చూట్టానికే భయంకరమైన ఆకారాలు గల భల్లూకాలు, వానరులు, శూరులైన గోలాంగ వాలములు, తమ ఇష్టమైన రూపాన్ని ధరించగలిగినవారు, దేవగంధర్వుల పుత్రులు, అయిన వానర సైన్యం ఇంకా మార్గమధ్యంలో ఉన్నారు.

ఓ రాజా! వీరంతా శతము, లక్ష, కోటి, అయుతము, శంకువు, అర్బుదము, నూరు అర్బుదములు, మధ్య, అంత్యము అను సంఖ్యలో ఉన్న వానరులతో కూడిన వానర నాయకులు

మార్గమధ్యంలో ఉన్నారు. వారంతా మహేంద్రునితో సమానమైన పరాక్రమం గలవారు. వాళ్ళంతా, మేరు, వింధ్యపర్వతాల వంటి అనేక ప్రదేశాల నుండి వచ్చి నీ పాదసేవ చేయబోతున్నారు.

[నూరు వేలు లక్ష. నూరు లక్షలు కోటి. పదివేలు అయుతము. లక్ష కోట్లు శంకువు. వెయ్యి శంకువులు అర్బుదము. పది అర్బుదములు మధ్యము. పది మధ్యములు అంత్యము. ఇరవై అంత్యములు సముద్రము. ముప్పై సముద్రములు పరార్థము. అంటే అసంఖ్యాకములైన వానరులు వస్తున్నారన్న భావంతో చెప్పబడ్డది. జోతిశ్శాస్త్రంలో చెప్పిన ఈ సంఖ్యా లక్షణాలు పదిరెట్లు చొప్పున పెరుగుతూ పోతాయి.]

ఓ రామా! ఈ వానరులంతా నీ సేవచేయటానికి త్వరలో వస్తున్నారు. రాక్షసుడైన రావణుణ్ణి, వాడి బంధువుల్ని చంపుతారు. సీతను తప్పకుండా తీసుకువస్తారు.

అప్పుడు పరాక్రమశాలి అయిన రాముడు, సుగ్రీవుడు తన ఆజ్ఞను పాలించి చేస్తున్న ప్రయత్నాలు చూసి సంతోషించాడు. ఆ సంతోషంలో రాముని నేత్రాలు కలువలు వికసించినట్లు వికసించాయి.

## 39వ సర్గ రామ సుగ్రీవులకు వానరసేన వందన సమర్పణ చేయటం

సుగ్రీవుడు చేతులు జోడిస్తూ, వినయంగా రాముడి పాదాలకు నమస్కారం చేయగా రాముడు సుగ్రీవుణ్ణి లేవనెత్తి కౌగలించుకొని ఇట్లా అన్నాడు:

రాముడు: ఓ సౌమ్యుడా! ఇంద్రుడు వానలు కురిపించడంలోను, సూర్యుడు చీకట్లను తొలగించడంలోను, చంద్రుడు చల్లదనాన్ని ఇవ్వడంలోను ఆశ్చర్యం ఏమీ లేదు. అది వాళ్ళ సహజధర్మం. అట్లాగే నీలాంటి మిత్రుడు ప్రత్యుపకారం చేయడం కూడా అంతే సహజం. ఓ సుగ్రీవుడా! నీవు శత్రువులకు భయంకరుడవు. మిత్రులకు ప్రత్యుపకారం చేసి సంతోషపెడ్తూ ఉంటావు. అదే నీ స్వభావం. ఓ మిత్రుడా! నీవు నా ప్రక్కన తోడుగా ఉంటే చాలు. లోకంలో శత్రువులందరినీ నాశనం చేయగలను. మనం మనస్సులు కలిసిన స్నేహితులం! మనది దైవం ఏర్పాటు చేసిన స్నేహం. కాబట్టి నాకు తోడుగా ఉండేందుకు నీవే తగినవాడివి.

సుగ్రీవుడా! పూర్వం శచీదేవి తండ్రి అయిన పులోముని సహాయంతోనే అనుహ్లాదుడు శచీదేవిని దేవేంద్రుని వద్ద నుండి అపహరించాడు. ఆ తరువాత దేవేంద్రుడు వారిద్దరినీ సంహరించి శచీదేవిని పొందాడు. అట్లాగే రావణుడు తన వినాశనానికే మారీచుడి సహాయంతో సీతను మోసగించి అపహరించాడు. నేను మారీచుణ్ణి సంహరించాను. ఇంకా రావణుడు మిగిలి ఉన్నాడు. త్వరలోనే వాడియైన నా బాణంతో వాణ్ణి సంహరిస్తాను. నీవు నాకు తోడుగా ప్రక్కన ఉంటే చాలు. సీతను తిరిగి తీసుకొని వస్తాను.

వీళ్ళిద్దరూ ఇట్లా మాట్లాడుకుంటూ ఉండగానే ఆకాశం అంతా పెద్ద పెట్టున దుమ్ము లేచింది. సూర్యుడు కూడా కనిపించకుండాపోయాడు. దిక్కులు తెలియకుండాపోయాయి. భూమి కంపిస్తోందా? అన్నట్లుంది.

మహాపర్వతాల్లా బలిసినవాళ్ళు, మహా బలవంతులు, వాడి అయిన కోరలున్నవాళ్ళు

అయిన వానరవీరులు లక్షల సంఖ్యలో రామ సుగ్రీవులున్న పర్వత ప్రాంతానికి వస్తున్నారు. కోట్లానుకోట్లుగా వస్తున్న వానర వీరులతో పర్వతం, అడవులు, చెట్లు, చేమలు అన్నీ నిండిపోయాయి. వాళ్ళంతా మేఘాల్లా గర్జిస్తూ వస్తూంటే పులులూ సింహాలే భయంతో పరుగులుపెట్టాయి. వాళ్ళంతా మహా బలవంతులేకాక, కామరూపులు కూడాను. వాళ్ళ ఇష్టానుసారం ఏ రూపాన్నైనా ధరించగలరు. ఒక్కొక్క వానరనాయకుడు కోటిమంది వానరుల్ని వెంటబెట్టుకొచ్చాడు.

మహా పరాక్రమవంతుడు, శ్రీమంతుడు అయిన శతబలి వెంట మేరు పర్వతం నుండి పదివేలకోట్ల మంది వచ్చారు. వాళ్ళంతా ఉదయ సూర్యుడిలాగా ఎర్రగాను, కొందరు చంద్రకాంతిని బోలి తెల్లగాను, మరి కొందరు కింజిల్కములవంటి కాంతితోను ఉన్నారు.

మేరుపర్వత మంతటివాడు, మహాశూరుడు, తార తండ్రి అయిన సుషేణుడు వెయ్యికోట్ల మంది వానరులను తెచ్చాడు. సుగ్రీవుడి మామ, రుమ తండ్రి అయిన తారుడు వెయ్యికోట్ల మంది వానరుల్ని తీసుకువచ్చాడు.

వానరులలో శ్రేష్ఠుడు, మహా బలవంతుడు, హనుమంతుడి తండ్రి అయిన కేసరి వేల సంఖ్యలో వానర వీరులను వెంటబెట్టుకొని వచ్చాడు. గోలాంగులకు (కొండముచ్చులకు) మహారాజైన గవాక్షుడు వెయ్యికోట్ల మంది వానర సేనను వెంటబెట్టుకొనివచ్చాడు. శత్రు భయంకరుడైన ధూమ్రుడు రెండువేల కోట్ల మంది భల్లూకవీరులను వెంటబెట్టుకొచ్చారు. మహావీరుడైన పవనుడు పర్వతాకారులు, మహాబలాఢ్యులు అయిన మూడు కోట్లమంది వానర సేనలను వెంటబెట్టుకొని వచ్చాడు. నల్లగా కాటుకరాశిలా కనిపించే నీలుడు పదికోట్లమంది వానరయోధుల్ని వెంటబెట్టుకొని వచ్చాడు. బంగారువన్నెతో ఉండే గవయుడు ఐదు కోట్ల మంది వానర యోధుల్ని వెంటబెట్టుకొచ్చాడు. మహాబలాఢ్యుడైన దరీముఖుడనే యోధుడు వెయ్యికోట్ల మంది వానరులతో వచ్చాడు. వారంతా సుగ్రీవుడికి ఎదురుగా నిలబడ్డారు.

మహాబలవంతులు, అశ్వనీదేవతల పుత్రులు అయిన మైందుడు, ద్వివిదుడు చెరో వెయ్యి కోట్లమంది వానరుల్ని తీసుకొని వచ్చారు. మహా బలశాలి అయిన గజుడు మూడు కోట్ల మంది వానరయోధుల్ని తీసుకువచ్చాడు. గొప్ప తేజశ్శాలి అయిన జాంబవంతుడు పదికోట్ల మంది భల్లూకవీరుల్ని తీసుకువచ్చాడు. వారు కూడా వచ్చి సుగ్రీవుడి ప్రక్కనే నిలబడ్డారు. మహా పరాక్రమవంతుడైన రుమణుడు నూరుకోట్ల మంది వానర వీరుల్ని తీసుకువచ్చాడు. గంధమాదనుడు అనే వానరవీరుడు పదిలక్షల కోట్ల మంది వానరుల్ని వెంటబెట్టుకువచ్చాడు.

యువరాజైన అంగదుడు వెయ్యికోట్ల మందిని, భీమపరాక్రమవంతుడైన తారుడు (రుమ తండ్రి కాదు) అయిదు కోట్ల మంది యోధులతోను, మహా పరాక్రమశాలి అయిన ఇంద్రజానువు గొప్ప వానర సైన్యాల్ని, రంభుడు అయుతముతోను, సహస్రముతోను, శతముతోను కూడినదైన వానర సేనతో వచ్చాడు. దుర్ముఖుడు రెండు కోట్ల వానరులను వెంటబెట్టుకొని వచ్చారు. హనుమంతుడు వెయ్యికోట్ల మందిని వెంటబెట్టుకొని వచ్చాడు. పరాక్రమవంతుడైన నలుడు వందకోట్ల మందిని వెంటబెట్టుకొని వచ్చాడు. శ్రీమంతుడైన దశముఖుడనే వానర నాయకుడు పది కోట్ల వానరుల్తో వచ్చాడు.

శరభుడు, కుముదుడు, వహ్ని, రంభుడు మున్నగు వారంతా అసంఖ్యాకంగా వానరులను తీసుకొనివచ్చారు. శ్రేష్ఠులైన ఆ మహావీరులంతా సుగ్రీవునకు తమ రాకను తెలియపరచుకొన్నారు. అప్పుడు సుగ్రీవుడు కూడా వారందరినీ అభినందించి, రామునికి కూడా పరిచయం చేశాడు. తరువాత సుగ్రీవుడు “ఓ వానర నాయకులారా! మీ సేనలన్నింటినీ నదీ తీరాన, సెలయేళ్ళవద్ద, పర్వతంపైన, అడవుల్లో నిలిపి ఉంచండి. వారందరినీ రాముడు పర్యవేక్షించి మన బలాన్ని గూర్చి ఒక అవగాహనకు రాగలడు” అన్నాడు.

# 40వ సర్గ వానరులకు సుగ్రీవుని ఆదేశం

వానరరాజైన సుగ్రీవుడు, నరశ్రేష్ఠుడైన రాముడికి తన వానర సేననంతా పరిచయం చేస్తూ ఇట్లా అన్నాడు.

సుగ్రీవుడు: ఓ ప్రభూ! మహాబలవంతులు, స్వేచ్ఛతో సంచరించేవారు, మహేంద్రుడి వంటి పరాక్రమవంతులు అయిన ఈ వానర వీరులంతా వివిధ దేశాలలో నా అధీనంలో నివసిస్తున్నారు. వీరు దైత్యులతోను, దానవులతోను సమానమైన భయంకరులు. గొప్ప బలపరాక్రమాలు కలిగినవారు.

ఓ రామా! నేలపైనా, నీటిలో కూడా ప్రయాణం చెయ్యగల కోట్ల సంఖ్యలో ఉన్న ఈ వానరసైన్యం అంతా నీ అధీనంలో ఉంటుంది. ఇకపై వారంతా నీ సేవకులు. పూర్వం వీరు సాధించిన పనులన్నీ ప్రసిద్ధి చెందినవి. వీరు మహా సాహసవంతులు, అలసట తెలియనివారు. వీళ్ళంతా కూడా ప్రభుభక్తిపరాయణులే. నీవు ఏ పని చెయ్యమంటే ఆ పని చేసుకొచ్చి నీ ముందు నిలబడతారు. కాబట్టి ఓ రామా! ఇప్పుడు ఏం చెయ్యాలో, ఎట్లా చెయ్యాలో వీళ్ళకు ఆదేశాలివ్వు. ఏం చేయాలో నాకు తెలిసినప్పటికీ వీళ్లకు ఆజ్ఞలు ఇవ్వవలసినవాడవు నీవే సుమా!

రాముడు (సుగ్రీవుని కౌగలించుకొని) : ఓ బుద్ధిమంతుడా! సుగ్రీవుడా! ముందుగా సీత జీవించి ఉందా? లేదా? అన్న విషయం తెలుసుకోవాలి. ఆ తరువాత, ఆ రావణుడు ఎక్కడుంటాడు? అతడి దేశం ఎక్కడుంది అని తెలుసుకోవాలి. ముందు ఈ విషయం తెలిసిన తర్వాత నేను మిగతా విషయాలు నీతో చర్చిస్తాను. కాబట్టి సీతాన్వేషణకై ప్రయత్నించు.

ఓ వానర రాజా! సీతాన్వేషణ విషయంలో నా కన్నా, లక్ష్మణుడి కన్నా నీవే సమర్థుడవు. ఆ పని నీ చేతుల మీదుగానే జరగాలి. నువ్వు నాకు ఎంతో ఆప్తుడవు. నా హితం కోరే స్నేహితుడవు. నీ బుద్ధిబలంతో ఎవరెవరిని, ఏఏ విధంగా నియోగించాలో, ఎంతకాలం లోపు ఈ

అన్వేషణ పూర్తి చెయ్యాలో నీవే ఒక పథకం తయారుచెయ్యి.

సుగ్రీవుడు (వినతుడనే సేనానితో): ఓ వినతుడా! వింటున్నావా! రామలక్ష్మణులు సీతాన్వేషణ బాధ్యతను నాకే అప్పగించారు. కాబట్టి నీవు సూర్యచంద్రులతో సమానమైన బలంగల వానరుల్ని లక్షమందిని తీసుకుని తూర్పుదిక్కుగా వెళ్ళు. కొండలు, అడవులు, దుర్గాలు ఒక్కటి కూడా విడవకుండా అన్నిచోట్లా వెతకండి. నీవు దేశమును, కాలమును, నీటిని గుర్తించి పనులు చెయ్యడంలో సమర్థుడవు. ఆయా ప్రదేశాల్లో ఎక్కడైనా రావణుడి స్థావరాలున్నాయేమో విచారించండి. అక్కడ సీతమ్మను దాచాడేమో తెలుసుకోండి.

మీరు వెళ్ళే దారిలో గంగా, సరయూ, కౌశికీ, యమున, సరస్వతీ, సింధు నదులు ప్రవహించే ప్రాంతాలన్నీ వెతకండి. బ్రహ్మమాల, విదేహ, మాళవ, కాశీ, కోసల, మగధ, పుండ్ర, అంగ, వంగ దేశాలలోను, పట్టునూలు లభించే కోశకార రాజుల పట్టణాల్లోను, వెండి గనులున్న భూముల్లోను, సీత కోసం వెదకండి.

[హిమవత్పర్వతానికి, వింధ్య పర్వతానికి మధ్యన శరావతి అనే నది వలయాకారంలో ప్రవహిస్తూ ఉంటుంది. ఇప్పుడు చెప్పిన ప్రదేశాలన్నీ ఆ నదికి తూర్పున ఉన్నాయనీ, కిష్కింధకు కాదని గోవిందురాజులు వ్యాఖ్యానించారు. ఆర్యావర్త దేశానికి తూర్పున వెదకమని సుగ్రీవుని అభిప్రాయమని మహేశ్వర తీర్థులవారి వ్యాఖ్య.]

ఓ వానరయోధుడా! తూర్పు దిక్కున ఉండే పట్టణాలలోను, మందర పర్వతంపైన, సముద్రాల్లోపల ఉన్న పర్వతాల్లోను వెతకాలి. అక్కడ కొందరికి చెవులకే మూతలు ఉంటాయి; కొందరికి పెదవుల్లాంటి చెవులు ఉంటాయి. కొందరి ముఖాలు భయంకరంగా ఇనుముతో చేసినట్లుంటాయి. కొంతమంది ఒక అడుగు వేస్తే ఎంతో దూరం పోగలుగుతారు. కొందరు బలవంతులైన నరమాంస భక్షకులూ, కొందరు చింపిరిజుట్టువాళ్ళు; బంగారు కాంతులు గల దేహాలుంటాయేగానీ, కిరాతకులు. పచ్చి చేపలు తినేవాళ్ళు, నీళ్ళల్లో స్వేచ్ఛగా తిరగ్గలిగేవాళ్ళు.

నరులరూపంలో ఉండే పెద్దపులుల వంటివారు మీకు కనిపిస్తారు. వీళ్ళందరూ నివసించే ప్రదేశాలన్నీ వెతకాలి. (ఇది జంబూద్వీప వర్ణనమని వ్యాఖ్యాతల అభిప్రాయం)

ఓ వానరయోధుడా! మీరు యవద్వీపానికి పోండి. అక్కడ రత్నాల గనులున్నాయి. ఆ ద్వీపం ఏడు ఖండాలుగా కనిపిస్తుంది. అక్కడే బంగారం దొరికే ద్వీపం ఉంది. దాన్ని సువర్ణ రూపక్యం అంటారు. ముఖ్యంగా ఈ రెండు ద్వీపాలను ఒక అంగుళమైనా విడవకుండా వెతకాలి. కొన్ని చోట్లకు ఆకాశంలో ఎగిరిపోవాల్సి ఉంటుంది. ఇంకొన్ని చోట్లకు నీళ్ళల్లో ఈదుకుంటూ పోవాల్సి ఉంటుంది. ఆ ప్రాంతాల్లో రావణాసురుడి జాడగాని సీతాదేవి జాడగానీ దొరక్కపోతే, ఆ యవ ద్వీపానికి రెండవ ప్రక్క దానవులుండే శిశిర పర్వతానికి పోయి చూడండి. అక్కడ ఎత్తైన శిఖరాలు కూడా ఉన్నాయి. మీరంతా రాత్రింబవళ్ళు ఎంతో అప్రమత్తులై సీతాదేవి ఆచూకీ తెలుసుకోవాలి.

ఓ వానరశ్రేష్ఠుడా! నీవు ప్లక్ష ద్వీపానికి కూడా వెళ్లి వెతుకు. అక్కడ సముద్రానికి సమీపంలోనే శోణమనే నది ఉంది. ఆ నదిలో నీళ్ళు ఎర్రగా రక్తంలాగా ఉంటాయి. అది బాగా లోతైన నది. ఆ నదీతీరాల్లో సిద్ధులు, చారణులు నివసిస్తూ ఉంటారు. అక్కడే చిత్రమైన అడవులు కూడా ఉన్నాయి. అక్కడెక్కడైనా రావణుడు గాని, సీతాదేవిగానీ ఉన్నారేమో వెతకండి.

ఈ పైన చెప్పిన ప్రదేశాలే కాకుండా, తూర్పు వైపున అనేక ఉద్యాన వనాలున్నాయి. పర్వతాల మీదనుండి ప్రవహించే నదులున్నాయి. కొండచరియ లుంటాయి. అవన్నీ వెతకండి.

ఓ వానరయోధుడా! ఈ తూర్పు ప్రాంతాల్లో ఏడు సముద్రాలున్నాయి. అవన్నీ లవణం, ఇక్షు, సుర, సర్పి, దధి, క్షీర, జలాలతో ఉంటాయి. ఇక్షుసముద్రంలో అలలు పెద్దవిగా ఉంటాయి. గాలి ఎక్కువగా ఉంటుంది. ఆ సముద్రంలో ద్వీపాలున్నాయి. అక్కడ అసురులుంటున్నారు. వాళ్ళకు సరిపడే ఆహారం లేదు. ఆకలితో బాధపడుతూ ఉంటారు. వాళ్ళు ప్రాణుల నీడల్ని చూసి ప్రాణుల్ని పట్టుకుని తింటూ ఉంటారు. వారు ఆ వరాన్ని బ్రహ్మ నుండి పొందారు. ఆ

ఇక్షుసముద్రంలో మహోరగాలు తిరుగుతూ ఉంటాయి. అవి అరిచే అరుపులు వింటే ప్రళయం వచ్చిందా అనిపిస్తుంది. కాబట్టి మీరు ఈ సముద్రంలో తిరిగేటప్పుడు ఈ రాక్షసులకు చిక్కకుండా మెలకువగా ఉండాలి. అట్లా ఈ సముద్రాన్ని దాటితే, రక్తజలాలతో మహాభయంకరంగా ఉండే లోహితమనే మరో సముద్రం కనిపిస్తుంది. ఈ సముద్రంలో శాల్మలీద్వీపం ఉంది. ఆ ద్వీపంలో పెద్ద బూరుగవృక్షం ఉంటుంది. ఆ వృక్షంపైన తెల్లగా కైలాసం లాగా కనిపించే గరుత్మంతుడి గృహం ఉంది. ఆ గృహాన్ని రకరకాలైన రత్నాలతో విశ్వకర్మ నిర్మించాడు. ఈ ద్వీపంలో మందేహులు అనే రాక్షసులు ఉన్నారు. వాళ్ళు చాలా భయంకరమైన వాళ్ళు. కామరూపులు, వివిధ రూపాలు ధరించి భయపెడ్తూ ఉంటారు. ఆ ద్వీపంలో ఉండే బ్రాహ్మణులు నిత్యం గాయత్రీ ఉపాసన చేయటం వల్ల, గాయత్రీ మంత్ర ప్రభావంచేత, ఈ రాక్షసులు సూర్యోదయానికల్లా సముద్రంలో పడిపోతారు. ఎండ బాగా ముదిరిన తర్వాత మళ్ళీ ఒడ్డుకు చేరుకుంటూ ఉంటారు. రోజూ ఇదే వరుస.

ఓ వానరశ్రేష్ఠుడా! మీరు సర్పి, దధి, సముద్రాలు దాటి పోతే, కుశ, క్రౌంచ ద్వీపాలు కనిపిస్తాయి. అవీ దాటుకుంటూ పోతే క్షీరసముద్రం కనిపిస్తుంది. దాని అలలు పైకి లేచినప్పుడు మంచి ముత్యాల్లాగా ప్రకాశిస్తూ ఉంటాయి. ఆ క్షీరసముద్రానికి మధ్యన ఋషభమనే తెల్లని పెద్ద పర్వతం ఉంటుంది. ఆ పర్వతం పైన వృక్షాలన్నీ వెండివృక్షాల్లాగా తెల్లగా ఉంటాయి. ఆ వృక్షాలకు పూసే పూలన్నీ దివ్యగంధాలు వెదజల్లుతూ ఉంటాయి. అక్కడే సుదర్శనమనే సరస్సు ఒకటి ఉంది. ఆ సరోవరం బంగారు కింజల్కాలుగల వెండి కమలాలతో. రాజహంసలతో అలరారుతూ ఉంటుంది. అక్కడికి దేవతలు, చారణులు, సిద్ధులు, యక్షులు, కిన్నరులు అప్సరస్త్రీలతో విహరించడానికి వస్తూ ఉంటారు.

ఓ వానర యోధుడా! క్షీరసముద్రాన్ని దాటిన తర్వాత నీకు శుద్ధ జలసముద్రం కనిపిస్తుంది. ఔర్యుడి కోపం వల్ల పుట్టిన బడబాగ్ని అనే మహాతేజస్సు ఆ జలసముద్రంలోనే ఉంది. ప్రళయకాలంలో ఈ బడబాగ్ని సమస్త లోకాల్ని వేగంగా దగ్ధం చేస్తుంది. ఈ సముద్ర

జలాల్లో ఉండే ప్రాణులన్నీ ఈ బడబాగ్నిని చూసి భయంతో అరుస్తూ ఉంటాయి. ఆ అరుపులు తీరం వరకు వినిపిస్తూ ఉంటాయి. ఈ సముద్రం సముద్రాలన్నింటిలోకీ శ్రేష్ఠమైనది. ఈ సముద్రానికి ఉత్తరంగా పదమూడు యోజనాలు విస్తరించిన జాతరూపశిల మనే బంగారపు కొండ ఉంది.

వానరులారా! అక్కడ మీకు వెయ్యి పడగలతో భూభారాన్ని మోసే ఆదిశేషుడు ఆ పర్వత శిఖరంపై కూర్చుని కనిపిస్తాడు. ఆ ఆదిశేషుడు చంద్రుని వంటి తెల్లని కాంతులు ప్రసరింపజేస్తూ ఉంటాడు. నల్లటి వస్త్రాన్ని ధరించిన ఆ దేవుడు విశాలమైన నేత్రాలు కలిగి ఉంటాడు. మూడు తలలతో చుట్టూ వేదిక కట్టిన ఒక పొడవాటి తాళవృక్షం ధ్వజంలాగా కనిపిస్తుంది. ఈ ధ్వజాన్ని తూర్పు దిక్కుకు ఎల్లలుగా నిర్ణయించారు. దాని తర్వాత బంగారు ఉదయపర్వతం ప్రకాశిస్తూ ఉంటుంది. ఆకాశాన్ని స్పృశిస్తూ కనిపించే దాని శిఖరం నూరు యోజనాలు విశాలమైనది, వేదికలతో కూడినది. ఆ శిఖరం పుష్పించిన సాల, తాల, తమాల, కర్ణికార వృక్షాలతో ప్రకాశిస్తూ ఉంటుంది. అక్కడ ఒక యోజనం వైశాల్యం పదియోజనాల ఎత్తు ఉండే సౌమనసమనే శిఖరం ఉంటుంది. పూర్వం మహావిష్ణువు మొదటి అడుగు ఈ సౌమనస శిఖరం పైన పెట్టాడు. రెండవ అడుగు మేరుపర్వతం పైన ఉంచాడు.

వానరులారా! సూర్యుడు జంబూద్వీపానికి ఉత్తరం వైపుగా ప్రయాణించినప్పుడు ఈ శిఖరం దగ్గరకు వచ్చి, ఇక్కడ నుండి దక్షిణ దిక్కుగా ఉన్నవారికి కనిపిస్తాడు. ఆ పర్వత శిఖరాలపైన వైఖానసులు, వాలఖిల్యులు అనే మహర్షులు తపస్సు చేసుకుంటూ ఉంటారు. వాళ్ళు సూర్యుడితో సమానంగా ప్రకాశిస్తూ ఉంటారు. సమస్త జీవరాసులకూ ప్రాణాధారమైన సూర్య భగవానుని దర్శనం ఈ శిఖరం పైనుండే అవుతుంది. అందుకనే దీన్ని సుదర్శనద్వీపం అన్నారు.

ఓ వానరులారా! మీరీ పర్వతాల్లోనూ, గుహల్లోనూ రావణుడి కోసం, సీతాదేవి కోసం వెతకాలి. దీన్ని బ్రహ్మ సూర్యోదయ బిందువుగా నిర్ణయించాడు. అందువల్ల భూమికి ఇది తూర్పు ద్వారం అయింది. అట్లాగే తూర్పు దిక్కుగా కూడా స్థిరపడ్డది. ఈ తూర్పు ద్వారానికి

వెనుకభాగాన ఉండే గుహలు, అరణ్యాలన్నీ జాగ్రత్తగా పరిశీలిస్తూ వెతకాలి.

ఈ ఉదయపర్వతానికి తూర్పుగా మీరు పోకండి. ఎందువల్లనంటే అక్కడ సూర్యకిరణాలు ప్రసరించక చీకటిగా ఉంటుంది. అక్కడ మీకు ఏమీ కనబడదు. అక్కడ దేవతలుంటారు. నేను చెప్పిన చోట్లన్నింటిలోనూ, సీతాదేవి కోసం వెతకండి.

ఓ వానరులారా! నేను చెప్పిన ఉదయపర్వతాల వరకూ వెళ్ళి, అన్ని చోట్లా వెతుకుతూ, ఒక నెల రోజుల్లో తిరిగి కిష్కింధకు చేరుకోవాలి. నెల రోజుల తర్వాత వచ్చేవారికి మరణ దండన విధిస్తాను. మీరు పోయే పని సఫలం చేసుకురండి. తూర్పుదిక్కు దేవేంద్రుడికి ఇష్టమైన దిక్కు. మీరు తిరిగి వచ్చిన తర్వాత మీకు అన్ని సుఖాలను ప్రసాదిస్తాను. వెంటనే సీతాన్వేషణకు బయలుదేరండి.

## 41వ సర్గ సుగ్రీవుడు హనుమంతుని దక్షిణ దిక్కుకు పంపటం

సుగ్రీవుడు వానర సేనను సీతాన్వేషణకై తూర్పు దిక్కునకు పంపిన తరువాత మరికొందరు యోధులను దక్షిణ దిక్కున వెదికేందుకు ఎంపిక చేశాడు. వాళ్ళలో ముఖ్యులు అగ్నిదేవుని కుమారుడైన నీలుడు, హనుమంతుడు, బ్రహ్మదేవుని కుమారుడైన జాంబవంతుడు, సుహోత, శరారి, శరగుల్మ, గజ, గవాక్ష, గవయ, సుషేణ, వృషభ, మైన్ద, ద్వివిద, విజయ, గంధమాదనులు, అగ్నిపుత్రులైన ఉల్కాముఖ, అనంగులను, అంగదుడు మున్నగు వారున్నారు. వీరందరకూ అంగదుణ్ణి నాయకుడుగా నియమించడం జరిగింది. తరువాత సుగ్రీవుడు వారందరికీ దక్షిణ దిశ యందు వివిధ ప్రదేశాల గురించి ఇట్లా చెప్పాడు.

ఓ వానర సేనానాయకుల్లారా! అనేక శిఖరాలతో, అనేక వృక్షాలతో కూడుకున్న వింధ్యపర్వతాలున్నాయి. దానికి దక్షిణ ప్రాంతం మహాసర్పాలకు పుట్టినిల్లుగా ఉంది. అనేక రమ్యమైన నదులు ఈ దేశంలో పారుతున్నాయి. గోదావరి, కృష్ణవేణి, నర్మద, మహానది గలగలా పారుతూ ఉంటాయి. వింధ్యపర్వతాలకు దక్షణాన ఉన్న మేఖల దేశం, ఉత్కళ, దశార్ణ నగరం, ఆబ్రవంతి, అవంతి మున్నగు దేశాలన్నింటిలోను సీతాదేవికై వెదకండి. విదర్భ, ఋష్టిక, మాహిషక, మత్స్య, కళింగ, కౌశిక, ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళ దేశాలన్నింటిలోనూ వెదకండి. మలయపర్వతానికి వెళ్ళి వెతకండి. ఆ పర్వతం పూర్తిగా ధాతువులతో నిండి ఉంది. చందన వనాలు అక్కడ విస్తారంగా ఉంటాయి. ఆ ప్రాంతంలో నిర్మలమైన జలాలతో నిండిన కావేరీ నది కనిపిస్తుంది. అప్సర స్త్రీలు ఈ నదీతీరాలలో విహరిస్తూ ఉంటారు. ఇక్కడ మలయపర్వతంపైన సూర్యుని వంటి తేజస్సుతో వెలగిపోయే అగస్త్య మహర్షి ఆశ్రమాన్ని చూస్తారు. మీరు తప్పకుండా ఆ మహర్షికి నమస్కరించి, ఆయన అనుజ్ఞ తీసుకొని తామ్రపర్ణి నదిని దాటి ముందుకు వెళ్ళండి. ఈ తామ్రపర్ణి నదీ పరీవాహ ప్రదేశం అంతా చక్కటి చందనవనాలతో ఆవరించి ఉంటుంది. ఆ తామ్రపర్ణీ నది, ప్రియుణ్ణి కలుసుకోవటానికి తొందరపడే ప్రియురాల్లాగా, సముద్రంలో కలిసేందుకు ఉరకలు వేస్తూ ఉంటుంది. ఈ

ప్రాంతాలన్నీ సీతాదేవి కోసం వెదకండి. అక్కడ పాండ్యదేశంలో కోట తలుపులకు తాపడం చేసిన విలువైన రత్నాలను చూడగలరు. ఇంకా కొద్దిగా ముందుకు పోతే మీరు సముద్రాన్ని చేరుకుంటారు. అక్కడే అగస్త్య మహర్షి సముద్రం మధ్యలో నిలబెట్టిన మహేంద్ర పర్వతాన్ని మీరు చూస్తారు. అక్కడ సముద్రతీరానికి చేరిన తర్వాత అప్పటి స్థితిగతులన్నీ అందరూ కలసి బాగా ఆలోచించండి.

మహేంద్ర పర్వతం అక్కడ సముద్రంలోకి బాగా చొచ్చుకొనిపోయి ఉంటుంది. ఆ పర్వతంపై ఉన్న అనేక వృక్షజాతులు, వివిధమైన ఫలపుష్పాలను అన్ని కాలాల్లోనూ అందిస్తూ ఉంటాయి. అప్సర స్త్రీలు ఆ పర్వతం మీద పహారాలకు వస్తూ ఉంటారు. పర్వదినాల్లో దేవేంద్రుడు కూడా రావడం కద్దు. ఆ సముద్రానికి ఆవలిగట్టున ఒక ద్వీపమున్నది. ఆ ద్వీపం వైశాల్యం నూరు యోజనాలుంటుంది. ఆ ద్వీపాన్ని మానవులు సులభంగా చేరలేరు. మీరు ఆ ద్వీపం అంతా వెతకండి. ఆ ద్వీపాన్ని పాలించే రాక్షసరాజు దేవేంద్రుడంత బలశాలి. ఆ రావణుడు పరమ దుర్మార్గుడు. చంపదగినవాడు. ఆ ద్వీపంలోనే నివసిస్తుంటాడు. మీరంతా ఈ దేశాలన్నింటిలోకి ప్రవేశించి సందేహానికి చోటు లేకుండా సీత కోసం వెతకండి. ఆ ద్వీపంలో పుష్పితక అనే పర్వతం ఉంది. సముద్రం మధ్యలో సూర్యచంద్ర కిరణములతో సమానమైన ఆ పర్వతం విశాలమైన శిఖరాలతో ఆకాశాన్నంటుకున్నట్లుంటుంది. అది ఒక వైపున సూర్యుడి వలె ఎర్రగాను, ఇంకొక వైపున చంద్రుడువలె తెల్లగాను ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ పర్వతానికి బంగారు శిఖరం ఉంది. సూర్యుడు ఆ శిఖరాన్ని సేవించి దక్షిణ సంచారానికి పోతూ ఉంటాడు. దాని వెండి శిఖరాన్ని చంద్రుడు సేవిస్తూ ఉంటాడు. ఓ వానరులారా, కృతఘ్నులు గాని, క్రూరాత్ములుగాని, నాస్తికులుగాని ఆ పర్వతాన్ని చూడలేరు. మీరంతా ఆ పర్వతానికి శిరస్సు వంచి నమస్కరించండి. తరువాత ఆ పర్వతం అంతా సీతాదేవి కోసం వెదకండి. ఆ పుష్పితక పర్వతానికి పధ్నాలుగు యోజనాల దూరంలో సూర్యవంతమనే పర్వతం ఉంది. అక్కడకు పోవటం చాలాకష్టం. అయినా పోయి వెతకాలి. సూర్యపర్వతాన్ని దాటిన తర్వాత కోరికలన్నీ తీర్చే వైద్యుతమనే పర్వతం ఉంది. అక్కడ అన్ని కాలాలలోనూ కోరుకున్నన్ని పూలు, పండ్లు,

కాయలు దొరుకుతాయి. ఆ వైద్యుత పర్వతం పైన దొరికే రుచిగల కందమూలాలను తిని, తేనెలు తాగి అక్కడ నుండి అవతల ఉండే కుంజర పర్వతానికి పోవాలి. ఆ కుంజర పర్వతం మీద విశ్వకర్మ అగస్త్య మహర్షి కోసం బంగారంతోను, వివిధ రత్నాలతోను ఒక భవనం కట్టించాడు. అది చాలా ఎత్తుగా ఉంటుంది. ఒక యోజనం వెడల్పు, పదియోజనాల పొడవు ఉంటుంది. అక్కడే సర్పాలయము అయిన భోగవతీ పట్టణం ఉంది. ఆ పట్టణ వీథులన్నీ విశాలంగా ఉంటాయి. అక్కడికి ఎవరూ పోలేరు. భయంకరమైన ఆకారంతో పెద్దపెద్ద వాడి అయిన కోరలతో విష సర్పాలు కాపలా కాస్తూ ఉంటాయి. మహానుభావుడైన వాసుకి ఆ పట్టణంలోనే నివసిస్తుంటాడు. మీరు అగస్త్య భవనం గుండా వెళ్ళి ఆ భోగవతీ పట్టణంలోను, ఆ పరిసర ప్రాంతాల్లోనూ సీతాదేవి కోసం వెతకాలి.

వానరులారా! ఆ భోగవతీ పట్టణానికి అవతల శ్రీమంతము, సమస్త రత్నమయము అయిన ఋషభ పర్వతం కనిపిస్తుంది. అక్కడ అనేక రంగుల్లో చందన వృక్షాలు కనిపిస్తాయి. ఆ చందన వృక్షాల్ని దూరాన్నుంచి చూడాల్సిందేకాని, ముట్టుకోలేరు. ఎందుకంటే ఆ వనాన్ని రోహితులు అనే భయంకరమైన గంధర్వులు కాపలా కాస్తూ ఉంటారు.

ఆ ఋషభ పర్వతంపైన శైలూషుడు, గ్రామణి, శిక్షుడు, శుక్రుడు, బభ్రువు అనే గంధర్వరాజులు అయిదుగురు ఉంటున్నారు. సూర్యుడితో సమానమైనవారు, చంద్రుడితో సమానమైనవారు, అగ్నితో సమానమైనవారు అయిన పుణ్యకర్మలు చేసిన మహాతేజోవంతులు అక్కడ కనబడతారు. ప్రళయకాలం వరకూ వారు అక్కడుంటారు. ఆ తర్వాత వచ్చే పితృలోకాలకు మీరు వెళ్ళవద్దు.

ఓ వానర నాయకుల్లారా! ఇప్పుడు నేను చెప్పిన ప్రదేశాల్లోనూ, నేను చెప్పకుండా విడిచిపెట్టిన లోకాల్లో కూడా మీరు సీతాదేవి కోసం వెతకాలి. ఎక్కడ ఉన్నదీ ఆచూకీ తెలుసుకొని రావాలి. నెల రోజుల్లోపుగా ఎవరైతే ముందుగా 'నేను సీతాదేవిని చూశాను' అని వచ్చి చెప్తాడో, అతడికి నాతో సమానమైన భోగభాగ్యాలను ఇస్తాను. మిత్రులారా! సీతాదేవిని చూసివచ్చి నాకు

చెప్పేవాడికన్నా నాకు ఆప్తుడు మరొకడు ఉండదు. నా ప్రాణానికన్నా అధికుడవుతాడు. వాడు ఎంతటి ఘోరమైన అపరాధాలు చేసినా నాకు బంధువే అవుతాడు.

ఓ వానరోత్తములారా! మీరు అమితమైన బలపరాక్రమాలు కలిగినవారు. గొప్ప సద్గుణాలున్న వంశాల్లో జన్మించారు. సీతాదేవి ఎక్కడున్నదో మీరు తెలుసుకొని సత్వరమే తిరిగి రావాలి.

ఈ విధంగా సుగ్రీవుడు దక్షిణ దిక్కుకు పోయే వానరులకు ఆదేశాలిచ్చి పంపాడు.

# 42వ సర్గ పశ్చిమదిక్కుకు పోయేవారికి సుగ్రీవుడి సందేశం

సుగ్రీవుడు వానరయోధుల్ని దక్షిణ దిక్కునకు పంపి, తరువాత పశ్చిమ దిక్కుకు పోయి సీతాన్వేషణ చేసేందుకై మేఘముతో సమానమైన బలం గల సుషేణుడు మున్నగు వారిని ఎంపిక చేశాడు. సుగ్రీవుడు, తారకు తండ్రి, మహా భయంకరమైన పరాక్రమం కలవాడు, తనకు మామగారు అయిన సుషేణునికి చేతులెత్తి నమస్కరించాడు. ఆయన నాయకత్వంలో మరీచి మహర్షి పుత్రులైన అర్చిష్మంతుడు, అతని తమ్ముడైన అర్చిమాల్యులను పశ్చిమ దిక్కుకు పంపాడు. వారంతా కూడా గరుత్మంతుడితో సమానమైన బలశాలురు.

సుగ్రీవుడు: ఓ వానర శ్రేష్ఠులారా! మీరు రెండు లక్షలమంది వానర సైనికుల్ని తీసుకొని పశ్చిమ దిక్కుకు పోయి సీతాదేవి కోసం వెదకండి. సుషేణుడు మీకు నాయకుడుగా ఉంటాడు.

ఓ యూధపతులారా! మీరు బాహ్లిక, సౌరాష్ట్ర, భీమ, శూర, కుక్షి దేశాలలోని గ్రామాల్లోను, పెద్దపెద్ద పట్టణాల్లోనూ సీతాదేవి కోసం వెదకండి. ఆయాదేశాల్లో విస్తారంగా పున్నాగ వనాలు, పొగడ చెట్ల వనాలు, విరిగి చెట్ల వనాలు, మొగలి పొదలు మున్నగు అనేక వనాల్లో వెదకండి. పడమటి దిక్కున పావనమైన నదులు అనేకం ప్రవహిస్తున్నాయి. ఆ నదీప్రాంతాల్లో అనేక మహారణ్యాలున్నాయి. నిర్జనారణ్యాలు, పీఠభూములు, పర్వతాలు, దుర్గాలు చూసుకుంటూ పశ్చిమతీరాన్ని చేరుకోండి.

పశ్చిమతీర సముద్రం చాలా భయంకరమైనది. అందులో పాములు, తిమింగలాలు, నక్రాలు, గ్రహాలు అనే భయంకరమైన జలచరాలున్నాయి. ఆ సముద్ర తీరాన దట్టమైన అడవులు, భయంకరమైన పర్వత శ్రేణులు, కొండలు ఉన్నాయి. వాటన్నింటిలోను రావణాసురుని కోసం, సీతాదేవి కోసం వెతకండి. పశ్చిమ తీరంలో మురిచీ పట్టణం, జటాపురం, అవంతీ పట్టణం, అంగలేపా నగరాలలో వెతకండి. అక్కడ అలక్షితమనే కీకారణ్యాలున్నాయి. అక్కడా వెతకండి.

సింధూనది పశ్చిమ సముద్రంలో కలిసే చోటుకు వెళ్ళండి. అక్కడ నూరు శిఖరాలుగల సోమగిరి ఉన్నది. ఆ శిఖరాలన్నింటిపైనా మహారణ్యాలుంటాయి. అక్కడ క్రూరమృగాలు, పక్షులు తిరుగుతూ ఉంటాయి. ఆ అడవుల్లో రెక్కలతో ఎగిరే సింహాలున్నాయి. అవి చేపల్ని, నీటి ఏనుగుల్ని పట్టి తమగూళ్ళల్లో పెట్టుకుంటాయి. ఆ మహారణ్యాల్లో మదమెక్కిన ఏనుగులు ఘీంకారాలు చేస్తూ ఉంటాయి. ఓ వానర వీరులారా! మీరంతా కామరూపులు కాబట్టి పర్వతశిఖరాల మీదకు పోయి వెతకండి.

ఓ వానరులారా! పశ్చిమతీరాన పారియాత్రము అనే పర్వతం ఉంది. దాని శిఖరాలు బంగారుకాంతుల్తో కళ్ళు జిగేలుమనేట్లుంటాయి. దాని వైశాల్యం నూరు యోజనాలుంటుంది. ఇరవై నాలుగు కోట్ల మంది గంధర్వులు ఆ పర్వతాల్లో నివసిస్తూ ఉంటారు. వాళ్ళంతా అగ్నిహోత్రంలా మహాతేజోవంతులు, మహాభయంకరులూ. వాళ్ళంతా గుంపులుగా తిరుగుతూ ఉంటారు. మీరు ఎంత పరాక్రమవంతులైనా, వాళ్ళ జోలికి పోవద్దు. అక్కడ దొరికే పండ్లు, కందమూలాలను ముట్టుకోవద్దు. వాటన్నింటికీ ఆ గంధర్వులు కాపలాకాస్తూ ఉంటారు. మీరు వాటిని ముట్టుకోకుండా ఎన్ని కోతిచేష్టలు చేసినా మిమ్మల్ని వాళ్ళు పట్టించుకోరు. కాబట్టి మీరు ఆ ప్రాంతం అంతా సీతాదేవి కోసం వెతకండి.

ఆ పర్వతానికి అవతల ప్రక్కన వజ్రము అనే పర్వతం ఉంది. అది వైడూర్యమణి కాంతులతో ప్రకాశిస్తూ ఉంటుంది. అక్కడ వజ్రాలు విరివిగా లభిస్తాయి. దాని ఎత్తు నూరు యోజనాలుంటుంది. వైశాల్యం కూడా నూరు యోజనాలుంటుంది. దాంట్లో అక్కడక్కడా గుహలు ఉన్నాయి. మీరు ఆ గుహలు, పర్వతప్రాంతాలన్నీ సీతాదేవి కోసం వెతకండి.

ఆ లవణ సముద్రంలో నాలుగోవంతులో చక్రవంతం అనే పర్వతం ఉంది. విశ్వకర్మ అక్కడే వెయ్యి అంచులున్న చక్రాయుధాన్ని తయారుచేశాడు. మహావిష్ణువు ఆ చక్రాయుధాన్ని రక్షిస్తున్న హయగ్రీవుడనే అసురుని చంపి ఆ చక్రాయుధాన్ని తీసుకున్నాడు. ఆ చక్రవంత పర్వతం మీదనే పంచజనుడు అనే రాక్షసుణ్ణి చంపిన శ్రీమహావిష్ణువు వాడి ఎముకలతో పాంచజన్యాన్ని

చేయించుకున్నాడు. అంటే శ్రీమహావిష్ణువు శంఖచక్రాలు రెండూ ఈ పర్వతం పైనే పొందాడు. ఈ చక్రవంతపర్వత సానువులు చిత్రంగా ఉంటాయి. ఈ సానువులు, గుహలు అన్నింటినీ సీతాదేవి కోసం వెతకండి.

చక్రవంత పర్వతానికి ఆవల అరవై యోజనాలు వ్యాపించిన వరాహ పర్వతం ఉంది. ఈ పర్వతశిఖరాలన్నీ తేజోవంతంగా ఉంటాయి. ఇక్కడి సముద్రం చాలాలోతుగా ఉంటుంది. ఈ పర్వతం పైనే ప్రాగ్జోతిషపురం నిర్మించబడ్డది. అక్కడే నరకాసురుడు నివసిస్తున్నాడు. ఈ వరాహపర్వత సానువులన్నీ సీతాదేవి కోసం వెతకండి.

అక్కడినుండి అవతల ప్రక్కన మేఘవంతమనే పర్వతం ఉంది. ఆ పర్వతం లోపలా బయటా బంగారమే. అక్కడ ప్రవహించే వాగులు కూడా బంగారం రంగులోనే ప్రవహిస్తాయి. ఆ అరణ్యాల్లో పులులు, సింహాలు, మదపుటేనుగులు ఇంకా ఎన్నో క్రూరమృగాలున్నాయి. అక్కడ దేవతలు శ్రీమంతుడూ, పాకాసురుని వధించినవాడు అయిన దేవేంద్రుడికి రాజ్యాభిషేకం చేశారు. మహేంద్రుడు పాలిస్తున ఆ పర్వతానికి రెండవ ప్రక్కన విరగబూసిన వృక్షాలతో శోభాయమానంగా అరవైవేల శిఖరాలు కనిపిస్తూ ఉంటాయి. వాటి మధ్యలో ఉన్నదే సావర్ణిమేరు పర్వతం. పూర్వం సూర్యుని అనుగ్రహం చేత ఆ పర్వతం మీద ఉండే శిలలు, వృక్షాలన్నీ బంగారంగా అయ్యాయి. అంతేకాదు, ఆ పర్వతంపై నివసించే దేవదానవ గంధర్వులు కూడా బంగారు రంగు దేహచ్చాయతో ప్రకాశిస్తూ ఉంటారు. విశ్వదేవులు, మరుత్తులు, వసువులు, దేవతలు సాయంసంధ్యా సమయాలలో ఈ పర్వతంపైకి వచ్చి సూర్యోపాసన చేస్తారు. సూర్యభగవానుడు వాళ్ళ పూజలందుకొని ఎవరికీ కనబడకుండా అవతల కనిపించే అస్తగిరి చాటుకుపోయి అదృశ్యుడైపోతాడని అంటారు.

ఈ సావర్ణిమేరువుకు, అస్తగిరి పర్వతానికి మధ్య దూరం పదివేల యోజనాలు. సూర్యుడు ఈ దూరాన్ని అర్ధముహూర్తంలో ప్రయాణం చేస్తాడు.

వానరులారా! ఈ అస్తగిరి శిఖరంపైన వరుణదేవుడికి విశ్వకర్మ ఒక భవనం కట్టించాడు. ఆ భవనం ఎప్పుడూ సూర్యకాంతితో ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ భవనం రమణీయమై చుట్టూ వృక్షాలతో, పశుపక్ష్యాదులతో జలసమృద్ధితో ఉంటుంది. వరుణదేవుడు ఆ భవనంలోనే ఉంటాడు.

సావర్ణి పర్వతానికి, అస్తగిరి పర్వతానికి మధ్య ఒక పెద్ద వేదిక నిర్మితమై ఉంటుంది. వేదిక మధ్యలో పదితలల బంగారు తాటిచెట్టు ఒకటి కనిపిస్తుంది. దానిపైన బ్రహ్మదేవునితో సరితూగే మేరుసావర్ణి మహర్షి నివసిస్తూ ఉంటాడు. మీరు ఆ మహర్షికి సాష్టాంగ నమస్కారం చెయ్యండి. ఆయన ఆశీర్వాదం పొందండి. తరువాత ఆ పర్వత ప్రాంతాలన్నీ సీతాదేవి కోసం వెతకండి.

ఓ వానరులారా! మీరు ఇంతవరకూ పోగలుగుతారు. అస్తగిరి తరువాత మీరు వెళ్ళవద్దు. అక్కడ అంతా చీకటిగానే ఉంటుంది. అక్కడ మీరు ఏమీ చూడలేరు. ఒక మాసం లోపల మీరు తిరిగిరావాలి. అట్లాకాకుండా, గడువు తర్వాత వచ్చేవారందరికీ మరణ దండన విధిస్తాను.

ఓ వానరులారా! మహానుభావుడు, అమిత బలాఢ్యుడు, వృద్ధుడు, నాకు మామగారు అయిన సుషేణుడు మీ కందరికీ నాయకత్వం వహిస్తాడు. మీరందరూ ఆయన ఆజ్ఞలను శిరసావహించాలి. సీతాన్వేషణ విషయంలో ఆయనకు అన్నివిధాలా సహకరించాలి. మీకు కార్యసిద్ధి అవుతుంది.

ఈ రాముడు దేవతా సమానుడు. అమిత పరాక్రమశాలి. మనకు మరువలేని ఉపకారాన్ని చేశాడు. మనం అంతా ఆయనకు కృతజ్ఞులమై ఉండి సీతాన్వేషణలో తోడ్పడుతూ ప్రత్యుపకారం చెయ్యాలి. అట్లా చేస్తే మన జన్మలు సార్థకమవుతాయి. మనం కృతార్థులం అవుతాము. ఓ వానరులారా! ఇప్పుడు నేను చెప్పిన చోట్లే కాకుండా నేను చెప్పని చోట్లు కూడా వెదకండి. ఎట్లాగైనా సరే, సీత దొరికిందనే కబురు తీసుకొని రండి.

సుగ్రీవుడు ఈ విధంగా ఆదేశించగానే సుషేణుడు తన బలగాన్నందరినీ వెంటబెట్టుకొని సుగ్రీవుడికి, రామలక్ష్మణులకు వీడ్కోలు చెప్పి సీతాన్వేషణకై బయలుదేరాడు.

# 43వ సర్గ సీతాన్వేషణకై ఉత్తరదిక్కుకు శతబలుడు పోవడం

సుగ్రీవుడు సుషేణుణ్ణి పశ్చిమదిక్కుకు పంపి వానరులలో శ్రేష్ఠుడైన శతబలుని పిలిచాడు. అతణ్ణి ఉత్తరదిక్కుకు సీతాన్వేషణకై పంపాలని అనుకున్నాడు. రామలక్ష్మణులు అక్కడ ఉండగానే శతబలునితో ఇట్లా అన్నాడు.

సుగ్రీవుడు: ఓ వానరోత్తమా! నీవు, యమపుత్రులైన నీ మంత్రులు మరో లక్షమంది వానరులు కలసి రామకార్యానికై ఉత్తర దిక్కుగా వెళ్ళి వెతకండి. ఈ మహాత్ముడు మనకు చేసిన మహోపకారానికి మనం ప్రత్యుపకారంగా సీత ఎక్కడున్నదో తెలుసుకొని రాముడికి తెలియజెయ్యాలి.

ఓ వానర నాయకులారా! మీరు కార్యాలు సాధించడంలో ఘటికులు. మనం ఇప్పుడు రాముడికి ఋణపడి ఉన్నాం. ఈ కార్యం సాధించి సీతాదేవి తిరిగి రాముడి దగ్గరకు చేరుకున్న తర్వాతనే మనం ఋణ విముక్తులమవుతాం. కాబట్టి మీరంతా రాముని సంతోషపెట్టే ఈ కార్యాన్ని సాధించండి. అప్పుడే మన జన్మ సఫలమవుతుంది.

ఓ వానర వీరులారా! ఈ సర్వోత్తముడైన రాముడు సర్వభూతములకు ప్రభువు. రామప్రభువు సంతోషిస్తే సకల జీవకోటి సంతోషిస్తుంది. రాముణ్ణి సంతోషపరచడమే నా లక్ష్యం. సీతను వెతకి ఆచూకీ తెలుసుకోవడమే నాకు పరమార్థం అన్న కృతనిశ్చయంతో మీరంతా బయలుదేరండి.

ఓ వానరులారా! మీరు ఉత్తర దిక్కుగా వెళ్ళండి. ఆ దిక్కున ఉండే మ్లేచ్ఛ, పుళింద, శూరసేన, ప్రస్థల, భరత, మద్రక, కురు, కాంభోజ, యవన, శక, బాహ్లీక, ఋషిక, పౌరవ, టంకణ, చీన, పరమచీన, నీహార, వరద, హిమవత్పర్వత ప్రాంత దేశాలలో సీతాదేవి కోసం వెతకండి. ఈ దేశాలన్నింటిలోను కాకులు దూరని కారడవులున్నాయి. చీమలు కూడా దూరలేని

చిట్టడవులు ఉన్నాయి. పర్వతప్రదేశాలున్నాయి. లోయలు, దుర్గాలు, గుహలు ఉన్నాయి. మీ సామర్థ్యం అంతా చూపించి సీతాదేవి ఎక్కడుందో వెతికి తెలుసుకొని రండి.

మీరు ముందుగా కాలపర్వతం నుండి సుదర్శన పర్వతానికి వెళ్ళండి. దానికి అవతల దేవసఖము అనే పర్వతం ఉంటుంది. ఆ ప్రాంతం అంతా వివిధ వృక్షాలతో ఉండి దట్టమైన అరణ్యం ఉంటుంది. ఆ అరణ్యంలో సీతాదేవి కోసం వెతకండి.

ఆ దేవసఖ పర్వతం నుండి ముందుకు పోతే, ఒక వంద యోజనాల మేర పెద్ద ఎడారి ఉంటుంది. అక్కడ ఒక చెట్టుగానీ, ఒక పిట్టగాని కనపడదు. తాగేందుకు ఒక బొట్టు నీరైనా ఉండదు. ఆ వంద యోజనాల మేరా క్రింద ఇసుకపర్రలు, పైన ఆకాశం తప్ప ఇంకేమీ కనబడవు. మీరు ఆవలికి వందయోజనాల ఎడారిని దాటి వెళ్ళండి.

ఆ ఎడారి దాటి ముందుకు పోతే కైలాస పర్వతం కనిపిస్తుంది. దాన్నే వెండి కొండ అని కూడా అంటారు. ఆ పర్వతం మీద విశ్వకర్మ కుబేరుడికో అందమైన భవనం కట్టించాడు. ఆ భవనానికి ప్రక్కనే ఒక సరస్సు ఉంది. అందులో కమలాలు, నీలోత్పలాలు ఇంకా ఎన్నో పుష్పజాతులు విరబూసి ఉంటాయి. ఆ సరస్సులో హంసలు, కారండవ పక్షులు స్వేచ్ఛగా విహరిస్తూ ఉంటాయి. ఈ అందచందాల్ని, రమణీయ దృశ్యాల్ని చూసేందుకు అప్సరస్త్రీలు గుంపులు గుంపులుగా వస్తూ ఉంటారు. విశ్రవణుడి పుత్రుడైన కుబేరుడు ఆ భవనంలోనే నివసిస్తూ ఉంటాడు. కుబేరుడంటే ధనానికి అధిపతి. లోకాలకు సిరిసంపదలు పంచేవాడు. యక్షులకు రాజు. యక్షులంతా ఆ సరోవరం వద్దకు జంటలు జంటలుగా వచ్చి విహరిస్తూ ఉంటారు. ఓ వానరులారా! మీరంతా కైలాస పర్వతం పైన, చంద్రకాంతితో ప్రకాశించే ఆ పర్వత శిఖరాలపైన, కొండగుహల్లోను సీతాదేవి కోసం వెతకండి.

కైలాసపర్వతం దాటి వెళితే, క్రౌంచపర్వతం ఉంటుంది. ఆ పర్వతానికో బిలం ఉంది. ఆ పర్వతాన్ని దాటి వెళ్ళాలంటే ఆ బిలం ద్వారానే వెళ్ళాలి. వేరే మార్గం లేదు. మీరంతా

సావధానులై ఏమరిపాటుతనం లేకుండా ఆ బిలం గుండా వెళ్ళండి. దేవతలచేత పూజించబడే మహర్షులు అక్కడ తపస్సు చేసుకుంటూ ఉంటారు. వాళ్ళంతా దేవతా రూపాలలో సూర్యునితో సమానమైన తేజస్సుతో ఉంటారు. మీరంతా ఆ మహర్షులకు నిశ్శబ్దంగా నమస్కరించి ముందుకు పొండి. ఆ మహర్షులకు తపోభంగం కలగకుండా ఉండేట్లు మసలుకోండి. ఓ వానరులారా! ఆ క్రౌంచపర్వత సానువుల్లో, గుహల్లోను, సీతాదేవి కోసం వెతకండి.

అట్లాగే క్రౌంచపర్వతం నుండి వృక్షాలు కూడా మొలవని మానసపర్వతానికి వెళ్ళండి. ఆ మానసపర్వతం మీదకు సామాన్య మానవులే కాకుండా దేవ, దానవ, రాక్షసులు కూడా పోలేరు. మీరు ఆ మానసపర్వతానికి వెళ్ళి అక్కడ సీతాదేవి కోసం వెతకాలి.

క్రౌంచపర్వతానికి అవతల వైపున మైనాకమనే పర్వతం ఉంది. దాని మీద మయుడు తన కోసం నిర్మించుకున్న భవనం ఉంది. అక్కడ గుర్రంముఖంతో ఉండే కిన్నెరాంగనలుంటారు. మీరు వారి ఇళ్ళల్లో సీతాదేవి కోసం వెతకండి. ఇంకా అక్కడి గుహలలో కూడా వెతకండి. ఓ వానరులారా! మీరు మైనాక పర్వతాన్ని దాటి ముందుకు పోతే సిద్ధాశ్రమాన్ని చూస్తారు. అక్కడ తపస్సంపన్నులైన వైఖానసులు, వాలఖిల్యులు నివసిస్తూ ఉంటారు. వారు పరిశుద్ధాత్ములు. వాళ్ళంతా అణిమాది అష్టైశ్వర్యాలు సంపాదించారు. వారందరికీ మీరు నమస్కరించి వారి ఆశీస్సులను పొందండి. వినయవిధేయతలతో, సీతాదేవిని గూర్చి వారికేమైనా తెలుసేమో విచారించండి. వారికి తెలిసి ఉంటే తప్పక చెబుతారు.

ఓ వానరులారా! అక్కడే వైఖానసమనే సరస్సు ఉంది. ఆ సరస్సులో పద్మాలు, కమలాలు విరగబూసి ఉంటాయి. హంసలు విహరిస్తూ ఉంటాయి. సార్వభౌముడనే దిగ్గజము ఆడ ఏనుగులతో విహరిస్తూ ఉంటుంది. ఈ సార్వభౌముడే కుబేరుడికి వాహనం.

ఆ వైఖానససరస్సుకు అవతల అంతా చీకటిమయం. సూర్యచంద్రులు, నక్షత్రాలు కనిపించవు. మేఘాలు ఉండవు. అంతా నిశ్శబ్దంగా ఉంటుంది. అయినా స్వయంప్రకాశకులైన

దేవతలు, సిద్ధులు మున్నగువారు తమ దేహం నుండి ప్రసరించే కాంతితో తపస్సమాధిలో ఉంటారు.

ఆ ప్రదేశానికి అవతల శైలోదము అనే నది ఉంది. ఆ నదికి రెండు ప్రక్కలా దట్టమైన వెదురు వనాలున్నాయి. ఎత్తుగా పెరిగిన వెదుళ్ళు గాలికి ఒక దానితో మరొకటి పెనవేసుకొని వంతెనలాగా ఏర్పడతాయి. సిద్ధులు వాటిని వంతెనలుగా వాడుకొని అటూ ఇటూ తిరుగుతూ ఉంటారు. అదే పుణ్యాత్ములు నివసించే ఉత్తరకురు దేశము.

ఉత్తరకురు దేశంలో అనేక నదులు ప్రవహిస్తూ ఉంటాయి. ఆ నదుల్లోని నీరు చల్లగానూ, మనోహరంగాను ఉంటుంది. కలువలు, కమలాలతో నిండి చూట్టానికి ఆ నదులు మనోహరంగా ఉంటాయి. అక్కడి నదీతీరాల ఉండే ఇసుకతిన్నెలు ముత్యాలు, విలువైన రత్నాలతో సమంగా ఉంటాయి. ఒక నదికి మరో నదికి నడుమ ప్రాంతాలు అనేక అరణ్యాలు, పట్టణాలు, గ్రామాలు, పర్వతాలతో నిండి ఉంటాయి. అక్కడి వృక్షాలు అన్ని కాలాల్లోను పూస్తాయి, ఫలిస్తాయి. ఆ వృక్షాల నాశ్రయించుకొని ఎన్నో పక్షులు నివసిస్తూ ఉంటాయి. నేలపైన అనేక వన్యమృగాలు స్వేచ్ఛగా తిరుగుతూ ఉంటాయి. కొన్ని వృక్షాలు మణులూ, వైడూర్యాలు కూడా ఇస్తూ ఉంటాయి.

అక్కడ గంధర్వులు, కిన్నెరులు, కింపురుషులు, నాగులు, విద్యాధరులు తమ తమ ప్రియురాళ్లతో విహరిస్తూ ఉంటారు. జంటలేనివాడు మచ్చుకైనా కనబడడు. వాళ్ళంతా క్రీడాపరాయణులు. గీత, వాద్య నృత్యాలలో మునిగి మనోహరంగా క్రీడిస్తూ ఉంటారు. సుఖసంతోషాలు అక్కడ పొంగిపొర్లుతూ ఉంటాయి.

ఉత్తర కురుదేశానికి ఉత్తరాన సముద్రం ఉంది. దాని మధ్యలో సోమగిరి అనే పర్వతం ఉంది. అయితే ఆ పర్వతం విష్ణు లోకవాసులకూ, బ్రహ్మలోకవాసులకూ, స్వర్గలోక వాసులకూ మాత్రమే కనిపిస్తుంది. ఇతరు లెవరికీ కనిపించదు. అక్కడ సూర్యచంద్ర నక్షత్ర కాంతులు పడవు. అయినా సోమగిరి పర్వతంలో నుండి ఉత్పన్నం అయ్యే కాంతుల వల్లనే ప్రకాశవంతంగా

తెలుస్తుంది. ఆ సోమగిరి పైననే బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు నివసిస్తూ ఉంటారు. వారిని సేవించే బ్రహ్మర్షులు కూడా అక్కడే ఉంటారు.

ఓ వానరులారా! మీరు ఉత్తరకురు దేశాన్ని దాటి వెళ్ళలేరు. సూర్యచంద్రుల సంచారం ఉండదు. కన్ను పొడుచుకున్నా కనిపించని కారుచీకట్లు. అక్కడ ఏముందో ఎవరికీ తెలియదు.

ఓ వానరవీరులారా! ఇంతవరకూ నేను చెప్పిన ప్రదేశాలన్నీ వెతకండి. నేను చెప్పని ప్రదేశాలు కూడా వెతకండి. అంతా వెతకి ఆ సీతాసాధ్వి ఎక్కడుందో తెలుసుకొని రండి. నేనూ, ఆ రామప్రభువు కూడా సంతోషిస్తాం.

ఓ వానరవీరులారా! రామకార్యం పూర్తిచేసుకొనివచ్చిన వారిని, వారి బంధువుల్ని కూడా సన్మానిస్తాను. వారి కోరికలన్నీ తీరుస్తాను. వారికి శత్రుభయం లేకుండా చేస్తాను.

# 44వ సర్గ రాముడు హనుమంతునికి ముద్రిక నివ్వడం

సుగ్రీవునికి తన మంత్రులందరిలోనూ, వాయుపుత్రుడైన హనుమంతునిపై ఎక్కువ నమ్మకం ఉంది. అందువల్ల ప్రత్యేకించి హనుమంతుడితో ఇట్లా అన్నాడు.

సుగ్రీవుడు: ఓ హనుమంతుడా! దూసుకొని ముందుకు పోవడంలో నీకు నీవే సాటి. అది నేలమీదగానీ, ఆకాశంలో నైతేనేమి, నీళ్ళలోనైతేనేమి స్వర్గలోకంగాని, మరోలోకంగాని, ఎక్కడికైనా అడ్డు తొలగించుకుంటూ వెళ్ళే సమర్థుడవు. నీకు తెలియని మార్గాలు లేవు. నీకు తెలియని లోకాలు లేవు.

అసురులతోను, గంధర్వులతోను, దేవతలతోను, సముద్రంతోను, పర్వతాలతోను కూడుకున్న లోకాలన్నీ నీకు కరతలామలకం. గమనంలోగానీ, వేగంలోగాని, తేజస్సులోగానీ, నీవు నీ తండ్రి వాయుదేవుడితో సమానమైనవాడవు. నీ అంతటి తేజస్సు గల ప్రాణి ఈ లోకంలో మరొకటి లేదంటే అతిశయోక్తి ఏమీ లేదు. కాబట్టి ఓ హనుమంతుడా! నిన్ను నేను ఏం చెయ్యాలో చెప్పడం కన్నా, నీవే ఏం చేస్తే సీతాదేవి లభిస్తుందో ఆలోచించి చెయ్యి.

నీతిమంతుడవైన ఓ పండితుడా! హనుమంతుడా! బలం, బుద్ధి, పరాక్రమం, దేశకాలానుగుణంగా నడుచుకోవడం, నీతి ఇవన్నీ నీలోనే ఉన్నాయి.

సుగ్రీవుడు హనుమంతుని గుణగణాలను అంతగా అభినందిస్తుంటే, రాముడు తనలో 'ఈ సుగ్రీవుడికి కార్యసాధకుడిగా హనుమంతుడిపై ఇంతటి విశ్వాసం ఉంది. ఈ హనుమంతుడు ఇంతకు పూర్వం కూడా అనేక అసాధ్యాలను సాధ్యం చేసి చూపిన చరిత్ర గలవాడు. సుగ్రీవుడు హనుమంతుడు కార్యాన్ని సాధించుకు వస్తాడన్న పూర్తి నమ్మకం పెట్టుకున్నాడు. నిజంగానే ఇతడు సీత ఉన్నచోటును తెలుసుకొని రాగలడని నమ్మకం కలుగుతోంది' అని అనుకున్నాడు.

రాముడు: ఓ హనుమంతుడా! నీవు తప్పకుండా సీతను చూసి వస్తావన్న నమ్మకం నాకు

కలిగింది. నా పేరు చెక్కిన నా ఉంగరాన్ని నీకు నా ఆనవాలుగా ఇస్తున్నాను. ఈ ఉంగరాన్ని చూసిన సీత నీవు నిజంగానే నా వద్ద నుండి వస్తున్నావని గ్రహిస్తుంది. భయపడకుండా ఉంటుంది.

ఓ వీరుడా! సుగ్రీవుడు నీతో చెప్పిన మాటలు వింటూ ఉంటే నీవు కార్యాన్ని సాధించుకు వస్తావన్న నమ్మకం నాకు కూడా కలుగుతోంది. నీలోని ఉత్సాహాన్ని చూశాను. నీలోని మాటల చాతుర్యాన్ని, పని సాధించే నేర్పునీ చూశాను. నీలోని బలపరాక్రమాలను నీ పూర్వచరిత్రే చాటుతున్నది. నీవు శీఘ్రంగా పోయి కార్యాన్ని సాధించి సీత ఎక్కడుందో మాకు చెప్పు.

అప్పుడు హనుమంతుడు ఆ ఉంగరాన్ని చేతుల్లోకి తీసుకుని కళ్ళకద్దుకొని శిరస్సున పెట్టుకున్నాడు. రాముడి పాదాలకు శిరస్సు వంచి నమస్కరించి బయలుదేరాడు.

వీరుడైన ఆ వాయుకుమారుడు వానర సైన్యంతో కలసి ఆకాశాన ప్రకాశించే పూర్ణచంద్రుడిలాగా సీతాన్వేషణకై బయలుదేరాడు.

"ఓ వాయుకుమారుడా! నేను నీ బలంపైనా, నీ అత్యధికమైన పరాక్రమం మీదా ఆధారపడి ఉన్నాను. సీత లభించేట్లు చెయ్యి" అన్నాడు రాముడు.

# 45వ సర్గ వానరవీరులు సీతాన్వేషణకై బయలుదేరటం

వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు వానర వీరులందరికీ ఏఏ భూభాగాల్ని వెతకాలో వివరంగా చెప్పి, త్వరగా సీతాన్వేషణా కార్యాన్ని పూర్తి చేసుకొని రమ్మని ఆదేశించాడు. రామలక్ష్మణులు కూడా సుగ్రీవుడు చేసిన ఏర్పాట్లకు సంతృప్తులై ప్రస్రవణ పర్వతంపై నిలబడి చూస్తున్నారు.

అంతట వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుని ఆజ్ఞను శిరసావహించిన వానరులంతా మిడతల దండులాగా భూమినంతా ఆక్రమిస్తూ ప్రయాణమయ్యారు. వాళ్ళల్లో శతబలుడనే వానర నాయకుడు తన సేనల్ని తీసుకొని ఉత్తర దిక్కుగా హిమవత్పర్వతాల వైపు బయలుదేరాడు. వానర నాయకుడైన వినతుడు తూర్పుదిక్కునకు ప్రయాణమయ్యాడు. వానరనాయకుడైన హనుమంతుడు అంగదునిలో కలసి అగస్త్యుని నివాసస్థానమైన దక్షిణ దిక్కుగా ప్రయాణమయ్యాడు. వానరవృద్ధుడు, వానరశ్రేష్ఠుడు అయిన సుషేణుడు వరుణునిచే పాలించబడుతున్న పశ్చిమదిక్కుగా ప్రయాణమయ్యాడు.

ఆ వానరులందరూ గొప్ప ధ్వనులు చేస్తూ, గర్జిస్తూ, సింహనాదాలు చేస్తూ, వికృతంగా అరుస్తూ, పరుగులు తీస్తూ బయలుదేరారు. వానరులు కొందరు "రావణుని చంపి సీతను తీసుకొని వస్తాం" అని అరిచారు. ఇంకొందరు "రావణుని నేనొక్కణ్ణే చంపేస్తాను. తరువాత రాక్షసులందర్నీ చంపి, సీతాదేవిని తీసుకువస్తాను. భయంతో వణికిపోతున్న సీతాదేవికి ధైర్యం చెప్పి పాతాళం నుండి నేనొక్కడినే తీసుకొనివస్తాను. మీరంతా ఇక్కడే ఉండండి" అన్నారు.

ఇంకొకడు, "నేను వృక్షాలన్నింటినీ పీకి అవతల పారేస్తాను. భూమిని చీల్చి వేస్తాను. సముద్రాలన్నీ క్షోభపడేట్లు చేస్తాను" అన్నాడు.

ఒకడు "నేను నూరు యోజనాల దూరం ఎగురగలను" అని అంటే మరొకడు "నేను నూరు యోజనాల కంటే ఎక్కువ దూరం ఎగురగలను" అన్నాడు.

“భూమి మీద గాని, ఆకాశంలోగాని, సముద్రాల్లోగాని, పర్వతాలపైనగానీ, అరణ్యాల్లోగాని, పాతాళంలోగానీ, నన్ను అడ్డుకునేవాళ్ళే లేరు” అని ఇంకొకడన్నాడు.

ఆ విధంగా బలగర్వంతో ఒక్కొక్కడూ ఒక్కొక్క విధంగా సుగ్రీవుని ఎదుట ప్రతిజ్ఞలు చేస్తూ బయలుదేరారు.

# 46వ సర్గ సుగ్రీవుని భూమండల అనుభవాలు

సుగ్రీవుడు వానరసేన లన్నింటికీ వీడ్కోలు పలికి రాముడితో కూర్చుని మాట్లాడుతూ ఉండగా రాముడు, "సుగ్రీవా! నీకు ఈ భూమండలం అంతా ఎట్లా తెలుసు?" అని అడిగాడు. అప్పుడు సుగ్రీవుడు రాముడి పాదాలకు వంగి నమస్కారంచేసి ఇట్లా చెప్పాడు.

సుగ్రీవుడు: ఓ రామా! మహిషరూపంలో వచ్చిన దుందుభి వాలిచే తరుమబడగా మలయపర్వతం వైపుగా పరుగెత్తాడు. నేను, వాలి వెంబడించాము. అతడు ఒక గుహలోకి పోయి దాక్కున్నాడు. వాలి నన్ను బయటనే ఉండమని చెప్పి తనొక్కడే గుహలోనికి వెళ్ళాడు. ఒక సంవత్సరం పాటు వాలి కోసం గుహ బైటనే నేను కాచుకొని కూర్చున్నాను. సంవత్సరం దాటిపోయిన తర్వాత ఒకానొక రోజున గుహలో నుండి రక్తం నురుగులు కక్కుతూ ప్రవాహం లాగా వచ్చింది. ఆ రాక్షసుడే వాలిని చంపి ఉంటాడని అనుకొని ఒక పెద్ద కొండశిలను గుహద్వారానికి అడ్డంగా పెట్టి నేను కిష్కింధకు తిరిగివెళ్ళాను. అక్కడ వాళ్ళంతా వాలి మరణించి ఉంటాడని అనుకున్నారు. నన్ను వానరరాజ్యాభిక్తుణ్ణి చేశారు. నేను రాజ్యాన్ని, రుమతోపాటు తారను కూడా పొంది సమస్త సుఖాలు అనుభవిస్తూ ఉన్నాను.

ఇంతలో వాలి ఆ మహిషరూపంలో ఉన్న దుందుభిని చంపి తిరిగి వచ్చాడు. అప్పుడు నేను భయపడుతూ గౌరవంగా అతని రాజ్యాన్ని అతనికి ఇచ్చివేశాను. దుష్టబుద్ధి గలవాడైన వాలి, నన్ను చంపాలని నిశ్చయించుకున్నాడు. అది గ్రహించిన నేను మంత్రులతో కలసి పారిపోవటం ప్రారంభించాను. విడవకుండా వాలి నన్ను చంపేందుకు వెంబడించాడు. వాలి అట్లా నన్ను తరుము కొస్తూ ఉండగా నేను నదులు, అరణ్యాలు, నగరాలు దాటుతూ పరుగెత్తాను. అట్లా పరిగెత్తుకుంటూ పోతున్న నన్ను వాలి వెంబడిస్తూనే ఉన్నాడు. ఈ భూమినంతా అద్దం పైభాగంలాగా, అలాత చక్రంతో సమానంగా (మండేకర్రను వేగంగా గుండ్రంగా తిప్పేటప్పుడు ఒక చక్రంలాగా ఏర్పడుతుంది. దాన్నే అలాతచక్రం అంటారు)

కనబడింది. నేను దాన్ని ఒక గోష్పాదాన్ని దాటినట్లు దాటాను.

ఆ తరువాత నేను తూర్పుదిక్కుగా పరుగెత్తి అనేక అరణ్యాలు, గుహలు, రమ్యమైన పర్వతాలు, సరస్సులను చూశాను. ధాతువులతో నిండిన ఉదయపర్వతాన్ని చూశాను. నిత్యం అప్సరసలు నివసించే క్షీరసాగరాన్ని చూశాను. వాలి తరుముకొస్తూ ఉండగా నేను పరుగెత్తుతూ తిరిగి వెనుకకు వచ్చి మళ్ళీ వెంటనే బయలుదేరాను.

తరువాత దక్షిణదిక్కుగా ప్రయాణమయ్యాను. ఆ వైపున కూడా వృక్షాలు, అరణ్యాలు దాటుతూ ఉండగా వాలి తరుముకుంటూ వచ్చాడు. ఇక నేను పశ్చిమదిక్కునకు పోయాను. నేను అక్కడ కూడా అనేక దృశ్యాలు చూశాను. పర్వతాలలో శ్రేష్ఠమైనదైన అస్తమాద్రిని చూశాను. అక్కడ నుండి ఉత్తరానికి పరుగెత్తాను. హిమవత్పర్వతాలు, మేరుపర్వతం, ఉత్తరసముద్రం దాకా వెళ్ళాను. ఈ విధంగా వాలి తరుముకు వస్తూ ఉండగా నాకు ఎక్కడా ప్రాణరక్షణకు చోటు కనిపించలేదు. అప్పుడు బుద్ధిమంతుడైన హనుమంతుడు ఇట్లా అన్నాడు.

హనుమంతుడు: రాజా! పూర్వం మతంగముని వానర రాజైన వాలిని శపించాడు. ఆ వృత్తాంతం అంతా నాకు ఇప్పుడే జ్ఞాపకానికి వస్తోంది. వాలి ఆ మతంగమహర్షి ఆశ్రమంలో ప్రవేశిస్తే అతడి శిరస్సు వెయ్యి ముక్కలవుతుంది. అందువల్ల మనం మతంగముని వనానికి వెళ్ళి శాశ్వతంగా అక్కడ నివాసం ఏర్పరచుకుందాం. అక్కడే సుఖంగా కాలం వెళ్ళదీసుకోవచ్చును.

ఓ రామా! అప్పుడు నేను ఈ విధంగా భూమండలం అంతా ప్రత్యక్షంగా చూసి ఈ పర్వతగుహకు వచ్చి చేరాను.

# 47వ సర్గ తూర్పు, ఉత్తరం, పడమరలకు వెళ్ళిన వానరులు తిరిగి రావటం

సుగ్రీవాజ్ఞను శిరసావహించిన వానరసేనలు సీతాన్వేషణకై దేశం నాలుగు దిక్కులకు వెళ్ళారు. చెట్లు, పుట్టలు, పర్వతాలు, గుహలు అరణ్యాలు, పట్టణాలు, గ్రామాలు అన్నీ వెతికారు. రామకార్యంపై ప్రేమచేత, సుగ్రీవుని యందు భయంచేతా వానరులంతా పగలంతా వెతికి రాత్రిపూట ఒక చోట కలుసుకునేవారు. బయలుదేరిన రోజు నుండి ఒక నెల రోజులు ఎంత వెతికినా సీత జాడ కానీ, రావణుని ఆచూకీ గానీ తెలుసుకోలేకపోయారు. ఒక మాసం గడువు కాగానే తిరిగి సుగ్రీవుని వద్దకు నిరాశతో వచ్చారు.

మహా బలశాలి అయిన వినతుడు సుగ్రీవుడు చెప్పిన చోట్లన్నీ తూర్పు దిక్కున గాలించి, సీత జాడ తెలుసుకోలేక తిరిగి వచ్చాడు.

వీరుడైన శతబలి కూడా సైన్యంతో వెళ్ళి ఉత్తరదిక్కు అంతా గాలించి సీతాదేవి జాడ కనుక్కోలేక నిస్పృహతో తిరిగివచ్చాడు.

పశ్చిమదిక్కుకు పోయిన సుషేణుడు కూడా వెదికి వేసారి ఒక మాసం నిండగానే తిరిగివచ్చి సుగ్రీవుని కలిశాడు.

ప్రస్రవణ పర్వతంపై రామలక్ష్మణులతో కలసి కూర్చున్న సుగ్రీవునితో ఇట్లా అన్నారు:

“అన్ని పర్వతాలు, అరణ్యాలు, నదులు, సముద్ర ప్రాంతాలు, భూములు, గ్రామాలు, పట్టణాలు వెదికాము. నీవు చెప్పిన గుర్తులను బట్టి అన్ని ప్రదేశాలూ చూశాము. ప్రవేశించటానికి వీలుపడని అడవి ప్రాంతాల్లోకి కూడా దూరి వెతికాం. అడ్డంవచ్చిన పెద్దపెద్ద ప్రాణుల్ని కూడా చంపేశాం. కానీ ఎక్కడా సీతాదేవి జాడ కనిపించలేదు.

ఓ వానరరాజా! అధికమైన బలము, ఉత్తమమైన వంశముగల ఆ హనుమంతుడు సీతను గూర్చి తెలుసుకొనగలడు. అంతేకాదు, వాయు కుమారుడైన హనుమంతుడు కూడా, సీతాదేవిని అపహరించిన దిక్కుకే వెళ్ళాడు. కనుక తప్పకుండా సీతాదేవి జాడ తెలుసుకొని మనందరినీ సంతోషపరుస్తాడు.”

# 48వ సర్గ దక్షిణ దిక్కున సీతాన్వేషణ

హనుమంతుడు అంగదుడితోను, తారుడితోను కలసి సుగ్రీవుడు చెప్పినట్లుగా దక్షిణ దిక్కుగా బయలుదేరాడు. వారంతా కలసి వింధ్య పర్వతాల్లోని గుహలు, అరణ్యాలు, కాలుపెట్టడానికి వీలుకాని ప్రదేశాలు, సరస్సులు, ఇట్లా ఎన్నో చోట్ల వెతుకుతూ ముందుకు పోయారు. అంతా తలో ప్రక్కకూ పోయి వెదికారు. కానీ ఫలితం శూన్యం. మహావీరులైన వారంతా దొరికినచోట్ల కందమూలాలు తినేవాళ్ళు, దొరకని చోట్ల పస్తుండేవారు. దట్టమైన అరణ్యాలు వెతికారు. నిర్జన ప్రదేశాలు చూశారు. జన సమ్మర్దమైన పట్టణాలు చూశారు. ఈ విధంగా వానరులంతా వెతికి వెతికి విసిగిపోయారు. అయినా నిరాశ చెందక ఒక చోటు నుండి మరొక చోటుకు పోతూ ముందుకు సాగిపోయారు. కొన్ని చోట్ల తినేందుకు ఏమీ దొరికేది కాదు. కొన్నిచోట్ల తాగేందుకు ఒక్క నీటిబొట్టైనా లభించేది కాదు. అటువంటి ప్రాంతాల్లో దున్నపోతులుగాని, లేళ్ళుగాని, ఏనుగులుగాని, పెద్దపులులుగాని కనిపించలేదు. కనీసం పక్షులు కూడా కనిపించేవి కావు. అక్కడ చెట్లకు పాకేవిగాని, నేలమీద పాకేవిగానీ లతలు, తీగలు కనపడలేదు. వృక్షాలన్నీ ఫలపుష్పాలు లేకుండా మ్రోడులై ఉన్నాయి. దీనికి కండుమహర్షి శాపమే కారణమని అక్కడి జనుల విశ్వాసం. కండు మహర్షి మహాత్ముడు, సత్యవ్రతుడు, తపోసంపన్నుడు. అటువంటి మహర్షి కుమారుడైన పది సంవత్సరాల బాలుడు మరణించాడు. అడవిలో ఉన్న ఓషధులేవీ ఆ బాలుణ్ణి బ్రతికించలేకపోయాయి. దాంతో ఆ కండు మహర్షి ప్రజలకు ఉపయోగపడని ఈ ఓషధులు ఉండి ఏం ప్రయోజనం అని కోపగించుకొని “ఈ దేశం ఎవరికీ నివాసయోగ్యం కాకుండా ఉండుగాక!” అని శపించాడు. అంతేకాకుండా మృగాలు, పక్షులకు కూడా నివాసయోగ్యం కారాదని “తరులతాగుల్మాదులు కూడా నిష్ప్రయోజనం అగుగాక” అని శపించాడు. అందువల్ల ఆ దేశం అట్లా అయిపోయింది. అయితే వానరవీరులు ఆ దేశంలో కూడా సీతాదేవి కోసం గాలించి వెతికారు.

అక్కడ నుండి ఇంకా ముందుకుపోయి కొండలు, నదులు, వాగులు అన్నీ వెతికి

చూశారు. కానీ వారికెక్కడా సీతాదేవి కనిపించలేదు. అక్కడ నుండి మహాభయంకరంగా ఉన్న కొండగుహ నొకదాన్ని చూశారు. దేవతల్ని కూడా లెక్కచేయని క్రూరాత్ముడైన రాక్షసుణ్ణి ఒకణ్ణి చూశారు. రాక్షసుణ్ణి చూడగానే పర్వతాకారులైన వానరయోధులు వాడిపైకి దూకారు. వాడు కూడా ఈ వానర సైన్యాన్ని చూసి "మీరందరినీ ఒకసారిగా చంపుతాను" అంటూ వాళ్ళపై దుమికాడు. వీడే రావణాసురుడై ఉంటాడని అంగదుడు తలచి వాడిపై లంఘించి ఒక్క గుద్దుగుద్దాడు. వాడు ఆ ఒక్కదెబ్బకే నెత్తురు కక్కుకొని చచ్చాడు. వాళ్ళంతా రావణాసురుణ్ణి చంపేశామన్న ఉత్సాహంతో, గుహ అంతా వెదికారు. వాళ్ళకు సీతాదేవి ఎక్కడా కనిపించలేదు. మళ్ళీ ఇంకో పర్వతగుహ వెతికారు. అక్కడా వాళ్ళకు ఎవరూ కనిపించలేదు; సీతాదేవీ కనిపించలేదు. అంతాకలసి చెట్టు కిందకు చేరి దీనంగా ముఖాలు వేళ్ళాడేస్తూ కూర్చున్నారు.

# 49వ సర్గ సీతాన్వేషణకు మరల ఉత్సాహవంతులవడం

అంగదుడు బాగా అలసిపోయాడు. తనతోటి నాయకుల్ని, సైనికుల్ని ఓదారుస్తూ ఇలా అన్నాడు.

అంగదుడు: మిత్రులారా! మనం అంతా కలసి వనాలు, పర్వతాలు, గుహలు, నదులు, పట్టణాలు, గ్రామాలు అన్నీ వెతికాం. కానీ సీతాదేవి కనబడలేదు. మనం బయలుదేరి చాలాకాలం అయింది. మన రాజు సుగ్రీవుడు అమిత కోపిష్ఠి. తను అనుకున్న పని కాకపోతే క్షమించడు. చండశాసనుడు. మనం మిగిలిన కొద్దిరోజులూ నిద్ర, అలసట మరచిపోదాం. సీతాదేవిని వెతికి తెలుసుకోవటమే పరమలక్ష్యంగా పెట్టుకుని పనిచేద్దాం. అందుకని దిగులు పడకుండా మనస్సునిండా ఉత్సాహాన్ని నింపుకుందాం. ఓర్పుతో పనిచేద్దాం. మళ్ళీ వెతకడం ప్రారంభిద్దాం. లేవండి. కష్టపడి పనిచేసిన వారికి ఫలితం తప్పకుండా లభిస్తుంది. మనమంతా రాముణ్ణి మనసులో తలచుకుంటూ, రామకార్యం కోసం పాటుపడదాం. అట్లా చేస్తే మన ప్రభువు సుగ్రీవుడు కూడా సంతోషిస్తాడు. ఉత్సాహం తెచ్చుకుని మళ్ళీ పని మొదలుపెట్టడమే మన తక్షణ కర్తవ్యమని నాకు అనిపిస్తోంది. అటుపైన మీ ఇష్టం.

అంతట గంధమాదనుడు లేచి, వానర సైన్యంతో "అంగదుడు చెప్పిందే సబబుగా కనిపిస్తోంది. తిరిగి ఉత్సాహం తెచ్చుకుని అన్వేషణ ప్రారంభిద్దాం. గడువు అయ్యేవరకు విశ్రాంతి మాట మరచిపోయి రామకార్యం కోసం పాటుపడదాం" అన్నాడు.

అంతట మహాబలశాలురైన వానరులంతా మళ్ళీ లేచారు. దక్షిణ దిక్కుగా వెతుకుతూ ముందుకు సాగారు. పర్వతాలన్నీ ఎక్కారు. శిఖరాల మీద నుండి చుట్టూ చూశారు. గుహలన్నీ వెదికారు. వానరులు ఎంత కష్టపడి వెతికినా ఎక్కడా సీత కనిపించలేదు. వానరులంతా పర్వతాలపై నుండి దిగి నేలమీద సమావేశం అయ్యారు. కొద్దిసేపు అలసట తీర్చుకున్నారు. తిరిగి దక్షిణ దిక్కుగా అన్వేషణ ప్రారంభించారు. హనుమంతుడు మొదలైన వానరశ్రేష్ఠులంతా

వింధ్యపర్వతాలన్నీ అన్నివైపుల నుంచీ క్షుణ్ణంగా గాలించి వెతికి చూశారు. సీతాదేవి కనిపించలేదు.

# 50వ సర్గ గుహలో వృద్ధురాలైన తాపసినిని చూడటం

హనుమంతుడు, అంగదుడు మున్నగు వారంతా వింధ్యపర్వతాలు, ఆ పరిసర ప్రాంతాలన్నీ అన్వేషించారు. పులులు, సింహాల వంటి భయంకర మృగాలుండే అరణ్యాలు, జలపాతాలూ, నదులు అన్నీ వెతికి చూశారు. అట్లా అన్వేషిస్తూ నైరుతీమూలగా ఉన్న ఓ శిఖరాన్ని చేరారు. గజ, గవాక్ష, గవయ, శరభ, గంధమాదన, మైంద, ద్వివిద, హనుమంత, జాంబవంత, అంగద, తారుడు మున్నగు వారందరూ వెతుకుతూ ఉండగా, దానవునిచే రక్షించబడుతూ తెరిచిపెట్టి ఉన్న ఋక్షబిలమనే బిలాన్నొకదాన్ని చూశారు. అందులోకి ప్రవేశించేందుకు ఎక్కడా అనువుగా కనిపించలేదు. దాన్ని చూడగానే వానరులందరూ పరమానందం చెందారు. సీతాదేవి ఈ బిలం లోపల ఉండవచ్చని ఊహించారు. ఆ బిలం పాతాళానికి ద్వారంలాగా కనిపించింది. దానిచుట్టూ అనేక విధాలుగా కలియ తిరిగి సూక్ష్మంగా అన్వేషించి చూశారు. ప్రవేశానికి మాత్రం ఎక్కడా దారి తెలియడంలేదు. తరువాత వాయుపుత్రుడైన హనుమంతుడు ఇట్లా అన్నాడు.

హనుమంతుడు: మిత్రులారా! దక్షిణదిక్కుగా వచ్చిన మనం అంతా పర్వతాలు, అడవులతో నిండిన అనేక ప్రదేశాలు వెతికి చూశాం. కానీ సీతాదేవి కనిపించలేదు. ఈ బిలానికి నాలుగుప్రక్కల నుండి హంసలు, క్రౌంచపక్షులు, సారపక్షులు, నీటితో తడిసిన చక్రవాకపక్షులూ బయటకు వస్తున్నాయి. అంటే ఈ ప్రాంతాల్లో ఎక్కడో నీరు ఉంది. అది సరోవరమా, కూపమా, దిగుడుబావియా, చెరువా అన్నది తెలియటం లేదు. నీరు పుష్కలంగా ఉండబట్టే ఈ బిలద్వారం చుట్టూ ఉండే ప్రాంతాలన్నీ పచ్చటి వృక్షాలతో నిండిఉన్నాయి.

అప్పుడు వానరులంతా కారుచీకటిగా ఉన్న ఆ బిలాన్ని అన్ని వైపులా పరీక్షించి ప్రవేశమార్గం కోసం వెదికారు. గాలి చొరబడే చోట్లన్నింట్లో వాళ్ళు చొరబడి చూశారు. సింహాలు, మృగాలు, పక్షులకు నివాసస్థానంగా ఉన్న ఆ బిలంలోకి ఎట్లాగో ప్రవేశించారు.

అక్కడ మహాప్రకాశవంతమైన మనోహరమైన ప్రదేశాన్ని చూశారు. దారి తప్పిపోకుండా ఉండేందుకు వాళ్ళంతా ఒకరినొకరు గట్టిగా పట్టుకొని, వృక్షాలతో దట్టమై ఉన్న బిలంలో ఒక యోజనం దూరం ప్రయాణంచేశారు. వాళ్ళకు అప్పుడు బాగా దాహం వేసింది. గొంతు ఎండిపోతోంది. ఆకలిబాధతో కాళ్ళు, ఒళ్ళు తేలిపోతున్నవి. అయినా ధైర్యాన్ని కూడగట్టుకుని. ముందుకు సాగిపోయారు. అప్పుడు వాళ్ళు కాస్త వెలుతురు చూశారు. వాళ్ళల్లో మళ్ళీ ధైర్యం పుట్టుకొచ్చింది. ఆ వెలుతురులో మనోహరమైన ప్రదేశాన్ని చూశారు.

చీకటిలేని ఆ వనంలో బంగారంరంగులో నిప్పులాగా భగభగమండే కాంతులతో, పుష్పించి ఉన్న సాల, తాల, తమాల, పున్నాగ, వంజుల, ధన, చంపక, నాగ, కర్ణికారవృక్షాల్ని చూశారు. అక్కడ ఉన్న బంగారువృక్షాలకు బంగారుపూలగుత్తులు, ఎర్రనైన చిగుళ్ళు పెనవేసుకున్న లతలూ ఉన్నాయి. అవన్నీ బంగారం అలంకారాలతో ఉండటం వల్ల ఉదయసూర్యుడివలె ప్రకాశించాయి. చెట్ల పైభాగాన రత్న వైదూర్యాలతో అలంకరించిన వేదికలున్నాయి. వాటిపైన పక్షులు ఎగురుతూ కనిపించాయి. అవన్నీ ఉదయసూర్యుని కాంతితో వెలిగే పద్మాల్లాగా కనిపించాయి.

అక్కడ ఆ వానరులంతా ఒక పెద్దసరస్సును చూశారు. అందులో నీరు నిర్మలంగా ఉంది. పెద్ద పెద్ద పద్మాలున్నాయి. బంగారంరంగులో చేపలు ఈదుతున్నాయి. నలువైపులా బంగారంతోను, వెండితోను కట్టిన ఇళ్ళు కనబడ్డాయి. వాటన్నింటికీ బంగారంతో చేసిన కిటికీలు అమర్చి ఉన్నారు. ఆ కిటికీలకు ముత్యాలతో చేసిన తెరలుకట్టారు. రత్నాలు వైదూర్యాలతో అలంకారాలు చేశారు. కొన్ని అంతస్తులు బంగారంతోను, కొన్ని అంతస్తులు వెండితోనూ కట్టారు. అక్కడ తాటిచెట్లు, సురపొన్న, వేరుమద్ది, అశోక, చండ్రి, సంపంగి, నాగకేసర, కొండగోగు చెట్లు చూశారు. వృక్షాలనిండా విరగబూసిన బంగారుపూలగుత్తులు మణికాంతులలో ప్రకాశించాయి. వాటినిండా బంగారు తుమ్మెదలు గుంపులు గుంపులుగా మూగాయి.

ఆ గృహాల లోపల బంగారంతో చేసిన శయ్యలు, ఆసనాలు ఉన్నాయి. బంగారు, వెండి, కంచు పాత్రలున్నాయి. అగరు, చందనాది దివ్యసుగంధాలు వెదజల్లుతున్నాయి. అక్కడ చక్కటి పానీయాలున్నాయి. అన్నీ మధురంగాను, వివిధ రకాలైన తేనెలతో చేయబడ్డాయి. ధగధగా మెరిసిపోయే బంగారునాణాలు, రత్నాలు రాసులుగా పోసి ఉన్నాయి.

అక్కడ నారచీరలు ధరించి కృష్ణాజినం కప్పుకుని శరీరం కృశించి ఉన్న ఒక తేజోమూర్తియైన వృద్ధ స్త్రీని చూశారు. ఆ తాపసిని చూసి వానరులంతా భయపడిపోయారు. అప్పుడు పర్వతాకారుడైన హనుమంతుడు ఆ వృద్ధురాలికి చేతులు జోడించి నమస్కరించి “నీవు ఎవరవు? ఈ బిలం ఎవరిది?” అని అడిగాడు.

# 51వ సర్గ హనుమంతునికి తాపసిని సమాధానం చెప్పటం

హనుమంతుడు ఆ వృద్ధ తాపసినికి నమస్కరించి మళ్ళీ ఇట్లా అన్నాడు.

హనుమంతుడు: ఓ తపస్వీ! మేమంతా బాగా అలసిపోయాం. ఆహారం లేక నీరసించిపోయాం. దాహం తీర్చుకోవటానికి నీరైనా దొరకక్క అలమటిస్తున్నాం. హఠాత్తుగా చీకట్లు అలముకున్న ఈ బిలంలోకి ప్రవేశించాం. తీరా ఇక్కడకు వచ్చిన తర్వాత, అనేక రకాలైన పదార్థాలను చూశాం. ఆశ్చర్యంతోను, భయంతోను భ్రాంతి చెందుతున్నాం. మాకు కంగారుగా ఉంది.

ఉదయసూర్యుని కాంతులతో బంగారువృక్షాలు, నోరు ఊరించే ఈ కందమూలాలు, పండ్లు, పెద్దపెద్ద విమానాలు, వాటికి పెద్దపెద్ద బంగారుకిటికీలు, మణిమాణిక్యాలు తాపడం చేసిన చిన్న కిటికీలతో కూడిన ఈ వెండి ఇళ్ళన్నీ ఎవరివి?

మంచి సువాసనలతో మధురమైన ఫలపుష్పాలతో కూడిన బంగారు వృక్షాలు, నిర్మలమైన నీటితో నిండి ఉన్న ఈ సరోవరంలోని పద్మాలన్నీ ఎవరికోసం ఏర్పాటు చేయబడ్డాయి? బంగారు తాబేళ్ళు, చేపలు ఎట్లా వచ్చాయి? ఇదంతా నువ్వు సృష్టించావా? లేక ఎవరైనా తపోధనులు సృష్టించారా? మా అందరికీ తెలిసేట్లుగా చెప్పు.

వృద్ధ తాపసిని: ఓ వానరశ్రేష్ఠుడా! పూర్వం మయుడనే రాజు ఒకడు ఉండేవాడు. అతడు మహా తేజశ్శాలి. గొప్ప మాయావి. తన మాయాబలం చేత ఈ బంగారువనం నిర్మించాడు. తరువాత ఈ బంగారు భవనం నిర్మించాడు. ఇతడు దానవరాజు లందరికీ శిల్పిగా ఉండేవాడు. ఇతడు బ్రహ్మదేవుని గూర్చి తపస్సు చేసి అనేక వరాలు పొందాడు; శుక్రాచార్యుల వారి నుండి సమస్త ధనాన్ని పొందాడు. ఈ మయుడు అన్ని కోరికలూ తీర్చగల సమర్థుడు. అతడే ఈ వనాన్ని సృష్టించి, కొంతకాలం ఇక్కడ నివసించాడు. ఈ మయుడు హేమ అనే అప్సర స్త్రీపై ఆసక్తుడై

ఉండటం చేత, మహేంద్రుడు ఈ మయుని వజ్రాయుధంతో చంపాడు. తరువాత బ్రహ్మ ఈ వనాన్ని, ఈ బంగారు వనాన్ని శాశ్వతమైన కామభోగాలను హేమకు ఇచ్చాడు.

ఓ వానరోత్తమా! నేను మేరుసావర్ణి కుమార్తెను. నా పేరు స్వయంప్రభ. హేమ నన్ను ఈ భవనానికి సంరక్షకురాలిగా ఉంచింది. అందువల్ల ఈ భవనాన్ని రక్షిస్తూ ఇక్కడే ఉంటున్నాను.

ఓ వానరోత్తమా! మీరు ఎవరు? ఏ పని మీద వచ్చారు? ఈ అడవుల్లో ఎందుకు తిరుగుతు న్నారు? ఇతరులు అడుగుపెట్టటానికి వీలుకాని ఈ ప్రదేశానికి ఎట్లా వచ్చారు? ఈ వనాన్ని ఎట్లా చూడగలిగారు? మీరంతా మంచి ఆకలి మీద ఉన్నారు. మీరు తినగలిగినన్ని పండ్లు, కందమూలాలు తినండి. కావలసినన్ని నీళ్ళు త్రాగండి. ఆ తరువాత మీ విషయం అంతా నాకు చెప్పు.

## 52వ సర్గ వృద్ధ తపస్వినికి వానరులు తమ వృత్తాంతాన్ని చెప్పడం

ఆవృద్ధతాపసి, స్వయంప్రభ అనుమతి ఇచ్చిన తరువాత ఆ వానరులంతా కడుపునిండా పండ్లను, కందమూలాలను తిన్నారు. తృప్తిగా నీరు త్రాగి విశ్రమించారు.

స్వయంప్రభ: ఓ వానరులారా! మీ ఆకలి బాధ తీరినదిగదా! ఇక మీ విషయం అంతా నాకు చెప్పండి వింటాను.

హనుమంతుడు: ఓ తాపసీ! సమస్త లోకాలకు ప్రభువు, శ్రీమంతుడు, దశరథమహారాజు జ్యేష్ఠపుత్రుడు అయిన రాముడు, భార్య సీతతోనూ, తమ్ముడు లక్ష్మణునితోనూ దండకారణ్యంలో నివసించేవాడు. అతడు ఇంట్లోలేని సమయం చూసి అతడి భార్య సీతాదేవిని రావణుడు అపహరించుకొని పోయాడు. రామునికి వానరరాజైన సుగ్రీవుడు మిత్రుడైనాడు. మేమంతా సుగ్రీవుని సేవకులం. అతడే మమ్మల్ని సీతాదేవిని వెతికి ఎక్కడున్నదో తెలుసుకొని రమ్మని పంపాడు. మమ్మల్ని ఆ విధంగా ఆదేశించగా మేము అగస్త్య మహర్షి నివసించినది, యముని రక్షణలోవున్న ఈ దక్షిణదిక్కుగా సీతాదేవిని వెతుకుతూ వచ్చాం. అరణ్యాలు, సముద్రాలు, పర్వతాలన్నీ గాలించాం. కానీ సీతాదేవి కనబడలేదు. మేమంతా ఆకలిబాధకు, దాహానికి తట్టుకోలేనివారమై, వాడిపోయిన ముఖాలు వేసుకొని, చింత అనే సముద్రంలోపడి ఒడ్డుకు చేరుకోలేకపోతున్నాం. ఇట్లా వెతుకుతూ ఉండగా వృక్షాలతోనూ, లతలతోనూ కప్పబడివున్న ఈ బిలం కనబడింది. నదిలో తడిసి నీళ్ళుకారుతూ ఎగిరిపోతున్న హంసలను, సారసపక్షుల్నీ చూశాం. అంటే ఈ బిలం లోపల ఎక్కడో నీటివసతి ఉండి ఉంటుందని ఊహించాం. లోపల అంతా గాఢాంధకారంగా ఉండటం చేత, మేమంతా తప్పిపోకుండా ఉండేందుకు ఒకరి చేతులు ఒకరం పట్టుకుంటూ ఒక యోజనదూరం ప్రయాణం చేశాం. మేమంతా రామకార్యం మీదనే వచ్చాం. నీ దయవల్ల మా ఆకలి, దప్పిక తీరిపోయాయి. ఆకలితో చావుకు సిద్ధంగావున్న మమ్మల్ని అందరినీ కాపాడావు. మేము నీకు ఏమి ప్రత్యుపకారం చెయ్యగలమో చెప్పు.

స్వయంప్రభ: ఓ వానరశ్రేష్ఠులారా! నేను ధర్మాన్ని ఆచరిస్తున్నదాన్ని. నాకు ఏమీ కోరికలు లేవు. అమిత బలాఢ్యులైన మీరంతా ధర్మకార్యానికై పనిచేస్తున్నారు, సంతోషిస్తున్నాను.

హనుమంతుడు: ఓ తపస్వీ! ధర్మాన్ని ఆచరిస్తున్న నిన్ను మేమందరం శరణుకోరుతున్నాం. మాకు సుగ్రీవుడు ఇచ్చిన గడువు తీరిపోతుంది. కాబట్టి నీవే మమ్మల్నందరినీ ఈ బిలం నుండి బైటపడెయ్యాలి. లేకపోతే మేము రామకార్యం పూర్తి చెయ్యకుండా తిరిగి వెళ్ళాల్సివస్తుంది. అంతే కాకుండా సుగ్రీవుడు మాకందరికీ మరణశిక్ష విధిస్తాడు. అందువల్ల మేమంతా నిన్ను శరణుకోరుతున్నాం.

స్వయంప్రభ: ఓ వానరులారా! ఒకసారి ఈ బిలంలోనికి ప్రవేశించినవాళ్ళు మళ్ళీ బయటకు వెళ్ళలేరు. కానీ మీ సత్ప్రవర్తనచే నన్ను సంతోషపెట్టారు. అందువల్ల నా తపశ్శక్తిని వినియోగించి మిమ్ములనందరినీ ఈ బిలం నుండి బయటకు పంపుతాను. మీరంతా కళ్ళుమూసుకోండి. కళ్ళు తెరచుకొని ఉంటే బయటకు వెళ్ళలేరు.

అప్పుడు వానరులంతా గట్టిగా కళ్ళుమూసుకున్నారు, క్షణకాలంలో వాళ్ళంతా బిలం బైటకి వచ్చేశారు. అంతట ఆ తపస్వి వారితో "ఓ వానరులారా! ఇది అనేక విధాలైన, వృక్షములు, లతలతో కూడిన వింధ్యపర్వతం. ఇది ప్రస్రవణపర్వతం. ఇదే మహోదధి అనే మహాసముద్రం, వానరులారా! మీకు శుభం జరుగుతుంది. నేను తిరిగి నా భవనానికి వెళ్తున్నాను" అంటూ ఆమె ఆ బిలంలోకి వెళ్ళిపోయింది.

# 53వ సర్గ సుగ్రీవుడు పెట్టిన గడువు తీరిపోవటం

అప్పుడు ఆ వానరులంతా సముద్రతీరాన్ని చేరారు. అదే వరుణదేవుడి స్థానం. అలలు భయంకరంగా తీరాన్ని చేరుతున్నాయి. అది సగర చక్రవర్తి త్రవ్వించిన మహాసముద్రం.

వానరులంతా మయుని మాయాదుర్గంలో చిక్కుకుపోయినప్పుడే సుగ్రీవుడు పెట్టిన గడువు తీరిపోయింది. మహాపరాక్రమవంతులైన వానరులంతా వింధ్యకు నైరుతిగావున్న తీరంలో నేలమీద కూలపడ్డారు. ఎదురుగా వృక్షాలను పెనవేసుకొని పుష్పించిన లతలనూ, పూతపిందెలు పట్టిన మామిడిలాంటి చెట్లను చూసి వసంతకాలం రానేవచ్చిందని భయపడ్డారు. సుగ్రీవాజ్ఞ తలచుకొని విలవిల్లాడిపోయారు.

పిమ్మట సింహపు మూపువంటి భుజాలు కలిగినవాడు, మహాబుద్ధిమంతుడు, యువరాజు అయిన అంగదుడు, తక్కిన వానర వృద్ధులతో ఇట్లా అన్నాడు:

అంగదుడు: ఓ వానరులారా! మనం అందరం బిలంలో ఉండగానే సుగ్రీవుడు విధించిన గడువు దాటిపోయింది. మనం ఆశ్వీయుజమాసంలో బయలుదేరాం. మనమందరం ప్రభుభక్తి గలవాళ్ళం. నీతిమార్గానపోయేవాళ్ళం. ప్రభువు చెప్పిన పనులు చేయటం మన విధి. మీ శక్తిసామర్థ్యాలు లోకంలో అందరికీ తెలిసినవే, పనులు సాధించటంలో మీకు మీరేసాటి. మీ అందరి అంగీకారంతో సుగ్రీవుడు నన్ను మీ అందరికీ నాయకుడుగా నియమించాడు. సుగ్రీవాజ్ఞను ఉల్లంఘించినట్లయితే మనమందరం మరణించాల్సి ఉంటుంది; అదే యథార్థం. సుగ్రీవుడి మాట కాదని ఎవడు బ్రతకగలడు? మనం కిష్కింధకు పోయి ఆయన చేతిలో చచ్చేకంటే, ఇక్కడే ఆత్మహత్య చేసుకోవటం మంచిది.

ఓ వానరవీరుల్లారా! నాకు యౌవరాజపట్టాభిషేకం చేసింది సుగ్రీవుడు కాదు. కార్యాలను సులభంగానూ, నేర్పుగానూ చేసే రాముడే దగ్గరుండి నాకు యౌవరాజ్యం ఇప్పించాడు. నన్ను

యువరాజుగా సుగ్రీవునిచేత చేయించాడే కానీ, సుగ్రీవుడు స్వయంగా చేయలేదు. అంతేకాకుండా సుగ్రీవుడు నాపై మొదటినుండీ సవతితల్లి ప్రేమే చూపిస్తూ వచ్చాడు. ఆ పూర్వవైరం మనస్సులో పెట్టుకొని, ఇప్పుడు రామకార్యంలో జాప్యం తెలియగానే నన్ను చంపేస్తాడు. అప్పుడు నన్ను గురించి నా బంధుమిత్రులు దుఃఖపడటం కంటే చేసేది ఏమీ ఉండదు. అందువల్ల ఈ పవిత్ర సముద్రతీరానే ప్రాయోపవేశం ప్రారంభిస్తాను.

అంగదుడు ఈ విధంగా దుఃఖీస్తూవుంటే, వృద్ధులైన వానరవీరులంతా జాలిపడి, “ఓ అంగదుడా! నీ ఊహ యథార్థమైనదే! సుగ్రీవుడు సహజంగానే నిష్కర్షగా ఉంటాడు. ఇప్పుడు రామకార్యంలో విఘాతం కలిగిందంటే రాముణ్ణి మెప్పించటానికైనా మనల్ని చంపేస్తాడనడంలో సందేహంలేదు. అపరాధం చేసి రాజు దగ్గరకు పోవడం అంటే మెడకు ఉచ్చు తగించుకున్నట్లే అవుతుంది. అందువల్ల సీతాదేవి దొరికేదాకా వెతుకుదాం. సీతాదేవి జాడ తెలిస్తే కిష్కింధకు పోదాం. లేదంటే మనమందరం ఇక్కడ నుండే యముడి పట్టణానికి పోదాం” అన్నారు. పెద్దలంతా చెప్పింది విన్న తారుడు ఇట్లా అన్నాడు.

తారుడు: వానరులారా! దుఃఖీంచకండి. మరణాన్ని గురించి ఆలోచించకండి, సుగ్రీవుణ్ణి గూర్చి భయపడకండి. మనమంతా కలసి మయుడి మాయాబిలంలోకి వెళ్ళి నివసిద్దాం. అక్కడ ఆహారం, నీరు సమృద్ధిగా ఉన్నాయి. అక్కడకు సుగ్రీవుడు, రాముడే కాదు, మహేంద్రుడు కూడా రాలేరు. కాబట్టి దుఃఖీంచకండి.

వానరులంతా అంగదుణ్ణి సమర్థిస్తూ మాట్లాడటంతో అంతా ముక్తకంఠంతో “ఓ అంగదుడా! నీవు ఎట్లా చేస్తే మనందరికీ క్షేమమని అనుకుంటావో ఆ విధంగానే చెయ్యి. మేమంతా నీ మాటను శిరసావహిస్తాం” అన్నారు.

# 54వ సర్గ హనుమంతుని ఉపదేశం

తారుడు అంగదుని సమర్థిస్తూ మాట్లాడటం, అంగదుని మాటల తీరు చూసి, వానరరాజ్యాన్ని కబళించాలని అంగదుడు చూస్తున్నాడని హనుమంతుడు అనుకున్నాడు. ఈ అంగదునికి ఎనిమిది అంగములుగల బుద్ధి, నాలుగు బలములు, పదునాలుగు గుణాలు ఉన్నాయని అనుకున్నాడు.

[

1. [ గ్రహణం, ధారణం, స్మరణం, ప్రతిపాదికం, ఊహ, అపోహ, అర్థవిజ్ఞానం, తత్త్వజ్ఞానం అనేవి ఎనిమిది బుద్ధిగుణాలు.
2. బాహుబలం, మనోబలం, ఉపాయబలం, బంధుబలం అనేవి నాలుగు బలాలు.
3. దేశకాలజ్ఞానం, దార్ఢ్యం, సర్వక్లేశసహిష్ణుత, సర్వవిజ్ఞానం, దక్షత, బలం, మంత్రగోపనం, అవిసంవాదిత్వం, స్వశక్తిపరిజ్ఞానత్వం, కృతజ్ఞత, శరణాగతి, వాత్సల్యం, అమర్షత్వం, అచపలత అనే పధ్నాలుగు సుద్గుణాలు.

]

అంగదుడు వాలి అంతటి పరాక్రమంతుడని, బుద్ధియందు బృహస్పతి అంతటివాడని, హనుమంతుడికి తెలుసు. అంగదుడు శుక్లపక్ష చంద్రుడిలాగా క్షణక్షణానికీ తేజోవంతుడూ, బలవంతుడూ, పరాక్రమవంతుడు అవుతున్నాడని హనుమంతుడు గ్రహించాడు. అంగదుడు సుగ్రీవుడి నుండి విడిపోకుండా కలసివుండేట్లు చేయాలని హనుమంతుడు తలచాడు. సామ దాన భేద దండోపాయాల్లో మూడవదయిన భేదోపాయం ద్వారా సాధించాలని అనుకున్నాడు. తన మాటల నేర్పుతో వానరులందరినీ విడదీశాడు. తరువాత దండోపాయాన్ని ప్రయోగించి అంగదుణ్ణి భయపెడ్తూ, హనుమంతుడు ఇట్లా అన్నాడు.

హనుమంతుడు: ఓ అంగదుడా! నీవు బలపరాక్రమాల్లో నీ తండ్రి వాలి వలే సమర్థుడవు. వానరరాజ్యాన్ని పాలించగల సామర్థ్యం ఉంది, అందులో ఏమీ సందేహం లేదు.

ఓ వానరశ్రేష్ఠుడా! వానరులు స్థిరమైన స్వభావం గలవాళ్ళు కాదు. చపలచిత్తులు. భార్యాపిల్లలకు దూరంగా ఉండే ఈ వానరులెవరూ నీ ఆజ్ఞలకు లొంగివుండరు. ఒక విషయం ఆలోచించు! ఈ జాంబవంతుడు, నీలుడు, సుహోత్రుడు నీతో కలసి ఉండరు, నేనుకూడా నీతో కలవను. మమ్మల్ని సామదానాది ఉపాయాలచేతను, దండముచేతను సుగ్రీవుని నుండి దూరం చెయ్యలేవు. బలవంతుడితో విరోధం పెట్టుకోకూడదు.

ఓ అంగదుడా! నువ్వు దూరంగా ఈ బిలంలో ఉంటూ బ్రతుకవచ్చని తారుడు చెప్పడం, నీవు తల ఊపడం సరిగాలేదు. ఈ బిలంలోకి ఎవరూ ప్రవేశించలేరని తారుడు అంటున్నాడు. లక్ష్మణుడు ఒక్క బాణంతో ఈ బిలాన్ని బ్రద్దలు కొట్టగలడు, పూర్వం మయుణ్ణి చంపేందుకు ఇంద్రుడు వజ్రయుధాన్ని ప్రయోగించడం ఎంత చిన్నపనో, అట్లా లక్ష్మణుడికి కూడా ఈ బిలం బద్దలుకొట్టేందుకు ఒక్క బాణం చాలు. కొబ్బరికాయ పగిలినట్లుగా రెండు చెక్కలవుతుంది. లక్ష్మణుని వద్ద నారాచ బాణాలున్నాయి. అవి వజ్రాయుధంకన్నా బలమైనవి, పర్వతాన్నైనా బద్దలు కొడతాయి.

ఓ శత్రుసంహరకుడా! నీవు బిలంలోకి వెళ్ళగానే ఈ వానరులంతా నిన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతారు. వాళ్ళందరికీ కళ్ళుతెరచినా కళ్ళుముసుకున్నా భార్యాపిల్లలే కనిపిస్తూ ఉంటారు. భార్యపక్కలో లేకుండా నీతోపాటు కటికనేలపై పడుకోమంటే, ఒక నిమిషం కూడా నీతో ఉండరు. నిన్ను విడిచిపెట్టి పారిపోతారు. బంధువుల్లేకుండా, స్నేహితుల్లేకుండా ఒంటరివాడివైపోతావు. చీమ చిటుక్కుమన్నా హడలి చస్తావు.

ఓ అంగదుడా! లక్ష్మణుడి బాణాలు అతి భయంకరమైనవి. నీకు చెప్పినపని మానేసి కుంటిసాకులు చెప్పి పారిపోవాలని చూస్తే, లక్ష్మణుడి బాణాలు నిన్ను వెంటాడి చంపుతాయి.

అట్లాకాకుండా, నీవు కూడా మాతోపాటే వచ్చి వినయంగా సుగ్రీవుడి దగ్గర మన దుర్గతి చెప్పుకుంటే, తప్పకుండా మన మొర ఆలకిస్తాడు. సుగ్రీవుడు తగిన సమయంలో నీకు రాజ్యాన్నిచ్చి తను తపస్సు చేసుకోవటానికి పోతాడు.

ఓ అంగదుడా! నీ పినతండ్రి సుగ్రీవుడు ధర్మాత్ముడు, ప్రేమాభిమానాలున్నవాడు, పరిశుద్ధుడు, నియమాలు, క్రమశిక్షణ కలవాడు. అతడు నిన్ను ఎన్నడూ శిక్షించడు. అంతేకాదు అతడు నీ తల్లికి సంతోషాన్ని కలిగించాలనే తాపత్రయపడుతూ ఉంటాడు. అతడు జీవించేదే ఆమెకోసం. అతడికి వేరే సంతానమే లేదుగదా! అందువల్ల అంగదుడా, మనం అందరం కలిసే తిరిగిపోదాం.

# 55వ సర్గ అంగదుడు ప్రాయోపవేశం చేయటం

హనుమంతుడు ప్రభుభక్తితోనూ, ధర్మసమ్మతంగానూ మాట్లాడిన మాటలన్నీ విన్న అంగదుడు ఇట్లా అన్నాడు.

అంగదుడు: ఓ హనుమంతుడా! సుగ్రీవునిలో సాధుత్వం, పరిశుద్ధమైన మనస్సు, ఋజుత్వం, పరాక్రమం, ధైర్యాలలో ఏ ఒక్కటీ లేవు.

దుర్మార్గుడైన సుగ్రీవుడు, తన అన్నగారు జీవించి ఉండగానే, తనకు తల్లివంటిదైన వదినగారిని పట్టమహిషియైన నా తల్లిని భార్యగా చేసుకున్నాడు. దుందుభి వేరే మార్గంలో బయటకు వస్తాడేమో, బిలద్వారం దగ్గరే ఉండి వాడితో యుద్ధం చెయ్యమని నా తండ్రి సుగ్రీవుణ్ణి బిలద్వారం దగ్గర నిలబెట్టాడు. నా తండ్రి చెప్పినట్లు చెయ్యకుండా, బిలద్వారాన్ని పెద్ద బండరాయితో కప్పిపెట్టి ఇంటికి తిరిగి వచ్చాడు. అతడు ధర్మం తెలిసినవాడు ఎట్లా అవుతాడు?

మహాశక్తిమంతుడైన రాముడితో చేతులుకలిపి స్నేహం చేశాడు. అతడినుండి ఉపకారాన్నీ, కీర్తినీ, రాజ్యన్నీ పొందాడు. అటువంటి రాముడికి ప్రత్యుపకారం చెయ్యకుండా కామసుఖాల్లో మునిగి తేలాడు. అటువంటివాడు ఎవరి ఉపకారాన్ని మాత్రం గుర్తుంచుకొని గౌరవిస్తాడు? సుగ్రీవుడు లక్ష్మణునకు భయపడి మనల్ని సీతాన్వేషణకు పంపాడే కాని, అతనిలో ప్రత్యుపకారం చెయ్యాలనే గుణం ఎంతమాత్రమూ లేదు. అటువంటి వాడిలో ధర్మం ఎట్లా ఉంటుంది? సుగ్రీవుడు పాపాత్ముడు, కృతఘ్నుడు, చేసిన ఉపకారాన్ని మర్చిపోయేవాడు. అతడి మనస్సు చంచలం. అటువంటి వాడిని ఎవరైనా పూజ్యుడని మన్నిస్తారా? అందులో అదే జాతిలో పుట్టినవాడెవడూ అతణ్ణి పూజ్యుడనడు. గుణవంతుడైనా కాకపోయినా తనకు పుట్టబోయే వాడికే రాజ్యం ఇస్తాడుకాని తన శత్రువు కొడుకైన నన్ను చంపకుండా వదిలిపెడ్తాడా? నేను సుగ్రీవుని ఆజ్ఞను పాటించలేకపోయాను; ఋక్షబిలంలో ఉండిపోదామనే ఆలోచన చేశాను; ఈ విషయం ఏదో విధంగా తెలుసుకుంటాడు. నన్ను అణగతొక్కేందుకు తను చేయగలిగిందంతా చేస్తాడు.

నేనొక అనాథలాగా కిష్కింధలో బ్రతుకు వెళ్ళదీయాల్సి ఉంటుంది. ఎన్నిచెప్పినా సుగ్రీవుడు క్రూరుడు, ఘాతకుడు. రాజ్యం ఇవ్వవలసి వస్తుందని గుట్టుచప్పుడు కాకుండా నన్ను చంపేస్తాడు. కిష్కింధకు వచ్చి వాడిచేతుల్లో చావడంకన్నా ఇక్కడ ప్రాయోపవేశం చేయడం మంచిది. మీరంతా నన్ను క్షమించండి.

ఓ వానరవీరులారా! మీరంతా మీ మీ ఇళ్ళకు తిరిగి వెళ్ళండి. మీ భార్యా పిల్లలతో సుఖంగా ఉండండి. బలవంతులైన రామలక్ష్మణులకు నా నమస్కారాలు చెప్పండి. నా పినతల్లి రుమకు నమస్కారాలు చెప్పండి. నా పినతండ్రి సుగ్రీవుడికి నమస్కారాలు చెప్పండి. నా తల్లి తారను ఓదార్చండి. ఆమెకు నేను ఒక్కడే కొడుకును. నేను చనిపోయానని తెలిస్తే తానూ మరణిస్తుంది.

ఈ విధంగా మాట్లాడి, అంగదుడు పేరుపేరునా వానర వృద్ధులందరికీ నమస్కారాలు చేశాడు. కన్నీళ్ళు పెట్టుకుంటూ నేల మీద దర్భలు పరుచుకొని పడుకున్నాడు.

అంగదుడు ఈ విధంగా ప్రాయోపవేశానికి పడుకోగానే వానర వీరులంతా గుండెలు పగిలేట్లుగా ఏడ్చారు. అంతా సుగ్రీవుణ్ణి తిట్టుకున్నారు, వాళ్ళుకూడా చచ్చిపోయేందుకే నిశ్చయించుకున్నారు. వెళ్ళి సముద్ర స్నానాలు చేశారు, దర్భలు తెచ్చి కొనలు దక్షిణం వైపు ఉండేట్లు పరచుకున్నారు. తూర్పు వైపుగా ముఖంపెట్టి కూర్చున్నారు.

అట్లా ప్రాయోపవేశానికి కూర్చున్న వాళ్ళంతా తమకు ఈ గతి పట్టడానికి గల కారణాలన్నింటినీ ఒకళ్ళతో ఒకళ్ళు చెప్పుకొని చెప్పుకొని ఏడ్చారు. "రాముడు వనవాసానికి రావడం, దశరథమహారాజు చనిపోవడం, జనస్థానంలో రాముడు ఖరుణ్ణి చంపడం, శూర్పణఖ ముక్కులు, చెవులు కోసి పంపడం, రావణాసురుడు సీతాదేవిని అపహరించడం, జటాయువు రావణుణ్ణి అడ్డుకుని మరణించడం, రాముడు వాలిని చంపడం, రాముడికి సుగ్రీవుడి మీద కోపం రావడం, రాముణ్ణి మెప్పించడం కోసం తమని సీతాన్వేషణకు పంపడం, తమకు ఋక్ష

బిలంలోనే గడువు తీరిపోవడం" మున్నగు విషయాలన్నీ చెప్పుకొని విలపించారు. పర్వతాకారులైన ఆ వీరులంతా బిగ్గరగా ఏడ్చారు. ఆ ఏడ్పుల్తో కొండలు మారుమోగ్రాయి, సముద్రఘోష మరుగున పడిపోయింది.

## 56వ సర్గ సంపాతి వానరుల వలన జటాయువు మరణాన్ని వినడం

జటాయువు సోదరుడు, చిరంజీవి, బలపరాక్రమవంతుడు, శ్రీమంతుడైన సంపాతి అనే గృధ్రరాజు వానరులు ప్రాయోపవేశానికి కూర్చోవడం చూశాడు. చాలా సంతోషించి బిగ్గరగా ఇట్లా అన్నాడు.

"ఆహా! భగవంతుడు ఎంత దయామయుడు! ప్రతి ప్రాణికి పూర్వకర్మలను అనుసరించి ఆహారాన్ని సమకూర్చిపెడ్తూ ఉంటాడు. నా పూర్వ జన్మల పుణ్యఫలవిశేషం చేత నా కోసం ఇంత ఆహారాన్ని ఏర్పాటుచేసి పెట్టాడు. ఈ వానరులంతా ప్రాయోపవేశానికి దర్భలు పరుచుకొని కూర్చున్నారు. వీళ్ళల్లో రోజుకొకడైనా మరణిస్తూ ఉంటాడు. అట్లా మరణించినవాడిని తిని నా ఆకలి బాధను తీర్చుకుంటాను."

ఆ సంపాతి మాటలు వింటున్న అంగదుడు హనుమంతుడితో ఇట్లా అన్నాడు.

అంగదుడు: ఓ హనుమంతుడా! ఈ పక్షి మాటలు విన్నావు గదా! యముడే మనల్ని చంపటానికి ఈ గృధ్రరూపంలో వచ్చినట్లుంది. మనం రాముడి కార్యం సాధించలేకపోయాం, రాజాజ్ఞను పాటించలేకపోయాం, మనకు మరణం ఈ రూపంలో రాసిపెట్టివుంది.

సీతను రక్షించడానికి అడ్డంపోయిన ఆ జటాయువు ప్రాణాలు పోగొట్టుకున్నాడు. అంటే సమస్త ప్రాణికోటి, పశుపక్ష్యాదులతో సహా రాముణ్ణి సంతోషపెట్టడానికి ప్రాణాలను సంతోషంతో సమర్పించుకుంటున్నాయి గదా! రాముడికి ఉపకారం చెయ్యటానికే మహాబలవంతుడైన జటాయువు ధైర్యంగా రావణాసురుడితో పోరాడి మరణించాడు. ఆ పుణ్యాత్ముడు జటాయువు రాముడి కోసం ప్రాణలు విడిచాడు. మనం కూడా రాముడి కోసమే అడవులకు వచ్చాం. అడవులన్నీ వెతికాం, అలసిపోయాం. సీతాదేవిని మాత్రం చూడలేకపోయాం. ఇప్పుడు ప్రాణాలు వదిలేందుకు సిద్ధపడ్డాం. నేడో రేపో మనలను పీక్కుతింటానికి ఈ గృధ్రరాజు కూడా వచ్చి

కూర్చున్నాడు.

ఆ జటాయువు రావణుడితో యుద్ధంచేసి చచ్చిపోయాడు. అతడు అదృష్టవంతుడు. మనకుమల్లే అతడు సుగ్రీవుడి భయం లేకుండా చచ్చిపోయాడు. సీతా రామలక్ష్మణులు వనవాసానికి రావడం ఏమిటి? దశరథ మహారాజు ఆ దిగులుతో మరణించడం ఏమిటి? సీతాదేవిని రావణాసురుడు అపహరించుకొనిపోవడం ఏమిటి? ఇవన్నీ మన ప్రాణాలు గాలిలో కలిసిపోయేందుకే వచ్చాయి సుమా! అసలు ఇన్ని మాటలెందుకు? ఈ కష్టాలన్నీ దశరథ మహారాజు కైకేయికి వరాలు ఇవ్వడంవల్లనే వచ్చాయి. ఈ వానరుల చావులన్నింటికీ ఆ కైకేయిదేవియే కారణం.

అంగదుడు ఈ విధంగా హనుమంతుడితో మాట్లాడుతూవుంటే, మహామతిమంతుడైన సంపాతి విన్నాడు. జటాయువును గూర్చి వాళ్ళు మాట్లాడుకుంటున్న మాటలు వింటుంటే సంపాతికి ఒళ్ళు గగుర్పొడిచినట్లైంది. దీర్ఘంగా నిట్టూరుస్తూ "ఎవడ్రా నీవు? నా తమ్ముడు జటాయువు మరణించాడని అంటున్నావు? నా తమ్ముడు నాకు ప్రాణకన్నా ఎక్కువ ప్రియమైనవాడు. ఎక్కడో జనస్థానంలో ఉంటున్న నా తమ్ముడికీ రావణాసురుడికీ ఎందుకు యుద్ధం జరిగింది? నా తమ్ముడు ఎట్లా చచ్చిపోయాడు? నా తమ్ముడు మహా పరాక్రమవంతుడే? మహాగుణవంతుడే? ఓ వానర శ్రేష్ఠులారా! జనస్థానంలో నివసించే నా తమ్ముడి మరణాన్ని గూర్చి నాకు ఇంకా వివరాలు చెప్పండి. నాకు తెలుసుకోవాలని ఉంది. సూర్యుడి కిరణాలవల్ల నా రెక్కలు కాలిపోయాయి. మీరు వచ్చి నన్ను క్రిందకు దింపండి. నేను మిమ్మల్ని వేడుకుంటున్నాను" అన్నాడు.

# 57వ సర్గ సంపాతికి రామకథ చెప్పడం

వానరులంతా సంపాతి మాటలు విన్నారు. అతడి కంఠంలో దుఃఖం తెలుస్తోంది. అయినా వీడు ఎవడో? ఏం అపకారం చేస్తాడోనని అనుమానపడ్డారు. కానీ ప్రాయోపవేశానికి కూర్చున్నవాళ్ళు మాత్రం సంతోషించారు. “ఎట్లాగో మనం చావటానికే కూర్చున్నాం, వీడు చంపి తింటే, మనం అనుకున్నపని ఇంకా త్వరగా అయిపోతుంది” అని అనుకున్నారు. వెంటనే అంగదుడే వెళ్ళి, సంపాతిని భుజాలపై ఎక్కించుకొని పర్వతశిఖరం పైనుండి క్రిందకు తీసుకువచ్చి ఇట్లా అన్నాడు.

అంగదుడు: ఓ పక్షిరాజా! మహాప్రతాపం కలిగిన ఋక్షరజుడు అనే వానరప్రభువు ఒకడుండేవాడు. అతడు నాకు తాతగారు, గొప్ప ధార్మికుడు. వాలిసుగ్రీవులు ఆయన పుత్రులు. నా తండ్రి వాలి మహాపరాక్రమవంతుడుగా ప్రసిద్ధిపొందాడు. ఇక్ష్వాకువంశంలో పుట్టినవాడు, సకల జగత్తులకు ప్రభువైన రాముడు, తండ్రియైన దశరథ మహారాజు ఆజ్ఞ పాటించడానికై భార్య సీత, తమ్ముడు లక్ష్మణునితో కలసి దండకారణ్యానికి వచ్చాడు. రాముని భార్యయైన సీతదేవిని రాముడులేని సమయంచూసి రావణాసురుడు జనస్థానం నుండి అపహరించాడు.

దశరథ మహారాజుకు మిత్రుడైన గృధ్రరాజు జటాయువు రావణుడితో యుద్ధంచేసి రావణుడి రథాన్ని విరగ్గొట్టి అలసిపోయి కూర్చుని ఉండగా రావణుడు అతణ్ణి చంపి సీతను అపహరించుకుపోయాడు. అట్లా రాముడికోసం చనిపోయిన జటాయువు శరీరానికి రాముడు దహన సంస్కారాలు చేసి ఉత్తమ గతులు పొందేట్లు చేశాడు. తరువాత రాముడు నా పినతండ్రియైన సుగ్రీవుడితో స్నేహంచేసి నా తండ్రియైన వాలిని చంపాడు. అంతట రాముడు సుగ్రీవుని కిష్కింధకు రాజుని చేశాడు. కిష్కింధకు ఇప్పుడు సుగ్రీవుడే రాజు. రాముని సంతోషపెట్టేందుకు సుగ్రీవుడు మమ్మల్నందరినీ సీతాన్వేషణకై పంపాడు. సీతను వెతికివచ్చేందుకు మాకు నెల రోజులు గడువు ఇచ్చాడు. గడువు అయిపోయింది కానీ,

రాత్రిపూట సూర్యకాంతి కనపడనట్లు సీత మాకు కనిపించలేదు. మేమంతా మయుడి మాయాబిలంలో ఉండగానే సుగ్రీవుడు పెట్టిన గడువు దాటిపోయింది. అందుకని మేమంతా సుగ్రీవుడికి భయపడి ప్రాయోపవేశం చెయ్యడానికి కూర్చున్నాం. రాముడికి, సుగ్రీవుడికి కోపం కలిగించిన తర్వాత మేమంతా అక్కడకు వెళ్ళినా మరణదండన పొందక తప్పదు. అందువల్ల ఇక్కడే ప్రాయోపవేశం చేద్దామని కూర్చున్నాం.

# 58వ సర్గ సంపాతి రెక్కలు కాలిపోయిన వృత్తాంతం

ప్రాయోపవేశానికి కూర్చున్న వానరులు చెప్పిన కథంతా విన్న తర్వాత సంపాతి కూడా కన్నీళ్ళు పెట్టుకొన్నాడు. వాళ్ళ దీనమైన కథ విని జాలి గలవాడై వాళ్ళతో ఇట్లా అన్నాడు.

సంపాతి: ఓ వానరులారా! రాముడికోసం, సీతను రక్షించేందుకై రావణుడితో యుద్ధం చేశాడని మీరు చెప్తున్న ఆ జటాయువు నాకు తమ్ముడే! నేను కూడా నా తమ్ముడి మరణాన్ని గూర్చి విన్నాను. కానీ నేను పెద్దవాడైపోయాను; పైగా రెక్కలు కూడా కాలిపోయాయి. కాబట్టి నేను ఆ రావణాసురుణ్ణి ఎదుర్కొని పోరాడలేను.

పూర్వం వృత్రాసుర వధ జరిగిన కాలంలో నేనూ, ఆ జటాయువు పోటీలుపడి సూర్యమండలంవైపుగా ఎగిరాం. సూర్యుడు ఆకాశంలో నడుమకు రాగానే (మిట్ట మధ్యాహ్నం కాగానే) సూర్యకిరణాల వేడి ఉద్ధృతమై నా తమ్ముడు జటాయువు సొమ్మసిల్లి పోయాడు. నేను వాడిని రక్షించడం కోసం నా రెక్కలతో జటాయువును కప్పి వేశాను. ఆ వేడికి నా రెక్కలు రెండూ కాలిపోయి నేను ఈ వింధ్యపర్వతంపై పడిపోయి ఇక్కడే కాలం గడుపుతున్నాను. జటాయువు ఏమైనాడో ఆనాటినుండి ఈనాటివరకూ నాకు తెలియదు. వారూ, వీరూ దండకారణ్యంలో జనస్థానంలో ఉన్నాడని చెప్పుకోగా విన్నాను.

అంగదుడు: ఓ సంపాతీ! నీ మాటలన్నీ విన్నాను. నేను కూడా మా కథ అంతా చెప్పాను. నీవు నిజంగా జటాయువు సోదరుడవే అయితే నీకు కూడా రామకార్యంపై ఆసక్తి ఉంటుంది. కాబట్టి సీతాదేవిని అపహరించుకు పోయిన ఆ రాక్షసుని స్థావరం నీకు తెలిస్తే చెప్పు.

సంపాతి: ఓ వానరులారా! రెక్కలు కాలిపోయినవి. వృద్ధాప్యం చేత శరీరంలో శక్తి అంతా క్షీణించిపోయింది. మాట సాయంచేసి రామకార్యానికి సహాయపడ్తాను. అంతకన్నా ఈ జీవితానికి పరమార్థం ఏం ఉంటుంది? నీటికి ప్రభువయిన వరుణలోకాన్ని గూర్చి, విష్ణుమూర్తి

అడుగులతో ఆక్రమించిన ముల్లోకాలు, దేవాసురులు అమృతంకోసం యుద్ధం చేయటం నేను ఎరుగుదును. నేను అంతటి పండు ముదుసలిని. నా ముసలితనంచేత నా తేజస్సంతా హరించుకుపోయింది. నేడో రేపో ప్రాణాలు గాలిలో కలిసిపోయేట్లున్నాయి. కాబట్టి వెంటనే నేను రామకార్యాన్ని చెయ్యాలి. ఒకానొకరోజున, రూపవతి, అనేక ఆభరణాలతో అలంకరించుకున్నదీ అయిన ఒక స్త్రీమూర్తిని, రావణాసురుడు దుర్బుద్ధితో హరించుపోవడం చూశాను. ఆమె తన అలంకారాలన్నీ తీసి ఒక పట్టు వస్త్రంలో మూటకట్టి జారవిడవడం నేను చూశాను. ఆ నగలు సూర్యకాంతిచే మెరుపుల్లాగా మెరిసిపోయాయి. అప్పుడామె "హా! రామా! హా! లక్ష్మణా" అంటూ అరవడం నేను విన్నాను. ఆమె రామా! అని ఆక్రందనం చేయడంవల్ల ఆమె సీతయే అయి ఉంటుందని అనుకొంటున్నాను.

సీతను అపహరించుకొని పోయిన ఆ రాక్షసుడు ఎవరో కాదు. వాడి పేరు రావణాసురుడు. అతడు విశ్రవసుని పుత్రుడు. సాక్షాత్తూ కుబేరునికి సోదరుడు. ఇక్కడనుండి నూరు యోజనాల దూరంలో సముద్రమధ్యంలో ఒక ద్వీపం ఉంది. ఆ ద్వీపంలో విశ్వకర్మచే నిర్మించబడినది, రమ్యమైనది అయిన లంకాపట్టణం ఉంది. ఆ లంకాపట్టణంలో వివిధములైన బంగారు ద్వారాలు, బంగారువేదికలు, పెద్దపెద్ద భవనాలు ఉన్నాయి. ఆ పట్టణానికి చుట్టూ సూర్యుని వంటి రంగుతో ప్రాకారం ఉంటుంది. ఆ పట్టణంలోని రావణాసురుని అంతఃపురంలో సీతాదేవి నిర్బంధించి ఉంచబడింది. ఆమె పట్టు వస్త్రాలను ధరించి ఉంది. రాక్షస స్త్రీలు ఆమెకు కాపలాగా ఉన్నారు. మీరు అక్కడకు చేరుకోగలిగితే జనకరాజ పుత్రిక అయిన సీతాదేవిని చూడగలరు. కనుక ఓ వానరవీరులారా! మీరు వెంటనే ఆ లంకాపట్టణానికి చేరుకోండి. మీ పరాక్రమాన్ని చూపండి; అప్పుడు మీరు ఆ రావణుణ్ణీ, సీతనూ కూడా చూడవచ్చు.

ఓ వానర శ్రేష్ఠులారా! నేను ఇప్పుడు మీకు చెప్పినదంతా నా దివ్యదృష్టిచేత చూస్తూ, చూసింది చూసినట్లుగా చెప్పాను. మీరు తప్పక సీతాదేవిని చూసి తిరిగిరాగలరు. నాకున్న జ్ఞానంతో ఆకాశయానంలో ఉండే అంతరాల్ని చెప్తాను వినండి.

ధాన్యపుగింజలు తిని బ్రతికే కులింగపక్షులు మున్నగునవి భూమికి దగ్గరగా ఉండే మొదటి కక్ష్యలో ఎగురుతాయి. కాకులు, వృక్షాలమీద ఉంటూ ఫలాలు తింటూ బ్రతికే ఇతర పక్షులు రెండవకక్ష్య వరకూ ఎగురగలవు. భాసపక్షులు, క్రౌంచపక్షులు, గోరింకలు మున్నగున్నవి మూడవ కక్ష్యవరకు ఎగురగలవు. డేగలు నాలుగవ కక్ష్యవరకు ఎగురగలవు. గ్రద్దలు ఐదవ కక్ష్య వరకు ఎగురగలవు. హంసలు ఆరవ కక్ష్య వరకు ఎగురగలవు. గరుత్మంతుడు, అరుణుడు దానికంటే ఎత్తైన కక్ష్యల్లో ఎగురగలవు. మేమందరమూ వినుత పుత్రుడైన అరుణుని సంతతి వారం.

ఓ వానరులారా! రావణాసురుడు సీతాదేవిని అపహరించి చాలా అవమానకరమైన పని చేశాడు. అట్లాగే సీతాదేవిని కాపాడటానికి అడ్డు వెళ్ళిన నా సోదరుణ్ణి చంపేశాడు. అందుకు తగిన ప్రతీకారం చేస్తాను. గరుత్మంతుని వలెనే నాకు కూడా దివ్యనేత్రాలు ఉన్నాయి. వాటి ద్వారా రావణునీ, సీతాదేవినీ కూడా ఇక్కడ నుండే చూడగలుగుతున్నాను. స్వభావసిద్ధంగానే మా జాతివాళ్ళంతా ఆహారబలంవల్ల నూరుయోజనాల దూరం చూస్తూ ఉంటాం. స్వభావం చేత మాకు ఆహారం చాలా దూరాన ఏర్పరచబడింది. కోళ్ళవంటి ప్రాణులకు ఆహారం వాటి పాదాల క్రిందనే ఏర్పరచబడింది. ఓ వానరులారా! ఈ లవణసముద్రాన్ని దాటేందుకు ఏదైనా మార్గం ఆలోచించండి. సీతాదేవిని చూసి కార్యసిద్ధిని పొంది తిరిగి వెళ్ళగలరు.

ఓ వానరులారా! మీరు నాకో సహాయం చెయ్యండి. మీరంతా కలసి కష్టం అనుకోకుండా, నన్ను సముద్రతీరానికి తీసుకుపోండి. నేను అక్కడ నా తమ్ముడికి తర్పణాలిస్తాను.

తరువాత ఆ వానరశ్రేష్ఠులంతా కలసి ఆ రెక్కలు కాలిపోయిన సంపాతిని సముద్రతీరంలో నీటివరకూ తీసుకు వెళ్ళారు. తర్పణాదులు అయిన తరువాత సంపాతిని అతడి పూర్వప్రదేశానికి చేర్చారు. సీతాదేవి ఉండే ప్రదేశం తెలుసుకోగలిగినందుకు వానరసేన అంతా సంతోషించారు.

# 59వ సర్గ సుపార్శ్వుడు చూసిన సంఘటన

సంపాతి చెప్పిన సీతా రావణుల వృత్తాంతాన్ని విన్న వానరసేన అంతా సంతోషించింది. వారిలో శ్రేష్ఠుడైన జాంబవంతుడు సంపాతితో ఇట్లా అన్నారు.

జాంబవంతుడు: ఓ సంపాతీ! సీతాదేవి ఎక్కడున్నది? ఆమెను ఎవరైనా చూశారా? ఆమెను హరించిన వాడెవడు? మాకు ఆ వివరాలన్నీ చెప్పు. వెతకటానికి మాకు చాలా అనుకూలంగా ఉంటుంది. రామలక్ష్మణుల బాణమహిమను తెలియని అతడు ఎవడు?

జాంబవంతుడి ప్రశ్న విన్న ప్రాయోపవేశ దీక్ష విరమించిన వేలాది వానరశ్రేష్ఠులు సంపాతికి దగ్గరగా వచ్చి కూర్చుని వినసాగారు.

సంపాతి: ఓ వానర శ్రేష్ఠులారా! సీత అపహరణాన్ని గూర్చి నాకు ఎవరు చెప్పారో, నేను విన్నది విన్నట్లుగా మీకు చెప్తాను. వినండి. విశాలమైన నేత్రాలు గల ఆ సీతాదేవి ఎక్కడుందో కూడా చెప్తాను. వినండి.

చాలాకాలం క్రితమే నా రెక్కలు కాలిపోయి ఈ పర్వతంపై పడిపోయి ఉన్నాను. వృద్ధుడను కూడా అయిపోయాను. ఇప్పుడు నాలో వెనుకటి బలపరాక్రమాలు లేవు. అందువల్ల నా కుమారుడు, సుపార్శ్వుడు, ఆయా కాలాలకు తగినట్లుగా ఆహారాన్ని సంపాదించుకొచ్చి నాకు ఇస్తూ నన్ను పోషిస్తున్నాడు.

గంధర్వులకు కామం అధికం. సర్పాలకు కోపం అధికం. లేళ్ళకు భయం అధికం. అట్లాగే మాకు ఆకలి ఎక్కువ. ఇట్లా ఉండగా ఒకానొక రోజున నా కుమారుడు మాంసం ఏమీ తేకుండా సాయంత్రానికి గానీ రాలేదు. ఆకలిబాధతో ఉన్న నేను అతనిని అనేక విధాలుగా నిందించి వాడి మనస్సు కష్టపెట్టాను. అయినా వాడు అదేమీ పట్టించుకోకుండా నన్ను అనునయిస్తూ ఇట్లా అన్నాడు.

సుపార్శ్వుడు: తండ్రీ! రోజుకు మల్లేనే మహేంద్ర పర్వశిఖరంపైకి పోయి ఆహారం కోసం నాలుగుప్రక్కలా చూస్తున్నాను. నేను తలక్రిందకు వంచి సముద్రజలాల్లో తిరిగే జంతువుల మార్గాన్ని అడ్డుకోవడానికై వేచివున్నాను. అప్పుడు కాటుక రాశివలె ఉన్న ఒక పర్వతాకారుడు ఒక స్త్రీని తీసుకొనిపోతూ కనిపించాడు. అప్పుడు నేను వారిద్దరినీ ఈ రోజు ఆహారంగా గ్రహిద్దామని అనుకొంటూ ఉండగా అతడు వినయంతో 'నాకు దారి వదులు' అని వేడుకున్నాడు. బ్రతిమాలేవాడిని చంపేవాడు వారైనా ఈ భూప్రపంచంలో ఉంటారా? నీచులు కూడా ఆ పని చెయ్యరు. ఇక నామాట వేరే చెప్పాలా?

తండ్రీ! అతడు గొప్ప తేజోవంతుడు, ఆకాశానికన్నా తేజస్సుతో వెలిగిపోతున్నాడు. నేను అట్లా చూస్తూ ఉండగానే ఎంతో దూరం వెళ్ళిపోయాడు. నేను అట్లాగే ఆ వైపే చూస్తూ నిల్చున్నాను. అప్పుడు ఆకాశంలో సంచరించే సిద్ధులూ, చారణులు, మహర్షులు నా దగ్గరకువచ్చి "నాయనా! సుపార్శ్వుడా! నీవు దైవవశాత్తు బ్రతికిపోయావు. వాడు నిన్ను వదలిపెట్టి పోయినాడు. నీకు మంచి జరిగింది. సందేహంలేదు" అన్నారు. మళ్లీ ఆ మహర్షులు నాతో "వాడే రాక్షసరాజు రావణాసురుడు. వాడు బలవంతంగా సీతాదేవిని అపహరించుకొని పోతున్నాడు. రామా! రామా! అంటూ విలపిస్తూన్న స్త్రీయే సీతాదేవి. జనకమహారాజుకు కుమార్తె, దశరథ మహారాజు కోడలు, రాముడి భార్య!" అని చెప్పారు.

ఓ తండ్రీ! ఆ రావణాసురుడి వల్ల బాగా ఆలస్యం అయిపోయింది. వేటకుకూడా వెళ్ళబుద్ధి కాలేదు.

ఓ వానరులారా! వృద్ధుడనై పోవటంవల్ల ఒంట్లో శక్తి లేకుండాపోయింది. రెక్కలు కాలిపోవటంవల్ల కూర్చున్న చోటునుండి కదల లేకుండా ఉన్నాను. అయినా నాకు ఇంకా బుద్ధి బాగానే పనిచేస్తోంది. నా బుద్ధిబలంతో మాటసహాయం చేస్తున్నాను. రాముడి పనే నా పని అనుకుంటున్నాను. కాబట్టి మీరంతా పట్టుదలతో, పరాక్రమంతో రామకార్యం సాధించండి. దేవతలు కూడా మిమ్మల్ని ఎదిరించలేరు. మీరు సుగ్రీవుడు పంపగా వచ్చారు, రామలక్ష్మణుల

బాణాలు ముల్లోకాలను రక్షించగలవు. రావణాసురుడు ఎంత బలవంతుడైనా మీరందరూ అతి సమర్థులు కావటాన మీరు సాధించలేని కార్యం అంటూ ఏదీ ఉండదు. ఆలస్యం చెయ్యకండి. మీ వంటి బుద్ధిమంతులు ఆలస్యం చెయ్యమన్నా చెయ్యలేరు కూడా!

# 60వ సర్గ సంపాతి తన వృత్తాంతాన్ని చెప్పడం

సంపాతి కోరినట్లుగా వానరనాయకులంతా అతడిని సముద్రతీరానికి తీసుకొనిపోయి జటాయువుకు జల తర్పణాలు వదిలిన తరువాత అతడిని తిరిగి పర్వతంపైన అతడి స్థానానికి చేర్చారు. దాంతో సంపాతికి వానరులందరిపైనా ఏర్పడ్డ ప్రేమాభిమానాలు దృఢపడ్డాయి. అంతట అంగదుడితో ఇట్లా అన్నాడు.

సంపాతి: ఓ వానరులారా! సీతాదేవి వృత్తాంతం నాకు ఎట్లా తెలిసిందో మీకు వివరంగా చెబుతాను. నిశ్శబ్దంగాను, సావధానంగాను వినండి.

పూర్వం, సూర్యరశ్మి చేతను, సూర్యతాపం చేతనూ నా రెక్కలు కాలిపోయి వింధ్యపర్వతాలపై పడ్డాను. ఆరు రోజులపాటు నాకు శరీర స్పృహలేదు. తరువాత కళ్ళు తెరిచిచూశాను. నాకు ఏమీ అర్థం కాలేదు. నాలుగు ప్రక్కలా పరికించి చూశాను, నేను దేన్నీ గుర్తుపట్ట లేకపోయాను. సముద్రాలు, సముద్రతీరాన ఉండే కొండలు, నదులు సరస్సులు, అడవులను చూశాను. ఈ పర్వతాన్ని, ఇక్కడ సంతోషంగా జీవిస్తున్న పశుపక్ష్యాదుల్ని చూశాను. కొంతకాలానికి ఇది దక్షిణ సముద్రతీరాన ఉన్న వింధ్యపర్వతాలని తెలిసింది. ఇక్కడే దేవతలచేత కూడా పూజించబడే నిశాకరుడనే మహర్షి ఆశ్రమం ఒకటి ఉంది. ఆ మహర్షి స్వర్గస్థుడైన తరువాత నేను అక్కడే ఎనిమిది వేల సంవత్సరాల నుండీ నివసిస్తున్నాను. ఎట్లాగో అతి కష్టంమీద ఆ పర్వతశిఖరంపై నుండి దర్భలతో నిండిన చిట్టడవికి చేరుకున్నాను. నాకు, జటాయువుకు పూర్వం ఒకసారి ఆ మహర్షిని దర్శించాలనే కోరిక కలిగింది. ఆ మహర్షి ఆశ్రమానికి అల్లంత దూరాన్నుంచీ సుగంధాలతో కూడిన గాలి వీస్తూ ఉంటుంది. ఆ మహర్షి ఆశ్రమంలో పూలు, పండ్లు లేని వృక్షం ఒక్కటైనా కనిపించదు. ఆయన్ను చూడాలనే కోరికతో ఆశ్రమానికి కొద్ది దూరంలో ఒక చెట్టు నీడన కూర్చున్నాను. తరువాత చంద్రునివలె చల్లని కాంతులు వెదజల్లుతూ ఆ మహర్షి స్నానం చేసి వస్తూ ఉండటం చూశాను. ఆయన వెనుక

ఎలుగుబంట్లు, పెద్దపులులు, సింహాలు, సర్పాలు అనేకం బ్రహ్మదేవుణ్ణి ప్రాణులు అనుసరించినట్లుగా వస్తున్నాయి. రాజుగారు అంతఃపురంలోకి పోగానే తదితర మున్నగు ఉద్యోగులంతా వెనక్కు తిరిగి వెళ్ళినట్లుగా, ఆ మహర్షి ఆశ్రమంలోకి వెళ్ళగానే ఆ జంతువులన్నీ వెనక్కు తిరిగి వెళ్ళిపోయాయి. అప్పుడు ఆ మహర్షి నన్ను చూసి సంతోషించి, ఆశ్రమంలోకి వెళ్ళి ఒక్క క్షణంలో మళ్ళీ వెనక్కు తిరిగి నా దగ్గరకు వచ్చి నన్ను పలకరిస్తూ "ఓ సౌమ్యుడా! నీ శరీరంపైన ఈకలన్నీ కాలి వికారంగా ఉన్నాయి ఎందువల్ల? ఏదైనా వ్యాధితో బాధపడుతున్నావా? లేక ఏదైనా చెయ్యరాని పనిచేస్తే నిన్ను ఎవరైనా దండించారా? పూర్వం నీమా నీ తమ్ముడు జటాయువు నన్ను చూడటానికి ఇక్కడకు వచ్చారు. నువ్వు పెద్దవాడవి, జటాయువు నీకంటే చిన్నవాడుకదా? మీరు అమితవేగంగా వాయుదేవునితో సమానంగా ఎగిరేవారు. మీరూ ఇష్టానుసారం మారు రూపాలు మార్చుకొనే కామరూపులు. మీరే మీ గృధ్రజాతికి రాజులు గదా? మీ ఇద్దరూ మనుష్యరూపంలో వచ్చి నా పాదాలకు నమస్కరించారు" అని చెప్పారు.

# 61వ సర్గ సంపాతి నిశాకర మహర్షితో సంభాషించడం

సంపాతి: ఓ మహర్షీ! నా శరీరం అంతా పుండయిపోయింది. కూర్చుని మాట్లాడేందుకు కూడా ఓపికలేదు. అయినా ప్రాణాలు విడిచే లోపుగా ఒక్కసారి మీ దర్శనం చేసుకోవాలని ఇట్లా వచ్చాను. తమరు అడిగారు కాబట్టి నా ఒంటి మీద ఉండే ఈకలన్నీ ఎట్లా కాలిపోయాయో చెప్తాను, దయచేసి వినండి.

నేను, జటాయువు ఒళ్ళు తెలియని బలగర్వంతో మునులందరినీ సాక్షులుగా పెట్టుకొని ఒక బలపరీక్ష పెట్టుకున్నాం. అదేమంటే, మేమిద్దరమూ సూర్యుడితో పాటు విశ్రాంతి లేకుండా అస్తమాద్రి వరకూ వెళ్ళాలని మునుల సమక్షంలో ఆకాశంలోకి ఎగిరాం. పైకి పోయి నేలపైకి చూస్తే పెద్ద పెద్ద నగరాలన్నీ అక్కడక్కడా విసిరిపడేసినట్లుగా రథచక్రాల ప్రమాణంలో కనిపించాయి. కొన్ని కొన్ని చోట్ల వాద్యధ్వని వినిపించింది. కొన్నిచోట్ల గాజులు, కాలి అందెలచప్పుడూ వినపడింది. కొన్నిచోట్ల ఎర్రని వస్త్రాలు ధరించిన స్త్రీలు గానంచేస్తూ కనపడ్డారు. దాదాపు సూర్యుని సమీపంనుండి సమాంతరంగా ఎగురుతూ పోతున్నాం. భూమిపైనున్న మహాపర్వతాలన్నీ చిన్నచిన్న రాళ్ళలాగా కనపడ్డాయి. భూమి మీద ప్రవహించే మహానదులన్నీ సన్నని దారపుపోగులాగా తెల్లగా కనబడ్డాయి. ఇక హిమాలయాలు, వింధ్యపర్వతాలు, మేరుపర్వతం సరస్సుల్లో విహరించే మదించిన ఏనుగుల్లా కనిపించాయి.

ఓ మహర్షీ! అప్పుడు మా ఇద్దరికీ విపరీతంగా చెమటలు పోశాయి. భయం వేసింది. దుఃఖం వచ్చింది. చిత్తభ్రాంతి కలిగింది. మూర్ఛ వచ్చినట్లయింది. మాకు అప్పుడు దిక్కులుగాని, మూలలుగానీ తెలియలేదు. లోకాలన్నీ కాలి ఎర్రని ముద్దగా అయినట్లు భ్రాంతి కలిగింది. సూర్యుడికి బాగా దగ్గరకు పోయామో ఏమో ఒళ్ళంతా తాపంతో కాలిపోసాగింది. నాకు మనస్సు, బుద్ధి పనిచెయ్యలేదు. కళ్ళు మాత్రమే పనిచేస్తున్నాయి. నిశ్చలంగా సూర్యుడి వైపు చూస్తూవుంటే సూర్యుడు ఎర్రగా ముద్దల్లే భూమి ప్రమాణంలో కనిపించాడు. జటాయువు నాతో

మాట్లాడనైనా మాట్లాడకుండా త్వరత్వరగా భూమి వైపుగా పడిపోసాగాడు. అది చూసి నేను కూడా నా శరీరాన్ని భూమి వైపుగా దింపాను. జటాయువు సూర్యతాపానికి తట్టుకొలేక మరణవేదన పడుతున్నప్పుడు నేను నా రెక్కలతో కప్పి వాడిని కాపాడాను. కానీ ఆ తాపానికి తట్టుకోలేక నా రెక్కలు మాడిపోయాయి. జటాయువు దండకారణ్య ప్రాంతంలో జనస్థానంలో పడిపోయి ఉంటాడని ఊహించాను. నేను మాత్రం రెక్కలు కాలిపోయి ఈ వింధ్యపర్వతాలపైన పడ్డాను.

ఓ మహర్షీ! రాజ్యాన్ని, సోదరుణ్ణి, రెక్కల్ని, పరాక్రమాన్ని అన్నీ కోల్పోయిన నేను మరణించాలని అనుకొంటున్నాను. అందువల్ల ఈ పర్వత శిఖరంపై నుండి దూకుతాను.

## 62వ సర్గ నిశాకర మహర్షి సంపాతిని ఓదార్చటం

సంపాతి: ఓ వానర శ్రేష్ఠులారా! నేను ఆ విధంగా నిశాకరమహర్షికి నా దీనగాథనంతా చెప్పుకొని విలపిస్తూ ఉండగా, దయగల ఆ మహర్షి నన్ను ఓదార్చాడు. చాలాసేపు దీర్ఘంగా ఆలోచించాడు. తరువాత ఆయన నాతో ఇట్లా అన్నాడు.

నిశాకర మహర్షి: ఓ సంపాతీ! నీవు దుఃఖించకు. నీకు కొత్తగా చిన్నచిన్న రెక్కలు వస్తాయి, మళ్ళీ కంటిచూపు వస్తుంది, పరాక్రమం బలం కూడా వస్తాయి.

ఓ సంపాతీ! నీవు మరణించటానికి వీలులేదు. నీ వల్ల ఒక మహాకార్యం జరగాల్సి ఉంది. ఆ కార్యం గూర్చి నేను ఇంతకు పూర్వమే విని ఉన్నాను. ఇప్పుడు ఆ దృశ్యాలన్నీ నా తపోబలంచేత చూశాను. నేను చూసింది చూసినట్లు చెబుతాను. నీవు శ్రద్ధతో విని ఆ విధంగా చెయ్యి.

"ఇక్ష్వాకుల వంశంలో దశరథుడనే రాజు ఉన్నాడు. అతడికి మహా తేజశ్శాలి అయిన రాముడనే కుమారుడు జన్మిస్తాడు. అతడు పితృవాక్యాన్ని పరిపాలిస్తూ తమ్ముడు లక్ష్మణుడు, భార్య సీతతో కలసి అరణ్యవాసం చేస్తాడు. రాక్షసరాజు, లోకకంటకుడు, దేవదానవ గంధర్వులచేత కూడా జయింపశక్యంకాని రావణుడు దండకారణ్యంలో అతని భార్యను హరిస్తాడు. దుఃఖంలో ఉన్న సీతాదేవిని భక్ష్యాలతోను, భోజ్యాలతోను, భోగాలతోనూ రావణుడు ప్రలోభపెట్టాలని ప్రయత్నిస్తాడు కానీ సీతాదేవి వేటినీ ముట్టుకోదు. ఆ విషయాన్ని తెలుసుకున్న దేవేంద్రుడు అమృతంతో సమానమైన పరమాన్నాన్ని సీతకు ఇవ్వగలడు. ఆమె ఆ పరమాన్నాన్ని మొదటి ముద్ద తీసి "నా భర్త, మహాప్రభువు అయిన రాముడు అతడి తమ్ముడు లక్ష్మణునితో కలసి జీవించి ఉన్నచో వారికి ఈ ఆహారం చేరాలి, అట్లా కాకుండా మరణించి ఉన్నా కూడా ఈ ముద్ద వారికే చెందా" లని అంటుంది. ఆ ముద్దను నేల మీద ఉంచుతుంది.

ఓ సంపాతీ! సీతాదేవిని వెతికేందుకు వానరులు రామదూతలుగా బయలుదేరి వస్తారు. అప్పుడు వారికి సీతాదేవి ఎక్కడున్నదో నీవు చెప్పాలి. అందువల్ల వాళ్ళు వచ్చేవరకూ ఇక్కడే ఉండాలి. ఎటువంటి పరిస్థితుల్లో నీవు ఎక్కడికీ వెళ్ళరాదు. దేశకాలములను నిరీక్షించి ఉండు. నేను ఇప్పుడే నా తపోబలంచేత నీకు రెక్కలు ఇవ్వగలను, కానీ నీ వలన ఈ రామకార్యం జరగాల్సివుంది. కాబట్టి నీవు ఇక్కడే ఉండి లోకహితమైన కార్యాన్ని చెయ్యి. ఆ తరువాత నీకు మళ్ళీ రెక్కలు వస్తాయి. నీవు రామకార్యాన్ని నీ కోసం చెయ్యటం లేదు. దేవతలు, బ్రాహ్మణులు, మహర్షుల హితం కోసం చేస్తావు, అంటే సీతాదేవి ఎక్కడుందో నీవు వానరులకు చెప్పాలి, నాకు కూడా రామలక్ష్మణుల్ని చూడాలని ఉంది. కానీ చాలాకాలం ఈ దేహంతో వేచి ఉండలేను, కాబట్టి నేను ఈ దేహాన్ని విడిచేస్తున్నాను.

ఓ వానరులారా! ఈ విధంగా ఆ నిశాకర మహర్షి రామునికి సంబంధించిన సమస్త విషయాలు నాతో చెప్పారు.

# 63వ సర్గ సంపాతికి మరల రెక్కలు పుట్టడం

ఓవానరులారా! ఆ విధంగా నాతో సమస్త విషయాలు చెప్పి ఆ నిశాకర మహర్షి ఆశ్రమంలోకి వెళ్ళారు. తరువాత నేను నెమ్మదిగా ప్రాకుకుంటూ వింధ్యపర్వతం పైకిచేరి మీ కోసం ఎదురుచూస్తున్నాను. ఆ మహర్షి నాకీ విషయాలన్నీ చెప్పి సుమారు నూరు సంవత్సరాలవుతోంది. ఆయన మాటలు తలచుకుంటూ దేశకాలములకై వేచి ఉన్నాను.

నిశాకర మహర్షి తన దేహాన్ని త్యజించి స్వర్గానికి వెళ్ళాడు. ఆ మహర్షి ఆదేశం ప్రకారం మరణించాలనే ఆలోచనను విరమించుకున్నాను. ఆ ఆలోచన వచ్చినప్పుడల్లా ఆ మహర్షి చెప్పిన మాటలు జ్ఞాపకం వస్తూ అగ్నిజ్వాలలు చీకట్లను పోగొట్టే విధంగా నా దుఃఖాన్ని పోగొడ్తూ ఉంటాయి.

రావణాసురుడు సీతాదేవిని అపహరించుకుపోతూ ఉంటే ఎందుకు అడ్డుకోలేదని నా కుమారుడి పైన విసుక్కున్నాను.

సంపాతి వానరులకు తన కథ చెప్తూవుండగానే సంపాతి శరీరంలో నుండి ఎర్రని ఈకలు వృద్ధి అయి రెక్కలు ఏర్పడ్డాయి. సంపాతి ఎన్నో వేల సంవత్సరాల తర్వాత వచ్చిన తన రెక్కల్ని చూసుకొని అమితంగా సంబరపడిపోయాడు. సంపాతి వానరులతో ఇట్లా అన్నాడు. "ఓ వానరులారా! చూశారా! ఎన్నడో సూర్యరశ్మిచేత మాడిపోయిన నా రెక్కలు తిరిగి ఇన్ని వేల సంవత్సరాల తర్వాత ఉన్న పళంగా మొలుచుకొచ్చాయి. ఆ నిశాకర మహర్షి చెప్పినట్లుగానే మళ్ళీ నాకు రెక్కలు మొలుచుకు వచ్చాయి. మళ్ళీ నాలోని పూర్వ పరాక్రమం, పౌరుషం వచ్చేశాయి. అంటే సీతాదేవిని గూర్చి ఆ మహర్షి చెప్పినదంతా యథార్థం కాబోతోందని గ్రహించండి. వెంటనే మీ ప్రయత్నాలు వేగవంతం చెయ్యండి, తప్పక సీతాదేవిని చూస్తారు. మీ శ్రమ ఫలిస్తుంది, రామకార్యం సిద్ధిస్తుంది. లోక కంటకుడు రావణుడు మరణిస్తాడు. ఇందుకు మీ ఎదుటే నాకు పూర్వంలాగా రెక్కలు రావటమే నిదర్శనం." తనకు పూర్వం ఉండే శక్తి

వచ్చిందో లేదో పరీక్షించుకోవాలనే కుతూహలంతో వానరులంతా చూస్తూ ఉండగానే ఆ పర్వతశిఖరం పైనుండి ఆకాశంలోకి ఎగిరాడు సంపాతి.

అంతట వానరులంతా రెట్టింపు ఉత్సాహంతో సీతాదేవిని వెతకటానికి దక్షిణముఖంగా బయలుదేరారు. సీతాదేవిని చూడబోతున్నామన్న ఉత్సాహంలో సుగ్రీవుడు మరణదండన విధిస్తాడనే భయం సూర్యరశ్మికి మంచు కరిగినట్లు కరిగిపోయింది.

# 64వ సర్గ లంకా నగరానికి ప్రయాణం

సంపాతి మాటలు విన్న తర్వాత అంగదుడికి కొండంత బలం వచ్చింది. వానరయోధులంతా సంతోషంతో గంతులు వేశారు! మళ్ళీ వాళ్ళల్లో నిద్రించిన సింహ పరాక్రమం మేల్కొంది. అంగదుడి సారథ్యంలో వానరయోధులంతా సముద్రతీరాన్ని చేరుకున్నారు.

సముద్రంలో అలలు ఆకాశాన్నందుకునేటంత ఎత్తుగా లేచి విరిగి మళ్ళీ నీళ్ళల్లో కలిసి పోతున్నాయి. అట్టి సముద్రంలో వికృతాకారంతో భయంకరంగా ఉండే అనేక జంతువులు నివసిస్తున్నాయి. దూరం నుండి చూసేవాళ్ళకు సముద్రం ఎంతో ప్రశాంతంగా నిద్రిస్తునట్లుగా కనిపించింది. ఇంకొంచెం దూరంలో చిన్న చిన్న అలలే కనిపించాయి. అవన్నీ తీరాన్ని సమీపిస్తున్నకొద్దీ భయంకరరూపాన్ని దాలుస్తున్నాయి. పాతాళంలో ఉండే రాక్షసులు సముద్రాన్ని కవ్వంతో చిలుకుతున్నారా? అని అనిపిస్తోంది. ఏమైనా ఆ భయంకర సముద్రాన్నిచూసి వానరులంతా దిగులు చెందారు. సంపాతి దగ్గరనుండి బయలుదేరేటప్పుడు వాళ్లలో ఉన్న ఉత్సాహం అంతా నీరు కారిపోయింది, ఇప్పుడు ఏం చేయటమా? అని దిగులుపడ్డారు. బుద్ధిమంతుడు, మహాబలశాలియైన అంగదుడు, దిగులుపడి కూర్చున్న వానరులను ఉద్దేశించి ఇట్లా అన్నాడు.

అంగదుడు: మిత్రులారా! మనస్సులోనికి విషాదాన్ని రానీయకండి. కోపించిన సర్పం బాలుణ్ణి చంపినట్లుగా విషాదం పురుషుణ్ణి చంపుతుంది. పరాక్రమం చూపించాల్సిన సమయాల్లో దిగులుపడి కూర్చుంటే పనులు సాధించగలమా?

ఆ విధంగా వానరులందరికీ ధైర్యాన్ని నూరిపోసి, ఆ రాత్రి అందర్నీ ప్రశాంతంగా విశ్రాంతి తీసుకోమన్నాడు. మర్నాడు ఉదయాన్నే వానరుల్లో వృద్ధులైన వారందరితోను కలసి ఆలోచించాడు. అంగదుడి చుట్టూవున్న వానరసేన, దేవేంద్రుడి చుట్టూ ఉండే దేవసేనలాగా

ప్రకాశించింది.

అంగదుడు: ఓ మహా తేజశ్శాలులారా! మనలో ఎవరో ఒక్కరు ఈ మహాసముద్రాన్ని దాటి లంకానగరాన్ని చేరాలి. ఏ ఒక్కరు ఈ మహత్కార్యాన్ని సాధించగలిగినా, ఆలస్యమైనా మనం సుగ్రీవాజ్ఞను శిరసావహించిన వాళ్ళం అవుతాం. సుగ్రీవుడు కూడా తన ప్రతిజ్ఞను కాపాడుకొని రాముడి కార్యం నెరవేర్చినట్లవుతుంది, సత్యసంధుడవుతాడు. ఇక సుగ్రీవుడు మనకు మరణదండన విధిస్తాడేమోనన్న భయం ఉండదు. రామలక్ష్మణులు సంతోషపడ్తారు. మనం అందరం క్షేమంగా కిష్కింధకు పోయి భార్యాపిల్లలతో సుఖంగా ఉండవచ్చు. మిత్రులారా! మీలో ఎవరు సముద్రాన్ని దాటి తిరిగి క్షేమంగా రాగలరో, మీమీ బలాలను అంచనా వేసుకొని నాకు చెప్పండి. అదే నాకు మీరిచ్చే అభయదక్షిణ అవుతుంది.

ఓ వానర శ్రేష్ఠులారా! నిశ్శబ్దంగా ఉండటం ఇప్పుడు మన ముందు ఉన్న సమస్యకు పరిష్కారం కాబోదు. మీరంతా ఉత్తమవంశాలలో పుట్టారు, పరాక్రమవంతులు, వెనుక ఎన్నో సాహసకార్యాలు చేశారు, అనేక సత్కారాలు అందుకున్నారు. మనం అంతా ఇట్లా చావుబ్రతుకుల్లో ఉన్నప్పుడు వెనుకంజ వేయకండి, సాహసాన్ని కూడకట్టుకొని ముందుకురండి. మీలో ఎవరు ఎంత దూరం ఎగరగలరో అంచనా వేసుకోండి, ఇప్పుడు ఇంతమంది వానరసేనల ప్రాణాలు ఆ ఒక్క యోధుడి చేతుల్లో ఉన్నాయి. సుగ్రీవుడి పేరుప్రతిష్ఠలు ఆ ఒక్క వీరుడి చేతుల్లో ఉన్నాయి. సీతాదేవిని ఆ రాక్షసుడి బారినుండి కాపాడే భాగ్యం ఆ ఒక్కడు చేసే సాహసంలో ఉంది. రామలక్ష్మణులను సంతోషపెట్టే అదృష్టం ఆ ఒక్కడి మనోధైర్యంలో ఉంది.

# 65వ సర్గ హనుమంతుడి సామర్థ్యాన్ని జాంబవంతుడు ప్రేరేపించడం

అంగదుడు చెప్పిన మాటలు వానరులంతా శ్రద్ధగా విన్నారు. వారి వారి బలాన్నీ, బలహీనతల్నీ అంచనా వేసుకున్నారు. అందులో గజుడు ముందుకు వచ్చి తాను పది యోజనాల దూరం ఎగిరిపోగలనన్నాడు. గవాక్షుడు ఇరవై యోజనాల దూరాన్ని ఎగరగలనని అన్నాడు. గవయుడు తాను ముప్పైయోజనాల దూరం వరకూ ఎగరగలనన్నాడు. మైందుడు తాను అరవై యోజనాల దూరం ఎగరగలనన్నాడు. ద్వివిదుడు డెభై యోజనాల దూరం ఎగురుతానన్నాడు. సుషేణుడు (తార తండ్రికాదు) ఎనభై యోజనాలకుపైగా ఎగిరిపోలేనన్నాడు. ఎంత తర్కవితర్కాలు చేసుకున్నా నూరు యోజనాల దూరం ఎగరగలనని ఏ ఒక్కడూ కచ్చితంగా చెప్పలేకపోయాడు.

వానరులందరిలోనూ వృద్ధుడూ, మహాబలవంతుడూ అయిన జాంబవంతుడు ఇలా అన్నాడు. "ఓ అంగదుడా! పూర్వం నాకు ఎగరగల సత్తా ఉండేదే! పూర్వం బలిచక్రవర్తి నిర్వర్తించిన యాగంలో మూడు లోకాలను తన పాదాలతో ఆక్రమించిన త్రివిక్రమునకు (మహావిష్ణువుకు) నేను ప్రదక్షిణ చేశాను. కానీ ఇప్పుడు బాగా ముసలివాడి నయ్యాను. మన ప్రభువు సుగ్రీవుడూ, మన ప్రభువుకు మహోపకారం చేసిన రాముడూ మనపై ఆశలు పెట్టుకొని మనల్ని ఈ పనికి వియోగించారు. మహా అయితే నేను తొంభై యోజనాలు ఎగరగలనేమో!" అన్నాడు.

జాంబవంతుడు అన్నమాటలు విన్న అంగదుడు ఇట్లా అన్నాడు. "ఓ వానర యోధుల్లారా! నేను నూరు యోజనాల సముద్రాన్నీ సునాయాసంగా లంఘిస్తాను. అయితే తిరిగి వచ్చే సామర్థ్యం నాకు ఉందో లేదో తెలియదు, అయినా నేనే పోయి వస్తాను" అన్నాడు.

ఆ మాట విని స్వామి భక్తిపరాయణుడు, వృద్ధుడూ అయిన జాంబవంతుడు లేచి "నాయనా! అంగదుడా! నీవు మా అందరిలోనూ శ్రేష్ఠుడవు. నీకు నూరు యోజనాలేకాదు,

వెయ్యి యోజనాలు ఎగిరే శక్తి కూడా ఉంది. సుఖంగా పోయి రాగలవు. నాయనా! నీవు మా అందరికీ రాజువి. సేవకుణ్ణి పంపించాల్సిన ఇటువంటి పనికి ఎక్కడైనా ప్రభువును పంపుతారా? నీవు మాలో ఎవరో ఒకరిని పోయి రమ్మని ఆజ్ఞాపించాలేకాని, రాజే ఈ పనికి పూనుకుంటే సేవకులు చూస్తూ కూర్చోకూడదు. నిన్ను మేమందరం భార్యలాగా కాపాడుకోవాలి. చెట్టుకు వేరు ఎట్లా ముఖ్యమో, నీవు మాకు అంతే ముఖ్యం. వేరు క్షేమంగా ఉంటే చెట్టు ఫలాలనిస్తుంది. నీవు ఆదేశించిన కార్యంచేసి చెట్టు మూలాన్ని కాపాడుకోవటం కార్యకర్తలమైన మా బాధ్యత. ఈ కార్యం సాధించడానికి నీవే మూలమైనవాడవు. నీవు మాకు పూజనీయుడవు; యువరాజువు. నిన్ను ఆశ్రయించుకొని ఉండే మేము ఈ కార్యాన్ని సాధించాలి. నీవు ఈ కార్యాన్ని నిర్వహించాలి" అన్నాడు. జాంబవంతుడి మాటలు విన్న అంగదుడు ఇట్లా అన్నాడు.

అంగదుడు: ఓ జాంబవంతుడా! నీవు చెప్పేది ఎట్లా ఉందంటే, అమ్మ పెట్టదు, అడుక్కుతిననివ్వదు అన్నట్లు ఉంది. నేను పోకూడదంటావు! మరెవరూ పోలేమంటున్నారు. సుగ్రీవుడి ఆజ్ఞ నెరవేర్చకుండా కిష్కింధకు పోలేం. పోతే మన ప్రాణాలు దక్కవు. ఆయనకు ఆగ్రహం వచ్చినా పట్టలేం; అనుగ్రహం వచ్చినా పట్టలేం. మళ్ళీ మనమంతా ప్రాయోపవేశానికి కూర్చోవడం కన్నా గత్యంతరం కనిపించడం లేదు.

ఓ జాంబవంతుడా! నీవు సర్వమూ తెలిసినవాడవు. వృద్ధుడవు, అనుభవజ్ఞుడవు. ఏదో ఉపాయం ఆలోచించి నీవే మమ్మల్ని అందరినీ ఒడ్డుకు చేర్చాలి.

జాంబవంతుడు: ఓ వీరుడా! అంగదుడా! బాగా ఆలోచించగా నాకో ఉపాయం స్ఫురిస్తోంది. నేను హనుమంతుడితో ఈ ప్రస్తావన తెచ్చి ఆలోచించి చూస్తాను. అతడే ఈ పనికి సమర్థుడని నా మనస్సుకు అనిపిస్తోంది. నేను అనుకున్నది అనుకున్నట్లు జరిగితే మనం అందరం బ్రతికి బయటపడవచ్చు.

సముద్రాన్ని లంఘించేందుకు హనుమంతుణ్ణి పురికొల్పాలని జాంబవంతుడు

# 66వ సర్గ హనుమంతుని జన్మ వృత్తాంతం

లక్షలాది వానరయోధులు సుగ్రీవాజ్ఞ పాటించలేక దిగులుపడి ఉన్నారు. యువరాజైన అంగదుడు ప్రాయోపవేశానికి కూడా సిద్ధపడ్డాడు. దైవం సంపాతి రూపంలోవచ్చి దారిచూపింది. ఇప్పుడు ఆ మార్గంలో వెళ్ళి రామకార్యాన్ని సాధించాలి. సీతాదేవిని చూసి రావాలి. అప్పుడు వృద్ధుడూ, అనుభవజ్ఞుడూ అయిన జాంబవంతుడు హనుమంతుడితో ఇట్లా అన్నాడు.

జాంబవంతుడు: ఓ హనుమంతుడా! నీవు మహా తేజస్సంపన్నుడవు. తేజస్సులోగాని, బలంలోగానీ, సుగ్రీవుడితోనూ, రామలక్ష్మణులతోనూ సమానమైనవాడవు. వినతా కశ్యపుల పుత్రుడైన గరుత్మంతుడు పక్షులలో శ్రేష్ఠుడు. గొప్ప పరాక్రమశాలియైన గరుత్మంతుడు సముద్రం లోతుల్లో ఉండే సర్పాలను కూడా పైకి లాక్కురావటం నేను అనేకసార్లు చూశాను. అతడి రెక్కలు ఎంతబలమైనవో నీ బాహువులు కూడా అంతే బలమైనవి. బలంలోగానీ, తేజస్సులోగానీ నీవు గరుత్మంతుడికి ఏమాత్రమూ తీసిపోవు. నీవు బుద్ధిమంతుడవు, సర్వశాస్త్రాలు చదివినవాడవు. సమస్త ప్రాణికోటికంటే తేజస్సులో, బలంలో ఎంతో గొప్పవాడివి. అటువంటి వాడివి ఇటువంటి క్లిష్ట పరిస్థితుల్లో యువరాజు అంగదుడు జీవన్మరణ సమస్యతో కొట్టుమిట్టాడుతూ ఉంటే, నీవు అంటీ ముట్టకుండా ఏకాంతంలో కూర్చుని ఉన్నావు. ఎందువల్ల? రామకార్యానికి నీవు ఎందుకు నడుం బిగించటం లేదు?

ఓ ఆంజనేయుడా! నీ జన్మ వృత్తాంతాన్ని నీకు ఒకసారి జ్ఞాపకం చేస్తాను. విను. అప్సర స్త్రీలలో శ్రేష్ఠురాలైన పుంజికస్థల అనే అప్సరస్త్రీ వానరుడైన కేసరిని వివాహమాడింది. ఆమెకు అంజన అనే మరో పేరుకూడా ఉంది.

అసమాన సౌందర్యవతి అయిన ఆ అంజనాదేవి శాపవశాన వానరస్త్రీగా భూలోకంలో జన్మించింది. ఆమె స్వభావానుసారంగా రూపాలు మార్చుకోగల శక్తిమంతురాలు. ఆమె శాపవశాన, భూలోకంలో వానర ప్రభువైన కుంజరుని కుమార్తెగా పుట్టింది. అయినా ఆమె

ఒకనాడు మనుష్యశరీరం ధరించి పుష్పమాలలు, అలంకారాలు ధరించి, తెల్లని పట్టువస్త్రాలు కట్టుకొని పర్వత శిఖారాలపైన విహరిస్తోంది. అప్పుడు విశాలమైన నేత్రాలు గల ఆమె ఆ పర్వతశిఖరాన ఉండగా, వాయుదేవుడు ఆమెను చూశాడు. అందమైన చంద్రునివంటి ఆమె ముఖం, బలమైన తొడలు బలిసి గుండ్రంగా కలిసిపోయివున్న స్తనములను చూశాడు. విశాలమైన ఆమె కటిప్రదేశం, గుప్పెటలోకి సరిపడేటంతటి సన్నని నడుము, సర్వాంగసుందరంగా ఉన్న, కీర్తిమంతురాలైన ఆ అంజనాదేవిని చూసి వివశుడైపోయాడు. కామంచే మోహితుడయ్యాడు. మన్మథుడిచే పీడించబడినవాడై, ఆ వాయుదేవుడు తన పొడవైన రెండు చేతులతో ఆమెను కౌగిలించుకున్నాడు.

అంజనాదేవి కలవరపడిపోయింది. "నా ఏకపత్నీవ్రతాన్ని పాడుచేస్తున్న నీవు ఎవరవు?" అని అడిగింది. అప్పుడు వాయుదేవుడు ఆమెతో ఇలా పలికాడు.

వాయుదేవుడు: ఓ అందమైన శ్రోణులు (కటిస్థలాలు) గలదానా! ఓ అంజనా! నేను నిన్ను బాధించను, హింసించను. భయపడకు. ఓ కీర్తిమంతురాలా! నిన్ను నేను కౌగలించుకొని మనస్సు చేతనే అనుభవించాను. అందువల్ల నీ ఏకపత్నీవ్రతానికేమీ భంగం కలుగదు. అయితే ఈ మానసిక సంగమంచేత నీకొక కుమారుడు కలుగుతాడు. అతడు బలవంతుడూ, పరాక్రమవంతుడూ అవుతాడు. గొప్ప బలం, తేజస్సు ఉంటాయి. పరాక్రమంగల నీ కుమారుడు ఎగరటంలోను, దుముకటంలోనూ, సర్వవ్యాపకుడుగా ఉండటంలోను నాతో సమానుడై ఉంటాడు.

ఓ హనుమంతుడా! వానర శ్రేష్ఠుడా! గొప్ప బాహువులు గలవాడా! తరువాత నీ తల్లి సంతోషించి వానర శ్రేష్ఠుడవైన నిన్ను ఒక పర్వత గుహలో కన్నది. పుట్టీపుట్టగానే సూర్యుణ్ణి చూసి అదేదో పండు అనుకొని దాన్ని పట్టుకోవడం కోసం ఆకాశంలోకి ఎగిరావు. ఓ వానరశ్రేష్ఠుడా! ఆ విధంగా నీవు మూడువందల యోజనాల దూరం ఎగిరావు. సూర్యుడి తేజస్సు నిన్ను ఆక్రమిస్తున్నా కూడా నీవు జంకూగొంకూ లేకుండా ఎగురుతూనే ఉన్నావు. నీవు ఆ

విధంగా సూర్యుడి వైపుగా చొచ్చుకుపోతూ ఉంటే ఇంద్రుడికి కోపంవచ్చి నీపై వజ్రయుధాన్ని ప్రయోగించాడు. ఆ వజ్రాఘాతానికి వచ్చి పర్వత శిఖరంపై పడ్డావు. ఆ పడటంలో నీ ఎడమ ప్రక్క గడ్డం విరిగిపడింది. అందువల్లనే నీకు 'హనుమంతుడు' అన్నపేరు వచ్చింది.

ఓ వానరశ్రేష్ఠుడా! దేవేంద్రుడు నీపై వజ్రాయుధాన్ని ప్రయోగించి నిన్ను బాధించడంవల్ల వాయుదేవుడికి ఇంద్రుడిపై కోపం వచ్చింది. దాంతో ముల్లోకాల్లోనూ గాలిని స్తంభింపజేశాడు. మూడు లోకాల్లోనూ గాలి స్తంభించడంచేత దేవతలందరూ వాయుదేవుణ్ణి కరుణచూపమని ప్రార్థించారు. నాయనా! హనుమంతుడా! నీ తండ్రి వాయుదేవుణ్ణి సంతృప్తి పరచేందుకు ఆ దేవతలు వరాలవర్షం కురిపించారు. బ్రహ్మదేవుడు నీకు శస్త్రాలచేత చావురాదని వరమిచ్చాడు. దేవేంద్రుడు నీవు కోరుకుంటే తప్ప నీకు మరణం రాదు అని వరమిచ్చాడు.

ఓ హనుమంతుడా! నీవు వాయుదేవునికి ఔరసపుత్రుడవు. కేసరికి క్షేత్రజ పుత్రుడవు. భయంకరమైన పరాక్రమవంతుడవు, పరాక్రమంలోనూ, వేగంలోనూ నీవు వాయుదేవుడితో సమానుడవు. అందువల్ల వాయుదేవుడిలాగానే ఎక్కడికైనా, ఎంతదూరమయినా ఎగిరిపోగలవు. మరణభయం లేని వాడవు. ఎటువంటి శస్త్రాస్త్రాలు నిన్ను బాధించవు, కాబట్టి నీవే మమ్మల్నందరినీ కాపాడాలి. మా ప్రాణాలన్నీ నీ చేతుల్లో ఉన్నాయి.

నాయనా! శ్రీ మహావిష్ణువు త్రివిక్రమ రూపంలో అవతరించినప్పుడు నేను ఈ పర్వతాలు, అరణ్యాలు, భూమిని ఇరవై ఒక్కసార్లు ప్రదక్షిణం చేశాను. అప్పుడు దేవతల అనుమతితో, అమృతంకోసం సముద్రాన్ని మథించే ఓషధుల్ని సంపాదించుకొచ్చాం. ఆ కాలంలో మేము ఎంతో బలంగా ఉండేవాళ్ళం. అవన్నీ ఒకప్పటి కథలు. ఇప్పట్లో మా అందరిలోకీ బలవంతుడివి, దైవానుగ్రహం పొందిన వాడివి నీవు ఒక్కడివే. అందుచేత నీవు విజృంభించి సముద్రాన్ని లంఘించు. వానరసేనకంతకూ, లోకానికీ నీ పరాక్రమాన్ని చాటిచెప్పు.

వానరశ్రేష్ఠుడా! ఓ హనుమంతుడా! వానరులంతా దిగులుపడి పోయారు,

విష్ణుభగవానుడు తన పాదాలతో ముల్లోకాల్ని ఆక్రమించినట్లు నీవు నీ శక్తిని చూపించు.

ఆ పలుకులు విన్న వాయుపుత్రుడైన ఆ హనుమంతుడు జాంబవంతుని ప్రేరేపణతో తన శరీరాన్ని పెద్దదిచేసి సముద్రాన్ని దాటేందుకు సంసిద్ధుడయ్యాడు. వానరుల ఆనందానికి అవధులు లేకుండాపోయాయి.

# 67వ సర్గ హనుమంతుని లంకానగర ప్రయాణం

మహాబలశాలియైన హనుమంతుడు నూరు యోజనాల దూరం ఎగిరి సముద్రాన్ని దాటి లంకానగరం చేరేందుకు సిద్ధపడ్డాడు. వానరులంతా దిగులుమాని హనుమంతుని చుట్టూచేరి అతణ్ణి అభినందించారు. వాళ్ళంతా మూడడుగులతో ముల్లోకాలను ఆక్రమించుకొన్న శ్రీమహావిష్ణువుతో పోల్చుతున్నారు. మహాబలశాలియైన హనుమంతుడు శరీరాన్ని పర్వతంలాగా పెంచి, తోకను విదిల్చికొట్టాడు. పర్వత గుహలోనుండి విడిచి పెట్టబడిన సింహంలాగా హనుమంతుడు విజృంభించాడు. అప్పుడాతడి ముఖం సూర్యునివలె ఎర్రగా ఉంది. పొగలేకుండా బాగా ప్రజ్వలించివున్న అగ్నిహోత్రంలాగా ఉంది. చిన్నా పెద్దా అయిన వానరులందరికీ వినయపూర్వకంగా నమస్కరించి ఇట్లా అన్నాడు.

హనుమంతుడు: మిత్రులారా! వాయుదేవుని వేగాన్ని ఎవరూ ఇంత అని కొలిచి చెప్పలేరు. ఎప్పుడూ ఆకాశంలోనే సంచరిస్తూ ఉంటాడు. పర్వతాన్నైనాసరే పెకలించగల బలాఢ్యుడు. అటువంటి వాయుదేవుడి ఔరసపుత్రుడనైన నేను ఎగరటంలోనూ, వేగంలోనూ ఆయనతో సమానమైనవాడిని. ఆకాశాన్నంటే మేరు పర్వతాన్ని ఎన్నిసార్లైనా ప్రదక్షిణం చేయగలను. సముద్రాన్ని నా చేతులతో కవ్వంతో చిలికినట్లు చిలికి, చెరువులు, నదులు, తటాకాల్లో నింపి ఈ లోకాన్నంతా జలప్రళయం సృష్టించగలను. నేను సముద్రంపై ఎగురుతూ ఉంటే, నా పిక్కల, తొడల బలానికి సముద్రజలం అంతాపైకి లేచి వస్తుంది. అప్పుడు సముద్రంలో ఉండే జలచరాలన్నీ పైకి లేచివస్తాయి. పక్షిరాజైన గరుత్మంతుడు ఆకాశంలో ఎగురుతూ ఉంటే నేనాయనకు అనేక వేల పర్యాయాలు ప్రదక్షిణం చేయగలను. సూర్యుడు ఉదయపర్వతం పైనుండి అస్తమాద్రికి చేరే లోపల నేను ఆయనను సమీపించి భూమిపైకి వచ్చి విశ్రాంతి తీసుకోకుండా మళ్ళీ ఆయనకు ఎదురుగా వెళ్ళగలను. అంటే నేను ఆకాశంలో ఎగిరే పక్షులన్నింటి కన్నా వేగంగా వెళ్ళగలను. ఇక పరాక్రమానికి వస్తే భూమిని చీల్చగలను, మేరుపర్వతాన్ని పొడిచెయ్యగలను; సముద్రంలో నీటినంతటినీ పీల్చివేయగలను. నేను ఎగిరే

వేగానికి పుష్పాలు, లతలు నా వెనకాలే ఎగురుతూ వస్తాయి. అట్లా నన్ను వెంబడించి వచ్చే పువ్వులు వస్తూవుంటే ఆకాశంలో స్వాతిమార్గంలాగా కనబడుతుంది.

ఓ వానరులారా! నేను ఆకాశంలో ఎగరడమూ, ఆకాశంలో పోవడమూ, తిరిగి ఆకాశంలోనుంచి దిగడమూ సమస్త ప్రాణకోటికి రెప్పపాటు కాలంలా కనబడుతుంది. నా వేగానికి మేఘాలన్నీ చెల్లాచెదరైపోతాయి. పర్వతాలన్నీ కంపిస్తాయి. సముద్రం క్షోభిస్తుంది. నాకు మల్లే ఎగిరిపోయే శక్తి, సామర్థ్యం, వేగం వాయుదేవుడికి, గరుత్మంతుడికి మాత్రమే ఉంటాయి. మరో ప్రాణికి లేదు. నేను అట్లా ఆధారం లేకుండా ఆకాశమార్గాన సముద్రంపైన ఎగురుతూవుంటే త్రివిక్రమావతారంలో ఉన్న విష్ణుభగవానుడా? అని అనుకుంటారు.

ఓ వానరులారా! నేను సీతాదేవిని చూస్తానన్న అనుభూతి నాలో కలుగుతోంది. నేను తప్పక సీతాసాధ్విని చూసి తిరిగివస్తాను. మీరు నిశ్చింతగానూ, సంతోషంగానూ ఉండండి. నేను పదివేల యోజనాలైనా ఇట్టే ఎగిరిపోగలనని అనిపిస్తోంది. వజ్రాయుధం ధరించిన దేవేంద్రుణ్ణి కూడా జయిస్తాను, బ్రహ్మదేవుణ్ణయినా ఇట్టే జయించి వాళ్ళ చేతుల్లో నుండి అమృతభండాన్ని లాక్కుని రాగలనని అనిపిస్తోంది.

సాటిలేని కాంతిమంతుడైన హనుమంతుడు ఈ విధంగా గర్జిస్తూ ఉంటే వానరులంతా సంతోషంతో గంతులు వేస్తూ నాట్యం చేశారు. వానర నాయకుడైన జాంబవంతుడు ఇట్లా అన్నాడు.

జాంబవంతుడు: వీరుడా! అమితవేగమైన గమనం గల శూరుడా! కేసరి పుత్రుడా! హనుమంతుడా! నీవు మిత్రులందరినీ శోకసముద్రంనుండి ఒడ్డున పడేశావు. నీ క్షేమం కోసం, నీకు కార్యసిద్ధి జరగాలని, మేమంతా ఆ సర్వేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ ఉంటాం. మహర్షులు, దేవతలు, పెద్దలందరూ నీవు క్షేమంగా సముద్రాన్ని దాటి రామకార్యం సాధించాలని ఆశీర్వదిస్తూ ఉంటారు; వారందరి అనుగ్రహం నిన్ను క్షేమంగా సముద్రాన్ని దాటిస్తుంది. నీ రాక కోసం

మేమంతా ఒంటి కాలిపై నిలబడి, కంటిపై రెప్పవేయకుండా ఎదురుచూస్తూ ఉంటాం. మా ప్రాణాలన్నీ నీవు రామకార్యం పూర్తిచేసుకొని రావటంపైనే ఆధారపడి ఉన్నాయి.

హనుమంతుడు: ఓ వానరులారా! నేను ఎగిరేటప్పుడు నా వేగాన్ని లోకంలో ఎవరూ తట్టుకొని నిలబడలేరు. అందువల్ల స్థిరంగా నిలబడగల మహేంద్రపర్వతంపైకి వెళ్ళి అక్కడనుండి ఆకాశంలోకి ఎగురుతాను. అక్కడనుండి ఒక్క గంతులో నూరుయోజనాల దూరం గాలిలో ఎగురుతూ ఉంటే, ఆ వేగాన్ని స్థిరమైన ఆ పర్వతమొక్కటే తట్టుకొని నిలబడగలదు.

తరువాత శత్రు సంహారకుడు, వాయుదేవునితో సమానమైనవాడు, వాయుపుత్రుడు అయిన హనుమంతుడు మహేంద్రపర్వతంపైన నిలబడ్డాడు. ఆ ప్రదేశమంతా వృక్షాలతోనూ, పచ్చికబయళ్ళతోనూ మనోహరంగా ఉంది. ఆ మైదానాల్లో లేళ్లు పచ్చిక మేస్తున్నాయి. పుష్పాలతో చెట్లన్నీ దట్టంగా ఇరుక్కుపోయినట్లున్నాయి. వృక్షాలన్నీ విరగబూసి ఉన్నాయి. పర్వతసానువుల్లోనుండి జలపాతాలు ధారాపాతంగా పడుతున్నాయి. ఆ అరణ్యం పులులు, సింహాలు, ఏనుగులకు నిలయమై ఉంది. పక్షులు వాటి వాటి భాషల్లో కమ్మగా కూస్తున్నాయి. మహేంద్రునితో సమానమైన పరాక్రమంగల ఆ వానరవీరుడైన హనుమంతుడు మహేంద్ర పర్వతశిఖరంపై నిలబడ్డాడు. అప్పుడు హనుమంతుడు తన రెండు బాహువులను విదల్చగా మహేంద్రపర్వతం, సింహం పంజా దెబ్బకు ఘీంకరించిన, మదించిన ఏనుగువలె ధ్వని చేసింది. ఆ చుట్టు ప్రక్కల ఉన్న పెద్ద పెద్ద బండరాళ్ళన్నీ గులకరాళ్ళలాగా దొర్లి నేలపై పడ్డాయి. ఆ పర్వతంపైకి విహారానికి వచ్చి మద్యం మత్తులో పడివున్న గంధర్వుల జంటలన్నీ పర్వతాన్ని వదిలిపెట్టి పారిపోయారు. చిన్నచిన్న శిలలన్నీ గాలికి ఎగిరిపడ్డాయి, బుసలుకొడ్తూ తోకమీద లేని నిల్చున్న మహాసర్పాలు పతాకాల్లాగా కనిపించాయి. మహాసమాధిలో ఉన్న మహర్షులు కూడా ప్రళయమని తలచి భయంతో కంగారుపడ్డారు. మహేంద్రపర్వతం బిడారి గుంపులోనుండి విడిపోయిన బాటసారిలాగా ఒంటరిదై విలవిల్లాడింది.

అమితవేగం గలవాడు, వేగం మీదే మనస్సు నిలిపినవాడు, శత్రు సంహారకుడు,

వానరులలో శ్రేష్ఠుడు అయిన ఆ హనుమంతుడు ఏకాగ్రచిత్తంతో లంకాపట్టణానికి ప్రయాణమయ్యాడు.



# సుందర కాండము



## 1వ సర్గ హనుమంతుణ్ణి మైనాకుడు గౌరవించడం

జాంబవంతుడు ప్రేరేపించగా శత్రుసంహారకుడైన హనుమంతుడు సీతాదేవిని వెతికి చూడాలన్న కాంక్షతో దేవతలు, చారణులు సంచరించే ఆకాశమార్గంలో ప్రయాణంచేసి లంకాపట్టణాన్ని చేరాలని సంకల్పించాడు. ఇతరులకు సాధ్యంకాని పనిని తలపెట్టిన ఆ హనుమంతుడు ఆకాశంకేసి శిరస్సు పైకెత్తగా, చూసేవాళ్ళకు మదించిన ఆబోతులాగా కనిపించాడు. ఆ మహాబలవంతుడు మనస్సులో తను చేయబోయే మహత్కార్య పథకం గూర్చి ఆలోచిస్తూ అక్కడ పచ్చికబీడులపైన పచార్లు చేశాడు. ఆ పచ్చికబీడులన్నీ దూరాన్నుంచి జలమయమైనట్లు కనిపించాయి. ధీమంతుడు, కామరూపుడు అయిన ఆ హనుమంతుడు శరీరాన్ని మేరుపర్వతమంత పెద్దదిగా పెంచాడు. పెంచిన ఆ శరీరంతో అటూ ఇటూ వేగంగా పచార్లు చేస్తుంటే శరీరానికి తగిలిన వృక్షాలు కూకటివేళ్ళతోసహా కూలి నేలపై పడ్డాయి. ఆ పర్వతాకారుడి ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు పక్షులు కొట్టుకుపోయి ఆమడదూరంలో పడ్డాయి. ఏమరుపాటున ఉన్న పులులూ, సింహాలు, ఏనుగులు ఆ మహాకాయుడి పాదాల క్రిందపడి పచ్చడి పచ్చడి అయిపోయాయి. ఆ మహేంద్రపర్వతం అంతా ఆకుపచ్చ, నలుపు, తెలుపు, ఎరుపు రంగు ధాతువులతో కలగాపులగంగాను, శోభాయమానంగాను కనిపిస్తున్నది. ఈ శోభల్ని చూస్తూ విహరించటానికి యక్షులు, కిన్నెరులు, కింపురుషులు, గంధర్వులు, దేవతాసర్పాలు సపరివారంగా వచ్చి కొంతకాలం ఉండిపోతూ ఉంటారు. ఆ పర్వతరాజాన్నాశ్రయించుకొని అనేక ఏనుగుల మందలు నివసిస్తున్నాయి. హనుమంతుడు ఆ ఏనుగు లందరిలోకీ శ్రేష్ఠమైన గజరాజుగా ప్రకాశించాడు. అతడు భూదేవిని వదలి ఆకాశాన్ని

ఆవరించే ముందుగా సూర్యభగవానునికి, మహేంద్రునికి, తండ్రియైన వాయుదేవునికి, బ్రహ్మ దేవునికి, సర్వభూతాలకు నమస్కరించాడు.

తరువాత తూర్పుదిక్కుగా తిరిగి తండ్రియైన వాయుదేవుని స్మరించి ఆశీస్సులు కోరి దక్షిణ దిక్కుగా వెళ్ళేందుకు శరీరాన్ని పెంచాడు. ఆ విధంగా శరీరాన్ని ఆకాశాన్నంటేట్లుగా పెంచిన హనుమంతుని వానర సేన అంతా నోరు తెరుచుకొని గుడ్లు అప్పగించి చూస్తూ నిలబడింది. పూర్ణిమ ఏర్పడిన సముద్రుడిలాగా, రామకార్యసిద్ధి కోసం, సముద్రాన్ని లంఘించడం కోసం శరీరాన్ని పెంచాడు. పాదాలు, అరచేతులు నేలపై ఉండేట్లుగా వంగి పర్వతాన్ని నొక్కిపట్టాడు, హనుమంతుడు కాళ్ళతోనూ, చేతులతోనూ గట్టిగా అదిమి పట్టుకోగా ఆ పర్వతం ఊపిరాడక గిజగిజ కొట్టుకుంది. వృక్షాలపై ఉండే పూలన్నీ రాలి నేలపై పడ్డాయి, రాలిన పుష్పాలన్నీ గుట్టలుగుట్టలుగా ఏర్పడి మహేంద్రపర్వతం పూల పర్వతామా? అన్నట్లు కనబడింది. హనుమంతుడు కుదిపిన కుదుపుతో ఆ మహేంద్రపర్వతం, మదించిన ఏనుగు మదోదకం కార్చినట్లుగా, నీరు కారిపోయింది. హనుమంతుడు మహేంద్రపర్వతాన్ని గట్టిగా పట్టుకోవడంవల్ల పర్వతం పైనుండి బంగారు వెండి, శిలలన్నీ బీట్లిచ్చాయి. బంగారం మధ్యమ జ్వాలలతో కూడిన అగ్నినుండి పొగలు బయలుదేరినట్లు, పర్వతం నుండి మణిశిలలతో కూడిన రాళ్ళు బయటపడ్డాయి.

[ వివరణ: అగ్నిజ్వాలలు ఏడు. కాళీ, కరాళీ, విస్ఫులింగినీ, ధూమ్రవర్ణా, విశ్వరుచి, లోహితా, మనోజవా అనేవి ఏడూ అగ్నిజ్వాలలు. వాటిలో మధ్యమ జ్వాల ధూమ్రవర్ణ. దానిలోనుండి పొగలు బయలుదేరుతాయి.]

హనుమంతుడు పర్వతాన్ని కుదిపినప్పుడు గుహల్లో నిద్రపోతున్న ప్రాణులు ప్రాణభయంతో భయంకరంగా అరుస్తూ పరుగులు పెట్టాయి. పర్వతం బీటలు వారటంతో భయపడి అరచిన పెద్ద పెద్ద ప్రాణుల అరుపులు సమీపంలోని అరణ్యం అంతా ప్రతిధ్వనించాయి.

మహాసర్పాలు తలపై స్వస్తికాకారంలో ఉండే చిహ్నాలు కనపడేంత పెద్దగా పడగలు విప్పాయి. భయంచేత లోపలనుండి పొంగివస్తున్న విషాన్ని అదుపుచేయలేక కసిగా కొండరాళ్ళను కరిచాయి. తీవ్రమైన విషప్రభావంచేత, ఆ శిలలన్నీ వెయ్యిముక్కలయ్యాయి. విషానికి విరుగుడైన ఔషధాలు ఎన్నో ఆ అరణ్యంలో ఉన్నా, ఈ విషసర్పాల విషాన్నీ శమింప చేయలేకపోయాయి.

పర్వతాలను ఏవో భూతాలు ఆవహించాయని తాపసులందరూ పైకి ఎగిరి వెళ్ళిపోయారు. విహారానికొచ్చిన విద్యాధరులు ఉన్నపళంగా తమ వస్తువులను ఎక్కడివక్కడే వదిలేసి పారిపోయారు. వాళ్ళు వదిలేసిన మద్యం, మద్యం వడ్డించే పాత్రలు, మద్యాన్ని సేవించే చిన్న చిన్న బంగారు పాత్రలు, రకరకాలైన భక్ష్యాలు, లేహ్యాలు, మాంసాలు, అక్కడ గుట్టలుగుట్టలుగా పడివున్నాయి. ఒరలతో ఉన్న ఖడ్గాలనుకూడా అక్కడే వదిలేశారు. ప్రియురాండ్రనుకూడా వదిలేసి ప్రాణరక్షణ కోసం పైకి ఎగిరివెళ్ళిపోయారు.

మద్యపానంచేత విద్యాధరుల కళ్ళు ఎరుపెక్కాయి. శరీరాలకు కామాన్ని రెచ్చగొట్టే లేపనాల్ని పూసుకుని ఉన్నారు. అందులో కొందరి కళ్ళు పద్మాల్లాగా గుండ్రంగా ఉన్నాయి; మెడలో బంగారు గొలుసులు, శిరస్సున ఎర్రని పుష్పమాలలు ధరించారు. మెడలో హారాలు, చేతులకు, భుజాలకు కంకణాలు ధరించారు. విద్యాధరులు తమ ప్రియురాండ్రతో కలసి ఆకాశంలో నిలబడ్డారు. అణిమాది సిద్ధులుగల ఆ విద్యాధరులు, మహర్షులు, ఏ ఆధారమూ లేకుండా ఆకాశంపై నిలబడి పర్వతాన్ని చూస్తున్నారు.

వాళ్ళు అలా నిలబడి వింతగా చూస్తూ ఉండగా, ఆకాశంలో ఉన్న చారణులు, సిద్ధులు, ఋషులు ఇలా అన్నారు.

“పర్వతాకారుడైన హనుమంతుడు తిములు, తిమింగలాలకు పుట్టినిల్లయిన సముద్రాన్ని దాటాలనుకొంటున్నాడు.

రామకార్యం సాధించాలనీ, తోటివానరుల ప్రాణాలు కాపాడాలనీ, ఇతరులు ఎవరూ చేయలేని ఈ సాహసాన్ని చేస్తున్నాడు. సముద్రం ఆవలి గట్టుకు పోవాలని అనుకొంటున్నాడు.”

విద్యాధరులు, పవిత్రాత్ములైన మహర్షులు మాట్లాడుకుంటున్న ఈ మాటల్ని విన్నారు. పర్వతశిఖరం పైనుండి ఎగరటానికి సిద్ధంగా ఉన్న పర్వతాకారుడైన హనుమంతుణ్ణి వానరులంతా చూశారు.

ఆ మహావీరుడు పర్వతంలాగా పెంచిన శరీరాన్ని ఒక్కసారిగా విదిల్చాడు. రోమముల నుండి రేగిన దుమ్ము మేఘాల్లా ఆకాశాన్ని ఆవరించింది.

తన ఆకారం ముందుభాగాన్ని వెడల్పుగానూ, పోనుపోనూ సన్నంగాను చేసుకుంటూ ఎగిరేందుకు వీలుగా తన శరీరాన్ని మలచుకున్నాడు. తోకను నిటారుగా పైకెత్తి గరుత్మంతుడు పామును విదిల్చినట్లుగా విదిల్చాడు.

తోకను వీపుదాకా తీసుకెళ్ళి నిట్టనిలువుగా నిలిపినప్పుడు, అది గరుత్మంతుడు పట్టుకొని తీసుకుపోతున్న పాములాగా కనిపించింది.

బాహువులు రెండూ పరిఘల్లాగా బిగపెట్టి నడుము సన్నగా చేసుకొని ఎగరటానికి వీలుగా పాదాల్ని మడిచి పెట్టుకొన్నాడు. భుజాల్ని, కంఠాన్ని అనువుగా వంచి బలాన్నంతా పుంజుకొని, తేజస్సును పెంచుకున్నాడు. కళ్ళు మాత్రం పైకి పెట్టి ఆకాశం వంక చూస్తూ తను వెళ్ళవలసిన మార్గాన్ని, గమ్యాన్ని మరోసారి సరి చూసుకున్నాడు, ఊపిరి బిగపట్టి ఉంచాడు.

మహాబలశాలి, వానరశ్రేష్ఠుడు అయిన హనుమంతుడు పాదాల్ని గట్టిగా నేలకానించి పైకి ఎగిరేముందు వానరులతో ఇట్లా అన్నాడు.

“ఓ మిత్రులారా! నేను ఇప్పుడు రామబాణంలాగా దూసుకుని రావణాసురుడి లంకా పట్టణానికి చేరుకోబోతున్నాను. నేను అక్కడ సీతాదేవిని చూడలేకపోయినట్లయితే, అటునించి

అటే స్వర్గానికి వెళతాను. స్వర్గంలో కూడా సీతాదేవిని చూడలేకపోతే రావణాసురుణ్ణి బంధించి తీసుకుని వస్తాను. మిత్రులారా! నేను రామకార్యం పూర్తిచేసుకొనిగానీ తిరిగిరాను. లేని పక్షంలో లంకనే పెళ్ళగించి తీసుకొనివస్తాను." ఇలా మిత్రులకు వీడ్కోలు పలికి తనను గరుత్మంతునితో సమానుడిగా భావించుకున్నాడు.

హనుమంతుడు ఎగరగానే ఆ వేగానికి చెట్లకొమ్మలన్నీ విరిగి నాలుగు మూలల్లోనూ పడ్డాయి. తన తొడల వేగంతో చీకుకొక్కెర పక్షులు నివసించే ఫలపుష్పాలతో నిండి ఉన్న వృక్షాలన్నీ పెకలించబడి అవి ఆకాశంలో అతిథుల్ని సాగనంపే బంధువుల్లాగా, చాలాదూరం హనుమంతుడితోపాటే వెళ్ళాయి. ఆ వేగానికి పెకలించబడ్డ సాలెవృక్షాలు, ఇతర మహావృక్షాలు మహారాజును అనుసరించి వెళ్ళే సైన్యంలాగా వెళ్ళాయి. పర్వతం వంటి ఆకారంతో హనుమంతుడి చుట్టూ పుష్పించిన వృక్షాలు, వృక్షాలపై పక్షులు ఉండటం వలన చూసే వాళ్ళకు ఆకాశంలో అరణ్యం మొలచినట్లనిపించి, ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. మహేంద్రుడికి భయపడి పర్వతాలన్నీ సముద్రంలో మునిగిపోయినట్లుగా, ఆ వృక్షాలన్నీ సముద్రంలో పడిపోయాయి. మేఘంలాగా ఆకాశంలో ఎగురుతున్న హనుమంతుడిపైన రాలిన ఫలపుష్పాదులచేత అతడు మిణుగురు పురుగులచే కప్పివేయబడ్డ పర్వతంలాగా భాసించాడు. హనుమంతుడి దూరం పెరుగుతున్నకొద్దీ, అతిథుల్ని సాగనంపటానికి వెళ్ళిన బంధువులు వెనుతిరిగినట్లుగా, అతడిపై రాలిన పూలు, పండ్లు, లతలు సముద్రంలో పడిపోసాగాయి.

హనుమంతుడి వేగానికి రాలిన పూలు, పండ్లు లతలు పడిన సముద్రం, నక్షత్రాలతో కూడిన ఆకాశంలాగా కనిపించింది. రకరకాల పుష్పాలు కప్పివేయడంతో మెరుపులతో కూడిన మేఘంవలె ఆతడు ప్రకాశించాడు. హనుమంతుడు రెండు చేతులూ బార్లా చాపి ముందుకు పోతూవుంటే పర్వతశిఖరం నుంచి బయటకు వస్తున్న అయిదు తలల మహాసర్పంలాగా కనిపించాడు. హనుమంతుడి తెరిచి ఉంచిన నోరు చూస్తే అటు సముద్రాన్నీ ఇటు ఆకాశాన్నీ కూడా తాగేస్తాడా? అన్నట్లుంది. ఆకాశంలో ఎగురుతున్న ఆంజనేయుడి కళ్ళు చింతనిప్పుల్లా

ఎర్రగా ఉండి పర్వతాలపై ఉండే నిప్పు నెగళ్ళవలె ఉన్నాయి. హనుమంతుడి కళ్ళు రెండు సూర్యచంద్రుల్లా ప్రకాశించాయి.

ఎర్రనైన హనుమంతుని ముక్కు, ముఖం సంధ్యాకాలాన ఉండే సూర్యబింబంలాగా తోచింది. ఆకాశంలో ఎగురుతున్న హనుమంతుని లాంగూలం (తోక) ఇంద్రుడి ధ్వజం మల్లే ఉంది. మహాకాయం, వాడియైన కోరలు కలిగిన హనుమంతుడు తన తోకను గుండ్రంగా చుట్టుకున్నాడు. ఆ తోకను చూసేవాళ్ళకు గూడు కట్టిన సూర్యుడా అన్నట్లుంది. ఎర్రగా ఉన్న హనుమంతుని పిరుదులు ధాతువుల కోసం పగలగొట్టిన పర్వతంలాగా కనిపించాయి. ఆకాశంలో ప్రయాణం చేస్తున్న హనుమంతుడి భుజాల క్రింద నుండి వీచే గాడ్పులు మేఘాలు గర్జిస్తున్నట్లున్నాయి. ఉత్తర దిక్కునుండి దక్షిణ దిక్కుకు వేగంగా పోయే ఉల్కలా, హనుమంతుడు అతివేగంగా ప్రయాణం చేస్తున్నాడు. హనుమంతుడు నడుముకు కట్టిన బంగారు గొలుసు వలన, విస్తృతించిన మదపుటేనుగులాగా ఉన్నాడు. ఆకాశాన విహరిస్తున్న హనుమంతుని నీడ సముద్రంలోపడి, ఓడలాగా కనిపించింది. హనుమంతుడు ప్రయాణం చేస్తూన్నంత మేర నేలా ఆకాశంకూడా కల్లోలితమయ్యాయి. కొండంత ఎత్తుకు లేచిన సముద్ర తరంగాలు హనుమంతుడి వీపును తాకి సముద్రంపాలవుతున్నాయి.

మహావేగంగా పోతున్న హనుమంతుని శరీరం నుండి వచ్చే గాలి, మేఘాల నుండి వచ్చే గాలి ఢీకొని సముద్రాన్ని అల్లకల్లోలం చేస్తూ, భయంకర శబ్దాలను పుట్టిస్తున్నాయి. హనుమంతుడు పెద్ద పెద్ద సముద్ర కెరటాలను తనతో కొంత దూరం తీసుకొనిపోతూ ఉంటే, వాటిని భూమి ఆకాశం మధ్య చిమ్ముతున్నట్లున్నది. మేరుపర్వతం వంటి సముద్ర తరంగాలను హనుమంతుడు లక్ష్యపెట్టకుండా అదే వేగంతో ముందుకుపోసాగాడు. హనుమంతుడి వేగానికి సముద్రజలాలు మేఘమండలంగా ఏర్పడి శరత్కాల మేఘాలవలె శోభించాయి. వస్త్రాలు తొలిగిపోగానే అవయవాలన్నీ బయటపడ్డట్లుగా, సముద్రంలో ఉండే తిమి తిమింగలాలు, రకరకాలైన నీటి జంతువులన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి. సముద్రంలో ఉండే సర్పాలు పైన

ఎగిరేది గరుత్మంతుడేమోనని భయపడ్డాయి. హనుమంతుడి నీడ పది యోజనాల వెడల్పు, ముప్పది యోజనాల పొడవునా నీటిపై పడ్డది. నల్లగా దట్టమైన ఆ మహనీయుడి నీడ నల్లని దట్టమైన మేఘ సముదాయంలాగా కనిపించింది. ఏ ఆధారం లేకుండా ఆకాశాన ఎగురుతున్న హనుమంతుడు రెక్కల పర్వతంలాగా కనిపించాడు. హనుమంతుడు ఎగురుతున్న మేరకు సముద్రం ఒక పెద్ద తొట్టిలాగా ఏర్పడింది.

హనుమంతుడు ప్రయాణం చేసినంత దూరాన తనతోపాటు మేఘాల్ని కూడా తీసుకొనిపోతూ, ఆకాశాన గరుత్మంతుడులాగా ప్రకాశించాడు. రంగు రంగుల మేఘాల్లోపలికి పోతూ, వస్తూ దాగుడు మూతలాడుతున్న చంద్రునివలె శోభించాడు. హనుమంతుడి వేగాన్ని, సాహసాన్ని, సామర్థ్యాన్ని చూస్తున్న దేవతలు పుష్పవర్షం కురిపించారు; హనుమంతుడికి వేడి తగలకుండా సూర్యుడు తన వేడిని ఉపసంహరించుకున్నాడు. వాయుదేవుడు చల్లని మలయమారుతాలతో సేద తీర్చాడు. ఆ విధంగా సూర్య భగవానుడు, వాయుదేవుడు కూడా రామకార్యంలో పాలు పంచుకున్నారు. హనుమంతుడు చేస్తున్న లోకకల్యాణకరమైన కార్యాన్ని అభినందిస్తూ దేవతలు, ఋషులు ప్రశంసించారు. గీత, గాన నృత్యాదులతో ఆహ్లాదం కలిగించారు. నాగులు, యక్షులు, రాక్షసులు, దేవతలు హనుమంతుణ్ణి వేనోళ్ళ కొనియాడారు. ఇంతసేపూ హనుమంతుడి సాహసకార్యాన్ని చూస్తూవున్న సముద్రుడు, 'నా ఉనికికి కారణభూతుడైన సగర చక్రవర్తి ఇక్ష్వాకు వంశస్థుడు. రాముడు కూడా ఇక్ష్వాకు వంశస్థుడే. ఆ రామకార్యార్థం పోతున్న హనుమంతునికి నేను ఏదైనా సాయం చేయాలి. ఇప్పుడు ఈ వానరశ్రేష్ఠుడికి నేను ఏమీ సహాయం చెయ్యకుండా అంటీ ముట్టనట్టుగా ఉంటే, ప్రతి ఒక్కరూ నన్ను తప్పు పట్టవచ్చును. అందువల్ల నేనే ఎదురుగా పోయి ఏమైనా సహాయం కావాలేమో అడిగివస్తాను' అని అనుకున్నాడు.

'ఇక్ష్వాకుల వంశానికి చెందిన సగరుడి మూలంగానే నేను ఆవిర్భవించాను. అదే ఇక్ష్వాకు వంశానికి చెందిన రాముని కార్యం కోసం ఈ హనుమంతుడు విశ్రాంతి లేకుండా నాపైన

ప్రయాణం చేస్తున్నాడు. ఇతడు అలసిపోవటంచేత బలం క్షీణించి పోకూడదు. అందువల్ల నేను అతడికి కొంతసేపు విశ్రాంతి తీసుకునే అవకాశం కల్పిస్తాను. ఆ తరువాత మరల శక్తిని పుంజుకొని మిగిలిన దూరాన్ని సునాయాసంగా దాటగలడు.'

సముద్రుడు ఈ విధంగా ఆలోచించి, సముద్రంలో బంగారు నిక్షేపాలతో నిండిన మైనాకుడనే పర్వతరాజుతో ఇలా అన్నాడు.

సముద్రుడు : ఓ పర్వతశ్రేష్ఠుడా! పాతాళంనుండి అసురులు పైకి రాకుండా ఉండేందుకు దేవేంద్రుడు నిన్ను ఇక్కడ అడ్డుగా నిలబెట్టాడు. అసురులు బలం పెంచుకొని భూలోకానికి రావటానికి ప్రయత్నం చేస్తున్నప్పుడల్లా, నీవు అతి విశాలమైన పాతాళానికి ద్వారంలాగా నిలబడి అడ్డగిస్తున్నావు. అంటే నీకు పైకి, క్రిందకూ పెరిగే స్వభావం ఉంది. ఓ మైనాకుడా! నీవు నీటి ఉపరితలం వరకూ పెరుగు. ఎందుకంటే మహావీరుడు, పరాక్రమశాలి, వానరశ్రేష్ఠుడూ అయిన హనుమంతుడు రాముడి పని మీద ఆకాశంలో ఎగురుతూ లంకా పట్టణానికి నిన్ను దాటుకుంటూ వెళుతున్నాడు. ఇక్ష్వాకు వంశీయులంతా నాకు పరమ పూజ్యులు. రాముడు కూడా ఇక్ష్వాకు వంశానికి చెందినవాడే. నీకూ, నాకూ కూడా పూజ్యుడే. హనుమంతుడికి సహాయం చెయ్యమని నేను నిన్ను అర్థిస్తున్నాను. ఆలస్యం చెయ్యకు. సత్పురుషులకు సహాయం చెయ్యకపోతే కోపం తెప్పించిన వాడవవుతావు. ఓ మైనాకుడా! హనుమంతుడు నాకు పరమ పూజ్యుడైన అతిథి. అతడు నీ మీద నిలబడేట్లుగా నీటినుండి పైకిలే. దేవగంధర్వాదుల చేత సేవించబడేవాడవు, బంగారానికి నిధివి అయిన ఓ మైనాకుడా! కాలయాపన చేయకుండా నీటిపైకి లేచి హనుమంతుడు నీపై విశ్రాంతి తీసుకునేందుకు ఆతిథ్యం ఇవ్వు. కొంతసేపు విశ్రమించి వెళ్ళిపోతాడు.

ఓ మైనాకుడా! రాముని ఘన చరిత్ర చూడు; సీత కష్టాల్లో ఉన్నదన్న విషయాన్ని గుర్తించు; రామకార్యంపై వెళ్తున్న హనుమంతుడి అలసటను దృష్టిలోపెట్టుకొని పైకి లేచిరా.

అప్పుడు సముద్రుడి కోరికను అనుసరించి మైనాకుడు, మేఘ మండలాన్ని ఛేదించుకు వచ్చిన సూర్యునివలె ఆ సముద్రజలాలలో నుండి బయటకు వచ్చాడు. ఆ పర్వతం మహావృక్షాలు, లతలు, బంగారు శిఖరాలతో నిండివుంది. మైనాకుడు నీటిని ఛేదించుకొని పైకి రావటంతో అంతవరకూ నల్లగా ఉన్న మేఘ మండలం అంతా బంగారు కాంతులతో దేదీప్యమానంగా వెలిగిపోయింది. అప్పుడా పర్వతం నూరుమంది సూర్యులు ఉదయించినట్లు విరాజిల్లింది.

అంతవరకూ నిరాఘాటంగా సాగిపోతున్న హనుమంతుడు హఠాత్తుగా సముద్రం నుండి పైకి లేచి నిలచిన ఈ పర్వతం తన పనికి విఘ్నం కలిగించేందుకే వచ్చిందని తలచాడు, వేగాన్ని పెంచాడు. ఆ మైనాకుడి శిఖర సముదాయాలన్నిటికీ తగిలేట్లు తన వక్షఃస్థలాన్ని తాకించి ఆ శిఖరాలన్నింటినీ పడగొట్టాడు. అప్పుడా పర్వత రాజైన మైనాకుడు హనుమంతుడి బలాన్ని, వేగాన్ని గుర్తించి ఎంతో సంతోషించాడు.

అప్పుడు మైనాకుడు మానవరూపంలో వచ్చి శిఖరం పైన నిలచి, ఆకాశంలో ఉన్న హనుమంతుడితో ఇలా అన్నాడు.

మైనాకుడు : ఓ వానరోత్తమా! నీవు ఇతరు లెవ్వరికీ సాధ్యంకాని పని చేపట్టావు. కొద్దిసేపు నా శిఖరంపై విశ్రమించు, అలసట తీర్చుకో. రాముడి వంశస్థులే సముద్రాల్ని వృద్ధి పొందించారు. అందువల్ల రాముడికి సహాయపడాలని, ప్రయాణం చేత అలసిపోయి ఉన్న నీకు సేవ చెయ్యాలనీ కోరుకొంటున్నాను. నీకు సహాయం చెయ్యటం ద్వారా రఘువంశ రాజైన రాముడికి సేవ చేసినట్లవుతుందని నా భావన. నా ఆతిథ్యం స్వీకరించి నన్ను కృతార్థుణ్ణి చెయ్యి.

ఓ వానరశ్రేష్ఠుడా! ఇంటికి వచ్చినవారికి ఆతిథ్యం ఇవ్వటం సామాన్య ధర్మం. ఆ వచ్చింది ఒక మహాపురుషుడే అయితే ఇక ఆతిధ్యం ఇచ్చేవారి అదృష్టాన్ని వేరే చెప్పాలా? నీవు దేవతలలో శ్రేష్ఠుడు, మహాత్ముడైన వాయుదేవుని పుత్రుడవు. ధర్మజ్ఞుడవైన నిన్ను పూజించితే వాయుదేవుని

పూజించినట్లే అవుతుంది. అది ఎట్లాగంటావా? పూర్వం కృతయుగంలో పర్వతాలకు రెక్కలుండేవి. అవి గరుత్మంతుడి వేగంతో అన్ని దిక్కులకూ సంచారం పోతూ ఉండేవి. అవి అట్లా ఎగురుతూ ఉంటే దేవతలు, మానవులు కూడా ప్రాణభయంతో విలవిల్లాడిపోయేవారు. అప్పుడు దేవేంద్రుడు తన వజ్రాయుధంతో వాటి రెక్కలను ఖండించాడు. దేవేంద్రుడు నా రెక్కలుకూడా ఖండించేందుకు వస్తూ ఉండగా వాయుదేవుడు నన్ను దూరంగా తీసుకొనిపోయాడు. తరువాత వాయుదేవుడు నన్ను తీసుకొనివచ్చి ఈ లవణ సముద్రంలో పడేశాడు. అప్పటి నుండీ నేను ఇక్కడే ఉంటున్నాను. నా రెక్కల్ని నీ తండ్రి వాయుదేవుడే కాపాడాడు. ఓ వానరోత్తముడా! నీ తండ్రి వలన గొప్ప సహాయం పొందాను; దైవికంగా నాకు సమీపంగా వెళ్తున్న నిన్ను ఆదరించి గౌరవించడం నా ధర్మం; అదృష్టం కూడాను. కనుక ఓ వానరోత్తమా! నీవు మా ఆతిథ్యం స్వీకరించి నాకూ, సముద్రుడికీ సంతోషాన్ని కలిగించు.

ఓ వానరోత్తమా! మా పూజలందుకో; కొంతసేపు విశ్రమించు. ఈ రోజు నీ దర్శనం కావటం మా భాగ్యంగా భావిస్తున్నాం.

హనుమంతుడు : ఓ మైనాకుడా! నీ ప్రియమైన మాటలే నాకు ఎంతో సంతోషాన్ని కలిగించాయి. అంతేచాలు. ఇప్పుడు నేను మీ ఆతిథ్యాన్ని స్వీకరించలేను. కోపగించుకోవద్దు. సూర్యాస్తమానానికల్లా నేను నా గమ్యాన్ని చేరుకోవాలి. ఇప్పుడు నాకు సమయంలేదు. అదీకాకుండా ఎక్కడా ఆగి విశ్రాంతి తీసుకోకుండా లంకాపట్టణాన్ని చేరుతానని నా స్నేహితుల వద్ద ప్రతిజ్ఞ చేశాను. అందువలన నీ మాట మన్నించలేకపోతున్నందుకు కోపగించుకోకు.

హనుమంతుడు ఈ విధంగా చెప్పి వారిద్దరినీ చేత్తో తాకి వారికి ఆనందాన్ని కలిగిస్తూ ముందుకు సాగిపోయాడు. అంతట మైనాకుడు, సముద్రుడు కూడా హనుమంతుని కార్యదీక్షకు ఎంతో సంతోషించారు. ఆ విధంగా విశ్రాంతి తీసుకోకుండా ఏ ఆధారం లేని ఆకాశంలో సాగి పోతున్న హనుమంతుణ్ణి చూసి దేవతలు, సిద్ధులు, మహర్షులు, చారణులు మరోసారి అభినందించారు. మైనాకుడి స్నేహభావానికి దేవేంద్రుడు కూడా చాలా సంతోషించాడు.

దేవేంద్రుడు : మైనాకుడా! ఓ సౌమ్యుడా! నీవు చేసిన పనికి ఎంతో సంతోషిస్తున్నాను. ఇకపైన నీవు స్వేచ్ఛగా ఉండే వరం ఇస్తున్నాను. ఇకపై నీకు ఇష్టమైన చోట స్వేచ్ఛగా ఉండవచ్చు. రామ కార్యంపైన వెళ్తున్న హనుమంతుడికి సహాయపడాలన్న నీ ఆలోచనను ఎంతో మెచ్చుకుంటున్నాను.

దేవేంద్రునికి సంతోషాన్ని కలిగించగలిగాను గదా అని ఆ మైనాకుడు కూడా ఆనందించాడు. అప్పటికే హనుమంతుడు చాలాదూరం వెళ్ళిపోయాడు.

ఇదంతా ఆకాశం నుండి చూస్తున్న దేవతలు, మహర్షులు, గంధర్వులు, సిద్ధులు సూర్యుడితో సమానమైన నాగమాతతో ఇట్లా అన్నారు. "ఓ సురసా! ఈ హనుమంతుడు వాయుపుత్రుడు. గొప్ప సాహసమైన పనికి పూనుకున్నాడు. మైనాకుడే స్వయంగా వెళ్ళి ఆతిథ్యమిచ్చినా వద్దని ముందుకు పోతున్నాడు. ఇతడి ధైర్యసాహసాల్ని, కార్యదీక్షను పరీక్షించాలని ఉంది. కాబట్టి నీవు రాక్షసరూపం ధరించి, భయంకరమైన కోరలతో, పచ్చని కళ్ళతో ఆకాశమంత నోరు చేసుకొని ఒక క్షణంపాటు అతడికి విఘ్నం కలిగించే ప్రయత్నం చెయ్యి, నిన్ను జయించి ముందుకు పోతాడా? లేక దిగులుపడిపోతాడా? మేమందరం చూడాలని అనుకుంటున్నాం."

అప్పుడు సురసాదేవి అందరికీ భయం కలిగించే భయంకర రూపాన్ని ధరించింది. హనుమంతుణ్ణి ఆకాశంలో అడ్డగించి ఇట్లా అంది. "ఓ వానరశ్రేష్ఠుడా! దేవతలే నిన్ను నాకు ఆహారంగా సమర్పించారు. ఇదిగో ఆకాశాన్నంతా నా నోటిలో ఆక్రమిస్తున్నాను. స్వేచ్ఛగా నా నోట్లోకి ప్రవేశించి నాకు ఆహారమై పొమ్ము. నా పని సులభమైపోతుంది." అందుకు ఆ వానరోత్తముడు ఏమాత్రమూ దిగులుపడకుండా రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ ఇట్లా అన్నాడు:

"ఓ సురసా! దశరథ మహారాజు కుమారుడైన రాముడు, సోదరుడైన లక్ష్మణుడు, భార్య

సీతతో కలసి దండకారణ్యంలో నివసిస్తూ ఉండేవాడు. రామలక్ష్మణులు ఇంట్లో లేని సమయం కనిపెట్టి రావణుడు, మహాపతివ్రత అయిన రాముని భార్య సీతాదేవిని అపహరించాడు. నేను రామకార్యంపై సీతాదేవిని చూసేందుకు వెళుతున్నాను. రాముడు భూమండలానికంతా ప్రభువు. నీవు కూడా ఆయన రాజ్యంలోనే ఉంటున్నావు కాబట్టి అట్టి ప్రభువు పనికి అడ్డు తగలవద్దు. ఆ విధంగా నీవు కూడా రామకార్యానికి సహాయపడు. అట్లాకాదు, నన్ను ఆహారంగా స్వీకరించాల్సిందేనని అంటావా? నాకు కొద్దిగా వ్యవధి ఇవ్వు. నేను సీతాదేవిని చూసి, ఆ విషయం రాముడికి చెప్పి తిరిగి వచ్చి నీకు ఆహారం అవుతాను. నేను నీకు ప్రతిజ్ఞ చేస్తున్నాను. నీవు నా మాట నమ్ము. ప్రస్తుతానికి నా దారికి అడ్డు రావద్దు." అప్పుడు కామరూపిణియైన ఆ సురస హనుమంతుడి మాటలు విని వికటంగా నవ్వుతూ "ఓ వానరశ్రేష్ఠుడా! నా ముఖంలోకి ప్రవేశించిన తర్వాతే నీవు వెళ్ళగలవు. ఇది బ్రహ్మదేవుడు నా కిచ్చిన వరం. కాబట్టి వృథామాటలు కట్టిపెట్టి నాకు ఆహారం అయిపో" అంటూ ఆ సురస తన నోరు ఇంకా పెద్దదిగా చేస్తూ హనుమంతుడి ఎదురుగా నిలబడ్డది. ఆ మాటలకు కోపించిన హనుమంతుడు "ఓ సురసా! నన్ను మ్రింగి నీలో ఇముడ్చుకోగలవా? ఏదీ మ్రింగు! చూద్దాం!" అంటూ తన శరీరాన్ని పది యోజనాల పొడవు, పది యోజనాల వెడల్పూ ఉండేట్లుగా పెంచాడు. ఆ సురస కూడా తన నోటిని ఇరవై యోజనాల వెడల్పూ, ఇరవై యోజనాల పొడమూ ఉండేట్లుగా పెంచింది. అది చూసిన హనుమంతుడు తన శరీరాన్ని ముప్పై యోజనాలుగా పెంచాడు. అదిచూసి సురస కూడా తన నోటిని నలుబది యోజనాలకు పెంచింది. వీరుడైన హనుమంతుడు ఏబది యోజనాలకు తన శరీరాన్ని పెంచాడు. సురస కూడా తన నోటిని అరువది యోజనాలకు పెంచింది. వీరుడైన హనుమంతుడు తన శరీరాన్ని డెబ్బది యోజనాలకు పెంచాడు. అంతట ఆ సురసా తన నోటిని ఎనుబది యోజనాల వరకు పెంచింది. పర్వతాకారుడైన హనుమంతుడు తన శరీరాని తొంబది యోజనాల వరకు పెంచాడు. అప్పుడు బుద్ధిశాలియైన హనుమంతుడు తన శరీరాన్ని బొటనవ్రేలంత చిన్నదిగా చేసుకొని దీర్ఘమైన నోరుకలదీ, నరకంతో సమానమైనదీ అయిన ఆ సురస నోట్లోకి పోయి మళ్ళీ వెంటనే బయటకు వచ్చాడు.

[వివరణ : ఈ శ్లోకాలన్నీ ఎవరో పిల్లలను సంతోష పెట్టడంకోసం రాసి జేర్చినట్లుగా ఉంది. ఎందువల్లనంటే, ఆ తీరం నుండి ఈ తీరం మధ్యనుండే దూరమే నూరు యోజనాలు. శరీరాన్ని తొంభై యోజనాల వరకూ పెంచేట్లయితే ఇంచుమించు ఈ తీరంనుండి ఆ తీరం వరకూ వ్యాపించినట్లే అవుతుంది గదా! ఇక ఎగరవలసిన పనే లేదు. అదీగాక అప్పటికే సగందూరం ఎగిరిరావడం జరిగిపోయింది. ]

ఆ విధంగా సురస నోట్లోకి పోయినట్లేపోయి బయటకు వచ్చి మళ్ళీ ఆకాశంలో నిలచిన హనుమంతుడు ఇట్లా అన్నాడు.

"దక్షప్రజాపతి కుమార్తెవైన ఓ సురసా! నీవు కోరినట్లే నీ ముఖంలోకి ప్రవేశించి వచ్చాను. నీకు నమస్కారం. రామకార్యంపై వెళ్తున్నాను, నీకిచ్చిన వరం కూడా సత్యం చేసినట్లయిందిగదా?" అన్నాడు. రాహువు నోట్లోకిపోయి వచ్చిన చంద్రుడు వంటి హనుమంతుణ్ణి చూసి సురస "సౌమ్యుడవయిన ఓ హనుమంతుడా! రామకార్యాన్ని సిద్ధించుకొనిరా, సీతను రాముని వద్దకు చేర్చు" అన్నది.

అప్పుడు దేవతలందరూ హనుమంతుడి మూడు సాహసోపేతమైన కార్యాలు చూసి చాలా సంతోషించారు. (1. సముద్రాన్ని లఘించే ప్రయత్నం 2. మైనాకుడి ఆతిథ్యాన్ని తిరస్కరించడం 3. సురస కల్పించిన విఘ్నాన్నుండి యుక్తితో బయటపడటం)

గరుత్మంతునితో సమానమైన వేగం గల ఆ హనుమంతుడు వరుణుని నివాసమైన సముద్రమును దాటుతూ ఆకాశమార్గం గుండా ప్రయాణం చేస్తున్నాడు. ఆకాశంలో మేఘాలు, పక్షులు, కైశికాచార్యులు, ఐరావతం తిరగటం చూశాడు. అవికాక ఇంకా సింహము, పెద్దపులులు, ఏనుగు ఆకారాల్తో తిరుతున్న ఎన్నో విమానాల్ని చూశాడు. స్వర్గవాసులైన ఎందరో పుణ్యాత్ముల్ని చూశాడు, యజ్ఞంలో సమర్పించిన హవిస్సులను మోసుకుపోతున్న అగ్నిదేవుణ్ణి చూశాడు. సూర్య చంద్రుల్ని, అశ్విని మున్నగు నక్షత్రాలను చూశాడు. కొన్నిచోట్ల గంధర్వులు,

యక్షులు, నాగులతో ఆకాశం కిటకిటలాడిపోతోంది. కొన్నిచోట్ల నిర్జనంగా ఉండి నిశబ్దంగా ఉంది. విశ్వావసు అనే గంధర్వరాజు అక్కడ కనిపించాడు. ఆకాశం జీవకోటి కోసం బ్రహ్మదేవుడు కట్టిన చాందినీలాగా ఉంది. వాయుపుత్రుడైన హనుమంతుడు ఆ విధంగా ఎటువంటి ఆధారమూ లేకుండా ఆకాశమార్గాన ప్రయాణం చేస్తున్నాడు.

ఇట్లా పోతూవుండగా, స్వేచ్ఛగా రూపాలను మార్చుకునే సింహిక అనే రాక్షసి హనుమంతుణ్ణి చూసింది. "ఆహా! ఇంత కాలానికి నాకో పెద్ద జంతువు ఆహారంగా దొరికింది గదా!" అని సంతోషించి హనుమంతుడి నీడను ఆకర్షించింది. ఆ విధంగా తన నీడను ఆకర్షించినప్పుడు, మహాసముద్రంలో ప్రయాణం చేసే ఓడకు ఎదురుగాలికి గురి అయినప్పుడు దానివేగం తగ్గిపోయినట్లుగా, తన్నుకూడా ఎవరో పట్టుకొని వెనక్కు లాగుతున్నట్లుగా హనుమంతునికి అనిపించి. వెంటనే హనుమంతుడు నాలుప్రక్కలా పరికించి చూశాడు. అప్పుడు క్రింద సముద్రంలో ఒక మహా జంతువును చూశాడు. ఆ జంతువు ముఖం చాలా వికృతంగా ఉంది. ఆ జంతువు తన నీడను పట్టుకొని ఆకర్షిస్తోంది. బహుశా సుగ్రీవుడు చెప్పిన ఆ సింహిక ఈ జంతువే అయి ఉంటుందని ఊహించాడు. వెంటనే తన శరీరాన్ని వర్షాకాలపు మేఘంలాగా పెంచేశాడు. పెరిగిపోతున్న నీడను చూసి ఆ సింహిక తన నోటిని పాతాళం వరకూ పెంచింది. ఆమె మేఘాల మల్లే గర్జిస్తూ హనుమంతుడి వైపుగా పరుగెత్తింది.

బుద్ధిమంతుడైన హనుమంతుడు, తన దేహాన్ని అతి చిన్నదిగా చేసి తెరచివున్న ఆ రాక్షసి నోట్లోకి ప్రవేశించాడు. మర్మస్థానాలన్నీ చూశాడు. హనుమంతుడు ఆమె నోటిగుండా ప్రవేశించడం సిద్ధులు, చారుణులు చూశారు. ఆమె శరీరం లోపలకు ప్రవేశించిన హనుమంతుడు తన వాడియైన గోళ్ళతో ఆమె గుండె మొదలైన మర్మస్థానాలన్నింటినీ ఊడపెరికి కన్నుమూసి తెరిచేటంతలో బయటకు వచ్చేశాడు. బుద్ధిశాలియైన హనుమంతుడు ధైర్యంతోనూ, నేర్పుతోనూ ఆ సింహికను సంహరించి మరల వేగంగా తన శరీరాన్ని పెంచాడు. అప్పుడు ఆ సింహిక హాహాకారాలు చేస్తూ మరణించి క్రింద పడిపోయింది. సింహిక చచ్చిపడడం చూసిన

సిద్ధులు, చారణులు హనుమంతుడితో "ఓ వానరోత్తమా! నీకు బుద్ధి, బలం, ధైర్యం, నేర్పు అనే నాలుగు లక్షణాలున్నాయి. ఎవడికి ఈ నాలుగు లక్షణాలూ ఉంటాయో వాడు సమస్త కార్యాలను సాధిస్తాడు. ఓ వానరోత్తమా! నీవు తలపెట్టిన కార్యం సిద్ధిస్తుంది" అన్నారు. పూజ్యుడైన హనుమంతుడు వారిచే స్తుతించబడి తిరిగి ఆకాశమార్గాన తన ప్రయాణాన్ని కొనసాగించాడు.

హనుమంతుడు సముద్రానికి ఆవలి ఒడ్డును సమీపించి పైనుండే బాగా పరికించి చూశాడు. అతడికి తీరం అంతా ఒత్తుగా పెరిగిన వృక్షాలు కనిపించాయి. అంతట నేలపైకి దిగి చుట్టూ మలయ పర్వత ప్రాంతంలో ఉండే వనాలను పోలిన వనాల్ని చూశాడు. ఒకసారి మహా పర్వతంలాగా ఉన్న తన శరీరాన్ని చూసుకొని ఇట్లా అనుకున్నాడు. 'నన్ను ఈ ఆకారంలో చూస్తే రాక్షసులు ఇతడు ఎవరా? అని ఆరాలు తీస్తారు.' అందువల్ల తన శరీరాన్ని తగ్గించుకొన్నాడు; అజ్ఞానం తొలగిపోయిన ఆత్మజ్ఞాని తన స్వస్వరూపాన్ని పొందినట్లు, తన సహజ రూపాన్ని ధరించాడు. తనకు ఇష్టమైన ఏ రూపాన్నైనా ధరించ గలిగిన హనుమంతుడు చిన్నరూపాన్ని ధరించాడు.

సర్వ వస్తువులు సమృద్ధిగా దొరికేదీ, రంగు రంగుల్తో చిన్న చిన్న శిఖరాలున్నదీ, మొగలిపొదలు, కొబ్బరిచెట్లు మొదలైన వృక్ష సంపదతో ఉన్న లంబ పర్వత శిఖరంపైన దిగాడు. ఆ శిఖరం పైనుండి లంకా పట్టణాన్నంతా పరిశీలించి చూశాడు. ఆకాశం నుండి ఒక్కసారిగా దిగటంతో అక్కడ ఉన్న చిన్న పెద్ద జంతువులన్నీ భయపడ్డాయి. హనుమంతుడు పెద్ద పెద్ద తరంగాల్తో కూడినదీ దానవుల నివాసాలకు దగ్గరగా ఉన్నదీ అయిన సముద్రాన్ని దాటి, తీరం మీద దిగి, అక్కడ అమరావతీ పట్టణం మల్లే ఉన్న లంకా పట్టాణాన్ని చూశాడు.

# 2వ సర్గ లంకానగర వర్ణన

మహాబలవంతుడు, ఎవరూ ఎదిరించలేని పరాక్రమవంతుడు అయిన హనుమంతుడు నూరుయోజనాల దూరం ఏకధాటిగా ఎగిరివచ్చినా, కించిత్తు కూడా అలసట చెందలేదు. త్రికూట పర్వత శిఖరంపై నిలబడ్డాడు. లంకనంతా ఒకసారి కలయజూశాడు. హనుమంతుడి పాదస్పర్శకు త్రికూట పర్వతం పులకించి తన మీద ఉన్న వృక్షాల నుండి పుష్పవర్షం కురిపించింది. ఆ పుష్పాలతో నిండిపోయిన హనుమంతుడు పుష్పాలతో కప్పబడిన శిలా విగ్రహంలా కనిపించాడు. వేయి యోజనాల దూరాన్నైనా అవలీలగా దాటగలిగిన తనకు నూరుయోజనాల దూరం ఒక లెక్కా అని అనుకున్నాడు. పచ్చని పచ్చికబీళ్ళ మధ్యలో నల్లగా ఉండే పెద్దపెద్ద రాళ్ళు, చిన్నచిన్న కొండలు దాటుకుంటూ హనుమంతుడు ముందుకు సాగిపోయాడు.

హనుమంతుడు రావణుడు పరిపాలించే సుందరమైన లంకా పట్టణాన్ని చూశాడు. ఆ ప్రదేశం అంతా పూలతోనూ, పండ్లతోనూ సువాసనలు వెదజల్లుతున్నాయి. ఆ త్రికూటపర్వతం నిండా వనాలనూ, ఉద్యానవనాలనూ, చక్కగా పూసి ఫలించిన వృక్షాలనూ చూశాడు. అక్కడ దేవదారు, కొండగోగు, ఖర్జూర, గజనిమ్మ, కొండమల్లె, పిప్పలి, మొగలి, కడిమి, అరటి, వేగిస, దేవకాంచన వృక్షాలతో వనాలన్నీ కళకళలాడుతున్నాయి. ఆ వృక్షాలను ఆశ్రయించి అనేక జాతుల పక్షులు నివసిస్తున్నాయి. పుష్పాల, ఫలాల బరువుకు వృక్షాలన్నీ వంగి హనుమంతుడికి నమస్కరిస్తున్నట్లుగా ఉన్నాయి. గాలికి తలలు ఊగిస్తూ హనుమంతుడికి ఆహ్వానం పలుకుతున్నట్లున్నాయి. ఆ పర్వతంపైన ఊహానిర్మితమా అన్నట్లు ఆ లంకను విశ్వకర్మ నిర్మించాడు. మట్టిగోడ ప్రాకారాలు దాని జఘనంగాను, అగడ్తలతో ప్రవహిస్తున్న అధికమైన నీరు వస్త్రంగాను, శతఘ్నులు శూలాలు కేశపాశాలుగాను, కోట బురుజులు కుండలాల్లాగాను ఉండటంచేత ఆ లంకను హనుమంతుడు ఒక స్త్రీ ఆకారంలో చూశాడు.

కైలాసశిఖరం వలె ఎత్తుగా ఉన్న ఆ లంకా పట్టణం ఆకాశాన్ని తాకుతున్నట్లుంది. భవనాలు అత్యున్నతంగా ఉన్నాయి. భయంకరులైన రాక్షసులతో, నాగములతో భోగవతీ పట్టణంలా ఉంది. ఆ నడబావులకు సమీపాన అనేక క్రీడాస్థలాల్ని ఆ వానరశ్రేష్ఠుడు చూశాడు.

సీతాదేవిని అపహరించుకు రావటంవల్ల ఏ క్షణాన్నైనా రాముడు తనపై దండెత్తుతాడేమోనని రావణుడు భద్రత బాగా కట్టుదిట్టం చేశాడు. నగరం చుట్టూ విశాలమైన కందకాలు త్రవ్వించాడు, వాటి నిండా నీరు నింపి నల్ల కలువల్ని పెంచాడు. ఆ కందకాల్ని ఆనుకొని బంగారు ప్రహరీ గోడ కట్టించాడు. దాని శిఖరాలన్నీ సూర్యకాంతిచేత ధగధగా మెరుస్తున్నాయి. ఆ నగరం అంతా పెద్ద పెద్ద భవనాలతో తీర్చి దిద్దినట్లున్నది. భవనాలన్నీ శరత్కాల మేఘాల్లాగానూ, ఆకాశంలో గ్రహాలు ఒకదానికి ఎదురుగా మరొకటి నిలబడ్డట్లుగా ఉన్నాయి. వీథులన్నీ విశాలంగా ఉన్నాయి, వీథికి రెండువైపులా తెల్లగా మెరిసిపోయే భవనాలు ఉన్నాయి. వాటి ద్వారాలను పక్షులు, పుష్పాలు చెక్కిన బంగారు రేకుల్ని తాపడం చేశారు. పట్టణమంతా ధ్వజాలు నిలిపి జండాలు ఎగురవేశారు. అది స్వర్గలోకంలోని అమరావతి వలె ఉంది. త్రికూటపర్వతం పైనుండి తెల్లగా మెరిసిపోయే భవనాలతో ఆకాశంలో తేలిపోతున్న పట్టణంలాగా కనిపించింది. హంసలు, కారండవములు స్వేచ్ఛగా విహరిస్తున్నవి, నల్లకలువలు, కమలాలు సమృద్ధిగా ఉన్నవి అయిన అనేక నడబావులు ఉన్నాయి. పూర్వం ఈ పట్టణంలో కుబేరుడుండేవాడు. తరువాత రావణాసురుడు దీన్ని తన రాజధానిగా చేసుకొని పాలిస్తున్నాడు. నగరం చుట్టూ పెద్దపెద్ద కోరలున్న రాక్షసులు అనేకమంది ఈ పట్టణానికి కావలి కాస్తున్నారు. హనుమంతుడు ఒకసారి ఆ పట్టణాన్నీ, మరోప్రక్క మహాసముద్రాన్నీ పరికించి చూశాడు. తమకు పరమశత్రువైన రావణుడు ఉండేది ఇక్కడేగదా అని అనుకున్నాడు. ఈ భయంకర శత్రువును జయించటం ఎట్లాగా అని ఆలోచించసాగాడు. ఎందువల్లనంటే ఈ పట్టణం దాని భద్రతా ఏర్పాట్లు చూస్తే దేవతలైనా ఈ పట్టణాన్ని జయించలేరేమో ననిపిస్తోంది. ఇక మా వానరసైన్యంగూర్చి చెప్పాలా? ఒకవేళ రాముడే కదిలివచ్చినా కూడా ఎటు ప్రక్కనుండి ప్రవేశించడమా అని తల పగలకొట్టుకోవాల్సిందే! ఎందువల్లనంటే ఇక్కడుంటున్న వాళ్ళంతా

రాక్షసులు. సామోపాయం వాళ్ళదగ్గర పనిచెయ్యదు. వీళ్ళంతా భోగభాగ్యాలతో తులతూగుతూ ఉన్నారు. అందువల్ల దానానికీ లొంగరు. మిత్రభేదాన్ని ప్రయోగిద్దామా? అంటే దానికీ వీలుపడేట్లు లేదు. పోనీ యుద్ధంచేసి గెలుద్దామా? అంటే అదీ సాధ్యమయ్యేట్లుగా లేదు. హనుమంతుడు మహాబుద్ధిశాలి, స్వామిభక్తి పరాయణుదు కావటం వల్ల, రాముడి పని సానుకూలం చెయ్యడం ఎట్లాగా? అని మళ్ళీ ఆలోచించాడు.

ఈ లంకా పట్టణాన్ని అడుగడుగునా భయంకరమైన రాక్షస యోధులు కాపలా కాస్తున్నారు. వాళ్ళంతా ఊర్ధ్వరేతస్కులు, మహాబలవంతులు, మాయావులు. నేను ఈ రూపంలోనే వెళ్తే నన్ను పోనివ్వరు, నన్ను బంధించినా బంధిస్తారు. కాబట్టి ఏదో ఉపాయం చేత పట్టణం లోపలకు ప్రవేశించాలి. సీతాదేవి ఎక్కడుందో వెతకాలి. అందువల్ల బాగా చీకటి పడేదాకా ఇక్కడే ఎవరికంటా పడకుండా కాలక్షేపం చేస్తాను. చీకట్లో ఒక సూక్ష్మరూపాన్నీ ధరించి ఎవరికంటా పడకుండా నగర ప్రవేశం చేస్తాను, కాబట్టి రామకార్యం సిద్ధించాలంటే రాత్రి సమయమే అనుకూలంగా ఉంటుందని అనుకున్నాడు.

దూతలుగా వెళ్ళినవాళ్ళు ఎప్పుడూ అప్రమత్తంగా ఉండాలి; నేర్పు, ఓర్పు వహించాలి; దేశకాలాలకు అనుగుణంగా తమను తాము మలచుకోవాలి. అప్పుడే తలపెట్టిన కార్యాలు సిద్ధిస్తాయి. లేని ఎడల సూర్యోదయంతో చీకట్లు పటాపంచలైనట్లుగా తలపెట్టిన పనులన్నీ నాశనం అవుతాయి. ప్రభువులు మంత్రులతో బాగా ఆలోచించి చేయదగిన పనులు, చేయకూడని పనులను వివరించి చెప్తూనే ఉంటారు. అయినా దూతలుగా వెళ్ళేవాళ్ళు తామే మహాపండితులమని అనుకొని, పనులు పాడుచేస్తూ ఉంటారు.

అందువల్ల ఎట్లా చేస్తే రామకార్యం సిద్ధిస్తుందో, ఎట్లా చేస్తే నేను కష్టపడి సముద్రాన్ని దాటిరావడం సంపూర్ణమైన ఫలితానిస్తుందో, ఆ విధంగా నేను నడుచుకోవాలి. అంతేకాని ఈ పని అనాలోచితంగా ఎందుకు చేశానా? అని తలపట్టుకునేట్లుగా ఉండకూడదు. రావణాసురుణ్ణి సంహరించాలనుకొంటున్న రాముడి సంకల్పానికి విఘాతం కలిగే పనులు చేయకూడదు. కాబట్టి

నేను ఇప్పుడు రాక్షసుల కంట పడకుండా ఉండటమే నా తక్షణ కర్తవ్యం. నాకూ కామరూపవిద్యలు తెలుసు. నేనుకూడా రాక్షసవేషం ధరిస్తే, వాళ్ళు నన్ను పట్టుకుంటారు. మరే రూపం ధరించినా వాళ్ళు కనిపెట్టగలరు. ఎందువల్లనంటే, వాయుదేవుడు కూడా అక్కడ కాపలావాళ్ళ అనుమతి లేకుండా లోపలకు ప్రవేశించలేక పోతున్నాడు. వాయుదేవుడి పరిస్థితే అట్లా ఉంటే, ఇక నాబోటివాళ్ళ మాట వేరే చెప్పాలా? కాబట్టి నేను, నా సహజ రూపంలోనే ఉంటే నాకు సర్వనాశనం తప్పదు. అందువల్ల నేను ఏదో ఒక చీమ, దోమవంటి చిన్న ఆకారాన్ని ఆశ్రయించాలి. బాగా చీకటి పడ్డ తర్వాత లంకా పట్టణంలో ప్రవేశించాలి; రామకార్యాన్ని సాధించాలి. అంతేకాకుండా, సీతాదేవిని వెతకాలంటే ఒక్కొక్క ఇంటికీ వెళ్ళి చూడాలంటే రాత్రి వేళలోనే వెతకటం శ్రేయస్కరం అని అనుకున్నాడు. సూర్యాస్తమయం అవుతూ ఉండగానే శరీరాన్ని పిల్లి అంత చిన్నదిగా చేశాడు. ఒక్కగంతులో మొదటి ప్రాంగణానికి చేరుకున్నాడు. అక్కడనుండి లోపలకు చూశాడు, భవనాలన్నీ వెండి స్తంభాలతోనూ, బంగారు కిటికీలతోనూ, బంగారంపై స్ఫటికాలు, వైడూర్యాలు, మణులు, రత్నాలు పొదిగిన తాపడం చేసిన గోడలతోను ప్రకాశిస్తున్నాయి. తెల్లగా, ఎత్తుగా ఉన్న విమానగృహాలు ధగధగా మెరిసిపోవడం చూశాడు. రాక్షసులంతా ఊహించలేనంత అద్భుతమైన ఆకారాల్తో, బలపరాక్రమాలు గలవారుగా కనిపించారు. లంకాపట్టణం గంధర్వుల నగరమా అన్నట్లు విరాజిల్లుతోంది. అయినా సీతదేవిని చూడబోతున్నాను గదా అని సంతోషపడ్డాడు.

అప్పుడు హనుమంతుడికి సహాయపడేందుకా? అన్నట్లుగా చంద్రుడు నక్షత్రాలను వెంట బెట్టుకొని ఆకాశంలోకి వచ్చాడు. ఆ చంద్రుని చల్లని వెన్నెలతో ఆకాశం అంతా చాందినీ కప్పినట్లుంది. ఉదయ చంద్రుని వెన్నెల పాలవలె తెల్లగా ఉంది. రాజహంసల వర్ణంలో మనోహరంగా ఆకాశాన వెలిగిపోతున్న చంద్రుణ్ణి హనుమంతుడు చూశాడు.

# 3వ సర్గ లంకాపట్టణం స్త్రీరూపంలో హనుమంతుని అడ్డుకోవడం

మహాబుద్ధిశాలి, వాయుపుత్రుడు, వానరశ్రేష్ఠుడు అయిన హనుమంతుడు మేఘాలను తాకుచున్న అతిఎత్తైన లంబ పర్వతశిఖరం పైనుండి అందమైన వనాలతో విలసిల్లుతున్నదీ, రావణుడిచే పాలించబడేదీ అయిన లంకా నగరంలో ధైర్యంగా ప్రవేశించాడు.

సముద్రం నుండి వస్తున్న చల్లని గాలులు లంకా నగరంలో ప్రవేశిస్తున్నాయి. సముద్ర ఘోష నగరమంతా వ్యాపిస్తోంది, బలిష్ఠమైన సైనికులతో ఉన్న ఆ లంకాపట్టణం అలకాపట్టణంలాగా అందంగా ఉంది. ముఖద్వారం వద్దనే ఏనుగులు గుంపులుగా విహరిస్తున్నాయి. తెల్లటి ముఖద్వారంతో అది, సర్పములు సంచరిస్తున్న భోగవతీ నగరంలాగా ఉంది. చల్లని మందమారుతాలతో ఉన్న ఆ లంకానగరం ఇంద్రుని అమరావతీ పట్టణంలాగా ఉంది. అక్కడ ఒక పెద్ద బంగారు ప్రాకారం ఉంది. మువ్వలు కట్టిన పతాకాలు ఆ ప్రాకారానికి అలంకరించబడ్డాయి. హనుమంతుడు ఆ ప్రాకారం దగ్గరగా వెళ్ళాడు.

హనుమంతుడు ఆ నగరాన్ని నలుమూలలా పరికించి చూశాడు. నగరంలో గృహద్వారాలన్నీ బంగారంతో తాపడంచేసి ఉన్నాయి. వాటిపై వజ్రవైడూర్యాలు పొదిగారు; అక్కడక్కడా బంగారు మదపుటేనుగుల్ని నిలబెట్టారు. ఇళ్ళు, వాకిళ్ళన్నీ తెల్లగా వెండిలాగా వెలిగిపోతున్నాయి. ఆ మెట్లపై స్ఫటికాలు, మాణిక్యాలు పొదిగారు. క్రౌంచపక్షులు, రాజహంసలు, నెమళ్ళు అక్కడ కనిపిస్తున్నాయి. భవనాలన్నీ ఆకాశాన్నంటుతూ మనోహరంగా ఉన్నాయి. దేవేంద్రనగరమైన అలకాపట్టణంలాగా లంకానగరం ఉండటం చూచి హనుమంతుడు సంతోషించాడు.

రావణుని నగరాన్ని చూసి హనుమంతుడు ఇట్లా అనుకున్నాడు: కాబట్టి ఈ నగరంపై బలప్రయోగం చేసే సాహసం ఎవరూ చేయలేరు. కుముదుడు, అంగదుడు, సుషేణుడు, మైందుడు, ద్వివిదుడు మాత్రం ఈ నగరాన్ని జయించగలరేమో! వీరే కాకుండా సుగ్రీవుడు,

కుశపర్వుడు, ఋక్షుడు కూడా ఇక్కడకు రాగల సమర్థులే. లంకాపట్టణం ఎంతగొప్ప బలిష్ఠమైనదైనా, రామలక్ష్మణుల బలం ముందు దిగదుడుపే అవుతుంది.

ఆ లంకాపట్టణం రత్నకాంతులనే వస్త్రాలను, కోష్ఠాగారం అనే చెవి కుండలాలను ధరించి, యన్త్రగృహాలు స్తనాలుగా ప్రకాశిస్తూ ఉండగా, చక్కగా అలంకరించుకొన్న స్త్రీలాగా కనబడుతోంది. ఇళ్ళల్లో నుండి వచ్చే దీపకాంతులచేత నగరం అంతా చీకట్లను తరిమివేసి వెలుగును ఆక్రమించుకుంది. అటువంటి లంకా పట్టాణాన్ని హనుమంతుడు చూశాడు.

మహాబలశాలియైన ఆ వానరశ్రేష్ఠుడు నగరంలోనికి ప్రవేశిస్తూ ఉండగా, ఆ లంకానగరం రాక్షసస్త్రీ రూపాన్ని ధరించి హనుమంతుణ్ణి చూసింది. భయంకరమైన తన కళ్ళు పెద్దవిగా చేసి ఇంకా భయం పుట్టేట్లుగా కనిపించింది. హనుమంతుడికి దగ్గరగా వచ్చి భయంకరమైన కంఠస్వరంతో ఇట్లా అంది.

లంకానగరం : ఓ వానరుడా! నీవు ఎవరవు? ఎందుకు నా నగరంలో ప్రవేశించావు? నేను నీ ప్రాణాలు హరించే లోపుగా నాకు యథార్థం చెప్పు. రావణ సైన్యం చేత అతి కట్టుదిట్టంతో రక్షించబడే నా నగరంలోకి నీవు ఎట్లా ప్రవేశించావు?

హనుమంతుడు : ఓ రాక్షసీ! నీవడిగిన ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్తాను. ముందుగా, నన్ను అడ్డగిస్తున్న నువ్వు ఎవరవు? నీ ఆకారం, కళ్ళు అన్నీ భయంకరంగా ఉన్నాయి. నువ్వు నన్ను ఎందుకు భయపెడ్తున్నావో ముందు చెప్పు. ఆ తర్వాత నా విషయాలన్నీ తప్పక చెబుతాను.

కామరూపిణియైన ఆ లంకానగరానికి హనుమంతుడిపై బాగా కోపం వచ్చింది. గొంతులోకి కాఠిన్యం తెచ్చుకొని ఇట్లా అంది.

లంకానగరం: నేను లంకాపట్టణాన్ని. మహాబుద్ధిశాలి రాక్షసరాజు అయిన రావణాసురుని ఆజ్ఞలను శిరసావహించి పాలిస్తూ ఉంటాను. ఈ నగరం నా రక్షణలోనే

ఉంటుంది. నువ్వు నా అనుమతి లేకుండా నా నగరంలో ప్రవేశించావు; నేను ఇప్పుడే నిన్ను చంపుతున్నాను. ఎట్లాగో నీకు నా చేతుల్లో చావు ఖాయం. చచ్చే ముందుగా నీవు ఎవరవు? నా నగరంలోకి ఎందుకు ప్రవేశించావు? ఈ లంకానగరం నా అధీనంలో ఉండటంవల్ల నేను ఈ నగరాన్ని అన్నివైపులనుండీ రక్షిస్తూవుంటాను.

వానరశ్రేష్ఠుడు, వాయుకుమారుడు, బలవంతుడు అయిన హనుమంతుడు అవసరం అయితే ఈ లంకానగరాన్ని ఎదిరించటానికి సిద్ధపడ్డాడు.

హనుమంతుడు : ఓ లంకా పట్టణమా! ఈ లంక బురుజులతోనూ, ముఖద్వారాలతోనూ చాలా అందంగా ఉంది. చూసినకొద్దీ ఇంకా చూడాలనిపిస్తోంది. బయటనుండి చాలాసేపు చూశాను. తృప్తికలుగలేదు. పట్టణం లోపల ఇంకా ఎంత మనోహరంగా ఉంటుందోనని చూడాలని వచ్చాను. నీ పట్టణ సౌందర్యం అంతా తిరిగి చూడాలని ముచ్చట పడుతున్నాను. లోపల ఎన్నో ఉద్యానవనాలు, అందమైన భవనాలు, అనేక వృక్షజాతులతో కూడిన తోటలున్నాయట. ఈ మనోహరమైన పట్టణాన్ని తిలకించటానికే వచ్చాను.

లంకానగరి : ఓరీ వానరాధమా! మరణం దగ్గర పడటంవల్లనే నీకీ దుర్బుద్ధి పుట్టింది. ఈ పట్టణాన్ని ఎల్లప్పుడూ రక్షించేందుకే రావణుడు నన్ను ఈ పనికి నియోగించాడు. కాబట్టి నన్ను జయించి కానీ నీవు ఈ పట్టణంలో అడుగుపెట్టలేవు.

రాక్షసి రూపంలో ఉన్న ఆ లంకానగరం ఇట్లా మాట్లాడుతూనే తన అరచేత్తో హనుమంతుణ్ణి చాచి కొట్టింది. ఆ దెబ్బకు హనుమంతుడు బిగ్గరగా అరిచాడు. కోపం ముంచుకొచ్చింది. పిడికిలి బిగించాడు. అయినా తమాయించుకున్నాడు. ఒక స్త్రీపైన తన బలం అంతా ప్రయోగించాలా? అని అనుకున్నాడు, ఒక గుద్దు గుద్దాడు. దాంతో లంకిణి గుడ్లు తేలేసి నేలపై పడింది. గుడ్లు తేలేయటంతో దానిముఖం ఇంకా వికృతంగా కనిపించింది. అయినా ఒక స్త్రీని కొట్టానే అని ఎంతో బాధపడ్డాడు. దగ్గరగా పోయి దయచూపి అనునయించి మాట్లాడాడు.

దాంతో ఆ లంకానగరి, హనుమంతుడంటేనే భయపడిపోయింది. గర్వం అంతా మటుమాయమై పోయింది. దీన స్వరంతో ఇట్లా అంది.

లంకానగిరి : ఓ మహాబాహూ! ఓ వానరశ్రేష్ఠుడా! నీవంటి తేజశ్శాలురు స్త్రీలపై దయ చూపాలేకాని చంపకూడదు. ఈపాటి నియమాలు నీకు తెలియనివి కావు.

ఓ వానరుడా! నేనే సాక్షాత్తూ లంకానగరాన్ని. నన్ను నీ పరాక్రమం చేత జయించావు. నేను పూర్వం బ్రహ్మదేవుని నుండి గొప్పవరాన్ని పొందాను. ఆ వరమును గూర్చి వివరంగా చెప్తాను విను.

"ఓ లంకా నగరమా! ఏనాడు ఒక వానరుడు వచ్చి తన పరాక్రమం చేత నిన్ను జయిస్తాడో, ఆనాటి నుండీ రాక్షసులకు చెడుకాలం దాపురించిందని తెలుసుకో" అని బ్రహ్మదేవుడు పలికి అంతర్ధానమయ్యాడు.

ఓ సౌమ్యుడా! ఇప్పుడు నీ దర్శనమైంది. నీ పరాక్రమం చేత నన్ను జయించావు. ఇక బ్రహ్మ వాక్కు యథార్థం కాబోతుంది. దురాత్ముడైన రావణుడు సీతను అపహరించి తెచ్చాడు. దాంతో అతడికి, మిగిలిన రాక్షసులందరికీ వినాశకాలం దాపురించింది. ఓ వానరశ్రేష్ఠుడా! నీవు ఈ లంకా పట్టణంలోకి ఏయే పనులు చక్కబెట్టేందుకు వచ్చావో, ఆ పనులన్నీ పూర్తిచేసుకో! నందీశ్వరుని శాపంచేత ఈ పట్టణం నిందితమైవుంది. కాబట్టి నీవు ఈ పట్టణమంతా స్వేచ్ఛగా సంచరించు. మహా పతివ్రత అయిన సీతను అన్వేషించు.

# 4వ సర్గ హనుమంతుడు రావణుని అంతఃపురంలో ప్రవేశించడం

మహాతేజశ్శాలి, వానరశ్రేష్ఠుడు, వాయుపుత్రుడు అయిన హనుమంతుడు, కామరూపిణి అయిన లంకిణిని జయించాడు. శత్రువుల నగరాన్ని ప్రవేశించేటప్పుడు సింహద్వారంనుండి కాకుండా ద్వారాలులేని ప్రదేశంనుండి ప్రవేశించాలని శాస్త్రాలు చెప్తున్నాయి. సర్వశాస్త్రాలు తెలిసినవాడు కావటం వలన హనుమంతుడు ప్రాకారం పైకి ఎగిరిదూకి నగరంలోకి ప్రవేశించాడు. తన ఎడమకాలు ఉంచి శత్రువు నగర ప్రవేశం చేశాడు హనుమంతుడు.

(వివరణ : బృహస్పతి వచనం ప్రకారం, వివాహాల్లోనూ, గృహప్రవేశాల్లోనూ కుడికాలు పెట్టి ప్రవేశించాలి. అట్లాగే శత్రువుల పట్టణంలోకీ, ఇళ్ళల్లోకీ వెళ్ళేటప్పుడు ఎడమకాలుపెట్టి వెళ్ళాలి.)

ధైర్యశాలియైన హనుమంతుడు లంకా పట్టణంలోని రాజమార్గం గుండా వెళ్ళాడు. రమణీయంగా ఉండే ఆ నగరాన్నంతా తిరిగి చూశాడు. ఏ ఇంటికిపోయినా, ఏ వీధిగుండా పోయినా, నగరంలోని జనులంతా నృత్యగానాలతో ఆనందసాగరంలో మునిగిపోయి కనిపించారు. స్త్రీ పురుష భేదం లేకుండా ఆట పాటల్లో పాల్గొంటున్నారు, బిగ్గరగా నవ్వుతున్నారు. కేరింతలు కొడుతున్నారు. ఆ భవనాల్లోని కిటికీలన్నీ వజ్రాలతో అలంకరించారు. ఆ భవనాలన్నీ మేఘాలను అంటుకునేటంత ఎత్తుగా కట్టుకున్నారు. తెల్లగా, ఎత్తుగా ఉండే ఆ భవనాలన్నీ దేవేంద్రుడి ఐరావతంలాగా కనిపించాయి. ఈ భవనాలవల్ల లంకానగరం అంతా శోభాయమానంగా వెలిగిపోతోంది.

(నాలుగు దిక్కుల్లోనూ నాలుగు ద్వారాలుండే గృహాల్ని పద్మం అని అంటారు. ఇటువంటి గృహాలను సర్వతోభద్రమంటారు పశ్చిమాన ద్వారం లేక మధ్యన వంకర తిరిగిన చతుశ్శాలా గృహము హయాననము. దక్షిణాన ద్వారం లేనిది వర్ధమానము, ధనప్రది. అదే విధంగా తూర్పున ద్వారం లేనిది స్వస్తిక గృహము; అనగా పుత్ర ధన సంపదలు ఇచ్చేది.)

హనుమంతుడు చిత్రవిచిత్రములైన పూలతోనూ, పూలదండలతోను, అలంకరించిన భవనాలను అనేకం చూశాడు. ఒక్కో ఇంట్లో మద్యపానం చేస్తున్నారు. స్వర్గంలో అప్సర కన్యల్లాగా మంద్ర, మధ్యమ స్వరాలతో గీతాలను ఆలపిస్తూన్న మధురమైన గానాన్ని విన్నాడు. ఆయా గృహల్లో స్త్రీలు నడిచేటప్పుడూ, మెట్లు ఎక్కి దిగేటప్పుడూ కాళ్ళ అందెలనుండి వచ్చే చప్పుళ్ళు, మొలనూలి చిరుగంటల నుండి వచ్చే శృంగార ధ్వనులను విన్నాడు. కొన్ని ప్రదేశాల్లో మల్లయుద్ధాల్లో వీరులు జబ్బలు చరుచుకొంటూ చేసే సింహనాదాలు విన్నాడు.

కొందరి గృహాల్లో జపంచేస్తున్నవారి మంత్రాలను విన్నాడు. వేదాధ్యయనం చేస్తున్న రాక్షసుల్నీ, రావణాసురుడి కొరకై స్తుతిపాఠాలను వల్లె వేస్తున్నవాళ్ళనీ చూశాడు. మేఘాల్లాగా గర్జిస్తున్న రాక్షసుల్ని చూశాడు. రాజవీథుల్లో గస్తీ తిరిగే రాక్షససైన్యాన్ని చూశాడు. వాళ్ళల్లో ఎందరో రావణుని గూఢచారులున్నారు.

లంకానగరంలో హనుమంతుడు అనేకరకాలైన రాక్షసుల్ని చూశాడు; కొందరు యజ్ఞ దీక్ష వహించారు. కొందరు జటలు ధరిస్తే మరికొందరు ముండనం చేయించుకున్నారు. కొందరు వస్త్రాలను ధరిస్తే, మరికొందరు ఎద్దు చర్మాలను ధరించారు. కొందరు మంత్రించిన దర్భలు చేతపట్టుకొని వాటినే ఆయుధాలుగా చేసుకున్నారు. మరికొందరికి వారు చేస్తున్న హోమకుండాలే ఆయుధాలుగా భావించారు. వాళ్ళల్లో వివిధ ఆకారాలున్న వాళ్ళున్నారు. కుంటివాళ్ళున్నారు; ఒంటి కన్ను వాళ్ళున్నారు; వినపడని వాళ్ళున్నారు. వేలాడేపొట్ట కొందరికైతే, మరికొందరికి వేలాడే చన్నులున్నాయి. భయంకరాకారులున్నారు. పొట్టివాళ్ళున్నారు, పొడుగాటి వాళ్ళున్నారు. వికృతరూపాల వాళ్ళున్నారు; మన్మథాకారులున్నారు.

కొందరు కవచాలు ధరించారు, కొందరు ధనుస్సు బాణాలు ధరిస్తే, మరికొందరు ఖడ్గాలు ధరించారు. వాళ్ళతోపాటు వివిధాలైన మారణాయుధాలున్నాయి. శతఘ్నులు, ముసలములు, పరిఘలు మొదలైన ఆయుధాల్ని కలిగివున్నారు. కొందరు లావుగా ఉంటే మరికొందరు సన్నగా ఉన్నారు. కొందరు పొడుగ్గా ఉంటే మరికొందరు పొట్టిగా ఉన్నారు,

కొందరు అందంగానూ, తేజస్సుతో ఉంటే మరికొందరు వికృతాకారులున్నారు. కొందరు ధ్వజాల్ని, కొందరు పతాకాల్ని ధరించారు.

అక్కడ హనుమంతుడు మహాబలవంతులైన రాక్షసులు పట్టిసములు, శక్తులు, వృక్షములు, అశనులు, క్షేపణులు, పాశములు, శూలములు మున్నగు మారణాయుధాల్ని ధరించినవారిని చూశాడు. అంతేకాకుండా వాళ్ళంతా కామరూపులు, స్వేచ్ఛగా ఎక్కడికైనా వెళ్ళిరాగల సమర్థులు. అటువంటి సైనికులు నూరువేల మంది నగరాన్ని కాపలాకాస్తూ ఎప్పుడూ సర్వసన్నద్ధులై ఉంటారు.

రావణాసురుడి భవనానికి గల ముఖద్వారం బంగారంతో చేయబడి ఉండటం హనుమంతుడు చూశాడు. ఆ భవనానికి చుట్టూ పెద్ద ప్రాకారం ఉంది. ఆ భవనానికి పద్మములతో నిండిన అగడ్తలు దానికి అలంకారంగా ఉన్నాయి. ఆ భవనం ఎత్తైన పర్వతశిఖరంపైన ఉంది.

రావణాసురుడి అంతఃపురం స్వర్గంలాగా ఉంటుంది. ఎక్కడ చూసినా మధురమైన సంగీతాలు వినిపిస్తూ ఉంటాయి. గుర్రాల సకిలింపులు, ఆభరణాల గలగలలు వినిపిస్తూ ఉంటాయి. అనేక రకాలైన వాహనాలున్నాయి. రథాలు, విమానాలు, అశ్వములు, గజములు, నాలుగేసి దంతాలుండి తెల్లగా ఉండే ఐరావతంవంటి మహాగజాలు, ఎల్లప్పుడూ ఆ భవన ప్రాంగణంలో సిద్ధంగా ఉంటాయి. ఇంతే కాకుండా ఉద్యాన వనాల్లో లేళ్ళు నెమళ్ళు, రకరకాల పక్షులు విహరిస్తూ ఉంటాయి. వేలకొలది రాక్షసులు ఆ భవనాన్ని రక్షిస్తూ ఉంటారు. అటువంటి భద్రతావలయం మధ్యలో ఉన్న రావణుని భవనంలోకి హనుమంతుడు రహస్యంగా ప్రవేశించాడు. రావణుని భవనం బంగారంతో నిర్మించారు, ప్రాకారాలన్నీ బంగారంతో తాపడం చేశారు. అంతఃపురం అంతా ఆరకుండా చందన, అగరు వంటి సుగంధద్రవ్యాలతో తడుపుతూ ఉంటారు. అటువంటి రావణుని అంతఃపురంలోకి హనుమంతుడు రహస్యంగా ప్రవేశించాడు.

# 5వ సర్గ రావణుని మందిరాలలో సీతకై వెతకడం

చంద్రుడు ఆకాశం మధ్యకుపోయి తన చల్లని కిరణాలతో లోకాలన్నింటినీ ఆహ్లాద పరుస్తున్నాడు. నక్షత్రాల మధ్యన వెలిగిపోతున్న చంద్రుడు గోశాలలో విహరించే ఆబోతులా హనుమంతుడికి కనిపించాడు. అటువంటి చంద్రుణ్ణి చూస్తున్న సముద్రుడు ఉప్పొంగిపోయాడు. దుఃఖాల్లో ఉన్న వారందరికీ ఉపశనం కలిగించాడు. ఈ భూమిపై ఏ లక్ష్మి మందర పర్వతంపై ఉంటుందో, సాయంసమయాల్లో ఏ లక్ష్మి సాగరములపై కనిపిస్తుందో, నీటిలో, పద్మాలలో ఏ లక్ష్మి కనిపిస్తుందో, ఆ లక్ష్మియే అప్పుడా చంద్రాణ్ణి ఆశ్రయించి ఉంది. వెండి పంజరంలో ఉండే హంసా, పర్వతగుహల్లో ఉండే సింహం, ఏనుగుపై స్వారీచేసే వీరుడువలె చంద్రుడు ఆకాశంలో ప్రకాశిస్తున్నాడు.

వాడియైన కొమ్ములతో తెల్లటి ఆబోతువలె అనేక శిఖరాలతో కూడిన పర్వతరాజము వలెను తెల్లటి దంతాలకు బంగారు తొడుగు తొడిగిన మదపుటేనుగు వలెను, పదహారు కళలతోనూ పరిపూర్ణంగా ప్రకాశిస్తున్న చంద్రుడు అప్పుడు ఆకాశాన వెలిగిపోతున్నాడు. వర్షాకాలం వెళ్ళిపోవటం వల్ల వర్షతుంపరలు చంద్రుని చల్లదనానికి అడ్డంకిగా లేవు. ఇంకా శీతకాలం రాకపోవటాన మంచు చంద్రుని కాంతి ప్రసారానికి అడ్డంకి కావటంలేదు. సూర్యకిరణాలు ప్రతిబింబించడంచేత మాలిన్యం అంతాపోయి చంద్రుని మచ్చకూడా మాయమైపోయింది. చెవులపిల్లి చిహ్నంతోకూడిన చంద్రుడు నిర్మలంగా ప్రకాశిస్తున్నాడు. అప్పుడే గుహలోనుండి బయటకువచ్చిన సింహంలాగాను, యుద్ధరంగంలో ప్రవేశించిన మదపుటేనుగులాగాను, సింహాసనాన్ని అధిష్ఠించిన రాజులాగానూ ఆ చంద్రుడు తన చల్లని కాంతులతో మద్యపానం, మాంసభక్షణం చేసే రాక్షసులకు ఆ సాయంత్రాన్ని స్వర్గంలాగా అనిపింపజేశాడు. ప్రియురాళ్ళందరూ అంతవరకూ నటించిన ప్రణయకోపాన్ని విడిచి పెట్టారు; ప్రియుల ఒళ్ళోకివచ్చి చేరుతున్నారు. పతివ్రతలైన స్త్రీలు తమ భర్తల పక్కల్లో ఒదిగి పోతున్నారు. వీళ్ళే కాకుండా ఘోరకృత్యాలు చేసే నిశాచరులు కూడా పేట్రేగిపోతున్నారు.

బుద్ధిమంతుడైన ఆ హనుమంతుడు అనేక ఇళ్ళలోకి పోయి చూశాడు. ఏ ఇంట్లో చూసినా మదించినవాళ్ళు, ఏమరపాటుగా ఉన్నవాళ్ళు కనిపించారు. ఆ ఇళ్ళన్నీ లక్ష్మీకళతో కళకళలాడుతున్నాయి.

ఇళ్ళలో రాక్షసులు ఒకరినొకరు పరిహాసాలాడుకొంటున్నారు; భుజాలు చరుస్తున్నారు; మద్యం సేవించిన మత్తులో అధికప్రసంగం చేస్తున్నారు. ఒకరినొకళ్ళు దోషారోపణలు చేసుకొంటున్నారు. కొందరు తమ ప్రియురాండ్ర తొడలపై పడుకున్నారు, కొందరు అభినయిస్తున్నారు, కొందరు ధనుస్సును ఎక్కుపెట్టి తమ ప్రతాపాన్ని సరిచూసుకొంటున్నారు. కొన్ని ఇళ్ళల్లో స్త్రీలు చందనం, అగరు వంటి లేపనాలను శరీరానికి పూసుకొన్నారు. కొందరు నిద్రపోతున్నారు, కొందరు ఆనందపారవశ్యంతో నిట్టూర్పులు విడుస్తున్నారు. కొందరు ప్రియుడిపై ప్రణయకోపాన్ని ప్రదర్శిస్తున్నారు. కొందరు విరగబడి నవ్వుతున్నారు, సత్పురుషులు వీథుల్లో సంచారాలు చేస్తున్నారు, ఏనుగులు ఘీంకరిస్తున్నాయి. దీర్ఘ నిశ్వాసములు విడుస్తున్న వీరులతో ఆ నగరం అంతా బుసలుకొడుతున్న సర్పాలతో నిండిన మడుగులాగా ఉంది. హనుమంతుడు ఆ నగరంలో ఎంతోమంది బుద్ధిమంతులైన వాళ్ళను చూశాడు. వాళ్ళంతా శ్రద్ధగా వారివారి పనులను చక్కబెట్టుకోవటంలో నేర్పరులైవున్నారు. వాళ్ళ పేర్లుకూడా రూపాలకు తగ్గట్టుగా ఉన్నాయి. ఆయా గృహాల్లో రాక్షసుల భార్యలు తమ భర్తలకు ప్రేమానురాగాలతో మద్యాన్ని అందిస్తూ, తాముకూడా సేవిస్తున్నారు. కొన్ని ఇళ్ళల్లో స్త్రీలు అర్ధరాత్రివేళ తమ ప్రియుల కౌగిళ్ళల్లో బందీలైపోయారు; సిగ్గుపడుతూనే తామూ పరవశులైపోవటం హనుమంతుడు చూశాడు. వాళ్ళంతా పుష్పాలచేత కప్పబడిన పక్షుల్లా కనిపించారు. కొందరు స్త్రీలు వాళ్ళ ఇళ్ళల్లో మేడపైన భర్తల ఒడిలో కూర్చుని మన్మథావేశం పొందుతున్నారు. భర్త ప్రేమకు పాత్రులై రతిక్రీడలు చేస్తున్నారు. వారంతా ధర్మమార్గాన్ని అనుసరించిన స్త్రీలే! హనుమంతుడు చూసినవారిలో కొందరు వస్త్రహీనులైకూడా ఉన్నారు. కొందరు పుటం పెట్టిన బంగారం రంగులో ఉన్నారు. కొందరు సంభోగానందాన్ని అత్యధికంగా ఆనందిస్తూ ఉండగా, కొన్ని ఇళ్ళల్లో ప్రియుడు దగ్గర లేనందువల్ల స్త్రీలు వియోగదుఃఖంతో

బాధపడుతూ ఉండటం హనుమంతుడు చూశాడు. అక్కడ స్త్రీలందరూ కడిగిన ముత్యాల్లా సౌందర్యవతులై ఉన్నారు. వాళ్ళంతా ప్రియుల మనస్సును ఆకర్షిస్తూ తమ ప్రియులతో చేరి ఆనందిస్తున్నారు.

హనుమంతుడు ఇంతమంది స్త్రీలను చూశాడు; కానీ ఉత్తమ సౌందర్యవంతురాలు, ధార్మికమైన రాజవంశానికి చెందిన సన్నని నడుముగలదీ, అతి సౌకుమార్యవతీ అయిన సీతాదేవి మాత్రం కనబడలేదు. అతి పురాతనకాలం నుండీ వస్తున్న ధర్మమార్గమందు స్థిరంగా నిలచి ఉన్నది; రాముని మనస్సులో స్థిరంగా నిలచినదీ; అన్ని కాలములందలి స్త్రీలలోనూ అందరికంటే ఉత్తమురాలైన సీతాదేవిని మాత్రం చూడలేదు. రాముడు చెప్పిన సీతాదేవి ఆభరణాలనైనా చూసి గుర్తిద్దామా? అని అనుకొంటే, అటువంటి ఆభరణాలు ధరించిన స్త్రీలు హనుమంతుడికి ఎక్కడా కనబడలేదు.

# 6వ సర్గ సీతకై రావణుని అంతఃపురంలో వెతకడం

తనకు ఇష్టమైన రూపాన్ని ధరిస్తూ సీతాదేవిని అన్వేషిస్తూ ఆమెను చూడలేకపోవటంతో హనుమంతుడు నిరుత్సాహపడ్డాడు. ఉదయసూర్యుడి కాంతితో వెలిగిపోతున్న రావణుని అంతఃపురంలోకి ప్రవేశించాలని నిశ్చయించుకున్నాడు. మహారణ్యాన్ని సింహం రక్షిస్తున్నట్లుగా భయంకర రాక్షసులు రావణుని అంతఃపురాన్ని కాపలా కాస్తున్నారు. ఆ భవనానికున్న వాకిళ్ళను వెండి, బంగారాలతో చేశారు. ఆ రాజభవనాన్ని శూరులైన రాజభటులు కంటికిరెప్పలా కాపలా కాస్తున్నారు. ఏనుగులు, గుర్రాలపైన అధిరోహించిన రాక్షసవీరులు అడుగడుగునా గస్తీ కాస్తున్నారు. వీళ్ళేకాక యోధులు కొందరు దంతపు నగిషీలతో చెక్కిన రథాలపై ఆ ప్రాంతం అంతా సంచరిస్తున్నారు. ఆ రథాలలో సింహం, పెద్దపులి చర్మాలతో తయారుచేసిన కవచాలున్నాయి. ఈ రథాలపైనుండి కాపలాకాస్తున్న యోధులంతా ఒకేసారి పదకొండువేలమంది సైనికులతో యుద్ధం చేయగల సమర్థులు. అక్కడ ఇటువంటి రథాలు, ఆసనాలు అనేకం ఉన్నాయి. ఆ భవనానికి నాలుగు వైపులా అందమైన వృక్షాలతో వనాలు ఉన్నాయి. ఆ వృక్షాలపైన అనేక జాతుల పక్షులు ఉన్నాయి. అనేక వన్యమృగాలు తిరుగుతూ ముచ్చట గొల్పుతున్నాయి.

అటువంటి రావణాసురుడి భవనంలో ఉత్తమమైన స్త్రీలు ఎందరో సంతోషంతో కాపురాలుంటున్నారు. వాళ్ళంతా అలంకారాలు చేసుకున్నారు, వాళ్ళ అలంకారాల ధ్వనులు సముద్రధ్వనిని మరిపించేట్లున్నాయి. ఆ భవనంలో అక్కడక్కడా ఛత్రము, చామరులు మొదలైన రాజ చిహ్నాలు కనిపిస్తున్నాయి. ఆ భవనం అంతా చందన, అగరువంటి సుగంధాలతో నిండిపోయింది. అటువంటి మహనీయులైన వారితో ఆ భవనం సింహాలతో కూడిన మహారణ్యంవలె శోభించింది.

ఆ భవనం భేరీ, మృదంగం మున్నగు వాద్యాలతోను, శంఖ నాదాలతోను

ప్రతిధ్వనిస్తోంది. అక్కడ నిత్యపూజా, అర్చనలే కాకుండా పర్వదినాల్లో హోమాలతో కూడిన విశేష పూజలు చేస్తూ ఉంటారు. అక్కడి రాక్షసులందరూ అమితమైన భక్తిశ్రద్ధలతో నిత్యమూ పూజలు చేస్తూ ఉంటారు.

ఆ భవనంలోని మధ్యభాగం మాత్రం సముద్రమధ్యంలాగా గంభీరంగాను, నిశ్శబ్దంగాను ఉంటుంది. అక్కడి పైకప్పులన్నీ రత్న వైడూర్యాలతో పొదగబడ్డాయి. ఆ భవనంలో ఎక్కడ చూసినా మణులే, రత్నాలే! అటువంటి రావణుని అంతఃపురాన్ని హనుమంతుడు చూశాడు.

హనుమంతుడు ఆ విధంగా ధనికుల గృహాలన్నీ ఒక్కచోట కూడా విడవకుండా సీతాదేవి కోసం వెతకసాగాడు. ఉద్యానవనాలు ఏమాత్రం భయంలేకుండా వెదికాడు.

మహాపరాక్రమశాలియైన హనుమంతుడు ముందుగా ప్రహస్తుని ఇంటి పైకి దూకాడు. అక్కడనుంచి మహాపార్శ్వుని గృహం పైకి దూకాడు. అక్కడనుండి మేఘంతో సమానుడైన కుంభకర్ణుని ఇంటి పైకి, విభీషణుని గృహం పైకి దూకాడు. అక్కడనుండి మహోదరుడు, విరూపాక్షుడు, విద్యుజ్జిహ్వుడు, విద్యున్మాలి, వజ్రదంష్ట్రుడు అనే రాక్షస ప్రముఖుల ఇళ్ళన్నీ గాలించాడు. అటుపైన శుకుడు, సారణుడు, ఇంద్రజిత్తు, జంబుమాలి, సుమాలి, రస్మికేతువు, సూర్యకేతువు, వజ్రకాయుడు అనే రాక్షసుల ఇళ్ళన్నీ వెదికాడు.

తరువాత ధూమ్రాక్షుడు, సంపాతి, విద్యుద్రూపుడు, భీముడు, ఘనుడు, విఘనుడు, శుకనాసుడు, వక్రుడు, శఠుడు, వికటుడు, బ్రహ్మకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, యుద్ధోన్మత్తుడు, మత్తుడు, ధ్వజగ్రీవుడు, నాది, విద్యుజ్జిహ్వులు, ఇంద్రజిహ్వులు, హస్తిముఖుడు, కరాళుడు, పిశాచుడు, శోణితాక్షుడు అనే రాక్షసుల ఇళ్ళల్లో సీతాదేవికోసం వెతికాడు. ఆ విధంగా ఒక్కొక్క ఇంటి పైకి దూకుతూ వాళ్ళ ఐశ్వర్య సమృద్ధిని చూసి హనుమంతుడు ఆశ్చర్యపోయాడు.

వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు ఒక్కో ఇంటిపైకీ దూకుతూ, రావణుని భవనం దగ్గర భయంకరమైన కళ్ళు కలిగిన రాక్షస స్త్రీలు ఉండటం చూశాడు. వాళ్ళంతా రావణుడికి

అంగరక్షకులై శూలాలు మున్నగు ఆయుధాలను పట్టుకొని కాపలా కాస్తున్నారు. రావణుని భవనానికి సమీపంలోనే అనేక సేనా విభాగాలున్నాయి. వాళ్ళంతా రకరకాలైన ఆయుధాలను ధరించిన భయంకరమైన ఆకారాల్తో యుద్ధానికి సిద్ధంగా ఉన్నారు.

ఆ రావణుని భవనమునందు మేఘములవంటి ఏనుగులున్నవి. అందులో కొన్నింటికి శత్రుసైన్యంపై ఐరావతంలాగా దాడిచేసే శిక్షణకూడా ఇవ్వబడింది; అవి నిరంతరం మదోదకాన్ని విడుస్తున్నాయి. మంచి మేలుజాతివి, తెలుపు, ఎరుపు ఇంకా అనేక రంగులలో మేలైన గుర్రాలున్నాయి. అక్కడ రావణాసురుడి భవనప్రాంతంలో వెయ్యి సేనా విభాగాలున్నాయి. (ఒక్కొక్క వాహినిలో 81 ఏనుగులు, 81 రథాలు, 243 గుర్రాలు, 405 కాల్బలము ఉంటాయి) అంతేకాకుండా వాయుపుత్రుడైన హనుమంతుడు అనేక ఆకారాల్లో ఉన్న పల్లకీలను, లతాగృహాలను, క్రీడాగృహాలను, కర్రతో నిర్మించబడ్డ చిన్నచిన్న పర్వతాలను, కామభోగాలకు ఉపయోగించే గృహాలను అక్కడ చూశాడు. ఆ రావణుడి భవనం మందరపర్వతమంత పెద్దదిగానూ, కుబేరుని భవనంలాగానూ ఉండి అనేక ధ్వజాలు, పతాకాలతో నిండివుంది. ఆ భవనం ఎక్కడ చూసినా అనేక రత్నాలు, మణులతో నిండి ఉన్నది. ఈ అంతఃపురాన్ని పరివేక్షించేందుకు అనేకమంది అధికారులున్నారు. హనుమంతుడు అక్కడ చూసిన పాత్రలు, శయనములు, ఆసనాలన్నీ బంగారంతో చెయ్యబడ్డాయి. విశాలంగానూ, మనోహరంగానూ ఉన్న ఆ భవనం కుబేరుని భవనంలాగా ఉంది. వందలకొద్దీ స్త్రీలు నివసించే ఆ మహాభవనంలో ఎన్నో ప్రాసాదాలున్నాయి. అటువంటి రావణుని అంతఃపుర భవనసముదాయం లోకి హనుమంతుడు ప్రవేశించాడు.

# 7వ సర్గ పుష్పక విమాన వర్ణన

ఆరావణుని అంతఃపుర సముదాయంలోని భవనాలన్నీ వైడూర్యాలతోనూ, మణులతోనూ అలంకరించబడ్డాయి. కిటికీలన్నీ బంగారంతో చేశారు. వర్షాకాలంలో మెరుపులు మెరుస్తూ ఉంటే క్రింద ఎగిరే పక్షులన్నీ మేఘాల్లాగా కనిపిస్తాయి. ఆ గృహాములలో అనేక విధాలైన శిలలున్నాయి, ప్రధానములైన శంఖశాలలను, ఆయుధశాలలను, పర్వతాలంత పెద్దపెద్ద మేడల్నీ, విశాలమైన ఆయుధాగారాన్నీ హనుమంతుడు చూశాడు. అక్కడ అంతఃపురంలో కనిపించే రత్నవైడూర్యాలు, వెండి బంగారాలు ఇంకా అనేక సిరిసంపదలన్నీ రాక్షసులు యుద్ధంచేసి సంపాదించినవే.

ఆ భవనసముదాయంలో కొన్ని వందల భవనాలున్నాయి. ఎక్కడా వాస్తుదోషాలు లేకుండా, దేవతలు కూడా మెచ్చుకునేట్లుగా అవి నిర్మించబడ్డాయి. ఆ భవనాలన్నీ ఎక్కడా చిన్నాచితకా లోపాలు కూడా కనిపించకపోవటంతో ఇవన్నీ మయుడే నిర్మించాడా? అన్నంత శ్రేష్ఠంగా ఉన్నాయి.

అప్పుడు హనుమంతుడు రావణుడు నివసించే గృహాల్ని చూశాడు. అవన్నీ అతడి బలానికి, పరాక్రమానికి తగ్గట్లుగా ఉన్నాయి. అక్కడ అతి విలువైన ఒక విమానాన్ని చూశాడు. దాన్ని చూస్తూంటే భూలోక స్వర్గంలాగా అనిపిస్తోంది. అంతా పుష్పాలు, వృక్షాలు, లతలతో నిండి ఉండటం వల్ల సువాసనలు వెదజల్లుతున్నాయి. ఆ విమానంలో నివసించే ఉత్తమ స్త్రీలంతా మేఘాలను అలంకరించిన మెరుపు తీగల్లాగా ఉన్నారు. ఈ భవనాలన్నీ స్వర్గంలోని పుణ్యాత్ములు నివసించేవిలా ఉన్నాయి. ఆకాశంలో హంసలు మోసుకొనిపోతున్న బ్రహ్మదేవుడి రథమా? అనిపించేట్లుగా ఉన్నాయి. అనేక రత్నాలతో అలంకరించబడి ఉండటం వల్ల ధగధగ మెరిసిపోతున్న పర్వత శిఖరాలవలెను, చంద్రుడు, శుక్రుడు మున్నగు గ్రహాలు సంచరించే ఆకాశంలాగా ఉంది. ఇంద్రధనుస్సులాగా అనేక రంగుల్తో విలసిల్లుతోంది. నగరంలో ఉండే

విమాన గృహాలన్నింటిలో ఇదే అతిశ్రేష్ఠమైనదిగా హనుమంతుడు భావించాడు.

అక్కడ భూమి నిండా అనేక పర్వతపంక్తులున్నాయి, వాటిలో రకరకాల వృక్ష సముదాయాలున్నాయి, అవన్నీ ఫలపుష్పాదులతో నిండి, ఆ పూలల్లోని పరాగం ఎంతో రమణీయంగా ఉంది; ఆ భవనంలోని నేల అంతా రకరకాల మణులతో అలంకరించబడి ఉంది. ఇవి కాకుండా తెల్లటి భవనాలు, పుప్పొడితో కూడిన అనేక పూలచెట్లు, కోనేరులు, అనేక ఉద్యానవనాలు అక్కడ నేలపైన నిర్మించారు.

ఈ విధంగా రత్నాలు, మణులతో వెలిగిపోతున్న ఆ గృహాన్ని 'పుష్పకము' అని అంటారు. అటువంటి పుష్పకవిమానగృహంలో రావణాసురుడు నివసిస్తూ ఉంటాడు. ఈ పుష్పకవిమాన గృహంలో వైదూర్యాదిమణులతో చిత్రించిన పక్షులు, పగడాలతో చేసిన పక్షులు, వెండితో చేసిన పక్షులు, లోహాలతో చేసిన ప్రతిమలు, గుర్రాల అవయవాల్ని సొగసుల్ని తెలిసేట్లుగా చేసిన ప్రతిమలు మనోహరంగా కనిపిస్తూ ఉంటాయి. అక్కడ చిత్రించిన పక్షుల ముక్కులన్నీ బంగారం, పగడాలతో చేసిన పలు వంకర్లు తిరిగిన ముక్కులతో, ఇవన్నీ మన్మథుడికి తోడుగా వచ్చాయా? అన్నట్లు కన్పిస్తాయి. మదపుటేనుగులు తొండాలలో తామరపద్మాలను తీసుకొని నీటితోనూ, పుప్పొడితోను పద్మాలతోను లక్ష్మీదేవిని అభిషేకం చేస్తున్నట్లుగా చిత్రించారు.

ఆ పుష్పక విమానగృహం ఒక మహాపర్వతమా? అన్నట్లుంది. మంగళకరంగానూ, రమణీయంగానూ ఉంది. వసంతఋతువులో విరగబూసిన పుష్పాల సుగంధాలన్నీ గుబాళిస్తూ ఉండటం హనుమంతుడు చూశాడు. అంత మహాపట్టణంలో, రాజభవనాల్లో రాముడికోసం తపించే సీతాదేవిని హనుమంతుడు చూడలేకపోవటంవల్ల ఎంతో దుఃఖించాడు. అప్పుడు హనుమంతుడు మనస్సు పరిపరివిధాలుగా ఆలోచించింది. గొప్ప ధైర్యశాలి అవటం వల్లా, దూరదృష్టి గలవాడవటం వల్లా, సీతాన్వేషణ తప్ప వేరే వ్యాపకంలేనివాడు కావడంవల్లా హనుమంతుడు సీతాదేవి కోసం మళ్ళీ వెతకడం ప్రారంభించాడు.

# 8వ సర్గ హనుమంతుడు మళ్లీ పుష్పకాన్ని వెతకటం

ఆమహాపుష్పక భవనంలో మధ్యగా రత్నాలతో పొదిగిన మరో విమానాన్ని హనుమంతుడు చూశాడు. దానికి బాగా దగ్గరగాపోయి పరిశీలించి చూశాడు, దాని కిటికీలన్నీ బంగారంతో చేశారు. దాని ఎత్తు ఇంత అనిగాని, అంత అనిగాని చెప్పలేం. విశ్వకర్మే తాను నిర్మించిన విమానా లన్నింటిలోకీ ఇది శ్రేష్ఠమైనదని మెచ్చుకున్నాడు. దాని ఎత్తు ఆకాశం అంత, దాని శిఖరాలు ఆకాశాన్ని ఒరుసుకుపోతూ సూర్యుడి మార్గాన్ని చూపే చిహ్నాలుగా ఉన్నాయి.

ఈ విమానాన్ని విశ్వకర్మ ఎంతో శ్రద్ధతో నిర్మించాడు. ప్రతి విభాగాన్నీ క్షుణ్ణంగా పరీక్షించి, పరిశీలించి అమర్చాడు. దానిలోపల ఎటు చూసినా మణులతోనూ, రత్నాలతోనూ పొదిగి ఉన్నాయి. అందులో ఏర్పాట్లన్నీ అత్యద్భుతంగా ఉన్నాయి. దేవలోకంలో కూడా ఇటువంటి విమానం లేదు. ఇంతటి మహత్తుతో కూడిన విమానం కేవలం తపస్సు చేతను, పరాక్రమంచేతనే లభ్యమయ్యేది.

ఈ విమానాన్ని పద్మంవంటి అనేక ఆకారాలతోను, అనేక గోపురాలతోనూ నిర్మించారు. అది ఒక్కోవైపు నుండి ఒక్కోవిధంగా కనబడుతూ ఉంటుంది. అయితే అందులోని శిల్ప విశేషాలన్నీ కూడా ఏ వైపు నుండి చూసినా అతిరమణీయంగా కనబడతాయి.

ఆ విమానంలో కూర్చుని, యజమాని ఎక్కడకు పోవాలని మనస్సులో అనుకుంటే అక్కడకు అది తీసుకుపోతుంది. అంతేకాకుండా, యజమాని వేగంగా పోవాలనుకుంటే అత్యధిక వేగంగానూ, మందంగా పోవాలనుకుంటే మందంగాను పోతుంది. సామాన్యంగా వాయువేగంతో పోతూ ఉంటుంది. దాన్ని ఆపగల శక్తి ఎవరికీ లేదు. దాని యజమాని మాత్రమే దాన్ని నియంత్రించగలడు. మహాత్ములు, పుణ్యాత్ములు, సంపన్నులు, కీర్తిమంతులు అయిన దేవేంద్రుడు మున్నగువారి నివాసం లాంటిది. దాని పనితనం ప్రశస్తమైనది. దాని సొగసు వర్ణనాతీతం. చిత్రవిచిత్రాలైన శిఖరాలతో మనోహరంగా శరత్కాల చంద్రుడిలాగా స్వచ్ఛమైన

కాంతులతో అది ప్రకాశిస్తోంది. గైరికాది ధాతువులతో మెరుస్తూ ఎత్తైనశిఖరాలతో ఒక మహాపర్వతంలాగా కనిపిస్తోంది.

ఆ విమానాన్ని కుండలాలు ధరించినవారూ, అందమైన ముఖం గలవారు, ఆహారం ఎక్కువగా తినేవారూ, ఆకాశంలోనే తిరిగే వారైన రాక్షసులూ, కళ్ళు గుండ్రంగానూ, వంకరగానూ, విశాలంగానూ ఉండే వేలకొద్దీ పిశాచాలూ మోస్తూ ఉంటాయి. వానర వీరులలో శ్రేష్ఠుడైన హనుమంతుడు, అక్కడున్న పుష్పక విమానం వసంత ఋతువులోని పుష్పాల సముదాయంలాగా అందంగా ఉండటం చూశాడు. అ పుష్పకం మనోహరమైనది, శ్రేష్ఠమైనది.

# 9వ సర్గ పుష్పకంలో నిద్రించే స్త్రీలను పరిశీలించడం

రావణాసురుడి అంతఃపుర భవనాల సముదాయమే ఒక పెద్ద నగరమంత ఉంది. ఆ సముదాయం అంతటిలోనూ అతిశ్రేష్ఠమైన భవనం ఒకటి ఉంది. అది ఒక యోజనం పొడవు, అర్ధ యోజనం వెడల్పూ గలది. ఈ భవనమే రావణాసురుడి నివాసం.

వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు సీతాదేవి కోసం వెదుకుతూ ఆ భవన సముదాయం అంతా తిరిగి చూశాడు. అట్లా తిరుగుతూ అన్నింట్లోకీ ఉత్తమమైన ఒక భవనాన్ని చేరుకున్నాడు. ఆ భవనం వద్ద ఏనుగులు గుంపులుగుంపులుగా తిరుగుతున్నాయి. వాటిల్లో కొన్నింటికి రెండేసి దంతాలు, కొన్నింటికి మూడేసి దంతాలు, కొన్నింటికి నాలుగేసి దంతాలు కూడా ఉన్నాయి. రాక్షస యోధులు రకరకాల ఆయుధాల్ని ధరించి పహరా కాస్తున్నారు. ఇంతమంది యోధులు, ఏనుగులూ తిరుగుతున్నా ఎక్కడా ఇరుకుగా ఉన్నట్లే అనిపించలేదు. ఆ భవనప్రాంగణం కూడా ఎంతో విశాలంగా ఉన్నది.

ఆ భవనంలో రావణాసురుడి భార్యలు, రాక్షస స్త్రీలు నివసిస్తున్నారు. వారందరూ రావణాసురుడు తన పరాక్రమం చేత జయించి తెచ్చి భార్యలుగా చేసుకున్న రాకుమార్తెలే! ఆ భవనమే ఒక మహాసముద్రంగాను, అందులో తిరుగాడే స్త్రీలంతా భయంకర మొసళ్ళు, తిమింగిలాలు, సొరచేపల్లాగా కనిపించారు.

కుబేరుడి భవనంలో ఐశ్వర్యం, దేవేంద్రుడి భవనంలో ఉండే వైభోగం రెండూ రావణాసురుడి భవనంలోనే తాండవం చేస్తున్నట్లున్నాయి. అంతేకాదు, రావణుని భవనంలోని భాగ్యం కుబేరుని సంపదతోను, యముని సమృద్ధితోను దీటైనదనీ, వాటికంటే ఎక్కువే అనీ చెప్పుకోవచ్చు.

ఆ భవనానికి మధ్యలో మరొక పెద్ద భవనంలాంటి పుష్పకం ఉంది. ఈ విమానాన్ని

పూర్వం విశ్వకర్మ నవరత్నాలతో, సర్వాంగ సుందరంగా బ్రహ్మదేవుడి కోసం నిర్మించాడు. కుబేరుడు బ్రహ్మను గూర్చి తపస్సు చేసి, బ్రహ్మను మెప్పించి ఆ విమానాన్ని పొంది భూలోకానికి తెచ్చుకున్నాడు. రావణాసురుడు కుబేరుణ్ణి తన పరాక్రమంతో జయించి ఆ విమానాన్ని తన సొంతం చేసుకున్నాడు.

ఆ పుష్పక విమానం పైభాగానికి హనుమంతుడు వెళ్ళి చూశాడు. అక్కడ వెండితో చేసిన స్తంభాలున్నాయి. వాటికి బంగారు తొడుగులు వేశారు. ఆ స్తంభాల మీద తోడేళ్ళు మొదలైన జంతువుల చిత్రాలు కన్నులపండువుగా చెక్కబడ్డాయి. మేడ మీద నడిచేందుకు పెద్ద, విశాలమైన వసారాలు ఏర్పరచారు. ఆ భవనం మేరుపర్వతం, మందరపర్వతం లాగా ఆకాశాన్నంటుతున్నది. ఆ భవనం లోపల అందమైన బంగారు వేదికలు, సోపానాలు ఉన్నాయి. అవన్నీ ప్రజ్వరిల్లుతున్న అగ్నిహోత్రుడివలె వెలిగిపోతున్నాయి. కిటికీలన్నీ రకరకాలైన ఆకారాల్తో బంగారంతో తాపడం చేసి గాలి కోసం ఇంద్రనీలమణులు పొదిగి ఉన్నాయి. కింద నేలనంతా పగడాలతోను, విలువైన మణులతోను, ముత్యాలతోను తాపడం చేశారు. బంగారు, రక్తచందనం పూతలతో ఉదయ సూర్యకాంతులతో తేజరిల్లుతున్నాయి. సుగంధాలతో భవనం అంతా గుబాళించుతోంది. రకరకాలైన ఆకారాలు, చక్కటి అలంకారం సంతరించుకొన్న గదులున్న ఆ "పుష్పకాన్ని" హనుమంతుడు చూశాడు.

ఇక్కడ భక్ష్యాలు, భోజ్యాలు, మద్యాలు, వివిధములైన అన్నాలు వివిధాలైన వాసనలతో ఘుమఘుమలాడుతున్నాయి. ఆ వాసనలన్నీ చూస్తూ ఉంటే, వాయుదేవుడే రకరకాలైన రూపాలు ధరించాడా అన్నట్లుంది. ఇంటికి వచ్చిన అతిథికి ఆదరంగా ఇల్లంతా చూపిస్తున్నట్లుగా ఆ సుగంధాలన్నీ హనుమంతుణ్ణి 'రావణుడు ఇక్కడున్నాడు' రమ్మన్నట్లుగా పిలుస్తున్నట్లుంది.

శోభాయమానంగా వెలిగిపోతున్న ఈ భవనం రావణాసురుడి అంతరంగం తెలుసుకొని ఆ ప్రకారం నిర్మించినట్లుగా ఉంది. అక్కడ ఆసనాలకు మణులు పొదిగారు. కిటికీలకు అలంకారాలు చేశారు. కింద నేలపై స్ఫటికాలు తాపడం చేశారు. దంతాలతో చేసిన బొమ్మల్ని

అలంకరించారు. వెండి బంగారాలతో చేసిన ఆభరణాలున్నాయి. స్తంభాలను పక్షులు మోస్తున్నాయా? అన్నట్లు పక్షుల రెక్కల్ని చెక్కగా, అవి ఆ భవనాన్ని ఆకాశంలోకి ఎగరేసుకుపోతున్నాయా? అన్నట్లుంది.

అక్కడ నేలపైన రత్నకంబళీ పరిచారు. ఆ కంబళీలపై (తివాచీ) అరణ్యాలు, వన్యమృగాలు, సరస్సులు, పక్షులు, పర్వతాలు మున్నగు ప్రకృతి సంపదలన్నింటినీ చిత్రించారు. నిజమైన పక్షులు కూడా ఆ భవనాల్లో నివసిస్తున్నాయి. అగరు చందనాది సువాసనలతో కూడిన ధూపాలు వేశారు. రకరకాల పుష్పాలు చల్లి అలంకరించడం చేత ఆ భవనం మంచి కాంతిగల కామధేనువులాగా ఉంది. ఆ మంటపం మనస్సుకు ఆనందం కలిగించడమే కాకుండా, వాళ్ళ శరీర కాంతి కూడా వృద్ధి చెందేట్లుంది. అది లక్ష్మీదేవికి పుట్టినిల్లై, ఎటువంటి దుఃఖానికి, శోకానికి తావు లేకుండా ఉంది. రావణుడు నివసించే ఆ భవనం ఇంద్రియ సుఖాలన్నింటినీ సమకూర్చిపెట్టేదిగా ఉంది. చూస్తున్నకొద్దీ హనుమంతుడికే, ఇది స్వర్గలోకమా? ఇక్కడ దేవతలుంటున్నారా? ఇంద్రుడి పట్టణమైన అమరావతియా? లేక గొప్ప తపస్సిద్ధిచేత ఏర్పడ్డాయా? అని ఆశ్చర్యం కలిగించింది.

జూదంలో అంతా పోగొట్టుకొని చేష్టలుడిగిపోయిన వాడిలాగా ఉన్నాయా దీపస్తంభాలు. ఆ భవనం అంతా దీపాలు ప్రజ్వరిల్లిన వెలుగు, రావణుని తేజస్సు, ప్రకాశవంతమైన అలంకారాలవల్ల వెలిగిపోవటం, నేర్పరులైన జూదరుల చేతుల్లో ఓడిపోతూ చేష్టలుడిగిన జూదరుల మల్లే నిశ్చలములైన బంగారు దీపాలను హనుమంతుడు చూశాడు. దీపాల ప్రకాశమూ, రావణుని తేజస్సూ, అలంకారాల కాంతులూ ఏకం కావడంతో ఆ భవనం హనుమంతునికి ప్రజ్వలిస్తున్నట్లు కనిపించింది. అనేకమంది ఉత్తమ స్త్రీలు అలంకారాలు, రంగురంగుల వస్త్రాలు ధరించి ఆ తివాచీలపై పడుకొని ఉండడం హనుమంతుడు చూశాడు. వారు రాత్రంతా మద్యపానం చేసి, క్రీడించడం వల్ల అలసిపోయి నిద్రకుపడ్డారు. పుణ్యఫలం ఖర్చైపోగా భూమిపై రాలిపడ్డ నక్షత్రాలా? అన్నట్లు ఉన్నారీ స్త్రీ సమూహమంతా! రాత్రంతా వారు

చేసిన మద్యపానం చేతా, రతిక్రీడల చేతా వారు ధరించిన పుష్పమాలలు, వస్త్రాలన్నీ నలిగిపోయి మలినమై, నిద్రలో మునిగిపోయారు. కొందరికి తిలకం చెమటలో తడిసి కారిపోయింది. అందెళ్ళన్నీ జారిపోయాయి. మెడలో ధరించిన హారాలన్నీ పక్కకు పడిపోయాయి. వస్త్రాలు జారిపోయాయి, జుట్టుముడి విడిపోయింది. చాలాదూరం నడచిన ఆడ గుర్రాల్లాగా బాగా అలసిపోయారు. వాళ్లు మేల్కొని ఉన్నంతసేపూ సూర్యోదయానికి వికసించిన పద్మాల్లాగా ఉండేవాళ్ళు. ఇప్పుడు నిద్రిస్తూండగా ముడుచుకుపోయిన పద్మాల్లాగా అయిపోయారు. మదంతో కూడిన తుమ్మెదలు ఈ ముఖపద్మాలను పదేపదే ఆస్వాదించగోరాయి.

స్త్రీలచే ప్రకాశిస్తూన్న ఆ భవనం అంతా శరత్కాలపు ఆకాశంలాగా నిర్మలంగాను కాంతివంతంగాను ఉంది. తన చుట్టూ ఆ స్త్రీలంతా ఉండడంతో రావణుడు నక్షత్రాల మధ్యన పూర్ణచంద్రుడివలె ప్రకాశిస్తున్నాడు. వాళ్ళంతా పుణ్యఫలం హరించడంచేత స్త్రీలుగా ఉద్భవించిన నక్షత్రాల్లాగా ఉన్నారు. ఎందువల్లనంటే, నక్షత్రాల్లో ఉండే తళుకు, కాంతి, నిర్మలత్వం అన్నీ వాళ్ళల్లో మూర్తీభవించి ఉన్నాయి కనుక.

వారు రాత్రి అంతా మద్యపానం చేశారు. కామక్రీడల్లో అలసిపోయి విశ్రాంతంగా సొమ్మసిల్లి గాఢనిద్రలో పడిపోయారు. వస్త్రాలు శరీరంపై నుండి జారిపోయాయి. పూలమాలలు నలిగి పోయాయి. ఆభరణాలు చిందరవందరగా పడి ఉన్నాయి. నుదుటి తిలకం కారిపోయింది. మొలనూళ్ళన్నీ వదులైపోయాయి. నేలమీద పడి దొర్లుతున్న ఆడ గుర్రప్పిల్లల్లా కనిపించారు. ఒక మాటలో చెప్పాలంటే, అడవిలో మదపుటేనుగు పాదాలకింద పడి నలిగిపోయిన పూలతీగల్లా అగుపించారు.

ఆ ఉత్తమ స్త్రీలు మెడలో ధరించిన ముత్యాల హారాలన్నీ స్తనాల మధ్యకు చేరి హంసలు పడుకున్నట్లుగా ఉన్నాయి. ఇంకొందరు ధరించిన వైడూర్యాలు పాలిండ్ల మధ్యన జేరి కాదంబ పక్షుల్లా కనిపించాయి. మరికొందరు ధరించిన బంగారుగొలుసులు చక్రవాక పక్షుల్లాగా అనిపించాయి. అట్లా చిందరవందరగా పడుకొని ఉన్న ఆ ఉత్తమ స్త్రీల జఘనాలన్నీ పెద్ద పెద్ద

ఇసుక తిన్నెలులాగా ఉన్నాయి. కారండ, హంస, చక్రవాక పక్షులతో శోభిస్తున్న నదుల్లా ఆ స్త్రీలు ప్రకాశించారు. వారి మొలనూళ్ళలో ధరించిన గజ్జెలు మొగ్గలాగాను, పెద్దపెద్ద బంగారు ఆభరణాలు వికసించిన పద్మాల్లాగాను, అవయవాలన్నీ మొసళ్ళలాగాను, శరీరకాంతులు నదీతీరాల్లాగాను, ఆ స్త్రీలందరూ మందగమనంతో ప్రవహించే నదుల్లాగానూ విరాజిల్లుతున్నారు.

అలంకారాల ఒత్తిడికి వారి మెత్తటి శరీరంపైనా స్తనాలపైనా పడి ఆరవళ్ళు పడి అవే ఆభరణాల్లాగా శోభించాయి. వారి ఉచ్ఛ్వాసనిశ్వాసాలకు పైట చెంగులు ఎగిరి ముఖాలపై పడి పతాకాల్లాగా శోభించాయి. చెవి కుండలాలు వారు విడిచే ఊపిరులకు మెల్లగా కదలుతున్నాయి. చక్కెర కలిపిన మద్యం తాగిన వారి నిట్టూర్పు వాయువుల మధురమైన సువాసనలు రావణుడికి అధికమైన ఆనందాన్ని ఇస్తున్నాయి. మద్యం మత్తులో కొందరు రావణుడు అనుకొని సవతుల్ని ముద్దులు పెట్టుకుంటున్నారు. వారి సవతులు కూడా మద్యం మత్తులోనే ఉండటం వల్ల రావణుడే తమను ముద్దుపెట్టుకుంటున్నాడని మురిసిపోతున్నారు. కొందరు స్త్రీలు కంకణాలున్న తమ బాహువులను, మరికొందరు వస్త్రాలను మడచి తలగడులుగా చేసుకొని నిద్రిస్తున్నారు. కొందరు నిద్రపోతున్న వారి భుజాలపైన, కొందరు తొడలపైనా తలపెట్టుకొని నిద్రపోతున్నారు. కొందరు తమ సవతుల పిరుదులపైన తలపెట్టుకోగా, కొందరు ప్రక్కవారి మెడమీద తలపెట్టుకొని నిద్రపోతున్నారు.

ఆ విధంగా ఆ స్త్రీలంతా ఒకరిపై ఒకరు చేతులు వేసుకొని పడుకుంటే ఆ వరుస పూలదండమల్లేనూ, వారి తలలు మత్తెక్కిన తుమ్మెదలగుంపులు ఆ పూలదండను మూగి ఉన్నట్లు కనిపించాయి. వాళ్ళ ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు వాళ్ళ పూలదండలన్నీ కదిలిపోతున్నాయి. ఒకళ్ళనొకళ్ళు పెనవేసుకొని పడుకోవటం వల్ల రేగినవాళ్ళ తలజుట్టు అంతా కలిసిపోయింది.

అక్కడ వాళ్ళంతా ఒక సమూహంగా పడుకుని నిద్రపోతూ ఉంటే, వాళ్ళు కట్టుకున్న చీరలు కాని, అవయవాలు కానీ ఆభరణాలు కానీ ఇన్ని అని తేల్చి చెప్పడం ఎవరికీ శక్యం కాదు. రావణుడు మేల్కొని ఉన్నప్పుడు ఎవరూ ఆ స్త్రీలను కన్నెత్తి చూడలేరు. ఇప్పుడు రావణాసురుడు

ప్రశాంతంగా నిద్రపోతూ ఉండడం వల్ల తుమ్మెదల్లా అక్కడి బంగారు దీపాలు ఆ స్త్రీలందరినీ తేరిపార చూస్తున్నాయా అన్నట్లున్నాయి. అట్లా నిద్రపోతున్న వాళ్లలో రాజర్షుల కుమార్తెలు, దేవకన్యలు, దైత్యాంగనలు, గంధర్వ స్త్రీలు, రాక్షస స్త్రీలు ఉన్నారు. రావణుడు అనేక యుద్ధాలు చేసి ఆ స్త్రీలందరినీ జయించి తెచ్చాడు. కొందరు మాత్రం మన్మథ ప్రేరణ చేతనే రావణుని కామించారు.

అత్యుత్తమురాలైన సీతాదేవి తప్ప మిగిలిన ఈ స్త్రీ లెవరినీ రావణుడు బలాత్కారంగా తీసుకురాలేదు. అంతా అతడి గుణాలను ప్రేమించి వచ్చినవారే. ఆ స్త్రీలలో ఒక్కరు కూడా మరొక పురుషుని పట్ల ప్రేమ కలవారు లేరు. కనీసం పూర్వం ఒక పురుషుడికి ప్రియురాలుగా ఉన్న స్త్రీ కూడా లేదు. అక్కడున్న స్త్రీ లందరూ సత్కులమందు జన్మించినవారే. అందులో అందంగా లేనివారు ఒక్కరూ లేరు. బుద్ధిహీనురాలు ఒక్కతె కూడా లేదు. అంతా తమ ప్రియుడైన రావణాసురుని ఆకర్షించగలిగిన నేర్పు గలవారే!

'రావణుని భార్యలైన ఈ స్త్రీలందరూ ఏ విధంగా ఈతనిపై ప్రేమాభిమానాలు చూపిస్తున్నారో, రాముని భార్య అయిన సీతాదేవి కూడా ఆ విధంగానే వశమై ఉంటే, నేను ఆమెను తప్పక ఇక్కడే చూడగలిగేవాడిని. కాబట్టి సీతాదేవి అతడి వశము కాలేదన్నది నిశ్చయం. ఈ రావణుడు సీతాదేవిని బలాత్కారంగానే అపహరించి ఎక్కడో దాచి ఉంచాడు. ఈ పరాక్రమవంతుడు చేసింది దుష్టకృత్యమే. అందులో ఎంతమాత్రమూ సందేహం లేదు' అని హనుమంతుడు అనుకున్నాడు.

# 10వ సర్గ హనుమంతుడు మండోదరిని చూడటం

హనుమంతుడు అంతఃపురమంతా పరిశీలిస్తూ దేవేంద్రుడి పడకగది వంటి దివ్యమైన పడకగది నొకదాన్ని చూశాడు. ఆ గది అంతా దంతాలతోను, బంగారంతోను, రత్న వైడూర్యాలతోను పొదిగి విస్తృతంగా అలంకారాలు చెయ్యబడి ఉంది. అక్కడ ఆసనాలన్నీ విలువైన వస్త్రాలతో కప్పబడి ఉన్నాయి. ఆ శయనాగారంలో ఒక ప్రక్కన స్వచ్ఛంగాను, తెల్లగాను చంద్రబింబం లాంటి శ్వేతఛత్రము ఉంది. దాని క్రింద ఒక విలువైన దుప్పటి పరచి ఉంది. ఆ దుప్పటిపై గొర్రె చర్మం కప్పబడి ఉంది. ఆ ప్రక్కనే ఉత్తమజాతి స్త్రీలు వింజామరలతో వీస్తున్నారు. సుగంధంతో కూడిన ధూపం గది అంతా విస్తరించింది. శ్రేష్ఠమైన పూలదండలు నలుమూలలా వ్రేలాడుతున్నాయి.

అట్టి శయనంమీద వీరుడైన రావణుడు పడుకొని నిద్రపోతున్నాడు. అతడి చెవికుండలాలు ఎర్రగా మెరుస్తున్నాయి. మహాబాహువులు గల ఆ వీరుడు బంగారువస్త్రాలను ధరించాడు. శరీరం అంతా సువాసనలు వెదజల్లే ఎర్రచందనం పూయబడి ఉంది. అద్భుతమైనవి, అపురూపమైనవి ఎన్నో ఆభరణాలు ధరించాడు. ఉదయకాంతులందు ఆకాశంలో మెరుపులతో కూడిన మేఘంలాగా ఉన్నాడు. స్వేచ్ఛారూపాలు ధరించగల ఆ పురుషుడు మన్మథుని కన్నా అందంగా ఉన్నాడు. రాత్రి అంతా రతిక్రీడలు జరపటంచే విశ్రాంతి తీసుకుంటున్నాడు. అప్పుడతడు వృక్షసముదాయంతోను, పూపొదలతోను నిద్రిస్తున్న మందర పర్వతంలాగా ఉన్నాడు. రాత్రి అంతా మద్యపానం చేయడంవల్ల ఆ మత్తుతోనే నిద్రిస్తున్నాడు. అటువంటి స్థితిలో ఉన్న రాక్షసరాజైన రావణుని హనుమంతుడు చూశాడు.

మహాసర్పం బుసలు కొడ్తున్నట్లుగా ఉన్న అతడి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు చూసి హనుమంతుడు బాగా దగ్గరగాపోయి చూశాడు. అంతలోనే భయపడినవాడివలె దూరంగా పోయాడు.

[వివరణ : ఇది వాల్మీకి కవితాశిల్ప సౌందర్యాన్ని చిత్రించే సన్నివేశం. రావణుని గాంభీర్యాన్ని, ప్రతిభని చెప్పడమే కాని, యథార్థంగా హనుమంతుడు భయపడ్డాడని కాదు ]

తరువాత హనుమంతుడు మరొకప్రక్క నుండి నిద్రించుచున్న రావణుని పరీక్షగా చూశాడు. రావణాసురుడు పడుకున్న ఆ పరమాసనం మదపుటేనుగు పడుకున్న సెలయేటి మడుగులాగే ప్రకాశించింది. అంతట ఆ రాక్షసరాజైన రావణుడు ప్రక్కపై రెండు చేతులూ రెండు ప్రక్కలా చాపుకొని పడుకోవడం చూశాడు. ఇంద్రధ్వజాల్లాంటి అతడి రెండు బాహువులతో పోట్లాడినప్పుడు ఐరావతం యొక్క దంతాల వల్ల కలిగిన గాయాల మచ్చలు కనిపించాయి. దేవేంద్రుడు వజ్రాయుధంతో కొట్టినప్పుడు పడ్డ గాట్ల మచ్చలు అతడి ఛాతీ మీద చూశాడు. శ్రీ మహావిష్ణువు చక్రాయుధంతో వేసిన దెబ్బలు రెండు భుజాల మధ్యనూ కనిపించాయి. అటువంటి బలిసిన బాహువులను హనుమంతుడు చూశాడు. అతడి బొటనవేలు మిగిలిన వేళ్ళూ, గోళ్ళూ అన్నీ శుభలక్షణాలు కలిగినవై ఉండటం చూశాడు. ఆ వేళ్ళన్నింటికీ ధగధగలాడే రత్నాలతో కూడిన ఉంగరాలను ధరించాడు. అతడి బాహువులు బలిష్ఠంగా ఏనుగు తొండాల్లాగా ఉన్నాయి. అతడి చేతులు రెండూ విసిరివేస్ని అయిదుతలల పాములాగా కనిపించాయి. చేతులకు కుందేటి రక్తవర్ణంలో ఉండే ఎర్రచందనాన్ని పూసుకోవటం వల్ల సుగంధాలు వెదజల్లుతున్నాయి. ఉత్తమస్త్రీలను ఆలింగన చేసుకోవటం వల్ల వారు పట్టించుకున్న లేపనాల సుగంధం కూడా గుబాళిస్తోంది. అవే బాహువులు దేవదానవ గంధర్వులతో యుద్ధం చేసేటప్పుడు ముల్లోకాలకు గగ్గోలు పుట్టించాయి. అటువంటి రాక్షసేశ్వరుని రెండు బాహువులు రెండు శిఖరాలతో ఉండే మందర పర్వతంలాగా శోభించాయి.

అతడు నిద్రిస్తుండగా నోట్లో నుండి వస్తున్న సుగంధాలు, అతడు ఆహారంగా తీసుకున్న అన్నరసముల సువాసనలతో మద్య గంధంతో నిండి ఉంది.

ముత్యాలు, రత్నాలు పొదిగిన ఆతడి బంగారు కిరీటం కాస్త ప్రక్కకు ఒరిగి ఉంది. ఆతడి విశాల బలిష్ఠమైన వక్షఃస్థలమంతా రక్తచందనపు మైపూతలతోను, శోభాయమానమైన

కంఠహారాల తోను ధగధగలాడుతూ ఉంది. పైన వేసుకునే తెల్లటి ఉత్తరీయాన్ని, ఉత్తమమైన పట్టుపీతాంబరాన్ని ధరించి పడుకొని ఉన్నాడు. అరమోడ్పు కన్నులతో నిద్రించడం వల్ల కళ్ళల్లో ఎఱ్రటిజీర తెలుస్తోంది. మహాసర్పంలాగా బుసలు కొడుతున్న ఆ మహావీరుడు మినుముల రాసివలె ఉన్నాడు. గంగా జలాల్లో జలకాలాడే మదపుటేనుగులాగా ఉన్నాడు. అతడి శయ్యకు నాలుగు ప్రక్కలా దీపాలుండటం చేత మెరుపుల మధ్యనున్న కారుమేఘంలాగా ఉన్నాడు.

రావణుని భార్యల ముఖాలు చంద్రునివలె ప్రకాశిస్తున్నాయి. వాళ్ళు ధరించిన పుష్పమాలలు వాడిపోలేదు. అలంకారాలు చెదిరిపోలేదు. వారంతా రావణుని తొడలపై తలపెట్టుకొని పడుకున్నారు. వాళ్ళంతా నృత్య, వాద్య సంగీతాల్లో ప్రావీణ్యం గలవారు. చెవులకు ధరించిన వజ్రవైడూర్యాలతో పొదిగిన కుండలాలు ధరించారు. అట్లాంటివే చేతులకు కూడా ధరించారు. చంద్రబింబంవంటి వారి ముఖారవిందాలతో ఆ విమానగృహం నక్షత్రగణాలతో ఆకాశం ప్రకాశిస్తున్నట్లు ప్రకాశించింది. ఆ రావణుని భార్యలందరూ రతిక్రీడల వల్లనూ, మద్యం మత్తు చేతనూ అలసిపోయి ఎక్కడ వాళ్ళు అక్కడే పడుకుని నిద్రపోయారు. నాట్యం చేసే రమణి నాట్యభంగిమలోనే పడి నిద్రపోయింది. గీతాలు ఆలపించే భామ ఆలాపనా భంగిమలోనే పవళించింది. వైణికురాలు వీణను కౌగలించుకొని పడుకుంది. మదంతో నిండిన కన్నులుగల మరొక యువతి, బలిసిన తన అవయవాలతో మృదంగాన్ని కౌగలించుకొని పడుకొంది. అలసిపోయిన మరో యువతి రెండు భుజాల మధ్యన చంకల వరకు పణవమును పట్టుకొని అట్లాగే నిద్రపోయింది. మరొకామె డిండిమను ఒడిలో పెట్టుకొని అట్లాగే నిద్రకు ఉపక్రమించింది. ఒక భామిని యువకుడు అయిన ప్రియుణ్ణి, తన బిడ్డనూ కౌగలించుకొని పడుకున్నట్లుగా ఒక చేత్తో డిండిమాన్ని, రెండవ చేత్తో ఇంకో డిండిమాన్ని కౌగలించుకొని నిద్రపోతోంది. మదించి ఒళ్ళు తెలియని ఇంకో యువతి ఆడంబరమనే వాద్యాన్ని గట్టిగా కౌగలించుకొని నిద్రపోతోంది.

ఒక సుందరాంగి ఒళ్ళు తెలియక నీళ్ళకుండను బోర్లాతోసి సగం తడిసిన బట్టల్తోనే

నిద్రిస్తోంది. ఒక యువతి మరో యువతిని కౌగలించుకొని పడుకుని నిద్రపోతోంది. ఆ విధంగా అక్కడ అనేకమంది యువతులు, చేతికి ఏది అందితే దాన్నే ప్రియుడుగా భావించి గుండెల కదుముకొని నిద్రపోతున్నారు.

ఆ స్త్రీలందరికీ దూరంగా ఏకాంత శయ్యపైన ఒక సుందరాంగి ఒంటరిగా నిద్రిస్తోంది. ఆమె అతిరూప సౌందర్యవతి. ఆమే మండోదరి. రావణాసురుని పట్టపురాణి. ఆమె ముత్యాలు, రత్నాలు పొదిగిన ఆభరణాలు ధరించింది. ఆమె ధరించిన బంగారు ఆభరణాలు ఆమె శరీరచ్ఛాయతో కలసిపోయాయి. అటువంటి రూపవతిని హనుమంతుడు చూశాడు. మొదట ఆమెయే సీతాదేవి అనుకున్నాడు.

ఆమె సీతాదేవి కానందుకు ఆ వానరశ్రేష్ఠుడు చాలా సంతోషపడ్డాడు. చేతులు చరిచాడు. తోకను ముందుకు తెచ్చుకొని మరీమరీ ముద్దుపెట్టుకున్నాడు. ఆ సమయాన అతడికి చేతనయిన కోతిగంతులన్నీ వేశాడు. అక్కడ నుండి నెమ్మదిగా జారుకుని క్రిందకు దూకాడు.

# 11వ సర్గ హనుమంతుడు మరల సీతాన్వేషణ చేయడం

మండోదరిని చూసి సీతాదేవి అయి ఉంటుందా? అని హనుమంతుడు మొదట అనుకొన్నాడు. కానీ ఆమె సీతాదేవి కాదని తనకు తానే సర్దిచెప్పుకున్నాడు. రాముడు లేకుండా సీతాదేవికి కంటిమీద కునుకు ఎట్లా పడ్తుంది? రాముడు తప్ప పరపురుషుడు, అది పరమేశ్వరుడే అయినా కన్నెత్తి కూడా చూడదు. రాముడు లేని సీత ఆహారం ముట్టదు. నీరు త్రాగదు. అలంకారాలు అసలే చేసుకోదు కాబట్టి ఈమె సీతాదేవి కాదు అని నిశ్చయించుకొన్నాడు. తిరిగి అన్వేషణ ప్రారంభించేందుకు పూనుకున్నాడు. ఈసారి పానశాల అంతా వెతకాలని అనుకున్నాడు.

ఆ పానశాలలో కొందరు స్త్రీలు రతిక్రీడలు చేసి అలసిపోయారు. కొందరు పాటలు పాడి అలసిపోయారు. మరికొందరు నృత్యం చేసి అలసిపోయారు. మద్యపానం చేసి కొందరు మత్తుతో జోగుతున్నారు. కొందరు మృదంగంపై తలవాల్చి నిద్రపోతున్నారు. కొందరు పీఠంపై తల ఉంచి నిద్రపోతున్నారు. కొందరు తివాచీలపై నిద్రించారు. స్త్రీలు ఒకచోట చేరినప్పుడు సౌందర్యానికి సంబంధించిన విషయాలు, అలంకరణలకు సంబంధించిన విషయాలూ మాట్లాడుకుంటున్నారు. కొందరు తాము పాడుతున్న గీతాల్లోని అర్థాలను గూర్చి చర్చించుకొంటున్నారు. వాళ్ళంతా అట్లా మాట్లాడుకుంటూనే నిద్రకు ఉపక్రమించారు.

రావణుడు వారి మధ్య విశాలమైన గోశాలలో ఆబోతులాగా ప్రకాశించాడు. మహారణ్యంలో ఆడఏనుగుల మధ్యలో ఉండే మదపుటేనుగులా ప్రకాశించాడు.

అక్కడ పానశాలలో లేడి మాంసం, అడవిదున్నల మాంసం, అడవి పందుల మాంసం వండి వడ్డించారు. అక్కడ తినగా మిగిలిన మాంసం, ఇతర ఆహార పదార్థాలను బంగారు పళ్లెరాలలో హనుమంతుడు చూశాడు.

హనుమంతుడు అక్కడ వరాహాలు, రకరకాల పక్షులు, మేకపోతులు, ఏదు పందులు, లేళ్ళు, నెమళ్ళు మొదలైన జంతువుల మాంసాలు ఉండటం చూశాడు. ఇంకా వండి తినటానికి సిద్ధంగా ఉన్న కక్కెర పక్షుల్నీ, దున్నపోతుల్నీ, ఏకశల్యమనే చేపల్నీ, మేక మాంసాన్ని చూశాడు. వాటి అన్నింటినీ ప్రధానంగా పులుపు, ఉప్పు బాగా వేసి రుచికరంగా చేశారు. వాళ్ళు పడుకునే ప్రక్కలుగాని, కూర్చునే ఆసనాలుగాని చక్కగా అలంకరించి ఉన్నాయి. ఆ పానశాల నిప్పు లేకుండానే మండిపోతోంది. మాంసంతో చేసిన అనేక రకాల భక్ష్యాలు తయారుచేసి పెట్టారు. మత్తు అధికంగా కలిగించేందుకు, సువాసనలు వెదజల్లేందుకు మద్యంలో చక్కెర, తేనె, పుష్పాలు వంటివి చేర్చి తయారుచేశారు. వాటినన్నింటినీ కొన్ని రకాల చూర్ణాలతో సంస్కరించి తయారుచేశారు. మధుపానం చేసేందుకు చిన్నాపెద్దా పాత్రల్ని సిద్ధంచేసి ఉంచారు. ఆ పాత్రలన్నింటినీ స్ఫటికంతోను, బంగారంతోను తయారుచేసి ఎంతో అందంగా అమర్చారు. అక్కడ బంగారు, వెండి కడవల నిండా మద్యాన్ని నిల్వచేసి ఉంచడాన్ని హనుమంతుడు చూశాడు.

కొన్ని పాత్రల్లో మద్యం సగం మిగిలిపోయి ఉంది. కొన్ని పూర్తిగా తాగేసి ఖాళీ అయిఉన్నాయి. ఇంకాకొన్ని ముట్టుకోనైనా లేదు. హనుమంతుడు అనేక రకాలైన భక్ష్యాలను, అన్నాలను అక్కడ చూశాడు. కొన్ని చోట్ల పాత్రలు విరిగిపోయి ఉండటం, కొన్ని చిందరవందరగా పడి ఉండటం చూశాడు. తినేందుకు ఫలాలు, త్రాగేందుకు నీరు విడివిడిగా అమర్చారు.

అక్కడ స్త్రీలు ఒకళ్ళనొకళ్ళు కౌగలించుకొని పడుకున్నారు. వాళ్ళంతా రకరకాలైన ఆకారాల్లో ఉన్నారు. మద్యం మత్తులో కొందరు స్త్రీలు నిద్రించేవారి వస్త్రాలన్నీ లాక్కుని కప్పుకొంటున్నారు. ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో వాళ్ళ ఒంటిపై ఉండే వస్త్రాలు, ధరించిన పూలమాలలు విచిత్రంగా కదలుతున్నాయి. ఆ పానశాల అంతా చందనం, తేనె, మద్యం, రకరకాల పుష్పాలు, ధూపాలు మున్నగు అనేక గంధాలతోకూడి వినూత్నమైన సుగంధాల్ని

వెదజల్లుతోంది. ఇవేకాక ఇంకా జలకాలాటలలో వాడే సుగంధాలు కూడా వాటికి తోడయ్యాయి.

మద్యం చేతను, వివిధాలైన సుగంధాల చేతను, రతికేళులతో అలసిపోవటం వల్ల, ఆ స్త్రీలు వాడిపోయిన పుష్పాల్లా వేలాడిపోయారు. వాళ్ళల్లో కొందరు పసిడిఛాయతో ఉంటే కొందరు చామనఛాయగా ఉన్నారు. మరికొందరు నల్లగా ఉన్నారు.

మహాతేజశ్శాలి అయిన హనుమంతుడు రావణుని అంతఃపురాల్లోను, పానశాలల్లోను, పడకటిళ్ళల్లోనూ కనిపించిన స్త్రీనల్లా నిశితంగా పరిశీలించి చూశాడు. అట్లా పరాయి స్త్రీలను, అందునా వారంతా రతికేళిలో ఉన్నప్పుడు, మద్యం మత్తులో ఉన్నప్పుడూ చూడటంవల్ల ఏదైనా ధర్మహాని కలుగుతుందా అని మనసులో సందేహపడ్డాడు. అయినా వారెవరినీ అనుభవించాలనే కోరిక తనలో కలుగనూ లేదు, తానాదృష్టితో చూడనూలేదు అని సంతృప్తిపడ్డాడు.

బుద్ధిమంతుడైన హనుమంతుడు సీతాదేవిని గుర్తుపట్టడం కోసమే అన్ని విధాలుగా ప్రయత్నం చేశాడేకాని, హనుమంతుని మనస్సు ఎన్నడూ అన్యమనస్కం కాలేదు; మనస్సు చంచలం కాదు. 'నేను చేసిందాంట్లో అధర్మం ఏమీ లేదు. నేను ఇట్లాగే చెయ్యాలి' అని మనస్సు స్థిరపరచుకున్నాడు. ఎందువల్లనంటే సీతాదేవిని చూడాలంటే, స్త్రీలలోనే వెదకాలి కానీ, ఆడలేళ్ళ గుంపులో వెతకం కదా? అందువల్ల తాను నిష్కల్మషమైన మనస్సుతో సీతాదేవికోసం ఏకాగ్రచిత్తంతోనే రావణుని అంతః పురం అంతా వెతికాడు. అయినా సీతాదేవి కనిపించలేదు. తరువాత వాయుపుత్రుడు ఆ పానశాలను విడిచి మరల సీతాన్వేషణను ప్రారంభించాడు.

# 12వ సర్గ సీత మరణించినదేమోనని శంకించటం

హనుమంతుడు సీతను చూడాలనే ఉత్సాహంతో రావణాసురుడి అంతఃపురంలోని పడకగదులన్నీ వెతికాడు, పానశాలలు వెదికాడు, లతాగృహాలు, చిత్రగృహాలు ఇట్లా ఎన్నోచోట్ల వెతికాడు. కానీ సీతాదేవిని మాత్రం చూడలేకపోయాడు. నిరాశ చెందిన ఒక స్థితిలో, సీత మరణించిందేమో అన్న అనుమానం కూడా కలిగింది. క్రూరుడు, దుర్మార్గుడు అయిన రావణుడు, శీలవతి, ధర్మమార్గాన్ని విడువనిది అయిన సీతాదేవిని చంపి ఉంటాడు. భయంకరులైన రాక్షసుల వికృతరూపాలు చూసి సీతాదేవి భయంతోనైనా మరణించి ఉండవచ్చును.

సుగ్రీవుడు చండశాసనుడు. అతడి దండనను ఎంతటివారైనా తప్పించుకోలేరు. నేను చాలాకాలం కాలక్షేపం చేసి. నా కర్తవ్యాన్ని నిర్వర్తించలేకపోయాను. సీతాదేవిని ఎన్ని విధాలుగా ప్రయత్నించినా చూడలేకపోయాను. నాకు సుగ్రీవుని నుండి కఠోరమైన దండన తప్పదు. సముద్రానికి ఉత్తరాన వానరమిత్రులంతా నాకోసం వేయి కళ్ళతో ఎదురుచూస్తూ ఉంటారు. వాళ్ళు సీతాదేవి కనిపించిందా? అని అడిగితే ఏమని సమాధానం చెప్తాను. కనిపించలేదంటే వాళ్ళంతా ప్రాయోపవేశం చేసి మరణిస్తారు. తీరా ఆవలివైపుకు పోగానే జాంబవంతుడు, అంగదుడు మున్నగు వారంతా నన్ను చూసి ఏమంటారో గదా! దిగులుపడేవాడు, నిరుత్సాహపడేవాడూ ఏ అభివృద్ధీ సాధించలేడని పెద్దలు అంటారు. పైగా అపజయాలన్నింటికీ కూడా కారణం అవుతుంది. అందువల్ల నేను మరింత ఉత్సాహంతో అన్వేషణ చేస్తాను. ఇంతవరకు పెద్ద పెద్ద భవనాల్లోను, పానశాలలు, నర్తనశాలల్లో ఒక్క అంగుళం కూడా వదలకుండా వెతికాను. ఇక నుండి ప్రధాన అంతఃపురానికి దూరంగాను, చిన్నచిన్న గృహాల్లోనూ వెతుకుతాను. ఈ విధంగా ఆలోచించిన హనుమంతుడు ఒక్కో భవనంపైకి ఎగురుతూ, మళ్ళీ క్రిందకు దూకి, మరల మరో ఇంటిపైకి దూకుతూ సీతాదేవి కోసం అన్వేషించసాగాడు. ఈ విధంగా చైత్యములు, వాటిని ఆనుకొని ఉండే వేదికలు, దిగుడు బావులు, పద్మ సరస్సులు,

ప్రాకారం లోపల ఉండే వీధులు అన్నీ వెతికాడు. ఎక్కడ వెదికినా అంగవైకల్యం గలవాళ్ళు, వికృతంగా ఉన్న రాక్షస స్త్రీలే కనిపించారు. కానీ సీతాదేవి మాత్రం కనబడలేదు. మహా సౌందర్యవంతులైన విద్యాధర స్త్రీలను చూశాడు కాని, సీత కనబడలేదు. అందమైన పిరుదులు, పూర్ణచంద్రుడి వంటి ముఖంగల నాగకన్యల్ని చూశాడేగానీ, అందమైన నడుము గలిగిన సీతాదేవి మాత్రం కనబడలేదు. వానరసేనలు పడిన కష్టమూ, తన సముద్ర లంఘనమూ ఫలితం లేకుండాపోయాయి కదా! అని మళ్ళీ దుఃఖితుడయ్యాడు. అంతట వాయుపుత్రుడైన హనుమంతుడు పుష్పక విమానం నుండి క్రిందకు దిగి 'ఇక పైన ఏం చెయ్యటమా?' అని ఆలోచనలో పడ్డాడు.

# 13వ సర్గ హనుమంతుడు అశోకవనంలో సీతను అన్వేషింప తలచడం

ఆవిమానగృహం నుండి వేగంగా బయటకు వచ్చిన హనుమంతుడు ఈ విధంగా ఆలోచించాడు.

“లంకాపట్టణం అంతా వెతికాను. లంకలో ఉన్న పర్వతాలు, నదులు, చెరువులు, గుంటలు అన్నీ వెతికాను. రావణుని అంతఃపురం అంతా అంగుళం వదలకుండా గాలించాను. ఎక్కడా సీతాదేవి కనిపించలేదు. ఆనాడు గృధ్రరాజు సంపాతి సీతాదేవి రావణుని ఇంట్లోనే ఉందని అన్నాడు. ఆ నమ్మకంతోనే రాజప్రాకారం లోపల ఉన్న గృహాలన్నీ వెదికాను.

విదేహకు చెందినది, పరమధార్మికుడైన జనకమహారాజు పుత్రిక అయిన సీతాదేవి, అసహాయ స్థితిలో పరమదుష్టుడైన ఆ రావణుడికి వశమైపోలేదు గదా? లేదా రాముడు ఎక్కడ వెంబడిస్తాడోనన్న భయంతో రావణుడే ఆమె నెక్కడైనా దారిలోనే జారవిడిచి ఉంటాడా? లేదా, ఆకాశ మార్గాన రావణుడు అపహరించి తెచ్చేటప్పుడు మార్గంలో గుండె పగిలిపోయి ఉంటుందా? లేక రావణుడు అపహరించేటప్పుడు తన బలమైన బాహువుల్తో గట్టిగా అదిమి పట్టుకున్నప్పుడు ఊపిరి ఆడక పూజ్యురాలైన సీతాదేవి మరణించి ఉంటుందా? సముద్రం పైన ఎగిరేటప్పుడు రావణునితో పెనగులాడుతూ సముద్రంలో జారిపడిపోయి ఉంటుందా? అసహాయురాలైన ఆ సాధ్వి తనకు వశం కాకపోవటంచేత అసహనంతో రావణుడు ఆమెను చంపి తినేసి ఉంటాడా? లేక ఆమె సౌందర్యానికి అసూయ చెందిన రావణుని భార్యలే చంపి తినేసి ఉంటారా? లేక దీనురాలై, రామునే ధ్యానిస్తూ విరహబాధ చేత మరణించి ఉంటుందా?

విదేహ రాజపుత్రి, జనకుని కుమార్తె అయిన ఆ సీతాసాధ్వి హా! రామా! హా! లక్ష్మణా! ఓ అయోధ్యా నగరమా! అంటూ విలపిస్తూ ప్రాణాలు విడిచి ఉండవచ్చును. లేదా, రావణుని భవనంలో బంధించబడి, పంజరంలో బంధించబడ్డ గోరింకలాగా ఇంకా విలపిస్తూనే

ఉంటుందా? జనకమహారాజు కుమార్తె, రాముని భార్య, కలువల వంటి కన్నులు గలది, సన్నని నడుము గలది అయిన సీత, రావణునికి ఎట్లా లొంగిపోతుంది?

సీత కనబడకపోయినా, చనిపోయినా, తప్పిపోయిన భార్యపైనే ప్రాణాలు నిలుపుకుని బ్రతుకుతున్న రాముడికి చెప్పకూడదు. రాముడికి చెప్పినా అనర్థమే కలుగుతుంది. చెప్పకపోయినా అనర్థమే జరిగేట్లుంది. ఏ విధంగా చూసినా పరిస్థితి విషమంగానే ఉంది. ఎంతో ఆశతో, పట్టుదలతో వచ్చాను. తలపెట్టిన పని కాకుండాపోతోంది. ఇప్పుడు నేను ఏం చెయ్యాలి? నేను తిరిగి కిష్కింధకు పోయినట్లయితే నేను ఏం సాధించినట్లు? ఎంతో శ్రమతో సముద్రాన్ని లంఘించి వచ్చినందుకు ఏమి సార్థకత ఉంటుంది? లంకలో ఇన్నిచోట్ల తిరిగాను, ఇంతమంది రాక్షసుల్ని చూశాను. ఇన్ని చేసినా చివరకు ఫలితం శూన్యంగా కనిపిస్తోందే? కిష్కింధకు తిరిగివెళ్తే సుగ్రీవుడు ఏమంటాడో? రామలక్ష్మణు లేమంటారో? నేను పోయి సీత కనిపించలేదన్న మాట చెప్తే రాముడు ప్రాణాల్ని విడిచినా విడుస్తాడు! సీత కనబడలేదన్న దుర్వార్త రాముడికి చాలా పరుషంగా వినిపిస్తుంది. భయంకరమూ, క్రూరమూ అయి ఇంద్రియాల్ని స్తంభింప చేస్తుంది. ఆ వార్త విన్న రాముడు ఇక జీవించడు. రాముడు అట్లా మరణిస్తే రాముడిపైనే ప్రాణాలు పెట్టుకొని బ్రతుకుతున్న లక్ష్మణుడు కూడా జీవించడు. రామలక్ష్మణులు మరణించడం చూసిన సుగ్రీవుడు కూడా ప్రాణత్యాగం చేస్తాడు. సుగ్రీవుడు లేని జీవితం దుర్భరమని తలచి రుమ కూడా ప్రాణాలు విడుస్తుంది. ముందుగానే వాలి మరణించడం వలన కలిగిన దుఃఖంతో కృశించి ఉన్న తార, సుగ్రీవుడు కూడా మరణించాడని తెలియగానే తానూ మరణిస్తుంది. ఈ మరణాలన్నీ చూస్తున్న అంగదుడు కూడా మరణించడం తథ్యం. తమ ప్రభువుకు వాటిల్లిన దుఃఖాన్ని భరించలేక వానర పౌరులంతా పిడికిళ్ళతో తలలు బాదుకుంటారు. సుగ్రీవుడు తన పౌరులందరి మేలు కోరుతూ మంచి మాటలు చెప్తూ, అప్పుడప్పుడూ తగినన్ని పారితోషికాలు, బహుమతులు ఇస్తూ ఉంటాడు. అటువంటి ప్రభువును పోగొట్టుకున్న పౌరులంతా ప్రాణాలు త్యజిస్తారు గదా! ఇక మీదట వానరులు పర్వతాలపైనా వనాల్లోనూ సంతోషంగా క్రీడించలేరు. బ్రతుకంతా భారంగానే వెళ్ళదీస్తారు. ప్రభువుకు కలిగిన దుఃఖానికి వ్యధ చెందినవాళ్ళు

భార్యాపిల్లల్తో పర్వతం పైనుండి దూకి మరణించవచ్చు; లేదా విషం తిని చావవచ్చును. లేదా అగ్నిప్రవేశమైనా చేస్తారు. కానీ జీవించరుగాక జీవించరు. ఈ విధంగా వానరజాతి అంతా నాశనం కావచ్చును. అందువల్ల సీతాదేవి కనిపించకపోతే నేను కిష్కింధకు వెళ్ళనే వెళ్ళను. ఆ విధంగా నేను తిరిగి వెళ్ళని పక్షంలో నేను తిరిగి రాగలనని ఎదురుచూస్తూ వానరులు, రామలక్ష్మణులు, సుగ్రీవుడు కూడా జీవించి ఉంటారు. నేను కూడా సీతాదేవి కనిపించకపోతే, దొరికిన కందమూలాలు తింటూ, దొరికిన చోట నీరు తాగుతూ, ఏ చెట్టు మీదనో కాలం గడుపుతూ వానప్రస్థ జీవనం గడుపుతాను. లేదా ఇక్కడే చితిని పేర్చుకొని అగ్నిప్రవేశం చేస్తాను. లేదా ప్రాయోపవేశానికి కూర్చుంటాను. నా శరీరాన్ని కాకులు, గ్రద్దలు, క్రూర జంతువులు తినగలవు. ఇటువంటి పరిస్థితుల్లో ప్రాణత్యాగం చెయ్యాల్సిన విధానం ఇదేనని అనుకొంటున్నాను. మహర్షులు కూడా అది ఈ మార్గాలే చెప్పారు. జానకి కనిపించకపోతే నీళ్ళల్లోకి దూకి చస్తాను. లేదా ఏ చెట్టు క్రిందనో కూర్చుని ముని జీవితాన్ని గడుపుతానే కాని నల్లని కన్నులు గల సీతను చూడకుండా తిరిగి వెళ్ళను. అట్లా కాకుండా సీత జాడ తెలుసుకోకుండా తిరిగి వెళితే అంగదుడు, మిగిలిన వానరులంతా కూడా మరణిస్తారు. మరణం వల్ల ఎవరూ ఏమీ సాధించలేరు. పైగా అనేక దోషాలకు కూడా అది హేతువు అవుతుంది. బ్రతికి ఉంటే దైవానుగ్రహంచేత మళ్ళీ ఎప్పుడైనా కలుసుకునే అవకాశం ఉంటుంది గదా!"

హనుమంతుడికి ఏం చెయ్యాలో పాలుబోక, బాధనంతా మనసులో అణచుకోలేకుండా ఉన్నాడు. పోనీ బయటకు చెప్పుకుందామా అంటే అక్కడ తన వారెవరూ లేదు. తను ఒంటరివాడైపోయాడు. పరిపరి విధాలుగా ఆలోచిస్తూ ఉంటే తన శోకానికి అంతులేకుండాపోతోంది.

సీతను అపహరించి ఇంతమంది కష్టాలకు కారణమయిన ఆ రావణుని చంపేస్తాను. ఇదే వాడి దుర్మార్గానికి సరి అయిన ప్రతిక్రియ అవుతుందని అనుకున్నాడు. లేదంటే, ఈ రావణుణ్ణి అపహరించుకొనిపోయి, పశువుల యజమానికి పశువును అప్పగించినట్లు రామునికి

అప్పగిస్తాను.

సీత కనిపించకపోవటం చేత హనుమంతుడు అనేక విధాలుగా ఆలోచిస్తూ, సీత కనబడేవరకూ 'నేను ఈ లంకా నగరాన్ని విడిచివెళ్ళను' అని తీర్మానించుకున్నాడు. సంపాతి మాటలు నమ్ముకొని రాముణ్ణి ఇక్కడకు తీసుకువస్తే, సీత కనిపించకపోవటంవల్ల కోపంతో రాముడు వానరులందరినీ చంపేస్తాడు. కాబట్టి ఆహారనియమాలు పాటిస్తూ ఇక్కడే కాలక్షేపం చేస్తాను. లేకపోతే రాముడు మున్నగు నరులు, సుగ్రీవుడు మున్నగు వానరులు అంతా నా మూలంగా చనిపోతారు. కాబట్టి నేను కిష్కింధకు పోను. ఇక్కడే సీత కనిపించేవరకూ వెతుకుతాను.

ఎదురుగుండా పెద్దపెద్ద వృక్షాలతో ఆశోకవనం కనిపిస్తోంది. ఇంకా ఈ వనంలో వెతకలేదు. ఇప్పుడు సీతాదేవి కోసం ఆ వనంలో ప్రవేశిస్తాను. వసువులకు, రుద్రులకు, ఆదిత్యులకు, అశ్వనీదేవతలకు, మరుత్తులకు నమస్కరించి, రాక్షసుల వినాశనాన్ని కోరుకుంటూ ఈ వనంలోకి ప్రవేశిస్తాను. దైవానుగ్రహాన్ని పొందిన తపోధనునికి తపస్సు ఫలించినట్లుగా, సీతను ఇక్ష్వాకుల వంశోద్ధారకుడైన రాముని వద్దకు చేరుస్తాను.

అంతట మనసులోనే లక్ష్మణసమేతుడైన రామునికి, జనకుని పుత్రిక అయిన జానకికి హనుమంతుడు నమస్కారం చేశాడు. రుద్రుడికి, ఇంద్రుడికి, యముడికి, వాయుదేవుడికి నమస్కరించాడు. సూర్యుడికి, చంద్రుడికి, మరుద్గణాలకు నమస్కరించాడు. సుగ్రీవునికి, రామలక్ష్మణులకు, అన్ని దిక్కులకూ నమస్కరించి అశోకవనం వైపుగా బయలుదేరాడు. అక్కడ చేయాల్సిన పనిని గురించి ఆలోచించడం మొదలుపెట్టాడు. "ఈ వనంలో రాక్షసులు చాలామంది ఉండవచ్చు. వనంలో వృక్షాలు బాగా దట్టంగా ఉన్నట్లు కనిపిస్తోంది. చుట్టూ కంచె వేసి ఉంది. అంటే భద్రతా ఏర్పాట్లు బాగా చేస్తారన్నమాట. వాయుదేవుడు కూడా భయం, భయంగానే గాలిని ఆ వనంలోకి ప్రసరింపజేస్తున్నాడు. రాక్షసుల కంటపడకుండా ఉండేందుకు, రామకార్యం సఫలం అయ్యేందుకు నేను సూక్ష్మరూపాన్ని ధరిస్తాను. దేవతలు, మహర్షులను

నాకు కార్యసిద్ధి కలిగించమని మరీ మరీ ప్రార్థిస్తున్నాను. తనంతట తానుగా పుట్టిన బ్రహ్మదేవుడు, దేవతలు, అగ్నిహోత్రుడు, వాయుదేవుడు, దేవేంద్రుడు, వరుణదేవుడు, విశ్వేదేవతలు, మరుత్తులు, శివుడు నాకు కార్యసిద్ధిని కలిగింతురుగాక! సమస్త భూతాలకు ప్రభువు అయిన ఈశ్వరుడు, కనిపించే దేవతలు, కనిపించని దేవతలు, నాకు కార్యసిద్ధిని కలిగింతురు గాక!

"ఎత్తైన ముక్కు, తెల్లని దంతాలు, చల్లని చిరునవ్వులు, తామరరేకుల వంటి నేత్రాలు గలదీ, ఎటువంటి దోషాలు లేనిదీ, చంద్రబింబంలాగా ప్రసన్నంగా ఉండేదీ, పరమపూజ్యురాలు అయిన ఆ సీతాదేవి ముఖకమలాన్ని ఎప్పుడు చూస్తానో కదా!

"నీచుడు, పాపాత్ముడు, క్రూరుడు, భయంకరమైన ఆకారం గలవాడు అయిన రావణుడు, దీనురాలు, అబల అయిన ఆ సీతాదేవిని బలాత్కారంగా ఎత్తుకొనివచ్చాడు. అట్టి సీతాదేవి నాకు ఇప్పుడు కనపడుగాక!" అని మనస్సులోనే ప్రార్థన చేసుకున్నాడు.

# 14వ సర్గ హనుమంతుడు అశోకవనంలోనికి ప్రవేశించడం

ఔహాతేజశ్శాలియైన హనుమంతుడు రావణుని భవనం పైఅంతస్తు నుండి అశోకవనం వైపు మెడ సారించి చూశాడు. అశోకవనాన్ని చూడగానే అతడిలోని శోకం నశించింది. ఒక్క గెంతులో ఆ భవనం మీదనుండి ఆశోకవనంలోకి దూకాడు.

అది వసంతకాలం కావటాన చెట్లన్నీ విరగపూసి ఉన్నాయి. అశోకవృక్షాలు, సంపెంగి, విరిగి, పొన్న, మామిడి, గానుగ ఇంకా అనేక వృక్షాలను చూశాడు. ఒక వృక్షంపై నుండి మరో వృక్షంపైకి బాణంలాగా దూసుకుపోతున్నాడు.

ఆ అశోకవనం అనేక ఉపవనాలతో కూడిన వనసమూహం. చెట్లన్నీ వెండి, బంగారు రంగుల్లో ఉన్నాయి. రకరకాల పక్షులు మధురంగా కూస్తూన్నాయి. వృక్షాలన్నీ వివిధ రకాలైన ఫలపుష్పాలతో నిండి ఉన్నాయి.

అందమైన కటిప్రదేశం గలదీ, దోషములు లేనిదైన సీతాదేవిని అన్వేషించేందుకై ఆ వనంలో హనుమంతుడు ప్రవేశించగానే నిద్రిస్తున్న పక్షులన్నీ లేచి ఎగిరిపోయాయి. ఆ పక్షుల తాకిడికి వృక్షాలపై నుండి రంగురంగుల పూలు నేలపై రాలాయి. ఆ పూలన్నీ హనుమంతుణ్ణి ముంచివేశాయి. అప్పుడు హనుమంతుడు ఒక పువ్వుల కొండలాగా కనిపించాడు. అతడు అట్లా ఒక చెట్టుపై నుండి మరో చెట్టుపైకి సంతోషంతో దూకుతూ ఉంటే భూతాలన్నీ 'ఇతడేనా వసంతుడు?' అని అనుకున్నాయి.

హనుమంతుడి బలానికి ఊగిపోయిన ఆ వృక్షాలన్నీ పూలవర్షం కురిపించాయి; పండ్లన్నీ రాలిపడ్డాయి, ఆకులన్నీ రాలిపడ్డాయి. జూదంలో ఓడినవాడు కట్టుబట్టల్ని కూడా పోగొట్టుకునట్లు ఆ వృక్షాలన్నీ మోడులై నిలిచాయి. పక్షులన్నీ భయపడిపోయాయి.

హనుమంతుని చేతుల, పాదాల చేత నలగగొట్టబడి ఎరిగిపోయిన శ్రేష్ఠమైన వృక్షాలుగల

ఆ అశోకవనం, ప్రియునిచే గాఢంగా చుంబింపబడి, గోళ్ల నొక్కులతో పళ్ల కొరుకుళ్లతో ఏర్పడ్డ గాట్లతో, రేగిన జుట్టుతో ఉన్న యువతి మల్లే అప్పుడు కనిపించింది.

వర్షాకాలంలో వింధ్య పర్వతంపైన తిరుగాడే మేఘాల్ని గాలిదేవుడు చెదరగొట్టినట్లుగా, హనుమంతుడు పెద్దపెద్ద పొదల్ని, తీగల్ని కదిలించివేశాడు. హనుమంతుడు అక్కడ వెండి, బంగారంతో తాపడంచేసి, రత్నాలు పొదిగిన వేదికల్ని చూశాడు.

అశోకవనంలో గుండ్రంగా ఉన్నవి, కోలగా ఉన్నవి, చతురస్రంగా ఉన్న దిగుడుబావుల్ని, కోనేర్లని చూశాడు. వాటి మెట్లన్నీ స్ఫటికాలతో పరచి రత్నాలు పొదిగారు. తీరములందు బంగారు మెట్లు అమర్చారు. అక్కడక్కడా కూర్చునేందుకు చపటాలు, పీఠాలు, అరుగులు అమర్చారు. వాటిపైనకూడా చలువరాళ్ళు తాపడం చేశారు. కోనేటి నీళ్ళలో చక్రవాకాలు, హంసలు నీటికోళ్ళు, సారపక్షులు విహరిస్తున్నాయి. దిగుడుబావుల్లోని నీళ్ళు తియ్యగా అమృతంలా ఉన్నాయి. గట్లపైన సంతానక వృక్షాలు, అనేక విధాలైన పొదలు, చిన్న చిన్న మొక్కలు దట్టంగా వ్యాపించి ఉన్నాయి. అక్కడక్కడా కరవీర వృక్షాలున్నాయి.

హనుమంతుడు అక్కడ ఒక ఎత్తైన పర్వతశిఖరాన్ని చూశాడు. దానిచుట్టూ చిన్నచిన్న కొండలున్నాయి. ఆ కొండల శిఖరాలపైన అనేక వృక్షజాతులున్నాయి. ఆ కొండల్లో నివసించేందుకు వీలైన గుహలున్నాయి.

రావణాసురుడు అత్యంత తపోసంపన్నుడు. అతడి తపోబలాన్నంతా ఐహిక భోగభాగ్యాలకే పరిమితం చేసినట్లుగా అక్కడి భోగ సాధనాలవల్లనూ, అలంకార సాధనాల వల్లనూ స్పష్టమవుతోంది. అశోకవనంలో ఒక కృత్రిమ పర్వతం ఉంది. దానిలో కృత్రిమంగా ఏర్పాటుచేసిన జలపాతంలాంటి వాగు ఒకటి ఉంది. ఆ వాగు పర్వతంలో అనేక మార్గాల గుండా చుట్టుకొని వస్తూ తిరిగి ఎక్కడనుండి బయలుదేరిందో మళ్ళీ అక్కడికే వచ్చి చేరుతుంది. అట్లా పర్వతంపై నుండీ జారిపడుతున్న వాగు ప్రియుడిపై అలిగి పుట్టింటికి పోతున్న భామలాగా ఉంది.

ఆ సెలయేటిలో పడి కొట్టుకుపోతున్న కొమ్మలు రెమ్మలు పుట్టింటికి వెళ్లవద్దని కాళ్ళవేళ్ళపడి బంధువులు బ్రతిమాలుతున్నట్లుంది. కొంతదూరం పోయి మళ్ళీ ఆ సెలయేరు పర్వతంపైకే ప్రవహిస్తూ ఉండటం చూసే వాళ్ళకు, బంధువుల మాటలు విని, అలకమాని మళ్ళీ భర్త దగ్గరకే చేరుతున్న యువతిలాగా ఉంది. హనుమంతుడు ఆ వాగును ఎంతో ఆసక్తితో చూశాడు.

చల్లగానూ, మధురంగానూ ఉండే నీటితో సమృద్ధిగా ఉన్న దిగుడుబావులు ఆ వనంలో చాలా ఉన్నాయి. వాటన్నింటికీ చక్కగా మెట్లు అమర్చారు. అడవి జంతువులు అనేకం వచ్చి అక్కడ దాహం తీర్చుకొనిపోతూ ఉంటాయి. ఆ దిగుడుబావుల చుట్టూ కూర్చునేందుకు చప్టాలు, తిన్నెలు కట్టారు. వాటన్నింటినీ చలువ రాళ్ళతో పొదిగారు, చిన్నాపెద్దా ఉద్యానవనాలు ఎన్నో ఉన్నాయి. అందులో అనేక ఫలవృక్షాలున్నాయి. ఆ వృక్షాలపైన అనేక జాతుల పక్షులు గూళ్ళు కట్టుకున్నాయి. అక్కడ శింశుపా వృక్షాలు కూడా నాటారు. వాటి చుట్టూ కూర్చునేందుకు బంగారు చప్టాలు, వేదికలు కట్టారు. హనుమంతుడు అక్కడ పల్లంగావున్న కొన్ని భూభాగాల్ని చూశాడు. చిన్న చిన్న ఊటబావుల్ని చూశాడు. అక్కడ కొన్ని వృక్షాల లతలన్నీ ఆకులు కనిపించకుండా ఎర్రటిపుష్పాలతో నిండిపోయి, అడవి తగలబడిపోతుందా? అన్నట్లున్నాయి.

హనుమంతుడు అక్కడ కొన్ని బంగారు వృక్షాల్ని చూశాడు. ఆ బంగారు వృక్షాలు కాంతి తనపై పడటంచేతనేమో తాను కూడా బంగారం రంగులోనే కనిపిస్తున్నానని అనుకున్నాడు. అందువల్లనే కాబోలు మేరుపర్వతంపై నుండి ప్రకాశించే సూర్యుడు కూడా బంగారం రంగులోనే ప్రకాశిస్తుంటాడు.

అక్కడొక శింశుపావృక్షం ఉంది. దాని చుట్టూ బంగారు వృక్షాలున్నాయి. వాటికి కట్టిన చిరుగంటలు గాలికి కదిలి చప్పుడు చేస్తున్నాయి. మహాబలశాలియైన హనుమంతుడు ఆ శింశుపావృక్షం చిటారు కొమ్మపైన కూర్చుని ఆలోచించడం మొదలుపెట్టాడు.

“దైవం అనుకూలిస్తే అటూ ఇటూ తిరిగే సీత నాకు కనిపించినా కనిపించవచ్చును.

రాముడి కోసం దిగులుతో నిరీక్షించే ఆమెను చూస్తూనే నేను గుర్తుపడితే పట్టగలనేమో? దైవానుకూలం ఉన్నప్పుడు ఏమైనా అద్భుతాలు జరగవచ్చును గదా?

"రావణుడు క్రూరుడు, దురాత్ముడే అయినా, చంపకవృక్షాలు, చందనవృక్షాలు, నకుళవృక్షాలతో కూడిన ఈ అశోకవనం చాలా అందంగా తీర్చిదిద్దాడు. ఈ వనంలో ఉన్న ఈ పద్మసరస్సు ఎంతో ముచ్చటగా ఉంది. ఎప్పుడైనా సీతాదేవి ఈ సరస్సు వద్దకు వస్తే రావచ్చు. దైవవశాన నేను చూడగలుగుతానేమో? రాముడితో వనవాసానికి అలవాటుపడిన లేడికళ్ళవంటి కళ్ళుగలది, పూజ్యురాలు, రాముని గూర్చిన ఆలోచనలతో కృశించిపోయినదైన ఆ సీతాదేవి ఈ ఉద్యానవనంలో కాసేపు తిరిగేందుకు వస్తే రావచ్చును. నా అదృష్టవశాన, నేను ఆమెను దర్శించగలనేమో? నడియౌవనంలో ఉన్నదీ, బంగారు శరీరచ్ఛాయ కలిగిన జానకి, సంధ్యావందనం, సంధ్యోపాసనా, మున్నగు అనుష్ఠానాలు నిర్వర్తించుకోవటానికి ఈ పవిత్రజలాల వద్దకు వస్తుందేమో? దైవం నాకు అనుకూలిస్తే ఆమెను ఇక్కడ చూడగలనేమో? రాజాధిరాజైన రాముని ప్రియురాలైన సీతాదేవి నివసించేందుకు ఈ వనం ఎంతైనా అనుకూలంగా ఉంది. చంద్రబింబంవంటి ముఖం గల ఆ సీతాదేవి జీవించి ఉంటే, దండకారణ్యాన్ని పోలి ఉన్న ఈ వనమే ఆమెకు తప్పక నివాసయోగ్యంగా ఉంటుంది. అదృష్టవశాన నేను ఈ వనంలోనే తిరుగుతున్నాను. పవిత్రమైన ఈ పద్మసరస్సుకు ఆమె రావచ్చును. సీతాదేవిని చూసి రామకార్యం నిర్వర్తించే అదృష్టం నాకు పట్టినా పట్టవచ్చును. దైవ నిర్ణయాలు ఎట్లా ఉంటాయో, ఎవరికీ ముందుగా తెలియవు కదా" అని మహాత్ముడైన హనుమంతుడు ఆలోచిస్తూ, పూలనూ, ఆకుల్నీ అడ్డంగా పెట్టుకొని, సీతాదేవి ఎక్కడైనా కనిపిస్తుందేమోనన్న ఆశతో నాలుగుప్రక్కలా కలయ చూశాడు.

# 15వ సర్గ హనుమంతుడు సీతాదేవిని దర్శించడం

హనుమంతుడు అశోకవన శోభను చూస్తూ, సీత కోసం అటూఇటూ చూస్తూ చింతాక్రాంతుడై తిరుగుతున్నాడు. ఆ ప్రాంతం అంతా ఎక్కువగా సంతానక వృక్షాల్తోను, సంతానక లతల్తోను కళకళలాడ్తోంది. కొన్ని చోట్ల ఆసనాలు అమర్చి ఉన్నాయి, వాటిపై కంబళీలు పరచారు. అక్కడక్కడ భూగృహాలున్నాయి. అశోకవృక్షాలన్నీ పుష్పించి ఉండడంతో ఉదయ సూర్యుని కాంతివలె ప్రకాశిస్తున్నాయి. తరచూ పక్షులు వాలుతూ ఉండటం వల్ల కొన్ని పూలు రాలిపడుతున్నాయి. ఇంతకు పూర్వమే సగం తిని వదిలేసిన పళ్ళన్నీ రాలి నేలపై పడుతున్నాయి. ఆ అశోకవృక్షాలన్నీ పూలు ఫలాల భారంతో తలలు వంగిపోయి హనుమంతుడికి నమస్కారం చేస్తున్నట్లున్నాయి. ఇవేకాక కర్ణికారవృక్షాలు, కింశుక వృక్షాలు, పున్నాగ వృక్షాలు, ఏడాకుల అరటిచెట్లు, సంపెంగలు, విరిగివృక్షాలు విరగబూసి బంగారుకాంతుల్ని వెదజల్లుతున్నాయి. అందులో కొన్ని అగ్నిజ్వాలల్లాగా మండిపోతున్నాయి. మరికొన్ని బంగారుకాంతులీనుతూ మేరుపర్వతంలాగా భాసిస్తున్నాయి. ఇంకొన్ని ఇంద్రవనాలను మరిపిస్తున్నాయి.

ఆ అశోకవనం దేవేంద్రుడి నందనవనంలాగానూ, కుబేరుడి చైత్ర రథంలాగాను ఉంది. ఆ అశోకవన శోభల్ని చూసి ఆనందించాల్సిందే గాని, మాటల్లో చెప్పటానికిగానీ, వర్ణించి చెప్పటానికిగానీ అలవి కావటంలేదు. ఆ పుష్పాలన్నీ నక్షత్రాల్లాగా ప్రకాశిస్తూండడంతో అశోకవనం రెండో ఆకాశమా? అన్నట్లుంది. ఆ పుష్ప సౌందర్యాలన్నీ రత్నరాసుల్లాగా వెలిగిపోవటం వల్ల ఇది రెండో సముద్రమా? అన్నట్లుంది. అక్కడ పుష్పాలు అన్ని మాసాల్లోనూ పుష్పించటంవల్ల ఆ వనమంతా తేనె వాసనల్తో మత్తెకిస్తూ ఉంటుంది. అక్కడ రకరకాల పక్షుల జంతువుల ధ్వనులు అన్నివేళల్లోనూ వినిపిస్తూ ఉంటాయి. అవి ఆకలిగా ఉన్నప్పుడు ఆ అరుపులు భయంకరంగా ఉంటాయి. ఆకలి తీరిన తర్వాత వాటి అరుపులు మనోహరంగా ఉంటాయి.

హనుమంతుడు అట్లా అశోకవనంలో ఒక వృక్షంపైనుండి మరో వృక్షం పైకి దూకుతూ ఒకానొక వృక్షాగ్రం నుండి పరికించి చూశాడు. దగ్గర్లోనే రెండవ గంధమాదన పర్వతం వంటి ఎత్తైన చైత్యప్రాసాదాన్ని చూశాడు. ఆ భవనం కైలాసంలాగా తెల్లగా మెరిసిపోతోంది. ఆ భవనాన్ని వెయ్యి స్తంభాలపైన కట్టారు. లోపలంతా పగడాలతో మెట్లు కట్టారు. పరిశుద్ధమైన బంగారంతో తిన్నెలు కట్టారు. ఆ భవనకాంతుల కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్నాయి. అత్యున్నతమైన ఆ భవనం మేఘాల్ని కూడా దాటి ఆకాశాన్ని స్పృశిస్తున్నట్లుంది.

హనుమంతుడు ఆ వృక్షంపైనుండి ఒక్క గెంతుతో ఆ భవనం పైకి దూకాడు. అక్కడ ఒక యువతిని చూశాడు. ఆహారం లేనందువల్ల ఆమె శరీరం అంతా కృశించిపోయివుంది. దీనురాలై, నిరాశానిస్పృహలతో మాటిమాటికీ నిట్టూర్పులు విడుస్తోంది. అయినా ఆమె ముఖం శుక్లపక్ష పాడ్యమి నాటి చంద్రబింబంలాగా నిర్మలంగాను, చిక్కి సన్నగానూ ప్రకాశవంతంగానూ కనిపిస్తోంది. ఆమె రూపవతే అయినా, శోకంచేత, పొగతో కప్పబడిన అగ్నిజ్వాలలాగా, ఆమె ముఖం మసకబారి ఉంది. ఏ అలంకారాలూ లేకుండా నలిగిపోయిన వస్త్రాన్నొకటి కట్టుకుంది. బురదకొట్టుకొని పుష్పించని తామర తీగలాగా ఉంది. ఆమె ముఖం చూస్తేనే, దుఃఖంతో బాధపడిపోతోందని తెలుస్తుంది. సిగ్గుతో తలవంచుకొని కూర్చునివుంది. అంగారక గ్రహంచేత పీడించబడిన రోహిణీ నక్షత్రం లాగా కాంతిహీనమై ఉంది. ఆమె కళ్ళు శ్రావణమేఘాల్లాగా వర్షిస్తున్నాయి. ధైర్యం పూర్తిగా నశించిపోయి ఉంది. ఎక్కడో ఆలోచిస్తూ పరధ్యానంలో ఉంది. తన వాళ్ళెవరూ దగ్గర లేకుండా, రాక్షస స్త్రీల మధ్యనే కాలం గడుపుతూ ఉండటం వల్ల ఆమె వేట కుక్కల మధ్య చిక్కుకుపోయిన ఆడ లేడిలాగా విలవిల్లాడి పోతున్నట్లుంది. పిరుదల వరకూ వేలాడుతున్న ఆమె పొడవాటి కేశసంపద వర్షాకాలంలో వృక్షసంపదతో కూడిన భూదేవిలాగా ఉంది. చిక్కి శల్యమైపోయి ఉన్న విశాలనేత్రాలు గల ఆ యువతి సీతాదేవిగా ఉండవచ్చునని హనుమంతుడు ఊహించాడు. ఇప్పుడు ఆమె పుట్టెడు దుఃఖాల్లోవున్నా ఆమె రాజభోగాలు అనుభవించే ముఖవర్చస్సు కలిగి ఉండటంచేత సీతాదేవి ఈమేనా? అని హనుమంతుడు తలచాడు. ఆనాడు రావణునిచే అపహరించబడినప్పుడు ఎట్లా ఉందో ఇప్పుడూ అట్లాగే ఉంది;

ఈమే సీతాదేవి అయివుండవచ్చని హనుమంతుడు భావించాడు.

పూర్ణచంద్రునివంటి ముఖం, అందమైన కనుబొమలు, సుందరమైన పయోధరాలు కలిగివుంది. నలుదిక్కులలోని చీకట్లను పారద్రోలగల దేహకాంతిని సంతరించుకొని ఉంది. నల్లటి పొడవైన కేశసంపదతో, ఎర్రటిదొండపండు వంటి పెదవులతో, అందమైన నడుంగలదీ, పద్మాలవంటి నేత్రాలు గలదీ, మన్మథుడి భార్య రతీదేవిలా ఉన్నదీ, పాతివ్రత్యధర్మమందు స్థిరంగా నిలిచివున్నదీ అయిన ఈ యువతి సీతాదేవియే అయి ఉంటుందేమోనని హనుమంతుడు భావించాడు. సర్వప్రాణులకు ఇష్టురాలైన ఆమె కటిక నేలపై ఒక తాపసినిలా కూర్చుంది. మితిమీరిన దుఃఖం ఆవరించి ఉండటంచేత కళాహీనంగా ఉంది. ఆమె పొగచే కప్పివేయబడ్డ అగ్నిజ్వాలలాగా ఉంది. సందేహాలతో నిండిన స్మరణ శక్తిలాగా ఉంది. నశించిన సమృద్ధిలాగా ఉంది. ఆ యువతిలో శ్రద్ధ దెబ్బతిన్నది; ఆశలన్నీ అడుగంటిన దానిలా ఉంది; అడుగడుగునా విఘ్నాలనే రుచిచూస్తూ నిస్పృహచెంది ఉంది; బుద్ధినైర్మల్యం నశించింది. అటువంటి ఈ యువతిని చూస్తూన్న హనుమంతునిలో ఈమే సీతాదేవి అయి ఉంటుందేమోనన్న ఆశ పొడచూపింది. తన వలన రాముడు అనుభవిస్తున్న కష్టాలను తలచుకొని దుఃఖిస్తోంది; రావణునిచే అపహరించబడినందుకు దుఃఖిస్తోంది; అసత్య ప్రచారాలతో అవమానించబడిన కీర్తికాంతలాగా ఉంది. కలతచెందటంచేత మాటమాటికీ నిట్టూర్పులు విడుస్తూ, లేడిపిల్ల కళ్ళ వంటి కళ్ళతో బెదురుచూపులు చూస్తూ ఉంది. ఆమె అపహరించబడిన నాటినుండీ స్నానం చేస్తున్నట్లుగా లేదు. శరీరంపై ఎక్కడా ఏ విధమైన అలంకారాలు లేక దీనురాలై మాలిన్యంతో నల్లటి మేఘాలతో కప్పివేయబడ్డ చంద్రుడిలాగా ఉంది.

మళ్ళీమళ్ళీ వల్లించకపోవటంవల్ల వంటబట్టని చదువుల్లాగా ఉన్న సీతను చూసిన హనుమంతునిలో ఈమె సీతయే అయి ఉంటుందా? అన్న ఆశ పొడసూపింది. మాట స్పష్టంగా లేకపోవటం వల్ల నానాతిప్పలూపడి అర్థంచేసుకొన్నట్లుగా, అలంకారాలు లేని ఆ యువతిని సీతాదేవియేనని అతికష్టంపై గుర్తించగలిగాడు. విశాలమైన నేత్రములుగలదీ, దోషరహితమైన ఆ

యువతిని తనకున్న బుద్ధిబలంచేత సీతాదేవియేనని హనుమంతుడు ఊహించుకోగలుగుతున్నాడు.

రాముడు చెప్పిన అలంకారాలన్నీ ఆమె ఒంటిపై హనుమంతుడు చూడగలుగుతున్నాడు. చాలాకాలంనుండి అవి శరీరంతోపాటు శుభ్రం చేయకపోవటంవల్ల కొద్దిగా దుమ్ముకొట్టుకొని ఉన్నాయి. కానీ ఆమె చెవులకున్న కుండలాలు, చేతులకున్న గాజులు, మణులతో పొదిగిన హారాలు అన్నీ రాముడు వర్ణించి చెప్పినట్లే కనబడుతున్నాయి. కాకపోతే కాస్త మాసిపోయి ఉన్నాయి.

హనుమంతుడు ఇలా ఆలోచించసాగాడు: రాముడు చెప్పిన అలంకారాలు ఇవే అని అనిపిస్తోంది. రావణుడు సీతాదేవిని అపహరించేటప్పుడు కొన్ని అలంకారాలు తీసి మూటకట్టి కిందపడవేసింది. అవి మాత్రం ఆమె ఒంటిపైన కనబడటంలేదు. సందేహంలేదు. ఈమె ఒంటిపై ధరించి ఉన్న ఆభరణాలు, రాముడు వర్ణించి చెప్పినవీ ఇవే అని అనుకుంటున్నాను. సందేహం లేదు. ఎందువల్లనంటే, ఆమె తన ఉత్తరీయంలో మూటకట్టిపడేసిన నగల్ని మేమంతా చూశాం. ఆ నగలు మూటకట్టిన ఉత్తరీయమూ, ఇప్పుడు ఈమె ఒంటిపై ధరించి ఉన్న వస్త్రమూ ఒకేమాదిరిగా ఉన్నాయి. రాముడు వర్ణించి చెప్పిన నగల గుర్తులను బట్టి, ఈమె ధరించిన వస్త్రం, నగలు మూటకట్టిపడేసిన ఉత్తరీయం అన్నివిధాలా ఒక్కటిగానే ఉండటం వల్ల ఈమె రాముని ప్రియురాలైన సీతయేనని నా మనస్సు కచ్చితంగా చెబుతోంది.

ఎవరికోసమైతే రాముడు జాలి, దయ, శోకము, కామము అనేవాటితో బాధపడుతున్నాడో ఆమె ఈ యువతియే. ఈమెపై కనపడకుండాపోయిన స్త్రీ అనే జాలి, ఆమెకు నేను తప్ప ఇంకెవరూ రక్షకులు లేరు కదా అనే దయ, కనపడకుండా పోయిన భార్యపై శోకము, ప్రియురాలు కావటంవల్ల కామముచే రాముడు నిత్యమూ బాధపడుతున్నాడు.

ఈమె రూపలావణ్యాలు, అంగప్రత్యంగ సౌందర్యాలు, ఈమె రూపం రాముడి రూపంతో

సరితూగేట్లుంది. ఈ సీతాదేవి మనస్సు రాముడిపై స్థిరంగా ఉంది. అట్లాగే రాముడి మనస్సు కూడా సీతాదేవిపై స్థిరంగా ఉంది. అందువల్లనే ఈ సీతాదేవి, ధర్మాత్ముడైన రాముడూ, ఒకరిపై ఒకరు ఆశ పెట్టుకొని క్షణక్షణం విరహంతో బాధపడుతున్నారు.

ఈ సీతనుండి దూరమైనా కూడా రాముడు ప్రాణాలతో ఉండ కలిగాడు, మరణించలేదు. ఇదొక అద్భుతమే! నిండు యౌవనంలో ఉప్పొంగిపోతున్న ఈ సీతను విడిచి మహాబాహువైన రాముడు జీవించి ఉన్నాడంటే, నమ్మలేని నిజం!

సీతే కనపడిందన్న సంతోషంతో హనుమంతుడు ఒక్కసారి మనసారా రామప్రభువును స్మరించి, స్తుతించాడు.

# 16వ సర్గ హనుమంతుడు సీతను గూర్చి దుఃఖించటం

హనుమంతుడు రాముణ్ణి, సీతాదేవిని మనస్సులో స్మరించుకున్నాడు. మనస్సులోనే వాళ్ళిద్దర్నీ స్తుతించాడు. తరువాత సీతాదేవి దయనీయస్థితిని తలచుకొంటూ దుఃఖించాడు.

"గురువుల వద్ద శుశ్రూషలుచేసి వినయసంపన్నుడైన లక్ష్మణుడు, పెద్దలచే దీవించబడిన సీతాదేవి కూడా కష్టాలపాలయ్యారంటే, కాలానికి ఎంత శక్తివుందో తెలుస్తోంది. రామలక్ష్మణుల పట్టుదల తెలిసినదవడం చేత, వర్షాకాలంలో గంగానది క్షోభించనట్లు ఈమె కంగారుపడటం లేదు. శీలం, వయస్సు, ప్రవర్తన, సద్వంశము వంటి ఉత్తమలక్షణాలచేత ఈ సీతకు రాముడే తగిన భర్త "అటువంటి రామునికి సీతయే తగిన భార్య." మెరుగుపెట్టిన బంగారంవంటి శరీరచ్ఛాయగల కాంతితో, లక్ష్మిలాగా లోకానికంతకూ పూజ్యురాలైన సీతాదేవిని చూసి హనుమంతుడు మనస్సులోనే రాముణ్ణి స్మరిస్తూ ఇట్లా అనుకొన్నాడు. పద్మాలవంటి నేత్రాలుగల ఈ సీతాదేవి కొరకే రాముడు వాలిని, కంబంధుణ్ణి సంహరించాడు. మహేంద్రుడు శంబరాసురుణ్ణి చంపినట్లు, మహాపరాక్రమవంతుడైన విరాధుణ్ణి చంపాడు. ఈ సీతాదేవి కోసమే కదా రాముడు జనస్థానంలో పద్నాలుగువేలమంది రాక్షసుల్ని వధించాడు. ఈ సీతాదేవి కోసమే గదా, మహాబలశాలులైన ఖరుణ్ణి, త్రిశిరుణ్ణి, దూషణుణ్ణి చంపాడు. ఈ సీతాదేవి కోసమే కదా, సుగ్రీవుడిని వానరరాజ్యానికి రాజును చేశాడు. నేనుకూడా ఈ సీతాదేవి కోసమే కదా ఇతరులెవరికీ సాధ్యం కాని సముద్రాన్ని ఆకాశమార్గాన దాటి లంకాపట్టణానికి చేరుకోగలిగాను.

రాముడు సీతాదేవికోసం ఈ భూమండలాన్నే కాదు, ముల్లోకాలనూ తలక్రిందులుగా చేసినా అది సబబుగానే ఉంటుందని నా అభిప్రాయం. ముల్లోకాలపై అధికారం గొప్పదా, లేక జనకపుత్రిక అయిన సీతాదేవి గొప్పదా అన్న ప్రశ్న ఉదయిస్తే, అందుకు 'సీతాదేవియే గొప్పది' అన్నదే సరైన సమాధానం అవుతుంది.

యజ్ఞభూమిని దున్నుతున్నప్పుడు, ఈ జనకపుత్రి, ఈ ధర్మశీల ఆ భూమినుండి బయటకు

వచ్చింది. దృఢమైన పాతివ్రత్య ధర్మం గల సీత ఈమెయే. పరాక్రమవంతుడూ, యుద్ధమునందు వెనుకంజవెయ్యని వాడూ, కీర్తిమంతుడూ అయిన దశరథమహారాజు పెద్దకోడలు ఈమే. ధర్మాలన్నీ తెలిసినవాడు, కృతజ్ఞుడు, బుద్ధిమంతుడైన రామునికి ప్రియురాలు ఈమే. అటువంటి ఈ మహాసాధ్వి, భర్తపైగల ప్రేమ చేత ఈమె సర్వసుఖాలు కాలదన్ని కష్టాలను లెక్కచెయ్యకుండా నిర్జనమైన అరణ్యాలకు వచ్చింది. భర్తకు సేవ చేయడమే పరమలక్ష్యంగా పెట్టుకొని, అరణ్యాల్లో దొరికే కందమూలాలకే తృప్తిపడి సంతోషంగా జీవిస్తూ ఉండేది. ఈమెకు ఇటువంటి కష్టాలు రావలసినవికావు. మేలిమిబంగారానికి దీటైన శరీరచ్ఛాయతో కూడి ఎల్లప్పుడూ చిరునవ్వులు చిందించే సీతాదేవికి ఇన్ని కష్టాలా?

ఎన్ని కష్టాలొచ్చినా, రావణుడు ఎన్ని బాధలుపెట్టినా శీలవతియైన ఈ సీతను రాముడు చూడగానే ఎండలో దాహంతో ఉన్నవాడు చలివేంద్రం చూడగానే ఎట్లా ఎగిరి గంతువేస్తాడో అట్లాగే, పరమానందభరితుడౌతాడు. రాజభ్రష్టుడైన రాజుకు రాజ్యం వస్తే ఎట్లా సంతోషిస్తాడో, అట్లే రాముడుకూడా సీతను చూడగానే తప్పక సంతోషిస్తాడు. ఈమెకు కోరికలు లేవు; భోగాలపై ఆసక్తిలేదు; అయినా రాముని చూడగలననే ఆశతోనే జీవిస్తున్నట్లుంది. ఈమె చుట్టూవున్న రాక్షస స్త్రీలుగాని, పుష్ప ఫలవృక్షాలుగానీ ఆమెకు కనిపించడంలేదు. ఆమె దృష్టి అంతా రాముడిపైనే! ఆమె ఏకాగ్రచిత్తంతో రాముణ్ణే ధ్యానిస్తూ ఉన్నది. స్త్రీకి ఎన్ని అలంకారాలున్నా భర్తయే గొప్ప అలంకారం. ఈ సీత అలంకారాలు ధరింపదగినదే అయినా, భర్త అనే అలంకారం లేకపోవటంవల్ల శోభించడం లేదు. ఈమెను అపహరించిన తరువాత కూడా రాముడు దుఃఖంతో జీవించి ఉన్నాడంటే, ఎవరూ చేయలేని పనిని రామప్రభువు చేస్తున్నాడు గదా! నల్లనిజుట్టు, పద్మములవంటి కన్నులు గల ఈమె సుఖాలు అనుభవిస్తూ ఉండటమే న్యాయం. అటువంటిది ఈమె పడుతున్న కష్టాలు చూసి నాబోటి వాడికే గుండెలు చెరువైపోతున్నాయి. భూమి వలె ఓర్పు గలది, పద్మాల వంటి నేత్రంగలదైన ఏ సీతాదేవిని రామలక్ష్మణులు రక్షిస్తూండేవారో అటువంటి సీతాదేవిని ఈ రాక్షస స్త్రీలు కాపలాకాస్తున్నారు. కష్టాలు ఒకదానిపై మరొకటి వచ్చిపడుతూ ఉంటే, సీత మంచు దెబ్బతిన్న తామర పూవ్వులాగా కాంతి

కోల్పోయింది. మగచక్రవాకపక్షి లేని ఆడచక్రవాకపక్షిలాగా దీనంగా దుఃఖిస్తోంది. పూల బరువుతో వంగిన అశోకవృక్షాలు, మంచు తొలగిపోవటం వల్ల నిర్మలంగానూ స్వచ్ఛంగానూ ప్రకాశించే చంద్రుడు, భర్త విరహంతో బాధపడుతున్న సీతను మరింతగా బాధపెడుతున్నాయి.

బలవంతుడు, వానరశ్రేష్ఠుడు, వాయువేగంతో ప్రయాణంచేసేవాడైన హనుమంతుడు అక్కడ ఉన్న పరిస్థితులన్నీ జాగ్రత్తగా పరిశీలించాడు. 'ఈమే సీత' అని నిర్ధారణ చేసుకున్నాడు, ఆ వృక్షంపైనే ఇంకొద్దిసేపు కూర్చున్నాడు.

# 17వ సర్గ సీతాదర్శనంతో హనుమంతుడు సంతోషించడం

నిర్మల నీలవర్ణంలో ఉండే జలాలలోకి హంస ప్రవేశించినట్లు నీలాకాశంలోకి చంద్రుడు ప్రవేశించి, నిర్మలమైన వెన్నెలను వెదజల్లుతూ హనుమంతుని సంతోషపెడ్తున్నాడు. బరువుతో కుంగిపోతున్న ఓడవలె సీతాదేవి దుఃఖసముద్రంలో మునిగివుంది. సీతాదేవిని స్పష్టంగా చూసేందుకు హనుమంతుడు తన దృష్టిని ఆమె వైపు సారించాడు. అప్పుడు ఆమె చుట్టూ అనేకమంది భయంకరులైన రాక్షస స్త్రీలను చూశాడు. వారిలో కొందరికి ఒకే కన్నువుంది, మరికొందరికి ఒకే చెవివున్నది. గొడుగుల వంటి చెవులున్నదీ, అసలు చెవులే లేనిదీ, తలవరకూ వ్యాపించివున్న ముక్కుగలదీ, పెద్దబాన అంత తలగలదీ, కొండలాగా సన్నగా బారుగావుండే మెడగలదీ, జడలు కట్టివున్న జుట్టుగలదీ, వ్రేలాడిపోయే నుదురూ, చెవులుగలదీ, వ్రేలాడిపోయే మోకాళ్ళుగలదీ, పొట్టిదీ, పొడవాటిదీ, గూనిదీ ఇట్లా వికారమైన అనేక ఆకారాలతో ఉన్న రాక్షస స్త్రీలు సీతాదేవికి కాపలాగా ఉన్నారు.

ఆ రాక్షస స్త్రీలంతా కోపిష్టులు, పొట్లాడే స్వభావం గలవాళ్ళు. పచ్చగా నల్లగా ఉన్న వాళ్ళు చేతుల్లో శూలాలు, గూటములు, ముద్గరాలు ధరించి ఉన్నారు. వాళ్ళ ముఖాలన్నీ పందుల్లాగాను, తేళ్ళకు మల్లేను, దున్నపోతులు, మేకపోతుల్లాగాను, ఆడ నక్కల్లాగానూ ఉన్నాయి. వాళ్ళ పాదాలు ఏనుగుల, ఒంటెల, గుర్రాల పాదాల మల్లే ఉన్నాయి. కొందరి తలలు గుండెల వరకూ కుదించుకొనిపోయి ఉన్నాయి. ఒకే చెయ్యి ఉన్న వాళ్ళు; ఒకే కాలు ఉన్న వాళ్ళు, గాడిద చెవులవాళ్ళు, గుర్రపుచెవులవాళ్ళు, ఆవు చెవులవాళ్ళు, ఏనుగు చెవులవాళ్ళు, కోతి చెవులవాళ్ళు, పెద్దముక్కు ఉన్నవాళ్ళు, అసలు ముక్కే లేనివాళ్ళు, వంకర ముక్కు ఉన్న వాళ్ళు, నుదుటి వరకూ వ్యాపించిన ముక్కు గలవాళ్ళు, పాదాల మీద జుట్టు ఉన్నవాళ్ళు, పెద్ద తలలవాళ్ళు, పెద్ద స్తనాలున్నవాళ్ళు, పొడవాటి నాలుక ఉన్నవాళ్ళు, పొడవాటి గోళ్ళు ఉన్న వాళ్ళు ఉన్నారు. వాళ్ళంతా చూసే వాళ్ళకు భయం కలిగించేట్లున్నారు. వాళ్ళందరికీ మాంసం, మద్యం అంటే చాలా ఇష్టం. వాళ్ళు ఒంటిపై రక్తమాంసాలు, మద్యం మరకలతో కూర్చుని చూపరులకు

గగుర్పాటు కలిగిస్తున్నారు.

హనుమంతుడు వాళ్ళందరి మధ్యలో రాజపుత్రిక, జనకుని కుమార్తె, దోషములేనిదైన సీతాదేవిని చూశాడు. ఆమె వస్త్రాలన్నీ మురికిపట్టి ఉన్నాయి. పోషణలేక ముఖమంతా మలినమై ఉంది. కేశములన్నీ మురికి పట్టివున్నాయి. పుణ్యఫలాలన్నీ క్షీణించగా భూమిపై పడిపోయిన నక్షత్రంలాగా ఉంది.

ఆ సీతాదేవి సత్యమనే గొప్ప సంపద కలిగివుంది. భర్త దర్శనం లేక దరిద్రురాలుగానూ ఉంది. భర్తపై ప్రేమ కలిగి ఉండటం అనే ఆభరణం ఒక్కటే ఆమె ధరించి ఉంది.

రావణునిచే చెర పట్టబడిన ఆ సీతాదేవి, గుంపునుండి విడిపోయి సింహాల మధ్య ఉన్న ఆడఏనుగు వలె ఉంది. వర్షాకాలంలో, శరత్కాల మేఘాలచే ఆవరించబడిన చంద్రుడిలాగా ఆ సీతాదేవి స్నానం చేయక పోవటంవల్ల కాంతి తగ్గిపోయివుంది. తంత్రులు సారించని వీణలాగా ఉంది. భర్త సన్నిధిలో ఉండవలసిన ఆ సీతాదేవి వికృతాకారులైన రాక్షసుల నడుమ ఉన్నది. అశోకవనంలో శోకసాగరంలో మునిగి ఉంది. ఆ రాక్షస స్త్రీల మధ్య గ్రహాల మధ్య ఉన్న రోహిణీ నక్షత్రంలాగా ఉంది. పుష్పాలు లేని లతలాగా బోసిపోయి ఉన్న సీతాదేవిని హనుమంతుడు చూశాడు. స్నానం చెయ్యక శరీరం అంతా మలినంగా ఉన్నాకూడా ఆమె సహజ సౌందర్యం కొట్టొచ్చినట్లు కనబడుతోంది. ఆమె బురద ఆవరించిన తామరతూడులాగా అందంగానూ ఉంది, కాంతి విహీనంగానూ ఉంది.

అతిలోక సుందరియైన ఆ సీతాదేవి శరీరపోషణలేక, మలిన వస్త్రాలను ధరించి ఉంది. లేడిపిల్ల కళ్ళవంటి నేత్రాలుగల ఆ సీతాదేవి ముఖం దీనంగా ఉంది. భర్త పరాక్రమం గూర్చి తెలిసినది కావటంవల్ల, ధైర్యాన్ని కోల్పోలేదు. ఆమె పాతివ్రత్యమే ఆమెకు రక్షగా నిలచింది. అటువంటి సీతాదేవిని హనుమంతుడు చూశాడు. లేడిపిల్లవలె బెదురుచూపులు చూస్తూవుంది. వేడిగా ఉన్న ఆమె నిట్టూర్పుల వల్ల లేతచిగుళ్ళు మాడిపోతున్నాయి. ఆమె దుఃఖాల ప్రోగులాగా

ఉంది. ఉవ్వెత్తున లేచిన దుఃఖతరంగంలాగా ఉంది. అటువంటి సీతాదేవిని హనుమంతుడు చూశాడు. అలంకారాలు లేకపోయినా, శరీరపోషణ లేకపోయినా, ఆమె అవయవాల సౌష్ఠవం తగ్గకుండా ఉంది. ఓర్పుకు భూదేవిలాగా ఉన్న సీతాదేవిని హనుమంతుడు చూశాడు. మత్తు కలిగించే నేత్రములు గల ఆ సీతాదేవిని చూసిన హనుమంతుడు ఆనందాశ్రువులు రాల్చి మనస్సులో రాముని స్తుతించి నమస్కరించాడు.

సీత కనబడటంచేత హృదయం అంతా ఆనందం నిండి ఆ హనుమంతుడు రామలక్ష్మణులకు నమస్కరించి ఆ చెట్టు ఆకుల మధ్య పొంచి కూర్చున్నాడు.

## 18వ సర్గ రావణుడు అశోకవనానికి రావడం

హనుమంతుడు ఆ విధంగా సీతాదేవిని చూస్తూ రామలక్ష్మణులను స్మరిస్తూ ఆ రాత్రి అంతా గడిపేశాడు. ఇంకా సూర్యోదయం కాలేదు. అప్పటికే వేదాలలో నిష్ణాతులు, యజ్ఞయాగాలు చేసేవారూ అయిన బ్రహ్మరాక్షసులు వేదాలు వల్లించడం మొదలుపెట్టారు. ఆ వేదఘోష హనుమంతుడు విన్నాడు. మహాబాహువు, మహాబలశాలి అయిన రావణాసురుణ్ణి వందిమాగధులు మంగళవాద్యాలతో స్తుతించి మేల్కొల్పారు. ప్రతాపవంతుడైన రావణుడు ఆ స్తుతి స్తోత్రాలకు మేల్కొని కూర్చొన్నాడు. కట్టుకున్న వస్త్రాలు, ధరించిన మాలలు చిందరవందరగా ఉన్నాయి. అప్పుడతడి జ్ఞాపకాలు సీతపైకి పోయాయి. సీత ఆలోచనలు రాగానే అతడి కామప్రవృత్తి ప్రజ్వరిల్లింది. మన్మథుడు అతడిపై దాడి చేశాడు. లోపల నుండి వస్తున్న కోరికల్ని జయించలేకపోయాడు. సర్వాంగసుందరంగా అలంకరించుకున్నాడు. అతిశయించిన తేజస్సుతో అశోకవనానికి బయలుదేరాడు.

ఆ వనం అంతా ఫలపుష్పాలతో శోభిల్లుతోంది. అక్కడక్కడా సుందరమైన సరస్సులున్నాయి. ఆ వనంలో అనేకరకాలైన పక్షిజాతులున్నాయి. అందులో కొన్ని మదించి ఉన్నాయి. అనేక మృగాలు కూడా స్వేచ్ఛగా తిరుగుతున్నాయి. ఆ వనంలోకి బంగారు ముఖద్వారం గుండా రావణుడు ప్రవేశించాడు. దేవేంద్రుడి వెనుక దేవతా స్త్రీలు, గంధర్వ స్త్రీలు వెళ్ళినట్లుగా రావణుని అనుసరించి వందమంది స్త్రీలు వెళ్ళారు. వాళ్ళల్లో కొందరు వింజామరల్తో విసిరారు, కొంతమంది బంగారు దీపాలను ధరించి వెళ్ళారు. కొందరు బంగారుపాత్రలలో నీరు జల్లుకుంటూపోయారు. కొందరు ఖడ్గాలు ధరించి వెళ్ళారు. ఒక వనిత మద్యం నింపిన బంగారు పాత్రను కుడిచేత్తో పట్టుకొని రావణునికి ఎడమప్రక్కగా నడుస్తోంది. ఇంకొక స్త్రీ శ్వేతఛత్రాన్ని పట్టుకుంది. ఇంకొక యువతి రాజహంసలా నడుస్తూ బంగారు దండాన్ని ధరించి నడుస్తోంది. అటువంటి రావణుని స్త్రీలందరూ మద్యం మత్తులో కళ్ళు అరమూతలపడుతూ ఉండగా, తమ భర్త అయిన రావణుని మేఘాన్ని మెరుపుతీగ అనుసరించినట్లు అనుసరించారు.

వాళ్ళంతా కూడా రావణునికి ప్రియాతిప్రియమైన వాళ్ళే. తమ ప్రియుడిపై ఉండే గౌరవంతోను, ప్రేమాభిమానాల్తోను అతణ్ణి అనుసరించి అశోకవనానికి వెళ్తున్నారు. వాళ్ళ శరీరం అంతా చెమటలు పోస్తున్నాయి. ధరించిన ఆభరణాలన్నీ అటూఇటూ జారుతున్నాయి. ఒంటికి పూసుకున్న పైపూతలన్నీ కరిగిపోతున్నాయి. నిద్రమత్తులో తూలుతున్నారు. అందమైన వారి జుట్టుముడులన్నీ చెదరి కేశములు పుష్పహారములలో చిక్కుకొనిపోయాయి. వారి చూపుల్లో మత్తు ఉంది; కామం ఉంది. వారంతా రావణుని అనుసరించి అశోకవనానికి వెళ్ళారు.

ఆ మహాబలుడైన రావణుడు సీతపైగల కామంతో మందబుద్ధియై మెల్లగాను అందంగాను నడచి వస్తున్నాడు. అతడిని అనుసరించి వచ్చే ఆ ఉత్తమ స్త్రీల వడ్డాణాల చిరుగంటల సవ్వడిని, కాళ్ళ అందెల చప్పుళ్ళను వాయుపుత్రుడైన హనుమంతుడు విన్నాడు. రావణుడు ద్వారంలో ఉండగానే తను కూర్చున్న చిటారుకొమ్మపై నుండి చూశాడు. రావణుడు నడుస్తూ ఉంటే కొంతమంది స్త్రీలు అతడికి ముందుగా సుగంధాలతో కూడిన నూనె దీపాలను పుచ్చుకొని నడుస్తున్నారు. ఆ సువాసనలు వనం అంతా వ్యాపించాయి. రావణునిలో కామము, దర్పము, మదము కొట్టొచ్చినట్లు కనబడుతున్నాయి. అతడి విశాలమైన నేత్రాలు ఎర్రగా ఉండి ఆతడిలోని కామాన్ని వ్యక్తం చేస్తున్నాయి. అప్పుడతడు పూలబాణాలతో కూడుకున్న మన్మథుడిలాగా కనిపించాడు. అతడు ధరించిన వస్త్రాలు అమృతం నురుగులాగా స్వచ్ఛంగా ఉన్నాయి. ఆ వస్త్రాలు పాదాలదాకా సాగి వ్రేలాడుతున్నాయి. అట్లా జారిపోతున్న వస్త్రాన్ని చేత్తో పైకెత్తి పట్టుకొని విలాసంగా నడుస్తున్నాడు.

హనుమంతుడు ఆ చిటారుకొమ్మపైనే కూర్చుని అక్కడ నుండి రావణుని పరిశీలనగా చూస్తున్నాడు. తను ఎవరికంటా పడకుండా ఉండేందుకు పచ్చటి ఆకుల్ని కప్పుకొన్నాడు. మహాతేజశ్శాలి అయిన హనుమంతుడు "ఈతడే విశ్రవసుని కుమారుడైన రావణుడు అయివుండవచ్చు" నని మనసులో అనుకున్నాడు. ఉత్సుకత పట్టలేకపోయాడు. ఇంకా నిశితంగా పరిశీలించి చూడాలనుకున్నాడు. వెంటనే ఆ కొమ్మపై నుండి క్రింది కొమ్మపైకి ఒక్క దుముకు

దుమికాడు. మళ్ళీ ఎవరికీ కనపడకుండా ఆకులు కప్పుకొని జాగ్రత్తపడ్డాడు.

నల్లని కేశములు, అందమైన కటిప్రదేశము, దగ్గరగా కలిసిపోయిన స్తనాలు, నల్లటి నేత్రాలు గల సీతను చూడాలనే కాంక్షతో రావణుడు సీతాదేవికి దగ్గరగా వచ్చాడు.

# 19వ సర్గ రావణుని చూడగానే సీతాదేవి భయపడటం

ఆక్షణంలో రూప యౌవనాలతోను, సర్వాలంకారాలతోను శోభితుడైన రాక్షసరాజును చూసి సీత, పెనుగాలికి అరటిచెట్టువలె ఊగిపోయింది. రావణుని చూసీచూడగానే బంగారు శరీరచ్ఛాయగల ఆ సీతాదేవి తొడల చేత పొట్టను, చేతులతో స్తనాలను కప్పుకొని ముడుచుకుపోయి కూర్చుంది. రాక్షస స్త్రీలచేత పరిరక్షించబడుతున్న ఆ సీతాదేవి, సముద్రం మధ్య ఆపదలో చిక్కుకున్న ఓడలాగా విలవిల్లాడిపోయింది. అటువంటి సీతను రావణుడు చూశాడు. ఆమె కటికనేలమీద కూర్చుని ఉంది. మహావృక్షం నుండి నరికిన కొమ్మలాగా నేలపై పడి ఉంది. సర్వాభరణాలు ధరించే యోగ్యత కలదే అయినా ఆమె ఆభరణాలేవీ ధరించలేదు. ధరించినవి కూడా దుమ్ముధూళి కొట్టుకొని మసకబారి పోయాయి. బురద అంటుకున్న తామరతూడులాగా ప్రకాశించీ, ప్రకాశించకుండా వెలవెలబోతోంది.

ఆ సీతాదేవి ఊహలనే గుర్రాలపై కోరికలనే రథాన్ని ఎక్కి రాజులలో శ్రేష్ఠుడైన రాముని దగ్గర విహరిస్తోంది. ఆమె మనస్సంతా రాముడిపైనే లగ్నం అయి ఉంది. అంతులేని దుఃఖం అనుభవిస్తూ ఉండటం చేత, ఏడవటం తప్ప వేరే గత్యంతరం లేనిదై ఉంది. మనసులో మాట చెప్పుకుందామన్నా రెండో మనిషి లేకపోవటం మూలంగా శుష్కించిపోయింది. ఆ సీతాదేవి మంత్రకట్టుచేత కట్టుబడిన మహాసర్పంలాగా కొట్టుకుంటోంది. ధూమకేతువు (పొగతో) అనే గ్రహం చేత పీడించబడుతున్న రోహిణీ నక్షత్రంలాగా ఉంది. అప్పుడా సీతాదేవి అసత్యం వల్ల చెడిపోయిన కీర్తి కాంతవలె, అవమానించబడిన శ్రద్ధవలె, క్షీణించిపోయిన పూజవలె, దెబ్బతిన్న ఆశవలె, అధ్యయనం చేయనందున శిథిలమైన విద్యలాగా ఉంది.

ఆ సీతాదేవి ఎదురుచూస్తున్న లాభం చేతికి అందనట్లుగా, అమలు కాని రాజాజ్ఞవలె, మండుచున్న దిక్కులవలె, ఒకరి సొత్తును మరొకరు అపహరించుకుపోయిన పూజాఫలం లాగా ఉంది. ఆ సీతాదేవి తొక్కి పారేసిన పద్మలతలాగా, శూరులను పోగొట్టుకున్న సేనలాగా, చీకటిచే

ఆక్రమించబడిన కాంతివలె, ఎండిపోయిన నదిలాగా ఉంది. ఆ సీతాదేవి పవిత్రమైన అగ్ని వేదిక; అపవిత్ర వస్తువులతో అపవిత్రమైపోయినట్లుంది. శాంతించిన అగ్నిజ్వాలలాగా, రాహువు మ్రింగిన చంద్రమండలంలాగా కాంతివిహీనంగా ఉంది.

ఏనుగు తొండంతో పద్మాలను, తూడుల్ని కొడ్తూ బీభత్సం చేస్తూ ఉండగా పక్షులన్నీ భయపడి పారిపోయినట్లు, సీతాదేవి మనస్సంతా వ్యాకులం చెంది ఆ పద్మసరస్సులాగా ఉంది. భర్తృశోకంతో శరీరపోషణ లేకుండా ఉన్న ఆ సీతాదేవి, నీరంతా ఎండిపోయిన నదిలాగా కృశించిపోయింది. కృష్ణపక్ష రాత్రివలె కళావిహీనంగా ఉంది. సుకుమారురాలు; సర్వాంగ సుందరంగా ఉండే ఆ సీతాదేవి రాజభవనాల్లో నివసించతగ్గదీ అయినా అప్పుడే పీకి నేలపైన పడేసిన తామరతూడులాగా కమిలిపోయింది.

ఏనుగుల నాయకుణ్ణి బంధించి దూరంగా తీసుకుపోయినప్పుడు, దుఃఖంతో నిట్టూర్పులు విడుస్తున్న ఆడ ఏనుగులాగా, ఆ సీతాదేవి మితిమీరిన దుఃఖంతో ఉంది. ఉపవాసాల చేతను, దుఃఖంచేతను, భయంచేతనూ సీతాదేవి శుష్కించిపోయి ఉంది. ఏదో మొక్కుబడిగా తింటూ, ఎల్లవేళల్లోను, రాముని ధ్యానంలోనే ఉంటోంది. అదే ఆమె తపస్సు. రాముడి విషయంలో అచంచలమైన పాతివ్రత్య నియమాలను పాటిస్తోంది. అటువంటి సీతాదేవిని రావణుడు "నాకు వశం కాకపోతే చంపుతాను" అని క్షణక్షణం భయపెడ్తున్నాడు. ఒక్కో సమయంలో మంచి మాటల్తో ప్రలోభపెడ్తున్నాడు.

# 20వ సర్గ రావణుడు సీతను ప్రలోభపెట్టడం

రాక్షస స్త్రీల మధ్య దీనురాలై దయనీయ స్థితిలో ఉన్న సీత దగ్గరకు రావణుడు వెళ్ళి అనేక విధాలుగా బ్రతిమాలుతూ, భయపెడ్తూ, అభినయం ద్వారా తన మనోభావాల్ని తెలియజేస్తూ ఇట్లా అన్నాడు.

రావణుడు: ఓ సీతా! ఏనుగు తొండము వంటి తొడలుగలదానా! నువ్వు నన్ను చూడగానే భయపడిపోతున్నావు. స్తనాలు కనిపించకుండా చేతులు అడ్డంగా పెట్టుకుంటున్నావు. నీ తొడలచేత పొట్టనంతా కప్పివేస్తున్నావు. ఎప్పటికైనా నాకు సొంతం కావలసిన నీ అందచందాలను ఎందుకట్లా దాచుకుంటున్నావు? విశాలమైన నేత్రాలు గల, సద్గుణ సంపత్తి గల, సర్వాంగ సౌందర్యవతివైన నిన్ను నేను ప్రాణాధికంగా ప్రేమిస్తున్నాను. నీపై ఉన్న కోరికతో నా మనస్సు, శరీరం కూడా దహించుకుపోతున్నాయి. సకలజనుల మనస్సునూ ఆకర్షించే అందచందాలున్నదానవు. నన్ను ఎందుకు దూరం చేస్తున్నావు? ఓ ప్రియురాలా! నన్ను కరుణించు. నా ప్రేమను అంగీకరించు.

ఓ సీతా! నీవు ఎవరిని గూర్చి భయపడవద్దు. ఇక్కడ పరాయివాళ్ళెవరున్నారు? కామరూపధారులైన రాక్షసులెవరూ మనల్ని చూడటం లేదు. నేను కూడా నీ ప్రేమకు దాసుణ్ణే కనుక నావల్ల నీకు ఎటువంటి అపకారమూ జరుగదు. కాబట్టి నీవు ఎవరిని చూసీ భయపడవలసిన అగత్యం లేదు.

భయస్వభావం గలదానా! సీతా! బలాత్కారం చెయ్యటం, ఇతరుల భార్యల్ని చెరబట్టడం, అపహరించడం వంటి గుణాలన్నీ మా రాక్షసులకు సహజమైన ధర్మాలు. అందులో ఏమీ సందేహం లేదు. కనుక రాక్షస ధర్మాన్ని అనుసరించి నిన్ను నేను బలాత్కారం చెయ్యను. కేవలం కామంతో నీ శరీరాన్ని కోరుకోవటం లేదు. నేను ఎంతకాలమైనా కామపీడితుడనై ఉంటానే కానీ బలాత్కారంగా నీ శరీరాన్ని ముట్టుకోను. నీవు మనస్సు మార్చుకుని నన్ను ప్రేమించి

ఆహ్వానించేవరకూ వేచి ఉంటాను. కాబట్టి ఓ దేవీ! ఆ విషయంలో నీవు నిశ్చింతగా ఉండు. ఎంతమాత్రమూ భయపడవద్దు. ఓ ప్రియురాలా! నన్ను మనస్ఫూర్తిగా ప్రేమించు. దుఃఖంతో నేలమీద పడుకోవటం, తల దువ్వుకొని పూలు పెట్టుకోకుండా ఉండటం, ఎప్పుడూ ఏదో పరధ్యానంలో ఉండడం, మాసిపోయిన వస్త్రాలను ధరించడం, ఉపవాసాలు చేస్తూ శరీరాన్ని శుష్కింపజేయడం వంటి పనులవల్ల నీకు ఏమాత్రం ఉపకారం జరగదు. వృథాగా నీవు బాధపడుతున్నావు; నన్ను బాధపెడుతున్నావు. ఇవి ఎంతమాత్రం నీవంటి వివేకం గలది చేయదగిన పనులు కావు.

ఓ సీతా! నీవు మనసు మార్చుకుని నన్ను ఇష్టపడి, నన్ను పొందిన ఎడల చందనం, అగరువు వంటి సుగంధలేపనాలు పూసుకోవచ్చు. కామాన్ని ప్రకోపించే శ్రేష్ఠమైన మద్యాలు, అనేక విచిత్రమైన మాలలు అలంకారాలు, వస్త్రాలు, ఆభరణాలు పొందవచ్చును. విలాసవంతమైన పడకలు, ఆసనము లపై పడుకొని నిద్రించవచ్చు. అంతేకాకుండా నిరంతరం నృత్యగీత వాద్యాలతో కాలం గడపవచ్చు.

ఓ సుందరీ! నీవు స్త్రీలలో రత్నము వంటి దానవు. నీవు అలంకారాలు లేకుండా ఉండకూడదు. నన్ను పొందిన తరువాత అలంకారాలు లేని ఈ దేహంతో నీవు ఏం సుఖపడగలవు? నన్ను ఏమి సుఖపెట్టగలవు? (నన్ను పొందిన తరువాత నీవు భోగాదులు అనుభవించేందుకు అయోగ్యురాలవు ఎట్లగుదువు?) జీవితములు బుద్బుద ప్రాయాలు. యౌవనంలో ఉన్న కొద్దికాలంలోనే భోగాలన్నీ అనుభవించాలి. యౌవనం అంతా వృథా అయిపోతోంది. (గతజల సేతుబంధనం) నీళ్ళన్నీ పోయిన తరువాత ఆనకట్ట కట్టితే ఏమైనా ప్రయోజనం ఉంటుందా?

దర్శనం చేతనే శుభాల నిచ్చేదానా! ఆ విధాత సౌందర్యాన్నంతా ఒక రాశిగా పోసి నిన్ను సృజించి ఉంటాడు. నిన్ను సృజించిన తరువాత ఇక సౌందర్యం అంతా ఖర్చయిపోవటం వల్ల మళ్ళీ ఇంకో సౌందర్యవతిని రూపొందించలేకపోయాడని నేను అనుకుంటున్నాను. కనుక నీ

వంటి సౌందర్యవతి సృష్టిలో మరొకరు లేరు. రూపయౌవనములతో వెలిగిపోతున్న నిన్ను ఆ బ్రహ్మదేవుడే చూసినా కూడా విడిచిపెట్టిపోలేడు. ఇక ఇతరుల మాట చెప్పాలా?

చంద్రబింబము వంటి నీ ముఖము, సొగసైన కటి ప్రదేశముగల ఓ సీతా! నా చూపు నీ ఏయే అవయవాలపై పడుతోందో, దానిమీద నిలిచిపోతోంది.

ఓ మైథిలీ! నీ మూర్ఖత్వాన్ని వదలిపెట్టు. నాకు భార్యవు కమ్ము. నిన్ను నా పట్టపురాణిగా చేస్తాను. నేను ఎందరినో ఉత్తమ స్త్రీలను తీసుకొని వచ్చాను. నీవు వాళ్ళందరిపైనా పట్టమహిషిగా ఉండు. నేను ముల్లోకాలు జయించి తీసుకువచ్చిన శ్రేష్ఠమైన వస్తువులు, ఈ రాజ్యము, నేను కూడా నీవారమైపోతాము. నేను జయించి సంపాదించినది, నా ఏలుబడిలో ఉండే రాజ్యాన్నంతా నీకుగాని, నీవు కోరుకుంటే నీ తండ్రి అయిన జనకునికిగాని ఇచ్చివేస్తాను.

ఓ సీతా! ఈ లోకంలో నన్ను ఎదిరించి నిలబడగల వాడు ఒక్కడు కూడా లేడు. దానినిబట్టి నా పరాక్రమం ఎటువంటిదో తెలుసుకో! నేను ఎన్నో యుద్ధాలు చేశాను. ఎన్నోసార్లు సురాసురుల్ని జయించాను. ఇంతవరకు ఒక్కడు కూడా నా ఎదుట నిలబడి యుద్ధం చేసినవాడు లేడు.

కాబట్టి ఓ సీతా! నాపై కరుణ చూపించి నన్ను అనుగ్రహించు. నాపై ప్రేమ చూపించు. ఉత్తమమైన ఆభరణాల్ని అలంకరించుకో. నీవు చక్కగా అలంకరించుకొని ఉండగా సర్వాంగసుందరివైన నిన్ను చూడాలని ఉంది.

ఓ భయస్వభావురాలా! ఓ అందమైనముఖం గలదానా! నా ప్రేమను అంగీకరించు. చక్కగా అలంకరించుకో. ముల్లోకాలలో దొరికే భోగాలన్నీ అనుభవించు. శ్రేష్ఠమైన మద్యాన్ని సేవించు. ఆనందంగా ఉండు. నన్ను ఆనందంలో ముంచి తేల్చు. నీ కిష్టమైనవారికి కోరినంత ధనం, భూములను దానం చెయ్యి. నిర్భయంగా నన్ను ఆజ్ఞాపించు. నన్ను కూడా నీ సేవకుడిగా చేసుకో. నన్ను మనస్ఫూర్తిగా ప్రేమించు. నువ్వూ నీ బంధువులు కూడా ఆనందంగా గడపాలి. ఓ

సుందరీ! నారబట్టలు కట్టుకున్న రామునితో ఏం సుఖాలు అనుభవించగలవు? ఐశ్వర్యాన్ని పోగొట్టుకున్నాడు. జీవితంలో ఓడిపోయి అడవుల్లో బ్రతుకు వెళ్ళదీసుకుంటూ ముని జీవితాన్ని గడుపుతున్నాడు. అసలు ఆ రాముడు జీవించి ఉన్నాడో లేడో కూడా తెలియదు.

ఓ సీతా! నిన్ను, నీ అందాన్ని, నీ వైభోగాన్నీ చూసేందుకు రాముడికి శక్యం కాదు. తెల్లటికొంగల గుంపులు నల్లని మేఘాన్ని కప్పివేసినట్లు, మేఘాలు చంద్రుని కప్పివేసినట్లు రాముడిక నిన్ను తెలుసుకోలేడు. హిరణ్యకశిపుడు ఇంద్రుని చేతిలో చిక్కిన తన భార్య అయిన కీర్తిని తిరిగి పొందగలిగాడు. కానీ, రాముడు మాత్రం నా నుండి నిన్ను దక్కించుకోలేడు.

అందమైన చిరునవ్వుగలదానా! తెల్లటి పలువరుస గలదానా! మనోహరమైన రూపము గలదానా! భయస్వభావురాలా! ఓ సీతా! గరుత్మంతుడు సర్పములను హరించునట్లుగా నీవు నా మనస్సును హరించివేశావు. నీవు నలిగిపోయిన పాత పట్టుచీర కట్టుకున్నావు. ఆహారం తీసుకోకుండా చిక్కిపోయి ఉన్నావు. అలంకారాలన్నీ వద్దన్నావు. అయినా నీ అందం ముందు మిగిలిన స్త్రీల అందమంతా వెలవెలబోతోంది. నీ మీద మనసుపడ్డ తర్వాత నా భార్యలతో సుఖపడలేకపోతున్నాను. నా అంతఃపురంలో ఉండే నా భార్యలైన ఉత్తమ స్త్రీలందరిపైనా నీవు ఆధిపత్యం వహించు. వాళ్ళంతా, లక్ష్మీదేవిని లోకులంతా సేవించినట్లు, నిన్ను సేవిస్తారు.

అందమైన కనుబొమలు, కటిప్రదేశం గల ఓ సీతా! కుబేరుని మించిన రత్నాలు ధనరాసులను, ముల్లోకాలనీ, నన్నూ కూడా ఏలుకో. రాముడు తపస్సు చేతగాని, బలము చేతగాని, పరాక్రమం చేతగాని, ధనము చేతగాని, తేజస్సు చేతగాని, కీర్తి చేతగాని నాతో సమానుడు కాదు.

ఓ సీతా! విలాస స్వభావాన్ని సంతరించుకో. నా వద్ద ఉండే ధనాన్ని, నేను సంపాదించుకున్న కీర్తిని తీసుకో! నీకు ఇష్టంవచ్చినట్లు తిను, త్రాగు, విహరించు, క్రీడించు, భోగాలనుభవించు. నన్ను సంతోషపెట్టు. ప్రకాశించుచున్న హారాలతో అలంకరించుకో.

పుష్పించిన వనాల్లో నాతో విహరించు. తుమ్మెదల వంటి ధ్వనులతో ప్రతిధ్వనించే సముద్ర తీరాల్లోని ఉద్యానాల్లో నాతో విహరించు.

# 21వ సర్గ సీత రావణుని నిందించటం

రావణుని మాటలు విన్న సీతాదేవి దీనంగానూ, గంపెడు దుఃఖం కడుపులో దాచుకుని మెల్లగా ఇలా అంది: మనస్సులో భర్తనే ధ్యానం చేస్తూ, రావణుడితో ప్రత్యక్షంగా మాట్లాడటానికి ఇష్టంలేక, మధ్యలో ఒక గడ్డిపరకను ఉంచి, వణికిపోయే స్వరంతో ఇట్లా అంది.

సీత: ఓ రావణుడా! నీవు నాపై గల మనస్సును నీ భార్యల పైకి మరల్చుకో. పాపాత్ముడైన వాడు ఉత్తమ సిద్ధుల్ని పొందలేడు. అట్లాగే నీవు నన్ను పొందలేవు. నేను ఉత్తమమైన వంశంలో పుట్టాను. ఉత్తమమైన వంశానికి కోడలుగా వెళ్ళాను. నేను పతియే దైవమని నమ్ముకున్న పతివ్రతను. ఇటువంటి పాపకార్యాలు నేను చేయను, చేయలేను. పరభార్యనైన నన్ను నీవు భార్యగా కోరకూడదు. అది ధర్మం కాదు. కాబట్టి నీవు కూడా సత్పురుషుడు ఆచరించే నియమాల్నే ఆచరించు.

ఓ రాక్షసుడా! ఒక్కసారి ఆలోచించు. నీవు నీ భార్యల్ని ఎట్లా రక్షిస్తున్నావో నీకే తెలుసు. ఇతరులు ఎవరైనా నీ భార్యల్ని అపహరిస్తే నీకెట్లా ఉంటుందో ఆలోచించుకో! నీవు ఇతరుల భార్యను అపహరించితే వాళ్ళు కూడా అట్లాగే స్పందిస్తారు గదా? అందువల్ల నీ పాపపు ఆలోచనలు మానుకో. నీ భార్యలతో సుఖంగా ఉండు.

ఓ రావణుడా! చపల స్వభావుడైన వాడు తన భార్యల యందు సంతృప్తి చెందక, ఇంద్రియనిగ్రహాన్ని కోల్పోయి, నీచబుద్ధి గలవాడై పరభార్యల యందు ఆసక్తుడైతే, అది తప్పక వాడి పతనానికి దారితీస్తుంది. నీ బుద్ధి పెడదార్లు పడుతోంది. ఈ దేశంలో నీకు మంచి చెప్పేవాళ్ళే కరువైపోయారా? లేదా వారి మాటలు నీవు పెడచెవిన పెడ్తున్నావా? లేదా వారు నీ ముందుకు వచ్చి ధర్మం పలకడానికి భయపడుతున్నారా? ఏ రాజైతే, ధర్మమార్గాన్ని వదిలి అధర్మమార్గాన్ని అనుసరిస్తాడో అట్టి రాజు పరిపాలన కుంటువడుతుంది; ఐశ్వర్యంతో కూడిన దేశాన్నే నష్టపోతాడు. చివరకు ఆ నగరం కూడా సర్వనాశనమైపోతుంది. అటువంటి రాజు

దొరకడం లంకా ప్రజలు చేసుకున్న పాపం. కొద్దికాలంలోనే వాళ్ళ సర్వైశ్వర్యాలు మంటకలసిపోతాయి. తొందరపాటుతో దూరదృష్టి లోపించటం వల్ల నీవు చేసిన పాపాలే నిన్ను సర్వనాశనం చేస్తాయి; లోకంలోని ప్రాణులన్నీ సంతోషిస్తాయి. పాపకర్మలు చేస్తున్న నీ గతీ అంతే అవుతుంది. నీవు నశించటం వల్ల నీచే పీడించబడిన వారంతా సంతోషించి 'వాడు తీసుకున్న గోతిలో వాడే పడ్డాడని' అనుకుంటారు. ఐశ్వర్యము, ధనము చూపి నన్ను ప్రలోభపెట్టాలని చూడకు. కాంతి సూర్యుని నుండి ఎట్లా వేరుకాదో, అట్లాగే నేను రాముడి నుండి వేరు కాను.

ఓ రావణా! నేను ఇంతకాలం నా భర్త అయిన రాముని భుజాన్నే తలగడగా చేసుకొని నిద్రించేదాన్ని. ఇప్పుడు మరొకరి భుజాన్ని తలగడగా స్వీకరించలేను; స్వీకరించను. వేదాధ్యయనం చేసిన బ్రాహ్మణులు వేదాన్నే ఆశ్రయించి ఉన్నట్లుగా, సమస్త భూమండలానికి ప్రభువైన రాముడికి భార్యనయిన నేను రాముణ్ణే ఆశ్రయించుకొని జీవిస్తాను.

ఓ రావణా! దుఃఖించుచున్న ఆడఏనుగును గజరాజుతో చేర్చినట్లుగా నన్ను రామునితో చేర్చు. నీవు ఘోరమైన తప్పు చేశావు. అయినా నీవు జీవించి ఉండాలన్నా, నీ రాజ్యాన్ని నీవు పాలించాలన్నా, పురుషశ్రేష్ఠుడైన రాముని శరణు కోరుకో. ఆ మహాత్ముడు నిన్ను క్షమించి విడిచిపెడతాడు. ఎందువల్లనంటే ధర్మాలన్నీ తెలిసిన రాముడు శరణు కోరినవారిని రక్షిస్తాడన్న కీర్తి గలవాడు. ఆ విధంగా శరణు కోరుకుంటూ నన్ను రాముడికి ఒప్పగించు. ఓ రావణా! నీవు నేను చెప్పిన హితాన్ని పెడచెవినపెడితే నీవు మరణించడం తథ్యం!

ఓ రావణా! ఇంద్రుని వజ్రాయుధం నిన్ను ఏమీ చేయలేకపోవచ్చును. యముడు కూడా నీ విషయంలో కొద్దిసేపు తటపటాయించవచ్చునేమో! కానీ రాముడు మాత్రం విడిచిపెట్టడు. ఇంద్రుని వజ్రాయుధధ్వనిని మించిన రాముని ధనుష్టంకార ధ్వనిని వినబోతున్నావు. రామలక్ష్మణులు ప్రయోగించే బాణాలు లంకానగరాన్ని ముంచెత్తగలవు. ఆ బాణాల ధాటికి తట్టుకోలేక లంకలోని రాక్షసులంతా మరణిస్తారు. గరుత్మంతుడు సర్పాలను పట్టుకున్నట్లుగా,

రాముడనే ఈ గరుత్మంతుడు రాక్షసులనే సర్పాలను మట్టుపెడతాడు. విష్ణువు మూడడుగులు వేసి రాజ్యలక్ష్మిని రాక్షసుల నుండి తీసుకొనిపోయినట్లుగా, నా భర్త అయిన రాముడు అతిత్వరలో నన్ను నీ వద్ద నుండి తీసుకొనిపోగలడు.

ఓ రావణా! రాముడు జనస్థానంలోని రాక్షసులందర్నీ ఒక్కడే హతమార్చాడు. నువ్వు ఏమీ చాతకానివాడివై, స్త్రీనైన నన్ను రాముడు లేని సమయం చూసి అపహరించుకొని వచ్చావు. నీవు చేసింది అతి నీచమైన పని అని నీకే తెలుసు. పెద్దపులుల వాసన పసిగట్టిన కుక్కలు ఎట్లా పారిపోతాయో, రామలక్ష్మణులు వచ్చీరాగానే నీవు వారి ఎదుట నిలువలేవు. వృత్రాసురుడు ఒంటి చెయ్యివాడై, రెండు చేతులతో వెలుగొందిన ఇంద్రుని ధాటికి నిలువ లేకపోయాడు. అట్లాగే రామలక్ష్మణులు ఇద్దరూ కలసి వచ్చినప్పుడు నీవు వారి ఎదుట నిలువలేవు. అతిత్వరలో రామలక్ష్మణులిద్దరూ వచ్చి, చిన్ని తటాకంలోని నీటిని సూర్యుడు తన వేడిచేత హరించినట్లు, నీ ప్రాణాన్ని హరిస్తారు. నీ కుల నాశకాలం దగ్గరపడింది. రాముడి వాడియైన బాణాల నుండి తప్పించుకోలేవు. మహావృక్షం తనపైన పడుతున్న పిడుగులనెట్లా తప్పించుకోలేదో, అట్లాగే నీవు కూడా మరణాన్నుండి తప్పించుకోలేవు.

# 22వ సర్గ సీతకు రెండుమాసాల గడువునివ్వడం

రావణుడు సీత మాటలన్నీ విన్నాడు. సీత పట్లగల కామంచేత ఆమె మాటలు అప్రియంగా ఉన్నా, వాటిని పట్టించుకోకుండా ఇట్లా అన్నాడు.

రావణుడు : ఓ సీతా! ఆడుదానిని మగవాడు బ్రతిమాలిన కొద్దీ ఇంకా పైపైకి పోయి భుజాల మీద ఎక్కికూర్చుంటుంది. కామంతో ఉన్న మగవాడు ఎంతటివాడైనా లోకువకాక తప్పదు. కాముకుడు ఆడవాళ్ళను ఎంతగా సంతోషపెట్టాలని ప్రయత్నిస్తాడో అంతకు అంత అవమానపడిపోతాడు.

ఓ సీతా! నేను నిన్ను కామించాను. కామం చాలాచెడ్డది. ఎవరిపై మనకు కామం అధికంగా కలుగుతుందో, అటువంటి వారిపై జాలి, ప్రేమ, స్నేహం పెరిగిపోతాయి. విచ్చలవిడిగా పరిగెత్తే గుర్రాలకు సారథి వలె, ఈ కామం నా కోపాన్ని మన్మథుడనే సారథి వెనక్కు లాగుతున్నాడు. అందువల్ల నిన్ను నేను ఏమీ చేయలేకపోతున్నాను. నా అంతటి వాడికి నీవు నీతులు చెప్పినందుకు నిన్ను అనేక విధాలుగా పరాభవించాలి; కాదుకాదు, చంపివేసి ఉండాలి. కానీ కామం నా కోపాన్ని లాగిపడ్తోంది. నీవు నాతో అన్న ఒక్కొక్క పరుషమైన మాటకూ నిన్ను క్రూరంగా హింసించి చంపవలసింది. ఓ మైథిలీ! నేను నీకు రెండుమాసాలు గడువు ఇస్తున్నాను. అందమైన శరీరఛాయ గలదానా! ఆ రెండు మాసాల్లోపుగా నీవు నా పక్క నలంకరించాలి. అట్లా నీవు అంగీకరించని ఎడల నిన్ను చంపి, నీ మాంసాన్ని ఉదయంపూట ఫలహారంగా పుచ్చుకుంటాను.

రావణుడు ఈ విధంగా సీతను భయ పెడుతూ ఉంటే చూసి దేవగంధర్వ స్త్రీలు కళ్లు చెమ్మగిల్లగా దుఃఖించారు. దుఃఖం వలన ఏర్పడ్డ పెదవుల కదలికచే కొందరు, ముఖనేత్ర భంగిమలచే కొందరు సీతను ఓదార్చారు. ఆ విధంగా దేవ గంధర్వ స్త్రీలచేత ఓదార్చబడిన సీత ఇట్లా అంది.

సీతాదేవి : ఓ రావణుడా! ఓ రాక్షసుడా! నిన్ను ఈ విధమైన పాపపు పనులు చెయ్యవద్దని నివారించేందుకు ఎవరూ ఉన్నట్లు లేరు. అందువల్లనే నీ కళ్ళు మూసుకుపోయాయి. నోటికి వచ్చినట్లల్లా ప్రేలుతున్నావు. శచీదేవి ఇంద్రునికి భార్య అయినట్లుగా, నేను ధర్మాత్ముడైన రామునికి భార్యను. అట్టి నన్ను, నూకలుచెల్లిన నీవు తప్ప, మరెవరైనా కోరుకుంటారా? ఓ రాక్షసాధమా! అమితమైన తేజస్సుగల రాముని భార్యనైన నన్ను ఈ విధమైన పాపపు మాటలు అన్నందుకు, నీవు ఎక్కడకుపోయినా రామబాణం నుండి తప్పించుకోలేవు. నీకు ఆయుస్సు మూడింది.

ఓ రాక్షసుడా! నీవు రాముణ్ణి ఎదిరించడం అంటే చెవులపిల్లి మహాగజాన్ని ఎదుర్కొన్నట్లు అవుతుంది. నీవు ఇక్కడ దూరంగా నీ లంకలో కూర్చుని రాముని నిందిస్తున్నావు. అతడి కంటికి ఎదురుగా ఉండి ఒక్క మాట అన్నాగానీ నీ ప్రాణాలు ఈపాటికి గాలిలో కలిసిపోయి ఉండేవి. ఓరీ! దుష్టుడా! దుర్బుద్ధితో నన్ను అన్న మాటలకు నీ పిల్లికళ్ళు ఎందువల్ల రాలి నేలపై పడలేదో తెలియటం లేదు. ధర్మాత్ముడైన రాముని భార్యను, దశరథుని కోడలిని, మహాపతివ్రతను అయిన నన్ను గూర్చి ఇట్లా మాట్లాడిన నీ నాలుక ఎందువల్ల తెగి నేలపై పడలేదో తెలియటం లేదు. ఓ రావణుడా! నా పాతివ్రత్యం చేత నిన్ను కాల్చి బూడిద చేసి ఉండేదాన్నే, కానీ నాకు రామాజ్ఞ లేనందున నీవు ఇంకా బ్రతికి ఉన్నావు. బుద్ధిశాలి అయిన రాముని భార్యనైన నన్ను అపహరించుకొని వచ్చావే కానీ, నీ మత్యువునే కొనితెచ్చుకున్నావని తెలుసుకోలేకుండా ఉన్నావు.

ఓ రాక్షసాధమా! నీవు మహాశూరుడనని, కుబేరుడి సోదరుడనని, అధిక బలసంపన్నుడనని విర్రవీగుతున్నావే? అట్టి నీవు రాముని దూరంగా పంపి ఒంటరిగా ఉన్న నన్ను ఎందుకు అపహరించావు? ఇటువంటి నీచమైన కార్యం చేసినందుకు సిగ్గుపడటం లేదా?

రాక్షసరాజైన రావణుడు సీతాదేవి పలికిన పరుషమైన మాటలు విన్నాడు. క్రూరమైన అతడికళ్ళు పెద్దవిచేస్తూ సీతను చూశాడు. అప్పుడు రావణుడు నల్లని మేఘంలాగా ఉన్నాడు. కోపంతో అతడి కంఠము, భుజాలు ఉబ్బిపోయాయి. సింహంలాగా నడిచాడు. శోభగల అతడి

నేత్రాలు మండిపోతున్నాయి కోపంతో అతడి కిరీటం పై భాగాన ఉన్న మణులు కంపించాయి. విచిత్రమైన మాలల్ని ధరించాడు; రకరకాలైన సుగంధాలతో కూడిన పై పూతల్ని పూసుకున్నాడు. ఎర్రని వస్త్రాలు, ఎర్రని మాలలు ధరించాడు. మేలిమి బంగారంతో చేసిన కడియాలను బాహువులకు ధరించాడు. నల్లగా, లావుగా ఉన్న తాడును నడుముకు బిగించుకున్నాడు. అట్టి రావణుడు అమృతం కోసం సముద్ర మథనానికై వాసుకిని కట్టిన మందరపర్వతంలాగా ఉన్నాడు. ఎర్రటికుండలాలు ధరించాడు. అవి ఎర్రని చిగుళ్ళూ, పుష్పాలతో కూడిన రెండు అశోకవృక్షాల్లాగా ఉన్నాయి. కల్పవృక్షంలాగా ఉన్న అతడు మూర్తీభవించిన వసంతంలాగా ఉన్నాడు. చక్కగా అలంకరించుకున్న అతడు శ్మశానంలోని మంటపంలాగా భయంకరంగా ఉన్నాడు. అటువంటి రావణుడు కోపంతో ఎర్రగా మండే నేత్రాలతో సీతను చూస్తూ ఇట్లా అన్నాడు.

రావణుడు : “ఓ సీతా! నీవు ధనం లేని బికారీ, నీతిలేనివాడూ అయిన రాముణ్ణే తలపై పెట్టుకొని పూజిస్తున్నావు. సూర్యుడు తన కాంతిచేత చీకట్లను నాశనం చేసినట్లు నేను నిన్ను ఇప్పుడే చంపగలను.”

ఉగ్రరూపం దాల్చిన ఆ రావణుడు రాక్షస స్త్రీలను ఇట్లా ఆజ్ఞాపించాడు.

“ఓ రాక్షస స్త్రీలారా! మీరంతా కలసి సీతకు కావలి ఉంటే చాలదు. సామదానభేదదండోపాయాలన్నీ ప్రయోగించి ఆ సీత నాకు వశమయ్యేట్లు చెయ్యండి. ఆ పని అతిత్వరలో జరిగిపోవాలి” అని ఆజ్ఞాపించాడు.

అప్పుడు ధాన్యమాలిని అనే రాక్షసస్త్రీ రావణుని కౌగలించుకొని ఇట్లా అంది.

ధాన్యమాలిని : మహారాజా! రాక్షసరాజా! నీవు నాతో హాయిగా గడుపు. ఈ మానవస్త్రీ వద్ద నీవేం సుఖాలు అనుభవించగలవు? ఆమె శరీరం అంతా పాలిపోయి ఉంది. ఆమె నిన్ను ఏ విధంగానూ సుఖపెట్టలేదు. నీ కౌగలింతల్లో దొరికేది ఏమిటో ఈమె తెలుసుకోలేదు.

బ్రహ్మదేవుడు ఆమెకు అటువంటి నరాన్నే పెట్టలేదు కాబోలు! ఏ పురుషుడైనా తనను ప్రేమించని స్త్రీ వెంట పడితే అతడి శరీరం అంతా తాపం మిగులుతుందేగాని సుఖపడలేదు.

అంతట రావణుడు ఆమె కౌగలిలో నుండి లేచి వెనక్కు తిరిగి అంతఃపురానికి బయలుదేరాడు. అతడి వెనకాలే దేవకన్యలు, గంధర్వ కన్యలు, నాగకన్యలు మిగిలిన పరివారమూ అతడి అంతః పురంలోకి ప్రవేశించారు.

రావణుడు ఈ విధంగా సీతను భయపెట్టి తన స్త్రీలతో కలసి మన్మథ గృహంలోనికి ప్రవేశించాడు.

# 23వ సర్గ రాక్షస స్త్రీలు సీతకు ఉపదేశించటం

రాక్షసులకు రాజు, శత్రువులకు భయంకరుడు, దశకంఠుడు అయిన రావణుడు "ఎట్లాగైనా సీత నాకు వశం అయ్యేట్లు చేయండి" అని ఆజ్ఞాపించి తన స్త్రీలతో కలిసి వెళ్ళిపోయాడు. తరువాత ఒక రాక్షస స్త్రీ త్వరగా సీత వద్దకు పరిగెత్తుకొనివచ్చి ఇట్లా అంది.

రాక్షస స్త్రీ : ఓ సీతా! నీ అంత తెలివితక్కువ స్త్రీ ఈ ప్రపంచంలో ఎక్కడా ఉండదు. రావణుడు పదిశిరస్సులు గలవాడు. పులస్త్య వంశంలో జన్మించాడు. సర్వశ్రేష్ఠుడు, మహాత్ముడు. అటువంటి రావణుడు నిన్ను వలచి భార్యను చేసుకుంటానంటే నీవు ఒప్పుకోవడంలేదు. నీవు వట్టి తెలివితక్కువదానవు.

ఏకజట : పులస్త్యుడు బ్రహ్మకు మానసపుత్రుడు. అతడు ప్రసిద్ధి చెందిన ప్రజాపతి. ఇతడు ఆరుగురు ప్రజాపతులలో నాలుగవవాడు. అటువంటి పులస్త్యునికి విశ్రవశుడు మానస పుత్రుడు. ఈ విశ్రవశువు కూడా బ్రహ్మదేవుడంతటి తేజస్సు గలవాడు.

ఓ విశాలమైననేత్రాలు గల సీతా! శత్రుసంహారకుడైన ఈ రావణాసురుడు అట్టి విశ్రవశుని కుమారుడు. అటువంటి రావణునికి భార్యవు అయ్యేందుకు నీవు ముందూ వెనకా ఆలోచిస్తున్నావేమిటి? సర్వాంగ సుందరివైన ఓ సీతా! నా మాట విను. నేను నీ మేలుకోరి చెప్తున్నాను.

హరిజట : ఓ సీతా! ఈ రావణుడు సామాన్యుడు కాడు. ఇతడు దేవతలను, వారి ప్రభువైన దేవేంద్రుని జయించాడు. అటువంటి రాక్షసరాజుకు భార్యవు కావటం నీ అదృష్టంగా భావించు. నిన్ను మరీమరీ ప్రార్థిస్తున్నాడు గదా! అని చులకన చేయవద్దు. అతడిని వివాహం చేసుకోవటమే నీకు శ్రేయస్కరం.

ప్రఘస : ఓ సీతా! రావణుడు మహాబలవంతుడు; వీర్యవంతుడు; శూరుడు; యుద్ధంలో

వెనుకంజవేయనివాడు. గర్వించదగిన మదము గలవాడు. అటువంటి రావణునికి భార్యవయ్యేందుకు ఎందుకు నీవు ఇష్టపడటం లేదు?

మండోదరి రావణుని రాణులందరిలోకి చాలా భాగ్యం గలది. ఆమెయే పట్టపురాణి. రావణునికి ప్రియురాలు; గౌరవపాత్రురాలు. అట్టి మండోదరిని కూడా కాదని నువ్వే కావాలని నీ వెంటపడుతున్న రావణుని ఎందువల్ల నిరాకరిస్తున్నావు?

అంతఃపురం నిండా రత్నాలు; రత్నాలవంటి భార్యలే! వాళ్ళందరినీ వదలి నీ వద్దకు వస్తానని అంటూ ఉంటే నీవు ఎందువల్ల రావణుని ప్రార్థనను త్రోసిపుచ్చుతున్నావు?

వికట : ఓ నీచురాలా! సీతా! రావణుడు దేవగంధర్వాదులను అనేక పర్యాయాలు ఓడించాడు. అటువంటి రావణుడు నీ ముందు నిలబడి నీ ప్రేమను యాచిస్తున్నాడు. వీరుడు, శూరుడు, సకలైశ్వర్యసంపన్నుడు అయిన రావణుని భార్య కావటానికి ఎందువల్ల నిరాకరిస్తున్నావు?

దుర్ముఖీ : ఓ దీర్ఘనేత్రాలు కలదానా! రావణుని పరాక్రమం నీకు పూర్తిగా తెలియదు. అందువల్లనే నీవు రావణుని ప్రియురాలయ్యేందుకు ముందూవెనకా చూస్తున్నావు. రావణునికి భయపడి సూర్యుడి గట్టిగా తాపాన్ని చూపడు. వాయుదేవుడు గట్టిగా వీచడు. నా మాట విని రావణుని ఆజ్ఞను అంగీకరించి అతడికి భార్యవు కమ్ము.

ఓ సీతా! రాజాధిరాజు, రాక్షసరాజు అయిన రావణుని అనుజ్ఞ లేకుండా వృక్షాలు పుష్పించవు. మేఘాలు కూడా వర్షించవు. అటువంటి రావణునికి భార్య అయ్యేందుకు ఎందుకని అంగీకరించవు?

ఓ చక్కనిదానా! ఓ సీతా! నీ మేలు కోరి ఇంతగా చెప్తున్నాను. నా మాట విను. రావణుని మాట కాదన్నావంటే నీవు మరణించడం ఖాయం. కోరి ఎందుకు మరణం తెచ్చుకుంటావు.

# 24వ సర్గ రాక్షస స్త్రీలు సీతను భయపెట్టడం

రావణుని ఆజ్ఞ ననుసరించి ఆ రాక్షస స్త్రీలంతా మళ్ళీ సీతను చుట్టుముట్టారు. వాళ్ళంతా వికృతముఖాలతో పరుషమైన మాటలతో సీతను బాధపెట్టారు. అందరూ తలోమాటా అన్నారు: "ఓ సీతా! నీవు రాజాంతఃపురంలో ఉంటూ రాజభోగాలను కాదంటున్నావు. అంతఃపురంలో శ్రేష్ఠమైన శయనాగారాలున్నాయి. ఉత్తమమైన అలంకారాలు ఉంటాయి. వాటన్నింటినీ నీవు ఎందుకు నిరాకరిస్తున్నావు? నీవు మానవస్త్రీవని మానవుడికే భార్యగా ఉండటమే గొప్ప అని భావిస్తున్నావా? రాక్షసులమైన మేమంతా మనుష్యులకన్నా తక్కువవారమని, హీనమైనవారమని చులకనగా ఉందా? అటువంటి ఆలోచనలన్నీ కట్టిపెట్టు. రాముణ్ణి గూర్చి మరచిపో. రాముడు దరిద్రుడు; రాజ్యభ్రష్టుడు. ఏ కార్యమూ సాధించలేని అసమర్థుడు. అంతేకాకుండా, అసలు జీవించి ఉన్నాడో? లేడో? కూడా తెలియదు. అటువంటి రాముని గూర్చి మరచిపో. రాక్షసరాజు, ముల్లోకాలను జయించినవాడు, సర్వైశ్వర్యసంపన్నుడూ అయిన రావణునికి భార్య అయ్యేందుకు అంగీకరించు. లేకపోతే మేమంతా నిన్ను చంపి సమానంగా పంచుకుని తినేస్తాం."

వారి మాటలకు దుఃఖించి, కన్నీళ్ళు పెట్టుకుంటూ పద్మముల వంటి కన్నులగలదీ, మహాపతివ్రత అయిన సీత వారితో ఇట్లా అన్నది.

సీత : ఓ రాక్షస స్త్రీలారా! మీరు అన్నీ పాపపు మాటలే మాట్లాడుతున్నారు. మీ మాటల్ని ధర్మాత్ములెవరూ హర్షించరు. మానవస్త్రీ రాక్షసునికి భార్యగా ఉండలేదు. మీరు నన్ను చంపినాసరే, నేను మీ మాటలు వినను. దీనుడైనా, రాజ్యభ్రష్టుడైనా నా భర్త రాముడే నాకు దైవం. సువర్చలకు సూర్యునిపై ఉన్నట్లు, నేను కూడా ఎల్లప్పుడూ నా భర్త యందే అనురాగంతో ఉంటాను.

మహాపతివ్రతలైన శచీదేవి ఇంద్రునివలె; అరుంధతి వసిష్ఠునివలె; రోహిణి చంద్రునివలె; లోపాముద్ర అగస్త్యునివలె; సుకన్య చ్యవనుని వలె; సావిత్రి సత్యవంతునివలె; శ్రీమతి కపిలుని

వలె; దమయంతి సౌదాసునివలె; కేశిని సగరునివలె; దమయంతి నలుని వలె నేను కూడా ఇక్ష్వాకు వంశశ్రేష్ఠుడైన రామునే అనుసరించి జీవిస్తాను.

హనుమంతుడు ఆ శింశుపావృక్షంపైనే ఉండి ఇదంతా చూస్తున్నాడు. ఆ రాక్షస స్త్రీలు వణికిపోతున్న సీతను నాలుగువైపుల నుండీ చుట్టుముట్టారు. కోపంతో, పెదవులు నాకుకుంటూ సీతను చంపి తినటానికా అన్నట్లు మీద మీదకు వచ్చారు. వాళ్ళ చేతుల్లో గండ్రగొడ్డళ్ళున్నాయి. సీత మాటలు విన్న రాక్షస స్త్రీలు కోపంతో "ఈమె రాక్షస రాజైన రావణునకు భార్య అయ్యేందుకు తగనిది. ఈమెను చంపి తినేద్దాం" అన్నారు. భయంతో కంపించిపోయిన సీత కన్నీళ్ళు కారుస్తూ ఆ శింశుపా వృక్షం వైపుగా పరుగెత్తింది. రాక్షసస్త్రీలు ఆమెను వెంబడించి అక్కడకు కూడా వెళ్ళారు. దీనవదనంతో దుఃఖిస్తున్న సీతను ఇంకా భయపెట్టారు. వాళ్ళలో వినత అనే రాక్షసస్త్రీకి శరీరం అంతా వంకరటింకరగా ఉండి, పొట్ట లోతుకుపోయి ఉంది. ఆమె కోపంతో ఇట్లా అంది.

వినత : ఓ సీతా! ఇంతవరకు నీవు రామునిపై ప్రకటించిన ప్రేమ చాలు. ఇక ఆపు. దేనికైనా ఒక హద్దు ఉంటుంది. నీకు మల్లే హద్దూపద్దూ లేకుండా 'రాముడో, రాముడో' అంటూ కలవరిస్తూ కూర్చుంటే నీకు కష్టాలు తప్పవు.

ఓ సీతా! ఒక మానవస్త్రీగా నీ ధర్మాన్ని ఇంతవరకూ నిర్వర్తించావు. చాలా సంతోషం. ఇక చాలు. ఇకపైన నా మాటలు విను. నేను చెప్పినట్లు చేయి. సుఖపడతావు.

రాక్షస ప్రభువైన రావణుని భర్తగా అంగీకరించు. అతడు అతిలోకసుందరుడు. మహాపరాక్రమవంతుడు. దేవతలకు రాజైన దేవేంద్రుడి వంటివాడు. నేర్పరి; త్యాగశీలి; అందరికీ ఆనందాన్ని కలిగించే మా రాక్షసరాజును వరించు.

ఓ సీతా! మానవుడూ, దీనుడూ అయిన రాముణ్ణి మరచిపో. రాక్షసరాజు, సర్వసంపన్నుడయిన రావణుని ఆశ్రయించు. శరీరం అంతా దివ్యమైన మైపూతలు పూసుకొని శ్రేష్ఠమైన అలంకారాలన్నీ ధరించి, లోకాలన్నింటికీ ప్రభువైన రావణునికి దేవేరివి కమ్ము.

అగ్నిదేవుని భార్య స్వాహాదేవివలె, ఇంద్రుని భార్య శచీదేవివలె మహారాణివి కమ్ము. దీనుడైన రాముడి ఆయుర్దాయం తీరిపోయింది. అటువంటి రాముణ్ణి తలచుకుంటూ కాలం వ్యర్థం చేసుకుంటే లాభం ఏమైనా ఉంటుందా? పోయిన వాళ్ళు ఎక్కడైనా తిరిగివస్తారా? నా మాటలు, నేను చెప్పే హితవాక్యాలు విను. లేకపోతే మేమంతా కలసి ఇక్కడికిక్కడే ఇప్పుడే బ్రతికి ఉండగానే నిన్ను తినేస్తాం.

వ్రేలాడే స్తనాలతో, మహావికారంగాను, భయంకరంగాను ఉండే వికట అనే రాక్షస స్త్రీ పిడికిలి బిగించి గర్జిస్తూ సీత పైకి వస్తూ ఇట్లా అంది.

వికట : ఓసీ! దుర్మార్గురాలా! సీతా! ఇంతవరకు నీపై ఎంతో జాలి చూపించాం. ఎంతో ప్రేమతో మాట్లాడాం. నీవు మా సహనాన్ని పరీక్షిస్తున్నావు. మా మాటలు లెక్కచేయక మూర్ఖంగా ప్రవర్తిస్తున్నావు. ఇంతవరకూ ఎట్లాగో సహించాం. మెత్తగా ఉంటూ, నీపై జాలి చూపించాం. ఒక్క విషయం తెలుసుకో! ఈ సముద్రాన్ని దాటి ఈవలి ఒడ్డుకు ఎవరూ రాలేరు. నిన్ను ఇతరులు ప్రవేశించలేని రాజాంతఃపురంలో ఉంచారు. మేమంతా రావణునికి విశ్వాసపాత్రులమైన సేవకులం. మేము ఇంతమందిమి నిన్ను ఇన్ని విధాలుగా కళ్ళలో వత్తులు వేసుకొని కాపలా కాస్తూ ఉంటే, దేవేంద్రుడికి కూడా నిన్ను సమీపించేందుకు సాధ్యం కాదు. ఇక సామాన్య మానవమాత్రుడైన రాముడి మాట వేరే చెప్పాలా?

కాబట్టి ఓ సీతా! నేను చెప్తున్న హితవాక్యాలన్నీ శ్రద్ధగా విని మనస్సు కుదుటపరచుకో. వృథాగా కన్నీళ్ళు కార్చడం ఆపేయి. అనవసరంగా దుఃఖించకు. ప్రేమగాను, సంతోషంగాను ఉంటూ రావణుడితో కలసి సుఖంగా విహరించు. భయస్వభావాన్ని వదలిపెట్టు. మేమంతా నీ సేవకులమైపోతాము. నీ ఆజ్ఞలను శిరసావహిస్తూ సేవలు చేస్తాం.

ఓ సీతా! స్త్రీల యౌవనం ఎల్లకాలం ఉండేది కాదు. ఆ విషయం అందరికీ తెలిసిందే. నీకూ తెలుసు. కాబట్టి యౌవనం ఉండగానే సుఖాలు అనుభవించాలి. మత్తు కలిగించే చూపులు

గల ఓ సీతా! నీవు రావణునితో కలసి జీవించు. రమ్యమైన ఉద్యానవనాలలోను, పర్వతాలపైనా, సరస్సుల వద్దా విహరించు. నీవు రావణుని భర్తగా అంగీకరిస్తే ఏడువేల మంది స్త్రీలు నీ చెప్పుచేతల్లో ఉంటారు.

ఓ సీతా! నీవు నేను చెప్పిన హితం వినకపోతే నీ గుండెని చీల్చి, బైటకులాగి తినేస్తాను.

చండోదరి : ఓ సీతా! రావణుడు అపహరించి తీసుకొని వచ్చినప్పుడు నిన్ను నేను చూశాను. అప్పుడు నీవు లేడికన్నుల వంటి కన్నులతో బిత్తరచూపులు చూస్తున్నావు. భయంతో నీ స్తనాలు దడదడ కొట్టుకుంటూ ఉండటం చూశాను. ఆహా! ఈమె గుండెను, ఆ గుండె చుట్టూ ఉండే మాంసాన్ని, ప్రేగుల్ని తినాలని అనిపించింది. నీ శిరస్సు గూడా పగులకొట్టి ఆ లోపలుండే మాంసాన్ని తినాలనిపించింది.

పఘస : చెలికత్తెలారా! ఈ సీత చాలా క్రూరమైనది. ఈమె మంచి మాటలకు లొంగేది కాదు. వృథాగా కాలాన్ని వ్యర్థం చెయ్యవద్దు. నేను ఈమె పీక నులిమి చంపేస్తాను. తర్వాత పోయి "ఆ మానవ స్త్రీ చచ్చిపోయిం" దని రాజుగారికి చెప్దాం. అప్పుడాయన "అయితే మీరు ఆమెను తినేయండి" అని అంటారు.

అజాముఖీ : చెలికత్తెలారా! మనం ఈమెను చంపేద్దాం. తర్వాత ఈమె శరీరాన్ని అంతా సమానంగా పంచుకొని తినేద్దాం. ఈ నరమాంసానికి అనుపానంగా మద్యం, మరికొన్ని లేహ్యా పదార్థాలు కూడా తీసుకురండి.

శూర్పణఖ : అజాముఖీ చెప్పిందే బాగుంది. వెంటనే మీలో ఒకరు వెళ్ళి మద్యం తీసుకురండి. ఈ సీతను తిని, మద్యం తాగి ఆనందంగా నాట్యం చేద్దాం.

రాక్షస స్త్రీలంతా ఈ విధంగా భయపెడ్తూ ఉండగా దేవకన్య వంటి ఆ సీతాదేవి భయంతో బిగ్గరగా విలపించసాగింది.

# 25వ సర్గ సీతావిలాపం

క్రూర స్వభావం గల ఆ రాక్షసస్త్రీల మాటలన్నీ సీతను మరింత భయభ్రాంతురాల్ని చేశాయి. అంతకు పూర్వమే రావణుడు కూడా వచ్చి పరుషంగా మాట్లాడి వెళ్ళడంవల్ల భయంతో వణికిపోతూ ఉంది. గుంపు నుండి విడిపోయి, తోడేళ్ళ మధ్య చిక్కుకుపోయిన ఆడలేడిలాగా సీతాదేవి విలవిల్లాడిపోయింది. నిరంతర శోకం చేత సీత ఉత్సాహాన్ని పూర్తిగా కోల్పోయింది. నిండుగా పుష్పించిన అశోకవృక్షం క్రింద కూర్చొని రాముడినే మనస్సులో ధ్యానించుకుంటూ కూర్చుంది. అటువంటి స్థితిలో సీతాదేవి కంటికిమింటికి ఏకధారగా కన్నీరుపెట్టుకుంటూ ఉండగా ఆ కన్నీటితో స్తనములన్నీ తడిసి ముద్దయిపోయాయి. నేడో రేపో తనకు ఈ రాక్షస స్త్రీల వలన ఆపద రాగలదని తలుస్తూ, పెనుగాలికి ఊగిపోయే అరటిచెట్టులా ఊగిపోయింది. సీత అట్లా భయంతో ఊగిపోతూ ఉంటే పొడవైన ఆమె జడ కూడా ఊగిపోయి సర్పంలాగా కనిపించింది. అసలే భర్త వియోగంతో బాధపడుతున్న ఆ సీతకు రాక్షసుల బెదిరింపులతో ఆ బాధ రెట్టింపయింది. అట్లా దుఃఖిస్తూనే అప్రయత్నంగానే ఆమె "అయ్యో! రామా! అయ్యో! లక్ష్మణా! అయ్యో! కౌసల్యా! అయ్యో! సుమిత్రా" అంటూ విలపించింది.

అయ్యో! నేను భర్తకు దూరమై, ఈ రాక్షసులు పెట్టే బాధలు భరిస్తూ, క్షణక్షణం దుఃఖంతో కుమిలిపోతున్నానే! అయినా మరణం నన్ను కబళించలేదు గదా! కాలం తీరందే స్త్రీకైనా పురుషుడికైనా మరణం రాదుగదా! అని పండితులు చెప్పే ప్రమాణవాక్యం సత్యమే!

నేను అల్పమైన పుణ్యం చేసుకున్నాను. అందువల్లనే భర్తకు దూరమయ్యాను. అనాథలాగా, తుపాను గాలికి సముద్రం మధ్యలో ఉన్న నౌక లాగా మునిగిపోవలసిందే గదా! నేను ఈ రాక్షస స్త్రీల బారిన పడి భర్తను చూడలేక, నీటి చేత కూల్చబడిన ఒడ్డులాగా, శోకంతో నశించిపోతున్నాను.

ఉత్తముడు, పద్మరేకులవలె ఎర్రని కన్నులు గలవాడు సింహమువలె పరాక్రమవంతుడు,

ప్రియముగా మాట్లాడేవాడు; కృతజ్ఞుడు అయిన నా భర్త రాముని అదృష్టవంతులు మాత్రమే చూడగలరు. అట్టి ప్రియాతిప్రియమైన రాముడు లేకుండా జీవించలేను. విషం తిని జీవించటం ఎంత కష్టమో రాముడు లేకుండా జీవించడం కూడా అంతే కష్టం.

నేను పూర్వజన్మలో ఎన్నో పాపాలు చేశాను. అందువల్లనే నేనీజన్మలో అతిదారుణమూ, భయంకరమూ అయిన దుఃఖాన్ని అనుభవిస్తున్నాను. మరణించి ఈ దుఃఖాన్నుండి విముక్తి పొందాలని ఉన్నా ఈ రాక్షసస్త్రీలు కావలికాస్తూ ఉండగా నాకు ఆ కోరిక కూడా తీరేట్లు లేదు. ఇష్టం వచ్చినప్పుడు మరణించే స్వేచ్ఛ కూడా లేకుండా పోయింది గదా? పరాధీనత్వము ఎంత బాధాకరమైనది? ఈ మానవ జన్మయే దుఃఖదాయకం!

# 26వ సర్గ ప్రాణాలు విడవాలని సీత నిశ్చయించుకోవటం

సీతాదేవి నిరంతరం కన్నీళ్ళు కారుస్తూ తలవంచుకొని విలపిస్తోంది. ఆమె పిచ్చిదానిలాగా భ్రాంతిలో ఉన్నట్లుగాను, శరీర స్పృహ లేనిదానివలె, నేలపైపడి దొర్లే ఆడగుర్రంలాగా, దొర్లుతూ విలపిస్తోంది.

రాముడు లేని సమయం చూసి, కామరూపుడైన ఈ రావణుడు, విలపిస్తూన్న నన్ను అపహరించుకొచ్చాడు. ఇక్కడ ఈ రాక్షస స్త్రీల వశమైపోయాను. ప్రతినిత్యం వాళ్ళు పెట్టే బాధలు, భయం కలిగించే మాటలు, క్రూరమైన చేష్టలు భరిస్తూ దుఃఖంతో జీవిస్తున్నాను. ఈ జీవితంపై ఏమాత్రం మక్కువ లేకుండా ఉంది. మనోరథుడైన రాముడికి దూరంగా ఉంటూ, క్షణక్షణం ఈ రాక్షస స్త్రీల మధ్య భయంతో బ్రతుకుతున్న నాకు ధనంపైన గాని, అలంకారాలపైనగాని ఆసక్తి లేరు. చివరకు బ్రతుకుపై కూడా తీపిలేదు. ఈ హృదయం ఇనుముతో చేయబడ్డది కాబట్టే ఇన్ని దుఃఖాలు వచ్చినా, ఎన్ని కష్టాలు పడుతున్నా అది పగిలిపోకుండా ఉంది. ఛీ! రాముడు లేకుండా కూడా ఇంతకాలం బ్రతికి ఉన్నానంటే, నేనెంత పాపిష్టిదాన్నో గదా! నా భర్త సముద్రము వరకూ వ్యాపించి ఉన్న భూమికంతకూ ప్రభువు. చక్కగా మాట్లాడి అందరికీ ఆనందం కలిగించగలవాడు. అటువంటి భర్తకు దూరమైన నాకు జీవితం పైనగాని, సుఖాలపైనగాని ఆసక్తి లేదు. రాక్షసస్త్రీలనే ఈ శరీరాన్ని చీల్చి భక్షించనీ! నేను ఎంతమాత్రం అభ్యంతరం చెప్పను. భర్తకు దూరమై జీవించే ఈ దుఃఖమయ జీవితంకన్నా వాళ్ళ చేతుల్లో మరణమే మేలు. అంతేకాని ఆ నీచుడు, నిందింపదగిన రావణుని నా ఎడమకాలుతో కూడా తాకను. రావణుడిది ఒట్టి పాపిష్టి స్వభావం. నేను అతడిని అంగీకరించనని స్పష్టంగా చెప్పాను. అయినా అతడు మూర్ఖునివలె నన్ను వెంబడించి వేధిస్తున్నాడు. అతడు చేస్తున్న ఈ పాపపుపని వలన అతడు, అతడి వంశమూ నాశనమైపోతాయి. అది అతడు తెలుసుకోలేకుండా ఉన్నాడు.

ఓ రాక్షసాంగనలారా! మీరు నన్ను కోసుకొని తిన్నా సరే; ముక్కలుగా నరికినా సరే; మండేనిప్పుల్లో పడేసినా సరే! నేను మాత్రం రావణుణ్ణి అంగీకరించను. మీరు ఎంతసేపు ఎన్ని విధాలుగా భయపెట్టినా ఏమీ ప్రయోజనం ఉండదు. నా రామప్రభువు ప్రసిద్ధికెక్కిన వాడు; మహా బుద్ధిశాలి; కృతజ్ఞత తెలిసినవాడు. జాలి కలవాడు. మంచి చరిత్ర గలవాడు. నా దురదృష్టం చేతనే నన్ను దయతలచడం లేదని భావిస్తున్నాను. ఎందువల్లనంటే ఆనాడు జనస్థానంలో ఒంటరిగా పద్నాలుగు వేలమంది రాక్షసుల్ని హతమార్చిన నా రామప్రభువు ఈనాడెందుకు నన్ను దయతలచకుండా ఉన్నాడు? అత్యల్పమైన పరాక్రమం గల రావణుడు నన్ను ఇక్కడ బంధించాడు. నా భర్త యుద్ధంలో ఇతడిని సంహరించగల పరాక్రమం కలవాడు. రాముడు ఆనాడు దండకారణ్యంలో రాక్షసశ్రేష్ఠుడైన విరాధుణ్ణి చంపాడు. అట్టి రాముడు నన్ను ఎందుకు రక్షించడం లేదో! ఈ లంకా నగరం సముద్రం మధ్యలో ఉన్నా కూడా, రామబాణానికి ఏదీ అడ్డు ఉండదు కదా? రాముని పరాక్రమం అంతులేనిది. అటువంటి రాముడు ప్రియమైన భార్యనైన నన్ను రక్షించేందుకు ఎందుకని రావటం లేదు? బహుశా రామునికి నేను ఇక్కడ బంధించబడి ఉన్నట్లు తెలిసి ఉండకపోవచ్చును. నా జాడ తెలిసి ఉన్నట్లయితే మహాతేజశ్శాలి అయిన రాముడు ఈ అవమానాన్ని సహించగలడా? జటాయువు జీవించి ఉంటే, సీత రావణునిచే హరించబడిందని చెప్పి ఉండేవాడే! కానీ జటాయువు రావణుని చేత చంపబడ్డాడు. జటాయువు వృద్ధుడయినా, రావణుని ప్రతిఘటించి ద్వంద్వయుద్ధం చేసి నన్ను రక్షించటానికి శాయశక్తులా ప్రయత్నించాడు. చాలా గొప్ప పరాక్రమంతో రావణుని ఎదుర్కొన్నాడు. అయినా అతడు రావణుని చేత చంపబడ్డాడు. ఆ విధంగా దైవం ప్రతికూలం అయింది. నేను ఇక్కడ ఉన్నట్లు రామునికి ఏమాత్రం తెలిసినా, కోపించిన రాముడు ఈ లోకంలో రాక్షసులే లేకుండా చేసేవాడు. రాముడు తలచుకొంటే ఈ సముద్రాన్ని ఎండిపోయేట్లు చేయగలడు. ఈ లంకను ఉఫ్‌మని ఊదేసేవాడే! ఇప్పుడు నేను ఎట్లా విలపిస్తున్నానో, అదేవిధంగా ఈ లంకలోని స్త్రీలంతా తమ భర్తలను పోగొట్టుకొని ఏడుస్తూ ఉండేవాళ్ళు. రామలక్ష్మణులు, రాక్షసుల దేశమైన ఈ లంకను వెతికి తెలుసుకొని శత్రు సంహారం చెయ్యగలరు. వారిద్దరి కంటబడిన ఏ శత్రువూ ప్రాణాలు నిలుపుకోలేదు. రాముడు లంకలో రాక్షసులు లేకుండా చేస్తాడు. కొద్దిరోజుల్లోనే ఈ లంక అంతా

శ్మశానం అయిపోతుంది. ఈ నగరవీథులన్నీ రాక్షసుల చితులై వాటి నుండి వచ్చే పొగ పట్టణమంతా వ్యాపిస్తుంది. ఆ శవాల్ని తినేందుకు ఆకాశం అంతా గ్రద్దలతో నిండిపోతుంది.

ఓ రాక్షసాంగనలారా! మీరు నా యెడల చాలా దుర్మార్గంగా ప్రవర్తిస్తున్నారు. మీకు రోజులు దగ్గరపడ్డాయని నా మనస్సు చెప్తోంది. ఈ లంకలో చాలా అశుభమైన శకునాలు కనిపిస్తున్నాయి. వాటినిబట్టి ఈ లంక కొద్దిరోజుల్లోనే కాంతిహీనమై పోతుంది. రాక్షసాధముడైన రావణుడు చంపబడతాడు. ఈ లంక భర్త మరణించిన స్త్రీ వలె విధవ అయిపోతుంది. ప్రభువైన రావణుడు, అతడి అనుచరులైన రాక్షసులు మరణించగా లంకలో రాక్షస స్త్రీలందరూ విధవలై పుణ్యోత్సవాలకు దూరమైపోతారు. ఈ లంకలోని ప్రతి ఇంటి నుండీ స్త్రీల హాహాకార ధ్వనులతో ఆకాశం అంతా నిండిపోతుంది. రాముడి బాణాలతో ఈ లంకనంతటినీ కాల్చివేస్తాడు. ఇక్కడి రాక్షస వీరులంతా మరణిస్తారు. అప్పుడిది అంధకార బంధురమై పోతుంది. ఇది సత్యం. శూరుడైన నా భర్త నేనిక్కడ రావణుని గృహంలో ఉన్నట్లు తెలుసుకోగలడా? అయ్యో! క్రూరుడైన రావణుడు నాకు విధించిన గడువు పూర్తికావస్తోందే! నాకు విధించిన ఈ గడువు (మృత్యువు) ఈ దుర్మార్గుడికే సంభవిస్తే ఎంత బాగుంటుందో గదా!

వీళ్ళంతా నరమాంసం తినేవాళ్ళు. పచ్చిమాంసం తినేవాళ్ళు. వీళ్ళకు చేయవలసిన పనులేవో, చేయకూడని పనులేవో తెలియదు. ధర్మాధర్మ విచక్షణ అంతకు ముందేలేదు. ఈ రాక్షసాధముడికి నా మాంసాన్ని ప్రాతఃకాలం భోజనంలో వడ్డిస్తారు. నా రాముడు దగ్గర లేని నేను ఏం చేయగలను? పద్మరేకుల వంటి కన్నులు గల రాముడు దగ్గర లేకపోవటం చేత చాలా దుఃఖంలో ఉన్నాను. నాపై దయదలచి ఇంత విషం ఇచ్చేవారు కూడా దగ్గర లేరు కదా! ఉంటే విషం పుచ్చుకొని యమధర్మరాజు వద్దకు వెళ్ళి ఉండేదాన్ని! రామునికి, లక్ష్మణునికి నేను జీవించి ఉన్నట్లు తెలిసి ఉండదు. అట్లా తెలిస్తే తప్పక నా కోసం వెతికేవాళ్ళే! ఒకవేళ రాముడు నా వియోగాన్ని భరించలేనివాడై దేహాన్ని చాలించి స్వర్గానికి చేరి ఉంటాడా? అట్లాగైనా, నా రాముణ్ణి స్వర్గంలో దర్శించుకునే గంధర్వులు, దేవతలు, సిద్ధులు, మహర్షులు కృతార్థులైపోతారు గదా!

ఎంతో పుణ్యాత్ములై ఉంటారు. లేదా రాముడు జీవించియే ఉండవచ్చును. అట్లనయినచో, ధర్మనిష్ఠ చేతను, ఉత్తమమైన మనస్సు కలిగి రాజర్షియై వైరాగ్యం చెంది నన్ను మరచి ఉండవచ్చును. అటువంటి వైరాగ్యం పొందినవారికి భార్య వలన ఏం ప్రయోజనం ఉంటుంది.

ఎవరైనా వ్యక్తి ఎదురుగుండా ఉన్నంతసేపూ ప్రేమ కారిపోతూ ఉంటుంది. వాళ్ళు ఎదుటలేనప్పుడు ఆ ప్రేమ కాస్తా ఎండిపోతుంది. ఇది సామాన్యజనానికి వర్తిస్తుందేమో కానీ, నా రాముడు అటువంటి వాడు కాడు. అసాధారణ లోకోత్తరుడు. లోకాలన్నింటికీ ఆదర్శప్రాయుడు.

స్త్రీనైన నేను, రాముడు లేకుండా ఈ విధంగా కృశించిపోతున్నానే! నాలోని సద్గుణాలన్నీ నశించిపోయాయా? లేక నా పుణ్యం అంతా క్షీణించిపోయిందా? నా ఈ పరిస్థితికి కారణం ఏమై ఉంటుంది? మహాత్ముడు, శూరుడు, శత్రుసంహారకుడు, క్లేశములేనివాడూ అయిన రాముడు నేను లేకుండా జీవించటం కంటే అస్త్రసన్యాసం చేసి వనాలలో దొరికిన దుంపలు, పండ్లు తింటూ తాపసులైపోయాడా? లేదా కామరూపుడైన రావణుడు కపటోపాయంచేత రామలక్ష్మణులిద్దరినీ చంపించి ఉండవచ్చు. ఎన్నివిధాలుగా ఆలోచించినా మృత్యువే నాకు సరి అయిన పరిష్కారమని తోస్తోంది. కానీ మరణం నాకు సంభవించటం లేదే!

పాపాలు చేయనివారు, మనస్సును జయించినవారూ, ప్రియాన్ని, అప్రియాన్ని సమానంగా చూసే మహత్ములకు నమస్కారం. ప్రియుడైన రామునికి దూరమై, పాపాత్ముడైన రావణుని వశంలో ఉన్న నేను ప్రాణత్యాగం చెయ్యాలని అనుకొంటున్నాను.

# 27వ సర్గ త్రిజట స్వప్నం

సీత మాటలు విన్న రాక్షస స్త్రీలందరూ కోపంతో ఊగిపోయారు. “పాపాత్మురాలా! నీలో ఉన్నవన్నీ పాపపు ఆలోచనలే! నిన్ను ఎంతమాత్రం ఉపేక్షించకూడదు. నిన్ను చంపి ఇప్పుడే నీ మాంసాన్ని తింటాం” అంటూ సీతను బెదిరించి భయపెట్టారు. ఇంతలో కాపలా ఉన్న వాళ్ళల్లో వృద్ధురాలైన త్రిజట అనే రాక్షసస్త్రీ అప్పుడే నిద్ర లేచింది. ఆ త్రిజట కోపంతో, “దుర్మార్గులారా! మీరు తినవలసింది జనకుని కుమార్తె అయిన సీత మాంసం కాదు. మీ మాంసాన్ని మీరే తినబోతున్నారు. ఇప్పుడే నేనొక భయంకరమైన స్వప్నాన్ని కన్నా. ప్రాతఃకాలంలో వచ్చే కలలు నిజం అవుతాయని అంటారు. నేను ఆ స్వప్నంలో సీత భర్త అయిన రాముడు రావణుని సంహరించినట్లు చూశాను. ఆ స్వప్నం చూస్తూన్నంత సేపూ నాకు భయం పుట్టింది. రోమాంచమైంది” అన్నది.

క్రోధంతో ఉండి నిప్పులు చెరుగుతున్న ఆ రాక్షసస్త్రీలు కూడా భయభ్రాంతులయ్యారు. తనకు వచ్చిన స్వప్నం ఏమిటో మా అందరికీ వివరంగా చెప్పమని త్రిజటను వేధించారు. త్రిజట తన స్వప్నాన్ని గూర్చి ఇట్లా చెప్పింది.

త్రిజట: ఏనుగు దంతాలతో చేసిన పల్లకీ నొకదాన్ని వెయ్యి హంసలు మోస్తున్నాయి. అందులో రాముడు వచ్చాడు. అతడు తెల్లని మాలలు, వస్త్రాలు ధరించాడు. అతడితోపాటు ఆ పల్లకీలో లక్ష్మణుడు కూడా ఉన్నాడు. సీతాదేవి తెల్లటి పట్టువస్త్రాన్ని ధరించింది. సముద్రం మధ్యన తెల్లటి పర్వతంపై కూర్చుంది. సూర్యుడితో కాంతి కలసిపోయినట్లుగా, సీతాదేవి రాముడితో కలసిపోయింది. ఆ తెల్లటి ఏనుగు పెద్ద పర్వతం అంత ఉంది. దానిపై రామలక్ష్మణులు కూర్చుని ఉండటం నేను చూశాను. తెల్లటివస్త్రాలతోను, తెల్లటిపూలదండలతోను ప్రకాశిస్తున్న రామలక్ష్మణులు సీతాదేవి వద్దకు వెళ్ళారు. ఆ తెల్లటి పర్వతశిఖరంపై రాముడు ఎక్కగా, ఏనుగుపై సీతాదేవికూడా ఎక్కింది. అంతట ఆమె తన భర్త

ఒడిలో నుంచి లేచి నిలబడి సూర్యచంద్రుల్ని పట్టుకోవడం నేను చూశాను. తరువాత సీతాసహిత రామలక్ష్మణుల్ని ఎక్కించుకున్న ఆ దివ్యగజం లంకా పట్టణంపైగా ఆకాశంలో ఎగరటం నేను చూశాను.

తరువాత ఎనిమిది ఎద్దులు కట్టిన బండిలో రాముడు సీతను ఎక్కించుకొని ఇక్కడికి వచ్చాడు. అంతట సీతారామలక్ష్మణులు పుష్పక విమానం ఎక్కి ఉత్తర దిక్కుగా వెళ్ళారు. అప్పుడు రాముడు శ్రీమహావిష్ణువా? అన్నట్లుండటం నేను కలలో చూశాను. స్వర్గాన్ని పాపాత్ములు పొందలేనట్లే, తేజో వంతుడైన రాముణ్ణి కూడా దేవదానవులు కానీ, రాక్షసులు కానీ, మరెవరూ కూడా జయించలేరు.

మన ప్రభువైన రావణుడు గన్నేరు పూలదండలు వేసుకున్నాడు. ఎర్రని వస్త్రాలు ధరించాడు. నూనెతో తడిసిపోయి ఉన్నాడు. మద్యాన్ని పూర్తిగా త్రాగి పుష్పక విమానంలో నుండి క్రిందపడ్డాడు. అప్పుడతడి తల అంతా బోడిగా ఉంది. నల్లటిగుడ్డ చుట్టుకున్నాడు. ఒక స్త్రీ అతణ్ణి లాక్కుపోతోంది. ఎర్రటి పూలదండలు ధరించిన రావణుడు, ఒంటినిండా రక్తచందనం పూసుకొని నూనె త్రాగుతున్నాడు. నవ్వుతూ, పిచ్చెక్కిన వాడిలాగా నాట్యం చేస్తూ, తరువాత గాడిదలు కట్టిన రథంలో వెళ్ళాడు. కొంతసేపటికి రథాన్ని దిగి, ఒక గాడిద నెక్కి వేగంగా దక్షిణదిక్కుగా పోవడం స్వప్నంలో చూశాను. ఆ వేగానికి భయపడ్డ మన ప్రభువు ఆ గాడిదపై నుండి తలక్రిందులుగా పడిపోయాడు. మళ్ళీ లేచి కూర్చున్నాడు. త్రాగిన మైకం వల్ల నడుస్తూ ఉంటే కాళ్ళు తడబడ్డాయి; కట్టుకున్న గుడ్డలు ఊడిపోయాయి. పిచ్చి మాటలు మాట్లాడుతూ ఉంటే భరించలేనంతగా దుర్గంధం అతడి నోట్లో నుండి వచ్చింది. చీకటిగా ఉండటం వల్ల నరకం వంటి బురద గుంటలో పడ్డాడు. అప్పుడు ఎర్రటి చీర ధరించిన, కారుమేఘంలాగా నల్లగా ఉన్న స్త్రీ ఒకతె అతడి మెడకు తాడుకట్టి దక్షిణ దిక్కుగా లాక్కుపోయింది.

నిశాచరుడైన కుంభకర్ణుడు, రావణుని కుమారులు కూడా నాకు స్వప్నంలో కనిపించారు. వారంతా ఒంటినిండా నూనె పూసుకున్నారు. పందిపై ఎక్కి రావణుడు, మొసలిపై ఎక్కి

ఇంద్రజిత్తు, ఒంటెపై ఎక్కి కుంభకర్ణుడు దక్షిణదిక్కుగా వెళ్ళారు. విభీషణుడు మాత్రం తెల్లని మాలలు, వస్త్రాలు ధరించాడు. గంధం పూసుకున్నాడు. శ్వేతఛత్రం ధరించి నాకు స్వప్నంలో కనిపించాడు. ఆ విభీషణుడు శంఖ దుందుభుల శబ్దాల మధ్య, నృత్యం, గీతాలు ఆలపిస్తూ ఉండగా, పర్వతం లాంటి నాలుగుదంతాల ఏనుగుపై ఎక్కి నలుగురు మంత్రులతో కలసి ఆకాశంలో ఉన్నట్లు కనిపించాడు. రాక్షసులంతా నూనె త్రాగుతూ, ఎర్రటి మాలలు వస్త్రాలు ధరించి, వాద్యాలు వాయిస్తూ, పాటలు పాడుతూ ఉండటం చూశాను. రమ్యమైన లంకా పట్టణంలోని మేడలు, గోపురాలు, ముఖద్వారాలు కూలిపోవటం చూశాను. రావణుని నగరమైన ఈ లంకను రామదూత అయిన వానరుడు కాల్చివేయటం చూశాను. లంకా పట్టణం అంతా బూడిద అయిపోయింది. రాక్షసస్త్రీలంతా నూనె త్రాగుతూ వికటంగా గంతులు వేయడం నాకు కనిపించింది. కుంభకర్ణుడు మొదలైన రాక్షసశ్రేష్ఠులందరూ ఎర్రటి వస్త్రాలు ధరించి పేడతో నిండిన గోతులలో మునిగిపోవటం నేను స్వప్నంలో చూశాను.

ఓ రాక్షస స్త్రీలారా! మీరందరూ దూరంగా పోండి. లేకపోతే మీరు కూడా నాశనం అయిపోతారు. తన భార్యను పీడించారన్న కోపంతో రాముడు మిమ్మల్నందరినీ చంపేస్తాడు. సీతాదేవి రామునికి ప్రియాతి ప్రియమైన ప్రియురాలు. ఆయన భార్య మహాసాధ్వి. అటువంటి మహా పతివ్రతను ఎవరైనా కష్టపెడితే రాముడు తప్పక శిక్షిస్తాడు. అందువల్ల ఇక నుండి అయినా సీతతో స్నేహంగా మెలగండి. సీతకు ప్రియమైన పనులు చేస్తూ, రాముని దయకు పాత్రులమవుదాం. అదే మనకు మంచిది. ఎవరైనా స్త్రీ కష్టాల్లో ఉంటే, ఇటువంటి స్వప్నం చూస్తే, ఆ స్త్రీకి కష్టాలన్నీ తొలగి ఉత్తమమైన సంతోషాన్ని పొందుతుంది.

ఓ రాక్షస స్త్రీలారా! ఇప్పుడు ఏమనుకున్నా ఏమీ ప్రయోజనం లేదు. జరిగిందేదో జరిగిపోయింది. ఇకపై జనకుని కుమార్తె అయిన సీతాదేవికి నమస్కరించండి. అనుగ్రహించమని ప్రార్థించండి. ఈమె మహాదయగల సాధ్వి. మనల్ని తప్పక రక్షించగలదు.

మనం పెట్టిన కష్టాలవల్ల విశాలాక్షి అయిన సీతాదేవికి, శరీర కాంతి కొద్దిగా తగ్గింది.

ఈమెకు ఇటువంటి కష్టాలు రావలసినవి కాదు. అయినా కష్టాలు అనుభవించింది. ఇకపై ఈమె సర్వ సుఖభోగాలు అనుభవించగలిగినదని అనుకొంటున్నాను. ఎందువల్లనంటే రావణుని వినాశమూ, రాముని విజయమూ త్వరలోనే ఉన్నట్లు కనబడుతోంది. ఈమె ఎంతో శుభమైన వార్తను వినబోతోంది అని నాకు స్వప్నంలో కనిపించింది. ఇక్కడ కనిపిస్తున్న శకునాలు కూడా దానికి అనుకూలంగానే ఉన్నాయి. చూడండి. ఈ సీతాదేవి ఎడమ కన్ను అదురుతోంది. ఈమె ఎడమ భుజం కూడా అదురుతోంది. అందువల్ల రాముడు త్వరలోనే వస్తాడని, నా స్వప్నం యథార్థమైనదే అవుతుందని నాకు అనిపిస్తోంది. ఇటు చూడండి. ఆ చెట్టు కొమ్మ మీద పింగళపక్షి మధురంగా కూస్తోంది. అంటే రాముడికి స్వాగతం పలుకుతున్నట్లుంది. కాబట్టి రాముడు త్వరలోనే వస్తాడు. నా మాటలు నమ్మండి. నాకు వచ్చిన స్వప్నాన్ని యథార్థంగా మీకు చెప్పాను.

# 28వ సర్గ సీత ప్రాణత్యాగానికి సిద్ధమవటం

రాక్షసరాజైన రావణుడు పలికిన క్రూరమైన మాటలకు సీతాదేవి మనస్సు బాగా కలత చెందింది. అతడు పెట్టిన గడువు దగ్గర పడటంతో ఆమెలో భయం పెరిగిపోయింది. సింహాల గుంపులో చిక్కుకున్న ఆడ ఏనుగులా భయపడిపోయింది. రాక్షస స్త్రీల మాటలు కూడా ఆమె మనస్సును కలచివేశాయి. నట్టడివిలో ఒంటరి అయిపోయిన బాలిక వలె విలపించింది. తరువాత సీత ఇలా ఆలోచించింది: ఇంతమంది ఇన్ని కష్టాలుపెడుతున్నా, ఇంకా బ్రతికే ఉన్నాను అని అంటే, కాలం రానిదే మరణం కూడా రాదని పెద్దలు చెప్పేమాట నిజమేనని అనిపిస్తోంది. ఏ సుఖాలు లేకుండా, ఎన్ని కష్టాలు వచ్చినా సహించి ఇంకా గుండె బద్దలు కాకుండా ఉందీ అని అంటే, నా హృదయం చాలాగట్టిదని అనిపిస్తోంది. అందువల్లనే వజ్రాయుధంతో కొట్టబడిన పర్వతశిఖరంలాగా వెయ్యిముక్కలు అవటంలేదు. నా దోషం ఏమీ లేకపోయినా ఈ రావణుడు నన్ను వేధించుకు తింటున్నాడు. బ్రాహ్మణుడైనవాడు, బ్రాహ్మణుడుకాని వాడికి మంత్రోపదేశం చేయలేనట్లుగానే నేను కూడా ఈ రావణునికి మనస్సు ఇవ్వలేకుండా ఉన్నాను.

[ వివరణ : 'నా హృదయం వెయ్యిముక్కలు కావలసింది; కానీ కాలేదు; ఇక మిగిలిదేమంటే, నన్నతడు చంపి తినే ప్రక్రియ ఒక్కటే మిగిలివుంది. బ్రాహ్మణుడు వేదాన్ని ఏ విధంగా విడువలేడో, అదే విధంగా నేను ఈ రావణుని కోరికను అంగీకరించలేను.' ]

లోకములకు ప్రభువైన రాముడు రాకపోతే, శస్త్రచికిత్స చేత గర్భాన్ని ఛేదించి బిడ్డను ఎట్లా బయటకు తీస్తారో, అదే విధంగా, రావణుడు నా అవయవాలన్నీ శస్త్రముల చేత ఖండిస్తాడు. రాజు విధించే మరణ శిక్షను తెల్లవారుజామున అమలుపరుస్తారు. అట్లాగే రావణుడు నాకు ఇచ్చిన రెండు మాసాల గడువు ఆలస్యంగా గడుస్తోంది. నేను ఏం చేయగలను? నాకు ఎంతటి కష్టంవచ్చి పడింది? అయ్యో! రామా! అయ్యో! లక్ష్మణా! అయ్యో సుమిత్రా! అయ్యో కౌసల్యా! అయ్యో! నా తల్లీ! దురదృష్టవంతురాలనైన నేను నడి సముద్రాన తుపానులో

చిక్కుకున్న ఓడలాగా నశించిపోతున్నాను. అరణ్యంలో పిడుగుపాటుకు రెండు సింహాలు మరణించినట్లుగా, నాచే ప్రేరేపించబడటం వలన రామలక్ష్మణులిద్దరినీ మృగరూపంలో వచ్చిన రాక్షసుడు సంహరించాడేమో? అంతే అయివుంటుంది. ముందుగా నా భర్తను పొమ్మన్నాను, ఆ తర్వాత తెలివి లేనిదాననై అతడి తమ్ముణ్ణి కూడా పంపించి వేశాను. ఓ రామా! ఓ సత్యవ్రతుడా! ఓ మహాబాహువా! నీవు పున్నమిచంద్రుడి వంటివాడవు. సమస్త ప్రాణకోటికి మేలుచేసేవాడివి. అందరినీ సంతోషిపెట్టేవాడవు. ఇప్పుడు నేను ఈ రాక్షసునిచేతిలో చావబోతున్న సంగతి నీకు తెలియదుగదా?

ఓ రామా! నేను నిన్ను తప్ప ఏ దేవుణ్ణీ ప్రార్థించలేదు. ఎంతో ఓర్పుతో ఉంటూ వచ్చాను. కటికనేలమీదనే పడుకుంటున్నాను, ధర్మం తప్పకుండా ఆచరిస్తున్నాను, పాతివ్రత్య నియమాలన్నీ పాటిస్తున్నాను. ఇవన్నీ వ్యర్థమైపోయాయి. కృతఘ్నుడికి ఉపకారం చేస్తే ఎట్లా వ్యర్థమైపోతుందో అట్లాగే వ్యర్థమైపోయాయి. దూరమైపోయిన నిన్ను చూడగలననే ఆశతో బ్రతుకుతున్నాను, చిక్కి, సౌందర్యం మంతా చెడిపోయినా, నేను చేసిన ధర్మమంతా వ్యర్థమైపోయింది. ఈ పాతివ్రత్య నియామాలన్నీ పాటించాను. అవన్నీ నిష్ప్రయోజనమయ్యాయి.

ఓ ప్రభూ! మీరు పిత్రాజ్ఞను నియమబద్ధంగా పాటిస్తారు. చరితార్థులు అవుతారు, అరణ్యవాస దీక్ష పూర్తిచేసుకొని తిరిగి అయోధ్యకు వెళతారు. మీ కష్టాలన్నీ తీరిపోతాయి. అటుపైన నిర్భయంగా ఎంతమంది స్త్రీలతోనైనా హాయిగా క్రీడించగలుగుతారు. నేను మీ మీద అనురాగంచేత నా మనస్సు అంతా మీ మీదనే లగ్నం చేశాను. మీ కోసమే తపస్సు చేశాను. అవన్నీ నా నాశనానికి కారణా లయ్యాయి. నా తపస్సు అంతా వ్యర్థం అయిపోయింది. ఇటువంటి దురదృష్టపు జీవితం గడపడం కంటే మరణించడమే మేలుకదా! విషం తింటాను, వాడియైన ఆయుధంచే ప్రాణం విడుస్తాను. ఈ రావణాసురుడి రాజ్యంలో నాకు విషం కానీ, ఆయుధం కానీ ఇచ్చే దాతయే కరువయ్యారు.

ఈ విధంగా సీతాదేవి రకరకాలుగా ఆలోచిస్తూ రాముణ్ణి తలచుకుంటూ ఏడ్చింది.

దాహంతో గొంతు ఎండిపోయింది. అట్లాగే ఆలోచిస్తూ విరగబూసిన ఇరుగుడు చెట్టు మొదట్లోకిపోయి కాసేపు కూర్చుంది. నా జడ చాలా పొడవుగా ఉందిగదా! దాంతో మెడకు ఉరిపోసుకొని చచ్చిపోవాలి అని అనుకొంది. అట్లాగే ఆలోచిస్తూ ఉండగా మళ్ళీ మనస్సు రామలక్ష్మణుల మీదకుపోయింది. తన వంశాన్ని గూర్చి ఆలోచించింది. అట్లా ఆలోచిస్తూ ఉండగా ఆమెకు అనేక శుభశకునాలు కనిపించాయి. అవన్నీ శోకాన్ని తొలగించేవిగానూ, అత్యుత్తమమైనవిగానూ తోచాయి.

[ వివరణ : సీత మహాధర్మాత్మురాలు, ఆత్మహత్యవంటి పాపకార్యానికి పాల్పడదు. ఈ ప్రస్తావన ప్రాచ్యప్రతిలో లేదు ]

# 29వ సర్గ సీతకు కొన్ని శుభశకునములు కనబడటం

ఐశ్వర్యం లభించగానే సేవకులందరూ యజమానిని చుట్టుముట్టినట్లుగా, శింశుపావృక్షం దగ్గరకుపోయి విలపిస్తున్న సీతకు అన్నీ శుభ శకునాలే కనిపించాయి. వంకరలు తిరిగిన కనురెప్పల వెంట్రుకలతో, విశాలమూ నల్లగానూ తెల్లగానూ ఉన్న ఆ సీతాదేవి ఎడమ కన్ను, తామర కొలనులో చేప తాకిడికి అదిరిన పద్మంలా అదిరింది. ఏనుగుతొండమువలె కలసి దగ్గరగా ఉన్న రెండుతొడలలో ఎడమతొడ మాటిమాటికీ అదురుతూ, రాముడు ఎదురుగానే ఉన్నాడని చెప్తున్నట్లనిపించింది. చక్కగా గుండ్రముగా ఉన్న సీతాదేవి ఎడమభుజముపై రాముడు తలపెట్టుకొని పడుకునేవాడు. చాలాకాలంగా ఆ భుజానికి పనిలేకుండా (రాముడు లేకపోవటంవలన) పోయింది. ఈ రోజున ఆ భుజం కూడా అదురుతోంది. తెల్లనికన్నులు, గుండ్రంగా కొనలుతేరిన పలువరసతో, పొంకమయిన అవయవాలతో ఉన్న ఆ సీతాదేవి కట్టుకున్న బంగారురంగు చీరకొంగు జారిపడింది.

పూర్వంకూడా ఇటువంటి శకునాలు చక్కగా ఫలించడం సీతాదేవికి అనుభవంలో ఉన్నాయి. బాగా ఎండిన విత్తనాలు వాన చినుకులు పడగానే మొలకెత్తినట్లుగా సీతాదేవిలో కూడా ఆశలు మొలకెత్తాయి. దొండపండువంటి క్రింది పెదవి, చక్కటి కనుబొమలు, అందమైన కన్నులు, తెల్లటి పలువరుసతో శోభాయమానంగా వెలిగిపోతున్న ఆ సీతాదేవి ముఖబింబం అప్పుడే రాహువు నోట్లో నుండి బయటపడిన చంద్రబింబంలాగా కనిపించింది. దుఃఖం పోయింది, కలవరం సద్దుమణిగింది, తాపం శమించింది, సీతాదేవి ముఖచిత్తం సంతోషంతో శుక్లపక్ష చంద్రుడివలె ప్రకాశించింది.

# 30వ సర్గ హనుమంతుడి ఆలోచనలు

పరాక్రమశాలియైన హనుమంతుడు సీత పడుతున్న ఆవేదన అంతా స్వయంగా విన్నాడు. రాక్షసస్త్రీలు సీతాదేవిని భయభ్రాంతురాల్ని చెయ్యడం ప్రత్యక్షంగా చూశాడు. త్రిజట స్వప్న వృత్తాంతం అంతా అత్యంత ఆసక్తితో ఆలకించాడు. దేవతాస్త్రీ వలె ఉన్న సీతాదేవిని చూడగలిగాను, రామకార్యం సగం పూర్తి అయింది గదా! అని సంతోషించాడు. ఇకపై తను రామకార్యాన్ని ఎట్లా పూర్తిచెయ్యాలా అని పరిపరివిధాలుగా ఆలోచించాడు. కొన్ని వేలలక్షలమంది వానరులను నియోగించిన రామకార్యాన్ని నేను సాధించగలుగుతున్నాను గదా అని మరీమరీ సంతోషపడిపోయాడు. శత్రుబలాన్ని దృష్టిలో ఉంచుకొని ఎంతో నేర్పుగా, నిగూఢంగా గూఢచారిలాగా సంచరిస్తూ విషయాలన్నీ తెలుసుకోగలిగాను.

రాక్షసుల విశేషాలన్నీ కనిపెట్టాను; రావణాసురుని ప్రభావం, అతడి అంతఃపుర వైభవం అన్నీ ప్రత్యక్షంగా చూశాను. ఇప్పుడు నాకు లంక అంతా క్షుణ్ణంగా తెలుసు. ఇకపై సకల ప్రాణుల పట్ల దయగల మహాత్ముడైన రాముని భార్యను ఓదార్చాలి. ఆమె రాక్షసులు పెట్టే బాధలు తట్టుకోనిదై తల్లడిల్లిపోతోంది. ఇప్పుడు ఆమెను ఓదార్చడమే తక్షణ కర్తవ్యం అని అనుకున్నాడు.

ఇంతకాలం సీతాదేవి తన మనస్సులో మాట చెప్పుకోవటానికైనా, ఎవరూ కనిపించక, ఈ రాక్షసస్త్రీల అఘాయిత్యాలకు తట్టుకోలేకుండా మనసంతా వ్యాకులమై దుఃఖీస్తోంది. ఇంతదూరం వచ్చి, రాముని సందేశం సీతాదేవికి చెప్పకుండా వెళ్ళడం అవివేకమే అవుతుంది అని అనుకున్నాడు. అంతేకాదు; ఆమెను ఓదార్చకుండా వెళ్ళిపోతే, ఆమె ప్రాణత్యాగం చేసుకున్నా చేసుకోవచ్చు.

పూర్ణచంద్రుని వంటి ముఖం కలవాడు, మహాబాహువు అయిన ఆ రాముడు సీతను చూడాలని ఎంతో ఆసక్తితో ఉన్నాడు. అటువంటి రాముడికి ఈ శుభవార్త చెప్పి ఓదార్చటం కూడా నాకు కర్తవ్యమే. ఈ రాక్షసస్త్రీలంతా సీతాదేవిని చుట్టుముట్టి ఉన్నారు. సీతాదేవితో ఎట్లా

మాట్లాడి ఓదార్చాలో బోధపడకుండా ఉంది! ఈ సమస్యకు పరిష్కారం ఏమిటా! అని తలపట్టుకొని కూర్చున్నాడు. సూర్యోదయానికి ముందే ఈమెను కలుసుకొని మాట్లాడాలి. లేకపోతే ప్రాణత్యాగం చేసినా చెయ్యగలదు! అంతేకాదు, నేనుపోయి రాముడితో 'సీతను చూశాను' అని చెప్పినప్పుడు 'సీత నాతో ఏం చెప్పమంది' అని అడుగుతాడు, అప్పుడు రాముడికి నేను ఏమని సమాధానం చెప్పగలను? కాబట్టి నేను సీతాదేవిని కలసి, మాట్లాడి రాముడికి ఏదైనా సందేశాన్ని తీసుకొని వెళ్ళాలి. లేకపోతే రాముడికి కోపంవచ్చి ఆ తీక్షణ దృష్టితోనే కాల్చి బూడిద చేయగలడు. నేను రామలక్ష్మణుల్ని, సుగ్రీవుని సైన్యాన్నీ తీసుకుని వచ్చే లోపల సీత ఆత్మహత్యకు పాల్పడితే, పడ్డ శ్రమ అంతా వ్యర్థమైపోతుంది. కాబట్టి సీతను ఓదార్చిగానీ లంకను విడిచి వెళ్ళకూడదు, కాబట్టి నేను ఇక్కడే పొంచి ఉంటాను. రాక్షసస్త్రీలు ఏమాత్రం ఏమరి ఉన్నాసరే సీతాదేవిని కలుసుకుంటాను.

ఇప్పుడు నేను మరీ సూక్ష్మమైన వానరరూపంలో ఉన్నాను. ఈ మరుగుజ్జు వానర రూపంలో ఉంటూ మానవభాషయైన సంస్కృతంలో మాట్లాడాలి. అప్పుడు సీత నన్ను నమ్ముతుందా? నన్ను చూసి రావణుడేనని సందేహపడినా పడవచ్చు, అట్లా కాదని వేరే భాషలో మాట్లాడితే సీతకు అర్థంకాకపోవచ్చును. కాబట్టి మానవభాషలోనే మాట్లాడుతాను. నా రూపం, దానికి భిన్నమైన నా భాష చూసి సీత భయపడిపోయినా పోవచ్చును. అదీగాక కామరూపియైన రావణుడే ఈ రూపంలోవచ్చి ప్రలోభపెడ్తున్నాడని సందేహపడవచ్చును; భయపడి అరవవచ్చును. అప్పుడు యమకింకరులవలె ఉన్న ఆ రాక్షసస్త్రీలు ఆయుధాలు తీసుకొని నన్ను ముట్టడించవచ్చు. వాళ్ళు బలాన్నంతా కూడగట్టుకొని నన్ను పట్టుకోవడానికి ప్రయత్నిస్తారు. దాంతో నేను వాళ్లకు అందకుండా కొమ్మలు, రెమ్మల చాటున దాక్కోవాలి. అప్పుడు వాళ్ళకు అనుమానం మరీ ఎక్కువ అవుతుంది. నేను నా ఆకారాన్ని పెంచి ఈ వనంలో తిరుగుతూవుంటే ఈ రాక్షసస్త్రీలు భయపడి రావణుని భవనంలో ఉండే వీరులను కూడా పిలవవచ్చును. వాళ్ళంతా కలసి నాతో యుద్ధానికి దిగవచ్చును. వాళ్ళంతా తలోమూలా అడ్డుకుంటూ ఉంటే, నేను సముద్రాన్ని సునాయాసంగా దాటలేకపోవచ్చును. లేదా వీళ్ళల్లో చురుకైన వాళ్ళు నన్ను

పట్టుకొని బంధించవచ్చు. లేదా, సీతనే చంపవచ్చును. అట్లా జరిగితే మొత్తం కార్యమే చెడిపోతుంది. నన్ను వాళ్ళు బాధించినా, లేదా చంపివేసినా, ఈ సముద్రాన్ని దాటి, సీతను కాపలాకాస్తున్న రాక్షసుల్ని తప్పించుకొని సీతాన్వేషణకై రాగల సమర్థుడెవడూ కనిపించటంలేదు. రాక్షసులందరినీ యుద్ధంలో జయించగల సామర్థ్యం నాకు ఉన్నా కూడా తిరిగి సముద్రం దాటి వెళ్ళగల శక్తి ఉంటుందా? అదీకాక, యుద్ధంలో జయాపజయాలు ఎవరూ చెప్పలేరు. అనిశ్చితమైన కార్యాలు చెయ్యటం నాకు ఇష్టం లేదు. బుద్ధిమంతుడైనవాడు, అనుమానం లేకుండా నిశ్చయంగా జయం కలిగించే పనులే తలబెడతాడు.

నేను సీతతో మాట్లాడకుండా వెళితే, ఆమె ప్రాణత్యాగం చెయ్యవచ్చును. అట్లాకాకుండా సీతతో మాట్లాడే ప్రయత్నంచేస్తే ఇన్ని ఉపద్రవాలున్నాయి. తెలివితక్కువవాడు దూతగా వెళితే చేతికి అందివచ్చిన ఫలం కూడా అందకుండా పోతుంది. మేము పండితులం అని విర్రవీగే దూతలు కార్యాన్ని చెడగొడతారు. అంతవరకూ పడ్డ శ్రమ అంతా సూర్యోదయం కాగానే మంచు కరిగినట్లు నశించిపోతుంది.

లాభనష్టాలు బేరీజు వేసుకున్న తరువాత కూడా వివేకశూన్యుడైన దూతల్ని నియమిస్తే, ఆ పని సఫలం కాదు; ఎందుకంటే పండితులమనే దురభిమానం గల దూతలు కార్యాలను చెడగొడతారు.

ఇప్పుడు నేను ఏ విధంగా ప్రవర్తిస్తే కార్యం చెడిపోకుండా, సత్ఫలితాల్నిస్తుందో జాగ్రత్తగా ఆలోచించి చెయ్యాలి. లేకపోతే సముద్రాన్ని దాటివచ్చిన కష్టం అంతా వృథా అయిపోతుంది. సీత నా మాటలు విని భయపడకుండా ఉండేందుకు ఏదైనా ఉపాయం ఆలోచించాలి.

సీతాదేవి మనస్సు పూర్తిగా రాముడిపైననే లగ్నం అయివుంది. కాబట్టి రాముణ్ణి కీర్తిస్తూ, స్తుతివాక్యాలు పలుకుతూ ఆమెకి నమ్మకం కలిగేట్లు చేస్తాననుకొని గొప్ప ప్రభావం గల ఆ హనుమంతుడు చెట్టు కొమ్మల మధ్య నుండి సీతాదేవిని చూస్తూ అర్థయుక్తమైన మాటలతో ఇట్లా

# 31వ సర్గ హనుమంతుడు సీతకు కనిపించకుండా రామకథ వినిపించటం

బుద్ధిశాలియైన హనుమంతుడు రామకార్యం చెడిపోకుండా ఎట్లా సఫలం చెయ్యాలా? అని పరిపరివిధాలుగా ఆలోచించి, చివరకు సీతకు వినపడేట్లుగా రాముణ్ణి మధురాతిమధురంగా ఇట్లా కీర్తించాడు.

ఇక్ష్వాకువంశంలో గొప్ప యశస్సు గలవాడు, పుణ్యాత్ముడు, ధర్మాత్ముడైన దశరథుడనే మహారాజు ఉండేవాడు. అతడి వద్ద రథ, గజ, అశ్వాలతో కూడిన పెద్దసైన్యం ఉండేది. అతడు గొప్పబలశాలి అని కీర్తి గడించాడు. ఆ దశరథ మహారాజు గొప్ప గుణాలచేత రాజర్షులందరిలో శ్రేష్ఠుడు. తపస్సుచేత ఋషులందరితో సమానమైనవాడు, బలంలో దేవేంద్రుడితో సమానుడు. ఆ దశరథుడు దయాస్వరూపుడు, అహింసాపరుడు. నీచస్వభావం లేనివాడు, ఐశ్వర్యాన్ని ఎన్నోరెట్లు పెంచి గొప్ప ఐశ్వర్య సంపన్నుడయ్యాడు; పేరు సంపాదించుకున్నాడు. అతడి రాజ్యం నాలుగు సముద్రాల వరకూ వ్యాపించి ఉండేది. తను సుఖపడేవాడు ఇతరులను సుఖపెట్టేవాడు.

అట్టి దశరథ మహారాజుకు రాముడు పెద్ద కుమారుడు. ఆ రాముడి ముఖం చంద్రబింబంలాగా ఉంటుంది. ప్రాణం ఉన్నవారిలోనూ, ప్రాణంలేని వస్తువుల్లోకూడా ఉత్తమమైనవాటిని గుర్తించగల సమర్థుడు. ధనుర్విద్య నేర్చిన వారందరిలోనూ శ్రేష్ఠుడు. శత్రువుల్ని పీడించడంలో నేర్పరి. తన సత్ప్రవర్తన చేత ఇతరులకు ఆదర్శప్రాయుడు. ప్రాణులన్నింటికీ రక్షకుడు, సకల ధర్మాలను రక్షించేవాడు.

ఆ రాముడు సత్యవాక్య పరిపాలకుడు, పితృవాక్యపరిపాలకుడు. వృద్ధుడూ, తండ్రీయైన దశరథమహారాజు ప్రతిజ్ఞను సత్యం చెయ్యటం కోసం భార్యతోనూ, తమ్ముడైన లక్ష్మణుడితోనూ అరణ్యవాసం చెయ్యటానికి వెళ్ళాడు. అడవుల్లో నివసించే రోజుల్లో దుర్మార్గులూ, ధర్మానికి హాని కలిగించేవారూ, నరమాంసభక్షకులూ అయిన పదిహేడువేలమంది రాక్షసుల్ని సంహరించాడు.

రావణుడనే రాక్షసరాజు జన స్థానంలో తన అనుచరులైన ఖరుడు, ధూషణుడు మున్నగువారు రాముడిచే సంహరించబడటం సహించలేకపోయాడు. ఆ కోపం మనస్సులో పెట్టుకొని మాయామృగాన్ని ఎరగా చూపి రామలక్ష్మణులు ఇంట్లోలేని సమయం చూసుకొని రాముడి భార్యయైన సీతాదేవిని అపహరించాడు.

దోషములులేని ఆ సీతాదేవిని వెతుకుచూ, అడవుల్లో సుగ్రీవుడనే వానరరాజుతో స్నేహం చేశాడు. తరువాత మహాబలశాలియైన వాలిని చంపి, మిత్రుడైన సుగ్రీవుణ్ణి రాజుని చేశాడు. సుగ్రీవుడు రామునికి ప్రత్యుపకారం చెయ్యాలని స్వేచ్ఛారూపాన్ని ధరించగల లక్షలాది వానరుల్ని సీతాన్వేషణ కోసం నాలుగు మూలలకు పంపించాడు. విశాల నేత్రాలుగల సీతాదేవి ఇక్కడ లంకలో ఉందని సంపాతి చెప్పాడు. నేను సీతాదేవిని కనిపెట్టి చూసేందుకు నూరుయోజనాల సముద్రాన్నీ దాటి ఇక్కడికి వచ్చాను. సీతాదేవిని వెతకడానికి వస్తున్న నాకు రాముడు సీత ఎట్లా ఉంటుందో వర్ణించి చెప్పాడు. రాముడు చెప్పిన రూపవర్ణనలన్నీ నేను ఇప్పుడే మీలో చూసి మీరే సీత అని నిర్ధారణ చేసుకున్నాను.

హనుమంతుడు ఈ విధంగా మాట్లాడి ఊరకున్నాడు. సీతాదేవి ఈ మాటలన్నీ విన్నది. ఎంతో ఆశ్చర్యపడింది. దుఃఖంచేత తనలోని చైతన్యాన్ని కోల్పోయింది. పొడవాటి జుట్టుగలదీ, భయస్వభావురాలైన సీత శింశుపావృక్షంపై ఈ మాటలు వినపడిన దిక్కుగా తలపైకెత్తి చూసింది. హనుమంతుడి మాటలు విన్న దిక్కుగా చూసింది. మనస్సంతా రాముణ్ణే నింపుకొని నాలుగు వైపులా చూస్తూ చాలా సంతోషించింది.

అంతట సీత ప్రక్కలకు, పైకి, క్రిందకు చూస్తూ, బుద్ధిబలం గలవాడూ, సుగ్రీవుడి మంత్రి, వాయుపుత్రుడు, ఉదయాద్రిపై వెలిగిపోయే సూర్యుడులాగా ప్రకాశిస్తున్న హనుమంతుణ్ణి చూసింది.

# 32వ సర్గ హనుమంతుని చూసిన సీతకు కలిగిన ఆలోచనలు

ఆ శింశుపావృక్షపై కొమ్మల చాటున దాగివున్న హనుమంతుణ్ణి సీతాదేవి చూసింది. అతడు పచ్చటి పసిడిరంగులో మెరిసిపోతున్నాడు. తెల్లనివస్త్రాలు ధరించాడు. మెరుపుతీగలాగా ఉన్నాడు. అతణ్ణి చూసి సీతాదేవి కలవరపడింది, ఆశ్చర్యపడింది. ఇట్లా ఆలోచించింది.

'ఈ వానరుడి రూపం భయంకరంగా ఉంది. చూడశక్యం కాకుండా ఉంది అయ్యో!' అని అనుకుంది. స్పృహతప్పినట్లైంది. చేష్టలుడిగిన ఆ సీతాదేవి దీనంగా జాలిగొలిపే గొంతుతో "హా! రామా! హా! లక్ష్మణా!" అంటూ మంద్రస్థాయిలో విలపించసాగింది. ఆ చెట్టుకొమ్మ పైన చూసిన వానరశ్రేష్ఠుని గూర్చి పరిపరి విధాలుగా ఆలోచించింది.

ఇప్పుడు నేను కల కనలేదు కదా? అనుకొని కళ్ళు నులుముకుంది. కలలో కోతి కనిపిస్తే అరిష్టం అనీ, ఆత్మ బంధువులు నాశనం అయిపోతారనీ శాస్త్రాలలో చెప్పారు. నా భర్త రాముడు, అతడి సోదరుడు లక్ష్మణుడు, నా తండ్రి జనకమహారాజు సుఖంగా ఉండాలి.

లేదు, లేదు ఇది కల కాదు. ఈ రాక్షసాంగనలు పెట్టే బాధల్తోనూ, రావణుడి బెదిరింపులతోనూ నేను నిద్రపోయి చాలాకాలం అయింది. కనుక కల కాదు. యథార్థమే! నేను సర్వకాల సర్వావస్థల్లోనూ రాముణ్ణే ధ్యానిస్తున్నాను. అందువల్ల నా మనస్సు ఎప్పుడూ రామకథల్నే తలచుకుంటూ ఉంటుంది. నా మనస్సు ఎల్లప్పుడూ రామవిరహంతో బాధపడుతూ అతడిని గూర్చే మన్మథుడి చేత పీడించబడుతుంది. అందువల్లనే ఎప్పటికైనా నా మనస్సులోని కోరిక తీరగలదని ఊహించుకుంటూ ఉంటాను. ఊహలదేముంది? ఏ రూపంలోనైనా ఉండవచ్చును గదా? కాదు! ఇతడు మాత్రం స్పష్టమైన ఆకారంతో నాతో మాట్లాడుతున్నాడు. ఇతడు ఎవరై ఉంటాడు? దీనికి కారణం ఏమై ఉంటుంది.?

బృహస్పతికి, దేవేంద్రుడికి, బ్రహ్మదేవుడికి, అగ్నిదేవుడికి నమస్కరిస్తున్నాను. ఈ

వానరుడు నాతో అన్న మాటలు సత్యం కావాలని కోరుకుంటున్నాను. ఇది అసత్యమో, మరొకటో కాకుండా ఉండాలి.

# 33వ సర్గ సీత హనుమంతునికి తన వృత్తాంతం చెప్పటం

పగడం వంటి ఎఱ్ఱనిముఖం గలవాడూ, మహాతేజశ్శాలీ, వాయుపుత్రుడూ అయిన ఆ హనుమంతుడు వినయంగా రెండు చేతుల్తో దోసిలి పట్టి శిరస్సువంచి సీతాదేవిని సమీపించి నమస్కరిస్తూ ఇట్లా అన్నాడు. “పద్మములవంటి నేత్రములు గలదానా! మాసిపోయిన పట్టువస్త్రాన్ని ధరించిన ఓ సాధ్వీ! ఎట్టి దోషాలు లేనిదానా! ఇక్కడ ఈ చెట్టు క్రింద శోకంతో నిలబడి ఉన్న నీవెవరు? తామరపూవులవంటి నీ రెండు నేత్రాలనుండి కన్నీరుకారుతూ ఉండటానికి కారణం ఏమిటి? సురులు, అసురులు, నాగులు, గంధర్వులు, రాక్షసులు, యక్షులు, కిన్నెరులలో నీవు ఏ జాతికి చెందినదానవు? నీవు రుద్రగణములలోని దానవా? లేక మరుద్గణములకు చెందిన దానవా? శ్రేష్ఠమైన కటిప్రదేశం గలదానా! నీవు దేవతాస్త్రీవి అయి ఉంటావని అనుకొంటున్నాను. నీవు స్వర్గం నుండి భూలోకానికి పడిపోయిన దేవతవా? లేక చంద్రుడికి దూరమై నక్షత్రమండలం నుండి జారిపడిన రోహిణివా? ఓ నల్లనినేత్రములు గలదానా? వసిష్ఠుని కోపానికి గురియై ఇక్కడకు వచ్చిన అరుంధతివా? శ్రేష్ఠమైన నడుము గలదానా! ఎవరో మరణించిన వారిని గూర్చి ఏకాంతంలో దుఃఖీస్తున్నట్లుగా కనబడుతున్నావు. ఎవరా మరణించిన వారు? నీ భర్తయా? నీ తండ్రియా? నీ సోదరుడా? లేక నీ పుత్రుడా? నీవు మళ్ళీమళ్ళీ నిట్టూరుస్తున్నావు, ఏడుస్తున్నావు, భూమిని తాకుతూ దుఃఖీస్తున్నావు? నిన్ను చూస్తూవుంటే ఎవరో మహారాజుకు కుమార్తెవనో, ఎవరో చక్రవర్తికి భార్యవనో అనిపిస్తోంది. అట్లా అయితే దేవతా స్త్రీవై ఉండవు? నీ అవయవ సౌష్ఠవం, సాముద్రిక లక్షణాలను బట్టి చూడగా నీవు ఎవరో క్షత్రియుడైన చక్రవర్తికి భార్యవై ఉంటావని తెలుస్తోంది.

“నీకు సర్వశుభాలు కలగాలని కోరుకుంటున్నాను. జనస్థానం నుండి రావణుడు బలాత్కారంగా తెచ్చిన సీతవు కావు కదా? నీలోని అతిలోక సౌందర్యం చేతనూ, తపస్సు చేస్తున్న వేషాన్ని, నీ దైన్యస్థితిని చూస్తూవుంటే నీవు రాముని భార్యవేమోనని నాకు అనిపిస్తోంది.”

హనుమంతుడు రాముని గూర్చి చెప్పిన మాటలు విని సీత చాలా సంతోషించింది. వృక్షంపై కూర్చున్న హనుమంతుడితో సీత ఇట్లా అంది.

"ఈ భూమండలంలోని రాజులలో శ్రేష్ఠుడు, బుద్ధిబలం గలవాడు, శత్రుసంహారకుడు అయిన దశరథమహారాజుకు నేను కోడలిని. ధర్మాత్ముడైన విదేహరాజు జనకుని కుమార్తెను. రామునికి భార్యను. నన్ను సీత అని అంటారు. నేను రామునితో కలసి సమస్తభోగాలు అనుభవిస్తూ పన్నెండు సంవత్సరాలు ఉన్నాను. పదమూడవ సంవత్సరం దశరథమహారాజు పెద్దలను సంప్రదించి రాజపురోహితులచే రామునికి రాజ్యాభిషేకం చేయడానికి ముహూర్తం నిశ్చయించారు. అన్ని ఏర్పాట్లు జరిగిపోయాయి. ముహూర్తానికి కొద్దిగంటల ముందు కైకేయి అను రాణి తన భర్తయిన దశరథునితో ఇట్లా అంది.

'ఓ మహారాజా! రాముడి రాజ్యాభిషేకాన్ని వెంటనే నిలిపి వేయండి. అట్లా నిలిపివేయకపోతే నేను ప్రాయోపవేశం చేసి ప్రాణాలు విడుస్తాను. ఓ రాజా! పూర్వం ప్రేమపూర్వకంగా నా కిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకొనే పక్షంలో రాముణ్ణి అరణ్యాలకు పంపించు.' కఠోరమూ, అప్రియమూ అయిన కైకేయి పలుకులు విని దశరథమహారాజు, పూర్వం తాను కైకేయి కిచ్చిన వరాలను జ్ఞప్తికి తెచ్చుకొని మూర్ఛిల్లాడు. సత్యనిష్ఠుడు, ధార్మికుడు అయిన వృద్ధుడైన ఆ దశరథమహారాజు తన జ్యేష్ఠపుత్రుణ్ణి రాజ్యాధికారం త్యజించమని యాచించాడు. శ్రీమంతుడైన రాముడు రాజ్యాభిషేకం కన్నా తండ్రి ఆజ్ఞను పాటించడమే ప్రియతమమని భావించి త్రికరణశుద్ధిగా రాజ్యం వదలుకొన్నాడు.

నిజమైన పరాక్రమవంతుడైన రాముడు ఇతరులకు దానం చేస్తాడేగాని, ఇతరుల నుండి తాను ఏదీ పుచ్చుకోడు. ప్రాణాపాయస్థితిలో సైతం అప్రియాన్ని మాట్లాడడు. కీర్తిమంతుడైన రాముడు ధరించిన విలువైన వస్త్రాలను వదలి, నార వస్త్రాలు ధరించి, రాజ్యాన్ని పరిత్యజించాలని సంకల్పించి, నన్ను తన తల్లికి అప్పజెప్పాడు.

రాముడు లేని స్వర్గవాసం కూడా నాకు ఇష్టం కాదు. అందువల్ల నేనూ అరణ్యవాసానికి నిశ్చయించుకొని, ఆయనకన్నా ముందుగా అరణ్యాలకు బయలుదేరాను. మిత్రులను ఆనందింపజేసేవాడూ, గొప్ప భాగ్యవంతుడూ అయిన లక్ష్మణుడు అన్నగారిని అనుసరింప నాకన్నా ముందే నారవస్త్రాలు ధరించి తయారయ్యాడు.

ఈ విధంగా మేం ముగ్గురమూ రాజాజ్ఞను శిరసావహిస్తూ, నియమనిష్ఠలను పాటిస్తూ, పూర్వం ఏనాడూ కనీవినీ ఎరుగని భయంకరారణ్యంలో ప్రవేశించాం. మహా తేజస్వియైన రాముడు దండకారణ్యంలో నివసిస్తూండగా, ఆయన భార్యనైన నన్ను దురాత్ముడైన రావణుడు అపహరించి ఇక్కడకు తెచ్చాడు. ఆ రావణుడు నాకు రెండు నెలలు గడువు ఇచ్చాడు. రెండు నెలల తరువాత నేను జీవించి ఉండను.”

# 34వ సర్గ సీత హనుమంతుని సందేహించటం

వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు ఎడతెరిపి లేకుండా అడుగడుగున దుఃఖంతో బాధపడుతున్న ఆ సీతాదేవి చెప్పిందంతా విని, ఓదార్పు మాటలతో ఇలా అన్నాడు:

విదేహ రాజకుమారీ! ఓ సీతాదేవీ! నేను రాముడు పంపగా వచ్చాను. నేను రాముడి దూతను. రాముడు క్షేమంగా ఉన్నాడు. నీ క్షేమం కూడా అడిగి తెలుసుకోమని నాతో మరీమరీ చెప్పాడు. వేదవేత్తలలో గొప్పవాడూ, బ్రహ్మాస్త్రమును తెలిసినవాడూ అయిన రాముడు నీ క్షేమాన్ని తెలుసుకొని రమ్మన్నాడు. నీ భర్తకు చాలా ఇష్టుడు, అనుచరుడు, సోదరుడు అయిన లక్ష్మణుడు కూడా నిన్ను గూర్చి బాధపడుతూ శిరస్సు వంచి నీకు నమస్కరిస్తున్నానని చెప్పమన్నాడు.

రామలక్ష్మణుల క్షేమవార్త వినగానే ఆనందంతో సీతాదేవి శరీరం అంతా దూదిపింజలాగా తేలికగా అయిపోయింది. అవయవాలన్నీ గగుర్పొడిచాయి. హనుమంతుడితో ఇట్లా అంది:

"మనిషి బ్రతికి ఉంటే చచ్చే లోపల ఆనందం పొందగలుగతా" డని పెద్దలు అంటూ ఉంటారు. ఆ మాట నిజమేనని నాకు ఇప్పుడు అనిపిస్తోంది.

రామలక్ష్మణుల మాట మరొకసారి నోటి వెంట విన్న సీతాదేవికి కలిగిన ఆనందం వల్ల హనుమంతుడి ఎడల స్నేహభావం ఏర్పడింది. అతడితో మనస్సు విప్పి మాట్లాడసాగింది. అంతలో హనుమంతుడు చెట్టుపై నుండి దిగివచ్చి సీతాదేవికి దగ్గరగా వెళ్ళాడు. హనుమంతుడు ఆ విధంగా తనకు దగ్గరగా రావడం చూసిన సీతాదేవి అతడు రావణుడేమోనని సందేహించింది. "అయ్యో! రాముడి మాట వినగానే ఒళ్లు మరచిపోయాను. ఎంత పెద్దతప్పు చేశాను. రావణుడే ఈ రూపం ధరించివచ్చాడు" అని అనుకుంది. వెంటనే సీత పట్టుకుని నిల్చున్న ఆ చెట్టుకొమ్మను చివాలున విడిచిపెట్టి వెళ్ళి దూరంగా నేలపైన కూర్చుంది.

ఈ రాక్షసాంగనలు పెట్టే బాధలకు, కామరూపుడైన రావణుడి బెదిరింపులతో భయార్తయై దుఃఖంలో మునిగి ఉండటం వల్లను, ఒంటరిదైపోవటం వల్లనూ ఎవరినీ నమ్మలేని స్థితిలో సీతాదేవి ఉన్నదని గ్రహించిన హనుమంతుడు అక్కడే నిలబడి ఏం చేయాలో తోచక రెండుచేతులూ జోడించి శిరస్సు వంచి నమస్కరించాడు. సీతాదేవి భయభ్రాంతురాలవడం వల్ల హనుమంతుడి వైపు కన్నెత్తికూడా చూడలేదు. అయినా హనుమంతుడు తనకు నమస్కరిస్తున్నాడని గ్రహించిన సీత మెల్లగా నిట్టూరుస్తూ ఇట్లా అంది:

సీత : నీవు రావణుడవే. మాయారూపంలో వచ్చి నన్ను మభ్యపెట్టి లోబరచుకోవాలని చూస్తున్నావు. నీవు నన్ను రకరకాలుగా బాధిస్తున్నావు. ఇది నీకు మంచిది కాదు. ఇంతకు ముందు కూడా నీవు జనస్థానంలో మాయాసన్యాసి రూపంలో వచ్చి నన్ను అపహరించుకొని వచ్చావు. మళ్ళీ ఈనాడు ఈ వానరరూపంలో మభ్యపెడ్తున్నావు. కామరూప విద్య తెలిసిన ఓ రాక్షసుడా! ఉపవాసాలు చేస్తూ శరీరాన్ని కృశింపజేసుకొని, దీనురాలనై ఉన్న నన్ను ఈ విధంగా బాధిస్తున్నావు. ఇది నీకు మంచిది కాదు.

నీవు నిజంగా రావణాసురుడవు కాకపోవచ్చును. ఎందువల్లనంటే, నిన్ను చూడగానే నా మనస్సులో సంతోషం కలిగింది. మధురంగా రాముడి మాటలు చెప్పావు. నీవు నిజంగానే రామదూతవైతే, నీకు సర్వశుభాలు కలగాలని కోరుకుంటున్నాను. ఓ వానరశ్రేష్ఠా! నాకు రాముని గూర్చి ఎంతసేపు విన్నా తనవితీరదు. అందువల్లనే మళ్ళీ మళ్ళీ అడుగుతున్నాను. ఓ వానరుడా! నా రాముని గుణాలను, పరాక్రమాన్ని గూర్చి చెప్పు. వింటాను. నదీ ప్రవాహం నది ఒడ్డును హరించినట్లు నా చిత్తాన్ని హరిస్తున్నావు.

చాలాకాలం క్రితం అపహరించబడిన నేను ఈ రోజు నా రాముడు పంపిన దూతను ఎదురుగా చూస్తున్నాను. ఆహా! ఇది ఎంత మధురమైన స్వప్నం! రాముడు స్వప్నంలో కనిపించినా కూడా ఎంతో ఆనందంగా బ్రతికేదాన్ని. కానీ కలలు కూడా నా మీద పగపట్టి ఉన్నాయి. నేను వానరుణ్ణి చూడటం కల కాదు. కలలో వానరం కనిపిస్తే శుభాల్ని

పొందలేరంటారు. రామకథ వినటం అనే శుభమే జరిగింది కాబట్టి నేను వానరాన్ని చూడటం కల కాదు; యథార్థమే. లేదా, నాకేమైనా చిత్తభ్రమ కలుగుతోందా? లేక వాతప్రకోపమా? లేక ఉన్మాదమా? ఇవన్నీ ఎండమావులు కావు కదా? కాదు. కాదు. ఇది కలా కాదు, ఉన్మాదమూ కాదు. నేను వానరాన్ని ప్రత్యక్షంగా చూస్తున్నాను. గుర్తు పట్టగలుగుతున్నాను, మాట్లాడగలుగుతున్నాను.

సీతాదేవి కపటసన్యాసి వేషంలో ఒకసారి రావణునిచే మోసపోయి ఉండటం వల్లను, రాక్షసులంతా కామరూపులవటం వల్లనూ ఈ వానరం రావణుడేనని నిర్ధారణ చేసుకుంది. ఈ నిర్ణయానికి వచ్చిన ఆ జనకుని కుమార్తె అయిన సీతాదేవి మాట్లాడకుండా కూర్చుండిపోయింది. వాయుపుత్రుడైన హనుమంతుడు సీతమ్మతల్లి మనసులోని ఆలోచనల్ని పసికట్టాడు. అప్పుడామెకు ఆనందం కలిగే మాటలు మాట్లాడాలని అనుకున్నాడు.

“రాముని తేజస్సు సూర్యుని తేజస్సు వంటిది. అతడు చంద్రుడువలె లోకాలకు, జనులకు మనోరంజకుడు. కుబేరుడువలె సర్వసంపదలకు ప్రభువు. శ్రీమహావిష్ణువు వలె రాముడు తేజస్సులో సూర్యుని వంటివాడు. జనులకు, లోకాలకు ఆనందం కలిగించటంలో చంద్రుని వంటి వంటివాడు. సర్వసంపదల్తో తులతూగుతూ కుబేరునితో సమానమైనవాడు. కీర్తియందు, పరాక్రమమునందు శ్రీ మహావిష్ణువుతో సమానమైనవాడు. రాముడు సత్యమునే మాట్లాడతాడు. మృదుమధురంగా మాట్లాడటంలో బృహస్పతితో సమానమైనవాడు. శోభలోగాని, సౌందర్యంలోగాని, సుకుమారత్వంలోగాని, భాగ్యంలోగాని సాటిలేని వాడు. కోపం చూపించాల్సి వస్తే కోపాన్ని ప్రదర్శించుతాడు. లోకంలోని మహారథుల్లో శ్రేష్ఠుడు. ఆ మహాబాహువు నీడ నాశ్రయించుకొని లోకాలు జీవిస్తునాయి.

తల్లీ! మాయామృగాన్ని చూపి, రాముడు దూరంగా వెళ్ళిన తర్వాత రావణుడు నిన్ను అపహరించుకొని వచ్చాడు గదా? అందుకు అతడికి ఏం ఫలితం లభిస్తోందో నీవే చూస్తావు గదా!

పరాక్రమవంతుడైన ఏ రాముడు అతిత్వరలో తన వాడిబాణముల చేత రావణుని సంహరించబోతున్నాడో, ఆ రాముడే నన్ను దూతగా నీ వద్దకు పంపాడు. అతడు నీ వియోగం చేత చాలా బాధపడుతున్నాడు. అతడే నీ క్షేమం కూడా తెలుసుకొని రమ్మన్నాడు. మహాతేజశ్శాలి, సుమిత్రాదేవి కుమారుడు అయిన లక్ష్మణుడు కూడా నీకు నమస్కరించి, నీ క్షేమం తెలుసుకుని రమ్మన్నాడు. వానరశ్రేష్ఠుడు, వానరరాజు అయిన సుగ్రీవుడు కూడా నీ క్షేమం తెలుసుకొని రమ్మన్నాడు.

ఓ దేవీ! రామలక్ష్మణ సుగ్రీవులు ప్రతి రోజు నీ గురించి ఆలోచిస్తూ ఉంటారు. దైవకృప చేత, నీవు రాక్షసుల మధ్య ఉన్నా కూడా, జీవించి ఉన్నావు. కొద్ది రోజుల్లోనే రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు కోట్లాది వానరసేనతో వచ్చి ఈ లంకను ముట్టడించడం నీవు చూస్తావు.

అమ్మా! నేను సుగ్రీవుడనే వానరరాజుకు మంత్రిని. దూతను. నా పేరు హనుమంతుడు. నేను నీ జాడ తెలుసుకొని రాముడికి చెప్పేందుకు నూరుయోజనాల సముద్రాన్ని దాటి వచ్చాను. నేను నా పరాక్రమం చేత దుర్మార్గుడైన రావణుని శిరస్సుపై పాదముంచి (లంకలో అడుగుపెట్టి) నిన్ను చూసేందుకు వచ్చాను.

ఓ దేవీ! నీవు సందేహపడినట్లుగా నేను రావణుడను కాను. నా మాటలు విశ్వసించి నీ సందేహాన్ని విడిచిపెట్టు.

# 35వ సర్గ హనుమంతుడు సీతకు తనపై విశ్వాసం కలిగించడం

హనుమంతుడు చెప్పిన రామకథను సీతాదేవి విని అమితానందం పొంది ఇట్లా అంది.

సీత : ఓ హనుమంతుడా! నీకు రామునితో పరిచయం ఎక్కడ, ఎట్లా కలిగింది? వానరులైన మీతో ఆ నరులకు పరిచయం ఎట్లా ఏర్పడింది? లక్ష్మణుని ఎట్లా ఎరుగుదువు? రాముని లక్షణాలను, లక్ష్మణుని లక్షణాలను వర్ణించి చెప్పు. వారి గుణగణాలు ఎంత విన్నా తృప్తి కలుగదు. నాలోని శోకం అంతా పటాపంచలైపోతుంది. అంతేకాదు, రామలక్ష్మణుల ఆకారాలు ఎట్లా ఉంటాయి? రూపవంతులేనా? వారి తొడలు ఎట్లా ఉంటాయి? వారి బాహువులు ఎట్లా ఉంటాయి? నాకు నీ నోట వినాలని కుతూహలంగా ఉంది, చెప్పు.

సీత ఆతురతతో అడిగిన ప్రశ్నలన్నింటికీ వాయుకుమారుడైన హనుమంతుడు యథార్థంగా తనకు తెలిసినంత మేరకు ఇట్లా వివరించాడు.

హనుమంతుడు : కలువరేకుల వంటి నేత్రాలు గల ఓ సీతాదేవీ! రామలక్ష్మణుల గూర్చి నీకు తెలియనిదేమీలేదు. అయినా నన్ను చెప్పమని అడిగావు. రాముని గూర్చి నాకు తెలిసిందేదో నీకు చెప్పవలసి రావటం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఈ అదృష్టానికి ఎంతో సంతోషంగా ఉంది.

ఓ సీతాదేవి! రాముని కళ్ళు పద్మరేకుల్లాగా విశాలమైనవి. సమస్త ప్రాణికోటిని ఆకర్షించేటంత సౌందర్యవంతుడు రాముడు. అతడు పుట్టుకతో సౌందర్యాన్నే కాక, దయ, కరుణ, జాలి అనే గుణాలను సంతరించుకొన్నాడు. రాముడు తేజస్సులో సూర్యుడితో సమానుడు. ఓర్పులో భూదేవితో సమానుడు. బుద్ధిలో బృహస్పతితో సమానుడు. రాముడు ప్రపంచంలోని ప్రాణులందరినీ రక్షిస్తాడు; ఇక తనవారి మాట వేరే చెప్పాలా? అన్నిటినీ మించి, ధర్మాన్ని, సత్ప్రవర్తనను రక్షిస్తాడు.

ఓ సీతాదేవీ! రాముడు సమస్త ప్రపంచాన్ని, నాలుగువర్ణాల వారిని, నాలుగు ఆశ్రమాల వారిని రక్షిస్తాడు. లోకంలో కట్టుబాట్లను ఏర్పరుస్తాడు. అంతేకాదు, అందరూ ఆ కట్టుబాట్లను తు.చ. తప్పకుండా ఆచరించేట్లు చేస్తాడు.

ఓ దేవీ! రాముడు బ్రహ్మచర్యవ్రతంలో ఉన్నవాడు. ఎంతో కాంతిమంతుడు. అందరిచే గౌరవించబడేవాడు. సత్పురుషులకు, సాధువులకు ఉపకారం ఎట్లా చెయ్యాలో తెలిసినవాడు. ఆయా కర్మల ప్రయోజనం, వాటి ఫలితాలను గూర్చి బాగా ఎరిగినవాడు. ఏ పనికి ఎటువంటి ఫలం రాగలదో ముందే తెలుసుకొని చెప్పగలడు.

ఓ సీతాదేవీ! రాముడు గొప్ప రాజనీతి తెలిసినవాడు. బ్రాహ్మణులను గౌరవిస్తాడు. విజయవంతుడు, విద్యావంతుడు. శత్రువులను పీడించేవాడు.

ఓ సీతాదేవీ! రాముడు వేదాలన్నీ చక్కగా అధ్యయనం చేశాడు. మీదుమిక్కిలి యజుర్వేదంలో నిష్ణాతుడు. వేదవేత్తలందరూ అతడిని శిరస్సున పెట్టుకొని పూజిస్తారు. వేదవేదాంగము లన్నింటిలోనూ పాండిత్యం గలవాడు.

రాముని భుజాలు విశాలమైనవి. బాహువులు పొడవైనవి. కంఠం శంఖాన్ని పోలి ఉంటుంది. మంగళకరమైన ముఖం. మాపుసంధి ఎముకలు పైకి కనపడవు. రాముని నేత్రాలు కలువరేకుల్లా ఎర్రగా ఉంటాయి. రాముని గూర్చి లోకంలో తెలియని వాళ్ళుండరు.

రాముని వక్షఃస్థలం, ముంజేయి, పిడికిలి స్థిరంగా ఉంటాయి. కనుబొమలు, బాహువులు పొడవుగా ఉంటాయి. జుట్టు, ముష్కాలు, మోకాళ్ళు హెచ్చుతగ్గులు లేకుండా సమంగా ఉంటాయి. వక్షఃస్థలం, నాభి, క్రిందిపొట్ట పొడవుగా ఉంటాయి. కనుకొనలు, అరచేతులు, అరికాళ్ళు ఎర్రగా ఉంటాయి. పాదరేఖలు, కేశసంపద, లింగమణి నున్నగా ఉంటాయి. కంఠధ్వని, నడక, నాభి గంభీరంగా ఉంటాయి.

ఓ దేవీ! రాముడి పొట్టపై మూడు ముడతలున్నవి. అతడి స్తనాలు, స్తనాగ్రాలు, రేఖలు పల్లంగా ఉంటాయి. కంఠం, లింగం, వీపు, పిక్కలు, పొట్టిగా ఉంటాయి. తలపైన మూడు సుళ్ళుంటాయి. అంగుష్ఠం మొదట్లో నాలుగు రేఖలుంటాయి. రాముని ఎత్తు తొంభై ఆరు అంగుళాలు. అతడి బాహువులు, మోకాళ్ళు, పిక్కలు సమానంగా ఉంటాయి.

రాముని కనుబొమలు, నాసికారంధ్రాలు, నేత్రాలు, చెవులు, పెదవులు, స్తనాగ్రాలు, మోచేతులు, మనికట్లు, మోకాళ్లు, ముష్కములు, పిరుదులు, చేతులు, పాదాలు, పిరుదులపై కండరాలు, మున్నగు జంటలుగా ఉండే అంగాలన్నీ సమంగా ఉంటాయి. అందమైన నాలుగు దంతాలుంటాయి. సింహంలాగాను, పెద్దపులిలాగాను, ఏనుగులాగాను, ఆబోతులాగాను హుందాగా నడుస్తాడు. అతడి పెదవులు, గడ్డం, ముక్కు, చాలా అందంగా ఉంటాయి. అతడి కళ్ళు, పళ్ళు, చర్మం, పాదాలు, జుట్టు నిగనిగ మెరుస్తూ ఉంటాయి. బాహువులు, వ్రేళ్ళు, తొడలు, పిక్కలు తీర్చిదిద్దినట్లుంటాయి.

రాముని ముఖం, కళ్ళు, నోరు, నాలుక, పెదవులు, దవడలు, స్తనాలు, గోళ్ళు, హస్తాలు, పాదాలు, ఈ పదీ పద్మంలాగా ఉంటాయి. శిరస్సు, లలాటం, చెవులు, కంఠం, వక్షం, హృదయం, కడుపు, చేతులు, కాళ్ళు, వీపు, ఈ పదీ పెద్దవిగా ఉంటాయి. తేజస్సు, కీర్తి, సంపద అనే మూడింటితో లోకం అంతా వ్యాపించి ఉంటాడు. అతడి తల్లితండ్రుల వంశాలు ప్రఖ్యాతమైనవి; పరిశుద్ధమైనవి. చంకలు, కడుపు, వక్షం, ముక్కు, మూపు, లలాటం, ఆరూ ఉన్నతంగా ఉంటాయి. అతడి వ్రేళ్ళకణుపులు, తలవెంట్రుకలు, రోమాలు, గోళ్ళు, చర్మం, లింగం, మీసం, దృష్టి, బుద్ధి అనే తొమ్మిదీ సూక్ష్మాలుగా ఉంటాయి. అతడు పూర్వాహ్నా, మధ్యాహ్నా, అపరాహ్నాలందు ధర్మార్థకామాలను సంపాదించుచుంటాడు.

రాముడు సత్యధర్మాలయందు ఆసక్తిగలవాడు. శ్రీమంతుడు. జనులను అనుగ్రహించటంలో ఆసక్తి గలవాడు. దేశకాలాలు, మంచిచెడ్డలు బాగా ఎరిగినవాడు. అందరితోను ప్రియంగా మాట్లాడేవాడు.

లక్ష్మణుడు రాముని సవతిసోదరుడు. రూపంలోగానీ, గుణాలలోగానీ, అతడివన్నీ రాముడి పోలికలే. యుద్ధంలో ఎన్నడూ పరాజయం అంటే ఏమిటో ఎరగనివాడు. మనుష్యులలో శ్రేష్ఠులైన రామలక్ష్మణు లిద్దరూ నిన్ను చూసేందుకు వెతకని చోటంటూ లేదు. చివరకు మమ్మల్ని కలుసుకున్నారు. నీ కోసం వెతుకుతూ వాళ్ళు ఋష్యమూక పర్వతానికి చేరుకున్నారు. అక్కడ వానర ప్రభువైన సుగ్రీవుణ్ణి కలిశారు. సుగ్రీవుణ్ణి అతని సోదరుడు వాలి రాజ్యభ్రష్టుణ్ణి చేశాడు. అతడికి భయపడి ఋష్యమూక పర్వతంపై సుగ్రీవుడు తలదాచుకుంటున్నాడు. ఆయన మంత్రులమైన మేమంతా ఆయనతోపాటే ఆ పర్వతంపై ఉంటున్నాము. ఇంతలో నారచీరలు ధరించి, శ్రేష్ఠమైన ధనుస్సులు చేతపట్టుకొని రామలక్ష్మణులు ఆ పర్వత ప్రాంతానికి వచ్చారు. ధనుర్ధారులై వస్తున్న రామలక్ష్మణులను చూసి సుగ్రీవుడు భయపడిపోయి ఆ పర్వతశిఖరంపై దాక్కున్నాడు. అప్పుడు సుగ్రీవుడు ఆ పర్వతశిఖరంపైనే ఉంటూ నన్ను దూతగా రామలక్ష్మణుల వద్దకు పంపాడు. సుగ్రీవాజ్ఞను శిరసావహించి నేను ఆ పురుషశ్రేష్ఠులిద్దరి దగ్గరకు వెళ్ళాను. వాళ్ళిద్దరూ మంచి సౌందర్యం గలవారు, మంచి లక్షణాలు కల వారిద్దరూ సర్వసమర్థులు. నేను వాళ్ళ వద్దకు నమస్కరిస్తూ వెళ్ళాను. ఆ పురుషశ్రేష్ఠులిద్దరూ సుగ్రీవుని యథార్థస్థితిని తెలుసుకొన్నారు. అప్పుడు నేను వారిద్దరినీ నా భుజాలపై ఎక్కించుకొని సుగ్రీవుడుండే పర్వతశిఖరంపైకి చేర్చాను. నేను మహాత్ముడైన సుగ్రీవునికి రామలక్ష్మణుల గూర్చి వివరించి చెప్పాను. రామలక్ష్మణులిద్దరూ సుగ్రీవుడితో కలసి మాట్లాడారు. ఆ తర్వాత రామ సుగ్రీవులిద్దరూ స్నేహం చేసుకున్నారు. ఈ విధంగా రామసుగ్రీవుల మధ్య స్నేహం ఏర్పడిన తర్వాత భార్యను పోగొట్టుకున్న సుగ్రీవుని, రాముడు ఓదార్చాడు. నీవు కనిపించకపోవటం వలన రాముడు దుఃఖించుచున్నాడని లక్ష్మణుడు సుగ్రీవునికి చెప్పాడు. రాముని దుఃఖం తెలుసుకున్న సుగ్రీవుడు రాహువు మ్రింగిన సూర్యుడువలె కాంతివిహీనుడైపోయాడు. రావణుడు నిన్ను అపహరించుకొని పోయేటప్పుడు నీవు జారవిడిచిన ఆభరణాలు మాకు దొరికాయి. మేము వాటిని రామలక్ష్మణులకు చూపాం. వారిద్దరూ ఆ ఆభరణాలు నీవేనని గుర్తించారు. నీ ఆభరణాలను చూసిన రాముడు వాటిని ఒడిలో పెట్టుకొని పరిపరివిధాలుగా విలపించాడు. ఆ ఆభరణాలు చూసిన తర్వాత రాముని దుఃఖానికి అంతులేకుండాపోయింది. అట్లాగే చాలాసేపు నేలపై పడి

ఉన్నాడు. నేను అప్పుడు రామప్రభువును లేవదీసి ఓదార్చాను. రాముడు ఆ ఆభరణాలను మాటిమాటికీ చూస్తూ, లక్ష్మణునికి చూపిస్తూ వాటిని తిరిగి సుగ్రీవుడి కిచ్చాడు.

పూజ్యురాలా! నీవు కనపడకపోవటం వలన రాముడు, మండే అగ్నిహోత్రంలాగా దహించుకుపోతున్నాడు. నీ కారణంగా రాముడికి నిద్రలేదు, చింతతో అగ్నిగృహంలో అగ్నుల్లాగా మండిపోతున్నాడు. భూకంపం చేత పెద్ద పర్వతం కదిలిపోయినట్లుగా నీ ఎడబాటు ఆయనను కదల్చివేస్తోంది.

ఓ దేవీ! అందమైన సెలయేళ్ళ దగ్గర, నదీతీరాలలో, వనంలో విహారాలకు వెళ్ళినా ఆనందించలేకపోతున్నాడు. ఓ సీతాదేవీ! రాముడు త్వరలో రావణుణ్ణి, బంధుమిత్రపరివారంతో సహా సంహరించి నిన్ను తీసుకొనివెడతాడు. ఓ దేవీ! ఆనాడు రాముడు వాలిని చంపాలనీ, సుగ్రీవుడు సీతను వెతికిపెట్టాలనీ ఒప్పందం చేసుకున్నారు. ఆ ఒప్పందం ప్రకారం వానరరాజైన వాలిని రాముడు సంహరించాడు. సుగ్రీవుణ్ణి రాజును చేశాడు. ఓ దేవీ! రామసుగ్రీవుల మధ్య స్నేహం ఈ విధంగా ఏర్పడింది; నేను సుగ్రీవుని మంత్రిగా, రాముని దూతగా నిన్ను వెతుక్కుంటూ సముద్రాన్ని దాటివచ్చాను. పర్వతం వంటి లక్షలాది వానరవీరులు దేశంలో ఇతర ప్రదేశాలకు నిన్ను వెతుక్కుంటూ వెళ్ళారు. సుగ్రీవుడు రాముడికి చేసిన ప్రతిజ్ఞ ప్రకారం మా వానరులందరం దేశం నాలుగుమూలలా నీకోసం గాలిస్తున్నాం. లక్ష్మీసంపన్నుడు, వాలి పుత్రుడు, మహాబలశాలి అయిన అంగదుడు, నేను, జాంబవంతుడు మున్నగు యోధులంతా నీ అన్వేషణకై దక్షిణ దిక్కున వెతుకుతున్నాం. మేమందరం వింధ్య పర్వతాలు దాటిన తర్వాత దారితప్పి ఎన్నో రాత్రుళ్ళు, పగళ్ళు గడిపేశాం. ఇంతలో సుగ్రీవుడు మాకిచ్చిన గడువు దాటిపోయింది. సుగ్రీవుడు దండిస్తాడన్న భయంతో మేమంతా ప్రాయోపవేశం చేసి దేహత్యాగం చెయ్యటానికి కూర్చున్నాం. అప్పుడు ఎంతో దుఃఖీస్తూ, నీవు అపహరించబడటం, వాలి వధ, జటాయువు మరణం గూర్చి మేమందరం మాట్లాడుకుంటున్నాం. ప్రాయోపవేశం చేసి ప్రాణత్యాగం చెయ్యవలసి వస్తున్నందుకు దుఃఖీస్తున్నాం.

ఇట్లా మేము దుఃఖీస్తూ ఉండగా జటాయువు సోదరుడైన సంపాతి అనే పక్షిరాజు తన సోదరుడి మరణాన్ని గూర్చి మా వలన తెలుసుకున్నాడు. అతడికి రావణుడిపై చాలా కోపం వచ్చింది. తన సోదరుణ్ణి చంపిన ఆ పాపాత్ముడు ఎవరో చెప్పమన్నాడు. అప్పుడు అంగదుడు జనస్థానంలో భయంకరుడైన రాక్షసులను రాముడు సంహరించడం యథార్థంగా ఆ సంపాతికి చెప్పాడు. సీతాదేవీ! ఆ సంపాతి తన సోదరుని మరణానికి చాలా దుఃఖీంచాడు. తరువాత నీవు రావణునిచే ఇక్కడ బంధించబడ్డావని చెప్పాడు. సంపాతి చెప్పిన సంతోషకరమైన వార్త విని, అంగదుడు మున్నగు వానరులమంతా బయలుదేరాం. నిన్ను చూడబోతున్నామన్న సంతోషంతో మా వానరులంతా వింధ్యపర్వత ప్రాంతం నుండి బయలుదేరి సముద్రతీరానికి చేరుకున్నాం. నూరుయోజనాల సముద్రాన్ని ఎట్లా దాటటమా అన్న దిగులుతో మాలో ఉన్న ఉత్సాహం అంతా నీరుకారిపోయింది. అప్పుడు నేను మిగిలిన వానరవీరులందరికీ ధైర్యం చెప్పి నూరుయోజనాల సముద్రాన్ని ఒక్క దుముకులో వచ్చి ఈ దక్షిణతీరాన వచ్చిపడ్డాను. నేను రాక్షసుల ఇళ్ళల్లో రాత్రిపూట ప్రవేశించి నీ కోసం వెతికాను. చివరకు రావణుణ్ణి, దుఃఖంలో మునిగిపోయి ఉన్న నిన్నూ చూశాను.

ఎట్టిదోషమూ లేని ఓ సీతాదేవీ! నీవు అడిగిన విషయాలన్నీ ఉన్నదున్నట్లుగా చెప్పాను. నేను రాముని దూతను. నాతో మాట్లాడేందుకు భయపడవద్దు. ఓ దేవీ! నేను రాముని కోసమే ఇంత పెద్ద ప్రయత్నం చేసి వచ్చాను. నేను సుగ్రీవుడి మంత్రిని, వాయుదేవుని కుమారుడను. రాముని దూతను. ఇది యథార్థం. ఓ సీతాదేవీ! ధనుర్ధారులందరిలోను శ్రేష్ఠుడైన ఆ రాముడు క్షేమంగా ఉన్నాడు. అన్నగారికి సేవలు చేసుకుంటూ, ఆయన మనసు తెలుసుకొని మసలుకొనే లక్ష్మణుడు క్షేమంగా ఉన్నాడు. ఓ దేవీ! సుగ్రీవుని ఆజ్ఞచేత, రామునికి సహాయం చేయటంకోసం నేనిక్కడికి ఒంటరిగా వచ్చాను. నా ఇష్టానుసారంగా రూపాలు మార్చగల నేను, నీ జాడ తెలుసుకోవటానికి ఒంటరిగా తిరుగుతూ ఇక్కడకు వచ్చాను. నా అదృష్టవశాన, దైవకృప చేత నిన్ను చూడగలిగాను. నేను త్వరగా సముద్రం దాటిపోయి నీవు కనిపించావన్న వార్త చెప్పి వానరులందరినీ సంతోషపరచాలి. ఓ దేవీ! నేను ఎంతో అదృష్టవంతుడను. సముద్రం దాటి

వచ్చిన కష్టం వృథా కాలేదు. నిన్ను చూడగలిగానన్న కీర్తి కూడా నాకు దక్కుతుంది. అది కూడా నాకు గొప్ప అదృష్టమే. ఓ సీతాదేవీ! మహాపరాక్రమశాలి అయిన రాముడు, రావణుని బంధుమిత్ర సపరివారంగా సంహరించి నిన్ను తీసుకొనిపోగలడు.

ఓ సీతాదేవీ! పర్వతాలన్నింటిలోకీ శ్రేష్ఠమైన మాల్యవంత పర్వతం ఉన్నది. అక్కడ నుండి కేసరి అనే వానరుడు గోకర్ణ పర్వతానికి వెళ్ళాడు. నా తండ్రి అయిన కేసరి, దేవతలు, ఋషులు ప్రార్థించగా సముద్ర తీరాన ఉండే పవిత్రక్షేత్రంలో శంబసాదడనే రాక్షసుణ్ణి చంపాడు. ఓ సీతాదేవీ! నేను ఆ కేసరి భార్య అయిన అంజనాదేవి యందు వాయుదేవుడి వలన జన్మించాను. నేను చేసిన పనులను బట్టి నాడు హనుమంతుడనే పేరు వచ్చింది. కనుక ఓ దేవీ! నీకు నమ్మకం కుదిరేందుకు రాముని కథ అంతా చెప్పాను. కొద్దిరోజుల్లో రాముడు వచ్చి నిన్ను తనతో తీసుకొని వెళ్తాడు.

అంతట శోకంతో కృశించి ఉన్న ఆ సీతాదేవి హనుమంతుడు చెప్పిన ఆనవాళ్ళు, గుణాలను బట్టి ఈతడు రాముడి దూతయేనని నమ్మింది. రాముడి విషయాలన్నీ వినటం వల్ల ఆనందం పొంగి కళ్ళవెంట నీళ్ళు కారాయి. అప్పుడామె ముఖం రాహువు విడిచిన చంద్రునివలె ప్రకాశించింది. అప్పుడు సీత హనుమంతుణ్ణి రామదూతయేనని నమ్మింది.

"ఓ సీతాదేవీ! నేను వాయుదేవుని వలన జన్మించిన వానరుడను. నేను వాయుదేవుడంతటప్రభావం కలవాడిని. ఓ దేవీ! నీకు చెప్పవలసింది అంతా చెప్పాను. ఇంకా నీ కోసం నేను ఏం చేయాలో చెప్పు. నేను తిరిగి వెళ్లాలి" అన్నాడు హనుమంతుడు.

# 36వ సర్గ హనుమంతుడు సీతకు రామముద్రిక నివ్వడం

హనుమంతుడు సీతాదేవికి నమ్మకం కలిగించేందుకు ఆమె అడిగినవన్నీ వివరంగా చెప్పాడు. మళ్ళీ వినయంతోను, భక్తిభావంతోను ఇట్లా అన్నాడు:

"ఓ భాగ్యవంతురాలా! బుద్ధిశాలి అయిన రామదూతగా నేను వచ్చాను. ఇదుగో! ఈ ఉంగరాన్ని చూడు. దీనిపై రాముని పేరు ఉంది. నీకు నమ్మకం కలిగించడానికే మహాత్ముడైన రాముడు నీకిమ్మన్నాడు. నీకు ఇకపై అన్నీ శుభాలే! నీ దుఃఖాలు తొలగిపోయే సమయం వచ్చింది."

జానకి భర్త పంపిన ఉంగరాన్ని తీసుకొని చూసి రాముడిదేనని గుర్తించింది. భర్తను చేరినంత సంబరపడిపోయింది. భర్త సందేశాన్ని హనుమంతుని ద్వారా విని సంతోషించింది. నిర్మలహృదయం గల ఆ సీత సిగ్గుపడిపోయింది. హనుమంతుణ్ణి ప్రత్యక్ష దైవంగా భావించి ప్రశంసించింది.

"ఓ వానరోత్తమా! నీవు పరాక్రమవంతుడవే కాదు; ఎంతో బుద్ధిశాలివి. అందువల్లనే ఈ రాక్షసరాజ్యంలో భయంలేకుండా తిరుగగలుగుతున్నావు. నీ పరాక్రమం మెచ్చుకోదగింది సుమా! ఈ సముద్రం నూరుయోజనాల దూరం ఉంది. అది భయంకరమైన మొసళ్ళు, తిములు, తిమింగలాలతో నిండి ఉంటుంది. అటువంటి భయంకర సముద్రాన్ని ఆవు పాదం వంటిదిగా చేసి సులువుగా దాటివచ్చావు.

ఓ వానరశ్రేష్ఠుడా! రావణుడు మిక్కిలి క్రూరుడు, భయంకరుడు. లంక లోపలా బయటా భయంకరమైన రాక్షసులు కాపలా కాస్తూ ఉంటారు. నువ్వు ఎంతమాత్రం భయపడకుండా, కొంచెం కూడా తొట్రుపాటు పడకుండా లంక అంతా విహరించావు. నువ్వు సామాన్యమైన వానరుడవు కావు.

ఓ వానరశ్రేష్ఠుడా! ప్రసిద్ధుడు, బుద్ధిమంతుడూ అయిన రాముడే నిన్ను పంపాడని నమ్ముతున్నాను. ఇప్పుడు నీతో మాట్లాడేందుకు నాకు ఎంతమాత్రమూ సంకోచం లేదు. బుద్ధిశాలి అయిన రాముడు, నీ పరాక్రమం ఎటువంటిదో, నువ్వు ఎటువంటివాడవో పరీక్షించకుండా నిన్ను దూతగా పంపి ఉండడు. అందునా, నా వద్దకు అసలే పంపడు కదా?

భగవత్కృప చేత సత్యప్రతిజ్ఞ కలవాడైన రాముడు, సంపదల్ని వృద్ధి పొందించేవాడైన లక్ష్మణుడు క్షేమంగా ఉన్నారు. ఆ రాముడు క్షేమంగా ఉంటే చాలు.

రాముడు క్షేమంగా ఉంటే కోపంతో ఈ సమస్త భూమండలాన్నీ కాల్చి బూడిద చేయడం లేదేమి? వాళ్ళిద్దరూ దేవతల్ని కూడా ఎదిరించి జయించగల సమర్థులే. అందులో సందేహమే లేదు. ఇదంతా నా దురదృష్టం. నేను నష్టజాతకురాలిని.

ఓ హనుమంతుడా! రాముడు నాకోసం దిగులుపడటం లేదు కదా? దుఃఖంతో బాధపడటం లేదు గదా! శత్రుసంహారానికి అవసరం అయిన ఏర్పాట్లన్నీ చేస్తున్నాడు గదా!

ఆ రాజకుమారుడు దైన్యమైన స్థితిలో లేడు గదా? భ్రాంతికి లోనుకావడం లేదు కదా! తను చేయవలసిన పనులన్నీ తొట్రుపాటు లేకుండాను, పొరపాటు లేకుండాను చేస్తున్నాడు గదా? ప్రయత్న లోపం ఎక్కడా జరగటం లేదు గదా?

శత్రుసంహారకుడైన ఆ ప్రభువు అవసరాన్నిబట్టి సామదానభేద దండోపాయాలను అవలంబిస్తున్నాడా? శత్రువులపై యుద్ధం ప్రకటించే ముందు మిత్రులందరినీ కూడుకట్టు కుంటున్నాడా? ఇతడు మైత్రిని కోరుకుంటాడు సరే! అవతలి వాళ్ళు కూడా ఇతడితో మిత్రులుగా ఉంటున్నారా? వాళ్ళంతా యోగ్యులే కదా? మిత్రులంతా ఇతడిని గౌరవిస్తున్నారు గదా!

ఆ రాజకుమారుడు విజయం కోరి దేవతలందరినీ ఆరాధిస్తున్నాడు గదా? ఎందువల్లనంటే, పురుష ప్రయత్నానికి, దైవం కూడా అనుకూలించాలి. అందువల్ల దైవారాధనకు

కూడా ఎంతో ప్రాముఖ్యం ఉంటుంది.

ఓ హనుమంతుడా! నా వియోగం చేత రాముడికి నాపై ఉండే అనురాగం తగ్గిపోలేదు కదా? నన్ను ఈ రాక్షసుడి చెరనుండి తప్పించాలనే ఆలోచనలో ఉన్నాడా? రాముడు సుఖాలే ఎరుగును కానీ, దుఃఖాలు ఎరుగడు. ఇప్పుడు వచ్చిన దుఃఖాన్ని తట్టుకోగలుగుతున్నాడా? క్రుంగిపోవటం లేదు కదా? సుమిత్ర, కౌసల్య, భరతుడు క్షేమంగా ఉన్నట్లు వార్తలేమైనా తెలుస్తున్నాయా? రాముడు నా వల్ల కలిగిన దుఃఖాన్ని తట్టుకొని, నన్ను ఈ శోకసముద్రంలో నుండి కాపాడుతాడా? యుద్ధం వచ్చినప్పుడు భరతుడు అన్నగారికి సహాయంగా నిలుస్తాడా? అక్షౌహిణి ప్రమాణం కలిగిన సైన్యాన్ని రాముడికి బాసటగా పంపుతాడా? వానరాధిపతియైన సుగ్రీవుడు వాడి అయిన కోరలు, గోళ్ళే ఆయుధాలుగా ఉండే తన సైన్యంతో నన్ను విడిపించేందుకు వస్తాడా? సుమిత్రా తనయుడైన లక్ష్మణుడు తన బాణాలతో ఈ రాక్షసుల్ని చీల్చి చండాడుతాడు గదా? ప్రజాకంటకుడైన రావణుడు రాముని భయంకరమైన అస్త్రాల చేత చంపబడటం త్వరలో చూడగలను గదా? నేను కనిపించకపోవటం వలన బంగారంలాగా కాంతివంతమైనదీ, పద్మంలాగా సువాసనలిచ్చే రాముని ముఖపద్మము వాడిపోయి లేదుగదా?

పితృవాక్య పరిపాలనకై కాలినడకన నన్ను అడవులకు తీసుకొని వెళ్ళేటప్పుడు ఏ రాముడికి విచారంగాని, కష్టంగాని, దుఃఖంగానీ కలుగలేదో అట్టి రాముడు ఇప్పుడు శోకం లేకుండా ధైర్యంగా ఉన్నాడు గదా?

ఓ హనుమంతుడా! రాముడి ప్రేమకు పాత్రులైన వారిలో నాతో సమానమైనవారు గాని, అధికులుగాని ఎవరూ లేరు. తల్లిగాని, తండ్రిగాని, మరి ఏ ఇతర వ్యక్తీ ముల్లోకాలలో కూడా లేరు. నేను కూడా ప్రియుడైన రాముడి వృత్తాంతాన్ని వినగలిగేంతవరకే జీవించాలని కోరుకుంటున్నాను.

ఆ విధంగా సీతాదేవి తన మనసులోని మాటను హనుమంతుడి ముందు చెప్పుకుంది.

ఇంకా రాముడి గూర్చి హనుమంతుడు చెప్తాడేమోనని ఆసక్తితో ఎదురు చూస్తోంది. సీత పలికిన మాటలన్నీ భక్తితోను, శ్రద్ధతోను విన్న హనుమంతుడు రెండుచేతులూ ఎత్తి శిరస్సున పెట్టుకొని అమ్మకు నమస్కరిస్తూ ఇట్లా అన్నాడు.

ఓ సీతాదేవీ! నీవు ఇక్కడ ఉన్నట్లుగా రాముడికి తెలియదు. తెలిసి ఉన్నట్లయితే, ఈపాటికే మహేంద్రుడు శచీదేవిని తీసుకొని వెళ్ళినట్లుగా నిన్ను తీసుకొని వెళ్ళేవాడే! నేను వెళ్ళి నీవు ఇక్కడ ఉన్నావన్న విషయం చెప్పగానే, రాముడు వానరులు, ఎలుగుబంట్లతో కూడిన గొప్ప సైన్యంతో ఇక్కడకు వస్తాడు. రాముడు తన బాణంచేత ఈ సముద్రాన్ని స్తంభింప చేస్తాడు. వానరసైన్యం, ఎలుగుబంట్ల గుంపులన్నీ లంకలో ప్రవేశిస్తాయి. రాముడు లంకాపట్టణంలో ప్రవేశించి రాక్షసులందరినీ సంహరిస్తాడు. రాముడు అట్లా విజృంభించి బాణాలవర్షం కురిపిస్తూ ఉంటే దేవతలుగాని, దానవులుగాని, రాక్షసులుగాని ఎవరూ ఎదురు నిలువలేరు. ఒకవేళ వాళ్ళంతా కలసి ఎదురువచ్చినా, వాళ్ళందరినీ సంహరిస్తాడు.

ఓ పూజ్యురాలా! నీ వియోగం వల్ల రాముడి దుఃఖాన్ని మాటల్లో చెప్పలేను. సింహం చేతిలో చిక్కుకొన్న ఏనుగులాగా సుఖం అనేది లేకుండా ఉన్నాడు. ఓ దేవీ! మలయపర్వతంపైన, వింధ్య పర్వతంపైన మేరు పర్వతంపైనా మందరపర్వతంపైనా, దుర్దురపర్వతంపైనా మా ఆహారమైన కందమూలాలపైన ఒట్టుపెట్టుకొని చెప్తున్నాను. మనోహరమూ, పూర్ణచంద్రుడి వంటి ముఖంగల రాముణ్ణి త్వరలోనే చూడగలవు. ఐరావతంపై కూర్చున్న మహేంద్రుడి వలె ప్రస్రవణపర్వతంపై అధిరోహించి ఉన్న రాముణ్ణి త్వరలోనే చూడగలవు. రాముడు మాంసాహారాన్ని త్యజించాడు. మద్యం సేవించడం లేదు. సాయంత్రం మాత్రమే కందమూలాలు, ఫలాలు భుజిస్తున్నాడు.

ఓ సీతాదేవీ! రాముడి మనసు ఎప్పుడూ నీ మీదే ఉంటుంది. శరీరస్పర్శ కూడా తెలియటం లేదు. ఒంటిమీద చీమాదోమా పాకినా తెలియటం లేదు. ధ్యాస అంతా నీ మీదే. పగలు రాత్రీ ఏదో ఆలోచిస్తూ ఉంటాడు. దుఃఖిస్తూ ఉంటాడు. నీ జ్ఞాపకాలతో మన్మథుడు అతణ్ణి

పూర్తిగా తన వశం చేసుకున్నాడు. రాముడు నిద్రించడం మేము చూడలేదు. ఎప్పుడైనా కాస్త మగత నిద్ర పడితే సీతా, సీతా అని కలవరిస్తూ లేచి కూర్చుంటాడు. కంటికి అందంగా కనిపించే పువ్వో, జిహ్వకు రుచిగా ఉండే ఫలమో కనిపిస్తే చాలు; సీతకి అంటూ నీకు నివేదన చేస్తాడు.

ఓ సీతాదేవీ! మహాత్ముడైన ఆ రాజకుమారుడు దుఃఖీస్తూనే రోజులు గడుపుతున్నాడు. 'సీతా' అంటూ నీ నామాన్నే జపం చేస్తున్నాడు. ఎట్లాగైనా నీ జాడ తెలుసుకొని నిన్ను తనదాన్ని చేసుకోవాలని అనుకొంటున్నాడు.

నిజానికి రాముడెంత దుఃఖీస్తున్నాడో, సీత కూడా అంతే దుఃఖీస్తోంది. రాముని గూర్చి వినటం వలన కొద్దిగా బాధ తగ్గింది. ఆ విధంగా సీతాదేవి శోకంతో కూడిన ఆనందాన్ని అనుభవించింది. శరత్కాలం ప్రారంభం అయ్యేటప్పుడుండే కొద్దిపాటి మేఘాల మధ్య నుండే చంద్రునితో కూడిన రాత్రి వలె ఉంది.

# 37వ సర్గ హనుమంతునితో వెళ్ళడానికి సీత నిరాకరించటం

హనుమంతుని మాటలు విన్న సీతాదేవి ఇట్లా అంది: “ఓ హనుమంతుడా! రాముడు ఎప్పుడూ నన్నే తలచుకుంటున్నాడన్నావు. నాకు ఎంతో సంతోషంగా ఉంది. నా వియోగం చేత రాత్రింబవళ్ళు దుఃఖిస్తున్నాడన్నావు. ఈ మాట వింటుంటే ఎంతో బాధగా ఉంది; ఈ అమృతంలో విషం కలిసినట్లుగా ఉంది.

“ఓ వానరశ్రేష్ఠుడా! మనం కష్టాల్లో ఉన్నా, సుఖాల్లో ఉన్నా భగవంతుడు మన మెడకు తాడుకట్టి లాక్కుపోతూనే ఉంటాడు. ప్రాణికోటిలో ఎవరూ భగవంతుణ్ణి నియంత్రించలేరు. నేను, రామప్రభువు, లక్ష్మణుడు ఎన్ని కష్టాల్లో మునిగి ఉన్నామో చూడు. సముద్రం మధ్యన నౌక పగిలిపోవడం వల్ల నావికుడు సముద్రంలో ఈదుతూ అలసిపోయినట్లుగా, రాముడు ఎప్పుడు ఈ దుఃఖసముద్రం నుండి ఒడ్డుకు చేరుతాడో గదా! ఓ హనుమంతుడా! నా భర్త రాక్షసులందరినీ చంపి, రావణాసురుని వధించి, ఈ లంకానగరాన్ని సర్వనాశనం చేసి నన్ను ఎప్పుడు దగ్గరకు చేర్చుకుంటాడో కదా? ఈ రావణాసురుడు నాకు ఒక సంవత్సరకాలం గడువుపెట్టాడు. ఈ గడువు తీరే లోపల రాముడు ఇక్కడకు రావాలని చెప్పు. ఈ గడువు దాటిందంటే నేను జీవించి ఉండను. రావణాసురుడు నాకు పెట్టిన గడువు కాలంలో పదినెలలు గడిచిపోయాయి. ఇక రెండు మాసాలే మిగిలి ఉన్నాయి.

“ఓ హనుమంతుడా! రావణాసురుడికి విభీషణుడు అనే తమ్ముడున్నాడు. అతడు ధర్మాత్ముడు. అతడి భార్య తన కుమార్తె అయిన ‘నల’ ను నా దగ్గరకు పంపిస్తూ ఉంటుంది. ఆ పిల్ల చెప్పింది. తన తండ్రి విభీషణుడు రావణుని వద్దకు వెళ్ళి, ‘సీతాదేవిని తిరిగి ఆమె భర్త వద్దకు చేర్చు’ అని చాలాసార్లు చెప్పాడట. కానీ రావణాసురుడు అతడి మాట లక్ష్యపెట్టడం లేదు. అంటే, రావణాసురుణ్ణి మృత్యుదేవత ఆవహించి, యుద్ధం కోసం వేచి ఉంది. యుద్ధం రాగానే మృత్యుదేవత రావణుణ్ణి కబళించివేస్తుంది.

“ఓ హనుమంతుడా! నా భర్త త్వరలోనే వచ్చి నన్ను కలుసుకుంటాడని నా అంతరాత్మ చెప్తోంది. నా రామప్రభువులో ఎన్నో మంచి గుణాలున్నాయి. ఉత్సాహం, పౌరుషం, బలం, దయ, కృతజ్ఞత, శౌర్యం, ప్రభావం అనే సద్గుణాలన్నీ ఆయనలో మూర్తీభవించి ఉన్నాయి. జనస్థానంలో తానొక్కడే పద్నాలుగువేలమంది రాక్షసుల్ని సంహరించాడు. అటువంటి నా ప్రభువుకు ఎదురుగా (శత్రువు) ఎవరూ నిలువలేరు. ఆయన పురుషోత్తముడు. ఎన్ని కష్టాలు వచ్చినా ఆయన చలించడు. శచీదేవికి దేవేంద్రుడి ప్రభావం తెలిసినట్లుగా, నాకు రాముని ప్రభావం బాగా తెలుసు.

“ఓ హనుమంతుడా! నా రాముడే సూర్యుని వంటివాడు. అతడి బాణాలే సూర్యకిరణాల వంటివి. రాక్షసులంతా జలాశయాల్లోని నీరు వంటివారు. రాముడి తీక్షణమైన బాణాలనే కిరణాలతో రాక్షసులనే జలాన్ని హరించివేస్తాడు.”

ఇలా రాముడి కొరకు శోకించుచూ, కన్నీళ్ళతో నిండిన సీతాదేవి హనుమంతుడితో చెబుతూ ఉండగా, హనుమంతుడు ఇట్లా అన్నాడు:

“సుందరమైన ముఖంగల ఓ సీతాదేవీ! నీవు అనుభవిస్తున్న దుఃఖాన్ని చూడలేకుండా ఉన్నాను. ఓ దోషం లేనిదానా! నీవు నా వీపుపైన ఎక్కుము. నిన్ను రాముని వద్దకు జేర్చి ఇప్పుడే నిన్ను దుఃఖం నుండి విముక్తురాలను చేస్తాను. ఓ దేవీ! నా శక్తిని గూర్చి నీవు భయపడవద్దు. నేను ఈ లంకాపట్టణాన్ని కూడా పెకలించుకొనిపోగలను. ఓ సీతాదేవీ! శ్రీ మహావిష్ణువు దైత్యులను సంహరించడానికి సిద్ధమైనట్లుగా, రామలక్ష్మణులు రాక్షసులపై యుద్ధానికి సంసిద్ధులై ఉన్నారు. నీవు వారిని ఇప్పుడే చూడగలవు. మహాబలశాలి అయిన రాముడు నిన్ను చూడాలనే కాంక్షతో, ఐరావతంపైన ఇంద్రుడు కూర్చున్నట్లుగా, ఆశ్రమంలో కూర్చుని ఉన్నాడు. అట్టి రాముణ్ణి నీవు ఇప్పుడే చూడగలవు. ఓ మంగళప్రదురాలా! ఓ సీతాదేవీ! నీవు సందేహించక నా వీపుపై ఎక్కి కూర్చుంటే, రోహిణి చంద్రుడి దగ్గరకు వెళ్ళినట్లుగా నిన్ను రాముడి దగ్గరకు చేరుస్తాను. నీవు నా వీపుపై కూర్చుని తేజశ్శాలురైన సూర్యచంద్రులతో మాట్లాడుతూ ఉండు.

ఈలోపుగా నేను నిన్ను ఈ మహాసముద్రాన్ని దాటిస్తాను. ఓ దేవీ! నీవు ఆకాశమార్గంలో వెళ్ళడం చూస్తారేమోగానీ, ఈ లంకవాసులెవరూ నా వెంట రాలేరు."

హనుమంతుడి మాటలకు సీతాదేవి చాలా సంతోషించింది. ఆమెలో కొత్తజీవం వచ్చినట్లయింది. హనుమంతుడితో ఇట్లా అంది:

"ఓ హనుమంతుడా! నీవు అంటున్న మాటలన్నీ చాలా వీరోచితంగానే ఉన్నాయి. కానీ నీ వానర బుద్ధి బయటపడిపోయింది. ఎందువల్లనంటే, నీవు ఇంత చిన్నశరీరంతో నా అంత పెద్దదాన్ని నీ వీపుపైన ఎక్కించుకొని సముద్రాన్ని దాటటమా? ఎవరైనా వింటే నవ్వివోతారు."

అంతట హనుమంతుడు సీతాదేవి మాటలు విని 'ఆహా! ఈనాడు ఈమె నా శక్తిసామర్థ్యాలను శంకిస్తోంది. ఈమెకు నా సంగతి తెలియదు. నేను ఎంత పెద్ద శరీరాన్ని ధరించగలనో, ఈమె కొకసారి చూపిస్తాను' అని అనుకొన్నాడు. శత్రుసంహారకుడు, వానరశ్రేష్ఠుడు అయిన హనుమంతుడు ఈ విధంగా ఆలోచించి, తన శక్తిసామర్థ్యాలను, తన నిజస్వరూపాన్ని సీతాదేవికి చూపాలని అనుకున్నాడు. వెంటనే చెట్టుకొమ్మ పైనుండి క్రిందకు దూకాడు. ధీమంతుడు శ్రీమంతుడు అయిన వానరశ్రేష్ఠుడు సీతాదేవికి నమ్మకం కలిగించడం కోసం పెరగడం ప్రారంభించాడు.

వానరోత్తముడైన హనుమంతుడు మేరుపర్వతం అంత, మందరపర్వతం అంత శరీరంతో ప్రజ్వలించే అగ్నిలాగా తేజస్సుతో వెలిగిపోతూ సీతాదేవి ఎదుట నిలబడ్డాడు. ఎర్రని ముఖం, పదునైన కోరలు, వాడి అయిన గోళ్ళతో భయంకరంగా కనపించే హనుమంతుడు సీతాదేవితో ఇట్లా అన్నాడు:

"ఓ సీతాదేవీ! ఈ లంకా పట్టణంలో ఉన్న పర్వతాన్ని, కోటబురుజుల్ని, ప్రాకారాల్ని, అందులోని రావణుణ్ణి వీటన్నిటితోపాటు లంకానగరాన్ని సముద్రం దాటించి తీసుకుపోగల సామర్థ్యం నాకు ఉంది. నాకు సామర్థ్యం ఉందా, లేదా అన్న కారణంపై సందేహించకు. మనస్సు

స్థిరంచేసుకో. నా వెంట వస్తే రామలక్ష్మణుల్ని చూడవచ్చు. వాళ్ళ దుఃఖం, నీ దుఃఖం కూడా మంచుకరిగినట్లు కరిగిపోతాయి.''

భయంకరమైన ఆకారంతో తన ఎదుట నిలబడిన వాయుపుత్రుడైన హనుమంతుణ్ణి చూసి సీతాదేవి ఇట్లా అంది:

"ఓ వానరశ్రేష్ఠుడా! నీ ధైర్యాన్ని, బలాన్ని చూశాను. నీకు వాయువులాగా దూసుకుపోగల గమనం ఉంది. అగ్నికి మల్లే అద్భుతమైన తేజస్సు ఉంది. నీకు తప్ప, ఈ సముద్రాన్ని దాటి రాగల సామర్థ్యం సామాన్యులెవరికీ ఉండదు. రావణుని రక్షకభటుల్ని తప్పించుకొని ఈ ప్రదేశానికి ఎవడు రాగలడు? నీవు నన్ను వీపుపై ఎక్కించుకొని వెళ్ళే సామర్థ్యం గలవాడవేనని నమ్ముతున్నాను. కానీ, రామునికార్యం చెడిపోకూడదు. రామునికార్యం చెడిపోయే పనులేవీ మనం చెయ్యకూడదు.

"నీవు నన్ను వీపుపై ఎక్కించుకొని వెళ్ళేటప్పుడు సముద్రమధ్యంలో నేను భయపడవచ్చును. నీవు వెళ్ళే వేగానికి, నేను కళ్ళు తిరిగి క్రింద పడిపోవచ్చును. నేనట్లా సముద్రం మధ్యలో పడిపోతే తిములకో, తిమింగలాలలకో, మొసళ్ళకో మంచి ఆహారాన్నయిపోగలను. కాబట్టి నేను నీతో రావటం శ్రేయస్కరం కాదు. నన్ను రక్షించబోయి, నీ ప్రాణాలకే ముప్పు తెచ్చుకొన్నట్లవుతుంది.

"లేదా, నీవు నన్ను తీసుకుపోతూ ఉండగా క్రూరాత్ములైన రాక్షసులు శూలాలు, ముద్గరాలు ధరించి నిన్ను చుట్టుముట్టవచ్చు. ఒక ప్రక్క వాళ్ళతో యుద్ధం చేస్తూ, నన్ను రక్షించే భారంకూడా నీపై పడుతుంది. ఏ ఆయుధమూ లేని నీవు ఒంటరిగా వాళ్ళకు చిక్కిపోవచ్చును. లేదా వాళ్ళతో యుద్ధం చేసేటప్పుడు ఏ రక్షణాలేని నీ వీపుపై నుండి జారిపడిపోవచ్చును. ఈ విధమైన యుద్ధంలో నీవు రాక్షసుల చేతుల్లో ఓడిపోవచ్చును. లేదా, క్రిందపడిపోయిన నన్ను బంధించి వాళ్ళు తీసుకొనిపోవచ్చును. లేదా చంపివేయవచ్చును. యుద్ధంలో

జయాపజయాలెప్పుడూ దైవాధీనాలే గదా! ఏమైనా జరుగవచ్చును. అట్లాకాకుండా, రాక్షసులందరినీ నీవు ఒక్కడివే చంపినచో రామునికి కీర్తి లభించదు. రాముని కీర్తి ఇనుమడించదు. దెబ్బ తగుల్తుంది. లేదా, రాక్షసులు నన్ను పట్టుకొనిపోయి ఎవరికీ తెలియని ప్రదేశంలో దాచిపెట్టవచ్చు. అప్పుడు నాకోసం నీవు పడ్డ శ్రమ అంతా వృథా అయిపోతుంది. అందువల్ల ఓ హనుమంతుడా! నీవు పోయి రామునికీ వార్త చెప్పు. మహాత్ముడైన రాముడు, లక్ష్మణుడు, నీమా, రాజైన సుగ్రీవుడు మున్నగువారి జీవితాలన్నీ నా క్షేమంతో ముడిపడి ఉన్నాయి కదా! అంతేకాకుండా వేలాది వానరులు, ఎలుగుబంట్లు నిరాశతో ప్రాణాలు విడుస్తారు.

"పాతివ్రత్య ధర్మాన్ననుసరించి నేను రాముని శరీరం తప్ప మరే పురుషుని శరీరం తాకను. నన్ను రావణుడు బలాత్కారంగా అపహరించుకొని రావడం వల్ల, రావణుని శరీరస్పర్శ నాకు కలిగింది. అప్పుడు నేను అనాథను. స్వయంగా రక్షించుకోలేని స్థితిలో ఉండటం వల్ల ఏమీ చేయలేకపోయాను. అదీగాక, నా అంతట నేనుగా పరపురుషుని స్పృశించటానికి ఇష్టపడను. రాముడే స్వయంగా తన వానరసేనతో వచ్చి రావణుని సంహరించి నన్ను ఇక్కడ నుండి తీసుకొని వెళితే ఆయన గౌరవానికి, ప్రతాపానికి తగినట్లుగా ఉంటుంది. యుద్ధంలో రాముని పరాక్రమాన్ని గూర్చి నేను వినటమే కాదు, స్వయంగా చూశాను. యుద్ధంలో దేవతలు, గంధర్వులు, నాగులు, రాక్షసులుగాని మరెవరూగాని రాముని ముందు నిలువలేరు. విచిత్రమైన ధనుస్సు ధరించి, దేవేంద్రుని వంటి పరాక్రమంగల రాముడు లక్ష్మణునితో కలసి, వాయువుతో కూడిన అగ్నిలాగా యుద్ధభూమిలో నిలచినప్పుడు ఎవరూ ఎదురుగా నిలబడలేరు. యుద్ధంలో శత్రుసంహారకుడైన రాముడి బాణాలనే కిరణాలతో ప్రళయకాల సూర్యుడిలాగాను, మదించిన దిగ్గజంలాగాను ఉండగా, యుద్ధభూమిలో అతడిని ఎవరూ ఎదుర్కోలేరు.

"ఓ వానరశ్రేష్ఠుడా! నా భర్తను, లక్ష్మణుని, వానర సేనానాయకుల్ని త్వరగా ఇక్కడకు తీసుకొనిరా! రాముడి కోసం పరితపించిపోతున్న నాకు సంతోషాన్ని కలిగించు."

# 38వ సర్గ సీత హనుమంతునికి చూడామణిని ఇవ్వడం

సీతాదేవి చెప్పిన మాటలు హనుమంతుడు విని చాలా సంతోషించి ఆమెతో ఇట్లా అన్నాడు:

“ఓ సీతాదేవీ! నీవు మంగళకరమైనదానవు. నీ దర్శనమే ఓ మహద్భాగ్యం. నీవు స్త్రీల స్వభావానికి, పతివ్రతల వినయానికి తగినట్లుగా ఉన్నావు. ఎవరికైనా నా వీపుపై ఎక్కి కూర్చొని నూరుయోజనాల దూరం ప్రయాణం చెయ్యడం చాలా కష్టం. అందులో స్త్రీలకు మరీ కష్టం.

“వినయవంతురాలవైన ఓ జానకీ! రాముడు తప్ప మరి ఏ ఇతర పురుషుడిని మరెవరినీ నీవు తాకనని చెప్పిన రెండవ కారణం రాముడి భార్యవైన నీకే చెల్లుతుంది. నీవు తప్ప మరి ఏ స్త్రీ ఆ మాట అనలేదు. నీవు నాతో ఏమేమి మాట్లాడావో ఎట్లా ప్రవర్తించావో యథార్థంగా అంతా రాముడికి చెప్తాను. నేను రాముడి పట్ల ప్రేమ చేత అతడికి ఏదో సహాయం చెయ్యాలన్న కుతూహలంతో అట్లా అన్నాను. నీపట్ల రాముడి పట్ల నాకుగల భక్తిభావంతో నిన్ను త్వరగా రాముడి దగ్గరకు చేర్చాలనే కోరికతో అట్లా అన్నానేగానీ, నేను నీవు ఆలోచించినంత దూరం ఆలోచించలేదు. నా మనస్సులో మరో కారణం ఏదీ లేదు, ఓ సీతాదేవీ! నీవు నాతో రావటానికి ఇష్టపడకపోతే రాముడు గుర్తించే ఆనవాలు ఏదైనా ఇవ్వు.”

దేవకన్యవంటి ఆ సీతాదేవి హనుమంతుడి మాటలు విని, మెల్లగా ఇట్లా అంది:

“ఓ హనుమంతుడా! నాకూ, నా భర్తకూ మాత్రమే తెలిసిన సంఘటన ఒకటి చెప్తాను. ఆ విషయాన్నే నీవు ఆయనకు ఓ విశిష్టమైన గుర్తుగా చెప్పు.

“మేము చిత్రకూటపర్వతంపై ఉండేవాళ్ళం. ఆ పర్వతం సిద్ధులకు, మునులకు పుట్టినిల్లు. ఆ సమీపానే గంగానది ప్రవహిస్తూ ఉంటుంది. అక్కడే మేము ఒక పర్ణశాల నిర్మించుకొని నివసించేవాళ్ళం. అక్కడ వృక్షాలన్నీ అనేక రకాల పుష్పాలతో నిండి ఉండేవి. ఆ ప్రాంతం

పుష్పాల సువాసనలతో గుబాళిస్తూ ఉండేది. ఒకానొక రోజు మేమిద్దరం జలక్రీడలతో ప్రొద్దుపుచ్చి అలసిపోయి ఆశ్రమానికి వచ్చాం. అప్పుడు నా భర్త నా తొడపై తలపెట్టుకొని పడుకున్నాడు. అప్పుడు ఒక కాకి వచ్చి నన్ను దాని ముక్కుతో పొడిచింది. నేను నా భర్తకు నిద్రాభంగం కలగకూడదని కదలకుండా కూర్చుని ఆ కాకిని ఒక గులకరాయితో కొట్టి అదిలించి తోలేశాను. అది నా నుండి ఓ మాంసఖండాన్ని దూరంగా తీసుకొనిపోయి అప్పుడప్పుడూ నా మీదకు దండెత్తడం మొదలుపెట్టింది. దాన్ని గట్టిగా అదిలిద్దామని నేను వడ్డాణాన్ని కొద్దిగా ఒదులు చెయ్యబోతే, నేను కట్టుకున్న చీర కాస్తా జారిపోయింది. ఆ కదలికవల్ల నా భర్త కళ్ళు తెరచి చూశాడు. అప్పుడు నా చీర జారిపోయి ఉండటం చూసి నన్ను ఎగతాళి చేస్తూ నన్ను ఆట పట్టించాడు. నాకు సిగ్గువేసింది; కోపం వచ్చింది; ఏడ్చేశాను. నన్ను బాధిస్తున్న కాకిని తోలకుండా జారిపోయిన నా చీరవంక చూసి ఎగతాళి చేస్తూవుంటే ఉడుకుమోతుతనంతో ఏడ్చేశాను. కోపంవచ్చి నేను పోయి ఆయన ఒళ్ళో తలపెట్టుకొని పడుకున్నాను. ఇంతలో నాకు నిద్రపట్టేసింది. అట్లా చాలాసేపు పడుకున్నాను. ఆ తర్వాత కొద్దిసేపటికి ఆయన నన్ను లేపి నా తొడపై తలపెట్టుకొని పడుకున్నాడు. అప్పుడు మళ్ళీ ఆ కాకి వచ్చి నా స్తనాలపైన గోళ్ళతో గీరింది, ముక్కుతో పొడిచింది. ఇట్లాచేస్తూ ఉండగా నా రక్తం నా భర్త ఒంటిమీదపడి ఆయన ఒళ్ళంతా తడిసింది. నా రక్తంతో తడవడం వలన ఆయన చివాలున లేచి కూర్చున్నాడు. ఆ మహాబాహువు నా స్తనాల మధ్య అయిన గాయాన్ని చూసి “ఓ దేవీ! నీ స్తనాలపైన గాయం ఎట్లా అయింది? అయిదు తలల నాగుపామువంటి నీతో ఆటలాడే ధైర్యం ఎవరికుంది?” అన్నాడు ఆయన నాలుగు ప్రక్కలా తల తిప్పి పరిశీలనగా చూశాడు. ముక్కుకు, గోళ్ళకూ నెత్తురయి మాంసఖండాన్ని తింటూన్న కాకిని చూశాడు. అది మాములు కాకి కాదు దేవేంద్రుడి కుమారుడే కాకి రూపంలో వచ్చాడు. మహాబాహువు మతిమంతుడైన ఆ దాశరథి కోపంతో కూర్చున్న చోటునుండి ఒక గడ్డి పరకను పెకలించి బ్రహ్మాస్త్రంగా మంత్రించి ఆ కాకి మీదకు వదిలాడు. ఆ గడ్డిపరక ప్రళయాగ్నిలాగా ప్రజ్వరిల్లి ఆ కాకి వెంటపడింది. అప్పుడా కాకి ఆకాశంలోకి ఎగిరిపోతూ ఉంటే బ్రహ్మాస్త్రం దాన్ని వెంబడించింది. ఆ కాకి ప్రాణభయంతో బ్రహ్మాస్త్రాన్నుండి తప్పించుకోవాలని లోకాలన్నీ తిరిగింది. మంత్ర ప్రభావంచేత దేవేంద్రుడుగాని దేవర్షులుగానీ ఆ

కాకిని రక్షించలేకపోయారు. చివరకు ఆ కాకి లోకాలన్నీ తిరిగి తిరిగి, దాన్ని కాపాడే వాళ్ళెవారూ కనపడకపోవటంతో రామప్రభువు పాదాలపైపడి శరణు వేడింది. ఆ కాకి చేసిన నేరం చంపదగినదే అయినా శరణు కోరిన వారిని రక్షించువారిలో శ్రేష్ఠుడైన రాముడు ఆ కాకిపై జాలి తలచి రక్షించాలనుకున్నాడు. రాముడు కాకిని చూసి "బ్రహ్మాస్త్రం వృథా కావటానికి వీలులేదు. అందుచేత ఈ అస్త్రాన్ని ఏం చేయాలో చెప్పు" అన్నాడు. అంతట ఆ కాకి తన కుడి కన్నుపై ప్రయోగించమన్నది. అప్పుడా గడ్డిపరక పోయి కాకి కుడికన్నుపై తాకింది. ఆ విధంగా కాకి తన కుడికంటిని ఇచ్చి ప్రాణాన్ని కాపాడుకుంది. అంతట ఆ కాకి రాముడికి నమస్కరించి తన నివాసానికి వెళ్ళిపోయింది.

"కనుక ఓ హనుమంతుడా! నీవుపోయి రాముడికి నా మాటగా, 'ఓ మహారాజా! ఓ రామా! నాకు బాధ కలిగించిందని సహించలేనివాడవై ఒక కాకి మీద బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించావు. అటువంటిది నీ వద్దనుండి అపహరించుకొని పోయిన ఈ రాక్షసుని ఎట్లా క్షమిస్తున్నావు?

'ఓ రాజా! నీవు మనుష్యులలో శ్రేష్ఠుడవు, శత్రువును సంహరించి నాపై దయ చూపించు. ఓ నాథా! నాథుడవైన నీవు ఉండగా నేను అనాథనైపోయానే! దయ అనేది ధర్మాలన్నింటిలోకీ గొప్పదని నీవే నాకు చెప్పేవాడివి. నా విషయంలో ఎందువల్ల ఇంత నిర్దయంగా ఉన్నావు. నీవు గాంభీర్యంలో సముద్రంవంటి వాడివి. సముద్రాల మధ్యనుండే భూమండలానికంతకూ ప్రభువ్వి, పరాక్రమంలో దేవేంద్రుడితో సమానమైనవాడవు. ఈ విషయాలన్నీ నాకు బాగా తెలుసు. నీవు అస్త్రవేత్తలందరిలోనూ శ్రేష్ఠుడవు. నీవు సత్యవంతుడవు. ధైర్యం కలవాడవు. అయినా కూడా నీ అస్త్రాల్ని ఈ రాక్షసుల్ని సంహరించేందుకు ప్రయోగించడంలేదు. ఎందువల్ల? దేవతలుగాని, నాగులుగాని, గంధర్వులుగాని, యుద్ధంలో నీ వేగానికి తట్టుకొని నిలబడలేరు. అటువంటి పరాక్రమశాలివైన నీవు నా విషయంలో అంటీముట్టనట్లు ఉంటున్నావు. నీ వాడిబాణాలతో రాక్షసుల్ని ఎందువల్ల సంహరించడం లేదు? పోనీ లక్ష్మణుడైనా అన్నగారి ఆజ్ఞచేత నన్ను

రక్షించవచ్చును గదా? అతడూ రక్షించడం లేదు. రామలక్ష్మణులైన మీరిద్దరూ వాయువు, అగ్నివలె సమానమైన తేజస్సుగలవారు. దేవతలుకూడా మిమ్మల్ని ఎదిరించలేరు. అయినా నన్ను రక్షించకుండా పట్టీపట్టనట్లు ఉండిపోతున్నారు ఎందువలన? అది మీ తప్పుకాదు. నేనే ఏదో మహాపాపం చేసుకొని ఉంటాను. సందేహం లేదు. అందువల్లనే మీరిద్దరూ సమర్థులైనా కూడా, నేను కష్టాల్లో ఉన్నానని తెలిసికూడా నన్ను పట్టించుకోవడం లేదు. అందుకు నేను చేసుకున్న పాపకర్మమే కారణమై ఉంటుందే కానీ, దోషం మీ యందు లేదు; సందేహం లేదు."

సీత కన్నీరు కారుస్తూ దీనాతిదీనంగా పలికిన మాటలకు హనుమంతుని మనస్సు ద్రవించి పోయింది. ఆమెను ఓదారుస్తూ ఇట్లా అన్నాడు:

"ఓ సీతాదేవీ! నీ వియోగదుఃఖం చేత రాముడు అన్నం తినడం లేదు. నీరు ముట్టడంలేదు. కంటిపైన కనుకు ఉండటం లేదు. ఈ మాట నీతో సత్యము మీద ఒట్టు పెట్టి చెప్తున్నాను. రాముడు పరిస్థితి ఆ విధంగా ఉంటే అతడి దుఃఖాన్ని చూసి లక్ష్మణుడు కూడా దిక్కుతోచని వాడై ఉన్నాడు.

"దోషములు లేని ఓ సీతాదేవీ! మా అదృష్టవశమున ఇప్పుడు నీవు కనపడ్డావు. కొద్దిరోజుల్లో కష్టాలన్నీ తొలగిపోయే సమయం వచ్చింది, ఇకపై నీవు దుఃఖించడం ఎంతమాత్రమూ తగదు. అమ్మా! ఆ రాజకుమారులిద్దరూ నిన్ను ఎప్పుడు చూద్దామా! అని ఆరాటపడిపోతున్నారు. నీవు ఇక్కడున్నట్లు తెలిసింది కాబట్టి వాళ్ళు లంకను భస్మంచేసి పారేస్తారు. ఓ విశాలాక్షీ! రాముడు రావణుణ్ణి, అతడి పరివారాన్నీ నాశనం చేసి నిన్ను తన పట్టణానికి తీసుకుపోతాడు. అమ్మా! రామునికిగానీ, లక్ష్మణునికిగానీ, వానరరాజు సుగ్రీవునికిగానీ, వానరులకుగానీ ఏదైనా సందేశం చెప్పు."

హనుమంతుడి మాటలు విన్న సీతాదేవి శోకదేవతలాగా ఉంది. అంతటి దుఃఖంలోనూ హనుమంతుడితో ఇట్లా అంది:

"ఉత్తమమైన మనస్సుగల కౌసల్యాదేవి లోకకల్యాణానికై ఏ రాముని కన్నదో, అట్టి రామునికి నా తరపున శిరస్సువంచి నమస్కారం చేశానని చెప్పు. సుమిత్రాదేవి కుమారుడైన లక్ష్మణుడు, ఉత్తమమైన భోగభాగ్యాలను, ప్రియమైన ఉత్తమస్త్రీలను, విశాలమైనరాజ్యాన్ని సర్వైశ్వర్యాన్ని త్యాగం చేసి, తల్లితండ్రుల అనుమతితో, రామునితో కూడా వనవాసానికి వచ్చాడు. రాముడికి సమస్తసేవలు చేస్తూ, అతడికి అనుకూలంగా నడచుకొంటూ అరణ్యవాసంలో రాముడి సంరక్షణాభారాన్ని స్వీకరించాడు. సింహంవంటి మూపు, పెద్ద బాహువులు, ఉత్తమమైన మనస్సు గలవాడు, అందరికీ ఆనందం కలిగించేవాడైన లక్ష్మణుడు నన్ను తల్లివలె చూసుకొనేవాడు. రాముణ్ణి తండ్రిలాగా సేవించేవాడు. వీరుడైన లక్ష్మణునికి నేను రావణునిచే అపహరించబడ్డానని తెలియదు. పెద్దలకు సేవలు చేస్తాడు, సమర్థుడు, మితభాషి, దశరథమహారాజుకు ఇష్టమైనవాడు, రాముని సోదరుడైన లక్ష్మణుని యెడల కూడా నేను పుత్రప్రేమతో మెలిగేదాన్ని. ఆ విధంగా నాకు చాలా ఇష్టుడు. అతడికి ఏపని చెప్పినా చక్కగా చేయగల కార్యసాధకుడు. తండ్రి దశరథమహారాజు మరణించాడని తెలిసినా, లక్ష్మణుడు సేవ వల్లనే బెంగ పెట్టుకోకుండా రాముడు ఉండగలిగాడు. అటువంటి లక్ష్మణుని క్షేమాన్ని విచారించానని చెప్పు. ఓ వానరశ్రేష్ఠుడా! హనుమంతుడా! పరిశుద్ధమైన మనస్సు గలవాడు, సమర్థుడు, రాముడికి చాలా ఇష్టుడైన లక్ష్మణుణ్ణి నా దుఃఖాలను అంతం చెయ్యమని చెప్పు.

"ఓ హనుమంతుడా! ఈ కార్యం నెరవేరడానికీ, రామప్రభువు నా దుఃఖం పోగొట్టడానికీ నీవే కర్తవు కావాలి. నీ ద్వారానే ఆ మహానుభావుడు నన్ను తీసుకొనివెళ్ళే ప్రయత్నం చేస్తాడు. నా భర్తతో ఈ మాట మరీ మరీ చెప్పు. 'ఓ రామప్రభూ! నేను ఇంకా ఒక్క మాసమే జీవించి ఉంటాను, ఆ తరువాత నేను బ్రతికి ఉండను. నేను శపథం చేసి చెప్తున్నాను. దేవేంద్రుడి రాజ్యలక్ష్మిని పాతాళంనుండి విష్ణుభగవానుడు తెచ్చినట్లు, పాపాత్ముడైన రావణునిచే అపహరించబడిన నన్ను రామప్రభువే తీసుకొనిపోవాలి."

తరువాత తన చీర కొంగులోనుండి సుందరమైనది, దివ్యమైనది అయిన చూడామణిని

తీసి రాముడికి తన ఆనవాలుగా ఇమ్మంది. హనుమంతుడు ఆ చూడామణిని తీసుకున్నాడు. అది తన వేలికి సరిపోవడం వల్ల వేలికి ధరించాడు. ఆమె దర్శనం అయింది; రామకార్యం సిద్ధించింది అని సంబరపడిపోయాడు. అతడి శరీరం లంకలో ఉందేకాని, అతడి మనస్సంతా రాముడి పాదాల వద్దనే ఉంది. అంతవరకు సీతాదేవి ధరించిన చూడామణిని ధరించగానే దాని ప్రభావం చేత హనుమంతుని శరీరం పెనుగాలికి ఊగిపోయిన మహాపర్వతంలాగా కదిలిపోయింది. తరువాత హనుమంతుడు సీతాదేవి అనుమతితో కిష్కింధకు ప్రయాణమయ్యాడు.

# 39వ సర్గ హనుమంతుడు చూడామణిని తీసుకొని ప్రయాణమవడం

సీతాదేవి హనుమంతునికి చూడామణి నిచ్చి, అతడితో ఇట్లా అంది: "ఓ హనుమంతుడా! ఈ చూడామణిని చూడగానే రాముడు నా తల్లిని, నన్నూ, దశరథమహారాజునూ గుర్తుచేసుకుంటాడు.

"ఓ హనుమంతుడా! కిష్కింధకు వెళ్లగానే రాముడు సైన్యంతో ఇక్కడకు వచ్చేట్లు చేసే బాధ్యత నీదే సుమా! ఈ కార్యం పూర్తి అయ్యేవరకూ నీవే నడుంకట్టుకొని పనిచెయ్యాలి. ఈ పనికి నీవే కర్తవు కావాలి. నీవు చేసే పనులన్నీ బాగా ఆలోచించి చెయ్యి. నువ్వు ఏది చేసినా, ఏమి ఆలోచించినా, నన్ను ఈ కష్టాల్లోనుండి బైటపడేట్లుగా చూడు." అంతట మహాపరాక్రమవంతుడైన హనుమంతుడు "అట్లే చేస్తాను" అని చెప్పి ఆమెకు శిరస్సువంచి నమస్కరించాడు. అప్పుడు సీతాదేవి గొంతు పూడుకుపోయింది, మాట పెకిలి బయటకురాలేదు. కష్టపడి నెమ్మదిగా ఇట్లా అంది:

"వానరశ్రేష్ఠుడవైన ఓ హనుమంతుడా! రామలక్ష్మణులతో సుగ్రీవునితో అతడి మంత్రులతో క్షేమం విచారించినట్లు చెప్పు. వృద్ధులైన వానరశ్రేష్ఠులను కూడా కుశలం అడిగానని చెప్పు. రాముడికి మరీమరీ చెప్పి నన్నీ నరకం నుండి బయటపడేట్లు చూడు. నేను ప్రాణాలతో ఉండగానే ఇక్కడకు వస్తే నేను కూడా ఆయనను చూస్తాను. ప్రాణం పోయిన తర్వాత వస్తే ఆయన మాత్రమే నన్ను (దేహాన్ని) చూడగలుగుతాడు. కాబట్టి నేను జీవించి ఉండగానే వచ్చి నన్ను ఊరడించమని చెప్పు. ఆ పుణ్యం అంతా నీకే దక్కుతుంది. నీవు చెప్పే మాటల్ని బట్టి అతడిలో ఉత్సాహం, పౌరుషం వృద్ధియయ్యేట్లుగా చూడు. నీవు ఎట్లా చెబితే వెంటనే బయలుదేరుతాడో, ఆ విధంగా నీవు నేర్పుతో నా సందేశాన్ని చెప్పాలి."

అప్పుడు ఆ వాయుపుత్రుడైన హనుమంతుడు శిరస్సు వంచి నమస్కరిస్తూ ఇట్లా అన్నాడు: "ఓ సీతాదేవీ! రాముడు యుద్ధంలో సూర్యుడినైనా, చంద్రుడినైనా, యముడినైనా ఎదిరించగల

సమర్థుడు. అదే యుద్ధం చేయవలసి వస్తే మరింతగా విజృంభిస్తాడు. రాముడు వీరులైన వానరములతోను, భల్లూకములతోను అతిత్వరలో వస్తాడు. శత్రువులందరినీ సంహరించి నీ శోకాన్ని తొలగిస్తాడు. రాముడు సముద్రాల మధ్యగల భూమినంతా జయించగల సమర్థుడు. ఆయన ఏం చేసినా, ఎన్ని విజయాలు సాధించినా అవి అన్నీ నీ కొరకే కదా?"

హనుమంతుని మాటలు సీతాదేవికి అతిమధురంగా వినిపించాయి. మనస్సంతా సంతోషంతో నిండిపోయింది. హనుమంతుణ్ణి మెచ్చుకుంది. రాముణ్ణి గూర్చి ఇంత కాలానికి తియ్యటి మాటలు హనుమంతుడి ద్వారా వినగలిగాను గదా అని సంతోషించింది. ఈ కొద్దిక్షణాలు ఆనందంగా గడి చాయి; ఇకపై మళ్ళీ దిగులుతో ఒంటరిగా బ్రతకాలిగదా అని దుఃఖించింది. తరువాత ఇలా అంది:

"శత్రుసంహరకుడైన ఓ వీరుడా! నీకు అంగీకారం అయితే ఒక్క రోజు ఏదైనా రహస్యప్రదేశంలో ఉండి విశ్రాంతి తీసుకొని వెళ్ళు. నీవు సమీపంలో ఉంటే, దురదృష్టవంతురాలనైన నాకు ఈ కొద్దిక్షణాలైనా ఉపశమనం కలుగుతుంది. ఓ వానరశ్రేష్ఠుడా! నీవు మళ్ళీ తిరిగి వచ్చేటప్పటికి జీవించి ఉంటానో లేదో తెలియదు. ఈ విషయంలో సంశయం ఏమీ లేదు. ఓ హనుమంతుడా! ఒక దుఃఖం తర్వాత మరొక దుఃఖంతో బాధపడే నేను, నువ్వు కనపడకపోవటం వల్ల నా మనస్సంతా దిగులుతో కృంగిపోతుంది; నన్ను ఇంకా తపింప చేస్తుంది.

"ఓ వానరశ్రేష్ఠుడా! నాకో సందేహం కలుగుతోంది. ఈ సముద్రం మహావిశాలమైనది. అందరికీ దాన్ని దాటే సామర్థ్యం ఉండదు గదా! మరి మన వానర, భల్లూకములుగానీ, రామలక్ష్మణులుగానీ ఈ విశాలమైన సముద్రాన్ని దాటి ఎట్లా రాగలరు? గరుత్మంతుడు, వాయుదేవుడు, నీవు మాత్రం ఈ సముద్రాన్ని దాటగల సమర్థులు. మరి మిగతావారి మాట ఏమిటి? ఓ హనుమంతుడా! ఈ గడ్డుసమస్యను ఎట్లా అధిగమిస్తారు? ఈ విషయంలో నీవే ఏదైనా మంచి ఆలోచన చేయగల దిట్టవు. ఓ వీరుడా! ఈ పనిని నీవు ఒక్కడివే చేయగలవు, అట్టి

శక్తిసామర్థ్యాలు నీకే ఉన్నాయి. కీర్తి కూడా నీకే దక్కుతుంది.

"రాముడు యుద్ధంలో రావణుణ్ణి, అతడి పరివారాన్నీ సంహరించి నన్ను ఆతడి పట్టణానికి తీసుకొని వెళ్ళిన ఎడల అది రాముడి కీర్తికి తగినట్లుగా ఉంటుంది. అందువల్ల ఈ యుద్ధంలో రాముడు తన పరాక్రమం చేతనే రాక్షససంహారం జరిగేట్లుగా ఆలోచన చెయ్యి. రాముడి పరాక్రమంతో రావణుణ్ణి, అతడి పరివారాన్ని చంపి నన్ను తీసుకువెళ్ళడమే నాకు ఇష్టం. కాబట్టి అందుకు తగిన ఆలోచనే చెయ్యి."

హనుమంతుడు సీతాదేవి మనోభావాన్ని అర్థం చేసుకున్నాడు. అర్థవంతంగాను, యుక్తాయుక్తంగాను, వినయంతోను సీతాదేవికి నమ్మకం, ధైర్యం కలిగించేందుకు ఇట్లా అన్నాడు:

"ఓ సీతాదేవీ! వానర, భల్లూకాలకు రాజైన సుగ్రీవుడు నిన్ను రక్షించాలనే గట్టి పట్టుదలతో ఉన్నాడు. అటువంటి సుగ్రీవుడు వేల కోట్లాది వానర భల్లూక సైన్యాలతో త్వరలో రాక్షసులందరినీ సంహరించేందుకు వస్తాడు. అమ్మా! ఇక సముద్రాన్ని ఎట్లా దాటి రాగలరా? అన్న సందేహాన్ని వదలి పెట్టు. ఎందువల్లనంటే పరాక్రమవంతులు, కష్టాలను ఓర్పుతో సహించగలవారు అయిన వానరయోధులు సుగ్రీవుడి అధీనంలో ఉన్నారు. వాళ్ళ దారికి ఆకాశంగానీ, నీరుగానీ, నేలగాని అడ్డంగా నిలవలేవు. అపరిమితమైన తేజస్సుగల ఆ వానరయోధులంతా ఎటువంటి గడ్డుకార్యాలు చేయవలసివచ్చినా వెనుకాడరు. మహాఉత్సాహవంతులైన ఆ వీరులంతా అనేకసార్లు ఈ ఆకాశాన్నంతా ఎగిరిచూశారు. భూమినంతా అనేకసార్లు చుట్టివచ్చారు. సముద్రాలు, పర్వతా లన్నింటికీ ప్రదక్షిణాలు చేశారు. అమ్మా! సుగ్రీవుడి సైన్యంలో అందరూ నాకన్నా గొప్పవారూ, నాతోటి సమానులే కాని, నాకంటే తక్కువ సామర్థ్యం గలవారు ఒక్కరు కూడాలేరు. నేనే ఇక్కడకు వచ్చానంటే, నాకంటే మహాబలవంతులైన మిగతావారి మాట వేరే చెప్పాలా? అమ్మా! ప్రభువులు ఏదైనా పనిని సాధించాలంటే సైనికుల్ని పంపిస్తారే కాని, సైన్యాధ్యక్షుణ్ణి పంపరు కదా? ఓ సీతాదేవి! నీవు ఆ

విషయంగా విచారించకు; దుఃఖపడకు. వానరసైనికులంతా ఒక్క గెంతులో ఈ సముద్రాన్ని దాటి లంకకు వస్తారు. రామలక్ష్మణులు సూర్యచంద్రుల్లాగా నా భుజాలపైన ఎక్కి నీ వద్దకు వస్తారు. నరులలో శ్రేష్ఠులు, మహావీరులు అయిన రామలక్ష్మణులు తమ బాణాలతో లంకనంతా ముంచి పారవేస్తారు. రాక్షసులంతా చావక తప్పదు.

"ఓ సీతాదేవీ! రఘువంశానికి ఆనందం కలిగించే రాముడు, రాక్షసుల్ని చంపి నిన్ను తన నగరానికి తీసుకొని వెళ్తాడు. అందువల్ల దుఃఖించవద్దు, ఓర్పుతోవుండు. మండిపోతున్న అగ్నిదేవుడిలాగా రాముడు నీ ముందు నిలబడే రోజు ఎంతో దూరంలో లేదు. ఆ రావణుణ్ణి, అతడి పరివారాన్ని తుదముట్టించిన తర్వాత నీవు రోహిణి చంద్రునితో కలసినట్లుగా రామునితో కలువగలవు. అతిత్వరలో నీ శోకం అంతం అవుతుంది.

"వానరులంతా, సింహాలు, పెద్దపులులవంటి పరాక్రమం గలవారు. వాళ్ళ శరీరాలు పర్వతాలంత పెద్దవి; గోళ్ళూ, కోరలే వాళ్ళ ఆయుధాలు. అటువంటి వానరసేన అంతా వచ్చి లంకను ముంచెత్తడం నీవు చూస్తావు. వారంతా నడుస్తున్న పర్వతాల్లాగా కనిపిస్తారు; మేఘాల్లాగా గర్జిస్తూ తిరగడం నీవు చూస్తావు.

"ఓ దేవీ! తీవ్రమైన మన్మథబాణములచేత మర్మస్థానమునందు కొట్టబడి రాముడు, సింహంచే పీడించబడిన ఏనుగువలె, సుఖమును పొందలేకుండా ఉన్నాడు. శచీదేవికి దేవేంద్రుడు రక్షకుడుగా ఉన్నట్లు రాముడు నీకు రక్షకుడుగా ఉన్నాడు గాదా! అందువలన దుఃఖంతో మనసు పాడుచేసు కోవద్దు. నీకు సర్వశుభాలు కలుగాలని కొరుకుంటున్నాను.

"ఓ సీతాదేవీ! రాముడికంటే గొప్పవాడు కానీ, లక్ష్మణుడితో సమానుడు కానీ ఈ లోకంలో ఇంకెవరైనా ఉన్నారా? అగ్ని, వాయువులతో సమానులైన ఆ రామలక్ష్మణు లిద్దరూ నీకు రక్షకులుగా ఉంటే నీకు భయం ఎందుకు? అమ్మా! నీవు ఇక్కడ ఇంకా ఎంతో కాలం ఉండవు. రాముడు రావటానికి కూడా ఎంతమాత్రం ఆలస్యం చెయ్యడు. నేను రాముణ్ణి కలవగానే

బయలుదేరుతాం, అంతవరకు కాస్త ఓపికపట్టు.”

# 40వ సర్గ హనుమంతుడు ఉత్తర దిక్కుగా ప్రయాణమవటం

దేవకన్యతో సమానురాలైన సీతాదేవి హనుమంతుని మధురమైన మాటలు విని ఇట్లా అంది:

“ఓ హనుమంతుడా! సగంసగం సస్యం మొలకెత్తిన భూమి వర్షపు చినుకులు పడగానే వికసించినట్లు, నీ మంచి మాటలతో నా మనస్సు ఆనందంతో పరవశిస్తోంది. దుఃఖంతో నీరసించిపోయిన నా చేతులతో పురుషశ్రేష్ఠుడైన నా రాముణ్ణి ఒక్కసారి ఒళ్ళంతా తడమాలని ఉంది. నా ఆ కోరిక తీరేట్లు చూడు; నీకు పుణ్యం ఉంటుంది.

“ఓ హనుమంతుడా! కాకి మీద కోపంతో గడ్డిపరక విసరి కన్నుపోగొట్టిన విషయాన్ని రాముడికి గుర్తుచెయ్యి.

“ ‘ఓ రామా! ఒకనాడు నా నుదుట తిలకం చెరిగిపోగా మణిశిలతో నుదుట పెట్టాల్సిన బొట్టును నా బుగ్గకు బాగా పైభాగాన పెట్టావు గుర్తుందా?’ అని గుర్తు చెయ్యి.

“ ‘అటువంటి ప్రేమపాత్రుడవైన నీవు నేను రాక్షసులచేత బంధించబడి నానాకష్టాలు పడుతూవుంటే ఇట్లా ఉపేక్షచేయడం బాగుందా’ అని అడుగు.

“ ‘ఓ రామా! ఈ చూడామణిని చాలా జాగ్రత్తగా కాపాడుకుంటున్నాను. ఈ కష్టకాలంలో దాన్ని చూసుకుంటూ నువ్వే నా ప్రక్కన ఉన్నట్లుగా భావించి సంతోషిస్తున్నాను. నీటిలోనుండి ఉద్భవించిన ఆ చూడామణిని నీకు పంపేస్తున్నాను, ఇకపై నేను ఆ కాస్త సంతోషాన్నీ కూడా కోల్పోయి జీవించలేను.’

“ ‘నువ్వు ఎప్పటికైనా వచ్చి నన్ను తీసుకొని వెళ్తావన్న ఆశతో ఈ రాక్షసులు పెట్టే బాధలు భరిస్తున్నాను. ఓ శత్రుసంహారకుడా! నేను ఇకపై నెలరోజులే జీవించి ఉంటాను. ఈ

రావణాసురుడు చాలా క్రూరుడు, కామంతో కన్ను మూసుకుపోవటంవల్ల అతడి దృష్టి సరిగాలేదు. ఇంకా ఆలస్యం చేస్తే నువ్వు నన్ను చూస్తావేమోగాని నేను నిన్ను చూడలేను. కాబట్టి ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా వచ్చేయి'."

గొప్పతేజస్సు గల హనుమంతుడు, సీత కన్నీరుమున్నీరై ఏడుస్తూ చెప్పిన మాటల్ని విని ఇట్లా అన్నాడు: "ఓ సీతాదేవీ! రాముడు గుర్తించగలిగేది, రాముడు మనస్సును సంతోషపెట్టేదైన మరొక జ్ఞాపికను ఏదైనా ఇవ్వు" అని అడిగాడు. అందుకు సీతాదేవి "ఓ హనుమంతుడా నేను ఇంతకు పూర్వమే ఉత్తమమైనది, చూడగానే రాముడు గుర్తించేదైన చూడామణిని ఇచ్చాను. ఆ మణిని చూడగానే నీవు నన్ను చూసినట్లుగా రాముడు విశ్వసిస్తాడు" అంది.

శ్రీమంతుడు, వానరులలో శ్రేష్ఠుడైన హనుమంతుడు ఆ చూడామణిని గ్రహించి సీతకు నమస్కరించి బయలుదేరడానికి తన శరీరాన్ని పెంచి ఎగరటానికి సిద్ధపడుతూ ఉండగా సీతాదేవి మళ్ళీ ఇట్లా అంది.

"ఓ హనుమంతుడా! సింహంవంటి పరాక్రమంగల రామలక్ష్మణుల్ని, సుగ్రీవుడి, అతడి పరివారపు క్షేమాన్ని మరీమరీ అడిగానని చెప్పు. నీవు వెళ్ళగానే రాముడి కోసం దిగులుతో దుఃఖీస్తున్నానని, ఈ రాక్షసస్త్రీలు పెట్టే బాధలు భరించలేకుండా ఉన్నానని చెప్పు. నీవు క్షేమంగా సముద్రం దాటి రాముణ్ణి చేరాలని కోరుకుంటున్నాను."

కార్యసాధకుడైన హనుమంతుడు, సీత చెప్పిన విషయాలన్నీ మనస్సులోనే మననం చేసుకుంటూ, ఇంకా మిగిలివున్న కొద్దిపాటి పనులు చక్కబెట్టుకునేందుకు ఉత్తరదిక్కుగా బయలుదేరాడు.

# 41వ సర్గ హనుమంతుడు ఉద్యానవనాన్ని ధ్వంసం చెయ్యడం

హనుమంతుడు సీతాదేవి సందేశాన్ని మనస్సుకు పట్టించుకున్నాడు. ఆమె అనుమతి పొంది కొద్దిదూరం పోయి ఆలోచించసాగాడు. నల్లనికన్నులు గల ఆ సీతాదేవిని చూశాను, ఇంకా కొద్దిపాటి పని మిగిలివుంది. ఈ రాక్షసుల్ని ఏదో విధంగా దారిలోకి తీసుకురావాలి. ఏమిటా దారి? సామోపాయం వీళ్ళతో సరిపడదు. వీళ్ళే ఐశ్వర్యవంతులు కాబట్టి దానం కూడా వీళ్ళ దగ్గర పనిచెయ్యదు. వీళ్ళు అమితమైన బలాఢ్యులు కావటంచేత భేదోపాయం కూడా సరిపడేట్లు లేదు. ఇక మిగిలిందల్లా దండోపాయం. ఇప్పుడు నా పరాక్రమం చూపటం ఒక్కటే ఉపాయంగా తోస్తోంది. కొంతమంది మహావీరుల్నైనా చంపితే మిగిలినవాళ్ళు దారికి రావచ్చునేమో! ఎవరికైనా ఒక పని అప్పజెప్పినప్పుడు, ఆ కార్యానికి భంగం కలగకుండా, దానికి సంబంధించిన చిన్నాచితకా కార్యాల్ని ఎవడు సాధిస్తాడో అతణ్ణే కార్యసాధకుడంటారు. కార్యం ఎంత చిన్నదైనా దాన్ని సాధించేందుకు ఒక ఉపాయాన్ని ఆలోచించాలి. అట్లాంటి ఉపాయాలు కూడా అనేకం ఉండొచ్చు. వాటిలో ఉత్తమమైన ఉపాయాన్ని ఎన్నుకున్నవాడినే సమర్థుడు అని అంటారు. యుద్ధంలో శత్రువుల బలాన్ని, మన బలాన్ని బేరీజు వేసుకొని సుగ్రీవుడి దగ్గరకు వెళ్ళినట్లయితే నేను ప్రభువు ఆజ్ఞను బాగా అమలుపరచిన వాణ్ణి అవుతాను.

ఇప్పుడు నాకూ, రాక్షసులకూ పెద్ద ఎత్తున యుద్ధం జరిగినప్పుడేగానీ వారి బలం ఎంతో, నా బలం ఎంతో తెలియదు. మంత్రులు, సేనానాయకులతో కూడిన రావణుని బలం కూడా బయటపడ్తుంది. అట్లాగే రావణాసురుడి యుద్ధవ్యూహం ఏమిటో కూడా తెలుసుకోగలుగుతాను. ఆ విధంగా రాబోయే యుద్ధంలో రాక్షసులకూ, వానరులకూ ఉండే తారతమ్యాన్ని తెలుసుకొని సుగ్రీవుడికి చెప్పవచ్చు, ఆ తరువాత నా దారిన నేను పోతాను అని అనుకున్నాడు.

క్రూరుడైన ఈ రావణాసురుడి ఉద్యానవనం పూలు, పండ్లు, లతలతో నిండి దేవేంద్రుడి నందనవనంలాగా ఉంది. ఎండిపోయిన అడవిని అగ్నిహోత్రుడు దహించినట్లుగా, నేను ఈ

ఉద్యానవనాన్ని నాశనం చేస్తాను. అప్పుడు రావణునికి కోపంవచ్చి, అశ్వములతోను, రథాలతోను, ఏనుగులతోను, మహారథులతోను, వివిధమైన ఆయుధాలనిచ్చి నన్ను బంధించమనో లేక చంపమనో గొప్పసైన్యాన్ని పంపవచ్చు. అప్పుడు నేను కోరుకున్నట్లుగా నా పరాక్రమాన్ని చూపి రావణసైన్యాన్ని చంపి సుగ్రీవుని వద్దకు వెళ్తాను.

ఇలా ఆలోచించి విజృంభించిన హనుమంతుడు తన తొడల వేగంతో, పెనుగాలికి వృక్షాలు విరిగిపడ్డట్లుగా, వృక్షాలన్నింటిని విరిచి పడేశాడు. ఉద్యానవనంలోని చెట్లనన్నింటినీ విరగ్గొట్టాడు. చెరువుల, సరస్సుల గట్లన్నీ తెగనరికి వేశాడు. పర్వతశిఖరాలను విరగ్గొట్టాడు. నందవనంలాగా మనోహరంగా ఉండే ఉద్యానవనం అంతా పెనుతుపానులో చిక్కునట్లు, దావాగ్నిచే దహించివేయబడినట్లు కనబడ్డది. అందమైన లతలన్నీ దుఃఖాక్రాంతులైన స్త్రీలవలె పడిపోయాయి. పక్షులన్నీ నివాసాలు కోల్పోయి, దీనంగా అరుస్తూ ఎగిరిపోయాయి.లతాగృహాల్ని, చిత్రగృహాల్ని పడగొట్టాడు. రాతిగృహాలు, ఇతర గృహాలన్నింటినీ నేలకూల్చాడు. క్రూరమృగాల్ని, క్రూరసర్పాలను స్వేచ్ఛగా విడిచేశాడు. ఇప్పుడా ఉద్యానవనం తన శోభనంతా కోల్పోయింది. రావణుని స్త్రీలకు ఆనందాన్ని కలిగించే అశోకలతలన్నీ నేలపాలయ్యాయి.

హనుమంతుడు రావణునికి కోపం కలిగేట్లుగా ఏమేం చెయ్యాలో అవన్నీ చేశాడు. రావణుని సైన్యాన్ని ఎదిరించడానికి సిద్ధంగా అశోకవనంలో ముఖద్వారం వద్దకు వచ్చి కూర్చున్నాడు.

# 42వ సర్గ రావణుడు హనుమంతునిపైకి సేవకులను పంపటం

అప్పుడు పక్షుల అరుపుల్తోను, చెట్లు విరిగి పడుతుంటే అయ్యే శబ్దాలతోను లంకలో నివసించేవాళ్ళంతా భయపడ్డారు. జంతువులు, పక్షులు ప్రాణభయంతో పరుగులుపెట్టాయి. రాక్షసులు అనేక దుశ్శకునాలు చూశారు. అప్పుడే నిద్రలేచిన రాక్షసస్త్రీలు ఉద్యానవనంలో విరిగిపోయిన వృక్షాల్ని, హనుమంతుణ్ణి చూశారు. ఆ రాక్షసస్త్రీలను భయపెట్టేందుకు మహాబాహువు, గొప్పధైర్యం కలవాడైన హనుమంతుడు తన శరీరాన్ని విపరీతంగా పెంచాడు. ఆ రాక్షసస్త్రీలంతా పర్వతాకారంలో ఉన్న హనుమంతుణ్ణి చూసి, సీతాదేవితో ఇట్లా అన్నారు.

రాక్షస స్త్రీలు : ఓ సీతా! ఈ వానరుడు ఎవరు? ఎక్కడనుండి వచ్చాడు, నీతో ఏం మాట్లాడాడు. నువ్వు ఏమీ భయపడవద్దు, ఉన్నదున్నట్లుగా మాకు చెప్పు.

సీత : ఓ రాక్షసస్త్రీలారా! భయంకరమైన రూపంగల రాక్షసుల గూర్చి తెలుసుకునే జ్ఞానం నా కెక్కడిది? అతడు ఎవరో? ఎక్కడ నుండి వచ్చాడో, ఏం చెయ్యబోతున్నాడో మీకే తెలియాలి. ఎందువల్లనంటే పాము పాదాలు పాముకే కదా తెలుస్తాయి? నాకు కూడా ఇతణ్ణి చూస్తే భయం వేస్తోంది. ఇతడు కూడా కామరూపుడైన రాక్షసుడే అయి ఉంటాడు.

కొందరు స్త్రీలు భయంతో పారిపోయారు. ఇంకొందరు రావణునికి చెప్పటానికి పరుగెత్తారు. కొంతమంది మాత్రం సీతకు కాపలాగా అక్కడే ఉన్నారు. వికృతమైన ఆకారాలుగల ఆ రాక్షసులు, వికృతాకారుడు భయంకరమైన కార్యాలు చేస్తున్న ఆ వానరుణ్ణి గూర్చి రావణునికి చెప్పారు.

“మహారాజా! భయంకరమైన శరీరంతో, అమితమైన పరాక్రమం గల వానరుడొకడు సీతతో ఏదో మాట్లాడాడు. మేము సీతను ఎంత గుచ్చిగుచ్చి అడిగినా ఆ వానరుణ్ణి గూర్చి ఏమీ చెప్పడంలేదు. అతడు దేవేంద్రుడికో, కుబేరుడికో దూత అయివుంటాడు. వాళ్ళు రాముడికి

సహాయం చెయ్యటానికే ఈ వానరుణ్ణి పంపి ఉంటారని మేము అనుకుంటున్నాం. అతి మనోహరమైనది, అనేక పక్షులు మృగాలకు నివాసమైన ఉద్యానవనం అంతా నాశనమైపోయింది. ఆ ఉద్యానవనంలో ఒక్క సీత కూర్చునే చోటు తప్పించి మిగిలిన వనమంతా సర్వనాశనం చేశాడు. జానకిని రక్షించడానికి ఆ చోటు మాత్రం నాశనం చెయ్యకుండా విడిచిపెట్టాడని మేం అనుకుంటున్నాం. ఆమె కూర్చునే శింశుపావృక్షాన్ని మాత్రం అతడు విరవకుండా వదలివేశాడు. కాబట్టి ఆ వానరాన్ని పట్టి కఠినమైన శిక్ష విధించాలి. ఓ రాజా! ఈ వానరుడెవరో ప్రాణాలకు తెగించియే సీతతో మాట్లాడాడు" అని చెప్పారు.

రాక్షసరాజైన రావణుడు, రాక్షసస్త్రీల మాటలు విని కోపంతో మండిపడ్డాడు. కళ్ళు రెండూ హోమగుండాల్లాగా మండిపోయాయి, మండేదీపం నుండి నూనెబొట్లు కారినట్లుగా అతడి కన్నులనుండి కన్నీటిబొట్లు జలజలా రాలాయి మహాతేజశ్శాలియైన రావణుడు, హనుమంతుని బంధించమని ఎనభైవేలమంది 'కింకరు' లనే రాక్షసజాతి వాళ్ళను నియోగించాడు. వాళ్ళంతా రావణాసురుడంతబలశాలురు.పొడవైన కోరలు, భయంకరమైన ఆకారం గల ఆ కింకరులంతా కూటములు, ముద్గరములనే ఆయుధాల్ని ధరించి ఉత్సాహంగా యుద్ధానికి బయలుదేరి వెళ్ళారు. వాళ్ళ కోసమే హనుమంతుడు ముఖద్వారం దగ్గర నిలబడి ఉన్నాడు. ఆ కింకరులంతా పరిఘలతోను, గదలతోను, సూర్యునివలె మెరిసే బాణాలతోను హనుమంతుని కొట్టారు. మిగతావాళ్ళంతా ముద్గరములు, పట్టిసములు, శులాలు, ప్రాసలు, తోమరాలు, కత్తులు పట్టుకొని హనుమంతుణ్ణి చుట్టుముట్టారు.

మహాతేజోవంతుడైన ఆ హనుమంతుడు తోక నేలపై కొట్టి గొప్పశబ్దం చేశాడు. దేహాన్ని పర్వతమంతగా పెంచేశాడు. లంకా పట్టణానికంతా వినిపించేట్లుగా జబ్బలు చరిచాడు. ఆ ధ్వనికి పక్షులు, జంతువులు భయపడి పారిపోయాయి. కొన్ని పక్షులు నేలవాలాయి.

హనుమంతుడు తన శరీరాన్ని పర్వతమంత పెద్దది చేసి పెద్దగా కేకలు వేశాడు. "మహా బలశాలియైన రాముడికి జయం, మహాబలవంతుడైన లక్ష్మణునికి జయం. రాముడిచే

కాపాడబడిన సుగ్రీవుడికి జయం. ఓ రాక్షసులారా! నేను వాయుపుత్రుడనైన హనుమంతుడను. శ్రమలేకుండా కార్యాలు చక్కబరచే కోశలాధిపతియైన రామునికి దాసుడను. నేను రాళ్ళు, వృక్షాలు శత్రువులమీదికి విసురుతూ యుద్ధం చేస్తాను. వెయ్యిమంది రావణులైనా నన్ను ఎదిరించలేరు. నేను మీరంతా చూస్తూ ఉండగానే ఈ లంకాపట్టణాన్నంతా నాశనం చేసి సీతాదేవికి నమస్కరించి వెళ్తాను."

హనుమంతుడి కేకలు విన్న ఆ కింకర రాక్షసులంతా భయభ్రాంతులయ్యారు. సంధ్యాకాలపు మేఘంలాగా నిలబడిన హనుమంతుణ్ణి చూశారు. ఆ కింకరులంతా నాలుగు వైపులనుండి భయంకరమైన ఆయుధాల్ని విసిరారు. అప్పుడు హనుమంతుడు ముఖద్వారం దగ్గర ఉన్న పెద్దఇనుప ద్వారాన్ని ఊడబెరికాడు. వీరుడైన ఆ హనుమంతుడు ఆ ద్వారాన్నే ఆయుధంగా చేసుకొని రాక్షసుల్ని కొట్టి చంపాడు. సర్పాన్ని కాళ్ళకు చుట్టుకొని గరుత్మంతుడు ఆకాశంలో తిరిగినట్లు హనుమంతుడు ఆ ఇనుప ద్వారాన్ని చేతబుచ్చుకొని గిరగిరా త్రిప్పుతూ ఆకాశమంతా తిరిగాడు. ఆ వచ్చిన కింకరులంతా చచ్చిపడిపోయారు. హనుమంతుడికి యుద్ధాన్ని ఆపడం ఇష్టంలేదు. రావణుడు మరికొంత సైన్యాన్ని తప్పక పంపగలడని ఎదురుచూస్తూ ఆ ముఖద్వారం దగ్గరే నిలబడ్డాడు. వాళ్ళల్లో మిగిలిన ఒకరిద్దరు భయంతో పరుగెత్తుకుని పోయి, కింకరులందరూ యుద్ధంలో మరణించారని చెప్పారు. ఆ మహాబలశాలురంతా చనిపోయారని విన్న రావణుడు గుడ్లు తేలేశాడు. ఈసారి అతి పరాక్రమశాలీ ప్రహస్తుని కుమారుడూ అయిన జంబుమాలిని హనుమంతుడి మీదకు పంపాడు.

# 43వ సర్గ హనుమంతుడు చైత్యప్రాసాదాన్ని ధ్వంసం చెయ్యడం

హనుమంతుడు కింకరులందరినీ హతమార్చాడు. 'నేను ఉద్యానవనాన్నంతా ధ్వంసంచేశాను. చైత్యప్రాసాదాన్ని, దాంట్లో ఉన్న ఇతర భవనాలను కూడా నాశనం చెయ్యాలి. అప్పుడే నేను తలపెట్టిన కార్యం పూర్తి అవుతుంది' అని అనుకున్నాడు. వాయుపుత్రుడు, వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు ఈ విధంగా ఆలోచించి ఒక గంతులో చైత్యప్రాసాద ప్రాంగణానికి చేరుకున్నాడు. మేరుపర్వతంలాగా ఉన్న ఆ చైత్యప్రాసాదంపైకి ఎక్కాడు. ఆ ప్రాసాదంపైన ఉన్న హనుమంతుడు రెండవ సూర్యుడిలా ప్రకాశించాడు. ఇతరులెవరూ ఎక్కడానికి సాధ్యంకాని ఆ ప్రాసాదాన్ని ఆక్రమించుకున్నాడు. తన శరీరాన్ని పారియాత్ర పర్వతమంతగా పెంచేశాడు. లంకాపట్టణం అంతా వినిపించేట్లుగా జబ్బలు చరిచాడు. ఆ ధ్వనికి లంకవాసుల చెవులన్నీ చిల్లులుపడ్డాయి. భయంతో పక్షులన్నీ ఆకాశం నుండి రాలిపడ్డాయి. ఆ ప్రాసాదాన్ని కాపాడుతున్న రక్షకభటులంతా స్పృహతప్పి పడిపోయారు.

స్పృహతప్పి పడిపోయిన వందమంది రక్షకభటులు తెప్పరిల్లి వెంటనే ప్రాసలు, ఖడ్గాలు, గండ్రగొడ్డళ్ళు ఇంకా అనేక రకాలైన ఆయుధాల్ని ధరించి హనుమంతుణ్ణి చుట్టుముట్టారు. వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు చుట్టూ భటులు తిరుగుతూ ఉంటే గంగానదిలో ఏర్పడే సుడిగుండాల్లాగా కనిపించారు. హనుమంతుడికి కోపం వచ్చి తన శరీరాన్ని ఇంకా విపరీతంగా పెంచాడు. ఆ భవనంలో బంగారంతో అలంకరించిన పెద్ద స్తంభాన్ని ఊడబెరికి దాన్నే ఆయుధంగా ధరించి గిరగిరా త్రిప్పుతూ ఉంటే ఆ వేడికి నిప్పు పుట్టుకొచ్చింది. దాంతో ఆ ప్రాసాదాన్నంతా తగలబెట్టాడు. తరువాత ఇంద్రుడు వజ్రాయుధంతో అసురుల్ని చంపినట్లుగా ఆ వందమంది రక్షకభటుల్ని చంపి ఆకాశంలో నిలబడి ఇట్లా అన్నాడు.

"ఓ రాక్షసుల్లారా! సీతాదేవిని వెతకటానికి వానరరాజైన సుగ్రీవుడు వేలకొద్దీ వానరుల్ని దేశం నలుమూలలకూ పంపించాడు. వాళ్ళంతా మహాపరాక్రమవంతులు, అమిత బలాఢ్యులు.

అందులో కొందరు ఏనుగంత ఉంటారు. ఇంకొందరు నూరుఏనుగుల ప్రమాణంలో ఉంటారు. ఇంకొంతమంది వెయ్యి ఏనుగుల ప్రమాణంలో ఉంటారు. వాళ్ళంతా నాకంటే వెయ్యిరెట్లు బలశాలురు. వాళ్ళందరికీ వాడియైన కోరలు, గోళ్ళే ఆయుధాలు. వాళ్ళ వేగాన్ని ఎవరూ లెక్కకట్టలేరు; వాయుదేవుడంత వేగం గల వాళ్ళను ఎవరూ అడ్డుకోలేరు. సుగ్రీవుడి దగ్గర కోట్లాది వానరులు, భల్లూకాలతో కూడిన పెద్దసేనవుంది. వారందరినీ వెంటబెట్టుకొని త్వరలో ఇక్కడకు వస్తాడు. మీ రాజైన రావణుడు అకారణంగా రాముడితో వైరం పెట్టుకున్నాడు. రాముడు వచ్చి మీ రాక్షసులందర్నీ చంపేస్తాడు, మీ రాజైన రావణాసురుణ్ణి చంపేస్తాడు. మీకు రాజు అనేవాడే ఉండడు, మీ లంకా పట్టణం అంతా సర్వనాశనం అయిపోతుంది" అంటూ హెచ్చరించాడు.

# 44వ సర్గ హనుమంతుడు జంబుమాలిని వధించటం

జంబుమాలి ప్రహస్తుని కుమారుడు. మహాబలశాలి. రావణాసురుడు ఆ జంబుమాలిని హనుమంతుడిపైకి యుద్ధానికి పంపాడు. పెద్దపెద్ద కోరలుగల ఆ జంబుమాలి ఎఱ్ఱటి వస్త్రాలు పూలమాలలు, చెవులకు కుండలాలు ధరించి బయలుదేరాడు. పెద్దశరీరంతో భయంకరుడైన జంబుమాలి ఇంద్రధనుస్సువంటి ధనుస్సును, బలమైన బాణాలను ధరించాడు. ధనుస్సు నారిని సంధించి, పిడుగుపాటువంటి ధ్వని చేశాడు. అతడి ధనుష్టంకారానికి దిక్కులన్నీ పిక్కటిల్లాయి. ఆకాశం కంపించింది. గాడిదలు కట్టిన రథాన్నెక్కి హనుమంతుణ్ణి ఎదుర్కోవటానికి వచ్చాడు. జంబుమాలి రథంపై రావటం చూసిన హనుమంతుడు సంతోషంతో పెద్దగా కేకలుపెట్టాడు. ముఖద్వారంపై నిలబడివున్న హనుమంతుడిపై జంబుమాలి వాడియైన బాణాల్ని ప్రయోగించాడు. అర్ధచంద్ర బాణంతో ముఖం మీద హనుమంతుణ్ణి కొట్టాడు. ఎఱ్ఱటి హనుమంతుని ముఖంపై తగిలి రక్తం కారటంవల్ల శరత్కాలంలో సూర్యకిరణాలతో వికసించిన పద్మంలాగా ఆ ముఖం ప్రకాశించింది. ఎఱ్ఱటి పద్మంపై ఎఱ్ఱచందనం చిలకరించినట్లైంది.

బాణాలచే దెబ్బతిన్న హనుమంతుడికి కోపం కట్టలుతెంచుకొచ్చింది. ప్రక్కనే ఉన్న ఒక రాయి తీసుకొని (చిన్న కొండంత ఉంది) ఆ జంబుమాలి పైకి విసిరాడు. దాన్ని అతడు పదిబాణాలతో ముక్కలుముక్కలు చేశాడు. భయంకర పరాక్రమశాలి, మహాబలవంతుడైన హనుమంతుడు తను విసిరిన రాయి విఫలం కావటంతో ప్రక్కనే ఉన్న పెద్ద సాలవృక్షాన్ని వ్రేళ్ళతోసహా పెకలించి దాన్ని విష్ణుచక్రంలాగా వేగంగా తిప్పుతూ ఉండటం చూచిన జంబుమాలి ఆ మహావృక్షంపైన బాణాలు ప్రయోగించాడు. నాలుగుబాణాలతో ఆ మహావృక్షాన్ని ఛేదించాడు. ఐదు బాణాల్ని హనుమంతుడి బాహువుపైన ప్రయోగించాడు, ఒక బాణాన్ని వక్షఃస్థలంపైనా, పది బాణాల్ని ఛాతీపైనా ప్రయోగించాడు. శరీరం అంతా బాణాలు గుచ్చుకొని బాధపెడ్తూ ఉంటే, హనుమంతుడు కోపంతో పరిఘనొకదాన్ని తీసుకొని మహావేగంతో గురిచూసి జంబుమాలి వక్షఃస్థలంపై కొట్టాడు. ఆ పరిఘ వేగానికి, రథం, రథానికి కట్టిన గాడిదలు, రథంలో కూర్చున్న

జంబుమాలి, అంతా కలసి ముద్దైపోయారు. అక్కడ అతడి శిరస్సుగాని, బాహువులుగాని, మోకాళ్ళుగాని, ధనుస్సుగాని, రథంగాని, దానికి కట్టిన గాడిదలుగాని ఏవీ కనపడలేదు. ఆ విధంగా జంబుమాలి ఆ పరిఘ వేగానికి తట్టుకోలేక చచ్చి నేలమీద పడిపోయాడు. ఆ దెబ్బకు అతడిలోని అహంకారాలన్నీ ముద్దైపోయాయి.

మహాబలశాలియైన రావణుడు, మొదట కింకరులు, ఆ తరువాత జంబుమాలి కూడా మరణించినట్లు విని కృద్ధుడైపోయాడు. అప్పుడతడి కళ్ళు ఎఱ్ఱగా చింతనిప్పు లయ్యాయి. వెంటనే మంత్రి కుమారుల్ని యుద్ధానికి వెళ్ళమని ఆదేశించాడు.

# 45వ సర్గ హనుమంతుడు మంత్రి పుత్రులను వధించటం

రావణుని ఆజ్ఞానుసారం అతడి మంత్రుల పుత్రులు ఏడుగురూ అశ్వాలను పూన్చిన రథాలపైన హనుమంతుడిపైకి యుద్ధానికి బయలుదేరారు. వాళ్ళంతా అగ్నితో సమానమైన కాంతి గలవాళ్ళు. మహాబలశాలురు. వారు అధిరోహించిన రథాలకు బంగారు జాలములను కట్టారు. యోధుల రథాలకు అలంకరించే జెండాలు, వాటిపై ఎగురుతున్నాయి. ఆ రథాలన్నీ కదుల్తూవుంటే, మేఘాలు గర్జిస్తున్నట్లు ధ్వనులు వస్తాయి. వారంతా అస్త్రవిద్యల్లో ఆరితేరినవారు. వాళ్ళు ఏడుగురూ విజయం సాధించడం కోసం ఒకరితో మరొకరు పోటీపడుతూ ఉంటారు. అట్లాగే ఇప్పుడు కూడా హనుమంతుడిపై యుద్ధానికి మంచి ఉత్సాహంతో బయలుదేరారు. వారిని అనుసరించి పెద్ద సైన్యం బయలుదేరింది. ఆ మంత్రి కుమారులంతా మెరుపులతో కూడిన మేఘాల్లాగా ఉన్నారు. కింకరులవంటి మహాయోధులే చంపబడ్డారని విన్న వాళ్ళ తల్లులు, బంధువులంతా భయంతో తల్లడిల్లిపోయారు.

పరిశుద్ధమైన బంగారంతో చేసిన రథాల్లో మంత్రి పుత్రులంతా కలసి ముఖద్వారం దగ్గరకు వెళ్ళారు. అక్కడ హనుమంతుడు యుద్ధానికి తయారై సిద్ధంగా నిలబడ్డాడు. ఒకరిపై ఒకరు పోటీపడుతూ ఏడుగురు మంత్రి పుత్రులు హనుమంతుడిపై లంఘించారు. ఆ రాక్షసులంతా మేఘాల్లాగా ఉంటే, వాళ్ళ రథ ధ్వనులన్నీ ఉరుముల్లాగా వినిపించాయి. వాళ్ళ ధనుస్సుల నుండి వెలువడే బాణాల్ని వర్షంలా హనుమంతుడిపై కురిపించారు. హనుమంతుణ్ణి ఆ బాణాలన్నీ కప్పివేయగా అప్పుడా హనుమంతుడు వర్షంచే కప్పబడిన పర్వతరాజులాగా శోభించాడు. ఆకాశంలో అతివేగంగా తిరుగుతూ ఉండటంవల్ల వాళ్ళు వేసిన బాణాలన్నీ నిష్ఫలమయ్యాయి. అప్పుడు హనుమంతుడు ఆకాశంలో ఇంద్రధనుస్సుతో కూడివున్న మేఘాల వరకు ఎగిరి మేఘాలతో ఆడుకునే వాయుదేవుడిలాగా కనిపించాడు. అంతట హనుమంతుడు భయంకరంగా కేకలువేస్తూ, ఆ రాక్షస సైన్యాన్నంతా భయపెడుతూ అమితమైన వేగంతో వాళ్ళపై దూకి, కొందరిని అరచేతులతో కొట్టాడు; కొందరిని పాదాలతో తన్నాడు; కొందరిని

పిడికిళ్ళతో గుద్దాడు; గోళ్ళతో రక్కాడు; కోరలతో పీకాడు, కొందరిని వక్షఃస్థలంతో ఢీకొన్నాడు, కొందరిని తొడలమధ్యవేసి నలిపేశాడు. కొంతమంది చనిపోయారు; కొంతమంది మళ్ళీ లేవలేకుండా పడిపోయారు; కొందరు నెత్తురు కక్కుకున్నారు. భయపడిన రాక్షససైన్యం అంతా చెల్లాచెదరై ప్రాణరక్షణ కోసం పరుగులు తీసింది. ఏనుగులన్నీ వికృత ధ్వనులు చేశాయి. అశ్వములు నేలకూలాయి. భూమి కంపించింది. పైకప్పులు తిరగబడ్డాయి. ధ్వజాలు, ఛత్రాలు చిరిగిపోయాయి. రథాలన్నీ తిరగబడ్డాయి, రక్తం ఏరులై పారింది. లంకానగరం అంతా హాహాకారాలతో మారుమ్రోగింది.

వీరుడూ, మహాబలశాలి అయిన హనుమంతుడు మహాబలశాలురైన రాక్షసుల్ని చంపి, ఇతర రాక్షసవీరులతో కూడా యుద్ధం చెయ్యాలనే కాంక్షతో తిరిగి ముఖద్వారంవద్దకు పోయి నిలబడ్డాడు.

# 46వ సర్గ హనుమంతుడు సేనాపతులను వధించటం

ఒక వానరుడు, భయంకరమైన కింకరులను, మంత్రి పుత్రులను సంహరించాడని విన్న రావణుడి నవనాడులూ కృంగిపోయాయి. అయినా బయటపడలేదు. లోలోపలే బాగా ఆలోచించాడు. నీతిశాస్త్ర కోవిదులు, యుద్ధంలో వాయువేగంతో దూసుకుపోయే వారూ, హనుమంతుణ్ణి ఎట్లాగైనా పట్టుకోవాలని తొందరపడుతున్న వాళ్ళు అయిన విరూపాక్షుడు, యూపాక్షుడు, దుర్ధరుడు, ప్రఘసుడు, భాసకర్ణుడు అనే అయిదుగురు సేనానాయకుల్ని పిలిపించి ఇట్లా ఆజ్ఞాపించాడు.

"ఓ సేనానాయకులారా! మీరందరూ పెద్దసైన్యాన్ని, రథాల్ని, గుర్రాల్ని, ఏనుగులను తీసుకొని పోయి ఆ వానరుణ్ణి బంధించండి. మీరు ఆ వానరుణ్ణి పట్టుకొని బంధించే ప్రయత్నం చెయ్యండి. చేస్తున్న అరాచకాలను బట్టి చూస్తూవుంటే వాడు సామాన్యమైన వానరంలాగా కనిపించటం లేదు. వాడొక మహాభూతమేమోనని నాకు అనిపిస్తోంది. మనందర్నీ నాశనం చెయ్యాలని దేవేంద్రుడే ఈ భూతాన్ని సృష్టించి ఉంటాడేమోనని అనిపిస్తోంది. నేను నాగులను, యక్షులను, అసురులను, మహర్షులను జయించాను. వాళ్ళు అపజయాన్ని జీర్ణించుకోలేక, నాపై పగతీర్చుకోవటానికే ఈ భూతాన్ని సృష్టించి ఉండవచ్చును. కాబట్టి దేశకాల విరోధమైన పని ఏదీ చేయొద్దు. మీరంతా చాకచక్యంతో వాణ్ణి పట్టుకొని బంధించాలి.

పూర్వం నేను వాలిని, సుగ్రీవుణ్ణి, మహాబలవంతుడైన జాంబవంతుణ్ణి, నీలుణ్ణి, ద్వివిదుణ్ణి ఇంకా అనేకమంది వానరవీరుల్ని చూశాను. కానీ వారెవరికీ వీడికున్నంత వేగంలేదు. వాళ్ళు వీడంతటి కాంతిమంతులుకారు, ఇంతటి ఆలోచనాపరులు కూడా కారు. ఈ వానరుడిలో అమితమైన ఉత్సాహం కనబడుతోంది. ఈ ఉత్సాహం వాళ్ళెవరికీ లేదు. అయినా యుద్ధానికి వెళ్ళేటప్పుడు జయాపజయాల్ని ముందుగానే నిర్ణయించలేం. అందువల్ల జయాన్ని కోరుకునే బుద్ధిమంతుడైనా, ముందు తన్ను తాను రక్షించుకుంటాడు. కాబట్టి మీరు అప్రమత్తులై

మెలగండి.”

అంతట మహాబలవంతులు, అగ్నితో సమానమైన తేజస్సు గలవారైన వాళ్ళంతా రాజాజ్ఞను శిరసావహించి రథాల్ని, మదించిన ఏనుగుల్ని, గుర్రాలను, రకరకాలైన శస్త్రాలతోనూ, ఆయుధాల తోనూ, సేనలతోనూ తమ బలాన్ని బాగా పుంజుకొని వేగంగా బయలుదేరారు. గొప్ప ఉత్సాహం తోను, బలంతోను, ధైర్యంతోను ఆ హనుమంతుడు ఆ ముఖద్వారం దగ్గరే నిలబడి ఉన్నాడు. అటువంటి హనుమంతుణ్ణి చూడగానే, రాక్షసులందరూ హనుమంతుణ్ణి నాలుగుప్రక్కల నుండీ ముట్టడించారు. దుర్ధరుడు వాడియైన నల్లగావున్న పచ్చని మొనలు కలిగివుండే అయిదు ఇనుప బాణాల్ని హనుమంతుడి తలపైన ప్రయోగించాడు. ఆ బాణాలు శిరస్సుకు తగలగానే హనుమంతుడు భయంకరంగా అరుస్తూ ఆకాశంలోకి ఎగిరాడు. వెంటనే దుర్ధరుడు తన ధనుస్సును ఆకాశం వైపుగా ఎక్కుపెట్టి వందలకొద్దీ బాణాల్ని హనుమంతుని వైపుగా ప్రయోగించాడు. శరత్కాలంలో మేఘాల్ని అడ్డగించే వాయువులాగా హనుమంతుడు ఆ బాణాలన్నింటినీ అడ్డుకున్నాడు. తరువాత తన శరీరాన్ని పర్వతమంత విశాలంగా పెంచి వేగంగా అంత ఎత్తునుండి ఒకేసారి దుర్ధరుడి రథంపైన పడ్డాడు. అప్పుడు దుర్ధరుడు నేలకూలాడు, ఎనిమిది గుర్రాలు, రథమూ విరిగి నేలమీద కూలిపోయాయి.

మహాబలశాలియైన దుర్ధరుడు నేలకూలటంతో విరూపాక్షుడు, యూపాక్షుడూ కోపంతో ఆకాశంలోకి ఎగిరి హనుమంతుడి వక్షఃస్థలంపై ఇనుప గదలతో మోదారు. గరుత్మంతుడి వంటి పరాక్రమం గల ఆ హనుమంతుడు అమితమైన వేగంతో నేల మీదకు వచ్చాడు. అంతట వాయు పుత్రుడైన ఆ హనుమంతుడు ఒక సాలవృక్షాన్ని పెకలించి విరూపాక్షుడు, యూపాక్షులను చచ్చేదాకా బలంగా మోదాడు. ఆ విధంగా ముగ్గురు రాక్షసయోధులు హనుమంతుడి చేతిలో ప్రాణాలు వదిలారు.

ఇదంతా చూస్తున్న ప్రఘసుడు వేగంగా హనుమంతుణ్ణి ఎదిరించాడు. పట్టరాని కోపంతో భాసకర్ణుడు శూలాన్నొకటి తీసుకొని హనుమంతుడి పైకి పోయాడు. ఆ విధంగా ఆ రాక్షసవీరు

లిద్దరూ హనుమంతుణ్ణి చెరోప్రక్క నుంచీ ఎదిరించారు. పోరాటం భీకరంగా సాగింది. ప్రఘసుడు పదునైన అడ్డకత్తితోను, భాసకర్ణుడు శూలంతోను ఎదుర్కొన్నారు. హనుమంతుడి ఒళ్ళంతా గాయాలయ్యాయి; గాయాల్లో నుండి నెత్తురు చిమ్ముతోంది. అప్పుడు హనుమంతుడు మృగాలతోను, పాములతోను, వృక్షాలతోను ఉన్న ఒక పర్వతాన్ని రెండు చేతులతో పెకలించి ఆ రాక్షసులిద్దరి పైనా విసిరేశాడు. ఆ పర్వతం క్రిందపడి వాళ్ళిద్దరూ అక్కడికక్కడే మరణించారు. ఆ విధంగా అయిదుగురు సేనానాయకులు చావగా మిగిలిన సైన్యం అంతా చిందరవందరగా భయభ్రాంతమై పారిపోయింది. అసుర సంహారంలో దేవేంద్రుడు వలె హనుమంతుడు ఆ రాక్షససైన్యంలో గందరగోళం సృష్టించాడు. దాంతో వాళ్ళల్లో వాళ్ళే చంపుకోవడం మొదలుపెట్టారు. గుర్రాల మీద గుర్రాలను, ఏనుగుల మీద ఏనుగులను, యోధుల మీద యోధులను, రథాల మీద రథాలను వేసి కొట్టి దేవేంద్రుడు రాక్షసులను సంహరించినట్లు హనుమంతుడు సంహరించాడు. రాక్షస కళేబరాలతో నేలంతా నిండిపోయింది. పోయేందుకు దారే లేకపోయింది ఆ మహాపరాక్రమవంతుడు హనుమంతుడు సేనానాయకుల్ని, సేనల్ని చంపి, ప్రళయకాల యముడివలె మళ్ళీ అశోకవనం ముఖద్వారం దగ్గర నిలబడ్డాడు. మళ్ళీ రాక్షసవీరులు వస్తారేమోనని ఎదురుచూస్తున్నాడు.

# 47వ సర్గ హనుమంతుడు అక్షకుమారుని వధించటం

హనుమంతుడు ఐదుగురు సేనాపతుల్నీ, సేనల్నీ, వాహనాలనూ నాశనం చేసి చంపాడని విన్న రావణుడు ఎదురుగుండా కూర్చున్న తన కుమారుడైన అక్షకుమారుడి వైపు చూశాడు. యుద్ధంలో ఉద్ధతుడు, యుద్ధోన్ముఖుడైన ఆ అక్షకుమారుడు తండ్రి మనోగతాన్ని గ్రహించాడు. బంగారంతో పొదిగిన చిత్రవర్ణమైన ధనుస్సును ధరించి, బ్రాహ్మణులచే యజ్ఞంలో ప్రజ్వలింపజేసిన అగ్నివలె ప్రకాశిస్తూ వెంటనే బయలుదేరాడు.

ఉదయసూర్యుని వంటి కాంతితో మెరిసిపోతున్న బంగారుజాలముతో కట్టబడి, పరిశుద్ధమైన గొప్ప రథాన్ని అధిరోహించి ఆ రాక్షసోత్తముడు, వాయునందనుడైన హనుమంతునిపై యుద్ధానికి బయలుదేరాడు. ఆ రథం ఎన్నో రత్నాలతో అలంకరించబడ్డది. చిన్నచిన్న పతాకాలు, ధ్వజం అమర్చారు. ఆ రథానికి ఎనిమిది గుర్రాలు పూన్చబడ్డాయి. మనోవేగంతో సమానంగా పరుగెత్తగల ఆ రథంలో ఆయాస్థానాల్లో అంబులపొదులు, ఎనిమిది ఖడ్గాలు, శక్తులు, తోమరాలు అమర్చి ఉన్నాయి. ఆ రథాన్ని సురులు, అసురులు కూడా అడ్డుకోలేరు. కోటిసూర్యుల కాంతితో వెలిగిపోతూ ఉంటుంది. అది నేలమీదా ఆకాశంలోకూడా ఎక్కడా అడ్డులేకుండా ప్రయాణం చెయ్యగలదు. ఎన్నో తపస్సులు చేసి, అక్షకుమారుడు ఆ రథాన్ని సంపాదించాడు. దేవతల పరాక్రమంతో సమానుడైన ఆ అక్షకుమారుడు బంగారుమాలలు అలంకరించుకున్నాడు. సూర్యచంద్రుల వలె ప్రకాశిస్తూ, సూర్యకాంతిని పోలిన రథాన్నెక్కి బయలుదేరాడు. అక్షకుమారుణ్ణి అనుసరించి వచ్చిన ఏనుగులు, గుర్రాలు, కాల్బలము, మహారథాలు చేస్తున్న శబ్దాలు భూమ్యాకాశాలను నింపివేస్తోంది. వారంతా ముఖద్వారం వద్ద కూర్చుని ఉన్న మహాబలుడైన హనుమంతుణ్ణి సమీపించారు.

సింహంవంటి నేత్రాలు గల ఆ అక్షకుమారుడు ప్రళయాగ్నిలాగా నిలబడివున్న హనుమంతుణ్ణి చూశాడు. అప్పుడతడికి విరోధభావం కలుగలేదు; గౌరవభావం కలిగింది.

అంతట అక్షకుమారుడు తన కర్తవ్యాన్ని నెరవేర్చటానికి తన బలాన్ని హనుమంతుడి బలాన్ని అంచనావేసుకున్నాడు. మంచు తొలగిన సూర్యుడువలే ప్రకాశిస్తూ, హనుమంతుడి పరాక్రమానికి అడ్డుకట్ట వేయగలననుకున్నాడు. మనస్సును స్థిరం చేసుకున్నాడు, వాడియైన మూడు బాణాలను ముందుగా ప్రయోగించి హనుమంతుణ్ణి యుద్ధానికి ఆహ్వానించాడు. మెడలో బంగారుగొలుసు, చెవులకు కుండలాలు ధరించిన అక్షకుమారుడు హనుమంతుణ్ణి సమీపించాడు. వాళ్ళిద్దరి యుద్ధం చూసి దేవాసురులు కూడా ఆశ్చర్యపోయారు. భూమి దద్దరిల్లింది, సూర్యుడు తన కాంతిని తగ్గించుకున్నాడు, వాయువు స్తంభించిపోయింది. పర్వతాలు కంపించాయి, సముద్రాలు క్షోభచెందాయి. గురిచూసి బాణాలు వదలడంలో నేర్పరియైన అక్షకుమారుడు వాడియైన మొనలుకలిగి, బంగారు పొన్నులు ఉన్నవి, విషంతోకూడిన సర్పాలవంటి మూడు బాణాలను హనుమంతుడి శిరస్సుకు గురిచూసి కొట్టాడు. ఒకేసారి మూడు వాడియైన బాణాలు శిరస్సుపై తగలటం వలన హనుమంతుడి ముఖం అంతా రక్తంతో నిండిపోయింది. ముఖమంతా రక్తం కావటంవల్ల అప్పుడే ఉదయిస్తున్న సూర్యుడువలె హనుమంతుడు ప్రకాశించాడు.

సుగ్రీవుని మంత్రులలో శ్రేష్ఠుడైన హనుమంతుడు, ఈ శ్రేష్ఠమైన ఆయుధాలతోను, చిత్రమైన ధనుస్సుతోను తనపై యుద్ధానికి వచ్చిన అక్షకుమారుణ్ణి చూసి ముచ్చటపడి, ఇక తను కూడాయుద్ధం ప్రారంభించడం మంచిదని తలచి దేహాన్ని పెంచాడు. మందరపర్వత శిఖరంపై నుండి కనిపించే సూర్యభగవానుడిలాగా ఉన్న ఆ హనుమంతుడు తీక్షణమైన చూపుల్తో అక్షకుమారుణ్ణి, అతడి రథాన్ని, అతడి సైన్యాన్ని ఆకాశంలో నుండి ఒక్కసారి చూశాడు. కళ్ళనుండి నిప్పులు కురిపించాడు.

అక్షకుమారుడు తన ధనుస్సునే ఇంద్రధనుస్సుగా చేసుకున్నాడు; బాణాలనే వర్షంలా చేసుకొని పర్వతంపై వర్షం కురిసినట్లుగా, ఆ పర్వతాకారుడైన హనుమంతుడిపై బాణవర్షం కురిపించాడు. భయంకర పరాక్రమంచేత మదించినవాడు, కోపంతో కళ్ళు ఎర్రబడినవాడు అయిన అక్షకుమారుడు, ఏనుగు తెలియక గడ్డి కప్పిన గుంటలో పడ్డట్లు, హనుమంతుని

పరాక్రమానికి బలికాబోతున్నాడు.

అక్షకుమారుడి బాణాలు బలంగా తగలడంచేత హనుమంతుడు ఉరుములు ఉరిమినట్లుగా భయంకరంగా అరుస్తూ, కాళ్ళు చేతులూ విదుల్చుకుంటూ ఆకాశంపైకి ఎగిరిపోయాడు. మహాబలవంతుడు, రాక్షసులలో శ్రేష్ఠుడు, ప్రతాపవంతుడు, రథికులలో శ్రేష్ఠుడైన అక్షకుమారుడుపైకి ఎగురుతున్న ఆ హనుమంతునిపై మేఘము పర్వతముపై వర్షం కురిపిస్తున్నట్లుగా బాణాలు కురిపిస్తూ, తన రథంతోసహా ఆకాశంలోకి హనుమంతుణ్ణి అనుసరించి వెళ్ళాడు. యుద్ధం చేయడంలో నేర్పరియైన అక్షకుమారుడు ఆకాశమంతా బాణాలతో కప్పివేశాడు. అతడి నైపుణ్యానికి హనుమంతుడికి అతడి పట్ల గొప్ప గౌరవభావం కలిగింది. ఇప్పుడు ఇతణ్ణి ఏ మార్గంలో హతమారుద్దామా? అని కొద్దిక్షణాలు ఆలోచించాడు.

ఉదయసూర్యుని వంటి కాంతివంతుడు, మహాబలశాలియైన అక్షకుమారుడు యుద్ధవిద్యలో బాగా ఆరితేరినవాడని గుర్తించాడు. యుద్ధంలో కావలసిన నేర్పూ, మెళకువలు అతడి వద్ద చూసి చాలా సంతోషించాడు. ఇంతటి సమర్థుడైన బాలుణ్ణి చంపాలంటే మనస్సు రావటంలేదే! అని అనుకున్నాడు. ఎందువల్లనంటే, ఇతడు బుద్ధిశాలి, గొప్ప పరాక్రమం గలవాడు. నిలకడైన మనస్సు గలవాడు, యుద్ధంలో ఆటుపోటులకు తట్టుకోగల సమర్థుడు; ఇతడి కార్యదక్షత చూస్తూ ఉంటే నాగులు, యక్షులు, మునులు గూడా ఇతణ్ణి మెచ్చుకోకుండా ఉండలేరని అనుకున్నాడు.

ఇతడు నాకు చాల దగ్గరగా నిలచి మహాపరాక్రమంతోను, అనుభవజ్ఞుడిమల్లే, ఉత్సాహంతోను యుద్ధం చేస్తున్నాడు. వీణ్ణి ఇప్పుడు చంపకుండా ఉపేక్షించినట్లయితే, ఉత్తరోత్తరా రామకార్యానికి అడ్డుతగల వచ్చును. కాబట్టి ఇక ఉపేక్షించకూడదు, వీణ్ణి చంపివేయడమే మంచిది. ప్రజ్వరిల్లబోయే అగ్నిహోత్రాన్ని ఎంతమాత్రం ఉపేక్షించకూడదు అని నిశ్చయించుకున్నాడు. అప్పుడు హనుమంతుడు అక్షకుమారుడి రథానికి కట్టిన ఎనిమిది గుర్రాలను అరచేతితో కొట్టి చచ్చేవరకూ మోదాడు. రథం ఇరుసుల్ని కాళ్ళతో తన్ని విరగ్గొట్టాడు.

గుర్రాలు చచ్చిపడిపోగా, రథచక్రాలు, రథం మధ్యలో ఉండే దూలం విరిగిపోవడంతో ఆ రథం ఆకాశం నుండి క్రిందపడిపోయింది. అంతట అక్షకుమారుడు రథంలో నుండి బయటకు దూకి తన తపఃశక్తిచేత ఆకాశంలోనే నిలబడి, తపఃప్రభావం చేత స్వర్గానికి ఎరిగివెళ్తున్న ఋషివలె కనిపించాడు.

అంతట వాయువుతో సమానమైన పరాక్రమం గల హనుమంతుడు, వాయువు, గరుత్మంతుడు, సిద్ధులు మాత్రమే సంచరించే ఆకాశమార్గంలో ఉన్న అక్షకుమారుణ్ణి మెల్లగా సమీపించి అతడి రెండుకాళ్ళూ పట్టుకొని తండ్రి అయిన వాయుదేవుని బలాన్నంతా సంతరించుకొని గిరగిరా త్రిప్పుతూ నేలపైకి విసిరికొట్టాడు. అప్పుడా అక్షకుమారుడి బాహువులు, తొడలు, నడుము, కంఠం విరిగి ముక్కలు ముక్కలయ్యాయి. శరీరం ఎక్కడా గుర్తుపట్టలేనంతగా శిథిలమైపోయింది. ఆ విధంగా ఆ మహావీరుడు మరణించాడు.

అప్పుడు జోతిశ్చక్రంలో తిరిగే మహర్షులు, భూతాలు, యక్షులు, పన్నగులు, దేవతలు, దేవేంద్రుడితో సహా అంతా ఆశ్చర్యపోయారు. దేవేంద్రుడితో సమానుడైన అక్షకుమారుణ్ణి అట్లా చంపివేసి, మళ్ళీ హనుమంతుడు అశోకవనం ముఖద్వారం వద్ద యముడిలాగా నిలబడ్డాడు.

## 48వ సర్గ ఇంద్రజిత్తు హనుమంతుని బంధించటం

అక్షకుమారుడి మరణం రావణుణ్ణి క్రుంగదీసింది. అయినా మనసు కుదుటపరచుకున్నాడు. అంతట ఆ రావణాసురుడు దేవతలతో సమానుడైన ఇంద్రజిత్తును యుద్ధానికి వెళ్ళమని ఆదేశించాడు:

"కుమారా! నువ్వు అస్త్రాలన్నీ తెలిసినవాడవు. శస్త్ర ప్రయోగం చేసేవాళ్ళల్లో శ్రేష్ఠుడవు. సురాసురులందరినీ ఏడిపించినవాడవు. బ్రహ్మదేవుని మెప్పించి అనేక అస్త్రాలను సంపాదించావు. నీ శౌర్యపరాక్రమాల్ని ఇంద్రాది దేవతలంతా చవిచూసినవాళ్ళే! ఇక సురులు, మరుద్గణాలు, మిగిలిన దేవతల విషయం వేరుగా చెప్పాలా? యుద్ధంలో నిన్ను ఎదిరించి పడిపోని వారు ముల్లోకాల్లోనూ లేరు. నువ్వు దేశకాల పరిస్థితుల ననుసరించిపోయే నేర్పరివి. నీ భుజబలం చేత, తపోబలం చేత ఎల్లప్పుడూ రక్షించబడుతూ వస్తున్నావు. యుద్ధంలో నీవు పొందని విజయంగాని, ప్రయత్నించి సాధించని కార్యంగానీ, బుద్ధిబలంతో నువ్వు ఆలోచించలేని కార్యంగానీ లేవు. ఈ విషయాలన్నీ ముల్లోకాల్లోనూ అందరికీ తెలిసిన విషయాలే. యుద్ధాలు చేయాల్సి వచ్చినప్పుడల్లా, ఇంద్రజిత్తు నా ప్రక్కన ఉన్నంతవరకూ విజయం నాదేనని నిశ్చింతగా ఉండేవాడిని. యుద్ధంలో నీవు చూపే పరాక్రమంలోగాని, తపోబలంలోగానీ నీవు నా అంతటివాడవు.

"పుత్రా! కింకరులు, అమాత్యపుత్రులు, సేనానాయకులు అశ్వగజరథాలన్నీ నాశనమయ్యాయి. నీ ప్రియసోదరుడైన అక్షకుమారుడు కూడా చంపబడ్డాడు. ఓ పుత్రా! నాకున్న బలమంతా నీలోనే ఉంది. నేను వాళ్ళపైన ఎన్నడూ ఆధారపడలేదు.

"ఓ బుద్ధిమంతుడా! ఈ వానరుడి బలాన్ని, ప్రభావాన్ని అంచనావేసుకో. దాంతో నీ బలాన్ని, వేగాన్ని సరిచూసుకో. పిమ్మట కార్యం సాధించుకొని రా. అస్త్రవేత్తలలో శ్రేష్ఠుడవైన ఓ కుమారా! నీ బలాన్ని, శత్రుబలాన్ని అంచనా వేసుకొని, శత్రుసంహారం చేసి విజయలక్ష్మితో

తిరిగివచ్చేట్లుగా పథకాలు వేసుకో.

"ఓ వీరుడా! సైన్యం ఎంతమంది ఉన్నా వాళ్ళంతా విజయాన్ని తెచ్చిపెట్టలేరు. నిన్ను యుద్ధానికి పంపడం నా అభిమతం కాదు. అయితే రాజధర్మాన్ని బట్టి, క్షత్రియధర్మాన్ని దృష్టిలో ఉంచుకొని నిన్ను ఆదేశిస్తున్నాను. ఓ శత్రువినాశకుడా! యుద్ధంలో ఉపయోగించే అనేక విధాలైన ప్రయోగాలలో నేర్పు సంపాదించాలి. అట్లాగే యుద్ధంలో విజయాన్ని కూడా కాంక్షించాలి. ఇది రాజధర్మం."

అంతట దేవతల వంటి ప్రభావం గల ఆ ఇంద్రజిత్తు యుద్ధానికి సిద్ధమై తండ్రియైన రావణునికి ప్రదక్షిణపూర్వక నమస్కారం చేసి బంధువులు, రాజోద్యోగులు ఇంకా అక్కడున్న వారంతా అభినందిస్తూ ఉండగా ఉత్సాహంతో హనుమంతుడిపై యుద్ధానికి బయలుదేరాడు.

అధికమైన శోభకలవాడు, పద్మపత్రాల వంటి నేత్రాలు గలవాడు, మహాతేజశ్శాలి అయిన ఇంద్రజిత్తు పర్వతాలను తాకే సముద్రంలాగా మహోత్సాహంతో బయలుదేరాడు. ఇంద్రుడితో సమానుడైన ఇంద్రజిత్తు గరుత్మంతుని వేగంతో రథంలో బయలుదేరాడు. ఆ రథానికి నాలుగు ప్రక్కలా నాలుగు పెద్దపులులు కట్టి ఉన్నాయి.

ఇంద్రజిత్తు వస్తున్న రథ ధ్వనిని, ధనుష్టంకారాన్ని హనుమంతుడు దూరం నుండే విన్నాడు. మళ్ళీ యుద్ధం చేయబోతున్నాను గదా అని సంతోషపడ్డాడు. యుద్ధాలు చెయ్యడంలో ప్రవీణుడైన ఆ ఇంద్రజిత్తు ధనుస్సులో వాడి అయిన బాణాల్ని సంధించాడు. అప్పుడు దిక్కులన్నీ కళ తప్పిపోయాయి. క్రూరమృగాలు బిగ్గరగా అరిచాయి. ఆకాశంలో జ్యోతిశ్చక్రంలో సంచరించే మహర్షులు, సిద్ధులు మున్నగువారంతా ఏం జరుగబోతోందో అని ఉత్సుకతతో చూస్తున్నారు. ఇంద్రజిత్తును చూసిన హనుమంతుడు కూడా పెద్దగా కేకలుపెట్టి దేహాన్ని పెంచాడు. ఇంద్రజిత్తు దివ్యమైన రథాన్నెక్కి, విచిత్రమైన ధనుస్సును చేతబట్టుకొని నారి సంధిస్తూ ఉంటే పిడుగులు పడుతున్నట్లనిపించింది. చాలా గొప్పవేగం గలవాడూ, మహాబలశాలీ, యుద్ధం అంటే భయమే

లేనివాడూ అయిన హనుమంతుడు, ఇంద్రజిత్తు ఒరినొకరు కలుసుకొన్నారు. అంతట హనుమంతుడు తన శరీరాన్ని పర్వతం లాగా పెంచేసి ఆకాశంలో విహరించాడు. ఇంద్రజిత్తు వేసిన బాణాలన్నీ వ్యర్థాలయ్యాయి.

శత్రుసంహారకుడైన ఇంద్రజిత్తు పొడవైనవి, వాడి అయినవి, రెక్కలు కట్టినవి, బంగారు పొన్నులు గలవి, చివర్లు బాగా ఒంగి ఉన్నవి అయిన బాణాల్ని ప్రయోగించాడు. ఇంద్రజిత్తు ఆ విధంగా ధనుస్సుపై చెయ్యిపెట్టగానే హనుమంతుడు మరల పైకి ఎగిరాడు. ఇంద్రజిత్తు ఎంత గురిచూసి కొట్టినా, హనుమంతుడు తన వేగాన్ని, గమనాన్ని మార్చుకుంటూ వాటినన్నింటినీ వ్యర్థం చేయసాగాడు. బాణానికి బాణానికీ మధ్యలో ప్రయాణం చేస్తున్నాడు. కొంతసేపు అట్లా తప్పించుకొని తిరుగుతూ ఇంద్రజిత్తుతో ఆడుకుంటూ, మళ్లీ వచ్చి ఎదురుగా నిలబడ్డాడు. మళ్ళీ రెండు చేతులూ, కాళ్ళు ఆడించుకుంటూ ఆకాశంలోకి ఎగిరాడు. ఇంతసేపు వాళ్ళిద్దరూ యుద్ధం చేసినా హనుమంతుడిలో ఉండే లోపాల్ని ఇంద్రజిత్తు తెలుసుకోలేకపోయాడు. అట్లాగే హనుమంతుడు కూడా ఇంద్రజిత్తులోని లోపాలను గ్రహించలేకపోయాడు. అందువల్ల ఎవరూ ఎవర్నీ లొంగదీసుకోలేకపోయారు. బాగా గురి చూసిన బాణాలే వ్యర్థమైపోతూ ఉంటే ఇంద్రజిత్తు దీర్ఘాలోచనలో పడ్డాడు. "ఇతణ్ణి చంపటానికి వీలులేకుండా ఉంటోంది. కనీసం బంధనానికి అయినా లొంగుతాడా?" అని ఆలోచించాడు. ఇట్లా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. అస్త్రవేత్తలలో శ్రేష్ఠుడైనవాడు, గొప్పతేజస్సు గలవాడు అయిన ఇంద్రజిత్తు హనుమంతుడిపై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. అస్త్రాల బలాబలాలు తెలిసినవాడైన ఇంద్రజిత్తు "ఇతడిని చంపటానికి వీలుపడటం లేదు" అని నిశ్చయించుకొని హనుమంతుణ్ణి బ్రహ్మాస్త్రంతో బద్ధుణ్ణి చేశాడు.

ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రంచేత హనుమంతుణ్ణి బద్ధుణ్ణి చేయగా, హనుమంతుడు కదలలేనివాడై నేలపై పడిపోయాడు. అయితే హనుమంతుడు తాను బ్రహాస్త్రం చేత బద్ధుడనయ్యానని తెలుసుకున్నాడు. బ్రహ్మదేవుని ఆజ్ఞకు బద్ధుడై ఉండిపోయాడు. 'బ్రహ్మదేవుడు,

వాయుదేవుడు, మహేంద్రుడు రక్షించటం వలన, అస్త్రంచేత బంధించబడ్డా నేను ఏమీ కలత చెందవలసిన పనిలేదు' అని తలచాడు. నన్ను రాక్షసులు బంధించడం వల్ల నాకు లాభమే జరుగుతుంది కానీ, నష్టం ఏమాత్రం లేదు. ఎట్లాగంటే, ఈ రాక్షసులంతా నన్ను బంధించి రావణుని ముందుకు తీసుకొని వెళ్తారు. అప్పుడు నేను రావణుడితో స్వయంగా మాట్లాడే అవకాశం కలుగుతుంది.

శత్రువులను సంహరించేవాడూ, ఆలోచించి మంచి పనులు చేసే వాడూ అయిన హనుమంతుడు తన కర్తవ్యాన్ని బాగా ఆలోచించి, కదలకుండా పడి ఉన్నాడు. శత్రుసేనలు దగ్గరకు వచ్చి బలాత్కారంగా హింసిస్తూ ఉండగా వాళ్ళపైన బిగ్గరగా అరిచాడు. హనుమంతుడు కదలటం లేదని నిర్ధారణ చేసుకున్న రాక్షసులు హనుమంతుణ్ణి గట్టిత్రాళ్ళతో బంధించారు. "రావణుడు నన్ను చూడాలని ఉబలాటపడుతూ ఉండవచ్చు" నని మనసులో అనుకొని రాక్షసులు బలవంతంగా బంధిస్తూ ఉంటే మెదలకుండా ఊరకున్నాడు. వాళ్ళంతా నారతో చేసిన త్రాళ్ళతో బంధించగానే బ్రహ్మాస్త్రప్రభావం పోతుంది. ఆ విషయం ఇంద్రజిత్తూ గ్రహించాడు. ఇప్పుడు ఏం చెయ్యటమా? అని ఆలోచనలో పడ్డాడు. ఎందువల్లనంటే బ్రహ్మాస్త్రం బంధించి ఉన్నప్పుడు మరొకసారి బంధిస్తే, బ్రహ్మాస్త్రం వెంటనే విడిచేస్తుంది. ఆ విషయం గ్రహించిన ఇంద్రజిత్తు చాలా బాధపడ్డాడు. "అయ్యో! ఈ రాక్షసులు మంత్రప్రభావం తెలియకపోవటం వల్ల, ఇంతటి మహాకార్యాన్ని ధ్వంసం చేశారే" అని చింతించాడు. ఒక అస్త్రం విడిచేసిన వ్యక్తిపై మరే అస్త్రమూ పనిచేయదు. అయ్యో! కార్యం అంతా వ్యర్థం అయిపోయిందే! అని బాధపడ్డాడు.

బ్రహ్మాస్త్రం నుండి విముక్తుడైన ఆ హనుమంతుడు తనను బంధించి తీసుకొనిపోతూ ఉండగా, తాను అస్త్రం నుండి విముక్తుడైనట్లు గ్రహించలేదు. క్రూరులైన రాక్షసులు త్రాళ్ళతో కట్టి తనను ఈడ్చుకొనిపోతూ తనను కర్రలతోను, పిడికిళ్ళతోనూ కొడ్తూ ఉండటం తెలుస్తూనే ఉంది. ఆ విధంగా వాళ్ళంతా తనను రావణుని వద్దకు తీసుకొని వెళ్ళారు. ఇంద్రజిత్తుకు బ్రహ్మాస్త్రం నుండి విముక్తుడైనాడని తెలిసినా అట్లాగే ఈడ్చుకుంటూ రావణుని వద్దకు తీసుకొనిపోయి

హనుమంతుణ్ణి చూపించాడు.

మదించిన ఏనుగువలె ఉన్న ఆ హనుమంతుణ్ణి రావణుని వద్దకు త్రాళ్ళతో కట్టి లాక్కుని పోయి, "ఇతడే ఆ వానరుడు" అని చూపించారు. అంతట సభలోని రాక్షసప్రముఖులంతా "ఇతడు ఎవరు? ఎవరివాడు? ఎక్కడ నుండి వచ్చాడు? ఇతడికి ఇక్కడ ఏం పని? ఇతడికి ఎవరు ఆశ్రయం ఇచ్చారు? సముద్రాన్ని దాటి ఎట్లా వచ్చాడు?" అని ఒకళ్ళతో మరొకళ్ళు చెవులు కొరుక్కున్నారు. బాగా కోపం వచ్చిన రాక్షసులు కొందరు "వీడిని చంపండి; వీడిని కాల్చివేయండి; వీణ్ణి భక్షించండి" అంటూ కేకలు వేశారు.

మహారత్నాలతో అలంకరించబడిన ఆ సభాభవనంలో రావణాసురుణ్ణీ, ఆతడి పాదాల వద్ద ఆసనాలపై కూర్చున్న వృద్ధులైన మంత్రుల్ని హనుమంతుడు చూశాడు. రాక్షసులచే ఈడ్చుకొని రాబడిన హనుమంతుణ్ణి రావణాసురుడు చూశాడు. మధ్యాహ్నపు సూర్యుడివలె వెలిగిపోతున్న కాంతితో సింహాసనంపై కూర్చున్న రావణుణ్ణి హనుమంతుడు చూశాడు.

రావణుడు కోపంతో, ఎఱ్ఱబడిన నేత్రాలతో ఆ హనుమంతుణ్ణి చూస్తూ, "ఈతడిని విచారించండి" అని తన మంత్రులను ఆజ్ఞాపించాడు.

అంతట మంత్రులు "నీవు ఎవరవు? నీవు వచ్చిన పని ఏమిటి? ఆ పనిపై నిన్ను పంపినదెవరు?" అని ప్రశ్నించారు. అంతట హనుమంతుడు "నేను సుగ్రీవుని దూతగా వచ్చాను" అని చెప్పాడు.

# 49వ సర్గ రావణాసురుడి ప్రభావం

భయంకరమైన పరాక్రమం గల హనుమంతుణ్ణి బంధించబడి ఈడ్చుకుంటూ రావణాసురుని సమ్ముఖానికి తీసుకొనివచ్చారు. అప్పుడు రావణాసురుణ్ణి చూస్తూ, 'ఆహా! అశోకవనం నాశనం చేస్తూ ఉంటే నన్ను చంపేందుకు రావణుడే వస్తాడని అనుకొన్నాను. అటువంటిది, ఇతడు నన్నే బంధించి తన వద్దకు రప్పించుకున్నాడు గదా!' అని అనుకొంటూ ఉంటే క్రోధావేశంతో ఎర్రబడ్డ కళ్ళతో రావణుణ్ణి చూశాడు.

అప్పుడు రావణాసురుడు ముత్యాలతో అలంకరించబడిన బంగారు కిరీటాన్ని ధరించి ఉన్నాడు. ఆ కిరీటంలో ప్రశస్తమైన మణులు, వజ్రాలు పొదిగారు. రావణుడు చిత్రవిచిత్రాలైన ఆభరణాల్ని ధరించాడు. శ్రేష్ఠమైన పట్టుబట్టలు కట్టుకున్నాడు. ఒంటికి ఎర్రచందనం పూసుకున్నాడు.

క్రూరమృగాలతో నిండి, అనేక శిఖరాలతో విలసిల్లే మందరపర్వతం లాగాను, సుందరము, ఎర్రని నేత్రాలు, భయంకరమైన కోరలు, వ్రేలాడే పెదవులున్న పదితలలతో విచిత్రంగా కనబడుతున్న ఆ రావణుణ్ణి హనుమంతుడు చూశాడు. అతడి వక్షఃస్థలంపై ముత్యాలహారాలు వ్రేలాడుతున్నాయి. ముఖం చంద్రబింబంలాగా ఉంది. మనిషి మూర్తీభవించిన కాటుక కొండలాగా ఉన్నాడు. ఉదయసూర్య కాంతుల్లో కనిపించే కారుమేఘంలాగా ఉన్నాడు.

బాగా బలిసి ఉన్న బాహువులకు రెండు రకాల బంగారుకడియాలు ధరించి, చందనం పూసుకున్నాడు. ఆ బాహువులు అయిదు తలల సర్పాలమల్లే ఉన్నాయి. రావణుడు కూర్చున్న సింహాసనం శ్రేష్ఠమైన స్ఫటికాలతో చేయబడింది. ఆ ఆసనానికి రత్నాలు పొదిగారు. దానిపై ఉత్తమమైన ఆస్తరణాలను పరచారు. అటువంటి సింహాసనంపై రావణుడు కూర్చొని ఉండగా, చక్కగా అలంకరించుకొన్న యువతులు వెనుకగా నిలబడి వింజామరల్తో వీస్తున్నారు.

దుర్ధరుడు, ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, నికుంభుడు అనే నలుగురు మంత్రులు రావణాసురుడికి దగ్గరగా కూర్చున్నారు. ఆ నలుగురూ కూడా బలదర్పితులు, మంత్రతత్త్వజ్ఞులు కావటం వల్ల ఆ రావణుడు నాలుగు సముద్రాల మధ్యన కూర్చున్నాడా? అన్నట్లున్నాడు. వీళ్ళే కాకుండా, ఆలోచనలను విమర్శనాదృష్టితో చూడగలిగినవారు, మంచి బుద్ధికుశలత కలగినవారు అయిన రాక్షసమంత్రులు కూడా అతడికి సమీపంలో కూర్చుని దేవతలు దేవేంద్రుణ్ణి సేవిస్తున్నట్లుగా సేవిస్తున్నారు. తేజోవంతమైన మేరుశిఖరంలాగా, ఆకాశంలో ఉన్న నీలిమేఘం లాగా ఉన్న ఆ రావణాసురుణ్ణి హనుమంతుడు చూశాడు.

భయంకరమైన ఆ రాక్షసులు త్రాళ్ళతో కట్టి తనను బాధపెడ్తున్నా కూడా, రావణాసురుడి వైభవానికి హనుమంతుడు ఆశ్చర్యపోయాడు. అతడి తేజస్సు చూసి నిశ్చేష్టుడయ్యాడు. అప్పుడా రావణుణ్ణి గురించి మనసులో ఇట్లా అనుకున్నాడు.

'ఆహా! ఏమి ఈ రావణుని రూపం! ఎంత ధైర్యశాలి! ఎంతటి బలసంపన్నుడు! ఏమి కాంతి! ఇతనిలో సర్వలక్షణ సంపన్నత్వం పొంగి పొరలుతోంది. ఇతడిలో అధర్మం గూడుకట్టుకుపోయింది. అధర్మమే లేకపోతే, ఈ రాక్షసరాజు ఇంద్రుడికీ, ఇంద్రలోకానికీ కూడా ప్రభువు అయి ఉండేవాడు. ఇతడు లోకులను బాధించే పాపకర్మలు చేస్తూ ఉండటం వల్లను, జనులను క్రూరంగా హింసిస్తూ ఉండటం చేతనూ, దేవతలు, దానవులు, సమస్తలోకాలు ఇతడంటే భయభ్రాంతులవుతున్నారు. ఇతడు తలచుకుంటే లోకాలన్నింటినీ సముద్రంలో ముంచెత్తగల సమర్థుడు. ఇతడే ధర్మపరుడైతే లోకాలన్నీ నెత్తిన పెట్టుకొని పూజించేవి గదా!' అని అనుకున్నాడు.

అమితమైన ప్రభావం గల రావణుణ్ణి చూసి హనుమంతుడు అనేక రకాలుగా ఆలోచించాడు.

# 50వ సర్గ రామదూతనని చెప్పటం

లోకాలన్నింటినీ ఏడిపించటమే కాని, తాను ఎన్నడూ ఏడవడం ఎరుగడు. అటువంటి పరిస్థితిని కల్పించి, తన ఎదుట దోషిగా నిలబడిన హనుమంతుణ్ణి చూసి రావణుడికి కోపం కట్టలు తెంచుకువచ్చింది. ఇంతలోనే మనసులో ఏవో అనుమానాలు పొడచూపాయి. ఈ వానరుడు గొప్ప తేజస్సు గలవాడే కాని సామాన్య వానరుడు కాడు అని మనసులోనే అనుకొంటూ ఇట్లా ఆలోచించాడు.

'పూర్వం నేను కైలాసపర్వతాన్ని పెకలించబోయినప్పుడు నంది నన్ను శపించాడు. ఆ నందియే ఈ వానరరూపంలో రాలేదు గదా! ఒకవేళ ఇతడు వానరరూపంతో వచ్చిన బాణాసురుడా?' అని పరిపరి విధాలుగా ఆలోచించాడు.

రావణుడి కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. మంత్రిసత్తముడైన ప్రహస్తుని పిలిచి, "ఈ దురాత్ముడు ఎక్కడ నుండి వచ్చాడో, ఎందుకు వచ్చాడో, అశోకవనంలో రాక్షసస్త్రీలను ఎందుకు భయపెట్టాడో అడుగు. బయటవాళ్ళు అడుగుపెట్టలేనంత భద్రతగల ఈ నగరంలోకి ఏ ప్రయోజనాన్నాశించి ప్రవేశించాడో అడుగు. ఎందుకు ఇంత భీకరంగా యుద్ధం చేశాడో అడుగు" అన్నాడు.

రావణుని ఆజ్ఞను శిరసావహించినవాడై, ప్రహస్తుడు హనుమంతుడితో ఇట్లా అన్నాడు:

"ఓ వానరుడా! నీవు కంగారుపడవద్దు. నీకు అంతా మంచే జరుగుతుంది. భయపడవద్దు. నీవు ఇంద్రుడు పంపితే వచ్చావా? ఈ లంకాపట్టణంలోకి ఎందుకు ప్రవేశించావు? భయపడకుండా చెప్పు. నీవు అన్నీ నిజాలే చెప్పాలి. అబద్ధాలు చెప్పకూడదు. అట్లా నిజం నిర్భయంగా చెప్తే నిన్ను ఏమీ చెయ్యకుండా విడిచేస్తాం? నీ దారిన నీవు పోవచ్చును.

నీవు గూఢాచారివై కుబేరుడు పంపిస్తే వచ్చావా? లేకపోతే యముడు పంపిస్తే వచ్చావా?

లేదా వరుణుడు పంపిస్తే వచ్చావా? లేదా విష్ణువే నిన్ను దూతగా పంపాడా? ఓ వానరుడా! నువ్వు చూడటానికి వానరుళ్ళాగా కనిపిస్తున్నావు. కానీ నీ తేజస్సు మాత్రం వానరుల కుండతగ్గట్లుగా లేదు. నీవు నిజం చెప్పితే నిన్ను విడిచిపెట్టేస్తాం. మూర్ఖించి నిజం చెప్పలేదనుకో, నీకు మరణం తప్పదు. ఒకవేళ నీ అంతట నీవే వస్తే రావణుని మందిరంలోకి ఎందుకు వచ్చావు? నిజం చెప్పు" అన్నాడు.

హనుమంతుడు : (రావణునితో) ఓ రాక్షసరాజా! నన్ను యముడు గాని, దేవేంద్రుడుగాని, వరుణుడుగాని పంపలేదు. నాకూ కుబేరుడికి ఏ విధమైన సంబంధమూ లేదు. విష్ణువు అంతకన్నా పంపలేదు. ఈ నగరానికి నా అంతట నేనే, రావాలనే వచ్చాను. నేను వానరుడను. నేను మారువేషంలో రాలేదు. నా జాతియే వానరజాతి.

ఓ రాజా! నీ దర్శనం చేసుకోవాలనుకున్నాను. నీవు నాబోటి వారికి దర్శనమివ్వవు కదా! అందుకని ఉద్యానవనాన్ని ధ్వంసం చేశాను. అప్పుడు రాక్షసులంతా నాపైకి యుద్ధానికి వచ్చారు. నన్ను నేను కాపాడుకోవటం కోసం వాళ్ళతో యుద్ధం చెయ్యాల్సివచ్చింది. నన్ను దేవతలుగాని, అసురులుగానీ బంధించలేరు. ఎందువల్లనంటే నీవు అనేక వరాలు పొందినట్లే, నేను కూడా బ్రహ్మదేవుని నుండి 'నన్నెవరూ పాశాలతో బంధించకుండా ఉండే' వరాన్ని పొందాను. నిన్ను చూడాలనే కోరికతో, నేను అస్త్రానికి లొంగి ఉన్నాను. నన్ను రాక్షసులు బంధించగానే ఆ అస్త్రం నన్ను విడిచేసింది. ఓ రాజా! నేను నీ వద్దకు ఒకానొక రాచకార్యంపై వచ్చాను. నేను అమితతేజోవంతుడైన రాముని దూతనని తెలుసుకో. నేను నీకు కొన్ని మంచిమాటలు చెప్తాను. సావధానంగా విను.

# 51వ సర్గ హనుమంతుడు రాముని ప్రభావాన్ని వర్ణించడం

మహాబలవంతుడైన రావణుణ్ణి చూసి నదురూ, బెదురూ లేకుండా హనుమంతుడు అర్థవంతమైన మాటలు ఇట్లా అన్నాడు:

ఓ రాక్షసరాజా! నేను సుగ్రీవుడు పంపగా ఇక్కడకు వచ్చాను. వానరరాజైన సుగ్రీవుడు నీ క్షేమాన్ని విచారించమన్నాడు. మహాత్ముడైన సుగ్రీవుడు నీకు సోదరుని వంటివాడు. ధర్మార్థాలకు సంబంధించినవి, ఇహపరాలకు ఉపయోగించే మాటలు చెప్తాను. విను.

లోకానికి తండ్రి వంటివాడు, దేవేంద్రుడితో సమానమైనవాడు, అనేక గజ, అశ్వసంపద కలిగినవాడూ అయిన దశరథమహారాజు ఉండేవాడు. ఆ దశరథుని పెద్దకుమారుడే రాముడు. ఇతడు ఆజానుబాహువు. తండ్రి మాట జవదాటనివాడు. అటువంటి రాముడు నాకు ప్రభువు. నా ప్రభువైన రాముడు తండ్రి మాటయే ధర్మమార్గం అని తలచి, అయోధ్యను విడిచి అరణ్యవాసం చేసేందుకు భార్య సీత, తమ్ముడు లక్ష్మణునితో కలసి దండకారణ్యంలో ప్రవేశించాడు. విదేహరాజపుత్రి, మహాపతివ్రత అయిన రాముని భార్య సీతాదేవి కూడా భర్తతోపాటే అరణ్యాల్లో నివసించేది. ఉన్నట్లుండి రాముడి భార్య అయిన సీత కనపడకుండాపోయింది.

తమ్ముడితో కలసి రాజకుమారుడైన రాముడు, సీతాదేవిని వెతకుతూ ఋష్యమూకపర్వతం పైన సుగ్రీవుణ్ణి కలసుకున్నాడు. సీతను వెతికిపెడ్తానని సుగ్రీవుడు రాముడికి ప్రతిజ్ఞ చేశాడు. అంతట రాముడు కూడా వానరరాజ్యానికి రాజును చేస్తానని సుగ్రీవుడికి ప్రతిజ్ఞ చేసి చెప్పాడు. తరువాత రాముడు యుద్ధంలో వాలిని చంపి సుగ్రీవుణ్ణి వానర భల్లూక గణాలకు రాజుగా చేశాడు.

ఓ రాక్షసరాజా! నీకు వాలిని గూర్చి బాగా తెలుసు గదా! ఆ వాలిని రాముడు ఒకే ఒక్కబాణంతో చంపాడు. వానరప్రభువైన సుగ్రీవుడు తన ప్రతిజ్ఞను కూడా నెరవేర్చుకోవటానికి,

సీతాదేవిని వెతకి జాడ తెలుసుకొమ్మని లక్షలాది వానరసేనల్ని దేశం నలుమూలలకూ పంపాడు. ఆ విధంగా లక్షలాది వానరసైన్యం సీతాదేవి కోసం అన్నిదిక్కుల్లోను, పాతాళంలోను, ఆకాశంలోను కూడా వెతుకుతున్నారు. ఆ వానరసేనల్లో కొంతమంది గరుత్మంతుడంతటి వేగం గలవారు. మరికొందరు వాయుదేవుని వంటి వేగం గలవారు. వాళ్లు ఎక్కడా, ఏమీ అడ్డులేకుండా అతిత్వరగా వెళ్ళగలరు.

నేను వాయుదేవుని పుత్రుడను. నా పేరు హనుమంతుడు. నేను సీతాదేవిని వెతకుతూ నూరుయోజనాల సముద్రాన్ని ఆకాశమార్గంలో దాటి ఇక్కడకు వచ్చాను. లంక అంతా తిరిగాను. సీతాదేవి నీ ఇంట్లో ఉండటం చూశాను. నువ్వు ధర్మార్థాలు బాగా తెలిసినవాడవు. గొప్ప తపస్సంపన్నుడవు. అందువలన, నీవు పరభార్యను నీ ఇంట్లో ఉంచుకోవటం మంచిది కాదు. నీవంటి బుద్ధిమంతులు ధర్మానికి వ్యతిరేకమైన పనులు చేయరు గదా? ఎందువల్లనంటే, అవి ఎంతో అపాయకరమైనవనీ, మూలాన్నే సర్వనాశనం చేస్తాయనీ వారెరుగుదురు.

ఓ రాజా! రాముడికి కోపం వస్తే లక్ష్మణుడికీ కోపం వస్తుంది. ఆ విధంగా కోపించిన అన్నదమ్ములు బాణాలు వదలుతూ ఉంటే వారి ఎదురుగా సురాసురులెవరూ నిలువలేరు. అర్థవంతమూ, ధర్మసమ్మతమూ అయిన నా మాట విను. సీతను తిరిగి రామునికి ఇమ్ము. నేను సీతాదేవిని చూశాను. నలుదిక్కులా వెతగ్గావెతగ్గా ఆమె దర్శనం ఇక్కడ దొరికింది. ఇకపై ఏంచెయ్యాలో రాముడే నిర్ణయిస్తాడు. ఇప్పుడు సీతాదేవి నీ అధీనంలో ఉంది. ఆమె అయిదు తలల సర్పమని తెలుసుకోలేకపోతున్నావు. విషం కలిపిన అన్నాన్ని తిని ఎవరూ జీర్ణం చేసుకోలేరు. అట్లాగే సీతాదేవిని సురులుగాని, అసురులుగాని జీర్ణింపజేసుకోలేరు.

ఓ రాక్షసరాజా! నీవు అనేక తపస్సులు చేసి, ఇతర ధర్మాలు ఆచరించటం వల్ల ఐశ్వర్యాన్ని, దీర్ఘాయుర్దాయాన్ని సంపాదించుకున్నావు. ఇటువంటి అధర్మకార్యం వల్ల రాముడు నీ ఐశ్వర్యాన్ని ఆయుస్సునూ నశింపజేస్తాడు.

ఓ రాజా! నీవు అసురుల నుండి గానీ, సురల నుండిగానీ మరణం లేకుండా ఉండేట్లు వరం పొందావు. అంతమాత్రంచేత నీకు మరణం సంభవించదని విర్రవీగొద్దు. ఎందువల్లనంటే సుగ్రీవుడు సురుడు కాడు, అసురుడూ కాడు, రాక్షసుడూ కాడు, గంధర్వుడూ కాడు, యక్షుడూ కాడు గదా! అందువల్ల సుగ్రీవుని నుండి నీ ప్రాణాలను ఎట్లా కాపాడుకోగలవు?

ఓ రాజా! ధర్మం అధర్మాన్ని నశింపజేసి సత్ఫలితాన్నిస్తుంది. కానీ, అధర్మం ధర్మాన్ని జయించలేదు. నీవు తపస్సు మున్నగు సత్కర్మలు చేశావు. ఆ ధర్మఫలాన్ని అనుభవించావు. ఇక నుండి అధర్మఫలాన్ని అనుభవించబోతున్నావు. ఇది నిశ్చయం. జనస్థానంలో రాముడొక్కడే రాక్షసులందరినీ సంహరించాడు. ఆ సంగతి నీకూ తెలుసు. వాలిని ఒక్క బాణంతో రాముడొక్కడే హతమార్చాడు. ఇప్పుడు రాముడు సుగ్రీవుడు ఒకటయ్యారు. అది తెలుసుకొని, నీకు ఏది మంచిదో నిర్ణయించుకో.

ఓ రాజా! నీ గుర్రాలను, ఏనుగులను, నీ రథాలను, ఈ లంకాపట్టణాన్ని నేనొక్కడినే నాశనం చెయ్యగలను. కానీ రాముని నిర్ణయం అట్లాలేదు. "సీతను అపహరించిన శత్రువును సంహరిస్తా" నని వానరులు, భల్లూకముల ఎదుట రాముడు ప్రతిజ్ఞ చేశాడు. అందువల్ల నేనాపని చేయటంలేదు.

ఓ రాజా! సాక్షాత్తూ దేవేంద్రుడే అయినా రాముడికి అపకారం తలపెడితే జీవించి ఉండడు. ఇక నీ బోటివాళ్ళ విషయం వేరే చెప్పాలా? నీ వశంలో ఉన్న సీతాదేవి నీ పాలిట కాళరాత్రి అని తెలుసుకో. అటువంటి సీతాదేవి అనే కాలపాశాన్ని నీ అంతట నీవే మెడకు తగిలించుకున్నావు. బాగా ఆలోచించుకొని నీకు శుభకరమైన నిర్ణయాన్ని తీసుకో. ఇప్పటికే సీతాదేవి ప్రభావం వల్ల లంకాపట్టణంలో మంటలు రగులుకున్నాయి. ఇక రాముడికి కోపం వస్తే నీ కోటబురుజులు, వీథులు, గృహాలు అన్నీ అతడి కోపాగ్నితో తగులబడిపోతాయి. త్వరలో నీవే చూస్తావు. నీ హితం కోరి చెబుతున్నాను. నీ మంత్రుల్ని, మిత్రుల్ని, బంధువుల్ని, కొడుకుల్ని, దాయాదుల్ని, లంకాపట్టణాన్ని, నీ భోగభాగ్యాలనూ నాశనం చేసుకోవద్దు.

ఓ రాక్షసరాజా! నేను రాముడి దాసుణ్ణి. అతడి దూతను. విశేషించి వానరుడను. అంటే, పక్షపాతబుద్ధి లేనివాడిని. అందువల్ల నేను చెప్పే హితం కూడా నిష్పక్షపాతంగా ఉంటుంది. నేను చెప్పే యథార్థవాక్యాలను స్వీకరించు.

ఓ రాజా! ఆ మహాకాంతిమంతుడైన రాముడు, సకలచరాచర ప్రాణుల్ని, పంచభూతాల్ని, ముల్లోకాలను సంహరించి మళ్ళీ సృష్టించగలడు. శ్రీ మహావిష్ణువుతో సమానమైన పరాక్రమం గలిగిన రాముడితో యుద్ధం చేయగల సమర్థుడు ఏ కాలంలోను, ఏ దేశంలోను దేవతల్లోగానీ, అసురుల్లోగానీ, యక్షులు, రాక్షసుల్లోగానీ లేరు. అటువంటి ప్రతిభావంతుడైన రాముడికి ఇటువంటి అపకారం చేసిన నువ్వు బ్రతికి బట్టకట్టలేవు. ముల్లోకాల్లోనూ, ప్రభువైన రామునికి ఎదురుగా నిలిచి పోరాడగలవారు దేవతల్లోగాని, గంధర్వుల్లోగాని, విద్యాధరుల్లోగానీ, నాగుల్లోగానీ, యక్షుల్లోగానీ లేరు. యుద్ధంలో రాముడు చంపదలచుకొన్న వానిని బ్రహ్మగాని, రుద్రుడుగాని, మహేంద్రుడుగాని, ఆ ముగ్గురూ ఏకమైగానీ రక్షింపలేరు.

నిర్భయంగా మాట్లాడుతున్న ఆ హనుమంతుడు పలికిన అప్రియమైన మాటలన్నీ విన్న రావణుడు కోపంతో కళ్ళు చక్రాల్లాగా చేసుకొని “ఈ వానరుణ్ణి చంపండి” అని ఆజ్ఞాపించాడు.

# 52వ సర్గ దూతను వధించరాదని విభీషణుడు బోధించడం

మహాత్ముడైన హనుమంతుడు పలికిన అర్థవంతమైన మాటలు విన్న రావణుడు కోపావేశాలతో ఊగిపోయాడు. "వీనిని చంపండి" అని ఆజ్ఞాపించాడు. కార్యములు సాధించడంలో నేర్పరి అయిన విభీషణునకు దూతగా వచ్చిన హనుమంతుణ్ణి చంపడం ఇష్టంలేకపోయింది. అందుకని అన్నగారైన రావణునితో వినయంగాను, హితాన్ని కోరి ఈ విధంగా అన్నాడు: "ఓ రాక్షసరాజా! నన్ను క్షమించు. కోపాన్ని విడిచిపెట్టు. ప్రసన్నుడవుగా. మంచిచెడ్డలు తెలిసినవారెవ్వరూ, సత్పురుషులైన రాజశ్రేష్ఠులు దూతగా వచ్చిన వారిని చంపరు. నీవంటి మహాత్ముడు, రాజధర్మాలెరిగినవాడు, దూతగా వచ్చిన వానిని చంపటం ధర్మం కాదు. లోకం మెచ్చదు. ప్రాణుల్లో తారతమ్యాలు తెలిసినవాడవు. నీకు తెలియని పరమార్థం లేదు. పోయిపోయి ఒక వానరాన్ని చంపడం లోకమర్యాద ప్రకారం కూడా నింద్యం. ఇది నీవు చేయవలసిన పనికాదు. నీలాంటి పండితులు కూడా దోషమైన పనులే చేస్తూ ఉంటే శాస్త్రజ్ఞానం సంపాదించడం వృథా శ్రమే అవుతుంది."

విభీషణుని మాటలు విన్న రావణుడు, "ఓ శత్రుసంహారకుడా! పాపాత్ములను చంపడంవల్ల ఎటువంటి పాపమూ అంటదు. అందువల్ల పాపాత్ముడైన ఈ వానరుణ్ణి చంపడమే సరి అయిన న్యాయం" అని అన్నాడు.

బుద్ధిమంతులలో శ్రేష్ఠుడైన విభీషణుడు, రావణుడు మితిమీరిన కోపావేశంలో ఉన్నాడని గ్రహించాడు. ఇటువంటి అధర్మాన్ని పెద్దలు మెచ్చరని భావించాడు. "ఓ లంకేశ్వరా! నీవు ప్రసన్నుడవు కమ్ము. కోపాన్ని విడిచిపెట్టి ధర్మార్థాలను పాటించు. నా మాట విను. రాజా ఎటువంటి విపత్కర పరిస్థితుల్లోనయినా దూతలను చంపకూడదు అని పెద్దలు అంటారు. ఈ వానరుడు నిస్సందేహంగా శిక్షార్హుడే! శత్రువే! రాక్షసవీరుల్ని అనేకమందిని చంపాడు. సేనానాయకుల్ని చంపాడు. మంత్రికుమారుల్ని చంపాడు. మన అక్షకుమారుణ్ణి కూడా చంపాడు.

ఇతడు చేసిన దురాగతం ఇంత, అంత అని వర్ణించి చెప్పలేం. అయినా దూతలను చంపరాదని పెద్దలు స్పష్టంగా చెప్పారు.

"దూతలకు అనేక విధాలైన శిక్షల్ని పెద్దలు నిర్ణయించి చెప్పారు. వాటిల్లో ఏదో ఒక శిక్ష వేయాలేగాని చంపకూడదు. దూతకు అంగవైకల్యం కలిగించవచ్చు; కొరడాలతో కొట్టికొట్టి విడువవచ్చును. తలగొరిగి పంపవచ్చును; కాల్చి ముద్రలు వేసి పంపవచ్చును. ఈ విధమైన శిక్షల్లో ఏదో ఒకటి విధించవచ్చు. అంతేగాని దూతను చంపడం ఎక్కడా వినలేదు.

"ఓ రాజా! నీవు మహాపండితుడవు. ధర్మార్థాలలో మంచిశిక్షణ పొందిన వాడవు. మంచిచెడులు బాగా ఆలోచించి పనులు చేయటంలో నేర్పరివి. నీవు కోపావేశం చేత ఇట్లాంటున్నావేకాని, ఇది నీ స్వభావం కాదు. కోపాన్ని నిగ్రహించుకో. మహాధైర్యవంతులు కోపాన్ని నిగ్రహించుకుంటారు.

"ఓ రాజా! ధర్మనిర్ణయాలలో నీ అంతటి వాడు మరొకడు లేడు. అట్లాగే లౌకికాచారాల్లో కూడా నీవు ప్రసిద్ధుడవు. నీకున్నంత శాస్త్రజ్ఞానం కూడా మరొకడికి లేదు. నీకు గొప్ప బుద్ధికుశలత గలవాడవు అన్న ఖ్యాతి ఉంది. సురాసురులందరిలోకీ నీవే శ్రేష్ఠుడవు. ఈ వానరాన్ని చంపి మనం ఏం అభివృద్ధిని సాధిస్తాం? ఈ వానరాన్ని పంపిన వాళ్ళను వధించడం మన లక్ష్యం కావాలి. వీడు మంచివాడో, చెడ్డవాడో, వీనిని మాత్రం మన శత్రువులు పంపించారు. అందువల్ల ఇతడు వాళ్ళ సేవకుడు మాత్రమే. వాళ్ళు చెప్పమన్న మాటలు ఇతడు మనకు చెప్పాడు. అది ఇతని తప్పు కాదు. కాబట్టి ఇతణ్ణి చంపడం ఉచితం కాదు.

"ఓ రాజా! ఇతణ్ణి చంపివేస్తే ఇంతటి మహాసముద్రాన్ని దాటి వచ్చేవాడు మరొకడు ఉండడు. ఓ శత్రువులపట్టణాలను జయించేవాడా! నీవితణ్ణి చంపే ప్రయత్నం మానుకో. ఇంద్రుణ్ణి గాని, మరే ఇతర దేవతల్నిగాని చంపు.

"యుద్ధప్రియుడవైన ఓ రాక్షసరాజా! మనం ఇతణ్ణి చంపితే, సముద్రానికి ఆవలిగట్టున

ఉన్న గర్వపోతులైన ఆ రాజకుమారులను ఇక్కడకు యుద్ధానికి ఎవరు తీసుకొని వస్తారు? ఈ దూత తప్ప మరొకరు నాకు కనపడటం లేదు.

"రాక్షసుల మనస్సుకు ఆనందం కలిగించేవాడా! పరాక్రమం, ఉత్సాహం, మనోధైర్యంగల సుర అసురులు కూడా నిన్ను జయించలేరే! అటువంటి నీవు, నీ పరాక్రమాన్ని చూపే అవకాశాన్ని వదలుకున్నట్లవుతుంది. బాగా శిక్షణ పొందినవారు, నీ హితాన్నే కోరే యోధులు, నీచే పోషించబడుతున్న రాక్షసవీరులు కోటిమందికి పైనే ఉన్నారు. వాళ్ళంతా శూరులు, ఏమరిపాటుతనం లేనివాళ్ళు; ఆత్మాభిమానం గలవాళ్ళు; శస్త్రధారులలో శ్రేష్ఠులు, నీ ఆజ్ఞలకు కట్టుబడిన నీ సేనాధి పతులు, మూఢులైన ఆ రాజకుమారు లిద్దరినీ హతమారుస్తారు. నీకు విజయాన్ని చేకూరుస్తారు."

రాక్షసరాజు, దేవతలకు శత్రువు, మహాబలశాలి, రాక్షసరాజులలో శ్రేష్ఠుడు అయిన రావణుడు తమ్ముడైన విభీషణుని ఉత్తమమైన పలుకులను గూర్చి బాగా ఆలోచించి అంగీకరించాడు.

# 53వ సర్గ రాక్షసులు హనుమంతుని తోకకు నిప్పు ముట్టించటం

మహాత్ముడైన విభీషణుని మాటలు విన్న రావణుడు ఇట్లా అన్నాడు: “విభీషణుడా! నీవు చెప్పింది ధర్మంగానే ఉంది. దూతను చంపటం నింద్యమైన పనే. అందువల్ల ఈ దురాత్ముడికి మరణదండనకు బదులుగా, మరేదైనా శిక్ష విధించాలి. వానరులకు తోకపై చాలా ప్రీతి ఉంటుందని అంటారు. దానికి నిప్పు ముట్టించండి. ఇతడు తిరిగి తన ఇంటికి పోయేటప్పుడు తోకలేకుండా వెళ్ళేట్లు చూడండి. ఆ విధంగా అంగవికారం చెంది బంధువులవద్ద, మిత్రులవద్ద అవమానం పొందుతాడు. అదే ఇతడికి సరియైన శిక్ష. ఇతడి తోకకు నిప్పు ముట్టించి లంకాపుర వీధుల్లో ఊరేగించండి. ఇతడిని రాక్షసులతో పాటు నాలుగుకాళ్ళ జంతువులు కూడా చూసేట్లుగా తిప్పండి.”

అంతట కోపంతో ఉన్న రాక్షసులంతా రావణుని మాటలు విని, వాళ్ళవాళ్ళ ఇళ్ళల్లో ఉండే పాత నూలుబట్టలన్నీ తెచ్చి హనుమంతుడి తోకకు చుట్టబెట్టారు. వాళ్ళట్లా గుడ్డపీలికలు చుట్టుతూవుంటే, అడవిలో ఎండిన కట్టెలకు నిప్పంటుకొని విజృంభించినట్లు, హనుమంతుడు విజృంభించాడు. తరువాత రాక్షసులు నూనె పట్టుకొచ్చి తోకనంతా తడిపి నిప్పు ముట్టించారు. తోకంతా మండుతూ ఉండగా ఉదయసూర్యుని ముఖంగల హనుమంతుడు కోపంతో వాళ్ళందరినీ విదిలించికొట్టాడు. ఆ రాక్షసులంతా పోయి నేలమీద పడ్డారు. ఆ విధంగా హనుమంతుని తోక మండుతూ ఉంటే ఇళ్ళల్లోనుండి స్త్రీలు, వృద్ధులు, పిల్లలు వీథిలోకివచ్చి ఆ వింత చూస్తున్నారు. అప్పుడు రాక్షసులంతా జేరి హనుమంతుని మళ్ళీ బంధించారు. వాళ్ళంతా త్రాళ్ళతో బంధిస్తూంటే, హనుమంతుడు తనలో ఇట్లా ఆలోచించాడు. ‘ఈ రాక్షసులు నన్ను బంధించి వాళ్ళేమీ సాధించలేరు. ఎందువల్లనంటే నేను ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు ఈ త్రాళ్ళ నన్నింటినీ తెంపుకొని ఈ రాక్షసులందర్నీ చంపగలను. నేను ప్రభువైన రాముని కార్యం చెడిపోగూడదని ఊరక ఉంటున్నాను. వీళ్ళంతా వాళ్ళ ప్రభువైన రావణుని ఆజ్ఞలను శిరసావహించి, నాకు శిక్ష అమలుపరిచామని విర్రవీగు తున్నారు. కానీ నేనట్లా అనుకోవటం

లేదు. వీళ్ళందరూ నా తోకకు నిప్పు ముట్టించి నన్ను ఊరంతా త్రిప్పాలని చూస్తున్నారు. అట్లాగే జరగనీ. నేను ఇంకోసారి లంకాపట్టణం అంతా చూసే వీలు కలుగుతుంది. నేను తలచుకుంటే ఈ రాక్షసులందరినీ ఒక్క గుద్దుతో చంపగలను కానీ, రాముని సంతోషం కోసం, ఈ అగ్నిని, బంధాలనీ సహిస్తాను. నేను ఇంతకు పూర్వం ఈ పట్టణాన్ని రాత్రివేళ చూడటంవల్ల, దీని దుర్గాలను, వాటి నిర్మాణాలను సరిగా చూడలేకపోయాను. ఇప్పుడు పగటి వేళ కావటంచేత అంతా స్పష్టంగా చూడగలుగుతాను. తమ సంతోషానికి వీళ్లు నా తోకకు నిప్పు అంటించినా, నాకు ఎంతమాత్రం బాధకలుగదు.' హనుమంతుడు తన మనస్సులో ఇట్లా ఆలోచించుకుంటూ వాళ్ళతోపాటు ఊరేగుతున్నాడు. రాక్షసులంతా పరమానందం చెందుతూ హనుమంతుణ్ణి ఊరంతా త్రిప్పారు. హనుమంతుడు వాళ్ళతో సుఖంగా లంకానగరం అంతా తిరిగాడు. హనుమంతుడు ఆ నగరంలో విశాలమైన విమానాల్ని చూశాడు. రహస్యమైన భూగృహాల్ని చూశాడు. విశాలమైన పురవీథుల్ని, రాచబాటల్నీ, కూడళ్ళను వివరంగా చూశాడు.

వాయుపుత్రుడైన హనుమంతుడు విశాలమైన వీథుల్ని, ఇరుకుగా ఉండే వీథుల్ని, చిన్నచిన్న ఇళ్ళను; మేఘాలనంటే ఎత్తైన సౌధాలను, చూశాడు. ప్రతి నాలుగు వీథులు కలిసే కూడళ్ళల్లో హనుమంతుణ్ణి నిలబెట్టి, అక్కడకు జేరిన స్త్రీపురుషులందరికీ "ఇతడొక గూఢచారి" అని చెప్పారు. లంకనంతా అల్లకల్లోలం చేసిన వానరుణ్ణి బంధించి, తోకకు నిప్పంటించి నగరం అంతా త్రిప్పుతున్నారని తెలిసి స్త్రీపురుషులంతా ఇళ్ళలోనుండి బైటకు వచ్చి ఈ వింతను చూసిపోతున్నారు. ఈ విధంగా హనుమంతుడి తోక చివరగా నిప్పు అంటించిన విషయం రాక్షసస్త్రీలు సీతాదేవికి చెప్పారు. "ఓ సీతా! నీతో మాట్లాడిన ఆ ఎర్రటిముఖం గల వానరుణ్ణి బంధించి, తోకకు నిప్పు ముట్టించి పట్టణం అంతా త్రిప్పుచున్నారు" అని చెప్పారు. అప్పుడు సీతాదేవి, రావణుడు తనను అపహరించినప్పుడు ఎంత దుఃఖించిందో, ఈ క్రూరాత్ములైన రాక్షసాంగనలు చెప్పిన మాటలు వింటూ అంతకు రెట్టింపు దుఃఖించింది.

సీతాదేవి దుఃఖంతో అగ్నిని ఉపాసించి హనుమంతుని క్షేమం కోసం అగ్నిదేవుని ఇట్లా

ప్రార్థించింది: "ఓ అగ్నిదేవా! నేను పతిసేవ చేసేదాననే అయితే, నేను ఏదైనా తపస్సు చేసివుంటే, నాకు పాతివ్రత్యం ఉన్నట్లయితే, హనుమంతుణ్ణి అగ్ని బాధనుండి కాపాడి చల్లగా చూడు.

"ఓ అగ్నిదేవా! బుద్ధిశాలియైన రామునికి నా పైన దయ ఉన్నట్లయితే, నేను అదృష్టవంతురాలనైతే, హనుమంతుణ్ణి చల్లగాచూడు. ధర్మాత్ముడైన రాముడు నన్ను కలుసుకోవాలని అనుకుంటున్నట్లైయితే సదాచార సంపన్నుడైన హనుమంతుణ్ణి చల్లగాచూడు. ఓ అగ్నిహోత్రుడా! అబద్ధమాడని సుగ్రీవుడు నన్ను ఈ దుఃఖసముద్రం నుండి దాటించాలని ఉన్నట్లైయితే హనుమంతుని చల్లగా చూడు."

ఈ విధంగా సీతాదేవి అగ్నిహోత్రుని ప్రార్థించింది. అప్పుడా అగ్నిహోత్రుడు హనుమంతుడు క్షేమంగా ఉన్నాడని సీతాదేవికి తెలుపుతున్నాడా? అన్నట్లుగా, అగ్నిహోత్రుడు తోకచుట్టూ ప్రదక్షిణం చేశాడే కానీ, ఏమాత్రమూ వేడిని కలిగించలేదు. హనుమంతుడి తండ్రియైన వాయుదేవుడు సీతాదేవి ప్రార్థనలను మన్నించి చల్లటి మలయమారుతాల్ని వీచి హనుమంతుడికి ఊరట కలిగించాడు.

హనుమంతుడు తనలో ఇట్లా అనుకోసాగాడు. 'వీళ్ళంతా నా తోకకు నిప్పుపెట్టారు, మంటలు ప్రజ్వరిలిల్లుతూనే ఉన్నాయి. అయినా ఆ వేడి నా శరీరానికి తెలియటంలేదు, నాకు ఏమాత్రమూ బాధ వేయటం లేదు. వాళ్ళు మంటపెట్టిన చోట మంచుముద్ద పెట్టినట్లుగా ఉంది. ఇదికూడా ఆ రామప్రభువు ప్రభావమేనా? వెనుక సముద్రాన్ని లంఘించినప్పుడు నాకు సముద్రుడితోను మైనాకుడితోను స్నేహం ఏర్పడిన విధంగానే, ఈనాడు అగ్నికూడా రామప్రభువు ప్రభావాన్నే చాటుతున్నాడా? నాపట్ల సీతాదేవికి కలిగిన దయవల్లనూ, రాముని తేజస్సుచేతనూ అగ్నిదేవుడు నన్ను కాల్చటం లేదు.' ఈ విధంగా ఆలోచిస్తూనే హనుమంతుడు ఆ రాక్షసుల గుంపులోనుండి ఒక్క ఎగురుఎగిరి నగరద్వారం పైకెక్కి నిల్చున్నాడు. బుద్ధిశాలియైన ఆ హనుమంతుడు శరీరాన్ని పర్వతంలాగా పెంచినట్లే పెంచి, మళ్ళీ చిన్నదిచేసి బంధనాలన్నింటినీ విదిల్చి వేశాడు. బంధనాలన్నీ తొలగిపోగానే మళ్ళీ పర్వతం అంత ఆకారాన్ని ధరించి

నాలుగుప్రక్కలా చూశాడు. తోరణానికి కట్టివున్న ఇనుపపరిఘ కనిపించింది. దాన్ని చేతిలోకి తీసుకొని రాక్షసులందరినీ చంపివేశాడు. మళ్ళీ లంకవైపు చూస్తూ, మండుతున్న తన తోకను చూసుకున్నాడు. తన తోక చుట్టూ అగ్నివలయంలాగా ఏర్పడి ప్రజ్వరిల్లుతూ ఉంటే కిరణాలతో కూడిన సూర్యుడిలాగా ప్రకాశించింది.

# 54వ సర్గ లంకా దహనం

హనుమంతుడు తను తలపెట్టిన కార్యాలన్నీ చక్కగా పూర్తిచేశాడు. మనస్సు సంతోషంతో ఉరకలు వేస్తోంది. జరుగబోయే కార్యక్రమం గూర్చి ఆలోచించడం మొదలుపెట్టాడు. నాకంటూ ప్రత్యేకమైన కార్యక్రమం ఏదీలేదు; రాక్షసుల్ని ఏది బాధిస్తుందో ఆ పని చెయ్యడమే నాకు ముఖ్యమైన కార్యం. కాబట్టి అట్లాంటి పని ఏముందా? అని కొద్దిసేపు ఆలోచించాడు. ఆశోకవనాన్ని పూర్తిగా ధ్వంసం చేశాను, కింకరుల వంటి ఉత్తమ రాక్షస వీరుల్ని చంపాను, సైన్యాన్ని మట్టుపెట్టాను, ఇక ఇళ్ళు వాకిళ్ళను నాశనం చెయ్యాల్సివుంది. అప్పుడుగాని రాక్షసులు వీథిన పడరు! అంటే రాముడు వచ్చే సమయానికి లంక సగం నాశనం అయివుంటుంది. ఇకపోతే రాముడు వచ్చిన తరువాత మిగతాది నాశనం చేస్తాడు. ఇప్పుడు 'నా తోకపైన అగ్నిదేవుడు ఆవహించి ఉన్నాడు, ఆయనకు ఏదైనా హోమద్రవ్యాన్ని సమర్పించి ఆయన్నీ తృప్తిపరుస్తాను' అని అనుకున్నాడు.

తరువాత ఉద్యానవనం నుండి బయటకువచ్చి, వాయువుతో సమానుడు, పరాక్రమవంతుడైన హనుమంతుడు మహామంత్రి ప్రవాస్తుని ఇంటిపైకి దుమికి, తన తోకనుండి ప్రళయాగ్ని శిఖరంవంటి అగ్నిని ఆతడి ఇంటిపై వేశాడు. ఆ సౌధమంతా అగ్ని ప్రజ్వరిల్లి మండిపోవటం మొదలైంది. తరువాత మహాతేజశ్శాలియైన ఆ హనుమంతుడు వరుసగా వజ్రదంష్ట్ర, శుక, సారణుల భవనాలలో కూడా ప్రళయాగ్నిని ప్రతిష్ఠించాడు. ఆ తరువాత ఇంద్రజిత్తు గృహానికి, జంబుమాలి, సుమాలుల గృహాలకూ నిప్పుపెట్టాడు. ఇట్లా ఒక భవనంనుండి మరో భవనానికి వెళ్తూ, రశ్మికేతువు, సూర్యశత్రువు, హ్రస్వకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, యుద్ధోన్మత్తుడూ, మత్తుడు, ధ్వజగ్రీవుడు, విద్యుజ్జిహ్వుడు, హస్తిముఖుడు, కరాళుడు, పిశాచుడు, శోణితాక్షుడు, కుంభకర్ణుడు, మకరాక్షుడు, యజ్ఞశత్రువు, బ్రహ్మశత్రువు, నరాంతకుడు, కుంభుడు, నికుంభుడు అనే రాక్షసుల భవనాలకు కూడా నిప్పుపెట్టాడు. గొప్ప కీర్తిమంతుడైన ఆ హనుమంతుడు ధనికుల ఇళ్లను, ఆ ఇళ్ళల్లోని సంపదల్నీ కాల్చివేశాడు.

పరాక్రమవంతుడు, శోభాశాలియైన ఆ హనుమంతుడు చివరగా రావణాసురుని భవనాన్ని చేరుకున్నాడు. ఆ భవనం అంతా మేరుపర్వతమంత ఉంది. భవనమంతా రత్నవైడూర్యాలతో పొదగబడినవి, బంగారంతో చేసిన అనేక వస్తువాహనాల్ని చూశాడు. వాటన్నింటికీ తన తోకనున్న ప్రళయాగ్నిని ముట్టించి తగలబెట్టాడు, ప్రళయకాల మేఘంలాగా గర్జించాడు. వాయుదేవుడు కూడా సహాయపడటంవల్ల అగ్నిదేవుడు తన పనిని త్వరగా ముగించేస్తున్నాడు. వాయువు మూలంగా అగ్నిగుండంగా మారిపోయింది. బంగారు కిటికీలన్నీ కరిగిపోయాయి; ముత్యాలు, మణుల్తో, రత్నాలతో చేసిన అలంకారాలన్నీ బూడిద అయ్యాయి. భవనాలన్నీ బీటలువారి బ్రద్దలయ్యాయి. భవనాల్నీ, వస్తువాహనాల్నీ వదిలేసి ప్రాణాలు దక్కించుకునేందుకు రాక్షసులంతా పరుగులుపెట్టారు. ఆ రాక్షసులంతా "అయ్యో! వానరుడి రూపంలో అగ్నిదేవుడే వచ్చాడు" అని బిగ్గరగా ఏడ్చారు. కొందరు స్త్రీలు అరుచుకుంటూ చంటిబిడ్డల్ని చంకనేసుకొని, జుట్టు విరబోసుకుని మేడలపైనుండి వీథుల్లోకి దూకారు. ఆ విధంగా వాళ్ళు మేడలపైనుండి దూకుతూ ఉంటే మేఘాలనుండి వచ్చే మెరుపుల్లాగా కనిపించారు. కాలిపోతున్న ఇళ్ళల్లోనుండి వెండి, బంగారం వంటి ధాతువులు కరిగి వీథుల్లోకి ప్రవహిస్తూ ఉండటం ఆ హనుమంతుడు చూశాడు. అగ్నిదేవుడికి ఎన్ని కట్టెలు వేసినా, తృప్తి ఉండనట్టే, ఎంతమంది రాక్షసుల్ని చంపినా హనుమంతుడికి తృప్తి కలగటంలేదు. ఎంతమంది రాక్షసులు చచ్చి నేలకొరుగుతున్నా భూదేవికి తృప్తి కలగడంలేదు. తను తగలబెట్టే ధాతువుల స్వభావాన్నిబట్టి కొన్నిచోట్ల కింశుకపుష్పాల రంగులోను, కొన్నిచోట్ల బూరుగపుష్పాల రంగులోను, కొన్నిచోట్ల కుంకుమపువ్వుల రంగులోనూ అగ్ని ప్రకాశిస్తోంది. మహా వేగవంతుడైన హనుమంతుడు ఆ లంకాపురాన్ని రుద్రుడు త్రిపురములను కాల్చినట్లు కాల్చివేశాడు. ఆ విధంగా లంకాపట్టణం అంతా అగ్నిమయమైపోయి ప్రజ్వరిల్లిన అగ్నిజ్వాలలు పర్వతశిఖరాలను తాకింది. భవనాలన్నీ అగ్నికి ఆహుతి అవుతూవుంటే వాయువు దానికి తోడైంది. రాక్షసుల శరీరాలే ఆ అగ్నిహోత్రుడికి ఆజ్యంగా అయి జ్వాలలు చెలరేగిపోయాయి. తగలబడిపోతున్న ఆ లంకానగరం అంతా కోటిసూర్యుల కాంతితో వెలిగిపోతోంది. భవనాలు కూలిపోతూ ఉండటంవల్ల పిడుగులు పడుతున్నట్లుగా అనేక శబ్దాలు పుట్టాయి. అగ్ని తీవ్రమైన కాంతిగలదై కింశుక పుష్పాలవంటి అగ్నిశిఖలతో ఆకాశం వరకు

వ్యాపించింది. ఆరిపోయిన అగ్నినుండి పొగలు పైకిలేచి ఆకాశాన్ని కప్పివేశాయి. 'ఇతడు వజ్రాయుధం ధరించే మహేంద్రుడే కాని, వానరుడు కాదు. లేదా కుబేరుడో, లేక వరుణుడో, యముడో, రుద్రుడో, సూర్యుడో, చంద్రుడో, కాలపురుషుడోకాని సామాన్యవానరుడు కాదు' అని రాక్షసులంతా అనుకున్నారు. సృష్టికర్త, జగద్రక్షకుడైన బ్రహ్మదేవుడే రాక్షససంహారం చెయ్యటానికి వానరరూపం ధరించి వచ్చాడా? అని అనుకున్నారు. అనంతమైనదీ, ఇంద్రియాలచేత తెలుసుకోలేనిది, ఊహలకు అతీతమైనది, అద్వితీయమైనది అయిన విష్ణుతేజస్సు, తన మాయ చేత వానరరూపం ధరించి వచ్చిందా? అని అనుకున్నారు. ప్రాణకోటి, గృహాలు, సంపదలు మున్నగునవన్నీ కలసి అగ్నికి ఆహుతి అయిపోతున్న లంకానగరాన్ని చూస్తూ రాక్షసులు పరిపరివిధాలుగా అనుకుంటూ ఉండగా, రాక్షససమూహాలతోను, గుర్రాలతోను, రథాలతోను, ఏనుగులతోను పశుపక్ష్యాదులతోను, ఆ లంకాపట్టణం గబగబా తగులబడిపోయింది. అదంతా చూస్తున్న రాక్షసులంతా ఏమీ చేయలేని దీనస్థితిలో ఉండిపోయారు; వికారమైన ధ్వనులతో ఏడుస్తున్నారు.

"అయ్యో తండ్రీ! అయ్యో కుమారా! అయ్యో ప్రియుడా! అయ్యో మిత్రుడా!" అంటూ రాక్షసులంతా విలపిస్తూ ఉంటే, ఏడ్పుధ్వనులు మిన్నుముట్టాయి. హనుమంతుడి కోపానికి లంకా నగరమంతా కాలిబూడిద అయింది. రాక్షసుల శవాలన్నీ గుట్టలు గుట్టలుగా పడి ఉన్నాయి. చాలా మంది యుద్ధవీరులు మరణించారు. ఎవరో మహాత్ముడు శాపం పెట్టినట్లుగా లంకానగరం అంతా నాశనం అయిపోయింది. అప్పుడాలంకలోని రాక్షసులంతా భయభ్రాంతులై విలపిస్తూ ఉండటం గొప్ప మనస్సుగల ఆ హనుమంతుడు చూశాడు. అప్పుడు హనుమంతుడు రాముణ్ణి ధ్యానించాడు.

# 55వ సర్గ సీతాదేవి క్షేమం గూర్చి భయపడటం

అప్పుడు హనుమంతుడికి మనస్సులో భయంవేసింది. “నేను ఈ లంకానగరాన్నంతా దహించి వేశాను. ఇదంతా రావణుడిపైనా, రాక్షసులపైనా కోపంతో చేశాను. కోపం చాలాచెడ్డది. కోపం వచ్చినవాడు నిప్పును నీళ్ళతో చల్లార్చినట్లుగా, కోపాన్ని బుద్ధిబలంతో చల్లార్చుకోవాలి. అట్లా కోపాన్ని నియంత్రించుకున్నవాళ్ళే ధన్యులు. సామాన్యంగా కోపం వస్తే పాపకార్యాలు చెయ్యకుండా ఉండలేం గదా! కోపంలో ఉన్నవాడు ఇది చేయదగిన పని, ఇది చేయరాని పని అని ఆలోచించరు. ఈ మాట మాట్లాడవచ్చు, ఈ మాట మాట్లాడకూడదు అన్న విచక్షణాజ్ఞానం ఉండదు. పూజ్యులు పెద్దలైన వాళ్ళను కూడా చంపుతారు. సత్పురుషుల్ని కూడా పరుషమైన మాటత్తో బాధపెడ్తారు. పాము కుబుసాన్ని విడిచినట్లుగా కోపం వచ్చినవాడు ఓర్పుచేత కోపాన్ని తొలగించుకోవాలి, అటువంటి వాడినే ఉత్తమపురుషుడంటారు.

“ఛీ! కోపంలో నేను ఎంత పాడుపని చేశాను. సీతాదేవి క్షేమంగూర్చి ఆలోచించకుండా లంకకు నిప్పు పెట్టాను. ఈ లంకానగరంతోపాటు పూజ్యురాలైన సీతాదేవికూడా కాలిపోయే ఉంటుంది. నేను తొందరపాటు చేత రామకార్యాన్ని పాడుచేశాను. ఏ కార్యం సాధించటానికైతే ఇంత కష్టపడ్డానో ఆ పని అంతా పాడైపోయింది. ఎందువల్లనంటే లంకానగరాన్ని కాల్చేముందు సీతాదేవి భద్రత గూర్చి ఆలోచించి ఉండాల్సింది. పని అంతా చక్కగా పూర్తిచేశాను, కానీ అవివేకంచేత తలపెట్టిన కార్యానికే నిప్పంటించాను. పని అంతా ధ్వంసం అయిపోయింది. సందేహంలేదు, జానకి కూడా ఈపాటికి కాలిపోయే ఉంటుంది. నా బుద్ధితక్కువ వల్లనే రామప్రభుకార్యం నాశనమైపోయింది. ఇక నేను జీవించి ఏం ప్రయోజనం? ప్రాణత్యాగం చెయ్యడమే మేలు. అగ్నిలో దూకనా? లేక సముద్రంలో పడి జలచరాలకు నా శరీరాన్ని ఆహారంగా ఇవ్వనా? పని అంతా ధ్వంసం చేసిన నేను సుగ్రీవుని ముఖం ఎట్లా చూడగలను? రామలక్ష్మణులకు ఏమని బదులు చెప్పగలను? సహజంగా కోతులకు ఉండే చపలత్వమే నన్నూ ఆవహించింది గదా! రజోగుణప్రవృత్తి ఎంత చెడ్డది! రక్షించగల సమర్థుడనై ఉండికూడా

సీతాదేవిని రక్షించలేకపోతిని గదా! సీతే గనుక మరణిస్తే ఆ రామలక్ష్మణులిద్దరూ ప్రాణాలు విడుస్తారు. వాళ్ళిద్దరూ మరణిస్తే సుగ్రీవుడూ మరణిస్తాడు. ఈ దుర్వార్త విన్న భరతశత్రుఘ్నులు కూడా మరణిస్తారు. నా వల్ల ఈ లోకమంతా బాధించబడుతుంది గదా! ఇంతకు పూర్వం నాకు అనేక శుభశకునాలు కనిపించాయి. మరి వాటికేమీ ప్రభావంలేదా? శుభశకునాలు తప్పకుండా జరుగుతాయని అంటారే! తప్పకుండా ఆ శుభశకునాలు ఫలిస్తాయి. మంగళస్వరూపిణియైన సీతాదేవి క్షేమంగా ఉండే ఉంటుంది! ఆమె తేజస్సువల్లనే, నా తోకకు నిప్పంటించినా, నాపై అగ్ని ప్రభావం పడలేదు. అటువంటిది సీతాదేవిని అగ్నిదేవుడు ఎందుకు దహిస్తాడు? తప్పకుండా ఆ పూజ్యురాలిని కాపాడి ఉంటాడు. సీతాదేవియే తన పాతివ్రత్య ప్రభావంచేత అగ్నిహోత్రుణ్ణే దహించి వేయగలదు. అటువంటిది ఆమెను అగ్నిహోత్రుడు దహించడం అనేది జరగదు" అని అనుకుంటూ ఉండగా, అతడికి ఆకాశంలో విహరించే చారణులు మాట్లాడుకోవటం వినిపించింది.

"ఆహా! హనుమంతుడు లంకనంతా దహించివేశాడు. ఈ లంకాదహనం చిరకాలం జనులు చెప్పకుంటారు. లంకలోని భవనాలన్నీ తగులబడిపోయాయి. రాక్షసస్త్రీలు, పురుషులు, పిల్లలు అంతా వీథినపడి ఆక్రందనలు చేస్తున్నారు. రావణాసురుడి కోటబురుజులన్నీ విరిగిపడ్డాయి. ఇంత విధ్వంసం జరిగినా, ఆశోకవనంలో సీతాదేవి మాత్రం ఏ ఆపదాలేకుండా సుఖంగా ఉన్నది గదా! ఇది ఎంత ఆశ్చర్యకరమైన విషయం, ఇంతటి విద్ధారం ఇదివరకు ఎన్నడూ చూడలేదు. ఇకపై కూడా చూడలేము" అని మాట్లాడుకోవటం హనుమంతుడు విన్నాడు. ఆకాశమార్గాన చారణులు చెప్పుకుంటున్న మాటలు వింటున్న హనుమంతుడు పరమానందం చెందాడు. అయినా సీతాదేవిని స్వయంగా మళ్ళీ ఒకసారి చూసి, ఆమె నుండి అనుమతి పొంది తిరిగి సుగ్రీవుని వద్దకు పోవాలనుకున్నాడు.

# 56వ సర్గ హనుమంతుడు మరల సీతాదేవిని దర్శించటం

హనుమంతుడు సీతాదేవిని శింశుపావృక్షానికి దగ్గర్లో కూర్చుని ఉండటం చూశాడు. మనస్సులోని భయాలు, సందేహాలు తొలగిపోగా మహదానందపడిపోయాడు. ఆమెకు నమస్కారం చేస్తూ, "ఓ పూజ్యురాలా! నీవు క్షేమంగా ఉండటం చూసి ఎంతో అనందంగా బయలుదేరుతున్నాను. వెళ్ళే ముందు నీ అనుమతి పొందాలని వచ్చాను" అన్నాడు.

అనుమతి కోరటానికి వచ్చిన హనుమంతుణ్ణి పదేపదే చూస్తూ, సీతాదేవి ఇట్లా అంది: "ఓ హనుమంతుడా! నీవు శత్రువీరులను సంహరించే వారిలో శ్రేష్ఠుడవు. రాముని కార్యం నీ ఒక్కడివే సాధించగలవని నమ్ముతున్నాను. నీ బలపరాక్రమాలు, ప్రతిభాపాటవాలు మిక్కిలి ప్రశంసించదగినవి. అయినా, రాముడే వచ్చి శత్రుసేనలను చీల్చిచెండాడిన తరువాత నన్ను తీసుకుని వెళ్ళడమే అతడి పరాక్రమానికి తగినట్లుగా ఉంటుంది. నాకూ అదే సంతోషం. కాబట్టి యుద్ధంలో ఆ వీరుడు తన పరాక్రమం ప్రదర్శించి నన్ను తీసుకుని వెళ్ళేట్లుగా చెయ్యి."

సీతాదేవి మనోగతం తెలుసుకున్న హనుమంతుడు ఇట్లా అన్నాడు. "ఓ సీతాదేవీ! రామప్రభువు వానరసైన్యాన్ని, భల్లూకాలగుంపులను వెంటబెట్టుకుని త్వరలోనే ఇక్కడకు వస్తాడు. శత్రువులపై విజయం సాధించి నిన్ను తీసుకుని వెళ్తాడు, నీ దుఃఖాలన్నీ తొలగిపోతాయి." ఇలా పలికి మరల సీతాదేవికి భక్తిపూర్వకంగా నమస్కరించాడు. తరువాత రామప్రభువును దర్శించుకోవాలనే ఆసక్తిగలవాడై మంగళప్రదమైన పర్వతశిఖరాన్ని చేరుకున్నాడు.

ఆ పర్వతం అంతా నల్లనివృక్షాలతో నిండి ఉంది. ఆ వనంలో ఎర్రని మచ్చలున్న ఏనుగుల గుంపులున్నాయి. ఆ పర్వతాన్ని మేఘాలు ఆవరించి ఉండటంచేత, ఉత్తరీయం ధరించినట్లుగా ఉంది. సూర్యభగవానుడు తన కిరణాలనే చేతులతో ప్రేమగా ఆ పర్వతాన్ని లేపుతున్నట్లుగా ఉంటే, పర్వతంపై ఉన్న ధాతువులు కొన్ని అక్కడక్కడ పైకి కనిపిస్తూ, నిద్రమత్తుతో కళ్ళు తెరుస్తున్నట్లున్నాయి. ఆ పర్వతసానువుల్లో నుండి ఎగిరెగిరిపడుతూ

ప్రవహించే సెలయేరుల ధ్వనులు వేదాధ్యయనం చేస్తున్నట్లున్నది. చెవులకింపైన సంగీతం ఆలపిస్తున్నట్లున్నది. ఆ పర్వతంపై ఎత్తుగా పెరిగిన దేవదారువృక్షాలు మహర్షులు చేతులు పెకెత్తి తపస్సు చేస్తున్నట్లున్నది. జలపాతాల ఘోషలు నాలుగుమూలల నుండి రొదపెడ్తున్నట్లున్నాయి. చల్లని శరత్కాలపు గాలులవల్ల కదిలే వృక్షాలు వృద్ధాప్యంతో వణకుతున్నట్లుంది. గాలి వెదురుపొదల మధ్యనుండీ వీస్తూ ఉండటం వలన పిల్లనగ్రోవులు ఊదుతున్నట్లుగా ఉంది; భయంకర సర్పాలు బుసలు కొడ్తున్నట్లున్నాయి. ఆ పర్వతంపై ఉండే గుహలన్నీ మంచుకప్పి ఉండటంవల్ల పర్వతం ధ్యానంలో ఉన్నట్లు కనిపిస్తోంది. కదిలే మేఘాలవల్ల ఆ పర్వతంపై ఉండే చిన్నచిన్న కొండలు మెల్లగా నడుస్తున్నాయా అన్నట్లున్నవి. మేఘాలు పర్వతశిఖరాలను తాకి పోతూవుంటే పర్వతం ఆవలిస్తోందా అన్నట్లుంది. ఆ పర్వతం ఎన్నో గుహలు, ఎన్నో శిఖరాలు, ఎన్నో వనాలతో శోభయమానంగా ఉంది.

ఆ పర్వతం ఎత్తైన తాటిచెట్లు, మర్రివృక్షాలు, ఇనుమద్దివృక్షాలు, లతలు, తీగలతో అల్లుకుపోయివుంది. ఆ పర్వతం నిండా అనేకరకాల ధాతువులున్నాయి; అనేక మృగాలతో శోభాయమానంగా ఉంది. జలాజలాపారే సెలయేర్లతో, చిన్నాపెద్దా రాతిబండలతో ఆ పర్వతం నేత్రపర్వంగా ఉంది. ఆ పర్వతంపైన మహర్షులు, గంధర్వులు, కిన్నెరులు నివసిస్తున్నారు. ఆక్కడ రుచికరమైన కందమూలాలకు, ఫలాలకు కరువే లేదు. రాముణ్ణి త్వరగా చూడాలన్న ఉత్సాహంతో హనుమంతుడు ఆ పర్వతంపైకి చేరుకున్నాడు హనుమంతుడు ఆ పర్వతంపైకి త్వరత్వరగా నడచి వస్తూవుంటే అతడి కాళ్ళ క్రిందపడ్డ రాళ్ళన్నీ పిండిపిండి అయ్యాయి. అక్కడ నుండి ఎగిరి సముద్రానికి అవతలగట్టుకు చేరుకోవాలని అనుకున్నాడు. ఆ ఎత్తైనశిఖరం పైనుండి భీకరంగా గర్జిస్తున్న సముద్రాన్ని చూశాడు. తండ్రి వాయుదేవుడిలాగా సముద్రం దాటేందుకు ఎగిరాడు.

హనుమంతుడు అట్లా ఎగరటానికి చేతులు గట్టిగా ఊపాడు. ఆ ఊపుకు అక్కడ నివసిస్తున్న ప్రాణులన్నీ కంపించిపోయాయి. శిఖరంపైన ఉండే వృక్షాలు విరిగిపడ్డాయి.

వజ్రాయుధం దెబ్బతిన్నట్లుగా వృక్షాలన్నీ నేలకూలాయి. ఆ కదలికకు గుహల్లో ఉండే సింహాలు భయంతో గర్జించాయి. అక్కడే నివసిస్తున్న విద్యాధరులు, గంధర్వులు భయపడి ఆకాశంలోకి ఎగిరిపోయారు. ఆ ఎగరడంలో వస్త్రాలు తొలగిపోయాయి, ధరించిన ఆభరణాలు చెల్లాచెదరయ్యాయి. భయంకర మైన విషసర్పాలు ప్రాణభయంతో కలుగుల్లోనుండి బయటకువచ్చాయి. గంధర్వులు, కిన్నెరులు, ఉరగులు, పన్నగులు, యక్షులు మున్నగువారంతా పర్వతాన్ని వదిలి పారిపోయారు. ఎత్తైన వృక్షాలతోను, శిఖరాలతోను ముప్పైయోజనాలు ఎత్తూ, పదియోజాల వెడల్పూ ఉండే ఆ శిఖరం నేలమట్టమయిపోయింది. భయంకరంగా గర్జిస్తున్న సముద్రాన్ని దాటి ఉత్తరపు దిక్కున ఉన్న ఒడ్డుకు చేరుకునేందుకు హనుమంతుడు ఆకాశంపైకి ఎగిరాడు.

# 57వ సర్గ హనుమంతుడు సముద్రాన్ని దాటడం

ఆకాశమనే మహాసముద్రంలో హనుమంతుడు ఏమాత్రమూ అలసట లేకుండా పెద్దఓడ ఆ సముద్రాన్ని దాటినట్లు వాయువేగంతో ఎగిరిపోయాడు. అటువంటి ఆకాశమనే సముద్రంలో చంద్రుడు తెల్లకలువగాను, సూర్యుడు కారండవ పక్షిగాను, నక్షత్రాలు కలహంసలు గాను, మేఘాలు నాచుగాను, పచ్చిక బయళ్ళుగాను, పునర్వసునక్షత్రం తిమింగలంగాను, కుజుడు పెద్దమొసలిగాను, ఐరావతం ఒక పెద్దద్వీపంగాను, స్వాతినక్షత్రం ఒక హంసగాను, గాలితెర అలలుగాను, చంద్రకిరణాలే చల్లటినీరుగాను, సర్పములు, యక్షులు, గంధర్వులు వికసించినపద్మాల్లా, నల్లకలువల్లాగానూ ప్రకాశించాయి.

వాయుపుత్రుడు, శ్రీమంతుడు, పర్వతాకారుడు, వానరుడైన ఆ హనుమంతుడు ఆకాశంలో ఎగురుతూ ఉంటే, ఇతడు ఆకాశాన్ని మ్రింగివేస్తున్నాడా? అన్నట్లూ; చంద్రుణ్ణి రాసుకుంటూ పోతూన్నాడా? అన్నట్లుంది. నక్షత్ర సూర్యమండలాలను తనతో లాక్కొనిపోతున్నాడా అన్నట్లు కనబడ్డాడు. హనుమంతుడి కాంతిచేత ఆకాశంలో మేఘాలన్నీ తెలుపు, ఎరుపు, నీలం, ఆకుపచ్చ, ముదిరిన ఎరుపు ఇంకా అనేక రంగుల్లో కనిపించాయి. మాటిమాటికీ మేఘాల్లోపలికి పోతూ, మళ్ళీ బయటకువస్తూ చంద్రుడిలాగా కనిపించాడు. అట్లా మేఘాలలోనుండి దూసుకుపోతూ ఉంటే మేఘగర్జన వంటి సింహనాదం చేస్తూ గరుత్మంతుడిలా ఆ హనుమంతుడు కనిపించాడు.

లంకాపట్టణాన్నంతా అల్లకల్లోలం చేసి, కాల్చిబూడిద చేసి, రాక్షససైన్యంలో భయాన్ని సృష్టించి, జానకీదేవిని దర్శించి, ఆమె ఆశీస్సులు పొంది సముద్రాన్ని దాటుకుంటూ, మైనాకుణ్ణి స్నేహపూర్వకంగా తాకిన ఆ హనుమంతుడు, ధనుస్సు నుండి విడువబడిన బాణంలాగా మహావేగంగా ముందుకుపోతూ, ఆ మహేంద్రపర్వతాన్ని చూడగానే సంతోషం పట్టలేక పెద్దగా సింహనాదం చేశాడు. మేఘగర్జన వంటి ఆ సింహనాదానికి దిక్కులన్నీ పిక్కటిల్లిపోయాయి. ఆ

వానరయోధుడు అంగదుడు, జాంబవంతుడు, ఇతర వానరయోధులు ఉన్న చోటుకు వచ్చి చేరుకున్నాడు. వాళ్ళందరికీ అభివాదం చెప్తున్నాడా అన్నట్లు తోక ఆడిస్తూ మళ్ళీ సింహనాదం చేశాడు. గరుత్మంతుడు సంచారం చేసే ఆకాశమార్గంలో హనుమంతుడు చేసిన ఆ సింహనాదం సూర్యమండలం వరకూ వ్యాపించింది.

సముద్రతీరాన, హనుమంతుడు ఎప్పుడు వస్తాడా? అని కళ్ళల్లో వత్తులు వేసుకొని కాచుకొని కూర్చున్న ఆ వానరయోధులంతా హనుమంతుని సింహనాదాన్ని విన్నారు. మేఘగర్జనలాగా ఉన్న ఆ సింహనాదంతో, అతడి బాహువులనుండి వీస్తున్న గాలితో, దూసుకువస్తున్న ఆ హనుమంతుణ్ణి వానరయోధులంతా చూశారు. వాళ్ళంతా సంతోషంతో తాటి ప్రమాణాన ఎగురుతూ గంతులువేశారు. వాళ్ళందరినీ చూస్తూ జాంబవంతుడు, “ఓ వానరయోధుల్లారా! హనుమంతుడు విజయలక్ష్మితో తిరిగి వస్తున్నాడు. అతడు చేసిన సింహనాదం ధ్వనిని బట్టి అతడు సఫలీకృతుడయ్యాడని తెలిసిపోతోంది” అన్నాడు.

అప్పుడు ఆ వానరులు సంతోషం పట్టలేక హనుమంతుణ్ణి చూడాలనే ఆతృతతో కొందరు పర్వతశిఖరానికి పోయి చూశారు. కొందరు వృక్షాలపైకి ఎక్కి చిటారుకొమ్మ నుండి వీక్షించారు. ఆ వానరులకు సరిపడినన్ని వృక్షాలు అక్కడ లేకపోవటంతో ఒకే వృక్షంపై కొమ్మకొమ్మనా వానరులు ఎక్కి తొక్కుతున్నారు. వారి బలానికి తట్టుకోలేని కొమ్మలన్నీ వంగిపోయాయి. కన్నీళ్ళు కారుస్తున్నయ్యా అన్నట్లు ఆకులన్నీ రాలిపడ్డాయి.

బలశాలి, వాయుపుత్రుడు అయిన హనుమంతుడు పర్వత గుహలోనికి ప్రవేశించిన వాయువులాగా గర్జించాడు. మేఘాల సమూహంలాగా వస్తున్న హనుమంతుణ్ణి చూస్తూ ఆ వానరులంతా అంజలిఘటిస్తూ నిల్చున్నారు. దట్టమైన వృక్షాలతో నిండివున్న ఆ మహేంద్రపర్వతం పైన ఆ హనుమంతుడు మహావేగంగా వచ్చి, మహాదానందంతో ఒక సెలయేటిగట్టున దిగాడు. రెక్కలు తెగిన పర్వతమా? అన్నట్లున్నాడు. ఆ వానరయోధులంతా పోయి ఆ వానరోత్తముణ్ణి ఆనందంతో చప్పట్లు కొడుతూ, నాట్యంచేస్తూ, కేరింతలతో

చుట్టుముట్టారు. కొందరు పెద్దపెద్ద పూలమాలలు కట్టి తెచ్చారు. కొందరు పండ్లు తెచ్చి ఇచ్చారు, ఇంకొందరు కందమూలాలు తెచ్చి ఇచ్చారు. అప్పుడా హనుమంతుడు గురువుకు నమస్కరించి పెద్దలకు, జాంబవంతుడికి, అంగదుడికీ నమస్కరించాడు. తనపైన అపారప్రేమాభిమానాన్ని చూపుతున్న అంగదుణ్ణి, జాంబవంతుడిని, ఇతర పెద్దలందరినీ ఉద్దేశించి "సీతాదేవిని చూశాను" అని అన్నాడు.

అంతట వాయుపుత్రుడైన హనుమంతుడు, యువరాజైన అంగదుడి చేతితో చెయ్యి కలిపి, ఆ మహేంద్రపర్వతంపై ఒక సుందరమైన ప్రదేశంలో కూర్చున్నాడు. వానరులంతా వారి చుట్టూ కూర్చున్నారు. అంగదుడి ప్రక్కన కూర్చున్న హనుమంతుడు "ఓ వానరయోధులారా! అశోకవనంలో సీతాదేవి రాముని తలచుకొంటూ, ఉపవాసాలు చేస్తూ చిక్కిశల్యమైపోయివుంది. ఆ పతివ్రత తల అంతా సంస్కారం లేకుండా ఒకే జడగా అట్టలు కట్టుకుపోయింది. అన్నపానాదులు లేక శరీరమంతా మందంగా దుమ్ము ధూళీ కొట్టుకొని ఉంది. భయంకరమైన రాక్షస స్త్రీలు రాత్రింబవళ్ళు కాపలా కాస్తున్నారు. నేను అటువంటి స్థితిలో ఉన్న సీతాదేవిని చూశాను" అని అన్నాడు.

"నేను సీతాదేవిని చూశాను" అన్న హనుమంతుడి ఒక్కమాటే ఆ వానరులందరికీ అమృతం త్రాగినంత ఆనందాన్ని కలిగించింది. పరమానందభరితులైపోయారు. మహాబలాఢ్యులైన కపిశ్రేష్ఠులు కొందరు సింహనాదాలు చేశారు. ఆబోతువలె రంకెలు వేశారు, కొందరు భళి, భళి అన్నారు, ఇంకొందరు కిచకిచమని తమ సొంతభాషలోనే సంతోషాన్ని వ్యక్తం చేశారు. కొందరు సంతోషాతిరేకంతో చప్పట్లు చరిచారు; ఇంకొందరు తమ తోకల్ని ఆకాశంలోకి ఎత్తి గట్టిగా నేలకేసి కొట్టారు; ఇంకొందరు ఎత్తైన శిఖరంపైకి ఎక్కి అక్కడ నుండి దూకి మదపుటేనుగు వంటి హనుమంతుణ్ణి తాకి చూశారు.

అంగదుడు : ఓ వాయుపుత్రుడా! హనుమంతుడా! నూరుయోజనాల సముద్రాన్ని దాటి వెళ్ళావు. తిరిగి వచ్చావు. నీ బలానికి, పరాక్రమానికి, నీకు నీవే సాటి. ఆహా! నీవు ఎంతటి

ప్రభుభక్తిపరుడవు? నీకున్న ధైర్యంగాని, పరాక్రమంగాని మరొకరికి ఉండవు. నీవు రామప్రభువు భార్యయైన సీతాదేవిని చూసి వచ్చావు. ఇకపైన రామప్రభువు, సీతాదేవితో సుఖంగా ఉంటాడు. అంటే ముల్లోకాలు సుఖంగా ఉన్నట్లే గదా! మనమంతా ఎంతో అదృష్టవంతులం.

హనుమంతుడు ఒక రాతిబండపైన కూర్చున్నాడు. అతడి చుట్టూ వానరులంతా గుమికూడారు. సీతాదేవిని గుర్చి, రావణాసురుడిని గూర్చి, లంకానగరాన్ని గూర్చి ఏం చెప్పబోతాడోనని చెవులు నిక్కబొడుచుకుని ఎదురుచూస్తూన్నారు. వాళ్ళ సంతోషానికి ఆనందానికి అంతేలేకుండా పోయింది.

అప్పుడు ఆ వానరుల మధ్యన, హనుమంతుడు జాంబవంతుడు ప్రక్కన కూర్చుని ఉంటే యువరాజైన అంగదుడు దేవలోకంలో దేవతల మధ్యన కొలువుతీరిన మహేంద్రుడిలాగా వెలిగిపోయాడు.

# 58వ సర్గ హనుమంతుడు లంకావిశేషాలను వివరించడం

హనుమంతుడు తిరిగి రావటంవల్ల మహేంద్రపర్వత ప్రాంతంలో పండగ వాతావరణం నెలకొంది. వృద్ధుడు, మహావీరుడైన జాంబవంతుడు కూడా పట్టలేని ఆనందంతో ఇట్లా అన్నాడు.

జాంబవంతుడు : సీతాన్వేషణకై బయలుదేరినప్పటి నుండి తిరిగివచ్చే వరకూ ఏం జరిగిందో వివరంగా చెప్పి మమ్మల్నందరినీ ఆనందంలో ముంచి ఎత్తు. నీవు సీతాదేవిని ఎట్లా చూశావు? ఆమెను ఎక్కడ చూశావు? క్రూరాత్ముడైన రావణుడు ఆమెపట్ల ఏ విధంగా ప్రవర్తిస్తున్నాడు? ఓ హనుమంతుడా! ఆ విషయాలన్నీ మాకు జరిగింది జరిగినట్లు చెప్పు. నీవు చెప్పేదంతా విన్న తర్వాత మనమంతా ఏం చెయ్యాలో ఆలోచిద్దాం. మనం రాముడి దగ్గరకు వెళ్ళే ముందు, ఆ ప్రభువుకు ఏయే విషయాలు చెప్పాలో, ఏయే విషయాలు చెప్పకూడదో మనం ఇక్కడే నిర్ణయించుకుందాం.

హనుమంతుడు : (రామప్రభువుకు, సీతాదేవికి మనస్సులోనే నమస్కరించాడు) ఓ జాంబవంతుడా! ఓ అంగదుడా! వానరశ్రేష్ఠులారా! ఈ సముద్రానికి దక్షిణతీరమైన ఆవలి ఒడ్డుకు చేరాలని సంకల్పించి, మీ అందరి ఎదుటా, ఈ మహేంద్రపర్వత శిఖరంపైనుండి ఆకాశంలోకి ఎగిరి వెళ్ళాను. మీకు ఆ సంగతి తెలుసు.

నేను అట్లా ఆకాశంలో ఎగురుతూ ఉండగా, అందమైన కాంచనశిఖరం ఒకటి నా దారికి అడ్డంగా నిలబడ్డది. ఎవరో నాకు అడ్డుగా వచ్చి నా పనికి విఘ్నం కలిగించబోతున్నారని అనుకున్నాను. ఆ శిఖరాన్ని పగలకొట్టి నా అడ్డు తొలగించుకోవాలని అనుకున్నాను. వెంటనే, నా తోకతో గట్టిగా ఆ శిఖరాన్ని కొట్టాను. వెంటనే ఆ శిఖరం అంతా ముక్కలు ముక్కలుగాను, పిండి పిండిగాను అయిపోయింది.

అప్పుడు ఆ శిఖరంలో నుండి నాకీ మాటలు వినిపించాయి. "ఓ హనుమంతుడా! నా

పేరు మైనాకుడు. నేనే ఈ పర్వతరాజుని. నేను నీ తండ్రి అయిన వాయుదేవునికి స్నేహితుడను అంటే నీకు పినతండ్రి వంటివాడిని. నేను ఈ సముద్రంలోనే స్థిరంగా ఉంటున్నాను. పూర్వం మహాపర్వతాలన్నింటికీ రెక్కలు ఉండేవి. అవి భూమి అంతటా సంచరిస్తూ ఉండేవి. ఆ విధంగా భూమిపై నివసించే ప్రాణులన్నింటికీ అపారమైన నష్టం సంభవించేది. అప్పుడు పాకాసుర సంహారియైన మహేంద్రుడు తన వజ్రాయుధంతో పర్వతాల రెక్కలన్నింటినీ నరికి ముక్కలు చేశాడు. అప్పుడు మహాత్ముడైన నీ తండ్రి వాయుదేవుడు నాకు గొప్పస్నేహితుడు కావడం వలన, నన్ను తన ప్రభావంచేత ఎగరగొట్టి ఈ సముద్రంలో పడేశాడు. ఆ విధంగా నన్ను ఆ మహేంద్రుని బారినుండి కాపాడాడు. ఓ శత్రుసంహారకుడా! నీవు రాముని కార్యార్థం బయలుదేరావు. రాముడు ధర్మాన్ని రక్షించేవారిలో శ్రేష్ఠుడు. పరాక్రమంలో మహేంద్రుడితో సమానమైనవాడు. అతడికి సాయపడ్డం అంటే నాకూ పరమ సంతోషమే. నీవు అతడి దూతగా వెళ్తున్నావు. కాబట్టి నీకు ఏదైనా సహాయం చెయ్యాలని అనుకుంటున్నాడు. అందుకే సముద్రంలో ఉండే నేను పైకి లేచి వచ్చాను. ఓ హనుమంతుడా! నీవు నా శిఖరంపై కొద్దిసేపు విశ్రాంతి తీసుకుని తరువాత నీ ప్రయాణం కొనసాగించు" అని పర్వతరూపంలో ఉన్న మైనాకుడు నాతో అన్నాడు. అప్పుడు నేను ఆ మహాత్ముడితో నా పనిని గూర్చి చెప్పాను. ఇప్పుడు విశ్రాంతి తీసుకోలేనని చెప్పాను. అంతట నాకు అనుజ్ఞ ఇచ్చి ఆ పర్వతశ్రేష్ఠుడు సముద్రం లోపలకు పోయి అంతర్ధానమయ్యాడు.

అంతట నేను అమితమైన వేగంతో చాలాసేపు ప్రయాణం చేశాను. అప్పుడు నాగమాతయైన సురసాదేవి నాకు ఎదురుగా నిలచి నాతో ఇట్లా అంది:

"ఓ వానరుడా! దేవతలు నిన్ను నాకు ఆహారంగా ఇచ్చారు. నేను ఇప్పుడు నిన్ను మ్రింగి నా ఆకలి తీర్చుకుంటాను, చాలాకాలం తర్వాత నాకు మంచి ఆహారం దొరికింది" అంది. అంతట నేను ఆమెకూ నమస్కారం చేసి, "ఓ దేవీ! దశరథమహారాజు పుత్రుడైన రాముడు, తమ్ముడు లక్ష్మణుడు, భార్య సీతతో కలసి దండకారణ్యంలో నివసిస్తూ వచ్చాడు. దురాత్ముడైన

రావణుడు ఆ సీతాదేవిని అపహరించుకొనిపోయాడు. కాంతిమంతుడు, మహాతేజస్వీయైన రాముడు ఆదేశించడం వల్లనే రామదూతగా సీతాదేవి దగ్గరకు పోతున్నాను. ఓ సురసాదేవీ! నీవు కూడా రాముడి రాజ్యంలోనే నివసిస్తున్నావు. కనుక రాముడికి నీవు కూడా సహాయం చెయ్యాలి. కాబట్టి నేను వెంటనే సీతాదేవిని చూడాలి. తరువాత ఆ వార్త రామునికి చెప్పి మళ్ళీ నీ దగ్గరకు వస్తాను. అప్పుడు నీవు కోరినట్లుగా నీ నోట్లో పడతాను. నేను ఒట్టుపెట్టుకొని చెపుతున్నాను. నన్ను విశ్వసించి, నన్ను సందేహించవద్దు" అని ఎన్నోవిధాలుగా చెప్పి చూశాను. అయినా ఆ కామరూపిణియైన సురసాదేవి నన్ను ముందుకు పోనియ్యలేదు. అప్పుడు నా దేహం పదియోజనాల పొడవుంది. ఆమె నోటిని పదిహేను యోజనాల మేరకు పెంచింది. అప్పుడు నేను నా శరీరాన్ని బొటన వ్రేలంతగా చేసి ఆ సురస నోట్లోకి పోయి అదే క్షణంలో బయటకు వచ్చేశాను. అప్పుడా సురసాదేవి ఎప్పటిలాగానే మామూలు రూపం ధరించి "రామకార్యాన్ని సాధించు, మహాపతివ్రతయైన సీతను రాముని వద్దకు చేర్చు, నీ సమయస్ఫూర్తికి మెచ్చాను, ఇకపై నీవు సంతోషంగా వెళ్ళు" అని అనగానే భూతాలన్నీ నన్ను ప్రశంసించాయి. తరువాత నేను గరుత్మండు వలే మళ్ళీ ఆకాశంలో ఎగురుతూ ముందుకుపోయాను.

కొంతదూరం పోయినతర్వాత ఎవరో నన్ను పట్టుకొని వెనక్కులాగుతున్నట్లుగా అనిపించింది. నేను నాలుగుప్రక్కలా చూడగా నా నీడను ఎవరో కదలకుండా పట్టుకుంటున్నట్లు అనిపించింది. సముద్రజలాల్లో ఒక రాక్షసస్త్రీ పడుకుని నా నీడను గట్టిగా పట్టుకొని వికృతంగా నవ్వుతూ, పెద్దగా కేకలుపెడ్తూ ఇట్లా అంది: "ఓ పెద్దశరీరం గలవాడా! ఎక్కడికి పోతున్నావు? నాకు బాగా ఆకలిగా ఉంది నిన్ను వదలను, నన్ను తప్పించుకొని పోలేవు. చాలాకాలం నుండి సరైన ఆహారం లేకుండా ఉన్నాను. ఇప్పుడు నీవు నాకు ఆహారమై నన్ను సంతోషపెట్టు" అంది. ఇంతకుముందే సురసాదేవితో జరిగిన అనుభవాన్నే గుర్తుంచుకున్నాను, ఎక్కువసేపు వాదోపవాదాలకు పోకుండా నా దేహాన్ని విపరీతంగా పెంచాను. ఆ రాక్షసి కూడా నన్ను మ్రింగివేయడానికి నాకంటే పెద్దగా నోరు తెరచింది. అప్పుడు నేను నా దేహాన్ని బాగా చిన్నదిగాచేసి ఆ రాక్షసి నోట్లోకి దూరిపోయాను. అట్లా ఆమె శరీరంలో ప్రవేశించి వేగంగా

పోయి ఆమె గుండెకాయను ఊడపెరికి చేత పుచ్చుకొని ఒక్క క్షణంలో బైటపడ్డాను. ఆ రాక్షసి గుడ్లుతేలేసి చచ్చి సముద్రజలాల్లోకి పడిపోయింది. అప్పుడాకాశంలో సంచారం చేస్తున్న సిద్ధులు, చారణులు నన్ను మెచ్చుకుంటూ "ఆహా! హనుమంతుడు ఈ సింహికను చంపేశాడు. ఈ భయంకరరాక్షసి పీడ విరగడై పోయిందిగదా!" మాట్లాడుకోవటం నేను విన్నాను. మళ్ళీ నా ప్రయాణం కొనసాగించి ముందుకుపోయాను.

సముద్రానికి దక్షిణతీరం కనిపించింది. ఆ తీరాన రకరకాలైన వృక్షాలతో అనేక వనాలు ఉన్నాయి. లంకాపట్టణం కూడా నాకు కనిపించింది. సూర్యుడు అస్తమించే వరకూ అక్కడా ఇక్కడా తిరుగుతూ చీకటి పడగానే ఆ లంకాపట్టణంలోకి ప్రవేశించాను. నేను పట్టణంలోకి ప్రవేశించబోతూవుంటే ఒక రాక్షసస్త్రీ వికటంగా నవ్వుతూ నా ఎదుటవచ్చి నిలబడింది. దాని తలవెంట్రుకలన్నీ భగభగమండే అగ్నిహోత్రంలాగా ఉన్నాయి. నన్ను చంపేందుకు నా మీదకు వచ్చింది, అప్పుడు నేను ఆ రాక్షసిని ఒక్క గుద్దుగుద్దాను. దాంతో అది నేలమీద పడిపోయింది. ఆ రాక్షసి నన్ను చూసి భయపడిపోయింది. "ఓ వీరుడా! నేను లంకాపురానికి అధిదేవతను, నన్ను లంకిణి అని అంటారు. నీవు నన్ను పరాక్రమంతో జయించావు. ఇంక ఈ లంకానగరంలోని రాక్షసులందరినీ జయించగలవు" అంది.

రాత్రిపూటనే సీతాదేవి కోసం వెదకాలని అనుకున్నాను. అట్లాగే రాత్రి లంక అంతా వెతికాను. రావణాసురుడి అంతఃపురంలో కూడా సీతాదేవి నాకు కనిపించలేదు. నేను దిగులుపడ్డాను. చివరగా రావణాసురుడి ఉద్యానవనానికి వెళ్ళాను. ఆ వనానికి ఎత్తైన ప్రాకారాలున్నాయి. భయంకరులైన రాక్షసులు కాపలా కాస్తున్నారు. ఆ ఉద్యానవనం మధ్యలో ఒక పొడవైన శింశుపావృక్షాన్ని ఎక్కాను. ఎవరి కంటాపడకుండా ఉండేందుకు సూక్ష్మరూపాన్ని ధరించి ఆకులసందున కూర్చుని వనం అంతా కలయచూశాను. అక్కడ నుండి కొద్దిదూరంలో ఒక బంగారు అరటితోటను చూశాను. అక్కడ ఓ అశోకవృక్షం క్రింద సీతాదేవిని చూశాను, ఆమె నడియవ్వనంలో ఉంది. ఆమె కన్నులు కమలరేకుల్లా ఉన్నాయి. ఉపవాసాలతో శరీరం

కృశించి ఉంది. మాసిపోయిన చీర కట్టుకుంది. చాలాకాలంగా ఆ చీరతోనే ఉండటం వల్ల ఆ చీర బాగా పాతదిగా కనిపించింది. తల అంతా దుమ్ముకొట్టుకుని జుట్టంతా అట్టలు కట్టుకుపోయింది. మనోవ్యధ అంతా ఆమె ముఖంలోనే కనిపించింది. అవయవాల్లో ఎక్కడా సత్తువలేదు. వికృతాకారంతో ఉన్న రాక్షస స్త్రీలు ఆమె చుట్టూ కాపలాకాస్తున్నారు. వారంతా భయంకరంగా ఉన్నారు. పచ్చి మాంసం తింటూ, నెత్తురు త్రాగుతున్నారు. పెద్దపులుల మధ్యనున్న లేడిపిల్లలా ఆమె ఉంది. వాళ్ళంతా ఆమెను భయపెడ్తున్నారు; బెదిరిస్తున్నారు. ఆమె జుట్టు అంతా అట్టకట్టుకుపోయి ఒకే జడగా అయిపోయింది. ఆమె కటికనేల పైనే పడుకుంటూ కళ్ళుమూసుకుని భర్తనే ధ్యానంచేస్తూ ఉండటం నేను చూశాను. ఆమె శరీరం రంగుమారిపోయి, శిశిరరుతువులో పద్మంలాగా వడలిపోయి ఉంది. ఆమె జీవించాలనే కోరికలేనిదై ఉన్నట్లు నేను చూశాను. రావణాసురుడి నిర్బంధానికి అంగీకరించక చనిపోవటానికే సిద్ధపడింది.

ఆ సమయంలో రావణుని భవనంలో స్త్రీల మొలనూళ్ల చప్పుళ్లు, అందెల సవ్వడులు కోలాహలంగా వినవచ్చాయి. అప్పుడు నేను ఉద్విగ్నుడనై, నా దేహాన్ని అమితచిన్నదిగా చేసుకొని, దట్టంగా ఉన్న ఆ శింశుపావృక్షం ఆకుల మధ్య పక్షిలా కూర్చున్నాను.

రావణాసురుణ్ణి చూస్తూనే సీతాదేవి తన చేతులతో స్తనాలను కప్పివేసుకుంది. మోకాళ్ళు అడ్డుపెట్టుకొని ఉదరభాగం కనపడకుండా కాపాడుకుంది. ఆమె దిగులుతో కృంగిపోయింది, కాపాడే దిక్కులేక భయంతో గజగజ వణికిపోయింది. అట్లాంటి దీనస్థితిలో ఉన్న సీతాదేవిని చూసి రావణుడు, "ఓ సీతా! నీవు అహంభావంచేత నన్ను గౌరవించడం లేదు. నన్ను చూడగానే గౌరవంతో నమస్కరించడం నేర్చుకో! నీకు మరో రెండు మాసాలు గడువు ఇస్తున్నాను. ఈ లోపుగా నీవు నీ మనస్సు మార్చుకొని నా వశం కాకపోతే నిన్ను చంపి నీ మాంసం వండించుకుని తింటాను, నీ రక్తం తాగుతాను" అని అన్నాడు.

దుర్బుద్ధి అయిన రావణాసురుడు అన్న మాటలకు సీతాదేవికి చాలా కోపం వచ్చింది. రావణాసురుడితో "ఓ రాక్షసాధమా! ఇక్ష్వాకువంశ ప్రభువైన దశరథుని కోడలిని,

మహాతేజశ్శాలియైన రాముని భార్యను అయిన నన్ను ఇట్లా పాపపు మాటలాడుచున్న నీ నాలుక ఎందువల్ల చీలికలు అయిపోలేదు? నీవు దుష్టుడవు, పాపిష్టివాడవు మాత్రమే కాదు దొంగవు కూడా. నా భర్త ఇంట్లో లేనప్పుడు నన్ను అపహరించుకొని వచ్చావు. నీవు పరాక్రమంలేని వాడవు. నా రామప్రభువుకు నీవు ఏ విషయంలోనూ సాటిరావు. అంతేకాదు ఆయనకు సేవకుడుగా ఉండేందుకు కూడా నీకు యోగ్యత లేదు. రాముడు సత్యవాది, యజ్ఞయాగాది క్రతువులు చేసేవాడు. యుద్ధంలో ప్రశంసలు అందుకున్నవాడు" అంది.

సీతాదేవి మాటలు విన్న రావణుడు మండిపడ్డాడు. పిడికిలి బిగించాడు, ఒక్క గుద్దు గుద్ది సీతాదేవిని చంపాలని ముందుకు వెళ్ళాడు. అక్కడున్న రాక్షసస్త్రీలంతా భయపడిపోయారు. హాహాకారాలు చేశారు. వాళ్ళల్లో ఉత్తమురాలు, రావణుని పట్టపురాణియైన మండోదరి ముందుకు వచ్చి రావణుణ్ణి నివారించింది. మదనతాపంతో, విరహంతో తపించి పోతున్న రావణునితో "ప్రభూ! నీవు దేవేంద్రుడితో సమానమైనవాడవు. నీ కోసం దేవ, గంధర్వ స్త్రీలంతా పడిగాపులు కాస్తున్నారు. వాళ్ళందర్నీ వద్దని ఈ సీత నీ కెందుకు?" అని చెప్పి అతణ్ణి అక్కడనుండి తీసుకుపోయింది. అతడితోపాటు మిగిలిన స్త్రీలంతా కూడా వెళ్ళిపోయారు.

అటు రావణుడు వెళ్ళిపోగానే, వికృతాకారులైన ఆ రాక్షసస్త్రీలంతా సీతాదేవిని క్రూరమైన ఈటెల్లాంటి మాటల్తో భయపెట్టారు. అయినా ఆ జానకి ఆ రాక్షస స్త్రీల మాటల్ని గడ్డిపరకలాగా నిర్లక్ష్యం చేసింది. ఆ పచ్చిమాంసం తినే రాక్షసస్త్రీలంతా పరుగెత్తుకుపోయి సీత నిశ్చయాన్ని ఆ రావణునికి చెప్పారు.

సీతాదేవి మనస్సు మార్చగలమనే ఆశ ఆ రాక్షసస్త్రీలలో నశించిపోయింది. దాంతో వాళ్ళంతా ఒళ్ళు మరచి నిద్రకుపడ్డారు. సీతాదేవి మాత్రం తన కష్టాలకు అంతులేకుండా పోతోందే అని విలపించసాగింది. ఇంతలో అక్కడ నిద్రపోతున్న రాక్షసస్త్రీలలో త్రిజట అనే వృద్ధ స్త్రీ నిద్రలేచి మిగతావాళ్ళను కూడా నిద్రలేపింది. అప్పుడే తనకు వచ్చిన స్వప్న వృత్తాంతం అంతా వాళ్ళకు చెప్పింది. చివరగా ఇలా అంది: "మీరు సీతాదేవిని ఏమీ అనకండి, మీరు ఏంచేసినా

ఆమె చచ్చిపోదు. ఆమె భర్తయైన రాముడు లంకకు వస్తాడు, రాక్షసులందరినీ సంహరిస్తాడు. సీతాదేవిని తీసుకుపోతాడు. తరువాత రాముడితో ఆమె సర్వసుఖాలు అనుభవిస్తుంది. మనం రాముడి నుండి చావు తప్పించుకొని బయటపడాలంటే సీతాదేవి ఒక్కతే మనల్ని రక్షించగలదు. అందువల్ల మనం అంతా ఆ వైదేహిపట్ల చేసిన అపరాధాలన్నింటినీ క్షమించమని ప్రార్థిద్దాం. మనం అట్లా ప్రార్థిస్తే ఆమె తప్పక ప్రసన్నురాలవుతుంది."

అప్పుడు సీతాదేవి ఆ త్రిజట స్వప్నవృత్తాంతం విన్నది. రాముడు వస్తాడన్న చల్లనిమాట ఆమెను ఆనందపారవశ్యంలో ముంచేసింది. "ఓ రాక్షసాంగనలారా! ఈ త్రిజట స్వప్నం యథార్థం అయితే నేను మిమ్మల్నందరినీ క్షమిస్తాను; తప్పక కాపాడుతాను" అని అంది.

ఆ శింశుపావృక్షం పైనుండి సీతాదేవి దుర్దశ చూసి దుఃఖంతో నా గుండె పగిలిపోయింది. ఆమెతో ఎట్లాగైనా మాట్లాడి ఆమెను ఓదార్చాలని మనస్సు తహతహలాడిపోయింది. నాకు ఒక ఉపాయం స్ఫురించింది. ఇక్ష్వాకువంశాన్ని వర్ణించి రాముడి వైభవాన్ని స్తుతిస్తే, సీతాదేవి మనస్సుకు తప్పక ఊరట కలుగుతుందని అనిపించింది. నేను చెట్టు కొమ్మపైనుండి చేసిన స్తుతి అంతా ఆ అమ్మ విన్నది. కన్నీళ్ళు కారుస్తూ, నా వంక చూసి "నీవు ఎవరవు? ఇక్కడికి ఎట్లా వచ్చావు? ఆ రామప్రభువుకు నీకూ ఎట్లా స్నేహం కుదిరింది?" అని అడిగింది.

నేను ఉన్నది ఉన్నట్లుగా చెప్పాను. "ఓ దేవీ! సుగ్రీవుడు వానరరాజు. రామప్రభువుకు సుగ్రీవుడితో స్నేహం అయింది. నేను సుగ్రీవుడి మంత్రిని; నా పేరు హనుమంతుడు. పనులు సాధించే వారిలో శ్రేష్ఠుడైన రామప్రభువు నన్ను నువ్వెక్కడున్నావో వెతికి తెలుసుకొని రమ్మన్నాడు. శ్రీమంతుడైన ఆ రామప్రభువు, తన వేలినుండి ఉంగరాన్ని తీసి నాకిచ్చి, 'సీతాదేవి కనిపించినప్పుడు, నా ఆనమాలుగా ఈ ఉంగరాన్ని చూపించు అన్నాడు' అని చెప్పి ఆ ఉంగరాన్ని ఆమెకిచ్చాను. తరువాత "ఓ దేవీ! నేను నీకు కూడా దాసుడనే, నువ్వు ఏమి చెయ్యమంటే అది చేస్తాను. నిన్ను వెంటనే రామలక్ష్మణుల వద్దకు తీసుకొని పొమ్మంటే, నా

వీపుపైన ఎక్కించుకొని తీసుకునిపోతాను" అని చెప్పాను.

ఆ జానకీదేవి ఆలోచించి, "రామప్రభువు వచ్చి రావణుణ్ణి సంహరించి నన్ను ఆయనే స్వయంగా తీసుకొని వెళ్ళటమే నా అభిమతం" అని చెప్పింది. అంతట నేను ఆ పూజ్యురాలికి నమస్కరించి రామప్రభువు గుర్తించేందుకు గుర్తుగా ఏదైనా ఒక వస్తువును ఇమ్మని ప్రార్థించాను. అప్పుడామె ఈ చూడామణిని నాకు ఇచ్చి తన ఆనవాలుగా రామప్రభువుకు చూపమంది. అప్పుడామె ఆ చూడామణిని ఇస్తూ ఒక వృత్తాంతాన్ని కూడా గుర్తుగా చెప్పింది.

నేను ఆ చూడామణిని తీసుకొని, ఆమెకు ప్రదక్షిణపూర్వక నమస్కారం చేసి బయలుదేరబోతూ ఉండగా "ఓ హనుమంతుడా! నేను ఇక్కడ పడుతున్న కష్టాలన్నీ రామప్రభువుకు చెప్పు. నీవు వెళ్ళి నా వృత్తాంతం అంతా చెప్పగానే, రామలక్ష్మణులు, సుగ్రీవుడు, వానరసేనలతో సహా ఇక్కడకు వెంటనే వచ్చేట్లు చెయ్యి. అట్లా మీరంతా రానిపక్షంలో, రామప్రభువు నన్ను ప్రాణాలతో చూడలేడు. ఎందువల్లనంటే, రావణుడు నాకు రెండు మాసాలే గడువిచ్చాడు. ఆ తర్వాత రావణుడు నన్ను చంపేస్తాడు. నేను అనాథగా ఇక్కడే చచ్చిపోతాను, ఈ సంగతి రామప్రభువుకు మరీమరీ చెప్పు" అంది.

సీతాదేవి చెప్పిందంతా విన్నాను. నాకు రావణాసురుడి మీద పట్టరానంత కోపం వచ్చింది. ఇక్కడ నుండి వెళ్ళే లోపుగా వాడికి గట్టిగా బుద్ధిచెప్పాలని అనుకున్నాను. బాగా ఆలోచించాను. రావణాసురుడికి బాగా కోపం తెప్పించే పని చెయ్యాలని అనుకున్నాను. నా దేహాన్ని పర్వతమంత పెద్దదిగా చేశాను. అశోకవనం అంటే అతడికి ప్రాణం. అందుకని ఆ వనంలో వృక్షాలన్నింటినీ విరగగొట్టి ధ్వసం చేశాను. నేనావనాన్ని నాశనం చేస్తూవుంటే పశుపక్ష్యాదులన్నీ భయంతో పరుగులుపెట్టాయి. రాక్షసులంతా భయంతో రావణాసురుడి దగ్గరకు పోయి చెప్పారు.

అప్పుడు రావణాసురుడు నా మీదకు కింకరుల్ని యుద్ధానికి పంపాడు. ఆ వనానికుండే

ఇనుప ద్వారాన్ని పీకి దాంతో వాళ్ళందర్నీ చంపేశాను. అక్కడ నుండి చైత్యప్రాసాదం పైకి ఎక్కి ఆ ప్రాసాదాన్ని ధ్వంసం చేశాను. అక్కడ ప్రాసాదాన్ని కాపలాకాస్తున్న నూరుగురుయోధులు నాపై యుద్ధానికి వచ్చారు. నేను ఆ చైత్యప్రాసాదంలో ఒక స్తంభాన్ని ఊడబెరికి దాంతో ఆ వందమందినీ చంపేశాను. అప్పుడు రావణాసురుడు ప్రహస్తునిపుత్రుడైన జంబుమాలిని నాపైకి యుద్ధానికి పంపాడు. నేను ఆ జంబుమాలిని కూడా చంపేశాను. వాడితో కూడా వచ్చిన సైన్యాన్ని కూడా మట్టుబెట్టాను. అప్పుడు రావణుడు మంత్రికుమారులు నలుగుర్ని నాపై యుద్ధానికి పంపాడు. వాళ్ళ వెనుక భయంకరమైన సైన్యం, రథాలు, గుర్రాలు, ఏనుగులు కూడా వచ్చాయి. నేను వారందరినీ యుద్ధంలో చంపేశాను. అంతట రావణుడు ఉగ్రుడైపోయాడు. నాపైకి సేనానాయకుల్ని యుద్ధానికి పంపాడు. ఆ సేనానాయకులు అయిదుగురు తమతో పాటు పెద్దపెట్టున సైన్యాన్నికూడా వెంటబెట్టుకొని వచ్చారు. నేను వాళ్ళతో కూడా యుద్ధం చేసి సమూలంగా నాశనం చేశాను. అప్పుడు రావణుడు తన కుమారుడైన అక్షకుమారుడిని నా పైకి పంపించాడు.

ఆ అక్షకుమారుడు వయస్సులో చిన్నవాడు, మండోదరి కుమారుడు. యుద్ధాల్లో బాగా ఆరితేరినవాడే. నాతోపాటే ఆకాశానికి ఎగిరి నన్ను కొట్టబోయాడు. నేనే అతడి కాళ్ళు రెండూ పట్టుకొని గిరగిరా త్రిప్పుతూ అంతఎత్తు నుండి నేలకేసి కొట్టాను. వాడి కాళ్ళూ, చేతులూ, విరిగి అక్కడిక్కడే చచ్చిపోయాడు. అక్షకుమారుడు చనిపోయాడని తెలియగానే రావణాసురుడు నీరుగారిపోయాడు. అయినా బింకంగానే మహాబలవంతుడు, యుద్ధోన్మత్తుడు అయిన తన కుమారుడు ఇంద్రజిత్తును నాపైకి యుద్ధానికి పంపాడు. నేను ఆ ఇంద్రజిత్తు సైన్యాన్నంతా నాశనం చేశాను. నన్ను జయించడం సాధ్యంకాదని అతడు తెలుసుకున్నాడు. అప్పుడు నన్ను బ్రహ్మాస్త్రంచేత బంధించాడు. రాక్షసులంతా నన్ను త్రాళ్ళతోకట్టి రావణాసురుడి దగ్గరకు ఈడ్చుకుంటూపోయారు. ఆ దురాత్ముడైన రావణుడు నన్ను చూసి ఉగ్రుడైపోయాడు. “నీవు లంకకు ఎందుకు వచ్చావు? రాక్షసులందరినీ ఎందుకు చంపేశావు?” అని అడిగాడు. రాక్షసరాజైన రావణునితో నేను ఇట్లా అన్నాను. “ఓ రాక్షసరాజా! నేను సీతాదేవిని చూడాలని ఈ

లంకాపట్టణానికి వచ్చాను. నేను వాయుదేవుని కుమారుణ్ణి, నా పేరు హనుమంతుడు. నేను వానరరాజైన సుగ్రీవుడికి మంత్రిని. సుగ్రీవుడు నీ క్షేమం విచారించాడు. ధర్మార్థకామాలకు సంబంధించిన ఈ హితకరమైన మాటలు సుగ్రీవుడు నీతో ఇట్లా చెప్పమన్నాడు.

'ఓ రాక్షసరాజా! ఋష్యమూకపర్వతం పైన నాకూ రణవిశారదుడైన రామునికి స్నేహం కుదిరింది. తన భార్యను రాక్షసుడొకడు అపహరించాడనీ, ఆ విషయంలో నన్ను సహాయం చెయ్యమనీ కోరాడు. అప్పుడు నేను కూడా వాలికీ నాకూ మధ్యన ఉన్న తగాదాను గూర్చి చెప్పి, ఆ విషయంలో నాకు సహాయం చెయ్యమని అడిగాను. ఈ విధంగా మేము ఒకరికొకరం సహాయం చేసుకునేట్లుగా ప్రతిజ్ఞలు చేసుకున్నాం. రాముడు ఇచ్చిన మాట ప్రకారం ఒకేఒక్క బాణంతో వాలిని చంపి నన్ను వానరరాజ్యానికి రాజును చేశాడు. అందువల్ల నేనుకూడా సీతాదేవిని వెతికిపెట్టి రాముడికి చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకోవాలి. అందుకోసం హనుమంతుణ్ణి నీ వద్దకు దూతగా పంపుతున్నాను. నీవు వెంటనే సీతాదేవిని రాముడికి ఇచ్చివేయాలి. నీవు అందుకు అంగీకరించకపోతే, వానరసైన్యం అంతా రాముడికి బాసటగా నిలచి నీ లంకాపట్టణాన్ని ముట్టడిస్తారు. నీ సైన్యాన్ని, రాక్షసులందర్నీ సమూలంగా నాశనం చేస్తారు. వానరవీరులు లోగడ దేవతలకు సహాయంచేసి అనేక యుద్ధాలలో జయం చేకూర్చిపెట్టారు. వానరుల శక్తిసామర్థ్యాల గూర్చి ముల్లోకాల వాళ్ళకూ తెలుసు.'

ఆ మాటలు విని రావణాసురుడు అగ్గిమీద గుగ్గిలంలాగా మండిపడ్డాడు. కళ్ళు చింతనిప్పుల అయ్యాయి. నన్ను నిలువునా కాల్చిపారేసేట్లు చూశాడు. ఇంత జరిగినా అతడు నా ప్రభావాన్ని తెలుసుకోలేకపోయాడు. నన్ను చంపమని ఆజ్ఞాపించాడు. అప్పుడతడి తమ్ముడు, మహాబుద్ధిమంతుడు అయిన విభీషణుడు దూతను చంపడం రాజధర్మానికి విరుద్ధం అని నచ్చచెప్పి, వేరే ఏదైనా శిక్షవేసి వదిలెయ్యమన్నాడు. లేదా వికృతాకారుణ్ణి చెయ్యవచ్చన్నాడు.

రావణుడు నా తోకకు నిప్పు అంటించమని ఆజ్ఞాపించాడు. అంతట రాక్షసులు నా తోకకు పాతగుడ్డలు చుట్టి దానిపై నూనెపోసి నిప్పు అంటించారు. నన్ను తాళ్ళతో బంధించి

ఉంచి నన్ను కట్టెలతో కొట్టారు. పర్వతాకారంతో ఉన్న నన్ను లంకాపట్టణం అంతా తిప్పారు, ఊళ్ళో ఆడ, మగ, పిల్లలు వృద్ధులూ అంతా వీథుల్లోకి వచ్చి నన్ను ఎగబడిచూశారు. నాకు బాగా కోపం వచ్చింది. వాళ్ళందరికీ తగిన గుణపాఠం చెప్పాలని అనుకున్నాను. వెంటనే నా శరీరాన్ని చిన్నది చేశాను, దాంతో వాళ్ళు నన్ను బంధించిన త్రాళ్ళనీ వదులయ్యాయి. నేను బంధవిముక్తుడనయ్యాను. అప్పుడు పట్టణ ద్వారాలకుండే ఇనుపస్తంభాలను పీకి వాటితో రాక్షసులందర్నీ కొట్టి చంపాను. వాయువేగంతో పట్టణంలోని భవంతులన్నింటి పైన ఎక్కి ప్రళయాగ్నిలాగా, ఆ భవనాలన్నింటికీ నిప్పు ముట్టించాను. పట్టణంలోని గృహాలన్నింటికీ నిప్పంటించాను. ఆ విధంగా లంకానగరం అంతా దగ్ధమైపోయింది.

పట్టణం అంతా కాలి బూడిద అయిపోయిన తర్వాత "అయ్యో! సీతాదేవి కూడా ఈ మంటల్లో చిక్కుకుపోయి మరణించిదేమో" నని భయపడిపోయాను. రామకార్యం అంతా ధ్వంసమైపోయిందే అని దిగులు చెందాను. అయితే అప్పుడు ఆకాశంలో తిరుగుతున్న చారణులు, "సీతాదేవి మాత్రం అగ్నినుండి తప్పించుకుని క్షేమంగా ఉండటం ఆశ్చర్యంగా ఉంది" అని మాట్లాడుకోవడం నేను విన్నాను. వాళ్ళ మాటలు విని నేను చాలా సంతోషపడ్డాను. అప్పుడు నాకు కొన్ని శుభశకునాలు కలిగాయి. నేను బయలుదేరి ఇక్కడకు వచ్చేముందు మళ్ళీ సీతాదేవిని స్వయంగా దర్శించుకున్నాను. ఆమె అనుజ్ఞ పొంది అక్కడనుండి బయలుదేరాను. తరువాత అరిష్టపర్వతంపైకి వెళ్ళి శరీరం పెద్దదిచేసి సముద్రాన్ని దాటాను. ఆ రామప్రభువు దయవలన సీతాదేవి ప్రభావంచేత మిమ్మల్నందరినీ మళ్ళీ చూడగలిగాను. మన ప్రభువైన సుగ్రీవుడి ఆజ్ఞలను శిరసావహించి సీతాదేవిని చూసి వచ్చాను. ఇకపై ఏం చెయ్యాలో అంగదుడు, పెద్దలు ఆలోచించాలి అని హనుమంతుడు అన్నాడు.

# 59వ సర్గ హనుమంతుడు లంకలో సీత దురవస్థలను వివరించడం

వాయుపుత్రుడైన హనుమంతుడు మళ్ళీ చెప్పడం మొదలుపెట్టాడు.

“సీతాదేవి పాతివ్రత్యమాహాత్మ్యం చేత, సుగ్రీవుని ప్రతిజ్ఞచేత రామకార్యం సఫలం అవుతుంది. నాకు ఆ తల్లి యెడల భక్తిభావం ఏర్పడ్డది. రావణాసురుడు ముల్లోకాలను కాల్చివేయగలిగినంతటి పరాక్రమవంతుడు, పైపెచ్చు అతడు మహాబలసంపన్నుడు. ఎందువల్లనంటే ఆ దురాత్ముడు సీతాదేవిని తాకినా కూడా అతడు నాశనం అయిపోలేదు. అందుకు అతడి తపోబలమే కారణం. అతడికి కోపంవస్తే ఎంతటి వారినైనా కాల్చిబూడిద చెయ్యగలడు.

“ఓ వానరులారా! జాంబవంతుడు, అంగదుడు మున్నగువారంతా ఒప్పుకుంటే, మనమే లంకాపట్టణానికి వెళ్ళి సీతాదేవిని తీసుకుని రామలక్ష్మణుల వద్దకు పోదాం. లంకాపట్టణంలోని వారి బలాబలాలను స్వయంగా చూశాను. ఆ రావణుని, అతడి రాక్షససేనను చంపటానికి నేనొక్కడినే చాలు. అంతేకాకుండా మీరంతా కూడా ఉంటారు. మీరందరూ మహాబలశాలురే! మహాపరాక్రమవంతులే! ఎవరికి ఎవరూ తీసిపోరు. మీ అందరికీ అస్త్రప్రయోగంలో కూడా నైపుణ్యం ఉంది. అటువంటి మీ అందరితో కలసి రావణునిపైకి యుద్ధానికి వెళ్తే విజయలక్ష్మి మనల్నే వరిస్తుంది. మనం అంతా కలసి వెళ్తే రావణుణ్ణి, అతడి పుత్రుల్ని, పరివారాన్ని కూడా సర్వనాశనం చెయ్యగలం. ఇంద్రజిత్తు బలాన్ని నేను చూశాను. అతడు బ్రహ్మాస్త్రం, ఇంద్రాస్త్రం, రౌద్రాస్త్రం, వాయవ్యాస్త్రం, వారుణాస్త్రం మున్నగు అస్త్రాలను ప్రయోగించగలడు. నేను వాటన్నింటినీ ఎదుర్కొని యుద్ధంలో అతణ్ణి చంపగలను. మీరందరూ సరే అని అంటే, నాతోకూడా వస్తే నేను రావణుణ్ణి కూడా బంధించగలను. నేను కురిపించిన రాళ్ళవానను దేవతలే తట్టుకోలేరు, ఇక ఈ రాక్షసుల మాట చెప్పాలా? మీ అనుజ్ఞ లేకపోవటం వల్ల నా పరాక్రమం అంతా చూపలేకపోయాను.

“ఓ వానరవీరులారా! మనమందరం ఒకరిని మించినవారు మరొకరం! సముద్రం చెలియలి కట్టను దాటివచ్చినా రావచ్చునేమో! మందరపర్వతం చలించినా చలిస్తుందేమో! కానీ జాంబవంతుణ్ణి ఎవరూ కదల్చలేరు. మహావీరుడు వాలిపుత్రుడైన అంగదుడు ఒక్కడే ఆ రాక్షసమూకలందర్నీ చంపగలడు. మహాత్ముడైన పవనుడున్నాడు. మహావేగవంతుడైన నీలుడున్నాడు, అతడి వేగానికి మందరపర్వతమే కదిలిపోతుంది. ఇక ద్వివిదుడున్నాడు. ద్వివిదుని పరాక్రమం ధాటికి దేవతలు, గంధర్వులు, ఉరగ, పక్షులలో ఎవరూ నిలువలేరు. ఇక ఈ మైంద, ద్వివిదులమాట చెప్పాలా? అశ్వినీదేవతల పుత్రులైన మైంద, ద్వివిదులను యుద్ధంలో ఎదిరించగల వాకొక్కడూలేడు. బ్రహ్మదేవుని వరప్రసాదం చేత, అమృతపానం చేయటంవల్లా వీరికి సాటి ఎవరూరారు. వీళ్ళద్దరికీ కోపంవస్తే రావణుని అశ్వదళాలను, గజదళాలను, సైన్యాన్ని, మొత్తం రాక్షసజాతినే నాశనం చేసేస్తారు. నేను లంకాపట్టణాన్నంతా కాల్చి బూడిద చేస్తాను. ఇప్పుడు అక్కడ నాపేరు వింటే ఎవరికీ నిద్రపట్టదు! ఆ పురవీథులన్నింటిలోను, రామలక్ష్మణులు, సుగ్రీవ మహారాజు వస్తారని రాక్షసులందర్నీ సర్వనాశనం చేస్తారనీ, నేను కేవలం ఆ రామప్రభువుకు దాసుణ్ణేనని, నేను వాయుపుత్రుణ్ణని, నాపేరు హనుమంతుడనీ అక్కడి వాళ్ళందరికీ చాటిచెప్పాను. ఇక వాళ్లు నాపేరు వింటే నీళ్ళుకూడా త్రాగరు!

“ఓ వానరవీరుల్లారా! సీతామహాసాధ్వి, దురాత్ముడైన రావణుడి అధీనంలో ఉండి నానాకష్టాలు పడుతోంది. అశోకవనంలో ఆ శింశుపావృక్షం క్రింద రోజులు లెక్కపెట్టుకుంటూ గడుపుతోంది. ఆమె దుఃఖంతో, మేఘాలు ఆవరించిన చంద్రునిలాగా, కళాకాంతులు లేకుండా పడివుంది. రావణాసురుడు ఎంత బలవంతుడైనా సీతాదేవి మనోబలం ముందు, చిత్తైపోతున్నాడు. ఆమె అతణ్ణి కొంచెం కూడా లెక్కచెయ్యడం లేదు. రాముడి పరాక్రమాన్ని వర్ణించి చెప్తోంది. రాత్రింబవళ్ళు రామప్రభువునే ధ్యానిస్తోంది. ఆమె స్థితి చాలా దయనీయంగా ఉంది. తలచుకుంటేనే జాలిపుడ్తోంది. ఆ రావణాసురుడు ఎంత నిర్బంధించినా, నహుషుడు నిర్బంధించినా, ఆ పురందరుణ్ణే ఎల్లవేళలా ధ్యానించిన శచీదేవిలాగా, ఆ వైదేహి రాముణ్ణే ధ్యానిస్తూ ఉంది. ఆమెను రావణుడు అపహరించిన రోజున ఏ చీర ధరించిందో, ఈనాటికీ అదే

చీరతో ఉంది. శరీరం, వస్త్రాలు కూడా దుమ్ము కొట్టుకుపోయాయి. మనోవ్యధ చెందుతూ ఉంది, దీనంగా రాముని కోసమే ఎదురుచూస్తూ ఉంది. ఎన్ని కష్టాలు పెట్టినా ఆ రావణాసురుణ్ణి తన పాతివ్రత్య ప్రభావంతో కాల్చిబూడిద చేయకుండా ఉంచిందీ అంటే అదంతా అతడి తపోబలమే. సీతాదేవిని నిర్బంధించడం వల్ల వాడి తపోబలం అంతా క్షీణించి పోయింది. ఆ మాట నాకు లంకిణి కూడా చెప్పింది. కాబట్టి రావణాసురుడికి రోజులు తీరాయి. వాడి కాలం దగ్గర పడింది. రాముడు వచ్చి రావణుణ్ణి చంపడం కేవలం నిమిత్తమాత్రమే! సీతాదేవి మాములుగానే సుకుమారి; సన్నటి శరీరం గలది. రాముని వియోగంవల్ల ఇప్పుడు ఇంకా చిక్కిపోయింది. మహాభాగ్యవంతురాలైన సీతాదేవి ఈ విధంగా లంకానగరంలో శోకంలో మునిగి ఉంది. అందువల్ల మనం ఇప్పుడు ఏం ప్రతీకారం చెయ్యాలో ఆలోచించండి.”

# 60వ సర్గ అంగదుడి సమధికోత్సాహం

హనుమంతుడు చెప్పిందంతా అంగదుడు విన్నాడు. "ఓ వానరయోధుల్లారా! మీరందరూ మహాపరాక్రమవంతులుగా ప్రసిద్ధికెక్కారు. హనుమంతుడు సీతాదేవిని చూసి వచ్చాడు, అని రామలక్ష్మణులకు పోయి చెప్తే వినేవాళ్ళు నవ్విపోతారు. ఇంతటి వీరాధివీరులై ఉండి సీతాదేవిని ఎందుకు మీతోపాటు తీసుకొనిరాలేదని అంటే మనం ఏమని సమాధానం చెప్తాం?

ఓ వానరయోధుల్లారా! ముల్లోకాల్లోని దేవతల్లోగానీ, దైత్యుల్లోగానీ ఎగిరిపోవడంలో మనతో సాటియైనవారు లేరు. పరాక్రమంలో కూడా మనల్ని ఎదిరించే వారెవరూ లేరు. రాక్షసయోధులందరినీ హనుమంతుడు చంపి వచ్చాడు. ఇప్పుడు మనం చేయాల్సింది కూడా ఏమీ లేదు. లంకాపట్టణానికి వెళ్ళడం, సీతాదేవిని వెంట తీసుకొని బయలుదేరడమే! ఎవరైనా ఒకడో అరో మనకు అడ్డంగా వస్తే వాణ్ణి చంపేసి మన దారిన మనం వచ్చేద్దాం. సీతాదేవిని వెంటబెట్టుకొని రామప్రభువు సన్నిధికి పోదాం. పోయి 'ప్రభూ! సీతాదేవిని వెతికి, చూసి రమ్మన్నావు. కానీ మేము సీతాదేవిని చూడటమే కాదు, వెంటతీసుకొనివచ్చాం! మేమంతా వానరరాజైన సుగ్రీవుడి సేవకులం' అని గర్వంగా చెప్దాం!" అన్నాడు.

అంగదుడు చెప్పిన మాటలు విన్న జాంబవంతుడు ఇట్లా అన్నాడు: "ఓ యువరాజా! నీవు చెప్పింది బాగానే ఉంది. నీ ఉత్సాహం కూడా మెచ్చుకోదగిందిగానే ఉంది. మనకు రామప్రభువు ఏం చెయ్యమని ఆజ్ఞాపించాడో, అంతవరకే చేసి ఆయన వద్దకు పోయి చెప్పాలి. కాని మన ఇష్టంవచ్చినట్లు కార్యాలు చేస్తే ప్రభువులు మెచ్చరు."

# 61వ సర్గ మధువనాన్ని ధ్వంసం చేయటం

జాంబవంతుడు చెప్పిన మాటలను అంగదుడు, హనుమంతుడు మున్నగు వానరశ్రేష్ఠులంతా అంగీకరించారు. తరువాత ఆ వానరయోధులందరూ మహేంద్రపర్వతాన్ని విడిచి సంతోషంగా ఇంటి ముఖం పట్టారు. మందరపర్వతం వంటివారు, మదించిన ఏనుగు వంటి శరీరంగలవారు, మహాబలశాలురు, మహాపరాక్రమవంతులైన ఆ వానరవీరులంతా ఆకాశాన్ని కప్పివేస్తూ మేఘమండలంలో ప్రయాణించారు. సమస్త ప్రాణకోటిచే పూజించబడుచున్నవాడూ, మహావేగవంతుడు, వాయుపుత్రుడైన హనుమంతుడు ముందు దారితీయగా, మిగిలిన వానరయోధులంతా అతణ్ణి అనుసరించి వెళ్ళారు. వాళ్ళంతా రామకార్యం సాధించుకు రావాలన్న పట్టుదలతో బయలుదేరారు. సాధించుకుని తిరిగి వస్తున్నారు. వాళ్ళ సంతోషానికి అవధుల్లేవు. సీతాదేవిని వెతకటానికి నలుగురూ నాలుగు దిక్కులకూ వెళ్ళారు. అయితే తక్కినవాళ్ళందరి కన్నా తామే సాధించగలిగామన్న సంతోషంతో వాళ్ళ కాళ్ళు నేలమీద నిలవడంలేదు. రాముడు చేసిన ఉపకారానికి సుగ్రీవుడు ప్రత్యుపకారం చేస్తున్నాడని చెప్పడానికి వాళ్ళంతా తొందరపడుతున్నారు. సీతాదేవిని చూసిన సంతోషవార్త చెప్పడానికి వాళ్ళంతా ఉబలాటపడుతున్నారు.

ఆ విధంగా వానరులంతా ఆకాశంలో ఎగిరిపోతూ ఉంటే దేవేంద్రుడి ఉద్యానవనం లాంటిది, భూమి మీద అనేక వృక్షజాతులతోను లతలతోను విలసిల్లే ఒక వనాన్ని చూశారు. అదే సుగ్రీవుడి మధువనం. ఎవరూ కన్నెత్తైనా చూడటానికి వీలుకాని ఆ వనం సుగ్రీవుడి మేనమామ దధిముఖుడి అధీనంలో ఉంది. అతడు మహాపరాక్రమవంతుడు. ఆ వనాన్ని చూడగానే మధుపింగళవర్ణంతో ఉన్న ఆ వానరులందరికీ ఆ వనంలోని మధువును తాగాలని బుద్ధిపుట్టింది. అనుమతి కోసం అంగదుణ్ణి అభ్యర్థించారు. అంగదుడు జాంబవంతుడు మున్నగు వృద్ధులతో చెప్పి వారిని ఒప్పించి, ఆ తర్వాత వానరులంతా మధువు త్రాగేందుకు అనుమతించాడు. అంగదుడు అనుమతించినందుకు వానరులంతా సంతోషంతో వనంలోకి మధువు తాగేందుకు

ఎగబడ్డారు.

ఆ వానరుల్లో కొందరు పాటలు పాడారు, కొందరు నృత్యం చేశారు, కొందరు ఒకళ్ళకొకళ్ళు దండాలు పెట్టుకున్నారు. కొందరు పెద్దపెట్టున నవ్వారు, కొందరు కేకవేశారు, కొందరు పరుగులు తీశారు. ఒక్కళ్ళనొకళ్ళు కలుసుకుని కిచికిచలాడారు, ఒక చెట్టు మీద నుండి మరో చెట్టుపైకి దూకారు, కొందరు చిటారుకొమ్మ పైనుండి దూకారు. ఒకడు పాటలు పాడితే వాడి పక్కవాడు పకపకా నవ్వాడు. పాడేవాడికి నవ్వేవాడిపై కోపం వచ్చింది. ఒకడు ఏడుస్తున్నాడు. ఒకడు నవ్వుతున్నాడు. ఇంకోడు ఆ నవ్వేవాడిని పడతోశాడు.

ఆ విధంగా వానరులంతా మితిమీరి మధుపానం చేశారు. మధువు తాగిన మత్తులో రకరకాల పిచ్చిచేష్టలు చేశారు. తాగని వాడుగానీ, తాగి మత్తెక్కనివాడుగానీ వాళ్ళల్లో ఒక్కడుకూడా లేడు. అయినా వాళ్ళకు తృప్తి కలుగలేదు. ఇంకా తాగుతూనే ఉన్నారు. ఆ మత్తులో చెట్ల ఆకులు, పూలు రాలగొట్టారు, కొమ్మలు విరగ్గొట్టారు. నందనవనంలాగా ఉండే ఆ వనం అంతా ధ్వంసమైపోయింది. ఇంతలో ఆ వనాన్ని కాపాడుతున్న దధిముఖుడు వచ్చి వాళ్ళను గట్టిగా మందలించాడు. వాళ్ళంతా అతడిపై ఎదురు తిరిగారు. తోటకు రక్షకుడైన దధిముఖుడు ఎట్లాగైనా ఆ తోటను ఈ కోతి మూకలనుండి కాపాడాలని శతవిధాలా ప్రయత్నించాడు. కొందర్ని తిట్టాడు, కొందర్ని చేతులతో కొట్టాడు, కొందరితో మంచిగా మాట్లాడాడు. కొందరితో పోట్లాడాడు. వాళ్ళుకూడా దధిముఖుణ్ణి కోరల్తో పీకారు, గోళ్ళతో రక్కారు. ఆ మధువును, తేనెను తాగినంత తాగారు. క్రింద పారబోసినంత పారబోశారు.

## 62వ సర్గ వానరులు దధిముఖుని పరాభవించడం

వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు "ఓ వానరులారా! మీ ఇష్టం వచ్చినంత మధువును తాగండి. మిమ్మల్ని తేనె తాగనీయకుండా ఎవరడ్డమొస్తారో చూస్తాను" అన్నాడు. ఆ మాటలు అంగదుడు కూడా అందుకొని "భళి భళి, హనుమంతుడు చెప్పినట్లే జరుగుతుంది. మీ ఇష్టం వచ్చినంత మధువు తాగండి. ఉత్తప్పుడే హనుమంతుడి మాటకు తిరుగులేదు, ఇప్పుడో రామకార్యం సాధించుకొనివచ్చాడు కాబట్టి హనుమంతుడి మాటను నేనూ అంగీకరిస్తున్నాను. మీరంతా తాగండి" అన్నాడు. అట్లా అంటూ ఉంటే వానరులంతా సంతోషంతో భళి భళీ అన్నారు. కోతిగంతులు వేశారు. మధువనం మీద పడ్డారు, అక్కడున్న కాపలావాళ్ళను తోసేశారు. హనుమంతుడు సీతాదేవిని చూసి రావటంవల్లనూ, అంగదుడు అనుమతించటంవల్లనూ, వానరులంతా నిర్భయంగా మధువనంలోకి ప్రవేశించారు. వనపాలకుల్ని తోసేసి, మధువు తాగినంత తాగారు. రుచికరమైన ఫలాలన్నీ తిన్నారు.

అప్పుడు వందలాది వనపాలకులు వచ్చి వానరుల్ని అడ్డుకున్నారు. వానరులంతా వనపాలకులపై దూకి, కొట్టి తరిమేశారు, కొంతమంది వానరులు తాగినంత తాగి మిగిలింది పారబోశారు. తాగినమత్తులో ఒకరిపై ఒకరు దూకారు. కొందరు చెట్టమీద కూర్చున్నారు, మత్తు ఎక్కువైనవాళ్ళు ఆకులు పరుచుకొని పడుకున్నారు. తాగినమత్తులో కొందరు సింహనాదాలు చేశారు, కొందరు తూలుతూ నడిచారు, కొందరు వికృత చేష్టలు చేశారు. కొందరు వారి వీరగాథలు చెప్తూవుంటే కొందరు వింటున్నారు. వనపాలకులంతా భయంతో పరుగులు తీశారు. వాళ్ళంతా భయపడిపోయి దధిముఖుడి వద్దకు వెళ్ళి ఇట్లా అన్నారు. "హనుమంతుడు వాళ్ళందరికీ స్వేచ్ఛనివ్వటంవల్లనే వారట్లా పేట్రేగిపోయి. మధువనంలో చొరబడ్డారు. నానారకాలైన దుష్టచేష్టలు చేస్తున్నారు, మమ్మల్నందరిని చావకొట్టారు" అన్నారు. అంతట ఆ దధిముఖుడు వాళ్ళందరినీ వెంటబెట్టుకొని మళ్ళీ మధువనానికి వెళ్ళాడు. వాళ్ళంతా తప్పతాగి మత్తులోవున్నారు. అందరం కలసి వాళ్ళను నాలుగు తగిలించి బైటకు తోసేద్దాం! మీరంతా

నాతో రండి అంటూ వనపాలకుల్నందరినీ వెంటబెట్టుకుని వెళ్ళాడు. ఆ వనపాలకులంతా రాళ్ళను, ఏపుగా పెరిగిన వృక్షాలను తీసుకొని అంగదుడు మున్నగువారు ఉన్న చోటుకు వెళ్ళారు. దధిముఖుడు కూడా ఒక వృక్షాన్ని పెకలించి వాళ్ళను ఎదిరించడానికి పోయాడు. మత్తులో ఉన్న వానరవీరులను చేతుల్లో ఉన్న వృక్షాల తలకొక్కటీ వడ్డించాడు.

వనపాలకులు, దధిముఖుడు తమపై దండెత్తిరావడం అంగదుడు చూశాడు. దధిముఖుణ్ణి పట్టుకొని ఎడాపెడా కొట్టాడు. అంగదుడు బాగా తాగిన మత్తులో ఉండటంచేత, తను కొట్టింది, తన తాతగారేనన్న జ్ఞానం లేకుండాపోయింది. దధిముఖుణ్ణి బలంగా కొట్టడంవల్ల కాళ్ళు, చేతులూ విరిగాయి. ఒళ్ళంతా రక్తంతో తడిసిపోయింది. బాగా వృద్ధుడవటాన మూర్ఛపోయాడు. కొదిసేపట్లోనే తెప్పరిల్లాడు. ఎట్లాగో వాళ్ళచేతుల్లో నుండి తప్పించుకొని బయటపడ్డాడు. కావలివాళ్ళతో "వీరులారా! ఈ అంగదుడు మున్నగు వారిని ఇక్కడే ఉండనిద్దాం, మనం పోయి వాళ్ళ ఆగడాలన్నీ సుగ్రీవుడికి చెప్దాం. ఆయనే వీళ్ళని తగిన విధంగా దండిస్తాడు, బాగా కోపంవస్తే చంపేస్తాడు కూడాను! ఎందువల్లనంటే, ఈ మధువనం ఆయన తాతముత్తాతల కాలంనుండీ అనుభవిస్తున్నది. ఎంతో అపురూపంగానూ, అభిమానంతోనూ ఈ వనాన్ని పోషిస్తూవచ్చాడు. దేవతలుకూడా ప్రవేశించలేని ఈ మధువనం అంటే సుగ్రీవుడికి చాలా ఇష్టం. అటువంటి వనాన్నే మత్తుమదంతో ధ్వంసంచేశారు. వీళ్ళు రాజాజ్ఞను ధిక్కరించడమే కాదు రాజు ఆగ్రహానికికూడా గురికాక తప్పదు. సుగ్రీవుడు ఈ దుర్మార్గుల్ని తప్పక చంపేస్తాడు. అప్పుడు నా కళ్ళు చల్లగా ఉంటాయి" అని దధిముఖుడు తన సేవకులతో కలసి ఆకాశమార్గాన సుగ్రీవుడు ఉన్నచోటుకు వెళ్ళాడు. అక్కడ సుగ్రీవుడితోపాటు రామలక్ష్మణులు కూడా ఉన్నారు. అప్పుడా దధిముఖుడు తన భృత్యులతోపాటు ముఖం వేలాడేసుకుని చేతులు జోడించి సుగ్రీవుడి పాదాలకు నమస్కరించాడు.

# 63వ సర్గ సుగ్రీవుడు రామునికి ధైర్యం చెప్పటం

మహాపరాక్రమవంతుడు, తనకు మేనమామ అయిన ఆ దధిముఖుడు తన కాళ్ళపై పడి నమస్కరించటం, ముఖం దీనంగా వేలాడేసుకుని ఉండటం చూసిన సుగ్రీవుడు అతణ్ణి లేవనెత్తి "ఓ వీరుడా! ఎందుకిట్లా భయపడుతున్నావు? నీకు వచ్చిన భయానికి కారణం ఏమిటి? నీకు అభయమిస్తున్నాను, జరిగింది జరిగినట్లు చెప్పు" అన్నాడు.

సుగ్రీవుడి మాటలతో దధిముఖుడికి ప్రాణంలేచి వచ్చినట్లయింది. "ఓ వానరరాజా! మీ తాతముత్తాతలకాలం నుండి మధువనాన్ని ఎంతో ప్రాణప్రదంగా కాపాడుకుంటూ వచ్చాను. నీ తండ్రి ఋక్షరజుని కాలం నుండి నేనావనాన్ని కళ్ళల్లో వత్తులువేసుకొని కాపలాకాస్తూ వచ్చాను. నీ అన్న వాలి హయాంలోనూ, నీవు రాజువైన తర్వాత కూడా ఏ విధమైన ఏమరిపాటు లేకుండా కంటికిరెప్పలాగా చూసుకుంటున్నాను. ఇంతకాలం దేవతలకైనా లోపలకు తొంగిచూసే అవకాశం ఇవ్వలేదు. మధువనం అంటే దేవేంద్రుడి నందనవనం కన్నా అందమైనదని ముల్లోకాలలోనూ ప్రసిద్ధి పొందింది. అటువంటిది, అంగదుడు, హనుమంతుడు మున్నగు వారంతా లక్షలాదివానరులతో కలసి మధువనంలోకి ప్రవేశించారు. చెట్లన్నీ ధ్వంసం చేశారు, మధువునంతా తాగేశారు. తాగినంత తాగి మిగతాదంతా నేలకేసి కొట్టారు. ఫలాలన్నీ తినేశారు. నేను, కావలివాళ్ళు అడ్డగిస్తే మమ్మల్ని నానాదుర్భాషలు ఆడటమే కాకుండా ఎముకలు విరిగేట్లు కొట్టారు, కొందర్ని తలక్రిందులుగా వేలాడదీసి వాళ్ళవాళ్ళ పశ్చిమ ద్వారాలను చూసేట్లుచేశారు. ఓ సుగ్రీవుడా! అంగదుడు మున్నగు వానరవీరులంతా మధువనాన్ని ధ్వంసంచేశారు. ప్రభువువైన నీవే సరైన నిర్ణయాన్ని తీసుకోవాలి. రక్షకుడిగా నేను ఏ పొరపాటూ చెయ్యలేదు" అని చెప్పాడు.

దధిముఖుడు సుగ్రీవునితో ఈ విధంగా విన్నవించుకుంటూ ఉంటే అక్కడే ఉండి వింటున్న రామలక్ష్మణులకు విషయం ఏమిటో బోధపడలేదు. లక్ష్మణుడు ఆ మాటే సుగ్రీవుణ్ణి అడిగాడు. "సుగ్రీవుడా! ఆ మధువనపాలకుడు ఇక్కడకు ఎందుకు వచ్చాడు? ఇంతసేపు అతడు

నీతో ఏం మాట్లాడుతున్నాడు? ఏదో దుఃఖంలో ఉన్నట్లున్నాడు? ఏం జరిగింది?'' అని అడిగాడు.

మధురంగా మాట్లాడటం తెలిసిన ఆ సుగ్రీవుడు లక్ష్మణునితో ఇట్లా అన్నాడు: "ఓ పూజ్యుడా! ఇతడు శుభవార్తనే తెచ్చాడు. రాముడికి నీకు కూడా ఎంతో ప్రీతికరమైన వార్త తెచ్చాడు. సీతాదేవిని వెదకడానికి దక్షిణదిక్కుగా పోయిన వానరవీరులు తిరిగి వచ్చారు. వాళ్ళంతా ఇక్కడకు రావడానికి ముందుగా మధువనానికి వెళ్ళారు. అక్కడ మధువునంతా త్రాగేశారు. ఆ తాగిన ఆనందంలో మధువనాన్నంత ధ్వంసం చేశారు. కావలి వాళ్ళను భయపెడుతున్నారు; తన్నితరిమేశారు. ఇది దధిముఖుడు నాతో చెప్పింది.

"ఓ లక్ష్మణా! అంగదుడు మున్నగు వానరులంతా దక్షిణదిక్కుగా పోయారు. వాళ్ళకు నేను ఇచ్చిన గడువు దాటిపోయినా ధైర్యంగా వచ్చారు. రావటమేకాదు, నాకు అత్యంత ప్రియమైన మధువనాన్ని ధ్వంసం చేశారు. దీనినిబట్టి ఈ వానరవీరులంతా వాళ్ళకు ఒప్పచెప్పిన కార్యాన్ని సాధించారని తెలుస్తోంది. వీరు సీతాదేవిని చూసి ఉంటారు. అందుకే వారు ఉత్సాహంగా మధువనంలో ప్రవేశించారు. నా ముందుకు వచ్చే సాహసం చేశారు. అంటే వాళ్ళు సీతాదేవిని చూశారనే మాట వాస్తవం.

"ఓ లక్ష్మణా! హనుమంతుడు కార్యసాధకులలో గొప్ప సమర్థుడు. బుద్ధిబలం, ఉత్సాహం ఉన్నవాడు, పరాక్రమం, ప్రతిభ ఉన్నవాడు. అంతేకాక అధిక విద్యాసంపన్నుడు. ఆ హనుమంతుడే తప్పక సీతాదేవిని చూసి ఉంటాడు. ఇతనికి తోడుగా జాంబవంతుడున్నాడు. ఇతడు వయోవృద్ధుడు, అనుభవజ్ఞుడు. ఏ పని ఎట్లా చెయ్యాలో, ఎప్పుడు చెయ్యాలో, ఎందుకు చెయ్యాలో అన్నీ వివరించి సలహాలివ్వడంలో జాంబవంతుణ్ణి మించినవాడు మరొకడు ఉండడు. అంగదుడు అమిత పరాక్రమవంతుడు. వానరసేన పైన గట్టిపట్టు ఉన్న యువరాజు. వీరిద్దరి సహకారంతో హనుమంతుడు ఎంతటి పనినైనా సాధించగల సమర్థుడు. ఓ రామలక్ష్మణులారా! హనుమంతుడు సీతాదేవిని చూసి వచ్చాడు. ఇందులో సందేహం లేదు. మీరిద్దరూ సంతోషంతో నాట్యం చెయ్యాల్సిన శుభదినం.

"ఓ మహాబాహూ! లక్ష్మణా! సీత జాడ తెలిసింది అన్నది సత్యం. ఎందుకంటే వానరులంతా నిర్భయంగా నా వనంలోని మధువునంతా తాగేస్తున్నారు. ఈ వనాన్ని బ్రహ్మ మా పూర్వీకులకు వరంగా ఇచ్చాడు. ఇప్పుడు ఆ వనంలో చేరి మధుపానం చేస్తున్న వాళ్ళంతా బుద్ధిమంతులు, మహాపరాక్రమవంతులు. వాళ్ళు సీతాదేవిని చూడనట్లయితే ఆ వనంలోకే కాదు, ఈ కిష్కింధకే వచ్చేవాళ్ళు కాదు."

అమృతం వంటి సుగ్రీవుని మాటలు రామలక్ష్మణుల్ని సంతోషంలో ముంచెత్తాయి. అంతట సుగ్రీవుడు, దధిముఖుణ్ణి చూసి "ఓ వీరుడా! వానరవీరులంతా వాళ్ళ కార్యం సఫలం చేసుకొని వచ్చివుంటారు. అందువల్లనే మధువనంలో చేరి మధువును సేవిస్తున్నారు. అందుకు నాకు సంతోషంగానే ఉంది. నేను వాళ్ళందర్నీ క్షమిస్తున్నాను. నేను, రామలక్ష్మణులు వాళ్ళకోసం ఎదురుచుస్తున్నామని చెప్పు. నీవు వెళ్ళి వాళ్ళను వెంటనే పంపించు. ఇక్కడున్నట్లుగా రావాలి సుమా!" అన్నాడు.

సుగ్రీవుడి మనస్సు సంతోషంతో దూదిపింజలాగా అయిపోయింది. రామలక్ష్మణుల వంక చూశాడు, వాళ్ళక్కూడా ఒళ్ళు గగుర్పొడిచింది. సీతాదేవి కనిపించిందన్న వార్త వాళ్ళను విశేషంగా సంతోషపెట్టింది.

# 64వ సర్గ హనుమంతుడు కిష్కింధకు బయలుదేరటం

దధిముఖుడు సుగ్రీవుడికి, రామలక్ష్మణులకు నమస్కరించి, తిరిగి మధువనానికి ఆకాశమార్గంలో వెళ్ళి, మద్యం మత్తు అప్పుడప్పుడే తగ్గుతూ ఉండటం వల్ల మెల్లమెల్లగా తూలుకుంటూ నడుస్తున్న వానరనాయకులందర్నీ చూశాడు. వీరుడైన దధిముఖుడు వాళ్ళ దగ్గరకు వెళ్ళి నమస్కరిస్తూ అంగదుడితో ఇట్లా అన్నాడు: "ఓ సౌమ్యుడా! వనరక్షకులు తెలిసీతెలియని వారు కావడం వల్ల, మీతో పరుషంగా ప్రవర్తించారు. అవన్నీ మనస్సులో పెట్టుకోకండి, వాళ్ళపై కోపగించవద్దు. నీవు వానరరాజ్యానికి యువరాజువు. ఈ వనాన్ని యథేచ్ఛగా అనుభవించే హక్కు నీకుంది. మేమంతా మూర్ఖులం, కేవలం కావలివాళ్ళం కావడంవల్ల మీతో ఎట్లా ప్రవర్తించాలో తెలియకచేసిన అపరాధాన్ని మన్నించు."

"ఓ దోషములులేనివాడా! మీరంతా ఇక్కడున్నట్లుగా మీ పినతండ్రియైన సుగ్రీవునితో చెప్పాను. మీరంతా మధువనంలో దిగినందుకు, మధువు తాగినందుకు ఆయన మిమ్మల్ని కోపగించుకోలేదు. పైపెచ్చు సంతోషించాడు. వానరరాజైన సుగ్రీవుడు మిమ్మల్నందరినీ వెంటనే అక్కడకు పంపమని నాతో మరీమరీ చెప్పాడు."

అంతట అంగదుడు దధిముఖుని మాటలు విని ఇట్లా అన్నాడు. "ఓ వానరశ్రేష్ఠులారా! మనం తిరిగి వచ్చిన వార్త రాముడికి తెలిసే ఉంటుంది. మనం ఇంకా ఇక్కడే ఉండటం ఉచితం కాదు. మీరంతా మీకు కావలసినంత మద్యాన్ని సేవించారు. మీ అలసట తీరింది. ఇంకా ఇక్కడ మనకు పనేముంది? కాబట్టి మనం అందరం వెంటనే సుగ్రీవుడి దగ్గరకు వెళ్ళడమే బాగుంటుంది. ఓ! వానరశ్రేష్ఠులారా నేను మీరు చెప్పినట్లే చేస్తాను. నేను యువరాజునే అయినా, స్వామికార్యం పూర్తి చేసుకుని వచ్చిన హనుమంతుని, మిగిలిన వానరుల ఇష్టప్రకారమే నడుచుకుంటాను. మిమ్మల్ని కాదని నా ఇష్టం వచ్చినట్లు మాట్లాడను. అట్లా చెయ్యడం అవివేకమే అవుతుంది."

అంగదుడు వినయంతో అన్న మాటలకు వానరవీరులంతా సంతోషించారు. అంగదుడి వినయాన్ని చూసి హనుమంతుడు మెచ్చుకుని "ఓ అంగదుడా! నీవు ఎప్పటికీ మా యువరాజువే కాదు; మా రాజువి కూడాను. ఒక ప్రజారంజకుడైన ప్రభువు మాట్లాడే తీరులోనే మాట్లాడావు. ఇంకోళ్ళు, ఇంకోళ్ళైతే ఐశ్వర్యమదంతో మమ్మల్ని ఆజ్ఞాపించే వారే కాని, మా మనోభావాన్ని పట్టించుకునేవారు కాదు. అట్లా మాట్లాడటం నీకే చెల్లింది. నీ భవిష్యత్తు ఎంత ఉజ్వలంగా ఉంటుందో నీ ఈ నడవడికయే చెప్తోంది. నీకు అంతా శుభమే జరుగుతుంది. ఓ యువరాజా! మేమంతా నీ వెనుకే ఉంటాం. మేమంతా ప్రయాణానికి సిద్ధంగా ఉన్నాం. నువ్వు గీచిన గీటు దాటం. నీ ఆజ్ఞలకు బద్ధులమై ఉంటాం. ఇది వాస్తవం" అన్నాడు.

హనుమంతుడు అట్లా అనడంతో, అంగదుడు సంతోషించినవాడై "అయితే, బయలుదేరండి, పోదాం!" అన్నాడు. అంతట వాళ్ళంతా ఆకాశమార్గాన పోతూ ఉంటే ఎగిరే పర్వతాల్లాగా కనిపించారు. వాళ్ళట్లా మేఘమండలం దాటి ఆకాశంలో దూసుకుపోతూ ఉంటే, అత్యధికమైన ధ్వనులు పుట్టాయి.

దధిముఖుని పంపి, సుగ్రీవుడు రాముడి ప్రక్కనే కూర్చుని ఇలా అన్నాడు: "ఓ రామా! విచారించకు. నీకు అన్నీ శుభాలే జరుగుతాయి. సీతాదేవి కనిపించింది కనుకనే, మనమిచ్చిన గడువు దాటిపోయినా వాళ్లు ఇక్కడికి వచ్చారు. సీతాదేవి కనిపించకపోయిన ఎడల వాళ్ళా సాహసం చేసి ఉండేవారు కాదు. ఒకవేళ తిరిగి వచ్చినా దిగులుపడి వచ్చేవాళ్ళేకాని, మధువనానికి పోయి ధ్వంసం చేసేంత సాహసం చెయ్యరు. కౌసల్యాపుత్రుడవైన ఓ రామా! ఊరడిల్లు. సీతాదేవిని హనుమంతుడే చూసి ఉంటాడు. ఇటువంటి మహత్కార్యాలు అతడు తప్ప మరొకరు చెయ్యలేరు. సూర్యుడితో సమానమైన తేజస్సు గలవాడు, కార్యసిద్ధి, బుద్ధికుశలత, పరాక్రమము, ఎడతెగని ప్రయత్నము హనుమంతుడిలోనే ఉన్నాయి. జాంబవంతుడు మంత్రిగాను, అంగదుడు సేనాపతిగాను, హనుమంతుడు కార్యనిర్వాహకుడుగాను పనిచేస్తే ఎంతటి అసంభవాలైనా సంభవాలు చెయ్యగలరు. కాబట్టి, ఓ ప్రభూ! ఈ విషయాన్ని గూర్చి

విచారించకండి."

సుగ్రీవుడు రాముడితో ఇట్లా మాట్లాడుతూ ఉండగా, వానరసేన అంతా ప్రస్రవణపర్వత ప్రాంతానికి వచ్చారు. వాళ్ళంతా గంభీరంగా సింహనాదాలు చేశారు. గర్జిస్తూ, రామకార్యం పూర్తి అయిందని దూరాన్నించే తెలియజేశారు. వాళ్ళ సింహనాదాలు విన్న సుగ్రీవుడు కూడా పొంగిపోయాడు. తోకను బాగా పొడిగించి ఆకాశానికందేట్లుగా నిలబెట్టాడు.

అప్పుడు అంగదుడు వానరవీరులందరినీ వెంటబెట్టుకొని రామప్రభువును దర్శించేందుకు వచ్చాడు. హనుమంతుడు రాముని చూసి శిరస్సు వంచి సమస్కరిస్తూ "ప్రభూ! సీతాదేవి పాతివ్రత్య నియమాలను కాపాడుకుంటూ, ఆరోగ్యంగా ఉంది" అన్నాడు. హనుమంతుని నోటివెంట ఆ మాట వినగానే రామలక్ష్మణులు ఉప్పొంగిపోయారు. హనుమంతుని ప్రశంసాపూర్వకంగా చూశారు.

# 65వ సర్గ హనుమంతుడు సీత వృత్తాంతాన్ని రామునికి తెలుపటం

యువరాజు అంగదుడు, జాంబవంతుడు, హనుమంతుడు మున్నగు వానరవీరులంతా రామలక్ష్మణులుంటున్న ప్రస్రవణపర్వతానికి వెళ్ళారు. రామలక్ష్మణులకు, వానరరాజైన సుగ్రీవునికి నమస్కరించారు. ఇప్పుడు సీత రావణుని అంతఃపురంలో నిర్బంధించబడి ఉందనీ, రాక్షసస్త్రీలంతా ఆమెకు కాపలా కాస్తున్నారని, ఆ క్రూరరాక్షసాంగనలంతా సీతను భయపెడ్తున్నారని చెప్పారు. ఆమెకు రామునిపై గల అనురాగాన్ని, రావణుడు పెట్టిన రెండుమాసాల గడువును గూర్చి రామునికి చెప్పారు.

అంతట రాముడు, "ఓ వానరవీరులారా! సీత ఎక్కడ ఉన్నది? నన్నుగూర్చి ఏమని అంటోంది? సీతకు సంబంధించిన విషయాలన్నీ నాకు వివరంగా చెప్పండి" అన్నాడు. అప్పుడు వానరులంతా హనుమంతునితో "ఆ వివరాలన్నీ రామప్రభువుకు నువ్వే చెప్పు" అన్నారు. అంతట హనుమంతుడు సీతాదేవి ఉంటున్న దక్షిణదిక్కుగా తిరిగి మనస్సులో సీతాదేవికి నమస్కరించి, ఇట్లా చెప్పడం ప్రారంభించాడు:

"ప్రభూ! సీతాదేవిని దర్శించాలనే కోరికతో నూరుయోజనాల సముద్రాన్ని దాటి లంకకు చేరాను. ఆ సముద్రతీరానికి దక్షిణంగా దుర్మార్గుడైన రావణాసురుడు నివసించే లంకానగరం ఉంది. అక్కడ మహాపతివ్రత, మహాసౌందర్యవతి అయిన సీతాదేవి రావణాసురుడి అధీనంలో ఉండటం చూశాను. ఆమె ప్రాణాలన్నీ నీ మీదే పెట్టుకొని బ్రతుకుతోంది. రావణుడు ఆమెను అశోకవనంలో బంధించి ఉంచాడు. ఆ సీతాదేవికి కావలిగా అనేక వందలమంది రాక్షసస్త్రీలను నియోగించాడు. వాళ్ళంతా వికారమైన ఆకారాలు కలిగిన మహాక్రూరాత్ములు. సీతాదేవిని క్షణక్షణం బెదిరిస్తూ, భయపెడ్తూ ఉండటం నేను చూశాను. సుఖాలు మాత్రమే అనుభవించవలసిన ఆ మహాపతివ్రత వాళ్ళమధ్య అష్టకష్టాలు పడుతోంది. వాళ్ళు ఆమెను కాలు మెదపనీయడం లేదు. ఆమె తలవెంట్రుకలన్నీ ఒకేజడగా అయిపోయి అట్టకట్టుకుపోయాయి.

ఆమె నిన్నే ధ్యానిస్తూ, నీ మీదే మనస్సు నిలుపుకొని జీవిస్తోంది. ఆమె కటికనేల పైనే పడుకుంటోంది. శరీరం అంతా దుమ్ముకొట్టుకొని, కృశించిపోయింది. రావణుడు తరచూ వచ్చి భయపెట్టి పోతూ ఉంటాడు. వాడి బాధపడలేక ఆమె మరణించడానికే సిద్ధపడింది. నేను లంకానగరమంతా ఎంతో కష్టపడి వెతికివెతికి, విసిగిపోయి చివరగా ఆమెను చూడగలిగాను.

"నేను ఇక్ష్వాకుల వంశాన్ని గూర్చి కీర్తించాను. ఆమె నా మాటలన్నీ విన్నది. ఆ విధంగా ఆమెకు నాపైన నమ్మకం కలిగేట్లు చేశాను. తరువాత ఆమె నన్ను నమ్మింది. నెమ్మదిగా ఆమెతో మాట్లాడాను. నా వృత్తాంతాన్ని, నేను వచ్చిన విషయాలన్నీ చెప్పాను. నీవు సుగ్రీవుడితో స్నేహం చెయ్యడం విని చాలా సంతోషపడింది. ప్రభూ! ఆమె పాతివ్రత్యాన్ని గూర్చి, ఆమెకు నీపై గల అచంచల విశ్వాసాన్ని గూర్చి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. ఓ పురుషశ్రేష్ఠుడా! నీ మీద భక్తితో తపస్సు చేస్తూ ఉన్న ఆ జనకపుత్రికయైన సీతాదేవిని కళ్లారా చూశాను. ఓ రామప్రభూ! నీవు గొప్పబుద్ధిశాలివి. చిత్రకూటపర్వతంపై మీరు ఉంటున్నప్పుడు జరిగిన కాకి వృత్తాంతాన్ని అంతా చెప్పింది. అంతట నన్ను చూసి 'ఓ హనుమంతుడా! నీవు ఇక్కడ చూసిందంతా ఆ పురుషశ్రేష్ఠుడైన రామునికి చెప్పు. నేను ఇంతవరకు అతిజాగ్రత్తగా కాపాడుకుంటున్న ఈ చూడామణి ఉంగరాన్ని ఇస్తూ నన్ను చూసినట్లు గుర్తుగా నా ప్రభువుకు సమర్పించు. నేను ఇంతకాలం ఈ చూడామణిని చూసుకుంటూ రాముడే నా ప్రక్కనే ఉన్నాడన్న భావనలో జీవిస్తున్నాను. ఇప్పుడా చూడామణిని కూడా నీకు ఇస్తున్నాను. ఇప్పుడు నాకు ఆ కాస్త సంతోషం కూడా దూరమైపోతోంది. కాబట్టి నా ప్రభువును త్వరగా వచ్చి నన్ను తీసుకొనిపొమ్మని చెప్పు: హనుమంతుడా! ఒకానొక రోజున నా నుదుట తిలకం చెరిగిపోయింది. అప్పుడు నా ప్రభువు మణిశిలను చుక్కగా అరగదీసి నా బుగ్గ పైభాగాన పెట్టి నన్ను ఆటపట్టించాడు. ఆ విషయాన్ని నీవు నా ప్రభువుకు జ్ఞాపకం చెయ్యి. రావణుడు నాకు పెట్టిన గడువు ఇంకా ఒక మాసమే ఉంది. అంటే ఇంకా మాసమే జీవించి ఉంటాను. ఆ తర్వాత ఇక నేను జీవించి ఉండనని చెప్పు" అన్నది. ఓ రామప్రభూ! ఆమె ధర్మం తప్పలేదు. దేహం అంతా కృశించిపోయి ఉంది. రావణుని అంతఃపురంలో నిరోధించబడినది, ఆడలేడివలె వికసించిన నేత్రాలు గలది అయిన ఆ సీతాదేవి

నాతో అన్నదంతా జరిగింది జరిగినట్లు చెప్పాను. కనుక, ఓ రాఘవా! లంకను ఆక్రమించటానికి సముద్రంపై సేతువును కట్టాలి.”

ఇలా పలికి హనుమంతుడు, రామలక్ష్మణులకు ఊరట కలిగించి, తనకు ఆనవాలుగా ఇచ్చిన చూడామణిని రాముని చేతిలో ఉంచి, రామలక్ష్మణులకు నమస్కరించాడు.

## 66వ సర్గ చూడామణిని చూచి రాముడు సీతకై విలపించటం

హనుమంతుడు చెప్పిన సీతాదేవి వృత్తాంతం అంతా రామలక్ష్మణులు విన్నారు. రాముడు ఆ చూడామణిని హృదయానికి హత్తుకొని విలపించాడు. ఆ చూడామణిని చూడగానే, పాతజ్ఞాపకా లన్నీ మనసులో మెదలి దుఃఖం పొర్లుకువచ్చింది. తనను తాను సంబాళించుకుంటూ సుగ్రీవుడితో ఇలా అన్నాడు: "ఓ మిత్రుడా! దూడమీద ఉండే ప్రేమచేత ఆవు పాలు చేపుతుంది. అట్లాగే నేను ఈ చూడామణిని చూస్తూ ఉంటే నా హృదయం ద్రవించిపోతోంది. ఈ మణిని నా మామగారైన జనకమహారాజు సీతాదేవికి ఇచ్చాడు. వివాహ సమయంలో ఆమె ఈ మణిని తలలో పెట్టుకుంది.

"ఓ సుగ్రీవుడా! జనకమహారాజు చేసిన ఒకానొక యజ్ఞానికి మెచ్చి దేవేంద్రుడు ఈ చూడామణిని ఆయనకు కానుకగా ఇచ్చాడు. ఈ మణి సముద్రగర్భంలో ఉద్భవించింది. దీని ప్రాశస్త్యాన్ని చూసిన వాళ్ళంతా మెచ్చుకున్నారు. ఓ సుగ్రీవుడా! ఈ చూడామణిని చూడగానే నా మామగారు జనకమహారాజును, నా తండ్రి దశరథమహారాజును ప్రత్యక్షంగా చూస్తున్నట్లుంది. ఈ మణిని నా ప్రియురాలు ఎల్లప్పుడూ ధరిస్తూ ఉండేది. ఈ మణిని చూస్తూ ఉంటే సీతయే నా ప్రక్కన ఉన్నట్లుగా ఉంది.

"ఓ హనుమంతుడా! శోకాగ్ని చేత దహించబడుతున్న నన్ను సీతకు సంబంధించిన నీ మాటలనే నీరుతో తడుపు. వైదేహి విషయం నాకు మళ్ళీమళ్ళీ చెప్పు.

"లక్ష్మణా! సీతాదేవి లేకుండా, నీళ్ళల్లో పుట్టిన మణిని మాత్రం చూస్తున్నాం. ఈ మణిని చూస్తున్న కొద్దీ నా హృదయం దేవేసినట్లుంటోంది. ఓ సౌమ్యుడా! సీత ఒక మాసం జీవించగలిగితే ఆమె చిరకాలం జీవించి ఉండేట్లు చేస్తాను. ఆ నల్లనికన్నులు గల సీత లేకుండా నేను క్షణంకూడా జీవించలేను. లక్ష్మణా! నన్నుకూడా సీతాదేవి ఉన్న ప్రదేశానికే తీసుకొని వెళ్ళు. ఆమె జీవించియే ఉందని తెలిసిన తర్వాత ఇక నేనిక్కడ ఒంటరిగా ఉండలేను. నా సీత మిక్కిలి

భయస్వభావురాలు. ఆ భయంకరమైన రాక్షసుల మధ్య, ఆ క్రూరాత్ముల మధ్య నా సీత ఎట్లా ఉంటోందో కదా! మేఘములచేత కప్పబడిన చంద్రుడు ఎట్లా ప్రకాశించడో రాక్షసులచేత ఆవరించబడినదైన ఆమె ముఖం ప్రకాశించదు.

"ఓ హనుమంతుడా! సీత ఇంకా ఏమన్నదో చెప్పు. రోగి ఔషధంచేత బ్రతికినట్లు నేను కూడా ఆమె మాటలు వింటూ బ్రతుకుతాను. మధురమైన స్వభావం కలది, మధురంగా మాట్లాడేదీ, అందమైన నడుము గలదీ నా ఎడబాటు చేత దుఃఖించుచున్నదీ అయిన సీత ఇంకా ఏమన్నదో చెప్పు."

# 67వ సర్గ సీత సందేశాన్ని రామునికి చెప్పటం

మహాత్ముడైన రాముని మాటలు విన్న హనుమంతుడు సీతాదేవి చెప్పమన్న కాకి వృత్తాంతాన్ని ఇట్లా వివరించి చెప్పాడు. ఓ పురుషశ్రేష్ఠా! నీమా, సీతాదేవీ చిత్రకూటపర్వతంపై ఉండే రోజుల్లో జరిగిన సంఘటనను నీకు తన జ్ఞాపకంగా చెప్పమంది. ఓ రామప్రభూ! చిత్రకూటపర్వతంపైన ఒకానొక రోజున నీవు ఆమె తొడపై తలపెట్టుకొని నిద్రపోతున్నావు. అప్పుడో కాకి వచ్చి సీతాదేవి స్తనాలపైన పదేపదే గీరటం వలన ఆమె స్తనాల నుండి రక్తం కారింది. ఆ కాకి మాటిమాటికీ వచ్చి ఎక్కువగా చీరిందట. అప్పుడు నీ ఒళ్ళంతా రక్తంతో తడిసి నీకు మెలకువ వచ్చిందట.

శత్రుసంహారకుడవైన ఓ రామా! అప్పుడు సీతాదేవి నిన్ను నిద్రలేపిందట. నీవప్పుడు ఆమె స్తనముల నుండి రక్తం కారటం చూచి కోపంతో సర్పంవలె బుసలుకొడ్తూ "ఓ సీతా! నీ స్తనములపై గీరిన దెవరు? వాడెవడో అయిదుశిరస్సుల సర్పంతో ఆడుకుంటున్నాడు. వాడెవడో చెప్పు?" అంటూ చుట్టూ కలయచూశావట. అప్పుడు ఒక కాకి రక్తంతో తడిసిన కాళ్ళతో సీతాదేవికి ఎదురుగా కనపడిందట. అప్పుడు నీవు కోపంతో కళ్ళు పెద్దవిచేసి ఆ దగ్గర్లోనే ఉన్న ఒక గడ్డిపరకను తీసి మంత్రించి ఆ కాకిపై విసరగా అప్పుడా గడ్డిపరక ప్రళయాగ్నికాగా ఆ కాకిని తరుముకొని వెళ్ళిందట. అంతట కాకి తన తండ్రి అయిన మహేంద్రుణ్ణి, దేవతల్ని, మహర్షుల్ని ప్రాథేయపడిందట. కానీ వాళ్ళెవరూ కూడా కాపాడలేకపోయారు. అప్పుడా కాకి ముల్లోకాలూ ప్రాణరక్షణకై పరుగులు పెట్టింది. కానీ కాపాడేవాళ్ళెవరూ లేకపోవడంతో తిరిగితిరిగి నీ దగ్గరకే వచ్చి ప్రాణభిక్ష కోరిందట.

ఓ రామా! అస్త్రం వ్యర్థం కారాదు. కాబట్టి ఆ కాకి కుడికన్ను మాత్రం కొట్టి ప్రాణాన్ని కాపాడావట. దాంతో ఆ కాకి నీ తండ్రి అయిన దశరథమహారాజుకు నమస్కారం చేసి తన నివాసానికి వెళ్ళిపోయిందట.

‘ఓ హనుమంతుడా! రామప్రభువు అస్త్రవేత్తలలో శ్రేష్ఠుడు. మహాబలవంతుడు, ఉత్తమశీలము కలవాడు. అటువంటి పరాక్రమవంతుడైన రాముడు నా విషయంలో ఏమైనా ప్రేమవుంటే, ఈ రాక్షసాధముణ్ణి చంపి ఉండేవాడే. కనీసం లక్ష్మణుణ్ణయినా పంపి నన్ను కాపాడమనేవాడే. ఆ ఇద్దరూ ఒకే చోట ఉండి కూడా నన్ను రక్షించలేదంటే, అది నా దౌర్భాగ్యమే తప్ప, వారి దోషం కాదు. నేనే ఏదో మహాపాపం చేసి ఉంటాను. సందేహం లేదు’ అంటూ కన్నీరుపెట్టుకొని విలపించింది.

“నేను ఆ పూజ్యురాలితో, ‘ఓ దేవీ! నిన్ను తలచుకొని దుఃఖీస్తూ రాముడు ఏ పనీ చేయలేకుండా ఉన్నాడు. రాముని దుఃఖాన్ని చూస్తున్న లక్ష్మణుడు కూడా దుఃఖపడుతున్నాడు. నేను సత్యం పైన ఒట్టుపెట్టుకొని చెప్తున్నాను. ఇప్పుడు నిన్ను చూశాను కాబట్టి ఇక దుఃఖీంచవద్దు. ఇది దుఃఖీంచాల్సిన సమయం కాదు. త్వరలోనే నీ దుఃఖాలన్నీ తీరిపోయే సమయం దగ్గరపడింది. పెద్దపులుల వంటి ఆ అన్నదమ్ములిద్దరూ నిన్ను చూడాలని తహతహలాడుతున్నారు. త్వరలోనే వచ్చి లంకానగరాన్ని ధ్వంసం చేస్తారు. ఓ దేవీ! రామప్రభువు రావణాసురుణ్ణి సపరివారంగా సంహరిస్తాడు. నిన్ను పట్టణానికి తీసుకువస్తాడు’ అని చెప్పాను.

అంతట ‘ఓ పూజ్యురాలా! రామప్రభువు గుర్తించే, రామప్రభువును సంతోషపెట్టే వస్తువేదైనా ఇమ్మ’ ని అడిగాను. అప్పుడామె తలలో నుండి ఈ చూడామణి తీసి నా కిచ్చింది. ప్రభూ! నేను ఈ చూడామణిని తీసుకొని శిరస్సు వంచి ఆమె పాదాలకు నమస్కరించాను. తిరిగి ప్రయాణమై వచ్చాను.

మంచివర్ణము గల ఆ జానకీదేవి మరల నాతో ఇట్లా అంది. ‘ఓ హనుమంతుడా! సింహముల వంటి రామలక్ష్మణులిద్దర్నీ, మంత్రి సమేతుడైన సుగ్రీవుని క్షేమం విచారించానని చెప్పు. నన్నీ దుఃఖ సముద్రంలో నుండి బయటపడేట్లు నీవే రామప్రభువుకు చెప్పు’ అని నాతో అంది.

“ఓ రాజసింహమా! ఆ పూజ్యురాలు సీతాదేవి నీకు చెప్పమని చెప్పినదంతా చెప్పాను.”

# 68వ సర్గ హనుమంతుడు సీతాదేవి సందేహాలను తీర్చిన వైనం

ఓ!నరశ్రేష్ఠుడా! నేను ప్రయాణానికి సిద్ధం అవుతూ ఉండగా, నీయందు గల ప్రేమ చేతను, మంచిహృదయం కలిగి ఉండటం వల్లనూ మళ్ళీ సీతాదేవి ఇట్లా అంది:

"ఓ వానరశ్రేష్ఠుడా! నీవు త్వరగా వెళ్ళి దశరథకుమారుడైన రామునితో యుద్ధంలో రావణుని, అతడి పరివారాన్ని చంపి నన్ను త్వరగా తీసుకొని వెళ్ళమని మరీమరీ చెప్పు.

"ఓ శత్రుసంహారకుడా! నీకు ఇష్టమైతే ఒక రోజు పాటు ఇక్కడే ఏదైనా రహస్యప్రదేశంలో ఉండిపో. విశ్రాంతి తీసుకొని వెళ్ళు. నేను దురదృష్టవంతురాలను కావటం వలన నీవు కంటికెదురుగా ఉండటం వలన ఒక ముహూర్తకాలమైనా శోకంలేకుండా ఉండగలుగుతాను. ఎందువల్లనంటే నీవు తిరిగి వచ్చే సమయానికి నేను జీవించి ఉంటానో లేదో? సందేహమే. ఒక దుఃఖం తర్వాత మరో దుఃఖం నన్ను వెంటాడుతోంది. దుఃఖాలననుభవించటానికే పుట్టిన దీనురాలను. అటువంటి నాకు నీవు కనిపించకుండాపోవటం వలన దుఃఖం అధికమే అవుతుంది.

"వీరుడవైన వానరశ్రేష్ఠుడా! నీకు సహాయంగా వానరులు, భల్లూకాలు పెద్దపెట్టున వస్తాయన్నావు. నాకో సందేహం కలుగుతోంది. వానర భల్లూక సైన్యాలు గాని, రామలక్ష్మణులు గాని ఈ మహాసముద్రాన్ని దాటి ఎట్లా వస్తారు? ముల్లోకాల్లో గరుత్మంతుడు, వాయుదేవుడు, నీవు మాత్రమే ఈ సముద్రాన్ని దాటగల సమర్థులు. అటువంటప్పుడు రావణుణ్ణి జయించడం అనేది ఎట్లా సాధ్యమౌతుందా? అని సందేహం కలుగుతోంది. ఓ హనుమంతుడా! ఈ కార్యాన్ని నీవు ఒక్కడివే సాధించగలవు. నీవు గొప్ప కీర్తిమంతుడవు కూడా కావచ్చును. కానీ రాముడే సమస్తసైన్యాన్ని వెంటబెట్టుకొని వచ్చి, రావణుణ్ణి చంపి విజయం సాధించి నన్ను నగరానికి తీసుకువెళ్ళినట్లయితేనే ప్రతిష్ఠాత్మకంగా ఉంటుంది. లేకపోతే రావణుడు, వీరుడైన రాముని మోసగించి నన్ను అపహరించి తెచ్చినట్లుగానే, రాముడు కూడా రావణుడికి భయపడి, ఆ

విధంగా నన్ను తీసుకొనివెళ్ళడం శోభస్కరంగా ఉండదు. శత్రుసంహారకుడైన రాముడే వచ్చి, తన బాణాలతో లంకానగరాన్ని ముంచి ఎత్తి, నన్ను తీసుకొనివెళ్ళడమే రాముడి కీర్తికి తగినట్లుగా ఉంటుంది. కాబట్టి మహాపరాక్రమశాలి అయిన రాముడు తన కీర్తిప్రతిష్ఠలకు తగిన రీతిలో 'పరాక్రమాన్ని చూపేట్లుగా ఆయన్ను ప్రేరేపించు' అన్నది.

"ఆమె మాటలలోని గొప్పఅర్థాన్ని ఉత్తమపౌరుషాన్ని నేను గ్రహించాను. వినయంగా ఆమెతో ఇట్లా అన్నాను. 'ఓ సీతాదేవీ! వానర భల్లూకాల అధిపతీ, వానరశ్రేష్ఠుడూ, మహాబలశాలి అయిన సుగ్రీవుడు నిన్ను రక్షించి రాముడికిచ్చిన ప్రతిజ్ఞ నెరవేర్చాలన్న గట్టి పట్టుదలతో ఉన్నాడు. సుగ్రీవుడి ఏలుబడిలో ఉండే మహావీరుల్లో తాము వెళ్ళదలచిన ఏ ప్రదేశానికైనా వెళ్ళగలవారు అనేకమంది ఉన్నారు. వాళ్ళంతా ఆకాశంలో ఎగరగలరు; నేలపై తిరగ్గలరు; సముద్రాల్లో ఈదుకొని పోగలరు. అపరిమితమైన తేజస్సుగల ఆ వీరులంతా ఎట్లాంటి పెద్దపెద్ద పనులు చెయ్యాలన్నా చెయ్యగలరు. వెనకడుగు వేసేవాళ్ళు వాళ్ళలో ఒక్కడూ లేదు. అటువంటి వానరుల్లో కొంతమంది నాకంటే గొప్పవారు. ఇంకొంతమంది నాతో సమానమైనవారు. అంతేగాని, నాకంటే తీసిపోయేవాడు ఒక్కడూ లేడు. నేను ఈ సముద్రం దాటి వచ్చానంటే, ఇక వాళ్ళ సంగతి వేరుగా చెప్పాలా? కనుక, ఓ సీతాదేవీ! అటువంటి సందేహాలు పెట్టుకోకు. వాళ్ళంతా ఒక్క గంతువేసి ఈ సముద్రాన్ని దాటగలరు. ఇక రామలక్ష్మణుల మాట అంటావా? వాళ్ళిద్దర్నీ నా వీపుపై కూర్చోబెట్టుకొని ఇక్కడకు తీసుకొని వస్తాను. అమ్మా! సీతాదేవీ! శత్రువులందరినీ సంహరించేందుకు ధనుస్సు చేతబట్టుకొని రాముడు, లక్ష్మణుడు త్వరలో లంకాపట్టణానికి రాబోతున్నారు. నీవు త్వరలోనే చూడగలవు. పర్వతంవంటి దేహంగలవారు, మేఘంవంటి వానరశ్రేష్ఠులు చేసే ధ్వనుల్ని మలయాద్రిచరియలపై త్వరలో వినగలవు. ఓ సీతాదేవీ! వనవాసం పూర్తిచేసుకొని శత్రుసంహారకుడైన రాముడు నిన్ను తీసుకొని అయోధ్యలో రాజ్యాభిషిక్తుడవడం నువ్వు చూస్తావు.' ఇలా ఇష్టములు, మంగళప్రదములూ అయిన మాటలతో ఆమెను సాంత్వనపరచి ఆమెకు శాంతి కలిగించాను.

# యుద్ధకాండము



## 1వ సర్గ రాముడు హనుమంతుణ్ణి కౌగలించుకోవడం

హనుమంతుడు చెప్పినదంతా విని రాముడు చాలా సంతోషించి ఇలా అన్నాడు: "భూమిపైన ఎవరూ చేయలేని కార్యాన్ని హనుమంతుడు చేసి చూపాడు. ఇతరుల ఊహలకు కూడా అందని కార్యాలు ఈ హనుమంతుడు చేశాడు. గరుత్మంతుడు, వాయువు, ఈ హనుమంతుడు మాత్రమే ఈ సముద్రాన్ని దాటగలరని నేను అనుకొంటున్నాను. మరొకరెవరూ ఇంతటి గొప్ప సాహసకార్యం చెయ్యగలరని నేను అనుకోవటం లేదు. రావణాసురుడు పాలించే లంకా పట్టణంలో కాలుపెట్టేందుకు దేవ, దానవ, గంధర్వ, యక్ష, ఉరగ జాతుల వారెవరికీ సాధ్యం కాదు. అటువంటి లంకకు పోయి ఈ హనుమంతు డొక్కడే క్షేమంగా తిరిగి రాగలిగాడు. శత్రు దుర్భేద్యమై, రాక్షసులచే ఎల్లప్పుడూ రక్షించబడే లంకలోకి వీర్యబలసంపన్నుడైన హనుమంతుడు తప్ప మరెవరు ప్రవేశించగలరు? హనుమంతుడు పరాక్రమంతోపాటు, బలాన్ని కూడా ప్రదర్శించి సుగ్రీవుడి కీర్తిని ఇనుమడింప చేశాడు. సేవకులు స్వామి భక్తితో ఎట్లా మెలగాలో లోకానికి చాటిచెప్పాడు. ప్రభువు అతి కష్టమైన పనిని చేయటానికి తన సేవకుణ్ణి నియమిస్తే, ఆ పనిని ఆసక్తితో చేసేవాడిని పురుషులలో శ్రేష్ఠుడని అంటారు. ఆ విధంగా హనుమంతుడు పురుషులలో శ్రేష్ఠుడు. బుద్ధిమంతుడు, సమర్థుడు అయి ఉండి కూడా, తనకు చెప్పినంతవరకే కార్యాన్ని చేసుకొచ్చి ప్రభువును సంతోషపెట్టే వాణ్ణి మధ్యముడు అంటారు. సేవకుడు బుద్ధిమంతుడు, సమర్థుడూ అయినా కూడా 'స్వామి కార్యాన్ని' నిర్లిప్తతతో చేసే వాణ్ణి అధముడు అని అంటారు. హనుమంతుడు ఆజ్ఞాపించిన కార్యాన్ని సమర్థవంతంగా చేయడమే కాకుండా, తన గొప్పతనాన్ని చాటిచెప్పాడు. సుగ్రీవుణ్ణి సంతోషపెట్టాడు. హనుమంతుడు సీతను

చూసిరావటం వలన మా రఘువంశ పరువు ప్రతిష్ఠల్ని కాపాడాడు. నాకు ప్రియాతి ప్రియమైన నా ప్రియురాలి సందేశాన్ని వినిపించాడు. నేను తగినట్లుగా అతడిని ఈ పరిస్థితిలో సత్కరించలేకపోతున్నాను. నేను అన్నివిధాలా దీనుడనై ఉన్నానే! అందుకు నేను మరీమరీ దుఃఖీస్తున్నాను. అటువంటి మహాత్ముడైన హనుమంతుణ్ణి నా హృదయపూర్వకంగా కౌగలించుకొంటున్నాను." రాముడు కొంచెంసేపు ఏదో దీర్ఘంగా ఆలోచించి తిరిగి, సుగ్రీవుడు వింటూ ఉండగా ఇలా అన్నాడు:

"సీతాన్వేషణ విషయంలో మనం అనుకున్నది సాధించాం. కానీ సముద్రాన్ని తలచుకుంటే, మనసు కలవరం చెందుతోంది. ఈ వానరులందరినీ సముద్రం దాటించి లంకకు ఎట్లా తీసుకుపోతాం?" ఇలా అంటూ కలవరపాటుతో ఆలోచించసాగాడు.

# 2వ సర్గ సుగ్రీవుడు రామునికి ధైర్యం చెప్పటం

దశరథ నందనుడైన రాముడు ఆ విధంగా దిగులు చెందుతూ ఉండగా, శ్రీమంతుడైన సుగ్రీవుడు ఇలా అన్నాడు.

సుగ్రీవుడు : "ఓ రామప్రభూ! నువ్వు వీరుడవు. సామాన్య మానవుడి మల్లే అట్లా దిగులు పడవచ్చునా? కృతఘ్నుడు స్నేహాన్ని వదలిపెట్టినట్లు దిగుల్ని వదిలెయ్యి. ఓ రామా! మనకు సీత క్షేమంగా ఉన్నట్లు తెలిసింది. శత్రువు ఎక్కడున్నాడో తెలిసింది. ఇంక నువ్వు ఎందుకు దిగులు పడుతున్నావో బోధపడటం లేదు. నువ్వు బుద్ధిమంతుడవు. శాస్త్రం తెలిసినవాడవు. ఆలోచించి చక్కటి నిర్ణయాలు తీసుకునే నేర్పుగలవాడవు. కాబట్టి ఉత్సాహాన్ని చెడగొట్టి నీరు కార్చే ఇటువంటి ఆలోచనల్ని విడిచిపెట్టు. తిమి, తిమింగలాలకు ఆలవాలమైన సముద్రాన్ని దాటివేళ్దాం. శత్రువును నాశనం చేద్దాం. ఉత్సాహంతో ఎంతటి కష్టమైన పనులనైనా చెయ్యవచ్చు. ఉత్సాహం లేనివాడికి కష్టాలూ, దుఃఖాలే మిగులుతాయి.

నీవు బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవు. శాస్త్రవిషయాలన్నీ తెలిసినవాడవు. నాబోటి వాళ్ళను ప్రక్కనుంచుకొని శత్రువుని జయించాలి. యుద్ధంలో ధనుస్సు చేతపుచ్చుకొని నిలబడితే నిన్ను ఎదిరించగలవాడు ముల్లోకాలలోనూ లేదు. వానరుల వల్ల నీకు అన్నీ ఉపకారాలే జరుగుతాయి. నీవు అతిత్వరలో సముద్రాన్ని దాటి సీతను కలుసుకోబోతున్నావు. ఓ రామా! దిగులుపడటం మాని, శత్రువుపై క్రోధం చూపు. ఎటువంటి ప్రయత్నం చెయ్యకుండా ఉండే క్షత్రియులు మందభాగ్యులు. శూరులకు కోపం వస్తే లోకాలన్నీ వణుకుతాయి.

ఓ రామా! నదులకు ప్రభువైన సముద్రాన్ని ఎట్లా దాటడమా అన్నదే గదా? మన ముందున్న సమస్య. దాన్ని మనలో ఉన్న పెద్దలందర్నీ సమావేశపరచి, వాళ్ళతో చర్చించి ఒక నిర్ణయానికి వద్దాం. మనం సముద్రం దాటామంటే, విజయలక్ష్మి నిన్నే వరిస్తుంది. ఇది సత్యం. ఈ వానరులంతా కామరూపులు. వాళ్ళకిష్టమైన రూపాన్ని ధరించగలరు. యుద్ధం చెయ్యటంలో

నేర్పరులు. రాళ్ళు, చెట్లు, కొమ్మలే వాళ్ళకు ఆయుధాలు. గోళ్ళతో రక్కుతూ, కోరల్తో పీకుతూ శత్రువును యమలోకానికి పంపుతారు.

ఓ శత్రుసంహారకుడా! ఏదో విధంగా మనం సముద్రాన్ని దాటి శత్రువును నాశనం చెయ్యబోతున్నామని నా అంతరాత్మ చెబుతోంది. ఇక ఇన్ని మాటలెందుకు? విజయం నిన్ను వరిస్తోంది? నాకు వచ్చే శకునాలన్నీ అట్లాగే ఉన్నాయి. మనస్సు చాలా ఉత్సాహంగా ఉంది.”

## 3వ సర్గ రాముడు లంకను గూర్చి విచారించటం

సుగ్రీవుడు పలికిన అర్థవంతమైన మాటలు విన్న రాముడు హనుమంతుణ్ణి పిలిచి ఇట్లా అన్నాడు.

రాముడు : ఓ హనుమంతుడా! తపోబలం చేతగాని, సముద్రాన్ని ఎండిపోయేట్లుచేసిగాని, సేతువును కట్టిగాని లంకలో ప్రవేశించే సామర్థ్యం నాకు ఉంది. నువ్వు లంకాపట్టణం అంతా ప్రత్యక్షంగా చూసివచ్చావు. అక్కడ ఎన్ని దుర్గాలున్నాయి. ఏపాటి సైన్యం ఉంటుంది? అక్కడ కావలి ఎట్లా కాస్తూ ఉంటారు? కోటగోడల నిర్మాణం ఎట్లా ఉంటుంది? రాక్షసుల ఇళ్ళు, వాళ్ళ జీవిత విధానాలు గూర్చి నువ్వు చూసింది చూసినట్లు చెప్పు.

అంతట హనుమంతుడు ఇలా చెప్పడం ప్రారంభించారు.

హనుమంతుడు : "ఓ ప్రభూ! బయట వాళ్ళెవరూ లోపలకు ప్రవేశించ కుండా ఎంతో రహస్యంగాను, చొరబడటానికి అలవికాకుండాను ఎలా కాపలా కాస్తూ ఉంటారో అన్నీ వివరంగా చెప్తాను. రాక్షసుల ప్రభుభక్తి, రావణుని తేజస్సుచేత, ఆ లంకా పట్టణం ఎంత సమృద్ధమయిందో, సముద్రం ఎంత భయంకరమైనదో నీకు వివరంగా చెప్తాను. సైన్యంలో ఉన్న విభాగాల గూర్చి, ఏనుగులు, గుర్రాలు, రథాలు, వాహనాల గూర్చి చెప్తాను, విను.

ఓ ప్రభూ! లంకా పట్టణంలో ఉండే ప్రజలంతా సుఖ సంతోషాలతో ఉంటున్నారు. వాళ్ళకు ఏనుగులు, గుర్రాలు, రథాలు, వాహనాలు సమృద్ధిగా ఉన్నాయి. కోట్లాది రాక్షసులు అక్కడ నివసిస్తున్నారు. లంకా నగరం చుట్టూ పెద్ద ప్రహరీ గోడ (ప్రాకారం) ఉంది. ఆ ప్రాకారం మొత్తానికి నాలుగు దిక్కుల్లోనూ నాలుగు పెద్దపెద్ద ద్వారాలున్నాయి. వాటికి పెద్ద తలుపులు అమర్చారు. ఆ తలుపులకు లోపలి ప్రక్క పెద్దపెద్ద గడియలున్నాయి. ఆ ద్వారాల వద్ద భద్రతా గృహాలు కట్టారు. ఆ గృహాల్లో పెద్దపెద్ద యంత్రాలున్నాయి. ఆ యంత్రాల నుండి రాళ్ళను,

బాణాలను శత్రువులపై ప్రయోగిస్తూ ఉంటారు. ఇవికాక భయంకరమైన శతఘ్నులు వందలు, వేల సంఖ్యలో ఉన్నాయి. అవన్నీ ఇనుముతో చేశారు. వాటన్నింటినీ ద్వారాలకు దగ్గరగా అమర్చి ఉంచారు. వాటిని ఏ క్షణంలోనైన ఉపయోగించేందుకు రాక్షసులు సిద్ధంగా ఉంటారు. ఆ నగరం చాలాపెద్దది. ప్రాకారాల్ని బంగారంతో తాపడం చేశారు. ఆ ప్రాకారాల్ని దాటి ఎవరూ వెళ్ళలేరు. అక్కడక్కడా ప్రాకారాల్లో మణుల, పగడాల, ముత్యాల, వైడూర్యాలతో పొదిగారు. ఆ ప్రాకారానికి బయట విశాలమైనవి, అగాధమైనవి కందకాలుంటాయి. వాటిని చల్లటి నీళ్ళతో నింపి ఉంచుతారు. ఆ నీళ్ళల్లో లెక్కలేనన్ని మొసళ్ళను పెంచుతున్నారు. ఆ కందకాలపైన దర్వాజాల కెదురుగా వంతెనలు కట్టారు. వాటి మీద శతఘ్నుల్లాంటి యంత్రాల్ని అమర్చి ఉంచారు. శత్రుసైన్యాలు ముట్టడించినప్పుడు బాణాలు, రాళ్ళ వర్షం కురిపించి వంతెనలను రక్షిస్తూ ఉంటారు. వాటిల్లో ఒక వంతెన చాలా దృఢంగా ఉంటుంది. బంగారు స్తంభాలపైన నిలిచి ఉంటుంది.

రామా! రావణుడు సైన్యాన్ని అదుపులో పెట్టుకోవడంలో ఏమరుపాటు లేకుండా ఉంటాడు. యుద్ధం చెయ్యాల్సి వస్తే తనే స్వయంగా ముందుంటాడు. పట్టణం అంతా ఎత్తైన పర్వతంపై నిర్మించడం వల్ల ఎటుప్రక్క నుండీ ప్రవేశించటానికి అనువుగా ఉండదు. దేవతలు కూడా లంకలోనికి ప్రవేశించలేరు. నగరం చుట్టూ నది ప్రవహించటం వల్ల అది నదీదుర్గం. పర్వతంపై ఉండటం వల్ల అది పర్వత దుర్గం. చుట్టూ అరణ్యం ఉండటం చేత అది వనదుర్గం. కృత్రిమంగా కట్టిన ప్రాకారాలవల్ల కృత్రిమదుర్గం ఈ నాలుగు దుర్గాలచేత లంకానగరం రక్షించబడుతూ ఉంటుంది.

ఓ రామా! ఆ లంకానగరానికి సముద్రం చాలా దూరంలో దక్షిణ తీరాన ఉంది. అక్కడ నౌకామార్గం లేదు. ఏవైపు నుండీ ఎవరూ ప్రవేశించే వీలులేదు. అమరావతి వంటి ఆ లంక పర్వతంపైన నిర్మితమైంది. రావణుని సైన్యం వందలు, వేలు గుర్రాలు, ఏనుగులతో ఉండి అజేయంగా నిలుస్తుంది. రావణుడు అనేక రకాలైన పరిఘల్ని, శతఘ్నుల్ని, యంత్రాల్ని సిద్ధం

చేసి ఉంచాడు. తూర్పు ద్వారం వద్ద పదివేల మంది రాక్షస సైనికులు ఆయుధాలు ధరించి యుద్ధానికి సిద్ధంగా ఉంటారు. దక్షిణ ద్వారాన్ని లక్షమంది సైనికులు కాపలా కాస్తున్నారు. రావణుడు చతురంగ బలాలను అక్కడ మోహరించి ఉంచాడు. అక్కడ నియోగించబడ్డ రాక్షసయోధులంతా చాలా శ్రేష్ఠమైనవారు. పశ్చిమ ద్వారాల్ని పదిలక్షల మంది సైనికులు కాపలా కాస్తున్నారు. వాళ్ళంతా ఖడ్గ విద్యలోను, అస్త్ర విద్యలోనూ నిపుణులు. ఉత్తర ద్వారం వద్ద కోటిమంది సైనికుల్ని మోహరించాడు. వాళ్ళందరూ గుర్రాలు, రథాలు, వాహనాలు కలిగి ఉంటారు. వాళ్ళంతా ఉత్తమ కులాలకు చెందినవాళ్ళు. నగర మధ్యలో ఉన్న సైనికులు వందల వేల సంఖ్యలో ఉంటారు. వాళ్ళతో కూడా ఎదిరించ శక్యం కాని వారు, అఖండ పరాక్రమవంతులు అయిన రాక్షస సైనికులు కోటిమంది పైగా ఉంటారు.

ప్రభూ! నేను ఆ వంతెనల్ని కూల్చివేశాను. లంకానగరాన్ని కాల్చివేశాను. కందకాలన్నీ పూడ్చివేశాను. ప్రాకారాల్ని పడగొట్టాను. సైన్యంలో కొంతమందిని చంపేశాను. మహా పరాక్రమవంతుల్లో కొందరిని చంపాను. మనం ఏదో విధంగా సముద్రాన్ని దాటగలం. మన వానర వీరులంతా లంకా పట్టణాన్ని నాశనం చేస్తారు. వానరసేన అంతా వెళ్ళినా వెళ్ళకపోయినా కూడా ఫరవాలేదు. అంగదుడు, ద్వివిదుడు, మైందుడు, జాంబవంతుడు, పనసుడు, అనలుడు, సేనానియైన నీలుడు ఆకాశమార్గాన పోయి పర్వతాలతోను, అడవులతోను, ప్రాకారాలతోను, అగడ్తలతోను ఉన్న ఆ లంకా నగరాన్ని పెళ్ళగించి పారేస్తారు. జైత్రయాత్రకు ముహూర్తం పెట్టు. అంగదాదుల్ని ప్రయాణానికి అనుమతి నివ్వు.

# 4వ సర్గ యుద్ధ సన్నాహాలు

రాముడు హనుమంతుడు చెప్పిందంతా విన్నాడు. తరువాత తేజోవంతుడు, సత్యపరాక్రమ సంపన్నుడు అయిన రాముడు ఇట్లా అన్నాడు.

రాముడు : "ఓ హనుమంతుడా! భయంకరుడైన ఆ రావణుణ్ణి, అతడి పట్టణాన్ని అల్లకల్లోలం చేస్తాను. నేను నిజం చెప్తున్నాను. ఓ సుగ్రీవుడా! ఇప్పుడే ప్రయాణానికి అన్ని ఏర్పాట్లు చేయించు. ఇప్పుడు ముహూర్తం చాలా శుభంగా ఉంది. ఈ ముహూర్తంలో యుద్ధానికి ప్రయాణమైతే మనకు తప్పక విజయం లభిస్తుంది. సీతాదేవిని అపహరించిన ఆ రావణుని ఎక్కడున్నా వెతికి చంపుతాను. మనం యుద్ధానికి బయలుదేరిన విషయం సీతాదేవి తెలుసుకుంటుంది. విషం తాగి చావబోతున్న సమయంలో చేతికి అమృతం దొరికినట్లుగా నేను వస్తూన్నానన్న విషయం విన్న సీతాదేవి, మరల జీవిస్తుంది.

సుగ్రీవుడా! ఈ రోజు ఉత్తర ఫల్గునీ నక్షతం. నా జన్మ నక్షత్రం పునర్వసు. నా కది సాధన తార అవుతుంది. రేపు హస్తా నక్షత్రం. అది నాకు నైధన తార అవుతుంది. కాబట్టి ఈ రోజే సైన్యం బయలుదేరేట్లు చూడు. ఇప్పుడు నాకు అన్నీ శుభ శకునాలే కనిపిస్తున్నాయి. నేను రావణుని సంహరిస్తాను. సీతాదేవిని తీసుకొని వస్తాను. విజయం నాదేనన్నట్లుగా నా కుడి కన్ను అదురుతోంది.

ధర్మాత్ముడైన రాముడు ఇట్లా చెబుతూ ఉండగా లక్ష్మణుడు, సుగ్రీవుడు రాముణ్ణి అభినందించారు. రాముడు సుగ్రీవుడితో మళ్లీ ఇట్లా అన్నాడు.

రాముడు : "ఓ సుగ్రీవుడా! నీలుడి నాయకత్వంలో ఒక లక్షమంది వానర సేనల్ని ఈ క్షణానే బయలుదేరమని చెప్పు. ఓ నీలుడా! నీవు ఎంచుకునే దారిలో చక్కటి ఆహారం, చల్లటి నీరూ దొరికేట్లు చూసుకొని వెంటనే బయలుదేరు. దుర్మార్గులైన రాక్షసులు మనం యుద్ధానికి

బయలుదేరుతున్నామని పసిగట్టి కందమూలాల్లోను, ఫలాల్లోనూ, విషం కలిపినా కూడా కలపవచ్చు. కాబట్టి నీవు ఏమరిపాటు లేకుండా వీళ్ళందరికీ రక్షకుడుగా ఉండు. పల్లంగా ఉండే ప్రదేశాల్లోను, నీళ్ళు నిలిచి ఉన్న ప్రదేశాల్లోను, దారి కష్టంగా ఉండే ప్రదేశాల్లోను, రాక్షసులు పొంచి ఉండి మీపైన దాడి చేయవచ్చు. మీరు ఎంతో అప్రమత్తులై ప్రయాణం సాగించాలి. కాబట్టి కొంతమంది వానరవీరులు ఆకాశమార్గంలో ప్రయాణం చేస్తూ, నేలపైన ఎక్కడైనా శత్రుసేనలు పొంచి ఉన్నాయా? అని కనిపెట్టి సైన్యాన్ని ముందుకు నడిపించాలి.

ఓ సుగ్రీవుడా! మనం మహాభయంకరమైన యుద్ధానికి సిద్ధమై వెళ్తున్నాం. మహాబలశాలురూ పరాక్రమవంతుల్నే వెంట తీసుకొని వెళ్దాం. బలహీనులైనవాళ్ళను ఇక్కడే వదిలెయ్యి. ఆ సైన్యం ఇక్కడివాళ్ళకు అవసరం అవుతుంది. పర్వతంలాంటి గజుడూ, మహాబలవంతుడైన గవయుణ్ణే సేనకు ముందుండి నడపమను. వాళ్ళు సైన్యానికి, ఆవుల మందకు ముందుగా గర్వంతో నడిచే ఆబోతులాంటివాళ్ళు. ఆకాశంలో ప్రయాణం చేసేవారిలో శ్రేష్ఠుడైన ఋషభుణ్ణి సైన్యానికి కుడిపక్కన ఉంటూ రక్షించమను. మదపుటేనుగు వంటి పరాక్రమంగల గంధమాదనుణ్ణి సైన్యానికి ఎడమ ప్రక్కన ఉంటూ కాపాడమని చెప్పు. దేవేంద్రుడు ఐరావతంపై వెళ్ళినట్లుగా నేను హనుమంతుని వీపుపై కూర్చున్ని. సేనను మధ్యనుండీ పర్యవేక్షిస్తూ ఉంటాను. కుబేరుడు 'సార్వభౌమ' అనే దిగ్గజంపై వెళ్తున్నట్లుగా, యముడి వంటి లక్ష్మణుడు అంగదుడిపై కూర్చుని వస్తాడు. భల్లూకరాజైన జాంబవంతుడు, సుషేణుడు, వేగదర్శి అనే ముగ్గురూ సేనలకు మధ్యనుంటూ కాపాడుతారు.

రాముడు చెప్పినట్లుగానే సుగ్రీవుడు వానర సైన్యాన్నంతటినీ బయలుదేరి ప్రయాణం అయ్యేట్లు ఆజ్ఞాపించాడు. వెంటనే పర్వతాలపైనా, గుహల్లోనూ, చెట్లపైనా బసచేసిన వానరసేన అంతా యుద్ధానికి వెళ్ళేందుకు ఉత్సాహంగా వచ్చి సైన్యంలో చేరిపోయారు. రామలక్ష్మణుల్ని సుగ్రీవుడు వచ్చి పూజించగానే సేనలన్నీ దక్షిణ దిక్కుగా ప్రయాణమయ్యాయి. రామలక్ష్మణులకు ముందు, వెనుకా, ప్రక్కలా ఏనుగుల్లాంటి కోట్లాది వానరయోధులు ప్రయాణమై వెళ్ళాడు.

సుగ్రీవుడి ఏలుబడిలో ఉన్న ఆ సైన్యం అంతా ఉత్సాహంతో, సంతోషంగా, గంతులు వేస్తూ, కమ్మని తేనెలు తాగుతూ, ఫలాలను, కందమూలాలను తింటూ దక్షిణ దిక్కుగా కదలిపోయారు. వాళ్ళల్లో ఒకళ్ళనొకళ్ళు పైకి ఎత్తి పట్టుకుంటే మరొకడు వచ్చి వాణ్ణి క్రిందకు పడదోశాడు. రావణుణ్ణి చంపేస్తామనీ, రాక్షసులందర్నీ నాశనం చేస్తామనీ వానరులంతా బీభత్సంగా అరుచుకుంటూ సింహనాదాలు చేస్తూ ముందుకు పోవడం రామలక్ష్మణులు చూశారు.

నీలుడు, ఋషభుడు, కుముదుడు ముందుండి వానరసేననంతా నడిపించారు. మహాబలవంతులు, పరాక్రమశాలులు అయిన వానర వీరులంతా మండలాకారంగా రామలక్ష్మణ సుగ్రీవుల్ని కాపాడుతూ నడిచారు. శతబలి అనే మహాపరాక్రమవంతుడు ఒక్కడే పదికోట్లమంది వానరుల్ని కాపాడుతూ నడిపిస్తున్నాడు. అట్లాగే కేసరి వంద కోట్లమంది ఉన్న వానర సైన్యానికి నాయకత్వం వహించాడు. పనసుడు, గజుడూ, అర్కుడూ అనే ముగ్గురూ ఆ మొత్తం సైన్యాన్ని మూడు ప్రక్కల నుండి కాపాడుతూ నడిపించారు. పరమ పరాక్రమవంతుడు, గాలిలో ఎగిరిపోయే వారిలో శ్రేష్ఠుడు, వానర సేనానాయకుడు అయిన నీలుడు ఆకాశమార్గం నుండి పర్యవేక్షిస్తూ ఆ సైన్యాన్ని నడిపించాడు. వలీముఖుడు, ప్రజంఘుడు, జంభుడు, రభసుడు నాలుగువైపుల నుండి వానరవీరులందర్నీ కలుపుకుపోతూ, వాళ్ళను ప్రోత్సహిస్తూ నడిపించారు. నేల ఈనిందా? అన్నట్లు ఆ వానర సేన అంతా ఉరకలూ గంతులూ వేస్తూ, త్రుళ్ళుతూ ప్రేలుతూ ముందుకు సాగిపోయింది. నగరాల ప్రక్కకు పోకుండా సముద్రం కన్నా భయంకరంగా ఘోషిస్తూ ఆ సేన ముందుకు సాగిపోయింది. ఉత్తమజాతి గుర్రాల కన్నా వేగంగా ఆ వానరులంతా నడిచారు. హనుమంతుని, అంగదుని వీపులపై ఉన్న రామలక్ష్మణులు రెండు పెద్ద గ్రహాలతో కూడి ఉన్న సూర్యచంద్రుల్లా ఉన్నారు.

ఆ వానర సేనలన్నీ గంతులేసుకుంటూ నేల ఈనినట్లు నడుస్తూ ఉంటే దుమ్మంతా రేగి ఆకాశం వరకూ పోయి సూర్యచంద్రుల్ని కప్పివేసింది. అలా దుమ్ము కప్పుకుపోవటం వల్ల పర్వతాలు, వనాలు కనిపించకుండాపోయాయి, లోకాలన్నీ చీకట్లు కమ్మాయి. దక్షిణ దిక్కు

అంతా దుమ్ముతో కప్పుకుపోయింది. గోళ్ళు కోరలే ఆయుధాలుగా గల ఆ వానరవీరులు ఎన్నో యోజనాల దూరం అమిత వేగంతో ముందుకు పోతూ ఉంటే, మహానదులు, పర్వతాలు, వనాలు అన్ని యోజనాల దూరం వెనక్కు పరుగెత్తుకుపోతున్నట్లు అనిపిస్తోంది. ఆ మహాసైన్యాలు వేగంగా పోతూ ఉంటే పర్వతాలు, నదులు, వనాలు ఏవి అడ్డుగా వచ్చినా వాటి మధ్య నుండి పోతున్నాయి. (అదే మానవ సైన్యాలేతే చుట్టూ తిరిగిపోయేవాళ్ళని భావం) ఆ వానర సైన్యంలో మహాపరాక్రమవంతుల నుండి అతి సామాన్య వానరుడు వరకూ "నేను రామకార్యాన్ని సాధించడానికి వెళ్తున్నా" నని అనుకొంటూ వాళ్ళకున్న ఉత్సాహంకన్నా రెట్టింపు ఉత్సాహంతో ముందుకు పోతున్నారు. వాళ్ళ బలాన్ని, పరాక్రమాన్ని పక్కవాళ్ళ దగ్గర ప్రదర్శించి ఉత్సాహంగా తమ దర్పాన్ని చాటుకొంటున్నారు. వాళ్ళల్లో కొందరు అమిత వేగంగా నడక సాగించారు. కొందరు ఎగురుతూపోయారు. కొందరు కిలకిల ధ్వనులు చేస్తే, కొందరు మహాధ్వనులు చేశారు. వారిని చూసి ప్రేరితులైన వాళ్ళు సింహనాదాలు చేశారు. కొందరు తమ తోకల్ని ఆకాశానికి అంటేట్లుగా ఎత్తి పెట్టారు. కొందరు దారిలో కనిపించిన పెద్దపెద్ద బండల్ని పెకలించారు. కొందరు చెట్లకొమ్మల్ని విరిస్తే, మరికొందరు మహావృక్షాల్ని వేళ్ళతో సహా ఊడబెరికారు. వాళ్ళల్లో వాళ్లే ఆ బండరాళ్ళతోను, చెట్ల కొమ్మల్తోను, వృక్షాలతోను యుద్ధం చేస్తూ ఆటలాడుకుంటున్నారు. ఆ విధంగా కోట్లాది వానరులు గుంపులు గుంపులుగా పోతూ ఉంటే ఎదట ఉండే నేల కనిపించడం లేదు. సుగ్రీవుడు పైఎత్తున ఉండి వాళ్లు తిండికి నీళ్ళకు ఇబ్బంది పడకుండా కాపాడుకొస్తున్నాడు. వానర సైన్యం అంతా ఎడతెరిపి లేకుండా రాత్రింబవళ్ళు ప్రయాణం చేస్తున్నారు. "సీతాదేవిని విడిపించేందుకు మనమంతా యుద్ధం చెయ్యాలి" అన్న సంతోషంతో ఒక క్షణం కూడా వృథాకాకుండా సాగిపోతున్నారు.

అక్కడ నుండి వానరులంతా వృక్ష సంపద విరివిగా ఉన్న సహ్య పర్వతం పైకి ఎక్కారు. రాముడు కూడా ఆ సహ్యామలయ పర్వత అందాలను తిలకిస్తూ ముందుకు సాగాడు. ఆ పర్వతంపై విస్తారంగా లభించే చంపక, తిలక, చూత, ప్రసేక, సిందువారక, తిని, కశవీర వృక్షాల నుండి ఫలాలను భుజించి సంతృప్తి చెందారు. ఇవేకాకుండా వానరులు అశోక, కరంజ,

ప్లక్ష, న్యగ్రోధ, జంబుక, ఆమలక వృక్ష ఫలాలను కూడా ఆరగించారు. ఆ వృక్షాలన్నీ విరగబూసి ఉండటం వల్ల ఆ వానరులందరిపైనా వాయుప్రభావంచేత పుష్పవర్షాన్ని కురిపించాయి. గాలికి ఆ వృక్షాలకున్న పుష్పాల నుండి మకరందపు వాసనలు గుబాళించాయి. తుమ్మెదల ఝుంకారాలు గాలిలో కలసి విచిత్రమైన ధ్వనులు చేస్తున్నాయి. మనోహరంగా ఉన్న ఆ పర్వత చరియల్లో మొగలి పొదలు, తెల్లవావిలి చెట్లు, ఇప్ప వృక్షాలు, పొగడ చెట్లు, వేగిస చెట్లు, తుమ్మికి చెట్లు, బొట్టుగు వృక్షాలు, నాగకేసర వృక్షాలు, ఇరుగుడువృక్షాలు, అడవిమల్లెలు, ఎర్రగోరంట్ల, ఈత, వేప, మామిడి, నీలాశోక, ఉలిమిరి, ఊడుగు, పద్మక వృక్షాలన్నీ వానరుల అల్లరికి తల్లడిల్లిపోయాయి.

ఆ పర్వతంపైన చల్లటి నీళ్ళు నిలచిన చెరువులు, సరస్సులు, జలాశయాలు కనిపించాయి. ఆ జలాశయాల వద్ద క్రౌంచపక్షులు, నీటికాకులు, కారండవ పక్షులు, చక్రవాక పక్షులు తిరుగుతున్నాయి. ఆ జలాశయాల వద్దకు అడవిపందులు, తరక్షువులు, (సివంగులు) సింహాలు, పెద్దపులులు, విషసర్పాలు రావటం చూశారు. ఆ జలాశయాల్లో కలువలు, చెంగల్వలు, కమలములు, నల్ల కలువలు విస్తారంగా వికసించి ఉన్నాయి. వివిధరకాల పక్షులు కిలకిలారావములు చేస్తున్నాయి. ఆ వానర సేన అంతా ఆ చల్లటి నీటిలో స్నానాలు చేశారు; కడుపు నిండా నీళ్ళు తాగారు. ఆ వృక్షాలకు వ్రేలాడుతున్న ఫలాల్ని తనివితీరా తిన్నారు. అమృతం లాంటి కందమూలాల్ని ఆరగించారు. తేనెరంగు శరీరాల్తో ఉండే వానరులంతా కడవల కొద్దీ తేనెను తాగుతూ ముందుకుపోయారు. మధుపానం చేసిన మత్తుతో లతలన్నింటినీ తుంపివేశారు; వృక్షాల్ని పెకలించారు. వాళ్ళలో పచ్చగా ఉన్న వానరులు పండిన వరిపొలాల్లాగా కనిపించారు.

పద్మాల వంటి నేత్రాలు గల రాముడు ఆ వానర సైన్యంతో కలసి మహేంద్ర పర్వతం పైకి వెళ్ళాడు. దశరథ కుమారుడైన రాముడు ఆ శిఖరంపై నుండి సముద్ర తీరాన్ని పరికించాడు. రామలక్ష్మణులు, సుగ్రీవుడితో కలసి ఆ సముద్ర తీరానికి చేరుకున్నారు. పెద్ద పెద్ద అలలతో పైకి

లేచి తీరాన ఉన్న తెల్లని రాళ్ళను కడుగుతున్న ఆ సముద్రాన్ని చూసి రాముడు ఇట్లా అన్నాడు. "ఓ సుగ్రీవుడా! మనం ఇప్పుడు సముద్రం దాకా వచ్చాం. ఇకపై మనం అనుకున్నట్లుగా ఈ సముద్రాన్ని ఏ ఉపాయం చేత దాటటమో ఆలోచించాలి. నదులన్నింటికీ భర్త అయిన ఈ సముద్రాన్ని ఉన్న పళంగా దాటలేము. ఏదైనా ఉపాయం చేతనే దాటాలి. మనం ఇక్కడే బసచేసి, ఉత్తమమైన ఆలోచనచేత వానర సైన్యాన్ని సముద్రాన్ని దాటించే ప్రయత్నం చేద్దాం.

"ఓ సుగ్రీవుడా! మన సేనలన్నీ ఈ సముద్ర తీరానే ఉండేట్లు చూడు. వాళ్ళంతా చెట్టుకొకడూ, పుట్టకొకడుగా పోకూడదు. సేనానాయకులంతా వాళ్ళందర్నీ అతి మెలకువతో పర్యవేక్షిస్తూ ఉండాలి. మనల్ని కనిపెట్టడానికి ఈ తీరాన కూడా కొంతమంది రాక్షసులు తిరుగుతూ ఉండవచ్చును. కాబట్టి మన సేనా నాయకులందరూ ఒక కంట మన సైన్యాన్ని కాపలా కాస్తూ ఉండాలి. రెండోకంట శత్రువుల గూఢాచారు లెవరైనా తిరుగుతున్నారేమోనని కనిపెట్టి ఉండాలి."

అంతట సుగ్రీవుడు రాముని ఆజ్ఞను శిరసావహించి, లక్ష్మణునితో కూడా వెళ్ళి, వానర సేనలందరినీ సమీపాన ఉన్న అడవుల్లో విడిది చేయించాడు. సముద్ర సమీపాన ఉన్న ఆ వానరసేన అంతా తేనెరంగు వలె ఉన్న నీటితో నిండిన రెండవ సముద్రంగా ప్రకాశించింది. విడిది చేసిన వానర సైన్యం చేస్తున్న అరుపుల ముందు సముద్ర ఘోష అణగారిపోయింది. సుగ్రీవుడు ఆ సైన్యాన్ని మూడు విధాలుగా విభజించాడు. వానర వీరులందరినీ ఒకటిగాను, గోలాంగూల (కొండముచ్చు) వీరులంతా ఒకటిగాను, భల్లూక వీరులందరూ ఒకటిగాను చేసి వేరు విడుదుల్ని ఏర్పాటు చేయించాడు. ఎగిరిపడుతున్న సముద్రపు అలలను, విజృంభించిన వాయుదేవుని ప్రతాపం చూసి వానరులంతా ఆనందంతో గంతులు వేశారు.

సముద్రానికి ఆవలిగట్టునే రాక్షస నివాసం అయిన లంకాపట్టణం ఉంది. అదంతా రాక్షస రాజ్యం. సముద్రం అంతా వరుణదేవుని నివాసం. ఎంతటి పెద్ద జీవాల్నయినా పట్టుకొని మింగ గల తిమి తిమింగలాలకు ఈ జలాలు పుట్టినిల్లు. రాత్రిళ్ళు తెల్లటి నురుగుతో మరీ

భయంకరంగా కనిపిస్తుంది. ఆ తెల్లటి నురుగంతా సముద్రుడి తెల్లని పలువరుసలాగా కనిపిస్తుంది. చంద్రోదయ వేళల్లో ఆ సముద్రుడు ఇంకా ఉప్పొంగిపోతూ ఉంటాడు. పడగలపై మణులు ధరించిన సర్పాలు మంటలు మండుతున్నట్లనిపిస్తూ భయంకరంగా ఉంటాయి. సముద్రం లోపల అనేక పర్వతాలుండటం వల్ల, ఎవరూ జొరపడి ప్రయాణం చెయ్యలేరు. అటువంటి వరుణుని నివాసాన్ని, అటుపై నున్న రాక్షసుల నివాసాన్ని వానరులంతా పరిశీలించి చూశారు. దాన్ని ఎట్లా దాటటమా? అని దిగులుపడ్డారు. అంతలోనే సముద్రంలో అలలు మొసళ్ళు, సర్పాల్లాగా ఎగసిపడ్డాయి. చంద్ర కిరణాలతో కలసిన సముద్రుడు నీటిబిందువుల్నే అగ్నికణాల్లాగా మండిస్తున్నాడు. ఆకాశంలోని నక్షత్రాల్లాగా అనిపిస్తున్నాయి. సముద్ర జలాలు ఆకాశంతోను, ఆకాశం సముద్ర జలాలలోను కలసిపోయి, రెంటికీ తేడా తెలియడం లేదు. మహాసర్పాలకు నివాసం అయిన ఆ సముద్ర జలాలు, రాక్షసులకు నిలయమై పాతాళమా అన్నట్లు భయంకరంగా ఉన్నాయి. నక్షత్రాలతో కూడిన ఆకాశం, రత్నాలతో కూడిన సముద్రం పరస్పరం ఒకదానితో మరొకటి సమానమైనవిగా కనిపిస్తున్నాయి. మేఘాలు ఎగురుతున్న ఆకాశానికి, అలతో కూడిన సముద్రానికీ ఏమీ తేడా తెలియకుండా ఉంది. పెద్దపెద్ద సముద్రతరంగాలు వచ్చి ఒడ్డున ఉన్న రాళ్ళకు కొట్టుకొని భయంకరమైన శబ్దాలు చేస్తున్నాయి.

మహాత్ములైన వానరులంతా సముద్రాన్ని చూశారు. నీటి జంతువులకు పుట్టినిల్లయిన ఆ సముద్ర జలాలన్నీ వాయుదేవునితో కలసి ఆకాశంపైకి ఎగసిపడుతున్నాయి. ఆ గంభీరమైన శబ్దాలు వాటితో అవి మాట్లాడుకొంటున్నట్లున్నాయి. ఆ వానరులంతా అత్యంత ఆశ్చర్యంతో ఆ సముద్రాన్నే చూస్తూ నిలబడ్డారు.

# 5వ సర్గ రాముడు సీతను స్మరించటం

సుగ్రీవుడి వానరసేన అంతా సముద్ర తీరాన ఉండే వృక్షాల సమూహంలో విడిది చేసింది. నీలుడి పర్యవేక్షణలో మైంద ద్వివిదులిద్దరూ ఆ సైన్యాన్ని అన్ని దిక్కుల నుండి కాపాడుతున్నారు. సముద్ర తీరాన దిగులుగా కూర్చున్న రాముడు, లక్ష్మణుడితో ఇలా అన్నాడు.

రాముడు : ఓ లక్ష్మణా! కాలం గడుస్తున్న కొద్దీ దుఃఖం తగ్గి శాంతి లభిస్తుందని అంటూ ఉంటారు. నా విషయం అందుకు వ్యతిరేకంగా ఉంటోంది. నా ప్రియురాలైన సీతను గూర్చిన నా దుఃఖం రోజురోజుకూ పెరుగుతోందే కానీ, తరగడం లేదు. నాకు ఆమె దూరమైందన్న దుఃఖం కన్నా, ఆమె అపహరించబడిందనే దుఃఖం కన్నా కూడా, ఆమెకు వయస్సు తరిగిపోతోందే అన్న బాధ నన్ను మరీమరీ కృంగదీసేస్తోంది. ఎందుకంటే ఆమె ఒక మాసం కన్నా జీవించదని హనుమంతుడు చెప్పాడు.

ఓ వాయుదేవుడా! నా ప్రియురాలి వైపు నుండి నా ప్రక్కగా వీచు. ఆమెను తాకిన తర్వాత నన్ను కూడా తాకు. ఆ విధంగా ఆకాశంలో చంద్రుణ్ణి చూస్తూ నా ప్రియురాలి ముఖబింబాన్నే చూసినట్లుగా తృప్తిపడుతున్నాను. ఆమెను చూసిన చంద్రుణ్ణే నేనూ చూడటం వల్ల మా ఇద్దరి చూపులూ కలసినట్లుగా సంతోషిస్తాను.

లక్ష్మణా! నా ప్రియురాలు అపహరించబడేటప్పుడు 'హ! నాథా!' అంటూ ఆక్రోశించి ఉంటుంది. ఆ ఆక్రందన నా మనస్సును తడిగుడ్డను పిండినట్లు పిండేస్తోంది. ఆమె ఆక్రందన, తాగిన విషంలాగా నా దేహాన్ని దహించివేస్తోంది. నా పాలిట, ఆమె వియోగమే కట్టెలు అయ్యాయి; ఆమెను గూర్చిన ఆలోచనలే భగభగమండే మంటలయ్యాయి; ఆ మన్మథాగ్ని చేత రాత్రింబవళ్ళు నా శరీరం దహించబడుతోంది.

లక్ష్మణా! నీవు ఇక్కడే కూర్చో. నేనొక్కణ్ణే పోయి ఆ సముద్రంలో పడుకుంటాను. ఆ

విధంగానైనా నాలో ప్రజ్వరిల్లే కామం కాల్చివేయకుండా ఉంటుందేమో! ఆమె, నేనూ ఇద్దరం నేల మీదనే (ఈ లోకంలోనే) ఉన్నామన్న తృప్తితో జీవించి ఉండగలుగుతున్నాను. ఇద్దరం ఈ లోకంలోనే ఉండటం వల్ల ఎప్పటికైనా కలుసుకుంటాం అనే ఆశతోనే బ్రతక గలుగు తున్నాను. ఆమె జీవించి ఉండటం వల్లనే నేనూ జీవించి ఉన్నాను. నీరు సమృద్ధిగా ఉన్న వరిచేను ప్రక్కనే, నీళ్ళు లేని చేను ఉన్నా కూడా, ప్రక్క చేనులోని తేమ వలన నీరు లేని పొలంలోని పైరు కూడా బ్రతికి ఉంటుంది. అదే విధంగా ఆమె బ్రతికి ఉండటం వల్లనే నేనూ జీవించి ఉన్నాను. నేను శత్రువును జయించి పద్మాల వంటి నేత్రాలు, అందమైన నడుముగల ఆ సర్వసంపన్నమైన నా సీతను ఎప్పుడు చూస్తానో గదా! పద్మాల వంటి ముఖాన్ని పైకి ఎత్తి పట్టుకొని, ఆ దొండపండువంటి పెదవుల్ని, రోగి ఔషధం సేవించినట్లుగా, ఆమె అధరామృతాన్ని ఎన్నటికి తాగుతానో! దగ్గరగా ఉండి బలిసి, తాటి పండ్లవలె గుండ్రంగా ఉండే ఆమె స్తనాలు నాకు ఎప్పుడు ఆనందాన్ని కలిగించునో కదా! నాథుడనైన నేను జీవించి ఉండి కూడా, అనాథలాగా ఆ రాక్షసుల మధ్య దిక్కులేనిదై పడి ఉందిగదా! జనక మహారాజు కూతురు, దశరథ మహారాజు కోడలు అయిన నా సీత ఆ రాక్షసుల మధ్యన ఎట్లా నిద్రపోతోందో గదా! నల్లని మేఘాల్ని తప్పించుకొని బయటకు వచ్చే చంద్రుడు వలె, ఆ రాక్షసాంగనల నుండి ఆమె ఎప్పటికి బయటపడి నా ఎదుటకు వస్తుందో కదా! సహజంగానే ఆమె సన్నటిది; శోకం వల్లను, ఆహారం లేకపోవటం వల్లనూ మరీ కృశించిపోయి ఉంటుందేమో! రావణుని గుండెలు చీల్చి, సీతకుండే దిగులు అంతా పోగొట్టి ఎన్నటికి ఆమెను తీసుకొని రాగలుగుతానో కదా! మహా పతివ్రత, దేవతా స్త్రీలతో పోల్చదగినదీ అయిన నా సీత దిగులు లేనిదై, నన్ను ఎన్నడు కౌగలించుకొని ఆనందబాష్పాలు విడుస్తుందో కదా! సీతా వియోగ శోకాన్ని మాసిపోయిన వస్త్రాన్ని విడిచినట్లు ఎన్నటికి విడిచెదనో కదా!

రాముడు ఆ విధంగా విలపిస్తూ ఉండగా పగలంతా గడిచిపోయింది. సూర్యుడి ప్రతాపం మందగించింది. దుఃఖంతోను, దిగులుతోను పద్మాలవంటి కన్నులు గల ఆ సీతాదేవిని తలచుకుంటూ రాముడు, సాయంసంధ్యను ఉపాసించేందుకు కూర్చున్నాడు.

సంధ్యావందనం అయిన తర్వాత లక్ష్మణుడు రాముడితో “అన్నా! నీవు రావణాసురుణ్ణి సంహరిస్తావు. త్వరలోనే సీతాదేవిని చూస్తావు. నీ కోరికలన్నీ తీరుతాయి. సర్వసమృద్ధితో ఉండే అయోధ్యకు తిరిగిపోతావు. అన్నీ శుభశకునాలే కనిపిస్తున్నాయి. ఈ శుభ శకునాలన్నీ చూసి సంతోషించు. ఈ వానర సైన్యాలన్నీ పూర్వం తారకాసుర సంహారానికి వెళ్ళిన దేవతల సేనలాగా ఉంది. ఓ పూజ్యుడా! దిగులు పడకు. అన్నీ శుభాలే జరుగుతాయి” అన్నాడు.

# 6వ సర్గ రావణుని మంతనాలు

మహేంద్రుని వంటి పరాక్రమంతో హనుమంతుడు లంకా పట్టణంలో చేసిన ఘోరమైన పనులు తలచుకొంటూ రావణుడు సిగ్గుపడిపోయాడు. మంత్రులందర్నీ సమావేశపరచాడు. వారితో ఇలా అన్నాడు:

"ఓ రాక్షస వీరులారా! ఈ లంకాపట్టణంలోకి ప్రవేశించడం ఎవరికీ శక్యం కాకుండా దుర్భేద్యమై ఉండేది. అటువంటిది, ఒక వానరుడు లంకలో ప్రవేశించి, జనకుని కుమార్తె అయిన సీతను చూసి, మాట్లాడిపోయాడు. లంకలోని వనాలన్నీ ధ్వంసం చేశాడు. చైత్యప్రాసాదాన్ని పగలకొట్టాడు. రాక్షస వీరుల్ని చంపాడు. లంకా పట్టణాని కంతకూ నిప్పుపెట్టాడు. ఇదంతా చూస్తూ ఉంటే అతడు ఏదో సామాన్యమైన వానరుడుగా కనిపించడం లేదు. కాబట్టి ఇప్పుడు ఏం చెయ్యాలో మీరంతా బాగా ఆలోచించి చెప్పండి.

"ఓ రాక్షస వీరులారా! మీరంతా బుద్ధిమంతులు, ఆలోచనాపరులు. జయం ఎప్పుడూ మంత్రాంగం పైనే ఆధారపడి ఉంటుందని పెద్దలంటారు. అందువల్ల రాముడి విషయంలో మనం ఏంచెయ్యాలి? ఎట్లా చేస్తే విజయాన్ని సాధిస్తాం? ఇప్పుడు మన తక్షణ కర్తవ్యం ఏమిటి? మనకు హితమైనదేది? మీరంతా బాగా ఆలోచించి చెప్పండి.

"లోకంలో ఉత్తములు, మధ్యములు, అధములు అని మనుష్యులు మూడు రకాలుగా ఉంటారు.

"తమ మేలు కోరే నేర్పరులయిన మంత్రులతోను, తనతో సరిసమానంగా, సుఖదుఃఖాలలో పాలుపంచుకొనే స్నేహితులతోను, తమ మేలు కోరే పెద్దలతో, బాగా ఆలోచించి, ఆపైన అదృష్టాన్ని నమ్ముకొని పనులు ప్రారంభించేవాడిని ఉత్తముడు అని అంటారు.

"అటువంటి మంత్రిసత్తములు ఉన్నా, వాళ్ళను సంప్రదించకుండా, తానొక్కడే

ఆలోచించి, అదృష్టంపైనే ఆధారపడి పనులు ప్రారంభించేవాడిని మధ్యముడని అంటారు.

"అసలు మంచిచెడ్డలే ఆలోచించకుండా, అదృష్టాన్ని లెక్కచేయకుండా, తను ఒక పనిని చేయవలసి ఉన్నా కూడా, ఉదాసీనతతో వ్యవహరించేవాడిని అధముడని అంటారు.

"అదేవిధంగా మంత్రాంగంలో కూడా మూడు విధాలు ఉన్నాయి. మంత్రులు భిన్నాభిప్రాయాలు లేకుండా శాస్త్రాన్ని దృష్టిలో ఉంచుకొని అంతా కలసికట్టుగా ఒక నిర్ణయానికి రావడాన్ని ఉత్తమ మంత్రాంగం అంటారు. అయితే మంత్రులందరూ ఎవరి అభిప్రాయాలు వాళ్ళుంచుకుంటూ, కార్యసాధన కోసం అంతా కలసి ఒక నిర్ణయానికి రావటాన్ని మధ్యమ మంత్రాంగం అంటారు. ఇక మంత్రులంతా ఎవరికి తోచినట్లు వాళ్ళు చెప్తూ, ఇతరుల ఆలోచనల్ని పట్టించుకోకుండా, ఒక నిర్ణయానికి రాలేకపోవడాన్ని అధమమైన మంత్రాంగం అంటారు.

"ఓ మంత్రిపుంగవులారా! మీరంతా బాగా ఆలోచించి చెప్పండి. రాముడు గొప్ప పరాక్రమవంతుడు. జనస్థానంలో పదిహేడువేలమంది రాక్షసుల్ని ఒక్కడే చంపాడు. అనేక లక్షలాది వానర సైన్యాన్ని వెంటబెట్టుకువస్తాడు. రాముడు తన పరాక్రమంతో సముద్రాన్ని ఎండగట్టగలడు. లేదా మరేదైనా ఉపాయంచేత లక్ష్మణునితో కలసి వానర సైన్యాన్నంతా వెంటబెట్టుకొని సముద్రాన్ని దాటి రాగలడు. లంకలో ప్రవేశించవచ్చును. కాబట్టి, మన రాక్షససైన్యానికి కీడు జరక్కుండా క్షేమంగా ఉండేందుకు తగిన ఉపాయం ఏదైనా మీరంతా చక్కగా ఆలోచించి చెప్పండి."

# 7వ సర్గ మంత్రులు రావణునికి ధైర్యం చెప్పటం

మహాబలశాలురు, బుద్ధిహీనులు, నీతిబాహ్యులు అయిన రావణుని మంత్రులంతా ముక్తకంఠంతో ఇట్లా అన్నారు.

మంత్రులు : రాజా! మనవద్ద గొప్ప సైన్యం ఉంది. పరిఘలు, శక్తులు, ఋష్టులు, పట్టిశములు ఇంకా ఎన్నో రకాలైన ఆయుధాలున్నాయి. నీవు ఎందుకు దిగులుపడుతున్నావు?

రాజా! నీవు పాతాళంలోని భోగవతీ పట్టణానికి పోయి యుద్ధం చేసి జయించావు. కైలాస పర్వతంపై యక్షులతో కూడి ఉన్న కుబేరునితో యుద్ధం చేసి అతణ్ణి జయించావు. యక్షులందర్నీ కొట్టి, నానాహింసలు పెట్టి ఆ కైలాస శిఖరంపై ఉండే కుబేరుని పుష్పక విమానాన్ని తెచ్చుకున్నావు. ఓ రాజా! నీతో స్నేహం చెయ్యాలని దానవేంద్రుడైన మయుడు తన కుమార్తె అయిన మండోదరిని నీకిచ్చి వివాహం చేశాడు. ఓ రాజా! మహాపరాక్రమవంతుడైన 'మధువు' అనే దానవుణ్ణి నీవు యుద్ధంలో జయించి నీవాణ్ణిగా చేసుకోవటమే కాకుండా, నీ చెల్లెలు 'కుంభీనసిని' ఇచ్చి వివాహం కూడా చేశావు.

ఓ మహాబాహూ! నీవు రసాతలానికి వెళ్ళి నాగుల్ని జయించి వాసుకిని, తక్షకుణ్ణి, శంఖుణ్ణీ, జటినీ జయించి లోబరచుకున్నావు. నిన్ను ఎదిరించి, నీకు శత్రువుగా నిలబడగలవాడు ఈ ముల్లోకాల్లోనూ లేడు. అట్లా నువ్వు శత్రుసంహారకుడవయ్యావు. బ్రహ్మదేవుణ్ణి మెప్పించి చావు లేకుండా వరాలు పొందావు. కాలకేయాది రాక్షసుల్తో ఒక సంవత్సరంపాటు యుద్ధం చేసి వారందరినీ నీ వశంలోకి తెచ్చుకున్నావు. ఆ కాలకేయాదుల నుండి మాయలు అన్నీ నేర్చుకున్నావు. లోకపాలకులందర్నీ జయించావు. శూరులు, బలవంతులు అయిన వరుణదేవుని పుత్రుల్ని వారి నాలుగు విధాలైన సేనల్నీ జయించావు.

ఓ రాజా! నువ్వు యమలోకం అనే మహాసముద్రాన్ని, యముడి సైన్యం అనే సాగరంలో

ప్రవేశించి, అఖండ విజయాన్ని సాధించి యముణ్ణి పారిపోయేట్లుగా చేశావు. ఆ సముద్రం యమదండమనే మొసళ్ళతోను, శాల్మలీ వృక్షాకారములో ముళ్ళతో కూడిన ఆయుధములతో నిండినదీ, కాలపాశమనే పెద్ద అలలతోను, సర్పాలే యమభటులుగా, భయంకరమైన జ్వరదేవత అక్కడ ఉండి కూడా నిన్ను యముడు ఎదిరించలేకపోయాడు. అక్కడ యుద్ధంలో నీ తేజస్సు చూసి అంతా ఆశ్చర్యపోయారు.

ఓ రాజా! భూమిపై చెట్లు ఎట్లా వ్యాపించి ఉంటాయో అలాగే భూమండలం అంతా ఇంద్రుడితో సమానమైన పరాక్రమం గల క్షత్రియులుండేవారు. ఆనాడు నీవు ఆ క్షత్రియులతో చూపిన శౌర్యపరాక్రమాలు తలచుకుంటే, ఈ రాముడు వాళ్ళెవరికీ సాటిరాడు. రాముడి కంటే గొప్ప శౌర్యవంతులైన క్షత్రియుల్నే నీవు యుద్ధంలో చంపేశావు.

ఓ రాజా! నీవు ఎందుకు శ్రమపడతావు? నీవు ఇంటిపట్టునే కూర్చో. ఇంద్రజిత్తు ఒక్కడే రాముణ్ణి, రాముడి సైన్యాన్ని నాశనం చేయగలడు. ఇంద్రజిత్తు శ్రేష్ఠమైన ఎన్నో యజ్ఞాలు చేసి మహేశ్వరుని మెప్పించి అనేక వరాలు పొందాడు. ఇంద్రజిత్తు సముద్రం వంటి దేవతల సైన్యంలో ప్రవేశించి, దేవేంద్రుని పిలక పిచ్చుకొని లంకకు ఈడ్చుకొని వచ్చాడు. అటువంటి సైన్యసముద్రం, శక్తుల్తో, తోమరములే చేపలుగాను, చిందరవందరగా పడి ఉన్న పేగులే నాచుగాను, ఏనుగులే తాబేళ్ళుగాను, గుర్రాలే కప్పలుగాను, ఏకాదశ, రుద్రులు, ద్వాదశదిత్యులు మహగ్రహాలుగాను, సప్త మరుత్తులూ, అష్టవసువులూ, మహాసర్పాలుగాను, రథాలు గుర్రాలు ఏనుగులు అనే నీటితో నిండి ఉంది. కాలిబంట్లు ఇసుక దిబ్బలుగా ఉండే దేవతా సైన్యం అనే సముద్రానికి పోయి ఇంద్రజిత్తు దేవేంద్రుణ్ణి పట్టుకొని ఈ లంకాపట్టణానికి తెచ్చాడు. ఓ ప్రభూ! సాక్షాత్తూ బ్రహ్మదేవుడే వచ్చి చెప్పటం వల్ల దేవేంద్రుణ్ణి విడిచిపెట్టావు. సర్వదేవతలచే పూజించబడేవాడు, మహాబలశాలియైన వృత్రాసురుణ్ణి, శంబాసురుణ్ణి చంపిన దేవేంద్రుణ్ణి నీవు దయతలచి వదలటం వల్లనే స్వర్గానికి వెళ్ళగలిగాడు.

ఓ రాజా! ఇంద్రజిత్తును ఒక్కణ్ణి పంపించు. అతడే రాముణ్ణి, రాముడి సేనల్ని నాశనం

చేసి వస్తాడు. హనుమంతుడి తేజస్సు అత్యల్పమైనది. అతణ్ణి, అతడి పరాక్రమాన్ని అతిగా గౌరవించడం తగదు. నీవు తప్పక రాముణ్ణి చంపబోతున్నావు.

## 8వ సర్గ రాక్షస సేనాపతుల ప్రగల్భాలు

రాక్షస మంత్రులందరూ రావణునికి తమ మనోభావాల్ని నిర్భయంగా తెలియజేశారు. ఆ తర్వాత శూరుడు, సేనాపతి, నీలమేఘంలాంటివాడు అయిన ప్రహస్తుడు వినయంతో ఇలా అన్నాడు: "ఓ ప్రభూ! ముల్లోకాల్లోను దేవదానవ గంధర్వ యక్ష కిన్నెరకింపురుష పిశాచ గణాలకు ఎవరికీ యుద్ధంలో నిన్ను ఎదిరించే శక్తి లేదు. ఇక సాధారణ వానరులా నిన్ను ఎదిరించేది? లంకానగరంలో మనం అంతా ఏమరిపాటుతో ఉన్నప్పుడు హనుమంతుడు వచ్చాడు. అప్పుడు రాక్షసులంతా భోగాల్లో మునిగి తేలుతున్నారు. ఆ విధంగా మనం అంతా ఏమరిపాటుతో ఉన్న సమయంలో హనుమంతుడు మనల్ని మోసం చేశాడు. నేను కనుక, హనుమంతుణ్ణి ఎదిరించి ఉంటే అక్కడే చంపేసి ఉండేవాణ్ణి; ప్రాణాలతో వదిలేవాణ్ణే కాదు.

"ఓ రాజా! నాకు అనుజ్ఞ ఇవ్వు. సముద్రతీరం, పరిసర వనాలూ, పర్వతాలలో ఎక్కడా ఒక్క వానరుడు కూడా అడుగుపెట్టకుండా, కనిపించినవాడిని కనిపించినట్లు చంపేస్తాను. నువ్వు జరిగిపోయిన దాన్ని తలచుకుంటూ బాధపడవద్దు. వానరుల వల్ల నీకు, లంకకు ఏ విధమైన ఆపదా రాకుండా నేను కాపాడతాను."

అంతట దుర్ముఖుడనే రాక్షసుడు ఉగ్రుడైపోయి పరిఘ అనే ఆయుధాన్ని చేతిలోకి తీసుకొని ఝళిపిస్తూ, "ఓ రాజా! లంకాపురానికి, అంతఃపురానికి హనుమంతుడు చేసిన పరాభవం; సుగ్రీవుడు, రాముడు మన ప్రభువైన రావణుని ఎదిరించడానికి రావడం సహించరానిది. ఈ క్షణానే, నేనొక్కడినే వెళ్ళి, ఆ వానరులందరూ సముద్రంలో ఉన్నా, పాతాళంలో ఉన్నా, ఆకాశంలో ఎగురుతున్నా సరే, వాళ్ళందర్నీ చంపేస్తాను" అన్నాడు.

తరువాత గొప్ప బలవంతుడైన వజ్రదంష్ట్రుడు రక్తమాంసాలతో ఉన్న పరిఘ నొకటి చేత పట్టుకొని కోపంతో ఇలా అన్నాడు: "ఓ రాజా! ఎదిరింప శక్యం కాని రాముడు, సుగ్రీవుడు, లక్ష్మణుడు ఉండగా దీనుడైన హనుమంతుడితో ఏం పని? నేను ఒక్కణ్ణే పోయి నా ఇనుప

గుదియతో వాళ్ళను చంపేస్తాను. వానర సైన్యాన్నంతా చిందరవందర చేస్తాను” అన్నాడు.

“ఓ రాజా! శత్రువుల్ని జయించాలంటే ఉపాయం తెలిసినవాడై ఉండాలి. బాగా మెలకువతో మెలగాలి. ఇప్పుడు శత్రువును జయించడానికి నాకు తెలిసిన ఉపాయం ఒకటి చెబుతాను వినండి.

“మనవాళ్ళంతా కామరూపులు. వాళ్ళల్లో మెరికల్లాంటి వాళ్ళను వేలాదిమందిని మానవరూపం ధరించి రాముడి దగ్గరకు పంపాలి. వాళ్ళంతా రాముడి దగ్గరకు పోయి, వాళ్ళందర్నీ భరతుడు పంపాడని, వెనుక నుండి ఇంకా సైన్యం వస్తోందనీ నమ్మేట్లుగా చెప్పాలి. ఆ తర్వాత మేము మరికొంతమంది ఆకాశ మార్గంలో వెళ్ళి, ఆ వానరులందరిపైనా శూలాలను, ఖడ్గాలను, బాణాలను ప్రయోగించి ఆ వానర సైన్యాన్ని చంపివేస్తాం. ఆ వానరుల్లో ఒకణ్ణి కూడా మిగల్చకుండా అందర్నీ యముడి దగ్గరకు పంపిస్తాం. అకస్మాత్తుగా తమ సహాయానికి వచ్చిన వానరులంతా చచ్చిపడి ఉంటే రామలక్ష్మణులకు పిచ్చెక్కినట్లవుతుంది. దాంతో వాళ్ళూ ప్రాణాలు వదుల్తారు.”

ఆ తర్వాత కుంభకర్ణుడి కొడుకు, మహాపరాక్రమవంతుడు, వీరుడు అయిన ‘నికుంభుడు’ లేచి అమితమైన కోపంతోను ఆవేశంతోను “ఓ రాజా! నువ్వు ముల్లోకాలనూ మూడు చెరువుల నీళ్ళు తాగించావు. నీవు ఒక్కడివే ముల్లోకాల వాళ్ళనూ గగ్గోలుపెట్టించగలవాడవు. నీవు ఎంతమాత్రం శ్రమపడవద్దు. నేను ఒక్కణ్ణే వెళ్ళి ఆ రామలక్ష్మణుల్నీ, సుగ్రీవుణ్ణీ, హనుమంతుణ్ణీ చంపివస్తాను. మిగిలిన వానరులందర్నీ కూడా చంపేస్తాను” అన్నాడు.

అంతట వాళ్ళల్లో పర్వతాకారుడైన ‘వజ్రహనువు’ లేచాడు. వాడు నాలుకతో మాటిమాటికీ పెదవుల్ని తడుపుకుంటూ “ఓ రాక్షసయోధుల్లారా! మీరందరూ నిర్భయంగా ఉండండి. మన ప్రభువు కార్యాన్ని నేను ఒక్కణ్ణే చక్కబెట్టుకొని వస్తాను. ఈ వానలందర్నీ చంపి తినేస్తాను. మీరు ఇక్కడే మద్యం సేవిస్తూ ఉండండి. మంచి మాంసం భోజనం చేస్తూ ఇక్కడే

ఆనందంగా గడపండి. ఈ కోతి మూకనంతటినీ మట్టుపెట్టడమే కాకుండా రామలక్ష్మణుల్నీ, సుగ్రీవుణ్ణీ, హనుమంతుణ్ణీ కూడా చంపేసి తిరిగి వస్తాను. అంతవరకూ మీరు ఇక్కడే మీ పనులు చేసుకుంటూ ఆనందంగా గడపండి" అని అన్నాడు.

# 9వ సర్గ విభీషణుని హితబోధ

ఆ తర్వాత నికుంభుడు, రభసుడు, సూర్యశత్రువు, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు, రశ్మికేతువు, రావణాసురుడి కుమారుడైన ఇంద్రజిత్తు, ప్రహస్తుడు, విరూపాక్షుడు, వజ్రదంష్ట్రుడు, ధూమ్రాక్షుడు, అతికాయుడు, దుర్ముఖుడు అనే రాక్షసవీరులంతా శూలాలు, ఖడ్గాలు, గ్రండగొడ్డళ్ళు, పట్టిశాలు, పరిఘలు చేతపట్టుకొని రావణుని ఉద్దేశిస్తూ, "ఓ ప్రభూ! మేము వెళ్ళి రాముని, లక్ష్మణుని, సుగ్రీవుణ్ణి, హనుమంతుణ్ణి చంపి తిరిగి వస్తాము" అన్నారు.

సభ అంతా, వాళ్ళ ప్రతిజ్ఞల్తో, గందరగోళంగా అయిపోయింది. అంతట విభీషణుడు లేచి వాళ్ళందరికీ నమస్కరిస్తూ, శాంతంగా కూర్చోమన్నాడు. ఇంద్రజిత్తును, మంత్రులను ఉద్దేశిస్తూ ఇలా అన్నాడు.

విభీషణుడు : నాయనలారా! కార్యాలు సాధించడానికి సామదాన భేదాలనే మూడు పద్ధతుల్ని అవలంబించాలి. ఆ మూడింట్లోనూ ఫలితాన్ని సాధించలేనప్పుడు దండోపాయాన్ని ప్రయోగించాలి. అందుకు తగిన సమయాసమయాలున్నాయని పెద్దలంటారు. మనం ఇంకా సామదానాన్నే ఉపయోగించలేదు. కాబట్టి వెంటనే దండోపాయాన్ని చేబట్టడం ఉచితంగా ఉండదు.

అన్నలారా! ఏమరిపాటుతో ఉన్నవాళ్ళనీ, మరొక శత్రువు చేత ఆక్రమించబడిన వాడినీ, దైవం ప్రతికూలంగా ఉన్నవాడినీ – రాజనీతి ప్రకారం బాగా ఆలోచించి వాళ్ళపైన దండోపాయాన్ని ప్రయోగించాలి. అప్పుడే కార్యం సఫలం అవుతుంది.

ఓ రాక్షసులారా! రాముడి విషయంలోకి వస్తే, రాముడు బలవంతుడు. ఏమరిపాటులేనివాడై, జయించి తీరాలనే కాంక్షతో ఉన్నాడు. పైగా అతడు కోపాన్ని

జయించినవాడు. ఎదిరింప శక్యం కానివాడు. అటువంటి రాముణ్ణి ఏ విధంగా ఎదిరిద్దామని అనుకొంటున్నారు? మహాభయంకరమైన సముద్రాన్ని దాటి హనుమంతుడు రాగలడని మనం ఎవరమైనా, ఎప్పుడైనా అనుకున్నామా? శత్రువు బలం ఏమిటో మనం తెలుసుకోకుండా మాట్లాడుతున్నాం. వాళ్ళెంతటి పరాక్రమవంతులో మనకు తెలియదు. కాబట్టి ముందూ వెనకా చూసుకోకుండా ఉన్నపళంగా శత్రువుపైన దూకడం మంచిది కాదు. వాళ్ళను తక్కువగా అంచనా వెయ్యడం కూడా తగదు. జనస్థానం నుండి రాముడి భార్యను మన ప్రభువు అపహరించుకొని వచ్చాడు గదా! కీర్తిమంతుడైన రాముడు మనకు ఇంతకు పూర్వం ఏమైనా అపకారం చేశాడా? ఖరుడు మతిమీరి ప్రవర్తించి రాముడి మీదకు యుద్ధానికి వెళ్ళాడు. రాముడు యుద్ధంలో ఖరుణ్ణి వధించాడు. అందులో అతడి దోషం ఏముంది? ఏ ప్రాణి అయినా తన బలానికి తగ్గట్టుగా తన ప్రాణాలను కాపాడుకోవాలి గదా? ఒకవేళ రాముడు తప్పుచేశాడని మనం అనుకుంటే ఆనాడే మనం అతడిపైకి యుద్ధానికి వెళ్ళి ఉండవలసింది.

ఓ రాక్షసులారా! సీత వలన మనకు ఇప్పుడీ భయం పట్టుకుంది. రాముడితో కలహానికి మూలకారణం సీతాదేవిని అపహరించి తేవడం. రాముడితో కలహం పెట్టుకోవాలంటే సీతాదేవిని అపహరించి తేవడం ఎందుకు? ఆమెను వెంటనే వెనక్కు పంపేయాలి. ఇతరుల భార్యలను చెరపట్టడం ఘోరమయిన తప్పు. అన్ని అనర్థాలకూ, పాపాలకూ పుట్టినిల్లు. అందువల్ల అపకీర్తి కలుగుతుంది. ఆయువు క్షీణిస్తుంది. కాబట్టి ఆమెను వెంటనే విడిచిపెట్టాలి. రాముడు పరాక్రమవంతుడు. ధర్మాన్ని అనుసరించేవాడు. అటువంటి వాడితో విరోధం పెట్టుకోవడం మంచిదికాదు. సీతను తిరిగి అతడికి ఇచ్చెయ్యాలి. మన లంకానగరం ఏనుగులు, గుర్రాలు, ధనకనకవస్తు వాహనాలతో తులతూగుతోంది. అటువంటి సర్వసంపన్నమైన ఈ లంకా పట్టణానికి రాముడు వస్తాడు. తన బాణాలతో ఈ పట్టణాన్ని సర్వనాశనం చెయ్యకపూర్వమే సీతాదేవిని రాముడికిచ్చేయడం రావణుడికి, రాక్షసజాతికి శ్రేయస్కరం. మనంగా ఆ సీతాదేవిని రాముడికి ఇవ్వకపోతే, వానరసైన్యం అంతా ఈ లంకా పట్టణానికి వస్తారు; రాక్షసులందర్నీ హతమారుస్తారు. ఈ సంపదలన్నీ సర్వనాశనం అయిపోతాయి.

ఓ ప్రభూ! నేను నీకు బంధువును కావటం వలన నేను నిన్ను బ్రతిమాలుకుంటున్నాను. నీ మేలు కోరినవాడిని కాబట్టి యథార్థంగా ఉన్నది ఉన్నట్లు చెప్తున్నాను. నా మాట విను. రాముడికి సీతను ఇచ్చివెయ్యి.

ప్రభూ! రాముడు నీపై, శరత్కాల సూర్యుని వంటి, కొత్తకొత్త కొనలు తేలి ఉన్నవీ, పొన్నులు కలవీ దృఢమైనవీ, వ్యర్థం కానివీ అయిన బాణాలను విడుస్తాడు. కాబట్టి అతడు ధనుస్సుపై చెయ్యివెయ్యక పూర్వమే సీతాదేవిని రాముడికి ఇచ్చివెయ్యి. కోపం వల్ల ధర్మమూ, సుఖమూ నాశనం అవుతాయి. అందువల్ల కోపాన్ని దిగమింగుకో, ధర్మాన్ని ఆచరించు. దానివల్ల నీ కీర్తి ఇనుమడిస్తుంది. సంతోషం వృద్ధి అవుతుంది. అనుగ్రహించు అందువల్ల మనం, మన పుత్రులు, బంధువులు అంతా బ్రతికిపోతాం. ఆ సీతాదేవిని రాముడికి ఇచ్చివెయ్యి.

ఈ విధంగా విభీషణుడు చెప్పిందంతా విని రావణుడు రాక్షసు లందర్నీ పంపివేసి తన అంతః పురంలోకి వెళ్ళిపోయాడు.

# 10వ సర్గ విభీషణుడు రావణుణ్ణి కలుసుకోవటం

ధర్మార్థకామ మోక్షాల విషయంలో విభీషణుడికి స్థిరమైన అభిప్రాయాలున్నాయి. ప్రాతఃకాలానే లేచి, రావణుని అంతఃపురానికి వెళ్ళాడు. ఆ రావణాసురుడి భవనం అనేక ఎత్తైన శిఖరాలతో కూడుకున్న మహాపర్వతం లాగా ఉంది. ఆ భవనంలో గదులన్నీ విశాలంగాను, విడివిడిగాను ఉంటాయి. ఇంకో ప్రక్క మహాబుద్ధిమంతులు, స్వామిభక్తి పరాయణులు అయిన మహామంత్రులు, వేదవేదాంగాలు అభ్యసించిన మహాపండితులు ఆ గృహ సముదాయంలో నివసిస్తున్నారు. ఆప్తులు, సమర్థులు, స్వామిభక్తి పరాయణులు అయిన రాక్షసయోధులు ఆ భవనాన్ని రక్షిస్తూంటారు. మదపుటేనుగుల నిట్టూర్పులు స్పష్టంగా వినిపిస్తున్నాయి. వేదఘోషల, శంఖనాదాల, వాద్యగీతాలతో ఆ భవనం అంతా ప్రతిధ్వనిస్తోంది. దాసదాసీజనాలతో భవనం అంతా కిటకిటలాడిపోతోంది.

ఆ భవనం అంతా ఉత్తమమైన ఆభరణాతోను, తోరణాలతోను, బంగారు బురుజులతోను అలంకరించబడింది. అటువంటి రావణ భవనం, గంధర్వుల భవనం లాగాను, మరుత్తుల గృహాల్లాగాను, పాతాళంలోని సర్పగృహాల్లాగాను మణులతో అలంకరించబడి విరాజిల్లుతోంది.

గొప్ప తేజస్సుతో కూడిన విభీషణుడు, సూర్యుడు తన కిరణ సముదాయంతో మహామేఘంలోకి ప్రవేశించినట్లు, రావణాసురుడి ప్రాసాదం లోపలకు ప్రవేశించాడు. వేదపండితులు రావణుని విజయాన్ని కాంక్షిస్తూ పఠిస్తున్న పవిత్రమైన పుణ్యాహ మంత్రాలను విన్నాడు. పూజలకోసం నిలవ ఉంచిన పెరుగు, పాలు, నెయ్యి, అక్షితలు, పుష్పములను విభీషణుడు చూశాడు. మంత్రములలోను బ్రాహ్మణములలోను ప్రవీణులైన బ్రాహ్మణులను విభీషణుడు అక్కడ చూశాడు.

(వివరణ : వేదంలో ఒక భాగాన్ని మంత్రం అని, ఇంకో విభాగానికి బ్రాహ్మణము అని అంటారు. యజ్ఞయాగాల్లో పఠించే వాటిని మంత్రాలని అంటారు. ఈ యజ్ఞాలు ఏ ఫలం ఆశించి

చేయాలో, ఆ కర్మలు చేసే విధానాలను తెలియబరచే వాటిని బ్రాహ్మణములు అని అంటారు.)

మహాబాహువు అయిన విభీషణుని బ్రాహ్మణులు ఆశీర్వదించుతూ ఉండగా, లోపలకు ప్రవేశించి, మహాతేజస్సుతో ప్రకాశిస్తున్న రావణుని చూసి నమస్కరించాడు. రాజును దర్శించినప్పుడు అనుసరించే విధంగా రావణునికి "జయ విజయీభవ" మున్నగు స్తోత్రాలు పలికాడు. అంతట విభీషణుని బంగారు ఆసనంపై కూర్చోమని రావణుడు సంజ్ఞ చేసి చూపాడు.

అప్పుడు అక్కడ మంత్రులు తప్ప మరెవరూ లేరు. అంతట మహాపరాక్రమశాలి అయిన రావణునికి హేతుబద్ధంగాను, హితకరంగాను, ధర్మసమ్మతమైన మాటలు చెప్పాడు. విభీషణుడు లోకమర్యాదలను, మంచిచెడులను, ధర్మాధర్మాలను దేశకాలాలను బట్టి కార్యములు చేయగల నేర్పుగలవాడు. ఎప్పుడు ఎవరికి ఏ విధంగా చెప్పాలో ఎరిగినవాడు. అందువల్ల ముందుగా అన్నగారిని స్తోత్రాలతో ప్రసన్నుణ్ణి చేసుకున్నాడు. ఆ తర్వాత హితకరమైన మాటల్ని ఇలా చెప్పాడు.

"అన్నా! సీతాదేవిని నీవు లంకా పట్టణానికి తెచ్చినప్పటి నుండి అన్నీ చెడు శకునాల్నే చూస్తున్నాం. అగ్నిహోత్రంలో హవిస్సులు వేస్తూ ఉంటే అగ్ని ప్రజ్వరిల్లడం లేదు. పొగమాత్రం కమ్ముకుంటోంది. వేదాధ్యయనం చేసే చోట పాములు తిరుగుతున్నాయి. హవిస్సులకు చీమలు పడ్తున్నాయి. ఆవుల పాలు విరిగిపోతున్నాయి. మదపు టేనుగులు మదజలం విడవడం లేదు. గుర్రాల సకిలింతలు దైన్యంగా ఉంటున్నాయి. ఒంటెలు, గాడిదలు, కంచర గాడిదలకు ఒంటిపై రోమాలు నిక్కబొడుచుకొని అవి కన్నీరు కారుస్తున్నాయి. వైద్యులు ఎన్ని చికిత్సలు చేసినా జంతువుల ఆరోగ్యం మాత్రం కుదుటపడటం లేదు. మాలకాకులు గుంపులుగా జేరి అరుస్తున్నాయి. గద్దలు గుంపులుగుంపులుగా వచ్చి ఇళ్ళపై వాలుతున్నాయి. నక్కలు పట్టణ సివార్లలోకి వచ్చి ఉదయం, సాయంత్రం అమంగళంగా ఊళలువేస్తున్నాయి. మాంసం తినే జంతువులు మన పట్టణ ద్వారాల వద్దకు వచ్చి పిడుగులు పడ్డట్లుగా అరుస్తున్నాయి.

"మహారాజా! ఇవి కాకుండా, లంకా దహనం వంటివి అనేకం సంభవించి ప్రజలు ధన ప్రాణాలను పోగొట్టుకున్నారు. ఇవన్నీ చూడగా సీతాదేవిని తిరిగి రాముడికి ఇచ్చివేయడమే శ్రేయస్కరంగా కనబడుతోంది. నేను అజ్ఞానం చేతగాని, బ్రతుకుపై తీపితోగానీ మనందరం సుఖంగా ఉండాలన్న కోరికతోగాని మాట్లాడుతున్నా నీవు మరొక విధంగా భావించకు. నాపై ఆగ్రహం చూపకు. ఈ దుశ్శకునాల గూర్చి లంకా పట్టణంలో ఉండే స్త్రీ పురుషు లందరికీ తెలుసు. ఈ అంతఃపురంలో నివసించేవాళ్ళకు కూడా తెలుసు. అయితే వాళ్ళంతా నీ ముందు చెప్పడానికి భయపడుతున్నారు. నేను నీకు స్వయాన తమ్ముణ్ణి కాబట్టి, చనువు తీసుకొని నీ క్షేమంకోరి నేను చూసింది, విన్నది నీకు చెప్పాలి కాబట్టి చెప్తున్నాను. నీవు సర్వమూ తెలిసినవాడవు. బాగా ఆలోచించి ఏది న్యాయమో అది చెయ్యి. ఏది ధర్మమో అది చెయ్యి."

విభీషణుడు ఈ విధంగా యుక్తియుక్తమైన మాటల్ని రావణుడు, మంత్రులతో కలసి కూర్చున్నప్పుడు విన్నవించుకున్నాడు. విభీషణుడిపై రావణాసురుడికి విపరీతమైన కోపం వచ్చింది. ఇలా అన్నాడు: "ఓ విభీషణుడా! రాముడు తలక్రిందులుగా తపస్సు చేసినా సీతాదేవిని తీసుకొనిపోలేడు. దేవేంద్రుడితో సహా దేవతలంతా అతడికి సహాయంగా వచ్చినా, వాళ్ళు నన్ను గెలువలేరు." ఇలా చెప్పి, విభీషణుని ఇంటికి పంపేశాడు.

# 11వ సర్గ రావణుడు మంత్రులతో సంప్రదించటం

సీత యెడల కామంతో కళ్ళు మూసుకుపోయిన ఆ రావణుడు సన్మార్గుడైన విభీషణుడు మున్నగువారిని అవమానించటంచేత, పాపకర్మల వల్లనూ కృశించిపోయాడు. రావణుడు సమయం మించిపోతోందని గ్రహించాడు. మంత్రుల్ని, మిత్రుల్ని సమావేశపరచాడు. మంతనాలు జరిపాడు. బంగారు కిటికీలతోను, రత్నవైడూర్యాలతో అలంకరించబడినదీ అయిన శ్రేష్ఠమైన రథాన్ని అధిరోహించాడు. కత్తులు, డాలు, ధరించిన రాక్షసయోధులు రథానికి ముందుగా బయలుదేరారు. అప్పుడా మహా రథం రాజ సభా భవనం వైపు బయలుదేరింది. రథానికి రెండు ప్రక్కలా రాక్షసయోధులు రక్షణగా నిలచారు. ఆ మహా రథాన్ని అనుసరించి రాక్షసయోధులు గుర్రాలమీద, ఏనుగుల మీద, రథాల మీద బయలుదేరారు. ఆ మహారథము విశాలమైన రాజవీధి గుండా రాజభవనానికి చేరుకుంది. అక్కడ వేలాది ప్రజలు గుమికూడి ఉన్నారు. వారంతా రావణునికి జయజయ ధ్వానాలు చేశారు. వాద్యాలు మ్రోగించారు. శంఖాలు పూరించారు. ఆ శబ్దాలన్నీ గాలిలో కలసి ఒకటై భూనభోంతరాళాలు నిండిపోయింది.

రాక్షసేంద్రునికి పట్టిన ఛత్రం చంద్రబింబంలాగా ప్రకాశించింది. ఆ ఛత్రానికి నడుమ బంగారు పూలగుత్తులమర్చారు. స్వచ్ఛంగా కాంతులు వెదజల్లే స్ఫటికాలు అమర్చారు. అట్టి రథంలో కూర్చున్న రావణునికి నేలపై ఉండే రాక్షసులంతా నమస్కారాలు చేశారు; జయజయ ధ్వానాలు చేశారు; ఆశీర్వచనాలు, స్తోత్రాలు పఠించారు. అంతట శత్రుసంహారకుడైన ఆ రావణుడు రథం దిగి మనోహరమైన సభా భవనంలోకి ప్రవేశించాడు. విశ్వకర్మచేత నిర్మితమైన ఆ రాజసభను ఆరువందల పిశాచాలు కాపలా కాస్తూ ఉంటాయి. అక్కడ అమర్చిన పరమాసనంపై మణులు వైడూర్యాలు పొదిగారు. ఆ ఆసనంపై ప్రియకమృగ చర్మాన్ని కప్పి ఉంచారు. అట్టి సింహాసనంపై రావణాసురుడు ఆసీనుడయ్యాడు.

అంతట రావణుడు తన సింహాసనంపై కూర్చుని, అతివేగంగా వెళ్ళే దూతల్ని పిలిచి

"శత్రువుల వ్యూహాలన్నీ తెలిశాయి; గొప్ప కార్యం సాధించాల్సి ఉంది. అందువల్ల మీరు అతివేగంగా పోయి రాక్షస వీరులందరినీ ఉన్నపళంగా తీసుకొనిరావాలి" అని ఆజ్ఞాపించాడు. అంతట ఆ దూతలందరూ అతివేగంగాపోయి విహార స్థలాల్లో ఉన్న వారిని, పడకటింట్లో ఉన్నవాళ్ళని, ఇతర విహారస్థలాలలో ఉన్నవాళ్ళనీ నిర్భయంగా కలసుకొని రావణుని ఆజ్ఞను తెలియపరచారు. ప్రభువాజ్ఞ వినగానే రాక్షస యోధులందరూ రథాల మీద, గుర్రాల మీద, ఏనుగుల మీద బయలుదేరి సభా భవనానికి చేరుకున్నారు. వాహనాలు లేనివారు కాలినడకనే వచ్చారు. ఆ లంకాపట్టణ పురవీథులన్నీ గుర్రాలు, ఏనుగులు, రథాలతో కిటకిటలాడిపోయాయి. వాళ్ళంతా కలసి సభాభవనం వైపు పరుగులు తీస్తూ ఉంటే ఆకాశంలో పక్షులు బారులుకట్టి పోతున్నట్లుగా ఉంది. వాళ్ళంతా వాహనాలు దిగి సభాభవనంలోకి పోతూ ఉంటే సింహాలు గుహలోకి వెళ్తున్నట్లుగా అనిపించింది. వాళ్ళంతా రావణాసురుడి పాదాలకు నమస్కరించారు. వారిలో కొందరికి బంగారు ఆసనాలపైన, కొందరికి దర్భాసనాలపైన, కొందరికి నేలపైన ఆసనాలు ఏర్పాటు చేయబడ్డాయి. వారివారి యోగ్యతల్ని బట్టి రావణుడికి సమీపంలో కూర్చోబెట్టారు. అట్టి అత్యవసర సమావేశానికి పండితులయిన ముఖ్యమంత్రులు, సర్వజ్ఞులైన అమాత్యులు, గుణవంతులైన అనేకమంది రాక్షస ముఖ్యులు వచ్చారు.

విచిత్రంగా తయారుచేయబడిన బంగారు రథంలో విభీషణుడు కూడా వచ్చాడు. అతడు సభలోకి అడుగుపెట్టగానే అన్నగారికి పాదాభివందనం చేశాడు. అట్లాగే శుకుడు, ప్రహస్తుడు కూడా పాదాభివందనం చేశారు. ఆ ముగ్గురు వాళ్ళ యోగ్యతలకు తగిన ఆసనాలపై కూర్చున్నారు. రాక్షసవీరులు ధరించిన వస్త్రాల నుండి వచ్చే శ్రేష్ఠమైన చందన, అగరు వంటి పైపూతల వాసనతోనూ, పూలమాలల్నించి వచ్చే సువాసనలతోను సభ అంతా గుబాళించింది. సభాస్థలం అంతా నిశ్చబ్దంగా ఉంది. అందులో ఒక్కడు గట్టిగా మాట్లాడేవాడు లేదు. అంతా భయంకరమైన పరాక్రమవంతులే. అసత్యం ఒక్కడూ చెప్పలేదు. అంతా రావణుని నోటి నుండి ఏమాట వస్తుందోనని ఎదురు చూస్తున్నారు. అంతమంది రాక్షసయోధుల నడుమ కూర్చున్న రావణుడు వసువుల మధ్యన కూర్చున్న దేవేంద్రుడిలాగా ప్రకాశించాడు.

# 12వ సర్గ రావణునికి కుంభకర్ణుని అభయం

రావణాసురుడు సభనంతా ఒకసారి కలయజూశాడు. అంతట ప్రహస్తుని పిలిచి, "ఓ సేనాపతీ! నేను ఒక ముఖ్యమైన విషయాన్ని ప్రస్తావిస్తున్నాను. వివిధ రంగాల్లో ఆరితేరిన చతుర్విధ యోధుల్నీ నగర రక్షణలో జాగరూకులై ఉండమని ఆజ్ఞాపించు" అన్నాడు.

అంతట ప్రహస్తుడు కాసేపు బయటకువెళ్లి తిరిగి వచ్చి, "మహారాజా! మన బలగాన్నంతా నగరానికి లోపల, బయట, మందిరం చుట్టూ కాపలా ఉంచాను. ఇకమీద చేయదలచినదంతా యథేచ్ఛగా చేసుకోవచ్చు" నని మనవి చేసుకున్నాడు.

తరువాత రావణాసురుడు సభాసదులతో ఇలా అన్నాడు: "ఓ సభాసదులారా! ధర్మార్థ కామాలకు సంబంధించిన సమస్యలు ఎదురైనప్పుడు మీరంతా, ప్రియాతిప్రియాల గురించి, కష్టసుఖాల గురించి లాభనష్టాల గురించి, సుఖదుఃఖాల గురించి బాగా ఆలోచించి మంచి నిర్ణయం తీసుకోగల సమర్థులు. పూర్వం మీరంతా చక్కగా ఆలోచించి నా చేత అనేకమైన పనులు చేయించారు. అవన్నీ మంచి ఫలితాలు పొందాయి. ఒక్కసారి కూడా మనం అపజయం పొందలేదు. సూర్యచంద్రుల, నక్షత్రాల, గ్రహాల, దేవతల సహకారంతోనే దేవేంద్రుడు విజయలక్ష్మిని చేపట్టగలిగాడు. అట్లాగే మీరందరూ నాతో సహకరించడం వల్లనే విజయం పొందగలిగాను.

"ఇప్పుడు నేను మీతో చెప్పాలని అనుకున్న విషయం ఇదివరకే మీకు చెప్పాలని అనుకున్నాను. మహాబలవంతుడు, సర్వశాస్త్రకోవిదుడు అయిన నా తమ్ముడు కుంభకర్ణుడు నిద్రపోతూ ఉండటం వల్ల చెప్పలేదు. ఇప్పుడతడు నిద్రలేచాడు. అందువల్ల కుంభకర్ణుడి సమక్షంలో మీ అందరికీ ఒక విషయం చెప్తున్నాను.

"ఓ వీరులారా! రాక్షసులు సంచరించే దండకారణ్యం నుండి జనకుడి కుమార్తె, రాముడి

భార్య అయిన సీతాదేవిని అపహరించుకొని వచ్చాను. ఆమె గొప్ప అందగత్తె. ఆమెవంటి అందగత్తె ముల్లోకాల్లోనూ లేదు. ఆమెను నా వశం కమ్మని ఎన్నో విధాలుగా చెప్పిచూశాను. కానీ ఆమె ససేమిరా, అంగీకరించనంది. ఆమె కూడా మయుడు నిర్మించిన మాయయేమోనని అనుకుంటాను. ఆమె ముఖం శరత్కాల చంద్ర బింబంలాగా ఉంటుంది. ఆ బంగారు బొమ్మ అసమాన సౌందర్యవతి. ఎర్రని అరికాళ్ళు, ఎర్రని గోళ్ళు, నేలమీద పాదాన్నంతా సమంగా మోపే ఆమె పాదాల మృదుత్వము, ఆమె దేహకాంతులు అగ్నిహోత్ర ప్రజ్వాలల్లాగాను, సూర్యప్రభలాగాను ఉంటుంది. ఆమెను చూస్తుంటేనే మన్మథుడు నన్ను దహించివేస్తున్నాడు. ఆమె ముక్కు సన్నగా కోటేరుతేలి ఉంటుంది. ఆమె అందమైన కళ్ళు, సుందరమైన ముఖము, చూసి నేను కామంతో కాలిపోతున్నాను. నేను కోపంతో ఉన్నా, సంతోషంతో ఉన్నా, మానసికంగా నలిగిపోతున్నా, శారీరకంగా దహించుకు పోతున్నా ఆ మన్మథుడు మాత్రం నన్ను ఒదలడం లేదు. ఆ సాధ్వి తన భర్త వస్తాడనే నమ్మకంతో ఉంది. అందుకనే నన్ను ఒక సంవత్సరం గడువు అడిగింది. ఆమెపట్ల మమకారంతో ఆమె కోరికను మన్నించి ఒక సంవత్సరం గడువుకు అంగీకరించాను. విశ్రాంతి లేకుండా చాలాదూరం ప్రయాణం చేసిన గుర్రంలాగా నేను కామభారంతో అలసిపోతున్నాను.

“మిత్రులారా! తిమింగలలాకు ఆలవాలమైన ఈ గంభీరమైన సముద్రాన్ని ఆ వానరసేనలు ఎట్లా దాటి రాగలరు? ఆ రామలక్ష్మణులు మాత్రం ఎట్లా దాటివస్తారు? వాళ్ళు దాటిరాలేరని గట్టిగా చెప్పనూ లేము! ఎందువల్లనంటే ఇదివరకు ఒక వానరుడు వచ్చి మనతో యుద్ధం చేసి నానాబీభత్సాన్ని సృష్టించిపోయాడు. మీరు బుద్ధిమంతులు. లోగడ చాలాసార్లు మీ సలహా పాటించి దేవాసుర యుద్ధాలలో జయం సంపాదించాను. అప్పట్నుంచీ మీరు నాతో కలసి మెలసి ఉంటున్నారు. దేవతల్నే జయించిన నాకు మానవులంటే భయంలేదు. అయినా కూడా మీరంతా ఈ విషయం బాగా ఆలోచించి మీ బుద్ధికి తోచింది చెప్పండి. రామలక్ష్మణులు, సుగ్రీవుడు మున్నగు వారంతా సీతాదేవి ఉన్నచోటును తెలుసుకోగలిగారు. వాళ్ళిప్పుడు సముద్రానికి అవతలిగట్టున ఉన్నారు. సీతాదేవిని తిరిగి ఇవ్వటం నాకు సుతరామూ ఇష్టం లేదు.

సీతాదేవిని వదలుకోకుండా మనం ఆ రామలక్ష్మణుల్ని సంహరించే ఉపాయాన్ని నాకు ఆలోచించి చెప్పండి. సముద్రాన్ని దాటే సామర్థ్యం వానరులకు ఉంటే ఉందేమోకానీ, రామలక్ష్మణులకు మాత్రం లేదు అని అనుకొంటున్నాను. నేను తప్పకుండా జయించాలని అనుకొంటున్నాను."

కామప్రకోపంతో అసంబద్ధంగా మాట్లాడుతున్న రావణుని మాటలు విన్ని కుంభకర్ణుడికి కోపం ముంచుకొచ్చింది. "ఓ రాజా! నీవు రాముని భార్యను బలాత్కారంగా అపహరించి తెచ్చేటప్పుడు మమ్మల్నెవర్నీ సంప్రతించలేదు. బాగా ఆలోచించిన తర్వాతనే ఏ పనైనా చెయ్యాలి. తీరా చేసిన తర్వాత ఇవాళ తర్జనభర్జన పడటంలో ప్రయోజనం ఏమీ ఉండదు. నీవు ఈ పని చేసే ముందే మమ్మల్ని అడిగి ఉంటే, నీకు ఈ మనస్తాపం లేకుండాపోయేది.

"రావణా! ఏ రాజు తను చేసే పని న్యాయసమ్మతంగా ఉందో లేదో ఆలోచించుకొని చేస్తాడో, అటువంటి రాజుకు పశ్చాత్తాప పడవలసిన పరిస్థితులు ఏర్పడవు. ఏది నీతి అయినది? ఏది అవినీతి అయినది? అన్న విచక్షణ లేనివాడే ముందు పనులు వెనుక, వెనుక పనులు ముందు చేస్తూ ఉంటాడు. ఉపాయం తెలియకుండా చేసే పనులు అశుచి అయిన వాళ్ళు ఇచ్చే హవిస్సుల్లాగా వ్యర్థం అయిపోతాయి. బలం ఉంది గదా! అని పనులు చేస్తే, కుమారస్వామి క్రౌంచపర్వతానికి రంధ్రం వేయగా, పక్షులు ఈ మూల నుండి ఆ మూలకు పోతూ ఉన్నట్లుగా, ఇతరులు ఆ పని వల్ల లబ్ధి పొందుతూ ఉంటారు. నీవు ఆలోచించకుండా చేసిన ఈ పనికి, నీ అదృష్టం బాగుండి రాముడు నిన్ను ఇంకా చంపలేదు. దోషరహితుడవైన ఓ రావణా! నువ్వు అనాలోచితంగా శత్రువు విషయంలో చేసిన ఈ పనికి నేను ఆ శత్రువునే చంపి సరిచేస్తాను. రావణా! దిగులు పడకు, నేను ఆ శత్రువును చంపేస్తాను. ఆ శత్రువులు ఇంద్రసూర్యులైనా, అగ్నివాయువులైనా, కుబేర వరుణులైనా వాళ్ళతో యుద్ధం చేస్తాను. పర్వతం లాంటి నా శరీర బలంతో, వాడియైన నా కోరల్తో, పరిఘ నొకటి చేత పుచ్చుకొని యుద్ధంలో గర్జిస్తూ ఉంటే, నన్ను చూసి దేవేంద్రుడైనా భయపడతాడు. రాముడు నన్ను ఒక బాణంతో కొట్టి రెండో బాణాన్ని విడిచే

లోపుగానే అతడి రక్తాన్ని తాగేస్తాను. నీవు ఇక భయపడకు. నేను రాముణ్ణి చంపి, నీకు జయాన్నిచ్చి సుఖపడేట్లు చేస్తాను. ముందు రామలక్ష్మణు లిద్దర్నీ చంపేసి, ఆ పైన వానరులందర్నీ తినేస్తాను. పోయి ఆనందంగా గడుపు, శ్రేష్ఠమైన మద్యాన్ని సేవించు, భయం లేనివాడినై సుఖంగా ఉండు. నేను రాముణ్ణి చంపిన తర్వాత సీత నీకు చాలాకాలం వశవర్తియై ఉంటుంది.”

# 13వ సర్గ రావణుని ఆత్మ స్తుతి

కుంభకర్ణుడి మాటలకు రావణునికి కోపం వచ్చింది. ఆ విషయం గ్రహించిన మహాపార్శ్వుడు కొద్దిసేపు ఆలోచించి లేచి నిలబడి, రావణునికి నమస్కరించి ఇలా అన్నాడు:

"మహారాజా! క్రూరమృగాలతో నిండిన అరణ్యంలోకి ప్రవేశించిన తర్వాత, శ్రేష్ఠమైన మధువును పొంది కూడా దాన్ని తాగకుండా వచ్చేవాడు మూర్ఖుడు. ఓ శత్రు వినాశకుడా! నీవు సర్వసమర్థుడవైన ప్రభువువైనప్పుడు నీకు మరొక నియంత ఎక్కడున్నాడు? నీవు ఆ శత్రువు తల తొలగించి ఆ వైదేహితో క్రీడించు. నీవు మహాబలవంతుడవు. కోడిపుంజు మాదిరిగా, సీతను బలాత్కారంగా, ఆక్రమించి అనుభవించు; ఆనందించు. నీ కోరిక నెరవేరిన తర్వాత ఇంక ఎవరికి భయపడాలి? ఒకవేళ ఏదయినా ఆపద ముంచుకొస్తే అంతా కలసి అందుకు ప్రతీకారచర్య తీసుకుందాం. వజ్రాయుధం తీసుకొని ఇంద్రుడే రాముడికి తోడుగా వచ్చినా కూడా, నేనున్నాను; కుంభకర్ణుడున్నాడు; ఇంద్రజిత్తు ఉన్నాడు. మేము ముగ్గురమే చాలు. నీకు విజయం చేకూర్చి పెట్టగలం. రాజా! ఈ సామదాన భేదోపాయాలన్నది యుద్ధం చేయడం చేతకాని వాళ్ళకోసం ఏర్పాటు చేశారు. దండోపాయం వల్లనే కార్యసిద్ధి అవుతుంది. ఓ రాజా! నీవు మహాబలవంతుడవు. శత్రువులే ఇక్కడకు రావడం జరిగితే శస్త్రబలంలో వాళ్ళందర్నీ సంహరిస్తాం."

మహాపార్శ్వుడు ఇట్లా చెప్పి కూర్చోగానే రావణుడు అతణ్ణి మెచ్చుకుంటూ ఇలా పలికాడు: "ఓ మహాపార్శ్వుడా! నాకు సంబంధించిన రహస్యం ఒకటి ఉంది. అది చెప్తాను. విను. చాలాకాలం క్రిందట 'పుంజికస్థల' అనే అప్సరసాంగన బ్రహ్మదేవుడి దగ్గరకు పోతూ ఉంది. నేను ఆమెను ఎక్కడ చూస్తానో అనే భయం కొద్దీ ఆమె ఆకాశంలో దాక్కుంటూ పోతోంది. అప్పుడు నేనా అప్సరసాంగనను చూశాను; బలవంతంగా ఆమెను వివస్త్రను చేసి అనుభవించాను. ఆమె అప్పుడు నలిగిపోయిన తామరకాడలాగా బ్రహ్మదేవుడి వద్దకు పోయింది.

మహాత్ముడైన బ్రహ్మదేవుడు విషయం అంతా గ్రహించాడు. నాపై ఆగ్రహించాడు. కోపంతో నన్ను చూసి "ఇకపై పరస్త్రీలను బలాత్కారంగా సంభోగించేట్లయితే నీ తల నూరు ముక్కలవుతుం" దని శపించాడు. నాకా శాపం సంగతి బాగా గుర్తుంది. అందువల్లనే నేను వైదేహిని బలాత్కరించి సుందరమైన నా శయనంపైకి చేర్చుకోలేదు.

"ఓ మహాపార్శ్వుడా! నాకు సముద్రానికున్నంత వేగమూ, వాయువు కున్నంత గమనమూ ఉన్నాయి. ఈ సంగతి ఆ రాముడికి తెలియదు. అందువల్లనే అతడు నా పైకి వస్తున్నాడు. పర్వత గుహలో ఉన్న సింహంలాగా, కోపించిన మృత్యువు వంటి నన్ను రెచ్చగొడుతున్నాడు. నేను రెండు నాలుకల సర్పాల్లాంటి బాణాల్ని వదలడం ఆ రాముడు ఎప్పుడూ చూసి ఉండడు. అందుకే నా పైకి వస్తున్నాడు. మదపుటేనుగును కొరువులతో అదుపు చేసేట్లు నేను వజ్రాయుధం వంటి బాణాలు వందలకొద్దీ ప్రయోగించి ఆ రాముణ్ణి నిగ్రహిస్తాను. ఉదయసూర్యుడు నక్షత్రాల కాంతిని హరించినట్లు రాముడి బలాన్ని లాగేస్తాను. దేవేంద్రుడు వరుణుడు కూడా నన్ను యుద్ధంలో జయించలేకపోయారు. ఒకప్పుడు లంకాధీశ్వరుడైన కుబేరుణ్ణి నా బాహుబలంలో జయించాను. నాకు రాముడు గానీ, ఆ వానర సైన్యంగానీ ఒక లెక్కా?"

# 14వ సర్గ విభీషణుని హితోపదేశం

విభీషణుడు రావణుడి మాటలు విన్నాడు. కుంభకర్ణుడి గర్జనలు విన్నాడు. రావణుని హితాన్ని కోరి అర్థవంతమైన మాటలను ఈ విధంగా చెప్పాడు:

"ఓ రాజా! సీత అనే మహా సర్పాన్ని నీ మెడకు చుట్టిన వాడెవడు? ఈ సర్పానికి వక్షః స్థలమే పడగగాను, ఆమె చింతయే విషంగాను, చిరునవ్వులే కరకైన కోరలు గాను, ఆమె అయిదు వేళ్ళే అయిదు తలలుగాను ఉండే ఆ సీతాదేవి అనే సర్పాన్ని నీ మెడకు చుట్టినదెవరు? గోళ్ళు, కోరలే ఆయుధాలుగా పోట్లాడే వానరుల్లో పర్వతాకారులున్నారు. కాబట్టి వాళ్ళంతా లంకలో ప్రవేశించే ముందే, సీతాదేవిని రాముడికి ఇచ్చివెయ్యి. నీవు అట్లా చేస్తే సుఖంగా బ్రతుకగలవు.

"వజ్రాయుధంతో సమానవైనవి, వాయువు వంటి వేగం గలవి, అయిన రాముని బాణాలు రాక్షసుల్ని సంహరించక ముందే సీతను ఇచ్చివేయటం మంచిది.

"ఓ ప్రహస్తుడా! పిడుగుల్లాంటి రాముడి బాణాలు వచ్చి ఇంకా నీ శరీరంలోకి చీల్చుకొని పోలేదు. అందువలన నీవు ఇన్ని ప్రగల్భాలు పలుకుతున్నావు. యుద్ధంలో రాముడి ఎదుట కుంభకర్ణుడుగాని, ఇంద్రజిత్తుగాని, మహాపార్శ్వుడుగాని, మహోదరుడుగాని, నికుంభుడు కాని, కుంభుడు కాని, అతికాయుడు కాని, మన ప్రభువైన రావణుడు కానీ నిలువలేరు. ఓ వీరుడా! నిన్ను సూర్యచంద్రులు దాచి ఉంచినా రాముడి బాణం నుండి తప్పించుకోలేవు. నువ్వే దేవేంద్రుడి వద్దకుగాని వరుణుని వద్దకు గాని వెళ్ళి రక్షణ కోరినా కూడా, వాళ్ళు నిన్ను రక్షించలేరు. నిన్ను ఆ మృత్యువే కాపాడినా, నీవు ఆకాశానికి ఎగిరిపోయినా, పాతాళానికి పోయి దాక్కున్నా నిన్ను ఆ రాముడు వదలడు."

ప్రహస్తుడు: ఓ విభీషణుడా! మాకు భయం అంటే ఏమిటో తెలియదు. మేము దేవతలతో,

దానవులతో యుద్ధం చేశాం. కానీ ఎన్నడూ భయం ఎరుగం. గంధర్వుల, మహోరగుల, పక్షుల వలనకానీ ఎన్నడూ భయపడలేదు. అటువంటిది ఈ మానవమాత్రుడు రాముని చూసి భయపడటమా?

ప్రహస్తుడు చెప్పిన మాటలు విన్న విభీషణుడు రాజు క్షేమాన్ని కోరి, ధర్మార్థ కామాలను గూర్చి ఇలా వివరించి చెప్పాడు.

విభీషణుడు: "ఓ ప్రహస్తుడా! ధర్మాన్ని ఆచరించనివాడు స్వర్గానికి పోలేడు. అదేవిధంగా రావణుడు, మహాపార్శ్వుడూ, కుంభకర్ణుడు మున్నగు వారంతా ఏఏ పనులు చేస్తామని పలికారో అవన్నీ రాముడి విషయంలో సాధ్యం కావు. కనీసం తెప్పకొయ్య అయినా లేనిదే సముద్రాన్ని ఎట్లా దాటలేమో, అట్లాగే ధర్మాన్ని విడిచినవారు రాముని ఎదిరించి నిలబడలేరు. రాముడు మహారథుడు, పరాక్రమవంతుడు. ఇక్ష్వాకు వంశంలో జన్మించాడు. అతడు పరమ ధార్మికుడు. అటువంటి రాముడి ముందు దేవతలు కూడా నిలబడలేరు. దేవేంద్రుడితో సమానమైన రాముణ్ణి, రావణుడు గాని, త్రిశీర్షుడుగాని, కుంభకర్ణుని పుత్రుడైన నికుంభుడుగాని, ఇంద్రజిత్తుగాని ఎదిరించలేరు. దేవాంతకుడుగాని, నరాంతకుడుగాని, అతికాయుడుగాని, అకంపనుడు గాని, యుద్ధంలో రాముని ఎదుట నిలువలేరు.

ఈ రాజు కామాతురుడై, ఆలోచించకుండా పనులు చేస్తున్నాడు. అటువంటి ఈ రాజుకు మీరు యథార్థాన్ని చెప్పకుండా అమిత్రుల్లాగా తలలూపుతున్నారు. అది రాక్షస వినాశనానికే దారి తీస్తుంది. వెయ్యి శిరస్సులు గల బలమైన సర్పం ఈ రాజు మెడకు చుట్టుకొని ఉంది. అటువంటి రాజుకు మీరంతా చేయూతనిచ్చి పైకి లేవదీయండి. ఆ సర్పాన్నుండి విడిపించండి. భయంకరమైన భూతం ఆవహించినవాడిని జుట్టు పట్టుకుని బయటకు లాగినట్లుగా, దుర్మార్గాలు చేస్తున్న రాజును స్నేహితులందరూ కలసి బలవంతంగా నిగ్రహించి రక్షించాలి. మన రాజు, రాముడనే సముద్రంలో పూర్తిగా మునిగిపోతున్నాడు; రాముడనే పాతాళంలో పడిపోతున్నాడు. అటువంటి రాజును మిత్రులంతా కలసి రక్షించాలి. చివరిసారిగా మీ అందరికీ

నేను చెప్పే హితమైన మాట ఏమిటంటే, సీతను రాముడికి ఇచ్చివెయ్యి.

మంత్రి అయినవాడు తన బలపరాక్రమాలకూ, తన రాజు స్థానాన్ని, వృద్ధి క్షయాల్ని, శత్రు స్థానాన్ని, వారి వృద్ధి క్షయాల్ని బేరీజు వేసుకోవాలి. చివరగా తన ప్రభువుకు ఏది మేలు కలిగిస్తుందో దాన్నే చెప్పి చేయించాలి."

# 15వ సర్గ విభీషణునితో ఇంద్రజిత్తు విభేదించటం

బృహస్పతితో సమానమైన బుద్ధిగల విభీషణుని అంతా శ్రద్ధగా విన్నారు. మహాబుద్ధిశాలి, రాక్షస సైన్యంలో ముఖ్యుడు అయిన ఇంద్రజిత్తు ఇలా అన్నాడు.

ఇంద్రజిత్తు: "చిన్న నాయనా! నువ్వు ఇంత పిరికివాడవని అనుకోలేదు. సామాన్యులు కూడా ఇంత పిరికిగా మాట్లాడరే! అటువంటిది పులస్త్య వంశంలో పుట్టిన వారు మాట్లాడవలసిన మాటలేనా? నీ అంతటి వారు ఇట్లా మాట్లాడకూడదు. మన వంశంలో బలం, శౌర్యం, పరాక్రమం, ధైర్యం, వీర్యం లేనివాడవు నీవు ఒక్కడివే సుమా! ఆ రామలక్ష్మణులంటే సామాన్య మానవులు. వాళ్లను మన రాక్షసుల్లో ఏ ఒక్కడైనా సంహరించగలడు! ఎందువల్ల మాకు పిరికి మందు నూరిపోస్తున్నావు? ముల్లోకాలకు ప్రభువు అయిన దేవేంద్రుడినే ఓడించాను. దేవతలంతా తలో దిక్కుకు పారిపోయారు. నేను ఐరావతాన్ని ఒక్క గుద్దు గుద్దితే నేలమీద పడి పొర్లిగింతలు పెట్టింది. దాని దంతాలు రెంటినీ ఊడబెరికాను. ఉత్తములైన దైత్యుల్ని చావగొట్టాను. అంతటి పరాక్రమవంతుడనైన నేను సామాన్య మానవుల్ని ఓడించలేనా?

అంతట శస్త్రధారులలో శ్రేష్ఠుడు అయిన విభీషణుడు, ఇంద్రునితో సమానమైన పరాక్రమం గల ఇంద్రజిత్తు మాటలు విని ఇలా అన్నాడు.

విభీషణుడు: "నాయనా! నీవు వయసులో చిన్నవాడవు. ఇంకా బుద్ధి పరిపక్వత కాలేదు. ఇటువంటి మాటల్తో నిన్ను నువ్వు నాశనం చేసుకుంటున్నావు. ఓ ఇంద్రజిత్తూ! రాముడు వలన రావణుడికి జరగబోయే అనర్థాన్ని చెప్పినా కూడా, నీవు మూర్ఖంగా రాముణ్ణి తక్కువగా అంచనా వేస్తున్నావు; నోటికి వచ్చిందల్లా మాట్లాడుతున్నావు. ఒక ప్రక్క నుండి నీ తండ్రికి రాముడి వల్ల పరాభవం జరగబోతోందని తెలిసి కూడా అందుకు అంగీకరిస్తున్నావంటే, నీవు రావణుడికి పుత్ర రూపంలో ఉన్న శత్రువు. రాజు, నా అన్నగారైన రావణుని మరణాన్ని సమర్థిస్తున్న నీవు చంపదగినవాడవు. ముక్కు పచ్చలారని బాలుణ్ణి ఈ మంత్రి సభలోకి తీసుకొనివచ్చి ఎవరు

కూర్చోబెట్టారో అతణ్ణి కూడా చంపవలసిందే!

ఓ ఇంద్రజిత్తూ! నీవు మూర్ఖుడవు. తెలివితక్కువవాడవు. అల్పబుద్ధివి. దుష్టబుద్ధిగలవాడవు. అందువల్లనే పెద్దలంటే వినయం, గౌరవం లేకుండా మాట్లాడుతున్నావు. రాముడి బాణాలు సూర్యకిరణాల్లాగా, బ్రహ్మాండం అంతా ప్రకాశించే మృత్యుదేవత అని తెలుసుకోలేకపోతున్నావు. యమదండం వంటి ఆ బాణాలను రాముడు యుద్ధంలో ప్రయోగిస్తూ ఉంటే వాటిని తట్టుకొని ఎవరూ నిలబడలేరు.

ఓ రాజా! ధనాన్ని, విలువైన రత్నాల్ని, ఆభరణాల్ని దివ్యమైన వస్త్రాలతో పాటు సీతాదేవిని కూడా సమర్పించుకో! అట్లా చేయడం వల్ల నీవు, నేను, ఈ రాక్షస రాజ్యం కూడా సుఖంగా ఉంటాం.

# 16వ సర్గ విభీషణుడు రావణుని విడిచి వెళ్ళటం

బుద్ధిమంతుడైన విభీషణుడు చెప్పిన హితకరమైన మాటలన్నీ రావణుడు విన్నాడు. తమ్ముడిపై పట్టరానంత కోపం వచ్చింది, ఇలా అన్నాడు.

రావణుడు: "ఓ విభీషణుడా! శత్రువులతోను, పగపట్టిన విషసర్పాలతోనైనా కలిసి జీవించవచ్చునేమోకాని, మిత్రుడనని చెప్పుకుంటూ ఉండే శత్రువుతో కలిసి ఉండకూడదు. ముల్లోకాల్లోనూ జ్ఞాతులు ఎట్లా ప్రవర్తిస్తారో నాకు తెలుసు. వాళ్ళు ఎప్పుడూ తమ జ్ఞాతులకు ఆపదలు రావాలని కోరుకుంటూ ఉంటారు. ఆ విధంగా ఆపదలు వస్తే సంతోషిస్తారు.

జ్ఞాతులు ఎప్పుడూ కూడా సమర్థుడు, కార్యసాధకుడు, విద్యావంతుడు, ధర్మస్వభావం కలవాడు, శూరుడైన జ్ఞాతిని చులకనచేసి మాట్లాడతారు; కీడు కోరుకుంటారు. ఇక ఆ జ్ఞాతి రాజు అయినా, లేక ఏదైనా ప్రధానమైన పదవిలో ఉన్నవాళ్ళైతే ఇకవారి అవస్థ వర్ణనాతీతం. అటు కక్కనూ లేక, ఇటుమింగనూ లేక, మనస్సులో ఒకటి పెట్టుకొని బయటకు ఒకటి మాట్లాడుతూ ఉంటారు. అన్యోన్యంగాను, స్నేహంగాను ఉన్నట్లే ఉంటారు; కష్టకాలం రాగానే ద్రోహంచేస్తారు. జ్ఞాతులు భయంకరులు, ద్రోహులు, నయవంచకులు.

విభీషణుడా! పూర్వం పద్మవనంలో తమను బంధించటానికి తాళ్ళు, ఇనుపగొలుసులతో వచ్చిన మనుషుల్ని చూసి ఏనుగులు కొన్ని శ్లోకాలు చదివాయి. ఆ శ్లోకాలకు భావం చెప్తాను విను. "అగ్ని మనల్ని ఏమీ చెయ్యలేదు. మనల్ని బంధించటానికి మనుష్యులొచ్చినప్పుడు, వాళ్ళతో కూడా వచ్చిన మన జాతి ఏనుగులే వాళ్ళకు మనల్ని బంధించే ఉపాయాల్ని చెప్తాయి. మనతో స్నేహం నటిస్తూ మనం బందీలమయ్యేట్లు చూస్తాయి. అందువల్ల మన జ్ఞాతుల్ని చూసి మనం భయపడాలి. సౌమ్యుడా! నేను ఈ విధంగా లోకంలో గౌరవించబడటం, సిరిసంపదలతో తులతూగడం, శత్రువుల్ని చెప్పుకింద తేలువలె ఉంచుకోవడాన్ని నువ్వు చూడలేకుండా ఉన్నావు. తామరాకు మీదపడిన బిందువులు ఏ విధంగా ఆకును అంటకుండా ఉంటాయో,

అన్నింటిలోనూ, జ్ఞాతిభయం చాలా ప్రమాదకరమైనది. ఈ విషయం అందరికీ తెలిసిందే.

సంపద అంతా ఆవుల్లో ఉంటుంది. ఇంద్రియ నిగ్రహం (తపస్సు) బ్రాహ్మణుల్లో ఉంటుంది. చాపల్యం స్త్రీలల్లో ఉంటుంది. అదేవిధంగా ఎంత స్నేహం చేసినా, జ్ఞాతి అనేవాడు దుష్టుడు అయితే అతడితో కలసి ఉండకూడదు. తుమ్మెదలు పూలలోనుండి తమకు కావలసినంత తేనెను త్రాగుతాయి, తర్వాత ఆ పూలను విడిచి వెళ్ళిపోతాయి. అదేవిధంగా నీవు నాతో ఉంటూ సమస్త భోగాలు అనుభవించావు, ఇప్పుడు నీవు తుమ్మెదలాగా ప్రవర్తిస్తున్నావు.

ఓ విభీషణుడా! ఏనుగు తృప్తిగా స్నానం చేస్తుంది. బైటకు రాగానే తొండంతో దుమ్ము అంతా తీసి ఒంటినిండా పోసుకుంటుంది. అట్లాగే దుష్టుడు ముందు స్నేహం చేస్తాడు. ఆ తరువాత ఆ స్నేహాన్ని అతడే చెడగొడతాడు. శరత్కాలంలో మేఘాలు ఉరుములు మెరుపుతో పెద్దగా వాన కురిపించేట్లు హడావిడి చేస్తాయి. కానీ తీరాచూస్తే బట్టదడుపు వానయైనా పడదు. అట్లాగే దుష్టులు స్నేహితుడికి ఉపకారం చేస్తున్నట్లుగా గర్జిస్తూ ఉంటారు, కానీ ఉపకారం చెయ్యరు. ఓ విభీషణుడా! నీవు నాకు తమ్ముడవు కావటం వలన బ్రతికిపోయావు. అదే ఇంకోడు, ఇంకోడు అయితే వాడి ప్రాణాలు తక్షణమే తీసేవాడిని. ఛీ! నువ్వు మన వంశాన్ని నాశనం చెయ్యటానికే పుట్టావు.

రావణాసురుడు ఆ విధంగా పరుషమైన మాటలనగానే, విభీషణుడు గద చేతితో పట్టుకొని ఆకాశంలోకి ఎగిరాడు. అతడితోపాటు మరో నలుగురు మంత్రులు కూడా అతడిని అనుసరించి వెళ్ళారు. అంతట విభీషణుడు రావణునితో ఇలా అన్నాడు.

విభీషణుడు: "ఓ రాజా! నీవు నాకు అన్నవు. అన్నగారు తండ్రి వంటివాడు, నీకు కోపంవస్తే, నీ ఇష్టం వచ్చినట్లల్లా అను. అన్నా! నీవు ధర్మమార్గం తప్పావు. నీవు నాపై చేసిన ఆరోపణలన్నీ అసత్యమైనవి. నీవు అన్న అసత్యాన్ని మాత్రం నేను మన్నించలేను. నీ మేలు కోరి ఎంతో జాగ్రత్తగా ఆలోచించి, నీకు ఉత్తమమైనదీ, తప్పక నీవు ఆచరించదగినదీ మాత్రమే నేను

చెప్పాను. కానీ రాజా! పోయేకాలం దగ్గర పడ్డవాళ్ళకు మంచిమాటలు రుచించావు, నీ మెప్పుకోసం నిన్ను సంతోషపెట్టే మాటలు చెప్పేవాళ్ళు చాలామంది దొరుకుతారు. కానీ, వినేటప్పుడు కష్టంగా ఉన్నా, నీ హితంకోరి చెప్పేవాళ్ళు ఎక్కడో ఒకళ్ళో అరో ఉంటారు. నీకు వినాశకాలం దాపురించిందని గ్రహించాను. తగలబడిపోతున్న ఇంటిని చూస్తూ ఊరుకోలేనట్లుగా, నీకు హితకరమైన మాటలు చెప్పాను. అన్నా! అగ్నిహోత్రం వంటి తేజోవంతమైన రాముడి బంగారు బాణాలు నీ శరీరంలో దిగబడుతూ ఉంటే నేను చూడలేను. శూరులు, బలవంతులు, అస్త్రవేత్తలుకూడా కాలం మూడినప్పుడు, ప్రవాహానికి ఇసుకతో వేసిన ఆనకట్టలాగా యుద్ధంలో నేలకూల్తారు. నీవు నాకు అన్నగారివి కావటం వలన నీ మేలుకోరి చెప్పాను, అందుకు నన్ను క్షమించు. రాముడి బాణాలనుండి నిన్ను, ఈ నగరాన్ని, రాక్షసుల్ని రక్షించుకో.

ఓ రావణా! నీ మేలు కోరి చెప్పిన మాటలు నీకు నచ్చటంలేదు. పోగాలము దాపురించినవాడు మిత్రునిమాట వినడు అని పెద్దలంటారు. నీ విషయంలో అది సత్యం అయింది.”

# 17వ సర్గ విభీషణుడు రాముణ్ణి ఆశ్రయించడం

విభీషణుడు రావణునితో పరుషమైన మాటలు పలికి తన నలుగురు అనుచరుల్తో కలసి, క్షణాల్లో రామలక్ష్మణులున్న చోటుకు చేరుకున్నాడు. మేరుశిఖరంలాగా ప్రకాశిస్తున్నవాడై మెరుపులాగా ఆకాశంలో వస్తున్న విభీషణుని వానరులంతా చూశారు. విభీషణుడు అతడి అనుచరులు కూడా ఉత్తమమైన దుస్తులు, అలంకారాలు ధరించారు. మేఘమువంటివాడు, పర్వతంతో సమానమైనవాడు, వజ్రాయుధంవంటి కాంతి గలవాడైన ఆ విభీషణుణ్ణీ, అతడి నలుగురు అనుచరుల్నీ సుగ్రీవుడు చూశాడు. బుద్ధిమంతుడైన సుగ్రీవుడు ఆ రాక్షసులను గూర్చి వానర నాయకులతో చర్చించాడు.

సుగ్రీవుడు: “ఓ వానరవీరులారా! ఈ రాక్షసుడు తనతోపాటు మరో నలుగురు రాక్షసుల్ని వెంటబెట్టుకొని వస్తున్నాడు. వాళ్ళంతా కవచాలు, రకరకాలైన ఆయుధాల్ని ధరించి ఉన్నారు. ఏమరుపాటున ఉంటే మనల్ని చంపడానికే వచ్చారా?” అన్నాడు. అంతట ఆ వానరవీరులంతా

వానవీరులు: “రాజా! నీ అనుజ్ఞ అయితే, మేము వీళ్ళను చెట్లకొమ్మల్తోను, రాళ్ళతోను కొట్టి చంపేస్తాం. వీళ్ళంతా మందబుద్ధులు, నీ అనుజ్ఞ అయితే వాళ్ళందర్నీ కొట్టిచంపి నేలపై పడేట్లు చేస్తాం” అన్నారు.

ఇంతలో సముద్రం దాటి వచ్చిన విభీషణుడు ఇంకా ఆకాశంలోనే నిలబడి, సుగ్రీవుణ్ణి, వానరుల్ని చూస్తూ బిగ్గరగా అరుస్తున్నట్లుగా ఇలా అన్నాడు.

విభీషణుడు: “ఓ వానరవీరుల్లారా! లంకానగరాన్ని రావణాసురుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతడు చాలా చెడ్డ ప్రవర్తన కలవాడు. నేను అతడి తమ్ముణ్ణి, నా పేరు విభీషణుడు. ఆ రావణాసురుడు సీతాదేవిని జనస్థానం నుండి అపహరించి, అడ్డువచ్చిన జటాయువును చంపి లంకలో బంధించి ఉంచాడు. ఆమె వివశురాలై, దీనంగా దుఃఖీస్తోంది

ఆమెను రాక్షసస్త్రీలు రక్షిస్తున్నారు. సీతాదేవిని రామునికి తిరిగి ఇచ్చివేసి, రామునితో స్నేహం చేసుకోమని అనేక విధాలుగా మంచి మాటలు చెప్పాను, నయనా, భయానా చెప్పినా అతడు వినిపించుకోలేదు. మన్మథుడు అతడి తలపై కూర్చుని ఆడిస్తున్నాడు, కామంచేత అతడి కళ్ళు మూసుకుపోయాయి. నేను చెప్పిన మంచి మాటలు ఏవీ చెవికెక్కించుకోలేదు. ఆయుర్దాయం తీరినవాడికి ఔషధం పనిచెయ్యనట్లుగా, నా మాటలు కూడా అతడి విషయంలో పనిచెయ్యలేదు. నన్ను నానామాటలు అన్నాడు. ఒక బానిసలాగా చూస్తున్నాడు. నన్ను చాలా అవమానించాడు. భార్యపిల్లలందర్నీ వదిలేసి రాముణ్ణి శరణు కోరుతున్నాను. విభీషణుడనే పేరుగల నేను వచ్చినట్లు మహాత్ముడైన రాముడికి వెంటనే చెప్పండి. అతడు లోకరక్షకుడు, శరణాగతుల పాలిట కల్పవృక్షం.”

మహా పరాక్రమవంతుడైన సుగ్రీవుడు, విభీషణుని మాటలు విని కంగారు పడుతూ వెళ్ళి రామలక్ష్మణులతో ఇలా అన్నాడు.

సుగ్రీవుడు: “ఓ రామప్రభూ! రావణాసురుడి తమ్ముడు విభీషణుడు మరో నలుగురు రాక్షసులతో కలసివచ్చాడు. అతడు నిన్ను శరణు కోరుతున్నట్లు చెప్పమన్నాడు. ఓ శత్రువినాశకా! నీవు ఇప్పుడు బాగా ఆలోచించి మంచి నిర్ణయం తీసుకోవాలి. నీవిప్పుడు మనకు లాభించే మంత్రాంగం గూర్చి, వ్యూహరచన గురించి, నీతిని గూర్చి, గూఢచారులను నియమించి సమాచారం రాబట్టడంతోనూ ఎంతో మెలుకువతో ఉండాలి. అట్లాగే శత్రువుల మంత్రాంగం ఏమిటో, వాళ్ళ వ్యూహ రచనలు ఎట్లా ఉంటాయో, వాళ్ళు ఏపాటి నీతిమంతులో, వాళ్ళు ఎటువంటి గూఢచారి కార్యకలాపాల్లో ఉన్నారోకూడా గ్రహించి నీవు అప్రమత్తుడవై మెలగాలి. నీకు సర్వశుభాలు చేకూరాలని కోరుకుంటున్నాను.

ఈ రాక్షసులు మాయలు మర్మాలు తెలిసినవాళ్ళు. ఇష్టమైన రూపాన్ని ధరిస్తారు. తలచుకున్నంతమాత్రం చేతనే అంతర్ధానమైపోతారు, కపటోపాయా లెన్నో తెలిసినవారు. వాళ్ళంతా శూరులు, పరాక్రమవంతులు, మహాబలశాలురు కూడా!

ఒకవేళ ఇతడు మనలోని లోటుపాట్లు తెలుసుకోవడానికే స్వయంగా వచ్చి ఉంటాడా? ఏదో వంకన మనలో ప్రవేశించి మన విశ్వాసాన్ని చూరగొని ఆ తరువాత నీపై దెబ్బతీయటానికి వచ్చి ఉంటాడా? ఊహించకుండా వచ్చి మన సైన్యంలోచేరి అవకాశం దొరకగానే, గుడ్లగూబ కాకుల్ని చంపినట్లు చంపవచ్చును. ఈ విభీషణుడు రావణాసురుడి గూఢచారి అయి ఉంటాడు. ఇతడు మనతో కలిసి ఉన్నట్లే ఉంటూ మనలో మనకు తగాదాలు పెట్టడానికి వచ్చి ఉండవచ్చు.

ఓ రామప్రభూ! మన మిత్రులెవరైనా సైనికుల్ని పంపిస్తే చేర్చుకోవచ్చు; అడవుల్లోనుండి వచ్చిన వాళ్ళనుకూడా చేర్చుకోవచ్చును; ఇంకా జీతానికి పనిచేస్తామని వచ్చేవాళ్ళనుకూడా సైన్యంలో చేర్చుకోవచ్చును. కానీ శత్రు పక్షంనుండి వచ్చినవాణ్ణి మాత్రం దగ్గరకు చేర్చకూడదు. ఇతడు మనకు శత్రువైన రావణాసురుడికి స్వయానా తమ్ముడు; శత్రుపక్షం నుండి వచ్చాడు. ఇతడిని ఎట్లా నమ్మడం? అందువల్ల ఇతడిని, ఇతడి మిత్రుల్ని చంపడం మంచిది.

సుగ్రీవుడు చెప్పినదంతా రాముడు విన్నాడు. రాముడు ప్రక్కనే ఉన్న వానరవీరులందరినీ ఒకసారి పరికించి చూశాడు.

రాముడు: "ఓ వానరవీరులారా! ఇప్పుడు సుగ్రీవుడు, విభీషణుణ్ణి గురించి చెప్పినదంతా విన్నారు గదా! కష్టాల్లో ఉన్నప్పుడు బుద్ధిమంతుడు, ఉత్తముడైన ఒక మిత్రుడు చెప్పాడు కదా అని మిగిలిన వాళ్ళంతా మెదలకుండా ఊరుకోవటం సరికాదు. మీరంతా కూడా, మీ అభిప్రాయాలను చెప్పండి. ఆ తరువాతే మనం ఏం చెయ్యాలో నిర్ణయించుకుందాం. అప్పుడా వానర వీరులంతా

వానరవీరులు: "ప్రభూ! ముల్లోకాల్లోనూ నీకు తెలియనిదిలేదు. నీకు అన్నీ తెలిసినా, మమ్మల్ని గౌరవించేందుకే ఇలా అంటున్నావు. నీవు సత్యవ్రతుడవు, పరమ ధార్మికుడవు, పరాక్రమశాలివి. నువ్వు ఏ విషయమైనా చక్కగా ఆలోచించకుండా చెయ్యవు.

వానర వృద్ధులంతా అట్లా చెప్పగానే, బుద్ధిమంతుడైన అంగదుడు లేచి,

అంగదుడు: "ప్రభూ! ఈ విభీషణుడు శత్రువుల దగ్గరనుండి వచ్చాడు, అందువల్ల ఇతడిని సందేహించాల్సిందే కాని, నమ్మకూడదు. మనం నమ్మి చేరదీస్తే కలసి మెలసి ఉన్నట్లే ఉంటూ సమయం చూసి దెబ్బతీస్తాడు. ఈ విషయంలో మంచి చెడులు బాగా చర్చించిన తర్వాతనే మనం ఒక నిర్ణయానికి రావడం మంచిది. అట్లా చెయ్యాలన్నా కూడా ముందుగా చేర్చుకోవాలి. ఆ తరువాతే గదా! గుణదోషాల గూర్చి ఆలోచించ గలుగుతాం. కాబట్టి ఇతణ్ణి మనలో చేర్చుకొని, ఒక కంట కనిపెట్టి ఉందాం.

అంగదుని మాటలు విన్న శరభుడు ఇలా అన్నాడు:

శరభుడు: "ప్రభూ! మనం అతడి గూర్చి తెలుసుకోకుండా మనలో చేర్చుకుంటే, ఆ వెనక కష్టాలు రావచ్చు. అందుకని మనం అతణ్ణి చేర్చుకోక ముందే మనలో ఎవరైనా అతడి వద్దకు పంపి నిశితంగా పరిశీలించి ఆ తరువాతే చేర్చుకోవటం మంచిది. లేకపోతే కొరివితో తల గోక్కునట్లవుతుంది.

అంతట జాంబవంతుడు లేచి, "ఓ రామా! రావణాసురుడు మనకు బద్ధశత్రువు. అతడు మనపై యుద్ధానికి సిద్ధంగా ఉన్నాడు. ఇతడు రావణునికి తమ్ముడు. అన్నగారిని ఎందుకు వదిలిపెట్టి వచ్చాడో చెప్పలేదు. అన్నగారు తిట్టాడని మాత్రం అన్నాడు. ఒకమాట అన్నా కూడా సొంత అన్నగారు కష్టాల్లో ఉన్నప్పుడు అతణ్ణి వదలిపెట్టి ఇక్కడికి వచ్చాడు. అది సరియైన కారణంగా అనిపించటం లేదు. తన మాట వినలేదన్న కారణాన ఆపత్కాలంలో అన్నగార్ని వదిలిపెట్టి రావడం నమ్మడానికి వీలులేకుండా ఉంది. అంతేకాకుండా, ఇతడు నిన్ను ఇంతకు పూర్వం ఎరుగడు. నీ గుణగణాలు తెలియవు. ఇంతదూరం నిన్ను వెతుక్కుంటూవచ్చి శరణుకోరటంలో ఏదో ఆంతర్యం ఉండి ఉంటుంది. పైగా ఇతడు రాకూడని సమయంలో, రాకూడని ప్రదేశానికి వచ్చి శరణు అన్న వంకతో మనలో చేరాలని చూస్తున్నాడు. ఇతడిని మనం చేర్చుకోకుండా ఉండటమే ఉచితం" అని చెప్పాడు.

తరువాత నీతికోవిదుడు, ఏది నీతియో, ఎది అవినీతియో బాగా ఎరిగినవాడైన మైందుడు ఇలా అన్నాడు.

మైందుడు: "ఓ ప్రభూ! మనలో ఎవరైనా గూఢచారిని విభీషణుడి దగ్గరకు పంపించి, మెల్లగా మాటల్లో పెట్టి రావణాసురుడి గూర్చి ఇతడి అభిప్రాయా లెట్లావున్నాయో కనిపెట్టాలి. ఇతడు మాట్లాడే ధోరణిని బట్టి ఇతడి మనస్సులోని విషయాన్ని పసిగట్టవచ్చును. ఇతడు దుష్టుడైతే శిక్షిద్దాం, యోగ్యుడైతే మనలో చేర్చుకుందాం.

మంత్రులలో ఉత్తముడు, సర్వశాస్త్రాల్లోనూ ప్రావీణ్యం ఉన్నవాడూ అయిన హనుమంతుడు లేచి ఇలా అన్నాడు:

హనుమంతుడు: "రామప్రభూ! నీవు బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవు, ఏ కార్యాన్నైనా నిర్ణయించడంలో నేర్పరివి. అంతేకాదు నీవు నిర్ణయించిన దాన్ని నలుగురిచేత ఒప్పించే నేర్పుకూడా నీలోనే ఉంది. చక్కగా, నేర్పుగా మాట్లాడటంలో బృహస్పతికూడా నిన్ను జయించలేడు. అటువంటి నీ ముందు నిలబడి చెప్పగలవాడిని కాను. అయినా నాకు తోచింది చెప్తాను, కేవలం వాదించటం కోసమో లేక నా ప్రతిభ చాటుకోవాలన్న కుతూహలమో నాకు లేదు. మిగిలిన మంత్రుల అభిప్రాయాల్ని తప్పుపట్టడంగాని, కించపరచడంగానీ నా ఉద్దేశం కాదు. నీ మీద ఉండే భక్తితోను, ప్రేమతోను నాకు తోచింది చెప్తున్నాను.

రామా! అంగదుడు మున్నగువారు విభీషణుని వలన మనకు లాభమా, నష్టమా అని పరిశీలించాలన్నారు. ఆ విషయంలో నేను విభేదిస్తున్నాను. ఎందువల్లనంటే అతడిని ఏదైనా ఒక పనిలో పెడ్తేగాని, సామర్థ్యాన్ని అంచనావెయ్యలేం. కొత్తవారికి వెంటనే ఒక బాధ్యతగల కార్యాన్ని ఒప్పగించడం మంచిదికాదని నా అభిప్రాయం. అతని వద్దకు గూఢచారుల్ని పంపాలని కొందరు చెప్పారు. అదీ నాకు సబబుగా కనిపించడంలేదు. అట్లాగే విభీషణుడు దేశంకాని దేశంలో, కాలంకాని కాలంలో వచ్చాడని కొందరన్నారు. ఈ సందర్భంలో నాకు తోచింది చెప్పాలని

అనుకుంటున్నాను.

ఓ ప్రభూ! పైన చెప్పిన వాదాలన్నీ సమంజసంగా లేవు. ఇతడు విభీషణుడు. ఇతడి అన్న రావణాసురుడు. ఇతడు తన అన్నగారిని అధముడని, దుష్టుడని దూషించాడు. రావణుడు సీతాదేవిని అపహరించడం, అది అధర్మమని తను చెప్పినా వినకపోవడం అతడికి స్వయంగా తెలుసు. నిన్ను పురుషోత్తముడవని ప్రశంసించాడు. అతడు నిన్ను ఎప్పుడూ స్వయంగా కలవకపోయినా, నీవు జనస్థానంలో ఖరదూషణాది రాక్షసుల్ని చంపావని తెలుసు. నీవు వాలిని సంహరించి సుగ్రీవుడికి వానర రాజ్యం కట్టబెట్టడం తెలుసు. ఆ విధంగా నీ పరాక్రమాన్ని తెలుసుకొని ఉంటాడు. అంతేకాకుండా నీవు లంకా పట్టణాన్ని ముట్టడించడం కోసం సముద్రతీరాన ఉన్నావని తెలుసుకున్నాడు. ఏదో విధంగా నీవు లంకను ముట్టడిస్తావన్న నమ్మకంతో, నిన్ను శరణు వేడేందుకు ఇదే సమయమని సముద్రానికి ఇవతలి ఒడ్డునే నిన్ను కలుసుకోవటమే సరైన ప్రదేశమని తలచాడు.

ఓ ప్రభూ! ఒక గూఢచారిని పంపి అతడి గుణదోషాలను తెలుసుకోవాలని మనలో ఒకరు అన్నారు. అది పొసగదు. ఎందువల్లనంటే, విభీషణుడు బుద్ధిమంతుడు. పూర్వ పరిచయం లేనివాడు, కొత్తచోటులో ఉన్నాడు కాబట్టి ఏం చెబితే ఏమి అవుతుందోనన్న భయంతో బదులు చెప్పకపోవచ్చు, లేదా సమాధానాల్ని దాటవేయవచ్చు. సంతృప్తికరంగా జవాబులు రాబట్టలేకపోవటం వలన అతణ్ణి 'దోషి' అనే నిర్ధారణకు రావచ్చు. అదీకాకుండా అడిగిన వాళ్ళందరికీ తన విషయాలన్నీ చెప్పి తీరాలనే నియమం ఏమీలేదు. అందువల్ల ఈ ప్రయత్నం పొసగదు.

రాజా! మాట్లాడే తీరు, స్వరాన్నిబట్టి ఎదుటివారి గుణదోషాలు తెలుసుకోవాలంటే, అడిగేవాడికి ఎంతో నేర్పు ఉండాలి. ఇతడు మాట్లాడినప్పుడు అతడిలో దుష్టస్వభావం ఏదీ కనబడలేదు. అతడి ముఖం కూడా ప్రసన్నంగా ఉంది, అందువలన నేను ఇతడిని సంశయించటం లేదు. కపటబుద్ధి ఉన్నవాడైతే ఎటువంటి జంకూ లేకుండా స్వయంగా రాలేడు.

ఇతడి మాటల్లో దోషంకూడా కనపడటం లేదు. ప్రభూ! మోసం చేయదలచుకున్నవాడు, తన మనస్సులోని భావాల్ని బయట పడకుండా దాచుకోలేడు, ఏదో రూపంలో బయటపడుతుంది.

ఓ ప్రభూ! నీవు పనులు చక్క బెట్టడంలో సమర్థుడవు. దేశకాలాలను బట్టి చేసే పనులు సఫలమౌతూవుంటాయి. ఈ విభీషణుడు నీ పరాక్రమాన్ని నీవు ధార్మికుడవన్న విషయాన్ని తెలుసుకున్నాడు. అతడి అన్నగారు చేసే దుర్మార్గాలు, అధర్మాలన్ని స్వయంగానే తెలుసు. నీవు వాలిని చంపి సుగ్రీవుణ్ణి రాజును చెయ్యడంకూడా విన్నాడు. నీవు తప్పక రావణసంహారం చేస్తావని తెలుసు. ఆ తరువాత లంకకు తనని రాజ్యాభిషిక్తుణ్ణి చేయమని ప్రార్థించడానికి వచ్చి ఉంటాడు. అట్లా ఇతడు నీకు శరణాగతుడైనాడు. కాబట్టి నీవు ఇతణ్ణి ఆదరించడమే మంచిది, ఏదో నా బుద్ధికి తోచింది చెప్పాను.

# 18వ సర్గ రాముడు విభీషణుని స్నేహాన్ని అంగీకరించడం

శాస్త్రాధ్యయన సంపన్నుడు, ఎదిరింప శక్యముకానివాడు అయిన రాముడు, హనుమంతుడు చెప్పిన మాటలకు సంతోషించాడు. తన మనస్సులోని అభిప్రాయాన్ని కూడా ఈ విధంగా చెప్పాడు.

రాముడు: "వానరవీరులారా! విభీషణుని విషయంలో నా అభిప్రాయం కూడా చెప్పాలని అనుకుంటున్నాను వినండి. 'నీతో స్నేహం చేస్తాను' అని ముందుకు వచ్చిన వాడిలో దోషం ఉన్నాకూడా అతడిని తిరస్కరించను. అదే ధర్మం. అట్లాంటి వాళ్ళనే పెద్దలు గౌరవిస్తారు..

అందుకు సుగ్రీవుడు చాలాసంతోషించాడు. ఆనందంతో ఇలా అన్నాడు:

సుగ్రీవుడు: "ప్రభూ! ఈ రాక్షసుడు దుష్టుడు అయినా, కాకపోయినా మనం పట్టించుకోవద్దు. బాగానేవుంది. కానీ, ఆపదల్లోవున్న అన్నగార్నే విడిచిపెట్టివచ్చాడే? ఇక ఇతడు మనల్ని మాత్రం విడచిపోడని నమ్మకం ఏముంది? అటువంటి వాడితో స్నేహం తగునా?

సుగ్రీవుని మాటలువిన్న రాముడు చిరునవ్వు నవ్వుతూ లక్ష్మణునితో ఇలా అన్నాడు. "సోదరా! సుగ్రీవుడు పలికిన మాటలు శాస్త్రాలన్నీ చదివిన పండితులు, పెద్దలకు సేవ చేసినవాళ్ళు మాత్రమే మాట్లాడదగినవిగా ఉన్నాయి. ఇతరులు ఇంత చక్కగా మాట్లాడలేరు, ఇక్కడ నాకో ధర్మసూక్ష్మం కనిపిస్తోంది. లోకంలో అందరికీ తెలిసిందే! రాజవంశాల్లో అయితే అది నిత్యకృత్యమే!

ఇరుగు పొరుగున ఉండే రాజులూ, రాజ్యంలోవుండే జ్ఞాతులూ, రాజు ఆపదల్లో ఉన్నప్పుడు దెబ్బతీస్తూ ఉంటారు. అందువల్లనే ఇరుగు పొరుగున ఉండే రాజుల్నీ, జ్ఞాతుల్నీ శత్రువులుగానే భావిస్తూ ఉంటారు. అదే విధంగా ఇప్పుడు రావణుడు కూడా విభీషణుణ్ణి అనుమానించి ఉంటాడు. ఇప్పుడు రావణుణ్ణి దెబ్బతీయాలనే కారణంతో ఈ విభీషణుడు మన

దగ్గరకు వచ్చాడు. అంతేకాకుండా జ్ఞాతులు సమర్థులూ, యోగ్యులైనాకూడా రాజులు నమ్మరు. ఆ విధంగా వీళ్ళిద్దరిమధ్య ఏవో తగాదాలు వచ్చాయి. అంతే! ఈ విభీషణుణ్ణి రావణాసురుడు శంకించి ఉంటాడు. మనం అతడి అన్నకు శత్రువులం అని తలచి మనతో స్నేహానికివచ్చాడు.

ఓ సుగ్రీవుడా! మనం శత్రువుల్ని చేర్చుకోవటమా? మానటమా? అన్న ప్రశ్నకు జవాబు యథాశాస్త్రంగా చెప్తాను విను. మనము రాక్షసులంకాము, కాబట్టి విభీషణునికి మనకు మధ్య జ్ఞాతి వైరం రాదు. ఇక రెండవది మనం రాక్షస రాజ్యానికి పొరుగువాళ్ళమూ కాదు, ఆ రాజ్యంపైన కాంక్షా మనకు లేదు. అందువల్ల విభీషణుడు మనల్ని ద్వేషించడమో, మోసగించడమో జరుగదు. ఈ రాక్షసుడు రాజ్యం పొందటానికి మన సహాయం కోరివచ్చాడు, ఇతడు మనల్ని వదిలిపెట్టి వెళ్ళేవాడు కాదు. రాక్షసుల్లోకూడా పండితులున్నారు. విభీషణుడు కూడా పండితుడిలాగానే కనిపిస్తున్నాడు. అందువల్ల మనం ఇతడిని చేర్చుకోవచ్చును, లోకంలో జ్ఞాతులు అసంతృప్తితోనే ఉంటూ ఉంటారు; పరస్పరం కలసిమెలసి ఉండరు. అంతర్గతంగానైనా విరోధంతోనే ఉంటూ ఉంటారు. ఈ విభీషణుడు కూడా రావణుడితో పోట్లాడి మన దగ్గరకు వచ్చి ఉంటాడు.

నాయనా! సుగ్రీవుడా! సోదరులందరూ భరతుడిలాగానే ఉండరు. తండ్రీ కొడుకులంతా నావంటివారై ఉండరు, స్నేహితులంతా నీవంటివారై ఉండరు.

అంతట లక్ష్మణుని ప్రక్కనే కూర్చుని వింటున్న సుగ్రీవుడు రాముడితో ఇలా అన్నాడు.

సుగ్రీవుడు: "ఓ రామా! ఓర్పులో భూదేవివంటి వాడవు, ఈ రాక్షసుణ్ణి రావణుడే గూఢచారిగా పంపి ఉంటాడని నా విశ్వాసం. అందువల్ల అతడిని చేర్చుకోకపోవటమే మంచిదని నా అభిప్రాయం. ఈ రాక్షసుడు నిన్ను, నన్ను, లక్ష్మణుణ్ణి, మన వానరసైన్యాన్ని చంపే దుర్బుద్ధితోనే వచ్చాడు. అందువల్ల అతడిని, అతడి మంత్రుల్ని కూడా బంధించాలి.

సుగ్రీవుడు చెప్పిందంతా రాముడు విన్నాడు. బాగా ఆలోచించి ఇలా అన్నాడు.

సుగ్రీవుడు: "ఓ సుగ్రీవుడా! ఈ రాక్షసుడు మంచివాడైనా, చెడ్డవాడైనా నాకేమీ భయంలేదు. ఇతడు నాకు ఎంతమాత్రం కీడు తలపెట్టలేడు. ఓ సుగ్రీవుడా! నేను తలచుకొంటే ఈ భూమండలంపై నుండే పిశాచాలను, దానవుల్ని, యక్షుల్ని, రాక్షసుల్ని కూడా వేలిగోటితో సంహరించగలను. అటువంటిది ఈ విభీషణుడు నన్ను ఏం చేయగలడు?

ఓ సుగ్రీవుడా! ఒకానొక అడవిలో ఒక బోయవాడు ఒక ఆడు పావురాన్ని చంపాడు. తరువాత కొంతసేపటికి వెళ్ళి ఆ మగ పావురాన్ని శరణు కోరాడు. అప్పుడా మగ పావురం, ఆ కిరాతకుడు తన భార్యను చంపిన వాడే అయినా, తన్ను శరణు వేడటం చేత తన శరీరంలోని మాంసాన్ని ఆహారంగా సమర్పించింది. ఈ కథ అందరికీ తెలిసిందే. ఇక నావంటి వాడిని ఎవరైనా వచ్చి శరణు కోరితే కాపాడకుండా ఎట్లా ఉండగలను? కణ్వమహర్షి పుత్రుడు కండువు అనే అతడు గొప్పమహర్షి, సత్యవాది ధర్మప్రబోధాత్మకమైన కథనొకటి చెప్పాడు. నీ కాకథ చెప్తాను విను.

"శత్రు సంహారకుడవైన ఓ రాజా! ప్రాణభయంతో చేతులు జోడించి శరణు అడిగినవాడు శత్రువే అయినా కూడా చంపకూడదు. కోపం, పగ, క్రౌర్యం లేవనటానికి అదే నిదర్శనం. శరణాగతుడు ఆర్తుడే అయినా, గర్వపోతు అయినా, శత్రు పక్షంవాడే అయినా, ఆత్మవేత్త తన ప్రాణాన్ని సమర్పించి అయినా సరే కాపాడాలి. అటువంటి శరణాగతుడైన శత్రువును భయంచేతగాని, మోహంచేతగాని కాపాడకపోతే పాపం వస్తుంది. అటువంటి శరణాగతుణ్ణి కాపాడకపోవడం వల్ల మరణిస్తే, అతడి పాపాలన్నీ అతణ్ణి రక్షించని వాడికి చుట్టుకుంటాయి. కాపాడనివాడి పుణ్యఫలాన్నంతా, ఆ శరణాగతుడు పొంది ఉత్తమ లోకాలకు పోతాడు. కాబట్టి శరణాగతుణ్ణి కాపాడకపోతే మహాపాపం వస్తుంది. స్వర్గాది పుణ్యలోకాలన్నీ నశించిపోతాయి. అపకీర్తి వస్తుంది, బలం, పరాక్రమం నశించిపోతాయి. ఇది యథార్థం." ఈ విధంగా కండు మహర్షి చెప్పాడు. కాబట్టి నేను ఆ మహర్షి చెప్పినట్లే చెయ్యదల్చుకున్నాను. నేను అట్లా చెయ్యటంవల్ల నాకు కీర్తి వస్తుంది; అభ్యుదయం అవుతుంది; పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి.

“ఓ సుగ్రీవుడా! నేను నీ వాణ్ణి. నీ శరణుకోరుతున్నాను అని ఎవరైనా అడిగితే, అతడు ఎవరైనా సరే, కాపాడుతాను. సమస్త భూతకోటిని భయం నుండి కాపాడటమే నా వ్రతం. శరణాగతుణ్ణి కాపాడటమే నా వ్రతం. ఈ వచ్చినవాడు విభీషణుడే అయినాసరే, లేక రావణాసురుడే అయినా సరే, నా శరణు కోరితే కాపాడుతాను. నీవు పోయి ఆ రాక్షసుణ్ణి తీసుకొని రా! నేను ఇతడికి అభయం ఇస్తున్నాను. అంతట సుగ్రీవుడు

సుగ్రీవుడు: “ఓ ప్రభూ! నీవు ధర్మజుడవు, లోకాలను పాలించేవారిలో శిరోమణివి. మహాబలశాలివి. ఉత్తమమైన మార్గంలోనే ప్రవర్తించేవాడవు. నీవు తప్ప ఇటువంటి ధర్మపరమైన మాటలు వేరెవరు చెప్పగలరు? ఈ విభీషణుడు మంచివాడేనని నా అంతరాత్మకూడా చెప్తోంది. నీతో నా సందేహాలు చెప్పడం వల్ల నా అనుమానాలుకూడా నివృత్తి అయ్యాయి. నిన్ను ఇన్ని విధాలుగా పరీక్షించి నా అనుమానాలు నివృత్తి చేసుకున్నాను. నేను ఇప్పుడే పోయి విభీషణుణ్ణి తీసుకువచ్చి నీ ముందు నిలబెడతాను. ఆ గొప్ప బుద్ధిమంతుడైన విభీషణుడు కూడా మాతో కలసిపోయి మనకు మంచి మిత్రుడవుతాడు.

తరువాత రాజైన రాముడు సుగ్రీవుని మాటలు విని, అతడు చెప్పిన విధంగా దేవేంద్రుడు గరుత్మంతుని కలసినట్లు, విభీషణునితో కలిశాడు.

## 19వ సర్గ విభీషణుడు రాముని పాదములను శరణు వేడటం

రాముడు అభయం ఇచ్చాడని వినగానే విభీషణుడు పరమ సంతోషంతో నేలవైపు చూస్తూ, తన నలుగురు మంత్రులతో ఆకాశంనుండి క్రిందికి దిగి వచ్చాడు. ఆ విభీషణుడు అతని నలుగురు మంత్రులు సాష్టాంగ నమస్కారం చేశారు. అంతట విభీషణుడు ధర్మసమ్మతమూ, మహా యోగ్యమైనవీ అయిన మాటలు ఇలా అన్నాడు.

విభీషణుడు: "ప్రభూ! నేను రావణుని తమ్ముడను. నా అన్నగారు నన్ను అవమానించాడు, నేను నీ శరణుకోరి వచ్చాను. సర్వభూత శరణ్యుడవైన నీ పాదములవద్ద శరణు కోరుకుంటున్నాను. నేను లంకాపట్టణాన్ని, నా భార్యాపిల్లలను, నా సంపదలన్నీ వదిలేసి నీ దగ్గరకు శరణు వేడుకునేందుకు వచ్చాను. ఇకపై నా ప్రాణము, నా రాజ్యము, నా సమస్త సుఖభోగాలన్నీ నీ అధీనంలో ఉన్నాయి.

విభీషణుడు శరణాగతి వాక్యాలను విన్న రాముడు ప్రసన్నంగా అతడి వంక చూస్తూ "ఓ విభీషణుడా! రాక్షసుల బలాబలాలను గూర్చి ఉన్నవి ఉన్నట్లుగా చెప్పు" అన్నాడు. అంతట విభీషణుడు "ఓ రామప్రభూ! రావణాసురుడు బ్రహ్మదేవుని మెప్పించి గంధర్వ, రాక్షస, అసురుల చేతగానీ, సమస్తభూతాలచేతగానీ చావు రాకుండా వరాలు పొందాడు. అందువల్ల మరణభయం లేని వీరుడౌతాడు. రెండవవాడు కుంభకర్ణుడు. ఇతడు మహా పరాక్రమవంతుడు అమిత తేజోవంతుడు. దేవేంద్రునితో సమానమైన బలం కలవాడు.

రావణాసురుడి సేనాధిపతి ప్రహస్తుడు. ఇతడు కైలాస పర్వతానికిపోయి కుబేరుని సేనాధిపతియైన మణిభద్రుణ్ణి జయించాడు.

ఇంద్రజిత్తు, యుద్ధంలో ఉడుము చర్మంతో చేసిన తొడుగుల్ని తొడుక్కుంటాడు. అతడి కవచాన్ని ఎవరూ పగలకొట్టలేరు. ఇతగాడు ధనుస్సు పట్టుకొని యుద్ధం చేస్తాడు. ఇతడు

ఇతరులకు కనపడకుండా యుద్ధంచేస్తాడు. ఇతడు అగ్నిహోత్రుని తృప్తిపరుస్తూ, ఆ ప్రభావంచేత అంతర్ధానమై శత్రువుల్ని సంహరిస్తూ ఉంటాడు.

అకంపనుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు అనే ముగ్గురూ లోకపాలకులతో సమానమైన పరాక్రమవంతులు. వీరు ముగ్గురూ యుద్ధంలో సేనానాయకులు.

వీళ్ళేకాకుండా కామరూపులై, స్వేచ్ఛగా రూపాలు మార్చుకునే రాక్షసవీరులు పదివేల కోట్లమంది లంకా నగరంలో ఉన్నారు. వీళ్ళంతా పచ్చిమాంసాన్ని భుజిస్తారు. రక్తాన్ని త్రాగుతారు.

రావణుడు లోకపాలకులందర్నీ యుద్ధంలో జయించాడు. లోకపాలురు, ఇతర దేవతల్నీ దురాత్ముడైన రావణుడు నానా బాధలుపెట్టాడు.

విభీషణుడు చెప్పిందంతా సావధానంగా విన్న రాముడు ఇలా అన్నాడు: "ఓ విభీషణుడా! రావణుని పరాక్రమాన్ని, అతడు పూర్వం సాధించిన విజయాల్ని గూర్చి చెప్పావు, నేను పూర్తిగా తెలుసుకున్నాను. నేను రావణుణ్ణి, ప్రహస్తుణ్ణి, ఇంద్రజిత్తును చంపి నిన్ను రాజును చేస్తాను. ఇది నా ప్రతిజ్ఞ. రావణుడు రసాతలంలో దాక్కున్నా, పాతాళానికి పోయి దాక్కున్నా, బ్రహ్మలోకానికే వెళ్ళి తలదాచుకున్నా అతణ్ణి ప్రాణాలతో వదలను. యుద్ధంలో రావణుణ్ణి, పుత్రుల్ని, అతడి పరివారాన్నందర్నీ చంపిగానీ, అయోధ్యకు పోను. నా ముగ్గురు సోదరుల మీద ఒట్టు పెట్టి చెప్తున్నాను.

ధర్మాత్ముడైన విభీషణుడు రాముని మాటలు విని తలవంచి, చేతులు జోడించి రామునితో ఇలా అన్నాడు: "ఓ ప్రభూ! లంకా పట్టణాన్ని ముట్టడించడంలోను, రాక్షసుల్ని చంపడంలోను నేనుకూడా స్వయంగా యుద్ధంచేయడానికి నా శాయశక్తులా నీకు చేదోడు వాదోడుగా ఉంటూ సహాయపడతాను." విభీషణుని మాటలకు రాముడు మిక్కిలి సంతోషించినవాడై అతణ్ణి కౌగలించుకొని లక్ష్మణునితో ఇలా అన్నాడు: "సోదరా! వంశ గౌరవాన్ని కాపాడే వాళ్ళల్లో

శ్రేష్ఠుడవు. నేను ఇప్పుడే సంతోషంతో ప్రకటిస్తున్నాను. నీవుపోయి సముద్రజలాలు తీసుకొనిరా! ఈ విభీషణుణ్ణి రాక్షసులకు రాజుగా అభిషేకించు.”

అంతట లక్ష్మణుడు, రామాజ్ఞను శిరసావహించి వానరులందరూ చూస్తూవుండగా విభీషణునకు రాజ్యాభిషేకం చేశాడు. రామప్రభువు విభీషణుని రాక్షసరాజుగా చేసినందుకు వానరు లంతా పండగ చేసుకున్నారు. కోలాహలంగా గంతులు వేస్తూ సందడి చేశారు.

ఆ తర్వాత రాముడు, సుగ్రీవుడు, లక్ష్మణుడు, హనుమంతుడు విభీషణులతో సమావేశం అయ్యారు. దుర్భేద్యమైన ఈ సముద్రాన్ని వానర సేనచేత దాటించడం ఎలాగా? అని సమాలోచనలు చేశారు. చివరకు విభీషణుణ్ణే ఏదైనా ఉపాయం ఆలోచించి చెప్పమన్నారు.

అంతట విభీషణుడు ఇలా అన్నాడు: “మిత్రులారా! రామప్రభువు సముద్రుణ్ణి ప్రార్థించాలి. ఈ సముద్రాన్ని పూర్వం సగర చక్రవర్తియే తవ్వించడం వల్ల, రామప్రభువుకు తప్పక సహాయపడతాడు.” అంతట విభీషణుడు రాముని సముద్రుని ధ్యానించి ఉపాసన చెయ్యమని ప్రేరేపించాడు. పరమ ధార్మికుడైన రాముడికి విభీషణుని సలహా నచ్చింది. రాముడు, సుగ్రీవుణ్ణి, లక్ష్మణుని, గౌరవించాలని అనుకున్నాడు. వాళ్ళవంక చూసి మందహాసం చేస్తూ “లక్ష్మణా! విభీషణుడు చక్కటి సలహా ఇచ్చాడు. నాకు నచ్చింది. సుగ్రీవుడు బుద్ధిమంతుడు, నీవేమో ఆలోచించడంలో సమర్థుడవు మీ ఇద్దరూ కూడా సరేనంటే, చెప్పండి” అన్నాడు.

అప్పుడు సుగ్రీవ లక్ష్మణులు ఇలా అన్నారు. “ప్రభూ! మనకు ఏమీ పాలుపోకుండా తలబ్రద్దలు కొట్టుకుంటూ ఉంటే ఈ విభీషణుడు దేవుడులాగా వచ్చి చక్కటి సలహా ఇచ్చాడు. దేవేంద్రుడే దిగివచ్చినా ఈ సముద్రంపై సేతువు కట్టకుండా లంకకు చేరలేం. విభీషణుడు చెప్పినట్లే చేద్దాం. ఇంకా కాలయాపనచెయ్యవద్దు. ఓ రామా! నీవు వెంటనే మన సేన అంతా లంకాపట్టణం చేరేందుకు సముద్రుణ్ణి సహాయం కోరు. నీవు శరణు కోరితే సముద్రుడు తప్పక కరుణిస్తాడు.”

అప్పుడు రాముడు సముద్రతీరానికి పోయి దర్భలు పరచుకొని, దానిపై వేదిలో అగ్నిలాగా శయనించాడు.

# 20వ సర్గ రావణుడు శుకుని దూతగా పంపటం

శార్దూలుడు అనే రాక్షసుడు గూఢచారిగా వచ్చి సుగ్రీవుడి సైన్యాన్నంతా ఆకాశంపైనుండీ చూశాడు. ఆ సేన అంతా వ్యూహాలుగా నిలబెట్టి ఉండటం, అసంఖ్యాకం ఉండటం చూసి వేగంగా తిరిగి వెళ్ళి రావణాసురుడితో ఇలా అన్నాడు: "ఓ రాజా! ఈ మహాసముద్రానికి ఉత్తర దిక్కున అసంఖ్యాకమైన వానరములు, భల్లూకాలతో నిండిపోయి, వాళ్ళంతా మరో సముద్రమా? అన్నట్లున్నారు.

"ఓ రాజా! మంచి రూపవంతులైన దశరథుని పుత్రులైన రామలక్ష్మణులు సీతాదేవి లంకలో ఉందని తెలుసుకున్నారు. లంకపై దండెత్తి రావడానికి సముద్రం ఒడ్డున పెద్దసేనతో సిద్ధంగా ఉన్నారు. ఎటునుంచి చూసినా ఆ వానరసైన్యంమంతా పదియోజనాల దూరం విస్తరించివుంది. నీవు వెంటనే దూతలను పంపించి సామదానభేదోపాయాలను ఉపయోగించి వాళ్ళను లొంగదీసుకో, దండోపాయం పనిచేసేట్లు కనపడటం లేదు."

శార్దూలుడు చెప్పినదంతా రావణాసురుడు విన్నాడు. ప్రశాంతంగా ఆలోచించాడు. గొప్పశూరుడు, కార్యసాధకుడైన శుకుడు అనేవాడిని పిలిపించాడు. "ఓ శుకుడా! నీవు ఇప్పుడే బయలుదేరి వెళ్ళు. సుగ్రీవుణ్ణి కలుసుకో. తడబడకుండాను, ఇంపుగాను, మధురంగాను నేను చెప్పినట్లు నా మాటలుగా ఇలా చెప్పు.

ఓ వానరుడా! నీవు ఉత్తమమైన వంశంలో జన్మించావు. మహా ధార్మికుడు, బ్రహ్మదేవుని పుత్రుడైన ఋక్షజుడి కుమారుడవు. నీవు నాకు సోదరుని వంటివాడవు. నరుడైన రాముడితో నీకు ఏం లాభం ఉంటుంది? నా మాట విని ఏ ప్రయోజనమూ లేని ఆ నరుడిని వదిలేసి వానరసైన్యాన్నంతా తీసుకొని నీ దారిన నీవు పో! నీ కొచ్చేనష్టం ఏమీ ఉండదు.

ఓ సుగ్రీవుడా! నేను రాముడి భార్యను అపహరించుకొని వచ్చినందువల్ల నీకు వచ్చిన

కష్టంగాని, నష్టంగానీ ఏమీ ఉండదు. నీవు బుద్ధిమంతుడవు, నేను చెప్పినదంతా బాగా ఆలోచించుకో. నా మాట విని రాముణ్ణి వదిలేసి నీ దారిన నువ్వు పో. నా లంకాపట్టణాన దేవతలు గంధర్వులైనా కూడా కాలుమోపలేరు. ఇక ఆ నరులు, నీ వానరుల మాట వేరేచెప్పాలా? ఓ శుకుడా నీవు ఇప్పుడే పోయి సుగ్రీవుడితో నా మాటగా చెప్పు. ఎట్లాగైనా అతడికి నచ్చచెప్పి తిరిగి కిష్కింధకు పోయేట్లుగా చెయ్యి" అని చెప్పాడు.

రావణుడి ఆజ్ఞ శిరసావహించి శుకుడు పక్షిరూపాన్ని ధరించి సముద్రానికి కొద్ది ఎత్తులోనే ఎగురుకుంటూ సుగ్రీవుడు ఉంటున్న చోటుకు చేరుకున్నాడు. ఆకాశంలోనే నిలబడి రావణాసురుడు చెప్పమన్న మాటలన్నీ యథాతథంగా సుగ్రీవుడితో చెప్పాడు. ఇలా మాట్లాడిన శుకుడి మాటల్ని వానరులు కూడా విన్నారు. వాళ్ళు వెంటనే ఆకాశంపైకి ఎగిరి, శుకుణ్ణి పట్టుకొని చావకొట్టారు, పిడికిళ్ళతో గుద్దారు. నేల మీదకు పడేట్లు తోశారు. అప్పుడా రాక్షసుడు "ఓ రామప్రభూ! నేను మీ దగ్గరకు దూతగా వచ్చాను. ధార్మికులైన నీవంటివారు దూతను చంపవచ్చునా? నీవు గట్టిగా వీళ్ళను మందలించు, లేకపోతే నా ప్రాణాలు తీసేట్లున్నారు. నా ప్రభువు చెప్పిన మాటలు కాకుండా ఏమైనా కల్పించి మాట్లాడితే నన్ను చంపవచ్చును. కానీ, నేను నా ప్రభువైన రావణాసురుడు చెప్పమన్నదే యథాతథంగా చెప్పాను" అని మొరపెట్టుకున్నాడు.

శుకుడి దీనాలాపనలు రాముడు విని ఆ వానరులతో "ఓ వానరులారా! ఇతణ్ణి చంపకండి, వదిలేయండి" అని అన్నాడు. వానరులు వదిలేయగానే 'బ్రతుకుజీవుడా' అనుకుంటూ ఆకాశంలోకి ఎగిరి తిరిగి సుగ్రీవుడితో ఇలా అన్నాడు. "ఓ సుగ్రీవుడా! నీవు మహా బలవంతుడవు, శక్తి సంపన్నుడవు. ముల్లోకాలను ముప్పతిప్పలు పెట్టించే రావణాసురుడికి నన్ను పోయి ఏమని చెప్పమంటావు?" అని అడిగాడు.

అప్పుడు సుగ్రీవుడు, "ఓయీ శుకుడా! పోయి రావణునితో నా మాటలుగా చెప్పు. 'ఓ రావణా! నీవు నాకు సోదరుడవు కావు; స్నేహితుడివీ కావు. నీ వలన నేను ఏ ఉపకారమూ

పొందలేదు. పైగా లోకులంతా పూజించే రామప్రభువుకు నీవు విరోధివి. నా శత్రువైన వాలికి స్నేహితుడవు. అట్లాచూచుకున్నా కూడా నా విరోధికి స్నేహితుడవైన నీవు నాకు విరోధివే! నిన్ను నీ జ్ఞాతుల్నీ నీ పరివారాన్నీ నాశనం చేస్తాను. నీ లంకాపట్టణం నా సైన్యంతో నిండిపోతుంది. నీ పట్టణాన్ని కాల్చి బూడిదచేసి పారేస్తారు. రామబాణంనుండి నీవు తప్పించుకోలేవు. దేవేంద్రుడుకూడా నిన్ను రామబాణంనుండి కాపాడలేడు. నీవు పాతాళానికిపోయి దాక్కున్నా, మరెక్కడున్నా రామబాణం నిన్ను వెతుక్కుంటూ వచ్చి చంపేస్తుంది. ఇక పిశాచాలు, రాక్షసులు నిన్ను రాముడినుండి రక్షించలేరు. రామలక్ష్మణులు ఇంట్లో లేకుండా చూసి, దొంగతనంగా సీతాదేవిని అపహరించి తెచ్చుకున్నావు. వృద్ధుడైన జటాయువును చంపావు. మహాబలవంతుడైన రఘువంశ రాముడు వచ్చి నీ ప్రాణాలు తీస్తాడు సిద్ధంగా ఉండు' అని చెప్పు" అన్నాడు. సుగ్రీవుడి మాటలు వింటున్న అంగదుడు ఇలా అన్నాడు: "రాజా! ఈ రాక్షసుడు గూఢచారియేకాని, దూత కాదు. వీడు ఆకాశంలో నిలబడి నీతో మాట్లాడుతున్నట్లే నటిస్తూ, పైనుండి మన సేనల సంఖ్యాబలాన్ని, వీరుల బలాన్ని అంచనా వేస్తున్నాడు. వీడు పోయి, రావణాసురుడి దగ్గర మన గుట్లు అన్నీ రట్టు చేస్తాడు. కాబట్టి వీణ్ణి ప్రాణాల్తో వదలకూడదు." అంగదుడు వెలిబుచ్చిన సందేహాలు విన్న సుగ్రీవుడు మళ్ళీ వానరుల్ని శుకుడిపై ప్రేరేపించాడు. వానరులంతా మళ్ళీ ఆకాశంపైకి ఎగిరి శుకుణ్ణి కట్టిపడేశారు. అప్పుడు మళ్లీ శుకుడు రాముణ్ణి ఇలా ప్రార్థించాడు: "ఓ రామప్రభూ! ఈ వానరులంతా కలసి నా రెక్కలు కత్తిరించేట్లున్నారు, నా కనుగుడ్లు పీకేట్లున్నారు, నన్ను చంపేందుకు సిద్ధపడుతున్నారు. వీళ్ళు నన్ను బ్రతకనిచ్చేట్లు లేదు. ఓ రామా! నేను ఈ వానరుల చేతిలో చనిపోతే, నేను పుట్టినప్పటినుండి చేసిన పాపాలన్నీ నిన్ను చుట్టుకుంటాయి కాబట్టి ఓ రామా! నన్ను రక్షించు." ఇలా వలవలా ఏడ్చాడు. వాడి ఏడుపు రాముని చెవిన పడింది. అంతట రాముడు 'దూతను చంపకండి' అని వానరులను ఆజ్ఞాపించాడు.

# 21వ సర్గ రాముడు సముద్రునిపై కోపగించటం

శత్రు వినాశకుడైన రాముడు సముద్రతీరాన దర్భలు పరచుకొని, సముద్రుడికి నమస్కరించి తన చేతినే దిండుగా చేసుకొని పడుకున్నాడు. ఏ చేతులకు పూర్వం మణులు పొదిగిన బంగారు కడియాలు ధరించేవాడో, ఏ చేతుల్ని ఉత్తమమైన పరిచారికలు సేవలు చేసేవారో, ఏ భుజానికి తెల్లని చందనం, అగురువు వంటి లేపనాలు పూసేవారో, ఏ భుజంపైన సీత తలపెట్టుకొని పడుకునేదో అటువంటి భుజాలు గంగా జలంలో మునిగిన తక్షకుడి శరీరంలాగా ఉంది.

కాడివలె ఉండే ఆ భుజం యుద్ధంలో శత్రువులకు దుఃఖాన్ని, మిత్రులకు ఆనందాన్ని కలిగించేది. సమర్థుడు, మహాబాహువు అయిన రాముడు ధనుస్సు మోస్తూ ఉండటం వలన ఆ భుజాన కాయలుకాసి ఉన్నాయి. అటువంటి బాహువు కోట తలుపులకు గడియవలె బలంగాను, దీర్ఘంగాను ఉండి. వేలకొద్దీ గోవుల్ని దానం చేసిన ఈ భుజాల్ని తలగడగా చేసుకొని శయనించాడు, 'నేను ఈ సముద్రాన్ని దాటనైనా దాటాలి లేదా మరణించనైనా మరణించాలి' అన్న దృఢ నిశ్చయంతో నియమాలన్నీ పాటిస్తు నిష్ఠగా దర్భలపై సముద్రతీరాన పడుకున్నాడు.

ధర్మవత్సలుడైన రాముడు ఆ సముద్రతీరాన పడుకుని సముద్రుణ్ణి ఉపాసిస్తూ మూడు పగళ్ళు, మూడు రాత్రిళ్ళు గడచినా సముద్రుడు కరుణించలేదు. రాముడికి సాక్షాత్కారం కాలేదు. సముద్రుడు చూపుతున్న నిరాదరణకు రాముడికి కోపం ముంచుకొచ్చింది. "లక్ష్మణా! ఈ సముద్రుడు ఇంతవరకు ప్రత్యక్షం కాలేదు. ఇతడు చాలాగర్విష్ఠి. సత్పురుషుల్లో ఉండే ఓర్పు, ఋజుత్వము, శాంతి, ప్రియంగా మాట్లాడటం వంటి గుణాలన్నింటినీ అసమర్థతగా పరిగణిస్తున్నాడు. లోకం ఆత్మస్తుతి చేసుకునేవాణ్ణి దుష్టుణ్ణి, దౌర్జన్యం చేసేవాణ్ణి, అందరినీ దండించే వాళ్ళనే గౌరవిస్తుంది. లక్ష్మనా! లోకంలో సామముచేత కీర్తిగాని, యశస్సుగానీ, యుద్ధంలో విజయంగాని పొందలేదు.

లక్ష్మణా! నేను ఈ సముద్రంపై బాణాలు సంధించి మొసళ్ళు, చేపలు, ఇతర జలచారాలన్నీ ఒడ్డుకు కొట్టుకొనివచ్చేట్లు చేస్తాను. ఈ జలచరాలన్నీ ఛిన్నాభిన్నమై పైకి తేలిపోతాయి, తొండాలు తెగిన ఏనుగుల్లాగా, ఈ జలచరాలన్నీ ముక్కలై పైకి తేలుతాయి, సముద్రజాలాల్ని ఇంకిపోయేట్లు చేస్తాను. శంఖాలు, ముత్యాలు, మొసళ్ళు కుప్పలు కుప్పలుగా బయటపడతాయి. నేను ఇంతవరకు ఓర్పుతో ఉన్నాను. ఈ సముద్రుడు నా ఓర్పును అసమర్థతగా భావిస్తున్నాడు. అందువల్ల నాకు కనిపించకుండా తిరుగుతున్నాడు. ఇటువంటి దుష్టుల దగ్గర ఓర్పు, మంచితనం పనిచెయ్యవు. నేను ఇకపై సౌమ్యంగా ఉండను. సౌమ్యంగా ఉన్నంతకాలం నాకు సాక్షాత్కారం కాదు.

లక్ష్మణా! నా ధనుస్సును, అంబులపొదిని తీసుకొనిరా, క్రూరసర్పాల వంటి నా బాణాలతో ఈ సముద్రాన్ని ఎండగడతాను. నా బాణాలతో ఈ సముద్రుడు క్షోభించిపోవాలి, చలియలికట్ట దాటకుండా కట్టలు తెంచుకొని భూమిపై వరదలైపారేట్లు చేస్తాను. దానవ సమూహంతో కూడా ఈ సముద్రాన్ని క్షోభపెట్తను" అంటూ ధనుస్సు చేతుల్లోకి తీసుకున్నాడు. కోపితుడైన రాముడు సముద్రాన్ని పరికించి చూశాడు. ప్రళయకాల అగ్నిహోత్రుడయ్యాడు. పిడికిటితో ధనుస్సు చివర గట్టిగా పట్టుకున్నాడు. ధనుష్టంకారం చేశాడు. జలచరాలు, భూచరాలు ముల్లోకాలూ గజగజా వణికిపోయాయి. వజ్రాయుధంవంటి బాణాల్ని సముద్రంపై వదిలాడు. అగ్ని శిఖల్లాంటి ఆ బాణాలు సముద్రంలోకి దూసుకుపోయాయి. జలచరాలన్నీ భయపడిపోయాయి, గాలి భయంకరంగా వీచింది, దాంతో పెద్ద పెద్ద అలలు లేచాయి. తిమి తిమింగలాలు, మొసళ్ళన్నీ క్షోభచెందాయి, అలలన్నీ సుడిగుండాలుగా మారాయి. శంఖాలు, ముత్యాలు, ఆలుచిప్పలు అలలతోపాటు పైకి లేచాయి. బాణాల్లోనుండి పుట్టిన అగ్నిజ్వాలలు అలలలో కలసి పొగలురేగాయి. బాణాలుపోయి పాతాళాన్ని తాకాయి, పాతాళంలో ఉండే దానవులంతా మలమలమాడిపోసాగారు, విషతుల్యమైన ఆ బాణాలు వాళ్ళందర్నీ తీవ్రంగా బాధపెట్టాయి. అంతట రాముడి కోపం రెట్టింపయింది. మహోగ్రవేగంతో పోయే బాణాన్ని ఒక్కటి తీసి వింటిలో సంధించి ఎక్కుబెట్టి వదలబోతూవుండగా, లక్ష్మణుడు అడ్డుగా పోయి 'వద్దు, వద్దు'

అంటూ బాణంపై చెయ్యివేసి ఆపాడు.

"అన్నా! నీలాంటి వాళ్ళు కోపానికి వశులు కాకూడదుగదా? మహావీరుడవైన నీవు సముద్రాన్ని ఎండగట్టవచ్చును. నీకు కావలసిన కార్యాన్ని పూర్తి చేసుకోవచ్చును. కానీ అతి ప్రాచీన కాలంనుండే వస్తున్న సత్పురుషుల ప్రవర్తనను నీవు దృష్టిలో ఉంచుకోవాలి" అన్నాడు.

# 22వ సర్గ సేతు నిర్మాణం

అంతట రాముడు సముద్రుణ్ణి ఉద్దేశించి "ఓ సముద్రుడా! నిన్ను పాతాళం వరకూ ఎండేట్లు చేస్తున్నాను. కాచుకో, నా బాణాల తాపానికి, నీ జలాలు, నీ జలాల నాశ్రయించి బ్రతికే జీవరాసులన్ని ఎండిపోతాయి. ఆ తరువాత నా బాణాలతోనే సేతువును కడతాను, దానిపైనుండి ఈ వానరసైన్యం అంత లంకకు చేరుకుంటారు.

"ఓ సముద్రుడా! నీవు దానవులకు నివాసాన్నిచ్చి, వాళ్ళ బలంతో విర్రవీగుతున్నట్లున్నావు. నన్ను నా పరాక్రమాన్ని అపహాస్యం చేస్తున్నావు. నీవు ఇప్పుడు నా వలన సంతాపం పొందబోతున్నావు" అన్నాడు. అంతట రాముడు బ్రహ్మాస్త్రాన్ని సంధించాడు. ధనుస్సుపైన ఉంచి వింటి నారిని లాగిపట్టి ఉంచాడు. రాముడా నారిని తాకినప్పుడు భూమి ఆకాశం బద్దలైపోగా, పర్వతాలన్నీ కంపించాయి. లోకాలన్నీ చీకట్లు కమ్మాయి, సరస్సులు, నదులు క్షోభించాయి. సూర్యచంద్రులు, నక్షత్రాలు గమనం తప్పాయి. సూర్యకిరణాలు మందంగా ప్రసరించడంచేత ఆకాశమంతా మండే ఉల్కల మల్లే కనిపించింది. వాయువుచేత మేఘాలన్నీ చిమ్మివేయ బడ్డాయి. అంతరిక్షం నుండి మహాధ్వనులు చేస్తూ పిడుగులుపడ్డాయి. మహావృక్షాలన్నీ నేలకూలాయి. పర్వత శిఖరాలు చలించిపోయాయి. మేఘాలు భయంకరంగా ఉరిమి మెరుపుల్తో నిప్పులు కక్కాయి. పిడుగు పాటుకు నిద్రించే ప్రాణులన్నీ లేచి కూర్చున్నాయి.

అంతకు పూర్వమే రాముడు ప్రయోగించిన బాణాలతో సముద్రజలాలు, జలచరాలుకూడా తల్లడిల్లిపోయాయి. సముద్రం ఆకాశానికెగసి పడింది. ఎన్నడూ లేని విధంగా, సముద్ర జలాలు చెలియలికట్టను అధిగమించి ఒక యోజనదూరం దాకా ప్రవహించాయి, రాముడు బ్రహ్మాస్త్రాన్ని ఎక్కుపెట్టి, ప్రయోగించకుండా పట్టుకొని నిల్చున్నాడు, అప్పుడు మేరుపర్వతం పైనుండి ఉదయించే సూర్యుడిలాగా సముద్రజలాల మధ్య నుండి సముద్రుడు స్వయంగా పైకి లేచి వచ్చాడు. ఆ సముద్రుడి వైడూర్య కాంతులతోను, తామరపూలవంటి

కన్నులతోను, ఎర్రటి వస్త్రాలు ధరించి, ఎర్రటిపూలదండలతోను, బంగారంతో చేసిన వివిధమైన ఆభరణాలతో అలంకరించబడిన హిమపర్వతంలాగా ఉన్నాడు. కౌస్తుభమణికి జత అయిన తెల్లని మణిని వక్షఃస్థలంపై ధరించాడు. సముద్రుడు ఆ విధంగా లేచి వస్తూంటే, వాయువు విపరీతంగా వీచింది. సముద్రంలో అలలు ఆకాశాన్నంటాయి. సముద్రం ఉపరితలం అంతా మొసళ్ళు తేలి ఆడుతున్నాయి. దేవత స్త్రీలతో సమానమైన గంగా, సింధువంటి నదులన్నీ అతడి వెనుకనే వచ్చాయి, అటువంటి సముద్రుడు అంజలి ఘటించి రాముడితో ఇలా అన్నాడు.

"ఓ సౌమ్యుడా! ఓ రామా! భూమి, వాయువు, ఆకాశం, నీరు, అగ్ని ఈ ఐదు తమకు ఏది సహజమైన స్వభావమో ఆ పరిధిలోనే పనిచేస్తూ ఉంటాయి. లోతుగా ఉండటం, దాటటానికి వీలు లేకుండా ఉండటం నా స్వభావం. అలా కాకుండా ఉంటే అది స్వభావానికి విరుద్ధం అవుతుంది.

రాజకుమారా! నాలో అనేక జలచరాలు నివసిస్తూ ఉంటాయి. నేను స్తంభించిపోతే (గడ్డకడితే) వాటి జీవిత విధానం అంతా తలక్రిందులైపోతుంది. కాబట్టి కోరికచేతగాని, మోహంచేతగాని, లోభంచేతగాని భయంవల్లగానీ నేను స్తంభించిపోను. అయితే నీకో సహాయం చెయ్యగలను. అదేమంటే, నీమా, నీ సైన్యం నన్ను దాటిపోయేంత వరకూ నాలో ఉండే జలచరాలేవి నిన్ను బాధించకుండా చేస్తాను. నీవు, నీ వానరసేన నన్ను దాటి పోయేందుకు నాపైన సేతువు కట్టుకోండి. అందుకోసం నేను ఆ ప్రాంతాన్నంతా మెరక అయ్యేట్లు చేస్తాను" అన్నాడు. అంతట రాముడు సముద్రుణ్ణి చూసి "ఓ సముద్రుడా! అమోఘమైన బాణాన్ని సంధించాను, అదే బ్రహ్మాస్త్రం. దాన్ని వెనక్కు తీసుకోవడం సాధ్యంకాదు. ఈ అస్త్రాన్ని నీ మీద ప్రయోగించాను. కానీ ఎక్కడ విడవాలో నీవే చెప్పు" అన్నాడు.

మహా తేజోవంతుడైన సముద్రుడు ఆ బ్రహ్మాస్త్ర ప్రభావాన్ని తెలుసుకున్నాడు. రామునితో ఇలా అన్నాడు. "ఓ ప్రభూ! ఇక్కడకు ఉత్తరంగా 'ద్రుమకుల్యం' అనే ప్రదేశం ఉంది. ఆ ప్రదేశం అంతా మనోహరమైందని జగత్ప్రసిద్ధి చెందింది. ఆ ప్రదేశంలో ఆభీరులు మొదలయినవారు

నివసిస్తూ ఉంటారు. వాళ్ళంతా పాపాత్ములు. నాలోనుండి ఉద్భవమయ్యే స్వాదుజాలాన్ని అన్నీ త్రాగి బ్రతుకుతూ ఉంటారు. వాళ్ళతో కలసి నేను సహజీవనం చెయ్యలేకుండా ఉన్నాను. వాళ్ళు నన్ను తాకినా కూడా సహించలేకపోతున్నాను, నీవు నీ బాణాన్ని వాళ్ళపైన ప్రయోగించి నాకు ఉపశమనం కలిగించు" అన్నాడు. రాముడు ద్రుమకుల్యం మీద ఆ బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు, అది మంటలు మండుతూపోయి ఆ ప్రదేశాన్నంతా దగ్ధంచేసింది. అక్కడ నుండి భూమిని చీల్చుకుంటూ పాతాళంలోకి దూసుకుపోయింది. ఆ బాణం పోయిన రంధ్రంగుండా నీరు బైటకు ఉబికి వచ్చి ఒక కూపంగా (బావి) తయారైంది. అప్పటినుండి అది 'వ్రణకూపం' అని ప్రసిద్ధి చెందింది. ఆ కూపంలోనుండి నిరంతరం స్వాదు జలాలు ఊటగా పైకి వస్తూ ఉంటాయి. ఆ కూపంలోని నీరుకూడా సముద్రజలాల్లాగా ఎన్నడూ ఎండిపోవు. రాముడు ప్రయోగించిన అస్త్రం ఆ దురాత్ములు వాడుకునే కూపాలు, తటాకాలలోని నీటినంతటినీ పీల్చివేసి ఎండిపోయేట్లు చేసింది. ఆ మరుకాంతారం ముల్లోకాల్లోనూ ప్రసిద్ధిపొందింది. అప్పుడు దశరథ కుమారుడు మహావిద్వాంసుడు దేవతలవంటి పరాక్రమం కలిగిన రాముడు అక్కడ ఉండే కూపాల్ని, తటాకాల్ని ఎండిపోయేట్లుచేసి ఆ మరుకాంతారానికి ఒక వరమిచ్చాడు. ఆ వర ప్రభావం చేత ఆ ప్రదేశంమంతా పశువులకు నివాసయోగ్యం అయింది. రోగాలు, రొష్టులు లేకుండా సుఖంగా జీవించసాగారు. వృక్షాలు తియ్యటి ఫలాలను అందిస్తూన్నాయి. తేనె, నెయ్యి, పాలు సమృద్ధిగా లభించాయి. ఆ ప్రదేశం అంతా సర్వ మంగళకరమైన మార్గంగా ఏర్పడింది. ఆ విధంగా సముద్రుడు తన కుక్షిలోని ఆ ద్రుమకుల్యం అంతా దగ్ధం అయిన తరువాత రాముడితో ఇలా అన్నాడు.

"ఓ సౌమ్యుడా! నీ వానరసైన్యంలో నలుడు అనే వాడొకడున్నాడు. అతడు విశ్వకర్మ కుమారుడు. నలుడి తల్లికి విశ్వకర్మ. "నీకు పుట్టబోయేవాడు నా అంతటి వాడవుతాడని" వరం ఇచ్చాడు. కనుక ఈ నలుడు ధైర్యం కలవాడు, ఉత్సాహవంతుడు, ఇతడికి నాపై వారధికట్టగల సామర్థ్యం ఉంది. అతడు కట్టే వారధి చెక్కుచెదరకుండా నా అలల్ని అదుపుచేస్తాను" అని చెప్పి అంతర్ధానం అయ్యాడు.

సముద్రుడు అంతర్ధానం కాగానే నలుడు లేచి రాముని ఎదుట నిలబడి చేతులు జోడించి నమస్కరిస్తూ "ప్రభూ! ఈ సముద్రుడు చెప్పింది యథార్థం. నా తండ్రి వరం వలన నాకా శక్తివుంది. నేను కట్టే వారధిపైన మన సేనలు లంకకు చేరగలవు? ప్రభూ! నేను విశ్వకర్మ ఔరస పుత్రణ్ణని నా తల్లి నాకు చెప్పింది. కానీ నాకీ నిర్మాణ కౌశలం ఉన్నదని తెలియదు. ఇప్పుడు సముద్రుడు చెప్పటం వల్ల నాకు గుర్తువచ్చింది. ఇప్పుడే ఈ వానరుల సహాయంతో సేతువు నిర్మాణం ప్రారంభిస్తాను" అని అన్నాడు.

నలుని మాటలు విన్న రాముడు సేతువు నిర్మాణం వెంటనే ప్రారంభం కావాలని ఆజ్ఞాపించాడు. అంతట కోట్లాది వానరసైన్యం నలుదిక్కులకు పోయారు. కంటికి కనిపించిన వస్తువునల్లా పట్టుకొచ్చారు. ఎవరి బలానికి తగ్గదాన్ని వాళ్ళు మోసుకువచ్చారు. అడవుల్లోకిపోయి మద్దిచెట్లను, చంద్రివృక్షాలను, తాటిచెట్లను, కొండమల్లెచెట్లనూ, బొట్టుగుచెట్లనీ, నేరేడు చెట్లనీ, మారేడుచెట్లనీ పెళ్ళగించుకొని వచ్చారు. పెద్దపెద్ద రాళ్ళను పెళ్ళగించుకొచ్చారు. పెద్దకొండంత బండరాళ్ళను తీసుకొచ్చి సముద్రంలో ఎత్తి పడేస్తూంటే సముద్రజలాలు ఆకాశం వరకు ఎగిరాయి. అక్కడ దొరికే వస్తువుల్తోనే నూలుతాళ్ళను, కొలతబద్దల్ని, ఇంకా ఇతర పనిముట్లను ఏర్పాటు చేసుకున్నారు. వాళ్ళపైన అజమాయిషీ చేస్తున్నవాళ్ళు, త్వరగా తెమ్మని వాళ్ళను తొందరపెట్టారు. తెచ్చిపడేసే వాళ్ళు తెచ్చిపడేస్తూంటే అందులో కొందరు వాటన్నింటినీ సమానంగా పేర్చి మట్టంకట్టారు. నలుడు పదియోజనాల వెడల్పు, నూరుయోజనాల పొడుగు ఉండేట్లుగా సేతు నిర్మాణం పనులు చురుగ్గా సాగించాడు. సముద్రం అంతా కోట్లాది వానరుల్తోను, తెచ్చిపడేసే సామాన్లతోను నిండిపోయి దిక్కులు పిక్కటిల్లి పోయేట్లుగా శబ్దాలయ్యాయి.

ఏనుగుల్లాంటి మహాకాయులైన ఆ వానరులంతా సంతోషంగా ఉరకలువేస్తూ పదునాలుగు యోజనాల దూరాన్ని ఒక్క రోజులో నిర్మించారు. రెండో రోజు ఇరవై యోజనాల దూరం నిర్మించారు, మూడవరోజున ఇరవైఒక్క యోజనాల దూరం నిర్మించారు, నాలుగోనాడు

ఇరవైరెండు యోజనల దూరం సేతువును నిర్మించారు. ఐదవ రోజున ఇరవైమూడు యోజనాల దూరం నిర్మించారు. వానరులలో శ్రేష్ఠుడైన నీలుడు, తండ్రి ఉంటే ఎలా కట్టివుండేవాడో, తానూ అదేవిధంగా నిర్మించాడు. సువేలాద్రిని హద్దుగా చేసుకొని నూరుయోజనాల సముద్రం మీద సేతువును అయిదు రోజుల్లో నిర్మించారు.

మహా బలవంతుడు, ధైర్యవంతుడైన ఆ నలుడు కట్టిన ఆ సేతువు ఆకాశంలో కనిపించే నక్షత్రమార్గంలాగా కనిపించింది. అప్పుడు దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు ఆకాశంలో నిలిచి సేతు బంధన కార్యాన్ని వేడుకతో తిలకించారు. మొసళ్ళకు, తిమింగలాలకు ఆలవాలమైన ఆ సముద్రంలో సేతువు కట్టవచ్చని ఎవరూ ఊహించియైన ఉండరు. ఈ అద్భుతాన్ని అయిదే అయిదు రోజుల్లో నిర్మించడం చూసి సమస్త ప్రాణకోటి ఆశ్చర్యపడిపోయింది. అట్లా వారధి కడుతూనే లక్షలాది వానరులు ఆవలి గట్టుకు చేరుకున్నారు. వానరులు కొందరు సంతోషంతో గంతులువేశారు, ఇంకొందరు ఆకాశంలోకి ఎగిరి నేలపై పడ్డట్లుగా ఆ వారధిపై పడ్డారు. కొందరు వారధిపైనుండి సముద్రంలోకి దూకి కొంతదూరం ఈదుతూపోయి మళ్ళీ వారధి పైకి వస్తున్నారు. కొందరు ఆకాశంలోనే ఎగిరి వచ్చారు. సముద్రం మధ్యలో ఉన్న ఆ వారధి తల్లో పాపిడి తీసినట్లు కనిపించింది.

అంతట విభీషణుడు గద చేతపట్టుకొని వానర సైన్యంతో కలసి లంకను ముట్టడించేందుకు అవతలి ఒడ్డుకు చేరుకున్నాడు. అంతట సుగ్రీవుడు రాముడితో ఇలా అన్నాడు: "ప్రభూ! సముద్రంపై కట్టిన ఈ వారధి నూరు యోజనాల దూరం ఉంది. కాబట్టి నీవు, లక్ష్మణుడు హనుమంతుని వీపుపైన, అంగదుని వీపుపైన ఎక్కి అవతలి ఒడ్డుకు చేరండి. నేను మీ ఇద్దరి ముందూ ఆకాశమార్గంలో వస్తాను." సుగ్రీవుడు ముందు వెళ్తూవుండగా రామలక్ష్మణులు అతడిని అనుసరించి వెళ్ళారు. వానరసైన్యం చేస్తున్న ధ్వనుల్తో సముద్రం అంతా ప్రతిధ్వనించింది. ఆ సైన్యం అంతా లంకకు చేరింది. తినేందుకు మంచిఫలాలు, కందమూలాలు, త్రాగేందుకు మంచినీరు లభించేచోటు చూసి వాళ్ళందరికీ వాళ్ళకు విడిది ఏర్పాటు చేశాడు.

ఆశ్చర్యకరమూ, ఇతరులెవ్వరూ చేయలేని ఆ సేతునిర్మాణాన్ని ఆకాశంలో నుండి చూస్తున్న దేవతలు, గంధర్వులు, సిద్ధులు, చారణులు, మహర్షులు, సమస్తభూతాలు తమ సంతోషాన్ని వ్యక్తంచేస్తూ వేరువేరుగా మంత్రజలాన్ని చల్లారు. “ఓ మహారాజా! రామా! శత్రువుల్ని జయించి అనేక సంవత్సరాలు ఈ సముద్రాల్ని, భూమండలాన్ని పాలించు” అని రాముణ్ణి దీవించారు.

# 23వ సర్గ రాముడు శుభ శకునాలు చూడటం

అప్పుడు రాముడు భవిష్యత్తును సూచించే శుభ శకునాల్ని అనేకం చూశాడు. శకునాల గూర్చి బాగా తెలిసిన రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. “లక్ష్మణా! ఇక్కడున్న ఈ అరణ్యంలో కందమూలాలు, ఫలాలు, త్రాగేందుకు మంచినీరు సమృద్ధిగా ఉన్నాయి. మన సైన్యం అంతా కడుపునిండా తిని అలసట తీర్చుకొవచ్చు, ఆపైన ఈ సైన్యాన్నంతా విభజించి వ్యూహరచన చేద్దాం. ఈ జరగబోయే భయంకరమైన యుద్ధానికి గరుడవ్యూహంగా ఏర్పాటుచేద్దాం. ఈ యుద్ధంలో భయంకరమైన వానర భల్లూకాలు నశిస్తాయేమోనని అనిపిస్తోంది. గాలి దుమారాలు తరచుగా వస్తున్నాయి. భూమి కంపిస్తోంది. దాంతో పర్వత శిఖరాలుకూడా స్వల్పంగా కంపిస్తున్నాయి. చెట్లు పడిపోతున్నాయి, మేఘాలు రక్తంతో కూడి వర్షిస్తున్నాయి. సాయంసంధ్య ఎర్రచందనంలాగా ఉంది. సూర్యమండలం నుండి అగ్ని కణికలు రాలుతున్నాయి. అడవుల్లో ఉండే క్రూరమృగాలు దీనంగా భయంతో సూర్యుడి వైపు చూస్తూ ఏడుస్తున్నాయి. ప్రళయకాలంలోలాగా చంద్రుడు నల్లగా ఎర్రగా ఉంటూ, ప్రకాశం లేకుండా భయం కలిగిస్తున్నాడు.

లక్ష్మణా! సూర్యమండలం చుట్టూ అప్రశస్తమైన చిన్న ఎర్రనిగూడు కనిపిస్తోంది. అందులో నల్లటిమచ్చ కనిపిస్తోంది. నక్షత్రాలన్నీ కాంతిహీనాలై రాబోయే ప్రళయాన్ని చాటిచెప్తున్నాయి. కాకులు, గ్రద్దలు, డేగలు నేలబారుగా ఎగురుతున్నాయి. అమంగళకరంగా కూస్తున్నాయి, వానరులు విడిదిచేసిన పర్వతాలన్నీ రక్త మాంసాలతో తడిసివున్నాయి.

ఇవన్నీ ఈ దేశానికి పట్టిన అరిష్టాన్ని చూచిస్తున్నాయి. మనం ఏమాత్రం ఆలశ్యం చెయ్యకుండా రావణాసురుడిపై యుద్ధాన్ని ప్రకటించాలి.” అలా రాముడు అంటూ ధనుస్సు ధరించి లంకానగరం వైపుగా నడక సాగించాడు. విభీషణుడు, మిగిలిన వానరులు దిక్కులు పిక్కటిల్లేట్లుగా సింహనాదాలు చేశారు, శత్రువుల్ని చంపేందుకు ధైర్యంగా ముందుకు నడిచారు.

వాళ్ళ ఉత్సాహం చూసి రాముడు సంతోషించాడు.

## 24వ సర్గ రాముడు లంక శోభను వర్ణించటం

రాజైన రాముడు, సైన్యాన్ని వ్యూహాలుగా విభజించి నడుపుతుంటే, శరత్కాలంలో నక్షత్రాల మధ్యనుండే చంద్రుడిలాగా ప్రకాశించాడు. సముద్రంలాంటి అపారమైన వానరసేన నడుస్తూవుంటే భూమి కంపించింది. వీళ్ళకు సమాధానంగా అటు లంకనుండి కూడా భేరీమృదంగ వాద్యధ్వనులు, రాక్షస యోధుల కోలాహలాలు, వినబడ్డాయి. రాక్షసులు కూడా యుద్ధానికి సిద్ధమయ్యారని తెలుసుకొని వానరులంతా సంతోషించారు. రాక్షసులు చేసే ధ్వనులను మించిపోయేట్లుగా సింహ నాదాల్ని రెట్టింపుచేశారు. రాక్షసులకు వినబడేట్లుగా పిడుగులు పడుతున్నాయ్యా? అన్నట్లు గర్జించారు. ఇరుపక్షాల వాళ్ళు అట్లా విచిత్రమైన ధ్వనులు చేస్తూంటే రాముడు మనస్సులో సీతను తలచుకున్నాడు. “అంగారకుడిచే ఆక్రమించబడిన రోహిణివలె, నల్లని కన్నులుగల సీత రావణుడిచేత బంధించబడింది” అని అనుకున్నాడు. లక్ష్మణునితో ఇలా అన్నాడు.

రాముడు: “లక్ష్మణా! పర్వతంపైన అతి సుందరంగా నిర్మించబడ్డ ఈ లంకా పట్టణాన్ని విశ్వకర్మ నిర్మించాడా? అన్నట్లుంది. ఈ పట్టణంలోని భవనాలన్నీ ఎత్తైన శిఖరాలతో ఆకాశాన్నంటుతున్నాయి. ఇక్కడ వనాల్లో అనేక జాతుల పక్షులు, జంతువులు సుఖంగా జీవిస్తున్నాయి. వనాలన్నీ పూలు పండ్లతో నిండి ఉన్నాయి. ఈ లంకాపట్టణం కుబేరుని చైత్రరథోద్యానమువలె శోభాయమానంగా ఉన్నది. ఈ వనాల్లో పూసే పూలు, పండే ఫలాలు తింటూ పక్షులు మత్తెక్కి పాటలు పాడుతున్నాయి. తియ్యటి తేనెల్ని త్రాగుతూ తుమ్మెదలు చెట్ట చెట్టుకూ తిరుగుతూ ఝంకారం చేస్తున్నాయి. చిగురుటాకులు తింటూ కోయిలలు మత్తెక్కి కూస్తున్నాయి.

రాముడు సైన్యాన్నంతా వ్యూహాలుగా విభజించాడు సైన్యం. అంతా గరుడవ్యూహంగా ఏర్పడ్డది. భూమిపైన తిరిగే వానర సైన్యాన్ని చూస్తూవుంటే ఆకాశంలో సంచారం చేస్తున్న

మేఘాల్లాగా కనిపించాయి. అప్పుడు రాముడు సుగ్రీవుడితో ఇలా అన్నాడు:

రాముడు: సుగ్రీవుడా! ఇప్పుడు మన సైన్యాన్నంతా వ్యూహాలుగా విభజించి నిలబెట్టడం అయిపోయింది. మనం బంధించి ఉంచిన ఆ శుకుణ్ణి విడిచి పెట్టవచ్చు.

అంతట సుగ్రీవుడు బంధాలన్నీ విప్పేసి ఆ శుకుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశాడు. అంతట ఆ శుకుడు "బ్రతుకుజీవుడా" అనుకుంటూ వేగంగా ఎగురుకుంటూ పోయి రావణాసురుడి ముందు వ్రాలాడు.

శుకుణ్ణి చూసిన రావణాసురుడు నవ్వుతూ "ఏమిరా! నీ రెక్కలన్నీ విరిగిపోయి ఉన్నాయి. నువ్వు ఆ కోతి మూకలచేతుల్లో పడలేదుగదా?" అన్నాడు.

శుకుడు: "రాజా! నేను నీ ఆజ్ఞల్ని శిరసావహించి సముద్రం దాటి వెళ్ళాను. సుగ్రీవుడితో ఎంతో మృదువుగా నువ్వు చెప్పమన్న మాటలన్నీ చెప్పాను. నీ మాటల్ని, (నా నోట) విన్న ఆ వానరులంతా కృద్ధులైపోయారు. ఆకాశం పైకి ఎగిరివచ్చి నన్ను పట్టుకొని పిడిగుద్దులు గుద్దారు, రెక్కలు విరిచేశారు. నాకు నోరు తెరిచి మాట్లాడే అవకాశం కూడా ఇవ్వలేదు. చచ్చేట్లు కొట్టారు. వానరులు ఎంత కోపిష్టి వాళ్ళో నాకు తెలిసివచ్చింది.

ప్రభూ! వాళ్ళు సముద్రానికి సేతువుకట్టారు. వానరులంతా ఆ సేతువు దాటి లంకలోకి ప్రవేశించారు. మనవాళ్ళైన ఖరుణ్ణి, కబంధుణ్ణి, విరాధుణ్ణి, సంహరించిన రాముడు ధనుస్సు పట్టుకొని యుద్ధభూమిలో నిలబడి ఉన్నాడు. సీతాదేవిని బంధించి ఉంచిన ఈ లంకా పట్టణాన్ని నాశనం చెయ్యడానికి వచ్చాడు.

రాజా! ఆ రాముడి సైన్యంలో ఉండే వానరులు భల్లూకాలన్నీ ఒక్కొక్కడూ ఒక పర్వతం అంత ఉన్నాడు. కోట్లాదిమంది నేల ఈనినట్లుగా లంకాద్వీపం అంతా ఆవరించుకున్నారు. మన పట్టణాన్ని నాలుగు మూలల నుండి ముట్టడించారు. కాబట్టి ఓ రాజా! సీతాదేవిని ఇచ్చి

సంధిచేసు కోవడమా? లేక రాముణ్ణి ఎదిరించి యుద్ధం చెయ్యడమా? అని నువ్వే నిర్ణయించుకో.

శుకుడు చెప్పిన మాటలకు రావణునికి కోపం వచ్చింది. కళ్ళు ఎర్రబడ్డాయి. కళ్ళల్లోనుండి నిప్పులు కురిపిస్తూ ఇలా అన్నాడు.

రావణుడు: "ఓరీ మూర్ఖుడా! దేవదానవ, గంధర్వులు అంతా కలిసి వచ్చినా, ముల్లోకాలూ వచ్చి నా కాళ్ళావేళ్ళ పడ్డాకూడా నేను సీతను విడువను. నా ధనుస్సును వాడి చాలాకాలం అయింది. నా బాణాలకు బొత్తిగా పనిలేకుండా పోయింది. వసంతకాలంలో విరగబూసిన పుష్పాలను మదమెక్కిన తుమ్మెదలు ముసురుతున్నట్లుగా నా బాణాలన్నీ రాముణ్ణి కప్పివేస్తాయి. మండే కొరవులు ఏనుగుల్ని నిగ్రహించినట్లు, ఉదయ సూర్యుడు నక్షత్రాలను రూపుమాపినట్లుగా నా బాణాలు రాముణ్ణి, వానరసైన్యాన్ని రూపుమాపేస్తాయి. నా బాణాలకు సముద్రంవంటి వేగం, వాయువువంటి గమనమూ ఉంటాయి. నాబాణాల ధాటి రాముడు ఎప్పుడూ రుచిచూడలేదు. అందువల్లనే నాతో యుద్ధం చెయ్యాలని ఉబలాటపడుతున్నాడు. యుద్ధంలో నా పరాక్రమం ఎరుగడు. నా తూణీరాలలో ఉన్న తీక్షణమైన విషసర్పాల్లాంటి బాణాలతో నేను యుద్ధం చేయడం ఎప్పుడూ విని ఉండడు. నేను శత్రుసేనల్ని నాట్యరంగంలో వీణ తంత్రుల్ని మోగించినట్లు, నా ధనుస్సులో బాణాలు కూరుస్తూ నారి భేదిస్తాను. నేను చేసే ధనుష్టంకారానికి నా శత్రుసేన అంతా హాహాకారాలు చేస్తూవుంటే వినోదిస్తాను. నా బాణాల్నుండి వచ్చే వేడిని దేవేంద్రుడుగాని, వరుణుడుగాని యమధర్మరాజుగానీ తట్టుకొని నిలబడలేరు. ఇక మిగిలిన వాళ్ళ సంగతి చెప్పాలా?" అంటూ మీసాలు మెలేశాడు.

# 25వ సర్గ రావణుడు గూఢచారులను పంపటం

శుకుడువచ్చి రామలక్ష్మణులు, సుగ్రీవుడు అతడి వానరసైన్యం లంకలోకి ప్రవేశించారని చెప్పగానే తన మంత్రులైన శుకుణ్ణి, సారణుణ్ణి పిల్చి రావణుడు ఇలా అన్నాడు: "ఓ మంత్రిపుంగవుల్లారా! ఈ మహాసాగరం పైన సేతువు కట్టడం అనేది ఇంతకుముందు కనీ, వినీ ఎరగం. అటువంటి మహాసాగరానికి వారధి కట్టి వానరసేనలన్నీ లంకలోకి ప్రవేశించాయని తెలిసింది. ఇప్పుడు శత్రువు మన దొడ్డిగుమ్మందాకా వచ్చాడు. కాబట్టి అతడి బలం ఎంతటిది? అతడివద్ద ఉండే వానరుల పరాక్రమం ఏపాటిది? వాళ్ళ సైన్యంలో ఎంతమంది ఉన్నారు? వాళ్ళల్లో ముఖ్యమైన వాళ్ళు ఎంతమంది, ఆ ముఖ్యమైన వాళ్ళు ఎవరు? రాముడికి మంత్రులెవరు? సుగ్రీవుడికి మంత్రులెవరు? వానరసైన్యంలో అతి పరాక్రమం గలవాళ్ళు, మహా బలాఢ్యులు ఎంతమంది ఉన్నారు? వాళ్ళు ఏ ఏ దేశాల నుండి వచ్చి సుగ్రీవుడితో చేతులు కలిపారు? అంతేకాకుండా వాళ్ళు సముద్రానికి సేతువు, ఎట్లా కట్టారు? రాముడి తక్షణ కర్తవ్యం ఏమిటి? రాముడి పరాక్రమ ఎటువంటిది? అతడు ఏఏ ఆయుధాలు ఉపయోగిస్తాడు? అతడి తమ్ముడు లక్ష్మణుడి పరాక్రమం ఎటువంటిది? అతడు ఏఏ ఆయుధాలు ఉపయోగిస్తాడు? అసలు సుగ్రీవుడు కాక, వానరుల్లో పెద్ద నాయకులెవరు? మొదలైన విషయాలన్నీ వివరంగా తెలుసుకొని ఇక్కడున్నట్లుగా రావాలి."

అంతట ఆ శుకుడు, సారణుడు వానరవేషాలు ధరించారు. ఎవరికీ తెలియకుండా మెల్లగా వానర సైన్యంలోకి ప్రవేశించారు. ఆ సైన్యాన్ని చూసిన తర్వాత వాళ్ళ పైప్రాణాలు పైనేపోయాయి. నోట మాట పెగల్లేదు, ఆ సేనయే ఒక మహాసముద్రంలా ఉంది. వాళ్ళంతా ఇప్పుడే సముద్రాన్ని దాటి అడవుల్లోను, పర్వతాలపైన, వనాల్లోను విడిదిచేశారు. వాళ్ళంతా ఒకడు విడిస్తే మరొకడు సింహనాదాలు చేస్తున్నారు. సింహనాదాలతో లంకానగరం అంతా మారుమ్రోగి పోయింది. ఆ సైన్యాన్ని లెక్కపెట్టడం, నక్షత్రాల్ని లెక్కపెట్టడం ఒకటేననిపించింది. మహాసముద్రంవంటి సైన్యాన్ని ఎదుర్కోవడం రాక్షసులకు సాధ్యంకాదని అనుకున్నారు. వాళ్ళు

అట్లా నిర్భయంగా తిరిగి రావణుడు అడిగిన భోగట్టా అంతా సేకరిస్తున్నారు. ఇంతలో వాళ్ళిద్దరూ విభీషణుడి కంటపడ్డారు. విభీషణుడు వెంటనే వాళ్ళను బంధించి రాముడి వద్దకు తీసుకొని వెళ్ళాడు. "ఓ రామా! వీళ్ళిద్దరూ రావణాసురుడి మంత్రులు, ఒకడు శుకుడు, రెండవవాడు సారణుడు. మన రహస్యాలు తెలుసుకొని రమ్మని రావణాసురుడు వీళ్ళిద్దర్నీ పంపించాడు. వీళ్ళు వానరుల్లాగా వేషం వేసుకుని మన సైనికుల్లో తిరుగుతూ ఉంటే నేనే పట్టుకొని నీ వద్దకు తీసుకువచ్చాను. వీళ్ళు చేస్తున్న గూఢచారి చర్యలకు ఎలా శిక్షిస్తావో, నీవే నిర్ణయించు" అన్నాడు.

అంతట ఆ రాక్షసులిద్దరూ ప్రాణభయంతో గజగజా ఒణికిపోయారు. చేతులు జోడించి నమస్కరిస్తూ రాముడితో "ఓ పుణ్యాత్ముడా! మా ప్రభువైన రావణుడు ఇక్కడ మీ వానర బలం ఎంత ఉందో తెలుసుకుని రమ్మని పంపాడు. మేము అందుకోసమే వచ్చాం, ఇంతలో విభీషణుడు మమ్మల్ని గుర్తించి మీ దగ్గరకు తీసుకొచ్చాడు" అన్నారు.

సకల ప్రాణుల్నీ రక్షించటంలో ఆసక్తి కలవాడు, దశరథుని కుమారుడైన రాముడు, వాళ్ళవంక చూసి మందహాసం చేస్తూ "ఓ రాక్షసులారా! మీ ప్రభువు రావణాసురుడు మిమ్మల్ని ఆదేశించినట్లుగా మా బలాన్నంతా చూశారా? మీరు అన్ని విషయాలూ తెలుసుకున్నారా? అట్లా తెలుసుకొని ఉంటే మీరు ఇక స్వేచ్ఛగా మీ ప్రభువు వద్దకు వెళ్ళొచ్చు. అట్లా కాకుండా ఇంకా తెలుసుకోవలసిన విషయాలు మిగిలిపోయి ఉంటే అవన్నీ కూడా తెలుసుకొని వెళ్ళండి. మీకేదైనా సహాయం కావాలంటే విభీషణుణ్ణి కూడా తీసుకొని వెళ్ళండి. మీరు పట్టుపడిపోయామని భయపడకండి, మీ ప్రాణాలకేమీ భయంలేదు. ఆయుధాలు లేనివాళ్ళను, దూతలుగా వచ్చిన వాళ్ళను చంపము. నీకు అభయం ఇస్తున్నాను. పొండి" అన్నాడు.

"ఓ విభీషణుడా! గూఢచారులు ఎప్పుడూ శత్రువులను కష్టాల్లో నెట్టేందుకే ప్రయత్నం చేస్తూవుంటారు. వీళ్ళ దురదృష్టవశాన మన చేతుల్లో చిక్కి ప్రాణభిక్షకోసం వేడుకుంటున్నారు. కాబట్టి వీళ్ళను స్వేచ్ఛగా వదిలేద్దాం" అన్నాడు. అంతట రాముడు రాక్షస గూఢచారులతో ఇలా

అన్నాడు: "ఓ రాక్షస మంత్రులారా! మీరు మీ ప్రభువు దగ్గరకుపోయి నేను చెప్పినందంతా యథాతథంగా చెప్పండి.

"ఓ రావణాసురుడా! నీవు ఏ బలంతో నా భార్య సీతను అపహరించుకొని వచ్చావో, ఆ బలాన్ని ప్రదర్శించే సమయం వచ్చింది. నేను రేపు ప్రాతఃకాలాన నీ లంకాపట్టణం బహిర్ద్వారాలని, ప్రాకారాల్ని పగలగొట్టి నీ రాక్షస సేనలందర్నీ సంహరిస్తాను. నీ సేనల్నీ, బంధువుల్నీ సమకూర్చుకొని యుద్ధానికి సిద్ధంగా ఉండు. దేవేంద్రుడు వజ్రాయుధాన్ని వదిలినట్లుగా నేను నా బాణాల్ని రేపు ఉదయం నీ మీద వదుల్తాను. నా ప్రతీకారం తీర్చుకుంటాను. నీవు సిద్ధంగా ఉండు." అని చెప్పి వాళ్ళిద్దర్నీ పంపేశాడు.

రామునిచేత ఆ విధంగా ఆజ్ఞాపించబడిన ఆ శుక సారణులు ధర్మాత్ముడైన రాముణ్ణి "జయ విజయీభవ" అని అభినందించి రావణుని వద్దకుపోయి ఇలా అన్నారు.

శుకసారణులు: ఓ రాజా! మేము వానర వేషాలతో వెళ్ళి రాముడి సేనలన్నింటినీ చూశాం. మమ్మల్ని విభీషణుడు పట్టుకొని చంపబోయాడు. ధర్మాత్ముడు, మహాతేజశ్శాలియైన రాముడు మమ్మల్ని విడిపించాడు.

రామలక్ష్మణులు, విభీషణుడు, సుగ్రీవుడు ఈ నలుగురు తేజశ్శాలురు మహేంద్రునితో సమానమైన పరాక్రమవంతులు. లోకపాలకుల్తో సమానమైన ఈ నలుగురూ ఒకటైతే మన లంకాపట్టణ ప్రాకారాల్ని, బహిర్ద్వారాల్ని పీకి మరోచోట పెట్టగల సమర్థులు. ఇక మిగిలిన బలశాలుర గూర్చి విచారించలేదు. ఇంకా చెప్పాలంటే మిగిలిన ముగ్గురూ కూడా అవసరం లేదు. రాముడొక్కడే లంకా పట్టణాన్నంతా దహించి వేయగలడు. కాబట్టి ఓ రాజా! రామలక్ష్మణులచేత రక్షించబడుతున్న ఆ వానరసేనను, సురాసురులే ఏకమై ఎదిరించినా జయించలేరు. మిగిలిన వానర యోధులంతా యుద్ధం చెయ్యడానికి ఉత్సాహంగా ఉన్నారు. ఇక విరోధాన్ని మర్చిపోయి సీతను తిరిగి ఇచ్చివేసి రాముడితో సంధి చేసుకోవడం మంచిది.

## 26వ సర్గ వానర బలగాన్ని రావణాసురుడు చూడటం

శుకుడు సారణుడు నిర్భయంగా తమ అభిప్రాయాన్ని రావణుడితో చెప్పారు. అంతా విన్న రావణుడు "ఓ మంత్రి సత్తములారా! దేవతలు, దానవులు, గంధర్వులు కలిసివచ్చి నన్ను ఎదిరించినా సీతను తిరిగి ఇవ్వను. మిమ్మల్ని ఆ వానరులు బాగా దేహశుద్ధి చెయ్యడంవల్ల మీకు భయం పట్టుకుంది. మతికూడా చలించి ఉంటుంది. నన్ను యుద్ధంలో ఎవరూ జయించలేరు" అని అన్నాడు.

ఈ విధంగా మాట్లాడిన కాంతిమంతుడైన రావణుడు ఆ వానరసేనల్ని స్వయంగా చూడాలని అనుకున్నాడు. శుక, సారణులను వెంటబెట్టుకొని మంచువలె తెల్లగాను, తాటిచెట్టు ప్రమాణాన ఎత్తుగాన ఉన్న తన ప్రాసాదం పైకి ఎక్కాడు. అక్కనుండి చూస్తూ ఉంటే, పర్వత ప్రాంతం, సముద్రప్రాంతం, అడవుల్లోను, ఎక్కడ చూసినా నేల ఈనినట్లుగా వానర సేనలుండటం చూశాడు. ఆ వానరులంతా ఇంతమంది అనిగాని, అంతమంది అనిగాని చెప్పడానికి వీలుపడేట్లు లేదు. "ఓ సారణుడా! వీళ్ళల్లో ముఖ్యుడు ఎవరు? వీళ్ళల్లో ఉత్సాహంగా ముందుకు వచ్చి యుద్ధం చేసేవాళ్ళు ఎంతమంది? సుగ్రీవుడు ఎవరి మాట వింటాడు? యుద్ధనాయకులందరికీ నాయకుడెవరు? ఈ వానరుల ప్రభావం ఎటువంటిది? ఓ సారణుడా! నాకు వివరంగా చెప్పు" అన్నాడు.

రావణుడు ఈ విధంగా ప్రశ్నించగా, సారణుడు వానరులగూర్చి తనకు తెలిసిన సమాచారం అంతా ఇలా చెప్పాడు:

"రాజా! వానరవీరుల్లో నీలుడనేవాడు ఒకడున్నాడు. లక్షలాది వానరవీరులు ఎప్పుడూ అతని చుట్టూ ఉంటారు. ఎప్పుడూ లంక వైపుకు తిరిగి సింహనాదాలు చేస్తూవుంటాడు. అతడి సింహనాదాల్తో లంకా పట్టణపు బయటి ద్వారాలు, పర్వతాలు, వనాలన్నీ కంపించిపోతున్నాయి. అటువంటి నీలుడు సుగ్రీవుడి సేనకు ముందువరుసలో నిలబడి ఉంటాడు.

అడుగో! ఆ పద్మకింజల్క వర్ణంతో కనిపిస్తూ, కోపంతో మాటిమాటికీ తోకను నేలకేసి కొడుతున్న వీరుణ్ణి అంగదుడు అని అంటారు. ఇతడు వాలి కుమారుడు. తండ్రితో సమానమైన బలం గలవాడు, సుగ్రీవుడికి చాలా ప్రియమైనవాడు, దేవేంద్రుడికి వరుణుడులాగా, ఈ అంగదుడు కూడా రామకార్యం చేసేందుకు నిన్ను యుద్ధానికి ఆహ్వానిస్తున్నారు.

అడుగో! అతడే హనుమంతుడు. నీవతణ్ణి బాగా ఎరుగుదువుగదా! ఇతడే రామదూతగా వచ్చి సీతాదేవిని చూసి వెళ్ళాడు. ఇతడే ఈ వానరసైన్యం అంతా ఇక్కడకు రావడానికి కారకుడు. మహావీర్యవంతుడు, అజేయుడు. వానరసేనతో నీపై యుద్ధానికి కాలు దువ్వుతున్నాడు.

అక్కడ, అంగదుడి వెనకగా ఉన్నవాడే నలుడు. చందనవనాల్లో తిరిగే వానరులంతా ఇతడి వెనకే ఉంటారు. వీళ్ళంతా కలసి వెయ్యికోట్ల ఎనభై లక్షల మంది ఉంటారు. అందరూ మహాభయంకరులు, క్రూరులు, మహా పరాక్రమవంతులు. ఇతడే 'నేనొక్కణ్ణే లంకాపట్టణాన్ని నాశనం చేస్తాను' అని సవాలు విసిరాడు.

అడుగో! శ్వేతుడు. వెండి కొండలాగా తెల్లగాను, బలంగాను ఉంటాడు. భయంకర పరాక్రమశాలి, బుద్ధిమంతుడే యుద్ధచపలుడు. సుగ్రీవుడికి దగ్గరగా ఉండి వానరసేనల్ని విభజిస్తూ కనిపిస్తున్నవాడే శ్వేతుడు. యోధులందరినీ ప్రోత్సాహపరుస్తూ ఉంటాడు. అక్కడనుండి ఎక్కడకోపోతున్న వాణ్ణి చూడు, అతడే శ్వేతుడు.

గోమతీ నదీతీరాన పర్వతశిఖరాలే రాజ్యంగా గలవాడు కుముదుడు. ఆ శిఖరాల్లో 'సంరోచనం' అనే శిఖరంపై నివసిస్తూ ఉంటాడు. అక్కడి వానరులందరికీ రాజు. ఈ కుముదుడు కోటిమంది వానరుల్ని తన వెంట తెచ్చాడు. ఇతడి తోక వెంట్రుకలు పొడుగ్గా ఎర్రగా పచ్చగా, తెల్లగా ఉంటాయి. దైన్యము లేనివాడు. తీవ్రస్వభావం గల ఈ కుముదుడు యుద్ధాన్నే కోరుకుంటూ ఉంటాడు. ఇతడుకూడా లంకాపట్టణాన్ని కూల్చాలని కృతనిశ్చతుడై ఉన్నాడు.

ఓ రాజా! అడుగో రంభుడు. ఇతడు కపిలవర్ణంలో ఉంటాడు. పొడవాటి జూలు కలిగి

సింహంవలె ఉండే సేనానాయకుడు. అక్కడ నిశ్చలంగా నిలబడి లంకను చూపుల్తోనే కాల్చేసేట్లు చూస్తున్నాడు. ఇతడు నూట ముప్పయిలక్షలమంది వానరుల్ని తనవెంట తీసుకొని వచ్చాడు. ఈ రంభుడు వింధ్యపర్వత శ్రేణుల్లోను, సిహ్యాద్రి పర్వత ప్రాంతాల్ని, కృష్ణగిరి పర్వత ప్రాంతాన్నీ కలిసి పాలిస్తూవుంటాడు. వీళ్ళంతా శూరులే కాదు, క్రూరులు కూడా! మహాపరాక్రమవంతులు.

అడుగో! చెవులు నిక్కబొడుచుకొని, ఆవలిస్తున్నాడు. వాడే శరభుడు; వానరయూథపతి. ఇతడికి చావంటే భయం లేదు. ఎటువంటి పరిస్థితుల్లోనైనా సరే, వెనుతిరిగి పారిపోడు. కోపంతో పైకి క్రిందకీ చూస్తూ తోక నేలకేసి కొడ్తున్నాడు. ఇతడు సాల్వేయ పర్వతాలపై ఉండే వానరులందరికీ రాజు. ఈ శరభుడి చేతి కింద నలభై లక్షలమంది వానర యోధులున్నారు. వాళ్ళంతా మహాబలవంతులే! వీళ్ళ నివాసమైన సాల్వేయ పర్వత శ్రేణులు అతిమనోహరంగా ఉంటాయి.

అడుగో అతడే పనసుడు భేరీధ్వనిచేస్తూ సింహనాదాలుచేస్తూన్నాడు. తన అనుచరుల మధ్య దేవేంద్రుడిలాగా కూర్చుని ఉన్నాడు. మహాభయంకరుడు. ఎనభై లక్షలమంది వానర యోధుల్ని వెంటబెట్టుకొని వచ్చాడు. వాళ్ళందరినీ యూథాలుగా విభజించి నిలబెట్టాడు. ఇతడు పారియాత్రా పర్వతంపైన నివసించే వానరులందరికీ రాజు.

అడుగో! వినతుడు. ఇతడు కృష్ణానది ప్రాంతాల్లో నివసించే వానరాలకు రాజు. ఇతడి వెంట అరవై లక్షలమంది వానరయోధులు వచ్చారు.

అడుగో! ఆ ఎర్రటి శరీర ఛాయతో, శరీరాన్ని పెంచుతూ కనిపించేవాడే గవయుడు. వీడి వెంట డెభై లక్షలమంది వానరులు వచ్చారు. ఇతడు అమిత తేజోవంతుడు, మిక్కిలి కోపిష్ఠివాడు. నిన్ను స్వయంగా ఎదిరించాలనుకొంటున్నాడు. అడుగో క్రోధనుడు బలవంతులైన వానరులను వానరయూథములను ఎవరు ఉండాల్సిన చోట వారిని ఉంచి నిన్ను యుద్ధానికి పిలుస్తున్నాడు.

రాజా! ఈ వానర యూథపతులందరూ మహాశూరులు. వారిని జయించడం చాలాకష్టం

వాళ్ళంతా కామరూపులు. వీళ్ళందరికీ ప్రత్యేకమైన సైన్యాలున్నాయి.

# 27వ సర్గ వానరుల పరాక్రమాన్ని సారణుడు వివరించడం

శుకుడు సారణుడు వానర వీరుల పరాక్రమాన్ని గురించి మరల ఇలా చెప్పడం ప్రారంభించారు.

అడుగో అందరికంటే పొడుగాటి తోక ఉన్నవాడే హరుడు. అతడి తోకపై వెంట్రుకలు పొడవుగా ఉండి ఎరుపు, తెలుపు పసుపువర్ణాలు కలిగివుంటాయి. అతడు తోక పైకి ఎత్తిపట్టుకుంటే సూర్యకాంతిలాగా ప్రకాశిస్తూవుంటుంది. ఇతడు సుగ్రీవుడి సైన్యాధిపతి, ఇక్కడ యూథపతి లక్షలాది వానరులు వృక్షాలు, కొమ్మలు పట్టుకొని ఇతడి వెనక లంకా పట్టణాన్ని ముట్టడించేందుకు వస్తున్నారు. హరుడుకూడా వెయ్యి కోట్లమంది వానరుల్ని వెంటబెట్టుకొని వచ్చాడు. నిన్ను స్వయంగా గెలవాలని అతడి అభిలాష.

రాజా! అటుప్రక్కగా చూడు. భల్లూకసైన్యం అంతా ఒక ప్రక్కగా ఉంది. వాళ్ళంతా కాటుక కొండల్లాగాను కారుమేఘాల్లాగాను ఉన్నారు. వీళ్ళందరూ పరమ భయంకరులు, నిన్ను ఎదిరించి యుద్ధం చెయ్యాలని ఉబలాటపడుతున్నారు. వీళ్ళంతా నదీ తీరాల్లోను, పర్వత సానువుల్లోనూ నివసిస్తూ ఉంటారు. ఆ భల్లూక వీరులందరికీ ధూమ్రుడు అనేవాడు అధిపతి. వీళ్ళంతా నర్మదా నదీజలాలు త్రాగుతూ ఋక్షవంతం అనే పర్వతంపై నివసిస్తూ ఉంటారు. అతడి ప్రక్కనే పర్వతంలాంటి మరొక భల్లూకం ఉంది. అతడు ధూమ్రుడి తమ్ముడు. ఇతడికి అన్న ధూమ్రుడులాగానే దగ్గర పోలికలుంటాయి కానీ అతడికంటే అధికమైన పరాక్రమం గలవాడు. ఇతడు జాంబవంతుడు. సాటిలేని మేటి నాయకుడు. ఇతడు గురు శుశ్రూష చేసినవాడు, బుద్ధిమంతుడు. సకల ధర్మాలు తెలిసినవాడు. దేవాసురయుద్ధంలో దేవేంద్రుడికి సహాయంచేశాడు. దేవేంద్రుడు ఇతడి సేవలను మెచ్చుకొని అనేక వరాలిచ్చాడు.

రాజా! ఈ భల్లూక వీరులందరూ మన రాక్షసుల్లాగానే అధిక బలవంతులు. అగ్నిహోత్రుడితో సరిసమానమైనవాళ్ళు. నల్లటి పొడవైన వెంట్రుకలతో పర్వతాలపైనుండి

పెద్దపెద్ద రాళ్ళను క్రిందకు పడతోస్తూ ఉంటారు. వీళ్ళల్లో ఎవరూ చావును గూర్చి భయపడరు.

అక్కడ ఎగురుతూ కనిపించేవాడే, దుంభుడు, ఇతడు దేవేంద్రుణ్ణి మెప్పించాడు. పర్వతాలపైన అమితమైన వేగంతో నడువగలడు.

రాజా! ఆ కనిపించేవాడే సన్నాదుడు. వానరులందరికీ పితామహుడులాంటివాడు. అతడు ఒక్క అడుగులో ఒక యోజనదూరం పర్వతాల్లోపోగలడు. అట్లాగే ఒక యోజనం ఎత్తు ఎగరగలడు. నాలుగు కాళ్ళ జీవుల్లో ఇంత పెద్ద శరీరం గలవాడు ఇతడు ఒక్కడే. పూర్వం దేవేంద్రుడితో యుద్ధం చేశాడు; అయినా ఓడిపోలేదు. ఇతడి జీవితంలో ఓటమిని ఎరుగడు. ఇతడు అగ్నిహోత్రుడికీ ఒక గంధర్వకన్యకూ పుట్టాడు. దేవాసురయుద్ధాల్లో దేవతలకు సహాయంచేసేవాడు – దేవేంద్రుడితో సమానమైన పరాక్రమం గలవాడు.

అతడు క్రథనుడు, యుద్ధాలంటే ఆసక్తిగలవాడు, అపజయం అనేది ఎరుగడు. ఇతడు హిమాలయాల్లోని జంబూవనంలో నివసిస్తూవుంటాడు. నీ అన్న కుబేరుడు, కిన్నెరులు కూడా ఈ జంబూవనంలోనే క్రీడిస్తూ ఉంటారు. ఇతడు ఒక్కడూ లంకాపట్టణాన్ని నాశనం చెయ్యాలని ఉవ్విళ్ళూరుతున్నాడు. అందు నిమిత్తం వెయ్యికోట్లమంది వానరుల్తో వచ్చాడు.

అడుగో ప్రమాథి. ఇతడి చరిత్ర చెప్తాను విను. పూర్వం శంబసాధనుడు అనే రాక్షసుడు ఏనుగురూపాన్ని ధరించి తపస్సు చేసుకునే మునులను బాధిస్తూ ఉండేవాడు. అప్పుడామునిజనం అంతా కలసి 'కేసరి' అనే వానరుణ్ణి ప్రేరేపించి ఆ శంబసాధనుడిపైకి పంపారు. అప్పుడాకేసరి ఏనుగు రూపంలో విహరిస్తున్న రాక్షసుణ్ణి చంపేశాడు. ఇతడు ఆ కేసరి వంశీయుడు. ఆ పూర్వవైరాన్ని దృష్టిలో ఉంచుకొని ఈ ప్రమాథికూడా కనిపించిన మదపుటేనుగు లన్నింటినీ చంపేస్తూ ఉంటాడు. వీడు ఆ ఏనుగును అట్లాగే ఎత్తి ఓ పర్వతానికేసి విసిరికొట్టి చంపుతాడు. లేదంటే ఒక పర్వతాన్నే పెకలించి ఆ ఏనుగుపైకి విసరి చంపడమో చేస్తూ ఉంటాడు. పెద్ద పెద్ద వృక్షాల్ని పెళ్ళగించి వాటితో ఏనుగుల్ని చావబాదుతూ ఉంటాడు. ఇతడు హిమాలయాల్లో గంగా

నదీతీరాన గుహల్లో నివసిస్తాడు. ఇతడుకూడా వెయ్యిలక్షలమంది వానరుల్ని వెంట బెట్టుకొనివచ్చాడు. వీడి సైనికులు నడుస్తూ ఉంటే నేలంతా ఎఱ్రగా దుమ్ముధూళిలో నిండిపోయి ఉంటుంది. ఆ మహాసైన్యం మధ్యలో ప్రమాథి ఒక పెద్ద మేఘంలాగా కనిపిస్తాడు.

రాజా! ఆతడే 'గోలాంగూలాధీశ్వరుడు' గవాక్షుడు. ఇతడు ఒక కోటిమంది 'గోలాంగూల' వీరుల్ని వెంటబెట్టుకొని సేతువు మీదనుండి వస్తున్నాడు. ఈ వానరుల ముఖాలన్నీ తెల్లగా ఉంటాయి. ఇతడు ఒక్కడే లంకానగరాన్ని నాశనం చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

ఓ రాజా! వానర నాయకులలో శ్రేష్ఠుడైన 'కేసరి' ఒక సేనా నాయకుడు. ఏ పర్వతంపైనా అన్నికాలాల్లోనూ పండ్లు ఇచ్చే వృక్షాలు ఉంటాయో, ఏ వృక్షాల చుట్టూ తుమ్మెదలు గుంపులు గుంపులుగా తిరుగుతూ ఉంటాయో, సూర్యుడు తన కాంతిలో ఏ పర్వతంచుట్టూ ప్రదక్షిణలు చేస్తూ ఉంటాడో, ఏ పర్వతంపైన పక్షులు, మృగాలు కూడా బంగారు కాంతుల్తో విలసిల్లుతూంటాయో, ఏ పర్వతసానువుల్లో మహర్షులు తపస్సు చేసుకుంటూ ఉంటారో, ఏ పర్వతంపైన కల్పవృక్షాల్లాంటి అనేక వృక్షజాతులు ఫలపుష్పాలనిస్తూంటాయో, ఏ పర్వతంపైన శ్రేష్ఠమైన మధువులు లభిస్తాయో, అటువంటి శ్రేష్ఠమైన మేరుపర్వతంపైన నివసిస్తాడు.

ఆ మేరుపర్వతంపైన అరవైవేల కాంచన శిఖరాలున్నాయి. రాక్షసుల్లో నీవు ఎట్లా శ్రేష్ఠుడవో, అట్లాగే ఆ శిఖరాల్లో శ్రేష్ఠమైన శిఖరం ఒకటున్నది. ఈ వానరులంతా ఆ శిఖరంపై నివసిస్తూ ఉంటారు. వీళ్ళల్లో కొందరి ముఖాలు తెల్లగాను, కొందరివి ఎఱ్రగాను, కొందరివి తేనెరంగులోను ఉంటాయి. వీళ్ళ కోరలు చాలా వాడిగా ఉంటాయి, వీళ్ళ గోళ్ళు పదునైన కత్తుల్లాగా ఉంటాయి. సింహాలు, పులులువలె నాలుగేసి కోరలుంటాయి; వీళ్ళ దగ్గరగా వెళ్ళే సాహసం ఎవరూ చెయ్యరు. మదించిన ఏనుగంత ఉంటారు. వీళ్ళ తోకలు చాలా పొడుగ్గా ఉంటాయి అందంగా ఉంటాయి. వీళ్ళు మేఘాల్లాగా గర్జిస్తూ ఉంటారు. వీళ్ళ కళ్ళు గుండ్రంగా పచ్చగా ఉంటాయి. వీళ్ళ గమనం, ధ్వని భయంకరంగా ఉంటాయి. వీళ్ళంతా లంకా నగరాన్ని సమీపిస్తున్నారు.

రాజా! శతబలి అనే వాడు మహావీరుడు. ఆ మహావీరుడు సూర్యోపాసకుడు, జయాన్ని కోరుతూ సూర్యుణ్ణి ఆరాధిస్తూ ఉంటాడు. రాముణ్ణి సంతోషపెట్టడానికి తన ప్రాణాల్నికూడా అర్పించడానికి సిద్ధంగా ఉన్నాడు. ఇతడూ లంకా పట్టణాన్ని నాశనం చెయ్యాలని కంకణం కట్టుకున్నాడు. రాజా! అదుగో! గజుడూ, గవాక్షుడూ, నలుడూ, నీలుడూ, వాళ్ళందరికీ ఒక్కొక్కరికీ పదికోట్లమంది సైనికులున్నారు. వీళ్ళే కాకుండా వింధ్యపర్వతంపై నివసించే వానరులంతా వచ్చారు. రాజా! వీళ్ళంతా ప్రభువులు, పర్వతాకారులు, పర్వతాల్నే పగులగొట్టే బలవంతులు– అని సారణుడు చెప్పాడు.

## 28వ సర్గ శుకుడు సుగ్రీవుని గూర్చి తెలుపడం

సారణుడు వానరవీరుల గూర్చిన వివరాలన్నీ రావణునకు చెప్పాడు. ఆ తర్వాత శుకుడు కూడా తాను సేకరించిన వానరుల వివరాల్ని మహారాజైన రావణునికి ఈ విధంగా విన్నవించాడు.

రాజా! మదించిన ఏనుగులవలె, గంగాతీరాన ఏపుగా ఎదిగిన మర్రిచెట్లవలె, హిమవత్పర్వతాలతో బలంగా పెరిగిన మద్దివృక్షాల్లాగా, మనకు ఎదురుగుండా కనిపించే ఆ వానరవీరులందర్నీ పరికించి చూడు. వాళ్ళంతా మహా బలవంతులు, అజేయులు, కామరూపులు, దైత్యదానవుల్ని కూడా ఓడించగల సమర్థులు. దేవతలవంటి పరాక్రమవంతులు. వీళ్ళలో ఇరవై కోట్లమంది వానరులు, వెయ్యి శంకువుల వానరులు, నూరు వృందముల వానరులున్నారు. వీళ్ళంతా సుగ్రీవుడి అనుచరులు; దేవతలకు, గంధర్వులకు పుట్టినవారు. అందువల్ల వాళ్ళంతా పుట్టుకతోనే కామరూపులు.

రాజా! అక్కడో ఇద్దరు యువకులు కనిపిస్తునారే! వాళ్ళే మైందుడు, ద్వివిదుడు. యుద్ధంలో వాళ్ళ ముందు ఎవరూ నిలువలేరు. వాళ్ళు బ్రహ్మదేవుణ్ణి మెప్పించి అమృతపానం చేశారు. వీళ్ళు తమ పరాక్రమంతో లంకాపట్టణాన్ని నేలమట్టం చెయ్యాలని కోరుకుంటున్నారు.

ఇటుప్రక్కగా, మరో ఇద్దరు పర్వతాల్లాంటి శరీరాలతో నిలబడ్డారు వాళ్ళే సుముఖుడు, దుర్ముఖుడు. వాళ్ళిదరూ మృత్యుదేవతకు పుత్రులు, తండ్రి అంతటి సమర్థులు. వీళ్ళ అదుపులో పదికోట్లమంది వానరులున్నారు వాళ్ళు లంకాపట్టణం వైపు క్రోధంతో చూస్తున్నారు.

మహారాజా! అక్కడ మదపుటేనుగులాగా నిలబడి ఉన్నాడు అతణ్ణి గుర్తు పట్టారా? అతడే కొద్దిరోజుల క్రితం మన లంకానగరానికి వచ్చాడు. సీతాదేవిని చూశాడు, మళ్ళీ వీళ్ళతో కలసి వచ్చాడు. ఇతడు వాయుదేవుని కుమారుడు, హనుమంతుడు అని అంటారు. సముద్రాన్ని

స్వయంగా ఆకాశంలో ఎగిరి వచ్చి దాటిన మొదటి వానరవీరుడు, పరమశాంతిమంతుడైనా కోపం వస్తే సముద్రాన్నే క్షోభింపచేయగలడు. మహాపండితుడు, విద్వాంసుడు. ఇతడుకూడా తనకు ఇష్టమైన రూపాన్ని పొందగలడు. వాయుదేవుడిలాగానే ఎక్కడికైనా దూసుకొనిపోగలడు. సుగ్రీవుడికి మంత్రి, రాముడికి నమ్మినబంటు.

రాజా! ఈ హనుమంతుడు పుట్టగానే ఆకలి బాధకు తట్టుకోలేక ఫలాలు, కందమూలాలు తన ఆకలిని తీర్చలేవని తలచి అక్కడకు మూడువేల యోజనాల దూరం ఎగిరి సూర్యుణ్ణి మ్రింగి తన ఆకలి తీర్చుకోవాలని అనుకున్నాడు. దేవతలు మహర్షులూకూడా దగ్గరకు పోలేని సూర్యుణ్ణి పట్టుకోవాలని అనుకున్నాడు. అయితే ఇతడు అక్కడనుండి ఉదయగిరిపై పడిపోగా వీడి హనువు (చెక్కిలి) కొద్దిగా సొట్టపోయింది. అందువల్ల ఇతణ్ణి హనుమంతుడు అని పిలువసాగారు. ఇతడిని మించిన బలవంతుడు మరొకడులేడు, ఇతడిని మించిన శరీరాకారం మరొకడికి లేదు. ఇతడి మాటల్లో ఉండే నేర్పు మరెవ్వరికీలేదు. గొప్ప ప్రభావం గలవాడు ఇతడొక్కడే! ఎవరి సహాయం లేకుండా లంకాపట్టణాన్ని నాశనం చెయ్యాలనుకున్నాడు.

రాజా! ఆ హనుమంతుడి ప్రక్కనున్న శూరుడే రాముడు. ఇతడు ఇక్ష్వాకు వంశంలో జన్మించాడు. అతడి శరీరం శ్యామవర్ణంలో ఉంటుంది. నేత్రాలు పద్మాల్లాగా ఉంటాయి. లోకంలో ప్రసిద్ధికెక్కిన అతిరథుల్లో ఒకడు. గొప్ప పరాక్రమం కలవాడు. ధర్మం ఎల్లవేళలా ఆచరించవాడు. గురుకులంలో విద్యనభ్యసించాడు. వేదాలన్నీ అధ్యయనం చేశాడు. వేదవేత్తలలో ఉత్తముడు. బ్రహ్మాస్త్రం మొదలైన దివ్యాస్త్రాలెన్నో తెలిసినవాడు. తన బాణాలతో ఆకాశాన్ని ఛేదించగలడు; పర్వతాలను పగలకొట్టి పిండి చేయగలడు. సముద్రాన్ని క్షోభపెట్టగలడు. ఇతడి కోపానికి మృత్యువైనా భయపడుతుంది, పరాక్రమంలో దేవేంద్రుణ్ణి మించినవాడు. నీవు జనస్థానం నుండి అపహరించి తెచ్చిన సీత ఇతడి భార్య. ఇప్పుడు నీతో యుద్ధానికి సిద్ధమైవచ్చాడు.

ఆ రాముడికి కుడిప్రక్కన బంగారు శరీరఛాయతో ఉన్నవాడు ఇతడి తమ్ముడు;

లక్ష్మణుడు. విశాలమైన వక్షఃస్థలం, ఎఱ్ఱని కన్నులు, నల్లగా కాటుకవంటి శిరోజాలు గలవాడు. ఇతడికి రాముడంటే ప్రాణంతో సమానం. నీతిశాస్త్రం మొదలైన సమస్త శాస్త్రాలలోను విశారదుడు. యుద్ధంలో అతడి ఎదుట నిలబడి ఎవరూ యుద్ధం చెయ్యలేరు. మహాకోపిష్ఠి. రాముడికి కుడిభుజం; ఆరో ప్రాణం. రాముడి కోసం తన ప్రాణాలైనా వదులుకుంటాడు. యుద్ధంలో రాక్షసులందర్నీ సంహరించాలని అనుకుంటున్నాడు.

రాజా! రాముడికి ఎడమ ప్రక్కన ఉన్నవాడు విభీషణుడు, అతడి నలుగురు మంత్రులు.

రాముడు ఆ విభీషణుణ్ణి లంకకు రాజుగాచేసి రాజ్యాభిషేకం కూడా చేశాడు. ఆ సంతోషంలో విభీషణుడు ఇప్పుడు నీ మీదికి యుద్ధానికి వస్తున్నాడు.

రాజా! రాముడి ప్రక్కనే కదలకుండా కూర్చున్నవాడే సుగ్రీవుడు. ఇతడు లోకంలోని వానరులందరికీ రాజు. పర్వతాల్లో హిమవత్పర్వతంలాగా, వానర రాజవంశాల్లో అందరికంటే ఈ సుగ్రీవుడు జ్ఞానంలోను, తేజస్సులోను, పరాక్రమంలోను శ్రేష్ఠుడు. ఇతడి కిష్కింధాపట్టణం గుహారూపంలో ఉండి శత్రు దుర్భేద్యంగా ఉంటుంది. ఇతడు ప్రధానులైన సేనాపతులతో కలిసి అరణ్యములతోను, వృక్షములతోను నిండినది, పర్వతంపై ఉండటంచేత, ప్రవేశించటానికి వీలు కానిది, ప్రకారాది దుర్గాలు గలది అయిన కిష్కింధ అనే గుహలో నివసిస్తాడు. సుగ్రీవుడి వక్షః స్థలంపై నూరు కమలాల బంగారుమాల ప్రకాశిస్తూ ఉంటుంది. రాముడు వాలిని చంపినప్పుడు, ఈ కాంచనమాలను, వాలి భార్యయైన తారను, వానర రాజ్యాన్నీ శాశ్వతంగా పొందాడు. ఆ కాంచనమాల ధరించినవాడు యుద్ధాల్లో ఓడిపోవడం జరగదు.

ఓ ప్రభూ! నూరు లక్షలు ఒక కోటి అనీ, నూరువేల కోట్లు ఒక శంఖువని, వెయ్యి శంకువులు ఒక మహా శంఖువనీ, వెయ్యి మహా శంకువులు ఒక వృందం అని, వెయ్యి మహావృందాలు ఒక పద్మం అని, వెయ్యి పద్మాలు ఒక మహాపద్మమని, వెయ్యి మహాపద్మాలు ఒక ఖర్వమని, వెయ్యి ఖర్వాలు ఒక మహా ఖర్వమని, వెయ్యి వేల మహాఖర్వాలు ఒక

సముద్రమని, వెయ్యి సముద్రాలు ఒక ఓఘమని, వెయ్యి ఓఘములు ఒక మహోఘమని పెద్దలు చెప్తారు.

రాజా! ఇప్పుడు వానరరాజైన సుగ్రీవుడు, నీ తమ్ముడైన విభీషణుణ్ణి, అతడి నలుగురు మంత్రుల్ని, ఒక మహోఘ వానరసేనను వెంటబెట్టుకొని నీ మీదకు యుద్ధానికి వస్తున్నాడు.

ఓ ప్రభూ! ప్రజ్వలించుచున్న గ్రహములతో సమానమై, వచ్చివున్న ఈ వానరసేనను చూసి, మనకు జయం కలిగేట్లుగాను, శత్రుసేనకు పరాజయం కలిగేట్లుగాను చెయ్యి.

# 29వ సర్గ రావణుడు శుక, సారణులను బహిష్కరించటం

శుకుడు సారణుడు చెప్పినదంతా రావణుడు విన్నాడు. రాముణ్ణి, అతడి సమీపంలో ఉన్న విభీషణుణ్ణి, లక్ష్మణుణ్ణి, వానరరాజైన సుగ్రీవుణ్ణీ, జాంబవంతుణ్ణి, సుషేణ, కుముద, నీల, నల, గజ, గవాక్ష, శరభ, మైంద, ద్వివిదులను చూశాడు. మనస్సులో దిగులు చెందాడు. కోపం ముంచుకొచ్చింది. ఈటల వంటి మాటలతో శుకసారణుల్ని భయపెట్టాడు. శుకసారణులు చేతులు జోడించి నమస్కరిస్తూ తలలు వంచుకొని నిలబడ్డారు. వాళ్ళపై కోపంతో మండిపడుతూ ఇలా అన్నాడు.

రావణుడు: "ప్రభువును ఆశ్రయించి జీవించే సేవకులు నిగ్రహానుగ్రహ సమర్థుడైన రాజుకు హితంకాని మాటలు చెప్పకూడదు. అయినా మీరిద్దరూ సందర్భం లేకపోయినా, యుద్ధానికి వచ్చిన శత్రువులను పొగుడుతూ మాట్లాడారు. మీ ఇద్దరూ ఆచార్యులకు, గురువులకు, వృద్ధులకు చేసిన సేవలన్నీ వ్యర్థమైపోయాయి. మీరు కొంచెంకూడా నీతిశాస్త్ర జ్ఞానాన్ని సంపాదించలేకపోయారు. లేదా, శాస్త్రాన్ని గ్రహించికూడా మీరు అర్థం చేసుకోలేకపోయారా? అజ్ఞానంలోనే పడి కొట్టుకుంటున్నారా? మీరు మూర్ఖులు. మీరు నాకు మంత్రులవటం నా దురదృష్టం. ఇటువంటి మూర్ఖుల మూలంగా, నేను ఎన్నడో శత్రువుల చేతిలో మరణించి ఉండాల్సింది. దైవానుగ్రహంచేత బ్రతికి ఉన్నాను.

నా నోట్లోనించి మాట రావటమే తడవుగా శుభాశుభాలన్నీ జరిగిపోతాయి. అటువంటి నాతో, నా ఎదుట ఇటువంటి అప్రియమైన మాటలు మాట్లాడారు. ఒంటి మీద స్పృహవుండే మాట్లాడారా? ఇట్లాంటి మాటలు మాట్లాడితే చస్తామేమోనన్న భయం కలగలేదా? అడవిలో కారుచిచ్చుకు కొన్నిచెట్లు చావకుండా బ్రతికి ఉండొచ్చునేమో కానీ, నా కోపాగ్నికి గురియై బ్రతికినవాడు ముల్లోకాల్లోనూ లేడు. ఏదో ఇంతకాలం నాకు సేవలుచేశారన్న ఒకే ఒక్క కారణంచేత నేను మిమ్మల్ని చంపకుండా వదిలివేస్తున్నాను. శత్రుపక్షాన్ని పొగిడే పాపిష్టి వాళ్ళైన

మిమ్మల్ని చంపేసేవాడినే! మీరు వెంటనే మీ పదవుల్ని వదలిపెట్టి పోండి. మళ్ళీ మీ ముఖాలు నాకు చూపకండి. మీరు ఇదివరకు చేసిన ఉపకారాల్ని జ్ఞాపకం ఉంచుకొని మిమ్మల్ని క్షమిస్తున్నాను. మీరు కృతఘ్నులు. ఇంతకాలం నుండి మీ మీద నాకుండే సదభిప్రాయం అంతా మంటకలసి పోయింది. నిజంగా మిమ్మల్ని చంపాల్సినంత పాపం చేశారు. అయినా వదిలివేస్తున్నాను. ఇక్కడ నుండి వెంటనే పోండి – అని భయపెట్టి పంపేశాడు.

రావణుని మాటలువిన్న శుక సారణులిద్దరూ సిగ్గుపడిపోయారు. రావణాసురునికి 'జయ విజయీభవ' అని స్తోత్రంచేసి వెళ్ళిపోయారు. అప్పుడు రావణుడు మహోదరుణ్ణి పిలిచి "నీతిశాస్త్రం బాగా తెలిసిన గూఢచారుల్ని పిలిపించు" అని ఆజ్ఞాపించాడు. వెంటనే మహోదరుడు గూఢచారులను పిలిపించి రావణుని ఎదుట హాజరు పరిచాడు. గూఢచారులు వచ్చి రావణునికి 'జయీభవ' 'విజయీ భవ' అంటూ అభివాదం తెలిపారు. అంతట రావణుడు, విశ్వాసపాత్రులు, శూరులు, నీతిశాస్త్రజ్ఞులైన గూఢచారులతో ఇలా అన్నాడు.

రావణుడు: "ఓ గూఢచారుల్లారా! మీరు వెంటనే వానరసైన్యంలోకి ప్రవేశించండి. రాముడి యుద్ధప్రయత్నాల గూర్చి వివరాలు రాబట్టండి. అతడి యుద్ధప్రణాళిక లేమిటి? అతడి మంత్రులెవరు? ఆ మంత్రుల్లో ఆంతరంగికులెవరు? అతడు ఎవరితో ఎక్కువగా స్నేహం చేస్తాడు? ఈ విషయాలన్నీ జాగ్రత్తగా సేకరించి నాకు చెప్పాలి. అంతేకాకుండా, ఆ రాముడు ఏఏ పనులు ఎట్లా చేస్తాడు? అతడు ఎక్కడ నిద్రపోతాడు? మీరు తెలుసుకోండి. ఓ గూఢచారుల్లారా! బుద్ధిమంతులైన రాజులు చారులవల్లనే శత్రువుల రహస్యాలన్నీ తెలుసుకుంటారు. తరువాత ఆ సమాచారంతో అతి స్వల్పమైన శ్రమతో శత్రువులను జయిస్తారు. కాబట్టి మీరిప్పుడు మీ తెలివితేటలన్నీ ఉపయోగించి శత్రువును గూర్చిన సమాచారం అంతా సేకరించి త్వరగా తిరిగిరండి" అని ఆజ్ఞాపించాడు.

అంతట ఆ గూఢచారులు రావణాసురుడికి ప్రదక్షిణపూర్వక నమస్కారం చేసి, రాజుకు జయవాక్యాలు పలికి రామలక్ష్మణులున్న చోటుకు బయలుదేరారు. వాళ్లు మారువేషాలు ధరించి

వానరసైన్యంలోకి ప్రవేశించి సమాచారం రాబట్టసాగారు. అట్లా వానరసైన్యంలో తిరుగుతూ వానరసైన్యాన్ని చూసి కలవరపడిపోయారు. వాళ్ళు అట్లా మారువేషాల్లో తిరుగుతూ ఉండగా వాళ్ళను విభీషణుడు పట్టుకున్నాడు. వీళ్ళల్లో శార్దూలుడు పరమ కిరాతకుడని వానరులతో చెప్పి అతణ్ణి చంపమన్నాడు. తరువాత మిగిలిన గూఢచారుల్ని కూడా వానరులు పట్టి బంధించారు. వాళ్ళందర్నీ వానరులు చంపబోతూవుండగా, రాముడు అడ్డుపడి వాళ్ళందర్నీ విడిపించి ఇళ్ళకు పంపేశాడు. రాక్షస గూఢచారులు వానరుల చేతుల్లో చావుదెబ్బలుతిని, ఉసూరుమంటూ ప్రాణాలు దక్కినందుకు సంతోషపడుతూ లంకానగరాన్ని చేరుకున్నారు. వాళ్ళు సేకరించిన సమాచారాన్ని, తమకు కలిగిన పరాభవాన్ని చెప్పేందుకు రావణాసురుడి దగ్గరకు వెళ్ళారు.

## 30వ సర్గ శార్దూలుడు రాముడి బలాన్ని వివరించి చెప్పటం

జయించలేనంత గొప్పసైన్యంతో వచ్చిన రాముడు సువేల పర్వత ప్రాంతంలో ఉన్నాడని గూఢచారులు చెప్పగానే రావణాసురుడి మనస్సంతా దేవినట్లయింది. బాగా కలవరపడిపోయాడు. శార్దూలుణ్ణి చూస్తూ "ఓ శార్దూలుడా! ఏమిటి నీవు బాగా అలసిపోయినట్లున్నావు. ముఖమంతా పీక్కుపోయింది. దీనంగాకూడా కనిపిస్తున్నావు శత్రువులకు పట్టుబడలేదు కదా? వాళ్ళు నిన్నేమీ చిత్రహింసలు పెట్టలేదుగదా?" అని అడిగాడు.

ఆ శార్దూలుడు భయంతో వణికిపోయాడు. ధైర్యం కూడగట్టుకొని మెల్లగా ఇలా అన్నాడు.

శార్దూలుడు: "ప్రభూ! ఆ వానరులంతా మహాపరాక్రమవంతులు, బలవంతులు. వాళ్ళందర్నీ ఆ రాముడే రక్షిస్తున్నాడు. అటువంటి వానరుల నుండి వాళ్ళ వివరాలు తెలుసుకోవడం సాధ్యమయ్యేపనికాదు. వాళ్ళతో మాట్లాడటమే కష్టమైపోయింది. వాళ్ళను నిశితంగా పరీక్షించడం ఇంకా ప్రమాదకరం. వానరసేనలోకి బయటనుండి ఎవరూ ప్రవేశించకుండా గట్టి రక్షణ ఏర్పాటుచేశారు. వాళ్ళను తప్పించుకొని లోపలకు ప్రవేశించటం ఎంతో కష్టమైపోయింది. కొంతవరకు మేము వెళ్ళిన పనిచేస్తూ ఉండగా విభీషణుని మంత్రులైన ఆ నలుగురు రాక్షసులు మమ్మల్ని గుర్తుపట్టారు. నన్ను నేల మీద పడేసి దొర్లించారు. కోపించిన వానరులు నన్ను పిడికిళ్ళతో గుద్దారు. కోరల్తో కొరికారు. గోళ్ళతో రక్కారు. నా ఒళ్ళంతా రక్తసిక్తం అయిపోయింది. శరీరం పట్టుతప్పిపోయింది, వాళ్ళు నన్ను చచ్చేట్లు కొడ్తూవుంటే నేను చేతులు జోడించి ప్రార్థించాను. అంతట వాళ్ళు నన్ను రాముడి దగ్గరకు తీసుకుపోయారు, రాముడే మాకు ప్రాణభిక్షపెట్టి పొమ్మన్నాడు. ఎట్లాగో బ్రతికి బయటపడ్డాం.

రాజా! ఆ రాముడు సముద్రంలో రాళ్ళువేసి సేతువు కట్టించాడు. ఆ సేతువు మీదుగా వాళ్ళు లంకలో ప్రవేశించారు. ఇప్పుడాసైన్యం అంతా సువేల పర్వతంపై నిలబడివుంది. ఆ వానరసైన్యాన్నంతా గరుడవ్యూహాకారంగా ఏర్పాటు చేశారు. రాముడు లంకా పట్టణంలో

ప్రవేశించేందుకు సిద్ధంగా ఉన్నాడు. రాముడు లంకలో ప్రవేశించేముందే సీతనైనా ఇచ్చివెయ్యి లేదా, యుద్ధంమైనా చెయ్యి ఏదో ఒక్కటి త్వరగా నిర్ణయించుకో!"

రాక్షసరాజైన రావణుడు శార్దూలుడు చెప్పిన మాటలన్నీ విన్నాడు. మనస్సులోనే పరిస్థితినంతా ఊహించుకున్నాడు, కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి. తిరిగి ఆ గూఢచారి శార్దూలుడితో ఇలా అన్నాడు.

రావణుడు: ఓ గూఢచారీ! వాళ్ళల్లో ఎదించడానికి వీలుకాని వానరులు ఎందరున్నారు? వాళ్ళ తేజస్సు ఎట్లాంటిది? వాళ్ళ బలాలు తెలుసుకున్న తర్వాత నేను ఏంచెయ్యాలో నిర్ణయించుకుంటాను. యుద్ధానికి వెళ్ళే వాళ్ళు శత్రుబలాన్ని గూర్చి అవశ్యం తెలుసుకోవాలి గదా!

అంతట గూఢచారియైన శార్దూలుడు ఇలా అన్నాడు.

శార్దూలుడు: "ప్రభూ! యుద్ధంలో జయించడం సాధ్యంకాని పరాక్రమవంతుడైన సుగ్రీవుడు ఋక్షరజస్సు పుత్రుడు. ప్రసిద్ధుడైన జాంబవంతుడు గద్గదుని పుత్రుడు. ధూమ్రుడు అనేవాడు జాంబవంతుడి తమ్ముడు. హనుమంతుడు కేసరి పుత్రుడు. ఈ హనుమంతుడు వాయుపుత్రుడనికూడా ప్రసిద్ధిచెందాడు. ఇతడే ఒంటరిగా రాక్షసులందర్నీ సంహరించాడు. కేసరి బృహస్పతి కుమారుడు.

రాజా! ధర్మాత్ముడైన సుషేణుడు యమధర్మరాజు కుమారుడు. సౌమ్యుడైన దధిముఖుడు చంద్రుని పుత్రుడు. సుముఖుడు, దుర్ముఖుడు, వేగదర్శియనే ఈ ముగ్గురు వానరులు బ్రహ్మదేవుడు సృజించిన మృత్యుదేవత కుమారులు. సేనాధిపతియైన నీలుడు అగ్ని పుత్రుడు.

ఎదిరింప శక్యంకానివాడు, బలవంతుడైన అంగదుడు దేవేంద్రుని (మనవడు) పౌత్రుడు, మైంద ద్వివిదులు ఇద్దరూ అశ్వనీదేవతల పుత్రులు. గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు,

గంధమాదనుడు అనే ఈ ఐదుగురూ యముడి పుత్రులు. శ్వేతుడు, జ్యోతిర్ముఖుడు అనే వాళ్ళిద్దరూ సూర్యుని పుత్రులు. హేమకూటుడు వరుణదేవుని పుత్రుడు. మహావీరుడైన నలుడు విశ్వకర్మకు పుత్రుడు. దుర్జనుడు వసువుకు పుత్రుడు. వీళ్ళుకాక ఇంకా పదికోట్లమంది వానరులున్నారు. వాళ్ళంతా దేవతలకు పుట్టినవాళ్ళే. వాళ్ళందరూ తేజస్సు గలవారు, శూరులే. వాళ్ళ పేర్లన్నీ చెప్పటం కష్టం. వాళ్ళంతా కూడా యుద్ధం చెయ్యటానికి ఉత్సాహం చూపిస్తున్నారు.

రాజా! రాముడు అందమైన యువకుడు. అతడితో సమానుడుగానీ అధికుడుగానీ మరొకడు లేడు. అతడు ఒక్కడే జనస్థానంలో ఖరుణ్ణి, దూషణుణ్ణి, త్రిశిరుణ్ణి, కబంధుణ్ణి, విరాధుణ్ణీ చంపి యమలోకానికి పంపాడు. దేవేంద్రుడుకూడా రామ బాణాన్ని తట్టుకొని నిలబడలేడు. రాముడు మహావీరుడే కాదు, అటువంటి గుణవంతుడు ముల్లోకాల్లోనూ లేడు, అతడు ధర్మాత్ముడు. లక్ష్మణుడు మదపుటేనుగులలోనే శ్రేష్ఠమైన మదపుటేనుగువంటివాడు.

రాజా! రాముడు నీ తమ్ముడైన విభీషణుణ్ణి లంకాధిపతిగా రాజ్యాభిషిక్తుణ్ణి చేశాడు. ఇప్పుడు రాముడు చేసే యుద్ధంలో విభీషణుడు ప్రముఖుడు. రాముడికి మేలు చెయ్యాలని కంకణం కట్టుకున్నాడు.

ఓ రాజా! సువేల పర్వతంపైన నిలచి, నీపై యుద్ధానికి సిద్ధంగా ఉన్న వానరసైన్యాన్ని గూర్చి నీకు వర్ణించి చెప్పాను. ఇకపై ఏం చ్యాలో నీవే నిర్ణయించు.”

# 31వ సర్గ రాముని మాయా శిరసు సీతకు చూపడం

వానరసైన్యం గూర్చి గూఢచారులు చెప్పినదంతా లంకాధిపతియైన రావణుడు విన్నాడు. మనస్సులో దిగులుపట్టుకుంది. పరిస్థితి చెయ్యిదాటి పోతుందేమోనని భయం కలిగింది. ఏక పక్ష నిర్ణయాలు ఆపేయాలనుకొని మంత్రులందర్నీ వెంటనే రమ్మని కబురు చేశాడు; మంత్రులంతా వెంటనే వచ్చారు. వాళ్ళందరితోను ఆలోచించి ఆ తర్వాత చేయాల్సిన కార్యక్రమాన్ని కార్యాచరణ పథకాన్ని నిర్ణయించాడు. అంతట రావణుడు మంత్రులందరినీ పంపేసి, తాను అంతఃపురంలోకి వెళ్ళాడు.

రావణుడు తన సేవకుల్లో గొప్ప మాయావి, మాయపనులు చెయ్యడంలో దిట్టయైన విద్యుజ్జిహ్వుణ్ణి పిలిపించాడు. అతడితో ఇలా అన్నాడు.

రావణుడు: "సీతాదేవిని మోసంతో జయించాలని అనుకుంటున్నాను. అందుకోసం రాముడి శిరస్సును, ధనుస్సు బాణాల్ని నీ మాయచేత సృష్టించు. త్వరగా వాటిని ఆశోకవనానికి తీసుకొని రా" అన్నాడు. రావణుని మాటలు విన్న విద్యుజ్జిహ్వుడు "అట్లే చేసెదను" అని చెప్పి, అతి కొద్ది సమయంలోనే తన మాయను చూపాడు. రావణుడు సంతోషించి ఒక ఆభరణాన్ని బహుమానంగా ఇచ్చాడు. అంతట రావణుడు సీతాదేవిని చూడటానికి అశోకవనానికి వెళ్ళాడు.

అశోకవనంలో సీతాదేవి నేలపై దీనురాలై కూర్చుని ఉంది, ఎన్నడూ దైన్యమునకు తగని ఆ సీతాదేవి దుఃఖంతో ముఖం వాడిపోయి రాముణ్ణే మనస్సులో ధ్యానిస్తూ కూర్చుంది. భయంకరమైన రాక్షసస్త్రీలంతా ఆమెకు కావలి కాస్తున్నారు. అటువంటి సీతాదేవిని చూస్తూ ఎంతో సంతోషించదగిన మాట చెప్పేవాడిలాగా ఉత్సాహంతో ఇలా చెప్పాడు: "ఓ మంగళ స్వరూపిణీ! నేను ఎంత బ్రతిమాలినా నా మాట వినలేదు. నీ రాముణ్ణి గూర్చి నీ నోటికి వచ్చిన మాటలన్నీ పేలావు. నీ భర్త రాముడు యుద్ధంలో చచ్చిపోయాడు. నీ ఆశలన్నింటినీ వమ్ముచేస్తూ, నిన్ను ఒంటరిదాన్నిచేసి, ఒక్కడే యమలోకాని పోయాడు. నీ గర్వాన్ని అణచివేశాను, నీ

ఆశలన్నింటినీ అడియాశలు చేశాను, ఇంకా ఎందుకు దుఃఖీస్తావు? నా భార్యవు కా!

ఓ మూఢురాలా! రాముడు తప్ప నీకు మరెవ్వరూ భర్తగా పనికిరారన్నావు గదా! రాముడు ఇప్పుడు చచ్చి యమలోకానికి పోయాడు. చచ్చిపోయిన వాడితో ఏం కాపురం చేస్తావు? ఇకపై రాముడి మీద ఆశ వదలుకో! ఓ మంగళ స్వరూపిణీ! సీతా! నీవు ఒట్టి తెలివితక్కువ దానవు. అన్నీ నీకే తెలుసనే అహంకారంలో ఉన్నావు. భయంకరుడైన వృత్రాసురుడు ఎట్లా మరణించాడో నీ భర్తా అట్లాగే మరణించాడు. ఆ రాముణ్ణి నేను ఎట్లా చంపించానో చెప్తాను, విను.

రాముడు సుగ్రీవుడి వానరసైన్యాన్ని తీసుకొని సముద్రం దాటి లంకా పట్టణంలో ప్రవేశించాడట; అంతట రాముడు సూర్యాస్తమయ సమయానికి అలసిపోయి సముద్రం ఒడ్డునే పడి నిద్రపోతున్నాడట. ఈతడి రాకను గూర్చి, నా గూఢచారులు ఒక కంట కనిపెట్టేవున్నారు. వాళ్ళంతా ఆదమరచి నిద్రిస్తూ ఉండగా, నా మంత్రి ప్రహస్తునిచే పంపబడిన సైన్యం పోయి రామలక్ష్మణులుండే స్థావరంపై దాడిచేసి రాముణ్ణి చంపేశారు. నా సైన్యంలోని రాక్షసులు పట్టిసాలు, పరిఘలు శూలాలు, తోమరాలు, ఈటెలు, చక్రాయుధాలువంటి అనేక మరణాయుధాలతో అర్ధరాత్రివేళ దాడిచేశారు.

హింసించటంలోను, చంపటంలోనూ నేర్పరియైన ప్రహస్తుడు, నిద్రపోతున్న రాముని శిరస్సును గొప్ప ఖడ్గంతో, నిరాఘాటంగా నరికేశాడు. అప్పుడు విభీషణుడు ఆకాశంపైకి ఎగిరిపోయాడు. కానీ రాక్షసులు వాడిని పట్టుకున్నారు. లక్ష్మణుడూ, జాంబవంతుడూ, సుగ్రీవుడూ తలో మూలకూ ఆ చీకట్లో పారిపోయారు. సుగ్రీవుణ్ణి పట్టుకొని మెడ విరిచేశారు, జాంబవంతుడు మోకాళ్ళపై లేవబోతూవుండగా పట్టిసంతో గట్టిగా కొట్టారు. అంతే మొదలు తెగిన వృక్షంలాగా అతడు నేలకొరిగాడు. భారీశరీరాలుగల మైందద్వివిదుల్ని నడుము దగ్గర నరికి పారేశారు. వాళ్ళు అట్లా రక్తపుమడుగులో పడివున్నారు. పనసుడు పనసపండులాగా నేలపై రాలిపడ్డాడు. దరీముఖుడు నారాచబాణాల చేత బంధించబడి గుహలోపడి ఉన్నాడు. రాక్షసులు

అంగదుణ్ణి బాణాలతో కొట్టగా వాడి అవయవాలన్నీ నేలపైపడి రక్తంలో మునిగి ఉన్నాయి. నిద్రపోతున్న ఇతర వానరులపైనుండి ఏనుగులు, రథాలు, మేఘాల్లాగా వేగంగా నడిపి చంపేశారు. కొందరు బ్రతికి బయటపడ్డవాళ్ళు చీకట్లోకి పారిపోయారు, కొందరు సముద్రంలోకి దూకారు, కొందరు ఆకాశంలోకి ఎగిరారు. కొంతమంది చెట్లపైకి ఎక్కారు. వికృతమైన నేత్రాలుగల రాక్షసులు ఆ వానరుల్ని కనిపించిన చోట కనిపించినట్లు చంపి పారేశారు.

ఈ విధంగా నా సైన్యం అంతా నీ భర్తను, నీ భర్త సైన్యాన్ని చంపి రక్తపు మడుగుల్లో పడేసింది. నేను నీ భర్త శిరస్సును, అతడి ధనుస్సునూ మాత్రం నీకు కానుకగా తీసుకొనివచ్చాను." అంతట ఆ రాక్షసరాజు ఒక రాక్షసస్త్రీతో సీత వినేట్లుగా, "యుద్ధంలో రాముడి శిరస్సు స్వయంగా తెచ్చిన ఆ విద్యుజ్జిహ్వుణ్ణి తీసుకొని రా" అని ఆజ్ఞాపించాడు.

అంతట విద్యుజ్జిహ్వుడు రాముడి శిరస్సును, ధనస్సును తీసుకొనివచ్చి అక్కడ ఉంచి, రావణుని పాదాలకు నమస్కరించి తలవంచుకొని నిలబడ్డాడు. "ఓ రాక్షసుడా! ఆ రాముడి శిరస్సును నా ఎదుట పెట్టద్దు, తీసుకుపోయి ఈ సీత ఎదుట ఉంచు. ఈ దౌర్భాగ్యురాలు తన భర్తను చివరిసారిగా కళ్ళారా చూసుకుంటుంది" అన్నాడు. విద్యుజ్జిహ్వుడు ముచ్చట గొల్పేట్లుగా తయారుచేసిన రాముడి శిరస్సును సీతాదేవి ఎదుట ఉంచాడు. "ఇదుగో మూడు లోకాల్లోనూ ప్రసిద్ధిచెందిన నీ భర్త ధనుస్సు" అని అంటూ రావణుడు ఆ ధనుస్సును సీత ఎదుట ఉంచాడు. "నారికట్టి ఉన్న ఈ ధనుస్సు రామునిదే, ప్రహస్తుడు ఇక్కడకు తీసుకొని వచ్చాడు. నీ భర్త శిరస్సును, అతడు వాడిన ధనుస్సునూ చివరిసారిగా చూసుకో, నీ భర్త! చనిపోయాడని మనస్సు రాయిచేసుకొని నాకు వశమైపో!" అన్నాడు.

## 32వ సర్గ రాముని శిరస్సు చూసి సీత విలపించటం

సీతాదేవి రాముని శిరస్సును, ఉత్తమమైన ధనుస్సును చూసింది. హనుమంతుడు తనతో మాట్లాడినప్పుడు రామసుగ్రీవుల స్నేహాన్ని గూర్చి చెప్పటం జ్ఞాపకానికి వచ్చింది. భర్త కన్నులు, ముఖం, రంగు, నుదురు, మెడలో చూడామణిని పరిశీలించి చూసింది. అవన్నీ తనకు బాగా తెలిసినవే కావటంవల్ల, రాముడి శిరస్సేనని నమ్మింది. కడుపంతా దేవినట్లైంది. భోరున ఏడ్చేసింది. గోరింకలాగా విలవిల్లాడిపోయింది. ఈ ఆపదకు కారణమైన కైకేయి జ్ఞాపకానికి వచ్చింది. "ఓ కైకా! నీ కోరిక తీరింది కదా? నీ కళ్ళు చల్లబడ్డాయి కదా? ఇక్ష్వాకు వంశానికి దీపం కావలసినవాడిని నాశనం చేశావుగదా తల్లీ! అమ్మా! రాముడు నీకేం అపకారం చేశాడని అతడికి నారబట్టలు కట్టబెట్టి, నాతో అడవులకు పంపావు?" ఇలా అంటూ దీనురాలైన ఆ బాల వణికిపోతూ మొదలు నరికిన అరటిచెట్టులాగా నేలపై పడిపోయింది. కొద్దిసేపట్లో తెప్పరిల్లింది. ఆ శిరస్సుకు దగ్గరగా వెళ్ళింది. "అయ్యో! ఆజానుబాహువులు గలవాడా! నీవు శత్రువుల్ని జయించాలనే వీరవ్రతాన్ని పట్టి వచ్చావు. నాకు సర్వనాశనం అయిపోయింది. నేను బ్రతికి ఉండగానే నీవు వెళ్ళిపోయావు, నేను నీ ఆఖరుఘడియలు చూడాల్సివస్తుందని ఊహించనైనా లేదు. నేను విధవనవటానికా ఇంకా బ్రతికి ఉన్నాను? ఓ సదాచార సంపన్నుడా! భార్య గుణహీనురాలైతేనే భర్త ముందుగా పోతాడని పెద్దలంటారు. అందువల్లనే నాకంటే ముందుగానే మరణించావా? ఆపదల్లో ఉన్నానని, నన్ను రక్షించటానికి వచ్చి నీవే చంపబడ్డావే!

రామా! లేగదూడపై చాలాప్రేమగల ఆవువంటి నా అత్త కౌసల్యాదేవికి, ఆవుకుదూడ లేకుండా చేసినట్లు, పుత్రుడవైన నీవు లేకుండా చేశారే! రామా! నీకు దీర్ఘాయువు ఉందని జ్యోతిష్కులంతా అన్నారే? వాళ్ళ మాటలన్నీ అసత్యాలేనా? ఓ రామా! నీవు బుద్ధిమంతుడవే అయినా, ఆ సమయంలో బుద్ధి నశించి, నిద్రకు లోబడిపోయావు. సకల భూతాలకూ కారణమైన కాలం నిన్ను కాటువేసింది. నీవు గొప్ప నీతిశాస్త్రజ్ఞుడవే! అటువంటి నీవు నిద్రలో ఎట్లా మరణించావు? కష్టాలు దాటే ఉపాయాలన్నీ తెలిసిన వాడవే? ఎందువల్ల నీ మరణాన్ని ముందే

తెలుసుకోలేకపోయావు? ఓ కమలలోచనుడా! అతి భయంకరమూ, అతిక్రూరమైన ఆ కాళరాత్రి నిన్ను కౌగలించుకొంది. ఏమాత్రం కనికరం లేకుండా నిన్ను మింగేసింది. ఓ పురుషపుంగవా! నీ కోసం నిరంతరం ధ్యానం చేస్తున్న నన్ను ఒదిలేసి ఒంటరిగానే వెళ్ళిపోయావా? ప్రియురాలినైన నన్ను వదిలేసి భూదేవిని కౌగలించుకొని పడుకున్నావా?

ఓ వీరుడా! బంగారంతో అలంకరించిన ఈ ధనుస్సు అంటే నాకు ఎంతో ఇష్టం. మనమిద్దరం కలసి ఈ ధనుస్సుకు గంధంపూసి పూలతో పూజించేవాళ్ళం. దోషమే ఎరుగని ఓ రామా! నీవు స్వర్గంలో నా మామగారైన దశరథమహారాజును, పితృదేవతలను కలసుకొని ఉంటావు. నీవు ఇప్పుడు పితృలోకంలో నక్షత్రమై ప్రకాశిస్తూ ఉంటావు, ఈ రాజర్షి వంశాన్ని వదలి వెళ్ళిపోయావు గదా!

రామా! నీవు బాలుడవై ఉండగా, బాలికనైన నన్ను చేపట్టావు, అప్పటినుండే కలసిమెలసే ఉంటున్నాం. నీవు మొట్టమొదట నా పాణిగ్రహణ సమయంలో నన్ను విడిచిపెట్టి వెళ్ళనని వాగ్దానం చేశావు, గుర్తుందా? జ్ఞాపకం తెచ్చుకో! నన్ను కూడా నీతోబాటే తీసుకొనివెళ్ళు. ఓ రామా! ఉత్తమలోకాలకు పోయేవాళ్ళల్లో నీవు ఉత్తముడవు. ప్రియురాలినైన నన్ను దుఃఖంలో వదిలేసి ఒక్కడివే ఆ లోకానికి వెళ్ళావు?

ఓ రామా! చందన అగరువంటి మంగళకరమైన లేపనాలు పూసిన నీ శరీరాన్ని కౌగలించుకుంటూ ఉండేదాన్ని. ఇప్పుడాదేహాన్ని నక్కలు, కుక్కలు ఈడ్చుకొని పోతున్నాయా? అయ్యో! వైదిక సంస్కారాలు లేకుండా ఇటువంటి దిక్కులేని చావు రాసిపెట్టివుందా? రామా! అరణ్యానికి ముగ్గురం కలసివచ్చాం. ఇప్పుడు లక్ష్మణుడు ఒక్కడే వెళ్ళి నీ తల్లి కౌసల్యాదేవిని చూస్తాడు. నీవు నిద్రిస్తుండగా రాక్షసులు నిన్ను చంపారని చెప్తారు. అది విని ఆమె గుండెలు పగిలి మరణిస్తుంది.

ఓ రామా! నేను దురదృష్టవంతురాలను, నా కోసం రాముడు సముద్రాన్ని దాటివచ్చాడు.

గోవుపాదం అంత చిన్నగుంటలో పడిపోయినట్లుగా, ఒక క్షుద్రుడి చేతుల్లో మరణించాల్సివచ్చింది. నన్ను వివాహం చేసుకోకుండా ఉంటే, నీకీ కష్టం వచ్చేది కాదు. నీ వంశానికి ఇంత నష్టం వాటిల్లేది కాదు, రాముడికి భార్యే మృత్యువు అయింది.

ఓ రామా! నేను పూర్వజన్మల్లో ఎప్పుడో పుణ్యదంపతులకో, కన్యాదానాలకో విఘాతం కలిగించి ఉంటానేమో! అందువల్లనే నేను ఈ జన్మలో పరమ ధర్మాత్ముడైన రాముడికి భార్యనుయైకూడా, ఇటువంటి దుఃఖాన్ని అనుభవిస్తున్నాను.

ఓ రావణుడా! నన్నుకూడా నా రాముడి శరీరంపైనే పడెయ్యి. భార్యను భర్త ప్రక్కకు చేర్చు, ఈ ఒక మంచిపనియైనాచేసి పుణ్యం కట్టుకో. మహాత్ముడైన నా భర్తను అనుసరించిపోతాను" అని వలవలా విలపించింది.

సీతాదేవి ఇలా విలపిస్తూ ఉండగా, ద్వారపాలకుడు వచ్చి, వినయంగా రావణునికి జయహో అంటూ స్తుతించి, అభివాదం చేసి సేనాపతియైన ప్రహస్తుడు దర్శనం కోరుతున్నాడని విన్నవించాడు.

"ఓ మహారాజా! మంత్రులందరితో కలసి ప్రహస్తుడు వచ్చాడు. ముఖ్యమైన రాచకార్యం ఉందని చెప్పమన్నాడు. వెంటనే తమల్ని దర్శనం చేసుకోవాలని కొరుకుంటున్నాడు" అని చెప్పాడు.

అంతట రావణుడు, అశోకవనంనుండి మంత్రులను చూసేందుకు బయలుదేరాడు. రావణుడు బయలుదేరగానే రాముడి శిరస్సు ధనుస్సుకూడా అంతర్ధానమైపోయాయి.

రావణాసురుడు సభా భవనంలోకి ప్రవేశించాడు. రావణుడు భయంకరమైన పరాక్రమంగల మంత్రులలో సమాలోచనలు చేశాడు. యుద్ధానికి సన్నద్ధం కావాలని వాళ్ళందరికీ ఆజ్ఞలు జారీచేసాడు. తన హితాన్ని కోరే మంత్రులు, సేనాపతులతో ఇలా అన్నాడు:

"భేరీలు గట్టిగా మోగించండి, సైన్యాన్నంతటినీ సిద్ధంచెయ్యండి. ముందుగా వాళ్ళెవరికీ యుద్ధాన్ని గూర్చి చెప్పకండి" అన్నాడు. అంతట దూతలంతా రావణుని ఆజ్ఞలను శిరసావహించి సైన్యాన్నంతా సమీకరించిన పిమ్మట వచ్చి రావణుడితో చెప్పారు.

# 33వ సర్గ అది రాముని శిరస్సుకాదని సీతను ఓదార్చటం

రావణాసురుడు సీతాదేవి రక్షణ కోసం నియమించిన రాక్షసస్త్రీలలో సరమకూడా ఒకతె. ఈమె సీతాదేవితో స్నేహంగాను, ఇష్టురాలిగాను, ఆప్తురాలుగాను మెలగుతూ ఉంటుంది. ఒళ్ళు తెలియని దుఃఖంలోవున్న సీతాదేవిని సరమ చూసింది. రావణాసురుడు, రాముడి మాయా శిరస్సును చూపించి సీతాదేవిని ఏడిపిస్తున్నాడని పసిగట్టింది. బడలికగావున్న ఆడ గుర్రం నేలపై పడి దొర్లుతున్నట్లుగా, నేలపై పడివున్న సీతాదేవి వద్దకు మెల్లగా వెళ్ళిన సరమ ఇలా అంది.

"ఓ సీతా! బాధపడకు. మనస్సు కుదుటపరచుకో. రావణాసురుడు నీతో మాట్లాడిందంతా నేను వింటూనే ఉన్నాను. రావణాసురుడు దండిస్తాడన్న భయంకూడా లేకుండా నీ క్షేమం కోరి అంతా గమనిస్తూనే ఉన్నాను.

ఓ సీతా! పిరికిదానిలా ఏడవకు. రావణాసురుడు ఇక్కడనుండి కలవరపడుతూ ఎందు వెళ్ళాడో తెలుసా? నేను బయటకుపోయి అన్ని తెలుసుకొని వచ్చాను. నీ భర్తయైన రామప్రభువు చనిపోలేదు. ఆ మహానుభావుడు ఆదమరచి నిద్రపోడు; పోయే సమయమూకాదు. అంతేకాకుండా భయంకరమైన వానరుల్ని తప్పించుకొని ఆ రాక్షసుడూ రాముని దగ్గరకుకూడా పోలేడు. రామప్రభువును సదా రక్షిస్తూ లక్ష్మణుడుంటాడు. రాముడు నిద్రపోయినా లక్ష్మణుడు నిద్రపోడు. కాబట్టి రాముణ్ణి చంపేశారని చెప్పినదంతా అబద్ధం. దేవతలంతా దేవేంద్రుణ్ణి కాపాడుతూ ఉంటారు. ఆ వానరులందరికీ రాళ్ళు, చెట్లే ఆయుధాలు. వాళ్ళను రాక్షసులు ఏమీచేయలేరు, వాళ్ళను తప్పించుకొని రామప్రభువు సమీపానికికూడా పోలేరు. రాముడు, అతడి పరివారంమంతా క్షేమంగా ఉన్నారు. నేను బయటకువెళ్ళి తెలుసుకొని వచ్చాను. నువ్వు అనవసరంగా దుఃఖించవద్దు.

ఓ సీతా! రాముడు ఆజానుబాహువు, విశాలమైన నేత్రాలు కలవాడు. అతడి పరాక్రమం జగత్ప్రసిద్ధి చెందింది, అతడు గొప్పనీతి శాస్త్రజ్ఞుడు, పరమధార్మికుడు. అటువంటి రామప్రభువు

చనిపోలేదు. ఆతడే నిజానికి లక్ష్మణుణ్ణి, ఆ వానరసేననంతా కూడా కాపాడుతున్నాడు. వాళ్ళను రాక్షసులు ఏమీ చేయలేరు, అంతా సురక్షితంగా ఉన్నారు, నీ కోసం నేను బయటకువెళ్ళి తెలుసుకొనివచ్చాను.

ఓ సీతా! రావణుడు కపట స్వభావంగలవాడు. సర్వభూతాలకు విరోధి, మాయావి, నిన్ను మోసంచెయ్యాలనే ఉద్దేశంతో రాముడి శిరస్సును, ధనుస్సు మాయచేత సృష్టించాడు. నేను నీ హితంకోరి చెప్తున్నాను దుఃఖించకు నీకు మంచిరోజులు అతి త్వరలో రాబోతున్నాయి. తిరిగి నీవు నీ ఐశ్వర్యాన్నంతా అనుభవిస్తావు. రాముడు, విభీషణునితో వానరసైన్యాన్నంతా వెంటబెట్టుకొని వచ్చారు, లంకంతా ఆ వానరసైన్యంతో నిండిపోయి ఉంది. రావణాసురుడు పంపించిన గూఢచారులే ఈ విషయాలన్నీ సేకరించుకొనివచ్చారు. వాళ్ళు చెప్పిన సమాచారంతో రావణుడికి భయం దిగులు పుట్టుకొచ్చాయి. అందుకే మంత్రులతోను, సేనాపతులతోను ఆలోచించటానికే ఇక్కడనుండి త్వరత్వరగా వెళ్ళిపోయాడు. ఈ విషయాలన్నీ బయటకు వెళ్ళి విచారించి వస్తున్నాను.”

‘సరమ’ సీతాదేవికి ఇలా చెప్పి ఊరడిస్తూ ఉండగానే, సైనికులందరూ ఒకేసారి సంసిద్ధులుకావడంవల్ల భయంకరమైన శబ్దాలు వస్తున్నాయి. గట్టిగా కొట్టడంచేత రణభేరుల ధ్వనులు ప్రతిధ్వనిస్తున్నాయి. ఆ ధ్వనులు, సైనికుల సందడి చూసిన ‘సరమ’ సీతాదేవితో ఇలా అంది.

“భయస్వభావురాలా! ఓ సీతా! భయంకరమైన రణభేరి ధ్వని వినిపిస్తోందా? అంటే సైనికులందర్నీ యుద్ధానికి సన్నద్ధమై రమ్మని పిలుస్తున్నారు. ఆ గంభీరమైన భేరీనాదం విను. మదించిన ఏనుగుల్ని సిద్ధం చేస్తున్నారు, రథాలకు గుర్రాల్ని పూనుస్తున్నారు. భటులంతా గుర్రాలపై సిద్ధంగా ఉన్నారు, ఎక్కడెక్కడ నుండియో వస్తున్న సేనలు, గుర్రాలు, రథాలు, చేసే ధ్వనులు సముద్ర ఘోషను మించిపోతోంది. రాజవీధులన్నీ సైనికులతో నిండిపోతున్నాయి.

ఓ సీతా! రాక్షసుల్లో భయంవచ్చి పడింది కానీ, ఇకపై నీవు భయపడాల్సిన పనిలేదు. దేవేంద్రుడితో సమానమైన పరాక్రమంగల రామప్రభువు రాక్షసులందర్నీ సంహరిస్తాడు. ఓ సీతా! విష్ణుమూర్తితో కూడివున్న దేవేంద్రుడివలె, లక్ష్మణునితో కూడిన రామప్రభువు రావణాసురుణ్ణి సంహరిస్తాడు. త్వరలోనే నిన్ను చేరుకుంటాడు, నిన్ను కౌగలించుకొంటాడు. నీవు అప్పుడు ఆ మహానుభావుడి వక్షఃస్థలమంతా ఆనందబాష్పాలతో తడిపేస్తావు.

ఓ సీతా! నీవు జడవేసుకొని చాలాకాలం అయింది. అట్ట కట్టుకొనిపోయి ఉంది. ఆ మహాబలవంతుడు రాగానే నీ చిక్కులన్నీ తీరిపోతాయి. అట్లాగే నీ తల వెంట్రుకలలో ఉండే చిక్కుకూడా విడివడుతుంది. అతిత్వరలో పూర్ణచంద్రుడివంటి ముఖ బింబంగల రామప్రభువును చూస్తావు, నీ దుఃఖాలన్నీ పాము కుబుసాన్ని విడిచేసినట్లు వీడిపోతాయి.

ఓ మైథిలీ! రామప్రభువు కొద్దికాలంలోనే తిరిగి సుఖాలన్నీ అనుభవిస్తాడు. రావణాసురుణ్ణి యుద్ధంలో చంపేస్తాడు. అతడు తలపెట్టింది పరిపూర్ణంగా సాధిస్తాడు. నీవు అతడి ప్రియురాలివి. నీవు కూడా అతడితో కలిసి సుఖాలు అనుభవిస్తావు, సంతోషంగా ఉంటావు.

ఓ సీతా! మేరుపర్వతం చుట్టూ గుర్రంలాగా గుండ్రంగా తిరిగే సూర్యభగవానుణ్ణి ప్రార్థించు. ఆ సూర్యభగవానుడే ప్రాణులందరికీ కాంతినిచ్చేవాడు.”

# 34వ సర్గ సరమ రావణుని గూర్చి తెలుపటం

రావణుడుపెట్టే బాధలకే దుఃఖ సముద్రంలో మునిగిపోయిన సీతాదేవి, రాముని శిరస్సుకూడా తెచ్చి చూపడంతో ఆమె దుఃఖానికి అంతే లేకుండా పోయింది. ఆ విధంగా దుఃఖంలో ఉన్న సీతాదేవికి సరమ పలికిన మాటలు, ఎండకు బీటలువారిన నేలపై వర్షపు జల్లుపడ్డట్లు, మనస్సుకు కొంత ఊరట కలిగించింది. సరమ ఒక్కత్తే సీతాదేవి మనస్సు తెలుసుకొని ఆమెను కొంతలో కొంత ఊరట కలిగించాలని ప్రయత్నం చేస్తూ ఉంటుంది. అందువల్ల ఆమెను మరికొంత సంతోషపెట్టాలనే ఉద్దేశంతో ఇలా అంది:

“నల్లని నేత్రములుగల ఓ సీతా! నీకు సంతోషాన్ని కలిగిస్తుందంటే, నేను బయటకువెళ్ళి ఎవరికంటా పడకుండా రాముడితో నువ్వు క్షేమంగా ఉన్నావని చెప్పిరమ్మంటే చెప్పివస్తాను. నువ్వు ఏమీ సందేహించకు. గరుత్మండులాగాను, వాయుదేవుళ్ళాగానూ, నేను కూడా ఆకాశంలో ఎగిరిపోగలను.” సరమ మాటలు సీతాదేవికి కొంత ఊరట కలిగించాయి. అంత దుఃఖంలోనూ, సరమతో ఇలా అంది. “ఓ సరమా! నీ సామర్థ్యం నాకు తెలుసు, నీవు ఆకాశంలో ఎగరగలవు, పాతాళానికీ పోయి రాగలవు. నీవు నిజంగా నన్ను సంతోషపెట్ట దలచినదానవయితే, ఇప్పుడు రావణాసురుడు ఏం చేస్తున్నాడో చూసిచెప్పు. అది చాలు. ఆ దుర్మార్గుడు గొప్పమాయావి, తన మాయాబలంతో, మద్యం తాగినవాడికి వెంటనే మాటలు తడబడినట్లుగా, నా మనస్సును అల్లకల్లోలం చేస్తున్నాడు. నాకు కాపలాగా ఉంచిన ఈ రాక్షసస్త్రీలంతా రోజూ నన్ను భయపెడ్తూ నానావిధాలుగా ఏడిపిస్తున్నారు. రావణుడు ఏ క్షణంలో ఏం చేస్తాడోనని భయంతో చచ్చిపోతున్నాను. నాలోవున్న సహనమంతా చచ్చిపోయింది, మనస్సు మనస్సులో లేకుండాపోయింది. అసలు నన్ను బ్రతకనిస్తాడంటావా? అసలా దుర్మార్గుడు నన్ను ఏం చెయ్యాలని అనుకుంటున్నాడు? నీవు పోయి తెలుసుకొనివస్తే నాకు కొంచెం ఊరటగా ఉంటుంది” అంటూ కళ్ళనిండా నీళ్ళుపెట్టుకుంది.

అంతట సరమ సీతాదేవి కన్నీళ్ళు తుడుస్తూ "ఓ జానకీ! నీకు అట్లా చేయడంవల్ల సంతోషం కలుగుతుందంటే ఇప్పుడే వెళ్ళి తెలుసుకుని వస్తాను" అని వెంటనే రావణాసురుడు ఉన్న చోటుకు పోయింది. అప్పుడు రావణుడు మంత్రులతో మంతానాలు సాగిస్తున్నాడు, వాళ్ళు మాట్లాడుకునేది అంతా విన్నది. రావణుడు ఏం చెయ్యబోతున్నాడో ఇట్టే గ్రహించింది, వెంటనే అశోకవనానికి తిరిగి వెళ్ళింది. పద్మాలు లేకుండా కూర్చున్న లక్ష్మీదేవిలాగావున్న సీతను చూసింది. సరమ తిరిగిరాగానే సీత ఆమెను స్నేహపూర్వకంగా కౌగలించుకుంది. ప్రక్కనే కూర్చోబెట్టుకుంది. "ఓ సరమా! నీవు ఇప్పుడు ఏం తెలుసుకొని వచ్చావో ఉన్నదున్నట్లుగా నాకు చెప్పు" అంది. చక్కగా మాట్లాడే నేర్పుగల సరమ ఇలా చెప్పింది: "ఓ వైదేహీ! రావణాసురుడి తల్లి వచ్చింది. ఆమెతోపాటు 'అవిద్ధుడు' అనే ముసలి మంత్రికూడా ఉన్నాడు. వాళ్ళిద్దరూ కూడా రాముడితో సంధిచేసుకోమన్నారు. సీతను తిరిగి రాముడి కిచ్చేయమని కాళ్ళావేళ్ళా పడి బ్రతిమాలారు. అట్లా చేయక మూర్ఖంగా రాముడితో యుద్ధంచేస్తే సర్వనాశనం అయిపోతుందని జోస్యం చెప్పారు. జనస్థానంలో రాముడొక్కడే అంతమంది రాక్షసుల్ని చంపడమే నీకు నిదర్శనం అన్నారు. అంతేకాకుండా హనుమంతుడు సముద్రాన్ని దాటివచ్చాడు. లంకా పట్టణాన్ని నాశనం చేశాడు, ఇట్లా ఎన్నడైనా ఎవరైనా చేశారా? అని అడిగారు. ఇవన్నీ నీ పాలిట దుశ్శకునాలుగా తీసుకో అన్నారు. ఎంతమంది ఎన్ని చెప్పినా ధనాశాపరుడు ధనాన్ని ఒదులుకోవడానికి ఇష్టపడనట్లుగా, రావణుడు నిన్ను ఒదులుకోవడానికి ఇష్టపడడం లేదు. ఓ సీతా! రావణుడు బ్రతికి ఉన్నంతవరకూ నిన్ను ఒదిలిపెట్టడు, అంటే వాడూ, వాడి మంత్రులూ చచ్చిపోవడానికి సిద్ధపడుతున్నారు. వాడికి ఎవరి భయమూలేదు. చివరకు ప్రాణభయంకూడా లేదు. యుద్ధంలో రాక్షసులంతా చచ్చిపోయినా నిన్ను ఒదలడు. రావణుడు చనిపోయిన తర్వాతే నీకు విడుదల. రావణుడు నీ మీద అంత పట్టుదలతో ఉన్నాడు" అని చెప్పింది.

"ఓ సీతా! భయపడకు నీ కళ్ళలోకి చూస్తూవుంటే, యుద్ధంలో రాముడు తప్పక రావణాసురుణ్ణి చంపి నిన్ను అయోధ్యకు తీసుకుపోతాడని నాకు అనిపిస్తోంది. కాబట్టి భయపడకు, ఇకపై దుఃఖించకు" అంది.

ఇంతలో వానరసైన్యాలన్నీ యుద్ధభేరీలు మోగిస్తూ శంఖాలు పూరిస్తూ, సింహనాదాలు చేస్తూ లంకా పట్టణంలోకి ప్రవేశించారు. వానరుల సింహనాదాలు వినగానే రాక్షసులందరికీ పైప్రాణాలు పైనేపోయాయి. ముఖాల్లో కళాకాంతులు లేకుండా పోయాయి, నిశ్చేష్టులైపోయారు. మన ప్రాణాల మీదకు వచ్చింది ఇక మనకు చావు తప్పదు అని అనుకున్నారు.

# 35వ సర్గ మాల్యవంతుడు లంకలో దుశ్శకునాలు వర్ణించి చెప్పడం

రాక్షస రాజైన రావణుడు ఆ విధంగా మంత్రులతో సమాలోచనలు చేస్తూ ఉండగానే, రాముడు లంకలో ప్రవేశించాడు. వానరసైన్యం చేస్తున్న భేరీధ్వనుల్ని, సింహనాదాల్ని విన్నాడు. లోకాలన్నింటినీ పీడించేవాడు, క్రూరుడైన రావణుడు మంత్రులందరిని ఇలా నిందించాడు:

"ఓ మంత్రి పుంగవులారా! రాముడు సముద్రాన్ని దాటి రావడం, వానరసైన్యాల పరాక్రమం అంతా చెప్పగా విన్నాను, మీరంతా పరాక్రమవంతులై కూడా ఏ ప్రయత్నమూ చెయ్యకుండా ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ కూర్చున్నారు."

అంతట సభలో ఉన్న రావణుడి తల్లికి పినతండ్రి, వృద్ధుడు; గొప్ప బుద్ధిమంతుడైన మాల్యవంతుడు ఇలా అన్నాడు:

"రాజా! విద్యలు బాగా అభ్యసించి, నీతి మార్గాన్ని అనుసరిస్తూ పరిపాలించే రాజువద్ద ఐశ్వర్యం చాలాకాలం అతడి వశంలో ఉంటుంది. బుద్ధిమంతుడైన రాజు సమయం, సందర్భం చూసి నడచుకోవాలి. రాజు తన శత్రువుకంటే బలహీనుడైతే, లేదా సమానమైన బలంగలవాడైతే సంధిచేసుకోవాలి. శత్రువు కంటే తను బలవంతుడైతే విరోధాన్ని కొనసాగించాలి. అట్లా సమయోచితంగా ప్రవర్తించిన రాజు తన బలాన్ని పెంచుకొంటూ గొప్ప ఐశ్వర్యాన్ని పొందుతాడు.

కాబట్టి, ఓ రావణా! నీవు రాముడితో సంధిచేసుకో! సీత కోసం రాముడు ఇంతదూరం వచ్చాడో, ఆ సీతను రాముడికి ఇచ్చివెయ్యి. అంతేకాకుండా, దేవతలు, ఋషులు, గంధర్వులు మొదలైనవాళ్ళంతా రాముడికే జయం కలగాలని కోరుకుంటున్నారు. ఆ రామునితో విరోధం పెట్టుకోవద్దు. అతడితో సంధిచేసుకో! అతడు కూడా దానికి ఇష్టపడతాడు.

బ్రహ్మదేవుడు సృష్టి ప్రారంభించేటప్పుడే సురులని, అసురులని ఇద్దర్నీ సృష్టించాడు.

దేవతలు ధర్మాన్ని ఆశ్రయించి ఉంటారు. అసురులు, రాక్షసులు ఎప్పుడూ అధర్మాన్ని ఆశ్రయించి ఉంటారు. కనుక ధర్మం దేవతల పక్షమని, అధర్మం రాక్షసులు, అసురుల పక్షమని తెలుస్తూవుంది. ధర్మం అధర్మాన్ని జయిస్తే కృతయుగం అనీ, అధర్మం ధర్మాన్ని మింగేసినప్పుడు కలియుగమని అంటూ ఉంటారు.

రాజా! నువ్వు దిగ్విజయ యాత్రలనే పేరుతో లోకాలన్నీ తిరుగుతూ ధర్మం నశించే పనులు చేశావు. అధర్మాన్ని స్వీకరించావు, భోగాలకు దాసుడవయ్యావు, అగ్నితో సమానమైన మహర్షులకు భయం కలిగించావు. ప్రజ్వరిల్లే అగ్నిలాగానే ఋషీశ్వరుల ప్రభావం అతి పవిత్రమైనది, ఎవరూ ఎదిరించలేనిది. వీళ్ళంతా ధర్మాన్ని రక్షించటమే ప్రధాన లక్ష్యంగా జీవిస్తారు. ధర్మరక్షణలో భాగంగానే యజ్ఞాలు, హోమాలు చేస్తూ వేదాల్ని పఠిస్తూ ఉంటారు. బ్రాహ్మణులంతా వేదఘోష చేస్తూవుంటే, రాక్షసులు గ్రీష్మంలో మేఘాల్లాగా పారిపోతూ ఉంటారు. ఋషీశ్వరుల అగ్నిహోత్రాల నుండి బయలుదేరిన పొగలు నాలుగు వైపులా వ్యాపించినట్లుగా, రాక్షసులంతా నాలుగు ప్రక్కలకూ పరుగులు తీస్తారు; రాక్షసుల తేజాన్ని అణచివేస్తాయి. మహర్షులు అనేక ప్రాంతాలలో తపస్సు చేస్తున్నారు. వారి తపోగ్ని రాక్షసులకు తాపం పుట్టిస్తుంది.

ఓ రాజా! నీవు దేవ, దానవ, యక్షులవల్ల చావురాకుండా వరాలు సంపాదించావు కానీ ఇప్పుడు గొప్ప పరాక్రమము, బలము దృఢమైన వానరములు, భల్లూకములు, గోలాంగూలములు వచ్చి గర్జించుచున్నారు. అస్త్రశాస్త్రాలలో శ్రేష్ఠుడైన మానవుల వలన నీకు మరణం తొంగిచూస్తోంది. నేను అనేకమైన దుశ్శకునాలను చూస్తున్నాను. ఇవన్నీ చూస్తూ ఉంటే రాక్షసులకు చెడుకాలం దాపురిస్తోందని భావిస్తున్నాను. భయంకరమైన మేఘాలు లంకపై గర్జిస్తూ రక్తాన్ని వర్షిస్తున్నాయి. ఏనుగులు, గుర్రాలు, ఏడుస్తూ కన్నీరు పెట్టుకుంటున్నాయి. మాంసం తినే క్రూరమృగాలు, గద్దలు, నక్కలు, లంకలోని ఉద్యానవనాల్లోచేరి భయంకరంగా అరుస్తున్నాయి. స్వప్నంలో నల్లనిస్త్రీలు తెల్లని పలు వరుసలతో నవ్వుతున్నట్లుగా కనిపిస్తున్నారు.

దేవతలకోసం చేసిన ఆహారం కాకులకు వేస్తే, వాటిని కుక్కలు తినిపోతున్నాయి. గాడిదలకు, ముంగిసలకు ఎలుకలు పుడుతున్నాయి. పిల్లులు పులుల్తోను, పందులు కుక్కల్తోను, కింనరులు రాక్షసుల్తోను, రాక్షసులు మనుషుల్తోనూ కలుస్తున్నారు. ఎర్రని పాదాలుగల తెల్లని పావురాలు, కాలం చేత ప్రేరేపించబడినవై రాక్షసుల వినాశనాన్ని సూచిస్తున్నాయి. ఇళ్ళల్లో పెంచుకునే గోరువంకలు మధురంగా కూయకుండా భయంకరంగా అరుస్తున్నాయి. పక్షులు మృగాలు పోట్లాడుకుంటే మృగాలు ఓడిపోతున్నాయి. ఇవన్నీ సూర్యుడివైపు ముఖంపెట్టి భయంకరంగా ఏడుస్తున్నాయి. మృత్యువు పురుషరూపం ధరించి అందరి ఇళ్ళలోకీ తొంగిచూస్తోంది. ఇంకా ఎన్నో దుశ్శకునాలు కనిపిస్తూన్నాయి. కనుక ఓ రాజా! ఇకమీదట సుఖంగా ఉండేందుకు ఏం చేయాలో బాగా ఆలోచించి చెయ్యి."

బలవంతుడు, ఉత్తముడైన మాల్యవంతుడు రావణాసురుణ్ణి పరికించి చూశాడు, తన మాటలు అతడికి రుచించలేదని తెలుసుకున్నాడు.

# 36వ సర్గ మాల్యవంతుని ఉపదేశాన్ని రావణుడు తిరస్కరించటం

దుర్మార్గుడైన రావణుడు మాల్యవంతుడు చెప్పిన మంచి మాటల్ని చెవికెక్కించుకోలేదు. అంతేకాక అతడిపై కృద్ధుడైపోయాడు. కోపంతో కళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా అయ్యాయి, కనుబొమలు తిప్పుతూ ఇలా అన్నాడు:

"ఓ మాల్యవంతుడా! నీవు పూర్తిగా శత్రుపక్షంలో చేరిపోయావు. 'హితం' అని అంటూ పరుషమైన మాటలు మాట్లాడావు, నా మనస్సు గాయపరచావు. ఆ రాముడు సామాన్యమానవుడు, సైన్యంగానీ వాహనాలుగాని లేవు. కేవలం కోతులమీదనే ఆధారపడ్డాడు. అతణ్ణి తండ్రి వెళ్ళగొట్టాడు. అతడికి అరణ్యాలు తప్ప తలదాచుకునే స్థలమే లేదు. అటువంటి రాముణ్ణి ఎక్కువచేసి చాలా మాట్లాడావు. ఇక నేనో! సమస్త రాక్షసులకూ ప్రభువును. నా పరాక్రమంతో ముల్లోకాలను జయించాను. అటువంటి నన్ను తక్కువగా చేసి మాట్లాడావు? నా పరాక్రమం చూసి ఓర్వలేకనా? లేక ఎదుటి పక్షంపై పక్షపాతమో? లేక శత్రువులచేత ప్రేరేపించబడ్డావనే నాకు అనిపిస్తోంది. లేకపోతే, పండితుడు, తత్త్వవేత్త, వృద్ధుడవు అయిన నీవు, నీకు ప్రభువును, నిగ్రహానుగ్రహ సామర్థ్యం ఉన్నవాడు అయిన నాతో ఇటువంటి ప్రసంగం చేస్తావా?

ఓ మాల్యవంతుడా! నేను సీతాదేవిని జనస్థానం నుండి తెచ్చుకున్నాను. ఆమె పద్మాసనం లేని లక్ష్మీదేవి. అటువంటి మంగళప్రదమైన సీతను రాముడికి ఎందుకు ఇవ్వాలి? భయంవల్లనా? నేను ముల్లోకాల్లో ఎవరికీ భయపడలేదు, అటువంటిది ఈ రాముడికి భయపడ్తానా? ఈ యుద్ధంలో నేను రాముణ్ణి, లక్ష్మణుణ్ణి, సుగ్రీవుణ్ణి చంపేస్తాను. ఆ వానరసేననంతా నాశనం చేస్తాను. దేవతలే స్వయంగా ద్వంద్వయుద్ధానికి వచ్చినా వాళ్ళను చంపేస్తాను. అటువంటిది రాముడికి భయపడను. ఒకళ్ళకి భయపడటం నా స్వభావం కాదు. సముద్రానికి సేతువు కట్టడం ఏమంత గొప్పవిషయం ఏమీకాదు. అంతమాత్రానికే నా

పరాక్రమం పూర్తిగా తెలిసిన నీవు శత్రుపక్షాన చేరిపోతావా? రాముడు సేతువు నిర్మించింది లంకలో ప్రవేశించడానికే! కానీ అతడు లంకనుండి బయటకుపోలేడు. ఇక్కడే మరణిస్తాడు ఇది సత్యం. శపథంచేసి చెప్తున్నాను."

మాల్యవంతుడు రావణాసురుడు మాట్లాడిందంతా ఓపిగ్గావిన్నాడు. రావణునికి తనపై కోపం వచ్చిందని గ్రహించాడు. రావణుడి కళ్ళు అహంకారంతో మూసుకుపోయాయిగదా అనుకున్నాడు. అయినా తను కూడా, అడిగిందానికి సమాధానం చెప్పి కూర్చోకుండా అట్లా మాట్లాడినందుకు సిగ్గుపడ్డాడు. రావణుడికి మర్యాదపూర్వకంగా జయహో చెప్పి ఇంటికి వెళ్ళిపోయాడు.

అంతట రావణుడు మిగిలిన మంత్రులతో యుద్ధ సన్నాహాలను గూర్చి, రక్షణ ఏర్పాట్ల గూర్చి వివరంగా చర్చించాడు. తూర్పు ద్వారాన్ని ప్రహస్తుణ్ణి రక్షణకు నియమించాడు. దక్షణద్వారాన్ని మహోదరుణ్ణి, మహాపార్శ్వుడ్నే చూసుకోమన్నాడు. పశ్చిమ ద్వారాలవద్ద మాయావి, తన కుమారుడైన ఇంద్రజిత్తును నియమించాడు. ఉత్తర ద్వారం దగ్గర తనే స్వయంగా యుద్ధం చేస్తానన్నాడు. పట్టణాన్నంతా మహాబలవంతుడైన విరూపాక్షుణ్ణి రక్షకుడుగా నియమించాడు. ఈ విధంగా ఆ లంకాపట్టాణానికి సంపూర్ణంగాను పటిష్ఠంగాను రక్షణ ఏర్పాట్లు చేసి రావణుడు సంతృప్తి చెందాడు.

లంకా పట్టణానికి సమగ్రమైన ఏర్పాట్లు చేసిన తర్వాత, మంత్రులందరినీ వారి బాధ్యతలు నిర్వహించేందుకు అనుమతించాడు. మంత్రులంతా రావణునికి జయహో అంటూ అభివాదం చేస్తూ వెళ్ళిపోయారు. తరువాత రావణుడు అంతఃపురంలోకి వెళ్ళిపోయాడు.

# 37వ సర్గ రాముడు లంకా పట్టణాన్ని ముట్టడించడం

రామలక్ష్మణులు, వానరరాజు సుగ్రీవుడు, అంగదుడు, జాంబవంతుడు, విభీషణుడు, శరభుడు, సుషేణుడు, మైందుడు, ద్వివిదుడు, గజుడు, గవాక్షుడు, కుముదుడు, నలుడు, పవనుడు మొదలైనవాళ్ళంతా పట్టణ పొలిమేరల్లోకి చేరుకున్నారు. పట్టణాన్ని ముట్టడించడాన్ని గూర్చి తీవ్రంగా ఆలోచించారు.

"ఇదే లంకాపట్టణానికి బహిర్ ప్రాకారం. దేవతలుగాని, అసురులుగాని, ఉరగులుగాని, గంధర్వులుగాని ప్రవేశించటానికి వీలుకాకుండా శత్రు దుర్భేద్యమై ఉంటోంది. పరాక్రమశాలురైన రాక్షసులు వివిధములైన ఆయుధాలతో ఈ ప్రాకారం దగ్గరే నగరాన్ని రక్షిస్తూవుంటారు. రాక్షసరాజైన రావణుడు ఈ నగరం లోపలే నివసిస్తూవుంటాడు. మనం విజయలక్ష్మిని ఏ విధంగా చేపట్టగలమో ఇప్పుడు మనం ఆలోచించాలి" అని రాముడు అన్నాడు.

అప్పుడు విభీషణుడు వినయంతోను, మృదువుగాను ఇలా అన్నాడు: "ప్రభూ! నా అనుచరులు నలుగురూ ఇప్పుడే పక్షిరూపాన్ని ధరించి లంకలోకి ప్రవేశించి నాలుగుమూలలా తిరిగివచ్చారు. రావణుడి యుద్ధప్రణాళికలన్నీ తెలుసుకొనివచ్చారు, వాళ్ళు తెచ్చిన భోగట్టా ఉన్నది ఉన్నట్లుగా మీకు నివేదిస్తాను, చిత్తగించండి.

ప్రహస్తుడు పెద్ద సైన్యాన్నిపెట్టుకొని ఉత్తరద్వారాన్నీ, మహాబలవంతులైన మహాపార్శ్వుడు, మహోదరుడూ దక్షిణ ద్వారాన్నీ, రావణాసురుడి కుమారుడైన ఇంద్రజిత్తు పశ్చిమ ద్వారాన్ని రక్షిస్తున్నారు. రావణాసురుడే స్వయంగా ఉత్తర ద్వారం దగ్గర ఉన్నాడు. లక్షలాది రాక్షస సైన్యం శూలాలు, ఖడ్గాలు, ధనస్సులు, ధరించి రావణునికి అండగా ఉన్నారు. విరూపాక్షుడు పెద్దసేనను పెట్టుకొని నగరం మధ్యలో ఉండి కావలి కాస్తున్నాడు. మొత్తం మీద రావణాసురుడితోసహా, రాక్షసవీరులంతా కూడా దిగులు చెందివున్నారని నా మంత్రులు నాతో స్వయంగా చెప్పారు.

రామా! మహాబలవంతులు, క్రూరులైన పదివేలమంది ఏనుగులపైనా, పదివేలమంది రథాలపైనా, పదివేలమంది గుర్రాలపైన, రావణుని వెనక నిలచి యుద్ధానికి సిద్ధమై ఉన్నారు. వీళ్ళందరికీ ఒక్కొక్కరికీ పదిలక్షలమంది పరివారం ఉంది." విభీషణుడు తన నలుగురు మంత్రుల్నీ రాముడి ముందుకు పిలిపించి వారిచేతనే స్వయంగా చెప్పించాడు.

"ఓ రామా! రావణుడు కుబేరుడిపైకి యుద్ధానికి పోయినప్పుడు పది లక్షలమంది రాక్షసయోధుల్ని వెంటబెట్టుకొని వెళ్ళాడు. వాళ్ళంతాకూడా రావణాసురుడంతటి సమర్థులే! పరాక్రమంలోగాని, బలంలోగానీ, తేజస్సులోగాని, ధైర్యంలోగాని, దర్పంలోగాని వాళ్ళెవరూ రావణునికి తీసిపోరు. ప్రభూ! నేనిదంతా నిన్ను భయపెట్టేందుకు చెప్పటంలేదు; నీకు కోపంవచ్చి వెంటనే రావణాసురుడ్ని సంహరిస్తానని ఇంతగా చెప్తున్నాను. ప్రభూ! నీవు పరాక్రమంలో దేవతలనైనా ఓడించగలవు, నీ గొప్ప సామర్థ్యాని గూర్చి ముల్లోకాలవాళ్ళకూ తెలుసు. ఇప్పుడు నీవు కూడా నీ సైన్యాన్నంతా నాలుగు భాగాలుగా చెయ్యి. నాలుగు ప్రక్కలనుండీ ముట్టడించు. రావణాసురుణ్ణి వధించు" అన్నారు.

అంతట రాముడు విభీషణుడు చెప్పినదంతా సావధానంగా విన్నాడు. వానర సేనాధిపతులందర్నీ పిలిచాడు. "ఓ వానరవీరులారా! మీలో నలుదు వానరవీరుల్ని వెంటబెట్టుకొని తూర్పు ద్వారాన్ని ముట్టడించి ప్రహస్తుడితో తలపడాలి. అంగదుడు తన సైన్యంతోపాటు దక్షిణ ద్వారంలో ఉన్న మహోదరుడితోను, మహాపార్శ్వుడితోను యుద్ధం చెయ్యాలి. హనుమంతుడు కొంతసైన్యాన్ని తీసుకొని పశ్చిమద్వారాన్ని శిధిలం చెయ్యాలి.

మహాత్ములైన మహర్షులను సర్వదా అపకారం చెయ్యటానికే కంకణం కట్టుకున్నవాడూ, ప్రజలందరినీ నానా హింసలూపెడ్తున్నవాడూ, బ్రహ్మదేవుడి నుండి వరాల్ని పొంది గర్వంతో మితిమీరి ప్రవర్తిస్తున్నవాడైన రావణాసురుణ్ణి నేను, లక్ష్మణుడూ కలసి ఉత్తర ద్వారం దగ్గర ఎదుర్కొంటాం.

"ఓ వానరులారా! ఈ యుద్ధం అయ్యేంతవరకూ మీలో ఎవ్వరూ కూడా (కామరూపులైనా) మనుష్యరూపం ధరించవద్దు. ఎందువల్లనంటే యుద్ధంలో మనసైనికులంతా మిమ్మల్ని గుర్తుపట్టడానికి సులభంగా ఉంటుంది. నేను, లక్ష్మణుడు, విభీషణుడు, అంగదుడు, హనుమంతుడు, సుగ్రీవుడు, నీలుడూ మాత్రం మానవుల రూపంలో ఉంటాం" అని చెప్పాడు. అంతట రామసేనయంతా లంకాపట్టణాన్ని ముట్టడించేందుకు సంతోషంతో ఉరకలువేస్తూ వెళ్ళింది.

# 38వ సర్గ రామలక్ష్మణులు సువేల పర్వతాన్ని అధిరోహించడం

రాముడు సువేలపర్వతం పైకిపోయి ఆ రాత్రికి అక్కడే గడపాలని అనుకున్నాడు. లక్ష్మణుడితో, ధర్మము, ఆలోచన, శాస్త్రము తెలిసిన విభీషణుడితో, సుగ్రీవుడు మొదలైన వారితో ఇలా అన్నాడు: "మిత్రులారా! ఈ సువేలపర్వతం నానావిధములైన ధాతువులతో కూడివుంది. మనం ఈ రాత్రికి ఇక్కడే ఉందాం. ఇక్కడనుండి చూస్తే మనకు లంకాపట్టణం అంతా కనిపిస్తుంది. రావణుడు ఉత్తమ పులస్త్యవంశంలో పుట్టాడు. అయితే ఆ గౌరవాన్ని పాటించలేదు. నీచబుద్ధితో నింద్యమైన పనిచేశాడు. తన చావు కోసమే నా భార్యను అపహరించాడు. వాడికి ధర్మాధర్మాలు తెలియవు, సదాచారాన్ని పాటించలేదు. అతడిని గూర్చి తలచుకుంటేనే ఒంటికి కారం పూసుకున్నట్లుంది, పరభార్యను అపహరించి ఘోరమైన పాపం చేశాడు. అతడు ఒక్కడూ చేసిన పాపానికి అతడి వంశమే నాశనం అయిపోతుంది గదా!" ఇలా అంటూ రాముడు సువేల పర్వతం పైకి నడక సాగించాడు. మిగిలిన వాళ్ళంతా అతణ్ణి అనుసరించారు.

హనుమంతుడు, నీలుడు, అంగదుడు, నలుడు, మైందుడు, ద్వివిదుడు, గజుడు, గవాక్షుడు గవయుడు, శరభుడు, గంధమాదనుడు, పనసుడు, కుముదుడు, హరుడు, దంభుడు, జాంబవంతుడు, సుషేణుడు, ఋషభుడు, శతిబలి మొదలైన వాళ్ళంతా పర్వతంపై వాయువేగంతో చేరుకున్నారు. క్షణాల్లో ఆ సువేలపర్వతం అంతా కిష్కింధలాగా వానరులమయంమై పోయింది.

ఆ సువేల పర్వతం పైనుండి చూస్తూవుంటే, దూరానవున్న లంకాపట్టణం త్రికూటపర్వత శిఖరంపైనుండి ఆకాశంలో వ్రేలాడుతోందా? అన్నట్లుంది. అందమైన బహిర్ద్వారాలతోను, ఎత్తైన ప్రాకారలతోను, రాక్షస సైనికుల సమూహాలతోను కోలాహలంగా ఉంది. ప్రాకారాలపైన నల్లగా పర్వతాల్లా నిలబడ్డ రాక్షస సైనికుల్ని ఆ చీకట్లో చూస్తూవుంటే "నడిచే మరో ప్రాకారమా?" అన్నట్లుంది. రాముడు అనుమతించడంతో వానరులంతా సింహనాదాలు చేశారు. ఇంకా

అప్పుడు సంధ్యాకాలమే అవడంవల్ల సూర్యుడు ఎర్రటిముద్దగా అయిపోయి కొద్దిసేపట్లోనే అస్తమించాడు. పిమ్మట పూర్ణ చంద్రుని రాకతో చల్లని వెన్నెల శోభయమానంగా ఆక్రమించుకుంది. వానరసేనల్లో ఒక్కడు కూడా రాక్షసుల చేతిలో పడకుండా ఉంటేట్లుగా వ్యూహం రచించిన విభీషణుణ్ణి, రాముడు అభినందించాడు. ఎంతో గౌరవించాడు. ఆ రాత్రికి రామలక్ష్మణులతో కలసి ఆ వానరులంతా సువేల పర్వతంపై నిద్రపోయారు.

## 39వ సర్గ రాముడు సువేల పర్వతంపైనుండి లంకను చూడటం

రామలక్ష్మణులు, వానర వీరులందరూ ఆ రాత్రి సువేల పర్వతంపై ఆనందంగా గడిపేశారు. అక్కడనుండి లంకాపట్టణ అందాలన్నీ ఆస్వాదించారు. అక్కడ వాళ్ళు మహావనాల్ని చూశారు, ఉద్యానవనాన్ని చూశారు, మిట్ట పల్లాలులేని సమతల ప్రదేశాల్ని చూశారు. సువేల పర్వతానికి, త్రికూటపర్వతానికి మధ్యవుండే రమణీయ ప్రదేశాలన్నింటినీ నేత్రపర్వంగా చూశారు.

ఆ వనాలలో సంపెంగలు, సురపొన్నలు, మద్ది, కానుగ, నాగకేశం, అశోక, తాటి, ఏరుమద్ది, కడిమి, ఏడాకుల అరటి, కొండగోగు, కలిగొట్ట, మొదలైన అనేక మహోన్నత వృక్షాల్ని చూశారు. నేల కనపడకుండా వాటిని అల్లుకొన్న అనేక రకాలైన లతలను చూశారు. ఆ లతలన్నీ పూలు విరగబూసి ఉన్నాయి. అక్కడ ఫలాలు, పుష్పాలన్నీ వృక్షాలకు చుట్టుకొని మనుషులు అలంకారం చేసుకున్నట్లుగా కనిపిస్తున్నాయి. ఆ పుష్పాలు వెదజల్లే సువాసనలు అడవియంతా వ్యాపించి పోయింది.

ఆయా వృక్షాలపైన గూళ్ళు కట్టుకొని ఉంటున్న పక్షులన్నీ మదించి పాటలు పాడుతున్నాయి. పూలపై వాలి తేనెలు త్రాగుతున్న గండు తుమ్మెదలు ఝుంకారం చేస్తున్నాయి. కోయిలలన్నీ పోటీలుపడి పాటలు అందుకున్నాయి. కౌజుపిట్టలు, బెగ్గర పక్షులు మధుర ధ్వనులుచేస్తున్నాయి. ఆ మహావనం అన్ని ఋతువుల్లోనూ తుమ్మెదలు మూగడంతో, కుబేరుడి చైత్యరథమును, దేవేంద్రుడి నందనోద్యానవనాన్ని తల దన్నేట్లుంది. లంకానగర శోభల్నీ, ఆ మహావనాల అందాల్నీ చూచేందుకు సుగ్రీవుడి అనుమతి పొంది కొంతమంది వానరులు లంకాపట్టణాన్ని చూడటానికి ముందుగా బయలుదేరారు. అమిత వేగంతో పోయిన ఆ వానరుల వేగానికి భూమి అదిరింది. దుమ్ము ఆకాశం వరకు వ్యాపించింది. వాళ్ళు చేస్తున్న సింహనాదాలతో ఆ వనాల్లోవుండే పక్షులు అడవి జంతువులు బెదిరిపోయి ప్రాణరక్షణ కోసం

నాలుగు దిక్కులకూ పారిపోయాయి. ఆ జంతువుల తాకిడికి పట్టణం అంతా అల్లకల్లోలం అయింది.

లంకాపట్టణానికి చుట్టూ ఉండే సముద్రం ఒక జలదుర్గంలా అమరివుంది. ఆ జలదుర్గాన్ని దాటిన తర్వాత సువేలపర్వతం పర్వత దుర్గంలాగా ఉంటుంది. ఆ పర్వతదుర్గం దాటిన తర్వాత దట్టమైన అడవి ఉంటుంది, అది వనదుర్గం. ఆ వనదుర్గం దాటిన తర్వాత త్రికూటపర్వతం ఉంటుంది. ఆ త్రికూటపర్వత శిఖరం చాలా ఎత్తైనది. ఆ శిఖరం ఆకాశన్నంటుకున్నట్లుంది. ఆ శిఖరం అంతా పూలతో నిండిపోయి, బంగారు కాంతులతో ధగధగ మెరిసిపోతూ ఉంటుంది. ఆ త్రికూటపర్వతం రమణీయంగాను కన్నుల పండువుగానూ ఉంటుంది. పక్షులుకూడా ఆ ఎత్తుకు ఎగరలేవంటే ఇక సామాన్యుల విషయంచెప్పాలా? ఆ త్రికూటపర్వత శిఖరంపైన లంకా పట్టణం నిర్మించబడింది. ఆ లంకాపట్టణం నూరుయోజనాల పొడుగు, ముప్పదియోజనాల వెడల్పు కలిగివుంటుంది. లంకా పట్టణంలోని భవనాలన్నీ తెల్లటి మేఘాల్లాగా ఎత్తుగా ఉంటాయి. ఆ ప్రాకారాలన్నీ వెండి, బంగారు కాంతుల్తో ప్రకాశిస్తూ ఉంటాయి. అక్కడి భవనాలు, విమానాలు ఆకాశంలో వర్షాకాల మేఘాల్లాగా ఉంటాయి. కైలాస పర్వతంలాగా వెయ్యి స్తంభాలతో నిర్మించిన ప్రాసాదం ఒకటి ఆకాశంలోకి చొచ్చుకుపోతున్నట్లుంటుంది. ఆ ప్రాసాదాన్ని రాత్రింబవళ్ళు వందలకొద్దీ రాక్షసవీరులు కాపలాకాస్తూ ఉంటారు. అదే రాక్షసరాజైన రావణాసురుడు నివసించే చైత్రప్రాసాద భవనం లంకాపట్టణానికి కిరీటం వంటిది.

మనోహరమైన ఆలంక బంగారంతోనిండి, అనేక విధాలైన ధాతువుల్తో విచిత్రమైన రంగుల్తోగల ఆ పర్వతం నిండా మనోహరమైన ఉద్యావనాలతో విలసిల్లుతూ ఉంటుంది. అనేక ఫలపుష్ప వృక్షాలతో నిండి ఉంటుంది. ఆ పట్టణలలో శూరులు, బలాఢ్యులు, పరాక్రమవంతులైన అనేకమంది రాక్షసులు నివసిస్తున్నారు. అష్టైశ్వర్యాలతో తులతూగుతున్నది. సర్వ సమృద్ధమైనదైన ఆ నగర శోభనంతా ఆ వానరులు చూశారు.

పరాక్రమవంతుడైన రాముడు పెద్ద పెద్ద భవనాలతో ఇరుకుగా ఉండి, సర్గతుల్యమైన ఆ లంకానగరాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. ఆ ప్రాసాదాలన్నీ అనేక శ్రేష్ఠమైన వస్తువుల్తో నిర్మించబడ్డది. ఆ మహానగరంలోని ప్రాసాదాల్లో యంత్రాలు అమర్చబడి ఉన్నాయి. సైన్యం ఎంతో అప్రమత్తతో కాపలాకాస్తున్న ఆ లంకానగరాన్ని రాముడు చూశాడు.

# 40వ సర్గ రావణ సుగ్రీవుల మల్లయుద్ధం

రామలక్ష్మణులు, సుగ్రీవుడు ఆ సువేలపర్వతంపైనుండి రెండు యోజనాల దూరంలో ఉన్న వానరసేనల్ని, వానరయాధిపతుల్ని చూశారు. మనోహరమైన వనాలతో విలసిల్లే ఆ లంకాపట్టణాన్ని, గోపుర శిఖరాలమీదవున్న రావణుణ్ణి, రాముడు చూశాడు. ఆ రావణాసురునికి తలపై విజయ ఛత్రం పట్టారు. రెండు ప్రక్కలా పరిచారికలు వింజామరలతో వీస్తున్నారు. నల్లని మేఘంలాగా ఉండే అతడి శరీరానికి ఎర్ర చందనం పూసి అలంకరించారు. ఐరావతం దంతాలతో వక్షఃస్థలంపై కుమ్మినప్పుడు దెబ్బలు తగిలి కాయలుకాచాయి. రక్తవర్ణంలో ఉండే పీతాంబరాన్ని ధరించాడు. సాయంసంధ్యలో కనిపించే మేఘమండలంలాగా ఉన్నాడు.

రావణుణ్ణి చూడగానే సుగ్రీవునికి కోపం ముంచుకొచ్చింది. రామలక్ష్మణులు వానరవీరులంతా చూస్తూవుండగా సుగ్రీవుడు గాలిలోకి ఎగిరి, రావణుడు విహరిస్తున్న గోపురంవైపు దూకాడు. రావణాసురుణ్ణి ఏమాత్రం లక్ష్యం చెయ్యకుండా ఒక గడ్డిపరకలాగా చూస్తూ "ఓ రాక్షసుడా! నేను ముల్లోకాలకూ ప్రభువైన రాముడికి సేవకుణ్ణి. నన్ను సుగ్రీవుడు అని అంటారు. అతడుమాత్రం నన్ను 'స్నేహితుడా' అని అంటాడు, ఆ మహానుభావుడి తేజస్సుతో ఇప్పుడు నీ ప్రాణాలు తియ్యటానికి వచ్చాను. కాచుకో!" అన్నాడు.

తనపైకి దుముకుతున్న సుగ్రీవుణ్ణిచూసి రావణుడు "ఓ సుగ్రీవుడా! నీవు నా ఎదుట పడనంత వరకూ సుగ్రీవుడవే! కానీ, ఇప్పుడు హీనగ్రీవుడౌతావు! చూడు" అంటూ సుగ్రీవుణ్ణి చేతుల్తో ఒక్క తోపుతోశాడు. సుగ్రీవుడు ఆ దెబ్బకు కిందపడ్డా వెంటనే బంతిలాగా పైకిలేచి రావణాసురుణ్ణి గట్టిగా పట్టి క్రిందకు తోశాడు. అంతట మహాబలశాలురైన రావణ సుగ్రీవులిద్దరూ బాహువులతో ద్వంద్వయుద్ధం చేసుకున్నారు. ఇద్దరి శరీరం చెమటతో తడిసి పోయింది, ఇద్దరి శరీరాలకీ గాయాలయ్యాయి. ఆ గాయాలనుండి రక్తంతో శరీరమంతా తడిసి ముద్దయింది. ఈ విధంగా వాళ్ళిద్దరూ చాలాసేపు యుద్ధంచేశారు చివరకు వాళ్ళిద్దరూ గోపురం

మీదనుండి ప్రాకారానికి, పరిఖకు మధ్యన పడ్డారు. ఇద్దరూ కూడా వేడి నిట్టూర్పులు విడుస్తూ ఒకరినొకరు పట్టుకొని నేలపైకి దూకారు.

వాళ్ళు ఒకరినొకరు పైకెత్తి కిందపడేస్తూ యుద్ధమార్గంలో అవలంబించాల్సిన పద్ధతులన్నీ అవలంబించారు. ఉత్తమమైన ఏనుగుల్లాగా, ఏనుగులు తొండాలతో కలియబడినట్లు, వాళ్ళిద్దరూ బాహువులతో తలపడ్డారు. ఒకళ్ళనొకళ్ళు చంపుకోవటానికి ప్రయత్నించారు. మాంసం ముక్క కోసం పిల్లుల్లాగా ఒకరినొకరు ఆక్రమించుకోవటానికి ప్రయత్నించారు. మల్లయుద్ధంలో నేర్పుగల వాళ్ళిద్దరూ, అనేక మండలాలు తిరుగుతూ, అనేకరకాలైన స్థితులను చేస్తూ, విచిత్రమైన గోమూత్రికలను, చిత్రమైలైన గతప్రత్యాగతములను, పరిహారాల పరిమోక్షాన్ని, వర్జనమును, పరిధానమును, అభిద్రవణమును, అప్లావమును, అనుస్థానమును, పరావృత్త, అపావృత్త, అపద్రుత, అవప్లుతములను, ఉపన్యస్త, అపన్యస్తములను చరించిరి.

ఇంతలో రావణుడు తన మాయలను చూపించటం ప్రారంభించాడు. ఆ విషయాన్ని పసిగట్టిన సుగ్రీవుడు ఆకాశం పైకి ఎగిరిపోయాడు. ఇకచేసేదేమీలేక రావణుడు అక్కడే ఉండిపోయాడు. సుగ్రీవుడు ఆ విధంగా రావణాసురుడికి అలసట కలిగించి రామప్రభువు వద్దకు వచ్చాడు. సుగ్రీవుడు చేసిన ఈ వీరోచితకార్యానికి రాముడు మెచ్చుకున్నాడు వానరులంతా తమ రాజును ప్రశంసించారు.

# 41వ సర్గ యుద్ధ సన్నాహాలు

వానర రాజు సుగ్రీవుడు రావణాసురుడితో యుద్ధం చేసి రాముడి వద్దకు వచ్చాడు. ఒంటి నిండా గాయాలతో తిరిగి వచ్చిన సుగ్రీవుణ్ణి కౌగిలించుకొని రాముడు ఇలా అన్నాడు.

రాముడు: "స్నేహితుడా! నీవు నాతో చెప్పకుండా ఇంత పెద్ద సాహసం చేశావు. నువ్వు వీరుడవే కావచ్చు. సాహసాలు చెయ్యటం నీకు సరదా కావచ్చు గాక! రాజులెవ్వరూ ఇటువంటి సాహసం చెయ్యరు. నేను, ఈ విభీషణుడు, మిగిలిన వానర వీరులంతా నీ కోసం ఎంతో కలవరపడిపోయాం. ఇక ముందు ఎన్నడూ ఇటువంటి సాహసం చెయ్యనని నీవు నాకు వాగ్దానం చెయ్యాలి!

ఓ మహాబాహూ! శత్రువును చంపే బలం ధైర్యం, సాహసం నీకు ఉన్నాయి. కానీ, నీకు ఏదైనా ఆపదవస్తే నాకు సీతతో కానీ, భరతుడితోకానీ, లక్ష్మణుడితోకానీ ఏమీ పనిలేదు. నువ్వు దేవేంద్రుడంతటి బలం గలవాడవే. వరుణ దేవుడంతటి సాహసం గలవాడవే. నేను కాదనను. నువ్వు మాతో చెప్పాపెట్టకుండా ఎగిరిపోయినప్పటి నుండి, తిరిగి నువ్వు మా కళ్ళపడేంతవరకు నీకు ఏం ఆపద ముంచుకొస్తుందోనని భయపడిపోతున్నాం. నేను యుద్ధం చేసి రావణాసురుడిని పుత్ర, బంధు, సపరివారంగా సంహరించి విభీషణుణ్ణి లంకకు రాజుగా చేసి, అయోధ్యకు పోయి రాజ్యాన్ని భరతుడికి ఒప్పచెప్పి, పిమ్మట ఈ దేహాన్ని విడిచిపెట్టాలని అనుకున్నాను."

రాముడు మృదువుగాను, దృఢంగాను మందలించగా, సుగ్రీవుడు ఇలా అన్నాడు.

సుగ్రీవుడు: "ఓ ప్రభూ! నీవు మహావీరుడవు. నీ భార్యను అపహరించిన ఆ రాక్షసుడు కంటపడగానే సహించలేకపోయాను. నన్ను నేను అదుపు చేసుకోలేకపోయాను. వాడిని వెంటనే చంపెయ్యాలనే ఆవేశంతో ఎగిరివెళ్ళి వాడితో యుద్ధం చేశాను. వాణ్ణి నువ్వే చంపుతానని ప్రతిజ్ఞ చేశావు కాబట్టి నేను వాణ్ణి చంపకుండా తిరిగివచ్చాను.

సుగ్రీవుడికి తనపై ఉన్న ప్రేమకు భక్తికి రాముడు సంతోషించాడు. కౌగిలించుకొని అభినందించాడు. ప్రక్కనే ఉన్న లక్ష్మణుణ్ణి చూస్తూ ఇలా అన్నాడు.

రాముడు: లక్ష్మణా! ఈ వనంలో దొరికే కమ్మటి ఫలాలు, కందమూలాలు తిని తియ్యటి నీరు త్రాగి, ఆ పిమ్మట సేనాసమూహాల్ని చక్కగా విభజించి వ్యూహాలుగా చేద్దాం. ఈ యుద్ధంలో భయంకరమైన వానరములు, భల్లూకములు, రాక్షసులు అధిక సంఖ్యంలో మరణించబోతున్నారు. నాకు అటువంటి శకునాలు కనిపిస్తున్నాయి. గాలులు తీవ్రంగా వీస్తున్నాయి. భూమి కంపిస్తోంది. పర్వత శిఖరాలు అదురుతున్నాయి. క్రూరమృగాలు భయంకరంగాను, పౌరుషంతోను అరుస్తున్నాయి. మేఘాలు రక్తబిందువుల్ని వర్షిస్తున్నాయి. సూర్యుడు ఒక అగ్నిగోళంలాగా ఉండి కిందపడుతూ ఉన్నట్లు కనిపిస్తున్నాడు. క్రూరమృగాలు, పక్షులు, దీనస్వరంతో సూర్యుని వైపు తిరిగి అరుస్తున్నాయి. ప్రళయం వచ్చిందా అన్నట్లుగా చంద్రుడిలో కాంతి తగ్గి, ఎరుపు, నలుపు కిరణాలు ప్రసరింపజేస్తూ రాత్రిపూటయే తాపం పుట్టిస్తున్నాడు. పగలు సూర్యమండలంలో నల్లని మచ్చ కనపడింది. నక్షత్రాల్లో కాంతి నశించింది. కాకులు, డేగలు, గద్దలు చిన్నచిన్న పిట్టలతో కలుస్తున్నాయి. నక్కల ఏడుపు వినపడుతోంది. కనుక ఓ లక్ష్మణా! మనం ఇప్పుడే లంకా నగరాన్ని ముట్టడిద్దాం.

ధర్మజ్ఞుడైన రాముడు ఈ విధంగా లక్ష్మణుడితో చెప్పి పర్వత శిఖరం నుండి క్రిందకు దిగాడు. సుగ్రీవుణ్ణి సంప్రదించి వానర సైన్యాన్నంతటినీ యుద్ధానికి సిద్ధం చేశాడు. అప్పటికే ప్రాతఃకాలం అయింది. విభీషణుడు, సుగ్రీవుడు, లక్ష్మణుడు, హనుమంతుడు, జాంబవంతుడు, సుషేణుడు, రాముణ్ణి అనుసరించారు. వాళ్ళ వెనక భల్లూకాలు, వానరవీరులు బయలుదేరారు. ఆ వీరులంతా నడుస్తూ ఉంటే భూమి అదిరింది. అంతా తలో బండరాయిని చేత పుచ్చుకొని లంకానగర ప్రాకారం వైపుకు దారితీశారు.

లంకాపట్టణ ద్వారమే పర్వత శిఖరం అంత ఎత్తుంది. అది ఉత్తర ద్వారం. ఆ ద్వారాన్ని రావణాసురుడే స్వయంగా రక్షిస్తున్నాడు. అతడికి అండగా అనేకమంది రాక్షస వీరులు వివిధ

ఆయుధాల్ని ధరించి ఉన్నారు. ఆ ద్వారం వరుణదేవుడు పరిపాలించే మహాసముద్రంలాగాను, దానవులు కాపాడుతున్న పాతాళంలాగా కనిపించింది. ఒక రాముడికి తప్ప మరెవ్వరికీ ఆ ఉత్తర ద్వారాన్ని ఎదిరించే సామర్థ్యం లేదు. అక్కడ రాక్షసులు వాడే ఆయుధాల్ని, వాళ్ళు వేసుకునే కవచాల్ని చూశాడు.

వానర సేనానాయకుడు, పరమ పరాక్రమవంతుడు అయిన నీలుడు, మైందుడు, ద్వివిదుడు తూర్పు ద్వారం వద్ద ఎదుర్కొన్నారు. మహాబలశాలి అంగదుడు, ఋషభుడు, గవాక్షుడు, గజుడు, గవయుడు దక్షిణ ద్వారంపై దాడిచేశారు. హనుమంతుడు, ప్రజంఘతరసులు పశ్చిమ ద్వారంపై దాడిచేశాడు. ఉత్తర పశ్చిమ ద్వారాల మధ్యలో గరుత్మంతుడితోను, వాయుదేవుడితోను సమానంగా ఆకాశంలో విహరించగల సుగ్రీవుడు నిలిచాడు. అతడికి అండగా ముప్పయి ఆరుకోట్ల మంది వానర సేన నిలిచి ఉంది. రాముడు ఆజ్ఞాపించినట్లుగా ఒక్కొక్క ద్వారం వద్ద ఒక కోటి మంది వానర వీరుల్ని నియోగించారు. ఈ యాజమాన్యాన్నంతటినీ లక్ష్మణునికి, విభీషణునికి ఒప్పచెప్పాడు. వానర వీరులంతా కోరలు, గోళ్ళు ఆయుధాలుగా చేసుకొని పోరాడారు. అందుబాటులో ఉన్న బండరాళ్ళనూ, వృక్షాల్ని, చెట్టుకొమ్మల్నీ విరిచి ఆయుధాలుగా చేసుకున్నారు.

వానర వీరులందరూ కనుగుడ్లు బయటకు వచ్చేట్లుగా పెద్దవి చేశారు. కోపంతో ముఖం ఎర్రబడింది. పౌరుషంతో తోకలు నిటారుగా ఎత్తారు. ఒక్కొక్కడిదీ ఒక్కొక్క శరీర నిర్మాణం. అంతా లంకపైకి దూకటానికి, కనిపించిన రాక్షసుల్లా కోరల్తో చీల్చటమే ఏకైక లక్ష్యంగా పెట్టుకున్నారు. వాళ్ళల్లో కొందరు ఏనుగంత బలం కలిగి ఉంటే, ఇంకొందరు నూరు ఏనుగుల బలాన్ని కలిగి ఉన్నారు. మరికొందరు వెయ్యి ఏనుగుల బలంగల వాళ్ళున్నారు. కొందరి బలం అంత, ఇంత అని చెప్పటానికి వీలులేకుండా ఉంది. వానరులంతా మిడతల దండులాగా లంకా పట్టణాన్ని ముట్టడించారు.

దేవతలు కూడా ఎదిరించటానికి వీలుకాని ఆ వానర, భల్లూక సేనలన్నీ రామలక్ష్మణ

సుగ్రీవుల వెనుక అంకిత భావంతో నిలిచాయి. మేఘాలు కమ్ముకున్నట్లు, నేల ఈనినట్లు లంకాపట్టణాన్ని ముట్టడిస్తున్న వానర సేనను చూసిన రాక్షసులందరూ ఆశ్చర్యపోయారు. సముద్రమే చలియలి కట్టను తెంచుకొని వచ్చిందా? అన్నట్లు మహాధ్వని చేస్తూ లంకను ఆక్రమిస్తున్నారు. వనాలు, ప్రాకారాలు బహిర్ద్వారాలు, ప్రాసాదాలు, భవనాలు అన్నీ చలించిపోయాయి. ఏ పని తర్వాత ఏ పని చేయాలో బాగా తెలిసినవాడు, కార్యతత్త్వం ఏమిటో ఎరిగినవాడు అయిన రాముడు తన మంత్రులందరినీ సమావేశపరచి చర్చించాడు. రాజధర్మాన్ని పాటిస్తూ అంగదుణ్ణి పిలిచి ఇలా అన్నాడు.

రాముడు: "సౌమ్యుడవైన ఓ అంగదుడా! నీవు నిర్భయంగా ఆకాశమార్గాన లంకా పట్టణానికి వెళ్ళు. రావణాసురుణ్ణి కలుసుకో. అతడితో నా మాటలు యథాతథంగా ఇట్లా చెప్పు.

'ఓ రాక్షసుడా! నీవు బ్రహ్మదేవుడు ఇచ్చిన వరముల మదంతో అంధుడవైపోయి మహర్షుల్ని, దేవతల్ని, గంధర్వుల్ని, అప్సరసల్నీ, నాగుల్ని మాత్రమే కాదు, సమస్త ప్రాణికోటికీ హింసించావు. నేటితో నీ దర్పం అంతా నశిస్తుంది. నీ ఐశ్వర్యం అంతాపోతుంది. నీ రాజ్యం హరించిపోతుంది. నీ బుద్ధి పెడదోవ పెట్టింది. నీవు చావబోతున్నావు. ఓ రాక్షసుడా! నీవు ఇన్ని పాపాలు చేసినా, చివరకు నా చేతిలో చావటం వల్ల మహర్షులు, రాజర్షులు మొదలైన ఉత్తములు పోయే లోకాలకు పోతావు.

ఓ రాక్షసాధముడా! నీవు ఏ బలం చూసుకొని, నేను లేని సమయంలో నా భార్యను అపహరించుకొనివచ్చావో, ఆ బలాన్ని ఇప్పుడు నా ముందు ప్రదర్శించు. లేదా, నా సీతను సగౌరవంగా తీసుకొని వచ్చి నాకు అప్పగించు. నన్ను శరణువేడుకో. ఏదో ఒకటి త్వరగా నిర్ణయించుకో. నీవు నన్ను శరణుకోరని పక్షంలో నా వాడిబాణాలతో నిన్ను వధిస్తాను. నీ రాక్షస జాతినంతటినీ నాశనం చేసి లోకంలో రాక్షసులు లేకుండా చేస్తాను. ధర్మాత్ముడైన విభీషణుడు నన్ను శరణుకోరాడు. నేనతడికి అభయం ఇచ్చాను. ఇకపై ఆ శ్రీమంతుడే లంకకు ఆధిపత్యం వహిస్తాడు. ఇది సత్యం. నీవు పాపాత్ముడవు. ధర్మానికి హాని చేశావు. నీవు రాజుగా ఉండేందుకు

ఎంతమాత్రం యోగ్యుడవు కావు.

ఓ రాక్షసుడా! ధైర్యం ఉంటే యుద్ధానికి రా! నీ పరాక్రమాన్ని ప్రదర్శించు. నా బాణాలతో నిన్ను సంహరిస్తాను. ఆ విధంగా నీ పాపాలన్నీ ప్రక్షాళితమౌతాయి. ఒకవేళ నీవు ఏ పక్షిరూపమో ధరించి నా నుంచి తప్పించుకొని పారిపోవాలని ప్రయత్నిస్తే, నీ ఆశ అడియాసే అవుతుంది. నువ్వు ముల్లోకాల్లో ఎక్కడ ఉన్నా నా బాణాలు నిన్ను వెంటాడి చంపుతాయి. నీ రోజులు మూడాయి. ఇక నీవు బ్రతకటం కలలోని మాట. నీవు జీవించి ఉండగానే లంకాపట్టణం అంతా తిరిగి చూడు. నీకు పరలోకానికి ఉపయోగపడే శ్రాద్ధాది కర్మలు చేసుకో. నీ ప్రాణం నా చేతుల్లో ఉంది. ఇదే నీకు చివరిసారిగా అవకాశం ఇస్తున్నాను.'

ఓ అంగదుడా! ఈ నా మాటల్ని యథాతథంగా రావణాసురుడితో చెప్పు. అతడేం చెప్తాడో విని నాతో చెప్పు."

అంతట రామాజ్ఞను శిరసావహించి అంగదుడు అగ్నినక్షత్రం లాగా ఆకాశమార్గాన ఎగిరిపోయి ఒక్క ముహూర్తకాలంలో రావణాసురుడి సమక్షంలో ప్రత్యక్షం అయ్యాడు. అప్పుడు రావణుడు మంత్రులతో సమావేశమై ఉన్నాడు. అంగదుడు రావణాసురుడి ఎదుట అగ్నిహోత్రంలాగా నిలబడి ఇలా అన్నాడు.

అంగదుడు: "ఓ రాక్షసరాజా! నా పేరు అంగదుడు. నేను వాలి కుమారుడను. నా పేరు, నా తండ్రి పేరు వినే ఉంటావు. కోసలాధిపతి అయిన రాముడు పంపగా వచ్చాను. నేను ఆయన దూతను. రామప్రభువు నీకు ఈ సందేశం ఇమ్మని నన్ను పంపాడు. దాన్ని యథాతథంగా చెప్తాను విను.

'ఓ క్రూరుడా! నీవు పాపాత్ముడవు. నీకు పౌరుషం ఉంటే బయటకు వచ్చి నాతో యుద్ధం చెయ్యి. నిన్ను, నీ మిత్రుల్ని, నీ బంధువుల్నీ, నీ జ్ఞాతుల్నీ చంపడానికే నేను వచ్చాను. ముల్లోకాలల్లో నువు ఎక్కడకు పోయి దాక్కున్నా నా బాణం నిన్ను వెతికి పట్టుకొని చంపుతుంది.

నీ చావు వల్ల ముల్లోకాల్లోని ప్రాణికోటి అంతా సుఖంగా జీవిస్తారు. నీవు నా చేతుల్లో చావడం వల్ల ఉత్తమమైన పుణ్యలోకాలనే పొందుతావు. లేదా, ఇంకా జీవించాలని ఆశ ఉంటే వెంటనే వైదేహిని తీసుకొని వచ్చి నాకు అప్పగించు. నన్ను శరణు వేడుకో. అభయం ఇస్తున్నాను. ఇకపై లంకకు నీ తమ్ముడు విభీషణుడే రాజవుతాడు. నేను అతడికి ఆ విధంగా వాగ్దానం చేశాను' అని చెప్పమన్నాడు.

ఈ విధంగా అంగదుడు రాముడి సందేశాన్ని వినిపించగా, రావణాసురుడికి పట్టరానంత కోపం వచ్చింది. తన మంత్రులలో 'ఇతడిని బంధించి చంపండి' అని ఆజ్ఞాపించాడు. దాంతో నలుగురు మహాబలవంతులైన రాక్షసులు అంగదుణ్ణి పట్టి బంధించడానికి ముందుకు వచ్చారు. అంతట అంగదుడు తన బలపరాక్రమాల్ని వాళ్ళందరికీ ప్రదర్శించాలని ఆ నలుగురికీ పట్టుబడిపోయాడు. వాళ్ళు దగ్గరకు వచ్చి పట్టుకోగానే, వాళ్ళ నలుగురినీ తన చేతుల్తో అదిమిపట్టుకొని పక్షిలాగా ఆ భవనం పైకి ఎగిరిపోయాడు. అక్కడ నుండి ఆ నలుగురినీ నేలపైకి విసిరికొట్టాడు. పిమ్మట ప్రతాపవంతుడైన అంగదుడు ఆ ప్రాసాదంపైకి ఎక్కాడు. అంతట దేవేంద్రుడు వజ్రాయుధంతో పర్వత శిఖరాల్ని పిండిచేసినట్లుగా, తన పిడికిళ్ళతో, ప్రాసాద శిఖరాల్ని పగలగొట్టాడు. ఆ విధంగా ఆ భవనం అంతా ధ్వంసం చేసి సింహనాదం చేస్తూ ఆకాశమార్గాన ఎగిరి వెళ్ళిపోయాడు.

అంగదుడు ఆ విధంగా రాక్షసులందరినీ ఏడిపించి, వానరులందరినీ సంతోషపెడ్తూ రాముడి సన్నిధికి చేరుకున్నాడు. తన కళ్ళముందే, తను కూర్చున్న సౌధాన్ని ఒక వానరుడు వచ్చి, నాశనం చెయ్యటాన్ని రావణాసురుడు జీర్ణించుకోలేకపోయాడు. నిజంగానే తనకు మరణం దగ్గరపడిందా? అని మధనపడిపోయాడు. నిట్టూర్పులు విడిచాడు.

రాముడి చుట్టూ ఉన్న వానరులందరూ సంతోషం పట్టలేకపోయారు. గంతులు వేస్తూ సింహనాదాలు చేశారు. యుద్ధం చెయ్యడానికి ఉరకలు వేస్తున్నారు. అంతట పర్వతాకారుడు, మహాబలశాలి అయిన సుషేణుడు వానర వీరులతో కలసి, నక్షత్రాల్లో చంద్రుడిలాగా, లంకా

పట్టణానికి ఉన్న నాలుగు ద్వారాలు తిరిగి చూసి వచ్చాడు. లంకా పట్టణం చుట్టూ సముద్రం లాగా ఆక్రమించి ఉన్న వానర సేనల్ని చూసి రాక్షసులంతా ఆశ్చర్యపోయారు. కొందరు భయపడ్డారు. కొందరు యుద్ధం చెయ్యబోతున్నాం గదా! అని సంతోషించారు. దీనులైన రాక్షసులు ప్రాకారానికి, అగడ్తలకు మధ్య ఉన్న ప్రదేశాలు అంతా వానరులతో నిండిపోవడం చూసి హాహాకారాలు చేశారు. వాళ్ళపై ప్రాణాలు పైనేపోయాయి. భయంకరమైన కోలాహలం ప్రారంభం అయింది. వెంటనే లంకలో ఉండే రాక్షసులంతా వివిధ రకాలైన ఆయుధాలు ధరించి ప్రళయకాలపు వాయువులాగా సంచరించారు.

# 42వ సర్గ వానరులు లంకను ఆక్రమించటం

అంతట రాక్షస సైనికులు వెళ్ళి రావణునితో, రాముడు వానర సైన్యంతో పట్టణాన్ని ముట్టడించాడని చెప్పారు. నగర రక్షణకు మరికొన్ని రక్షణ ఏర్పాట్లు చేసి తాను అంతఃపుర సౌధం పైకి ఎక్క నగరం అంతా పర్యవేక్షించాడు. ఎటుచూసినా యుద్ధం చెయ్యటానికి ఉత్సాహంగా ఉరకలు వేస్తున్న వానర సమూహాలే కనిపించాయి. వాళ్ళందరి చేతుల్లో రాళ్ళు, చెట్ల కొమ్మలు, వృక్షాలే ఆయుధాలుగా పెట్టుకున్నారు. ఈ వానరులను సమూలంగా నాశనం చెయ్యటం ఎట్లాగా? అని దీర్ఘంగా ఆలోచించాడు.

రాముడు ఉత్సాహంగా తన వానర సైన్యాలతో లంకా ప్రాకారాన్ని నలుమూలలా తిరిగి చూశాడు. పట్టణం అంతా పతాకాలతోను ధ్వజాలతోను శోభాయమానంగా ఉండటం చూశాడు. ఇంతలో సీతాదేవి జ్ఞాపకానికి వచ్చింది. లేడి కన్నుల వంటి కన్నులు గల నా సీత దుఃఖీస్తూ కటిక నేలపై పడి ఉంటుంది గదా? అని విచారపడ్డాడు. తననే నిరంతరం ధ్యానించే ఆమెను రాక్షస స్త్రీలు ఎన్ని బాధలు పెడ్తున్నారో గదా? అని చింతించాడు. తరువాత లంకా పట్టణాన్ని ఆక్రమిస్తున్న వానర యోధులకు తగు విధంగా సూచన లివ్వసాగాడు.

రాముడు ఆజ్ఞలను స్వీకరించి వానర సేనలన్నీ రెట్టింపు ఉత్సాహంతో సింహనాదాలు చేస్తూ లంకా నగరాన్ని ముట్టడించాయి. వాళ్ళ చేతుల్లో పెద్ద పెద్ద బండరాళ్ళున్నాయి. వేళ్ళతో సహా పీక్కొచ్చిన మహావృక్షాలున్నాయి. కొందరు పెద్ద పెద్ద చెట్ల కొమ్మల్ని పట్టుకున్నారు. ప్రాకారాలన్నింటినీ పిండి పిండిగా చేసి లంకా పట్టణ ప్రవేశానికి మార్గం చేసుకోవాలని వాళ్ళ ఆలోచన.

రావణాసురుడు తన భవనం పైకి వెళ్ళి లంకా నగరాన్నంతా కలయచూశాడు. పర్వతాలపైన, ఉద్యానవనాల్లో, అరణ్యాల్లో, ఎక్కడ చూసినా అశేషంగా వానర సేనలతో నిండిపోవడం రావణుడు చూశాడు. వీళ్ళంతా భూమిని కబళించేస్తున్నారా? అన్న అనుమానం

కలిగింది. ధైర్యం తెచ్చుకున్నాడు. వానర సైన్యాలన్నింటినీ సమూలంగా నాశనం చెయ్యమని రాక్షసులను ఆదేశించాడు.

రావణాసురుడు అట్లా చూస్తూ ఉండగానే వానర సైన్యాలన్నీ భాగాలుగాను, విభాగాలుగాను విభజించుకొని ప్రాకారం పైకి ఎగబ్రాకడం మొదలుపెట్టారు. అంత ఎత్తైన ప్రాకారం పైకి ఎక్కడానికి తమ ప్రాణాల్నైనా లెక్కచేయకుండా రామకార్యం కోసం సాహసించారు. వాళ్ళు పైకి ప్రాకటమే కాకుండా చేతుల్లో పెద్ద పెద్ద వృక్షాలు, కొమ్మలు, పెద్ద పెద్ద రాళ్ళు పట్టుకొని మరీ ప్రాకుతున్నారు. బహిర్ద్వారాల దగ్గరకు చేరిన వానరులు ద్వారాల్ని చేతిపిడికిళ్ళతోను, రాళ్ళతోను పగలగొట్టారు. వృక్షాలతోను, పెద్దపెద్ద కొమ్మల్తోను ద్వారాల్ని పొడిచారు. ప్రాకారానికి అడ్డుగా ఉండే కందకాలన్నీ నీటితో నిండి ఉన్నాయి. వాటన్నింటినీ గడ్డితోను, మన్నుతోను, రాళ్ళతో చెట్ల కొమ్మల్తోను పూడ్చివేశారు. అంతట వానరవీరులు వెంటరాగా, య్యూధపతులు ప్రాకారాల మీదకు ఎక్కారు.

పర్వతాల్లాంటి వానరయోధులంతా బంగారు బహిర్ద్వారాలను పగులగొట్టారు. కైలాస శిఖరాల్లాంటి ఆ ద్వారాలను పగులగొడ్తూ ఉంటే వానర సేనలంతా గంతులు వేశారు; కేకలు పెట్టారు; సింహనాదాలు చేశారు. ప్రాకారాన్ని ఆక్రమించిన వానర సైన్యం అంతా 'రాముడికి జయం, లక్ష్మణుడికి జయం, సుగ్రీవుడికి జయం' అంటూ జయజయ ధ్వానాలు చేసింది. సముద్రానికే వారధి కట్టిన వారికి కందకం పూడ్చడం ఒక లెక్క? మహాబలుడైన నలుడు వానరవీరులతో ప్రాకారాన్ని పగులకొట్టడం ప్రారంభించారు. వానర సైన్యాలన్నింటికీ ఆ ప్రాకారాలపైనే ఉండేందుకు తగిన వసతులన్నీ ఏర్పాటు చేశాడు.

కుముదుడు కూడా పది కోట్లమంది వానరవీరుల్ని వెంటబెట్టుకొని తూర్పు ద్వారాన్ని ముట్టడించాడు. ప్రభసుడు, పనసుడు మున్నగు వానరయోధులంతా కుముదుణ్ణి అనుసరించి వెళ్ళారు. అట్లాగే శతబలి ఇరవై కోట్ల మంది వానరయోధుల్ని వెంటబెట్టుకొని దక్షిణ ద్వారాన్ని ముట్టడించాడు. మహాబలశాలి, తార తండ్రి అయిన సుషేణుడు కోటికోట్ల మంది వానర వీరుల్ని

వెంటబెట్టుకొని పశ్చిమ ద్వారాన్ని ముట్టడించాడు.

రామలక్ష్మణులు, సుగ్రీవుడితో కలసి ఉత్తర ద్వారాన్ని ఢీకొన్నారు. గద పట్టుకొని మహావీరుడైన విభీషణుడు కూడా రాముడి ప్రక్కన అండగా నిలచాడు. మహాకాయుడు, భయంకరుడు, గోలాతి గోలుడూ అయిన గవాక్షుడు ఒక కోటిమంది వానర వీరులతోను, శత్రు విధ్వంసకుడైన ధూమ్రుడు కోటిమంది భల్లూకాలను వెంటబెట్టుకుని రాముని వెంట నిలచాడు. గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడూ, గంధమాదనుడు నలువైపులకూ పోయి చూస్తూ వానరసేనల్ని పర్యవేక్షిస్తున్నారు.

మహాసాగరంలాగా పొంగి పొరలిపోతూ నాలుగు దిక్కుల నుండి వస్తున్న వానర సేనల్ని చూసిన రావణాసురుడికి కోపంతో ఒళ్ళంతా ఒణికిపోయింది. వానరులు నగరం లోపలకు చొచ్చుకొని రావటం చూశాడు. ఇక తన సైన్యాన్ని ప్రాకారాల నుండి బయటకుపోయి వానరుల్ని ఎదుర్కోమని ఆదేశించాడు. వెంటనే రాక్షసులంతా భయంకరంగా సింహనాదాలు చేస్తూ చంద్రుని వంటి తెల్లటి భేరీలను బంగారు దండాలతో నలుమూలలూ పిక్కటిల్లేట్లుగా మ్రోగించారు. ఆ భేరీనాదాలు విన్న రాక్షస వీరులు శంఖాలు పూరించాడు. అలా శంఖాలు పూరిస్తున్న నీలాంగులు, నిశాచరులు మేఘాల మధ్యలో కనిపించే కొంగల్లా బారులుగా కనిపించారు. రాక్షస సైన్యం కూడా సముద్రం కట్టలు తెంచుకున్నాదా? అన్నట్లు వానరులపైపడింది.

వానరుల సింహనాదాలు, రాక్షసుల సింహనాదాలు, రాక్షసుల భేరీనాదాలు, శంఖ దుందుభుల ఘోషతో, ఏనుగుల ఘీంకారాలతోను, గుర్రాల సకిలింపులతో, రథచక్రాల చప్పుళ్ళతో, భూమ్యాకాశాలు బద్దలైపోయాయి. మునుపు ఎన్నడో జరిగిన దేవదానవ యుద్ధాన్ని తలపింపజేసింది. మహాసంగ్రామం ఆరంభం అయింది.

రాక్షసులంతా తమ ప్రతాపాలను గుర్తుచేసుకుంటూ తళతళా మెరిసిపోయే

శూలాలతోను, శక్తి ఆయుధాలతోను, గదలతోను, గండ్రగొడ్డళ్ళతోను వానరుల్ని చావగొట్టారు. వానరులు రాక్షసుల్ని కొట్టారు. అంతేకాకుండా వానరులు రాక్షసుల పైకి దూకి పళ్ళతో పీకారు; గోళ్ళతో రక్కారు. చెట్లకొమ్మల్ని విసిరేశారు. ఇట్లా చేస్తూ సుగ్రీవ మహారాజుకు జై! అంటూ జయజయ ధ్వానాలు చేశారు. ప్రాకారాలపై నుండీ రాక్షసులు నేలపై ఉన్న వానరుల్నీ శూలాలతోను, ఖడ్గాలతోను పొడిచారు. దాంతో కోపగించిన వానరయోధులు ఒక్క గంతులో ప్రాకారంపైకి ఎగిరి, అక్కడున్న రాక్షసుల్ని కిందకు పడదోశారు.

ఆ విధంగా వానరులకు, రాక్షసులకూ జరిగిన పోట్లాటలో నేలంతా రక్తంతో తడిసింది. మాంసం ముద్దలు ముద్దలుగా పడి నేలంతా బురద అయిపోయింది.

# 43వ సర్గ వానరుల –రాక్షసుల మధ్య ద్వంద్వ యుద్ధం

మహాబలశాలురైన వానరులు రాక్షసులు భీకరంగా పోరు సాగించారు. వానరులు తమతో సమానంగా పోట్లాడటం సహించలేని రాక్షసులు రావణాసురుడికి జయజయ ధ్వానాలు చేశారు. బంగారు శిరోభూషణాలు ధరించినవారు, అగ్నిహోత్రంలాగా తేజోవంతమైన రథాలలో రమణీయమైన కవచాలు ధరించి, దశదిశలందూ ప్రతిధ్వనించేట్లుగా జయజయ ధ్వానాలు చేస్తూ వానర సైన్యాన్ని ఎదిరించారు. వాళ్ళంతా కామరూపులైన రాక్షసులు; కామరూపులైన వానరులను ఎదిరించడంతో గొప్ప ద్వంద్వయుద్ధం ప్రారంభమయింది.

గొప్ప తేజస్సు గల ఇంద్రజిత్తు వాలి పుత్రుడైన అంగదుడితో తలపడ్డాడు. వాళ్ళిద్దరి యుద్ధం అంధకాసురుడు శివునితో యుద్ధం చేయటాన్ని తలపింపజేసింది. సంపాతి అనే భయంకరమైన వానరయోధురు ప్రజంఘునితో తలపడ్డాడు. హనుమంతుడు జంబుమాలితో ద్వంద్వయుద్ధానికి దిగాడు. విభీషణుడు మహావేగవంతుడైన శత్రుఘ్నునితో తీవ్రంగా పోరాడాడు. బలాఢ్యుడైన గజుడు తపసుడు అనే రాక్షసుడితో యుద్ధం చేశాడు. నీలుడు నికుంభునితో తలపడ్డాడు. వానర రాజైన సుగ్రీవుడు ప్రఘసుడితోను, శ్రీమంతుడైన లక్ష్మణుడు విరూపాక్షుడితోను యుద్ధానికి దిగారు. ఎదిరింప శక్యం కానివాడైన అగ్నికేతువు, రస్మికేతువు, మిత్రఘ్నుడు, యజ్ఞకోపుడు అనేవాళ్ళ నలుగురూ రాముణ్ణి ఎదిరించారు. వజ్రముష్టి మైందుని, అశనిప్రభుడు ద్వివిదుడిని, ఎదుర్కొన్నారు. భయంకరుడైన ప్రతపనుడు అనే రాక్షసయోధుడు నలుడితో యుద్ధం చేశాడు. యముని పుత్రుడు, మహాబలశాలి వానరశ్రేష్ఠుడు అయిన సుషేణుడు విద్యున్మాలితో తలపడ్డాడు. భయంకరమైన ఇతర వానరులందరూ రాక్షస వీరులతో ద్వంద్వయుద్ధం చేశారు.

అప్పుడు జయాన్నే కోరుకునే రాక్షసులు, వానరులు చేస్తున్న గొప్ప యుద్ధం చూసేవాళ్ళకు రోమాంచమును కలిగించింది. రక్తం ఏరులై పారింది. ఆ రక్తప్రవాహంలో రోమాలు

గడ్డివాముల్లాగా తేలాయి. శరీరాలు ఎండుకట్టెల్లాగా కొట్టుకుపోయాయి.

కోపించిన ఇంద్రజిత్తు శత్రుసైన్యాన్నంతా చీల్చిచండాడాడు. అంగదుణ్ణి గదతో, దేవేంద్రుడు వజ్రాయుధంతో కొట్టినట్లు, కొట్టాడు. అంతట అంగదుడు కోపంతో ఇంద్రజిత్తు ఎక్కిన రథాన్ని, విరగ్గొట్టి, రథసారథిని చంపాడు.

ప్రజంఘుడు వేసిన మూడు బాణాలతో సంపాతిని కొట్టాడు. సంపాతి తిరిగి మద్ది చెట్టుతో కొట్టి ప్రజంఘుని చంపేశాడు. మహాబలశాలి అయిన జంబుమాలి తన రథంపై నుండి తీవ్రమైన బాణాన్ని హనుమంతుడి వక్షఃస్థలంపై కొట్టాడు. ఆ బాణం వక్షఃస్థలం పగిలిపోయిందా? అన్నంత తీవ్రంగా తగిలింది. అంతట వాయుపుత్రుడైన హనుమంతుడు జంబుమాలి రథాన్ని ఎక్కి పిడికిలితో గుద్ది ఆ రాక్షసుణ్ణి అతడి రథాన్ని కూడా నేలకూల్చాడు. భయంకరుడైన ప్రతపనుడు గర్జిస్తూ నలుడి మీదకు లంఘించాడు. అప్పుడు నలుడు వాడి రెండు కనుగుడ్లు ఊడబెరికి అవతల పారేశాడు. ప్రఘసుడు తన చేతి పనితనం అంతా చూపిస్తూ వాడి అయిన బాణాలను వదలుతూ మీదమీదకు రావడం చూసిన సుగ్రీవుడు సప్తవర్ణ వృక్షంతో కొట్టి అతణ్ణి చంపాడు. చూడడానికే భయంకరంగా ఉన్న విరూపాక్షుణ్ణి బాణవర్షం కురిపించి లక్ష్మణుడు సంహరించాడు.

అగ్నికేతువు, రశ్మికేతువు, మిత్రఘ్నుడు, యజ్ఞకోపుడూ అనే నలుగురు రాక్షసులు రాముడిపై బాణాలు వదిలారు. రాముడు వారిపై అగ్నిజ్వాలల వంటి బాణాల్ని వదలి ఆ నలుగురి శిరస్సులూ తెగ్గొట్టాడు. మైందుడు పిడికిలితో పొడవగా వజ్రముష్టి అనే రాక్షసుడు అక్కడికక్కడే చచ్చిపోయాడు. వజ్రముష్టి గుర్రాలు, రథం కూడా మైందుడి పిడికిలి పోట్లతో కోటబురుజుల్లాగా నేలకూలాయి. నికుంభుడు నల్లగా కాటుక కొండలాగా ఉండే 'నీలుడి' పైన నూరు బాణాలు వదిలాడు. నీలుడు వాటన్నింటినీ నవ్వుతూ గ్రహించి నికుంభుడి శిరస్సును, విష్ణు భగవానుడు చక్రంతో నరికినట్లు, నరికాడు. తరువాత వాడి రథాన్ని కూల్చి ఆ రథచక్రంతో సారథిని కూడా చంపాడు. వజ్రకాయుడైన ద్వివిదుడు రాక్షసులంతా చూస్తూ ఉండగా అశనిప్రభుణ్ణి మొనలు

తేరిన పర్వతం లాంటి బండరాయితో కొట్టాడు. అంతట అశనిప్రభువు తేరుకొని ద్వివిదుడిపై బాణాల వర్షం కురిపించాడు. దాంతో ద్వివిదుడి ఒళ్ళంతా గాయాలయ్యాయి. ద్వివిదుడు తన శరీరంపై అయిన గాయాల్ని చూసుకొన్నాడు. ఎక్కడ లేని కోపం ముంచుకొచ్చింది. అంతట ద్వివిదుడు మద్దిచెట్టుతో అశనిప్రభుణ్ణి కొట్టి చంపాడు; వాడి రథాన్ని విరగ్గొట్టాడు. గుర్రాన్ని, సారథిని చంపేశాడు. విద్యున్మాలి బంగారు ములుకులున్న బాణాల్ని సుషేణుడిపైన వదిలాడు. అంతట కోపోద్రిక్తుడైన ఆ వానరోత్తముడు సుషేణుడు, పెద్దరాయి నొకదాన్ని తీసుకొని విద్యున్మాలి రథంపై విసిరికొట్టాడు. ఆ దెబ్బకు రథం విరిగిపడింది. అంతట విద్యున్మాలి గద తీసుకొని సుషేణుడిపై తలపడ్డాడు. సుషేణుడు వాడి చేతిలో గదను చూసి పెద్ద రాయి ఎత్తి కొట్టబోతూ ఉండగా విద్యున్మాలి గదతో సుషేణుడి వక్షఃస్థలంపై గట్టిగా కొట్టాడు. సుషేణుడు ఆ గదాఘాతాన్ని లెక్కచెయ్యకుండా పెద్ద బండరాయిని ఎత్తి విద్యున్మాలి వక్షఃస్థలానికేసి కొట్టాడు. ఆ దెబ్బను తట్టుకోలేక విద్యున్మాలి అక్కడికక్కడే ప్రాణాలు విడిచాడు.

ఆ విధంగా వానర రాక్షసుల మధ్య భీకరమైన ద్వంద్వయుద్ధం జరిగింది. చాలామంది రాక్షసులు చచ్చిపడ్డారు. విరిగిన ఖడ్గాలు, గదలు శక్తి, పట్టిసాలు, తామర ఆయుధాలు ముక్కలైపోయి కుప్పలుగా పడి ఉన్నాయి. విరిగి పడిపోయిన రథచక్రాలు, చచ్చిపడిపోయిన ఏనుగులు, చచ్చిపడిన వానర, రాక్షస దేహాలతో రణరంగం అంతా భయంకరంగా తయారైంది. చనిపోయిన కళేబరాలకోసం నక్కలు గుంపులు గుంపులుగా చేరాయి. తలలు విడిపోయిన వానర, రాక్షస వీరుల మొండాలు చెల్లాచెదరుగా పడి ఉన్నాయి.

అటువంటి భీకర సమయంలో ఇరుపక్షాల వారూ సూర్యాస్తమయాన్ని కాంక్షిస్తూ మళ్ళీ యుద్ధం చెయ్యడానికి సిద్ధం అయ్యారు.

# 44వ సర్గ ఇంద్రజిత్తు మాయలు

ఆ విధంగా వానరులు, రాక్షసులు ఒకరి ప్రాణాలు మరొకరు తీసుకుంటూ మహాసంగ్రామం జరుగుతూ ఉండగా సూర్యాస్తమయం అయింది. అప్పుడు పరస్పరం ఒక్కళ్ళనొకళ్ళు జయించాలనే తీవ్రమైన కోరికతో రాత్రి యుద్ధానికి సిద్ధమయ్యారు. ఆ గాఢాంధకారంలో ఎవరు ఎవరితో యుద్ధం చేస్తున్నారో తెలియటం లేదు. 'నీవు రాక్షసుడవు' అంటూ వానరులు వానరుల్నే చంపటం మొదలుపెట్టారు. అట్లాగే రాక్షసులు కూడా, 'నీవు వానరుడవు' అంటూ రాక్షసుల్నే చంపసాగారు. ఆ కారుచీకట్లో "రా" "చంపు", "చీల్చు" అంటూ కేకలు వేసుకుంటూ గందరగోళంగా యుద్ధం చేశారు. బంగారు కవచాలు ధరించిన రాక్షసులు ధాతువులతో నిండిన పర్వతాల్లా కనిపించారు. రాక్షసులు చేతికందిన వానరుల్నల్లా నమిలివేశారు. అప్పుడు వానరులు ఎగిరి గుర్రాలపై కూర్చున్న రాక్షసులపైకి, ఏనుగులపై కూర్చున్న రాక్షసులపైకి ఎగిరి వాళ్ళను కోరలతో పీకి, గోళ్ళతో రక్కుతున్నారు. వాళ్ళ ధ్వజాల్ని విరగ్గొట్టారు. ఆ విధంగా వానరులు రాక్షస సేనల్ని చీల్చిచండాడుతూ ఉంటే, రామలక్ష్మణులు కనిపించిన రాక్షసుణ్ణి, కనిపించని వారినీ కూడా తమ బాణాలతో చంపసాగారు. గుర్రాల డెక్కలనుండి, రథచక్రాల నుండి రేగిన దుమ్ముతో కన్నులకు ఏమీ కనపించకుండాపోయింది. ఆ రాత్రి అంతా ఒళ్ళు గగుర్పొడిచేట్లుగా, ఏం జరుగుతుందో తెలుసుకోలేనంతగా యుద్ధం సాగింది. ఎవరికి ఎవరూ తీసిపోలేదు. రక్తం ఏరులైపారింది.

అక్కడంతా భేరీమృదంగ నాదాలతో నిండిపోయింది. రాక్షసులు, వానరులు కొట్టుకుంటూ అరిచే అరుపులు, దెబ్బతిని పడిపోయిన వాళ్ళ మూలుగులు, ఘోరంగా వినిపిస్తున్నాయి. వానరుల్ని చంపేందుకు రాక్షసులు శక్తి ఆయుధాల్ని, శూలాల్ని, గండ్రగొడ్డళ్ళన్నీ నిరాఘాటంగా వాడారు. కామరూపులైన రాక్షసుల్ని చంపేందుకు వానరులంతా పెద్దపెద్ద రాళ్ళను, చెట్లను, చెట్లకొమ్మల్నీ వాడారు. ఆ యుద్ధ భూమిలో పడిపోయిన ఆయుధాలు, చెట్లూచేమలూ, రాళ్ళూ అన్నీ భూమాతను పూజించిన పుష్పాల్లాగా కనిపించాయి. రక్తమాంసం

మట్టితో కలిసి బురద అయిపోయి కాలుపెడితే జర్రున జారిపడేట్లుంది. ఎవరు చచ్చిపోయారో కూడా తెలుసుకోలేనంత బీభత్సంగా తయారైంది. వానరులు, రాక్షసులు కోకొల్లలుగా చచ్చిపడ్డ ఆ రాత్రి కాళరాత్రే అయింది. ఎంతసేపటికీ తెల్లవారలేదు. ఆ కారుచీకట్లలో, రాక్షసులు రాముడిపై బాణాల వర్షం కురిపించారు. రాముడు కూడా ఎదురు దాడిగా వారిపై బాణాల్ని గుప్పించాడు. దెబ్బలు తిన్న వాళ్ళ ఆక్రందనలు, సింహనాదాలు, వారివారి పక్షాన చెప్పే జయజయ ధ్వానాలు అంతా కలసి ప్రళయకాలంలో సప్తసముద్రాల మహాధ్వనిని తలపింపజేసింది. ఆ చీకట్లోనే రాముడు అగ్నిజ్వాలల వంటి బాణాల్ని ఆరింటిని వదిలాడు. ఆ ఆరు బాణాలు మహోదరుడు, మహాపార్శ్వుడు, యజ్ఞశత్రుమా, శుకసారణులు, వజ్రదంష్ట్రుడు అనే ఆరుగురి మర్మస్థానాల్లో తగిలి హాహాకారాలు చేస్తూ యుద్ధరంగం నుండి పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నారు. అంతట రాముడు బంగారు ములుకులు గల అగ్నిజ్వాలాల వంటి బాణాల్ని నలుదిక్కులా విచ్చలవిడిగా కురిపించాడు. ఆ బాణాల వాతపడ్డ వాళ్ళంతా అగ్నిహోత్రంలో పడ్డ మిడతల్లాగా మాడిపోయారు. రాముడు వదిలిన బంగారు ములుకుల బాణాలు శరత్కాల చీకట్లో మిణుగురు పురుగుల్లాగా కనిపించాయి. ఆ కాళరాత్రి ఇరుపక్షాలవాళ్ళు చేసే సింహనాదాల మహాధ్వనితో, త్రికూట పర్వతమే పెద్దగా అరుస్తోందా? అన్నట్లనిపించింది. ఒక వంక కామరూపులైన రాక్షసులు వానరుల్ని పట్టుకొని భక్షిస్తూ ఉంటే, మరోప్రక్క గోలాంగ వానరవీరులు రాక్షసుల్ని పట్టుకొని పీక్కుతింటున్నారు.

అప్పుడు అంగదుడు ఇంద్రజిత్తుపై దాడిచేస్తూ రథంపై పడి గుర్రాల్నీ, సారథినీ చంపేశాడు. రథాన్ని ముక్కలు ముక్కలుగా నాశనం చేశాడు. ఇంద్రజిత్తు రథంలో నుండి అప్పటికప్పుడే అంతర్ధానమయ్యాడు. ఇంద్రజిత్తు మహాపరాక్రమశాలి. అటువంటి ఇంద్రజిత్తు యుద్ధంలో నుండి పరాజితుడు కావడంతో రామలక్ష్మణులు సంతోషించి అంగదుణ్ణి అభినందించారు. విభీషణుడు, సుగ్రీవుడు మున్నగు వారంతా అంగదుణ్ణి ఎంతగానో మెచ్చుకున్నారు. వానరవీరులంతా 'భలే భలే' అని కేకవేశారు.

ఇంద్రజిత్తు అంగదుడు చేసిన క్రూరమైన పనికి కృద్ధుడయ్యాడు. రామలక్ష్మణులు మొదలు వానర పక్షం అంతా అంగదుణ్ణి పూజించడం ఇంద్రజిత్తు జీర్ణించుకోలేకపోయాడు. దానికి నూరింతలుగా ప్రతీకారం చెయ్యాలనుకున్నాడు. రాముడు, విభీషణుడు ఇదంతా గమనించారు. వానరవీరులందరినీ ముఖ్యంగా అంగదుణ్ణి జాగ్రత్తగా ఉండమని వారించారు. "ఓ వానర వీరులారా! ఈ ఇంద్రజిత్తు బ్రహ్మదేవుడి నుండి అనేక వరాలు పొందాడు. ముల్లోకాల్నీ ఏడిపిస్తున్నాడు. యుద్ధంలో అంతర్ధానం అయిపోయాడు. మన కంటికి కనపడకుండా మనపై దాడి చేస్తాడు. కాబట్టి మనమంతా అప్రమత్తులమై ఉండాలి. ఏమైనా వాడికి కాలం తీరిపోయింది" అన్నారు. ఇట్లా అంటూ ఉండగానే ఇంద్రజిత్తు రామలక్ష్మణులపైన బాణాలను వదిలాడు. అతడు మాయావి కాబట్టి, ఎవరికంటా పడకుండా మాయాయుద్ధానికి దిగాడు. ఆ మాయాయుద్ధంలోనే రామలక్ష్మణులిద్దర్నీ నాగపాశంతో బంధించాడు. దాంతో వాళ్ళిద్దరూ ఒళ్ళు తెలియకుండా పడిపోయారు. రామలక్ష్మణులతో ఎదుట పడి యుద్ధం చెయ్యలేక ఈ విధంగా మాయాయుద్ధం చేసి వాళ్ళిద్దర్నీ నాగపాశం చేత బంధించి కట్టి పడేశాడు.

# 45వ సర్గ రామలక్ష్మణులు నాగపాశబద్ధులవటం

యుద్ధంలో నుండి ఉన్నట్లుండి అంతర్ధానమైన ఇంద్రజిత్తు ఎక్కడ ఉన్నాడో వెతికి పట్టుకోమని రాముడు పదిమంది వానర సేనాపతుల్ని ఆదేశించాడు. రామాజ్ఞను శిరసావహించిన అంగదుడు, నీలుడు, శరభుడు, వినతుడు, జాంబవంతుడు, సానుప్రస్థుడు, ఋషభుడు, ఋషభస్కంధుడు, సుషేణుడి ఇద్దరు పుత్రులు కలిసి ఇంద్రజిత్తును వెదికేందుకు రెట్టించిన ఉత్సాహంతో ఆకాశంలో నలుదిక్కులా వెదకసాగారు. వానరులంతా తన కోసం ఆకాశంలో వెదకటం ఇంద్రజిత్తు చూశాడు. వాళ్ళందర్నీ అడ్డగించేందుకు వాళ్ళపై మంత్రించిన బాణాల్ని వదిలాడు. అంతటితో అతడి కోపం చల్లారలేదు. రామలక్ష్మణులపై ఎక్కడా సందు లేకుండా నాగపాశాల్ని ప్రయోగించాడు. బాణరూపంలో ఉన్న మంత్రపూర్వకమైన పాములకు వాళ్ళిద్దరూ కట్టుపడిపోయారు. వారి దేహం అంతా గాయాలయ్యాయి. గాయాల నుండి రక్తం కారుతోంది. ఒంటి నిండా రక్తం కారుతున్న ఆ రామలక్ష్మణులిద్దరూ విరగబూసిన మోదుగ చెట్లలాగా కనిపించారు. కాటుక కొండ వంటి ఇంద్రజిత్తు కళ్ళుమాత్రమే ఎర్రగా కనపడుతున్నాయి. అప్పుడు ఇంద్రజిత్తు రామలక్ష్మణులతో ఇలా అన్నాడు.

ఇంద్రజిత్తు: "ఓ రామలక్ష్మణుల్లారా! నేను అంతర్ధానమై యుద్ధం చేస్తూ ఉంటే, ఇంద్రుడైనా నన్ను పట్టుకోలేడు. ఇక నీవు పంపిన ఆ వానరుల మాట వేరే చెప్పాలా? మీరంతా నాకు కోపం తెప్పించారు. అందువల్ల మీ ఇద్దరూ నా కోపాగ్నికి గురి అయ్యారు. ఇప్పుడు మిమ్మల్ని రెక్కలు కట్టిన బాణాలతో ముంచి ఎత్తాను. ఇక మీరు యమ సదనానికి ప్రయాణం కండి." ఇలా చెప్పి నాగపాశాలచే బంధించబడి ఉన్న వారిపై మళ్ళీ బాణాల్ని గుప్పించాడు. ఆ విధంగా రామలక్ష్మణుల ఆయువుపట్ల పై ప్రయోగించి వాళ్ళిద్దర్నీ విపరీతంగా బాధించాడు. క్షణాల్లో రామలక్ష్మణులకు కళ్ళు కనిపించకుండా నేలపై పడిపోయారు. అంతట ఇంద్రజిత్తు దిక్కులు దద్దరిల్లేట్లుగా నారి సారించాడు. పెద్దగా అరిచాడు.

మహాధనుర్ధారులు, మహావీరులు, రాజకుమారులైన రామలక్ష్మణులు పూర్తిగా తూట్లు పడిపోయాయి. రక్తం కారిపోతోంది. ఆయువుపట్టులో కూడా దెబ్బలు తగిలాయి. నిలవలేక వీరశయనంపై (యుద్ధభూమిలో వీరులు నేలపై పడి ఉండటాన్ని కవులు వీరశయనం అని అంటారు) పడి ఉన్నారు. ఒళ్ళంతా నెత్తురు కారుతూ ఉంటే బాధలో మూలిగారు. ఇంద్రజిత్తు బాణాలు వారి శరీరాల్లో చేతి వేళ్ళ కొనలతో సహా అన్ని భాగాల్లోనూ దూసుకుపోయాయి.

కామరూపుడు, క్రూరాత్ముడు అయిన ఇంద్రజిత్తు వేసిన బాణాలతో రామలక్ష్మణుల శరీరం నుండి రక్తం, ప్రస్రవణ పర్వతంపై నుండి పారే జలప్రవాహంలాగా, ఏరులైపారింది. దేవేంద్రుణ్ణే పడగొట్టిన ఆ ఇంద్రజిత్తు బాణాలు ముందుగా రాముడి మర్మస్థానాల్లో తగిలి రాముడే ముందుగా పడిపోయాడు. ఆ నాగపాశాలనే బాణాలు రాముణ్ణి కదలకుండా, మెదలకుండా చేశాయి. అటుపిమ్మట ఇంద్రజిత్తు, బంగారు పింజలతో వాడి అయిన ములుకులతో పై నుంచి కిందకు దూకే బాణాలతోనూ, వంకరటింకర్లు లేకుండా గుండ్రంగా ఉండే 'నారాచ' అనే బాణాలతోను, గండ్రగొడ్డళ్ళ వంటి బాణాలతోను, చేమోడ్పు వంటి బాణాలతోను, అర్ధచంద్రాకారపు బాణాలతోను రాముణ్ణి కొట్టాడు. రాముడి పిడికిలి పట్టు బిగుసుకుపోయింది; బంగారు ధనుస్సు ఇంకా చేత్తోనే పట్టుకున్నాడు. సంధించి ఎక్కుపెట్టిన బాణం అట్లాగే నిలబడిపోయింది; ఆ ధనుస్సుతోపాటు రాముడు నేలకొరిగిపోయాడు. ఆ విధంగా నాగాస్త్రానికి కట్టుబడిపోయి, శరీరం అంతా గాయాలతో నిండిపోయి, యుద్ధభూమిలో వీరశయనంపై పడివున్న ఆ పురుషోత్తముణ్ణి, తన అన్నగారైన రాముణ్ణి లక్ష్మణుడు అరమోడ్పు కన్నులతో చూశాడు. 'ఇక బ్రతకం' అని అనుకున్నాడు. అట్లా నాగపాశ బద్ధులై నేలమీదపడి ఉన్న ఆ రామలక్ష్మణులను చూస్తూ వానరోత్తములంతా వలవలా ఏడ్చారు.

# 46వ సర్గ విభీషణుడు సుగ్రీవునికి ధైర్యం చెప్పటం

ఇంద్రజిత్తును వెతికేందుకు వెళ్ళిన వానరోత్తములంతా ఆకాశంలోను, భూమిపైనా వెతుకుతూ ఉండగా, బాణాల్తో ఒళ్ళంతా గాయాలై నేలపై పడివున్న రామలక్ష్మణుల్ని చూశారు. మేఘం వర్షం కురిసి తను చేయదలచుకున్నది చేసినట్లుగా, ఇంద్రజిత్తు కూడా తను అనుకున్న పని పూర్తి చేసుకొనిపోయాడు. అప్పుడు విభీషణుడు, సుగ్రీవుడు కూడా రాముడు పడి ఉన్న చోటుకు వచ్చారు. ఇంతలోనే హనుమంతుడు, నీలుడు, మైందుడు, ద్వివిదుడు, సుషేణుడు, కుముదుడు, అంగదుడు కూడా అక్కడకు వచ్చారు. రామలక్ష్మణులున్న స్థితి చూసి వాళ్ళందరికీ ఏడుపొచ్చింది. ఒళ్ళంతా గాయాల్తో నిశ్చేష్టులై ఉన్నారు. మాటిమాటికీ నిట్టూర్పులు విడుస్తున్నారు. వాళ్ళలో ఉండే పరాక్రమం అంతా మాయమైపోయింది. ఒళ్ళంతా ఎక్కడ చూసినా నెత్తురే. పడిపోయిన బంగారు ధ్వజాల్లా నిశ్చేష్టులై ఉన్న రామలక్ష్మణుల చుట్టూ వానరయోధులంతా మూగారు. రామలక్ష్మణులు యుద్ధం చేస్తుండగానే వాళ్ళంతా ఆకాశంలో ఇంద్రజిత్తు కోసం తెగ గాలించారు. కానీ అతడి మాయాబలంచేత ఎవరూ కనుక్కోలేకపోయారు. అందులో ఏ ఒక్కరి కంటపడ్డా వాణ్ణి ప్రాణాల్తో వదిలేవాళ్ళేకాదు. మాయం అయిపోయిన వాళ్ళను కనుక్కునే రాక్షసమాయలు తెలిసిన విభీషణుడు తన అన్న కొడుకైన ఇంద్రజిత్తును చూశాడు.

అంతట ఇంద్రజిత్తు రామలక్ష్మణులు నేలమీదపడి ఉండటం చూసి చాలా సంతోషించాడు. రాక్షస వీరులందరితోను “ఓ రాక్షస వీరులారా! జనస్థానంలో ఖరదూషణాదుల్ని చంపిన అన్నదమ్ములిద్దర్నీ నా బాణాలతో చంపేశాను. మహాబలవంతులమని మిడిసిపడిపోయారు. ఇప్పుడు నా పరాక్రమం ముందు నేలకొరిగారు. దేవతలంతా ఏకమై వచ్చినా, మహర్షు లంతా తలక్రిందులుగా తపస్సు చేసినా నాగపాశబంధాల నుండి ఈ రామలక్ష్మణుల్ని విడిపించలేరు. ఈ రాముడు వల్ల నా తండ్రికి మనశ్శాంతి లేకుండాపోయింది. నా తండ్రి ఎప్పుడూ ఈ రాముణ్ణి గురించే ఆలోచిస్తూ ఉండేవాడు. రాత్రి మూడు జాములైనా

నిద్రపోయేవాడు కాదు. ఈ రాముడి మూలంగా వర్షాకాలంలో నదుల్లో నీళ్ళన్నీ బురదలైనట్లుగా మన లంకా పట్టణంలో రాక్షసులందరి మనశ్శాంతీ పోయింది. ఈ రాక్షసజాతినంతా కాపాడేందుకు నేనీ రామలక్ష్మణుల్ని చంపేశాను. ఇకపైన ఈ అన్నదమ్ముల పరాక్రమం, వానరవీరుల పరాక్రమం అంతా శరత్కాల మేఘాల్లాగా కనిపించకుండా పోయాయి" అని అంటూ ఇంకా వానర వీరులందరిపైనా బాణాలు వదిలాడు.

శత్రుసంహారకుడైన ఇంద్రజిత్తు నీలుడిపైన తొమ్మిది బాణాల్ని వదిలాడు. మైందుడు, ద్వివిదుడి పైనా మూడేసి బాణాలు, జాంబవంతుడిపైన ఒక్క బాణము, హనుమంతుడిపైన పది బాణాలు, గవాక్షుడి మీద, శరభుడి మీద రెండేసి బాణాలు, అంగదుడి మీద లెక్కలేనన్ని బాణాలు వదిలాడు. ఆ విధంగా శత్రుపక్షంలో ఒక్కర్నీ కూడా విడవకుండా వీరవిహారం చేసి చివరగా సింహనాదం చేస్తూ పకపకా నవ్వాడు. ఇంకా సంతోషం పట్టలేక తోటి రాక్షస వీరుల్తో, "రాక్షసుల్లారా! నేను వదిలిన బాణాలతో రామలక్ష్మణులు చచ్చిపడున్నారు. వానరయోధులంతా చెల్లాచెదరైపోయారు. వానరులంతా చెట్టుకొకడు పుట్టకొకడు పరిగెత్తుకుపోతున్నారు చూడండి. చూడండి" అన్నాడు. ఇంద్రజిత్తు మాటలకు రాక్షసయోధులంతా సంతోషించారు. ఒక్క ఇంద్రజిత్తు ఇంతపెద్ద వానర సేనను నిరుత్తరుల్ని చేశాడే అని ఆశ్చర్యపోయారు. వాళ్ళంతా రాముడు చచ్చిపోయాడని నమ్మారు. ఇంద్రజిత్తుని ఆకాశానికెత్తుతూ పొగిడారు. పెద్ద పండగే చేసుకున్నారు. ఇంద్రజిత్తు మళ్ళీ వెళ్ళి, ఎందుకైనా మంచిదని, చచ్చిపడున్న ఆ రామలక్ష్మణుల్ని చూసివచ్చాడు. వాళ్ళిద్దరూ ప్రాణాలు వదిలారని నిశ్చయించుకున్నాడు. ఇక తన సంతోషానికి అవధుల్లేకుండాపోయిన ఆ ఇంద్రజిత్తు లంకాపట్టణంలోకి ప్రవేశించాడు.

ప్రతి అవయవంలోనూ బాణాలు గుచ్చుకొని జీవచ్ఛవంలాపడి ఉన్న రామలక్ష్మణుల్ని చూస్తూ సుగ్రీవుడు భయపడిపోయాడు. గుండె చెరువయ్యేట్లుగా దుఃఖించాడు. అట్లా దుఃఖిస్తూ కళతప్పి వెలవెలబోతున్న సుగ్రీవుణ్ణి చూసి విభీషణుడు ఇలా ఓదార్చాడు.

విభీషణుడు : "ఓ సుగ్రీవుడా! భయపడకు. ధైర్యం వహించు. ఇది కన్నీళ్ళు పెట్టుకునే

సమయం కాదు. యుద్ధాల్లో ఒక్కొక్కప్పుడు అటూదిటు, ఇటుదటూ అవుతూ ఉంటాయి. ఏదీ నిశ్చయం అని చెప్పలేము. ఒకడు కొంతసేపు జయం పొందవచ్చు. కొంతసేపైన తర్వాత రెండోవాడు జయించవచ్చు. చివరకు ఎవరు జయిస్తారనేది ఇప్పుడే చెప్పలేం.

ఓ సుగ్రీవుడా! నీవు మహావీరుడవు. అధైర్యపడవద్దు. మనకు ఇంకా భోగాలు అనుభవించే అదృష్టం ఉన్నట్లయితే ఈ రామలక్ష్మణులు మూర్ఛ నుండి తేరుకోవచ్చును. ఆ ధైర్యవంతులు మహాబలశాలురు మూర్ఛ నుండి తేరుకోవచ్చును. నీవు మనసు కుదుటపరచుకో. సత్యధర్మ పరాయణులకు మృత్యుభయం ఉండదు. అనాథనై వచ్చిన నేను ధైర్యంగా ఉండేట్లు చూడు" అని అంటూ సుగ్రీవుడి కళ్ళు తుడిచి ఓదార్చాడు. పిమ్మట ధర్మాత్ముడైన విభీషణుడు చేతిలోకి నీళ్ళు తీసుకొని రాక్షసమాయను తెలుసుకోగలిగే మంత్రాన్ని పఠించాడు. పిమ్మట సుగ్రీవుడితో ఇలా అన్నాడు. "ఓ సుగ్రీవుడా! ఇది దుఃఖించవలసిన సమయం కాదు. కొన్ని సమయాల్లో అతి స్నేహం, ప్రేమ కూడా మరణాన్ని తెచ్చిపెట్టాయి. వ్యాకులత పనులన్నింటినీ ధ్వంసం చేస్తుంది. కాబట్టి రాముడి స్థానంలో ఉండి సైన్యాన్ని నడిపించు. రామలక్ష్మణులకు స్పృహవచ్చేంతవరకు మనం ఏదో విధాన వాళ్ళను కాపాడుకుందాం. స్పృహ వచ్చిన తర్వాత వారిద్దరూ మనల్నందర్నీ రక్షిస్తారు. రాముడు మరణించడు. ఎందువల్లనంటే ఆ కాంతిమంతుడి ముఖాన కాంతి ఇంకా అలాగే ఉంది. చనిపోయేవాడి ముఖాన ఇటువంటి కాంతి ఉండదు. కనుక ఓ సుగ్రీవుడా! నీవు ధైర్యం వహించు. సైన్యానికి ధైర్యం చెప్పు. నేను చేయవలసిందంతా చేస్తూనే ఉంటాను. నీవు మాత్రం ధైర్యం విడవకుండా సైన్యాన్ని నడువు. ఓ వీరుడా! వానరులంతా కళ్ళ పెద్దవి చేసుకొని మన వైపే చూస్తున్నారు. నన్ను ఇంద్రజిత్తు అని పొరపాటుపడుతున్నారు. ఒక్కళ్ళు చెవి మరొకరు కొరుక్కుంటున్నారు. నన్ను చూసి భయపడి పారిపోవాలని చూస్తున్నారు. వాళ్ళను పిలచి ధైర్యం చెప్పు. నేను ఇంద్రజిత్తును కాదని నచ్చచెప్పు. వాళ్ళ భయాన్ని పోగొట్టు. వాళ్ళకు ధైర్యం చెప్పి యుద్ధానికి సన్నద్ధులుగా చెయ్యి" అని చెప్పాడు. అట్లాగే విభీషణుడు వానర సైన్యానికి కూడా ధైర్యం చెప్పాడు. వాళ్ళందర్నీ ఊరడించాడు.

మాయావి అయిన ఇంద్రజిత్తు రాక్షస సేనాపతుల్ని వెంటబెట్టుకొని లంకా పట్టణంలోకి ప్రవేశించాడు. రావణాసురుడి దగ్గరకు వెళ్ళాడు. చేతులు జోడించి నమస్కరిస్తూ, "తండ్రీ! రామలక్ష్మణుల్ని చంపేశాను. నీ శత్రువులు ఇద్దరూ చనిపోయారు" అని చెప్పాడు. ఆ మాట వినగానే రావణాసురుడు పరుగున పోయి ఇంద్రజిత్తును కౌగలించుకున్నాడు. శిరస్సుపై ముద్దు పెట్టుకొంటూ "కుమారా! ఆ రామలక్ష్మణుల్ని ఎలా చంపావో నాకు వివరంగా చెప్పు. వినాలని ఉంది" అన్నాడు. అంతట ఇంద్రజిత్తు తాను అంతర్ధానమై ఆ వానర వీరులందర్నీ ఎట్లా తిప్పలు పెట్టిందీ, చివరకు రామలక్ష్మణులిద్దర్నీ నాగపాశబద్ధుల్ని చేసిందీ, చెప్పాడు. చివరిసారిగా వస్తూ వస్తూ వారిద్దర్నీ చూసివచ్చాను. వాళ్ళల్లో కాంతి పూర్తిగా నశించిపోయింది. చచ్చి నేలపై పడి ఉన్నారు. అటుపిమ్మటే నేను లంకాపట్టణంలోకి ప్రవేశించానని కూడా చెప్పాడు. ఇంద్రజిత్తు చెప్పిన మాటలకు రావణాసురుడు సంతోషంతో పొంగిపోయాడు. రామలక్ష్మణుల గూర్చి ఇంతకాలం తను పడుతున్న మనోవ్యధ అంతాపోయింది గదా అని సంతోషిస్తూ పుత్రుణ్ణి పరిపరి విధాలుగా మెచ్చుకున్నాడు.

# 47వ సర్గ సీతకు రామలక్ష్మణుల్ని చూపటం

ఇంద్రజిత్తు తాను చేయవలసిన పని పూర్తి చేసుకొని లంకలో ప్రవేశించగానే, వానరయోధులంతా రామలక్ష్మణుల చుట్టూచేరారు. వారిద్దర్నీ శతవిధాలుగా కాపాడుకుంటూ వచ్చారు. హనుమంతుడు, అంగదుడు నీలుడు, సుషేణుడు, కుముదుడు, నలుడు, గజుడు, గవాక్షుడు, గవయుడు, గంధమాదనుడు, శంభుడు, రంభుడు, పృథుడు, శతబలి మొదలైన వాళ్ళంతా దీనులై రామలక్ష్మణులను చూస్తూ ఒకళ్ళతో ఒకళ్ళు చెప్పుకుంటూ దుఃఖించారు. వాళ్ళంతా వ్యూహాలుగా ఏర్పడ్డారు. చేతుల్లో రాళ్ళు, వృక్షాలు పట్టుకొని నాలుగు ప్రక్కలా, ఆకాశంలోకే చూస్తూ అప్రమత్తులై ఆ రాజకుమారులిద్దర్నీ రక్షిస్తున్నారు. గాలికి గడ్డిపోచ కదిలినా కూడా ఇంద్రజిత్తేమోనని ఉలిక్కిపడుతున్నారు. ఒకళ్ళకొక్కళ్ళు హెచ్చరికలు చేసుకుంటున్నారు.

అక్కడ లంలానగరంలో రావణాసురుడు పండగ చేసుకుంటున్నాడు. ఇంద్రజిత్తు వెళ్ళిపోగానే, సీతాదేవికి కావలిగా ఉంటున్న రాక్షస స్త్రీలను పిలిపించాడు. వాళ్ళతో "ఓ రాక్షసాంగనల్లారా! ఇంద్రజిత్తు రామలక్ష్మణు లిద్దర్నీ చంపేశాడు. మీరు పుష్పక విమానంలో సీతాదేవిని యుద్ధభూమికి తీసుకొని వెళ్ళండి. ఆమెకు రామలక్ష్మణుల మృతదేహాల్ని చూపించి తిరిగి అశోకవనానికి తీసుకొని వెళ్ళండి. ఇన్నాళ్ళు ఆ సీతాదేవి ఎవరిని నమ్ముకొని నన్ను తిరస్కరించిందో ఆ రాముణ్ణి చంపేశాను. రాముడు, అతడి తమ్ముడూ కూడా యుద్ధభూమిలో చచ్చిపడి ఉన్నారు. ఇకపై ఆమె ఎవర్ని చూసుకుని మిడిసిపడుతుందో చూస్తాను. ఇక మైథిలికి నేను తప్ప వేరే దిక్కులేదు. చక్కగా అలంకరణాలన్నీ అలంకరించుకుని ఏ దిగులూ లేకుండా నన్ను ఆశ్రయిస్తుంది. కాబట్టి మీరు ఆమెను వెంటబెట్టుకొని వెళ్ళి రామలక్ష్మణుల మృతదేహాల్ని చూపించి తిరిగి అశోకవనానికి తీసుకుపోండి" అన్నాడు.

అంతట ఆ స్త్రీలంతా సీతాదేవిని పుష్పకంలో ఎక్కించుకొని రామలక్ష్మణుల్ని

చూపించడానికి తీసుకుపోయారు. సీతాదేవి చచ్చిపడి ఉన్నా వానర వీరుల శరీరాల్ని చూసింది. సంతోషంతో నాట్యం చేస్తున్న రాక్షసయోధుల్ని చూసింది. చచ్చి (నట్లు) పడి ఉన్న రామలక్ష్మణుల శరీరాల్ని చూసింది. శరీరాల్లో సందులేకుండా బాణాలు గుచ్చుకొని రక్తంతో తడిసిపోయి పడి ఉన్న రామలక్ష్మణుల్ని దుఃఖార్తులై కాపలాకాస్తున్న వానరవీరుల్ని చూసింది. ఆ రాజకుమారులు ధరించిన కవచాలన్నీ విరిగి ముక్కలైపోయాయి. శరతల్పంపై పడి ఉన్న ఆ వీరుల్ని చూసింది. వారి ధనస్సులు దూరంగా పడిపోయి ఉన్నాయి. మహావీరులు, పురుషశ్రేష్ఠులు, అగ్నిపుత్రులు, మహావీరులైనవారు స్కంద విశాఖల్లాగా పడి ఉన్నారు. పద్మముల వంటి నేత్రాలు గల ఆ వీరుల కళ్ళు మూతపడి ఉండటం చూసింది. అటువంటి రామలక్ష్మణుల్ని చూసిన సీతాదేవి దీనంగాను బిగ్గరగాను విలపించింది. దోషములు లేని ఆ ఇల్లాలు, నల్లని నేత్రముల గల ఆ సీతాదేవి దుమ్ములో నేలపై పడి ఉన్న భర్తను, లక్ష్మణుణ్ణి చూసి ఏడ్చింది. దేవతల వంటి ప్రభావం గలిగిన ఆ సోదరులను చూడగానే దుఃఖం ముంచుకొచ్చింది. వాళ్ళు మరణించారని తలచి ఇలా అంది.

# 48వ సర్గ త్రిజట సీతాదేవిని ఓదార్చటం

మహాబలవంతులైన తన భర్త, మరిది చచ్చిపడి ఉన్నారని తలచిన సీతాదేవి దీనంగా ఏడుస్తూ ఇలా అంది.

సీతాదేవి : "పూర్వం నేను పుత్రసంతానవంతురాలనవుతానని, వైధవ్యం లేని దాన్నవుతానని జోతిష్కులు చెప్పారు. ఇప్పుడు వారు చెప్పిందంతా అసత్యమైపోయిందే! నేను యజ్ఞయాగాలు చేసేవానికి భార్యనవుతానని చెప్పిన పండితుల మాటలన్నీ అసత్యాలయ్యాయే! వీరులైన రాజుల భార్యలందరిలోను నేను భర్త ప్రేమాభిమానాలకు పాత్రురాలను అవుతానని చెప్పిన పండితులంతా అసత్యం పలికినట్లైంది గదా! 'ఈమె సౌభాగ్యవతి అవుతుంది' అని చెప్పిన దైవజ్ఞులైన బ్రాహ్మణుల వాక్కులన్నీ అసత్యాలయ్యాయే! నా పాదాల్లో ఉండే పద్మరేఖల వల్ల, భర్తతో కలసి సామ్రాజ్యాభిషేకించబడతానని పండితులు అనేవాళ్ళు. పాదాల్లో ధ్వజాలు, పద్మాలు మొదలైన ముద్రలుండే స్త్రీలంతా మంచి ఫలములు పొందుతారని చెప్పారే! ఆ ముద్రలన్నీ నా శరీరంలో ఉన్నాకూడా, రాముడు మరణించడం చేత అన్నీ వ్యర్థమైపోయాయి కదా! నా జుట్టు సన్నగా నునుపుగా సమంగా నల్లగా ఉంటుంది. నా కనుబొమలు కలవకుండా ఉంటాయి. నా పిక్కలు రోమాల్లేకుండా గుండ్రంగా పొందికగా ఉంటాయి. నా దంతాలు ఎక్కడా సందులు లేకుండా ఉంటాయి. నా కన్నులు, కణితలు, చేతులు, పాదాలు, తొడలు, చీలమండలు, సమంగాను, పుష్టిగా ఉంటాయి. నా వేళ్ళు చేతులకు తగినట్లుగా ఉంటూ, వేలిగోళ్ళు గుండ్రంగా ఉంటాయి. నా స్తనములు రెండూ ఎడం లేకుండా దగ్గరగా ఉంటూ, స్తనాల మొనలు అంటుకుని పోయి ఉన్నాయి. నాభి లోతుగా ఉంది. వక్షఃస్థలం పక్కలు బలుపుగా ఉంటాయి. నా దేహంపై ఉండే రోమాలు మృదువైనవి. నా దేహం కాంతి సానపట్టిన రత్నంలాగా మెరిసిపోతుంది. నా పాదాలు, పాదాల వేళ్ళు, అరికాళ్ళు నేలను అంటుకొని ఉంటాయి. ఇవన్నీ శుభలక్షణాలని పండితులు చెప్పారు. నేను ఎప్పుడూ చిరునవ్వులు నవ్వుతూనే ఉంటాను. నా అరచేతుల్లో యవాకార రేఖలున్నాయి. నా వేళ్ళ మధ్య సందుల్లేకుండా ఉన్నాయి. ఇవన్నీ శుభ

కన్యాలక్షణాలని పండితులన్నారు. నా భర్తతో కలసి రాజ్యాభిషేకం జరుగుతుందని జోతిష్కులు చెప్పారు. ఇంతమంది చెప్పినవీ అసత్యాలైపోయాయే!

ఈ రాజకుమారులిద్దరూ జనస్థానంలో తప్పిపోయిన నన్ను వెదకి వెదకి వేసారిపోయారు. చివరకు ఇక్కడ నిర్బంధంలో ఉన్నట్లు తెలుసుకొని అలవికాని సముద్రాన్ని కూడా దాటి పెద్ద సేనతో నన్ను తీసుకొని పోయేందుకు వచ్చారు. అటువంటి నా భర్త నా మరిది ఈ ఇంద్రజిత్తు మాయకులోబడి చచ్చిపోయారు. అయ్యో! నా భర్త, మరిది వారుణాస్త్రం, ఆగ్నేయాస్త్రం, ఇంద్రాస్త్రం, బ్రహ్మశిరోనామకాస్త్రం వంటి అనేక అస్త్రాలు తెలిసినవారే! వాటిని ఉపయోగించుకొని ఎందుకు తమ ప్రాణాలను కాపాడుకోలేదో! ఇదంతా నా దురదృష్టమే కదా? ఇప్పుడు నేను అనాథనైపోయాను. మాయచేసి నా భర్త కంటపడకుండా ఇంద్రజిత్తు యుద్ధం చెయ్యటం వల్ల నా భర్త మరణించాడు. లేకపోతే దేవేంద్రుడైనా నా భర్త ఎదుట నిలువలేడు. ఇక ఇంద్రజిత్తు మాట చెప్పాలా? యుద్ధంలో కంటపడిన శత్రువు లెవ్వరినీ రాముడు ప్రాణాలతో వదలలేదు. ఇన్ని మాటలెందుకు? దైవాన్ని ఎవరూ జయించలేరు కదా? కాలం చెయ్యలేని పని అంటూ ఏదీ ఉండదు కదా! నా అత్తగార్ని గూర్చి నేను ఎక్కువగా దుఃఖీస్తున్నాను. రాముడి కన్నా, లక్ష్మణునికన్నా, నా తల్లి కన్నా, నా కన్నా కూడా నేను నా అత్తగారిని గూర్చే ఎక్కువగా దుఃఖీస్తున్నాను. ఎందువల్లనంటే అరణ్యవాసం ఎప్పుడు పూర్తి అవుతుందా? అని కౌసల్యాదేవి రోజులు ఘడియలు లెక్కపెట్టుకుంటూ ఉంటుంది. మా ముగ్గురినీ ఎప్పుడు చూస్తానా? అని కళ్ళు కాయలు కాచేట్లు ఎదురుచూస్తూ ఉంటుంది.

ఈ విధంగా విలపిస్తున్న సీతాదేవితో త్రిజట ఇలా అంది.

త్రిజట : ఓ సీతాదేవీ! నీవు దుఃఖీంచవద్దు. రామలక్ష్మణులు మరణించలేదు. అన్నదములిద్దరూ జీవించే ఉన్నారు. రాజు యుద్ధంలో మరణిస్తే సైన్యం ముఖాల్లో సంతోషం కనిపిస్తుందా? యుద్ధంపై ఉత్సాహం చూపగలరా? శత్రువుపై కోపాన్ని ప్రదర్శించగలరా? అంతేకాదు, మనం వచ్చిన పుష్పక విమానం దేవలోకానికి చెందినది. నిజంగా రామలక్ష్మణులు

చనిపోయి ఉన్నట్లైతే మనిద్దరినీ మోసుకొని వచ్చేది కాదు. యుద్ధంలో ప్రధానమైన వీరుడు చనిపోతే, సైన్యం అంతా నిర్వీర్యం అయిపోతుంది. ఏ ప్రయత్నం చెయ్యాలన్నా ఉత్సాహం లేకుండా ఉండటమే కాకుండా అయోమయ స్థితిలో పడిపోతూ ఉంటారు. సముద్ర మధ్యలో చుక్కాని విరిగిపోయిన ఓడలాగా దారి తెన్నూ తెలియక తిరుగుతూ ఉంటారు. కానీ ఇక్కడ పరిస్థితి అట్లాలేదు. వానరయోధులంతా రామలక్ష్మణుల్ని చాలా జాగ్రత్తగా రక్షిస్తున్నారు. వాళ్ళలో కలవరం కనిపించకపోగా, కార్యదీక్ష తెలుస్తోంది. ఓ సీతా! నా మాట నమ్ము. ఈ శుభ లక్షణాల్ని బట్టి రామలక్ష్మణులు జీవించే ఉన్నారని తెలుస్తోంది. నీ మంచి నడవడిక వల్లనూ, బుద్ధిమంతురాలవు కావడం వల్లనూ, నీ మీద నాకు ప్రేమ ఏర్పడింది. అందువల్లనే ఇంత దీర్ఘంగా ఆలోచించి చెప్తున్నాను. అసలే కష్టాల్లో ఉన్న పిల్లవు. నీకు అబద్ధాలు చెప్తే నాకు ఒరిగేదేముంటుంది, చెప్పు. ఒక్కమాట చెప్తున్నాను విను; సురాసురులు ఏకమై ఒకటిగా వచ్చినా రామలక్ష్మణుల్ని ఏమీ చెయ్యలేరు. రాముడు రావణుణ్ణి చంపి, నిన్ను తనతో తీసుకొనిపోతాడు. నన్ను నమ్ము, ఓ సీతా! నీవే ఆ రామలక్ష్మణుల్ని పరీక్షగా చూడు. వాళ్ళ ముఖాల్లో ఎక్కడైనా కళాకాంతులు తగ్గాయా? చావబోయేవాళ్ళ ముఖాల్లోను, చచ్చినవాళ్ళ ముఖాల్లోనూ ఎక్కడా కళాకాంతులు ఉండవు. వాళ్ళు కేవలం మంత్ర బలానికి కట్టుబడి స్పృహతప్పి నిశ్చేష్టులై ఉన్నారు. నువ్వు అదేపనిగా దుఃఖీస్తూ ఉంటే నీ ప్రభావం చేత వాళ్ళకు కీడు జరిగినా జరగవచ్చు. కాబట్టి దైవాన్ని నమ్మి, దుఃఖాన్ని వదలిపెట్టు.

త్రిజట చెప్పిందంతా సీతాదేవి విన్నది. చేతులు జోడించి నమస్కరించింది. ఇలా అంది: "నీ నాలుక పై దేవతలే ఉండి అట్లా పలికిస్తున్నారని అనుకుంటున్నాను. నీ నోటి వాక్యం ప్రకారమే జరగాలని మరీమరీ కోరుకుంటున్నాను." అంతట ఆ పుష్పకవిమానం సీతాదేవిని, త్రిజటను ఎక్కించుకొని అశోకవనం వైపుగా వాయువేగంతో దూసుకుపోయింది. అశోకవనం చేరిన సీతాదేవి రామలక్ష్మణుల్ని తలచుకుంటూ దుఃఖించసాగింది.

# 49వ సర్గ రాముడు మేల్కొనటం

భయంకరమైన నాగపాశాలకు కట్టుపడిపోయి పాముల్లాగా నిట్టూర్పులు విడుస్తూ రామలక్ష్మణులు నేలపై పడి ఉన్నారు. సుగ్రీవుడు మున్నగు వానరవీరులంతా ఏమరపాటు లేకుండా క్షణక్షణం వాళ్ళిద్దర్నీ కనిపెట్టి సేవలు చేస్తున్నారు. అట్లా ఉండగా, ఉండగా మహాబలశాలియైన రాముడు కొద్దిగా కళ్ళు తెరిచాడు. ఇంకా నాగపాశాలచే బంధించబడి ఉన్నా కూడా ధర్మాత్ముడు, మహాధైర్యవంతుడూ కావటం వల్ల మూర్ఛ నుండి తేరుకున్నాడు. ప్రక్కనే నాగపాశంతో బంధించబడి ఉన్న సోదరుడు లక్ష్మణుణ్ణి చూశాడు. దుఃఖం పొర్లుకొచ్చింది. కళ్ళ వెంబడి నీరు కారుస్తూ, "అయ్యో! నా ప్రాణానికి ప్రాణమైన లక్ష్మణుడు యుద్ధంలో పరాజితుడై నేలపై పడి ఉన్నాడే! నేనిక ఎవరికోసం బ్రతకాలి? సీతతో ఇక నాకేం పని ఉంది? నేను ముల్లోకాలూ వెతికి సీత వంటి భార్యను పొందగలనేమోగాని, లక్ష్మణుని వంటి సోదరుణ్ణి పొందలేను. సుమిత్రాదేవికి ముద్దుల బిడ్డడైన లక్ష్మణుడే చనిపోయినట్లయితే నాకీ ప్రపంచంతో ఏమీ పనిలేదు. ఈ వానర ప్రముఖులందరి ముందూ ప్రాణాలు వదిలేస్తాను.

నేను మా అమ్మ కౌసల్యాదేవికి ఏమని బదులు చెప్పగలను? నా తల్లి కైకేయికి ఏమని చెప్పను? లక్ష్మణుడు లేకుండా అయోధ్యకు పోయి సుమిత్రాదేవిని ఎట్లా ఓదార్చగలను? పిల్లపోయిన లేడివలె ఆమె విలపిస్తూ ఉంటే నేను ఆమెను చూడగలనా? ఆమెకు ఏమని బదులు చెప్తాను? భరత శత్రుఘ్నులకు ఏమని సమాధానం చెప్తాను? అడవికి పోయేటప్పుడు నాతో కూడా వచ్చిన లక్ష్మణుడు లేకుండా అయోధ్యకు తిరిగి వెళ్తే సుమిత్రాదేవి నన్ను నిందించదా? ఆమె అట్లా నిందిస్తూ ఉంటే తట్టుకొని బ్రతకగలనా? ఆ నిందలన్నీ వింటూ అయోధ్యలో మరణించే బదులు ఇక్కడే, లక్ష్మణునితోపాటే మరణిస్తాను. నా మీద ప్రేమతో, భక్తితో అడవులకు వచ్చిన నా తమ్ముడు నాకోసం ఈ శరతల్పంపై పడిపోయాడు. చేష్టలుడిగి చచ్చిపోయిన వాడిలాగానే పడి ఉన్నాడు. అయ్యో! నేను ఎంత పాపిష్టివాడిని! ఎంతటి దుష్టకార్యాలు చేశానో గదా! నేను చేసిన పాప కార్యాల వల్లనే నా తమ్ముడు లక్ష్మణుడికి ఈ గతిపట్టింది!

ఓ తమ్ముడా! లక్ష్మణా! నేను ఎప్పుడు దుఃఖిస్తున్నా నన్ను కన్నతల్లిలాగా ఓదార్చేవాడవే! నేను ఇప్పుడు నీ కోసం ఇంతగా దుఃఖిస్తూ ఉంటే మాట్లాడవేమి? నన్ను ఎందుకు ఓదార్చడం లేదు? అనేకమంది రాక్షసుల్ని పడగొట్టావు. చివరకు రాక్షసుల చేతిలోనే పడిపోవాల్సి వచ్చిందిగదా? నీ ఒంటి నిండా బాణాలతో గాయాలైపోయాయి. గాయాల్లో నుండి నెత్తురు వరదలై పారుతోంది. బాణాలే నీకు పట్టుపాన్పు అయింది. అస్తమిస్తున్న సూర్యుడిలాగా ప్రకాశిస్తున్నావు. ఆయువుపట్ల అన్నింటిలోనూ బాణాలు గుచ్చుకున్నాయి. మాట్లాడలేకుండా ఉన్నావు. అయినా ఆ దీనమైన చూపుల్లోనే ఎంత బాధపడిపోతున్నావో తెలుస్తోంది. ఓ తమ్ముడా! నీవు నా వెంట ఎలా అడవులకు వచ్చావో, నేను కూడా అట్లాగే నీ వెంట యమసదనానికి వస్తాను. లక్ష్మణా! నువ్వంటే మన బంధువులందరికీ ఇష్టం. కానీ నీకు మాత్రం నేనంటేనే ఇష్టం. నీవు నన్ను ఒక్క క్షణం కూడా విడిచి ఉండేవాడివి కాదు. అటువంటి నిన్ను పోగొట్టుకున్న నేనే దౌర్భాగ్యుణ్ణి. నేనే దురదృష్టవంతుణ్ణి. నా దురదృష్టం వల్లనే నీకీ దురవస్థ వచ్చింది. నీకు ఎంత కోపం తెప్పించినా ఒక పరుషవాక్యం కూడా మాట్లాడి ఎరుగవే! నా మనస్సు తెలుసుకొని నడచుకునేవాడవే! నీవు నాతో ఉన్నట్లు మరొకరెవ్వరూ నాతో ఆ విధంగా ఉండలేరు సుమా! ఒకేసారి అయిదువందల బాణాలు వదలగలిగే నా తమ్ముడు కార్తవీర్యార్జుని కన్నా అధికుడు. కార్తవీర్యార్జునుడికి వెయ్యి చేతులుండేవి. కానీ నీకు రెండే చేతులున్నా కూడా అతడికన్నా ఎక్కువ బాణాల్ని ఎక్కువ వేగంతో వదిలేవాడివి. మహాపరాక్రమవంతుడవైన నువ్వు దేవేంద్రుడి బాణాలనైనా తిప్పికొట్టగల సమర్థుడవు. ఓ తమ్ముడా! లక్ష్మణా! పట్టు పరుపులపై పడుకోవలసిన నీవు ఈ రోజును ఈ మాయావి రాక్షసుడు వేసిన బాణాలనే పాన్పుగా చేసుకుని పడి ఉన్నావే!

అయ్యో! విభీషణుణ్ణి లంకా పట్టణానికి రాజుగా రాజ్యాభిషేకం చేస్తానని ప్రతిజ్ఞ చేశాను. ఆ వాగ్దానం అసత్యమైపోయిందే! నన్ను ఆ అసత్య దోషం దహించివేస్తోంది. ఓ సుగ్రీవుడా! నీవు నీ వానర సైన్యాన్నంతా తీసుకుని వెంటనే కిష్కింధా నగరానికి వెళ్ళిపో. నేను మరణించిన తర్వాత బలవంతుడైన రావణాసురుడు మిమ్మల్నందరినీ తరిమి కొడ్తాడు. నీవు, అంగదుడు, నీలుడు మొదలైన వానర వీరులంతా సముద్రాన్ని దాటి వెళ్ళిపోండి. ముల్లోకాల్లో ఎవరూ

చేయలేని సాహసాలు హనుమంతుడు చేశాడు. భల్లూకాల రాజైన జాంబవంతుడు, గోలాంగూలాల రాజైన గవాక్షుడూ ప్రాణాలను లెక్కచెయ్యకుండా పోట్లాడారు. మైందుడు, ద్వివిదుడు నా కోసం ఎంతో కష్టపడ్డారు. కేసరీ, సంపాతీల యుద్ధం రాక్షసులందరినీ భయభ్రాంతుల్ని చేసింది. గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు ఇట్లా ఇంకా ఎంతోమంది వానరయోధులు నా కోసం ప్రాణాలను పణంగా పెట్టి పోరాడారు. అంతా ఎంతో ధైర్యసాహసాలు ప్రదర్శించి యుద్ధం చేశారు. నేను చాలా సంతోషిస్తున్నాను.

ఓ సుగ్రీవుడా! మానవుడు ఎంత చేసినా దైవం ప్రతికూలించినప్పుడు ఏమీ చెయ్యలేడు. దైవాన్ని అతిక్రమించలేడు. ఓ శత్రుసంహారకుడా! నీ హృదయం మంచిది. నీవు పవిత్రమైనవాడవు. ధర్మభీతి గలవాడవు. ఒక మిత్రుడు చేయగలిగిందంతా చేశావు. వానరశ్రేష్ఠులంతా కూడా తమ శక్తివంచన లేకుండా చేయవలసిన కార్యాలన్నీ చేశారు. వాళ్ళందరికీ కూడా అనుజ్ఞ ఇస్తున్నాను. వాళ్ళందర్నీ కూడా వెళ్ళిపొమ్మను.

రాముడు ఆ విధంగా విలపిస్తూ ఉంటే వానరులంతా కూడా కన్నీరు పెట్టుకున్నారు. ఇలా ఉండగా విభీషణుడు వానర వీరులందరికీ ధైర్యం చెప్పి, వాళ్ళందరి భయాలు పోగొట్టి, గద భుజాన పెట్టుకొని వానర వీరులతో కలసి రాముడున్న చోటుకు వచ్చాడు. అప్పుడు రాముడి సమీపాన ఉన్న వానరులంతా నల్లగా కాటుక కొండలాగా ఉన్న విభీషణుణ్ణి చూసి ఇంద్రజిత్తే వచ్చాడని భయపడిపోయారు.

# 50వ సర్గ విభీషణుని చూసి వానరులు భయపడటం

అప్పుడు గొప్ప తేజస్సుగలవాడు, మహాబలవంతుడు అయిన సుగ్రీవుడు సేనానాయకులందరినీ చూస్తూ, "సముద్రం మధ్యన తుపానులో చిక్కుకున్న నావలాగా మన సైన్యం అంతా వ్యాకులపాటు చెందుతున్నది. ఎందువల్ల?" అని అడిగాడు. అందుకు వాలి పుత్రుడైన అంగదుడు, "రాజా! రామలక్ష్మణులు శరీరం నిండా బాణాలు గుచ్చుకొని శరీరం అంతా రక్తసిక్తం అయిపోయి నిశ్చేష్టులై శరతల్పం మీద ఉన్నారు. నీవు ఆ వీరులను చూడలేదా?" అని అడిగాడు. అందుకు సుగ్రీవుడు ఇలా అన్నాడు.

సుగ్రీవుడు : "ఓ అంగదుడా! వానరుల వ్యాకులపాటుకు రామలక్ష్మణుల స్థితి కారణం కాదు. వేరే ఏదో భయం వాళ్ళను పట్టి పీడిస్తోంది. వాళ్ళ చేతుల్లో ఉన్న చెట్లు, కొమ్మలు అవతల పారేసి పారిపోతున్నారు. అందరి ముఖాల్లోను భయం తొంగి చూస్తోంది. అట్లా పారిపోవడానికి వారేమీ సిగ్గుపడటం లేదు. ఒకళ్ళ నొకళ్ళు ఒరుసుకుంటూ పోతున్నారు. పడిపోయిన వాళ్ళ మీద నుండి దాటుకుంటూ పోతున్నారు."

అదే సమయంలో రాక్షసవీరుడైన విభీషణుడు గద చేత పుచ్చుకొని వచ్చాడు. సుగ్రీవుడికి అభివాదం చెప్పాడు. రామలక్ష్మణులు పడి ఉండటం చూశాడు. అప్పుడు అక్కడకు వచ్చిన విభీషణుని చూసి వానరులు భయపడి పారిపోతున్నారని సుగ్రీవుడు గ్రహించాడు. ప్రక్కనే ఉన్న జాంబవంతుణ్ణి చూస్తూ ఇలా అన్నాడు. "ఓ భల్లూకరాజా! ఈ వచ్చింది విభీషణుడు. కానీ మన వానర వీరులంతా ఇతణ్ణి చూసి ఇంద్రజిత్తు అని భయపడి పారిపోతున్నారు. నీవు పోయి వాళ్ళందరికీ ధైర్యంగా ఉండమని నచ్చచెప్పు. వాళ్ళంతా చెల్లాచెదరై చెట్టుకొకడు పుట్టకొకడూ కాకుండా చూడు" అన్నాడు. అంతట జాంబవంతుడు వెళ్ళి వానర వీరులందరినీ దగ్గరకు చేర్చుకొని భయపడవద్దని, ఆ వచ్చింది ఇంద్రజిత్తు కాదని, అతడి పినతండ్రి విభీషణుడని, మన రామప్రభువుకు అతడు బంటు అని చెప్పాడు. అప్పుడు వాళ్ళంతా ధైర్యం తెచ్చుకొని మళ్ళీ ఒక

చోటుకు చేరారు. యుద్ధానికి సన్నద్ధులయ్యారు.

పరమ ధార్మికుడైన విభీషణుడు రామలక్ష్మల దీనావస్థను చూసి దుఃఖించాడు. చల్లటి నీళ్ళతో రామలక్ష్మణుల ముఖాల్ని చక్కగా ప్రక్షాళన చేశాడు. అయినా వాళ్ళింకా స్పృహలోకి రాలేదు. విభీషణుడు ఆ రాజకుమారుల కోసం దుఃఖీస్తూ ఇలా అన్నాడు.

విభీషణుడు : "ఈ రామలక్ష్మణులు మహా బలవంతులు. పరాక్రమవంతులు. యుద్ధవిద్యల్లో ప్రవీణులు. మాయాయుద్ధం చేసే రాక్షసులు చాటుగా మాయలతో వీరిని బంధించి ఈ దురవస్థకు గురిచేశారు. ఇంద్రజిత్తు క్రూరుడు. దుష్టబుద్ధిగలవాడు. అతడు ఆ తల్లి కడుపున చెడపుట్టాడు. అన్నీ తండ్రి బుద్ధుల్నే పుణికిపుచ్చుకున్నాడు. మాయలు, కుటిల యుద్ధాలు తెలియని వారు కావటం వల్ల రామలక్ష్మణుల్ని చాటుగా దెబ్బకొట్టి మోసం చేశాడు. అయ్యో! ధర్మాత్ములైన ఈ రాజకుమారుల శరీరం అంతా బాణాలు గుచ్చుకున్నాయి. శరీరం అంతా రక్తంతో తడిసిపోయింది. కటిక నేలపై పడి ఉన్నారు. నేను వీరి అండన చేరాను. నేను లంకకు రాజునై రామరాజ్యాన్ని నెలకొల్పాని ఆశపడ్డాను. ఈ రాజకుమారులిద్దరూ మరణశయ్యపై ఉన్నారు. ఇకపై నాకు రాజ్యకాంక్ష లేదు. నా శత్రువైన రావణాసురుడే జయించినట్లవుతుంది" అంటూ వాపోయాడు.

అప్పుడు సుగ్రీవుడు విభీషణుణ్ణి అక్కున జేర్చుకొని ఇలా ఓదార్చాడు: "ఓ విభీషణుడా! నీవు ధర్మం తెలిసినవాడవు. ధర్మాన్నే ఆచరించేవాడవు. అధర్మం ఎన్నటికీ జయించదు. కాబట్టి రావణాసురుడి కోరిక నెరవేరదు. నీవు లంకా పట్టణాన్ని ఏలుతావు. అక్కడ రామరాజ్యాన్ని నెలకొల్పుతావు. సందేహం లేదు. ఈ రామలక్ష్మణులు ఈ మూర్ఛ నుండి తేరుకుంటారు. మళ్ళీ యుద్ధంలో వీరవిహారం చేస్తారు. శత్రువుల్ని సమూలంగా నాశనం చేస్తారు." ఇలా అంటూ పరిపరి విధాలుగా ఓదార్చాడు.

తరువాత సుగ్రీవుడు సుషేణుడితో ఇలా అన్నాడు.

సుగ్రీవుడు : "ఓ వీరుడా! ఈ రామలక్ష్మణులను కనిపెట్టుకొని ఉండు. వాళ్ళు మూర్ఛ నుండి తేరుకోగానే, మన వానర యోధుల్ని వెంటబెట్టుకొని వారిద్దర్నీ కిష్కింధకు చేర్చు. నేను ఇక్కడే ఉండి రావణాసురుణ్ణి, వాడి పుత్రుల్ని, బంధువుల్ని, రాక్షసుల్ని సమూలంగా నాశనం చేసి కోల్పోయిన రాజ్యలక్ష్మిని ఇంద్రుడు తీసుకుని వచ్చినట్లు, సీతాదేవిని తీసుకొని వచ్చి రాముడికి సమర్పిస్తాను." సుగ్రీవుడు మాటలు విన్న సుషేణుడు ఇలా అన్నాడు.

సుషేణుడు : "రాజా! పూర్వం దేవతలకు రాక్షసులకు యుద్ధం జరిగినప్పుడు నేను అక్కడే ఉన్నాను. రాక్షసులు దేవతలపైన బాణాల్ని వర్షంలాగా కురిపించారు. అనేకమంది దేవతలు మరణించారు; మూర్ఛపోయారు. అప్పుడు బృహస్పతి తన మంత్రబలంతోను, కొన్ని ఓషధుల్తోను వాళ్ళందరికీ చికిత్స చేశాడు. అప్పుడా మూలికలన్నింటినీ క్షీరసాగర సముద్రం పరిసరాల నుండి సేకరించారు. నీవు కనుక ఆ మూలికల్ని వెంటనే తెప్పిస్తే రామలక్ష్మణులు వెంటనే తేరుకుంటారు. కాబట్టి వెంటనే వానరవీరుల్ని ఆ క్షీరసముద్ర తీరానికి పంపు. వాటిని 'సంజీవకరణి' 'విశల్యకరణి' అని రెండు మూలికల్ని దేవతల కోసం సృష్టించారు. నీవు వాటిని వెంటనే తెప్పించు. ఆ క్షీరసాగరమే పూర్వం దేవతలు, రాక్షసులు అమృతం కోసం చిలికిన పాలసముద్రం. అక్కడ ఆ పాలసముద్రతీరాన్నే ద్రోణ పర్వతం అనీ, చంద్రపర్వతం అనీ రెండు పర్వతాలున్నాయి. ఆ పర్వతాలుపైన 'సంజీవకరణి, విశల్యకరణి' అనే మూలికలు విస్తారంగా లభిస్తాయి. ఆ దివ్య ఔషధ మూలికల్ని దేవతలు ఆ రెండు పర్వతాలపైనా నాటి వృద్ధి చేశారు. వాయునందనుడైన హనుమంతుణ్ణి అక్కడకు పంపించు. అతడు ఆ మూలికల్ని తేగానే రామలక్ష్మణులు కోలుకుంటారు. నీవు దుఃఖించకు; ఆలస్యం చెయ్యొద్దు."

సుషేణుడు ఇట్లా అంటూ ఉండగానే ప్రళయకాల వాయువులాగా గాలి వీచించి. సముద్ర జలాలు చెదిరిపోయాయి. మేఘాలన్నీ ఛిన్నాభిన్నం అయ్యాయి. మహావృక్షాలన్నీ నేలకూలాయి. జలజంతువులన్నీ ప్రాణభీతితో ఈతలు కొట్టాయి. ఇంతలోనే వినుతా పుత్రుడైన గరుత్మంతుడు జ్వలిస్తున్న అగ్నిహోత్రుడిలాగా రావటం వానరులంతా చూశారు. గరుత్మంతుడు రాగానే

రామలక్ష్మణుల్ని బాణరూపాన బంధించిన సర్పాలన్నీ పారిపోయాయి. గరుత్మంతుడు తన చల్లని చేతులతో రామలక్ష్మణుల శరీరాల్ని స్పృశించాడు. రామలక్ష్మణుల శరీరాలపై అయిన గాయాలన్నీ మరుక్షణంలోనే మటుమాయమైపోయాయి. అంతేకాకుండా, ఆ రాజకుమారుల తేజస్సూ, ఓజస్సూ, వీర్యము, బలము, ఉత్సాహము, బుద్ధికుశలత, జ్ఞాపకశక్తి, సూక్ష్మార్థ పరిజ్ఞానాలన్నీ తిరిగి పొందటమే కాకుండా రెట్టింపయ్యాయి. పిమ్మట రామలక్ష్మణుల్ని ఆనందంతో లేవనెత్తి కౌగలించుకున్నాడు. అప్పుడు రాముడు ఇలా అన్నాడు: "ఓ మహానుభావా! ఇంద్రజిత్తు మా ఇద్దర్నీ మరణం అనే సముద్రంలోకి నెట్టాడు. నీవు నావలాగా వచ్చి మమ్మల్ని ఒడ్డుకు చేర్చావు. ప్రాణదానం చేశావు. తిరిగి మా బలం, తేజస్సు ప్రసాదించావు. నిన్ను చూస్తూ ఉంటే నా తండ్రి దశరథ మహారాజును నా తాతగారైన 'అజ' మహారాజును చూస్తున్నట్లుగా ఉంది.

ఓ రూపవంతుడా! దివ్యపుష్ప మాలికల్ని, దివ్యాభరణాల్ని ధరించావు. నీ నుండి సుగంధాలు పెల్లుబికి వస్తున్నాయి. నిర్మలమైన పట్టువస్త్రాలను ధరించావు. నీవెవరవు?" అని అడిగాడు.

రాముని ప్రశ్నలకు ఆ తేజోవంతుడు, పక్షిరాజు అయిన గరుత్మంతుడు సంతోషంతో, "ఓ రామా! నేను నీ స్నేహితుణ్ణి. నిన్ను సంతోషపెట్టడానికే వచ్చాను. నిజానికి నిన్ను సంతోషపెట్టడం నా విధి. నేను బయట సంచరించే వాటన్నింటికీ ప్రాణంలాంటివాణ్ణి. నన్ను అందరూ గరుత్మంతుడు అని అంటారు. నీకు సహాయం చెయ్యాలనే వచ్చాను. క్రూరాత్ముడైన ఇంద్రజిత్తు ప్రయోగించిన మాయానాగపాశాలు చాలా శక్తిమంతమైనవి. వాటి నుండి అసురులు గాని, మహా బలశాలురైన దేవతలుగాని, దేవేంద్రుడితో సహా దేవతలు, గంధర్వులు, కూడా విడిపించుకొని బైట పడలేరు. కరుకైన కోరలతోను, భయంకరమైన విషంతోను కూడుకున్న 'నాగులు' అనే మహాసర్పాలను ప్రయోగించాడు. ఈ నాగులందరూ కద్రువకు పుట్టినవాళ్ళు. ఇంద్రజిత్తు తన మాయా ప్రభావం చేత వారందర్నీ బాణాలుగా మార్చి మీ మీద వదిలాడు. ఓ

రామా! నీవు ధర్మజ్ఞుడవు కావటం వల్ల నీ పరాక్రమం ఎన్నటికీ వ్యర్థం అయిపోదు. ఈ యుద్ధంలో నీవు నీ సోదరుడు ఇద్దరూ జయిస్తాను. ప్రజాకంటకులైన రాక్షసులందర్నీ సంహారం చేస్తారు.

ఓ రామా! ఇంద్రజిత్తు మీ ఇద్దర్నీ నాగపాశాలతో బంధించాడని తెలియగానే స్నేహధర్మాన్ని పాటించి వచ్చేశాను. మిమ్మల్ని ఈ నాగపాశాల నుండి విడిపించాను. ఇకపైన ఏమరపాటు లేకుండా శత్రుసంహారం చెయ్యండి. మీరేమో పరిశుద్ధులు, ఋజుస్వభావం (వక్రబుద్ధి లేకపోవటం) గలవాళ్ళు. మాయలు చేయటం, వక్రబుద్ధితో, కపటత్వంలో యుద్ధం చేయటం రాక్షసులకు స్వభావం. కాబట్టి మీరంతా ఏమరిపాటుతనం లేకుండా ఉండాలి.

ఓ రామా! నీవు ధర్మాత్ముడవు. శత్రువులను కూడా ప్రేమించేవాడవు. ఓ మిత్రుడా నాకు అనుజ్ఞ ఇవ్వు. నేను వెళ్ళివస్తాను. నేను ఎవరినో తెలుసుకోవాలనే ప్రయత్నం చెయ్యకు. ముందు యుద్ధం చెయ్యి. శత్రు సంహారం చేసిన తర్వాత అన్నీ నీకే తెలుస్తాయి. నీ బాణాల ధాటికి వృద్ధులు, పిల్లలు మాత్రమే జీవించి ఉంటారు. మిగిలిన రాక్షసులంతా మరణిస్తారు. పిమ్మట నీవు సీతను పొందుతావు."

గరుత్మంతుడు ఈ విధంగా మాట్లాడి, వానరులందరి మధ్యా రాముని బాధలన్నింటినీ నివృత్తి చేసి, రామునికి ప్రదక్షిణ నమస్కారం చేసి, కౌగిలించుకొని వాయువేగంతో ఆకాశంలోకి ఎగిరి వెళ్ళిపోయాడు. పిమ్మట, రాముడు బాధలన్నింటి నుండి విముక్తుడైనాడని తెలుసుకున్న వానర నాయకులంతా సింహనాదాలు చేశారు. వానర వీరులు కూడా భేరీలు రెండింతలుగా మోగించారు. మృదంగాలు వాయించారు. శంఖాలు పూరించారు. తోకలు ఝాడించి నేలకేసి కొట్టారు. జబ్బలు చరిచి యుద్ధానికి సన్నద్ధులయ్యారు. వృక్షాలను పెళ్ళగించి భుజాన ధరించారు. వానరయోధుల యుద్ధోన్మాదం చూసిన నిశాచరులైన రాక్షసులు భయపడిపోయారు. అర్ధరాత్రి పూట వానరులు చేస్తున్న మహాధ్వనులు, గ్రీష్మఋతువు అయిపోయిన తర్వాత ఉరిమే తొలకరి మేఘాల ఉరుముల్లాగా, మహాభయంకరంగా ఉన్నాయి.

# 51వ సర్గ రాముడు బంధవిముక్తు డవడం

వానర వీరులంతా కోలాహలంగా గంతులు వేస్తూ సింహనాదాలు చేస్తూన్న ధ్వనులన్నీ సభాభవనంలోకి దూసుకుపోయాయి. వానరులంతా ఎందువల్ల ఇంత సంతోషంగా ఉన్నారో రావణాసురుడికి అంతుబట్టలేదు. మంత్రులతో రావణుడు ఇలా అన్నాడు: "మంత్రిసత్తములారా! రామలక్ష్మణు లిద్దరూ చనిపోయి యుద్ధ భూమిలో పడి ఉన్నారు. వాళ్ళ నాయకుడు చనిపోవటం వల్ల వానరులంతా దుఃఖిస్తూ ఉండాలేగాని, ఇట్లా సంతోషంగా ఉంటూ, యుద్ధోన్మాదులై సింహనాదాలు చేస్తున్నారు. అసలు బయట ఏం జరుగుతుందో తెలుసుకొని రండి." అంతట ఆ మంత్రులందరు వెంటనే ప్రాకారం పైకి ఎక్కి చూశారు. రామలక్ష్మణులు భయంకరమైన నాగపాశాల్నుండి విడిపించుకొని ఉత్సాహంగా సైన్యాలను యుద్ధానికి సన్నద్ధుల్ని చేస్తూ ఉండటం చూశారు. మంత్రులంతా భయపడిపోయారు. యుద్ధం ముగిసిందని సంతోషపడుతున్న తరుణంలో మళ్ళీ యుద్ధ మేఘాలు కమ్ముకు రావటంతో వాళ్ళంతా కలవరపడిపోయారు. ముఖాలు వేళ్ళాడేసుకుని రావణాసురుడి దగ్గరికి వెళ్ళారు. వాళ్ళందరికీ ప్రభువు మనస్తత్వం బాగా తెలుసు. అప్రియమైన విషయమైనా ప్రియంగా చెప్పాలి. లేకపోతే వాళ్ళ తలలు కోట గుమ్మానికి వేళ్ళాడ కడతాడని వాళ్ళకు బాగా తెలుసు.

"రాజా! యుద్ధంలో ఇంద్రజిత్తు చేతుల్లో చిత్తుగా ఓడిపోయి, నాగపాశానికి కట్టుబడి చచ్చిపడున్న రామలక్ష్మణులు కట్టు తాళ్ళు తెంచుకున్న మదపుటేనుగులాగా విచ్చలవిడిగా తిరగటం మేమంతా చూశాం" అన్నారు. మంత్రులు చెప్పిందంతా రావణాసురుడు విన్నాడు. మనసులో కలవరం బయలుదేరింది. ముఖం చిన్నబోయింది. దిగులు పట్టుకుంది. 'ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగపాశం నుండి తప్పించుకోవటానికి దేవేంద్రుడికైనా సాధ్యం కాదే! అటువంటి అమోఘమైన అస్త్రాన్ని కఠోర తపస్సు చేసి సంపాదించాడు. తేజస్సులో సూర్యుడితో సమానమైనవి. భయంకకర విషసర్పాలతో సమానమైనవి. ఆ బాణాలు వాసుకి తేజస్సుతో సమానమైనవి. ఇంద్రజిత్తు లోగడ అనేక యుద్ధాల్లో అనేకమందిపై ప్రయోగించాడు. వాళ్ళల్లో

ఒక్కడు కూడా బ్రతికి బయటపడలేదు. రామలక్ష్మణు లిద్దరూ నాగపాశాల నుండి బంధవిముక్తులయ్యారంటే రాక్షస సైన్యానికి పెద్దగా ప్రాణనష్టం వాటిల్లేట్లుంది.' ఇట్లా తనలో తానే అనుకుంటూ మహాసర్పంలాగా నిట్టూర్పులు విడిచాడు. కృద్ధుడైపోయాడు. ధూమ్రాక్షుణ్ణి చూస్తూ, రావణుడు, "ఓ ధూమ్రాక్షుడా! నీవు భయంకరమైన పరాక్రమం కలవాడవు. నీవు వెంటనే గొప్ప సైన్యాన్ని వెంటబెట్టుకొనివెళ్ళి ఆ రామలక్ష్మణుల్ని, వానరుల్ని సమూలంగా నాశనం చేసిరా!" అన్నాడు.

అంతట ధూమ్రాక్షుడు రావణుడికి శిరస్సు వంచి నమస్కారం చేసి యుద్ధోత్సాహంతో ఆ రాజ సభ నుండి బయటకు వచ్చాడు. గొప్ప సైన్యాన్ని వెంటబెట్టుకొని యుద్ధానికి బయలుదేరాడు. ఆ నిశాచరయోధులంతా నడుముకు గొలుసులు కట్టుకున్నారు. వాళ్ళందరూ, శూలాలు, ముద్గరాలు, మొదలైన భయంకరమైన ఆయుధాల్ని చేత పట్టుకున్నారు. వీళ్ళే కాకుండా అనేకమంది రాక్షసయోధులు గదలు, ఇనుప దండాలు, ఇనుప గుదియలు, ముసలాలు, బల్లెములు, ఈటెలు, గండ్రగొడ్డళ్ళు తీసుకొని పెద్దపెట్టున సింహనాదాలు చేస్తూ బయలుదేరారు. రథాలన్నింటికీ కంచరగాడిదల్ని పూన్చారు. ఆ రథాలకు బంగారు కిటికీలు, ధ్వజాలు అమర్చబడ్డాయి. పెద్దపులుల్లాంటి రాక్షసయోధులు కొందరు గుర్రాలపైనా, ఏనుగులపైనా బయలుదేరారు.

ధూమ్రాక్షుడి రథానికి తోడేలు ముఖం, సింహంవంటి ముఖాలున్న కంచర గాడిదల్ని పూన్చారు. ఆ రథం భయంకరమైన ధ్వనులు చేస్తూ బయలుదేరింది. రాక్షస సైన్యం అంతా అతణ్ణి అనుసరించింది. ధూమ్రాక్షుడు ముందుగా పశ్చిమ ద్వారం వద్ద వానర సేనల్ని అటకాయించాలని నిర్ణయించుకొని ఆ దిక్కుగా చిద్విలాసంగా బయలుదేరాడు. హనుమంతుడు ఏ ద్వారం దగ్గర సేనాపతిగా ఉన్నాడో, ఆ పశ్చిమ ద్వారం గుండా ధూమ్రాక్షుడు బయటకొచ్చాడు. అతి క్రూరుడు, భయంకరుడు అయిన ఆ ధూమ్రాక్షుడు గాడిదలచే లాగబడుతున్న రథంపై మహాశబ్దాలు చేసుకుంటూ వెళ్తూ ఉంటే ఆకాశంలో క్రూరమైన

శకునాలు కనిపించాయి. రథంపైన భయంకరమైన గ్రద్ద ఒకటి వ్రాలింది. రాబందుల గుంపు రథానికి ప్రదక్షిణలు చేసింది. గుర్తు తెలియని మొండె మొకటి రక్తం కోరుతూ ధూమ్రాక్షుని రథం ప్రక్కగా వచ్చిపడింది. మేఘాలు రక్తాన్ని వర్షించాయి. పెద్ద పెద్ద ధ్వనులు చేస్తూ పిడుగులు పడ్డాయి. రథానికి ఎదురు గాలి వీచసాగింది. దిక్కులన్నీ చీకట్లు కమ్మాయి. ఈ శకునాలన్నీ చూసి ధూమ్రాక్షుడి మనస్సు కలత చెందింది. ఈ వానరుల వల్ల రాక్షస సైనికుల మనసులో కూడా మరణ భయం చోటు చేసుకొన్నది. రామాజ్ఞలను పాలించేవారు, మహాబలశాలురు అయిన వానర సేనల్ని ధూమ్రాక్షుడు చూశాడు.

# 52వ సర్గ హనుమంతుడు ధూమ్రాక్షుని వధించటం

ధూమ్రాక్షుడు, భయంకరమైన సైన్యంతో తమ పైకి దూసుకు రావడం వానర సేన అంతా చూసింది. యుద్ధం చెయ్యాలన్న కోరికతో వచ్చిన వానరులంతా తమ కలలు నిజమవుతున్నాయని సంతోషంతో సింహనాదాలు చేశారు. రాక్షసులకు వానరులకు మధ్య పోరు ప్రారంభం అయింది. రాక్షసులంతా శూలాలతోను, ముద్గరాలతోను యుద్ధానికి దిగారు. అటు వానరులంతా చెట్లతోను, రాళ్ళతోను, రాక్షసుల్ని ఎదుర్కొన్నారు. ఒకళ్ళ నొకళ్ళు ఘోరంగా కొట్టుకున్నారు. క్రూరాత్ములైన రాక్షసులు అనేకమంది వానరుల శిరస్సుల్ని ఖండించారు. వానరులు చెట్ల కొమ్మల్తో రాక్షసుల తలలు పగులకొట్టారు. వానరులు తమతో సరిసమానంగా యుద్ధం చేస్తూ ఉండటంతో రాక్షసులకు కోపం కట్టలు తెంచుకొచ్చింది. దాంతో వాళ్ళు కలకపక్షి రెక్కల్తో చేసిందీ, సూటిగాపోయేవీ అయిన వాడిగల బాణాల్ని ఆ వానరులపై వదిలారు. ఆ బాణ వర్షానికి చాలామంది. వానరులు హతులయ్యారు. ఒక్క బాణాల్తోనే కాకుండా గదలతోను, పట్టిసాలతోను, ముద్గరాలతోను, కూటాలతోను వానరుల్లో చాలామందిని కొట్టి చంపేశారు.

భయం అనేదే ఎరుగని ఆ వానరవీరులు ఎంతమాత్రం జంకలేదు; వెనక్కు తగ్గలేదు. పైపెచ్చు రెట్టించిన రోషంతో అమాంతం రాక్షసులపై పడి కోరల్తో పీకారు. గోళ్ళతో రక్కారు. ఎక్కడెక్కడి నుండియో పెద్దపెద్ద రాళ్ళను పెళ్ళగించుకొని వచ్చి రాక్షసుల తలలపై పడేట్లు విసిరేశారు. సింహనాదాలు చేశారు. అట్లా సింహనాదాలు చేస్తూ తమ పేర్లు చెప్పుకున్నారు. వానరులు విసిరిన రాళ్ళ దెబ్బలకు రాక్షసుల తలలు పగిలాయి. కొంతమందిని బాహువుల్తోనే చితక్కొట్టారు. సాధారణంగా నెత్తురు తాగే రాక్షసుల్ని నెత్తురు కక్కుకునేట్లుగా కొట్టారు. కొందరు వృక్షాలు పీక్కొచ్చారు. వృక్షాలతో కొడ్తూ ఉంటే రాక్షసులు కుప్పలు కుప్పలుగా నేలకొరిగారు. రాళ్ళదెబ్బలకు వాళ్ళ తలలు గుర్తు పట్టలేనంతగా చితికిపోయాయి. వానరులు స్వేచ్ఛగా విసుర్తున్న రాళ్ళు కొన్ని రాక్షసుల తలలు పగులకొట్టూ ఉంటే కొన్ని పోయి రథానికి కట్టిన ధ్వజాలను విరగ్గొట్టాయి; కంచర గాడిదల్ని నేలకూల్చాయి. పర్వతం లాంటి రాళ్ళదెబ్బలకు

తట్టుకోలేక పర్వతాల్లాంటి ఏనుగులు, ఏనుగులపై నున్న రాక్షసవీరుల్నీ నేలకూల్చాయి. అందులో కొన్ని రాళ్ళు గుర్రాలకు తగిలాయి. రాళ్ళ దెబ్బలకు గుర్రాలు, గుర్రాలపై ఉన్న రాక్షస వీరులు కూడా చచ్చి నేలకొరిగారు. ఆ విధంగా ఏనుగులు, గుర్రాలు, రాక్షసవీరులు చచ్చి గుట్టలు గుట్టలుగా పడి ఉన్నారు. అమిత పరాక్రమవంతులైన వానర వీరులు ఒక గెంతులో రాక్షసులపై ఒక పర్వతం లాగా పడి వాళ్ళందర్నీ నేలకూల్చారు. కొందర్ని గోళ్ళతో రక్కి కోరల్తో పీకి చంపారు. అట్లా పడిపోయిన రాక్షసుల్లో కొందరు జుట్టు విరచుకొని నెత్తురు మడుగుల్లోపడి మూర్ఛపోయి కనిపించారు. కృద్ధులైన రాక్షసులు కూడా వజ్రాయుధాల వంటి వారి బాహువుల్తో వానరుల్ని కొట్టారు. అందుకు ప్రతీకారంగా వానరులు కూడా తమ బాహుబలాన్ని రాక్షసులకు చూపించారు. బాగా దెబ్బలుతిన్న యోధులు ఇరుపక్షాల్లోనూ పరుగులు పెట్టారు.

రాక్షస శ్రేష్ఠుడైన ధూమ్రాక్షుడు తన సేనలో చాలామంది రాక్షసులు హతులవడం చూశాడు. కుపితుడైపోయాడు. రెట్టించిన ఉత్సాహంతో యుద్ధం చేస్తున్న వానరుల్ని చూసి ఈర్ష్యపడ్డాడు. వానరుల్ని చంపేందుకు తానే స్వయంగా బయలుదేరాడు. తనవెంట వచ్చిన రాక్షసవీరులు వానరుల్ని ఈటెలతో పొడిచారు. కొందర్ని ముద్గరతో కొట్టారు. ఆ దెబ్బలకు వానరుల్లో చాలామందికి గాయాలయ్యాయి. నెత్తురు మడుగుల్లో పడిపోయారు. వానరులు పెద్ద సంఖ్యలో చావడంతో, రెట్టించిన ఉత్సాహంతో రాక్షసులు భిందిపాలములతోను, పట్టిసాలతోను వానరుల్ని కొట్టారు. త్రిశూలాలతో పొడుస్తూ ఉంటే వానరుల ప్రేగులన్నీ బయటకు వచ్చాయి. కొందరు వానరుల్ని తరిమికొట్టారు. ఇరుపక్షాల మధ్య యుద్ధం భీకరంగా సాగింది. రెండు పక్షాల్లోనూ అపారప్రాణ నష్టం సంభవించింది.

ఆ భయంకర యుద్ధ వాతావరణంలో వింటినారి ధ్వనులే వీణానాదాలుగాను, గాయాల్తో బాధపడుతున్నవారి ఎక్కిళ్ళే తాళధ్వనులుగాను. అపస్మారకంగా పడివున్న యోధుల మూలుగులే మంద్ర స్వరంలో సంగీతంగాను, గాంధర్వ గానాన్ని అధిగమించాయి.

ధూమ్రాక్షుడు ధనుస్సు చేత బుచ్చుకొని చిద్విలాసంగా నవ్వుతూ వానరులపై బాణాల

వర్షం కురిపించాడు. ఆ బాణాల ధాటికి తట్టుకోలేక వానరులంతా పరుగులు పెడ్తూ ఉంటే, ఆ ధూమ్రాక్షుడు పడిపడి నవ్వాడు. అట్లా పరుగులు పెడ్తూన్న వానర సైన్యాన్ని హనుమంతుడు చూశాడు. దూమ్రాక్షుడిపై చెప్పలేనంత కోపం వచ్చింది. వాయుదేవుడితో సమానమైన పరాక్రమం గల హనుమంతుడి కళ్ళు చింతనిప్పుల్లా ఎర్రబడ్డాయి. సూదికిమల్లే మొనదేరిన పెద్ద బండరాయి నొకటి అమాంతం ధూమ్రాక్షుడి రథంపైన వేశాడు. ఆకాశంలో నుండి వస్తున్న ఆ బండను ధూమ్రాక్షుడు చూశాడు. కొద్ది క్షణాల్లో తన రథం పిండి పిండి కాబోతోందని గ్రహించాడు. వెంటనే నేలపైకి దూకాడు. అతడు నేలపైకి దూకగానే ఆ రాయి వచ్చి ధూమ్రాక్షుడి రథం పైపడింది. రథ ధ్వజం విరిగింది. రథచక్రాలన్నీ నుగ్గు నుగ్గు అయ్యాయి. పిమ్మట హనుమంతుడు ఒక పెద్ద వృక్షాన్ని వేళ్ళతో సహా పెకలించి, ఆ చెట్టుతో రాక్షసులందర్నీ కొట్టాడు. ఆ దాడికి రాక్షసుల శిరస్సులు పగిలాయి; రాక్షసులంతా కాళ్ళకు బుద్ధిచెప్పి ప్రాణరక్షణకై పరుగులు పెట్టారు. అంతట హనుమంతుడు మరో పెద్దరాయిని పెళ్ళగించి ధూమ్రాక్షుడిపైకి పరుగెత్తాడు. అప్పుడు మహాపరాక్రమవంతుడైన ధూమ్రాక్షుడు చేతిలోని గదను తీసుకొని హనుమంతుడిపై విసిరాడు. ఆ గద వచ్చి హనుమంతుడి నెత్తిపైన పడ్డది. హనుమంతుడు ఆ దెబ్బకు చలించనైనా చలించకుండా, చేతిలో ఉన్న రాయిని ధూమ్రాక్షునిపైకి విసిరాడు. అది ధూమ్రాక్షుడి శిరస్సుపై పడింది. ఆ దెబ్బకు ధూమ్రాక్షుడి అవయవాలన్నీ విరిగిపోయాయి. ప్రాణాలు కోల్పోయాడు. ధూమ్రాక్షుడు చనిపోవటం కళ్ళారా చూసిన రాక్షసులంతా భయంతో పరుగులు పెట్టారు. శత్రుసంహారం చేసి, శత్రువుల నెత్తుర్ని వరదలై పారేట్లు చేసిన వాయుపుత్రుడైన హనుమంతుణ్ణి వానరులంతా పూజించారు.

# 53వ సర్గ వజ్రదంష్ట్రునితో యుద్ధం

హనుమంతుడు ధూమ్రాక్షుణ్ణి చంపాడని విన్న రావణాసురుడి కోపానికి అవధుల్లేకుండా పోయింది. పగపట్టిన నాగుపాములాగా బసుకొట్టాడు. మాయావి అయిన వజ్రదంష్ట్రుణ్ణి పిలిచాడు. "ఓ వీరుడా! నీవు సైన్యాన్ని వెంటబెట్టుకొని వెళ్ళి ధూమ్రాక్షుణ్ణి చంపిన హనుమంతుణ్ణి చంపిరా. అట్లాగే సుగ్రీవుణ్ణి వాని వానరసైన్యాన్నీ కూడా మట్టుపెట్టిరా" అన్నాడు. వజ్రదంష్ట్రుడు ప్రభువాజ్ఞను శిరసావహించి వెంటనే హనుమంతుడిపైకి యుద్ధానికి బయలుదేరాడు.

ఏనుగులు, గుర్రాలు, రథాలు, కంచరగాడిదలు, ఒంటెలు, రకరకాలైన పతాకాలు, ధ్వజాలతో కూడిన రథాల్ని, లక్షలకొద్దీ రాక్షస సైన్యాన్ని వెంటబెట్టుకొని వజ్రదంష్ట్రుడు బయలుదేరాడు. ఆ వజ్రదంష్ట్రుడు ధగధగ మెరిసిపోయే బంగారు కిరీటాన్ని ధరించాడు. చేతులకు భుజాలకు పట్టెలు, బంగారు కవచం, ధనుస్సు ధరించి, రథానికి ప్రదక్షిణం చేసి పిమ్మట రథాన్ని అధిరోహించాడు. వజ్రదంష్ట్రుడు ఆ విధంగా రథంలో వెళ్తూ ఉంటే, సేవకులంతా కాలినడకన అనుసరించే వాళ్ళంతా లాఠీలను, పట్టిసాలను, ముసలాలను, భిరిడివాలను, పాశములను, శక్తులను గదలను, చక్రాయుధాలను, గండ్ర గొడ్డళ్ళను, ధరించి వజ్రదంష్ట్రుణ్ణి అనుసరించారు. ఏనుగుల మీద నుండి యుద్ధం చేసే వీరులంతా, తోమరాలను, అంకుశాలను తీసుకొని బయలుదేరారు. జయమే లక్ష్యంగా పెట్టుకొని ముందుకుపోతున్నాను. వర్షాకాలంలో ఉరుముల్తోను, మెరుపుల్తోను పరుగులు పెట్టే మేఘాల్లాగా ఉన్నారు. భయం లేకుండా కదలిపోతున్న మదపుటేనుగులన్నీ కదలిపోతున్న పర్వతాల్లాగా ఉన్నాయి. తళతళా మెరిసిపోయే ఆయుధాల్ని ధరించిన రాక్షస వీరులంతా యుద్ధం చేయటానికి ఉత్సాహం చూపిస్తూ సింహనాదాలు చేస్తూ, లంకాపట్టణానికి దక్షిణ ద్వారం వైపుగా బయలుదేరిపోయారు.

రాక్షస సేనలు ఉత్సాహంతో ఉరకలు వేస్తూ అట్లా ముందుకు పోతూ ఉంటే వాళ్ళకు కూడా దుశ్శకునాలు కనిపించాయి. ఆకాశం నుండి ఎర్రగా కాలే కొరవులు కిందపడ్డాయి.

నక్కలు భయంకరంగా నిప్పులు చెరుకుతున్నట్లుగా అరుస్తున్నాయి. భయంకర మృగాలు రాక్షసులు కీడును సూచిస్తూ అరిచాయి. ఈ శకునాలన్నీ రాక్షసుల్లో కొంత భయోత్పాతం కలిగించాయి. వాళ్ళు భీతి చెందారు. ఎవరికివారే మానసికంగా క్షోభననుభవించారు. వజ్రదంష్ట్రుడు కూడా ఈ భయోత్పాతాలను చూశాడు. కానీ లెక్కచెయ్యలేదు. మహాపరాక్రవంతుడు, అమిత బలవంతుడు కావటాన, రాక్షస సేన ధైర్యాన్ని నీరు కార్చకూడదనుకున్నాడు. సైనికులందరికీ ధైర్యాన్ని కలిగించే మాటలే చెప్పాడు.

అంతవరకు జయాన్నే పొందుతూ వస్తున్న వానర సేనలు, మరల రాక్షసులు కొత్త సేనతో, కొత్త నాయకుడితో యుద్ధానికి రావడం చూశారు. దిక్కులు పిక్కటిల్లేటట్లుగా సింహనాదాలు చేశారు. మహాబలవంతులైన వానరులు, మహాభయంకరులైన రాక్షసులు కలియబడ్డారు. యుద్ధం ప్రారంభం అయింది. ఎవరికి ఎవరూ తీసిపోకుండా యుద్ధం చేస్తున్నారు. ఒక్కళ్ళనొకళ్ళు చంపుకొంటున్నారు. ఇరుపక్షాల వారికి కాళ్ళు చేతులూ విరిగాయి. మెడలు విరిగాయి శవాలన్నీ నెత్తురు మడుగుల్లో తేలుతున్నాయి. నెత్తురు మాంసము, మట్టి కలిసి బురదగా మారిపోయింది. కాలుపెడ్తే జారిపోయే ట్లుంది. వానరులు చెట్లతోను, రాళ్ళతోను యుద్ధం చేశారు. రాక్షసులు రకరకాలైన మారణాయుధా లతో యుద్ధం చేశారు. వానరులకు గోళ్ళూ, కోరలు, చేతులే ఆయుధాలయ్యాయి. పిడికిళ్లతో గుద్దారు; అరచేతుల్తో చరిచారు. కాళ్ళతో తన్నారు. గోళ్ళతో రక్కారు, కోరల్తో పీకారు. ఈ విధంగా అనేకమంది రాక్షస వీరుల్ని చంపేశారు. అట్లాగే వానరయోధులు కూడా చచ్చి నేలకొరిగారు.

వజ్రదంష్ట్రుడు వాడి అయిన బాణాల్ని వానరులపై సంధించి వాళ్ళను చంపాడు. పాశాలతో విహరించే యమధర్మరాజు లాగా కనిపించాడు. ఆయుధాలతో యుద్ధం చేయటంలో ఆరితేరిన రాక్షసులు ఎక్కువమంది వానరుల్ని బాధలుపెట్టారు. వానరుల్ని నిర్దాక్షిణ్యంగా చంపారు. చిన్నచిన్న మృగాల్ని పట్టి వేధించే సింహంలాగా అంగదుడు రాక్షసుల్లో అనేకమందిని చంపాడు. దేవేంద్రుడి వంటి పరాక్రమం గల అంగదుడు భయంకరంగా పోట్లాడాడు.

అంగదుడు పెద్దపెద్ద వృక్షాల్ని పెళ్ళగించి వాటితో రాక్షసుల్ని కొట్టాడు. ఆ దెబ్బలకు మొదలు నరికిన చెట్టులా రాక్షసులంతా నేలకూలారు. చనిపోయిన శవాలు, విరిగిపోయిన రథాలు, ముక్కలైపోయిన రథ ధ్వజాలు, పతాకాలు, ఇరుపక్షాల సైనికుల శవాలతోను రక్తపుమడుగులతోను ఆ యుద్ధ భూమి అంతా మహా భయంకరంగా తయారైంది. ఆ రాక్షసులు ధరించిన హారాలు, కవచాలు, ఆభరణాలు రంగు రంగుల దుస్తులతో, రకరకాల ఆయుధాలతో ఆ యుద్ధభూమి అంతా కూడా నక్షత్రాలతో కూడిన శరత్కాల రాత్రివలె ఉంది. అంగదుడి పరాక్రమానికి రాక్షససేనలన్నీ గాలికి మేఘాలవలె పరుగెత్తారు.

# 54వ సర్గ వజ్రదంష్ట్రుని మరణం

అంగదుడు రాక్షస సైన్యాన్ని చీల్చిచండాడుతూ ఉండటం చూసిన వజ్రదంష్ట్రుడికి కోపం కట్టలు తెంచుకుంది. మహేంద్రుడి వజ్రాయుధంలాగా వింటి నారిని సంధించి భయంకరమైన ధ్వనులు చేస్తూ, పారిపోతున్న రాక్షసులకు ధైర్యం కలిగేట్లు చేశాడు. ఒక్క క్షణం కూడా వృథాచెయ్యకుండా వానరులపై బాణాల వర్షం కురిపించాడు. వజ్రదంష్ట్రుడే కాకుండా అనేకమంది ఇతర రాక్షసయోధులు రథాలపై వానరుల్ని చుట్టుముట్టి హతమార్చారు. మహాబలవంతులు, శూరులు అయిన వానరులు వృక్షాలతోను, రాళ్ళతోను కొట్టి చాలామంది రాక్షసుల్ని చంపారు. ఇరుపక్షాల వారి మధ్య ఘోరమైన యుద్ధం జరిగింది. తలలు తెగినవాళ్ళు కాళ్ళుచేతులు విరిగినవాళ్ళు, దెబ్బలతో ఒళ్ళంతా రక్తం కారుతున్న వాళ్ళు, చచ్చి నేలపై పడిపోయినవాళ్ళు అనేకమంది ఉన్నారు. వాళ్ళ శవాల కోసం గద్దలూ, రాబందులూ, కాకులూ గుంపులు గుంపులుగా వచ్చి వాలాయి. ఆ పక్షి సమూహాలన్నీ శవాలపై వాలి వాటిని కప్పేశాయి.

వజ్రదంష్ట్రుడి కళ్ళెదటనే అనకమంది రాక్షసవీరుల్ని వానరులు చంపటం జరిగింది. రాక్షసులంతా భయంతో పురుగులు పెట్టసాగారు. ఇదంతా స్వయంగా చూస్తున్న వజ్రదంష్ట్రుడికి కోపం, రోషం కట్టెలు తెంచుకున్నాయి. ధనుస్సు చేతిలోకి తీసుకున్నాడు. ధనుష్టంకారం చేశాడు. కంకపక్షి రెక్కల్తో సూటిగాపోయే బాణాల్ని వదలి వానరుల్ని చిత్రవధలకు గురిచేశాడు. ఒక్కొక్క బాణాన్ని అయిదుగురు, ఏడుగురు, ఎనిమిది మంది, తొమ్మిదిమంది వానరులపైకి ఒకేసారి వదిలాడు. పరాక్రమవంతుడైన ఆ వజ్రదంష్ట్రుడు ఆ విధంగా విచిత్రమైన రీతిలో బాణాల్ని ప్రయోగిస్తూ వానరులందరినీ చంపసాగాడు. వానరులంతా భయంతో పారిపోయారు. దేవతలంతా బ్రహ్మదేవుడి చుట్టూ మూగినట్లుగా, ఆ వానరులంతా అంగదుడి చుట్టూ చేరారు. వానర సైన్యాలు ఛిన్నాభిన్నం కావటం చూసిన అంగదుడు తన కోసమే ఎదురుచూస్తున్న వజ్రదంష్ట్రుణ్ణి ఢీకొన్నాడు.

అంగదుడు, వజ్రదంష్ట్రుడు ఇద్దరూ పరమ కృద్ధులయ్యారు. సింహాలు మదపుటేనుగులవలె వ్యవహరించారు. అప్పుడు వజ్రదంష్ట్రుడు అంగదుడి ఆయుపట్లపై వెయ్యి బాణాల్ని సంధించాడు. అంగదుడి శరీరం అంతా బాణాలు గుచ్చుకొన్నాయి. ఒళ్ళంతా నెత్తురు మడుగయ్యింది. అప్పుడు అంగదుడు ఒక వృక్షాన్ని పెళ్ళగించి వజ్రదంష్ట్రుడిపైకి విసిరాడు. వజ్రదంష్ట్రుడు ఆ మహావృక్షాన్ని చూస్తూనే కలవరపడిపోయాడు. అనేక బాణాల్ని వేసి ఆ వృక్షాన్ని మధ్యలోనే ముక్కలు ముక్కలు చేశాడు. వజ్రదంష్ట్రుడి పరాక్రమాన్ని చూసిన అంగదుడు ఆశ్చర్యపోయాడు. అంతట ఒక ఈ పర్వతంలాంటి వెడల్పైన శిలను ఎత్తి వజ్రదంష్ట్రుడి మీదకు విసిరి సింహనాదం చేశాడు. పర్వతం లాంటి పెద్దశిల తనపైన పడబోతోందని గ్రహించిన వజ్రదంష్ట్రుడు ఒక గద తీసుకొని నేలపైకి దూకాడు. అతడు నేలపైకి దూకిన మరుక్షణంలోనే ఆ శిల వజ్రదంష్ట్రుని రథాన్ని, చక్రాలను, దానికి పూన్చిన గుర్రాలను నుగ్గునుగ్గు చేసివేసింది. ఇది ఇట్లా ఉండగా అంగదుడు మెరుపులాగా మహావృక్షాలతో ఉన్న ఒక పర్వత శిలను ఊడబెరికి వజ్రదంష్ట్రుడి తలపై పడేశాడు. అతడు అక్కడికక్కడే నెత్తురు కక్కుకొంటూ నేలపైపడి మూర్ఛపోయాడు. అప్పుడు అంగదుడు పోయి అతడి ఎదుట నిలబడ్డాడు. మూర్ఛ నుండి తేరుకున్న వజ్రదంష్ట్రుడు తన గదతో అంగదుడి వక్షఃస్థలంపై కొట్టాడు. దాంతో తృప్తి చెందనివాడై అంగదుడితో ముష్టియుద్ధానికి తలపడ్డాడు. వాళ్ళిద్దరూ ఒకర్నొకరు బాగా కొట్టుకున్నారు. ఇద్దరూ నెత్తురు కక్కుకోవటం మొదలుపెట్టారు. వాళ్ళట్లా యుద్ధం చేస్తూ ఉంటే బుధుడు, అంగారకుడు పోరాడినట్లుంది.

అప్పుడు అపరిమిత పరాక్రమవంతుడైన అంగదుడు పూలు, పండ్లు ఉన్న వృక్షాన్నొకటి పెళ్ళగించి, మళ్ళీ పోరాటానికి సిద్ధపడ్డాడు. వజ్రదంష్ట్రుడు కూడా మరొక వృక్షాన్ని పెళ్ళగించి అంగదుణ్ణి ఎదుర్కొన్నాడు. ఆ రాక్షసవీరుడు, వానరయోధుడు ఒకరినొకరు జయించాలన్న ఆకాంక్షతో చాలాసేపు పోట్లాడారు. ఇద్దరికీ ఒళ్ళంతా గాయాలయ్యాయి. ఒళ్ళంతా రక్తం కారింది. ఒంటి నిండా రక్తంతో వాళ్ళిద్దరూ విరగబూసిన మోదుగ చెట్టు లాగా శోభించారు. ఇద్దరూ బాగా అలసిపోయారు. రెప్పపాటు కాలంలో రెట్టించిన పౌరుషంతో అంగదుడు లేచి

నిలబడ్డాడు. ఒరలో నుండి మెరిసే కత్తిని తీసి వజ్రదంష్ట్రుని మెడ నరికేశాడు. వజ్రదంష్ట్రుడు మారుమాట లేకుండా నెత్తుటి మడుగులో పడిపోయాడు. ఇదంతా చూస్తున్న రాక్షసయోధులు భయపడిపోయారు. వారి గర్వం అణగారిపోయింది. భయంతో లంకాపట్టణం వైపుగా పరుగులు పెట్టారు. మహాబలవంతుడు వాలి పుత్రుడు అయిన అంగదుడు. ఆ వజ్రదంష్ట్రుణ్ణి వధించాడు. వానరసేనలందరి మన్ననలకు పాత్రుడయ్యాడు.

# 55వ సర్గ అకంపనునితో యుద్ధం

వజ్రదంష్ట్రుణ్ణి అంగదుడు చంపాడన్న వార్త విని రావణుడు సహించలేకపోయాడు. ప్రక్కనే చేతులు జోడించుకొని ఉన్న అకంపనుడితో ఇలా అన్నాడు: "అమిత పరాక్రమం గల రాక్షసుల్ని వెంటబెట్టుకొని, సమస్తమైన అస్త్రశస్త్రాలను ప్రయోగించడంలో నిపుణుడవైన నీ నాయకత్వంతో వెంటనే బయలుదేరాలి. ఉత్తముడవైన నీవు సైనికులందరికీ శిక్షకుడవు, రక్షకుడవు, నాయకుడవు; యుద్ధప్రియుడవు. ఎల్లప్పుడూ నా పురోభివృద్ధినే కాంక్షించే నీవు ఇప్పుడు యుద్ధానికి బయలుదేరి వెళ్ళాలి. ఓ అకంపనుడా! నీవు ఎదిరింప శక్యం కానివాడవు. వెంటనే బలవంతులైన రామలక్ష్మణుల్ని, సుగ్రీవుణ్ణి జయించాలి. మిగతా వానరులందరినీ సంహరించాలి." ఆ మహాబలవంతుడు మహాపరాక్రమవంతుడు, రాక్షస సేనాధ్యక్షుడు అయిన అకంపనుడు క్షణాల్లో రాక్షస సైన్యాన్నంతా సిద్ధం చేశాడు. అకంపనుడే స్వయంగా యుద్ధానికి నాయకత్వం వహించటం వల్ల భయంకరమైన ఆకారాలు గలవాళ్ళు, భయంకరమైన నేత్రాలు గలవాళ్ళు అయిన రాక్షసయోధులంతా రకరకాలైన ఆయుధాల్ని పుచ్చుకొని యుద్ధానికి సిద్ధమై వచ్చారు. మేఘ గర్జనలవంటి మహాధ్వనులతోను, మేఘవర్ణంతోను, ధగధగలాడే బంగారు కుండలాలతోను వెలిగిపోతూ బయలుదేరాడు. అతడి వెనకాలే పెద్ద రాక్షససైన్యం కదలివెళ్ళింది. దేవతలు సైతం ఈ అకంపనుణ్ణి యుద్ధంలో కంపింపజేయలేరు. యుద్ధంలో ఎన్ని రోజులు, సంవత్సరాలైనా కొంచెం కూడా కంపించకుండా పోరాడుతాడు. అందువల్లనే అతణ్ణి అకంపనుడు అని పిలిచేవారు. ఆ పేరుతోనే ప్రసిద్ధి చెందాడు. అకంపనుడు ఆ విధంగా రథంపై వెళ్తూ ఉంటే సూర్యుడిలాగా ప్రకాశించాడు.

యుద్ధంపై గల ఉత్సాహంతో శత్రువుల పైకి అతివేగంగా పోతున్న అకంపనుడి రథం హఠాత్తుగా నిలిచిపోయింది. గుర్రాలు ముందుకు సాగిపోలేదు. కారణం ఏమీ లేకుండానే గుర్రాల్లో ఎందుకు ఉత్సాహం తగ్గిపోయిందా? అని ఆలోచిస్తూ ఉండగా, అకంపనుడి ఎడమ కన్ను అదిరింది. మాటలు తడబడ్డాయి. ముఖంలో కళతప్పి వెలవెలబోయింది. గాలి ఎడాపెడా

వీచసాగింది. ఫెళ్ళున ఎండ కాస్తున్నా ఆకాశం అంతా మబ్బులు కమ్మాయి. పక్షులు, జంతువులు భయంకరంగానూ కర్ణకఠోరంగానూ అరవడం మొదలుపెట్టాయి. సింహం వంటి మూపులు గలవాడూ, పెద్దపులుల వంటి పరాక్రమంతో వెలిగిపోయే ఆ అకంపనుడు ఈ శకునాలు చూసినా, ఏమీ పట్టించుకోకుండా యుద్ధోత్సాహంతో ముందుకుపోయాడు. అకంపనుడు మహాసైన్యంతో బయలుదేరగానే సముద్రం కంపిస్తోందా అన్నట్లు పెద్దపెద్ద శబ్దాలయ్యాయి. ఆ ధ్వనులు వింటూనే, వానర సైన్యం అంతా భయపడిపోయింది. అయితే వానరులంతా వృక్షాలు, పెద్దపెద్ద రాళ్ళు చేతపుచ్చుకొని యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డారు. రాముడి కోసం వానరులు, రావణాసురుడికి కోసం రాక్షసవీరులు తమ తమ ప్రాణాల్నే పణంగా పెట్టి పోరుకు సిద్ధపడ్డారు. యుద్ధం భయంకరంగా సాగింది. ఇరుపక్షాల్లోను మహాబలశాలురు, మహా పరాక్రమశాలురే పాల్గొన్నారు. ఉభయ పక్షాల్లోనూ పర్వతాకారులే ఉన్నారు. వానరులందర్నీ తుదముట్టించాలని రాక్షసయోధులు ఆకాంక్షించారు. అట్లాగే రాక్షసవీరులందర్నీ తుదముట్టించాలని వానరయోధులు కృతనిశ్చయులయ్యారు. ఆ మహాబలశాలురు అందరూ క్రోధావేశాల్తో సింహనాదాలు చేసుకుంటూ, ఒకరినొకరు కవ్వించుకుంటూ యుద్ధం చేస్తూ ఉంటే, ఆ ధ్వనులకు దిక్కులు పిక్కటిల్లాయి. ఇరుపక్షాల వాళ్ళు పాదాల తొక్కిడికి, నేలంతా దుమ్ము రేగి ఎర్రటి మేఘాల్లాగా కనిపించింది. ఆ దుమ్ములో ఎదురుకుండా ఉన్నవాళ్ళే కనిపించకుండాపోయారు. రథాలు కనిపించటం లేదు; రథికుల కవచాలూ కనిపించటం లేదు; గుర్రాలుగానీ, రథాలుగానీ కనిపించకుండా ఇరుపక్షాల వాళ్ళ పరుగులు అరుపులే తప్పించి వాళ్ళ రూపాలే తెలియడం లేదు. దుమ్మువల్ల భయంకరమైన చీకటి ఏర్పడింది. ఆ చీకట్లో (దుమ్ములో) వానరులు వానరుల్నే కొడ్తున్నారు; రాక్షసులు రాక్షసుల్నే చంపుతున్నారు. ఆ విధంగా ఒకరినొకరు తెలుసుకోకుండా చంపుకుంటూ ఉంటే నెత్తురు వరదలై పారింది. యుద్ధభూమి అంతా నెత్తురూ మాంసపు కండలూ, దుమ్ముతో కలసి బురద బురద అయిపోయింది. నేలంతా బురద కావటంలో దుమ్ము రేగడం ఆగిపోయింది. ఆ ప్రదేశం అంతా శవాలు గుట్టలు గుట్టలుగా పడి ఉన్నాయి. ఎవరి శరీరం ఎవరిదో గుర్తుపట్టడానికి వీలులేకుండా ముఖాలన్నీ చితికిపోయాయి. పరాక్రమించిన వానరులు శిలలతోను, వృక్షాలతోను విహరిస్తే,

రాక్షసులంతా గదలతోను, శక్తులతోను, ప్రాసలతోను, పరిఘలతోను, తోమరాలతోను పోరాడారు. మహాబలశాలురైన వానరులు బాహువులతో రాక్షసుల్ని కొట్టి చంపారు. రాక్షసులు కూడా అందుకు ప్రతీకారంగా వారి వారి ఆయుధాల్తో వానరుల్ని కొట్టి చంపారు.

మహాపరాక్రమశాలి అయిన అకంపనుడు రాక్షసయోధులందర్నీ పురికొల్పుతూ, వాళ్ళకు ఉత్సాహాన్ని కలిగిస్తూ యుద్ధోన్మాదుల్ని చేశాడు. ఆ విధంగా మహోత్సాహంతో మీదకు వస్తున్న రాక్షసుల చేతుల్లోని ఆయుధాల్ని ఊడపెరుక్కొని వాళ్ళను శిలలతోను చెట్లకొమ్మలతోను కొట్టి చంపారు. వానర వీరులైన కుముదుడు, మైందుడు, ద్వివిదుడు చెలరేగి యుద్ధం చేశారు. వానర వీరులంతా వృక్షాలతో కొడ్తూ ఉంటే రాక్షస వీరుల తలలు పగిలి మరణించారు. ఎక్కడ చూసినా రాక్షసుల శవాలే కుప్పలు కుప్పలుగా నేలమీద కనిపించాయి.

## 56వ సర్గ అకంపనుని వధ

యుద్ధంలో రాక్షస వీరులే అధికంగా చనిపోవడం అకంపనుడు స్వయంగా చూశాడు. క్రోధావేశపరుడయ్యాడు. ధనుస్సు సారించాడు. సారథితో “ఓ సారథీ! ఎక్కువమంది వానరులున్న చోటుకు రథాన్ని తీసుకొని వెళ్ళు, వాళ్ళందరినీ సంహరిస్తాను. చనిపోయిన రాక్షసవీరుల ఆత్మలకు శాంతిని కలిగిస్తాను. అదుగో అటు చూడు. చెట్ల కొమ్మల్తోను, రాళ్ళతోను గొప్ప యుద్ధం చేస్తున్న ఆ వానరవీరుల మధ్యకు తీసుకొనిపో. వాళ్ళందర్నీ ఒకేసారి సంహరిస్తాను” అన్నాడు. అంతట సారథి రథాన్ని వానరుల మధ్యకు తీసుకొనిపోయి నిలబెట్టాడు. అకంపనుడు ధనుస్సును ఎక్కుపెట్టి బాణవర్షాన్ని కురిపించాడు. ఎడతెరిపి లేకుండా వచ్చిపడుతున్న ఆ బాణాలకు వానరులు తట్టుకో లేకపోయారు. భయపడిపోయారు. ప్రాణరక్షణకై పరుగులు తీశారు. అకంపనుడి బాణాలు వానరుల పాలిట మృత్యుదేవత కావటం దూరం నుండీ హనుమంతుడు చూశాడు. ఆ మహాబలవంతుడు ఒక్క గంతులో అకంపనుడున్న చోటుకు చేరుకున్నాడు. హనుమంతుణ్ణి చూడగానే వానర వీరులందరికీ ప్రాణాలు లేచివచ్చినట్లయింది. పరుగులు పెట్టడం మానుకున్నారు. మళ్ళీ నిలబడి యుద్ధం చెయ్యడం ప్రారంభించారు.

అకంపనుడు హనుమంతుడిపై దేవేంద్రుడు కురిపించే వర్షధారల్లాగానే, బాణాల వర్షాన్ని కురిపించాడు. ఇక హనుమంతుడు తనపై కురిపిస్తున్న బాణవర్షానికి ఎంతమాత్రం లెక్కచెయ్యలేదు. ఇక ఈ అకంపనుణ్ణి అంతమొందించాలని నిశ్చయించుకున్నాడు. కోపంతో అడుగులు వేస్తున్న వాయుపుత్రుడి పాదాఘాతానికి భూమి కంపించింది. మహాతేజోవంతుడైన హనుమంతుడు సింహనాదం చేస్తూ మిట్టమధ్యాహ్నపు సూర్యుడువలె ప్రకాశించాడు. ఒక్కసారిగా అకంపనుడి మీదకు లంఘించాలనుకున్నాడు. ఇంతలో తన చేతిలో ఆయుధం ఏదీ లేదని గుర్తు వచ్చింది. వెంటనే ఒక పర్వతాన్ని పెకలించి చేత్తో పట్టుకున్నాడు. ఆ పర్వతాన్ని గిరగిరా త్రిప్పుతూ అకంపనుడి శిరస్సుపై పడేట్లు విసిరేశాడు. అది ముందే గ్రహించిన

అకంపనుడు, ఆ పర్వతాన్ని తన బాణాలతో అడ్డుకొని దాన్ని పిండి పిండిగా చేసి పారేశాడు. అది చూసిన హనుమంతుడి కోపం కట్టలు తెంచుకుంది. దగ్గర్లోనే ఒక చిన్న కొండంత ఉన్న పెద్ద ఇనుమద్ది చెట్టు నొకదాన్ని పీకాడు. మహాబలవంతుడైన హనుమంతుడు ఆ మద్దిచెట్టును గిరగిరా త్రిప్పుతూ అకంపనుడి మీదకు పరుగుతీశాడు. దారిలో ఎదురైన రాక్షసుల్ని, ఏనుగుల్ని, రథాలను ఆ మద్దిచెట్టుతో బాది వాళ్ళ తలలు పగులకొట్టాడు. మహావేగంతో పరిగెడుతున్న హనుమంతుడి తొడల తాకిడికి చెట్లు విరిగి పడిపోయాయి. నేలబీటలువారింది. కోపించిన యముడివలె అడ్డువచ్చిన వారి ప్రాణాలు తీసేస్తూ ఉంటే, చావగా మిగిలిన రాక్షసయోధులు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని పరుగులు తీశారు. ఆ విధంగా రాక్షసుల ప్రాణాలను తీస్తున్న హనుమంతుడిపై అకంపనుడికి విపరీతమైన కోపం వచ్చింది. హనుమంతుణ్ణి అంతం చెయ్యాలని నిశ్చయించుకుని సింహనాదం చేశాడు. దేహాన్ని చీల్చిపారేసే పద్నాలుగు పదునైన బాణాల్ని వదిలాడు. అట్లా తనపైన అకంపనుడు బాణాల వర్షం కురిపిస్తూ ఉంటే, హనుమంతుడు వాటిని లెక్క చేయలేదు. ఆ మహాకాయుడు, ఆ ధైర్యవంతుడు, మహాపరాక్రమవంతుడు అయిన ఆ హనుమంతుడు విరగబూసిన అశోకవృక్షం వలెను, పొగలు లేకుండా మండే అగ్నిహోత్రంలాగాను కనిపించాడు. మహావృక్షాలతో కూడిన పర్వతంలాగా నిశ్చలంగా నిలబడ్డాడు. అటువంటి సమయంలో హనుమంతుడు మరొక వృక్షాన్ని పెళ్ళగించి దాంతో అకంపనుడి శిరస్సుపై కొట్టాడు. ఆ దెబ్బకు అకంపనుడు నేలకూలాడు.

మహావీరుడు, బలశాలి, మహాపరాక్రమశాలి అయిన అకంపనుడు చచ్చి నేలపై పడి ఉంటే రాక్షసయోధులంతా భయంతో, భూకంపానికి చెట్లవలె, గజగజ వణికిపోయారు. వానరులు తరుముకొస్తూ ఉంటే రాక్షసులు చేతులోని ఆయుధాల్ని అక్కడే పారేసి పరుగులు తీశారు. వాళ్ళు భయంతో మాటిమాటికీ వెనక్కు చూసుకుంటూ లంకా పట్టణం వైపు పరుగెత్తారు. వాళ్ళ దేహాలన్నీ చెమటలు పోశాయి. తలలు విరబోసుకున్నారు. నిట్టూర్పులు విడుస్తూ మూఢులైపోయారు. వాళ్ళల్లో వాళ్ళే కొట్టుకోవటం మొదలుపెట్టారు.

ఆ విధంగా అకంపనుణ్ణి హతమార్చి, రాక్షస సేనల్ని పారద్రోలిన హనుమంతుణ్ణి వానరులంతా అభినందించారు. జయజయధ్వానాలు చేశారు. హనుమంతుడు కూడా ఆ వానరవీరులందర్నీ మెచ్చుకున్నాడు. వానర వీరులంతా బిగ్గరగా సింహనాదాలు చేశారు. ఆ సింహనాదాలతో లంకాపట్టణం అంతా దద్దరిల్లిపోయింది.

మహా భయంకరుడు, శత్రునాశకుడు అయిన కైటభాసురుణ్ణి సంహరించిన శ్రీమహావిష్ణువులె, మహాకపి హనుమంతుడు అకంపనుణ్ణి వధించాడు. దేవగణాలన్నీ హనుమంతుణ్ణి పూజించాయి. రామలక్ష్మణులు, సుగ్రీవుడు, విభీషణుడు మిగిలిన వానరలోకం హనుమంతుణ్ణి ఎంతగానో గౌరవించారు; కొనియాడారు.

# 57వ సర్గ ప్రహస్తుడితో యుద్ధం

అకంపనుణ్ణి హనుమంతుడు చంపేశాడని రావణాసురుడు విన్నాడు. ఆ రాక్షసరాజు ముఖం వెలవెలబోయింది. మంత్రుల వంక చూశాడు. మంత్రు లందరితోనూ మంతనాలు జరిపాడు. దీర్ఘాలోచన చేయగా ఆ లంకానగరం అంతా ఒకసారి కలయతిరగాలన్న కోరిక కలిగింది. అప్పటికి ఇంకా అపరాహ్ణం కాలేదు. ఇంకా ఉదయపు ఘడియల్లోనే ఉంది. పట్టణాన్ని రక్షిస్తున్న సమూహాల్ని, వ్యూహాలుగా ఉన్న సేనల్ని, పతాకాలతో అలంకరించిన ధ్వజాలను చూశాడు. బలవంతులైన రాక్షస సేనల్ని ఎదిరిస్తున్న వానర సేనలపై కోపం బాగా పెరిగింది. తిరిగి తన భవనానికి వెళ్ళాడు. యుద్ధాలలో ఆరితేరిన ప్రహస్తుణ్ణి పిలిచి ఇలా అన్నాడు: "ఓ ప్రహస్తుడా! నీవు యుద్ధాలు చేయడంలో నేర్పరివి. విశారదుడవు. శత్రువులు మన సేనల్ని ఇబ్బంది పెడ్తున్నారు. మన పట్టణాన్ని ముట్టడించారు. నువ్వు తప్ప మరొకరెవ్వరూ ఈ శత్రు మూకల్ని తరిమికొట్టలేరు. వెళ్తే నేను స్వయంగా వెళ్ళాలి. లేదంటే, కుంభకర్ణుడుగాని, ఇంద్రజిత్తుగాని, సేనాపతివైన నీవో ఈ పని చక్కబెట్టగల సమర్థులు. అందువల్ల నీవు ఇప్పుడే తగినంత సైన్యాన్ని వెంటబెట్టుకొని వానరులందరినీ సంహరించిరా. నీవు మన సైన్యంతో ముందు నిలబడితేనే చాలు! ఈ వానర సైన్యం అంతా చెట్టుకొకడు, పుట్టకొకడుగా పారిపోతారు. వాళ్ళంతా కోతిమూకలు. వాళ్ళల్లో యుద్ధశిక్షణ ఎంతమాత్రమూ లేదు. నీ సింహనాదాలు వినగానే, సింహగర్జనకు ఏనుగుల వలె, వానరులంతా మనోనిబ్బరం కోల్పోయి పరుగులు తీస్తారు.

ఓ ప్రహస్తుడా! నీవు ఆ విధంగా వానర సేనల్ని చెల్లాచెదరు చేశావంటే రామలక్ష్మణ, సుగ్రీవులు ఒంటరివాళ్ళయిపోతారు. అప్పుడు నీవు మన సైన్యంతో వాళ్ళను ముట్టడించి వాళ్ళను తేలికగా చంపెయ్యవచ్చు. ఒకవేళ మనం అనుకున్నట్లు జరిగినా, జరగకపోయినా కూడా, మనం వీరోచితంగా యుద్ధం చెయ్యాలేగాని, వేరే మార్గాంతరం లేదు. యుద్ధాల్లో జయాపజయాలు ఎవరివో ముందుగానే నిర్ణయించలేము. అలా అని యుద్ధం చెయ్యకుండా ఉండనూ లేముగదా!

ఒకవేళ తాత్సారం చేశామే అనుకో! ఇంతదూరం వచ్చిన శత్రువు మనల్ని చంపిగాని వెనక్కు పోదు. యుద్ధంలో జయం మనల్ని కూడా వరించవచ్చు గదా! మనం పూర్వం ఎన్నో యుద్ధాల్లో దేవతల్ని కూడా జయించాం. కాబట్టి ఇప్పుడు వీరోచితంగా పోట్లాడటమే మన కర్తవ్యం. ఓ ప్రహస్తుడా! నీ ఆలోచన ఏమిటో కూడా చెప్పు. నేను చెప్పిందంతా నీకు నచ్చినా, నచ్చకపోయినా నిర్భయంగా, నీ అభిప్రాయం చెప్పు."

రాక్షసరాజైన రావణుడు చెప్పినదంతా ప్రహస్తుడు విని, అసురరాజుతో శుక్రాచార్యుడి వలె ఇలా బదులు చెప్పాడు. "ఓ రాజా! నువ్వు చెప్పినదంతా ఇదివరకే మంత్రి మండలిలో చర్చించాం. వివాదాలు కూడా వచ్చాయి. సీతాదేవిని ఇచ్చివేసినట్లయితే యుద్ధం ఉండదని, అలా ఇవ్వకపోతే యుద్ధం తప్పదని అనుకున్నాం. నీవు సీతాదేవిని ఇవ్వటానికి ఇష్టపడలేదు. మేము మంత్రుల మందరం యుద్ధం రాకతప్పదని ఆ రోజే అనుకున్నాం.

ఓ రాజా! నేను నీ అభిమానానికి పాత్రుడనయ్యాను. నీ ఆదరాభిమానాల వల్ల ఎంతో సుఖసంతోషాలతో జీవిస్తున్నాను. పైగా నువ్వు నన్ను ఎంతో గౌరవంగా చూస్తున్నావు. ఇప్పుడు నేను నిన్ను సంతోషపెట్టాల్సిన సమయం వచ్చింది. అందుకోసం ఏం చెయ్యమన్నా చేస్తాను. నా భార్యాపిల్లల్ని కూడా లెక్కచెయ్యకుండావెళ్ళి యుద్ధం చేస్తాను. యుద్ధంలో ప్రాణత్యాగానికైనా సిద్ధపడి యుద్ధం చేస్తాను. నువ్వే చూస్తావుగదా!" అని రావణాసురునితో అంటూ తోటి సేనానాయకులతో ఇలా అన్నాడు:

"ఓ సేనాధ్యక్షుల్లారా! యుద్ధానికి సైన్యాన్ని సిద్ధం చెయ్యండి పిడుగుల్లాంటి నా బాణాలతో ఆ వానరములన్నింటినీ చీల్చి చెండాడుతాను. ఆ వానరుల రక్తమాంసాలతో మనం విందు చేసుకుందాం. మిగిలింది పక్షులకు విందు చేస్తాను."

ప్రహస్తుడు ఆజ్ఞాపించినట్లుగానే సైన్యాధ్యక్షులంతా సమస్త సేనల్నీ, మారణాయుధాల్నీ సన్నద్ధం చేశారు. మదపుటేనుగుల వంటి రాక్షస యోధులతో లంకా పట్టణం అంతా

నిండిపోయింది. యుద్ధంలో జయం కలిగేందుకు రాక్షసవీరులు హోమాలు చేశారు. బ్రాహ్మణుల్ని (బ్రహ్మరాక్షసుల్ని) గంధపుష్పాలిచ్చి పూజించారు. ఆ గంధపుష్పాల సువాసన గాలిలో కలసి అంతా సుగంధాల వాసన వీచింది. యుద్ధంలో విజయం తమకే సిద్ధించాలని రాక్షస వీరులంతా మంత్రించిన పుష్పమాలల్ని ధరించారు. కవచాల్ని ధరించారు. ధనుస్సు చేత ధరించి రావణునికి నమస్కరించారు. పిదప ప్రహస్తుడి వద్దకు వచ్చి నిలబడ్డారు.

అప్పుడు రావణాసురుడు ప్రహస్తుణ్ణి ఆశీర్వదించి వీడ్కోలు పలికాడు. భేరీలను మహా భయంకరంగా మ్రోగించారు. మేఘాలవలె గర్జిస్తూ, సూర్యుడివలె కళ్ళు మిరిమిట్లు గొలుపుతూ, చంద్రుడివలె మనోహరంగా ఉంటూ, బంగారు కిటికీలతోను, పైకప్పుతోను, సర్పధ్వజంతోను, చక్కటి చక్రాలతో అమర్చబడినదీ, మహావేగంగా పోయే గుర్రాలను పూన్చినదీ అయిన రథాన్ని తెచ్చి ప్రహస్తుడి ముందు ఉంచారు. రావణాసురుని వద్ద అనుమతి పొందిన ప్రహస్తుడు రథాన్ని అధిరోహించాడు. పిమ్మట సర్వసమర్థుడైన సారథి కూడా ఎక్కి రథాన్ని ముందుకు నడిపించాడు. రాక్షస సైన్యం అంతా ఆ రథం వెనకాలే బయలుదేరింది.

సేనాపతి అయిన ప్రహస్తుడు బయలుదేరగానే మేఘధ్వనివంటి భేరీల ధ్వని, వాద్యాలధ్వని, శంఖముల ధ్వనులతో భూమి నిండిపోయింది. రాక్షసులంతా పెద్దగా సింహనాదాలు చేశారు. ఆ ధ్వనితో దిక్కులు పిక్కటిల్లాయి. శంఖాలు పూరించారు. దుందుభులు ఉరుముల్లాగా ధ్వనించాయి. సముద్రం పొంగిపొరలి భూమిని ముంచెత్తుతున్నట్లుగా అనిపించింది. నరాంతకుడు, కుంభహనువు, మహానాదుడు, సమున్నతుడు అనే నలుగురు మంత్రులు ప్రహస్తుడికి నలువైపులా నడుచుకుంటూ వెళ్ళారు. రాక్షస సేననంతా వ్యూహాలుగా విభజించి ప్రహస్తుడికి చేదోడువాదోడు ఉండేట్లు చేశారు. ప్రళయ కాలంలో సర్వాన్ని తనలో లీనం చేసుకునే యముడివలె ప్రహస్తుడు, అతడి సైనికులు చేసే అట్టహాసాలకు సింహనాదాలకు లంకా పట్టణంలో ఉండే జంతువులన్నీ భయపడిపోయాయి. భయంతో వికృత స్వరాలతో అరిచాయి. రక్తమాంసాలు తినే పక్షులు అపసవ్యంగా మండలాకారంలో తిరుగుతూ రథ

ధ్వజంపై ప్రదక్షిణలు చేశాయి. నక్కలు భయంకరంగా ఊళలు వేస్తూ నిప్పులు కక్కాయి. ఆకాశం నుండి నిప్పు రవ్వల వంటి ఉల్కలు కిందపడ్డాయి. గ్రహాల మధ్య యుద్ధం ఆరంభం కావడంతో గ్రహాల కాంతులు క్షీణించాయి. మేఘాలు భయంకరంగా గర్జించాయి. రాక్షసయోధులందరూ రక్తపు వర్షం వల్ల తడిసిపోయారు. గ్రద్ద ఒకటి ప్రహస్తుడి ధ్వజంపై నిలచి ముక్కుతో రెక్కల్ని పొడుచుకుంటోంది. రథసారథి సూతవంశంలో పుట్టాడు. వంశపారంపర్యంగా రథసారథ్యమే వృత్తిగా చేపట్టినవాడు. లోగడ అనేక యుద్ధాల్లో అతడు ప్రహస్తుడికి సారథిగా ఉన్నాడు. అటువంటి సారథి చేతిలోని కొరడా జారి నేలపై పడిపోయింది. రథానికి కట్టిన గుర్రాల కాళ్ళు అకారణంగా పల్లాలోపడి తొట్రుపాటు చెందాయి. గుణములచేత, పౌరుషంచేత ప్రసిద్ధుడైన ప్రహస్తుడు యుద్ధానికి రావడం వానర సైన్యం చూసింది. పెద్ద పెద్ద రాళ్ళనూ, వృక్షాలను పెళ్ళగిస్తూ ఉండటం ప్రహస్తుడు చూశాడు. అటు వానరులు ఇటు రాక్షసులు భీకరంగా అరుస్తూ ఒకరినొకరు కవ్వించుకుంటున్నారు. వాళ్ళు భూమ్యాకాశాలు బద్దలు అయ్యేట్లు సింహనాదాలు, అట్టహాసాలు చేశారు. దుర్మతి అయిన ప్రహస్తుడు తాను హనుమంతుణ్ణి వానరుల్ని జయించగలనని ధీమాగా అనుకున్నాడు.

# 58వ సర్గ ప్రహస్తుడి వధ

అట్లా వస్తున్న మహాకాయుణ్ణి రాముడు చూశాడు. ప్రక్కనే ఉన్న విభీషణునితో రాముడు: "మిత్రుడా! భారీ శరీరంతో వస్తున్న ఈ నాయకుడు ఎవరు? ఇతడి బలపౌరుషాలు ఎటువంటివి? ఇతడిని గూర్చి నాకు చెప్పు." విభీషణుడు శత్రుసంహారకుడైన రాముడితో ఇలా అన్నాడు: "రామా! ఈతడి పేరు ప్రహస్తుడు. రావణాసురుని సేనాధిపతి. లంకా పట్టణంలో ఉండే సైన్యంలో మూడోవంతు ఇతడి అధీనంలో ఉంటుంది. ఇతడు మహాపరాక్రమవంతుడు, శూరుడు. శస్త్రవిద్యలలో ఆరితేరినవాడు."

సింహనాదాలు చేస్తూ, మహాసేనను వెంటబెట్టుకొని వస్తున్న భయంకరమైన శరీరం గల ప్రహస్తుణ్ణి వానరులంతా చూశారు. అప్పుడు రాక్షసయోధులంతా తళతళలాడే కత్తులతోను, శక్తి ఆయుధాలతోను, ఋష్టులు అనే ఆయుధాల్ని ముసలములను, శూలాలను, గదలను, ఇనుప గుదియలను, ఈటెలు మొదలైన మారణాయుధాలను, రకరకాలైన గండ్రగొడ్డళ్ళతోనూ ధనుస్సు బాణాలను, ధరించి రావణాసురునికి 'జయం' అని అంటూ వానరవీరుల పైకి దూకారు. రాక్షసయోధుల్ని వానరులంతా రాళ్ళను, చెట్లను పట్టుకొని ఎదుర్కొన్నారు. రాక్షసులు వానరులపై బాణముల వర్షాన్ని కురిపించగా, వానరులంతా వారిపై రాళ్ళ వర్షాన్ని కురిపించారు. ఆ విధంగా మహాసంగ్రామం ప్రారంభం అయింది.

యుద్ధంలో వానరులు అనేకమంది రాక్షసుల్ని చంపేశారు. రాక్షసయోధులు కూడా వానరుల్ని శూలాలతో పొడిచి చంపారు; ఇనుప గుదియలతో వానరుల్ని చితకబాదారు; గండ్రగొడ్డళ్ళతో వానరుల్ని నరికేశారు; బాణాలతో వానరుల శరీరము గాయాలు చేసి చంపారు. పదునైన ఖడ్గాలతో వానరుల తలలు నరికారు. వానరులు కూడా కనిపించిన చెట్లనన్నింటినీ పెళ్ళగించుకొనివచ్చి, వాటితో రాక్షసుల్ని బాదారు, వాడి అయిన గోళ్ళతో రక్కి చంపారు; పిడికిళ్ళతో గుద్దుతూ రాక్షసుల దంతాలు ఊడపీకారు; కళ్ళు ఊడపెరికారు. నెత్తురు కక్కుకొని

చచ్చేట్లుగా కొందరు రాక్షసుల్ని నేలపై పడేసి కొట్టి చంపారు. వాడి అయిన కోరల్తో గొంతువరకు దిగేట్లుగా కొరికి చంపారు. ఇరుపక్షాల్లోను దెబ్బలు తిని ప్రాణాలు ఇంకా పోని వాళ్ళంతా ఏడుస్తూ మూలుగుతూ నేలపై పడి ఉన్నారు. తక్కిన వాళ్ళంతా సింహనాదాలు చూస్తూ ఒకరి నొకరు ఎదుర్కొని బాధిస్తున్నారు.

ఈ విధంగా ఒకరి నొకరు హింసించుకుంటూ, క్రూరంగా చంపుకుంటూ ఇరుపక్షాలవారు కృద్ధులైపోయారు. నిర్భయంగా క్రూర కార్యాలు చేస్తున్నారు. అప్పుడు ప్రహస్తుని మంత్రులైన నరాంతకుడు, కుంభహనువు, మహానాదుడు, సమున్నతుడు వానరులను పట్టి క్రూరంగా చంపారు. వానరుల్లో మహాయోధుడైన ద్వివిదుడు వేగంగా వచ్చి పెద్ద బండరాయితో నరాంతకుణ్ణి కొట్టి చంపాడు. దుర్ముఖుడనే వానరుడు పెద్ద వృక్షాన్నొకటి పెళ్ళగించుకొచ్చి గిరగిరా తిప్పుతూ సమున్నతుడనే రాక్షసుణ్ణి తల పగల కొట్టి చంపాడు. మహాతేజశ్శాలి అయిన జాంబవంతుడు పెద్ద బండరాయిని ఎత్తి మహానాదుని ఎదురు రొమ్ములపై వేసి చంపాడు. వీర్యవంతుడైన తారుడు కుంభ హనువుతో యుద్ధం చేసి పెద్ద వృక్షంతో తల పగుల కొట్టి చంపాడు. అట్లా తన నలుగురు మంత్రుల్నీ వానరయూధపతులు చంపడం ప్రహస్తుడు చూస్తూ సహించలేకపోయాడు. ధనుస్సు తీసుకొని వానరులపై విచ్చలవిడిగా బాణప్రయోగంచేసి సర్వశక్తుల్నీ ఒడ్డి పోరాడాడు. సముద్రం పొంగిపొర్లి భూమండలాన్నంతా ముంచివేస్తుందా? అన్నట్లుగా ఉభయ సైన్యాలు మహాధ్వనులు చేశాయి.

అప్పుడు ఆ మహాయుద్ధంలో కుపితుడైన ప్రహస్తుడు బాణాలతో వానరులందరినీ గాయపరిచాడు. ఇరుపక్షాలలో చచ్చిపడున్న మృత కళేబరాలు పర్వతాల్లాగా గుట్టలు గుట్టలుగా పేరుకుపోయాయి. నెత్తురు మడుగుల్తో ఉన్న ఆ యుద్ధభూమి, వైశాఖ మాసంలో విరగబూసిన మోదుగచెట్లతో నిండిన అడవిలా అనిపించింది. ఆ యుద్ధభూమి అంతా యమునిచే సృష్టించబడిన మహాసముద్రంలా కనిపించింది. ఆ సముద్రంలో చచ్చిపడి ఉన్న వీరులంతా సముద్ర తీరాలుగాను, విరిగి పడిపోయిన ఆయుధాలే మహావృక్షాల్లాగా, రక్తపు మడుగులన్నీ

మహాసముద్ర జలాలుగాను, గుండెల కిరువైపులా ఉండే మాంసఖండాలన్నీ చిక్కటి బురదగాను, విచ్చల విడిగా పడి ఉన్న పేగులు నాచుగాను, చిందరవందరగా పడి ఉన్న తలలు, మొండాలు చేపల్లాగాను, మిగిలిన అవయవాలన్నీ పచ్చికబయళ్ళుగాను, అక్కడ వ్యాపించిన గద్దలన్నీ హంసలుగాను, రాబందులే సారసపక్షులుగాను, మేధస్సే అక్కడ వ్యాపించిన నురుగుగాను, జీవచ్ఛవాల్లా పడి ఉన్న బాధితుల మూలుగులు మహాధ్వనులుగాను, పిరికివాళ్ళకు అలవికాకుండాపోయే యముడు అనే మహాసముద్రంలోకి పోతున్న మహాప్రవాహం లాగా ఆ యుద్ధభూమి కనిపించింది. శరత్కాలంలో హంసలు, సారస పక్షులూ ఉండే నదిని సులభంగా దాటిపోనలవికాని ఆ నదిని రాక్షసులు వానరులు సులభంగా దాటిపోగలిగారు. కలువ పూల పుప్పొడితో నిండి ఉన్న అడవిలో దిగి బయటకు వచ్చిన ఏనుగుల దేహాలు ఎర్రబడ్డట్లు, ఆ యుద్ధభూమిలోకిపోయిన వానరుల దేహాలు, రాక్షసుల దేహాలు ఎర్రపడిపోయాయి.

ప్రహస్తుడు దేవేంద్రుని రథం వంటి రథంలో కూర్చుని బాణాల వర్షం కురిపిస్తూ వానరవీరుల్ని ఊచకోత కోస్తున్నాడు. అది చూసి సహించలేని నీలుడు ఆ రాక్షస వీరునికి ఎదురువెళ్ళాడు. సూర్యుడివలె ప్రకాశిస్తున్న తన రథంపైకి నిర్భయంగా వస్తున్న ఆ వానరుడికి తన శక్తి ఏమిటో ఆ రాక్షస సేనాపతి తెలియచెప్పాలని అనుకున్నాడు. వెంటనే ధనుస్సును చేతిలోకి తీసుకొని నారి సంధించి నీలుడిపైకి బాణాల వర్షం కురిపించాడు. ఆ బాణాలన్నీ గురితప్పకుండా పగపట్టిన సర్పాల్లాగా పోయి నీలుణ్ణి తాకాయి. మహాకాయుడైన నీలుడిపై ఆ బాణాలన్నీ, శరత్కాలంలో భూమిపైపడే వర్షధారల్లాగా, పడి నిర్వీర్యాలయ్యాయి. అయితే తనపై బాణాల్ని ప్రయోగించిన ప్రహస్తుడిపై అతడికి చెప్పలేనంత కోపం వచ్చింది. వెంటనే మహాసాలవృక్షాన్నొకటి పెళ్ళగించి గిరగిరా తిప్పుతూ రథానికి కట్టిన గుర్రాలను కొట్టి చంపాడు. అమాంతం ఎగిరివెళ్ళి ప్రహస్తుడి చేతిలోని ధనుస్సును ఊడపెరుక్కుని ముక్కలుముక్కలుగా విరిచేసి అవతల పారేశాడు. అటుపిమ్మట విడవకుండా పదేపదే సింహనాదాలు చేశాడు. అనుకోని ఈ పరిణామానికి రాక్షస సేనాధిపతి కొద్దిగా కంగారుపడినా వెంటనే తేరుకుని భయంకరమైన ముసలాయుధాన్ని చేతిలోకి తీసుకొని నీలుడి ముఖంపైన కొట్టాడు. నీలుడి

శరీరం అంతా రక్తంతో తడిసిపోయింది. అప్పుడు నీలుడికి బాగా కోపం వచ్చింది. చేతిలో ఉన్న సాలవృక్షంతో బలంగా ప్రహస్తుడి ఎదురురొమ్ములపై కొట్టాడు. అప్పుడు రాక్షస వానర సేననాయకులిద్దరి శరీరాలు రక్తంతో తడిసి ముద్దయ్యాయి. ఇద్దరూ మహాబలవంతులే! ఇద్దరూ మహాకాయులే. వాళ్ళు ఎన్నడూ యుద్ధంలో వెనకడుగు వేసినవాళ్ళు కాదు. ఇద్దరూ బద్ధవైరంతో పోరుకు సిద్ధపడ్డారు. సింహ శార్దూలాల్లాంటి వాళ్ళిద్దరూ ఎన్నో యుద్ధాల్లో సింహంవంటి దర్పంతోను, పెద్దపులివంటి పరాక్రమంతోను శత్రువుల్ని చీల్చిచెండాడినవాళ్ళే. అంటే ఇద్దర్లో ఎవరూ ఇంతవరకు పరాజయం అనేది ఎరుగరు. వాళ్ళిద్దరూ ఒకర్ని మరొకరు జయించాలనే తీవ్రమైన కాంక్షతో పరస్పరం కోరలతో కొరుక్కున్నారు. అప్పుడు ప్రహస్తుడు ముసలాయుధంతో నీలుడి పైకి వేగంగా పరుగెత్తాడు. ప్రహస్తుడు తనను కొట్టే లోపుగానే నీలుడు పెద్ద రాయిని తీసి ప్రహస్తుడి తలపై పడేట్లు విసిరాడు. ఆ దెబ్బకు ప్రహస్తుడి తల ముక్కలు ముక్కలు అయిపోయింది. దాంతో ఆ ప్రహస్తుడు మొదలు నరికిన వృక్షంలాగా నేలకూలాడు. అప్పుడు అతడి తల నుండి దేహం నుండి కారిన రక్తం, పర్వతంపై నుండి ప్రవహించే, సెలయేరులా పారింది. అంతవరకు మహాబలశాలి అయిన సేనానాయకుడి అండన యుద్ధం చేస్తున్న సైన్యం అంతా, విరిగిపోయిన ఆనకట్టవద్ద నిల్వవుండే నీరంతా నిలువలేనట్లుగా, నిలువలేక లంకా పట్టణం వైపుగా పరుగులు తీశారు.

ఆ విధంగా మహాపరాక్రమశాలి అయిన ప్రహస్తుణ్ణి చంపి నీలుడు రామలక్ష్మణుల వద్దకు పోయి "ప్రహస్తుణ్ణి చంపాను" అని చెప్పాడు. రామలక్ష్మణులు నీలుణ్ణి అనేక విధాలుగా కొనియాడారు.

# 59వ సర్గ రామ – రావణ యుద్ధం

రాక్షస సైన్యం లంకా పట్టణానికి పరుగులు పెట్టి రావణుని వద్దకెళ్ళి నీలుడు అనే వానర సేనాపతి ప్రహస్తుణ్ణి హతమార్చాడని చెప్పారు. ప్రహస్తుడి మరణవార్త వినగానే రావణాసురుడిలో ఒకేసారి భయం, దుఃఖం, కోపం, నిరాశ చోటుచేసుకున్నాయి. ప్రహస్తుడి కోసం ఎంతో బాధపడ్డాడు. దేవేంద్రుడు దేవతలకు చెప్పే విధంగా రావణాసురుడు రాక్షసులతో ఇలా అన్నాడు: "ఓ రాక్షసయోధుల్లారా! మన సేనానాయకుడు ప్రహస్తుడు దేవేంద్రుడితోనే స్వయంగా యుద్ధం చేసి దేవసైన్యాన్నంతా ఛిన్నాభిన్నం చేసి దేవేంద్రుణ్ణే జయించాడు. అపజయం అనేదే ఎరుగని ఈ మహావీరుణ్ణి అతడి బలగాన్ని, మహాగజాల్ని కేవలం వానరులు చంపారని మీరు చెబుతున్నారు. కాబట్టి ఈ వానర సేన ఆషామాషీ కోతిమూకలు కావు. ఈ వానర సైన్యాన్ని తక్కువగా అంచనా వేయకూడదు. శత్రువుల్ని జయించేందుకు గట్టి ప్రయత్నమే వెయ్యాలి. ఇక ఉపేక్ష చేయకూడదు. నేనే స్వయంగా యుద్ధభూమికి బయలుదేరతాను. తాడోపేడో తేల్చుకోవాల్సిన సమయం వచ్చింది. కార్చిచ్చు అడవుల్ని కాల్చి బూడిద చేసినట్లు, నా బాణాలతో ఈ వానర సైన్యాన్ని, రామలక్ష్మణులను ఇప్పుడే సర్వనాశనం చేస్తాను."

రావణాసురుడి కోసం అగ్నిహోత్రంలాగా ప్రజ్వలించే రథాన్ని సిద్ధం చేశారు. అది బంగారంతో చేయబడింది. సర్వాలంకారాలతో తళతళలాడుతూ ఉత్తమాశ్వాలను పూన్చిన రథాన్ని రావణాసురుడు అధిరోహించాడు. అప్పుడు సైన్యం అంతా శంఖాలు పూరించారు. భేరీలు, దుందుభులు, ఇతర వాద్యాలు మ్రోగించారు. రాక్షసయోధులంతా భుజాలు చరిచి తొడలు కొట్టారు. రాక్షసులు స్తోత్రపాఠాలు చదివారు. బ్రహ్మరాక్షసులు రావణాసురుణ్ణి గూర్చి వేదమంత్రాలు వల్లించారు. రాక్షసయోధులు సింహనాదాలు చేస్తూ ఉండగా రావణాసురుడి రథం బయలుదేరింది. ఆ రథంలో మహామేఘాల వంటి వాళ్ళూ, పర్వతాకారులూ, చింతనిప్పుల్లాంటి నేత్రాలు కలిగిన రాక్షసయోధులు కూడా రావణాసురుడికి రక్షణగా బయలుదేరారు. ఆ రాక్షసరాజైన రావణాసురుడు పరివారంతోను సైన్యంతోను

బయలుదేరిపోతూ ఉంటే భూతాలతో కలసిపోయే కాలరుద్రుడిలా కనిపించాడు. రావణుడి రథం అమిత వేగంతో లంకాపట్టణాన్ని దాటిపోయింది. అక్కడ మహాసముద్రం వంటి వానర సేనను చూశాడు. వాళ్ళు చేస్తున్న సందడి సముద్ర ఘోషను కప్పివేస్తోంది. వాళ్ళు చేస్తున్న సింహనాదాలు మేఘగర్జనల్లా వినిపిస్తున్నాయి. వాళ్ళంతా మహావృక్షాల్నీ, మహాశిలలనే ఆయుధాలుగా చేతుల్లో ధరించి యుద్ధానికి సిద్ధంగా ఉండటం రావణుని కంటపడింది.

ఒక మహాప్రళయంగా, ఒక మహా సముద్రంలాగా తరలి వస్తున్న రాక్షస సైన్యాన్ని, వానర సేనల మధ్యన ఉన్న రాముడు చూశాడు. రాక్షసులను గూర్చి పూర్తిగా అవగాహన ఉన్న విభీషణుణ్ణి ఇలా అడిగాడు: "ఓ మిత్రుడా! రకరకాల పతాకాలతోనూ, ధ్వజాలతోనూ, ఈటెలు, శూలాలు ధనస్సులు మొదలైన అనేక ఆయుధాలను ధరించి వస్తున్న వాళ్ళూ, మహేంద్ర పర్వంలాంటి ఏనుగులతోను, కలవరమే ఎరుగనివారూ, భయానికే భయం కలిగిస్తున్నవాళ్ళూ అయిన రాక్షస సైన్యం పర్వతాలపై నుండి వచ్చే మహావరదల్లే వస్తోంది. ఈ భయంకర సైన్యాన్ని వెంటబెట్టుకొని వస్తున్న వారి నాయకుడు ఎవరు?"

శక్రుడుతో సమానమైన పరాక్రమం గల విభీషణుడు, ఆ వచ్చే రాక్షసవీరులను గూర్చి, వారి ప్రతాపాల గూర్చి ఇలా చెప్పుకొచ్చాడు: "ఓ రామా! ఉదయసూర్యుడిలా ఎర్రటి ముఖంతో కనిపిస్తున్న ఏనుగు అంబారీపై వస్తున్న వాడే అకంపనుడు. ఈ అకంపనుడు రావణునికి స్వయంగా పుత్రుడే!

అదుగో, సింహం గుర్తుతో పతాకం కనిపిస్తోందే, ఆ రథంపైన మదపుటేనుగువంటి శరీరం కలవాడూ, బయటకు బాగా కనిపిస్తూ ఉండే కోరలుండేవాడూ, ఇంద్ర ధనుస్సు వంటి ధనుస్సును ధరించి ఉన్నవాడూ, బ్రహ్మను మెప్పించి అంతర్ధానం అయిపోయే వరం పొందినవాడూ అయిన ఇంద్రజిత్తు. అక్కడ ఆ రథం మీద వింధ్యపర్వతంలాగా మహేంద్ర పర్వతంలాగా, అస్తగిరిలాగా ఉండే ఆ మహాకాయుడి పేరు నిజంగానే 'అతికాయుడు.' శస్త్రధారులందరిలోకీ అతిపెద్ద ధనుస్సును ధరించేది కూడా ఇతడే.

గణగణమంటూ గంటలు మ్రోగించుకుంటూ ఐరావతం అంత పెద్ద ఏనుగుపై కర్ణకఠోరంగా సింహనాదాలు చేస్తూ ఉదయసూర్యుడిలా ఎర్రటి కన్నులుగల, ఆ వీరుడి పేరు మహోదరుడు.

ఇటు ప్రక్కగా, సాయంకాలంలో మేఘాలు అలముకొన్న పర్వతంలాగా ఉండి, బంగారు ఆభరణాలు ధరించి, మెరిసిపోయే ఈటెను పట్టుకొని గుర్రాన్నెక్కి వేగంగా పిడుగుల్లాగా వస్తున్న వాడి పేరు 'పిశాచుడు.'

అడుగో! పర్వతమంత ఎద్దు మీద వస్తున్నాడు; మెరుపులకు మల్లే తీక్ష్ణమైన కాంతుల్తో మెరుస్తూ ఉంటాడు; అతడి చేతిలోని త్రిశూలం, వజ్రాయుధం అంత శక్తిమంతమైంది. అతడి పేరు 'త్రిశిరుడు.'

అడుగో! సర్పరాజ చిహ్నంతో ఉన్న పతాకం గల రథం మీద కూర్చుని ధనుస్సును సరిచూసు కుంటున్నాడు, వెడల్పాటి ఛాతీగలవాడు, మేఘంవంటి రూపంలో ఉన్నవాడి పేరు 'కుంభుడు.'

అడుగో! పెద్ద పరిఘను ఆయుధంగా పెట్టుకొని వస్తున్నాడు. అతడి పేరు 'నికుంభుడు'. అతడు రాక్షసైన్యానికి ధ్వజంలాంటివాడు. అనేక ఘోరకృత్యాలు చేసినవాడు.

అతడి రథాన్నే చూడు. దానిమీద ఎగురుతూ పెద్ద పతాకం ఉంది. ఆ రథం నిండా ధనుస్సులు ఖడ్గాలు, బాణాలు ఇతర మారణాయుధాలు ఉన్నాయి. ఆ రథం మీద వచ్చేవాడి పేరు. 'నరాంతకుడు'. వాడు పర్వత శిఖరాల్ని అమాంతం పెళ్ళగించి వాటితో పోట్లాడతాడు.

ఓ రామా! అటు చూడు. అనేక భయంకర రూపాలుగల పెద్దపులులు ఒంటె ముఖాలతోను, ఏనుగు ముఖాలతోను, గుర్రం ముఖంతోను, ఉండే ఘోరాకారులను వెంటబెట్టుకొని రథం మీద వస్తున్నాడు. అతడు తన ఎర్రటి కనుగ్రుడ్లను అటూ ఇటూ

తిప్పుతున్నాడు. పూర్ణచంద్రుని వంటి తెల్లటి ఛత్రం కింద కూర్చున్నాడు. భూతప్రేత పిశాచాలను వెంటబెట్టుకొని వచ్చే రుద్రుడు మల్లే ఉన్నాడు. వింధ్య హిమవత్పర్వతం అంత పెద్ద శరీరంతోను, నవరత్నాలు పొదిగిన కిరీటాన్ని పెట్టుకుని, బంగారు కుండలాలు ధరించాడు. ధగధగ సూర్యుడివలె మెరిసిపోతున్నాడు. అతడే 'రావణాసురుడు'. దేవతల దర్పాన్నీ, దేవేంద్రుడి దర్పాన్నీ, యముడి దర్పాన్నీ కూడా అణచివేసిన రాక్షసరాజు. జగత్ప్రసిద్ధి చెందిన రావణుడు."

విభీషణుడు రాక్షస వీరులందరి గురించి వివరంగా చెప్పాడు. రాముడు అంతా విన్నాడు. అందర్నీ పరికించి చూశాడు. రావణాసురుణ్ణి చూస్తూ విభీషణుడితో ఇలా అన్నాడు.

రాముడు : "ఆహా! రాక్షసరాజైన రావణుడు ఎంతో తేజస్సుతో గొప్పగా ప్రకాశిస్తున్నాడు. సూర్యకిరణాల వలన సూర్యునిలా, తేజస్సుచేత వెలిగిపోతున్న ఇతడి రూపాన్ని చూడలేకుండా ఉన్నాను. ఇతడి రూపం, కాంతి, తేజం దేవదానవ వీరులెవ్వరిలోనూ ఉండదు. ఇతడి రూపమే ఇతడి ప్రతాపాన్ని చాటిచెప్తోంది. మహాకాయుల్ని, భయంకరమైన ఆకారాలున్న వాళ్ళనీ వెంటబెట్టుకొని వస్తూ ఉంటే, యమకింకరుల్ని వెంటబెట్టుకొని వచ్చే యమధర్మరాజు మల్లే విరాజిల్లుతున్నాడు.

"ఓ విభీషణా! ఈ పాపాత్ముడి ఆయువు తీరింది. అందువల్లనే, ఈ రోజు నా కంటపడ్డాడు. సీతను అపహరించి తెచ్చిన నాటి నుండీ, వీడికోసం ఎదురుచూస్తున్నాను. ఈ నాటికి నా ఎదురు చూపులు ఫలించాయి." అంతట మహా పరాక్రమవంతుడైన రాముడు తమ్ముడు లక్ష్మణునితో కలసి ధనుస్సు చేత ధరించి నిలబడ్డాడు.

ఇది ఇలా ఉండగా, అటుప్రక్క, రావణుడు మహాబలవంతులైన రాక్షస వీరులను చూసి, "ఓ వీరులారా! మీరంతా నగరానికి తిరిగి వెళ్ళండి. రాక్షసుల గృహాలను, రాజమార్గాలను రక్షించండి. మీరంతా కూడా నాతో ఇక్కడే ఉన్నారని శత్రువులు పసిగట్టినట్లైతే, వానరులంతా నగరంలో ప్రవేశించి సర్వ నాశనం చేస్తారు. అందువల్ల మీరు పోయి నగరాన్ని, ప్రజల ఆస్తుల్నీ

కాపాడండి. పోండి" అన్నాడు. "మహాసముద్రాన్ని ఒక మహా మీనం చీల్చుకు పోయినట్లు నేను ఒక్కణ్ణి ఆ వానర సముద్ర ప్రవాహాన్ని చీల్చివేస్తాను" అంటూ రథాన్ని వానర సైన్యం వైపుగా నడిపించాడు.

ధగధగలాడుతూన్న రావణుని రథం వానర సైన్యం వైపుగా వేగంగా దూసుకు రావడం సుగ్రీవుడు చూశాడు. అప్పుడు సుగ్రీవుడు ఒక పర్వత శిఖరాన్ని పెళ్ళగించి చేత్తో పట్టుకొని రావణాసురుడికి ఎదురుగా పరుగెత్తాడు. ఎన్నో వృక్షాలు చరియలతో ఉన్న ఆ శిఖరాన్ని బలంగా ఆ రాక్షసరాజు రథంపై పడేట్లుగా విసిరేశాడు. ఓ బలమైన కొండ శిఖరం తనపై పడుతూ ఉండటాన్ని రావణుడు దూరాన్నుంచే చూశాడు. వెంటనే బంగారు ములుకులతో ఉండే బాణాలను ఆ పర్వత శిఖరంపై వర్షంలాగా కురిపించాడు. పెద్దపెద్ద వృక్షాలతోనూ, కొండ చరియలతోనూ ఉన్న ఆ పర్వత శిఖరం ముక్కలు ముక్కలై నేలమీద పడ్డది. అంతట ఆ రాక్షస రాజు రావణాసురుడు మహాసర్పంలాంటి బాణాల్ని సంధించి వదలాడు. ఆ బాణం, దేవేంద్రుడి వజ్రాయుధం లాగా వేగంగా పోతూ, మంటలు మండిస్తూ, నిప్పులు కక్కుతూ వాయువేగంతో సుగ్రీవుడి మీదకు వచ్చింది. నిశితంగాను వజ్రాయుధం వంటి ఆ బాణం, కుమారస్వామి వదలిన ఉగ్రశక్త్యాయుధం క్రౌంచ పర్వతాన్ని కొట్టినట్లు సుగ్రీవుణ్ణి చీల్చుకుంటూపోయింది. మహావీరుడైన ఆ సుగ్రీవుడు ఆ బాణం తనను చీల్చుకుంటూ పోవటంవల్ల బాధపడుతూ పెద్దగా అరుస్తూ నేలపై పడిపోయాడు. అట్లా నిశ్చేష్టుడై పడి ఉన్న సుగ్రీవుణ్ణి చూసి వానరులంతా చుట్టూ చేరి సింహనాదాలు చేశారు.

అప్పుడు గవాక్షుడు, గవయుడు, సుదంష్ట్రుడు, జ్యోతిర్ముఖుడు, నభుడు అనే అయిదుగురూ వాళ్ళ దేహాల్ని పెంచి, పర్వతాలు పెళ్ళగించి వాటిని తీసుకొని రావణాసురుడి వైపు పరుగెత్తారు. అప్పుడు రాక్షసరాజైన రావణుడు నిశితాగ్ర బాణాల్ని వదలి ఆ వానరుల చేతుల్లో ఉన్న పర్వత శిఖరాల్ని ముక్కలు ముక్కలుగా చేశాడు. ఆ తరువాత బంగారు ములుకులు గల బాణాన్ని వదలి ఆ వానర వీరులందర్నీ నేలమీద పడగొట్టాడు. ఆ అయిదుగురు

వానరయోధులూ నేలకొరగ్గానే, రావణుడు వానరులందరిపైనా బాణాల వర్షం కురిపించాడు. ఆ బాణాల తాకిడికి వానరవీరులు కొందరు ఘోరంగా చచ్చిపోతూ ఉంటే, కొందరు బాధతో విలవిల్లాడిపోతున్నారు. ఈ విపరీతం చూస్తున్న వానరులంతా భయంతో కేకలుపెట్టారు. పరుగు పరుగున పోయి రాముణ్ణి శరణువేడారు.

అప్పుడు ఉత్తమ ధనుర్ధారి, మహాత్ముడు అయిన రాముడు ధనుస్సుచేత పుచ్చుకొని వెంటనే బయల్దేరాడు. అప్పుడు లక్ష్మణుడు చేతులు జోడించి రాముడితో ఇలా అన్నాడు: "ప్రభూ! ఈ దుర్మాతుణ్ణి చంపేందుకు నువ్వు సమర్థుడవే అయినా, నువ్వు అనుజ్ఞ ఇస్తే నేను పోయి చంపుతాను." మహాతేజశ్శాలి, సత్యపరాక్రమాలు కలవాడు అయిన రాముడు ఇలా అన్నాడు: "లక్ష్మణా! వెళ్ళు. యుద్ధంలో అన్ని జాగ్రత్తలూ తీసుకుంటూ మెలకువతో వ్యవహరించు. రావణుడు గొప్పశక్తిమంతుడు. యుద్ధం చేసేటప్పుడు నువ్వు ఆశ్చర్యపోయే పరాక్రమాన్ని ప్రదర్శిస్తాడు. ముల్లోకాలూ కూడా ఇతడి ముందు నిలువలేవు. అందువల్ల ముందుగా అతడిలోని బలహీనతలను గ్రహించి అప్రమత్తంతో యుద్ధంచేసి విజయం సాధించు. అట్లాగే నీలోని బలహీనతలను సరిచేసుకొంటూ ముందుకు పో. నీ నేత్రాలు, నీ ధనుస్సూ నీకు రక్షగా ఉంటాయి." అంతట లక్ష్మణుడు రాముని కౌగలించుకొని, అంజలి ఘటించి అభివాదం చేసి యుద్ధానికి వెళ్ళాడు.

ఏనుగు తొండాల వంటి బాహువులు గల రావణుని బాణాలతో వానరుల దేహాలు చీల్చుకొని చెల్లాచెదరై పోతూ ఉండటం లక్ష్మణుడు చూశాడు. వాయుపుత్రుడైన హనుమంతుడు రావణుని బాణాల్ని అడ్డుకుంటూ, రావణునిపై లంఘించాడు. అమాంతంగా రావణుని రథానికి ఎదురుగా నిలిచి ఇలా అన్నాడు. "నీవు దేవ, దానవ, గంధర్వ, యక్ష, రాక్షసుల వలన చావు రాకుండా ఉండే వరాన్ని పొందావు. కానీ వానరుల వల్ల నీకు మరణం తప్పదు. నా ఒక్క పిడికిలి గుద్దుతో నీ శరీరం నుండి నీ జీవుడు బయటకు వెళ్ళేట్లు చేస్తాను. కాచుకో." అందుకు రావణుడికి కోపంతో కళ్ళు ఎర్రగా చింతనిప్పులయ్యాయి. అతడు ఇలా అన్నాడు: "వానరుడా!

రా వచ్చి నీ పరాక్రమం ఏమిటో చూపించు. నీ పరాక్రమాన్ని లోకానికి చాటి చెప్పు. ఆ తరువాతనే నిన్ను చంపుతాను." అందుకు హనుమంతుడు, "ఓ రావణా! పూర్వం నీ కుమారుడైన అక్షయుణ్ణి చంపింది నేనే. గుర్తు తెచ్చుకో" అన్నాడు. అంతట మహాతేజశ్శాలి అయిన రావణుడు హనుమంతుని మాటలు విని, అరచేతితో వక్షఃస్థలంపై ఒక చరుపు చరిచాడు. ఆ దెబ్బకు హనుమంతుడు తట్టుకోలేక గిరగిరాలు తిరుగుతూ తూలిపడ్డాడు. అయితే తేజశ్శాలి అయిన హనుమంతుడు ఒక ముహూర్తకాలంలోనే తేరుకుని నిలబడ్డాడు. ఆ రావణుని తన అరచేత్తో ఒక్క దెబ్బ కొట్టాడు. హనుమంతుని దెబ్బ తగలగానే ఆ దశకంఠుడి కళ్ళు బైర్లుకమ్మాయి. భూకంపంచేత పర్వతం కంపించినట్లు కంపించాడు. హనుమంతుడిచేత దెబ్బ తిన్న రావణుణ్ణి చూసి ఋషులు, వానరులు, సిద్ధులు దేవతలు ఆశ్చర్యపోయారు. ఆశ్చర్యకరమైన ధ్వనులు చేశారు.

తరువాత గొప్ప తేజస్సు గల రావణుడు తేరుకొని స్పృహ రాగానే ఇలా అన్నాడు. "వానరుడా! భలే! భలే! ఫరవాలేదు. పరాక్రమవంతుడవే! పరాక్రమంలో నాకు దీటైన శత్రువుగానే నిలబడ్డావు." రావణుని మాటలు విన్న హనుమంతుడు ఇలా అన్నాడు. "రావణా! ఛీ! నీ నుండి ప్రశంసలు పొందడం నాకు అవమానం. నా బలం ఏం బలం? నువ్వు ఇంకా జీవించే ఉన్నావు గదా! నీ బడాయి మాటలు చాలించు. ఓరీ! దుర్బుద్ధీ! ఇప్పుడు నన్ను మరోసారి కొట్టు. తరువాత నేను నా పిడికిలి గుద్దుతో నిన్ను యమలోకానికి పంపుతాను." అంతట కృద్ధుడైన రావణుడు కుడిచేత్తో పిడికిలి బిగించి గట్టిగా హనుమంతుడి వక్షఃస్థలంపై కొట్టాడు. అంతట ఆ దెబ్బకు హనుమంతుడు తూలిపడ్డాడు. మహాబలశాలి అయిన హనుమంతుడు ఆ విధంగా తూలిపడటంతో, అతిరథుడైన రావణుడు రథాన్ని నీలుడి వైపుగా పోనిచ్చాడు.

రాక్షసరాజు ప్రతాపవంతుడు అయిన రావణుడు సర్పాలతో సమానమైన విషపూరిత బాణాలను వానర సేనాపతి అయిన నీలుడిపై ప్రయోగించాడు. ఆ బాణాలన్నీ నీలుడికి మర్మస్థానాల్లో తగిలి మంటలు పుట్టించాయి. అయినా బాధను లెక్కచేయకుండా

పర్వతశిఖరాన్నొకటి రావణునిపై విసిరాడు. ఇంతలో గొప్పతేజస్సు గల హనుమంతుడు మూర్ఛ నుండి తేరుకున్నాడు. నీలుడితో యుద్ధం చేస్తున్న రావణుణ్ణి చూసి కోపంతో "ఓ రాక్షసుడా! మరొకరితో యుద్ధం చేస్తున్న వారిపైకి దండెత్తి పోవడం యుద్ధ నీతి కాదు. అందువల్ల నిన్ను ఇప్పటికి వదిలేస్తున్నాను" అని అన్నాడు.

అంతట రావణుడు, నీలుడు విసిరిన పర్వత శిఖరాన్ని ఏడు బాణాలతో తుత్తునియలు చేశాడు. తను ప్రయోగించిన పర్వత శిఖారాలన్నీ వ్యర్థం అయిపోవటంతో వానర సేనాపతి అయిన నీలుడికి బాగాకోపం వచ్చింది. దాంతో మద్దిచెట్లను, సాలవృక్షాల్ని పెళ్ళగించి విసిరేశాడు. రావణుడు వాటన్నింటినీ సమర్థంగా ఎదుర్కొని ముక్కలు ముక్కలుగా చేశాడు. తరువాత నీలుడిపై బాణాల వర్షం కురిపించాడు. అంతట నీలుడు శరీరాన్ని చిన్నదిగా కుదించుకొని రావణుని ధ్వజం చివరి భాగాన పోయి వాలాడు. ధ్వజంపైన కూర్చున్న నీలుడు రావణుని చూస్తూ భీకరంగా సింహనాదం చేశాడు. నీలుడు ధ్వజంపై నుండి ధనుస్సు చివరిభాగంపైకి, అక్కడ నుండి రావణుడి కిరీటంపైకి వాలుతూ ఉండటం చూసిన హనుమంతుడు, రామలక్ష్మణులు ఆశ్చర్యపోయారు. నీలుడు ఆ విధంగా గంతులు వేస్తూ ఉంటే రావణాసురుడు కూడా ఆశ్చర్యపోయాడు; చికాకుపడిపోయాడు. రావణుడి అవస్థ చూస్తున్న వానరులంతా పకపకా నవ్వారు. రావణునికి ఏమీ పాలుపోలేదు. కొద్దిసేపు ఆలోచించి చివరకు ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాలని అనుకున్నాడు. ఆగ్నేయాస్త్రానికి అవసరమైన మంత్రాన్ని జపించి, ధ్వజంపై కూర్చున్న నీలుడితో, రావణుడు, "ఓరీ వానరా! నీ మాయలు ఎక్కడైనా చెల్లుతాయేమో కానీ, నా వద్ద పనిచేయవు. నువ్వు ఎన్ని వేషాలు వేసినా, ఎన్ని మాయలు చేసినా, ఇప్పుడు నేను ప్రయోగించే అస్త్రాన్నుండి తప్పించుకోలేవు. చాతనయితే నీ ప్రాణాల్ని కాపాడుకో" అంటూ ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రం సూటిగాపోయి నీలుడి వక్షఃస్థలాన్ని తాకింది. దాంతో నీలుడి శరీరం అంతా నిప్పులపై దొర్లించినట్లయిపోయింది. ఆ బాధను తట్టుకోలేక ధ్వజాగ్రాన్నుండి నేలపై పడిపోయాడు. నీలుడు అగ్నిహోత్రుడి పుత్రుడే కావటం వల్ల అగ్నిహోత్రుడి అనుగ్రహం పొందగలిగాడు. ఆ ప్రభావంతో నీలుడు మోకాళ్ళపైన పడ్డాడు.

అందువల్ల ప్రాణాపాయం తప్పింది; అయినా నీలుడు మూర్ఛపోయాడు.

నీలుడు మూర్ఛపోయి పడి ఉండటంతో రావణుడు యుద్ధ ఆపటానికి ఇష్టపడలేదు. అందువల్ల రథాన్ని లక్ష్మణుడున్న వైపుగా మళ్ళించాడు. యుద్ధోత్సాహంతో ఆ యుద్ధభూమినంతా ఒకసారి కలయచూశాడు. మేఘ గంభీర ధ్వనులు చేస్తూ దిక్కులు పిక్కటిల్లేట్లుగా ధనుష్టంకారం చేశాడు. అప్పుడు లక్ష్మణుడు రావణునితో "ఓ రాక్షసరాజా! నువ్వు వానరులతో చేసిన యుద్ధం చాలు. ఇక నాతో యుద్ధానికి రా!" అని అంటూ నలు దిక్కులా వ్యాపించేట్లుగా ధనుష్టంకారం చేశాడు. అప్పుడు రావణుడు లక్ష్మణుడి సవాలును స్వీకరిస్తూ, "ఓ లక్ష్మణా! నీకు కాలం తీరింది. అందువల్లనే నా ముందుకు వచ్చి నన్ను కవ్విస్తున్నావు. కానీ! ఇది నా అదృష్టం అనుకుంటాను. వానరులతో విసిగిపోయిన నాకు ఓ నరుడివి కనిపించావు. నిన్ను కూడా యమసదనానికి పంపిస్తాను. కాచుకో" అన్నాడు. అంతట లక్ష్మణుడు రావణుని ప్రగల్భాలకు ఏమాత్రం తొణక్కుకుండా, "ఓ రాక్షసుడా! పాపకృత్యాలే నీకు నిత్యకృత్యాలు. ప్రగల్భాలు పలకటంలో నీకు నువ్వే సాటి. వీరులు, ప్రతాపం కల వాళ్ళెవరూ ప్రగల్భాలు పలుకరు. తమని తాము పొగుడుకోరు. నీ బలప్రతాపాలు నాకు తెలుసు. వృథా ప్రేలాపనలు మాని ధనుస్సు పుచ్చుకో. నాతో యుద్ధానికి తడపడు" అన్నాడు. దాంతో రావణాసురుడు కృద్ధుడైపోయాడు. కరకు కొనలతోను, ములుకులతోను ఉన్న ఏడు బాణాలను లక్ష్మణుని మీదకు సంధించాడు. లక్ష్మణుడు ఆ బాణాలన్నింటినీ నిగ్రహించి దారిలోనే ముక్కలు ముక్కలుగా చేశాడు. అది చూసిన రావణుడు మరీ కృద్ధుడై మరీ తీక్ష్ణమైన బాణాల్ని ప్రయోగించాడు. అందుకు సిద్ధంగా ఉన్న లక్ష్మణుడు వాటన్నింటినీ తిప్పి కొట్టాడు. పైపెచ్చు, లక్ష్మణుడు కత్తివాయి బాణాల్ని, అర్ధచంద్రాకార బాణాల్ని, ఈటెల వంటి బాణాల్ని ప్రయోగించి రావణాసురుడి బాణాలన్నిటినీ సమర్థవంతంగా ఎదుర్కొన్నాడు.

అప్పుడు రావణుడు తన బాణాలన్నీ వ్యర్థం అయిపోవటం చూసి, లక్ష్మణుని నేర్పరితనాన్ని మనసులోనే అభినందించాడు. మళ్ళీ రెట్టింపు వేగంతో మరిన్ని వాడి అయిన బాణాల్ని

ప్రయోగించాడు. మహేంద్రుడితో సమానమైన లక్ష్మణుడు వాడి అయినవి, అగ్రబాణాలున్నవి, పిడుగుల్లాగా భయంకరంగా వేగంతో పోయేవి, అగ్ని వంటి తేజస్సుగలవి అయిన బాణాల్ని ప్రయోగించాడు. అంతట రావణుడు వాడియైన ఆ బాణాలన్నింటినీ ముక్కలుగా చేశాడు. బ్రహ్మదేవుడు ప్రసాదించిందీ, ప్రణయాగ్నితో సమానమైనదీ అయిన బాణాన్ని తీసి మంత్రించి లక్ష్మణుని నుదుటకు తగిలేట్లుగా కొట్టాడు. ఆ బాణప్రభావం చేత లక్ష్మణుని చేతిలో ధనుస్సు వదలుగా పట్టుకొని తూలాడు. అతి కష్టంపైన నిగ్రహించుకొని రావణుని ధనుస్సును గురిచూసి బాణాన్ని వేశాడు. ఆ ధనుస్సు కాస్తా రెండు ముక్కలైంది. వెంట వెంటనే తీవ్రమైన మూడు బాణాల్ని రావణునిపై ప్రయోగించాడు. లక్ష్మణుని బాణాల దాడికి తట్టుకోలేక కొద్దిసేపు రావణుడు స్పృహ కోల్పోయాడు. శరీరం అంతా రక్తంతో తడిసింది. ఇక ఉపేక్ష చేయకూడదని తలచి, బ్రహ్మదేవుడిచ్చిన శక్తి ఆయుధాన్ని ప్రయోగించాలనుకున్నాడు. ఆ శక్తి పొగతో కలసిన నిప్పులాగా ఉంటుంది. ఈ ఆయుధాన్ని ప్రయోగించినప్పుడు వానరులంతా భయపడి పరుగులు తీశారు. అంతట రావణుడు శక్తి ఆయుధాన్ని లక్ష్మణుడిపై ప్రయోగించాడు. హోమం చేసిన అగ్నిలా ఉండే బాణాన్ని కూడా ప్రయోగించాడు. ఆ శస్త్రం లక్ష్మణుడి వక్షఃస్థలంలో తాకింది. అంతట లక్ష్మణుడు మూర్ఛపోయి నేలపై పడ్డాడు. వెంటనే రావణుడు మూర్ఛలో ఉన్న లక్ష్మణుణ్ణి బలం అంతా ఉపయోగించి తనతో ఎత్తుకొని పారిపోవాలని చూశాడు. హిమవత్పర్వతాన్ని, మేరుపర్వతాన్ని, ముల్లోకాల్నీ కూడా చేతులతో లేవనెత్తగలిగేవాడేగానీ, లక్ష్మణుణ్ణి మాత్రం లేవనెత్తలేకపోయాడు. కారణం ఏమంటే, శక్తి అస్త్రం లక్ష్మణుడి వక్షఃస్థలాన్ని తాకగానే, తానే మహావిష్ణువు అని భావించి, తనను ఈ శక్తి అస్త్రం ఏమీ చెయ్యలేదని అనుకున్నాడు. రాక్షసుల మదం అణచేందుకే వచ్చినవాడు, కేవలం విష్ణు అంశతోనే వచ్చిన వాడూ కావటం వల్ల, లక్ష్మణుణ్ణి ప్రజాకంటకుడైన రావణాసురుడు ఎత్తలేకపోయాడు.

అప్పుడు వాయుపుత్రుడైన హనుమంతుడు కృద్ధుడయ్యాడు. కోపంతో పిడికిలి బిగించి వేగంగా పోయి రావణాసురుడి వక్షఃస్థలంపై ఒక్క గుద్దు గుద్దాడు. వజ్రాయుధం లాంటి ఆ గుద్దుకు రావణాసురుడు బోర్లాపడిపోయాడు. నోట్లోనుండి, ముక్కులో నుండి, కళ్ళల్లో నుండి,

చెవుల్లో నుండి రక్తం కారింది. లేచి తూలుతూ మెల్లగా రథంపై కూర్చున్నాడు. అక్కడే ఒళ్ళు తెలియకుండా మూర్ఛపోయాడు. భయంకరంగా పోట్లాడే రావణుడు, హనుమంతుడి దెబ్బకు మూర్ఛపడిపోవడంతో దేవేంద్రుడు, దేవతలు దేవర్షులు అంతా సంతోషించారు. వానరులందరూ సింహనాదాలు చేశారు.

అప్పుడు ఆ మహాబలశాలి అయిన హనుమంతుడు లక్ష్మణుణ్ణి తన చేతులతో ఎత్తుకొని రాముడి వద్దకు తీసుకొని వెళ్ళాడు. రావణుడు లక్ష్మణునికి పరమ శత్రువు అవటం వల్ల ఎత్తలేకపోయాడు. కానీ హనుమంతుడు రామలక్ష్మణులకు మిత్రుడు, భక్తుడు, బంటు. కాబట్టి అవలీలగా ఎత్తగలిగాడు. లక్ష్మణుణ్ణి రాముని దగ్గరకు చేర్చగానే శక్తి ఆయుధం లక్ష్మణుణ్ణి విడిచి రావణుని వద్దకు పోయింది. ఊహించటానిక్కూడా అంతుబట్టని విష్ణు అంశ అయిన తన నిజస్వరూపాన్ని గూర్చి లక్ష్మణుడు స్మరించాడు. అంతట శరీరంపై అయిన గాయాలన్నీ మాయమైపోయాయి. వానరులంతా పడిపోయి ఉండటంతో రాముడు రావణుణ్ణి ఎదుర్కోవటానికి సిద్ధమయ్యాడు. అప్పుడు హనుమంతుడు వచ్చి రామునితో "విష్ణువు గరుత్మంతుని అధిరోహించి శత్రువులను సంహరించినట్లు, నువ్వు నా వీపుపైన కూర్చుని రావణునితో యుద్ధం చేయి" అన్నాడు. అంతట రాముడు హనుమంతుని వీపుపై ఎక్కి యుద్ధానికి బయలుదేరాడు. యుద్ధానికి సిద్ధమై రథంపై వస్తున్న రావణాసురుణ్ణి, బలిచక్రవర్తిని చూసిన విష్ణుమూర్తిలా, చూసి కృద్ధుడైపోయాడు. తన మహా ధనుస్సును ఎత్తాడు. వింటిని సారించి పిడుగుల మల్లే ధనుష్టంకారం చేశాడు. రావణాసురుడితో ఇలా అన్నాడు: "ఓ రాక్షసుడా! నిలు! నిలు! నాకు ఇంత పెద్ద అపకారం చేశావు. తప్పించుకొని ఎక్కడకు పోగలవు? ముల్లోకాల్లో నువ్వు ఎక్కడున్నా వదలను! నువ్వు ఇంద్రుడు, యముడు, సూర్యుల వద్దకుగానీ, బ్రహ్మ, అగ్ని, శివుల వద్దకు గాని, పది దిక్కులలో ఎక్కడ ఉన్నా నిన్ను వెతికి పట్టుకొని వధిస్తాను. ఓ రావణా! నువ్వు ఏ శక్తి ఆయుధం చేత లక్ష్మణుణ్ణి కొట్టావో, ఆ లక్ష్మణుడే ఇప్పుడు వచ్చి నీ పుత్రుల్ని, నీ భార్యల్ని చంపేస్తాడు. ఓ రాక్షసుడా! నేను ఎవరినో చెబుతాను విను. జనస్థానంలో నివసించిన నీ బంధువులైన పద్నాలుగు వేలమంది రాక్షసుల్ని హతమార్చింది నేనే. రాముడు అన్న మాటలన్నీ

విన్న రావణుడు కోపంతో మండిపడుతూ రాముని వాహనమైన హనుమంతునిపై ప్రళయాగ్నితో సమానమైన బాణాల్తో కొట్టాడు. సహజంగానే తేజోవంతుడైన హనుమంతుడు, రావణుని బాణాల ప్రయోగంతో మరింత తేజోవంతుడయ్యాడు. అప్పుడు గాయపడిన హనుమంతుణ్ణి చూడగానే రాముడికి కోపం వచ్చింది. వెంటనే వాడి అయిన బాణాల్ని వదిలాడు. ఆ బాణాలు తగలగానే రథచక్రాలు ఊడిపోయాయి, గుర్రాలు చచ్చి నేలకూలాయి, సారథి యమలోకానికి పోయాడు. రథంలో ఉండే ఖడ్గాలు, శూలాలు మొదలైన ఆయుధాలన్నీ ముక్కలు ముక్కలు అయ్యాయి. దేవేంద్రుడు వజ్రాయుధాన్ని మేరు పర్వతం మీద ప్రయోగించినట్లు రాముడు రావణుని వక్షఃస్థలంపై ప్రయోగించాడు.

మునుపు రావణాసురుడు వజ్రాయుధం చేత దెబ్బలు తిన్నాడు, పిడుగుపాటును తట్టుకొని నిలిచాడు. కానీ, రామబాణాల్ని తట్టుకోలేకపోయాడు. శరీరం అంతా ఒణికిపోయింది. ధనుస్సు నేలపై పడింది. మూర్ఛపోయాడు. మహాపరాక్రమశాలి అయిన రాముడు మూర్ఛపోయి పడి ఉన్న రావణుణ్ణి చూశాడు. మెరిసిపోయే అర్ధచంద్రాకారపు బాణాన్ని తీసి ఆ రాక్షసరాజుపై వదిలాడు. ఆ బాణం దూసుకుపోయి అతడి శిరస్సుపై ఉండే నవరత్నఖచితమైన కిరీటాన్ని పగులకొట్టింది. కొంతసేపట్లో రావణాసురుడు మూర్ఛ నుండి తేరుకున్నాడు. శిరస్సుపై కిరీటం విరిగి ముక్కలై ఉండటం చూశాడు. ముఖాన కళాకాంతులన్నీ మసగబారాయి. విషం పిండిన సర్పంలాగా, ఆరిపోయిన అగ్నిహోత్రంలా, గ్రహణం పట్టిన సూర్యుడిలా, సంపదలు కోల్పోయిన శ్రీమంతుడిలా పడి ఉన్న రావణుణ్ణి చూస్తూ రాముడు ఇలా అన్నాడు: "ఓ రావణుడా! నువ్వు భయంకరంగా యుద్ధం చేశావు. వానరవీరు లెందరినో పొట్టన పెట్టుకున్నావు. అలసిపోయి ఉన్నావు. ఇప్పుడు నేను కొట్టిన దెబ్బకు తట్టుకోలేక మూర్ఛపోయావు. నీలో శక్తి అంతా ఖర్చయిపోయింది. కనీసం ధనుస్సు చేత్తో పట్టుకునే ఓపికకూడా లేదు. ఇటువంటి నిన్ను చంపను. అట్లా చంపడం యుద్ధధర్మం కాదు. ఒకవేళ నిన్ను చంపినా లోకులు నన్ను మెచ్చరు. నేను ధర్మాన్ని తప్పేవాడిని కాను. కాబట్టి ఇప్పుడు నీపై బాణాలు వేసి మృత్యుదేవతకు ఒప్పచెప్పను.

"ఓ రాక్షసుడా! నువ్వు యుద్ధంలో అలసిపోయావు; నాకు తెలుస్తూనే ఉంది. నువ్వు ఇప్పుడు ఇక నీ నగరానికి పోయి విశ్రాంతి తీసుకో. రేపు రథాన్నెక్కి కొత్త ధనుస్సుతో రా. నువ్వు రథంపై నుండి యుద్ధం చేస్తూ ఉండగా, నా బలం ఎంతటిదో చూపిస్తాను."

రాముడు అలా అనటంతో రావణుడి దర్పం, సంతోషం అన్నీ నీరు కారిపోయాయి. చేతిలో ధనుస్సు విరిచేసి నన్ను నిరాయుధుణ్ణిగా నిలబెట్టాడు. నా గుర్రాల్ని, సారథిని చంపాడు. నా రథాన్ని విరగ్గొట్టాడు. నా కిరీటాన్ని ముక్కలు ముక్కలుగా విరగ్గొట్టాడు. రామబాణం చేత శరీరం అంతా బాధపెడుతోంది. ఈ స్థితిలో రాముడు ఈ విధంగా అంటూ ఉంటే రావణాసురుడికి ఏంచెయ్యాలో తోచలేదు. తిరిగి లంకా నగరానికి వెళ్ళిపోయాడు.

రావణాసురుడు యుద్ధభూమి నుండి ఇంటికి తరలిపోగానే రామలక్ష్మణులు వానర సేనలకు గుచ్చుకున్న బాణాలన్నీ తీసివేసి సేవచేశారు.

ఆ విధంగా ఇంద్రుని శత్రువైన రావణుడు పరాజయం పొందడం చూసిన భూతగణాలు, దిక్పాలకులు, మహర్షులు, సురా సురులంతా సంతోషించారు.

# 60వ సర్గ రావణుడు వ్యధ చెందటం

రావణాసురుడికి రామబాణాలు వచ్చి తగిలాయి. బాధపడిపోయాడు. బాధ కన్నా ఎక్కువగా భయపడ్డాడు. భయం కలగ్గానే దిగులు పుట్టుకొచ్చింది. ఇదివరకున్న దర్పం అంతా నీరుకారి పోయింది. సింహాన్ని చూసిన ఏనుగులాగా, గరుత్మంతుని చూసిన సర్పంవలె ఆయాసపడుతున్నాడు. మహాబలవంతుడైన రాముడితో తలపడిన తర్వాత భయంపట్టుకుంది. క్షీన్నుడైపోయాడు. పొగలు సెగలు లేకుండానే నిప్పులు కక్కేమంటలు మండించే బ్రహ్మదండం లాగాను, చటుక్కున ఏ ప్రక్కన పడితే ఆ ప్రక్కన మెరిసే మెరుపుల్లాగాను వచ్చి పడే రామబాణాన్ని తలచుకుంటూ వ్యధ పడిపోతున్నాడు. బంగారు దివ్య సింహాసనంపై కూర్చున్నా సుఖంగా కూర్చోలేకుండా ఉన్నాడు. రాక్షసవీరులందర్నీ సమావేశపరచి ఇలా అన్నాడు: "ఓ వీరులారా! నేను దేవేంద్రుడితో సరిసమానమైన బలవంతుణ్ణి; పరాక్రమవంతుణ్ణి. అటువంటి నన్ను ఒక సామాన్య మానవుడు జయించాడు. నేను చేసిన కఠోర తపస్సులన్నీ వ్యర్థం అయిపోయాయి.

"దేవతలు, దానవులు, పన్నగులు, యక్షులు, రాక్షసుల నుండి నేను చంపబడకుండా ఉండేట్టు వరాన్ని బ్రహ్మదేవుడు నాకు ప్రసాదించాడు. మానవుల నుండి చంపబడకుండా ఉండే వరాన్ని నేను కోరలేదు; బ్రహ్మదేవుడు ప్రసాదించనూలేదు. అయితే బ్రహ్మదేవుడు నీకు మానవుడి వల్లనే మరణభయం కలుగుతుందని హెచ్చరించాడు. నాకు ఇప్పుడు జ్ఞాపకానికి వస్తోంది. బ్రహ్మ వాక్యానికి ఎక్కడైనా తిరుగు ఉంటుందా? అంతే! అదే జరిగింది.

"ఓ రాక్షసయోధుల్లారా! పూర్వం నేను దిగ్విజయయాత్ర చేస్తూ ఉన్నప్పుడు ఇక్ష్వాకువంశీయుడైన 'అనరణ్య' డనే రాజుని చిత్రవధ చేశాను. ఆ రాజు నన్ను ఇలా శపించాడు. 'ఓ రాక్షసుడా! నీవు అధముడవు. నా వంశంలో పుట్టిన పుణ్యపురుషుడే, నీ పుత్రులను, మంత్రుల్ని, గుర్రాల్ని, రథాల్ని, నీ సారథిని, నిన్నూ కూడా సంహరిస్తాడు' అని

శపించాడు. ఆనాడు ఆ మహాత్ముడు చెప్పింది దశరథాత్మజుడైన రాముడేమోనని నాకు అనిపిస్తోంది.

"నేను పూర్వం వేదవతి అనే ఆమెను బలవంతం చేశాను. ఆ మహాభాగ్యవంతురాలే జనకుని కుమార్తె సీతగా జన్మించినది. నన్ను పార్వతి, నందీశ్వరుడు, రంభ, వరుణిని పుత్రిక ఏ విధంగా శపించారో అట్లాగే జరుగుతోంది. ఋషులు, మహాత్ముల మాటలు వ్యర్థం కావు కదా!

ఇవన్నీ దృష్టిలో ఉంచుకొని తగిన మెలకువలతో మీరు ప్రయత్నాలు కొనసాగించాలి. రాజవీథుల్లోను, గోపురాల్లోను, శిఖరాల్లోను ఏమరిపాటుతనం లేకుండా కావలికాయాలి. దేవదానవుల దర్పాల్ని అణగగొట్టినవాడు, సాటిలేని గాంభీర్యం కలవాడు, బ్రహ్మదేవునిచే శాపగ్రస్తుడైనవాడు అయిన నా సోదరుడు కుంభకర్ణుణ్ణి నిద్రలేపండి. మహాబలవంతుడైన ప్రహస్తుడు యుద్ధంలో చనిపోయాడు. నేను అపజయంతో తిరిగివచ్చాను. అందువల్ల మనం రక్షణ విషయంలో మరిన్ని కట్టుదిట్టాలు చేసుకోవాలి. నగర ప్రాకారాలన్నింట్లోను గట్టి రక్షణ ఏర్పాట్లు చెయ్యాలి." కుంభకర్ణుణ్ణి నిద్రలేపడానికి వెళ్ళే రాక్షసయోధులతో ఇలా అన్నాడు: "ఓ వీరులారా! మీరు రాజభవన ద్వారం దగ్గర కాపలా ఉండండి. కొందరు ప్రాకారం ఎక్కి కాపలాకాయాలి. మరికొందరు నిద్రలో ఉన్న కుంభకర్ణుణ్ణి నిద్రలేపండి. కాలకర్మం చేత ఆరు నెలలు, ఏడు నెలలు, ఎనిమిది నెలలు, పదినెలలు కూడా నిద్రపోతూ ఉంటాడు. అతడు పడుకుని ఇంకా పది రోజులు కూడా కాలేదు. మంత్రిమండలిలో తాను చెప్పదలచుకున్నదంతా మనతో చర్చించి నిద్రపోవటానికిపోయాడు. ఇప్పుడే కునుకుపట్టి ఉంటుంది. దీర్ఘనిద్రలోకి వెళ్ళే ముందే అతణ్ణి లేపండి. ఆ మహా బలవంతుడు, ఆ మహాబాహువు నాకు మల్లే శాపగ్రస్తుడు కాదు. కాబట్టి అతణ్ణి నరులుగాని, వానరులుగాని చంపలేరు. మన రాక్షస వీరులందరిలోను తలమానికంలాంటి వాడు. యుద్ధభూమిలో ధ్వజంలాంటివాడు. యుద్ధంలో వానరుల్ని, రామలక్ష్మణుల్ని కూడా చంపగల సమర్థుడు. అయితే పరమమూర్ఖుడు. శరీర సుఖాలకు బానిస అయి ఎప్పుడూ నిద్రపోతూ ఉంటాడు. ఈ మహాయుద్ధంలో రాముడు నన్ను దారుణంగా

అవమానించాడు. ఇప్పుడు కుంభకర్ణుడు లేచినట్లయితే నా దుఃఖాలన్నీ తీరిపోతాయి. ఇతడు ప్రతాపంలో దేవేంద్రుడితో సమానుడే అయినా, నేను ఇంతటి దుఃఖం ఉన్నప్పుడు నాకు సహాయపడక నిద్రావస్థలో పడి ఉంటే ఇతడివల్ల నాకేం ప్రయోజనం ఉంటుంది? అదీకాకుండా నిద్రపోయే ముందు మంత్రి మండలిలో నాకు సహాయపడ్తానని మాట ఇచ్చాడు. కాబట్టి అతణ్ణి వెంటనే నిద్రలేపండి."

ఆ రాక్షస ప్రముఖులంతా రావణాసురుని మాటలు విని వెంటనే కుంభకర్ణుని నిద్రలేపే ప్రయత్నం చేశారు. కుంభకర్ణుడి నివాసం అతి విశాలమైనది. ఎటు చూసినా ఒకటిన్నర యోజనాల వైశాల్యం గలది, పుష్పాల సుగంధాలతో వ్యాపించి ఉన్న కుంభకర్ణుని నివాస గృహం లోపలకు వెళ్ళారు. కుంభకర్ణుడి ఉచ్ఛ్వాసనిస్స్వాసాలు భయంకరమైన తుపానుగాలుల్లా ఉండి లోపలకు ప్రవేశించలేకపోయారు. ఒక్కోసారి గాలి ముక్కుల్లోకి పీలుస్తూ ఉంటే అంతా ధూళిలాగా లోపలకు కొట్టుకువెళ్ళేవాళ్ళు. ఇంతలోనే నిస్స్వాసంలో గాలిని బైటకు వదల్తూ ఉంటే వెయ్యి ఏనుగులు బైటకు నెట్టేస్తున్నట్లుగా పదియోజనాల దూరానపోయి పడేవాళ్ళు. అప్పుడప్పుడూ నిట్టూర్పులు విడుస్తున్నప్పుడు లోపలకు పోయి ఏదైనా స్థావరాన్ని ఏర్పాటు చేసుకొన్నారు. ఆ విధంగా మహాప్రయత్నం చేసి వాళ్ళంతా లోపలకు ప్రవేశించగలిగారు. ఆ బంగారు గృహంలో అంతా మనోహరమైన మంగళద్రవ్యాలు కనిపించాయి. బంగారంతో చేసిన పెద్దపెద్ద అరుగుల్లాంటి శయ్యమీద పర్వతంలా పడి నిద్రపోతున్నాడు. అంతనిద్రలో కూడా బంగారు ఆభరణాలు, కవచాలు ధరించి లేపటానికి వీలులేకుండా వికృతంగా పడి ఉన్నాడు. ఒంటి మీద రోమాలన్నీ నిక్క బొడుచుకొని ఉన్నాయి. ముక్కుల్లో నుండి వెయ్యిపాములు బుసకొడ్తున్నట్లు భయంకరమైన శబ్దాలు వస్తున్నాయి. ఆ ముక్కు రంధ్రాలు రెండూ పాతాళగుహల్లా ఉన్నాయి. ఆ ముక్కురంధ్రాల్లో నుండి, నోట్లో నుండి పెనుతుపాను గాలుల్లా ఊపిరి వదుల్తున్నాడు. అంతకు ముందు అతడు తిన్న ఆహారం తాలూకు కొవ్వు, రక్తం, మాంసం వాసనలతో రాక్షసుల ముక్కులు పగిలిపోయాయి. లేపటానికి వీలుకాని విధంగా నిద్రపోతున్నా, కిరీట కాంతులచేత సూర్యుడిలాగా ప్రకాశిస్తున్న, రాక్షస శ్రేష్ఠుడు, శత్రుసంహారకుడు అయిన

కుంభకర్ణుణ్ణి చూశారు.

కుంభకర్ణుడు నిద్ర లేవగానే అతణ్ణి తృప్తిపరచేందుకు ఎదురుకుండా అందుబాటులో ఉండేట్లుగా మేరు పర్వతం అంత ఎత్తున, జింకల మాంసాన్ని, దున్నపోతుల మాంసాన్ని, పందిమాంసాన్ని, పెద్ద అన్నపు రాశిని అక్కడుంచారు. పెద్దపెద్ద బానలు, గుండిగల నిండా రకరకాలైన మద్యాల్ని నింపి ఉంచారు. ఆ శత్రుసంహారకుడి ఒంటి నిండా ఘుమఘుమ సువాసనలు వెదజల్లే చందన అగరువంటి లేపనాల్ని పూశారు. సుగంధాలు వెదజల్లే పుష్పమాలలతో అలంకరించారు. మేఘాలు గర్జిస్తున్నట్లుగా చెవి రంధ్రాల వద్ద చేరి అరిచారు. పెద్దపెద్ద శంఖాల్ని పూరించారు. ప్రయోజనం లేకపోయిది. అంతా ఒకేసారి దుందుభులు మ్రోగించారు; శంఖాలు పూరిస్తూ, సింహనాదాలు చేస్తూ ఉంటే పక్షులన్నీ భయపడి గూళ్ళు వదలి పారిపోయాయి. ఎంతో ఎత్తులకు ఎగురుకుంటూ పోయినా ఈ శబ్దాల బాధ తప్పక, ఇహ ఎగరలేక నేలమీద పడిపోయాయి.

అట్లా వాళ్ళంతా కలసి మూకఉమ్మడిగా ఎంత ప్రయత్నించినా కుంభకర్ణుణ్ణి నిద్ర లేపలేకపోయారు. చివరకు అరచేతుల్తో ఆ చెంపా ఈ చెంపా వాయించారు; పిడికిళ్ళు బిగించి గుద్దారు; పాదాలతోను, మోకాళ్ళతోను తన్నారు. ఆ దెబ్బలకు నిద్రలేకపోగా, ఊపిరి గట్టిగా పీల్చి వదుల్తూ ఉంటే, ఆ గాలి తాకిడికి మహాయోధులైన రాక్షసులు నిలువలేకపోయారు. ఇక లాభం లేదనుకున్నారు. ఇనుప గుదియలతోను, ముసలాలతోను, గదలతోను, ముద్గరాలతోను కొట్టారు; పొడిచారు. అప్పటికీ నిద్రలేవలేదు. పదివేలమంది రాక్షసులు ఒకేసారి శంఖాలు పూరించారు. కాటుక కొండలాగా పడి ఉన్నాడేకాని, నిద్ర లేవలేదు. ఇక వాళ్ళు ప్రయత్నాన్ని కొంచం ఉద్ధృతం చెయ్యాలని అనుకున్నారు. కొంతమంది భేరీలు, మృదంగాలు శంఖాలు పూరిస్తూ ఉంటే కొందరు గుర్రాల్ని కొట్టినట్లు కొరడాలతో కొట్టారు. ఏనుగుల్ని పొడిచినట్లు అంకుశాల్తో పొడిచారు. ఆ మహాధ్వనికి లంకా పట్టణం అంతా మారుమ్రోగింది. అడవులు పర్వతాలు చలించిపోయాయి. కానీ కుంభకర్ణుడు నిద్రలేవలేదు. జుట్టు పీకారు; చెవులు

కొరికారు. గుండిగల్తో నీళ్ళు తెచ్చి ఒళ్ళంతా ముంచెత్తారు. చెవిరంధ్రాల్లో ఏకధారగా నీరుపోసి బాధపెట్టారు. ఓ వెయ్యి ఏనుగుల్ని తెప్పించి అతడిపై విడవకుండా నడిపించారు. అప్పుడు ఏదో చీమో, దోమో మీద ప్రాకుతున్నట్లు చేత్తో తోసేశాడు. ఆ చేతికి తాకిన ఏనుగుపోయి అంత దూరానపడింది. అయినా దాని వెనక మరొకటి మరొకటీ రావడంతో ఏమిటీ ఏదో ప్రాకుతున్నట్లున్నదని అలవోకగా కన్ను తెరచి చూశాడు. ఆవలిస్తూ నిద్రలేచాడు. నోరు తెరచి ఆవలిస్తూ ఉంటే లేచిన మంటలు మేరు పర్వతం మీద సూర్యుడు ఉదయించే ఉదయ సూర్యుడిలా కనిపించాయి. ఒళ్ళు విరుచుకుంటూ, ఆవలిస్తూ, నిట్టూర్పులు విడుస్తూంటే కొండ గుహల్లోంచి వచ్చే పెద్దగాలిగా వీచింది. పైకి లేస్తున్న కుంభకర్ణుడి ఆకారం ప్రళయకాలంలో ప్రాణులన్నింటినీ భస్మం చేసే యముడిలాగా ఉంది. ఎర్రగా మండుతున్న అతడి నేత్రాలు అగ్నిజ్వాలల్లాగాను, మెరుపుల్లాంటి కాంతివంతంగాను ఉన్నాయి.

అట్లా నిద్ర లేస్తూనే ఆకలితో దహించుకుపోయాడు. వెంటనే అనేక రకాలైన మాంసరాసుల్ని అతడి ఎదుట పెట్టారు. పందిమాంసాన్ని, దున్నపోతుల మాంసాన్ని ఆబగా తినేశాడు. పిమ్మట లేడిమాంసాన్ని లొట్టవేసుకుంటూ తిన్నాడు. దాహం వేసినప్పుడుల్లా పచ్చి నెత్తురు బానలకు బానలు తాగేశారు. ఆ విధంగా ఆకలి బాధ తగ్గిన తర్వాత, రాక్షసయోధులంతా ఆయన ఎదుటపడి సాష్టాంగ నమస్కారాలు చేశారు. వినయంగా నిలబడ్డారు. తనను మధ్యలో నిద్రలేపినట్లు గుర్తువచ్చింది. వాళ్ళంతా తన ముందు వినయంగా నిలబడి ఉండటం చూస్తూ ఆశ్చర్యపోయాడు. "ఓ రాక్షసయోధుల్లారా! నన్ను ఎందుకు నిద్రలేపారు? రాజు క్షేమమే కదా? ఉపద్రవాలేమీ రాలేదుగదా? నా అన్నగారు ఏ కారణం చేతనైన భయపడ్తున్నాడా? ఏదో భయం మిమ్మల్ని పట్టి పీడిస్తోందని తెలుస్తోంది. మీ భయానికి కారణమైన ఆ శత్రువు ఎవరో చెప్పండి. వాణ్ణి చంపి వస్తాను. దేవేంద్రుణ్ణైనా పడగొడతాను. అగ్నిహోత్రుణ్ణైనా ఆర్పేస్తాను. మా అన్నకు ఎవరు ఎంత చిన్న ఉపద్రవం కలిగించినా సహించలేను. నన్ను నిద్ర లేపడానికి గల కారణం ఏమిటో నిర్భయంగా చెప్పండి" అని అడిగాడు.

చాలా ఆతురతతో ఆ విధంగా మాట్లాడిన శత్రుసంహారకుడైన కుంభకర్ణునితో, మంత్రి యూపాక్షుడు చేతులు జోడించి నమస్కరిస్తూ "రాజా! మేము ఎన్నడూ దేవతలకు కూడా భయపడలేదు. ఈనాడు మనుష్యుల వలన గొప్ప భయం ఏర్పడింది. దైత్య, దానవుల వల్ల కూడా ఎన్నడూ ఇంతటి భయాన్ని ఎరుగం. సీతాపహరణం వలన కోపించిన రాముడు లక్ష్మణ సమేతుడై యుద్ధానికి వచ్చాడు. ఈ దాడిలో సుగ్రీవుణ్ణి సహాయంగా తీసుకొని పర్వతాల్లాంటి కోట్లాది వానరుల్తో లంకా పట్టణాన్ని ముట్టడించారు. ఇంతకు పూర్వం ఒకే ఒక్క వానరుడు వచ్చి అక్షకుమారుణ్ణి, చతురంగ బలాన్ని చంపి, లంకా పట్టణాన్ని కాల్చి బూడిద చేసిపోయాడు. అతడు పోయి సూర్యుడి వంటి కాంతిగల రామలక్ష్మణుల్ని వెంటబెట్టుకొని వచ్చాడు. ఆ రాముడు నిన్న నీ అన్నగారైన రావణుణ్ణి యుద్ధంలో జయించాడు. మన ప్రభువు మరణించి ఉంటాడని రాముడు తలచి మీ అన్నగారిని విడిచి వెళ్ళిపోయాడు" అని చెప్పాడు.

యూపాక్షుడు చెప్పిదంతా కుంభకర్ణుడు విన్నాడు. తన అన్నగారైన రావణుడు యుద్ధంలో ఓడిపోయాడన్న మాటను జీర్ణించుకోలేకపోయాడు. కోపంతో ఒళ్ళంతా మండిపోయింది. ఆ మంటతో నిద్ర కాస్తా మాయమైపోయింది. ఆ మహామంత్రితో ఇలా అన్నాడు: "ఓ యూపాక్షుడా! నా అన్నగారికి మనస్తాపం కలిగించిన ఆ రామలక్ష్మణుల్ని, వానర మూకల్ని ముందుగా రక్తమాంసాలతో రాక్షసులందరికీ విందు చేస్తాను. ఆ రామలక్ష్మణుల రక్తం నేనే స్వయంగా తాగుతాను."

కుంభకర్ణుడు ఆ విధంగా కోపోద్రిక్తుడై లేచి నిలబడ్డాడు. అంతట మరోమంత్రి, మహోదరుడు, లేచి చేతులు జోడించి నమస్కరిస్తూ, "ఓ మహాబాహూ! ముందుగా రావణాసురుడు చెప్పేది విను. అటుపిమ్మట అందులోని గుణదోషాలను విచారించి అటుపిమ్మట శత్రుసంహారాన్ని చెయ్యి" అన్నాడు. గొప్ప తేజస్సు, బలము, గల కుంభకర్ణుడు మహోదరుని మాటలు విని అతడితో కలసి బయలుదేరాడు. ఇంతలో కొందరు రాక్షసులు రావణుని ఇంటికి వెళ్ళి కుంభకర్ణుణ్ణి నిద్రలేపామన్న సందేశాన్నిచ్చారు. "ఓ ప్రభూ! నీ సోదరుడైన కుంభకర్ణుడు

నిద్ర నిండి లేచాడు. అతడు అక్కడనుండి యుద్ధానికి వెళ్ళాలా? లేక ఇక్కడకు నిన్ను చూసేందుకు రావాలా?" అని అడిగారు. అంతట రావణుడు మిక్కిలి సంతోషిస్తూ "నేను కుంభకర్ణుణ్ణి ముందుగా కలుసుకోవాలనే అనుకుంటున్నాను. కాబట్టి అతణ్ణి ఇక్కడికే తీసుకొనిరండి" అన్నాడు. ఆ రాక్షసులు రావణాసురుని ఆజ్ఞలను శిరసావహించి, కుంభకర్ణుడి వద్దకు వెళ్ళి ఇలా అన్నారు: "రాక్షసులలో శ్రేష్ఠుడైన నీ సోదరుడు నిన్ను చూడాలనుకొంటున్నాడు. కాబట్టి ఆయనకు సంతోషం కలిగించమని ప్రార్థిస్తున్నాం." అంతట కుంభకర్ణుడు రావణుని గృహానికి బయలుదేరాడు.

అంతట కుంభకర్ణుడు. స్నానపానాదులు పూర్తి చేసుకొని, చక్కగా అలంకరించుకొని, అనేక రకాలైన మాంసాలు, మద్యాలు సేవించి, మత్తెక్కి రాజసందర్శనానికి బయలుదేరాడు. కడుపునిండా తిన్నాడు. మద్యాన్ని పూర్తిగా సేవించాడు. ఇక రాక్షస సైన్యంతో కలసి అన్నగారి భవనానికి బయలుదేరాడు. అప్పుడు ఆ కుంభకర్ణుడు ప్రళయకాలంలో ప్రాణుల్ని సంహరించే యముడివలె ఉన్నాడు. అతడు అడుగు తీసి అడుగువేస్తూ ఉంటే భూమి కంపించింది. కుంభకర్ణుని తేజస్సు చేత రాజమార్గం అంతా సూర్యకిరణాలచేత భూమివలె ప్రకాశించింది. దేవేంద్రుడు బ్రహ్మదేవుని గృహానికి వెళ్ళిన విధంగా కుంభకర్ణుడు రావణాసురుడి గృహానికి వెళ్ళాడు. శత్రుసంహారకుడు, పర్వతాకారుడు అయిన కుంభకర్ణుడు రాజవీథుల వెంట రావణ గృహానికి వెళ్తూ ఉండగా, లంకా నగరానికి బైట నుండీ చూస్తున్న వానర నాయకులు కూడా భయపడిపోయారు. అటువంటి వానరుల్లో కొందరు భయంతో రాముణ్ణి శరణుకోరారు. కొందరు స్పృహతప్పారు. కొందరు నలుదిక్కులకూ పారిపోయారు. కిరీటం ధరించి పర్వతంలాగా వస్తున్న తేజోవంతుడైన కుంభకర్ణుడు సూర్యుణ్ణి తాకుతున్నాడా అన్నంత ఎత్తుకు ఎదిగిపోయాడు. నమ్మశక్యం కాకుండా పెరిగిపోయిన ఆ రాక్షసరాజు శరీరాన్ని చూసి వానరులు భయంతో పరుగులు తీశారు.

# 61వ సర్గ కుంభకర్ణుని గూర్చి విభీషణుడు రామునికి చెప్పడం

పూర్వం ఆకాశాన్నంతా ఆక్రమించుకున్న త్రివిక్రముడైన శ్రీమన్నారాయణమూర్తివలె పర్వతాకారుడై వెళ్తున్న కుంభకర్ణుణ్ణి చూసి వానరులంతా పరుగులు తీశారు. రాముడు కూడా ఆ పర్వతాకారుణ్ణి చూసి ధనుస్సు చేతిలోకి తీసుకుంటూ, ప్రక్కనే ఉన్న విభీషణుణ్ణి "ఆ పర్వతాకారుడు ఎవరు? శిరస్సు మీద కిరీటం ఉంది. కళ్ళు మిరుమిట్లు గొలిపేట్లుగా నల్లగా మేఘంవలె ఉన్నాడు. ఈ లంకా పట్టణానికి ధ్వజంలాగా కనపడుతున్నాడు. వానరులంతా ఇతణ్ణి చూసి భయపడుతున్నారు. నేను ఇంతవరకు ఇంతటి భారీశరీరాన్ని చూడలేదు. ఇతడు రాక్షసుడా? లేక అసురుడా?" అని అడిగాడు. అందుకు విభీషణుడు ఇలా అన్నాడు.

విభీషణుడు : "రామా! ఇతడు విశ్రవశుని కుమారుడు. పేరు కుంభకర్ణుడు. గొప్ప ప్రతాపవంతుడు. పూర్వం యుద్ధంలో ఇంద్రుణ్ణి, యముణ్ణి ఓడించాడు. ఇంత పెద్ద దేహం ఉన్న రాక్షసుడు మరొకడు లేడు. ఇతడు యుద్ధాల్లో దేవ, దానవ, యక్ష, నాగ, గంధర్వ, విద్యాధర, పన్నగులందర్నీ ఓడించాడు. వికృతములైన నేత్రాలతో, శూలాన్ని చేత ధరించిన మహాబలశాలి అయిన కుంభకర్ణుణ్ణి చూస్తే దేవతలు కూడా మృత్యు దేవత అని భయపడ్డారు. రాక్షసులంతా బ్రహ్మ, రుద్రాది దేవతల్ని మెప్పించి వరాలు పొంది బలవంతులయ్యారు. కానీ ఈ కుంభకర్ణుడు మాత్రం సహజంగానే గొప్ప బలంగలవాడు; తేజోవంతుడు, ఇతడు పుడుతూనే గొప్ప ఆకలితో పుట్టాడు. ఆకలి బాధతో ఎన్నో వేల ప్రాణుల్ని చంపి తిన్నాడు. ఈ కుంభకర్ణుడి వల్ల భయంతో ప్రజలంతా భీతిచెందిపోయారు. ప్రాణభయంతో దేవేంద్రుడి దగ్గరకుపోయి మొరపెట్టుకున్నారు. అప్పుడు ఇంద్రుడు కుపితుడై కుంభకర్ణుని వజ్రాయుధంతో కొట్టాడు. దాంతో మహేంద్రుడిపై కోపంతో ఐరావతం దంతాన్నొకటి పీకి అతడి వక్షఃస్థలంపై కొట్టాడు. ఆ దెబ్బకు దేవేంద్రుడు తట్టుకోలేకపోయాడు. దేవేంద్రుడు ప్రజల్ని, మహర్షుల్ని వెంటబెట్టుకొని బ్రహ్మదేవుని వద్దకు పోయాడు. "దేవా! ఈ కుంభకర్ణుడు ప్రజలను చంపి తింటున్నాడు. ఋషుల ఆశ్రమాల్ని ధ్వంసం చేస్తున్నాడు. ఇతరుల భార్యల్ని అపహరించుకుపోతున్నాడు" అని మొరపెట్టుకున్నారు.

ఇంద్రుడి మాటలు విన్న బ్రహ్మదేవుడు కూడా తన సృష్టికి విఘాతం కలుగుతుందని కలత చెందాడు. బ్రహ్మదేవుడే స్వయంగా ఈ కుంభకర్ణుణ్ణి చూసి భయపడిపోయాడు. దాంతో "ఈ విశ్రవశువు ఇతడిని లోకాన్ని నాశనం చెయ్యటానికే కన్నాడు. వీడివల్ల లోకానికి ఉపద్రవం కలుగుతోంది కాబట్టి ఇకపై వీడు చచ్చినట్లు పడి ఉండుగాక!" అని అన్నాడు. బ్రహ్మవాక్కు చేత కుంభకర్ణుడు అక్కడికక్కడే పడిపోయాడు. అక్కడే ఉన్న రావణుడు బాధతో బ్రహ్మదేవుడితో "ఓ ప్రజాపతీ! బంగారం కాసేపండ్లు పండనీయకుండా కాయగా ఉండగానే తుంచివేస్తున్నావే. వీడు ఎవరో కాదు. నీ మునిమనుమడు. వీడిని ఇంత దారుణంగా శాపం పెట్టడం న్యాయం కాదు. బ్రహ్మవాక్కు వ్యర్థం కాదు. కాబట్టి నీవే ఏదైనా మార్గాంతరం ఆలోచించి కనికరించు" అన్నాడు. అందుకు శాంతించిన బ్రహ్మదేవుడు "ఓ రావణుడా! ఈ కుంభకర్ణుడు నా శాపం మూలంగా ఆరు నెలలపాటు అట్లా నిద్రలో పడి ఉంటాడు. పిదప ఒక్క రోజు మాత్రం ఆకలితో నోరు తెరుచుకొని, అగ్నిహోత్రుడిలాగా కనిపించే దాన్నల్లా తినేస్తూ ఉంటాడు" అని చెప్పాడు.

ఓ రామా! నీ పరాక్రమానికి రావణుడు భయపడిపోయాడు. మరణభయం పట్టుకుంది. అందుకని కుంభకర్ణుణ్ణి నిద్రలేపాడు. ఈ రాక్షసుడు భయంకరమైన పరాక్రమం కలిగినవాడు. అమిత కోపంతో ఇంటి నుండి బయటకు వస్తున్నాడు. ఇతడు వానరులందర్నీ చంపి తినేస్తాడు. వీణ్ణి చూస్తూనే వానరులు భయంతో పరుగులు పెడ్తున్నారే, ఇక ఇతడితో ఎదురుపడి యుద్ధం ఏం చేస్తారు? కాబట్టి నీవు వానరులందరినీ పిలిచి, ఇతడు రాక్షసుడు కాడనీ, ఒక మాయాయంత్రమనీ చెప్పాలి. అప్పుడే వానరులంతా నిలబడి యుద్ధం చేయగలుగుతారు" అన్నాడు.

రాముడు విభీషణుడు చెప్పినదంతా విన్నాడు. ఆ ప్రకారమే యుద్ధతంత్రాన్ని సిద్ధం చెయ్యాలని అనుకున్నాడు. సేనాపతి నీలుణ్ణి పిలిపించాడు.

రాముడు: "ఓ నీలుడా! నీవు సాక్షాత్తూ అగ్నిహోత్రుడి పుత్రుడవు. అగ్నిహోత్రుడంతటి పరాక్రమవంతుడవు. రాక్షసులు వాళ్ళ నగరాన్ని కాపాడుకోవటానికి మన మీదే ఎదురు

దాడిచేస్తారు కాబట్టి నీవు మన సైన్యాన్నంతా వ్యూహాలుగా పన్ని ఉంచు. వానరులందర్నీ ధైర్యంగా ఉండమని చెప్పు. వాళ్ళు మనపై దాడి చేయడానికి ముందే మన వాళ్ళందర్నీ మోహరించి లంకా ద్వారాల్ని, వీథుల్ని, వంతెనలను, ఆక్రమించి ఉండు. మనకు అవసరం అయ్యే రాళ్ళు, చెట్లు, చెట్ల కొమ్మల్నీ సేకరించి ఉంచుకో."

అంతట వానరశ్రేష్ఠుడైన నీలుడు, రాముని ఆజ్ఞను శిరసావహించి, ఆ వానరులందరినీ భయం లేనివారుగా చేసి సిద్ధం చేశాడు. అందరూ చేతుల్లో వృక్షాలూ, రాళ్ళు, పర్వత శిఖరాలు ఎత్తి నిలబడ్డారు. వాళ్ళంతా పర్వతంపైన సమీకరించబడిన మేఘసముదాయంలాగా కనిపించారు.

## 62వ సర్గ కుంభకర్ణుడు రావణుని కలుసుకోవటం

రాక్షస శ్రేష్ఠుడు, అధిక పరాక్రమవంతుడైన కుంభకర్ణుడు రాజమార్గంగుండా రావణాసురుడి భవనానికి ప్రయాణమయ్యాడు. అతడి వెనకాలే పెద్దరాక్షస సైన్యంకూడా బయలుదేరింది. పురజనులంతా తమ ఇళ్ళల్లోనుండి ఆ రాక్షస వీరుడిపై పుష్పవర్షం కురిపించారు. తన అన్న రావణుడు నివసించేది, విశాలమైనది, కళ్ళు మిరుమిట్లు గొల్పేదీయైన భవనంలోకి ప్రవేశించాడు. బంగారు సింహాసనంపై కూర్చున్న తన అన్నగారైన రావణాసురుణ్ణి చూశాడు. కుంభకర్ణుడు ఆ విధంగా నడిచివెళ్తూ ఉంటే భూమి కంపించింది, భవనంలోని ప్రాకారాలన్నీ దాటుకుంటూ పుష్పక విమానంలో సింహాసనంపై దిగులుగా కూర్చున్న అన్నగారిని చూశాడు. కుంభకర్ణుణ్ణి చూడగానే రావణుని దిగులంతా మాయమైపోయింది. కొండంత బలంవచ్చింది. చివాలున సింహాసనంపైనుండి లేచి ఎదురువెళ్ళి తమ్ముణ్ణి కౌగలించుకున్నాడు, కుంభకర్ణుడు అన్నగారి పాదాలకు నమస్కరించాడు. "అన్నా! ఎందుకు నన్ను పిలిపించావు? నీవు ఏ కారణంచేత దిగులు చెందుతున్నావు?" అని అడిగాడు. ఆ కుశలప్రశ్నలకే రావణాసురుడు సంతోషంతో పొంగిపోయాడు, మళ్ళీ మళ్ళీ తమ్ముణ్ణి కౌగలించుకున్నాడు. తమ్ముడికి ఉచిత ఆసనం చూపించి, తాను పోయి తన సింహాసనంపై కూర్చున్నాడు.

కుంభకర్ణుడు తన ఆసనంపై కూర్చున్నాడు. అన్నగారికి వచ్చిన ఆపద తలచుకొని కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి. అన్నగారిని చూస్తూ "రాజా! నీవు ఎంతో అవసరం ఉంటేగానీ నన్ను నిద్రలేపవు, నిన్ను అంతగా వేధిస్తున్న సమస్య ఏమిటి? నీవు ఎవరిని చూసి భయపడుతున్నావు? చెప్పు. నేను పోయి ఇప్పుడే వాళ్ళను చంపేస్తాను" అని అన్నాడు. తమ్ముడు కుంభకర్ణుడు తనను ఆదుకోవడానికి కృతనిశ్చయుడై వచ్చాడని తెలుసుకొని రావణుడు సంతోషించాడు, ఇలా అన్నాడు. "ఓ మహాబలవంతుడా! నీవు నిద్రపోయి అప్పుడే తొమ్మిది దినాలవుతోంది. నాకు రాముణ్ణి గూర్చిన భయం పట్టుకొని వేధిస్తోంది. నీవు నిద్రలో

ఉండటంవల్ల నీకీ విషయాలన్నీ తెలియవు. దశరథుని కుమారుడైన రాముడు, సుగ్రీవుణ్ణి అతడి వానరసైన్యాన్ని వెంటపెట్టుకొని సేతువును నిర్మించి సముద్రాన్ని దాటి వచ్చాడు. మన రాక్షసులందరినీ హింసించటం మొదలుపెట్టాడు. ఆ వానరమూకలంతా లంకాపట్టణంలో ఇళ్ళువాకిళ్ళన్నింటినీ నాశనం చేశారు, సుందరమైన ఈ నగరాన్ని శ్మశానంగా మార్చారు. వచ్చేదారిలో నీవు చూసే ఉంటావు. ఆ వానరులు సామాన్యులుకారు, ముఖ్యులైన మన రాక్షసుల్లో చాలామందిని చంపేశారు. ఇంత జరిగినా వానరుల్లో ఎవరూ చచ్చినట్లులేదు. పూర్వం ఎన్నడూ వాళ్ళు యుద్ధాల్లో ఓడిపోలేదట. ఇప్పుడు మన రాక్షసజాతి మనుగడకే ముప్పు వచ్చింది. నువ్వు తప్ప మరెవ్వరూ మన రాక్షసజాతిని కాపాడలేరని అనిపించింది. అందువల్లనే నిన్ను నిద్రలేపాల్సివచ్చింది. నీవు వెంటనే నడుంకట్టుకో! ఈ శత్రువులందరినీ చంపు. మన జాతినంతా రక్షించు, నా ధనాగారమంతా శున్యమైపోయింది, ఇటువంటి గడ్డు పరిస్థితుల్లో నీవే నన్ను అదుకోవాలి. ఇక లంకాపురంలో మిగిలిందల్లా బాలలు, వృద్ధులు మాత్రమే. ఓ గొప్ప బాహువులు గలవాడా! ఓ శత్రుసంహారకుడా! సోదరా! ఇతరులెవ్వరివల్లాకాని ఈ కార్యాన్ని నీవు ఒక్కడివే సాధించగలవు. అన్నగారికోసం నీవు ఈ కార్యభారాన్ని బాధ్యతను స్వీకరించాలి. ఇంతవరకూ నేను ఎవ్వరినీ ఈ విధంగా ప్రాధేయపడలేదు. ఆ సంగతి నీకూ తెలుసు, అంతేకాదు నువ్వంటే నాకు అధికమైన ప్రేమ గౌరవం ఉన్నాయి, ఓ రాక్షస శ్రేష్ఠుడా! నీవు కూడా అనేక పర్యాయాలు దేవదానవయుద్ధాల్లో నాకు విజయాన్ని సాధించిపెట్టావు. నువ్వు భయంకరమైన పరాక్రమం గలవాడవు. నీ పరాక్రమాన్ని చూపే సమయం వచ్చింది, లేచి విజృంభించు.

నీవు యుద్ధమునందు ఆసక్తి ఉన్నవాడివి, బంధువుల ఎడల ప్రేమకలవాడివి. కాబట్టి తమ్ముడా! నా కోసం ఈ ప్రియము, హితము చెయ్యి. విజృంభించిన వాన శరత్కాల మేఘాల్ని తరిమికొట్టినట్లుగా, నీ తేజస్సు చేత శత్రుసేనల్ని తరిమికొట్టు.”

# 63వ సర్గ కుంభకర్ణుడు రావణుని నిందించటం

రావణాసురుడు దుఃఖంతో దీనంగా మాట్లాడినదంతా కుంభకర్ణుడు విన్నాడు. బిగ్గరగా నవ్వుతూ ఇలా అన్నాడు.

కుంభకర్ణుడు : "ఓ రావణా! పూర్వం ఈ విషయం గూర్చి మంత్రిమండలిలో చర్చించాం. ఆ రోజు మనం ఏ ఆపదముంచుకొస్తుందని ఊహించామో అదే ఇప్పుడు జరిగింది. పాపాలు చేసేవాళ్ళకు నరకం ఎట్లా ప్రాప్తిస్తుందో, అదేవిధంగా పాపకర్మల ఫలంకూడా సంప్రాప్తమవుతుంది.

మహారాజా! నీవు పరాక్రమవంతుడననే గర్వంతో ఈ పని చేసేముందే ఆలోచించకుండా తొందరపాటుతో చేశావు. అందువల్లనే దాని ఫలితాన్నికూడా ఊహించనైనా ఊహించలేకపోయావు. బలం ఉందిగదా అని ముందు చెయ్యాల్సిన పనులు వెనుక, వెనుక చెయ్యాల్సిన పనుల్ని ముందూ చేసేవాడు, ఏది నీతియో, ఏది అవినీతియో తెలుసుకోలేడు. ఒక పని చేసేటప్పుడు దేశకాలాలు అనుకూలంగా ఉన్నాయా? అని కూడా చూసుకోవాలి. అట్లా విచక్షణ లేనివాడు చేసేపనులు కూడా, అపవిత్రుల చేతుల్లో ఉండే హవిస్సులాగానే చెడిపోతాయి. ఎవరైతే మంత్రుల సలహాలు తీసుకుంటూ మూడు విధాలైన కర్మల్నీ, ఐదు విధాలైన సాధనాలతో సాధించుకుంటాడో అతడే నీతిమార్గంలో ఉంటాడు. ఆ మూడు కర్మలూ ఏమిటంటే: తనకు జయం, శత్రువుకు నాశనం కలిగించే పనులను ఉత్తమ కర్మలనీ, తన బలం శత్రుబలం సమంగా ఉండేప్పుడు చేసే కర్మల్ని మధ్యమరకం కర్మలనీ, శత్రువుకు జయం తనకు అపజయం కలిగించే కర్మల్ని అధమమైన కర్మలనీ అంటారు. అట్లాగే పనులు చేసే ముందు ప్రారంభం ఉపాయం, మానవద్రవ్యవనరులు సమకూర్చుకోవటం, దేశకాలాలను గుర్తించటం, ఆపదలు వచ్చినప్పుడు ప్రతిక్రియ చేసుకొనే సామర్థ్యం, కార్యసిద్ధియనే ఐదు సాధనాలు.

ఓ రాజా! ప్రాతఃకాలాన ధర్మాన్ని, మధ్యాహ్నకాలాన అర్థాన్ని, సాయంకాలన కామాల్ని

సేవించాలి. అట్లా కాకపోతే జంటలుగా సేవించాల్సివస్తే, ఉదయాన ధర్మార్థాల్ని మధ్యాహ్నం అర్థధర్మాల్ని, సాయంకాలం ధర్మకామాల్ని సేవించాలి. సాయం సమయాల్లో మూడు సేవించినాకూడా సేవించవచ్చు. అయితే మూడు కాలాల్లోనూ కామాన్ని సేవించకూడదు. ధర్మార్థకామాలను సేవిస్తూ, సందర్భానుసారంగా మంత్రులతో సంప్రదిస్తూ, సామదానభేదదండాలనే నాలుగు విధాలైన ఉపాయాల్ని ఆచరించాలి. అట్లా చెయ్యని రాజు దుఃఖాలపాలవుతాడు. అపకీర్తిని పొందుతాడు. రాజు తను చేయదగిన కార్యాలు, చేయదగని కార్యాల గూర్చి శాస్త్రజ్ఞానం తెలిసిన మంత్రుల్ని సంప్రదించాలి. అంటే పనులు చేసేముందే మంత్రుల్ని సంప్రదించే రాజు ఎప్పుడూ సుఖాలే పొందుతాడు. నీతిశాస్త్రం కొంచెమైనా తెలియని మంత్రులను, సంప్రదిస్తే, నోటికొచ్చిన అవాకులు చవాకులు పేల్తారేగానీ, అవి ధర్మ సమ్మతంగా ఉండవు. తమ గొప్పదనం చాటుకోవడంకోసం నోటికి వచ్చినట్లల్లా మాట్లాడతారు. నీతిశాస్త్రంగాని, ఇతర శాస్త్రాలుగాని తెలియని మంత్రుల్ని సంప్రతిస్తే వారివల్ల కీడే జరుగుతుంది కానీ, మేలు ఎన్నటికీ జరుగదు.

కనుక సంపదలనాశించేరాజు అటువంటి అజ్ఞానులు చెప్పే సలహాలేవీ పాటించకూడదు. మంత్రులు శత్రువులతో చేరి తమ రాజుకు చెడు సలహాలు ఇస్తూవుంటారు. అటువంటి మంత్రుల్ని వారి నడవడికను బట్టి గుర్తించి వారిని మంత్రిమండలిలో చేర్చుకోకుండా దూరంగా ఉంచాలి. శత్రువులకు అమ్ముడుపోయిన మంత్రులు చెప్పే సలహాలు పాటించే రాజుల పాలనను శత్రురాజు తేలిగ్గా పసిగట్ట గలుగుతారు. చపలచిత్తుడై తొందరపడి పనులు చేసే వానిలో ఉండే లోపాల్ని, (కుమారస్వామి బాణాన్ని ప్రయోగించి చేసిన) క్రౌంచపర్వత రంధ్రంలో పక్షులు ప్రవేశించినట్లు శత్రువులు తమకు అనుకూలంగా ఉండేట్లు చేసుకుంటారు. శత్రువుల ఎత్తుగడలు తెలుసుకోలేని వాడు, తనను తాను కాపాడుకోని రాజు, తను కష్టాల్లో పడుతూ రాజ్యాన్ని కూడా పోగొట్టుకుంటాడు. నీకు పూర్వం విభీషణుడు చెప్పినట్లు చెయ్యి. అదే ఇప్పటికీ సరియైన మార్గం అని నాకు అనిపిస్తోంది. అట్లా కాదని నీవు అనుకుంటే నీ ఇష్టం వచ్చినట్లే చెయ్యి'' అని చెప్పికూర్చున్నాడు.

కుంభకర్ణుని మాటలు విన్న రావణుడు కోపంతో కనుబొమలు విరిచాడు. "తమ్ముడా! నీవు పరమ పూజ్యుడివలెను, ఒక ఆచార్యుడివలెను, ఒక గురువుగాను నాకు బోధిస్తున్నావు. ఈ మాటల వల్ల ఏం ప్రయోజనం? వృథా ప్రయాసే! నీతులపై చర్చించే సమయం కాదు. ఈ సమయంలో ఏం చెయ్యాలో అది చెయ్యి. తెలివితక్కువతనం వల్లగాని, భ్రాంతివల్లగాని నేను ఏదో చేశాను. అట్లాచేసిన పొరపొరపాటును గూర్చి చర్చించేందుకు ఇది సమయంకాదు. ఇప్పుడు తిరగతోడినందువల్ల ఏం ప్రయోజనం? బుద్ధిమంతులు జరిగిపోయినదాన్ని గూర్చి ఎక్కడైనా దుఃఖీస్తూ కూర్చుంటారా?

తమ్ముడా! నీకు నామీద స్నేహం ఉన్నట్లైయితే, నీవు పరాక్రమశాలివని నమ్మితే, వెంటనే నాకు సహాయపడాలి. అంతేకానీ, నా దోషాల్ని ఎన్నకూడదు. పోనీ నా దోషాల్ని నీ పరాక్రమంతో సరిచెయ్యి. అపదల్లో ఉంటూ దీనుడైన వాడికి సాయపడేవాడే నిజమైన స్నేహితుడు. నీతి తప్పి ప్రవర్తించినవాడికి సహాయపడే బంధువే నిజమైన బంధువు." అని అన్నాడు.

అన్నగారి తప్పుల్ని, లోపాల్ని, నీతి బాహ్యమైన ప్రవర్తనను నిర్మొహమాటంగా కుండపగల కొట్టినట్లు ముఖానే అడగటం రావణాసురుడు తట్టుకోలేకపోతున్నాడని కుంభకర్ణుడు గ్రహించాడు. అన్నగారికి బాగా కోపం వచ్చిందని తెలుసుకున్నాడు. తననుతాను సంబాళించుకొని మృదువుగాను, మెల్లగాను ఇలా అన్నాడు. "రాజా! విచారించకు, నాపై కోపగించవద్దు. నీవు నిశ్చింతగా ఉండు. నేను జీవించి ఉన్నంతవరకు నీవు దుఃఖపడాల్సిన పనిలేదు. నీ దుఃఖానికి కారణమైనవాడిని నేను నాశనం చేస్తాను. నేను నీకు బంధువును కావటంవలన, అందులో స్వయానా తమ్ముణ్ణి కావటంవల్ల నీకు హితం చెప్పటం నా బాధ్యత. ఒక బంధువైనవాడు, స్నేహితుడైనవాడు ఈ సమయంలో ఏమేం చెయ్యాలో అవన్నీ యుద్ధంలో చేసి చూపిస్తాను. నేను శత్రువులందర్నీ సమూలంగా నాశనంచేసి నీ అభీష్టాన్ని నెరవేరుస్తాను. ఓ మహాబాహూ! నేను ఇప్పుడే బయలుదేరుతున్నాను. రామలక్ష్మణుల్ని చంపేస్తాను, వానరసైన్యమంతా లంకనుండి పారిపోయేట్లు చేస్తాను. రాముణ్ణి సంహరించి రాముడి శిరస్సు

తెచ్చి నీకు బహుమానంగా ఇస్తాను, ఆ శిరస్సును సీతాదేవికి చూపి దుఃఖపడేట్లుచెయ్యి. అన్నా! ముందు నీవు సుఖంగా ఉండాలి, అటుపిమ్మట బంధువుల్ని పోగొట్టుకున్న లంకావాసులంతా సుఖపడాలి. రామలక్ష్మణుల్ని చంపి రాక్షసులందరికీ సంతోషాన్ని కలిగిస్తాను. ఓ రాజా! నీ శత్రువు దేవేంద్రుడైనా, యముడైనా వాళ్ళను సర్వనాశనం చేస్తాను. నా పర్వతాకారాన్ని, నా భయంకరమైన కోరల్నీ, నా చేతిలోని యమపాశం లాంటి శూలాన్ని చూస్తూ మహేంద్రుడైనా గుండెలు చేత్తో పుచ్చుకొని పారిపోతాడు. ఈ వానరులు నాకో లెక్కా? నిజానికి నాకు ఏ ఆయుధమూ వద్దు, నా బాహువులే చాలు. బ్రతుకుపై తీపి ఉన్నావాడు ఎవ్వడూ నా ఎదుట నిలబడడు. శక్తి ఆయుధం, గద, ఖడ్గంలాంటివన్ని నా దృష్టిలో ఆటబొమ్మలు. నేను కోపంతో చెలరేగితే దేవేంద్రుడైనా నా ముందు నిలబడలేడు. ఆ రాముడు నా పిడికిలిపోటు తట్టుకొని ప్రాణాలతోవుంటే కదా! ఇక అతడు నాపై బాణాలు వేయడం, అవి వచ్చి నాకు గుచ్చుకోవడం అనే ప్రశ్నే తలెత్తదు.

ఓ రాజా! నీకు బ్రహ్మదేవుడివల్లగాని, మహేంద్రుడివల్లగాని ఆపదలురావు. నాకు కోపంవస్తే దేవతలందర్నీ నేల కరిపిస్తాను, యముడికి నిద్రలేకుండా చేస్తాను. అగ్నిహోత్రుణ్ణియైనా భక్షించి జీర్ణించుకుంటాను. నక్షత్రాలతో సహా సూర్యుణ్ణి నేలపై పడేట్లు చేస్తాను, సముద్రాల్ని తాగేస్తాను పర్వతాలన్నింటినీ పిండిచేస్తాను, భూమిని కూడా బ్రద్దలుకొట్టగలను, ప్రాణికోటినంతటిని తినేసి, ఎప్పుడూ నిద్రపోతూవుంటే కుంభకర్ణుడి ప్రతాపం ఏమిటో లోకానికి చాటుతాను. ముల్లోకాలు నా ఆహారానికి చాలవు.

కాబట్టి ఓ రాజా! నేను జీవించి ఉన్నంతవరకు దిగులుపడకు, దుఃఖాన్ని విడిచిపెట్టు. రామలక్ష్మణులిద్దర్నీ చంపి నీకు సంతోషాన్ని కలిగిస్తాను. హనుమంతుడు మొదలైన వానరులందర్నీ చంపేస్తాను. అన్నా! నీవు మద్యం సేవిస్తూ నీ ఇష్టం వచ్చినట్లు ఆనందించు. నేను తప్పక రాముణ్ణి చంపుతాను. సీతాదేవి నీ వశమవుతుంది.”

# 64వ సర్గ మహోదరుడి మాయోపాయం

మహాబాహువు, పర్వతాకారుడు సాటిలేని బలవంతుడైన కుంభకర్ణుడు పలికిన మాటల్ని మంత్రి మహోదరుడు కొట్టిపారేశాడు. మహోదరుడు: "ఓ కుంభకర్ణుడా! నువ్వు జన్మించిన కులం చాలా ఉత్కృష్టమైనది. నీవు అసామాన్యమైన దేహదార్ఢ్య గలవాడివే! మహాపరాక్రమవంతుడవే. అయినా నీకు పనులు సులువుగా చేసే నేర్పుగాని, ఓర్పుగానీ లేవు. నీ మాటలన్నీ గర్వంతో కూడివున్నాయి.

ఓ కుంభకర్ణుడా! ఏది నీతియో, ఏది నీతి కాదో, రాజుకు తెలియకుండానే రాజ్యపాలనచేస్తూ ఉంటాడా? నేను చిన్నవాణ్ణి కాబట్టి బలంచేత మూర్ఖంగా మాట్లాడినా పట్టించుకోడన్న ధైర్యంతో మాట్లాడావేకాని, వివేకంతో కాదు. మన రాక్షసరాజైన రావణునికి దేశకాల విభాగాన్ని గూర్చి ఇతరులకన్నా బాగానే తెలుసు. పెద్దల సేవలకు ఉపయోగపడని బలం ఏమి బలం? మన రాజు తన స్థానం, శత్రువుల స్థానం, వృద్ధి, క్షయాల గూర్చి చక్కగా తెలిసినవాడు. బుద్ధిబలంలేనివాడు చేయకూడని చేయరాదని అనుకునే పనిని, సర్వజ్ఞుడైన బుద్ధిమంతుడు ఎందుకు చేస్తాడు? మన రాజు అన్నీ తెలిసిన సర్వజ్ఞుడు.

ఓ కుంభకర్ణుడా! ధర్మార్థ కామాలు ప్రత్యేకఫలాలు ఇస్తాయని చెప్పావు, వాటికి స్వభావంలేదు; ప్రమాణాల్లేవు. ఇక నీవు ఫలాలను ఎట్లా నిర్ణయిస్తావు? మన రాజు సీతాదేవిని అపహరించుకొని రావడం అధర్మమని, అందువల్లనే ఆయన ఇప్పుడు ఆపదల్లో చిక్కుకున్నాడని నీ అభిప్రాయం కాబోలు! అంతే మంచిపనులు చేస్తే మంచిఫలాలు, చెడుపనులు చేస్తే చెడుఫలాలు కలుగుతాయని నీ అభిప్రాయం కాబోలు! కానీ లోకంలో అట్లా జరగడం లేదు. మంచిపనులు చేసినా చెడుఫలితాలు కలగటం, చెడుపనులు చేసినా మంచిఫలాలు కలగడం మనం రోజు చూస్తూనే ఉన్నాం. చేసేపనులనుబట్టి ఫలం లభిస్తుందేకాని, ధర్మాధర్మాలనుబట్టి వస్తాయనుకోవటం అవివేకం. అట్లాగైతే, కష్టపడి సంపాదించిన ధనం సుఖాల్ని, దొంగతనంచేసి

సంపాదించిన ధనం దుఃఖాల్నీ ఇస్తుందా? ఏ పని చేస్తే సుఖం లభిస్తుందని అనుకుంటామో ఆ పనులు చెయ్యాలి. అదే మన రాజు చేశాడు. మనంకూడా సమ్మతించాం. ఇహలోక సౌఖ్యాలకు పరలోకసౌఖ్యాలకు జనులు ఆయా పనులు చేస్తూ ఉంటారు. శాస్త్ర సమ్మతం కాకుండా ఉండే తమ ఇష్టానికి పనులు చేసేవారూ ఉన్నారు. వాళ్ళు ఈ లోకంలో సుఖాలు అనుభవిస్తున్నారు. కాబట్టి శాస్త్ర సమ్మతమైన పనుల వల్లనే సుఖాలు దొరుకుతాయనే నియమం ఏమీలేదు. అట్లాగే ధర్మార్థాలకు, కామాలకు కూడా ఫలనియమం ఏమీలేదు. ఏ పనిచేసినా ఒకప్పుడు సుఖం, మరొకప్పుడు దుఃఖం రావచ్చు. రాముడు జనస్థానంలో చేసినపనివల్ల మన రాజుకు శత్రువయ్యాడు. శత్రువు విషయంలో ఏం చేసినా దోషం ఉండదు. అందువల్ల మన రాజు సీతను అపహరించుకువచ్చాడు. మనం అంతా సమ్మతించాం.

ఓ కుంభకర్ణుడా! నీవు ఒంటరిగాపోయి యుద్ధంచేస్తానని అంటున్నావు అది నీ పరాక్రమాన్ని ప్రదర్శించటానికేనా? నీ ఆలోచన సరిగాలేదు. ఎందువల్లనంటే, జనస్థానంలో మహాబలశాలులైన రాక్షసులెందర్నో రాముడొక్కడే చంపేశాడు. అటువంటి రాముడితో నీవు ఒక్కడివే యుద్ధం చేస్తావా? రాముడు పేరు చెబితేనే భయపడి జనస్థానంనుండి పారిపోయి వచ్చిన రాక్షసులెందరో లంకలో తలదాచుకుంటున్నారు. అటువంటిది నీవు ఒక్కడివే ఎట్లా రాముణ్ణి ఓడిస్తావు? ఆ రాముడు కోపించిన సింహంలాంటివాడు, నిద్రపోతున్న సర్పంలాంటివాడని తెలిసికూడా నీవు నిద్ర లేపుతానంటున్నావు? ఆ రాముడు ప్రజ్వలించే అగ్నిహోత్రంలాంటివాడు. అతడికి కోపంవస్తే ఎవరూ అతడినుండి తప్పించుకోలేరు. ఈ రాక్షస సైన్యం అంతా కలిసి పోరాడినాకూడా జయించగలరో, లేదో సందేహమే! అటువంటిది, నీవు ఒక్కడివే యుద్ధం చేస్తావా? ఓ కుంభకర్ణుడా! నీవు రాక్షసులందరిలోనూ మహాబలశాలివి. అట్లాగే మానవులందరిలోనూ రాముడు అధిక బలశాలి. అతడికి సాటి మరొకడులేడు. అతడు దేవేంద్రుడివంటి పరాక్రమశాలి, సూర్యునివంటి తేజశ్శాలి. మహాబలవంతుడైన శత్రువును బలహీనుడు ఎదుర్కొని ప్రాణాలు పోగొట్టుకోకూడదు."

ఈ విధంగా మహోదరుడు కుంభకర్ణుణ్ణి రాక్షసులందరి మధ్యలో కోపంతో మాట్లాడి, రావణాసురుడితో ఇలా అన్నాడు:

"రాజా! రాముణ్ణి యుద్ధంలో జయించడంకన్నా, ఉపాయంతో జయించడం మేలని నా అభిప్రాయం. నాకు తోచిన ఉపాయం చెప్తాను. ఆలోచించి, నీకు ఉచితమని అనిపిస్తే ఆచరించు.

ఓ రాజా! సీతాదేవిని కావాలని తెచ్చుకున్నావు, ఆమె ఇంకా నీ అధీనంలోనే ఉంది. నీవు కావాలనుకుంటే నీకు వశమౌతుంది. నా ఉపాయం ఏమంటే, నేను కుంభకర్ణుడు, ద్విజిహ్వుడు, సంహ్రాది, వితర్దనుడూ రాముడిపై యుద్ధానికి వెళ్తున్నామని ప్రచారం చెయ్యి. మేము ఐదుగురం రాముడుతో మా శక్తివంచన లేకుండా యుద్ధం చేస్తాం. రాముణ్ణి మేం జయిస్తే, ఏ ఉపాయమూ అవసరం ఉండదు. ఒకవేళ రాముడే మమ్మల్ని జయిస్తే, మేము రాముడి బాణాలతో కొట్టబడిన శరీరాలతో వచ్చి నీ పాదాలపైనపడి 'రామలక్ష్మణుల్ని మేం చంపి తినేశాం' అని చెప్పి చచ్చిపోతాం. ఆ తరువాత ఒక రాక్షసుణ్ణి ఏనుగుపై ఎక్కించి ఈ ఐదుగురు రాక్షసయోధులు రామలక్ష్మణుల్ని చంపి తినేశారని చాటింపు వేయించు. అంతటితో ఆగక నీవు సంతోషంతో పండుగ చేసుకోవాలి. సేవకులందరికీ ధనాన్ని ఇతర వస్తువుల్ని కానుకగా ఇవ్వాలి. యోధులందర్నీ పూలదండలతో సత్కరించి, కొత్త గుడ్డలిచ్చి, వారిని వీర అనులేపనాలతోను, మద్యంతోను బహూకరించాలి. వాళ్ళతోపాటు నువ్వూ మద్యపానం చెయ్యాలి.

రాక్షసులు రామలక్ష్మణుల్ని చంపేశారనే వార్తను బాగా ప్రచారం చెయ్యాలి. అట్లా అట్లా ఆ వార్త సీతాదేవికి కూడా చేరుతుంది. అటుపిమ్మట నీవు సీతాదేవిని ఓదార్చాలి; మంచిమాటలు చెప్పాలి; మచ్చిక చేసుకోవాలి ధనం, రత్నవైడూర్యాలతో ప్రలోభపెట్టాలి.

రాజా! ఈ కపటోపాయం వల్ల, సీతాదేవి రామలక్ష్మణులు చనిపోయారని నమ్ముతుంది. ఇదివరకు ఏదో ఒకనాడు రాముడు వస్తాడనే నమ్మకంతో నీ వశంకాలేదు. ఇప్పుడు రాముడు చచ్చిపోయాడన్న దుఃఖం, నీవు ఏంచేస్తావోనన్న భయంతో నీ వశం అవుతుంది. సీతాదేవి

పుట్టుకతోనే రాకుమార్తె కాబట్టి సర్వసుఖాలు అనుభవించింది. మధ్యలో ఆమె సుఖాలకు దూరంమైంది, రాముడు ఎట్లాగో పోయాడు కాబట్టి నిన్ను అంగీకరిస్తే తిరిగి సుఖపడవచ్చునని ఆమె అనుకోవచ్చు. ఆ విధంగా నీకు వశం అవుతుంది. ఆలోచించగా నాకీ ఉపాయం తోచింది. నీవు రాముడి ఎదుటికి యుద్ధానికి పోవద్దు. ఈ ఉపాయం మంచి ఫలితాన్నిస్తే యుద్ధం లేకుండానే నీ కోరిక ఇక్కడే తీరిపోతుంది. ఇంకేముంది; నీ జీవితం అంతా సుఖమయమే అవుతుంది.

రాజా! యుద్ధాలుచేసి ప్రాణనష్టం పొందేకంటే యుద్ధం చెయ్యకుండా నువ్వు శత్రువును జయించినట్లవుతుంది. నీ చిరకాల వాంఛ నెరవేరుతుంది. సుఖంగా ఉండు.”

# 65వ సర్గ కుంభకర్ణుడు యుద్ధానికి పోవటం

మహోదరుడు అన్నమాటలతో కుంభకర్ణుడికి బాగా కోపం వచ్చింది. ఇకముందు ఎన్నడూ అట్లా మాట్లాడవద్దని వారించాడు. అంతట రావణాసురుడితో ఇలా అన్నాడు. "అన్నా! ఇటువంటి పిరికివాళ్ళను దగ్గరకు చేర్చకు. నీరులేని మేఘాలవలె వీరులు వృథాగా గర్జించరు. నేను ఇప్పుడే యుద్ధానికి వెళ్తాను, ఆ రాముణ్ణి చంపుతాను, నీవు నిర్భయంగా ఉండు. నేను తిరిగివచ్చిన తర్వాత నా పరాక్రమాన్ని నీకు చూపిన తర్వానే గర్జిస్తాను. నువ్వు చూస్తూవుండు శూరులు ఎప్పుడూ తమను తాము పొగుడుకోరు, వాళ్ళు శూరత్వాన్ని చేసి చూపిస్తారు."

"ఓ మహోదరుడా! నీవో బుద్ధిలేనివాడివి, పిరికివాడివి. నీవో పండితుడవని సర్వం నీకే తెలుసని నీకు అహంకారం. నీలాంటి వాచాలురు చెప్పిన మాటలు వినటం వల్లనే నా అన్నగారు ఆపదల్లో చిక్కుకున్నాడు. ఎప్పుడూ రాజు ప్రక్కనే ఉంటూ, రాజు చేప్పే ప్రతిమాటకూ 'తాన' అంటే 'తందాన' అంటూ వంతపాడుతూ ఇచ్చకాలమాటలు చెప్తూ నా అన్నగారిని తప్పుడు దోవల్లో నడిపించారు. మీ వల్లనే సీతాపహరణమూ, ఆ పిమ్మట యుద్ధమూ వచ్చిపడ్డాయి. రాజు మిమ్మల్ని నమ్మాడు. మీరు మిత్రుల్లాగా నటిస్తూ రాజుపై మీకుండే ఈర్ష్యాద్వేషాల్ని, శత్రుత్వాన్ని ఈ విధంగా సాధించుకున్నారు. మీరు నిజమైన మిత్రులని నమ్మినరాజు తన సైన్యాన్నంతా నష్టపోయాడు. బొక్కసం క్షీణించి పోయింది. ఇప్పుడు రాజును ఒంటరివాణ్ణి చేశారు. లంకాపట్టణాన్ని కూడా శిథిలావస్థలో మిగిల్చారు. మీరంతా నయవంచకులు, మీరు చేసిన దుర్మార్గపు ఆలోచనల మూలంగా, జరిగిన నష్టాన్ని సరిచేయడం కోసం నేను ఇప్పుడు యుద్ధం చెయ్యాల్సివస్తోంది. నేను యుద్ధభూమికిపోయి, శత్రువుల్ని జయించి వస్తాను" అన్నాడు మహాదరుణ్ణి ఉద్దేశిస్తూ.

బుద్ధిమంతుడైన ఆ కుంభకర్ణుడు చెప్పింది విని రావణుడు సంతోషంతో "తమ్ముడా! కుంభకర్ణుడా! నీవు యుద్ధ విశారదుడవు, నీ శక్తి సామర్థ్యాలగూర్చి నాకు బాగాతెలుసు. నీ

అంతటి బలవంతుడు రెండోవాడులేడు, అట్లాగే నీవంటి బంధుమాలేడు. నీకన్నా గొప్ప స్నేహితుడు కూడా నాకు ఎవరూ లేరు. నిన్ను పూర్తిగా నమ్ముకున్నవాణ్ణి కావటంవల్ల నిన్ను నిద్రలేపాను. ఓ శత్రుసంహారకుడా! యుద్ధంచేసి నన్ను సంతోషపెట్టాలనుకున్న వాళ్ళందరికీ ఇదే సరియైన సమయం. కాబట్టి తమ్ముడా! పాశాన్ని తీసుకొని వెళ్ళే యముడువలె నీవు నీ శూలాన్ని తీసుకొని బయలుదేరు. సూర్యునివంటి తేజస్సుగల నీవు తేజోవంతుడవై రామలక్ష్మణుల్ని చంపి తిను. ఆపైన నీకు యుద్ధం చెయ్యాల్సిన అవసరమే ఉండదు. నీ పర్వతాకారం చూడగానే ఆ వానరులంతా పారిపోతారు. ఈ మహోదరుడి మాటల్ని పట్టించుకోకు. ఇతడు పిరికిపంద" అన్నాడు. ఈ విధంగా కుంభకర్ణుణ్ణి యుద్ధానికి ప్రేరేపించి పంపి, చావు తప్పి కన్నులొట్టపోయింది కదా! అని సంతోషించాడు. తనకు పునర్జన్మ ప్రాప్తించినట్లుగా భావించాడు.

కుంభకర్ణుడు శూలాన్ని చేత పుచ్చుకొని గబగబా అడుగులు వేసుకుంటూ పోయాడు. అతడి శూలాన్ని ఉక్కుతో చేశారు, బంగారంతో అలంకారాలు చేశారు, అది ఇంద్రుడి వజ్రాయుధం వంటిది. మహా తేజస్సుతో కూడి ఉండే ఆ శూలం శత్రువుల రక్తంతో తడిసి ఉన్నందువల్ల మంటలు మండుతున్నట్లుగా ఉంటుంది. ఆ శూలంతో పూర్వం దేవదానవ గంధర్వ, యక్ష, కిన్నెరులను అనేకమందిని చంపాడు. అటువంటి శూలాన్ని ధరించి కుంభకర్ణుడు అన్నగారికి నమస్కరించి "అన్నా! సైన్యాన్నంతా ఇక్కడే ఉండనివ్వు. నేను ఒక్కణ్ణే వెళ్ళి పోరాడుతాను, నా ఆకారం చూడటంతోనే వాళ్ళంతా వ్యాకులపడిపోతారు. నాకు ఎట్లాగో ఆహారం సమృద్ధిగా కావాలి. వాళ్ళందర్నీ భక్షిస్తాను" అన్నాడు.

అంతట రావణుడు కుంభకర్ణునితో ఇలా అన్నాడు. "సోదరా! నీవు ఒంటరిగా వెళ్ళవద్దు. వానరుల్లో మహా బలవంతులు చాలామంది ఉన్నారు, వాళ్ళంతా యుద్ధంలో నేర్పరులు. ఒంటరిగా ఉన్నా, ఏమాత్రం ఏమరపాటుతో ఉన్నా కోరల్తో పీక్కుని తింటారు. కాబట్టి నీవు మన సైన్యాన్ని వెంటబెట్టుకుని వెళ్ళు. వాళ్ళు యుద్ధం చేస్తూ ఉంటే వాళ్ళకు అపకారం తల పెటేవాళ్ళందర్నీ చంపు. మన సైనికులంతా శూలాలు, ఇనపగుదియలు తీసుకుని నీకూడా

వస్తారు.” బాహువులకు ఉంగరములతోను, బంగారు ఆభరణాలతోను, పెద్ద పెద్ద చెవులుగల ఆ కుంభకర్ణుడు అగ్నిహోత్రంవలె వెలిగిపోయాడు. అమృతమథనంలో వాసుకిలాగా, నల్లటి మొలతాడు ధరించాడు. ధగధగ మెరిసే బంగారు కవచాన్ని ధరించాడు. ఆ కవచం ఎంతగట్టిదంటే, పర్వతానికి పోయి ఢీ కొట్టినా కూడా విరగదు. అప్పుడాకవచం ధరించిన కుంభకర్ణుడు సంధ్యాకాలంలో మేఘాలతో కప్పుకుపోయిన మేరుపర్వతంలాగా ఉన్నాడు. అలంకారంలేని అవయవం లేదంటే ఆతిశయయోక్తి కాదు. చేతితో శూలం తీసుకొన్నాడు. మూడడుగులు కోరడానికి బయలుదేరిన శ్రీమన్నారాయణమూర్తివలె ఉన్నాడు. అటువంటి కుంభకర్ణుడు అన్నగారిని కౌగలించుకుని, మూడుసార్లు ప్రదక్షిణ నమస్కారం చేశాడు. రావణుడు తమ్ముడైన కుంభకర్ణుని మనసారా ఆశీర్వదించి పంపాడు. అప్పుడు శంఖాలు పూరించారు. దుందుభులు మ్రోగించారు. ఆ మహావీరుడు యుద్ధభూమికి ప్రయాణంకాగా, అతడి రథం వెనకాలే గుర్రాలు, ఏనుగులు, వివిధ ఆయుధాలు ధరించిన సైనికులు బయలుదేరారు. శూలంపట్టుకొని, స్వేతఛత్రం కింద రక్తగంధం అద్దిన మహాకాయంతో వెళ్తూవుంటే రాక్షసస్త్రీలు పూలవర్షం కురిపించారు. ఆ కుంభకర్ణుడి వెనకాలే సింహనాదాలు చేసుకుంటూ బయలుదేరిన రాక్షస సైన్యంలో మహాబలవంతులు, భయంకరాకారులు, రక్తనేత్రాలుగలవాళ్ళ, కాటుక కొండలవంటి మహాకాయాలంతా శూలాలు, ఖడ్గాలు, గండ్రగొడ్డళ్ళ, ఇనుప గుదియలు, గదలు, ముసలములు మున్నగు ఆయుధాల్ని ధరించి వెళ్ళారు.

మహా పరాక్రమవంతుడైన కుంభకర్ణుడు యుద్ధానికిపోతూ తన శరీరాన్ని వికృతంగాను, మరీ పెద్దదిగాను మార్చుకున్నాడు. ఆ వికృతాకారంలో కళ్ళు రెండూ చక్రాలంత ఉన్నాయి. ఆ శరీరం చుట్టు కొలత రెండువందల గజాలకు పెరిగివుంది; ముఖాన్ని విశాలంగా పెంచి కాల్చిన పర్వతంలాగా కనిపించాడు. అటువంటి కుంభకర్ణుడు నవ్వుతూ రాక్షసుల్తో ఇలా అన్నాడు. “రాక్షసుల్లారా! నేను ఇప్పుడు కోపంతో ఉన్నాను. నా ఎదుటపడే వానరులందర్నీ, అగ్నిలోపడే మిడతలవలె, కాల్చివేస్తాను. ఎక్కడో చెట్లు చేమల్లో తిరిగే ఈ వానరులు నాకు ఏమీ అపకారం చెయ్యలేరు. నిజానికి మన ఉద్యానవనాలకు కోతులు ఒక అలంకారం. వీళ్ళంతా ఈ పట్టణాన్ని

ముట్టడించడానికి రామలక్ష్మణులే కారణం. ముందా రాముణ్ణి చంపుతాను, వాళ్ళిద్దర్నీ చంపితే ఈ వానరులందర్నీ చంపినట్లే అవుతుంది." కుంభకర్ణుని మాటలు విన్న రాక్షస సైనికులంతా, సముద్రం కంపించేట్లుగా ధ్వనులుచేశారు. కుంభకర్ణుడు కూడా భయంకరమైన కీడును కలిగించే అనేక దుశ్శకునాల్ని చూశాడు. ఆకాశంనుండి ఉల్కలు జారిపడ్డాయి. పిడుగులు పడ్డాయి, మేఘాలన్నీ బూడిదరంగును సంతరించుకున్నాయి. సముద్రాలు, అరణ్యాలు భూమితోసహా కంపించాయి, భయంకరమైన నక్కల నోళ్ళు ఎర్రగా నిప్పు ముద్దల్లాగా కనిపించాయి. పక్షులు రథంచుట్టూ మండలాకారంలో అపసవ్యంగా ప్రదక్షిణలు చేశాయి. అతడి శూలంపైన గ్రద్దవాలింది, ఎడం కన్ను, ఎడం చెయ్యి అదిరాయి, సూర్యుడు కాంతిహీనుడై మసక మసకగా కనిపించాడు. గాలి బిగదీసింది; ఊపిరాడటమే కష్టమయింది. అయినా కుంభకర్ణుడు ఈ శకునాలేమీ లెక్క చెయ్యలేదు. దేవుడిపైన భారంవేసి తలపెట్టిన కార్యం సాధించేందుకు ముందుకు సాగాడు. అట్లాగే కాలినడకనే నగర ప్రాకారాలన్నీ దాటాడు. ప్రాకారం దాటగానే మేఘాల గుంపులాగా ఉండే వానరసేన బిలబిల్లాడుతూ ఉండటం చూసి ఆశ్చర్యపోయాడు. దొర్లుకొస్తున్న పర్వతంలాగా ఉన్న కుంభకర్ణుణ్ణి చూసిన వానరులంతా గాలిచేత చెదరగొట్టబడిన మేఘాల్లాగా నలుదిక్కులకూ పారిపోయారు. పారిపోతున్న వానరుల్ని చూసిన కుంభకర్ణుడు మేఘంలాగా గర్జించాడు. ఆ గర్జనకే బలహీనులైన వానరులు కొందరు మొదలు నరికిన మద్దిచెట్లవలె నేలపై కూలారు. పెద్ద పరిఘను ధరించి శత్రు వినాశనానికై బయలుదేరివచ్చిన కుంభకర్ణుడు, ప్రళయకాలంలో పాశం ధరించి వచ్చిన యమకింకరుళ్ళా వస్తూ ఉండటం చూసి వానర సేనలన్నీ చెల్లాచెదరైపోయాయి, భయభ్రాంతులయ్యారు.

# 66వ సర్గ కుంభకర్ణుణ్ణి చూసి వానరులు భయపడటం

భయంకరాకారుడైన కుంభకర్ణుడు ప్రాకారాన్ని దాటి, పిడుగులు పడేట్లు, పర్వతాలు ఎగరగొడుతున్నట్లు, సముద్రం ప్రతిధ్వనించేట్లుగా ధ్వనులుచేస్తూ గర్జించాడు. దేవేంద్రుణ్ణి, యముణ్ణి, వరుణుణ్ణిగూడా భయపెట్టే భయంకరమైన నేత్రాలుగల కుంభకర్ణుణ్ణి చూసి వానరులంతా భయంతో అటూ ఇటూ పరుగులుపెట్టారు. పారిపోయే వాళ్ళేవరూ సాదాసీదావానరులుకాదు; నలుడు, నీలుడు, గవాక్షుడు మొదలైనవాళ్ళు. వాళ్ళ భయాన్ని చూస్తున్న యువరాజైన అంగదుడు ఇలా అన్నాడు. "ఓ వానరవీరుల్లారా! మీరంతా మీ పరాక్రమాన్ని విస్మరించారు; మీ వంశ గౌరవాన్ని, మీ పుట్టుపూర్వోత్తరాల్ని మరిచి పరుగులు పెడ్తున్నారు, ఎక్కడకు పరుగెత్తుతారు? ఓ సౌమ్యులారా! వెనక్కురండి, ఈ రాక్షసుడు యుద్ధం చేసేవాడు కాడు. భయపెట్టేందుకు చేసిన ఓ యంత్రం! ఓ పెద్ద బొమ్మ! మనం అంతా సమష్టిగా ఎదుర్కొంటేనే రాక్షసుల చేత సృష్టించబడ్డ ఈ బొమ్మ నాశనమైపోతుంది. మీరంతా సేకరించి పెట్టుకున్న రాళ్ళను, వృక్షాల్ని చేతిలోకి తీసుకుని ఎదిరించండి" అని పిలుపునిచ్చాడు. దాంతో పారిపోతున్న వాళ్ళంతా రాళ్ళను, వృక్షాల్ని పట్టుకొని యుద్ధానికి తయారయ్యారు. ఎత్తైన పర్వతశిఖరాలతోను, శిలలతోను, పుష్పించివున్న వృక్షాలతో కొట్టినా కూడా మహాబలశాలియైన కుంభకర్ణుడికి చీమకుట్టినట్లైనా అనిపించలేదు. అతణ్ణి కొట్టుకున్న వృక్షాలు ముక్కలయ్యాయి, శిలలు పిండిపిండి అయ్యాయి. కుంభకర్ణుడు కూడా కోపంతో వానరులను కార్చిచ్చు అడవుల్ని కాల్చినట్లు నశింపజేశాడు. వానరులు చాలామంది కాళ్ళుచేతులు విరిగి నేలపైపడి రక్తంతో తడిసి ఎర్రటి పుష్పాల్లా కనిపించారు. కొందరు వెనక్కు తిరిగి చూడకుండా పరుగులు పెట్టి సముద్రంలో పోయిపడ్డారు. అట్లా పారిపోతున్న వాళ్ళను చూసి, అంగదుడు మళ్ళీ "ఓ వానరవీరులారా! పారిపోకండి; వెనక్కురండి; యుద్ధం చేయండి. భయపడేవాళ్ళకు భూమిపైన ఎక్కడా చోటు కనపడదు. వృథాగా ప్రయాసపడకండి, పైగా అట్లా పారిపోయి రక్షించుకున్న ప్రాణాల్ని ఏం చేసుకుంటారు? అట్లా మీరు ఇళ్ళకు చేరినా, మీ భార్యలుకూడా మిమ్మల్ని గౌరవించరు, పైగా

పరిహసిస్తారు. అట్లా జీవించటం మరణంకన్నా హీనమైనది. మనకు అతిప్రాచీనమైన చరిత్ర ఉంది. ఉత్తమ వంశాల్లో పుట్టాం. మీరేమీ ఆషామాషీ కోతిమూక కాదు. సామాన్యవానరాల్లాగా భయపడి ఎక్కడికి పారిపోతారు? మీ మీ పరాక్రమాల్ని గుర్తుచేసుకోండి. పిరికిపందలుగాను, 'ఛీ' అని అనిపించుకుంటూ చిరకాలం ఉండేకన్నా, సత్పురుషులు అనుసరించిన మార్గాన్ని అనుసరిం చండి. భయాన్ని విడిచి, విజయాన్ని, శాశ్వతకీర్తిని సంపాదించండి. మనం అల్పాయుర్దాయం గలవాళ్లమైతే, శత్రువు చేతుల్లో చచ్చి వీరస్వర్గాన్ని పొందుతాం. లేదా శత్రువును మనమే చంపి శాశ్వతమైన కీర్తిని పొందుదాం. మండే అగ్నిహోత్రుణ్ణి చేరిన మిడతలాగా, కుంభకర్ణుడు, రాముణ్ణి చూడగానే ప్రాణాలు విడుస్తాడు" అని ప్రోత్సాహపరస్తూ చెప్పాడు.

అంగదుడి మాటలు విన్న వానరులంతా అంగదుణ్ణి నిందిస్తూ "కుంభకర్ణుడితో చేసిన యుద్ధం చాలు, ఇది నిలబడి యుద్ధంచేసే సమయంకాదు, ప్రాణరక్షణే మాకు ముఖ్యం" అని అంగదుడితో పలికి కుంభకర్ణుణ్ణి తప్పించుకొని దిక్కుకొకరు చొప్పున పారిపోయారు. అంగదుడు వాళ్ళందర్నీ బ్రతిమాలాడు, రాముడి ప్రతాపాన్ని వర్ణించి చెప్పాడు, ఎంతో ధైర్యం చెప్పాడు, ఎంతో యుక్తియుక్తంగా మాట్లాడి వాళ్ళందర్నీ తిరిగి వచ్చేట్లు చేశాడు. ఋషభుడు, శరభుడు, మైందుడు, ధూమ్రుడు, నీలుడు, కుముదుడు, సుషేణుడు, గవాక్షుడు, రంభుడు, ద్వివిదుడు, తారుడు, పనసుడు, హనుమంతుడు మొదలైన వానరయోధులంతా కుంభకర్ణుడి పైకి యుద్ధానికి వెళ్ళారు.

# 67వ సర్గ కుంభకర్ణుని సంహారం

అంగదునిచే ప్రేరేపించబడిన వానరవీరులంతా తిరిగి వచ్చి కుంభకర్ణుడిపై యుద్ధం చెయ్యటానికి సిద్ధమై వచ్చారు. పరాక్రమవంతులైన ఆ వానరులందరూ ప్రాణాలకు తెగించి యుద్ధం చెయ్యడానికే సిద్ధపడ్డారు. పర్వతాకారులైన వానరవీరులు వృక్షాల్ని, కొండ శిఖరాల్ని ఎత్తి కుంభకర్ణుడిపై విసిరారు. దాంతో కోపించిన కుంభకర్ణుడు గద నాలుగు వైపులా తిప్పుతూ వానరులందర్నీ భయపెట్టాడు. కుంభకర్ణుడి గదకు ఒక్కొక్కసారి ఏడువందలమంది, ఎనిమిది వందలమంది, వెయ్యిమంది వానరులు తగులుకొని విసిరివేయబడ్డారు. అంతేకాకుండా కోపించిన కుంభకర్ణుడు పదిమంది, పదహారుమంది, ఇరవైమంది వానరుల్ని రెండు చేతుల్తో పట్టుకొని నోట్లో వేసుకుని నమిలి మ్రింగుతున్నాడు. వానరులు మాత్రం ఏమాత్రం నిరాశ చెందకుండా రాళ్ళను, వృక్షాలను విసరసాగారు.

అంతట వానర శ్రేష్ఠుడైన ద్వివిదుడు ఒక పెద్ద పర్వతాన్ని పెకలించి, కుంభకరుని వైపుగా విసిరాడు. ఆ పర్వతం కుంభకర్ణుడి ముందు యుద్ధంచేస్తున్న రాక్షస సైన్యంపై పడింది. ఆ దెబ్బకు అనేకమంది సైనికులు, గుర్రాలు, ఏనుగులు, రథాలు ధ్వంసం అయ్యాయి. రాక్షసుల రక్తంతో నేలంతా తడిసిపోయింది, రథాల్లో నుండి యుద్ధం చేస్తున్న రాక్షసులుకూడా వేగంగా బాణాలు సంధించి వానరుల తలలు నరికేస్తున్నారు. అటు రాక్షసులు కూడా పెద్ద పెద్ద వృక్షాలను పర్వత శిఖరాలను విసిరి ఒంటెల్ని, గుర్రాల్ని, ఎనుగుల్ని, రథాల్ని అపారంగా నష్టం కలిగిస్తున్నారు. హనుమంతుడు పెద్ద పర్వత శిఖారాన్ని, శిలల్ని, వృక్షాల్ని కుంభకర్ణుడి తలపై వర్షంలాగా కురిపించాడు. కుంభకర్ణుడు వాటన్నింటినీ తన శూలంతో ఎదుర్కొని తప్పించుకుంటున్నాడు.

అంతట కుంభకర్ణుడు శూలాన్ని చేత్తోపట్టుకొని వానర సైన్యంపై పడేందుకు బయలుదేరాడు. అది గ్రహించిన హనుమంతుడు ఒకపెద్ద పర్వతశిఖరాన్ని పట్టుకొని

కుంభకర్ణుణ్ణి ఆ పర్వత శిఖరంతో కొట్టాడు. ఆ దెబ్బకు శరీరం అంతా రక్తం కొవ్వుతో కలసి తడిసి ముద్ద అయింది. కుంభకర్ణుడు మెరిసే శూలాన్ని పట్టుకొని, కుమారస్వామి క్రౌంచపర్వతాన్ని కొట్టినట్లు, హనుమంతుడి వక్షఃస్థలంపై కొట్టాడు. ఆ దెబ్బకు హనుమంతుడు తూలిపోయాడు; ముఖమంతా రక్తంతో తడిసిపోయింది. అప్పుడా హనుమంతుడు ఉరుములతో సమానంగా ధ్వని చేస్తూ అరిచాడు, హనుమంతుడి అవస్థ చూస్తున్న రాక్షసులు సంతోషంతో సింహనాదాలు చేశారు. అదే సమయంలో వానరులంతా కుంభకర్ణుడికి దూరంగా పారిపోయారు. అట్లా పారిపోతున్న వాళ్ళందరికీ నీలుడు ధైర్యంచెప్పి వాళ్ళిందర్నీ పారిపోకుండా ఆపాడు. వెంటనే ఒక పర్వత శిఖరాన్ని తీసుకొని కుంభకర్ణుడి మీదకు విసిరేశాడు. నీలుడు విసిరిన పర్వత శిఖరాన్ని కుంభకర్ణుడు పిడికిలి బిగించి అడ్డుకోగా, ఆ శిఖరం ముక్కలు ముక్కలై, నేలపైపడింది. అంతట ఋషభుడు, శరభుడు, నీలుడు, గవాక్షుడు, గంధమాదనుడు, అంతా కలసి కుంభకర్ణుణ్ణి తలో ప్రక్కనుండీ ఎదిరించారు. అన్నివైపులనుండి పర్వత శిఖరాలు విసిరారు, వృక్షాలతోకొట్టారు; పిడికిళ్ళతో గుద్దారు, ఇంతమంది ఇన్ని విధాలుగా తమ బలమంతా ప్రయోగించినా కూడా, కుంభకర్ణుడికి చీమకుట్టినట్లైయినా అనిపించలేదు. ఇట్లా యుద్ధం చేస్తూవుండగా కుంభకుర్ణుడి చేతికి ఋషభుడు చిక్కాడు, ఆ ఋషభుణ్ణి పట్టుకొని రెండు చేతులమధ్యా ఉంచి గట్టిగా కౌగలించుకుని ఒదిలేశాడు. దాంతో ఋషభుడి ముఖంమంతా రక్తంతో తడిసిపోయి నేలపై పడ్డాడు. దాంతో ఊరుకోకుండా, కుంభకర్ణుడు శరభుణ్ణి పిడికిలితో కొట్టాడు; నీలుణ్ణి మోకాలుతో పొడిచాడు. గవాక్షుణ్ణి అరచేత్తో చరచాడు, గంధమాదనుణ్ణి పాదంతో గట్టిగా తన్నాడు. ఆ ఐదుగురూ కుంభకర్ణుడి చేతుల్లో చావుదెబ్బలు తిన్నారు, బాధతో మొదలు నరికిన కింశుకవృక్షాల్లాగా నేలపై పడ్డాడు. ఆ ఐదుగురు మహావీరులు నేలపై పడిపోవటం చూసిన వానరవీరులందరూ మూక ఉమ్మడిగా కుంభకర్ణుడిపై లంఘించారు; ఒక పర్వతంపైకి ఎగప్రాకినట్లు పాకారు. వాడి శరీరాన్ని అందినవాడు అందినచోటల్లా కోరల్తో పీకారు, గోళ్ళతో రక్కారు, పిడికిళ్ళతో గుద్దారు, చేతులతో కొట్టారు. వేలకొద్దీ వానరులు ఆ రాక్షసుడి శరీరంపై ఎక్కి నానావిధాలుగా హింసిస్తూ ఉంటే చెట్లతో నిండిన పర్వతంవలె అతడు ప్రకాశించాడు. కోపించిన కుంభకర్ణుడు చేతికి అందిన వానరులందర్నీ పట్టుకొని, గరుత్మంతుడు

సర్పాల్ని భక్షించినట్లు భక్షించాడు. ఒక ప్రక్కన కుంభకర్ణుడు వానరుల్నిపట్టి పాతాళంవంటి తన నోట్లో పడేస్తూ ఉంటే, ఆ వానరులంతా ప్రాక్కుంటూ ముక్కుల్లోనుండి బయటకు వస్తున్నారు. కుంభకర్ణుడిచే చంపబడిన వానరుల రక్తమాంసాలు నేలపైపడి బురద బురద అయింది. శూలాన్ని చేత్తో ధరించిన కుంభకర్ణుడు వజ్రాయుధాన్ని ధరించిన ఇంద్రుడువలె, పాశాన్ని ధరించిన యముడివలె ప్రకాశించాడు. గ్రీష్మకాలంలో ఎండిపోయిన అడవుల్ని కాల్చివేస్తున్న అగ్నిహోత్రుళ్ళాగా, కుంభకర్ణుడు వానరసేనల్ని కాల్చి చంపుతున్నాడు. వానర నాయకులంతా నేలపై కూలారు; ఎదిరించిన వానర సేనల్ని చంపుతూ ఉండటంతో మిగిలిన వానరులు ప్రాణరక్షణకై వికృత శబ్దాలు చేసుకుంటూ పారిపోయారు; అట్లా పోయి రాముణ్ణి శరణు వేడారు.

వానరులంతా కుంభకర్ణుడి చేతిలో దెబ్బతినడంతో, కోపించిన అంగదుడు కుంభకర్ణుడిపై లంఘించాడు ఒక పెద్ద పర్వత శిఖరాన్ని తీసుకొని, రాక్షస సైన్యాన్నంతా భయభ్రాంతుల్ని చేస్తూ, ఆ కుంభకర్ణుడి శిరస్సుపై వేశాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుడికి అంగదుడిపై కోపంవచ్చింది. చేతులోకి శూలాన్ని తీసుకొని అంగదుడిపై విసిరారు. కానీ అంగదుడు నేర్పుగా ఆ దెబ్బనుండి తప్పించు కున్నాడు, వెంటనే గాలిలోకి ఎగిరి కుంభకర్ణుడి వక్షఃస్థలంపై చేతుల్తో గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుడికి కళ్ళుతిరిగినట్లైయింది. కొద్దిగా తూలాడు, వెంటనే తేరుకొని అంగదుణ్ణి చేత్తో అలవోకగా గుద్దాడు. దాంతో అంగదుడు అల్లంత దూరానపోయి స్పృహతప్పి పడిపోయాడు.

కుంభకర్ణుడు అంగదుణ్ణి అక్కడే వదిలేసి సుగ్రీవుడు ఉన్న వైపుగా పరుగెత్తాడు. తన వైపుగా వస్తున్న కుంభకర్ణుణ్ణి చూస్తూ సుగ్రీవుడు ఇలా అన్నాడు. "ఓ రాక్షసుడా! ఇంతవరకు సామాన్య వానరులతో యుద్ధంచేసి నీ ప్రతాపం చూపావు, ఇకవారితో యుద్ధం ఆపు, నాతో తలపడు. నేను విసురుతున్న ఈ పర్వత శిఖరాన్ని తట్టుకొని నిలబడు, నీ బండారం బయటపడుతుంది." ధైర్యసాహసాలతో మాట్లాడిన సుగ్రీవుడి మాటలు విన్న కుంభకర్ణుడు "ఓ

సుగ్రీవుడా! నీవు బ్రహ్మదేవుడి మనుమడవు, ఋక్షరజస్సు కుమారుడివి. ధైర్యసాహసాలు గలవాడివే అయినా ఎందుకట్లా గర్జిస్తావు?'' అని అన్నాడు. అందుకు బదులుగా సుగ్రీవుడు పర్వతాన్ని గట్టిగా పట్టుకొని విసిరివేశాడు. కుంభకర్ణుడి వక్షఃస్థలాన్ని తాకగానే పర్వతమంతా పిండి అయిపోయింది. దాంతో వానరులంతా భయంతో దిగులు చెందారు. రాక్షసులంతా సంతోషంతో గంతులు వేశారు. దెబ్బతిన్న కుంభకర్ణుడు కోపంతో పర్వత గుహలాంటి నోరు తెరిచి గర్జించాడు. మెరుపులాంటి శూలాన్ని సుగ్రీవుడిపైకి విసిరాడు. ఆ శూలం సుగ్రీవుడిపై పడేలోపుగానే, హనుమంతుడు ఆకాశంలోనే ఆ శూలాన్ని పట్టుకొన్నాడు. వెయ్యి పుట్ల ఉక్కుతో చేసిన ఆ శూలాన్ని మహాబలశాలియైన హనుమంతుడు మోకాలుపై ఆనించి రెండు ముక్కలుగా విరిచేశాడు. హనుమంతుడు ఆ మహాశూలాన్ని పట్టుకోవడం, విరిచి అవతల పారేయడం చూసిన వానరసేనలు సంతోషించాయి. శూలాన్ని పోగొట్టుకున్న కుంభకర్ణుడు భయపడి యుద్ధంనుండి తప్పుకున్నాడు. వానరులంతా హనుమంతుణ్ణి వేయివిధాలుగా పూజించి గౌరవించారు.

శూలాన్ని హనుమంతుడు విరిచేయడంతో కుంభకర్ణుడికి విపరీతమైన కోపం వచ్చింది. లంకలో ఉన్న మలయపర్వత శిఖరానొక్కటి పెళ్లగించి సుగ్రీవుణ్ణి కొట్టాడు. దాంతో సుగ్రీవుడు స్పృహతప్పి పడిపోయాడు. సుగ్రీవుడు పడిపోవడంతో రాక్షస సైన్యమంతా సంతోషించారు. కుంభకర్ణుడు నేలపై పడివున్న సుగ్రీవుణ్ణి లేవనెత్తి భుజాన వేసుకున్నాడు; మహామేఘాన్ని ఎత్తుకుపోయే వాయువువలె సుగ్రీవుణ్ణి లంకాపట్టణం వైపుగా ఎత్తుకుపోతుంటే, మహోన్నతమైన మేరు పర్వతం పరుగెత్తుతున్నట్లుంది. అట్లా రాక్షసరాజు వానరరాజును ఎత్తుకుపోతూవుంటే రాక్షసులంతా సంతోషించారు. దేవతలు ఆశ్చర్యపోయారు. దేవేంద్రుణ్ణి ఎదిరించిన కుంభకర్ణుడు, దేవేంద్రుడితో సమానమైన సుగ్రీవుణ్ణి ఓడించి ఎత్తుకుపోతున్నాడు. ఇక రామలక్ష్మణులు ఇతడికి ఒక లెక్కా అని దేవతలు అనుకుంటూ ఉండటం కుంభకర్ణుడు విన్నాడు. కుంభకర్ణుడు తనలో తానే సంతోషించాడు, సుగ్రీవుణ్ణి కుంభకర్ణుడు తీసుకొనిపోవటం బుద్ధిమంతుడైన హనుమంతుడు చూశాడు. ఏంచేయాలో అతడికి పాలుపోలేదు. చాలాసేపు

ఆలోచించాడు. 'ఆ పర్వతాకారుడైన ఈ కుంభకర్ణుణ్ణి పిడికిళ్ళతో గుద్ది, శరీరమంతా విరగ్గొటి చంపేస్తాను, అటుపిమ్మట సుగ్రీవుణ్ణి విడిపించేస్తాను, వానరులందరినీ సంతోషపరుస్తాను' అని అనుకున్నాడు. ఇంతలో మళ్ళీ ఇలా ఆలోచించాడు. 'ఆ దేవతలు, గంధర్వులు, ఉరగులు అంతా కలసి బంధించినా సుగ్రీవుడు వాళ్ళందరి నుండీ తప్పించుకొనిరాగల బలవంతుడు. కుంభకర్ణుడు పర్వత శిఖరంతో గట్టిగా కొట్టటం వలన స్పృహతప్పి ఉన్నాడు. ముహూర్తకాలంలోనే అతడు తిరిగి తేరుకోగలడు. అటుపిమ్మట తనకు ఏది హితమో అతడే నిర్ణయించుకోగలడు. మహాత్ముడైన సుగ్రీవుణ్ణి నేను విడిపించినట్లైతే, అది అతడికి శాశ్వతమైన అపకీర్తి తెచ్చిపెట్టగలదు. దాన్ని అతడు హర్షించడు. అందువల్ల కొద్దిసేపు వేచిచూద్దాం. ఈలోగా వానరరాజైన సుగ్రీవుడే తేరుకొని తగిన నిర్ణయాన్ని తీసుకోగలడు' అని అనుకున్నాడు. ఈ విధంగా ఆలోచించిన హనుమంతుడు వానరులందరికీ ధైర్యం చెప్పి యుద్ధానికి సన్నద్ధుల్ని చేశాడు.

పిమ్మట సుగ్రీవుణ్ణి భుజాన వేసుకొని కుంభకర్ణుడు లంకా నగరంలోకి ప్రవేశించాడు. ప్రజలంతా అతడిపై పుష్పవర్షం కురిపించారు, ఆ రాజ వీథియంతా సుగంధాలు కలిపిన నీళ్ళు జల్లారు. రాజవీథియంతా చల్లగాను, సుగంధ భరితంగాను ఉండటంచేత మహాబలుడైన సుగ్రీవునికి స్పృహవచ్చింది. కుంభకర్ణుడి భుజాలపైనుండి లంకా నగరంలోని రాజవీథుల అందాల్ని చూస్తూ ఇలా అనుకున్నాడు. 'నేను ఈ రాక్షసుడికి చిక్కిపోయాను, ఇప్పుడు నేను ఏం చేయాలి? దానికి ఇంత ఆలోచన ఎందుకు? నేను ఏంచేస్తే నా వానరులంతా సంతోషిస్తారో, ఆ పనినే చేస్తాను' అని అనుకున్నాడు. వెంటనే తన వాడిగోళ్ళతో కుంభకర్ణుడి భుజాలు కండలు ఊడి బయటకు వచ్చేట్లుగా పీకాడు. వెంటనే అతడి చెవులు రెండూ నరికేశాడు. అంతట వాడి ముక్కుకూడా కొరికేశాడు, ఈ పనులన్నీ మెరుపులాగా ఒక్క క్షణంలో కానిచ్చేశాడు. ఈ అనుకోని దాడికి కుంభకర్ణుడి ఒళ్ళంతా రక్తం కారిపోయింది. ముఖం అంతా వికారంగా తయారైంది; మళ్ళీ శుర్పణఖకు పట్టిన గతే కుంభకర్ణుడికీ పట్టింది. బాధతోను, అవమానంతోను కుంభకర్ణుడికి విపరీతమైన కోపం వచ్చింది. సుగ్రీవుణ్ణి ఎత్తి నేలకేసి కొట్టాడు, అప్పుడు

రాక్షసులంతా కాళ్ళతో తొక్కారు. సుగ్రీవుడు వీటన్నింటినీ లెక్క చేయకుండా ఉన్నట్లుండి ఆకాశంపైకి ఎగిరి ఒక్క గెంతులో రాముడి ముందువచ్చి పడ్డాడు.

ముక్కు చెవులు తెగిపోయిన కుంభకర్ణుడు నెత్తురుకారుతూ ఉంటే సెలయేర్లు ప్రవహిస్తున్న పర్వతంలాగా ఉన్నాడు. కాటుక కొండవంటి కుంభకర్ణుడి శరీరమంతా రక్తంతో తడిసివుంటే సంధ్యాకాలపు మేఘంలాగా కనిపించాడు. సుగ్రీవుడు తప్పించుకు పోయాడన్న కోపంతో కుపితుడైపోయాడు. భయంకరమైన ఇనుప గుదియ నొకటి తీసుకొని మళ్ళీ యుద్ధభూమికి బయలుదేరాడు. యుద్ధభూమిలో వానరుల మధ్యన చొరబడి ప్రళయకాలాగ్నిలాగా వానరసైన్యాన్ని చంపడం మొదలుపెట్టాడు. ఆ పచ్చి రక్తమాంసాల వాసనకు కుంభకర్ణుడిలో జఠరాగ్ని ప్రవేశించింది; ఎక్కడలేని ఆకలి పుట్టుకొచ్చింది. ఇహ ఆ ఆకలి వల్ల వీళ్ళు వానరులా, రాక్షసులా, పిశాచాలా అన్న భేదం లేకుండా చేతికందిన వాళ్ళందర్నీ చంపి తినడం మొదలుపెట్టాడు. వానరులు వృక్షాలతో కొడుతున్నా లెక్క చేయకుండా ఏడువందలమందిని, ఎనిమిదివందలమందిని, రెండువేలమందిని, మూడువేలమందిని రెండుచేతుల్తో గుంపులు గుంపులుగా పట్టుకొని నోట్లోకి వేసుకుని నమిలి మింగేస్తున్నాడు. అట్లా మింగుతూ ఉంటే వానరుల రక్తం మేధస్సూ బుగ్గలపైనుండి కారుతోంది. కుంభకర్ణుడికి చిక్కకుండా తప్పించుకోవటమే ఒక పెద్ద కళ అయింది, అదే పెద్దయుద్ధం అయింది. వాళ్ళంతా పరుగునపోయి రాముణ్ణి శరణు వేడారు.

అప్పుడు శత్రు సంహారకుడైన లక్ష్మణుడు కుంభకర్ణుణ్ణి ఎదుర్కొన్నాడు. ముందుగా ఆచి తూచి ఏడు బాణాలు వదిలాడు, అటుపిమ్మట ఎడతెగకుండా బాణాల వర్షం కురిపించాడు. ఆ మహాకాయుడు, కుంభకర్ణుడు వాటినేమీ లెక్కచెయ్యలేదు. పెద్ద పెద్ద అడుగులువేస్తూ రాముడి మీదకు పరుగెత్తాడు. రాముడు కూడా ఆ రాక్షసుడితో యుద్ధాన్ని ఆహ్వానిస్తూ రౌద్రాస్త్రాన్ని సంధించాడు. అందులోనుండి వేలాది, లక్షలాది బాణాలు దూసుకుపోయి కుంభకర్ణుడి వక్షఃస్థలాన్ని తాకాయి, ఆ బాణాలకు ఆ మహాకాయుడు తట్టుకోలేకపోయాడు. చేతిలో ఉన్న

ఇనుప గుదియ జారి పడిపోయింది. బాణాలు గుచ్చుకున్న చోటల్లా ఊటబావిలోనుండి వచ్చినట్లు రక్తంపైకి పొంగి పొర్లివస్తోంది. కాసేపట్లో తెప్పరిల్లాడు. కోపం ముంచుకొచ్చింది. వానరులపైపడి అందినవాళ్ళను అందినట్లుగా పిడికిళ్ళతో పొడిచాడు. పాదాలతో తన్నాడు, నోట్లోనుండి అగ్నిజ్వాలలు కురిపించాడు. ఆ కోపంలో కళ్ళు మూసుకుపోయాయి, తన పర అనే భేదాన్ని మర్చిపోయాడు. చేతికందిన రాక్షసుల్ని కూడా చంపడం మొదలుపెట్టాడు. పెద్ద పెద్ద కేకలుపెడ్తూ యుద్ధభూమియంతా పరుగులు తీశాడు. ఆ మహాబలవంతుడు, పెద్ద పర్వత శిఖరాన్ని ఒకటి ఎత్తి రాముడి పైకి విసిరాడు. ఆ శిఖరం తన్ను చేరేముందే రాముడు ఏడు బంగారు బాణాలతో ఆ శిఖరాన్ని కొట్టాడు. అప్పుడా శిఖరం రెండు వందల ముక్కలుగా పగిలిపోయింది. అందులోనుండి భగ భగ మంటలు బయలుదేరి వానరసైన్యంపై పడబోతూవుంటే రాముడు మళ్ళీ బాణాలతో దానిని పిండి పిండిగాచేసి వానరులందర్నీ కాపాడాడు.

ఇక ఉపేక్ష చేయకూడదని, లక్ష్మణుడు రాముడితో ఇలా అన్నాడు: “అన్నా! ఈ కుంభకర్ణుడు రక్తపానంచేత బాగా మత్తులో ఉన్నాడు. తన వాళ్ళెవరో పరాయి వాళ్ళెవరో తెలుసుకునే స్థితిలో లేడు. కాబట్టి వానరులంతా వాడి శరీరంపైకి ఎక్కి వాణ్ణి కదలనీయకుండా చెయ్యాలి. బాగా మత్తుమీద ఉండటంవల్ల వాళ్ళ బరువు మొయ్యలేక నేలపైకి ఒరిగిపోతాడు, వీడు ఒకసారి నేలపై పడితే ఇకలేవడు; లేవలేడు. ఆపైన వానరులంతా ఎవరికి అందిన శరీరభాగాన్ని వాళ్ళు కొరికి పారేస్తారు. కాబట్టి వీణ్ణి వానరులచేతనే చంపించవచ్చు.”

దాంతో వానరవీరులంతా లక్ష్మణుడు చెప్పినట్లు సంతోషంతో కుంభకర్ణుడి మీదకు వెళ్ళారు. వందలాది వానరులు కుంభకర్ణుడి పర్వత శరీరంపైకి ఎగబాకారు. వానరులు చీమల్లా తనపై ఎక్కుతూ ఉంటే కుంభకర్ణుడికి కోపం వచ్చింది. మదమెక్కిన ఏనుగు మావటివాణ్ణి విదిల్చినట్లుగా వానరులందర్నీ విదిల్చేశాడు. అప్పుడు వానరులంతా నేలపై పడ్డారు. దాంతో రాముడికి కోపం వచ్చింది, కళ్ళతోనే నిప్పులు చెరిగాడు. ఇక కుంభకర్ణుణ్ణి తానే సంహారం

చెయ్యాలని నిశ్చయించాడు. ధనుస్సు సారించి భయంకరమైన ధ్వని చేశాడు. అంబులపొదిని చేతిలోకి తీసుకున్నాడు, ఆ విధంగా రాముడే నడుం బిగించటం చూసిన వానరులందరూ సంతోషంతో గంతులు వేశారు. అంతట రాముడు, లక్ష్మణుణ్ణి వానరుల్ని వెంటబెట్టుకుని కుంభకర్ణుడి మీదకు పోయాడు.

అ కుంభకర్ణుడు మదించిన ఏనుగువలె అందరి మీదకూపోతూ, అందర్నీ కవ్విస్తూ, రాక్షసుల్ని వెంటబెట్టుకొని తిరుగుతున్నాడు, వానరులందర్నీ వెదకి వెదకి పట్టుకొని చంపి తింటున్నాడు. దాంతో ఆ కుంభకర్ణుడి నోట్లోనుండి రక్తం వర్షంలాగా కారుతోంది. దాన్ని నాలుకతో నాక్కుంటూ, నెత్తురువంటి నేత్రాలతో వానరులెక్కడున్నారా? అని వెతుకుతున్నాడు. వింధ్య, మందర పర్వతంలాంటి ఆ మహాకాయుడు ప్రళయకాలంలో జీవులు కోసం వేటాడే యముడిలాగా కనిపించాడు. అటువంటి కుంభకర్ణుణ్ణి, రాముడు చూశాడు.

అగ్నిహోత్రంలాగా ప్రజ్వలించిపోతున్న ఆ రాక్షస రాజును చూడగానే, పురుషోత్తముడైన రాముడు ధనుష్టంకారం చేశాడు. ధనుష్టంకారం వినగానే కుంభకర్ణుడు కోపంతో రేగిపోయాడు, రాముణ్ణి ఎదిరించడానికి పరుగెత్తాడు. మహాబాహువులు గల ఆ కుంభకర్ణుడు గాలిని ఎదిరిస్తూ వచ్చే మేఘంలాగా కనిపించాడు. అప్పుడా కుంభకర్ణుణ్ణి చూసి రాముడు ఇలా అన్నాడు. "ఓ కుంభకర్ణుడా! నేనే రాముణ్ణి, నీవు దేవేంద్రుణ్ణి ఎదిరించినవాడవని నాకు తెలుసు. నేను రాక్షసవంశాన్ని నాశనం చెయ్యటానికి వచ్చానని తెలుసుకో. కొన్నిక్షణాల్లో నీ ప్రాణాలు గాలిలో కలిసిపోతాయి. అయినా చచ్చిపోతున్నానే అని విచారపడకు." ఆ మాట్లాడేవాడే రాముడని కుంభకర్ణుడు తెలుసుకున్నాడు. వికృత ధ్వనులు చేస్తూ నవ్వుతూ కోపంతో వానరులందర్నీ తరిమికొడ్తూ, రాముడికి ఎదురుగా వెళ్ళి ఇలా అన్నాడు. "ఓరీ! నేను విరాధుడ్ని కాదు; కంబంధుడను కాదు; మారీచుడనుకాదు. నేను కుంభకర్ణుణ్ణి. ఇనుముతో చేసిన ఈ ముద్గరాన్ని చూడు, దీంతోనే పూర్వం నేను దేవదానవులందర్నీ జయించాను. 'ఇతడికి ముక్కు, చెవులు లేవే' అని చిన్నచూపు చూడకు. ఆ ముక్కు చెవుల కోసం నేను ఎంతమాత్రం వ్యధచెందడం లేదు. ఓ

దోషరహితుడా! ఇక్ష్వాకువంశ శ్రేష్ఠుడా! నా అవయవములన్నింటిపైనా నీ పరాక్రమం చూపించు, నీ పౌరుష పరాక్రమాలు చూడాలని ముచ్చటగా ఉంది. అటు పిమ్మట నిన్ను నీ పౌరుషాన్ని భక్షించి వేస్తాను."

కుంభకర్ణుని మాటలు విన్న రాముడు పొన్నులుగల బాణాన్ని ప్రయోగించాడు. వజ్రాయుధంతో సమానమైన బాణాన్ని ప్రయోగించినా కూడా, కుంభకర్ణుడు ఉలకలేదు, పలకలేదు; వ్యధచెందలేదు. రాముడు ఇదే బాణాన్ని ప్రయోగించి వాలిని వధించాడు.

వజ్రాయుధంవంటి ఈ బాణం కుంభకర్ణుణ్ణి శరీరానికి కొంచెం కూడా బాధ కలిగించ లేకపోయింది. రాముడు ప్రయోగించే బాణాలన్నీ వర్షంలాగా కుంభకర్ణుడి శరీరంపైపడి జారి నేలపై పడిపోతున్నాయి. అంతట కుంభకర్ణుడు తన ముద్గరను భయంకరమైన వేగంతో త్రిప్పుతూ రాముడి బాణాన్ని అడ్డగించాడు. అప్పుడు రాముడు కుంభకర్ణుడిపై వాయువ్యాస్త్రాన్ని వదిలాడు, అది కుంభకర్ణుడి బాహువును తెగకొట్టింది. ముద్గరతో సహా ఆ బాహువు కిందపడి అనేకమంది వానరులు చనిపోయారు. చావకుండా ఉన్న వాళ్ళు, చేతులు కాళ్ళు విరగొట్టుకున్న వానరులంతా భయంతో గజగజా వణికిపోతూనే, రామ – కుంభకర్ణుల యుద్ధం చూసేందుకు దగ్గరకు పోయారు.

పర్వతాకారుడైన ఆ కుంభకర్ణుడు ఒక చెయ్యి తెగిపోయినా, ఏమాత్రం జంకు గొంకూ లేకుండా రెండవ చేత్తో ఒక సాలవృక్షాన్ని పెళ్ళగించి రాముడిమీదకు పరుగెత్తాడు. అప్పుడు రాముడు ఇంద్రాస్త్రాన్ని సంధించి బాణాన్ని వదిలాడు. దాంతో ఆ బాణం కుంభకర్ణుడి రెండో బాహువును నరికేసింది. అంతట ఆ బాణం వేగానికి తెగిన బాహువు సాలవృక్షంతో సహా గిరగిరా తిరుగుతూ వృక్షాన్ని, పర్వతాల్ని, రాక్షసుల్ని, వానరుల్ని నలగకొడ్తూ నేలపైన పడింది. రెండు చేతులు తెగిపోయిన ఆ కుంభకర్ణుడు పెద్ద పెద్ద కేకలు పెడ్తూ రాముడి పైకి పరుగెత్తాడు. అంతట రాముడు రెండు పాదాల్నీ గురిపెట్టి బాణాన్ని వదిలాడు, ఆ బాణం వాడి రెండు పాదాల్ని నరికేసింది, ఆ ధ్వని నలుదిశలా వ్యాపించింది. పర్వతాలు, గుహలు మారుమ్రోగాయి,

సముద్రంలోని జీవరాసులన్ని భయంతో అడుక్కుపోయాయి. వానర రాక్షససైన్యాలు భయభ్రాంతులయ్యారు.

బాహువులు, పాదాలూ తెగిపోయినా ఎంతమాత్రం చలించకుండా ఆ కుంభకర్ణుడు బడబాగ్ని ముఖంవలె, రాహువు చంద్రుణ్ణి మ్రింగటానికి పోయినట్లు (తొడల సహాయంతో) రాముడిపైకి లంఘించాడు, అట్లా మీద మీదకు వస్తున్న కుంభకర్ణుడిపై వాడి కొనలుగల బాణాన్ని అతడి ముఖంపై కొట్టాడు. అతడి ముఖంమంతా బాణాలతో నిండిపోవటంతో మాట్లాడలేక స్పృహతప్పి పడిపోయాడు, అప్పుడప్పుడూ అతికష్టం మీద అరుస్తున్నాడు.

వజ్రంతోను, బంగారంతోను, పొన్నుగల ఆ బాణాం ప్రజ్వరిల్లుతున్న అగ్ని, సూర్యులవలె, మహేంద్రుడి వజ్రాయుధంవలె, పిడుగువంటి వేగంతో ఉండే బాణాన్ని రాముడు కుంభకర్ణుడి కంఠాన్ని గురిచేసి వదిలాడు, ఆ బాణం పొగలతో భగభగ మండుతూ దేవేంద్రుడి వజ్రాయుధంలాగా, దూసుకుపోయి కుంభకర్ణుడి కంఠాన్ని, పూర్వం పురందరుడి వజ్రాయుధం వృత్రాసురుడి శిరస్సు తెగవేసినట్లుగా, నరికేసింది. వంకర తిరిగిన కోరలతో, మెరిసిపోయే బంగారు కుండలాలతో ఉన్న కుంభకర్ణుడి శిరస్సుపైకి ఎగిరింది. ఆకాశంలో ఉదయించిన పునర్వసు నక్షత్రాల రెంటి మధ్యన ('పునర్వసు' లో రెండు నక్షత్రాలుంటాయి) ఉండే చంద్రుడిలాగా కనిపించింది. అట్లాపైకి ఎగిరిన కుంభకర్ణుడి శిరస్సు లంకాపట్టణాన్ని, దార్లోవున్న ఇళ్ళను, గోపురాల్ని, ఎత్తైన ప్రాకారాన్ని విరగ్గొట్టి లంకాపట్టణంలో పడింది, కుంభకర్ణుడి మొండం మాత్రం ఎగిరి సముద్రంలో పడింది. ఆ ముండెం బరువుకు సముద్రంలో ఉండే జీవరాసులు, గ్రహాలు అణగారిపోయాయి.

మహా బలవంతుడు, పర్వతాకారుడైన కుంభకర్ణుడు చనిపోగానే భూమి, పర్వతాలు కంపించాయి. దేవతలు సంతోషం పట్టలేక దుందుభులు మ్రోగించారు. దేవర్షులు, మహర్షులు, పన్నగులు, దేవతలు, భూతముల, సుపర్ణులు, గుహ్యకులు, యక్షులు, గంధర్వులు, ఆకాశం మీద గుమికూడారు. రాముడి పరాక్రమాన్ని వేనోళ్ళపొగిడారు, అయితే కుంభకర్ణుని సంహారం

రావణుడికి, అతడి బంధువులకు దుఃఖాన్నే మిగిల్చింది. సింహాన్ని చూసి ఏనుగులు ఆక్రందనం చేసినట్లు రాముణ్ణి తలచుకొని రాక్షసులంతా భయభ్రాంతులయ్యారు. రాముడు కుంభకర్ణుణ్ణి సంహరించి, రాహువునుండి విముక్తి పొందిన సూర్యుడు చీకట్లను పారద్రోలి ఆకాశంలో ప్రకాశించినట్లు, వానరసైన్యం మధ్య ప్రకాశించాడు. కుంభకర్ణుడి మరణవార్త విన్న వానరుల ముఖాలన్నీ పద్మల్లాగా వికసించాయి. వానర సేనలన్నీ రాముణ్ణి పూజించాయి. దేవతల్ని జయించిన మహావీరుడు, అనేక మహాయుద్ధాల్లో అవలీలగా జయాన్ని సాధించిన కుంభకర్ణుణ్ణి యుద్ధంలో రాముడు, వృత్రాసురుణ్ణి మహేంద్రుడువలె హతమార్చాడు.

# 68వ సర్గ కుంభకర్ణుడి మరణానికి రావణుడు విలపించటం

రాక్షసులంతా పరుగున రావణాసురుడి వద్దకుపోయి, "రాజా! యముడితో సమానమైన కుంభకర్ణుడు వానరులందర్నీ తరిమికొట్టాడు, కొందర్ని చంపి తిన్నాడు. కర్మ పరిపక్వం అవటంవల్లను, రామ బాణానికి గురి అయి మరణించాడు. ఓ ముహూర్తకాలంపాటు తన ప్రతాపాన్ని చూపాడు. పిమ్మట రాముడి తేజస్సుముందు నిలువలేకపోయాడు. రాముడి బాణములచే కొట్టబడిన సగం శరీరం (మొండెం) సముద్రంలో పడ్డది. శిరస్సు మాత్రం ఎగిరివచ్చి లంకా పట్టణంలో పడింది. బాహువులు తొడలు తెగిపోయాయి. ఈ విధంగా ముద్ద అయిపోయిన కొండచిలువలాగా వికృతంగా మరణించాడు" అని చెప్పారు.

మహా బలవంతుడైన కుంభకర్ణుడు చనిపోయాడనే వార్త వినగానే రావణుడి నవనాడులూ క్రుంగిపోయాయి. నోటమాట రాక నిశ్చేష్టుడయ్యాడు మూర్ఛచేత కిందపడిపోయాడు.

రావణుని కుమారులైన దేవాంతక, నరాంతక, త్రిశిరస్సు, అతికాయుడు తమ పినతండ్రి మరణవార్త విని దుఃఖంతో కిందపడి దొర్లారు. కుంభకర్ణుని సవతి సోదరులైన మహోదరుడు, మహాపార్శ్వులు దుఃఖసముద్రంలో మునిగిపోయారు.

కొంతసేపటికి రావణుడు మూర్ఛనుండి తేరుకున్నాడు. కుంభకర్ణుడి మరణాన్ని గూర్చి తలచుకొని తలచుకొని విలపించాడు. "ఓ వీరుడా! నీవు శత్రువుల గర్వాన్ని అణచివేశావు. నీవు మహాబలవంతుడవు. నన్ను ఒంటరివాణ్ణిచేసి పోయావు. నువ్వూ ఒంటరిగానే పోయావు. యుద్ధంలో శత్రువులందరికీ తాపాన్ని కలిగించావు. ఇప్పుడు మరణించి నన్ను తాపంలో ముంచేశావు. నీ అండదండలతోటే నేను సురాసురులను జయించాను. నీవు నా కుడిభుజంగా ఉండేవాడివి. నిజానికి నా జయాలన్నీ నీవే సుమా! అటువంటి నీవు ఇప్పుడు నాకు లేకుండా పోయావు. అందువల్ల ఇకపై నేను ఉన్నా లేనట్లే! ప్రళయాగ్నిలాంటి నీవు దేవదానవుల గర్వాన్ని అణచివేశావు. తమ్ముడా! అంతటి బలశాలివైన నిన్ను రాముడు ఎట్లా చంపగలిగాడు?

వజ్రాయుధం దెబ్బ నిన్ను ఏమీచేయలేకపోయిందే! అంతటి మహావీరుడవైన నిన్ను రామబాణం ఎట్లా నేలకూల్చ గలిగింది? అయ్యో! నీకు నిద్ర అంటే ప్రియమేకానీ, ఇప్పుడు శాశ్వతంగా నిద్రకు ఉపక్రమించావే? తమ్ముడా! ఏ దేవగణాలు, మహర్షులు నీ పేరు వింటేనే భయంతో ఒణికిపోయారో, వాళ్ళంతా ఇప్పుడు ఆకాశంలో నిలబడి "భలే, భలే" అంటూ కేకలు వేస్తారు, నీ మరణానికి వానరులంతా సంతోషిస్తున్నారు. నీకు భయపడి వాళ్ళంతా లంకా నగరానికి వెలుపలనే ఉండిపోయారు. నీవు లేవని తెలియగానే ఆ కోతిమూకలన్నీ లంకలో ప్రవేశించి సర్వనాశనం చేస్తాయి.

తమ్ముడా! నీవే లేకపోయిన తర్వాత నాకు ఈ రాజ్యం ఎందుకు? సీత వలన ఇక ఏమి ప్రయోజనం? నీవు లేకుండా నాకు ఇకమీదట జీవించాలనికూడా లేదు. నిన్ను చంపిన ఆ రాముణ్ణి నేను యుద్ధంలో చంపకుండా ఉంటే, నా జీవితమే వ్యర్థం. నా జీవితానికి అర్థమే ఉండదు. తమ్ముడా! నీవు ఏ లోకంలో ఉన్నావో, నేనూ అదే లోకానికి వచ్చేస్తాను. నీవు లేని జీవితం నాకు వద్దే వద్దు. తమ్ముడా, పూర్వం నాచే పరాభవించబడ్డ వాళ్ళంతా ఇప్పుడు నన్నుచూసి నవ్వుతారే! నీవు లేకుండా నేను ఇంద్రుణ్ణి ఎట్లా ఎదుర్కోగలను? మహాత్ముడైన విభీషణుడు చెప్పిన మాటల్ని పెడచెవిన పెట్టాను. ఆనాడు విభీషణుడు ఏం చెప్పాడో అదే ఇప్పుడు జరుగుతోంది, కుంభకర్ణుడు, ప్రహస్తుడు మరణించడం నన్ను కలచివేస్తోంది. వాళ్ళ చిత్రవధ జరిగినప్పటినుండీ విభీషణుడు అన్నమాటలే నాకు గుర్తుకువచ్చి సిగ్గుపడేట్లు చేస్తున్నాయి. ధార్మికుడైన తమ్ముణ్ణి వెళ్ళగొట్టిన పాపమే ఇప్పుడు నన్ను కట్టి కుడుపుతోంది. ఆ పాపకర్మఫలమే ఇప్పుడు నేను అనుభవిస్తున్న దుఃఖం అని అనుకుంటున్నాను" అంటూ దుఃఖించాడు. ఇంద్రుని శత్రువైన కుంభకర్ణుడు చంపబడ్డాడని విన్న రావణాసురుడు వ్యాకులచిత్తంతో దీనుడై విలపిస్తూ మూర్ఛపోయి నేలపైపడి ఉన్నాడు.

# 69వ సర్గ రావణుని పుత్రులు యుద్ధానికి వెళ్ళడం

ఆవిధంగా దుఃఖంతో విలపిస్తున్న రావణుని చూసి 'త్రిశిరస్సు' ఇలా అన్నాడు: "రాజా! మహా పరాక్రమశాలియైన నా పినతండ్రి కుంభకర్ణుడు మరణించడం బాధాకరమే. కానీ నీవంటి సత్పురుషులు, బుద్ధిమంతులు ఇట్లా విలపించకూడదు. నువ్వు ఒక్కడివే ముల్లోకాలను జయించగల సమర్థుడవు. నిన్ను నువ్వు కించపరచుకోవటం ఏమీబాగా లేదు. ప్రతాపంలో నీకు ఎవరూ సాటిరారే! నీకు బ్రహ్మ ఇచ్చిన కవచం ఉంది; బాణాలున్నాయి; ధనుస్సు ఉంది; వెయ్యిగాడిదలు పూన్చిన దివ్యరథం ఉంది. వాటి సహాయంతో నీవు అనేక పర్యాయాలు దేవదానవుల్ని జయించావు. అటువంటి నీవు ఇప్పుడుకూడా రాముణ్ణి సులభంగా జయించగలవు. నీవు ఇప్పుడు ఆ రాముణ్ణి శిక్షించాలేకానీ, విలపించకూడదు.

మహారాజా! నా పిన్నతండ్రి, కుంభకర్ణుడి స్థానంలో నేను యుద్ధానికి వెళ్తాను. నీవు ఇక్కడే ఉండు. గరుత్మంతుడు సర్పాలవలె, నేను యుద్ధంలో శత్రువులందర్నీ నాశనంచేసి వస్తాను. దేవేంద్రుడు చేత శంబరాసురుడివలె, విష్ణువుచేత నరకునివలె (ఈ నరకుదు కృష్ణునిచే చంపబడిన నరకాసురుడు కాడు) నేను రాముణ్ణి యుద్ధంలో జయించి వస్తాను."

త్రిశిరస్సుని మాటలతో రావణునకు తిరిగి ప్రాణం లేచివచ్చినట్లైంది. కొత్త ఊపిరి వచ్చినట్లైంది. త్రిశిరస్సు మాటలు విన్న 'దేవాంతకుడు, నరాంతకుడు, అతికాయుడు' కూడా యుద్ధానికి సన్నద్ధులయ్యారు. రావణునికి పుత్రుల యుద్ధోన్మాదం సంతోషాన్ని కలిగించింది. ఎందువల్లనంటే, వాళ్ళు నలుగురూ దేవేంద్రుణ్ణికూడా ఎదిరించగల సమర్థులే. ఆ నలుగురూ నేనంటే నేనని యుద్ధోత్సాహంతో ముందుకువస్తూ ఉంటే రావణునికి మళ్ళీ జీవితంపై కొత్త ఉత్సాహం పుట్టుకొచ్చింది. ఈ రాక్షసులందరూ ఆకాశంలో సంచరించగలవాళ్ళే; అన్ని మాయలు తెలిసినవారే. దేవతల్ని జయించినవారే, యుద్ధం అంటే ఒంటికాలుపై దూకేవాళ్ళే! అంతా దేవతలనుండి వరములు పొందిన వారే. యుద్ధంలో శాస్త్రీయమైన నేర్పుగలవాళ్ళే!

సూర్యుని వంటి తేజస్సుతో, శత్రుసేనల్ని చీల్చి చండాడగల బలశౌర్యాలు గల కుమారులు ధైర్యంచెప్పి తామే యుద్ధానికి వెళ్తామని చెప్పడంతో అప్పుడు రావణుడు దేవతలతో కూడిన దేవేంద్రుడివలె ప్రకాశించాడు. అంతట రావణుడు పుత్రులందర్నీ కౌగలించుకొని ప్రశస్తమైన అలంకారాలతో అలంకరించి ఆశీర్వదించి యుద్ధానికి పంపాడు. తన కుమారులకు రక్షణగా తన సోదరులైన మహోదరుణ్ణి, మహాపార్శ్వుణ్ణి వారివెంట యుద్ధభూమికి పంపాడు. వారుకూడా రావణునికి భక్తిపూర్వకంగా ప్రదక్షిణ నమస్కారంచేసి బయలుదేరారు. శత్రువుల ఆయుధాలవల్ల తగిలే దెబ్బలు బాధ పెట్టకుండా ఉండేందుకు వాళ్ళంతా శరీరాలకు గంధం, ఓషధులు పూసుకున్నారు. కాలదేవత చేత తరుమబడుతున్న ఆ మహావీరులు ఆరుగురూ యుద్ధభూమికి తరలి వెళ్ళారు. ఆ మహోదరుడు మేఘంవంటి మదపుటేనుగునెక్కి వెళ్తూవుంటే అస్తగిరిపై సూర్యుడివలె భాసించాడు. ఆ మదపుటేనుగుకూడా శ్రేష్ఠమైన ఐరావత జాతికి చెందింది.

త్రిశిరస్సు ఉత్తమజాతి గుర్రాలు పూన్చిన రథాన్ని అధిరోహించాడు. ఆ రథంలో త్రిశిరస్సు పర్వతశిఖరంపైన ఇంద్రధనుస్సుతో తేజరిల్లే మహా మేఘంలాగా తేజరిల్లాడు. మూడు తలలపైనా కిరీటాన్ని పెట్టుకున్నాడు, అప్పుడా త్రిశిరస్సు బంగారు శిఖరాలతో మెరిసిపోయే హిమవంతుడిలాగా ఉన్నాడు.

మహాపరాక్రమవంతుడు, విలువిద్యా ప్రవీణుడు అయిన 'అతికాయుడు' దృఢమైన రథాన్ని అధిరోహించాడు. రథంలో శ్రేష్ఠమైన ధనుస్సులను, మెరిసిపోయే ఈటెలను, పదునైన ఖడ్గాలను, ఇనుపగుదియలను అమర్చి ఉంచారు. బంగారు కిరీటంతో, ధగధగా మెరిసిపోయే ఆభరణాలతో రథంపై కూర్చున్న 'అతికాయుడు' మేరుపర్వతంలా కనిపించాడు. ఆ అతికాయుడి చుట్టూ పెద్ద పులుల్లాంటి రాక్షసవీరులు సేవిస్తూవుంటే, దేవతల మధ్యన ఉన్న దేవేంద్రుడిలాగా కనిపించాడు.

నరాంతకుడు బంగారు ఆభరణాల్ని ధరించి, తెల్లటిజాతి అశ్వంపై, కొరివిలాంటి ఈటెను పట్టుకొని కూర్చుంటే, నెమలి వాహనంపై శక్తి ఆయుధాన్ని ధరించిన కుమారస్వామిలాగా

కనిపించాడు.

మహాకాయుడైన మహాపార్శ్వుడు గదను భుజానపెట్టుకొని యుద్ధరంగంలోకి దిగుతూ ఉంటే గదాధారియైన కుబేరుళ్ళాగా అనిపించాడు. అంతులేని సైన్యం వెంటరాగా, అమరావతీ పట్టణంనుండి బయలుదేరిన దేవతల్లాగా, వారా లంకాపట్టాణాన్నుంచి అశేష సేనాసమూహంతో ఉత్తమమైన ఆయుధాన్ని ధరించి, శ్రేష్ఠమైన గుర్రాల్ని, మదపుటేనుగులపైన, రథాలపైన మేఘాల్లాగా గంభీరమైన ధ్వనులు చేసుకుంటూ బయలుదేరారు. సూర్యుడితో సమానమైన తేజస్సుగలవాళ్ళు, కిరీటాలు, కుండలాలు ధరించిన ఆ రావణుని కుమారులు ఆకాశాన్నేలే గ్రహాల్లాగా కనిపించారు. వాళ్ళ చేతుల్లో మెరిసే ఆయుధాలు తళతళామెరుస్తూ ఆకాశంలో హంసలబారుల్లా కనిపించాయి.

ఆ రాక్షసరాజు కుమారులు 'విజయమో వీరస్వర్గమో' అన్న కృతనిశ్చయంతో బయలుదేరారు. అపజయంగానీ, వెనకడుగు వేయడంగానీ వారెరుగరు. అదే మహోత్సాహంతో సింహనాదాలు చేస్తూ సాగిపోయారు. ధనుష్టంకారాలు చేశారు; ఉరుముల్లా ఉరిమారు; రావణుని కీర్తించారు; శత్రువుని దూషిస్తూ ముందుకు సాగారు. వాళ్ళ పాదాల వేగానికి భూమి కంపించింది. వాళ్ళ సింహనాదాల్తో ఆకాశం పిక్కటిల్లింది. వాళ్ళు ఆ విధంగా యుద్ధభూమిలో ప్రవేశించగానే చెట్లు, రాళ్ళు పుచ్చుకొని యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డ వానరవీరుల్ని చూశారు.

రాక్షససైన్యం గుర్రాలతోను, ఏనుగుల్తోను, రథాలతోను, వాటికి కట్టిన చిరుగంటలు మ్రోగుతూ ఉండటంమంతా వానరవీరులు చూశారు. ఏనుగుల మీద నున్న రాక్షసయోధులంతా కారుమేఘాల్లాగానూ, ఆయుధాలతో నడుస్తున్న యోధులంతా మండే అగ్నిహోత్రంలా కనిపించారు. రాక్షస వీరుల్ని చూసి, "ఆహా! పరాక్రమం చూపే అవకాశం వచ్చింది గదా" అని వానరవీరులంతా సంతోషించారు. వాళ్ళంతా పర్వత శిఖరాలు తీసుకున్నారు, వృక్షాలు పట్టుకుని సింహనాదాలు చేశారు. ఒక్కక్షణంకూడా ఆగకుండా రాక్షససైన్యంలోకి చొరబడ్డారు. పర్వతాకారులైన వానరయోధులు పెద్దపెద్ద శిఖారాలున్న పర్వతాల్లాగా కనిపించారు. శిలలు,

వృక్షల్నే ఆయుధాలుగా ధరించి వానరులంతా చెలరేగి యుద్ధం చేశారు. కొందరు ఆకాశంలోకి ఎగిరి యుద్ధం చేశారు. ఆ విధంగా రాక్షసవీరులకు వానరయోధులకు పోరు భీకరంగా సాగింది. వానరయోధులచే ప్రయోగించబడే శిలల్ని, వృక్షాల్ని రాక్షసవీరులు తమ ఆయుధాల్తోనే సమర్థవంతగా ఎదుర్కొంటు న్నారు. ఒకళ్ళను మించి మరొకళ్ళు సింహనాదాలు చేసుకుంటున్నారు. వానరయోధులు విసిరే శిలలల్తోను వృక్షాల్తోను రాక్షసవీరుల కవచాలు పగిలిపోతున్నాయి. కొందరు వానరులు గుర్రాలమీదా, ఏనుగులమీద, రథాలపై నుండి యుద్ధంచేసే రాక్షసవీరుల్ని ఎదుర్కొన్నారు. ఆ విధంగా వాహనాలపై నుండీ యుద్ధంచేస్తున్నవారిని, వానరుల్లో కొందరు ఎగిరి పిడికిళ్ళతో గుద్దుతున్నారు. కొందరు ఆ తాకిడికి తట్టుకోలేక గుడ్లుతేలేసి నేలపైపడిపోతున్నారు. బాధ భరించలేనివాళ్ళు అరుస్తున్నారు. రాక్షసులుకూడా వానరుల్ని శూలాలతో పొడుస్తున్నారు; ఖడ్గాలతో కొడ్తున్నారు; గదల్తో బాదుతున్నారు. శక్తి ఆయుధంతో కొందర్ని సంహరించారు.

ఆరు నూరైనా, నూరు ఆరైనా జయమే లక్ష్యంగా పెట్టుకొని, ప్రాణాల్నికూడా పణంగాపెట్టి ఇరుపక్షాలవాళ్ళు యుద్ధంచేస్తున్నారు. వానరులచేత దెబ్బలుతిన్న రాక్షసులు, రాక్షసులచేత దెబ్బలుతిన్న వానరులు క్షతగాత్రులై నేలపై పడిఉన్నారు. వాళ్ళ శరీరాల్లోనుండి కారే రక్తం ఏరులై పారింది. వాళ్ళ రక్తమాంసాలన్నీ కలిసిపోయి బురదగా తయారైంది. పర్వతాకారులైన వానరుల చేతుల్లో చచ్చిపడున్న రాక్షసులు పగిలిపోయిన పర్వతశిలల్లాగా కనిపించారు. ఆ మహాయుద్ధంలో శూలాల వంటి ఆయుధాలు విరిగి నేలపై పడ్డాయి. ఎంతటి ప్రాణనష్టం వాటిల్లినా, ఆయుధాలు నష్టపోయినా రాక్షసులు కొంచెంకూడా వెనుకంజ వేయకుండా భీకరంగా పోట్లాడారు. ఒక్కో రాక్షసవీరుడు వానరయోధుల్ని పట్టుకొని గిరగిరా తిప్పుతూ, ఆ తిప్పుతున్న వానరుడితోనే మిగిలిన వానరాల్ని కొడ్తున్నారు. వానరులుకూడా రాక్షసుల్ని అట్లాగే చేశారు. ఆ విధంగా వానరయోధులు రాక్షసవీరులు తమ యుద్ధనైపుణ్యాన్ని ప్రదర్శించారు. వానరుల చేతుల్లోనుండి శూలాల్ని, వృక్షాల్ని లాక్కుని వాటితో వానరుల్నే కొట్టి చంపారు. అట్లాగే వానరులుకూడా రాక్షసుల చేతుల్లోనుండి శూలాల్ని గదల్ని ఇనపగుదియల్ని కూడాపెరుక్కుని

వాటితో రాక్షసుల్ని చంపారు. రాక్షసుల చేతుల్లోనుండి ఆయుధాల్ని లాక్కుని వాటితో వానరులు కొట్టిన దెబ్బలకు కవచాలు పగిలిపోయి, చర్మం చీరుకుపోయి కత్తి వాటుకు చెట్లల్లోనుండి పాలు కారినట్లు, శత్రువుల దేహాల్లోనుండి రక్తం కారసాగింది. కొందరు వానరులు అత్యంత నేర్పుతో ఏనుగులచే ఏనుగుల్ని, గుర్రాలచే గుర్రాల్ని, రథాలచేత రథాల్నీ ఢీ కొట్టించి నేలకూల్చారు. అది చూస్తున్న వానరులంతా సంతోషంతో గెంతులువేశారు. ఆ మహాయుద్ధం ఒక దొమ్మీగా మారిపోయింది.

రాక్షసులు కరుకైన అర్ధచంద్రాకార బాణాల్నీ, పదునైన బల్లాల్నీ, ఇంకా అనేక రకాలయిన ఆయుధాలతో వానరుల్ని కొట్టి చంపారు. వానరులు తెచ్చే వృక్షాల్ని, శిలల్ని ముక్కలుముక్కలు చేశారు. విరిగిపోయిన శూలాలు, ఖడ్గాలు, గదలు, పర్వతశిలలు, ముక్కలైపోయిన వృక్షాలు గుట్టలు గుట్టలుగా పడిఉన్నాయి. వాటిమధ్యన రాక్షసవీరుల, వానరయోధుల మృతకళేబరాలు కూడా గుట్టలు గుట్టలుగా పేరుకుపోయాయి. ఈ విధంగా రాక్షస వానర యుద్ధం కోలాహలంగా సాగిపోతూ ఉంటే ఆకాశాన నిలబడి దేవతలు, మహర్షులు సంతోషంతో దుందుభులు మ్రోగించారు, శంఖాలు పూరించారు.

అప్పుడు నరాంతకుడు గుర్రం మీద మహావేగంగా వచ్చి, మహాసముద్రంలో చొరబడే సోరచేపలాగా, ఆ వానరసైన్యంలో చొరబడ్డాడు. ఆ మహావీరుడు, ధైర్యశాలి, శక్త్యాయుద్ధంతోను, ఈటెల్తోను, ఏడువందలమంది వానరవీరుల్ని చీల్చి పారేశాడు. వానరులంతా భయపడిపోయారు. ఆ మహావీరుడి యుద్ధాన్ని చూడటానికి ఆకాశంలో మహర్షులు, దేవతలు; బారులుతీరి నిలబడ్డారు. వానరసైన్యం పరాక్రమించే లోపలే నరాంతకుడు వారందర్నీ ఈటెలతో వెంబడించి చీల్చి చంపాడు. మహారణ్యంలో రేగిన కారుచిచ్చులాగా, వానరసైన్యాన్ని నరాంతకుడు రూపుమాపాడు. వానరులు పర్వతశిఖరాల్ని వృక్షాల్ని పెళ్ళగించే లోపలే, దేవేంద్రుడు వజ్రాయుధంతో పర్వతాన్ని పగులగొట్టినట్లు నరాంతకుడు తన ఈటెతో వానరవీరుల గుండెల్లో పొడిచాడు. వానాకాలంలో వీచే గాలిలాగా ఎడాపెడా, నరాంతకుడు

అన్ని దిక్కులనుండీ శత్రుసంహారంచేశాడు. అప్పుడా నరాంతకుడు ఆకాశంలో ఎగిరే వానరుల్నిగాని, నేలపై నిలచి పోట్లాడే వానరుల్నిగాని, పారిపోతున్న వానరుల్నిగానీ, ఎవర్నీ విడవకుండా తన దగ్గరుండే ఆయుధాల్తో చంపేస్తూ ఉంటే వానరులు అక్కడ నిలవలేక పోయారు; కదలలేకపోయారు మెదలలేకపోయారు.

ప్రళయకాల యముడిలాగా, గ్రీష్మకాల సూర్యుడిలాగా, ఒకే ఒక్క ఈటెతో ఆ నరాంతకుడు వానరసైన్యాన్నంతా నేలకరిపించాడు. వజ్రాయుధంవంటి ఈటె దెబ్బకు వానరులు తట్టుకోలేకపోయారు. పెద్దపెట్టున కేకలు పెడ్తూ హాహాకారాలు చేశారు. వజ్రాయుధం దెబ్బకు నేలకూలిన పర్వత శిఖరాల్లా కనిపించారు.

ఆ మహాయుద్ధం అట్లా సాగిపోతూ ఉండగా దెబ్బలుతిన్న వానరులు కొద్దిగా కోలుకొని త్వరగా సుగ్రీవుడి దగ్గరకుపోయి నరాంతకుడి ప్రతాపాన్ని గుర్చి వివరించారు. నరాంతకుడి బలంముందు వానరులు నిలువలేక పోతున్నారని నివేదించారు. సుగ్రీవుడుకూడా నరాంతకుడి దెబ్బలకు తట్టుకోలేక నలుదిక్కులకూ పారిపోతున్న వానరుల్ని చూశాడు. అప్పుడు మహాతేజోవంతుడైన వానరరాజు, పరాక్రమంలో దేవేంద్రుడితో సరిసమానమైన అంగదుడితో ఇలా అన్నాడు. "అంగదా! ఆ గుర్రంపై నుండి ఈటెతో మన సేనలన్నింటినీ ఛిన్నాభిన్నంచేస్తూ క్షోభపెడ్తున్నాడు. నీవు పోయి వెంటనే ఆ రాక్షసుణ్ణి సంహరించాలి."

ఈ విధంగా సుగ్రీవాజ్ఞను శిరసావహించిన అంగదుడు ఆకాశంలో మేఘాలవరకూ ఎగిరాడు. అప్పుడు మేఘాల మధ్యనుండే సూర్యుడివలె వెలిగిపోయాడు. పర్వతంవంటి ఆకారంతో నవరత్న ఖచితములైన బంగారు కడియాలు ధరించిన అంగదుడు, గైరికాది ధాతువుల్తో ధగధగలాడే పర్వతంలాగా కనిపించాడు. నరాంతకుడితో యుద్ధానికి గోళ్ళు, కోరలే చాలనుకున్నాడు. అందుకనే వేరే ఆయుధాన్నేమీ ధరించకుండా వచ్చాడు. ఆ నరాంతకుడి ఎదురుగాపోయి, "ఓ రాక్షసుడా! నీ ప్రతాపమంతా అల్పులపై చూపిస్తున్నావేమి? అల్పులైనవాళ్ళను చంపి నీవేం సాధిస్తావు? నీకు చేతనైతే వజ్రాయుధం వంటి నీ ఈటెతో నా

ఛాతీపై కొట్టు. నేను అంగదుణ్ణి కిష్కింధా రాజ్యానికి యువరాజును” అని అన్నాడు.

అంగదుడి మాటలకు నరాంతకుడు మహాసర్పంలాగా బుసలు కొట్టాడు. పళ్ళు పటపటా కొరికాడు. తళతళలాడే ఈటెను అంగదుడిపైకి విసిరాడు. వజ్రంకంటే బలమైన అంగదుడి వక్షః స్థలంపైపడి అది రెండుగా విరిగి క్రిందపడింది, గరుత్మంతుడు కొరికి పారేసిన సర్పంలాగా రెండు ముక్కలైంది. అంగదుడు ఒక్క దూకునపోయి, నరాంతకుడు ఎక్కిన గుఱ్ఱం తలపైన అరచేత్తో ఒక్క చాపుబాదాడు. దాంతో గుఱ్ఱం దవడలు లోపలకుపోయాయి, కనుగుడ్లు బైటకువచ్చాయి ఒక్కసారిగా నేలపై కూలిచచ్చింది, కృద్ధుడైపోయిన నరాంతకుడు పిడికిలి బిగించి అంగదుడి నెత్తిమీదకొట్టాడు. దాంతో అంగదుడి తల చిట్లింది. వెచ్చగా నెత్తురు కారింది. మంటలు మండినట్లయి స్పృహతప్పి పడ్డాడు, కొద్దిసేపట్లోనే తేరుకున్నాడు. నరాంతకుడు ఎంత బలశాలియో అర్థమైంది. ఆశ్చర్యపోయాడు, అమాంతం లేచి నిలబడి పిడికిలి బిగించి నరాంతకుడి ఎదురు రొమ్ములపై గుద్దాడు. ఆ దెబ్బకు కవచం విరిగిపోయింది. వక్షంలోనుండి నెత్తురు కారింది. వజ్రాయుధం దెబ్బకు నేలకూలిన పర్వత శిఖరంలాగా నేలమీదపడి మరణించాడు. నరాంతకుడి మరణానికి ఆకాశంలోనుండి చూస్తున్న దేవతలంతా సంతోషించారు, యుద్ధభూమిలో ఉన్న వానరవీరులంతా సంతోషంతో గంతులు వేశారు. జయింప శక్యంకాని నరాంతకుణ్ణి ఒక్కగుద్దుతో చంపిన అంగదుణ్ణి రాముడు అభినందించాడు మెచ్చుకున్నాడు. అంగదుడు మళ్ళీ యుద్ధానికి సిద్ధం అయ్యాడు.

# 70వ సర్గ హనుమంతుడు దేవాంతక, త్రిశిరస్సులను సంహరించటం

అంగదుడు నరాంతకుణ్ణి చంపడంతో దేవాంతకుడు, త్రిశిరస్సు, మహోదరుడు దుఃఖించారు. మహాబలశాలియైన మహోదరుడు కోపంతో అంగదుడిపై లంఘించాడు, సోదరుణ్ణి చంపిన అంగదుడిపై యుద్ధానికి మహోదరుడు ఎనుగునెక్కి బయలుదేరాడు. ఇంకో ప్రక్కనుండి దేవాంతకుడు ఇనుప గుదియ తీసుకుని అంగదుణ్ణి ఎదిరించాడు. ఉత్తమాశ్వాలు పూన్చిన రథంపైనుండి త్రిశిరస్సు అంగదుణ్ణి ఎదుర్కొన్నాడు.

దేవతల దర్పాన్నే అణచివేసిన ముగ్గురు రాక్షసయోధులూ తనపైకి యుద్ధానికి రావడం చూసిన అంగదుడు ఒక మహావృక్షాన్ని పెళ్ళగించి పట్టుకున్నాడు. నిండుగా పూలుపూచి ఉన్న ఆ వృక్షాన్ని దేవాంతకుడిపైకి విసిరేశాడు. అప్పుడు త్రిశిరస్సు దాన్ని వాడియైన బాణాన్ని ప్రయోగించి దారిలోనే ముక్కలుగా చేశాడు. అంతట అంగదుడు ఆకాశంలోకి ఎగిరి అక్కడనుండి రాళ్ళవర్షం, చెట్లవర్షం కురిపించాడు. అప్పుడు త్రిశిరస్సు తన బాణాల్తోను, దేవాంతకుడు ఇనుప గుదియతోను ఆ వృక్షాల్ని, రాళ్ళను సమర్ధంగా ఎదుర్కొన్నారు. ఆ వృక్షాలన్నీ విరిగి నేలపై పడిపోయాయి. రాళ్ళన్నీ పిండి అయ్యాయి, త్రిశిరస్సు బాణాల్తోను, మహోదరుడు ఏనుగుపైనుండి ఎదిరించారు. మహోదరుడు తోమరంతో అంగదుణ్ణి ఎదుర్కొన్నాడు. అదే సమయంలో దేవాంతకుడు తన ఇనుప గుదియతో అంగదుడి వక్షంపై గట్టిగా కొట్టాడు. ముగ్గురు రాక్షసయోధులూ ఒకేసారి తనపై విరుచుకుపడుతున్నా, మహాప్రతాపవంతుడైన అంగదుడు ఏమాత్రం జంకలేదు. అప్పుడు అంగదుడు మహావేగంతో మహోదరుడు ఎక్కిన మదపుటేనుగు తలపై అరచేత్తో ఒక్క దెబ్బ వేశాడు, దాంతో ఆ ఏనుగు వికృతంగా అరుస్తూ గుడ్లు తేలేసింది. అంతట ఆ ఏనుగు రెండుదంతాల్ని పీకేశాడు. ఆ దంతంతో దేవాంతకుణ్ణి గట్టిగాకొట్టాడు. ఆ దెబ్బ గట్టిగా తగలడంతో దేవాంతకుడు అవయవాలన్నీ పట్టుతప్పాయి. నోట్లోనుండి చిక్కగా రక్తం ప్రవహించింది. పెళ్ళగించి పడేసిన

వృక్షంలాగా నేలపై పడ్డాడు. కొంతసేపటికి ఆ మహావీరుడు తెప్పరిల్లాడు, తన ఇనప గుదియను తీసుకొని గిరగిరా త్రిప్పుతూ అంగదుణ్ణి కొట్టాడు. ఆ దెబ్బ అంగదుడి మోకాళ్ళ మీద తగలగా నేలపై పడిపోయాడు మళ్ళీ కొద్దిసేపట్లో తేరుకుని, మళ్ళీ లేచి నిలబడ్డాడు.

అట్లా అంగదుడు తిప్పుకొని మళ్ళీ లేవటం త్రిశిరస్సు చూసి వాడియైన బాణాన్ని అంగదుడి నుదుట తగిలేట్లుగా కొట్టాడు. ముగ్గురు కలసి అంగదుణ్ణి చుట్టుముట్టి కొడ్తున్నారని హనుమంతుడు చూశాడు. అప్పుడు హనుమంతుడు, నీలుడితో సహా అంగదుడి దగ్గరకు వెళ్ళాడు. నీలుడు ఒక పెద్ద పర్వతశిఖరాన్ని ఎత్తి త్రిశిరస్సు శిరస్సుపై పడేశాడు. అయితే త్రిశిరస్సు ఆ పర్వతశిఖరాన్ని దూరాన్నుంచే చూసి బాణాలతో ముక్కలుముక్కలుగా చేశాడు. వాడియైన బాణం తగలటంతో ఆ రాళ్ళముక్కలన్నీ అగ్నిశిఖల్లా మండుతూ నేలపై పడ్డాయి. దాంతో దేవాంతకుడు పరమానందం చెందాడు. తనవద్దనున్న ఇనపగుదియను తీసుకొని హనుమంతుడి మీదకు యుద్ధానికి పోయాడు. తనపైకి లంఘించిన దేవాంతకుణ్ణి చూస్తూనే హనుమంతుడు ఒక్క దూకులోపైకి ఎగిరి, దేవాంతకుని తలపైన గట్టిగా గుద్ది సింహనాదంచేశాడు, దాంతో దేవాంతకుడి శిరస్సు చిన్న చిన్న ముక్కలై పోయింది. దేవాంతకుడి కళ్ళు, పళ్ళు, నాలుక అన్నీ బైటకు వచ్చేశాయి. దేవాంతకుడి ప్రాణంపోయి నేలపై పడిపోయాడు.

రాక్షసయోధుల్లో ముఖ్యుడైన దేవాంతకుడు చనిపోగానే త్రిశిరస్సుకి పట్టరానంతకోపం వచ్చింది, కృద్ధుడైపోయాడు. మహా వాడియైన బాణాల్ని తీసి నీలుడి ఎదురు రొమ్ములపై గురి చూసి కొట్టాడు. మందరపర్వతం లాంటి ఏనుగుపైన, మహోదరుడు కూడా నీలుడు ఉన్నచోటుకే వచ్చాడు. ఆకాశంలో ఇంద్రధనుస్సు ఏర్పడగానే మేఘాలు మెరుపులతో కూడి వర్షించినట్లు, మహోదరుడు నీలుడి వక్షఃస్థలంపై బాణాల వర్షం కురిపించాడు. నీలుడి ఒళ్ళంతా బాణాలు గుచ్చుకున్నాయి. ఒళ్ళంతా నెత్తురుముద్దై స్పృహతప్పి నేలపై పడిపోయాడు. ఇంతలోనే నీలుడు తెప్పరిల్లాడు, వెంటనే వృక్షాలతో ఉన్న పర్వతశిఖరాన్ని పెళ్ళగించి గాలిలోకి ఎగిరి మహోదరుడి శిరస్సుపై బలంగా కొట్టాడు. వజ్రాయుధం దెబ్బకు పర్వతం ముక్కలైనట్లు, నీలుడు

పర్వతశిఖరంతో కొట్టిన దెబ్బకు మహోదరుడు చచ్చి ఏనుగుతోసహా నేలకూలిపోయాడు.

చూస్తూ ఉండగానే తన పినతండ్రి, మహోదరుడు మరణించడం త్రిశిరస్సు తట్టుకోలేకపోయాడు. కృద్ధుడై హనుమంతుడిపైన, నీలుడిపైన ఒకేసారి బాణాలవర్షం కురిపించాడు. హనుమంతుడికి కోపం వచ్చింది. వెంటనే ఒక పర్వతశిఖరాన్ని ఎత్తి త్రిశిరస్సు తలపై విసిరేశాడు. త్రిశిరస్సు ఆ శిఖరాన్ని బాణాల్తో వారించి ముక్కలు ముక్కలుగా చేశాడు. ఆ దెబ్బనుంచి తప్పించుకున్నాడనే క్రోధంతో హనుమంతుడు వృక్షవర్షం కురిపించాడు; త్రిశిరస్సు వాటన్నింటినీ సమర్థవంతంగా తన బాణాలతో ఎదుర్కొంటూ సింహనాదం చేశాడు.

హనుమంతుడు ఇక ఉపేక్షించి లాభంలేదని అనుకున్నాడు. అమాంతంగా గాలిలోకి ఎగిరి త్రిశిరస్సు రథానికి కట్టిన గుర్రాల్ని గోళ్ళతో, ఏనుగును సింహం చీల్చినట్లు, చీల్చివేశాడు. అప్పుడు త్రిశిరస్సు, యముడు కాళరాత్రిని స్వీకరించినట్లు శక్త్యాయుధ్ధాన్ని తీసుకొని హనుమంతుడిపైకి విసిరి సింహనాదం చేశాడు. అంతట తనపై వచ్చి పడుతున్న శక్తిని, ముందుగానే చేతుల్తో హనుమంతుడు పట్టుకొని విరిచి నేలపై పారేశాడు. హనుమంతుడు శక్తిని విరిచి వేయడం చూసిన వానరులంతా సంతోషంతో సింహనాదాలు చేశారు. అంతట త్రిశిరస్సు ఖడ్గాన్ని ఎత్తి హనుమంతుడిపైకి విసిరేశాడు. అది సూటిగాపోయి హనుమంతుడి వక్షఃస్థలంలో గట్టిగా గుచ్చుకొంది. ఆ దెబ్బకు తట్టుకుని నిలబడ్డ వాయుపుత్రుడు, మహా బలశాలియైన హనుమంతుడు పిడికిలి బిగించి త్రిశిరస్సు గుండెలపై గుద్దాడు. ఆ దెబ్బ గట్టిగా తగలటంతో త్రిశిరస్సు స్పృహతప్పాడు, చేతిలోవున్న ఆయుధం క్రిందపడిపోయింది. వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు పడిపోతున్న ఖడ్గాన్ని అందుకొని, ఆ ఖడ్గం ఝుళిపిస్తూ రాక్షసులందర్నీ భయపెట్టాడు. ఇంతలో త్రిశిరస్సు తెప్పరిల్లాడు, హనుమంతుడు కొట్టిన దెబ్బకు సహించలేనివాడై ఒక్కసారిగా పైకి ఎగిరి హనుమంతుణ్ణి పిడికిలి బిగించి కొట్టాడు. ఆ పిడికిలి పోటుకు హనుమంతుడికి పట్టరాని కోపం వచ్చింది. త్రిశిరస్సు శిరస్సులను గట్టిగా పట్టుకున్నాడు. విశ్వరూపుడి శిరస్సును దేవేంద్రుడు తెగకొట్టినట్లుగా, ధగధగ మెరిసిపోయే కిరీటంతోను,

కుండలాలతోను వెలిగిపోతున్న త్రిశిరస్సు శిరస్సులను చేతిలో ఉన్న ఖడ్గంతో నరికేశాడు. ఆకాశం నుండి రాలే నక్షత్రంలాగా త్రిశిరస్సు మూడు తలలూ నేలమీదపడ్డాయి. దేవేంద్రుణ్ణి ఎదిరించిన ఆ త్రిశిరస్సును పరాక్రమవంతుడైన హనుమంతుడు చంపగానే, వానరులంతా ఎగిరారు; కోతి గంతులు వేశారు; సింహనాదాలు చేశారు. రాక్షసులంతా నలుదిక్కులకు పారిపోయారు.

త్రిశిరస్సు, మహోదరుడు, నరాంతకుడు, దేవాంతకులను వానరులు సంహరించడం మహాపార్శ్వుడు చూశాడు. కుపితుడైపోయాడు. గదను తీసుకున్నాడు. పూర్వం ఆ గదతోనే అనేక యుద్ధాల్లో గెలిచాడు. ఆ గదనిండా నెత్తురు మాంసం కండలు అంటుకొని ఉన్నాయి. పూర్వం ఈ గద దెబ్బకు ఐరావతం, మహాపద్మ, సార్వభౌమ అనే దిగ్గజాలు భయపడిపోయాయి. మహాపార్శ్వుడు ప్రళయకాలాగ్నివలె మండిపడుతూ గద తీసుకొని వానరులపైకి బయలుదేరాడు. అప్పుడు ఎదురుగా ఋషభుడనే వానరశ్రేష్ఠుడు ఎదురయ్యాడు. పర్వతాకారుడైన ఋషభుని చూడగానే వజ్రాయుధంవంటి గదతో అతడి వక్షఃస్థలంపై గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బకు ఋషభుడికి బాగా గాయాలయ్యాయి. చాలా నెత్తురు కారిపోయింది. మూర్ఛపోయాడు. చాలాసేపటికిగానీ తెలివిరాలేదు. మూర్ఛనుండి తేరుకోగానే, మహాపార్శ్వుడు మీద కలియపడి, అతడి చేతిలోని గదను ఊడపెరుక్కున్నాడు. ఋషభుడు గదను తన చేతిలోకి తీసుకోగానే గిరగిరా తిప్పుతూ మహాపార్శ్వుణ్ణి కొట్టాడు. ఆ దెబ్బతో మహాపార్శ్వుడి పళ్ళు, కళ్ళు రాలి పడ్డాయి. వజ్రాయుధం దెబ్బకు పర్వతంవలె నేలకూలాడు. ఆ విధంగా రాక్షసవీరుడు మహాపార్శ్వుడు మరణించగానే, రాక్షసులంతా ప్రాణభయంతో పరుగులు తీశారు. రావణాసురుడి తమ్ముడైన మహాపార్శ్వుడు చనిపోగానే రాక్షససైన్యం ఆయుధాల్ని ఎక్కడిక్కడే ఒదిలేసి పరుగులు తీశారు. మహాసముద్రం పొంగి పొర్లుతోందా? అన్నట్లు పరుగులు తీశారు.

# 71వ సర్గ అతికాయుడితో యుద్ధం

గొప్ప తేజస్సుగలవాడు, బ్రహ్మనుండి వరాలు పొందినవాడు, పర్వతమంత దేహంకలవాడు, యుద్ధాల్లో దేవదానవుల్ని ఎదిరించినవాడు, ఇంద్రునివంటి పరాక్రమంగలవాడు అయిన అతికాయుడు సోదరులను, పిన్నతండ్రిని శత్రువులు చంపివేయడాన్ని జీర్ణించుకోలేకపోయాడు. ఎట్లాగైనా శత్రువులందర్నీ తుదముట్టించిగాని లంకకు పోరాదని కృతనిశ్చయంతో, వెయ్యి సూర్యులతో సమానంగా ప్రకాశించే రథాన్ని అధిరోహించాడు. వానరసైన్యం మీదకు తన రథాన్ని నడిపించాడు. కిరీట కుండలాలతో వెలిగిపోతూ, మాటిమాటికీ తన పేరు ప్రకటించుకుంటూ దిక్కులు పిక్కటిల్లేట్లుగా సింహనాదాలు చేశాడు.

అతికాయుడు చేస్తున్న ధనుష్టంకారానికి వానరులంతా భయపడిపోయారు.అతడి పర్వతాకారం చూస్తూ, కుంభకర్ణుడు మళ్ళీ బ్రతికి వచ్చాడా? అని భయపడ్డారు. త్రివిక్రమావతార కాలంనాటి విష్ణుమూర్తిలాగా ఉన్న ఆ రూపాన్ని చూస్తూ భయపడిపోయారు. వాళ్ళకు యుద్ధం ఎట్లా చెయ్యాలో బోధపడలేదు, వాళ్ళంతా రాముడి దగ్గరకు పరుగెత్తి శరణుకోరారు.

ధనుస్సు ధరించి, కోటిసూర్యుల కాంతితో వెలిగిపోయే రథంపైన ఎక్కి వస్తున్న 'అతికాయుణ్ణి' రాముడు దూరాన్నించే చూశాడు. అతడి తేజస్సు చూసిన రాముడు కూడా ఆశ్చర్యపోయాడు, వానరులందరికీ ధైర్యం చెప్పి విభీషణుడితో ఇలా అన్నాడు. "విభీషణా! అడుగో! ఆ వెయ్యి గుఱ్ఱాలు పూన్చిన రథంపై కోటిసూర్యులతో సమానంగా వెలిగిపోతూ ధనుస్సును ధరించి, సింహంవంటి కన్నులుగల పర్వతాకారుడు ఎవరు? భూతగణాలతో తేజరిల్లే రుద్రుడివలె ఉన్నాడు. ధనుస్సు వాడియైన బాణాలు ధరించాడు. మెరుపుమల్లే మెరిసిపోతున్నాడు, మహా మేఘంలాగా కనిపిస్తున్నాడు. తోమరాలతోను, శక్త్యాయుధాలతోను, నాలుకలు చాచిన మృత్యుదేవతలా కనిపిస్తున్నాడు. ఆ రథంనిండా బంగారుపూతపూసిన ధనుస్సులున్నాయి. ఆ

రథం ఆకాశంలో ఇంద్రధనుస్సులాగా ప్రకాశిస్తోంది. పెద్దపులివంటి ఈ రాక్షసుడు ఎవరు? ఈతడి బాణాలు సూర్యకిరణాల్లాగా కళ్ళు మిరుమిట్లుగొల్పుతున్నాయి. ధ్వజంపైన రాహుగ్రహం చిత్రించి ఉంది. మూడు వంపులు తిరిగిన ఇతడి వింటి నారి మ్రోగిస్తూవుంటే మేఘాలు గర్జిస్తున్నట్లుంది.

ఆ ధనుస్సు వెనుకభాగం బంగారు అలంకారాలతోను శోభయమానంగా ఇంద్రధనుస్సులాగా మనోహరంగా ఉంది. రథంపై ఎగురుతున్న పతాకాలన్నీ శోభను రెట్టింపు చేస్తున్నాయి. ఒకేసారి నలుగురు సారథులు నడిపేట్లుగా అమర్చబడిందా రథం. రథానికి చుట్టూ రకరకాలైన అంబులపొదులు అమర్చారు. ఆ ధనుస్సులన్నీ బంగారువింటి తాడుతో అమర్చారు. ఆ రథంలో అమర్చిన ఖడ్గాలన్నీ పొడవుగాను మూడు, నాలుగు పిడులతో ఉండి, ఆ రాక్షసవీరుడి చుట్టూ వేళ్ళాడకట్టబడ్డాయి. నోరు మత్యువువలె పెద్దదిగాను, మెడనిండా పూలదండలతోను, ప్రకాశించే ఈ వీరుడు మేఘాల మధ్యనున్న సూర్యుడిలాగా కనిపిస్తున్నాడు. ఇతడి బాహువులు ఎత్తుగా హిమాలయా శిఖరాల్లాగావున్నాయి. వాటికి బంగారు కవచాలు తొడిగాడు.

ఓ విభీషణుడా! ఎవరు ఇతడు? ఈతడి చెవుల కుండలాలు మంగళకరంగా ఉన్నాయి. కళ్ళు మిరుమిట్లుగొల్పేట్లున్నాయి. ఇతడి కళ్ళు పునర్వసు నక్షత్రాల మధ్యన ఉన్న పూర్ణచంద్రుడి వలె ప్రకాశిస్తున్నాయి. ఇతడు ఎవరు? ఇతణ్ణి చూసిన వానరులు భయంతో పరుగులు పెట్టడంలో ఏమీ ఆశ్చర్యపడనక్కరలేదు. ఓ విభీషణుడా! ఇతడు ఎవరో నాకు వివరంగా చెప్పు.”

అంతట ఆ రాక్షసశ్రేష్ఠుడైన విభీషణుడు ఇలా అన్నాడు. “ఓ రామా! ఇతడు రావణాసురుని కుమారుడు. యుద్ధం చేయడంలో తండ్రి అంతటి పరాక్రమశాలి, శస్త్రవిద్యలన్నీ నేర్చిన అస్త్రవిద్యా ప్రవీణుడు. గురుకులంలో వేదాభ్యాసం చేసినవాడు. గొప్ప అశ్వికుడు; రథికుడు; విలువిద్యేకాక, కత్తియుద్ధం వంటి అనేక ఆయుధాలతో సమరవిద్యల్ని అభ్యసించాడు. సామ దాన భేద దండోపాయాల నెరిగిన నిపుణుడు. రాజనీతిని, తంత్రాన్ని బాగా ఎరిగినవాడు. ధాన్యమాలిని ఇతడి తల్లి. ఇతడి పేరు అతికాయుడు. లంకాపట్టణం ఇతడి రక్షణలోనే ఉంటుంది.

ఈ అతికాయుడు ఆత్మవిద్య నెరిగినవాడు. బ్రహ్మను మెప్పించి అనేక అస్త్రాలు సంపాదించాడు. దేవదానవులచేతుల్లో చావు రాకుండా బ్రహ్మ నుండి వరాలు పొందాడు. బ్రహ్మ ఇతడి తపస్సుకు మెచ్చుకుని ఇప్పుడు ఇతడు ధరించిన కవచాన్ని, దివ్యరథాన్ని ప్రసాదించాడు. తన బలంతోను, దేవతల వరబలంచేతను దేవదానవుల్ని అనేకసార్లు జయించాడు. యక్షుల్ని శిక్షించి రాక్షసుల్ని రక్షించాడు. ఇంద్రుడి వజ్రాయుధాన్ని స్తంభింపజేశాడు. వరుణుడి పాశాన్ని భగ్నంచేశాడు, రాక్షసయోధుల్లో శ్రేష్ఠుడు. ఓ రామా! పురుషోత్తమా! ఈతడి విషయంలో నీవే స్వయంగా పూనుకోవాలి. లేకపోతే వానరసేనలు అపారంగా నష్టపోవాల్సి ఉంటుంది."

విభీషణుడు రాముడు ఇట్లా మాట్లాడుకుంటూ ఉండగానే, 'అతికాయుడు' వానరసేనల్లోకి ప్రవేశించాడు. ధనుష్టంకారంచేసి సింహనాదాలు చేశాడు. దాంతో వానరవీరుల్లో శ్రేష్ఠులైన కుముదుడు, ద్వివిదుడు, నీలుడు, శరభుడు అంతా కలసి ఒకే సమయంలో ఎదిరించారు. పర్వతశిఖరాల్ని, మహావృక్షాల్ని అతికాయుడిపై విసిరేశారు. అస్త్రవిద్యలో ప్రవీణుడైన అతికాయుడు పదునైన బాణాలతో వాటన్నింటినీ సమర్థంగా ఎదుర్కొని ముక్కలు ముక్కలుగా చేశాడు. ఆ మహాబలశాలి, భయంకరాకారుడైన అతికాయుడు స్వయంగా ఆ వానరవీరుల ఎదుట నిలబడి వారిపై ఉక్కు బాణాల్ని ప్రయోగించాడు. ఆ బాణాల వాతపడి అనేకమంది వానరులు కాళ్ళూ, చేతులూ, తల పోగొట్టుకున్నారు. కోపంతో ఉన్న సింహం లేళ్ళ గుంపుపై పడ్డట్లుగా, అప్పుడా అతికాయుడు వానరసేనా సమూహాన్ని చెదరగొట్టేశాడు. ఆ రాక్షసవీరుడు వానరసైన్యంలో యుద్ధం చెయ్యని వాళ్ళ జోలికి పోలేదు. ధనుస్సును అంబుల పొదిని ధరించి ఉన్న రాముణ్ణి చూసి, దగ్గరగా వెళ్ళి గర్వంగా ఇలా అన్నాడు.

అతికాయుడు : "నేను ధనుర్బాణాలను ధరించి యుద్ధం చెయ్యటానికి వచ్చాను. నేను సామాన్యులతో యుద్ధం చెయ్యను. నన్ను ఎదిరించే శక్తి, ధైర్యం, ఉత్సాహం ఉన్నవాళ్ళెవరైనా ఉంటే ముందుకు రండి. నేను యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను."

శత్రుసంహారకుడైన లక్ష్మణుడు చిరునవ్వు నవ్వుతూ ఆ రాక్షసుడి ఆహ్వానాన్ని

స్వీకరించాడు. కోపంతో లక్ష్మణుడు యుద్ధరంగంలో నిలబడి ధనుష్టంకారాన్ని చేశాడు. ఆ ధ్వని భూమి, ఆకాశం, సముద్రాలు, దిక్కులన్నీ నిండిపోయి రాక్షసుల గుండెల్లో భయాన్ని నింపింది. ఆ ధనుష్టంకార ధ్వనికి 'అతికాయుడు' ఆశ్చర్యపోయాడు. ఎదురుగుండా నిలబడ్డ లక్ష్మణుణ్ణి చూసి కోపంతో ఇలా అన్నాడు. "లక్ష్మణా! నీవు చిన్నపిల్లవాడవు, యుద్ధం చెయ్యటంలో నేర్పులేనివాడవు. నాతో తలపడి వృథాగా ప్రాణాలెందుకు పోగొట్టుకుంటావు. నిన్ను నేను ఏమీచెయ్యను. నీవు వచ్చిన దారినే వెళ్ళిపో. అట్లాకాదని మూర్ఖించి యుద్ధానికే సిద్ధపడితే, అట్లాగే ఉండు. ఇక్కడనుండే సరాసరి నిన్ను యమలోకానికి పంపిస్తాను. పరమేశ్వరునిచే ప్రసాదించబడినవి, శత్రువుల గర్వం అణచివేసేవీ, పరిశుద్ధమైన బంగారంతో అలంకరించబడ్డవియైన నా బాణాల్ని ఒకసారి చూడు. సర్పాల్లాంటి నా బాణాలు కోపించిన సింహం ఏనుగురక్తం త్రాగినట్లు నీ రక్తాన్ని త్రాగుతాయి." ఇలా అంటూ ధనుస్సులో బాణాన్ని సంధించాడు. అతికాయుడి అధిక ప్రేలాపనకు కోపించిన లక్ష్మణుడు ప్రశాంతచిత్తంతో ఇలా అన్నాడు. "ఓ దురాత్ముడా! బడాయి మాటలు చెప్పుకున్నంత మాత్రాన గొప్పవాళ్ళో, ఉత్తములో కాలేరు. నీవు కోరుకున్నట్లే నేను యుద్ధానికి సిద్ధంగా ఉన్నాను. నీ ప్రతాపం ఎంతో నాపైన చూపు! ఎవరైనా కార్యాన్ని సాధించిన తరువాతే తమ గొప్పతనాన్ని చెప్పుకోవాలేకాని, బడాయిమాటలు పౌరుషాన్ని చాటవు. నీవా ధనుస్సు ధరించి అనేక ఆయుధాల్ని పక్కన పెట్టుకొని రథంపైన ఉన్నావు, బాణాలచేతగాని, అస్త్రాలచేతగాని నీ పరాక్రమాన్ని (ప్రతాపాన్ని) చూపించు. నీ ప్రతాపం ఎంతో చూస్తాను. అటుపిమ్మట నేను వాడియైన బాణాలతో గాలితాకిడికి పక్వమైన తాటిపండు నేలపైరాలినట్లు, నీ తలను పడగొడ్తాను. పరిశుద్ధమైన బంగారంతో చేసిన నా బాణం నీ శరీరంలో గుచ్చుకొని రక్తం ఏరులైపారేట్లు చేస్తాను. నన్ను చిన్నపిల్లవాడిగా భావించి జాలి చూపించకు. నేను బాలుడినైనా, నీవు వృద్ధుడవైనా, నేను నీ పాలిట మృత్యుదేవతనని గుర్తుంచుకో. బాలుడే అయినా, విష్ణుమూర్తి మూడడుగులతో ముల్లోకాలనూ ఆక్రమించుకున్నాడు."

లక్ష్మణుడి మాటలు హేతుబద్ధంగా ఉన్నా, కోపించిన అతికాయుడు ధనుస్సును గ్రహించి

బాణాన్ని సంధించాడు. వారిద్దరిమధ్య యుద్ధాన్ని చూసేందుకు మహాత్ములైన విద్యాధరులు, భూతములు, దేవతలు, దైత్యులు, మహర్షులు, యక్షులువచ్చి ఆకాశంలో బారులుకట్టి నిలిచారు.

అంతట అతికాయుడు బాణాన్ని ధనుస్సుపై సారించి వేగంగా లక్ష్మణుడిపై వదిలాడు. శత్రుసంహారకుడైన లక్ష్మణుడు సర్పంవలె వేగంగా వచ్చి తనపై పడుతున్న ఆ బాణాన్ని, అర్ధచంద్రబాణాన్ని ప్రయోగించి ఛేదించాడు. దేహం తెగిపడిన సర్పంవలె తన బాణం వ్యర్థంకావటంతో కోపించిన అతికాయుడు ఒకేసారి ఐదు బాణాల్ని సంధించాడు; ఆ బాణాలు తనపైకి రాకపూర్వమే లక్ష్మణుడు వాటన్నింటినీ సమర్థవంతంగా తన వాడియైన బాణాలతో ఎదుర్కొని ముక్కలుగాచేసి పారేశాడు. అంతట శత్రువులను సంహరించటంలో నేర్పరియైన లక్ష్మణుడు, వాడియైన బాణాన్ని గ్రహించి ధనుస్సుపై సారించాడు. పరాక్రమవంతుడైన లక్ష్మణుడు వంగిన కణుపులుగల ఆ బాణాన్ని అతికాయుడి నుదుట తగిలేట్లుగా కొట్టాడు. ఆ బాణం ఆ రాక్షసుడి నుదుటపై బలంగా దిగటం వలన రక్తంతో తడిసిపోయింది. అప్పుడతడు పర్వతంపై ఉన్న సర్పరాజువలె కనిపించాడు. లక్ష్మణుని బాణంచేత దెబ్బతిన్న ఆ రాక్షసుడు, రుద్రుడి బాణంచే కొట్టబడిన త్రిపురా నగర గోపురంలాగా కనిపించాడు. మహాబలశాలియైన ఆ రాక్షసుడు ఆ దెబ్బకు తట్టుకొని నిలబడ్డాడు. తర్వాత తాను ఏ ప్రకారంగా యుద్ధం చెయ్యాలో ఆలోచించుకుంటూ, లక్ష్మణుడితో ఇలా అన్నాడు: “బాలుడా! బాణాన్ని ప్రయోగించడంలో నీ నేర్పును నేను అభినందిస్తున్నాను. నేను నాతో సరిసమానుడైన శత్రువుతో యుద్ధం చేస్తున్నాను గదా! అని సంతోషంగా ఉంది.” ఇలా చెప్పి, తలవంచుకొని రెండుభుజాల మధ్య తల అణచుకొని రథం మధ్యలో ఒక క్షణం కూర్చున్నాడు. అటుపిమ్మట రథాన్ని అటూ ఇటూ త్రిప్పుతూ ఒక బాణాన్ని వదిలాడు. ఆ తర్వాత మూడు బాణాల్ని, ఆపైన ఐదు బాణాల్ని, ఆ తర్వాత ఏడు బాణాల్ని సంధించి లక్ష్మణుడిపైకి వదిలాడు. ఆ బాణాలన్నీ బంగారు పింజలతోకూడినవై సూర్యుని తేజస్సుతో సమానంగా ప్రజ్వరిల్లుతూ లక్ష్మణుడి పైకి వస్తూవుంటే, లక్ష్మణుడు ఏమాత్రం చలించకుండా వాడియైన బాణాలతో వాటన్నింటినీ దారిలోనే నివారించాడు. దేవేంద్రుణ్ణే ఎదిరించిన ఆ అతికాయుడు తన బాణాలన్నీ నిర్వీర్యం

అయిపోతూవుంటే కుపితుడైపోయాడు. అప్పుడు మరొక వాడియైన బాణాన్ని తీసుకొని సంధించి లక్ష్మణుని వక్షఃస్థలానికి గురిపెట్టి కొట్టాడు. లక్ష్మణుని వక్షఃస్థలంనుండి రక్తం కారింది, అంతట లక్ష్మణుడు ఆ బాణాన్ని పీకి పారేశాడు. మరొక బాణాన్ని తీసుకొని మంత్రాన్ని పఠించి ఆగ్నేయాస్త్రాన్ని ధనుస్సులో సారించాడు, అప్పుడా ధనుస్సుకూడా ప్రజ్వలిస్తూండగా ఆ బాణాన్ని అతికాయుడు మీద వదిలాడు. అప్పుడు అతికాయుడు సూర్యాస్త్రాన్ని తీసి లక్ష్మణునిపై ప్రయోగించాడు. ఆ అస్త్రాలు రెండూ ఆకాశంలో మంటలు మండిస్తూ, కోపించిన మహాసర్పాల్లాగా పోరాడాయి. చివరకు ఒకదాన్ని మరొకటి భస్మం చేసుకుని నేల మీద పడిపోయాయి.

అంతట కోపించిన అతికాయుడు ఐషీకాస్త్రాన్ని ప్రయోగించగా, లక్ష్మణుడు దాన్ని ఇంద్రాస్త్రంతో ఎదుర్కొన్నాడు. ఆ విధంగా తన అస్త్రాలన్నీ నిష్ఫలంకావటంతో అతికాయుడు ఈసారి యమదేవతాక మంత్రాన్ని జపించి అస్త్రాన్ని వదిలాడు. ఆ యామ్యాస్త్రాన్ని లక్ష్మణుడు వాయువ్యాస్త్రంతో అడ్డుకున్నాడు, అంతేకాకుండా లక్ష్మణుడు ఈ రాక్షసుడిపై ఎడతెగని బాణవర్షం కురిపించాడు. ఆ బాణాలన్నీ దేవతలచే ప్రసాదించబడిన దివ్యకవచాన్ని తాకి నేలపై పడిపోయాయి. ఆ విధంగా తన బాణాలన్నీ అతికాయుడి కవచాన్ని ఛేదించలేక పోవటంచేత లక్ష్మణునికి బాగా కోపం వచ్చింది. ఎంత ప్రయత్నించినా ఆ రాక్షసయోధుణ్ణి ఏమి చేయలేకపోయాడు.

ఆ పురుషశ్రేష్ఠుడైన లక్ష్మణుడు ఆ రాక్షసయోధుణ్ణి ఏమాత్రం నొప్పించలేక పోయాడు. అప్పుడు వాయుదేవుడు వచ్చి “లక్ష్మణా! ఇప్పుడు ఈ అతికాయుడు బ్రహ్మచే ప్రసాదించబడిన కవచాన్ని ధరించాడు. ఆ కవచం ప్రభావంచేత ఏ అస్త్రం అతడి మీద పనిచెయ్యదు. కాబట్టి ఇతడిపై బ్రహ్మాస్త్రాన్ని సారించు” అని చెప్పాడు. అంతట లక్ష్మణుడు బ్రహ్మాస్త్ర మంత్రాన్ని బాణంతో అనుసంధానం చేసి ఆ అతికాయుడి మీద వదిలాడు. ఆ బ్రహ్మాస్త్రం ధనుస్సులోనుండి బయటకు వస్తూనే భూమి, ఆకాశం, దిక్కులు, సూర్యచంద్రాది గ్రహాలు భయపడిపోయాయి.

భూమి కంపించింది, లక్ష్మణుడు ప్రయోగించిన యమదూతవంటి బ్రహ్మాస్త్రం వేగాన్ని పుంజుకుంటూ వాయువేగంతో ప్రయాణిస్తోంది. ఆ బాణం పొన్నులకు మంచి రెక్కలుకట్టి ఉన్నాయి; అంతట తీవ్రమైన బాణం తనపైకి దూసుకురావటం అతికాయుడు చూశాడు. అతడు ఎంతమాత్రం తొణకలేదు, బెణకలేదు. ఆ బాణాన్ని తన వద్ద ఉన్న శక్తి ఆయుధంతోను, ఋష్టితోను, గదతోను, కుఠారంతోను, శూలంతోను బాణాలతోను ఎదుర్కొన్నాడు. అగ్నివలె ప్రజ్వలిస్తున్న ఆ బాణం ఆశ్చర్యాన్ని కలిగిస్తూ వజ్రాయుధంవంటి ఆయుధాలన్నింటినీ భస్మం చేసివేసింది. సూటిగా వెళ్ళి ఆ అతికాయుడి, కిరీటంతోను, కుండలాలతోనూ అలంకరించబడిన, శిరస్సును ఖండించి వేసింది. అంతట ఆ శిరస్సు పర్వతశిఖరంలాగా నేలపై పడిపోయింది. వస్త్రములు, అలంకారములూ దూరంగాపోయి పడ్డాయి. ఆ దృశ్యంచూస్తున్న రాక్షసవీరులంతా యుద్ధభూమినుండి త్వరగాపోయి లంకాపట్టణాన్ని చేరుకున్నారు. భయంకరమైన బలంగల ఆ రాక్షసుణ్ణి చంపటంవల్ల, వానరుల ముఖాలన్నీ వికసించిన పద్మాల్లాగా అయిపోయాయి. అంతా కలసి లక్ష్మణుణ్ణి కీర్తించి, పూజించారు. అంతట లక్ష్మణుడు ఆ అతికాయుణ్ణి చంపి వానరులందరిచేత పూజించబడినవాడై, వెంటనే రాముని వద్దకు వెళ్ళాడు.

# 72వ సర్గ రావణుడు వ్యధ చెందటం

అతికాయుడు లక్ష్మణుని చేతిలో దారుణంగా చంపబడ్డాడని విన్న రావణుడు భయపడిపోయాడు, ఇలా అన్నాడు. "ఓ రాక్షసులారా! రాముడు శ్రమపడకుండా తన పనులు చక్కబెట్టుకోవటంలో గట్టివాడు. అందువల్లనే మహావీరులైన ధూమ్రాక్షుడు, ప్రహస్తుడు, కుంభకర్ణుడు చంపబడ్డారు. వీళ్ళంతా అనేక యుద్ధాల్లో సునాయాసంగా విజయాన్ని సంపాదించినవారు. యుద్ధం అంటే అమితమైన ఆసక్తి గలవారు, అపజయం అన్నది ఎన్నడూ ఎరుగరు. అటువంటి మహావీరులంతా మరణించారు. వీళ్ళే కాకుండా అనేకమంది రాక్షసశ్రేష్ఠులు ఈ యుద్ధంలో మరణించారు. నా కుమారుడైన ఇంద్రజిత్తు, రామలక్ష్మణులిద్దర్నీ నాగపాశంచేత బంధించాడు. భయంకరమైన ఆ నాగపాశంనుండి దేవతలు, యక్షులు, గంధర్వులు కూడా విడిపించుకోలేరు. అటువంటి నాగపాశాన్నుండి ఆ రామలక్ష్మణులు తప్పించుకొని బయటపడ్డారు. వాళ్ళు అట్లా మాయచేత విడిపించుకున్నారా? లేక ఏశక్తియైనా విడిపించిందా? ఇంతవరకూ అది శేషప్రశ్నగానే మిగిలిపోయింది. నా ఆజ్ఞలచే పంపబడిన రాక్షసవీరులుకూడా చాలామంది ఈ యుద్ధంలో చనిపోయారు. ఇక మిగిలిన రాక్షసయోధుల్లో రామలక్ష్మణుల్ని, సుగ్రీవ విభీషణుల్ని, చంపగలవాళ్ళు నాకు కనిపించడం లేదు. రాముడి పరాక్రమంచేత రాక్షసులంతా చంపబడ్డారే! ఆహా! ఈ రాముడు ఎంతటి పరాక్రమవంతుడు? ఎంతటి బలశాలి! అతడి అస్త్రబలం ఎంత గొప్పదోగదా!

ఓ రాక్షసులారా! మీరంతా ఏమాత్రం ఏమరిపాటుతనం లేకుండా ఉండాలి. మిమ్మల్ని మీరు రక్షించుకుంటూ ఉండాలి. లంకానగరాన్ని రక్షించాలి. నా ఆజ్ఞ లేకుండా సీతాదేవి ఉంటున్న అశోకవనంలోకి ఎవరూ ప్రవేశించకుండా చూడండి. అట్లాగే ఆ అశోకవనంలో ఉండేవాళ్ళనుకూడా బయటకు రానీయవద్దు. ఎక్కడెక్కడ శత్రువులు ప్రవేశించే వీలుంటుందో, అటువంటి కీలకమైన ప్రదేశాలన్నీ ఎంతో అప్రమత్తతతో రక్షించాలి. అంతే కాకుండా, అన్ని దిక్కులూ పదే పదే కావలికాస్తూ ఉండండి.

ఓ రాక్షసులారా! సాయంకాలమప్పుడూ, ఉదయాన, అర్ధరాత్రి సమయాల్లోనూ, అన్నివేళలా అన్ని మూలలా కనిపెడ్తూ ఉండాలి. వానరుల్ని ఒఠి కోతిమూకేగదా! అని తక్కువగా అనుకోవద్దు, వాళ్ళంతా పొంచి ఉంటారు. ఎప్పుడైనా మీదపడి లంకాపట్టణంలోకి ప్రవేశించవచ్చు?" అని ఆదేశించాడు. అప్పుడు ఆ రాక్షస యోధులంతా తమ ప్రభువు ఆజ్ఞలను శిరసావహించారు. తరువాత రావణుడు దుఃఖం అనే బాణంచేత ఛేదించబడ్డవాడై భరించలేని బాధతో అంతఃపురంలోకి వెళ్ళాడు. ఒక ప్రక్క కోపం, ఒక ప్రక్క తాపం, అన్నిటినీమించి పుత్రశోకం రావణుణ్ణి కృంగదీస్తోంది.

# 73వ సర్గ ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించడం

యుద్ధంలో మరణించగా మిగిలిన రాక్షసవీరులంతా త్వరగా లంకా పట్టణాన్ని చేరుకుని, దేవాంతకుడు, త్రిశిరస్సు, అతికాయుడు, మొదలైన వీరులంతా చనిపోయారని రావణాసురుడికి తెలియజేశారు. పుత్రుల మరణం, సోదరులిద్దరూ యుద్ధంలో మరణించడం, రావణుణ్ణి బాగా క్రుంగదీసింది. ఈ వార్త విన్న రావణుడు నిశ్చేష్టుడై చాలాసేపు మౌనంగా ఉండిపోయాడు.

దీనుడై శోకసముద్రంలో మునిగివున్న రావణుణ్ణి చూసి, కుమారుడైన ఇంద్రజిత్తు ఇలా అన్నాడు. "రాక్షస ప్రభువైన ఓ తండ్రీ! ఈ ఇంద్రజిత్తు జీవించి ఉండగా నువ్వు ఇట్లా దీనుడవై దుఃఖంతో ఉండటానికి వీల్లేదు. యుద్ధంలో ఇంద్రజిత్తు బాణాన్ని తప్పించుకొని బ్రతికి బయటపడ్డ వీరుడు ఇంతవరకూ ఒక్కడూలేడు. ఇప్పుడుకూడా ఆ రామలక్ష్మణుల శరీరాల్ని నా బాణాలతో ఎక్కడా సందులేకుండా తూట్లుపడేట్లు చేస్తాను. వాళ్ళ వెచ్చటి నెత్తురంతా ఈ నేలపై ప్రవహించేట్లు చేస్తాను. వాళ్ళిద్దరూ మరణించి నేలపైపడి ఉండటం నీవు చూడగలవు. తండ్రీ! ఇప్పుడే నీకు ప్రతిజ్ఞ చేస్తున్నాను. వ్యర్థంకాని నా బాణాల్ని ఆ రామలక్ష్మణులపైన ప్రయోగిస్తాను. పూర్వం బలిచక్రవర్తి యజ్ఞవాటికలో విష్ణుమూర్తి పరాక్రమాన్ని చూసిన ఆ ఇంద్రుడు, యముడు, వరుణుడు, సాధ్యులూ, అశ్వినీదేవతలు, సూర్యచంద్రులు, అగ్నిహోత్రుడు, మున్నగు దేవతలందరూ నా పరాక్రమాన్ని చూస్తారు."

మహాధైర్యశాలియైన ఇంద్రజిత్తు, తండ్రికి వీడ్కోలుచెప్పి, వాయువేగంతో పోయే రథాన్ని అధిరోహించాడు. కంచరగాడిదలు కట్టిన, సూర్యుని రథంతో సమానమైన వేగంగలదైన, ఆ రథాన్ని ఎక్కి యుద్ధభూమికి బయలుదేరాడు. మహాబలశాలురతో కూడిన అశేషరాక్షససేన ఆ రథం వెనకే బయలుదేరింది. వాళ్ళల్లో కొందరు ధనుస్సులు ధరించారు. కొందరు గుర్రాలపై బయలుదేరారు, కొందరు గజారూఢులై బయలుదేరారు. వాళ్ళందరూ గదలు, ఈటెలు, ఇనుపగుదియలు, ఖడ్గాలు, గండ్రగొడ్డళ్ళు మొదలైన ఆయుధాల్ని ధరించి ఇంద్రజిత్తు వెనకాలే

బయలుదేరారు.

ఇంద్రజిత్తుకు జయాన్ని కాంక్షిస్తూ శంఖాలు పూరించారు; దుందుభులు, భేరీలు మ్రోగించారు. చంద్రబింబంవంటి తెల్లటి ఛత్రం రథంలో అమర్చారు. ఇంద్రజిత్తు ఆ ఛత్రం కింద బంగారు సింహాసనంపై కూర్చున్నాడు. బంగారు పిడులతో చేసిన చామరాలతో విసిరారు. సూర్యుడువచ్చి ఆకాశంలో వెలుగు నింపినట్లు ఇంద్రజిత్తు రాక్షససైన్యంలో ధైర్యం అనే వెలుగుని నింపాడు. ఇంద్రజిత్తు రథం యుద్ధభూమికి కదిలి వెళ్తూవుంటే బ్రహ్మరాక్షసులు వేదమంత్రాలు, స్తోత్రపాఠాలు చదివారు.

అంతట ఆ అరిందముడు ఆ విధంగా యుద్ధభూమికి చేరుకోగానే, తన రథం దివ్యరథం కావడానికి శాస్త్రోక్తంగా అగ్నిహోత్రాలు, హోమాలు చేయించాడు. ఆ రథంచుట్టూ రాక్షసుల్ని కాపలా ఉంచాడు. అగ్నిహోత్ర ప్రభలతో తేజరిల్లుతూ ఉన్న ఇంద్రజిత్తు, బ్రహ్మరాక్షసులచేత శాస్త్రోక్తంగాను, మంత్రయుక్తంగాను, వేదోక్తంగాను అగ్నిహోత్రాన్ని ప్రజ్వలింపజేసి, హోమాలు చేశాడు. ముందుగా అగ్నిహోత్రాన్ని గంధపుష్పాలతో పూజించాడు. హవిస్సులతోను, వరిపేలాలతో హోమంచేసి నమస్కరించాడు. ఆయుధాలన్నింటినీ దర్భలపైన పరిచాడు. తాండ్రకొమ్మల్ని సమిధలుగా వాడాడు. ఎర్రటి వస్త్రాల్ని ధరించాడు. నల్లటి ఇనపతెడ్డును తీసుకొని, అగ్నిహోత్రానికి అన్నివైపులనుండీ దర్భల్నీ, తోమర ఆయుధాల్ని పరిచాడు. అంతట నల్లటిమేకను మెడనులిమివేసి సమిధల్తో అగ్నిహోత్రాన్ని ప్రజ్జ్వలింపచేశాడు. పొగలు లేకుండా, జయాన్ని సూచిస్తూ, పెద్దపెద్ద మంటలులేచాయి. ఆ అగ్నిహోత్రపు జ్వాలలకు నమస్కారపూర్వకంగా ప్రదక్షిణలుచేస్తూ ఉండగా, బంగారు ఆభరణాలు ధరించిన అగ్నిహోత్రుడు స్వయంగా అగ్నిగుండా లోనుండి లేచివచ్చి, ఇంద్రజిత్తుచే సమర్పించిన హవిస్సులను తీసుకొని అంతర్ధానమయ్యాడు. అటుపిమ్మట ఇంద్రజిత్తు భక్తిపూర్వకంగా బ్రహ్మాస్త్రమంత్రాన్ని జపించాడు. తనను, తన ధనుస్సును, యుద్ధభూమిలో తనకు సంబంధించిన సమస్తాన్ని మంత్ర జలం చేత అభిమంత్రించాడు. ఆ విధంగా అగ్నిహోత్రంలో హోమంచేసి

ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమంత్రాన్ని జపించగానే నవగ్రహాలు, నక్షత్రాలు, ఆకాశం కంపించాయి.

అగ్నిహోత్రం వంటి తేజోవంతుడు, మహేంద్రుడితో సమానమైన పరాక్రమం గల, మహామంత్ర వేత్తయైన ఇంద్రజిత్తు హోమాన్ని యథా శాస్త్రీయంగా ముగించుకొన్న పిమ్మట, రథం, గుర్రాలు, సారథితో సహా ఆకాశానికి ఎగిరిపోయి అంతర్ధానమయ్యాడు. అప్పుడు పతాకాలతో కూడిన రథాలు, గుర్రాలు, ఏనుగులతో కూడిన సైన్యంమంతా నేలమీద నడుస్తూ సింహనాదాలు చేస్తూ ఇంద్రజిత్తును నేలపై అనుసరించారు. అప్పుడు ఇంద్రజిత్తు రాక్షసులతో "ఓ రాక్షసయోధుల్లారా! మీరు ఉత్సాహంతో యుద్ధం చెయ్యండి. వానరులందర్నీ చంపేయండి" అని ఆకాశం నుండి ఆదేశించాడు, అప్పుడు రాక్షసులంతా చిత్ర విచిత్రమైన ఆయుధాలను, బాణాలను, తోమరాలను, అంకుశాలను, చేతపట్టుకొని విజయం తమదేనన్న ధీమాతో భయంకరంగా గర్జిస్తూ, సింహనాదాలు చేస్తూ వానరులందరిపైనా విరుచుకుపడ్డారు. ఇంద్రజిత్తు ఆకాశంలో అజ్ఞాతంగా ఉంటూనే సైనికులందర్నీ ఉత్తేజపరుస్తూ వానరుల పైకి పురికొల్పుతున్నాడు. నేలపైన రాక్షసులు వానరుల్ని ముసలాలతోను, తోమరారతోను, గదలతోను హింసిస్తూవుంటే, ఇంద్రజిత్తు వారిపై పదునైన ఇనప బాణాలవర్షం కురిపించాడు. అంతట ఆకాశంలో ఎగిరే వానరులంతా శిలల్ని, వృక్షాల్నీ తీసుకొని ఆకాశంలోకిపోయి ఇంద్రజిత్తును ఎదిరించారు. మహాయోధుడైన ఇంద్రజిత్తు ఆకాశంలో నుండి నేలపై యుద్ధంచేసే వానరుల్ని ఒక్కొక్క బాణంతో ఐదుగుర్ని, ఏడుగుర్ని, తొమ్మిదిమందిని చంపసాగాడు. సూర్యకిరణాలవలె కళ్ళు మిరిమిట్లు గొలుపుతూ యుద్ధాల్లో అజేయుడుగా నిలబడే ఆ ఇంద్రజిత్తు బంగారు బాణాల్తో నేలపై యుద్ధం చేస్తున్న వానరుల్ని సంహరించాడు. ఆ బాణాలకు తట్టుకోలేక వానరుల్లో చాలామంది మరణించారు. వానరయోధుల్లో ఉత్సాహం తగ్గింది, జయంపై ఆశలు సన్నగిల్లాయి. దేవాసురయుద్ధంలో అసురులవలె వానరులు నేలకూలారు. వానరుల్లో ప్రథమ, ద్వితీయ శ్రేణులకు చెందిన వానరులు మాత్రం ఇంద్రజిత్తు ధాటికి తట్టుకొని నిలబడ్డారు. మేటి వానరనాయకులు మాత్రమే రాళ్ళతోను వృక్షాల్తోను ఇంద్రజిత్తును అన్నివైపులనుండి ముట్టడించారు. రాళ్ళు వృక్షాలు తనపై పడకుండా ఇంద్రజిత్తు బాణాల వర్షం కురిపించాడు.

మహాసమర్థుడైన ఇంద్రజిత్తు తనను రక్షించుకుంటూనే, నేలపై యుద్ధం చేస్తున్న రాక్షసవీరుల్ని కూడా రక్షించసాగాడు. ఇంద్రజిత్తు ప్రయోగిస్తున్న మహావాడియైనవి, మహాసర్పాల్లా విషతుల్యమైన బాణాలు వానరులను అధిక సంఖ్యలో మట్టుబెట్టాయి.

అంతట ఇంద్రజిత్తు పద్దెనిమిది కరకు బాణాల్ని గంధమాదనుడిమీద వదిలాడు. ఏడు బాణాలతో మైందుడి మర్మస్థానాలన్నింటిపై గురిచూసి కొట్టాడు. ఐదు బాణాల్ని గజుడి మీద, పది బాణాల్ని జాంబవంతుడి మీద, ముప్పైయి బాణాల్ని నీలుడిపైనా వదిలాడు. వరములచే పొందిన మంత్రించిన బాణాల్ని సుగ్రీవుడిపైన ఋషభుడిపైన, అంగదుడిపైనా వదిలి నిశ్చేష్టుల్ని చేయగా వారంతా మూర్ఛపోయారు.

ఇంద్రజిత్తు ఆ యుద్ధభూమిలో ప్రళయకాలాగ్నిలాగా నలువైపుల నుండీ వానరుల్ని హింసించాడు. సూర్యకిరణల్లాంటి తీక్ష్ణమైన బాణాల్ని వదుల్తూ అనేక వేలమంది వానరుల్ని హతమార్చాడు. మిగిలిన వాళ్ళంతా తీవ్రమైన గాయాల్తో, నెత్తురురోడే శరీరాలు గలవారై యుద్ధంపై ఆసక్తి కోల్పోయారు; వ్యాకులపడిపోయారు; మూర్ఛపోయారు. వానరుల్లో నెలకొన్న ఈ గందరగోళ పరిస్థితులన్నీ ఇంద్రజిత్తును పరమానందభరితుణ్ణి చేశాయి. అంతటితో తృప్తి చెందని ఇంద్రజిత్తు వానరసైన్యంలో ప్రవేశించి ఎవరికీ కనపడకుండా మాయమై పైనుండి బాణములవర్షం కురిపిస్తూ వానరుల్ని హింసించాడు. వానరుల దేహాలన్నీ గాయాలయ్యాయి, వాళ్ళంతా వికృతంగా కేకలువేస్తూ, ఇంద్రుడి వజ్రాయుధంచేత కొట్టబడిన పర్వత శిఖరాల్లా పడిపోయారు. వానరులకు గాలిలోనుండి బాణాలు వచ్చి పడటమే తెలుస్తోందిగాని, వాటిని ప్రయోగిస్తున్నది ఎవరో కనబడటం లేదు. అట్లాగే ఇంద్రజిత్తుచే ప్రయోగించబడిన వివిధమైన ఆయుధాలు తగిలి వానరుల శరీరాల్నుండి రక్తం ఏరులై పారింది. వాళ్ళల్లో కొందరు, ఆయుధాలు ఎటువైపునుండి వస్తున్నయో చూడాలనే కుతూహలంతో పైకి చూడగా ఆయుధాలు వాళ్ళ కళ్ళల్లో గుచ్చుకొని హాహాకారాలు చేశారు.

ఆ విధంగా ఇంద్రజిత్తు ఆకాశంనుండి అదృశ్యంగా బంగారు బాణాలతోను, గద

మొదలైన ఆయుధాలతోను వానరులను హతమార్చాడు. అంతట సూర్యకిరణాల్లాంటి తీక్షణమైన బాణాల్ని రామలక్ష్మణులపై వేశాడు. అయినా ధైర్యశాలియైన రాముడు ఆ బాణాల్ని లెక్క చేయకుండా ఎదుర్కొంటున్నాడు. అప్పుడు లక్ష్మణుడితో ఇలా అన్నాడు.

రాముడు: "లక్ష్మణా! దేవేంద్రుణ్ణి కూడా జయించిన మాయావి ఈ ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రాన్ని సంధించాడు. ఇంతవరకూ వానరులందర్ని ఆ అస్త్రప్రభావంతో పడగొట్టాడు. ఇప్పుడు మనపైకూడా ప్రయోగిస్తున్నాడు. ఈ మహాబలశాలి ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రాన్ని వదుల్తున్నాడు. అందువల్లనే మనం అతణ్ణి ఏమీ చెయ్యలేకపోతున్నాం. ఈ అస్త్రం నిస్సందేహంగా, మహాత్ముడు, పరమపూజ్యుడైన బ్రహ్మదేవుడిచ్చిన వరప్రసాదమేనని అనుకొంటున్నాను. కాబట్టి నీవుకూడా నాకు మల్లేనే మనస్సుని నిశ్చలం చేసుకుని ఓర్చుకోవటం ఒక్కటే మార్గం. ఇతడు వేసే బాణాలుకాని, ఆయుధాలుగాని ఏ దిక్కున వస్తున్నాయో తెలియటంలేదు. మన వానరసైన్యం, వానర నాయకులంతా మూర్ఛలో ఉన్నారే కానీ, మరణించలేదు. మనంకూడా సమయోచితంగా, యుద్ధతంత్రాన్ని అనుసరించి యుద్ధం చేయడం మానేద్దాం, మూర్ఛపోయి పడివుందాం. దాంతో విజయం సాధించానన్న ఉత్సాహంతో ఇంద్రజిత్తు తప్పకుండా లంకాపట్టణానికి తిరిగి పోతాడు."

అంతట రామలక్ష్మణులు కూడా ఇంద్రజిత్తు బాణాలను ఎదిరించకుండా, బ్రహ్మాస్త్ర ప్రభావానికి లొంగి మూర్ఛపోయారు. రామలక్ష్మణులు మూర్ఛపోవటం ఇంద్రజిత్తు చూశాడు. పరమ సంతోషంతో సింహనాదాలు చేశాడు; రాముడు తలచినట్లే జరిగింది. వానరసైన్యం, రామలక్ష్మణులు పడిపోగానే మరణించారని తలచిన ఇంద్రజిత్తు లంకాపట్టణానికి పోయాడు. తండ్రియైన రావణునికి జరిగిందంతా చెప్పాడు.

## 74వ సర్గ హనుమంతుడు ఓషధులున్న పర్వతాన్ని తేవడం

అప్పుడా యుద్ధభూమిలో రామలక్ష్మణులు, సుగ్రీవుడు, నీలుడు, అంగదుడు, జాంబవంతుడు కూడా స్పృహలేనివారై మూర్ఛపోయి పడి ఉన్నారు. అపస్మారకంలో ఉంటున్నవారిని, కొన ఊపిరిలో ఉన్న వాళ్ళనూ చూస్తూ, ధైర్యం పలుకుతూ విభీషణుడు ఇలా అన్నాడు. "ఓ వానరవీరులారా! మీరు భయపడకండి, ఇంద్రజిత్తు బ్రహ్మదేవుని వలన అమోఘమైన వేగంగల బ్రహ్మాస్త్రాన్ని పొందాడు. బ్రహ్మ ప్రసాదితమైన ఆ బ్రహ్మాస్త్రాన్ని ఇప్పుడు ఇంద్రజిత్తు ప్రయోగించాడు. ఆ పరమ పవిత్రమైన అస్త్రాన్ని గౌరవించటంకోసం, రామలక్ష్మణులు ఆ అస్త్రాన్ని ఎదిరించడం మాని ఆ అస్త్ర ప్రభావానికి కట్టుబడిపోయారు. రామలక్ష్మణులు మూర్ఛపోయారేకానీ, మరణించలేదు. అందువల్ల మీరెవరూ దుఃఖించవద్దు." విభీషణుడు పలికిన మాటల్ని, బ్రహ్మాస్త్రాన్ని గౌరవించి, ఆ అస్త్రంనుండి బయటపడిన హనుమంతుడు విన్నాడు. అంతట ఆ అర్ధరాత్రి సమయంలో విభీషణుడూ, హనుమంతుడూ కాగడాలు పట్టుకొని యుద్ధభూమియంతా కలియ తిరిగి చూశారు. ఎక్కడ చూసినా తోకలు తెగినవారు, చేతులు తెగినవారు పడివుండటం చూశారు. దెబ్బలుతిని పడివున్న సుగ్రీవుణ్ణి, అంగదుణ్ణి, నీలుణ్ణి, శరభుణ్ణి, గంధమాదనుణ్ణి, గవాక్షుణ్ణి, సుషేణుణ్ణి, వేగదర్శిని, ఆకుహుణ్ణి, మైందుణ్ణి, నలుణ్ణి, జ్యోతిర్ముఖుణ్ణి, ద్వివిదుణ్ణి, పనసుణ్ణి, ఇంకా అనేకమంది వానరవీరుల్ని చూశారు. ఆ ఒక్క రోజు ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్ర తాపానికి అరవైఏడు కోట్లమంది వానరయోధులు మరణించారు. పిమ్మట వాళ్ళిద్దరూ జాంబవంతుణ్ణి చూశారు, వయోవృద్ధుడైన ఆ జాంబవంతుడికి ఒళ్ళంతా గాయాలయ్యాయి, రక్తం కారుతూ పడివున్నాడు. అప్పుడు విభీషణుడు ఇలా అన్నాడు. "ఓ పూజ్యుడా! జాంబవంతుడా! ఆ ఇంద్రజిత్తు బాణాలకు నీవు ప్రాణాలు పోకుండా, జీవించి ఉండటం మాకెంతో సంతోషాన్ని కలిగిస్తోంది." అంతట జాంబవంతుడు విభీషణుణ్ణి చూస్తూ, "ఓ రాక్షసరాజా! నీ మాటల్నిబట్టి నీవు విభీషణుడవేనని గుర్తించాను – నేను ఇంద్రజిత్తు వేసిన బాణాలు ఒళ్ళంతా గుచ్చుకొని కొనఊపిరితో ఉన్నాను. కళ్ళు తెరిచి

చూడలేకుండా ఉన్నాను. ఓ విభీషణుడా! అంజనాదేవి కడుపు చల్లగా, వాయుపుత్రుడైన హనుమంతుడు జీవించి ఉన్నాడు గదా?" అని అడిగాడు. అందుకు ఆశ్చర్యపోతూ విభీషణుడు "ఓ భల్లూకరాజా! పూజ్యుడా! నీవు వాయుపుత్రుడైన హనుమంతుడి క్షేమమే విచారిస్తున్నావు? ఎందువలన? వానరరాజైన సుగ్రీవుడికన్నా, అంగదునికన్నా, పరమపవిత్రుడైన రామప్రభువు కన్నా, నువ్వు హనుమంతుణ్ణే ఎక్కువగా అభిమానిస్తున్నావా?" అని అడిగాడు, అందుకు జాంబవంతుడు "ఓ రాక్షసరాజా! నేను ఆ వాయుపుత్రుడి క్షేమాన్ని ఎందుకు ముందుగా విచారించానో ఒక్కమాటలో చెప్తాను విను. ఒక్క హనుమంతుడు జీవించి ఉంటే, రామలక్ష్మణ, సుగ్రీవాది సమస్త వానరసేనా జీవించి ఉన్నట్లే అవుతుంది. అట్లాగే హనుమంతుడు ఒక్కడూ మరణిస్తే, మనం అంతా జీవించి ఉన్నా మరణించినట్లే! ఎందువల్లనంటావా, హనుమంతుడు వేగానికి వాయుదేవుడితో సమానమైనవాడు, పరాక్రమానికి అగ్నిహోత్రుడితో సమానం. అందువల్ల అతడు ఒక్కడూ జీవించి ఉంటే, మన కందరికీ ప్రాణం పోస్తాడు" అన్నాడు.

అప్పుడు హనుమంతుడు, జాంబవంతుడి పాదాలకు నమస్కరిస్తూ, "నేను హనుమంతుణ్ణి, మీ పాదాలకు నమస్కరిస్తున్నాను" అన్నాడు. హనుమంతుడి గొంతు వినగానే, ప్రాణం లేచివచ్చి నట్లుగా జాంబవంతుడు భావించాడు. బాణాలవల్ల కలిగే శరీర బాధలన్నీ మటుమాయమై పోయాయి. మహానందం పొందాడు. హనుమంతుడితో ఇలా అన్నాడు. జాంబవంతుడు: "ఓ వానర శార్దూలమా! హనుమంతుడా నాకు దగ్గరగా రా, పరాక్రమానికి నీకు సాటి ఎవరూ లేరయ్యా. ఇప్పుడు నీవే ఈ వానరులందర్నీ కాపాడాలి. మా అందరికీ నీవే ఆప్తుడవు; స్నేహితుడవు. నీ పరాక్రమం చూపే సమయం వచ్చింది. వానరసైన్యాన్ని, భల్లూకసైన్యానికి ప్రభువైన సుగ్రీవ, అంగదుల్ని, పురుషోత్తముడైన రాముణ్ణి, లక్ష్మణుణ్ణి ఈ మూర్ఛ దీర్ఘనిద్ర కాకుండా కాపాడాలి. అటుపైన వాళ్ళగాయాలన్నీ మానేట్లుచేసి మళ్ళీ యుద్ధానికి సంసిదుల్ని చెయ్యాలి.

ఓ హనుమంతుడా! నీవు సముద్రాన్ని దాటి ఉత్తరంగా ప్రయాణం చేసి హిమపర్వతానికి

చేరుకోవాలి. అక్కడ వృషభం అనే కాంచన శిఖరమూ, కైలాసపర్వతమూ కనిపిస్తాయి. వాటి మధ్య 'ఔషధీ' పర్వతం ఒకటుంది. ముల్లోకాలకు అవసరం అయ్యే ఔషధాలన్నీ ఆ పర్వతంపైనే ఉంటాయి. ఆ పర్వతం వెదజల్లే కాంతులను చూస్తేనే అది ఔషధి పర్వతం అని తెలుస్తూ ఉంటుంది.

అటువంటి దివ్య పర్వతంపైన నాలుగు ముఖ్యమైన ఔషధులు ఉన్నాయి. వాటికాంతులు దశదిశలా ప్రకాశిస్తూ కనిపిస్తాయి. ఆ నాలుగింట్లో "సంజీవకరణి" అనే ఔషధి ఒకటుంది. ఆ ఔషధి వల్ల చనిపోయిన వాళ్ళుకూడా లేచి కూర్చుంటారు. ఇక రెండవది 'విశల్యకరణి' అనే మూలిక ఉంది, దాన్ని తాకిస్తే చాలు, ఎంతటిగాయాలైనా, వ్రణాలైనా ఇట్టే మాయమైపోతాయి. ఇక మూడవది 'సౌవర్ణకరణి' దానివల్ల గాయాల తాలూకు మచ్చలు కూడా కనిపించకుండా పోయి, చర్మం ఎప్పటిలాగానే పూర్వస్థితికి వస్తుంది. నాలుగవది 'సంధానకరణి'. అది తెగిపోయిన అవయవాలను అతికిస్తుంది. కనుక ఓ హనుమంతుడా! నీవిప్పుడు వాయువేగంతో వెళ్ళి ఆ నాలుగు ఔషధుల్ని తీసుకురావాలి. వాటి ప్రభావం వల్ల మృతులైన వానరులంతా మళ్ళీ జీవం పోసుకుంటారు. తిరిగి ఆరోగ్యవంతులై యుద్ధానికి సిద్ధమౌతారు."

జాంబవంతుడు చెప్పిన మాటలన్నీ శ్రద్ధగావిన్న వాయుపుత్రుడైన హనుమంతుడు శరీరాన్ని పెంచి త్రికూటపర్వతం పైకి ఎగిరాడు. పర్వతంలాంటి హనుమంతుడు త్రికూటపర్వతంపై కాలుపెట్టగానే ఆ త్రికూటపర్వతం హనుమంతుని బరువుకు కృంగింది. పర్వత శిఖరాలన్నీ విరిగిపడ్డాయి. మహావృక్షాలన్నీ కూలాయి. ఎండిన చెట్లన్నీ ఫెళాఫెళా ముక్కలై మంటలు లేచాయి. లంకాపట్టణం అంతా కంపించింది. గృహాలు, గోపురాలు కూలాయి. రాక్షసులకు ఏమీ అర్థంకాక విలవిల్లాడిపోయారు. హనుమంతుడి పాదాల ఒత్తిడికి సముద్రంకూడా అల్లకల్లోలమైంది. ఇదంతా ఒక అరక్షణంలో జరిగిపోయింది. ఆ అరక్షణంలో హనుమంతుడు త్రికుటాన్ని విడిచి, సమీపంలో ఉన్న మలయపర్వతంపైకి ఎగిరిపోయాడు. ఆ మలయపర్వతం మేరు, మందరపర్వతాల్లాగా ఎన్నో సెలయేర్లు, రకరకాల వృక్షాలతోను, లతలు,

జలాశయాలతో విలసిల్లింది. ఆ జలాశయాలు వికసించిన కమలములతో, మనోహరంగా ఉన్నాయి. వన్యమృగాలతోను, గుహలతోను ఆ మలయపర్వతం అరవై యోజనాల ఎత్తున ఉంటుంది. దేవతలు, అప్సరసలు, గంధర్వులు అక్కడకు విహారానికి వస్తూ ఉంటారు. మహామేఘంవంటి వాయుపుత్రుడైన హనుమంతుడు తన శరీరాన్ని పెద్దది చేశాడు. పాదాలతో ఆ పర్వత శిఖరాన్ని తొక్కిపట్టాడు. పెద్దగా నోరు తెరచి పెద్దపెట్టున గర్జించాడు. లంకాపట్టణంలోని రాక్షసులంతా భయంతో నిశ్చేష్టులయ్యారు.

మహా పరాక్రమశాలి, శత్రుసంహారకుడైన హనుమంతుడు సముద్రమునకు నమస్కరించి రామకార్యానికి ఉద్యుక్తుడయ్యాడు. తోకను సర్పంలాగా పైకి ఎత్తి, నడుము వంచి మెడసారించి నోరుపెద్దగా తెరచి ఆకాశంపైకి ఎగిరాడు. ఆ వేగానికి ఆ శిఖరంపైనున్న శిలలు, వృక్షాలు కొంత దూరం ఎగిరి కిందపడ్డాయి. అంతట హనుమంతుడు సర్పాల్లాంటి తన చేతుల్ని చాచి, గరుత్మంతుడిలాగా మహావేగంతో దిక్కులన్నింటినీ కలవరపెడుతూ హిమపర్వతాలవైపుగా ప్రయాణం సాగించాడు. పైన ఆకాశంలో ఎగురుతున్నప్పుడు హనుమంతుడి వేగానికి సముద్రంలో సుడిగుండా లేర్పడ్డాయి. నీళ్ళల్లో జంతువులన్నీ విష్ణుచక్రంలాగా గిర్రున తిరగసాగాయి. వాయుపుత్రుడైన హనుమంతుడు వాయువేగంతో పర్వతాలు, నదులు, అరణ్యాలు, పట్టణాలు, గ్రామాలు దాటుకుంటూ హిమలయాలవైపుగా ప్రయాణం సాగించాడు. జాంబవంతుడు చెప్పిన మాటల్నే మననం చేసుకుంటూ ఉండగానే హిమపర్వతాన్ని సమీపించాడు.

హిమపర్వతం ఎన్నో సెలయేరులు, జలప్రవాహాలు, మనోహరమైన తెల్లటి పర్వతశిఖరాలు, వృక్షాలు, లతలతో శోభయమానంగా ఉంది. ఆ మహాపర్వతంపై మహర్షి సమూహాల్ని, వాళ్ళ ఆశ్రమాల్ని చూశాడు. హనుమంతుడు అక్కడ బ్రహ్మదేవుడి గృహాన్ని, కైలాసాన్ని, ఇంద్రుని గృహాన్ని, రుద్రుడు విలాసంగా బాణాలు ప్రయోగించే స్థలాన్ని, హయగ్రీవ క్షేత్రాన్ని, రుద్రుడు బ్రహ్మశిరస్సు ఖండించిన ప్రదేశాన్ని, సూర్యుని కింకరులను చూశాడు. అక్కడే

బ్రహ్మదేవుడు ఇంద్రుడికి వజ్రాయుధం ఇచ్చినచోటును, కుబేరుని గృహం, ఛాయాదేవికి ప్రీతి కలిగించేందుకు విశ్వకర్మ సూర్యుని కిరణాలకాంతిని తగ్గించేందుకు సూర్యుణ్ణి బంధించిన స్థలాన్ని, శంకరుడి ధనుస్సు ఉండే స్థలాన్ని, బ్రహ్మ కూర్చుండే స్థలాన్ని, పాతాళ బిలాన్ని చూశాడు.

తరువాత కైలాసాన్ని, హిమవచ్ఛిలను, ఋషభపర్వతాన్ని, సమస్త ఔషధాలతో ప్రజ్వలించే ఔషధిపర్వతాన్ని చూశాడు. ఆ పర్వతంపై జాంబవంతుడు చెప్పిన మూలికలకోసం అన్వేషణలో అనేక వేలయోజనాల దూరం తిరిగాడు. ఆ ఔషధులు, మూలికలు పరమ పవిత్రమైనవి, దేవతలచే రక్షించబడటంవల్ల, అవి అందరి కంటపడకుండా అదృశ్యంగా ఉంటూ ఉంటాయి. అందువల్ల హనుమంతుడు ఎన్నివేల యోజనాలు తిరిగినా వాటిని తెలుసుకోలేకపోయాడు. దాంతో కోపించిన హనుమంతుడు గట్టిగా అరచాడు. అతడి కళ్ళు ఎర్రగా అగ్ని గోళాల్లాగా ఉన్నాయి. అప్పుడు ఆ పర్వతంతో ఇలా అన్నాడు. "ఓ పర్వతరాజమా! రామకార్యానికి సహాయపడకూడదని నిశ్చయించుకొన్నట్లున్నావు. నిన్నేం చేస్తానో చూస్తూవుండు. నా బాహుబలం చేత నిన్ను హింసించబోతున్నాను. కాచుకో!" వెంటనే హనుమంతుడు చెట్లతోను, ఏనుగులతోను, బంగారుగనులతోను, వేలాది ధాతువుల్తోను, చిన్నచిన్న శిఖరాలతోను, ఉన్న ఆ పర్వతాన్ని పట్టుకొని పెళ్ళగించి వేశాడు. అట్లా పెళ్ళగించిన ఆ పర్వతరాజాన్ని అరచేతిలో పెట్టుకొని ఆకాశానికి ఎగిరిపోయాడు. అప్పుడు దేవతలంతా అతణ్ణి స్తోత్రం చేశారు. సూర్యునివలె ప్రకాశిస్తున్న ఆ పర్వతాన్ని పట్టుకొని ఆకాశమార్గాన ఎగిరిపోతూ ఉంటే, రెండవ సూర్యుడివలె కనిపించాడు. అట్లా ఆ పర్వతాన్ని పట్టుకొని ఆకాశంలో పోతున్న ఆ వాయుపుత్రుడైన హనుమంతుడు, వెయ్యి అంచులు గలిగి అగ్ని జ్వాలలతో తేజరిల్లే చక్రాయుధాన్ని ధరించిన విష్ణుమూర్తివలె కనిపించాడు.

అప్పుడు ఆ ఔషధుల పర్వతాన్ని అరచేతిలో పెట్టుకొని ఆకాశమార్గాన వస్తున్న వాయుపుత్రుడైన హనుమంతుణ్ణి వానరవీరులంతా చూశారు. సంతోషంతో గర్జనలు చేశారు. ఆ

పర్వతరాజు భూమిపైకి సమీపిస్తున్నకొద్దీ ఆ వాసనకే వానరవీరులంతా గర్జిస్తూలేచి నిలబడ్డారు. ఆ మూలికల వాసన తగలగానే గాయాలు నయమైన వానరులంతా లేచి నిలబడ్డారు. వానరుల కేకలు, గర్జనలు విని లంకాపట్టణంలోని రాక్షసులంతా భయపడిపోయారు. అంతట ఆ మహానుభావుడైన హనుమంతుడు ఓషధిపర్వతంతో సహా వానరసేనల మధ్యన దిగాడు. వానర శ్రేష్ఠులందరికీ నమస్కరించాడు. విభీషణుణ్ణి కౌగలించుకున్నాడు. ఆ మహా ఔషధుల వాసనను రామలక్ష్మణులు ఆఘ్రాణించారు. వెంటనే నిద్రలోనుండి లేచినట్లు లేచి కూర్చున్నారు. వాళ్ళ శరీరంపై అయిన గాయాలన్నీ మాయమైపోయాయి, ఆ మూలికల గాలి సోకిన వానరులంతా లేచికూర్చున్నారు. యుద్ధంలో మరణించిన వాళ్ళుకూడా లేచి కూర్చున్నారు. ఏ రోగము, నొప్పి లేకుండా రాత్రి నిద్రపోయి తెల్లవారగానే నిద్రలేచినట్లుగా లేచారు.

ఈ ఔషధుల గాలి సోకగానే మృతులైనవారు, క్షతగాత్రులైన రాక్షసులు కూడా బ్రతికి లేచి కూర్చునేవారే. కానీ రాక్షసులు యుద్ధంలో ఎంతమంది చనిపోయారో ఎవరూ తెలుసుకోకుండా ఉండేందుకు చచ్చిన వాళ్ళనూ, గాయపడ్డవాళ్ళనీ, నిర్దాక్షిణ్యంగా సముద్రంలో పారేయమని రావణుడు ఆజ్ఞాపించాడు. రావణుడు అట్లా ఆజ్ఞాపించకపోయినట్లైతే రాక్షసులుకూడా బ్రతికే వాళ్ళు.

రామలక్ష్మణులు, వానరులు లేచి నిలబడగానే, హనుమంతుడు ఆ ఔషధుల పర్వతాన్ని తిరిగి హిమవత్పర్వతంపై వదలివేసి వెంటనే తిరిగి వచ్చేశాడు.

# 75వ సర్గ వానరులు లంకను ముట్టడించటం

మహాపరాక్రమవంతుడైన వానరరాజు సుగ్రీవుడు, ఇకపై జరగవలసిన యుద్ధాన్ని గురించి రాముడితో చర్చించాడు. తరువాత హనుమంతుడితో ఇలా అన్నాడు. "ఓ హనుమంతుడా! రావణాసురుడి పుత్రులు, సోదరులు యుద్ధంలో మరణించారు. అతడు ఆ దుఃఖంలో నుండి తేరుకొని యుద్ధం చెయ్యలేడు. అందువల్ల ఈ సమయంలో మనం లంకాపట్టణాన్ని ముట్టడించి సద్వినియోగం చేసుకోవాలి. అందువలన మన వానర వీరులంతా దివిటీలతో పోయి లంకా పట్టణాన్ని ముట్టడించాలి." వెంటనే సుగ్రీవుని ఆజ్ఞ మేరకు చీకటిపడగానే దివిటీలు చేత పుచ్చుకొని వానరులందరూ లంక వైపుగా ప్రయాణం చేశారు. దివిటీలతో వానర వీరులు లంకా పట్టణాన్ని నలుమూలల నుండి ముట్టడించడం కావలి ఉన్న రాక్షసవీరులు చూశారు. వాళ్ళంతా భయపడి లంకాపట్టణంలోకి పారిపోయారు. కావలి వాళ్ళ నుండి ప్రతిఘటన తక్కువగా ఉండటంతో వానరవీరులంతా సంతోషించారు. లంకాపట్టణ ద్వారాలకు, బురుజులకు, రాజవీథుల్లో ఉన్న ప్రాసాదాలకు, గృహాలకు, చిన్నచిన్న వీథుల్లో ఉండే ఇళ్ళకు నిప్పు అంటించారు. ఆ విధంగా వానర వీరులంతా వేలాది ఇళ్ళకు నిప్పు అంటించగా, పెనుగాలి వీచి అంతకు నాలుగు రెట్లు గృహాలు దగ్ధమైపోయాయి. పర్వతాల్లాంటి ప్రాసాదాలు క్షణాల్లో కాలిబూడిద అయ్యాయి. పట్టణం అంతా నేలమట్టమై శ్మశానంగా తయారైంది. అయితే ఆయా ఇళ్ళల్లో ఉన్న చందనం, అగరు వంటి సుగంధ ద్రవ్యాలు కూడా కాలిపోవడంతో పట్టణం అంతా సుగంధాలు వ్యాపించాయి. ముత్యాలు, రత్నాలు, పట్టుచీరలు, కంబళ్ళు, బంగారు ఆభరణాలు, రథాలకు, గుర్రాలకు అలంకరించే బంగారు ఆభరణాలు కరిగి వీథుల్లోకి ప్రవహించాయి. యోధులు వాడుకునే కవచాలు, ఖడ్గాలు, ధనుస్సులు, వింటినారి, బాణాలు, తోమరాలు, అంకుశాలు, శక్త్యాయుధాలు, చామరాలు, ఛత్రాలు, పులిచర్మాలు కాలిబూడిద అయిపోయాయి. మద్యం తాగుతున్న వాళ్ళు, మాంసం తింటున్నవాళ్ళు, భార్యలతో పడకటిళ్ళల్లో ఉన్నవాళ్ళు, నిద్రపోయినవాళ్ళు, వృద్ధులు, పిల్లలు, స్త్రీలు అంతా ఆ మంటలకు భయపడి దిక్కులేనివారై

పరుగులు తీశారు. లక్షలాది రాక్షసులు నిలవనీడలేని వారయ్యారు. మంటలు ఆకాశాని కెగప్రాకాయి. ఆ కాలిపోయిన గృహాలన్నీ సాదాసీదా ఇళ్ళు కావు. అందమైనవి; అమూల్యమైనవి; గంభీరమైనవి. అవన్నీ ఆకాశన్నంటే పెద్దపెద్ద సౌధాలే. అవన్నీ అర్ధచంద్రాకారంతోను, పూర్ణచంద్రాకారంతో, చంద్రశాలలతోనూ నిర్మితమైనవి. కిటికీలన్నీ బంగారంతో చేశారు. రత్నాలు మణులు పొదిగారు. పాన్పులు శయ్యలు, ఆసనాలను చిత్ర విచిత్రమైన అలంకారాలతో అలంకరించారు. గృహావరణలన్నీ పెద్ద పెద్ద తోటలు వేసుకున్నారు. ఆ తోటలు ఎప్పుడూ క్రౌంచపక్షులు అరుపుల్తోను, నెమళ్ళ నాట్యంతోను, వీణానాదాలతోను, స్త్రీల ఆభరణాల చప్పుళ్ళతోనూ ఎప్పుడూ సందడిగా ఉంటాయి. అటవంటి గృహాలన్నింటికీ వానరులు నిప్పంటించారు; అన్నీ కాలి బూడిద అయిపోతున్నాయి. ఆ పట్టణం అంతా అట్లా మండిపోతూ ఉంటే వర్షం కురిసేటప్పుడు మెరిసే మెరుపుల్లాగా కనిపించాయి. ఆ మంటలకు ఆ గృహాలన్నీ పగిలిపోతూ, వజ్రాయుధం దెబ్బకు శబ్దాలు చేసే పర్వతాల్లాగా, పెద్ద పెద్ద చప్పుళ్ళయ్యాయి. ఆ విమాన గృహాల్లోని నిద్రిస్తున్న ఉత్తమ స్త్రీలు భయంతో అయ్యో! అయ్యో! అంటూ పరుగులు పెడ్తూ ఉంటే వాళ్ళ శరీరాల మీద ఉండే ఆభరణాలన్నీ జారిపడిపోయాయి. అట్లా మండుతున్న విమాన గృహాలు, ఓషధుల్తో ప్రకాశించే హిమవత్పర్వత శిఖరాల్లా ప్రకాశించాయి; విరగబూసిన మోదుగ చెట్ల వలె కనిపించాయి. ఏనుగులు, గుర్రాలు కాలిపోకుండా వాటి బంధాలన్నింటినీ విప్పేశారు. అప్పుడా జంతువులన్నీ ప్రళయ (కాలంలో) జలాల్లో ఈదులాడే జలజంతువుల్లా కనిపించాయి. ఆ కాళరాత్రిలో ఏనుగులు, గుర్రాలు ఒకదాన్ని చూసి మరొకటి భయపడ్తూ ప్రాణరక్షణకై త్రొక్కిసలాడాయి. మండిపోతున్న ఆ లంకాపట్టణం రక్తంతో పరవళ్ళు తొక్కుతున్న మహాసముద్రంలాగా ఉంది. ఒక్క మాటలో చెప్పాలంటే వానరులు పెట్టిన చిచ్చుతో లంకాపట్టణం అంతా ప్రళయకాలంలో కాలి బూడిద అయ్యే భూమిలాగా ఉంది. పొగలు దట్టంగా కమ్ముకొని ఎవరికీ ఊపిరి ఆడటం లేదు. ఆడవాళ్ళు, పిల్లలు, వృద్ధులు వేసే కేకలు, పెడబొబ్బలు పదియోజనాల దూరానికి వినిపిస్తున్నాయి. ఒళ్ళు కాలిన రాక్షసులంతా ఇళ్ళల్లో నుండి బయటకు పరుగులు తీస్తూ ఉంటే, బయట ఉన్న వానరులంతా వాళ్ళను ఎదిరించారు. అంతా మహాప్రళయం లాగా బీభత్సంగా తయారైంది.

అప్పుడు రామప్రభువు, ధనుస్సు తీసుకొని నారి సంధించి ధనుష్టంకారము చేశాడు. ఆ శబ్దానికి దిక్కులు పిక్కటిల్లాయి. క్రుద్ధుడైన రుద్రదేవుడు వేదమయ ధనుష్టంకారం చేసినట్లుంది. ఆ భయంకర ధ్వనికి రాక్షసులంతా దద్దరిల్లిపోయారు. రాక్షసుల అరుపులు, వానరుల కోలాహలాల ధ్వనులు దశదిశలూ మారుమ్రోగింది. అప్పుడు రాముడు ఒక బాణాన్ని సంధించి విడిచాడు. ఆ బాణానికి కైలాస శిఖరం అంత ఎత్తున్న ఉండే లంకాపుర ద్వారం ముక్కలు ముక్కలుగా విరిగి నేలపై పడింది. అటుపిమ్మట కొన్ని బాణాల్ని లంకా పట్టణం వైపుగా సంధించాడు. విమాన గృహాల్లోను, ఇళ్ళల్లోనూ ఉండే రాక్షసులంతా, ఆ బాణాల్ని చూసి తమను యుద్ధానికి ఆహ్వానిస్తున్నట్లుగా భావించారు. అప్పుడు వాళ్ళందరూ యుద్ధ సన్నద్ధులై సింహనాదాలు చేశారు. ఆ అర్ధరాత్రి సమయాన ప్రళయకాలపు కాళరాత్రిలాగా భయంకరంగా కనిపించింది.

పరాక్రమవంతుడైన సుగ్రీవుడు వానరులందర్నీ రావణుని అంతఃపురం దగ్గరకు పోయి యుద్ధం చెయ్యమని ఆదేశించాడు. ఎవరెవరు ఏయే కీలక స్థానాల్లో నుండి యుద్ధం చెయ్యాలో వివరించి చెప్పాడు. అట్లా స్థానాలు తప్పించి యుద్ధం చేస్తే రాజధిక్కార నేరంగా పరిగణిస్తానని హెచ్చరించాడు. ఆ విధంగా సుగ్రీవాజ్ఞను శిరసావహించి వానరులంతా రావణాసురుని అంతఃపురాన్ని ముట్టడించారు. వాళ్ళంతా కీలక స్థావరాల్లో పొంచి ఉన్నారు. వానరులు అంతఃపురాన్ని ముట్టడించినట్లు గ్రహించిన రావణాసురుడు పడక పై నుండి దిగ్గున లేచి కూర్చున్నాడు. పెద్దగా సింహనాదం చేశాడు. ఆ శబ్దానికి దశదిశలూ కలవరపడ్డాయి. ప్రళయకాల రుద్రుడివలె లేచి నిలబడ్డాడు. కుంభకర్ణుడి పుత్రులైన కుంభుణ్ణి, నికుంభుణ్ణి రాక్షసయోధులతోపోయి వానరుల్ని ఎదిరించమని ఆజ్ఞాపించాడు. అప్పుడా కుంభుడు, నికుంభుడు, యూపాక్షుడు, శోణితాక్షుడు, ప్రజంఘుడు, కంపనుడు రావణుని ఆజ్ఞను శిరసావహించి బయలుదేరారు. అప్పుడా మహావీరులందరినీ రావణుడు, అక్కడి నుండియే సింహనాదాలు చేస్తూ పోయి వానరుల్ని సంహరించమని ఆదేశించాడు.

అప్పుడా రాక్షస వీరులంతా సింహనాదాలు చేస్తూ మహాశక్తిమంతమైన ఆయుధాల్ని ధరించి బయలుదేరారు. అప్పటికే రాత్రి కావటాన చంద్రుడు వెన్నెల, వానరుల దివిటీల కాంతీ, రాక్షసులు ధరించిన ఆభరణాల కాంతి, నక్షత్రాల కాంతీ అన్నీ కలిసిపోయి పట్టపగల్లా కనిపించింది. లంకా పట్టణాన్ని కాల్చివేస్తూ రేగుతున్న మంటలు ఆకాశాన్నంటుతూ ఉంటే, ఆ మంటల సెగలు పాతాళానికి వ్యాపించాయి. ఆ మిశ్రమ కాంతిలో రాక్షససైన్యాలూ, వానర సైన్యాలూ పరస్పరం ఎదుర్కొన్నారు. పతాకాలు, ధ్వజాలు, రథాలు, గుర్రాలు, ఏనుగులు వివిధ మారణాయుధాల్తో రాక్షసులు సంసిద్ధులయ్యారు. వాళ్ళంతా మెరిసిపోయే ఆభరణాలు, పూలమాలలు ధరించారు. వాళ్ళంతా పరాక్రమంతో పౌరుషంతో మహామేఘాల్లాగా సింహనాదాలు చేస్తూ వానర సేనలపై దండెత్తిపోయారు.

అట్లా వస్తున్న రాక్షస సైన్యాన్ని, యుద్ధోత్సాహులైన వానరులంతా వృక్షాల్తోను, పర్వత శిఖరాలతోను, రాక్షసులను ఎదిరించారు. పిడికిళ్ళతో రాక్షసుల్ని గుద్దారు. ఉన్మాదుల్లాగా ఎగిరి గంతులు వేశారు. తమపైకి ఎగురుకుంటూ వస్తున్న వానరులను రాక్షవీరులు తమ ఖడ్గాలతో తలలు నరికేశారు. ఆ మహా పోరాటంలో వానరులు రాళ్ళతో రాక్షసుల కాళ్ళు, చేతులు తలలు చితక్కొట్టారు. కోరలతో రాక్షసుల చెవులు కొరికేశారు. వాడి అయిన గోళ్ళతో రాక్షసుల దేహం అంతా రక్కారు. ఆ పోరాటంలో ఒక రాక్షసుడు ఓ వానరుణ్ణి చంపగా, ఇంకో వానరుడు వేగంగా వచ్చి ఆ చంపిన రాక్షసుణ్ణి చంపుతున్నాడు. ఒకడు ఒకడిని పడత్రోస్తే, ఆ పడతోసినవాణ్ణి ఇంకొకడు వచ్చి పడతోస్తున్నాడు. ఒకణ్ణి ఒకడు తిడ్తూ ఉంటే ఇంకొకడు ఆ తిట్టినవాణ్ణి తిడుతున్నారు. ఈ విధంగా అక్కడ యోధులు పరస్పరం ఒకరిని ఒకరు చంపుకొంటూ, పీక్కుంటూ, రక్కుకొంటూ పోరాటం సాగించారు.

రాక్షసుల తల వెంట్రుకల ముడులన్నీ విడిపోయాయి, కట్టుకున్న వస్త్రాలు జారిపోయాయి. కవచాలు విరిగిపోయాయి. ధ్వజాలు, పతాకాలు ముక్కలు ముక్కలయ్యాయి. వానరులు రాక్షసవీరుల్ని అన్ని వైపుల నుండి ఎదుర్కొన్నారు.

# 76వ సర్గ రాక్షసయోధుల మరణం

భయంకరమైన ఆ యుద్ధంలో అనేకమంది వీరులు మరణించారు. అప్పుడు అంగదుడు అమితమైన ఉత్సాహంతో కంపనుడి పైకి యుద్ధానికి తలపడ్డాడు. కంపనుడు తన పైకి వస్తున్న అంగదుణ్ణి గదతో గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బకు అంగదుడు కొద్దిసేపు అచేతనుడయ్యాడు. మళ్ళీ కొద్దిసేపట్లో తేరుకున్న అంగదుడు ఒక పెద్ద పర్వత శిఖరాన్ని ఎత్తి కంపనుడి నెత్తి మీద పడేశాడు. ఆ దెబ్బకు కంపనుడు తలపగిలి నెత్తురు కారుతూ నేలపై పడి మరణించాడు. కంపనుడు అంగదుడి చేతుల్లో మరణించటం చూసిన శోణితాక్షుడు అంగదుడితో యుద్ధానికి తలపడ్డాడు. శోణితాక్షుడు తన రథంపై నుండే వాడి అయిన బాణాల్ని అంగదుడిపై వదిలాడు. మంగలి కత్తి వంటి బాణాల్ని, అర్ధచంద్రాకారపు బాణాల్ని, ఇనప బాణాల్ని, దూడపళ్ళ వంటి బాణాల్ని, కంకపక్షి రెక్కలు కట్టిన బాణాల్ని, రెండు ప్రక్కలా చెవులున్న బాణాల్ని, అర్ధనారాచబాణాల్ని, గన్నేరు ఆకుల వంటి బాణాల్ని, శోణితాక్షుడు, వాలి పుత్రుడైన అంగదుడిపైన సంధించాడు. అప్పుడు అంగదుడు అమాంతం గాలిలోకి ఎగిరి రథంపైకి దూకి శోణితాక్షుడి చేతిలో నుండి ధనుస్సు బాణాల్ని ఊడపెరుక్కుని విరిచేశాడు. అంతట రథాన్ని విరగ్గొట్టాడు. అప్పుడు శోణితాక్షుడు కత్తి డాలు తీసుకొని ఆకాశంలోకి ఎగిరిపోయాడు. అంగదుడు కూడా అంతే వేగంతో ఆకాశంలోకి ఎగిరి శోణితాక్షుడి చేతిలోని కత్తి డాలు లాక్కుని ఆ కత్తితోనే శోణితాక్షుడి భుజం దగ్గర నుండి యజ్ఞోపవీతం లాగా గుండెల్ని చీరేశాడు. అంతట అంగదుడు విడవకుండా సింహనాదాలు చేశాడు. శోణితాక్షుడు ఇనుప గుదియ తీసుకొని అంగదుడిపైకి దూకాడు. అదే సమయంలో మహాపరాక్రమవంతుడైన యూపాక్షుడు, ప్రజంఘుడుతో కలసి రథంపై వచ్చి అంగదుణ్ణి ముట్టడించారు. అంగదుడు అనుకోకుండా శోణితాక్ష, ప్రజంఘుల మధ్య ఇరుక్కుపోయాడు. వాళ్ళందరి మధ్యనా ఉన్న అంగదుడు, విశాఖా నక్షత్రాల మధ్యన ఉండే పూర్ణచంద్రుడి వలె ప్రకాశించాడు. ఆ పోరాటంలో అంగదుడికి బాసటగా మైందుడు, ద్వివిదుడు వచ్చి ఆ రాక్షసు లిద్దరి ఎదుటా నిలబడ్డారు. రాక్షస వీరులు

ఖడ్గము, డాలు, గదలు ధరించి మహాపరాక్రమాలతో ఆ వానర వీరుల్ని ఎదిరించారు. ఒక ప్రక్క అంగద, మైంద, ద్వివిదులూ, రెండో ప్రక్క శోణితాక్ష, యూపాక్ష, ప్రజంఘులు ఒళ్ళు గగుర్పొడిచే విధంగా పోరాడారు. వానర వీరులు వృక్షాలు, శిలల్ని ప్రజంఘుడిపై విసిరారు. ప్రజంఘుడు వాటిని తన ఖడ్గంతో అడ్డుకొని నరికేశాడు. శోణితాక్షుడు గదతోను, యూపాక్షుడు బాణాలతోను రథాన్ని, గుర్రాన్ని వానరుల దాడి నుండి కాపాడుకొస్తున్నారు. అప్పుడు ప్రజంఘుడు తన ఖడ్గంతో అంగదుడి మర్మస్థానాలన్నీ తెగ్గొట్టాలని అంగదుడిపైకి లంఘించాడు. అప్పుడు అంగదుడు ఇనుమద్ది వృక్షాన్ని పెళ్ళగించి ఆ ప్రజంఘుణ్ణి కొట్టాడు. అంతట అతడి భుజంపై ఒక్క గుద్దు బలంగా గుద్దాడు. దాంతో ప్రజంఘుడి చేతిలో ఉన్న కత్తి జారి నేలపై పడింది. అంతట కుపితుడైన ప్రజంఘుడు తిరిగి అంగదుణ్ణి ఒక గుద్దు గుద్దాడు. ఆ దెబ్బకు అంగదుడికి దిమ్మతిరిగిపోయి కొద్ది క్షణాలు మూర్ఛపోయాడు. కొద్దిసేపటికల్లా వాలి పుత్రుడైన అంగదుడు తేరుకున్నాడు. నేలపై పడి ఉన్న ప్రజంఘుడి ఖడ్గాన్ని చేతిలోకి తీసుకొని ప్రజంఘుడి శిరస్సు నరికేశాడు.

తన పినతండ్రి అయిన ప్రజంఘుడు అంగదుడి చేతిలో తన కళ్ళ ముందే మరణించటాన్ని యూపాక్షుడు జీర్ణించుకోలేకపోయాడు. బాణ ప్రయోగంతో అంగదుణ్ణి చంపాలనుకున్నాడు. కానీ బాణాలన్నీ అయిపోయాయి. ఇక చేసేదేమీ లేక, ఖడ్గాన్ని తీసుకొని, రథం దిగి అంగదుడి మీదకు లంఘించాడు. అట్లా వస్తున్న యూపాక్షుణ్ణి ద్వివిదుడు చూశాడు. కృద్ధుడైపోయాడు. ఎగిరి యూపాక్షుడి ముందు నిలబడి ఎదురు రొమ్ముల మీద బలంగా గుద్దాడు. తమ్ముడు ద్వివిదుడి చేతిలో చిక్కుకోవడం చూసి, శోణితాక్షుడు గద తీసుకొని ద్వివిదుడిపైకి లంఘించాడు. శోణితాక్షుడు ద్వివిదుణ్ణి గదతో గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బకు ద్వివిదుడు కళ్ళు చెదిరినట్లయింది. అదే సరి అయిన సమయం అని తలచిన శోణితాక్షుడు ద్వివిదుణ్ణి కొట్టడానికి మళ్ళీ గద ఎత్తాడు. అప్పటికే తేరుకున్న ద్వివిదుడు శోణితాక్షుడి చేతిలో నుండి గదను ఊడపెరుక్కున్నాడు.

ఇంతలో వానర యూధపతి మైందుడు వచ్చి అరచేత్తో యూపాక్షుడి ఎదురు రొమ్ములపై

పిడికిలితో గుద్దాడు. క్షోణితాక్షుడు యూపాక్షుడు, మైంద ద్వివిదులతో పోరాడసాగారు. క్షోణితాక్షుడి ముఖమంతా ద్వివిదుడు గోళ్ళతో రక్కి నేలపై పడేసి కాళ్ళతో తొక్కాడు. మైందుడు యూపాక్షుణ్ణి చేతులతోనే కొట్టి చంపాడు. ఈ విధంగా చేస్తున్న యుద్ధంలో రాక్షసయోధులు, సైన్యం కూడా చాలా భాగం నశించింది. చావగా మిగిలిన రాక్షసులు భయంతో కుంభకర్ణుడి కుమారుడైన కుంభుడి దగ్గరకు పోయి మొరపెట్టుకున్నారు. కుంభుడు వాళ్ళకు ధైర్యం చెప్పి, ధనుస్సు తీసుకొని వారి వెంట వెళ్ళాడు. వాడి అయినవి, విష సర్పాల్లాంటి బాణాల్ని, అనేక మారణాయుధాల్ని రథం నిండా నింపుకున్నాడు. ఇంద్రధనుస్సు లాంటి ధనుస్సును ధరించాడు. వింటిని చెవుల దాకా లాగి పెద్దగా ధనుష్టంకారం చేశాడు. పిమ్మట బాణాల్ని సంధించి ద్వివిదుడి మీదకు వదిలాడు. ఆ బాణాలు సూటిగా పోయి ద్వివిదుడి పాదాలను తాకి పాదాలన్నీ నెత్తురుతో తడిసిముద్దయి తూలిపడిపోయాడు. అక్కడే ఉన్న మైందుడు ఒక పెద్ద బండరాయిని తీసి కుంభుడి పైకి విసిరాడు. కుంభుడు ఆ రాయిని తన బాణాలతో ముక్కలు ముక్కలుగా చేశాడు. అంతట మరొక విష సర్పం లాంటి బాణాన్ని సంధించి మైందుడి మర్మస్థానాలకు తగిలేట్లుగా వదిలాడు. అప్పుడు మైందుడు కూడా మూర్ఛపోయి నేలమీద పడ్డాడు. ఆ విధంగా కుంభుడు, మైందుణ్ణి ద్వివిదుణ్ణి కొట్టడం చూసిన అంగదుడు పరుగు పరుగున వచ్చి కుంభుణ్ణి ఎదుర్కొన్నాడు. అప్పుడు కుంభుడు అయిదు ఇనుప బాణాల్ని అంగదుడిపైకి వదిలాడు. దాంతో తృప్తి చెందక మరో మూడు కరుకు బాణాల్ని, బంగారంతో అలంకరించిన ఇనుప బాణాల్ని అంగదుడిపై వదిలాడు. అంగదుడు వాటిని తట్టుకుంటూనే కుంభుడిపైన రాళ్ళ వర్షం కురిపించాడు. ఆ పిమ్మట చెట్లను బలంగా విసిరాడు. అంగదుడు విసిరేసిన రాళ్ళను, చెట్లను కుంభుడు బాణాల్తో ఎదుర్కొన్నాడు. అంతట కుంభుడు, ఏనుగుల్ని కొరవులు చూపిస్తూ దారి కనిపించకుండా చేసేట్లుగా, అంగదుడి కనుబొమ్మల్ని గురిచూసి బాణాలు వదిలాడు. నెత్తురు కారుతూ ఉండటం వల్ల అంగదుడు కళ్ళ తెరువలేకపోయాడు. అయినా అంగదుడు, ఒక చేత్తో కళ్ళు తుడుచుకుంటూనే, రెండవ చేత్తో ఒక సాలవృక్షాన్ని రొమ్ముల దగ్గర పెట్టి గట్టిగా పట్టుకొని పెళ్ళగించాడు. ఇంద్ర ధ్వజం వంటి ఆ సాలవృక్షాన్ని కుంభుడి పైకి విసిరేశాడు. అదే సమయాన దేహాన్ని ఛేదించుకుపోయే ఏడు బాణాల్ని అంగదుడి మీద వేశాడు. ఆ బాణాలు సూటిగా తగిలి

అంగదుడు మూర్ఛపోయి నేల మీద పడిపోయాడు. అంగదుడు ఆ విధంగా, నీళ్ళల్లో పడ్డ వాడికి మల్లే విలవిలా కొట్టుకుంటూ ఉంటే, వానరులంతా పరుగు పరుగున పోయి రాముడితో చెప్పారు.

రాముడు జాంబవంతుణ్ణి పిలిచి, అంగదుణ్ణి కాపాడుతూ కుంభుడితో యుద్ధం చెయ్యమని పంపాడు. రామాజ్ఞను శిరసావహించి జాంబవంతుడు మహాయోధులైన వానర వీరులైన సుషేణుణ్ణీ, వేగదర్శినీ తీసుకొని కుంభుడి మీద దాడిచేశారు. ధనుర్విద్యలో గొప్ప నేర్పరి అయిన కుంభుడు ఆ ముగ్గురు వానరయోధుల్ని తన బాణాలతో అడ్డగించాడు. సముద్రం చెలియలికట్టను దాట లేకపోయినట్లు, వాళ్ళు కుంభుని సమీపించలేకపోయారు. కుంభుడి పరాక్రమం ముందు వానర వీరు లెవ్వరూ నిలవలేకపోవటం సుగ్రీవుడు చూశాడు. మదపుటేనుగు పైకి అమిత వేగంతో దూకే సింహంలాగా, కుంభుడిపైకి సుగ్రీవుడు దూకాడు. పెద్ద పెద్ద రాళ్ళను కుంభుడి మీదకు విసిరేశాడు. పెద్ద పెద్ద ఇనుమద్ది, చంద్రవృక్షాల్ని పెళ్ళగించి కుంభుడిపైకి విసిరాడు. సుగ్రీవుడు విసిరేసే వృక్షాలు, రాళ్ళు ఆకాశాన్ని కప్పేశాయి. కుంభుడు వాటన్నింటినీ తన బాణాల్తో ఛేదించాడు. అయినా సుగ్రీవుడు వ్యధ చెందలేదు. తనకైన గాయాల్ని లెక్కచెయ్యలేదు. వెంటనే వ్యూహాన్ని మార్చేశాడు. మెరుపులాగా ఆకాశంలోకి ఎగిరి కుంభుడి రథంపైకి దూకాడు. అతడి చేతిలో ఉన్న ధనుస్సును లాక్కుని విరిచేశాడు. ధనుస్సు విరిచేయడంతో, కుంభుడు, దంతాలు పీకేసిన ఏనుగులాగా అయిపోయాడు. అప్పుడు సుగ్రీవుడు ఇలా అన్నాడు:

సుగ్రీవుడు: “ఓరీ కుంభుడా! నీ పరాక్రమం మెచ్చుకోదగ్గది. నీ విలువిద్యా నైపుణ్యం అద్భుతం. నీవు రావణాసురుడంతటి ప్రభావం కలవాడివి. నీ తండ్రికి పుట్టిన బిడ్డలందరిలోనూ నీ వొక్కడివే అమిత ప్రతిభాశాలివి. నీవు నిజంగా ప్రహ్లాదుడు, బలిచక్రవర్తి, కుబేరుడు, వరుణుడు మొదలైన వాళ్ళతో పోల్చతగ్గవాడవు.

ఓ కుంభుడా! నీ పెత్తండ్రి రావణాసురుడు దేవతలను మెప్పించి అనేక వరాలు

పొందాడు. నీ తండ్రి కుంభకర్ణుడు కేవలం తన పరాక్రమం చేతనే దేవదానవులందర్నీ జయించాడు. ధనుర్విద్యలో నీవు ఇంద్రజిత్తు అంతటి వాడవు. పరాక్రమంలో నీ పెత్తండ్రితో సమానుడవు. బల పరాక్రమాల్లోగాని, ధైర్యసాహసాల్లోగాని నీకు నువ్వే సాటి. నీ అస్త్రవిద్యానైపుణ్యం ప్రశంసించ దగ్గది. మహాబలశాలుడైన వానర వీరులందరినీ జయించావు. ఈ యుద్ధం వలన నీ పరాక్రమాన్ని స్వయంగా చూడగలిగాను.

ఓ కుంభుడా! నీవు బాగా అలసిపోయి ఉన్నావు. మహా వీరులైన వానరులందరితోనూ యుద్ధం చేశావు. కొంతసేపు విశ్రాంతి తీసుకో. లేకపోతే, అలసిపోయి ఉన్నవాడిని చంపాడనే అపఖ్యాతి నాకు వస్తుంది. నీవు విశ్రాంతి తీసుకున్న తర్వాత మనిద్దరం పోరాడుదాం. సూర్యచంద్రులు, సమస్త భూతాలు చూస్తూ ఉండగా, దేవేంద్రుడు శంబరాసురుణ్ణి చంపినట్లు, నేను నిన్ను చంపేస్తాను.

సుగ్రీవుడి ఓదార్పు మాటలు, ప్రశంసలు కుంభుడికి విపరీతమైన కోపాన్ని తెప్పించాయి. నోటితో మాట్లాడుతూ నొసటితో వెక్కిరిస్తున్నట్లుగా అనిపించింది. అగ్నిహోత్రంలో నెయ్యిహోమం చేసినట్లుగా భగ్గున మండిపోయాడు. అక్కడికక్కడే సుగ్రీవుడి మెడ పట్టుకొని గుంజాడు. సుగ్రీవుడు కూడా కుంభుడి మెడ పట్టుకున్నాడు. వాళ్ళిద్దరూ, రెండు మదపు టేనుగుల్లాగా ఢీకొన్నారు. నిట్టూర్పులు విడిచారు. నోటిలో నుండి సెగలతోపాటు పొగలు కూడా వెలువడ్డాయి. ఎవరికి ఎవరూ జయానికి సందు ఇవ్వకుండా చాలాసేపు పోరాడారు. వాళ్ళ వాళ్ళ పాదాల తొక్కిడికి నేల కంపించింది. సముద్రజలాలు అల్లకల్లోలం అయ్యాయి. కుంభుడికి పాతాళం చూపాలని అనుకున్నాడేమో? అమాంతం ఎత్తి గిరగిరాతిప్పి సముద్రంలోకి విసిరేశాడు. అప్పుడు సముద్ర జలాలు వింధ్య పర్వతం ఎత్తున లేచాయి. కుంభుడు ఆ సముద్రజలాల్లో నుండి ఎగిరి బయటకు వచ్చాడు. పిడికిలి బిగించి సుగ్రీవుడి ఎదురు రొమ్ములపై గుద్దాడు. దాంతో సుగ్రీవుడికి వజ్రాయుధంతో కొట్టినట్లుగా ఎదురు రొమ్ములు పగిలి నెత్తురు కారగా ఆ నెత్తురు వజ్రాయుధం తాకిడికి మేరు పర్వతంపై మండిన మంటల్లాగా కనిపించాయి.

కుంభుడు కొట్టిన దెబ్బకు వానర రాజు సుగ్రీవుడు కుపితుడయిపోయాడు. పిడికిలి బిగించాడు. అప్పుడా పిడికిలి సహస్ర కిరణాలతో తేజరిల్లే సూర్యుడిలాగా ఉంది. వజ్రాయుధం వలె ఉన్న పిడికిలితో గట్టిగా కుంభుడి వక్షఃస్థలంపై గట్టిగా గుద్దాడు. ఆ దెబ్బకు కుంభుడి ఎదురు రొమ్ముల్లో ఉన్న ఎముకలన్నీ ముక్కలైపోయాయి. ఆ దెబ్బకు తట్టుకోలేక కుంభుడు ఆరిపోయిన అగ్నిహోత్రంలాగా అయిపోయాడు. అంగారక గ్రహం నేల మీద పడిపోయినట్లు కుంభుడు పడిపోయాడు. రుద్రునిచే కొట్టబడిన సూర్యునివలె ప్రకాశించాడు. కుంభుడి మరణం రాక్షసుల్లో దుఃఖాన్నే మిగిల్చింది. భూమి కంపించి, అరణ్యాలు, పర్వతాలు వణికాయి.

# 77వ సర్గ హనుమంతుడు నికుంభుని చంపటం

నికుంభుడు తన సోదరుడైన కుంభుని సుగ్రీవుడు చంపాడని విని తట్టుకోలేకపోయాడు. సుగ్రీవుణ్ణి కాల్చేద్దామా? అన్నంత కోపం వచ్చింది. మహేంద్ర పర్వతం వంటి పరిఘను తీసుకొన్నాడు. ఆ పరిఘ అనేక యుద్ధాల్లో రాక్షసులకు జయాన్ని సంపాదించి పెట్టింది. హిమాలయ శిఖరం వంటి ఆ పరిఘాయుధాన్ని బంగారుకట్లతో తాపడం చేశారు. వజ్రాలు, పగడాలు పొదిగారు. పట్టుకునేందుకు అనువుగా అయిదువేళ్ళ ముద్రలుంటాయి. ఇంద్రధ్వజం వంటి ఆ పరిఘాయుధానికి పూలదండలతో అలంకారాలు చేశారు. భయంకరుడు, పరాక్రమవంతుడు అయిన నికుంభుడు ఆ పరిఘాయుధాన్ని పట్టుకొని గిరగిరా త్రిప్పుతూ పెద్దనోరు తెరచి సింహనాదం చేశాడు. నికుంభుడు వక్షఃస్థలాన్ని కాపాడుకుంటూ ధగధగ మెరిసే కవచాన్ని ధరించాడు. మెరిసిపోయే బంగారుబాహువులు ధరించాడు. మెడలో పూలదండలున్నాయి. చేతిలో పరిఘాయుధాన్ని ధరించిన ఆ నికుంభుడు ఆకాశంలో ఇంద్ర ధనుస్సుతోను, మెరుపులతోను, ఉరుముతున్న మహామేఘంలాగా కనిపించాడు.

నికుంభుడు గిరగిరా త్రిప్పుతున్న పరిఘాయుధం కొనల నుండి ఏడు వాయువుల గ్రంథులు బ్రద్దలైపోయాయి. ఆ పరిఘాయుధం పొగలేని నిప్పుగా ప్రజ్వరిల్లింది. పరిఘాయుధం నుండి వీచిన గాలికి లంకా పట్టణంతోను, గంధర్వనగరాలతోను, గ్రహనక్షత్రాలతోను, చంద్రుడితోను, మహా గ్రహాలతోను ఆకాశం అంతా తిరిగిపోతూ ఉన్నట్లనిపించింది. క్రోధం అనే కట్టెలు గల నికుంభుడనే అగ్ని విజృంభించడంతో ఎవరూ ఎదురు నిలువలేకపోయారు. ప్రళయకాలాగ్ని హోత్రుడిలాగా తేజరిల్లుతున్న నికుంభుణ్ణి చూసి వానరసైన్యం అంతా భయభ్రాంతులయ్యారు.

ఆ సమయంలో మహాబలవంతుడైన హనుమంతుడు రొమ్ముచరిచి, తొడకొట్టి నికుంభుడికి సవాలు విసిరాడు. నికుంభుడు సూర్యప్రభలాగా వెలిగిపోతున్న ఇనుప గుదియను

తీసి హనుమంతుడి వక్షఃస్థలంపై కొట్టాడు. ఆ గుదియ హనుమంతుణ్ణి తాకగానే ఆ పరిఘాయుధం ముక్కలుముక్కలై పోయింది. ఆ ముక్కలన్నీ ఆకాశంలో కెగిరి కొరువుల్లా కనిపించాయి. అయితే ఆ పరిఘ వక్షః స్థలానికి తాకగానే హనుమంతుడు భూకంపానికి ఒణికిన పర్వతంలాగా ఒక్కక్షణం ఒణికిపోయాడు. మరుక్షణంలోనే తేరుకొని హనుమంతుడు పిడికిలి బిగించాడు. దానికి వాయువేగాన్ని, వాయు పరాక్రమాన్ని జోడించి నికుంభుడి వక్షఃస్థలంపై గుద్దాడు. ఆ దెబ్బకు నికుంభుడు ధరించిన కవచం విరిగింది; చర్మం చిట్లిపోయింది; కారుతున్న రక్తం మంటల్లాగా కనిపించింది. నికుంభుడు ఆ దెబ్బకు తూలిపోయాడు. వెంటనే తట్టుకుని నిలబడ్డాడు. హనుమంతుణ్ణి రెండు చేతుల్తోనూ గట్టిగా బంధించి నికుంభుడు పెద్దగా సింహనాదం చేశాడు. 'ఇంకేముంది, హనుమంతుడి పని అయిపోయిం' దని రాక్షసులంతా సంతోషించారు. సింహనాదాలు చేశారు. ఈ రాక్షసుడు తనను రెండు చేతుల్తో పైకెత్తి మోసుకుపోతున్నాడని హనుమంతుడు గ్రహించాడు. అప్పుడు హనుమంతుడు వజ్రాయుధం వంటి తన పిడికిలి బిగించి ఒక్కపోటు పొడిచాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక నికుంభుడు హనుమంతుణ్ణి ఒదిలేశాడు. హనుమంతుడు చివాలున్న బంతిలాగా లేచి నిలబడి మళ్ళీ నికుంభుణ్ణి పిడికిళ్ళతో కొట్టాడు. వీర్యవంతుడైన హనుమంతుడు నికుంభుణ్ణి నేలమీద పడేసి కాళ్ళతో తొక్కాడు. అంతట హనుమంతుడు చివాలున పైకి ఎగిరి నికుంభుడి వక్షఃస్థలంపైకి దూకి, రెండు చేతుల్తో నికుంభుడి కంఠం పట్టుకొని మెడ విరగదీశేశాడు. నికుంభుడు భయంకరంగా అరుస్తూ ప్రాణం వదిలాడు. నికుంభుడి ప్రాణం పోగానే వానరయోధులంతా దిక్కులు పిక్కటిల్లేట్లు సింహనాదాలు చేశారు.

# 78వ సర్గ మకరాక్షునితో యుద్ధం

కుంభుడు, నికుంభుడూ యుద్ధంలో మరణించారని విన్న రావణాసురుడు అగ్గిమీద గుగ్గిలం వేసినట్లు మండిపడ్డాడు. ఒక ప్రక్క దుఃఖంతోను, మరో ప్రక్క రోషంతోను కాలుకాలిన పిల్లిలాగా అటూ ఇటూ పచార్లు చేశాడు. ఖరుడి పుత్రుడైన మకరాసురుణ్ణి పిలిపించి "కుమారా! నీవు వెంటనే సైన్యంతో బయలుదేరి యుద్ధానికి వెళ్ళు. ఆ రామలక్ష్మణుల్ని, వానరుల్ని చంపెయ్యి. నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. ఏ సంకోచమూ పెట్టుకోకుండా వాళ్ళను చంపెయ్యి" అని ప్రోత్సాహపరచాడు. అంతట ఆ మకరాక్షుడు దశకంఠునికి ప్రదక్షిణ పూర్వకంగా నమస్కరించి రాజభవనం నుండి బయటకు వచ్చాడు.

వెంటనే మకరాక్షుడు సేనాధిపతిని కలసి తనకు వెంటనే రథాన్ని, సైన్యాన్ని ఏర్పాటు చెయ్యమని చెప్పాడు. సేనాపతి క్షణాల్లో మంచి రథాన్ని, సైన్యాన్ని సిద్ధం చేశాడు. అప్పుడు మకరాక్షుడు ఆ రథానికి ప్రదక్షిణం చేసి, రాక్షసయోధులందరితో ఇలా అన్నాడు. "ఓ రాక్షసయోధుల్లారా! మీరందరూ నాతో కలసి ధైర్యసాహసాలతో యుద్ధం చెయ్యాలి. ఆ రామలక్ష్మణుల్ని చంపెయ్యాలి. ఆ విధంగా మనం అంతా కలసి మన ప్రభువైన రావణాసురునికి సంతోషాన్ని కలిగించాలి.

ఓ నిశాచరులారా! నేను సుగ్రీవుణ్ణి, రామలక్ష్మణుల్ని, వానరసైన్యాన్ని నా బాణాల చేత సంహరిస్తాను. నా ధాటికి తట్టుకోలేక వాళ్ళంతా ఎండుకట్టెల్ని అగ్నిహోత్రుడు దహించినట్లు, కాలి బూడిదయిపోతారు. మీరంతా వానర సేనల్ని చీల్చి చెండాడండి." అని చెప్పి, రథాన్నెక్కి వెంటనే యుద్ధభూమికి బయలుదేరాడు. బలవంతుడైన మకరాక్షుడి ఆదేశాల ప్రకారం రాక్షసయోధులందరూ రకరకాలైన ఆయుధాల్ని ధరించి, ఆ రథం వెనుకే బయలుదేరారు. రాక్షసవీరులందరూ మహాకాయులే! తేనె రంగు కళ్ళతో, వాడి అయిన కోరలతో, తలలు విరబోసుకుని మదపుటేనుగుల్లాగా సింహనాదాలు చేస్తూ బయలుదేరారు. అట్లా పోతూ

ఉండగా, మకరాక్షుడి రథసారథి చేతిలో నుండి కొరడా జారి నేలపై పడిపోయింది. రథ ధ్వజం ఉన్నట్లుండి నేలకూలింది. గుర్రాల వేగం తగ్గిపోయింది; కాళ్ళు తడబడ్డాయి. గాలి దుమారం లేచింది. కానీ రాక్షస వీరులెవరూ ఈ శకునాల్ని గూర్చి ఆలోచించనయినా ఆలోచించలేదు. వాళ్ళంతా మకారాక్షుడి రథాన్ని అనుసరించి యుద్ధభూమికి తరలిపోయారు. ఈ యోధులంతా యుద్ధాల్లో బాగా ఆరితేరినవాళ్ళే. వాళ్ళు ఇంతకు పూర్వం ఎన్నో యుద్ధాల్లో గదల దెబ్బలు, ఖడ్గాల దెబ్బలు, బాణాల దెబ్బలు తిన్నవారే. తమ గొప్పతనాలు, శౌర్య పరాక్రమాన్ని గూర్చి పరస్పరం చెప్పుకుంటూ, సింహనాదాలు చేస్తూ యుద్ధభూమికి చేరుకున్నారు.

# 79వ సర్గ రాముడు మకరాక్షుణ్ణి చంపడం

మకరాక్షుడి నాయకత్వంలో యుద్ధం చేయటానికి రాక్షస సైన్యం అంతా అతడి రథం వెనకాలే బయలుదేరి వచ్చారు. వాళ్ళందరూ శూలాలు, శక్తి ఆయుధాలు, గదలు, తోమరాలు, పట్టిసాలు, భిందిపాలములు మొదలైన ఆయుధాలు ధరించి వచ్చారు. అట్లా యుద్ధోత్సాహంతో ఎగురుకుంటూ గంతులు వేస్తూ సింహనాదాలు చేస్తూ వస్తున్న రాక్షస సేనల్ని వానరులంతా చూశారు. వాళ్ళంతా శిలలతోను, వృక్షాలతోను యుద్ధానికి సన్నద్ధులయ్యారు. వెంటనే ఒకళ్ళ నొకళ్ళు చంపాలనే సమరోత్సాహంతో కలియబడ్డారు. మకరాక్షుడు వానర సైన్యాలపై బాణాల వర్షం కురిపించాడు. ఆ యుద్ధంలో వానరులకే దెబ్బలు ఎక్కువగా తగిలాయి. వానరులు భయపడి పారిపోయారు. అట్లా వానరులు పరుగులు పెట్టడంతో, రాక్షసయోధులు తామే జయించామని సంతోషంతో సింహగర్జనలు చేశారు.

అట్లా పరుగులు పెట్టుకుంటూ వస్తున్న వానర వీరుల్ని రాముడు చూశాడు. రాక్షసులను ముందుకు సాగి రాకుండా ఉండేందుకు రాక్షసులందరిపైనా బాణాలతో వర్షం కురిపించాడు. దాంతో రాక్షసుల వేగం నశించింది. రాముడు రాక్షస సేనల్ని అడ్డగించినందుకు మకరాక్షుడికి బాగా కోపం వచ్చింది. రాముడితో ఇలా అన్నాడు. “ఓ రామా! నువ్వు! దండకారణ్యంలో నా తండ్రిని చంపినప్పటి నుండి నీతో యుద్ధం చేసి నీ ప్రాణాలు తియ్యాలని కాచుకొని ఉన్నాను. ఆ మహారణ్యంలో అప్పుడు కనిపించకుండా తప్పించుకున్నావు. ఇప్పుడు దైవానుగ్రం చేత ఎదుట పడ్డావు. కాచుకో. నీ ప్రాణాలు తీస్తాను. ఆకలితో బాధపడే సింహం మృగం కోసం కనిపెట్టుకొని ఉన్నట్లు, నేను నీ కోసం కనిపెట్టు కొని ఉన్నాను. వాడి అయిన బాణాల్ని ప్రయోగించి ఇప్పుడే నిన్ను యమలోకానికి పంపుతాను. ఓ రామా! నాతో ఏ విధంగా యుద్ధం చెయ్యదలచుకున్నావో నువ్వే చెప్పు. అదే అస్త్రాలతో యుద్ధం చేద్దామా? లేక గదాయుద్ధం చేద్దామా? లేక ద్వంద్వ యుద్ధం చేద్దామా? నువ్వు ఏ విద్యలో ప్రావీణ్యం సంపాదించావో ఆ విధానంలోనే యుద్ధం చేద్దాం. ముల్లోకాలవాళ్ళూ మన యుద్ధం చూసి ఆశ్చర్యపోవాలి; మూడు కాలాల వాళ్ళూ

గుర్తుంచుకోవాలి. ఇక యుద్ధానికి రా!'' అన్నాడు.

అప్పుడు రాముడు "ఓరీ పాపీ! వాచాలుడా! వృథా ప్రేలాపనలు చెయ్యకు. యుద్ధంలో నేర్పు ఉన్న వాడెవ్వడూ ఇన్ని మాటలు మాట్లాడి సమయాన్ని వృథా చెయ్యడు. ఇప్పుడే నిన్ను చంపి నీ మాంసాన్ని కాకులకు, గద్దలకు వేస్తాను. నక్కలు నీ మాంసంతో విందు చేసుకుంటాయి'' అని అన్నాడు. అప్పుడు మకరాక్షుడు రాముడిపైన బాణాల వర్షం కురిపించాడు. రాముడు ఆ బాణాలన్నింటినీ సమర్థంగా ఎదుర్కొని ముక్కలు చేశాడు. ఆ మహాయుద్ధంలో ఇద్దరూ భయంకరంగా పోరాడారు. వాళ్ళు చేస్తున్న ధనుష్టంకారాలు ఆకాశంలో ఉరుములు ఉరిమినట్లయింది. ఆ అద్భుత పోరాటాన్ని చూసేందుకు దేవదానవ గంధర్వ మహోరగులంతా ఆకాశంలో బారులు తీరి నిలబడ్డారు. ఆ యుద్ధంలో ఒకరికి ఒక గాయం అయితే, రెండవవారు శత్రువుకు రెండు గాయాలయ్యేట్లుగా యుద్ధం చేశారు. మకరాక్షుడు వదలిన బాణాల్ని రాముడు ముక్కలు చేస్తే, రాముడి వదిలిన బాణాల్ని మకరాక్షుడు ముక్కలు చేశాడు. ఆ విధంగా ముక్కలైపోయిన బాణాలు గుట్టలుగుట్టలుగా పేరుకుపోయాయి.

అంతట మహాబాహువైన రాముడికి బాగా కోపం వచ్చింది. ఇంకా ఎక్కువసేపు వీడిని ఉపేక్షించకూడదని అనుకున్నాడు. వెంటనే మకరాక్షుడి ధనుస్సును రెండుగా విరగ్గొట్టాడు. ఇంకో ఎనిమిది బాణాలు వేసి రథసారథిని చంపాడు. ఆ తర్వాత కొన్ని బాణాలతో రథానికి పూన్చిన గుర్రాల్ని నేలకూల్చాడు. రథం కూలిపోగానే మకరాక్షుడు నేలపైకి దూకి ఒక శూలాన్ని పట్టుకొని రాముడి మీదకు విసిరేశాడు. అగ్నిజ్వాల వలె ఆకాశంలో దూసుకొని వస్తున్న ఆ శూలాన్ని, రాముడు బాణాలతో మధ్యలోనే ముక్కలు చేశాడు. ఆ ముక్కలన్నీ ఆకాశం పై నుండి ఉల్కలు పడ్డట్టు పడ్డాయి. యుద్ధం చూస్తున్న దేవదానవులంతా భలే, భలే అని మెచ్చుకున్నారు. ఆ అవమానాన్ని జీర్ణించుకోలేని మకరాక్షుడు 'నిలు, నిలు' అంటూ కేకలు పెట్టాడు. అప్పుడు రాముడు నవ్వుతూ వాడిపై ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రం సూటిగా మకరాక్షుడి గుండెల్ని చీల్చేసి నేలకూల్చింది. మకరాక్షుడు అక్కడికక్కడే ప్రాణాలు విడిచాడు. మకరాక్షుడి

మరణం కళ్ళారా చూస్తున్న రాక్షస వీరులంతా ప్రాణరక్షణ కోసం లంకానగరంలోకి పరుగెత్తుకుపోయారు. వజ్రాయుధపు దెబ్బకు పర్వతం పగిలినట్లుగా మకరాక్షుడు నేలకూలటం చూసిన దేవతలంతా సంతోషించారు.

# 80వ సర్గ ఇంద్రజిత్తు మళ్ళీ యుద్ధానికి రావటం

మకరాక్షుణ్ణి రాముడు చంపాడని రావణాసురుడికి చెప్పారు. కోపంతో పళ్ళు పటపటా కొరుకుతూ ఏంచెయ్యాలో ఏంచెయ్యగూడదో తెలియక తలపట్టు కూర్చున్నాడు. పిదప ఇంద్రజిత్తును పిలిపించి ఇలా అన్నాడు. "కుమారా! నీవు పరాక్రమవంతుడవు. అమిత బలవంతుడవు. యుద్ధంలో నేర్పు, చాతుర్యం, సమయానుకూలంగా నిర్ణయాలు తీసుకోవటంవంటి అనేక విషయాల్లో నీవు సమర్థుడవు. దేవేంద్రుడంతటి వాణ్ణి నీవు యుద్ధంలో జయించావు. నీవు యుద్ధరంగంలో ఉన్నావని తెలిస్తేనే శత్రువులు భయంతో ప్రాణాలు విడుస్తారు. నీ ప్రతాపం అప్రతిమానం. నీవు యుద్ధభూమికి పోయినప్పుడల్లా ఆ రామలక్ష్మణుల్ని కట్టిపడేస్తూనే ఉన్నావు. కానీ దైవం వాళ్ళకు అనుకూలంగా ఉంటోంది.

ఏది ఏమైనా, ఇప్పుడు నువ్వే యుద్ధభూమికి పోయి యుద్ధం చెయ్యాలి. వాళ్ళందరికీ కనిపిస్తూనే యుద్ధం చేస్తావో, లేక కనిపించకుండా (అదృశ్యంగా) యుద్ధం చేస్తావో నీవే నిర్ణయించుకో. నీవు ఈసారి రామలక్ష్మణుల్ని, వానర యోధుల్ని చంపిరా."

తండ్రి రావణుని ఆజ్ఞను శిరసావహించి ఇంద్రజిత్తు యజ్ఞవాటికకు పోయాడు. యథావిధిగా అభిచారహోమం చేశాడు. దేవదానవ, బ్రహ్మరాక్షసులందరినీ తృప్తిపరచాడు. కంటికి కనపడకుండా వెళ్ళే రథాన్ని తెప్పించాడు. ఆ రథానికి నాలుగు గుర్రాలు పూన్చారు. రథం నిండా బాణాలు, ధనుస్సులు, ఆ రథాన్నంతా బంగారు రేకులతో తాపడం చేశారు. రథానికి బయట ప్రక్కన జింకలు, చంద్రబింబం, చంద్రవంక మొదలైన చిత్రాలతో అలంకరించారు. రథ ధ్వజానికి బంగారు కట్లు వేశారు. రత్నవైడూర్యాల్ని పొదిగారు. ఆ రత్నవైడూర్యాల కాంతి ప్రజ్వలించిన అగ్నిహోత్రంలా ఉంది. ఆ రథమహిమ వల్లను, రథంలో బ్రహ్మాస్త్రమూ ఇంద్రజిత్తూ ఉండటం వల్లనూ ఆ రథం ఎవరికీ కనిపించకుండా యుద్ధభూమిలో సంచరించింది. అప్పుడు ఇంద్రజిత్తు రాక్షసులకు మాత్రమే తెలిసిన (రాక్షసదేవతాకములైన) మంత్రములచేత హోమం

చేసి, ఆ రథాన్ని అధిరోహించి లంకా పట్టణం నుండి బయలుదేరాడు. రాక్షసయోధులతో ఇలా అన్నాడు. "ఓ రాక్షసయోధుల్లారా! కపట మునివేషాల్లో తిరుగుతున్న రామలక్ష్మణుల్ని నేను చంపబోతున్నాను. అంతేకాదు భూమి మీద ఇక వానరులు లేకుండా చేస్తాను. నా తండ్రి, రాక్షసరాజు అయిన రావణాసురుణ్ణి సంతోషపెడ్తాను. మీరందరు ధైర్యంగాను, ఉత్సాహంగాను యుద్ధం చెయ్యండి." ఇలా చెబుతూ యుద్ధం పట్ల ఉత్సాహాన్ని రేకెత్తించాడు.

అంతట ఇంద్రజిత్తు అంతర్ధానమయ్యే రథంలో కూర్చుని, తానూ అంతర్ధానుడై రథాన్ని రామలక్ష్మణుల ముందు నిలిపాడు. అప్పుడు రామలక్ష్మణులు మూడు తలల సర్పాల్లాగా యుద్ధభూమి నంతా బాణాలతో నింపేస్తున్నారు. ఇంద్రజిత్తు అదృశ్యరథం నుండి వాళ్ళపై బాణాల వర్షం కురిపించి ఆకాశంలోకి ఎగిరిపోయాడు. మళ్ళీ ఆకాశం నుండి నిశితమైన బాణాల వర్షం కురిపించాడు.

ఇంద్రజిత్తు వదిలిన వాడి బాణాలు అమితమైన వేగంతో వచ్చి పడుతూ ఉంటే, రామలక్ష్మణులు కూడా సూర్య తేజస్సుతో సమానమైన దివ్య బాణాల్ని ప్రయోగించి ఆకాశం అంతా కప్పేశారు. అయితే ఇంద్రజిత్తు అదృశ్యంగా ఉండటం వల్ల ఒక్క బాణం కూడా అతడికి తగలలేదు. అప్పుడు ఇంద్రజిత్తు ఆకాశం అంతా పొగమంచు కప్పుకొని దిక్కులు కనపడకుండా ఉండేట్లు చేశాడు. అంతే కాకుండా తన ధనుష్టంకారం గాని, గుర్రాల డెక్కల చప్పుళ్ళుగాని, రథచక్రాల ధ్వనిగానీ వినపడకుండా జాగ్రత్తపడ్డాడు. అట్లా అదృశ్యరూపంలో ఉంటూ, ఆకాశంలో తిరుగుతూ, వానకురుస్తున్నట్లుగా బాణాల వర్షం కురిపించాడు. దేవతలను మెప్పించి పొందిన దివ్యాస్త్రాలను ప్రయోగించి రామలక్ష్మణుల అవయవాలను నొప్పించాడు. రామలక్ష్మణులు ధారాపాతంగా వచ్చి పడుతున్న బాణాల్ని ఎదుర్కొంటూ ఒక పర్వతం లాగా నిలబడ్డారు. రామలక్ష్మణులు బంగారు పింజలు వేసిన బాణాల్ని పైకి వదిలారు. కంకుపక్షి రెక్కల్తో ఉన్న ఆ బాణాలు సూటిగా పోయి ఇంద్రజిత్తు శరీరంలోకి చొచ్చుకొనిపోయి, నెత్తురుతో తడిసి నేలపై పడ్డాయి. అట్లా వచ్చి పడ్డ బాణాల్ని చూసిన రామలక్ష్మణులకు తమ లక్ష్యం ఏదో

కొద్దిగా బోధపడింది. ఇక ఆలస్యం చెయ్యకుండా, వెంట వెంటనే అత్యుత్తమమైన బాణాల్ని, నెత్తురుతో తడిసిన బాణాలు ఏ దిక్కు నుండి వచ్చి పడ్డాయో, అదే లక్ష్యంగా చేసుకొని అస్త్రాల్ని ప్రయోగించారు. పురుషోత్తములైన రామలక్ష్మణుల బాణాల్ని తప్పించుకుంటూ, ఇంద్రజిత్తు తన రథాన్ని అన్ని దిక్కులకూ నడిపించాడు. అట్లా తప్పించుకొని తిరుగుతూనే, తన రథంలో నుండి వాడి అయిన బాణాల్ని ఆ అన్నదమ్ములపై వదిలాడు. ఆకాశంలో మేఘాల మధ్యనున్న సూర్యుడు కనిపించనట్లుగా, అప్పుడా ఇంద్రజిత్తు ఎక్కడున్నదీ రామలక్ష్మణులు తెలుసుకోలేకపోయారు. అట్లా ఆకాశం నుండి బాణాలు వచ్చి పడుతూ ఉంటే, వందలకొద్దీ వానరులు మరణించారు. తమ వాళ్ళంతా తమ కళ్ళముందే మరణిస్తూ ఉంటే లక్ష్మణుడు కృద్ధుడైపోయాడు. లక్ష్మణుడు: “అన్నా! నీ అనుమతి అయితే ఈ రాక్షసులందర్నీ సంహరిస్తాను. ఇప్పుడే బ్రహ్మాస్త్రాన్ని విడుస్తాను” అన్నాడు. అప్పుడు రాముడు ఇలా అన్నాడు. “తమ్ముడా! లక్ష్మణా! ఒక్కణ్ణి చంపడం కోసం, భూమిపై నుండే రాక్షసులందర్నీ చంపుతాననడం న్యాయం కాదు. ఎందువల్లనంటే, యుద్ధం చెయ్యకుండా ఉన్న వాళ్ళను, యుద్ధం చెయ్యడానికి భయపడేవాళ్ళను, చేతులెత్తి నమస్కరించి శరణు కోరేవాళ్ళను, పారిపోయేవాళ్ళను, మద్యం మత్తులో ఉన్న వాళ్ళను చంపకూడదు. తమ్ముడా! మనం ఇంద్రజిత్తు ఒక్కడే చచ్చేమార్గం ఏదైనా ఆలోచిద్దాం! మహాక్రూరమైనవి, విషసర్పాల్లాంటివి, మహావేగంగా పోయే అస్త్రాల్ని ప్రయోగిద్దాం. ఈ మాయావి, ఇంద్రిజిత్తు, కంటికి కనిపిస్తూ న్యాయమైన పోరాటం చేస్తే, మనతో పనేముంటుంది; మన సేనానాయకులే వాళ్ళ బలంతో చంపేస్తారు. అందువల్ల నేను వాడి మీద ఒక దివ్యాస్త్రాన్ని ప్రయోగించాలని అనుకుంటున్నాను. ఈ మాయావి ఇంద్రజిత్తు, పాతాళానికిపోయినా, స్వర్గం వంటి ఊర్ధ్వలోకాలకు పోయినా, ఆకాశంలో ఉన్నా, భూమి మీద ఏ మూల దాక్కున్నా, నా దివ్యాస్త్రం అతణ్ణి వెతికి వెతికి పట్టుకుని చంపేస్తుంది” అన్నాడు. వెంటనే ఆ పురుషోత్తముడు కృతనిశ్చయుడై ఇంద్రజిత్తును చంపాలని సంకల్పించి ధనుష్టంకారం చేశాడు.

# 81వ సర్గ ఇంద్రజిత్తు మాయా సీతను వధించటం

రాముడు తనను చంపటానికి కృతనిశ్చయుడైనట్లు ఇంద్రజిత్తు ముందుగానే పసిగట్టాడు. కుంభకర్ణుడు మున్నగు రాక్షస శ్రేష్ఠులెందర్నో పొట్టన పెట్టుకోవడం కళ్ళారా చూశాడు. కాబట్టి ఏ మాయోపాయం చేతనైనా సరే రామలక్ష్మణుల్ని చంపడానికి నిశ్చయించుకున్నాడు. అందుకుగాను, యుద్ధభూమి నుండి పశ్చిమ ద్వారం ద్వారా నిష్క్రమించాడు. రాముణ్ణి వానరుల్ని యుద్ధం పట్ల నిరాసక్తుల్ని చేస్తే యుద్ధం చేయకుండా వాళ్ళను తేలిగ్గా చంపవచ్చునని ఆలోచించాడు. అందుకోసం, ఒక మాయసీతను చేసి రథంపై కూర్చోబెట్టుకొని యుద్ధభూమికి వచ్చాడు. అట్లా లంకా పట్టణం నుండి ఇంద్రజిత్తు మళ్ళీ తమపైకి యుద్ధానికి రావటం వానరులంతా చూశారు. చెట్లు రాళ్ళు చేత్తో పుచ్చుకొని పోరాటానికి సిద్ధపడ్డారు. హనుమంతుడు కూడా ఒక పెద్ద పర్వత శిఖరాన్ని ఎత్తి పట్టుకున్నాడు. తన ఎదుటకు వస్తున్న ఇంద్రజిత్తు రథాన్ని చూశాడు. అందులో ఒక స్త్రీమూర్తి ఉండటం చూశాడు. ఆమె తల జుట్టు అంతా సంస్కారం లేక అట్టలు కట్టుకుని ఒకే జడ అయింది. ఉపవాసాలు చేయడం వల్ల శరీరం శుష్కించిపోయింది. ఇంతకాలం ఒకే చీరతో ఉండటం చేత చీర మాసిపోయి ఉంది. శరీరం అంతా దుమ్ము పేరుకుపోయింది. పూర్వం సీతాదేవిని ఒకే ఒక్కసారి చూచి ఉండటం వల్ల, గుర్తించి సీతాదేవియేనని అనుకున్నాడు.

దుమ్ముకొట్టుకొని, దీనంగా ఉన్న ఆ సీతాదేవిని ఇంద్రజిత్తు రథంపై చూసిన హనుమంతుడికి పట్టరానంత కోపం వచ్చింది. కన్నీళ్ళు పెట్టుకొని విషాదం చెందాడు. అటువంటి దీనావస్థలో ఉన్న సీతాదేవిని ఇంద్రజిత్తు యుద్ధభూమికి ఎందుకు తీసుకొచ్చాడో వాయునందనుడైన హనుమంతుడికి అర్థం కాలేదు. "ఇప్పుడితడు ఏమి చేయదలచాడో" నని అనుకుంటూ వానర వీరులందర్నీ వెంటబెట్టుకొని ఆ రథం వైపుగా పరుగెత్తాడు. హనుమంతుడు వానరవీరుల్తో కలసి తన పైకి రావడం ఇంద్రజిత్తు చూశాడు. వెంటనే ఒరలో నుండి కత్తి తీసి రెండోచేత్తో మాయాసీత జుట్టుపట్టుకొని శిరస్సు ఖండించడానికి సిద్ధమయ్యాడు. అప్పుడా

మాయాసీత 'రామా! రామా!' అంటూ విలపిస్తూ ఉంటే, ఆ వానరులముందే ఆమెను కొట్టాడు. సీతాదేవి జుట్టుపట్టుకున్న ఇంద్రజిత్తును చూసి దీనుడై దుఃఖంతో కన్నీరు కార్చాడు.

రాముడి పట్టమహిషి, ప్రియురాలు, మహాపతివ్రత అయిన సీతాదేవి దురవస్థను చూసిన హనుమంతుడు ఇంద్రజిత్తుతో పరుషంగా ఇలా అన్నాడు. "ఓరీ! దుర్మార్గుడా! నీవు బ్రహ్మర్షుల వంశంలో పుట్టావు. కానీ రాక్షసస్త్రీ కడుపున పుట్టడం చేత నీకు ఇటువంటి చెడుబుద్ధులు పుడుతున్నాయి. ఓరీ! రాక్షసుడా! నీవు ఎంత పాపం చేస్తున్నావో నీకు తెలియటం లేదు. మహాసాధ్వి, మహాపతివ్రత అయిన సీతాదేవి తలవెంట్రుకులు పట్టుకున్నావే! నీవు దురాచారపరుడవు. క్రూరుడవు. నీవు చేస్తున్న ఈ పాపిష్టి పనికి నీ పరాక్రమాలు, కీర్తి దహించుకపోతాయి. ఈ దీనురాలు నీకు ఏమి అపకారం చేసింది? ఇల్లు వాకిలి వదిలిపెట్టి అరణ్యాల్లో ఉంటోంది. రాజ్యాన్ని పోగొట్టుకుంది. భర్త నుండి దూరం అయింది. అటువంటి ఈ నిర్భాగ్యురాలిని చంపావంటే నీవు బ్రతికి ఉండటం అనేది కలలోని మాట. ఇప్పుడు నా చేతికి చిక్కావు. నువ్వు నా నుండి తప్పించుకోలేవు. నువు చచ్చిన తర్వాత, స్త్రీహత్యాపాతకాన్ని నెత్తినవేసుకొని నరకానికి పోతావు" అంటూ ఇంద్రజిత్తుపైకి లంఘించాడు.

అప్పుడు వానరయోధులకు, రాక్షసవీరులకు నడుమ ఘోర పోరాటం సాగింది. ఇంద్రజిత్తు వానర సైన్యంపై బాణాల వర్షం కురిపించాడు. వానరశ్రేష్ఠుడైన హనుమంతుడితో ఇలా అన్నాడు. "ఓ వానరుడా! నీవు, సుగ్రీవుడు, రామలక్ష్మణులు లంకా పట్టణానికి ఏం సాధిద్దామని వచ్చారో, ఆ కార్యాన్ని భగ్నం చేస్తున్నాను. దాంతో ఇంతవరకు మీరంతా పడ్డ శ్రమ అంతా వృథా అయిపోతుంది. సీతాదేవిని ఇప్పుడు నీ ఎదుటనే చంపేస్తాను. సీతను చంపిన తర్వాత రామలక్ష్మణుల్ని చంపుతాను. ఆ తర్వాత నిన్ను, సుగ్రీవుణ్ణి చంపుతాను. చివరగా మా వంశ నాశనానికి పూనుకున్న విభీషణుణ్ణి చంపేస్తాను. స్త్రీలను చంపకూడదని నీతులు చెప్పావు గదా? ఓ వానరుడా! శత్రువులను దుఃఖాల పాలు చేసేందుకు ఏమైనా చెయ్యవచ్చు. అది కర్తవ్యంగా భావిస్తున్నాను" అని అంటూనే సీతాదేవిని జందెము పెట్టున ఖడ్గంతో చీల్చివేయగా

ఆమె నేలపై కూలి ప్రాణాలు విడిచింది. ఆ విధంగా ఇంద్రజిత్తు సీతాదేవిని స్వయంగా చంపి హనుమంతుణ్ణి చూసి "ఓరీ! వానరుడా! నేను రాముడి ప్రియురాలిని చంపేశాను. చూడు. మీరు పడ్డ శ్రమ అంతా వృథా అయిపోయింది" అంటూ పెద్ద పెట్టున సింహనాదం చేస్తూ రథంలో కూర్చున్నాడు. ఇంద్రజిత్తు చేసిన సింహనాదం విన్న వానరులు దుఃఖంలో వెనక్కు వెళ్ళిపోయారు.

# 82వ సర్గ సీత వధ గూర్చి విన్న రాముడు మూర్ఛపోవటం

పశ్చిమ ద్వారం వద్ద యుద్ధం చేస్తున్న వానర రాక్షస సేనలు మహా ఘోరంగా విలపిస్తున్న ధ్వనులు వినిపించాయి. ఆ భయంకర ధ్వనులు విన్న రాముడు జాంబవంతుణ్ణి పిలిచి "ఓ సౌమ్యుడా! హనుమంతుడు యుద్ధం చేస్తున్న పశ్చిమ ద్వారం నుండి భయంకరమైన ధ్వనులు వినిపిస్తున్నాయి. దీనిని బట్టి హనుమంతుడికి అసాధ్యమైనదేదో జరిగి ఉంటుంది. అందువలన నీవు వెంటనే సైన్యాన్ని తీసుకొని హనుమంతుడికి సహాయంగా వెళ్ళు" అని ఆజ్ఞాపించాడు. అంతట జాంబవంతుడు పెద్ద భల్లూక సేనల్ని వెంటబెట్టుకొని పశ్చిమ ద్వారం వైపు బయలుదేరాడు.

హనుమంతుడు విషణ్ణ వదనంతో వానర సేనల్ని వెంటబెట్టుకొని ఎదురు రావడం జాంబవంతుడు చూశాడు. హనుమంతుడే కాదు, వానర సేన అంతా దుఃఖ సముద్రంలో మునిగి ఉండటం జాంబవంతుడు చూశాడు. మహాశయుడైన ఆ హనుమంతుడు జాంబవంతుణ్ణి, అతడి సేనల్ని వెనుకకు మళ్ళించి, అమిత వేగంతో రాముడి వద్దకు వెళ్ళి దుఃఖీస్తూ ఇలా అన్నాడు. "ఓ రామప్రభూ! మేము అందరం యుద్ధం చేస్తూ ఉండగానే మా కళ్ళ ఎదుటనే ఇంద్రజిత్తు విలపిస్తున్న సీతాదేవిని వధించాడు. ఓ శత్రుసంహారకుడా! సీతాదేవి మరణాన్ని కళ్ళారా చూసిన తర్వాత ఇక యుద్ధాన్ని ఆపివేసి నీకీ విషయాన్ని చెప్పటానికి వచ్చాం" అన్నాడు.

అంతట రాముడు హనుమంతుడి మాటలు వింటూనే, మొదలు నరికిన వృక్షంలాగా, మూర్ఛపోయాడు. దేవతలతో సమానుడైన రాముడు మూర్ఛపోయి నేలపై పడిపోవడం చూసి వానరులందరూ వచ్చి రాముడి చుట్టూ చేరారు. హఠాత్తుగా రేగిన మంటలవలె, ఎదరించటానికి వీలుకాని ఆ రాముడిపై సువాసనలతో కూడిన నీటితో రాముడి ముఖం కడిగారు; శైత్యోపచారాలు చేశారు. గుండెలు పగిలేట్లుగా దుఃఖీస్తున్న లక్ష్మణుడు రాముణ్ణి కౌగలించుకొని ఓదారుస్తూ ఇలా అన్నాడు. "పూజ్యుడా! నీవు ధర్మమార్గాన్ని అవలంబించినవాడవు.

జితేంద్రియుడవు, నీవు నమ్ముకున్న ధర్మం నీ దుఃఖాన్ని పోగొట్టలేకపోయింది; ధర్మం నిరర్థకమైపోయింది. స్థావరములు, జంగములు అయిన ప్రాణులు కంటికి కనిపించినట్లుగా ధర్మాధర్మములు కనిపించడం లేదు కాబట్టి ధర్మం అనేది లేదనే నా అభిప్రాయం. స్థావరములైన వృక్షాలు, పర్వతాలు; జంగములైన పశుపక్ష్యాది ప్రాణికోటి ఏ విధంగా మనకు కంటికి కనిపిస్తున్నాయో, అదేవిధంగా ధర్మాధర్మాలు కంటికి కనిపించడం లేదు. కాబట్టి ధర్మాధర్మాలనేవి లేనేలేవు. అట్లా ఉన్నట్లయితే నీవంటివాడికి ఆపదలు వచ్చేవి కావు. అధర్మం అనేది ఉంటే రావణుడు నరకాన్ని పొంది ఉండేవాడు; నీవు ఈ విధంగా కష్టాలు అనుభవిస్తూ ఉండేవాడవు కావు? ఆ రావణునికి ఆపదలు రాకపోవడం వల్ల అధర్మం మంచి ఫలితాల్నిస్తోందని నాకు అనిపిస్తోంది. అనగా, ధర్మం మంచి ఫలితాల్నిస్తుందని, అధర్మం చెడు ఫలితాల్నిస్తుందనే నియమం ఏమీ లేదు. అట్లా ఉండేట్లయితే, జనులు అధర్మం పట్ల ఆసక్తి చూపుతూ, ధర్మాన్ని విడిచిపెట్టేవాళ్ళు కాదు. ధర్మాన్ని ఆచరించేవాళ్ళకు మంచి ఫలాలే లభించి ఉండేవి. అట్లాకాకుండా, అధర్మం చేసేవాళ్ళ సిరిసంపదలు వృద్ధి చెందుతున్నాయి.

[ధర్మాధర్మాల నియమం గూర్చి పెద్దలు ఇలా వివరించారు. ఏ క్రియ అయినా మూడు క్షణాలకన్నా ఎక్కువసేపు ఉండదు. ధర్మమైనా, అధర్మమైనా క్రియారూపమే. (ఏదో ఒక పనే) కాబట్టి ఆ పని జరిగిన నాలుగవ క్షణంలో అది నశించిపోతుంది. అట్లా నశించిపోయేది ఫలాన్ని ఎట్లా ఇవ్వగలదు? అని లక్ష్మణుడు అంటున్నాడని వ్యాఖ్యాతల అభిప్రాయం.]

రామా! పుణ్యాత్ములు అధర్మంచేత చంపబడినట్లయితే అధర్మం చేత ధర్మం చంపబడినట్లే గదా! అలాగయితే చంపబడిన ధర్మం ఏమి ఉద్ధరిస్తుంది? వ్యర్థమే గదా?

[లేదా, విధియే ధర్మాధర్మ ఫలాలనిచ్చు పరమేశ్వరుడే అధర్మకర్తను చంపినా లేదా ఇతరుల్ని చంపినా ఆ పాపఫలం పరమేశ్వరుడికే చెందుతుంది కానీ, కర్తకు చెందదు. అంటే, ధర్మమనగా సత్కర్మల ఫలం చేత సంతోషించే ఈశ్వరుడు. అధర్మం అంటే, సత్కర్మల వల్ల వచ్చే మంచి ఫలము, దుష్కర్మలచేత వచ్చే చెడు ఫలము కూడా ఈశ్వరుడికే చెందాలి; ప్రేరేపించబడిన

కర్తకు కాదు. ఇది మరికొందరి వ్యాఖ్యాతల అభిప్రాయం.]

ప్రాచ్య పాఠంలో ఈ విధంగా ఉంది: స్వర్గాది ఫలాలను ఉద్దేశించి కొన్ని కర్మలను విధించినట్లే, శత్రు వినాశనానికి కూడా వేదంలో కొన్ని శ్యేనయాగాదులు విధించబడ్డాయి. ఇంద్రజిత్తు చేసిన నికుంభిలాహోమం కూడా శాస్త్ర ప్రకారం చేసిందే. అయినా అది ప్రజాకంటకుడు చేత చేయబడటం చేత ఈ హోమం పాపకర్మగాను, అధర్మంగాను పరిగణించబడ్డది. ఇటువంటి అధర్మ కార్యాలు ధర్మాత్ముల్ని బాధించడం ద్వారా ధర్మానికి హాని కలుగుతుది. అట్లాగే ధర్మం బలం అధికమైతే అధర్మాన్ని అణగద్రొక్కవచ్చును. అయితే, ఈ అణగద్రొక్కబడే అధర్మం కూడా వేదవిహితమే. అందువల్ల వేదవిహితమైన ధర్మానికి హాని కలిగించే అధర్మం వల్ల మనకు ఎట్లా పాపం వస్తుందో, అట్లాగే వేదవిహితమైన (శ్యేనయాగం వంటివి) అధర్మానికి హాని కలిగించే ధర్మం వల్ల కూడా పాపం రావాలి కదా?

శత్రు సంహారకుడవైన రామా! ధర్మానికి ప్రతిఘాతము ఎట్లా జరుగుతుందో తెలియదు. ఎందుకంటే అది కంటికి కనపడేది కాదు. అందువల్ల లేని దానితో సమానమే. అటువంటి ధర్మం ఏం మంచిని చేయగలదు? అటువంటి ధర్మం శత్రువును ఎట్లా తెలుసుకొంటుంది? దానిని ఎట్లా పీడించగలదు?

ఓ శత్రుసంహారకుడా! పాపకర్మను ఎదుర్కొనే ఉపాయం కనపడకపోతే ధర్మం అధర్మాన్ని ఎట్లా ఎదిరించి నాశనం చెయ్యగలదు? సత్పురుషులలో శ్రేష్ఠుడవైన రామా! ధర్మమనేది నిజంగా ఉండి ఉంటే నీకు ఏ కష్టమూ కలిగి ఉండగూడదు. కానీ నీవు కష్టపడుతున్నావే! అందువల్ల ధర్మం అనేది ఉందని చెప్పటానికి వీల్లేదు. లేదా, ధర్మం బలహీనపడి, పిరికిదై తొలగిపోయినట్లయితే, అటువంటి బలహీనమైనదీ, మర్యాదను అతిక్రమించినదీ అయిన ధర్మాన్ని విడువడమే మంచిదని నా అభిప్రాయం ఏదైనా కార్యం సాధించేందుకు ధర్మం కన్నా బలానికి ఫలం అధికంగా లభించేట్లయితే, నీవు ధర్మాన్ని వదలి బలాన్నే ఆశ్రయించు. ఓ శత్రు సంహారకుడా! సత్యం పలకటమే ధర్మమని నీవు

నమ్ముతున్నట్లయితే, నీ తండ్రి దశరథుడు మొదట నీకు రాజ్యాభిషేకం చేస్తానన్నారు. ఆ తర్వాత లేదు పొమ్మన్నాడు. మరి నీ మీద కరుణ లేని మన తండ్రిని ఎందుకు బంధించలేదు?

ఓ శత్రుసంహారకుడవైన ఓ రామా! పూర్వం ఇంద్రుడు వజ్రరూపుడనే మునిని చంపి యజ్ఞం చేశాడు. ధర్మమే కర్తవ్యం అయి ఉంటే యజ్ఞం మాత్రమే చేసేవాడు; మునిని చంపేవాడు కాదు. ధర్మమే కర్తవ్యం అని అనుకొని ఉంటే మునిని సంహరించే వాడేకాని యజ్ఞం చేసేవాడు కాదు. కానీ ఇంద్రుడు రెండూ చేశాడు. దీనిని బట్టి క్షత్రియులకు సమయా సమయాలనేవి ఉంటాయని, కాలానుసారం రెండు చేస్తూ ఉండాలని తేలింది.

ఓ రామా! ధర్మం ఆచరించినా, అధర్మం ఆచరించినా వినాశం కలుగుతూనే ఉంది. అందువల్లనే మానవులు తమ ఇష్టానుసారం, రెండింటినీ ఆచరిస్తూ ఉంటారు. కాబట్టి, కాలాన్ని బట్టి, ఇష్టాన్ని బట్టి ధర్మాధర్మాల్ని ఆచరిస్తూ ఉండటమే క్షేమమని నా అభిప్రాయం. ఆనాడు నీవు ధర్మానికి మూలమైన అర్థాన్ని వదిలేసి రాజ్యాన్ని కాదన్నావు. పర్వతాలలో నుండి చిన్నచిన్న వాగులుగా బయలుదేరి అన్నీ కలిసి ఒకటై మహానదిగా మారినట్లు, రాజ్యాన్ని పొంది పన్నుల ద్వారా క్రమంగా ఆదాయాన్ని వృద్ధి చేసుకుంటూ యజ్ఞాల వంటి అన్ని పనులు చక్కపెట్టడానికి వీలవుతుంది. అర్థం (ధనం) లేనివాడు తేజో విహీనుడవుతాడు. ధనం లేకుండా పనులన్నీ ఎండాకాలంలో నదుల్లాగా ఉపయోగం లేకుండా పోతాయి. సుఖాలకు అలవాటు పడిన మానవుడు ధనాన్ని కాదని, సుఖాలు కావాలని కోరుకుంటే వాటి కోసం దొంగతనం వంటి పాపకార్యాలు చెయ్యాల్సివస్తుంది. లోకంలో ఎవరి దగ్గర ధనం ఉంటుందో, అతడికే ఎక్కువమంది స్నేహితులుంటారు; బంధువులు దగ్గరకు చేర్తారు. ధనవంతుడినే పండితుడుగా పరిగణిస్తారు. ధనమున్నవాడే పరాక్రమవంతుడవుతాడు. ధనమున్నవాడే బుద్ధిమంతుడుగా చలామణీ అవుతాడు. ధనమున్నవాడే మహా భాగ్యశాలి. ధనమున్నవాడే గొప్ప గుణవంతుడుగాను, పెద్దమనిషిగాను గుర్తించబడతాడు. ఓ ధీరుడా! నీవు రాజ్యాన్ని ఒదులుకోవాలనే నిర్ణయం తీసుకోవటం వల్లనే, నేను ఇప్పుడు ధనం యొక్క ప్రాశస్త్యాన్ని గూర్చి

చెప్పవలసి వచ్చింది. (అనగా ఆనాడు రాజ్యాన్ని విడిచేటప్పుడు నీవు ఈ విషయాన్ని గూర్చి ఆలోచించలేదు) లోకంలో ధనం ఉన్నవాడికే ధర్మము, అర్థము, కామము లభిస్తాయి. ధనం చేతిలో ఉన్నవాడికి కొండమీద కోతి కావాలంటే దిగివస్తుంది. ధనహీనులు ఎన్ని ప్రయత్నాలు చేసినా ఆ ధనం లభించదు. ధనం కొంతైనా చేతిలో ఉంటే దాన్ని వృద్ధి చేసుకోవచ్చు. రామా! ధనమున్నవాడికి సంతోషం వచ్చినా, కోపం వచ్చినా, కామం కలిగినా, దర్పము, ధర్మము, శమము, ధమము, ఒకటేమిటి, సర్వమూ శోభిస్తాయి. ధనాన్ని కాదని, ధర్మాన్నే పట్టుకొని వేళ్ళాడేవాడికి ఇహలోక సౌఖ్యాలేవీ దక్కవు. ఆకాశంలో దట్టంగా మేఘాలు కమ్ముకున్నప్పుడు గ్రహాలు కనిపించినట్లుగా నీ వద్ద ధనం కనిపించటం లేదు. నీవు అర్థానికి మూలమైన రాజ్యాన్ని కాదన్నావు. తండ్రి ఆజ్ఞను శిరసావహించావు. అడవులకు వచ్చావు. నీ ప్రాణం కన్నా ఎక్కువైన నీ ప్రియురాలిని రావణుడు హరించాడు. ఓ వీరుడా! ఇంద్రజిత్తు నీకు కలిగించిన దుఃఖాన్ని ఇప్పుడు నా పరాక్రమంచేత పోగొడతాను. నీవు లేచి నాతో రా!

ఓ దీర్ఘమైన బాహువులు గలవాడా! నీవు దృఢవ్రతుడవు. నీవు నరులలో శ్రేష్ఠుడవు. మహాత్ముడవు. సూక్ష్మమైన బుద్ధిగలవాడవు. అయినా నిన్ను గూర్చి నీవు తెలుసుకోలేకుండా ఉన్నావు. నీవు నన్ను ఆజ్ఞాపించు. నేను ఈ రాక్షసరాజును, రావణాసురుణ్ణి, గుఱ్ఱాలతోను, ఏనుగులతోను, రథాలతోను ఉన్న రాక్షస సైన్యాన్ని, లంకా పట్టణాన్ని నా బాణాల్తో ధ్వంసం చేస్తాను" అని అన్నాడు.

# 83వ సర్గ విభీషణుడు సీత మరణించలేదని చెప్పటం

సోదరుడిపై అపారమైన ప్రేమగల లక్ష్మణుడు ఆ విధంగా రాముణ్ణి ఓదార్చాడు. వానర సేనాసమూహాలన్నింటినీ ఆయా స్థానాల్లో నిలిపి, విభీషణుడు రాముడి వద్దకు వచ్చాడు. కాటుక కొండల్లాంటి తన నలుగురు మంత్రుల్నీ వెంటబెట్టుకొని దుఃఖీస్తున్న రాముడు ఉన్న చోటుకు వచ్చాడు. వానరులంతా కూడా శోక సముద్రంలో ఉండటం విభీషణుడు చూశాడు. నిశ్చేష్టుడై లక్ష్మణుని ఒడిలో పడుకొన్న రాముణ్ణి విభీషణుడు చూశాడు. దుఃఖసముద్రంలో మునిగి ఉన్న రాముణ్ణి చూస్తూ, "నీ దుఃఖానికి కారణం ఏమిటి" అని అడిగాడు. అప్పుడు లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి, వానరుల్ని చూస్తూ కన్నీరు కారుస్తూ ఇలా అన్నాడు.

లక్ష్మణుడు : "ఓ సౌమ్యుడా! సీతను ఇంద్రజిత్తు చంపాడని హనుమంతుడు చెప్పాడు. ఆ వార్త వినగానే రాముడు మూర్ఛపోయాడు" అని చెప్తూ ఉండగానే, మధ్యలో అడ్డుకుంటూ విభీషణుడు రాముడితో ఇలా అన్నాడు: "ఓ మహారాజా! సముద్రం ఎండిపోయిందని ఎవరైనా చెప్తే అది ఎంత సత్యమో, సీతాదేవి మరణించిందని హనుమంతుడు చెప్పింది కూడా అంతే నిజం. ఎందువల్లనంటే, రావణుడికి సీతను గూర్చి ఎటువంటి అభిప్రాయాలున్నాయో నాకు బాగా తెలుసు. అందువల్ల ఎట్టి పరిస్థితిల్లోనూ సీతాదేవిని చంపేందుకు రావణుడు అంగీకరించడు. సీతాదేవిని వదిలివేయమని రావణునితో నేను ఎన్నోసార్లు ప్రార్థించాను. అయినా అతడు అంగీకరించలేదు. అంతేకాదు, సామ, దాన, భేద, దండోపాయాలవల్ల కానీ, మరే ఇతర మాయోపాయాల వల్లగానీ సీతాదేవిని చూడటానికైనా వీలులేకుండా నా అన్న రావణుడు గట్టి కట్టుదిట్టాలు చేశాడు. అటువంటిది, సీతాదేవిని ఈ ఇంద్రజిత్తు యుద్ధభూమికి తీసుకురావడం, వధించడం, అన్నీ అభూత కల్పనలు; ఇంద్రజిత్తు మాయలు. ఆ సీత మాయాసీత అని తెలుసుకో! వానరులందర్నీ మోసగించి, లంకా పట్టణంలో 'నికుంభిల' అనే దేవతకు హోమాలు చేస్తాడు. అట్లా హోమాలు చేసి యుద్ధానికి వస్తే అతణ్ణి దేవేంద్రుడు కూడా జయించలేడు. వానర సేనల్ని మోసం చేయటానికే మాయాసీతను సృష్టించాడు. అంతేకాని

యథార్థమైన సీత కాదు. ఓ రాజా! ఇంద్రజిత్తు హోమం పూర్తి చేసేలోపలే, మనం సైన్యంతో అక్కడకు చేరుకుందాం. నరులలో శ్రేష్ఠుడవైన ఓ రామా! అకారణంగా దుఃఖించకు. దుఃఖీస్తున్న నిన్ను చూసి వానర సైన్యం అంతా దిగులుపడుతున్నారు. ఓ రాజా! దుఃఖాన్ని విడిచి, నీవు ఇక్కడే విశ్రాంతి తీసుకో. మాతో లక్ష్మణ ప్రభు వచ్చి యుద్ధం చేస్తాడు. లక్ష్మణుడు తన వాడియైన బాణాలతో ఆ ఇంద్రజిత్తు హోమం జరగకుండా ధ్వంసం చేస్తాడు. ఆ తర్వాత అతణ్ణి సంహరించగలుగుతాడు. పక్షి ఈకలు కట్టిన లక్ష్మణుని బాణాలు అమిత వేగంతో పోయి క్రూరమైన పక్షుల్లాగా ఇంద్రజిత్తు నెత్తురు తాగగలవు. కనుక ఓ మహాబాహూ! ఇంద్రజిత్తును చంపటానికి దేవేంద్రుడు వజ్రాయుధం ప్రయోగించినట్లు, శుభలక్షణాలు గల లక్ష్మణుణ్ణి పంపు. నరులలో శ్రేష్ఠుడవైన ఓ రామా! ఇంక ఏమాత్రం ఆలస్యం చెయ్యకూడదు. దేవతల శత్రువుల్ని చంపేందుకు, దేవతలకు దేవేంద్రుడు ఆజ్ఞాపించినట్లుగా ఇంద్రజిత్తును వధించటానికి ఆజ్ఞ ఇవ్వు. రాక్షస శ్రేష్ఠుడైన ఇంద్రజిత్తు హోమకర్మలు పూర్తిచేసే ముందే మనం అతడిని ఎదుర్కోవాలి. హోమం పూర్తి అయితే, అతణ్ణి సురాసురులు కూడా కనిపెట్టలేరు. అప్పుడు దేవతలకు కూడా ప్రాణసంశయం అవుతుంది" అన్నాడు.

# 84వ సర్గ ఇంద్రజిత్తును చంపడానికి లక్ష్మణుడు బయలుదేరటం

రాముడు దుఃఖసముద్రంలో మునిగి ఉండటం వలన విభీషణుడు చెప్పినదంతా విన్నాడే కానీ పరధ్యానంలో ఉండటం చేత తలకెక్కలేదు. అంతట విభీషణుడితో ఇలా అన్నాడు. "ఓ విభీషణుడా! నేను పరధ్యానంలో ఉండటం చేత నీవు ఏం చెప్పావో నాకు బోధపడలేదు. మళ్ళీ ఒకసారి చెప్పు." మాట్లాడటంలో నేర్పరి అయిన విభీషణుడు ఇలా అన్నాడు: "ప్రభూ! నీ ఆజ్ఞలను శిరసావహించి సేనలను నాలుగు ప్రక్కలా నిలబెట్టాను. ఆయాస్థానాల్లో యూథపతుల్ని నియమించాను. ఆ మాట నీకు చెప్పాలనే వచ్చాను. ఓ మహాశయా! నీవు కారణం లేకుండానే దుఃఖీస్తున్నావు. నీవు ఎంతమాత్రం దుఃఖించవద్దు. నువ్వు దుఃఖీస్తూ ఉంటే వానరసేన అంతా దిగులుపడుతోంది. దాంతో శత్రువులు మరింత బలవంతులవుతారు. కాబట్టి విచారించవద్దు. ఉత్సాహంతో ఉండు.

నేను నీ మేలుకోరి చెపుతున్నాను. వెంటనే లక్ష్మణుణ్ణి వానరసైన్యంతో ఇంద్రజిత్తు పైకి యుద్ధానికి పంపు. ఇప్పుడు 'నికుంభిల' దేవత ఆలయానికి వెళ్ళి, అక్కడ ఇంద్రజిత్తును సంహారం చెయ్యాలి. జయశీలి అయిన లక్ష్మణుడు తన ధనుస్సును మండలాకారంగా వంచి విషసర్పాల్లాంటి బాణాలను విడుస్తూ ఉంటే ఆ ధాటికి ఇంద్రజిత్తు నిలువలేడు. అతడు లక్ష్మణుణ్ణి చేతిలో మరణించడం ఖాయం. నీవు సీతాదేవిని తీసుకొని పోదలచినట్లయితే లక్ష్మణుణ్ణి వెంటనే యుద్ధానికి పంపు.

ఓ రామా! పూర్వం ఇంద్రజిత్తు బ్రహ్మదేవుని మెప్పించి బ్రహ్మశిరస్సు అనే అస్త్రాన్ని, ఇష్టానుసారం నడిచే గుర్రములను సంపాదించాడు. ఇప్పుడు రాక్షససైన్యాన్ని వెంటబెట్టుకొని 'నికుంభిల' దేవతాలయానికి యజ్ఞకర్మలు చేయడానికి వెళ్ళాడు. అతడు యజ్ఞకర్మలు చేయకముందే అతణ్ణి ఎదిరించాలి. యజ్ఞకర్మలు పూర్తి చేసినట్లయితే అతణ్ణి దేవేంద్రుడు కూడా జయించలేడు. మనల్నందర్నీ జయించగలుగుతాడు. 'హోమం పూర్తి అయ్యేలోపల ఎవరు అతణ్ణి

ఎదుర్కొంటారో, అతడి చేతుల్లోనే మరణిస్తాడు' అని బ్రహ్మదేవుడు చెప్పాడు.

ప్రభూ! ఇంద్రజిత్తు మరణం బ్రహ్మదేవుడిచే ముందే నిర్ణయించడమైపోయింది. ఇప్పుడు చేయవలసిందల్లా ఇంద్రజిత్తును నికుంభిలహోమాన్ని చెయ్యకుండా అడ్డుకోవడమే. అట్లా అడ్డుకునే శక్తిసామర్థ్యాలు కూడా లక్ష్మణప్రభువుకు ఒక్కడికే ఉన్నాయి. వానరులెవ్వరూ ఇంద్రజిత్తును సంహరించలేరు. ఇంద్రజిత్తు మరణం లక్ష్మణప్రభువు చేతుల్లోనే రాసిపెట్టి ఉన్నట్లు తోస్తోంది. నీవు రాక్షసులందర్నీ చంపి సీతాదేవిని తీసుకుపోదలచినట్లయితే నేను చెప్పేది వినాలి. నీ మేలుకోరి చెప్తున్నాను. కాబట్టి ఈ లక్ష్మణుడు వానర సైన్యంతో నికుంభిలాదేవతాలయానికి పోయి పోరాడి ఆ ఇంద్రజిత్తును సంహారం చేస్తాడు. ఇంద్రజిత్తు చనిపోయిన మరుక్షణమే రావణుడు బంధువులతో సహా చచ్చిపోయినట్లే అనుకో."

విభీషణుడు చెప్పిన మాటలకు రాముడు "ఓ మిత్రుడా! ఇంద్రజిత్తు మహాభయంకరుడు; మాయావి; ధనుర్విద్యావిశారదుడు. బ్రహ్మాస్త్రం ప్రయోగించడం తెలిసినవాడు. అందువల్లనే దేవతల్ని కూడా జయించగలిగాడు. అతడు ఆకాశంలో మేఘాలు కమ్ముకున్న సూర్యుడిలాగా ఎవరికీ కనపడకుండా, దేవతల్ని సహితం మోసం చేశాడు. ఇతణ్ణి గూర్చి నాకు తెలుసు" అన్నాడు. పిమ్మట లక్ష్మణునితో "తమ్ముడా! నీవు సుగ్రీవుణ్ణి, హనుమంతుణ్ణి, జాంబవంతుణ్ణి, మిగిలిన యూథపతుల్ని వెంటబెట్టుకొనిపో. అన్నీ తెలిసిన ఈ విభీషణుడు, అతడి నలుగురు మంత్రులు కూడా నీ వెంట ఉంటారు. నీవు ఆ మాయావి అయిన ఇంద్రజిత్తును వధించు" అన్నాడు.

రాముడి మాటలు విని ఆశ్చర్యకరమైన పరాక్రమం గల విభీషణునితో కలసి లక్ష్మణుడు శ్రేష్ఠమైన కవచాన్ని, ఎడమచేత్తో ధనుస్సు, కుడిచేత్తో ఖడ్గాన్ని ధరించాడు. రాముడి పాదాలకు నమస్కరించి ఇలా అన్నాడు. "అన్నా నా బాణాలు ఇంద్రజిత్తు శిరస్సును ఛేదించి, తామరకొలనుకుపోయే హంసలవలె, లంకా పట్టణాన్ని ఆక్రమిస్తాయి. చూడు."

రాజకుమారుడు, పరాక్రమవంతుడు అయిన లక్ష్మణుడు అన్నగారి ఆశీస్సులు పొందినవాడై, విభీషణుడితో కలసి బయలుదేరాడు. వేలాది వానరులతో హనుమంతుడు, మంత్రులతో విభీషణుడు లక్ష్మణుణ్ణి అనుసరించారు. మార్గమధ్యంలో జాంబవంతుడు భల్లూకసైన్యాన్ని వెంటబెట్టుకొని లక్ష్మణుణ్ణి అనుసరించాడు. మిత్రులకు ఆనందం కలిగించే లక్ష్మణుడు వ్యూహాలుగా తీరి నిలబడిన రావణుని సేనల్ని దూరాన్నుండే చూశాడు. శత్రుసంహారకుడైన ఆ లక్ష్మణుడు బ్రహ్మవరప్రసాదితమైన హోమాన్ని ఇంద్రజిత్తు ప్రారంభించకముందే చంపెయ్యాలని నిర్ణయించుకున్నాడు.

అక్కడ శత్రుసైన్యం అనేక విధాలుగా విభజింపబడి ఉంది. అక్కడ మిలమిలా మెరిసిపోయే ఆయుధాలు అనేకం ఉన్నాయి. ధ్వజములతో కూడిన రథాలు అనేకం నిలబెట్టి ఉన్నాయి. సాటిలేని సముద్రం వంటి ఆ భయంకర సైన్యంలోకి దూసుకుపోవాలంటే సాధ్యం కాకుండా ఉంది. సైన్యంతోనూ రథాలతోను మూసుకొనిపోయి చీకట్లు కమ్ముకున్న ఆ ప్రదేశంలో నికుంభిలా దేవతాలయం ఎక్కడ ఉందో లక్ష్మణుడికి కనిపించలేదు.

## 85వ సర్గ ఇంద్రజిత్తుతో యుద్ధం

అప్పుడు విభీషణుడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! వానరులందర్నీ శిలలు, వృక్షాలు తీసుకొని రాక్షసులతో యుద్ధం చెయ్యమని ఆజ్ఞాపించు. అప్పుడు రాక్షసులంతా వానరులను ఎదుర్కోవటానికి సిద్ధపడ్తారు. అప్పుడు నీవు వారిపై బాణాల వర్షం కురిపించు. దాంతో సైన్యం అంతా ఛిన్నాభిన్నం అవుతుంది. అప్పుడు వారి మధ్యన ఉన్న ఇంద్రజిత్తు నీకు కనిపిస్తాడు. వజ్రాయుధం వంటి బాణాన్ని ఆ ఇంద్రజిత్తుపై ప్రయోగించు. ఏమాత్రం తటపటాయించకు. కంటికి కనపడగానే వాడిపై బాణాలు వదిలాలి. అప్పుడు నిన్ను ఎదిరించేందుకు యజ్ఞశాలను వదిలి బయటకు వస్తాడు. ముల్లోకాల్నీ బాధలుపెడ్తున్న ఆ ఇంద్రజిత్తును నువ్వు చూసీచూడటంతోనే బాణాన్ని ప్రయోగించాలి."

రాక్షసయోధులు భల్లూకయోధులు శిలల్ని, వృక్షాల్ని తీసుకొని రాక్షసులపైన దండెత్తారు. వానరులు, భల్లూకాలు, తమ వాడి అయిన గోళ్ళతో రాక్షసుల్ని రక్కారు. పదునైన కోరలతో పట్టి పీకారు. అదే సమయంలో లక్ష్మణుడు రాక్షసులపై బాణాలవర్షం కురిపించాడు. రాక్షసులు కూడా వాడి అయిన బాణాలతో వానరులపై తిరుగుదాడి చేశారు. రాక్షసులు శక్తి ఆయుధాలతోను, ఖడ్గాలతోను, తోమరాలతోను వానరుల్ని కొట్టి హింసించారు. పరస్పరం ఒక్కళ్ళ నొకళ్ళు కొట్టుకుంటున్నారు; చంపుకుంటున్నారు. పోరాటం ఓ పెద్ద దొమ్మీగా తయారైంది. ఆ యుద్ధభూమిలోని కోలాహలం లంకాపట్టణానికి వ్యాపించింది. ఆ కోలాహలయుద్ధంలో రాక్షసులు వదిలిన బాణాలు, ఇతర ఆయుధాలు, వానరులు విసిరేసిన శిలలు, వృక్షాలు చేరి పెద్ద పర్వతమంత ఎత్తున పేరుకుపోయాయి. రాక్షసులు శక్తిమంతమైన ఆయుధాలతో వానరులను చంపుతున్నారు. అటు వానరులు కూడా రాక్షసవీరుల్ని కొట్టి చంపారు. భయంకరమైన శరీరాలతో భల్లూకాలు, వానరులు రాక్షసుల్ని కోరల్తో పీకి చంపేస్తున్నారు. రాక్షస వీరులందరికీ విపరీతమైన భయం పట్టుకుంది. తన సేనల్ని హింసిస్తున్నారని తెలుసుకున్న ఇంద్రజిత్తు యజ్ఞాన్ని సగంలోనే ఆపేసి యుద్ధరంగంలోకి వచ్చాడు. ఆ చీకట్లో ఇంద్రజిత్తు మహాకోపంతో

అనుచరుల్తో కలసి బయటకు వచ్చాడు. ఇంద్రజిత్తు ముఖం, కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. నల్లగా కాటుకకొండలాగా ఉన్న ఆ ఇంద్రజిత్తు ధనుస్సును భయంకరమైన బాణాల్ని ధరించి, సంహరించేందుకు బయలుదేరిన మృత్యుదేవతలాగా కనిపించారు. రథంపై వస్తున్న భయంకరుడైన ఇంద్రజిత్తును చూసి రాక్షసులంతా సంతోషంతో సింహనాదాలు చేశారు. ఆ సమయంలో హనుమంతుడు మోయలేనంత బరువున్న వృక్షాన్ని ఎత్తి రాక్షససైన్యంపై పడేస్తూ కారుచిచ్చు మహారణ్యాన్ని కాల్చి బూడిద చేసినట్లు రాక్షసులందర్నీ చంపాడు. రాక్షసుల్ని అట్లా చంపుతున్న భీకరాకారుడైన హనుమంతుడిపై అనేకరకాలైన ఆయుధాల్ని రాక్షసులు నాలుగుమూలల నుండి ప్రయోగించారు. శూలాలు ధరించిన వాళ్ళు శూలలతోను, ఖడ్గాలు ధరించినవాళ్ళు ఖడ్గాలతోను, శక్తులు ధరించినవాళ్ళు శక్తులతోను, పట్టిసాల్ని ధరించిన వాళ్ళు పట్టిసాలతోను ఆ హనుమంతుణ్ణి కొట్టారు. మిగిలిన రాక్షసులు కూడా పర్వతంలాగా శరీరాన్ని పెంచిన ఆ హనుమంతుణ్ణి ఇనపముద్గరాలతోను, గండ్రగొడ్డళ్ళతోను, భిందిపాలములతోను, పిడికిళ్ళతోను, అరచేతుల్తోను కొట్టారు. హనుమంతుడు భయంలేనివాడై మహాపౌరుషంతో యుద్ధం చేసి చాలామంది రాక్షసుల్ని చంపాడు. అటువంటి హనుమంతుణ్ణి ఇంద్రజిత్తు చూశాడు. అంతట సారథితో "వానరులున్న చోటుకు రథాన్ని మళ్ళించు. లేకపోతే ఈ వానరుడు రాక్షసులందర్నీ చంపేస్తాడు" అన్నాడు. ఇంద్రజిత్తు చెప్పినట్లుగానే సారథి రథాన్ని హనుమంతుడు యుద్ధం చేస్తున్న చోటుకు తీసుకుపోయి నిలిపాడు. అంతట ఇంద్రజిత్తు బాణాల్ని, ఖడ్గాల్ని, పట్టిసాల్ని, గండ్రగొడ్డళ్ళను, హనుమంతుడిపైకి వర్షంలాగా కురిపించాడు. మహాబలశాలి అయిన ఆ వాయుపుత్రుడు వాటన్నింటినీ చేతులతో స్వీకరించి వాడిపైకే విసిరేశాడు. అప్పుడు కృద్ధుడైన హనుమంతుడు ఇంద్రజిత్తుతో "ఓరీ! నీవు రావణుడి పుత్రుడవైతే నేను వాయుపుత్రుణ్ణి. నువ్వేదో మహావీరుడనని మిడిసిపడుతున్నావు. నన్ను ఎదిరించి ఇంతవరకూ ఎవరూ ప్రాణాల్తో బయటపడలేదు" అన్నాడు. అప్పుడు విభీషణుడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! ఈ ఇంద్రజిత్తు దృష్టి అంతా హనుమంతుడిపైనే ఉంది. ఎట్లాగైనా హనుమంతుణ్ణి చంపాలనే పట్టుదలతో కనిపిస్తున్నాడు. ఇదే మంచి, అదునైన సమయం. నీ బాణాల్లోకే శ్రేష్ఠమైన బాణాల్ని ఎన్నిక చేసుకో. అతడి ఆయువుపట్లపై ప్రయోగించు. ఇంద్రజిత్తును

వెంటనే వధించు" అన్నాడు.

విభీషణుడు చెప్పింది లక్ష్మణుడు విన్నాడు. హనుమంతుడితో యుద్ధం చేయటానికి సిద్ధమై సింహనాదం చేస్తున్న పర్వతాకారుడైన ఇంద్రజిత్తును లక్ష్మణుడు చూశాడు.

# 86వ సర్గ ఇంద్రజిత్తు విభీషణుల సంవాదం

అంతట విభీషణుడు ధనుర్బాణాలతో సంసిద్ధుడై ఉన్న లక్ష్మణుణ్ణి చూసి సంతోషంతో అతణ్ణి సమీపంలో ఉన్న ఒక వనానికి తీసుకొని వెళ్ళాడు. అక్కడ ఇంద్రజిత్తు తలపెట్టిన యజ్ఞశాలను, హోమగుండాల్ని చూపించాడు. అక్కడే కారుమేఘం లాంటి మర్రిచెట్టొకటి ఉంది. విభీషణుడు ఆ చెట్టును చూపిస్తూ "లక్ష్మణా! ఇంద్రజిత్తు ఈ మర్రిచెట్టు కింద భూతబలినిచ్చి, యుద్ధానికి బయలుదేరాడంటే అదృశ్యుడై సమస్త భూతకోటినీ కాల్చుకుతింటాడు. వాడి బాణాలతో శత్రువులందర్నీ నిరాయుధుల్ని చేస్తాడు; బంధించేస్తాడు. అతడు ఈ మర్రిచెట్టు దగ్గరకు రాకముందే వాణ్ణి జయించాలి. అతడి రథాన్ని, గుర్రాల్నీ నీ బాణసంపదతో నాశనం చెయ్యాలి" అన్నాడు.

విభీషణుడి సలహా మేరకు లక్ష్మణుడు ధనుర్బాణాలను ధరించి ధనుష్టంకారం చేశాడు. అగ్నిహోత్రంలాగా మెరిసిపోతున్న ఆ రథాన్ని, కవచాన్ని ధరించి అధిరోహించి ఉన్న ఇంద్రజిత్తు అక్కడ ప్రత్యక్షం అయ్యాడు. పౌలస్త్యమహర్షి వంశంలో పుట్టిన ఆ మహాబలవంతుడు, అపరాజితుడు అయిన ఇంద్రజిత్తును చూసి లక్ష్మణుడు ఇలా అన్నాడు. "ఓ రాక్షసుడా! నీకు ధైర్యం ఉంటే, నీవు వీరుడవే అయితే మాయాయుద్ధం మాని, నాతో ముఖాముఖీ యుద్ధం చెయ్యి. నేను నిన్ను ఇప్పుడు యుద్ధానికి ఆహ్వానిస్తున్నాను" అన్నాడు.

లక్ష్మణుడి మాటలు విని, గొప్ప తేజస్సు, పౌరుషము గల ఇంద్రజిత్తు లక్ష్మణుడి ప్రక్కనే ఉన్న విభీషణుణ్ణి చూసి అతడితో ఇలా అన్నాడు. "ఓ రాక్షసుడా! నీవు ఈ లంకలోనే పుట్టిపెరిగావు. నా తండ్రికి సొంత తమ్ముడివి. నాకు పినతండ్రివి. నేను నీకు పుత్రుడి నవుతాను. అటువంటి నీవు, నీ పుత్రుడికే ద్రోహం తలపెట్టావు. నీవు వట్టి దుర్మతివి. ధర్మాన్ని దూషించినవాడా! నీవు జ్ఞాతుపట్లగాని, స్నేహితుల ఎడలగాని, జాతిపైనగాని, సోదరుల పైనగాని ఏమాత్రం ప్రేమాభిమానాలు లేనివాడవు. ఓ దుర్బుద్ధీ! నీవు సొంతవాళ్ళను కాదని, పరాయివాళ్ళ

పంచనజేరి ఊడిగం చేస్తున్నావు. శత్రువుల దగ్గర సేవకుడిగా ఉంటున్నావు. నిన్ను ఈ విధంగా చూడాల్సివచ్చినందుకు సిగ్గుపడుతున్నాను. నువ్వు చేస్తున్న ఈ పనికి సత్పురుషులు నిందిస్తారు. నీవు పరమ అల్పబుద్ధి గలవాడవు. అందుచేతనే నీవు చేసింది ఎంత నీచమైందో తెలుసుకోలేకుండా ఉన్నావు. నీవు స్వజనులను వదిలేసి నీచులైన ఇతరుల పంచను ఆశ్రయించావు. శత్రువులు గుణవంతులే కావచ్చు; తనవాళ్ళు గుణంలేనివాళ్ళే కావచ్చు. అయినా కూడా, గుణంలేని స్వజనులే మేలు. పరాయి వాడు ఎప్పటికీ పరాయివాడే కదా? తనవాళ్ళను వదిలేసి, శత్రుపక్షంతో చేతులుకలిపి స్వపక్షంవాళ్ళందర్నీ చంపిస్తావు. అటుపిమ్మట ఆ శత్రుపక్షంవాళ్ళు నిన్ను నిర్దాక్షిణ్యంగా చంపేస్తారు. రావణుని సోదరుడవైన ఓ రాక్షసుడా! నీవు లక్ష్మణుణ్ణి ఇక్కడకు తీసుకొచ్చి నా హోమాన్ని భగ్నం చేశావు. ఇది నీవు చేయవలసిన పనికాదు" అని పరుషంగాను, బాధతోను అన్నాడు.

ఇంద్రజిత్తు మాటలు విన్న విభీషణుడు ఇలా అన్నాడు. "ఓరీ! దుర్మార్గుడా! నీ కుటిలస్వభావం ఎవరికి తెలియదు? నన్ను గూర్చి, నా సత్ప్రవర్తన గూర్చి తెలిసికూడా ఏమీ తెలియనివాడిలాగా మాట్లాడుతున్నావు. నీ పినతండ్రిననే గౌరవం అయినా లేకుండా నోటికి వచ్చినట్లల్లా ప్రేలుతున్నావే? నేను రాక్షసవంశంలో పుట్టినా క్రూరకర్మలు ఎప్పుడూ చెయ్యలేదు. నేను గుణానికి విలువనిస్తానేకాని, కులానికి కాదు. నా అన్నగారి శీలము నా శీలానికన్నా భిన్నమైనదైనా కూడా నేనాయన్ను గౌరవిస్తూనే వచ్చాను. నిరసించలేదు. అయితే అధర్మాన్ని సహించలేను. దారుణమైన పనులంటే నాకు ఇష్టముండదు. మా స్వభావాలు ఎంత విరుద్ధమైనవే అయినా, సొంతతమ్ముణ్ణి దేశం నుండి బహిష్కరిస్తాడా? నీ తండ్రి నా పట్ల అట్లా ప్రవర్తించాడు.

ధర్మభ్రష్టుడై, శీలము లేనివాడై, పాపకార్యాలు చేసేవాడిని, చేత్తో పట్టుకున్న పామును అవతల పారేసినట్లు, విడిచిపెట్టేవాడే సుఖపడతాడు. ఇతరుల ధనాన్ని, భార్యను అపహరించే దుర్మార్గుణ్ణీ, తగలబడిపోతున్న ఇంటిని వదిలేసినట్లుగా వదిలెయ్యాలని పెద్దలంటారు. పరుల ధనాన్ని అపహరిం చడం, పరస్త్రీని తాకడం, మంచిహృదయం గల వాళ్ళను శంకించడం అనే

మూడు దోషాలు సర్వ నాశనానికి కారణాలవుతాయి. మహర్షుల్ని క్రూరంగా చంపటం, దేవతలతో విరోధం పెట్టుకోవడం, అహంకారం, రోషం, శత్రుత్వం, ప్రతికూలత్వం అనే దోషాల్లో ఏ ఒక్కటి ఉన్నా జీవితాన్ని, ఐశ్వర్యాన్ని నాశనం చేస్తాయి. నా అన్నగారైన రావణాసురుడిలో ఈ దోషాలు అన్నీ ఉన్నాయి. మేఘాలు పర్వతాల్ని కప్పివేసినట్లుగా, నా సోదరునిలో ఉన్న మంచిగుణాలన్నింటినీ ఈ దోషాలు కప్పివేశాయి. నీ తండ్రి, నా సోదరుడు అయిన రావణుడిలో ఈ దోషాలన్నీ ఉండటం చేత విడిచివచ్చేశాను. ఇకపైన ఈ లంకానగరంగాని, నీవుగాని, నీ తండ్రిగానీ ఉండరు. ఓ ఇంద్రజిత్తూ! నీవు ఎక్కువ గర్వంతో విర్రవీగిపోతున్నావు. దానికి తోడు మూర్ఖుడవు. కాగడా వేసి వెదికినా నీలో వినయం కనబడదు. పెద్దలంటే గౌరవం అసలే లేదు. యమపాశం చేత బంధించబడి ఉన్న నీవు నన్ను నోటికి వచ్చినట్లల్లా ప్రేలావు. ఆ దోషంచేతనే మరణం నీకు మరీ చేరువ అయ్యింది. ఇక నీవు ఆ మర్రిచెట్టు ఛాయకు కూడా పోలేవు. లక్ష్మణుణ్ణి ఎదిరించి జీవించటం కలలో మాట! లక్ష్మణునితో యుద్ధానికి సిద్ధం చెయ్యి. ఆపైన నీవు యమలోకానికి పోయి యమదూతలు చెప్పే పనులన్నీ చేస్తూ ఉంటావు. శరీరబలం, ఆయుధబలం ఉన్నది గదా! వాటన్నింటినీ ఖర్చుచెయ్యి. ఆపైన లక్ష్మణునిచే ప్రయోగించబడే వాడిబాణాలకు నీవు, నీ సైన్యం మరణించడం ఖాయం" అని చెప్పాడు.

# 87వ సర్గ ఇంద్రజిత్తుతో యుద్ధం

ఇంద్రజిత్తు విభీషణుని మాటలు విన్నాడు. క్రోధావేశాలతో పరుషమైన మాటల్తో ముందుకు వచ్చాడు. ప్రళయకాల యమునితో సమానమైన ఆ ఇంద్రజిత్తు, నల్లని గుర్రాలు పూన్చిన, బాగా అలంకారాలు చేసి ఉన్న ఆ దివ్యరథంపై నుండి ఖడ్గం పైకెత్తాడు. దృఢమైనది, వేగం గలదీ అయిన ధనుస్సును ధరించాడు. శత్రువులపాలిట యమపాశాల్లాంటి బాణాల్ని తీసుకున్నాడు. బాగా అలంకరించుకొని, శత్రుసంహారకుడైన ఆ ఇంద్రజిత్తు ఎదురుగా లక్ష్మణుణ్ణి చూశాడు.

లక్ష్మణుడు హనుమంతుని వీపుపై కూర్చొని, ఉదయపర్వతంపై సూర్యుడు వలె ప్రకాశించాడు. లక్ష్మణునితోపాటు ఉన్న విభీషణుడు, వానరనాయకులతో ఇంద్రజిత్తు "ఇప్పుడు నా ప్రతాపం ఏమిటో మీకు రుచి చూపించబోతున్నాను. కాచుకోండి. నా ధనుస్సు నుండి బయలుదేరే బాణాలు వర్షంలాగా మీ శరీరాలన్నింటిపైనా నింపివేస్తాను. దాంతో మీ శరీరాలన్నీ, అగ్నిచేత దూది భస్మమైపోయినట్లు, నేలకూలిపోతాయి. నేను తోమరాలతోను, ఋష్టులతోను మీ శరీరాలన్నింటినీ చీల్చివేస్తాను. మీ అందర్నీ యమలోకానికి పంపుతాను. పూర్వం మీ అన్నదమ్ములిద్దర్నీ పిడుగులాంటి నా బాణంచేత కట్టిపడేశాను. మూర్ఛపోయి పడిపోయారు. నాతో పెట్టుకోవటం అంటే పడగెత్తిన పాముతో పెట్టుకోవడమే; మిమ్మల్ని యమలోకానికి పంపుతాను" అన్నాడు.

అందుకు సమాధానంగా లక్ష్మణుడు ఇలా అన్నాడు. "ఓ రాక్షసుడా! నువ్వు చెయ్యలేని పనులు చేసినట్లుగా తలచుకుంటూ, ఊహించుకుంటూ సంతోషపడుతున్నావు. కార్యసాధకుడెవ్వడూ నీకుమల్లే ప్రగల్భాలు పలకడు. ఓరీ మూర్ఖుడా! నువ్వు నన్ను జయించానని చెప్పుకుంటూ మురిసిపోతున్నావు. నీవే కాదు, నన్ను ఎవ్వరూ జయించలేరు. ఆనాడు రాత్రి నీవు అదృశ్యరూపంలో ఉంటూ 'దొంగదెబ్బ' కొట్టావు. వీరులు అట్లా చెయ్యరు. ఓ రాక్షసుడా! నేను

ఇప్పుడు నీ ఎదురుగా ఉన్నాను. నీ ప్రతాపం ఏమిటో, నీ ప్రభావం ఎంతో, ఇప్పుడు చూపించు.”

అంతట మహాబలశాలి అయిన ఇంద్రజిత్తు ధనుస్సు చేతిలోకి తీసుకొని భయంకరమైన బాణాల్ని సంధించి లక్ష్మణునిపై ప్రయోగించాడు. ఆ బాణములు విషసర్పాల్లాగా లక్ష్మణుని పైకి దూసుకొనిపోయాయి. ఆ బాణాల్ని లక్ష్మణుడు ఎదుర్కొన్నాడు. కొన్ని బాణాలు లక్ష్మణుని తాకి శరీరంలో గుచ్చుకొని రక్తం ప్రవహించింది. అప్పుడు లక్ష్మణుడు పొగలేని అగ్నివలె ప్రకాశించాడు. లక్ష్మణుడు తన బాణములచే బాధించబడుట చేత, ఇంద్రజిత్తు సంతోషాన్ని పట్టలేకపోయాడు. బిగ్గరగా గర్జిస్తూ ఇలా అన్నాడు. “ఓ లక్ష్మణా! రెక్కలు కట్టినవి, అంచులతో కూడినవి, నీ ప్రాణాలు తీసేవి అయిన బాణాల్ని నీపై సంధిస్తున్నాను. కాచుకో, ఇప్పుడు నేను ప్రయోగించే బాణాలు తగిలి చచ్చి నేలపై పడిపోతావు. నీ దేహాన్ని డేగలు, గ్రద్దలు, నక్కలు తింటాయి. ఓరీ దుష్టుడా! క్షత్రియాధముడా! రామ కింకరుడా! నిన్ను చంపిన సంగతి ఆ రాముడికి తెలుస్తుంది. నేను నీ శిరస్సును ఖండించి లంకాపట్టణానికి తీసుకొనిపోతాను. నీ విరిగిపోయిన కవచాన్ని, నేలపై పడి ఉన్న ధనుస్సును, నీ మొండాన్నీ మాత్రమే రాముడు చూడగలడు.” ఇలా అంటూ బిగ్గరగా అరిచాడు. అంతట లక్ష్మణుడు మెల్లగాను, మృదువుగాను ఇలా అన్నాడు. “చెడ్డబుద్ధి గలవాడా! ప్రగల్భాలు పలకటం మాను! ఓ రాక్షసుడా! క్రూరకర్మలు చెయ్యడం నీకు వెన్నతో పెట్టిన విద్య. అదే చేతల్లో చేసి చూపించు. ఓరీ అధముడా! నేను బడాయి మాటలేవీ మాట్లాడను. చెయ్యవలసిందేదో చేసి చూపిస్తాను. నీ మరణం నా చేతుల్లో రాసిపెట్టి ఉంది.” ఇలా అంటూ అయిదు నారాచ బాణాల్ని గట్టిగా నారి సంధించి గొప్పవేగంతో ఇంద్రజిత్తు వక్షఃస్థలంపై కొట్టాడు. ఆ రెక్కలు కట్టిన బాణాలు ప్రజ్వలించే సర్పాల్లాగా ఇంద్రజిత్తుకు వక్షఃస్థలంపై తగిలి రక్తంతో తడిసి సూర్యకిరణాల్లాగా ప్రకాశించాయి. లక్ష్మణుని బాణాలకు బదులుగా ఇంద్రజిత్తు మూడు బాణాల్ని ప్రయోగించి లక్ష్మణుణ్ణి కొట్టాడు.

ఈ విధంగా పరస్పరం ఒకరినొకరు కొట్టుకొంటూ జయం పొందాలనే ఆకాంక్షతో యుద్ధం భయంకరంగా సాగింది. ఇద్దరూ సమఉజ్జీలే; ఇద్దరూ పరాక్రమం కలవారే; ఇద్దరూ

బలవంతులే; ఇద్దరూ తేజస్సు గలవారే; అసమాన తేజోవంతులు. ఆ వీరులిద్దరూ ఆకాశంలో గ్రహాలవలె పోరాడారు. దేవేంద్రుడు వృత్రాసురుడు వలె పోరాడారు. మహామేఘాల్లాగా ఒకరిపై మరొకరు బాణాలవర్షం కురిపించారు. భయంకరమైన ధనుస్సులు, బాణాలు, ఖడ్గాలు మొదలైనవి ధరించిన ఇంద్రజిత్తు, లక్ష్మణుడు ఒకరికన్నా మరొకరు విజృంభించి యుద్ధం చేశారు.

లక్ష్మణుని ధనుష్టంకారము విని ఇంద్రజిత్తు పాలిపోయిన ముఖంతో లక్ష్మణుని వంక చూశాడు. ఇంద్రజిత్తులో చోటుచేసుకున్న దిగులు, వ్యాకులతను విభీషణుడు పసిగట్టాడు. అప్పుడు లక్ష్మణుడితో "ఓ మహాబాహూ! నేను ఇంద్రజిత్తులో కనపడే లక్షణాలను బట్టి, అతడు దుర్బలుడైనట్లు తెలుస్తోంది. త్వరపడు, నీవిప్పుడు ఇంద్రజిత్తుపై దాడి తీవ్రతరం చెయ్యి" అని ప్రోత్సహించాడు. అప్పుడు లక్ష్మణుడు ఇంద్రుని వజ్రాయుధంతో సమానమైన బాణాన్ని వదలగా, అది ఇంద్రజిత్తు మర్మావయావలను తాకి శరీరం అంతా క్షోభ చెందించింది. క్షణకాలం మూర్ఛపోయాడు. మళ్ళీ క్షణాల్లోనే తేరుకుని స్థిరంగా నిలబడగలిగాడు. కృద్ధుడైపోయి నేత్రాలు ఎర్రబడ్డాయి. లక్ష్మణునితో "ఓ లక్ష్మణా! మొదటి యుద్ధంలో నా పరాక్రమం చూపించాను. గుర్తు లేదా? అప్పుడే మరచిపోయావా? నా ధాటికి తట్టుకోలేక నీవు, నీ అన్నకూడా నేలపైపడి దొర్లారే! అయినా మళ్ళీ నా ఎదుటపడటానికి ధైర్యం చేస్తున్నావంటే, నీ జ్ఞాపకశక్తి అయినా నశించి ఉండాలి. లేదా యమలోకానికి పోవటానికి సిద్ధపడి అయినా వచ్చి ఉండాలి. ఏది ఏమైనాగానీ, మళ్ళీ నా ఎదుటపడే సాహసం చేశావు కాబట్టి నా పరాక్రమం మళ్ళీ చూపిస్తాను. కాచుకో" అంటూ ఏడు నిశితమైన బాణాల్ని లక్ష్మణుడి పైకి సంధించాడు. వాడి అయిన అంచులుగల ఆ బాణాలన్నీ హనుమంతుడికి తగిలాయి. గురితప్పటంతో, ఇంద్రజిత్తుకు బాగా కోపం వచ్చింది. ఈసారి నూరు బాణాల్ని ప్రయోగించాడు. ఆ నూరు బాణాలు పోయి విభీషణుడికి తగిలాయి.

అప్పుడు రాముని సోదరుడు, నరశ్రేష్ఠుడు అయిన లక్ష్మణుడు ఇంద్రజిత్తు వేసిన బాణాలు గురితప్పటం చూసి నవ్వుకున్నాడు. "ఓ రాక్షసుడా! యుద్ధానికి వచ్చిన శూరులు బాణాల్ని ఈ

విధంగా ప్రయోగించరు. నీవు ప్రయోగించిన బాణాలు పసలేనివిగా కనిపిస్తున్నాయి. శత్రువును ఛేదించేవిగా లేవు. యుద్ధంలో జయం కావాలనుకునే వాళ్ళెవరూ బాణాల్ని ఇట్లా ప్రయోగించరు” అని అంటూ, ఇంద్రజిత్తుపై వాడి అయిన బాణాల్ని ప్రయోగించాడు. దాంతో ఇంద్రజిత్తు కవచం విరిగి ముక్కలై ఆకాశం నుండి రాలిన ఉల్కలవలె రథం మధ్యలో పడ్డాయి. లక్ష్మణుడు ప్రయోగించిన నారాచబాణాల వలన కవచం విరిగిపోవటం చేత ఇంద్రజిత్తు శరీరం అంతా గాయాలై నెత్తురు కారుతూ ఉదయసూర్యుడి వలె ఎఱ్ఱబడింది. దాంతో ఉగ్రుడైన ఇంద్రజిత్తు వాడి అయిన వెయ్యి బాణాల్ని లక్ష్మణునిపై ప్రయోగించాడు. దాంతో లక్ష్మణుడు ధరించిన కవచం కూడా విరిగిపోయింది. ఈ విధంగా ఒకరినొకరు తీసిపోకుండా పరస్పరం ప్రతిక్రియ చేసుకుంటూ పోరాడారు. ఆ యుద్ధంలో ఇద్దరూ కవచాల్లేకుండా యుద్ధం చెయ్యాల్సి రావడంతో, వాళ్ళ శరీరం అంతా తూట్లుపడి రక్తంతో తడిసిపోయింది. వాళ్ళ శరీరంలో నుండి రక్తం సెలయేర్లయి పారింది. అయినా మొక్కవోని పట్టుదలతో, జయించాలనే తీవ్రకాంక్షతో ఇద్దరూ మదించిన ఏనుగుల్లా పోరాడారు. వారి యుద్ధం ఎంతకాలం జరిగిందో వాళ్ళకే తెలియదు. అంతటి దీర్ఘకాలంపాటు యుద్ధం చేసినా, వాళ్ళలో అలసట కాని, విసుగు కానీ కనిపించలేదు. అస్త్రవేత్తలలో శ్రేష్ఠులైన వారిద్దరూ అనేక రకాలైన అస్త్రాల్ని ప్రయోగించడం చేత ఆకాశం అంతా బాణాల్తో పందిరివేసినట్లయింది. వాళ్ళిద్దరూ వ్యాకులతతోను, నిటూర్పులతోను, గర్జింపులతోనూ చేసే ధ్వనులు భయంకరమైన ఉరుముల్లాగా వినబడ్డాయి; కంపం పుట్టించాయి.

కీర్తిమంతులు, జయం పొందాలనే తీవ్రమైన పట్టుదలగలవారూ అయిన వాళ్ళిద్దరూ బంగారుపొన్నులు గల నారాచబాణాల చేత గాయపడగా, రక్తం ఏరులైపారింది. యుద్ధంలో వారు ప్రయోగించిన బాణాలు, యజ్ఞము నందు అగ్నుల ప్రక్కన పడివున్న దర్భల్లాగా, గుట్టలుగా పడిఉన్నాయి. గాయాలతో, నెత్తురుతో తడిసి ఉన్నవారి శరీరాలు, ఆకులులేని బాగా పుష్పించిన మోదుగచెట్టులాగా, బూరుగ చెట్టువలె ప్రకాశించాయి. అప్పుడు మహాత్ముడైన విభీషణుడు యుద్ధరంగంలో పరాజయం ఎరుగని లక్ష్మణుని యుద్ధపరిశ్రమను తొలగించుటకై హితమూ, ప్రియమూ చేకూర్చుచూ, యుద్ధరంగంలోనే ఉండిపోయాడు.

# 88వ సర్గ లక్ష్మణుడు ఇంద్రజిత్తు సారథిని వధించటం

లక్ష్మణ –ఇంద్రజిత్తు లిరువురూ 'జయం' అనే ఒకే ఒక లక్ష్యంకోసం మదించిన ఏనుగుల్లాగా ఒకరిపైఒకరు యుద్ధంచేస్తూ ఉండటం చూస్తున్న విభీషణుడు యుద్ధరంగంలోకి పోయి నిలబడ్డాడు. తానూ ధనుస్సును ధరించి ధనుష్టంకారం చేసి, కరుకుకొనలతో ఉన్న బాణాల్ని రాక్షసులపై సంధించాడు. ఆ బాణాలు అగ్నిశిఖరాల్లాగా అన్నివైపులకూ పోయి రాక్షస వీరులపై పడ్డాయి. విభీషణుడు యుద్ధం చేస్తూ ఉంటే అతడి మంత్రులు కూడా శూలాలతోను, ఖడ్గాలతోను, పట్టిసాలతోను రాక్షసవీరుల్ని వధించారు. అప్పుడా విభీషణుడు, గున్నఏనుగుల మధ్య నున్న మదపుటేనుగువలె శోభించాడు. యుద్ధములందు ఆరితేరినవాడు కావటం వలన, విభీషణునకు సమయాసమయాలు బాగా తెలుసు. వానరవీరులకు తగు విధంగా సూచనలిస్తూ, ప్రోత్సాహకరంగా మాట్లాడుతూ, జాగ్రత్తలు బోధిస్తూ వారి ప్రక్కన అండగా నిలబడ్డాడు. వానరులతో ఇలా అన్నాడు. "ఓ వానరవీరుల్లారా! ఇప్పుడు రావణాసురుడికి సైన్యంలో మిగిలింది ఈ ఇంద్రజిత్తు ఒక్కడే! రావణాసురుడి ఆశలన్నీ వీడిపైనే పెట్టుకొని బ్రతుకుతున్నాడు. మీరు ఎందుకట్లా నిరాసక్తులుగా ఉంటారు? ఉత్సాహం తెచ్చుకోండి. బాగా యుద్ధం చెయ్యండి. ఈ పాపిష్టివాణ్ణి చంపేస్తే, రావణుడు మినహా మిగిలిన సైన్యం అంతా నశించినట్లే. ప్రహస్తుడు, నికుంభుడు, కుంభకర్ణుడు, కుంభుడు, ధూమ్రాక్షుడు, జంబుమాలి, మహామాలి, అశనిప్రభుడూ, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు, వజ్రదంష్ట్రుడు, సంహాది, వికటుడు, తపనుడు, మందుడు, ప్రఘాస – ప్రఘస, ప్రజంఘ, జంఘులు, అగ్నికేతువు, రశ్మికేతువు, విద్యుజ్జిహ్వ, దిజిహ్వ, సూర్యశత్రు, అకంపన, సుపార్శ్వ, చక్రమాలి, కంపనులు, దేవాంతకుడు, నరాంతకుడు మొదలైన వారంతా హతులయ్యారు.

ఓ వానరులారా! మీరంతా గొప్పబలం గలిగిన ఇంతమంది రాక్షసుల్ని చంపారు. మీ కండబలంతో సేతువు కట్టి సముద్రాన్ని దాటారు; ఇప్పుడు మీ శక్తిసామర్థ్యాల ముందు ఈ ఇంద్రజిత్తు గోష్పాదమంతటివాడు. వీడిని కూడా అంతమొందించండి. శత్రుశేషం లేకుండా

చెయ్యండి. తండ్రినైన నేను పుత్రుణ్ణి చంపటం ధర్మం కాదు. అయినా రామప్రభువు కోసం నా సోదరుడి పుత్రుణ్ణి చంపేస్తాను. నా మనస్సు, బుద్ధి అతణ్ణి చంపమనే అంటున్నాయి. కానీ, కళ్ళనిండా నీరు నిండిపోయి ఆ పని చెయ్యనివ్వడం లేదు. అందుచేత, మహాబాహువు లక్ష్మణుడే ఇతణ్ణి వధించటానికి సమర్థుడు. మీరందరూ కలసి ఈ ఇంద్రజిత్తు అనుచరుల భరతం పట్టండి."

విభీషణుడు ఇట్లా చెప్పగానే వానరవీరులంతా ఉత్సాహంగా తోకలు ధ్వజాల్లాగా పైకెత్తి సింహనాదాలు చేశారు. పురివిప్పి నాట్యం చేస్తున్న నెమళ్లవలె కోలాహల ధ్వనులు చేశారు. అంతట జాంబవంతుడు భల్లూక సైన్యాన్ని వెంటబెట్టుకొని రాక్షసుల్ని ఎదిరించేందుకు బయలుదేరాడు. భల్లూకయోధులు రాళ్ళతోను, వృక్షాలతోను రాక్షసుల్ని కొట్టారు. గోళ్ళతో రక్కారు. కోరలతో చీల్చివేశారు. అప్పుడు మహాబలశాలురైన రాక్షసులు జాంబవంతుణ్ణి ముట్టడించి, జాంబవంతుడిపై బాణాలు ప్రయోగించారు; గండ్రగొడ్డళ్ళతోను, పట్టిసములతోను, తోమరములతోను కొట్టారు. అప్పుడా వానర – రాక్షసుల మధ్య, దేవదానవుల్లాగా, భయంకర సంగ్రామం నడిచింది.

ధైర్యముగల హనుమంతుడు, లక్ష్మణుని తన వీపుపై నుండి క్రిందకు దింపి, పర్వతం వంటి పెద్దపెద్ద శిలల్ని పెకలించి వేలాది రాక్షసుల్ని సంహరించాడు. ఇంద్రజిత్తు పినతండ్రి అయిన విభీషణునితో చేస్తున్న యుద్ధాన్ని ఆపి, మళ్ళీ లక్ష్మణుడిపై లంఘించాడు. లక్ష్మణ – ఇంద్రజిత్తు లిద్దరూ ఒకరిపై మరొకరు బాణాల వర్షం కురిపించుకున్నారు. ఆ మహావీరులిద్దరూ పరస్పరం బాణాలు సంధించుకుంటూ, వర్షాకాలంలో మేఘాలు ఆవరించిన సూర్యచంద్రుల్లాగా, బాణాలు విస్తరించుకోవటం వల్ల ఒకరికొకరు కనిపించకుండా పోరాడారు. ఆ సమయంలో వారు ధనుస్సును ఎట్లా పట్టుకున్నారో, వింటిని ఎట్లా సారించారో, ఎట్లా బాణాన్ని వదిలారో ఎవరూ చూడలేకపోయారు. కానీ వారు విడిచిన బాణాలు ఆకాశాన్ని కప్పేస్తున్నాయి; నేలమీద ఏ వస్తువు కనిపించటం లేదు. ఆ మహాయుద్ధం మహాభీకరంగా సాగింది. విజయలక్ష్మి ఎవర్ని

వరిస్తుందో ఎవరూ చెప్పలేకపోయారు.

వారిద్దరూ ప్రయోగించిన బాణాలు ఆకాశం అంతా కప్పివేయగా, అంధకారం అలముకొంది. నెత్తురు మాంసంతో నేలంతా తడిసిపోయింది. మాంసాహారులైన పక్షులు, జంతువులు ఆ యుద్ధభూమికి చేరుకున్నాయి. గాలి స్తంభించింది. అగ్ని ప్రజ్వలించక మందంగా మండింది. యుద్ధం లేకుండా లోకాలన్నీ సుఖశాంతులతో ఉండాలని మహర్షులు ఆశీర్వదించారు. గంధర్వులు, చారణులు ఆ ఘోరయుద్ధాన్ని చూడటానికి భయపడుతూ వచ్చారు.

అప్పుడు లక్ష్మణుడు నాలుగు బాణాల్ని ఇంద్రజిత్తు రథానికి పూన్చిన గుఱ్ఱాలపై ప్రయోగించాడు. అంతట పిడుగువంటి బాణాన్ని ప్రయోగించి సారథి శిరస్సును నరికేశాడు. సారథి చనిపోవటంతో మహాతేజశ్శాలి అయిన ఇంద్రజిత్తు తానే రథాన్ని స్వయంగా సారథ్యం చేసుకుంటూ ధనుస్సును కూడా ఉపయోగించాడు. సారథి లేకుండా, రథాన్ని సారథ్యం చేసుకుంటూనే యుద్ధం కూడా చేస్తున్న ఇంద్రజిత్తును చూసిన వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. ఇంద్రజిత్తు తన లోపాన్ని లక్ష్యపెట్టకుండా నిర్భయంగా రథం మీద తిరుగుతూ ఉండటం చూసిన లక్ష్మణుడు అతడిపై అమిత వేగంగా బాణాల్ని ప్రయోగించాడు. ఆ యుద్ధంలో సారథి చచ్చిపోవడం ఇంద్రజిత్తు పాలిట అశనిపాతం అయింది. దాంతో ఇంద్రజిత్తుకు యుద్ధంపై ఉత్సాహం పోయింది. ఇంద్రజిత్తు ముఖం వేలాడేసుకుని ఉండటం చూసిన వానరులంతా సంతోషంతో లక్ష్మణుణ్ణి కీర్తించారు. అప్పుడు ప్రమాథి, శరభుడు, రభసుడు, గంధమాదనుడు అనే నలుగురు వానరయోధులు ఎగిరి ఇంద్రజిత్తు రథానికి కట్టిన నాలుగు గుఱ్ఱాలపై పడ్డారు. పర్వతాల్లాంటి ఆ వానరయోధుల బరువుకు ఆ గుఱ్ఱాలు నాలుగూ నెత్తురు కక్కుకుని చచ్చిపోయాయి. అంతటితో ఆగక ఆ నలుగురు యోధులూ ఇంద్రజిత్తు రథాన్ని విరగ్గొట్టారు. పిమ్మట వాళ్ళు నలుగురూ పోయి లక్ష్మణుడి ప్రక్కన నిలబడ్డారు.

సారథి చచ్చిపోయాడు. గుఱ్ఱాలు చచ్చిపోయాయి; రథం విరిగిపోయింది. అంతట

ఇంద్రజిత్తు రథంపై నుండి దిగి లక్ష్మణుని పైకి లంఘించాడు. అప్పుడు దేవేంద్రుడి వంటి పరాక్రమశాలి అయిన లక్ష్మణుడు వాడి అయిన బాణాల్ని ఇంద్రజిత్తుపై వదలి, అక్కడే నిలబడిపోయేట్లు చేశాడు.

# 89వ సర్గ లక్ష్మణుడు ఇంద్రజిత్తును సంహరించడం

రథం విరిగిపోయింది. గుర్రాలు చనిపోయాయి. మహాతేజశ్శాలి అయిన ఇంద్రజిత్తు నేలపై నిలచి లక్ష్మణుడితో యుద్ధం చేస్తున్నాడు. వాళ్ళిద్దరూ ఒకరిని చంపాలని ఇంకొకరు భీకరమైన బాణాల్ని ప్రయోగించుకుంటూ యుద్ధం చేస్తున్నారు. వారప్పుడు మహారణ్యంలో గెలుపుకోసం పోట్లాడే మదపుటేనుగుల్లాగా ఉన్నారు. అప్పుడు తమతమ నాయకుల విజయాన్ని కోరుకుంటూ ఇరుపక్షాల సైనికులు ఒకళ్ళనొకళ్ళు చంపుకుంటున్నారు. ఇంద్రజిత్తు రాక్షసవీరులందరికీ ఉత్సాహాన్ని ప్రేరేపిస్తూ ఇలా అన్నాడు. "ఓ రాక్షస వీరులారా! ఇప్పుడు దిక్కులన్నీ చీకట్లు కమ్ముకున్నాయి. రాక్షసులెవరో, వానరులెవరో తెలుసుకోకుండా ఉన్నారు. కాబట్టి మీరెవరూ ధైర్యాన్ని విడువవద్దు. వానరులందర్నీ చంపండి. నేను లంకకు పోయి వేరే రథంపైన యుద్ధానికి వస్తాను. మీరంతా వానరుల్ని అడ్డగించి నాపై యుద్ధానికి రాకుండా జాగ్రత్త పడండి" అని అంటూ ఇంద్రజిత్తు లంకానగరంలోకి ప్రవేశించాడు.

శత్రుసంహారకుడైన ఇంద్రజిత్తు వానరులను మభ్యపెట్టి లంకా నగరానికిపోయి, బంగారంచే అలంకరించబడ్డదీ, ఉత్తమమైన అశ్వాలను పూన్చినది, శ్రేష్ఠమైన ఆయుధాలతో నింపబడినది, గుర్రముల స్వభావం తెలిసినవాడు, సందర్భానుసారంగా సలహాలు ఇవ్వగలవాడైన సారథిచే సిద్ధం చేయబడిన రథాన్ని అధిరోహించి మళ్ళీ యుద్ధభూమికి వచ్చాడు.

ఇంద్రజిత్తు, రథారూఢుడై రావడం చూసిన లక్ష్మణుడు, విభీషణుడు అతడి చురుకుదనానికి ఆశ్చర్యపోయారు. ఇంద్రజిత్తు కోపావేశంతో మండిపడుతూ వానరులపై విచ్చలవిడిగా బాణవర్షాన్ని కురిపిస్తూ అనేకమంది వానరుల్ని చంపాడు. నారాచ బాణాలచే బాధించబడిన వానరులంతా, దేవతలు బ్రహ్మదేవుని వద్ద మొరపెట్టుకున్నట్లు, లక్ష్మణుని వద్దకు పోయి మొరపెట్టుకున్నారు.

అంతట లక్ష్మణుడు ధనుస్సు చేత ధరించి ఇంద్రజిత్తును ఎదుర్కొన్నాడు. మొదటగా

ఇంద్రజిత్తు చేతిలోని ధనుస్సును విరగ్గొట్టాడు. అప్పుడు ఇంద్రజిత్తు మరో ధనుస్సును తీసుకున్నాడు. లక్ష్మణుడు ఆ ధనుస్సును కూడా విరగ్గొట్టాడు. అంతట విషసర్పాల్లాంటి అయిదు బాణాల్ని సంధించి ఇంద్రజిత్తు వక్షఃస్థలంపై కొట్టాడు. ఆ బాణాలు అయిదూ, ఇంద్రజిత్తు శరీరాన్ని ఛేదించి రక్తంతో తడిసి నేలమీద పడిపోయాయి. ఇంద్రజిత్తు ధనుస్సు పోగొట్టుకొని ముఖం నుండి రక్తం కారుతూ ఉండగా, గట్టి వింటినారి గల మరో ధనుస్సును గ్రహించాడు. ధనుర్విద్య యందు మహానేర్పరి అయిన ఆ ఇంద్రజిత్తు, ఇంద్రుడు వర్షం కురిపించినట్లుగా, లక్ష్మణునిపై బాణాల వర్షం కురిపించాడు. మహాతేజశ్శాలి అయిన లక్ష్మణుడు బెదరక చెదరక, ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణాలలో ఒక్కటి కూడా తన సమీపానికి రాకముందే, మార్గమధ్యంలోనే, అన్నింటినీ ఛేదించివేశాడు. ఏమాత్రం తొట్రుపాటు లేని లక్ష్మణుడు మహా అద్భుతమైన పరాక్రమాన్ని ఇంద్రజిత్తుకు చూపించాడు. అట్లా కోపించిన లక్ష్మణుడు, ఆయుధ ప్రయోగంలో తనకున్న నేర్పునంతా ప్రదర్శిస్తూ రాక్షసులందరిపై మూడేసి బాణాలను ప్రయోగించాడు. ఆ బాణాలు పోయి ఇంద్రజిత్తును కూడా తాకాయి.

బలవంతుడు, శత్రుసంహారకుడు, శత్రువు అయిన లక్ష్మణుడు గట్టిగా కొట్టడంతో, వీరుడైన ఇంద్రజిత్తు తిరిగి అతడిపై వాడి అయిన బాణాల్ని ప్రయోగించాడు. ధర్మాత్ముడైన లక్ష్మణుడు ఇంద్రజిత్తు వేసిన బాణాలు తనదాకా రాకముందే వాటన్నింటినీ వాడి అయిన తన బాణాలచేత ఛేదించాడు. వంగిన కణుపులు గల భల్లబాణాలతో ఇంద్రజిత్తు సారథిని కొట్టి, సారథి తలను ఖండించాడు. సారథి పడిపోయినా కూడా, ఆ గుర్రాలు ఎంతమాత్రం తొట్రుపాటు లేకుండా, మండలాకారంగా సంచరిస్తూ రథాన్ని లాక్కుంటూపోయాయి. ఆ అశ్వముల అద్భుత ప్రావీణ్యానికి అంతా ఆశ్చర్యపోయారు. లక్ష్మణుడు, యుద్ధభూమియందున్న ఇంద్రజిత్తు గుర్రాల్ని భయపెట్టేందుకై వాటిపై బాణాల్ని ప్రయోగించాడు. లక్ష్మణుడు తన గుర్రాలను అడ్డుకోవటం సహించని ఇంద్రజిత్తు, అతణ్ణి పది బాణాలతో కొట్టాడు. ఆ బాణాలు లక్ష్మణుని కవచానికి తగిలి విరిగి ముక్కలయ్యాయి.

అంతట రావణపుత్రుడైన ఇంద్రజిత్తు లక్ష్మణుని కవచంపై ప్రయత్నించటం మాని, మంచి పొన్నులుగల మూడు బాణాల్ని లక్ష్మణుని లలాటంపై ప్రయోగించాడు. ఆ మూడు లక్ష్మణుని లలాటంపై నాటుకుని మూడు శిఖరాలున్న పర్వతంవలె లలాటం ప్రకాశించింది. దీంతో కోపించిన లక్ష్మణుడు అయిదు బాణాల్ని గురిచూసి కుండలాలతో అలంకరించిన ఇంద్రజిత్తు ముఖంపై కొట్టాడు. వీరులు, గొప్పబలం గలవారు, ధనుర్ధారులు అయిన ఆ లక్ష్మణ – ఇంద్రజిత్తులు ఆ విధంగా పరస్పరం వాడి అయిన బాణాలతో కొట్టుకున్నారు. వాళ్లిద్దరి శరీరాలు బాణాలతో తూట్లుపడి ఒళ్ళంతా రక్తం కారగా, వారప్పుడు పుష్పించిన మోదుగ వృక్షాలవలె కనిపించారు. ఎట్లాగైనా జయం సంపాదించాలనే పట్టుదలతో వాడి అయిన బాణముల చేత అన్ని అవయవాలను కొట్టుకున్నారు. ఇంద్రజిత్తు కలత చెందిన మనస్సు గలవాడై, కోపంతో మూడు బాణాల్ని పినతండ్రి అయిన విభీషణుడిపై ప్రయోగించాడు. మిగిలిన వానర నాయకులందరిని ఒక్కొక్క బాణంతో కొట్టాడు. కోపించిన విభీషణుడు ఇంద్రజిత్తు గుర్రాలను తన గదతో బాది చంపాడు. సారథిని అంతకు పూర్వమే పోగొట్టుకొని, ఇప్పుడు గుర్రాల్ని కూడా నష్టపోవడంతో, ఇంద్రజిత్తు రథంపై నుండి నేలపైకి దూకి, పినతండ్రి అయిన విభీషణుణ్ణి శక్తి ఆయుధంతో కొట్టాడు. విభీషణునిపైకి వస్తున్న శక్తిని ముందుగానే చూసిన లక్ష్మణుడు తన బాణంతో అడ్డుకుని ముక్కలుగా చేశాడు. దృఢమైన శరీరం గల విభీషణుడు, రథాన్ని నష్టపోయి, తనతోపాటే నేలపై నుండి యుద్ధం చేస్తున్న ఇంద్రజిత్తు వక్షః స్థలంపై వజ్రంతో సమానమైన అయిదు బాణాల్ని వేశాడు. ఆ బాణాలన్నీ ఇంద్రజిత్తు వక్షఃస్థలాన్ని చీల్చి నెత్తురులో తడిసి నేలపై పడ్డాయి. పినతండ్రిపై కోపించిన ఇంద్రజిత్తు, యమునిచే ప్రసాదించబడిన ఉత్తమమైన బాణాన్ని విభీషణునిపై ప్రయోగించాడు. కుబేరునిచే ప్రసాదించబడినది, భయంకరమైన పరాక్రమం గల ఉత్తమమైన బాణాన్ని వేసి లక్ష్మణుడు దాన్ని అడ్డుకున్నాడు.

అటు ఇంద్రజిత్తు యముడు ఇచ్చిన అస్త్రాన్ని, ఇటు లక్ష్మణుడు కుబేరుడు ఇచ్చిన అస్త్రాన్ని ధనుస్సుల్లో సంధించారు. ఇద్దరూ నారి సంధించి ధనుష్టంకారం చేశారు. ఆ మోత క్రౌంచపక్షుల కేకల్లా ఉన్నాయి. అప్పుడా అస్త్రాలు రెండూ మండుతూ ఒకదాన్ని మరొకటి ఎదుర్కొన్నాయి. అవి

రెండూ చాలాసేపు మంటలు మండిస్తూ నిప్పురవ్వలు రగిలి అంతరిక్షంలో పోరాడి చివరకు రెండూ నేలకూలాయి. ఇద్దరూ తమ ప్రయత్నం వ్యర్థం కావడంతో సిగ్గుపడ్డారు; కోపం వచ్చింది. వెంటనే లక్ష్మణుడు వారుణాస్త్రాన్ని సంధించాడు. దేవేంద్రుణ్ణే జయించిన ఇంద్రజిత్తు రుద్రదేవతాకమనే అస్త్రాన్ని సంధించాడు. ఆ అస్త్రం వారుణాస్త్రాన్ని పడగొట్టింది. అంతట జయాన్ని కాంక్షిస్తూ ఇంద్రజిత్తు ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. లక్ష్మణుడు దానికి దీటుగా సూర్యాస్త్రాన్ని సంధించాడు. ఆ సూర్యాస్త్రం, ఆగ్నేయాస్త్రాన్ని అడ్డుకుంది. దాంతో కృద్ధుడైన ఇంద్రజిత్తు ఒక్క బాణంతో శత్రువులందరినీ సంహారం చెయ్యాలనుకొని అసురాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్ర ప్రభావంతో ధనుస్సులో నుండి వదిలిన ఆ బాణంలో నుండి మండే బాణాలు, ముద్గరలు, శూలాలు, గదలు, ఖడ్గాలు, గండ్రగొడ్డళ్ళు బయలుదేరాయి. అది సమస్త శత్రువుల్నీ నాశనం చేసే ప్రభావం గలది. అది చూసిన లక్ష్మణుడు దానికి దీటుగా మహేశ్వరాస్త్రాన్ని వదిలాడు. ఆ మహేశ్వరాస్త్రం, అసురాస్త్రం నుండి వెలువడిన ఆయుధాలన్నింటినీ వెంబడించి పడగొట్టింది.

వాళ్ళిద్దరికీ ఆశ్చర్యకరమైన, రోమాంచమును కలిగించు యుద్ధం జరిగింది. ఆకాశంలో సంచరించే భూతాలన్నీ లక్ష్మణుని చుట్టూ నిలిచాయి. దేవేంద్రుణ్ణి ముందు ఉంచుకొని ఉన్న ఋషులు, పితృదేవతలు, దేవతలు, గంధర్వులు, గరుడులు, ఉరుగులు మొదలైన వారంతా లక్ష్మణునికి రక్షణగా నిలిచారు.

పిమ్మట లక్ష్మణుడు తాకితేనే తగలబడిపోయేదీ, ఇంద్రజిత్తును చీల్చివేయగలదీ అయిన మరొక శ్రేష్ఠమైన అస్త్రాన్ని సంధించాడు. వీరుడైన లక్ష్మణుడు సంధించిన ఆ బాణం మంచి రెక్కలతో గుండ్రంగా, అందంగా, ఉండి తాకగానే చంపేసే సమర్థవంతం గలది. ఆ అస్త్రం నివారింప శక్యంకానిది. రాక్షసులకు భయాన్ని కలిగించేది. సర్పవిషంతో సమానమైనది. ఆ బాణం సదా దేవతల చేత పూజించబడుతూ ఉంటుంది.

పూర్వం దేవాసుర యుద్ధంలో గొప్ప తేజస్సుగలవాడు, సమర్థుడు, పరాక్రమవంతుడు,

ఆకుపచ్చని గుర్రం గలవాడు అయిన దేవేంద్రుడు ఈ బాణాన్ని ప్రయోగించి దానవులను జయించాడు.

సుమిత్రానందనుడయిన లక్ష్మణుడు, యుద్ధంలో ఎన్నడూ ఓటిమిని ఎరుగని ఐంద్రాస్త్రాన్ని, శ్రేష్ఠమైన బాణాన్ని, ధనుస్సునందు సంధించి ఇలా అన్నాడు. "ఓ దివ్యాస్త్రమా! రాముడు ధర్మాత్ముడైతే, సత్యసంధుడైతే, పౌరుషంలో ఎదిరించగలవాడెవరూ లేనివాడైతే, ఈ ఇంద్రజిత్తును చంపుము" అని పలికి వంకరలేకుండా సూటిగా వెళ్ళే బాణాన్ని చెవి దాకా వింటిని లాగి, ఇంద్రజిత్తుపై ప్రయోగించాడు.

శత్రుసంహారకుడైన లక్ష్మణుడు ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ బాబం గురి తప్పకుండా సూటిగా పోయి శిరస్త్రాణాన్ని ధరించి, దేహానికి కవచం తొడుక్కుని, ధగధగలాడే కుండలాలతో ఉన్న ఇంద్రజిత్తు శిరస్సును ఖండించింది. అప్పుడతడి దేహం మొదలునరికిన వృక్షంలాగా నేలకొరిగింది. బంగారపుకాంతులతో విలసిల్లే ఆ ఇంద్రజిత్తు శిరస్సు శరీరం నుండి విడిపోయి నెత్తురులో తడుస్తూ నేలపై పడి ఉంది. ఇంద్రజిత్తు తలకు పెట్టుకున్న శిరస్త్రాణంతోను, దేహానికి తొడుక్కున్న కవచంతోను నేలపై పడ్డాడు. వృత్రాసురుడు మరణించినప్పుడు దేవతలవలె, విభీషణుడు, వానరవీరులు సింహనాదాలు చేశారు. ఆకాశంలో దేవతలు, మహర్షులు, గంధర్వులు దుందుభులు మ్రోగించారు.

వానరులంతా బలవంతులై రాక్షసవీరుల్ని చంపేస్తూ ఉంటే రాక్షసులంతా ముద్గరాలను, శూలాలను, గండ్రగొడ్డళ్ళను మొదలైన ఆయుధాల్ని అక్కడే వదిలేసి ప్రాణరక్షణకై దశదిశలా పరుగులు తీశారు. కొందరు లంకాపట్టణంలోకి పరుగెత్తారు. కొందరు అడవుల్లోకి పారిపోయారు. ఇంకొందరు పర్వతాలపైకి ప్రాక్కుంటూపోయారు. సూర్యాస్తమయంతో సూర్యకిరణాలు మాయమై పోయినట్లు, ఇంద్రజిత్తు మరణించగానే రాక్షసులంతా మాయమైపోయారు.

పాపాత్ముడైన ఇంద్రజిత్తు మరణించటం వల్ల మహర్షులు, దేవేంద్రుడూ కూడా సంతోషించారు. ఆకాశంలో దేవతలు దుందుభులు మ్రోగించారు. అప్సరసలు నాట్యం చేశారు. గంధర్వులు గానం చేశారు. దేవతలు పుష్పవర్షం కురిపించారు. దేవతలు సంతోషించారు. వాళ్ళంతా అక్కడ కలుసుకొని "బ్రాహ్మణులకు ఏ కష్టాలు ఆపదలు లేకుండా పోయాయి గదా" అని సంతోషిస్తూ వెళ్ళిపోయారు.

అప్పుడు వానరయోధపతులంతా మహాబలవంతులైన ఇంద్రజిత్తును చంపిన లక్ష్మణుణ్ణి అభినందించారు. వానరులంతా సంతోషంతో సింహనాదాలు చేశారు. లక్ష్మణుడి చుట్టూ మూగారు. "లక్ష్మణుడు జయించాడు" అంటూ కేకలు వేశారు. వానరవీరులంతా ఒకళ్ళ నొకళ్ళు కౌగలించుకొన్నారు. లక్ష్మణుణ్ణి అభినందించారు. విభీషణుడు, హనుమంతుడు, జాంబవంతుడు లక్ష్మణుణ్ణి అభినందించి స్తుతించారు.

దేవతలంతా ఇంద్రజిత్తు చంపబడ్డాడని విని, తమ అత్యంత ఆప్తుడైన లక్ష్మణుణ్ణి తలచుకొని సంతోషపడ్డారు.

# 90వ సర్గ రాముడు లక్ష్మణుణ్ణి కౌగిలించుకొని అభినందించడం

ఇంద్రజిత్తును సంహరించి సంతుష్టుడైన శుభలక్షణాలు గల లక్ష్మణుడు సంతోషంగా ఉన్నాడు. యుద్ధంలో అయిన గాయాల వల్ల ఒళ్ళంతా రక్తసిక్తంగా తయారైంది. భీకరయుద్ధం చేయటంవల్ల అలసిపోయి ఉన్నాడు. అలా అలసిపోయి ఉండటం వలన, హనుమంతుణ్ణి, విభీషణుణ్ణి ఆసరాగా పట్టుకొని రామసుగ్రీవులున్న చోటుకు బయలుదేరాడు. దారిలో మహాతేజశ్శాలి, పరాక్రమవంతుడు అయిన లక్ష్మణుడు వానరవీరులందరికీ గౌరవపూర్వకంగా నమస్కరించాడు. పిమ్మట రాముని వద్దకు వెళ్ళి నమస్కరించాడు. దేవేంద్రుడి ప్రక్కన ఉపేంద్రుడు వలె పోయి ప్రక్కగా నిలబడ్డాడు.

అప్పుడు వీరుడైన లక్ష్మణుడు, మహాత్ముడైన రాముడితో నీరసంగా గొణుగుతున్నట్లుగా ఇంద్రజిత్తు వధను గూర్చి చెప్పాడు. అప్పుడు విభీషణుడు రామునితో "ప్రభూ! ఇంద్రజిత్తు శిరస్సు మహాత్ముడైన లక్ష్మణుడు ఖండించాడు" అని చెప్పాడు. లక్ష్మణుడు నీరసంగా ఉండటం వల్ల స్పష్టంగా చెప్పలేకపోయాడు. అదే విభీషణుడు రాముడికి విన్నవించాడు.

గొప్ప పరాక్రమం గల రాముడు లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించాడని విని చాలా సంతోషించాడు. ఇలా అన్నాడు: "లక్ష్మణా! అసాధ్యమైన పనిని సాధ్యం చేశావు, బాగుంది. సంతోషించాను. ఇంద్రజిత్తు మరణించడం వల్ల జయం మనకు నిశ్చయంగా లభించినట్లే!"

పరాక్రమవంతుడైన రాముడు లక్ష్మణుణ్ణి దగ్గరకు తీసుకొని శిరస్సుపై చుంబించాడు. లక్ష్మణుడు బిడియపడుతున్నా కూడా వినకుండా, స్నేహపూర్వకంగా తన తొడపై కూర్చోబెట్టుకొని గాఢంగా కౌగలించుకున్నాడు. ఆప్యాయంగాను, ప్రేమతోనూ తమ్ముణ్ణే చూస్తూ ఉండిపోయాడు. యుద్ధంలో తగిలిన దెబ్బలకు లక్ష్మణుడు బాధతో నిట్టూర్పులు విడుస్తూ, శారీరక బాధలకు తట్టుకోలేక మెల్లగా మూలుగుతున్నాడు. అటువంటి లక్ష్మణుణ్ణి, పురుషశ్రేష్ఠుడైన రాముడు మాటిమాటికీ ఒళ్ళంతా తడుముతూ, ఓదారుస్తూ ఇలా అన్నాడు:

“తమ్ముడా! నీవు చాల మంగళకరమైన పనిని చేశావు. నీవు తప్ప ఈ ఇంద్రజిత్తును మరెవ్వరూ చంపలేరు. పుత్రశోకం చేత రావణుడు సగం చచ్చిపోయాడు. అతడి నవనాడులూ క్రుంగిపోయి ఉంటాయి. దురాత్ముడైన ఆ ఇంద్రజిత్తును నువ్వు చంపటం వల్ల ఇప్పుడు నాకు శత్రువులు లేకుండా చేశావు. అది ఎట్లాగంటే, రావణునికి కుడిభుజాన్ని (ఈ ఇంద్రజిత్తును) నీవు నరికేశావు. ఆ రావణునికి ఇంద్రజిత్తే ఆయువుపట్టు వంటివాడు. ఈ మహాయుద్ధంలో హనుమంతుడు, విభీషణుడు సహాయంకూడా మరువరానిది. నీవు మూడు పగళ్ళు, మూడు రాత్రుళ్ళు ఇంద్రజిత్తుతో యుద్ధం చేసి చివరకు సంహరించావు. ఆ శత్రువును నువ్వు చంపడం వల్ల నాకు విజయం చేకూర్చిపెట్టావు. ఇప్పుడు నాకు శత్రువులు లేకుండా చేశావు. కుమారుడు చనిపోయాడని విన్న రావణుడు ఏ క్షణంలోనైనా పెద్ద సైన్యాన్ని వెంటబెట్టుకొని రాగలడు. రానివ్వు! ఇప్పటికే పుత్రశోకంతో సగం చచ్చిపడున్న ఆ రావణుణ్ణి చంపేస్తాను.

లక్ష్మణా! నీవు ఇంద్రజిత్తును సంహరించావు. నేను సీతాదేవిని, ఈ భూమండలాన్ని పొందడం ఏమీ కష్టం కాదు” అన్నాడు. అంతట రాముడు సుషేణుణ్ణి పిలిచి ఇట్లా అన్నాడు. “ఓ సుషేణుడా! బుద్ధిమంతుడు, మిత్రులంటే ప్రాణం పెట్టేవాడు అయిన ఈ లక్ష్మణుడు శరీరం నిండా బాణాలు గుచ్చుకొని బాధపడుతున్నాడు. ఇతడికి వైద్యం చేసి పూర్తిగా కోలుకునేట్లు చెయ్యి. అట్లాగే, విభీషణుడికి, భల్లూక, వానర వీరులకు కూడా బాణాలు శరీరం అంతా గుచ్చుకొని బాధపడుతున్నారు. నీవు వాళ్ళందరికీ కూడా చికిత్సచేసి త్వరగా స్వస్థులను చెయ్యి” అన్నాడు.

అంతట సుషేణుడు రాముని ఆజ్ఞని పాలిస్తూ లక్ష్మణునికి ముక్కుల ద్వారా ఉత్తమమైన ఔషధాన్ని ఇచ్చాడు. ఆ ఔషధం వాసన చూసినంత మాత్రానే, శరీరంలో ఇరుక్కుపోయిన బాణాల ములుకులన్నీ తొలగిపోయాయి. బాధ తగ్గింది. గాయాలన్నీ మానిపోయాయి. పిమ్మట విభీషణుడు మున్నగు వానరులందరికీ ఔషధాలతో చికిత్స చేసి బాధ నివారించాడు.

అప్పుడు శరీర బాధలన్నీ తొలగిపోయిన లక్ష్మణుణ్ణి చూసి రాముడు, విభీషణుడు,

సుగ్రీవుడు మొదలైన వారంతా బాధల నుండి విముక్తిపొంది సంతోషించారు. లక్ష్మణుడు చేసిన ఆ కష్టసాధ్యమైన పనికి రాముడు మెచ్చుకున్నాడు. యుద్ధరంగంలో ఇంద్రజిత్తు చనిపోవడంతో సుగ్రీవుడు, విభీషణుడు ఎంతో సంతోషించారు.

# 91వ సర్గ రావణుడు విలపించటం

ఇంద్రజిత్తు చనిపోయాడని రావణుని మంత్రులు విన్నారు. ఆ వార్తను ధ్రువపరచుకున్నారు. యథార్థమేనని తెలుసుకున్న పిదప, రావణాసురుని వద్దకుపోయి దుఃఖీస్తూ "మహారాజా! విభీషణుని సహాయంతో లక్ష్మణుడు మేమందరం చూస్తూ ఉండగానే మహాతేజశ్శాలి అయిన ఇంద్రజిత్తును చంపేశాడు. యుద్ధములలో పరాజయాన్ని ఎరుగనివాడూ, దేవేంద్రుడినే జయించినవాడు, శూరుడైన నీ పుత్రుడు లక్ష్మణుడితో పోరాడాడు. అమోఘమైన బాణాన్ని వదిలి ఆ లక్ష్మణునికి తాపాన్ని కలిగించాడు. చివరకు వీరులంతా పోయే ఉత్తమలోకాలకు పోయాడు" అని చెప్పారు.

యుద్ధంలో తన పుత్రుడైన ఇంద్రజిత్తు చంపబడ్డాడన్న వార్తను జీర్ణించుకోలేకపోయాడు. ఘోరము, భయంకరము, దారుణము అయిన ఆ వార్త విని రావణుని నవనాడులూ క్రుంగిపోయాయి. నోటమాట రాలేదు. నిశ్చేష్టుడయ్యాడు. మూర్ఛపోయాడు. కొంతసేపటికి తేరుకున్నాడు. పుత్రశోకంచేత వ్యాకులుడై విలపించాడు.

"అయ్యో! పుత్రా! రాక్షససేన కంతటికీ తలమానికము వంటివాడవే! మహాబలవంతుడవే! ఇంద్రుణ్ణి కూడా జయించినావే! ఈనాడు లక్ష్మణుని చేతిలో ఎట్లా ఓడిపోయావు? నీకు కోపంవస్తే నీ ముందు ఎవరూ నిలువలేరే! నీవు ధనుస్సును ధరించి నిలబడితే కాలపురుషుడు యముడు కూడా భయపడి పారిపోతారే! మందరపర్వత శిఖరాల్ని కూడా కూర్చున్న చోటునుండే ఛేదించగలవే! యుద్ధంలో లక్ష్మణుని ఛేదించడం నీకు ఏపాటిది?

ఓ మహాబాహూ! నీకు కూడా మరణాన్ని కల్పించి కబళించివేసిన ఆ యముడు చాలా బలవంతుడని నాకిప్పుడే తెలిసివచ్చింది. ఆ కాలదేవతపై నాకిప్పుడు గౌరవం పెరుగుతోంది. ప్రభువు కొరకు ప్రాణాలు విడిచే గొప్పయోధులందరికీ ఇదే మార్గం; వారందరూ స్వర్గాన్నే పొందుతారు.

ఇంద్రజిత్తు మరణం, సమస్త దేవతాగణాలకు, లోకపాలకులకు, మహర్షులకు ఇకపైన ఆటవిడుపు అవుతుంది. ఏ భయమూ లేకుండా సుఖంగా నిద్రిస్తారు. ఇంద్రజిత్తు లేని ఈ భూమండలం, ముల్లోకాలూ, భోగాలు నాకు శూన్యంగా కనబడుతున్నాయి. పర్వతగుహల్లోని ఆడఏనుగులు మదపుటేనుగు కోసం విలపించినట్లు అంతఃపుర వనితలంతా విలపిస్తూ ఉండటాన్ని నేను వింటాను గదా!

ఓ శత్రుసంహారకుడా! నీ యువరాజ్యాన్ని, లంకను, రాక్షసుల్ని, తల్లిని, నన్ను, భార్యల్ని, మమ్మల్నందరినీ విడిచి ఎక్కడకు వెళ్ళావు? ఓ పుత్రా! నేను మరణించిన తర్వాత నాకు ప్రేతకార్యాలు ఎవరు చేస్తారయ్యా! ఇప్పుడు నీ మరణంవల్ల ఆ ధర్మానికి విరుద్ధంగా జరిగిందే! రామలక్ష్మణులు, సుగ్రీవుడు ఇంకా బ్రతికే ఉన్నారు; ఇంకా నా బాధలు అన్నీ తొలగిపోనేలేదు. మరి ఇంతలోనే ఏం తొందర వచ్చిందని మమ్మల్నందర్నీ నడిసముద్రంలో వదలివెళ్ళావు?" అంటూ చాలాసేపు విలపించాడు. ఇంతలోనే కోపం ముంచుకొచ్చింది. సహజంగానే కోపానికి అధిదేవత అయిన రావణుడికి, పుత్రశోకం తోడైంది. గ్రీష్మంలో సూర్యకిరణాల్లాగా ఇంకా మండిపడ్డాడు. కనుబొమలు ముడిపడ్డాయి. అట్లా కనుబొమలు ముడిపడినప్పుడు, మహాప్రళయంలో అలలతో పాటుపైకి లేచిన మొసళ్ళవలే ఉంది. రావణుడప్పుడు కోపంతో ఆవలించగా అతడి ముఖం నుండి వృత్రాసురుడి నోటి నుండి వెలువడ్డట్లు, పొగలు సెగలతో మంటలు రేగాయి. పుత్రశోకం చేత విలపిస్తున్న ఆ రావణుడు క్రోధానికి పెద్దపీట వేశాడు. సీతను చంపి తన శోకం చల్లార్చుకోవాలని అనుకున్నాడు. మామూలుగానే ఎర్రగా ఉండే అతడి కళ్ళు క్రోధంతో చింతనిప్పులయ్యాయి; జ్యోతుల్లా మండాయి. సహజంగానే అతడి శరీరం ఎప్పుడూ క్రోధంతో పొగలూ, సెగలూ కక్కుతూ ఉంటుంది. ఇప్పుడు పుత్రశోకం తోడై కాలరుద్రుడి వలె దుర్వాసుడయ్యాడు. మండేకాగడాల నుండి నీటిబొట్లు రాలినట్లు, కోపించిన అతడి నేత్రాలనుండి కన్నీటిబొట్లు రాలాయి. కోపంతో పళ్ళు పటాపటా కొరుకుతూ ఉంటే ఉరుములు ఉరిమినట్లుంది. అప్పుడా రాక్షసరాజు దృష్టి ఏ పక్కకు పడిందో అటు ప్రక్కనున్న రాక్షసులంతా శిరస్సులు వంచి విధేయులై నిలబడ్డారు. స్థావరజంగమము లన్నింటిపైనా కోపించిన

మృత్యుదేవతవలె, అప్పుడు రాక్షసరాజు నాలుగు దిక్కులూ చూశాడు. అతడి దృష్టిపడకుండా శిరస్సులు వంచి, వినయంగా నిలబడి రాక్షసులు తమని తాము రక్షించుకున్నారు. రాక్షసరాజైన రావణుడు వాళ్ళతో ఇలా అన్నాడు. "నేను వేలకొద్దీ సంవత్సరాలు తపస్సు చేసి బ్రహ్మదేవుని మెప్పించాను. బ్రహ్మదేవుని వరప్రసాదం వలన నాకు ఎన్నడూ దేవదానవుల నుండి ఎటువంటి భయము లేకుండా నిర్భయంగా ఉన్నాను. నాకు బ్రహ్మదేవుడు సూర్యుని వంటి కాంతిగల కవచాన్ని అనుగ్రహించాడు. ఆ మహితాత్వమైన కవచాన్ని దేవతలుగాని, అసురులుగానీ, అస్త్రాలతోగానీ, శస్త్రాలతోగానీ, పిడికిళ్ళతోగానీ, వజ్రాయుధంతోగానీ ఛేదించలేరు. నేను ఇప్పుడీ కవచాన్ని ధరించి, రథం మీద యుద్ధభూమికి వెళ్తే దేవేంద్రుడైనా ఎదిరించలేడు.

"పూర్వం దేవాసురయుద్ధంలో సంతోషించిన బ్రహ్మదేవుడు నాకు ఈ దివ్యధనుర్బాణాలను ప్రసాదించాడు. ఇప్పుడు ఆ మంగళప్రదమైన ధనుర్బాణాలను రామలక్ష్మణుల్ని చంపటానికి ఉపయోగిస్తాను. దానిని విశేషపూజలు చేసి బయటకుతీయండి."

క్రూరుడైన ఆ రావణునికి పుత్రశోకం తోడైంది. క్రోధావేశాలతో కూడిన బుద్ధితో ఆలోచించి సీతాదేవిని చంపాలని అనుకున్నాడు. చింతనిప్పుల్లా మండేకళ్ళతో, ఘోరంగా ఉన్న ఆ భయంకరుడు, దీనస్వరంతో రాక్షసులందర్నీ కలయచూస్తూ ఇలా అన్నాడు.

"నా కుమారుడు వానరులను మభ్య పెట్టేందుకు మాయాసీతను సృష్టించి వధించాడు. నేను ఇప్పుడు అది యథార్థం చేస్తాను. వాడి అభీష్టాన్ని నెరవేరుస్తాను. ఆ క్షత్రియాధముడిపై ఇంకా ప్రేమానురాగాల్తో ఉన్న ఆ సీతను సంహరిస్తాను" అని అన్నాడు.

పుత్రశోకంతో వ్యాకులమైన మనస్సు గల రావణుడు కాంతివంతమైన ఖడ్గాన్ని తీసుకొని సీత ఉన్న ప్రదేశానికి బయలుదేరాడు. అనుచరులంతా సింహనాదాలు చేశారు. రాక్షసులకు జయం నిశ్చయమని నమ్ముతూ పరస్పరం కౌగలించుకుంటూ ఇలా అన్నారు. "ఇప్పుడు మన ప్రభువును చూడగానే రామలక్ష్మణులు భయంతో ఒణికిపోతారు. పూర్వం ఇతడికి కోపం వచ్చి

ఇంద్ర, యమ, కుబేర, వరుణులు నలుగుర్నీ జయించాడు. వీరుకాక మన రాజు చేతిలో పరాజయం పొందిన వారెందరో ఉన్నారు. తన పరాక్రమంతో ముల్లోకాల్లో ఉండే ఉత్తమమైన వస్తువులన్నింటినీ తెచ్చుకొని అనుభవిస్తున్నాడు'' అని చెప్పుకున్నారు.

రావణుడు ఒళ్ళు తెలియని కోపంతో అశోకవనానికి పోయి సీతాదేవిని చంపబోయాడు. అతడి శ్రేయస్సు కోరే మంత్రులు, స్నేహితులు సీతాదేవిని సంహరించవద్దని వారించారు. వారి మాట లెక్కచేయకుండా కోపంతో అంగారకుడు రోహిణీదేవి మీదకు పోయినట్లు, రావణాసురుడు సీతాదేవికి పైకి వెళ్ళాడు. అట్లా ఖడ్గం చేత్తోపట్టుకొని తన పైకివస్తున్న రావణాసురుణ్ణి సీతాదేవి చూసింది. సీతాదేవి విలపిస్తూ ఇలా అనుకుంది. "ఈ దుష్టబుద్ధి అయిన రావణుడు కోపంతో నాపైకి వస్తున్నాడు. చూడబోగా వీడు నన్ను చంపేందుకే వస్తున్నట్లున్నాడు. నేను నాథుడు కలిగి ఉండి కూడా అనాథవలె చావాలని నా నొసట వ్రాసి ఉన్నట్లుంది. ఈతడు ఇంతకాలం తన భార్యవు కమ్మని వేధిస్తున్నాడు. నేను ప్రతిసారీ దృఢంగా తిరస్కరించేదాన్ని. ఇక నిరాశ చెంది, కోపావేశంలో నన్ను చంపేందుకు కత్తి చేత్తోపట్టుకొని బయలుదేరాడు. నాకు చావు తప్పదు. ఇది నిశ్చయం. లేదా యుద్ధంలో రామలక్ష్మణులను చంపేసి ఉంటాడు. ఎందుకంటే రాక్షసులు చాలామంది ఆనందంతో సింహనాదాలు చేస్తూ పెద్దపెద్ద ధ్వనులుచేయడం నేను విన్నాను. అయ్యో! ఎంత ఘోరం జరిగిపోయింది? ఈ రాజకుమారులిద్దరూ నా మూలంగా ప్రాణాలు కోల్పోయారే! ఛీ! ఛీ! అట్లా జరగడానికి వీల్లేదు. ఆ రాకుమారులిద్దరినీ ఎవరూ చంపలేరు. లేదా, ఇతడు రామలక్ష్మణుల్ని చంపలేక, పుత్రశోకంచేత నన్ను చంపి కసి తీర్చుకోవాలని అనుకుంటున్నాడా? వీడు ఎటువంటి పాపకార్యాలు చెయ్యటానికైనా వెనుకాడడు. ఇంతకూ ఒకర్ని నిందించి ఏం ప్రయోజనం? ఆనాడు హనుమంతుడు తన వీపుపై ఎక్కించుకొని రాముని సన్నిధికి చేరుస్తానన్నాడు. నేనే మూఢురాలనై వద్దన్నాను. అతడు చెప్పిన మాట విని ఉంటే, ఎప్పుడో నా భర్త వద్దకు చేరుకొని సుఖంగా ఉండేదాన్ని. నాకు ఈ దుఃఖం ఉండేది కాదు.

ఒకవేళ ఆ రాకుమారులు వీళ్ళ చేతుల్లో హతులై ఉంటే, ఆ వార్త కౌసల్యాదేవి వింటుంది. ఉన్న ఒక్క కొడుకూ పోయాడనే కడుపుకోత భరించలేక గుండెపగిలి చచ్చిపోతుంది. తప్పదు. తన ముద్దులకొడుకు బాల్యం, యౌవనం, అతడి అందచందాలు, ముద్దుమాటల్ని తలచుకొని ఏడుస్తుంది. అతడి సత్యవ్రతం, ధర్మపరాయణత్వం తలచుకొని కుమిలికుమిలి ఏడుస్తుంది గదా? పుత్రశోకం భరించలేక అగ్నిప్రవేశం చేస్తుంది. లేదా సరయూనదిలో దూకి మరణిస్తుందేకాని, జీవించి ఉండలేదు.

ఇంతటి అరిష్టానికీ అంతటికీ ఆ 'గూను' కదా కారణం. ఛీ! మంధర ఎంత పాపిష్టిది? ఎంతమందికి శోకాన్ని కలిగించింది?" అని తనలో తానే ఊహించుకుంటూ రాబోయే మరణాన్ని తలచుకుంటూ విలపిస్తోంది. ఆ విధంగా విలపిస్తున్న సీత చంద్రుడు లేనప్పుడు అంగారక గ్రహానికి వశమైపోయిన రోహిణివలె ఉంది.

అప్పుడు రావణుని మంత్రులలో ఒకడూ, చక్కటి శీలము గలవాడు, వృద్ధుడూ, మేధావి అయిన 'సుపార్శ్వుడు' సీతను చూస్తూ, తోటిమంత్రులు వద్దని వారిస్తున్నా వినకుండా, రావణునితో ఇలా అన్నాడు. "ఓ వీరుడా! రాక్షసరాజా! వేదాభ్యాసం చేశావు. బ్రహ్మచర్యాశ్రమం స్వీకరించి అగ్నిహోత్రాది పవిత్రకర్మలన్నీ ఆచరించావు. గృహస్థాశ్రమాన్ని స్వీకరించి నిత్యాగ్నిహోత్ర విధుల్ని నిర్వర్తిస్తున్నావు. అంతటి సత్కీర్తి గలవాడవు. ఈనాడు ఒక స్త్రీని చంపాలని ఎందుకు అనుకుంటు న్నావు? రాజా! మాతో కలసి యుద్ధానికి రా! నీ కోపం అంతా రాముడిపై చూపించు. అంతేకానీ, చక్కటిచుక్క, అందునా రాచబిడ్డ అయిన ఒక స్త్రీని చంపాలనే ప్రయత్నం మానుకో. ఈ రోజు కృష్ణపక్షం, చతుర్దశి. యుద్ధానికి కావలసిన సన్నాహాలన్నీ చెయ్యి. రేపు అమావాస్యనాడు మమ్మల్నందరినీ వెంటబెట్టుకొని విజయాలకోసం యుద్ధరంగానికి బయలుదేరు. శూరుడవు, బుద్ధిమంతుడవు, రథికుడవు, ఖడ్గధారివి అయిన నీవు శ్రేష్ఠమైన రథాన్ని అధిరోహించి బయలుదేరు. దశరథపుత్రుడైన రాముణ్ణి వధించు. అప్పుడు నీవు సీతను పొందగలవు" అన్నాడు.

దురాత్ముడైన రావణుడు, మంత్రి, స్నేహితుడు పలికిన ధర్మసమ్మతమైన మాటలు అంగీకరించి, తన ప్రాసాదానికి వెళ్ళాడు. మరల అక్కడ నుండి రాజ్యసభకు వెళ్ళి మంత్రులతోను, స్నేహితులతోను సమాలోచన చేశాడు.

# 92వ సర్గ రాముడు రాక్షససేనను సంహరించటం

రాక్షసరాజైన రావణుడు రాజసభకు వచ్చి సింహాసనంపై ఆసీనుడయ్యాడు. అయినా అతడి ముఖంలో గాంభీర్యము, దర్పము కనబడటం లేదు. పుత్రశోకం చేత కృశించి, కోపంతో సింహంలాగా నిట్టూరుస్తూ, అంజలి ఘటించి సేనానాయకులతో ఇలా అన్నాడు. "ఓ సేనాధిపతుల్లారా! మీరంతా గజసేనతోను, అశ్వసేనతోను, రథ సముదాయాలతోను, కాలిబంటులతోను కలసి యుద్ధభూమికి వెళ్ళండి. అక్కడ మీరందరూ కలసి రాముణ్ణి చుట్టుముట్టి యుద్ధం చెయ్యండి. అంతా బాణాల వర్షం కురిపించి రాముణ్ణి హతమార్చండి. మీ వాడిబాణాలతో అతడి కవచాన్ని బద్దలుకొట్టండి. అతడి శరీరం అంతా బాణాలతో తూట్లు పొడవండి. పిమ్మట నేను రేపు వచ్చి అందరూ చూస్తూ ఉండగా అతణ్ణి చంపేస్తాను."

సేనాపతులందరూ రావణుని ఆజ్ఞను శిరసావహించి వెంటనే పెద్ద సైన్యాన్ని వెంటబెట్టుకొని బయలుదేరారు. రాక్షసులందరూ పదునైన పరిఘల్ని, పట్టిసాలను, ఖడ్గాలను, గండ్రగొడ్డళ్ళను, వాడియైన బాణాల్ని వానరసైన్యంపై ప్రయోగించారు. అటునుండి వానరులు కూడా పర్వతాల్ని, వృక్షాల్ని విసిరారు. సూర్యోదయం అయిన దగ్గర్నుండి రాక్షసులకు వానరులకు భీకరయుద్ధం కొనసాగింది. ఆ యుద్ధంలో వానరులు, రాక్షసులు కూడా పరస్పరం ప్రాణాలకు తెగించి యుద్ధం చేశారు. ఆ మహాయుద్ధంలో రేగిన దుమ్ము అంతా నేలపై ఏరులై పారుతున్న రక్తంలో కరిగిపోయింది. ఆ భీకర రణసాగరంలో చచ్చిపడున్న గుర్రాలు పెద్దపెద్ద చేపల్లాగా ఉన్నాయి. రథ ధ్వజాలు గట్లపైన మహావృక్షాల్లాగా కనిపించాయి. అందులో మునిగితేలుతున్న శవాలే తెప్పకొయ్యలయ్యాయి. రక్తప్రవాహమే ఆ సాగరజలాలయ్యాయి. ఆ రక్తపుటేరుల్లో తడిసిపోతూ, వానరులు ఎగిరిఎగిరి ఆ యుద్ధంలో రథాల్ని, ధ్వజాల్ని, పతాకాల్ని, కవచాల్ని అనేక ఆయుధాల్ని విరగ్గొట్టారు. వానరులు వాడి అయిన గోళ్ళతోను, కోరలతోను రాక్షసుల్ని రక్కారు. జుట్టును, ముక్కు చెవుల్ని, నుదుటిని దంతాలతో కొరికి ముక్కలుగా ఖండించారు. ఫలాలతో నిండి ఉన్న చెట్టుపైకి పక్షుల గుంపులు వాలినట్లు, ఒక్కొక్క

రాక్షసుడిపైనా వందమంది వానరులు దాడి చేశారు. అప్పుడు రాక్షసులు వారందర్నీ గదలతోను, ఖడ్గాలతోను, గండ్రగొడ్డళ్ళతోను, ప్రాసలతోను కొట్టి తరిమేశారు. రాక్షసులు వానరుల్ని పట్టుకొని దారుణంగా చంపుతూ ఉంటే, వానరులంతా పోయి రాముణ్ణి శరణుజొచ్చారు.

అప్పుడు గొప్పతేజస్సు, పరాక్రమముగల రాముడు ధనుర్బాణాలను ధరించి రాక్షస సైన్యంలోకి ప్రవేశించాడు. వారిపై బాణాలవర్షం కురించాడు. రాముని బాణాల ధాటికి తట్టుకోలేని రాక్షసులు, ఆకాశంలో మేఘాలు సూర్యుణ్ణి తాకలేనట్లు, రాముడి దగ్గరకుకూడా పోలేకపోయారు. ఎవరూ చేయలేని ఆ మహాభయంకరమైన పనులు జరగడం చూశారు. కానీ రాక్షసులు, రాముణ్ణి మాత్రం చూడలేకపోయారు. అది ఎట్లాగంటే, గాలి దుమారం లేచినప్పుడు, దుమ్ము ధూళి కనిపిస్తుంది; వృక్షాలు పడిపోవడం కనిపిస్తుంది. కానీ గాలి కనపడదు. అదేవిధంగా ఆ మహాయుద్ధంలో, మహాసైన్యాలన్నీ చెల్లాచెదరైపోవడం, రథాలు కూలిపోవడం కనిపిస్తోందేకాని, రాముడు బాణప్రయోగం చేసే నేర్పును మాత్రం ఎవరూ చూడలేకపోతున్నారు. ఒక వైపు నుండి రామబాణాలకు రాక్షససైన్యాలు చెల్లాచెదరైపోవటమూ, రథాలు విరిగిపోవటమూ కనిపిస్తోందేకానీ, రాక్షసులు రాముణ్ణి చూడలేకపోతున్నారు. అంతా రామబాణాలు గుచ్చుకొని బాధపడేవాళ్ళే కానీ, వాటిని ప్రయోగించే రాముణ్ణి చూడలేకపోతున్నారు. శబ్ద, రూప, రస, గంధాలను ఇంద్రియాలు అనుభవిస్తాయేకానీ, వాటికి కారణభూతమైన పరమాత్మ ఆ దేహికి కనపడనట్లుగా, దెబ్బలుతింటూ బాధపడుతున్నా, రాక్షసులకు ఆ దెబ్బలకు, బాధలకు కారణం రాముడని తెలియడం లేదు.

ఇతడు ఏనుగుల్ని పడగొడ్తున్నాడు; ఇతడు రథాల్ని కూలుస్తున్నాడు; ఇతడు సైనికుల్ని చంపుతున్నాడు, ఇతడు అశ్వాలను అశ్వికుల్ని చంపుతున్నాడని భయాందోళనలకు గురి అయ్యారు. రాక్షసులు ఆ విధంగా కేకలుపెడుతూ, కనిపించినవాడినల్లా రాముడనే భావిస్తూ, కుపితులై రాక్షసుల్లో రాక్షసులే కొట్టుకున్నారు. మహాత్ముడైన రాముడు గాంధర్వాస్త్రాన్ని ప్రయోగించడం చేత రాక్షసులంతా గాంధర్వానికి ప్రభావితులయ్యారు. అందువల్ల రాముణ్ణి

చూడలేకపోయారు. ఆ ప్రభావం చేత అనేకవేల 'రాములు' గా రాక్షసులకు కనిపించాడు. మరుక్షణంలో రాము డొక్కడే అని తెలుసుకోసాగారు. ఆ రాక్షసులకు మహాత్ముడైన రాముడు ధనుస్సు యొక్క, "అలాత చక్రం" వంటి తిరుగుతున్న బంగారు అగ్రభాగమే కనబడుతోందిగానీ, రాముడు కనపడటం లేదు. (చివర నిప్పు ఉన్న కర్రను వేగంగాను, గుండ్రంగాను తిప్పేటప్పుడు చూసేవాళ్ళకు అది గుండ్రంగా ఉన్నట్లు కనిపిస్తుంది. దాన్నే 'అలాతచక్రం' అని అంటారు)

యుద్ధమందు మృత్యుచక్రంవలె, రాక్షసుల్ని చంపుతున్నా రాముడు వారి పాలిట 'రామచక్రం' అయ్యాడు. ఈ రామ (మృత్యు) చక్రానికి రాముడి శరీరమే మధ్యభాగం. వింటి నారిని గట్టిగా లాగినప్పుడు అది రాముడి నడుము చుట్టూ తిరిగి గుండ్రంగా ఏర్పడినప్పుడు దాని మధ్యనున్న రాముని దేహం 'చక్రనాభి' వలె ఉంది. అతడి బలమే జ్వాలలయ్యాయి. బాణాలే ఆ చక్రానికి ఆకులు. ధనుస్సే చక్రానికి చివర్లు. నారితలము సంధించినప్పుడు పుట్టే ధ్వనియే దాని ఘోషలు. తేజస్సు, బుద్ధి అనేవే దాని కాంతి. దివ్యాస్త్రాలే గుణములు, దాని చివరి భాగములు. అటువంటి రామచక్రం ఆ సైన్యం అంతటా తిరిగి రాక్షసుల్ని కాల్చివేసిందని భావం.

రాముడొక్కడూ, ఒక జాము (3 గంటలు) కాలంలో ఇష్టానుసారం రూపాల్ని ధరించగలిగిన రాక్షసులకు సంబంధించిన వాయువేగం గల, పదివేల రథాల్ని, పద్దెనిమిదివేల ఏనుగుల్ని, రౌతులతో సహా పధ్నాలుగు వేల గుర్రాల్ని, రెండు లక్షలమంది కాల్బలాన్ని, అగ్నిశిఖల వంటి బాణాల చేత సంహరించాడు. గుర్రాలు చంపబడ్డాయి. రథాలు విరిగి ముక్కలయ్యాయి. చావగా మిగిలిన రాక్షసులు లంకానగరం వైపు పరుగెత్తారు. చచ్చిపడి ఉన్న ఏనుగులు, సైనికులు, గుర్రాలతో నిండిపోయిన ఆ యుద్ధభూమి కోపించి, రుద్రుడు విహరించిన ప్రదేశంలా అయింది.

అప్పుడు దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు, రాముడు చేసి చూపిన ఆ అద్భుత యుద్ధాన్ని 'బాగు, బాగు' అని మెచ్చుకున్నారు. అప్పుడు రాముడు ప్రక్కనే ఉన్న సుగ్రీవుడితోను, విభీషణుడితోను, హనుమంతునితోను, జాంబవంతునితోను, మిగిలిన వానరశ్రేష్ఠులతోను ఇలా

అన్నాడు: “మిత్రులారా! ఇటువంటి అస్త్రప్రయోగ శక్తి నాకూ, ఈశ్వరుడికీ మాత్రమే ఉన్నది.”

ఇంద్రునితో సమానుడు, మహాత్ముడు, అస్త్రములందుగాని, శస్త్రములందుగాని, అలసట లేనివాడు అయిన రావణ సైన్యాన్ని చంపిన ఆ రాముణ్ణి దేవతాగణం అంతా స్తుతించారు.

# 93వ సర్గ రాక్షస స్త్రీలు విలపించటం

రావణాసురుడు పంపిన చతురంగబలాలు, వేలకొద్దీ గుర్రాలు, రౌతులూ, అగ్నిహోత్రంలా వెలిగిపోయే రథాలు, రథసారథులు, మెరసిపోయే ఇనుప గుదియలతో పోరాడే యోధులు, వివిధములైన ఆయుధాలతో పోరాడే శూరులు, కామరూపులైన రాక్షసులు, రామబాణాలకు గురి అయ్యారు; మరణించారు అన్న వార్త లంకానగరం అంతా దావానలంలాగా వ్యాపించింది. చావగా మిగిలిన వారు నగరానికి రావడం రాక్షసాంగనలు చూశారు. వారు చెప్పినదంతా విన్నారు. రాక్షసాంగనలంతా కన్నీరుమున్నీరుగా ఏడ్చారు. వాళ్ళల్లో భర్తలు పోయిన వాళ్ళున్నారు; పుత్రుల్ని పోగొట్టుకున్న వాళ్ళున్నారు; సోదరుల్ని పోగొట్టుకున్న వాళ్ళున్నారు. ఆప్తుల్ని, బంధువుల్నీ పోగొట్టుకున్నవాళ్ళున్నారు. వాళ్ళంతా ఒకళ్ళకు చెప్పుకుని మరొకళ్ళు పెద్దపెట్టున ఏడ్చారు. వాళ్ళంతా శూర్పణఖను చెడతిట్టారు.

“ఈ శూర్పణఖ వల్లనే ఇంత అనర్థం జరిగింది. అసలు ఇది జనస్థానానికి ఎందుకు వెళ్ళింది? ఈ కురూపి మన్మథుడి వంటి రాముణ్ణి కామించటమా? వేళ్ళాడే పొట్టవేసుకొన్న ఈ ముసలిదానికి రాముడు కావాల్సి వచ్చాడా? ముల్లోకాలవాళ్ళు అసహ్యించుకునే దీని అందానికి రాముడు కావాల్సి వచ్చాడా? దీనికి ఒక్క మంచిగుణమైనా ఉందా? ఒళ్ళంతా ముడతలు పడిపోయిందే! ఇది రాముణ్ణి ఎట్లా వలచింది? దీని తల అంతా నెరిసి ముగ్గుబుట్టలాగా ఉంటుంది. ఈ ముసలి శూర్పణఖ అందరూ ఎగతాళి చేసే పని చేసింది. అందరూ నిందించే పని చేసింది. ఈ దౌర్భాగ్యురాలు చేసిన తప్పుడు పనికి ఈ రోజున మనమందరం దుఃఖసముద్రంలో మునిగిపోయాం. ఖరదూషణాదులు కూడా ఆ అయోగ్యురాలి చెప్పుడుమాటలు వినే చెడిపోయారు. ఇన్ని మాటలెందుకు, రాక్షసకులాన్నే నాశనం చేసింది. ఈ ముసలిదాని మాటలు వినే మన ప్రభువు రావణాసురుడి బుద్ధి కూడా పెడత్రోవన పట్టింది; రాముడితో వైరం పెట్టుకునేట్లు చేసింది. దీని మాట విని, సీతను తీసుకొచ్చి తన చావు తానే తెచ్చుకున్నాడు. పోనీ ఆ సీతనైనా దక్కించుకున్నాడా, అంటే అదీలేదు. ప్రాణాల మీదకు తెచ్చుకున్నాడు.

ఈ సీతకోసం, విరాధుడు రాముడితో వైరం పెట్టుకున్నాడు. రాముడు ఒక్కడే ఈ విరాధుణ్ణి, ఖరుణ్ణి, దూషణుణ్ణి, త్రిశిరుణ్ణి చంపాడు. అంతేకాదు జనస్థానంలో పధ్నాలుగు వేలమంది భయంకరులైన రాక్షసయోధుల్ని రాముడొక్కడే సంహరించాడు. రాముడు పరాక్రమవంతుడని తెలుసుకోవటానికి ఈ ఒక్క నిదర్శనం చాలదా? జంతువుల్ని పట్టుకొని వాటి నెత్తురు త్రాగి పచ్చిమాంసం తినే కబంధుణ్ణి రాముడు సంహరించాడు. ఈ నిదర్శనం చాలదా? మేరుపర్వతంతో సమానమైనవాడు, మహాబలవంతుడు, దేవేంద్రుడి కుమారుడు అయిన వాలిని ఒక్క బాణంతో హతమార్చాడే! ఈ నిదర్శనం చాలదా? ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని, భార్యను పోగొట్టుకొని, ఋష్యమూకపర్వతంపై తలదాచుకొంటున్న సుగ్రీవుణ్ణి, స్నేహధర్మాన్ని గౌరవించి కిష్కింధకు రాజుగా చేశాడు. ఈ నిదర్శనం చాలదా?

విభీషణుడు తన అన్నగారైన రావణునికి ధర్మాధర్మాలను వివరిస్తూ హితబోధ చేశాడు. ఆయన మాటలు విని ఉంటే రాక్షసులకు ఈనాడు ఇటువంటి దుస్థితి కలిగేదికాదు. మనమంతా ఎంతో సుఖసంతోషాలతో ఉండేవాళ్ళం. ఒళ్ళు తెలియక, మదమెక్కిన మన ప్రభువుకు ఆ విభీషణుడి మాటలు రుచించలేదు. కుబేరుడంతటి వాడి తమ్ముడై పుట్టాడు. కానీ ఏం ప్రయోజనం? అటు తను పుట్టిన వంశగౌరవాన్ని మంట కలిపాడు; ఇటు రాక్షసకులాన్ని సర్వనాశనం చేశాడు. ఆనాడు విభీషణుడి మాట విని ఉంటే లంకాపట్టణం ఈ విధంగా వల్లకాడు అయిఉండేది కాదు. ఇంతమంది ఆడవాళ్ళం దుఃఖాల్లో మునిగిపోయాం. మహాబలవంతుడైన కుంభకర్ణుణ్ణి రాముడు చంపేశాడు. ఎదరించటానికి వీలుకాని మహాబలశాలి అయిన అతికాయుణ్ణి, ప్రియపుత్రుడైన ఇంద్రజిత్తును ఆ లక్ష్మణుడు చంపేశాడు. అయినా ఈ రావణాసురుడికి తెలిసిరావటం లేదు. అయ్యో! నా కొడుకు చనిపోయాడని ఒకరు, అయ్యో! నా భర్త చనిపోయాడని మరొకరు, నా సోదరుడు పోయాడే అని ఇంకొకరు చెప్పుకుంటూ రాక్షసాంగనలంతా విలపించసాగారు.

ఆ రాముడు మహాశూరుడు. యుద్ధంలో ఏనుగుల్నీ, గుర్రాల్నీ, రథాల్నీ నాశనం చేశాడు.

సైనికులు ఎందరు చనిపోయారో లెక్కలేదు. అతడు సామాన్యమానవుడు కాడు. రుద్రుడో, దేవేంద్రుడో, విష్ణువో ఈ రూపంలో వచ్చి ఉండాలి. లేక యముడే ఈ రాముడు రూపంలో వచ్చాడా? ఎవరైతేనేం! రాక్షసులందర్నీ సంహరించేశాడు. మా వాళ్ళంతా యుద్ధంలో చనిపోయారు. మాకు ఇక బ్రతకాలని లేదు. భయపడుతూ జీవించేకన్నా మరణమే మేలు. మేమంతా అనాథలమైపోయాం అంటూ ఏడ్చారు.

ఆ రావణాసురుడికి యుద్ధం అంటే భయంలేదు. చావు రాకుండా వరాలు సంపాదించుకొని కూర్చున్నాడు. మాకు రాముడివల్ల ఇంత ఘోరం జరిగిందే అనిగానీ, ప్రజలంతా భయపడుతున్నారే అన్న ఆలోచనగానీ అతగాడికి లేదు. రాముడితో యుద్ధానికి తలపడిన వాడిని దేవతలు గాని, గంధర్వులుగాని, పిశాచాలుగాని రక్షించలేవు. ఏ వీరుడు యుద్ధానికి బయలుదేరినా అపశకునాలు ఎదురవుతూనే వచ్చాయి. రావణుడికి రాముడి చేతులో చావు మూడిందనే దుశ్శకునాలు అనేకమందికి అనేక రకాలుగా కనిపించాయి.

పూర్వం రావణాసురుడు దేవదానవరాక్షసుల వల్ల తనకు చావు రాకుండా బ్రహ్మదేవుడి వద్ద నుండి వరాలు పొందాడు. అయితే రావణుడు అప్పుడు మనుషులను గూర్చి అడగనూలేదు, బ్రహ్మదేవుడు మానవుల నుండి చావురాదని వరం ఇవ్వనూలేదు. రావణుడు అప్పుడు గర్వాంధకారంతో మానవులంటే అలక్ష్యంతో బ్రహ్మని అడగలేదు. అందువల్ల ఇప్పుడు అతడికే చావుమూడింది; రాక్షసజాతి అంతటికీ ప్రాణాంతకమైంది. అందువల్లనే ఇప్పుడు ఈ ఘోరం జరుగుతోంది.

బ్రహ్మదేవుడిచ్చిన వరబలంతో రావణాసురుడి బలం రెట్టింపయింది. తిరుగులేని బలశాలి కావడంవల్ల అతడు దేవతల్ని పెట్టే బాధలు కూడా నూరింతలు ఎక్కువయ్యాయి. దాంతో దేవతలు బ్రహ్మను గూర్చి తీవ్రంగా తపస్సు చేశారు. దేవతల తపస్సుకు మెచ్చిన బ్రహ్మ సంతోషించి, ఇకపై దానవులు, రాక్షసులు దేవతల్ని బాధలు పెట్టరనీ, భయంతో సంచరిస్తారనీ చెప్పారు. దాంతో తృప్తిచెందని దేవతలు దేవేంద్రుని నాయకత్వంలో త్రిపురాసురులను సంహారం

చేసిన శివుడి దగ్గరకు పోయి ప్రార్థించారు. ప్రసన్నుడైన ఆ మహాదేవుడు “దేవతలారా! రాక్షసులందరూ నాశనం కావటానికి ఒక స్త్రీ జన్మిస్తుంది. అటుపిమ్మట మీరంతా రాక్షస బాధలు లేకుండా ప్రశాంతంగా ఉంటారు” అని చెప్పాడు. ఆ దేవతల్ని కాపాడేందుకు, రాక్షసుల్ని అంతం చేసేందుకు ఇప్పుడు ఈ సీత వచ్చింది. మునుపు ఆకలిబాధ చేత దానవులంతా మరణించినట్లే, ఇప్పుడు ఈ సీతవలన ఈ రావణాసురుడు చేసిన పనికి, రాక్షసులందరికీ వినాశకాలం వచ్చింది. ప్రళయకాలంలో యముడి చేతిలో పడ్డట్టు, ఇప్పుడు మనం అంతా ఈ రాముడి చేతిలో పడి మరణిస్తున్నాం. ఇహ మనల్ని ఎవరూ కాపాడలేరు. విభీషణుడు మహాబుద్ధిశాలి. సరి అయిన సమయానికి సరి అయిన నిర్ణయం తీసుకున్నాడు. ఎవరి వల్ల ఆపద రానున్నదో ముందుగానే గ్రహించి, ఆ రాముడినే శరణు వేడుకున్నాడు. అందుకనే అంటారు, ‘సాక్షి కాళ్ళు పట్టుకోవటం కన్నా, శత్రువుతోనే సమాధాన పడటం శ్రేయస్కరం’ అని.” ఈ విధంగా రాక్షస స్త్రీలంతా భయంతో ఒకళ్ళనొకళ్ళు కౌగలించుకుంటూ ఏడ్చారు.

# 94వ సర్గ రావణుడు యుద్ధభూమికి బయలుదేరటం

లంకా పట్టణంలోని రాక్షసస్త్రీల ఏడుపులు, పెడబొబ్బలు హాహాకారాలు విన్నాడు. రావణుడు ఆలోచనలో పడ్డాడు. నిట్టూర్పులు విడిచాడు. తన చేతకానితనాన్ని ఒప్పుకోవటానికి అహంకారం అడ్డుపడ్డది. కోపావిష్టుడయ్యాడు. పెదవులు కొరికాడు. క్రోధంతో కళ్ళు చింతనిప్పుల్లా అయ్యాయి. విజృంభించిన ప్రళయాగ్ని అయ్యాడు. రాక్షసమంత్రులు కూడా అతడి ముఖంలో ముఖంపెట్టి చూడలేకపోయారు. కళ్ళతోనే కాల్చివేసేటట్లు చూస్తూ, ప్రక్కనే ఉన్న మహోదర, మహాపార్శ్వ, విరూపాక్షులతో "సైన్యం సిద్ధం చెయ్యండి. వెంటనే యుద్ధానికి బయలుదేరాలి" అన్నాడు.

ఆ మంత్రులు అందరు భయంతో ఒణికిపోతూ, రాజాజ్ఞను శిరసా వహించి, పెద్ద సైన్యాన్ని సమీకరించి సిద్ధం చేశారు. సంప్రదాయం ప్రకారం మహారథులైన ఆ రాక్షసశ్రేష్ఠులందరూ రావణుని పూజించి, ప్రభువుకు విజయం కలగాలని స్తోత్రం చేసి దోసిళ్ళుకట్టి నిలబడ్డారు. పిమ్మట క్రోధంతో రగిలిపోతున్న ఆ రావణుడు నవ్వుతూ మహోదర, మహాపార్శ్వ, విరూపాక్షులతో ఇలా అన్నాడు. (వెనుక యుద్ధంలో మరణించిన మహోదర, మహాపార్శ్వలు రావణుని సోదరులు వీరు ముగ్గురూ రావణుని మంత్రులు అని వ్యాఖ్యాతలు వివరించారు)

"ఓ అమాత్యులారా! ఈ రోజున నా ధనుస్సు నుండి వెలువడే బాణాలు, ప్రళయసూర్యునివలె ఆ రామలక్ష్మణులను చంపేస్తాయి. శత్రువును చంపి, నేను ఖరుడు, కుంభకర్ణుడు, ప్రహస్తుడు, ఇంద్రజిత్తు ఆత్మలకు శాంతి కలిగిస్తాను. ప్రతీకారం తీర్చుకుంటాను. నా బాణాల చేత దిక్కులు కనిపించకుండా కప్పేస్తాను. ద్యులోకంగానీ, సముద్రాలుగానీ, మేఘాలు గానీ కనపడకుండా చేస్తాను. నేను రెక్కలుకట్టిన బాణాల్ని వదిలి వానరుల్ని గుంపులుగుంపులుగా చంపుతాను. వాయువేగం గల రథాన్ని అధిరోహించి, సముద్రం వంటి

ధనుస్సును ధరించి, నేను వదిలిన బాణతరంగముల చేత వానరసైన్యం అంతా నశిస్తుంది. వికసించిన పద్మాలవంటి ముఖాలు, పద్మకింజల్కం వంటి శరీరఛాయ కలిగిన ఆ వానరులనే సరస్సులోకి నేను మదపుటేనుగు వలె ప్రవేశించి ధ్వంసం చేస్తాను. నా బాణాలు వానరుల ముఖాల్లో గుచ్చుకొని నేలపై పడిపోయినప్పుడు కాడతో కూడిన పద్మంలాగా భూమికి అలంకారం కాగలరు. నేను వదిలే ఒక్కొక్క బాణానికీ, మహావృక్షాల్ని పెళ్ళగించుకుని వచ్చే నూరుగురువానరులు నేల కూలుతారు. భర్తలను, సోదరులను, పుత్రులను పోగొట్టుకున్న రాక్షస స్త్రీలకు ఊరట కలిగించేట్లుగా, శత్రువులందరినీ చంపినందువల్ల వారి కన్నీళ్ళు తుడిచినట్లవుతుంది. నా బాణాలతో చచ్చిపడే శత్రువుల రక్తమాంసాల్ని నక్కలు, గ్రద్దలూ తృప్తిగా తింటాయి.

ఓ వీరులారా! నా రథాన్ని సిద్ధం చెయ్యండి. నా ధనుస్సును సిద్ధం చెయ్యండి. రాక్షస వీరులందరినీ నా వెంటరమ్మని చెప్పండి" అన్నాడు. అప్పుడు మంత్రి మహాపార్శ్వుడు అక్కడ ఉన్న సేనాధిపతుల్ని చూసి "సేనలను వెంటనే సిద్ధం చెయ్యండి" అని ఆజ్ఞాపించాడు. ఆ సేధిపతులంతా సైన్యాన్ని సిద్ధంచేసి వచ్చి చెప్పారు.

ఆ మరుక్షణంలోనే రాక్షస సేనలన్నీ యుద్ధానికి మోహరించబడ్డాయి. వాళ్ళంతా ఖడ్గాలు, పట్టిసాలు, శూలాలు, గదలు, ముసలాయుధాలు, శూలాయుధాలు, శక్త్యాయుధాలు, కూటముద్గరములు, చక్రాయుధాలు, గండ్రగొడ్డళ్ళు, భిందిపాలాలు, శతఘ్నులు ఇంకా రకరకాల ఆయుధాల్ని పట్టుకుని యుద్ధానికి సిద్ధపడ్డారు. ఆ రాక్షస యోధులంతా మహాభయంకరులు, వికృతాకారులు.

రావణాసురుడి రథానికి ఎనిమిది గుర్రాల్ని కట్టారు. అనుభవజ్ఞుడు, విశ్వాసపాత్రుడు అయిన సారథి రథాన్ని నడుపుతున్నాడు. రథం నిండా వివిధరకాలైన ఆయుధాల్ని అమర్చారు. ఆ రథంపై రావణాసురుడు ఎక్కి కూర్చున్నాడు. ఆ రథం వెనకాలే జయజయ ధ్వానాలు చేసుకుంటూ రాక్షసయోధులు బయలుదేరారు. వారంతా రావణునికి జయాన్ని కాంక్షిస్తూ కేకలు

వేశారు, భూమి బ్రద్దలయ్యేట్లు పెడబొబ్బలు పెట్టారు. దిక్కులు పిక్కటిల్లేటట్లు సింహనాదాలు చేశారు. ఎదిరించనలవి కాని మహాపార్శ్వుడు, మహోదరుడూ, విరూపాక్షుడు రావణుని అనుసరించి రథాల్లో బయలుదేరారు.

రావణుని రథాన్ని పదకొండువేలమంది విలువిద్యా ప్రావీణ్యులు అనుసరించారు. వారంతా ఒంటరిగా పోరాడే సామర్థ్యం గలవాళ్ళు. ఈ పదకొండువేలమందీ ఎల్లవేళలా రావణుణ్ణి, రావణుడి సారథిని, అశ్వాలను, రథాన్నీ, ధ్వజాన్నీ కాపాడుతూ ఉంటారు. రామలక్ష్మణులుండే ఉత్తరద్వారంవైపు రథాన్ని తోలించాడు.

ఆ సమయంలో ఆకాశంలో సూర్యుడు కాంతిహీనుడై మసకగా కనిపించాడు. దశదిశలా చీకట్లు కమ్ముకున్నాయి. పక్షులు అమంగళకరంగా అరిచాయి. భూమి కంపించింది. ఆకాశం నుండి నెత్తురు వాన కురిసింది. గుర్రాల కాళ్ళల్లో సత్తువ తగ్గి తడబడ్డాయి. రథధ్వజంపై గ్రద్దలు వ్రాలాయి. నక్కలు భయంకరంగా అరిచాయి. రావణుని ఎడమకన్ను, ఎడమ భుజము అదిరాయి. రావణుని ముఖంలో కళ తప్పింది. మాటలు తడబడ్డాయి. అంతరిక్షం నుండి పిడుగువంటి ధ్వని చేస్తూ ఉల్క ఒకటి జారిపడింది. కాకులు, గద్దలు ఎదురువచ్చి వికృతంగా కూశాయి. కాలం దగ్గరపడటం వల్ల రావణుడు వీటిని దేనినీ తెలుసుకోలేకపోయాడు. అట్లాగే యుద్ధభూమికి సాగిపోయాడు.

రావణాసురుడి రథధ్వనులు వానరులు విన్నారు. మహాకాయులైన రాక్షసయోధులు యుద్ధానికి వస్తూ ఉండటాన్ని వానరులు చూశారు. దాంతో వానరవీరులు కూడా యుద్ధానికి సన్నద్ధులై నిలిచారు. ఆ రెండు సైన్యాలూ భీకరంగా తలపడ్డాయి. ఇరుపక్షాల వాళ్ళూ జయమే ప్రధానలక్ష్యంగా ప్రాణాలొడ్డి పోరాడారు.

అప్పుడు రావణుడు కృద్ధుడై వానర సైన్యాలపైన బంగారుపింజల బాణాల్ని వదిలాడు. ఆ బాణాలకు వానర సైన్యంలో కొందరి తలలు తెగిపోయాయి. కొందరికి గుండెలు

పగిలిపోయాయి. కొందరికి పక్కటెముకలు విరిగాయి. కొందరు చెవులు, కొందరు కళ్ళు పోగొట్టుకున్నారు. కొందరు స్పృహలేకుండా పడిపోయారు. అప్పుడా రావణుడు కోపంతో కనుగుడ్లు తిప్పుతూ ఆ యుద్ధభూమి అంతా రథంపై కలయతిరిగాడు. అతడు ఏ వైపుకుపోతే, ఆ వైపున వానరులంతా భయంతో పారిపోయారు.

# 95వ సర్గ సుగ్రీవుడు విరూపాక్షుని వధించడం

రావణుడు వదలిన బాణాలు వానరుల అవయవాలన్నింటినీ ఛేదించుకుంటూ పోయాయి. అప్పుడా యుద్ధభూమి అంతా వానరుల శవాలతో నిండిపోయింది. మండే అగ్నిహోత్రంలో పడ్డ మిడతల్లాగా, రావణాసురుడు వదిలే బాణాలతాపానికి వానరులు నిలవలేకపోయారు. మంటల మధ్య చిక్కుబడిన ఏనుగువలె, వానరులంతా కేకలుపెట్టారు. మేఘాలను పెనుగాలులు తరిమినట్లురావణుడి బాణం తాకిడికి వానరులంతా హాహాకారాలు చేస్తూ పరుగులు తీశారు. రాక్షసరాజైన రావణుడు ఆ విధంగా వానరులందర్నీ మట్టుబెట్టి; వేగంగా రాముడి వైపుగా రథాన్ని నడిపించాడు.

యుద్ధంలో దెబ్బలుతిని పారిపోతున్న వానరుల్ని చూసి సుగ్రీవుడు, తనతో సమానుడైన సుషేణుణ్ణి అక్కడ తన స్థానంలో నిలిపి, పెద్దవృక్షాన్ని చేత్తో పట్టుకొని రాక్షససైన్యం వైపుగా వెళ్ళాడు. వానరయోధులందరూ వృక్షాల్ని, శిలల్నీ చేత్తో పుచ్చుకొని సుగ్రీవుడికి అందిస్తూ నిలబడ్డారు. మహాకాయుడైన సుగ్రీవుడు పెద్దగా గర్జిస్తూ రాక్షసయోధులందర్నీ చంపుతూ, మేటి రాక్షసవీరులపైకి లంఘించాడు. ప్రళయకాల వాయువువలె సుగ్రీవుడు పెద్దపెద్ద వృక్షాలను పెళ్ళగించి మహాకాయులైన రాక్షసుల్ని పడగొట్టాడు. అడవిలో పక్షులపై పడే వడగళ్ళ వాన కురిపించే మేఘంలాగా, సుగ్రీవుడు రాక్షససేనపై రాళ్ళవర్షం కురిపించాడు. ఆ రాళ్ళు తగిలిన రాక్షసుడల్లా నేలకొరిగాడు. ఆ రాళ్ళదెబ్బలకు రాక్షసుల తలలు పగిలాయి, కాళ్ళు చేతులూ విరిగాయి. వజ్రాయుధం దెబ్బకు ముక్కలు ముక్కలైన పర్వతశిఖరాల్లాగా కూలారు. తీవ్రంగా గాయాలైనవారు ప్రాణరక్షణకై పరుగులు తీశారు.

సుగ్రీవుడు రాక్షసుల్ని చెండుకు తినడం విరూపాక్షుడు చూశాడు. ఎదిరించ శక్యంకాని ఆ వీరుడు, ధనుస్సు తీసుకొని, తన పేరు బిగ్గరగా ప్రకటించుకుంటూ, రథంలో నుండి అమాంతం ప్రక్కనున్న ఏనుగుపై దూకి సింహనాదం చేశాడు. ఆ ఏనుగు పైనుండి విరూపాక్షుడు తీవ్రమైన

బాణాల్ని సుగ్రీవుడిపైకి ప్రయోగించాడు. దాంతో రాక్షసుల్లో భయంపోయి ధైర్యంగా నిలబడ్డారు. వాళ్ళుకూడా విరూపాక్షుడితోపాటు సుగ్రీవుణ్ణి ఎదిరించారు.

మహాశూరుడూ, సమర్థుడూ అయిన సుగ్రీవుడు ఒక పెద్దవృక్షాన్ని ఎత్తి, విరూపాక్షుడు ఎక్కిన ఏనుగు తలపై, గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బకు ఆ గజరాజము తట్టుకోలేక ధనస్సంత (రెండు గజాలు) దూరాన పోయి పడి గట్టిగా ఘీంకారం చేసింది. విరూపాక్షుడు వెంటనే ఆ చచ్చిన ఏనుగును వదిలేసి, సుగ్రీవుడి పైకి లంఘించాడు. ఎద్దుచర్మంతో చేసిన డాలును ఖడ్గాన్ని ధరించి, నిలబడి ఉన్న సుగ్రీవుడిపైకి లంఘించాడు. వెంటనే సుగ్రీవుడు మేఘం వంటి పెద్దశిల నొకటి తీసి విరూపాక్షుడిపై విసిరాడు. విరూపాక్షుడు ఆ శిలనుండి తప్పించుకొని కత్తి తీసుకొని సుగ్రీవుణ్ణి బలంగా కొట్టాడు. ఆ ఖడ్గ ప్రహారానికి సుగ్రీవుడు ఒక ముహూర్తకాలం స్పృహ కోల్పోయాడు. అప్పుడా సుగ్రీవుడు కొన్నిక్షణాల్లోనే తేరుకుని హఠాత్తుగా ఎగిరి పిడికిలి బిగించి విరూపాక్షుడి వక్షః స్థలంపై గుద్దాడు. ఆ దెబ్బకు కృద్ధుడైన విరూపాక్షుడు ఖడ్గం తీసుకొని సుగ్రీవుడి కవచాన్ని బద్దలుకొట్టాడు. ఆ దెబ్బకు సుగ్రీవుని పాదాలు తొట్రుపడ్డాయి; తూలి కిందపడ్డాడు. వెంటనే బంతిలాగా లేచి, భయంకరమైన ధ్వని చేస్తూ అరచేత్తో గట్టిగా చరిచాడు. విరూపాక్షుడు ఎట్లాగో ఆ దెబ్బను తప్పించుకుంటూ సుగ్రీవుడి వక్షఃస్థలంపై గుద్దాడు. రాక్షసయోధుడు తన చేతిదెబ్బ నుండి తప్పించుకోవటం చూసి సుగ్రీవుడికి చాలా కోపం వచ్చింది. సమయం కోసం వేచి ఉండి, సుగ్రీవుడు విరూపాక్షుని కణతలపై చేత్తో బలంగా కొట్టాడు. మహేంద్రుడి వజ్రాయుధం లాంటి ఆ దెబ్బకు విరూపాక్షుడి ముక్కు నుండి జలపాతం నుండి నీరు కారినట్లుగా, రక్తం కారసాగింది. ఆ నెత్తురుతో ఒళ్ళంతా తడిసిపోయి విరూపాక్షుడు నేలపై పడిపోయాడు. నెత్తురు నురుగులు కక్కుతూ ప్రవహించింది, కనుగుడ్లు బయటకు వచ్చాయి. అటువంటి వికృతనేత్రాలతో, బాధ భరించలేక నేలపైపడి దొర్లుతూ, జాలిపుట్టేట్లు అరుస్తూన్న విరూపాక్షుణ్ణి వానర వీరులంతా చూశారు.

అప్పుడు ఆ రాక్షస వానరసేనలు చెలియలి కట్టను తెంచుకొని పొంగిపొరలుతున్న రెండు

మహాసముద్రాల్లాగా పోరాడారు. ఆ మహాబలవంతుడు విరూపాక్షుణ్ణి, వానరరాజు సుగ్రీవుడు చంపడంతో వానర సైన్యాల సంతోషానికి అవధుల్లేకుండా పోయింది. అటు రాక్షస సైన్యాలు తమ నాయకుడు చచ్చిపోవడంతో వెన్ను విరిగినట్లయి, దుఃఖంతోపాటు కోపం కూడా పొంగిపొర్లింది. మళ్ళీ పోరాటానికి సిద్ధపడ్డారు. మహాబలుడైన విరూపాక్షుడు సుగ్రీవుడిచే చంపబడటం వలన వానరసైన్యం విజృంభించి ప్రవహించే గంగానదిలాగా ఉంది.

# 96వ సర్గ మహోదరుడి మరణం

ఆమహాయుద్ధంలో రాక్షస వానర సైన్యాలు పరస్పరం జయంకోసం ప్రాణాలు విడుస్తూ గ్రీష్మంలో సరస్సుల్లాగా త్వరగా క్షీణించిపోతున్నాయి. ఒక ప్రక్క రాక్షససేన క్షీణిస్తూ ఉండటం, మరోప్రక్క విరూపాక్షుడు చంపబడటం వలన రావణునికి కోపం రెట్టింపయింది. క్షీణించిపోతున్న తన సైన్యం, పెరిగిపోతున్న వానరుల విజయ పరంపరలు విధివైపరీత్యమే కదా! అని బాధపడ్డాడు. అక్కడే ఉన్న మహోదరుడితో "ఓ మహాబాహూ! ఇప్పుడు నా ఆశలన్నీ నీ పైనే ఉన్నాయి. శత్రుసైన్యాన్ని చీల్చిచండాడు. కనిపించినవాడినల్లా చంపెయ్యి. నీ ప్రతాపం చూపాల్సిన సమయం ఇదే! ఇది నీ ఋణం తీర్చుకునేందుకు చివరి అవకాశం. బాగా యుద్ధం చేసి ఆ ఋణం తీర్చుకో" అన్నాడు. అంతట ఆ మహోదరుడు రావణుని పలుకులనే ఆజ్ఞలుగా శిరసావహించి, మిడత అగ్నిహోత్రంలోకి దూకినట్లుగా శత్రుసైన్యంలోకి ప్రవేశించాడు.

మహాబలవంతుడు, తేజశ్శాలి అయిన మహోదరుడు వానర సంహారం చేయసాగాడు. అటు వానరులు కూడా, పెద్దపెద్ద శిలల్ని తీసుకొని రాక్షసవీరుల్ని సంహరించసాగారు. కృద్ధుడైన మహోదరుడు బంగారుపొన్నులుగల బాణాలతో వానరుల కాళ్ళు చేతులు, తొడలు ఛేదించాడు. రాక్షసుల దెబ్బలకు తట్టుకోలేని వానరులు పరుగెత్తుకుంటూపోయి సుగ్రీవుణ్ణి శరణువేడారు. అప్పుడు సుగ్రీవుడు ఆ వానరయోధులను ఊరడించి, మహోదరుడి పైకి లంఘించాడు. గొప్ప తేజశ్శాలి అయిన ఆ సుగ్రీవుడు, పర్వతమంత పెద్ద శిలనొకటి తీసుకొని ఆ మహోదరుడిపైకి లంఘించాడు. మహోదరుడు తనపై వచ్చి పడుతున్న ఆ పెద్దశిలను బాణాలతో ఛేదించేశాడు. ఆ శిల వెయ్యిముక్కలై, గ్రద్దల గుంపులాగా, నేలపై పడింది. అంతపెద్ద శిల వృథా కావటంతో, సుగ్రీవుడు ఒక సాలవృక్షాన్ని పెళ్ళగించి ప్రయోగించగా, దాన్ని కూడా బాణంతో ముక్కలు ముక్కలు చేశాడు. శత్రుసంహారకుడైన ఆ మహోదరుడు సుగ్రీవుడిపై బాణాల వర్షం కురిపించి శరీరం అంతా చీరేశాడు. దాంతో కృద్ధుడై పోయిన సుగ్రీవుడు నేలపైపడి ఉన్న పరిఘాయుధాన్ని చేతిలోకి తీసుకొని దాన్ని మహాదరుడికి చూపిస్తూ అతడికి ఉన్న గుర్రాన్ని దాంతో చంపేశాడు.

వెంటనే మహోదరుడు నేలపైకి దూకి, గదను తీసుకొని సుగ్రీవుడిపైకి దూకాడు. సుగ్రీవుడు పరిఘను, మహోదరుడు గదను తీసుకొని పరస్పరం కొట్టుకున్నారు. వాళ్ళిద్దరూ అట్లా యుద్ధం చేస్తూ ఉంటే మదించిన వృషభాల్లా ఉన్నారు. మహోదరుడు, ప్రజ్వలించే సూర్యుడిలాగా, తన వద్ద ఉన్న గదను సుగ్రీవుడిపైకి విసిరాడు. తనపై పడుతున్న కాంతివంతమైన గదను, మహాబలవంతుడు, వానరరాజు అయిన సుగ్రీవుడు పరిఘతో ఎదుర్కొని ఆ గదను విరగొట్టాడు. అంతట మహాతేజశ్శాలి అయిన సుగ్రీవుడు నేలపైపడి ఉన్న ఇనపరోకలిని తీసుకొని మహోదరుడి పైకి విసిరేశాడు. అప్పుడు మహోదరుడు మరొక గదతో ఆ రోకలిని నేలపై పడగొట్టాడు. ఆ విధంగా ఆ మహావీరులిద్దరూ ఆయుధాలు నిర్వీర్యమై పోతూ ఉండటం వలన, ముష్టియుద్ధానికి తలపడ్డారు. వాళ్ళిద్దరూ పరస్పరం అరచుకుంటూ, చేతులతో ఒకర్నొకరు చరుచుకుంటూ, కొట్టుకుంటూ నేలమీద పడ్డారు. ఇంతలోనే చివాలున లేచి నిలబడి భుజాలతో నెట్టుకున్నారు. ఈ విధంగా ముష్టియుద్ధంలో అలసిపోయిన వాళ్ళిద్దరూ అక్కడే పడి ఉన్న కత్తి డాలు తీసుకొని పోరాటం కొనసాగించారు. ఇద్దరూ ఆయుధాలు ప్రయోగించడంలో నేర్పరులే! ఇద్దరూ తేజోవంతులే. ఇద్దరూ పౌరుషంతో పోరాటాన్ని సాగించారు. మహాపరాక్రమవంతుణ్ణని తనకుతానే ప్రకటించుకునేవాడు, దుష్టబుద్ధి అయిన మహోదరుడు, కత్తిని సుగ్రీవుడి గుండెల్లోకి గురిపెట్టగా, సుగ్రీవుడు దాన్ని డాలుతో అడ్డుకున్నాడు. మహోదరుడి కత్తి సుగ్రీవుడి డాలులో చిక్కుకుపోయింది. దాన్ని లాగటానికి పెనుగులాడుతూ ఉండగా, సుగ్రీవుడు ఆ అదను చూసుకొని తన కత్తితో కుండలాలతో అలంకరించబడి ఉన్న మహోదరుడి శిరస్సును ఖండించాడు. మహోదరుడి శిరస్సు ఖండించబడి నేలపై పడగానే, ఆ భీకరదృశ్యం చూస్తున్న రాక్షస వీరులు పారిపోయారు.

సుగ్రీవుడు మహోదరుణ్ణి చంపగానే వానరులంతా సంతోషంతో సింహనాదాలు చేశారు. రాముడు సంతోషించాడు. రావణుడు కోపంతో మండిపడ్డాడు. రాక్షసులంతా భయభ్రాంతులై ప్రాణభయంతో పారిపోయారు. మహాపర్వతంలో ఒక భాగాన్ని పడగొట్టినట్లు, సూర్యపుత్రుడైన సుగ్రీవుడు, ఎదిరించటానికి అలవికాని మహోదరుణ్ణి హతమార్చాడు. మహోదరుణ్ణి

సంహరించిన సుగ్రీవుణ్ణి చూచి ఆకాశంలో బారులుతీరిన దేవదానవ, యక్ష, సిద్ధ సమూహాలూ, భూమండలంపై నుండే ప్రాణికోటి అంతా కీర్తించారు.

# 97వ సర్గ అంగదుడు మహాపార్శ్వుణ్ణి వధించటం

మహోదరుడు సుగ్రీవుడి చేతుల్లో చంపబడటం చూసిన మహాపార్శ్వుడికి కోపం కట్టలుతెంచుకుంది. కళ్ళు ఎర్రగా కెంపులయ్యాయి. ఆ రాక్షసుడు అంగదుడిపైన భయంకర వానరసైన్యంపైనా నిశితమైన బాణాల్ని ప్రయోగించి క్షోభింపజేశాడు. వానరుల్లో ముఖ్యులైన అనేకమంది వానరుల శిరస్సులు గాలికి తొడిమ నుండి ఫలములు రాలినట్లు, రాలి నేలపై పడ్డాయి. విజృంభించిన ఆ రాక్షసుడు వానరుల్లో కొందరి బాహువుల్ని, ఛేదించాడు. ఇంకొందరి పక్కలు విరిగిపోయాయి. కొందరి కాళ్ళు విరగ్గొట్టాడు. ఆ విధంగా మహోదరుడి చేత బాధించబడ్డ వాళ్ళంతా వికలాంగులై యుద్ధం చేయలేనివారై నేలపైపడి ఉన్నారు. వానరసైన్యం మహాపార్శ్వుడి బాణాలవల్ల భయపడిపోవడం, బాధతో విలవిల్లాడటం అంగదుడు చూశాడు. పర్వదినాల్లో సముద్రుడు పొంగినట్లు, అతడిలో కోపం పెల్లుబికింది. సూర్యకాంతితో సమానంగా మెరిసిపోయే పరిఘాయుధం ఒకటి కనిపించింది. దాంతో మహాపార్శ్వుణ్ణి బలంగా కొట్టాడు. ఆ దెబ్బ మహాపార్శ్వుడికి గూబమీద తగిలింది. గూబ గుయ్యిమంది. మూర్ఛపోయి రథం పైనుండి కిందపడ్డాడు. ఆ పరిఘ వేగానికి రథం ఊగిసలాడింది. రథసారథి కూడా కిందపడ్డాడు. అదే సమయాన కాటుకకొండ వంటివాడు, మహాపరాక్రమవంతుడు అయిన జాంబవంతుడు ఒక పెద్దపర్వతాన్ని ఎత్తి ఆ రథంపై వేశాడు. దాంతో ఆ రథం ముక్కలై విరిగిపోయింది; రథానికి పూన్చిన గుర్రాలు అక్కడికక్కడే చచ్చిపోయాయి. ఇంతలోనే మూర్ఛ నుండి తేరుకున్న మహాపార్శ్వుడు మళ్ళీ ధనుస్సును తీసుకొని అనేక బాణాలతో అంగదుణ్ణి కొట్టాడు. భల్లూకరాజైన జాంబవంతుణ్ణి మూడు బాణాలతోను, గవాక్షుణ్ణి అనేక బాణాలతోను పీడించాడు. గవాక్షుడు, జాంబవంతుడు బాణములచే పీడించబడటం చూసిన అంగదుడు కోపావేశంతో భయంకరమైన పరిఘాయుధాన్ని రెండు చేతులతోను బలంగా త్రిప్పి, మహాపార్శ్వుడిపైన విసిరివేశాడు. ఆ పరిఘపోయి రాక్షసుడి చేతిలో ధనస్సును తాకి అల్లంత దూరానపోయి పడింది. శిరస్సున ధరించిన కవచం విరిగి నేలపై పడిపోయింది. అంతట ప్రతాపవంతుడైన అంగదుడు

అరచేత్తో కుండలాలు ధరించిన కణతపైన గట్టిగా కొట్టాడు. ఎదిరించ శక్యం కాని మహాపార్శ్వుడు ఇట్లా దెబ్బ మీద దెబ్బ తగలటం, అందులోనూ ఒక వానరుడి చేతిలో దెబ్బలు తినటాన్ని జీర్ణించుకోలేకపోయాడు. గొప్ప వేగము, కాంతిగల ఆ మహాపార్శ్వుడు కోపంతో గండ్రగొడ్డలిని తీసుకొని అంగదుడి మీదకు బలంగాను, వేగంగాను విసిరాడు. ఎట్లాగైనా ఈ రాక్షసుణ్ణి అంతం చెయ్యాలనే కసితో ఉన్న అంగదుడు, రాక్షసుడు విసిరిన ఆ గండ్రగొడ్డలి దెబ్బ నుండి తృటిలో తప్పించుకున్నాడు. తండ్రి అంతటి పరాక్రమం గల అంగదుడు వజ్రాయుధం వంటి పిడికిలిని బిగించి, గాలిలోకి ఎగిరి ఆ రాక్షసుడి వక్షస్థలం ఎడమ భాగంపై గట్టిగా గుద్దాడు. ఆ పిడికిలి దెబ్బకు ఆ రాక్షసుడి గుండె పగిలి చచ్చి నేలపై పడిపోయాడు. అతడు చచ్చి నేలపై పడిపోవటం చూస్తున్న రాక్షససైన్యం అంతా క్షోభ చెందింది. రావణునికి గొప్ప పరాభవం జరిగినట్లయింది. మహాపార్శ్వుణ్ణి చంపినందుకు వానరులంతా అంతా అంగదుణ్ణి వేనోళ్ళ పొగిడారు. పెద్దపెట్టున సింహనాదాలు చేశారు. వానరుల సింహనాదాలతో కూడిన శబ్దాలు ప్రాకారాల్ని, గోపురాల్ని కోటబురుజుల్ని బ్రద్దలు కొడ్తున్నట్లుగా వినబడింది.

అంతట ఇంద్రునికి బద్ధశత్రువైన రావణుడు వానరులు, దేవతలు చేస్తున్న కోలాహలం విని కృద్ధుడైపోయాడు. కోపంతో మళ్ళీ యుద్ధానికి సంసిద్ధుడయ్యాడు.

# 98వ సర్గ రామ రావణుల యుద్ధం

మహోదరుడు, మహాపార్శ్వుడు, విరూపాక్షులపై రావణుడు దింపుడుకళ్ళ ఆశపెట్టుకొని బ్రతుకుతూ వచ్చాడు. మహాబలశాలురైన ఆ ముగ్గురు యోధుల్ని కూడా ఈ వానరులు పొట్టన పెట్టుకోవడంతో, అతడి కోపం కట్టలు తెంచుకుంది. క్రోధావేశంతో సారథితో ఇలా అన్నాడు. "అమాత్యుల మరణం వల్ల, లంకానగరాన్ని ముట్టడించడం వల్లా, రామలక్ష్మణులు నాకు తీరని దుఃఖాన్ని కలిగించారు. ఇప్పుడే వాళ్ళిద్దర్నీ సంహరించి ఆ దుఃఖానికి ఉపశమనం కలిగిస్తాను. రాముడు అనే వృక్షానికి సుగ్రీవుడు, జాంబవంతుడు, అంగదుడు, హనుమంతుడు, కుముదుడు, నలుడు, గంధమాదనుడు, మైందుడు, ద్వివిదుడు మొదలైన వారంతా కొమ్మలలాంటి వాళ్ళైతే, సీత ఆ వృక్షానికి పూసినపువ్వే ఫలమైంది. ఇప్పుడు నేను కొమ్మలు రెమ్మలతో సహా ఆ రామవృక్షాన్ని నరికేస్తాను. అప్పుడు సీత అనే ఫలాన్ని నేను పొందగలుగుతాను" అంటూ ఆ అతిరథుడు చెప్పగానే రథం కదిలింది. ఆ రథఘోష దశదిశలా వ్యాపించింది; భూమి, భూమిపై ఉన్న పర్వతాలు కంపించాయి. నదులూ సముద్రాలు పొంగాయి. అడవులు, అడవి మృగాలు చలించాయి.

అంతట రావణాసురుడు వానరసైన్యంపై మహాఘోరమూ, అమిత తీక్షణము అయిన తామసాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రప్రభావం చేత మంటలు రేగాయి. ఆ మంటల్లోపడి వేలాది వానరవీరులు కాలి బూడిదయ్యారు. పూర్వం రావణాసురుడు బ్రహ్మదేవుణ్ణి మెప్పించి ఈ తమసాస్త్రాన్ని పొందాడు. అట్లా కాలిపోగా మిగిలిన వానరవీరులు రాముడి వద్దకు పరుగులు తీసి శరణు కోరారు. భయంతో ఆ వానరులు అట్లా పరుగులు తీస్తూ ఉంటే రేగిన దుమ్ము ఆకాశం అంతా కమ్మేసింది. అట్లా భయంతో పరుగులు తీస్తున్న వానరయోధుల్ని రాముడు చూశాడు. ఆ ఆజానుబాహువు ఆకాశాన్నంటే ధనుస్సును ధరించి నిలిచాడు. అప్పుడు ఉపేంద్రుడితో ఉన్న దేవేంద్రుడివలె లక్ష్మణునితో ఉన్న రాముణ్ణి, రావణుడు చూశాడు. పద్మపత్రములవలె విశాలమైన నేత్రములు గల, దీర్ఘబాహువు, శత్రుసంహారకుడు అయిన

రాముడు ధనుస్సును ఆనుకొని, ఆకాశాన్ని తాకుతున్నాడా? అన్నట్లు కనబడ్డాడు.

గొప్ప తేజస్సు, బలము గల రఘువంశ సంజాతుడైన లక్ష్మణునితో కూడిన రాముడు, యుద్ధంలో దెబ్బలు తిన్న వానరుల పైకి, తన మీదకు యుద్ధానికి వస్తున్న రావణాసురుణ్ణి చూసి రాముడు చాలా సంతోషించాడు. అంతట ధనుస్సును చేత ధరించి, ధనుష్టంకారం చేశాడు. ఆ ధనుష్టంకారానికి భూమి బద్దలయిపోతుందా? అని అనిపించింది. రాముడి ధనుష్టంకారం చేతను, అటునుండి రాముని బాణాల ధ్వనిచేతనూ వందలకొద్దీ రాక్షసులు క్రిందపడిపోయారు. ఆ విధంగా రామలక్ష్మణుల ఎదుటకు వచ్చే రావణుడు, సూర్యచంద్రులను పట్టేందుకు పోయే రాహువువలె కనిపించాడు. లక్ష్మణుడు ముందుగా రావణునితో పోరాడాలని అనుకున్నాడు. రాముడు అందుకు అంగీకరించాడు. అంతట లక్ష్మణుడు తన ధనుస్సు నుండి అగ్నిశిఖలవంటి బాణాల్ని రావణునిపై వదిలాడు. విలువిద్యలో అఖండ ప్రావీణ్యం ఉన్న రావణుడు ఆ బాణాలన్నింటినీ మార్గమధ్యంలోనే ఎదుర్కొన్నాడు. లక్ష్మణుడు ప్రయోగించిన బాణాల్ని, రావణుడు చేతి పనితనం చూపిస్తూ (హస్త లాఘవంతో) ఒక బాణాన్ని ఒక బాణంతోను, మూడు బాణాల్ని మూడు బాణాల్తోను, పది బాణాల్ని పది బాణాలతోను మార్గమధ్యంలోనే ఎదుర్కొని వాటనన్నింటినీ నేలకూల్చేశాడు.

అంతట ఆ శత్రుసంహారకుడైన రావణాసురుడు లక్ష్మణుణ్ణి వదలి, రాముడి పైకి లంఘించాడు. కోపంతో కన్నులు ఎరుపెక్కాయి. రావణుని ధనుస్సు నుండి జలధారల్లాగా వెలువడుతున్న బాణాల్ని, అచలంగా పర్వతంవలె నిలబడి ఉన్న రాముడిపై కురిపించాడు. అవన్నీ కోపించిన సర్పాల్లా ప్రకాశిస్తూ రాముణ్ణి సమీపిస్తూ ఉండగా, రాముడు వాటన్నింటినీ ఛేదించాడు. ఆ విధంగా రాముడు రావణునిపైనా, రావణుడు రామునిపైనా పరస్పరం బాణాల వర్షం కురిపించుకున్నారు. విపరీతమైన వేగంతో వచ్చిపడుతున్న బాణాల్ని ఇరువురూ తప్పించుకుంటూ, ఆ ఇద్దరూ సవ్యంగాను, అపసవ్యంగాను, గుండ్రంగాను, ఒకరిచుట్టూ మరొకరూ తిరుగుతూ చాలాసేపు చిత్రవిచిత్రంగా పోరాడారు. మృత్యుదేవతతోను,

యమునితోను సమానమైన వారిద్దరూ ఒకరిపై మరొకరు బాణాలు ప్రయోగిస్తూ యుద్ధం చేస్తూ ఉంటే ప్రాణులన్నీ భయభ్రాంతులయ్యాయి. అప్పుడు వర్షాకాలంలో మెరుపులతో కూడిన మేఘాల్లాగా, మెరుస్తున్న బాణాలతో ఆకాశం అంతా నిండిపోయింది. ఆ బాణాల మధ్యన ఉండే సందులు ఆకాశానికి కిటికీలవలె కనిపించాయి.

ఆకాశం అంతా బాణాలతో నిండిపోయింది. సూర్యాస్తమయం తర్వాత కూడా పైకి లేచే మేఘాల వలె ఆకాశం అంతా అంధకారం అయిపోయింది. పరస్పరం ఒకళ్ళ నొకరు చంపుకోవాలనే ఆకాంక్షతో వృత్రాసుర, దేవేంద్రులవలె, దగ్గరకు పోయేందుకు కూడా వీలులేకుండా భయంకరమైన యుద్ధం చేశారు. ఇద్దరూ ధనుర్విద్యలో ప్రవీణులే. యుద్ధంలో నేర్పరులే. అస్త్రవేత్తలలో శ్రేష్ఠులే. అటువంటి వారిద్దరి మధ్య పోరాటం భీకరంగా సాగింది. వాళ్ళిద్దరు ఏ పక్కకుపోయారో, ఆ ప్రక్కన రెండు సముద్రాలు కలిసేచోట గాలికి రేగే అలలవలె వాళ్ళ బాణాలు ఆకాశం వరకూ లేచాయి. లోకకంటకుడైన రావణుడు తన విలువిద్యా నైపుణ్యంతో రాముడి నుదుట వరుసగా బాణాలు వదిలాడు. రావణుని ధనుస్సు నుండి బయలుదేరిన నల్లకలువల వంటి ఆ నారాచబాణాలు రాముని నుదుట గుచ్చుకున్నాయి. అయితే రాముడు ఎంతమాత్రం బాధపడలేదు. అప్పుడు కోపించిన ఆ కోదండపాణి రావణాసురుడిపై రౌద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రాలన్నీ సూటిగాపోయి రావణుని కవచానికి తాకి ఏమాత్రం వ్యధ కలిగించకుండానే నేలపై పడిపోయాయి. అటుపిమ్మట రాముడు పరమాస్త్ర మంత్రాన్ని జపించి సంధించాడు. రావణాసురుడు ఆ అస్త్రాలన్నింటినీ తన అస్త్రాలతో అడ్డగించాడు. అయితే అవి, రావణుడు సంధించిన బాణాల్ని ఛేదించి బుసలు కొట్టే అయిదు తలల పాములాగా నేలకూలాయి. అంతట రావణుడు రామునిపై ఆసురాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రం నోరుతెరచుకొని ఉన్న సింహాలు, పెద్దపులులు, కంకములు, కాకులు, గ్రద్దలు, డేగలు, నక్కలు, తోడేళ్ళ ముఖాలు గల వాడి అయిన బాణాల్ని, భయంకరమైన అయిదు ముఖాల సర్పాలవలె ఉండే వాడి అయిన బాణాల్ని ప్రయోగించాడు. మహాతేజశ్శాలి, మాయావి అయిన రావణుడు కోపంతో సర్పంలాగా బుసలు కొడ్తూ, గాడిదల ముఖంతోను, వరాహాల ముఖంతోను, కుక్కల

ముఖంతోను, కోళ్ళ ముఖంతోను, మొసలి ముఖంతోను, సర్పముల ముఖంతోను గల బాణాన్ని ఇంకా ఎన్నో వాడి అయిన బాణాల్ని రాముడి మీద ప్రయోగించాడు. అప్పుడు అసురాస్త్రాలచే చుట్టుముట్ట బడినవాడై, ఉత్సాహం విడువక, అగ్నితో సమానమైన తేజస్సుగల రాముడు పావకాస్త్రాన్ని ప్రయోగించాడు. రాముడు ఇంకా అనేక రకాలైన బాణాల్ని ప్రయోగించాడు. అవన్నీ అగ్నితో మండే ముఖాల్తోను, సూర్యుడి వంటి ముఖాల్తోను, అర్ధచంద్రాకార ముఖాల్తోను, పెద్దఉల్కల వంటి ముఖాలున్నవి; మెరుపునాలుకల వంటి బాణాల్నీ ప్రయోగించాడు. ఆ భయంకరమైన బాణాల్ని, రాముడు తన అస్త్రాల చేత తిప్పికొట్టాడు. అవి ఆకాశం నుండీ ముక్కలుముక్కలై నేలమీద పడిపోయాయి. శ్రమపడకుండా పనులు చేయడంలో నేర్పరి అయిన రాముడు ఆ అస్త్రాన్ని భగ్నం చేయడం చూసి స్వేచ్ఛా రూపాలు ధరించగల నేర్పు ఉన్న సుగ్రీవుడు మొదలైన వానరలంతా రాముడు చుట్టూ చేరి సంతోషంతో అరిచారు; కేకలుపెట్టారు; సింహనాదాలు చేశారు. మహాత్ముడైన రాముడు రావణునిచే ప్రయోగించబడిన అస్త్రాల్ని బలప్రయోగం చేత శాంతింపచేశాడు. వానరులంతా సంతోషంతో సింహనాదాలు చేశారు.

# 99వ సర్గ లక్ష్మణుడు మూర్ఛపోవటం

ఆవిధంగా అస్త్రాలన్నీ భగ్నమై పోవటంతో రావణునికి కోపం రెట్టింపు అయింది. అప్పుడు మయుడిచే నిర్మించబడినదీ, అతిక్రూరమైనదీ, అయిన మరొక అస్త్రాన్ని రాముడిపై ప్రయోగించాడు. ఆ అస్త్ర ప్రభావం చేత రావణుని ధనుస్సు నుండి వజ్రాయుధం వంటి శూలాలు, గదలు, ముసలములు అన్ని వైపులకూ బయలుదేరాయి. ప్రళయకాలంలో వాయువు పుట్టినట్లు, అనేకరకములైనవీ, తీక్షణమైనవీ, అయిన ముద్గరములు, కూటములు, పాశములు, ప్రజ్వరిల్లే వజ్రాయుధాలు బయలుదేరాయి. శ్రీమంతుడు, ఉత్తమాస్త్రాలు తెలిసిన వారిలో శ్రేష్ఠుడు, మహాకాంతిమంతుడూ అయిన రాముడు ఆ అస్త్రాన్ని, గాంధర్వమనే అస్త్రంతో ఎదుర్కొన్నాడు.

మహాత్ముడైన రాముడు తన అస్త్రాన్ని కొట్టివేయడం రావణాసురుడు జీర్ణించుకోలేకపోయాడు. కోపంతో కళ్ళు ఎర్రగా జ్యోతులయ్యాయి. అప్పుడు రాముడిపై సౌరాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రం ధీమంతుడైన రావణుని ధనుస్సు నుండి పెద్దపెద్ద చక్రాల్లాగా బయలుదేరింది. దశదిశల నుండి చక్రాల్లాగా వచ్చిపడుతున్న ఆ బాణాలచేత సూర్యచంద్రులచేతమల్లే ఆకాశం, దిక్కులూ ప్రకాశించాయి. మండుతూ వస్తున్న ఆ చక్రాయుధాలన్నింటినీ రాముడు ఉత్తమోత్తములైన అస్త్రాల చేత ఖండించాడు. రావణుడు కృద్ధుడైపోయాడు. తాను ప్రయోగించిన శ్రేష్ఠమైన అస్త్రాలన్నీ వ్యర్థం కావటంవల్ల ఉత్తమమైన బాణాల్ని రాముడి మర్మావయవాలపై ప్రయోగించాడు. అవన్నీ రాముడికి మర్మస్థానాల్లో గుచ్చుకొన్నాయి కానీ, రాముడు ఎంతమాత్రం చలించలేదు. ప్రతీకారంగా రాముడు అనేక బాణాల్ని రావణాసురుడిపై ప్రయోగించి అవయవాలన్నింటినీ వేధించాడు. ఇంతలో బలశాలియైన లక్ష్మణుడు కోపించి ఏడుబాణాల్ని గ్రహించి, మనుష్యులకు శిరస్సు వంటిదైన ధ్వజాన్ని కొట్టి ముక్కలుముక్కలు చేశాడు. అంతట శ్రీమంతుడు బలశాలి అయిన లక్ష్మణుడు ఒక బాణాన్ని ప్రయోగించి కుండలాలు ధరించి ఉన్న సారథి శిరస్సును ఖండించాడు. వాడి అయిన అయిదుబాణాల్ని ప్రయోగించి ఏనుగుల్లాంటి తొండంలాగా ఉండే రావణుని ధనుస్సును

విరగ్గొట్టాడు. విభీషణుడు ఎగిరి వెళ్ళి రావణుని రథానికి పూన్చిన గుర్రాలను గదతో మోది చంపాడు. గుర్రాలు చంపబడగా, రావణుడు ఆ మహారథం నుండి కిందకు దూకాడు. సోదరుడైన విభీషణుడిపై కోపంతో వజ్రాయుధం వంటి మండే శక్తి ఆయుధాన్ని ప్రయోగించాడు. ఆ శక్తి ఆయుధం విభీషణుణ్ణి చేరకముందే, లక్ష్మణుడు మూడు బాణాలతో దాన్ని ఛేదించివేశాడు. బంగారుమాలలు గల ఆ శక్తి ఆయుధం మూడుముక్కలై అగ్నికణాల్ని విరజిమ్ముతూ, ఆకాశం నుండి జారిపడే ఉల్కవలె, నేలపై పడిపోయింది.

అంతట రావణాసురుడు మరొక శక్త్యాయుధాన్ని తీసుకున్నాడు. యముడు కూడా ఆ శక్తిని ఎదిరించి నిలబడలేడు. మహాకాంతివంతమైనది. కళ్ళు మిరుమిట్లు కొలుపుతూ ఉంటుంది. దాన్ని ఎవరూ తేరిపారచూడను కూడా చూడలేరు. ఆ శక్త్యాయుధాన్ని రావణుడు నిత్యమూ పూజిస్తూ ఉండేవాడు. ఆ శక్త్యాయుధం దేవేంద్రుడి వజ్రాయుధంతో సమానమైనది. రావణాసురుడు ఆ శక్తిని చేతిలోకి తీసుకున్నాడు. దాన్ని బలంకొద్దీ గిరగిరా తిప్పాడు. ఆ శక్తి అక్కడే మంటలు సంతరించుకుంది. ఆ శక్తి తాకితే విభీషణుడు మరణించక తప్పదు. అప్పుడు లక్ష్మణుడు మెరుపువలె పోయి విభీషణునికి అడ్డుగా నిలబడ్డాడు. తన ధనుస్సును ఎక్కుపెట్టి ఉంచాడు. వెంటనే బాణాల వర్షం కురిపించి రావణాసురుణ్ణి బాణాలతో కప్పేశాడు. అప్పుడు రావణుడు ఆ శక్త్యాయుధాన్ని విభీషణుడి పైకి ప్రయోగించలేకపోయాడు. విభీషణుడికి అడ్డుగా పోయి, అతడి ప్రాణాలు కాపాడిన లక్ష్మణుడిపై రావణాసురుడు కోపంతో మండిపడ్డాడు. ఇలా అన్నాడు. “ఓ లక్ష్మణా! నీ బలాన్ని, శక్తియుక్తుల్ని సమయస్ఫూర్తిని మెచ్చుకుంటున్నాను. నీవు నా తమ్ముణ్ణి శక్త్యాయుధం నుండి కాపాడావు. కాబట్టి అతణ్ణి వదిలేస్తున్నాను. ఆ శక్తిని నీపైన ప్రయోగిస్తాను. ఇనపగుదియల్లాగా ఉన్న నా బాహువులతో బలంగా త్రిప్పుతూ ఆ శక్తిని నీ మీద ప్రయోగిస్తాను. అది నీ గుండెల్ని పగలకొట్టి, ఆ నెత్తురు మరకల్తో తిరిగి నా చేతుల్లోకి వస్తుంది. అటువంటి మహిమాన్వితమైన శక్తి ఇది” అని చెప్తూ, మయుడు చేత సృష్టించబడిన ఆ శక్త్యాయుధాన్ని లక్ష్మణుడి గుండెలకు గురిపెట్టి ప్రయోగించాడు. శత్రుసంహారమే లక్ష్యంగాగల ఆ ఆయుధం భగభగ మండుతూ, దానికి అమర్చిన ఎనిమిది గంటలూ భయంకరంగా శబ్దాలు

చేస్తూ బయలుదేరింది. వజ్రాయుధంలాగా కన్నులు మిరుమిట్లు గొలిపే కాంతితో, చెవులు బ్రద్దలయ్యే శబ్దాలు చేస్తూ లక్ష్మణుడి గుండెలకు తాకేముందు, ఆ మహాశక్త్యాయుధాన్ని చూస్తూ రాముడు ఇలా అన్నాడు. "ఓ శక్త్యాయుధమా! లక్ష్మణుడు క్షేమమగుగాక! నీ ప్రయత్నం విఫలమగుగాక! నీవు వ్యర్థమై నిర్వీర్యమైపోయెదవుగాక" అని అన్నాడు.

ఆ మహాశక్త్యాయుధం మహా క్రూరసర్పంలాగా పోయి, రాముడి మాటలు పెడచెవిన పెట్టి, లక్ష్మణుడి వక్షఃస్థలంలో లోతుగా దిగబడింది. ఆ ఆయుధం రావణుడి యొక్క వేగంచేత లక్ష్మణుడి వక్షఃస్థలం ఛేదించబడగా, లక్ష్మణుడు నేలపై పడిపోయాడు. లక్ష్మణుడు పడిపోవటం వలన, మహా తేజశ్శాలి అయిన రాముడు సోదరప్రేమ చేత దుఃఖాక్రాంతుడయ్యాడు. రాముడు కన్నీరు పెట్టుకుంటూ విలవిల్లాడిపోయాడు. దుఃఖించేందుకు ఇది సమయం కాదని అనుకున్నాడు. ప్రళయకాల అగ్నిహోత్రుడివలె మండిపడ్డాడు. రావణాసురుణ్ణి చంపేయాలని కృతనిశ్చయుడయ్యాడు. శక్త్యాయుధం గుచ్చుకోవటం వల్ల నెత్తురుతో తడిసి పడి ఉన్న లక్ష్మణుడు, సర్పములతో కూడిన పర్వతంలాగా పడి ఉన్నాడు. లక్ష్మణుని శరీరంలో నుండి రావణుడు ప్రయోగించిన శక్తిని పీకెయ్యాలని వానరులు ప్రయత్నంచేశారు. కానీ, రావణుడు విడవకుండా బాణాలు విడవటంవల్లను, ఆ శక్తి బలంగాను లోతుగాను దిగబడటం వల్లనూ ఆ ఆయుధాన్ని శరీరం నుండీ పీకెయ్యలేకపోయారు. అంతట రాముడు ఆ భయంకరమైన శక్తిని పైకిలాగుతూ ఉండగా బలశాలి అయిన రావణుడు, రాముడి మర్మావయవాలన్నింటినీ బాణాలతో పీడించాడు. రాముడు తనపైకి వచ్చిపడుతున్న బాణాన్ని లెక్కచేయకుండా లక్ష్మణుణ్ణి కౌగలించుకొని హనుమంతుడితోను, వానరరాజైన సుగ్రీవుడితోను ఇలా అన్నాడు. "ఓ వానరవీరులారా! మీరు ఈ లక్ష్మణుడి చుట్టూ నిలబడి ఇతణ్ణి కనిపెట్టి ఉండండి. పాపాత్ముడైన ఈ రావణుని చంపే సమయం దగ్గరపడింది. చాతకపక్షికి మేఘాలు కనిపించినట్లు, ఎంతో కాలం నుండీ వధించాలని ఎదురుచూస్తున్న పాపాత్ముడు ఇప్పుడు తటస్థపడ్డాడు. ఇక వీణ్ణి వదలను; చంపేస్తాను.

ఓ వానరులారా! నేను సత్యప్రమాణం చేసి చెప్తున్నాను. వీణ్ణి చంపటం ఎంతోసేపు పట్టదు. ఈ ప్రపంచంలో ఉంటే రాముడుండాలి; లేదా రావణుడుండాలి. ఇది మీరు అతి త్వరలో చూడబోతున్నారు. ఓ వానరులారా! నేను రాజ్యాన్ని పోగొట్టుకున్నాను, వనవాసం చేశాను, దండకారణ్యంలో కందమూలాలు తింటూ తిరిగాను, రాక్షసులు సీతను అవమానించారు. నేను ఘోరమైన దుఃఖాన్ని పొందాను. నకరయాతనలు అనుభవించాను. ఇప్పుడు నేను యుద్ధంలో రావణుణ్ణి సంహరించి ఈ కేశాలన్నంటినీ కడిగేసుకుంటాను.

ఎవరికోసం నేను వాలిని చంపి సుగ్రీవుణ్ణి రాజ్యాభిషిక్తుణ్ణి చేశానో, ఎందునిమిత్తం ఈ వానరసైన్యాన్ని వెంటబెట్టుకొని వచ్చానో, ఏ కార్యసాధనకై సముద్రంపై సేతువును దాటివచ్చానో, అట్టి పరమ పాపాత్ముడు ఇప్పుడు నా కంటపడ్డాడు. పగబట్టిన విషసర్పాన్నుండి ఎట్లా బ్రతికి బయటపడలేడో, గరుత్మంతుడి కంటపడ్డ సర్పం ఎట్లా తప్పించుకోలేదో, అట్లాగే ఈ పాపాత్ముడు నా కంటబడ్డాడు. వీణ్ణి ఇక బ్రతకనీయను.

ఎదిరింపశక్యంకాని ఓ వానరవీరులారా! మీరంతా మహాబలవంతులని నాకు తెలుసు. అయినా మీరు నిశ్చింతగా ఉండండి. నేను రావణుడితో చేసే యుద్ధాన్ని చూస్తూ ఉండండి. యుద్ధభూమిలో రాముడు ఎట్లా యుద్ధం చేస్తాడో, రామపరాక్రమం ఏమిటో, ముల్లోకాల్లో ఉండే దేవతలు, దేవర్షులు, చారణులు, గంధర్వులు మొదలైన వాళ్ళంతా ఇప్పుడు చూస్తారు. చరాచర సమస్త ప్రాణులూ మూడు లోకాల్లోను, మూడు కాలాల్లోను చెప్పుకుంటారు" అన్నాడు.

వానరులతో రాముడు ఇట్లా అని, యుద్ధానికి సిద్ధమై బంగారంతో అలంకరించబడిన వాడి అయిన బాణాలను రావణాసురుడిపై ప్రయోగించాడు. అటు నుండి రావణుడు ప్రకాశవంతమైన నారాచ బాణాల్ని, ముసలాల్ని, మేఘాలు వర్షం కురిపించినట్లు, రాముడిపై కురిపించాడు. ఈ విధంగా రామ రావణులు పరస్పరం ప్రయోగించుకొన్న బాణాలు భయంకర ధ్వనులు చేశాయి. రామరావణులు ప్రయోగించిన బాణాలన్నీ విరిగిపోయి ఆకాశం నుండి నేల మీద చెల్లాచెదరుగా పడిపోయాయి. రామరావణులు నారి సంధించి టంకారాలు చేసినప్పుడల్లా

ప్రాణులన్నీ భయపడిపోయాయి. ఆ యుద్ధం చూసేవాళ్ళను ఆశ్చర్యపరచింది. ప్రకాశించుచున్న ధనస్సు గల రాముడు బాణవర్షం కురిపించగా, రావణుడు, పరివారం భయంతో గాలిచేత తరుమబడిన మేఘాల్లాగా పారిపోయారు.

# 100వ సర్గ లక్ష్మణుడు మూర్ఛ నుండి తేరుకొనటం

శూరుడైన లక్ష్మణుడు మహాబలవంతుడైన రావణుని శక్త్యాయుధం చేత దెబ్బతిని రక్తంతో తడిసి నేలమీద పడిపోయి ఉన్నాడు. లక్ష్మణుణ్ణి చూస్తూ రాముడు సుషేణుడితో ఇలా అన్నాడు. "ఓ సుషేణుడా! రావణుని శక్త్యాయుధంచేత దెబ్బ తిని నా తమ్ముడైన లక్ష్మణుడు సర్పంలాగా నేలపై పొర్లాడుతున్నాడు. ఈతడు నాకు ప్రాణంతో సమానం; చాలా ఇష్టుడు. ఇతడు నెత్తురు మడుగులో పడి పొర్లాడుతూ ఉంటే నేను ఎట్లా పోరాడేది? మనస్సంతా వ్యాకులమై ఉంటే నాకు పోరాడే శక్తి ఎక్కడ నుండి వస్తుంది? నా ప్రాణంతో సమానమైనవాడు, అన్నీ శుభలక్షణాలే గల వాడూ, శ్లాఘించదగినవాడూ అయిన నా తమ్ముడు లేకుండా నేనుమాత్రం ఎందుకు బ్రతికుండాలి? వాడే లేని, ఈ సుఖాలు నాకెందుకు? చేతులో నుండి ధనుస్సు జారిపోతోంది. బాణాలు కూడా శక్తిలేని వైపోతున్నాయి. దుఃఖంతో నా పరాక్రమం ఎందుకూ పనికి రాకుండా పోతోంది. నన్ను చూస్తే నాకే అసహ్యం వేస్తోంది. అయ్యో! నా కళ్ళ ముందే ఈ దురాత్ముడు నా తమ్ముణ్ణి పడ గొట్టాడు. నిద్రలో నడిచేవారి అవయవాలు స్వాధీనంలో ఉండనట్లుగా, నా కాళ్ళు చేతులూ తడబడు తున్నాయి. నాకు చచ్చిపోవాలని అనిపిస్తోంది. ఈ దురాత్ముడైన రావణునిచే నా తమ్ముడి మర్మావయవాలన్నీ గాయాలయి బాధతో మూలుగుతున్నాడు" అని విలపిస్తూ రాముడు దుఃఖ పరవశుడయ్యాడు.

"ఓ వీరులారా! నా తమ్ముడు శత్రువుచే దెబ్బతిని నేలపై పడి దుమ్ములో బాధతో పొర్లాడుతున్నాడు. ఇంక నేను ఎవరి కోసం యుద్ధం చెయ్యాలి? ఏం సుఖపడగలను? నాకు సీత ఎందుకు? మహాకాంతిమంతుడైన ఈ లక్ష్మణుడు నేను వనవాసానికి వచ్చేటప్పుడు నా వెనకాలే వచ్చాడు. ఇప్పుడు నేను కూడా ఇతడి వెనకాలే ఇతడు వెళ్ళే లోకానికి వెళ్తాను. ఈ నా తమ్ముడికి బంధుప్రీతి అధికం. ఎల్లవేళలా నన్ను అనుసరించే ఉండేవాడు. కపటయుద్ధంలో శత్రువు ఇతడికి ఈ గతి పట్టించాడు. ఏ దేశంలోనైనా మంచి భార్యలు దొరుకుతారు. మంచి బంధువులు కూడా దొరకవచ్చు. కానీ ఇంతమంచి సోదరుణ్ణి ఏ దేశంలోనూ పొందలేము" అంటూ రాముడు

ఎలుగెత్తి విలపించాడు. ఆ దుఃఖంలో ఇంద్రియాలన్నీ స్వాధీనంలో తప్పాయి. "తల్లి అయిన సుమిత్రకు ఏమి సమాధానం చెప్పగలను? కౌసల్యా, కైకేయులకు ఏమని సమాధానం చెప్తాను? లక్ష్మణుడెక్కడు? అని భరతుడడిగితే ఏమని సమాధానం చెప్పగలను. బంధువులందరి చేతా నిందలు పడటం కన్నా ఇక్కడే మరణించడం మంచిది. ఓ తమ్ముడా! శూరులలో గొప్పవాడివే! సమర్థుడవే! నన్ను విడిచి ఎందుకు వెళ్ళావు? తమ్ముడా! నేను నీ కోసం ఇంతగా విలపిస్తూ ఉంటే నాతో ఎందుకు మాట్లాడవు" అంటూ నేలమీద చతికిలపడిపోయాడు.

[ఈ ఘట్టంలోని శ్లోకాలు కొన్ని ప్రతుల్లో లేవు. రాముడు సామాన్య మానవుడిగా ప్రవర్తించాడని చెప్పడానికి కొందరు ఈ ఘట్టంలోనూ, సీతాపహరణ ఘట్టంలోనూ, రాముడు అతిగా విలపించినట్లు వర్ణించడం కోసం చాలా శ్లోకాలు చేర్చి ఉంటారు. ఇది రాముడి ధీరత్వానికి, ఉదారత్వానికి భంగకరంగా ఉంది. ఇటువంటి కల్పనలు అసందర్భం; అనావశ్యం.]

అప్పుడు వానరశ్రేష్ఠుడైన సుషేణుడు ఇలా అన్నాడు. "ఓ నరశ్రేష్ఠుడవైన రామా! ఈ లక్ష్మణుడు చనిపోలేదు. ఇతడి ముఖంలో వికారమూ కనిపించడం లేదు. ముఖం కళతప్పలేదు. వివర్ణం కాలేదు. ముఖం ఇప్పటికీ ప్రసన్నంగానే ఉంది. ప్రాణం లేనివాడి ముఖాన ప్రేతకళ స్పష్టంగా తెలుస్తుంది. ప్రభూ! ఈ లక్ష్మీవర్ధనుడికి ఇంతవరకూ మరణం సంభవించలేదు. ఇంకా ప్రాణాలతోనే ఉన్నాడు. నీవు ఇంత చేటు దుఃఖపడాల్సిన అగత్యం లేదు. ఇతడు మూర్ఛపోయి ఉన్నాడు. పరిశీలించి చూడు! ఇతడి గుండె కొట్టుకుంటూనే ఉంది. నిట్టూర్పులు వినబడటం లేదా?" అని ఊరడించాడు. రాముణ్ణి ఓదార్చిన పిమ్మట సుషేణుడు హనుమంతుడితో ఇలా అన్నాడు. "ఓ సౌమ్యుడా! వీరుడా! పూర్వం నీకు జాంబవంతుడు చెప్పిన ఔషధపర్వతానికి వెంటనే వెళ్ళి అక్కడ ఆ పర్వతంపైన దక్షిణశిఖరంపైన వృద్ధి అవుతున్న 'విశల్యకరణి, సావర్ణ్యకరణి, సంజీవకరణి, సంధానకరణి" అను నాలుగు ఓషధుల్ని తీసుకొనిరా. వాటితో మహాత్ముడు, వీరుడు అయిన లక్ష్మణుణ్ణి స్వస్థుణ్ణి చేయవచ్చును. ఆ మూలికల వలన లక్ష్మణుడు

తప్పక జీవిస్తాడు" అని చెప్పాడు.

శ్రీమంతుడైన హనుమంతుడు ఆ మాట విని ఓషధి పర్వతానికి చేరుకున్నాడు. కానీ అక్కడ తనకు కావలసిన మూలికల్ని గుర్తించలేకపోయాడు. అందువల్ల ఆలస్యం చెయ్యకుండా "ఈ పర్వతాన్నే తీసుకొని వెళ్తాను. తనకు కావలసిన ఓషధుల్ని ఆ సుషేణుడు, జాంబవంతుడే చూసుకుంటారు. ఆలస్యం అయితే లక్ష్మణస్వామి ప్రాణాలకు అపాయం కలగవచ్చు" అని ఆలోచించాడు.

అంతట మహాబలశాలి అయిన హనుమంతుడు ఆ ఓషధి పర్వతంపై నున్న దక్షిణ శిఖరాన్ని మూడుసార్లు అటూఇటూ ఊపి, పుష్పించిన వృక్షాలతో సహా ఆ శిఖరాన్ని ఎత్తి అరచేతిలో పెట్టుకొని ఆకాశమార్గాన ఎగిరి వచ్చి యుద్ధభూమిలో దింపాడు. అటుపిమ్మట కొద్దిసేపు విశ్రాంతి తీసుకొన్నాడు. తరువాత సుషేణుడితో ఇలా అన్నాడు. "ఓ వానరశ్రేష్ఠుడా! నాకు ఆ ఓషధులు ఎట్లా ఉంటాయో తెలియలేదు. మనకా సమయం ఆట్టేలేదు. నేను తెలియక ఒకదానికి బదులు మరొక ఓషధి తెస్తే కార్యం అంతా చెడిపోతుందని ఈ పర్వతశిఖరాన్నంతా తీసుకొని వచ్చాను" అన్నాడు.

వానరశ్రేష్ఠుడైన సుషేణుడు హనుమంతుడి మాటలు విని అతణ్ణి కొనియాడాడు. ఓషధుల్ని పైకి తీశాడు. దేవతలు కూడా చెయ్యలేని ఈ పనిని హనుమంతుడు చేసినందుకు వానర శ్రేష్ఠులంతా హనుమంతుణ్ణి కొనియాడారు. అంతట మహాకాంతిమంతుడు, వానరశ్రేష్ఠుడు అయిన సుషేణుడు ఓషధుల్ని ముందుగా మడిచి లక్ష్మణుని ముక్కల ద్వారా శరీరంలోకి పంపాడు. ఆ ఓషధం శరీరంలో ప్రవేశించగానే, శరీరంలోని బాణపు ముక్కలన్నీ బయటకు వచ్చేశాయి. దాంతో లక్ష్మణుడి శరీర బాధలన్నీ తొలగిపోయాయి. వెంటనే లేచినిలబడ్డాడు. వానరులంతా అట్లా మంత్రం పెట్టినట్లు లేచి నిలబడ్డ లక్ష్మణుణ్ణి చూసి సంతోషిస్తూ కేరింతలు కొట్టారు. కోతి గంతులు వేశారు. కుప్పిగంతులు వేశారు. శత్రు వీర సంహారకుడైన రాముడు గాఢంగా కౌగలించుకున్నాడు. అప్పుడు రాముడు, లక్ష్మణునితో ఇలా

అన్నాడు. "వీరుడా! నీవు మృత్యుదేవతను జయించావు. నా అదృష్టం చేత నిన్ను మళ్ళీ సజీవంగా చూడగలిగాను. నీవేలేని జీవితం నాకు ఎందుకు? నీవు లేకుండా, సీతగాని, విజయంగానీ నన్ను సంతోషపెట్టలేవు. నీవు లేకుండా వీటన్నింటివల్లా నాకేం ప్రయోజనం? నీవే చెప్పు." అప్పుడు లక్ష్మణుడు రాముడితో ఇలా అన్నాడు. "అన్నా! దోషరహితుడా! నా మూలంగా నీవు నిరాశ చెందటం న్యాయం కాదు. నీవు రావణుని చంపుతానని లోగడ ప్రతిజ్ఞ చేశావు. సత్యవ్రతాన్ని ఆచరించే నీవంటివాళ్ళు ప్రతిజ్ఞను వ్యర్థం చెయ్యరు. ప్రతిజ్ఞను పాలించడమే మహాత్ముల లక్షణం నీవు ప్రయోగించిన బాణాన్నుండి శత్రువు, గర్జించుచున్న సింహకోరల నుండి మహాగజము తప్పించుకోలేనట్లుగా, ప్రాణాలతో తిరిగి వెళ్ళలేడుగదా? అన్నా! సూర్యుడు అస్తమించే లోపుగా ఈ దురాత్ముణ్ణి చంపెయ్యాలని నేను కోరుకుంటున్నాను.

పూజ్యుడవైన వీరుడా! నీకు రావణుణ్ణి చంపాలనే కోరిక ఇంకా ఉంటే, నీవు చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకోవాలని అనుకుంటే, సీతాదేవిని పొందాలనే అభిలాష ఉంటే, వెంటనే ఆ పాపాత్ముణ్ణి చంపివెయ్యి."

## 101వ సర్గ రాముడు మరల రావణునితో యుద్ధం చేయటం

రాముడు లక్ష్మణుడు చెప్పిందంతా విన్నాడు. ధనుస్సు తీసుకొన్నాడు. భయంకరమైన బాణాల్ని సంధించాడు. అటు రావణుడు కూడా మరొక రథాన్ని ఎక్కి, సూర్యుణ్ణి మింగటానికి పోయే రాహువువలె, రాముడికి ఎదురుగా వెళ్ళాడు. రథంపై తన కెదురు పడిన రావణునిపై మండుతున్న అగ్నితో సమానమైనవి, బంగారంతో అలంకరించబడ్డవి అయిన బాణాల్ని, రాముడు సంధించాడు. రాముడు నేలపై నిలబడి యుద్ధం చేస్తుంటే, రావణుడు రథంపై నుండీ యుద్ధం చేస్తున్నాడు. అది సరిగా లేదని దేవ, గంధర్వ, కిన్నెరులు దేవేంద్రుడితో అన్నాడు. అంతట దేవేంద్రుడు తన రథాన్ని రాముడి కిమ్మని, సారథి మాతలిని, ఆదేశించాడు. అప్పుడు మాతలి ఆ రథాన్ని దేవలోకం నుండి తెచ్చి రాముడికిచ్చాడు. ఆ రథంలోని భాగాలన్నీ బంగారంతో చేశారు. ఆ రథంలో అనేకవేల చిరుగంటలు అమర్చబడ్డాయి. ఆ రథం యొక్క నిలువు దూలం వైడూర్యాదిమణుల్తో అలంకరించబడి సూర్యుడివలె ప్రకాశించింది. బంగారు శిరోభూషణాలతోను, తెల్లని చామరాలతోను, బంగారు జరీలతోను, అలంకరించి సూర్యునితో సమానమైన తేజస్సుతోను, ఆకుపచ్చని ఉత్తమాశ్వాలతోను పూన్చబడింది. ఆ రథానికి ధ్వజం బంగారుదండంపై ఎగురుతూ ఉంది. ఇంద్రుడు సారథి అయిన మాతలి రథంపై నుండియే రామునికి నమస్కరిస్తూ ఇలా అన్నాడు.

“గొప్ప బలంగలవాడవు, శోభ గలవాడవు, శత్రు సంహారకుడవు, అయిన ఓ రామా! నీకు విజయం కలగాలని కోరుతూ, దేవేంద్రుడు నీకు ఈ రథాన్ని పంపాడు. ఈ రథంలో ఇంద్రుని గొప్ప ధనుస్సు, అగ్నితో సమానంగా ప్రజ్వరిల్లే కవచం, సూర్యుని తేజస్సుతో కూడిన బాణాల్ని, నిర్మలము, మంగళప్రదమైన శక్తిని ఇందులో అమర్చి ఉంచాడు. ఓ రాజా! నేను నీకు సారథిగా ఉంటాను. మహేంద్రుడు దానవుల్ని చంపినట్లు నీవు ఈ రావణాసురుణ్ణి వధించు.” అప్పుడు రాముడు ఆ రథానికి ప్రదక్షిణం చేసి, నమస్కరించి, లోకాలన్నింటికీ సుఖశాంతుల్ని సమకూర్చటం కోసం రథాన్ని అధిరోహించాడు.

అంతట మహాబాహువు అయిన రాముడికి, రాక్షసరాజైన రావణునికి రోమాంచము పుట్టించే రీతిలో మహాభయంకరంగా యుద్ధం జరిగింది. గొప్ప అస్త్రములనెన్నో ఎరిగిన రాముడు, రావణుడు ప్రయోగించే గాంధర్వాస్త్రాన్ని గాంధర్వాస్త్రం చేతను, దైవాస్త్రాన్ని దైవాస్త్రం చేతను ఛేదించివేశాడు. రావణుడు కృద్ధుడైపోయాడు. రాముడిపై ఘోరమైన అసురాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ బాణం రావణుని ధనుస్సు నుండి బయలుదేరి బంగారంతో అలంకరించబడి విషసర్పాల్లాగా రాముడిపైకి వచ్చింది. మంటలు మండిస్తున్న ముఖాల గల భయంకరమైన ఆ విషసర్పాలన్నీ నిప్పులుకక్కుతూ, నోళ్ళు తెరుచుకొని రాముడి మీదకు వెళ్ళాయి. వాసుకి అంశతో తీవ్రమైన స్పర్శగలిగి, ప్రకాశవంతమైన పడగలతో విషంకక్కుతూ, దిక్కులను, విదిక్కులను నింపేశాయి. వేగంగా వచ్చి మీదపడుతున్న సర్పాలను నిగ్రహించడానికి రాముడు గరుత్మతాస్త్రాన్ని మంత్రించి ప్రయోగించాడు. రాముని ధనుస్సు నుండి సంధించబడిన బంగారుపొన్నులు గల అగ్నివలె ప్రజ్వలించే ఆ బాణాలన్నీ సర్పాలకు శత్రువులైన బంగారు గరుత్మంతులుగా అయి సంచరించాయి. రాముని బాణాలల్నీ గరుత్మంతుని ఆకారాల్తో స్వేచ్ఛగా సంచరిస్తూ సర్పరూపంలో విహరిస్తున్న రావణుని బాణాలన్నింటినీ ఖండించివేశాయి.

రావణాసురుడు తన రాక్షసాస్త్రం కూలిపోవడంతో కృద్ధుడై, మహాఘోరమైన బాణవర్షాన్ని రాముడిపై కురిపించాడు. వేలాది బాణాలు సూటిగాపోయి రాముణ్ణి, రథసారథిని, అశ్వాన్ని బాధించాయి. ఒక బాణంతో రథధ్వజాన్ని కొట్టాడు. రావణుడి ప్రతాపాన్ని ఆకాశం నుండి వీక్షిస్తున్న దేవతలు, గంధర్వులు, చారణులు, సిద్ధులు, మహర్షులు కలతచెందారు. వానర నాయకులు, విభీషణుడు కూడా వ్యధచెందారు. రావణాసురుడు అనే రాహువు రాముడు అనే చంద్రుణ్ణి పట్టుకోవడం చూసి బుధుడు ప్రజలకు అశుభాల్ని చేయడం కోసం ప్రజాపతి దేవతగాగల, చంద్రుడికి ప్రియురాలు అయిన రోహిణినక్షత్రాన్ని ఆక్రమించాడు. అన్నివైపుల్నుంచీ పొగలు కమ్ముకున్నాయి; మహాసముద్రం లోపల నుండి మంటలు వేస్తూ అలలతో సూర్యుణ్ణి తాకేట్లుగా పైకి ఎగసి పడ్డాయి. సూర్యకిరణాల తేజస్సు మందగించింది. ధూమకేతువుతో చేరడంవల్ల సూర్యబింబం ఓ మొండెంలాగా కనిపించింది. ఆకాశంలో స్పష్టంగా కనిపించే

ఇంద్రదేవతాకము, అగ్నిదేవతాకమూ అయిన ఇక్ష్వాకుల వంశీయుల విశాఖ నక్షత్రాన్ని అప్పుడు అంగారకుడు ఆక్రమించాడు. మహాసముద్రంలో నుండి మైనాక పర్వతం లేచినట్లుగా అప్పుడు రావణుడు పదితలల్తోను, ఇరవై చేతుల్తోను ధనుర్బాణాలను ధరించి నిలిచాడు. ఆ యుద్ధభూమిలో అట్లా నిలబడిన ఆ రావణుణ్ణి రాముడు చూశాడు. రాముడికి అంతా అయోమయంగా కనిపించింది. తికమకపడ్డాడు. ధనుస్సులో బాణాలు సంధించలేకపోయాడు. కోపం వచ్చింది. కన్నులు ఎర్రగా జ్యోతుల్లా అయ్యాయి. కనుబొమలు ముడివడ్డాయి. చూపుల్తోనే కాల్చిపారేసేట్లుగా పదితలలతో ఎదురుగా ప్రత్యక్షమైన రావణుణ్ణి, రాముడు చూశాడు. బుద్ధిమంతుడైన రాముడి కోపాన్ని చూసి జీవకోటి అంతా భయపడింది. భూమి కంపించింది. సింహాలు, పెద్దపులులూ సంచరించే పర్వతాలూ కూడా కంపించాయి. ఆ పర్వతాల్ని ఆశ్రయించుకున్న చెట్లూ చేమలు, వాటిని ఆశ్రయించుకున్న పశుపక్ష్యాదులు, ఆడిపోయాయి. నదులకు భర్త అయిన సముద్రుడు క్షోభించాడు. ఆకాశంలో మేఘాలు జనులు భయపడేట్లుగా ఉరుములు ఉరుముతూ ఆకాశం అంతా పరుగులు తీశాయి. ఆ విధంగా రాముడి కోపాన్ని చూసి ప్రకృతి అంతా క్షోభించగా, ప్రాణులన్నీ భయపడ్డాయి. రావణాసురుడు కూడా భయపడ్డాడు.

మహాశూరులైన రామ – రావణులు అనేక రకాలయిన ఆయుధాలతోను, శస్త్రాలతోను, అస్త్రాలతోను యుద్ధం చేశారు. ప్రళయం వస్తోందా? అన్నట్లు ఆ మహాయుద్ధం సాగిపోతోంది. దేవతలు, గంధర్వులు, మహోరగులు, మహర్షులు, దానవులు, దైత్యులు, గరుత్మంతులు, ఖేచరులు, ఆకాశం అంతా బారులుతీరి ఆ మహా యుద్ధాన్ని వీక్షిస్తున్నారు. అసురులంతా రావణాసురుడికి జయం కలగాలని వాళ్ళల్లో వాళ్ళు చెప్పుకున్నారు. సురులంతా రాముడికి జయం కలగాలని మనస్ఫూర్తిగా కోరుకున్నారు.

అప్పుడు రావణాసురుడు మహాభయంకరమైనదీ, వజ్రాయుధంతో సమానమైనదీ అయిన శూలాన్ని తీసుకున్నాడు. ఆ శూలం ధ్వనులు చేస్తూ అంతరిక్షంలో ప్రయాణం చేస్తుంది. ఆ

ఆయుధాన్ని ఆకాశంలో చూస్తేనే ప్రజలు భయంతో ఒణికిపోతారు. శత్రుసంహారం చెయ్యడంలో దానికదే సాటి. దాని శిఖరాలు పర్వతశిఖరాల్లాగా ఎత్తైనవి. పొగలు, సెగలు కక్కుతూ ప్రళయాగ్నిలా మహాభయంకరమైన ఆ శూలాయుధం ముందు యముడు కూడా నిలువలేడు. ఆ శూలం తాకినవాళ్ళందర్నీ చీల్చివేయగలదు; కాల్చివేయగలదు. నరికివేయగలదు. అటువంటి శూలాన్ని రావణాసురుడు కోపావేశంతో చేతిలోకి తీసుకొని గట్టిగా అటూ ఇటూ ఊపుతూ, రాక్షస సైన్యానికంతకీ ఉత్సాహాన్ని కలిగిస్తూ పెద్దగా సింహనాదం చేశాడు. ఆ సింహనాదానికే భూమి, పర్వతాలు కంపించాయి. సముద్రం అల్లకల్లోలం అయింది. ఆ శూలాన్ని చేత్తో పట్టుకొని త్రిప్పుతూ రాముడితో "ఓ రామా! కోపంతో నీపై ప్రయోగిస్తున్న ఈ శూలాయుధం వజ్రం అంత శక్తిమంతమైనది. ఈ శూలం నీ ప్రాణాల్ని, నీ తమ్ముడు లక్ష్మణుడి ప్రాణాన్ని తప్పక తీస్తుంది. మీ సోదరులిద్దరూ యుద్ధంలో చచ్చిపోయిన రాక్షసవీరుల దగ్గరకు చేరుకుంటారు" అంటూ ఆ మహాశూలాన్ని రాముడిపై ప్రయోగించాడు.

ఆ శూలం రావణుడి చేతిలో నుండి బయటకు రాగానే, దానికి కట్టిన ఎనిమిది గంటలూ భయంకరంగా మ్రోగి దిక్కులు పిక్కటిల్లిపోయాయి. ఆ శూలంలో నుండి పొగలు సెగలు కక్కుతూ మెరుపుల్లాంటి మంటలు లేచాయి. పరమభయంకరంగా తన పైకి వస్తున్న శూలాన్ని రాముడు చూశాడు. వెంటనే రాముడు ధనుస్సును గ్రహించి బాణాన్ని సంధించి శూలానికి గురిపెట్టాడు. ప్రళయాగ్నిని చల్చార్చటానికి దేవేంద్రుడు కురిపించే కుంభవృష్టివలె, రాముడు బాణ ప్రవాహాన్ని వదిలాడు. ఆ బాణాలన్నీ, అగ్నిహోత్రంలో పడ్డ మిడతల్లాగా, ఆ శూలానికి తగిలి కాలిబూడిద అయిపోయాయి. రాముడికి కోపం కట్టలు తెంచుకుంది. దేవేంద్రుడి వద్ద నుండి మాతలి తెచ్చిన శక్తి ఆయుధాన్ని తీసుకున్నాడు. రాముడు బలాన్నంతా ఉపయోగించి ఆ శక్త్యాయుధాన్ని ఆ శూలంపై ప్రయోగించాడు. దానికి కట్టిన గంటలు భయంకరంగా మ్రోగాయి. ప్రళయకాలాగ్ని వలె మంటలు లేచాయి. అప్పుడు శక్త్యాయుధం రావణాసురుడు ప్రయోగించిన శూలాన్ని ఎదుర్కొంది. శక్త్యాయుధం తాకీతాకడంతోనే ఆ శూలం ముక్కలుగా విరిగి నేలపై పడింది. అప్పుడు రాముడు అతితీక్ష్ణమైన బాణాల్ని తీసుకొని మహావేగంతో పరుగెత్తే

రావణాసురుడి రథానికి కట్టిన గుర్రాల్ని పడగొట్టాడు. అటుపిమ్మట రాముడు వాడి అయిన బాణాలచేత రావణాసురుడి వక్షఃస్థలాన్ని ఛేదించాడు. అతటితో ఆగక ఆ బాణాలు రావణుని శరీర అవయవాలన్నింటినీ తీవ్రంగా ఛేదించాయి. రాముడు ప్రయోగించిన మూడు బాణాలు రావణుని లలాటంపై తగిలాయి. దేహంలోని అవయవాలన్నీ ఛేదించబడగా రక్తం కారుతున్న ఆ రావణుడు వికసించిన అశోకవృక్షంలా కనిపించాడు. రాముడి బాణముల వలన శరీరం అంతా గాయాలై రక్తంతో తడిసిపోయింది. అప్పుడతడికి అమితమైన దిగులు పట్టుకుంది; పట్టరానంత కోపం వచ్చింది.

# 102వ సర్గ అలసిపోయిన రావణుని సారథి దూరంగా తీసుకొనిపోవటం

రావణుడు యుద్ధంచెయ్యటంలో తనంతటివారు ఇంకోడులేడని గర్వపడుతూ ఉండేవాడు. రాముడి చేతుల్లో చావుదెబ్బలు తినడంతో అహంకారం చోటులో అవమానం చోటుచేసుకుంది. ఆ అవమానం రాముడు కొట్టినదెబ్బల కన్నా ఎక్కువగా బాధించింది. కోపంతో నల్లనిముఖం అయినా ఎర్రబడింది. కన్నులు జ్యోతుల్లా మండాయి. ఆ కోపంతో రాముడిపై, వర్షం చెరువును నింపినట్లు, రామునిపై బాణాల్ని ప్రయోగించాడు. అయినా రాముడు పర్వతంలాగా ఏమాత్రం చలించలేదు; సూర్యకిరణాల్లాగా స్వీకరించుచూ, తన బాణాలచేత వాటన్నింటినీ ఎదిరించాడు. అంతట కృద్ధుడైన రావణుడు, రాముడి వక్షఃస్థలంపై బాణాలను ప్రయోగించాడు. ఆ బాణాలు రాముడికి తగిలి ఒళ్ళంతా నెత్తురుమయం అయి, పుష్పించిన కింశుక వృక్షంలాగా కనిపించాడు. అందుకు ప్రతీకారంగా రాముడు ప్రళయాగ్నితో సమానమైన బాణాల్ని ప్రయోగించాడు. ఇట్లా ఆ రామ – రావణులిద్దరూ కోపావేశాలతో ప్రయోగించే బాణాల సముదాయంతో ఆకాశం అంతా కమ్ముకొని దశదిశలా చీకట్లు కమ్ముకున్నాయి. ఎదురుకుండా ఉన్నా కూడా ఒకరి కొకరు కనిపించనంతటి అంధకారం కమ్ముకుంది. అంతట దశరథ కుమారుడైన రాముడు నవ్వుతూ ఇలా అన్నాడు: "ఓ రాక్షసాధమా! నేను లేని సమయం చూసి, జనస్థానం నుండి నా భార్యను అపహరించుకొని వచ్చావు. అందువల్ల నీవు పరాక్రమవంతుడివి కావు. అయినా 'నేను శూరుడనని మిడిసిపడుతున్నావు. నీవు ఇతరుల భార్యలను తాకటం అనే నీచాతి నీచమైన పనిచేసి కూడా శూరుడనని విర్రవీగుతున్నావు. నువ్వు ఎవరికి శూరుడవు? రక్షణలేని స్త్రీలను అపహరించడంలో శూరుడవా? ఇతరుల భార్యలను చెరపట్టడంలో శూరుడవా? నీచమైన పురుషులు చేసే పనులన్నీ చేస్తూ 'నేను శూరుడనని' ప్రగల్భాలు పలుకుతున్నావు. నీవు కట్టుబాట్లు లేని అధముడవు; సిగ్గూ ఎగ్గూ లేనివాడవు. సదాచారాలను మంటగలిపేవాడా! నీవు శూరుడవా? గర్వంతో దురాచారాలు చేస్తూ మృత్యువును

కౌగలించుకొనే నీవు శూరుడవా? కుబేరుడికి తమ్ముడనని, పెద్దసైన్యం గలవాడననీ, బలసంపన్నుడననీ, విర్రవీగుతూ ఉంటావే. నీవు జీవితంలో మెచ్చదగిన పని ఒకటైనా చేశావా? దుర్మార్గుడా! మదాంధుడవై నీచమైన పనులన్నీ చేస్తున్న నీవు శూరుడవా? అట్టి దుర్మార్గమైన పనులన్నింటికీ ఇప్పుడు ఫలం అనుభవించబోతున్నావు. నీవు నేను ఉండగా సీతను అపహరించే ప్రయత్నం చేసి ఉంటే, ఆనాడే నిన్ను నీ తమ్ముడు ఖరుడి దగ్గరకు పంపేవాణ్ణి. క్రూరుడా! దైవవశాత్తు ఇప్పుడు నీవు నా కంటపడ్డావు. ఇకపై నానుండి తప్పించుకోలేవు. ఇప్పుడే నిన్ను యమలోకానికి పంపిస్తాను. ఓ రావణుడా! ప్రకాశవంతమైన కుండలాలతో ఉండే నీ శిరస్సును ఖండిస్తాను; యుద్ధభూమిలో దుమ్ములోపడి పొర్లాడేట్లు చేస్తాను. అనాథగా పడిఉండే నీ శరీరాన్ని కాకులు, గ్రద్దలూ, నక్కలు పీక్కుతింటాయి. నా బాణాలతో శరీరం అంతా తూట్లుపడి నెత్తురు ఏరులై ప్రవహిస్తుంది. నీవు నేలపై పడిపోగానే, గరుత్మంతుడు సర్పాలను చీల్చినట్లు, రాబందులు నీ ప్రేగుల్ని ముక్కుతో పొడిచిపొడిచి బయటకు లాగి తింటాయి." ఇలా అంటూ ఆ రాక్షసరాజుపై బాణాల వర్షాన్ని కురిపించాడు. శత్రువైన రావణుణ్ణి చంపాలని నిశ్చయించుకున్న రాముడి పరాక్రమము, బలము, ఉత్సాహము, అస్త్రబలము రెట్టింపయింది. కీర్తిమంతుడు, సచ్ఛీలుడూ అయిన రాముడికి సర్వ అస్త్రములు, మంత్రములు చక్కగా స్ఫురించగా, ఉత్సాహంచేత హస్తలాఘవం నూరింతలయింది. రాముడు తనలో వృద్ధి అవుతున్న ఈ శుభలక్షణాలన్నింటినీ స్వయంగా తెలుసుకున్నవాడై రెట్టించిన ఉత్సాహంతో రావణుణ్ణి నిస్తేజుణ్ణి చేశాడు. ఒక ప్రక్క రాముడు బాణవర్షం కురిపిస్తూ ఉండగా, మరో ప్రక్క వానరులు రాళ్ళ వర్షం కురిపించారు. అప్పుడు రావణుడిలో ధైర్యం సన్నగిల్లింది; గుండెలు జారిపోయాయి. నిస్తేజుడయ్యాడు. మంత్రాలు జపించి అస్త్రాలు ప్రయోగించలేకపోయాడు. ధనుస్సును ఎక్కుపెట్టాలంటే చేతులు సహకరించలేదు. రాముణ్ణి పతిఘటించలేకపోయాడు. తను పూర్వం చేసిన దురాగతాలన్నీ ఒక్కొక్కటే జ్ఞప్తికి వచ్చి అంతర్మథనం ప్రారంభం అయింది. పాపాలే పండి, మృత్యువు ఎదురుగా నిలబడి అతడి చేత యుద్ధం చెయ్యకుండా విముఖుణ్ణి చేసింది. రథసారథి రావణుని దైన్యస్థితిని గుర్తించాడు. స్వామిభక్తి పరాయణుడైన సారథి సమయస్ఫూర్తితో రథాన్ని మెల్లగా యుద్ధభూమి నుండి దూరంగా తీసుకుపోయి రావణుడి ప్రాణాలు కాపాడాడు.

# 103వ సర్గ రావణుడు సారథిని నిందించటం

రావణుడికి దైవం ప్రతికూలించి, మృత్యుదేవత అనుకూలించడం చేత, కోపంతో కళ్ళతోనే నిప్పులు కురిపిస్తూ సారథితో ఇలా అన్నాడు. "ఓ సారథీ! నీకు దుర్బుద్ధి పుట్టింది. నన్ను బలహీనుడిగాను, అశక్తుణ్ణిగాను జమకట్టావు. నేను పౌరుషం లేనివాణ్ణని, నా ధైర్యం చచ్చిపోయిందని, అనుకున్నావా? పరాక్రమం పోగొట్టుకొని ఏదో విధంగా ప్రాణాలు దక్కించుకోవాలనుకునే పిరికివాణ్ణని అనుకున్నావా? లేక, నాకు అస్త్రబలం లేదనీ, మాయామర్మాలు తెలియని అసమర్థుడనని అనుకున్నావా? పగ్గాలు నీ చేతిలో ఉన్నాయనే కండకావరంతో నీ ఇష్టం వచ్చినట్లుగా రథాన్ని యుద్ధభూమి నుండి దూరంగా తీసుకొనివచ్చి నన్ను ఘోరంగా అవమానించావు. నీకు అటువంటి దుర్బుద్ధి లేకపోయినట్లయితే, నన్ను మాటమాత్రమైనా అడగకుండా, శత్రువుతో యుద్ధం చేస్తున్న నన్ను ఇట్లా యుద్ధభూమి నుండి దూరంగా తీసుకొని వస్తావా? దుర్మార్గుడా! నేను ఎంతో కాలం నుండీ కష్టపడి ఆర్జించుకున్న అజేయుణ్ణనే కీర్తిని ఈ రోజున నాశనం చేశావు. పరాక్రమవంతుడూ, పరాక్రమంచేత నాతో సమఉజ్జీ అయిన శత్రువు చూస్తూ ఉండగా, యుద్ధం చెయ్యటమే ఊపిరిగా పెట్టుకున్న నన్ను ఇట్లా యుద్ధభూమి నుండి దూరంగా తీసుకొని వచ్చి అపకీర్తిపాలు చేశావే? లోకం దృష్టిలో నన్ను నీచపురుషుడిగా నిలబెట్టావే? ఓరీ! దుష్టబుద్ధీ! నీవు శత్రువు దగ్గర ఏదైనా లంచం పుచ్చుకున్నావా? లేకపోతే, సారథి అనేవాడు యుద్ధం చేసేందుకు శత్రువు ఎదుట నిలబెట్టాలేకానీ, దారి మళ్ళించి నన్ను ఇక్కడకు తీసుకొని రావచ్చా? నీవు ఇప్పుడు చేసినపని శత్రువు చేసేదేగాని, మిత్రుడైనవాడు, హితంకోరేవాడూ ఈ విధంగా చెయ్యడు. నువ్వు నా దగ్గర ఎంతోకాలం నుండి పని చేస్తున్నావు. నీకు నేను చేసిన ఉపకారాలు ఏమాత్రం జ్ఞాపకమున్నా, ఏమాత్రం విశ్వాసమున్నా, శత్రువు పారిపోక ముందే రథాన్ని మరల్చు." రావణాసురుడు పలికిన పరుషమైన మాటలు విని రావణుని హితాన్ని కోరేవాడు, బుద్ధిమంతుడు అయిన సారథి ఇలా అన్నాడు.

“రాక్షసరాజా! నేను శత్రువులకు అమ్ముడుపోలేదు. స్వామిభక్తిని మరువలేదు. భయపడలేదు. నేను ఎటువంటి దురాలోచనలు చెయ్యలేదు. నీ ఎడల నా స్నేహభావం సన్నగిల్లలేదు. నీవు చేసిన సత్కారము మరచిపోలేదు. రాజా! నీకు శ్రేయస్సు కలగాలని, నీవు క్షేమంగా ఉండాలని, నీ కీర్తిని రక్షించాలని, నీ మంచిని కోరి, నిర్మలమైన మనస్సుతో నీకు సంతోషం కలిగించదని తెలిసి కూడా నిన్ను యుద్ధభూమి నుండి తప్పించి దూరంగా తీసుకొని వచ్చాను. మహారాజా! నన్ను నీచుణ్ణిగాను, దుష్టుడిగాను భావించవద్దు. నీవు ఆరోపించిన దోషాలేవీ నాలో లేవు. నేను పూర్వము, ఇప్పుడు, ఇకముందు కూడా నీ హితాన్ని కోరే సేవకుడినే.

నీవే ఆలోచించు. చంద్రోదయం అయ్యేటప్పుడు సముద్రజలాలు ఉప్పొంగిపోతూ ఉంటాయి. సముద్రంలో కలిసే నదీజలాలన్నీ వెనక్కుపోతాయి. అట్లాగే ఆ మహాయుద్ధంలో నీవు బాగా అలసిపోయావు. నిజానికి నువ్వు ఎంత అలసిపోయావో నీకంటే నాకే ఎక్కువ తెలుసు. యుద్ధం అంటే నువ్వు చూపిస్తున్న ఉత్సాహం, నీ పట్టుదలను నేను గమనించకపోలేదు. రథానికి పూన్చిన గుర్రాలు బాగా అలసిపోయి ఉన్నాయి. నేను ఎంత ప్రయత్నించినా, వాటిలో శక్తి నశించిపోవటం వల్ల, లాగలేకపోతున్నాయి. బాగా అలసిపోవటం వల్ల బలాన్నీ కోల్పోయాయి. పరాక్రమం ప్రదర్శించటంలో సుముఖత్వంగాని శత్రువు కన్నా అధికమైన బలంగానీ నీలో కనబడలేదు. ఎద్దులు వాన దెబ్బతిన్నట్లుగా గుర్రాలు ఎండ దెబ్బతిన్నాయి. అంతేకాకుండా ఎటుచూసినా అపశకునాలు కనిపిస్తున్నాయి. రాజా! సారథి అనేవాడు, శుభాశుభ శకునాన్ని, దేశకాలాన్ని అనుసరించుకొని రథాన్ని నడపాలి. అంతేకాకుండా, ప్రభువు (రథికుడు) మనస్సు గ్రహించుకుంటూ రథాన్ని నడపాలి. యజమాని అలసిపోయి ఉన్నాడా? లేక ఉత్సాహంగా ఉన్నాడా అని తెలుసుకుంటూ ఉండాలి. ప్రభువు బలాన్ని, శత్రువు బలాన్ని నిశితంగా పరిశీలిస్తూ ఉండాలి. రథం ఎత్తు పల్లాల్లోకి పోకుండా సమమైన నేలపై నడుపుతూ ఉండాలి. సమయాసమయాన్ని అంచనా వేసుకుంటూ ఉండాలి. ముఖ్యంగా శత్రువు లోపాన్ని గమనిస్తూ ఉండాలి; దానికి తగినట్లుగా రథాన్ని నడపాలి. అంటే, శత్రువుకు మరీదగ్గరగా తీసుకుపోవటమో లేక ప్రక్కకు తీసుకొనిపోవడమో, లేదా సూటిగా ఎదురుకుండా నిలపడమో,

వెనుకగా తోలుకుని పోవడమో, తెలుసుకుంటూ సారథ్యం చెయ్యాలి.

మహారాజా! నీవు మహావీరుడవు. నేను ఈ రథాన్ని కేవలం నా ఇష్టం వచ్చినట్లు నడపడం లేదు. నేను ప్రభుభక్తితోనే ఈ పని చేశాను. ఓ శత్రుసంహారకుడా! ఆజ్ఞాపించు. నీవు ఎట్లా చెయ్యమంటే అట్లాగే చేస్తాను. నీ ఆజ్ఞను జవదాటను. నీ ఋణాన్ని తీర్చుకుంటాను" అన్నాడు.

సారథి చెప్పిన మాటల్ని రావణుడు సావధానంగా విన్నాడు. సంతుష్టుడయ్యాడు. పరిపరివిధాల మెచ్చుకున్నాడు. సారథితో ఇలా అన్నాడు. "ఓ సూతుడా! నీవు వెంటనే రథాన్ని రాముడు ఎదుటగా నిలబెట్టు. నేను రాముణ్ణి సంహరించకుండా వెనుదిరగను." అంతట రావణుడు సంతోషంతో హస్తాభరణాన్ని తీసి సారథికి బహుమానంగా ఇచ్చాడు. అంతట సారథి తిరిగి రథాన్ని యుద్ధభూమికి తోలుకొనిపోయాడు. అప్పుడు రథం రాముడి ఎదురుగా నిలబడింది.

# 104వ సర్గ ఆదిత్యహృదయ స్తోత్రం

రామరావణ యుద్ధం చూసేందుకు దేవతలంతా వచ్చి ఆకాశంలో బారులు తీరి ఉన్నారు. భగవానుడైన అగస్త్య మహర్షి కూడా వాళ్ళతో కలసి వచ్చాడు. రాముడు యుద్ధం చేసి బాగా అలసిపోయి ఉండటం చూశాడు. రాముడు రావణునితో ఏ విధంగా యుద్ధంచెయ్యాలో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. అప్పుడు అగస్త్య మహర్షి రాముడి దగ్గరకు వచ్చి ఇలా అన్నాడు. "ఓ రామా! యుద్ధాల్లో సమస్తమైన శత్రువుల్నీ జయించేందుకు ఒక రహస్యమైన స్తోత్రం ఉంది. దాన్ని నీకు ఉపదేశిస్తాను. ఆ స్తోత్రాన్ని జపించు. నీవు యుద్ధంలో సమస్త శత్రువుల్ని జయించగలవు" అని ఆదిత్యహృదయ స్తోత్రాన్ని ఉపదేశించాడు.

# 105వ సర్గ రావణుడు తిరిగి యుద్ధభూమికి రావడం

రావణుడు ఇచ్చిన బహుమతి సంతోషంతో తీసుకొన్న రథసారథి మళ్ళీ రథాన్ని గంధర్వనగరం వలె ఉన్న శత్రుసైన్యాన్ని ఎదిరించేందుకు యుద్ధభూమికి తీసుకొని వచ్చాడు. ఆ రథం మహావేగంతో వచ్చి నిలిచింది. గుర్రాలకు బంగారుమాలలు అలంకరించారు. యుద్ధానికి కావలసిన ఆయుధాలు ఇతర వస్తుసామగ్రి అంతా అందు సమకూర్చారు. ఆ రథం వేగంగా వస్తూ ఉంటే భూమి దద్దరిల్లింది; రాక్షస సైన్యంలో ఉత్సాహం నింపింది. ఆ రథం పైభాగాన పెద్దపతాకం ఎగురుతూ ఉంది. నల్లని గుర్రాలు పూన్చారు. అది సూర్యుడి కాంతితో సమానంగా ప్రకాశిస్తూ ఆకాశంలో విహరించే విమానంలాగా ఉంది. పతాకం ఇంద్రధనుస్సును పోలిన రంగుల వలె కాంతివంతంగా ఉంది. ఆ రథం నుండి ప్రయోగిస్తున్న బాణధారలు ఆకాశం నుండి జలధారలు వర్షిస్తున్న మేఘంలాగా ఉంది. ఆ విధంగా వంగి వంకరగా వస్తున్న రావణుని రథాన్ని చూస్తూ మాతలితో రాముడు ఇలా అన్నాడు: “మాతలీ! వేగంగా వస్తున్న ఆ రావణుని రథాన్ని చూడు. ఈతడు మళ్ళీ వేగంగా ప్రదక్షిణముగా వస్తున్నట్లున్నాడు. అంటే, చావటానికే మళ్ళీ తిరిగి వస్తున్నాడని నా కనిపిస్తోంది. అందువల్ల నీవు కూడా త్వరగా వెళ్ళి అతడికి ఎదురుగా నిలుపు. ఈసారి వీడిని విడిచేది లేదు; చంపేస్తాను. గుర్రాల్ని, రథాన్ని బాగా అదుపులో ఉంచుకో. శత్రువు రథాన్ని గాని, వేగాన్ని గానీ చూసి భయపడవద్దు. నీలో ఎక్కడా కలవరపాటు చూపించకు. నిబ్బరమైన మనస్సుతో కళ్ళాన్ని పట్టుకొని గుర్రాల్ని నడుపు. ఓ మాతలీ! నీవు దేవేంద్రుడికి అనేక యుద్ధాల్లో సారథ్యం వహించావు. నీవు బాగా అనుభవజ్ఞుడవు. అందువల్ల నీకు ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. అయితే ఇతడిని చంపే వరకూ నేను ఏకాగ్రచిత్తంతో యుద్ధం చెయ్యాలని అనుకుంటున్నాను. ఇటుపిమ్మట నేను నీతో మాట్లాడే అవకాశం ఉండకపోవచ్చు. అందువల్ల ముందుగా నీకు తెలియజేస్తున్నాను. నేను నీకు బోధించడం లేదు.” దేవతాసారథి, ఉత్తముడు అయిన మాతలి రాముడి మాటలకు సంతోషించాడు. మాతలి రథాన్ని ప్రదక్షిణముగా ఉండేట్లు నడుపుతూ, అధికంగా

దుమ్మురేగేట్లుగా రావణుడికి రథం కనబడకుండా ఉండేట్లుగా నడిపాడు. అంత రావణుడు కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి. రథచక్రాలంత పెద్దవిగా చేశాడు. ఆపైన రాముడిపైన బాణవర్షం కురిపించాడు. రావణుడు విడుస్తున్న బాణాలకు, రాముడికి సహజంగా కోపంలేనివాడైనా, కోపాన్ని ఆపాదించుకొని, దేవేంద్రుడు ఇచ్చిన ధనుస్సును అందుకున్నాడు. సూర్యకిరణాలతో సమానమైన బాణాల్ని గ్రహించాడు. ఇద్దరూ పరస్పరం ఒకరినొకరు తుదముట్టించాలనే తీవ్రమైన ఆకాంక్షతో ఎదురెదురుగా నిలబడ్డ రెండు సింహాల వలె యుద్ధం చేశారు. అప్పుడు దేవతలు, గంధర్వులు మొదలైనవాళ్ళంతా రావణుని మరణాన్ని చూడాలనే తీవ్రకాంక్షతో ఆకాశంలో బారులుతీరి నిలబడ్డారు.

రావణుని వినాశాన్ని, రాముడి విజయాన్ని సూచిస్తూ రోమాంచం కలిగించే అనేక శకునాలు కనబడ్డాయి. మేఘాలు రావణుని రథంపైన రక్తవర్షాన్ని కురిపించాయి. తీవ్రమైన సుడిగాడ్పులు బయలుదేరి రావణుని రథానికి ప్రదక్షిణపూర్వకంగా వీచాయి. పెద్ద గ్రద్దల గుంపు ఆకాశంపైన తిరుగుతూ రావణాసురుడి రథంపై వాలాయి. లంకాపట్టణం అంతా పట్టపగలే జలపుష్ప కాంతులతో సంధ్యారాగం అలముకొంది. భూమి అంతా మంటలు మండుతున్నట్లు కనిపించింది. ఆకాశంలో పిడుగుల్లాంటి కొరవులు పెద్దపెద్ద శబ్దాలు చేస్తూ గిర్రున తిరిగాయి. ఇవన్నీ రావణాసురుడికి అపశకునాలుగా కనిపించాయి. రావణాసురుడి రథం ఏ ప్రక్కకు తిరిగితే ఆ ప్రక్కల్లా భూమి కంపించి, పోరాడుతున్న రాక్షసవీరుల చేతుల్ని ఎవరో బంధిస్తున్నట్లు అనుభూతి చెందారు. సూర్యకిరణాలు ఎరుపు, పసుపు, తెలుపు, నలుపు రంగుల్తో రావణాసురుడి ఒంటిపై ప్రసరించాయి. అప్పుడతడు, గైరికాది ధాతువుల్తో మెరుస్తున్న పర్వతంవలె కనిపించాడు. నక్కలు నోటితో నిప్పులు కక్కుతూ రావణుడికి ఎదురుగా వెళ్ళి ఏడుస్తున్నట్లుగా అరిచాయి. క్రింద నక్కల్లాగానే ఆకాశంలో గ్రద్దలు కూడా భయంకరంగా అరుస్తూ రథం చుట్టూ ప్రదక్షిణలు చేశాయి. యుద్ధభూమిలో సుడిగాడ్పులు రేగి రావణుడి ముఖం అంతా కప్పేశాయి. ఆకాశాన మేఘాల్లేవు; ఉరుములు లేవు; మెరుపులు లేవు; అయినా భయంకరంగా ధ్వనులు చేస్తూ పిడుగులు, కొరవులు రాక్షససైన్యంపై పడ్డాయి. దుమ్ముతో ఆకాశం కప్పేసింది. చీకట్లు కమ్మింది.

ఆకాశంలో గోరువంకలు పోట్లాడుకుని చచ్చి రావణాసురుడి రథంపై పడ్డాయి. రావణాసురుడి రథానికి కట్టిన గుర్రాల కళ్ళల్లో నుండి కన్నీళ్ళు ధారలుగా కారాయి; పిరుదుల్లో నుండి అగ్నికణాలు రాలాయి. ఈ విధమైన భయంకరమైనవి, అతిక్రూరమైనవి ఉత్పాతాలు కనిపించాయి. ఇందుకు వ్యతిరేకంగా రాముడికి శుభశకునాలు కనిపించాయి.

# 106వ సర్గ రామ రావణుల భయంకర పోరాటం

రామ రావణులిద్దరూ అతిభయంకరంగా యుద్ధం చేశారు. లోకాలన్నీ భయపడిపోయాయి. ఆ యుద్ధంచూస్తూ అటు రాక్షసవీరులు, ఇటు వానరయోధులు యుద్ధం మానేశారు. వాళ్ళు ధరించిన ఆయుధాలు అట్లాగే చేతుల్లోనే ఉండిపోయాయి. శిలావిగ్రహాల్లాగా నిలబడిపోయి ఆ రామ రావణ యుద్ధాన్ని ఆసక్తితో చూస్తున్నారు. ఆ యుద్ధభూమి అంతా రామ రావణులు తప్ప ఇంకెవ్వరూ యుద్ధం చెయ్యటంలేదు. ఇంతవరకూ జరిగిన యుద్ధానికి ఇదే చివరిఘట్టమని ఇరుపక్షాల సైనికులు భావించారు. రాక్షసవీరులు రావణాసురుణ్ణి ఆసక్తితోను, జయించాలన్న ఆకాంక్షతోనూ చూస్తున్నారు. వానరయోధులు కూడా రాముడి బాణప్రయోగాన్నీ, వేగాన్నీ ప్రత్యక్షంగా చూస్తూ, తేరిపారచూస్తున్నారు. రాముడే జయిస్తాడనే నమ్మకంతో నిలబడి చూస్తున్నారు.

అక్కడ కనిపించిన శకునాల్ని రామ రావణు లిద్దరూ చూశారు. ఒకరిపై మరొకరు కోపంతోను, పట్టుదలతోను, జయించాలనే ఆకాంక్ష చేతను వాళ్ళిద్దరూ ఆ శకునాల్ని లెక్కచెయ్యలేదు. ఇరువురూ ఎవరికి వారే, తనకు జయం నిశ్చయమన్న ధీమాతో యుద్ధం చేశారు. తమ శాయశక్తులా యుద్ధం చేశారు. అప్పుడు రావణుడు రాముడు కూర్చున్న, దేవేంద్రుడి రథంపైనున్న ధ్వజంపై బాణాల్ని ప్రయోగించాడు. అవన్నీ ఆ ధ్వజాన్ని చేరకుండానే 'రథశక్తిని' స్పృశించి నేలమీద పడిపోయాయి. అంతట మహాపరాక్రమవంతుడైన రాముడు కోపించి సర్పాల్లాంటి బాణాల్ని రావణుని ధ్వజంపైన ప్రయోగించాడు. ఆ ధ్వజం కాస్తా విరిగి నేలపై పడింది. రామబాణం చేత రావణుని రథధ్వజం కాస్తా క్రింద పడిపోవటంతో, రావణుడు సహించలేకపోయాడు. దగ్గరగా ఉండే వస్తువుల్ని దహించివేసే అగ్నిహోత్రుడిలాగా మండిపడిపోయాడు. కోపావేశంతో బాణవర్షాన్ని కురిపించాడు. మంటల్ని మండించే బాణాల్ని గ్రహించి రాముడి రథానికి పూన్చిన అశ్వాలపై వదిలాడు. ఆ పచ్చటి అశ్వాలు దేవేంద్రుడివి కావటాన ఆ బాణాలు పోయి అశ్వాలకు తామర తూండ్లవలె తాకాయే కానీ, ఎంతమాత్రం

బాధించలేదు. తన బాణాలు నిష్ఫలం కావడంతో రావణుడు మహోగ్రుడైపోయాడు. ఈసారి ఒక్క బాణాల్నే కాదు, గదల్ని, పరిఘల్ని, చక్రాయుధాల్ని, ముసలాయుధాల్ని, శూలాయుధాల్ని, గండ్రగొడ్డళ్ళనీ, ఇంకా అనేకమైన భయంకరాయుధాల్ని రాక్షసమాయతో తన ధనుస్సులోనే సంధించి రావణాసురుడు ప్రయోగిస్తూ ఉంటే భయంకరమైన ధ్వనులు బయలుదేరాయి. ఆ భయంకర ఆయుధాలన్నీ గురి తప్పాయి; రాముడి మీద కాకుండా వానరసైన్యాన్ని పోయి తాకాయి. అయినా రావణుడు నిరుత్సాహపడలేదు. ఏకాగ్రచిత్తంతోను, రెట్టించిన ఉత్సాహంతోను వేలాది బాణాల్ని రాముడిపై సంధించాడు. రావణుడు ప్రయత్నాన్ని చూచి రాముడు చిరునవ్వుతో, తన ధనుస్సును ఎక్కుపెట్టి తీక్ష్ణమైన అస్త్రాల్ని రావణుడిపై ప్రయోగించాడు. అట్లా ఆ ఇద్దరూ ప్రయోగించిన బాణాలన్నీ ఆకాశాన్ని కప్పేశాయి. మరో క్రొత్త ఆకాశాన్నే సృష్టించాయి. రామ రావణులు ప్రయోగించిన బాణాలు ఏవీ లక్ష్యాన్ని ఛేదించకుండా వృథా కాలేదు; నిష్ఫలం కాలేదు. అయితే ఒకరి బాణం మరొకరి బాణాల్ని ఛేదించి రెండు కూడా నేలపాలయ్యాడు వారిద్దరూ బాణాల్ని ప్రయోగించడంలో ప్రదర్శించిన నేర్పు చూడవలసిందేకాని వర్ణించ తరం కాదు. వారిద్దరూ సవ్యంగాను, అపసవ్యంగా కూడా తిరుగుతూ బాణాలు ప్రయోగించారు. ఆ బాణాలతో దిక్కులన్నీ గోడకట్టినట్లుగా గాలి కూడా చొరబడలేకపోయింది. అప్పుడు రాముడు రావణాసురుడి గుర్రాల్ని, రథాన్నీ గురి చూసి బాణాల్ని సంధించాడు. ఆ బాణాలన్నింటికీ రావణుడు ప్రతిక్రియ చేస్తూ నిరోధించాడు. ఇరువురూ పరమకృద్ధులైపోతున్నారు. అద్భుతంగాను, ఒళ్ళు గగుర్పాటు పుట్టించేట్లు గాను యుద్ధం చేశారు.

రామ రావణులు అట్లా రోమాంచజనకంగా యుద్ధం చేస్తూ ఉంటే, ఏడు సముద్రాలు క్షోభించాయి. ఆ సముద్రాల క్రింద, పాతాళంలో నివసించే దానవులు, పన్నగులు వ్యథ చెందారు. పర్వతాలు, అరణ్యాలతో కూడిన భూమి కంపించింది. సూర్యుడి కాంతి మందగించింది. గాలి స్తంభించింది. దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు, కింనరులు, మహోదరులు మొదలైన వాళ్ళంతా కలత చెందారు. అప్పుడు వాళ్ళంతా "గోవులకు, బ్రాహ్మణులకు, శుభం కలుగుగాక! లోకాలు నశించకుండా స్థిరంగా ఉండుగాక! రాముడు యుద్ధంలో రాక్షసరాజును

జయించుగాక!" అని ఒకళ్ళకొకళ్ళు చెప్పుకుంటూ ఊరడిల్లారు. అయినా మహాఘోరమూ, రోమాంచజనకమైన ఆ రామ - రావణ యుద్ధాన్ని తిలకిస్తూ అక్కడే ఉండిపోయారు. అప్పుడు గంధర్వసంఘాలు, అప్సరససంఘాలూ సాటిలేని ఆ మహాయుద్ధాన్ని చూస్తూ "ఆకాశం వంటిది ఆకాశమే; సముద్రం వంటిది సముద్రమే వాటితో పోల్చేందుకు మరోటి ఎట్లా లేదో, అట్లాగే రామ-రావణ యుద్ధం లాంటిది రామ-రావణ యుద్ధమే సుమా!" అని చెప్పుకున్నారు.

అప్పుడు మహాబాహువు, రఘువంశరాజుల కీర్తిని వృద్ధిచేసేవాడూ అయిన రాముడు కోపంతో సర్పాలతో సమానమైన బాణాల్ని ప్రయోగించి కుండలములతో శోభాయమానంగా ప్రకాశిస్తూన్న రావణుని శిరస్సును ఛేదించాడు. అప్పుడు నేలమీద పడిన ఆ శిరస్సును ముల్లోకాలవాళ్ళూ చూశారు. చూస్తూ ఉండగానే అదే మాదిరి శిరస్సు మరొకటి మొలచుకొచ్చింది. పనులు చేయుటలో నేర్పరి అయిన రాముడు అట్లా మొలచుకువచ్చిన రావణాసురుడి రెండవ శిరస్సును కూడా ఖండించాడు. ఆ శిరస్సు అటు నేలపై పడిందో లేదో, ఇటు రావణుడి మెడపై మూడోసారి శిరస్సు మొలచుకొచ్చింది. రాముడు ఈ విధంగా విసుగూ, విరామం లేకుండా నూటఒక్కసార్లు ఛేదించగా, రావణునికి అట్లా నూట ఒక్కసార్లూ శిరస్సు మొలచుకొచ్చింది. ఆ విధంగా రాముడు ఎన్నిసార్లు రావణాసురుడి శిరస్సులు ఖండిస్తున్నా కూడా అతడి ప్రాణాలు మాత్రం పోవడం లేదు, సరిగదా, ఇటు మళ్ళీ మళ్ళీ శిరస్సులు మొలచుకొస్తున్నాయి. అంతట రాముడు తీవ్రంగా ఆలోచించాడు. 'ఏ బాణంతో అయితే మారీచుడు చంపబడ్డాడో, ఏ బాణానికైతే దండకారణ్యంలో ఖరదూషణాదులు మరణించారో, ఏ బాణాలకు విరాధుడు చచ్చిపోయాడో, ఏ బాణానికి క్రౌంచారణ్యంలో కబంధుడు అంతమొందాడో, అదే బాణాన్ని రావణాసురుడిపై ప్రయోగించానే! ఎందువల్ల ఇతడు మాత్రము చనిపోకుండా ఉండటానికి కారణం ఏమై ఉంటుందా?' అని ఆలోచించాడు. అయినా ఏమాత్రం అలసట చెందకుండా, ఈసారి రావణాసురుడి వక్షఃస్థలంపై రాముడు బాణవర్షం కురిపించాడు. రామ రావణులిద్దరూ రాత్రిపగలు అనే తేడా లేకుండా వ్యాకులము, రోమాంచకరమూ అయిన ఆ మహాయుద్ధం ఆకాశంపైన పర్వతాలపైన చేశారు. దేవ, దానవ, యక్ష, పిశాచ, ఉరగ, రాక్షసులు

చూస్తూ ఉండగా ఆ మహాయుద్ధం ఏడు రోజులు సాగింది. ఆ రామరావణ యుద్ధం రాత్రి పగలనే తేడా లేకుండా, ఒక్కక్షణమైనా విశ్రాంతి లేకుండా పోరాటం సాగింది. ఇంకా రాముడు రావణుణ్ణి సంహరించకపోవటం చూస్తున్న సారథి అయిన మాతలి రాముడితో ఇలా అన్నాడు.

# 107వ సర్గ రాముడు రావణుని సంహరించటం

అప్పుడు మాతలి రాముడితో ఇలా అన్నాడు. “ఓ వీరుడా! ఓ సర్వసమర్థుడా! ఈ రావణాసురుని చంపడానికి ఏమీ తెలియనివాడివలె ఇంత ఆలస్యం చేస్తున్నావెందుకు? అతడు వేస్తున్న ప్రతి బాణానికీ నీవు ప్రతిగా బాణాలు వదలడం ఎందుకు? ఈతడికి దేవతలు చెప్పిన వినాశకాలం వచ్చేసింది. నీవు సమస్తమైన అస్త్రాలు తెలిసినవాడవే! ఈతడి పైన నీవిప్పుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించు. వెంటనే చచ్చిపోతాడు.”

అంతట రాముడు మాతలి మాటలు విని యుద్ధాల్లో తిరుగులేనిదీ, భగవంతుడైన అగస్త్యుడు తనకు ప్రసాదించినదీ, సర్పంలాగా బుసలుకొడ్తూ ఉండేదీ అయిన బ్రహ్మాస్త్రాన్ని తీశాడు. పూర్వం బ్రహ్మదేవుడు ఈ తేజస్సు గల అస్త్రాన్ని స్వయంగా నిర్మించి ముల్లోకాలను జయించేందుకు ఇంద్రుడి కిచ్చాడు. ఆ అస్త్రానికి రెక్కల్లో వాయువును, బాణపుకొన యందు (ములికి) అగ్నీ సూర్యుల్ని, బరువు కొరకు మేరు మందర పర్వతాల్ని అధిష్ఠాన దేవతలుగా నియోగించాడు. దాని శరీరం బ్రహ్మమయం. అదే బ్రహ్మాస్త్రం.

దాని శరీరం మంటలు మండిస్తూ ఉంటుంది. దాని పొన్నులు బంగారంతో అలంకరించబడింది. భూతాలన్నింటిలోని తేజస్సునూ గ్రహించి ఈ అస్త్రంలో పొందుపరచాడు. సూర్యుడి వంటి కాంతిగలదా బ్రహ్మాస్త్రం. సర్పంలాంటి ఆ బాణం పొగలు విరజిమ్ముతూ ప్రళయాగ్ని వలె ప్రజ్వలిస్తూ ఉంటుంది. ఆ అస్త్రం అమితవేగంతో శత్రువుల్లోకి జొరబడి ఏనుగుల్ని, గుర్రాలను చీల్చి చండాడుతుంది. రథాలను, శత్రువుల ప్రాకారాల్ని, పురద్వారాల్ని, అగడ్తల్ని పగలుకొడ్తుంది. వజ్రంలాగా కఠినమైనది. పర్వతాలనైనా పగలగొట్టగలదు. యుద్ధరంగంలో మహాధ్వనులు చేస్తూ, భయంకరంగా బుసలు కొడ్తూన్న మహాసర్పంలాగా తిరుగుతూ, సమస్త ప్రాణికోటినీ గజగజలాడిస్తుంది. శత్రుసేనల్ని చీల్చిచెండాడి వాళ్ళ రక్తమాంసాలతో కంకపక్షులకూ, పవళపక్షులకూ, గ్రద్దలకూ, నక్కలకూ ఆహారాన్ని అందిస్తుంది.

యుద్ధరంగలో కాలయముడిలా సంచరిస్తుంది. గరుత్మండుడివలె, రంగులరెక్కలతో యథేచ్ఛగా ఎక్కడకుపడితే అక్కడకు పోగలదు. ఇది ముల్లోకాల్లోని అతిశ్రేష్ఠమైన అస్త్రాలన్నింటికీ శిరస్త్రాణం వంటిది. వానరులందరికీ సంతోషాన్ని కలిగించేదీ, రాక్షసులందర్నీ శోకసముద్రంలో ముంచేదీ, గరుత్మంతుడి రెక్కలవలె వేగముగలది అయిన బాణాన్ని రాముడు చేతిలోనికి తీసుకొని ధనుస్సులో సంధించాడు. వేదోక్తంగా మంత్రాన్ని జపించాడు. రాముడు ఆ బాణాన్ని వింటినారిపై సంధించి ఎక్కుపెట్టగానే భూతాలన్నీ భయపడిపోయాయి. భూమి కంపించింది. రాముడు, ఇంద్రుడి ఆయుధమైన వజ్రాయుధం వంటిది, ఎదిరింపశక్యం కానిదీ, యముడివలె నివారించ శక్యంకానిదీ అయిన ఆ బ్రహ్మాస్త్రాన్ని రావణాసురుని వక్షఃస్థలంపై ప్రయోగించాడు. ఆ అస్త్రం మహావేగంతోపోయి రావణుని హృదయాన్ని చీల్చివేసింది. వేగంగల ఆ బాణం రావణుని ప్రాణాన్ని హరించి రక్తసిక్తమైన రావణుణ్ణి సంహరించి రక్తంతో తడిసి, తన కర్తవ్యాన్ని నిర్వర్తించి (రావణుణ్ణి సంహరించడం) చడీచప్పుడూ లేకుండా తన నివాసస్థానమైన అంబులపొదికి వచ్చి చేరుకుంది.

ఆ విధంగా రావణుడు హతమయిన తర్వాత అతడి చేతిలో నుండి ధనుర్బాణాలు క్రింద పడిపోయాయి. ప్రాణాలు అనంతవాయువుల్లో కలసిపోయాయి. భయంకరమైన వేగము, గొప్పతేజస్సు గల ఆ రావణుడు ప్రాణాలు విడిచి, వజ్రాయుధం చేత సంహరించబడ్డ వృత్రాసురుడిలాగా రథంపై నుండి నేలపై పడిపోయాడు. అట్లా చచ్చి నేలపై పడి ఉన్న రావణాసురుణ్ణి చూసి రాక్షససైన్యం అంతా భయంతో పారిపోయింది. మహావృక్షాల్నే ఆయుధాలుగా చేసుకొని పోరాడిన వానరవీరులంతా సంతోషంతో సింహనాదాలు చేస్తూ పారిపోతున్న రాక్షసులందర్నీ తరిమికొట్టారు. రాక్షసులంతా జాలిపుట్టేట్లుగా నడుస్తూ లంకపట్టణం వైపుగా పరుగులు తీశారు.

దేవతలు ఆకాశం నుండి దుందుభులు మ్రోగించారు. భూమి సుగంధాల్ని వెదజల్లింది. వాయుదేవుడు ఆ సుగంధాన్ని నలుమూలలకూ చేరవేశాడు. దేవతలంతా రాముడిపైనా, రాముడి

రథంపైనా పూలవర్షం కురిపించారు. భూమిపైన వానరులు, ఆకాశాన దేవతలు రాముణ్ణి కీర్తిస్తూ స్తోత్రం చేశారు. దేవతల స్తోత్రాలు ముల్లోకాల వారికీ వినిపించాయి. లోకకంటకుడు, భయంకరుడు అయిన రాక్షసరాజు మరణానికి ముల్లోకాల్లోని ప్రాణికోటి అంతా పరమానందభరితులయ్యారు.

రాముడు కూడా రావణుని మరణానికి సంతోషించాడు. దేవతల కష్టాలు తీరాయి. దిశలన్నీ ప్రసన్నం అయ్యాయి. ఆకాశం నిర్మలమైంది. భూకంపనలు నిలిచిపోయాయి. గాలి హాయిగా వీచింది. సూర్యుడు నిశ్చలమైన కాంతుల్ని ప్రసరింపజేశాడు.

అప్పుడు సుగ్రీవుడు మొదలైన మిత్రులంతా లక్ష్మణుడితో కూడా కలిసి మనోహరుడైన రాముణ్ణి సమీపించి ప్రశంసించారు.

రఘువంశ రాజులకు ఆనందకరుడైన ఆ రాముడు శత్రువును చంపి, తన శపథాన్ని నెరవేర్చుకొని యుద్ధరంగంలో మిత్రులతో, సైన్యంతో కలసి, దేవతాగణంతో కూడిన ఇంద్రుడి వలె ప్రకాశించాడు.

# 108వ సర్గ రాముడు విభీషణుని ఊరడించటం

యుద్ధంలో చచ్చిపడి ఉన్న అన్నగారైన రావణుణ్ణి చూసి విభీషణుడు దుఃఖంతో ఇలా విలపించాడు. "ఓ వీరుడా! పరాక్రమవంతులలో శ్రేష్ఠుడవు. సుశిక్షితుడవు. శాస్త్రజ్ఞానం విశేషంగా సముపార్జించావు. హంసతూలికాతల్పాలపైన శయనించేవాడవు. ఇప్పుడు జీవంలేనివాడివై కటిక నేలపైన పడి ఉన్నావే! అన్నా! సూర్యుడితో సమానంగా తేజరిల్లే వాడివే! ఈనాడు నీ శిరస్సు, కిరీటమూ విడివిడిగా పడిఉన్నాయి గదా! దండకడియాలు ధరించుకొని దుమ్ముతో కూడిన కటిక నేలపై పారచాపుకొని పడిఉన్నావే! అన్నా! నీకు ఇటువంటి గతిపడ్తుందని నేను నీకు ముందుగానే హెచ్చరించాను. కామాంధుడవై నా మాటలు పెడచెవిన పెట్టావు. నా మాటలు రుచించలేదు. నాపై కోపగించుకొన్నావు. అందువల్లనే నీకీనాడు ఈ దురవస్థ సంప్రాప్తమైంది. ప్రహస్తుడు, ఇంద్రజిత్తు, కుంభకర్ణుడు, అతిరథుడు, అతికాయుడు, నరాంతకుడు స్వయంగా నేనుగానీ, దేనిని వ్యతిరేకించామో, దాని ఫలితం ఈ విధంగా చచ్చి ఈ కటికనేలపై పడి ఉన్నావు. కామాంధుడివి కావటంచేత సీతాపహరణం మహాపాపమని నీకు కూడా తోచలేదు.

అన్నా! నీవు రాజనీతిజ్ఞులలో శ్రేష్ఠుడవు. ఈ భూమండలంలోని దేహబలం అంతా నీలోనే కేంద్రీకృతం అయిఉండేది. నీ అంతటివాడు లేడనిపించుకొన్నావు. మహావీరుడవు, ఆయుధ ధారులలో శ్రేష్ఠుడవు. ఇప్పుడు నీవు నేలపై పడి ఉంటే, ఆ సూర్యుడే నేలపై పడిపోయినట్లుంది. చంద్రుడే చీకట్లో కలసిపోయినట్లుంది. అగ్నిహోత్రాలు చల్లారిపోయినట్లుంది. నీవు మూర్తీభవించిన ఉత్సాహానివి. ధైర్యమనే చిగురు, సహనం అనే శ్రేష్ఠమైన పుష్పం, తపస్సనే బలం, శౌర్యం అనే దృఢమైన మొదలుగల రాక్షసరాజ్యం అనే వృక్షం, ఈ యుద్ధంలో రాముడనే పెనుగాలి చేత పడగొట్టబడింది. తేజస్సే దంతాలు, కులవంశమే వెన్నెముక, కోపమే దేహంగాను వెనుకభాగమే తొండంగా గల రావణుడనే మదగజము రాముడనే సింహం చేత సంహరించబడి నేలపై పడి ఉంది. నీ పరాక్రమము ఉత్సాహము అనే జ్వాలలు గలదీ, నిట్టూర్పులనే ధూమంతో

కూడిన, బలమనే ప్రతాపం గలిగిన రావణుడనే అగ్నిని రాముడనే మేఘము ఆర్పేసింది. రాక్షసులనే మూపు, కొమ్ములు, తోక గలది, శత్రువుల్ని ఓడించేది, ఉత్సాహంతో మదగజంలాంటిది, చాపల్యం అనే చెవులు, నేత్రాలుగలది అయిన రావణుడనే వృషభం రాముడనే పెద్దపులి చేత చంపబడింది.” ఈ విధంగా విలపిస్తున్న విభీషణుణ్ణి అనునయిస్తూ రాముడు ఇలా అన్నాడు.

“ఓ విభీషణుడా! దుఃఖించకు. ఈ రావణాసురుడు పిరికివాడివలె చచ్చిపోలేదు. ప్రచండ పరాక్రమంతోను, అత్యున్నతమైన ఉత్సాహంతోను, మహాయుద్ధం చేసి నిర్భయుడై వీరమరణం పొందాడు. క్షత్రియధర్మాన్ని స్వీకరించి, యుద్ధభూమి యందు మరణించినవారు వీరస్వర్గాన్నే పొందుతారు. అట్లా యుద్ధంలో మరణించిన వారి గూర్చి దుఃఖపడకూడదు. ఏ బుద్ధిమంతుడు ఇంద్రుడితో సహా ముల్లోకాల్నీ గడగడలాడించాడో అటువంటివాడు యుద్ధంలో మరణించినప్పుడు విచారించకూడదు. యుద్ధాల్లో విజయం ఎవరో ఒకరి పక్షానే ఉంటుంది. కాబట్టి యుద్ధంలో వీరుడైనవాడు చంపుతాడు లేనిచో చంపబడుతాడు. అంతేకాని విజయం ఎల్లవేళలా ఒకరికే లభించాలనే నియమం లేదు. అట్లా ఇదివరకెప్పుడు జరగలేదు. కాబట్టి యుద్ధంలో మరణించిన శూరుణ్ణి గూర్చి దుఃఖించకూడదు, అనేది క్షత్రియసంప్రదాయం; అనాదిగా వస్తున్న ఆచారం; పూర్వులంతా అంగీకరించింది. అందువల్ల ఓ విభీషణా! వీరమరణాన్ని గూర్చిన నిజతత్త్వాన్ని తెలుసుకొని, శోకాన్ని విడిచి, ఇకపై జరగవలసిన కార్యక్రమాన్ని గూర్చి ఆలోచించు” అన్నాడు.

ఓదార్పుతో కూడినదీ, ఉదాత్తమైనదీ అయిన రాముని మాటలు విన్న విభీషణుడు ఇలా అన్నాడు. “ఓ రామా! ఇతడు దేవతలతోను, దేవేంద్రుడితోనూ అనేకసార్లు పోరాడాడు. పరాజయమన్నది ఇంతవరకు ఎరుగడు. సముద్రం చెలయలి కట్టను తాకి వెనక్కుపోయినట్లు, ఇతడు, నీతో పెట్టుకొని పరాజితుడయ్యాడు; హతుడయ్యాడు. నా అన్న, రావణుడు, అనేక దానధర్మాలు చేశాడు. పెద్దల్ని, దేవతల్ని పూజించి మెప్పించాడు. సమస్త భోగభాగ్యాలు

అనుభవించాడు. మిత్రుల్ని, సేవకుల్ని ఆదరించి, పోషించి ధనధాన్యాదులనిచ్చి సంతోషపెట్టాడు. శత్రువుల్నందర్నీ హతమార్చాడు. ఇతడు ఆహితాగ్ని, మహాతపశ్శాలి. వేదాధ్యయనం చేశాడు. అనేక వైదిక కర్మలు చేసిన వాళ్ళల్లో ప్రధానుడు. ఇతడికి మరణ సంస్కారాలన్నీ నీ అనుమతితో చేయాలని అనుకుంటున్నాను." విభీషణుడు అన్నగారిపై ప్రేమతోను, భక్తిచేతను జాలిగొలిపే మాటలతో రాముడిని ప్రార్థించాడు. అంతట మహాత్ముడైన రాముడు స్వర్గప్రాప్తికి అవసరమైన అంత్యసంస్కారాలన్నీ చెయ్యమని ఆజ్ఞాపించాడు. "ఓ విభీషణుడా! విరోధాలన్నీ మరణంతోపాటే మరణిస్తాయి. మేము చెయ్యాలని అనుకున్న పనిని చేశాం. మా పని అయిపోయింది. ఇక నీవు ఇతడికి అంత్య సంస్కారాలు చెయ్యి. ఇతడు నీ కెట్లా సోదరుడో, ఇప్పుడు నాకు కూడా సోదరుడులాంటివాడే" అన్నాడు.

## 109వ సర్గ రావణుని స్త్రీలు విలపించటం

మహాత్ముడైన రాముడు రావణుణ్ణి సంహరించినట్లు రావణాసురుడి రాణులంతా విన్నారు. దుఃఖంతో విలవిల్లాడిపోతూ అంతఃపురంలో నుండి బయటకు వచ్చారు. జుట్టువిరబోసుకున్నారు. నేలపైపడి దొర్లారు. ఎంతమంది ఎంతగా ఓదార్చినా వాళ్ళ దుఃఖానికి ఉపశమనం కనిపించలేదు. దూడలు చచ్చిన ఆవుల్లాగా ఎంతమంది వారించినా వినకుండా అంతఃపురంలో నుండి బయలుదేరారు. రాక్షసుల్ని వెంటబెట్టుకొని ఉత్తరద్వారం దాటి బయటకు వచ్చి యుద్ధరంగానికి చేరుకొని భర్తకోసం వెతుకుతూ, " 'ఓ రాజపుత్రా!' అని రాముణ్ణి, 'అయ్యో! నాథా' అని భర్తను కేకలుపెడ్తూ, నెత్తురు బురదలో పడి ఉన్న రాక్షసుల శవాలన్నింటిని చూసుకుంటూ నలువైపులా వెతికారు. మహాగజం చచ్చిపోతే విలపించే ఆడఏనుగుల్లాగా, అదుపు తప్పిన దుఃఖంలో విలపించారు.

ఆ యుద్ధభూమిలో నల్లగా కాటుకకొండలాగా దుమ్ములో పడిఉన్న ఆ మహాపరాక్రమవంతుణ్ణి, మహాకాంతివంతుణ్ణి ఆ రావణుని స్త్రీలంతా చూశారు. అక్కడ నరికేసిన లతల్లాగా, వాళ్ళంతా రావణాసురుడి శరీరంపై పడిపోయారు. ప్రేమాతిశయంతో ఒక స్త్రీ ఆతణ్ణి కౌగలించుకొని ఏడ్చింది. మరొకతె పాదాల్ని, ఇంకొక స్త్రీ కంఠాన్ని, మరొక స్త్రీ భుజాన్ని, ఇంకొకామె ముఖాన్ని పట్టుకొని విలపిస్తూ మూర్ఛపోయారు. వారిలో ఒక స్త్రీ అతడి తలను ఒడిలో పెట్టుకొని, మంచు బిందువులు పద్మాన్ని తడిపినట్లుగా, కన్నీళ్ళతో ఆతడి ముఖాన్ని కడిగింది. ఆ స్త్రీలంతా నేలపై పడి ఉన్న తమ భర్తను చూసి దుఃఖంతో అనేక రీతులుగా విలపిస్తూ ఇలా అన్నారు.

"నాథా! నువ్వంటే దేవేంద్రుడు, యముడు కూడా భయపడేవారు. కుబేరుణ్ణి జయించావు; అతడి పుష్పకవిమానాన్ని తీసుకొచ్చావు. మహాపరాక్రమవంతులైన దేవతల్ని, గంధర్వుల్నీ ఇంకా ఎంతో మందిని గడగడలాడించావు. అటువంటి నీవు ఈనాడు

యుద్ధరంగంలో చచ్చిపడి ఉన్నావే! దేవతల వల్లగానీ, అసురుల వల్ల గానీ, పన్నగుల వల్లగానీ భయం లేకుండా బ్రతికినవాడివే! ఈ రోజు ఒక సామాన్య మానవుడిచేతిలో చచ్చిపడున్నావా? ఇంతటి దురవస్థ నీకెలా సంభవించింది?

దేవదానవ రాక్షసుల లెవరూ నిన్ను జయించలేకపోయారే! అటువంటిది బలహీనుడైన ఒక సామాన్య వ్యక్తిని చంపినట్లుగా ఆ మానవమాత్రుడు చంపి పడేశాడే!" అంటూ ఆ రావణుని స్త్రీ లంతా దుఃఖాన్ని ఆపుకోలేక మాటిమాటికీ, తలచుకొని ఏడ్చారు. "నాథా! నీ హితం కోరేవారూ, నీ స్నేహితులు అయినవాళ్ళ మాటల్ని నీవు ఎన్నడూ లెక్కచెయ్యలేదు. ఆ సీతను తీసుకొచ్చి నీ చావును కొనితెచ్చుకున్నావు. రాక్షసులందర్నీ చంపావు. నీ కుమారులకు కూడా కీడు తెచ్చిపెట్టావు. నీ తమ్ముడు, విభీషణుడు నీ మేలుకోరి ఎన్నో మంచిమాటలు చెప్పాడు. నీవు అతడి మాటలు వినకపోగా, అతణ్ణి దూషించి పంపావు. అతడు చెప్పినట్లుగా ఆ జనకపుత్రికను రాముడికిచ్చి స్నేహం చేసుకుంటే ఇంత గొప్ప ఆపద వచ్చేదికాదు గదా? నువ్వు విభీషణుడి మాట విని ఉంటే రాముడు మనకు మిత్రుడయ్యేవాడు. మాకు వైధవ్యం తప్పేది. నీ శత్రువులైన దేవతలు, మొదలైన వాళ్ళ కోరిక తీరి ఉండేది కాదు. నీవు సీతను అపహరించి తెచ్చావు. దాంతో నువ్వూ, మేము, ఈ రాక్షస వంశం ఈ మూడు ఒకేసారి నాశనం అయ్యేట్లు చేశావు. ఓ రాక్షసరాజా! నెపం అంతా నీ మీదే వెయ్యడం కూడా ధర్మం కాదు. ఎట్లాగంటావా? ప్రతి పనినీ ఆ దైవమే చేయిస్తూ ఉంటుంది. దైవానుకూలం లేనిదల్లా నశించిపోతూ ఉంటుంది. గదా! ఓ మహాబాహూ! యుద్ధంలో వానరులు, రాక్షసులు, నీవు, చావటం అనేది దైవసంకల్పమే కాని, మరొకటి కాదు. ఫలాల్నిచ్చే దైవవిధిని, ధనంచేతగాని, కోరికల చేతగాని, పరాక్రమం చేతగానీ, ఆజ్ఞలచేతగానీ తప్పించుకోవటం ఎవరి తరమూ కాదు.

ఆ రాక్షసరాజు భార్యలు దుఃఖంతో బాధపడుతూ కన్నీరు మున్నీరుగా ఏడ్చారు.

# 110వ సర్గ మండోదరి విలపించటం

రావణాసురుడి స్త్రీలంతా ఆ విధంగా విలపిస్తూ ఉండగా, రావణాసురుడి జ్యేష్ఠభార్య, పట్టమహిషి అయిన మండోదరి భర్త చనిపోయి నేలపై పడి ఉండటం చూసింది. ఊహించటానికే వీలుపడనటువంటి పనులుచేయడంలో శ్రేష్ఠుడైన రాముడి చేత చంపబడిన ఆ దశకంఠుణ్ణి ఆమె చూసింది. పట్టరాని దుఃఖంతో ఇలా విలపించింది. “ఓ మహాబాహూ! నీవు కుబేరుడి తమ్ముడవు. నీవు కన్నెర్ర చేస్తే, దేవేంద్రుడు కూడా నీ ఎదుట నిలవలేడు గదా! నీ పేరు విన్నంతమాత్రానే మహర్షులు, దేవతలు, గంధర్వులు, చారణులు కూడా దిక్కులు తెలియక పరుగులు తీసేవారే! అటువంటి రాక్షసరాజువైన నీవు, ఒక సామాన్య మానవమాత్రుడి చేతిలో చంపబడ్డావా? ఎంత సిగ్గుపడవలసిన విషయం? ఏమిటీ వింత? ముల్లోకాలను ఆక్రమించి, ముల్లోకాల సంపదల్నీ అనుభవిస్తున్న నీ వెక్కడ? అడవుల్లో తిరిగే సామాన్య మానవమాత్రుడైన ఆ రాముడెక్కడ? అటువంటి సాధారణ మానవమాత్రుడు నిన్ను ఎట్లా చంపాడు? నాథా! నీవు స్వేచ్ఛారూపాల్ని ధరించే శక్తిగలవాడవు. నీవు ఉండే ప్రదేశాల్లోకి సామాన్య మానవులెవ్వరూ కూడా ప్రవేశించలేరే! అటువంటి నిన్ను ఒక సామాన్య మానవమాత్రుడు సంహరించటమా? ఓ ప్రభూ! చతురంగ బలాలతో కూడుకున్నవాడివి, అస్త్రశస్త్రాలే కాకుండా, అనేకమైన ఆయుధ సామగ్రితో పరిపూర్ణుడవైన నిన్ను ఆ రాముడు ఎదిరించాడంటే నమ్మలేకపోతున్నాను. నీ అంతటివాడైన నీ తమ్ముడు ఖరుణ్ణి జనస్థానంలో ఒక్కడే చంపాడంటే, ఆ రాముడు సామాన్య మానవుడు కాడు. ఓ రాజా! దేవతలు కూడా ప్రవేశించలేని లంకాపట్టణంలోకి ఆనాడు హనుమంతుడు ప్రవేశించిన నాడే మేమెంతో ఆశ్చర్యపడ్డాం. నాథా! ఏనాడైతే వానరులు సముద్రంపై వారధి కట్టారో, ఆనాడే రాముడు సామాన్య మానవుడు కాడేమోననే అనుమానం కలిగింది. లేదా, నిన్ను మోసం చేసి చంపటానికి ఆ యముడే రాముడనే మాయావేషం వేసుకొచ్చాడేమో? లేదా, దేవేంద్రుడే ఈ రాముడని అనుకుందామా? అంటే, ఆ దేవేంద్రుడికి యుద్ధంలో నీ ముందు నిలబడే ధైర్యం ఎక్కడుంది? కాబట్టి ఈ రాముడు దేవేంద్రుడు కాడు.

కాబట్టి ఈ రాముడు ఆది, మధ్య, అంతము లేనివాడు, బ్రహ్మాది దేవతల కంటే గొప్పవాడు, జ్ఞానశీలుడు, చరాచర జీవులన్నింటినీ పోషించేవాడు, శంఖచక్ర గదాదులను ధరించేవాడు, శ్రీవత్సమనే పుట్టుమచ్చ వక్షఃస్థలంపై ఉన్నవాడు, ఎల్లప్పుడూ లక్ష్మీదేవితో కలసి ఉండేవాడూ, అజేయుడు, శాశ్వతమైనవాడు, స్థిరమైనవాడూ అయిన ఆ పరమాత్మ, లోకాలకు ప్రభువు, శ్రీమంతుడు, గొప్పకాంతి గలవాడు అయిన విష్ణువు. లోకముల హితంకొరకు వానరరూపాలు ధరించిన దేవతలతో కలసి, రాక్షస రాజువైన నిన్ను, నీ పరివారాన్ని, బంధువుల్ని, చంపి ఉంటాడు.

నాథా! నీవు పూర్వం ఇంద్రియాల్ని జయించి గొప్ప తపస్సు చేసి ములోకాల్నీ జయించావు. ఆ ఇంద్రియాలే నీపై పగపట్టినయ్యా? అన్నట్లుగా ఇప్పుడు నిన్ను జయించాయి. నీ మిత్రులు హితం కోరే బంధువులతోపాటు, రాముడితో స్నేహం చేసుకోమని చెప్పాను. నీవు నా మాటకూడా లెక్కచెయ్యలేదు. దాని ఫలితం ఇప్పుడు అనుభవిస్తున్నావు. ఓ రాక్షసశ్రేష్ఠుడా! నీ ఐశ్వర్యం, నీ దేహం, బంధుజనం నశించటానికే నీకు సీతపై వ్యామోహం పుట్టింది. ఓ దుర్బుద్ధులు గలవాడా! అరుంధతికంటే, రోహిణి కంటే కూడా ఉత్తమురాలు, పరమ పతివ్రత అయిన సీతను అవమానించావు. వినాశాన్ని కొనితెచ్చుకున్నావు. నీకూ, నీవారికీ కూడా వినాశాన్ని తెచ్చిపెట్టావు. సీత అంటే భూమికంటే ఓర్పుగల సాధ్వి. లక్ష్మికే లక్ష్మి వంటిది. భర్తే దైవమని నమ్మింది. ఎట్టి దోషాలు లేని అవయవ నిర్మాణం కలిగింది. సర్వమంగళ ప్రదాయిని. నిర్మానుష్యమైన అరణ్యాల్లో నివసిస్తూ ఉన్న దీనురాలైనటువంటి సీతను దొంగతనంగా భర్తలేని సమయం చూసి అపహరించి తెచ్చావు. ఆమెతో కలసి జీవించాలనే నీ కోరికయే నిన్ను ఈ స్థితికి తెచ్చింది. యథార్థంగా నీవు రామబాణం చేత చావలేదు; సీతాదేవి తపస్సు చేత కాల్చబడ్డావు. ఓ రాక్షసరాజా! నీవు ఏనాడు సీతాదేవిని తాకావో ఆనాడే కాల్చబడకుండా ఉండటానికి కారణం ఏమిటంటే, ఆ పాపానికి ఫలితాన్నిచ్చే ఇంద్రుడు, అగ్ని మొదలైన దేవతలు నువ్వంటే భయపడటమే! పాపకర్మలు చేసినవాడు దాని ఫలాన్ని కాలం వచ్చినప్పుడు అనుభవించాల్సిందే! తప్పించుకోవడం ఎవరికీ సాధ్యం కాదు. ఇది సత్యం. అట్లాగే పుణ్యకర్మలు చేసినవాడు

పుణ్యఫలం పొందుతాడు. విభీషణుడికి మంచి ఫలం లభించింది; అట్లాగే నీ పాపకర్మలకు పాపఫలం లభించింది. సౌందర్యానికే పట్టం కట్టదలచుకొంటే నీ వద్ద సీతకన్నా అధికమైన సౌందర్యవంతులున్నారు. కానీ నీవు కామంచేత మన్మథవశుడవై గుడ్డివాడవయ్యావు; ఆ విషయాన్ని గ్రహించలేకపోయావు. నాథా! కులంచేతగానీ, రూపంచేతగానీ, విద్యచేతగానీ, సీత నాకంటే గొప్పదిగాని, సమానురాలుగానీ కాదు. అజ్ఞానము వలన నీవు తెలుసుకోలేక ఈ గతిని కొనితెచ్చుకున్నావు. ఇన్నిమాట లెందుకు? లోకంలో ఏ ప్రాణికీ ఏదో కారణం లేకుండా మరణం రాదు. నీకు సీత మూలంగా చావు వచ్చింది. అంతే! అయితే ఆ సీత అనే నిమిత్తాన్ని ఎక్కడో దండకారణ్యం నుండి కష్టపడి తెచ్చుకున్నావు. నీ మరణంతో సీత ఇకపై రాముడితో సుఖంగా జీవించగలదు.

ఓ వీరుడా! నీతో కలసి విమానంపై ఎక్కి కైలాసానికి, మందర – మేరు పర్వతాలకు, చైత్రరథమనే ఉద్యానవనాలకు, ఇతర దేవతావనాల యందు విహరించాను. చిత్రవిచిత్రములైన పూలమాలలు, వస్త్రాలు ధరించాను. దేశదేశాలలోని శోభలెన్నో చూశాను. అటువంటి నాకు, నీ మరణంతో ఆ భోగాలన్నీ దూరమైపోయాయి. ఒక సర్వసాధారణ విధవనైపోయాను. ఆహా! రాజుల సంపదలు, వారి కామభోగాలు ఎంత చంచలమైనవి? ఓ రాజా! నా ప్రభూ! నీ కనుబొమలు, ఎత్తైన ముక్కు, చక్కటి చర్మము, సుకుమారమైన నీ ముఖము, కాంతిచేత చంద్రుడి సమానమైనవాడవు; శోభ చేత పద్మంతో సమానమైనవాడవు; తేజస్సు చేత సూర్యుడితో సమానమైనవాడవు; నీ ఎర్రటి నోరు; నీ ప్రకాశించే కుండలాలు, కిరీటం ధరించి ఎంతో అందంగా ఉండేవాడివి. నీవు మద్యం సేవించి మత్తు వలన వ్యాకులము, చంచలము అయిన నేత్రాలతో చిరునవ్వులు చిందిస్తూ, తియ్యగా మాట్లాడేవాడివి. ఆ ముఖము ఈనాడు రాముడి బాణాలచేత ఛేదించబడి రక్తసిక్తమై, మెదడులో నుండి ఉబికి వస్తున్న కొవ్వుతో యుద్ధభూమిలో దుమ్ముకొట్టుకొని నేలపై పడిఉంది. సౌందర్యహీనమై ప్రకాశంలేకుండా పడిఉంది. అయ్యో! స్త్రీకి వైధవ్యమే చివరి దశ. ఈ వైధవ్యాన్ని గూర్చిన ఆలోచనే నాకు ఎన్నడూ కలుగలేదు. ఎందువల్లనంటే, నేనొక దానవరాజు కుమార్తెను; ఒక రాక్షసరాజుకు భార్యను. దేవేంద్రుణ్ణి,

ముల్లోకాలనూ జయించినవాడనే గర్వంతో వైధవ్యం గూర్చి నేను ఎన్నడూ ఆలోచించలేదు. అంతేకాకుండా నా సంరక్షకులందరూ, శత్రువుల గర్వాన్ని అణిచేవారని, శూరులని, బలసంపన్నులని పౌరుషం గలవారని, ఎవరి నుండీ భయం లేనివారనే దృఢమైన నమ్మకాన్ని కలిగి ఉండేదాన్ని. ఓ రాక్షస శ్రేష్ఠులారా! అటువంటి మీకు ఒక సామాన్య మానవమాత్రుడి చేతుల్లో మరణించవలసివచ్చిందే? రాజా! నునుపుగా ఉండే ఇంద్రనీలమణుల వలె నీలవర్ణం గలదీ, ఎత్తైన శిఖరం లాంటిదీ, కేయూర, వైడూర్యాలతోను, అంగదములు, ముత్యాలతో ప్రకాశించేదీ, పుష్పమాలలచే సుగంధాలతో నీ శరీరం గుబాళిస్తూ ఉండేదో, అటువంటి నీ శరీరం, ముళ్ళపంది శరీరంలాగా, బాణాలతో గుచ్చుకొని ఉండటంవల్ల నిన్ను కౌగలించుకొని స్పర్శాసుఖాన్ని పొందలేకుండా ఉన్నాను. రక్తంతో ఎర్రబడ్డ నేలపై పడిఉన్న నీ శరీరం వజ్రాయుధంచే కొట్టబడిన పర్వత శిఖరంలాగా ఉంది. నాథా! ఇదంతా నిజమా? లేక స్వప్నమా? మృత్యువుకే మృత్యువైన నీవు మృత్యువుకు ఎట్లా లొంగిపోయావు? ఇది రాముడికి ఎట్లా సాధ్యపడింది? నీవు లోకపాలకులందర్నీ జయించి, ముల్లోకాలకూ భయం కలిగించి, ముల్లోకాల ఐశ్వర్యాలనూ అనుభవించావు. కైలాసాన్ని ఎత్తి శంకరుణ్ణే కదిలించివేశావు. గర్వించిన వాళ్ళందర్నీ నిగ్రహించావు. నీ పరాక్రమంతో లోకాలన్నింటికీ బాధ కలిగించావు. నీ భయంకరధ్వనులకు భూతాలన్నీ భయపడిపోయేవి. నీ వాళ్ళను, నీ భృత్యుల్ని ఎప్పుడూ రక్షిస్తూ నీ యెడల గర్వం ప్రదర్శించినవారిని వధిస్తూ ఉండేవాడివి. నీవు వేలకొద్దీ దానవవీరుల్ని, యక్షుల్నీ సంహరించావు. యుద్ధాల్లో కవచులనే రాక్షసుల్ని దగ్గరకు తీసేవాడవు. నాథా! నీవు అనేక యజ్ఞయాగాదుల్ని పాడుచేశావు. ధర్మవ్యవస్థను సమూలంగా నాశనం చేస్తానని కంకణం కట్టుకున్నావు. నీ వాళ్ళందర్ని సంరక్షించావు. యుద్ధాల్లో మాయలు సృష్టించడంలో నీకు నీవే సాటి. నాథా! నీవు అనేక దేశాల నుండి దేవ, అసుర, దానవ కన్యల్ని తీసుకొచ్చావు. శత్రువు స్త్రీలకు శోకాన్ని మిగులుస్తూ ఉండేవాడివి. నీ వాళ్ళను మాత్రం ప్రాణప్రదంగా కాపాడుతూ ఉండేవాడివి. నా భర్త లంకా ద్వీపానికి రక్షకుడు. భయంకరమైన పనులు చేస్తూ ముల్లోకాల్లోనూ ప్రసిద్ధి చెందావు. అయినా మాకు సమస్త కామభోగాలను సమకూర్చి పెట్టినవాడవు. నీవు రథికులలో శ్రేష్ఠుడవు. ఇటువంటి నా భర్తను రాముడు నేలకూల్చినా కూడా ఇంకా నేను జీవించి

ఉన్నాను అని అంటే, నా కంటే మొండిది లోకంలో ఎక్కడైనా ఉంటుందా?

ఓ రాక్షసరాజా! అమూల్యములైన శయనముల మీద నిద్రించే నీవు, ఈనాడు దుమ్ము ధూళితో కూడిన ఈ కటికనేలపై ఎందుకు నిద్రిస్తున్నావు? నాథా! మన కుమారుడు ఇంద్రజిత్తును లక్ష్మణుడు హతమార్చినప్పుడే నా నవనాడులూ క్రుంగిపోయాయి. ఇప్పుడిక జీవచ్ఛవంగా మిగిలిపోయాను. నువ్వా నన్ను విడిచివెళ్ళిపోయావు. బంధువులంతా యుద్ధంలో చచ్చిపోయారు. ఇక నేను ఒకర్తెనూ కామభోగాలు లేకుండా దుఃఖంతో అనేక సంవత్సరాలు జీవించాలా? నాథా! నాకు ఇక జీవించాలని లేదు. దుఃఖంచేత పీడించబడుతున్న నన్ను కూడా నీతో తీసుకొని వెళ్ళు. నీవు లేకుండా నేను ఉండలేను. ఓ నాథా! నేను దీనురాలనై నీకోసం విలపిస్తున్నాను. మందబుద్ధి గలదానను. నన్ను ఒంటరిదాన్ని చేసి ఎందుకు వెళ్ళిపోయావు. ఇంతగా విలపిస్తున్న నాతో ఎందుకు మాట్లాడవు? నాథా! నేను మేలిముసుగు లేకుండా నగరప్రాకారం దాటి కాలినడకన వచ్చానని అలిగావా? కోపంవచ్చిందా? నాథా! నీకు భార్యలపైన ప్రేమ అధికమని నాకు తెలుసు. నీ భార్యలందరూ లజ్జ అనే మేలి ముసుగును జారవిడిచి నీ దగ్గరకు వచ్చారు గదా? మరి వాళ్ళందరి మీదా ఎందుకు అలగటం లేదు? నాథా! నీకు కామక్రీడలన్నింటిలోనూ చేదోడువాదోడుగా ఉండే నీ స్త్రీలంతా నీకోసం విలపిస్తున్నారే? వాళ్ళను ఎందుకు ఓదార్చవు? వాళ్ళందరిపైనా అభిమానం లేదా? మోజు తీరిపోయిందా? రాజా! పతివ్రతలు, ధర్మాత్ములు, సదా పెద్దలను సేవించేవారూ అయిన అనేకమంది కులస్త్రీలను, నీ క్రూరకర్మలచేత, భర్తలు లేనివాళ్ళుగా చేశావే? దుఃఖంతో పరితపించే ఆ పతివ్రతలంతా శపించటం వల్లనే నీవు ఓడిపోయావు. ఆ భర్తృవియోగం కలిగిన స్త్రీల శాపమే ఇప్పుడు నీకు తగిలింది; మమ్మల్ని విధవల్ని చేసింది. నాథా! పతివ్రతల కళ్ళ నుండి కారిన ఒక్కొక్క కన్నీటిబొట్టు ఒక్కొక్క అస్త్రమై నీకు తాకాయి. పతివ్రతల కన్నీళ్ళు వృథా కావన్న లోకోక్తి నీ విషయంలో సత్యమే అయింది సుమా! రాజా! నీ తేజస్సుచేత ముల్లోకాలను ఆక్రమించుకున్న శూరుడవుగదా! ఇటువంటి వాడవు నీచాతినీచమైన ఈ స్త్రీ చౌర్యాన్ని ఎట్లా చేశావు? నీ మాయచేత మాయామృగాన్ని సృష్టించి రాముణ్ణి ఆశ్రమం నుండి దూరంగా పోయేట్లు చేసి అతడి భార్యను అపహరించుకొని

వచ్చావే? అది పిరికివాళ్ళు చేసేపని అని నీకు అనిపించలేదా? నీవు ఎన్నడూ యుద్ధంలో భయపడినట్లు నాకు జ్ఞాపకం లేదు. మా అందరి దురదృష్టం చేత చేసిన ఈ సీతాపహరణం వల్ల నీ పాపం పండింది! నాథా! నీ తమ్ముడు, నా మరిది అయిన విభీషణుడు గడచిన విషయాల్ని, రాబోవు విషయాల్ని చక్కగా ఎరిగి, వర్తమాన కార్యములు చేయడంలో నేర్పరి; సత్యవ్రతుడు. నీవు సీతను అపహరించి తేవడంవల్ల, అతడు ఇలా చెప్పాడు. 'నీ కామక్రోధ వ్యసనాల వల్ల రాక్షసవీరులందరూ నాశనమైపోతారు. కూకటివేళ్ళతో సహా నాశనం అయిపోతారు' అని చెప్పాడు. అతడు చెప్పినట్లుగానే ఈ అనర్థం జరిగింది. నీ వల్లనే రాక్షసవంశం అంతా దిక్కులేకుండా పోయింది. అయితేనేం? నీవు బలానికి, పౌరుషానికి పెట్టిందిపేరు. యుద్ధంలో చచ్చిపోయావు. నీ కోసం నేను దుఃఖపడకూడదు. అయితే నేనూ ఆడదాన్నే కావటం వలన, మనస్సు నిలవక ఏడుస్తూ ఉన్నాను. నాథా! నీ పాపపుణ్యాలు తీసుకొని నీ దారిన నీవు పోయావు. నీవు చనిపోవటం వల్ల నేను దుఃఖసముద్రంలో ఒంటరిగా మిగిలిపోయాను. నీ ఎడబాటును సహించలేకపోతున్నాను. అందువల్లనే నన్ను గురించే దుఃఖపడుతున్నాను.

ఓ పుణ్యాత్ముడా! నీ మేలుకోరి నీ మిత్రులు చెప్పిన మాటలేవీ వినలేదు. నీ తమ్ముడు విభీషణుడు కూడా అనేక విధాలుగా శాస్త్రయుక్తంగాను, అర్థవంతమైనవీ, నీకు శ్రేయస్సును సమకూర్చేవీ ఎంతో మృదువుగా చెప్పాడు. నీవు వినలేదు. నీవు విభీషణుడి మాటలే కాదు, మారీచుడి మాటలు కూడా లెక్కచెయ్యలేదు. పోనీ కుంభకర్ణుడి మాటలైనా విన్నావా? అతడి మాటలూ పెడచెవిన పెట్టావు. నా తండ్రి కూడా వచ్చి ఎన్నోవిధాల నీకు చెప్పిచూశాడు. నీ పరాక్రమ మదంచేత ఎవరి మాటలూ లెక్కచెయ్యలేదు. ఇప్పుడు ఇటువంటి గతిపట్టింది. ఓ నీలమేఘవర్ణుడా! పసుపువస్త్రాలతో, బంగారు బాహువులతో, నెత్తురులో తడిసి నేలమీద కాళ్ళూచేతులూ బార్లా చాపుకొని నిద్రపోతున్నావా? అన్నట్లు పడుకున్నావు. ఇంతసేపటి నుండీ నీ కోసం పరితపిస్తున్నానే! నాతో ఒక్కమాటైనా మాట్లాడవేం? ప్రభూ! నేను దుఃఖంతో నీ కోసం విలపిస్తూ ఉంటే, నాతో ఒక్కమాటైనా మాట్లాడవేమి? గొప్ప పరాక్రమం గలవాడు, యుద్ధంలో ఎన్నడూ వెనుకంజవేయనివాడు, అయిన మాల్యవంతుని దౌహిత్రుడా! నాకు బదులు చెప్పవేమి?

ఇప్పుడు నీకు ఇంతపెద్ద పరాభవం జరిగినా కూడా నీవు ఎట్లా నిశ్చింతగా నిద్రపోతున్నావు? ఇంతకాలం లంకలోకి సూర్యకిరణాలు భయంభయంగా ప్రవేశించాయి. ఇప్పుడు సూర్యకిరణాలు నిర్భయంగా లంకలోకి ప్రవేశిస్తున్నాయి. సూర్యకాంతులతో తేజరిల్లే నీ పరిఘాయుధాన్ని రామబాణం ముక్కలుముక్కలు చేసిందే! నీవు ప్రియురాలిని కౌగలించుకొని పదుకున్నట్లుగా ఈ కటికనేలను కౌగలించుకొని పడుకున్నావేమి? ఓ రాజా నీవు మరణించావని తెలిసికూడా నా గుండె ముక్కలైపోలేదు. ఛీఛీ!" అంటూ విలపించింది.

మండోదరి ఈ విధంగా విలపిస్తూ ఉండగా కన్నీళ్ళ చేత చూపు మందగించింది. హృదయం పగిలేట్లు విలపించడం చేత కొంతసేపు మూర్ఛపోయింది. దుఃఖంతో ఆ మండోదరి రావణాసురుడి వక్షఃస్థలంపై పడి ఉంది. నెత్తురుతో కూడి దుమ్ముధూళీ అంటుకుని ఉదయకాంతుల్లో నీలమేఘంలాగా ప్రకాశించింది. అప్పుడు ఆమె సవతులు లేవదీసి కూర్చోబెట్టి "ఓ దేవీ! ప్రాణులన్నింటికీ బాల్యం, కౌమారం, యౌవనం, వార్ధక్యాలవల్ల మార్పులు సహజం. అట్లాగే రాజుల వైభవానికి కూడా స్థిరత్వం ఉండదు. ఈ విషయం నీకు తెలియందికాదు. అందుచేత దుఃఖించకు" అంటూ ఊరడించారు. వాళ్ళట్లా ఓదారుస్తున్న కొద్దీ ఆమెలో దుఃఖం మరీ పెల్లుబికి వచ్చింది. కన్నీటిధారలతో కాలవలు కట్టి ఆమె ఎత్తైన స్తనాలన్నీ తడిసిపోయాయి.

అంతట రాముడు కూడా విభీషణుణ్ణి ఓదారుస్తూ ఇలా అన్నాడు. "ఓ మిత్రుడా! ఊరడిల్లు. లేచి నీ సోదరుడికి దహనసంస్కారాలు జరిపించు. ఈ స్త్రీలందరినీ ఊరడించి ఇళ్ళకు పంపు" అని చెప్పాడు. అప్పుడు ధర్మజ్ఞుడు, బుద్ధిమంతుడు అయిన విభీషణుడు రాముడు చెప్పిందే సబబుగా ఉందని అనుకున్నాడు. రాముడితో ఇలా అన్నాడు. "రామా! ఈ రావణుడు అధర్మపరుడు. ధర్మం తప్పి ప్రవర్తించాడు. వ్రతానుష్ఠానాలన్నీ వదిలేశాడు. ఇతడు క్రూరుడు; అసత్యవాది; ఘాతకుడు. పరులభార్యలను తాకేవాడు. కాబట్టి ఇటువంటి అయోగ్యుడికి సంస్కారాలు చేయడానికి నేను తగినవాడిని కాను. నాకంటే పెద్దవాడే అయినా, ప్రజాకంటకుడుగా ఉండేవాడు. అందువల్ల పూజకు తగడు. ఈతడు నాకు సోదరుడే అయినా,

స్వభావాల చేత శత్రువు. నేను ఇతడికి దహనసంస్కారాలు చెయ్యలేదని మొదట్లో లోకులు నిందించినా ఇతడి స్వరూప స్వభావాలు తెలుసుకున్న పిదప నేను మంచిపనే చేశానని మెచ్చుకుంటారు" అన్నాడు.

విభీషణుడు చెప్పినదంతా విని, రాముడు తిరిగి ఇలా అన్నాడు: "ఓ విభీషణా! నీవు రాక్షస రాజువు. నీ సహాయం వల్లనే నేనీ యుద్ధం జయించాను. కాబట్టి, నేను నీకు ఏది మేలో తప్పక చెప్పాలి. నా మాట విని నన్ను సంతోషపెట్టు. ఈ నిశాచరుడు అధర్మంగా ప్రవర్తించి ఉండవచ్చు. అసత్యాలే పలికి ఉండవచ్చు. అయినా ఇతడు మహాబలవంతుడు; తేజశ్శాలి; శూరుడు; మహాత్ముడు. లోకాల్ని ఏడిపించినా కూడా, దేవేంద్రుడు మొదలైన వాళ్ళెవరూ ఇతణ్ణి జయించలేక పోయారు. అయినా, ధర్మానుసారంగా నీవు ఇతడికి యథాశాస్త్రంగా సంస్కారాలు చెయ్యాలి. అందువల్ల నీకు కీర్తి లభిస్తుంది."

అంతట విభీషణుడు, రాముడు చెప్పినట్లుగానే అన్నగారికి దహనాది సంస్కారాలు చెయ్యటానికి సంసిద్ధుడయ్యాడు. వట్టివేళ్ళూను, పద్మకం అనే సుగంధ ద్రవ్యాలనూ వేసి చందనపు కట్టెలతో వేదోక్తంగా చితిపేర్పించాడు. ఆ చితిపైన తెల్లజింకచర్మాన్ని పరిచారు. వేదోక్తంగా ఆ రాక్షసేంద్రుడికి అంత్యేష్ఠ, పితృమేధ మున్నగు సంస్కారాలు జరిపించాడు. ముందుగా చితికి ఆగ్నేయభాగాన అగ్నివేదిని ఏర్పాటు చేశారు. పడమటిదిక్కున గర్హపత్యాగ్నినీ, తూర్పుదిక్కున ఆహవనీయాగ్నినీ, దక్షిణదిక్కున దక్షిణాగ్నినీ స్థాపించారు. బంగారుపాత్రలతో పెరుగుతో కలిపిన నెయ్యిని పోసి అగ్నిహోత్రాన్ని చేశారు. అప్పుడు రావణాసురుడి పాదాల మధ్య సోమలతను తెచ్చే బండినీ తొడల నడుమ యజ్ఞాలకు వాడే ధాన్యాన్ని దంచుకునే రోటినీ రోకలినీ, ఇంకా ఆయాస్థానాలలో దారు పాత్రలను, స్థాలినీ, ఆరనికట్టెల్ని, ఉత్తరేణి కట్టెల్నీ శాస్త్రంలో చెప్పినట్లుగాను, స్మృతులలో చెప్పినట్లు గాను, క్రమంతప్పకుండా విధులన్నీ నిర్వర్తించాడు. ఆ చితికి సమీపంలోనే పవిత్రమైన యజ్ఞపశువును (మేకను) చంపి అగ్నిహోత్రంలో వేశారు. అటుపిమ్మట నేతితో తడిపిన దర్భలు రావణుడికి అన్ని వైపులా

పరిచారు. గంధంతోను, పూలదండలతోను, వివిధములైన వస్త్రాలతోను, రావణాసురుడి మృతదేహాన్ని అలంకరించారు. పిమ్మట బ్రహ్మరాక్షసులు (రాక్షసపురోహితులు) అంతా కన్నీరుకారుస్తూ దీనంగా చితిమీద పేలాలు జల్లారు. అంతట విభీషణుడు మంత్రయుక్తంగా ఆ రావణాసురుడి చితికి నిప్పు అంటించాడు.

అటుపిమ్మట విభీషణుడు స్నానం చేసి, తడిబట్టల్తో దర్భలు, గరికలతో కూడిన తిలోదకాల్ని నేలపై విడిచాడు. ప్రేతను ఆవాహనం చేసి రావణాసురుడి కోసం ఉదకదానాన్ని ఇస్తూ. శిరస్సు వంచి నమస్కారం చేశాడు. రావణుని భార్యలందరినీ ఓదార్చి వారందరినీ లంకాపట్టణంలోకి పంపించి, తాను రాముడి వద్దకు పోయి వినయంగా నిలబడ్డాడు.

అప్పుడు రాముడు వృత్రాసురుణ్ణి సంహారం చేసిన దేవేంద్రుడివలె, శత్రుసంహారం చేసిన రాముడు సుగ్రీవ, లక్ష్మణ సహితంగా వానర సైన్యాల మధ్య సంతోషంతో తేజరిల్లాడు. శత్రుసంహారకుడైన రాముడు ధనుర్బాణాలను, దేవేంద్రుడిచ్చిన కవచాన్ని విడిచి శత్రుసంహారం అయిపోవటం వలన కోపాన్ని కూడా విడిచి, తన సహజస్వభావం అయిన సౌమ్యతను స్వీకరించాడు.

# 111వ సర్గ విభీషణుని రాజ్యాభిషేకం

యుద్ధం చూడటానికి వచ్చిన దేవతలు, గంధర్వులు, దానవులు, భయంకరమైన ఆ రామరావణ యుద్ధాన్ని కన్నులారా తిలకించి పులకితులయ్యారు. రాముడి పరాక్రమం, వానరవీరులు చేసిన మహాయుద్ధం, సుగ్రీవుడి మంత్రాంగం, లక్ష్మణుడి అనురాగం, గూర్చి కథలుకథలుగా చెప్పుకున్నారు. రామలక్ష్మణుల్ని కన్న కౌసల్యా, సుమిత్రలను తలచుకొని వారి జన్మలు ధన్యమయ్యాయని అనుకున్నారు. ఆ విధంగా ఒకళ్లకొకళ్ళు చెప్పుకుని విమానాలెక్కి తమతమ నివాసాలకు వెళ్ళిపోయారు.

అంతట మహాత్ముడైన రాముడు దేవేంద్రుడి సారథి అయిన మాతలిని సత్కరించి సన్మానించాడు. అగ్నిహోత్రుడిలా వెలిగిపోతున్న ఆ దివ్యరథాన్ని తిరిగి తీసుకొనివెళ్ళటానికి అనుమతించాడు. అంతట ఆ మాతలి ఆ దివ్యరథాన్ని తీసుకుని దేవలోకానికి వెళ్ళిపోయాడు. మాతలి వెళ్ళగానే సుగ్రీవుణ్ణి పరమానందంతో కౌగలించుకొని గౌరవించాడు. అంతట రామలక్ష్మణులు వానరుల పూజలు అందుకుని తమ శిబిరాలకు వెళ్ళిపోయారు.

రాముడు తన శిబిరంలో కూర్చుని, లక్ష్మణుడితో, “సోదరా! ఈ విభీషణుడు మనకు మిత్రుడు. నాకు పరమభక్తుడు. మనకు యుద్ధంలో మహోపకారం చేశాడు. మనం అతడికి వాగ్దానం చేసినట్లుగా, అతణ్ణి రాజ్యాభిషిక్తుణ్ణి చెయ్యాలి. కాబట్టి నీవు లంకాపట్టణానికి వెళ్ళి ఇతడి రాజ్యాభిషిక్తుణ్ణి చేసిరా” అని అన్నాడు. అన్నగారి మాటలను శిరసావహించిన లక్ష్మణుడు, విభీషణుణ్ణి వెంటబెట్టుకొని లంకాపట్టణానికి వెళ్ళాడు. మహాబలవంతులు, మహావేగంతో వెళ్ళేవారూ అయిన వానర యోధులకు బంగారుపాత్రల నిచ్చి సప్తసముద్రజలాలను తెమ్మని ఆదేశించాడు. ఆ వానరశ్రేష్ఠులంతా అప్పటికప్పుడే, వాయువేగంతో వెళ్ళి సప్తసముద్రాల నుండి జలాల్ని తెచ్చారు. అంతట లక్ష్మణుడు, విభీషణుణ్ణి సింహాసనంపై కూర్చోబెట్టాడు. ఆ రాజసభ, విభీషణుడి మిత్రులు, రాక్షసప్రముఖులు, విభీషణుడి మంత్రులు, లంకాపట్టణంలోని పౌరులతో

కిటకిటలాడిపోయింది. అప్పుడు ఆ పెద్దలంతా అక్షతలు, పేలాలు, మోదకాలు, పుష్పాలు, సుగంధ ద్రవ్యాలు విభీషణుడికి సమర్పించారు. రాముడు చేసిన ప్రతిజ్ఞ మేరకు, రామానుగ్రహం చేత విభీషణుడు ఆ క్షణానే లంకకు రాజు అయ్యాడు. అప్పుడు విభీషణుడు ప్రజలందరికీ మంచిమాటలతో సందేశాన్ని వినిపించి అందర్నీ సంతోషపెట్టాడు. పట్టాభిషేకం కాగానే విభీషణుడు మళ్ళీ రాముడి దగ్గరకు వెళ్ళాడు. రాక్షసప్రముఖులు తనకు సమర్పించుకున్న మంగళద్రవ్యాలన్నీ రామలక్ష్మణులకు సమర్పించాడు. రామలక్ష్మణులు కూడా వాటిని సంతోషంతో స్వీకరించారు. విభీషణుడు, కృతార్థుడు, పరిపూర్ణ మనోరథుడు అయ్యాడు.

అంతట రాముడు అక్కడే చేతులు జోడించి నిలబడ్డ హనుమంతుడితో ఇలా అన్నాడు. "ఓ మారుతీ! (విభీషణుని చూపిస్తూ) లంకాధిపతి అయిన ఈ విభీషణుని అనుమతి పొంది, లంకాపట్టణానికి పొమ్ము. అక్కడ అశోకవనంలో ఉంటున్న సీతాదేవిని కలుసుకో. ఆమెకు నా విజయాన్ని గూర్చి చెప్పు. నేనూ, నా తమ్ముడు లక్ష్మణుడు కులాసాగా ఉన్నామని చెప్పి ఆమెను సంతోషపెట్టు. ఓ హనుమంతుడా! నేను రావణసంహారం చేశానని చెప్పు. ఇంకా ఆ మైథిలి సంతోషించే విషయాలన్నీ చెప్పు. ఆమె ఏమీ చెప్తుందో తెలుసుకొని వచ్చి నాకు చెప్పు."

# 112వ సర్గ సీత హనుమంతుడి ద్వారా సందేశం పంపటం

రామాజ్ఞను శిరసావహించిన హనుమంతుడు, రాక్షసులు స్వాగతం పలుకుతూ ఉండగా లంకానగరంలో ప్రవేశించాడు. అంతట నియమం ప్రకారం విభీషణుని అనుజ్ఞ తీసుకొని సీతాదేవిని కలిసేందుకు అశోకవనానికి వెళ్ళాడు. అక్కడ సీతాదేవి రాక్షసాంగనల మధ్య గ్రహబాధ అనుభవిస్తున్న రోహిణిదేవి వలె స్నానాదిసంస్కారాలు లేకుండా శుష్కించిపోయి పూర్వం తను చూసినప్పుడు ఎట్లా ఉందో ఇప్పుడూ అట్లాగే ఉంది. చూడగానే ఆమె హనుమంతుణ్ణి గుర్తుపట్టలేదు. కొద్ది క్షణాలైన తర్వాత హనుమంతుణ్ణి గుర్తుపట్టింది. ప్రాణం లేచివచ్చినంత సంతోషపడింది. వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు రామసందేశాన్ని సీతాదేవితో ఇలా చెప్పాడు:

"ఓ సీతాదేవీ! సుగ్రీవుడు, లక్ష్మణుడు, విభీషణుడు మరి ఇతర వానర ప్రముఖులతో కలసి రాముడు క్షేమంగా ఉన్నాడు. శత్రుసంహారకుడైన రాముడు శత్రువును నిశ్శేషంగా సంహరించాడు. వానరసైన్యాలన్నీ వీరోచితంగా పోరాడాయి. విభీషణుడు సహాయం చేశాడు. లక్ష్మణుడు రాజనీతిని, పరాక్రమాన్ని ప్రదర్శించాడు. రావణాసురుణ్ణి రాముడే సంహరించాడు. నీ క్షేమం తెలుసుకొని రమ్మన్నాడు. నీతో తన మాటలుగా రాముడు ఇలా చెప్పమన్నాడు.

'ఓ దేవీ! నీకీ సంతోషవార్తను చెప్పి ఇంకా ఎక్కువ సంతోషపెడ్తున్నాను. నీవు పాతివ్రత్య ధర్మాలన్నీ చక్కగా తెలిసినదానవు. నా అదృష్టంచేత నీవు ఇంకా జీవించి ఉన్నావు. ఓ సీతా! నేను యుద్ధంలో గెలిచాను; నీవు ఇంతవరకూ పడుతున్న వ్యధకంతకూ తెరపడింది. మన శత్రువు రావణాసురుడు చచ్చిపోయాడు. దేవీ! నేను నిద్రాహారాలు లేకుండా నిన్ను శత్రువు చేతిలో నుండి విడిపించేందుకు ఎంతో కృషిచేశాను. నీవు దుఃఖాన్ని విడిచిపెట్టు; స్వస్థురాలవు కమ్ము. ఈ రావణుడితో యుద్ధం చెయ్యడానికి, మహాసముద్రంపై సేతువు నిర్మించాను. నేను రావణాసురుణ్ణి చంపేస్తానని చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చాను. ఇకపై నీవు లంకాపట్టణంలో ఉన్నా భయపడవద్దు.

ఇప్పుడు ఈ లంక అంతా, నా మిత్రుడైన విభీషణుడి అధీనంలో ఉంచాను. కాబట్టి నీవు స్వగృహంలో ఉన్నట్లుగానే భావించు. విభీషణుణ్ణి లంకకు రాజును చేశాను. ఆ సంతోషంతోను, ఉత్సాహంతోను నీ దర్శనానికై వస్తాను' అని రాముడి మాటలుగా చెప్పాడు."

చంద్రబింబము వంటి ముఖం గల సీతాదేవి రామసందేశం విన్నది. ఆ ఆనందంలో ఆమెకు కాలుచెయ్యీ ఆడలేదు. నోటమాట రాలేదు. నిశ్చేష్టురాలు అయిపోయింది. అట్లా మాటాపలుకూ లేకుండా నిశ్చేష్టురాలైన సీతాదేవిని చూస్తూ హనుమంతుడు "అమ్మా! సీతాదేవీ! ఏమి ఆలోచిస్తున్నావు? నాతో ఎందుకు మాట్లాడటం లేదు?" అని అడిగాడు. అందుకు సీతాదేవి కన్నుల నిండుగా నీరు నింపుకొని గద్గదస్వరంతో ఇలా అంది. "నా భర్తకు సంబంధించిన విజయాన్ని వింటూ ఉంటే సంతోషంతో నాకు మాటలు రావడంలేదు. కాలూచెయ్యీ పని చెయ్యడం లేదు. ఓ హనుమంతుడా! నాకు ఇంత ప్రియమైనవార్త చెప్పి నన్ను పరమానందభరితురాల్ని చేశావు. ఇంత సంతోషవార్త చెప్పిన నీకు ఇవ్వదగిన వస్తువు ఈ భూలోకంలో ఏదీ నాకు కనబడటం లేదు. వెండిగాని, బంగారం గాని, రత్నరాసులుగాని, ముల్లోకాధిపత్యం కట్టబెట్టినా, నీ మాటలకు సాటిరావు." ఆమె అన్న మాటలకు హనుమంతుడు అంజలి ఘటించి సంతోషంతో ఇలా అన్నాడు. "అమ్మా! నీవు భర్తయొక్క ప్రియాన్ని, హితాన్ని కోరేదానవు. భర్త విజయాన్నే కోరుకునేదానవు. ఎట్టి దోషములూ లేని ఓ సీతాదేవీ! నా మీద నీకున్న వాత్సల్యం కొద్దీ ఇలా అంటున్నావు. ఇటువంటి మాటలు అనటానికి నీవే తగినదానవు. ఓ సౌమ్యురాలా! నేను చెప్పిన మాటవలన నీ సంతోషానికి అవధులు లేకుండాపోయాయి. అమ్మా! నన్ను సంతోషపెట్టడానికి ఒక బదులుమాటగాని, వస్తువు గానీ లేదన్నావు. ఎంతో ప్రేమతో, ఎంతో విలువైనమాట అన్నావు. ధనధాన్యాల కన్నా, రత్నరాసుల కన్నా ముల్లోకాల ఆధిపత్యం కన్నా, నీవు అన్న మాట విలువ అయింది. అమ్మా! ఆ మహానుభావుడు శత్రుసంహారం చేశాడు. విజయాన్ని చేపట్టి సంతోషంగా ఉండటాన్ని చూస్తున్నాను. అదే నాకు పరమార్థం" అన్నాడు. హనుమంతుడి పలుకులు వింటున్న సీతాదేవి అతడితో ఇలా అంది. "ఓ హనుమంతుడా! ఎక్కువ మంచిలక్షణాలతో కూడి, మాధుర్యం, అలంకారం గల మాటలకు

ఎనిమిది బుద్ధిగుణాలతో మాట్లాడటంలో నీకు నీవే సాటి. (ఎనిమిది బుద్ధి గుణాలు: 1. ఇతరులు చెప్పేది వినాలనే కోరిక ఉండటం, 2. వినడం 3. విన్నదాన్ని గ్రహించడం 4. జ్ఞాపకం ఉంచుకోవడం 5. చెప్పినదాన్ని ఊహించుకోవడం 6. అవసరం లేనిదాన్ని విడిచిపెట్టడం 7. అర్థాన్ని గ్రహించడం 8. యథార్థాన్ని నిర్ణయించుకోవడం) ఓ హనుమంతుడా! నీవు మెచ్చదగిన వాయుదేవుని పుత్రుడవు. గొప్ప ధార్మికుడవు. బలం, శౌర్యం, శాస్త్రజ్ఞానం, బుద్ధిబలం, పరాక్రమం, నేర్పు, తేజస్సు, ఓర్పు, ధైర్యం, స్థైర్యం, వినయం వంటి గుణాలే కాకుండా ఇంకా ఎన్నో సుగుణాలు నీలో ఉన్నాయి."

పిమ్మట హనుమంతుడు అంజలి ఘటించి వినయంగా సీతాదేవితో ఇలా అన్నాడు. "ఓ దేవీ! నీవు ఇప్పుడు అనుమతించినట్లయితే, పూర్వం నిన్ను భయపెట్టిన ఈ రాక్షసస్త్రీలందరినీ చంపాలని అనుకుంటున్నాను. ఈ భయంకరమైన ఆకారాలు గలవాళ్ళూ, భయంకరమైన పనులు చేసేవాళ్ళు, భయంకరమైన కన్నులు గలవాళ్ళూ, అతి క్రూరులూ అయిన ఈ రాక్షసాంగనలంతా నిన్ను దారుణంగా బాధలుపెట్టారు. కాబట్టి నా కోరిక మన్నించు. నీకు అపకారం చేసిన ఈ రాక్షసాంగన లందర్నీ పిడికిళ్ళతో పొడిచి చంపుతాను. అరచేతుల్తో కొట్టి వీరి పళ్ళు రాలగొడ్తాను. పాదాలతో తన్ని వీళ్ళ మోకాళ్ళు విరగ్గొడ్తాను. ముక్కూ చెవులు కొరికిపారేస్తాను. తలవెంట్రుకలన్నీ పీకేస్తాను. గోళ్ళతో చీల్చేస్తాను. వీళ్ళను నానావిధాలుగా బాధించి చంపాలని అనుకుంటున్నాను. నీ అనుమతి కోరుతున్నాను."

దీనులయందు జాలి గలది, దయామయురాలు అయిన సీత హనుమంతుడితో ఇలా అంది. "ఓ వానరోత్తమా! ఈ రాక్షసస్త్రీలంతా రాజ సేవకులు. అందువల్ల వాళ్ళకు ఎటువంటి స్వతంత్రం ఉండదు. యజమానుల ఆజ్ఞలకు లోబడి పనిచేస్తూ ఉంటారు. అటువంటి దాసీలపైన కోపం చేసుకోవచ్చునా? నా దురదృష్టం వల్ల, నేను పూర్వం చేసుకున్న పాపకర్మల ఫలంచేత నేను ఈ కష్టాలన్నీ అనుభవించాల్సి వచ్చింది. ఎంతటివారైనా వారి కర్మఫలాన్ని అనుభవించాల్సిందే గదా! ఓ మహాబాహూ! నీ అంతటి మహాత్ములు ఇటువంటి ఆలోచనలు

చెయ్యకూడదు. నేను అనుభవించిన కష్టాలన్నీ దైవనిర్ణయాలు. పూర్వకర్మల ఫలమేనని నేను నమ్ముతున్నాను. ఈ రాక్షసస్త్రీల దోషం ఏమీ లేదు. అందువలన నేను వీళ్ళందర్నీ మన్నిస్తున్నాను. వీళ్ళంతా రావణాసురుడి ఆజ్ఞల మేరకు నడచుకున్నారు. ఇప్పుడా రావణాసురుడే చచ్చిపోయాడు. ఇకపైన వీళ్ళు నన్ను ఎందుకు బాధిస్తారు? ఓ హనుమంతుడా! ఒకవేళ ఈ రాక్షసస్త్రీలు వాళ్ళే స్వయంగా నన్ను బాధించినా కూడా నేను వాళ్ళను తప్పుపట్టను. వీళ్ళకు అపకారం చెయ్యను. చెయ్యనీయను. ఈ సందర్భంగా నీకో కథ చెప్తాను, విను.

ఒకానొక అడవిలో ఓ వేటగాణ్ణి పులి తరుముకుంటూ వచ్చింది. ప్రాణరక్షణ కోసం ఓ చెట్టు ఎక్కాడు. ఆ చెట్టుపైన ఓ ఎలుగుబంటు ఉంది. అప్పుడా పులి ఎలుగుబంటిని చూస్తూ ఇలా అంది. 'మిత్రమా! ఈ చెట్టు పైకెక్కిన మానవుడు ఈ అడవిలో ఉండే జంతువులన్నింటికీ శత్రువు. అతణ్ణి క్రిందకు తోసెయ్యి. నేను వాణ్ణి చంపేస్తాను' అంది. అందుకా ఎలుగుబంటు 'ఈతడు మనకు శత్రువే అయినా, నా దగ్గరకు వచ్చిన వాణ్ణి కాపాడటమే నాకు ధర్మం' అని చెప్పింది. కొంతసేపటికి ఎలుగుబంటి నిద్రపోయింది. అంతట ఆ పులి, మానవుడితో "ఆ ఎలుగుబంటి నిద్రపోతోంది గదా! దాన్ని క్రిందకు పడత్రొయ్యి. నేను దాన్ని చంపేస్తాను" అంది. అందుకా వేటగాడు అంగీకరించి ఆ ఎలుగుబంటిని క్రిందకు పడత్రోశాడు. చెట్లకొమ్మలపైన నిద్రపోవడం దానికి అలవాటు కావటాన, చటుక్కున మరో కొమ్మపట్టుకొని క్రిందపడకుండా తప్పించుకుంది. అప్పుడు పెద్దపులి ఎలుగుబంటితో ఇలా అంది. "ఓ భల్లూకమా! ఈ వేటగాడు ఉపకారం చేసిన నీకు అపకారం చేశాడు. చూశావుగదా! కాబట్టి ఇప్పుడైనా అతణ్ణి క్రిందకు పడత్రొయ్యి" అంది. అంతట ఆ భల్లూకం, "ఇతడు నాకు ఎంత అపకారం చేసినా, నేను తిరిగి ఇతడికి అపకారం చెయ్యను" అని ఖచ్చితంగా చెప్పేసింది. అంతేకాకుండా ఆ భల్లూకం పెద్దపులితో ఒక పద్యం చెప్పింది. "ప్రాజ్ఞుడు అయినవాడు తనకు అపకారము చేసినవారికి ప్రత్యుపకారం చేయడు. అపకారం చేసినవారికి ఉపకారం చెయ్యడమే సత్పురుషుల సదాచారం. సదాచారమే సత్పురుషులకు ఆభరణం."

ఓ హనుమంతుడా! ఎదుటివారు పాపాత్ములే అయినా, చంపదగినవారే అయినా, మంచివారు వారి యెడల దయచూపిస్తారు. ఏమంటే లోకంలో తప్పులు చెయ్యనివాడెవడూ ఉండరని వారి అభిప్రాయం. అదీకాకుండా, లోకాన్ని బాధించడం రాక్షసులకు వినోదం. వాళ్ళంతా పాపకర్మలు చేస్తూ ఉంటారు. కామరూపులు. అది వాళ్ళ స్వభావం. కాబట్టి వాళ్ళకు కీడు చెయ్యడం తగినపని కాదు" అని సీతాదేవి చెప్పింది. అందుకు హనుమంతుడు "ఓ దేవీ! నీవు ఆ రాముడికి తగిన భార్యవు. ఓ కీర్తిమంతురాలా! రామునికి బదులు చెప్తే నేను ఇక రాముడి దగ్గరకు వెళ్తాను" అని అన్నాడు. అంతట సీతాదేవి హనుమంతుడితో ఇలా అంది. "ఓ హనుమంతుడా! నేను వెంటనే నా భర్తను చూడాలని కోరుకుంటున్నాను." వాయుపుత్రుడు, గొప్ప బుద్ధిమంతుడు అయిన హనుమంతుడు, ఆమెకు సంతోషం కలిగేట్లుగా ఇలా అన్నాడు. "స్థిరంగా మంత్రులతో ఉన్నవాడూ, శత్రువులను సంహరించినవాడూ, పూర్ణచంద్రుడివంటి ముఖం కలవాడూ, లక్ష్మణునితో కూడా ఎల్లవేళలా ఉండేవాడూ అయిన రాముణ్ణి, శచీదేవి, ఇంద్రుణ్ణి చూసినట్లుగా ఇప్పుడే చూడగలవు" అన్నాడు.

అంతట మహాతేజశ్శాలి అయిన హనుమంతుడు, సాక్షాత్తూ లక్ష్మీదేవివలె ప్రకాశిస్తున్న ఆ సీతాదేవితో ఇలా పలికి రాముడున్న చోటుకు వచ్చాడు. అప్పుడు ఆ వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు సీతాసందేశాన్ని దేవేంద్రుడితో సమానుడైన రామునికి వినిపించాడు.

# 113వ సర్గ సీతారాములు కలుసుకోవటం

మహాబుద్ధిశాలి, పరాక్రమవంతుడు, కమలరేకుల వంటి కన్నులు గలవాడు, సకలధనుర్విద్యల యందు శ్రేష్ఠుడు అయిన రామునికి నమస్కరించి హనుమంతుడు ఇలా అన్నాడు. "ఓ రామప్రభూ! ఏ సీతాదేవికోసం ఈ మహాయుద్ధం చేశామో, ఏ సీతాదేవి ఈ మహాప్రయత్నానికంతకూ ఫలమో, అటువంటి, దుఃఖసముద్రంలో మునిగి ఉన్న, సీతాదేవిని నీవు వెంటనే చూడాలి. దుఃఖసముద్రంలో కొట్టుమిట్టాడుతున్న ఆ సీతాదేవి నీ విజయవార్త వినగానే ఆనందబాష్పాలతో నిన్ను వెంటనే చూడాలని కోరుకుంది. వెనుక నేను ఆమెను చూసి ఉండటం చేతను, ఆమెకు నా యందు ఏర్పడిన నమ్మకం చేతనూ, లక్ష్మణసహితుడైన రాముని తాను వెంటనే చూడాలని కోరింది" అని చెప్పాడు. హనుమంతుని మాటలు విన్న ధర్మాత్ములలో శ్రేష్ఠుడైన రాముని కళ్ళల్లో నీళ్ళు ఉబికి వచ్చాయి. కొద్ది క్షణాలపాటు వ్యాకులత చెందాడు. వేడినిటూర్పులు విడిచాడు. ప్రక్కనే ఉన్న, మేఘంతో సమానమైన, విభీషణుడితో ఇలా అన్నాడు. "ఓ విభీషణుడా! శిరఃస్నానం చేయించి, శ్రేష్ఠమైన మైపూతలు పూసుకొని, దివ్యమైన ఆభరణాలు ధరించుకొన్న సీతాదేవిని వెంటనే ఇక్కడకు తీసుకొనిరమ్ము" అని ఆదేశించాడు.

రాముడి మాటలు విన్న విభీషణుడు వెంటనే అంతఃపురానికి వెళ్ళి, తన రాణుల ద్వారా సీతకు రాముని ఆదేశం తెలియజేశాడు. పిమ్మట రాక్షసప్రభువు, శ్రీమంతుడు అయిన విభీషణుడు భాగ్యవంతురాలైన సీతను చూసి, వినయంగా, అంజలిఘటించి శిరస్సు వంచుకొని "ఓ సీతాదేవీ! నీవు చక్కగా అభ్యంగనస్నానం చేసుకొని, దివ్యమైన అంగరాగములు పూసుకొని, దివ్యాభరణాలను ధరించి, రథంపై పోవలెను. నీ భర్త రాముడు నిన్ను చూడాలని కోరుతున్నాడు" అని చెప్పాడు. అంతట సీతాదేవి విభీషణుని మాటలు విని "రాక్షసరాజా! నేను స్నానాదులు ఏమీ లేకుండానే, ఈ విధంగానే నా భర్తను చూడాలని అనుకుంటున్నాను" అని అన్నది. అంతట విభీషణుడు ఆమెతో "అమ్మా! నీవు నీ భర్త చెప్పినట్లే చేయడం మంచిది" అని అన్నాడు. విభీషణుని మాటలు విన్న సీతాదేవి, భర్త ఎడలగల భక్తితో, అట్లాగే చేస్తానన్నది. తరువాత

రాక్షసయువతులు ఆమెకు అభ్యంగనస్నానం చేయించారు. ఆమెను సర్వాంగసుందరంగా అలంకరించారు, శ్రేష్ఠములైన వస్త్రాల్ని ధరించిన సీతాదేవిని, రాక్షసస్త్రీలు కూడా ఉండి పల్లకీ ఎక్కించి రాముడి వద్దకు తీసుకొని వెళ్ళారు. విభీషణుడు రాముని వద్దకు వెళ్ళి సీతాదేవి వచ్చిందని సంతోషంగా తెలిపాడు. అయినా మహాత్ముడైన రాముడు ఏదో పరధ్యానంగా ఆలోచిస్తున్నాడు. సీతాదేవి వచ్చిందని వినగానే రాముడు సంతోషించాడు. అయినా వెంటనే, రాక్షసుడి ఇంట్లో చాలాకాలం ఉండటం చేత అతడిలో దైన్యం, కోపం కూడా కలిగాయి. అందువల్ల, సీతాదేవి వచ్చినాకూడా సంతోషం లేనివాడై విభీషణుడితో ఇలా అన్నాడు. "నిత్యమూ నా మేలుకోరు ఓ రాక్షసరాజా! విభీషణుడా! సీతను నా వద్దకు తీసుకొనిరా!" అన్నాడు. అంతట తలపైన పాగాలు, చేతుల్లో బెత్తాలు, పొడవాటి చొక్కాలు ధరించిన సేవకులు జనాల్నందర్నీ దూరంగా పంపేశారు. సీతాదేవి వచ్చేందుకు దారికి రెండు ప్రక్కలా రాక్షససేవకులు నిలబడ్డారు. అప్పుడు వానరులు, భల్లూకాలన్నీ దూరంగాపోయి నిలబడ్డారు. ఎగిరి చెట్లకొమ్మలపైన కూర్చున్నారు. ఆ త్రొక్కిసలాటతో ఏర్పడిన శబ్దాలు సముద్రఘోషలాగా వినిపించింది. వానరభల్లూకాలను రాక్షససేవకులు అట్లా తరిమికొట్టడాన్ని రాముడు సహించలేకపోయాడు. విభీషణుడిపై కోపం వచ్చింది. ఇలా అన్నాడు. "ఓ విభీషణుడా! వీళ్ళందరూ ఎవరనుకున్నావు? నా సొంతవారు. నా దగ్గరి బంధుజనం. వాళ్ళను తరిమికొట్టడం ద్వారా నన్ను అవమానిస్తున్నావు. ఇక ఆ ఏర్పాట్లన్నింటినీ కట్టిపెట్టు. స్త్రీలకు ఇళ్ళుకానీ, వస్త్రాలు కానీ, గోడలు – తెరలుగానీ ఆభరణాలు కావుసుమా! స్త్రీలకు మంచి ప్రవర్తన, సచ్ఛీలములే ఆభరణములు. స్త్రీలు వాళ్ళ సొంతవారు చనిపోయినప్పుడుగానీ (దుఃఖసమయాల్లో) రాజ్యంలో అల్లకల్లోల పరిస్థితులు ఏర్పడ్డప్పుడుగాని, యుద్ధభూమిలోగాని, యజ్ఞయాగాదుల్లోగానీ, స్వయంవర సమయాల్లోగానీ, వివాహ సమయాల్లోగానీ, పురుషుల కంట పడటం దోషం కాదు. సీతాదేవి ఇప్పుడు యుద్ధభూమికి వచ్చింది. అష్టకష్టాలుపడుతూ ఉంది. నన్ను చూడటానికి వస్తోంది. అందువల్ల ఆమెను ఇతరులు చూచినందువల్ల దోషం ఏమీ లేదు. ఓ విభీషణుడా! నా స్వజనం అంతా నా చుట్టూ ఉండగానే ఆమెను నా వద్దకు తీసుకొనిరా. వారంతా నా సమక్షంలో ఉండగానే నన్ను కలుసుకుంటుంది. ఆమె పల్లకీని విడిచిపెట్టి కాలినడకనే వచ్చి నన్ను

కలుసుకొంటుంది” అని చెప్పాడు.

రాముడు ఈ విధంగా అనడంతో విభీషణుడు సిగ్గుపడ్డాడు. ఒక్క విభీషణుడే కాదు, లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, హనుమంతుడూ మనస్సులో చాలా బాధపడ్డారు. భార్యపై ప్రేమ లేకుండా ఇంత కటువుగా మాట్లాడాడే అని వారనుకున్నారు. రాముడికి సీతాదేవిపైన ప్రేమ సన్నగిల్లిందా? అని కూడా అనుకున్నారు.

అప్పుడు సీతాదేవి, విభీషణుడు వెనుక సిగ్గుతో తలవంచుకొని, ఒళ్ళంతా ముడుచుకొని, వచ్చి రాముడి ఎదురుగా నిలబడింది. అంతమంది జనం మధ్యలో తన ముఖం కనిపించకుండా చీరకొంగుతో కప్పుకొని రాముడికి దగ్గరగా పోయి “పూజ్యుడా!” అని సంబోధించి ఇక దుఃఖాన్ని ఆపుకోలేనిదై భోరున ఏడ్చేసింది. పతియే ప్రత్యక్షదైవంగా భావించే ఆ సీతాదేవి అనురాగంతోను, సంతోషంతోను, విస్మయంతోను, ప్రసన్నంగా కూర్చుని ఉన్న రాముడి ముఖంలోకి చూసింది. ఆ నిర్మలమైన చంద్రబింబం వంటి ముఖం గల ఆ సీతాదేవి శుక్లపక్ష పాడ్యమినాటి చంద్రోదయంవలె మనోహరమైన తన భర్త ముఖబింబాన్ని చూస్తూ మనస్సులోనే దుఃఖాన్నంతా ఒదిలేసింది.

# 114వ సర్గ రాముడు సీతను శంకించటం

వినయంతో వంగి తన ప్రక్కనే నిలబడిన సీతాదేవిని చూస్తూ రాముడు ఇలా అన్నాడు.

"ఓ మంగళప్రదురాలా! యుద్ధంలో శత్రువును జయించాను. దాంతోపాటు నిన్ను కూడా జయించుకున్నాను. పౌరుషంతో ఒక పురుషుడు చేయదగిందంతా చేశాను. నా శత్రువును తొలగించడం ద్వారా నా అవమానాన్నీ, కోపాన్నీ కూడా అంతం చేశాను. నా పౌరుషాన్ని లోకానికి చాటి చెప్పడమైంది. దాంతో నేను పడిన శ్రమకు ఫలం దక్కిందనే అనుకుంటున్నాను. నేను శత్రువును చంపుతానని చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చడం ద్వారా, నేను స్వతంత్రుణ్ణయ్యాను.

ఓ సీతా! నేను లేని సమయంలో అచపరచితుడైన రాక్షసుడు నిన్ను అపహరించుకొని పోయాడు. దైవికంగా నాకు జరిగిన అవమానాన్ని, పురుషప్రయత్నం చేత దాన్ని సరిచేసు కున్నాను. తనకు జరిగిన అవమానాన్ని ఎవడు తన తేజస్సు చేత పోగొట్టుకోడో, అటువంటివాడు ఎంత గొప్ప పౌరుషవంతుడైతే మాత్రం, ఏం ప్రయోజనం? అట్టి పరాక్రమహీనుడికి పురుషార్థం చేకూరదు. హనుమంతుడు సముద్రాన్ని దాటి వచ్చి లంకను గగ్గోలపరచిపోయాడు. అతడు చేసిన వీరోచితకార్యాలన్నీ సఫలం అయ్యాయి. సుగ్రీవుడు తను స్వయంగా హితమైన ఆలోచనలు చేస్తూ తన వానరసైన్యం ద్వారాను, పరాక్రమం చూపి నాకు అన్ని విధాలా సహాయపడ్డాడు. అతడు పడ్డ కష్టానికి ఫలం చేకూరింది. ఈ విభీషణుడు సకలదుర్గుణ సంపన్నుడైన అన్నగార్ని కాదని, ధర్మాత్ముడై, నన్ను చేరిన ఈ విభీషణుడు పడిన శ్రమ అంతా సఫలం అయింది." రాముడు ఈ విధంగా మాట్లాడుతూ ఉంటే, ఆడలేడి వలె భయపడుతూ కంటినిండా నీళ్ళు నింపుకొని సీత నిలబడింది.

అప్పుడు రాముడి కన్నీరుకారుస్తూ ఉన్న సీతాదేవిని చూశాడు. మండే అగ్నిహోత్రంలో ఆజ్యంపోసినట్లుగా, 'జనాపవాదం' అనే భయంతో రాముడి హృదయం మండిపోయింది. గుండెరాయి చేసుకుని సీతాదేవితో కఠినంగా ఇలా అన్నాడు. "ఓ సీతా! అవమానం పాలు

కాకుండా ఉండటానికి పురుషుడు చెయ్యాల్సిన మానవప్రయత్నం అంతా చేశాను. పూర్వం ఇల్వలుడు మొదలైన రాక్షసులచేత ఆక్రమించుకోబడిన దక్షిణాపథం, నరమానవులకు నివాసయోగ్యం కాకుండాపోయింది. అప్పుడు తపోబల సంపన్నుడైన అగస్త్యుడు, తన తపఃశక్తిచేత ఆ రాక్షసుల్ని సంహరించి దక్షిణాపథాన్ని జయించాడు. అట్లాగే, నిన్ను అపహరించిన ఆ రావణాసురుణ్ణి నా పరాక్రమంచేత సంహరించి, నిన్ను జయించుకున్నాను.

ఓ మంగళస్వరూపిణీ! నేనూ, నా స్నేహితులూ పరాక్రమం చూపి శత్రువును సంహరించాం. ఇంత పెద్దయుద్ధాన్ని కేవలం నిన్ను దక్కించుకోవడానికి చెయ్యలేదు. ఆ సంగతి నీకు తెలియకపోతే ఇప్పుడు తెలుసుకో. నేనీ యుద్ధపరిశ్రమను సదాచారాన్ని కాపాడటానికీ, ప్రసిద్ధి గల నా వంశగౌరవానికి అపవాదు, అపకీర్తి కలగకుండా ఉండటానికే నేనీ యుద్ధం చేశాను.

ఓ సీతా! దుష్టమైన రావణుని చూపుల చేత చూడబడ్డావు. ఆ విధంగా నువ్వు సందేహింప దగిన దానవు. నువ్వు నా ఎదుటగా నిలబడి ఉంటే, కంటి జబ్బుతో బాధపడేవాడికి దీపపు కాంతివలె నేను భరించలేకుండా ఉన్నాను.

ఓ భాగ్యవతీ! సత్కులంలో పుట్టిన తేజఃశ్శాలి అయిన పురుషుడెవరైనా, పరుల ఇంట్లో ఉండివచ్చిన స్త్రీని మళ్ళీ స్వీకరిస్తాడా? నేను నా కులగౌరవం కాపాడేందుకే నిన్ను జయించాను. శత్రువును చంపి నేనా కీర్తిని సాధించాను. ఇప్పుడు నీ యందు నాకు ఆసక్తిలేదు. అందుచేత నీకిప్పుడు అనుజ్ఞ ఇస్తున్నాను; దశదిశలలో నీ ఇష్టము వచ్చిన దిక్కునకు వెళ్ళవచ్చును. నాకు నీతో పనిలేదు. అందుచేత ఇక్కడ నుండి నీ ఇష్టము వచ్చిన చోటుకు వెళ్ళవచ్చును.

ఓ మంగళప్రదురాలా! నేను బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. నీకు ఇష్టమైతే, లక్ష్మణుని సంరక్షణలోగానీ, భరతుడి సంరక్షణలోగానీ, శత్రుఘ్నుని సంరక్షణలోగానీ ఉండవచ్చును. లేదా నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి.

ఓ సీతా! నీ రూపము దివ్యమైనది. నీవు మనోహరంగా ఉంటావు. ఇంతకాలం రావణాసురుడి స్వగృహంలో ఉన్నావు. అతడు నిన్ను చూస్తూ ఊరకే ఉండగలడా?" అని అన్నాడు. ఆ సీతాదేవి, చాలాకాలం తర్వాత కనిపించిన భర్త ఇటువంటి నిందలు వేస్తూ, నిర్దయగా 'ఎక్కడికైనా నీ ఇష్టం వచ్చిన చోటుకు పో' అని అంటూ ఉంటే, ఏనుగు తొండంచేత పీకివేయబడిన లత వలె విలవిల్లాడిపోయింది. కన్నీరుమున్నీరుగా ఏడ్చింది.

# 115వ సర్గ సీత అగ్నిప్రవేశం

రాముడు కోపంతో పరుషంగా మాట్లాడుతూ ఉంటే సీతాదేవి తట్టుకోలేకపోయింది. ఇంతకు పూర్వం ఎన్నడూ రాముడు ఇటువంటి మాటలు మాట్లాడి ఎరుగడు. ఇంతమంది జనం మధ్య భర్త నుండి ఇటువంటి అవమానకరమైన మాటలు వస్తూ ఉంటే సిగ్గుతో తలకొట్టేసినట్లయింది. ఆ రాముడి మాటలు వాడిబాణాల్లాగా శరీరంలో గుచ్చుకొని తీవ్రంగా బాధించాయి. కొంతసేపటికి తనను తాను సంబాళించుకొని, కళ్ళు తుడుచుకొని గద్గదమైన వాక్కులతో మెల్లగా రాముడితో ఇలా అంది.

“వీరుడా! ఎవరో ఓ పామరుడు ఒక పామర స్త్రీతో మాట్లాడినట్లుగా నాపై ఇంతటి దారుణమైన నిందలు మోపడం నీకు న్యాయంగా ఉందా? ఓ మహాబాహూ! నా పాతివ్రత్యంపై ఒట్టుపెట్టుకొని చెప్తున్నాను; నేను అటువంటి దానను కాదు. నా మాట నమ్మండి. లేదా నీవు ఎటువంటి ప్రమాణం చెయ్యమన్నా చేస్తాను. ఎక్కడో ఎవరో ఒక దుష్ట స్త్రీ ఏదో తప్పు చేసి ఉంటే, నీవు స్త్రీ జాతినే శంకిస్తున్నావు. నీవు లోగడ నన్ను పరీక్షించి ఉంటే, సచ్చరిత్ర గలదానని నమ్మి ఉంటే, ఇప్పుడు ఈ అనుమానాన్ని విడిచిపెట్టు; ఇప్పుడు కూడా అంతే పవిత్రురాలను.

ప్రభూ! నా శరీరం నా వశంలో లేనప్పుడు, రావణుని శరీర స్పర్శ నాకు కలిగిందంటే అది దైవం యొక్క అపరాధమే కానీ, నా దోషం కాదు; నేను ఇష్టపడి ఆ పని చెయ్యలేదు. అయితే నా అధీనంలో ఉన్న నా హృదయం మాత్రం నీ యందే లగ్నమై ఉంది. నేను అసమర్థురాలనైన స్థితిలో నా శరీరాన్ని పరపురుషుడు తాకాడంటే, అందుకు నేనేమి చెయ్యగలను? ఇంతకాలం నీతో కలసి జీవించాను. అయినా నేను ఎటువంటిదాననో నీవు తెలుసుకోలేకపోయినట్లయితే నేను పూర్తిగా చచ్చిపోయినట్లే లెక్క.

రాజా! నన్ను వెదకడం కోసం మహావీరుడైన హనుమంతుణ్ణి లంకకు పంపావు. నేను లంకలో ఉన్నట్లుగా తెలుసుకున్నావు గదా? మరి అప్పుడే నన్ను ఒదిలేసి ఉండవచ్చును గదా?

అప్పుడే నీవు నన్ను త్యజించి ఉండి ఉంటే, నేను ఈపాటికి ప్రాణాలు విడిచేసి ఉండేదాన్ని. నీవు అప్పుడే ఇటువంటి అనుమానాన్ని బయటపెట్టి ఉంటే, వృథాగా నీవింత శ్రమపడవలసి ఉండేది కాదు. నీ మిత్రులు కూడా ఇన్ని కష్టాలు పడేవాళ్ళు కారు.

ఓ రాజశ్రేష్ఠుడా! నీవు, కోపావేశంచేత, అల్పబుద్ధి గల మానవుడి వలె "స్త్రీ" అనేదానికే ప్రాధాన్యమిచ్చావు. కానీ నా యథార్థజన్మను గూర్చి ఆలోచించడం లేదు. లోకం దృష్టిలో నేను జనకమహారాజు కుమార్తెను. కానీ, యథార్థంగా నా పుట్టుక భూమినుండి జరిగింది. అటువంటి నా పుట్టుకకుగానీ, నా మంచి నడవడికకుగానీ ఎంతమాత్రం విలువ ఇవ్వలేదు. నీవు బాల్యంలోనే నా హస్తాన్ని గ్రహించి వివాహమాడావు. అప్పుడు నీవు చేసిన ప్రమాణాలన్నీ గాలిలో కలసిపోయాయి. నాకు నీయందు ఉన్న భక్తి, ప్రేమ, నా శీలం అన్నీ ఇప్పుడు నీకు కనుమరుగయ్యాయి" అంటూ సీతాదేవి కన్నీరు పెట్టుకుంటూ విలపించింది.

ఈ విధంగా విలపిస్తూ, దుఃఖంచేత గద్గదమైన కంఠంతో, దీనుడై నిలబడ్డ లక్ష్మణునితో ఇలా అంది. "లక్ష్మణా! ఈ కష్టాలకూ, అనుమానాలకూ ఒకటే మందు. అదే నా అగ్నిప్రవేశం. నేను ఇప్పుడే అగ్నిప్రవేశం చేస్తాను. వెంటనే చితి ఏర్పాటు చెయ్యి. అపనిందలు భరిస్తూ, ఒక దోషిగా జీవించడం నాకు ఇష్టం లేదు. నన్ను, నా గుణాల్ని, నా పాతివ్రత్యాన్ని గుర్తించని భర్తచేత, ఇంతమంది సమక్షంలో భర్తచేత విడిచివేయబడిన నాకు అగ్నిప్రవేశం చెయ్యడం ఒక్కటే శరణ్యం. ఆ పనిని ఇందరి సమక్షంలో ఇప్పుడే చేస్తాను" అని సీతాదేవి అంటూ ఉంటే, లక్ష్మణుడికి రాముడిపై ఒళ్ళు మండిపోయింది. 'ఏంచెయ్యమంటావు?' అన్నట్లుగా కోపంతో రాముడి వంక చూశాడు. అప్పుడు రాముడు భావయుక్తంగా సీత చెప్పినట్లే చెయ్యమని తల ఊపాడు.

అంతట పరాక్రమవంతుడైన ఆ లక్ష్మణుడు రాముని అభిలాష తెలుసుకొని, అతడి అభిమతం ప్రకారమే చితిని ఏర్పాటు చేశాడు. అప్పుడు రాముడు చూసేవాళ్ళకు ప్రళయకాలపు యముడిలా కనిపించాడు. బ్రతిమాలటానికిగాని, పలకరించటానికిగానీ ఎవరికీ ధైర్యం

లేకపోయింది. పిమ్మట సీతాదేవి తలవంచుకొని రాముడికి ప్రదక్షిణంచేసి, భగభగ మండుతున్న చితి దగ్గరకు వెళ్ళింది. దేవతలకు, బ్రాహ్మణులకు నమస్కరించింది. అగ్నిహోత్రుడికి అంజలి ఘటించి ఇలా అంది.

"నా మనస్సు ఎల్లప్పుడూ రాముని యందే స్థిరంగా ఉన్నట్లయితే లోకాలన్నింటికీ సాక్షి అయిన అగ్నిహోత్రుడు నన్ను రక్షించుగాక! నా ప్రవర్తన పరిశుద్ధమైనదైతే, రామప్రభువు నన్ను గురించి సందేహిస్తున్న దోషాలు నాలో లేనియెడల అగ్నిహోత్రుడు నన్ను అన్నివిధాలా రక్షించుగాక! నేను మనస్సు చేతగాని, కర్మ చేతగాని, ధర్మము తెలిసిన రాముణ్ణి అతిక్రమించకుండా ఉన్నట్లయితే అగ్నిహోత్రుడు నన్ను అన్ని విధాలా రక్షించుగాక! పూజ్యుడైన సూర్యుడు, చంద్రుడు, వాయువు, దిక్కులు, పగలు, సంధ్యలు, రాత్రి, భూమి, ఇతర దేవతలు నేను మంచి నడవడిక గలదానని నమ్మితే, అగ్నిహోత్రుడు నన్ను రక్షించుగాక" అంటూ సీతాదేవి అగ్నికి ప్రదక్షిణం చేసి తొణకక, బెణకక, ప్రజ్వలించే అగ్నిలోనికి ప్రవేశించింది. అప్పుడు అక్కడున్న ఆబాలగోపాలంతో కూడిన ఆ పెద్ద జనసముదాయం అంతా సీతాదేవి ప్రజ్వలించే అగ్నిలోనికి ప్రవేశించగా వ్యాకులపాటుతో చూశారు. అప్పుడు ఆ సీతాదేవి పరిశుద్ధమైన బంగారు ఆభరణాల్ని ధరించి అగ్నిహోత్రంలో పడటాన్ని సమస్తభూతాలు చూశాయి. అగ్నిలో ప్రవేశించిన ఆ మహాభాగ్యవంతురాలు, ముల్లోకాల నుండీ తిలకిస్తున్నవారికి ఒక పవిత్రమైన హవిస్సు లాగా కనిపించింది. యజ్ఞమంత్రాలతో సంస్కరించబడిన ఆజ్య (నేతి) ధారవలె అగ్నిలో పడుతున్న ఆ సీతాదేవిని చూసి స్త్రీలంతా బిగ్గరగా ఏడ్చారు. ముల్లోకాలు, దేవగంధర్వ దానవులు కూడా ఆమెను, శాపగ్రస్త అయి స్వర్గంలో నుండి నరకంలోకి జారిపడిపోతున్న దేవతా స్త్రీవలె చూశారు. ఆమె అగ్నిలోకి ప్రవేశిస్తూ ఉంటే, రాక్షసులు, వానరులు కూడా హాహాకారాలు చేశారు.

# 116వ సర్గ బ్రహ్మ రాముని మహావిష్ణువుగా స్తుతించటం

వానరులు, రాక్షసులు హాహాకారాలు చేస్తూ విలపించడం ధర్మాత్ముడైన రాముడు చూశాడు. తాను కూడా దుఃఖించే మనస్సుతో కన్నీళ్ళతో నిండిన నేత్రాలతో నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. ఇంతలో కుబేరుడూ, పితృదేవతలతో కలసి యముడు, నీటికి ప్రభువైన వరుణుడు, త్రినేత్రుడైన మహేశ్వరుడు, బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడైన బ్రహ్మ మొదలైన దేవతలంతా సూర్యునివలె ప్రకాశించుచున్న విమానంలో రాముడి వద్దకు వచ్చారు.

ఆ దేవతాశ్రేష్ఠులంతా, సర్వాభరణాలతో అలంకరించుకున్న దీర్ఘములైన భుజాలను ఎత్తి అంజలి ఘటించి నమస్కరిస్తూ రాముడితో ఇలా అన్నారు.

"ఓ రామా! నీవు లోకాలన్నింటికీ కర్తవు, జ్ఞానుల్లో శ్రేష్ఠుడవు. సర్వసమర్థుడవే! సీత అగ్ని ప్రవేశం చేస్తూ ఉంటే నీవు ఎందువల్ల ఉదాసీనంగా చూస్తూ నిలబడ్డావు? దేవతాగణాలలో శ్రేష్ఠుడవైన నిన్ను గూర్చి నీవెందుకు తెలుసుకోలేకపోతున్నావు? నీవు పూర్వకల్పాల్లో వసువుల్లో ఋతధముడనే వసువ్వి. ముల్లోకాలను సృష్టించినవాడవు. నీవు రుద్రుల్లో ఎనిమిదవ రుద్రుడవు. పన్నెండుమంది సాధ్యులలో నీవు ఐదవవాడవు. అశ్వనీదేవతలు నీ చెవులు, సూర్యచంద్రులు నీ నేత్రాలు. ఓ పరంతపా! నీవు లోకాలన్నింటికీ ముందే ఉన్నావు. లోకాలన్నీ నాశనం అయిన తర్వాత కూడా నీవు ఉంటావు. నిన్ను నీవు తెలుసుకోకుండా ఒక సామాన్య మానవుడివలె సీతను ఉపేక్షిస్తున్నావు."

లోకాలకు ప్రభువు, రఘువంశంలో పుట్టినవాడు ధర్మాన్ని సంరక్షించు వారిలో శ్రేష్ఠుడు అయిన రాముడు వారితో ఇలా అన్నాడు. "నేను దశరథ కుమారుడనైన రాముడను పేరుగల మానవుడననే అనుకుంటున్నాను. నేను ఎవరివాడను? ఎందువల్ల ఇట్లా ఉన్నాను? భగవంతుడవైన నీవు చెప్పు" అన్నాడు.

రాముడి మాటలు విని, బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడైన బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు. “సత్యమైన పరాక్రమం గల ఓ రామా! నేను చెప్పే మాటలు విను. అవి సత్యమైన మాటలు.

శ్రీరామ స్తోత్రం

నీవు లక్ష్మీస్వరూపుడవు, లక్ష్మీసమేతుడు, చక్రాయుధం గలవాడూ, సర్వసమర్థుడమూ అయిన శ్రీమన్నారాయణుడవు. ఒక కొమ్ము గల వరాహమూర్తివి నీవే. భూతకాలాలలో శత్రువుల్ని జయించేవాడవు, భవిష్యత్తులో శత్రువులను జయించేవాడమూ నీవే.

వినాశరహితమయినవాడవు. మధ్యయందు, అంతమునందూ కూడా యథార్థంగా ఉండే బ్రహ్మవు నీవే! లోకులకు అత్యుత్తమ ధర్మమైన యజ్ఞానివి నీవే. నీ సైన్యం అంతటా వ్యాపించి ఉంటుంది. నీవు నాలుగు భుజాలు గలవాడవు.

నీవు శార్ఙ్గమనే ధనుస్సును ధరించేవాడవు. ఇంద్రియాల్ని నియమించేవాడవు. మానవుల హృదయ గుహలలో నివసించేవాడవు. పురుషులలో ఉత్తముడవు. అజేయుడవు. ఖడ్గాన్ని ధరించేవాడవు. సర్వాంతర్వ్యాప్తివి. భూమికి సుఖాన్నిచ్చేవాడవు. గొప్ప బలంగలవాడవు.

నీవు సేనానాయకుడవు. గ్రామాధిపతివి. నీవే బుద్ధి, ఓర్పు, ఇంద్రియ నిగ్రహము, సృష్టి ప్రళయాలు. నీవే ఉపేంద్రుడవు. నీవే మధుసూదనుడవు.

నీవు ఇంద్రుడు చేసే పనులన్నీ చేయగలవాడవు. నీ నాభియందు పద్మం ఉంది. యుద్ధంలో వినాశం చేసేవాడవు. నీవు శరణాగతుల్ని రక్షిస్తావని మహర్షులు అంటారు.

నీవు వేలకొద్దీ శాఖలు అనే కొమ్మలు, వందలకొద్దీ విధివాక్యం అనే శిరస్సులు గల, గొప్ప కర్మాలోచనం చేసే వేదాలే ఆత్మగా గలవాడవు. ముల్లోకాల్నీ సృష్టించినవాడవు. సర్వస్వతంత్రుడవు. నీవు సిద్ధులకు, సాధ్యులకు అతిప్రాచీనమైన ఆశ్రయమైనవాడవు.

నీవే యజ్ఞము, నీవే వషట్కారము, నీవే ఓంకారము. నీవు అందరికంటే ఉత్కృష్టుడవు. నీకు పుట్టుకగాని, నాశనముగాని లేదు. నీవు ఎవరవు అనే విషయం ఎవరూ ఎరుగరు.

నీవు అన్ని ప్రాణులలోను, గోబ్రాహ్మణుల్లోనూ, నలుదిక్కులయందూ, ఆకాశం, పర్వతాల యందు నదుల్లోనూ కనబడతావు. వేలకొద్దీ పాదాలు వందలాది శిరస్సులు, వేలాది నేత్రాలు గలిగి, లక్ష్మీదేవితో కూడిన నీవు సమస్త ప్రాణుల్ని, పర్వతాలతో కూడిన భూమినీ ధరిస్తున్నావు. ఓ రామా! భూమికి అడుగున నీటిలో నీవు ఆదిశేషుడు రూపంలో మూడు లోకాల్ని, దేవగంధర్వ దానవుల్ని, ధరిస్తూ ఉన్నావు.

ఓ రామా! నేను నీ హృదయాన్ని. సరస్వతీదేవి నీ నాలుక. నీ అవయవములందు దేవతలను రోమాలుగా నేనే నిర్మించాను. నీ కనురెప్పపాటు రాత్రి కాగా, కన్ను తెరవటమే పగలు అవుతోంది. నీవు నియమించిన విధినిషేధాలే వేదాలు. నీవు లేనిది ఏదీ లేదు. ఈ జగత్తు అంతా నీ శరీరమే. నీ స్థిరత్వమే భూమి. నీ కోపమే అగ్ని. నీ ప్రసాదమే చంద్రుడు. నీవే సాక్షాత్తూ విష్ణువు.

పూర్వం నీవు మూడు పాదాలతో ముల్లోకాల్నీ ఆక్రమించి, భయంకరుడైన బలిచక్రవర్తిని బంధించి దేవేంద్రుడికి త్రిలోకాధిపత్యాన్ని కట్టబెట్టావు.

సీతయే లక్ష్మీదేవి. నీవు ప్రకాశస్వభావం గల కృష్ణవర్ణుడవైన, ప్రజాపతి స్వరూపుడవైన విష్ణువు. నువ్వు రావణుణ్ణి వధించేందుకు మానవ శరీరాన్ని ధరించావు.

ధర్మాన్ని పోషించేవారిలో శ్రేష్ఠుడవైన ఓ రామా! నీవు రావణుణ్ణి చంపి మా కార్యాన్ని పూర్తి చేశావు. ఇక సంతోషంతో స్వర్గానికి తిరిగి వచ్చేయి. ఓ ప్రభూ! నీ వీర్యము అమోఘము. నీ పరాక్రమమం అమోఘం. నీ దర్శనం అమోఘం. నిన్ను స్తుతించటం అమోఘం.

ఈ భూలోకంలో నీయందు భక్తిగలవారి జీవితాలు సార్థక మవుతాయి. ప్రభువు,

నిత్యుడు, పురాతనుడు, పురుషులలో శ్రేష్ఠుడమూ అయిన నీ యందు భక్తి గలవాళ్ళ కోరికలన్నీ ఇహంలోనూ, పరంలోనూ కూడా నెరవేరుతాయి.

పురాతన ఇతిహాసాలకు సంబంధించిన ఈ దివ్యస్తోత్రాన్ని పఠించే మానవులకు ఎన్నడూ పరాభవం ఉండదు.

# 117వ సర్గ అగ్నిదేవుడు సీతాదేవిని స్తుతించడం

బ్రహ్మ చేసిన రామస్తోత్రం అంతా విని అగ్నిహోత్రుడు చితిలో నుండి మనుష్యాకారంలో సీతాదేవిని ఎత్తుకొని బయటకు వచ్చాడు. అగ్నిలో ప్రవేశించే ముందు సీతాదేవి ఎట్లా ఉందో చితి నుండి బయటకు వచ్చినప్పుడు కూడా అట్లాగే ఉంది. అలంకరించుకొన్న శుద్ధమైన బంగారు ఆభరణాలతోను, ధరించిన ఎర్రని వస్త్రాలతోను ఆ సీతాదేవి ఉదయసూర్యునివలె ప్రకాశించింది. ఆమె ధరించిన వస్త్రాలుగాని, పూలమాలలుగాని కొంచెం కూడా వాడిపోలేదు; నలిగిపోలేదు. ఇతర అలంకారాలేవీ చెక్కుచెదరలేదు. ఉంగరాలు తిరిగిన నల్లని తలవెంట్రుకలతో ఎటువంటి దోషాలులేని బాల అయిన ఆ సీతాదేవిని అగ్నిదేవుడు తన అంకముపైన కూర్చోపెట్టుకొని తీసుకొచ్చి రాముడికి ఒప్పగించి ఇలా అన్నాడు. “ఓ రామా! ఇదుగో! నీ సీత. ఈమెలో ఎటువంటి పాపమూ లేదు. ఈమె మనసావాచా కర్మణా నిన్ను ఎన్నడూ అతిక్రమించలేదు. ఈమె మంచి చరిత్ర గలిగిన పవిత్రురాలు. నీవు దగ్గర లేనప్పుడు, ఆ నిర్జనారణ్యంలో ఈమె దీనంగా వివశ అయిపోయి ఉన్నప్పుడు, రావణాసురుడు గర్వంతో తన పరాక్రమం చేత అపహరించి నిర్బంధించాడు. ఈమె నీ యందే మనస్సు లగ్నం చేసుకొని, నీవే గతి అని నమ్ముకొని జీవించింది. భయంకరమైన రాక్షసస్త్రీలు ఆమెను అనేక విధాలుగా బాధించినా ఈమె మనసు నీనుండి చెదరలేదు. రావణాసురుడు ఎన్నివిధాల భయపెట్టినా లెక్కచెయ్యలేదు. ఓ రామా! విశుద్ధభావం గలది, ఏ పాపమూ ఎరుగనిదీ అయిన ఈ సీతను స్వీకరించు. నా మాటకు ఎదురు చెప్పవద్దు. నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను” అని అన్నాడు.

ధర్మాత్ముడైన రాముడు చాలా సంతోషించాడు. కన్నులవెంట ఆనందబాష్పాలు దొర్లాయి. ఒక క్షణంసేపు ఆలోచించాడు. గొప్ప పరాక్రమవంతుడు, ధైర్యశాలి, ధర్మాన్ని పోషించేవారిలో శ్రేష్ఠుడూ అయిన రాముడు ఆ మాటలు విని బ్రహ్మదేవునితో ఇలా అన్నాడు. “ఓ దేవా! ఈ సీత ఏ పాపమూ ఎరుగదని ముల్లోకాల వాళ్ళకూ తెలియాలి. ఎందువల్లనంటే, మంగళప్రదురాలైన ఈ సీత రావణుని అంతఃపురంలో చాలాకాలం ఉండటం వలన, నేను ఈ జానకిని

పరీక్షించకపోయినట్లయితే, ‘ఈ దశరథరాముడు వట్టి మూఢుడనీ, కామమునకు వశుడైపోయాడనీ’ నలుగురూ నాలుగు విధాలుగా అనుకుంటారు. ఎల్లవేళలా నా మనస్సులో మెదిలే ఈ జనకపుత్రి అయిన సీత ఇతరులను మనసులో కూడా తలవదనీ, నా యందే భక్తి, ప్రేమ గలదనీ నాకు తెలుసు. మహాసముద్రం తీరాన్ని ఎట్లా దాటలేదో, అట్లాగే, తన తేజస్సుచేత రక్షించబడుతున్న ఈ సీతను రావణుడు తాకలేదు. సత్యాన్నే నమ్ముకున్న నేను, ముల్లోకాలకూ నమ్మకం కలగటానికే సీత అగ్నిలో ప్రవేశిస్తున్నా చూస్తూ ఊరకున్నాను; కావాలనే ఉపేక్షించాను. ఈ మంటలు మండే అగ్నిశిఖల్లాగా, పొందశక్యం కాని ఈమెను మనస్సులో అయినా అతిక్రమించే శక్తి, దురాత్ముడైన ఆ రావణునికి లేదు. మంగళప్రదురాలైన ఈ సీతకు రావణాసురుడి అంతఃపురంలోని ఐశ్వర్యాలతో పనిలేదు. కాంతి సూర్యుణ్ణి విడిచి ఉండనట్లు, సీత నన్ను విడిచి మరెవ్వరినీ కోరుకోదు. జనకపుత్రి అయిన సీతతో సమానమైన పవిత్రురాలు ఈ మూడులోకాల్లో కూడా లేదు. ఆత్మాభిమానం గలవాడు కీర్తిని ఎట్లా ఒదులుకోలేడో, అట్లాగే నేను కూడా ఈమెను వదులుకోలేను. నాయందు స్నేహంగల లోకపాలకులైన మీరంతా వచ్చి స్వయంగా చెప్పిన మంచిమాటల్ని తప్పక స్వీకరిస్తాను; ఆచరిస్తాను” అని అన్నాడు.

విజయం పొందినవాడు, గొప్ప బలవంతుడు, మహాసుఖములు అనుభవించవలసిన ఆ రాముడు తనకు తెలిసిందంతా చెప్పి, తాను చేసిన పనికి మహాత్ములైన బ్రహ్మాదుల చేత ప్రశంసింపబడుతూ ఉంటే, సీతాదేవిని దగ్గరకు తీసుకున్నాడు.

# 118వ సర్గ దశరథుణ్ణి రామలక్ష్మణులు చూడటం

చక్కగా మాట్లాడిన రాముడి మాటలు దేవతలంతా విన్నారు. మహేశ్వరుడు అంతకన్నా చక్కగా రాముడితో ఇలా అన్నాడు. "పద్మముల వంటి నేత్రములు గలవాడా! శత్రుసంహారకుడా! ధర్మాత్ములలో శ్రేష్ఠుడా! మా అదృష్టం కొద్దీ నీవు రావణాసురుణ్ణి సంహరించావు. రావణుడు లోకాలన్నింటినీ గజగజా వణికించాడు. నీవు తప్ప ఎవ్వరూ చేయలేని ఈ రావణసంహారాన్ని చేసి ముల్లోకాల్ని గాఢాంధకారం నుండి తప్పించావు. ఇందుకు ముల్లోకాలూ సంతోషిస్తున్నాయి.

ఓ మహాబలవంతుడా! రామా! ఇక నువ్వు అయోధ్యా నగరానికి పో. భరతుడు నీ కోసం దీనంగా ఎదురుచూస్తున్నాడు. నీ తల్లి కౌసల్యాదేవి నీపై ప్రాణాలు పెట్టుకొని బ్రతుకుతోంది. వెళ్ళి ఆమెను ఓదార్చు. లక్ష్మణుని తల్లి అయిన సుమిత్ర, నీ పినతల్లి కైకేయీలను ఓదార్చు. రాజ్యాభిషేకం చేసుకొని కలకాలం రాజ్యపాలన చెయ్యి. నీ బంధువుల్ని, మిత్రుల్నీ సంతోషపెట్టు. పుత్రులను కని ఇక్ష్వాకు వంశాన్ని వృద్ధి చెయ్యి. అశ్వమేధయాగం చేసి గొప్పకీర్తిని పొందు. బ్రాహ్మణులను, గోవులను పోషించు. ప్రజారంజకంగా పాలనచేసి ఆదర్శప్రాయమైన రామరాజ్యాన్ని స్థాపించు. అటుపిమ్మట నీ నిజధామమమునకు వెళ్ళు.

ఓ రామా! మానవ లోకంలో నీకు పూజ్యుడైన నీ తండ్రి దశరథమహారాజు ఈ విమానంలో ఉన్నాడు. నిన్ను పుత్రుడుగా పొందిన ఆయన జన్మ ధన్యమైంది. ఆయనిప్పుడు ఇంద్రలోకంలో ఉంటున్నాడు. నీవు లక్ష్మణుడితో కూడా వెళ్ళి ఆయనకు నమస్కారం చెయ్యి" అని అన్నాడు. మహేశ్వరుడి మాటలు విన్న రాముడు లక్ష్మణునితో కలసి విమానంలోకి పోయి నిర్మలమైన వస్త్రాన్ని ధరించి, దివ్యకాంతులతో ప్రకాశిస్తున్న తండ్రిని చూసి నమస్కరించారు. తన ప్రాణాలకన్నా ఎక్కువగా ప్రేమించేవాణ్ణి దగ్గరకు తీసుకొని ఒడిలో కూర్చోబెట్టుకొని కౌగలించుకొని దశరథుడు ఇలా అన్నాడు. "ఓ రామా! నేను ఉంటున్నది స్వర్గంలోనే అయినా ఆ స్వర్గసౌఖ్యాలు నన్ను సంతోషపెట్టడం లేదు. నన్ను ఇక్కడ దేవతలు, దేవర్షులు ఎంతో గౌరవంగా

చూస్తున్నారు. అయినా నాకు సంతోషంగా లేదు. మనశ్శాంతి లేదు. నేను నీకు నిజం చెప్తున్నాను. కుమారా! నీవు ఇప్పుడు శత్రుసంహారం చేశావు. వనవాసం గడువు పూర్తి అయింది. నాకు ఇప్పుడు చాలాసంతోషంగా ఉంది. ఓ రామా! నువ్వు మాట్లాడటంలో నేర్పరివి. ఆనాడు నిన్ను అడవులకు పంపేందుకు కైకేయి నాకు ఎన్నిమాటలు చెప్పిందో నాకు ఇంకా జ్ఞాపకం ఉన్నాయి. నువ్వు లక్ష్మణుడితో కూడా క్షేమంగా ఉన్నావు. మీ ఇద్దర్నీ ఇట్లా చూడటం నాకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తోంది. మీ ఇద్దర్నీ కౌగలించుకొన్న పిమ్మట సూర్యోదయంతో మంచు కరిగిపోయినట్లు నా దుఃఖం అంతా దూరమైపోయింది. కుమారా! పూర్వం జనకమహారాజు సభలో పరమధార్మికుడైన ఏకపాదుడనే బ్రాహ్మణుడుండేవాడు. వరుణుని కుమారుడు 'వంది' అతడిని శాస్త్రవాదంలో ఓడించాడు. అటుపిమ్మట ఏకపాదుడి కుమారుడు అష్టావక్రుడు, ఆ వందిని వాదంలో జయించి తండ్రిని తరింపజేశాడు. అట్లాగే, ఈనాడు పరమ పూజ్యమైన నీ స్వభావంతో నన్ను తరింపజేశావు.

ఓ సౌమ్యుడా! పురుషోత్తముడా! నీవు రావణసంహారం చెయ్యడం కోసం ఇంద్రాదులు నీ రాజ్యాభిషేకానికి విఘ్నం కలిగించారని నాకు ఇప్పుడే తెలిసింది. రామా! వనవాసకాలం గడువు ముగిసిపోయింది. ఇక నీవు అయోధ్యకు పో. శత్రుసంహారకుడవైన నిన్ను చూడబోయే ఆ కౌసల్య ఎంత అదృష్టవంతురాలో గదా! నీవు రాజ్యాభిషిక్తుడవైన తర్వాత నీ పాలనలో ఉండే జనులు ఎంతటి భాగ్యశాలురోగదా! అనురాగవంతుడు, పరిశుద్ధుడు, పరమధార్మికుడు అయిన భరతుడు, నీవు కలసి అయోధ్యానగరంలో ఉండగా మిమ్మల్ని చూడాలని కోరికగా ఉంది. కుమారా! నీవు సీతతోను, లక్ష్మణునితోను పద్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసం చేశావు. ఆ వనవాసం కాలం పూర్తి అయిపోయింది. నీవు చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చుకున్నావు. యుద్ధంలో రావణుణ్ణి సంహరించావు. దేవతలకు ప్రీతి కలిగించావు. ఓ శత్రుసంహారకుడా! ఇతరులెవ్వరూ చెయ్యలేని పనిని చేసి గొప్ప కీర్తిని సంపాదించావు. పోయి తమ్ములతో కలసి రాజ్యపాలన చెయ్యి. బహుకాలం సుఖాలు అనుభవించు" అని ఆశీర్వదించాడు.

అప్పుడు రాముడు చేతులు జోడించి నమస్కరిస్తూ "ఓ తండ్రీ! నువ్వు ధర్మాలన్నీ తెలిసినవాడవు. అప్పుడు నీవు కోపంలో కైకేయీదేవిని, భరతుణ్ణి 'విడిచేస్తున్నాను' అని అన్నావు. తండ్రీ! అంత ఘోరమైన శాపము వారికి అంటకుండేట్లు అనుగ్రహించు. నేను నిన్ను మరీమరీ వేడుకుంటున్నాను. నన్ను అనుగ్రహించు. నా ప్రార్థన మన్నించు" అన్నాడు. అంతట దశరథ మహారాజు రాముడి విన్నపాన్ని మన్నించాడు. ఆ తర్వాత లక్ష్మణుణ్ణి కౌగలించుకొని ఇలా అన్నాడు. "నాయనా! లక్ష్మణా నీవు సీతారాముల్ని భక్తితో సేవించావు. అందుకు నాకెంతో సంతోషంగా ఉంది. ధర్మఫలాన్ని పొందావు. ధర్మము తెలిసినవాడా! లక్ష్మణా! నువ్వు సీతారాములను సేవించటంవల్ల ఈ లోకంలో గొప్పయశస్సు పొందుతావు. రాముడి అనుగ్రహం సంపాదిస్తే స్వర్గం వంటి ఉత్తమ లోకాలు కూడా పొందగలవు. కుమారా! రాముడు ఎల్లప్పుడూ లోకహితాన్ని గురించే ఆలోచిస్తూ ఉంటాడు. నీవు అటువంటి రాముణ్ణి విడవకుండా సేవిస్తూ ఉండు. నీకు సమస్త శుభాలు కలుగుతాయి. ఇంద్రుడి పాలనలో ఉండే ముల్లోకాల్లోని సిద్ధులు, మహర్షులు మహాత్ముడైన రాముడి సన్నిధినే కోరుకుంటున్నారు. రాముణ్ణే పూజిస్తున్నారు. అవ్యక్తము, నాశరహితము, దేవతల హృదయము, పరమరహస్యము అయిన ఆ పరబ్రహ్మమే రాముడుగా అవతరించాడని చెప్తున్నారు. అటువంటి సీతారాములను భక్తితో సేవించి నీవు ధర్మానుష్ఠానాన్ని, అఖండ కీర్తినీ పొందావు" అని లక్ష్మణునితో అంటూ, ప్రక్కనే అంజలి ఘటించి నిలబడి ఉన్న సీతాదేవిని చూస్తూ ఇలా అన్నాడు. "ఓ పుత్రీ! సీతా! రాముడు నిన్ను 'విడిచి వేస్తాను' అని అన్నాడని అతడిపై కోపించకు. రాముడు నీ మంచికోసమే ఇదంతా చేశాడు. నీ పవిత్రచరిత్రని లోకానికి చూపటానికే నీతో అట్లా మాట్లాడాడు. అంతే! నీకు పతిసేవల్ని గూర్చి నేను చెప్పాల్సిన పని లేదు. అయినా, పెద్దవాడిని, నీకు మామగారినీ కావటాన చెప్తున్నాను. 'నీ భర్త అయిన ఈ రాముడే నీకు పరమ దైవము" అని చెప్పాడు.

రఘువంశ సంజాతుడైన దశరథమహారాజు పుత్రులకు, సీతకు ఈ విధంగా ఉపదేశించి ఇంద్రలోకానికి వెళ్ళిపోయాడు. గొప్పప్రభావం కలవాడూ, శోభతో కూడినవాడూ, రాజులలో ఉత్తముడూ అయిన దశరథుడు పులకించినదేహం గలవాడై, సీతారామలక్ష్మణులను ఆశీర్వదించి

స్వర్గానికి వెళ్ళాడు.

# 119వ సర్గ మహేంద్రుడి వరాలు

దశరథుడు వెళ్ళిపోయిన పిమ్మట, రాముడు పాకాసురుణ్ణి సంహరించిన మహేంద్రునికి అంజలి ఘటించి నమస్కరించాడు. మహేంద్రుడు రాముణ్ణి చూస్తూ ఇలా అన్నాడు. "ఓ రామా! నీవు మానవులలో శ్రేష్ఠుడవు. నీవు రావణాసురుణ్ణి సంహరించి దేవకార్యం పూర్తి చేశావు. లోకాలన్నీ సుఖశాంతులతో వర్ధిల్లేట్లు చేశావు. అందువల్లనే దేవతలమైన మేమంతా నీ వద్దకు వచ్చాం. మేమందరం వరాలు ఇవ్వగల సమర్థులం. కాబట్టి నీకు మా దర్శనం వృథాకారాదు. ఏదైనా వరం కోరుకో" అన్నాడు.

మహాత్ముడైన మహేంద్రుడు ప్రసన్నుడై ఇట్లా పలుకగా, ప్రసన్నమైన ముఖంగల రాముడు ఇలా అన్నాడు. "ఓ మహేంద్రుడా! నీవు చక్కగా మాట్లాడటంలో నేర్పుగల వాడవు. నీకు నామీద ప్రేమ ఉన్నట్లయితే, నేను కోరే కోరికను యథార్థం చెయ్యి. నా కోసం వానరయోధులు అందరూ భార్యాపిల్లల్ని వదలుకొని సంతోషంగా నా వెంట వచ్చారు. తమ ప్రాణాలైనా లెక్కచెయ్యకుండా పరమపరాక్రమంతో యుద్ధం చేశారు. నీవు వాళ్ళందరిపైనా అనుగ్రహం చూపాలి. వాళ్ళందరూ బ్రతికేట్లు చెయ్యాలి. వానరసైన్యంలో గోలాంగుల వీరులున్నారు; భల్లూక వీరులున్నారు; వానరులున్నారు. వారిలో కొంతమంది యుద్ధంలో మరణించారు. కొందరు వికలాంగులయ్యారు. మరికొందరు కారాగారాలలో బాధలు పడుతున్నారు. ఓ మహేంద్రుడా! నీవు అనుగ్రహించి వారందర్నీ బ్రతికించాలి. వికలాంగులంతా పూర్వం వలె బలపరాక్రమములు గలవారై ఉండాలి. రోగాలతో బాధలు పడేవారందరికీ సంపూర్ణారోగ్యాన్ని ప్రసాదించు. నీవు ఆశ్రితుల గౌరవాన్ని కాపాడేవాడవు. అంతేకాకుండా, వానరులు నివసించే ప్రదేశాల్లో, అన్ని కాలాల్లోనూ సమృద్ధిగా కందమూలాలు, ఫలపుష్పాలు వాళ్ళకు లభించేట్లు చెయ్యి. వారు నివసించే ప్రదేశాల్లో పారే నదులు, సరస్సులన్నింటిలోనూ సమృద్ధిగా నీరు ఉండేట్లు అనుగ్రహించు. ఇదే నేను నిన్ను కోరే వరం" అన్నాడు.

దేవేంద్రుడు రాముడి కోరిక విని చాలా సంతోషించాడు. "ఓ రామా! నీవు కోరిన వరం చాలా గొప్పది. ఉదాత్తమైనది. నేను ఆడినమాట తప్పను. నేను రెండు మాటలవాణ్ణి కాను. నీవు కోరినట్లే జరుగుతుంది. యుద్ధంలో రాక్షసుల చేతుల్లో మరణించిన వానరులు, గోలాంగూలాలూ, భల్లూక వీరులు అందరూ నిద్రపోయి లేచినట్లుగా లేచి కూర్చుంటారు. వాళ్ళకు ఎటువంటి గాయాలూ ఉండవు. వాళ్ళు పోగొట్టుకున్న శరీరావయవాలన్నీ తిరిగి పొందుతారు. ఏ రుగ్మతా లేకుండా ఆరోగ్యవంతులవుతారు. వాళ్ళంతా పరమానందంతో వెళ్ళి వారి స్నేహితులతో, బంధువులతో, భార్యాపిల్లలతో సుఖంగా ఉంటారు. వారు నివసించే ప్రదేశాలన్నింటిలోనూ కందమూలాలు, ఫలపుష్పాలు సమృద్ధిగా ఉంటాయి. నదుల్లో, సరస్సుల్లో నీరు సమృద్ధిగా ఉంటుంది" అని అన్నాడు.

దేవేంద్రుడు ఈ వరం అనుగ్రహించగానే మరణించిన వానరులు, గోలాంగూలాలు, భల్లూకాలన్నీ నిద్రపోయి లేచినట్లుగా లేచి కూర్చున్నారు. గాయాలతో బాధపడేవారు. వికలాంగులంతా పూర్వ బలపరాక్రమాలు కలిగినవారై గంతులు వేశారు. అట్లా చచ్చిబ్రతికిన వారంతా రాముడికి సాష్టాంగ నమస్కారాలు చేశారు. సుగ్రీవాది నాయకులంతా రాముణ్ణి అనేక విధాలుగా స్తుతించారు.

అక్కడ చేరి ఉన్న దేవతలంతా చేతులు కట్టి నమస్కరిస్తూ రాముణ్ణి స్తోత్రాలు చేశారు. మహేంద్రుడు ఇలా అన్నాడు. "ఓ రామా! నీవు వానరులందరినీ పంపించెయ్యి. ఈ మైథిలిని ఓదార్చు. సీతాలక్ష్మణులతో కలసి అయోధ్యకు పో. నీ తల్లులందరికీ సంతోషాన్ని కలిగించు. నీ కోసం కళ్ళు కాయలుకాచేట్లుగా ఎదురుచూస్తున్న భరత శత్రుఘ్నులను సంతోషపెట్టు, ఆదరించు. నీవు రాజ్యాభిషేకం చేసుకో. అయోధ్య పౌరులందర్నీ సంతోషపెట్టు. యుగయుగాలు వారు జ్ఞాపకం పెట్టుకునేట్లుగా రామరాజ్యాన్ని స్థాపించు.

అంతట సీతారామలక్ష్మణులు ఆ దేవతలందరికీ నమస్కారం చేశారు. దేవతలంతా దివ్యకాంతులతో తేజరిల్లే వారి వారి విమానాల్లో స్వర్గానికి ప్రయాణమై వెళ్ళారు.

రామలక్ష్మణులచే రక్షించబడుతున్న ఆ వానరసేన అంతా ఎంతో కీర్తిని సంపాదించి ఆ సంతోషంతో పూర్ణ చంద్రాకాంతులతో విరాజిల్లారు.”

# 120వ సర్గ విభీషణుడు పుష్పకవిమానాన్ని తేవటం

శత్రుసంహారకుడైన రాముడు ఆ రాత్రి అక్కడే సుఖంగా నిద్రపోయాడు. ఉదయానే విభీషణుడు వచ్చి అంజలి ఘటించి నమస్కరిస్తూ జయహో అంటూ కీర్తించాడు. “ఓ రామా! స్నానాదికాలకు చక్కటిజలాన్ని ఏర్పాటుచేశాను. ఆ జలాలన్నీ అంగరాగాలతోను, పుష్పమాలలతోను సుగంధ పరిమళాలు వెదజల్లుతున్నాయి. స్నానం చేయించడంలో ఈ యువతులు నిష్ణాతులు. నీకు శాస్త్రోక్తంగా మంగళస్నానాలు చేయిస్తారు. నా కోరిక మన్నించు” అని వేడుకొన్నాడు.

అందుకు రాముడు “మిత్రుడా! సుగ్రీవుడు మొదలైన వానరవీరు లందరూ మంగళస్నానాలు చెయ్యటానికి ఏర్పాట్లుచెయ్యి. నేను ఇప్పుడు మంగళస్నానాలు చెయ్యను. నాకంటె చిన్నవాడు, మహాబాహువు, ధర్మాత్ముడు అయిన నా తమ్ముడైన భరతుడు నాకోసం అయోధ్యలో పరితపిస్తున్నాడు. ఆ కైకేయిపుత్రుడు, నా కోసం ప్రతిజ్ఞ చేశాడు. కాబట్టి నేను భరతుణ్ణి చూసేంతవరకు మంగళాస్నానాలు చెయ్యను. నూతన వస్త్రాల్ని ధరించను. ఆభరణాలు పెట్టుకోను. అయోధ్య ఇక్కడకు చాలా దూరాన ఉంది. నేను వెంటనే బయలుదేరి అయోధ్యకు పోవాలి” అని చెప్పాడు.

రాముని మాటలు విన్న విభీషణుడు ఇలా అన్నాడు. “ఓ రామా! ఒక్క రోజులో నిన్ను అయోధ్యకు చేరుస్తాను. ఓ పరాక్రమవంతుడా! సూర్యునితో సమానమైన తేజస్సుగలదీ, మనోభావాలకు తగినట్లుగా ప్రయాణం చేసేదీ, ఉత్తమమైన పుష్పకవిమానాన్ని రావణాసురుడు యుద్ధంలో కుబేరుణ్ణి జయించి తన సొంతం చేసుకున్నాడు. కుబేరుడు వచ్చినా తిరిగి ఇవ్వకుండా నీ కోసమే ఉంచాను. నీవు ఆ విమానంపై అయోధ్యకు సుఖంగా చేరవచ్చును.

ప్రభూ! నాది ఒక చిన్నకోరిక. నీవు సర్వమూ తెలిసినవాడవు. నా మీద నీకు అనుగ్రహం ఉన్నట్లయితే, నాకు నీ ఎడల గల భక్తిభావాన్ని నీవు మెచ్చుకున్నట్లయితే, నా మీద నీకు

వాత్సల్యం ఉన్నట్లయితే, నీవు ఇక్కడ మంగళాస్నానాలు చెయ్యపోయినా, సీతాలక్ష్మణులతో కలసి ఒక రోజు అయినా ఇక్కడ ఉండు. నువ్వేకాదు. నీ సైన్యమంతా కూడా భోగ్యవస్తువులతో విందు ఆరగించి, నా పూజలు స్వీకరించి అటుపిమ్మట వెళ్ళవచ్చు. ఓ రామా! నీ యెడల ప్రేమతోను, భక్తితోను, గౌరవంతోను, స్నేహం చేతనూ నిన్ను బ్రతిమాలుకొంటున్నాను. నేను నీ సేవకుడను కాబట్టి నిన్ను ఆజ్ఞాపించలేను గదా!" అని ప్రార్థించాడు.

విభీషణుడి మాటల్ని రాముడు విన్నాడు. వానర నాయకులంతా అక్కడ ఉండగానే ఇలా అన్నాడు. "శత్రుసంహారకుడవైన ఓ వీరుడా! ఓ ప్రసన్నుడా! నీ ఆలోచనలతో నాకు గొప్ప సహాయం చేశావు. నాకోసం నీవు పరాక్రమాన్ని చూపించావు. నాతో ఉత్తమమైన స్నేహం చేశావు. నీవు నన్ను అన్నివిధాలుగా పూజించి సత్కరించావు. ఓ రాక్షసరాజా! నీవు చెప్పినట్లు చేయకుండా ఉండాలనే ఉద్దేశం నాకులేదు. అయితే నా మనస్సు అంతా నా తమ్ముడి మీదనే పీకుతోంది. ఓ విభీషణుడా! పూర్వం నేను చిత్రకూటంలో ఉండగా నన్ను ఒప్పించి అయోధ్యకు తీసుకొనిపోవాలని, నా తమ్ముడు భరతుడు ఎంతగానో ప్రయత్నం చేశాడు. కానీ అప్పుడు నేను ఒప్పుకోలేదు. వనవాసదీక్ష పద్నాలుగుసంవత్సరాలు కాగానే, వస్తానని మాట ఇచ్చాను. అందువల్లనే నా తమ్ముడిపై నా మనస్సు తొందర చేస్తోంది. నా మాతృదేవత, కౌసల్యాదేవిని నేను వెంటనే చూసి ఆమెను సంతోషపెట్టాలి. లక్ష్మణుడి తల్లి సుమిత్రాదేవిని చూడాలి. కీర్తివంతురాలైన నా పినతల్లి కైకేయీదేవిని చూడాలి. నా గురుదేవుల దర్శనం చేసుకోవాలి. మిత్రుడైన గుహుణ్ణి, పౌరులను, జానపదులను చూడాలని నా మనస్సు తొందరపెడ్తూంది.

ఓ సౌమ్యుడా! విభీషణుడా! నాకు అనుజ్ఞ ఇవ్వు. నీ ప్రేమచేత, నీ ఆదరణ వలన నీవు నన్ను పూజించినట్లుగానే భావిస్తున్నాను. ఓ మిత్రుడా! నాపై కోపగించుకోవద్దు. నేను నిన్ను బ్రతిమాలుకొంటున్నాను. విభీషణా! వెంటనే ఆ పుష్పకవిమానాన్ని తెప్పించు. పని అయిపోయిన తర్వాత ఇక్కడ ఉండటం సబబుగా ఉండదు" అని ఎంతో అనునయంగా అన్నాడు.

అంతట విభీషణుడు, లంకాపట్టణానికి పోయి పుష్పకవిమానాన్ని తీసుకొని వచ్చాడు. ఆ

విమానం మేరుశిఖరాన ఉంది. దాన్ని విశ్వకర్మ నిర్మించాడు. దాంట్లో ఉండే పరికరాలన్నీ బంగారంతో చిత్రవిచిత్రాలుగా అమర్చారు. ఆ విమానంలో వజ్రవైదూర్య మణిమయరత్నాలతో కూడిన వేదికలు, మంటపాలు నిర్మించారు. అవన్నీకూడా స్వచ్ఛమైన కాంతులతో తేజరిల్లాయి. ఆ బంగారువిమానంలో బంగారుపద్మాలచేత అలంకరించబడిన బంగారు మేడలున్నాయి. కిటికీలన్నీ ముత్యాలు, మణులు అలంకరించారు. ఆ విమానానికి చుట్టూ చిరుగంటలు అమర్చారు. అవి స్వచ్ఛమైన, మధురమైన ధ్వనులు చేస్తున్నాయి. విశ్వకర్మచే నిర్మించబడ్డ ఈ విమానం మేరుపర్వతమా? అన్నట్లు కనిపించింది. అటువంటి ఆ విమానాన్ని రాముడికి సమర్పించి విభీషణుడు అక్కడ నిలబడ్డాడు.

మహాబలశాలి అయిన రాముడు, లక్ష్మణసమేతుడై మేరుపర్వతం వలె ఉన్న ఆ విమానాన్ని చూసి ఆశ్చర్యపడ్డాడు.

# 121వ సర్గ పుష్పకవిమానంపై అయోధ్యకు బయలుదేరటం

ఆ పుష్పకవిమానాన్ని రాముని ఎదుట నిలిపి వినయంగా చేతులు జోడించి “ప్రభూ! ఇకపై నేను ఏమిచెయ్యాలో ఆజ్ఞాపించు” అన్నాడు. అంతట మహాతేజోవంతుడైన రాముడు లక్ష్మణునితో సంప్రదించి ఇలా అన్నాడు. “ఓ విభీషణా! ఈ వానరులందరూ తమ ప్రాణాలకు తెగించి వీరోచితమైన కార్యాలు చేశారు. నిజానికి వాళ్ళవల్లనే మనం విజయం సాధించగలిగాం. అందువల్ల వీళ్ళందర్నీ సత్కరించడం మన బాధ్యత. వీరందర్నీ రకరకాలైన వస్తువులు, వస్త్రాలు, మణిమయ రత్నాలు, ఆభరణాలను ఇచ్చి సత్కరించు; సంతోషపెట్టు. ఓ విభీషణా! ఉత్సాహవంతులు, యుద్ధంలో ప్రాణభయంలేకుండా విజయలక్ష్యంతో పనిచెయ్యడం వల్లనే నీవు లంకను జయించగలిగావు. వీళ్ళంతా ప్రాణాలకు తెగించి పని చేసినవాళ్ళే. కాబట్టి వీరందరినీ ధనంతోను, శ్రేష్ఠమైన వస్తువుల్తోను, సన్మానిస్తే వారికష్టానికి ఫలితం దక్కినట్లవుతుంది. కాబట్టి కృతజ్ఞుడవైన నీవు ఈ వానరులంతా సంతోషించే విధంగా సన్మానించు; వాళ్ళను ఆనందపరచు.

నువ్వు త్యాగశీలుడవు; అందర్నీ కలుపుకుంటూ పోయేవాడవు, దయగలవాడవు, జితేంద్రియుడవు అయినట్లయితే, వీళ్ళంతా నీతో చనువుగా మెదుల్తారు. అందుకనే ఇంత దూరం చెప్తున్నాను. రాజా! ప్రేమించే గుణంలేని రాజుతో యుద్ధానికి పోవటానికి సైనికులు ఇష్టపడరు. ఆ రాజును త్వరలో విడిచిపెట్టిపోతారు. కాబట్టి ఈ వానరులందర్నీ సత్కరించు” అన్నాడు. రాముని మాటలు విన్న విభీషణుడు వెంటనే వానరవీరులందర్నీ, ధనంతోను, రత్నాలతోను, ఘనంగా సన్మానించి సంతోషపెట్టాడు. అంతట వానరులంతా రత్నాలచేత, ధనం చేత సత్కరించబడిన పిదప రాముడు అత్యుత్తమమైన పుష్పకవిమాన్ని ఎక్కాడు. రాముడు విమానంలో కూర్చుని విభీషణుడు సుగ్రీవుడు మున్నగు వీరులతో ఇలా అన్నాడు. “ఓ వానరశ్రేష్ఠులారా! మీరంతా నాకు మీ స్నేహహస్తాన్నందించి నా కార్యాన్ని సాధించిపెట్టారు. మీ అందరికీ హృదయపూర్వకంగా నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఇక మీరంతా యథేచ్ఛగా మీ ఇష్టం వచ్చిన ప్రదేశాలకు పోవచ్చు. మీకు అనుజ్ఞ ఇస్తున్నాను.

ఓ సుగ్రీవుడా! స్నేహితుని హితంకోరే స్నేహితుడుగా నీవు చేయవలసిందంతా చేశావు. ధర్మాత్ము డవైన నీకు కృతజ్ఞతలు తెలుపుతున్నాను. ఇక నీవు నీ సైన్యాన్ని వెంటబెట్టుకొని కిష్కింధకు వెళ్ళు.

ఓ విభీషణుడా! ఈ లంకారాజ్యాన్ని నీ వశం చేశాను. ఇకపై నీ రాజ్యంలో సుఖం నివసించు. ఇంద్రునితో కలసి దేవతలంతా కలసివచ్చినా నిన్ను జయించలేరు. ఇక నేను నా తండ్రి రాజధాని అయిన అయోధ్యకు వెళ్తాను. మీ అందరీ అనుజ్ఞ కోరుతున్నాను. మీరంతా నాకు సెలవు ఇప్పించాలి" అన్నాడు.

రాముని మాటల్ని వానరులు, వానరనాయకులు, విభీషణుడు అంతా విన్నారు. అందరూ కలసి చేతులు జోడించి నమస్కరిస్తూ వినయంగా ఇలా అన్నారు. "మేము కూడా మీతో అయోధ్యకు రావాలని అనుకుంటున్నాము. మేమంతా అయోధ్యలోని ఉద్యానవనాల్లో సంతోషంగా విహరిస్తాం. రాజశ్రేష్ఠుడా! రాజ్యాభిషేకం చేయించుకొని పట్టాభిషిక్తుడవై ఉండగా నిన్ను చూడాలని కోరుకుంటున్నాము. అటుపిమ్మట కౌసల్యాదేవికి నమస్కరించి మా ఇళ్ళకు వెళ్తాం. మమ్మల్ని కూడా అయోధ్యకు తీసుకొని వెళ్ళమని కోరుకుంటున్నాం" అన్నారు. వానరులు, విభీషణుడు ఈ విధంగా పలుకగా, ధర్మాత్ముడైన రాముడు ఇలా అన్నాడు. "మిత్రులారా! నాకు ప్రాణస్నేహితులైన మీ అందరితో కలసి అయోధ్యకు పోవడం నాకు పరమానందాన్ని కలిగిస్తుంది. ఓ సుగ్రీవుడా! వానరులందరితో కలసి వెంటనే విమానం ఎక్కి కూర్చోండి. రాక్షసరాజా! విభీషణా! నీవు కూడా నీ మంత్రులతో కలసి విమానంలోకి ఎక్కి కూర్చోండి" అన్నాడు.

తరువాత సుగ్రీవుడు వానరులతోను, విభీషణుడు అమాత్యులతోను సంతోషంగా ఆ దివ్యవిమానం ఎక్కి కూర్చున్నారు. వాళ్ళంతా ఎక్కి కూర్చున్న పిదప, రాముని ఆజ్ఞతో ఆ పుష్పకవిమానం ఆకాశంలోకి ఎగిరింది. ఆ విమానం నాలుగుప్రక్కలా హంస ప్రతిమలతో ప్రకాశిస్తూ ఉండగా, రాముడు పరమసంతోషంతో కూర్చున్నాడు. అప్పుడు అంతా రాముణ్ణి

కీర్తిస్తూ ఉంటే రాముడు కుబేరుడివలె విరాజిల్లాడు. అంతమంది వానరులు, భల్లూకాలు సుఖంగా కూర్చుని ప్రయాణం చేశారు.

# 122వ సర్గ రాముడు సీతతో సంభాషించటం

రాముని అనుమతితో ఆ విమానం వాయువేగంతో ఆకాశాన ప్రయాణం సాగించింది. అప్పుడు రఘువంశానికి ఆనందదాయకుడైన రాముడు నాలుగుప్రక్కలా దృష్టి సారించి, చంద్రబింబం వంటి ముఖం గల సీతాదేవితో ఇలా అన్నాడు.

"ఓ సీతా! కైలాసశిఖరం వలె త్రికూటశిఖరంపై విశ్వకర్మ లంకా పట్టణాన్ని నిర్మించాడు. వానరులు, రాక్షసులు ఒకరినొకరు ఘోరంగా చంపుకొన్నారు. వారి రక్తమాంసాలతో నేలంతా ఎట్లా బురదగా తయారైందో చూడు. రాక్షసరాజైన రావణాసురుడు బ్రహ్మ నుండి వరాలు పొంది లోకాల్ని పీడించసాగాడు. చివరకు అతడు నా చేతిలో మరణించాడు. అదిగో అక్కడ కుంభకర్ణుడు చంపబడ్డాడు. అక్కడే ప్రహస్తుడు కూడా చంపబడ్డాడు. ఇక్కడ ధూమ్రాక్షుడు హనుమంతుడి చేతిలో మరణించాడు. మహాత్ముడైన సుషేణుడు, విద్యున్మాలిని ఇక్కడే చంపాడు. రావణాసురుడి పుత్రుడు, గొప్పమాయావి అయిన ఇంద్రజిత్తు మన లక్ష్మణునిచేతిలో మరణించాడు. వికటుడనే రాక్షసుణ్ణి అంగదుడు చంపాడు. మహాబలశాలురు, ఎదిరించడానికే అలవికాని విరూపాక్షుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు, అకంపనుడు, త్రిశిరస్సు, అతికాయుడు, దేవాంతకుడు, నరాంతకుడు మున్నగు అనేకమంది రాక్షసశ్రేష్ఠులు ఇక్కడ వానరయోధుల చేతుల్లో ఘోరంగా చంపబడ్డారు. యుద్ధోన్మత్తుడు, మత్తుడు అనే ఇద్దరు రాక్షసప్రముఖులు, కుంభుడు, నికుంభుడు అనే కుంభకర్ణుని పుత్రులిద్దరూ ఇక్కడ చంపబడ్డారు. మహాబలశాలి, ఎదిరింపశక్యంకాని మకరాక్షుణ్ణి నేను సంహరించాను. ఈ మహాయుద్ధంలో మహాపరాక్రమవంతులైన అకంపనుడు, శోణితాక్షుడు, యూపాక్షుడు, ప్రజంఘుడు, కూడా ఇక్కడ చంపబడ్డారు. చూడటానికే భయంపుట్టించే విద్యుజ్జిహ్వుడు, యజ్ఞశత్రువు, సుప్తఘ్నుడు, సూర్యశత్రువు, బ్రహ్మశత్రువు చంపబడ్డారు. ఇక్కడే రావణాసురుడి శరీరంపై పడి అతడి పట్టపురాణి మండోదరి, ఆమె వెయ్యిమంది సవతులు దీనంగా విలపించారు.

సుందరమైన ముఖంగల సీతా! ఇక్కడ కనబడేదే, మేమంతా సముద్రందాటి మొట్టమొదట లంకలో కాలుపెట్టిన సముద్రతీరం. ఓ సీతా! నీ కోసం, నా ఆజ్ఞపై నలుడు సముద్రంపై నిర్మించిన సేతువు. ఓ సీతా! ఈ విశాలమైన సముద్రాన్ని చూడు. ఇది మా పూర్వీకుడైన సగరుడిచే త్రవ్వించబడ్డది. ఈ సముద్రానికి ఆవలి గట్టులేదా? అన్నంత విశాలమైనది. ఇదే వరుణదేవుని నివాసం. ఎల్లవేళలా గర్జిస్తూ ఉండే ఈ సముద్రం శంఖాలు, ముత్యాలు, రత్నాలతో సమృద్ధిగా ఉంటుంది. ఓ సీతా! హనుమంతుడు నిన్ను వెతుకుతూ ఈ సముద్రాన్ని దాటి వచ్చేటప్పుడు, బంగారుకాంతులతో విలసిల్లే ఈ మైనాకపర్వత శిఖరం సముద్రాన్ని ఛేదించుకొని పైకి వచ్చింది; హనుమంతుణ్ణి విశ్రాంతి తీసుకోమని ప్రాధేయపడింది. ఇది సముద్రంపైన నలుడిచే నిర్మించిన సేతువు. ఇక్కడే సర్వసమర్థుడైన శివభగవానుడు నన్ను అనుగ్రహించాడు. ఈ సముద్రతీరమే 'సేతు బంధనము' అనే పేరుతో ప్రసిద్ధి చెందింది. ఈ పవిత్ర క్షేత్రాన్ని ముల్లోకాల వారూ సేవిస్తారు. ఇక్కడే విభీషణుడు నన్ను కలుసుకున్నాడు.

ఓ సీతా! అదుగో అక్కడ దూరాన కనిపిస్తున్నదే కిష్కింధానగరం; సుగ్రీవుడి రాజధాని. అది చాలా సుందరమైననగరం. ఇక్కడ చిత్రివిచిత్రమైన వనాలు అనేకం ఉన్నాయి. ఈ వనాల్లోనే నేను వాలిని సంహరించాను" అన్నాడు. వాలి పరిపాలించిన కిష్కంధానగరాన్ని సీతాదేవి చూసింది. అప్పుడు రాముడితో పరమసంతోషంతోను, వినయంగానూ ఇలా అంది. "రాజా! తార మొదలైన సుగ్రీవుని ప్రియభార్యలను, ఇతర వానరస్త్రీలను మన రాజధాని అయిన అయోధ్యకు తీసుకొని వెళ్ళాలని ప్రార్థిస్తున్నాను" అంది. అందుకు అంగీకరించిన రాముడు విమానాన్ని నిలిపి, సుగ్రీవుడితో ఇలా అన్నాడు. "వానరరాజా! మీరందరూ మీ స్త్రీలతో కలసి అయోధ్యకు రావాలని సీత కోరుకొంటోంది. నీవు కూడా నీ భార్యలందరినీ తీసుకొని త్వరగా వచ్చి విమానంలో కూర్చోండి" అన్నాడు. అమితమైన తేజస్సుగల రాముడి మాటలు విన్న వానర ప్రభువు, శ్రీమంతుడు అయిన సుగ్రీవుడు వెంటనే అంతఃపురంలోకి వెళ్ళి తారతో ఇలా అన్నాడు: "ప్రియురాలా! వానరవీరుల భార్యలందరినీ నీ వెంట తీసుకొని అయోధ్యకు రావాలని ఆ సీతాదేవి కోరుతోంది. సీతను సంతోష పెట్టేందుకు రామప్రభువు అనుజ్ఞ ఇచ్చాడు. కాబట్టి నీవు

వానర స్త్రీలందరినీ వెంటబెట్టుకొని వాళ్ళందరికీ అయోధ్యా నగరాన్నీ, దశరథుని భార్యల్నీ చూపుదాం.” అంతట తార వానరస్త్రీలందరినీ పిలిచి ఇలా అంది. “ఓ వానరధీరపత్నులారా! మనమందరం అయోధ్యకు వెళ్ళడానికి, సుగ్రీవుడు, మిగిలిన వానరులు అనుజ్ఞ ఇచ్చారు. నాకు కూడా మీ అందరితో అయోధ్య చూడాలని కోరికగా ఉంది. రాముడు అయోధ్యానగరం చేరగానే ఆయనను అక్కడి పౌరులు, జానపదులు ఘనంగా ఆహ్వానిస్తారు. మనం అందరం ఆ వేడుకల్ని చూద్దాం. త్వరగా బయలుదేరి రండి” అని చెప్పింది. అంతట ఆ వానరాంగనలంతా తార వెంట బయలుదేరి విమానానికి ప్రదక్షిణపూర్వకంగా నమస్కరించి ఆ విమానం ఎక్కి కూర్చున్నారు. విమానం ఆకాశంలోకి దూసుకుపోయింది. అప్పుడా విమానం ఋష్యమూక పర్వతంపైగా ప్రయాణిస్తున్నప్పుడు రాముడు సీతతో ఇలా అన్నాడు. “ఓ సీతా! ఈ పర్వతాన్ని చూడు. ఇదే ఋష్యమూక పర్వతం. బంగారు కాంతులతో తేజరిల్లుతూ ఉంటుంది. ఈ పర్వతం అంతా గైరికాది ధాతువుల్తో మెరిసిపోతూ ఉంటుంది. మెరుపులు మెరిసే మేఘమా? అన్నట్లు ఉంటుంది. ఇక్కడే నేను వానరరాజు సుగ్రీవుణ్ణి కలుసుకున్నాను. ఇక్కడే వాలిని చంపి కిష్కింధకు రాజును చేస్తానని సుగ్రీవుడికి ప్రతిజ్ఞ చేశాను. ఈ పర్వతం ప్రక్కగా పంపానది ప్రవహిస్తూ ఉంటుంది. ఆ నదీతీరాన కూర్చుని నీ ఎడబాటు సహించలేక అలవికాని దుఃఖంతో విలపించేవాణ్ణి. ఈ పంపానదీ తీరానే తాపసి అయిన శబరిని చూశాను. ఇక్కడే యోజనం దూరం వరకూ చేతులుచాపుకొని ప్రాణుల్ని చంపితినే కబంధుణ్ణి సంహరించాను. ఓ సీతా! ఈ ప్రదేశాన్ని చూడు. ఇక్కడ కనిపించే వృక్షం దగ్గరే జటాయువు రావణాసురుడితో ఘోరంగా యుద్ధం చేసి ప్రాణాలు వదిలాడు. ఇదుగో ఇటు చూడు. ఇదే జనస్థానం. ఇక్కడే మహాపరాక్రమవంతులైన ఖరదూషణాదుల్ని నేను సంహరించాను. ఇదే మనోహరమైన మన ఆశ్రమం. అందులోనే మన పర్ణశాల ఉంది. రావణాసురుడు నిన్ను అపహరించుకొని పోయింది ఈ పర్ణశాల నుండే. ఓ సీతా! మంగళకరమైనదీ, మనోహరమైనదీ అయిన పవిత్రగోదావరీ తీరానే అగస్త్యమహర్షి ఆశ్రమం ఉంది. అదుగో మహాత్ముడైన సుతీక్ష్ణుని ఆశ్రమం ఎట్లా దివ్యకాంతులతో విరాజిల్లుతోందో చూడు! ఈ ఆశ్రమానికి సమీపానే శరభంగాశ్రమం కూడా ఉంది. మనం ఈ ఆశ్రమంలో మహర్షిని సేవిస్తూ ఉన్నప్పుడే దేవేంద్రుడు ఇక్కడకు వచ్చి వెళ్ళాడు. ఓ సీతా!

మహాకాయుడైన విరాధుణ్ణి నేను వధించి ఇక్కడే! ఇక్కడికి దగ్గరలోనే సూర్యవైశ్వానర ప్రభలతో వెలుగొందే అత్రిమహర్షి ఆశ్రమాన్ని సేవించుకున్నాం. ఇవిగో చూడు. ఈ ఋష్యాశ్రమపదాలు కనబడుతున్నాయి. ఇదుగో ఇక్కడే కైకేయిపుత్రుడు భరతుడు నన్ను ప్రసన్నుణ్ణి చేసుకొని తిరిగి అయోధ్యకు తీసుకొనిపోవాలని వచ్చి మనల్ని కలుసుకున్న త్రికూటపర్వతం. అదుగో ఆ దూరంగా కనిపించేదే యమునాతీరం. దాని సమీపానే సుందరమైన వనాలతో కూడిన భరద్వాజ ఆశ్రమం. మనం ఆ రోజు రాత్రి ఆయన ఆతిథ్యం స్వీకరించాం. ఆ కనిపించేదే ముల్లోకాల్నీ పావనం చేస్తున్న గంగానది. ఆ పవిత్ర నదీతీరాన రకరకాలైన పక్షులు విహరిస్తున్నాయి. రంగురంగుల ఫలపుష్పాలతో కూడి వృక్షసముదాయంతో కూడిన అడవులు ఉన్నాయి. మనల్ని గుహుడు వచ్చి కలుసుకున్న శృంగిబేరపురాన్ని నీవు ఇప్పుడు చూస్తున్నావు. ఇక్కడ దట్టమైన అడవుల్లో యజ్ఞయాగాదులు చేసినట్లు గుర్తు ఉన్న ఆ యూపస్తంభాల్ని చూడు. అటుపైన దూరంగా మా నాయనగారి రాజధానీనగరం అయోధ్య కనిపిస్తోంది. దైవకృప చేత మళ్ళీ మనం మన నగరాన్ని చేరుకుంటున్నాం. నీవు ఇప్పుడు మన నగరానికి నమస్కారం చెయ్యాలి" అని చెప్పాడు.

రాముడు ఇట్లా చెప్తూ ఉంటే వింటున్న సుగ్రీవుడు, విభీషణుడు, ఇతర వానరులంతా సంతోషంతో ఆ విమానంలోనే గంతులు వేశారు. మంగళకరమైన ఆ మహానగరాన్ని చూస్తూ సంబరపడిపోయారు. అప్పుడు వానరులు, రాక్షసులు కూడా తెల్లనిమేడల్ని, విశాలమైన వీథుల్ని, ఏనుగులు, గుర్రాలతో నిండిన రాజవీథుల్ని ఇంద్రుడి అమరావతి వలె ఉన్న ఆ అయోధ్యా నగరాన్ని చూశారు.

# 123వ సర్గ రాముడు భరద్వాజ మహర్షిని దర్శించడం

పద్నాలుగుసంవత్సరాలు పూర్తి అయిన తర్వాత పంచమినాడు రాముడు సీతాలక్ష్మణసమేతంగా భరద్వాజమహర్షి ఆశ్రమానికి వెళ్ళాడు. ఆ మహర్షికి భక్తిపూర్వకంగా నమస్కారం చేశారు. అప్పుడు రాముడు మహర్షితో ఇలా అన్నాడు. “పూజ్యుడా! అయోధ్యానగరంలో అంతా సుభిక్షంగా ఉన్నదా? ప్రజలంతా సుఖశాంతులతో ఉన్నారా? భరతుడు రాజ్యపాలన చక్కగాచేస్తున్నాడా? అక్కడి విషయాలు ఏమైనా మీకు తెలుస్తున్నాయా? మా తల్లులందరూ క్షేమమే కదా?” రాముడి మాటలు విన్న భరద్వాజమహర్షి చిరునవ్వుతో ఇలా అన్నాడు. “రామా! భరతుడు మురికిపట్టిన శరీరంతో జటాధారియై నీ పాదుకలను ముందుపెట్టుకొని నీ కోసం ఎదురుచూస్తున్నాడు. నీ తల్లులు, మిగిలిన నీ పరివారం అంతా క్షేమమే.

యుద్ధములందు జయంపొందువాడా! ఓ రామా! పూర్వం నీ తండ్రి కైకేయికి ఇచ్చిన వరాలు సత్యం చెయ్యటానికి, నీవు తండ్రి ఆజ్ఞను శిరసావహించావు. ధర్మం ఆచరించటానికై రాజ్యభోగాల్ని త్యాగం చేశావు. అడవుల్లో కందమూలాలు తింటూ తమ్మునితోను, భార్యతోను కలసి కాలినడకన అరణ్య ప్రవేశం చేశావు. అప్పుడు నిన్ను చూసి నాకు చాలా జాలికలిగింది. కానీ ఇప్పుడో, మహాశత్రువును సంహరించావు, కార్యాన్ని సాధించావు. భార్యతోను, తమ్మునితోనూ నన్ను చూసేందుకు వచ్చావు. ఈనాడు నాకు చాలాసంతోషంగానూ, గర్వంగానూ ఉంది.

ఓ రామా! నీవు జనస్థానంలో ఉండగా సుఖాలు అనుభవించావు. దుఃఖాలు అనుభవించావు. ఆ విషయాలన్నీ నాకు పూర్తిగా తెలుసు. బ్రాహ్మణుల ప్రార్థనను మన్నించి వారందరికీ రక్షణ కల్పించావు. మహాపతివ్రత అయిన నీ భార్యను రావణాసురుడు అపహరించాడు.

ఓ ధర్మరక్షకుడా! రామా! మారీచుడు మాయామృగంగా రావడం, అప్పుడు సీతాదేవిని రావణుడు అపహరించుకొనిపోవడం, నీవు కంబంధుణ్ణి చంపడం, పంపాసరస్సుకు వెళ్ళడం, సుగ్రీవుడితో స్నేహం చెయ్యడం, వాలిని హతమార్చడం, వానరులచేత సీతాన్వేషణ చేయించడం, హనుమంతుడు సముద్రాన్ని లంఘించి లంకకు జేరడం, ఆతడు లంకా దహనం చెయ్యడం, సీతావృత్తాంతాన్ని నీకు తెలియజేయడం, నీవు నలుడి చేత సేతువును నిర్మించడం, వానరులు ఉత్సాహంతో రాక్షసులతో యుద్ధం చెయ్యడం, రావణాసురుణ్ణి అతడి పుత్రుల్ని, బంధువుల్ని, సర్వసైన్యాన్ని సంహరించడం, దేవతలంతా ప్రత్యక్షంకావడం, దేవేంద్రుడు వరం ఇవ్వడం మొదలైన విశేషాలన్నీ నా తపోబలంచేత ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే ఉన్నాను. ఇంతటి మహత్కార్యాన్ని సిద్ధి చేసుకొని తిరిగి నా ఆశ్రమానికి వచ్చిన నీకు ఏదైనా వరం ఇద్దాం అని అనుకుంటున్నాను. కోరుకో" అన్నాడు.

భరద్వాజమహర్షి పలికిన మాటలు విన్న రాముడు, నమస్కారం చేసి, "ఓ మహాత్ముడా! నేను ఇప్పుడు అయోధ్యానగరం వెళ్తున్నాను. నేను పోయేదారిలో వృక్షాలన్నీ కాలం అయినా, అకాలం అయినా సరే, సమృద్ధిగా ఫలాలు అందించాలి. చక్కగా తేనెలు కురిపించే పుష్పాలు పూస్తూ ఉండాలి. ఇదే నేను మిమ్మల్ని కోరుకునే వరం" అని అన్నాడు. అందుకు భరద్వాజ మహర్షి 'తథాస్తు' అనడం, అప్పటికప్పుడే అరణ్యాల్లోని వృక్షాలన్నిటికీ, స్వర్గంలో కల్పవృక్షాల్లాగా, కోరుకున్న పండ్లు పండాయి. అంతవరకూ పూలుపూయని చెట్లు పూలు పూశాయి. అంతవరకూ కాయలుగా ఉన్న వృక్షాలన్నీ ఫలవృక్షాలయ్యాయి. చెట్లనిండా పూలు విరగబూశాయి. ఎండిపోయిన చెట్లన్నీ చిగిర్చాయి. వృక్షాల నుండి తేనెలు కారాయి. అయోధ్యానగరానికిపోయే మూడు యోజనాల దూరం ఫలాలతోను, మధువులతోను 'మధువనా' లయ్యాయి. అప్పుడు వానర వీరులందరూ పరమసంతోషంతో తృప్తిగా ఫలాలు తిన్నారు. కడుపు నిండా మధువు త్రాగారు.

# 124వ సర్గ హనుమంతుడు భరతుని కలుసుకోవడం

అప్పుడు రాముడు అయోధ్యనుగూర్చి ఆలోచించాడు. హనుమంతుణ్ణి పిలిచి ఇలా అన్నాడు. "ఓ హనుమంతుడా! నీవు ఇప్పుడు అయోధ్యకు పోయి అక్కడ రాజభవనంలో అందరి క్షేమమూ తెలుసుకొని రావాలి. ముందుగా శృంగిబేరిపురం వెళ్ళు. అక్కడ నిషాదరాజు గుహుణ్ణి కలుసుకో. నాకు అతడు చాలా దగ్గరి స్నేహితుడు. నేను క్షేమంగా ఉన్నానని చెప్పు. అతడు చాలా సంతోషిస్తాడు. అతణ్ణి అయోధ్యకు వెళ్ళే దారి అడిగి తెలుసుకో. అతడు దారి చూపడమే కాకుండా భరతుడి యోగక్షేమాలు కూడా చెబుతాడు. అక్కడ నుండి నీవు భరతుడి దగ్గరకు పో. అతడితో నేను, నా భార్యసీత, తమ్ముడు లక్ష్మణుడు క్షేమంగా ఉన్నామని చెప్పు. నేను కృతార్థుణ్ణి అయ్యానని చెప్పు. బలవంతుడైన రావణాసురుడు సీతాదేవిని అపహరించుకొనిపోవడం, సుగ్రీవుడితో నా స్నేహం, ఆ పిమ్మట వాలిని వధించిన వృత్తాంతం అతడితో చెప్పు. సీతాన్వేషణ కార్యంలో నీవు అత్యధికమైన పరాక్రమం చూపిన వైనాన్ని, సముద్రాన్ని దాటి లంకను చేరి సీతాదేవిని నీవు ఎలా కనుక్కున్నావో చెప్పు. నేను వానరసేనతో సముద్రతీరాన్ని చేరుకోవటం, రావణవధ జరగటం, ఆ పిదప బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలు ప్రత్యక్షమై వరాలు ఇవ్వడం, మహేశ్వరుడి అనుగ్రహం చేత నా తండ్రిగారైన దశరథ మహారాజును కలుసుకున్నానని చెప్పు. ఓ సౌమ్యుడా! నేను సుగ్రీవుడితోను, విభీషణుడితోను వచ్చినట్లు భరతునికి చెప్పు. రాముడు బలవంతులైన శత్రువుల్ని సంహరించి, ఉత్తమకీర్తిని పొంది మహాబలవంతులైన మిత్రులతో కలసి వస్తున్నాడని చెప్పు.

ఓ హనుమంతుడా! ఈ మాటలు విన్న తర్వాత భరతునిలో కనిపించే మార్పులను జాగ్రత్తగా పరిశీలించు. నన్ను గూర్చిన అతడి మనోభావాలు ముఖాన కొట్టొచ్చినట్లు తెలుస్తాయి. చూపుల్లోను, మాటల్లోనూ భరతుని మనోభావాలను తెలుసుకో. ఈ అయోధ్యసామ్రాజ్యం మా తండ్రి తాతల కాలం నుండి మాకు సంక్రమిస్తోంది. భోగభాగ్యాలు సమృద్ధిగా లభిస్తాయి. ఏనుగులు, గుర్రాలు, రథములతో కూడి సమస్తహంగులూ సమకూరి ఉన్న అందులో

పద్నాలుగుసంవత్సరాలు యథేచ్ఛగా అనుభవిస్తూ ఇప్పుడు విడిచిపోవాలంటే ఎవరికైనా కష్టంగానే ఉంటుంది. నా తమ్ముడు భరతుడు రఘువంశంలో జన్మించాడు. సమస్త భూమండలాన్నీ అతణ్ణి పరిపాలించనీ. అంతేకాకుండా అతడికి పద్నాలుగుసంవత్సరాల పరిపాలనా అనుభవం ఉంది. అతడే రాజ్యభారాన్ని వహించాలనుకుంటే అట్లాగే కానిమ్మను.

ఓ హనుమంతుడా! భరతుని ఆలోచనలు, ప్రయత్నాలు తెలుసుకొని, త్వరగా వచ్చెయ్యాలి. మేము అయోధ్యకు బాగా దూరంగా ఉండగానే వచ్చెయ్యాలి సుమా."

అంతట హనుమంతుడు రాముని ఆజ్ఞను శిరసావహించి మానవరూపంలో అయోధ్యకు బయలుదేరాడు. పరాక్రమవంతుడైన హనుమంతుడు వాయువేగంతో ఆకాశమార్గాన, గంగా, యమునా సంగమాన్ని దాటి శృంగిబేరిపురం చేరాడు. గుహుని కలసి ఇలా అన్నాడు. "ఓ గుహుడా! నీకు పరమమిత్రుడూ, రఘువంశసంజాతుడు, సత్యమైన పరాక్రమం గలవాడూ, సీతాలక్ష్మణులతో కలసి ఉన్న రాముడు క్షేమంగా ఉన్నట్లు నీతో చెప్పమన్నాడు. ఈనాడు పంచమితిథి కావటాన భరద్వాజ మహర్షి కోరికపైన ఈ రాత్రికి ఆయన ఆశ్రమంలోనే గడుపుతాడు. రేపు ఉదయానే ఆ మహర్షి అనుమతి తీసుకొని బయలుదేరుతాడు. త్వరలో నీ స్నేహితుడైన రాముణ్ణి చూస్తావు." ఆ పైన ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా, గొప్పతేజస్సు గల వాయుపుత్రుడు, మరొక ఆలోచన లేకుండా భరతుణ్ణి చూసేందుకు బయలుదేరాడు. దారిలో హనుమంతుడు పరశురామ తీర్థాన్ని, వాలుకినీ నదిని, వరూథీ నదిని, గోమతీ నదిని, సాలవృక్షపు అడవుల్ని, లక్షలాది జానపదుల్ని చూస్తూ నందిగ్రామ సమీపానికి చేరుకున్నాడు. ఆ ప్రదేశాలన్నీ మనోహరమైన వనాలతో ఇంద్రుని నందనవనాన్ని, కుబేరుడి చైత్రరథ వనాల వలె కనిపించాయి. అక్కడ స్త్రీలు, పిల్లలు, వృద్ధులూ ఆనందంగా జీవిస్తూ ఉండటం చూశాడు.

అయోధ్యానగరానికి క్రోసుడు దూరాన నందిగ్రామంలో భరతుడు ఆశ్రమాన్ని నిర్మించుకొని జీవిస్తున్నాడు. హనుమంతుడు ఆ ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ నారచీరలు, కృష్ణాజనము ధరించి కృశించిపోయి దీనంగా ఉన్న భరతుణ్ణి చూశాడు. తలనిండా జడలు పెరిగి

ఒంటినిండా మురికిపట్టిన దేహంతో కనిపించాడు. అతడు కందమూలాలు, ఫలాలు మాత్రమే తింటూ, ఇంద్రియాల్ని నిగ్రహించుకొని తాపసధర్మాన్ని ఆచరిస్తున్నాడు. పరిశుద్ధమైన మనస్సుతో నియమనిష్ఠలను పాటిస్తూ బ్రహ్మర్షితో సమానమైన తేజస్సుతో ప్రకాశిస్తున్న ఆ భరతుడు, రామపాదుకలను ఎదుట ఉంచుకొని పూజిస్తూ రాజ్యపాలన చేస్తున్నాడు. నాలుగు వర్ణాలవారూ ఎటువంటి భయాలు లేకుండా సుఖసంతోషాలతో జీవిస్తున్నారు. పరిశుద్ధులైన మంత్రులు, పురోహితులు, సేనానాయకులు కూడా కాషాయవస్త్రాలు ధరించి అతడికి దగ్గరగా కూర్చున్నారు. రాకుమారుడైన భరతుడే నారచీరలు ధరించి, ఏ భోగాలూ అనుభవించకుండా ఉంటే, అయోధ్యావాసులు కూడా భోగాలపై విరక్తులై జీవించసాగారు. సకల ధర్మాలూ తెలిసిన మరొక ధర్మదేవతా? అన్నట్లుగా ఉన్న భరతుణ్ణి హనుమంతుడు చూశాడు. వినయంగా అంజలి ఘటించి నిలిచి హనుమంతుడు ఇలా అన్నాడు.

"ప్రభూ! నారచీరలు ధరించి దండకారణ్యంలో నివసిస్తున్న నువ్వు ఎవరికోసం దుఃఖీస్తున్నావో, నీ అన్న అయిన ఆ రాముడు నీ క్షేమం అడిగి తెలుసుకోమన్నాడు. నిన్ను సంతోషపెట్టే విషయాలు కొన్ని చెబుతాను. విను. ఇక దుఃఖీంచడం మానెయ్యి. రాముడు ఈ క్షణానే నీ ప్రక్కనే ఉన్నంత దగ్గర్లోకి వచ్చాడు.

ఓ రాజా! రామప్రభువు రావణాసురుణ్ణి సంహరించాడు. సీతాదేవిని పొందాడు. చేయదగిన పనులన్నింటినీ పూర్తిచేశాడు. మహాబలశాలురైన మిత్రుల్ని వెంటబెట్టుకొని వస్తున్నాడు. దేవేంద్రుని వెంట శచీదేవివలె, ఆ రామప్రభువు వెంట ఆ మహాపతివ్రత అయిన సీతాదేవి అనుసరించివస్తోంది. వారితోపాటే, మహాతేజోవంతుడైన లక్ష్మణ ప్రభువు కూడా వస్తున్నాడు" అని చెప్పాడు.

హనుమంతుని మాటలు విన్న భరతుడు సంతోషాన్ని పట్టలేకపోయాడు. నిశ్చేష్టుడై నేలమీద పడిపోయాడు. మూర్ఛపొందాడు. ఒక ముహూర్తకాలంలో తెప్పరిల్లి, లేచి అంతటి ప్రియమైన వార్త చెప్పిన హనుమంతుణ్ణి గట్టిగా కౌగలించుకుని ఇలా అన్నాడు.

“ఓ సౌమ్యుడా! నా మీద ఇంత దయ చూపిస్తూ నాకు ప్రియాతిప్రియమైన వార్తను తెచ్చిన నీవు దేవతా పురుషుడివా? లేక దైవాంశసంభూతుడివైన మానవుడవా? మహాత్మా! నాకు ఇంతటి ప్రియాతిప్రియమైన వార్త చెప్పిన నీకు లక్ష గోవుల్ని నూరుగ్రామాల్ని బహుమతిగా ఇస్తున్నాను. కుండలాలు ధరించినవారు, సదాచారవతులు, అవివాహితలైన పదహారుగురు కన్యలను భార్యలుగాను, బంగారుచ్ఛాయతో అందమైన ముక్కు, ఊరువులు, చంద్రబింబంవంటి ముఖం గల ఉత్తమకులంలో పుట్టిన స్త్రీలను వాళ్ళకు దాసీలుగా ఇస్తాను” అన్నాడు.

రాముడు తిరిగి వస్తున్నాడని హనుమంతుడు చెప్పిన మాట విన్న భరతుడు ఉప్పొంగిపోయాడు. రాముణ్ణి చూడబోతున్నానన్న సంతోషంలో హనుమంతుడితో ఇలా అన్నాడు.

# 125వ సర్గ వనవాస వృత్తాంతాలు తెల్పడం

రాముడు వస్తున్నాడన్న ఆనందాన్ని భరతుడు దాచుకోలేకపోయాడు. హనుమంతుణ్ణి కౌగలింతలతో ముంచెత్తుతూ, ఇలా అన్నాడు. "ఓ హనుమంతుడా! రాముడు నా అన్న మాత్రమే కాదు. నాకు ప్రభువు కూడా. అతడు మమ్మల్నందర్నీ విడిచి అరణ్యవాసానికి పోయి అప్పుడే పద్నాలుగేళ్ళు అయింది. ఈ అరణ్యవాసంలో ఆయన ఏమేమి ఘనకార్యాలు సాధించాడు? రామునికి, వానరులకు స్నేహం ఎట్లా ఏర్పడింది? నాకు వినాలని కుతూహలంగా ఉంది. 'మానవుడికి ఆయుర్దాయం అంటూ ఉంటే నూరేళ్ళ తర్వాత అయినా ఆనందం లభిస్తుంది' అని పెద్దలు అంటారు. నా విషయంలో అది యథార్థమైందని అని అనిపిస్తోంది" అని అంటూ కూర్చోవడానికి ఒక ఆసనం ఇచ్చాడు. అప్పుడు హనుమంతుడు రాముని వృత్తాంతం అంతా ఇలా చెప్పాడు:

"ఓ ప్రభూ! నీ తల్లికి రెండు వరాలు ఇవ్వడం, రాముడు అరణ్యానికి వెళ్ళడం, పుత్రశోకంతో దశరథమహారాజు మరణించడం, దూతలను పంపి నిన్ను నీ తాతగారి ఇంటి నుండి పిలిపించడం, నీవు అయోధ్యకు వచ్చి రాజ్యాన్ని నిరాకరించడం, నీవు చిత్రకూటానికి పోయి శత్రుసంహారకుడైన రాముణ్ణి రాజ్యాన్ని స్వీకరించమని ప్రార్థించడం, తండ్రికిచ్చిన మాటను యథార్థం చెయ్యడం కోసం నీ కోరికను అంగీకరించకపోవడం, మార్గాంతరం కనిపించకపోవడం చేత అన్నగారి పాదుకల్ని తీసుకొని నీవు తిరిగి అయోధ్యకు రావడం, మొదలైన విషయాలన్నీ నాకంటే ఎక్కువగా నీకే తెలుసు. అటుపిమ్మట ఏం జరిగిందో నేనిప్పుడు నీకు చెప్తాను విను.

నీవు నీ సైన్యం చిత్రకూటం విడిచి వెళ్ళిన తర్వాత, కొత్త మనుషుల్ని చూడటం వల్ల పశుపక్ష్యాదులన్నీ భయపడ్డాయి. అటుపైన సీతా రామలక్ష్మణులు అక్కడ ఉండటానికి ఇష్టపడలేదు. వాళ్ళు అక్కడ నుండి దండకారణ్యానికి వెళ్ళారు. అది జనసంచారం లేని

కీకారణ్యం. మదపుటేనుగులు మహావృక్షాల్ని గూడా పెళపెళా విరిచేస్తూ ఉంటాయి. సింహాలు, పులులు, జింకలు మొదలైన అడవిజంతువులు మాత్రమే సంచరిస్తూ ఉంటాయి. వాళ్ళు అట్లా నడుచుకుపోతూ ఉండగా, విరాధకుడనే రాక్షసుడు ఎదురుపడ్డాడు. మహాబలాఢ్యుడైన ఆ విరాధుడు పెద్దగా కేకలు పెడ్తూ, చేతులు చాపుకుంటూ వాళ్ళను అడ్డగించాడు. ఆ దురాత్ముణ్ణి రామలక్ష్మణులు ఒక పెద్దగొయ్యి తీసి, ఒక పెద్దఏనుగును పాతిపెట్టినట్లుగా, పాతిపెట్టారు. ఆ సాయంత్రానికల్లా వాళ్ళు శరభంగ మహర్షి ఆశ్రమానికి చేరారు. అదొక మనోహరమైన ఆశ్రమం. ఆనాడే ఆ మహర్షి తన శరీరాన్ని అక్కడే వదిలి స్వర్గానికి పోవడం ఆ సీతారామలక్ష్మణులు కళ్ళారా చూశారు. అప్పుడు అక్కడున్న మహర్షులందరితో కలసి సీతారామలక్ష్మణులు జనస్థానానికి వెళ్ళారు.

సీతారామలక్ష్మణులు జనస్థానంలో పర్ణశాల నిర్మించుకొని ఉంటూ ఉండగా ఒకనాడు శూర్పణఖ అనే రాక్షసి రాముడి దగ్గరకు వచ్చి, సీతాదేవిని చంపబోయింది. రాముడి ఆజ్ఞను శిరసావహించి లక్ష్మణుడు ఖడ్గంతో ఆ శూర్పణఖ ముక్కూ చెవులూ కోసి పంపేశాడు. అప్పుడు ఆమె వెనుకనే ఉంటున్న భయంకరమైన పాపకార్యాలు చేసే పద్నాలుగువేలమంది రాక్షసులు రాముడిపై దండెత్తి వచ్చారు. అప్పుడు మహాత్ముడైన రాముడు జాము సేపట్లో, తానొక్కడే, అంతమంది రాక్షసుల్నీ సంహరించాడు. ఆ పద్నాలుగు వేలమందీ మహాబలవంతులు. అడవిలో తపస్సు చేసుకునే మునీశ్వరులను చంపి తింటూ ఉండేవాళ్ళు.

అప్పుడు ఆ శూర్పణఖ అవమానంతోను, కోపంతోను, లంకాధీశ్వరుడు, తన అన్నగారు అయిన రావణాసురుడి దగ్గరకు పోయి జరిగిందంతా చెప్తూ, సీత అందచందాల్ని గూర్చి కూడా ఆ రాక్షసుడికి నూరిపోసింది. అప్పుడు రావణాసురుడు తన అనుచరుడూ, మహామాయావీ అయిన మారీచుడనే వాణ్ణి వెంటబెట్టుకొని బంగారులేడి రూపాన్ని ధరించి సీతాదేవిని వ్యామోహపెట్టాడు. ఆమె ఆ బంగారు లేడిని తన ఆశ్రమంలో పెంచుకోవాలన్న కోరికను రాముడికి చెప్పింది. సీతాదేవి కోరికను తీర్చాలనే తలంపుతో రాముడు ధనుస్సు తీసుకొని ఆ

మాయాలేడిని వెంబడించి వెతికాడు. అది ఎంతసేపటికీరాముడికి చిక్కకుండా ఏడిపించింది. ఇక చివరకు రాముడు నున్నటి కణుపుగల బాణాన్ని లేడిపై వదిలాడు. కొంతసేపటికి లక్ష్మణుడు కూడా రాముణ్ణి వెతుక్కుంటూ ఆశ్రమాన్ని వదిలి దూరంగా వెళ్ళాడు. అప్పుడు సీతాదేవి పర్ణశాలలో ఒంటరిగా ఉండటం కనిపెట్టిన రావణాసురుడు ఆశ్రమంలో చొరబడి, అంగారకగ్రహం రోహిణిని పట్టుకున్నట్లు సీతాదేవిని బలవంతంగా ఎత్తుకొనిపోయాడు. అప్పుడు ఆ సీతాదేవిని కాపాడటం కోసం గ్రద్దల రాజైన జటాయువు రావణాసురుణ్ణి ఎదిరించి యుద్ధం చేసి చనిపోయాడు.

ఆ విధంగా రావణాసురుడు సీతాదేవిని అపహరించుకొని ఆకాశమార్గాన పోతూ ఉండటాన్ని, ఋష్యమూకపర్వతం పై నుండి వానరులమైన మేమంతా చూశాం. అంతట ఆ రావణాసురుడు సీతాదేవిని లంకాపట్టణానికి తీసుకొనిపోయాడు. అక్కడ ఆమెను సుందరమూ, విశాలమూ అయిన అతడి బంగారుసౌధంలో ఉంచి ఆమెను లొంగదీసుకోవాలని ఎన్నో విధాల ప్రయత్నం చేశాడు. కానీ సీతాదేవి అతణ్ణీ, అతడి మాటల్నీ, ఏమాత్రం లెక్కచెయ్యలేదు. గడ్డిపోచకన్నా హీనంగా చూసింది. దాంతో కోపగించుకున్న ఆ రాక్షసుడు ఆమెను అశోకవనంలో బందీగా ఉంచాడు.

ఆ మహారణ్యంలో రాముడు ఆ మాయామృగాన్ని (బంగారు లేడి) చంపి తిరిగి ఆశ్రమానికి వెళ్ళి చూస్తే సీతాదేవి పర్ణశాలలో కనిపించలేదు. సీతాదేవి కోసం వెతుకుతూ ఉండగా ఆశ్రమానికి దగ్గర్లో కొన ఊపిరితో ఉన్న జటాయువును చూశాడు. తన తండ్రికి స్నేహితుడైన జటాయువుకు రాముడు దహనసంస్కారాలు చేసి సీతాన్వేషణలో లక్ష్మణుణ్ణి వెంటబెట్టుకొని గోదావరీ తీరానికి చేరుకున్నారు. వాళ్ళు ఎంత వెతికినా సీతాదేవి కనిపించలేదు. కబంధుడనే రాక్షసుడు రామలక్ష్మణుల్ని అడ్డగించాడు. వారిద్దరూ ఆ కబంధుణ్ణి చంపేశారు. ఆ కబంధుడే చనిపోతూ వాళ్ళిద్దర్నీ ఋష్యమూకానికి పంపాడు. రామలక్ష్మణులు సుగ్రీవుణ్ణి ఋష్యమూకపర్వతంపై కలుసుకున్నారు. వారిద్దరికీ ఒకరిపై మరొకరికి స్నేహం కుదిరింది.

పూర్వం సుగ్రీవుడి, అన్న వాలి తమ్ముణ్ణి వెళ్ళగొట్టాడు. రాముడు సుగ్రీవుడికి వానరరాజ్యానికి రాజును చేస్తానని వాగ్దానం చేశాడు. అటుపిమ్మట వాలిని చంపి సుగ్రీవుణ్ణి కిష్కింధకు రాజును చేశాడు. అంతట సీతాదేవిని వెదకటానికి వానరసేనల్ని నలుదిక్కులకూ పంపించాడు.

వింధ్యపర్వతానికి దక్షిణ దిక్కున ఉన్న ప్రాంతం అంతా వెతుకుతూ ఉండగా గడువు తీరిపోయింది. మేమంతా దిగులుపడ్తూ ఉంటే జటాయువు అన్న సంపాతి వలన సీతాదేవి రావణాసురుడు అపహరించుకొని లంకకు తీసుకుపోయాడని తెలిసింది. అప్పుడు నేను పరాక్రమంతో నూరుయోజనాల సముద్రాన్ని లంఘించి లంకకు చేరాను. నారచీరలు కట్టుకొని, మలిన శరీరంతో, దీనంగా ఉన్న సీతాదేవిని అశోకవనంలో చూశాను. రాముడు ఆనవాలుగా నా కిచ్చిన ఉంగరాన్ని ఆమెకు చూపాను. ఆమె నాకు తన దుస్థితినంతా చెప్పింది. తిరిగి ఆమె గుర్తుగా రాముడికిమ్మని చూడామణిని నా కిచ్చింది. నేనా మణిని తెచ్చి రాముడికిచ్చి సీత సందేశాన్ని చెప్పాను. అంతట ఆ మహాత్ముడు విజృంభించి వానరసేనల్ని వెంటబెట్టుకుని రావణాసురుడిపై యుద్ధానికి బయలుదేరాడు. సముద్రంపై నలుడి చేత సేతువు కట్టించారు. మేమంతా ఆ సేతువు ద్వారా లంకానగరానికి చేరుకున్నాం. నీలుడు ప్రహస్తుణ్ణి, లక్ష్మణుడు ఇంద్రజిత్తును చంపారు. రాముడే స్వయంగా రావణ కుంభకర్ణుల్ని చంపాడు. శ్రీమంతుడు, శత్రుసంహారకుడు కూడా అయిన రాముణ్ణి ఇంద్రుడు మహేశ్వరుడు బ్రహ్మదేవుడు స్తుతించారు. ఆ పిమ్మట సీతారామలక్ష్మణులు దశరథమహారాజును చూసి ఆయన ఆశీస్సులు పొందారు. ఇంద్రుడు ప్రేమతో ఇచ్చిన వరాల్ని గ్రహించి రాముడు వానరుల్తో కలసి పుష్పకవిమానంలో కిష్కింధకు వచ్చాడు. అక్కడ నుండి గంగాతీరాన భరద్వాజమహర్షి ఆశ్రమంలో ఈ రాత్రి గడిపి, రేపు పుష్యయోగాన బయలుదేరి ఇక్కడకు వస్తున్న రాముణ్ణి నీవు చూడగలవు" అన్నాడు.

అప్పుడు భరుతుడు అమృతతుల్యమైన హనుమంతుడి మాటలు విని, సంతోషించి, అంజలి ఘటించి "నా కోరిక చాలా కాలానికి తీరింది గదా!" అని అన్నాడు.

# 126వ సర్గ రాముడి స్వాగతానికి ఏర్పాట్లు

సత్యపరాక్రమం గలవాడూ, శత్రుసంహారకుడూ అయిన భరతుడు హనుమంతుని మాటలు వింటూ పరమానందభరితుడయ్యాడు. శత్రుఘ్నునితో ఇలా అన్నాడు. “తమ్ముడా! దేవాలయాలలోని దేవతలందరినీ విశేషమైన పూలమాలలతో అలంకరించమను. రాజవీథులన్నింటికీ అలంకారాలు చేయమను. నగరమంతా మంగళవాద్యాలతో మారుమ్రోగిపోవాలి. పరిశుద్ధులైన బ్రాహ్మణులను పూజించి సత్కరించాలి. స్తోత్రపాఠాలు పఠించేవాళ్ళను, సూతులను, మేలుకొలుపులు పాడే వైతాళికుల్ని, రకరకాలైన వాద్యాల్ని వాయించేవాళ్ళను, నాట్యకత్తెల్ని నటసమూహాల్ని, రామప్రభువును ముందు వరుసలో ఉండి ఆహ్వానించాలి” అని ఆదేశించాడు.

అంతట శత్రుఘ్నుడు భరతుని మాటల్నే ఆజ్ఞలుగా గ్రహించి, అనేకమంది పనివాళ్ళను వేరువేరు పనులు చేసేందుకు నియమించాడు. నందిగ్రామం నుండి అయోధ్య వరకూ వీథులన్నీ సమంగా ఉండేట్లు చేయించాడు. వీథులన్నీ మంచువంటి చల్లటి నీటితో తడిపించారు. వీథులన్నీ పేలాలు పూలుజల్లారు. రాజవీథులన్నింటిలోను అనేకచోట్ల పతాకాలు ఎగరేశారు. ఈ ఏర్పాట్లన్నీ సూర్యోదయానికి ముందే జరిగిపోవాలని ఆదేశించారు. గృహాలన్నీ శోభాయమానంగా అలంకరించి పండుగ వాతావరణాన్ని సృష్టించాలి. రాజవీథులన్నీ పూలదండలతో తోరణాలు కట్టించాలి. అయిదురంగుల్తో విడిపూలను వీథుల్లో అలంకారంగా జల్లాలి. పట్టణం అంతా సుగంధాల్తోనూ ధూపాల్తోను ముంచెత్తాలి. రంగురంగుల ముగ్గులు పెట్టాలి అని అయోధ్యా పౌరులందర్నీ ఆదేశించాడు.

తెల్లవారుజామునే అయోధ్యాపట్టణం నుండి దశరథమహారాజు భార్యలు, మంత్రులు, సైన్యాధ్యక్షులు, వారి భార్యలు, బ్రాహ్మణశ్రేష్ఠులు, పురప్రముఖులు, రాముని దర్శనానికి గుంపులుగుంపులుగా బయలుదేరారు. అమాత్యులైన ధృష్టి, జయంతుడు, సిద్ధార్థుడు,

అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలకుడు, సుమంత్రుడు మొదలైన వాళ్ళంతా స్వచ్ఛమైన బంగారు ఆభరణాల్ని అలంకరించుకొని మదపుటేనుగులపైన బయలుదేరారు. వాటి సరసనే ఆడ ఏనుగులపైన గున్న ఏనుగులపైన, గుర్రాలపైనా రాజపురుషులు, మహారథులు, బయలుదేరారు. శక్తులు, ఋష్టులు, పాశాలు అనే ఆయుధాల్ని ధరించి వీరపురుషులూ, ధ్వజాలు, పతాకాలు చేతిలో పట్టుకొని సైనికులు వారి వెంట నడిచి వెళ్ళారు. కౌసల్యాదేవీ, సుమిత్రాదేవీ, కైకేయీదేవీ వాహనాలపైన బయలుదేరారు. వారి వెనకాలే దశరథమహారాజు ఇతర భార్యలు వేరువేరు రథాలపై బయలుదేరి నంది గ్రామానికి వెళ్ళారు. అప్పుడు రథచక్రాల చప్పుళ్ళతోను, గుర్రాలు లేపుతున్న దుమ్ముతోను శంఖాలు, దుందుభుల మోతలతోనూ భూమి అంతా కంపించిపోయింది.

వందిమాగధులు స్తోత్రపాఠాలు చదువుతూంటే, మంగళవాద్యాలతో గానాలు చేస్తూ ఉండగా వారి వెనకాలే నారచీరలు ధరించి మృగచర్మాన్ని కప్పుకొని, ధర్మాత్ముడైన, మహాత్ముడు అయిన భరతుడు రామపాదుకల్ని శిరస్సున ధరించి రామదర్శనం కోసం రామనామజపం చేస్తూ బయలుదేరాడు. తెల్లగా చంద్రకాంతివలె ఉన్న శ్వేతఛత్రాన్ని, వింజామరల్నీ తీసుకొని రాజపురుషులు, పూలదండలు, మోదకాలూ ధరించిన ఆమాత్యులూ, బ్రాహ్మణశ్రేష్ఠులు, వర్తకప్రముఖులు, శ్రేణీముఖ్యులు, రామదర్శనం కోసం భరతుణ్ణి అనుసరించి వెళ్ళారు.

సూర్యోదయం కావస్తోంది. అయోధ్యానగరం అంతా నంది గ్రామానికి వచ్చి చేరింది. రాముడి జాడ ఎక్కడా కనబడటం లేదు. రాముడి కోసం నిరీక్షిస్తూ ఉన్న భరతుడు ప్రక్కనే ఉన్న హనుమంతుడితో ఇలా అన్నాడు. "ఓ హనుమంతుడా! పూజ్యుడైన రాముడు వస్తున్న జాడ ఎక్కడా కనిపించడం లేదు. కనీసం, వానరుల జాడ అయినా కనిపించడం లేదు. ఓ వాయుపుత్రా! వానరులకు సహజమైన కోతి స్వభావం చేత నన్ను ఆటపట్టించలేదు గదా?" అన్నాడు. అంతట హనుమంతుడు వినయంగా భరతుడితో ఇలా అన్నాడు. "భరద్వాజ మహర్షి అనుగ్రహం చేత వృక్షాలన్నీ ఇప్పుడు పుష్పించి ఫలాలన్నిస్తున్నాయి. చెట్ల నుండి తేనెలు

కారుతున్నాయి. తుమ్మెదలు మత్తెక్కి ఝుంకారాలు చేస్తున్నాయి. ఒక్క భరద్వాజ మహర్షే కాకుండా, రాముడు అడిగినందువల్ల దేవేంద్రుడు కూడా వానరులు ఎక్కడుంటే అక్కడ వృక్షాలన్నీ సమృద్ధిగా ఫలపుష్పాలు, తేనెలు కురిపించేట్లుగా వరం ఇచ్చాడు. అకాలంలో కూడా సమృద్ధిగా దొరుకుతున్న ఫలపుష్పాలకు, కందమూలాలకూ ఆశపడి వానరాలు ఆలస్యం చేస్తూ ఉండవచ్చును. అంతేకాకుండా భరద్వాజమహర్షి రాముడికి సైన్యసమేతంగా విందుభోజనాలు ఏర్పాటు చేస్తానన్నారు. అందువల్లనే నిన్నటి దినం ప్రయాణం కాకుండా సీతారామలక్ష్మణుల్ని ఆపేసి ఉండవచ్చు. ఓ శత్రుసంహారకుడా! అదుగో మాటల్లోనే వచ్చేస్తున్నారు. చెవులు రిక్కించి విను. వానరులు సంతోషంతో కేరింతలు కొడుతూ రావడాన్ని నీవు వినవచ్చు. దుమ్ము ఎంత ఎత్తుకు రేగుతుందో చూడు. అంటే వానరసైన్యం ఇప్పుడు గోమతీ నదిని దాటుతోంది. అప్పుడే కొంతమంది వానరవీరులు సాలవనంలోకి ప్రవేశిస్తున్నారు. ఆకాశంలో చంద్రమండలం వలె, నిర్మలంగా కనిపించేదే పుష్పక విమానం. దాన్ని పూర్వం విశ్వకర్మ బ్రహ్మదేవుడి కోసం నిర్మించాడు. బ్రహ్మదేవుడు దాన్ని కుబేరుడికి బహూకరించాడు. రావణాసురుడు కుబేరుణ్ణి యుద్ధంలో ఓడించి ఈ పుష్పకవిమానాన్ని సొంత చేసుకున్నాడు. ఇప్పుడు రాముడు రావణాసురుణ్ణి బంధుమిత్రపరివారంగా సంహరించి, ఇప్పుడా విమానంలో వస్తున్నాడు. సూర్యుని తేజస్సుతో, మనోవేగంగా మన వైపుగా వస్తున్న ఆ పుష్పకాన్ని చూడు. ఆ విమానంలో సీతారామలక్ష్మణులు, వారి ప్రక్కనే వానరరాజైన సుగ్రీవుడు, రాక్షసరాజు విభీషణుడూ కూర్చున్నారు'' అన్నాడు.

హనుమంతుడు ఇలా చెప్తూ ఉండగానే "అదుగో రామప్రభువు, అడుగో రామప్రభువు'' అంటూ పురుషులు, స్త్రీలు, వృద్ధులు, పిల్లలు కేరింతలు కొట్టారు. అప్పుడు రథాలపైన, ఏనుగులపైన గుర్రాలపైన అధిరోహించి ఉన్న వీరులు, నేలపై నిలబడి ఉన్నవారూ రాముణ్ణి ఆకాశంలో ఉన్న చంద్రుణ్ణి చూసినట్లు చూశారు. అప్పుడు రాముడు ఆ దివ్యవిమానంలో దేవేంద్రుడివలె ప్రకాశించాడు. మేరుపర్వతం పైన సూర్యుడివలె తేజరిల్లాడు. ఆకాశంలో అమితవేగంతో ప్రయాణం చేసే ఆ పుష్పకవిమానం, నలుప్రక్కలా హంసలు ప్రతిమలతో

విరాజిల్లుతూ నేలపై వాలింది. మహాబలశాలి అయిన భరతుడు త్వరగా విమానం వద్దకు పోయి అన్నగారైన రాముడికి సాష్టాంగ నమస్కారం చేశాడు. అంతట రాముడు భరతుణ్ణి లేవనెత్తి కౌగలించుకున్నాడు. ఆ పిమ్మట భరతుణ్ణి తొడపై కూర్చోబెట్టుకున్నాడు. పిమ్మట శత్రుసంహారకుడైన భరతుడు లక్ష్మణుని వద్దకు, సీత వద్దకు వెళ్ళి నమస్కరించాడు. పిమ్మట భరతుడు సుగ్రీవుణ్ణి, జాంబవంతుణ్ణి, అంగదుణ్ణి, మైంద – ద్వివిద, నీల, ఋషాభాదుల్ని కౌగలించుకున్నాడు. కామరూపులైన ఆ వానరులంతా మానవరూపాలు ధరించి భరతుణ్ణి కుశలప్రశ్నలు వేశారు. పిమ్మట భరతుడు సుగ్రీవుణ్ణి కౌగలించుకొని ఇలా అన్నాడు. “ఓ సుగ్రీవా! ఈ నాటి నుండి నీవు మాకు అయిదవ సోదరుడవు. ఉపకారాన్ని పురస్కరించుకొని మిత్రులు ఏర్పడతారు. అపకారం చెయ్యడం శత్రులక్షణం” అన్నాడు. పిమ్మట విభీషణుడితో “ఓ విభీషణుడా! నీవు సమయానికి చేసిన సహాయంవల్లనే, నా అన్నగారైన రాముడు ముల్లోకాల వారికీ సాధ్యంకాని దుర్లభమైన రావణసంహారాన్ని చెయ్యగలిగాడు.” అంతట వీరుడైన శత్రుఘ్నుడు రామలక్ష్మణుల పాదాలకు నమస్కరించాడు. పిమ్మట సీతాదేవి పాదాలకు వినయంతో నమస్కరించాడు.

అప్పుడు రాముడు, శోకంచేత కృశించిపోయి ఉన్న తల్లి కౌసల్యాదేవి పాదాలకు నమస్కరించి ఆమె మనస్సుకు సంతోషం కలిగించాడు. ఆ తర్వాత సుమిత్ర, కైకేయి, ఇతర తల్లులకు నమస్కారం చేశాడు. అటుపిమ్మట గురువులైన వసిష్ఠుల వారి పాదాలకు నమస్కరించాడు. అంతట పురజనులు, మంత్రులు, మొదలైన వారంతా ‘ఓ మహాబాహూ! కౌసల్యాదేవికి ఆనందాన్ని కలిగించేవాడా! రామా! నీకు స్వాగతం’ అంటూ నమస్కరించారు. ఆ నగరవాసులంతా అనేక కోట్ల దోసిళ్ళతో నమస్కరిస్తూ ఉంటే వికసించినపద్మంవలె కనిపించింది. ధర్మజ్ఞుడైన భరతుడు తను ఇంతకాలం పూజిస్తున్న రామపాదకుల్ని స్వయంగా రాముడి పాదాలకు తొడిగాడు. అంజలిఘటించి ఇలా అన్నాడు. “అన్నా! నీవు నా వద్ద న్యాసముగా ఉంచిన ఈ రాజ్యాన్నంతనూ నీకు తిరిగి అప్పగిస్తున్నాను. నీవు అయోధ్యకు వచ్చి, రాజ్యాభిషేకం చేసుకొని రాజు కావటం నేను చూడాలని కోరుకుంటున్నాను. నేను ఇన్ని

సంవత్సరాలుగా కోరుకుంటున్న కోరిక చరితార్థమైంది; కోరిక తీరింది. అన్నా! నీవు వచ్చి కోశాగారాన్ని, కోష్టాగారాలను, సైన్యాన్ని వచ్చి చూడు. నీ ప్రభావం చేత అన్నీ పదిరెట్లు పెరిగి ఉన్నాయి" అన్నాడు. అన్నగారి యెడల ప్రేమతో భరతుడు పలుకుతున్న మాటలు వింటున్న విభీషణుడు, సుగ్రీవుడు, వానరులు ఆనందబాష్పాలు రాల్చారు. పిమ్మట రాముడు భరతుణ్ణి తొడపై కూర్చోబెట్టుకొని ఆ విమానం పైనే భరతుడి ఆశ్రమానికి వెళ్ళారు. అక్కడ ఆశ్రమంలోనే విమానం నేలపై దిగింది. రాముడు సైన్యంతో సహా నేలపై దిగి, వినయంతో ఇలా అన్నాడు. "ఓ విమానమా! ఇకపై నీవు ప్రభువైన కుబేరుడి వాహనంగా ఉండు. ఇక వెళ్ళు" అన్నాడు. రాముడు అట్లా అనగానే అత్యుత్తమమైన ఆ విమానం ఉత్తరదిక్కుగా ప్రయాణం చేస్తూ కుబేరుని వద్దకు వెళ్ళిపోయింది. ఆ విధంగా రావణుడు అపహరించిన ఆ విమానం తిరిగి కుబేరుని వద్దకు చేరింది.

పరాక్రమవంతుడైన రాముడు పురోహితుడైన వసిష్ఠుని పాదాలకు, దేవతలకు ప్రభువైన ఇంద్రుడు బృహస్పతి పాదాలకు నమస్కరించినట్లు, నమస్కరించి సమీపాన ఉన్న ఆసనంపై కూర్చున్నాడు.

# 127వ సర్గ శ్రీరామ పట్టాభిషేకం

కైకేయీ ప్రియపుత్రుడు భరతుడు అంజలి ఘటించి నమస్కరిస్తూ, పెద్ద అన్నగారు, సత్యపరాక్రమాలు గలవాడూ అయిన రాముడితో ఇలా అన్నాడు. “ఓ రామా! నీవు మా అమ్మ మాటలను గౌరవించి ఈ రాజ్యాన్ని నాకు ఇచ్చావు. అదేవిధంగా నేను తిరిగి నీ రాజ్యాన్ని నీకే ఇచ్చివేస్తున్నాను. బాగా బలిసిన ఎద్దు ఎంతబరువైనా సునాయాసంగా లాగగలిగినట్లుగా ఒక లేగదూడ లాగగలదా? మహాప్రవాహానికి గండ్లు పడ్డ ఆనకట్టను గడ్డిగాదం వేసి నిలపగలమా? అదేవిధంగా ఎన్నో సమస్యలతో కూడుకున్న ఈ రాజ్యపాలనా భారాన్ని మోసే శక్తి నాకు లేదు. శత్రుసంహారకుడవైన ఓ వీరుడా! ఎన్ని అలంకారాలు చేసినా గాడిద గుర్రంవలె పరుగెత్తగలదా? కాకి హంసవలె సోయగాల్ని చూపించగలదా?

ఓ మహారాజా! ఒకడు తన పెరటిలో ఒక వృక్షాన్ని నాటాడు. ఆ వృక్షం పెద్దదై, బాగా మానుకట్టి పెద్దపెద్ద కొమ్మల్తో పూలు పూసేవరకూ ఎదిగింది. ఆ పూలు పండ్లు కాకుండానే రాలిపోతుంటే ఆ మొక్క నాటినవాడి కృషి ఫలిస్తుందా? అట్లాగే, నీవు ప్రభువుగా ఉండాలి. భృత్యులమైన మమ్మలి పోషిస్తూ ఉండాలి. అట్లా పోషించకపోతే, ఆ వృక్షంలాగానే ఫలాలు పొందకుండా పోతాము. (అనగా మన తండ్రిగారైన దశరథుడు దక్షుడైన ప్రజాపాలకుడు కావాలని పుత్రకామేష్టి యాగాన్ని చేసి నిన్ను పొందాడు. ఇప్పుడు నీవు ఆయన కోరుకున్నట్లుగా రాజ్యపాలన చెయ్యకపోతే, ఆయన ఆశలన్నీ వ్యర్థమైపోతాయి గదా!)

ఓ రామా! నీవు ఇప్పుడు రాజ్యాభిషేకం చేసుకుని మిట్టమధ్యాహ్నపు సూర్యుడివలె మహాతేజస్సుతో ప్రకాశిస్తూ ఉండటం ఈ లోకం అంతా చూడాలి. రామా! ఇంతకాలం అరణ్యవాసం చేస్తూన్నప్పుడు భయంకర మృగాలు తమ అరుపులతోనే నీకు మేలుకొలుపులు పాడేవి. ఇకపైన వివిధ మంగళవాద్యాలు మ్రోగుతూవుంటే, నీ పరిచారికల అందెలచప్పుళ్ళు, మొలనూళ్ళ చప్పుళ్ళు వింటూ నిద్రలేవాలి. మనోహరమైన స్తోత్రపాఠాలు, సంగీతాలాపనలూ

వింటూ నిద్రలేవాలి. జ్యోతిశ్చక్రం ఎంతకాలం తిరుగుతూ ఉంటుందో, ఈ భూమి ఎంతకాలం ఉంటుందో, అంతకాలమూ నీవు సమస్తభూమండలాన్ని పాలించాలి" అని అన్నాడు.

భరతుడు చెప్పిన మాటలను శత్రుసంహారకుడైన రాముడు ఆలకించాడు. అంతవరకూ వినయంగా నిలబడే మాట్లాడుతున్న భరతుడు భుజాలపైనుండి పెద్దబరువును దింపుకున్నవాడివలె పోయి ఒక ఆసనంపైన కూర్చున్నాడు.

అప్పుడు శత్రుఘ్నునిచే ఏర్పాటు చేయబడ్డవారు, వేగంగాను, సుందరంగాను పనిచేసే క్షురకులు వచ్చారు. రామలక్ష్మణు, భరతుల గడ్డాలు, మీసాలు తీర్చిదిద్దారు. ముందుగా భరతుడు మంగళాస్నానాలు చేశాడు. ఆ తర్వాత లక్ష్మణుడు, అతడి తరువాత వానరరాజైన సుగ్రీవుడు, రాక్షసరాజైన విభీషణుడూ, మంగళాస్నానాలు చేశారు. జడలు కట్టుకొని పోయిన తలవెంట్రుకలన్నింటినీ శ్రద్ధగా చిక్కుతీసిన పిమ్మట రాముడు మంగళాస్నానాలు చేశాడు. చందనము, మైపూతలను, రంగురంగుల పూలదండలతోను, శ్రేష్ఠమైన వస్త్రాలను ధరింపజేసి రాముణ్ణి అలంకరించారు. అప్పుడు దశరథమహారాజు భార్యలందరూ సీతకు మనోహరంగా అలంకారాలు స్వయంగా చేశారు. పిమ్మట పుత్రపేమగల కౌసల్యాదేవి, అక్కడకువచ్చిన వానరుల భార్యలందరికీ ప్రీతితో అలంకారాలు చేసింది. అప్పుడు శత్రుఘ్ని ఆజ్ఞచేత సుమంత్రుడు, చక్కటి శుభలక్షణాలు కలిగిన గుర్రాలనుకట్టిన రథాన్ని తోలుకొని వచ్చాడు. అప్పుడు గొప్ప బాహువులు గల, అమోఘ పరాక్రమవంతుడైన రాముడు ఆ రథంపై ఎక్కి కూర్చున్నాడు, ఆ రథం వెనుక సుగ్రీవుడు, హనుమంతుడు మొదలైనవారు దివ్యమైన వస్త్రాలను ధరించి, మెరిసిపోయే కుండలాలను ధరించి దేవేంద్రుడివలె బయలుదేరి వెళ్ళారు. అట్లాగే సీతాదేవిని అనుసరిస్తూ, అందమైన కుండాలాలు, వివిధములైన అలంకారాలతో సుగ్రీవుడి భార్యలు అనుసరించారు. ఆ విధంగా అందరూ అయోధ్యానగరం వైపుగా బయలుదేరారు.

సీతా రామ లక్ష్మణ, భరత, శతృఘ్నులకన్నా ముందుగా దశరథమహారాజు మంత్రులందరూ అయోధ్యకు బయలుదేరి వెళ్ళారు. అక్కడ మంత్రులైన అశోకుడు, విజయుడు,

సుమంత్రుడు, మొదలైన వారంతా వసిష్ఠమహర్షిని కలిశారు. రాజ్యాభిషేకానికి చెయ్యాల్సిన పనుల గురించి చర్చించారు. ఆ మహాత్ముడి రాజ్యాభిషేకానికి ముందుగా ఏయే శుభకార్యాలు చెయ్యాలో వాటన్నింటినీ చెయ్యమని వసిష్ఠమహర్షికి చెప్పి మళ్ళీ వారంతా రాముడికి స్వాగతం పలికే ఏర్పాట్లకోసం ఎదురు వెళ్ళారు.

పచ్చనిరంగు గల గుర్రాలను కట్టిన దేవేంద్రుని రథంవలె, రాముడు ఉత్తమమైన రథాన్ని ఎక్కి అయోధ్యానగరానికి బయలుదేరాడు. భరతుడు గుర్రాల కళ్ళాలు పట్టుకొని సారథ్యం చేశాడు. శత్రుఘ్నుడు రాముని శిరస్సుపై తెల్లటి ఛత్రాన్ని పట్టాడు. ఒక ప్రక్క లక్ష్మణుడు వింజామర వీస్తూవుంటే, రెండోప్రక్క రాక్షసరాజైన విభీషణుడు వింజామరను వీచాడు. అప్పుడు ఆకాశంపై బారులుతీరిన ఋషిసంఘాలు, దేవతలు, మరుద్గణాలు రాముణ్ణి స్తోత్రం చేశారు. ఆ స్తోత్రాలన్నీ గాలిలో కలసి మనోహరంగా వినిపించాయి. సుగ్రీవుడు పర్వతమంత ఎత్తున్న శత్రుంజయం అనే ఏనుగునెక్కి రాముడి రథాన్ని అనుసరించాడు. కామరూపులైన వానరులు మానవరూపాల్ని ధరించి తొమ్మిదివేల ఏనుగులపై ఆ రథం వెంట వెళ్ళారు. పురజనులంతా సంతోషంతో జయజయధ్వానాలు చేశారు. రాముడు వాళ్ళందరికీ ప్రత్యభినందనం చేశాడు. అమాత్యులతోను, బ్రాహ్మణులతోను, కూడిన రాముడు నక్షత్రాలమధ్యనున్న చంద్రుడువలె ప్రకాశించాడు.

రకరకాల వాద్యాలు వాయిస్తూ కొందరూ, స్వస్తికాలు చేతుల్తో మ్రోగించేవాళ్ళు కొందరు, శ్రావ్యంగా గానం చేసేవాళ్ళు కొందరు, స్వస్తి వాచకాలు పలుకుచూ వందిమాగధులు ముందునడుస్తూ అయోధ్యానగరానికి ప్రయాణం అయ్యారు. పసుపురంగుతో కూడిన అక్షితలు తీసుకొని బ్రాహ్మణులు, కన్నెపడచులు, గోవులూ, మధురభక్ష్యాలు తెస్తున్నవారూ రామునికి ముందుగా నడిచారు. రాముడు తనతో కూడా వస్తున్న మంత్రులతో, సుగ్రీవుడితో తన సఖ్యాన్ని గూర్చి చెప్పాడు. హనుమంతుని ప్రభావాన్ని గూర్చి చెప్పాడు. వానరులంతా తన కోసంచేసిన మహత్తర కార్యాలనుగూర్చి పేరుపేరునా చెప్పాడు. విభీషణుడు తన అన్నగారితో విభేదించి

తనతో చేరినవిధం వివరించి చెప్పాడు. రాముడు చెప్తున్న విషయాలన్నీ విన్న మంత్రులు, పౌరులు ఆశ్చర్యపోయారు. అట్లా మాట్లాడుతూ రాముడూ, మంత్రులూ, పౌరులూ సంతోషంతో అయోధ్యానగరాన్ని చేరుకున్నారు. అయోధ్యలో ప్రతిఇంటిపైనా పతాకాలు ఎగరేశారు. రాముడు, ఇక్ష్వాకుల వంశరాజులు తరతరాలుగా నివసిస్తున్న రాజప్రాసాదానికి చేరుకున్నారు. రాముడు ఆ పూర్వీకుల రాజప్రాసాదానికి చేరుకోగానే కౌసల్య, సుమిత్ర, కైకేయీలకు నమస్కరించాడు. పరమధార్మికుడైన భరతుడితో ఇలా అన్నాడు. "తమ్ముడా! అశోకవనాల మధ్యన ముత్యాలతోను, వైడూర్యాలతోను, నిర్మించబడిన ఈ ఇంట్లో సుగ్రీవుడికి ఉండేందుకు బస ఏర్పాటు చెయ్యి" అన్నాడు. అప్పుడు సత్యపరాక్రముడైన భరతుడు సుగ్రీవుడి చెయ్యిపుచ్చుకొని రామమందిరానికి తీసుకొనివెళ్ళాడు. అక్కడ శత్రుఘ్నుడు ఆజ్ఞాపించగా ఆ భవనమంతా తైలదీపాలతో అలంకరించారు. పరుపులు తెచ్చి పరిచారు. అంతట సుగ్రీవుణ్ణి ఆ భవనంలో సుఖంగా విశ్రాంతి తీసుకున్నాడు.

మహా తేజోవంతుడైన భరతుడు సుగ్రీవుడితో ఇలా అన్నాడు. "ఓ వానరరాజా! రాముని రాజ్యాభిషేకానికై సముద్రజలాలు తెప్పించాలి. త్వరగా వెళ్ళిరాగల నీ భటుల్ని పంపించు" అన్నాడు. అంతట సుగ్రీవుడు నలుగురు వానరయోధుల్ని పిలచి, రత్నాలు పొదిగిన బంగారు పాత్రలనిచ్చి తెల్లవారేలోగా నాలుగు సముద్రాలనుండి జలాలు తెమ్మని ఆజ్ఞాపించాడు. అప్పుడు పెద్దపెద్ద ఏనుగులవంటి శరీరాలుగల అ నలుగురు వానరయోధులు, గరుత్మంతుడివలె ఆకాశంలో ఎగిరి నాలుగు ప్రక్కలకూ వెళ్ళిపోయారు. వాళ్ళు అటువెళ్ళగానే, హనుమంతుడు, జాంబవంతుడు మొదలైన వానరయోధులుకూడా బంగారు కలశాల్ని తీసుకుని భూమండలంలోని ఐదువందల నదులనుండి పవిత్రజలాలను తీసుకొచ్చారు. సుషేణుడు పూర్వసముద్ర జలాల్ని ఆ బంగారు కలశం నిండా తెచ్చాడు. ఋషభుడు దక్షిణసముద్రంనుండి బంగారుకలశం నిండా సముద్రజలాల్ని తెచ్చాడు, గవయుడు పశ్చిమ సముద్రాన్నుండి బంగారు కలశంనిండా సముద్రజలాల్ని తెచ్చాడు. నలుడు గరుత్మంతుడివలె వాయువేగంతో పోయి ఉత్తర సముద్రజలాల్ని తెచ్చాడు. వీళ్ళంతా మహావేగంతో ఆ కలశాల్లో నీరు చిందిపోకుండా

ఉండేందుకు రక్తచందనం కొమ్మల్ని మూతగాపెట్టి పట్టుకొచ్చారు.

ఆ విధంగా రామాభిషేకం కోసం బంగారు కలశాల నిండా పుణ్యోదకాలు సమకూరగానే శత్రుఘ్నుడు ఆ విషయాన్ని వసిష్ఠమహర్షికి తెలియజేశాడు. అంతట ఆ వసిష్ఠ మహర్షి సీతారాములిద్దర్నీ రత్నఖచితమైన పీఠంపై కూర్చోబెట్టాడు. అప్పుడు వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, కాత్యాయనుడు, సుయజ్ఞుడు, గౌతముడు, విజయుడు అనే ఎనిమిదిమంది మునీశ్వరులు నిర్మలమైన, సుగంధాలతో కూడిన జలాలను, అష్టవశువులు సహస్రాక్షుడైన దేవేంద్రుణ్ణి అభిషేకించినట్లు, రాముడికి అభిషేకం చేశారు.

అంతట వసిష్ఠమహర్షి బ్రాహ్మణుల్ని వెంటబెట్టుకొని సీతారాముల్ని రత్నఖచిత సింహాసనంపై కూర్చోబెట్టారు. సుగంధాలు గుబాళించే నిర్మలమైన జలాలన్నింటితోనూ, ఆ నరశార్దూలుడైన రాముడికి అభిషేకం చేశారు. అటుపిమ్మట ఋత్విక్కుల చేతను, పెండ్లికాని కన్యలచేతను, మంత్రులచేతను, ఆకాశమందున్న దేవతలచేతను, నలుగురు లోకపాలకుల చేతను, మిగిలిన అనేక దేవతాసమూహాల చేతను రాముడికి అభిషేకం చేయించారు. అభిషేకజలాలలో సముద్ర నదీ జలాలేకాక, అనేక ఔషధుల రసాన్ని మూలికల భస్మాన్ని కూడా చేర్చి అభిషేకం చేశారు.

పిదప మహాత్ముడైన వసిష్ఠుడు, పూర్వం బ్రహ్మచేత నిర్మించబడినదీ, రత్నవైడూర్యాలతో పొదగబడినదీ, తేజస్సుతో ప్రకాశించేదైన కిరీటాన్ని సభలో వివిధములైన రత్నాలను రాశిగాపోసిన పీఠంపై ఉంచారు. పట్టాభిషేక సమయాల్లో పూర్వం మనుచక్రవర్తి, ఆయన తర్వాత క్రమంగా ఆయన వంశస్థులైన రాజులందరూ ఈ కిరీటాన్నే ధరించేవారు. ఆ మహాసభా భవనం బంగారంతో నిర్మించారు. ఆపైన, రత్నపీఠంపై ఉంచిన కిరీటాన్ని తీసి వసిష్ఠుడు రాముని శిరస్సుపై అలంకరించాడు. అనంతరం ఋత్విక్కులు కూడా రామునికి ఇతర అలంకారాలను అలంకరించారు. అప్పుడు శత్రుఘ్నుడు రామునికి తెల్లనిది, స్వచ్ఛమైన ఛత్రాన్ని పట్టాడు. వానరరాజైన సుగ్రీవుడు తెల్లని వింజామరతో విసిరాడు. రాక్షసరాజైన విభీషణుడు రెండవ

ప్రక్కన చంద్రునివంటి తెల్లని వింజామరతో విసిరాడు. వాయుదేవుడు, దేవేంద్రునిచే పంపబడిన నూరుపద్మముల ఆకారంతో ప్రకాశించే బంగారుమాలను, అనేక రత్నాలతోను, మణులతోను అలంకరించబడిన ముత్యాలహారాన్ని రామునికి బహూకరించాడు.

రాముని అభిషేకమహోత్సవ సమయంలో దేవతలు, గంధర్వులు, సంతోషంతో గానం చేశారు. అప్సర స్త్రీలు మైమరచి నాట్యం చేశారు. రాముని అభిషేక సమయాన భూమి పులకించి సస్యసమృద్ధమైనది; వృక్షాలన్నీ సుగంధాలతో కూడిన పూలతోను ఫలాలభారం చేతను నేలను తాకాయి.

రాముడు బ్రాహ్మణులకు లక్ష గుర్రాల్ని లక్ష తొలిఈత గోవుల్ని, నూరు ఎడ్లను ముప్పైకోట్ల బంగారు నాణాల్ని, అనేక ఆభరణాల్ని దానాలు చేశాడు. సూర్యకిరణాలతో సమానమైన మాణిక్యాలు పొదిగిన బంగారు మాలను సుగ్రీవుడికి బహూకరించాడు. వైడూర్యాలతోను, మణులతోను పొదగబడిన బంగారు బాహపురుల్ని వాలి పుత్రుడైన అంగదుడికి ప్రేమభావంతో రాముడు బహూకరించాడు. శ్రేష్ఠమైన మణులూ, చంద్రకాంతుల వలె ప్రకాశించే ముత్యాలహారాన్నీ, దివ్యమైనదీ, నిర్మలమైనవీయైన రెండు వస్త్రాలను, సుందరమైన అలంకారాలను సీతకు బహూకరించాడు. జనకపుత్రికయైన సీత హనుమంతునివైపు చూస్తూ, ఆ హారాన్ని కంఠాన్నుండి తీసి భర్త వైపు, మిగిలిన వానరులందరివైపూ దృష్టి సారిస్తూ అలా ఉండిపోయింది. ఇతరుల మనోభావాలు చదవడంలో నేర్పరియైన రాముడు సీతతో ఇలా అన్నాడు. “సౌభాగ్యవతివైన ఓ సీతా! నీకు ఎవరియందు సంతోషం ఉందో, తేజస్సూ, ధైర్యం, యశస్సు, నేర్పు, సామర్థ్యం, వినయం, నీతి, పౌరుషం, పరాక్రమం, బుద్ధి అనే గుణాలు ఎవరిలో ఎల్లప్పుడూ ఉంటాయో, అతనికి ఈ హారాన్ని బహూకరించు.” అప్పుడు నల్లనికన్నుల సీత ఆ హారాన్ని హనుమంతుడికి బహూకరించింది. చంద్రుని కిరణాల్లాగా తెల్లగాను, నున్నగానూ ఉన్న ఆ హారాన్ని ధరించిన వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు తెల్లనిమేఘాలు ఆవరించుకున్న పర్వతంవలె ప్రకాశించాడు. వానరులలో పెద్దవాళ్ళందరికి తగురీతిగా వస్త్రాలు, భూషణాలు

ఇంకా విలువైన కానుకల్నిచ్చి రాముడు సత్కరించాడు. అటుపిమ్మట రాముడు మైంద, ద్వివిదులకు, నీలుడికి అనేక విలువైన వస్తుసముదాయాల్ని బహూకరించి సత్కరించాడు. శ్రమ పడకుండా పనులు చేసే రాముడు, విభీషణుణ్ణి, సుగ్రీవుణ్ణి, హనుమంతుణ్ణి, జాంబవంతుణ్ణి, ఇంకా ప్రధానమైన అనేకమంది వానరులను రత్నాలు, వస్త్రాలు, ఆభరణాలు బహూకరించి సన్మానించాడు. పిదప వాళ్ళంతా ఎంతో సంతోషిస్తూ వారివారి స్థానాలకు వెళ్ళిపోయారు. మహాత్ములైన వానరశ్రేష్ఠులందరూ రాముడికి నమస్కరించి, రాముని అనుజ్ఞ పొంది కిష్కింధకు వెళ్ళిపోయారు.

వానరరాజైన సుగ్రీవుడు శ్రీరామ పట్టాభిషేకమహోత్సవాన్ని కన్నులార తిలకించి, ధన్యతచెంది కిష్కింధకు వెళ్ళిపోయాడు. అంతట విభీషణుడు కూడ రాముని వలన రాక్షసరాజ్యాన్ని పొందినవాడై శ్రీరాముని అనుజ్ఞ పొంది, తన రాక్షసమంత్రులతో కలసి లంకకు వెళ్ళిపోయాడు.

గొప్ప కీర్తిగలవాడూ, మిక్కిలి ఉదారస్వభావుడైన రాముడు శత్రువుల్ని సంహరించి రాజ్యాన్నిపాలిస్తూ అనేక సుఖభోగాలను అనుభవించాడు. ఒకానొక రోజున, ధర్మమునందు ఆసక్తిగల రాముడు, ధర్మాన్ని చక్కగా తెలిసిన లక్ష్మణునితో ఇలా అన్నాడు. "సర్వధర్మాలనూ ఎరిగిన ఓ లక్ష్మణా! మనకు వంశపారంపర్యంగా వస్తున్నది, మన పూర్వీకులు ఎందరో అధిష్ఠించి పాలించిన ఈ భూమిని, నీవుకూడా నాతో కలసి పాలించు. మన పూర్వీకులు పాలించిన ఈ రాజ్యానికి, యువరాజ్యపట్టాభిషిక్తుడవై నాతో కలసి పాలించు. నా భాగంలో నీమా పాలుపంచుకో" అన్నాడు. ఈ విధంగా రాముడు ఎంత బ్రతిమాలినా లక్ష్మణుడు అంగీకరించలేదు. చివరకు రాముడు భరతుణ్ణి యౌవరాజ్యాభిషిక్తుణ్ణి చేశాడు.

రాముడు అనేకసార్లు పౌండరీకము, అశ్వమేధము, వాజపేయం, ఇంకా అనేక యజ్ఞయాగాలు చేశాడు. రాముడు పదివేల సంవత్సరాలు రాజ్యం చేశాడు. మంచిమంచి గుర్రాలతో అధికమైన దక్షిణలిస్తూ వంద అశ్వమేధయాగాలు చేశాడు. అజానుబాహువు,

విశాలమైన వక్షఃస్థలం గలవాడూ, ప్రతాపవంతుడైన ఆ రాముడు లక్ష్మణుని సాహచర్యంలో ఈ భూమండలాన్నంతా పాలించాడు. ధర్మాత్ముడైన రాముడు రాజ్యంచేస్తున్న రోజుల్లో స్త్రీలు వైధవ్య దుఃఖాన్ని పొందలేదు. ప్రజలు క్రూరజంతువుల చేతగానీ, వ్యాధులచేతగాని, దొంగలచేతగాని భయములేనివారై జీవించారు. చిన్నవాళ్ళకు పెద్దవాళ్ళు ప్రేతకర్మలు చేసే దుస్థితి ఎన్నడూ కలుగలేదు. ప్రజలు సుఖసంతోషాలతో జీవించడమే కాకుండా ధర్మపరులై ఉండటంలో రాముణ్ణి అనుసరించారు. ప్రజలు రాముడు శిక్షిస్తాడేమోనన్న భయంతో ఎన్నడూ జీవించలేదు; అయితే తమ ప్రవర్తన వలన రాముడికి ఎక్కడ బాధ కలుగుతుందోనని భయపడుతూ జీవించేవాళ్ళు. ఒకళ్ళనొకళ్ళు హింసించుకోవడం వారెరుగరు. చిన్నవాళ్ళు పెద్దవాళ్ళను గౌరవించేవారు. పెద్దవాళ్ళు చిన్నవాళ్ళను ప్రేమించేవారు. రాముడి రాజ్యంలో ప్రజలు వేలసంవత్సరాలు రోగాలుగాని, ఈతిబాధలుగానీ లేనివారై సుఖంగా జీవించేవాళ్ళు, ఒక్కొక్కరూ వేలాది పుత్రుల్ని కనేవారు. రాజ్యంలో ఎవరినోటవిన్నా రాముడి కథలే. ఎల్లప్పుడూ రాముడిని గూర్చిన కథలే చెప్పుకునేవారు. ప్రజలు ఎక్కడ చూసినా రాముడు, రాముడు, రాముడు అంటూ ఏదో సందర్భంగా రాముణ్ణే తలచుకుంటూ ఉండేవారు. ఒక్క మాటలో చెప్పాలంటే, రామరాజ్యం అంతా రామమయం అయిపోయింది.

రామరాజ్యంలో ప్రతివృక్షమూ ఆ కాలం ఈ కాలం అనే భేదం లేకుండా సర్వకాలాలలోనూ, మ్రానులుకట్టి కొమ్మలు శాఖోపశాఖలుగా విస్తరించి, ఏ కాలంలో చూసినా పూలు, పిందెలు, కాయలు పండ్లతో నిండి ఉండేవి. (నెలకు మూడు వర్షాలు పడేవి) క్రమం తప్పకుండా మేఘాలు వర్షించేవి. గాలి సమంగా వీస్తూ ప్రాణులకు ఆహ్లాదాన్ని కలిగించేది. పెనుగాడ్పులు గాని, గాలి స్తంభించిపోవడంగానీ ఎన్నడూ ఉండేది కాదు. ప్రజలంతా సత్యాన్నే పలికేవారు, అబద్ధాలాడటం అంటే ఏమిటో ఎరుగరు. స్త్రీ పురుషులనిగాని, బాలలు వృద్ధులనే తేడా లేకుండా ప్రజలంతా ధర్మాన్నే ఆచరించేవారు. ఒక్కమాటలో చెప్పలంటే రామరాజ్యంలో జనులంతా సద్గుణసంపన్నులు, సదాచార ధర్మపరాయణులు. శ్రీమంతుడైన రాముడు తమ్ములతో కలసి పదకొండువేల సంవత్సరాలు రాజ్యపాలనచేసి యుగయుగాలవారు

రామరాజ్యాన్ని గుర్తుంచుకునేట్లుగా పాలించాడు.

ఫలశ్రుతి :

పూర్వం వాల్మీకి రచించిన ఈ ఆదికావ్యం ధర్మసమ్మతమైనది. కీర్తినిచ్చేది. ఆయుర్దాయాన్ని పెంచేది, రాజులకు విజయాన్ని చేకూర్చిపెట్టేది. అటువంటి ఈ పుణ్యకావ్యాన్ని ఎవరు చదివినా, ఎవరువిన్నా, వారంతా సర్వపాపాలనుండి విముక్తులవుతారు. శ్రీరామపట్టాభిషేకము వరకు ఉన్న ఈ గ్రంథాన్ని విన్నవారు పుత్రుల్ని కోరేవారికి పుత్రులూ, ధనం కోరేవారికి ధనమూ పొందెదరు. రాజులు శత్రువులను జయించి భూమిని పొందెదరు.

ఈ ఆదికావ్యాన్ని స్త్రీలు విన్నట్లైతే, రాముణ్ణి కన్న కౌసల్యాదేవివలె, లక్ష్మణ శత్రుఘ్నుల్ని కన్న సుమిత్రాదేవి వలెను, భరతుణ్ణి కన్న కైకేయీ దేవివలెను దీర్ఘాయువులుగా ఉండే పుత్రుల్ని పొంది సుఖంగా ఉంటారు.

ఈ రామాయణ కావ్యాన్ని, రాముని విజయవృత్తాంతాన్ని విన్నవారు దీర్ఘాయుష్మంతులవుతారు. వాల్మీకిచే రచించిన ఈ కావ్యాన్ని నమ్మకంతో విన్నవారు కోపాన్ని జయించి, కష్టములను అధిగమిస్తారు; బంధువులతో కలసి ఆనందంగా జీవిస్తారు. రామానుగ్రహం కలిగి సమస్త కోరికలూ నెరవేరుతాయి.

ఈ రామాయణ కావ్యాన్ని విన్న యెడల దేవతలంతా సంతోషిస్తారు. ఈ రామాయణాన్ని పఠించిన ఇళ్ళలో విఘ్నాలు కలిగించే భూతాలు అన్ని పారిపోతాయి. యజమానికి సుఖశాంతులు లభిస్తాయి. ప్రవాసంలో ఉన్నవారు క్షేమంగా తిరిగివస్తారు, రజస్వలలైన యువతులు ఈ రామాయణాన్నివింటే ఉత్తమమైన భర్తలను పొంది ఉత్తమసంతానాన్ని కనెదరు. ఈ రామాయణం విన్నవారు సమస్త పాపాలనుండి విముక్తులవుతారు. దీర్ఘాయుర్దాయాన్ని పొందుతారు.

క్షత్రియులు శిరస్సువంచి నమస్కరిస్తూ ఈ రామాయణాన్ని బ్రాహ్మణులనుండి వినాలి. ఈ రామాయణాన్ని పారాయణం చేసే వారికి ఐశ్వర్యం, పుత్రలాభం కలుగుతుంది. ఈ రామాయణం సర్వోత్తమమైన ఇతిహాసము; ఆదికావ్యం. దీనిని పూజిస్తూ పఠించేవారిని రాముడు సంతోషించి అనుగ్రహిస్తాడు. రాముడు నిత్యుడు, ఆదిదేవుడు, సమస్త పాపాలనూ హరించే శ్రీమహావిష్ణువు. ఈ సృష్టికిపూర్వం ప్రళయజలాల్లో శయనించిన శ్రీమన్నారాయణమూర్తి సర్వేశ్వరుడు, మహావిష్ణువు. ఈ రామాయణం పఠించినా, విన్నా దేవతలు అనుగ్రహిస్తారు, పితృదేవతలు సంతోషిస్తారు.

ఈ వాల్మీకిమహర్షి రచించిన రామునికి సంబంధించిన ఈ సంహితను భక్తి పూర్వకంగా వ్రాసే నరులకు స్వర్గప్రాప్తి కలుగుతుంది. గొప్ప అర్థంగల శుభకరమైన ఈ కావ్యాన్ని చదివినవారు కుటుంబాభివృద్ధిని, ధనధాన్యాభివృద్ధిని ఉత్తమస్త్రీలను, పొందుతారు. భూలోక సుఖాలన్నింటినీ పొందుతారు.

ఈ రామాయణ ఆఖ్యానాన్ని సంపదలుకోరేవారు నియమంతో వినాలి. అట్లా వినయంలో విన్నవారు ఆయుర్దాయము, ఆరోగ్యం, సత్కీర్తి, సోదరప్రేమ, సౌభాగ్యాన్ని, జ్ఞానాన్ని, తేజస్సును పొందుతారు.

రామాయణాన్ని శ్రద్ధతో చదివితే మేలు సమకూరుతుంది; విష్ణుబలం వృద్ధి అవుతుంది. ఈ రామాయణ పఠనం వల్ల దేవతలంతా తృప్తి చెందుతారు.



# ఉత్తరకాండము



## 1వ సర్గ మహర్షుల ఆగమనం

రాముడు రాక్షసులను సంహరించి, రాజ్యాన్ని స్వీకరించి శుభముహూర్తాన పట్టాభిషిక్తుడయ్యాడు. ప్రజారంజకంగా పరిపాలన సాగిస్తూ ఉండగా, రాముణ్ణి అభినందించేందుకు మహర్షులు దేశం నలుమూలలనుండీ వచ్చారు.

తూర్పు దిక్కు నుండి కౌశికుడు, యువక్రీతుడు, గార్గ్యుడు, గాలవుడు, మేధాతిథి పుత్రుడైన కణ్వుడు వచ్చారు. దక్షిణదిక్కు నుండి ఆత్రేయుడు, నముచి, ప్రముచి, అగస్త్యుడు, అత్రి, సుముఖుడు, విముఖుడు వచ్చారు. పశ్చిమదిక్కు నుండి నృషంగుడు, కవషి, ధౌమ్యుడు, కౌషేయుడు వచ్చారు. ఉత్తరదిక్కు నుండి వశిష్ఠుడు, కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, భరద్వాజుడు వచ్చారు.

(వివరణ: వసిష్ఠుడు అయోధ్యలో పురోహితుడుగా ఉన్నప్పటికీ, ఇతడు సప్తర్షి మండలంలో ఉండే వశిష్ఠుని రూపాంతరమే. ఇక్కడ ఉదహరించబడిన వశిష్ఠుడు సప్తర్షి మండలంనుండి వచ్చాడని గోవిందరాజులు వ్యాఖ్య వ్రాశారు)

ఈ మహర్షులందరూ వేద వేదాంగములందు నిష్ణాతులు, వివిధశాస్త్ర విషయాల్లో సమర్థులు. వారంతా అగ్నితో సమానమైన కాంతిగలవారే. అగస్త్యమహర్షి ద్వారపాలకుడి వద్దకుపోయి, తామంతా రాముణ్ణి చూడటానికి వచ్చామని చెప్పారు. మంచి నడవడిక గలవాడు, ఇతరుల మనోభావాలను పసిగట్టగలవాడూ, నీతిమంతుడూ, ధైర్యశాలి అయిన ఆ

ద్వారపాలకుడు, చంద్రకాంతులతో తేజరిల్లుతున్న రాముణ్ణి చూసి, అగస్త్యమహర్షి మొదలైన మహర్షుల రాకను తెలిపాడు. అంతట రాముడు, బాలభానుడి కాంతులతో విరాజిల్లే ఆ మునీశ్వరుల్ని ఆహ్వానించి సకలమర్యాదలు చెయ్యమని ద్వారపాలకుణ్ణి ఆదేశించాడు.

రాముడు వినయంతో నమస్కరించి ఆ మహర్షులందరికీ అర్ఘ్యపాద్యాదులు మొదలగు అర్చనలు అందించి, అడుగున దర్భలు పరచి వాటిపై ఉత్తమమైన మృగచర్మాన్ని పరిపించి శ్రేష్ఠమైన ఆసనాలు పరచి వారందరినీ కూర్చోమని అర్థించాడు. అంతట రాముడు వారందరినీ కుశలప్రశ్నలు వేసి వారిక్షేమాన్ని విచారించాడు.

వేదవేత్తలైన ఆ మహర్షులు రాముడితో ఇలా అన్నారు "గొప్ప బాహువులు గల ఓరామా! భగవదనుగ్రహంచేత మేము అందరం క్షేమంగానే ఉన్నాం. రామా! లోకాలన్నింటినీ పీడించిన రావణాసురుణ్ణి సంహరించావు. నీవు ముల్లోకాలను జయించగలవు. మా అదృష్టవశమున ఈనాడు నిన్ను చూడగలిగాము. ధనుస్సు చేతపట్టుకొని లోక కంటకుడైన రావణుణ్ణి వధించావు. పుత్రపౌత్ర సహితుడైన రావణ వధ నీకు భారము కాదు కదా? ధర్మాత్ముడవైన ఓరాజా! ఎల్లవేళలా నీ హితాన్నే కోరే లక్ష్మణుడితోను, తల్లులతోను, ఇతర సోదరులతోను కూడివున్న నిన్ను నేడుమేమంతా చూడగలగడం మా భాగ్యంగా భావిస్తున్నాం. ప్రహస్తుడు, వికటుడు, విరూపాక్షుడు, మహోదరుడు, అకంపనుడు, దుర్ధర్షుడు మొదలైన రాక్షసుల్ని సంహరించావు. ముల్లోకాల్లోనూ కుంభకర్ణుడంతటి భారీశరీరం కలవాడు ఇంకొకడు లేడు. అటువంటి కుంభకర్ణుణ్ణి సంహరించావు. మహాపరాక్రమవంతులైన త్రిశిరస్సు, అతికాయుడు, దేవాంతక నరాంతకులను, నీవు సంహరించి లోకానికి సంతోషం కలిగించావు. చూడటానికి మహాభయంకరంగా కనిపించే కుంభకర్ణుడి పుత్రులైన కుంభనికుంభులను సునాయాసంగా సంహరించావు. ప్రళయకాల యమునితో సమానులైనవారు, యుద్ధోన్మత్తులైన యజ్ఞకోపుడు, ధూమ్రాక్షుణ్ణి నీ అస్త్రబలంతో సంహరించావు. దేవతలకు కూడా సాధ్యంకాని రావణాసురిడితో ద్వంద్వయుద్ధంలో జయించి విజయలక్ష్మిని చేపట్టావు. అయితే రామా! యుద్ధంలో ఎదుటపడి

బాహాబాహీగా యుద్ధంచేసిన పై వీరుల్ని జయించడంలో కన్నా మహామాయావియైన ఆ ఇంద్రజిత్తును నీవు, లక్ష్మణుడు జయించగలగడం ముల్లోకాల్ని ఆశ్చర్యపరుస్తోంది. అభయాన్ని ఇచ్చి వర్ధిల్లుతున్నావు."

ఆ మహర్షులంతా ముక్తకంఠంతో ఆ విధంగా ఇంద్రజిత్తును ప్రశంసించగా రాముడు అబ్బురపడ్డాడు. వారితో ఇలా అన్నాడు: "మహాత్ములారా! రావణ కుంభకర్ణులకన్నా ఇంద్రజిత్తును గూర్చి మీరంతా ఇంతగా పొగుడుతున్నారే? కారణం ఏమిటి? రావణ కుంభకర్ణులు మహా బలవంతులుగదా? అట్లాగే మహోదరుణ్ణీ, ప్రహస్తుణ్ణి, విరూపాక్షుణ్ణి, దేవాంతక–నరాంతకులకన్నా ఈ ఇంద్రజిత్తును గూర్చి ఇంతగా ప్రశంసించడంలో హేతువేమిటి? అంతేకాదు, మహావీరులైన అతికాయుడు, త్రిశిరుడు, ధూమ్రాక్షులకన్నా ఈ ఇంద్రజిత్తు గొప్పవాడా? అయితే ఆ ఇంద్రజిత్తు ప్రభావం ఎటువంటిది? బలం ఏపాటిది? పరాక్రమం ఏపాటిది? ఏ కారణంచేత అతడు తండ్రినిమించిన కొడుకని వర్ణిస్తున్నారు? మిమ్మల్ని నేను ఆజ్ఞాపించడం లేదు. రహస్యం కాకపోతే, అతణ్ణిగూర్చి వినాలని కుతూహలంగా ఉంది. ఇంద్రుణ్ణి కూడా జయించగలిగినంత బలం ఆ ఇంద్రజిత్తుకు ఎలావచ్చింది? అతడు ఎటువంటి వరాల్ని సంపాదించాడు? అతడి తండ్రిని మించిన బలశాలి ఎలా అయ్యాడు?"

# 2వ సర్గ పులస్త్యుని జన్మ వృత్తాంతం

మహాత్ముడైన రాముడు అడిగిన ప్రశ్నలన్నింటికీ మహాతేజస్వియైన అగస్త్యమహర్షి ఇలా అన్నాడు "రామా! ఇంద్రుణ్ణి జయించిన ఇంద్రజిత్తు యుద్ధంలో శత్రువును హతమార్చకుండా వెనక్కుతిరిగి వచ్చేవాడు కాదు. అతడి బాల్యాన్ని, తేజస్సును గూర్చి చెప్తాను విను. ఇతడి చరిత్ర చెప్పేముందు రావణాసురుడి పుట్టుక, అతడు పొందిన వరాలగూర్చి చెప్తాను విను.

'మునుపు కృతయుగంలో బ్రహ్మ పదిమంది ప్రజాపతుల్ని సృష్టించాడు. వారిలో పులస్త్యుడు ఒకడు. అతడు బ్రహ్మర్షి. అన్నివిధాలా తండ్రితో సమానమైనవాడు. అతడి ధర్మవర్తన గూర్చిగాని, గుణగణాల్ని గూర్చిగాని వర్ణించి చెప్పలేం. సద్గుణ సంపన్నుడైన అతడు ప్రజాపతి పుత్రుడనే సార్థక నామం కలవాడు. ప్రజాపతి కొడుకు, ధర్మశీలుడు కావటంవల్ల దేవతలంతా కూడా ఆయనంటే చాలా ఇష్టపడేవారు; అట్లా ముల్లోకాలవారికి ప్రీతిపాత్రుడయ్యాడు.

ఆ మహనీయుడు తపస్సు ఆచరించడానికి మేరుపర్వతం ప్రక్కనే ఉండే తృణబిందు అనే మహర్షి ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడే ఆశ్రమాన్ని ఏర్పాటుచేసుకొని, స్వాధ్యాయనమందు ఇంద్రియాల్ని అదుపులో ఉంచుతూ తపస్సు చేస్తూ ఉండేవాడు. ఆ ఆశ్రమప్రాంతంలో ప్రకృతి ఎంతో రమణీయంగాను, మనోహరంగానూ ఉంటుంది. అన్ని ఋతువుల్లోనూ వృక్షాలు పూలు పండ్లతో సమృద్ధిగా ఉండేవి. అనుభవానికి యోగ్యంగా ఉండేది. ఆ కారణాన ఆ ప్రాంతాల్లో విహరించేందుకు మునికన్యలు, నాగకన్యలు, రాజర్షుల కన్యలు, అప్సరసలు వెళ్ళి ఆడుతూ పాడుతూ విహరించేవాళ్ళు. వాళ్ళంతా అలా ఆటపాటలతో విహరించడం వల్ల మహాత్ముడైన పులస్త్యుడి తపస్సుకు భంగం కలిగేది. ఆ కన్యకల ఆటపాటలు, నాట్యాలు హద్దులు మీరి పులస్త్యుడికి కోపం తెప్పించగా 'నా కంటపడ్డ స్త్రీ గర్భవతి అవుతుంది' అని శాపంలాంటి మాట అన్నాడు. ఆ విషయం తెలుసుకున్న ఆ కన్యలు పులస్త్యమహర్షి ఆశ్రమప్రాంతాలకు వెళ్ళాలంటే భయపడి అటు వెళ్ళడం మానేశారు. అయితే 'తృణబిందు' వనే రాజర్షి కుమార్తెకు ఈ విషయం

తెలియక ఆ ఆశ్రమప్రాంతాల్లో భయంలేకుండా తిరిగింది. ఎంతసేపు ఆడుకున్నా తనతోటి కన్యలెవ్వరూ కనబడని కారణం వల్ల వాళ్ళకోసం వెదుకుతూ ఉండగా, ప్రజాపతియైన పులస్త్యుడు స్వరయుక్తంగా వేదాధ్యాయనం చేస్తున్నాడు. ఆమె అట్లా ఆ వేదధ్వనిని వింటూ ఉండగా ఆమె పులస్త్యుడి కంటపడింది. అంతే ఆమె శరీరం అప్పటికప్పుడే తెల్లగా పాలిపోయినట్లైంది. దేహంలో ఏవేవో మార్పులు కలిగి గర్భవతి లక్షణాలు కనిపించాయి, నిలువెల్లా కంపించిపోయింది. ఏం జరిగిందో తెలుసుకోలేక గబగబా ఏడుస్తూ తండ్రి ఆశ్రమానికి పోయింది. బెదిరిపోతూ, వింతగా కనిపిస్తున రాజర్షి కూతుర్ని 'ఏమిటి' ? అని అడిగాడు. అప్పుడా యువతి చేతులు జోడించి తండ్రికి నమస్కరిస్తూ "నాయనా! నేనేపాపము ఎరుగను. పులస్త్యమహర్షి వేదాధ్యయనం చేస్తూ ఉంటే వింటూ నిలబడ్డాను. అటుపిమ్మటే ఇట్లా అయింది" అని అంది. అంతట ఆ రాజర్షి తృణబిందు ఒకక్షణం కళ్ళుమూసుకుని ధ్యానంచేశాడు, తన కూతురు స్థితికి పులస్త్యుడు కోపంలో అన్న మాటలేనని తెలుసుకున్నాడు. వెంటనే కూతుర్నివెంట బెట్టుకొని పులస్త్యుని ఆశ్రమానికి వెళ్ళి, ఆ మహర్షితో ఇలా అన్నాడు "ఓ మహర్షి! ఈ యువతి నా కుమార్తె, గుణవంతురాలు, బుద్ధిమంతురాలు. దైవికంగా ఈమె నీకు సంక్రమించిన భిక్షగా స్వీకరించు, పగలనక, రాత్రనక నీవు ఎప్పుడూ తపోనిష్ఠలో ఉంటావు. అందుచేత నీ శరీరపోషణకు ఒక సేవకురాలు కావాలి, నీకు మనశ్శాంతి కలిగించేవారు కావాలి. నీ ఆజ్ఞలకు బద్ధురాలై, నీ మనసెరిగి సేవలు చేస్తూవుంటుంది. ఈమెను స్వీకరించు" అన్నాడు.

రాజర్షి తృణబిందు మాటలువిన్న పులస్త్యుడు "సరే భార్యగా స్వీకరిస్తున్నాను" అన్నాడు. అంతట తృణబిందు కుమార్తెను పులస్త్యునికి అప్పగించి తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు. అంతట ఆ బాలిక తన గుణములచేతను, సేవలచేతను భర్తను సంతోషపెడ్తూ ఆశ్రమజీవితాన్ని సుఖసంతోషాలతో గడపసాగింది.

మహాతేజశ్శాలియైన పులస్త్యుడు ఒకనాడు ఇలా అన్నాడు: "సుందరీ! నీ శీలానికి, నీ సేవలకూ ఎంతో సంతోషించాను. ఆ సంతోషంలో నీకు ఒక పుత్రుణ్ణి ప్రసాదిస్తున్నాను, ఆ

పిల్లవాడు నా అంతటివాడు అవుతాడు. మన ఉభయవంశాలనూ ఉద్ధరించే పౌలస్త్యుడనే కుమారుణ్ణి ఇస్తాను. నేను ఇక్కడ వేదాధ్యయనం చేస్తూవుండగా, నీవు వినడంవల్ల వాడు 'విశ్రవుడు' అనేపేరుతో ప్రసిద్ధి చెందుతాడు" అన్నాడు. భర్త మాటలకు పరవశురాలై అపరిమిత ఆనందాన్ని పొందింది. అనతి కాలంలో ముల్లోకాలలో యశోధర్మాలతో ప్రకాశించబోయే పండంటి మగబిడ్డను కన్నది. అతడికి విశ్రవశుడు అని నామకరణం చేశారు. తండ్రివలె వేదాధ్యయనం చేస్తూ సర్వభూతముల యెడలా సమభావంతో మెలగుతూ, వ్రతాలు, ఆచారాలు పాటిస్తూ అతడు తపఃశ్శాలి అయ్యాడు.

# 3వ సర్గవిశ్రవశు, వైశ్రవణుల చరిత్ర

పులస్త్యుని కుమారుడైన విశ్రవసుడు కొద్దికాలంలోనే తండ్రి అంతటి వాడయ్యాడు. వేదాధ్యయనంలోనూ, తపస్సుచేతనూ, నిష్ఠానియమాల చేతనూ, సద్గుణములచేతనూ, సచ్ఛీలము చేతనూ అందరి మెప్పునూ పొందాడు. శుచిగా జీవించే ఆ మునిపుంగవుడు భోగములయందు ఆశలేనివాడై ఇంద్రియనిగ్రహంతో, ధర్మాన్నే ఆచరిస్తూ ఉండేవాడు. విశ్రవశుని గుణగణాలు. సచ్ఛీలము తెలుసుకొన్న భరద్వాజమహర్షి దేవతా సౌందర్యంగల తన కుమార్తెను అతడికిచ్చి వివాహంచేశాడు. సకలధర్మాలు తెలిసిన ఆ విశ్రవశుడు దేవతవంటి తన భార్య వలన వంశోద్ధారకుడయిన పుత్రుణ్ణి కనాలనుకున్నాడు. తనకు పుట్టబోయే కుమారుడు ఆశ్చర్యాన్ని కలిగించేటంతటి పరాక్రమవంతుడు, బ్రాహ్మణుల గుణగణాలతో విలసిల్లేవాడై ఉండాలని కోరుకున్నాడు. అతని అభీష్టము నెరవేరింది. ఆ పిల్లవాడు పుట్టగానే తాతగారైన పులస్త్యుడు సంతోషించాడు. పిల్లవాని జాతకవిశేషాలు పరీక్షించిన పులస్త్యుడు ఈ పిల్లవాడు ధనాధ్యక్షుడు కాగలడు" అని అన్నాడు. అంతట దేవర్షులందరి సమక్షాన ఆ పిల్లవాడికి 'వైశ్రవణుడు' అని నామకరణం చేశాడు. దేవర్షులంతా ఈ పిల్లవాడు అన్నివిధాలుగా తండ్రివలె పేరు ప్రఖ్యాతులు పొందుతాడని దీవించారు. కాలక్రమాన వైశ్రవణుడు హవిస్సులనందుకునే అగ్నిహోత్రుడివలె గొప్ప తేజస్సుతో వెలిగిపోయాడు. ఆ వైశ్రవణుడు వేయ్యిసంవత్సరాలు ధర్మబుద్ధిగలవాడై, నియమాలు పాటిస్తూ గొప్ప తపస్సు చేశాడు. వెయిసంవత్సరాలు తపస్సు చేసిన తర్వాత ఆహారం లేకుండా, కేవలం గాలి, నీరు మాత్రమే తీసుకుంటూ వెయ్యి సంవత్సరాలు తపస్సుచేశాడు. ఇతడి కఠోరమైన తపస్సుకు మెచ్చుకొని బ్రహ్మదేవుడు, ఇంద్రుడు, దేవతాగణాలతో కలసి వైశ్రవణుని ఆశ్రమానికి వెళ్ళారు. బ్రహ్మ ఇలా అన్నాడు: "వత్సా! మంచినియమాలుగలవాడా! నీ తపస్సుకు సంతోషించాను, ఏం వరం కావాలో కోరుకో, వరాలు కోరుకునే యోగ్యత సంపాదించావు" అన్నాడు. అప్పుడు వైశ్రవణుడు "పూజ్యుడా! నన్ను లోకపాలకులలో ఒకడుగాచేసి, ధనాధిపత్యాన్ని నాకు ఇప్పించు" అన్నాడు. అంతట బ్రహ్మ అట్లే

అగుగాక అన్నాడు. "నాయనా! ఇప్పుడు ఇంద్ర, వరుణ, యమ అను ముగ్గురే లోకపాలకులున్నారు, ఇప్పుడు నీకోసం మరొక లోకపాలకత్వాన్ని సృష్టిస్తున్నాను. నీవు నిధులకు అధిపతిగా ఉంటూ, నాలుగవ లోకపాలకుడవు కమ్ము. నీకు దేవత్వాన్ని ప్రసాదించి, లోకసంచారానికై సూర్యునితో సమానమైన ప్రకాశంగల పుష్పకవిమానాన్ని ఇస్తున్నాను తీసుకో" అని పలికి దేవతలతోపాటు అంతర్ధానుడయ్యాడు. బ్రహ్మ, మొదలైన దేవతలంతా వెళ్ళిపోయిన తర్వాత వైశ్రవణుడు తండ్రియైన విశ్రవశువుతో ఇలా అన్నాడు. "తండ్రీ! బ్రహ్మదేవుడు నాకు లోకాధిపత్యాన్ని ప్రసాదించాడు కానీ, ఉండేందుకు నివాసాన్ని ఏర్పాటుచేయలేదు. సర్వసమర్థుడవైన ఓ తండ్రీ! ఏ ప్రాణికీ హానికలుగకుండా ఉండే నివాసస్థానాన్ని చూపించు" అన్నాడు. అందుకు విశ్రవశువు ఇలా అన్నాడు "పుత్రా! వినుము. దక్షిణ సముద్రతీరాన త్రికూటపర్వతం ఉంది. ఆ పర్వతంపైన మహేంద్రుడి అమరావతిని పోలిన విశాలమైన లంక అనే పట్టణం ఉంది. పూర్వం రాక్షసులకోసం విశ్వకర్మ ఆ లంకా నగరాన్ని సృష్టించాడు. ఆ నగరాన్ని బంగారు ప్రాకారాలతోను, ద్వారాలను పెద్దపెద్ద గడియలతోను, యంత్రాలతోను, ఆయుధాలతోను నిర్మించాడు. బంగారం, వైడూర్య, మాణిక్యాలతో నిర్మితమైన ముఖద్వారాలతో ఆ లంకాపురి విలసిల్లుతూ ఉంటుంది. పూర్వం విష్ణుమూర్తికి భయపడి రాక్షసులంతా ఆ నగరాన్ని విడిచి పాతాళానికి వెళ్ళిపోయారు. ఇప్పుడానగరంలో ఎవరూ నివసించడంలేదు, కాబట్టి నీవు వెళ్ళి ఆ నగరంలో నివసించు. ఎవరికీ ఏవిధమైన బాధకలగదు, నీకు అన్ని విధాలా సుఖంగా ఉంటుంది. నీకు శుభం చేకురుతుంది" అని అన్నాడు.

ధర్మాత్ముడైన ఆ వైశ్రవణుడు తండ్రి ఆదేశం ప్రకారం త్రికూటంపై నిర్మితమైన లంకానగరానికిపోయి నివాసం ఏర్పాటు చేసుకున్నాడు. అటుపిమ్మట వైశ్రవణుని అనుమతితో లక్షలాది రాక్షసులువచ్చి నివాసాలు ఏర్పాటు చేసుకొని సుఖంగా జీవించసాగారు. అప్పటినుండి లంకానగరం మళ్ళీ జనసమర్దం అయి కళకళలాడింది. ధర్మాత్ముడైన వైశ్రవణుడు పుష్పకవిమానంపై తల్లిదండ్రులను సందర్శిస్తూ ఉండేవాడు.

దేవతాగణాల చేతను, గంధర్వులచేతను స్తుతించబడినవాడై, అప్సర స్త్రీల నాట్యాలతో కూడిన ఆ లంకానగరంలో వైశ్రవణుడు సూర్యుడివలె కిరణాలతో ప్రకాశిస్తూ తండ్రివద్దకు వెళ్ళాడు.

# 4వ సర్గ రాక్షస వంశాలు

అగస్త్యమహర్షి మాటలువిన్న రాముడు ఆశ్చర్యపోయాడు. పూర్వం లంకలో రాక్షసుల పుట్టుక ఎలా జరిగిందో రాముడిడి అర్ధంకాలేదు. అందువల్ల గార్హపత్యం, ఆహవనీయం, దక్షిణాగ్ని అనే త్రేతాగ్నులవలె వెలిగిపోతున్న అగస్త్యమహర్షితో ఇలా అన్నాడు. "ఓ పూజ్యుడా! పూర్వం కూడా ఈ లంక రాక్షసులకు నివాసం అని నీవు అంటూ ఉంటే నాకు ఆశ్చర్యంగా ఉంది. మేము ఇంతవరకూ రాక్షసులు పులస్త్యవంశంలో పుట్టిన వారని అనుకున్నాం. ఇప్పుడు నీవు ఇతర వంశాలకు చెందిన రాక్షసులుకూడా ఉండేవారని చెప్తున్నావు. అయితే ఆ రాక్షసులు రావణ, కుంభకర్ణ, ప్రహస్తులకంటే అధిక బలవంతులా?

ఓ మహామునీ! అట్లెయినచో ఆ రాక్షసుల మూలపురుషుడెవరు? అతడి పేరేమి? బలంవల్ల మదమెక్కిన అతని పేరు ఏమిటి? విష్ణుభగవానుడు వాళ్ళను ఎందుకోసం తరిమేశాడు? వాళ్ళు చేసిన అపరాధం ఏమిటి? ఓ దోషములేనివాడా! నాకు వివరంగా చెప్పి, నా సంశయాలన్నింటినీ తీర్చు" అన్నాడు.

అప్పుడు అగస్త్యుడు సంస్కారవంతము మంగళకరమైన రాముడి పలుకులు విని ఇలా అన్నాడు: "ఓ రామా! పద్మ సంభూతుడైన బ్రహ్మదేవుడు మొదట జలాన్ని సృష్టించాడు. ఆ జలాన్ని రక్షించేందుకు ప్రాణుల్ని సృష్టించాడు, ఆ ప్రాణులన్నీ ఆహారంలేక నీరసించిపోయాయి. అయినా వారంతా సహనంతోను, వినయంతోను బ్రహ్మ దగ్గరకు వెళ్ళి మేము చెయ్యాల్సిన పనేమిటో సెలవివ్వండి' అన్నారు. అందుకు బ్రహ్మ వాళ్ళందరికీ అవసరమైన జవసత్వాలు ప్రసాదించి మీరు ఈ జలరాసినంతా కాపాడండి అన్నాడు. అప్పుడు వాళ్ళలో కొందరు 'అట్లాగే రక్షిస్తాం' అన్నారు మిగిలిన వాళ్ళంతా 'అట్లాగే పూజిస్తాం' అన్నారు. అంతట బ్రహ్మ మీలో రక్షిస్తాం అన్నవాళ్ళంతా రాక్షసులుగాను, 'పూజిస్తాం' అన్నవాళ్ళంతా యక్షులుగాను అగుదురుగాక! అన్నాడు.

ఆ విధంగా రాక్షసుల్లో మధుకైటభులతో సమానులు, శత్రుసంహారకులు అయిన హేతి, ప్రహేతి అనే రాక్షసనాయకులైన సోదరులుండేవారు. వాళ్ళల్లో ప్రహేతి అనేవాడు పరమధార్మికుడు, అతడు తపస్సు చేసుకోవటానికి వనాలకు వెళ్ళిపోయాడు. హేతి మాత్రం వివాహం చేసుకోవాలని గొప్ప ప్రయత్నం చేశాడు. తానే స్వయంగా వెళ్ళి యముడి సోదరియైన 'భయం' అనే కన్యను వివాహంచేసుకున్నాడు. ఆమె పేరుకు తగినట్లుగానే మహాభయంకరురాలు. రాక్షసనాయకుడైన ఆ హేతి ఆమె యందు, విద్యుత్కేశుడు అనే పుత్రుణ్ణి పొందాడు. ఆ బాలుడు సూర్యుడితో సమానమైన కాంతితో మహాతేజశ్శాలియై నీటి మధ్యన పెరిగే తామరపువ్వులా పెరిగాడు. విద్యుత్కేశుడికి యుక్తవయస్సు రాగానే హేతి అతనికి వివాహం చెయ్యాలని అనుకున్నాడు. అప్పుడా రాక్షసరాజు 'సంధ్య' తో సమానురాలైన సంధ్యా పుత్రికయైన 'సాలకటంకట' ను విద్యుత్కేశుని కొరకు ఎంపిక చేశాడు. కన్యను వరువకు దానం చెయ్యవలసినదే కదా అని సంధ్య ఈ వివాహానికి అమోదం తెలిపింది. వివాహానంతరం విద్యుత్కేశుడు సంధ్యాకుమార్తెతో, ఇంద్రుడు శచీదేవితో విహరించినట్లు విహరించాడు. కొంతకాలానికి సాలకటంకట గర్భవతి అయింది. ఆ గర్భం ఆమెకు సంతోషాన్ని కలిగించలేదు. ఎందువల్లనంటే, భర్తతో స్వేచ్ఛగా కామక్రీడలు జరిపేందుకు ఈ గర్భం ఆటంకంగా ఉంటుందని భావించింది, అందువల్ల నెలలునిండగానే మందర పర్వతానికిపోయి అక్కడే ఆ శిశువును ప్రసవించి, ఆ శిశువును అక్కడే ఒదిలి భర్త దగ్గరకు వెళ్ళిపోయింది.

మందరపర్వతంపై ఒదిలేసిన శరత్కాల సూర్యునివంటి కాంతిగల ఆ శిశువు ఆలనాపాలనా చూసేవాళ్ళు లేక ఆకలిదప్పికలతో, తన పిడికిలిని నోట ఉంచి మెల్లగా ఏడవ సాగింది. ఆ పిల్లవాడి అదృష్టవశాన, ఆ సమయానికి పార్వతీపరమేశ్వరులు అటే వెళ్తూ, ఆ శిశువు రోదన విన్నారు. కరుణామయుడైన పరమేశ్వరుడు ఆ శిశువును తీసుకొనివచ్చి పార్వతీదేవికిచ్చాడు. అప్పుడా పార్వతీ పరమేశ్వరులిద్దరూ ఆ పిల్లవాణ్ణి తమ పుత్రుడిలాగానే భావించి వెంటనే తల్లితో సమానమైన వయస్సునిచ్చి ఆ బాలుణ్ణి యువకుడిని చేశారు. ఆ బాలుడికి సుకేశుడు అని నామకరణం చేశారు. అట్లాగే ఆ యువకుణ్ణి దేవపురుషుడుగా

అనుగ్రహించారు; ‘కాలగమనం’ అనే విమానాన్నిచ్చి స్వేచ్ఛగా సంచరించమన్నారు. ఓ రామా! ఇక ఆ సుకేశుడి వైభోగం చెప్పాలా? పరమేశ్వరుడి నుండి అనేక వరాలు పొందాడు; ఇష్టంవచ్చినట్లు ఆకాశంలో తిరిగేందుకు విమానాన్ని పొందాడు. అప్పటినుండీ సుకేశుడు ఆకాశమార్గాన, ఇంద్రుడివలె విహరిస్తూ, పరమేశ్వరుని సాన్నిధ్యంలో ఉంటూ దేవతలకు కూడా ప్రీతిపాత్రుడయ్యాడు.

# 5వ సర్గ సుకేశుని సంతానం

రామా! సుకేశుడు ధర్మాత్ముడై ఉండటం, (రాక్షస లక్షణాలు లేకపోవటం) చూసిన గ్రామణి అనే గంధర్వుడు తన కుమార్తె 'దేవవతి' నిచ్చి వివాహం చెయ్యాలని అనుకున్నాడు. ఆ దేవవతి అందాలరాశి. రూపము, యౌవనము, లావణ్యము కలిగినదై ముల్లోకాల్లోనూ రెండవ లక్ష్మీదేవిగా ప్రసిద్ధి పొందింది. శివుడి వలన వరములు పొందినవాడు, శివపార్వతులకు ప్రియమైనవాడూ అయిన సుకేశుడితో గ్రామణి తన మనస్సులో మాటచెప్పి దేవవతినిచ్చి వివాహం చేశాడు. దేవవతి సుకేశుణ్ణి భర్తగాపొంది, తన జన్మ ధన్యమైనదని తలచింది. పూర్వపుణ్యఫలంచేతనే ఇటువంటి భర్త దొరికాడని మురిసిపోయింది. అటు సుకేశుడు కూడా దేవవతి వంటి అనురాగవతి, అనుకూలవతియైన భార్య దొరికినందుకు ఎంతగానో సంతోషించాడు. 'అంజన' అనే దిగ్గజానికి పుట్టిన మహాగజము ఆడ ఏనుగుతో విహరిస్తున్నట్లు సుకేశుడు అమితానందం పొందాడు.

కొంతకాలానికి సుకేశునికి దేవవతియందు ముగ్గురు పుత్రులు కలిగారు. వారు ముగ్గరుకూడా మూడు (దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని, గార్హపత్యాగ్ని) అగ్నులతో సమానమైన తేజస్సుతో కూడిన దేహాలు కలవారయ్యారు. సుకేశుడు వాళ్ళకు మాల్యవంతుడు, సుమాలి, మాలి అని నామకరణం చేశాడు. పరమేశ్వరుడితో సమానమైన తేజస్సు కలిగిన తన కుమారులను చూసుకుంటూ సుకేశుడు చాలా సంతోషించాడు.

వాళ్ళు ముగ్గురూ మూడు అగ్నులు వలె తేజస్సు గలవారు. ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి కలిగిన మూల మహామంత్రముల వంటివాళ్ళు. వాత పిత్త శ్లేష్మాలనే మూడు వ్యాధుల్లాగా మహాభయంకరులు. వాళ్ళు ముగ్గురూ దినదినాభివృద్ధి చెందుతూ పెరిగారు. యుక్తవయస్సురాగానే, తన తండ్రి శివుడి వలన వరాలుపొంది ఐశ్వర్యవంతుడయ్యాడని విన్నారు. తాముకూడా తపస్సుచెయ్యాలని నిశ్చయించుకొన్నారు, కఠినమైన నియమాలతో

ఘోరంగా తపస్సు చేశారు. అంతటి కఠిన నియమాలు లోకంలో ఎవరూ పాటించి తపస్సు చెయ్యలేరు. సహజంగా రాక్షసులు కావటాన వాళ్ళు ముగ్గురూ ఎంతటి కష్టాన్నైనా సహించి తపస్సు చెయ్య గలిగారు. వాళ్ళ కఠోర తపస్సుకు భూతాలన్నీ భయపడ్డాయి. సత్యము, ఋజువర్తనం, శమము అనే ధర్మాన్ని భూలోకంలో పాటించటం ఎంతో దుర్లభం. అందువలన దేవ, అసుర మానవ సంఘాలన్నీ భయపడిపోయాయి.

అప్పుడు బ్రహ్మదేవుడు, ఇంద్రుడు మున్నగు దేవతాగణంతో వచ్చి ఆ ముగ్గురు సోదరులకు ప్రత్యక్షమయ్యారు. వరాలు కోరుకోమన్నారు, బ్రహ్మదేవుడు అన్నమాటలకు వాళ్ళు కళ్ళు తెరిచి చూశారు. ఎదురుగా ఉన్న బ్రహ్మాది దేవతలందర్నీ చూశారు. చివాలునలేచి నిలబడి అంజలిఘటించి బ్రహ్మను స్తోత్రంచేశారు. పిమ్మట వారీవిధంగా వరాలు కోరారు. "దేవా! మా శత్రువులందర్నీ నాశనం చెయ్యగలశక్తి మాకు కావాలి. మమ్మల్ని ఎవరూ జయించకుండా ఉండాలి. మేము చిరంజీవులుగా ఉండిపోవాలి, మాలోమాకు ఎన్నటికీ విభేదాలు రాకుండా ఉండాలి; అనురాగంతో జీవించాలి" అని కోరారు. అంతట బ్రహ్మ వారు కోరిన వరాలిచ్చి తన లోకానికి వెళ్ళిపోయాడు.

అటు పిమ్మట వాళ్ళు ముగ్గురూ వరాల బలంచేత గర్విష్ఠులయ్యారు. భయంకరులై ముల్లోకాల్నీ కాల్చుకు తిన్నారు. సురులు, అసురులు, ఋషులు, చారణులు నానాబాధలూ పడ్డారు. నరకంలో బాధలుపడే మనుష్యుల్లాగా వారికి ఎవరూ రక్షకులు లేకుండా పోయారు.

రామా! పిమ్మట ఆ రాక్షసులుముగ్గురూ శిల్పులలో శ్రేష్ఠుడైన విశ్వకర్మ వద్దకువెళ్ళి ఇలా అన్నారు. "ఓ మహాశిల్పీ! దేవతల ఓజసు, తేజస్సులకు తగినట్లుగాను, వాళ్ళ హృదయాలకు ఇష్టం అయ్యేట్లుగా వాళ్ళకు గృహాలు కట్టించి ఇవ్వడంలో నేర్పరివి. ఓ మహాశిల్పీ! హిమపర్వతంపైనగానీ, మేరుపర్వతంపై గాని, మందరపర్వతంపైనగానీ మహేశ్వరుని గృహంవంటి గృహాన్ని మాకు నిర్మించిపెట్టు" అన్నారు. అంతట ఆ మహాశిల్పి విశ్వకర్మ వారితో ఇలా అన్నాడు. "ఓ రాక్షస ప్రభువుల్లారా! దక్షిణ సముద్రతీరాన త్రికూటము, సువేలము అనే

రెండు పర్వతాలున్నాయి. ఆ రెంటికీ నడుమనున్న శిఖరం కారుమబ్బులా ఉంటుంది. నాలుగుదిక్కులా ఉన్న కొండచరియలు విచ్చుకత్తుల్లా ఉంటాయి. అందువల్ల ఆకాశంలో ఎగిరేపక్షులు కూడా ఆ చెరియలు దాటిరాలేవు. ఆ శిఖరం మీద ముప్ఫైయోజనాల వెడల్పు, నూరుయోజనాల పొడవుగల లంకాపట్టణాన్ని మహేంద్రుడు నిర్మించమంటే నిర్మించాను. దానికి చుట్టూ బంగారు రేకులతో తాపడం చేసిన ప్రాకారం ఉంది. ముఖద్వారాలు కూడా బంగారంతోనే నిర్మించాను. ఆ లంకానగరం దేవేంద్రుడి అమరావతివలె శత్రువులచే ఎదిరింపరానిది, మీరు ఆ లంకా నగరంలో నివసించండి. మిమ్మల్ని శత్రువులెవ్వరూ ఎదిరించలేరు."

విశ్వకర్మ మాటల్ని విన్న ఆ రాక్షసవీరులు అనేక వేల రాక్షసవీరుల్ని తీసుకొని వెళ్ళి ఆ లంకానగరంలో నివాసం ఏర్పాటు చేసుకున్నారు. ఆ కాలంలో నర్మద అనే గంధర్వస్త్రీ ఉండేది. ఆమెకు ఆసీత్ శ్రీ, కీర్తి, సమద్యుతి శ్రీకీర్తులతో సమానమైన కాంతిగల ముగ్గురు కుమార్తెలున్నారు. ఆ కుమార్తెలపేర్లు వరుసగా సుందరి, కేతమతి, వసుద. ఈ ముగ్గురు గంధర్వకన్యల్నీ సుకేశుని పుత్రులు ముగ్గురికి, సుందరిని పెద్దవాడైన మాల్యవంతుడికి, కేతుమతిని సుమాలికి, వసుదను మాలికీ ఇచ్చి, భగుడు దేవతగా గల ఉత్తర ఫల్గుణీనక్షత్రంతో కూడిన ముహూర్తాన వివాహంచేసింది. ఆ వివాహం అయిన తర్వాత ఆ ముగ్గురూ వారి భార్యలతో దేవతలు అప్సరసలతో విహరించినట్లు సుఖసంతోషాలతో గడిపారు.

ఓ రామా! మాల్యవంతుడు, సుందరియందు వజ్రముష్టి, విరూపాక్షుడు, దుర్మఖుడు, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు, మత్తోన్మత్తలను పుత్రులు అనల అనే పుత్రిక జన్మించారు.

సుమాలికి, కేతుమతి యందు ప్రహస్తుడు, అకంపనుడు, వికటుడు, కాలికాముఖుడు, ధూమ్రాక్షుడు, దండుడు, సుపార్శ్వుడు, సంహాద్రి, ప్రఘసుడు, బాసకర్ణుడు అను పుత్రులను, పుష్పోత్కట, కైకసి, కుంభీవసి అను కుమార్తెలూ జన్మించిరి. మాలికి, వసుదయందు అనలుడు, అనీలుడు, హరుడు, సంపాతి అను పుత్రులు కలిగారు. ఈ నలుగురూ విభీషణునికి

మంత్రులయ్యారు. పిమ్మట ఆ ముగ్గురు సోదరులు, వారి పుత్రులు, ఇతర రాక్షసులతో కలసి, వారి పరాక్రమంచేత బ్రహ్మదేవుడి నుండి పొందిన వరముల వల్ల గర్వించినవారై ఇంద్రుణ్ణి ఇతర దేవతా సమూహాన్ని, ఋషులను, నాగులను, యక్షులను నానాబాధలు పెట్టేవారు. యజ్ఞాల్ని ధ్వంసం చేస్తూ గాలివలె దేశం అంతా వ్యాపించి ప్రజల్ని పీడించేవాళ్ళు.

# 6వ సర్గ దేవతలు విష్ణువును ప్రార్థించటం

ఆ ముగ్గురు రాక్షససోదరులు బలగర్వంచేతను, వరగర్వంచేతనూ ముక్కోటి దేవతల్ని, ఋషిగణాన్ని నానాబాధలు పెడ్తున్నారు. యజ్ఞయాగాలు ధ్వంసం చేశారు. అంతాకలసి, సృష్టి, స్థితి, లయకారకుడైనవాడు, ఆది అంతములేనివాడు, వ్యక్తం కానిరూపం గలవాడూ, సకల లోకాలకు ఆధారభూతుడు, చరాచరసృష్టికంతటికి పరమగురువు, మన్మథ శత్రువు, త్రిపురాలకు శత్రువు, త్రినేత్రుడు, అయిన మహేశ్వరుడి దగ్గరకు వెళ్ళి అంజలిఘటించి నమస్కరిస్తూ ముక్తకంఠతో ఇలా ప్రార్థించారు.

"ప్రాణులకు ప్రభువైనవాడా! పూజ్యుడా! వరములచేత గర్వితులై, ముల్లోకాలవాళ్ళను సుకేశుని కుమారులు ముప్ప తిప్పలు పెడ్తున్నారు. మా ఆశ్రమాలకు రక్షణలేకుండా పోయింది. దేవతల్ని స్వర్గంనుండి వెళ్ళగొట్టి వాళ్ళే దేవతల్లాగా వ్యవహరిస్తున్నారు.

మాలి, సుమాలి, మాల్యవంతులు, వారి రాక్షసగణం మాపై పడి 'నేనే విష్ణువును; నేనే రుద్రుణ్ణి; నేనే బ్రహ్మను; నేనే ఇంద్రుణ్ణి; నేనే యముణ్ణి, నేనే వరుణుణ్ణి, నేనే చంద్రుణ్ణి, నేనే సూర్యుణ్ణి' అని అంటున్నారు.

ఓ మహాదేవా! వాళ్ళతో నానాబాధలూపడుతున్న మాకు అభయం ఇవ్వు. భయంకరులు, లోకకంటకులైన ఆ రాక్షసుల్ని వధించు" అని మొరపెట్టుకున్నారు.

ఆ విధంగా దేవతలు, ఋషులు ప్రార్థించగా, ఆ మహేశ్వరుడు ఇలా అన్నాడు "ఓ దేవతల్లారా! నేనే సుకేశునికి వరాలు ఇచ్చాను. అందువల్ల ఈ రాక్షసుల్ని నేను చంపలేను. అయితే వాళ్ళు ఎవరివల్ల చంపబడతారో మీకు ఉపాయం చెప్తాను. మీరు విష్ణువు దగ్గరకుపోయి శరణు కోరండి. ఆయనే వాళ్ళను చంపగల సమర్థుడు" అని సలహా ఇచ్చాడు.

అంతట ఆ దేవ, ఋషిగణం అంతా శివుణ్ణి స్తుతించి, విష్ణువు వద్దకు వెళ్ళారు. శంఖచక్ర

గదాధారియైన ఆ శ్రీమహావిష్ణువును స్తుతించారు. సుకేశునిపుత్రుల ఆగడాలను ఇలా విన్నవించారు.

“ప్రభూ! త్రేతాగ్నులవంటి సుకేశుని పుత్రులు ముగ్గురూ మమ్మల్నందర్నీ స్థానభ్రష్టుల్ని చేశారు. మా స్థానాలన్నీ వాళ్ళు ఆక్రమించుకున్నారు. లంకలో త్రికూటపర్వతంపై నివాసం ఏర్పాటు చేసుకున్నారు. ఆ పట్టణం లోపలికి ఒక చీమయైనా దూరలేదు. ఆకాశమార్గన ఒక పక్షికూడా పోజాలదు. ఆ లంకాపట్టణంలో నివసిస్తూ మమ్మల్నందర్నీ బాధిస్తున్నారు.

దేవతలకు ప్రభువా! ఓ మధుసూధనా! మేమంతా నిన్ను శరణు కోరుతున్నాం. సూర్యుడు మంచును తొలగించినట్టు ఆ రాక్షసుల్ని సంహరించి మమ్మల్ని రక్షించు. భయం కలిగినప్పుడల్లా నీ అభయం కోరుకుంటూ ఉంటాం. నీ చక్రాయుధంచేత వాళ్ళ తలలు ఖండించు. నిన్నే నమ్ముకున్న వాళ్ళం, కాబట్టి నీవే మమ్మల్ని రక్షించాలి.

ఓ దేవదేవా! మితిమీరిన మదంతో విర్రవీగుతున్న ఆ దుష్టరాక్షసుల్ని సపరివారంగా నాశనం చెయ్యి. సూర్యుడు మంచును తొలగించినట్లు నీవు మా భయాన్ని తొలగించు” అని ప్రార్థించారు.

“వాళ్ళను తప్పకుండా సంహరిస్తాను, మీరు నిర్భయంగా ఉండండి” అని అభయం ఇస్తూ విష్ణువు అన్నాడు.

అక్కడ లంకలో మాల్యవంతుడు ఈ దేవతా ప్రయత్నాల గూర్చి విని, తన సోదరులతో ఇలా అన్నాడు: “ఓ రాక్షసశ్రేష్ఠులారా! మనల్నందర్నీ సంహరిస్తానని విష్ణువు దేవతలకు, ఋషులకు ప్రతిజ్ఞ చేశాడు. ఇప్పుడు మన కర్తవ్యం ఏమిటో మీరంతా ఆలోచించాలి.

విష్ణువు సామాన్యుడు కాదు, హిరణ్యకశిపుడువంటి బలపరాక్రమాలు కలిగిన రాక్షసుల్ని అనేకమందిని చంపాడు. ఇతడితో యుద్ధంచేసిన నముచి, కాలనేమి, సంహ్లాదుడు,

మాయావియైన రాధేయుడు, ధార్మికుడైన లోకపాలకుడు, యమలార్జునులు, హార్దిక్యుడు, శుంభుడు, నిశుంభుడు, మొదలైన అసురుల్ని, దానవుల్ని సంహరించిన విషయం మనమందరం ఎరుగుదుము. మన పూర్వీకులైన ఈ అసురులు కూడా సామాన్యులేం కారు. వాళ్ళు ఎన్నో యజ్ఞయాగాలు చేశారు. అంతా మాయలు తెలిసినవారే. అందరూ అస్త్రాలు ప్రయోగించడంలో నేర్పుగలవాళ్ళే. అంతా శత్రుభయంకరులే! అటువంటి అసంఖ్యాక అసురుల్ని, శ్రీమన్నారాయణుడొక్కడే సంహరించాడు.

మీరంతా ఆలోచన చేసేముందు ఈ విషయాలన్నీ దృష్టిలో ఉంచుకొని తగిన కర్తవ్యాన్ని మనం చేపట్టాలి. మనల్ని చంపుతానని ప్రతిజ్ఞచేసిన నారాయణుని జయించడం కష్టం." అన్నగారి మాటల్ని విన్న మాలి, సుమాలి, అశ్వనీదేవతలు దేవేంద్రుడితో అన్నట్లు, అన్నగారితో ఇలా అన్నారు. "అన్నా! మనం బాగా అధ్యయనం చేశాం, విరివిగా దానాలిచ్చాం, యాగాలుచేశాం, రోగాల్లేని ఆయుర్దాయాన్ని పొందాం (ఐశ్వర్యాన్ని). తిరుగులేని రాజ్యాన్ని పాలిస్తున్నాం. మనం ధర్మాత్ములమై ధర్మమార్గాన్ని స్థాపించాం. మనం అనేకసార్లు సముద్రంవంటి దేవతాసైన్యాల్ని మన శస్త్రబలంతో జయించాం. అన్నింటికన్నా ముఖ్యమైనదేమంటే మనం మృత్యువును జయించాం; మత్యుంజయులం! ఇక మనం ఎవరికి భయపడాలి? నారాయణుడు, రుద్రుడు, ఇంద్రుడు, యముడు వంటివారు కూడా మన ఎదుట నిలబడటానికే భయపడతారే? రాక్షసరాజా! సోదరా! మనకు విష్ణువుతో ఎటువంటి విరోధమూలేదు. కాబట్టి విష్ణువుకు కూడా మనపై ద్వేషం ఉంటుందని మేం అనుకోవటంలేదు. కాకపోతే, ఈ దేవతల చెప్పుడు మాటలు విన్న విష్ణువు మనపై కోపంలో రెండుమాటలు అని ఉండవచ్చు. అంతమాత్రం చేత అదేమీ విష్ణువు మనపై చేసిన ప్రతిజ్ఞ కాదు. అందుచేత మనం అందరం కలసి ఈ కుతంత్రానికి కారకులైన దేవతలందర్నీ చంపేద్దాం."

బలవంతులైన ఆ రాక్షసశ్రేష్ఠులంతా దేవతలపై యుద్ధాన్ని ప్రకటించి, జంభవృత్రాసురాదులవలే కోపంతో యుద్ధానికి బయలుదేరారు. రథాలు, ఏనుగులు, గుర్రాలు,

గాడిదలు, ఎద్దులు, ఒంటెలు, శింశుమారములు, పెద్దపులులు, సింహాలు, వరాహములు, చమరబలగాల్ని ఎక్కి రాక్షసులంతా దేవలోకంపైకి దాడిచేశారు. లంకలో నివసించే ప్రాణులన్నీ అనేక దుశ్శకునాల్ని చూశారు. ఏం జరగబోతోందోనని భయపడ్డారు. అటు రాక్షసులు తమపై పెద్దపెట్టున దండెత్తి రావటాన్ని చూసిన దేవతలు భయంతో పారిపోయారు. అప్పుడు రాక్షసుల వినాశాన్ని సూచిస్తూ అనేకమైన అపశకునాలు భూమిపైన, ఆకాశంలోకూడా కనబడ్డాయి. మేఘాల్లోనుండి ఎముకలు రాలాయి; వేడిరక్తం వర్షించింది. సముద్రాలు చెలియలికట్టల్ని తెంచుకుని ప్రహించాయి. పర్వతాలు, భూమి కంపించాయి. కొన్నిభూతాలు వికృతంగా నవ్వాయి. భయంకరమైన ఆడనక్కలు ఏడ్చాయి. గ్రద్దల గుంపులు భయంకరమైన ముఖాల్తో రాక్షసులపై ప్రదక్షిణాలు చేశాయి. భూమి మొదలైన భూతాలన్నీ కంపించాయి. పావురాలు, గోరువంకలు ఎర్రటి పాదాలతో వచ్చి వాలాయి, కాకులు, పక్షులు, పిల్లులు భయంకరంగా అరిచాయి.

వరగర్వంతోను, బలగర్వంతోను విర్రవీగుతున్న ఆ రాక్షసులు ఆ ఉత్పాతాలను లెక్క చెయ్యలేదు. కాలపాశంచేతుల్లో చిక్కుకుపోయిన ఆ రాక్షసులు, ముందుకు వెళ్ళారేకాని, తిరిగిరాలేదు. మాల్యవంతుడు, సుమాలి, మాలి త్రేతాగ్నుల్లాగా ముందువెళ్తూ ఉంటే రాక్షససైన్యం వారిని అనుసరించి వెళ్ళింది. దేవతలంతా బ్రహ్మదేవుణ్ణి ఆశ్రయించి ఉన్నట్లు, రాక్షసులంతా మాల్యవంతుణ్ణి మాల్యవత్పర్వతంవలె ఆశ్రయించారు.

అప్పుడు ప్రభువైన శ్రీమహావిష్ణువు దేవదూతల ద్వారా, రాక్షసులు దండెత్తి రావడాన్ని తెలుసుకున్నాడు. ఇక ఉపేక్షించరాదని అనుకున్నాడు. పద్మములవంటి నేత్రములుగల శ్రీహరి, ఆయుధాల్ని ధరించి గరుత్మంతుడిపై వెయ్యిసూర్యుల కాంతితో బయలుదేరాడు. దివ్యమైన కవచాన్ని ధరించాడు, ఖడ్గాన్ని ధరించాడు. మంచి రెక్కలుగలిగి పర్వతంవలె ఉన్న గరుత్మంతుడిపై ఎక్కి, రాక్షససంహారానికి బయలుదేరాడు. పచ్చనివస్త్రాలు ధరించి గరుత్మంతుని వీపుపై కూర్చున్న నల్లనిశరీరచ్ఛాయ గల ఆ శ్రీమహావిష్ణువు, బంగారుకొండ మీద మెరుపుతో

ఉన్న మేఘంవలె కనిపించాడు. అప్పుడు సిద్ధులు, దేవర్షులు, మహోరగులు, గంధర్వులు, యక్షులు, స్తుతిస్తూవుంటే శంఖ, చక్ర, గదాఖడ్గ ధారియై శార్ఙ్గమును చేతబూని శ్రీమహావిష్ణువు రాక్షస సైన్యంలోకి ప్రవేశించాడు. గరుత్మంతుడి రెక్కలనుండి వచ్చే గాలికి రాక్షససైన్యాలు, రథాలు, రథధ్వజాలు ఎగిరెగిరి పడ్డాయి. అప్పుడు వేలకొద్దీ రాక్షససైనికులు శ్రీమహావిష్ణువును చుట్టుముట్టి వాడియైనవి రక్తమాంసాలు పూయబడిన ఆయుధాలతో కొట్టారు.

# 7వ సర్గ శ్రీమహావిష్ణువు రాక్షసులను సంహరించటం

రాక్షసులనే మేఘాలుగర్జిస్తూ, మేఘాలు పర్వతంపై వర్షం కురిపించినట్లు నారాయణుడనే అద్రిపై బాణవర్షం కురిపించారు. రాక్షసుల ధనుస్సులనుండి బయలుదేరిన వజ్రములవంటి బాణాలు వాయు మనోవేగంతో బయలుదేరి మిడతలు పంటచేనుపై, దోమలు అగ్నిని, ఈగలు అమృతఘటాన్ని; సముద్రంలో మొసళ్ళు ప్రవేశించినట్లు; ప్రళయకాలమందు లోకములువలె, నారాయణుని తాకి రూపురేఖలు లేకుండా పోయాయి. రథికులు గజారూఢులు, అశ్వారూఢులు, కాల్బంటులు రకరకాలైన ఆయుధాలతో ఊపిరాడని విధంగా యుద్ధం చేయడం వలన శ్రీహరి ప్రాణాయామం చేసిన యోగివలె కనిపించాడు. చేపలసమూహం సముద్రాన్ని కలతపెట్టినట్లు, రాక్షసులు బాణాలతో కొడ్తూవుంటే, ఆ మహావిష్ణువు శార్ఙ్గమనే ధనుస్సును ఎక్కుపెట్టి రాక్షసులపై బాణాల్ని ప్రయోగించాడు. వేలాది వాడియైన బాణాల్ని ఆ రాక్షసులపై ప్రయోగించాడు. ఆ విధంగా, వర్షాన్ని వాయువు తరిమినట్టు రాక్షసులపై బాణాల వర్షం కురిపించి రాక్షసులను తరిమి, పాంచజన్యమనే మహాశంఖాన్ని పూరించాడు. ఆ భయంకర పాంచజన్య శబ్దం మూడు లోకాల్ని భయపెట్టింది; అరణ్యంలో సింహగర్జనం విన్న మదించిన ఏనుగులవలె, శంఖధ్వని విన్న రాక్షసులు దిగ్భ్రాంతిచెందారు. గుర్రాలు పరుగులు పెట్టాయి; ఏనుగులు ఎలుకల్లా పరుగులుపెట్టాయి. వీరులు రథాలపైనుండి జారిపడ్డారు. చక్రయుధం రక్తధారను స్రవింప చేసింది. శ్రేష్ఠమైన శంఖధ్వని, శార్ఙ్గముయొక్క ధ్వని, విష్ణు సంబంధమైన ధ్వని రాక్షసులు చేసే ధ్వనిని మ్రింగివేసింది. సూర్యుని నుండి వెలువడిన భయంకరమైన కిరణాలవలె శార్ఙ్గము నుండి వెలువడిన బాణాలు సాగరంలోని ప్రవాహం, పర్వతాలనుండి గజేంద్రాలు, మేఘం నుండి జలప్రవాహము వెలువడినట్టు అతి శ్రీఘ్రముగా వచ్చాయి. శ్రీహరి ధనుస్సునుండి బయలుదేరిన బాణాలన్నీ జెండాలను, ధ్వజాలను, రథాలను ధ్వంసం చేశాయి. ఏనుగుల్ని, గుర్రాల్ని నేలకూల్చాయి. కాలిభటుల తలలు ఎగిరిపోతున్నాయి. శరభమృగంచేత సింహాలు, సింహాలచేత ఏనుగులు, ఏనుగులచేత పులులు, పులులచేత చిరుతపులులు,

చిరుతపులులచే జాగిలాలు, జాగిలాలచే పిల్లులు, పిల్లులచే పాములు, పాములచే ఎలుకలు, హరించబడ్డట్లుగా, శ్రీహరిచే రాక్షసులు హరించబడ్డారు. ఈ విధంగా శ్రీహరి రాక్షసుల్ని సంహరించి దేవేంద్రుడు మేఘాన్ని పూరించినట్టు శంఖాన్ని పూరించాడు. ఆ శంఖనాదంతో చావగా మిగిలిన సైనికులు లంకముఖం పట్టారు. అప్పుడు సుమాలి విష్ణువుతో యుద్ధానికి దిగాడు. ఆ సుమాలి, సూర్యుణ్ణి పొగమంచు కప్పేసినట్లు, శ్రీహరిని తన బాణాలలో కప్పాడు. అప్పుడు లంకముఖం పట్టిన రాక్షసులంతా యుద్ధం చెయ్యడానికి తిరిగివచ్చారు. వారందరికీ ఉత్సాహం కలిగించాలని సుమాలి బిగ్గరగా ధ్వని చేస్తూ సింహనాదం చేశాడు. సుమాలి అట్లా సింహనాదం చేస్తూవుండగా విష్ణుభగవానుడు అతడి రథ సారథి శిరస్సును ఖండించాడు. సారథిలేని గుర్రాలు అదుపుతప్పి, ఇంద్రియనిగ్రహం కోల్పోయిన మానవుడివలె, అటూ ఇటూ పరుగెత్తాయి. దాంతో గుర్రాలు రథాన్ని యుద్ధభూమి నుండి దూరంగా తీసుకుపోయాయి. ఇదంతా చూస్తున్న మాలి, విష్ణువుపై యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు. మాలి ధనుస్సునుండి బంగారంతో అలంకరించబడిన బాణాలు, పక్షులు క్రౌంచపర్వతాన్ని సమీపించినట్లు విష్ణుమూర్తి దేహంలో గుచ్చుకున్నాయి. ఈ అవకాశాన్ని జారవిడవకూడదని అనుకొని మాలి వేలాది బాణాల్ని శ్రీమహావిష్ణువుపై ప్రయోగించాడు. విష్ణువు ఇంద్రియ నిగ్రహం కలవాడు మనోవ్యధలకు గురికానట్టు ఆ బాణాలేవీ శ్రీహరిని బాధించలేకపోయాయి. పిమ్మట మహావిష్ణువు ధనుష్టంకారంచేసి మాలిపైన బాణాలవర్షం కురిపించాడు. వజ్రాయుధం వంటి ఆ బాణాలు మెరుపుల్లాగా మెరుస్తూ మాలి దేహాన్ని తాకి, సర్పాలు అమృతం తాగినట్లు అతడి రక్తాన్ని త్రాగాయి. శంఖచక్ర గదాధారియైన శ్రీహరి, మాలి రథ ధ్వజాన్ని, రథాన్నీకూడా కూల్చేశాడు. గుర్రాలు నేలకూలాయి. రథం ధ్వంసం కాగానే, సింహంవలె నేలపైకి దూకాడు. అంతట మాలి గదను తీసుకొని, యముడు ఈశ్వరుణ్ణి కొట్టినట్టు, ఇంద్రుడు వజ్రాయుధంతో పర్వతాన్ని కొట్టినట్టు, గరుత్మంతుడి నుదుట గట్టిగా కొట్టాడు. గరుత్మంతుడు ఆ దెబ్బకు తట్టుకోలేక, విష్ణువుతో సహా యుద్ధభూమి నుండి వెనుతిరిగాడు. విష్ణువు వెనక్కుపోవడం చూసిన రాక్షసులంతా సంతోషంతో సింహనాదాలు చేశారు. రాక్షసుల కేకలు, సింహనాదాలు విన్న శ్రీహరికి బాగా కోపం వచ్చింది. గరుత్మంతునిపైన కూర్చుని వెనక్కు తిరిగి ఉండియే

చక్రాయుధాన్ని ప్రయోగించాడు. ఆ చక్రం ఆకాశాన్నంతా కాంతితో ప్రకాశింప చేస్తూ మాలి శిరస్సును ఖండించింది. చక్రంచే ఖండించబడిన శిరస్సు, పూర్వం రాహువు తల తెగినట్లు, రక్తం కారుతూ నేలపైపడింది. ఆకాశంనుండి ఈ మహాయుద్ధాన్ని వీక్షిస్తున్న దేవతలు సంతోషంతో బిగ్గరగా సింహనాదాలు చేశారు. మాలి చనిపోవడం చూసిన సుమాలి మాల్యవంతుడూ సైన్యాన్ని తీసుకొని లంకకు పారిపోయారు.

ఇంతలో గరుత్మంతుడు తెప్పరిల్లాడు, మళ్ళీ యుద్ధరంగంలో ప్రవేశించి, రెక్కలతో గట్టిగా గాలిని సృష్టించి రాక్షసులందరినీ ఎగరగొట్టాడు. శ్రీహరి చక్రం వాతపడిన రాక్షసుల్లో కొందరి తలలు ఖండించబడ్డాయి. గదతో వక్షఃస్థలాలు ముద్దముద్ద అయ్యాయి. కొందరి కంఠాలు నాగలి దెబ్బకు వాడిపోయినట్లైపోయాయి. కొందర్ని ఖడ్గంతో పొడిచి చంపాడు. కొందరి తలలు ముసలంచేత బ్రద్దలు చెయ్యబడ్డాయి, మరికొంతమంది బాణాలచేత కొట్టబడ్డారు. ఆ విధంగా రాక్షసులంతా ఆకాశంలో నుండి సముద్రంలోకి పడిపోయారు. శ్రీహరి ఆ విధంగా రాక్షసుల పాలిట ధూమకేతువై చిత్రవధ చేశాడు. పారిపోతున్న వాళ్ళుకూడా ఆ శ్రీహరినుండి తప్పించుకోలేకపోయారు. ఆ రాక్షస సైన్యంలోని గొడుగులు నేలకూలాయి. ఆయుధాలు జారిపోయాయి. రాక్షసుల వస్త్రాలన్నీ చిరిగి తుంపులైపోయాయి. ప్రేగులు బయటకు వచ్చాయి, భయంతో నేత్రాలు చంచలం అయ్యాయి. ఈ విధంగా రాక్షసుల్ని వివిధ పద్ధతుల్లో చీల్చిచెండాడాడు. శ్రీహరి ప్రయోగించిన బాణాల వేగానికి, రాక్షసులు, పెనుగాలికి ఎగిరిపోయిన మేఘాల్లాగా పారిపోయారు. రాక్షసుల కుండలాలు, మణిహారాలు తెగిపోయాయి.

# 8వ సర్గ రాక్షసులు రసాతలానికి పోవడం

శ్రీమహావిష్ణువు రాక్షససైన్యాన్ని సంహరిస్తూ ఉండగా, కోపించిన మాల్యవంతుడు, సముద్రం గట్టునుతాకి వేగంగా వెనక్కు వచ్చేవిధంగా, తిరిగి యుద్ధానికి సన్నద్ధుడై విష్ణువుతో ఇలా అన్నాడు: "ఓ శ్రీహరీ! నీవు క్షత్రియధర్మాన్ని విస్మరించి యుద్ధం చేస్తున్నావు. యుద్ధం అంటే భయపడి పారిపోతున్న మమ్మల్ని చంపుతున్నావే! ఇదేనా క్షత్రియధర్మం? యుద్ధంలో నుండి పారిపోతున్న మమ్మల్ని చంపుతున్నావు కాబట్టి పుణ్యాత్ములకు కలిగే స్వర్గానికి నీవు అర్హుడవు కావు. ఓ శ్రీహరీ! శంఖచక్ర గదాయుధాల్ని ధరించినవాడా! నీకు అంతగా యుద్ధంపై కోరిక తీరని ఎడల నేను ఇక్కడ నీ ఎదురుగా నిలబడ్డాను. నాతో యుద్ధంచేసి నీ ప్రతాపాన్ని చాటుకో!"

మహాబలవంతుడైన ఆ శ్రీమహావిష్ణువు మాల్యవంతుడి మాటలు విని ఇలా అన్నాడు. "ఓ రాక్షసా! మీ రాక్షసుల వలన దేవతలకు, ఋషులకు ఆపద ఏర్పడింది, మీ అందరినీ సంహరించి వాళ్ళను కాపాడతానని ప్రతిజ్ఞ చేశాను. నేను ప్రాణాలైనా వదులుతాను కానీ, చేసిన ప్రతిజ్ఞను మీరను! దేవతలకు సంతోషాన్ని కలిగిస్తాను. మీరు రసాతలానికిపోయి దాక్కున్నా కూడా మిమ్మల్ని వదలిపెట్టను." ఎఱ్ఱనిపద్మముల వంటి నేత్రాలు కలిగిన ఆ శ్రీహరి ఇట్లా అంటూ ఉండగానే, మాల్యవంతుడు శక్త్యాఆయుధాన్ని తీసి విష్ణువు వక్షఃస్థలంపై కొట్టాడు. పెద్దగా ఘంటారావం చేసుకుంటూ వచ్చిన ఆ శక్త్యాఆయుధం శ్రీహరి వక్షాన్ని తాకి మహామేఘాన్ని ఆవరించిన మెరుపువలె ప్రకాశించింది. కుమారస్వామికి ఇష్టుడైన ఆ శ్రీహరి అదేశక్తి ఆయుధాన్ని పైకి లాగి మాల్యవంతుడిపై ప్రయోగించాడు. ఆ శక్త్యాయుధం మాల్యవంతుణ్ణి తాకి పర్వతంపై పిడుగుపడినట్లు పడింది. ఆ దెబ్బకు మాల్యవంతుడి కవచం బ్రద్దలైపోయింది. కొద్ది క్షణాలపాటు నిశ్చేష్టుడయ్యాడు. మళ్ళా తెప్పరిల్లి పర్వతంవలె లేచి యుద్ధానికి సిద్ధపడ్డాడు. పిమ్మట అనేక ముళ్ళతో కూడిన శూలాన్ని విష్ణువుపై ప్రయోగించాడు. ఆ శూలంపోయి శ్రీహరి వక్షాన్ని తాకింది. పిమ్మట పిడికిలి బిగించి శ్రీహరిని గట్టిగా గుద్ది ఆరుమూరలు అవతలకుపోయి పడ్డాడు. క్రింద పడిపోయిన మాల్యవంతుడు మళ్ళీ లేచి నిలబడి

గరుత్మంతుణ్ణి గట్టిగా కొట్టాడు. అప్పుడు గరుత్మంతుడికి మహాకోపం వచ్చింది. రెక్కలురెండూ గట్టిగా విసిరి పెద్ద గాలిదుమారాన్ని లేపాడు. ఆ దుమారానికి రాక్షసులంతా, పెనుగాలికి ఎండుటాకులప్రోగు ఎగిరినట్లు ఎగిరిపోయారు. అన్నగారైన మాల్యవంతుడు గరుత్మంతుని రెక్కల తాకిడికి నిలబడలేక ఎగిరిపోవటం చూసిన సుమాలి సైన్యాన్ని వెంటబెట్టుకొని లంకకు వెళ్ళిపోయాడు. బలమైన గరుత్మంతుని రెక్కల తాకిడికి నిలబడలేక మాల్యవంతుడు కూడా సిగ్గుపడుతూ లంకకు తిరిగి వెళ్ళిపోయాడు.

కమలాలవంటి నేత్రాలుగల ఓ రామా! ఈ విధంగా ఆ రాక్షసులు అనేక పర్యాయాలు శ్రీహరితో యుద్ధంచేసి ఆయన ఎదురుగా నిలబడలేక భయంతో భార్యాపిల్లల్ని, పరివారాన్నీ తీసుకుని లంకను విడిచిపెట్టి పాతాళానికిపోయి స్థిరపడ్డారు. ఓ రామా! ఆ సాలకటంకట (విద్యుత్కేశుని భార్య) వంశస్థులు, పరాక్రమశాలురైన ఆ సుమాలి, మాల్యవంతుడు, మాలి మొదలైన వాళ్ళంతా గొప్పవాళ్ళు; రావణాసురుడికన్నా అనేకరెట్లు బలవంతులు. ఒక్క శ్రీమన్నారాయణుడు తప్ప, దేవతలను హింసించే రాక్షసుల్ని, మరెవ్వరూ సంహరించలేరు.

ఓ రామా! నీవు నాలుగు బాహువులు గలవాడూ, అతి ప్రాచీనుడైన, నారాయణుడవే! శ్రీహరివి. జయింపశక్యం కానివాడివి, సర్వసమర్థుడవు, వినాశరహితుడవు. నీవు రాక్షసులను సంహరించటానికే అవతరించావు.

క్షీణించిపోయిన ధర్మాన్ని తిరిగి స్థాపించడానికి, శరణాగతులను రక్షించడానికి, సర్వభూతాలను సృజించువాడైన ఆ శ్రీమహావిష్ణువు దుష్టుల్ని శిక్షించేందుకు ఆయాకాలాల్లో అవతరిస్తూ ఉంటాడు.

ఓ రామా! ఇంతవరకు రాక్షసుల జన్మవృత్తాంతాన్ని గూర్చి చెప్పాను. ఇప్పుడు రావణాసురుడి వృత్తాంతాన్ని, అతడి పుత్రులను గూర్చి చెప్తాను విను.

అప్పుడు సుమాలి విష్ణువుకు భయపడి రాక్షసులతో కలసి చాలాకాలం పాతాళంలో

నివసించాడు. బలశాలియైన కుబేరుడు పిల్లాపాపల్తో లంకలో నివసించేవాడు.

# 9వ సర్గ రావణాదుల జన్మవృత్తాంతం

కొంతకాలం తర్వాత సుమాలి పాతాళం నుండి భూలోకానికి వెళ్తూ ఉండేవాడు. అట్లా భూలోకంలో సంచరించేటప్పుడు ఒక పర్యాయం పద్మములు ధరించని లక్షీదేవి వలె ఉండే అవివాహిత కుమార్తెను కూడా తీసుకొని వెళ్ళాడు. అప్పుడు బంగారుకుండలాలు ధరించినవాడైన ఆ సుమాలి, తండ్రియైన పులస్త్యుని చూడటానికి పుష్పకవిమానంలో వెళ్తున్న కుబేరుణ్ణి చూశాడు. అప్పుడా కుబేరుడు దేవతల్లాగా వెలిగిపోతూ ఉండటం చూశాడు. మనంకూడా అట్లా కుబేరుడు వంటి వైభవం పొందాలంటే ఏంచెయ్యాలా? అని తన వాళ్ళందరితో కలిసి ఆలోచించాడు. అప్పుడు తన కుమార్తెయైన కైకసితో ఇలా అన్నాడు. "కుమారీ! నీకు పెళ్ళి ఈడు వచ్చింది. నువ్వు అంగీకరిస్తావో లేదో అనే భయంతో యువకులెవ్వరూ సాహసించి నిన్ను కోరుకోవటం లేదు. నీకా వయస్సు మించిపోతోంది, నీ వివాహం విషయమై మేమంతా చాలా దుఃఖపడుతున్నాము. పుత్రీ! నీవు సమస్త సద్గుణసంపన్నురాలవై సాక్షాత్తూ లక్ష్మీదేవివలె ఉన్నావు. సహజంగా ఆడపిల్ల తల్లిదండ్రు లంతా తమ కుమార్తెకు ఎటువంటి వరుడు దొరుకుతాడోనని దిగులుతో ఉంటారు. ఎందుకంటే, కన్య తల్లివంశము, తండ్రివంశము, పుత్రిక ఏ వంశానికి వెళ్తుందో, ఆ వంశమూ, ఈ మూడు వంశాల సద్గతులు, సత్కీర్తి ఆమె నడవడిక పైననే కదా ఆధారపడి ఉంటాయి?

పుత్రీ! నీవు మునులలో శ్రేష్ఠుడు, ప్రజాపతివంశంలో పుట్టినవాడు, పులస్త్యుని కుమారుడైన విశ్రవసును వరించి వివాహం చేసుకో. నీవు అతణ్ణి వివాహం చేసుకుంటే సూర్యునివంటి తేజస్సుతో వెలిగిపోతున్న కుబేరునివంటి పుత్రుల్ని కనగలవు." అంతట కైకసి తండ్రి మాటలు విని, తండ్రిపైన గౌరవంతో విశ్రవసు తపస్సు చేసుకుంటున్న ఆశ్రమానికి వెళ్ళింది. ఆ సమయంలో విశ్రవసు సాయంకాలం అగ్నిహోత్రం చేస్తూ నాలుగో అగ్నిలాగా తేజస్సుతో ప్రకాశించాడు. అప్పుడు కైకసి ముని పాదాలపైనే దృష్టివుంచి, కాలిబొటని వ్రేలు నేలకేసి రాస్తూ నిలబడింది.

ఉత్తమమైన స్వభావం గల ఆ విశ్రవసు, అందమైన కటిప్రదేశం గలది, చంద్రబింబంలాంటి ముఖంగలదీ అయిన ఆ కైకసిని చూసి "మంగళప్రదురాలా! నీవు ఎవరవు? ఎవరి కుమార్తెవు? ఏ పని మీద ఇక్కడకు వచ్చావు?" అని అడిగాడు.

ముని మాటలు విన్న కైకసి ఇలా అంది. "మహాత్మా! ఓ బ్రహ్మర్షీ! నేను నా తండ్రి పంపగా వచ్చాను. నా పేరు కైకసి, మిగిలిన విషయాలన్నీ నీవే తెలుసుకో." అంతట ఆ ముని తన తపశ్శక్తిచేత తెలుసుకొని ఆమెతో ఇలా అన్నాడు. "ఓ మంగళప్రదురాలా! నీ మనస్సులో ఉన్న కోరికను గ్రహించాను. నీకు నా వలన పుత్రులు కావాలని కోరుకుంటున్నావు. ఇది సంధ్యాసమయం, చాలా దారుణమైనది. అందువల్ల నీకు చాలా భయంకరమైన ఆకారం గలవాళ్ళూ, భయంకరులు, క్రూరులైన వారితో స్నేహసంబంధాలు ఉండేవాళ్ళు అయిన రాక్షసులు పుత్రులుగా పుడతారు." కైకసి ఆ బ్రహ్మర్షి మాటలు విని నమస్కరిస్తూ "పూజ్యుడా! నీవు బ్రహ్మజ్ఞానివని, నీవంటి పుత్రులు కలగాలనే కోరికతో నిన్ను ఆశ్రయించాను. నన్ను అనుగ్రహించు" అని వేడుకొంది. అప్పుడు మహాతపశ్శాలియైన ఆ విశ్రవసుడు, చంద్రుడు రోహిణితో అన్నట్లుగా "మంగళకరమైన ముఖంగలదానా! నీ చివరి పుత్రుడు మాత్రం ధర్మాత్ముడవుతాడు. నా వంశానికి తగినవాడవుతాడు" అన్నాడు.

ఓ రామా! విశ్రవసుడు ఇలా చెప్పిన కొంతకాలానికి కైకసి భయంకరులు, క్రూరులైన పుత్రుల్నికన్నది. పెద్దవాడికి పదితలలు, పెద్దకోరలు, ఇరవై చేతులు, ప్రకాశవంతమైన నల్లని జుట్టుతో పుట్టాడు. నల్లగా కాటుకకొండలా ఉన్నాడు. అతడు పుట్టగానే ఆడనక్కలు, మాంసం తినే జంతువులు నోళ్ళలో నిప్పుల కబళముతో అప్రదక్షిణంగా తిరిగాయి; మేఘాలు రక్తాన్ని వర్షించాయి, సూర్యుడు మసకబారిపోయాడు. పెద్దపెద్ద ఉల్కలు రాలాయి, భూమి కంపించింది. ప్రళయకాలపు గాడ్పులు వీచాయి. సముద్రం క్షోభించింది. బ్రహ్మర్షియైన విశ్రవసుడు ఈ పిల్లవాడికి దశగ్రీవుడు అని పేరుపెట్టాడు. దశగ్రీవుడి తర్వాత మహాకాయుడైన కుంభకర్ణుడు పుట్టాడు. ఇతణ్ణి మించిన శరీరప్రమాణం ముల్లోకాల్లోనూ మరొకరికిలేదు. కుంభకర్ణుని తర్వాత

వికృతరూపంలో శూర్పణఖ పుట్టింది. ఆమె తర్వాత ధర్మాత్ముడైన విభీషణుడు పుట్టాడు. విభీషణుడు పుట్టినప్పుడు దేవతలు పుష్పవర్షం కురిపించారు. గంధర్వులు దుందుభులు మ్రోగించారు.

లోకాలకు ఉపద్రవాలు కల్పించే ఆ రావణ, కుంభకర్ణులు ఆ మహారణ్యంలోనే పెరిగి పెద్దవారయ్యారు. మదించిన కుంభకర్ణుడు తపస్సు చేసుకుంటున్న మహర్షుల్ని చంపి తింటూ దాంతో తృప్తిచెందక ముల్లోకాల్లోనూ సంచరించేవాడు. ధర్మాత్ముడైన విభీషణుడు వేదాధ్యయనం చేస్తూ, మితాహారం, శాఖాహారం మాత్రమే భుజిస్తూ తాపస జీవితం గడిపాడు. ఒకానొక రోజున ధనాధిపతియైన కుబేరుడు పుష్పకవిమానంలో తండ్రిని చూసేందుకు వచ్చాడు. రాక్షసియైన కైకసి కుబేరుణ్ణి చూసి ఈర్ష్యచెందింది. తన కుమారుడైన దశగ్రీవుడితో ఇలా అంది: “పుత్రా! నీ సోదరుడైన కుబేరుడి వైభవం చూస్తున్నావుగదా? ఎట్లా తేజస్సుతో వెలిగిపోతున్నాడో? కావటానికి మీ ఇద్దరూ అన్నదమ్ములే అయినా, మీలో ఎంత అసమానత్వం ఉందో చూడు! నాయనా! నీవుకూడా కుబేరుడంతటి గొప్పవాడివి కావాలి. అందుకు తగిన ప్రయత్నంచెయ్యి.” ఆ విధంగా తల్లి కైకసిచేత ప్రభావితుడైన దశగ్రీవుడు, కుబేరుడిపై అసూయచెంది తల్లితో ఇలా అన్నాడు. “అమ్మా! నేను కుబేరునితో సమానుడనవుతాను; అతడికన్నా అధికుడయ్యేందుకే ప్రయత్నం చేస్తాను. నీకు ప్రతిజ్ఞచేసి చెప్తున్నాను.” అన్నాడు.

పిమ్మట ఆ దశగ్రీవుడు కుబేరుడిపైన కలిగిన ద్వేషంతో అతడికన్నా అధికుడు కావటానికి కఠోరమైన తపస్సు చెయ్యాలని నిశ్చయించుకున్నాడు. అందుకు గోకర్ణ క్షేత్రానికి పోయి ఆశ్రమాన్ని నిర్మించుకున్నాడు. తమ్ములతో కలసి అనేక నిష్ఠానియమాలతో ఘోరంగా తపస్సుచేసి బ్రహ్మదేవుని మెప్పించాడు. బ్రహ్మదేవుడినుండి అనేక వరాలు పొందాడు.

# 10వ సర్గ రావణాదులు వరములు పొందటం

రాముడు అగస్త్యమహర్షితో "ఓ మహర్షీ! మహాబలశాలులైన ఆ రాక్షససోదరులు చేసిన తపస్సు ఎటువంటిది? వివరాలు చెప్పండి" అని అడిగాడు.

రాముడికి అగస్త్యమహర్షి ఇలా చెప్పాడు. "రామా! కుంభకర్ణుడు తపోధర్మాలన్నీ అనుసరిస్తూ, గ్రీష్మంలో మండుటెండల్లో పంచాగ్నుల మధ్య తపస్సు చేశాడు. వర్షాకాలంలో వీరాసనం వేసుకొని, ఏ ఆచ్ఛాదనా లేకుండా వర్షానికి తడుస్తూ తపస్సు చేశాడు. శీతాకాలంలో మెడ వరకూ నీళ్ళల్లో నిలబడి తపస్సు చేశాడు. ఈ విధంగా పదివేల సంవత్సరాలు చేశాడు.

విభీషణుడు ఒక కాలిపై నిలబడి అయిదువేల సంవత్సరాలు తపస్సు చేశాడు. సూర్యుణ్ణి చూస్తూ, రెండుచేతులతో నమస్కరిస్తూ మనస్సునిండా వేదపురుషుణ్ణే ధ్యానిస్తూ తపస్సుచేశాడు. అతడి తపస్సుకు దేవతలంతా సంతోషించారు. పూలవర్షం కురిపించారు, అప్సరసలు ఆడారు; గంధర్వులు పాడారు.

రావణాసురుడు ఆహారంలేకుండా పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. వెయ్యిసంవత్సరాలు తపస్సు పూర్తికాగానే ఒక శిరస్సును ఖండించి అగ్నిలో హోమంచేశాడు. ఆ విధంగా తొమ్మిదివేల సంవత్సరాల్లో తొమ్మిది శిరస్సుల్ని అగ్నిలో హోమంచేశాడు. చివరి వెయ్యి సంవత్సరాలు కాగానే పదవ శిరస్సుకూడా హోమం చేయడానికి సిద్ధపడ్డాడు. అప్పుడు బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై "ఓ దశకంఠుడా! నీ తపస్సుకు సంతోషించాను, నీ తపస్సు వృథాకారాదు. ఏం వరం కావాలో కోరుకో" అన్నాడు.

అప్పుడు దశగ్రీవుడు సంతోషించి ఇలా అన్నాడు. "ఓ పూజ్యుడా! ప్రాణులు మరణం అంటేనే భయపడతారు. మృత్యువును మించిన శత్రువు లేదు. అందువల్ల నాకు మృత్యువు రాకుండా ఉండాలని కోరుకుంటున్నాను." అందుకు బ్రహ్మ దశగ్రీవుడితో ఇలా అన్నాడు. "ఓ

దశగ్రీవుడా! మరణం లేకుండా ఉండటం అనేది అసంభవం. కనుక మరేదైనా వరం కోరుకో.”

ఓ రామా! బ్రహ్మదేవుడు అట్లా అనడంతో దశగ్రీవుడు అంజలిఘటించి నమస్కరిస్తూ ఇలా అన్నాడు: “నిత్యుడవైన ఓ ప్రజాపతీ! పక్షులు, నాగులు, యక్షులు, దైత్యులు, దానవులు, రాక్షసులు, దేవతలు మొదలైనవారెవ్వరూ నన్ను చంపకుండా ఉండేట్లు వరం ఇవ్వు. ఒక్క మానవుల్ని మాత్రం వదిలేస్తున్నాను. మానవులు, మిగిలిన ఇతర ప్రాణులూ నా జోలికి రాకుండా నేనే జాగ్రత్తపడగలను. వాళ్ళంతా నాకు గడ్డిపరకలతో సమానం.” అంతట బ్రహ్మ ఇలా అన్నాడు: “ఓ రాక్షసశ్రేష్ఠా! నీవు కోరినట్లే అగుగాక! నీవు అడగకపోయినా, నీవు హోమం చేసిన నీ తొమ్మిది శిరస్సుల్ని నీకు యథాతథంగా ప్రసాదిస్తున్నాను. నేటినుండీ నీవు మరల దశగ్రీవుడవే. అంతేకాదు, నీ మనస్సుకు ఏ రూపం, ఎట్లా ఇష్టపడతావో ఆ ఆకారం నీ ఇష్టప్రకారం నా వరప్రభావం చేత లభిస్తుంది.”

చంద్రకిరణాలవలె ఎల్లప్పుడూ సర్వసద్గుణాలతో విలసిల్లే విభీషణుడు చేతులు జోడించి నమస్కరిస్తూ ఇలా అన్నాడు: “ఓ భగవంతుడా! లోకము లన్నింటికీ పూజ్యుడైనవాడా! ఎటువంటి ఆపదల్లో ఉన్నా నా బుద్ధి ఎల్లవేళలా ధర్మమునందే స్థిరంగా ఉండేట్లు అనుగ్రహించు. నేను ఉపదేశం పొందకపోయినా కూడా బ్రహ్మాస్త్రం నాకు సిద్ధించేట్లు అనుగ్రహించు. నేను ఏ ఆశ్రమంలో ఉన్నా ధర్మసమ్మతమైన బుద్ధియే నాకు కలిగేట్లుగా అనుగ్రహించు. నేను అటువంటి ధర్మాన్నే ఆచరిస్తూ ఉందునుగాక! ఓ బ్రహ్మదేవా! ధర్మం ఎడల ఆసక్తులై ఉన్నవారికి లోకంలో ఏ కొరతా ఉండదుకదా! కనుక నాకు ధర్మబద్ధమైన బుద్ధిని ప్రసాదించు.” బ్రహ్మదేవుడు విభీషణుని కోరికకు చాలాసంతోషించాడు. “ఓ విభీషణా! నీవు కోరుకున్నట్లే ధర్మాత్ముడవవుతావు. ఓ శత్రుసంహారకుడా! నీవు రాక్షసకులంలో పుట్టినా, నీ బుద్ధి ధర్మం యందు స్థిరమై ఉంది కాబట్టి నీకు మరణం లేకుండా ఉండేట్లు వరం ఇస్తున్నా” అని అన్నారు.

అప్పుడు దేవతలందరూ ఆకాశాన నిలబడి బ్రహ్మదేవుడికి చేతులు జోడించి నమస్కరిస్తూ, కుంభకర్ణుడికి వరాలు ఇవ్వవద్దని వేడుకున్నారు. “ఓ బ్రహ్మదేవుడా! ఈ కుంభకర్ణుడు

నందనవనంలో ఏడుగురు అప్సరస్త్రీలను, పదిమంది మహేంద్రుని అనుచరుల్ని, ఋషులను, మనుషుల్నీ చంపి తిన్నాడు. వరాలేవీ లేకుండానే లోకాల్ని కాల్చుకుతినే ఈ కుంభకర్ణుడికి వరాలుకూడా ఇస్తే, ముల్లోకాల్నీ చంపి తినేస్తాడు. అందుచేత ఇతడి మతికి మోహాన్ని కలిగించు, దాంతో లోకం క్షేమంగా ఉంటుంది; వాడికి వరం ఇచ్చినట్లూ ఉంటుంది" అని అన్నారు.

దేవతల మాట విని, బ్రహ్మ సరస్వతిని తలచుకున్నాడు. అప్పుడు సరస్వతీదేవి ఆయన ఎదుట ప్రత్యక్షమైంది. అంజలిఘటించి నమస్కరిస్తూ "దేవా! నన్ను ఎందుకు స్మరించారు? నేను ఏమిచెయ్యాలి?" అని అడిగింది. బ్రహ్మదేవుడు సరస్వతితో ఇలా అన్నాడు: "ఓ దేవీ! నీవు కుంభకర్ణుని యందు ఆవహించు. దేవతలు కోరినట్లు పలుకు." వెంటనే సరస్వతీదేవి కుంభకర్ణుని నాలుకపై ఆవహించింది. అటుపిమ్మట బ్రహ్మదేవుడు కుంభకర్ణుడితో "ఓ మహాబాహూ! నీకేవరం ఇష్టమో కోరుకో!" అన్నాడు. అప్పుడు కుంభకర్ణుడు వరం ఇలా కోరాడు. "దేవా నేను అనేక సంవత్సరాలు నిద్రించవలెనని కోరుకుంటున్నాను" అన్నాడు. అంతట బ్రహ్మ 'తథాస్తు' అని పలికి అంతర్ధానమయ్యాడు. అంతట సరస్వతీదేవి కూడా అతణ్ణి విడిచి వెళ్ళిపోయింది. సరస్వతీదేవి విడువగానే కుంభకర్ణునికి స్పృహవచ్చింది. తనకు జరిగినది తలచుకుంటూ "నేను కోరుకుందామని అనుకున్నదేమిటి? చివరకు కోరుకున్నదేమిటి? ఇలా ఎందుకు జరిగింది? ఇటువంటిమాట నా నోట్లోనుండి ఎట్లా వచ్చింది? బహుశాః ఇది దేవతల కుట్రయే అయివుంటుంది" అని అనుకున్నాడు.

మహాతేజస్సుతో ప్రకాశించుచున్న ఆ సోదరులు ముగ్గురూ ఈ విధంగా వరాలు పొంది శ్లేషాత్మకవనానికిపోయి సుఖంగా నివసించసాగారు.

# 11వ సర్గ రావణుడు లంకను ఆక్రమించడం

రావణ, కుంభకర్ణ, విభీషణులు బ్రహ్మనుండి వరాలు పొందారని తెలుసుకొని సుమాలి పాతాళాన్ని వదలి బయటకు వచ్చాడు. సుమాలి, మారీచుడు, ప్రహస్తుడు, విరూపాక్షుడు మహోదరుడు మొదలైన మంత్రులతోను, అనుచరులతోను ఉత్సాహంగా బయటకు వచ్చాడు. తిన్నగా రావణుని వద్దకు పోయి కౌగలించుకొని ఇలా అన్నాడు: "నాయనా! రావణా! మనందరి అదృష్టం వలన అసాధ్యమైన వరాల్ని పొందావు. ఓ మహాబాహూ! మేమంతా విష్ణువుకు భయపడి రసాతలానికి పోయి తల దాచుకుంటున్నాం. ఇప్పుడు నీవు వరాలు పొందటం వలన మాకు విష్ణువు భయంపోయింది. మేమంతా ఆ విష్ణువుకు భయపడి మన నివాసం అయిన లంకాపట్టణాన్ని వదలి రసాతలంలో తల దాచుకుంటున్నాం. ఇప్పుడు మన నివాసస్థానమైన ఆ లంకాపట్టణాన్ని నీ సోదరుడు, బుద్ధిమంతుడు, ధనాధిపతియైన కుబేరుడు నివాసంగా చేసుకున్నాడు. కాబట్టి దోషంలేని ఓ మహాబాహూ! నీవు సామదాన దండోపాయాల్లో ఏదో ఒకదాన్ని ప్రయోగించి ఆ కుబేరుణ్ణి అక్కడనుండి వెళ్ళగొట్టు. లంకాపట్టణాన్ని నీ స్వాధీనం చేసుకో. లంకాధిపతివి కమ్ము, మేమంతా నీకు విధేయులమై ఉంటాం. ఆ విధంగా మునిగిపోయిన రాక్షసవంశాన్ని నిలబెట్టినవాడివి అవుతావు." అప్పుడు దశగ్రీవుడు తాతగారైన సుమాలితో ఇలా అన్నాడు: "తాతా! కుబేరుడు అన్న, అతడు పూజ్యుడు, నీవు ఈ విధంగా మాట్లాడటం తగదు." సుమాలి దశగ్రీవుడి మనస్సు తెలుసుకున్నాడు, ప్రస్తుతానికి మౌనం వహించి తలవంచుకొని పోవడమే మంచిదని అనుకున్నాడు.

కొంతకాలానికి ప్రహస్తుడు దశగ్రీవుడి దగ్గరకు పోయి ఇలా అన్నాడు. "ఓ దశగ్రీవుడా! నీవు మహాశూరుడవు, నీవు శూరులు అనవలసిన మాటలు మాట్లాడడం లేదు. శూరులైనవారికి అన్నా, తమ్ముడు అనే బంధుత్వాలు ఉండకూడదు. ఆ మాటకువస్తే దితి, అతిది అక్కచెల్లెళ్ళు, మహా అందగత్తెలు, ఒకరిపై ఒకరు ఎంతో అన్యోన్యంగా ఉండేవాళ్ళు. వాళ్ళిద్దరూ కశ్యపుడికి భార్యలయ్యారు. అదితి ముల్లోకాలకూ ప్రభువులైన దేవతల్ని కన్నది. దితి దైత్యుల్ని కన్నది.

ధర్మాలన్నీ తెలిసినవాడా! ఓ వీరుడా! సముద్రము, పర్వతాలతో కూడిన ఈ భూమి అంతా పూర్వంనుండీ దైత్యులది. అయితే మహాబలశాలియైన విష్ణువు దైత్యులందర్నీ యుద్ధంలో చంపి ముల్లోకాల్నీ దేవతలకు ఒప్పజెప్పాడు. సోదరుడితో విరోధం ఈనాడు నీవు ఒక్కడివే పెట్టుకోవడంలేదు. అనాదినుండి సురాసురులే ఈ పనిచేశారు, అందువల్ల నా మాట విను, నేను చెప్పినట్లు చెయ్యి. దశగ్రీవుడికి ప్రహస్తుడి మాటలు బాగానచ్చాయి. 'అట్లాగే చేస్తాను' అన్నాడు.

ఆ రోజునే దశగ్రీవుడు ప్రహస్తుణ్ణి, మిగిలిన రాక్షసుల్ని వెంటబెట్టుకొని లంకానగరంలోని త్రికూటపర్వతానికి చేరుకున్నాడు. అప్పుడు ఆ రావణుడు త్రికూటపర్వతంపై ఉండి ప్రహస్తుణ్ణి కుబేరుడి దగ్గరకు రాయబారానికి పంపాలని అనుకొని ప్రహస్తుడితో ఇలా అన్నాడు: "ఓ ప్రహస్తుడా! నీవు ధనాధిపతియైన కుబేరుడి దగ్గరకుపోయి బ్రతిమాలుతూ (సామపూర్వకంగా) నా మాటగా ఇలా చెప్పు. సౌమ్యుడా! ఓ కుబేరుడా! రాక్షసులకు చెందిన లంకానగరంలో నీవు నివాసం ఏర్పాటు చేసుకున్నావు. దోషంలేని నీలాంటివారికి ఇది ధర్మం కాదు. కాబట్టి ఓ సాటిలేని పరాక్రమవంతుడా! రాక్షసులకు చెందిన లంకను మాకు ఇచ్చెయ్యి, నాకు సంతోషాన్ని కలిగించు. ధర్మాన్ని పాలించు అని ప్రాథేయపూర్వకంగా చెప్పు."

అంతట ప్రహస్తుడు లంకానగరానికిపోయి కుబేరుడితో ఇలా అన్నాడు. "ఓ మహాబాహూ! మంచి నియమములు గలవాడా! శస్త్రధారులందరిలోనూ శ్రేష్ఠుడా! నీ తమ్ముడు, దశగ్రీవుడు పంపగా నీ దగ్గరకు వచ్చాను. ఓ ధనాదీశా! గొప్పబుద్ధిగలవాడా! నీవు సకల శాస్త్రములందు పండితుడవు. దశగ్రీవుడు చెప్పమన్న మాట చెప్తున్నాను. ఆలకించు. 'పూర్వం రమ్యమైన ఈ లంకానగరం భయంకర పరాక్రమవంతులైన సుమాలి మొదలైన రాక్షసులు ఏలుబడిలో ఉండేది. కాబట్టి ఈ నగరాన్ని దశగ్రీవుడికి ఇచ్చివెయ్యమని సామపూర్వకంగా ప్రార్థిస్తున్నాను'"

చక్కగా మాట్లాడటంలో నేర్పరియైన కుబేరుడు ప్రహస్తుడి మాటలు విని ఇలా అన్నాడు: "ప్రహస్తా! ఈ లంకను నా తండ్రి నాకు ఇచ్చాడు. అప్పుడు రాక్షసులెవ్వరూ ఈ లంకలో

నివసించేవాళ్ళు కాదు. పాడుబడి ఉంది. నేను వచ్చిన తర్వాత అంతా శుభ్రంచేయించి, ప్రజలకు నివాసయోగ్యంగా చేశాను. నీవు వెళ్ళి దశగ్రీవుడితో నా మాటగా ఇలా చెప్పు. ఓ మహాబాహూ! ఈ పట్టణం, రాజ్యం నీకు కూడా సంబంధించినదే. ఏ బాధలూలేని ఈ రాజ్యాన్ని, ధనాన్ని మనం పంపకాలు చేసుకోవలసిన అగత్యం లేదు. మనం ఇద్దరం కలసి అనుభవిద్దాం''' ఇలా ప్రహస్తుడితో చెప్పి, తండ్రివద్దకుపోయి ఆయనకు నమస్కరించి తన మనస్సులోని మాటను ఆయనతో ఇలా చెప్పాడు. "తండ్రీ! ఈ దశగ్రీవుడు పూర్వం రాక్షసులు అనుభవించిన లంకను తనకు ఇచ్చివేయమని ప్రహస్తుణ్ణి పంపించాడు. ఓ ధర్మాత్ముడా! నేను ఏంచెయ్యాలో నాకు నీవే ఆదేశించు."

మునిశ్రేష్ఠుడు, బ్రహ్మర్షియైన ఆ విశ్రవసుడు కుబేరుని మాటలువిని, అంజలిఘటించి నిలబడి ఉన్న కుబేరుడితో ఇలా అన్నాడు. "కుమారా! దుష్టబుద్ధిగల ఆ దశగ్రీవుడు నా వద్దకు కూడా వచ్చి చెప్పాడు. నేను అనేక విధాలుగా నచ్చచెప్పి పంపాను, నన్ను ఎదిరించి, నేను చెప్పిన హితవు వినకపోతే నీవు దానిఫలితం అనుభవిస్తావు; నశించిపోతావు, అని కూడా మందలించాను. కుమారా! ధర్మసమ్మతమైనది, నీ శ్రేయస్సుకోరి ఈమాట చెప్తున్నాను విను. వరాలుపొందానన్న గర్వంతో వాడికి కళ్ళుమూసుకుపోయాయి. వాడు ధర్మాన్ని విడిచి తన బలాన్నే నమ్ముకుంటున్నాడు. మంచి చెడులు తెలుసుకునే స్థితిలోలేడు. అందువలన లంకను వాడికి వదిలివెయ్యి. నువ్వు, నీ అనుచరులు కైలాస పర్వతానికి వెళ్ళండి. ఆ కైలాస ప్రాంతంలో ఉత్తమమైన మందాకిని నది ఉంది. దాని జలాలు సూర్యుని బోలిన వన్నెగల బంగారు పద్మాలతోనూ, తెల్ల కలువలూ, ఇంకా ఎన్నో సుగంధ పుష్పాలతో నిండి ఉన్నాయి. అది దేవతలకు విహారభూమి, గంధర్వులు, నాగులు, పన్నగులు, కిన్నెరలు, అప్సరసలు అక్కడ స్వేచ్ఛగా విహరిస్తూ ఉంటారు. ఆ దుష్టుడైన రావణునితో తగాదా పెట్టుకోవద్దు" అన్నాడు. తండ్రిమాటను గౌరవించే బుద్ధిమంతుడైన కుబేరుడు తన భార్యాపిల్లల్నీ, మిత్రుల్ని, అమాత్యుల్ని, పరివారాన్నీ ధనవాహనాలతో సహా లంక నుండి కైలాసానికి జేర్చి అక్కడ నివాసం ఏర్పాటు చేసుకున్నాడు.

అప్పుడు ప్రహస్తుడు పరమానంద భరితుడయ్యాడు, రావణుని వద్దకు వచ్చి "మహాపురుషా! నీ అన్న కుబేరుడు లంకానగరాన్ని వదలి కైలాసానికి పోయాడు. లంక ఇప్పుడు ఖాళీగా ఉంది. ఇక నీవు నీ అనుచరులతోను, బంధువులతోను, రాక్షసులతోను, సైన్యంతోను లంకానగరానికి ప్రయాణం కమ్ము!" అని వినయంగా చెప్పాడు.

చాలా సంతోషంతో దేవేంద్రుడు స్వర్గంలోకి ప్రవేశించినట్లు రావణుడు లంకానగరంలో ప్రవేశించాడు. రాజ్యాభిషేకం చేసుకుని ఆ లంకానగరాన్ని నివాసంగా చేసుకున్నాడు. ఇప్పుడానగరం అంతా నల్లని మేఘాల్లా ఉండే రాక్షసుల్తో నిండిపోయింది. అప్పుడా కుబేరుడు కూడా తండ్రి మాటలను గౌరవించి కైలాసపర్వతంపైన దేవేంద్రుని స్వర్గమందలి అమరావతివలె నగరాన్ని నిర్మించుకున్నాడు.

# 12వ సర్గ రావణుని వివాహం

రావణుడు పట్టాభిషిక్తుడై సోదరులతోను, సోదరి శూర్పనఖతోను లంకలో సుఖంగా కాలం గడుపుతున్నాడు. పిదప సోదరులను సంప్రదించి సోదరి శూర్పనఖకు కాలకుని పుత్రుడైన విద్యుజ్జిహ్వునకు ఇచ్చి వివాహం జరిపించాడు. కొంతకాలానికి రావణుడు వేటకని అడవికి వెళ్ళాడు. అక్కడ దితి కుమారుడైన మయుడు కనిపించాడు, అతనితోకూడ లేడి కన్నులవంటి కన్నులుగల యువతి ఉంది. వారిద్దర్నీచూసి రావణుడు ఇలా అడిగాడు. "మనుష్యసంచారమే లేని ఈ అడవిలో ఈ కన్యతో కలసి తిరుగుతున్న నీవు ఎవరవు? ఎందుకు ఒంటరిగా ఈ అడవిలో తిరుగుతున్నావు?" అని అడిగాడు. ఓ రామా! అప్పుడా మయుడు ఇలా బదులుచెప్పాడు. "అయ్యా! నేను దితి పుత్రుణ్ణి, దేవేంద్రుడికి శచీదేవినిచ్చి వివాహం చేసినట్లుగా, దేవతలంతా నాకు హేమ అనే అప్సర స్త్రీతో వివాహం చేశారు. నేను ఆమెతో పదివేల సంవత్సరాలు స్వర్గసుఖాలు అనుభవించాను. ఆమె దేవతల పనిమీద వెళ్ళి పదమూడుసంవ్సరాలైంది, ఇంకా తిరిగిరాలేదు. ప్రతిక్షణమూ ఆమెను తలచుకుంటూ, పదునాలుగు సంవత్సరాల తరువాత వజ్రవైడూర్యాలతోను బంగారుమయమైన నగరాన్ని నా మాయాశక్తిచేత నిర్మించి హేమ దగ్గర లేకపోవటం వలన ఈ బాలికను పెంచుతూ అక్కడ ఆ నగరంలోనే కాలం గడుపుతున్నాను. ఈ బాలిక నా కుమార్తె. పేరు మండోదరి. నేను లేకుండా ఒంటరిగా ఆ పట్టణంలో ఉండలేనంది. ఈ బాలికను తీసుకొని ఈ వనానికి వచ్చాను. ఎందువల్లనంటే అటు తల్లితండ్రుల వంశాలు, ఇటు వివాహం చేసుకోబోయేవారి వంశం మొత్తం మూడు వంశాల కీర్తి ప్రతిష్ఠలు ఆధారపడి ఉంటాయి. అట్లా ఈ మండోదరికి ఎక్కడైనా వరుడు దొరుకుతాడేమోనని బయలుదేరాను. ఓ వీరుడా! నాకు హేమ వలన ఈ బాలిక కాకుండా ఇంకో ఇద్దరు కుమారులు పుట్టారు. పెద్దవాడు మాయావి, రెండోవాడు దుందుభి. అయ్యా! నీవు అడిగావు కనుక నా చరిత్ర అంతా చెప్పాను. ఇప్పుడు నీ వివరాలన్నీ నేను తెలుసుకోవాలని కోరుతున్నాను. నీ వెవరవు? ఎక్కడనుండి వచ్చావు? ఈ అడవిలో నీకు ఏం

పని? తెలుసుకోవాలని అనుకుంటున్నాను. చెప్పు?" అని అడిగాడు.

అంతట రావణుడు మయుడితో వినయంగా ఇలా అన్నాడు: "నేను విశ్రవసు పుత్రుణ్ణి. నన్ను దశగ్రీవుడు అని అంటారు. నా తండ్రియైన విశ్రవసు బ్రహ్మ నుండి మూడవవాడు." రామా! దశగ్రీవుడి మాటలువిన్న మయుడు చాలా సంతోషించాడు, ఈతడు మహర్షి కుమారుడని తెలుసుకొని తన కుమార్తెకు వరుడుగా తగినవాడని అక్కడే నిశ్చయించుకున్నాడు. అప్పుడా మయుడు, తన కుమార్తెచేతిని తీసుకొని ఆ దశగ్రీవుని చేతిలోపెట్టి నవ్వుతూ ఇలా అన్నాడు. "రాజా! ఈమె అప్సరసయైన హేమ కడుపున పుట్టింది, పేరు మండోదరి. నా కుమార్తెయైన ఈ కన్యను నీవు భార్యగా స్వీకరించు:" అందుకు దశగ్రీవుడు వెంటనే అంగీకరించాడు. అగ్నిహోత్రాన్ని ప్రజ్వలింపజేసి, అగ్నిసాక్షిగా అక్కడికక్కడే వివాహం చేసుకున్నాడు. దశగ్రీవుణ్ణి 'ఈతడు దారుణమైన ప్రవృత్తిగల వాడవుతాడ' ని తండ్రి విశ్రవసుడు శపించాడని తెలిసికూడా మయుడు దశగ్రీవుడికిచ్చి వివాహం చేశాడు. ఎందువల్లనంటే, అతడి వంశ ప్రతిష్ఠలకు ముగ్ధుడై పిల్లనిచ్చాడు. ఆ కన్యకతో పాటు తాను ఎంతో శ్రమకోర్చి తయారుచేసిన శక్తి ఆయుధాన్ని కూడా ఇచ్చాడు. ఆ శక్తినే రావణుడు రామలక్ష్మణుల మీద ప్రయోగించాడు. అంతట రావణుడు భార్య మండోదరితో కలసి తన నగరానికి వెళ్ళాడు. పిమ్మట వైరోచనుడి దౌహిత్రియైన వజ్రజ్వాలను కుంభకర్ణునికిచ్చి వివాహం చేశాడు. గంధర్వరాజైన శైలూషుని కుమార్తె 'సరమ' ను విభీషణునికిచ్చి వివాహం చేశాడు. ఈ సరమ సర్వధర్మాలు తెలిసింది, ఈమె మానససరోవరం తీరాన పుట్టింది. అప్పుడు వర్షాకాలం కావటాన ఆ సరస్సు ఈ బాలికవున్న చోటువరకూ వచ్చిందట. అప్పుడా సరమ కూతురుపై ఉండే మమకారంతో 'సరస్సా పెరగకు' అని అనడంతో ఆ సరస్సు పెరగడం మానేసింది. ఆ తీపి గుర్తుగా ఈ శిశువుకు సరమ అని పేరు పెట్టుకున్నారు.

ఆ ముగ్గురు అన్నదమ్ములు తమ భార్యలతో దేవతల్లాగాను, గంధర్వుల్లాగాను, వనాల్లోను, సరస్సు వద్దా విహరిస్తూ ఆనందంగా గడిపారు.

ఇట్లా ఉండగా మండోదరికి ఒక మగపిల్లవాడు పుట్టాడు. అతనికి మేఘనాధుడని నామకరణం చేశారు. పుట్టగానే మేఘంలాగా గర్జించాడట, అందువల్ల మేఘనాధుడని నామకరణం చేశారు. ఇతడినే మీరంతా ఇంద్రజిత్తు అని అంటూ ఉంటారు.

ఆ బాలుడు పుట్టిన వెంటన మేఘగర్జన చేస్తూ విలపించాడు. ఆ ధ్వనికి లంకాపురి అంతా జడమయిపోయింది. తండ్రి అతనికి "మేఘనాధుడు" అని నామకరణం చేశాడు.

ఆ బాలుడు ఉత్తమ స్త్రీల సంరక్షణలో కర్రలు కప్పిన నిప్పువలె రావణాంతఃపురంలో పెరిగాడు.

# 13వ సర్గ రావణుని దురాగతాలు

క్రమంగా కొంతకాలానికి బ్రహ్మదేవుని వరం వలన కుంభకర్ణుడికి తీవ్రమైన నిద్ర ఆవహించింది. అందువలన రావణుణ్ణి తనకో నిద్రాగృహం ఏర్పాటు చెయ్యమని కుంభకర్ణుడు అడిగాడు. అప్పుడు రావణుడు విశ్వకర్మవంటి శిల్పుల్ని పిలిపించి ఒక యోజనం వెడల్పు (ఎనిమిది మైళ్ళు) మూడు యోజనాలు పొడవు ఉండే విశాలమైన గృహాన్ని కుంభకర్ణుడి కోసం నిర్మించాడు. ఆ గృహంలో అన్ని వసతులు ఏర్పాటుచేశారు. స్ఫటికాలతోను, మణులతోను, బంగారు స్తంభాలతోను నిర్మించారు. మెట్లన్నీ వైడూర్యాలతోను మాణిక్యాలతోనూ పొదిగారు. ముఖద్వారాలు దంతాలతో చెక్కబడ్డాయి. వాటికి చిరుగంటలు వ్రేలాడదీశారు. అరుగులన్నీ వజ్రాలు, స్ఫటికాలతో పొదిగారు. ఆ గృహం మేరుపర్వత గుహలాగా ఉండి సమస్త సౌకర్యాలు కల్పించబడింది. ఆ గృహంలోకి ప్రవేశించి కుంభకర్ణుడు కొన్ని వేల సంవత్సరాలు నిద్రలో గడిపాడు.

ఒక ప్రక్కన కుంభకర్ణుడు నిద్రావస్థలో ఉండగా, రావణుడు విజృంభించి దేవతలను, ఋషులను, గంధర్వులను బాధించాడు. నందనవనం వంటి ఉద్యానవనాల్ని నాశనం చేశాడు. జలక్రీడలకు దిగిన ఏనుగు నదిని క్షోభపెట్టినట్లు, పెనుగాడ్పులు వృక్షాల్ని పెకలించినట్లు, వజ్రాయుధం పర్వతాన్ని పిండిచేసినట్లు, రావణుడు నందనోద్యాన వనాన్ని ధ్వంసం చేశాడు. రావణుడు ఈ విధంగా వీర్రవీగి పాపకృత్యాలు చేస్తున్నాడని తెలుసుకొని, ధనాధిపతీ ధర్మవేత్తా అయిన కుబేరుడు తమ వంశగౌరవాన్ని దృష్టిలో ఉంచుకొని దశగ్రీవుని వద్దకు ఒక దూతను పంపాడు. మొదట ఆ దూత లంకానగరంపోయి విభీషణుణ్ణి కలుసుకున్నాడు. విభీషణుడా దూతను సత్కరించి, కుబేరుడి సందేశాన్ని తెలుసుకున్నాడు. అంతట విభీషణుడు ఆ దూతను రాజసభకు తీసుకొనిపోయి రావణునకు పరిచయం చేశాడు.

అంతట ఆ దూత తేజోమూర్తియైన రావణునికి అభివాదంచేసి, 'జయ విజయీభవ'

అంటూ జయస్తోత్రాలు పఠించాడు. పిమ్మట తన ఆసనంపైనుండి లేచి నిలబడి కుబేరుడి సందేశాన్ని ఇలా వినిపించాడు. "రాజా! నీ అన్నగారైన కుబేరుడు నీ శ్రేయస్సు కోరుకుంటూ చెప్పమన్న మాటలు చెప్తున్నాను. ఆలకించండి. నీ బుద్ధిని ధర్మకార్యాలు చెయ్యడంకోసం నిలుపు. ఋషులు ఎందరో నీ చేతుల్లో చనిపోయారట. నీవు ధ్వంసంచేసిన నందన ఉద్యానవనాన్ని చూశాను, దేవతల్నికూడా నీవు బాధిస్తున్నావు, వారందరూ నీ చావుకోసం ప్రయత్నాలు చేస్తున్నారని తెలుస్తోంది. నీవు నా తమ్ముడవు కాబట్టి, బాలుడు తప్పు చేసినా, రక్షించ తగ్గవాడు కాబట్టి నీ క్షేమం కోరిచెప్తున్నాను. తప్పులు ఎంతటివారైనా చేస్తారు. ఒకప్పుడు నేను కూడా పాపకార్యంచేసి, అందుకు ప్రాయశ్చిత్తం పొందాను. అదేమంటే, శివుని అనుగ్రహం పొందడంకోసం హిమాలయ పర్వతాల్లో తపస్సు చేస్తున్నాను. అక్కడ పరమశివుడు పార్వతీదేవితో విహరించడం చూశాను. ఆమె ఎవరో యువతి అనుకొని ఆమెను నా ఎడమకంటితో ఆసక్తితో చూశాను. అంతె! నాలో ఏ దోషభావమూ లేదు. అయినా ఆ దేవి నాపై కోపగించుకుంది, ఆమె కోపాగ్ని చేత నా ఎడమకన్ను దగ్ధమై పోయి పచ్చరంగుకు మారిపోయింది. పిమ్మట నేను అక్కడనుండి వేరొక చోటుకుపోయి ఇంద్రియాలన్నింటినీ నిగ్రహించుకొని శివుడి కోసం తీవ్రంగా తపస్సుచేశాను. నా తపస్సు ఫలించించి మహాదేవుడు ప్రత్యక్షమయి ఇలా అన్నాడు "ధర్మాత్ముడా! నీ తపస్సుకు సంతోషించాను, మౌనం వహించి, ఇంద్రియాల్ని జయించి ఇంతకాలం నా కోసం ఏకాగ్రతతో తపస్సుచేశావు. నిన్ను మెచ్చుకుంటు న్నాను, నా మిత్రుడుగా చేసుకుంటున్నాను. పార్వతి ఆగ్రహానికి గురి అయ్యావు. ఫలితంగా నీ ఎడమకన్ను పింగళవర్ణం పొందింది. ఇకపై నువ్వు ఏకాక్షి పింగళుడు అనే పేరుతో ప్రసిద్ధి చెందుతావు." ఇలా నన్ను ఎంతగానో ఆదరించి మెచ్చుకొని తన మిత్రుడుగా చేసుకున్నాడు. ఒక ప్రక్కన చిన్న తప్పుచేసి కన్ను పోగొట్టుకున్నాను. మరో ప్రక్క మహేశ్వరుడికి మిత్రుడనయ్యాను; ధన్యుణ్ణయ్యాను. అది అట్లా ఉండనివ్వు. ఇక నేను చెప్పదలచుకున్నదేమంటే, కుల గౌరవానికి అపకీర్తిని తెచ్చే దూషణమైన పాపకార్యాలన్నీ విడిచిపెట్టు, ప్రాయశ్చిత్తం చేసుకో. ధర్మబుద్ధితో నడచుకో, దేవతలు, ఋషులు ఏకమయ్యారు. నిన్ను అంతం చెయ్యటానికి ప్రయత్నాలు చేస్తున్నారు. నీ ప్రవర్తన మార్చుకొని, వాళ్ళ ప్రయత్నాలనుండి విరమించుకునేట్లు చెయ్యి" అని

కుబేరుడు చెప్పమన్న మాటల్ని దూత చెప్పాడు.

దూతతో దశగ్రీవుడు ఇట్లా అన్నాడు: "ఓ దూతా! నీ మాటలు విన్నాను. నీవుగాని, నిన్ను పంపిన నా సోదరుడు గానీ జీవించి ఉండరు. ఆ భూపతి నాకు నీతులు చెప్పేటంతటివాడా? మహేశ్వరుడి స్నేహితుణ్ణని గొప్పలు చెప్పుకుంటున్నాడు. ఇంతకాలం అన్నగారు గదా అని సహిస్తూ వచ్చాను. ఆ కుబేరుడితో పాటు మిగిలిన లోకపాలకుల్ని కూడా సంహరిస్తాను. ముల్లోకాల్ని నా గుప్పెటలో ఉండేట్లు చేసుకుంటాను" అని అంటూ ఖడ్గంతీసి ఆ దూత తలనరికి ఆ శరీరాన్ని రాక్షసులకు ఆహారంగా ఇచ్చాడు. పిమ్మట రావణుడు మంచి ముహూర్తం చూసుకొని రథాన్నెక్కి ముల్లోకాల్నీ జయిస్తానని ప్రతిజ్ఞ చేసి కుబేరుడిపై దండెత్తి వెళ్ళాడు.

## 14వ సర్గ రావణుడు యక్షులను జయించటం

ప్రహస్తుడు, మహోదరుడు, మారీచుడు, శుకుడు, సారణుడు, ధూమ్రాక్షుడు అను ఆరుగురు మంత్రులతో కలసి దశగ్రీవుడు ఉత్సాహంగా, యక్షులపై విజయయాత్రకు బయలుదేరాడు. వారంతా చాలా తక్కువ వ్యవధిలోనే నదులు, పర్వతాలు, పట్టణాలు, పల్లెలు దాటుకుంటూ కైలాస పర్వతాన్ని చేరారు. రాక్షసుల ఉత్సాహం, పరాక్రమాల ముందు యక్షులు నిలబడి ఎదిరించలేకపోయారు. ఆ దండెత్తివచ్చిన రావణాసురుడు కుబేరుని సోదరుడని తెలుసుకున్న యక్షులు కుబేరుని వద్దకు పోయి మొరపెట్టుకున్నారు. వాళ్ళు చెప్పిందంతా విన్న కుబేరుడు వేరే మార్గాంతరం లేదని అనుకుని “మన సైన్యాన్ని సిద్ధం చెయ్యండి” అన్నాడు. కుబేరుడు అనుజ్ఞ ఇచ్చి తన సైన్యాన్నికూడా పంపించడంతో యక్షులు ఉత్సాహం తెచ్చుకొని యుద్ధానికి సిద్ధపడ్డారు. యక్షులు, రాక్షసులు భీకరంగా పోరాడారు, సాధారణంగా నిశ్శబ్దంగా ఉండే కైలాసపర్వతం యక్ష రాక్షసుల యుద్ధ కోలాహలంతో కంపిస్తోందా అన్నట్లుగా మారుమ్రోగింది. ఆ యుద్ధంలో యక్షులది పైచెయ్యి అవటాన్ని దశగ్రీవుడు సహించలేకపోయాడు తన మంత్రులకు ఉత్సాహాన్నివ్వాలని రావణుడు పెద్దగా సింహనాదం చేశాడు. దాంతో రాక్షసమంత్రుల్లో కొత్త ఉత్సాహం రేకెత్తి విజృంభించారు. ఒక్కొక్క మంత్రి వెయ్యిమంది యక్షుల్ని ఎదిరించి పోరాడారు. యక్ష సైనికులు కూడా గదలతోను, ముసలములతోను, ఖడ్గాలతోను, శక్తులతోను, తోమరములతోను, రావణుని సైనికులపై దాడి చేశారు. యక్షులు ఆయుధాలు ప్రయోగిస్తున్నా, రావణుడు మేఘాలవలన కుంభవృష్టిగా వర్షధారలతో కొట్టబడిన పర్వతంవలె కొద్దిగా కూడా వ్యధచెందలేదు. రావణుడు ఏమాత్రం చలించక యమదండం వంటి గదను పుచ్చుకుని యక్షుల సైన్యంలోకి చొరబడ్డాడు. కాలదండం వంటి గదతో యక్షుల్ని చావకొట్టి యమలోకానికి పంపాడు. రావణుడి మంత్రులుకూడా అట్లాగే యక్షుల్ని చీల్చి చండాడారు. వాయువు చేత ప్రజ్వలింపబడిన అగ్ని ఎండు కట్టెలను కాల్చినట్లు ఆ యక్షసైన్యాన్ని రావణుడు ధ్వంసం చేశాడు. యక్షులు రాక్షసుల ధాటికి తట్టుకోలేక పోతున్నారు. మహోదరుడు, శుకుడు

మొదలయిన మహాత్ములు, వాయువు కొన్ని మేఘాలను వదిలి పెట్టినట్లు కొంతమంది యక్షులను వదిలిపెట్టారు. కొందరు దెబ్బలు తిని నేల మీద పడిపోయారు. నదీ ప్రవాహం ఒడ్డును ఒత్తిడికి గురిచేసినట్టు నేలకొరిగారు. కొందరు యుద్ధ భూమి నుండి వెనుకకు మరలడంవల్ల ఋషులకు ఆకాశంలో నిలబడి యుద్ధం చూడడానికి స్థలం లేకపోయింది. యక్షులు దారుణంగా పడిపోవడం చూసి కుబేరుడు 'సంయోధకంటకు' డనే యక్షవీరుణ్ణి పంపాడు. ఆ యక్షుడు మహావేగవంతమైన చక్రాయుధంతో రాక్షసులందర్నీ చంపాడు. ఆ యక్షుడి దెబ్బకు మారీచుడు స్పృహతప్పి పడిపోయాడు. కొద్దిసేపట్లోనే తెప్పరిల్లాడు, బలాన్ని పుంజుకొని ఆ సంయోధకంటకుణ్ణి ఎదిరించాడు. మారీచుడి ధాటికి ఆగలేక ఆ యక్షుడు పారిపోయాడు. అంతట రావణుడు ముఖద్వారాన్ని ముట్టడించాడు. అక్కడ కాపలావున్న 'సూర్యభానుడు' అనే యక్షుడు ఒక స్తంభాన్ని పెళ్ళగించి రావణుణ్ణి బలంగా కొట్టాడు. దాంతో రావణాసురుడి శరీరంలోనుండి రక్తం విపరీతంగా స్రవించి, ధాతువులచేత ఎర్రగా ప్రకాశించే పర్వతంలాగా ప్రకాశించాడు. అంతపెద్ద దెబ్బతగిలినా, బ్రహ్మ ఇచ్చిన వరప్రభావంచేత చావలేదు. రావణుడికి విపరీతమైన కోపంవచ్చి, అదే స్తంభాన్ని తీసుకొని సూర్యభానుణ్ణి తల పగలకొట్టి చంపాడు. దాంతో సూర్యభానుడి అనుచరులంతా భయపడ్డారు. అస్త్రాలు విడిచిపెట్టి కొందరు కొండగుహల్లో దాక్కున్నారు, కొందరు నదీతీరాలకు పారిపోయారు, కొందరు తోటకూరకాడల్లాగా వాడి నేలపై పడిపోయారు.

# 15వ సర్గ కుబేరుడు ఓడిపోవటం

యక్షవీరులంతా యుద్ధభూమి నుండి వెనుతిరగడం చూసిన కుబేరుడు 'మణిభద్రు' డనే యక్షవీరుణ్ణి పంపి "ఓ యక్షవీరుడా! పాపాత్ముడైన రావణుణ్ణి వధించు; యక్షుల్ని రక్షించు" అని ఆదేశించాడు. మణిభద్రుడు, కుబేరుని ఆజ్ఞను శిరసావహించి నాలుగువేలమంది సైనికులతో రావణుణ్ణి ఎదుర్కొన్నాడు. డేగల్లా శీఘ్రంగా సంచరిస్తున్న యక్షుల ఆయుధాల ధాటికి రాక్షసులు చెల్లాచెదరయ్యారు. యక్షరాక్షసులయుద్ధం భీకరంగా సాగింది. ఆ యుద్ధాన్ని తిలకిస్తున్న ఋషులు, గంధర్వులు ఆశ్చర్యపోయారు. రానురాను రాక్షసులదే పైచెయ్యి అయింది. ప్రహస్తుడు, మారీచుడు మహోదరుడు, తలో వెయ్యిమంది యక్షుల్ని నేలకూల్చారు. యక్షులంతా సూటిగాను ధర్మబద్ధంగాను నడిచేవారు. రాక్షసులంతా మాయాయుద్ధం చేశారు. దాంతో యక్షులు రాక్షసుల మాయల ముందు నిలువలేకపోయారు.

ధూమ్రాక్షుడే స్వయంగా మణిభద్రుడితో తలబడ్డాడు. ధూమ్రాక్షుడు ముసలంతో మణిభద్రుణ్ణి కొట్టగా, మణిభద్రుడు ఆ దెబ్బను తట్టుకొని, గదతో ధూమ్రాక్షుణ్ణి బలంగా మోదాడు. ధూమ్రాక్షుడి తలపగిలి నెత్తురు కాలవై పారుతుండగా నేలకొరిగాడు. ధూమ్రాక్షుడు అట్లా పడిపోవటం చూసిన రావణుడు కోపంతోవచ్చి మణిభద్రుణ్ణి ఎదుర్కొన్నాడు. అప్పుడు మణిభద్రుడు రావణుణ్ణి మూడు శక్తులతో కొట్టాడు, దాంతో కృద్ధుడైన రావణుడు గదతో మణిభద్రుడి కిరీటాన్ని మోదగా అది పక్కకి ఒరిగిపోయింది. దాంతో ఆనాటినుండి అతడు 'పార్శ్వ మౌళి' అనే పేరుతో ప్రసిద్ధి చెందాడు. రావణుని ధాటికి ఆగలేక మణిభద్రుడు యుద్ధభూమినుండి పారిపోయాడు.

అప్పుడు కుబేరుడు శంఖం, పద్మం అనే నిధుల ఆదిదేవతలతోను, శుక్రుడు, పౌష్టపదుడు అనే మంత్రుల్తోను కలసి రావణాసురుణ్ణి ఎదిరించటానికి వచ్చి రావణుడితో ఇలా అన్నాడు. "ఓరీ! దుర్బద్ధీ! మన వంశమర్యాదను కాపాడమని నిన్ను ఎంతగానో నయానాభయానా

చెప్పిచూశాను, అయినా నీవు వినలేదు. ధూర్తుడవై ప్రవర్తిస్తున్నావు. ఇప్పుడు నీవు చేస్తున్న నీతిబాహ్యమైన పనులకు ముందుముందు తగిన ఫలం అనుభవిస్తావు. నీవు నరకయాతనలు అనుభవిస్తున్నప్పుడు నేను చెప్పిన మాటలు జ్ఞాపకానికి వచ్చి విలపిస్తావు. అజ్ఞానంతో విషాగ్ని తాగినవాడు దాని ఫలాన్ని అనుభవించేటప్పుడు తన అజ్ఞానానికి విచారిస్తాడు. నీకు వినాశకాలం దాపురించింది. నీవు తెలుసుకోలేకుండా ఉన్నావు. తల్లిదండ్రుల్ని, గురువును అవమానించేవాడు ఘోరమైన నరకాన్ని పొందుతాడు. ఈ శరీరం అస్థిరమని తెలుసుకొని, ఈ శరీరం ఉండగానే పరమాత్ముణ్ణి సంతోషపరచని బుద్ధిహీనుడు మరణించిన తర్వాత సంప్రాప్తమయ్యే దుర్గతులకు విచారిస్తాడు. ధర్మాచరణవల్లనే రాజ్యభోగాలు, ధనధాన్యాదులు, సుఖసంతోషాలు కలుగుతాయి. అధర్మం వల్ల కలిగేదంతా దుఃఖమే కాబట్టి ఇహానికి, పరానికి పనికొచ్చే ధర్మాన్నే ఆచరించాలి. దుఃఖాల్ని తెచ్చిపెట్టే పాపాల్ని ఎవ్వరూ చెయ్యకూడదు. బుద్ధిమంతుడు సుఖాన్నికోరి ధర్మాన్ని ఆచరిస్తాడు. బుద్ధిహీనుడు పాపపు పనులుచేసి వాటి ఫలితంగా నరకయాతనలు అనుభవిస్తాడు. మాతా పితల సేవ చేయకుండా ఎవరికీ సద్బుద్ధి పుట్టదు. కర్మానుసారంగా ఫలం లభిస్తుంది. పుణ్యకర్మలు చేస్తూ ఉంటే రూపం, అభివృద్ధి, మంచి సంతానం, శౌర్యధైర్యాలు కలుగుతాయి. నీవు ఇట్లాంటి పాపకార్యాలు చేస్తూ ఉంటే నరకానికే పోతావు, నిన్ను ఎవరూ మార్చలేరు. అందువలన నీతో మాట్లాడి ప్రయోజనంలేదు.” అని యుద్ధానికి సిద్ధమైయ్యాడు. ముందుగా కుబేరుని మంత్రులు రావణుణ్ణి ఎదిరించారు, రావణుడి సైనికులు పారిపోయారు. కుబేరుడు రావణుడి శిరస్సు మీద కొట్టాడు.

ఇక చివరగా రావణుడు కుబేరుడితో తలపడ్డాడు. అన్నదమ్ములిద్దరూ ప్రచండంగా పోరాడారు. ఒకానొక సమయంలో కుబేరుడి గద రావణుని తలపై గట్టిగా తగిలింది. అయితే అది పర్వతంవంటి రావణుణ్ణి కదల్చలేకపోయింది. కుబేరుడు ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగిస్తే, రావణుడు వారుణాస్త్రాన్ని ప్రయోగించాడు. కుబేరుడి దగ్గర కూడా రావణుడు మాయలు చూపిస్తూ యుద్ధంచేశాడు, పులి, పంది, కారుమబ్బు, ఎత్తైనపర్వతం, సముద్రం, మహావృక్షం, యక్షుడు, దైత్యుడు, మొదలైన అనేకరూపాలు ధరించి కుబేరుణ్ణి ముప్పతిప్పలు పెట్టాడు. ఈ

మాయలతో యుద్ధంచేస్తూ కుబేరుడు సతమతమవుతూ ఉంటే, ఉన్నట్లుండి ఒక దివ్యాస్త్రాన్ని ప్రయోగించి గదతో కుబేరుణ్ణి తలపగిలేట్లు కొట్టాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక కుబేరుడు స్పృహతప్పి పడిపోయాడు. అతడి అనుచరులంతా (పద్మం మొదలైన నిధులకు అధిష్ఠానదేవతలు) రెప్పపాటు కాలంలో కుబేరుణ్ణి నందనవనానికి తీసుకొనిపోయి ఉపచారాలుచేసి తెలివివచ్చేట్లు చేశారు. ఈ విధంగా యక్షుల్ని సంహరించాడు. కొందర్ని భక్షించాడు. కుబేరుణ్ణి ఓడించి అతడి పుష్పకవిమానాన్ని అపహరించుకొనిపోయాడు.

ఓ రామా! పుష్పకవిమానం అంటే ఆషామాషీ విమానం కాదు. దాని స్తంభాలన్నీ బంగారు కాంతులతో నిత్యనూతనంగా ఉంటాయి. ముఖద్వారానికున్న తోరణాలన్నీ వైడూర్యాలతో నిర్మించారు. ఆ విమానం అంతా ముత్యాలచేత కప్పబడివుంది, మనస్సుతో సమానవేగం గలది. ఇష్టమైన రూపాన్ని ధరించగలదు. ఇష్టానుసారంగా ఆకాశంలో ఎగిరే ఆ విమానంలోనే అనీ కాలాలలోనూ ఫలాలుండే వృక్షాలుంటాయి. ఆ విమానంలోని మెట్లనన్నింటినీ మణులతో పొదిగారు. పరిశుద్ధమైన బంగారంతో అందులోని అరుగుల్ని నిర్మించారు. ఇది దేవతలకు చెందినది; నాశములేనిది, చూసినంత మాత్రానే మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. ఎల్లప్పుడూ మనస్సుకు సుఖంగా ఉంటుంది. ఎంతో పనితనంతో కూడిన నగిషీలు చెక్కారు. ఆ విమానాన్ని స్వయంగా బ్రహ్మ తయారుచేశాడు. ఆ విమానంలో అన్ని భోగ్యపదార్థాలు లభ్యమవుతాయి. అందులో కూర్చుంటే శీతోష్ణాలు సమంగా ఉండి నివసించేందుకు సుఖప్రదంగా ఉంటుంది. రావణుడు ఈ విమానాన్ని అపహరించి ఇష్టానుసారం ప్రయాణంచేస్తూ ముల్లోకాలనూ జయించానని విర్రవీగేవాడు. ఈ విధంగా కుబేరుణ్ణి ఓడించి కైలాసపర్వతం పైనుండి దిగి భూమి పైకి వచ్చాడు.

నిర్మలమైన కిరీటం హారాలు ధరించి, ప్రతాపవంతుడైన ఆ రావణుడు ఆ విమానంలో కూర్చుని, యజ్ఞశాలలోని అగ్నివలె ప్రకాశించాడు.

## 16వ సర్గ రావణాసురుడన్న పేరు ఎట్లా వచ్చింది?

పూజ్యుడు, తనకన్నా పెద్దవాడైన కుబేరుణ్ణి జయించి రావణుడు పుష్పకవిమానం అధిరోహించి కుమారస్వామి జన్మించిన శరవణానికి వెళ్ళాడు. కిరణముల చేత కప్పబడిన శరవణము రెండవ సూర్యుడివలె ఉండెను. కైలాసంనుండీ వస్తున్న ఆ విమానం ఉన్నట్లుండి నిలిచిపోయింది. మనస్సులో తలచినంత మాత్రానే గమ్యానికి చేర్చే ఈ విమానం హఠాత్తుగా ఎందుకు నిలిచిపోయిందా? అని మంత్రులతో సంప్రతిస్తుండగా, మారీచుడు వచ్చి, "ప్రభూ! ఇది కుబేరుడికి తప్ప ఇతరులకు పనికిరాదేమో? లేదంటే వేరే ఏదైనా బలమైన కారణం ఉండి ఉండాలి" అన్నాడు.

ఇంతలో శివుని అనుచరుడు, నిత్యం ఆనందంలో ఉండేవాడు అయిన నందీశ్వరుడు నిర్భయంగా రావణుని దగ్గరకు వచ్చి ఇలా అన్నాడు. "ఓ రావణా! వెనక్కు వెళ్ళిపో. ఈ పర్వతంపైన శంకరుడు క్రీడిస్తున్నాడు. ఆయన అట్లా క్రీడించే సమయంలో పక్షులు, నాగులు, యక్షులు, దేవతలు, గంధర్వులు, రాక్షసులు మరి ఏ ఇతర భూతములుకూడా ఈ పర్వతంపైకి రాకూడదు. అందువల్ల ఓ దుర్బుద్ధీ! నీవు వెనక్కు వెళ్ళిపో. లేకపోతే నీకు మరణం తప్పదు."

నంది మాటలకు రావణుడికి బాగాకోపం వచ్చింది, కళ్ళు ఎర్రబడ్డాయి. విమానంలోనుండి దిగివచ్చాడు. "ఎవడా శంకరుడు? నన్ను ఆజ్ఞాపించేవాడా? ఈ పర్వతాన్నే పెళ్ళగించి పారేస్తాను" అని అంటూ పర్వతాన్ని పెళ్ళగించడానికి పర్వతమూలానికి వెళ్ళాడు. అతడు అక్కడ శివుడి సమీపాన ఉండే నందీశ్వరుణ్ణి చూశాడు. ప్రకాశవంతమైన శూలాన్ని ధరించిన ఆ నంది రెండవ శివుడివలె ఉన్నాడు. అప్పుడా రావణుడు వానరమువంటి ముఖంగల నందీశ్వరుణ్ణి చూసి, అవమానిస్తూ బిగ్గరగా నవ్వాడు. పూజ్యుడైన నందీశ్వరునకు రావణునిపై కోపంవచ్చి, "ఓ రావణా! నా వానర రూపాన్ని చూసి నవ్వావు. నాతో సమానమైన పరాక్రమంగల వానరులు నీ కులాన్ని నాశనం చేస్తారు. ఓరీ! క్రూరుడా! గోళ్ళు, కోరలు

ఆయుధాలుగా ఉపయోగిస్తూ, మనోవేగంతో కూడిన వాళ్ళు, యుద్ధం అంటే మిక్కిలి ఉత్సాహవంతులు, పర్వతమంతటివారూ అయిన వానరులంతా కలసి నీ మంత్రుల్ని, పుత్రుల్ని, నీ బలాన్ని, దర్పాన్ని, ఔన్నత్యాన్ని నాశనంచేస్తారు. ఓ రాక్షసుడా! నేను నిన్ను ఇప్పుడే చంపగలను. కానీ నువ్వు అనేక పాపకర్మలు చేసి ఉండటంవల్ల ఇంతకు పూర్వమే చచ్చి ఉన్నావు. చచ్చిన నిన్ను మళ్ళీ మళ్ళీ చంపటం సబబుగా ఉండదని ఒదిలేస్తున్నాను" అన్నాడు.

మహాత్ముడైన నందీశ్వరుడు అట్లా అనగానే దేవతలంతా దుందుభులు మ్రోగించారు. ఆకాశంనుండి నందీశ్వరుడిపై పుష్పవర్షం కురిసింది. అప్పుడు మహాబలవంతుడైన దశగ్రీవుడు నంది మాటల్ని లెక్కచెయ్యకుండా పర్వత మూలాన్ని సమీపించి ఇలా అన్నాడు: "ఓ ఈశ్వరుడా! నేను వెళ్తూ ఉంటే నా ప్రయాణానికి ఏ పర్వతం అడ్డం వచ్చిందో, ఆ పర్వతాన్ని పెకలించి పారేస్తాను."

ఓ రామా! దశగ్రీవుడు అట్లా అని ఆ పర్వతం మీద భుజాన్ని ఆనించి గట్టిగా కదిల్చాడు, అప్పుడా పర్వతం కంపించింది. పర్వతంపైవున్న ఈశ్వరుడు, ప్రమథగణాలు కూడా చలించారు. అప్పుడు పార్వతి కూడా చలించి శంకరుణ్ణి కౌగలించుకొంది. ఓ రామా! అప్పుడు దేవతలలో శ్రేష్ఠుడు, సకలపాపహరుడైన మహేశ్వరుడు కాలి బొటనవేలుతో ఆ పర్వతాన్ని అదిమి ఉంచాడు. అప్పుడు పర్వతం క్రిందవున్న రావణుని చేతులు నలిగిపోయాయి. అది చూస్తున్న అతడి మంత్రులంతా ఆశ్చర్యపోయారు. అప్పుడు రావణుడు, రోషంవల్లా, చేతులు నలిగిపోవటం వల్లా ముల్లోకాలూ అదిరిపోయేట్లుగా బిగ్గరగా అరిచాడు. ఆ శబ్దానికి అతడి మంత్రులు, ఆకాశంలో సంచరిస్తున్న ఇంద్రుడూ, దేవతలు ఉలిక్కిపడ్డారు. సముద్రాలు క్షోభించాయి, పర్వతాలు కంపించాయి, సిద్ధులంతా ఉలిక్కిపడ్డారు. అంతట అతడి మంత్రులంతా కలసి రావణునితో ఇలా అన్నారు: "ఓ రావణా! నీలకంఠుడైన ఆ ఉమాపతిని ప్రార్థించు, ఆ మహాదేవుణ్ణి సంతోషపెట్టు. ఆయన కరుణామయుడు." అంతట రావణుడు అమాత్యుల మాటలు విని పరమశివుణ్ణి భక్తితో స్తుతించాడు, ఆ రాక్షసుడు అట్లా ఏడుస్తూ ఉండగా వెయ్యి

సంవత్సరాలు గడిచిపోయాయి. పిమ్మట పర్వతంపైనున్న మహాదేవుడు సంతోషించి ఆ దశగ్రీవుని భుజాలు బయటకువచ్చేట్లు చేస్తూ ఇలా అన్నాడు: "ఓ దశగ్రీవుడా! నీ దర్పానికి సంతోషించాను. పర్వతం క్రింద నలిగిపోతూ భయంకరమైన రావం (శబ్దం) చేశావు. ఆ రావానికి ముల్లోకాలు భీతిల్లాయి. కాబట్టి నీవు ముల్లోకాలకూ భీతిని కలిగించే 'రావాల్ని' చేశావు కాబట్టి ఇకనుంచీ 'రావణుడు' అనే పేరుతో ప్రసిద్ధుడవవుతావు. దేవతలు, మానవులు, యక్షులు, ఇతర ప్రాణులు రావణుడని పిలుస్తారు ఇక నీవు వెళ్ళ వచ్చు. నేను అనుజ్ఞ ఇస్తున్నాను." అప్పుడు మహేశ్వరుని మాటలు విన్న రావణుడు "మహాదేవా! నీవు నన్ను అనుగ్రహించినట్లైయితే, నిన్ను యాచిస్తున్నాను, నాకో వరం ఇవ్వు. ఓ దేవా! దేవతలుగాని, గంధర్వులుగాని, దానవులుగాని, రాక్షసులుగాని, యక్షులుగాని, నాగులుగాని, బలవంతులైన ఇతరులెవ్వరూ నన్ను చంపకుండా ఉండేట్లు బ్రహ్మనుండి వరాన్ని పొందాను. మానవులు నా దృష్టిలో లెక్కకురాని అల్పజీవులు, వారివల్ల నాకు భయంలేదు. నాకు ఒక దివ్యాస్త్రాన్ని ప్రసాదించవలసిందిగా కోరుతున్నాను" అని ప్రార్థించాడు అందుకు పరమశివుడు "ఓ రావణా! ఇది ఖడ్గాయుధం. దీనిపేరు చంద్రహాసము. ఇది దివ్యశక్తితో ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ ఖడ్గాయుధాన్ని కూడా నన్ను పూజించినట్లే పూజించాలి. నీవు అట్లా చెయ్యనినాడు ఇది తిరిగి నా వద్దకు వచ్చేస్తుంది" అని అన్నాడు.

ఈ విధంగా మహేశ్వరుడు పెట్టిన రావణుడు అనే సార్థకనామంతోను, చంద్రహాసమనే ఖడ్గాయుధాన్ని పొంది మహేశ్వరునికి నమస్కరించి పుష్పక విమానాన్ని ఎక్కి వెళ్ళాడు. రామా! పిమ్మట అక్కడ ఉన్న గొప్ప పరాక్రమం గల క్షత్రియులందర్నీ బాధిస్తూ పీడించాడు. కొందరు ఎదురు తిరిగిన క్షత్రియయోధుల్ని రావణుడు అంతం చేశాడు. మరికొందరు క్షత్రియులు ఇతడితో యుద్ధం చెయ్యలేక ఓటమిని అంగీకరించి సామంతులయ్యారు.

# 17వ సర్గవేదవతి శపించటం

రామా! బలవంతుడైన ఆ రావణుడు భూమండలమంతా తిరుగుతూ ఒకనాడు హిమపర్వత ప్రాంతలలోని అరణ్యాల్లో తిరుగుతున్నాడు. అక్కడ దేవకన్యలా ప్రకాశిస్తున్న ఒకానొక కన్యను చూశాడు. ఆమె వేదోక్తంగా నియమాలన్నీ పాటిస్తూ కృష్ణాజినమును ధరించి, జటలుకట్టి తపస్సు చేసుకుంటోంది. రావణుడు గొప్ప నియమాల్తో తపస్సు చేసుకుంటున్న ఆ కన్యను మోహించాడు. కోరికను అదుపులో ఉంచుకోలేకపోయాడు.

"ఓ మంగళప్రదురాలా! నీవు నవయౌవనంలో ఉన్నావు. ఈ వయస్సులో ఆటపాటల్తోను యౌవనసుఖాలతో వివాహ జీవితం గడపాలే గాని, ఈ తాపసికజీవితం కాదు. నీవు నీ వయస్సుకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నావు. ఇది నీవు చెయ్యాల్సిన పనికాదు. ఓ భయస్వభావం గలదానా! నీ అందచందాలు పురుషుల్ని కామంతో మత్తెక్కించేట్లున్నాయి. కామోన్మాదం కలిగిస్తోంది. ఇది నీకు తపస్సు చేయటానికి తగిన వయస్సు కాదు. లోకంలో అంతా ఇట్లాగే ఆలోచిస్తారు ఓ భద్రురాలా! నువ్వు ఎవరి దానవు? నీ భర్త ఎవరు? నిన్ను అనుభవించే పురుషుడు ఈ లోకంలో పుణ్యాత్ముడే అయి ఉంటాడు. ఓ భయశీలా! నీవీ తపస్సు ఎందుకు చేస్తున్నావు? ఓ సుందరముఖీ! నిన్ను గురించి తెలుసుకోవాలని అనుకుంటున్నాను, నాకు అంతా వివరంగా చెప్పు" అని అన్నాడు.

అంతట ఆ కన్య రావణుని మాటలు విని, యథాశాస్త్రీయంగా ఆతిథ్యం ఇచ్చి ఇలా చెప్పింది. "ఓ రాక్షసరాజా! గొప్ప తేజస్సుగలవాడు, బృహస్పతి కుమారుడు, బృహస్పతి అంతటి తెలివిగలవాడైన కుశధ్వజుడనే బ్రహ్మర్షి కుమార్తెను. నా పేరు వేదవతి, ప్రతి నిత్యమూ వేదాధ్యయనం చేస్తూ వేదస్వరూపుడైన నా తండ్రిగారి పోషణలో మునికన్యగా జీవిస్తున్నాను. దేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, పన్నగులు నా తండ్రి దగ్గరకువచ్చి నన్ను వారికి కన్యాదానం చెయ్యమని కోరారు. అందుకు నా తండ్రి అంగీకరించలేదు. ఎందువల్లనంటే,

ఆయన నన్ను దేవతలకు ప్రభువైన శ్రీమహావిష్ణువునకు నన్ను ఇచ్చి వివాహం చెయ్యాలని అనుకున్నాడు. ఆమాటే వాళ్ళందరికీ చెప్పి పంపేవాడు. శంభువు అనే దైత్యరాజు నా తండ్రి నిద్రపోతున్నప్పుడు వచ్చి నా తండ్రిని చంపేశాడు. పిమ్మట నా తల్లి కూడా నా తండ్రి శరీరాన్ని కౌగలించుకొని అగ్నిప్రవేశం చేసింది. అప్పటినుండి నేను నా తండ్రి కోరికను యథార్థం చెయ్యాలని సంకల్పించి ఆ నారాయణుణ్ణే మనస్సునిండా నింపుకొని తపస్సు చేస్తున్నాను. నేను నా ప్రతిజ్ఞ నెరవేరేవరకూ తపస్సు చేస్తూనే ఉంటాను. నాకు నారాయణుడే భర్త, అతడు తప్ప మరొకరిని ఎవ్వరినీ భర్తగా అంగీకరించను. నేను ఈ భయంకరమైన నిర్ణయంతో నియమాలన్నీ అవలంబించి తపస్సు చేస్తున్నాను. నేను నా గురించి నీవు అడిగిన వివరాలన్నీ పూర్తిగా చెప్పాను. ఓ రాక్షసరాజా! నిన్ను గుర్చి నాకు అంతా తెలుసు, ముల్లోకాల్లో జరిగే విషయాలన్నీ నా తపోబలంచేత తెలుసుకోగలను. కాబట్టి ఓ రాక్షసరాజా! రావణా! నీవు వెళ్ళవచ్చు" అని అంది.

ఆ వేదవతి అంతగా చెప్పినా మన్మథపీడితుడైన రావణుడు ఆ కన్యతో ఇలా అన్నాడు. "ఓ సుశ్రోణీ! నీవు వ్యర్థంగా ఊహల్లో బ్రతుకుతున్నావు. ఈ నియమాలు, కఠోర తపస్సులన్నీ ముసలితనం వచ్చిన పిదప చెయ్యాల్సిన పనులు. ఇప్పుడు నీవు నిండు యౌవనంలో ఉన్నావు. సమస్త సద్గుణ సంపన్నురాలవు, త్రిలోకసుందరివైన నీవు అట్లా అనటం బాగాలేదు. ఓ మంగళప్రదురాలా! నేను లంకకు రాజును, నన్ను దశగ్రీవుడంటారు. అటువంటి నాకు నీవు భార్యవై సర్వసుఖాలు అనుభవిస్తూ నన్ను సంతోషపెట్టాలని కోరుకుంటున్నాను.

ఓ మంగళప్రదురాలా! నీవు విష్ణువును గూర్చి ఏమీ తెలియక అట్లా మాట్లాడుతున్నావు. నా భోగభాగ్యాలలోగాని, బలపరాక్రమాల్లోగాని, తక్కువవాడిని కోరుకోవటం వలన నీవు ఎంత వెర్రిబాగులదానవో తెలుస్తోంది" అని అన్నాడు. రావణుని మాటలు విన్న వేదవతి "పాపము శమించుగాక! నీవు అటువంటి మాటలు మాట్లాడి అపచారం చెయ్యవద్దు. ఓ రాక్షసరాజా! బుద్ధిమంతుడెవడూ, ముల్లోకాలకు అధిపతి, సర్వభూతాలచేత స్తుతించబడేవాడైన విష్ణువును అవమానించునా?" అని అంటూ ఉండగానే, రావణుడు ఆమె జుట్టు గుప్పెటలో పట్టుకొన్నాడు.

అప్పుడా వేదవతికి పట్టరానంత ఆగ్రహం కలిగింది, తన చేతినే కత్తిగా చేసుకొని ఆమె శిరోజాలను ఒక్క వేటున తెగనరికింది. కోపం వలన ఆమె ముఖం ప్రజ్వరిల్లుతున్న అగ్నిహోత్రంలాగా మండిపోయింది. "ఓరీ! దుష్టరాక్షసుడా! నీ వలన అవమానం పొందిన తర్వాత కూడా జీవించడం అనేది అసంభవం. నేను ఇప్పుడే అగ్నిప్రవేశం చేస్తున్నాను. ఓ పాపాత్ముడా! నీవు నన్ను ఈ అరణ్యంలో అవమానించావు, నీ పాపానికి ఫలం అనుభవించకుండా తప్పించుకోలేవు. నేను నిన్ను చంపటానికి మళ్ళీ జన్మిస్తాను. ఎందువల్లనంటే, పాపాత్ముడైన పురుషుణ్ణి స్త్రీ చంపలేదు గదా? ఒకవేళ నిన్ను శపిద్దామా? అంటే నా విలువైన తపస్సును నీవంటి దుష్టుడు కోసం వ్యర్థం చేసుకోను. అందువల్ల నేను మళ్ళీ జన్మించి నీ అంతుచూస్తాను, నేను ఏదైనా జన్మలో ఒక ధరాత్మునికి పుత్రికనై పుట్టి నీ చావుకు కారకురాలనవుతాను."

ఆమె అట్లా అంటూనే ప్రజ్వలించుచున్న అగ్నిలో ప్రవేశించింది. అప్పుడా ప్రదేశమంతా దివ్యమైన పుష్పవర్షం కురిసింది. పద్మంవంటి కాంతిగల ఆ వేదవతి మళ్ళీ పద్మంలోనే జన్మించింది. మళ్ళీ ఆ రాక్షసుడు ఆమెను గ్రహించెను. పద్మమధ్య భాగంవంటి కాంతిగల ఆ కన్యను తీసుకొని రావణుడు తన ఇంటికి వెళ్ళి తన మంత్రికి చూపాడు. సాముద్రిక లక్షణాలు తెలిసిన ఆ మంత్రి రావణునితో "ప్రభూ! ఈమె నిన్ను చంపటానికే ఈ ఇంట్లోకి చేరింది" అని అన్నాడు. ఆ మాటవిన్న రావణుడు ఆమెను సముద్రంలోకి విసిరి వేశాడు. ఉత్తమురాలైన ఆమె భూదేవిని జేరి జనకుని నాగలి చేత భూమిపైకి వచ్చింది.

ఓ రామా! జనకుని కుమార్తెగా పుట్టిన ఈమెయే నీ భార్య! ఓ మహాబాహూ! నీవు సాక్షాత్తూ సనాతనుడవైన శ్రీమహావిష్ణుమూర్తివే కదా! పర్వతం వంటి శత్రువుని వేదవతి తన కోపంచేత పరాక్రమహీనుణ్ణిగా చేసింది. ఆ విధంగా ఆమె నీ పరాక్రమానికి సహకరించింది. మీ ఇద్దరివల్లా ఈ దుర్మార్గుడు సంహరించబడ్డాడు.

భాగ్యవంతురాలైన వేదవతియే నాగలిచేత దున్నిన భూమిలో జనకునికి పుత్రికగా

జన్మించింది. కృతయుగంలో వేదవతి అనే పేరుతో ఉన్న ఈమె త్రేతాయుగంలో రావణుణ్ణి సంహరించటానికి జనకుని కులమందు మానవకాంతగా పుట్టింది. ఈమె నాగలిచాలు నుండి ఉద్భవించింది కాబట్టి జనులు ఈమెను 'సీతా' అని పిలుస్తున్నారు.

# 18వ సర్గ రావణుడు మరుత్తుని జయించటం

ఓరామా! వేదవతి అగ్నిప్రవేశం చేసిన తర్వాత రావణుడు మళ్ళీ పుష్పకవిమానాన్ని అధిరోహించి భూలోకంలో సంచరించాడు. మరుత్త మహారాజు ఉశీరబీజమనే క్షేత్రంలో యజ్ఞం చేస్తున్నాడు. ఆ యజ్ఞాన్ని, సాక్షాత్తూ బృహస్పతి సోదరుడు, సర్వధర్మాలు తెలిసిన సంవర్తుడనే మహర్షి చేయిస్తున్నాడు. యజ్ఞంలో హవిర్భాగాల్ని గ్రహించేందుకు దేవతలంతా వచ్చారు. అదే సమయంలో రావణుడు కూడా ఆ యజ్ఞం జరిగే చోటుకు వచ్చాడు. దేవతలంతా రావణుణ్ణి చూసి భయపడ్డారు. ఈ రాక్షసుడు దేవతలకు శత్రువు. అనేక వరాలుపొంది ఉన్నాడు. ఇతడి వలన ఏదైనా అపాయం జరుగుతుందేమోనని శంకించారు. వెంటనే ఇంద్రుడు నెమలి రూపాన్ని, యముడు కాకిరూపాన్ని, కుబేరుడు తొండగానూ, వరుణుడు హంసరూపాలనూ ధరించారు. ఇతర దేవతలు కూడా ఇదే విధంగా తలో రూపాన్ని ధరించి ఆ రాక్షసుడి దృష్టినుండి తప్పించుకున్నారు.

అప్పుడు రావణుడు ఒక కుక్కరూపాన్ని ధరించి యజ్ఞశాలలో ప్రవేశించి, "నాతో యుద్ధం చేస్తావా? లేకపోతే ఓటమిని అంగీకరిస్తావా" అని అడిగాడు. అందుకు ఆ మహారాజు "నీవు ఎవరవు?" అని అడిగాడు. అందుకు రావణుడు బిగ్గరగా నవ్వుతూ ఇలా అన్నాడు. "నేనే రావణుణ్ణి. నా అన్నయైన కుబేరుణ్ణి జయించి అతడి పుష్పకవిమానాన్ని పొంది భూలోకం అంతా సంచరిస్తున్నాను. నన్ను, నా చరిత్ర ఎరగనంటున్నావే? నీ అమాయకత్వం చూస్తూ ఉంటే నాకు జాలివేస్తోంది. ఎందుకంటే నా పరాక్రమాన్ని గూర్చి ముల్లోకాల వాళ్ళకూ తెలుసు. నీ కొక్కడికే నా విషయం తెలియదంటే ఆశ్చర్యంగా ఉంది. అయితే మరి నా పరాక్రమం ఏమిటో రుచిచూస్తావా? లేక ఓటమిని అంగీకరిస్తావా?" అని అన్నాడు.

అందుకు ఆ మరుత్త మహారాజు ఇలా అన్నాడు. "కుబేరుడు ధర్మాత్ముడు, ముల్లోకాలవారికీ పూజ్యుడు, పైగా నీకు అన్నగారు. అటువంటి కుబేరుణ్ణి జయించి వచ్చానని

గొప్పలు చెప్పుకుంటున్నావే! లోకంలో ఎవరైనా ఇటువంటి అధర్మమైన కార్యాలను చేసేవాళ్ళను మెచ్చుకుంటారా? నీవంటి దురాత్ముణ్ణి తమ్ముడుగా పొందిన ఆ కుబేరుడు ఎంతటి దౌర్భాగ్యుడు? నాయనా! నీవు ఏ ఘనకార్యాలుచేసి దేవతల నుండి వరాలు పొందావు? తనగొప్పలు తానే చెప్పుకునే వదరుబోతును నేను ఇంతవరకు చూడలేదు, వినలేదు. ఓరీ! దుర్మతీ! నిలబడు. నీతో యుద్ధం చేసి ఇప్పుడే నీ ప్రాణాలు తీస్తాను" అని అంటూ ధనుస్సు, బాణాలు చేతిలోకి తీసుకున్నాడు. అప్పుడు యజ్ఞాన్ని చేయిస్తున్న బ్రహ్మర్షియైన సంవర్తనుడు మరుత్త మహారాజుతో ఇలా అన్నాడు. "మహారాజా! నా మాట విను. యుద్ధం చేసే ప్రయత్నం చెయ్యకు ఎందువల్లనంటే, మహేశ్వరుణ్ణి ఉద్దేశించి చేస్తున్న యజ్ఞం పరిసమాప్తం కాకపోతే కులం అంతా నాశనం అయిపోతుంది. యజ్ఞదీక్షలో ఉన్న నీవు కోపగించుకోరాదు. యుద్ధాలు చెయ్యకూడదు. యుద్ధాల్లో జయాపజయాల్ని ముందుగా ఎవరూ చెప్పలేరుగదా! పైగా, ఈ రాక్షసుడు జయింపశక్యం కానివాడు. కాబట్టి ధనస్సు పక్కనపెట్టి యుద్ధప్రయత్నం విరమించుకో" అని చెప్పాడు. అంతట మరుత్త మహారాజు యుద్ధం చేసే ఆలోచన విరమించుకొని, ధనుస్సు, బాణాలు ప్రక్కన పడేసి యజ్ఞం పరిసమాప్తం చెయ్యడానికి సిద్ధపడ్డాడు.

పిమ్మట శుకుడు వికారంగా నవ్వుతూ, "మా రాక్షసేశ్వరుడు రావణుడు, జయించాడు" అని అట్టహాసంగా ప్రకటించాడు. వెంటనే రావణుడు తన విజయవైభవాన్ని చాటుకొంటూ అక్కడున్న ఋషుల్ని వారి రక్తాన్ని తృప్తిగా తాగి భూలోకానికి వెళ్ళిపోయాడు.

రావణుడు వెళ్లిపోగానే ఇంద్రాది దేవతలంతా తమ నిజరూపాల్ని ధరించారు. ఇంద్రుడు నెమలిని చూసి ఇలా అన్నాడు. "ధర్మం తెలిసినదానా! నీ యెడల చాలా సంతోషించాను. నీకు సర్పాలవల్ల భయం ఉండదు. నాకున్న వెయ్యికళ్ళు నీ పింఛంపై ఉండేట్లు వరం ఇస్తున్నాను, నేను వర్షం కురిపించినప్పుడల్లా నీకు ఆనందం, సంతోషాలు కలుగుతాయి" అని వరమిచ్చాడు. పూర్వం నెమళ్ళ పింఛాలన్నీ నల్లగా ఉండేవట. ఇంద్రుని వరానికి సంతోషించి నెమళ్ళన్నీ వెళ్ళిపోయాయి.

యజ్ఞశాలలో కర్రపైన ఉన్న కాకితో యముడు ఇలా అన్నాడు. "ఓ పక్షీ! నీ విషయంగా ఎంతో సంతోషించాను. ఇకపైన రోగాలు నిన్ను పీడించవు, రోగాలతో మరణించవు. అంటే ఎవరైనా చంపేవరకూ జీవించే ఉంటావు. నీవు భుజించే పితృ శేషాల వలన యమలోకంలో ఆకలి బాధలు పడుతున్న మానవుల బంధువులు తృప్తి చెందుతారు" అని వరం ఇచ్చారు.

అంతట వరుణుడు పక్షిరాజైన హంసతో ప్రేమపూర్వకంగా ఇలా అన్నాడు. "ఓ హంసా! నీ రంగు మనోహరంగానూ, సుందరంగానూ ఉంటుంది. చంద్రమండలంతో సమానంగానూ, ఉత్తమముగాను, పరిశుద్ధమైన నురుగువంటి కాంతితోను వర్ధిల్లుతావు. నీవు నా సహజ దేహమైన జలాలలో విహరిస్తూ ఉంటావు. నన్ను ఈనాడు సంతోషపెట్టినందుకు గుర్తుగా, నీవు జీవించినంత కాలం సంతోషంగా ఉంటావు" అని వరమిచ్చాడు.

పిమ్మట కుబేరుడు పర్వతంపైనున్న తొండతో ఇలా అన్నాడు. "నువ్వు నాకు సంతోషాన్ని కలిగించావు. నీకు బంగారం రంగు ఉండేట్లుగా వరం ఇస్తున్నాను. నీ శిరస్సు అక్షయంగా ద్రవ్యంతో నిండి ఉంటుంది" అని వరం ఇచ్చాడు. ఆ యజ్ఞవాటికలో ఆయాదేవతలు ఆయాజీవులకు వరాలిచ్చి వెళ్ళిపోయారు.

# 19వ సర్గ రావణుని అనరణ్యుడు శపించటం

రాక్షసరాజైన రావణుడు మరుత్తమహారాజును జయించి తన జైత్రయాత్రను భూమండలం అంతా కొనసాగించాడు. మహేంద్ర వరుణులవంటి మహాత్ములైన రాజుల్ని సైతం యుద్ధానికి ఆహ్వానించేవాడు. లేదా అంటే ఓడిపోయామని అంగీకరించమనేవాడు. ఏదో ఒకటి చెయ్యాలని వాళ్ళను నిర్బంధించేవాడు, బుద్ధిమంతులైన ప్రభువులు అనేకమంది, పరాక్రమవంతులైనా, తగినంత సైన్యబలం ఉన్నాకూడా శత్రువు బలాన్ని అంచనావేసుకుని, తమ ఓటమిని అంగీకరించి తమ రాజ్యంలో శాంతిభద్రతలకు భంగం కలగకుండా సురథుడు, గాధి, గయుడు, పురూరవుడు మొదలైన రాజులెందరో తమ ఓటమిని అంగీకరించి శాంతిని కోరుకున్నారు.

రామా! రాక్షసరాజు లోకంలో రాజులందర్నీ పీడిస్తూ తన జైత్రయాత్రను సాగిస్తూ ఒకనాడు అయోధ్యకు వచ్చాడు. అప్పుడు అయోధ్యను అనరణ్యుడనే మహారాజు పాలించేవాడు, అతడు ఇక్ష్వాకుల వంశస్థుడు. దేవేంద్రుడు అమరావతిని పాలిస్తున్నట్లుగా, ఆ అనరణ్యుడు అయోధ్యను పాలించేవాడు. అప్పుడు రావణుడు ఆ అనరణ్యుని సమీపించి “నాతో యుద్ధం చేస్తావా? లేక ఓటమిని అంగీకరిస్తావా? ఇది నా శాసనం” అన్నాడు.

అప్పుడు అయోధ్యా ప్రభువైన అనరణ్యుడు ఇలా అన్నాడు. “పాపాత్ముడా! రాక్షసరాజా! నేను నీతో యుద్ధం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను. నీవుకూడా సిద్ధం కమ్ము.” రావణుని గూర్చి ముందే విని ఉండటం వలన అనరణ్యుడు పెద్ద సైన్యాన్ని సిద్ధంచేసుకుని రావణునితో యుద్ధానికి సిద్ధంగానే ఉన్నాడు. రామా! పదివేల ఏనుగులు, లక్షగుర్రాలు, వేలకొద్దీ రథాలు, పదాతిదళంతో రావణాసురుడితో యుద్ధానికి తలపడ్డాడు. ఆ తర్వాత రావణునికి, అనరణ్యునికి మధ్య భీకరయుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో అనరణ్యుని సైన్యం అంతా, అగ్నిలో పోసిన హోమద్రవ్యంవలె నశించిపోయింది. అగ్నిలో మిడతలు ప్రవేశించినట్లు రావణుని సమీపించి

నశించిపోయారు. మహాసముద్రంలో చేరే నదుల్లాగా అదృశ్యమైపోతున్నారు. అప్పుడు రాజు కోపావేశంతో ఇంద్రధనుస్సువంటి ధనుస్సును ధరించి రావణునిపైకి యుద్ధానికి వెళ్ళాడు. రావణుని అమాత్యులైన ప్రహస్త, మారీచ, సారణులు అనరణ్యమహారాజుతో యుద్ధం చెయ్యలేక పారిపోయారు. అటుపిమ్మట అనరణ్యుడు ఎనిమిదివందల బాణాల్ని రావణునిపైన ప్రయోగించాడు. ఆ బాణాలన్నీ పర్వతంపై పడుతున్న వర్షపుధారల్లాగా రావణుడికి ఏమాత్రం బాధ కలిగించలేకపోయాయి. అంతట కోపించిన రావణుడు అరచేత్తో అనరణ్యుని తలపై గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బతో అనరణ్యుడు రథంపై నుండి జారిపడిపోయాడు. అరణ్యంలో పిడుగుపడి కాలిపోయిన సాలవృక్షంలాగా నేలకూలాడు. అప్పుడు రావణుడు హేళనగా నవ్వుతూ ఇలా అన్నాడు. “నన్ను ఎదిరించినందువల్ల ఏం జరిగిందో చూశావుగదా! నా గురించి, నా పరాక్రమాన్ని గురించీ తెలియక అనవసరంగా చావు కొనితెచ్చుకున్నావు.” అందుకు కొనఊపిరితో ఉన్న అనరణ్యమహారాజు ఇలా అన్నాడు. “దుష్టుడా! రావణా! ఎంతటివారైనా కాలాన్ని ఎదిరించలేరుగదా! వీరుడనని చెప్పుకుంటున్న నీవు నన్ను జయించలేదు. ఆ కాలమే నాకు వ్యతిరేకం అయింది. నీవు కేవలం నిమిత్తమాత్రుడవయ్యావు. కాలప్రభావంచేత ప్రాణాలు పోతున్నాయేగాని, నేను యుద్ధంనుండి పారిపోలేదుగదా? యుద్ధం చేస్తున్న నన్ను కొట్టి చంపావు. ఓ రాక్షసుడా! నీవు ఇక్ష్వాకువంశమును అవమానించావు. నేను దాన ధర్మాలుచేసి ఉంటే, హోమాలుచేసి ఉంటే, గొప్ప తపస్సు చేసి ఉంటే, ప్రజల బాగోగులు బాగా చూసి పాలించినవాణ్ణయితే నా శాపం యథార్థమవుతుంది. మహాత్ములైన ఇక్ష్వాకుల వంశమునందు దశరథునికి రాముడు పుట్టి నీ ప్రాణాలు తీస్తాడు” అని అంటూ ప్రాణాలు విడిచాడు. ఆ శాపం విన్న దేవతలు దుందుభులు మోగించి, పుష్పవర్షం కురిపించారు. అనరణ్యుడు స్వర్గస్థుడైన పిమ్మట రావణుడు అక్కడనుండి వెళ్ళిపోయాడు.

# 20వ సర్గ రావణుడు యమలోకంపై యుద్ధానికి వెళ్ళడం

రావణుడు పుష్పకవిమానంపై మేఘమండలంలో సంచరిస్తూ ఒకానొక చోట నారదుణ్ణి చూశాడు. అప్పుడా రావణుడు నారదునికి నమస్కరించి కుశల ప్రశ్నలడిగాడు. మహాతేజశ్శాలి, కాంతిమంతుడైన నారదుడు రావణునితో ఇలా అన్నాడు. "విశ్రవశుని కుమారుడవు, సౌమ్యుడవైన ఓ రావణా! ఓ రాక్షసరాజా! గొప్ప పరాక్రమం కలవాడా! నీవు చేసిన యుద్ధాలు, నీ అఖండవిజయాల్ని గూర్చి విన్నాను చాలా సంతోషంగా ఉంది.

ఓ రాక్షసశ్రేష్ఠుడా! విష్ణువు చేసిన దైత్య సంహారం, గంధర్వ ఉరగుల మధ్య జరిగిన యుద్ధాలు, నీవు చేసిన యుద్ధాల గురించి విని ఉన్నాను. నీకో విషయం చెప్తాను. సావధానంగా విను. ఇష్టం అయితే చెయ్యి. లేకపోతే నీ ఇష్టం. నాయనా! మానవులంతా అర్భకులు, రోగాలచేత పీడించబడుతూ ఉంటారు, మృత్యువుకు వశమైనవాళ్ళు అంటే వీళ్ళంతా చచ్చిన వాళ్ళతో సమానం. ఈ చచ్చిన వాళ్ళ మీద నీ పరాక్రమం చూపి ఏం ప్రయోజనం? నిన్ను, దేవ, దానవ, దైత్య, యక్ష, గంధర్వ, రాక్షసులే చంపలేరుగదా? నీకు ఈ మానవమాత్రులు ఒక లెక్కా? అటువంటి అర్భకుల్నిపట్టి ఎందుకు పీడిస్తావు? ఈ మనుష్యులు వాళ్ళకు ఏదిమంచో, ఏదిచెడో తెలుసుకోలేక గొప్ప ఆపదల్లో చిక్కుకుంటూ ఉంటారు. ముసలితనం, రోగాలు వాళ్ళను పట్టి పీడిస్తూ ఉంటాయి. ఇటువంటి వాళ్ళను చంపడంవల్ల నీకు ఖ్యాతి వస్తుందా? ఇటువంటి వాళ్ళు ఎక్కడైనా యుద్ధంపట్ల ఆసక్తి చూపుతారా? వాళ్ళందర్నీ దైవమే ఆకలి, దప్పిక అనీ ముసలితనమని, రోగాలనీ, రొప్పులనీ పట్టి పీడిస్తూవుంటే, దిగులుపడి దుఃఖాల్లో మునిగి ఉన్నారు. నీవు పోయి అటువంటి అర్భకులైన వాళ్ళను వృథాగా చంపుకుతింటే నీకేం ఒరుగుతుంది? ఈ మానవుల దీనస్థితిని చూడు. కొన్నిచోట్ల సంగీత నృత్యాలతో సంతోషంగా కనిపిస్తారు. మరి కొన్నిచోట్ల దుఃఖాలతో తలమునకలై ఏడుస్తూ ఉంటారు. వీళ్ళంతా తల్లి, తండ్రి, భార్య, పుత్రులు అనే పాశాలచేత బంధించబడి మోహం చెంది బాధపడుతూ ఉంటారు. తమ స్వస్వరూపాన్ని తెలుసుకోలేకుండా పోతున్నారు. ఓ సౌమ్యుడా! ఇట్లాంటి మోహంతో

కొట్టుమిట్టాడుతున్న ఈ మనుష్యలోకాన్ని ఇంకా బాధలుపెట్టి ఏంప్రయోజనం. నీవు ఈ లోకాన్నంతా జయించినట్లే సుమా! సందేహం లేదు.

శత్రుపురములను జయించు ఓ రావణా! ఈ మానవులందరూ ఏనాటికైనా యమలోకానికి వెళ్ళేవారే! అందువల్ల నువ్వు యముణ్ణి ఓడించు. నువ్వా యముణ్ణి ఓడిస్తే అందర్నీ జయించినట్లే అవుతుంది" అని అన్నాడు. నారదుని మాటలు వింటున్న రావణుడు నవ్వుతూ ఇలా అన్నాడు: "దేవ గంధర్వ లోకాల్లో విహరించే వాడా! కల (యుద్ధ) ప్రియుడా! ఓ నారదమహర్షీ! నేను ఇప్పుడు యుద్ధం చేయడానికి పాతాళానికి వెళ్తున్నాను. అటుపిమ్మట మూడు లోకాల్నీ జయించి, నాగులను, దేవతలను వశం చేసుకుంటాను. అమృతం కోసం సముద్రాన్ని మథిస్తాను." అప్పుడు నారదమహర్షి రావణునితో ఇలా అన్నాడు: "ఓ రావణా! నీవు రసాతలానికి వెళ్తున్నానని చెప్తూ దక్షిణ దిక్కుకు పోతున్నావు. ఇటువెళ్తే యమలోకం వస్తుంది సుమా! ఎదిరించటానికి శక్యంకానివాడా! శత్రువుల్ని పీడించేవాడా! ఈ మార్గానే వెళ్ళి యమలోకాన్ని చేరుకో" అన్నాడు. అంతట నారదుని మాటలకు బిగ్గరగా నవ్వుతూ శరత్కాలమేఘంలాగా తెల్లగా ఉన్న నారదునితో "ఓ బ్రహ్మర్షీ! నీవు చెప్పిన పనిపూర్తియైనట్లే. యముణ్ణి చంపేందుకే అతడు ఉండే దక్షిణ దిక్కుగా వెళ్తున్నాను. పూజ్యుడమా, సమర్థుడైన నారదా! నేను యుద్ధంచేసి నలుగురు లోకపాలకుల్నీ జయిస్తానని ప్రతిజ్ఞ చేశాను. అందువల్ల ముందుగా యమలోకానికి వెళ్ళి ప్రాణులందర్నీ హింసించే ఆ యముణ్ణి సంహరిస్తాను" అన్నాడు. అంతట రావణుడు నారదుడికి నమస్కరించి అభివాదం చెప్పి, తన మంత్రులతో కలసి పుష్పకవిమానంపై దక్షిణాన యమసదనంలో ప్రవేశించాడు.

అంతట గొప్ప తేజస్సుగలవాడు, పొగలేని అగ్నివలె ప్రకాశవంతంగా ఉన్నవాడూ, బ్రాహ్మణశ్రేష్ఠుడైన నారదుడు ఒక క్షణకాలం ధ్యానంలోకి పోయి తన తపోబలం చేత ఇలా ఆలోచించాడు. "యముడు ముల్లోకాల్లోని ఆయుర్దాయం తీరిన భూతాలన్నింటినీ, స్థావరజంగమములూ, ఇంద్రునితోసహా ధర్మానుసారం నశింప జేసేస్తాడు. అటువంటి యముణ్ణి

ఈ రావణుడు ఎట్లా జయించగలడు? యముడు, అగ్నివలె ప్రాణులు చేసే కర్మలన్నింటికీ సాక్షియై ఉంటాడే? అతడి అనుగ్రహంతోనే చైతన్యంతో ఉండే ప్రాణులన్నీ తమతమ వ్యవహారాలు నిర్వర్తిస్తూ ఉంటాయి గదా? అతడి పేరు చెబితేనే ముల్లోకాలు ఒణికిపోతాయే? అటువంటి యముడితో రావణుడు ఎట్లా యుద్ధం చెయ్యగలడు? లోకంలో పాపపుణ్యాలనిచ్చేవాడు యముడు; ముల్లోకాలను జయించినవాడు. అటువంటి యముణ్ణి ఏవిధంగా జయించగలడు? ఇదేదో చూడముచ్చటగా ఉండేట్లుంది. ఈ రావణ–యముల యుద్ధం చూడాల్సిందే. నేను ఇప్పుడే యమలోకానికి వెళ్తాను" అని అనుకున్నాడు.

# 21వ సర్గ రావణుడు యమకింకరులతో యుద్ధం చెయ్యడం

నారదుడు ఈవిధంగా తనలోతనే ఆలోచించుకుంటూ జరిగిందంతా యముడితో చెప్పొచ్చుగదా అని త్వరగా యమలోకానికి చేరుకున్నాడు అగ్నిదేవుణ్ణి సాక్షిగా పెట్టుకుని యముడు ప్రాణులకు పాప, పుణ్యాల ఫలాలు ఇస్తున్నాడు. నారద మహర్షిని చూడగానే యమధర్మరాజు ఎదురేగి అర్ఘ్యపాద్యాదులిచ్చి ఆసనం చూపించాడు. సుఖంగా కూర్చున్న తర్వాత యముడు మహర్షిని ధర్మగ్లాని కలగలేదు కదా అని ప్రశ్నించాడు. నారదుడు ఇలా అన్నాడు. "యమధర్మరాజా! దశగ్రీవుడనే రాక్షసుడు జయించటానికి వీలులేని విధంగా వరాలు పొంది ఉన్నాడు. మహాబలశాలి, పరాక్రమవంతుడు. అతడు తన పరాక్రమంచేత నిన్ను జయించాలనే కాంక్షతో వస్తున్నాడు. నీకు ముందుగా చెప్తే తగుజాగ్రత్తలు తీసుకుంటావుగదా అని నిన్ను హెచ్చరించటానికి వచ్చాను." నారదుడు ఈ విధంగా మాట్లాడుతూ ఉండగానే ఆ రాక్షసుడి విమానం దూరాన కనబడింది. అది ఉదయసూర్యునివలె ప్రకాశిస్తోంది, ఆ లోకం అంతా వెలుగు విరజిమ్ముతోంది.

రావణుడు విమానం దిగి వస్తూ ఉండగా అక్కడ పాపపుణ్యాలను అనుభవిస్తున్న ప్రాణుల్ని చూశాడు. అక్కడ ఘోరమైన రూపాలతోను, భయంకరమైన కోరలు కలిగిన యముని సైనికులను చూశాడు. కొన్ని ప్రాణుల్ని క్రిములు తింటున్నాయి; కొన్ని కుక్కలు పీక్కుతింటున్నాయి. కొన్ని ప్రాణులకు చెవుల్లో భయంకరమైన ధ్వనుల్ని వినిపిస్తున్నారు. కొందర్ని రక్తపుటేరు (వైతరణీ)ని దాటిస్తున్నారు. కొందర్ని బాగా కాలిన ఇసుకమీద నడిపిస్తున్నారు. కొందరు పాపాత్ముల్ని 'అసిపత్రవనంలో' నడిపిస్తున్నారు. కొందరు రౌరవ నరకంలోని క్షారనదిలోను, కత్తుల అంచులపైనా నడిపిస్తున్నారు. ఆకలి దప్పికలతో అలమటిస్తున్నవారు నీళ్ళకోసం ప్రాధేయపడ్తున్నారు. కొందరు జుట్టు విరబోసుకుని కళావిహీనంగా ఉన్నారు. కొందరు మలముతోను, పంకముతోను నిండిన శరీరాలతో ఉన్నారు. రావణుడు ఈవిధంగా బాధలు పడుతున్న అనేక ప్రాణుల్ని చూశాడు.

కొందరు తాముచేసిన పుణ్యఫలాన్ని అనుభవిస్తూ మంచిమంచి నృత్య సంగీతాలు తిలకిస్తూ ఆనందిస్తున్నారు. గోదానాలు చేసినవాళ్ళు గోరసాన్ని, అన్నదానం చేసినవాళ్ళు అన్నాన్ని, గృహదానం చేసినవాళ్ళు గృహాలను ఈవిధంగా ఆ పుణ్యాత్ములు తమతమ పుణ్యఫలాల్ని అనుభవిస్తున్నారు. అక్కడే మరికొందరు ధార్మికుల్నికూడా చూశాడు. వాళ్ళంతా బంగారం, మణులు, ముత్యాలు అలంకరించుకొని స్త్రీలతో విహరిస్తున్నారు.

అంతట బలశాలియైన రావణుడు పాపాలకు ఫలితాల్ని అనుభవిస్తున్న ప్రాణుల్ని బలవంతంగా విడిపించాడు. అట్లా విముక్తులైన ప్రాణులన్నీ ఎంతో సుఖాన్నిపొందాయి. ఆ జీవులన్నీ అకస్మాత్తుగా దొరికిన ఈ సుఖాలకు ఆశ్చర్యపోయాయి. ఆ జీవులకు (ప్రేతలకు) కాపలాగా ఉన్న యమకింకరు లంతా రావణునిపై విరుచుకుపడ్డారు. ఆ యమలోకంలో అన్ని దిక్కులనుండీ యమకింకరులు అరుచుకుంటూ పరుగులు తీశారు. అంతా కోలాహలంగా తయారైంది. యమకింకరులందరూ ప్రాసలు, పరిఘులు, శూలాలు, ముసలములు, శక్తులు తోమరములు తీసుకొచ్చి పుష్పకంపై దాడిచేశారు. వాళ్ళంతా తేనెటీగల్లాగా పుష్పకంలోకి వెళ్ళి ఆ విమానాన్ని ధ్వంసంచేశారు. ఎంతో విలువైన వస్తువుల్ని కూడా ముక్కలుముక్కలుగా కొట్టారు. ఆ పుష్పకం బ్రహ్మదేవుని తేజస్సుచేత నిర్మించబడ్డది కాబట్టి, ఎంతమంది ఎంతగా విరగొట్టినా నశించకుండా పూర్వంలాగానే ఉండి పోయింది. యమకింకరులంతా పుట్టగొడుగుల్లా వేలు, లక్షలమంది యుద్ధానికి పుట్టుకొస్తున్నారు రావణుని మంత్రులు కూడా వృక్షాలతోను, పర్వతాలతోను తమ బలంకొద్దీ యమకింకరుల్ని కొడుతూ యుద్ధం చేశారు. మహాబలాఢ్యులైన వారియుద్ధం భీకరంగా సాగింది. రావణుడి శరీరం అంతా తూట్లు పడి రక్తం కారుతూ పుష్పకంలో కూర్చుని వికశించిన అశోకవృక్షంలాగా కనిపించాడు. బలవంతుడైన రావణుడు అస్త్రబలంతో శూలం, గద, ప్రాసము, శక్తి, తోమరము, బాణములు, శిలలు, వృక్షాలు ప్రయోగించాడు. రావణుడు ప్రయోగించిన ఆ భయంకరమైన ఆయుధాలన్నీ యమ కింకరుల పైనా, నేలమీదా పడ్డాయి. లక్షలాది యమభటులు రావణుని అస్త్రాలన్నింటినీ ఎదుర్కొన్నారు. వాళ్ళంతా కలసి భయంకరుడైన రావణుని బలంగా కుమ్మివేశారు. ఆ దాడిచేత రావణుని

కవచం జారిపోయింది. ఒళ్ళంతా రక్తసిక్తమైంది. రావణుడు కోపంతో పుష్పకం దిగి నేలపైకి వచ్చాడు. ధనస్సు బాణాల్ని తీసుకున్నాడు, కోపించిన యముడివలె ధనస్సు సంధించి, త్రిపురంపైన శంకరుడు ప్రయోగించినట్లు బాణాలవర్షం కురిపించాడు. గ్రీష్మకాలంలో వనాన్ని కాల్చివేస్తున్న దావాగ్నివలె, ఆ బాణాలన్నీ పొగలతోకూడిన ప్రళయాగ్నిలాగా ఆ యమకింకరుల్ని కాల్చివేసాయి. అప్పుడు రావణుడు మంత్రులతో కలసి భూమిని కంపించి వేస్తున్నాడా అన్నట్లు బిగ్గరగా సింహనాదం చేశాడు.

# 22వ సర్గ యమ–రావణుల యుద్ధం

యమధర్మరాజు రావణుని సింహనాదం విన్నాడు. శత్రువుదే పైచెయ్యి అయిందని, తన సైనికుల బలం క్షీణిస్తోందని గ్రహించాడు. తన రథాన్ని సిద్ధం చెయ్యమని సారథికి చెప్పాడు. క్షణాల్లో రథంవచ్చి నిలబడింది. ముల్లోకాలను నశింపజేసే మృత్యుదేవత ప్రాసం, ఉద్గరము ధరించివచ్చి ప్రక్కన నిలబడింది, అగ్నితో సమానమైనది, తేజస్సుచే ప్రజ్వరిల్లేది, అయిన కాలదండము ఆకారాన్నిపొంది ప్రక్కన నిలబడింది. కాలపాశాలు రెండూవచ్చి రెండుప్రక్కలా అంటుకున్నట్లుగా నిలబడ్డాయి. అగ్నితో సమానమైన ముద్గరము కూడావచ్చి సశరీరంగా నిలబడింది. కోపించిన ఆ యముణ్ణి చూసి ముల్లోకాలూ భయపడ్డాయి. దేవతలు వణికిపోయారు. యముడు రథంలో కూర్చోగానే సారథి ఆ రథాన్ని రావణుడు ఉన్న చోటుకు తీసుకొచ్చి నిలిపాడు. మృత్యుదేవతతో కూడివచ్చిన యముణ్ణి చూసి రావణుని మంత్రులు భయంతో పారిపోయారు. వాళ్ళంతా అల్పబలం గలవాళ్ళు కావటంచేత భయంతో స్పృహకోల్పోయారు. ఇది తాము యుద్ధంచేయదగిన చోటుకాదని భయంతో ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని పరుగులు తీశారు. రావణుడు మాత్రం యముణ్ణి చూసి భయపడలేదు. కంగారు లేకుండా స్థిరంగా నిలబడ్డాడు. యముడు కోపించి శక్తులతోను, తోమరాలతోను రావణుని మర్మస్థానాల్ని ఛేదించాడు. కొద్దిసేపట్లోనే రావణుడు కోలుకుని తిరిగి యుద్ధానికి సిద్ధపడ్డాడు. వెంటనే యముని రథంపైన, మేఘం వర్షించినట్లు, బాణాల్ని కురిపించాడు. బాణాలచేత బాధపడుతున్న రావణునిపై వందలకొద్దీ శక్తిఆయుధాల్ని ప్రయోగించగా, వాటికి తిరిగి ఆయుధాల్ని ప్రయోగించలేక రావణుడు నీరసించిపోయాడు. శత్రువులను బాధించడంలో నేర్పరియైన యముడు వరుసగా ఏడు రోజులపాటు రావణుణ్ణి స్పృహలేకుండా పడిపోయేట్లు చేశాడు.

వీరుడవైన ఓ రామా! యముడు, రావణుడు ఇద్దరూ జయాన్ని కోరుకుంటూ తీవ్రంగా యుద్ధం చేశారు. ఆ భీకరయుద్ధం అట్లా సాగుతూ ఉంటే, దేవతలు, గంధర్వులు, సిద్ధులు,

మహర్షులు, బ్రహ్మదేవుడు యుద్ధస్థలానికి వచ్చారు.

ఆ యమ–రావణ యుద్ధం జరిగినన్ని రోజులూ ప్రళయం వచ్చిందా? అని లోకాలన్నీ భీతిచెందాయి. రావణుడు కూడా ఇంద్రుడి వజ్రాయుధంవంటి నాలుగు బాణాల్ని మత్యుదేవతపైనా, ఏడు బాణాలు సారథిపైనా ప్రయోగించాడు. ఆ బాణాలన్నీపోయి మర్మస్థానాల్లో తాకాయి. అప్పుడు యముని ముఖం కోపాగ్నితో జేవురించింది, అప్పుడు మృత్యువు యమునితో ఇలా అంది. "దేవా! ఈ రాక్షసుడు ఇక జీవించకూడదు. నన్ను ప్రయోగించండి. నేను వాడి ప్రాణాలు హరిస్తాను. ఇదేకదా మన కట్టుబాటు? శ్రీమంతుడైన హిరణ్యకశిపుడు, నముచి, శంబరుడు, విసంధి, ధూమకేతువు, బలిచక్రవర్తి, దంభుడు, వృత్రుడు, బాణుడు, రాజర్షులు, గంధర్వులు, మహోరగులు, ఋషులు, పన్నగులు, దైత్యులు, యక్షులు, అప్సరసలు, మొదలైన వారందరినీ ప్రళయకాలంలో మహాసముద్రాల ద్వారా పర్వతాలతోను, నదులద్వారా భూమిద్వారా సమస్త చరాచర భూతాలన్నింటినీ నా చేతనేకదా నశింపజేశారు? ఎదిరించటానికి శక్యంకాని ఎందరో బలవంతుల్ని, ఎందరో వీరుల్నీ నా చూపువలననే నశింపజేశాను. నాకు ఈ నిశాచరుడు ఒక లెక్కా? ధర్మాలన్నీ బాగా తెలిసినవాడా! ఓ యమధర్మరాజా! నన్ను ప్రయోగించు. వీడిని క్షణాల్లో నా వాతపడేట్లు చేస్తాను. నాకంట పడ్డవాడు ఎవడూ బ్రతికి బయటపడలేదు గదా? ఓ యమధర్మరాజా! నేను నా బలాన్ని గూర్చి ప్రగల్భాలు పలకడం లేదు. ఇది స్వభావసిద్ధంగా వస్తున్న కట్టుబాటు. నాకంట పడ్డవారు క్షణకాలం కూడా జీవించకూడదుగదా?" అనగా, యమధర్మరాజు "ఓ మృత్యుదేవతా! నీవు ఆగు, నేనే వీడిని చంపెదను" అని అన్నాడు.

పిమ్మట కోపించిన యముడు ఎర్రనైన కన్నులతో కాలదండాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు, ఆ దండానికి ఇరుప్రక్కలా కాలపాశాలు అమర్చబడ్డాయి. అగ్ని, వజ్రములతో సమానమైన ముద్గరం కూడా ఆ కాలపాశాల ప్రక్కనే ఉన్నది. ఆ ముద్గరాన్ని ఎవరు చూస్తారో వాళ్ళ పైప్రాణాలు పైనే హరించుకుపోతాయి. ఇకదాన్ని ప్రయోగించినా, అది తాకినా ఇక చెప్పాలా? ఆ

కాలదండం చుట్టూ అగ్నిజ్వాలలతో నిండి ఆ రాక్షసుణ్ణి కాల్చి బూడిద చేస్తుందా? అన్నట్లున్న ఆ గొప్ప ఆయుధాన్ని యముడు చేతిలోకి తీసుకున్నాడు. అప్పుడు బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై యమధర్మరాజుతో ఇలా అన్నాడు. "గొప్పబాహువులు గలవాడా! ఓ యమధర్మరాజా! ఈ రాక్షసుణ్ణి ఈ యమదండంతో చంపవద్దు. నేను ఇతడికి వరమిచ్చానుగదా? నా వరం అసత్యం అయ్యేట్లు చెయ్యకు. దేవతలు గాని, మరొకరుగాని నా మాటను అసత్యం చేస్తేవారు ముల్లోకాలనూ అసత్యం చేసినట్లు అవుతుంది. నా మాటవిను. నీవు ఇప్పుడు కోపించి ఈ భయంకరమైన దండాన్ని ప్రయోగిస్తే, ఇష్టులు, అయిష్టులు అన్న తేడా లేకుండా అందర్నీ చంపేస్తుంది. నాచే సృష్టించబడిన ఈ దండము ప్రాణుల విషయంలో కూడా వ్యర్థం కాదు.

ఓ సౌమ్యుడా! దీనిని రావణునిపై ప్రయోగిస్తే క్షణకాలం కూడా జీవించదు. నీ దండం ప్రయోగించినా కూడా, ఈ రాక్షసుడు మరణించవచ్చు లేదా నా వరప్రభావంచేత మరణించక పోవచ్చు. రెండు విధాలా నా మాటే అసత్యమవుతుంది. అందువల్ల నీకు లోకకల్యాణంపై ఏమాత్రం అభిమానం ఉన్నా ఈ ఎత్తిన దండాన్ని ఉపసంహరించుకో, నా మాటను సత్యంచెయ్యి" అన్నాడు. అందుకు ధర్మాత్ముడైన యముడు ఇలా అన్నాడు: "ఓ దేవదేవా! నీవు మా అందరినీ శాసించదగిన వాడవు గదా? అయితే, నేను యుద్ధానికి సిద్ధమై ఈ యుద్ధభూమిలో ఉన్నాను. నీ వరప్రభావం వలన నేను ఇతడిని చంపకుండా వదిలెయ్యడం కొరకు, నేను ఇప్పుడే యుద్ధరంగంనుండి అంతార్ధానమై వెళ్ళిపోతున్నాను" అని అంతర్ధానుడైపోయాడు.

రావణుడు ఈ విధంగా యముణ్ణి జయించానని చాటుకొని, పుష్పకవిమానంపై వెళ్ళిపోయాడు. బ్రహ్మ మొదలైన దేవతలంతా సంతోషంతో స్వర్గానికి వెళ్ళిపోయారు.

# 23వ సర్గ రావణుడు వరుణిని పుత్రులను ఓడించటం

రావణుడి ఒళ్ళంతా రక్తంతో తడిసిపోయి, పచ్చిపుండులా తయారైంది. అటువంటి రావణుణ్ణి చూసి మారీచుడు మొదలైన అతడి మంత్రులు ఆశ్చర్యపోయారు. వాళ్ళందరికీ తాను యముణ్ణి ఎట్లా ఓడించాడో, తన గొప్పతనాన్ని తానే చాటుకుంటూ బడాయి కబుర్లు చెప్పాడు. వాళ్ళందరికి ధైర్యం చెప్పి అభయం ఇచ్చాడు. అంతా కలసి పుష్పకాన్ని ఎక్కి కూర్చున్నారు, విమానం రసాతలంవైపుగా ప్రయాణం సాగించింది. రసాతలం బలశాలులైన దైత్యులు, ఉరగులకు నివాస స్థానం. ఆ రసాతలాన్ని వరుణుడు అఖండజలాలతో రక్షిస్తూ ఉంటాడు. రావణుడు ముందుగా వాసుకి చేత పాలించబడే భోగవతిపురానికి పోయి నాగులను జయించాడు, అక్కడనుండి మణిమయపురానికి వెళ్ళాడు.

ఆ మణిమయపురం మహాబలశాలురైన దైత్యులకు నివాసస్థానం. అక్కడ వరములు పొందిన నివాతకవచులు నివసిస్తున్నారు. రావణుడు వాళ్ళను యుద్ధానికి పిలిచాడు. వాళ్ళంతా అమితమైన పరాక్రమం గలవారు, రకరకాలైన ఆయుధాలు గలవారు. యుద్ధం అంటే వెనక్కుపోయే వాళ్ళుకారు, ఉత్సాహంగా యుద్ధంచేసే మదం ఉన్నవాళ్ళు. క్రోధానిష్ఠులైన రాక్షసులకు, దానవులకు వ్యాకుల సమరం సాగింది. శూలాలతో ఒకరినొకరు పొడుచుకున్నారు. త్రిశూలాలు, పట్టిసాలు, వజ్రాయుధాలు, ఖడ్గాలు, రోకళ్ళు, ధారాళంగా ప్రయోగించుకుంటూ ఒకరి తలలు మరొకరు పగలకొట్టుకున్నారు. ఈ యుద్ధం ఒక సంవత్సరపైనే సాగింది. అన్నాళ్ళుగా భీకరయుద్ధం సాగినా అందులో విజేతలుగానీ, పరాజితులుగానీ ఎవరు లేరు. అప్పుడు ముల్లోకాలకూ ప్రభువైన బ్రహ్మదేవుడు అక్కడకువచ్చాడు. వాళ్ళయుద్ధాన్ని వారించి ఇలా అన్నాడు. "సురులు అసురులు కలసి వచ్చినా ఈ రావణుణ్ణి జయించలేరు, అట్లాగే నివాతకవచులు కూడా అంతటి బలశాలురే. ఎవరిని ఎవరూ జయించలేరు. అందువల్ల మీరు ఇట్లా యుద్ధం చేసుకోవటం వృథాశ్రమే అవుతుంది. కాబట్టి మీరిద్దరూ స్నేహం చేసుకోండి. మీరు సంపదల్ని భోగాల్ని పంచుకోండి, కలసి అనుభవించండి. అదే మీ ఇరువురికీ

శ్రేయస్కరం.” బ్రహ్మ మాటలకు సంతోషించిన రావణుడు, నివాతకవచులతో అగ్నిసాక్షిగా స్నేహం చేసుకున్నాడు. వాళ్ళ దగ్గర సత్కారాలందుకుంటూ, రావణుడు అక్కడ ఒక సంవత్సరం ఉండి తన సొంత ఇంట్లో ఉన్నట్లే ఉన్నాడు. రావణుడక్కడ మణిమయపురంలో ఉంటూ, నివాతకవచులతో స్నేహంగా ఉంటూ వారివద్ద నూరుమాయల్ని నేర్చుకున్నాడు. వరుణుడి నివాసం కోసం వెదుకుతూ అక్కడే రసాతలంలో ఉండిపోయాడు. చివరకు కాలకేయుల నివాస స్థానమైన అశ్మపురానికి వెళ్ళాడు. అక్కడ బలపరాక్రమాల దర్పంతో ఉన్న కాలకేయుల్ని చంపేశాడు, తన వాళ్ళను చంపి వాళ్ళ రక్తం తాగుతూ మాంసం తింటున్న శూర్పణఖ భర్త, తన బావయైన విద్యుజ్జిహ్వుణ్ణి ఖడ్గంతో నరికి చంపేశాడు. పిమ్మట దైత్యులందరినీ సంహరించి, తెల్లని మేఘంవలె కైలాసంవలె దివ్యకాంతులతో ఉన్న వరుణుని భవనాన్ని చూశాడు. అక్కడే నిలబడి పాలను ధారలుగా కారుస్తున్న కామధేనువును చూశాడు. ఈ కామదేనువునుండి స్రవిస్తున్న పాలతోనే క్షీరసముద్రం ఏర్పడింది. ఈ కామధేనువే మహేశ్వరుని వాహనమైన మహావృషభానికి తల్లి. చల్లని కిరణములు గలవాడు, రాత్రికి ప్రభువుయైన చంద్రుడికి జన్మనిచ్చింది ఈ క్షీరసాగరమే. ఈ క్షీరసాగరంనుండి స్రవించే నురుగునే భుజించి మహర్షులు జీవిస్తున్నారు. పితృదేవతలు భుజించే స్వధకూడా ఈ క్షీరసముద్రంనుండి పుట్టినదే. సురభి అనే పేరుతో ప్రసిద్ధమైన ఆ కామధేనువుకు నమస్కరించి ప్రదక్షిణంచేసి రావణుడు వరుణుని భవనంలోకి ప్రవేశించాడు. ఆ భవనం జలధారలతో కూడి, నిత్యానందంతో ఉంటూ, శరత్కాలపు మేఘంలాగా ప్రకాశించింది.

రావణుడు ఆ భవనంలో మొదటగా ఎదురుపడిన సేనాధ్యక్షుణ్ణి చంపి, అతడి రక్తమాంసాలు ఆరగించి, అక్కడున్న ద్వారపాలకులతో ఇలా అన్నాడు. “ఓ ద్వారపాలుకుల్లారా? రావణుడు యుద్ధానికి వచ్చాడు అని చెప్పు. అతడు యుద్ధం చెయ్యలేకపోతే, చేతులెత్తి నమస్కరించి శరణు వేడమను, ఓటమిని అంగీకరించమను. అప్పుడు నా వలన అతడికేభయం ఉండదు” అని అన్నాడు. ఇంతలో వరుణుని కుమారులు తమ బలగాలతోవచ్చి రావణుని ఎదుర్కొన్నారు. మహాపరాక్రమ వంతులైన వరుణపుత్రులు కాంతివంతమైన రథంపై యుద్ధానికి

వచ్చారు. వారిమధ్య యుద్ధం రోమాంచ జనకంగా సాగింది. రావణుని మంత్రులు, వరుణుని సైన్యాన్ని క్షణాల్లో పడగొట్టారు. తమ సైన్యాన్నంతా నష్టపోవటం చూసిన వరుణ కుమారులు తమ రథాల్ని త్వరగా నడుపుకుంటూ ఆకాశాన ఉన్న పుష్పకానికి ఎదురుగా నిలబెట్టారు. ఆకాశంలో రావణ – వరుణ కుమారులు సమాన స్థానాల్లో నిలచి దేవదానవులవలె భీకరంగా యుద్ధం చేశారు. రావణుణ్ణి, మహోదరుణ్ణీ నారాచబాణాలతో చీల్చి చండాడారు. దాంతో కోపించిన రావణుడు వికటాట్టహాసం చేస్తూ బాణాల్ని, శూలాలను, ముసలాలను, శక్తులను, ఖడ్గాలను ఇట్లా రకరకాలైన ఆయుధాల్తో వరుణ కుమారుల్ని బాధించాడు. వాళ్ళు ఆయుధాల ధాటికి తట్టుకోలేక పోయారు. మహోదరుడు వాళ్ళను గదతో గట్టిగా కొట్టాడు. దాంతో వాళ్ళు ఆకాశంనుండి నేలపై పడిపోయారు. మహోదరుడు వాళ్ళ రథాల్ని విరగ్గొట్టాడు, గుర్రాల్ని చంపేశాడు. అట్లా నేలపైన పడిపోయిన వరుణకుమారుల్ని వారి సైనికులు యుద్ధరంగం నుండి ఇళ్ళకు మోసుకొని పోయారు. అట్లా యుద్ధంనుండి పారిపోతున్న వరుణ కుమారులతో రావణుడు ఇలా అన్నాడు. “పోయి నీ తండ్రి వరుణుణ్ణి యుద్ధానికి పంపండి” అని అరిచాడు. అపస్మారక స్థితిలో ఉండటాన వారీ మాటలు వినిపించుకోలేదు.

అప్పుడు వరుణుని మంత్రి ప్రహసుడు రావణుని వద్దకువచ్చి ఇలా అన్నాడు. “రాక్షసరాజా! వరుణుడు ప్రస్తుతం నగరంలో లేడు. సత్యలోకానికి వెళ్ళాడు. నీవు సామాన్య సైనికుల్ని బాధిస్తే ఏం లాభం. వరుణకుమారుల్నే ఓడించి పంపావు గదా? అది చాలదా?” అని అన్నాడు. అప్పుడు రావణుడు వికటంగా నవ్వుతూ “అట్లాగా! అయితే సరే! మేమే జయించాం” అని తనవాళ్ళందరినీ పుష్పకవిమానంలో ఎక్కించుకొని లంకకు వెళ్ళిపోయాడు.

# 24వ సర్గ రావణుడు శూర్పణఖను ఖరునితో దండకారణ్యానికి పంపటం

దురాత్ముడైన రావణుడు అనేకమంది రాజకన్యలను, దేవకన్యలను, ఋషికన్యలను అపహరించి బందీగా తీసుకొనివచ్చాడు. వారి బంధువుల్ని సంహరించి వారందర్నీ విమానంలో బంధించాడు. ఆ కన్యలంతా తమ అసహాయస్థితిని తలచుకొంటూ కన్నీరుమున్నీరుగా ఏడ్చారు. పొడవైన జుట్టుతో, అందమైన శరీరసౌష్టవం కలిగి, చంద్రబింబంవంటి ముఖము, బలిసిన స్తనములు, సన్ననినడుముగల ఆ స్త్రీలంతా దేవతాస్త్రీలవలె కనిపించారు. రథము ఇరుసుల్లాగా ఉన్న పిరుదలతో చూసేందుకు ఎంతో మనోహరంగా ఉన్నారు. వారంతా శోకంచేత కలతచెంది ఉన్నారు. వారి నిట్టూర్పులు, ప్రజ్వరిల్లిన అగ్నిగుండంవలె ఉండి పుష్పకవిమానం అంతా వ్యాపించాయి. వాళ్ళంతా రావణుని చేతిలో చిక్కి, సింహం వాతపడ్డ ఆడలేడివలె విలవిల్లాడిపోయారు. ఆ స్త్రీలందరూ తమ తల్లిదండ్రులను, భర్తలను, సోదరులను, తలచుకొని తలచుకొని విలపించారు. పూర్వజన్మలో ఏయే పాపాలు చేశామోగదా! ఈ రాక్షసుడి చేతికి చిక్కిపోయాము! ఓ మృత్యుదేవతా! వీని వలన ఏ ఆపద పొందకముందే నన్ను తీసుకొనిపో! ఈ రాక్షసుడు నన్ను ఏ భూతానికైనా బలి ఇచ్చినా ఇస్తాడు!" అని ఒక స్త్రీ విలవిల్లాడింది. "ఛీ! ఈ మనుష్యలోకం కన్నా అధమమైన లోకం మరొకటి ఉండబోదుగదా! ఉదయసూర్యుడు నక్షత్రాన్ని హరించినట్లు ఈ రాక్షసుడు మన భర్తలను నాశనం చేశాడుగదా!" అని మరొక వనిత ఏడ్చింది. "ఈ దుర్మార్గుడు పరస్త్రీలను ఈ విధంగా చెరబట్టి పీడిస్తున్నాడు. స్త్రీయే ఇతని నాశనానికి కారణమవుతుంది ఇది సత్యం" అని శపించారు. ఉత్తమ స్త్రీలందరు కలిసి శపించగానే ఆకాశాన దేవతలు దుందుభులు మ్రోగించారు, పూలవాన కురిపించారు. అదే సమయంలో రావణుడి మనస్సులోకూడా ఏదో భయం అజ్ఞాతంగా తళుక్కున మెరిసింది. అయినా మూర్ఖుడు కాబట్టి లెక్కచెయ్యకుండా వాళ్ళందరితో లంకలోకి ప్రవేశించాడు.

రావణుడు ఈ విధంగా లంకలోకి ప్రవేశించగానే కామరూపిణియైన రావణుని సోదరి

శూర్పణఖ బిగ్గరగా ఏడుస్తూ కాళ్ళమీద పడింది. అప్పుడు రావణుడు ఆమెను లేవదీసి ఓదారుస్తూ "ఓ మంగళ స్వరూపురాలా! నువ్వు నాతో ఏదైనా చెప్పాలని అనుకుంటున్నావా? నీకు వచ్చిన కష్టం ఏమిటి?" అని అడిగాడు. అందుకు ఆ శూర్పణఖ కన్నీరుమున్నీరుగా ఏడుస్తూ ఇలా అంది. "రాజా! బలవంతుడవైన నీ వలన, నాకు బలాత్కారంగా వైధవ్యం సంభవించింది. నీవు కాలకేయులనే ప్రసిద్ధిచెందిన దానవుల్ని సంహరిస్తూ, నా ప్రాణానికి ప్రాణమైన నా భర్తను కూడా చంపేశావు. నా భర్తను నిర్దాక్షిణ్యంగా చంపి నా సౌభాగ్యాన్ని మంట కలిపావు. ఆ విధంగా నువ్వు నాకు సోదరుడి రూపంలో ఉన్న శత్రువయ్యావు! నాకు నువ్వే వైధవ్యం కలిగించావు. యుద్ధాలలో ఇంటి అల్లుణ్ణి రక్షించవలసిన నీవే, స్వయంగా అతణ్ణి చంపి ఇప్పుడు వచ్చి నీకేం కష్టం వచ్చిందని ఓదారుస్తున్నావా? సిగ్గులేదా?" అని విలపించింది. సోదరి దుఃఖాన్నిచూసి బాధపడుతూ, ఓదారుస్తూ, బ్రతిమాలుతూ ఇలా అన్నాడు. "సోదరీ! దుఃఖించకు, యుద్ధకాంక్షతో జయంకోరుకుంటూ, ఒళ్ళు తెలియని ఆవేశంలో తన వారెవరో, పరాయివారెవరో గుర్తించలేకపోయాను. అట్లా యుద్ధంచేస్తూ ఉండగా అన్న, తమ్ముడు, బావ, మరిది అనే బంధుత్వాలే గుర్తుకురావు. అందువల్లనే ఈ అనర్థం జరిగిపోయింది. నేను కావాలని నీకు ఈ కష్టాన్ని తెచ్చిపెట్టలేదు. నన్ను నమ్ము. నీకు జీవితంలో ఎట్లాంటి కష్టం లేకుండా చూసుకుంటాను. నిన్ను ఇప్పుడే దండకారణ్యానికి పంపే ఏర్పాట్లు చేస్తాను. మన పినతల్లి కొడుకు 'ఖరుణ్ణి' నీకు తోడుగా పంపుతాను. అతడితోపాటు పధ్నాలుగువేలమంది మహాశూరులైన రాక్షసయోధుల్ని పంపుతాను, ఆ సేనకంతటికీ మన సోదరుడైన దూషణుణ్ణి సేనాధిపతిగా చేస్తున్నాను. అక్కడ ఖరుడు, దూషణుడు నిన్ను అల్లారుముద్దుగా చూసుకుంటారు. నీవు అడింది ఆట, పాడింది పాటగా నీ మనస్సు తెలుసుకొని నడుచుకుంటూ ఉంటారు. నీకు ఏ కష్టమూ రాకుండా చూసుకుంటారు" అని అన్నాడు.

రావణుడు చెప్పినట్లుగానే పధ్నాలుగువేలమంది రాక్షసయోధుల్ని, వారికి సేనాధిపతిగా దూషణుణ్ణి, తన ప్రతినిధిగా ఖరుణ్ణి ఇచ్చి శూర్పణఖను దండకారణ్యానికి పంపాడు. అక్కడ దండకారణ్యంలో ఖరుడు ఏమాత్రం శ్రమ, భయంలేనివాడై, మునులను, ఋషులను చంపి

తింటూ సంచరించాడు. శూర్పణఖ కూడా అప్పటినుండి ఆ దండకారణ్యంలోనే నివసించింది.

# 25వ సర్గ మేఘనాధుడు (ఇంద్రజిత్తు) యజ్ఞం చెయ్యడం

ఆవిధంగా రావణుడు ఖరుణ్ణి దండకారణ్యంలో నియోగించి, శూర్పణఖను అతడికి అప్పగించి సుఖంగా లంకలో ఉంటున్నాడు. ఒకానొక రోజున విహారాని కని లంకలో ఉన్న 'నికుంభిల' అను ఒక ఉద్యానవనానికి వెళ్ళాడు. అక్కడ సుందరమైన దేవాలయ ప్రాంగణంలో వందలకొద్దీ యూపస్తంభాలుండటం చూశాడు. అక్కడ మహాయజ్ఞం జరుగుతోంది, అక్కడ తన కుమారుడైన మేఘనాధుణ్ణి చూశాడు. అతడు కృష్ణాజినాన్ని కట్టుకున్నాడు; కమండలము, శిఖ, దండం ధరించివున్నాడు. రావణుడు అతడి దగ్గరకు వెళ్ళి, కొడుకును కౌగలించుకొని, "కుమారా! ఇక్కడ ఏం జరుగుతోంది? నాకు అంతా వివరంగా చెప్పు" అన్నాడు. అప్పుడు బ్రాహ్మణశ్రేష్ఠుడైన శుక్రుడు రాక్షసరాజైన రావణునితో ఇలా అన్నాడు. "రాజా! మేఘనాధుడు యజ్ఞసిద్ధిని పొందేందుకై మౌనవ్రతాన్ని పాటిస్తున్నాడు. ఇప్పుడతడు మాట్లాడినట్లయితే యజ్ఞం అసంపూర్ణం అవుతుంది. రాజా! నీ పుత్రుడు చాలాపెద్దవైన ఏడు యజ్ఞాలు పూర్తిచేశాడు. అగ్నిష్టోమము, అశ్వమేధము, రాజసూయము, గోమేధము, వైష్ణవము అనే యజ్ఞాలన్నీ పూర్తి చేశాడు. ఇతరులెవ్వరూ చేయలేని 'మాహేశ్వర' యజ్ఞాన్ని కూడా పూర్తిచేశాడు. ఆ యజ్ఞం పూర్తికాగానే సాక్షాత్తూ మహేశ్వరుడే ప్రత్యక్షమయ్యాడు. ఆకాశంలోకూడా సంచరించేందుకు స్థిరమైనది, దృఢమైనది, స్వేచ్ఛానుసారం నడిచేదీయైన రథాన్ని, చీకటిని సృష్టించే మాయను మన మేఘనాధునికి వరాలుగా ప్రసాదించాడు. రాక్షసరాజా! యుద్ధంలో ఈ మాయను ప్రయోగిస్తే సురులు, అసురులు కూడా ఇతడు ఎక్కడున్నదీ తెలుసుకోలేరు. రాజా! అంతేకాదు తరిగిపోని బాణాలతో అంబులపొదిని, దివ్యమైన ధనుస్సును, శత్రుసంహారం చెయ్యగల అస్త్రాల్నీకూడా ప్రసాదించాడు. ఓ రావణా! నీ కుమారుడు ఈ రోజు యజ్ఞం పరిసమాప్తి చేసుకొని నిన్ను చూడటానికి రావాలని అనుకుంటున్నాడు" అన్నాడు.

అప్పుడు రావణుడు ఇలా అన్నాడు. "పుత్రా! నీవు చేసినపని మంచిదికాదు. ఎందువల్లనంటే మన శత్రువైన ఇంద్రాది దేవతలకు ద్రవ్యాలిచ్చి సత్కరించారు; పూజించారు.

సౌమ్యుడా! అయిందేదో అయిపోయింది, జరిగిపోయినదాన్ని గురించి తవ్వుకుని ఏం ప్రయోజనం? జరిగిన దానిని ఇప్పుడు మార్చలేం గదా? ఇక నాతోరా. ఇంటికి వెళ్దాం" అన్నాడు. అటుపిమ్మట రావణుడు మేఘనాధునితోను, తమ్ముడు విభీషణునితోను కలసి, తను బలాత్కారంగా తెచ్చిన స్త్రీలందరినీ వారికి చూపించాడు. సర్వలక్షణ సంపన్నులైన ఆ దేవదానవ స్త్రీలనుచూసి ధర్మాత్ముడైన విభీషణుడు ఇలా అన్నాడు. "అన్నా! నీవు చేస్తున్న ఈ పనులు ఏమీ బాగాలేవు. ఇట్లాంటి పనుల వల్ల కీర్తి, ధనం, కులం నాశనం అయిపోతాయి. పరస్త్రీలను చెరపట్టి ఇట్లా బంధించడం ధర్మసమ్మతమేనని నీవు అనుకుంటున్నావా? నువ్వు చేసినట్లుగానే, మనల్ని లెక్క చెయ్యకుండా మధువు అనే దానవుడు మన సోదరియైన కుంభీనసిని అపహరించాడు" అని అన్నాడు. ఆ మాట వినగానే రావణుడు మండిపడ్డాడు "ఎవడా మధువు? ఎక్కడుంటాడు" అని అడిగాడు. అందుకు విభీషణుడు ఇలా అన్నాడు. "అన్నా! మన మాతామహుడైన సుమాలికి అన్న, మన తల్లికి పెద్దతండ్రియైన మాల్యవంతుడనే రాక్షసుని కుమార్తె అంటే మన పిన్నతల్లికి కూతురు; అనగా మనకు సోదరి యన్నమాట. అన్నా! ఇది ఎలా జరిగిందో చెప్తాను విను. మేఘనాధుడు యజ్ఞదీక్షలో ఉన్నాడు, నేను నీళ్ళల్లో ఉండి తపస్సు చేసుకుంటున్నాను. అన్నగారు, కుంభకర్ణుడు నిద్రపోతున్నాడు. ఈ అదను చూసుకొని, రాక్షసశ్రేష్ఠులైన అమాత్యులను చంపి, నీ అంతఃపురంలో, నీ రక్షణలో ఉన్నాకూడా, ఆమెను బలాత్కారంగా అపహరించుకొనిపోయాడు. మేము అతడిని క్షమించాం; చంపలేదు, ఎందువల్లనంటే, మనం ఏదో ఒక రోజున మన సోదరిని ఒక అయ్య చేతిలో పెట్టాల్సిందే గదా? చూస్తూన్నావుగదా! నీవు చేస్తున్న ఈ చెడ్డపనుల ప్రభావం వలన ఈ జన్మలోనే మన ఇంట్లోనే, మన కళ్ళముందే మధువు ఈ అఘాయిత్యం చేశాడు అనే యథార్థాన్ని గ్రహించు.

రాక్షసరాజైన రావణుడు విభీషణుని మాటలువిని కృద్ధుడైపోయాడు. కళ్ళు ఎర్రగా జ్యోతుల్లాగా అయ్యాయి. "ఆ మధువు అంతటి శూరుడా? నా సంగతి తెలియదా? వాడికి ఎన్ని గుండెలు? నాతోనే పెట్టుకుంటాడా? నా రథాన్ని సిద్ధంచెయ్యండి. నా తమ్ముడు కుంభకర్ణుడు, మేఘనాథా! మీరు కూడా నా రథంలోనే కూర్చోండి. మనం ఇప్పుడు మధువును చంపి,

అటునుండి అటే దేవలోకంపై కూడా వెళ్దాం" అన్నాడు. వెంటనే నాలుగువేల అక్షౌహిణుల రాక్షససైన్యం, అనేకరకాలైన ఆయుధాలు ధరించి యుద్ధానికి బయలుదేరాయి. సైన్యానికి ముందుండి మేఘనాధుడు దారి తీయగా రావణుడు సైన్యమధ్యంలో ఉన్నాడు. సైన్యానికి చివరగా కుంభకర్ణుడు ఉండి ఆ సేనను నడిపించాడు. ధర్మాత్ముడైన విభీషణుడు లంకను పరిరక్షిస్తూ లంకానగరంలోనే ఉండిపోయాడు. రావణుడి సైన్యంలోని గాడిదలు, గుర్రాలు, ఒంటెలు, మొసళ్ళు, సర్పాలు, సైనికులతో ఆకాశంలో ఎక్కడా సందులేకుండా పోయింది. దేవతలతో విరోధం పెట్టుకున్న దైత్యులు కూడా రావణసైన్యంలో కలిసి యుద్ధానికి వెళ్ళారు. ముందుగా రావణుడు, 'మధువు' నగరానికి వెళ్ళాడు. అక్కడ మధువు కనిపించలేదు. కానీ సోదరీ 'కుంభీనసి' కనిపించింది. ఆ కుంభీనసి భయపడుతూ, అంజలిఘటించి రావణుని పాదాలపై పడి ఏడ్చింది. రాక్షసశ్రేష్ఠుడైన రావణుడు, చెల్లెల్ని లేవదీసి, భయపడవద్దని అభయమిచ్చి ఓదార్చాడు. "నీకేం కావాలి?" అని అడిగాడు. అందుకామె "రాజా! నీవు నిజంగా నా యందు ప్రసన్నుడవైతే, నా భర్తను చంపకు. లోకంలో స్త్రీలకు వైధవ్యంకన్నా భయంకరమైనది మరొకటి ఉండదు గదా? కాబట్టి ఓ రాజశ్రేష్ఠుడా! 'భయపడకుము' అని నాకు అభయం ఇచ్చావు. ఓ భాగ్యవంతుడా! నీవు నా కిచ్చిన మాట నిలబెట్టుకో. మధువును క్షమించి వదిలెయ్యి, నాకు వైధవ్యాన్ని తప్పించు" అని వేడుకుంది. అంతట రావణుడు సంతోషించి "అట్లాగేకానీ! నేను మధువును చంపను. నేను దేవలోకంపై యుద్ధానికి వెళ్తున్నాను. మధువును కూడా నాతో దేవలోకానికి యుద్ధం చెయ్యడానికి సిద్ధంకమ్మను" అని అన్నాడు. వెంటనే ఆ కుంభీనసి వెళ్ళి నిద్రపోతున్న మధువును లేపింది, అతడితో ఇలా అంది. "నాధా! మహాబలశాలియైన నా సోదరుడు రావణుడు వచ్చాడు, దేవలోకంపై యుద్ధానికి వెళ్తున్నాడు, నీ సహాయం కోరుతున్నాడు. నిన్ను కూడా తనతో దేవలోకంపై యుద్ధానికి రమ్మంటున్నాడు. అందువలన నీవు కూడా నీ సైన్యంతో కలసి అన్నకు సహాయంగా వెళ్ళు. అదే మనకు ధర్మం" అని చెప్పింది. అంతట ఆ మధువుకూడా ఆమె కోరికను మన్నించి రావణునితో యుద్ధానికి వెళ్ళేందుకు అంగీకరించాడు. రావణుని వద్దకుపోయి అంజలిఘటించి నమస్కరించి సకలమర్యాదలు చేశాడు. అంతట రావణుడు అతడి సత్కారాలు అందుకొని, ఆ రాత్రికి అక్కడే నిద్రించి,

మరునాడు దేవలోకంపై యుద్ధానికి బయలుదేరాడు. అక్కడనుండి ముందుగా కుబేరుడి నగరమైన కైలాసానికి పోయి సైన్యంతో అక్కడ బసచేశాడు.

# 26వ సర్గ నలకూబరుడు రావణుని శపించటం

సూర్యుడు అస్తమించగానే రావణుడు విడిది చేసిన ఆ కైలాస పర్వతంపై చంద్రుడు ఉదయించాడు. ఆ చంద్రోదయం కాగానే అలసివున్న రావణుని సైన్యం అంతా విశ్రమించారు. రావణుడు మాత్రం ఆ పర్వతశిఖరంపై కూర్చుని చంద్రకిరణాలలో ఆ పర్వతంపై ఉండే భోగ్యవస్తువులన్నీ పరిశీలనగా చూస్తున్నాడు. ఆ వనప్రాంతం అంతా కదంబ, వకుల మున్నగు వృక్షసంపదతో ప్రకాశిస్తూ ఉండటం రావణుడు చూస్తున్నాడు. ఆ మధురమైన నిర్జనప్రదేశాల్లో కిన్నరులు మన్మథపీడితులై తమ ప్రియురాళ్ళతో విహరిస్తున్నారు. విద్యాధరులు మదముతో మత్తులై తమ స్త్రీలతో క్రీడించి ఆనందిస్తున్నారు. కుబేరుడి భవనంలోనుండి అప్సరస స్త్రీల మధురగానం దూరంగా వినిపిస్తోంది, గాలి కదలికకు పుష్పాల్లోని మకరందంతో కూడిన సుగంధాలు ఆ పర్వతమంతా వ్యాపిస్తున్నాయి. మకరందంతోను పుప్పొడితోను కలసిన గాలి మత్తెక్కిస్తోంది. కామోద్రేకం కలిగేట్లు వీస్తున్నాయి. మధురసంగీత ధ్వనులచేత, పుష్పసమృద్ధిచేత, చల్లని గాలివల్ల, పర్వత సౌందర్యంచేత, రాత్రి ప్రారంభం కాగానే చంద్రుడు కామం ప్రకోపింపజేస్తూ ఉండటంచేత, రావణుడు కామవశుడై నిట్టూర్పులు విడుస్తూ చంద్రునివంక చూస్తున్నాడు.

ఇంతలో అప్పరస స్త్రీలలో శ్రేష్ఠురాలైన రంభ అక్కడ ప్రత్యక్షం అయింది. ఆమె ముఖం పూర్ణ చంద్రబింబంలాగా ఉంది. దివ్యాభరణాలు ధరించింది. దివ్యచందనం, అనులేపనాలు పూసుకుంది. తలలో మందార పుష్పాల్ని అలంకరించుకుంది, దివ్యమైన పుష్పాలతోకూడిన మాలలు ధరించింది. రత్యుత్సవం జరుపుకోవటానికి కావలసిన అద్భుత అలంకారాలన్నీ చేసుకుంది. రతి కోసం ఆమె సమర్పించే ఉత్తమోపాయనమైన వడ్డాణంతో అలంకరించుకుంది. ఆమె బలిసిన జఘనము మనస్సును నేత్రాలను కట్టిపడేసేట్లుంది. ఆమె అలంకరించుకొన్న తిలకం ఇంకా తడితడిగానే ఉంది. ఆరుఋతువులకు సంబంధించిన పుష్పాలతో అలంకరించుకుంది. కాంతి చేతగాని, శోభచేతగాని, లావణ్యం చేతగాని, కీర్తి చేతగాని, ఆమె

అపర లక్ష్మీదేవివలె ఉంది. లేచిగుళ్ళవంటి చేతులు, నీలిమేఘంవంటి లేతనీలి వస్త్రాల్ని ధరించి మేలిముసుగు వేసుకుంటూ సైన్యమధ్యం నుండి నడుచుకుంటూ వెళ్ళడం రావణుని కంటబడింది. అప్పటికే మన్మథవశుడై పోయిన రావణుడు అటుగా వెళ్తున్న రంభను చెయ్యిపట్టుకొని ఇలా అన్నాడు. “ఓ అందమైన నడుముగలదానా! నీవు ఎక్కడకు వెళ్తున్నావు? నీనుండి భోగసిద్ధిని అందుకోబోతున్న అదృష్టవంతుడు ఎవరు? అమృతం చిందించే నీ అధరామృతాన్ని ఏ భాగ్యశాలి పొందబోతున్నాడు? బంగారుకుంభములవలె, బలిసి, ఎడం లేకుండా ఉన్న ఈ నీ కుచములు ఎవరి వక్షఃస్థలాన్ని స్పృశించనున్నాయి? బంగారువడ్డాణంతో అలంకరించబడిన నీ జఘనమును ఎవడు ఆరోహించనున్నాడు.

ఓ భయస్వభావం గలదానా! నీవు ఎవరినో వెతుక్కుంటూ ఎందుకు వెళ్తున్నావు? ఎవరికోసం వెళ్తున్నావు? ఇంద్రుడి కోసమా? విష్ణువు కోసమా? అశ్వనీదేవతల కోసమా? వాళ్ళెవరూ నాకంటే అధికులుకారు. నన్ను వదలి వాళ్ళదగ్గరకు పరుగులు పెట్టడం మంచిపనికాదు. ఓ విశాలమైన కటి ప్రదేశం గలదానా! ఈ శిలాఫలకంపైన విశ్రమించు. నేను తప్ప ఈ మూడు లోకాల్లోనూ ప్రభువైనవాడెవ్వడూ లేడు. ముల్లోకాల పాలకుడనూ, ప్రభువును అయిన రావణుణ్ణి, నీకు శిరస్సువంచి నమస్కరిస్తూ ప్రార్థిస్తున్నాను. నాకు పొందువలన స్వర్గసౌఖ్యాన్ని చేకూర్చు” అన్నాడు.

రంభ రావణుని మాటలు విని వణికిపోతూ అంజలిఘటించి నమస్కరిస్తూ ఇలా అంది. “ఓ పూజ్యుడా! నీవు ఇట్లా మాట్లాడటం తగదు. నాపై కోపగించుకోకు, నన్ను క్షమించి వదిలెయ్యి. నీవు నాకు పరమపూజ్యుడవు. ధర్మమార్గంలో చూసినా కూడా నేను నీకు కోడలి వరుస అవుతాను. ఇంకోళ్ళెవరైనా నన్ను ఇట్లా అవమానిస్తే నన్ను రక్షించవలసిన నీవే ఇట్లా మాట్లాడవచ్చునా?” అని భయంతో తలవంచుకొని పాదములను చూస్తూ నిలబడ్డ రంభతో రావణుడు ఇలా అన్నాడు. “ఓ రంభా! నీవు నిజంగానే నా కుమారునికి భార్యవైతే నాకు కోడలివని ఒప్పుకుంటాను” అన్నాడు. అందుకు రంభ ఇలా అంది. “రాజా! నేను తప్పకుండా

నీకు కోడలినే. నీ సోదరుడైన కుబేరునికి పుత్రుడైన నలకూబరుని భార్యను. నలకూబరుడు పుట్టుకచేతను, ధర్మాచరణమునందూ బ్రాహ్మణుడు. పరాక్రమంలో క్షత్రియుడు. కోపంవస్తే అగ్నితో సమానమైనవాడు, ఓర్పులో భూదేవివంటివాడు. నేను అతడి కోసమే అలంకరించుకొని వెళ్తున్నాను, సత్యంగా అతడికి నాపై ప్రేమవుంది. నాకు కూడా అతడిపైనే ప్రేమ వుంది. సత్యాన్ని గ్రహించి నన్ను విడిచిపెట్టమని ప్రార్థిస్తున్నాను" అంది. అందుకు రావణుడు ఇలా అన్నాడు "ఓ రంభా! నేను నీ కోడలిని అని అన్నావే, అది ఒకరికే భార్యగా ఉండే వాళ్ళకు చెల్లుతుంది. అప్సరసలకు భర్త అనేవాడు ఉండడు. అట్లాగే అప్సరస్త్రీలకు వివాహం కూడా ఉండదు. ఇది దేవలోకంలో అనాదిగా వస్తున్న ఆచారం" అని రంభతో అంటూనే ఆమె చెయ్యిపుచ్చుకొని ఆ శిలాఫలకంపైన పరుండబెట్టి మైధునమునకు ప్రారంభించెను. పిమ్మట అతడు విడిచిపెట్టివేయగా మాలలు, అలంకారాలన్ని జారిపోయాయి. అప్పుడా రంభ మహాగజం క్రీడించిన సరస్సువలె వ్యాకులత్వం చెందింది. ఆమె జుట్టు నలిగి చిక్కుపడిపోయింది. చిగుళ్ళవంటి చేతులు కమిలిపోయాయి, భయంతో గాలికి కదలిపోయే లత వలె వణికిపోయింది. సిగ్గుతోపోయి అంజలిఘటించి నలకూబరుడి పాదాలపై పడింది. మహాత్ముడైన నలకూబరుడు ఆ స్థితిలో ఉన్న రంభనుచూసి "మంగళప్రదురాలా! ఇదేమిటి అలంకారాలన్నీ ఇట్లా నలిగిపోయి ఉన్నాయి. పైగా నా కాళ్ళమీద పడుతున్నావు, నీ ఈ స్థితికి కారణం ఏమిటి?" అని అడిగాడు. అంతట రంభ వణికిపోతూ, అంజలిఘటించి నమస్కరిస్తూ జరిగిందంతా ఇలా చెప్పింది. "దేవా! రావణుడు దేవలోకంపై యుద్ధానికి వెళ్తూ సైన్యంతో సహా ఈ రాత్రి ఇక్కడే గడిపాడు. నీ వద్దకు వస్తున్న నన్నుచూసి ఆ రాక్షసుడు అడ్డగించాడు. నేను అతడికి అంజలిఘటించి నమస్కరిస్తూ 'ప్రభూ! నేను నీకు కోడలిని' అని ప్రార్థించాను. కామవశుడైన ఆ రాక్షసరాజు నామాటల్ని పెడచెవిన పెట్టాడు. ఓ సౌమ్యుడా! ఈ రాక్షసుడు నన్ను బలాత్కారంగా అవమానించాడు, పురుషబలం ముందు నా బలం తలవంచింది. నా అపరాధాన్ని క్షమించు" అంది.

అంతట ఆ నలకూబరుడు రంభ చెప్పిన మాటల్నివిన్నాడు. కొద్దిసేపు కళ్ళుమూసుకొని ధ్యానంచేశాడు, రావణుడు చేసిన అత్యాచారం అంతా తెలుసుకున్నాడు. కోపంతో చేతిలోనికి

నీళ్ళు తీసుకొని రావణునికి భయంకరమైన శాపాన్నిచ్చాడు. "ఓ మంగళప్రదురాలా! అతడు కామంలేని నిన్ను బలాత్కారంగా అనుభవించాడు. కాబట్టి ఇకపైన అతడు కామంలేని ఏ స్త్రీనైనా అవమానిస్తే, అప్పుడే అతడి శిరస్సు ఏడుముక్కలుగా బ్రద్దలవుతుంది" అని శపించాడు. ఆ శాపం అతడి నోటి నుండి వెలువడగానే దేవతలంతా దుందుభులు మ్రోగించారు. ఆకాశంనుండి పుష్పవర్షం కురిసింది. మితిమీరిపోతున్న రావణుని కామప్రవృత్తికి, తగిన శాస్తియే జరిగిందని బ్రహ్మ, ఋషులు, పితృదేవతలు సంతోషించారు. రావణుడు కూడా ఈ భయంకరశాపం విన్నప్పటి నుండీ తనపై కోరికలేని స్త్రీలతో మైధునానికి ప్రయత్నంకూడా చెయ్యలేదు. రావణునిచే అపహరింపబడి బంధించబడిన స్త్రీలందరూ కూడా నలకూబరుని ఈ శాపమునకు సంతోషించారు.

# 27వ సర్గ రావణుడు ఇంద్రునిపై దండెత్తటం

గొప్పతేజస్సు గల రావణుడు కైలాసం నుండి ఇంద్రలోకాన్ని చేరుకున్నాడు, రావణసైన్యం ఇంద్రలోకాన్ని ముట్టడించింది. రాక్షససైన్యం చేస్తున్న శబ్దం సముద్రం అట్టడుగునుండి వస్తున్న ఘోషవలె అనిపించింది. రావణుడు ఇంద్రలోకాన్ని ముట్టడించినట్లు దేవేంద్రుడు తెలుసుకొని, ఆదిత్యుల్ని, వసువులను, రుద్రులను, సాధ్యులను, మరుత్తులను యుద్ధానికి సన్నద్ధం కావాలని ఆజ్ఞాపించాడు. దేవతలంతా దేవేంద్రుని ఆజ్ఞను శిరసావహించి ఆయుధాల్ని చేతబట్టుకొని రాక్షసులను ఎదిరించడానికి బయలుదేరారు. ఇంతలో ఇంద్రుడు విష్ణువు వద్దకువెళ్ళి, "ప్రభూ! రావణుడు బ్రహ్మ ఇచ్చిన వరగర్వంతో పెద్దసైన్యాన్ని వెంటబెట్టుకొని స్వర్గాన్ని ముట్టడించాడు, నీవే మమ్మల్ని రక్షించాలి. నిన్నే శరణు వేడుకుంటున్నాము. నముచి, వృతాసురుడు, బలి, నరకాసురుడు, శంబరాసురులను, నీ అనుగ్రహంచేత సంహరించాను. దేవదేవా! మధుసూధనా! ముల్లోకాల్లోని స్థావరజంగమా లన్నింటికీ నీవే గతి. వేరే దిక్కులేదు. నీవు శ్రీమన్నారాయణుడవు, లక్ష్మీపతివి, పద్మనాభుడవు, సనాతుడవు. నీవే నన్ను దేవేంద్రునిగా చేశావు, ఇప్పుడు నా లోకాన్ని రక్షించాల్సిందికూడా నీవే. నీవు తప్ప వేరేదిక్కులేదు. సమస్త లోకాల్ని సృష్టించినవాడవు, మరల ప్రళయకాలంలో లోకాలన్నింటినీ నీలో లయంచేసేదీ నీవే. దేవదేవా! చక్రం ధరించి నీవు రావణునితో యుద్ధంచేస్తావో, లేక మరే ఉపాయం ఆలోచిస్తావో, మమ్మల్ని, మా లోకాన్ని నీవే రక్షించాలి" అని పరిపరివిధాలుగా వేడుకున్నాడు.

ప్రభువైన శ్రీమహావిష్ణువు ఇంద్రుని మాటలు విని ఇలా అన్నాడు. "భయపడకు, ఈ దుష్ట రాక్షసుడు బ్రహ్మ ఇచ్చిన వరం మూలంగా చంపటానికి శక్యం కాకుండా ఉన్నాడు. సురాసురులెవరూ ఇతణ్ణి ఎదిరించలేరు; ఓడించలేరు; చంపలేరు.

మహేంద్రా! నీవు నన్ను యుద్ధం చెయ్యమని కోరావు. కానీ నేను ఇప్పుడు యుద్ధం చెయ్యను. ఎందువల్లనంటే, విష్ణువు (నేను) యుద్ధానికి వెళ్తే శత్రువును చంపకుండా తిరిగిరాడు.

ఒకవేళ నేను ఈ రాక్షసుణ్ణి చంపితే బ్రహ్మ యిచ్చిన వరం అసత్యమౌతుంది. అందువల్ల ఇప్పుడు ఆ రాక్షసుణ్ణి చంపను, కానీ సమయం, సందర్భం చూసుకొని నేనే వాణ్ణి సమూలంగా నాశనం చేస్తాను. కాబట్టి ఇప్పుడు నీవు వెళ్ళి అతడితో యుద్ధం చెయ్యి" అని చెప్పి పంపించేశాడు.

అంతట మహేంద్రుడు తన వారినందరినీ వెంటబెట్టుకొని తిరిగి స్వర్గానికి చేరుకొని రుద్రులు, ఆదిత్యులు, వసువులు, మరుత్తులు. ఆశ్వినీ దేవతలు మొదలగు వారితో కూడి రావణునితో యుద్ధానికి సిద్ధమయ్యాడు. దేవ, దానవ, రాక్షసుల యుద్ధం భయంకరంగా సాగింది. అనేకరకములైన ఆయుధాల్ని ఇరుపక్షాలవారూ స్వేచ్ఛగా ఉపయోగించారు. రావణుని మంత్రులైన మారీచ, ప్రహస్త, మహాపార్శ్వ, మహోదరులు, అకంపన, నికుంభ, శుక, సారణ, సంహ్లాద, ధూమకేతు, మహాదుష్ట్ర, ఘటోదర, జంబుమాలి, మహాహ్రాద, విరూపాక్షులు, సప్తఘ్న, యజ్ఞకోప, దుర్ముఖ, దూషణ, ఖరుడు, త్రిశిరస్సు, కరవీరాక్ష, సూర్యశత్రు, మహాకాయ, అతికాయ, దేవాంతక, నరాంతకులనే రాక్షసులు దేవతల్ని ముప్పతిప్పలు పెట్టారు.

రావణుని తాతగారి తమ్ముడైన సుమాలి కూడా రాక్షససైన్యానికి తోడయ్యాడు. అతడు మహాబలవంతుడు, పరాక్రమశాలి. అతడు దేవతా సమూహాలన్నింటినీ, మహావాయువు మేఘాల్ని చెదరగొట్టినట్లు, చెదరగొట్టాడు. రామా! రాక్షసుల పరాక్రమం ముందు దేవతలు, సింహాల ముందు లేళ్ళ గుంపులవలె, పరుగులు తీశారు. ఇంతలో సావిత్రుడనే ఎనిమిదవ వసువు దేవతల పక్షాన అనేక ఆయుధాలతో ఎదిరించాడు. అతడితోపాటు త్వష్ట, పూష అనే ఆదిత్యులుకూడా నిర్భయంగా యుద్ధం చేశారు. రాక్షసులుకూడా వందలు, వేలాది ఆయుధాల్ని దేవతలపై ప్రయోగించారు. వసుసుమాల మధ్య యుద్ధం రోమాంచజనకంగా సాగింది. మహాత్ముడైన వసువు సుమాలి వాహనమైన సర్పాన్ని పడగొట్టగా, సుమాలి వసువు రథాన్ని విరగ్గొట్టి వసువును చంపేందుకు గదను చేతిలోకి తీసుకున్నాడు. సావిత్రుడు యమదండంవంటి గదను సుమాలి తలపై విసిరాడు. దాంతో సుమాలి భస్మమై ఎముకలూ, మాంసం కూడా కనిపించకుండా పోయాయి. సుమాలి మరణం రాక్షసుల ధైర్యసాహసాలపై దెబ్బతీసింది.

రాక్షసులు నలుమూలలకు పారిపోయారు. రాక్షసులు వసువు ముందు నిలవలేకపోయారు.

# 28వ సర్గ మేఘనాధ – జయంతుల యుద్ధం

సుమాలి వసువు చేతిలో మరణించడం, రాక్షసులు పారిపోవడం చూస్తున్న, మహావీరుడు, రావణుని కుమారుడైన మేఘనాధుడు యుద్ధం చెయ్యడానికి ముందుకు వచ్చాడు. మళ్ళీ రాక్షసులందర్నీ సమీకరించాడు. తన ఇష్టానుసారం ప్రయాణంచేసే, నిప్పులా మండే రథాన్ని ఎక్కి రకరకాలైన ఆయుధాల్ని ప్రయోగిస్తూ దేవతాసైన్యాన్ని చెదరగొట్టాడు. మేఘనాధుణ్ణి చూసిన మహేంద్రుడు దేవతలతో ఇలా అన్నాడు.

"దేవతలారా! భయపడకండి. ధైర్యంగా నిలబడి పోరాడండి. మీకు తోడుగా నా కుమారుడు జయంతుణ్ణి పంపుతున్నాను" అన్నాడు. అంతట దేవేంద్రుని కుమారుడైన జయంతుడు వచ్చి మేఘనాధుణ్ణి ఎదుర్కొన్నాడు. జయంతుడు దేవతలకు నేతృత్వం వహించడంతో మళ్ళీ దేవతలంతా ధైర్యంగా ముందుకువచ్చి రాక్షసులతో యుద్ధం చేశారు. దేవ–రాక్షసుల మధ్య యుద్ధం భీకరంగా సాగింది.

మేఘనాధుడు, జయంతుని సారథిగా ఉన్న మాతలి పుత్రుడైన గోముఖుని బంగారుమొన గల బాణాలతో కొట్టాడు. అప్పుడు జయంతుడు మేఘనాధుని సారథిని కొట్టాడు. మహాబలశాలియైన మేఘనాధుడు కోపంతో కనులెర్రజేసి జయంతునిపై బాణాల వర్షం కురిపించాడు. వాడియైన అంచులున్న బాణాన్ని దేవతలపై ప్రయోగించాడు. మేఘనాధుడు, శతఘ్ని, ముసలము, ప్రాసము, గద, ఖడ్గము మున్నగు పెద్దపెద్ద ఆయుధాల్ని దేవతాసైన్యంపై ప్రయోగించాడు. మేఘనాధుడు ఆ విధంగా శత్రుసైన్యాన్ని చెండాడుతూవుంటే, లోకాలన్నీ వ్యధచెందాయి; చీకట్లు కమ్ముకున్నాయి. జయంతుడి సైన్యంలో చాలామందికి తీవ్రంగా గాయాలయ్యాయి. ఆ భీకరయుద్ధం అట్లా సాగుతూ ఉంటే ఎవరు రాక్షసులో, ఎవరు దేవతలో తెలుసుకోలేకపోతున్నారు. చీకట్లు కమ్ముకోవటంవల్ల దేవతలు దేవతల్నే కొట్టారు. రాక్షసులు రాక్షసుల్నే చంపుకున్నారు. ఆ విధంగా అంతా అయోమయంగా తయారైనప్పుడు పులోమ అనే

దైత్యరాజు జయంతుణ్ణి దూరంగా తీసుకునిపోయాడు. శచీదేవి తండ్రి జయంతునికి తాతయైన ఆ పులోముడు జయంతుని తీసుకొని సముద్రంలోకి ప్రవేశించాడు. యుద్ధరంగంలో జయంతుడు కనపడకపోవటం వలన దేవతలంతా దుఃఖీస్తూ పారిపోయారు.

అదే మంచి అదను అనుకొని మేఘనాధుడు దేవతలపై విరుచుకుపడ్డాడు. జయంతుడు కనపడకుండా పోవడం, దేవసైన్యం ధైర్యాన్ని కోల్పోవడంతో, దేవేంద్రుడే మాతలిని రథం సిద్ధం చెయ్యమన్నాడు. వెంటనే మాతలి రథాన్ని తెచ్చి మహేంద్రుడి ముందుంచాడు. దేవేంద్రుడే స్వయంగా యుద్ధరంగంలోకి ప్రవేశించడంతో దేవతలంతా దుందుభులు మ్రోగించారు. అప్సరస్త్రీలు నృత్యం చేశారు, అశ్వనీ దేవతల్ని వెంటబెట్టుకుని బయలుదేరాడు. దేవేంద్రుడు యుద్ధానికి బయలుదేరేటప్పుడు సూర్యుని తేజస్సు మసకబారింది; గాలి ప్రచండంగా వీచింది. ఆకాశం నుండి ఉల్కలు రాలాయి. ఇంతలో శూరుడు, ప్రతాపవంతుడైన రావణుడు విశ్వకర్మ నిర్మించి ఇచ్చిన రథాన్నెక్కి రణరంగానికి వచ్చాడు. ఆ రథాన్ని భయంకరమైన మహాసర్పాలు చుట్టుకొని ఉన్నాయి. ఆ సర్పాలు క్రోధంలో బుసలు కొడ్తూవుంటే, యుద్ధరంగాన మంటలు చెలరేగాయి. ఆ రథాన్ని దైత్యులు రక్షిస్తూ ఉండగా, రావణుడు మహేంద్రుడికి ఎదురుగా వెళ్ళాడు. మేఘనాధుణ్ణి యుద్ధంనుండి తప్పుకోమన్నాడు. తానే స్వయంగా ఇంద్రుణ్ణి ఎదుర్కోవాలనుకున్నాడు. అప్పుడు యుద్ధరంగాన ఆయుధాలు, మేఘాలు వర్షించినట్లు, శరవర్షం కురిపించాయి. దుష్టాత్ముడైన కుంభకర్ణుడు ఎవరితో యుద్ధం చేస్తున్నాడో ఎవరికీ తెలియలేదు. కోపంతో అతడు దంతాలతోను, పాదాలతోను, భుజాలతోను, హస్తాలతోను, శక్తులతోను, తోమరాలతోను, ముద్గరములతోను, ఏది దొరికితే దాంతో దేవతల్ని కొట్టాడు. భయంకరులైన రుద్రులు, ఆ కుంభకర్ణుణ్ణి ఎడతెరిపిలేకుండా కొట్టారు. ఆ కుంభకర్ణుడి శరీరంనిండా ఆయుధాలు గుచ్చుకొని రక్తం ఏరులై పారుతూ ఉంటే మెరుపులతో కూడిన మేఘంలా ఉన్నారు. అప్పుడు రుద్రుల బలానికి ఆగలేక రాక్షసులు పరుగులు తీశారు. కొందరు రాక్షసులకు దెబ్బలు బాగా తగలడం వలన కదలలేక అక్కడే నేల మీద పడిపోయారు. కొందరు లేవలేక ఏ రథాన్నో ఏనుగునో, గుర్రాన్నో, ఒంటెనో ఆసరాగా చేసుకుని లేవబోతూ ఉంటే దేవతలు వాళ్ళను

ఆయుధాలతో చంపేశారు. చచ్చిపడున్న రాక్షసులతో నిండి ఉన్న ఆ రణభూమి చిత్రకారుడు వేసిన చిత్రంలాగా ఉంది. ఆ రణభూమి అంతా ఉభయుల రక్తం అనే ఉదకప్రవాహంలో ఆయుధాలనే మొసళ్ళతోకూడి, కాకులతోను, గ్రద్ధలతోను కలసి ప్రవహించింది. తన సైన్యం అంతా నష్టమైపోతూ ఉండటంచూసి, రావణుడు కోపంతో ఇంద్రుడిని ఎదిరించాడు. రావణుని చూసి, ఇంద్రుడు ధనుష్టంకారం చెయ్యగా ఆ శబ్దం అన్నిదిక్కులా వ్యాపించింది. అంతట ఇంద్రుడు అగ్నివంటి తేజస్సుగల బాణాన్ని రావణుని శిరస్సు మీద సారించాడు. రావణుడుకూడా అదేవిధంగా ఇంద్రునిపై బాణాలవర్షం కురిపించాడు. ఆ ఇరువురూ ప్రయోగించిన బాణాలతో ఆకాశం అంతా నిండిపోయి లోకం అంతా చీకట్లు కమ్మాయి.

# 29వ సర్గ మేఘనాధుడు – ఇంద్రుని బంధించటం

ఆకాశం అంతా చీకట్లు ఆవరించుకొని అంతా అంధకారం అయింది. దేవతలు, రాక్షసులు ఉన్మత్తులై ఒకరినొకరు చంపుకుంటూ యుద్ధంచేశారు. చీకటి కప్పివేసిన ఆ రణరంగంలో ఇంద్రుడు, రావణుడు, మేఘనాధుడు మాత్రమే మోహం చెందలేదు. రావణుడు తన సైన్యం అంతా నష్టమైపోయినట్లు చూసి, కోపంతో సింహనాదం చేశాడు. అంతట రావణుడు "సారథీ! నేను శత్రువుల్ని పూర్తిగా నాశనం చేసేవరకూ రథాన్ని వారి మధ్యనుండి మరల్చవద్దు. ఓ సారథీ! మళ్ళీమళ్ళీ చెప్తున్నాను, నన్ను దేవతల మధ్యనుండి మరల్చవద్దు. దేవతలందర్నీ సమూలంగా నాశనం చేస్తాను. నీవు భయపడకు. సారథీ! మనం ఇప్పుడు నందనవనం దగ్గర ఉన్నాం, రథాన్ని ఉదయపర్వతం దగ్గరకు తీసుకొనిపో" అన్నాడు. సారథి రావణుడు చెప్పినట్లే రథాన్ని శత్రువులమధ్యకు నడిపించాడు. ఎదురుగా రథంలో రావణుణ్ణి చూస్తున్న ఇంద్రుడు దేవతలతో ఇలా అన్నాడు "దేవతలారా! నేను చెప్తున్న మాటను శ్రద్ధగా వినండి, ఆ రావణుని ప్రాణాలతో బంధించండి. ఎందుకంటే వరబలం గల అతణ్ణి చంపలేము, బంధించడమే ఇప్పటికి మనకు కర్తవ్యం. ఆ విధంగా చెయ్యండి, నేను కూడా బలిచక్రవర్తిని బంధించిన పిమ్మటే ముల్లోకాలనూ ఏలే ఇంద్ర పదవిని పొందాను. అందుకని ఈ పాపాత్ముడ్ని బంధించమంటున్నాను" అన్నాడు.

రామా! అంతట ఇంద్రుడు అక్కడనుండి వెళ్ళి మరొకచోట రాక్షసులతో యుద్ధం చేస్తున్నాడు. అప్పుడు రావణుడు ఉత్తర దిక్కునుండి, నూరుయోజనాల దూరాన సైన్యంలోకి దూసుకొని దేవసైన్యాన్ని బాణాలలో ముంచెత్తాడు. అప్పుడు ఇంద్రుడు తన సైన్యం క్షీణించిపోవడం చూసి, వెనక్కువచ్చి రావణుడు వెనక్కు తిరిగి పోయేట్లు చేశాడు. ఇంతలో రావణునిపై ఇంద్రునిదే పైచెయ్యికావడం చూస్తున్న రాక్షసులు ఆర్తనాదాలు చేశారు. రాక్షసుల ఆర్తనాదాలు వింటున్న మేఘనాధుడు కోపావేశంతో రథంపై దేవతా సైన్యంలోకి చొరబడ్డాడు. పూర్వం అతడు శివుడివద్ద పొందిన మాయను ఆశ్రయించి దేవసైన్యంలోకి ప్రవేశించాడు.

అప్పుడా మేఘనాధుడు దేవతలందర్నీ వదలి ఇంద్రునిపై దాడిచేశాడు. అయితే ఇంద్రుడికి మాత్రం మేఘనాధుడు కనపడలేదు. దేవతలనుండి తనపై బాణాల వర్షం కురుస్తున్నా, తన కవచం జారిపోయినా మేఘనాధుడు లెక్క చెయ్యలేదు. అతడి పరాక్రమం అంతా ఇంద్రునిపైనే! ముందుగా ఇంద్రుని రథసారథి మాతలిపైన సంధించి ఆ పిమ్మట ఇంద్రునిపై బాణాల వర్షం కురిపించాడు. అప్పుడు, ఇంద్రుడు మాతలిని, రథాన్ని వదలి ఐరావతంపై ఎక్కి మేఘనాధుడి కోసం వెదికాడు. అయితే మేఘనాధుడు తన మాయాప్రభావంచేత ఇంద్రుడికి కనపడకుండా తప్పించుకొని తిరుగుతూ, ఇంద్రునిపై బాణాల వర్షం కురిపించాడు. ఇంద్రుడు బాగా అలసిపోయేదాకా వేధించి, చివరకు మాయచేత బంధించి తనసైన్యం మధ్యలోకి తీసుకొని వెళ్ళాడు. అట్లా దేవేంద్రుణ్ణి మేఘనాధుడు బలవంతంగా తీసుకువెళ్తూవుంటే దేవతలంతా నిశ్చేష్టులయ్యారు. ఏం జరగబోతోందో? అని ఆందోళన చెందారు. అసురుల్ని జయించే మాయలెన్నో ఇంద్రుడివద్ద ఉన్నాయి, అయినా మేఘనాధుడు ఇంద్రుణ్ణి బంధించి తీసుకుపోయాడు. మాయావియైన మేఘనాధుడు కూడా కనిపించడం లేదే! అని అనుకున్నారు. దాంతో దేవతలంతా కలసి రావణుణ్ణి ఎలాగైనా ఇక్కడనుండి పారిపోయేట్లు చేయాలని నిశ్చయించుకున్నారు. ఆ విధంగా కోపించిన దేవతలు తమ యుద్ధ తీవ్రతను వేగవంతం చేశారు. ఆదిత్యులు, వసువులు తీవ్రంగా యుద్ధం చెయ్యడంతో, రావణుడు బాగా అలసిపోయాడు; యుద్ధం చెయ్యలేక పోతున్నాడు. తండ్రి బాగా దెబ్బలు తిని, యుద్ధం చెయ్యలేకుండా ఉండటాన్ని మేఘనాధుడు చూశాడు. రావణుని దగ్గరకుపోయి ఇలా అన్నాడు. “తండ్రీ! ఇక మనం వెళ్ళిపోదాం. యుద్ధం ఆపి వెయ్యి, మనం విజయాన్ని సాధించాం. నువ్వు సంతోషంగా ఉండు. పరమేశ్వరుని వరప్రభావం చేత పొందిన మాయతో ముల్లోకాలకూ ప్రభువైన ఇంద్రుణ్ణి బంధించేశాను. దేవతల గర్వం అణచివేశాను, ఓ తండ్రీ! శత్రువును నీ తేజస్సుచేత నిగ్రహించు. ముల్లోకాల్నీ నీ ఇష్టంవచ్చినట్లు అనుభవించు. ఇంకా మనకు ఇక్కడ ఎందుకు అవస్థలు. ఇంకా యుద్ధం చేసి ఏమి సాధిస్తాం?” అన్నాడు. ఇంద్రజిత్తు మాటలు విన్న దేవతలుకూడా యుద్ధం విరమించి వెనక్కు వెళ్ళిపోయారు.

ఆ విధంగా యుద్ధం పూర్తి అయిపోయిన తర్వాత గొప్ప తేజస్సుగలవాడు, దేవతా శత్రువువైన రావణుడు, ఇంద్రజిత్తు మాటలువిని ఇలా అన్నాడు. "గొప్ప సామర్థ్యము గలవాడా! ఓ కుమారా! నీ అసమాన పరాక్రమంచేత మన వంశప్రతిష్ఠను చిరస్థాయిగా నిలిచేట్లు చేశావు. ఇంద్రుని బంధించడం అంటే సామాన్య విషయమా? అంటే, దేవతలందర్నీ జయించినట్లే! నీవు వెంటనే దేవేంద్రుణ్ణి రథంపై కూర్చోబెట్టి మన సేనతో కలసి మన నగరానికి బయలుదేరు. నేనూ, మంత్రులతో కలసి, నీ వెనకాలే వస్తాను." పిమ్మట పరాక్రమశాలియైన ఆ ఇంద్రజిత్తు ఇంద్రుణ్ణి తీసుకొని సైన్యంతో కలసి, లంకానగరానికి చేరుకొని, యుద్ధం చేసిన రాక్షసుల్ని వారి ఇళ్ళకు పొమ్మని చెప్పాడు.

# 30వ సర్గ బ్రహ్మదేవుడు ఇంద్రుణ్ణి బంధనాలనుండి విడిపించటం

ఇంద్రజిత్తు దేవేంద్రుణ్ణి బంధించి తీసుకొనిపోవటం వలన దేవతలంతా బ్రహ్మదేవుణ్ణి వెంటబెట్టుకొని లంకకు వెళ్ళారు. బ్రహ్మదేవుడు దేవతలతో కలసి ఆకాశంలోనే నిలబడి పుత్రులతోను, బంధువులతోను సుఖంగా ఉన్న రావణునితో ఇలా అన్నాడు.

"నాయనా! రావణా! యుద్ధంలో నీ పుత్రుని పరాక్రమం చూశాను, చాలా సంతోషించాను. అతడు నీ అంతటి పరాక్రమవంతుడయ్యాడు; లేదే అంటే, నిన్ను మించిపోయాడే అని అనిపిస్తోంది. నీ తేజస్సుచేత మూడు లోకాల్ని జయించావు. నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నావు. మీ ఇద్దరి విషయంలో ఎంతో సంతోషిస్తున్నాను. రావణా! అతిబలశాలియైన నీ కుమారుడు ఇంద్రుణ్ణే జయించాడు కాబట్టి ఇకనుండి అతడు 'ఇంద్రజిత్తు' అని ప్రసిద్ధి చెందుతాడు. నువ్వు ఏ ఇంద్రజిత్తు వలన దేవతలను జయించగలిగావో, ఆ ఇంద్రజిత్తు, ఇకపైనకూడా మహాబలవంతుడుగాను, జయింప శక్యం కానివాడుగాను ఉంటాడు. ఓ మహాబాహూ! నీవు ఇక ఇంద్రుణ్ణి బంధాలనుండి విడుదల చెయ్యి. ఇతడిని విడిచిపెట్టినందుకు దేవతల్ని ఏమి ఇమ్మంటావో చెప్పు" అని అన్నాడు.

అప్పుడు మహాతేజశ్శాలీ, యుద్ధములలో జయింపశక్యము కానివాడు అయిన ఇంద్రజిత్తు ఇలా అన్నాడు. "దేవా! ఇతనిని విముక్తుణ్ణి చెయ్యాలంటే నాకు మరణంలేకుండా ఉండే వరం ప్రసాదించు" అన్నాడు. అందుకు బ్రహ్మ "నాయనా! ఈ భూలోకంలో ఏ ప్రాణికీ కూడా ఎన్నటికీ మరణం లేకుండా ఉండటం అనేది జరగదు. గొప్పతేజస్సుగల భూతములకు కూడా అమరత్వం లేదు" అన్నాడు. అంతట మేఘనాధుడు ఇలా అన్నాడు. "తాతా! నేను ఇంకో వరం కోరుకుంటాను, విను. నేను శత్రువులను జయించేందుకు, వేదోక్తంగా అగ్నిలో హవ్యములను సమర్పిస్తూ ఉంటాను. నేను యుద్ధంలో ప్రవేశించే ముందుగా నాకు అగ్నిలోనుండి గుర్రాలతో కూడిన రథం, నా కొరకు బయటకురావాలి. నేను ఆ రథంలో ఉన్నంతవరకూ నాకు మరణం

రాకూడదు. ఒకవేళ నేను హోమం సరిగ్గా చెయ్యకుండా యుద్ధానికి వెళ్తే, అప్పుడు నాకు మరణం కలగవచ్చు. ఓ దేవా! లోకంలో తపస్సుచేసి అమరత్వాన్ని వరంగా కోరుకుంటారు. కానీ నేనుమాత్రం నా పరాక్రమాన్ని చూపి అమరత్వాన్ని సంపాదించుకుంటున్నాను" అని అన్నాడు. అందుకు బ్రహ్మదేవుడు "అట్లే అగుగాక" అని దీవించాడు. పిమ్మట ఇంద్రజిత్తు ఇంద్రుణ్ణి విడిచిపెట్టాడు. ఇంద్రుడు దేవతలతో కలసి స్వర్గానికి వెళ్ళాడు.

రామా! ఇంద్రుడికి సహజంగా ఉండాల్సిన కాంతి తగ్గిపోయింది. దీనుడై, విచారంగా ఉండటం చూసి బ్రహ్మ ఇలా అన్నాడు. "ఓ ఇంద్రుడా! నీవు పూర్వం చెయ్యకూడని పాపం చేశావు, ఆ ఫలితమే ఈ రోజు అనుభవిస్తున్నావు, నీవు చేసిన పాపం ఏమిటో చెప్తాను విను.

పూర్వం నేను ఒకే శరీరచాయ, మాట, రూపముగల ప్రజలను సృష్టించాను. తీరా సృష్టించిన తర్వాత వాళ్ళల్లో ఏ ప్రత్యేకతా లేకపోవటం వలన నాకు తృప్తి కలుగలేదు. అప్పుడు నేను ప్రజల అవయవాల్లో ఏ అవయవం శ్రేష్ఠంగా ఉంటుందో, దానిని తీసుకొని, వాటన్నింటి కలయికతో ఒక స్త్రీని నిర్మించాను. ఆ స్త్రీకి 'అహల్య' అని పేరుపెట్టాను. 'హలము' అంటే రూపంలో వికారం, అటువంటి వికారం కలిగింది 'హలము;' హలము లేనిది కాబట్టి 'అహల్య' అని పేరుపెట్టాను. ఆటుపిమ్మట ఈమెను ఎవరికి భార్యను చెయ్యాలా? అని ఆలోచించాను. అప్పుడు ఆమె నా భార్యయైతే బాగుండును అని కోరుకున్నావు. కానీ నేను ఆమెను గౌతముడి రక్షణలో చాలా సంవత్సరాలు (న్యాసముగా) ఉంచాను. పిమ్మట అతడు ఆమెను తిరిగి నాకు అప్పగించేశాడు, నేను ఆ మహర్షి యొక్క గొప్ప మానసిక స్థైర్యానికి ముగ్ధుడనయ్యాను. అతడి తపస్సిద్ధిని కూడా గుర్తించాను, అందువల్ల ఆమెను అతడికే భార్యగా ఇచ్చేశాను. గొప్ప ధర్మాత్ముడు, బుద్ధిశాలియైన ఆ గౌతముడు ఆమెతో సుఖంగా ఉంటున్నాడు. నేను చేసిన ఈ పనికి దేవతలంతా నిరుత్సాహ పడ్డారు. నీవు కూడా ఆ మహర్షిపై అసూయచెంది ఉన్నావు. ఒకానొక సమయంలో గౌతమముని ఆశ్రమంలో అగ్నిజ్వాలవలె మండుతున్న అహల్యను చూశావు. ఆమె కోసం పరితపించి పోతున్న నీవు కామంతో అంధుడవై ఆమెను చెరచావు.

అప్పుడు కోపించిన ఆ మహర్షి నిన్ను ఇలా శపించాడు. "ఇంద్రా! నీవు నా భార్యను నిర్భయంగా చెరచావు, అందుచేత నీవు యుద్ధంలో నీ శత్రువులచేత బంధించబడతావు. ఓ దుర్బుద్ధిగలవాడా! నీవు ఇక్కడ చేసిన చెడుప్రవర్తనా దుష్టపరిణామం మనుష్యలలో కూడా వ్యాపిస్తుంది. మానవులు ఇటువంటి పాపం చేసినప్పుడు, చేసినవానికి సగం పాపం, మిగిలిన సగం పాపం నీకు సంక్రమిస్తుంది. అంతేకాదు ఎవరెవరు ఇంద్రపదవిని పొందుతారో వారాపదవిలో స్థిరంగా ఉండరు. ఇదే నీకు నేను ఇస్తున్న శాపం" అని అతడు నీతో అన్నాడు. అప్పుడే, మహాతపశ్శాలియైన ఆ మహర్షి భార్యను కూడా ఇట్లా శపించాడు. "చెడు నడవడిక గలదానా! నా ఆశ్రమంనుండి నువ్వు దూరంగా వెళ్ళిపో. నీవు ఒక్కతైవే రూపయౌవన సంపన్నురాలనన్న గర్వంతో ప్రవర్తించావు. అందువలన, లోకంలో నీవంటి రూపమును ప్రజలందరూ కూడా పొందగలరు" అని శపించాడు. ఆ తర్వాత ప్రజల్లో చాలామంది రూప సంపన్నులయ్యారు. అప్పుడు అహల్య గౌతమమునితో "ఓ బ్రహ్మర్షీ! ఇంద్రుడు నీ రూపంలో వచ్చి, నన్ను అవమానించాడు. నేను నీవే వచ్చావనే భ్రమలో ఉన్నాను. నేను తెలిసి ఈ అపచారం చెయ్యలేదు. కాబట్టి నన్ను అనుగ్రహించు" అని వేడుకుంది.

అహల్య మాటలకు గౌతమమహర్షి ఇలా అన్నాడు. "ఓ సాధ్వీ! ఇక్ష్వాకు వంశంలో ఒక మహారథుడు పుడతాడు. లోకంలో 'రాముడు' అనే పేరుతో ప్రసిద్ధి చెందుతాడు. ఆ మహాబాహు మానవరూపంలో ఉన్న శ్రీమహావిష్ణువే! అతడు ఒక బ్రాహ్మణుని పనిమీద ఆశ్రమానికి వస్తాడు. ఓ మంగళప్రదురాలా! నీవు రాముణ్ణి చూడగానే పవిత్రురాలవు కాగలవు. నీవు చేసిన పాపం అంతా తొలగిపోతుంది, నువ్వుచేసిన పాపాన్ని తొలగించి నిన్ను పవిత్రురాలను చెయ్యగల సమర్థుడు అతడొక్కడే. శ్రేష్ఠమైన శరీరవర్ణము గలదానా! నీవు ఆ రామునికి ఆతిథ్యం ఇస్తావు. అటుపిమ్మట నాతో కలసి నివసిస్తావు" అని శాపవిమోచనాన్ని కూడా అనుగ్రహించాడు. పిమ్మట గౌతమమహర్షి భార్యయైన అహల్య కఠోర తపస్సుచేసింది, ఓ దేవేంద్రా! ఆ ముని శాపంవల్లనే నీకీ ఆపదవచ్చింది. నీవు చేసిన పాపకార్యానికి ఫలితంగా నీవు ఈ రాక్షసునిచే బంధించబడ్డావు, ఇప్పుడు నీవు మనస్సు నిర్మలంగా ఉంచుకో. విష్ణువుకు అత్యంత ప్రీతికరమైన వైష్ణవయజ్ఞాన్ని

చెయ్యి. దేవేంద్రా! నీవు ఆ యజ్ఞాన్ని చేసి పవిత్రుడవై స్వర్గానికి వెళ్ళు. నీ కుమారుడు జయంతుడు యుద్ధంలో మరణించలేదు. అతడిని మాతామహుడు మహాసముద్రంలో దాచి ఉంచాడు.

ఇంద్రుడు బ్రహ్మ చెప్పినవిధంగా వైష్ణవయజ్ఞంచేసి మళ్ళీ స్వర్గంలో ప్రవేశించి, దేవతల్ని పాలించాడు. ఓ రామా! నీకు ఇంద్రజిత్తు బలాన్ని గూర్చి చెప్పాను. దేవేంద్రుణ్ణే జయించి బంధించి లంకకు తీసుకుపోయాడంటే అతడి పరాక్రమాన్ని గూర్చి వేరేచెప్పాలా?

అగస్త్యుని మాటలువిన్న రాముడు, లక్ష్మణుడు, వానరులు ఆశ్చర్యపోయారు. రాముని ప్రక్కనే కూర్చుని ఉన్న విభీషణుడు "ఓ మహర్షీ! ఎప్పుడో నా చిన్నతనంలో జరిగిన విషయాలన్నీ మళ్ళీ గుర్తుచేశారు" అన్నాడు: రాముడు అగస్త్యునితో ఇలా అన్నాడు "మహర్షి! ఇదంతా సత్యమే, నేను ఈ విషయం అంతా విభీషణుని నుండి విన్నాను."

"ఓ రామా! రావణాసురుడు పుత్రుల్ని, బంధువుల్ని వెంటబెట్టుకొని ఇంద్రుణ్ణి జయించిన విధం అంతా నీకు చెప్పాను" అని అగస్త్యమహర్షి అన్నాడు.

# 31వ సర్గ రావణుడు శివుని ఆరాధించటం

మహాతేజశ్శాలియైన రాముడు ఋషులలో శ్రేష్ఠుడైన అగస్త్యమహర్షికి నమస్కరించి ఇలా అడిగాడు. "పూజ్యుడవైన ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! రావణుడు అంత క్రూరంగా ప్రవర్తిస్తూ ఉంటే ఆ కాలంలో అతణ్ణి ఎదిరించ గలిగిన శూరుడు ఒక్కడుకూడా లేకపోయాడా? రావణుణ్ణి ఎదిరించే క్షత్రియుడైన రాజ్యపాలకులంతా పరాక్రమాన్ని కోల్పోయారా? అజ్ఞానులై శాస్త్రజ్ఞానం లేనివారయ్యారా? ఈ లోకం అంత గొడ్డుపోయి ఉండేదా?" అందుకు అగస్త్యమహర్షి రాముడి మాటలకు నవ్వుతూ, "బ్రహ్మదేవుడు పరమేశ్వరునికి చెప్పినమాటల్నే ఇప్పుడు నీకు చెప్తున్నాను విను" అని ఇలా చెప్పాడు.

"రావణుడు రాజులందరినీ పీడిస్తూ, భూమండలమంతా తిరుగుతూ మాహిష్మతీ పురానికి చేరాడు. ఆ రాజ్యాన్ని అర్జునుడు అనే రాజు పాలించేవాడు. ఆ రాజ్యంలో శత్రుబాధలనుండి రక్షించుకోవడం కోసం శరములు(రెల్లుగడ్డి)తో కప్పబడిన అగ్నిగుండంలో ఎప్పుడూ అగ్ని ఉండేది. మహాబలశాలియైన ఆ అర్జునుడు ఒకానొక రోజున తన స్త్రీలతో విహరించేందుకు నర్మదా నదీతీరానికి వెళ్ళాడు. అదేరోజున రావణుడు ఆ మాహిష్మతీపురంపై దాడిచెయ్యడానికి వెళ్ళి, అతడి మంత్రులతో ఇలా అన్నాడు: "నేను రావణుడనే రాక్షసరాజుని. నేను మీ రాజుతో యుద్ధం చెయ్యడానికి వచ్చాను. పోయి మీ రాజును యుద్ధానికి రమ్మని చెప్పండి." అందుకు ఆ మంత్రులు, తమ రాజు పట్టణంలో లేడని చెప్పారు. పౌరులుకూడా ఆ మాటే చెప్పారు. అందువల్ల రావణుడు వింధ్యపర్వతాలకు చేరి అక్కడి ప్రకృతి సౌందర్యానికి మురిసిపోయాడు. ఎత్తైన ప్రదేశాలనుండి జలజలాపారుతున్న సెలయేర్లు మనోహరంగా ఉన్నాయి. దేవ, దానవ, గంధర్వులు తమ స్త్రీలతో అక్కడ క్రీడిస్తూ ఉంటారు. ఆ పర్వతంపైన స్ఫటికంవంటి స్వచ్ఛమైన నీటితో ప్రవహించే నదులతో కదిలే నాలుకలతో వేయిపడగల ఆదిశేషుడువలె కనిపించింది. అనేక గుహలతో నిండిన ఆ వింధ్యపర్వతం హిమాలయాల్ని పోలివుంది. ఆ ప్రకృతి సౌందర్యాల్ని తిలకిస్తూ రావణుడు నర్మదానదీ తీరానికి వచ్చాడు.

పవిత్రమైన ఆ నర్మదానదిలో రాళ్ళు దొర్లుతున్నాయి. ఆ నది పశ్చిమ సముద్రాన్ని చేరాలని ఆరాటపడుతోంది. దప్పికగొన్న సింహాలు, పులులు, భల్లూకాలు, మహాగజాలు ఆ నీటిని కలుషితం చేస్తున్నాయి. అక్కడ చక్రవాకములు, కారండవాలు, హంసలు, సారపక్షులు మొదలైన అనేక పక్షిజాతులతో కనులపండువుగా వుంది. ఆ తీరాలన్నీ వృక్షాలతోనిండి, వికసించిన పూలతో నిండి సువాసనలు వెదజల్లుతున్నాయి. అప్పుడా రాక్షసశ్రేష్ఠుడు ఆ నదిలో జలకాలాడి తన మంత్రులతోవచ్చి ఆ ఇసుకతిన్నెలపై కూర్చున్నాడు. ఆ నర్మదనదినే గంగానదిగా భావించి ఆనందిస్తూ విలాసంగా మంత్రులను పిలిచి ఇలా అన్నాడు: "ఓ శుక సారణులారా! ఇది మిట్టమధ్యాహ్నసమయం, సూర్యుడు తన తీవ్రకిరణాలచేత లోకాన్నంతటికీ తాపం కలిగిస్తున్నా కూడా. నేను ఇక్కడున్నానని తెలుసుకుని తన తాపాన్ని నిగ్రహించుకొని చంద్రుడిలాగా చల్లటి కిరణాలను ప్రసరించి నన్ను సంతోషపెడుతున్నాడు. గాలికూడా నాకు భయపడి, నర్మదానది నుండి వీస్తూ నాకు చల్లదనాన్నిస్తోంది. ఇక్కడి వనాలలోని ఫలపుష్పాలనుండి సువాసనల్ని తెచ్చి నా శ్రమను తొలగిస్తోంది. అనేక జలజీవరాసులలో, నదులలో శ్రేష్ఠమైన ఈ నర్మదానది భయపడుతున్న స్త్రీ లాగావుంది. అటువంటి ఈ పవిత్ర నర్మదానదిలో స్నానం చెయ్యండి, పవిత్రులు కండి. నేనుకూడా ఈ ఇసుకతిన్నెలపైన శివభగవానుణ్ణి ఆవాహన చేసి పుష్పాలతో పూజిస్తాను" అన్నాడు.

అంతట రావణుడు చెప్పినట్లుగానే అతడి మంత్రులంతా పవిత్ర నర్మదానదిలో స్నానాలుచేశారు. రాక్షసేంద్రులనే ఏనుగులు, ఆ నర్మదా జలాలన్నింటినీ కలచివేశాయి. అంతట ఆ రాక్షసవీరులంతా నర్మదలో స్నానాలుచేసి రావణుని పూజలకై పుష్పాల పర్వతాన్ని ఏర్పాటుచేశారు. పిమ్మట రాక్షసరాజైన రావణుడుకూడా చల్లటి నర్మదానదిలో దిగి స్నానంచేసి, వేదోక్తమైన మంత్రాలన్ని జపించి, ఆ నర్మదాజలాల నుండి బయటకు వచ్చాడు. తడిసిన బట్టలు విడచి తెల్లని వస్త్రాలు ధరించి అంజలిఘటించి రావణుడు ముందు కెళ్తువుంటే, అతడి మంత్రులంతా బంగారు శివలింగాన్ని, పుష్పరాసుల్ని తీసుకొని అతడి వెనకనే నడిచారు. అప్పుడు రావణుడు బంగారు శివలింగాన్ని ఇసుకతిన్నెపై ప్రతిష్ఠ చేసి, చందనం మొదలైన గంధాలతోను,

పుష్పాలతోను పూజచేశాడు. సర్వోత్తముడు, శ్రేష్ఠుడు, వరాలు ఇచ్చేవాడు, చంద్రుణ్ణి శిరస్సున ధరించినవాడైన మహేశ్వరుణ్ణి పూజించి సామగానం చేశాడు. ఆ పరమశివుని ఎదుట చేతులు చాపి నృత్యం చేశాడు.

# 32వ సర్గ కార్తవీర్యార్జునుడు రావణుని బంధించటం

రావణుడు బంగారుశివలింగాన్ని నర్మదా నదీతీరాన ప్రతిష్ఠచేసి భక్తితో పూజలు చేస్తున్నాడు. అప్పుడు ఆ సమీపంలోనే కార్తవీర్యార్జునుడు తన స్త్రీలతో కలసి నర్మదానదిలో జలక్రీడలాడుతున్నాడు. అప్పుడా స్త్రీల మధ్యనున్న అర్జునుడు వెయ్యి ఆడఏనుగుల మధ్యనున్న గజేంద్రునివలె ప్రకాశించాడు. వెయ్యి చేతులున్న అర్జునుడు క్రీడిస్తూ తన బలాన్ని పరీక్షించుకోవటానికి వెయ్యిచేతుల్నీ ఆ నదీప్రవాహానికి అడ్డంగాపెట్టి, నేలపైన కాళ్ళతో అదిమి పెట్టాడు. అప్పుడు అర్జునుణ్ణి సమీపిస్తున్న నదీజలాలు, అతణ్ణి తప్పించుకొని పోలేక ఎదురుగా ప్రవహించడం ప్రారంభం అయింది. నదిమధ్యగా ఒక పర్వతంలాగా అర్జునుడు అడ్డుగా ఉండటంవలన పెద్ద ఆనకట్ట కట్టినట్లయింది. పశ్చిమానికి ప్రవహించాల్సిన ఆ ప్రవాహం, ఎదురు తిరిగి తూర్పుగా ప్రవహించడం మొదలైంది. ఆ ప్రవాహంతోపాటే, చేపలు, మొసళ్ళువంటి జలచరాలు కూడా ప్రవాహంతోపాటే ఎదురుగా పోసాగాయి. ఆ నదీజలాలు అట్లా ఎదురుతిరిగి ప్రవహించడంవలన రావణుడు పూజకోసం పెట్టుకున్న పుష్పాలన్నీ కొట్టుకుపోయాయి. వాటికి బదులుగా అర్జునుడు పూజకు పంపించిన పుష్పాలా? అన్నట్లు చేపలు, మొసళ్ళు తిమింగిలాలు శివలింగం వద్దకు కొట్టుకువచ్చాయి. పోనీ ప్రకృతి విపరీతాలు కూడా ఏమీ కనిపించలేదు. పక్షులన్నీ ప్రశాంతంగానే ఉన్నాయి. అప్పుడు రావణుడు పూజలో ఉండటంవల్ల నోటితో మాట్లాడకుండా, కుడిచేతి వ్రేలితో సంజ్ఞచేసి, నదీజలం ఇట్లావెనక్కి ప్రవహించడానికి కారణం ఏమిటో తెలుసుకురమ్మని శుకసారణులను ఆదేశించాడు. అంతట శుక సారణులిద్దరూ ఆకాశమార్గానపోయి స్త్రీలతో కలసి జలక్రీడలాడుతున్న పురుషుణ్ణి చూశారు. ఆ పురుషుడు పెద్ద మద్దిచెట్టులాగా నీటికడ్డంగా పడుకున్నాడు. అతడి జుట్టు నదియంతా వ్యాపించి ఉంది. అతడి కనుకొనలు మదించి ఎర్రగా ఉన్నాయి, అతడి మనస్సు సంతోషంతో తేలిపోతోంది. శ్రేష్ఠమైన ఆ వెయ్యిమంది స్త్రీల మధ్యనున్న ఆ పురుషుడు వెయ్యి ఆడఏనుగుల మధ్యనున్న మదపుటేనుగువలె కనిపించాడు. ఆశ్చర్యాన్ని గొలిపే ఆ పురుషుడే

కార్తవీర్యార్జునుడని చెప్పారు.

శుక సారణుల మాటలువిన్న రావణుడు అర్జునుని ఎదిరించడానికి వెంటనే బయలుదేరాడు. రావణుడు బయలుదేరుతూ ఉండగా, పెద్దగాలి దుమారం రేగింది. ఆకాశంనుండి సన్నగా రక్తబిందువులు కురిశాయి. అయినా రావణుడు ఈ శకునాల్ని ఏమీ లెక్కచెయ్యలేదు. మహోదరుడు, మహాపార్శ్వుడు, ధూమ్రాక్షుడు, శుకుడు, సారణులను వెంటబెట్టుకొని అర్జునుడున్న చోటకు వెళ్ళాడు. అక్కడున్న అర్జునుని మంత్రులతో, "అమాత్యులారా! నేను రావణుణ్ణి, రాక్షసరాజుని. కార్తవీర్యునితో యుద్ధానికి వచ్చాను. వెంటనే వెళ్ళి చెప్పండి" అన్నాడు. అందుకు అర్జునుని మంత్రులు నవ్వుతూ ఇలా అన్నారు "ఓ లంకేశ్వరా! ఇది అర్ధరాత్రి సమయం. మా రాజు మద్యంతో మత్తెక్కి తన స్త్రీలతో క్రీడిస్తున్నాడు. ఇట్లాంటి సమయంలోనా కయ్యానికి కాలుదువుతున్నావు. బుద్ధిమంతుడెవ్వడూ ఇట్లాంటి సమయంలో యుద్ధానికి పిలవడు. పోయి రేపు ఉదయానే రా. మహారాజుతో యుద్ధం చెయ్యవచ్చు. నీవు అంతగా తొందర పడతానంటే, ముందు మాతో యుద్ధంచేసి మమ్మల్ని ఓడించి, ఆ తర్వాత నీవు అర్జునునితో యుద్ధం చెయ్యవచ్చు" అని అన్నారు. వాళ్ళు ఇంకా ఇట్లా మాట్లాడుతూ ఉండగానే రావణుని అనుచరులు, అర్జునుని మంత్రుల్ని చంపి తినేశారు. ఆ దారుణ హింసను చూస్తూ అల్లంత దూరాన ఉన్న అర్జునుడి అనుచరులు కోపంతో రావణుని మంత్రుల్ని ఎదుర్కొన్నారు. ఇరుపక్షాలవాళ్ళు భయంకరంగా పోరాడారు. అర్జునుని వీరుల పరాక్రమం ముందు రావణుని మంత్రులు నిలవలేక పరుగులు పెట్టారు. అంతట రావణుని భటులు, మంత్రులు వాళ్ళకు సహజమైన మాయాబలాన్ని ఉపయోగించి కార్తవీర్యుని భటుల్ని హతమార్చారు. భయభ్రాంతులైన కొందరు మంత్రులు, భటులు పరుగు పరుగునపోయి కార్తవీర్యార్జునునికి ఈ వార్త చెప్పారు. అప్పుడు ఆ కార్తవీర్యార్జునుడు 'భయపడకండి' అని స్త్రీలతోచెప్పి, గంగాజలాలనుండి దిగ్గున లేచిన అంజన అనే దిగ్గజంవలె నీళ్ళల్లోనుండి బయటకువచ్చాడు. క్రోధంతో కార్తవీర్యుని కళ్ళు ఎర్రబడ్డాయి. ప్రళయాగ్నివలె మండిపడ్డాడు. చీకట్లను ఎదిరించటానికి బయలుదేరిన సూర్యునివలె, అర్జునుడు రావణుని సంహరించేందుకు

బయటకు వచ్చాడు.

అర్జునుడు చేతిలో గదను ధరించి గరుత్మంతుని వేగంతో రావణునిపైకి వస్తూ ఉండగా, ప్రహస్తుడు సూర్యుడు చీకటిని ఎదిరించినట్టు అడ్డుకున్నాడు. ప్రహస్తుడు నిప్పులు చెరిగే ముసలాయుధాన్ని అర్జునుని మీదకు విసిరేశాడు. అర్జునుడు ఆ ముసలాన్నుండి అవలీలగా తప్పించుకొని ప్రహస్తుడి నెత్తిమీద గదతో ఒక మొత్తు మొత్తాడు, ఆ దెబ్బకు తట్టుకోలేక ప్రహస్తుడు, వజ్రాయుధంచేత కొట్టబడిన పర్వతంవలె పడిపోయాడు. ప్రహస్తుడు నేలకూలటంతో మారీచ, శుక, సారణ, మహోదర, ధూమ్రాక్షులు యుద్ధభూమినుండి పారిపోయారు. రావణుడు కార్తవీర్యార్జునుణ్ణి స్వయంగా ఎదిరించాడు. వేయి చేతులున్న కార్తవీర్యార్జునుడు, ఇరవై చేతుల్తో రావణుడు భయంకరంగాను ఆశ్చర్యంగాను యుద్ధాన్ని ప్రారంభించారు.

క్రోధావేశాల్తో రగిలిపోతున్న ఆ ఇద్దరు వీరులూ సంక్షోభం చెందిన రెండు సముద్రాల్లాగాను, మొదలంటా పెళ్ళగించబడ్డ రెండు పర్వతాల్లాగాను, తేజస్సుతోకూడిన ఇద్దరు సురులవలెనూ, వనాన్ని దహిస్తున్న రెండు అగ్నుల్లాగాను, ఆడు ఏనుగుకోసం పోట్లాడుతున్న రెండు మదపుటేనుగుల్లాగాను, ఉరిమే రెండు మేఘాల్లాగాను, గదలతో ఒకరినొకరు కొట్టుకున్నారు. వాళ్ళట్లా గదలతో కొట్టుకుంటూ ఉంటే పిడుగులు పడ్డట్టు దిక్కులు పిక్కటిల్లాయి.

కోపించిన కార్తవీర్యార్జునుడు తన బలాన్నంతా ఉపయోగించి గదతో రావణుని వక్షఃస్థలాన కొట్టాడు. రావణుని కవచం విరిగి పడింది. రావణుడు బారెడు దూరానపోయి పడ్డాడు. వరములచేత రక్షించబడ్డాడేగాని, లేకపోతే ఆ దెబ్బకు చచ్చిపడుండేవాడే! రావణుడు బలహీనుడై నేలపై వ్యాకులత చెంది ఉండటం చూసిన కార్తవీర్యార్జునుడు, గరుత్మంతుడు సర్పాన్ని పట్టినట్లు, రావణుణ్ణి తనవెయ్యి చేతులతో పట్టుకొని, శ్రీహరి బలిని బంధించినట్లు బంధించాడు. రావణుడు అట్లా బంధితుడు కాగానే దేవతలు, సిద్ధులు, చారణులు పుష్పవర్షం కురిపించారు. రావణుని బంధించిన కార్తవీర్యార్జునుడు, పెద్దపులి లేడిని పట్టినట్లు, సింహం ఏనుగును బందీచేసినట్లు సంతోషంతో సింహనాదం చేశాడు. అప్పుడు ప్రహస్తుడు తెప్పరిల్లాడు,

రావణుడు బంధింపబడి ఉండటం చూశాడు. వెంటనే ముసలములు, మరి ఇతర ఆయుధాలు పుచ్చుకొని అర్జునుని వెంటబడ్డాడు. అర్జునుడు రాక్షసులు తనపై ప్రయోగించే ఆయుధాలన్నింటినీ తనమీద పడకుండానే వాటిన్నంటినీ పట్టుకొని విరిచేశాడు. అంతట కార్తవీర్యార్జునుడు రాక్షసులందర్నీ చెదరకొట్టి, రావణుని బంధించి తన మంత్రులతో కలసి నగరానికి చేరుకున్నాడు. బ్రాహ్మణులు, పౌరులు కార్తవీర్యార్జునునిపై పుష్పాలు, అక్షితలు చల్లి నగరానికి ఆహ్వానించారు.

# 33వ సర్గ పులస్త్యుడు వచ్చి రావణుని బంధవిముక్తుణ్ణి చేయటం

గాలిని బంధించడం ఎంత ఆశ్చర్యమో, రావణుని బంధించడం కూడా అంతే ఆశ్చర్యం అని దేవతలంతా అనుకుంటూ ఉండగా పులస్త్యుడు విన్నాడు. పుత్ర ప్రేమచేత, ఆ మహర్షి రావణుణ్ణి చూడటానికి వచ్చాడు. వాయువేగంతో వాయుమార్గమందు ఇంద్రుడు అమరావతిలోకి ప్రవేశించినట్లు పులస్త్యుడు మాహిష్మతీ నగరంలోకి ప్రవేశించాడు. సూర్యునివలె ప్రకాశిస్తూవస్తున్న పులస్త్యమహర్షిని చూసి పౌరులంతా పోయి అర్జునునితో చెప్పారు. అంతట కార్తవీర్యార్జునుడు, అంజలిఘటించి నమస్కరిస్తూ, ఎదురువెళ్ళి పులస్త్యమహర్షిని ఆహ్వానించాడు. రాజపురోహితుడు అర్ఘ్యము, మధుపర్కం తీసుకొనిరాగా బృహస్పతి దేవేంద్రుని ముందుకు వెళ్ళినట్లు కార్తవీర్యార్జునుడు పులస్తమహర్షి ముందుకు వెళ్ళాడు. ఇంద్రుడు ఈశ్వరునకు నమస్కరిస్తున్నట్లు నమస్కరించి అర్ఘ్యపాద్యాదులు సమర్పించి సంతోషంతో ఇలా అన్నాడు. "ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! నీ రాకచే ఈ మాహిష్మతీనగరం ఇంద్రుని అమరావతివలె ప్రాచుర్యం సంతరించుకొంది. దేవతలచే పూజించబడే నీ పాదాలకు నమస్కరిస్తున్నాను. మేమంతా నీకు ఏమి సేవలు చెయ్యాలో చెప్పి మమ్మల్ని ధన్యుల్ని చెయ్యి; ఆజ్ఞాపించు" అన్నాడు.

అంతట పులస్త్యుడు ఇలా అన్నాడు: "రాజా! ధర్మం నిర్విఘ్నంగా సాగుతోందా? పుత్రులు, బంధువులు క్షేమమేకదా? అగ్నిహోత్రం చక్కగా సాగుతోందా? రావణుణ్ణి కూడా జయించి తిరుగులేని నీ బలాన్ని చాటుకున్నావు. ఓ రాజా! ఎవరిని చూసి గాలి, నీరు, అగ్ని కూడా భయపడతాయో అటువంటి నా మనవడిని జయించావు. నాయనా! నీవు నా మనవడి కీర్తినంతా తాగేశావు; 'రావణవిజేత' అని లోకానికి చాటుకున్నావు. నేను నిన్ను బ్రతిమాలుతున్నాను రావణుణ్ణి విడిచిపెట్టు."

అంతట కార్తవీర్యార్జునుడు, మారుమాట్లాడకుండా, సంతోషంతో రావణుణ్ణి బంధంనుండి విడుదలచేశాడు. అర్జునుడు దేవతల శత్రువైన రావణునితో అగ్నిసాక్షిగా

స్నేహసంబంధం కుదుర్చుకున్నాడు. అతనికి ఆభరణాలు వస్త్రాలు ఇచ్చి సత్కరించాడు. పిమ్మట రావణుడు పులస్త్యునికి నమస్కరించి లంకానగరానికి వెళ్ళిపోయాడు. అంతట పులస్త్యుడు కూడా రావణుని బంధవిముక్తుణ్ణిచేసి బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు.

ఓ రామా! ఆ విధంగా మహాబలశాలియైన రావణుడు పులస్త్యుని వలన విడుదల పొంది లంకకు చేరుకున్నాడు. లోకంలో ఎంతటి బలవంతుడికన్నా మించిన వాళ్ళు ఉంటారు. అందుచేత తనకు శ్రేయస్సు కోరుకునేవాడు శత్రువు విషయంలో అనాదరం చూపగూడదు. రావణుడు కార్తవీర్యార్జునితో స్నేహం చేసుకున్నాడేకానీ, మళ్ళీ రాజులందర్నీ హింసిస్తూ భూలోకం అంతటా సంచరించాడు.

# 34వ సర్గ రావణుడు వాలితో మైత్రి చేసుకోవటం

కార్తవీర్యునిచే విడువబడిన రావణుడు భూమి అంతా తిరుగుతూ, ఎక్కడైనా బలవంతుడు కనిపిస్తే వానిని యుద్ధానికి పిలుస్తూ సంచరించాడు. అట్లా సంచారం చేస్తూ ఒకానొకరోజున కిష్కింధకుపోయి దివ్యమాల ధరించిన వాలిని యుద్ధానికి పిలిచాడు. అప్పుడు వాలి మంత్రి, తారకు తండ్రియైన తారుడు రావణునితో ఇలా అన్నాడు. “ఓ రాక్షసరాజా! నిన్ను ఎదిరించి యుద్ధం చెయ్యగలవాడు వాలి ఒక్కడే. అతడు ఇప్పుడు నాలుగు సముద్రాల్లోనూ అర్ఘ్యం ఇచ్చేందుకు వెళ్ళాడు. నువ్వు వేచి ఉంటే ఓ ముహూర్తకాలంలో వస్తాడు. అతడు వచ్చేంతవరకూ నీవు ఇక్కడే ఉండి ప్రకృతి అందాలన్నీ చివరిసారిగా ఆస్వాదించు ఆ ఎముకల గుట్ట చూడు. వాలితో యుద్ధానికి వచ్చి వాలి తేజస్సుచే మరణించిన వాళ్ళ ఎముకలు. అతడు రావడం ఏమిటి, నీవు మరణించడం ఏమిటి, రెండూ ఒకేసారి జరుగుతాయి. అంతవరకూనైనా ఆనందంగా గడుపు. కాదంటావా అతడిప్పుడు దక్షిణ సముద్రతీరాన అర్ఘ్యం విడుస్తూ ఉంటాడు. నీవు అక్కడకు వెళ్తే అతడితో యుద్ధం చెయ్యవచ్చు” అన్నాడు. అంతట రావణుడు తన మంత్రులను తీసుకొని పుష్పకం ఎక్కి దక్షిణసముద్రాన్ని చేరుకున్నాడు.

రావణుడు అక్కడ సంధ్యోపాసన చేస్తున్న వాలిని చూశాడు. మేరుపర్వతం అంత ఉన్న వాలి ముఖం ఉదయసూర్యునివలె వెలిగిపోతోంది. కాటుకకొండవంటి రావణుడు వాలి కంటపడకుండా వాలిని పట్టుకోవాలని అడుగులో అడుగు వేసుకుంటూ చప్పుడు చెయ్యకుండా వెళ్ళాడు. రావణుడు అట్లా దొంగపిల్లిలాగా రావటం వాలి గమనించాడు. అయినా ఏమీ ఎరగనట్లే సంధ్యోపాసనలో మునిగి ఉన్నాడు. రావణుని దురాలోచన పసిగట్టినా ఏమీ కంగారు పడలేదు. కుందేలును చూసిన సింహంవలె, సర్పాన్ని చూసిన గరుత్మంతునివలె, రావణుని చూసిన వాలి ఏమీ లెక్కచెయ్యలేదు, వాలి తనలో ఇలా అనుకున్నాడు. ‘నన్ను దొంగచాటుగా జయించాలనే దుష్టసంకల్పంతో వస్తున్న ఈ రాక్షసుడికి తగిన బుద్ధి చెప్తాను. ఈతడిని నా చంకలో వ్రేలాడదీసుకొని మూడు మహాసముద్రాలకు వెళ్తాను. గరుత్మంతుడు సర్పాన్ని పట్టుకొని

వెళ్తున్నట్లుగా, నేను ఇతడి చేతులూ, తొడలు గాలిలో వ్రేలాడేట్లు మోసుకొని పోతాను. నా చంకలో వ్రేలాడుతున్న ఇతణ్ణి చూసి జనం అంతా నవ్వాలి. అదే ఇతడికి తగిన శాస్తి' అని తనలో అనుకొని చంకలో వ్రేలాడేట్లు చేసుకొని ఆకాశంలోకి ఎగిరాడు. అప్పుడు రావణుడు వాడియైన గోళ్ళతో వాలిని బాధించసాగాడు. అయినా వాలి లెక్కచెయ్యకుండా, వాయువు మేఘాన్ని అపహరించినట్లు ఎత్తుకొనిపోయాడు. వాలి రావణుణ్ణి ఎత్తుకుపోతూ ఉంటే, రావణుని మంత్రులు అరుస్తూ, కేకలువేస్తూ వాలిని వెంబడించారు. గొప్ప వేగం గల వాలి పక్షులు ఎగరలేని సముద్రాలన్నింటినీ చేరుకుంటూ, నమస్కరిస్తూ పోయాడు. ఆ విధంగా వాలి పశ్చిమసముద్రాన్ని చేరాడు. అక్కడ స్నానంచేసి, సంధ్యోపాసన చేసి అర్ఘ్యాలిచ్చి, రావణుని మోసుకుంటూ ఉత్తరసముద్రానికి బయలుదేరాడు. అక్కడ ఉత్తరసముద్రంలో అనుష్ఠానాలన్నీ చేసుకొని, రావణుని మోసుకొని తూర్పుసముద్రానికి వెళ్ళాడు. ఇంద్రుని పుత్రుడైన వాలి తూర్పుసముద్రంలో కూడా సంధ్యావందనం పూర్తిచేసుకొని, రావణుని మోసుకొని కిష్కింధకు చేరాడు. అప్పుడు వాలి రావణుణ్ణి క్రిందకుదింపి, రావణునితో "నువ్వు ఎక్కడనుండి వచ్చావు" అని అడిగాడు. అప్పుడు రావణుడు ఇలా అన్నాడు. "మహేంద్రుడివంటి వానరేంద్రా! నేను రాక్షసరాజును. నీతో యుద్ధం చెయ్యటానికి వచ్చాను. నువ్వేమో, నన్ను పశువును కట్టి తీసుకొనిపోయినట్లు మూడు సముద్రాలు త్రిప్పి, కిష్కింధకు తీసుకొని వచ్చి నేలపై దింపావు. నీ బలమే బలం! నీ పరాక్రమమే పరాక్రమం; నీ గాంభీర్యమే గాంభీర్యం. నీకు నువ్వే సాటి. ఈ విధంగా కొద్దిగా కూడా అలసట లేకుండా నన్ను మోసుకుంటూ మూడు సముద్రాలు తిరిగివచ్చావు. నీవంటి మహాబలశాలి మరొకడు ఉండడు. ఓ వానరరాజా! నీకున్న వేగగమనం వాయువుకు, గరుత్మంతునికి, మనస్సుకు మాత్రమే ఉన్నాయి. సందేహంలేదు.

ఓ వానరశ్రేష్ఠా! నీవెంతటి బలశాలివో, నీతో యుద్ధం చెయ్యకుండానే తెలుసుకున్నాను. నీతో అగ్నిసాక్షిగా చిరకాల స్నేహం కోరుతున్నాను. ఓ వానరరాజా! భార్యలు, పుత్రులు, పురం, రాష్ట్రం, భోగములు, ఆచ్ఛాదనములు, భోజనం అన్నీకూడా మనిద్దరికీ భోగ్యాలుగా ఉండగలవు." పిమ్మటవారు అగ్నిహోత్రాన్ని ప్రజ్వలింపజేసి పరస్పరం కౌగలించుకున్నారు.

సోదర స్నేహభావాన్ని ప్రకటించు కున్నారు. పిమ్మట వారిద్దరూ కిష్కింధలోకి ప్రవేశించారు. రావణుడు వాలికి అతిథిగా మూడు మాసాలు ఉన్నాడు. పిమ్మట రావణుని మంత్రులు వచ్చి తీసుకెళ్ళారు.

రామా! ఈ విధంగా వాలి బలం సాటిలేనిదిగా ఉండేది. అంతటి వాలిని నీవు మిడుతను అగ్ని మాడ్చినట్లు మాడ్చివేశావు.

# 35వ సర్గ హనుమంతుని జన్మవృత్తాంతం

అప్పుడు రాముడు అంజలిఘటించి అగస్త్యునితో ఇలా అన్నాడు "ఓ మహర్షీ! వాలి బలం, రావణుని బలం సాటిలేనివే. కానీ, హనుమంతుని బలంతో సాటిరావని నా అభిప్రాయం. హనుమంతునిలో శౌర్యం ఉంది; మంచితనం ఉంది; సామర్థ్యం ఉంది; బలం ఉంది; ధైర్యం ఉంది; బుద్ధి ఉంది; నీతి ఉంది; ప్రభావం ఉంది; యుక్తమైన కార్యాన్ని సాధించే నేర్పు ఇవన్నీ హనుమంతుని ఆశ్రయించి ఉన్నాయని నా అభిప్రాయం. ఈ మహాత్ముడు సముద్రాన్ని చూసి ఎట్లా దాటగలమా! అని దిగులుపడి కూర్చున్న వానరసేన కంతటికీ ధైర్యం చెప్పాడు. వందయోజనాల సముద్రాన్ని దాటాడు. అప్పుడు ఇతడు అంతఃపురంలో ఎక్కడో ఉన్న సీతను వెతికిచూచి, మాట్లాడి, ఓదార్చాడు. ఆ లంకలో తాను ఒక్కడే సేనా నాయకుల్ని, మంత్రికుమారుల్ని, అక్షకుమారుణ్ణి, కింకరుల్ని చంపాడు. బంధాలనుండి విముక్తుడై, రావణునితో మాట్లాడి, లంకనంతా భస్మంచేసి వచ్చాడు. యుద్ధంలో హనుమంతుడు చేసినపనులు యముడు కానీ, ఇంద్రుడు కానీ, విష్ణువు కానీ, కుబేరుడు గానీ చేసినట్లు వినలేదు. ఓ మహర్షీ! ఈతడి బాహుబలం చేతనే నేను లంకను, సీతను, లక్ష్మణుణ్ణి, విజయాన్ని, రాజ్యాన్ని, మిత్రుల్ని, బంధువుల్ని పొందగలిగాను. సుగ్రీవుని మిత్రుడైన హనుమంతుడే లేని ఎడల సీత జాడయైనా తెలుసుకుని ఉండేవాణ్ణి కానుగదా? ఓ మహర్షీ! వాలిసుగ్రీవులకు వైరం వచ్చినప్పుడు, ఇతడు సుగ్రీవునికి హితం చెయ్యాలని అనుకుంటే వాలిని చిన్నమొక్కను గోటితో గిల్లినట్లు గిల్లి అవతలపారేసేవాడే! కానీ ఎందుకు అట్లా చెయ్యలేదు? హనుమంతుడు తనకు పరమ ఆప్తుడైన సుగ్రీవుడు ఎన్ని కష్టాలుపడుతున్నా చూస్తూ ఊరుకున్నాడేగాని, తన బలాన్ని ప్రయోగించలేదు. అంటే హనుమంతునికి తన సామర్థ్యం గూర్చి తనకే తెలియదా? ఓ మహామునీ! దేవతల చేత పూజించబడేవాడా! నాకు హనుమంతుని గూర్చి వివరంగా చెప్పు" అని అడిగాడు.

అప్పుడు అగస్త్యుడు రాముని మాటలు విని హనుమంతుని ఎదుటే, అతన్నిగూర్చి ఇలా చెప్పాడు.

“రామా! నీవు చెప్పినదంతా యథార్థమే. నీవు చెప్పిన గుణాలు వేటిల్లోనూ హనుమంతునికి సమానుడు మరొకడులేడు.

ఓ రామా! పూర్వం మహాతపశ్శాలురైన మహర్షులు హనుమంతునికి శాపం ఇచ్చారు. ఆ శాపఫలితంగా అతడి బలపరాక్రమాలేమిటో అతనికే తెలియవు. ఓ రామా! ఇతడు బాల్యంలోనే వర్ణించి చెప్పడానికి వీలులేనట్టి కార్యాలు చేశాడు. కేవలం అజ్ఞానంచేతనే ఏమీ తెలియని వాడివలె ఇట్లా కూర్చున్నాడు. హనుమంతుని గూర్చి తెలుసుకోవాలని కోరుతున్నావు కాబట్టి, చెప్తాను విను.

ఓ రామా! సూర్యుని వరప్రభావం చేత ఈతడి తండ్రియైన కేసరి మేరుపర్వత ప్రాంతాన్ని రాజ్యంగా చేసుకుని పాలిస్తున్నాడు. ఆ కేసరికి అంజన అనే పేరు గల భార్యవుంది. ఆమె యందు వాయుదేవుడు ఉత్తముడైన హనుమంతునికి జన్మనిచ్చాడు. అంజనాదేవి వరిముల్లువంటి పచ్చటి శరీరకాంతితో కూడిన ఈ హనుమంతుని కన్నది. ఈతని తల్లి పండ్లు తీసుకురావటానికి సమీపాన ఉన్న అడవిలోకి వెళ్ళింది. ఆ సమయంలో హనుమంతునికి తట్టుకోలేనంత ఆకలి వేసింది. ఆ ఆకలి బాధకు, శరవణంలో శిశువుగావున్న కుమారస్వామివలె ఏడ్చాడు. అప్పుడే ఉదయిస్తున్న సూర్యుణ్ణి ఈ హనుమంతుడు చూశాడు. శిశువైన హనుమంతుడికి ఆ ఉదయసూర్యుడు ఒక పండువలె కనిపించాడు. ఆ పండును తినాలనే ఆసక్తితో సూర్యుని దగ్గరకు పోవాలని ఎగిరాడు. హనుమంతుడు ఆ విధంగా సూర్యుణ్ణి పట్టుకోవాలనే కోరికతో పైకి ఎగరటం చూస్తున్న దేవతలు, దానవులు, యక్షు లు ఆశ్చర్యపడ్డారు. శిశువుగా ఉన్న ఈ హనుమంతుడు ఎంత వేగంగా సూర్యునివైపు ఎగురుతున్నాడంటే, ఆ వేగం వాయువుకు, మనస్సుకు, గరుత్మంతునికి కూడా లేదు. శిశువుగా ఉన్నప్పుడే ఈ శిశువుకు ఇంతటి గమనవేగం ఉంటే, ఇతడు పెరిగి పెద్దవాడైన పిదప ఎంతటి వేగవంతుడవుతాడోనని ఆశ్చర్యపడ్డారు.

అప్పుడు వాయువు ఎగురుతున్న తన పుత్రుణ్ణి కాపాడటంకోసం మంచువంటి చల్లటి గాలి రూపంలో హనుమంతుణ్ణి అనుసరిస్తూ వెళ్ళాడు. ఆ శిశువు, తండ్రియైన వాయుదేవుని

బలంవల్లనూ, సహజమైన తన బాల్యచాపల్యం వల్లనూ, ఆకాశంలో కొన్ని వేల యోజనాలు ఎగిరి సూర్యుని దగ్గరకు వెళ్ళాడు.

“ఇతడు శిశువు; తప్పొప్పులు, మంచిచెడులు తెలియనివాడు. అదీ కాకుండా, ఇతడు దేవతా కార్యంకోసం జన్మించాడు. కాబట్టి ఇతణ్ణి భస్మం చెయ్యకూడదు” అని సూర్యుడు ఆలోచించాడు. ఇంతలో రాహువు సూర్యుణ్ణి పట్టుకోవడానికి వచ్చాడు. రాహువుకూడా సూర్యుడి రథంపైనే ఉన్నాడు. తాను సూర్య చంద్రుల్ని కూడా మ్రింగేవాడైనా, ఆ సమయంలో హనుమంతుణ్ణి చూసి భయపడి పారిపోయాడు. అప్పుడా రాహువు దేవతా గణాలతో కొలువుతీరి ఉన్న ఇంద్రుని వద్దకు వెళ్ళి ఇలా అన్నాడు. ‘బలవృత్రాసుర సంహారకుడవైన ఓ ఇంద్రా! నువ్వు సూర్యచంద్రుల్ని నాకు ఆహారంగా చూపించావు. మళ్ళీ ఈ రోజున నా ఆహారాన్ని మరొకరికి కూడా ఇచ్చావు. ఇది నీకు న్యాయంగా ఉందా? ఈ రోజు పర్వదినం గదా అని సూర్యుణ్ణి పట్టుకోవడానికి వెళ్ళాను. అప్పటికే మరొకడెవరో సూర్యుణ్ణి పట్టుకున్నాడు” అని ముఖం ఎర్రగా కందగడ్డలాగా చేసుకున్నాడు.

రాహువు మాటలువిన్న ఇంద్రుడు బంగారుమాల ధరించి వెంటనే బయలుదేరి, కైలాసశిఖరం వంటి కాంతిగలదీ, నాలుగుదంతాలతో మదజలం విడుస్తున్నదీ, అలంకారాలతో అట్టహాసం చేస్తున్న, ఐరావతాన్ని ఎక్కి రాహువుని ముందు ఉంచుకొని, సూర్యుడు, హనుమంతుడు ఉన్న చోటకు వెళ్ళాడు. అప్పుడు రాహువు ఇంద్రుని దాటి వేగంగా ముందుకు వెళ్ళాడు. పర్వతశిఖరం వంటి రాహువు పరుగెత్తుకుంటూ తన వైపు వస్తూ ఉండటం హనుమంతుడు చూశాడు. అప్పుడు హనుమంతుడు సూర్యుణ్ణి విడిచి, రాహువునికూడా పండే అనుకొని రాహువుని పట్టుకునేందుకు ఎగిరాడు. సూర్యుణ్ణి వదలి తనమీదకు పరిగెత్తుకు వస్తున్న హనుమంతుణ్ణి చూసి రాహువు ముఖం కనిపించకుండా వెనక్కు తిరిగి కూర్చున్నాడు. భయంతో రక్షించమని ‘ఇంద్రా, ఇంద్రా’ అంటూ అరిచాడు. అంతట దేవేంద్రుడు రాహువుతో ‘నేను వీణ్ణి సంహరిస్తాను, భయపడకు’ అని అభయం ఇచ్చాడు. అప్పుడు హనుమంతుడు ఐరావతాన్ని

చూసి, ఇదికూడా ఏదో ఫలమే అయివుంటుందని దానిపైకి ఎగరబోయాడు, అప్పుడు హనుమంతుడి ముఖం సూర్యాగ్నుల తేజస్సుతో కాంతివంతంగా ప్రకాశించింది. అయినా ఇంద్రుడు హనుమంతునిపై కోపించక, వజ్రాయుధంతో చిన్నగా తాకించాడు. అప్పుడు ఇంద్రుని వజ్రపు దెబ్బకు హనుమంతుడు పర్వతంపై పడిపోయాడు. పడిపోయినప్పుడు ఎడమదౌడ ఎముక విరిగింది. ఇంద్రుడు తన పుత్రుడిపై వజ్రాయుధాన్ని ప్రయోగించడం వల్ల వాయువుకు కోపం వచ్చింది. తన కోపాన్ని ఇంద్రుడికి తెలియజెయ్యాలను కున్నాడు. అప్పుడు వాయుదేవుడు లోకాలన్నింటిలోనూ వాయువును స్తంభింపజేసి హనుమంతుణ్ణి తీసుకొని ఒక గుహలోకి పోయి కూర్చున్నాడు. దాంతో ప్రాణులన్నింటికీ మలమూత్ర స్థానాలన్నీ అడ్డగించబడ్డాయి, ఇంద్రుడు వర్షాన్ని నిరోధించినట్లు నిరోధించాడు. ప్రాణులన్నీ గాలి పీల్చలేక బాధపడ్డాయి. దేహాల్లో వాయుప్రసారం లేకపోవటం వలన కీళ్ళు అన్నీ పట్టుకుపోయాయి. శరీరాలన్నీ ఎండుకట్టెల్లా తయారయ్యాయి. వాయుప్రకోపం చేత స్వాధ్యాయం, వషత్కారం (దేవతలకిచ్చే హవిస్సు సమర్పించడం) ఆగిపోయాయి. ప్రాణులు పనులు చెయ్యలేకపోయాయి. ధర్మాచరణ కుంటుపడింది. ఈ విధంగా ముల్లోకాలూ నరకయాతన అనుభవించాయి.

అప్పుడు దేవతలు, అసురులు, మనుష్యులు దుఃఖితులై బ్రహ్మదేవుని దగ్గరకుపోయి ఇలా మొరపెట్టుకున్నారు. "ఓ బ్రహ్మదేవా! ఈ ప్రాణులన్నింటినీ నీవే సృజించావు, ఈ వాయువును ఆయుస్సుకు అధిపతిని చేశావు. ఈ వాయువు మా ప్రాణాలకు అధిపతియై, అంతఃపురంలో స్త్రీలను నిరోధించినట్లు మమ్మల్ని నిరోధించి నానాకష్టాలు పెడుతున్నాడు. మేమంతా వాయువుచేత బాధించబడ్డవాళ్ళం, నిన్ను శరణుకోరుతున్నాం. మా ప్రాణాల్ని కాపాడు." ప్రజాపతియైన బ్రహ్మదేవుడు వాళ్ళ మాటలన్నీ విని ఇలా అన్నాడు. "ప్రజలారా! వాయువుకి ఎందుకు కోపంవచ్చిందో చెప్తాను వినండి అన్నాడు. రాహువు మాటలువిని దేవేంద్రుడు వాయుపుత్రుడైన హనుమంతుణ్ణి కొట్టాడు. అందుకు వాయువుకు కోపం వచ్చింది. శరీరంలేని వాయువు శరీరాలన్నింటికీ ప్రభువై పాలిస్తూ ఉంటుంది. ఆ వాయువు లేని శరీరం కట్టే అయిపోతుంది. ఆ వాయువే సుఖం. ఆ వాయువు లేకుండా శరీరధారులు సుఖపడలేరు.

వాయువే ఆయుర్దాయం, ఇప్పటికే వాయువులేక ప్రాణులన్నీ కట్టెలైపోయాయి."

పిమ్మట బ్రహ్మదేవుడు దేవ, గంధర్వ, సర్ప, యక్షులందర్నీ వెంటబెట్టుకొని వాయువు ఉన్న చోటుకు వెళ్ళాడు. వాయువు ఒడిలో ఉన్న శిశువును చూసి బ్రహ్మ మొదలైన దేవతలంతా జాలిపడ్డారు.

# 36వ సర్గ దేవతలు హనుమంతునికి వరములివ్వడం

పిల్లవాడిని ఒడిలో పెట్టుకొని దుఃఖిస్తున్న వాయువు బ్రహ్మ మొదలైన దేవతల్ని చూడగానే, లేచి నిలబడి, బ్రహ్మకు మంత్రపూర్వకంగా ప్రదక్షిణం చేసి నమస్కరించాడు. వేదవిత్ అయిన బ్రహ్మదేవుడు వాయువును రెండుచేతులతో పైకి లేవనెత్తి శిశువును చేత్తో తాకి ఆశీర్వదించాడు. బ్రహ్మదేవుడి చెయ్యి తాకగానే శిశువు, నీరుపోసిన పైరువలె, తిరిగి ప్రాణంపోసుకున్నాడు. బాలునికి తిరిగి ప్రాణం రాగానే వాయువు సంతోషించి వెంటనే ప్రాణులన్నింటిలోనూ సంచరించటం ప్రారంభించాడు. తిరిగి వాయుప్రసారం జరగడంతో, ప్రాణుల్లోనూ శీతలము, వాతము తొలగిపోయాయి. పద్మములతో నిండిన పద్మ లతలవలె సంతోషించారు.

అంతట యశస్సు, వీర్యము; ఐశ్వర్యము, శోభ; జ్ఞానము వైరాగ్యములు గలవాడు, త్రిమూర్తు లలో శ్రేష్ఠుడు, దేవతలచేత పూజించబడేవాడైన బ్రహ్మదేవుడు వాయుదేవుణ్ణి సంతోషపెట్టాలని అనుకున్నాడు. దేవతలతో ఇలా అన్నాడు: "ఓ మహేంద్రా! అగ్నీ! వరుణుడా! మహేశ్వరా! కుబేరుడా! మీకు తెలిసిన విషయమే అయినా మళ్ళీ చెప్తున్నాను వినండి.

ఈ శిశువు కారణజన్ముడు. దేవతలు అనేక కార్యాలు ఇతని వలన సాధించుకోవలసి ఉంది. అంతేకాకుండా ఈ వాయుదేవుణ్ణి కూడా సంతోషపెట్టేందుకు మీరందరూ ఈ శిశువుకు వరాలు ఇవ్వండి" అన్నాడు.

అంతట దేవేంద్రుడు ఆనందంతో బంగారుమాలను ఇస్తూ ఇలా అన్నాడు. "ఇతని దౌడ నాచే ప్రయోగించబడిన వజ్రంచేత కొట్టబడింది. కాబట్టి ఈ వానరశేష్ఠుడు 'హనుమంతుడు' అని ప్రసిద్ధి చెందుతాడు. ఇకపై ఇతడు వజ్రాయుధంచేత చంపబడడు" అని వరం ఇస్తున్నాను" అని అన్నాడు.

ముల్లోకాలకు పూజ్యుడు, చీకట్లను హరించేవాడైన సూర్యభగవానుడు ఇలా అన్నాడు.

“నేను నాతేజస్సులోని నూరవవంతు ఇతడికి ప్రసాదిస్తున్నాను. ఇతడు విద్యాభ్యాసంచేసే వయస్సురాగానే, నేనే ఇతడికి శాస్త్రాలన్నీ నేర్పుతాను. శాస్త్రజ్ఞానంలో ఇతడిని మించినవాడు ముల్లోకాలు వెదికినా దొరకడు. ఆ కారణన ఇతడు మాటలలో బహునేర్పరి కాగలడు” అని వరం ఇచ్చాడు.

అంతట వరుణుడు ఇలా అన్నాడు. “పదిలక్షల సంవత్సరాలకు కూడా నా పాశము (వరుణపాశము) చేతగాని, జలంచేతగాని, ఇతనికి మృత్యువు సంభవించదు.” అని వరం ఇచ్చాడు. అంతట యముడు సంతోషించి ఇలా అన్నాడు” ఇతనికి యమదండముచేత మరణం సంభవించదు. యుద్ధాల్లో దిగులు చెందడు, రోగాలు, రొప్పులు ఇతణ్ణి బాధించవు” అని వరం ఇస్తున్నాను అన్నాడు. అంతట కుబేరుడు ఇలా అన్నాడు. “నా గద వలన ఇతడు యుద్ధాల్లో మరణించడు” అని ఒక కన్నుపచ్చగా గల కుబేరుడు వరమిచ్చాడు. అంతట శివభగవానుడుకూడా “ఇతడు నా ఆయుధములచేతగానీ, నా చేతగానీ చంపబడడు” అని వరం ఇచ్చాడు. శిల్పులలో శ్రేష్ఠుడు, గొప్ప బుద్ధిబలం గలవాడైన విశ్వకర్మ ఇలా అన్నాడు “నేను తయారుచేసిన అస్త్రములచేతగాని, ఇతరములైన దివ్యాస్త్రములచేతగాని ఇతడు చంపబడడు. ఇతడు దీర్ఘాయుష్మంతుడై చిరకాలము జీవిస్తాడు” అని వరం ఇచ్చాడు. అంతట బ్రహ్మదేవుడు కూడా, “ఇతడు బ్రహ్మదండములవలనా చంపబడడు” అని వరం ఇచ్చాడు.

ఈ విధంగా దేవతలంతా తలో వరం ఇచ్చి ఆ బాలహనుమంతుణ్ణి దీవిస్తూవుంటే బ్రహ్మ చాలా సంతోషించి వాయుదేవుడితో ఇలా అన్నాడు. “ఓ వాయూ! ఈ హనుమంతుడు శత్రుభయంకరుడవుతాడు. మిత్రుల్ని, శరణార్థుల్ని అభయమిచ్చి కాపాడుతాడు. ఇతడు ఆకాశంలో ఎగర గలిగేవాళ్ళలో శ్రేష్ఠుడు అవుతాడు. తనకు ఇష్టము వచ్చిన రూపాల్ని ధరించగలడు, ఇష్టానుసారం సంచరిస్తాడు; ఇష్టానుసారం వెళ్ళగలడు. అతడి దారిని ఎవరూ అడ్డగించలేరు. కీర్తిమంతుడవుతాడు. ఇతడు యుద్ధంలో రావణుని వినాశనానికి మూలకారకుడవుతాడు. రామకార్యం ఇతనివల్లనే సిద్ధిస్తుంది. రాముడికి ఆనందాన్ని కలిగిస్తాడు,

ఆశ్చర్యకరమైన పనులు ఎన్నో చేస్తాడు.

బ్రహ్మమొదలైన దేవతలంతా హనుమంతునికి అనేక వరాలనిచ్చి, వాయువువద్ద అనుమతిపొంది వారి గృహాలకు వెళ్ళిపోయారు. అంతట వాయువు ఆ శిశువును అంజనాదేవికి ఒప్పగించి, హనుమంతుడు పొందిన వరములగూర్చి ఆమెకుచెప్పి వెళ్ళిపోయాడు. క్రమంగా హనుమంతుడు పెరిగి పెద్దవాడై బాల్యచాపల్యం చేత మహర్షుల ఆశ్రమాలకు పోయి అగ్నిహోత్రాలను ఆర్పివేయడం, నారబట్టల్ని చింపడం, యజ్ఞపాత్రల్ని పగులకొట్టటం వంటి అల్లరి చిల్లర పనులుచేస్తూ మహర్షుల కోపానికి గురి అవుతూ ఉండేవాడు. కేసరి, అంజనాదేవి, వాయువు ఎంతగా వారించినా ప్రయోజనం ఉండేది కాదు. అతడి అల్లరిని ఆపలేకపోయారు. అతడికి ఉండే వరాల బలంచేత మహర్షులుకూడా అశక్తులైపోయారు. ఇట్లా ఉండగా ఒకానొకరోజున మిక్కిలి వ్యధ చెందిన భృంగ్వంగిరస వంశీయులైన ఋషులు కోపించి ఇలా శాపం పెట్టారు. "ఓ వానరా! నువ్వు ఏ బలం చూసుకొని మమ్మల్నందరినీ బాధిస్తున్నావో ఆ బలం నీవు మరచిపోతావు. మా శాపంవల్ల నీ బలం నీకే తెలియకుండా పోతుంది. నీ కీర్తిని ఎవరైనా స్తుతించినప్పుడు, నీ బలాన్ని గూర్చి నీకు గుర్తుచేసినట్లయితే అప్పుడు మళ్ళీ నీవు నీ పూర్వపు బలాన్ని పొందుతావు. నీ వరాలన్నీ ప్రభావితం అవుతాయి" అని శాపం పెట్టారు.

(వివరణ: దక్షిణ సముద్రతీరంలో జాంబవంతుడు హనుమంతుని బలాన్ని గూర్చి గుర్తు చేసిన తర్వాత ఈ శాపవిమోచనం అయింది.)

ఆ మహర్షుల శాపం వలన హనుమంతునిలోని తేజస్సు బలం, వేగం అణిగిపోయినాయి. అమాయకత్వంతోను, మెతకదనంతోనూ, ఆశ్రమ జీవితమే గడిపేవాడు. సూర్యునితో సమానమైన తేజస్సు గలిగిన 'ఋక్షరజసు' డనే రాజు ఉండేవాడు. ఇతడే వాలిసుగ్రీవుల తండ్రి. ఆ రాజు మరణానంతరం అతడి మంత్రులు వాలిని రాజుగా రాజ్యాభిషేకం చేశారు. సుగ్రీవుణ్ణి యువరాజును చేశారు. బాల్యం నుండీ వాలి సుగ్రీవులు, వాయువు అగ్నివలె ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. వాలిసుగ్రీవులకు వైరం వచ్చినప్పుడు ఈ హనుమంతుడు సుగ్రీవునికి మంత్రిగా

ఉండేవాడు. అప్పుడు కూడా శాపంమూలంగా అతడి బలం గూర్చి అతడికే తెలియకుండా పోయింది. అందువల్లనే హనుమంతుడు, ఏనుగుచే బంధించబడిన సింహంవలె వాలిసుగ్రీవుల యుద్ధంలో సుగ్రీవుడితో కలసి యుద్ధం చెయ్యలేదు.

హనుమంతుడు వ్యాకరణాన్ని సూర్యుని వద్ద అభ్యసించాడు. ఇతడు ఒకపెద్ద గ్రంథాన్ని చేతపుచ్చుకొని ఉదయాద్రిపై ఒక కాలు, అస్తాద్రిపై మరొక కాలు ఉంచి సూర్యుడికి అభిముఖంగా నిలచి సూర్యునినుండి వ్యాకరణం, శాస్త్రాలు నేర్చుకునేవాడు. అట్లా నేర్చుకుంటూ వ్యాకరణానికి సూత్రాలు, వ్యాఖ్యలు, వార్తికములు, సంగ్రహాలతో కూడిన మహాభాష్యాన్ని రచించాడు. శాస్త్ర పాండిత్యంలోను, చంధశ్శాస్త్రంలోను హనుమంతునితో సమానమైనవాడు మరొకడు లేదు. ఇతడు సకల విద్యలలోను, తపస్సులోను బృహస్పతితో సమానమైనవాడు. తొమ్మిది వ్యాకరణాలు తెలిసిన ఈ హనుమంతుడు వచ్చే కల్పంలో నీ అనుగ్రహంవల్ల (రాముని అనుగ్రహంవల్ల) బహ్మదేవుడు కాగలడు. ఈ హనుమంతుడు భూమిని ముంచెత్తగలిగిన సముద్రుడంతటివాడు; లోకాలన్నింటినీ కాల్చివేయగల అగ్నివంటివాడు; ప్రళయకాల యమునివంటివాడు. ఇతడి ఎదురుగా ఎవరూ నిలబడలేరు. పరాక్రమము, ఉత్సాహము, బుద్ధి, ప్రతాపము, మంచిస్వభావము, మాధుర్యము, నీతి, అవినీతుల్ని విడదీసి చెప్పగల విచక్షణాజ్ఞానం, గాంభీర్యం, నేర్పు, బలం, ధైర్యం అనే గుణాలు కలిగి ఉండేవాడు, హనుమంతుడికంటే గొప్పవాడు ఈ లోకంలో లేనేలేదు.

ఓ రామా! హనుమంతుని వలెనే సుగ్రీవుడు, మైందుడు, నీలుడు, తారుడు, అంగదుడు, నలుడు, రంభుడు, ఇంకా అనేకమంది వానరశ్రేష్ఠులు నీకు సహాయం చెయ్యడం కోసమే దేవతలు సృష్టించారు. ఓ జగత్ప్రభూ! రామా! గజ, గవాక్ష, గవయ, సుదంష్ట్ర, మైంద, జ్యోతిముఖ, నలులనే భల్లూకనాయకులు, వానరనాయకులు, నీకొరకే సృష్టించ బడ్డారు" అని అగస్త్యుడు చెప్పాడు. అగస్త్యమహర్షి చెప్పిన విషయాలన్నీ విన్న రామలక్ష్మణ, వానర, రాక్షసులంతా ఆశ్చర్యపోయారు. పిదప రాముడు అంజలిఘటించి అగస్త్యమహర్షితో ఇలా

అన్నాడు.

"ఓ బ్రహ్మర్షీ! నేడు నీ రాకవలన దేవతలు, పితృదేవతలు, ప్రపితామహులు నా విషయంలో సంతోషించారు. మేమంతా కూడా మీ దర్శన భాగ్యంచేత ధన్యులమయ్యాం. నేను ఈనాడు మిమ్మల్నందరినీ ఒక కోరిక కోరుతున్నాను. నాయందు దయవుంచి నన్ను అనుగ్రహించమని ప్రార్థిస్తున్నాను. రాజకార్యాలన్నీ ఆయా ఉద్యోగులకు అప్పగించి, యజ్ఞాయాగాది క్రతువులను చేస్తాను. తపస్సుచేసి పాపాలన్నీ ప్రక్షాళన చేసుకొని మిమ్మల్ని ఆశ్రయిస్తాను. మీరందరూ దయచేసి ఆయా సమయాల్లో వస్తూ ఉండాలి. దగ్గరుండి ఆ క్రతువుల్ని జరిపిస్తూ ఉండాలి" అని ప్రార్థించాడు. రాముని మాటలు విన్న ఋషులు "అట్లేఅగుగాక" అని ఆశీర్వదించి తిరిగి వెళ్ళిపోయారు. అంతట సూర్యాస్తమయం అయింది. రాముడు సభ్యులందరినీ విడిదికి పంపివేసి, తాను సంధ్యోపాసన ముగించుకొని, పిమ్మట అంతఃపురానికి వెళ్ళాడు.

# 37వ సర్గ రాముడు రాజసభను అలంకరించటం

ధార్మిక ప్రవృత్తిగల రాముడు రాజ్యాభిషిక్తుడు కాగా, దేశప్రజలంతా సంతోషంతో ఆ రాత్రియంతా పగల్లాగానే గడిపేశారు. తెల్లవారు జామునే సౌమ్యులైన స్తోత్రపాఠకులు రాజును మేలుకొల్పటానికి అంతఃపురానికి వచ్చారు. యథావిధిగా రాజును స్తుతించారు.

"కౌసల్యకు ఆనందాన్ని కలిగించేవాడా! వీరుడా! సౌమ్యుడా! ఓ రామా! మేల్కొనుము. ఓ రాజా! నీవు నిద్రపోతే జగత్తు అంతా నిద్రపోతుందిగదా! నీ పరాక్రమం విష్ణుభగవానుని పరాక్రమం వంటిది. నీ రూపం అశ్వినీదేవతలవంటిది. బుద్ధిబలంలో నీవు బృహస్పతితో సమానుడవు, ప్రజాపతి వంటివాడవు. ఓర్పుయందు భూదేవితో సమానమైనవాడవు. వేగానికి నీవు వాయువుతో సమానుడవు. తేజస్సులో సూర్యుడంతటివాడవు, గాంభీర్యంలో సముద్రం అంతటివాడవు, నీవు శివభగవానుడంతటి స్థిరత్వం గలవాడవు. చంద్రుడంతటి సౌమ్యుడవు. ఓ మహారాజా! నీ వంటివారు పూర్వం లేరు; ఇకముందు కూడా ఉండబోరు. నీ అంతటివాడవు నీవే సుమా! నీవు ఎదిరించటానికి శక్యం కానివాడవు. ఓ పురుషశ్రేష్ఠా! నిన్ను కీర్తి, లక్ష్మి ఎన్నడూ విడిచిపెట్టవు. లక్ష్మి, ధర్మం నీ యందు స్థిరంగా ఉంటాయి" అంటూ స్తుతించారు.

పిమ్మట వందిమాగధాదులు కూడా వచ్చి ఉత్తమమైన స్తుతులతో రాముని మేల్కొలిపారు. అంతట రాముడు, శ్రీమన్నారాయణుడు ఆదిశేషునిపై నుండి లేచినట్లు, తెల్లటి వస్త్రాలతో కప్పబడిన శయనంపై నుండి లేచాడు. రాముడు అట్లా లేచి నిలబడగానే సేవకులు దోసిలొగ్గి నమస్కరిస్తూ శుభ్రమైన పాత్రలలో జలాన్ని తీసుకొనివచ్చారు, రాముడు స్నానాది కార్యాలు పూర్తిచేసుకొని అగ్నిహోమం చేశాడు. పిమ్మట ఇక్ష్వాకువంశపు రాజులంతా సేవిస్తూవచ్చిన దేవతాగృహానికి వెళ్ళాడు. దేవతల్ని, పితృదేవతల్ని, బ్రాహ్మణులను యథావిధిగా పూజించి రాజసభకు వచ్చాడు. అప్పుడు ప్రజ్వరిల్లే అగ్నిహోత్రం వంటి వసిష్ఠాది పురోహితులు, మహాత్ములైన మంత్రులు ఆదరంతో దగ్గరకు వచ్చి నిలబడ్డారు. దేశ దేశాలనుండి వచ్చిన

రాజులు, క్షత్రియులంతా, ఇంద్రుని ప్రక్కన కూర్చున్న దేవతల్లాగా, వచ్చి ప్రక్కన కూర్చున్నారు.

అప్పుడిక్కడ భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు, మూడువేదాలు యజ్ఞాన్ని ఉపాసించినట్లు రాముణ్ణి ఉపాసించారు. సేవకులంతా చేతులుకట్టి నమస్కరించి, వికసించిన ముఖాలతో అల్లంత దూరాన నిలబడ్డారు. గొప్ప పరాక్రమం, తేజస్సుగల, స్వేచ్ఛగా రూపాలు ధరించగలిగిన సుగ్రీవుడు మొదలైన వారంతా రామునికి దగ్గరగావచ్చి కూర్చున్నారు. విభీషణుడు కూడా తన నలుగురు రాక్షసమంత్రులతో వచ్చి, యక్షుడు కుబేరుడి దగ్గర కూర్చున్నట్లు కూర్చున్నాడు. దేవేంద్రుడి చుట్టూ ఋషులు ఉన్నట్లు, రాముని చుట్టూ తేజోవంతులైన ఋషులు, పరాక్రమవంతులైన రాజులు, మహాబలశాలులైన వానర భల్లూకాలు, రాక్షసులు కూర్చున్నారు. అప్పుడు రాముడు దేవేంద్రుడివలె శోభించాడు. వాళ్ళంతా ఆవిధంగా సమావేశమై ఉండగా, మహాత్ములైన పండితులు ధర్మప్రబోధకాలైన కథలూ, సూక్తులు వినిపించారు.

(వివరణ: అగస్త్యుడు రామునికి వాలి సుగ్రీవాది వృత్తాంతాల్ని చెప్పి వెళ్ళిపోయినట్లు పైన 36వ సర్గలోనే పేర్కొన్నాం. అయినా ఇక్కడ ప్రక్షిప్త సర్గలని మరో అయిదు సర్గములు ప్రస్తావించడం అసంగతమని, అవి ప్రక్షిప్త సర్గములు అనీ వ్యాఖ్యా త్రయంతో ప్రకటించిన రామాయణ సంపాదకులు అన్నారు. ఏమైనా, పాఠకులు తెలుసుకోదగిన విషయాలే గదా అని ఇక్కడ పొందు పరుస్తున్నాం. ఇట్లాగే 23వ సర్గం తర్వాత కూడా అయిదు ప్రక్షిప్త సర్గల్ని ఇదే స్ఫూర్తితో తెలియజేశాం.)

–వ్యాఖాత

ఉత్తరకాండం – ప్రక్షిప్త సర్గము – 1

వాలిసుగ్రీవుల పుట్టుక

రాముడు అగస్త్య మహర్షిని ఇలా అడిగాడు. “ఓ మహర్షీ! వాలిసుగ్రీవుల తండ్రి

ఋక్షరజస్సు అని చెప్పావేకానీ, వారి తల్లి ఎవరో చెప్పలేదు. మాకు ఆమెనుగూర్చి కూడా తెలుసుకోవాలని ఉంది" అని అన్నాడు. "ఓ రామా! ఒకానొకనాడు లోకసంచారం చేస్తూ నారదుడు నా ఆశ్రమానికి వచ్చాడు. ఆ మహర్షికి అర్ఘ్యపాద్యాదులిచ్చి సత్కరించి పూజించాను. ఇప్పుడు నీవు అడిగిన ప్రశ్ననే నేను అడుగగా నారదుడు నాకు చెప్పిన కథను ఇప్పుడు నీకు చెప్తున్నాను విను.

శోభాయుక్తము, మంగళప్రదము, పర్వతశ్రేష్ఠమైన మేరుపర్వతం పైన నూరుయోజనాల విస్తారం కలిగిన బ్రహ్మదేవుని దివ్యసభ వుంది. చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడు ప్రతిరోజూ ఆ ప్రదేశంలో సభ జరిపేవాడు. అందుకే అది దివ్యసభ. ఒకానొక రోజున బ్రహ్మదేవుడు యోగాభ్యాసం చేస్తూ ఉండగా అతడి నేత్రాలనుండి కన్నీరు స్రవించింది. ఆ దేవదేవుడు ఆ కన్నీటిని చేత్తో గ్రహించి నేలపై ఉంచాడు. ఆ కన్నీటిబొట్టు నుండి ఓ వానరుడు పుట్టాడట. అప్పుడు బ్రహ్మ ఆ వానరాన్ని ముద్దుమాటల్తో బుజ్జగిస్తూ ఇలా అన్నాడట. 'ఓ వానరా! ఈ పర్వతంపైన ఎప్పుడూ దేవతలు విహరిస్తూ ఉంటారు. ఇక్కడ వృక్షాలన్నింటికీ మధురమైన ఫలపుష్పాలు సమృద్ధిగా కాస్తూ ఉంటాయి. మధురమైన తేనెలు చిలుకుతూ ఉంటాయి. నీవు వాటిని తింటూ సుఖంగా ఇక్కడే ఉండు. అటుపిమ్మట నీకు శ్రేయస్సు కలుగుతుంది."

బ్రహ్మదేవుడు చెప్పినట్లుగానే, ఆ వానరుడు పగలంతా ఆ పర్వతంపై లభించే ఫలపుష్పాలన్నీ తింటూ, తేనెలు త్రాగుతూ, సాయంత్రానికల్లా రకరకాలైన పుష్పాలు సేకరించుకొచ్చి బ్రహ్మదేవుని పాదాలవద్ద ఉంచి నమస్కరించి వెళ్తూ ఉండేవాడు. కొంతకాలానికి, ఒక రోజున దప్పికచేత ఆ వానరుడు శిఖరంపైనున్న ఒక సరస్సును చూశాడు. వెంటనే అక్కడకు పోయి నీరు త్రాగేందుకు తల వంచగానే నీటిలో తన ప్రతిబింబాన్నే చూశాడు. ఇతడు ఎవరో నాకు శత్రువు. ఈ నీటి మడుగులో దాక్కున్నాడన్న భ్రాంతి కలిగింది. ఇతడు తన్ను తుదముట్టించటానికే వచ్చాడని తలచి, సహజమైన కోతి స్వభావంచేత ఆ మడుగులోకి దూకాడు. పిమ్మట ఆ వానరుడు ఆ మడుగునుండి బయటకు వచ్చాడు. ఆ క్షణంలోనే ఆ

వానరుడు ఒక స్త్రీగా మారిపోయాడు. ఆ స్త్రీరూపం మనోహరంగా ఉందట. ఆ లావణ్యవతి జఘనము విస్తరించి ఉంది; కనుబొమ్మలు అందంగా ఉన్నాయి; కేశములు నల్లగా ఉండి ముంగురులు ముఖాన వ్రేలాడాయి. ముఖం చిరునవ్వులు చిందించింది, స్తనములు బలిసివున్నాయి.

ఆ త్రిలోకసుందరి, మనోహరంగా ఉండి అందరి మనస్సు హరించి ఆకట్టుకొనేటట్టు ఉంది. చేతిలో పద్మంవుంటే లక్ష్మీదేవి అనుకునేవాళ్ళు; చేతిలో వీణవుంటే సరస్వతీదేవి అనుకునేవాళ్ళు; సాక్షాత్తూ పార్వతీదేవీవలె ఉంది.

ఇంతలో దేవేంద్రుడు బ్రహ్మదేవుని సేవించుకొని ఆ దారినేపోతూ ఈ సుందరాంగిని చూశాడు. ఆమె కూడా దేవేంద్రుణ్ణి చూసింది, పరస్పరం చూపులు కలిశాయి. ఇద్దరూ మన్మథవశులయ్యారు. ఆ క్షణంలోనే వారు దేహమందు సర్పమువలె క్షోభచెందారు. ఇంద్రుడు తన నిగ్రహాన్ని కోల్పోయి స్కలించాడు, అప్పుడా దేవేంద్రుని వీర్యము ఆమె శీలులపై (తల వెంట్రుకలు) పడింది. అప్పుడు ఆ దేవతాస్త్రీ దేవేంద్రుని అమోఘమైన వీర్యాన్నుండి వానర యోధుడు జన్మించాడు. రేతస్సు వాలమందు (తల వెంట్రుకపై) పడుటచేత అతడు వాలి అయ్యాడు. అప్పుడే సూర్యభగవానుడు కూడా తన కర్తవ్యాన్ని ఆచరిస్తూ ఆ స్త్రీమూర్తిని చూసి మన్మథపరవశుడై తన రేతస్సును ఆమె కంఠంపైన విడిచాడు. అట్లా ఆమె కంఠంపైన విడిచిన రేతస్సు వలన సుగ్రీవుడు జన్మించాడు. వీరిద్దరూ మహాబలశాలురైన వానర నాయకులు, ఇంద్రుడు మహిమాత్మకమైన బంగారు గొలుసును ఆ బాలుని మెడలో వేసి స్వర్గానికి వెళ్ళిపోయాడు. పిమ్మట సూర్యభగవానుడు హనుమంతుణ్ణి తన కుమారుడు సుగ్రీవునికి స్నేహితునిగాచేసి తన విధులు నిర్వర్తించేందుకు ఆకాశంలో ముందుకు సాగిపోయాడు.

రామా! ఆ రాత్రి గడిచి మర్నాడు సూర్యోదయం కాగానే ఋక్షరజస్సు మళ్ళీ వానరరూపాన్ని పొందాడు. అతడు తిరిగి వానర రూపం పొందగానే, పచ్చనికళ్ళు, స్వేచ్ఛారూపం పొందగలగేవాళ్ళు మహాబలవంతులైన వానర పుత్రుల్ని చూసుకున్నాడు. అప్పుడు

వాళ్ళిద్దరిచేత అమృతంవంటి తేనెలు త్రాగించి, బ్రహ్మదేవుని వద్దకు తీసుకొని వెళ్ళాడు. ముల్లోకాలకూ పితామహుడైన బ్రహ్మ, తన కుమారుడు ఋక్షరజస్సును పరిపరివిధాలా ఓదార్చాడు. అప్పుడు బ్రహ్మ దూతను పిలిచి ఇలా అన్నాడు.

"ఓ దేవదూతా! నువ్వు ఋక్షరజస్సును, ఈ పిల్లలిద్దర్నీ తీసుకొని కిష్కింధాపురానికి వెళ్ళు. ఆ నగరాన్ని నేను నిర్మించమని అడిగితే విశ్వకర్మ నిర్మించాడు. ఆ నగరం అతి పవిత్రమైనది, చాలా అందంగా నిర్మించాడు. అక్కడ నాలుగు వర్ణాలవాళ్ళు సుఖంగా జీవించవచ్చు. కామరూపులు, మహాబలశాలురుయైన అనేకమంది వానరశ్రేష్ఠులు నివసిస్తున్నారు. బయటి వాళ్ళెవరూ ఆ నగరంలోకి ప్రవేశించలేరు, ఆ కిష్కింధాపురం నిండా అనేక రకాలైన రత్నాలు ధనరాసులు ఉన్నాయి.

నీవు ఈ ఋక్షరజస్సును, అతడి ఇద్దరు పుత్రుల్ని తీసుకొని కిష్కింధకు వెళ్ళు. వానర యూథనాయకుల్ని, సామాన్యవానరాలను పిలిచి సమావేశం ఏర్పాటుచెయ్యి. ఇతణ్ణి సింహాసనంపైన కూర్చోబెట్టి రాజ్యాభిషేకం చెయ్యి. వాళ్ళందరితోను నేను చెప్పానని చెప్పు. ధీరుడైన ఈ ఋక్షరజస్సుకు విధేయులై నడచుకోమని నా మాటగా చెప్పు."

అప్పుడా దేవదూత వాయువేగంతో కిష్కింధానగరానికి వెళ్ళాడు. బ్రహ్మదేవుని ఆదేశం ప్రకారం ఋక్షరజస్సును రాజోచిత వస్త్రములు, కిరీటము ధరింపచేసి రాజుగా అభిషిక్తుణ్ణి చేశాడు. అప్పటి నుండి ఆ వానరశ్రేష్ఠుడు ఏడు సముద్రాల మధ్యనున్న భూమండలంపై నివసించే వానరులందరికీ రాజై పరిపాలించాడు. ఈ కథను శ్రవణం చేసిన వారికి వినిపించిన వారికీ కూడా సకల శుభములు చేకూరుతాయి.

"ఓ రామా! ఈ విధంగా వాలి సుగ్రీవులకు తల్లీ, తండ్రీ కూడా అతడే అయ్యాడు. నీవు కోరిన విషయాన్నంతా చెప్పి నీ సందేహాన్ని తీర్చాను. ఓ రామా! నీకు రాక్షసుల ఉత్పత్తి, వానరుల ఉత్పత్తి చెప్పాను" అని అగస్త్యమహర్షి అన్నాడు.

ఉత్తరకాండం – ప్రక్షిప్త సర్గము – 2

“అతి పురాతనమైనది, అతి ఆశ్చర్యం కలిగించేదైన కథను నీ అనుగ్రంవల్ల విన్నాను. ఓ బ్రహ్మర్షీ! దేవతలలో మహాబలశాలురైన ఇంద్ర, సూర్యులు వానరులుగా పుట్టడం ఎంతో ఆశ్చర్యంగా ఉంది. ఓ మునిశ్రేష్ఠుడా! బ్రాహ్మణోత్తమా! వాలిసుగ్రీవుల ఈ దివ్యమైన జన్మ ఎట్లాంటిదా అని అనుకుంటూ ఉండేవాణ్ణి. నీ అనుగ్రహంచేత తెలుసుకోగలిగాను” అన్నాడు రాముడు. అప్పుడు అగస్త్యమహర్షి ఇలా చెప్పాడు: “ఓ రామా! అతిప్రాచీనమైనది, అత్యంత ఆశ్చర్యాన్ని కలిగించేదైన మరొక కథ చెప్తాను. విను.”

“పూర్వం కృతయుగంలో రాక్షసరాజైన రావణుడు, బ్రహ్మదేవుని కుమారుడైన సనత్కుమారుడు ఒకచోట కూర్చుని ఉండటం చూశాడు. అప్పుడా రావణుడు ఆ మహర్షికి అంజలి ఘటించి నమస్కరించాడు, ప్రజ్వలిస్తున్న అగ్నివలె తేజస్సుగలవాడు, సత్యాన్నే పలికేవాడైన ఆ సనత్కుమారుణ్ణి ఇలా అడిగాడు.

“ఓ పూజ్యుడా! మహామునీ! నీకు ముల్లోకాల్లోని అన్ని విషయాలు తెలుసు. ప్రతి రోజు బ్రాహ్మణులు ఎవరిని పూజిస్తూ ఉంటారు? యోగులైన వారంతా ఎవరిని ధ్యానిస్తూ ఉంటారు? లోకంలో దేవతలు ఎవరిని ఆశ్రయించి యుద్ధంలో శత్రువుల్ని జయిస్తున్నారు? దేవతలందర్లోకి అత్యధికమైన బలశాలి ఎవరు?” అని ఎంతో వినయంగా అడిగాడు. అందుకు మహాతపశ్శాలియైన ఆ సనత్కుమారుడు ధ్యానదృష్టితోచూసి రావణుని మనస్సులోని ఆలోచనలు ఏమిటో తెలుసుకున్నాడు. పిమ్మట ఇలా అన్నాడు.

“నాయనా! శ్రీమహావిష్ణువు జగత్తు కంతటికీ ప్రభువు, ఆయన పుట్టుకయే లేనివాడు. అందువలన ఆయన పుట్టుకగూర్చి ఎవరికీ తెలియదు. ఆయన సర్వసమర్థుడు, ప్రళయ జలాలపైనే నిద్రిస్తూ ఉంటాడు. సకలపాపాలను హరించేవాడు. బ్రహ్మ ఆయన నాభికమలంనుండే జన్మించాడు. ఆట్టి శ్రీమహావిష్ణువే సకల స్థావరజంగమాలను

సృష్టించినవాడూ, సకల జగత్తుకూ అధిపతి, అటువంటి శ్రీహరిని ఆశ్రయించి యజ్ఞాలు చేసిన పండితులు అనేకమంది స్వర్గాన్ని పొందారు. దేవత్వాన్ని పొంది అమృతపానం చేశారు. అటువంటి వారంతా శ్రీమహావిష్ణువునే పూజిస్తూ ఉంటారు. పురాణ, వేద, పాంచరాత్ర, ఆగమాలన్నింటిలోనూ చెప్పిన విధంగా జనులందరూ ఈ విష్ణువునే పూజిస్తారు. నిత్యమూ యోగులు ఈయననే ధ్యానిస్తారు, యజ్ఞములచేత పూజిస్తారు, దైత్యదానవులు, మొదలైన దేవతాశత్రువులందర్నీ శ్రీమహావిష్ణువే యుద్ధంలో జయిస్తాడు. అందరిచేత పూజలందుకునేదీ ఆ శ్రీమహావిష్ణువే" అని చెప్పాడు. ఆ మహర్షి చెప్పిన మాటల్ని విన్న రావణుడు వినయంతో మరలా ఇలా అడిగాడు. "ఓ మహానుభావా! యుద్ధంలో శ్రీమహావిష్ణువుచేత చంపబడినవాళ్ళకు ఎటువంటి గతులు కలుగుతాయి? ఈ దైత్య, దానవ, రాక్షసులంతా ఎటువంటి గతుల్ని పొందుతారు?" అని అడిగాడు. "ఓ రావణా! దేవతలచేత చంపబడ్డ వాళ్ళంతా తప్పకుండా స్వర్గానికే వెళ్తారు. వాళ్ళు మళ్లీ భ్రష్టులై స్వర్గాన్నుండి భూలోకంలో జన్మిస్తారు. అంటే వారి పాపపుణ్యాల ఫలాన్ని బట్టి పుడుతూ ఉంటారు; చస్తూ ఉంటారు. అదే చక్రధారియైన శ్రీమహావిష్ణువు చేతిలో మరణించినవారందరూ విష్ణుపదమైన వైకుంఠానికి వెళ్తారు. అంటే శ్రీహరి కోపంకూడా వరంతో సమానమే" అని చెప్పాడు.

అప్పుడు రావణుడు సనత్కుమారుడు చెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు. చాలా ఆశ్చర్యపోయాడు, వెంటనే సంతోషంతో పొంగిపోయాడు. ఇక శ్రీహరితో యుద్ధం ఎట్లా చెయ్యటమా? అని తీవ్రంగా ఆలోచించాడు.

ఉత్తరకాండం – ప్రక్షిప్త సర్గము – 3

లక్ష్మీనారాయణులే సీతారాములుగా జన్మించడం

దుర్మార్గుడైన రావణుడు ఇట్లా ఆలోచనల్లో మునిగి ఉండటం చూసి సనత్కుమారుడే మళ్ళీ ఇలా అన్నాడు. "ఓ మహాబాహూ! నీవు ఏం ఊహించుకుని మురిసిపోతున్నావో నాకు

తెలుసు. కొద్దికాలం ఓపికపట్టు, నువ్వు కోరుకున్న వారితో యుద్ధం చేస్తావు. నీ కోరిక నెరవేరుతుంది'' అని అన్నాడు.

అందుకు రావణుడు సంతోషిస్తూ, ''ఓ మహర్షీ! పోనీ ఆ శ్రీమహావిష్ణువు లక్షణాలేమిటో నాకు చెప్పు'' అని అడిగాడు. అందుకు ఆ మునిశ్రేష్ఠుడు ఇలా అన్నాడు. ''ఓ రాక్షసశ్రేష్ఠుడా! నీవు అడిగిందంతా చెప్తాను విను. శ్రీమహావిష్ణువు అంతటా ఉన్నాడు. బహుసూక్ష్మంగా ఉంటాడు. ఇంద్రియాలకు కనిపించేవాడు కాదు, అతిప్రాచీనుడు. ముల్లోకాల్లోని స్థావర జంగమాలన్నింటిలోనూ వ్యాపించి ఉన్నాడు. శ్రీమహావిష్ణువు లేని చోటు అంటూ ఉంటుందా? భూమి, పాతాళం, స్వర్గం, పర్వతాలు, అడవులు, నదులు, నగరాలు, ఒకటేమిటి సర్వత్రా వ్యాపించి ఉంటాడు.

అతడే ఓంకార స్వరూపుడు, సత్యస్వరూపుడు, భూమి, ఆకాశం అతడే. భూమిపైన ఉండే పర్వతాలు, భూమిని మోసే ఆదిశేషుడూ అతడే. పగలు, రాత్రి, రెండు సంధ్యలు, సూర్యచంద్రులు, యముడు, కాలము, వాయువు, అగ్ని, బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, ఉదకం, సర్వస్వమూ అతడే.

వినాశములేనివాడు, లోకాలన్నింటికీ ప్రభువు, అతి ప్రాచీనుడైన ఈ విష్ణువు ఒక్కడే సంసార దుఃఖాలనుండి తప్పించగలవాడు. లోకాలన్నింటిని సృష్టించి, పోషించి, ఉపసంహరించుకొనేవాడు. ఇదంతా అతడికి ఒక క్రీడ. ఓ రావణా! ఒకమాటలో చెప్పాలంటే ముల్లోకాల్లోను, కదిలే ప్రాణుల్లోను, కదలని ప్రాణుల్లోను, సమస్త ప్రకృతి సముదాయంలోనూ విష్ణువే వ్యాపించి ఉన్నాడు.

కింజిల్కములవలె అరుణ వస్త్రాల్ని ధరిస్తాడు. నీలమేఘశ్యాముడైన ఆ శ్రీమహావిష్ణువు వర్షాకాలంలో ఆకాశంలోని మెరుపులతో కూడిన మేఘంలాగా ఉంటాడు. పద్మాలవంటి నేత్రాలుంటాయి. వక్షఃస్థలంలో శ్రీవత్సం అనే పుట్టుమచ్చ ఉండటంవల్ల, మచ్చవున్న చంద్రుడు

వలె ఉంటాడు. విజయస్వరూపురాలై లక్ష్మి ఎల్లప్పుడు అతడి శరీరాన్ని, మేఘంలో మెరుపువలె, ఆవరించుకొని ఉంటుంది.

అతణ్ణి ఎవరు పడితేవాళ్ళు చూడలేరు. దేవతలైనా, పన్నగులైన, అసురులైనా, ఎవరూ ఆయన అనుగ్రహం లేకుండా చూడలేరు. నాయనా! రావణా! భగవంతుణ్ణి యజ్ఞఫలంచేతగాని, తపస్సులచేతగాని, దానముల చేతగాని, యాగములచేతగానీ చూడటానికి సాధ్యంకాదు. ప్రాణాన్ని ఆయనకే సమర్పించి, మనస్సునిండా ఆయన్నే నింపుకొని, అతడే ఏకైక రక్షకుడని పరిపూర్ణవిశ్వాసంతో ధ్యానించేవారికే దర్శనం ఇస్తాడు. పాపాల్ని భస్మం చేసుకున్న భక్తులు మాత్రమే, భగవంతుణ్ణి చూడగలరు. ఓ రాక్షసరాజా! నీవు భగవంతుణ్ణి చూడాలని ఆరాటపడితే అతణ్ణి గూర్చి ఇంకా చెప్తాను. విను.

కృతయుగం గడిచిపోయిన తర్వాత త్రేతాయుగ ప్రారంభంలో భగవంతుడు దేవతలకు, మనుష్యులకు హితం చెయ్యడంకోసం భూలోకంలో ఇక్ష్వాకు వంశంలో దశరథ మహారాజు పుత్రుడుగా జన్మిస్తాడు. బుద్ధి, బలపరాక్రమాలు కలిగి ధైర్యవంతుడుగాను. సహన శీలుడుగాను ఉంటాడు. తండ్రి ఆజ్ఞ మేరకు దండకారణ్యంలో సోదరుడైన లక్ష్మణుడు, భార్య సీతతోను సంచరించగలడు. లక్ష్మీదేవి భూమినుండి జనకమహారాజు కుమార్తె అయిన సీతగా అవతరిస్తుంది. ఆ సీత మంచిశీలం గలది; ఆచారవంతురాలు; సమస్త సద్గుణ సంపన్నురాలు; గొప్ప ధైర్యంగలది. ఓ రావణా! సర్వోత్తముడని, విద్ముడు, వినాశంలేని వాడు, దేవదేవుడు అయిన ఆ శ్రీమహావిష్ణువు యొక్క విభూతులన్నీ వివరంగా చెప్పాను.

ఓ రామా! అప్పుడు మహాబాహువు, ప్రతాపవంతుడైన రావణుడు నీతో వైరంపెట్టుకోవాలని మనస్సులో నిశ్చయించుకున్నాడు. ఆ కోరిక ఎట్లా నెరవేరుతుందో మనస్సులోనే తీవ్రంగా ఆలోచించాడు. సనత్కుమారుడు చెప్పిన మాటలన్నీ అతడి చెవుల్లో మళ్ళీ మళ్ళీ మారుమ్రోగాయి. చాలా సంతోషించాడు. నీతో యుద్ధానికే సిద్ధపడ్డాడు.

రాముడు అగస్త్యమహర్షి చెప్పిన వృత్తాంతం అంతా విని ఆశ్చర్యపోయాడు. ఓ మహర్షీ నాకు ఆ ప్రాచీన కథను కూడా చెప్పు అని కోరాడు.

ఉత్తరకాండం – ప్రక్షిప్త సర్గము – 4 – 5

నారదుడు చెప్పిన కథను అగస్త్యుడు మళ్ళీ చెప్పడం

గొప్పతేజస్సుగల అగస్త్య మహర్షి సత్యపరాక్రమవంతుడైన రాముడుకి మిగిలిన కథ ఇలా చెప్పాడు. "ఓ రామా దురాత్ముడైన రావణుడు శ్రీమహావిష్ణువుతో వైరం తెచ్చుకోవటం కోసమే సీతను అపహరించాడు. ఈ విషయాన్ని నారదుడు నాతో మేరుపర్వతంపై కలసినప్పుడు చెప్పాడు.

ఓ రామా! దేవతలు, ఋషులు కూడా ఏ కథను విని ఆనందబాష్పాలు కారుస్తారో, ఆ కథను నారదుడు నాకు చెప్పిన మాటల్నే ఇప్పుడు నీకు చెప్తాను విను. "ఎవరు ఈ కథను భక్తిపూర్వకంగా వినిపిస్తారో, ఎవడు వింటాడో ఆ ఇద్దరూ పుత్రాది సకల సుఖాలు అనుభవిస్తారు, స్వర్గంలో పూజించబడతారు.

రామా! రావణుడు శ్రీమహావిష్ణువుతో వైరం పెట్టుకొని ఆయన అనుగ్రహం పొందటానికే నిశ్చయించుకున్నాడు. అందులో భాగంగా, బలగర్వంతోను, వరగర్వంతోను, శూరులైన రాక్షసుల్ని వెంటబెట్టుకొని, దేవ, దైత్యరాక్షస మానవుల్లో బలవంతుడని పేరున్న ప్రతివానిని యుద్ధానికి పిలిచేవాడు. రామా! రావణుడు ఈ విధంగా ముల్లోకాల్లోనూ జైత్రయాత్ర సాగిస్తూ, ఒకానొక రోజున నారదుణ్ణి మేరుపర్వతంపైన చూశాడు. నారదుణ్ణి చూడగానే రావణునికి పరమసంతోషమైంది, అంజలిఘటించి దగ్గరగాపోయి నమస్కరిస్తూ ఇలా అన్నాడు. "మహాభాగ్యశాలివైన ఓ నారదా! నువ్వు బ్రహ్మలోకం మొదలుకొని అన్ని లోకాలూ సంచరిస్తూ ఉంటావు కదా? ఏ లోకంలోని మానవులు అధిక బలవంతులు. అటువంటి బలవంతులతో యుద్ధం చేసి విజయం సాధించాలని కోరుకుంటున్నాను" అన్నాడు. అంతట నారదుడు బాగా

ఆలోచించి ఇలా అన్నాడు.

"ఓ రాక్షసరాజా! క్షీరసముద్రానికి దగ్గర్లో ఒక ద్వీపం ఉంది. ఆ ద్వీపంలో ఉండేవాళ్ళు తెల్లగా, వెన్నెల్లాగా ఉంటారు. పెద్దపెద్ద శరీరాలుంటాయి. బలపరాక్రమాల్లోకూడా అధికులే. వాళ్ళు మాట్లాడుతూ ఉంటే మేఘాలు ఉరిమినట్లుంటుంది, ఆ ద్వీపాన్ని శ్వేతదీపం అంటారు. నువ్వు కోరుకునే బలపరాక్రమాలు ఆ ద్వీపవాసుల్లో సమృద్ధిగా ఉన్నాయి. వారి చేతులు కోటగడియల్లాగా పొడవుగా ఉంటాయి. పెద్ద దేహప్రమాణం కలిగిన మహాబలాఢ్యులు" అని చెప్పాడు. అందుకు రావణుడు తిరిగి నారదుణ్ణి ఇలా ప్రశ్నించాడు.

"ఓ ప్రభూ! నారదా! ఆ ద్వీపంలో ఉండే వారి జన్మవిశేషాలేమిటి? ఎట్లా పుడ్తారు? ఎక్కడనుండివచ్చి ఆ ద్వీపంలో నివాసం ఉంటున్నారు? వారి స్వభావ స్వరూపాలెటువంటివి? ముల్లోకాల్లోనూ నీకు తెలియని విషయాలు ఉండవు. అన్నీ నీకు కరతలామలకం. నాకు అన్నీ వివరంగా చెప్పు" అన్నాడు. నారదుడు తిరిగి ఇలా చెప్పాడు.

"ఓ రాక్షసశ్రేష్ఠుడా! ఆ ద్వీపవాసులకు శ్రీహరిని స్తోత్రం చెయ్యడంకన్నా వేరే వ్యాపకం లేదు. శ్రీహరిని గూర్చే ఆలోచిస్తారు; ఆరాధిస్తారు; ఆయనయందే ఆసక్తులై ఉంటారు. వాళ్ళకు రెండో ఆలోచనే ఉండదు. శ్రీహరిని సేవించడమే ఉత్తమమైన గతి అని వాళ్ళు గట్టిగా నమ్ముతారు. అక్కడుండే మహాత్ములంతా గొప్పగొప్ప పుణ్యాలు చేసుకొని ఆ శ్వేతద్వీపంలో నివాసాన్ని సంపాదించుకున్నారు.

నాయనా! యజ్ఞాలుచేసో, యాగాలుచేసో, తపస్సుచేసో దానాలుచేసో నియమాలు పాటించో ఆ ద్వీపంలో చోట సంపాదించుకోలేరు. అట్లాంటి వారికందరికీ స్వర్గం ప్రాప్తమవుతుంది. పుణ్యఫలం క్షీణించగానే భూలోకంలో తిరిగి జన్మిస్తారు. శ్రీహరి చక్రాయుధంచేతగాని, విల్లువంచి ప్రయోగించే బాణంచేతగానీ, చంపబడినవారికి మాత్రమే ఆ శ్వేతద్వీపంలో స్థానం లభిస్తుంది.

రావణునికి నారదుని మాటలు చాలా ఆశ్చర్యాన్ని కలిగించాయి. "ఎట్లాగైనా, ఆ శ్రీహరితో యుద్ధం చెయ్యాలి" అని తీర్మానించుకున్నాడు. నారదుని వద్ద సెలవు తీసుకొని శ్వేతద్వీపానికి బయలుదేరాడు. దిక్కులు పిక్కటిల్లేట్లు సింహనాదంచేసి, రాక్షసులతో కలసి పుష్పకాన్నెక్కి శ్వేతద్వీపం చేరుకున్నాడు. నారదుడుకూడా రావణుని యుద్ధం చూడాలనే వేడుకతో శ్వేతద్వీపానికి వెళ్ళాడు. నారదుని కన్నా ముందుగానే రావణుడు ఆ ద్వీపాన్ని చేరుకోవటాన్ని ఆ మహర్షి చూశాడు. పరాక్రమశాలియైన రావణుని పుష్పకం శ్వేతద్వీపం చేరగానే వాయువు వ్యతిరేకంగా వీచింది. ఆ ద్వీపం తేజస్సుచేత వీచిన గాలికి ఆ పుష్పకం నిలబడలేకపోయింది. వాయువుచే ఎగురకొట్టబడిన మేఘంవలె ఎగిరిపోయింది. రావణుని మంత్రులు ఆ ద్వీపం యొక్క తేజస్సుకు, తీవ్రమైన గాడ్పులకు భయపడిపోయారు. రావణునితో ఇలా అన్నారు. "రాజా! మాకు స్పృహతప్పి పోతోంది, నిలబడలేకుండా ఉన్నాం. మాలో నుండి చైతన్యం తప్పిపోతోంది. నిలబడి యుద్ధం చెయ్యలేం" అని అంటూ అక్కడనుండి పారిపోయారు. అంతట రావణుడు పుష్పకాన్ని, రాక్షసుల్ని వదలేశాడు. పుష్పకం వెళ్ళిపోయింది.

రాక్షసులెవ్వరూ లేకుండా, భయంకర రూపం ధరించి, యుద్ధానికి మనుషుల కోసం చూశాడు. అక్కడ కొంతమంది స్త్రీలుమాత్రం కనిపించారు. ఒక స్త్రీ చిరునవ్వు నవ్వుతూ, చేత్తోపట్టి పైకి లేపుతూ "నీవెవరవు? నీవు ఇక్కడకు ఎందుకు వచ్చావు? నిన్ను ఎవరు పంపారు? నీ తల్లిదండ్రులెవరు?" అని అడిగింది.

రామా! ఒక స్త్రీ తన్ను అట్లా సునాయాసంగా లేవనెత్తి ఇట్లా ప్రశ్నిస్తూ ఉంటే రావణునికి బాగా కోపం వచ్చింది. అయినా ఇలా సమాధానం చెప్పాడు. "నేను విశ్రవసుని కుమారుణ్ణి, రావణుడనే రాక్షసరాజును. యుద్ధం చెయ్యటానికి ఇక్కడకు వచ్చాను. ఇక్కడ పురుషులు ఎవరూ లేరా?" అని అడిగాడు. అందుకా స్త్రీలంతా అతణ్ణి చూసి పకపకా నవ్వారు; వాళ్ళల్లో ఒక స్త్రీ రావణుని నడుం పట్టుకొని రెండు చేతుల్తోనూ గిరగిరా త్రిప్పింది. అప్పుడు ప్రక్కనే ఉన్న సఖీతో "ఓ సఖీ! పది ముఖాలు, ఇరవై చేతులు కలిగి, నల్లగా కాటుకకొండలా ఉన్న ఒక పురుగును

పట్టుకొచ్చాను చూడు" అని చూపిస్తూ మరొక స్త్రీపైకి విసిరేసింది. ఆమె మరొక స్త్రీపై విసిరేసింది, ఇట్లా స్త్రీలు తనతో ఆడుకుంటూ ఉంటే కోపం వచ్చిన రావణుడు, ఆమె చేతిని గట్టిగా కొరికాడు. అప్పుడా స్త్రీ ఆ పురుగును విదిల్చి అవతల పారేసింది. ఇంకొక స్త్రీ అతణ్ణి చేత్తో పట్టుకొని ఆకాశంలోకి ఎగిరేసింది. అతడామె చేతిని గోళ్ళతో గీరాడు, అప్పుడామె ఆ రావణుణ్ణి విదిల్చిపారేయగా అతడు పోయి సముద్రంలో పడ్డాడు.

రామా! రావణుడు ఆ విధంగా ఆ ద్వీపంలో స్త్రీలచేత అవమానించబడగా, నారదుడు అతడికి దగ్గరగాపోయి "ఓ రావణా! నీ అంతటివాడికి స్త్రీల చేతుల్లో భంగపాటు జరిగిందా?" అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటించాడు. సంతోషంతో నవ్వుతూ నృత్యంచేశాడు. ఓ మహాబాహూ! రావణుడు నీ చేతిలో మరణం పొందాలనే, సీతను అపహరించాడు.

ఓ రామా! నీవే శంఖ, చక్ర, గదా, శార్ఙ్గ, పద్మాదులను ధరించిన శ్రీమన్నారాయణుడవు, సర్వదేవతల చేతనూ పూజించబడేవాడవు. శ్రీవత్సమనే పుట్టుమచ్చ గలవాడవు. ఇంద్రియాలన్నింటికీ అధిపతివి. పద్మము, నాభియందు గలవాడవు. గొప్ప యోగివి, భక్తులకు ఆశ్రయమిచ్చే శ్రీమన్నారాయణుడవు. నీవు రావణుణ్ణి సంహరించటానికే మానవరూపం ధరించావు. ఓ రామా! 'నేను నారాయణుడను అని ఎందువల్ల తెలుసుకోలేకుండా ఉన్నావు?' భాగ్యశాలివైన ఓ రామా! మోహము చెందకు, నీకునీవే స్వయంగా తెలుసుకో. నీవు రహస్యాలన్నింటిలోనూ, పరమరహస్యమని బ్రహ్మదేవుడే చెప్పాడు గదా? ఓ రాక్షస సంహారకుడా! నీవు మూడు గుణాలను నీ మాయాశక్తిచేత సృజించావు. మూడు కాలాలను సృజించిన కాలరూపుడవు నీవే! మూడడుగులు బలివద్ద పుచ్చుకొని ముల్లోకాలు ఆక్రమించినవాడవు. ఓం, తత్, సత్ అను మూడు పదాలకూ మూలపురుషుడవు. మూడు కాలాల్లోనూ పనులన్నీ నడిపించేవాడవు నీవే. మూడు వేదాలచేతా ప్రతిపాదించబడ్డ వాడవు నీవే.

పూర్వం మూడు అడుగులతో ముల్లోకాల్ని ఆక్రమించి బలిని బంధించడం కోసం, అదితి కడుపున దేవేంద్రునికి తమ్ముడుగా పుట్టావు. నీవు సనాతనుడవైన విష్ణుమూర్తివి కాదా?

మనుషుల్ని, మహర్షుల్ని అనుగ్రహించడానికే మానుషరూపం ధరించావు. ఓ దేవతాశ్రేష్ఠుడా! పాపాత్ముడైన రావణాసురుణ్ణి సంహరించి దేవతా కార్యాన్ని సాధించావు. మహాభాగ్యవంతురాలైన లక్ష్మీదేవి నీకోసం భూమిలోనుండి ఆవిర్భవించి, జనకుని ఇంట్లో పెరిగింది. గొప్పకీర్తిగల రామా! రావణుడు సీతాదేవిని లంకలో నిర్బంధించి తల్లి వలె రక్షించాడు.

ఓ రామా! నాకు ఈ కథ అంతా నారదమహర్షి చెప్పాడు. సనత్కుమారుడు రావణునికి ఎట్లా ఉపదేశం చేశాడో, అతడు అదే విధంగా నడచుకున్నాడు" అని చెప్పాడు.

ఎవడు బ్రాహ్మణ సన్నిధిలో శ్రాద్ధ సమయంలో ఈ కథను వినిపిస్తాడో, ఆ శ్రాద్ధం వాని పితృదేవతలకు చేరి సంతృప్తులవుతారు. రాముడు, అతడి సోదరులుకూడా ఈ దివ్యకథను విని ఆశ్చర్యపోయారు. సుగ్రీవుడు మొదలైన వానరులు, విభీషణుడు మొదలైన రాక్షసులు, రాజులు మంత్రులు అక్కడ సమావేశమైన బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు ధార్మికులైన శూద్రులు, అంతా ఆనందపరవశులయ్యారు. వాళ్ళంతా రామునివంక తృప్తిగా భక్తితో శ్రీమహావిష్ణువునే దర్శిస్తున్నట్లు సంతోషపడ్డారు. అంతట, అగస్త్యుడు మొదలైన మహర్షులంతా "ఓ రామా! మాకు దర్శనమిచ్చి మమ్మల్ని ధన్యుల్నిచేశావు. ఇక మేము వెళ్తాం" అన్నారు. పిమ్మట వారంతా పూజించటానికి ఎట్లా వచ్చారో అట్లాగే వెళ్ళిపోయారు.

# 38వ సర్గ జనకాదులు తమ రాజ్యాలకు వెళ్ళడం

మహాబాహువైన రాముడు ఆ విధంగా ప్రతిదినమూ రాజసభను నడుపుతూ, పౌరులు, జానపదులు వారి కర్తవ్యాలు నిర్వర్తించేట్లుగా పరిపాలన సాగించాడు. అట్లా కొన్నాళ్ళు గడిచింది. ఒకరోజున మిథిలాధిపతియైన జనకమహారాజుతో ఇలా అన్నాడు. "ఆర్యుడా! మీ ఆశీర్వాదబలంచేతనే నేను రావణుని సంహరించగలిగాను. మేము సుఖంగా ఉన్నాం అని అంటే ధర్మాత్ములైన మీ అండదండలే అందుకు కారణం. మీరే మాకు అన్ని విధాలా పెద్దదిక్కుగా ఉంటూ మమ్మల్నందర్నీ సంరక్షిస్తూ వచ్చారు. మీతో సంబంధం కలుపుకోవడం వలన ఇక్ష్వాకు వంశప్రతిష్ఠలు ఇనుమడించాయి. మీరు భరతునితోడు తీసుకొని మిథిలకు బయలుదేరండి. మీ రాక వలన మేము పొందిన ఆనందానికి గుర్తుగా రత్నాలను స్వీకరించండి" అని వినయంతో అన్నాడు.

రాముని ఆతిథ్యానికి మర్యాదలకు చాలా సంతోషించి జనకమహారాజు ఇలా అన్నాడు "నీవు మాకు ప్రేమతో ఇచ్చిన రత్నాలను, ధనాన్ని నా కుమార్తెలిద్దరికీ బహుమానంగా ఇస్తున్నాను" అని మిథిలకు వెళ్ళిపోయాడు.

పిదప రాముడు కేకయ మహారాజు, మేనమామయైన యుధాజిత్తుతో ఇలా అన్నాడు: "మామా! నన్నూ, భరతుణ్ణీ, లక్ష్మణ శత్రుఘ్నుల్ని, మా అయోధ్యా ప్రజల్ని, ఎన్నో విధాలుగా ఆదుకొని మా అభివృద్ధికి సహాయం చేశావు. నీ మేలు మరువరానిది. తాతగారు పెద్దవారయ్యారు. ఆయన ఒక్కడే రాజ్యభారాన్ని మోయలేరు. కాబట్టి ఆయనకు, ప్రజలకు సేవలుచేస్తూ ఆయనకు చేదోడు వాదోడుగా ఉండు. లక్ష్మణుడు నీ వెంట తోడుగా వస్తాడు." ఆ విధంగా మేనమామతో పలికి విలువైన అనేక రత్నరాసులనిచ్చి లక్ష్మణుణ్ణి తోడుగా ఇచ్చి పంపాడు.

పిమ్మట రాముడు కాశీరాజును రకరకాలైన మణులతోను, ధనరాసుల్తోను సత్కరించి

“మిత్రుడా! నీవు ఎంతో ప్రేమ చూపావు. రాజ్యపాలనలో భరతునికి సహాయం అందించావు. వారణాసికి నీ తిరుగు ప్రయాణం సుఖంగా సాగాలని కోరుకుంటున్నాను” అని గాఢంగా కౌగలించుకున్నాడు.

పిమ్మట రాముడు మూడువందలమంది రాజులను విలువైన రత్నాలతో సత్కరిస్తూ ఇలా అన్నాడు: “మిత్రులారా! రావణుని సంహరించడంలో మీ తేజస్సు ప్రభావం నా ప్రక్కన అండగా నిలువడం వల్లనే యుద్ధంలో జయించి క్షేమంగా అయోధ్యకు తిరిగివచ్చాను. సీతాపహరణం విన్న భరతుడు మిమ్మల్ని రప్పించాడు. మీరు మీ రాజధాని విడిచివచ్చి చాలారోజులైంది. మీ సత్యపాలన, ధర్మవర్తనకై మీ ప్రజలు ఎదురుచూస్తూ ఉంటారు” అని ఎంతో ఆప్యాయంగా వారందరికీ వీడ్కోలు పలికాడు.

అందుకు ఆ రాజులంతా రాముడుతో ఇలా అన్నారు: “రామా! శత్రుసంహారంచేసి, విజయంతో నీవు అయోధ్యకు తిరిగిరావడం మాకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తోంది. నీవు క్షేమంగా తిరిగి రావాలనేదే మా చిరకాల ఆకాంక్ష. మా కోరిక నెరవేరింది. అదే మాకు పరమానందాన్ని కలిగిస్తోంది. ఓ రామా! నీవు మమ్మల్ని ప్రశంసిస్తున్నావు, ఇటువంటి ప్రశంసలుగాని, ఆప్యాయంగానీ మేము ఎన్నడూ ఎరగం. మమ్మల్ని ఇట్లా గౌరవించడం నీకే చెల్లింది. నీ ప్రశంసలు అందుకోవడం మా భాగ్యం. నీవు ఎల్లప్పుడూ మా హృదయాల్లోనే ఉంటావు, మేమంతా ఎల్లప్పుడూ నీ స్నేహాన్నే కోరుకుంటూ ఉంటాం.” ఇలా పలికి ఆ రాజులంతా తమ దేశాలకు వెళ్ళిపోయారు.

# 39వ సర్గ రాముడు వానరులను సత్కరించటం

రాజులంతా వారి చతురంగ బలాలతో వెళ్తూ ఉంటే భూమి కంపించింది. రాముడి సహాయంగా వెళ్ళటానికి రమ్మని భరతుడు కబురు పంపితే వాళ్ళంతా పెద్ద సైన్యాల్ని వెంటబెట్టుకొని వచ్చారు. వాళ్ళంతా అక్షౌహిణుల సైన్యం, రథాలు, వాహనాల్ని వెంటబెట్టుకొని వచ్చారు. వాళ్ళంతా రాముడితో ఇలా అన్నారు: "రామా! యుద్ధంలో రావణుడు మా కళ్ళ పడకుండా తప్పించుకున్నాడు. (అక్కడ ఉంటే మేమే రావణుణ్ణి సంహరించి ఉండేవాళ్ళం గదా!) భరతుడు మమ్మల్నందర్నీ రమ్మని పిలిచాడే కానీ, మేం ఇక్కడే ఉండిపోయాం. యుద్ధం చెయ్యలేకపోయాం కదా! మేము యుద్ధం అంతా అయిపోయిన తర్వాత వచ్చినట్లైయింది. రామలక్ష్మణుల చేతికింద ఉంటూ మేముకూడా లంకకు వచ్చి యుద్ధం చేసేవాళ్ళం." ఇలా ఒకళ్ళకు ఒకరు చెప్పుకుంటూ వాపోయారు.

యుద్ధం చెయ్యడానికి సైన్యంతో వచ్చిన ఆ రాజులంతా తమ రాజ్యాలకు తిరిగి వెళ్ళి, రాముణ్ణి సంతోషపరిచేందుకు అనేక రకాలైన రత్నరాసుల్ని, ధనధాన్యాల్ని, రథాల్ని, భద్రగజాల్ని, ఉత్తమమైన అశ్వాలను, చక్కటి రూపురేఖలున్న దాస దాసీ జనాన్ని, వస్త్రాల్ని, పాడి పశువుల్ని తమతో వచ్చిన భరత లక్ష్మణ శత్రుఘ్నులకు ఇచ్చి పంపారు. వాళ్ళు ఆ బహుమానాలన్నింటినీ ఎవరెవరు ఏమేమి ఇచ్చారో పేరుపేరునా చెప్తూ రాముడికిచ్చారు. రాముడు తమ్ముళ్ళు తెచ్చిన కానుక లన్నింటినీ సుగ్రీవుడు మున్నగు వానరులకు, విభీషణుడు మున్నగు రాక్షసులకు బహుమానాలుగా ఇచ్చేశాడు. వాళ్ళంతా ఆ బహుమానాల్ని శరీరంపై ధరించి వాళ్ళను వాళ్ళే చూసుకుంటూ మురిసిపోయారు.

పిమ్మట రాముడు హనుమంతుణ్ణి, అంగదుణ్ణి దగ్గరగా పిలిచి కౌగలించుకొని సుగ్రీవుడితో ఇలా అన్నాడు. "ఓ వానరరాజా! అంగదుడు నీకు సుపుత్రుడు. హనుమంతుడు నీకు మంత్రి. వాళ్ళిద్దరూ ఎప్పుడూ నీ హితం కోరేవాళ్ళు. అట్లాగే నా హితంకూడా కోరుకుంటూ

ఉంటారు. కాబట్టి నేను వాళ్ళను ప్రత్యేకంగా సత్కరించాలి" అంటూ తన ఒంటి మీద ఉన్న నగలన్నింటినీ అంగదుడికి, హనుమంతుడికీ తొడిగి ఆనందించాడు. పిమ్మట నీలుడు, నలుడు, గజుడు, గయుడు, గవాక్షుడు, జాంబవంతుడు మొదలైన వానరవీరులందరినీ పిలచి, "ఓ వానరవీరులారా! మీ సేవలు అందుకుంటున్న సుగ్రీవుడు ఎంతో భాగ్యశాలి" అని ప్రశంసించాడు. అట్లాగే నేనుకూడా మీ సహాయం వల్లనే యుద్ధంలో విజయం సాధించాను అని అంటూ విలువైన ఆభరణాలిచ్చి సత్కరించాడు.

# 40వ సర్గ రాముడు మిత్రులకు వీడ్కోలు చెప్పడం

రాముడి ఆదరాభిమానాలు చూరగొన్న ఆ వానర రాక్షసులంతా మధుర పదార్థాలను తింటూ, పానీయాలు త్రాగుతూ హాయిగా నెలరోజులు గడిపేశారు. రాముడు కూడా ప్రతిరోజూ వారందరితో ఆటపాటల్లో మునిగి తేలుతూ ఆనందించాడు.

ఒకరోజున రాముడు సుగ్రీవుడితో కలసి ముచ్చటిస్తూ ఉండగా ఇలా అన్నాడు: "ఓ సుగ్రీవుడా! హనుమంతుడు, నలుడు, నీలుడు, సుషేణుడు, మైంద, ద్వివిదులు, గజ, గవయ, గవాక్షులు, శరభ, శతబలులు, జాంబవంతుడు నిన్నెంతగా ప్రేమిస్తారో, వాళ్ళు నాకు అంతే చేదోడు వాదోడుగా ఉంటూ నా కార్యం సాధించారు. నా కోసం వాళ్ళంతా ప్రాణాల్నే పణంగా పెట్టి వీరోచితంగా యుద్ధం చేశారు. వీళ్ళందరూ నా వాళ్ళు కూడా! కాబట్టి వాళ్ళందర్నీ అత్యంత ఆదరంగా చూసుకోవాలి. అట్లాగే అంగదుణ్ణి కంటికి రెప్పలాగా కాపాడాలి. నిండు పుత్రప్రేమతో చూసుకోవాలి. అతడికి ఏ అపకారం తలపెట్టినా, నాకు అపకారం చేసినట్లే భావించుకో. ఇక మీరంతా కిష్కింధకు వెళ్ళి మీ బాధ్యతల్ని నిర్వర్తిస్తూ ఉండండి."

పిమ్మట విభీషణుడితో మాట్లాడుతూ, "సోదరా! విభీషణా! ధర్మమార్గాన లంకను పాలించు. ఎట్టి పరిస్థితుల్లోనయినా, నీ మనస్సు అధర్మం వైపు మళ్ళకుండా ఉండేట్లు చూసుకో. నేను, నీ సోదరుడైన కుబేరుడు, నీ ప్రజలు నీవు ధర్మనితుడవని నమ్ముతున్నాము. ధర్మంగా పాలించే రాజే చిరకాలం భూమిని శాసించగలడు, గుర్తుంచుకో. నన్ను మరచిపోకు, సుగ్రీవుణ్ణి తలచుకుంటూ ఉండు."

రాముడి ప్రేమలోలికే మాటలువిన్న వానరులు, భల్లూకాలు, రాక్షసులు అంతా ముక్తకంఠంతో రాముడికి జయజయ ధ్వనులు చేశారు. హనుమంతుడు రాముడికి ప్రదక్షిణ పూర్వకంగా సాష్టాంగ నమస్కారం చేస్తూ "ఓ రామప్రభూ! నాకు నీయందు ప్రేమ, భక్తి స్థిరంగా ఉండేట్లు దీవించు. నాకు నీయందు అచంచల భక్తి ఉండేట్లు అనుగ్రహించు. రామకథలు

లోకులు చెప్పుకున్నంత కాలం, నేను అవి వింటూ ఉండే ఆనందాన్ని ప్రసాదించు, నేను సజీవుడనై ఉందునుగాక! ఓ రామా! దివ్యమైన నీ చరిత్రను, కథలను అప్సరస్త్రీలు నాకు వినిపిస్తూ ఉందురుగాక!" అని ప్రార్థించాడు. హనుమంతుడు అట్లా భక్తిపూర్వకంగా ప్రార్థిస్తూ ఉంటే, రాముడు సింహాసనంపైనుండి లేచివచ్చి హనుమంతుణ్ణి కౌగలించుకొని ఇలా అన్నాడు. "ఓ వానరశ్రేష్ఠుడా! నీవు కోరినట్లే జరుగుతుంది. సందేహం లేదు, నా చరిత్ర లోకంలో ఉన్నంత కాలం నీవు సజీవుడుగా ఉంటావు. లోకాలు ఉన్నంతవరకూ నా చరిత్ర వినిపిస్తూనే ఉంటుంది; అంతవరకూ నీ కీర్తికూడా ప్రకాశిస్తూనే ఉంటుంది. ఓ మిత్రుడా! నీవు నాకు చేసిన ఉపకారాలకు నేను ప్రత్యుపకారం చెయ్యాలంటే నా ప్రాణాలు చాలవు. ప్రత్యుపకారాలు ఆపద సమయాల్లో కదా చెయ్యాలి? నీకు అలాంటి దుర్దశ రాకుందుగాక! నీవు చేసిన ఉపకారానికి, నన్ను ఇట్లాగే ఎన్నటికీ ఋణపడి ఉండనీ! అంతవరకూ నన్ను గుర్తుచేసుకుంటూ ఈ వైడూర్యమణి మధ్యన మెరిసే ఆణిముత్యాల హారాన్ని నా స్వహస్తాలతో నీకు అలంకరిస్తున్నాను." ఇలా అంటూ ఆ హారాన్ని హనుమంతుడి మెడలో వేశాడు. పిదప రాముడు సుగ్రీవాది వానర భల్లూక, రాక్షసులందరికీ వీడ్కోలు చెప్పి పంపాడు. వాళ్ళంతా రాముడి పాదాలకు నమస్కరిస్తూ విడువలేక విడుస్తూ, కళ్ళవెంట ఆనందబాష్పాలు కారుస్తూ రాముణ్ణి కౌగలించుకొని తమ ప్రదేశాలకు వెళ్ళిపోయారు.

# 41వ సర్గ పుష్పకవిమానాన్ని కుబేరునికి తిరిగి పంపటం

రాముడు వానర, భల్లూక, రాక్షస మిత్రులందర్నీ పంపి తమ్ములతో సుఖంగా కాలం గడుపుతున్నాడు. ఒకానొకనాడు మధ్యాహ్నం వేళ తమ్ములతో కలసి ఉండగా ఆకాశవాణి ఇలా పలికింది. "ఓ రామప్రభూ! నేను చెప్పేదంతా సావధానంగా విను. నా పేరు పుష్పకం, నీవు పంపగా నేను కుబేరుడి దగ్గరకు వెళ్ళాను. అతడు ఏమన్నాడో నీకు చెప్తాను విను. రాముడు రావణుని సంహరించి లోకకల్యాణానికి తోడ్పడ్డాడు, నాకు అదే పదివేలు. నా అదృష్టవశాత్తు ఆ కార్యం సిద్ధించింది. రాముడు రావణుణ్ణి సంహరించి, నిన్నుకూడా జయించుకున్నాడు కాబట్టి ఇకమీదట నీవు అతడికే వాహనంగా ఉండు. ఇది నా ఆజ్ఞ" అని ఆ ఆకాశవాణి పలికింది.

ఆ పుష్పకం పలికిన మాటలు విన్న రాముడు తిరిగి ఇలా అన్నాడు. "ఓ విమానశ్రేష్ఠమా! నీకు స్వాగతం పలుకుతున్నాను. ధనాధిపతి మాకు మిత్రుడు; కుబేరుడే నిన్ను తిరిగి పంపాడు కాబట్టి నిన్ను మేము ఉపయోగించుకున్నా కూడా ఎవరూ తప్పుపట్టరు" అని అంటూ ఆ పుష్పకాన్ని నీటితోను, పుష్పాలతోను పూజించి "ఇక నీవు వెళ్ళు. నేను కావాలనుకున్నప్పుడు వస్తూవుండు, ఓ సౌమ్యుడా! ఆకాశాన సిద్ధులకు అడ్డుగాపోకు, నాలుగు దిక్కుల్లోనూ యథేచ్ఛగా సంచరిస్తూవుండు" అని అన్నాడు. అంతట ఆ పుష్పకం "అట్లే అగుగాక" అని అక్కడనుండి అంతర్ధానమైంది.

పుష్పకం అంతర్ధానం అయిన పిమ్మట, భరతుడు అంజలిఘటించి ఇలా అన్నాడు: "ఓ వీరుడా! దేవతా స్వరూపుడవైన నీవు రాజ్యపాలన ప్రారంభించాక, మనుష్యులే కాకుండా మనుష్యేతరులు కూడా మాట్లాడుతున్నారు. దేశంలో నీ పాలన ప్రారంభమై నెలకూడా కాలేదు. అయినా దేశంలో ఎక్కడా రోగబాధలు లేవు, అకాలమరణాలు లేవు. స్త్రీలు ఆరోగ్యవంతులయిన సంతానాన్ని ప్రసవిస్తున్నారు. పురుషులు దృఢకాయులై ఉన్నారు. ఈతి బాధలులేవు. మేఘాలు సమయాను సారంగా వర్షిస్తున్నాయి. అందువల్ల పాడిపంటలు సమృద్ధిగా పండుతున్నాయి.

మమ్మల్ని ఈ రాజు కలకాలం పాలించాలని ప్రజలు కోరుకుంటున్నారు" అన్నాడు. భరతుని మధురమైన మాటలకు రాముడు సంతోషించాడు.

# 42వ సర్గ సీతారాముల వనవిహారం

రాముడు పుష్పక విమానాన్ని పంపిన తర్వాత ఒకానొక రోజు సీతతో కలసి అంతఃపురానికి దగ్గరలోనే ఉన్న అశోకవనానికి విహారంగా వెళ్ళాడు. ఆ వనంలో చంపక, అశోక, పున్నాగ, మధూక, పనస, అసవ, వృక్షాలూ, పొగలేని అగ్ని వంటి కాంతిగల పారిజాతవృక్షాలతో శోభాయమానంగా ఉంటుంది. ఆ అశోకవనంలోని వృక్షాలు ఎల్లప్పుడూ ఫలపుష్పాలతో నిండి మనోహరంగా ఉంటుంది. ఆ వనంలోని వృక్షాలను, మొక్కలను లతలను అందంగా తీర్చిదిద్దేందుకు అనుభవజ్ఞులైన తోటమాలులు ఉన్నారు. ఆ వనంలో శ్రేష్ఠమైన కోకిలలు ఉన్నాయి, మదించిన తుమ్మెదలు ఝుంకారాలు చేస్తూ తిరుగుతూ ఉంటాయి.

ఆ వనంలో అనేక దిగుడు బావులున్నాయి. వాటి మెట్లకు మాణిక్యాలు పొదిగారు. ఆ దిగుడుబావులన్నీ వికసించిన పద్మాలతో నిండి ఉంటాయి. చక్రవాకాలు, నీటికాకులు, చిలుకలు, హంసలు, సారసపక్షులు చేసే ధ్వనులతో ఆ వనం మారుమ్రోగుతూ ఉంటుంది. ఆ వనంలో తివాచీలు పరచినట్లు పచ్చిక బీడులుంటాయి. ఆ ఉద్యానవనం ఇంద్రుని నందనోద్యానంవలె, బ్రహ్మ నిర్మించిన చైత్ర్యోద్యానవనంవలె ఉంది.

అశోకవనంలోకి సీతతో కూడావచ్చిన రాముడు మైరేయకమనే మద్యాన్ని ఇంద్రుడు శచీదేవికి త్రాగించినట్లు, సీతచే త్రాగించాడు. సీతారాముల కోసం మధురమైన ఫలాలను, పక్వంచేసిన మాంసాన్ని ఏర్పాటుచేశారు. వారిద్దరినీ సంతోషపెట్టేందుకు కిన్నెరస్త్రీలు, అప్సరసలు, ఉరగస్త్రీలు నృత్య సంగీతాలతో అలరించారు. సీతతో విహరిస్తున్న రాముడు అరుంధతితో కూడివున్న వసిష్ఠుడివలె ప్రకాశించాడు. సీతారాములు ఆ విధంగా భోగాలు అనుభవిస్తూ శిశిరకాలం అంతా గడిపారు.

ధర్మాత్ముడైన రాముడు ధర్మకార్యాలన్నీ మధ్యాహ్నంలోపుగా ఆచరిస్తూ, మధ్యాహ్నకాలం నుండీ అంతఃపురంలో గడిపేవాడు. సీతకూడా మధ్యాహ్నంవరకూ దేవతాపూజలన్నీ చేస్తూ

అత్తలందర్నీ సమభావంతో ఆదరిస్తూ సేవలుచేసేది. మధ్యాహ్నం దాటిన పిదప సర్వాలంకారాలు చేసుకొని, ఆభరణాలన్నీ ధరించి పట్టువస్త్రాలతో శచీదేవి ఇంద్రుని చేరినట్లు, రాముని వద్దకు వెళ్తూ ఉండేది. ఆ విధంగా అలంకరించుకొని వచ్చిన సీతను చూస్తూ రాముడు పరమానందం పొందేవాడు. ఆ ఆ దివ్య దంపతులు ఆనందంగా అన్యోన్యంగా పదివేల సంవత్సరాలు గడిపారు.

ఒకానొక రోజున రాముడు సీతతో "ఓ సీతా! త్వరలో నీ వలన నాకు సంతానప్రాప్తి కలుగబోతోంది. ఈ సమయంలో నీకు ఇష్టమైనదేదైనా కోరుకో. నేను నీ కోరిక తీర్చాలి" అన్నాడు. సీత చిరునవ్వు నవ్వుతూ ఇలా అంది "ఓ రామా! గంగాతీరాన ఉండే పవిత్రమైన తపోవనాన్ని చూడాలని ఉంది. అక్కడ నివసించే తపస్వులతో నివసిస్తూ, వారు తినే కందమూలాలే తింటూ, ఉగ్రమైన తపస్సు చేసుకుంటున్న ఆ మహర్షుల పాదాల దగ్గర ఉండాలని కోరుకుంటున్నాను. అటువంటి కందమూల ఫలాలు తింటూ ఒక్క రోజైనా వారి పాదసేవ చేసుకుంటూ గడపాలన్నదే నా కోరిక" అంది. అంతట రాముడు "ఓ సీతా! రేపే నీవు ముని ఆశ్రమాలు చూసేందుకు వెళ్ళే ఏర్పాటు చేస్తాను. సిద్ధంగా ఉండు" అని మాట ఇచ్చాడు. అటుపిమ్మట సీతను లాలించి అంతః పురానికి పంపి తాను స్నేహితులతో కలసి సభా భవనానికి వెళ్ళాడు.

# 43వ సర్గ రాముడు ప్రజాసదస్సును ఏర్పాటుచేయడం

రాముడు సభామందిరంలో కొలువుతీరి ఉన్నాడు. అక్కడ రాజుకు వినోదం కలిగించేవాళ్ళు, కథలు చెప్పేవాళ్ళు, ఆయన చుట్టూచేరి రకరకాల సంభాషణలు చేస్తున్నారు. విజయుడు, మధుమత్తుడు, కాశ్యపుడు, మంగలుడు, కులుడు, సురాజి, కాలియుడు, భద్రుడు, దంతవక్త్రుడు, సుమాగధుడు, మొదలైన వారంతా ఉత్సాహంగా రామునికి హాస్యం కలిగించే మాటలు చెప్తున్నారు. అప్పుడు మాటల సందర్భంలో రాముడు భద్రుడితో ఇలా అన్నాడు "భద్రుడా! దేశంలో వార్తలేమిటి? నన్ను గూర్చి, భరతుణ్ణి గురించి, లక్ష్మణుణ్ణి గురించి ఏమనుకొంటున్నారు? శత్రుఘుణ్ణి గురించి, తల్లి కైకేయినిగూర్చి ఏమని చెప్పుకుంటున్నారు? కొత్తగా రాజ్యానికి వచ్చిన రాజునుగూర్చి వాళ్ళ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు. రాముడు మాటలువిని భద్రుడు రామునికి నమస్కరించి ఇలా అన్నాడు: "రాజా! ప్రజలు మంచిగాను, చెడుగానూ కూడా చెప్పుకుంటున్నారు. ఓ సౌమ్యుడా! పురుషశ్రేష్ఠుడా! ప్రజల్లో ఎక్కువమంది రావణుని వధను గూర్చి, నీ విజయాన్ని గూర్చే ఎక్కువగా మాట్లాడుకొంటున్నారు." అంతట రాముడు భద్రునితో "ఓ భద్రుడా! ఉన్నది ఉన్నట్లుగా చెప్పు. ఎందువల్లనంటే, మంచిగా మాట్లాడుకుంటూ ఉండేవారికి ఇంకా మంచిచేస్తూ ఉండవచ్చు, అదే చెడుగా చెప్పుకునే విషయం తెలిస్తే ఇకపైన అటువంటి చెడ్డపనులు చేయకుండా నిరోధించటానికి వీలవుతుంది. అందువలన సంకోచం లేకుండా చెప్పు" అన్నాడు.

రాముడి మాటలు విని భద్రుడు అంజలిఘటించి ఇలా చెప్పాడు. "రాముడు సముద్రంమీద ఎవరూ చేయలేని సేతువును కట్టాడు, ఇంతటి ఆశ్చర్యకరమైన పనిని ఇతడి పూర్వీకులేకాదు, దేవతలుకూడా చెయ్యలేదు. పెద్ద సైన్యంతో వెళ్ళి ఎదిరించటానికి శక్యంకాని రావణుని లంకను వశం చేసుకున్నాడు. రావణుని చంపి, సీతను తీసుకొచ్చాడు. రావణుని స్పర్శ తగిలిన సీతను విడిచెయ్యలేదు. మళ్ళీ ఇంటికి తెచ్చుకున్నాడు. రావణుడు ఒడిలో కూర్చోబెట్టుకొని లంకకు తీసుకొని వెళ్ళి అశోకవనంలో ఉంచాడు, అప్పుడామె రాక్షసుల వశమై

ఉంది. అటువంటి సీతనుగూర్చి రాముడు ఏవగించుకోకుండా ఎట్లా కాపురం చేస్తున్నాడోగదా? అతడికి సీత వలన ఎటువంటి సుఖం కలుగుతుందో అతడికే తెలియాలి? ఇకపై మనంకూడా అట్లా చెయ్యాల్సి వుంటుంది. ఎందువల్లనంటే రాజు ఎట్లా చేస్తాడో, ప్రజలుకూడా అతణ్ణి అనుసరించి అట్లాగే చేస్తారు గదా? అంటూ గ్రామాల్లోను, పట్టణాల్లోనూ కూడా ప్రజలు ఈ విధంగా చెప్పుకుంటున్నారు." అక్కడున్న మిత్రులంతా కూడా, ప్రమాణంచేసి అతడు చెప్పిందంతా నిజమే, అతడు అసత్యం చెప్పలేదు అన్నారు. అప్పుడు శత్రుసంహారకుడైన రాముడు చాలా దుఃఖించాడు, వాళ్ళందరినీ ఇళ్ళకు పంపేశాడు.

# 44వ సర్గ లక్ష్మణ భరత శత్రుఘ్నులతో చర్చించటం

రాముడు మిత్రులందరినీ పంపివేసి దీర్ఘంగా ఆలోచించాడు. అప్పుడు ద్వారపాలకుణ్ణి పిలిచి "నీవు పోయి వెంటనే లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను ఇక్కడకు తీసుకొనిరా" అన్నాడు. రాముడి ఆజ్ఞను శిరసావహించిన ద్వారపాలకుడు ముందుగా లక్ష్మణుని ఇంటికి పోయి "రాకుమారా! మహారాజు నిన్ను వెంటనే చూడాలని కోరుతున్నాడు" అన్నాడు. లక్ష్మణుడు వెంటనే రథం ఎక్కి రాముని ఇంటికి వెళ్ళాడు. అంతట ద్వారపాలకుడు భరతుని ఇంటికి వెళ్ళి "యువరాజా! మిమ్మల్ని మహారాజు వెంటనే చూడాలని కోరుతున్నాడు" అని చెప్పాడు. భరతుడు కూడా వెంటనే అన్నగారిని చూడటానికి బయలుదేరాడు. అంతట ఆ సేవకుడు శత్రుఘ్నుని ఇంటికి వెళ్ళి "రాకుమారా! మహారాజు నిన్ను వెంటనే చూడాలని కోరుకుంటున్నాడు" అని చెప్పాడు. అప్పుడు శత్రుఘ్నుడు కూడా బయలుదేరి వెంటనే రాముడి ఇంటికి వెళ్ళాడు. అంతట ద్వారపాలకుడు లోపలకు వెళ్ళి "ప్రభూ! తమ్ముళ్ళు ముగ్గురూ వచ్చారు" అని విన్నవించుకున్నాడు. అప్పుడు రాముడు "వాళ్ళను నాదగ్గరకు తీసుకొనిరా. నాజీవితం వాళ్ళపైనే ఆధారపడివుంది. వీళ్ళు నా పంచప్రాణాలతో సమానం" అన్నాడు.

అంతట రాముని అనుమతి పొందిన ఆ సోదరులు ముగ్గురూ శక్రుని తేజస్సుతో, అంజలిఘటించి నమస్కరిస్తూ లోపలకు వచ్చారు. ఆ సమయంలో రాముని ముఖం రాహువు ఆక్రమించిన చంద్రబింబంలాగా, సంధ్యాసమయపు సూర్యబింబంలాగా, వాడిపోయిన పద్మంవలె, కాంతిలేకుండా ఉంది. కళ్ళ నిండుగా నీళ్ళు నిండి ఉన్నాయి. ఆ స్థితిలో ఉన్న అన్నగారిని చూసి ముగ్గురు సోదరులూ పాదాభివందనం చేసి 'ఏం చెప్తాడా' అని ఎదురుచూశారు.

రాముడు వాళ్ళ ముగ్గుర్నీ లేవదీసి కౌగలించుకొని కూర్చోండని ఆసనాలు చూపాడు. ఓ రాకుమారుల్లారా! మీరే నా సర్వస్వం, మీరే నా జీవితం. మీరు సంపాదించి ఇచ్చిన రాజ్యాన్ని

నేను పాలిస్తున్నాను. మీరు శాస్త్రవిషయాలన్నీ బాగా తెలిసినవారు, బుద్ధిమంతులు. మీరందరూ కలసి నా కర్తవ్యాన్ని నిర్ణయించి చెప్పాలి" అన్నాడు. రాముడు అట్లా అంటూవుంటే సోదరుల ముగ్గురు రాముడు ఏం చెప్పబోతున్నాడోనని దిగులుపడి చూస్తున్నారు.

# 45వ సర్గ లోకాపవాదాన్ని గూర్చి తమ్ముళ్ళకు చెప్పటం

దిగులుగా కూర్చున్న తమ్ముళ్ళను చూస్తూ, వాడిపోయిన ముఖంతో రాముడు ఇలా అన్నాడు: “సోదరులారా! నన్ను గురించి, సీతను గురించి ప్రజలంతా ఏమనుకుంటున్నారో ఇప్పుడే విన్నాను. నేను ఇక్ష్వాకువంశంలో పుట్టాను, సీత మహాత్ముడైన జనకమహారాజు వంశంలో జన్మించింది. సౌమ్యుడవైన లక్ష్మణా! దండకారణ్యంలో సీత ఎట్లా అపహరించబడిందో, నేను రావణుణ్ణి ఎట్లా చంపానో నీకు పూర్తిగా తెలుసు. లక్ష్మణా! రావణసంహారం అయిన తర్వాత సీతను అయోధ్యకు తీసురావడానికి సందేహించాను. అప్పుడు సీత తన పాతివ్రత్యాన్ని నిరూపించుకోవటానికి అగ్ని ప్రవేశం చేసింది. అప్పుడు నువ్వు కూడా అక్కడే ఉన్నావుగదా! పిమ్మట అగ్నిదేవుడు, ఆకాశంలో సంచరించే వాయుదేవుడు సూర్యచంద్రులు సీత నిర్దోషి; ఏ పాపము ఎరుగదని చెప్పారుగదా? పిమ్మట దేవతలు, గంధర్వుల సన్నిధిలో సీత పరిశుద్ధురాలని దేవేంద్రుడు ఆమెను నా చేతిలో పెట్టాడు. అంతేకాదు నా అంతరాత్మకు సీత పరిశుద్ధురాలని తెలుసు. అందువల్లనే సీతను అయోధ్యకు తీసుకొని వచ్చాను. నువ్వే వీటన్నింటికీ ప్రత్యక్ష సాక్షివి. కానీ ప్రజలు ఈ రోజున ఇంకొక విధంగా అంటున్నారు. ఆ మాటలు వింటూ ఉంటే నాకు బాధ దుఃఖం కలుగుతోంది. ఈ లోకంలో అపకీర్తి పొందినవాడు అది పోయేవరకు నరకంలో ఉంటాడు. దేవతలు కూడా అపకీర్తిని సహించరు. కీర్తిని లోకంలో అంతా పూజిస్తారు. మహాత్ములంతా కీర్తి కోసమే ప్రయత్నిస్తూ ఉంటారు. ఓ పురుషశ్రేష్ఠులారా! అపవాదుకు భయపడిన నేను నా ప్రాణాలనైనా వదులుకుంటాను; మిమ్మల్ని కూడా వదులుకుంటాను. ఇక సీత మాట వేరేచెప్పాలా? సోదరులారా అపవాదం మూలంగా శోకసముద్రంలో మునిగివున్న నన్ను చూడండి! ఇంతకుమించిన దుఃఖం ఈ లోకంలో ఏం ఉంటుంది?

లక్ష్మణా! రేపు ఉదయానే, సుమంత్రుణ్ణి రథం కట్టమని చెప్పు. నీవుకూడా ఆ రథంలో సీతను తీసుకొని దేశం పొలిమేరలు దాటి గంగానదికి ఆవలి ఒడ్డున తమసాతీరాన వాల్మీకి

ఆశ్రమం ఉంది. సీతను ఆ ఆశ్రమంలో వదిలి వచ్చేయి. ఈ విషయంలో నా మనస్సు మార్చేందుకు ప్రయత్నించకు. నేను చెప్పింది చెయ్యి. అంటే, ఈ విషయంలో ఎవరు అడ్డు చెప్పినా నా మనస్సు క్షోభిస్తుంది. నా పాదాల మీద, జీవితంపైనా ఒట్టు పెట్టుకొని చెప్తున్నాను. ఎవరైనా సాహసించి నాకు ఎదురు మాట్లాడితే వాళ్ళు నా తమ్ముళ్ళే కాదనుకుంటాను. ఇది రాజాజ్ఞగా స్వీకరించి చెప్పింది చెప్పినట్లు చెయ్యండి.

ఇప్పుడే సీత గంగాతీరంలోని ఋష్యాశ్రమాలు చూడాలని కోరుకుంది. ఆ విధంగా, ఆమె కోరిక తీర్చినట్లు కూడా అవుతుంది.'' ఇలా చెప్పి రాముడు కన్నీళ్ళు పెట్టుకుంటూ, సోదరులను పంపి, ఇంట్లోకి వెళ్ళాడు.

# 46వ సర్గ సీతను వాల్మీకి ఆశ్రమంలో వదలటం

తెల్లవారింది. కలత చెందిన మనస్సుతో లక్ష్మణుడు వాడిపోయిన ముఖంతో సుమంత్రుణ్ణి పిలిచి ఇలా అన్నాడు: "సుమంత్రుడా! సీతాదేవిని వాల్మీకి ఆశ్రమానికి తీసుకొని వెళ్ళాలి, శ్రేష్ఠమైన రథాన్ని, వేగంగాపోయే ఉత్తమమైన అశ్వాల్ని పూన్చి సిద్ధంచెయ్యి. సీతాదేవికి సుఖంగా ఉండేట్లు రథంలో మెత్తటి పరుపులను ఏర్పాటుచెయ్యి. ఇది రాజాజ్ఞ." అంతట సుమంత్రుడు అట్లాగే చేస్తాను అని చెప్పి, వెంటనే రథాన్ని సిద్ధంచేశాడు. అంతట లక్ష్మణుడు అంతఃపురంలోకిపోయి సీతతో ఇలా అన్నాడు: "ఓ సీతాదేవి! నీవు గంగాతీరంలో ఋష్యాశ్రమంలో ఉండాలని కోరావట, ప్రభువులు అందుకు అంగీకరించారట. అందుచేత నిన్ను ఆశ్రమానికి తీసుకు వెళ్ళేందుకు రథం సిద్ధంచేశాను. రాజాజ్ఞననుసరించి నిన్ను త్వరగా అక్కడకు చేర్చవలసి ఉంది." లక్ష్మణుని మాటలు విన్న సీతాదేవి చాలా సంతోషించి ప్రయాణానికి సిద్ధమైంది. సీత చాలావిలువైన ఆభరణాలనూ, శ్రేష్ఠమైన వస్త్రాలను, ఇంకా అనేక విలువైన వస్తువుల్ని తీసుకొని వెళ్ళి ముని పత్నులకు బహూకరిస్తాను అని అనుకొని, ఆ వస్తువులన్నీ రథంలో చేర్చమని చెప్పింది. లక్ష్మణుడు ఆమె చెప్పినట్లే చేశాడు. రథాన్ని సిద్ధంచేసుకొని ఆమె భవనం ముందు నిలబెట్టాడు. అప్పుడు సీతాదేవి లక్ష్మణునితో ఇలా అంది: "లక్ష్మణా! నా కెందుకనో అన్నీ అపశకునాలే కనిపిస్తున్నాయి సుమా! నా కుడికన్ను అదురుతోంది, శరీరం అంతా వణుకు పుడ్తోంది. గుండెల్లో ఏదో తెలుసుకోలేని బాధగా అనిపిస్తోంది. ఓ లక్ష్మణా! నా కెందుకో చాలా దిగులుగా ఉంది. ధైర్యం సన్నగిలిపోతోంది. అంతా శూన్యంగా కనిపిస్తోంది. అన్నగారిపై ప్రేమగలవాడా! లక్ష్మణా! రాముడు, అత్తగారు అంతా క్షేమమే కదా? పట్టణాల్లోను, పల్లెల్లోనూ ఉండే మన ప్రజలంతా సుఖంగా ఉన్నారు గదా?" అని అంటూ దేవతలందరికీ నమస్కారం చేసింది. సీతాదేవి మాటలన్నీ తలవంచుకొని వింటూ, పైకి మాత్రం సంతోషాన్ని తెలియజేస్తూ "అంతా శుభప్రదంగానే ఉంటుంది" అని అన్నాడు.

వాళ్ళు అట్లా ప్రయాణంచేస్తూ గోమతీ తీరంలో ఉండే ఆశ్రమాలలో విడిది చేశారు.

మరునాడు ఉదయానే సుమంత్రుణ్ణి పిలిచి లక్ష్మణుడు ఇలా అన్నాడు: "సూతుడా! రథాన్ని సిద్ధంచెయ్యి, త్వరగా గంగానదిని చేరుకొని గంగాస్నానంచేస్తే మనస్సు కొంచెం కుదుటపడ్తుంది. సుమంత్రుడు సీతాదేవిని మరల రథంలో ఎక్కించుకొని వెంటనే గంగానది వైపుగా ప్రయాణం కొనసాగించాడు.

అప్పటికి మిట్టమధ్యాహ్నం అయింది. లక్ష్మణుడు ఇక దుఃఖాన్ని ఆపుకోలేక బావురుమన్నాడు. సీతాదేవి బెదిరిపోయింది. లక్ష్మణుడితో ఇలా అంది: "లక్ష్మణా! నేను గంగాతీరాన ముని ఆశ్రమాల్లో సేవలుచెయ్యాలని చాలాకాలంగా కోరుకుంటున్నాను. తీరా నా కోరిక నెరవేరిన ఈ సమయంలో నీవు ఇట్లా దుఃఖీస్తునావు, ఎందువల్ల? నీ దుఃఖం చూస్తూవుంటే నాకు భయం కలుగుతోంది. ఎప్పుడూ రాముడి సేవలో ఉండే నీవు రెండు రోజులు దూరంగా వచ్చేశానని బాధపడుతున్నావా? లక్ష్మణా! రాముడు నాకు కూడా ప్రాణానికన్నా ఎక్కువైనవాడు. నేనే ఈ విధంగా దుఃఖీంచడం లేదే! నా ధైర్యాన్నికూడా పాడుచెయ్యకు. ముందుగా గంగానదిని దాటించు. నా దగ్గరున్న వస్త్రాల్ని, ఆభరణాల్ని ముని పత్నులకు ఇవ్వాలి. అటుపిమ్మట మహర్షులందరికీ పాదనమస్కారం చేసుకొని ఒక రాత్రి అక్కడ గడుపుదాం. మర్నాడే బయలుదేరి నగరానికి వెళ్ళిపోదాం. ఓ లక్ష్మణా! పద్మములవంటి నేత్రాలు, సింహంవంటి వక్షఃస్థలం, సన్నని నడుము గల శ్రేష్ఠుడైన రాముణ్ణి త్వరగా చూడాలని నా మనస్సు ఉవ్విళ్ళూరుతోంది" అన్నది.

శత్రుభయంకరుడైన లక్ష్మణుడు ఆమె మాటలు విని, కళ్ళు తుడుచుకొని, గంగ దాటేందుకు నావల్ని ఏర్పాటు చేశాడు. పిమ్మట ఓ సుందరమైన నావలో సీతాదేవిని ఎక్కించి గంగానదిని దాటించాడు.

# 47వ సర్గ రాముని నిర్ణయాన్ని సీతకు చెప్పటం

సుమంత్రుణ్ణి రథం దగ్గరే ఉండమని చెప్పి, సీతాదేవిని పడవపై గంగానదిని దాటించి సీతాదేవితో ఇలా అన్నాడు: "మంగళప్రదురాలా! బుద్ధిశాలియైన అన్నగారు నన్నీపని చెయ్యమని ఆజ్ఞాపించాడు. రాజాజ్ఞకు బద్ధుడనై ఈ పాపకార్యానికి ఒడిగట్టున్నాను. లోకం తప్పకుండా నన్ను నిందిస్తుందని నాకు తెలుసు. నా హృదయంలో చిచ్చు రగుల్కుంటోంది. ఈ పాపకార్యం చెయ్యటానికే బ్రతికి ఉన్నానా అని ఏడుస్తున్నాను. నాకు మరణం సంభవిస్తే ఇంతకన్నా ఎక్కువగా సంతోషించేవాడిని అమ్మా! ఇందులో నేను నిమిత్తమాత్రుణ్ణే! నన్ను తప్పుపట్టకు." నేల మీద పడి ఏడుస్తూ శోకాలు పెడ్తున్న లక్ష్మణునితో సీతాదేవి ఇలా అంది.

"లక్ష్మణా! నీకు ఏమైంది? నువ్వు ఎందుకు ఇంతగా ఏడుస్తున్నావో నాకు బోధపడటం లేదు. నీ ఆరోగ్యం బాగుందికదా? నీ అన్నగారు క్షేమమేకదా? రాజు మీద ఒట్టువేసి ఉన్నది ఉన్నట్లుగా చెప్పు. నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను." అప్పుడు లక్ష్మణుని కంఠం దుఃఖంతో పూడుకుపోయింది. అట్లాగే సంబాళించుకొని ఇలా అన్నాడు: "అమ్మా! సీతాదేవీ! దేశంలో ప్రజలు నిన్ను గూర్చి తలోవిధంగా మాట్లాడుకుంటూ ఉండటాన్ని రాజుకు రాజసభలో ఉండగా చెప్పారట. ఆ వార్త విన్న రాజు తట్టుకోలేకపోయాడు. నన్ను పిలిచి నన్నిట్లా ఆజ్ఞాపించి ఇంట్లోకి వెళ్ళిపోయాడు. ఆయన నన్ను ఏమని ఆజ్ఞాపించాడో ఆ మాటల్ని నా నోటితో చెప్పలేకుండా ఉన్నాను. నేను లంకలో ఉండగానే నా ముందే అగ్ని మొదలైన దేవతలువచ్చి నీ పవిత్రతను గూర్చి రాముడికి చెప్పి వెళ్ళారు. కానీ లోకులు అనుకునే మాటల్ని భరించలేక మహారాజు నిన్ను బహిష్కరించాడు. రాజాజ్ఞను ధిక్కరించడం నాకూ నీకూ ఎవరికీ సాధ్యంకాదు. నిన్ను ఈ ఆశ్రమంవద్ద దిగబెట్టి రమ్మన్నాడు. ఇదే వాల్మీకి మహర్షి ఆశ్రమం. ఆ మహర్షి మా నాయనగారికి పరమ మిత్రుడు.

ఓ సీతాదేవీ! నీవు ఆ మహాత్ముని పాదాల దగ్గరచేరి, పతివ్రతా ధర్మాలు ఆచరిస్తూ,

రాముణ్ణే మనస్సుంతా నింపుకొని మితాహారాన్ని భుజిస్తూ ఇక్కడే నివసించు. నీకు సర్వశుభాలు చేకూరుతాయి.”

# 48వ సర్గ రామునికి సీతాదేవి సందేశం

దారుణమైన లక్ష్మణుని మాటలు వినగానే సీతాదేవి దుఃఖం భరించలేక నేలపైపడి మూర్ఛపోయింది. కొద్దిక్షణాల్లోనే తేరుకుని కన్నీళ్ళు పెట్టుకుంటూ దీనంగా చూస్తూ లక్ష్మణునితో ఇలా అంది. “లక్ష్మణా! బ్రహ్మదేవుడు నన్ను కష్టాలు అనుభవించటానికే సృష్టించాడు. అందువల్లనే లోకంలో ఉండే దుఃఖానంతటినీ నేను అనుభవిస్తున్నాను. ఓ లక్ష్మణా! నేను పరిశుద్ధమైన నడవడిక గలదానను. అయినా రామప్రభువు నన్ను విడిచిపెట్టేశాడు. ఇది ఆ మహాత్ముడి దోషం కాదు. నేనే పూర్వజన్మలలో ఎన్నడో భార్యాభర్తలను విడదీసి పాపం కట్టుకొని ఉంటాను. అటువంటి పూర్వజన్మల పాప ఫలమే నాకు ఈ స్థితిని కల్పించింది సుమా!

లక్ష్మణా! పూర్వం నేను అరణ్యవాసంలో ఎన్ని కష్టాలు అనుభవించినా రాముని పాదాలను ఆశ్రయించి ఉండేదాన్ని. ఇప్పుడు బంధువు లందర్నీ వదలి ఆశ్రమంలో ఒంటరిగా ఎట్లా ఉండగలను? నా కష్టాలు ఎవరితో చెప్పుకోను? నాయనా! లక్ష్మణా! మునిపత్నులంతా మహాత్ముడైన రాముడు నిన్ను ఎందుకు వదిలేశాడని నన్ను నిలదీసి అడిగితే, నేను ఏం తప్పుచేశానని వాళ్ళకు చెప్పను?

లక్ష్మణా! నేను ఆనాడు అగ్నిప్రవేశం చేసినట్లే, ఈనాడు గంగాజలాలలో ప్రవేశించి ప్రాణత్యాగం చెయ్యగలను. కానీ ఈనాడు అట్లా చెయ్యలేను. ఎందువల్లనంటే, నా గర్భంలో పెరుగుతున్న ఇక్ష్వాకుల వంశాంకురం కూడా నశిస్తుంది. నా భర్తవంశం విచ్ఛిన్నమైపోవటాన్ని నేను సహించలేను.

లక్ష్మణా! నీవు రాజాజ్ఞను నెరవేర్చి పో. దుఃఖాలు అనుభవించటానికే జన్మించిన నన్ను ఒంటరిగా వదిలేసి రాజాజ్ఞను ఆచరించు. నాయనా! నేను చెప్పే ఈ నాలుగు మాటలు కూడా వినిపో.

లక్ష్మణా! నా అత్తగార్లందరికీ భేదమేమీ లేకుండా, చేతులు జోడించి పాదములకు నమస్కరిస్తున్నానని చెప్పు. మహారాజు క్షేమాన్ని విచారించానని చెప్పు. ధర్మాత్ముడైన రాజుకు నా మాటలుగా ఇలా చెప్పు.

'రామ! సీత పరిశుద్ధురాలు; నీయందు గొప్ప భక్తికలది; నిత్యమూ నీ హితాన్నే కోరుకుంటూ ఉంటానని నీకు తెలుసు.

ఓ వీరుడా! ప్రజలతో వచ్చిన అపకీర్తికి భయపడి నువ్వు నన్ను పరిత్యజించావు. నీవే నాకు ఉత్తమగతి అని నమ్ముకున్నదానను. కావున నా వలన నీకు కలిగిన అపనిందను నేనే తొలగించుకోవాలి.

రాజా! నీకు దూరంగా ఉంటూ నీ ధర్మప్రవృత్తికి తోడ్పడుతూ లోకులు నీపై మోపిన అపనిందను నేను తొలగిస్తాను. నేను నా శరీరంగూర్చి విచారించడం లేదు. పౌరులను సోదరులవలె చూసుకోవటమే గొప్పధర్మం. పౌరజానపదుల విషయంలో ధర్మప్రవృత్తి చేత లభించే పుణ్యం వలన అత్యధికమైన కీర్తివస్తుంది. నాపై నిందమోపిన పౌరజానపదులను కూడా నీ సోదరులవలె చూసుకో.

రామా! స్త్రీకి భర్తయే దేవత; భర్తయే బంధువు; భర్తయే గురువు; అందువలన భర్తకు ఇష్టమైనది ప్రాణాలు అర్పించి అయినా చెయ్యడమే ధర్మం" అని రాముడికి తన మాటలుగా చెప్పమంది. నేను గర్భవతి నన్న విషయం చూసి వెళ్ళు లక్ష్మణా అని చెప్పింది.

సీతాదేవి మాటలువిన్న లక్ష్మణుడు డగ్గుత్తికతో ఇలా అన్నాడు: "అమ్మా! నీ రూపాన్ని పూర్వము నేనెన్నడు చూడలేదు. రాముడు దగ్గర లేని నిన్ను నేనెలా చూడగలను?" అని దుఃఖీస్తూ నమస్కరించాడు. "రాముణ్ణి విడిచి ఒంటరిగా శోకదేవతలాగా ఉన్న నిన్ను చూడవలసిన పాపాత్ముణ్ణి అయ్యాను" అని అంటూ ఆమెకు ప్రదక్షిణం చేసి అంజలిఘటించి నమస్కరిస్తూ గంగనుదాటి రథం వద్దకు చేరుకున్నాడు. అప్పుడామె ఆడునెమలివలె కేకలు పెడ్తూ

కూలబడిపోయింది. కొద్దిక్షణాల్లోనే తెలివివచ్చి బిగ్గరగా విలపించింది.

# 49వ సర్గ సీతాదేవి వాల్మీకి ఆశ్రమాన్ని చేరుకోవటం

లక్ష్మణుడు సీతాదేవిని వదిలి వెళ్ళిన తర్వాత ఆమె తన దురదృష్టాన్ని తలచుకొని భోరున ఏడుస్తూ ఉంటే, గంగలో స్నానానికి వెళ్తున్న మునికుమారులు ఆమెను చూశారు. వెంటనే పరుగు పరుగున ఆశ్రమానికి వెళ్ళి వాల్మీకి మహర్షితో ఇలా చెప్పారు. "పూజ్యుడా! ఎవరో మహానుభావుని భార్య ఒంటరిగా భోరున విలపిస్తూ ఉండటం చూశాం. ఆమె ముఖం చూస్తే మానవకాంతలాగా కనిపించలేదు, శాపగ్రస్తురాలైన లక్ష్మీదేవిలా ఉంది.

ఓ పూజ్యుడా! మీ ఆశ్రయాన్ని కోరుకుంటోందని మేం అనుకుంటున్నాం. మిమ్మల్ని శరణుజొచ్చినట్లుంది. మీ ఆశ్రమానికి సమీపానే విలపిస్తోంది. మీరు ఆమెను రక్షించాలి" అని అన్నారు. అంతట వాల్మీకి మహర్షి తన తపశ్శక్తిచేత ఆమె వృత్తాంతం అంతా తెలుసుకొన్నాడు. వెంటనే శిష్యులను వెంటబెట్టుకొని సీతాదేవి విలపిస్తున్న చోటుకు వెళ్ళాడు. మహాత్ముడైన ఆ వాల్మీకి మహర్షి కనుచూపుమేరలో ఉన్న ఆమె వద్దకు వెళ్ళి, అనాథలాగా పడివున్న అభాగ్యురాలైన రాముని భార్యను చూశాడు. ఆమె దుఃఖానికి ఉపశమనం కలిగేలా మధురమైన మాటలతో ఆమెను ఓదారుస్తూ ఇలా అన్నాడు. "ఓ పతివ్రతాశిరోమణీ! నీవు దశరథుని కోడలవు, రాముని భార్యవు, జనకమహారాజు కుమార్తెవు. నీకు స్వాగతం. నా యోగబలంచేత నీవు వస్తున్న విషయం నేను ముందుగానే తెలుసుకున్నాను. ఓ సీతా! దివ్యదృష్టితో నీ వృత్తాంతం అంతా గ్రహించాను. నువ్వు ఏ పాపమూ ఎరుగవు, ఇప్పుడు నా సంరక్షణలో ఉన్నావు. నిర్భయంగా ఉండు. అమ్మా! నా ఆశ్రమానికి సమీపానే కొందరు స్త్రీలు తపస్సు చేసుకుంటున్నారు. ఆ తాపసస్త్రీలు నిన్ను గోవు లేగదూడను చూసుకున్నట్లుగా చూసుకుంటారు. ఓ సీతా! లేచి ఈ అర్ఘ్యం తీసుకో, మానసిక క్షోభనంతా విడిచెయ్యి. ఈ ఆశ్రమాలన్నీ నీ సోంత ఇళ్ళే అని అనుకొని స్వేచ్ఛగా సంచరించు."

సీతాదేవి వాల్మీకిమహర్షి మాటలు విని చాలా ఆశ్చర్యపడింది, ఆయన పాదాలను

శిరస్సుచేత స్పృశించి నమస్కరించింది. దోసిలికట్టి "మీ ఆజ్ఞకు బద్ధురాలను" అంది.

ముందు మహర్షి నడుస్తూ ఉంటే ఆయన వెనుకనే అంజలి ఘటించి అనుసరించి వెళ్ళింది. వాల్మీకిమహర్షి వెంటబెట్టుకొని వస్తున్న సీతను ఆ తాపస స్త్రీలు చూశారు. ఆయనకు ఎదురుగా వెళ్ళి సాదరంగా ఆహ్వానిస్తూ ఇలా అన్నారు: "మునిశ్రేష్ఠా! నీకు స్వాగతం. నీవు మా ఆశ్రమం పావనంచేసి చాలాకాలమైంది. నీ రాక వలన మేమంతా పవిత్రులమైనాం. నీకు నమస్కరిస్తున్నాం. నీవు ఏమి అజ్ఞాపిస్తావో సెలవిస్తే మేమంతా శిరసావహిస్తాం."

ఆ తాపసస్త్రీల మాటలువిన్న వాల్మీకిమహర్షి ఇలా అన్నాడు: "తపస్వినులారా! ఈమె రాముని భార్య సీత. ఇక్కడ ఉండటానికి వచ్చింది. ఈమె దశరథ మహారాజు కోడలు, జనకుని కుమార్తె, మహాపతివ్రత. ఏపాపమూ చేయని ఈమెను భర్త త్యజించాడు. అందువలన నేను ఈమె సంరక్షణ అంతా చూడాలి. ఈమె మీతో కలసి జీవిస్తుంది. మీరంతా ఈమెను ప్రేమాభిమానాలతో చూడాలి. ఈమె గొప్ప రాజవంశంనుండి వచ్చింది; అదీకాక నా సంరక్షణలో ఉంటోంది. మీరంతా ఈమెను విశేషంగా పూజిస్తూ ఉండాలి. అదే నా అభీష్టం" అన్నాడు. ఆ విధంగా వాల్మీకి మహర్షి సీతాదేవిని ఆ తపస్వినుల సంరక్షణలో ఉంచి శిష్యులతో కలసి తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

## 50వ సర్గ లక్ష్మణ–సుమంత్రుల సంభాషణ

సీతాదేవి వాల్మీకి ఆశ్రమానికి చేరుకొని ఆయన సంరక్షణలో ఉండటం అంతా లక్ష్మణుడు చూస్తూ మనస్సులో గొప్ప వ్యధ చెందాడు. దైన్యం చెందినవాడై సంతాపంతో సారథియైన సుమంత్రునితో ఇలా అన్నాడు: "సారథీ! సుమంత్రుడా! చూశావా! విధి ఎంత బలీయమైనదో? సీతా వియోగం వలన రాముడు పొందే దుఃఖాన్ని ఎవరూ వర్ణించి చెప్పలేరు గదా? అట్లా లోకాలన్నింటిచేతా పూజించబడే సీతాదేవి భర్తను విడిచి ఈ ఆశ్రమంలో జీవించాల్సి వస్తోంది! ఇంతకన్నా దుఃఖం మరొకటి ఉంటుందా? ఇదంతా విధి వైపరీత్యం తప్ప మరొకటి కాదు. దైవ నిర్ణయాన్ని ఎవరైనా దాటగలరా? ఏ రాముడు దేవ, గంధర్వ, అసుర, రాక్షసుల్ని అవలీలగా సంహరించగలడో అట్టి రాముడు దైవానికి కట్టుబడి ఉన్నాడు గదా? పూర్వం తండ్రి ఆజ్ఞను పరిపాలించేందుకు పద్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసం చేశాడు. కేవలం పౌరజానపదులు ఏదో అన్నారని సీతాదేవిని మళ్ళీ అడవులపాలు చెయ్యడం అంతకంటే ఎక్కువ బాధాకరం; క్రూరము అని నా కనిపిస్తోంది."

లక్ష్మణుడు పరితప్త హృదయంతో మాట్లాడినదంతా బుద్ధిమంతుడైన సుమంత్రుడు విని ఇలా అన్నాడు. "లక్ష్మణా! సీతను గూర్చి నువ్వు బాధపడకు. పూర్వం బ్రాహ్మణులు జ్యోతిష్కులు నీ తండ్రి సమక్షంలో ఈ విషయాన్ని గూర్చి మాట్లాడుకున్నారు. అప్పుడు నేనూ అక్కడే ఉన్నాను. వాళ్ళప్పుడు చెప్పారు. 'రాముడు కష్టాలే ఎక్కువగా అనుభవిస్తాడు. ఇష్టులైన బంధువు లందరికీ దూరమై వారి వియోగ దుఃఖాన్ని అనుభవిస్తాడు. అంతేకాదు మహాత్ముడు, ధర్మాత్ముడైన రాముడు కొద్దికాలం తర్వాత నిన్ను, సీతను, భరత శత్రుఘ్నుల్నికూడా విడిచి వేయగలడని అప్పుడు వారు చెప్పారు.

లక్ష్మణా! నేను, నీ తండ్రిగారైన దశరథమహారాజు, వసిష్ఠుడు ఉండగా దుర్వాసమహర్షి కొన్ని విషయాలు చెప్పాడు. అవి నీకు గానీ, భరతుడికిగానీ చెప్పతగినవి కావు. ఓ లక్ష్మణా!

దశరథ మహారాజు నాతో 'ఓ సుమంత్రా దుర్వాసమహర్షి చెప్పిన విషయాలు ప్రజల చెవుల్లో పడకూడదు సుమా!' అని నన్ను హెచ్చరించాడు. ఇప్పుడు నీవు భరించలేనంత వేదన చెందుతున్నావు కాబట్టి, నీకేమైనా ఉపశమనంగా ఉంటుందంటే చెప్తాను. ఈ విషయాన్ని నీవు భరతునికిగాని, శత్రుఘ్ననకుగాని చెప్పకూడదు. దైవసంకల్పంచేత ఇటువంటి దుఃఖం కలిగిందో, ఆ దైవాన్ని ప్రతిఘటించలేం కదా!" అప్పుడు లక్ష్మణుడు సుమంత్రుని ఆ విషయం తనకు తప్పక చెప్పమని మరీమరీ అడిగాడు.

(వివరణ: దుఃఖం అంటే ప్రస్తుతం అనుభవిస్తున్న కష్టం, శోకం అంటే, తలచుకొని తలచుకొని ఏడవడం.)

## 51వ సర్గ సుమంత్రుడు దుర్వాసుని ద్వారా విన్న వృత్తాంతం

మహాత్ముడైన లక్ష్మణుడు కోరగా సుమంత్రుడు దుర్వాస మహర్షి వలన విన్న వృత్తాంతాన్ని ఇలా చెప్పాడు: "లక్ష్మణా! పూర్వం అత్రి కుమారుడైన దుర్వాసమహర్షి చాతుర్మాస్యము గడపటానికి వసిష్ఠుని ఆశ్రమానికి వచ్చాడు. గొప్ప తేజస్సుగలవాడూ, యశశ్శాలీయైన నీ తండ్రి, మీ పురోహితుడైన వసిష్ఠుని చూసేందుకు స్వయంగా బయలుదేరి వెళ్ళాడు. అక్కడ వసిష్ఠుని కుడిప్రక్కన దుర్వాసమహర్షి కూర్చున్నాడు. నీ తండ్రి వారిద్దరికీ వినయంగా నమస్కరించాడు. వాళ్ళు కూడా నీ తండ్రిని గౌరవించి స్వాగతం పలికారు. ఆసనం, అర్ఘ్యం, పాద్యం కందమూలాలు ఇచ్చి ఆదరించారు. ఆ మునులు ఇద్దరూ మధ్యాహ్నసమయంలో భవత్కథలు చెప్పుకుంటూ కాలక్షేపం చేశారు.

అప్పుడు నీ తండ్రియైన దశరథమహారాజు అంజలిఘటించి, అత్రి పుత్రుడైన దుర్వాసమహర్షిని ఇలా అడిగాడు. "పూజ్యుడా! నా వంశం ఎంతకాలం ఉంటుంది? నా రాముని ఆయుర్దాయం ఎంత? మిగిలిన పుత్రుల ఆయుర్దాయం ఎంత? నా వంశం గూర్చి తెలుసుకోతగినవేమైనా ఉంటే చెప్పవలసింది. నాకు వినాలని కుతూహలంగా ఉంది" అని అడిగాడు.

అంతట నీ తండ్రి దశరథమహారాజు అడిగిన ప్రశ్నలన్నింటికీ దుర్వాసమహర్షి ఇలా చెప్పాడు.

"రాజా! పూర్వం దేవతలకు దానవులకు యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో దానవులు భృగుమహర్షి భార్యను శరణు కోరారు. ఆమె వాళ్ళకు రక్షణ కల్పిస్తానని మాట ఇచ్చి తనరక్ష కల్పించింది. అందుకు దేవతల పక్షాన యుద్ధంచేస్తున్న శ్రీమహావిష్ణువు తన చక్రాయుధంచేత భృగుమహర్షి భార్య కంఠాన్ని నరికేశాడు. భార్యావియోగానికి కోపించిన మహర్షి విష్ణువును ఇలా శపించాడు. 'జనార్దనా! నీవు కోపావేశంతో చంపకూడని నా భార్యను చంపావు. నాకు

భార్యావియోగాన్ని కలిగించావు. కాబట్టి నీవు మనుష్యుడుగా పుట్టి, నా వలెనే చాలాకాలం భార్యావియోగాన్ని పొందుతావు' అని శపించాడు. భృగుమహర్షికూడా, తన అవివేకానికి చాలా పశ్చాత్తాపపడ్డాడు, ధ్యానంలోకిపోయి అంతర్గతంగా తన ఆత్మతో శ్రీమహావిష్ణువును పూజించాడు.

అప్పుడు భక్తవత్సలుడైన విష్ణుభగవానుడు 'ఓ భృగూ! విచారించకు. నీవు ఇచ్చిన శాపం లోకానికి వరం అవుతుంది. నేను లోకహితం కోసం ఈ శాపాన్ని గ్రహిస్తున్నాను విచారించకు" అని పలికాడు.

ఓ దశరథ మహారాజా! మూడు లోకాలకు ప్రభువైన శ్రీమహావిష్ణువే, రాముడనే పేరుతో నీకు పుత్రుడుగా జన్మించాడు, అంతేకాదు భృగుశాపఫలమైన భార్యావియోగాన్ని కూడా పొందుతాడు.

ఓ రాజా! రాముడు చాలాకాలం అయోధ్యాధిపతిగా ఉంటాడు. పదకొండువేల సంవత్సారాలు రాజ్యపాలన చేస్తాడు. పిదప బ్రహ్మలోకానికి చేరుకుంటాడు. నీ దశరథ రాముడు పెద్ద పెద్ద దానాలతో కూడిన అనేక యాగాల్ని చేస్తాడు. అశ్వమేథయాగం చేస్తాడు. అనేక రాజవంశాల్ని నిలబెడ్తాడు. రాముడికి సీత వలన ఇద్దరు కుమారులు కలుగుతారు. వారి రాజ్యాభిషేకం అయోధ్యలో జరుగదు. వేరొకచోట జరుగుతుంది" అని మహాతేజశ్శాలియైన దుర్వాసమహర్షి చెప్పాడు. పిమ్మట నేను, నీ తండ్రియైన దశరథ మహారాజు తిరిగి నగరానికి వచ్చేశాం. నేను అప్పుడు విన్న మాటలన్నీ మనస్సులోనే ఉంచుకున్నాను. ఓ లక్ష్మణా! ఇప్పుడు నీవున్న స్థితిలో నీకీ విషయం చెబితే కొంత ఊరటగా ఉంటుందని చెప్పాను. నీవు మాత్రం నీ అన్నదమ్ములకు చెప్పవద్దు. రాముడి విషయంలోగానీ, సీత విషయంలోగానీ ఇకపైన దుఃఖించకు. ధైర్యంగావుండు" అని అన్నాడు. సుమంత్రుని మాటలు విన్న లక్ష్మణుడు ఎంతో ఆశ్చర్యపోయాడు, వారా రాత్రికి కేశినీ నదీతీరంలో విడిది చేశారు.

# 52వ సర్గ లక్ష్మణుడు రాముని ఓదార్చటం

లక్ష్మణుడు ఆ రాత్రి కేశినీనదీ తీరాన బసచేసి మరునాడు ఉదయానే ప్రయాణం ప్రారంభించాడు. మిట్టమధ్యాహ్నానికి అయోధ్యకు చేరుకున్నాడు. రాముణ్ణి కలుసుకొని ఏం చెప్పాలి? ఎట్లా చెప్పాలా? అని గుణించుకుంటూ ఉండగానే రాముడు నివసించే చంద్రకాంతివంటి ఆ తెల్లటి భవనం ఎదురుగా నిలబడివుంది. రాముడు మాటిమాటికీ కన్నీరు కారుస్తూ దీనుడై కూర్చుని ఉన్నాడు. లక్ష్మణుడు రాముణ్ణి చూడగానే అతడి పాదాలకు నమస్కరించి మనస్సు కుదుటపరచుకొని అంజలిఘటిస్తూ ఇలా అన్నాడు: “వీరుడా! పూజ్యుడవైన నీ ఆజ్ఞ ప్రకారం సీతాదేవిని వాల్మీకి ఆశ్రమానికి సమీపాన విడచి మరల నీ పాదసేవ చేసుకోవటానికి తిరిగి వచ్చాను. పూజ్యుడా! దుఃఖించకు, కాలానికి ఎవరూ ఎదురు ఈదలేరు గదా? నీవంటి బుద్ధిమంతులు, ఆత్మాభిమానం కలవారూ దుఃఖించరు.

ఈ లోకంలో కూడబెట్టేవన్నీ నశించేవే, ఎంతపైకిపోయినా తిరిగి క్రిందకు రావల్సిందే. కలయికలన్నీ విడిపోవటానికే వస్తాయి. ఎంతకాలం జీవించినా మరణాన్ని తప్పించుకోలేం గదా? అందువల్ల భార్య, పుత్రులు, మిత్రులు, ధనం మొదలైన విషయాల్లో ఆసక్తిని అధికంగా పెంచుకోరాదు. ఏదో ఒక రోజున వియోగం తప్పదు గదా?

ఓ రామా! నీవు నిన్ను అదుపులో ఉంచుకోగలవు, నీవు లోకాల్నే అదుపులో ఉంచగల సమర్థుడవు. మనస్సును నిగ్రహించు, దుఃఖాన్ని దిగమ్రింగు. ఓ రామా! నీవు పురుషశ్రేష్ఠుడవు. నీవు ఇట్లాగే బెంగపెట్టుకొని కూర్చుంటే, మళ్ళీ అపవాదు రావచ్చు. అదే లోకులు ‘చూశావా? రాముడు ప్రజ్ఞకైతే భార్యను పంపాడేగాని, ఆమెపై మోహం చంపుకోలేక ఆమెను గూర్చియే ఆలోచిస్తూ రాచకార్యాలు ప్రక్కన పెడ్తున్నాడు’ అని అంటారు. ఏ అపవాదు వలన నీవు సీతను వదిలివేశావో, మళ్ళీ అదే అపవాదు ఇంకోరూపంలో వస్తుంది. అందువల్ల మనస్సును మనస్సుచేత, ఆత్మను ఆత్మచేత నిగ్రహించుకో. సహజంగా బుద్ధి దుర్బలమైనది; దానికి ధైర్యాన్ని

నూరిపొయ్యి. లోకులు నిందించే అవకాశం ఇవ్వకు." అంటూ లక్ష్మణుడు రాముణ్ణి ఓదార్చాడు. అంతట రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు: "లక్ష్మణా! నీ ఓదార్పు మాటలతో నా మనస్సులోని భారం దించినట్లైయింది, ఇకపై మనస్సు కుదుటపరచుకొని కార్యోన్ముఖుడనవుతాను."

# 53వ సర్గ నృగు మహారాజు కథ

లక్ష్మణుడి మాటలు విన్న రాముడు పరమానందపడి లక్ష్మణుని ఎంతగానో అభినందించాడు. "ఓ లక్ష్మణా! ఇట్లాంటి క్లిష్టసమయాల్లో వివేకవంతము, సమ్మతమైన హితబోధచేసేవాళ్ళు ఎందరుంటారు? నీవంటి శుభలక్షణములు గలవారు ఎక్కడ కనిపిస్తారు. నామనస్సులో మాట చెప్తున్నాను విను. ఈ మనోవ్యధలో ఉండి, నేను పౌరులను చూసి నాలుగు రోజులైంది. అందుకు నా అంతరాత్మ ఎంతగానో క్షోభిస్తోంది. ఇప్పుడే పౌరుల పనిమీద మనస్సు పెడ్తాను. నీవు వెంటనే మంత్రుల్ని, పురోహితుల్ని పిలిపించు. ప్రతిరోజూ పౌరుల పనులు చూడని రాజు ఘోరమైన గాలి, వెలుతురులేని నరకానికి పోతాడు.

పూర్వం నృగుడనే మహారాజు ఉండేవాడు. అతడు ఎంతో ధర్మసమ్మతంగా రాజ్యపాలనచేస్తూ ఉండేవాడు. విశేషించి గొప్ప బ్రాహ్మణ భక్తుడు. అతడు అనేకవేల లక్షల గోవుల్ని లేగ దూడలను బ్రాహ్మణులకు దానం ఇచ్చేవాడు.

ఆహితాగ్నిపరుడు, దరిద్రుడు, ఉంఛ వృత్తితో (చేలల్లో రాలిన గింజలు ఏరుకుంటూ) జీవించేవాడు. ఆ బ్రాహ్మణుడి ఆవు, లేగదూడా ఒక మందలో కలసిపోయి మరొక బ్రాహ్మణుడికి దానం ఇవ్వడం జరిగింది. ఆకలి బాధతో బాధపడుతున్న ఆ బ్రాహ్మణుడు తన ఆవు కనిపించక, దేశం అంతా గాలించి వెదుకుతూ 'కనఖం' అనే గ్రామంలో తన ఆవుదూడ ఒక బ్రాహ్మణుడి ఆవుల్లో కలిసిపోయి ఉండటం చూశాడు. ఆవు బాగా ఆరోగ్యంగానే ఉందిగానీ, దూడమాత్రం శుష్కించి పోయివుంది. అప్పుడా బ్రాహ్మణుడు 'శబలా' రా! అని పిలిచాడు. వెంటనే ఆ ఆవు బ్రాహ్మణుని గొంతు గుర్తుపట్టి అతడి వెనకాలే బయలుదేరింది. అంతవరకూ ఆ గోవు ఎవరి ఇంట్లో ఉంటోందో, ఆ బ్రాహ్మణుడువచ్చి మొదటి బ్రాహ్మణుని అడ్డుకొని, "ఓ పండితుడా! ఈ గోవు నాది. దీన్ని రాజు నాకు దానం చేశాడు. కాబట్టి విడిచిపెట్టి వెళ్ళు" అన్నాడు. ఆ పండితులిద్దరి మధ్యా వివాదం పెరిగిపోయి, నృగు మహారాజు వద్దకు వెళ్ళారు. కానీ వాళ్ళిద్దరూ

రాత్రింబవళ్ళు రాజుకోసం నిరీక్షిస్తూ ఉన్నా ఆయన దర్శనం కాలేదు. వాళ్ళు కోపంతో నృగు మహారాజును ఇలా శపించారు. "పేదల కష్టాలు చూడకుండా మాకు కష్టం కలిగించావు కాబట్టి, నీవు ఎవరి కంటాపడకుండా ఒక తొండవై ఒక బావిలో పడి ఉండు." పిమ్మట ఆ నృగు మహారాజు తన శాపవృత్తాంతం తెలుసుకొని ఆ బ్రాహ్మణులను కాళ్ళావేళ్ళాపడి బ్రతిమాలుకొనగా, వారిట్లా శాపవిమోచనాన్ని ప్రసాదించారు. "విష్ణువు యాదవుల కీర్తిని వృద్ధి పొందించడానికై వాసుదేవుడనే పేరుతో మానవుడుగా జన్మిస్తాడు. రాజా! అతడి దర్శనం అయిన తర్వాత నీకు శావిమోచనం కలుగుతుంది. కలియుగం దగ్గరపడే ముందు భూభారాన్ని తొలగించడం కోసం గొప్ప పరాక్రమంగల నరనారాయణులుగా పుట్టగలరు" అని శాపవిమోచనాన్ని ప్రసాదించి, ఆ బ్రాహ్మణులిద్దరూ కలసి ఆ గోవును మరొక బ్రాహ్మణునికి దానం ఇచ్చి ఎవరి దారిన వాళ్ళు పోయారు.

లక్ష్మణా! ఈ విధంగా ఆ రాజు బ్రాహ్మణ శాపంవలన దారుణమైన కష్టాలు అనుభవిస్తున్నాడు. కాబట్టి పనిమీదవచ్చే పౌరులకు బాధకలిగించే రాజు దోషం చేసినవాడవుతాడు. ఓ లక్ష్మణా! నీవు వెంటనే వెళ్ళి పౌరులెవరైనా దర్శనం కోసం వచ్చారేమో చూడు" అన్నాడు.

# 54వ సర్గ నృగ మహారాజు శాపాన్ని అనుభవించడం

పరమార్థాన్ని తెలుసుకోగోరిన లక్ష్మణుడు అంజలిఘటించి రాముణ్ణి ఇలా అడిగాడు. "రామా! ఆ బ్రాహ్మణులిద్దరూ గోరంత అపరాధానికి కొండంత శాపాన్నిచ్చారు గదా? అప్పుడా రాజు బ్రాహ్మణులను ఏమీ అనలేదా?" అని అడిగాడు. అందుకు రాముడు ఇలా అన్నాడు.

"సౌమ్యుడా! నృగ మహారాజుకు ఈ విషయం తెలుసుకునేటంతలోనే, ఆ బ్రాహ్మణులిద్దరూ వెళ్ళిపోయారు. అంతట ఆ మహారాజు ఈ శాపాన్ని ఎట్లా అనుభవించాడో చెప్తాను విను.

ఓ మంత్రి సత్తములారా! నారద, పర్వతులవంటి దేవతా సమానులైన ఆ ఇద్దరు బ్రాహ్మణులు ఇద్దరూ నాకు భయంకరమైన శాపాన్నిచ్చారు. బ్రాహ్మణశాపం వృథాగా పోదుగదా! అందువలన వెంటనే నా కుమారుడైన వసువును రాజ్యాభిషిక్తుణ్ణి చెయ్యడానికి ఏర్పాట్లు చెయ్యండి.

బ్రాహ్మణ శాపాన్ని చాలాకాలం అనుభవించాల్సి ఉంటుంది. అందుకోసం నేను నివసించేందుకు ఒక పెద్ద గోతిని తవ్వండి, అందులో మూడు కాలాల్లోను సుఖంగా ఉండేట్లు (శీతా కాలంలో చలిబాధలేకుండాను, వేసవికాలంలో వేడిబాధ లేకుండాను, వర్షాకాలంలో వర్షం బారిన పడకుండాను) మూడు గోతులు ఉండేట్లుగా నిర్మించండి. నేను ఆ గోతిలో ఉంటూ నా శాపవిమోచానం కోసం నిరీక్షిస్తూవుంటాను.

ఆ గోతిలో ఫలవృక్షాలను, పుష్పాలతో నిండిన లతలతో నీడనిచ్చే పొదలుగా పెరిగే వృక్షాల్ని నాటించండి. ఆ గోతిని అన్ని విధాలా సుందరంగా ఉండేట్లు నిర్మించండి, నా శాప కాలం అంతా అక్కడ గడిపేస్తాను. ఆ గోతికి నాలుగు వైపులా ఒకటిన్నర యోజనాల మేరకు సుగంధాల్ని వెదజల్లే పుష్పాల్ని చల్లించండి.

లక్ష్మణా! ఆ నృగమహారాజు తనకు కావలసినట్లుగా అన్ని ఏర్పాట్లూ చేయించుకొని, పుత్రుణ్ణి రాజ్యాభిషిక్తుణ్ణి చేసి అతడికి ఇలా ఉపదేశం చేశాడు. 'నరశ్రేష్ఠా! పుత్రా! నా కోసం నువ్వు బాధపడకు, దైవం చాలా గొప్పశక్తిగలది. ఎంతటివాళ్ళూ దైవాన్ని అతిక్రమించిపోలేరు, ఆ దైవమే నాకీ కష్టం కలిగించింది. కుమారా! మనం అందరం పూర్వజన్మల కర్మఫలాన్ని అనుసరించి కష్టసుఖాలు, ధన ధాన్యాదులు పొందుతూ ఉంటాం. కర్మానుభవం కాగానే, మనం వెళ్ళవలసిన చోటుకు చేరుకుంటాం. అందుచేత నా కోసం దుఃఖించకు' అని బోధించాడు.

లక్ష్మణా! మహాకీర్తిశాలియైన ఆ నృగమహారాజు పుత్రునికి ఈ విధంగా బోధించి, తను ఏర్పాటు చేసుకున్న (తను తీసుకొని) గోతి లోనికి ప్రవేశించాడు. ఆ బ్రాహ్మణులిచ్చిన శాపాన్ని ఆ విధంగా అనుభవించటం ప్రారంభించాడు.

# 55వ సర్గ నిమి చక్రవర్తి, వసిష్ఠుడు పరస్పరం శపించుకోవడం

లక్ష్మణా! నృగమహారాజు శాపవృత్తాంతాన్ని గూర్చి నీకు చెప్పాను. నీకు వినాలనే కుతూహలం ఉంటే మన పూర్వీకుడు, ఇక్ష్వాకులలో పన్నెండవవాడైన నిమిచక్రవర్తి కథ చెప్తాను విను. ఆ నిమిచక్రవర్తి స్థిరమైన బుద్ధితో ధర్మాన్ని తప్పక పాటిస్తూ ఉండేవాడు. ఆ నిమి గౌతముని ఆశ్రమానికి దగ్గరగా, ఇంద్రుని నగరమైన అమరావతి వంటి పట్టణాన్ని నిర్మించాడు. ఆ పట్టణానికి వైజయంతము అని పేరుపెట్టాడు. యశశ్శాలియైన నిమిచక్రవర్తి ఆ నగరంలో నివసించాడు. ఆ మహాపట్టణాన్ని నిర్మించి, తన తండ్రి కోరిక ప్రకారం దీర్ఘసత్రయాగం చెయ్యాలని సంకల్పించాడు. మనుచక్రవర్తి కుమారుడు, తన తండ్రియైన ఇక్ష్వాకును ఆహ్వానించాడు. బ్రహ్మర్షులలో శ్రేష్ఠుడైన వసిష్ఠుని ఋత్విక్కుగా నియమించాడు. ఆయనతో పాటు అత్రి మహర్షిని, అంగరసుని, తపోనిధియైన భృగువును కూడా నియమించాడు. ఇంతలో వసిష్ఠుణ్ణి దేవేంద్రుడు పిలిచి తను చేస్తున్న యజ్ఞాన్ని పూర్తిచేసి పొమ్మన్నాడు. దేవేంద్రుణ్ణి కాదనలేని వసిష్ఠుడు నిమిమహారాజుతో తను దేవలోకం నుండీ వచ్చి సత్రయాగాన్ని పూర్తిచేస్తానని చెప్పి వెళ్ళిపోయాడు.

పిదప నిమి మహారాజు తన యాగం త్వరగా పూర్తికావాలని వసిష్ఠుని స్థానంలో గౌతముణ్ణి నియమించి యజ్ఞాన్ని పూర్తిచేశాడు. ఆ యజ్ఞం పూర్తి అయ్యేందుకు ఐదువేల సంవత్సరాలు పట్టింది.

పిమ్మట ఇంద్రుని యజ్ఞాన్ని పూర్తిచేయించి వచ్చిన వసిష్ఠుడు యజ్ఞం ప్రారంభించాలని నిమిమహారాజు వద్దకు వెళ్ళాడు. తన స్థానంలో గౌతముడు ఉండి యజ్ఞం పూర్తిచేయించాడని తెలుసుకొని మహారాజుపై ఉగ్రుడైపోయాడు. వసిష్ఠమహర్షి వెళ్ళే సమయానికి నిమిమహారాజు నిద్రపోతున్నాడు, రాజుకోసం ఒక ముహూర్తకాలం కూర్చున్నాడు. ఎంతకూ రాకపోవటంచేత కోపావిష్టుడై "రాజా! నువ్వు నన్ను అవమానం చేశావు, నాకు వాగ్దానంచేసి, మరొకరిచేత నీ

యజ్ఞాన్ని పూర్తి చేయించుకున్నావు. అందువల్ల నీ దేహం చైతన్యంలేకుండా పోవుగాక!" అని శపించాడు.

పిదప నిద్ర మేల్కొన్న రాజు, మహర్షి శాపం గూర్చి విన్నాడు, రాజు తిరిగి వసిష్ఠుని ఈ విధంగా శపించాడు. "ఓ బ్రహ్మర్షీ! నేను స్పృహలేకుండా నిద్రపోతూవుంటే నన్ను శపించావు, కాబట్టి బ్రహ్మర్షివైన నీ దేహం కూడా చైతన్యంలేకుండా పోవుగాక."

లక్ష్మణా! ప్రభావంలో నిమిచక్రవర్తి, వసిష్ఠ మహర్షులు సమానులే కావటం వలన కోపావేశాలకులోనై ఒకరినొకరు శపించుకున్నారు. వెంటనే వారిద్దరూ దేహంలేనివారై పోయారు.

# 56వ సర్గవసిష్ఠుడు వరుణుని రేతస్సులో ప్రవేశించటం

రాముడు చెప్పిన కథ విన్న లక్ష్మణుడు ఆశ్చర్యపోయాడు. "అన్నా! నిమి, వసిష్ఠులు దేహాల్ని వదిలిపెట్టి మళ్ళీ దేహాల్ని ఎట్లా పొందగలిగారు?" అని అడిగాడు. అంతట రాముడు ఇలా చెప్పాడు.

"లక్ష్మణా! ధార్మికులైన రాజర్షి, బ్రహ్మర్షులు (నిమి–వసిష్ఠులు) ఇద్దరూ దేహం లేనివారై వాయురూపాన్ని పొందారు. అంతట వసిష్ఠ మహర్షి వాయురూపంలో బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి ప్రదక్షిణ నమస్కారం చేసి "తండ్రీ! దేవదేవా! పూజ్యుడా! నిమి ఇచ్చిన శాపం వలన రూపాన్ని కోల్పోయాను. వాయురూపంలో మిగిలాను. దేహం లేకుండా ఏ ప్రాణీ కూడా కర్మలు చెయ్యలేదు. దేహంలేని ప్రాణికి అన్నీ దుఃఖాలే. కాబట్టి నాకు ఒక దేహాన్ని అనుగ్రహించు" అని ప్రార్థించాడు. అందుకు బ్రహ్మదేవుడు అభయమిచ్చి ఇలా అన్నాడు. "ఓ యశస్వీ! నీవు మిత్రా వరుణుల (సూర్యుడు–వరుణుడు) తేజస్సులో ప్రవేశించు. ఆ విధంగా నీవు శరీరాన్ని ధరిస్తావు. తిరిగి ఆ విధంగా నాకు పుత్రుడవవుతావు" అని ఆదేశించాడు. అంతట వాయురూపంలో ఉన్న వసిష్ఠుడు వరుణుని నివాసానికి చేరుకున్నాడు. అదే సమయంలో ఊర్వశి చెలికత్తెలతో కలసి ఆటపాటల్తో విహరిస్తూ ఉంటే వరుణుడికి ఆమెపై కోరిక కలిగింది. ఆ మాటే ఊర్వశితో అన్నాడు. అందుకా ఊర్వశి అంజలిఘటించి నమస్కరిస్తూ ఇలా అంది. "దేవా! సూర్యభగవానుడు ముందుగా నన్ను తన వద్దకు రమ్మన్నాడు. అందువల్లనే సూర్యభగవానుడికి వశమైపోయాను." పూర్తిగా మన్మథునికి వశమైపోయిన వరుణుడు, ఇలా అన్నాడు. "ఓ ఊర్వశీ! ఓ అందమైన కటిప్రదేశం గలదానా! నాతో సంగమించేందుకు ఇష్టం లేకపోయినా, నాపై నీ అనురాగం చూపుతూ నా కోరిక తీరేట్లు చూడు. అంతే చాలు" అన్నాడు. అందుకా ఊర్వశి సంతోషంతో ఇలా అంది "ప్రభూ! నిన్ను మానసికంగా సంతోషపెట్టగలను, శరీరసంపర్కం మాత్రం చెయ్యలేను. నా భావన అంతా నీపైనే లగ్నం చేస్తాను" అంది. అంతట ఊర్వశి మాటలకు చాలా సంతోషించినవాడైన వరుణుడు, అగ్నితో సమానమైన కాంతిగల తన

రేతస్సును ఒక కుండలో విడిచిపెట్టాడు.

పిమ్మట ఊర్వశి, సూర్యభగవానుని సన్నిధికి వెళ్ళింది. అప్పుడు ఆమె ప్రవర్తనకు కోపించిన సూర్యభగవానుడు ఇలా అన్నాడు: "ఓ ఊర్వశీ! నేను ముందుగా నిన్ను పిలిచాను కానీ నువ్వు ఎంతమాత్రం భీతిలేనిదానివై, దుష్టురాలివై భావనచేత మరొక పురుషుణ్ణి వరించావు. కాబట్టి నీవు భూలోకానికిపోయి కొంతకాలం ఉండు. బుధుని కుమారుడు, కాశీరాజు అయిన పురూరవుడు నీకు భర్త కాగలడు. పోయి అతడితో కొంతకాలం గడిపి రా!"

ఓ లక్ష్మణా ఆ తర్వాత సూర్యభగవానుని శాపం వలన ప్రతిష్ఠాన నగరంలో నివసిస్తున్న బుధుడి ఔరసపుత్రుడైన పురూరవుని ఊర్వశి భర్తగా పొందింది. అంతట పురూరవుడు ఆమె వలన మహాబలాఢ్యుడైన 'ఆయువు' అనే పుత్రుణ్ణి పొందాడు. ఇంద్రుడితో సమానమైన కాంతిగల నహుషుడు, ఈ ఆయువు పుత్రుడే.

లక్ష్మణా! ఇంద్రుడు వజ్రాయుధంచేత వృత్రాసురుణ్ణి సంహరించిన పిమ్మట నహుషుడు లక్ష సంవత్సరాలు ఇంద్రపదవిలో ఉన్నాడు. అందమైన ఊర్వశి శాపకాలం తీరిన పిదప తిరిగి దేవలోకానికి వెళ్ళిపోయింది."

# 57వ సర్గవసిష్ఠుడు క్రొత్తదేహమును పొందటం

దివ్యమైనది, అద్భుతమైనదీ అయిన వసిష్ఠమహర్షి, నిమిచక్రవర్తుల కథను విన్న లక్ష్మణుడు సంతోషిస్తూ ఇలా అడిగాడు. "రామా! దేహాలు కోల్పోయిన బ్రహ్మర్షి, రాజర్షులు తిరిగి దేహాల్ని పొందారా? పొందితే ఏ విధంగా పొందగలిగారు?" అని అడిగాడు. అందుకు రాముడు ఇలా బదులు చెప్పాడు. "లక్ష్మణా! సూర్యుడు, వరుణుల తేజస్సును ఒక కుంభంలో ఉంచారు, ఆ కుంభంలో నుండి ఇరువురు మహర్షులు బయటకువచ్చారు. ముందుగా భగవత్స్వరూపుడైన అగస్త్యమహర్షి బయటకువచ్చాడు, ఊర్వశి మూలంగా స్కలించిన సూర్యుని తేజస్సు ముందుగా ఉంచబడింది. అటుపిమ్మట వరుణుని తేజస్సుకూడా ఆ కుంభంలోనే స్కలించబడింది. కొంతకాలానికి సూర్యుడు, వరుణుల తేజస్సు కారణంగా ఆ కుంభంలోనుండి తేజోవంతుడు, ఇక్ష్వాకువంశస్థుల పురోహితుడు అయిన వసిష్ఠుడు పుట్టాడు. ఓ లక్ష్మణా! దోషములేని వసిష్ఠుడు జన్మించగానే, ఇక్ష్వాకువు తన వంశానికి పురోహితునిగా స్వీకరించాడు.

లక్ష్మణా! మహాత్ముడైన వసిష్ఠుని, క్రొత్తశరీరం ఎట్లా ఏర్పడిందో వివరంగా చెప్పాను. ఇప్పుడు రాజర్షియైన నిమిచక్రవర్తి శరీరం ఎట్లా వచ్చిందో చెప్తాను విను.

మహాత్ములైన ఋషీశ్వరులందరూ రాజు దేహం లేనివాడవటం చూసి, యోగదీక్ష ఇచ్చారు. ఆ రాజు దేహాన్ని సుగంధద్రవ్యాల చేతను, తైలముల చేతను కాపాడారు. అటుపిమ్మట యజ్ఞం పరిసమాప్తం అయింది. అప్పుడు భృగువు ఇలా అన్నాడు: "రాజా! యజ్ఞం సంతృప్తికరంగా పరిసమాప్తమైంది, దేవతలంతా సంతోషించారు. కాబట్టి ఇప్పుడు ఈ రాజుకు శరీరం వచ్చేట్లు చేస్తాను." అక్కడే ఉన్న దేవతలందరూ, "మేము ఇతడి ప్రాణాలు ఇచ్చేందుకు సిద్ధంగానే ఉన్నాం. కానీ ప్రాణాన్ని ప్రవేశపెట్టేందుకు శరీరం కావాలి గదా? ఏ శరీరంలో ప్రవేశపెట్టాలో చెప్పండి" అన్నారు. అప్పుడు నిమి ఆత్మ ఇలా అంది. "నేను సర్వప్రాణుల కళ్ళలో ఉండాలని కోరుకుంటున్నాను" అంది. అంతట దేవతలు "ఓ నిమిచక్రవర్తీ! నీవు వాయువు

రూపంలోనే తిరుగుతూ ప్రాణుల నేత్రాల పైన ఉంటావు. నీవు విశ్రాంతి తీసుకోవాలని అనుకున్నప్పుడు కనురెప్పలు వాలిపోతాయి'' అని అన్నారు. పిమ్మట దేవతలంతా వారి స్థానాలకు వెళ్ళిపోయారు.

పిమ్మట మహాత్ములైన ఋషులంతా నిమి దేహాన్ని తీసుకొనివచ్చారు. నిమికి కుమారుణ్ణి పుట్టించడానికి, నిమి శరీరంపైన ఆరణిని (యజ్ఞాల్లో నిప్పు పుట్టించేందుకు వాడే కర్ర) ఉంచి, మంత్రాలను పఠిస్తూ, హోమాలు చేస్తూ (ఆరణితో) బలంగా మథించారు. ఆ విధంగా అతడి శరీరంలో నుండి ఒక అద్భుత వ్యక్తి పుట్టుకొచ్చాడు. మథించడంచేత పుట్టాడు కాబట్టి 'మిథి' అన్నారు. అందులోనుండి జన్మించాడు కాబట్టి 'జనకుడు' అన్నారు. దేహంనుండి పుట్టుకొని వచ్చాడు కాబట్టి 'విదేహుడు' అన్నారు. ఈ విధంగా జనకునికి ఈ పేర్లు అన్నీ స్థిరపడ్డాయి. ఆ విధంగా 'మిథి' ఉంటున్న నగరం 'మిథిలానగరమని' ప్రసిద్ధిచెందింది.

ఓ లక్ష్మణా! నిమిచక్రవర్తి శాపంవల్ల వసిష్ఠునకు, వసిష్ఠుని శాపంవల్ల నిమికి నూతన శరీరాలు ఎట్లా వచ్చాయో తెలుసుకుంటే ఆశ్యర్యం కలుగుతుంది'' అని రాముడు అన్నాడు.

## 58వ సర్గ శుక్రాచార్యుడు యయాతిని శపించటం

రాముడు చెప్పినదంతా లక్ష్మణుడు శ్రద్ధగా విన్నాడు. మరల రాముణ్ణి ఇలా అడిగాడు: "రామా! వసిష్ఠ నిమిచక్రవర్తుల కథలు అద్భుతంగా ఉన్నాయి. అయితే నాకో సందేహం. నిమి చక్రవర్తి యాగంచేస్తూ దీక్షలో ఉన్నాడుగదా? దీక్షలో ఉంటూ, ఓర్పులేనివాడై, అందులో బ్రహ్మర్షియైన వసిష్ఠుని విషయంలో సరిగా ప్రవర్తించలేదు" అన్నాడు. అప్పుడు రాముడు ఇలా అన్నాడు: "ఓ వీరుడా! అందరి పురుషుల్లోనూ ఓర్పు సమానంగా ఉండదుగదా! యయాతి మహారాజు విషయాన్ని చూడు! శుద్ధ సత్వాన్ని అవలంబించి, రోషాన్ని నిగ్రహించి శుక్రాచార్యుని వలన భయంకరమైన శాపాన్ని పొందాడు. నీకు యయాతి కథ చెప్తాను విను.

సౌమ్యుడా! లక్ష్మణా! నహుషుని పుత్రుడు యయాతి. అతడు ప్రజలను ఎంతో ప్రేమతో పాలించేవాడు. అతనికి ఇద్దరు భార్యలు. ఇద్దరూ కూడా సాటిలేని అందగత్తెలే. ఒకామె శర్మిష్ఠ, రెండవభార్య దేవయాని. శర్మిష్ఠ రాజర్షి, దానవరాజుయైన వృషపర్వుని కుమార్తె. రాజుకు ఈమె యందు ప్రేమ అధికంగా ఉండేది. రెండవభార్య దేవయాని. ఈమె రాక్షసగురువైన శుక్రాచార్యుల కుమార్తె, రాజుకు ఈమెపై అనురాగం ఉండేది కాదు.

శర్మిష్ఠ, దేవయాని ఇద్దరూ గుణవంతులు, రూపవంతులే. శర్మిష్ఠకు 'పూరువు' డనే కుమారుడు, దేవయానికి 'యదువు' అనే పుత్రుడు జన్మించారు. రాజుకు పూరువు తల్లి ప్రేమ పాత్రురాలు కావటం వలన, రాజుకు కూడా పూరువుడంటేనే ఇష్టంగా ఉండేది. తండ్రి తనయందు తగినంత ప్రేమాదరాలు చూపటం లేదని యదువు దుఃఖీస్తూ ఉండేవాడు. ఒకనాడు తల్లియైన దేవయాని వద్దకుపోయి ఇలా అన్నాడు: "తల్లీ! నీవు దేవతాస్వరూపుడైన శుక్రాచార్యులవారి కడుపున జన్మించావు. నేను నీ కడుపున జన్మించాను, అయినా మనమిద్దరం రాజు చేత రోజూ అవమానించబడుతున్నాం. ఈ అవమానాలు సహిస్తూ బ్రతకడం కన్నా, ఇద్దరం కలసి అగ్నిప్రవేశం చేద్దాం. రాజును శర్మిష్ఠతోనే కులకనియ్యి. అట్లా కాదంటావా; నాకు

అనుమతి ఇవ్వు, నేను అగ్నిప్రవేశం చేస్తాను. నేను మాత్రం ఇకపై ఈ అవమానాలతో జీవించలేను:" అప్పుడు దేవయాని దుఃఖీస్తూ తండ్రిని స్మరించింది. శుక్రాచార్యుడు తన తపోశక్తిచేత కూతురు దుఃఖీస్తూ తన్ను తలచుకోవడం తెలుసుకున్నాడు. వెంటనే కుమార్తె ముందు ప్రత్యక్షం అయ్యాడు. దేవయాని తండ్రితో ఇలా అంది: "ఓ తండ్రీ! నేను ఈ అవమానాలు సహిస్తూ జీవించలేను. అగ్నిప్రవేశం చేస్తాను, లేదా నీళ్ళలో దూకుతాను. ఓ మునీశ్వరా! చెట్టును అవమానించడం వలన ఆ చెట్టును ఆశ్రయించి ఉన్న ప్రాణులు కూడా బాధపడతాయి గదా! ఈ రాజర్షియైన యయాతి నన్ను ప్రేమతో చూసుకోవడంలేదు, సవతి ముందు అవమానాలు పడాల్సివస్తోంది. నేను గౌరవం లేకుండా బ్రతుకుతున్నాను, అనాదరంతో బ్రతికి ఉండటంకన్నా మరణించడం మేలని అనుకుంటున్నాను."

కుమార్తె దీనగాథ విన్న శుక్రాచార్యుని మనస్సు వికలమైపోయింది. యయాతిని ఇలా శపించాడు. "ఓ యయాతీ! దుర్బుద్ధీ! నువ్వు నన్నూ, నా కూతుర్నీ అవమానిస్తున్నావు. నీ రూపం శరీరం శిధిలమైపోయి ముసలివాడివైపో" అన్నాడు. సూర్యునితో సమానమైన తేజస్సుగలవాడూ బ్రాహ్మణులలో శ్రేష్ఠుడైన శుక్రాచార్యుడు యయాతికి శాపం ఇచ్చి కుమార్తెను ఓదార్చి తన ఇంటికి వెళ్ళిపోయాడు.

## 59వ సర్గ యయాతి తన వార్ధక్యాన్ని పూరువునకు ఇవ్వడం

శుక్రాచార్యుడు శపించగానే యయాతి మహారాజుకు ముసలితనం వచ్చేసింది. అకాలంలో తనకు వార్ధక్యం రావడంవల్ల చాలా దుఃఖించాడు. దేవయాని పుత్రుడైన యదువును పిలిచి “నాయనా! యదూ! నాకు అకాలంలో ఈ వృద్ధాప్యం వచ్చిపడింది. నాకు ఇంకా భోగాలపైన మక్కువపోలేదు. అంతేకాకుండా యజ్ఞాయాగాలు ఎన్నో చెయ్యాలని ఉంది. అందువల్ల నీవు కొంతకాలంపాటు నా ముసలితనాన్ని తీసుకో. నేను భోగాలన్నీ అనుభవించిన తర్వాత నీ యౌవనాన్ని తిరిగి ఇచ్చివేస్తాను” అని అడిగాడు. అందుకు యదువు కఠినంగా ఇలా అన్నాడు. “నీకు పూరువే ఇష్టుడు కదా! రోజూ అతడితోనే కలసి రాజ్యపాలన చేస్తున్నావు; భోజనాదులు అతడితోనే పంచుకుంటున్నావు గదా? నీ ముసలితనాన్ని కూడా అతడితోనే పంచుకో!” అన్నాడు. అంతట యయాతి, పూరువుని పిలిచి “నాయనా! పూరుమా! నా ముసలితనాన్ని నీవు తీసుకో, నీ యౌవనాన్ని నాకు ఇవ్వు. నేను భోగాలు అనుభవించిన తర్వాత నీ యౌవనాన్ని నీకిచ్చేస్తాను” అని అడిగాడు.

యయాతి మాటలు విన్న పూరువు తండ్రితో ఇలా అన్నాడు. “తండ్రీ! నీవు నన్ను అట్లా కోరడమే నాపై అనుగ్రహం చూపినట్లు అనుకొంటున్నాను. వెంటనే నా యౌవనాన్ని తీసుకో. నేను నీ వార్ధక్యాన్ని సంతోషంతో స్వీకరిస్తాను.” పిమ్మట యువకుడైన యయాతి ఎన్నో భోగాల్ని అనుభవించాడు, వేలకొద్దీ యాగాల్ని చేశాడు. వేలసంవత్సరాలు రాజ్యాన్ని పాలించాడు. సంతృప్తుడైన యయాతి పుత్రుడైన పూరువునితో ఇలా అన్నాడు. “పుత్రా! ఇదిగో నీ యౌవనము. నీవు చేసిన త్యాగానికి ఎంతో సంతోషించాను, నిన్ను రాజ్యాభిషిక్తుణ్ణి చేస్తాను.” అంతట యదువుతో ఇలా అన్నాడు. “ఓరీ దుర్బుద్ధీ! నీవు క్షత్రియరూపంలో ఉన్న రాక్షసుడవు; నా ఆజ్ఞను ధిక్కరించావు. హేళనగా మాట్లాడావు, అందువల్ల నీ సంతానం అంతా క్రూరులైన రాక్షసులవుతారు. నీకు పిశాచాలు పుత్రులుగా పుడ్తారు. ఇకపై నీవు చంద్రవంశానికి చెందినవాడవు కాకుండా, నీ బుద్ధులకు సరితూగే రాక్షసవంశం ఏర్పడుతుంది” అని

శపించాడు.

రాజర్షియైన ఆ యయాతి పూరువుని రాజ్యాభిషిక్తునిచేసి రాజ్యాన్ని వృద్ధిపొందించమని ఆశీర్వదించి తాను తపోవనానికి వెళ్ళాడు. పిదప మరణానంతరం యయాతి స్వర్గానికి వెళ్ళాడు. పూరువు కాశీరాజ్యాన్ని ధర్మబద్ధంగా పాలించాడు.

రాజవంశం నుండి బహిష్కరించబడిన యదువు క్రౌంచవనంలో పట్టణాన్ని నిర్మించుకొని వేలాది రాక్షసుల్ని వృద్ధిచేశాడు. ఓ లక్ష్మణా! సహనవంతుడై, యయాతి మహారాజు శుక్రాచార్యుడిచ్చిన శాపాన్ని సహించాడు. అటువంటి శాపాన్ని నిమి సహించలేదు.

ఓ లక్ష్మణా! సౌమ్యుడా! నీకు యయాతి కథ అంతా చెప్పాను. పనుల కోసం మనల్ని చూసేందుకు ఎవరైనా రాజ సభకు వచ్చారేమో వెళ్ళి చూద్దాం. లేకపోతే నృగమహారాజు వలె మనంకూడా పౌరుల కోపానికి గురికావలసి ఉంటుంది. రాముడు ఇట్లా అంటూ ఉండగానే నక్షత్రాలు మరుగైపోయి, సూర్యోదయం అయింది.

## ఉత్తరకాండం – ప్రక్షిప్త సర్గము – 1

## కుక్క ఒకటి రామునిదర్శనం కోరి రావడం

తెల్లగా తెల్లవారింది. రామలక్ష్మణులు రాజసభకు వెళ్ళారు, అప్పటికే మంత్రులు, వసిష్ఠుడు తమ స్థానాల్లో ఆసీనులై ఉన్నారు. ఆ రాముని సభలో వ్యవహార జ్ఞానమున్న మంత్రులున్నారు, ధర్మశాస్త్రాధ్యయం చేసిన పండితులున్నారు. మహేంద్రుని సభ వలె, యముని సభవలె, వరుణిని సభవలె ఉంది. ఆ ధర్మాసనం నిర్వహిస్తూ ఉండటం వల్ల ఎక్కడా అధర్మం జరగడం లేదు. రాజభయం వలన ప్రజలు అధర్మం జోలికే వెళ్ళడంలేదు. ప్రజల ధర్మప్రవర్తన చేత వాళ్ళను వాళ్ళే రక్షించుకో గలుగుతున్నారు. అప్పుడు లక్ష్మణుడు వెళ్ళి ధర్మాన్ని కోరుకుంటూ ప్రజలెవరైనా వచ్చారేమోనని సభాభవనం బయటకువెళ్ళి చూశాడు. అక్కడ మనుష్యసంచారం

ఏమీ కనిపించలేదు కానీ, ఒక కుక్క మాత్రం లక్ష్మణుని చూస్తూ అదేపనిగా మొరుగుతోంది. అప్పుడు లక్ష్మణుడు, "ఓయీ! నీకు వచ్చిన కష్టం ఏమిటో నిర్భయంగా చెప్పు" అని అడిగాడు. అందుకా కుక్క "నేను రామప్రభువుతోనే స్వయంగా మనవి చేసుకోవాలి" అంది. లక్ష్మణుడు లోపలకు వెళ్ళి రాముడితో "ఓ కుక్క నీ దర్శనం కోరుతోందని, తానే నీతో స్వయంగా మనవిచేసుకుంటుందట. భయానికే అభయమిచ్చే రామునికే చెప్పకోవాలని కోరుకుంటోంది" అని చెప్పాడు. అంతట రాముడు "ఆ కుక్కను సభలోనికి ప్రవేశపెట్టు" అన్నాడు. మళ్ళీ లక్ష్మణుడు వెళ్ళి ఆ కుక్కను సభామందిరంలోకి వచ్చి స్వయంగా రాముణ్ణి చూడమని చెప్పాడు. అప్పుడు ఆ కుక్క లక్ష్మణునితో ఇలా అంది. "ఓ లక్ష్మణా! దేవతామందిరాల్లోను, బ్రాహ్మణుల ఇళ్ళల్లోను ఎల్లప్పుడు ఇంద్రుడు, అగ్ని, సూర్యుడు, వాయుదేవుడు ఉంటారు. కాబట్టి మాబోటి జీవులకు అక్కడ ప్రవేశం ఉండదు. రామప్రభువు మూర్తీభవించిన ధర్మదేవత. ఎల్లప్పుడు సత్యమే మాట్లాడుతాడు. రణరంగంలో సమర్థుడు, అన్ని ప్రాణుల హితాన్ని కోరేవాడు, అన్ని ప్రాణుల్నీ సమభావంతో చూసేవాడు, రఘువంశాన్నే ఉద్ధరించేవాడు, ఆనందింపచేసేవారిలో శ్రేష్ఠుడైన రాముడు సంధి, విగ్రహ, యాస, ఆసన, ద్వైధీభావ, సమాశ్రయం అనే ఆరు గుణాలు తెలిసినవాడు. అన్నీ తెలిసినవాడు, అన్నీ చూడగలిగేవాడు, నీతిమార్గాన నడిచేవాడు; నడిపించేవాడు ఆ రాముడు.

ఓ లక్ష్మణా! ఆ రాముడే చంద్రుడు, మృత్యువు, యముడు, కుబేరుడు, అగ్ని, ఇంద్రుడు, సూర్యుడు, వరుణుడు. ఆ రాముడే ప్రజాపాలకుడు. ఓ లక్ష్మణా! ఆ రాముడే స్వయంగా రమ్మంటే తప్ప నేను సభాభవనంలోకి ప్రవేశించలేను. కాబట్టి నీవు రాముణ్ణి అడిగి ఆయన అనుమతి ఇస్తే అప్పుడు నేను లోపలకు రాగలను" అంది.

అంతట లక్ష్మణుడు ఓర్పుతో మళ్ళీ సభాభవనంలోకి వెళ్ళి రాముడితో ఇలా అన్నాడు. "ఓ మహాబాహూ! కౌసల్యకు ప్రియమైన పుత్రుడా! ఓ ప్రభూ! బయట ఒక శునకం ఏదో పని మీద వచ్చింది. ద్వారం దగ్గర నిలబడి ఉంది" అన్నాడు. అప్పుడు రాముడు "పని మీద వచ్చి ఉన్నట్లైతే

వెంటనే ఆ శునకాన్ని ప్రవేశపెట్టు" అన్నాడు.

## ఉత్తరకాండం – ప్రక్షిప్త సర్గము – 2

## రాముడు శునకానికి న్యాయం చెయ్యడం

రాముడు చెప్పగానే లక్ష్మణుడు వెంటనే బయటకువెళ్ళి ఆ శునకాన్ని తీసుకొచ్చి రాముని ముందు నిలబెట్టాడు. అప్పుడు రాముడు ఆ శునకాన్ని చూసి "ఓ శునకమా! భయపడకు, చెప్పదలచుకున్నదంతా నిర్భయంగా చెప్పు" అన్నాడు. అప్పుడా శునకం ఇలా అంది.

"రామా! సమస్తప్రాణుల సృష్టికి రాజే కారణం. రాజే గొప్ప నాయకుడు. అంతా నిద్రపోతూవుంటే, రాజు ఒక్కడే మేల్కొని ఉంటూ ప్రజల్ని రక్షిస్తూ ఉంటాడు. ఆ రాజే ప్రజల్ని పాలిస్తాడు. రాజే ధర్మాన్నీ, నీతినీ, రక్షిస్తూ పాలిస్తాడు. రాజే ధర్మాన్ని కాపాడకపోతే ప్రజలు నశించిపోతారు, కాబట్టి ఉత్తమపాలకుడవైన ఓ రామా! సత్పురుషులు ఆచరించాల్సిన ధర్మాలన్నీ నీకు బాగా తెలుసు. నువ్వు ప్రమాణాలకే ప్రమాణానివి!

రాజే కర్త, రక్షకుడు, జగత్తుకు తండ్రి, కాలము, యుగము కూడా. ధర్మమే ప్రజలను నిలబెడుతుంది. ముల్లోకాలను రక్షించేది ధర్మమే. శత్రువులను అదుపులో పెట్టడం కూడా ధర్మమే. ఈ ఉత్తమ ధర్మమే మరణానంతరం ఫలాన్నిస్తుంది. ధర్మం వల్ల లభ్యం కానిది అంటూ ఏమీ ఉండదు. రామా! దానం, దయ సత్పురుష పూజనం, వ్యవహారాలలో ఋజుత్యం ఇహ పర రక్షణ కలిగిస్తాయి. కాబట్టి అవి కూడా "ధర్మం" అనబడతాయి. రాజులలో శ్రేష్ఠుడా! నీవు ధర్మాలకు ఉత్తమస్థానం, మంచిగుణాలకు సముద్రంవంటివాడవు. అటువంటి నీముందు నిలబడి ధర్మాన్ని గూర్చి మాట్లాడటం నా అజ్ఞానం తప్ప మరొకటికాదు. నీకు శిరస్సువంచి నమస్కరిస్తున్నాను. అజ్ఞానంతో ఏదైనా తప్పుగా మాట్లాడితే నన్ను క్షమించు" అన్నది. అందుకు రాముడు "శునకమా! నీవు ఏం చెప్పదలచుకున్నావో నిర్భయంగా చెప్పు. కాలయాపన చెయ్యకు" అన్నాడు. అప్పుడా శునకం మళ్ళీ ఇలా అంది. "రాజా! ధర్మబద్ధమైన సమస్త భయాల్ని

తొలగించే రాజు రక్షకుడవుతాడు. ఇక నా విషయం చెప్తాను విను.

బ్రాహ్మణులు నివసించే ప్రాంతంలో కాపురం ఉంటున్న సర్వార్థ సిద్ధుడు అనే ఒక సన్న్యాసి నిష్కారణంగా నన్ను కొట్టాడు.” శునకం చేసిన అభియోగాన్ని విన్న రాముడు ద్వారపాలకుణ్ణి పిలిచి సర్వార్థ సిద్ధుడనే ఆ బ్రాహ్మణుని తీసుకుని రమ్మన్నాడు. అతడు వెంటనే వెళ్ళి ఆ బ్రాహ్మణుణ్ణి తీసుకొనివచ్చి రాముని ఎదుట నిలబెట్టాడు. అప్పుడా బ్రాహ్మణుడు “రాజా! నన్ను ఎందుకు పిలిపించారు?” అని అడిగాడు. అప్పుడు రాముడు ఇలా అన్నాడు.

“ఓ బ్రాహ్మణుడా! నీవు ఈ శునకాన్ని కర్రతో కొట్టావుకదా? అది నీకు ఏం అపకారం చేసింది? కోపం మిత్రుడువలె కనిపిస్తుందేకానీ, అది శత్రువే. కోపం వాడియైన కత్తి వంటిది. కాబట్టి కోపం సర్వాన్ని నశింపజేస్తుంది; తపస్సు చెయ్యడం, యజ్ఞం చెయ్యడం, దానాలు ఇవ్వడం వంటివన్నీ కోపాన్ని నశింపజేసుకోవటానికే చేస్తూ ఉంటారు. మనసు కళ్ళెంలేని గుర్రంలాంటిది. భోగ్యవస్తువులకోసం పరుగులు పెడ్తూ ఉంటుంది. మనః స్థైర్యంతో ఇంద్రియాల్ని అదుపులో ఉంచుతూ సారథ్యం చెయ్యాలి. ధర్మం తెలిసినవాడు మనస్సుచేత, కర్మచేత, వాక్కు చేత, చూపుచేత ఎదుటివారి శ్రేయస్సు కోరుకోవాలి. అటువంటి వాడు ఎవరినీ ద్వేషించడు. అతడు ఆచరించే కర్మల పాపపుణ్యాలు అతన్ని అంటవు. అదుపులోలేని మనస్సు చేసే అపకారం, పదునైన కత్తిగానీ, తోకతొక్కిన త్రాచుపాముగానీ, ఆగర్భశత్రువుగానీ చేయలేడు. సహజంగా వినయవంతుడు కాకపోతే, ఎన్ని బోధలు చేసినా అతణ్ణి మార్చలేరు. ఎలుక తోలును పట్టుకొని ఎంత తోమినా నలుపు నలుపేగాని, తెల్లబడదు గదా?” అన్నాడు.

శ్రమపడకుండా పనులు చేసే రాముడి మాటలు విన్న సర్వార్థ సిద్ధుడనే బ్రాహ్మణుడు ఇలా అన్నాడు. “ఓ రామా! నేను వీధివెంట భిక్షకోసం తిరిగి తిరిగి వేసారిపోయాను. నాకు ఎక్కడా భిక్ష దొరకలేదు, ఈ కుక్క నావెంట పడసాగింది. దాన్ని పొమ్మని ఎన్నోసార్లు అదలించాను, అయినా అది లెక్క చెయ్యలేదు. ఆ కోపావేశంలోనే ఆ కుక్కను కొట్టాను. నా నేరాన్ని ఒప్పుకుంటున్నాను. ఓ రాజా! నీవు నన్ను శిక్షించు. నీవు విధించిన శిక్ష ఆనందంగా

అనుభవిస్తాను, ఎందువల్లనంటే ఇక నాకు నరకం వస్తుందేమోనన్న భయం ఉండదు” అన్నాడు. అప్పుడు రాముడు సభలో ఉన్న పెద్దలతో ఇలా అన్నాడు: “పెద్దలారా! ఇతడు చేసిన నేరాన్ని అంగీకరించాడు. ఇతడు ఎటువంటి శిక్షకు అర్హుడో చెప్పండి, నేరం చేసిన వాళ్ళకు శిక్షపడ్డప్పుడే ప్రజలకు రక్షణ ఉంటుంది.” అంతట భృగు, అంగిరస, కుత్స, వసిష్ఠ, కాశ్యపు మొదలైన ధర్మశాస్త్రం బాగా అధ్యయనం చేసిన వారు, ఆయా సంఘాల పెద్దలు, మంత్రులూ అంతా కలసి చర్చించుకొని రాముడితో ఇలా అన్నారు.

“ఓ రామా! నీవు రాజువు; శాసకుడువు. శిక్షించే అధికారం ఉన్నవాడవు. నీవు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువుతో సమానుడవు, మేమంతా కలసి ఈ బ్రాహ్మణుడు శిక్షార్హుడు కాడనే నిర్ణయానికి వచ్చాం” అన్నారు.

అప్పుడు ఆ శునకం ఇలా అంది. “ఓ రామా! నీవు అనుమతి ఇస్తే ఒకమాట చెప్తాను. నీవు నాతో ‘నీకేంకావాలి అని ప్రతిజ్ఞాపూర్వకంగా సభామధ్యంలో అడిగావు. కాబట్టి ఆ బ్రాహ్మణుని కులపతిగా చెయ్యి. మహారాజా! కులంజర క్షేత్రంలో కులపతి పదవిని ఇవ్వు” అంది.

అంతట రాముడు శునకం కోరిన విధంగా ఆ బ్రాహ్మణుణ్ణి కులపతిగాచేసి పంపాడు. ఆ బ్రాహ్మణుడు కూడా సంతోషంతో ఏనుగుపై ఊరేగించినంతగా సంబరపడిపోయాడు. అప్పుడు సభలోవున్న పెద్దలంతా ముక్తకంఠంతో “ఓ రామా! నీవు ఇతణ్ణి కులపతి చేయడంవల్ల వరం ఇచ్చినట్లుందేకానీ, దండన విధించినట్లుగా లేదు” అన్నారు. అందుకు రాముడు “పెద్దలారా అందులో ఉండే ధర్మసూక్ష్మాన్ని మీరు గ్రహించలేకపోయారు. నేనిప్పుడు ఆ శునకాన్నే వివరించి చెప్పమంటాను, వినండి” అని అన్నాడు.

రాముడి అనుమతితో ఆ శునకం ఇలా అంది. “ఓ రామా పూర్వజన్మలో నేను కులపతిగా ఉండేవాణ్ణి. దేవతాపూజలు, బ్రాహ్మణ పూజలు అయిన తర్వాతనే తింటూ ఉండేవాణ్ణి. దాస దాసీ

జనాలందరినీ దయగా చూస్తూ మంచి ప్రవర్తనతో దేవతా ద్రవ్యాలన్నీ రక్షిస్తూ ఉండేవాడిని. మంచి నడవడికతో వినయవంతుడనై ప్రాణులందరి ఎడలా దయ కలిగి ఉండేవాణ్ణి. అటువంటి నాకే శునకంగా పుట్టే దురవస్థ, అధమగతీ పట్టాయే! ఇక ఈ బ్రాహ్మణుడంటావా? ధర్మాన్ని పరిత్యజించిన వాడు, కోప స్వభావం గలవాడు. కృద్ధుడు, క్రూరుడు, కఠినుడు, పాండిత్యం లేనివాడూ, ఇతరులకు అపకారం చెయ్యటానికి వెనుకాడనివాడు, అధార్మికుడైన ఈ బ్రాహ్మణునికి కులపతిత్వాన్ని ఇస్తే ఇతడి పెద్దలు ఇటు ఏడు తరాల వాళ్ళూ, అటు ఏడు తరాలవాళ్ళు పతితులైపోతారు.

ఎవరి భార్యాపిల్లలంతా నరకానికిపోవాలని కోరుకుంటామో, అటువంటివాడికి దేవాలయాల మీద, గోవులమీదా, బ్రాహ్మణుల మీదా అధికారం ఇవ్వాలి. ఎవరైతే తన దగ్గర దాచి ఉంచమని ఇచ్చిన ధనాన్ని కాజేస్తాడో, ఎవరైతే బ్రాహ్మణ ధనాన్నిగాని, దేవతా ధనాన్నిగాని, స్త్రీ ధనాన్నిగాని, చిన్నపిల్లల ధనాన్నిగానీ హరిస్తాడో అతడు తన సొంత వాళ్ళందరితో కలసి నశిస్తాడు; వాడు మరణించిన వెంటనే అవీచీ నరకానికి పోతాడు. దేవతల ధనాన్ని, బ్రాహ్మణ ధనాన్ని కోరుకునేవాడు నరకానికే పోతాడు. అందువల్ల ఎట్టి పరిస్థితుల్లోకూడా కులపతిత్వాన్ని కోరుకోకూడదు."

ఆ మాటలు వింటున్న రాముని నేత్రాలు ఆశ్చర్యంతో పత్తి కాయలంత పెద్దవయ్యాయి. పిమ్మట ఆ శునకం వచ్చిన దారినే వెళ్ళిపోయింది. ఆత్మాభిమానంగలది, పూర్వజన్మజ్ఞానం గలదీ, జన్మ మాత్రం చేతనే శునకం అయినదీ అయిన ఆ శునకం వారణాసిలో ప్రాయోపవేశం చేసి ప్రాణాలు విడిచింది.

## ఉత్తరకాండం – ప్రక్షిప్త సర్గము – 3

## గ్రద్ద, గుడ్లగూబ వివాదం

ఒకానొక కీకారణ్యంలో ఒక గ్రద్ద, గుడ్లగూబ నివసిస్తున్నాయి. ఒక రోజు గ్రద్ద

పాపబుద్ధిగలదై గుడ్లగూబ గూటికిపోయి, "ఇది నా గూడు; నీవు బయటకుపో" అంది. అది పెద్ద వివాదమైపోయింది. ఆ రెండుపక్షులూ, సమస్తలోకాలకూ రాజు అయిన రాముణ్ణే పోయి అడుగుదాం అని బయల్దేరాయి. రెండూ రాముని పాదాలు తాకి నమస్కరించాయి. ముందు గ్రద్ద ఇలా అంది.

"గొప్ప కాంతిగలవాడా! నీవు సురాసురల కన్నా శ్రేష్ఠుడవని నమ్ముతున్నాను. దేవగురువు బృహస్పతి, రాక్షస గురువు శుక్రాచార్యులకన్నా గొప్పవాడవు. ఓ రాజా! నీవు ప్రాణులలోని తారతమ్యాలు తెలిసినవాడవు, చంద్రునివంటి కాంతి గలవాడవు, సూర్యునివలె చూడశక్యం కానివాడవు, హిమాలయాలవలె స్థిరమైనవాడవు, సముద్రునివలె గంభీరమైనవాడవు. ధర్మాన్ని పాలించడంలో యమునివంటివాడవు. ఓర్పుకు భూదేవితో సమానుడవు. గమనంలో వాయువుతో సమానుడవు. కీర్తిగలవాడవు, సర్వసంపదలు ఉన్నవాడవు, పూజ్యుడవు. పట్టు విడువనివాడవు; జయింప శక్యంకానివాడవు. శాస్త్రాలన్నీ తెలిసినవాడవు, నరులలో శ్రేష్ఠుడా! ఓ రామా! వినుము. నేను కష్టపడి కట్టుకున్న గూడును ఈ గుడ్లగూబ తన బలపరాక్రమాలచేత ఆక్రమించుకొన్నది. నయానా భయానా చెప్పిచూశాను. ప్రయోజనం కనపడక నీతో ఫిర్యాదు చేద్దామని వచ్చాను. నా గూడు నాకు ఇచ్చేట్లు చేసి నన్ను రక్షించాలి" అంది.

అంతట గుడ్లగూబ ఇలా అంది. "రామా! రాజు చంద్ర, ఇంద్ర, సూర్య, యమ, కుబేరుల అంశలతో జన్మిస్తాడు; మానవ అంశ నామమాత్రంగా ఉంటుంది. కానీ నీవు సంపూర్ణంగా విష్ణు భగవానుని అంశతో ఉంటూ సమస్తదేవతల గుణగణాలూ పుణికి పుచ్చుకున్నావు. నీవు సౌమ్యులలో శ్రేష్ఠుడవు కావటంచేత నీలో సోమాంశ అధికంగా ఉంది. ప్రజాపాలకుడైన ఓ రామా! నీవు క్రోధంచేతను, దండంచేతను, దానంచేతను ప్రజల్లో పాపభయాన్ని పోగొట్టి ఇంద్రుడివలె దాతవు, హర్తవు, రక్షకుడవై ఉన్నావు. అగ్నితో సమానమైన తేజస్సుతో, లోకాల్ని తరించేట్లు చేస్తూ సూర్యుడివలె ప్రకాశిస్తున్నావు. రామా! లక్ష్మీదేవి వక్షఃస్థలంలో ఉండటం వలన నీవు కుబేరుడికంటే అధికుడవు. స్థావరజంగమాలన్నింటి యందు సమభావం గలవాడవు.

సర్వభూతాలూ నీకు లోబడి ఉంటాయి. నీవు మిత్రుల్ని శత్రువుల్ని కూడా సమభావంతో చూస్తావు. వ్యవహారాల్లోను, వివాదాల్లోనూ ధర్మంతో కూడిన శాసనాలు చేస్తూ ఉంటావు. ఓ రామా! నీవు కోపమే ఎరుగనివాడవు, ఎవరిపైన అయినా కోపించామా అంటే, అతడికి కాలం తీరిందనే చెప్పుకోవాలి. అందువల్లనే నిన్ను పరాక్రమశాలివైన 'యముడు' అని అంటారు. ఓ మానవశ్రేష్ఠుడా! నీవు క్రౌర్యము లేనివాడవు, సకల ప్రాణుల యెడల సహనంతో కూడి ఉంటావు. ఓ రాజా! దుర్బలులకు నీవే బలం, చూడలేనివారికి నీవే నేత్రాలు; దిక్కులేనివారికి గతివి. అట్లాగే నీవు మాకు కూడా రక్షకుడవు. ఓ ధార్మికుడా! ఈ గ్రద్ద నా గూటిలో చేరి నన్ను బయటకు పొమ్మంటోంది, నీవు మానవులలో శిక్షకుడవు గదా?" అంది.

రాముడు వాళ్ళ విజ్ఞాపనల్ని విని మంత్రుల్ని పిలిపించాడు. ధృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, రాష్ట్రవర్ధనుడు, అశోకుడు, ధర్మాపాలుడు, సుమంత్రుడు మొదలైన మంత్రులందరినీ పిలిపించాడు. వీరంతా దశరథమహారాజుకు, రామునికికూడా మంత్రులే. వాళ్ళంతా మహాత్ములు, నీతిమంతులు, సకలశాస్త్ర విశారదులు, మంచి మంచి కులాల్లో జన్మించినవారు. బిడియస్తులు, నీతివిషయంలోను, ఆలోచనా విధానాల్లోను, ధర్మన్యాయశాస్త్రాల్లో కూడా పండితులు. విచారణ ప్రారంభిస్తూ రాముడు గ్రద్దను ఇలా అడిగాడు. "ఓ గృధ్రమా! నువ్వు గూడు కట్టుకొని ఎంతకాలమైంది?" అందుకా గ్రద్ద ఇలా అంది. "ఓ రామా! ఏనాడైతే మానవజాతి భూమి మీద పుట్టిందో అప్పటినుండీ నా గూడు ఉంది." పిమ్మట రాముడు గుడ్లగూబను కూడా అడిగాడు. గుడ్లగూబ రాముడితో "రామా! భూమిమీద వృక్షాలు ఎప్పటినుండీ వృద్ధి అయ్యాయో అప్పుడే నేను గూడు కట్టుకున్నాను" అంది. ఇద్దరిమాటలు విన్న రాముడు పండితులతో ఇలా అన్నాడు: "ఓ పెద్దలారా! వృద్ధులులేనిదే అది సభ అని అనిపించుకోదు. ధర్మం చెప్పనివారు వృద్ధులు కాజాలరు. సత్యం అయితేనే కానీ అది ధర్మం కానేరదు. కపటంతో కూడినది సత్యంకాదు. ఏ సభ్యుడు తెలిసికూడా నిశ్శబ్దంగా ఉంటాడో, చెప్పవలసింది చెప్పడో వారంతా అసత్యం పలికినట్లే అవుతుంది. కామంచేతగాని, క్రోధంచేతగానీ, భయంచేతగానీ, తెలిసి ఉండి కూడా ఎవడు ప్రశ్నలకు సమాధానం చెప్పడో

అటువంటి వాడు వెయ్యి వరుణ పాశాల చేత బంధించబడతాడు. ఒక్కొక్క పాశం ఒక సంవత్సరం అయిన తర్వాత విడుస్తుంది. అందుచేత ఎవరికి సత్యం తెలుసో వారు తప్పక సత్యమే చెప్పాలి" అన్నాడు.

అందుకు ఆ మంత్రులు ఇలా అన్నారు: "గొప్పబుద్ధిగలవాడా! రామా! ఈ గుడ్లగూబలో నిజాయితీ కనిపిస్తోంది. ఈ గ్రద్ద దగ్గర మాకు ఆ నిజాయతీ కనిపించడంలేదు. కనుక ఓ రామా! నీవే తీర్పు చెప్పాలి. ఎందువల్లనంటే, రాజేగదా మాకు పరమగతి? ప్రజలందరికీ రాజే మూలం. రాజధర్మమే అతిప్రాచీనమైనది. ఏ మానవులకు రాజు శిక్షకుడుగా ఉంటాడో అట్టి ప్రజలకు దుర్గతులు ఉండవు. వాళ్ళను యముడుకూడా బంధించలేడు. ఆ ప్రజలంతాకూడా పురుషోత్తము లవుతారు" అని అన్నారు. అప్పుడు రాముడు ఇలా అన్నాడు "ఓ సభాసదులారా! పురాణాల్లో చెప్పిన ధర్మాన్ని చెప్తాను వినండి.

"సూర్య, చంద్ర, నక్షత్ర, పర్వత, మహారణ్యాలు, ఆకాశం, స్థావర జంగమాలతో కూడిన ముల్లోకాలూ జలప్రళయంలో చిక్కుకుపోయాయి. అప్పుడు నీరు తప్ప మరేమీ లేదు, అంతా నిద్రావస్థలో ఉంది. పూర్వం భూమి లక్ష్మితో కలసి విష్ణువు కడుపులోకి ప్రవేశించింది. గొప్ప తేజస్సు గలవాడూ, సకల భూతాల్లోనూ నివసించేవాడైన ఆ మహావిష్ణువు వారిద్దరినీ తనలో ఇముడ్చుకొని ప్రళయజలాల్లోకి ప్రవేశించి అనేక వేలకోట్ల సంవత్సరాలు నిద్రపోయాడు. అట్లా విష్ణువు నిద్రిస్తూ ఉండగా బ్రహ్మదేవుడు కూడా ఆ విష్ణువు కడుపులోకి ప్రవేశించాడు.

పిమ్మట విష్ణువు నాభినుండి బంగారుపద్మం పుట్టుకొచ్చి అందులోనుండి బ్రహ్మదేవుడు బయటకు వచ్చాడు. బయటకువచ్చి మహాయోగియై గొప్ప తపస్సు చేశాడు. అటుపిమ్మట భూమిని, వాయువును, పర్వతాల్ని, వృక్షాల్ని సృష్టించ దలచినవాడై, అంతలోనే మనుజులను, సర్పాలను, జరాయుజాలను, అండజాలను సృష్టించాడు. ఆ బ్రహ్మదేవుడి చెవి గులిమినుండి మధుకైటభులు పుట్టారు. వాళ్ళిద్దరూ మహా వీర్యవంతులు, ఘోరమైన రూపం గలవాళ్ళు, ఎదిరింపశక్యం కానివారూ, అయిన ఆ దానవులు ఇద్దరూ బ్రహ్మదేవుణ్ణి చూసి కోపావేశంతో

మీద పడబోయారు. వాళ్ళట్లా మీదకు వచ్చి పడుతూ ఉంటే, బ్రహ్మ వికృతంగా అరిచాడు. ఆ శబ్దం వినగానే శివుడు, విష్ణువు అక్కడకు వచ్చారు. అప్పుడు శ్రీమహావిష్ణువు ఆ మధుకైటభులిద్దర్నీ తన చక్రాయుధంచేత సంహరించాడు. ఆ దానవులు చనిపోగానే వాళ్ళ కొవ్వు అంతా భూమిపైపడి అన్నివైపులకు వ్యాపించింది. అప్పుడు విష్ణువు భూమినంతా మళ్ళీ పరిశోధించి భూమిని పరిశుద్ధంచేశాడు. అట్లా పరిశుద్ధమైన భూమిపై వృక్షాలను, వనస్పతుల్ని, ఔషధుల్ని, సస్యాలను సృష్టించాడు. అందుచేత ఇతరుల గూటిని ఆక్రమించుకొన్న గ్రద్దయే పాపంచేసిందని, దండింప దగిందని, గుడ్లగూబ వాదం" అని అన్నాడు.

అప్పుడు ఆకాశంనుండి అశరీరవాణి ఇలా పలికింది. "ఓ రామా! ఈ గ్రద్దను చంపకు. ఇతడు పూర్వం గౌతమ మునిచే శపించబడిన బ్రహ్మదత్తుడనే రాజు. ఈ బ్రహ్మదత్తుడు శూరుడు, పరిశుద్ధుడు, సత్యవ్రతుడు. ఒకానొక రోజున ఓ బ్రాహ్మణుడు ఈ బ్రహ్మదత్తుని వద్దకువచ్చి, 'రాజా! నాకు నూరుసంవత్సరాలకు సరిపడే ఆహారం కావాలి' అని కోరాడు. అంతట బ్రహ్మదత్త మహారాజు ఆ బ్రాహ్మణోత్తముడికి స్వయంగా అర్ఘ్యపాద్యాదులను ఇచ్చి, భోజనానికై కావలసిన ఏర్పాట్లన్నీ చేశాడు. ఆ భోజనంలో చేపలు, మాంసంకూడా ఉన్నాయి. అందుకా ముని కోపించి 'నీవు గ్రద్దవై పోవుదువుగాక! అని శపించాడు. అప్పుడు ఆ రాజు ఇలా అన్నాడు. 'సర్వధర్మాలు తెలిసినవాడా! గొప్ప నియమాలుగలవాడా! నా అజ్ఞానంచేత జరిగిన ఈ అపరాధాన్ని మన్నించు. నన్ను శపించకు, నాకు శాపవిమోచనాన్ని ప్రసాదించు' అని వేడుకున్నాడు. అంతట ఆ ముని, ఈ అపరాధం రాజు అజ్ఞానం చేతనే చేశాడని తెలుసుకొని శాంతించి ఇలా అనుగ్రహించాడు. 'ఓ రాజా! ఇక్ష్వాకువంశంలో పద్మాలవంటి నేత్రాలతో రాముడనే రాజు జన్మిస్తాడు, అతడు నిన్ను తాకగానే నీ పాపాలన్నీ తొలగిపోయి పరిశుద్ధుడవవుతావు' అన్నాడు.

అంతట రాముడు ఆ గ్రద్దను దగ్గరకు తీసుకొని చేత్తో స్పృశించగానే బ్రహ్మదత్తమహారాజు తన నిజస్వరూపాన్ని పొంది రాముడితో ఇలా అన్నాడు. "ధర్మముల నెరిగినవాడా! రామా! ప్రభూ! నీ అనుగ్రహం చేత ఈ ఘోరమైన నరకం నుండి విముక్తి పొందాను."

# 60వ సర్గ రాముని సభకు మునులు రావడం

ఒకానొక వసంతఋతువు ఉదయానే రాముడు ప్రాతఃకాల ఉపాసనలన్నీ పూర్తిచేసుకొని లక్ష్మణునితో మాట్లాడుతూ రాజసభ భవనంలో తన దర్శనం కోరి వచ్చేవారికోసం నిరీక్షిస్తూ కూర్చున్నాడు. అప్పుడు సుమంత్రుడు వచ్చి ఇలా అన్నాడు. "మహారాజా! భార్గవుడు, చ్యవనుడు మొదలైన వందమంది మునీశ్వరులు యమునాతీరాన్నుండి వచ్చారు. ఓ నరశ్రేష్ఠుడా! వారంతా చాలాసంతోషంగా కనబడుతున్నారు." అంతట రాముడు ఆ మహాభాగ్యవంతులైన బ్రాహ్మణులను ప్రవేశపెట్టమని సుమంత్రునితో చెప్పాడు. వెంటనే మహాతేజస్సుతో ప్రకాశిస్తున్న ఆ వందమంది మునీశ్వరులు రాజభవనంలోకి ప్రవేశించారు. వారంతా కూడా కలశము నిండుగా ఆయా పుణ్యతీర్థాల నుండి పవిత్రజలాలను తీసుకువచ్చారు. అనేక రుచికరమైన కందమూల ఫలాలను రాముడికి సమర్పించుకున్నారు. రాముడు వాటన్నింటినీ ప్రీతితో తీసుకొని వాళ్ళందరికీ అర్ఘ్యపాద్యాదులతో స్వాగతం చెప్పి ఆసనాలు చూపించి కూర్చోమన్నాడు. వారంతా సుఖాసీనులైన తర్వాత వారితో ఇలా అన్నాడు. "మహాత్ములారా! మీరు ఏయే పనుల కోసం ఇక్కడకు వచ్చారో అవన్నీ సావధానుడనై చేయడానికి సిద్ధంగా ఉన్నాను. మీరంతా నిస్సంకోచంగా నన్ను ఆజ్ఞాపించండి. మహర్షులారా! నా సమస్త రాజ్యం, నా జీవితం, సర్వమూ బ్రాహ్మణుల సేవలకై వినియోగిస్తాను, ఇది సత్యం."

రాముని మాటలు విన్న ఆ యమునాతీర వాసులైన మనిపుంగవులంతా పరమానందం చెంది ఇలా అన్నారు: "ఓ రామా! మేమంతా ఎందుకువచ్చామో, ఏమి అడగబోతున్నామో కూడా తెలుసుకోకుండా 'మీరు కోరింది చేస్తాను' అని ప్రతిజ్ఞ చేశావు. అట్లా ముందుగానే ప్రతిజ్ఞ చెయ్యడం నీకే తగింది. పూర్వకాలంలో రాజులెవ్వరూ కార్యం ఏమిటో తెలుసుకోకుండా ప్రతిజ్ఞలు చేసేవాళ్ళు కారు. ఓ రామా! ఈ భూలోకంలో ఇలా ప్రతిజ్ఞ చెయ్యడం నీకే చెల్లింది. నువ్వు బ్రాహ్మణులపై ఉండే గౌరవం చేతనే ప్రతిజ్ఞచేశావు. అంటే నీవు తప్పక మా కోరికను తీర్చగలవు. ఋషులమైన మమ్మల్నందరినీ ఈ మహాభయాన్నుండి రక్షించు.".

# 61వ సర్గ లవణాసురునిపై యుద్ధ సన్నాహాలు

ఋషుల మాట విన్న రాముడు “మునులారా! మీరెవ్వరూ భయపడవద్దు. మీకొచ్చిన కష్టం ఏమిటో చెప్పండి. మీ భయాన్ని తప్పక తొలగిస్తాను” అన్నాడు. అంతట ఆ ఋషులలో భార్గవుడనే మహర్షి ఇలా అన్నాడు. “రాజా! పూర్వం కృతయుగంలో మధువు అనే రాక్షసుడుండేవాడు. అతని సంతతిలో అతడే పెద్దవాడు, బుద్ధిమంతుడు, బ్రాహ్మణులను పూజించేవాడు. ఉత్తములైన దేవతలతో బాగా స్నేహంగా ఉండేవాడు. సద్బుద్ధిగలవాడు. అతడు మంచి పరాక్రమవంతుడు. మనస్సు ఎల్లప్పుడూ ధర్మంపైనే స్థిరంగా నిలిపేవాడు. అతడి గుణగణాలకు సంతోషించి రుద్రభగవానుడు అతడికో అద్భుతమైన వరాన్ని ఇచ్చాడు. అదేమంటే, మహాశక్తిమంతమైన తన శూలంలోనుండి మరో శూలాన్ని సృష్టించి మధువుకి ఇచ్చి ఇలా అన్నాడు: ‘ఓ రాక్షసేశ్వరా! నీవు దేవతలతోను బ్రాహ్మణులతోను స్నేహంగా ఉన్నంతకాలం ఈ శూలం నీ వద్ద ఉంటుంది. వాళ్ళ విషయంలో నీ బుద్ధి మారిందంటే, ఈ శూలం వెంటనే అదృశ్యమైపోతుంది. ఈ శూలం నీ చేతిలో ఉన్నంతకాలం నిన్ను ఎవ్వరూ జయించలేరు. నిన్ను ఎవరు ఎదిరించినా, వారిని ఈ శూలం భస్మంచేసి, మళ్ళీ నీ చేతి లోకి వస్తుంది.” అప్పుడా మధువు ఆ శూలాన్ని రుద్రభగవానుడి నుండి గ్రహించి మళ్ళీ భక్తిపూర్వకంగా నమస్కరించి ఇలా అన్నాడు. ‘ఓ భగవానుడా! ఈ శూలము తరతరాలుగా నా వంశీయులందరికీ రక్షగా ఉండేట్లు అనుగ్రహించు’ అని వేడుకున్నాడు. అందుకు రుద్రభగవానుడు అట్లా జరగదు, అయినా నాచే ఇవ్వబడిన శూలాన్ని చేతిలో ఉంచుకొని కోరావు కాబట్టి నీ శుభమైన కోరిక వ్యర్థం కాకూడదు. అందుకని నీ కుమారుల్లో ఒక్కరు మాత్రం ఈ శూలాన్ని ఉపయోగించగలుగుతారు. అంతేకానీ, నీ వంశానికంతకూ ఉపయోగించదు. అతడిచేతిలో ఈ శూలం ఉన్నంతవరకూ అతణ్ణి ఎవరూ చంపలేరు” అని చెప్పి శివభగవానుడు అదృశ్యమైపోయాడు.

అటుపిమ్మట ఆ మధువు దేవేంద్రభవనంవంటి ఉత్తమమైన ఒక భవనాన్ని నిర్మించి అందులో నివసిస్తూ ఉండేవాడు. అంతట, మధువు విశ్వావసువు అనే మనువు కుమార్తెయైన

కుంభీనసిని వివాహం చేసుకున్నాడు. ఆ కుంభీనసికి మహాపరాక్రమవంతుడైన లవణుడు అనే కుమారుడు కలిగాడు. అతడు బాల్యంనుండీ సదా పాపకర్మాలు చేస్తూ ఉండేవాడు. కుమారుని దుష్టస్వభావానికి మధువుకి ఎంతో కోపం వచ్చింది. ఏమీ అనలేక, ఏమీ చెయ్యలేని నిస్సహాయస్థితిలో, తనవద్ద ఉన్న శూలాన్ని ఇచ్చి దాన్ని గూర్చిన వివరాలన్ని చెప్పి తాను వరుణలోకానికి వెళ్ళిపోయాడు.

ఓ రామా! అతడు సహజంగానే దుష్టుడు, అందులో ఆ శూలం కూడా అతడికి తోడైంది. ముల్లోకాల్లోని జనుల్నీ పీడిస్తున్నాడు. విశేషించి మునులన్నా, తపస్సు చేసుకునే బ్రాహ్మణులన్నా మరీ ద్వేషిస్తున్నాడు. ఇక అతడి ఆగడాలు భరించలేక నీవే మాకు దిక్కు అని నమ్ముకొని నీ దగ్గరకు వచ్చాం. వీరుడవైన ఓ రామా! పూర్వం లవణుడిచే బాధించబడ్డ ఋషీశ్వరులు చాలామంది రాజులను ఆశ్రయించారు కానీ, ఒక్క రక్షకుడు కూడా ముందుకు రాలేదు. ఓ మహానుభావా! నీవు రావణుని, అతడి సైన్యాన్ని మట్టుపెట్టావని విన్నాం. ఇక ఈ భూమండలంలో నువ్వు తప్ప మరొక దిక్కులేదని అనుకొని మేమంతా కలసి వచ్చాం. అందువలన భయపీడితులమైన మమ్మల్ని రక్షించమని కోరుతున్నాం" అని వేడుకున్నారు.

## 62వ సర్గ లవణాసుర సంహారానికి శతృఘ్నుని పంపటం

అప్పుడు రాముడు “ఆ లవణుడు ఎక్కడ ఉంటాడు? వాని ఆచార వ్యవహారాలెలా ఉంటాయి? ఏయే ఆహారాన్ని భుజిస్తూ ఉంటాడు?” అని అడిగాడు. అందుకు మునులు ఇలా అన్నారు. “ఓ రామా! వాడు జంతువులు కనిపిస్తే జంతువుల్ని తింటాడు, మునులు కనిపిస్తే మునులను తింటాడు. లోకాలన్నింటినీ భయభ్రాంతుల్ని చెయ్యడమే వాడి ఆచారం. ఇకపోతే మధువనం అంతా అతడిదే. అక్కడే నివాసం ఉంటాడు.”

అప్పుడు రాముడు భయపడవద్దని మునులందరికీ అభయమిచ్చాడు. త్వరలోనే అతణ్ణి సంహరిస్తానని ప్రతిజ్ఞచేశాడు. మరల తమ్ముల నుద్దేశిస్తూ ఇలా అన్నాడు. “సోదరులారా! మీలో ఎవరు ఈ లవణాసురుణ్ణి చంపాలని ఉవ్విళ్ళూరుతున్నారు?” అని అడిగాడు. ముందుగా భరతుడు లేచి తాను భారం వహిస్తానన్నాడు అంతలోనే శత్రుఘ్నుడు లేచి నిలబడి ఇలా అన్నాడు: “అన్నా! నీవు అరణ్యవాసం చేసినంతకాలం భరతుడు జటావల్కాలు, నారచీరలు కట్టి, కందములాలు తింటూ, నందిగ్రామంలో ఉంటూ బాగా అలసిపోయి ఉన్నాడు. పట్టాభిషేకం అయిన తర్వాతనే కొద్దిపాటి విశ్రాంతిని తీసుకుంటున్నాడు, కాబట్టి లవణసంహారానికి నన్ను పంపమని కోరుతున్నాను.”

శత్రుఘ్నుని మాటలు విన్న రాముడు “శత్రుఘ్నా! అట్లాగే చెయ్యి. నేను నీకు అనుజ్ఞ ఇస్తున్నాను. నిన్ను మధునగరానికి రాజ్యాభిషిక్తుణ్ణి చేస్తాను. నువ్వు అన్నట్టే భరతుణ్ణి విశ్రాంతి తీసుకోనీ! నీవు అస్త్రవిద్యా విశారదుడవు. సమర్థుడవు, నీవు ఆ దుష్టుణ్ణి సంహరించి సాధు సంరక్షణచేస్తూ ధర్మమార్గంలో రాజ్యాన్ని పాలించు. ఓ శత్రుఘ్నుడా! నేను పెద్దవాడిని. అన్నగారిని. నా మాటకు ఎదురు చెప్పకు. నేను చెప్పినదంతా చెయ్యడమే నీ ధర్మం. అందులో సందేహంలేదు, ఓ శత్రుఘ్నుడా! నేను సంకల్పించినట్లే యథాశాస్త్ర ప్రకారంగా వసిష్ఠాది బ్రాహ్మణులు నీకు మంత్రపూర్వకంగా రాజ్యాభిషేకం చేస్తారు” అన్నాడు.

# 63వ సర్గ రాముడు శత్రుఘ్నుని మధునగరానికి అభిషిక్తుణ్ణి చెయ్యడం

రాముని మాటలు విన్న శత్రుఘ్నుడు సిగ్గుపడుతూ మెల్లగా వినయంతో ఇలా అన్నాడు: "మహారాజా! నాకన్నా పెద్దవాడు ఉండగా అభిషేకానికి నేనెట్లా అర్హుడను కాగలను? నీవు సర్వధర్మాలు తెలిసినవాడవు, నీ శాసనాన్ని కాదనలేను. అట్లా అనడం పాపంచేసినట్లే గదా? నాకంటే పెద్దవాడైన భరతుడు నేను లవణుణ్ణి సంహరిస్తానని అన్నప్పుడు నేను మాట్లాడి ఉండకూడదు. తొందరపాటుతో నేనే ఆ లవణుణ్ణి చంపుతానని అనడం వల్లనే ఈ అధర్మం పుట్టుకొచ్చింది. ఓ రామా! పెద్దవాడు భరతుని మాటకు ఎదురుచెప్పడం వల్లనే నాకు ఈ శిక్ష లభించింది. మళ్ళీ నీకుకూడా ఎదురుచెప్పి మరొక తప్పు చేయడం నాకు సమ్మతం కాదు. కనుక పురుషశ్రేష్ఠుడవైన ఓ రాజా! నేను నీ శాసనానికి బద్ధుడనై ఉంటాను. చిన్నవాడనయినా రాజ్యాభిషిక్తుడను కావడం అనే అధర్మం నాకు తగలకుండా చెయ్యి."

శూరుడూ, మహాత్ముడూ అయిన శత్రుఘ్నుని మాటలకు రాముడు చాలా సంతోషించాడు. భరతునితోను, లక్ష్మణునితోనూ ఇలా అన్నాడు: "భరతుడా! పురోహితుణ్ణి, ఋత్విక్కులను, నేను ఆజ్ఞాపిస్తున్నానని పిలిపించు. రాజ్యాభిషేకానికి కావలసిన సంబరాలన్నీ తెప్పించు. పురుషశ్రేష్ఠుడైన శత్రుఘ్నునకు ఇప్పుడే రాజ్యాభిషేకం చేస్తాను."

రాజు ఆ విధంగా శాసించగా అభిషేకానికి కావలసిన ఏర్పాట్లన్నీ చకచకా జరిగిపోయాయి. సాటిరాజులు, బ్రాహ్మణులు అంతా విచ్చేశారు. మహాత్ముడైన శత్రుఘ్నుని అభిషేకం వైభవంగా జరిగింది. ఇంద్రాది దేవతల చేత అభిషిక్తుడైన కుమారస్వామివలె ఆ శత్రుఘ్నుడు అందరికీ ఆనందాన్ని కలిగించాడు. సుర్యుడి వలె ప్రకాశించాడు, పౌరులు, విద్యావంతులు అంతా సంతోషించారు. కౌసల్య, సుమిత్రా, కైకేయి, ఇతర తల్లులంతా శత్రుఘ్నుని దీవించారు. యమునాతీర వాసులైన ఋషులు ఇక లవణుడు మరణించినట్టే అని

సంతోషించారు.

పిమ్మట రాజ్యాభిషిక్తుడైన శత్రుఘ్నుని తన ప్రక్కనే కూర్చోబెట్టుకొని రాముడు ఇలా అన్నాడు. "సౌమ్యుడా! శత్రుఘ్నా! దివ్యమైనది, శత్రువినాశకరమైనది అయిన ఈ బాణాన్ని నీకు ఇస్తున్నాను. నువ్వు దీనితో లవణాసురుణ్ణి చంపగలవు. నాయనా! ఈ బాణాన్ని శ్రీమహావిష్ణువు ప్రళయజలాల్లో శయనించి ఉన్నప్పుడు సృష్టించాడు. ఈ విషయం ఇంతవరకు ఎవ్వరికీ తెలియదు. దీన్ని సురులు, అసురులు కూడా చూడలేరు. ఇది ఏ ప్రాణికీ కూడా కనపడదు. మధుకైటభులపైన కోపించిన శ్రీమహావిష్ణువు ఈ బాణాన్ని సృష్టించాడు. శ్రీమహావిష్ణువు ఈ బాణంతో ఆ మధుకైటభు లిద్దర్నీ సంహరించిన పిమ్మట ప్రాణులభోగం కోసం ముల్లోకాల్నీ సృష్టించాడు. శత్రుఘ్నా! రావణ సంహార సమయంలో కూడా నేను ఈ బాణాన్ని వాడలేదు. ఇప్పుడు మహేశ్వరునిచే లవణునికి ప్రసాదించిన శూలాన్ని నీవు ఎదిరించాల్సి ఉంటుంది. కాబట్టి నీవు ఈ ఆయుధాన్ని ధరించి లవణుడు పురంలో ప్రవేశించడానికి ముందే అతడిని ద్వారం వద్దనే ఎదిరించు. అతడు భవనంలో ప్రవేశించే ముందుగానే అతణ్ణి యుద్ధానికి ప్రేరేపించు. నీవు అప్పుడు అతణ్ణి సులభంగా చంపగలవు. నీకు ఈ విషయం అంతా వివరంగా చెప్పాను. శూలాన్ని ఎట్లా నిర్వీర్యం చెయ్యాలో చెప్పాను. ఎందుకంటే శ్రీమంతుడైన ఈశ్వరుని ఆజ్ఞను దాటటానికి ఎవరికీ శక్యం కాదుగదా!"

# 64వ సర్గ శత్రుఘ్నుడు లవణునిపై యుద్ధానికి వెళ్ళడం

రాముడు శత్రుఘ్నునితో మళ్ళీ ఇలా అన్నాడు. "పురుషశ్రేష్ఠుడా! నాలుగువేల గుర్రాలు, వంద ఏనుగులు, రెండువేల రథాలు, వివిధ ఆహారపదార్థాలు, ధనధాన్యాలు నీ వెంట తీసుకుని వెళ్ళు. యమభటుల్లాంటి సైనికుల్ని వెంటబెట్టుకొని వెళ్ళి, వాళ్ళందర్నీ మధురమైన మాటల్తోను, ఆదరంగాను చూసుకోవాలి. వాళ్ళందరిపైన ప్రేమ ఉట్టిపడుతూ ఉండాలి. ఎందువల్లనంటే, ఆ దూరప్రాంతంలో వాళ్ళను సంతోషపరిచేందుకు, భార్య, పిల్లలు, బంధువులు ఉండరుగదా! అందువల్ల వారికి లోటు తెలియకుండా నీవే వాళ్ళందరినీ ఉల్లాసపరుస్తూ, ఉత్సాహపరుస్తూ ఉండాలి. నువ్వు ధనుష్పాణివై ముందు ఉండు. నువ్వు అతడిపైకి దండెత్తి వెళ్తున్నావని అతడు తెలుసుకోకుండా ఉండేట్లు మసలుకో. ఎందుకంటే ఎవరైతే లవణుణ్ణి ప్రత్యక్షంగా యుద్ధానికి ఆహ్వానిస్తారో, వారు మృత్యువును ఆహ్వానించినట్లే!

గ్రీష్మం పోయి వర్షాకాలం వచ్చిన తర్వాత అతణ్ణి చంపటానికి అనువుగా ఉంటుంది. గ్రీష్మం ఇంకా పూర్తిగా పోకముందే సైన్యాన్నంతా గంగానది దాటించు. వర్షాకాలం వస్తే నదిలో నీళ్ళు పూర్తిగావుంటాయి. దాటటం కష్టమవుతుంది. మహర్షుల్ని ముందు ఉంచుకొని వెళ్తూ ఉండు. సైన్యాన్నంతా నదీతీరానే ఉంచి ధనుస్సు, బాణం ధరించి ఒంటరిగా మధునగరానికి వెళ్ళు."

శత్రుఘ్నుడు అన్నగారి మాటలు, సలహాలు విని సేనానాయకుల్తో ఇలా అన్నాడు: "మీరంతా బయలుదేరండి, నేను చెప్పిన చోటపోయి బసచేస్తూ ఉండండి. నేను తర్వాత బయలుదేరి మిమ్మల్ని కలుసుకుంటాను." ఇలా చెప్పి, కౌసల్యకు, సుమిత్రకు, కైకేయికి మిగిలిన తల్లులకు నమస్కరించి వాళ్ళ దీవెనలు పొందాడు. పిమ్మట రాముడికి ప్రదక్షిణ పూర్వకనమస్కారం చేశాడు. అటుపిమ్మట భరతునికి లక్ష్మణునికి నమస్కరించి వాళ్ళ ఆశీస్సులు పొందాడు, కులగురువు పురోహితుడైన వసిష్ఠమహర్షికి పాదాభివందనం చేశాడు. రాముడి

అనుమతి పొంది చతురంగ బలాలతో బయలుదేరాడు.

# 65వ సర్గ కల్మాషపాదుని వృత్తాంతం

శత్రుఘ్నుడి సైన్యం అంతా నెల రోజులు ప్రయాణంచేసింది. పిదప శత్రుఘ్నుడు తను బసచేసేందుకు సమీపానే ఉన్న వాల్మీకి ఆశ్రమానికి చేరుకున్నాడు. ఆ మహర్షికి పాదాభివందనం చేసి ఇలా అన్నాడు: "పూజ్యుడా! నేను అన్నగారి పని మీద వెళ్తున్నాను. నేను ఈ రాత్రికి ఇక్కడ బసచేసి రేపు ఉదయానే వెళ్ళిపోతాను." అంతట వాల్మీకి ఇలా అన్నాడు: "సౌమ్యుడా! రఘువంశంవారికి నా ఆశ్రమం వాళ్ళ సొంత ఇంటితో సమానం. ఇదుగో అర్ఘ్యం, పాద్యం, ఆసనం స్వీకరించు. ఇవిగో మధురమైన కందమూలాలు, ఫలాలు. వీటిని ఆరగించు." శత్రుఘ్నుడు ఆ పూజలను స్వీకరించి, "మహర్షీ! నీ ఆశ్రమంలో ఉన్న ఈ యజ్ఞగుండం ఎవరిది?" అని అడిగాడు. అప్పుడు వాల్మీకి ఇలా చెప్పాడు. "ఓ శత్రుఘ్నా, పూర్వం ఈ ఆశ్రమంలో ఎవరు ఉండేవారో చెప్తాను విను.

రాజా! మీ పూర్వీకుడైన సుదాసుడనే రాజు ఉండేవాడు. అతడి కుమారుడిపేరు మిత్రసహుడు. మిత్రసహుడు బాల్యంనుండీ వేట అంటే చాలా ఇష్టపడేవాడు. ఆ రాజు ఒకనాడు వేటకై అడవులకు వెళ్ళగా అక్కడ విచ్చలవిడిగా తిరుగుతున్న రెండు పులుల్ని (రాక్షసులు) చూశాడు. ఆ రాక్షసులిద్దరూ పెద్దపులి రూపాన్ని ధరించి అడవిలో ఉండే మృగాలన్నింటినీ చంపి తింటూ ఉండేవారు. కాలక్రమంలో అడవిలో జంతువులే లేకుండా పోయాయి. వేటకు వచ్చిన సౌదాసునికి (సుదాసుని కుమారుడు) ఒక్క జంతువు కూడా కనిపించక విసిగి వేసారి పోయాడు. అప్పుడతడి కంటికి ఓ పులుల జంట (రాక్షస సోదరులు) కనిపించింది. సౌదాసుడు ఆ పులుల జంటలో ఒకదాన్ని చంపాడు. రెండోది తప్పించుకుపోయింది. ఆ తప్పించుకున్న రాక్షసుడికి (పులి) సౌదాసుడిమీద కోపం వచ్చింది, అతడిపై పగ తీర్చుకోవాలని అనుకున్నాడు.

అట్లా కొంతకాలం జరిగింది. సౌదాసుడు రాజ్యభారాన్ని వహించి, అశ్వమేధయాగాన్ని తలపెట్టాడు. ఈ ఆశ్రమానికి దగ్గరలోనే యజ్ఞశాలను నిర్మించాడు. వసిష్ఠుణ్ణి ఆ యాగానికి

ఋత్విక్కుగా నిర్ణయించుకున్నాడు. కొన్నిసంవత్సరాలపాటు ఆ యజ్ఞం అట్లా సాగుతూనే ఉంది. యజ్ఞం పూర్తి అయ్యేవరకూ ఆ రాక్షసుడు వేచి ఉన్నాడు. యజ్ఞం పూర్తి అయ్యే సమయానికి ఆ రాక్షసుడు వసిష్ఠుని రూపంలో వచ్చి సౌదామునితో ఇలా అన్నాడు. "రాజా! ఈనాటితో యజ్ఞం పరిసమాప్తం అవుతుంది. ఈ సమయంలో నాకు మంచి మంసాహారం తినాలని కోరిక కలిగింది. నువ్వు ఏమాత్రం సందేహించకుండా నాకు మంసాహారాన్ని ఏర్పాటు చెయ్యి." వసిష్ఠుని రూపంలో ఉన్న రాక్షసుని మాటలు విని రాజు వంటవాళ్ళతో వసిష్ఠుడి కోసం మంచి మాంసాహారం తయారుచెయ్యమని ఆజ్ఞాపించాడు. అప్పుడు వంటవాళ్ళు! వసిష్ఠుడు మాంసాహారం తినటమా!' అని సందేహపడ్డారు. వెంటనే రాక్షసుడు వంటవాడి రూపాన్ని ధరించాడు. అంతట ఆ వంటవాడు మనుష్యమాంసంతో వంటలు చేసి రాజుతో "రాజా! ఇదుగో మధురమైన మాంసాహారం" అన్నాడు. అప్పుడు రాజు భార్యయైన మదయంతితో కలసి ఆ మాంసాహారాన్ని వసిష్ఠుడికి సమర్పించాడు. వసిష్ఠుడు ఆహారాన్ని మనుష్యమాంసంతో చేసినట్లు గ్రహించాడు. కోపంతో ఇలా అన్నాడు: "రాజా! నీవు నాకు ఏ భోజనం అయితే ఇవ్వాలని తెచ్చావో, ఇకపైన అదే నీకు భోజనం అవుతుంది. సందేహంలేదు" అన్నాడు. అప్పుడు సౌదాసుడు తిరిగి వసిష్ఠున్ని శపించటానికి చేతిలోకి నీళ్ళు తీసుకున్నాడు. ప్రక్కనే ఉన్న అతడి భార్య మదయంతి ఇలా అంది. "రాజా! వశిష్ఠుడు మన పురోహితుడు, దేవతతో సమానం, అటువంటి వసిష్ఠుణ్ణి శపించకూడదు." ఇలా అని అతణ్ణి నిగ్రహించింది. చేతిలోని తేజస్సుతోకూడిన జలం వృథా కారాదని, ఆ జలాన్ని తన పాదలపైనే విడిచాడు. అప్పుడా రాజు పాదాలు నల్లగా అయిపోయాయి. ఆనాటినుండి గొప్పకీర్తిమంతుడైన ఆ సౌదాసమహారాజు 'కల్మాషపాదుడు' అన్న (నల్లని పాదాలున్నవాడు) పేరుతో ప్రసిద్ధి పొందాడు. అంతట ఆ రాజు భార్య వసిష్ఠుని ప్రార్థించగా, వసిష్ఠుడు జరిగిన మోసాన్ని గ్రహించాడు. "ఓ రాజా! నేను ఇచ్చిన శాపం వృథా కాదు. అందువలన నీకు శాపవిమోచనం చెప్తాను. పన్నెండు సంవత్సరాల తర్వాత నీవు నరమాంసం తినడం మానేస్తావు" అన్నాడు. ఆ విధంగా రాజు పన్నెండు సంవత్సరాలపాటు ఆ శాపాన్ని అనుభవిస్తూనే రాజ్యాన్ని పాలించాడు. పిదప శాపవిమోచనం పొందాడు.

ఓ శత్రుఘ్నుడా! నీవు అడిగిన ఈ ఆశ్రమసమీపంలో ఉన్నచోటనే కల్మాషపాదుడు (సౌదాసుడు) యజ్ఞవాటిక ఉండేది. అంతట శత్రుఘ్నుడు ఆ సౌదాసునికథ విని, మహర్షితోపాటు పర్ణశాల లోపలకు వెళ్ళాడు.

# 66వ సర్గ లవకుశుల జననం

శత్రుఘ్నుడు వాల్మీకి ఆశ్రమానికి చేరిన రాత్రే సీతాదేవి ప్రసవించింది. ఇద్దరు మగపిల్లల్ని కన్నది. అర్ధరాత్రి సమయంలో ఆ ముని కుమారులువచ్చి సీతాదేవి ప్రసవించిందని, తల్లీ బిడ్డలు సుఖంగా ఉన్నారని వాల్మీకిమహర్షికి చెప్పారు. "గొప్పతేజస్సుగల మహర్షీ! ఆ పసివాళ్ళకు భూత బాధలు లేకుండా ఉండేట్లు రక్ష కల్పించండి" అని చెప్పారు. వాల్మీకి వాళ్ళమాటలు విని ఉదయ సూర్యుని వంటి ఆ బాలులిద్దర్నీ చూసి సంతోషించి, వాళ్ళకు భూతాలు, రాక్షసులను నశింపచేసే రక్ష కల్పించాడు. ఆ వాల్మీకిమహర్షి చేతుల్లోకి దర్భలు తీసుకొని అభిమంత్రించి ఇవ్వగా వృద్ధ స్త్రీలు కొనలతో ఒక శిశువుకు, మొదళ్ళతో రెండో శిశువును తుడిచారు (సంమార్జనం). మంత్రాలతో సంస్కరించిన దర్భల కొనలతో రక్షపొందినవాడిని 'కుశుడని' మొదళ్ళతో (లవము) రక్ష కల్పించబడ్డ వాడిని 'లవుడని' నామకరణం చేశాడు. ఈ విధంగా వీరిద్దరికీ నేను రక్ష కల్పించిన విధంగా లవకుశులై లోకంలో ప్రసిద్ధులవుతారు అని వాల్మీకిమహర్షి అన్నాడు.

ఆ విధంగా వాల్మీకిచేత రక్ష కల్పించబడ్డ బాలులిద్దర్నీ ఆ వృద్ధస్త్రీలు రాముని గోత్ర నామాలతో కీర్తించారు. అట్లా సీతారాముల్ని ప్రశంసిస్తూ చేసిన కీర్తనలకు శత్రుఘ్నుడికి మెలకువ వచ్చింది. వెంటనే పురిటి ఇంటికి వెళ్ళి కవల పిల్లలతో ఉన్న సీతాదేవిని చూసి ఆమె పాదాలకు నమస్కరిస్తూ "అమ్మా! భగవంతుని కృప వలన నీ దర్శనం అయింది" అని అన్నాడు. తెల్లవారి శ్రావణఘడియలు రావడంతో ప్రాతఃకాలంలో చేయాల్సిన విధులన్నీ నిర్వర్తించి, అంజలిఘటించి నమస్కరిస్తూ వాల్మీకిమహర్షి వద్ద సెలవు తీసుకొని బయలుదేరి వెళ్ళాడు. శత్రుఘ్నుడు ఆ విధంగా ఏడు రోజులు ప్రయాణం చేసి యమునాతీరాన్ని చేరి చ్యవనమహర్షి ఆశ్రమంలో విశ్రాంతి తీసుకున్నాడు. ఆ రాత్రి అంతా చ్యవనుడు మొదలైన ఋషీశ్వరులు చెప్పే దివ్యగాథలు వింటూ బడలిక అంతా మరచిపోయాడు.

# 67వ సర్గ మాంధాత చరిత్ర

శత్రుఘ్నుడు సాయంకాల విధులన్నీ నిర్వర్తించుకొని రాత్రికి భృగుపుత్రుడైన చ్యవనమహర్షి వద్ద కూర్చుని లవణుని బలపరాక్రమాలగూర్చి చెప్పమని అడిగాడు. అతడి వద్ద ఉన్న శూలాన్ని గూర్చి కూడా తనకు తెలియపర్చమన్నాడు.

మహాత్ముడైన శత్రుఘ్నుని మాటలు విని, మహాతేజశ్శాలియైన చ్యవనమహర్షి ఇలా అన్నాడు. "ఓ శత్రుఘ్నుడా! లవణుని గూర్చిన కథలు అనేకం ఉన్నాయి. ఇక్ష్వాకువంశానికి చెందిన ఒక రాజు కథను చెప్తాను విను.

రాజా! పూర్వం అయోధ్యలో యువనాశ్వుని పుత్రుడైన మాంధాత అనే రాజు ఉండేవాడు. అతడి బలపరాక్రమాలు ముల్లోకాల్లోనూ ప్రసిద్ధి చెందాయి. ఆ మాంధాత భూమండలాన్నంతా శాసించి, దేవలోకాన్ని జయించాలని అనుకున్నాడు. మాంధాత శక్తిసామర్థ్యాలు తెలిసిన ఇంద్రుడు మనస్సులో కలతచెందాడు. దేవేంద్రునితో అర్ధాసనం, రాజ్యంలో సగభాగం ఇస్తానని దేవతలు బేరం చేశారు. మాంధాత అందుకు ససేమిరా ఒప్పుకోన్నాడు. అటుపిమ్మట దేవేంద్రుడే మాంధాతతో ఇలా అన్నాడు: "ఓ పురుషశ్రేష్ఠుడా! నువ్వు భూమండలంలోనే చక్రవర్తివి కాలేదు. అటువంటి నీవు స్వర్గాన్ని కోరడంలో న్యాయం ఉందా? ఈ భూమండలం అంతా నీ వశంలో ఉందని చెప్పగలవా? మధువనంలో ఉంటున్న మధువు పుత్రుడు లవణుడు నిన్ను లెక్కపెడ్తున్నాడా? నీ ఆజ్ఞల్ని పాలిస్తున్నాడా?" అని అడిగాడు.

దేవేంద్రుడు తెలివిగా తన ఆయువు పట్టుపైన దెబ్బకొట్టాడని మాంధాత గ్రహించాడు. స్వర్గంపై దండయాత్రను నిలిపేశాడు. ఆ సైన్యాన్ని మధువనం వైపు మళ్ళించాడు. ఎట్లాగైనా లవణాసురుణ్ణి తన అధీనంలోకి తెచ్చుకొని, ఇంద్రత్వానికి పోటీపడాలనుకున్నాడు. వెంటనే లవణుడి దగ్గరకు ఒక దూతను పంపి "యుద్ధానికి సిద్ధంగా ఉండ" మని కబురు చేశాడు. లవణాసురుడికి ఈ వార్త తెచ్చిన దూతపై ఒళ్ళుమండిపోయింది. ఆ దూతను అక్కడికక్కడే చంపి

తినేశాడు. ఎన్ని రోజులైనా దూత తిరిగి రాకపోవటం వలన మాంధాతకు లవణుడిపై కోపం వచ్చింది. ఆ రాక్షసుడిపైన అన్ని వైపులనుండీ బాణవర్షం కురిపించాడు. ఆ బాణాలన్నీ లవణుడిపై, దున్నపోతుమీద వర్షం పడ్డట్లు, నిష్ప్రయోజనమైపోయాయి. అంతట ఆ రాక్షసుడు శివభగవానుడిచ్చిన శూలాన్ని పట్టుకొని మాంధాతపై ప్రయోగించాడు. ఆ శూలం రాజును, అతడి సైన్యాన్ని, వాహనాల్నీ, భస్మంచేసి తిరిగి లవణుడి వద్దకు వచ్చి చేరింది. అంతట పరాక్రమవంతుడైన మాంధాత, అతడిసైన్యం ఆ శూలంచేత దారుణంగా చంపబడ్డారు. కాబట్టి, ఓ శత్రుఘ్నుడా! ఆ శూలంయొక్క శక్తి చాలా గొప్పది; సాటిలేనిది.

ఓ శత్రుఘ్నుడా! రేపు ప్రాతఃకాలానే బయలుదేరు, శూలాయుధం లేని అతడిని హతమార్చు. నీకు తప్పక జయం కలుగుతుంది. ఇది నిశ్చయం. నువ్వు ఈ కార్యం నిర్విఘ్నంగా పూర్తిచెయ్యి, లోకకల్యాణం జరుగుతుంది.''

# 68వ సర్గ శత్రుఘ్న – లవణుల సంవాదం

ఆ రాత్రి అంతా చ్యవనుడు మున్నగు మునులతో గడిపి శత్రుఘ్నుడు ఉదయానే యమునా నదిని దాటి మధుపుర ద్వారం దగ్గర వేచి ఉన్నాడు. ఆహారం సంపాదించుకోవడం కోసం లవణుడు ఉదయానే నగరం వదిలి వెళ్ళిపోయాడు. మధ్యాహ్నం అయింది, లవణుడు కొన్ని వందల జీవాల్నిచంపి మోసుకొస్తున్నాడు; సింహద్వారం దగ్గర ధనుస్సు బాణాలు ధరించి ఉన్న శత్రుఘ్నుణ్ణి చూశాడు. "ఎవడ్రా నువ్వు. ద్వారానికి అడ్డంగా నిలబడ్డావు. నీకు తోడు ఈ ఆయుధం కూడా ఎందుకు? నీలాంటి వాళ్ళను చాలామందిని చంపితిన్నాను. నీవొక లెక్కా! నీకు కాలం మూడింది. నా కళ్ళపడ్డావు. నీవు ప్రాణాలతో బయటపడలేవు. అసలే ఇవ్వాళ జీవాలు తక్కువగా దొరికాయే! అని బాధపడుతూవుంటే, ఆ భగవంతుడే నిన్ను నా దగ్గరకు పంపాడు. నిన్ను కూడా చంపి ఈ జీవాల్తో కలిపితే నాకీరోజు భోజనం సరిపోతుంది" అని హేళనగా మాట్లాడాడు. లవణుడు అట్లా మాట్లాడుతూ ఉంటే శత్రుఘ్నునికి అరికాలిమంట నెత్తిపైకి వచ్చింది. ఆ మంట రోమరోమాలనుండి ప్రజ్వరిల్లి పెద్దతేజస్సు అయింది. అప్పుడు లవణుడితో ఇలా అన్నాడు.

"దురాత్ముడా! ఎందుకు ప్రగల్భాలు పలుకుతావు. ఈ రోజుతో నీ ఆయువు తీరింది. నీతో ద్వంద్వయుద్ధం చేయడానికి వచ్చాను. నేను దశరథమహారాజు పుత్రుణ్ణి, రామచంద్ర మహారాజుకు తమ్ముడను, నా పేరు శత్రుఘ్నుడు. నిన్ను హతమార్చడానికి వచ్చాను."

శత్రుఘ్నుని మాటలు విన్న లవణుడు పరిహాసంచేస్తూ ఇలా అన్నాడు. "ఓ దుర్మతీ! నీకు కాలం తీరింది. అందువల్లనే దైవం నిన్ను నా ముందుకు పంపాడు. నా పిన్నతల్లికి సోదరుడైన రావణుని నీ అన్న రాముడు ఒక స్త్రీ కారణంగా చంపాడని విన్నాను. పోనీలే, మనకెందుకు? ఏదో దూరపు చుట్టరికం. పైగా వాళ్ళుండేది ఎక్కడో సముద్రానికి అటుప్రక్కన లంకలో. అందుకని నేనప్పుడు అంతగా పట్టించుకోలేదు. ఏదో లేగడ్డి పరకలతో సమానం అని

ఒదిలేశాను. ఇప్పుడు ఆ భగవంతుడే నిన్ను నా ముందుకు పంపాడు. నీలాంటి వాళ్ళను ఎంతోమందిని చంపాను. ఇక్కడే ఉండు. లోపలకుపోయి ఆయుధం తీసుకొనివస్తాను. అటుపిమ్మట మనం యుద్ధం ప్రారంభం చేద్దాం. ఒక క్షణం ఓపికపట్టు" అన్నాడు. శత్రుఘ్నుడు ఇలా అన్నాడు: "ఓ రాక్షసుడా! ఎదురుగా ఉన్న శత్రువును బుద్ధిమంతుడెవడూ విడువడు. చేతికిచిక్కిన శత్రువును బుద్ధితక్కువగా ఎవడైనా వదిలేస్తే, చివరకు వాడి ప్రాణానికే ముప్పు వస్తుంది. కాబట్టి ఇప్పుడు నిన్ను వదిలిపెట్టే ప్రసక్తేలేదు. నువ్వు ముల్లోకాలకూ, రాముడికీ కూడా శత్రువు. పాపాత్ముడవు, నిన్ను యమలోకానికి పంపుతాను. నీవు నన్ను దాటి ఒక్క అడుగుకూడా వెయ్యలేవు. నువ్వు చచ్చే ముందు నువ్వు చంపి తెచ్చుకున్న ఈ జీవాలన్నింటినీ ఒక్కసారి చూసుకో!"

# 69వ సర్గ శత్రుఘ్న – లవణుల యుద్ధం

శత్రుఘ్నుని మాటలు విన్న లవణుడు నిప్పులు కక్కాడు. "నిలు! నిలు!" అంటూ కేకలు పెట్టాడు. పళ్ళు పటపటా కొరికాడు. రెండు చేతులూ గట్టిగా నలుపుకున్నాడు. "రా! ముందు నీ పనిపూర్తి చేసుకొని ఆ పిమ్మటే భోజనానికి వెళ్తాను" అన్నాడు. అంతట శత్రుఘ్నుడు ఇలా అన్నాడు: "ఓరీ! దురాత్ముడా! పూర్వం ఎంతోమందిని చంపానని ప్రగల్భాలు పలుకుతున్నావు. అప్పుడే శత్రుఘ్నుడు పుట్టివుంటే నువ్వు అప్పుడే చచ్చి ఉండేవాడివి. పాపాత్ముడా! నిన్ను ఇప్పుడు యుద్ధంలో చంపుతాను. నీ మరణం పండితులను, బ్రాహ్మణులను, మునీశ్వరులను సంతోషపరుస్తుంది. ఇదిగో ఈ బాణం వజ్రాయుధంతో సమానం. సూర్యకిరణాలు పద్మంలో ప్రవేశించినట్లు నా బాణాలు నీ హృదయంలో ప్రవేశిస్తాయి."

అప్పుడు లవణుడు కోపావేశంతో ఒక పెద్దవృక్షాన్ని పెళ్ళగించి శత్రుఘ్నుని వక్షఃస్థలానికి తగిలేట్లుగా విసిరేశాడు. శత్రుఘ్నుడు ఆ వృక్షాన్ని బాణంతో వందముక్కలుగా ఖండించాడు. దాంతో ఆ రాక్షసుడు కల్లుతాగిన కోతిలాగా కంటికి కనిపించిన వృక్షాలన్నింటినీ శత్రుఘ్నునిపై విసిరాడు. శత్రుఘ్నుడు వాటన్నింటినీ ఛిన్నాభిన్నాలుగా చేసేశాడు. అంతట రాక్షసుడిపైన బాణాల వర్షాన్ని కురిపించాడు. అయినా ఆ లవణుడు ఎన్ని బాణాలు కురిపించినా తొణకలేదు; బెణకలేదు. పిమ్మట లవణుడు అట్టహాసం చేస్తూ ఒక వృక్షాన్ని పెళ్ళగించి శత్రుఘ్నునిపై విసిరేశాడు. ఆ దెబ్బ శత్రుఘ్నుని తలపై బలంగా తగిలింది. దాంతో స్పృహతప్పి పడిపోయాడు. అది చూస్తున్న దేవతలు, ఋషులు, గంధర్వులు, అప్సరసలు హాహాకారాలు చేశారు. రాక్షసుడు పరమానందం చెందాడు. శత్రువు చచ్చి నేలపై పడిపోయాడని సంబర పడిపోయాడు. శత్రువు ఎట్లాగో చచ్చిపోయాడుగదా అని శూలం తెచ్చుకోవటానికి ఇంట్లోకి వెళ్ళలేదు. తనకు ఆహారంగా తెచ్చిన జంతువుల్ని భుజాన వేసుకొన్నాడు. వెళ్ళేందుకు సిద్ధం అయ్యాడు.

ఇంతలోనే శత్రుఘ్నుడు తేరుకున్నాడు. చివాల్నలేచి నిలబడ్డాడు. ద్వారానికి అడ్డంగా

నిలబడి రాక్షసుణ్ణి అడ్డగించాడు. వెంటనే తన అమ్ములపొదిలో నుండి అన్నగారు ఇచ్చిన దివ్యాస్త్రాన్ని బైటకు తీశాడు. మండుతున్న ఆ బాణం నలుదిక్కుల్నీ తేజస్సుతో నింపేసింది. వజ్రాయుధం వంటి వేగం, మేరు, మందర పర్వతాలతో సమానమైన ఆ బాణం ఎన్నడూ ఓటమిని ఎరుగదు. ఇది దానవనాయకులను, పర్వతములను, అసురుల్ని కూడా చీల్చివేసింది. ఆ బాణాన్ని చూసిన ప్రాణులన్నీ భయపడిపోయాయి. జగత్తులన్నీ తలక్రిందులయ్యాయి. దేవ, గంధర్వాది సంఘాలన్నీ బ్రహ్మదేవుడి వద్దకు పరుగెత్తారు. "ఓ దేవదేవా! మహాప్రళయం వచ్చిందా అనిపిస్తోంది. ఇటువంటి విపరీతం ముందెన్నడూ మేం చూడలేదు" అన్నారు. అప్పుడు బ్రహ్మ దేవతలతో ఇలా అన్నాడు. "దేవతాశ్రేష్ఠులారా! వినండి. లవణుని చంపేందుకు శత్రుఘ్నుడు ఒక దివ్యమైన, అపురూపమైన బాణాన్ని ధరించాడు. ఈ బాణం చాలా సనాతనమైనది. తేజోవంతమైనది. దీన్ని లోకాలన్నింటినీ సృష్టించిన ఆ శ్రీమహావిష్ణువు స్వయంగా సృజించాడు. ఈ గొప్ప బాణంతో మధుకైటభులనే రాక్షసులిద్దర్నీ సంహరించాడు. ఈ బాణాన్ని గూర్చి ఆ శ్రీమహావిష్ణువుకు తప్ప మరెవ్వరికీ తెలియదు. ఇది ఆ శ్రీమహావిష్ణువు యొక్క అతిప్రాచీనమైన రూపం. మీరంతా భయాన్ని విడిచిపెట్టండి. అంతా కలసి ఆ శత్రుఘ్నుడు ఆ లవణాసురుణ్ణి ఎట్లా చంపుతాడో వెళ్ళి చూడండి." దేవతలంతా ఆ శత్రుఘ్న – లవణుల యుద్ధం చూసేందుకు ఆకాశంలో బారులుతీరి నిలబడ్డారు. శత్రుఘ్నుడు ఆకాశాన దేవతలు గుమికూడి ఉండటం చూసి పెద్దగా సింహనాదం చేశాడు. ఆ సింహనాదంతో శత్రుఘ్నుడు మళ్ళీ యుద్ధానికి పిలుస్తున్నాడని లవణుడు వెనక్కి తిరిగి చూశాడు. వెంటనే యుద్ధానికి సిద్ధమైవచ్చాడు. అప్పుడు ధనుర్ధరుడైన శత్రుఘ్నుడు ఆ దివ్యాస్త్రాని సంధించి లవణుని వక్షఃస్థలానికి గురిచూసి ప్రయోగించాడు. ఆ దివ్యాస్త్రం ఆ రాక్షసుని గుండెలు చీల్చివేసి, తిరిగి శరవేగంతో శత్రుఘ్నుని వద్దకు వచ్చి చేరింది. శత్రుఘ్నుని బాణంచే కొట్టబడిన ఆ లవణాసురుడు వజ్రాయుధంచేత కొట్టబడిన పర్వతంవలె నేల కూలిపోయాడు. లవణాసురుడు అట్లా మరణించగానే అతడిచే పూజించబడుతున్న ఆ గొప్పశూలం, దేవతలంతా చూస్తూ ఉండగా శివభగవానుని త్రిశూలంలో లయమైపోయింది.

ఆ విధంగా ఒకే బాణంతో రాక్షస సంహారంచేసి శత్రుఘ్నుడన్న పేరును సార్థకం చేసుకున్నాడు. లవణాసురుడి వల్ల ముల్లోకాల్లోనూ ఏర్పడ్డ భయం అనే చీకట్లు తొలగించి శత్రుఘ్నుడు లోకానికంతకూ జీవనజ్యోతిని వెలిగించి సూర్యుడివలె ప్రకాశించాడు. అప్పుడు దేవతలు, ఋషులు, పన్నగులు, అప్సరసలు అంతా "శత్రుఘ్నుడా! మా అదృష్టవశాన లోకాలన్నీ ప్రసన్నాలయినాయి" అంటూ శత్రుఘ్నుని కొనియాడారు.

# 70వ సర్గ శత్రుఘ్ననికి దేవతలు వరాలు ఇవ్వడం

లవణాసుర సంహారంతో దేవతలంతా సంతోషించారు. ఇంద్రుడు, అగ్ని మొదలైన దేవతల్ని ముందుంచుకొని శత్రుఘ్నుని అభినందించేందుకు వచ్చాడు. "ఓ మహాబాహూ! నీవు బాహుబలంతో లవణాసురుణ్ణి సంహరించావు. అదంతా మా అదృష్టంగా భావిస్తున్నాం, నిన్ను అభినందిస్తున్నాం. ఇప్పుడు నీకు మా దర్శనం అయిందికదా! మా దర్శనం వృథా కారాదు. ఏదైనా వరం కోరుకో" అన్నారు. అంతట శత్రుఘ్నుడు అంజలిఘటించి నమస్కరిస్తూ ఇలా అన్నాడు.

"ఓ దేవా! రమ్యమైన ఈ మధుపురి దేవతలచే నిర్మించబడి నా రాజధాని కావాలని కోరుకుంటున్నాను" అని అన్నాడు. అంతట దేవతలంతా సంతోషించి రమ్యమైన ఈ మధుపురం శూరులైన వీరులతో రక్షించబడుతూ ఉంటుంది అని దీవించారు. తరువాత వారంతా దేవలోకానికి వెళ్ళిపోయారు.

శత్రుఘ్నుడు వెంటనే అదే శ్రావణమాసంలో తన సైనికుల చేత నగర నిర్మాణం ప్రారంభించాడు. ఆ నగరం దేవతానగరాన్ని పోలివుంది. ప్రజలు ఎటువంటి భయమూ లేకుండా సుఖంగా ఉన్నారు. ఇంద్రుడు సకాలంలో వర్షాలు కురిపించేవాడు. పొలాలన్నీ సమృద్ధిగా పండేవి. యమునాతీరాన ఆ నగరం అర్ధచంద్రాకారంలో నిర్మించబడింది. ప్రజలు ఎటువంటి ఈతిబాధలూ లేకుండా సుఖంగా ఉన్నారు. నగరంలోని గృహాలన్నీ తీర్చిదిద్దినట్లుగా నిర్మించారు. విశాలమైన వీథులతోకూడి వర్తక, వ్యాపారాలు వర్ధిల్లాయి. పూర్వం లవణాసురుడి కాలంలో తెల్లగా ఉండే భవనాలను ఆకర్షణీయమైన రంగులతో అలంకరించారు. ఆ నగరం చుట్టూ ఉద్యానవనాలు, క్రీడాస్థానాలు, ఏర్పరచారు. అన్ని దిక్కులనుండీ వర్తకులు వచ్చి అక్కడ స్వేచ్ఛగా వ్యాపారాలు చేసుకునేవారు. ఈ ఏర్పాట్లన్నీ చెయ్యడానికి శత్రుఘ్ననికి పన్నెండు సంవత్సరాల కాలం పట్టింది. పన్నెండవ సంవత్సరం వచ్చిన తర్వాత శత్రుఘ్ననికి రాముడిపై గాలి మళ్ళింది.

రాముడి పాదదర్శనం చెయ్యాలనే తీవ్రమైన ఆకాంక్ష కలిగింది. రాజైన శత్రుఘ్నుడు ఆ మధుపురిని అమరావతివలె అలంకరించి అన్నగారిని చూడటానికి ప్రయాణం అయ్యాడు.

# 71వ సర్గ శత్రుఘ్నుడు అయోధ్యకు బయలుదేరటం

శత్రుఘ్నుడు చాలా తక్కువ సైన్యాన్ని వెంట తీసుకొని పన్నెండు సంవత్సరాల తర్వాత రామదర్శనానికై తపిస్తూ అయోధ్యకు బయలుదేరాడు. ఏడెనిమిది మజిలీలు చేసుకుంటూ ఆ కొద్దిపాటి సైన్యంతో వాల్మీకి ఆశ్రమానికి చేరుకున్నాడు. పురుషశ్రేష్ఠుడైన ఆ శత్రుఘ్నుడు వాల్మీకి మహర్షికి అంజలిఘటించి నమస్కరించాడు. వాల్మీకిమహర్షి ఇచ్చిన అర్ఘ్యం, పాద్యం, ఆసనం వంటి అతిథి సత్కారాలన్నీ పొందాడు. ఆ రాత్రి మహర్షితో గడిపి అనేక భగవత్కథలు శ్రవణంచేశాడు.

లవణుని వధించడాన్ని గూర్చి వాల్మీకిమహర్షి ఇలా అన్నాడు: "మహాబాహూ! ఓ సౌమ్యుడా! శత్రుఘ్నా! మహాబలాఢ్యుడైన లవణుడు ఎందరో రాజుల్ని, మహారాజుల్ని యుద్ధం చేసి పొట్టనపెట్టుకున్నాడు. అటువంటి పాపాత్ముణ్ణి సులభంగా చంపావు. నీ ప్రభావంచేత లోకులంతా భయంలేకుండా నిర్భయంగా జీవిస్తున్నారు. రావణవధకు రామప్రభువు గొప్ప ప్రయత్నం చేశాడు. కానీ నీవు ఈ లవణాసురుణ్ణి అనాయాసంగా సంహరించావు. ఈ లవణుడి మరణంవలన దేవతలకు, సమస్త భూతాలకూ హితం చేకూర్చావు. ఓ శత్రుఘ్నా! నీవు చేసిన యుద్ధం అంతా నేను ఇంద్రునిసభలో నుండి చూశాను. ఈ రాక్షసుణ్ణి సంహరించి ఇతరులవల్ల సాధ్యంకాని కార్యాన్ని నీవు చేసిచూపావు, నీ పరాక్రమం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. ఏదీ ఒక్కసారి నీ శిరస్సు ముద్దుపెట్టుకొనీ! నీ యెడల నా అత్యుత్తమమైన ప్రేమను ప్రదర్శిస్తాను." అంతట వాల్మీకి మహర్షి శత్రుఘ్నుని శిరస్సు చుంబించి అతడికి, అతడి అనుచరులకు గొప్ప ఆతిథ్యానిచ్చాడు. భోజనాలైన తర్వాత అందరికీ ఉత్తమమైన గాన మాధుర్యాన్ని ప్రసాదించాడు.

రామకథను ఉన్నదున్నట్లుగా, ఎన్నడో జరిగినదంతా ఇప్పుడు కళ్ళ ముందు తెరపై చూస్తున్నట్లుగా వినిపించాడు. అది వీణ వాయించినట్లుగా వీణాతంత్రులకు శ్రుతిచేసినట్లుంది. మూడు స్థానాల్లోనూ మూడు కరణాలకు అనుకూలంగా ఉంది. అటు సంస్కృత వాఙ్మయాన్ని,

ఇటు సంగీతశాస్త్రాన్ని సమన్వయపరచి పాడారు. పూర్వం ఎట్లా జరిగిందో అదంతా కళ్ళకు కట్టినట్లు వినిపిస్తూ ఉంటే శత్రుఘ్నుడు కొద్దిసేపు స్పృహ కోల్పోయాడు. రాజుతో వచ్చిన వాళ్ళంతా యథార్థమైన కథకు, సంగీత మాధుర్యానికీ ముగ్ధులైపోయారు. ఎంత ఆశ్చర్యం! అని ఒకళ్ళకొకళ్ళు చెప్పుకున్నారు. అక్కడున్న సైనికులంతా ఇది కలా? నిజమా? అని అనుకున్నారు. పూర్వం ప్రత్యక్షంగా చూసినదంతా ఈ ఆశ్రమంలో వింటున్నాం. ఇది స్వప్నమా? లేక ఏదైనా అద్భుతసంగీత స్వరకల్పనా? ఎంత మాధుర్యం? ఈ మాధుర్యం కథలో ఉందా? లేక రచనా తీరులో ఉందా? లేక శ్రావ్యమైన కంఠస్వరంలో ఉందా? అని ఆశ్చర్యపోయారు. శత్రుఘ్నునితో ఇలా అన్నారు "మహారాజా! ఇదంతా ఏదో స్వప్నంలాగా ఉంది. మీరే మహర్షిని అడగండి." అందుకు శత్రుఘ్నుడు వాళ్ళతో "ఇది మహామహిమాన్వితమైన తాపసాశ్రమం. ఏవో వింతలు జరుగుతాయి. వాటికి ఏవో అర్థాలు, పరమార్థాలు ఉంటాయి. మనలాంటి సామాన్య మానవులం మనోభ్రాంతితో ఏది పడితే అది వారిని అడగకూడదు" అన్నాడు. మహర్షికి నమస్కరించి శయనస్థలానికి వెళ్ళాడు.

# 72వ సర్గవాల్మీకి ఆశ్రమం నుండి అయోధ్యకు ప్రయాణం

ఆ రాత్రి అంతా శత్రుఘ్నునికి నిద్ర పట్టలేదు. రామునికి సంబంధించిన మధురగీతాలే చెవుల్లో గింగురుమని మ్రోగుతున్నాయి. ఏమా మాధుర్యము! ఏమా సంగీత లాలిత్యము? ఏమా సాహిత్య ప్రక్రియ?

శత్రుఘ్నుడు ఉదయానే లేచి ప్రాతఃకాల కర్మలన్నీ ముగించుకొని అంజలి ఘటించి నమస్కరించి వాల్మీకిమహర్షితో ఇలా అన్నాడు. "పూజ్యుడా! రఘువంశంలో వారందరినీ ఆనందపరచే రాముణ్ణి ఎప్పుడెప్పుడు చూద్దామా? అని మనస్సు ఉవ్విళ్ళూరుతోంది. నీవు, ఈ మునీశ్వరులు అనుమతిస్తే అయోధ్యకు వెళ్ళాలని ఉంది." అప్పుడు వాల్మీకి మహర్షి శత్రుఘ్నుని కౌగలించుకొని అతడు వెళ్ళేందుకు అనుమతి ఇచ్చాడు. పిమ్మట శత్రుఘ్నుడు శ్రేష్ఠమైన రథాన్నెక్కి అయోధ్యకు చేరుకొని రాముని భవనానికి వెళ్ళాడు.

రాముడు, అక్కడ మంత్రి సభలో, దేవతలమధ్య దేవేంద్రుడివలె, కూర్చున్నాడు. పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ వెళ్ళి రాముడి పాదాలకు నమస్కరించాడు. రాముడితో ఇలా అన్నాడు: "మహారాజా! నీవు ఆజ్ఞాపించినట్లే, పాపాత్ముడైన లవణుని సంహరించాను. అతడి పట్టణాన్నంతా తిరిగి నిర్మించాను. రామా! నీ ఆజ్ఞకు కట్టుబడి పన్నెండు సంవత్సరాలు నీకు దూరంగా ఉన్నాను. నీవు చెయ్యమన్న పనులన్నీ చేశాను. ఇకపై నిన్ను వదలి ఉండలేను. నీవు నన్ను అనుగ్రహించాలి. ఆవును వదలి లేగదూడ దూరంగా ఉండగలదా?" అన్నాడు.

అట్లా మాట్లాడుతున్న తమ్ముణ్ణి చూస్తూ రాముడు అభిమానంతో వెళ్ళి ఆలింగనం చేసుకున్నాడు. తమ్ముడి శరీరం అంతా తనివితీరా తడిమి మైమరచిపోయాడు. తమ్ముణ్ణి ఆనందసాగరంలో ముంచెత్తాడు. తన్నుతాను సంబాళించుకుని శత్రుఘ్నునితో ఇలా అన్నాడు: "శూరుడా! దుఃఖించకు, ఇది క్షత్రియులకు శోభించదు, ప్రవాసం చేత రాజులు దిగులుపడరు. క్షత్రియులు ప్రజల సుఖసంతోషాల కోసమే పాటుపడాలికదా? క్షత్రియ ధర్మానుసారంగా

పాలించాలి, నా మీద బెంగగా ఉండటం సహజమే. ఓ వీరుడా! అప్పుడప్పుడూ వస్తూండు, నాలుగు రోజులు ఉండి తిరిగి నీ పట్టణానికి వెళ్తూవుండు. ఆ మాటకు వస్తే, తమ్ముడూ! నువ్వు నాకు నా ప్రాణాలకన్నా ఎక్కువ ఇష్టమైనవాడవు. మరి మనం క్షత్రియులమైనందుకు రాజ్యాన్ని పాలించడం మన ప్రథమ కర్తవ్యం కదా? శత్రుఘ్నుడా! నువ్వు నాతోపాటు ఒక వారం రోజులు ఉండు. అటుపిమ్మట నీ సైనికుల్ని, అధికారుల్ని తీసుకొని మధురకు వెళ్ళు." అంతట శత్రుఘ్నుడు అన్నగారి మాటలు శిరసావహించాడు. ఒక వారం రోజులు అయోధ్యలో గడిపిన తర్వాత తిరిగి మధురకు ప్రయాణం అయ్యాడు.

మహాత్ముడైన, సత్యపరాక్రమంగల రామునివద్ద, భరతునివద్ద, లక్ష్మణునివద్ద సెలవు తీసుకొని రథమెక్కి మధురకు వెళ్ళిపోయాడు. అప్పుడు భరతుడు, లక్ష్మణుడు చాలాదూరం వరకూ వెళ్ళి శత్రుఘ్నుని సాగనంపి వచ్చారు.

# 73వ సర్గ బ్రాహ్మణుని పుత్రశోకం

రాముడు శత్రుఘ్నుని పంపి తమ్ములతో కలసి రాచకార్యాలు నిర్వహిస్తూ ఉంటున్నాడు. ఇలా ఉండగా ఒకానొకరోజున ఒక బ్రాహ్మణుడు చనిపోయిన ఐదు సంవత్సరాల బాలుణ్ణి భుజానవేసుకుని రాజద్వారం దగ్గర ఏడుస్తూ కూర్చున్నాడు. "పుత్రా! నేను పూర్వజన్మలో ఏదో ఘోరమైన పాపంచేసి ఉంటాను. అందువల్లనే నువ్వు అకాలమరణం పొందావు. నాకు దుర్భరమైన కడుపుకోతను మిగిల్చిపోయావు. నువ్వు పూర్ణాయుర్దాయం గలవాడవైతే నాకూ, మీ అమ్మకూ సేవలుచేసేవాడవు. ఇకపై మాకు సేవలు ఎవరు చేస్తారు? నీ మీద దిగులుతో ముందుగా మీ అమ్మ మరణిస్తుంది, అటుపిమ్మట నేను మరణిస్తాను. పుత్రా! తెలిసి నేను ఏ పాపమూ చెయ్యలేదు. పాపం చెయ్యాలనే ఆలోచనకూడా చెయ్యలేదు. అసత్యం అంటే ఎట్లా ఉంటుందో ఎరుగను. హింస అనేది బొత్తిగా తెలియదు. ఏ ప్రాణికీ అపకారం చేసి ఎరుగను. ఇటువంటి సాధు జీవితం గడుపుతున్న నాకు, ఇంతటి దుఃఖం కలగటానికి కారణం ఏమిటి? పుత్రుడు తల్లిదండ్రులకు చెయ్యాల్సిన ప్రేతకర్మలు, నేను నీకు చెయ్యాల్సి రావడం నా దౌర్భగ్యం కదా? రాముడు రాజైన తర్వాతనే ఇట్లాంటి అకాలమృత్యువులు సంభవిస్తున్నాయి. ఇంతకు పూర్వం ఎరుగంగదా? అంటే ఈ పాపం అంతా ఆ రామునిదే కాని నాది కాదు; నా పుత్రునిది కాదు. ఇతర రాజ్యాలలోని బాలురు ఇట్లా అకాలమృత్యువాత పడటంలేదు. కాబట్టి ఓ రామా! నువ్వు నా పుత్రుణ్ణి బ్రతికించు లేదా నేను, నా భార్య కూడా అనాథలమై ఈ రాజద్వారం ముందే మరణిస్తాం. ఆ తర్వాత బ్రహ్మహత్యాపాతకం కూడా మూటకట్టుకొని తమ్ముళ్ళతోను, బంధువులతోను సుఖంగా ఉండు. ఇంతకాలం ఇక్ష్వాకువంశస్థులు పాలించినప్పుడు ఈ బాల్యమరణాలు ఉండేవి కావు. రాముడు రాజయ్యాకనే ఇట్లాంటి అకాలమరణాలు సంభవిస్తున్నాయి. అనగా ఈ రాజ్యం నాథుడులేని రాజ్యం అయింది. రాజు అశాస్త్రీయంగా పాలిస్తే, రాజు చరిత్ర మంచిది కాకపోతేను జనులు అకాలమరణం చెందుతూ ఉంటారు. లేదంటే దేశంలో ప్రజలు చెడ్డనడవడిక గలవారైనా, లేదా జనులకు రక్షణ లేకపోయినా ఇట్లా

అకాలమరణాలు జరుగుతాయి. ఎన్ని విధాలుగా చూసినా, దోషం రాజుదేకానీ ప్రజలది కాదు."
ఇలా ఏడుస్తూ ఆ బ్రాహ్మణుడు చనిపోయిన పిల్లవాణ్ణి కౌగలించుకొని ఆ రాజద్వారం వద్ద కూర్చున్నాడు.

# 74వ సర్గ యుగధర్మాలు

బ్రాహ్మణుడు పుత్రశోకంతో రోదించడం రాముడి చెవిన పడింది. వెంటనే సోదరులను, మంత్రులను, వసిష్ఠుని, వామదేవుని, ఆయాశాఖలలో ప్రముఖుల్ని సమావేశ పరిచాడు. వసిష్ఠుడితోపాటు మార్కండేయుడు, మౌద్గల్యుడు, వామదేవుడు, కాశ్యపుడు, కాత్యాయనుడు, జాబాలి, గౌతముడు, నారదుడు, మున్నగువారంతా వచ్చి తమ తమ స్థానాల్లో కూర్చున్నారు. మహర్షులందరికీ రాముడు నమస్కరించాడు. మంత్రులందరికీ ప్రత్యభివాదం చేసి మన్నించాడు. అంతట సభాసదులందరికీ బ్రాహ్మణుని వృత్తాంతాన్ని చెప్పి కర్తవ్యాన్ని నిర్ణయించమన్నాడు.

అప్పుడు నారదుడు లేచి ఇలా అన్నాడు: "రాజా! ఈ బాలుడికి అకాలమరణం ఎలావచ్చిందో చెప్తాను. ఆపైన విధివిధానాలన్నీ నీవు ఆలోచించి చెయ్యి.

రాజా! కృతయుగంలో బ్రాహ్మణులు మాత్రమే తపస్సు చేసుకొనేవారు. ఇతరులు ఎవరూ చేసేవారు కాదు. అందువల్ల ఆ యుగంలో అజ్ఞాన ఆవరణం ఉండేది కాదు. అంతా బ్రహ్మమయంగా ఉండేది. ఆ యుగంలో జనులందరూ త్రికాలజ్ఞులై ఉండేవారు. అకాలమరణాలు అసలే ఉండేవికావు. ఈ యుగంలో అంతా ద్విజులే (బ్రాహ్మణులే). ఈ యుగంలో తపస్సుచేత, వీర్యముచేత కూడా బ్రాహ్మణులు అధికులుగా ఉండేవారు. ఈ యుగంలో బ్రాహ్మణులు నిత్యనైమిత్తికాది కర్మలే కాకుండా, కాయక్లేశమైన తపస్సుకూడా చేసేవారు.

త్రేతాయుగం వచ్చే సమయానికి భూమి మీద అధర్మం ఒక పాదం మోపింది. దాంతో బ్రాహ్మణులతోపాటు మనువంశంలో పుట్టిన క్షత్రియులుకూడా తపస్సు చేసుకునేవారు. త్రేతాయుగంలో బ్రాహ్మణ, క్షత్రియుల్లో భేదం లేకపోవటంవలన శాస్త్రనిర్మాతలు చాతుర్వర్ణ వ్యవస్థను ఏర్పాటుచేశారు. అధర్మం భూమి మీద ఒక పాదం మోపడం వల్లనూ, చాతుర్వర్ణ వ్యవస్థ ఏర్పాటు కావడంవల్లనూ, త్రేతాయుగంలోని బ్రాహ్మణులు, కృతయుగంలోని

బ్రాహ్మణులకన్నా తక్కువ వారుగా ఉండేవారు; తేజస్సు తగ్గింది. భూమిమీద ఒక పాదం అధర్మం మోపడంచేత అంతకు పూర్వం ఏ కృష్యాదికమును మాంసమును వలె, రజోగుణజన్యమైన మలంవలె పూర్వులు పరిహరించారో అటువంటి అసత్యం (కృష్యాదికము) అధికంగా ప్రచారంలోకి వచ్చింది. ఎప్పుడైతే ఒక పాదం అధర్మం ఏర్పడిందో దాంతోపాటే, కృతయుగంలోకన్నా ఆయుర్దాయ ప్రమాణం కూడా తగ్గింది. భూమి మీద అధర్మం ఒక పాదం ప్రవేశించినా లోకంలో సత్యం, ధర్మం యెడల ఆసక్తి గలవారై మంచి పనులనే చేస్తూ ఉండేవాళ్ళు. త్రేతాయుగంలో బ్రాహ్మణులు, క్షత్రియులు తపస్సు చేసుకుంటూ ఉంటే, ఇతరకులాలవాళ్ళు వీరికి శుశ్రూష చేస్తూ ఉండేవారు. ఈ రెండు కులాలవారికీ శుశ్రూష చెయడమే వైశ్యులకు, శూద్రులకు పరమధర్మంగా ఉండేవి. శూద్రులు పైమూడు కులాల వారినీ పూజించేవారు. ఓ రాజశ్రేష్ఠుడా! త్రేతాయుగ-ద్వాపరయుగాల సంధికాలంలో బ్రాహ్మణ క్షత్రియులకుకూడా తేజస్సు క్షీణించింది.

పిదప భూమిమీద రెండవ అధర్మపాదం కూడా మోపబడింది. అందువల్లనే ఈ యుగానికి ద్వాపరం అని పేరువచ్చింది. రాజా! ఈ ద్వాపరంలో కూడా అధర్మం, అసత్యం వృద్ధిచెందాయి. ఈ యుగంలో వైశ్యులకు కూడా తపస్సు చేసుకునే అవకాశం కల్పించారు. ఈ విధంగా తపస్సు మూడు యుగాల్లోనూ మూడు వర్ణాలవారికీ సంక్రమించింది. అంటే మూడు యుగాల్లోకూడా శూద్రుడికి తపస్సు (ధర్మం) లభ్యం కాలేదు, కాబట్టి శూద్రుడు తపస్సు చెయ్యకూడదు. కానీ కలియుగంలో శూద్రుడు కూడా తపస్సుకు అర్హుడు అవుతాడు.

కావున ఓ రాజా! ద్వాపరయుగంలో కూడా శూద్రుడు తపస్సు చేయడం అధర్మం. నీ దేశంలో ఎక్కడో దుర్బుద్ధియైన శూద్రుడు తపస్సు చేస్తున్నాడు. అందువల్లనే ఈ బాలుడు అకాలమరణం పొందాడు. చెడు నడతగల ఏ నరుడైనా రాజ్యంలో ఏ మూలయైనా సరే అధర్మంగానీ, చెయ్యకూడని పనిగానీ చేస్తే, ఆ రాజ్యంలో నుండి లక్ష్మి తొలగిపోతుంది; ఆ రాజుకు నరకప్రాప్తి సంభవిస్తుంది. ప్రజలను ధర్మంగా పాలించిన రాజుకు ప్రజలు చేసుకున్న

పుణ్యాలలోనూ, తపస్సులోను, పుణ్యకార్యాల్లోనూ, ఆరవవంతు లభిస్తుంది. రాజు ప్రజలపుణ్యంలో ఆరవవంతు తీసుకుంటూ కూడా, ప్రజలను రక్షించనిచో ఎట్లా? కనుక పురుషశ్రేష్ఠుడా నువ్వు నీ రాజ్యం అంతా వెదికి అతడిని పట్టుకోవాలి.

రామా! ఎక్కడ పాపకార్యం జరుగుతుందో కనిపెట్టేందుకు రాజు ప్రయత్నంచెయ్యాలి. అట్లా చేసినట్లైయితే ధర్మం వృద్ధి చెందుతుంది. ఈ బాలుడు కూడా జీవిస్తాడు" అని అన్నాడు.

# 75వ సర్గ శూద్రతపస్వి కోసం రాముడు వెదకడం

నారదుడు చెప్పిన మాటలకు రాముడు పరమానందం చెందాడు. లక్ష్మణుని పిలిచి ఇలా అన్నాడు: "లక్ష్మణా! ఆ బ్రాహ్మణుని పిలిచి ఓదార్చు. ఆ బాలుణ్ణి నూనె తొట్టెలో ఉంచి శరీరాన్ని భద్రపరచు. సుగంధ ద్రవ్యాలన్నీ వాడి ఆ శరీరం పాడవకుండా చూడు. ఎటువంటి ఆపదా రాకుండా కాపాడుతూ ఉండు" అని ఆదేశించాడు.

అంతట రాముడు పుష్పకాన్ని మనస్సులో తలచి 'ఇక్కడకు రా' అన్నాడు. రాముని అభిప్రాయాన్ని తెలుసుకున్న ఆ పుష్పకవిమానం రాముని ఎదుటవచ్చి నిలబడింది. రాముడికి శిరస్సు వంచి నమస్కరిస్తూ, 'మహారాజా! మీ ఎదుటనే ఉన్నాను' అంది.

అంతట రాముడు మునులందరికీ నమస్కరించి, శూద్రతపస్విని వెదకటానికి బయలుదేరాడు. పుష్పకం ఎక్కి కూర్చొని పశ్చిమదిక్కుగా పొమ్మని ఆదేశించాడు. అక్కడనుండి ఉత్తరదిక్కుగా పోయి హిమపర్వత ప్రాంతం అంతా గాలించాడు. అక్కడ కొంచెంకూడా అధర్మపరులు తపస్సు చేయడం కనిపించలేదు, అక్కడనుండి తూర్పుదిక్కంతా వెదికాడు. కనిపించిన తపస్కులంతా సదాచార సంపన్నులై కడిగిన ముత్యంలా కనిపించారు. పిమ్మట రాజర్షి పుత్రుడు, మహారాజైన రాముడు దక్షిణ దిక్కంతా వెదికాడు. అక్కడ శైలవపర్వతానికి సమీపంలో ఒక పెద్ద సరస్సును చూశాడు. ఆ సరస్సులో తలక్రిందులుగా నిలచి తపస్సు చేస్తున్న ఓ మునీశ్వరుణ్ణి చూశాడు. రాముడు అతని దగ్గరకు వెళ్ళి ఇలా అన్నాడు. "ఓ మునీంద్రా! ఓ తపోవృద్ధుడా! నేను దశరథమహారాజు పుత్రుడను. పేరు రాముడు. నీవు చాలా ఘోరమైన తపస్సు చేస్తున్నావు, నువ్వు ఏమి కోరి ఇంత కఠినమైన తపస్సు చేస్తున్నావు? నువ్వు స్వర్గాన్ని కోరుకుంటున్నావా? లేక మరేదైనా ప్రయోజనం ఆశిస్తున్నావా? ఎవరిని ఉద్దేశించి తపస్సు చేస్తున్నావు? ఓ మహామునీ! నీవు బ్రాహ్మణుడవా? లేక క్షత్రియుడవా? లేక వైశ్యుడవా? లేక శూద్రుడవా? యథార్థం చెప్పు. నీకు భద్రమగుగాక!" అని అడిగాడు.

శిరస్సు క్రింద ఉంచి తపస్సు చేస్తున్న ఆ మునీశ్వరుడు రాజశ్రేష్ఠుడైన రామునితో తన జాతిని, తాను ఏమి కోరి తపస్సు చేస్తున్నాడో ఆ వివరాలన్నీ యథార్థంగా చెప్పాడు.

# 76వ సర్గ శూద్రతపస్విని వధించడం

రాముడు మాటలువిన్న (శూద్ర) తపస్వి, నీళ్ళలోనే తలక్రిందుగానే ఉండి ఇలా సమాధానం ఇచ్చాడు. “గొప్పకీర్తి గల రామా! నేను శూద్ర జాతిలో పుట్టాను. నా పేరు శంబూకుడు, దేవత్వం పొందాలన్నదే నా కోరిక. నేను చెప్పేదంతా సత్యమే.” ఆ శూద్రుడు అట్లా అంటూ ఉండగానే రాముడు తన ఒరలోనుండి ధగధగ మెరిసే ఖడ్గాన్ని తీసి అతడి శిరస్సు ఖండించాడు. అతడి శిరస్సు ఖండించగానే ఇంద్రాది దేవతలంతా ప్రత్యక్షమై రాముణ్ణి ప్రశంసించారు. దేవతా సంఘాలన్నీ ఆకాశంపైనుండి పుష్పవర్షం కురిపించాయి. సంతోషించిన ఇంద్రుడు రాముడితో ఇలా అన్నాడు. “రామా! గొప్ప బుద్ధిగలవాడా! నువ్వు దేవకార్యాన్ని చక్కగా చేశావు. నీ వలన ఒక శూద్రుడు స్వర్గానికి చేరుకోకుండా తప్పించావు. వరం కోరుకో” అన్నాడు.

అప్పుడు రాముడు అంజలిఘటించి నమస్కరిస్తూ ఇంద్రునితో ఇలా అన్నాడు: “దేవా! నీవు నాయందు ప్రసన్నుడవైతే ఆ బ్రాహ్మణ పుత్రునికి ప్రాణదానం చెయ్యి. నా అపచారం వల్లనే ఆ బ్రాహ్మణుని పుత్రుడు మరణించాడు. నేను ఆ వృద్ధబ్రాహ్మణునికి పుత్రుణ్ణి బ్రతికిస్తానని వాగ్దానంచేసి వచ్చాను” అన్నాడు. అందుకు ఇంద్రుడు “ఓ రామా! నీవు శూద్రుణ్ణి సంహరించిన ముహూర్తానే అక్కడ బ్రాహ్మణబాలుడు లేచి కూర్చున్నాడు. నరశ్రేష్ఠుడా! నీకు అంతా శుభమే జరుగుతుంది. అగస్త్యమహర్షి గత పన్నెండుసంవత్సరాలుగా జలశయ్యపై శయనించి దీక్షగా తపస్సు చేస్తున్నాడు. ఆ దీక్ష పరిసమాప్తం అయింది. మేము ఆ బ్రహ్మర్షిని చూడాలని అనుకుంటున్నాము. నువ్వు కూడా ఆ బ్రహ్మర్షిని దర్శించుకో” అంటూ ఇంద్రుడు అగస్త్యమహర్షి వద్దకు బయలుదేరాడు. రాముడుకూడా పుష్పకంపై అగస్త్యమహర్షి దర్శనానికి వెళ్ళాడు.

తపోనిధీ, ధర్మాత్ముడైన అగస్త్యుడు దేవతలందరికీ అర్ఘ్యపాద్యాది అతిథి మర్యాదలన్నీచేసి గౌరవించాడు. దేవతలుకూడా ఆ మహర్షిని పూజించి దేవలోకానికి వెళ్ళిపోయారు. పిమ్మట

రాముడు అగస్త్యమహర్షి దర్శనానికి వెళ్ళి అగస్త్యునికి అంజలిఘటించి నమస్కరించాడు. గొప్ప తేజస్సుతో ప్రజ్వరిల్లిపోతున్న ఆ బ్రహ్మర్షి రాముణ్ణి అర్ఘ్యపాద్యాదులతో ఆదరించి ఇలా అన్నాడు: "ఓ రామా! నా అదృష్టం చేత నా ఆశ్రమానికి వచ్చావు. నీకు స్వాగతం పలుకుతున్నాను. నీవు అనేక ఉత్తమగుణాలచేత గౌరవించ దగినవాడవు. నువ్వు పూజించతగిన అతిథివి. నీవు ఎల్లప్పుడూ నా హృదయంలోనే ఉంటావు. నువ్వు శూద్రుణ్ణి సంహరించడానికి వచ్చావని దేవతలు చెప్పారు. ధర్మాత్ముడైన బ్రాహ్మణుని పుత్రుణ్ణి బ్రతికించావు. రామా! నీవు ఈ రాత్రికి ఇక్కడే విశ్రమించి నా ఆశ్రమాన్ని పావనంచెయ్యి. నీవు సాక్షాత్తూ లక్ష్మీ సమేతుడవైన నారాయణుడవు. నువ్వే సర్వజగత్తులకూ ఆధారం. నీవు సకల దేవతలకు ప్రభువు; సనాతనుడవు, రేపు ఉదయానే నీ నగరానికి వెళ్ళవచ్చును.

రామా! నావద్ద ఒక దివ్యమైన ఆభరణం ఉంది. దాన్ని విశ్వకర్మ తయారుచేసి ఇచ్చాడు. ఆ ఆభరణాన్ని నీకు ఇస్తున్నాను, దాన్ని స్వీకరించి నన్ను అనుగ్రహించు. ఎవరైనా ఇచ్చినదాన్ని అనుభవించకుండా మరొకరికి ఇచ్చేట్లైయితే అధికమైన ఫలం సిద్ధిస్తుంది కదా! నీవు ఇంద్రునితో సహా మిగిలిన దేవతలందరినీ తరింపజేయగల సమర్థుడవు. నీవు ఆ ఆభరణాన్ని స్వీకరించి నన్నుకూడా తరింపజెయ్యి."

పిమ్మట బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు, ఇక్ష్వాకు వంశీయులలో మహారథుడు అయిన రాముడు క్షత్రియధర్మాన్ని గుర్తుచేస్తూ ఇలా అన్నాడు. "పూజ్యుడవైన ఓ బ్రాహ్మణోత్తమా! దానం గ్రహించడం అనేది బ్రాహ్మణులకు నిషేధంకాదు. కానీ క్షత్రియులు దానం గ్రహించడం అపచారం అవుతుందిగదా! అందులోనూ బ్రాహ్మణుని వస్తువును దానంగా పొందటమంటే మరింత పెద్దదోషంగదా! అందువలన ఓ బ్రహ్మర్షీ నేను ఏం చెయ్యాలో నీవే నిర్ణయించు" అన్నాడు. అంతట అగస్త్యుడు ఇలా చెప్పాడు.

"రామా! పూర్వం కృతయుగంలో అంతా బ్రహ్మమయంగా ఉండేది. అప్పుడు ప్రజలకు రాజు ఉండేవాడు కాదు. దేవతలకు మాత్రం ఇంద్రుడు రాజుగా ఉండేవాడు. అప్పుడు ప్రజలంతా

బ్రహ్మదేవుణ్ణి ఇలా ప్రార్థించారు. ఓ దేవా! దేవతలకు రాజుగా దేవేంద్రుణ్ణి ఇచ్చినట్లే మాకు కూడా ఒక రాజును ప్రసాదించు అని అర్థించారు. పిమ్మట దేవతలలో శ్రేష్ఠుడైన బ్రహ్మదేవుడు ఇంద్రాది లోకపాలకులందరినీ పిలిచి, మీ తేజస్సులో కొంత భాగం ఇవ్వండి అని అడిగాడు. అందుకు వారంతా అంగీకరించి తమ తేజస్సునుండి కొంత భాగాన్ని తీసి బ్రహ్మదేవునికిచ్చారు. వెంటనే బ్రహ్మదేవుడు తుమ్మాడు. ఆ తుమ్మునుండి 'క్షుపు' డనే రాజు ఉద్భవించాడు. అంతట బ్రహ్మదేవుడు లోకపాలకుల అంశలన్నింటినీ సమానంగా ఆ 'క్షుపు' నిలో నిక్షేపించాడు. ఇంద్రుని అంశనుండి భూమిని ఆజ్ఞాపించే శక్తిని, వరుణుని అంశచేత శరీర పుష్టిని, కుబేరుని అంశచేత ధనధాన్యాలను, యముని అంశచేత పరిపాలనా దక్షతను గ్రహించి సంపూర్ణమైన రాజుగా స్థాపించాడు. కావున ఓ రామా! ఈ ఆభరణం ఇంద్రుని అంశవల్ల వచ్చింది. కాబట్టి దీనిని గ్రహించవచ్చు. అప్పుడు రాముడు ఆ ఆభరణాన్ని స్వీకరించాడు. పిమ్మట రాముడు మహర్షితో ఇలా అన్నాడు: "ఓ బ్రహ్మర్షీ! ఈ ఆభరణాన్ని నీకు ఎవరు ఇచ్చారు? ఎక్కడ ఇచ్చారు? ఎవరు తీసుకొని వచ్చారు?" అని అడిగాడు. రాముని మాటలువిన్న అగస్త్య మహర్షి ఇలా అన్నాడు. "రామా! పూర్వం ఎప్పుడో త్రేతాయుగంలో జరిగింది. అడిగావు కాబట్టి చెబుతాను విను" అన్నాడు.

# 77వ సర్గ శవాన్ని భక్షించిన దివ్యపురుషుడు

రాముడు అడిగిన ప్రశ్నకు అగస్త్యుడు ఇలా చెప్పాడు. "రామా! పూర్వం త్రేతాయుగంలో జరిగిన కథ చెప్తాను విను. నూరుయోజనాల విస్తీర్ణంగల ఒక అరణ్యం ఉండేది. అయితే మృగాలు, పక్షులు ఎక్కడా కనిపించేవి కావు. ఆ అరణ్యంలో ఒక మూల తపస్సు చేసుకుంటూ ఉండేవాడిని. ఒకసారి నాలుగు మూలలూ చూసి వద్దామనిపించి, అలా తిరగటం ప్రారంభించాను. ఆ అరణ్య మధ్యలో ఒక యోజనం మేరకు ఒక సరస్సు ఉండటం చూశాను. హంసలు ఇంకా ఇతర జలచరాలు, కలువపూలు, పద్మాలతో ఆ సరస్సు మనోహరంగా ఉంది. ఆ సరస్సుకు సమీపంగా ఒక ఆశ్రమం ఉందిగానీ అందులో ఎవరూ ఉండటంలేదు. నేను ఒక రాత్రి అక్కడ గడిపాను. మర్నాడు ఉదయానే స్నానం చేయటానికి ఆ సరస్సు వద్దకు వెళ్ళాను. అక్కడ ఒక శవం పడివుంది. ఆ శవాన్ని చూసి నేను ఆశ్చర్యపోయాను. ఇంతలో ఆకాశంలోనుండి ఒక విమానం వచ్చి ఆగింది. అందులోనుండి ఒక దివ్యపురుషుడు బయటకు వచ్చాడు. అతడిని సేవిస్తూ సుమారు ఒక వెయ్యిమంది అప్సరసలు ఆటపాటలతో అతణ్ణి అలరిస్తున్నారు. ఆ విమానంలో ఉన్న ఆ స్వర్గనివాసి మేరుపర్వతం నుండి బయటకు వస్తున్న సూర్యుడివలె ప్రకాశించాడు. ఆ స్వర్గవాసి సరాసరి వెళ్ళి ఆ శవాన్ని భక్షించాడు. సరస్సులోకి దిగి నీరు త్రాగాడు. చేతులు కడుక్కొని తిరిగి విమానంలోకి వెళ్ళిపోతూ ఉండగా నేను అతడి దగ్గరకు వెళ్ళి ఇలా అడిగాను. "ఓ సౌమ్యుడా! నీవు ఎవరవు? నింద్యమైన ఆహారాన్ని ఎందుకు తింటున్నావు? నాకు చెప్పు, తెలుసుకోవాలని ఉంది." అంతట ఆ స్వర్గవాసి తన వృత్తాంతాన్నంతా నాతో చెప్పాడు.

# 78వ సర్గ అగస్త్యునికి శ్వేతుడు చెప్పిన కథ

ఓ రామా! నా మాటలువిని ఆ స్వర్గవాసి అంజలిఘటించి నాతో తన కథనంతా ఇలాచెప్పాడు. "ఓ బ్రహ్మర్షీ! సుఖదుఃఖాలను ఎవరూ తప్పించుకొని తిరగలేరుగదా? నేను విదర్భదేశపు రాజైన సుదేవుడి పుత్రుణ్ణి. నా తండ్రికి ఇద్దరు భార్యలు. నేను పెద్దభార్య సంతానం. నన్ను శ్వేతుడు అని అంటారు. ఆయనకు రెండో భార్య వలన సురథుడు అనేవాడు పుట్టాడు.

నా తండ్రి మరణించిన తర్వాత నన్ను రాజ్యాభిషక్తుణ్ణి చేశారు. నేనుకూడా నా తండ్రిగారి వలెనే ధర్మబద్ధంగాను, ప్రజారంజకంగానూ రాజ్యపాలన చేసేవాడిని. వేలసంవత్సరాలు అలా గడచిపోయాయి. ఒకానొక రోజున నాకున్న సాముద్రికజ్ఞానంతో నా మరణాన్ని గూర్చి తెలుసుకున్నాను. జంతువులుగానీ, పక్షులుగానీ తిరగని ఈ అరణ్యానికి వచ్చాను. ఈ సరస్సు ప్రక్కనే ఒక కుటీరాన్ని నిర్మించుకొని తపస్సు చేసుకుంటూ ఉండేవాడిని. నా తపస్సు ఫలించి నాకు బ్రహ్మలోకంలో స్థానం దొరికింది. నేను బ్రహ్మలోకంలో ఉంటున్నా కూడా ఆకలిదప్పుల నుండి నేను విముక్తి పొందలేదు.

ఒక రోజున బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి "దేవా! బ్రహ్మలోకంలో ఉండేవాళ్ళకు ఆకలిదప్పులు ఉండవంటారు. మరి నన్ను ఆ రెండూ ఇంకా పట్టి పీడిస్తూనే ఉన్నాయే? దీనికి కారణం ఏమిటి?" అని అడిగాను. అందుకు బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు: "ఓ శ్వేతుడా! నీవు ఎంత గొప్ప తపస్సుచేసినా, నీకు శరీరభ్రాంతి పోలేదు. నీకు శరీరంపై ఉండే మమకారం వల్ల, గొప్పతపస్సు చేసినప్పటికీ, శరీరాన్ని బాగాపోషిస్తూ వచ్చావు. దాంతో నీ శరీరం బాగా బలిసివుంది. ఓ శ్వేతుడా! విత్తనం నాటందే మొలవదుగదా? నీవు కొంచెం కూడా దానం చెయ్యలేదు. కేవలం తపస్సు మాత్రమే చేశావు అందువల్ల ఆకలిదప్పులు నిన్ను వదలకుండా పీడిస్తున్నాయి. ఇకపై నీవు, నీచే బాగా పోషించబడిన నీ దేహంనుండీ మాంసాన్ని తింటూ కాలంగడుపు, నీ మృతదేహం అక్కడే నా ఆశ్రమంలోనే ఉంటుంది. నువ్వు ఆ శవంలోని

మాంసాన్ని తింటూ నీ ఆకలి తీర్చుకో. నువ్వు ఈ విధంగా నీ శరీరంలోనుండి మాంసాన్ని తింటూ ఉండగా ఒకనాడు దివ్యశక్తి సంపన్నుడైన అగస్త్యమహర్షి నీ వద్దకువస్తాడు. నీవు శవం శరీరంనుండి మాంసం తింటూ ఉండటంచూసి, నీ వృత్తాంతం చెప్పమని అడుగుతాడు. అప్పుడు నీ కథ అంతా ఆయనకు చెప్పు. అతడు నిన్ను కరుణిస్తాడు, నీ ఆకలిదప్పుల్ని పోగొడతాడు. ఆయన దేవతలనుకూడా తరింపజేయగల శక్తిసంపన్నుడు. నీ ఆకలిదప్పికల బాధ ఆయనకు ఒక లెక్కా?

ఓ బ్రాహ్మణోత్తమా! బ్రహ్మదేవుని ఆజ్ఞ ప్రకారం కుత్సితమైన ఈ మాంసాన్ని తింటూ కాలంగడుపుతున్నాను. ఓ బ్రహ్మర్షీ! నేను అనేక సంవత్సరాలుగా తింటున్నా కూడా ఆ శరీరంలోని మాంసం తరగడం లేదు; నా ఆకలీ నశించడంలేదు. ఓ బ్రహ్మర్షీ! కష్టంలో ఉన్న నన్ను కాపాడు. నీవు తప్ప మరెవ్వరూ నాకు సహాయం చెయ్యలేరు. ఈ ఆభరణాన్ని స్వీకరించు, నన్ను అనుగ్రహించు. సౌమ్యుడవైన బ్రాహ్మణోత్తమా! ఈ ఆభరణాన్ని స్వీకరించి ధరించు. ఈ బంగారం వస్త్రములు, భక్ష్యభోజ్యాలు సమర్పించుకుంటున్నాను. అన్ని కామములను, భోగములను నీకు ఇచ్చివేస్తున్నాను, నన్ను మాత్రం అనుగ్రహించు" అని వేడుకున్నాడు.

ఓ రామా! నేను ఆ స్వర్గవాసి మాటలు విని అతణ్ణి తరింపజెయ్యటానికి అతడిచ్చిన ఆభరణమును స్వీకరించాను. నేను ఆ ఆభరణాన్ని స్వీకరించగానే ఆ రాజర్షికి చెందిన మనుష్యదేహం నశించింది. ఆ శరీరం (శవం) అదృశ్యంగానే ఆ రాజర్షి సంతోషించి స్వర్గానికి వెళ్ళిపోయాడు. రామా! ఇంద్రుడితో సమానుడైన ఆ రాజర్షి నాకు ఈ ఆభరణాన్ని కానుకగా ఇచ్చాడు.

# 79వ సర్గ దండకారణ్యం – చరిత్ర

అగస్త్యుడు చెప్పిన కథనంతా విన్న రాముడు ఆశ్చర్యపోయాడు. మళ్ళీ ఇలా అడిగాడు: "ఓ బ్రహ్మర్షీ! విదర్భరాజు పుత్రుడు శ్వేతుడు పక్షులు, మృగాలులేని శూన్యమైన అరణ్యంలో ఎందుకు తపస్సు చేశాడు?" అందుకు అగస్త్యుడు ఇలా బదులుచెప్పాడు: "రామా! పూర్వం కృతయుగానికి ప్రభువైన మనువు పాలిస్తూ ఉండేవాడు. అతడికి ఇక్ష్వాకు వంశోద్ధారకుడై పుట్టాడు, మనువు ఇక్ష్వాకును రాజ్యాభిషిక్తునిగా చేసి రాజవంశాన్ని విస్తరింప చెయ్యమని చెప్పాడు. అప్పుడు ఇక్ష్వాకు 'అట్లాగే చేస్తాను' అని చెప్పాడు. అంతట మనువు చాలా సంతోషించి, 'కుమారా! అకారణంగా ఎవరినీ దండించకు, దోషానికి తగిన దండనను, శాస్త్రాన్ననుసరించి విధిస్తూ ఉండు. శిక్షాస్మృతిని చక్కగా అమలుచేస్తే ఈ లోకంలో ధర్మం వర్ధిల్లుతుంది' అని కుమారునికి ఉపదేశించి యోగమార్గాన బ్రహ్మలోకానికి వెళ్ళాడు. తండ్రి స్వర్గస్థుడైన పిదప ఇక్ష్వాకు అనేక యజ్ఞయాగాలుచేసి ధర్మపరులైన నూరుగురు పుత్రుల్ని కన్నాడు. వారిలో చివరివాడు విద్యాహీనుడు, మూర్ఖుడూ అయ్యాడు. పెద్దలను గౌరవించేవాడు కాదు. అతడికి తండ్రి దండుడు అని పేరుపెట్టాడు. ఈ దుండుని ఏ ప్రాంతానికి రాజును చెయ్యాలా? అని ఆలోచించి చివరకు వింధ్యశైవలపర్వతాల మధ్యనున్న అరణ్యప్రాంతాన్నంతా దండుడికిచ్చాడు.

రామా! ఆ దండుడు ఆ అరణ్య ప్రాంతానికికంతా రాజై, అక్కడే ఒక గొప్పనగరాన్ని నిర్మించుకున్నాడు. ఆ నగరానికి మధుమంతమని పేరు పెట్టుకున్నాడు. శుక్రాచార్యుణ్ణి పురోహితుడుగా నియమించుకున్నాడు. ఆ విధంగా శుక్రాచార్యునితో కలసి సంతోషంగా ఉంటూ స్వర్గాన్ని దేవేంద్రుడు పాలించినట్లు పాలించాడు. శుక్రాచార్యునితో కూడిన ఆ ఇక్ష్వాకుపుత్రుడు బృహస్పతితో కూడిన దేవేంద్రుడివలె రాజ్యాన్ని పాలించాడు.

# 80వ సర్గ దండుడు శుక్రాచార్యుని పుత్రికను బలాత్కరించటం

“ ఓ రామా! పురోహితుడైన శుక్రాచార్యుని అండదండలతో దండుడు చాలాకాలం రాజ్యపాలన చేశాడు. ఒకానొక రోజున దండుడు పురోహితుడైన శుక్రాచార్యుల ఆశ్రమానికి వెళ్ళాడు. అది చైత్రమాసం. ప్రకృతి అంతా మనోహరంగా ఉంది. అక్కడ శుక్రాచార్యుని కుమార్తెయైన అరజ ఆ వనంలో విహరిస్తూ ఉండటం చూశాడు. దండుడి మనస్సు భ్రమించింది. కామపీడితుడయ్యాడు, మన్మథుడు గట్టిగాపట్టి పీడించాడు. అతడు స్వేచ్ఛగా విహరిస్తున్న అరజ వద్దకు వెళ్ళి “ఓ సుందరీ! నీవెవరవు? ఎవరి కుమార్తెవు?” అని అడుగుతూ మనోనిగ్రహాన్ని కోల్పోయాడు. అయినా ఆ బాలిక ఓర్పుతో “రాజా! నేను పుణ్యకర్మలు చేస్తూ ఉండేవాడూ, ప్రకాశవంతుడూ అయిన శుక్రాచార్యులవారి పుత్రికను. నాపేరు ‘అరజ’ అంటారు. మహారాజా! నా తండ్రి నీకు గురువు. నువ్వు ఆ మహాత్ముడికి శిష్యుడవు. నన్ను నీవు తాకకూడదు. ఆయనకు కోపంవస్తే నిన్ను నామరూపాలు లేనివాడిగా చేస్తాడు. నీవు నన్ను కోరుకుంటున్నట్లైతే, ధర్మసమ్మతంగా నా తండ్రి వద్దకు పోయి అడుగు. అట్లా కాకుండా వేరే దురాలోచన ఏదైనా చేస్తే నీవు గొప్ప ఆపదలో చిక్కుకుంటావు. నా తండ్రికి కోపంవస్తే ముల్లోకాలనూ కాల్చివేయగలడు. కాబట్టి ఓ రాజా! నీకు యథార్థంగా నాపై కోరిక ఉంటే నా తండ్రిని యాచించు; అతడు తప్పక నన్ను నీకు ఇవ్వగలడు” అని చెప్పింది.

కామపరవశుడైన ఆ దండుడు, అరజతో ఇలా అన్నాడు. “అందమైన కటిప్రదేశం గలదానా! మాటలతో కాలయాపన చెయ్యకు. నిన్ను చూసింది మొదలు మన్మథుడు నన్ను పీడిస్తున్నాడు; నా పైప్రాణాలు పైనే పోతున్నాయి. నిన్ను పొందిన తర్వాత నేను చచ్చిపోయినా విచారించను; భయంకరమైన పాపం వచ్చినా విచారం లేదు. నా మనస్సంతా వ్యాకులమైపోతోంది, నిన్ను పొందకుండా ఉండలేను, నీ భక్తుణ్ణి, నన్ను కరుణించు” అని అంటూ బలవంతుడైన ఆ దండుడు ఆమెను కౌగలించుకొని బలాత్కారంగా అనుభవించాడు. దండుడు మహాభయంకరమైన ఈ పాపకృత్యాన్ని చేసి వెంటనే తన నగరానికి వెళ్ళిపోయాడు.

అంతట అరజ ఏడుస్తూ తండ్రి రాకకోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

## 81వ సర్గ దండుని శుక్రాచార్యులు శపించటం

కొంతసేపటికి శుక్రాచార్యుడు ఆకలితో బాధపడుతూ శిష్యులతో కలసి ఆశ్రమానికి చేరుకున్నాడు. దీనురాలై ఏడుస్తూ ఉన్న అరజను చూశాడు. ఆమె ఒళ్ళంతా దుమ్ముకొట్టుకొని మలినమై కళాకాంతులు లేనిదై, రాహువుచే కప్పబడిన సూర్యునివలె పడి ఉంది. శుక్రాచార్యుడు స్వతహాగా కోపిష్టి, దానికి దగ్గట్లుగా ఆకలి మీద ఉన్నాడు. కుమార్తెను చూడగానే ముల్లోకాల్నీ కాల్చివెయ్యాలన్నంత కోపం వచ్చింది. శిష్యులతో ఇలా అన్నాడు.

"చూశారా! దుర్మార్గుడైన ఈ దండుడు ఎంత కిరాతకమైన పనిచేశాడో! వీడు ప్రజ్వరిల్లుతున్న అగ్నిశిఖను పట్టుకున్నాడు. వాడికీ వాడి పరివారానికి రోజులు మూడాయి. ఎంతటి నీచుడు! గురుపుత్రికనే బలాత్కరిస్తాడా? వీడికి వినాశం దాపురించింది. 'పాపకర్మ, పాపాచారం చేసిన దుర్మతియైన ఈ రాజు, పుత్రులు, సైన్యము, వాహనములు ఏడు రోజుల్లో నశించుగాక. ఇంద్రుడు ఇతడి నూరుయోజనాల వనాన్ని కాల్చివేయుగాక! ఇక్కడ ఉండే స్థావరజంగమాలు, సమస్తప్రాణులూ ఏడు రాత్రులు ధూళివర్షంపొంది మరణించుగాక!' అని శపించాడు. అంతట శిష్యులందరినీ దేశ సరిహద్దులకు బయట నివసించమని ఆదేశించాడు. శుక్రాచార్యుల పరిజనం అంతా ఆశ్రమాన్ని విడిచి వెళ్ళిపోయారు. అంతట అరజను "ఓ దుర్బుద్ధిగలదానా! పవిత్రురాలవు అయ్యేవరకూ నువ్వు ఈ ఆశ్రమంలోనే నిశ్చలధ్యానం చేసుకుంటూ నివసించు. ఓ అరజా! యోజనం దూరంలో విశాలంగా ఉన్న ఈ మనోహరమైన సరస్సు మనోవ్యథలు ఏమీ లేకుండా అనుభవించు. ఇక్కడ నివసించే పశుపక్ష్యాదులన్నీ నీకు ఏ ప్రమాదమూ కలిగించకుండా సంచరిస్తాయి" అన్నాడు. తండ్రి మాటలకు దుఃఖీస్తూ 'అట్లాగే ఉంటాను' అని అన్నది. పిమ్మట శుక్రాచార్యుడు కూడా ఆశ్రమాన్ని వదిలి వెళ్ళిపోయాడు.

రామా! ఆ బ్రహ్మర్షి శపించినట్లుగానే దండుడు, వాడి అనుచరులు అందరూ బూడిద అయిపోయారు. వింధ్య-శైవలపర్వతాల మధ్యనుండే ఈ ప్రదేశం అంతా నివాసానికి యోగ్యం

కాకుండా పోయింది. ఆనాటి నుండి ఈ ప్రదేశానికి ‘దండకారణ్యం’ అన్న పేరు స్థిరపడింది. అటుపిమ్మట మునులు, తాపసులు మాత్రమే నివసిస్తూ వచ్చారు. అందువల్ల జనస్థానం అనికూడా పేరువచ్చింది” అన్నాడు. ఓ రామా! సూర్యుడు అస్తమిస్తున్నాడు నీవు కూడా పోయి ఆదిత్యోపాసన చెయ్యి, సంధ్యనుపాసించు” అని కథ చెప్పడం ముగించాడు.

# 82వ సర్గ రాముడు అయోధ్యకు బయలుదేరటం

అగస్త్య మహర్షి చెప్పగానే రాముడు పవిత్రమైన సరస్సు వద్దకు వెళ్ళి స్నానాదికాలు ముగించుకొని సంధ్యోపాసనచేసి మరల ఆశ్రమంలోకి ప్రవేశించాడు. అగస్త్యుడు రాముని భోజనానికై మధురమైన ఫలాలను; ఉత్తమజాతి దుంపలను, కాయకూరలతో కూడిన వరిఅన్నాన్ని ఏర్పాటు చేశాడు. రాముడు తృప్తిగా భోజనం చేసి ఆ రాత్రికి అక్కడే విశ్రమించాడు. శత్రుసంహారకుడైన రాముడు ప్రాతఃకాలానే లేచి సంధ్యావందనం హోమం మొదలైన నిత్యకర్మలన్నీ పూర్తి చేసుకొని అగస్త్య మహర్షి వద్దకు వెళ్ళి అంజలిఘటించి నమస్కరించి ఇలా అన్నాడు: "ఓ బ్రహ్మర్షీ! నేను అయోధ్యకు వెళ్ళేందుకు అనుమతి కోరుతున్నాను, మహాత్ముడవైన నీ దర్శనం చేత ధన్యుడనయ్యాను; మీ దర్శనార్థమూ, నన్ను నేను పవిత్రుణ్ణి చేసుకొనుటకు రాగలను" అన్నాడు.

రాముడు అన్నమాటలకు ధర్మమే నేత్రంగా గల ఆ మహర్షి ఇలా అన్నాడు: "ఓ రామా! నీవు అన్నమాటలు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి. ఎందువల్లనంటే, ఓ రఘునందనా! నీవే సకల ప్రాణుల్నీ పవిత్రం చేసేవాడవు. నిన్ను ఎవరైతే ఒక ముహూర్త కాలమైనా దర్శిస్తారో వారందరికీ స్వర్గప్రాప్తి లభిస్తుంది; దేవతలందరిచేతా పూజించబడతారు. ఏ ప్రాణియైనా నీ యందు విరోధభావం ప్రదర్శిస్తాడో వాడు వెంటనే యమలోకానికి వెళ్తాడు. ఈ విధంగా సకలప్రాణుల్నీ పవిత్రుల్ని చేసే సత్తా ఉన్నవాడివి, నిన్ను కీర్తించినంత మాత్రనే సిద్ధిపొందుతారు. నీవే ఈ జగత్తు అంతటికీ గతివి. ఓ రామా నీవు క్షేమంగా నీ నగరానికి వెళ్ళి రాజ్యాన్ని ధర్మబద్ధంగా పాలించు. ఎవరివల్లా, ఎటువంటి భయమూ లేనివాడివై వర్ధిల్లు" అన్నాడు.

అంతట రాముడు పుణ్యశీలముగల ఆ మహర్షికి అంజలిఘటించి నమస్కరించాడు. మిగిలిన మునీశ్వరులందరికీ నమస్కరించాడు. పిమ్మట పుష్పకవిమానాన్ని అధిరోహించాడు. రాముడు మధ్యాహ్నమయ్యే సరికల్లా అయోధ్యకు చేరుకున్నాడు. పిమ్మట పుష్పకం వెళ్ళడానికి

అనుజ్ఞ ఇచ్చాడు. అంతట వాకిలివద్దనున్న ద్వారపాలకులతో ఇలా అన్నాడు. “భటులారా! మీరు వెంటనే వెళ్ళి భరతుడికి, లక్ష్మణునికి నేను వచ్చినట్లు చెప్పి రండి” అన్నాడు.

# 83వ సర్గ రాజసూయంపై భరతుడి అభిప్రాయం

అంతట ద్వారపాలకుడు వెంటనే వెళ్ళి రాముని ఆగమనాన్ని భరత లక్ష్మణులకు చెప్పి, ఆ విషయాన్ని రామునికి చెప్పాడు. అంతట రాముడు భరత, లక్ష్మణులిద్దర్నీ ఆలింగనం చేసుకొని ఇలా అన్నాడు. "భరత, లక్ష్మణులారా! అత్యుత్తమమైన బ్రాహ్మణుని పని పూర్తిచేసి వచ్చాను. ఇప్పుడు రాజధర్మానికి సంబంధించిన మరో అత్యుత్తమమైన కార్యాన్ని తలపెడ్తున్నాను. అదే రాజసూయం. రాజసూయం చేసే అర్హత రాజులకు మాత్రమే ఉంటుంది. తమ్ములారా! నాకు ఆ రాజసూయాన్ని చెయ్యాలనే సంకల్పం కలిగింది. మీ సహాయంతో నేనా కార్యాన్ని పూర్తిచేస్తాను. ఆ యాగం వల్ల సమస్త పాపాలు క్షయమైపోతాయి, ధర్మాన్ని పోషిస్తుంది. మీ ఇద్దరూ నాకు ఆత్మవంటివారు, మీరే దగ్గరుండి జరిపించమని కోరుతున్నాను. ఆ యాగం వలన ధర్మం శాశ్వతంగా నిలిచిపోతుంది.

సోదరులారా! శత్రువినాశకుడైన మిత్రుడు ఉత్తమమైన ఈ రాజసూయాన్నిచేసి వరుణత్వాన్ని పొందాడు. సర్వధర్మాలు తెలిసిన సోముడు ధర్మానుసారం ఈ యాగాన్ని చేసి శాశ్వతమైన కీర్తిని, సకల లోకాల్లోనూ శాశ్వతమైన స్థానాన్ని పొందాడు. రాజసూయం ఇహపరాలకు యోగ్యమైనది. మీరు కూడా శ్రద్ధగా ఆలోచించి చెప్పండి."

చక్కగా మాట్లాడే నేర్పుగల భరతుడు ఇలా అన్నాడు. "ఓ సత్పురుషుడా! ఓ మహాబాహూ! అఖండ పరాక్రమవంతుడా! నువ్వే మూర్తీభవించిన ధర్మానివి. సమస్త భూమండలం నీ యందే నిలచివుంది. ముల్లోకాల్లోనూ అఖండ కీర్తిమంతుడమూ నీవే. లోకాలన్నింటికీ నాథుడవు, రాజులందరిలోను మహాత్ముడవు, లోకాలన్నీ నిన్ను దేవతలు బ్రహ్మదేవుని చూసినట్లు చూస్తున్నాయి. రాజులందరూ నిన్ను తండ్రివలె గౌరవిస్తున్నారు. సమస్తభూతాలకూ నీవేకదా గతివి? అటువంటి నీవు రాజసూయాన్ని తలపెట్టడం ఎంతవరకూ సబబా అని ఆలోచిస్తున్నాను. నీవు ఈ యాగాన్ని చేస్తే ఒక్క రాజవంశం కూడా భూమిపైన మిగిలి

ఉండదుగదా? దుష్టులైన రాజులుగానీ, పాపాత్ములైన రాజులుగాని, ధర్మహాని తలపెట్టే రాజులుగానీ ఈ భూమండలంపై ఉంటే ఈ యజ్ఞం చెయ్యవచ్చు. కానీ అట్లాంటి పరిస్థితి ఈనాడు లేదుగదా? ఓ పురుషశ్రేష్ఠుడా! భూమిపైన ఉండే రాజులందర్నీ చంపటం ధర్మం కాదు. పైగా వాళ్ళంతా నీయందు విధేయులై ఉన్నారుగదా?'' అన్నాడు.

భరతుడి మాటలు విని రాముడు చాలా సంతోషించాడు. ''ఓ దోషములేనివాడా! భరతుడా! ఇప్పుడు నీవన్నమాటలన్నీ నాకు సంతోషాన్ని కలిగించాయి. నువు నిర్భయంగా చెప్పావు. నువ్వు చెప్పిన మాటలన్నీ ధర్మసమ్మతంగా ఉన్నాయి. నువ్వు ధర్మం చక్కగా తెలిసినవాడవు. తమ్ముడా! నేను రాజసూయం చెయ్యాలనే ఆలోచనను విరమించుకుంటున్నాను. లోకాన్ని పీడించే కర్మల్ని బుద్ధిమంతులైనవారు చెయ్యరుగదా! 'బాలుడు చెప్పినా మంచిమాట అయితే వినాలని' పెద్దలంటారు. కాబట్టి ధర్మసమ్మతంగా ఉన్న నీ మాటను స్వీకరిస్తున్నాను'' అన్నాడు.

# 84వ సర్గ అశ్వమేధయాగాన్ని గూర్చి లక్ష్మణుని మాటలు

భరతుడు చెప్పినదంతా రాముడు విన్నాడు. పిదప లక్ష్మణుడు ఇలా అన్నాడు. "అన్నా! అశ్వమేధయాగం సర్వపాపవినాశకరం అని పెద్దలు అంటారు. పూర్వం ఇంద్రుడు అశ్వమేధాన్నిచేసి వృత్రాసురుని సంహరించటం వలన సంభవించిన బ్రహ్మహత్యా పాతకాన్ని పోగొట్టుకున్నాడు. పూర్వం దేవదానవులు కలసిమెలసి ఉండే రోజుల్లో వృత్రాసురుడు ఉండేవాడట. వాడి శరీరం మేరుపర్వతం అంత ఉండేదట. అతడు నూరుయోజనాల లావు, మూడువందల యోజనాల పొడవు కలిగి దానికి తగినంత బలంతో ఉండేవాడు. ధర్మాలన్నీ తెలిసినవాడూ, కృతజ్ఞుడు, బుద్ధిశాలియైన అతడు ఈ భూమండలాన్నంతా ధర్మంగా పాలించేవాడు. అతడి పాలనలో భూమి దున్నకుండానే పండేదట. వృక్షాలు అన్ని కాలాల్లోనూ పండ్లు, పూలు సమృద్ధిగా పండించేవి.

అప్పుడా వృత్రాసురుడు అత్యుత్తమమైన తపస్సును చేయాలని సంకల్పించాడు. ఇహలోక సుఖాలపైనా మోహంమొత్తింది. అప్పుడు అతడి పెద్దకుమారుడైన మధురుణ్ణి రాజుగాచేసి తాను సకలదేవతలకు భీతికలిగేట్లు ఘోరమైన తపస్సు ప్రారంభించాడు. వృత్రాసురుడు ఉగ్రమైన తపస్సు చేయడం చూసి, ఇంద్రుడు భయపడిపోయాడు, తన ఇంద్రత్వానికే మోసం వస్తుందేమోనన్న భయంతో విష్ణుమూర్తి వద్దకుపోయి మొరపెట్టుకున్నాడు. "మహాబాహూ! ఈ వృత్రాసురుడు లోకాలన్నీ జయించాడు. ఇప్పుడు ఉగ్రమైన తపస్సు ప్రారంభించాడు. ఇతడు తపస్సుచేసి వరాలు పొందాడంటే, నా వశంలో ఉండడు. ఓ సురాధీశా! ఈ మహాబలశాలి, ఉదారస్వభావుడు అయిన ఈ రాక్షసుడు ఏనాటికైనా దేవతలకు పక్కలో బల్లెంవలె తయారవుతాడు. కాబట్టి నీవు ఇతడి విషయంలో ఉపేక్షించవద్దు. నువ్వు కన్నెర్రచేస్తే చాలు! నామరూపాల్లేకుండా పోతాడు. దేవతలంతా నీ అనుగ్రహం కోసం ఎదురుచూస్తున్నారు. ఈ వృత్రాసురుణ్ణి సంహారంచేసి ముల్లోకాలవారికీ సహాయపడు. మాకు నీవే దిక్కు. నువ్వు దేవతలకు ఎల్లప్పుడూ సహాయంచేస్తూ ఉంటావు. ఈ కార్యం నీవు తప్ప మరెవ్వరూ చెయ్యలేరు.

దిక్కులేనివారికి నీవే దిక్కు" అని ప్రార్థించాడు.

# 85వ సర్గవృత్రాసుర సంహారం

అంతట రాముడు "ఓ శత్రుసంహారకుడవైన ఓ లక్ష్మణా! వృత్రాసుర సంహారం గూర్చి పూర్తిగా చెప్పు, వింటాను" అన్నాడు. అప్పుడు లక్ష్మణుడు ఇలా చెప్పాడు: "విష్ణుభగవానుడు ఇంద్రుడు మున్నగు దేవతలంతా చెప్పింది విన్నాడు. దేవతలతో ఇలా అన్నాడు 'ఓ దేవతలారా! వృత్రాసురుడు నాకు పరమభక్తుడు, అందువలన మీరు కోరినట్లు నేనతణ్ణి చంపలేను. కానీ మీకో ఉపాయం చెప్తాను. నా తేజస్సును మూడు భాగాలుగా విభజిస్తాను, ఒక అంశ ఇంద్రుని వజ్రాయుధంలో, ఒక అంశ ఇంద్రుడిలోను, మూడవ అంశం భూమిలోను ప్రవేశపెడ్తాను, అప్పుడు ఇంద్రుడు వృత్రాసురుణ్ణి చంపగలుగుతాడు'". అందుకు దేవతలంతా సంతోషించి "ఓ దైత్యసంహారకా! నువ్వు ఎట్లా చెయ్యమంటే అట్లాగే చేస్తాం. వృత్రాసుర సంహారం జరగటమే మా లక్ష్యం. ఔదార్యంగల ఓ జగత్ప్రభూ! ఇప్పుడే నీ అంశలను ప్రవేశపెట్టు, మేము కార్యోన్ముఖులమై బయలు దేరుతాం" అన్నారు.

పిమ్మట ఇంద్రుడు మొదలైన దేవతలంతా వృత్రాసురుడు తపస్సు చేస్తున్న మహారణ్యానికి వెళ్ళారు. అక్కడ మహాతపస్సమాధిలో ఉన్న వృత్రాసురుణ్ణి చూశారు. అతడి తేజస్సు ముల్లోకాల్నీ కాల్చివేసేట్లున్నది. ఇతణ్ణి ఎలా చంపడమా అని ఆలోచిస్తూ ఉండగా, ఇంద్రుడు వజ్రాయుధాన్ని రెండు చేతులతోనూ గట్టిగా పట్టుకొని వృత్రాసురుని శిరస్సుపై కొట్టాడు. ఆ వజ్రాయుధం దెబ్బకు వృత్రాసురుడి శిరస్సు పగిలి క్రిందపడుతూ ఉండగా అగ్నిజ్వాలలు లేచాయి. లోకాలన్నీ భయపడ్డాయి. అయినా, ఆ వృత్రాసురుడు చనిపోలేదేమోనన్న భయంతో దేవేంద్రుడు అక్కడనుండి పారిపోయాడు. అట్లా లోకాలు ఎంత వరకూ ఉన్నాయో అంత వరకూ పరుగెత్తుతూనే ఉన్నాడు. ఇంద్రుడు అట్లా పరుగుపెడ్తూ ఉంటే అతడి వెనకాలే 'బ్రహ్మహత్యాపాతకం' కూడా వెంట పడింది. ఆ బ్రహ్మహత్యాపాతకం ఇంద్రుడి శరీర భాగాలన్నింటిలోకీ ప్రవేశించింది. దాంతో ఇంద్రుడి దుఃఖానికి అంతులేకుండా పోయింది. శత్రువును చంపి ఇంద్రుడు కనిపించకుండా పోవడంతో దేవతలంతా భయపడిపోయి మళ్ళీ

ముల్లోకాలకూ ప్రభువైన శ్రీమహావిష్ణువును ప్రార్థించారు. "ప్రభూ! నీవే మాకు దిక్కు. నువ్వు ఆది అంతం లేనివాడవు. అనాదివి, సనాతనుడవు, సకల భూతరక్షకుడవు. నువ్వు వృత్రాసురుణ్ణి చంపావు. బ్రహ్మహత్యాదోషం ఇంద్రుణ్ణి పీడిస్తోంది. బ్రహ్మహత్యా పాతకాన్నుండి కాపాడు" అని ప్రార్థించారు. అంతట విష్ణువు వారితో ఇలా అన్నాడు: "ఓ దేవతల్లారా! ఇంద్రుణ్ణి నన్నే పూజించమని చెప్పండి. పుణ్యప్రదమైన అశ్వమేధయాగాన్ని చేస్తే నన్ను పూజించినట్లే అవుతుంది. అప్పుడు ఇంద్రుడు పవిత్రుడు అవుతాడు, తిరిగి ఇంద్రత్వాన్ని పొందుతాడు." భగవంతుడైన ఆ విష్ణుభగవానుడు దేవతలందరికీ అమృతంతో సమానమైన మాటలుచెప్పి, వాళ్ళంతా స్తుతిస్తూ ఉండగా తన లోకానికి వెళ్ళిపోయాడు.

# 86వ సర్గ ఇంద్రుడు అశ్వమేధయాగాన్ని చేయడం

గొప్పపరాక్రమం గలవాడూ, మహాతపస్వియైన వృత్రాసురుణ్ణి సంహరించిన తర్వాత ఇంద్రుణ్ణి బ్రహ్మహత్యాపాతకం ఆవహించగా లోకాలన్నంటికి చివరిదైన లోకానికిపోయి చైతన్యాన్ని కోల్పోయి ఒక సర్పంవలె పడి ఉన్నాడు. ఇంద్రుడు కనిపించకుండా పోవడంతో ముల్లోకాల్లో పరిపాలన అంతా కుంటుపడిపోయింది. వర్షాలు కురవలేదు, దాంతో భూమి అంతా ఎండి బీటలువారింది. నదుల్లో, చెరువుల్లో, ఎక్కడా నీరులేకుండా పోయింది. లోకాలన్నీ అనావృష్టిచేత బాధపడ్డాయి. దేవతలంతా కలతచెందారు, వెంటనే విష్ణుభగవానుడు ఉపదేశించిన అశ్వమేధయాగం చెయ్యడానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసుకున్నారు. పండితుల్ని, ఋత్విక్కుల్ని, ఋషుల్ని, ఉపాధ్యాయుల్ని వెంటబెట్టుకొని ఇంద్రుడున్న చోటుకు పోయారు.

బ్రహ్మహత్యా పాతకంచేత ఆవరించబడి ఉన్న ఇంద్రుణ్ణి చూశారు. ఆ దేవతాప్రభువును ముందు ఉంచుకొని అశ్వమేధయాగాన్ని చేశారు. ఆ యజ్ఞం పరిసమాప్తం అయిన తర్వాత, బ్రహ్మహత్యాపాతకం ఇంద్రుణ్ణి వదలి, ఆ దేవతలందర్నీ "నాకు ఎక్కడ స్థానం కల్పిస్తారు?" అని అడిగింది. అప్పుడా దేవతలంతా సంతోషించి, "నిన్ను నాలుగు భాగాలుగా విభజించుకో" అన్నారు.

అంతట ఆ బ్రహ్మహత్యాపాతకం దేవతలతో ఇలా అంది. "ఓ దేవతలారా! నాలోని నాలుగో భాగాన్ని వర్షాకాలంలో నీటితో సమృద్ధిగా ఉండే నదుల్లోను, సరస్సుల్లోనూ, ఉంటూ పాపాత్ముల దర్పాన్ని తొలగిస్తూ సంచరిస్తాను. ఒక అంశలో ఎల్లప్పుడూ చవట భూముల్లో నివసిస్తూ ఉంటాను. నా మూడో అంశను యువతులైన స్త్రీలలో ఉంటూ వాళ్ళ దర్పాన్ని తొలిగిస్తూ మూడు దినాలపాటు వాళ్ళతో ఉంటాను. ఇక నా నాలుగో అంశను, అపరాధం లేకుండా ఎవరైతే బ్రాహ్మణులను వంచనచేత చంపుతారో వాళ్ళను ఆశ్రయించి ఉంటాను."

అంతట దేవతలంతా "ఓ దుఃఖాన్ని కలిగించే నివాసం గలదానా! నీకు ఏది ఇష్టమో

అట్లాగే చెయ్యి" అన్నారు. పిమ్మట దేవతలంతా సంతోషించి ఇంద్రుడికి నమస్కరించారు. అంతట ఇంద్రుడు పాపం లేనివాడై తన స్వర్గానికి వెళ్ళాడు. అంతట ముల్లోకాల్లోనూ ప్రశాంతత నెలకొంది. అప్పుడా ఇంద్రుడు అశ్వమేధాన్ని వేనోళ్ళ కొనియాడాడు.

కనుక రామా! అశ్వమేధము యొక్క అనుగ్రహం చాలాగొప్పది. ఓ రాజా! అశ్వమేధాన్ని చెయ్యి. అంతట ఇంద్రునివంటి ప్రభావం కలిగిన రాముడు, ఉత్తమమైన లక్ష్మణుని మాటలువిని చాలా సంతోషించాడు.

# 87వ సర్గ రాముడు 'ఇలుని' గూర్చి చెప్పటం

లక్ష్మణుని మాటలు విని రాముడు నవ్వుతూ ఇలా అన్నాడు: "లక్ష్మణా! నరశ్రేష్ఠా! నీకు ఇలుడి కథ చెప్తాను విను."

పూర్వం కర్దమప్రజాపతి కుమారుడు ఇలుడు అనే పరమధార్మికుడు ఉండేవాడు. శ్రీమంతుడైన ఆ ఇలుడు బాహ్లిదేశాన్ని పాలించేవాడు, ఆ ఇలుడు సమస్త భూమండలాన్ని తన అధీనంలో ఉంచుకొని ప్రజల్ని కన్నబిడ్డల్లాగా చూస్తూ గొప్పకీర్తిని సంపాదించాడు. దేవతలు, దైత్యులు, నాగ, రాక్షస, గంధర్వ, యక్ష సమూహాలన్నీకూడా ఆ ఇలుడిని భక్తిశ్రద్ధలతో పూజించేవారు. అతడికి ఎక్కడ కోపంవస్తుందో (పౌరుషం) అని ముల్లోకాలు భయపడేవి. బాహ్లీక ప్రభువైన ఆ ఇలుడు ధర్మ, పరాక్రమములయందు సుస్థిరుడై విరాజిల్లాడు.

ఒకానొక మనోహరమైన చైత్రమాసంలో బంధుజనులతోను, సైన్యంతోను కలసి వేటకు వెళ్ళాడు. వేటలో వేలాది జంతువుల్ని చంపినా అతడికి తృప్తి కలుగలేదు. అందుచేత మహాసేనుడు జన్మించిన దేశానికి కూడా వేటకై వెళ్ళాడు. ఆ ప్రదేశంలోనే దేవతల ప్రభువైన పరమశివుడు పార్వతీదేవితో విహరిస్తున్నాడు. ఆ పరమేశ్వరుడు పార్వతీదేవిని సంతోషపెట్టాలని స్త్రీరూపాన్ని ధరించి సరస్సులో స్నానంచేస్తున్నాడు. ఆ క్షణానే, ఆ అడవీప్రాంతాన ఉండే సమస్త జీవరాసులూ, వృక్షాలు, చెట్లూ చేమలతో సహా పుల్లింగములో ఉన్నవన్నీ స్త్రీత్వాన్ని పొందాయి. ఇంతలో ఆ ఇలమహారాజు కూడా జంతువులను వేటాడుతూ ఆ ప్రదేశంలో కాలుమోపాడు. అంతే తాను తరుముకుంటూ వచ్చిన మృగాలు, తాను తన సైన్యంకూడా స్త్రీత్వాన్ని పొందడం గమనించాడు. అతడికి చాలాదుః ఖం కలిగింది. ఇదంతా శివభగవానుని క్రీడ అని తెలుసుకొని శివుణ్ణి గూర్చి తీవ్రంగా ధ్యానించి శరణుకోరాడు. అప్పుడు పార్వతీ సమేతుడైన పరమేశ్వరుడు చిరునవ్వు నవ్వుతూ, ఇలుడితో ఇలా అన్నాడు. "ఓ కర్దమ పుత్రుడా! మహాబలశాలీ! ఓ రాజర్షీ! లెమ్ము, నిన్ను అనుగ్రహిస్తున్నాను. నీవు పుంసత్వము తప్ప మరే వరమైనా కోరుకో" అన్నాడు.

స్త్రీరూపంలో ఉన్న ఆ రాజు శివుని నుండి వరం కోరుకోలేదు. ప్రక్కనేవున్న పార్వతీదేవికి భక్తిపూర్వకంగా నమస్కరించి ఇలా ప్రార్థించాడు. "వరములు ఇచ్చే సమర్థత గల ఓ దేవీ! నీవు లోకాలన్నింటికీ వరాలిచ్చే తల్లివి. నీ దర్శనం వ్యర్థం అవుతుందా? మమ్మల్ని నీ చల్లని నేత్రాలతో చూడు, మమ్మల్ని కరుణించు" అని ప్రార్థించాడు.

పరమశివుని దేవేరియైన పార్వతి రాజర్షి మనస్సులోని ఆవేదనను గ్రహించి ఇలా అంది: "నీకు పరమశివుడు సగం వరం ఇస్తాడు, నేను సగం వరం ఇస్తాను. నువ్వు మా ఇద్దరినీ నీకు కావలసింది కోరుకో" అన్నది. అంతట ఆ దేవి పలుకులకు సంతోషించిన రాజు ఇలా అడిగాడు: "ఓ దేవీ! నీవు నాయందు ప్రసన్నురాలవయ్యావు, నేను ఒక మాసం స్త్రీగా ఉంటూ మరొక నెలరోజులు పురుషుడుగా ఉండేట్లు అనుగ్రహించు" అని ప్రార్థించాడు. అందుకు ఆ దేవి 'అట్లే అగుగాక' అని దీవించి, "ఓ రాజా! నీవు స్త్రీగా ఉన్నప్పుడు పురుషత్వాన్ని స్మరించవు పురుషుడిగా ఉన్నప్పుడు స్త్రీత్వాన్ని స్మరించవు" అని దీవించింది. ఈ విధంగా ఆ ఇలమహారాజు ఒక మాసం పురుషుడుగాను, ఒక మాసం స్త్రీగాను ఉంటూ 'ఇల' అనే పేరుతో ముల్లోకాల్లోనూ అతిలోకసుందరిగా ప్రసిద్ధుడయ్యాడు.

# 88వ సర్గ ఇలా – బుధుల పరస్పర దర్శనం

ఇలుడి కథ విన్న భరత–లక్ష్మణులు ఆశ్చర్యంతో రాముణ్ణి ఇలా అడిగారు: "సోదరా! ఆ రాజు స్త్రీగా ఉన్నప్పుడు ఎలా ప్రవర్తించేవాడు? పురుషుడుగా ఉన్నప్పుడు ఎలా ప్రవర్తించేవాడు? మాకు వివరంగా చెప్పవలసింది." అప్పుడు వారితో రాముడు ఇలా అన్నాడు: "ఆ రాజు స్త్రీగా మారిన మొట్టమొదటి నెలలో, త్రిలోకసుందరియైన ఇలగా మారాడు. ఆమె పరిచారికలు (అతనితో వచ్చిన సైనికులు) కూడా స్త్రీలే కావటంవలన వారందరినీ వెంటబెట్టుకొని వనవిహారం చెయ్యసాగారు. వాళ్ళు అట్లా తిరుగుతూ, తిరుగుతూ ఓ కొండ ప్రక్కగాఉన్న సరస్సు వద్దకు వెళ్ళారు. అదే సమయంలో చంద్రభగవానుని కొడుకు బుధుడు నీళ్ళల్లో మునిగి తపస్సు చేసుకుంటున్నాడు. అప్పుడు ఇల కూడా తన సఖీజనంతో కలసి సరస్సులోకి దిగింది. అంతా కలసి కేరింతలు కొడుతూ ఆడ ఏనుగులవలె సరస్సునంతా అల్లకల్లోలం చేశారు. దాంతో తపస్సు చేసుకుంటున్న బుధుడు కన్నులు విప్పి చూశాడు. కళ్ళు తెరవగానే త్రిలోకసుందరియైన ఇలను చూశాడు. తపస్సుపై ధ్యానం పోయింది. మనసంతా 'ఇల' తో నిండిపోయింది. మన్మథవశుడై పోయాడు, ఇక మనస్సు నిగ్రహించుకోలేకపోయాడు. అప్పుడు బుధుడు తనలో ఇలా అనుకున్నాడు: 'దేవతలలోగానీ, అప్సరసలలోకానీ, నాగజాతి స్త్రీలలోగాని ఇంతటి అతిలోకసుందరిని చూడలేదు. ఈమెకు వివాహం అయి ఉండకపోతే ఈమె నాకు తగిన భార్య అవుతుంది' అని అనుకున్నాడు. వెంటనే నీళ్ళలోనుండి బయటకు వచ్చాడు. సమీపానే ఉన్న తన ఆశ్రమానికి వెళ్ళాడు. ఆ నారీమణులందరినీ తన ఆశ్రమానికి పిలిపించాడు. వాళ్ళంతా వెంటనే బుధుడి సమీపానికి వెళ్ళి అతడికి శిరస్సు వంచి నమస్కరించారు.

అప్పుడు బుధుడు ఆ స్త్రీలకు ఇలను చూపిస్తూ, "ఈ సుందరి ఎవరు? త్రిలోకసుందరియైన ఈమె ఎవరికి భార్య? ఇక్కడకు ఎందుకు వచ్చారు? త్వరగా చెప్పండి" అని అడిగాడు. అంతట ఆ నారీమణులంతా మృదుమధురమైన మాటలతో ఇలా అన్నారు. "అందమైన కటిప్రదేశంగల ఈమె మాపై అధికారం చెలాయిస్తూ ఉంటుంది. వివాహంకాని

ఈమెతో కలసి మేమంతా ఈ అరణ్యంలో విహరించేందుకు వచ్చాం" అన్నారు. ఆ స్త్రీల మాటల్లో స్పష్టత లేకపోవడం వల్ల క్షత్రియుడైన బుధుడు ఆవర్తనియనే విద్యను (తెలియని విషయాల్ని తెలుసుకునే శక్తి) మనస్సులో ధ్యానంచేశాడు. అప్పుడాశ్రేష్ఠుడికి ధ్యానంలో రాజు యొక్క యథార్థ వృత్తాంతం అంతా బోధపడింది. అప్పుడా స్త్రీలతో ఇలా అన్నాడు: "మీరు ఈ పర్వతంపై భాగాన కింపురుషులుగా నివసిస్తూ ఉండండి. మీరంతా ఇక్కడే ఉంటూ నివాసాలు ఏర్పాటు చేసుకోండి. మీకు వచ్చే భర్తలు కూడా కింపురుషులు అవుతారు."

ఆ బుధుడి మాటల ప్రకారం వాళ్ళంతా కింపురుషాంగనలయి ఆ పర్వతంపైనే ఉంటున్నారు. ఆ విధంగా కింపురుషజాతి ఏర్పడింది.

# 89వ సర్గ ఇలా – బుధులకు పురూరవుడు పుట్టడం

కింపురుషుల ఉత్పత్తికి సంబంధించిన కథను రాముడు చెప్పగా భరత–లక్ష్మణులు ఆశ్చర్యపడి మిగిలిన కథ చెప్పమని కోరారు. అప్పుడు రాముడు మిగిలిన కథను ఇలా చెప్పాడు. "బుధుడు ఆ కింనరస్త్రీలందరితోనూ మాట్లాడుతూ, వాళ్ళల్లో అతిలోకసుందరితో ఇలా అన్నాడు. "ఓ సుందరమైన కటిప్రదేశము గలదానా! నేను నిన్ను నా దానినిగా చేసుకోవాలని అనుకుంటున్నాను, నీవు కూడా సంతోషంగా నా దగ్గరకు రా" అంటూ ఆప్యాయంగా పలికాడు. తనవాళ్ళెవరూ లేనిదై, ఒంటరిగా ఆ పర్వతంపై ఉన్న తనను ప్రేమగా, ఆప్యాయంగా పిలిచిన తేజోవంతుడైన పురుషునితో ఇలా అంది. "ఓ సౌమ్యుడా! ఒంటరిదాననై అక్కడా ఇక్కడా స్వేచ్ఛగా తిరుగుతున్న నన్ను ప్రేమగా పిలిచావు. నేను నీ దానను అయ్యేందుకు ఇష్టపడుతున్నాను. ఓ చంద్రుని పుత్రుడా! బుధుడా! నన్ను ఆజ్ఞాపించు. నీకు ఏది ఇష్టమో అదే చేస్తాను" అంది.

కాముకుడైన బుధుడు ఆమె మాటలకు పరమానందంచెంది, ఆమెతో విహరించాడు. కోరికలతో కాలిపోతున్న ఆ బుధుడు (ఆ ఇలను) నానావిధాలుగా సంతోషపెడ్తూ అరణ్యంలో విహరించాడు. ఇంతలోనే చైత్రమాసంపోయి, వైశాఖం వచ్చింది. వైశాఖమాసం మొదటి రోజున పూర్ణచంద్రుని వంటి ముఖంగల ఇలమహారాజు ప్రక్కపైనుండి లేచాడు. బయటకు వచ్చిచూస్తే ఆ సరస్సులో నీటిపై ఆసనం వేసుకొని ధ్యానం చేస్తున్న బుధుణ్ణిచూసి ఇలా అన్నాడు. "పూజ్యుడా! నేను నా అనుచరులతో కలసి ఈ అడవికి వేటకు వచ్చాను. ఇప్పుడు నా సైన్యంలో ఒకరు కూడా కనిపించడం లేదు. నీకేమైనా తెలుసా?" అని అడిగాడు.

రాజుకు గతం ఏమీ జ్ఞాపకంలేదని బుధుడు గ్రహించాడు. ఆ రాజర్షిని సర్వవిధాలా ఓదార్చాడు, ఈ మధ్య ఓ రాళ్ళ వానకురిసిందని ఆ రాళ్ళవానకు సైనికులంతా చచ్చిపోయారనీ చెప్పాడు. ఆ రాళ్ళవాన పడ్డరోజున నీవుమాత్రం పరిగెత్తుకొనివచ్చి నా ఆశ్రమంలో తల

దాచుకోవటంవల్ల బ్రతికి బయటపడ్డావని చెప్పాడు. ఇంకా ఇలా అన్నాడు: "ఓ వీరుడా! నీవు నాతో బాటే మధురమైన కందమూలాలు తింటూ, ఈ ఆశ్రమంలోనే సుఖంగా ఉండు. నీకు అంతా శుభమే జరుగుతుంది" అని అన్నాడు.

అప్పుడా రాజర్షి బుధుని ఓదార్పు మాటలకు ఎంతో సంతోషించాడు. కానీ సైన్యాన్నంతా పోగొట్టుకున్నందుకు దుఃఖీస్తూ ఇలా అన్నాడు: "ఓ బ్రాహ్మణోత్తమా! నా సైన్యంలేని రాజ్యం నాకు వద్దు, నేను రాజ్యత్యాగం చేస్తాను. నేను ఇక ఇక్కడ ఉండలేను. నాకు అనుమతి ఇస్తే వెంటనే వెళ్ళిపోతాను. నా పెద్దకుమారుడు ధర్మవర్తనుడైన శశిబిందు రాజవుతాడు. భార్యను, సేవకుల్ని, సైన్యాన్ని పోగొట్టుకొని ఇంకా ఎవరి కోసం జీవించను. ఓ గొప్పతేజస్సు గలవాడా! నన్ను ఇక్కడుండమని నిర్బంధించవద్దు" అన్నాడు.

ఆ ఇలమహారాజు అట్లా దుఃఖీస్తూవుంటే బుధుడు ఎంతో అనునయంగా ఇలా అన్నాడు: "ఓ రాజా! నీవు బుద్ధిమంతుడివి, ఇంతగా వైరాగ్యం చెందకూడదు. మనస్సు కుదటపరచుకో. నువ్వు ఒక ఏడాది పాటు ఇక్కడ నివసించు. ఆ పైన నీకు అన్నీ శుభాలే జరిగేట్లు చూస్తాను" అన్నాడు. అంతట ఇలమహారాజు బుధుడు చెప్పినట్లే ఒక్క సంవత్సరం ఉండేందుకు అంగీకరించాడు. అప్పటినుండి ఆ ఇలమహారాజు ఒక నెల రోజులు సుందరమైన స్త్రీగా ఉంటూ మరుసటి నెల పురుషుడుగా అయి ధర్మబుద్ధితో ఉండేవాడు. పిమ్మట ఆ సుందరియైన ఇలకు నవమాసాలు నిండి బుధుని వలన పురూరవుడు అనే కుమారుణ్ణి కన్నది. ఆ బాలుడు అన్ని విధాలా తండ్రితో సమానమైన వర్ణం, బలం గలవాడయ్యాడు.

# 90వ సర్గ ఇలకు పురుషత్వం లభించడం

రాముడు చెప్పిన పురూరవుని జన్మవృత్తాంతాన్ని విన్న భరతుడు, లక్ష్మణుడు ఇలా అడిగారు. "ఓ రామా! బుధునితో పాటు ఒక సంవత్సరం కాపురంచేసిన ఇలను గూర్చిన వివరాలు చెప్పు" అని అడిగారు. వాళ్ళ ఉత్సుకతను గమనించిన రాముడు ఇలా చెప్పాడు: "ఇలుడు పురుషత్వాన్ని పొందిన తర్వాత బుధుడు చాలా ఉదారస్వభావం గలవాడై, సంవర్ణుడు, చ్యవనుడు, అరిష్టనేమి, దుర్వాసుడు మొదలైన ఋషిశ్రేష్ఠుల్ని పిలిపించాడు. వాళ్ళతో ఇలా అన్నాడు. "మహర్షులారా! మహాబాహువైన ఈ రాజు కర్దమ ప్రజాపతి కుమారుడైన 'ఇలుడు'. ఇతడిని గూర్చిన విషయాలన్నీ మీరే తెలుసుకొని, అతడికి శ్రేయస్సు కలిగేట్లు చెయ్యండి." వాళ్ళంతా అట్లా మాట్లాడుకుంటూ ఉండగానే కర్దముడు బ్రాహ్మణులను వెంటబెట్టుకొని వచ్చాడు. పులస్త్యుడు, క్రతువు, వషట్కారుడు, ఓంకారుడు కూడా ఆశ్రమానికి వచ్చారు. కర్దముడు ఇలా అన్నాడు: "బ్రాహ్మణులారా! శివుడు తప్ప మరొకరు ఇతడికి హితాన్ని చెయ్యలేరు. శివుడికి ప్రీతికలిగించాలంటే అశ్వమేధంకంటే ఎక్కువ ప్రియమైనది మరొకటిలేదు. అందుకని మనందరం ఇలుడి క్షేమాన్నికోరి అశ్వమేధయాగం చేద్దాం" అన్నాడు. ఆ బ్రాహ్మణశ్రేష్ఠులంతా శివుణ్ణి ఆరాధించడం కోసం ఆ యాగం చెయ్యడానికి అంగీకరించారు. రాజర్షియైనవాడు, సంవర్తనుడి శిష్యుడు అయిన మరుత్తుడు ఆ యజ్ఞానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేశాడు. అప్పుడు బుధుడి ఆశ్రమం దగ్గర గొప్ప యజ్ఞాన్ని చక్కగా నిర్వహించారు. దాంతో రుద్రుడు సంతుష్టుడు అయ్యాడు. వారి ముందు ప్రత్యక్షమై ఇలా అన్నాడు. "బ్రాహ్మణోత్తములారా! మీ భక్తికి సంతోషించాను, ఈ యజ్ఞంచేత సంతృప్తి చెందాను. ఈ ఇలుడికి ఏమి శుభాలు కలగాలని మీరంతా కోరి ఈ యజ్ఞాన్ని చేశారు? అతడికి కావలసిన వరాల్ని కోరుకోండి" అన్నాడు. అప్పుడు ఆ బ్రాహ్మణులంతా" ఈ 'ఇల' పురుషుడు అయ్యేట్లుగా అనుగ్రహించు" అని కోరారు. అప్పుడు శివభగవానుడు సంతోషించి ఇలకు పురుషత్వాన్ని ప్రసాదించి అంతర్ధానం అయ్యాడు. అంతట యజ్ఞం నిర్వహించిన బ్రాహ్మణులు కూడా

వెళ్ళిపోయారు.

ఇలుడు బాహ్లీకదేశానికి పుత్రుడైన శశిబిందును రాజుగా చేశాడు. తాను మధ్యదేశంలో 'ప్రతిష్ఠానం' అనే మరో రాజ్యాన్ని స్థాపించుకొని రాజ్యపాలన చేశాడు. కొంతకాలం ధర్మబద్ధంగా రాజ్యపాలన చేసిన ఇలుడు శరీరత్యాగం చేశాడు. పిమ్మట అతడి పుత్రుడైన పురూరవుడు ప్రతిష్ఠానపురాన్ని రాజధానిగా చేసుకొని చక్కగా రాజ్యపాలన చేశాడు.

తమ్ముళ్లారా! అశ్వమేధ ప్రభావాన్ని గూర్చి మీకు చెప్పాను. ఈ యాగం చేసి శివభగవానుణ్ణి మెప్పించి ఇలుడు శాశ్వతంగా పురుషత్వాన్ని పొందాడు; దుర్లభమైన బ్రహ్మలోకాన్ని కూడా పొందాడు.

# 91వ సర్గ అశ్వమేధ యాగం

రాముడు తమ్ములిద్దరికీ అశ్వమేధ మహత్త్వాన్ని చెప్పి లక్ష్మణునితో ఇలా అన్నాడు: "లక్ష్మణా! వసిష్ఠుణ్ణి, వామదేవునీ, జాబాలినీ, కశ్యపునీ, ఇంకా ఉత్తములైన బ్రాహ్మణులను వెంటబెట్టుకొని రా. మంచి లక్షణాలున్న అశ్వాన్ని సిద్ధంచెయ్యి" అన్నాడు. అంతట లక్ష్మణుడు రాముని ఆదేశాలప్రకారం ఆ బ్రాహ్మణోత్తములందర్నీ ప్రవేశపెట్టాడు. రాముడి అభీష్టం విన్న ఆ బ్రాహ్మణులంతా భక్తితో శివుడికి నమస్కరించి, రాముణ్ణి అభినందించారు.

అప్పుడు రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు: "ఓ లక్ష్మణా! అశ్వమేధానికి రమ్మని సుగ్రీవుని వద్దకు దూతను పంపు. అట్లాగే వానరనాయకులను, వానరులందరినీ వెంటబెట్టుకొని రమ్మని చెప్పు. మహాపరాక్రమవంతుడైన విభీషణుని, అతడి రాక్షసపరివారాన్ని ఆహ్వానిస్తూ దూతను పంపించు. మన మిత్రులు, బంధువులు అయిన రాజులందరికీ ఆహ్వానాలు పంపు. మనదేశంలోను, ఇతర దేశాల్లోనూ ఉండే బ్రాహ్మణశ్రేష్ఠులందరికీ ఆహ్వానాలు పంపు. తపోధనులైన ఋషులందరికీ ఆహ్వానాలు పంపు.

మేళతాళాలు వాయించే వాద్యగాళ్ళను, నటకులను, నాట్యకత్తెలను, ఆహ్వానించు. నైమిషంలో మహాయజ్ఞవాటికను నిర్మించు. ఆ యజ్ఞవాటికలో అతిథులందరినీ యథావిధిగా సత్కరించు, అంతా సంతోషంతో తిరిగి వెళ్ళేట్లు ఏర్పాటన్నీ నిర్దుష్టంగా చెయ్యి. నూకలులేని బియ్యాన్ని ఒక లక్ష బండ్లపైన తెప్పించు. తిలలు, పెసలువంటి పదార్థాలు పదివేల బండ్లపై తెప్పించు. శనగలు, ఉలవలు, మినుములు, ఉప్పు, నూనెలు, నెయ్యి తగుప్రమాణంలో ఏర్పాటుచెయ్యి. మంచిపరిమళం ఉండే సుగంధద్రవ్యాన్ని కూడా సమకూర్చు. భరతుడు కోట్లకొద్దీ వెండి నాణాలను, నూరుకోట్ల బంగారునాణాలను ఈ ఏర్పాట్ల కోసం తీసుకొని ముందుగానే అక్కడకు వెళ్తాడు. ఆ వాటికలోనే అతిథుల సౌకర్యంకోసం వీధుల్లో వర్తకులు దుకాణాలుపెట్టుకునే ఏర్పాట్లనూ చెయ్యాలి. వంటల్లో నేర్పరులైన ఆడ, మగ వంటవాళ్ళను

భరతుడు వెంట బెట్టుకొనివెళ్ళాలి. అట్లా ముందుగా వెళ్ళిన భరతుడు పిల్లలకు, పెద్దలకు, బ్రాహ్మణులకు, ఆ యజ్ఞాన్ని పర్యవేక్షించే వాళ్ళందరికీ తగినన్ని సౌకర్యాలు ఏర్పాటు చెయ్యాలి. మన తల్లులందరికీ ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయించాలి, యజ్ఞదీక్షలో ఉపయోగించేందుకు నా భార్య బంగారుప్రతిమను, ఆయా కర్మలలో దక్షులైనవాళ్ళందరినీ తన కూడా తీసుకొని వెళ్ళాలి.

గొప్ప బలంగలవారూ, నరశ్రేష్ఠులు, గొప్ప తేజస్సుగలవారూ పరివారంతో కలసివచ్చే రాజులందరికీ, అన్ని వసతులతో కూడిన గుడారాలు వేయించాలి. వారి అన్నపానాదుల విషయంలో శ్రద్ధచూపాలి. వారికి కావలసిన వస్త్రాలన్నీ ఏర్పాటుచెయ్యాలి. ఈ ఏర్పాట్లన్నీ చేయించేందుకు భరతుడికి తోడుగా శత్రుఘ్నుడు కూడా వెళ్ళాడు.

అంతలో వానరులలో శ్రేష్ఠుడైన సుగ్రీవుడు, వానరముఖ్యులతో, పరివారాన్ని వెంటబెట్టుకొని వచ్చాడు. రాక్షసప్రముఖుడైన విభీషణుడు రాక్షసమంత్రులతో కలసివచ్చి రాముని దర్శించాడు. తపోధనులు, ఋషులు వేదవేత్తలువచ్చి రాముణ్ణి సేవించారు. రాముడు వారందరికీ తగిన రీతిలో పూజలందించి సత్కరించాడు. అతిథులంతా యజ్ఞంలో పాల్గొని మహదానంద భరితులయ్యారు.

# 92వ సర్గ అశ్వమేధ యాగంలో

రాముడు యాగానికి కావలసిన సంబారాలన్నీ పంపించి సర్వలక్షణమై నల్లటి యాగాశ్వాన్ని విడిచాడు. ఆ యాగాశ్వం వెనుక లక్ష్మణుడు, ఋత్విక్కులు, సర్వసైన్యసమేతంగా నైమిషానికి బయలుదేరారు. రాముడు యజ్ఞవాటికనంతా తిరిగి చూశాడు. ఏర్పాట్లన్నీ స్వయంగా చూసి సంతృప్తి చెందాడు. రాముడు నైమిషానికి (యజ్ఞవాటికకు)రాగానే రాజులంతా కానుకలు సమర్పించారు, రాముడు కూడా వారందరినీ తగు విధంగా సత్కరించాడు. రాజులను పూజించడంలోను, వారి ఆలనాపాలనా అంతా భరతశత్రుఘ్నులు స్వయంగా పర్యవేక్షించారు. నియమనిష్ఠలు గల బ్రాహ్మణులందరికీ సుగ్రీవుడు, మహాత్ములైన వానరములు వడ్డనచేశారు. ఋషులందరికీ విభీషణుడు, ఇతర రాక్షసులు సేవకులవలె సపర్యలుచేశారు.

ఈ విధంగా అశ్వమేధంలో ఏర్పాట్లన్నీ చక్కగా ఏర్పాటుచేయబడ్డాయి. యాగాశ్వాన్ని లక్ష్మణుడు రక్షిస్తూ వచ్చాడు. యాచకులు యాచించకుండానే కావలసినవన్నీ అమర్చటంతో వాళ్ళ సంతోషానికి అంతు లేకుండా పోయింది. జిడ్డు కారేవాడుకానీ, చింపిరిగుడ్డలతో తిరిగేవాడుకానీ, ఆ యజ్ఞవాటిక అంతా కాగడావేసి వెతికినా కనిపించలేదు. దీనుడుగాని, బక్కచిక్కినవాడు గానీ అసలే లేడు. బంగారం, ధనం, రత్నాలు విచ్చలవిడిగా దానాలుచేశారు. ఆ యజ్ఞానికి వచ్చినవారంతా (చిరంజీవులైన మునులు) మేము ఇంద్రుడు చేసిన యజ్ఞాన్ని చూశాం, చంద్రుడుచేసిన యాగం చూశాం; కుబేరుడు చేసిన క్రతువులు చూశాం; వరుణుడు చేసిన యాగాలుచూశాం, కానీ రాముడు చేస్తున్న ఈ అశ్వమేధానికి సాటిరావుగదా అన్నారు. ఎక్కడచూసినా వానరులు, రాక్షసులు, వస్త్రాల్ని ధనాన్ని, రత్నాల్ని యాచకులకు 'చాలు; వద్దు' అనేంతవరకూ దానంచేశారు. దానాలుచేసి, గంపలు ఖాళీ అవుతూవుంటే మరుక్షణంలో మళ్ళీ వాటన్నింటినీ వస్తువుల్తో నింపేస్తున్నారు. రాముడు చేస్తున్న ఆ యజ్ఞం ఒక సంవత్సరంపైనే నడచింది.

# 93వ సర్గ లవకుశులు రామకథను గానం చెయ్యడం

అశ్వమేధయాగాన్ని దర్శించడానికి వాల్మీకి మహర్షి తన శిష్యులతో కలసివచ్చాడు. ఋషీశ్వరులకు ప్రత్యేకించిన స్థలంలో వాల్మీకి బస చేసేందుకు పర్ణశాలను ఏర్పాటుచేశారు. ఆయనకు బండ్లనిండా పండ్లు, ఇతర మధురపదార్థాలను అందుబాటులో ఉంచారు. రాముడే స్వయంగా వాల్మీకిమహర్షికి, ఇతర ఋషీశ్వరులకు అతిథి సత్కారాలు చేశాడు. వాల్మీకి సంతోషిస్తూ తన శిష్యులిద్దరితోనూ ఇలా అన్నాడు. "మీరిద్దరూ రామాయణ కావ్యాన్నంతా గానంచెయ్యండి. ఋషులు నివసించే పర్ణశాలలకు పోయి వినిపిస్తూ ఉండండి. పవిత్రులైన బ్రాహ్మణుల ఇళ్ళకు పోయి రామాయణ కావ్యగానం చెయ్యండి. నాలుగువీధుల కూడళ్ళలో ప్రజలకు వినిపించండి, రాముడి ఇంటి దగ్గరకుపోయి వినిపించండి. యజ్ఞశాలలోనూ, ఋత్విక్కులకూ ఈ కావ్యాన్ని మీ గానమాధుర్యంతో ఆనందపరచండి. మీరు మధురమైన పరిశుద్ధమైన, పర్వతశ్రేణుల్లో పండినవీ అయిన ఈ పండ్లు తింటూ గానంచెయ్యండి. అందువల్ల మీకు శ్రమ తెలియకుండా ఉంటుంది; కంఠమాధుర్యం కూడా చెడిపోకుండానూ ఉంటుంది. ఓ బాలకుల్లారా! 'మీరు ఎవరి పుత్రులు' అని రాముడు అడిగితే 'మేము వాల్మీకి శిష్యులం' అని చెప్పండి. నేను మీకు పూర్వం ఏ విధంగా శిక్షణ ఇచ్చానో అదే రీతిలో శ్లోకముల సంఖ్య మొదలైన ప్రమాణాలనుబట్టి రోజుకు ఇరవైచొప్పున రామాయణంలోని సర్గలు మధురమైన కంఠంతో గానంచెయ్యండి. ఎవరైనా ధనం ఇవ్వజూపితే అధికంగా తీసుకోకండి, లోభగుణం మంచిదికాదు గదా! పైగా ఆశ్రమంలో ఉంటూ కందమూలాలు తింటూ జీవించే మనకు ధనంతో ఏమి పని?

రాజైన రాముడు మిమ్మలి పిలిపిస్తే ఋషులంతా అక్కడ కూర్చొని ఉండగా గానంచెయ్యండి. 'మీరు ఎవరి పుత్రులు' అని రాముడు అడిగితే మేము 'వాల్మీకి శిష్యులం' అని చెప్పండి. ధర్మానుసారం పాలించడం వలన రాజు తండ్రి వంటివాడు. కాబట్టి ఆయన యెడల అనాదరభావంతో గానం చెయ్యకూడదు, కావ్యాన్ని మొదటినుండీ గానంచెయ్యాలి.

నాయనలారా! మీరు రేపు ప్రాతఃకాలంనుండి వీణాతంత్రులకు లయ సరిపోయేట్లుగా మధురంగాను, ఉత్సాహంగానూ గానంచెయ్యండి" అంటూ వాల్మీకి మహర్షి కుశలవులకు ఉపదేశించాడు. అంతట ఆ సీతాపుత్రులు ఇద్దరు 'అట్లాగే చేస్తాం' అన్నారు. ఆ బాలురు ఇద్దరూ వాల్మీకి మహర్షి మాటల్ని, శుక్రుడు చెప్పిన నీతిశాస్త్రాన్ని అశ్వనీదేవతలు హృదయంలో భద్రపరచుకొన్నట్లు, హృదయమంతా నింపుకొని ఆ రాత్రి సుఖంగా నిద్రపోయారు.

# 94వ సర్గ లవకుశుల గానాన్ని రాముడు సభలో వినడం

తెల్లవారింది. లవకుశులిరువురూ స్నానంచేసి హోమాది నిత్యకర్మలు ముగించుకొని, పూర్వం మహర్షి చెప్పినట్లుగా రామాయణ గానం ప్రారంభించారు. అనేక ప్రమాణాలు గలదీ, అపూర్వమైనదీ, గేయాలతో కూడినదీ, తంత్రీలయబద్ధంగా సాగిపోతూన్న ఆ గానమాధుర్యాన్ని రాముడుకూడా కుతూహలంతో విన్నాడు.

మర్నాడు ఆ బాలురనిద్దర్నీ సభకు పలిపించాడు. ఆ సభకు, అశ్వమేధానికి వచ్చిన రాజులను, పండితులను, ఆయా సంఘాల అధ్యక్షుల్ని, పౌరాణికుల్ని, శబ్దశాస్త్రవేత్తల్నీ, వృద్ధులైన (బ్రాహ్మణుల్ని), గానం అంటే ఆసక్తి ఉన్నవాళ్ళని, లక్షణశాస్త్రం తెలిసినవాళ్ళనీ, గాంధర్వశాస్త్ర నిపుణుల్నీ, ఛందస్సు, పాదనియమాలు తెలిసిన వాళ్ళను, జోతిషంలో విశేషజ్ఞానం ఉన్నవాళ్ళనీ, అలంకార శాస్త్రవేత్తల్ని, కావ్య విశారదుల్నీ, అనేక భాషలు తెలిసినవారినీ, ఇతరుల మనస్సులో భావాన్ని గ్రహించేవాళ్ళనీ, వర్తకుల్నీ, న్యాయశాస్త్ర నిపుణుల్నీ, గీత, నృత్యములందు విశారదుల్నీ, వేదాంతార్థాలను విశదీకరించేవాళ్ళను, ఇంకా అనేకరంగాల్లో నిష్ణాతులయిన ఎంతోమందిని ఆ సభకు పిలిపించాడు.

ఆ మహాసభ ప్రారంభంకాగానే ఆ ముని కుమారులిద్దరూ గానం ప్రారంభించారు. అటువంటి మధురగానాన్ని సభికులు ముందెన్నడూ వినలేదు. ఇంకా ఎంతవిన్నా తృప్తిచెందేట్లులేదు. ఒక్క మునులే కాదు, రాజులే కాదు ఆ సభలోవున్న ప్రతిఒక్కరూ ఆ బాలురిద్దర్నీ కళ్ళతోనే త్రాగేస్తున్నారు. వాళ్ళంతా వాళ్ళల్లోవాళ్ళు ఇలా అనుకుంటున్నారు "ఈ బాలురిద్దరూ బింబంనుండి బయటకు తీసిన బింబంవలె రాముని పోలి ఉన్నారు. ఆ బాలురిద్దరూ జటలు, నారబట్టలు లేకపోతే అచ్చు రాముడిలాగానే ఉన్నారు. ఏమాత్రం భేదం కనిపించడం లేదు" అని అనుకొంటూ ఉండగా నారదుడు సభలోకి ప్రవేశించాడు. అప్పటికే మొదటిసర్గ పూర్తియైంది. అటుపిమ్మట రెండవ సర్గనుండి ఇరవై సర్గలు వరకూ గానంచేశారు. ఆ

ఇరవైసర్గలూ విన్నతర్వాత రాముడు సోదరునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! ఈ మహాత్ములైన బాలురిద్దరికీ పద్ధెనిమిదివేల బంగారునాణాలు ఇవ్వు. వాళ్ళు ఇంకా ఏమైనా కోరుకుంటే, అవీ ఇవ్వు" అన్నాడు. అంతట లక్ష్మణుడు ఆ బంగారు నాణాలను బాలులిద్దరికీ విడివిడిగా ఇచ్చాడు. కానీ వాళ్ళు ఆ బంగారాన్ని స్వీకరించలేదు. లక్ష్మణుడితో ఇలా అన్నారు: "రాజా! మేము అరణ్యంలో ఉంటాం, అక్కడ దొరికే కందమూలాలతో జీవిస్తాం. మేము బంగారు నాణాలను ఏం చేసుకుంటాం?" వాళ్ళామాటలు అంటూ ఉండగా సభలోని యావన్మందీ, రాముడు కూడా ఆశ్చర్యపోయారు. అప్పుడు రాముడు ఆ మునికుమారులను ఇలా అడిగాడు: "ఈ కావ్యం పరిణామం ఎంత? ఈ కావ్యాన్ని రచించిన మహాత్ముడెవరు? ఆ రచయితది ఏ దేశం? ఆ మహాత్ముడు ఎక్కడున్నాడు?" అని అడిగాడు. ఆ మునికుమారులు రామునితో ఇలా అన్నారు: "మహారాజా! మహాతపశ్శాలియైన వాల్మీకిమహర్షి నూరు ఉపాఖ్యాలుగా రచించాడు. ఈ కావ్యంలో మొదటిసర్గం నుండి ఉత్తరకాండంతో కలిపి ఆరుకాండముల కావ్యమిది. మొత్తం కావ్యంలో ఐదువందల సర్గలున్నాయి. ఆ మహర్షి నీ చరిత్ర అంతా ఆరుకాండల్లో రచించాడు. నీ చరిత్రకు సంబంధించిన ఈ కాండములన్నీ కూడా కావ్యనాయకుని జీవితం ఎంతకాలం ఉంటుందో అంతవరకూ ఉన్న నీ కథను ఇరవై నాలుగువేల శ్లోకాలలో రచించాడు. ఈ కావ్యాన్ని రచించిన భగవంతుడైన వాల్మీకిమహర్షి యజ్ఞవాటికలోనే ఉన్నాడు. నీకు వినాలని ఉంటే తీరికచేసుకొని తమ్ములతో కలసి యజ్ఞవాటికకు వచ్చి విను" అన్నారు. అంత రాముడు 'తప్పక వచ్చి వింటా' అని చెప్పగా ఆ బాలురిద్దరూ రాముని అనుమతిపొంది, వాల్మీకివద్దకు వెళ్ళారు. అంతట రాముడు కూడా మునులతోను, రాజులతోను కలసి యజ్ఞశాలకు వెళ్ళాడు.

ఆ బాలగాయకులు చేసిన గానం తాళం, లయలకు సరిపడేట్లుంది. సర్గతో విడగొట్టిన ఆ కావ్యం శబ్దాలకు స్వరాలకూ అనుకూలంగా ఉంది. అటువంటి కావ్యాన్ని రాముడు విన్నాడు.

# 95వ సర్గ సీత శపథం చెయ్యాలని రాముడు కోరడం

రాముడు ఈ విధంగా రామాయణకావ్యాన్ని చాలారోజులుగా మునులతోను, రాజులతోను కూడి వింటున్నాడు. ఆ కథాశ్రవణం అంతా వింటూ ఈ బాలగాయకులు సీతాపుత్రులేనని గ్రహించాడు. అప్పుడు దూతలను పిలిచి ఇలా అన్నాడు: "దూతలారా! మీరు వాల్మీకి దగ్గరకువెళ్ళి నా మాటగా చెప్పండి. 'సీత సత్ప్రవర్తన కలదీ, ఏ విధమైన కళంకమూ లేనిదీ అయితే, ఆమె వాల్మీకిమహర్షి అనుమతిపొంది ఇక్కడ సభికులమధ్య తన నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోవచ్చును. నాకు ఆమె వలన కలిగిన అపవాదాన్ని పోగొట్టుకోవడం కోసం ప్రజాసదస్సు ఏర్పాటు చేస్తున్నాను. ఆమెను సభికుల మధ్యకు వచ్చి శపథం చెయ్యమను" అని కబురు పంపాడు.

అందుకు వాల్మీకిమహర్షి "రాముడు కోరినట్లే సీత చేస్తుంది. స్త్రీకి పతియే దైవం కదా?" అన్నాడు. అప్పుడా దూత తిరిగి వచ్చి సభామధ్యనున్న రాముడికి చెప్పాడు. వాల్మీకి మాటలు విన్న రాముడు సంతోషించి సభాసదులతో ఇలా అన్నాడు. "శిష్యులతో కూడిన పూజ్యులైన ఋషులు, అనుచరులతోకూడిన రాజులు, సీతాదేవిమీద దోషారోపణ చేసిన నగరజానపదులు అంతా వచ్చి వినవచ్చు. రేపు సభకు సీతాదేవి వచ్చి శపథం చేస్తుంది" అని ప్రకటించాడు.

మహాత్ముడైన రాముడు అన్నమాటల్ని విన్న ఋషిశ్రేష్ఠులంతా బాగు, బాగు అని ప్రశంసించారు. రాముని మాటలువిన్న రాజులంతా "నరశ్రేష్ఠా! ధర్మనిర్ణయం ఆచరించే నీ నిర్ణయం నీకు మాత్రమే చెల్లింది. ఇతరులెవ్వరూ ఇట్లా చెయ్యలేరు" అని అంటూ రాముణ్ణి కొనియాడారు. అంతట సభ ముగిసింది. ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

# 96వ సర్గ సీత అయోధ్యకు వచ్చుట

తెల్లవారింది. మహాతేజశ్శాలి, రాజు అయిన రాముడు యజ్ఞశాలకు వెళ్ళాడు. ఋషులందర్నీ పిలిపించాడు. రాజులు, వానరులు, రాక్షసులు, పౌరజానపదులు అంతా సభకు వచ్చారు.

వసిష్ఠుడు, వామదేవుడు కాశ్యపుడు, విశ్వామిత్రుడు, దుర్వాసుడు, పులస్త్యుడు, శక్తిమంతుడు, భార్గవుడు, వామనుడు, మార్కండేయుడు, మౌద్గల్యుడు, గర్గుడు, చ్యవనుడు; శతానందుడు, భరద్వాజుడు, అగ్నిపుత్రుడు, నారదుడు, పర్వతుడు, గౌతముడు, కాత్యాయనుడు, సుయజ్ఞుడు, అగస్త్యుడు, మొదలైన బ్రహ్మతేజస్సంపన్నులు, తపోధనులు తమ శిష్యులతోసహా వచ్చారు.

క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు వేలసంఖ్యలో వచ్చారు. వీళ్ళేకాక జ్ఞాననిష్ఠులు, తపోనిష్ఠులు, యోగనిష్ఠులు అయిన బ్రాహ్మణులు మొదలైన వాళ్ళెంతోమంది సీతాదేవి చేస్తున్న శపథాన్ని వినేందుకు వచ్చారు. అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు, ఎండుటాకు రాలినా ఆ శబ్దం స్పష్టంగా వినిపిస్తుంది.

వాల్మీకి మహర్షి సీతాదేవిని వెంటబెట్టుకొని సభలోనికి ప్రవేశించాడు. సీతాదేవి రాముణ్ణే మనస్సునిండా నింపుకొని, కన్నీరంతా కంఠంలో నింపుకొని, అంజలిఘటించి తలవంచుకొని ఆ మహర్షి వెనకాలే వచ్చింది. బ్రహ్మదేవుని వెనక శ్రుతివస్తున్నట్లు, వాల్మీకి వెనుక సీతాదేవి వస్తూవుంటే, సభాసదులంతా ఆమెకు అభివాదం చేశారు. ఆ ధ్వని ఆకాశాన్నంటింది. సభాసదుల హృదయాల్లోనుండి దుఃఖం పెల్లుబికి వచ్చి పెద్ద కోలాహలం చెలరేగింది. కొందరు రాముణ్ణి అభినందించారు; కొందరు సీతాదేవిని అభినందించారు; అంతా కలసి ఇద్దర్నీ పెద్దగా అభినందించారు.

అప్పుడు వాల్మీకి మహర్షి రాముడితో ఇలా అన్నాడు. "రామా! ఉత్తమనియమవంతురాలు, ధర్మాన్ని ఆచరించేదీ అయిన ఈ సీతను నీవు లోకాపవాదము వలన నా ఆశ్రమం వద్ద విడిచి వెళ్ళావు. గొప్పవ్రతము గల రామా! లోకాపవాదానికి వెరచిన నీకు ఈ సీత తన నిర్దోషిత్వాన్ని రుజువు చేసి చూపగలదు. ఆమెకు అనుమతి ఇవ్వు. కవలలైన ఈ ఇద్దరూ సీతపుత్రులే. ఎదిరింప శక్యంకాని ఈ ఇద్దరూ నీ కుమారులే. ఇది యథార్థము. నేను సత్యమునే చెప్తున్నాను. ఓ రామా! నేను ప్రచేతసుని కుమారుణ్ణి, ప్రచేతసుని వంశంలో పదమూడవ తరంలో వాడిని. నేను ఎప్పుడూ అసత్యం చెప్పలేదు. వీరిద్దరూ నీ పుత్రులే. నేను కొన్నివేల సంవత్సరాలు తపస్సు చేశాను. సీతలో ఏమాత్రం దోషం ఉన్నా, నాకు తపస్సు ఫలితం లభించకుండుగాక! మనసా, వాచా, కర్మణా నేను ఎన్నడూ పాపం చెయ్యలేదు. సీత పవిత్రురాలైతేనే నాకు నా తపఃఫలం లభించుగాక! ఓ రామా! సీత ఐదు జ్ఞానేంద్రియాల్లోను, మనస్సునందూ కూడా పరిశుద్ధురాలని నేను అరణ్యంలో, సెలయేరు వద్దనే గ్రహించాను. అందువల్లనే ఆమెను కాపాడాను. పరిశుద్ధురాలు, పతియే దైవం అని నమ్మి పూజించే ఈ సీత నీకు శపథం చెయ్యగలదు. అందువలన రామా! నీ భార్య సీత పరిశుద్ధురాలని తెలిసికూడా లోకాపవాద భయానికి వెరచి ఈమెను పరిత్యజించావు. అటువంటి ఈ సీత పరిశుద్ధురాలని నేను దివ్యజ్ఞానంచేత తెలుసుకొని, ఆ విషయాన్నే నీకు చెపుతున్నాను."

# 97వ సర్గ సీత రసాతలములో ప్రవేశించటం

వాల్మీకి మాటలు విన్న రాముడు సభలో నిలబడివున్న సీతాదేవిని చూసి, మహర్షికి అంజలిఘటించి నమస్కరిస్తూ ఇలా అన్నాడు.

"ధర్మవేత్తవైన ఓ మహానుభావా! నీవు చెప్పిందంతా యథార్థమే. సీత దోషరహిత అని నా సంపూర్ణ నమ్మకం. పూర్వం సీత అగ్నిప్రవేశం చేసి తన నిర్దోషత్వాన్ని రుజువు చేసుకుంది. దేవతలంతావచ్చి ఆమె నిర్దోషియని చెప్పారు. అటుపిమ్మటే నేను ఆమెను తీసుకొని అయోధ్యకు వచ్చాను. కానీ, ఓ మహర్షీ! లోకాపవాదం బలంగా ఉండటంచేత నేను సీతను విడిచిపెట్టాలని నిశ్చయించుకున్నాను. ఆమెలో ఏ పాపము లేదని తెలిసికూడా, లోకాపవాదానికి భయపడి ఆమెను అరణ్యంలో వదిలేశాను. అందుకు నన్ను క్షమించు. ఈ గాయకులిద్దరూ కవలలుగా పుట్టిన నా కుమారులేనని నేను ఎరుగుదును, ఈ మహాసభలో మరల సీత పరిశుద్ధురాలని నిర్ణయం అయిన తర్వాత నేను సీతను తప్పక స్వీకరిస్తాను."

రాముడి మనస్సులోనిమాట ఎరిగిన ఇంద్రుడు, మొదలైన తపశ్శాలురంతా, సీత శపథం చేసే సమయానికి అక్కడకు వచ్చారు. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, విశ్వేదేవతలు, మరుద్గణులు, సాధ్యులు, సప్తర్షులు, నాగులు, పక్షులు, సిద్ధులు, మొదలైన వారంతా సీతా శపథాన్ని వినాలనే కుతూహలంకొద్దీ అక్కడకు వచ్చారు. ఆ వచ్చిన దేవతల్ని, ఋషుల్ని చూసి రాముడు ఇలా అన్నాడు. "దేవతాశ్రేష్ఠులారా! వాల్మీకిమహర్షి మాటల మీద నాకు నమ్మకం ఉంది. కానీ, జనులమధ్య నాపై ఉన్న అపవాదంను పోగొట్టి సీత సత్ప్రవర్తన గలదని లోకానికి నమ్మకం కలిగే విధంగా ఈ సభలో మీ అందరి ముందూ జానకి శపథం చెయ్యాల్సివుంది. అలా చేయగలిగితే ఆమెను మరల స్వీకరిస్తాను" అన్నాడు.

అప్పుడే మంచి సుగంధాలతో కూడిన వాయువు ఆకాశంనుండి వీచింది. ఆ పరిమళానికి సభలోని వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. కాషాయవస్త్రాలు ధరించిన సీత అక్కడకువచ్చి అందరికీ

అంజలిఘటించి నమస్కరించి, తల వంచుకొని వినమ్రురాలై ఇలా అంది. "నేను రాముణ్ణి తప్ప మరెవ్వరినీ మనస్సులో కూడా స్మరించని దాన్ని అయితే, భూదేవి నన్ను తనలో ఇముడ్చుకోవటానికి రెండుగా అగుగాక! నేను మనోవాక్కాయములచేత రాముణ్ణి మాత్రమే పూజించినట్లయితే భూదేవి నన్ను తనలో జేర్చుకొనుగాక! నేను ఇప్పుడు చెప్పిందంతా సత్యమైతే, నేను రాముణ్ణి తప్ప మరొకర్ని ఎరుగకపోతే భూదేవి నన్ను తనలో జేర్చుకొనుగాక!" అని శపథం చేసింది.

సీత ఆ విధంగా మూడుసార్లు ప్రతిజ్ఞ చెయ్యగానే అక్కడ సభలోవుండే వాళ్ళందరూ ఆశ్చర్యపోయేట్లుగా ఆ యజ్ఞశాలలోని భూమినుండి ఒక దివ్యమైన సింహాసనంపైకి లేచింది. అద్భుతమైన ఆకారంతో ఉన్న ఆ సింహాసనం రత్నాలచేత అలంకరించబడ్డది. అమితబలమైన సర్పములు ఆ సింహాసనాన్ని తమ శిరస్సులపై మోస్తున్నాయి. ఆ సింహాసనంపైన భూదేవి కూర్చొనివుంది. ఆమె తన రెండుచేతులు చాపి సీతాదేవిని తన బాహువులతో పట్టుకొని, "బిడ్డా! రమ్మ" అని స్వాగతం చెప్పి, అభినందించి, సింహాసనంపై తన ప్రక్కనే కూర్చోబెట్టుకొంది. వెంటనే ఆ సింహాసనం సీతాదేవితో కలసి రసాతలానికి వెళ్ళిపోయింది. అట్లా రసాతలంలోకి ప్రవేశిస్తున్న సీతను చూసి దివ్యమైన పుష్పవర్షం కురిసింది. అశరీరవాణి ఇలా పలికింది: "సీతా! నీ శీలము ఎంతగొప్పది! ఆహా! ఆహా!" అంటూ దేవతలు పలికిన మాటలు బిగ్గరగా వినబడ్డాయి. ఆకాశంనుండి సీతాదేవి రసాతల ప్రవేశాన్ని వీక్షిస్తున్న దేవతలు అనేక విధాలుగా మాట్లాడుకున్నారు. అప్పుడా యజ్ఞవాటికలో ఉండే సమస్త ఋషిపుంగవులకు, రాజులకు ఆశ్చర్యం కలిగింది. అటు ఆకాశంలో ఉన్న వాళ్ళల్లోనూ, ఇటూ భూమిపైన ఉండే స్థావర జంగమాల్లోనూ, పెద్దశరీరాలు కలిగిన దానవుల్లోనూ, పాతాళంలో ఉండే నాగుల్లోనూ, కొందరు సీత పాతివ్రత్యాన్ని ప్రత్యక్షంగా చూసి సంతోషంతో అరిచారు. కొందరు ఆలోచనలో పడ్డారు. కొందరు సీతను, రాముణ్ణి మార్చి మార్చి చూస్తున్నారు. కొందరు కలతచెందారు.

సీత రసాతలాన్ని ప్రవేశించడం చూసి జగత్తు అంతా కలత చెందింది. ఓ

ముహూర్తకాలంపాటు నిశ్చేష్టులయ్యారు. అంతటా నిశ్శబ్దం ఆవరించింది.

# 98వ సర్గ బ్రహ్మదేవుడు రాముని ఓదార్చటం

సీతాదేవి రసాతలంలోకి పోయి అదృశ్యం కాగానే వానరులంతా దుఃఖంతో హాహాకారాలు చేశారు. మునులంతా ఆమెను కొనియాడుతూ భేష్ భేష్ అని అభినందించారు. రాముడు, యజ్ఞ దీక్షలో ఉన్నవాళ్ళూ పలాశదండానికి తల ఆనించి కన్నీరుమున్నీరుగా విలపిస్తూ దీనులైపోయారు. రాముడు చాలాసేపు విలపించి క్రోధశోకాలను మేళవించి ఇలా అన్నాడు. "ఓ సీతా! లక్ష్మీదేవివంటి నీవు చూస్తూ ఉండగానే అదృశ్యురాలవైపోయావు. మునుపు ఎన్నడూ ఇంతటి దుఃఖాన్ని పొంది ఎరుగను.

ఓ సీతా! నేను లేని సమయంలో నిన్ను అపహరించుకొని సముద్రానికి అవతలి ఒడ్డున లంకలో దాచి ఉంచారు. అక్కడనుండి నిన్ను తీసుకొనివచ్చాను. ఇప్పుడు భూమి నుండి తీసుకొని రాలేనా?

పూజ్యురాలైన ఓ భూదేవి! నా భార్యయైన సీతను నాకు ఇచ్చివెయ్యి. నాకు ఆట్టే కోపం తెప్పించకు. కోపం వస్తే నా ప్రతాపం ఏమిటో చూపి నా సీతను తెచ్చుకుంటాను.

ఓ భూదేవీ! నీవు నాకు అత్తగారివే కదా! ఎందువల్లనంటే పూర్వం నాగలితో నిన్ను దున్నుతూ జనకుడు సీతను పైకి తీశాడు. అందువల్ల, అత్తగారిగానైనా నా సీతను నాకు ఇచ్చెయ్యి. లేదంటావా! నాకు కూడా వివరమును ఇమ్ము. పాతాళంలోనైనా, స్వర్గంలోనైనా సీతతోనే నివసిస్తాను. నేను సీతకోసం పిచ్చివాణ్ణి అయిపోయాను. పూర్వం సీత ఎలా ఉండేదో అట్లాగే యథాతథంగా నాకు అప్పగించు. అట్లా చెయ్యకపోయావో, పర్వతాలతోను, అరణ్యాలతోను కూడిన నీ వ్యవస్థనంతా ఛిన్నాభిన్నం చేస్తాను. భూమి అనేదే లేకుండా అంతా జలమయం చేసేస్తాను" అన్నాడు.

క్రోధశోకాలతో కూడిన రాముడి మాటలకు దేవతలంతా భయభ్రాంతులయ్యారు.

బ్రహ్మదేవుని ముందు పెట్టుకొని వచ్చారు. బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు. "ఓ రామా! ఉత్తములైన నియమములు గలవాడా! దుఃఖించకు. నీ నిజస్వరూపాన్ని స్మరించుకో. నేను నిన్ను స్మరింపజేయటం లేదు. ఈ క్షణాన నీవు వైష్ణవ జన్మనుగూర్చి స్మరించు. మాలిన్యంలేనిది, పతివ్రతయైన సీత నీ పూర్వరూపాన్ని కోరుకుంటూ, నీ ఆశ్రయాన్ని పొందటానికి, తీవ్రమైన తపస్సు చేయడానికి నాగలోకానికి వెళ్ళింది. మళ్ళీ నీవు ఆమెను వైకుంఠంలోనే కలుసుకోగలుగుతావు. ఇందులో ఎంతమాత్రం సందేహంలేదు. నేను ఇంతమందిలో, ఈ పరిషత్తులో, చెప్తున్నాను. నా మాట నమ్ము.

రామా! నీవు విన్న కావ్యాలన్నింటిలోకీ ఉత్తమమైన ఈ కావ్యమే నీకు విపులంగాను, స్పష్టంగాను వివరించగలదు. నీ జన్మ మొదలుకొని నీవు పొందిన సుఖదుఃఖాలు, అనుభవాలూ, రాబోవు వృత్తాంతాన్నీ అంతా విపులంగా వాల్మీకి ఈ కావ్యంలో నిబంధించాడు.

ఈ ఆదికావ్యం అంతా నీకు సంబంధించినదే! వాల్మీకి నిన్నే నాయకుడుగా నిర్ణయించుకొని వ్రాశాడు. రాముడు తప్ప కావ్యయశస్సును పొందతగినవాడు మరొకడు లేడుకదా? దివ్యమూ, ఆశ్చర్యకరమూ, సత్యమూ, అయిన ఏ వృత్తాంతాన్ని దాచకుండా, ఈ కావ్యాన్ని నేను, దేవతలం కలసి విన్నాం.

పురుషశ్రేష్ఠుడవైన రామా! నీవు ధర్మానుసారంగా, సావధానచిత్తుడవై రామాయణంలోని రాబోయే కథనంతా విను. ఈ రామాయణంలోని రాబోయే కథకు ఉత్తరభాగమని పేరు. అటువంటి ఉత్తమమైన ఉత్తరభాగాన్ని మునులందరితో కలసి విను. రాజర్షివైన ఓ రామా! ఈ భాగాన్ని ముందుగా నీవే వినాలి. ఇతరులెవ్వరూ నీకన్నా ముందుగా వినకూడదు" అంటూ బ్రహ్మదేవుడు రాముడికి ఉపదేశంచేసి దేవతలతో కలసి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

బ్రహ్మలోకానికి చెందిన మహాతేజశ్శాలురైన ఋషులందరూ బ్రహ్మదేవుని అనుజ్ఞ తీసుకొని ఉత్తరభాగాన్ని వినేందుకు తిరిగి భూలోకానికి వచ్చారు. అప్పుడు రాముడు వాల్మీకి

మహర్షితో మాట్లాడుతూ ఉండగా భూమి లోపల నుండి ఒక వాణి ఇలా వినబడింది. "ఓ రామా! నువ్వు తాపాన్ని విడిచిపెట్టు, ఈ ఘటనలన్నింటికీ దైవమే కారణం. నువ్వు సీత కావాలని తపిస్తున్నావు. అదంతా వృథాశ్రమే, ఆమె దర్శనం ఇకపై నీకు లభించదు. ఎందుకంటే ఆమె మూడు లోకాల్లోనూ వ్యాప్తమై ఉంది. ఇక్కడ పాతాళంలో ఉన్న మూర్తిని నాగులు పూజిస్తున్నారు. మానవలోకంలో మానవులు పూజిస్తూ ఉంటారు, ఈమెయే పితృదేవతలకు తృప్తినిచ్చే స్వధ. స్వర్గంలో దేవతలకు తృప్తినిచ్చేదీ ఈ స్వరూపమే. శ్రీమహావిష్ణువు దేహంపై లక్ష్మీదేవిగా ప్రతిష్ఠితమై ఉంది.

కావున ఓ రామా! సీతను చూడాలనే ప్రయత్నాన్ని విరమించుకో. సీతను చూడాలనుకుంటే ఆమె ప్రతిరూపాలైన కుశలవులలో ఆమెను చూసుకో.

(ఈ దృష్టిలో చూస్తే సీతారాములు అప్పుడూ ఉండేవారు; ఇప్పుడూ ఉన్నారు; ఎప్పుడూ ఉంటారు; అంతటా ఉన్నారు; ఉంటారు).

ఉత్తరకాండమును వినగోరిన రాముడు వాల్మీకి మహర్షితో "భగవానుడా! మిగిలిన ఉత్తరకాండాన్ని కూడా రేపు వినగోరుతున్నాను." అని కుశలవులతో కలసి వాల్మీకి ఆశ్రమానికిపోయి వాళ్ళ పర్ణశాలలోనే నివసించాడు. ఆ రాత్రి అంతా సాధ్వీరత్నమైన సీతాదేవినే స్మరిస్తూ గడిపాడు.

# 99వ సర్గ రామరాజ్యం

తెల్లవారింది. రాముడు ప్రాతఃకాల నిత్యకర్మలన్నీ పూర్తిచేసుకున్నాడు. మును లందరినీ సమావేశపరచాడు. కుశలవులను చూసి రామాయణాన్ని గానం చెయ్యమన్నాడు. కుశలవులు రామాయణ ఉత్తరభాగాన్ని గానం చెయ్యడం ప్రారంభించారు:– ఉత్తరభాగం కథ ఇలా చెప్పారు.

సీత రసాతలంలోకి ప్రవేశించిన తర్వాత, యజ్ఞాన్ని పూర్తిచేసిన, రాముని మనసంతా సీతావియోగంచేత దుఃఖంతో నిండిపోయింది. ప్రపంచం అంతా శూన్యమైపోయినట్లు, అంధకారంగా అనిపించింది. మనశ్శాంతి లేకుండా పోయింది. యజ్ఞం పరిసమాప్తి కాగానే ఋక్ష, వానర, రాక్షసులందర్నీ పంపివేశాడు. బ్రాహ్మణులందరికీ విరివిగా దానాలు చేశాడు. అంతట రాముడు కుశలవుల్ని వెంటబెట్టుకొని అయోధ్యకు ప్రయాణమయ్యాడు. రాముడు సీతను తప్ప మరెవరినీ భార్యగా స్వీకరించలేదు. ఎన్ని యజ్ఞాలు చేసినా సీత స్థానంలో బంగారుప్రతిమనే ప్రక్కన పెట్టుకొని కర్మలు చేసేవాడు. రాముడు ఆ విధంగా పదివేల సంవత్సరాలు ఎన్నో యజ్ఞయాగాలు చేస్తూ విరివిగా దానాలు చేస్తూ వచ్చాడు. శ్రీమంతుడైన ఆ రాముడు అగ్నిష్టోమము, అతిరాత్రము, గోసవము అనే అధిక ధనవ్యయంతో కూడిన యజ్ఞాలు చేశాడు. మహాత్ముడైన రాముడు ఎంతో దీర్ఘకాలం ధర్మరక్షణ చేస్తూ పరిపాలించాడు. రాముడి రాజ్యంలో భల్లూకాలు, వానరాలు, రాక్షసులు కూడా సుఖంగా నివసించారు. సామంతరాజులంతా ప్రతినిత్యమూ రాముణ్ణి సేవిస్తూ ఉండేవారు. మేఘాలు ఆయాకాలాల్లో క్రమం తప్పకుండా వర్షించి దేశాన్ని సుభిక్షంగా చేశాయి. నాలుగుదిక్కుల్లోని నగరాలు, గ్రామల్లోని ప్రజలు పుష్టిగాను, ఆరోగ్యంగానూ ఉండేవారు. రాముడు రాజ్యం చేస్తున్నంత కాలం దేశంలో ఎక్కడా అకాలమరణాలు ఉండేవికావు. ప్రాణులేవీ వ్యాధుల్తో బాధలు పడలేదు. ఏ విధమైన అనర్థాలు లేనివారై సుఖశాంతులతో జీవించారు.

పుత్రులతోను, మనుమలతోను ఆనందంగా గడుపుతూ ఉండగా, చాలాకాలం తర్వాత

కౌసల్యాదేవి మరణించింది. అట్లాగే కీర్తిమంతులైన సుమిత్ర, కైకేయీలు కూడా కౌసల్యాదేవిని అనుసరించి స్వర్గానికి వెళ్ళారు. భేదబుద్ధి లేకుండా తల్లులు జీవించి ఉన్నంత కాలం వాళ్ళచేత తపోధనులైన బ్రాహ్మణులందరికీ విరివిగా దానాలు ఇప్పించాడు. అట్లాగే పితృదేవతల సంతృప్తికోసం బ్రాహ్మణులకు అనేక విధములైన దానాలు చేసేవాడు; చాలా కష్టమైన యజ్ఞాలు చేశాడు. ఈ విధంగా రాముడు ధర్మాన్ని వృద్ధి పొందించే అనేక యజ్ఞాల్ని చేశాడు. అనేక వేల సంవత్సరాలు అట్లా గడిచిపోయింది.

# 100వ సర్గ రాముడు గంధర్వదేశాన్ని ఆక్రమించటం

రాముడు ఆయాసమయాల్లో ధర్మోచిత కార్యాలు చేస్తూ, ప్రజలను సొంతబిడ్డల వలె చూసుకుంటూ అనేక వేల సంవత్సరాలు రాజ్యపాలన చేశాడు. ఇట్లా ఉండగా ఒకానొక రోజున కేకయరాజు మేనమామయైన యుధాజిత్తు పదివేల గుర్రాలను, శ్రేష్ఠమైన కంబళ్ళను, విలువైన రత్నాలను, చిత్రవిచిత్రమైన వస్త్రాల్ని, ఆభరణాల్ని ఇచ్చి అంగిరసుని పుత్రుడు తనకు పురోహితుడైన గార్గ్యుడి ద్వారా పంపాడు. బ్రహ్మర్షియైన ఆ గార్గ్యుడు కూడా ఈ సంబారాలన్నీ తన చేతులమీదుగా రాముడికి సమర్పించడం వల్ల తన జన్మ చరితార్థమైందని భావించాడు. ఆమాటే కేకయరాజుతో అని బయలుదేరాడు.

ఆ బ్రహ్మర్షి వస్తున్నట్లు ముందుగానే తెలుసుకున్న రాముడు తన అనుచరులతో కలసి ఒక క్రోసుదూరం ఉండగానే ఎదురేగి స్వాగతం పలికి అర్ఘ్యపాద్యాది సత్కారాలు చేసి గౌరవించాడు. బ్రహ్మర్షి ఆసీనుడైన తర్వాత అంజలిఘటించి నమస్కరిస్తూ మేనమామ క్షేమసమాచారాలన్నీ అడిగి తెలుసుకున్నాడు. కేకయరాజ్యం అంతా సుభిక్షంగా ఉందా? అని విచారించాడు. నువ్వు సాక్షాత్తు దేవేంద్రుడు పంపిన బృహస్పతివలె వచ్చావు. మేనమామ ఏదైనా చెప్పిరమ్మన్నాడా? ఇంత శ్రమపడి రావటానికి ప్రత్యేకమైన కారణం ఏమైనా ఉందా? అని ఎంతో వినయంగా ప్రశ్నించాడు.

అంతట గార్గ్యమహర్షి ఇలా అన్నాడు. “గొప్పబాహుబలం గల నరశ్రేష్ఠుడా! నీ మేనమామయైన యూధజిత్తు తన మాటలుగా చెప్పమని నాతో అన్నమాట చెప్తాను విను. “మా రాజ్యానికి సమీపాన సింధునదికి రెండు ప్రక్కలా ఆక్రమించుకొని గంధర్వరాజ్యం ఒకటి ఉంది. ఈ దేశం సర్వసంపదలతోను, చాలా సుభిక్షంగాను, ఆనందదాయకంగాను ఉంది. శైలూషుడనే గంధర్వరాజు ఈ దేశాన్ని పాలిస్తున్నాడు, ఆయన యుద్ధంలో బాగా ఆరితేరినవాళ్ళు, అధునాతన ఆయుధసంపత్తి గలిగి, గొప్ప బలశాలులైన మూడుకోట్లమంది గంధర్వసైన్యంతో

వర్ధిల్లుతున్నాడు. ఓ రామా! ఆ గంధర్వుడు మదోన్మత్తుడై ఉన్నాడు. నీవు అతడి మదమణచి ఆ రాజ్యాన్ని ఆక్రమించుకొని నీ రాజ్యంలో కలుపుకో. నేను ఎన్నడూ నీకు అహితాన్ని చెప్పను. నీ మేలుకోరి ఈ సలహా ఇస్తున్నాను, నేను చెప్పినట్లు చెయ్యి. నీకు శుభం కలుగుతుంది" అని చెప్పమన్నాడు.

మేనమామ సందేశాన్ని విన్న రాముడు 'అట్లాగే చేస్తాను' అని గార్గ్యుడితో ఇలా అన్నాడు: "బ్రహ్మర్షీ! భరతుడి కుమారులైన తక్షుడు, పుష్కలుడు గొప్ప పరాక్రమవంతులు. వాళ్ళిద్దరూ మా మేనమామ అండదండలతో ఆ గంధర్వులను సంహరించి, ఆ రెండు రాజ్యాలను వాళ్ళిద్దరూ పాలిస్తూ ఉంటారు. అందుకు తగిన సైన్యాన్నంతా ఇక్కడనుండి సమీకరించి పంపుతాం" అని చెప్పి రాముడు భరతుడి కొడుకులిద్దర్నీ పిలిపించి స్వయంగా అభిషిక్తుల్ని చేశాడు. తగినంత సైన్యాన్ని తీసుకొని కుమారులతో వెళ్ళి కార్యాన్ని చక్కబెట్టుకొని రమ్మని భరతుణ్ణి ఆదేశించాడు.

ఓ శుభముహూర్తాన భరతుడు తగినంత సైన్యాన్ని తీసుకొని జైత్రయాత్రకు బయలుదేరాడు. యుద్ధం జరగబోతుందని, రక్తమాంసాలు సమృద్ధిగా దొరుకుతాయన్న ఆశతో అనేక క్రూరమృగాలు, భూతాలు, రాక్షసులు భరతుడి వెనకాలే వెళ్ళారు. సుమారుగా రెండు మాసాలు ప్రయాణం చేసి, భరతుడు, సైన్యం కేకయ దేశాన్ని చేరింది.

# 101వ సర్గ భరతుడు గంధర్వులను జయించడం

దూతగా వెళ్ళిన బ్రహ్మర్షి గార్గ్యుడు భరతుణ్ణి పెద్దసైన్యంతో సహా వెంటబెట్టుకొని రావడంతో కేకయరాజైన యుధాజిత్తు చాలా సంతోషించాడు. యుధాజిత్తు తన సైన్యాన్ని కూడా భరతుడి సైన్యానికి బాసటగా నిలిపి గంధర్వుల పైకి దండెత్తి వెళ్ళాడు.

భరతుడి నాయకత్వంలో యుధాజిత్తు సహకారంతో పెద్దఎత్తున సైన్యాన్ని తీసుకొని తమ నగరాల్ని ముట్టడిస్తూ ఉంటే గంధర్వులు కోపోద్రిక్తులయ్యారు. పెద్దపెట్టున సైన్యాన్ని మోహరించి భరతుడి సైన్యాన్ని ఎదుర్కొన్నారు. ఇరుపక్షాలవారూ రోమాంచమును కలిగించే విధంగా యుద్ధం చేశారు. ఆ యుదం అట్లా ఏడు రోజుల పాటు జరిగింది. ఎవరూ ఆధిక్యతను నిరూపించుకోలేక పోయారు. రక్తం ఏరులై పారుతూవుంటే అందులోపడి శవాలు తేలుతూ ఉన్నాయి. భరతుడు ఏమాత్రం కలతచెందక నిశ్చల మనస్సుతో యుదం కొనసాగించాడు. చివరగా సంవర్తము అనే అస్త్రాన్ని గంధర్వులపై ప్రయోగించాడు. ఆ అస్త్రం గంధర్వుల పాలిట కాలపాశం అయింది. మూడుకోట్లమంది గంధర్వయోధులు నేలకూలారు. అంతా యమసదనం వైపుగా ప్రయాణంచేశారు. ఆకాశాన్నుండి చూస్తున్న దేవతలు ఆ భీకరయుద్ధంచూసి ఆశ్చర్యపోయారు.

గంధర్వులంతా యుద్ధంలో మరణించగా, గంధర్వనగరాన్ని భరతుడు స్వాధీనం చేసుకున్నాడు. దాన్ని రెండుగా విభజించి ఒక భాగానికి 'తక్షశిల' అని రెండవదానికి 'పుష్కలావతము' అని పేర్లుపెట్టాడు. తక్షుణ్ణి తక్షశిలకు, పుష్కలుణ్ణి పుష్కలావతానికి రాజులుగా నియమించి రాజ్యపాలన చేసుకొండని కుమారులకు చెప్పి తాను రామదర్శనానికి అయోధ్యకు వెళ్ళాడు.

ఆ రెండు నగరాలు ధనధాన్య సమృద్ధంగా ఉండి ఒక దానితో ఒకటి పోటీపడుతూ అభివృద్ధి చెందాయి. ఆ రెండు నగరాల్లోనూ, తోటలు, ఉద్యానవనాలు, చక్కటి వీథులకు

రెండువైపులా అంగళ్ళు తెరవబడ్డాయి. రమణీయమైన ప్రాసాదాలు, మందిరాలు, దేవాలయాలు విహారప్రదేశాలు, క్రీడావాటికలు నిర్మించారు. భరతుడు ఐదు సంవత్సరాలు అక్కడ ఉండి కొడుకులచేత అవిశ్రాంతంగా పనిచేయించి, అభివృద్ధి సాధించి అయోధ్యకు తిరిగి వెళ్ళాడు. అన్నగార్కి నమస్కరించి, సాధించిన అభివృద్ధినంతా నివేదించాడు. రాముడు గంధర్వుల వధను, పురనిర్మాణం గూర్చి తెలుసుకొని చాలా సంతోషించాడు.

# 102వ సర్గ లక్ష్మణుని పుత్రులకు రాజ్యాభిషేకం

ఆ అన్నదమ్ములంతా గంధర్వదేశాన్ని జయించి భరతపుత్రులకు రాజ్యాభిషేకం చేసిన రాముడు, లక్ష్మణపుత్రుల్ని గూర్చి కూడా ఆలోచించారు. "లక్ష్మణా! నీ పుత్రులు అంగదుడు, చంద్రకేతువు సమర్థులైన రాజ్యపాలకులు. ధర్మాత్ములు. వీరిద్దర్నీకూడా రాజ్యాభిషిక్తుల్ని చెయ్యాలని అనుకుంటున్నాను. నీవే తగిన ప్రదేశాన్నిచూసి ఎంచుకో. అక్కడ ఎట్లాంటి పీడలూ ఉండకూడదు. ఆశ్రమజీవితాలు గడిపేవారికి విఘాతం కలిగించకూడదు" అన్నాడు. అప్పుడు భరతుడు ఇలా అన్నాడు. "అన్నా! రామప్రభూ! కారుపథం అనే దేశం రమణీయంగా ఉంటుందని నేను అనుకుంటున్నాను. ఆ ప్రదేశం అంతా నిరామయంగా ఉంటోంది. ఆ ప్రదేశంలో అంగదుడికి ఒక నగరాన్ని, చంద్రకేతువుకు ఒక నగరాన్ని నిర్మించి ఇస్తే చాలా యోగ్యంగా ఉంటుందని భావిస్తున్నాను" అన్నాడు.

అంతట రాముడు భరతుడి ఆలోచననే సమర్థించి, అంగదుడికి 'అంగదీయము' అనే నగరాన్ని, చంద్రకేతువుకు 'చంద్రకాంతము' అనే నగరాన్ని నిర్మించి వారిద్దరినీ ఆయా నగరాలకు పాలకుల్ని చేశాడు. వారిద్దరికీ అయోధ్యలోనే రాజ్యాభిషేకం చేసి ఆ కారుపథదేశానికి పశ్చిమదిక్కున అంగదుణ్ణి, ఉత్తరదిశనున్న భాగానికి చంద్రకేతువును రాజులుగా నియమించాడు. లక్ష్మణుడు అంగదుడితోను భరతుడు చంద్రకేతువుతోనూ వెళ్ళి ఒక సంవత్సరం పాటువుండి, పిమ్మట రామప్రభువు సేవలకై అయోధ్యకు వెళ్ళారు.

ఆ విధంగా రామపాద సేవాతత్పరులు, పరమధార్మికులు అయిన భరత, లక్ష్మణులిద్దరికీ ఎన్నివేల సంవత్సరాలు గడిచిపోయాయో వారికే తెలియలేదు. ధర్మమార్గతత్పరులై, ప్రతిరోజూ పౌరుల సేవలకై ప్రయత్నిస్తూ ఉంటూ ఉండగా పదివేల సంవత్సరాలు గడచి పోయాయి.

ధర్మాచరణలో ఆ అయోధ్యానగరంలో ఉంటూ పరిపూర్ణమైన మనస్సులతో కూడి, లక్ష్మీసంపన్నులైన ఆ రామ, భరత, లక్ష్మణులు ప్రజ్వరిల్లే మూడు అగ్నులవలె ప్రకాశించారు.

# 103వ సర్గ యముడు రాముని దర్శించటం

ఒకానొక రోజున యమధర్మరాజు ఒక మునివేషాన్ని ధరించి రామదర్శనాని కోసం వెళ్ళాడు. ఆ సమయంలో ద్వారం దగ్గర లక్ష్మణుడు ఉన్నాడు. ఆ మునీశ్వరుడు లక్ష్మణునితో ఇలా అన్నాడు: "అయ్యా! నేను అతిబలుడు అనే మహర్షి శిష్యుణ్ణి. గురుకార్యంపైన రాముణ్ణి చూడాలని వచ్చాను." ఆ మాట విన్న లక్ష్మణుడు వెంటనే వెళ్ళి, మహా తపస్వి, సూర్యుడివలె వెలిగిపోతున్న మునిపుంగవుడొకడు నిన్ను చూడాలని వచ్చాడని చెప్పాడు. అంతట రాముడు "లక్ష్మణా! ఆ మహనీయుణ్ణి వెంటనే లోపలకు తీసుకొనివచ్చి సకల మర్యాదలు చెయ్యి" అన్నాడు. పిమ్మట లక్ష్మణుడు ద్వారం దగ్గరకు వెళ్ళి, ఆ మునీశ్వరుణ్ణి సాదరంగా ఆహ్వానించి రాముని వద్దకు తీసుకొని వెళ్ళాడు. అంతట ఆ మునీశ్వరుడు రాముని చూసి 'వృద్ధిపొందుము' అని దీవించాడు. మునీశ్వరుణ్ణి చూడగానే రాముడు ఎదురుగా వెళ్ళి అంజలిఘటించి నమస్కారంచేసి అర్ఘ్యంపాద్యం ఇచ్చి అతిథి సత్కారాలన్నీ చేసి ఆసనం చూపి కూర్చోబెట్టాడు. యోగక్షేమాలు అడిగి తెలుసుకున్నాడు. అంతట రాముడు ఆ మునిని "మహర్షీ! నీవు వచ్చిన పని ఏమిటో" అని వినయంగా అడిగాడు. అందుకు ఆ ముని ఇలా అన్నాడు: "రాజా! ఈ విషయాన్ని మనం ఇద్దరమే మాట్లాడుకోవాలి, మనం మాట్లాడుకోవటం మరొకరెవరూ వినకూడదు; చూడకూడదు. అట్లు ఎవరైనా విన్నా, చూసినా వారు ఎంతటివారైనా సరే వాళ్ళని నీవు చంపెయ్యాలి. నువ్వు అందుకు అంగీకరిస్తే నేనా రహస్యాన్ని చెబుతాను." అంతట రాముడు లక్ష్మణుణ్ణి పిలిచి "లక్ష్మణా, నేను, ఈ ముని పరమరహస్యమైన విషయాన్ని మాట్లాడుకుంటున్నాం. మేము మాట్లాడుకోవడం ఎవరైనా చూసినా, విన్నా, అట్టివారిని నేనే స్వయంగా చంపాల్సి ఉంటుంది. కాబట్టి నువ్వు ద్వారపాలకుణ్ణి బయటకు పంపెయ్యి. నువ్వే ద్వారం దగ్గర కాపలాగా ఉండు" అని శాసించాడు. అప్పుడు లక్ష్మణుడు ఆ ద్వారపాలకుణ్ణి పంపేసి తానే ద్వారం దగ్గర కాపలాగా నిలబడ్డాడు. అంతట రాముడు ఆ మునీశ్వరునివంక చూస్తూ "మునీంద్రా! మనల్ని ఎవ్వరూ చూడరు; మనం మాట్లాడుకునేవి ఎవరూ వినరు. ఇక

నీవు చెప్పదలచుకున్నది నిర్భయంగా చెప్పవచ్చు" అన్నాడు.

# 104వ సర్గ రామునికి బ్రహ్మదేవుని సందేశాన్ని వినిపించడం

గొప్పబుద్ధిబలం గలవాడా! రాజా! నేను ఎందుకు వచ్చానో చెబుతాను విను. నన్ను బ్రహ్మదేవుడు పంపాడు, ప్రభూ! పూర్వావస్థయందు నేను, నీ సంకల్పంచేత, సకల సంహారకర్తగా, 'కాలం' అనే పేరుతో వ్యవహరించబడే నీ పుత్రుణ్ణి. యమధర్మరాజు అని కూడా పిలుస్తూ ఉంటారు. ఇక బ్రహ్మదేవుడు తన మాటలుగా చెప్పమన్న మాటలు చెప్తాను. సావధానుడవై విను.

"ఓ సౌమ్యుడా! పూర్వం లోకాలన్నింటినీ నీ మాయాబలంచేత ఉపసంహరించి, ప్రళయజలాల్లో శయనించి ఉన్నావు. ముందుగా నన్ను సృష్టించావు. అటుపిమ్మట అనేక పడగలు గల ఆదిశేషుణ్ణి సృష్టించావు. మేధః ప్రధానుడైన మధువు అనే రాక్షసుడి మేధస్సుతో భూమిని, కైటభుని ఎముకలతో వృక్షాల్నీ, లతల్నీ, పర్వతాల్నీ నింపేశావు. ఆ కారణం చేతనే భూమికి 'మేదిని' అనే పేరువచ్చింది.

నీ నాభిలో నుండి సూర్యతేజస్సుతో సమానమైన పద్మాన్ని సృష్టించావు. అప్పటినుండి ప్రజాపతిత్వాన్ని నాకు ఒప్పగించావు. నేను ఆ ప్రజాపతిత్వాన్ని సరిగా నిర్వహించలేక నీ కొరకు తపస్సు చేశాను. నీవు నన్ను కరుణించి నాకు తేజస్సునిచ్చి సృష్టిచేసే విధానాన్ని నేర్పావు. నేను సృష్టించే భూతకోటినంతటినీ రక్షించమని నిన్ను నేను ప్రార్థించాను.

నీవు ప్రాణులను రక్షించేందుకు సనాతనమూ, ఎదిరింపశక్యం కానిదీ అయిన హిరణ్యగర్భ స్థితినుండి విష్ణుత్వాన్ని పొందావు. అదితియందు మహాపరాక్రమశాలియైన ఉపేంద్రుడుగా పుట్టావు, నీ సోదరులైన దేవతల పరాక్రమాన్ని వృద్ధిపొందిస్తూ, అవసరమైనప్పుడల్లా వాళ్ళకు సహాయపడుతూ వచ్చావు.

ప్రజలంతా రావణుని వలన బాధలు పడుతూ ఉంటే, మనుష్య జన్మ ఎత్తి ఆ రావణుణ్ణి

సంహరిస్తానని సంకల్పించావు. అప్పుడే పదకొండు వేల సంవత్సరాలు ఈ భూలోకంలో ఉంటానని ప్రతిజ్ఞ చేశావు. అట్లాగే నీవు సంకల్పించినట్లే దశరథపుత్రుడుగా జన్మించావు. మనుష్యులకు నేను నిర్ణయించిన పూర్ణాయుర్దాయం తీరిపోయింది. ఇక నీవు ఈ అవతారం చాలించి తిరిగి మా లోకానికి రావల్సిన సమయం ఆసన్నమయింది.

మహారాజా! ఇంకా నీవు ప్రజల్ని రక్షించాలని అనుకుంటే ఇక్కడే ఉండవచ్చు. లేదంటావా, సురలోకాన్ని జయించాలనే కోరికవుంటే విష్ణుత్వాన్నిపొంది, వచ్చెయ్యి. దేవతలమంతా నిన్ను ప్రభువుగా వరించి నీ సేవ చేసుకుంటూ నీ సంరక్షణలో నిర్భయులై ఉంటారు'' అని బ్రహ్మదేవుడు తన మాటగా చెప్పమన్నాడని ఆ యమధర్మరాజు చెప్పాడు.

బ్రహ్మదేవుని సందేశాన్ని యముని ద్వారా విన్న రాముడు నవ్వుతూ ఇలా అన్నాడు: ''బ్రహ్మదేవుని మాటలు నీ ద్వారా విని చాలా సంతోషించాను. నేను పుట్టింది ముల్లోకాల బాధలు తీర్చడానికే! వచ్చిన పని అయింది కాబట్టి ఎక్కడనుండి వచ్చానో అక్కడికే వెళ్తాను.

ఓ కాలపురుషా! నేనే నిన్ను గూర్చి ఆలోచిస్తున్నాను, ఇంతలో నువ్వే వచ్చావు. బ్రహ్మదేవుడు చెప్పిన మాటలు వినిపించావు. దేవతలు ఎప్పుడూ నాకు విధేయులేగదా! అందువలన నేను నా పూర్వస్థానానికే వెళ్తాను.''

# 105వ సర్గ లక్ష్మణుడు రాముని ఆజ్ఞ మీరి లోనికి వచ్చుట

రాముడు, యమధర్మరాజుతో సమావేశమై ఉండగా రాముణ్ణి చూడాలని దుర్వాసుడు వచ్చాడు. ద్వారం వద్ద ఉన్న లక్ష్మణుణ్ణి చూసి రాముణ్ణి వెంటనే చూడాలని పట్టుబట్టాడు. అప్పుడు లక్ష్మణుడు ఆ మునిని కాళ్ళా వేళ్ళాబడి వేడుకున్నాడు. "రాముడు చాలా ముఖ్యమైన విషయం గూర్చి ఒక మునీశ్వరుడితో మాట్లాడుతున్నాడు. ఎవరినీ లోపలకు పంపవద్దన్నాడు" అని మొరపెట్టుకున్నాడు. అయినా ఆ మహర్షి వినలేదు. అప్పుడా ముని మండిపడుతూ "వెంటనే వెళ్ళి చెప్తావా? లేదా? లేదంటే నిన్ను, రాముణ్ణి, భరతుణ్ణి, శత్రుఘ్నుణ్ణి, మీ సంతతి అంతటినీ, నీ అయోధ్యనూ కూడా భస్మంచేస్తాను" అన్నాడు. అప్పుడు లక్ష్మణుడు ఒక క్షణకాలం నిశ్చలమైన బుద్ధితో ఆలోచించాడు. "నేను అన్నగారి మాట మీరి వెళ్తే నేనొక్కణ్ణే మరణిస్తాను. లేదా అని మూర్ఖిస్తే ఈ ముని అన్నగార్ని దేశాన్ని కూడా శపిస్తాడు. కాబట్టి నేను లోపలకు వెళ్ళడమే శ్రేయస్కరం, అన్నగారు రఘువంశం, దేశం, అంతా క్షేమంగా ఉంటారు."

అప్పుడు లక్ష్మణుడు లోపలకు వెళ్ళి "దుర్వాసమహర్షి వచ్చాడు ద్వారం దగ్గర వేచి ఉన్నా" డని రాముడితో చెప్పాడు. రాముడు వెంటనే యముణ్ణి పంపేసి, ద్వారం దగ్గరకుపోయి దుర్వాసుని సాదరంగా ఆహ్వానించాడు. అర్ఘ్యపాద్యాది సత్కారాలన్నీ చేసి ఆదరించాడు. పిమ్మట "ఓ మహర్షీ! ఏమి పని మీద నన్ను చూడాలని వచ్చారు" అని వినయంగా అడిగాడు. అందుకు ఆ మహర్షి "వత్సలారా! నేను భోజనంచేసి వెయ్యి సంవత్సరాలైంది. నాకు బాగా ఆకలిగా ఉంది. సిద్ధంగా ఏది ఉంటే అది పెట్టు, ఆకలిబాధ భరించలేకుండా ఉన్నాను" అన్నాడు. రాముడు వెంటనే అక్కడే ఆహారాన్ని ఆ మహర్షికి సమర్పించాడు. దుర్వాసుడు ఆ ఆహారాన్ని తిని సంతృప్తి చెంది తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

మహర్షి వెళ్ళిపోయిన తర్వాత రామునికి, యముడితో మాట్లాడుతూ ఉండగా లోపలకు ఎవరు వచ్చినా మరణదండన విధిస్తాను అని అన్న మాటలు జ్ఞాపకానికి వచ్చాయి.

ప్రాణసమానుడైన సోదరుడు లక్ష్మణుణ్ణి శిక్షించవలసి వచ్చిందే అని దుఃఖించాడు, దైన్యంచేత నోటమాట రాలేదు.

మహాకీర్తిమంతుడైన రాముడు (కాలపురుషుడు) యముడు చెప్పిన మాటలు స్మరించుకొని "ఇక సోదరులు, పరివారం అంతా నశించ వలసిందే కదా" అని అనుకున్నాడు.

# 106వ సర్గ లక్ష్మణుడు శరీరంతో స్వర్గానికి వెళ్ళడం

తలవంచుకొని దీనుడై రాహువుచే మ్రింగబడిన చంద్రుడివలె ఉన్న రాముణ్ణి చూసి లక్ష్మణుడు ఇలా అన్నాడు: "ఓ మహాబాహూ! నా కోసం దుఃఖించకు. పూర్వకర్మ ఎట్లావుంటుందో అట్లా జరగవలసిందేగదా! విధిని ఎవరూ మార్చలేరు గదా! ఓ సౌమ్యుడా! నన్ను చంపటానికి ఎంతమాత్రం వెనుకాడవద్దు. ప్రతిజ్ఞను నిలబెట్టుకోలేనివారు నరకానికి పోతారు." లక్ష్మణుని మాటలు విన్న రాముడు చలించిపోయాడు. మంత్రులను, పురోహితులను సమావేశపరిచాడు. తానుచేసిన ప్రతిజ్ఞ, దుర్వాసమహర్షి రావటం, తన్ను చూడడానికి వచ్చిన తపస్వికి చేసిన ప్రతిజ్ఞ మొదలైన విషయాల్ని వాళ్ళ ముందు ఉంచాడు. ఈ విషయంపై దీర్ఘ చర్చ జరిగింది. వసిష్ఠమహర్షి ఇలా అన్నాడు. "ఓ రామా! నీకూ లక్ష్మణుడికీ ఎడబాటు రాబోతుందని నాకు ముందుగానే తెలుసు, లక్ష్మణుని విషయంలో నీవు చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చుకో. లేకపోతే ధర్మం నశిస్తుంది, అదీగాక లక్ష్మణుడితో ఎడబాటు కలిగే సమయం వచ్చేసింది. ధర్మం నశించకూడదు. ధర్మం నశిస్తే స్థావరజంగమాలు, దేవఋషి గణాలతో కూడిన ముల్లోకాలు నశిస్తాయి. ఓ పురుషశ్రేష్ఠుడా! నీవు ఇప్పుడు లక్ష్మణుణ్ణి విడిచిపెట్టడం వలన ముల్లోకాల్నీ రక్షించినట్లవుతుంది. జగత్తు క్షేమంగా ఉండేట్లు చెయ్యి."

సభలోని పెద్దలందరి మాటలు విన్న రాముడు పరిషత్తు మధ్యలో ఉన్న లక్ష్మణునితో ఇలా అన్నాడు: "ఓ లక్ష్మణా! ధర్మానికి హాని కలగరాదనే కారణంగా నిన్ను విడిచివేస్తున్నాను. సత్పురుషులకు మరణమైనా, విడిచివేయడమన్నా, రెండూ సమానమే!" అన్నాడు.

రాముడు అన్నమాటలకు లక్ష్మణుని కన్నీరు వరదై పారింది. లక్ష్మణుడు సభనుండి ఇంటికి కూడా పోకుండా బయటకు వెళ్ళిపోయాడు. అక్కడనుండి సరాసరి సరయూనదీ తీరానికిపోయి ఆచమనం చేసి అంజలిఘటించి ఇంద్రియాలన్నీ నిగ్రహించి, ఊపిరి బిగదీసి కూర్చున్నాడు. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు ఆగిపోయాయి. యోగసమాధిలో ఉన్న అతడి పైన

ఇంద్రుడు, మొదలైన దేవతలంతా పుష్పవర్షం కురిపించారు. అప్పుడు ఇంద్రుడు సమాధిలో ఉన్న లక్ష్మణుణ్ణి శరీరంతోపాటే స్వర్గానికి తీసుకొనిపోయాడు. అక్కడున్న దేవతలంతా శ్రీమహావిష్ణువులో నాలుగవ అంశం స్వర్గానికి వచ్చి చేరిందిగదా! అని సంతోషించారు. అప్పుడు దేవతలంతా లక్ష్మణుని పూజించారు.

# 107వ సర్గ కుశలవుల పట్టాభిషేకం

లక్ష్మణుని బహిష్కరించిన తర్వాత రాముని దుఃఖానికి అంతం లేకుండా పోయింది. సభాసదులను ఉద్దేశించి ఇలా అన్నాడు: "ధర్మాత్ముడైన భరతుణ్ణి రాజును చెయ్యాలనుకుంటున్నాను. లక్ష్మణుడు లేని జీవితాన్ని నేను ఊహించుకోలేను. నేనుకూడా లక్ష్మణుడు వెళ్ళిన దారినే వెళ్ళిపోతాను. భరతుడి రాజ్యాభిషేకానికి అన్ని ఏర్పాట్లు చెయ్యండి" అన్నాడు. రాముడు మాటలువిన్న సభలోని వారంతా నిర్వీర్యులైపోయారు. నోట మాటాపలుకూ లేకుండా ప్రతిమల్లా అయిపోయారు. అప్పుడు భరతుడు ఇలా అన్నాడు. "రామా! నువ్వు లేకుండా నేను రాజ్యమేకాదు, స్వర్గం కూడా కొరుకోను. అందువల్ల వీరులైన లవకుశులకు రాజ్యాభిషేకం చెయ్యి, వాళ్ళే అన్ని విధాలా అర్హులు. దక్షిణకోసలదేశానికి కుశుణ్ణి, ఉత్తరకోసలదేశానికి లవుణ్ణి రాజుగా అభిషేకించు. ఇదే ధర్మమార్గం. వెంటనే మనుషులను పంపి శత్రుఘ్నుని పిలిపించు." భరతుడు చెప్పిన మాటకు సభలోనివారంతా మరీ దిగాలు పడిపోయారు, అప్పుడు వసిష్ఠుడు ఇలా అన్నాడు. "రామా! నీ మాట, భరతుని మాట విని ఈ సభలోని వారంతా స్పృహతప్పి పడిపోయారు. వాళ్ళ అభిప్రాయాల్ని మన్నించు. వారి అభీష్టానికి వ్యతిరేకంగా వెళ్ళకు."

అంతట రాముడు సభికుల వద్దకు వెళ్ళి వాళ్ళను లేవదీసి, ఓదార్చి, 'మీ అభీష్టం ఏమిటో చెప్పండి' అన్నాడు. అప్పుడు ఆ పెద్దలంతా "ఓ రామా! నీవు ఎక్కడికి వెళ్తావో చెప్పు, మేము కూడా నీ వెనకాలే వస్తాం. పౌరుల యెడల నీకు నిజంగా ప్రేమవుంటే మమ్మల్నికూడా నీతోనే తీసుకొనిపోవాలేకాని విడిచివెళ్ళకూడదు. నువ్వు తపోవనాలకు వెళ్తే అక్కడికే వస్తాం. సముద్రంలోనో, నదిలోనో పోయి మునుగుతానంటే మేము నీతోనే మునుగుతాం. రాజా! మేమంతా కోరుకునేది ఇదే. ఇదే మా సంతోషం, ఇదే మేము కోరుకునే వరం, నీతో కలసి ఉండటమే మా ఆనందం" అన్నారు. రాముడు వారికి గల భక్తికి, ప్రేమకు ముగ్ధుడయ్యాడు. 'సరే అట్లాగే' అన్నాడు.

పిమ్మట రాముడు కుశుణ్ణి దక్షిణ కోసలకు (కుశావతి), లవుణ్ణి ఉత్తరకోసలకు (శ్రావస్తీపురం) రాజుగా అభిషిక్తుణ్ణి చేసి ప్రయాణం చేయించాడు. పిమ్మట రాముడు పట్టాభిషిక్తులైన పుత్రులను కౌగలించుకొని, శిరస్సుపై ముద్దుపెట్టుకొని వేలకొద్దీ రథాలను, వేలకొద్దీ ఏనుగుల్ని ధనధాన్యాలను, విలువైన రత్నాలను వారికి సమానంగా ఇచ్చి వారి పట్టణాలకు పంపాడు. కుమారులను రాజ్యాభిషిక్తుల్ని చేసి వాళ్ళను వారి రాజధానులకు పంపి దూతలద్వారా శత్రుఘ్ననికి ఈ వార్తను తెలియజేశాడు.

# 108వ సర్గ రాముడు పరమధామునకు వెళ్ళటం

రాముడు ఆజ్ఞప్రకారం దూతలు మధురాపురానికి వెళ్ళారు. వాళ్ళు ఎక్కడా బసచేయకుండా మూడు పగళ్ళు, మూడు రాత్రిళ్ళు ప్రయాణం చేసి మధురాపురానికి చేరుకున్నాడు. శత్రుఘ్నుడికి రామ సందేశాన్ని తెలిపారు. మహర్షికి రాముడు ప్రతిజ్ఞచెయ్యడం, దుర్వాసమహర్షి పట్టుపట్టడం, లక్ష్మణుని వదలివేయడం, కుశలవుల పట్టాభిషేకం, పౌరులుకూడా రాముణ్ణి అనుసరిస్తామని పట్టుపట్టడం, మున్నగు విషయాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పారు.

రాజా! లవుని కొరకు శ్రావస్తీపురమును, కుశుడి కొరకు కుశావతి అనే నగరాన్ని నిర్మించి, రాముడు, భరతుడు, అయోధ్యను విడిచి స్వర్గానికి పోవటానికి నిశ్చయించుకున్నారు. అయోధ్యా జనులనుకూడా వెంట తీసుకొని వెళ్తూ, అయోధ్యను జనశూన్యం చెయ్యదలచారని, చెప్పి శత్రుఘ్నుని త్వరగా బయలుదేరమని విన్నవించుకున్నారు.

అంతావిన్న శత్రుఘ్నుడికి మతిపోయినట్లయింది, కొదిసేపట్లోనే తేరుకుని, తన పురోహితుడైన కాంచనుణ్ణి, మంత్రులను పిలిపించి కులక్షయం అయిపోయిందని చెప్పాడు. తానుకూడా, అన్నగార్లతోపాటే దేహత్యాగం చెయదలచుకొన్నట్లు వాళ్ళతో చెప్పాడు.

అంతట తన రాజ్యాన్ని రెండు భాగాలుగా విభజించి తన పుత్రులైన సుబాహువు, శత్రుఘాతికి సమానంగా ఇచ్చి రాజ్యాభిషేకం చేశాడు. మధురను సుబాహువుకు, శత్రుఘాతికి వైదిశనగరాన్ని ఇచ్చి పట్టాభిషేకం చేశాడు. అట్లాగే చతురంగబలాల్ని, ధనధాన్యాలని, విలువైన వస్తువు లన్నింటినీ వాళ్ళిద్దరికీ సమానంగా ఇచ్చి తాను మధురాపురాన్ని విడిచి అయోధ్యకు వెళ్ళాడు. మునీశ్వరుల మధ్యన తెల్లని వస్త్రాలను ధరించి ప్రజ్వలిస్తున్న అగ్నిహోత్రంలా ఉన్న రాముడికి అంజలిఘటించి నమస్కారంచేసి ఇలా అన్నాడు. “ఓ రామా! రాజా! నేను నా పుత్రులిద్దరికీ రాజ్యాభిషేకం చేసి నిన్ను అనుసరించి రావడానికి సిద్ధమై వచ్చాను. నన్ను కూడా

నీతో అనుసరించి రానివ్వు. నా అభీష్టాన్ని కాదనకు, నన్ను అనుగ్రహించు" అని అన్నాడు. శత్రుఘ్నుని మాటలు విన్న రాముడు "సరే! అట్లాగే కానీ" అన్నాడు.

రాముడు తమ్ముళ్ళతో ఇట్లా మాట్లాడుతూ ఉండగా బయట వానరులు, భల్లూకాలు, రాక్షసులు గుంపులు, గుంపులుగావచ్చి వాళ్ళల్లోవాళ్ళు చర్చించుకొంటున్నారు. అదంతా పెద్దకోలాహలంగా వినిపించింది. వాళ్ళందరికీ సుగ్రీవుడు నాయకత్వం వహించి ముందున్నాడు, ప్రతివాడూ ఒకేమాట మాట్లాడుతున్నాడు. అదే "రామా! మేముకూడా నీ వెనకే వస్తాం. మమ్మల్ని విడిచి వెళ్ళకు" అని. ఆ రెండుమాటలే పెద్దకోలాహలమై ఆ శబ్దాలు ఆకాశాన్నంటాయి. అంతట సుగ్రీవుడు కూడా రాముడి ముందుకుపోయి ఇలా విన్నవించుకున్నాడు. "రాజా! నేనూ నీ వెంటరావటానికి సిద్ధమై వీరుడైన అంగదుడికి రాజ్యాభిషేకం చేసి వచ్చాను: నీతో కలసి రావటానికే నిశ్చయించుకున్నాను. కామరూపులైన ఈ వానరాలు, భల్లూకాలు కూడా నిన్ను విడిచి ఉండలేరు" అని ప్రాధేయపడ్డాడు. సుగ్రీవుని మాటలు విన్న రాముడు చిరునవ్వు నవ్వుతూ, "మిత్రుడా! నీవు ప్రక్కనలేకుండా స్వర్గానికైనా వెళ్ళను. అట్లాగే కామరూపులైన ఈ వానరులు, భల్లూకాలు కూడా నాతోనే వస్తారు" అన్నాడు. తిరిగి విభీషణునితో ఇలా అన్నాడు: "రాక్షసరాజా! విభీషణా! ఈ భూమిపైన జీవకోటి ఉన్నంతకాలం నీవు లంకలో జీవించి ఉంటావు. సూర్యచంద్రులు ఎంతవరకూ ఉంటారో ఈ భూమి ఎంతకాలం ఉంటుందో, నా కథ ఎంతకాలం లోకంలో వ్యాపించి ఉంటుందో అంతకాలం వరకూ నీవు లంకలో రాజ్యం చేస్తూ ఉంటావు. ప్రజలను ధర్మానుసారం పాలించమని నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. నీవు నా ఆజ్ఞ ప్రకారం నడచుకోవాలి, ఎదురుచెప్పకు. ఓ విభీషణా! ఇంకో విషయం ఏమంటే, ఇక్ష్వాకుల కులదేవత, దేవతలందరికీ ఆరాధ్యుడు అయిన జగన్నాథుని ఆరాధించు" అన్నాడు. అంతట రాక్షసరాజైన విభీషణుడు అంజలిఘటించి నమస్కరిస్తూ, "అట్లాగే చేస్తాను" అని అన్నాడు.

పిదప రాముడు హనుమంతుడితో ఇలా అన్నాడు: "హనుమంతుడా! నీవు బుద్ధిమంతుడవు. నీకు విశేషించి చెప్పనక్కరలేదు బ్రహ్మ నీకు దీర్ఘాయువుగా వరం ఇచ్చాడు.

దాన్ని సార్ధకం చేసుకుంటూ, లోకంలో నా కథ వినిపిస్తూ ఉన్నంతకాలం నీవు బ్రహ్మానందాన్ని పొందుతూ సుఖంగా జీవించు.” రాముని మాటలకు సంతోషిస్తూ హనుమంతుడు ఇలా కోరాడు: “పరమపవిత్రమైన నీ కథ లోకంలో ప్రచారంలో ఉన్నంతకాలం నీ ఆజ్ఞపాలిస్తూ భూలోకంలోనే ఉంటాను” అన్నాడు. పిమ్మట జాంబవంతుణ్ణి, మైంద ద్వివిదుల్ని కూడా ఈ విధంగానే దీవించి కలియుగం వచ్చేంత వరకూ జీవించమని ఆదేశించాడు. మిగిలిన వానర, భల్లూక నాయకులందరికీ తనను అనుసరించడానికి అనుజ్ఞ ఇచ్చాడు.

# 109వ సర్గ రాముని మహా ప్రస్థానం

తెల్లవారింది రాముడు కులగురువు, పురోహితుడు అయిన వసిష్ఠుని పిలిచి ఇలా అన్నాడు: "ఓ మహర్షీ! ప్రజ్వలించే అగ్నిహోత్రాన్ని ముందు ఉంచుకొని ఉత్తమమైన బ్రాహ్మణులు ముందుకు వెళ్ళాలి. ధర్మానుష్ఠానికి సాంకేతికమైనవాడు వాజ పేయఛత్రాన్ని ధరించి (వాజపేయ యాగం చేసినవారు మాత్రమే గౌరవసూచకంగా ధరించు ఛత్రాన్ని వాజపేయాత పత్రము) వెళ్ళాలి." అంతట వసిష్ఠుడు మహాప్రస్థానమునకు సంబంధించిన విధిని యథాశాస్త్రీయంగా పూర్తిచేశాడు. పిమ్మట రాముడు సూక్ష్మవస్త్రాల్ని ధరించి, చేతిలో దర్భలు పటుకొని పరబ్రహ్మమును ధ్యానిస్తూ సరయూనదికి చేరుకున్నాడు. రాముడు సరయూనదికి చేరేంతవరకు మౌనవ్రతాన్ని ఆచరించాడు. నడవటం తప్పమరే ఇంద్రియాలు పనిచెయ్యలేదు. ప్రకాశించే సూర్యునివలె ఇంటినుండి బయలుదేరి, రాముడికి కుడిప్రక్కన లక్ష్మీదేవి, ఎడమప్రక్కన భూదేవి, ముందుగా సంహారశక్తి అనుసరించాయి. బాణాలు, ధనుస్సు, ఇతర ఆయుధాలన్నీ పురుషరూపాన్ని ధరించి రాముడి వెనకాలే నడచివచ్చాయి. వేదములు, గాయత్రి, ఓంకారము, వషట్కారము మొదలైన వారందరూ బ్రాహ్మణ రూపాల్లో రాముణ్ణి అనుసరించి వెళ్ళాయి. మహాత్ములైన ఋషులు, బ్రాహ్మణులు, ఆ పురుషోత్తముని అనుసరించారు. మంత్రులు, వృద్ధ దాసీలు, బాలదాసీలు, కంచుకులు, కింకరులు, పురుషులు, పిల్లలు పెద్దలు, పరిచారికలు, పరిజనులు, రాముడి వెంట నడిచారు. భరత, శత్రుఘ్ను, స్త్రీ, పురుషులతోను, సమస్త వస్తుసామగ్రితోను అగ్నిహోత్రాన్ని ముందు ఉంచుకొని అనుసరించారు. వానరులంతా హృష్టులై, పుష్టులై, స్నానంచేసి, ఆనందంతో కిలకిలా శబ్దాలు చేసుకుంటూ రాముణ్ణి అనుసరిస్తూ వెళ్ళారు. ఆ సముదాయంలో దీనుడుగాని, బిడియపడేవాడుగాని, దుఃఖించేవాడుగానీ లేరు. అంతా పరిపూర్ణ ఆనందంతో అనుసరించారు. 'రాముడు వెళ్ళి పోతున్నాడట' అంటూ చూడటానికి వచ్చిన జనపదులుకూడా, రాముణ్ణి చూడగానే ఇళ్ళూ వాకిళ్ళు, అన్ని మరచిపోయి అతణ్ణి అనుసరించి వెళ్ళారు. భల్లూకాలు, వానరులు, రాక్షసులు, నగరవాసులు, జానపదులు అంతా

భక్తితో రాముని వెనకాలే వెళ్ళారు. నగరంలో కంటికి కనిపించకుండా ఉండే భూతాలుకూడా రాముణ్ణి అనుసరించి స్వర్గానికి బయలుదేరాయి. రాముడు దృష్టి ప్రసరించిన స్థావర జంగమాలన్నీ కూడా రాముడి వెంట బయలుదేరాయి. అయోధ్యలో ఊపిరి పీల్చే చాలా చిన్న ప్రాణికూడా మిగిలిలేదు. అన్ని రాముణ్ణి అనుసరించి వెళ్ళాయి.

# 110వ సర్గ రాముడు వైష్ణవ తేజస్సులో ప్రవేశించటం

రాముడు ఒకటిన్నర యోజనాల దూరంవెళ్ళి పవిత్రమైన సరయూనదిని చేరుకున్నాడు. ఆ నది సుళ్ళతోనిండి ప్రవాహం అంతా వ్యాకులమైవుంది. రాముడు తాను, ప్రజలు ప్రవేశించేందుకు తగిన (స్వర్గప్రాప్తి పొందేందుకు) చోటుకు వచ్చాడు. అప్పుడు సమస్తలోకాలకూ పితామహుడైన బ్రహ్మదేవుడు, సకలదేవతలతో కలసి శతకోటి విమానాలను, తనకూడా తీసుకొనివచ్చారు. రాముడు స్వర్గప్రవేశానికి వచ్చి చేరిన స్థలానికే వారంతా కూడావచ్చి రాముడికి స్వాగతం పలికారు.

సహజమైన కాంతి, తేజస్సు గల దేవతలంతా వచ్చి నిలబడగానే, ఆకాశం అంతా తేజోమయమైపోయింది. గాలి అంతా సువాసనలతో నిండిపోయింది. దేవతలు మహాప్రవాహంగా పుష్పవర్షం కురిపించారు. వందలాది గంధర్వులు గానాలుచేశారు. అప్సరసలు నాట్యాలు చేశారు. అటువంటి ముహూర్తంలో రాముడు మెల్లగా సరయూనదివైపుగా నడిచాడు.

అప్పుడు బ్రహ్మదేవుడు ఆకాశంలోనే నిలబడి, రాముడికి బాగా దగ్గరగావచ్చి, ఇలా అన్నాడు: “విష్ణూ! నీకు స్వాగతం! నీకు మంగళమగుగాక! రామా! మా అదృష్టం వలన నిన్ను దర్శించుకుంటున్నాం. ఓ మహాబాహూ! ఓ దేవా! నీవు, నీ సోదరులతో కలసి, నీ స్వీయదేహంలో ప్రవేశించు. నీ దేహములలో దేనిలో ప్రవేశించాలని సంకల్పిస్తావో దానిలో ప్రవేశించు. ఆ వైష్ణవశరీరం గానీ, లేదు, నిత్యమైన నీ శుద్ధబ్రహ్మ స్వరూపానగాని, ప్రవేశించు దేవా! నీవే లోకాలకు గతివి. నీవు మాయాశక్తి చేత తప్ప మరెవరి చేతా ఊహింపను కూడా శక్యంకాని వాడవు. జరాశూన్యుడవయిన నిన్ను తెలుసుకొనలేరు” అని స్తోత్రం చేశాడు.

బ్రహ్మదేవుని మాటలు విన్న రాముడు, తమ్ములతోకూడా శరీరాలతోనే వైష్ణవతేజస్సులో ప్రవేశించాడు. పిమ్మట విష్ణురూపంలో విలీనం అయి విష్ణువైపోయిన రాముణ్ణి దేవఋషులు,

గంధర్వులు, అప్సరసలు, గరుత్మంతులు, నాగులు, యక్షులు, దైత్య, దానవ, రాక్షసులు పూజించారు. దేవతలంతా, పవిత్రమైన ఈ స్వర్గం అంతా "ఇప్పుడు పరిపుష్టమైంది. సంతోషంతో నిండిపోయింది. మనోరథాలన్నీ సంపూర్ణాలయ్యాయి. భేష్, భేష్" అని స్తోత్రం చేశారు. పిమ్మట గొప్ప తేజస్సుగల విష్ణువు బ్రహ్మతో ఇలా అన్నాడు. "ఓ సువ్రతా! ఈ జనులందరికీ ఉత్తమలోకాలను ఇమ్ము. వీరందరూ ఉత్తమమనస్సుతో, నాపై గల భక్తితో, ప్రేమతో నా కూడా వచ్చారు. నా కోసం ప్రాణాలర్పించిన (దేహాలు) భక్తులంతా సేవించ దగినవారుగదా?" అన్నాడు. విష్ణువు పలికిన మాటలకు బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు: "దేవా! నీ వెనుకనే వచ్చిన వీరంతా 'సంతానక' మనే లోకానికి వెళ్తారు. ఆ లోకం బ్రహ్మలోకానికి ప్రక్కనే ఉంటుంది. నిన్ను స్మరిస్తూ, నీ మీద భక్తితో బ్రహ్మగుణాలు కలిగి ప్రాణాలు విడిచినవారంతా ఈ 'సంతానక' లోకంలో నివసిస్తూ ఉంటారు.

దేవతల వలన పుట్టిన వానరాలు, భల్లూకాలు, మొదలైన వారంతా తమ ఉత్పత్తికి కారకులైన దేవతలలోనే లీనమైపోయారు. రామా! వారిలో సుగ్రీవుడు సూర్యమండలాన్ని చేరాడు. ఇతరులంతా తమ తండ్రులను పొందారు" అన్నాడు.

బ్రహ్మదేవుడు ఇట్లా మాట్లాడుతూ ఉండగా సరయూనదిలోని గోప్రతార క్షేత్రానికి వచ్చిన జనులంతా సంతోషంతో సరయూనదిలోనికి ప్రవేశించారు. అప్పుడు నీటిలో దిగి ప్రాణాలు విడిచిన ప్రతి ఒక్కరూ మనుష్యదేహాన్ని విడిచి విమానం ఎక్కి వెళ్ళారు. పశుపక్ష్యాదులుకూడా ఆ సరయూనదీ జలాల్లో ప్రవేశించి, దేహాలను విడిచి స్వర్గానికి వెళ్ళాయి. సరయూనదీ జలాల్లో ప్రవేశించిన స్థావరాలు, జంగమాలూ కూడా ఆ నీళ్ళల్లో తడవగానే ఆ దేహాన్ని విడిచి దేవలోకాన్ని చేరుకున్నారు. ఆ జలాల్లో ప్రాణాలు విడిచిన వానర, భల్లూక, రాక్షసులంతా ఆయా దేహాల్ని విడిచి స్వర్గాన్ని చేరుకున్నారు. బ్రహ్మదేవుడు ఆ వచ్చిన వారందర్నీ స్వర్గలోకంలో ఉంచి తాను బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు.

# 111వ సర్గ శ్రీమద్రామాయణ మహత్త్వం

ఉత్తరభాగంతో కూడా కలిపి ఏడుకాండలతో కూడిన ఈ రామాయణాన్ని వాల్మీకిమహర్షి రచించాడు. ఈ గ్రంథరాజము బ్రహ్మదేవుని చేత పూజించబడ్డది. ముల్లోకాల్లోనూ, చరాచర ప్రాణికోటి అంతా వ్యాపించి ఉండే శ్రీమహావిష్ణువు దుష్టులను శిక్షించి, ధర్మాన్ని ప్రతిష్ఠించి, సాధువులను రక్షించి తిరిగి తన స్వస్థలమైన విష్ణుపదానికి వెళ్ళిపోయాడు. ఇది విష్ణుకథ కావడంవలన దేవలోకంలో దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు సంతోషంతో ఈ రామాయణ మహాకావ్యాన్ని 'శ్రవణం చేస్తూ ఉంటారు.

ఈ రామాయణ ఆఖ్యానం అయుస్సును వృద్ధి పొందిస్తుంది. సమస్త సంపదల్ని చేకూర్చి పెడ్తుంది. పాపాలన్నీ తొలగిపోతాయి. వేదంతో సమానమైనది కావటంవలన పండితులు దీన్ని శ్రాద్ధ సమయాల్లోకూడా పఠిస్తూ ఉంటారు.

పుత్రుడు లేనివాళ్ళు పుత్రుణ్ణి పొందుతారు. ధనం లేనివారు ధనాన్ని పొందుతారు. రామాయణంలో ఒక శ్లోకం చదివినా సర్వపాపాలు హరిస్తాయి. రామాయణ కావ్యాన్ని చదివిన వారిని నూతన వస్త్రాలతోను, బంగారంతోను, గోదానంతోను సత్కరించాలి. అట్లా చేస్తే సమస్త దేవతలూ సంతోషిస్తారు. ఈ మహాకావ్యాన్ని పఠించినవాడు ఈ లోకంలోను, మరణించిన తర్వాత స్వర్గంలో పూజింపబడుతాడు. ప్రాతఃకాలాల్లోగాని, మధ్యాహ్నపు వేళల్లోగానీ, సాయంకాల పూటగానీ పఠించినవాడు ఎన్నటికీ పతనం చెందడు. అనేక సంవత్సరాలు శూన్యంగా ఉన్న రమ్యమైన అయోధ్య, ఋషభుడనే రాజు పరిపాలించిన పిదప తిరిగి జనం అయోధ్యలో నివసించసాగుతారు.

ఉత్తరకాండ అన్న పేరుతో భవిష్యత్కథతో కూడిన ఈ రామాయణాన్ని ప్రచేతసుని పుత్రుడైన వాల్మీకి మహర్షి రచించాడు. దీన్ని బ్రహ్మదేవుడుకూడా ఆమోదించాడు, ఈ రామాయణమనే కావ్యంలో ఒక్క సర్గను విన్నాకూడా వెయ్యి అశ్వమేధాలు, పదివేల

వాజపేయాలు చేసిన ఫలం దక్కుతుంది. ఈ లోకంలో రామాయణాన్ని విన్నవాడికి ప్రయాగ మున్నగు తీర్థాలకు, గంగవంటి పుణ్యనదులకు, నైమిశంవంటి అరణ్యాలకు, కురుక్షేత్ర యాత్రలవల్ల వచ్చే ఫలం దక్కుతుంది. సూర్యగ్రహణ పుణ్యకాలమందు కురుక్షేత్రంలో పుట్టెడు బంగారం దానంచేసినంత ఫలం దక్కుతుంది. శ్రద్ధాసక్తులతో రామాయణ గాథను విన్నవాడు సమస్త పాపాలనుండి విముక్తుడై విష్ణులోకాన్ని పొందుతాడు.

పూర్వం వాల్మీకి రచించిన ఈ ఆదికావ్యాన్ని భక్తితో విన్నవాడు విష్ణువులో లీనమైపోతాడు. వంశవృద్ధి జరుగుతుంది. అత్యుత్తమమైన ఈ రామాయణం గాయత్రీ స్వరూపము. ఈ రహస్యాన్ని గ్రహించి పఠించాలి. రాముడి కథను ప్రతిరోజూ చదువుతూ, వింటూ ఉండేవానికి సర్వపాపాలూ తొలగి దీర్ఘాయువు కలుగుతుంది. శ్రేయస్సు కోరుకునే ప్రతివాడూ నిత్యం రామాయణాన్ని వినాలి; అట్లా వినేవాడు తప్పక విష్ణులోకాన్ని చేరుకుంటాడు. రామాయణాన్ని సంపూర్ణంగా చదివినవాని పై మూడుతరాలవాళ్ళు విష్ణులోకాన్ని పొందుతారు.

రాముని చరితము ధర్మార్థకామ మోక్షములనే నాలుగు పురుషార్థాలను ఇస్తుంది. అందువల్ల మానవుడు ప్రతినిత్యమూ రామాయణాన్ని పఠిస్తూ ఉండాలి. హీనపక్షం ఎవరైతే ఈ రామాయణంలోని ఒక పాదమైనా చదువుతాడో, అట్టివాడు బ్రహ్మలోకాన్ని పొందుతాడు. బ్రహ్మచే పూజింపబడతాడు.

పూర్వం జరిగిన ఆఖ్యానాలు చదివేవారికి, వినేవారికి, స్మరించే వారికీ మంగళం అవుతుంది "శ్రీమహావిష్ణువు బలం వృద్ధి పొందుగాక" అని దృఢంగాను, విశ్వాసంతోను చాటిచెప్పండి.

